# భారతి

## సచిత్ర మాసపత్రిక

అధిపతి

కా. నాగేశ్వరరావు

సంపాదకుడు

గన్నవరపు సుబ్బరామయ్య

సంపుటము ౧౧, సంచిక ౧.౨

ఆంధ్రపత్రికా ముద్రాలయము, మద్రాసు

౧౯౩౪

# భారతి-ఏకాదశ సంపుటము-భా. ౨.

## ౨

స



## త్రివర్ణచిత్రముల అకారాది సూచి

# వైద్యరాజ యస్. పి. జేయిన్ "గౌళియ"

స్పెషలిస్టు

అన్నివిధములయిన దేహదుర్బలత్వములు కుదుర్పబడును.

స్త్రీలకు

## స్త్రీ జీవన్ లేక సంతాన నిరోధము

స్త్రీ జీవన్ ఒకబుడ్డి వాడిన చాలును. ఇక సంతాన మెన్నటికినీ కలుగదు. ఏమాత్రము అపాయము లేనిది. గ్యారంటీ యివ్వబడును. ఖరీదు బుడ్డి రు. 8 లు.

## గర్భరక్షక లేక సంతానప్రాప్తి

మీకు సంతానము లేనియెడల ఈ దివ్యౌషధమును వాడుడు. అనేకమందికి గుణమిచ్చినది.

ఖరీదు ప్యాకెటు 1 కి రు. 4 లు.

## కాంతాకోకిల లేక కోకిలస్వరము

దీనివలన కంఠము కోకిలస్వరమువలె నుండును. వ్యాధులవల్ల స్వరము మందగించినచో యీ ఔషధమును వాడుడు. ఖరీదు బుడ్డి రు. 1-8-0 లు

పురుషులకు

ఈ ఔషధములు పుచ్చుకొన్నచో బలము కలుగును.

## పురుష రక్ష

అధికముగా శక్తి బలము కలుగును. శుక్లనష్టమును పోగొట్టును. ఆకలి వృద్ధియగును. బలహీనతను పోగొట్టును. ఖరీదు బుడ్డి 100 మాత్రలు రు. 4 లు.

## నారిమద్ భంజన్ బట్

నరముల బలహీనత పోగొట్టును ధాతుపుష్టిని కలుగజేసి జీవితసౌఖ్యము నొడగూర్చును.

బుడ్డి 21 మాత్రలు ఖరీదు రు 1-8-0 లు.

## పెన్‌స్ట్రిక్ పి. పి. పి.

నపుంసకత్వమును పూర్తిగా పోగొట్టును. శరీరమునకు మంచిసత్తువ బలము కలుగజేయును.

బుడ్డి ఖరీదు రు. 3 లు.

జాబులు యింగ్లీషులో వ్రాయవలెను.

**JIWAN RAS DHARA PHARMACY,**
Banstalla Street, CALCUTTA.

---

శ్రేష్ఠమయిన

## భాక్సు కెమేరా

క్రొత్తకెమేరాలు వచ్చియున్నవి. ఫోటోగ్రాఫు నేర్చుకొనువారికి మంచితరుణము. ఒకడజన్ ప్రింటింగు పేపర్లు, 4 ఫిలిం యెక్స్‌పోజర్లు, మంచి లెన్సు, డెవలపింగు ద్రావకములతో రు. 2-12-0. మేలు రకము రు. 3-12-0. వాడు విధము తెలియజేయబడును.



పోస్టేజి ప్యాకింగు వేరు. మూడు కెమేరాలు ఒకేసారి తెప్పించుకొనువారికి పోస్టేజి యుచితము. మీకు నచ్చనిచో మీ సొమ్ము తిరిగి వాపసుచేయబడును.

**BHARAT UNION TRADING Co.,**
**P. B. No. 2394 (Sec. B.) CALCUTTA.**

---

## ఆత్మకథ

(గాంధిమహాత్ముని స్వీయచరిత్రము)

శతావధాని,

వేలూరి శివరామశాస్త్రిగారు తెనిగించినది

ప్రకాశకులు:

కాశీనాథుని నాగేశ్వరరావుగారు

వెల మొదటిభాగము రు. ౦-౧౨-౦.

రెండవభాగము రు. ౧-౦-౦.

కొలదిప్రతులే కలవు. త్వరపడుడు.

మేనేజరు,

ఆంధ్రగ్రంథమాల,

నెం. 7, తంబుశెట్టివీథి, మద్రాసు.

# భారతి

## సచిత్ర మాసపత్రిక


అధిపతి

కా. నాగేశ్వరరావు

సంపాదకుడు

గన్నవరపు సుబ్బరామయ్య



సంపుటము ౧౧, సంచిక ౭

ఆంధ్రపత్రికా ముద్రాలయము, మద్రాసు

౧౯౩౪


విషయసూచిక

## చిత్రములు



---




సంపు. ౧౧ భావసంవత్సరము, ఆషాఢమాసము (జూలై ౧౯౩౪) సంఖ్య ౭

## గ్రీష్మము

కవిరాజహంస, వోలేటి పార్వతీశము

కోకలే మేన గుమ్మితుల గ్రుచ్చెడుకాలము, పేఁబయళ్లపై
రాకలు పోకలుం బగలు రాపడుకాలము, పుచ్చకాయ కే
లోకువపెట్టుకాల, మఱలోఁగిళు లూరుపు లాఁగుకాల, మా
కాకులు గూండ్లు కట్టుకొనుకాలము దాపురమయ్యె నేపునన్.

నీరయిపోయె దీర్ఘికల నిండిననీరు, క్రమక్రమంబుగా
నేఱు లెడారు లయ్యె, వడనింకిననూతులఁ జేదుత్రాళ్లకున్
ఘూరలు బారలయ్యె నెలముంజెకర ల్లెళనీళ్లె జీవనా
ధారము లయ్యె నిర్జలపథమ్ముల నెండల ఘుండు వేసవిన్.

ఆకుటీరమ్ముల యనుదినగండమ్ము, రాచబాటల యంటరాని తెగులు
పద్మాకరముల తాపజ్వర వేదన, పసిపూపపిందెల విసపుఁగోర
కడలుచూపఁగరాని కడలకన్నులదుమ్ము, పచ్చపచ్చికబీళ్ల మచ్చమాపు
పవలింటిపూటల బలిమినమ్మెట్రవేటు, నిదురచాలనిరేల నెత్తికోత

కోడికొండల చెకుముకి పూలకారు, - బడుగుపనివారల యొడళ్ల బందకారు
పాలబాలపాపలయాకురాలుకారు, - విశ్వభీకర మగుచుండె వెట్టకారు.

పొదను జంతువైనఁ బుట్టలోఁబామైనఁ - గలుగులోన నెండ్రకాయయైన
బురదఁ బందియైన సరసిని మీనైన - వేఁగె నొక్కలాగె వేసఁగిఁబడి.

గాలి గరళ మయ్యె, గదులు కుంపటు లయ్యె,-నలరుఁదోఁట లగ్గిచెలమ లయ్యెఁ
దాప మడఁచునీరె దావానలం బయ్యెఁ - గలదె జనుల కింక నిలువ నీడ.

అమరులకు హవిస్సు లందించునిత్య క్రియాచారు లగునాహితాగ్నులకును
అతిథిసత్త్రములకు నాత్మీయులకు వంట కములఁగూరుచు కులకాంతలకును
దినవెచ్చముఁగడించుకొనఁ బాలుపడి కొల్మికడఁ బాటుపడు లోహకారకులకు
బహుజనకార్యధూర్వహధూమయానసంచోదనోద్యోగసంపాదకులకు
నగ్గిచెరలాట తప్పని దగునుగాక - యసురుసురు పెట్టి వేసంగి విసరువేళ
జిహ్వ లివురుటకైన నోర్చెదరు గాని - పోవిడువ రేమొ పొగచుట్ట భోగపరులు.

పగలురేయినొక్క పగిది గ్రీష్మమురాజు - మలఁగి కడల నిప్పులొలుకుచుండ
వేగుకోడికూత వేళమాత్రము ప్రాణ-వాయువుల కొకింత వసముగలిగె.

పందికొమ్మునైనఁ బగిలించు నెండకు - లోఁగి లోకమెల్ల దాఁగియుండఁ
గర్షకునకుఁ బాలికాఁపొక్కఁడే చావు-బ్రదుకునడుమఁ బాటుపడుచునుండె.

వడినడగాలి దూలి వసివాఁడిన వేఁడిచివుళ్లు మెక్కి ప్రా
బడినమెలుంగు నిట్టుసురుపాటున నించుక సంచలింప నూ
మిడిసినడిగుజ్జుగొమ్మ నునుమెత్తనియాకుల మెత్త నొంటిపై
నొడుదొడుకొచుఁ గోకిల కుహూకుహుహూ యనుచుండెఁ బేదగన్.

పగిలివిరిసిన సరసిగర్భములలోనఁ - గమలివాఁడిన దిగ్వితానములలోనఁ
గాలిసోలిన జీవసంఘములలోన, మాఱుమొఱసిన దాపంచమస్వరంబు.

ముడిమెండలు, వడగాడ్పులు - సుడిదుమ్ములుఁ గారుచిచ్చు చుఱచుఱలు జగం
బుడికింపఁగ హాహారవ - మడరఁదొడఁగె నంతకంత కగ్గల మగుచున్.

ఆరవ మ్మతటం బెరసి హైందవసంఘకృతాపరాధఘో
షారవమై, యఘకృతజనాభిభవప్రతిఘాతి వీరఘం
టారవమై, నిరంతరమహాత్మనివేదిత సత్యధర్మగీ
తారవమై లయించె మహితప్రణవారవమం దనంతమై.

---

# మహాభారతము

## వ్యాసునికూర్పు – తిక్కన తీర్పు

మున్నంగి...శర్మ

వ్యాసుని భారతము, నన్నయ - తిక్కనల తెలుఁగింపునఁ బొందిన మార్పుల నించుక విన్నవింతును. పెక్కురు పెక్కుమాఱులు ఇదివఱకు తడవిన ప్రాఁతభావములే నా యీ వ్రాఁత యందును దోఁపవచ్చును. విషయమునందలి తీఁపియుఁ, దల్లినుడిమీఁది వెఱ్ఱివలపును నాతలంపులను వెలువరింపఁ బురిగొల్పినవి. కావున ఈ తెంపరితనము.

### వ్యాసునికూర్పు :

వ్యాసాచార్యుఁడు పదునెనిమిది పురాణములం గూర్చె నందురు. ఈపురాణముల నన్నిటిని వ్యాసుఁడే రచించెనా? భారతకథాసందర్భమున నొకపాత్రయై నటించిన వ్యాసుఁడే ఈపురాణకర్తయా? అనుసంశయములకుఁ జోటీయక, ప్రకృతము మనకు విషయమయిన భారతరచనమునకు మాత్రము కట్టువడి కత సాగింతము.

వ్యాసుని పదునెనిమిది పురాణములలో "భారతము" తలమానికము. తక్కినవానియందు లేని క్రొత్తతెన్నులు భారతమునఁ బెక్కులు. సన్నివేశరచనాచాతుర్యమును, సంవిధానకౌశలమునను, పాత్రసృష్టియందును, భావానుగుణసంభాషణాక్రమనిర్వహణమునను, అన్నిటను వ్యాసుని నిపుణత, భారతమట్లు, మఱియేపురాణమును వెల్లడింపదు. వాల్మీకిరామాయణము కత వేఱు; దాని మార్గమే వేఱు. అది భారతమున కెందునను బోలదు. వ్యాసభారతమును తెలుఁగుభారతముతోఁ, అందు తిక్కనతెలుఁగింపుతోఁ బోల్చినపుడు, వ్యాసకవికూర్పునందలి నెప్పరితనమున నేమఱుపాటులున్నవి; చాతుర్యమున ఛాందసమున్నది; విషయసమృద్ధియందు వివేచనము కొఱవడినది; శబ్దసంపత్తికి ఔచితి జతపడదు; సమయమునకు పొందువడని సంభాషణములు; వృత్తితోఁ బొత్తుగోరని వక్తృత్వము, ఆత్మప్రజ్ఞ దెస మొగము మలఁచిన వాదములు కఱవు దీఱఁ గాంచవచ్చును. కాని, సంస్కృతవాఙ్మయమున రచితములయిన శ్రవ్య, దృశ్యప్రబంధములలో నేదియు నీవ్యాసభారతరచన కెందును ఎనగాదని పెద్దలన్నమాట సమీచీనము.

### నన్నయతెలుఁగుమార్పు:

నన్నయభట్టారకుఁడు విద్వాంసుఁడు; శబ్దానుశాసనుఁడు; శాస్త్రవిదుఁడు; ప్రవక్త; ప్రామాణికుఁడు; ఉభయభాషాభిజ్ఞుఁడు; కవితావిలాసుఁడు; వ్యాసభారతప్రశస్తి నెఱిఁగినవాఁడు; తెలుఁగువలపురుచి మఱిగినవాఁడు; ప్రకృతిసిద్ధమగు రసజ్ఞతఁ గన్నవాఁడు; రాజనరేంద్రుని యాస్థాని పండితుఁడు; తత్పురోహితుఁడును. రసపిపాసువగు రాజనరేంద్రుఁడు తన పురోహితుని నన్నయభట్టారకుని పాండిత్యకవితావిశేషములఁ జక్కఁగ కనిపట్టినాఁడు. మహాభారతస్వారస్యము జుఱ్ఱినాఁడు; భారతమును తెలుఁగునఁ బలికింప ముచ్చటపడినాఁడు; వినయపూర్వకముగ నన్నయను నియోగించినాఁడు. భట్టారకుఁడును, భారతమునెడఁ దనకుఁగల పేర్మికిఁ దన యేలికకోరిక తోడ్పడుట తొంటిపున్నెముగా నమ్మి తెలుఁగుసేఁతకుఁ దలపడెను. అదిమొదలు అరణ్యమునఁ గొంతవఱకు ఆయన తెలుఁగించె నని, ఆతని తెలుఁగుమార్పున సంస్కృతశబ్దజాలము ఎక్కుడుగా పుంజుకొన్నదని, తెలుఁగుభారతవర్తమానముం గూర్చి తెలిసినవారెల్ల రెఱుఁగుదురు. మాతృకం గల భావమును తెలుఁగున దిగుమతి సేయుటయి నన్నయతెలుఁగింపునకు ఉద్దేశ్యము,ప్రయోజనము ననుటయుఁ జదివినవా రెఱుఁగుదురు. భట్ట అటనట ఇంచుక స్వతంత్రత వహింపఁగడఁకఁ జూపినను, మాతృకకుఁ జాలవఱకు విధేయతయు చూపినాఁడు. పటిమతగ్గిన పట్టులు లేవనరాదు గాని ప్రసన్నతకుఁదలఁగిన పంక్తి కలదనరాదు. ప్రయోజనము

పాటింపని సంబుద్ధులు తెలిపినటు, శైలి సడలినది గాని సారళ్యము సంపన్న మయినది. సంస్కృతపదభరితము, సమాసభూయిష్ఠము నయ్యుఁ గటువచస్సు కలికమునకుఁ గానరాదు. నాఁటికి నేఁటికి నన్నయశైలి తెలుఁగు కవితకు ఒక మేలిమచ్చయినది. అరణ్యపర్వమునకు మనే అతనికి ఆయుఃపరిమితి ముగిసినది. కడమనేఁత కట్టువడినది.

### తిక్కనతీర్పు :

నన్నయకుఁ దరువాత ఇంచుమించు ౧౼ శతాబ్దికి భారతము తెలుఁగు నేఁత తిక్కనపాలఁబడినది. ఏకారణ మయిన మనకేమిగాని అరణ్యపర్వశేషమటుంచి తిక్కన విరాటపర్వము తొలిగా స్వర్గారోహణముదాఁక పదు నేను పర్వములను తెలుఁగించినాఁడు. తెలుఁగు నేఁతకు దొరకొనిన తిక్కనకు, నన్నయ భారతము తెలుఁగింపు దక్క, మఱి తెలుఁగు పద్యప్రబంధము లేవేని దొరకి యుండు నేమో చెప్పరాదు. నన్నయకు మునుపు పద్య రచన యున్న దనువాద మొకఁ డున్నది. మచ్చునకు ఆకాలమునాఁటి శాసనములందలి పద్దెములు కొన్ని కనఁబడుచున్నవి. కాని గ్రంథరూపముగ నేవియుఁ గనఁబడవు. నన్నయయే పద్యరచనకుఁ దొంటివాఁ డని గోసయు మఱొకదిక్కునుండి వినఁబడును. సంస్కృత కవిత్వమునకు వాల్మీకి యెట్లు: తెలుఁగుకవనమునకు నన్నయ అట్ల అందురు. సంతసమే! నన్నయకుఁ దక్కిన పరువునఁ దిక్కనకును పాలు లేకపోవదు. నన్నయశైలి, తననాఁటికే, తెలుఁగు బాసయు, కైతయుఁ గమియమాఁగినదని మూదలించుచున్నది. సంస్కృత శబ్దాధిక్యముగా, సమాససమ్మర్దముగా నుం డియు, నన్నయ తెలుఁగుకైత కొకనడకయు, పోతయుఁ దేర్చి నమూనా చూపినాఁడు. అట్లతిక్కనయు, తెలుఁగు పదములకు మిక్కిలి చొరవయిచ్చి పలుఁనడకలతో నొక పోత, నిజవైలక్షణ్యము, స్వనామాంకితము నగుదానిని, తెలుఁగు బాసకుఁ గానుకగ నిచ్చినాఁడు. భట్టారకుని భార తముమార్పుతప్ప మఱి తెలుఁగుకబ్బ మేదియు నగ పడమిఁ, దిక్కనరచనకు నన్నయరచనయ తొలిప్రా పయిన దని యొప్పికొనవచ్చును. కాని నన్నయ తిక్కనల రచనలందలి పరిపాకము గాంచుచో నన్నయ నాఁటికే తెలుఁగుబాసయుఁ, గైతయు నిగ్గుదేఁలిన దని, అదృష్టము లయినవి కాని, సంఖ్యయందు కొలఁది యయినను సారతరము లయిన గ్రంథములు కొన్నియేని యుండియుండు నని, తెలుఁగుకైతకు శ్రీకారము జుట్టిన తెలుఁగువాల్మీకి నన్నయకుఁ బూర్వమే తెలుఁగు గడ్డకుఁ బుట్టియుండు నని ఊహించుట కెంతేని యవ కాశము కలదు. సరి, ఆగోడవ యటుండె.

తిక్కన, తనరచనకు మొదలికుటకుమున్న, నన్నయరచనం గాంచి, తెలుఁగుపలుకుబడికి పరువు చాల తగ్గినదని, తెలుఁగురూపే మాఱినదని, దానితో తెలుఁగునడత, నవకము, ఎక్కటితనము మాఱిపోయె నని, తెలుఁగును మూఁడుపాళ్లు సంస్కృతము మ్రింగి వేసిన దని, ఇట్లే పగాకుగ నున్నయెడ ఇంకను తెలుఁగు సంస్కృతమునఁ గరఁగిపోవునని వగచి కాఁబోలు తన చేతలోఁ దెలుఁగునకుఁ బెద్దగా నెల విచ్చినాఁడు; రూపునకుఁ దెచ్చినాఁడు; దిద్దితీర్చినాఁడు; అమృతము వోసినాఁడు; బ్రదుకుదెఱువేర్పఱిచినాఁడు. ఈతని తెలుఁగునేఁత కిదియ మేలియక్కఱ. ఇంతియకాదు— ఈయక్కఱ నూఁడి, నన్నయ తన కూర్పున కెక్కిం చిన నుడులగమిగాక, తననాఁడు, తెలుఁగుసీమయందు పలునాడుల వాడల గూడెములఁ బరిపాటిగ నాడుచుం డిన నుడులను దెక్కింటిని కూర్చి పేర్చి, రూపు సెడిన వాని తొంటిపుట్టుకయు వాలకమును నుఱితించి, నొక్కుదీర్చి తనవ్రాఁతను గుప్పించినాఁడు. అంతే అంతటితోఁ దెలుఁగుబాస మొగసాలకు గడియపడినది.

పిమ్మట బయలుదేఱిన కవులఁబొఁ బెక్కురు, వ్రాఁతయందును, పోతయందును మునుపటిగాడిలో వైచి తమకైతను ఈడ్చుట అటుండ, తమ మునుపటి వారు తమ పొత్తముల వాడిన పలుకులతోఁ దనిసిరే కాని, మున్నటి కబ్బముల కెక్కని నుడులను, తమ నాఁడు వాడుకలో నున్నను, తమకూర్పునఁ జేర్పఁ దెగిం పరైరి. కావుననే మన తెలుఁగు నాఁటికి నేఁటికి గుంపటి లోని మొక్కవలె, ఎదుగు పొదుగు లేక, గిడసవాఱి నది. ఉకురుగలబాసకుఁ దెంపొక పెద్దగుఱుతు.

తిక్కన తర్వాతికవులు—శ్రీనాథుఁడు లోలు తగా నలువురయిదుగురుమాత్రము, తిక్కన వాడని నుడులను గొన్నింటిని తమ కబ్బములం జొప్పించిరి. అందు "ఆముక్తమాల్యద"కారుఁడు పెక్కింటినిఁ బనివడి కూర్చి తన కతకుఁ జేర్చికొన్నాఁడు. తిక్కన, ఏపట్టున నేని తలఁపున కొప్పిన తెలుఁగుపలుకు దొరకినంతన ఒప్పరి కింపక, నడకతిన్నదనముంగూడఁ బాటింపక పొదిగినాఁడు. ఆతని మక్కువ కగ్గమగుటకతమునన తెలుఁగు నేఁటి దాఁక ఒకనెరవున ఎక్కటితనముతో బ్రదుకఁగలిగినది.

తెలుఁగునుడి- నేటికాన్పు:

ఒక్కొక్కరును, ఆవలకు కబ్బములకెక్కక, తమ నాఁటి వాడుకలోనుండుమాటలను జతపఱుచుచుంట, పలుకుబడికి బలుపు పరువు గూరుచుండును. వెనుకటి వారిపొత్తము లేని మాటలు, తారు వాడఁగూడ దను నెట్టికి లోనుగాక, నూటిగా గ్రుచ్చి యొత్తుచుండవల యును. పొత్తముల కెక్కిన పలుకులతో వలగొను చుండవలయుఁ గాని, క్రొత్తనుడులకు, వాడుక నున్న వానికి, ఎడ మీఁగూడ దను కట్టడ లేదు. తమ వ్రాఁతల లోఁ గ్రొత్తపోకడలను, క్రొంగ్రొత్త వన్నె - చిన్నెల ను గులికింప వెలయునట్లు వాడుక నున్న నుడుల, అను-పానులు, అర్థమును దెలిసి అనువగుచోట్లఁ జొప్పింపఁ దమకపడవలయును. ఇట్టి కడఁకయందు ముందంజ నైచుట తల్లి బాసకు నిజముగ నూడిగ మగును. దానఁ దమ ఎక్కటితనము, వలఁతితనము వెలయఁగలవు. బాసయుఁ బొదలఁగలదు. 'కృతకభాష' అనుసడి తప్పును. 'జీవద్భాష' యన్న మేలిమాట యొప్పును.

వాడుకమాత్రమున నుండి, ఈవలకు కబ్బముల కెక్కనిమాట లెన్నేని కడమవడియున్నవి. కబ్బముల కెక్కని నుడులు నిఘంటువుల కందవు. ఇంతవఱకు "శబ్దరత్నాకర" మొక్కఁడే తెలుఁగున ననుకొనఁదగిన నిఘంటువు. ఇది సంస్కృతాంధ్రశబ్దములం గూడినది. వట్టి అచ్చతెనుఁగుమాటలం గూడిన "లక్ష్మీనారాయణీయము" కూడ నొకపాటిగ నెన్నఁదగినదియ. తెలుఁగు వ్రాయసకాండ్రకు, శబ్దార్థమునకై వెంపరలాడువారికి, పైరెండు నిఘంటువులే ఏడుగడ లయినవి. శబ్దరత్నాకరమున మొదట, గ్రంథస్థములు కాక, వాడుకలో నుండుమాటలు కొన్ని కూర్పఁబడి యుండెను. ఈతరువాతికూర్పులలో శబ్దరత్నాకరమున మఱికొన్నిమాటలు చేర్పఁబడినవి. అవి ఆంగ్లాది విదేశీయములు. ఉదా: స్టేషన్, స్టీమరు, స్టోరు, గుమాస్తా, మునిషీ—ఇట్టివి. ఇట్టిమాటల కూర్పు కొఱమాలినది. దీని ప్రయోజన మింతయుఁ దోఁపదు. కబ్బముల వాడక, నిఘంటువుల కెక్కక, వాడుకమాత్రమున నున్న తెలుఁగునుడులు పెక్కు లున్నవి. నాడు నాడులు తిరిగి జనులవలనఁ దెలియఁదగినవి. ఇట్లు తెలిసి కబ్బములకు, నిఘంటువులకును ఎక్కించినచో నెక్కుడుగ నక్కఱపడఁగలవు. ఈచెప్పిన వెరవున మాటలఁ బ్రోవుసేయు జతనమే కానరాదు.

వ్యాసుని కూర్పునకు తిక్కనచేసిన తీర్పుం గూర్చి ముచ్చటించుటకు మున్న, తెలుఁగుసీమనాడులలో రూపుచెడి వాడఁబడుచున్న నుడులను తిక్కన రూపుసేసి తన రచనఁబొందుఁ జొప్పించె ననుటకు మూదలగాఁ గొన్నిటి నిటఁ జూపుదును:—

| వాడుక | తిక్కన | అర్థము | వాడుసీమ |
| --- | --- | --- | --- |
| కాయి | క్రాయు | = ఉమియు[1] | కర్నూలు, బళ్లారి, అనంతపురము, మొలకసీమ, (నైజాం) |
| శీమార్లు | చిరమరలు | = చిక్కులు[2]. | కర్నూలు, నైజాం. |

౧. క్రాయు. ఉదా :—
'భువనభయంకరంబు.. .........
.......................
...................... కొ
రవకులముఖ్య, యుష్మలిక గ్రాసితె...'
—శాంతి ౧-౮.

౨. చిరమరలు. ఉదా :—
'సారహీనములగు............
........................
.........................
చెలిమివేర్పాటను చిరమరలకు...'
—శాంతి ౧-౫౮.

| | | |
|---|---|---|
| పిట్ట | పిట్ట = మట్టిపెల్ల౧. | తెలుఁగు సీమలోఁ |
| ముట్టు | ముట్టు = వస్తువు౨ | కొన్నిచోట్ల. |

ఎదుగు ఎద్దు=క్రమ్మ.వెన్నంటు౩. పడమటిసీమ నంతట,నెల్లూరు,నైజాం.

భారతము నుత్తమనఁ బ్రయుక్తములై, రూపుమాఱి వాడుక నున్న మాటలు మచ్చునకు:—

| వాడుక. | భారతము. | అర్థము. | వాడుసీమ. |
|---|---|---|---|

ఆమోయిన-అమ్మోయినను౪=ఉన్నపాటున-తెలుగుసీమ నంతటను.

ఉగెత్తులు-ఉవ్వెత్తున౫= అడుగాన - పడమటిసీమలోఁ బెక్కుడల,నెల్లూరు.

ఎదారు - ఎడారు-ఎసరు౬=జనుపు-కర్నూలు, బళ్లారి, అనంతపురము,నైజాం.

పళి - ప్రయి౭ = నింద, సడి - నెల్లూరు, కడప కొంతభాగము.

నంజర - నంజుడు౮ = మాంసము-కర్నూలు, నైజాం.

గ్రామ్యసకాంధ్ర యాదరమునకు దూరమై వాడుకలో నున్న మాటలకు మచ్చు కొన్ని:—

| మాట. | అర్థము. | వాడుసీమ. |
|---|---|---|
| దూదర<br>రూ. దూగర<br>నామర | = పైరులకుఁ బట్టు తెగులు. | కడప జిల్లా. |
| సాంగెము | = సంఘమర్యాద. (సాంఘ్యము.) | పడమటిసీమ యంతయు. |
| సంగెన = | ఎక్కుడు. | కర్నూలు, బళ్లారి, అనంతపురము, నైజాము. |

౧. పిట్ట. ఉదా:—

'గురుని మాట సరకుఁగొనమి, దుశ్శీలతే
పిట్ట పుడుకగోరు............—'ఆను ౪-౯౦.

ఈమాట "శబ్దరత్నాకరము"న కెక్కదు.

౨. ముట్టు. ఉదా:—

'పారావతేములు............
...............పసిఁడిం
దారమునసైన ముట్టులు......'

—ఆను ౪-౧౧౮.

౩. ఎద్దు. ఉదా:—

'ఇట్లు కలయం గనుంగొని...వీర లెయ్యది
యద్దుపడి.................

—ఉద్యో. ౪-౨౫౦

౪. అమ్మోయిన. ఉదా:—

"గోవుల...............
.సరభసమై వానిపిరుందఁదిరిగి యమ్మోయిపఱచే."

౫. ఉవ్వెత్తున. ఉదా:—

"కవలవారు............
.....................
ఒక్కమాత్రలోన నువ్వెత్తుగొనరె!"

—ఉద్యో. ౧-౪౯.

దీనికి ఉత్పాత మని వాడుక అర్థము.

౬. ఎడరు - ఎడారు. ఉదా:—

'వలదు శంకింప నింద్రునివలనఁ బుట్టు
నెడరు వొందక..... ......"

—శాంతి. ౧-౨౬౦.

౭. ప్రయి. ఉదా:—

"నన్నిటు లాదురాత్ము సదనంబునకుం.. ...
బన్నము లన్నియుం దెలిపి ప్రయ్యిడనే"

—విరాట. ౨-౧౫౪.

ఈపదము "శబ్దరత్నాకరము"నఁ గానఁబడదు. అరవమున పళి; కన్నడమున బయ్యి. అర్థ మన్నిటనొక్కఁడే.

౮. నంజుడు. ఉదా:—

'అనఘ, విశాఖ.........
'క్రొవ్వుఁగల మేఁకనంజుడు......'

—ఆను. ౨-౩౭౯.

తిక్క = రాచు, రుద్దు. ,,
శగటు = చక్కట్లు - పరిహాసోక్తి అనంతపురమున, కదిరి తాలూకా.
సల్లాపొద్దు / పల్లాపగలు } = ప్రొద్దాక.
పనార్లు = పనిచేటులు. పశ్చిమసీమ.
పంగెన = దెప్పును. ,,
బంకు = అరుగు. కర్నూలులో కొంత భాగము, సైజాము.

ఇంత చాలును, తెలుఁగుబలుపు తగ్గుటకుఁ, దెలుఁగునుడులమెఱుఁగవులు చూపుచున్న ఒప్పిదికింపునకు నిదర్శనముగా పైపలుకులను దెలుపుచుఁ గొంత కొమ్మదాంట్లు వేయవలసివచ్చినది. ఇఁక అసలుకత నందికొందము.

## వ్యాసునికూర్పు - ఏమఱుపాటు:

పట్టు: అద్దమరేయి— వంటయిల్లు— వడముడి మైమఱచి నిటురించుచున్నాఁడు—కీచకునిచేఁ దన పడిన యగడు సైరంధ్రి భీమునితోఁ దలపోసికొనవచ్చినది.

అడవులలోఁ బెరిగిన మూఁడేండ్ల యీడుగల ఆవు తొలిమాఱు ఎదగొని పొగరుతో నున్న కోడెను దరిసినట్లు, నీరిచాయ నున్న కొంగపెంటి కలయికఁ గోరి తనజోడు (పోతుకొంగ)ను జేరినట్లు, ద్రోవది భీముం దరిసినది; గోమతీతీరమందలి మహాసాలమును తీగవలె, పాండురాజు రెండవకొడుకును పాంచాలరాజపుత్త్రి పొదివికొనెను; అట్లు అతని నిజబాహుయుగళిచేఁ బొదివికొని, సులక్షణవతియగు నాకృష్ణ, దారి తెన్ను లేని యడవిని బడి నిదురించు సింహమును సింహివలె మేల్కొల్పెను. కరిణి తనజోడునట్లు శీలవతియగు పాంచాలి భీమసేనునిఁ గౌఁగిలించి, వీణనుండి వెడలు గాంధారస్వరమువంటి మధురస్వనమున భీము నిట్లు సంబోధించెను:

"ఉత్తిష్ఠోత్తిష్ఠ, కిం శేషే, భీమసేన, యథామృతః,
నామృతస్య హి పాపీయాన్ భార్యామాలభ్య జీవతి."

[చచ్చినట్లు పరుండితివి, భీమసేనా, లెమ్ము లెమ్ము! బ్రదికినవానికి భార్యయనుదు నేని ఆపాపి చావకుండునా!]

అని సైరంధ్రిచే వ్యాసుఁడు పలికించినాఁడు! అదనున కనువుగా నడవనేర్చినది: కొండవంటి తాల్మి గలది! ఐదుగుర మగలవలపు సరిగా గడించినది! కలఁకు లలమియు మెలఁకువ గోల్పడనిది! మగలవెంట వలచి సిలుఁగులఁబడ నోపిన యిల్లాలు! ధర్మరాజును మొదలుగా మగలను రాచఱికపు నడకలం గూర్చి ఎచ్చరింపఁ గల వలఁతి!* అత్తమది కెక్కిన కోడలు!† ఇన్ని మేలి గొనముల నలరారు ద్రోవది, కీచకుఁడు తన్నుఁబఱచిన యాఱడి ఎఱిఁగించి భీము నెసగొల్పి చలముదీర్చికొనఁ బనివడి సగమురేయిని వంటయింటికడకు వచ్చిన ద్రోవది "భీమసేనా, చచ్చినట్లు పడియున్నావు లేలెమ్ము" అనుట అదనున కనువగునా? ఆమెనడతకు ఉఱవగునా? ఆవు కొంగ సింహి ఏనిక తీవ ఉపమానములు పెంపునకే కాని సమయయోగ్యమా! సరసమా! వట్టిఘాఁదసమనవలదా! మఱియుఁ జూడుఁడు

*కుంతిమాట—
"భుజబలమున జీవించుట
నిజధర్మము; మెత్తవడుట నింద్యము; మాద్రీ
ప్రజలకుఁ జెప్పుము; ద్రుపదా
త్మజఁ గార్యం బనుగుమనుము తగ నండఱితోన్."
ఉద్యోగ. ఆ 3-౯౯౯.

†"కొడుకులకంటె నయ్యనుఁగుఁ
గోడలి కెక్కుడు గూర్తుఁ; గోడలున్,
గొడుకులు సేయు భక్తి, కట
కోటిమడుంగులు భక్తి నాకు నె
ప్పుడుఁ దగఁజేయుచుండు! నది
పుణ్యచరిత్ర! కులాగ్రగణ్య...
......................
........................."
—ఉద్యోగ. ఆ 3-౯౮౩.

"ఇంతతొందరగా నిట కేమిపనిబూని వచ్చితివి ?" అని భీముఁడు ప్రశ్నించినాఁడు. సరే. అడుగఁదగిన మాటయే. పాంచాలి కైన పరాభవము నెఱిఁగియు నిట్లనాలోచితముగ నడిగె నేల అన నక్కఱలేదు. నిదురమబ్బున నడిగెనని, లేదా భుజబలమేకాని బుద్ధిబలము భీమునియందు తక్కువని సమాధానపడవచ్చును. పదంపడి, భీముఁడు "నీ వన్నె మాసినది! వెల్లనై యగపడుచున్నావు! తేటతెల్లముగా నాకెల్ల ఎఱిఁగింపుము. అది సంతోషప్రద మయినదో, సంతాపకారణ మయినదో, ప్రియమో అప్రియమో నిజము నాకుఁ దెలిసికొనవలయును. అంతయు విని తగినవెరవు చేయుదును."* అని భీమునినోరఁ బలికించినాఁడు వ్యాసుఁడు! ఒరు లెఱుఁగకుండ మెలఁగవలసినవారు గదా ఈదంపతులు! భీముని పరున్నచోట దీప ముండెనే యనుకొందము. ఆదీపమును దూరమున నుంచియో, ఆర్పియో చీఁకటింటనుండి గుజగుజలు వోయియుందురు గాని, తమ మఱుఁగుబాటు బయల్పడునన్న బీతుగలవారు దీపము వెలుఁగున సుద్దులు సాగింతురా? ఇందేమి ఔచితి కలదు? సభలో కీచకుని తాఁపు దిన్నపుడు పాంచాలిని భీముఁడు చూచెఁగదా? అప్పటికి లేని వన్నెమాఁపు వెల్లబాటు క్రొత్తగ ఆమెయందు భీముఁ డేది చూడఁగలిగెను? ఆతాఁపునకు ఈతలపోతకుఁ దడ వెంతపట్టినది?

### తిక్కన తీర్పు:

తిక్కన ఈపట్టును ఎంతకొలఁదిలో ముగించి ఔచితిం గాపాడెనో తిలకింతము. చెప్పవలయునది మానఁడు; మానఁదగినది చెప్పఁడు. అక్కఱయయిన దానిని వదలఁడు; అనవసరమగు సోదెకు దిగఁడు. ఆవు ఎదఁగొని కోడెను గదిసెనని, ఆడుకొంగ మగకొంగకై వలపులాడె నని అక్కరమాలిన ప్రసంగమును గ్రుక్కక, సూటిగా పాత్రమర్యాదకును, పట్టునందలి భావమునకును ఒప్పిదమగునట్లు నాట్యకళాకౌశలముం గుప్పినాఁడు—చిత్తగింపుఁడు!

రాత్రిసమయం బగుటయు సమస్తజనంబులు గ్రమంబున నిద్రింపం దొడంగినం, దానును శయ్యాతలంబు విడిచి మేనిధూళి గడిగి, ధౌతపరిధానపరీతయై, మహానసగృహంబున సుప్తుండైన వృకోదరుకడకుం జని,—

"నన్నుఁ బరాభవించి సద
నంబునకుం జని కీచకుండు ము
న్నున్న తెఱంగు దప్పక సు
ఖోచితశయ్యను నిద్రసేయ, నీ
కన్నుమొగుడ్పు నూఱటకుఁ
గారణ మెయ్యది, భీమసేన, మీ
యన్న పరాక్రమంబు వల
దన్న నొకో దయామాలి తక్కటా!"

అనుచు మందమంద సంభాషణంబుల సంబోధించు పాంచాలిపాణిస్పర్శంబున మేలుకని 'ఇది ఎవ్వరు ?' అనవుడు, 'నేను' అను నమ్మానిని యెలుంగెఱింగి, భీమసేనుండు, 'యాజ్ఞసేని కీచకు దురాచరణంబు నాకుఁ బ్రకటించి, వాని నిర్జింప నియోగించు నదియై యరుగుదెంచెం గావలయు! అత్తెఱంగు ఇత్తెఱవ తాన చెప్ప విందు' నని తలంచి,

'ఇంత ప్రొద్దేల యిచ్చోటి కేగుదేరఁ ?
గారణం బేమి ? యెవ్వరుఁ గానకుండు
నట్లుగాఁ జనుదెంచితే యంబుజాక్షి !'
అనిన నయ్యింతి యి ట్లను నతనితోడ :

'ఎఱిఁగి ఎఱింగి న న్నడుగ
నేమిటి! కిప్పుడెఱింగి యింతకుఁ
మఱచుట గల్గెనే నది వినం
బనిలే; దటుగాక యున్నయూ
పెఱిఁగియు, నేన చెప్ప విన
నిష్టము గల్గుట చాల లెస్స! య

*"కేనాస్యర్థేన సంప్రాప్తా త్వరితేవ మమాన్తికమ్? న తే ప్రకృతిమాన్ వర్ణః కృశా పాణ్డుశ్చ లక్ష్యసే.
ఆచక్ష్వ పరిశేషేణ సర్వం విద్యా మహం యథా; సుఖంవా యదివా దుఃఖం ద్వేష్యంవా యదివాప్రియమ్?

త్తెఱఁగెఱింగించెదర విసుము
　　తెల్లముగా మొదలింటినుండియుక్.'

అని యా తరువాతికథ పలికించినాఁడు. ద్రోపది ఇట్లు తనకడ చెప్పికొను వరుసను—

న్వ్యాసునితీర్పు :

గొంతి పెద్దకొడుకు తొంటివైభోగము, ఇప్పటి పేదతికముం దలంచి పోల్చి పొక్కుచు పాంచాలి భీమసేనునితో వాపోవుచున్నది :

"పదివేల ఏనుఁగులును పదివేల గుఱ్ఱములును బంగారుచౌడోళ్లతోఁ దనవెంట నడవఁగా నూరేఁగు ధర్మతనయుఁడు నేఁడు జూదముతో బ్రదుకుచున్నాఁడే! నూఱువేలరథములు, అమితఓజస్సంపన్నుని మహారాజును యుధిష్ఠిరుని ఇంద్రప్రస్థమునఁ గొలుచుచుండెడివే! నూఱువేలమంది దాసీలు ఎల్లప్పుడును రేయుంబవలు తన (ధర్మసుతుని) వంటయింట వడ్డనపాత్రలు చేపట్టి అతిథులకు భోజనములు పెట్టుచుండెడివారే!
......................"*

ఈతలపోతయందు కవితాకళ మూతిముడిచినది. పట్టిజాబితా తయారయినది. కేవలము మూలమునకు విధేయమగుటచే—

" పదివేల హస్తులు పదివేల హయములు
　　నెవ్వని వాకిట నెనసియుండు."

అని "శ్రీకృష్ణభారతము"నను తెలుఁగింపఁబడినది.

తిక్కన తీర్పు :

" ఎవ్వాని వాకిట నిభమదపంకంబు
　　రాజభూషణరజోరాజి నణఁగు,
ఎవ్వనిచారిత్ర మెల్లలోకములకు
　　నొజ్జయై వినయంబు నొఱపు గఱపు,
ఎవ్వని కడకంట నివ్వటిల్లెడు చూడ్కి
　　మానితసంపద లీనుచుండు,
ఎవ్వని గుణలతి లేడువారాసుల
　　కడపటి కొండపైఁ గలయఁ బ్రాఁకు,
అతఁడు భూరిప్రతాప మహాప్రదీప
దూరవిఘటితగర్వాంధకారవైరి
వీరకోటీరమణిఘృణివేష్టితాంఘ్రి
తలఁడు కేవల మర్త్యుఁడె ధర్మసుతుఁడు!
　　....................."

అని చక్కని చిత్తారిపనితనముఁ జూపినాఁడు. వాచ్యముగ నుండినదానికి వ్యంగ్యరూపమిచ్చి కవిత్వ మనిపించినాఁడు. స్థాయి నెఱిఁగి, భావము నెఱిఁగి, ఆలపించి జీవము పోసినాఁడు. పట్టిమాటల జాబితాకు, ఒకపోతకుఁ దెచ్చి, మేలిపూత యిచ్చినాఁడు.

ఈపర్వమున మఱొకపట్టు :

నాలవ ఆశ్వాసము : సాలంకృతుఁడు, సాయుధుఁడు అర్జునుఁడు ఉత్తరునిం దట్టి జముపుబాపి నొగమీఁదఁ గూర్చుండఁబెట్టి తాను రథియై కురుబలముం దఱుముచున్నాఁడు.

తమ కురుసేనవంకకు వడిగా వచ్చుచున్న అర్జునుని రథధ్వానము వాతావరణమునం దంతట గ్రమ్మినది. కౌరవులు అతని పతాకాగ్రముం గాంచిరి. అతని రథధ్వానమును, తఱచు మొఱయు నతని గాండీవగుణరవమును వినిరి. ఆమహారథికుని ఆగాండీవధ్వనియు వచ్చుట గమనించి కాంచి ద్రోణుఁ డిట్లనియె :

దూరమునఁ బ్రకాశించునది యాపార్థుని కేతనాగ్రము. ఇది యాతని యరదముచప్పుడు. ఈభయంకరముగ గర్జించునది అతని పతాకయందలి వానరము. ఆవానరధ్వని సేనలనెల్ల సంక్షుభిత మొనర్చినది. ఆరథశ్రేష్ఠమున నధిష్ఠించియున్న యామహారథికాగ్రణి

---

*" దశ నాగసహస్రాణి హయానాం హేమమాలినామ్,
　　యం యాన్త మనుయాన్తీహ సో ఒయం ద్యూతేన జీవతి!
రథాః శతసహస్రాణి నృపాణా మమితౌజసామ్,
　　ఉపాసన్త మహారాజ మింద్రప్రస్థే యుధిష్ఠిరమ్!
శతం దాసీ సహస్రాణాం యస్య నిత్యం మహానసే
　　పాత్రీ హస్తం దివా రాత్ర మతిథీక్ భోజయ త్యుత!"

మేఘగర్జాసన్నిభ మయిన గాండీవధనుష్టంకారము చేయుచున్నాఁడు.* ఇది వ్యాసుని కూర్పు.

పూర్వార్ధమునఁ దొలుత రథధ్వానము వినఁబడె నని, పిదప ధ్వజాగ్రము కనఁబడె నని, తరువాత గాండీవజ్యా రవము వినఁబడె నని వైశంపాయనుఁ డన్నాఁడు. ఉత్తరార్ధమునఁ దొలుత సిడము కనఁబడె నని, అంతట రథముచప్పుడు వినఁబడెనని, తరువాత గాండివము నల్లెత్రాటిని మీటుచున్న అర్జునుఁడు రథమునఁ గూర్చుండి యుంట యగపడె నని ద్రోణుఁ డన్నాఁడు. ఈవినఁబడుటలో కనఁబడుటలోఁ గల వ్యాఘాతము లటుండె. దూరమునుండి దొడవుల్లఁ జేరవచ్చు రథగమనమందలి పరిణతిక్రమమా ఇది అని ప్రశ్న. వీరపురుషోచితమను శంఖారవ మిందు లేదు. పోనిండు. అది పార్థుని కేతనాగ్రమని, ఇది యతని తేరిచప్పు డని, అది యతని జెండాయందలి వానరగర్జ యని నిస్సంశయముగఁ జెప్పుచున్నాఁడే ద్రోణుఁడు! మఱియుఁ గాండీవధనుష్టంకారము సేయుచు నతఁడు రథమునఁ గూర్చుండి యున్నాఁడనియుఁ జూచి పలికినాఁడే! ఈకూర్పున నేర్పరితన మేదేనిఁ గలదా? క్రమగతి పాటింపఁబడెనా?

చిత్తగింపుఁడు తిక్కనచిత్తారిపనితనము:

"శ్రవణపుటంబులు వ్రయ్యంగఁ దాఁకి సం
క్షోభంబుఁ గావించె గుణము మ్రోఁత;
బ్రహ్మాండభాండంబుఁ బగిలించి భూత ని
శ్చైతన్య మొనరించె శంఖరవము;
గగనభాగం బెల్లఁ గప్పి క్రాలుచు బెగ
డడరించె నుగ్రంపుఁ బడగపఱపు;
మిఱుమిట్లు గొని మూఁక పఱివోవ వెలిఁగి ప
రిభ్రాంతి సేసెఁ గిరీటకాంతి;

తెల్ల: మిది గాండివంబును, దేవదత్త
మును, గపిధ్వజమును, వాసవుని వరమునఁ
గన్న మకుటంబు—నను వేఱొక్కొ న్నియైన
నుజ్వలాద్భుతభంగుసలై యున్నె యిట్లు!"

తొలుత అల్లెత్రాఁటి మ్రోఁత, దానివెంట శంఖధ్వని వినఁబడెను. అంతట పతాకాగ్రముమాత్రము; దానితో కిరీటకాంతులుమాత్రము కనఁబడెను. ఆయతి ద్రాటిమీట గాండివముదే యని, ఆదిందము మ్రోఁత దేవదత్తముదే యని, ఆపడగపఱపు వానరాంకమే యని, ఆకిరీటకాంతులు ఇంద్రదత్త మగు మకుటప్రసారితమే యని — వాని పావిత్ర్యములను, వైలక్షణ్యములను బట్టి యూహించి నిశ్చయించెను. చాలును-హృద్యమగు నీసందర్శనమును, కళాప్రవణతను ఇంతకన్న వాచ్యము చేయఁగాదు. ఆకూర్పునకు ఈతీర్పునకుఁ గల తెలుఁగుమెలుఁగులు రసలుబ్ధుల కూహ్యములు.

## వ్యాసుని కూర్పు:

సంజయుని రాయబారముపట్టు: ధర్మరాజు మాట:

"కర్ణశ్చ జానాతి సుయోధనశ్చ
ద్రోణశ్చ జానాతి పితామహశ్చ,
అన్యేచ యే కురవ స్తత్ర సన్తి
యథార్జునా న్నా స్త్యపరో ధనుర్ధరః.
జాన న్త్యేత త్కురవః సర్వఏవ
యే చాప్యన్యే భూమిపాలాః సమేతా,
దుర్యోధనే రాజ్య మిహాభవద్యథా
హ్యరిన్ద మే ఫాల్గునే విద్యమానే.
తేనానుబన్ధం మన్యతే ధార్తరాష్ట్రః
శక్యం హర్తుం పాణ్డవానాం మనుత్వమ్

*"మహారథ మనుప్రాప్తం దృష్ట్వా గాణ్డీవధన్వినమ్,
అయం వీరాశ్చ శూరాశ్చ దుర్ధర్షాశ్చైవ సంయుగే.
ఏత ద్ధ్వజాగ్రం పార్థస్య దూరతః ప్రతిదృశ్యతే,
మేఘాః సవిద్యు స్తనితో రోర్వీతిచ వానరః
ఆస్థాయచ రథం యాతి గాణ్డీవం వికిప న్ధనుః.
అశ్వానాం స్తనితం శబ్దో వహతాం పాకశాసనమ్,
రథ స్యాంబుధర స్యైవ శ్రూయతే భృశదారుణః.
దారయన్నివ తేజస్వీ వసుధాం వాసవాత్మజః,
ఏవ తిష్ఠన్ రథిశ్రేష్ఠో రథే రథిశతప్రణుత్.

కిరీటినా తాళమాత్రాయుధేన
తద్వేదినా సంయుగం తత్ర గత్వా.

*     *     *     *

గాణ్డీవ విస్ఫారితశబ్ద మాజా
వశృణ్వానా ధార్తరాష్ట్రాః (ధ్రియన్తే;
క్రుద్ధం నచే ద్వీక్షతే భీమసేనం
సుయోధనో మన్యతే సిద్ధ మర్థమ్.
ఇన్ద్రోః ప్యేత నోత్సహే త్తాత హర్తు
మైశ్వర్యం నో జీవతి భీమసేనే,
ధనఞ్జయే నకులేచైవ సూత,
తథా వీరే సహదేవే సహిష్ణౌ.

*     *     *     *

ఈ క్రింది తెలుఁగుపద్యములలో పైవాని యర్థము సుస్పష్టమగుట ముందటివానికింబలె గద్యరూపమున వ్రాయమానితిని. పైవానియందలి భావమును జెక్కు చెదరనీక తన మార్పునఁ గూర్చి, అందలి సడలుబాటు ఇందుఁ బొరయనీక, సుప్రసన్నముగా భావమును సాక్షాత్కరింపఁ జేసినాఁడు తిక్కన-ఉపలక్షింపుఁడు!

తిక్కన తీర్పు :

ధర్మరాజు :

" చాపాచార్యుఁడు, భీష్ముఁడుం, గృపుఁడు, న
శ్వత్థామయుం, గర్ణుఁడున్,
భూపశ్రేష్ఠుఁడుఁ దారు మ న్నెఱుఁగరే
పో ! రెట్లుఁ గయ్యంబు ; లా
శాపాళంబులు జుట్ట లా వెఱఁగియుం
జావేఁడిమార్కొందు ! రిం
తేపో ! తమ్ముఁ గపిధ్వజప్రభల యం
ధీభూతులం జేయవే !"

*     *     *     *

" గాండీవజ్యారవం బుత్కట మయి పెలుచం
గ్రమ్మినన్, భీమబాహా
దండం బేపారి కుంభద్గద జడియుచు రా
ద్రంబుగాఁ దోఁచినన్ వే
దండద్వంద్వంబుమాడ్కిం దఱిమికవలు మా
ద్యద్గతిం దాఁకినన్, జా
కుండం బోకుండఁ గౌరవ్యులకు వళెమె బి
ట్టులికి మూర్ఛిల్లకుండన్."

పై నుదాహృతమగు వ్యాసకృతమూలమునకును, తిక్కనతెలుఁగునకును గల భేదము సవిమర్శముగఁ బరికింతము.

"కర్ణశ్చ జానాతి........." అని వ్యాసుఁడు. వాచ్యముచేసినాఁడు. తిక్కన దానికి, సంక్షిప్తపఱచి, భావమునకుఁ బుష్టినిచ్చి, వ్యంగ్యపూర్వకముగా కవితా కళను సాధించినాఁడు. వ్యాసుఁడు, కర్ణుని సుయోధనుని, ద్రోణుని భీష్ముని వరుసగాఁ జెప్పినాఁడు. కృపాశ్వత్థామలపే రెత్తఁడు! తొలుత కర్ణునిఁ, బిమ్మట సుయోధనుని, తరువాత ద్రోణ-భీష్ములను—నలువురను క్రమపఱచినాఁడు. దేనినిఁబట్టి ఈ క్రమము నిర్ణయించి నట్టు? అధికారార్హతను బట్టియా? ఔచితిని బట్టియా? ఎఱుకగలవారినిఁ బేర్కొనవలయునెడ ద్రోణ-భీష్ముల నుగ్గడించి తరువాత ఎవరినేని చెప్పఁదగును. సర్వ మెఱిఁగియుఁ దనపంతమే నెగ్గవలయు నను సుయోధనుఁడు హఠయోగి; కర్ణుఁడో : రారాజు అడుగుజాడలఁ బట్టి తనతోఁచినట్లు నూటిగా నడచు కర్మయోగి. ఇట్టి వీరిని ఎఱుకగలవారిలోఁ దొలుతగాఁ జెప్పుటయు, నిజముగా ఎఱుకగల ధర్మయోగులను- ద్రోణ, భీష్ములను- తరువాత చెప్పుటయు ఔచితి యనఁబడునా? ధర్మరాజు సంజయునిలో వరుసగా నీనలువుర నిట్ల నుడివెనని పురాణములపుట్టు వెఱింగిన బుద్ధిశాలురు వాదింపఁ బూనరుగదా ! అర్హతను, అధికారతారతమ్యములను, ఔచితినిఁ బాటించియకాఁబోలు—తిక్కన, ద్రోణ, భీష్ముల తరువాత కృపాశ్వత్థామలను, పిమ్మట కర్మయోగిని కర్ణుని, పదంపడి హఠయోగిని సుయోధనునిఁ బేర్కొన్నాఁడు ! ఎఱుకగల పెద్దలను వరుసఁ బడి తెలిపి, ఎఱుఁగఁజాలని ఎఱుఁగనొల్లనివారి నిద్దఱను వాకొన్నాఁడు. ఎప్పుడు ఎక్కడ ఎవ్వఁడు ఎట్లు పేర్కొన్నను, చాపాచార్యునో శాంతనవునో— ఇరువు

రలో నొకని మొదల నిడి, కృపాశ్వత్థామల నిద్దఱినో అథవా ఒకరినేని, చెప్పి కడమవారిని వాకొనుచుఁ గ్రమభంగము పొరయనీక మరియాదఁ గాపాడువాఁడు తిక్కన. వ్యాసుఁ డిట్లు పాటించుట కానరాదు. చూడుఁడు:—

"ద్రోణుఁడు భీష్మడుఁడున్ కృపుఁడు
ద్రోణసుతుండును కర్ణ శల్యులున్
ప్రాణము లా సుయోధనుని
పాలివయంత్రము;..............."

అని రాయబారి సంజయుని నోరను,—

"భీష్మద్రోణ కృపాదిధన్వి నికరాభీలంబు......"

అని తత్తరపడుచుండిన ఉత్తరుని నోరనుబలికించినాఁడు తిక్కన. అంతియకాదు— ఉత్తరగోగ్రహణమున కురుసేనం జూపి జ్ఞప్తియుంచుకొనుటకై పేర్వేరవరుసఁ గిరీటి ఉత్తరకుమారునకుఁ దెలుపుచున్నాఁడు:

"కాంచనమయవేదికా కనత్కేతనో
జ్జ్వలవిభ్రమమువాఁడు కలశజుండు;
సింహలాంగూలభూషితనభోభాగకే
తుప్రేంఖణమువాఁడు ద్రోణసుతుఁడు;
కనకగోవృషసాంద్ర కాంతిపరిస్ఫుట
ధ్వజసముల్లాసంబువాఁడు కృపుఁడు;
లలితకంబుప్రభాకలితపతాకావి
హారంబువాఁడు రాధాత్మజుండు;
మణిమయోరగరుచిజాల మహితమైన
పడగవాఁడు కురుక్షితిపతి; మహోగ్ర
శిఖరఘనతాళతరువగు సిడమువాఁడు
సురనదీసూనుఁ డేర్పడఁ జూచికొనుము."

ఇందునను మెలఁకువ గోల్పడదు. కలనికి మొనగాఁడు కలశజుఁడు (ద్రోణుఁడు.) అతనివెనుక అశ్వత్థామయు, నాతర్వాత కృపుఁడును నిలిచినారు. ఆపిఱుంద రాధేయుఁడు; పిమ్మట కురురాజు. ధుముదారుదొర గాంగేయుఁడు. ఎత్తి పైఁబడవచ్చు పగఱనుండి ఏలికను గాచికొనుటకై, తమ్ముఁ గడచికాని సుయోధనుని దరియరుండ, ద్రోణాదికర్ణులు మొగాళమునను, భీష్ముఁడు వెన్నునను నిలిచినట్లు సంవిధానము. ఇది మూలము ననుసరించినదియ. పైసంఘటనమును మాతృకతోఁ బోల్చి తిక్కన తీర్పుటితనమును గమనింపఁ బఠితకు వదలుదును.

మఱియు, "గాండీవవిస్ఫారితశబ్ద మాజౌ" అనిన పట్టున, వ్యాసభగవానుఁడు," గాండీవగుణరావము ధార్తరాష్ట్రులు ఇందనుక విన లేదుగాన బ్రదికిరి. క్రోధావిష్టుని భీమసేనునిఁ జూచునందాఁక తనప్రాణ్ము సాగినదనియే సుయోధనుఁడు నమ్మియుండఁగలఁడు." అని మరల "భీమార్జునులును, వీరుఁడగు నకులుఁడును, సహనశీలుఁడగు సహదేవుఁడును సజీవు లైయుండునంతకు ఇంద్రుఁడేని మా ప్రభుత్వమును హరింపఁగలఁడటయా?" అని యుధిష్ఠిరుని నోరఁ బలికించినాఁడు. ఇందు కవితా కౌశల మెక్కడ? పూర్వార్ధమున గాండీవజ్యారవము జెప్పెను; క్రోధమూర్తిని భీమునిఁ బలికెను. ఉత్తరార్ధమున భీమార్జునులను, నకుల సహదేవులను రెట్టించెను, ఈపునరుక్తికిఁ బ్రయోజన మేమి?

ఇఁక తిక్కనతీర్పుఁ జిత్తగింపుఁడు—

"గాండీవజ్యారవంబు" తో మొదలిడి అర్జునుని పరాక్రమమును వ్యంగ్యముగా సూచించుచు గదాదండమండితుఁడగు భీముని బాహాదండశౌర్యమును దెలిపి, నకుల సహదేవుల రణవిద్యాప్రవీణత నెఱింగించినాఁడు. భావానుగుణమయిన, సన్నివేశసముచితమయిన వృత్తమును నడపినాఁడు. నలువుర అన్నదమ్ముల బలపరాక్రమ శౌర్యముల రీతులం గ్రమముగాఁ బ్రకటించినాఁడు. తొలుత గాండీవజ్యారవము పలుమరు ఉత్కటముగాఁ గ్రమ్ముటయు, పిమ్మట బాహాదండ మేపాఱి కుంభద్వద జడిపించు భీముని రౌద్రాకృతి తోఁచుటయు, పదపడి ఏన్గులజోడు వలెఁ దఱుము నకుల సహదేవుల తాఁకుటయుఁ జూపినాఁడు. అర్జునుఁడు శ్రవణమాత్రభయంకరుఁ డని, భీముఁడు దర్శనమాత్ర భయంకరుఁడని, నకుల సహదేవులు సంఘర్షణమాత్రభయంకరులని తారతమ్యములను వ్యక్తీకరించినాఁడు. 'క్రమ్మినన్', 'తోఁచినన్', 'తాఁకినన్'—అని ధ్వనిఁ బ్రసాదించి మెఱుఁగువెట్టినాఁడు. ఇది తిక్కనతీర్పు.

ఇట్టిపట్టుల నెన్నేని జూపనగును. సంగ్రహణమున నున్న సొగసు సుగమును సాగతీతలో నుండదు. ఐనను, కళాచాపల్యమునఁ బడి మఱొక్కదానినిం జూప నుంకింతును.

## వ్యాసుని కూర్పు-స్వర్గారోహణము :

స్వర్గరంగము – ధర్మరాజు ప్రవేశము – తత్పశ్చిమ భాగమున నాతని చిత్తవృత్తిఁ బరిశీలింపఁ గుతూహలురయిన నారదాదిమునుల గమనము.

వైశంపాయనుని మాట

"యుధిష్ఠిరుఁడు స్వర్గమున నడుగిడెను; ఐశ్వర్యసమగ్రుఁడై సింహాసనాసీనుఁ డయిన దుర్యోధనునిఁ గాంచెను. ఆ దుర్యోధనుఁడు సూర్యునట్లు ప్రకాశించుచు వీరపురుషస్వత్వమగు కీర్తిలాంఛనము ధరించియుండెను. ఆతఁడు దివ్యతేజస్సంపన్నులు, శుభకర్మకరులు నగు సిద్ధాదిదేవతలం గూడియుండెను. దుర్యోధనుని, ఆతని యైశ్వర్యమును జూచి యుధిష్ఠిరుఁడు కోపోద్రిక్తుఁడై చూపు మఱల్చెను.* యుధిష్ఠిరుఁడు స్వర్గమున నడుగుబెట్టఁగానే ఐశ్వర్యసమగ్రుఁడు ఉత్తమపీఠస్థుఁడగు దుర్యోధనునిఁ గనెనని వైశంపాయనునిచేఁ బలికించి, 'సూర్యప్రభాకలిత......'అని చెప్పించెను. ఆద్యంతములందు దుర్యోధనుని పేరు రెట్టించి చెప్పించెను. ఇందు నేర్పు పెంపు లేదు. కవిత – గానకళల జీవమంతయు ఎత్తుగడయందును, తీఱుగడయందును నిక్షిప్తమయియుండఁదగును. పైఁజెప్పిన ఉక్తి కేవలము వాచ్యము.

ఇఁక తిక్కనతీర్పు:—

"............కట్టెదురఁ దోఁచె :
నున్నతాసనాసీనుఁ, డభ్యుదితసరసి
జాప్తసంకాశుఁ డమృతాశనాంగనాది
వృతుఁడు; వీరలక్ష్మీవిరాజితుఁడు; సతత
యుక్త సుఖసాధనుండు దుర్యోధనుండు !"

కనఁబడె నని ప్రారంభించి, ఆమహావైభవమునంత ఎఱిఁగించి చివరకు పేరు వెలువరించినాఁడు తిక్కన కవితిలకుఁడు! ఇది తీర్పుగాదా ?

ఈయదనున శబ్దప్రయోజనముదెస వ్యాసుని చూపునకు తిక్కనచూపునకు ఎంతవ్యత్యాసముగలదో స్థాలీపులాకన్యాయముగ నొకటి మూదలించినఁ జాలును.

ఈస్వర్గారోహణమునను, వ్యాసుఁడు ధర్మరాజును 'యుధిష్ఠిరుఁడు' అనియే పెక్కెడల వాడినాఁడు! తిక్కన ఈపర్వమున నెక్కడను ఆశబ్దము నకుఁ జోటిచ్చినాఁడు గాఁడు. యుధిష్ఠిరత్వమునకు ఈస్వర్గభూమి స్థానము గాదని, సమయమును గాదని తిక్కనకవి యెఱుఁగును. ఇక్కడనే కాదు—ఏపట్టుననేని తిక్కన పదప్రయోజనమునెడ ప్రజ్ఞ కోల్పడె నని చెప్ప నయితికాదు. స్థానము సమయమును గమనింపక వ్యాసుఁడు ఇచ్చవచ్చినట్లు వాడినాఁడు.

ఈభాగ మింతట గట్టిపెట్టుదును. నాట్యకళావిరచనమున, పాత్రసృష్టియందుఁ బుష్టియందును వ్యాసునికి తిక్కనకుఁ గల కౌశలభేదము ముందు మనవిచేసికొందును.

---

వైశంపాయన ఉవాచ:—

* "స్వర్గం త్రివిష్టపం ప్రాప్య తవ పూర్వపితామహాః;
యుధిష్ఠిరప్రభృతయో య దకుర్వత తచ్ఛృణు.
స్వర్గం త్రివిష్టపం ప్రాప్య ధర్మరాజో యుధిష్ఠిరః;
దుర్యోధనం శ్రియాజుష్టం దద ర్శాసీన మాసనే.
భ్రాజమాన మివాదిత్యం వీరలక్ష్మ్యాభి సంవృతమ్
దేవై ర్భ్రాజిష్ణుభిః సాధ్యైః సహితం పుణ్యకర్మభిః.
తతో యుధిష్ఠిరో రాజా దుర్యోధన మమర్షితః
సహసా సన్నివృత్తోఽభూ చ్ఛ్రియం దృష్ట్వా సుయోధనే."

# అథర్వవేదము

బుఱ్ఱా వెంకటసుబ్బారాయుడు, యమ్. ఏ.,

౧

**అథర్వవేదమును** జదువువారు చాలఅరుదు. అందలివిషయములనుగూర్చికూడ చాలతక్కువమందికి తెలిసియుండును. అథర్వవేద మన మంత్రశాస్త్రమనియు, నాయుర్వేదమునకు జెందినదనియు, భూతవిద్యకు జెందినదనియు, ధనుర్విద్యకు జెందినదనియు నిట్లనేకు లనేకవిధముల దలంచుచున్నారు. ఈయభిప్రాయము లన్నియుగూడ కొంతవఱకు సత్యములు, గొంతవఱకు నసత్యములుగూడ నైయున్నవి. అథర్వవేదమున నీవిషయముల నన్నిటిగూర్చియేకాక మఱికొన్ని యితరవిషయములగూర్చికూడ ఉన్నది. కాని ప్రత్యేకించి యేయొక్క విషయమునుగూర్చియు నాద్యంతమును లేదు

అథర్వవేదము ఋగ్యజుస్సామవేదములకు(అనగా త్రయీవిద్యకు) తరువాతిదిగా నెంచబడుచున్నది. అనగా నిది వైదికగ్రంథములలో దురీయస్థానము నలంకరించుచున్నది. దీనికే 'అథర్వణ' మనియు, 'అథర్వాంగిరసః' అనియు, 'భృగ్వంగిరసః' అనియు, బ్రహ్మవేదమనియు గూడ పేర్లు కలవు. అథర్వవేదమునకు దొమ్మిది శాఖలు గలవని సంప్రదాయవాదులు నుడువుదురు. కాని, మన కగపడునవిమాత్రము రెండే. అవి (౧) శౌనకీయశాఖ (౨) పైప్పలాదశాఖ (అనునవి.)

వీనిలో శౌనకీయశాఖయే ప్రధానమైనదిగా గనుపించును. రెండవది కాశ్మీరమున గొద్దిచోట్ల దప్పనెక్కడను వాడుకలో లేదు. కాశ్మీరమునందైనను నీశాఖకు జెందిన పూర్ణమగు సంహితాగ్రంథము లభ్యముకాలేదు. శౌనకీయశాఖకు జెందిన సంహిత హిందూదేశమునను, పశ్చిమదేశములందునుగూడ అనేకపర్యాయములు ముద్రితమైనది.

అథర్వవేదమును బఠించువా రరుదని చెప్పియుంటిని. అథర్వము* స్థితి యీరీతినే యుండిన గొలది కాలములో స్వరయుక్తముగా జదువువారులేమి, ఈవేదము నశించుట నిక్కువము. స్వరయుక్తముగా దీనిని జదివినవారు వృద్ధులలో గొంద ఱక్కడక్కడ గలరు. అట్టివారు గొలదిమంది కాశీయం దున్నారు. వీరు ఋగ్వేదులైయుండియు, నాసక్తిచే నథర్వమునుగూడ వల్లించియున్నారు.

ఈ వేదమునకుగూడ మిగిలిన వేదములకుబలె బ్రాహ్మణాదులు గలవు. గోపథబ్రాహ్మణము దీనికి జెందినదే. ఈబ్రాహ్మణ మీవేదమునకు జెందిన వైతానశ్రౌతసూత్రముపై నాధారపడియున్న దనియు, నందుచే నాశ్రౌతసూత్రముకంటె నర్వాచీనమైనదనియు గొందఱు విమర్శకులు చెప్పుచున్నారు. పైజెప్పిన శ్రౌతసూత్రముగాక, ఈవేదమునకు జెందినవి కౌశికశ్రౌతసూత్రమనియు, కౌశికగృహ్యసూత్రమనియు మఱి రెండు కలవు. ఈవేదమునకు జెందిన యుపనిషత్తులు చాలకలవు. అందు ముండకోపనిషదాదులు ముఖ్యమైనవి. ఈవేదమునకు జెందిన యొక ప్రాతిశాఖ్యగూడ కలదు.

ఈవేదము (శౌనకీయసంహిత) ఇరువదికాండలుగ విభజింపబడియున్నది. కాండలయందు సూక్తములు, మంత్రములు నని యంతర్భేదముగలదు. అష్టకములు, ననువాకములు నని మఱియొక విభజనగూడ కలదు.

## అథర్వవేదమునందలి విషయములు :

అథర్వమునుగూర్చి విమర్శించుటకు బూర్వము దీనియందలి విషయముల బరిశీలింతము. ఇందలి సూక్త

* ఈ వ్యాసమున సందర్భమునఁబట్టి వేఱొకయర్థము కాన్పించనిచోట్లనెల్ల 'అథర్వము' అనుపదము 'అథర్వసంహిత' అనునర్థమున నుపయోగింపబడినది. వ్యాసముయొక్క నామముకూడ నాయర్థముననే ఉపయోగింపబడినది.

ముల నీక్రిందివిధమున విషయభేదమునుబట్టి విభజింప నగును :

౧. భైషజ్యసూక్తములు :—వ్యాధులను, గ్రహాదులను వదల్చుట కుపయోగించు మంత్రములు గలవి.

౨. ఆయుష్యసూక్తములు :— ఆయురారోగ్యదములగు మంత్రములు గలవి.

౩. ఆభిచారిక లేక, కృత్యాప్రతిహరణసూక్తములు :— ఇందు పిశాచాదుల బారద్రోలుటకును, ప్రయోగము మొదలగునవి చేయుటకును, వైరులను, మంత్రవేత్తలను జంపుటకును నుపయోగించు మంత్రములు గలవు.

౪. స్త్రీకర్మలు

౫. సామ్మనస్య సూక్తములు :— సభలయందు ఘనతసంపాదింప నుపయోగించు సూక్తములు.

౬. రాజకర్మకు జెందిన సూక్తములు.

౭. బ్రాహ్మణుల స్వోత్కర్షను వెల్లడించునట్టియు, వారి శ్రేయస్సుల కుపయోగించునట్టియు సూక్తములు.

౮. పౌష్టికసూక్తములు :— అభ్యుదయార్థము, ఆపదనుండి విముక్తికై యుపయోగించు మంత్రములు గలవి.

౯. ప్రాయశ్చిత్తసూక్తములు.

౧౦. తాత్త్విక సూక్తములు :— తత్త్వజ్ఞానము, ప్రపంచోత్పత్తి మొదలగువానిం జెప్పునవి.

౧౧. ఆచారకాండకు జెందిన సూక్తములు.

౧౨ విషయపృథక్త్వము ప్రధానముగా గల కాండలు:—ఇట్టివి త్రయోదశకాండమొదలు అష్టాదశకాండవఱకును గలవు. వీనిలో నొక్కొక్కకాండయం దొక్కొక్క విషయమునుగూర్చి చెప్పబడియున్నది.

౧౩. ఇరువదియవ కాండ

౧౪. కుంతాపసూక్తములు.

## I. భైషజ్యసూక్తములు

ఇవి రెండువిధములుగా నున్నవి :

౧. వ్యాధుల బోగొట్టుట కుపయోగించునవి.

౨. పిశాచాదులబారద్రోలుట కుపయోగించునవి.

వీనియందు కొన్ని మూలికల యుపయోగము గూడ చెప్పబడియున్నది. ఇట్లుపయోగించు నోషధికి 'భేషజీ' అనియు, ఉదకమునకు 'భేషజీః' అనియు వాడుక గలదు. ఇందు శాంతికర్మయేకాని ఆభిచారిక కర్మ యేమాత్రమును లేదు. ఇందలి మాయవిద్య మిక్కిలి సాధువైనదేకాని దారుణమైనది కాదు.

ఇంత ప్రాచీనకాలమున వైద్యశాస్త్ర మున్నట్లు ప్రపంచమున మఱే యేవాఙ్మయమునందును కానము. ఋగ్వేదదశమమండలమున నీరీతినే యున్న సూక్తములు గూడ నీభైషజ్య సూక్తములతో సమకాలీనములని తోచును. బహుశః ఇట్టిసూక్తము లన్నియు నార్యులు, యూరోపియనులు కలిసియున్న కాలము నుండియు నుండి యుండవచ్చును.

ఈభైషజ్యసూక్తములకును, ఉపవేదమని చెప్పబడుచున్న ఆయుర్వేదమునకును, అత్యంతసంబంధము కానగును. ఈరెంటియందునుగూడ తక్మ, యక్ష్మ, జ్వరముల విషయమై నిదాన మొకటే యైనట్లు గాన్పించును.

అథర్వమున ఆస్రావము, అపచిత్, అతిసారము, అప్లి అనురోగములనుగూర్చి తరచు వినుచుందుము. బహుశః ఆయుర్వేదము క్రీ. పూ. ౧౦౦౦ సంవత్సరములనుండియు వృద్ధినొందుచుండి యుండును. మన ఆయుర్వేదమే అరేబియాద్వారా యూరపు ప్రవేశించిన దనుట కాధారములు గలవు.

వీనియందు ( భైషజ్యసూక్తములందు ) రోగములు ద్వివిధముగ విభజింపబడినవి—౧. అంతశ్శరీరమునకు జెందినవి, ౨. బాహ్యశరీరమునకు జెందినవి.

౧. అంతశ్శారీరకములు :— (అ) ఇందు ముఖ్యమైనది 'తక్మ' యనునది. దీని కౌషధము I. ౨౫;

V. ౪; V. ౨౨; VI. ౨౦; VII. ౧౧౬; XIX. ౩౯ సూక్తములలో జెప్పబడియున్నది.

(ఆ) అంతశ్శరీరమునకు జెందిన మఱియొక రోగము 'జలోదరము' (Dropsy). ఇది వరుణప్రేరితమని యున్నది. (ఐతరేయబ్రాహ్మణమందున్న శునశ్శేపాఖ్యానమును జూడుడు.) ఇది గుండెకు జెందిన వ్యాధియని వీరుచేసిన నిదానము చాల సరిగా నున్నది.

(ఇ) యక్ష్మ మొదలగునవి.

(౨) బాహ్యశరీరమునకు జెందిన వ్యాధులు: (అ) కిలాసము (ఒకవిధమగు కుష్ఠురోగము), (ఆ) విద్రధి (వ్రణము), (ఇ) అపచిత్ (గండమాలమునకు జెందిన వ్యాధి), (ఈ) కురుపులు, (ఉ) దెబ్బలు.

పై వాని కన్నిటికిని అథర్వమున చికిత్సలు చెప్పబడియున్నవి. "అమూర్యాయన్తియోషితో" అను సూక్తమునుబట్టి యాకాలమునాటికే పట్టీలువేయుట, కట్లు కట్టుట మొదలగు చికిత్సలు తెలిసియున్నట్లు తోచును. వీనిలో గొన్ని సూక్తములు సర్పవిద్యకు,* విషవిద్యకును జెందియున్నవి. వీని బఠించిన సర్పములు జేరకుండును. సర్పదష్టులైనవారు విషముపోయి స్వస్థులగుదురు. శిరోజవృద్ధికిగూడ నిం దౌషధము చెప్పబడియున్నది. పిచ్చి, వెఱ్ఱి-వీనిని గూర్చిచెప్పుచు, గొన్ని సూక్తములు భూతవైద్యములోనికి దిగుచున్నవి. రక్షస్సులను, మూర్ఛలను బారద్రోలుటకై కొన్నిమంత్రములు గలవు. 'వ్యాధి' యను రక్షస్సునకు కణ్వుడనుపేరట. ఈరక్షస్సు గర్భముననున్న శిశువును దినివేయునని యానాటివారి నమ్మకము.

చికిత్సార్థమై యున్న కొన్నిమంత్రములు ఆయుర్దాయదములుగగూడ నుపయోగింప వీలుగల్గియున్నవి. VII ౧౦. సూక్తములో శిశువును 'జంభుని' నుండి రక్షించుట కొకమంత్రము గలదు.

ఇట్టి శాంతికారకములగు భైషజ్యాదిసూక్తములన్నియు నాథర్వణునిచేతను, ఘోరాభిచారికసూక్తములన్నియు 'నంగిరసు'నిచేతను నిట్లథర్వమంతయు రెండు తరగతులుగ రచింపబడియున్నట్లు కనుపించును. దీనిని గూర్చి ముందుముందు చెప్పుదుము.

పైనజెప్పిన విషయముల గాంచిన నాకాలపు ప్రజలు వ్యాధులనుగూడ నొకవిధమగు పిశాచముల మాడ్కి చూచుచుండిరనియు, నట్టిపిశాచముల బారద్రోలుటకునై యోషధుల నధిష్ఠించియుండు దేవతల నాహ్వానించుచు, మంత్రితములగు నోషధుల నుపయోగించుచుండిరనియు తోచును.

## II ఆయుష్యసూక్తములు

ఇం దాయురారోగ్యములకై మంత్రములుగలవు. వీనికిని పై జెప్పిన భైషజ్యసూక్తములకును చాల సంబంధము గలదు. ఇందు శతసంవత్సరపరిమితాయుస్సును, పశుపుత్రాదులను నిమ్మని తరచు ప్రార్థనలు గలవు. (ఈ విషయమున గృహ్యసూత్రముల జూడుడు.) మఱియు యమ, మృత్యు, నిర్ ఋతి, త్యంతకాదు లత్యంతవిధేయతతో స్వస్తికై బుజ్జగింపబడియుండిరి. ఈ సూక్తములతో తరచుగా నగ్నికి సంబంధముగలదు.†

## III ఆభిచారిక, లేక కృత్యాప్రతిహారణ సూక్తములు

ఇందు రిపు, భూత, మాంత్రికులపై ప్రయోగమునకై వినియోగించు మంత్రములు గలవు. ఈవిద్యకు 'యాతువిద్య' అనిపేరు. ఇది ఘోరరూపమగు వేదమని కొందఱందురు. ఇందు మానవమాత్రులగు మాంత్రికుల

* సర్ప వ్యాఘ్రములగూర్చి అథర్వమున తరచు ప్రసంగింపబడుటచే నిప్పటికిని ఇవి విశేషముగాగల వంగదేశమున కీయథర్వము రచియించునాటికి, ఆర్యులు వచ్చియుండిరనియు, నచ్చటనే యథర్వవేదము రచింపబడెననియు నొకవాదము గలదు.

† ఈసందర్భమున జీవప్రాణములతో నగ్నికి సంబంధ మున్నట్లు సూచించు యజుర్వేద మంత్రములను, గృహ్యసూత్రములను, ఉపనిషద్వాక్యములను జూడుడు.

కును, ఘోరరక్షస్సులకును భేదము గమనింపబడియుండ లేదు. భ్రాతృవ్య, సపత్న, అరాయ, పిశాచ, సుదాన్వా అను పదము లీయిద్దఱివిషయమునను జెప్పబడియున్నవి. ఈభాగము 'అంగిరసుని'తో తరచు సంబంధము గలిగి యున్నది. బహుశః 'అథర్వాంగిరసః' అనుపేరునందు 'అంగిరసః' అనుపేరుగలయాత డీ సూక్తముల రచయిత యైయుండవచ్చును.

'అభిచార' అనునది సామాన్యపదము. అందలి భేదములు (౧) కృత్యా, (౨) వలగా, (రహస్యస్థలమున చేయు ప్రయోగము). (౩) భూలకర్మలు (ఓషధులతో జేసెడి కర్మ.) నవీన 'విధాన' వాఙ్మయమున నీ యాభిచారిక కర్మయందు వేలువేలు విభాగము లేర్పడినవి.

మంత్రవిద్య హిందూయూరోపియన్ కాలము నుండియు నున్నట్లు గన్పట్టును. ఇప్పటికిని ఐర్లండు జర్మనీదేశములలో నొకవిధమగు మంత్రవిద్య కలదని తెలియుచున్నది.

ఆభిచారిక కర్మకు జెందిన సూక్తములలో గొన్నింట పడతుల సుఖప్రసవమునకై యనేకరక్షస్సులు నామములతో సంబోధింపబడి బుజ్జగింపబడు చున్నవి. ఒక్కొక్కచో వానిని తరిమివేయుటకై మంత్రములు గలవు. మానవశత్రువులపై ప్రయోగమున కనువగు మంత్రము లింతకంటె నెక్కువగా నున్నట్లు గనుపించును. ఇట్టివానియం దేదేని యొక ప్రత్యేకదేవత యాహ్వానింపబడుచున్నది. విహవ్యసూక్తము V. 3 "మమాగ్నే వర్చో విహవే ష్వస్తు" అనుదాని నిట్టి వాని కుదాహరణగా గైకొనదగును.

## IV స్త్రీ కర్మలు

ఇవి ఋగ్వేదము X ౮౫ (వివాహసూక్తము) లోని కర్మలను బోలియుండును. స్త్రీలకు వివాహ సందర్భమున జేకూరబోయెడు నుపద్రవములే ఇట్టి స్త్రీ కర్మలలో చాలవానికి గారణమైనట్లు కనుపించును. అథర్వమునగాక యిట్టి స్త్రీకర్మలను గూర్చి యీ క్రిందివానిలో గలదు.

ఋగ్వేదము:—X ౪౦; ౮౫, ౧౪౫, ౧౫౯, ౧౬౨, ౧౮౩ సూక్తములు.

తైత్తిరీయసంహిత:—II (iii) ౯౧.

మైత్రాయణిసంహిత:—II (iii) ౭.

తైత్తిరీయబ్రాహ్మణము:—II (iii) ౧౦.

శతపథబ్రాహ్మణము:—XIV (ix) ౪ (అనగా బృహదారణ్యకోపనిషత్తు VI ౪.) ఇట్టివి పెక్కులు గృహ్యకర్మలయందుగూడ కాననగును. అథర్వమున స్త్రీలు మంత్రవిద్యయం దారితేరినట్లు కనుపింతురు. స్త్రీల కిట్టి శక్తినిగూర్చి యింకను ఋగ్విధానము I ii ౫; II xxxv ౨; III xv ౨; XIX iii; XXI iv మొదలగువానియందు గూడ విశేషించి చెప్పబడి యున్నది.

అన్యోన్యప్రేమ కుదురుటకై స్త్రీపురుషులచే నిట్టి మాయవిద్య యభ్యసింపబడియుండవచ్చును. అట్టి యభీష్టములను నెరవేర్చుకొనుటకై వీరు మంత్రితములగు నోషధులనుగూడ ఉపయోగించుచుండెడివారు. అథర్వమున వైదికవాఙ్మయమంతటిలో మొదటిసారి కామబాణమునుగూర్చి చెప్పబడియున్నది. "ఇషుః కామస్య యా భీమా తయా విధ్యామి త్వా హృది. ఆధీపర్ణాం కామశల్యా మిషుం సంకల్పకుల్మలాం తాం సుసన్నతాం కృత్వా కామో విధ్యతు త్వా హృది" (III. ౨౫ I. ౨) మొదలగువానిని జూడుడు. స్త్రీకర్మలకు జెందిన సూక్తము లన్నియు రెండువిధములుగ విభజింపవచ్చును.

౧. నాశనహేతుకములు

౨. శాంతిదములు

ఇందు మొదటితరగతికి జెందినవానిలో సపత్నులనుగాని ప్రేమకు ఇతరాటంకములనుగాని నాశనము సేయుటకై మారణప్రయోగములు గలవు. రెండవ తరగతికి జెందినసూక్తములు వధువునందలి దోషపరిహారమునకైకాని, వివాహసందర్భమున వధువునకు రాగల యుపద్రవముల వారించుటకైకాని యుపయోగింపబడుచున్నవి. వీనివిషయమై గృహ్యసూత్రములలో విశే

షించి చెప్పబడియున్నది. మఱియు నథర్వమునగూడ ప్రత్యేకించి యొకకాండ గలదు. (౧౪-వ కాండ.) (వివాహానంతరము చేయవలసిన స్త్రీకర్మలనుగూర్చి, గర్భాధానము, సీమంతము, పుంసవనము, శోష్యంతీకర్మ, జాతకర్మ మొదలగుసంస్కారములగూర్చి విపులముగా జెప్పునట్టి గృహ్యసూత్రముల జూడుడు.) సుఖప్రసవమునకై యథర్వమున 'వషట్ తే' అను సూక్తము (I ౧౧) చెప్పబడినది.

## V సామ్మనస్యసూక్తములు

ఇవియన్నియు సభకు జెందినవి. ఇందువేర్వేరు ఫలముల బడయుటకై వేరువేరు సూక్తములు గలవు. ఇవియన్నియు సభలో నాధిక్యము సంపాదించుట కుపయోగించును. ఇందు సభకేగునాతడు సభ్యులందరి మెప్పును బడయుటకును, ప్రతివాదుల క్రోధ మడంచుటకును, గ్రామసభలో దన వాక్కున కంద రొడంబడునట్లు చేయుటకును, రాజకీయసాంఘికసంస్థలలో ఘనత సంపాదించుటకును, నందరిలో దానె యనుగ్రహపాత్రు డగుటకును, సభయందు నిజవాదమున జయము గాంచుటకును నుపయోగపడు సూక్తము లనేకములు గలవు. ఇట్టివిషయములే ఋగ్వేదము II. ౨౬; VII. ౧౨; X ౧౬౬, ౧౯౧ సూక్తములలో గలవు.

## VI రాజకర్మకు జెందిన సూక్తములు

అథర్వవేదమును బరీక్షించి చూచిన నాకాలమున బ్రజలలో రెండువిధములగు నాగరికత గనుపించును. సామ్మనస్యాదిసూక్తములబట్టి యానాటిప్రజలు రాజకీయన్యాయనేత్తలు నైయుండి రాజకీయవిషయములలో నారితేరినవారివలె కనుపింతురు. ఇట్లే రాజకర్మకు జెందిన సూక్తములనుబట్టికూడ నిర్ణయింపవీలున్నది. మరియొకచో గొన్ని సూక్తములవలన నానాటి ప్రజలు మూఢవిశ్వాసములలో మునిగియున్నట్లగపడుదురు. దీనినిబట్టి ప్రజలు రెండుతెరగతులుగ నుండియున్నట్లూహింపనగును. ఇందు మొదటి తరగతికి జెందినవారు (బహుశః బ్రాహ్మణక్షత్రియులు) రాజకీయములలో బాల్గొనుచుండిరి. శేషించినవారందరు కర్షకులైయుండి, తద్వృత్తికి సహజమైన మూఢభక్తి, మూఢవిశ్వాసములు మొదలగువానిని గలిగియుండిరి. అందుచే నిట్టి రెండువిధముల నాగరకతయు నథర్వమున బ్రతిబింబించుచున్నది.

అదియుగాక నాథర్వణమతాచార్యుల ప్రభావము కేవలము సామాన్యప్రజ యందేకాక రాజసభలయందుగూడ చూపబడుచుండును. ఇట్టి కారణమును బట్టియే కొందరు విమర్శకులు, అథర్వము బ్రహ్మవేదమని పిలువబడుట కెట్టి యర్హత గలదో క్షత్రవేదమని పిలువబడుటకుగూడ నట్టియర్హత గలిగియున్నదనుచున్నారు.

అథర్వణులు మొదట సాధారణప్రజల ప్రాపకమునంది క్రమేపీ రాజుల యనుగ్రహము నంది మతాచార్యులు, రాజపురోహితులు నైన ట్లగపడుదురు. రాజుల ప్రాపకమునందుటకు పైనుదాహరించిన కర్మలకు జెందిన సూక్తములుకూడ కారణమైయుండునని తోచును.

ఈ సూక్తములలో గొన్ని రాజుయొక్క యెన్నికనుగూర్చియు, మరికొన్ని రాజ్యాభిషేకమును గూర్చియు నున్నవి. రాజ్యమును విస్తరింపజేయుట, బలపరచుట, శత్రువులనుండి రక్షించుట మొదలగు కర్మలయందు రాజు నిజపురోహితుని మంత్రసహాయము నపేక్షించుచుండెను. ఇట్టిపురోహితుడు, అథర్వమునందలి పైజెప్పిన సూక్తములలోని మంత్రముల నుపయోగించి రాజుయొక్క యభివాంఛితమును నెరవేర్చుచుండెను. మరియు నిట్టి పౌరోహిత్యము ప్రథమమున నేరిదైయుండినను కాలక్రమమున నాథర్వణునకుదప్ప నితరులకు రాకయుండెననుట కాధారములు గలవు. కాలక్రమమున రాజుయొక్క జయము పురోహితుని మంత్రప్రభావముపై నాధారపడియుండు నను నమ్మకము ప్రజలలో బయలుదేరెను. (శ్రౌతసూత్రములను నైతరేయబ్రాహ్మణమునందలి యైంద్రమహాభిషేకమును జూడుడు) పైసూక్తములబట్టి రాజు యుద్ధాదులందు పురోహితుని సలహాప్రకారము చేయవలెననియు, పగతుర సేనను బట్టుటకు పురోహితుడు మాయల బన్నుచుండెననియు దెలియుచున్నది.

## VII బ్రాహ్మణుల స్వోత్కర్షను వెల్లడించునట్టియు, వారి శ్రేయస్సున కుపయోగించునట్టియు సూక్తములు :

అథర్వవేదకాలమున బ్రాహ్మణులు మిక్కిలి యున్నతపదవి నున్నట్లీసూక్తములవలన దెలియు చున్నది. వారి కసామాన్యములును, నన్యదుర్లభంబులు నగు నెన్నియో హక్కు లుండియుండెను. ఈ కాలమునుండియే వారు 'భూసురు' లని పిలువఁబడను చున్నట్లగపడును. తాము దేవతలకును, మనుష్యులకును మధ్యస్థగతివారమని వారు ప్రజల కెఱిగించుచుండిరి. ఈకాలపు బ్రాహ్మణుల సాంఘికస్థితి శ్రౌతసూత్రము లలో గనబడు బ్రాహ్మణుల స్థితిని బోలియున్నది. ఇందు బ్రాహ్మణు లెవ్వరిచేతనుగూడ హింసింపబడ దగనివారనియు, నధికముగ దక్షిణ కర్హు లనియు నున్నది. బ్రాహ్మణహింసయు, బ్రాహ్మణహత్యయు మహాపాత కములని యీ సూక్తములు ఘోషించుచున్నవి. (ఇట్టి బ్రాహ్మణోత్కర్ష పురాణేతిహాసములలో విశేషించి కలదు.) ఇట్టి నిషేధవాక్యములకంటె విధివాక్యము లెక్కువగ గలవు. వీనిలో బ్రాహ్మణులు పూజాదక్షి ణాదుల కర్హులనియు, బ్రాహ్మణుల కిచ్చిన దక్షిణ స్వర్లోకమున నిల్వయుంచుకొన్న నిధివంటిదనియు నున్నది. 'ఏతం సధస్థాః పరివో దదామి' అను సూక్తమును జూడుడు. (VI ౧౨౩). ఇందు గొన్ని సూక్తములు పురోహితియొక్క ప్రాముఖ్యమును, తన్మాహాత్మ్యమును జెప్పుచున్నవి. కొన్ని సూక్తము లలో స్వోత్కర్షకథనముతోబాటు బ్రాహ్మణుల ధన తృష్ణగూడ వెల్లడియగుచున్నది. ఇట్టివానికి III ౨౯; VI. ౭౧; VII ౭ సూక్తములలో బ్రాయశ్చిత్తము విధింపబడియున్నది. మరియొకచో బ్రాహ్మణు లెట్లు తమయున్నతపదవి నిల్పుకొనవలెనో చెప్పబడియున్నది.

## VIII పౌష్టికసూక్తములు

ఈసూక్తములు సదా యభ్యుదయమును, నాప ధలనుండి విముక్తిని గోరు మంత్రములతో నిండి యున్నవి. అథర్వవేదము నిట్టి యభ్యుదయము కొరకైన ప్రార్థనలతో నిండియుండుటచేతనే కొందఱ థర్వవేదము కామ్యేష్టివంటిదని యనుచున్నారు. ఇందు (పౌష్టికసూక్తములలో) గృహారామముల యభ్యున్నతినిగూర్చియు, నదీక్షేత్రముల యనుకూల తను గూర్చియు, వర్షపాతమునుగూర్చియు, సస్యసమృ ద్ధినిగూర్చియు, గవాశ్వాదుల సౌఖ్యమును గూర్చియు, ద్యూతవాణిజ్యములం దదృష్టమునుగూర్చియు, ప్రయా ణమునందు క్షేమమునుగూర్చియు, సర్పాదివిషజంతువుల నుండి యనుపద్రవమునుగూర్చియు నసామాన్యములగు ప్రార్థనామంత్రములు గలవు. ఇట్టివిషయములే మనకు దరచు గృహ్యసూత్రములందు గోచరించును. ఇట్టి ప్రార్థనలలో తరచు "శంనో అస్తు ద్విపదే; శం చతుష్పదే" అను పశుపుత్రాదుల క్షేమమునుగూర్చిన మంత్రము పల్లవివలె గానబడుచున్నది. దుష్టదైవము నుండియు, నాపదలనుండియు విముక్తిని గలుగజేయు మనునట్టియు, పశుపుత్రాదులను విరివిగా నిమ్మనునట్టియు ప్రార్థనలు గల సూక్తము లీయథర్వవేదమున దాదాపుగా నైదవవంతుగలవు.

గృహ్యనిర్మాణమునుగూర్చి యిందు గొన్ని మంత్రములు గలవు. ఈవిషయమై గృహ్యసూత్రము లను జూడుడు. లాంగలపూజనుగూర్చి యొకసూక్తము గలదు. దీనివిషయమైకూడ గృ. సూ. లను జూడుడు. వర్షార్థము గొన్నిమంత్రము లున్నవి. (ఋగ్వే. మం డూకసూక్తము*.) కొన్నిమంత్రములు గొల్లవాండ్రకు చోరాదులనుండియు, క్రూరజంతువులనుండియు బాధ పోగొట్టునవియై యున్నవి. వర్తకమును గూర్చియు, ప్రయాణమునుగూర్చియు తృతీయకాండయందలి ౧౫-వ సూక్తమున జెప్పబడియున్నది. నిర్విఘ్నముగను, నిరుపద్రవముగను ప్రయాణము సాగుటకై యొక సూక్తము గలదు. వాతావరణమునుగూర్చియు నొకచో గలదు. ఇందలి కొన్నిమంత్రములవలన నప్పటిరోజు లలో సర్పభీతి చాలగ నుండియున్నట్లు దోచును. సర్ప ములనుండి రక్షించుటకై యీమంత్రము లుద్దిష్టములై

* వర్షమునకై యిప్పటికిని ఆంధ్రదేశమున పల్లెటూళ్లలో గప్ప నూరేగించు నాచారము గలదు.

యుండును. ఈసూక్తములలోనే శ్రౌతగృహ్యసూత్రములలో విశేషముగా జెప్పబడియున్న దర్శపౌర్ణమాస్యలందు పశుపుత్రాదులకై చేయబడు నిష్టులు మొదలగు వానినిగూర్చికూడ జెప్పబడియున్నది.

## IX ప్రాయశ్చిత్తసూక్తములు

ఈ విభాగమునకు జెందినవి దాదాపు ౪౦ సూక్తములు గలవు. ఇందలి విషయములు ప్రాయశ్చిత్తమునకు జెందినవి. కర్మాచరణమున దప్పుచేయుటయొకపాపముగా పరిగణింపబడుటయే ఈప్రాయశ్చిత్తసూక్తములకు కారణమైనట్లు కనపడును. ఇట్టి ప్రాయశ్చిత్తసూక్తము లిం దుండుటంజేసి, కొందరు విమర్శకు లీయథర్వము బ్రాహ్మణములకంటె నర్వాచీనమనియు, ప్రాయశ్చిత్తమునుగూర్చి విశేషించియున్న శ్రౌతధర్మసూత్రములతో సమకాలీనమనియు తలంచుచున్నారు.

## X తాత్త్వికసూక్తములు

తత్త్వజ్ఞానముతో హాలకర్మలో నిమగ్నులైన గ్రామనివాసులకుగాని రాజకర్మలయందు నిమగ్నులైన పురోహితాదులకుగాని (అథర్వవేదకాలమునం దీరెండు తరగతులకే ప్రజలు జెందియున్నట్లు కనుపింతురు) సంబంధము లేకుండుటచే నీసూక్తము లీయథర్వవేదమున నేల సమకూర్పబడినవో తెలియరాదు. తత్త్వజ్ఞానమునుగూర్చి ప్రసంగముగల యితరవేదములతోబాటు దీనికిగూడ వేదప్రామాణ్యము గలుగుటకై యథర్వణాచార్యు లిందు గొన్ని కల్లబొల్లి తత్త్వజ్ఞానపుసూక్తములు వీలైనచోట్లనెల్ల నర్థరహితముగ జొప్పించిరని కొందరు విమర్శకుల యభిప్రాయము.

ఇందలి సూక్తము లంతగా నర్వాచీనములైనట్లు గానరావు. బహుశః యిట్టి సూక్తములమూలముననే యథర్వమునకు బ్రహ్మవేద మనుపేరు వచ్చియుండును. ఇందు అసత్తు, కామము (ఇచ్ఛ) మొదలగువిషయములనుగూర్చి తరచు తాత్త్వికవాదములు కనవచ్చును. ఇందు క్షుద్రవస్తువులగూర్చికూడ పెద్దపెద్ద యుపన్యాసము లుండుటచే "నిందలి సారము గణింపదగినది కా"దనియు, "నిందు గనబడు వేదాంతము బూటకపు వేదాంతము, మిగిలిన వేదములవలె నీవేదముగూడ కనబడుటకై యిందు కొన్ని కల్లబొల్లి వేదాంతపువాక్యములు దొర్లింపబడిన" వనియు గొందరు విమర్శకులు జెప్పు వాదమునకు దగినట్లిందు గొన్ని సూక్తము లూరక డాంబికముగాను, కృత్రిమముగాను, అన్యోన్యవిరుద్ధముగాను నున్నవి.

ఇందు భూరివిశ్వముయొక్క ఏకత్వమును జాటు కొన్ని సమస్యలుగూడ గలవు. ఇందలి వరుణసూక్తము మాత్ర మపూర్వమై, నూతనవిషయభరితమై యొప్పారుచున్నది. ఇట్లితరవేదస్థవిషయములనుగూర్చి నూతనాశయములను వెదజల్లు సూక్తము లీవిభాగమున మరికొన్ని కలవు. ఈతాత్త్వికవిషయములుగల సూక్తములందు చాలవరకు ఋగ్వేదస్థతాత్త్వికసూక్తప్రభావము కనుపించునుకాని ఋగ్వేదమున నూరక స్పృశించి విడువబడిన విషయము లన్నియు నిందు తరచి తరచి వివరింపబడినవి. ఇట్టి సూక్తములకు జెందినవి అథర్వమున 'కేనపార్‌ష్ణీ ఆభృతే పూరుషస్య' (X. ౨;) "యస్మా మన్యుర్జాయా మావహత్" (XI. ౮.) మొదలైనవి. ఈరెంటియందును పురుషసూక్తము (ఋగ్వేదము X. ౯౦.) యొక్క ప్రభావము కనుపించును. ఇందు మొదటిదానియందు (X. ౨.) ఋగ్వేదస్థహిరణ్యసూక్తముయొక్క ప్రభావమును, రెండవదానియందు (XI. ౮.) ఋగ్వేదములోని సూర్యాసూక్తము ( = వివాహసూక్తము X. ౮౫.) యొక్క ప్రభావమును గూడ కనుపించును. ఇం దాత్మబ్రహ్మల యైక్యము నిరూపింపబడినది.

ఈశాఖకు జెందిన బ్రహ్మోద్యసూక్తము అనన్యదృష్టము, అశ్రుతపూర్వము, నూతనభావవిలసితములైనట్లు కనుపించును.

అథర్వణులు తాత్త్వికవిషయముల నేకొంచెమో కృషిసల్పి యభివృద్ధిగాంచినను నైతిహాసికవిషయముల నేమాత్రము మనసు బోనిచ్చినట్లులుగాని, యితిహాసమున నూతనముగ మార్పుల దెచ్చినట్లులుగాని కనుపిం

చదు. ఋగ్వేదమున చాలవరకు ప్రాకృతదేవతల (Nature Deities) ను గూర్చియే కలదు. కాని, యథర్వమున సామాన్యగృహ్యదేవతలను (Domestic deities) 'అస్యమా', 'అనుమతి' మొదలగువారిని గూర్చికాని, భూతములగూర్చికాని విశేషముగా కలదు. అందుచే నీయథర్వమున నింద్రాగ్నిసూర్యాది ప్రాకృత దేవతల యైతిహాసికవృత్తములం కేమాత్రము నభివృద్ధి లేదు. అగ్నిమాత్రము రుద్రునితో నేకత్వము నొంది నట్లు కానవచ్చును. అతడు (క్రమేపి) శివునితో నైక్యము నొందెను. ఐతిహాసిక దేవతల (mythological deities) గూర్చి యెక్కడేని యున్నను, నది మరి యొక గ్రంథమునుండి సేకరింపబడియున్నట్లగపడును.

ఇందు "సత్యం బృహ దృత ముగ్రం దీక్షా" (XII. ౧.) అను పృథ్వీసూక్తముమాత్రము సహజమగు కవితారసముతో నొప్పారుచున్నది. ఇట్లు కవిత్వమున నొప్పు సూక్తములు అథర్వమున కొలదిగా నున్నవి. మధ్యంతరితసూక్తముల జాడును.

## XI ఆచారకాండకు జెందిన సూక్తములు

ఈసూక్తములనుబట్టి యథర్వవేదము శ్రౌత సూత్రరచనానంతరము రచింపబడినట్లు తెలియనగునని కొందరు విమర్శకుల యభిప్రాయము. లేనిచో నాచార కాండకు జెందిన సూక్తములైనను కౌశికవైతానశ్రౌత సూత్రములు రచించినపిమ్మట యథర్వమున జేర్పబడి యుండవలెనని వారి తలంపు. అథర్వమునకు శ్రౌత భాగ మంతటితోను పరిచయ మున్నటు లీసూక్తముల వలన కనబడును. శ్రౌతకర్మలతో సంబంధములేదనిన కొన్నిసూక్తముల కర్థము గన్పట్టదు. శ్రౌతములోదప్ప నితరములతో నాసూక్తములకు సంబంధము కనుపించదు. అథర్వసంహితారచనకు బూర్వముకూడ అథర్వణులు సోమకర్మల నెరింగియున్నటులు గనుపింతురు.

## XII విషయపృథక్త్వము ప్రధానముగాగల కాండలలోని సూక్తములు

ముందుచెప్పిన ట్లిట్టివి XIII ; XIV ; XV ; XVI ; XVII ; XVIII కాండలలో గలవు. వీనిలో నొక్కొక్క కాండమం దొక్కొక్క విషయమును గూర్చి ప్రసంగింపబడియున్నది.

XIII - వ కాండలో నాలుగు పెద్దసూక్తములు గలవు. ఇవి సూర్యునియొక్క రూపమగు "రోహితు" నుద్దేశించియున్నవి. ఈరోహితుని భార్య రోహిణి. (ఈమె ప్రజాపతియొక్క రూపాంతరమని కొందరు విమర్శకులు తలంతురు.)

XIV - వ కాండయందు రెండు సూక్తములు గలవు. ఇం దాథర్వణుల వైవాహికమంత్రములు గలవు. ఇవి కొద్దిపాఠభేదముతో ఋగ్వేదములోని సూర్యాసూక్తము (X. ౮౫.) లోనివైయున్నవి. ఇదికాక యిందు ఋగ్వేదములోని X-౮౦-౧౦ మొదలగు మంత్రములుగూడ కనుపించుచున్నవి. ఐనను నిందు గొన్ని నూతనవిషయములుగూడ కలవు. కొద్ది పాఠభేదములతో నీవైవాహికమంత్రములే గృహ్యసూత్రములలో దఱచు కనుపించును. ఈమంత్రములు చాల పురాతనమైనట్లు తోచును. వీని కాలనిర్ణయముచేయుట చాలకష్టము. ఈకాండ కేలనో సాయణుడు వ్యాఖ్యానము చేసియుండలేదు.

XV - వ కాండలో బ్రాహ్మణములలోవలెనే మంత్రములు ఛందోబద్ధములుకాక, వచనరూపమున నున్నవి. ఇందు నిగూఢమగు వ్రాత్యకర్మలనుగూర్చి యున్నవి. వీనియందు శైవప్రభావ మిూపత్తు కనుపించును. అనార్యుల నార్యబృందములోనికి జేర్చికొని బ్రహ్మచర్యవ్రత మలవడజేయుచున్న ట్లీవ్రాత్యకర్మ వలన తెలియుచున్నది. విజాతీయుల నార్యబృందములోనికి జేర్చుకొని వారిని బ్రాహ్మణులవలె నాకాలమున మన్నించిరనుట కిదియొక నిదర్శనము. ఈవ్రాత్యకర్మకును, వ్రాత్యస్తోమమునకును సంబంధము కలదు. వీనికి సామవేదముతోగూడ సంబంధ మున్నట్లు తోచును. ఈకాండయందు రెండేసూక్తములు గలవు.

XVI - వ కాండయందు తొమ్మిది సూక్తములు గలవు. వీనిని రెండు విభాగములుగా చేయవచ్చును. ౧-౪ సూక్తములలోని మంత్రము లన్నియు

వచనరూపమున నున్నవి. వీనిని అథర్వపరిశిష్టమందురు. ఇవి అభిషేకమంత్రములలోనివి. ఇం దాచారకాండకు జెందిన అప్పంబంధమగు మంత్రము లున్నవి. వీని యాశయ మేమియో తెలియకున్నది. ౭౬-౭౭ సూక్తము లలో దుఃస్వప్నదోషమును హరించునదియు, నట్టి స్వప్నమును రాకుండజేయునదియు నగు నొక విపుల మగు ప్రయోగము కలదు. ఇవి యిచట నెందులకు జేర్చబడినవో తెలియకున్నది.

XVII - వ కాండలో 'విషాసహీ' అను నొకటే సూక్తము కలదు. ఇది యాయుష్యసూక్తము లలో ముఖ్యమైనది. ఇది ప్రత్యేకముగా నెందుల కొక కాండగా నేర్పరుపబడినదియు, నెందుల కీప్రదేశమున జేర్చబడినదియు జెప్పవీలు లేకున్నది.

XVIII - వ కాండలో నాలుగు సూక్తము లుగా నాలు గనువాకము లున్నవి. ఇందు పితృమేధ మునకు జెందిన మంత్రము లున్నవి. వీనిలోని మంత్ర ములు చాలవఱకు, పాఠభేదములతో ఋగ్వేదదశమమండ లములో కనుపించుచున్నవి. ఋగ్వేదము X. ౧౦; ౧౧; ౧౨ సూక్తములలోని మంత్రములే యీయథర్వమున జొప్పింపబడినట్లు కనబడును. ఋగ్వేదములోని X ౧౦ సూక్త మథర్వమున జేర్చుట సహజమై కన్పట్టును. కాని ఋగ్వేదము X ౧౧; ౧౨ సూక్తముల జేర్చుట యందుమాత్ర మెట్టి సామంజస్యమును జూపట్టదు. వీని జేర్చుటకు ఋగ్వేదమునం దాథర్వణుల కున్న గౌర వముదప్ప వేఱేమియు కారణము గానరాదు. ఇందు (XVIII-వ కాండలో) మూడవసూక్తములోని ౭౩ మంత్రములలో ౩౬ మాత్రము ఋగ్వేదమునుండి గ్రహింపబడినవి. శేషించినవానిలో గొన్ని యథర్వ ణమునకే చెందినవియు, గొన్ని యజుర్వేదమునుండి సేక రింపబడినవియు నైనట్లు కనుపించును. నాలుగవ సూక్తములోని ౮౯ మంత్రములలో ౧౨ మాత్రము ఋగ్వేదమునుండియు, ౭ తైత్తిరీయారణ్యకమునుం డియు గ్రహింపబడినవి. శేషించిన వన్నియు నాథర్వ ణులవే యనదగును. ఇందు ప్రేతకర్మకు జెందిన కొన్ని విశేషములు తెలియుచున్నవి

## XIII ఇరువదియవ కాండ

ఇందలి ౧౪౩ సూక్తములలో ౧౩ మాత్రమే మన కపరిచితమైనవియు, నూతనమైనవియును. మిగిలిన వన్నియు ఋగ్వేదము ఎనిమిదవమండలమున గాన వచ్చును. దీనికి శస్త్రకాండయని యింకొక పేరు కలదు. ఈకాండ హోత మొదలగువారిలో నొకడగు బ్రహ్మ కుపయోగించుటకై కూర్పబడియుండును. లేనియెడల నీవేదమునకు యజ్ఞమున కుపయోగపడుకాలము వచ్చి నప్పుడు శస్త్రస్తోత్రములందు బ్రహ్మకు సహాయభూతు డైన బ్రాహ్మణాచ్ఛంసి యుపయోగమునకైన రచి యింపబడియుండవలెను.

అథర్వప్రాతిశాఖ్య యీ కాండను, XIX-వ కాండను విడిచిపెట్టియున్నది. దీనినిబట్టి యీ రెండు కాండలు శేషించిన వేదముకంటె నర్వాచీన మైన వని యూహింపవచ్చును. అట్లర్వాచీనమైనవగుటచే బ్రథమమున వేదమని పిలుచుట కధికారము లేకపోయి యుండవలెను. లేదా, యిందలి విషయములు తఱచు కేవలైహిక, లౌకికవిషయములగుటను, నథర్వమతా చార్యుల యానాటి యనౌచిత్యకర్మల కసహ్యపడి, యీరెండుకాండలకును వైదికులు వేదాధికారము నిరాక రించియుండవచ్చును. లేదా ఋగ్వేద మంత్రములు మిక్కుటముగాగల యిరువదియవకాండగల యథర్వ శాఖకు (= శౌనకీయశాఖకు) పై జెప్పిన యథర్వప్రాతి శాఖ్య చెందియుండకపోవచ్చును. అందుచే నీకాండ ప్రసంగమందు లేకుండియుండును.

## XIV కుంతాపసూక్తములు

ఇవి యిరువదియవకాండలోని కొన్ని సూక్త ములు. వీనిని సాయణుడు తన మైతరేయబ్రాహ్మణ భాష్యమున ఖిలములని యుదాహరించియున్నాడు. వీనికి కుంతాప యనుపే రెట్లువచ్చెనో తెలియకున్నది. శాంఖాయనాశ్వలాయన శ్రౌతసూత్రములలోదప్ప నిక

నెచ్చటను వీనినిగూర్చిన ప్రసంగము లేదు. ఈమంత్రము లతిగూఢములై యర్థశూన్యము లైనట్లు కనుపించును. "మిక్కిలి పవిత్రములగు తాత్త్వికవిషయములతో బాటిట్టి వేదానాచిత్యవిషయము లిందుండుటకు కారణ మాచారకాండలో నుదాహరించిన యెట్టి తుచ్ఛకర్మకు నైనను వేదప్రమాణము కలుగజేసి యందు గౌరవము కలుగజేయుటకై ప్రయత్నముచేయు బ్రాహ్మణులు పన్నిన పన్నుగడయేయని తోచుచున్నది." అని యొక విమర్శకు డనుచున్నాడు. ఈ సూక్తములకును శ్రౌత తాత్త్వికాదివిషయములు గల సత్సూక్తములకును మధ్య ఋగ్వేదమునందలి "దానస్తుతులు" సేతువువోలె నున్నవి.

---



దర్జా —సూర్య.

# భట్టోద్భటుడు — తద్గ్రంథ ప్రశంస

విద్వాన్, కల్లూరి వేంకటసుబ్రహ్మణ్య దీక్షితులు

శ్రీమధుమారమణ చరణ సేవాపరిణతభక్తి భావభరితుండగు నుద్భటభట్టాచార్యుల కావ్యాలంకారసంగ్రహ మలంకారవిషయ నిరూపణమునఁ బ్రశస్తిగన్నయది. ఆలంకారికులలో మొట్టమొదటివాఁడగు భామహుని తరువాత నుద్భటాచార్యుఁడు సుప్రసిద్ధ ప్రామాణికుఁడు. వామనాచార్యుఁ డీతనికి సమకాలీనుఁ డని తెల్పుట కాధారములు గన్పట్టుచున్నవి. క్రీ. శ. ౭౫౫ మొదలు ౭౮౬ వరకు జయాపీడుఁడను రాజు కాశ్మీర రాజ్యపాలనము గావించెననియు, నాతనిసభయందు వామనాచార్యులు మంత్రియై యుండెననియు,

"మనోరథః శంఖదత్తశ్చటక స్సంధిమాం స్తథా,
బభూవుః కవయ స్తస్య వామనాద్యాశ్చ మంత్రిణః."

అని కల్హణుని రాజతరంగిణి వాకొనుచున్నది. కాని యీశ్లోకమున నుద్భటుని పేరు గన్పట్టదు. అయినను 'వామనాద్యాశ్చ' అని 'ఆద్య' పదప్రయోగమువలన నీతఁడు తత్సభయం దుండెనని తెల్పుటకుఁ బ్రతిబంధము లేకపోవుటయేకాక, జయాపీడుని సభయం దీతఁడు పొందు గౌరవ మెట్టిదో వర్ణించు రాజతరంగిణియందలి,

"విద్వాన్ దీనారలక్షేణ ప్రత్యహం కృతవేతనః,
భట్టోఽభూ దుద్భట స్తస్య భూమిభర్తు స్సభాపతిః."

అను శ్లోకము పైవిషయముతోఁబాటు నీతని సభాపతిత్వమునుగూడ ప్రసంగించుచు వామనాచార్యుని సమకాలీనత్వమునకుఁ బ్రబల సాక్ష్య మిచ్చుచున్నది.

దీనింబట్టి జయాపీడుని రాజ్యకాలమగు క్రీ. శ. ౭౫౫ - ౭౮౬ సంవత్సరములలో నుద్భటవామనాచార్యు లుండి రనుట విదితము. కావ్యాలంకారసంగ్రహప్రస్తావనమున జయాపీడుని రాజ్యకాలము క్రీ. శ. ౭౭౯ - ౮౧౩ సంవత్సరములమధ్య నని యున్నది. ఆకాలనిర్ణయవిభేదమున కాధారములు మృగ్యములు.

భట్టోద్భటుని గ్రంథమునకు లఘువృత్తి వ్రాసిన ప్రతీహారేందురా జీతని కత్యంత సన్నిహితకాలీనుఁ డని తెలియుచున్నది. అభిధానవృత్తిమాతృకాకారుఁడైన భట్టకల్లటుని కుమారుఁడగు ముకుళుని కీతఁడు శిష్యుఁడైనట్లు సాహిత్యదర్పణభూమిక యనుచున్నది. ఈప్రతీహారేందురాజు తన లఘువృత్తియందు అమరకుఁడు, కాత్యాయనుఁడు, చూర్ణికారుఁడు, దండి, భట్టవామనుఁడు, భామహుఁడు అనువారి వ్రాఁతల మాత్రమే ప్రమాణములుగాఁ గొనియున్నాఁడు. కావున నీతఁడు ప్రాచీనుఁడే కాని

యర్వాచీనుఁడు కాఁడు. ఇతఁడు రూపకాలంకారప్రస్తావనమున 'నేకదేశ' శబ్దవ్యాఖ్యానవిమర్శనముఁగావించుటలో భామహుని గ్రంథముపై 'భామహవివరణము' అనుపేర నొక గ్రంథము నుద్భటాచార్యుఁడు వ్రాసినట్లు స్పష్టపఱచియున్నాఁడు. ఉద్భటాచార్యుఁడు కుమారసంభవ మను సమగ్రమగు కావ్యమునుగూడ వ్రాసిన ట్లీతని లఘువృత్తివలన నే విదితమగుచున్నది.

ప్రకృతము కావ్యాలంకారసంగ్రహమున నాకావ్యమునందలిదే కానోపు గిరిజాకల్యాణఘట్టమునందలి ప్రథమాంశ ముదాహరింపఁబడినది. కాని యీతని యుదాహరణపద్ధతియసామాన్యనైపుణిం బ్రదర్శించుచున్నది. ఇతరాలంకారికు లెవ్వరును జొచ్చి చూడని పోకడ లిందు గోచరించుచున్నవి. శ్రీమద్భరతఖండమున భక్తిజ్ఞాన సాధనములుగాని విద్యాధనములు శాశ్వతస్థితిగలవి లేవని తెల్పుటకోయనున ట్లీగ్రంథనిర్మాణవిధానము నడచినట్లున్నది. ప్రాక్తనకవిశేఖరులు సహృదయహృదయారవింద వికసనరచనారంభ సంరంభంబున మునిఁగితేలుచు నానందగీతిక లాలపించునాఁడు 'కావ్యాలాపాంశ్చ వర్జయే' త్తను శ్రుతితంత్రి విసంవాది స్వర విస్ఫూర్తిగావించి, తమ యుత్సాహావేశముల డిందువఱుప, వారు

"చతుర్వర్గఫలప్రాప్తి స్సుఖా దల్పధియామపి,
కావ్యాదేవ యత స్తేన తత్స్వరూపం నిరూప్యతే."
—విశ్వనాథకవిరాజు

"ధర్మార్థకామమోక్షేషు వైచక్షణ్యం కలాసుచ,
కరోతి కీర్తిం ప్రీతించ సాధుకావ్యనిషేవణమ్."
—భామహుఁడు.

"కావ్యాలాపాశ్చ యేకేచి ద్గీతకా న్యఖిలానిచ,
శబ్దమూర్తిధర స్యైతే విష్ణో రంశా మహాత్మనః."
—విష్ణుపురాణము

అను ప్రామాణికాభిప్రాయముల నూఁతఁగాఁ గొని, యాశ్రుతితంత్రి నసత్కావ్యవిషయముగా స్థానాంతరమున మేళవించి తమ విశ్రుతకావ్యగానలహరికి విశృంఖలవిహారసంపత్తి ననుగ్రహించిరి.

కాని మన యుద్భటాచార్యునివంటి కొందఱు ఆశ్రుతితంత్రీస్వనంబును దమ యుదాత్తరసభావబంధురప్రబంధగీతీరవంబున విలీనంబుఁగావించి, కావ్యమూర్తియు, భక్తిరసవిస్ఫూర్తియు విజ్జోడుకాకుండ సంఘటించుటలోఁ దమ పనితనముఁ జూపి ధన్యులైరి. అందుచే నైహికాముష్మికఫలములు దేహళీదత్తదీపన్యాయమున నొకచోఁ జేకూరెను. అందులకు భట్టోద్భటుని గ్రంథనిర్మాణపద్ధతి నిదర్శనము. భట్టోద్భటుఁడు తొలుత వ్రాయఁబూనిన దలంకారలక్షణ గ్రంథము. అద్దానికి లక్ష్యశ్లోకముల గ్రంథాంతరముల నుండి యెత్తికాని, యప్పటికప్పుడు సరిపడు భావములుగల శ్లోకములు స్వయముగా వ్రాసికాని, తక్కిన యాలంకారికులవలె గ్రంథరచనము సాగింపవలసియుండెను. కాని యీయాచార్యశేఖరుఁ డట్లుకాక క్రమముగ లక్షణము వ్రాసి, దాని కుదాహరణ మిచ్చు

టలోఁ గుమారసంభవపుణ్యగాథను గావ్యముగా వ్రాసెను. ఒకమూల నలంకార శాస్త్రమునఁ గ్రమఃంథ తప్పకుండఁ జూచుకొనవలెను. ఒకమూల నందుల కనువగు నుదాహరణశ్లోకములఁ బూర్వోత్తర కథాసందర్భము చెడకుండ రసాభివ్యంజకములగునట్లు చూచుకొనుచు వ్రాసికొనవలెను. ఇట్లత్యద్భుతముగ లక్ష్యలక్షణసమన్వయం బునఁ దనమనోరథరథము నద్వితీయప్రతిభావైభవమున నిరాఘాటఘంటాపథంబులం బట్టించుట వింతగాఁ దోఁచకమానదు. ఇందీతఁ డెంతవరకుఁ గృతార్థుఁ డయ్యెనో దిఙ్మాత్రముగ వివరించెదఁగాక.

మొదటఁ బునరుక్తవదాభాసమున కుదాహరణముగా,

"తదాప్రభృతి నిస్సంగీ నాగకుంజర కృత్తిభృత్,
శితికంఠః కాలగల త్సతీశో కానలవ్యథః."

అని యుపక్రమించి కథాధోరణి సాగించినాఁడు. అటుపై లలిత సుకుమారపదగుంభనంబుల శరత్కాలమును వర్ణించుచుం బోయి,

"ఇతి కాలే కల్లోలాపికాదంబకుసంకులే,
త్రిదశాధీశ శార్దూః పశ్చాత్తాపేన ధూర్జటిః.
తాం శశిచ్ఛాయవదనాం నీలోత్పలదళేక్షణామ్,
సరోజకర్ణికాగారీం గౌరీంప్రతి మనో దధౌ."

అని యుపమాలంకారమున కొకవంక లక్ష్యము నిరూపించుచు నొకవంకఁ గథాసంబంధముం బ్రకటించెను.

మఱియు నీశ్వరుఁడు వటువేషధారియై పార్వతికిఁ బ్రత్యక్షమయ్యె నను కాళిదాస కావ్యకథాచ్ఛాయ మనమునం దిడుకొని,

"ఏష శర్వోఽపి భగవాన్ వటూభూయస్మన ర్తతే."

అనుటలో 'అపి' శబ్దప్రయోగముచేఁ బ్రస్తుతాలంకార లక్ష్యాంశమునకును, విధేయాంశమునకు నొక వింతసొబగుఁ గూర్చి,

"తన్నాస్తి య న్నకురుతే లోకే హ్యుత్పన్నకార్యికః"

అనుదానిచేఁ బైవిషయమును సమర్థించుకొని నొచ్చియు నొచ్చకుండఁ గథాసంఘటనంబు గావించి యర్థాంతరన్యాసాలంకార లక్ష్యమును బూరించినాఁడు. ఇదికదా కవిబ్రహ్మ కుండఁదగు చాతుర్యము! ఇట్లే కొన్ని ముఖ్యములగు ఘట్టముల నీతఁడు లక్ష్యముల నిచ్చుటలోఁ జూపిన మెలఁకువ కొనియాడఁదగియున్నది.

పులకేశియొక్క శిలాశాసనముంబట్టి క్రీ. శ. ౬౩౪ ప్రాంతమువాఁ డన్న కాళిదాసీతనికిఁ బూర్వుఁడని చెప్పవలసియున్నది. అందుచేఁ దత్కుమారసంభవ కథాచ్ఛాయ లీగ్రంథమునఁ గానవచ్చుచున్నవి. పార్వతి తపోవర్ణనము, ఈశ్వరుని వటువేషము, సంభాషణము మొదలగు ముఖ్యకథాంశములేకాక వర్ణనములంగూడ యించించుక తచ్ఛాయలు గోచరించెడిని.

"విజిత్య నేత్రప్రతిఘాతినీం ప్రభా
మనన్యదృష్టిః సవితార మైక్షత."

"తథాభితప్తం సవితు ర్గభస్తిభి
ర్ముఖం తదీయం కమలశ్రియం దధౌ,
అపాంగయోః కేవల మస్య దీర్ఘయో
శ్శనైశ్శనైః శ్యామికయా కృతం పదమ్."

—కాళిదాసుని కుమారసంభవము.

ఉత్ప్రేక్షాలంకారోదాహరణమున,

"అస్యాః సదార్కబింబస్థ దృష్టిక్షీతాతపై ర్జపైః,
శ్యామికాంకేన పతితం ముఖే చంద్రభ్రమాదివ."

—ఉద్భటుని కుమారసంభవము.

ఇట్లే సూక్ష్మముగ గమనించినకొలంది కొన్ని పోలికలు చూపవచ్చును. అసామాన్యప్రతిభావంతులగు నీయిరువురు కవులు నొకేవిధమగు కథావిధానమున, దమ కవితావైభవమును గనఁబఱచిరి. కావున సహృదయు లిందలి రుచిభేదముల ననాయాసముగ నాస్వాదించి యానందించుభాగ్యము నందెదరుగాక!

అఘటనఘటనానైపుణ్యమున నారితేరిన యిట్టి కవిబ్రహ్మల కావ్యసృష్టియందలి భావసంపత్తి గ్రహించి మనము నిజమగు భావకవులము, స్వభావకవులము నయ్యెదము గాక!

---



దత్తమండల కళాశాల, అనంతపురము

—టి. రామచంద్రరావు.

# కవిత్వమూ, దూరమునుండీ చూపూ

డాక్టరు టి. వి. శేషగిరిరావు

(Poetry and Psychic Distance)

ఉన్నతమైన కవిత్వమునందుదూరమునుండి చూపు (Psychic Distance) అనునది ముఖ్యముగా నుండవలసిన యంశమని నాకు తోచుచున్నది. ఈదూరము స్థలసంబంధమైన దూరముకాదు. కాలసంబంధమైన దూరమునూ కాదు. ఇది మనస్సంబంధమైనదూరము.

ఒక ఉదాహరణమువలన ఈ విషయము తేటపడగలదు. గోదావరివరదలనుచూడుడు. నిరంతరముగా ప్రవహించు జలప్రవాహము, నిమిషనిమిషమునకును ఉప్పొంగి పొరలిపోవు నదీరాజమును చూచునప్పుడు జీవనమునకు వరదలవల్ల కలుగు కష్టనష్టములను గూర్చి మనము తలంచకపోము. ఇట్టి తలంపులు మన మనస్సునకు బాధాకరములై యుండును. అయినను, నది సౌందర్యముగనున్నదని దానిని చూచి ఆనందింతుము. వింతమైన ఆజలముల రంగునూ, గట్టుకానని నదివైశాల్యమును, మిన్నుజేరునట్లుండు ప్రవాహమును, ఆప్రవాహముయొక్క చురుకైన ధోరణియు దానిచే కొట్టుకొనిపోబడు వృక్షములును, ఆవృక్షములను పట్టబోవు జాలరివాండ్రును, ఈసౌందర్యమును చూచి ఆనందించు చూపరుల సౌందర్యమును చూచి మెచ్చదగినవే మైయున్నవి. ఇట్లు ఒకే దృగ్విషయము, ఒకవిధమున జూచిన భయమును, వికారమును పుట్టించుచున్నది. ఇంకొకవిధమునజూచిన సౌందర్యమును వెల్లడించి ఆనందము నిచ్చుచున్నది. ఈ తారతమ్యమునకు కారణము చూచువాని మనస్సుననుండు దూరము Detachment అని నాయొక్క భావము.

కొన్నికొన్ని దివ్యములైన సమయములయందు కవి వ్యవహారవిషయములనుండియు, దినచర్యనుండియు, సామాన్య జీవనమునుండియు తప్పించుకొని తన మనస్సును సామాన్యదృష్టికి గోచరమగు వ్యవహారప్రపంచకమునుండి దూరముగా తీసుకొనిపోయి, అచ్చటనుండి సృష్టియందును, మన జీవితమునందును మిళితమైన సౌందర్యమును అవలోకించును ఈసౌందర్యమును మాటలయందు ప్రదర్శించును. దీనినే మనము కవిత్వ మనుచున్నాము.

ఇట్టిచూపు, లేక అవలోకనమునందలి దూరమును Psychic Distance, లేక Detachment అని ఆంగ్లభాషయందు అందురు. మాట ఏదైననేమిగాని భావము ఒకటియే. ఈ Distance లేక దూరము కవికిని కవిమనస్సుయొక్క వికారములకును

(అనగా Affections, లేక Modifications of the mind), లేక అట్టివికారములను కల్పించు అంశములకును మధ్య కాన్పించును.

దీనివలననే కవియొక్క మనస్సు సాధారణ ప్రాపంచిక వ్యవహారప్రవాహమునందు కొట్టుకొనిపోకుండా కాపాడుకొనుచుండును. మిథిలాపట్టణము తగులబడుచున్న దని విని నప్పుడు, "మిథిల తగులబడుచున్నది. నా దేదియు తగులబడుట లేదు" అని రాజర్షి జనకమహారాజు ననిపించినది ఈ దూరము నుండి చూచు దృష్టియే (Distance లేక Detachment). రోముపట్టణము తగులబడు చున్నప్పుడు నీరో (Nero) ను ఫిడేలుపై వాయింపజేసినది యీదూరమునుండిచూచు దృష్టియే. భయంకరమైన గోదావరినదియందలి సౌందర్యమును సుబ్బారావను ఒక ఆంధ్రచిత్రకళానిపుణునకు చూపినది యీ దూరమునుండిచూచుదృష్టియే. ఈదూరము నుండి చూచు చూపువలననే శ్రీయుత కవికొండల వెంకట్రావుకవి "భావమురళి" యను గ్రంథమున "ప్రతిదినము", "చిన్ని మేఘము", "శీతాకాలపు సంధ్య", "జీవన గీతిక", "వరదలప్పుడు" మొదలగు గీతికలను వ్రాయగలిగిరి. దీనివలననే వారు "తన యుత్తగంపను మేటవాలుగ తలపై పెట్టుకొన్న అందకత్తెనగవును" చూడగలిగిరి.

ఇచట ఇంకొకవిషయము విశదీకరింపవలసియున్నది. ఈదూరమునుండి చూచు చూపునందు కవికి చెందిన విలువైన ఆంతరానుభవములు వెడలగొట్టబడునేమో యను సందేహము కొందఱికి కలుగవచ్చును. కాని యీసందేహము సరికాదు. ఇట్టి దూరదృష్టివలన కవిమనస్సునుండి విడగొట్టబడునది వ్యవహారప్రపంచకమునందలి జీవనమువలన కలిగిన కల్మషములుమాత్రమే. ఈ దూరము నుండి చూచుదృష్టి (Distance or Detachment) అనునది మన మనస్సునకు ద్రావకమును వడగట్టు ఒకగుడ్డవంటిది. కాని, వ్యక్తి జీవనమును భగ్నపరచు మంటవంటిది కాదు.

ఇంకొక సంగతి. కవియొక్క మనస్సు విషయములనుండి ఎప్పుడూ ఒకటేదూరములో నుండిన ప్రయోజనములేదు. మనస్సును ఎంతదూరములో నుంచవలయునో, ఎంత దగ్గరలో నుంచవలయునో విషయము యొక్క స్వభావమునుబట్టియూ, స్థితిగతులను బట్టియూ మారుచుండవలయును. కవి యొక్క నిపుణత మనస్సుయొక్క దూరమును సరిపఱచుకొనునట్టిశక్తి (Distancing Power) పై ఆధారపడి యున్నది. అట్టిశక్తి లేనిచో అనవసరముగా కవి మనస్సుఎక్కువ దూరముగాపోవుటగాని (Over-distancing) మరీదగ్గరగా వచ్చుటగాని (Under-distancing) తటస్థించును. అందుచేత కవిదృష్టి యందు లోపములును, కవిత్వమునందు వెలుతురును సంభవించును.

# ఉల్టా-సీదా

వెంపటి నాగభూషణం

(ఏకాంకనాటిక)

[ పెద్దహాలు. సోఫాలు, కుర్చీల, సెటీలు—గూడాను. మైసూరు టెక్నలాజికల్ ఇన్‌స్టిట్యూటులో తయారైనవి. ఎడంవైపున బల్లపైన ఫిడేలు. దానిప్రక్కన త్రొక్కుడుహార్మోనియం. పాశ్చాత్యసినీమానటీనటకుల చిత్తరువులు కుడ్యాలంకారాలు. హాలుకు మధ్యగా కాశ్మీరంతివాచీపైన దంతపుపనుపుతెలకోళ్ల బల్ల. దానిపైన పుస్తకాలు, రెండు ఫోటోలు.

సమయం సాయంకాలం అయిదుగంటలు. ఉమాశంకరశర్మ పచార్లుచేస్తూ టాడు. ఇరవై అయిదేళ్లవాడు. కొంచెంగా నూలకాయుడు. పొడుగాటి ముక్కు. నునుపై వెడల్పుగావున్న నుదురు. బుజం మీదికి వ్రేలాడుతున్న పొడుగాటి వెండ్రుకలు. కళ్లకు పాన్సునే బ్లూసర్జిసూటు తొడుక్కున్నాడు. ఆవేశంతో యిటూ, అటూ తిరుగుతూ, విసుగుతో ముఖం చిట్లించి, రిస్టువాచి చూస్తూ—]

ఉమా

అరగంటైంది వచ్చి. ఇంతవరకూ విశాల వచ్చేజాడలు లేవు. తప్పకుండా యింటివద్ద వుంటాను రమ్మంది. చిత్తరువు గీయించుకోడానికిసిద్ధంగా వుంటానంది. ఇంతలో ఏమికార్యం ముంచుకొచ్చిందో! ఎక్కడికి వెళ్లిందో తెలియదన్నాడు నౌకరు. 'నాలుగింటికే కారు వచ్చింది. అందులో వెళ్లింది.' అని మాత్రం చెప్పాడు. ఎక్కడికైె వుంటుంది చెప్మా. నేనుతప్ప ఆప్తస్నేహితులు లేరని అనేకమార్లు చెప్పిందే? అనే నానమ్మకం కాని ఆడవాళ్లని పూర్తిగా నమ్మడం......

[ఇంతలో సింహద్వారం కర్టెను తొలిగించి విశాల ప్రవేశిస్తుంది ఇరవైరెండేళ్లు. బొద్దుశరీరం. సుంద్రటి ముఖం. నల్లని పెద్ద కళ్లు. ఒత్తయిన తలకట్టు. పిఱుదులదాక వ్రేలాడే అయిదుపాయల జడ. లేత పసుపురంగుపైన బంగారుపూల పట్టుచీరె పార్సీవిధానంగా కట్టుకుంది. పైన మహమ్మల్ పొట్టికోటు వేసుకుంది. ద్రాక్షగుత్తిలోలాకులు చెవులకు. ఎడం చేతికి చిన్న రిస్టువాచి. కుడిచేతిలో టాయిలెట్‌పెట్టె.

ఉమాశంకరశర్మను చూచి ఆతురతతో గబగబా దగ్గర కొచ్చి—]

విశాల

హల్లో! చాలా సేపుఅయిందా వచ్చి? అర్జంటు పనిమీద వెళ్లాను. యక్స్క్యూజుచెయ్యాలి—

(అంటూ చేతులోసామగ్రి సోఫాలోపెట్టి, కోటువిప్పి హార్మోనియంకు తగిలించి, ఉక్కచేత యిస్సుమంటూ కుడివైపునున్న కుర్చీలో జార్లగిలబడి, టేబిలుఫాను తనవైపు త్రిప్పుకొని, ఉమాశంకరశర్మ ముఖం చిట్లించి నిలబడి వుండడం గమనించి—)

హల్లో, కూర్చోకూడదూ...ఎంత సే పైంది వచ్చి. అబ్బ, ఉక్క జాస్తీగా లేదూ... అయితే—?

ఉమా

(కోపంతో)

అయితే?......నేనేం నీ నౌకరు ననుకున్నావా? ఈ కాపలాకి అర్థ మేమిటి?

విశాల

నౌకరు వని ఎవరన్నారూ ?

ఉమా

ఇంత సేపు ఎక్కడికి కెళ్లావు ?

విశాల

ఎక్కడికి కెళ్తే నీకెందుకు ?

ఉమా

నాకెందుకా ? నాకు కాకపోతే ఎవరికి ? ధైర్యంగా అడుగుతున్నావే ? "ఈ దినం అయిదుగంటలకు తప్పకుండా రా. ఫోటో గీయించుకోడానికి సిద్ధంగా వుంటాను" అన్నావే ? జ్ఞాపకం లేదూ ? తాబేదారల్లే వచ్చి నిలబడ్డానే...

విశాల

రాకుండా ఊర్కోక పోయినావ్.

ఉమా

అట్లాగేం ? ఇల్లా అవుతుందని తెలిస్తే అంతే జేసేవాణ్ణి.

విశాల

సరే !

ఉమా

అయితే, ఎక్కడికి కెళ్లావో చెప్పవా ?

విశాల

చెప్పితీరాలా ? నాయిష్టంవచ్చినచోటికి వెళ్ల డానికి నాకు స్వాతంత్ర్యం లేదూ ?

ఉమా

స్వాతంత్ర్యంవుండబట్టే యిట్లా నీయిష్టంవచ్చి నట్టు మగవాళ్లతో చెలగాటం ఆడుతున్నావు.

విశాల

ఆట్టే మాట్లాడకు. నాయిష్టం నాది. వచ్చి నాతో నేస్తం చేయమని నిన్ను బొట్టూ కాటుకా పెట్టి పిల్చానా ?

ఉమా

ఆంధ్ర దేశంలో బయల్దేరిన సినీమాయాక్ట ర్లలో నాకేగదా కాస్త పేరు, ప్రఖ్యాతులు వచ్చాయని గర్వమా నీకు ?

విశాల

తెలుగుజిల్లాలలోకల్లా నేనే గదా అడ్వరు టైజు మెంటుఅయిన ఆర్టిస్టును అని అహంభా వమా నీకు ?

ఉమా

అటువంటిది నా కేంలేదు.

విశాల

నాకూ లేదు.

ఉమా

మరెందుకు యీపిచ్చివేషాలు, పొగరుబోతు మాటలు ?

విశాల

మాటలు మిగులకు. మర్యాద యిచ్చి మర్యాద కాపాడుకో.

ఉమా

ఈ ఏడాదినుండీ నీస్నేహం జేసి, నీ తలతిక్క లకు, దర్జాలకు, డాంబికాలకు తగలేసిన అయిదారువేలకు యిదేనా నాకు జవాబు ?

విశాల

ఎవరు తగలెయ్యమన్నారు? నువ్వుకాకపోతే మరొకరు నాకు.

ఉమా

అదే అనుకున్నాను. లేకపోతే ఇట్లా షికార్లు ఎందుకు జరుగుతాయి?

విశాల

నాయిష్టం. నా దినచర్యలకీ, కార్యక్రమాలకూగూడ నువ్వేనా ఏం అధిపతివి?

ఉమా

(కోపంతో సోఫావద్దకొచ్చి)

వొళ్లు తెలియకుండా వాగుతున్నావు. యావనగర్వంతో కళ్లు కన్పడ్డంలేదు. ఇహనుంచి నాతో చెప్పందే బయటికి వెళ్లావంటే చూడు—

విశాల

(రోషంతో)

ఏం. నువ్వేం నాకు పుస్తెకట్టావా? అగ్నిసాక్షిగా పెళ్లిచేసుకొన్న మొగుడుకన్న అధికంగా చలాయిస్తున్నావే?

ఉమా

చలాయిస్తున్నానా?...... (అనుమానంతో చూస్తూ)... అయితే జాకెట్టుగుండీ ఎందుకు ఊడింది? జుట్టు రేగిందేం?

విశాల

ఇంకా చాలా జరిగింది!

ఉమా

చాలా జరిగిందేం? సిగ్గులేకుండా మాట్లాడుతావేం యింకా.

విశాల

సిగ్గులేకుండా అడిగినవాళ్లకు సిగ్గులేకుండా చెప్పద్దూ, జవాబు.

ఉమా

(ఆవేశంపట్టలేక)

సిగ్గులేకుండా అడిగానేం? నువ్వు చేసింది బాగుందేం?

(అంటూ జడపట్టుకు సోఫాలోంచి లేవనెత్తుతాడు.)

విశాల

(కెవ్వున కేకవేసి, పట్టువిడిపించుకొని)

దుర్మార్గుడా, దూరంగావుండి మాట్లాడు. దౌర్జన్యం చెయ్యకు. బల ముందిగదా అని పశువులాగ ప్రవర్తిస్తావేం? ఇల్లాంటి దౌర్భాగ్యుడవని తెలిస్తే గడపత్రొక్కనిచ్చేదాన్నే గాదు. ఆట్టే పిచ్చివేషాలు వేస్తే నౌకరుచేత మెడపట్టి గెంటిస్తాను. కబడ్దార్—

(అని నలిగిన జడను ముందుకు తీసుకొని సవరించుకుంటుంది.)

ఉమా

(రెండుచేతుల్తో కళ్లుమూసుకోడానికి ప్రయత్నిస్తూ, సోఫాలో కూలబడి.)

ఎంతపని, ఎంతపని. బుద్ధి పూర్తిగా గడ్డితిన్నది. అవలీలగా వల్లోపడ్డాను. రసపిపాస యిచ్చాడు దిక్కుమాలిన దేవుడు. లేకపోతే, అందరితోపాటు ఏదో చదివి, ప్యాసవ్వో, తప్పో, ఏగుమాస్తాగానో, బడిపంతులుగానో

జీవితం గడిపేవాణ్ణి. సౌందర్యమని, శృంగార మని, కళ అని పెనుగులాడుతూ ఎందుకు యిటువంటి జీవితం? తరతరాలనుంచీ, యుగ యుగాలనుంచీ యీదిక్కుమాలిన ఆడజాతి యింతే, మొగాళ్లని పిండి పిప్పిజేసి, అధః పాతాళానికి త్రొక్కేస్తారు. ఇనుపకచ్చ డాల్ గట్టుకొన్న మునిముచ్చులే తల్లక్రిందు లైనారు. ఇక నాబోటివాళ్లా?

విశాల

(జడ సవరించుకోడం ముగించి)

నిజం, ముమ్మాటికీ నిజం. వెర్రి వెంగ ళాయల్లే ఎవరు రమ్మన్నారు ఇక్కడికి. వేదాంతం మాట్లాడుతావేం, వేదాంతం? తక్షణం వెళ్లిపో. గిరగిర త్రిప్పి నీడబ్బు నీకు పారవేస్తాను. ఇంటిదగ్గర గీతగోవిందం పెడ్తున్న చక్కటిపెళ్లాన్ని వదిలి, నాకాళ్లకు నిన్నెవ్వరు మ్రొక్కమన్నారోయ్ - శుంఠ. నాదర్శనం దొరికిందాక తహతహలాడావే?

ఉమా

అందుకు తగిన ప్రాయశ్చిత్తమా యిది?

విశాల

ఏమో, నీకే తెలియాలి. కావడిమోసేవాడికి గాని తెలియదు బరువు. ఆలోచించుకో—

(అని ఒకక్షణం పచారుజేసి, హార్మోనియం దగ్గర కెళ్లి వాయించడం ప్రారంభించి పాడ్తుంది.)

"నీదు చరణములే, నీదు చరణములే—
ఓరామరామ-నీదు చరణములే—
గతియని నమ్మినవాడనో, రామ రామ నీ"

[ఉమా కళ్లుతెరిచి నిప్పు)యోజనంగా చూస్తూ, రెండుమూడునిమిషా లైనతర్వాత ఆగానతరంగంలో చిక్కుకొని, మెల్లగా తాళంవేయడం ప్రారంభించి, తర్వాత పాడ్తాడు—]

ఉమా

"పాపకర్మపు గుంటరా యిది
ఇకనే తాళజాలనుర - ఓరామ, రామ"

విశాల

(విని, ఓరచూపు చూసి, హఠాత్తుగా రాగం మార్చి)

"నాదబిందుకలాపీ నమోనమో
వేదమంత్రస్వరూపా నమోనమో
నామశంభుకుమారా నమోనమో—"

(మన్యు, వెనక్కు తిరిగి చూస్తుంది. ఉమా వెర్రిగా తల త్రిప్పుతూ ఇంకా, "పాపకర్మపు గుంటరా యిది" అని పాడ్తూంటాడు. విశాల విరగబడి వెకిలిగా నవ్వుతుంది. ఉమాకు చేతనత్వం వచ్చి, తన పరిస్థితిని తెలిసికొని, పాట విరమించి, మెల్లగా విశాలవెనక్కు జేర్తాడు.)

విశాల

(అతను రావడం గమనించి, చూడనట్టుగా నటించి, శ్రుతిమార్చి పాడ్తుంది—దేశాక్షుగీ రాగంలో)

"స్తనవినిహితమపి హార ముదారం
సా మనుతే కృశతను రివ భారం

రాధికాకృష్ణ! రాధికా!
రాధికా తవ విరహే కేశవ!
సరసమసృణమపి మలయజపంకం
పశ్యతి విషమివ వపుషి సశంకం
రాధికా కృష్ణ! రాధికా!
రాధికా తవ విరహే కేశవ!

* * * *

హరిరితి హరిరితి జపతి సకామం
విరహవిహితమరణేవ నికామం
రాధికా కృష్ణ! రాధికా!
రాధికా తవ విరహే కేశవ!"

ఉమా

(ఆవేశంతో విశాలపైకి వంగి, రెండుచెంపలూ ముద్దుపెట్టుకుంటూ—)
ఎందుకమ్మా అంత ఆవేదన. ఇక్కడేవున్నా నుగా.

విశాల

(ఓరచూపుతో)
నిన్నెవరు పిల్చారు?

ఉమా

నన్నొకరు రమ్మనాలా
(అని తిరిగి బలవంతంగా ముద్దుపెట్టుకుంటూ, బుజాలు పట్టుకు విశాలను లేవదీసి, పాడ్తాడు.)
"ప్రియే! చారుశీలే! ప్రియే! చారుశీలే!

ముంచ మయి మాన మనిదానం
సపది మదనానలో దహతి మమ మానసం
దేహి ముఖకమలమధుపానమ్
సత్యమేవాసి యది సుదతి! మయి కోపినీ
దేహి ఖరనఖరశరఘాతమ్
ఘటయ భుజబంధనం జనయ రదఖండనం
యే నవా భవతి సుఖజాతమ్!
ప్రియే! చారుశీలే! ప్రియే! చారుశీలే!

త్వమసి మమభూషణం త్వమసిమమజీవనం
త్వమసి మమ భవజలధిరత్నమ్
భవతు భవతీహ మయి సతత మనురోధినీ
తత్ర మమ హృదయ మతియత్నమ్!
ప్రియే! చారుశీలే! ప్రియే! చారుశీలే!"

(ఇద్దరూ కలిసి పాడ్తూ నృత్యంచేస్తారు. తుదకు విశాల అలిసిపోయి సోఫాలో కూర్చుంటుంది. ఉమా ప్రక్కనే కూర్చుని ఆమె నుదుటనున్న ఘర్మబిందువులు తుడుస్తూ—)

ఉమా

అయిపోయిందా జగడం?

విశాల

అయిపో కేంజేస్తుంది. నీ అలసత్వం తెలిసే అల్లా ఏడ్పించాను.

ఉమా

అవునులే, మధ్యమధ్య యిల్లాంటి ప్రేమ కలహాలు లేకపోతే శాస్త్రప్రపద్ధతిగా నడవదు రొమాన్సు. రాజీచిహ్నంగా ఏదీ ఒకటి....
(అని పైకి జరుగుతాడు.)

విశాల

(దూరంగా తొలగి)
అబ్బ, రమ్మన్నారు.

ఉమా

అల్లాగేం, ఎట్లా తప్పించుకుంటావో చూస్తాగా.
(అని బలవంతంగా దగ్గరకు లాక్కొని చుంబనం జేస్తాడు.)

విశాల

(తృప్తికనపరుస్తూ అతని ఒళ్లో తలపెట్టి)
చాలా. హృదయం శమించిందా. తాపం చల్లారిందా?

11.     7     5     3

ఉమా

ఆఁహా...అయితే బాకీ తీర్చవు?

విశాల

మార్వాడీ అప్పులవాళ్లకన్న మించావే. (అని గథాలునలేచి) బాకీ తీర్చాలేం...అసలు, వడ్డీ గూడానా?

(అని చెంపమీదకొట్టి దూరంగా పరుగెత్తుకుంది.)

ఉమా

(చెంప రుద్దుకుంటూ)

అట్లాగేం. చూస్కో, తీర్చుకుంటాను. సరే. అయిం దేదో అయిందిగాని, ఫోటో గీయించుకుంటానని ప్రామిస్సు జేశావు. సిద్ధమై వచ్చాను. పది నిమిషాలు కదలకుండా కూర్చో. తయారుజేస్తాను.

విశాల

అబ్బ, యిప్పు డేమిటి. తర్వాత చూడకూడదూ ఆపని?

ఉమా

కాదు. తిప్పలు పెట్టకు. ఇప్పుడే మూడ్ ఉంది. పదినిమిషాలు చాల్లే......

విశాల

అయితే వుండు. టీ త్రాగి కూర్చుందాం. సరేనా, మళ్లీ తిక్కవస్తుందా?

ఉమా

త్వరగా తెప్పించు మరి.

విశాల

జయకరన్, జయకరన్, టీ.

(జయకరన్ పళ్లెంలో వెండికోపాలు, టీ, బిస్కట్లుతెచ్చి బల్లమీద పెట్టి పోతాడు. విశాల టీ కలిపినతర్వాత యిద్దరూ త్రాగడం మొదలుపెడ్తారు.)

విశాల

అయితే నాబొమ్మగీస్తే నీ కేంప్రయోజనం?

ఉమా

అడిగావ్, డర్టీప్రశ్న. నా కున్న యావచ్ఛక్తినీ వినియోగించడానికి నిశ్చయించుకున్నాను. మాస్టరుపీస్ తయారుజేస్తాను, చూడు.

విశాల

చేసి...డబ్బు సంపాదిస్తావా?

ఉమా

ఏంజరుగుతుందో చూడు. వచ్చేనెల ఢిల్లీలో జరిగే వైస్రాయిఎగ్జిబిషనుకు పంపించా లనుకుంటాను. బిక్కనీరుమహారాజు లక్షరూపాయ లిస్తాననా్న అమ్ముతానా?

విశాల

ఊఁ. అమ్మవు. డబ్బు చేదా?

ఉమా

వెధవడబ్బు ఎవరికి కావాలి? స్వంతంగా కష్టపడి వ్రాసిన నీచిత్తరువు, నామెత్తుధనం పోసినా — "కర్ణాట కిరాట కీచకుల కమ్మ త్రిశుద్ధిగ నమ్మ భారతీ"

విశాల

అబ్బో. కవిత్వంలో పడిపోతున్నావు. టీ చల్లారుతోంది. పూర్తిచెయ్యి.

ఉమా

(టీ త్రాగుతూ)
నిన్నుగూర్చి తల్చుకుంటూంటే యింకా టీ గూడ ఎందుకు?

విశాల

ఎంత అమాయకుడవు. కాబట్టే నాచేతుల్లో కీలుబొమ్మ అయినావు.

ఉమా

(పూర్తిచేసి)
సరే సిద్ధంకా, మరి.

విశాల

అంటే అర్థం?

ఉమా

అంటే అర్థం రెడీ కమ్మన్నమాట.

విశాల

రెడీ అన్నమాటే. ఇక్కడే వున్నానుగా.

ఉమా

హాండు-బ్యాగులోంచి పెన్సిలు, కాగితంతీసి, ఆమె వైపు చూస్తూ)
అల్లాకాదు - యీ వైపుగా కూర్చుంటే బాగుంటుందేమో.

(అని వచ్చి విశాలను సోఫాచేతిమీద ఓరగా కూర్చోపెట్తాడు.)

విశాల

ఇప్పుడే చూసుకో. తర్వాత నన్ననకు.

ఉమా

(రెండు మూడు నిమిషాలు నిదానించి చూచి)
ఒకటి తట్టుతోంది, విశాలా, చెప్తానుగాని ఏమీ అనుకోవుగద.

విశాల

చెప్పు, ఏమిటో.

ఉమా

ఈపైదుస్తు లన్నీ లేకుండా—మామూలుగా-

విశాల

(త్రపతో)
ఆఁ. అర్థమైంది. చాలాదూరందాకా వున్నాయే ఊహలు.

ఉమా

అదిగాదు, విశాలా. అసలు ఆర్టుకు ఆధారమే అది. స్వాభావికమైనట్టుగా వుంటే గాని బాగుండదు. గ్రీకు, రోమను ఆర్టులో ఎన్ని నగ్నచిత్తరువు లున్నాయో, ఓనాడు ఆల్బం తెచ్చి చూపించానుగా. చూశావుగా, శరీర సౌష్ఠవం, మార్దవం ఎట్లా నిరూపింపబడ్డాయో. మన దేవతలు, దేవుళ్లు విగ్రహాల విషయాల్లో గూడా అంతే. కాబట్టి నే చెప్పేది ఏమంటే—

విశాల

ఆశే. నాకేం మానాభిమానాలు లేవనుకున్నావా? ఎంత చెడ్డా స్త్రీని. వస్త్రవిహీనురాల్నిగా నీముందు నిలబడనా. అట్లా గీసి నలుగురికంటా పడేస్తావూ? ఎట్లా అడగబుద్ధి అయింది?

ఉమా

(కాగితాలు ప్రక్కనపడేసి)
అదే, మామూలు వాళ్లకూ ఆర్టిస్టుకూ వుండే తారతమ్యం. ఆర్టులో నీతి-అవినీతి

అనేది లేదు. చిత్రకారుడు స్రష్ట. అన్నిటికి అతీతుడు. జ్ఞానచక్షువుతో మర్మభేదియై అంతర్వ్యాప్తమైన సత్యాన్ని వెలికిదెస్తాడు. ఆర్టిస్టు సమదర్శి. దేన్నీ భేదబుద్ధితో చూడడు. ఏఅంశాన్నీ బుజువుచేయడు. ఏమతాన్నీ వాదించడు. ఏధర్మాన్నీ నిషేధించడు. వెలుగునీడల్ని, సుఖదుఃఖాల్ని, పుణ్యాపాపాల్ని, నిమ్నోన్నతాల్ని, ఉదయాస్తమయాల్ని, సంపత్తువిపత్తుల్ని, అపథపథాల్ని,— అన్నిటినీ సకలవ్యాపారాల్నీ, స్పృశించి, వాటి అంతరంలో వుండే మధువుతో మధుచక్రం కూడబెడ్తాడు. ద్వంద్వాలను అతిక్రమించి—'ఆదిత్యవర్ణః తమసఃపరస్తాత్'ను దర్శిస్తాడు. అదే నాఆదర్శం. దాన్నే నీచిత్తరువులో ప్రదర్శించడానికి ఆదుర్దాపడ్తున్నాను.

విశాల

అబ్బ చంపకు ఉమా, నీఆర్టు ఉపన్యాసాలతో. లక్షపర్యాయాలు చెప్పావు, ఈవిషయాలు ఇంతవరకు. ప్రాణం విసుగుచస్తోంది. కావలిస్తే యిల్లా కూర్చుంటాను. చిత్తరువుగీస్తే గియ్యి, లేకపోతే లేదు. అంతే.

ఉమా

(కనికరంపుట్టించేటట్లుగా)

విశాలా, నీకోసం ఎన్నో త్యాగాలుచేశాను. నాఆదర్శం నీచెలిమిలో పరాకాష్ఠను పొందుతుందని భావించాను. నిరాశుణ్ణిగా జేయకు. అందరిస్త్రీలమోస్తరుగాదు నీవు. కళోపాసకురాలవు. గాననృత్యాభినయాల్లో ఆరి తేరినదానవు. ధవళచంద్రికను బోలిన మందహాసంతో, ఉషఃకాంతి విరజిమ్మే విశాలనేత్రరోచిస్సుతో, వీణాగానాన్ని పరిహసించే మంజులభాషణంతో,— నాటకరంగంమీద, నిశ్శబ్దచలనచిత్రాల్లోనూ, ప్రతిభంగిమంలోను, ప్రతివిన్యాసంలోను, ప్రతివిలోకనంలోను, రసస్ఫూర్తిని ప్రదర్శించి లోకాన్ని సమ్మోహింపజేశావు. నీకుతెలియనిదే ముంది. ఇంతకూ నేను పరాయివాణ్ణిగాదు. తయారైన చిత్రం నీకూ నాకూమధ్య శాశ్వతబంధంగా వుంటుంది. నచ్చకపోతే నాశనం చేతువుగాని నీచేతుల్తోనే. అంతేగాని, నా స్వర్ణస్వప్నానికి అడ్డురాకు మొదలే. నువ్వు "వరూధినీ" ఫిలింలో నాయికాపాత్రను ధరించి నగ్నంగా నాట్యంచేసి ప్రవరుణ్ణి వల్లో వేసుకోడానికి ప్రయత్నించలేదూ? ఆఫిలిం అందరూ చూడ్డంలేదూ?

విశాల

తెలివితక్కువవాడా, ఆఫిలింలో మేనేజరు ఎంతనిపుణతతో తయారుజేశాడుడ్రెస్సు. సన్నని ఉల్లిపరసెల్లా తెచ్చాడు. ఫిలింలో వస్త్రమున్నట్టుగానే కన్పడలేదు. అంతేగాని కేవలం వస్త్రవిహీనురాలనుగా వున్నా ననున్నావా, అందులో?

ఉమా

అడ్డుపెట్టకు విశాలా. నాజీవితోత్సాహాన్ని అంతా క్రోడీకరించి బొమ్మలో గ్రుమ్మరించడానికి సంసిద్ధుణ్ణి అయివచ్చాను. భంగ

పర్చుకు నన్ను. వేసుకుంటాను. నీతివాదుల మోస్తరు పెడసరిగా వాదించకు. ఇంతకూ ఇందులో అధర్మ మేముంది ?

విశాల

ఏమిటి ఉమా, పిచ్చివేదాంతధోరణిలో పడ్తున్నావు. నా కిష్టంలేదు. ముమ్మాటికీ యిష్టంలేదు.

ఉమా

(స్విచ్ నొక్కి ఒకలైటు ఆర్పేసి, ఆమెచీర కొంగు పట్టుకుని)

పోనీ, విశాలా, పదినిమిషాలు వద్దులే. ఒకక్షణం, ఒక్కసారి కన్పడు అట్లా. అది స్మృతిపథంలో వుంచుకొని బొమ్మగీస్తాను.

(అని మోకాళించి ఆమె జబ్బలు పట్టుకు బ్రతిమాలు కుంటాడు.)

విశాల

(అక్కడనుంచి తప్పించుకోడానికి ప్రయత్నిస్తూ)

ఏమిటి ఉమా, ఈదినం చేష్టలు విపరీతంగా వున్నాయి. ఊరోకో. నాకు యిష్టం లేదని చెప్పడంలేదూ. వొదులు కొంగు. అబ్బా! వదులు. మూర్ఖంపట్టు పట్టక. చెప్తాను ఉండు. అదుగో, ఎవరో వస్తున్నారు. కాళ్ళ చప్పు డవుతోంది. వొదులు కొంగు త్వరగా, దూరంగా వెళ్లు. అబ్బ! వెళ్లు...

(ఉమా కొంగువదిలి కొంచెందూరంగా వెళ్తాడు దీనంగా. ఏమీ ఎరగనిదానల్లే హార్మోనియందగ్గరకు వెళ్తుంది, విశాల...జయకరణ్ వచ్చి—"ఎవరో గౌతమీబాయిగారుట, చూడ్డానికి వచ్చింది" అంటాడు... ఉమాముఖం తెల్లబోతుంది. విశాల ధైర్యం తెచ్చుకొని ఉమాదగ్గర కొచ్చి—)

(మెల్లగా) ఎందుకు అట్లా బెదుర్తావు?

ఉమా

(మెల్లగా) మాఆవిడే అయివుంటుంది. ఎట్లా యిప్పుడు?

విశాల

మీ ఆవిడా? ఎందుకు వస్తుంది ? నాతో పరిచయం లేదే ... ఒకవేళ ఆవిడే అయితే మాత్రం ఎందుకు భయం... ఫర్వా లేదు. నువ్వు ఆ లోపలి పడకగదిలోకి వెళ్లు. తక్కింది నేను చూస్తాను. వెళ్లు, త్వరగా...

(నౌకరువైపు తిరిగి)

లోపలికి తీసుకురా ఆవిడ్ని...

[నౌకరు వెళ్తాడు. ఉమా శయ్యాగారంలోకిచేరు కుంటాడు. విశాల నలిగిన చీరెను సర్దుకొని, తల్లో పూలు సర్దుకొని, సిగిరెట్టు వెలిగించి, న్యూసుపేపరు చూస్తూ సోఫాలో కూర్చుంటుంది

గౌతమీబాయి ప్రవేశిస్తుంది. ఇరవై ఏళ్లది. చామనచాయ. సన్నటి పీలమనిషి. కాని అనాకారి అనడానికి వీల్లేదు. దక్షిణాదిచీర కాశాపోసి కట్టుకుంది. కొప్పు బారెడంత. అర్ధణాఅంత కుంకుమ బొట్టు. హాల్లోకి వచ్చి అన్నీ వింతగా చూస్తూ, విశాలను కనిపెట్టి]

గౌతమి

అమ్మా, నీవేనా విశాలవు. సినీమాలో వేషంవేసేదానవు, నువ్వేనా అమ్మా ?

విశాల

(కినితో)

అవును నేనే. ఏంకావాలీ ?

గౌతమి

(రెండుచేతులూ జోడించి)

మరేమీ వద్దు, నా భర్తను నాకు యిప్పించు, తల్లీ.

విశాల

(సందేహం సూచిస్తూ)

ఏమిటమ్మా అంటావు?

గౌతమి

నా భర్త, భర్త. గిరజాలుతిరిగిన వెండ్రుకలు. బొద్దుమనిషి. చిత్తరువులు గీస్తారే - ఆయన. ఇప్పించు తల్లీ, దయచేసి.

విశాల

(అదేగొంతుతో)

ఏమిటీ?

గౌతమి

ఆయనే. నీవు ఆడే కంపెనీలోనే, తెరలు, చిత్తరువులు గీసేపనిలో ఆయన ప్రవేశించారు. నీవల్లో పడి ఆయన నావైపే చూడ్డం మానేశారు. ఏడాది అయింది. ఇంటికి సరిగా రావడంగూడా లేదు.

విశాల

అవును. నువ్వుచెప్పే గుర్తులుగలఆయన మాకంపెనీలో ఉన్నట్టున్నాడు. అయిదారు మార్లు చూచాను. ఆపైన నాకు తెలియదు. పరిచయం అసలేలేదు.

గౌతమి

తెలుసు, తెలుసు. అబద్ధమాడకు. ఆయన్ని చెయ్యిచిక్కించుకొన్నావు. పౌడర్లు, రంగులు, తళుకుచీరెలు, ఫాషన్లు—అన్నీ తోడ్పడి నిన్ను అందవతినిగా జేశాయి. నేను సామాన్యందాన్ని. అమాయకురాల్ని. ఆషోకులు, మాయలు, మర్మాలు తెలియనిదాన్ని. నీముందు నేను ఆయనకు నచ్చుతానా? కాని, రెండేళ్లక్రిందట, (గద్గదికతో) రెండేళ్లక్రిందట స్వయంగా ఏరీ కోరీ నన్ను పెళ్లిచేసుకొన్నారు. ఇప్పుడు నన్ను తలసనైనా తలవరు... (ఏడుస్తుంది)

విశాల

(లేచి, దగ్గరకొచ్చి గౌతమిని సోఫాలో కూర్చోపెట్టి, ప్రక్కనుకూర్చొని)

ఏడవకమ్మా ఏడవకు. ఎందుకు వృథాగా ఏడుస్తావు. చెప్తాను విను. నేను మీ ఆయన్ని దొంగిలించలేదు. వల్లో వేసుకోలేదు. ఇంత అమాయకురాలవు ఎట్లా నెగ్గుకొస్తావు అల్లాంటిభర్తతో. నిజంచెప్తాను. నేను ఆయన్ను బాగా ఎరగనైనా ఎరగను.

గౌతమి

పెంషుడ్డీను తోటలోంచి నీకు రోజూ సాయంత్రం పూలు పంపిస్తారు. వాడు నాకు చెప్పాడు.

విశాల

అబద్ధం. నేనొక్కపూరెమ్మగూడ ఆయనదగ్గరనుంచి పుచ్చుకోలేదు. యథార్థం. ఎరగను.

గౌతమి

నేను అబద్ధమాడ్తున్నానంటావా, అయితే? వాడు చెప్పాడు—నెలకు పదిహేను రూపాయలు యిస్తారని.

విశాల

ఎంత అమాయకురాలవమ్మా. తప్పపుట్టావు బ్రాహ్మణకులంలో. పూర్వకాలంమనిషివి. ఆయనరహస్యం నీకు తెలియలా? చెప్తాను విను...ఇది ఆధునికయుగం. జీవితం, ప్రేమ, ఊహాలు, ఆశయాలు—అన్నీ రూపాంతరం పొంది, చిత్రగతుల్లో నడుస్తున్నాయి!... అయితే అడుగుతాను, నీకూ ఆయనకూ యీమధ్య ఏమైనా మనస్పర్థలు కల్గినాయా?

గౌతమి

అవును, ఏడాదిక్రిందట. నాతప్పేంలేదు. అకారణంగా నామీద కోపంపడ్డారుఆయన.

విశాల

అఁ. అల్లా చెప్పు. అటువంటి దేదో జరిగి వుండాలి. అట్లా కలహం వచ్చినప్పుడు, తిరిగి పెళ్లాంయొక్క ఆపేక్షని—ఆదరణని, అనురాగాన్ని—చూరగొనడానికి— మొగవాళ్లు చేసే ట్రిక్కులే యివి: నాబోటిదాన్ని ఎవత్తెనో ఒకదాన్ని రూపకల్పన చేసి, ఆవ్యక్తిమీద ప్రేమనంతా ప్రవహింపజేస్తున్నట్టుగా నటించి, వీలుగావుంటే ప్రణయలేఖలూ, ఫోటోలూ పుట్టించి, ఆచర్యలన్నీ భార్యకు విశదమయ్యేటట్టు ప్రవర్తిస్తారు. ఆకీలకం కనిపెట్టి ఆడవాళ్లు భర్తని తమవైపు త్రిప్పకోవాలి. అట్లా యీరోజుల్లో ప్రతిష్ఠాపనబుల్ యువకుడూ చేస్తూంటాడు.

గౌతమి

నిజంగానా అమ్మా, అదేం చిత్రం.

విశాల

చిత్రమే మరి...అల్లానే మీ ఆయనగూడా నన్ను ఊహించుకొని యిట్లా తమాషా చేస్తున్నాడు కాబోలు. అంతే చూడు ఆయనడ్రాయరు, కాగితాలు. బహుశః నా దస్కతుతో ఉత్తరాలు, నాఫోటోగూడా వుండవచ్చు. అంతేగాని ఆయన్ని నేను దగ్గరకు తీయలేదు. నేనుమాత్రం ఆడుదాన్ని గాదమ్మా. నాకుమాత్రం పరువుప్రతిష్ఠలు లేవూ? మానాభిమానాలు లేవూ? ఈ సినీమావృత్తిలో వున్నానుగదా-అన్నీ త్యజించాననుకొన్నావా? కేవలం ఆర్టును ఉద్ధరించడానికే యిందులోకి దిగాను. తెలుగు దేశంలో లలితకళ లన్నీ అధోగతిలో వున్నాయి. తక్కినచోట్లంతా పరివర్తనం జరుగుతోంది. సినీమారంగాన్ని ఉత్తేజితం జేద్దామని నావుద్దేశం. కథాసంవిధానంలోనేం, సంఘటనాసామరస్యంలోనేం, రంగస్థలనిర్ణయంలోనేం, సంభాషణాక్రమంలోనేం అభినయవిశేషాల్లోనేం కళాభివృద్ధిసూచనలు కన్పిస్తున్నాయి. జాతియొక్క జీవన సౌష్ఠవం, ఆశయాదర్శాలు సినీమాలో ప్రతిబింబించాలనే ఉత్సాహం జ్వాలల్లే అంటుకుంది. తెలుగునాడుయొక్క చేవని వన్నె తరగకుండా ప్రదర్శించాలని నాకోర్కె. అందుకోసమే ఎడతెగకుండా పాటుబడ్తున్నాను. ఒక్కొక్కప్పుడు నిద్రాహారాలుగూడాలేకుండా పనిజేస్తాను. సంస్కారం తక్కువైనా క్రొత్తవిషయాలు తంటాలుపడి నేర్చుకొని

ఆచరిస్తున్నాను. శ్రమలనేది లేకుండా, విశ్రాంతిలనేది ఎరగకుండా, పౌరుషంతో పెనుగులాడుతున్నాను. నామూలంగా ఆంధ్ర కీర్తి మూడుగజాలు పైకిలేవాలి. అదే నా అభిలాష. అంతేగాని, తక్కిన అన్ని విషయా ల్లోను నీమో స్తరుదాన్నే నేనూ. అనాదినుంచీ వస్తూన్న భారతస్త్రీల గౌరవమర్యాదలు నాకు తెలియవూ. సీత, సావిత్రి, దమయంతి, చంద్రమతి—వాళ్లు మనపూర్వులు గారూ?

గౌతమి

ఎంతదానవమ్మా. ఎన్ని మంచి ఊహలు, తలపులూ వున్నాయి నీ చిన్నబుర్రలో. పొరబాటుపడ్డానమ్మా నిజంగా—నిన్నుగూర్చి యితరులు చెప్పినదంతా విని. నీవన్నట్టుగా అమాయకురాలను. క్షమించు—యీవిధంగా వచ్చి నిన్ను ప్రశ్నించి కలతపెట్టినందుకు.

విశాల

ఫర్వాలేదమ్మా, దానికేం మా కిటువంటివి మామూలే. దాదాపు రోజురోజూ అను భవమే. కాని నేనుమాత్రం ఎవరినీ దగ్గరకు తీయక, నీబోటివా ళ్లెవరయినా వస్తే— వాళ్ల సంసారజీవితసౌఖ్యానికి ఈ విధంగా సహాయం చేస్తుంటాను. వాళ్లు తిరిగి కలిసి కులాసాగా వుంటే నా కదే చాలు.

గౌతమి

ఎంతమంచిదానవమ్మా, ఎంత మంచిదానవు. చేతులెత్తి దణ్ణం పెడ్తాను.

విశాల

దాని కేమొచ్చెగాని, ఇంటి కెళ్లి ఏమీ తెలి యనిదానికిమల్లే నటించి, నీభర్తనుత్రిప్పుకో. తెలిసిందా. అంతా నటన అని నీవు కను క్కొన్నావని తెలియగానే, తిరిగి నీవా డవు తాడు.

గౌతమి

(లేచి) ప్రాణంపోశావమ్మా. ఏడాదినుంచీ, కంటికి మంటికి ఏకధారగాఏడుస్తూ, క్షోభతో కాలం గడుపుతున్నాను. జీవాన్ని చల్లబడే శావు. నీవు చెప్పినట్టుగాచేసి ఆనందపడ్తాను. కృతజ్ఞురాల్ని. నిన్ను మఱచిపోలేను ఎప్ప టికీ. వెడ్తాను.... ...

విశాల

ఉండు బొట్టుపెడ్తాను.

(అని ప్రక్కబల్లమీదవున్న కాశీకుంకుమభరణి తెరిచి, బొట్టుపెట్టి, పండు—తాంబూలం యిస్తుంది. గౌతమి ఆనందంతో అందుకొని నిష్క్రమిస్తుంది. ఆమె పూర్తిగా వెళ్లగానే, లోపలివైపుకు చూచి—)

పంపించేశానోయ్, ఉమా. ఇక బయటపడు, ముసుగులోంచి. వెళ్లింది మీ ఆవిడే.

ఉమా

(లేని సంతోషం తెచ్చిపెట్టుకొంటూ)

థాంక్సు, విశాలా, థాంక్సు. రక్షించావు. సినీమానుగురించి ఉపన్యాసం దంచేసి, సీత సావిత్రిల పేర్లు లాక్కొచ్చి, మహాచక్కగా మాసికవేశావు. అంతా వినబడుతూనేవుంది. ఈ చాకచక్యాలు వుండబట్టే లాక్కొస్తు న్నావు నవ్యంగా...

విశాల

అవునవును. ఇటువంటప్పుడు నాగుణగణనం. లేనప్పుడు పిచ్చికమీద బ్రహ్మాస్త్రమల్లే విరుచుకుపడ్డం. దార్జన్యంతో బలమంతా ప్రయోగించడం. జుట్టుపట్టుకులాగావే యిందాక, జ్ఞాపకముందా? మీఆవిడకు వప్పగించాలి సింది; తెలిసేది నీపని. రామప్పపంతులు అవస్థ సంభవించేది - శృంగారకట్టసంభావనతో. అమాయకురాలు పాపం!

ఉమా

సరేలేవోయ్ చీవాట్లు. రావడం ఒక్క నిమిషం ఆలస్యమైతే కబుర్లమీద కబుర్లు దూకిస్తావే. నన్నుమాత్రం విడిచి నువ్వుండగలవా...

విశాల

(వెక్కిరింపుగా నవ్వుతూ)

అనగా అనగా ఓఅబ్బాయి. పెళ్లాంపేరు వినగానే ఆమడదూరం పారిపోయి ఆమూలసౌధంబులో అన్నట్టుగా దాక్కున్నాట్ట...

ఉమా

నేనూ చెప్తాకథ...అనగా అనగా ఓఅమ్మాయిట...

విశాల

చాలు, తెలివికి సంతోషించా. గుర్రాన్ని కట్టిపెట్టు. పిరికిపందా, నువ్వా మాట్లాడాలీ!

పిల్లీ వచ్చే ఎలుకల బార్
ఎక్కడిదొంగ లక్కాడే - గప్‌చిప్.

(రాగం అందుకొని దగ్గరగావచ్చి ఆవిడెరెండుచేతులు కలిపి)

ఉమా

పిల్లీ వచ్చే ఎలుకలబార్

విశాల

ఉల్టా-సీదా ఉమాశంకర్

ఉమా, విశాల

పిల్లీ వచ్చే ఎలుకలబార్
ఉల్టా-సీదా ఉమాశంకర్.

(ఇద్దరూ వెర్రిగా గంతులేస్తూ పాడ్తారు).

[తెర]

# సరోజిని

మల్లవరపు విశ్వేశ్వరరావు

ఆమె దివ్యాంబుజసుమమ్ము, ఆమె రక్త
లుదయరాగరోచిస్సుల నుజ్వలించు!
తావుల దిగంతరాళమ్ము లావరించు
నామె సాంధ్యసరోలక్ష్మినోముపంట.

అపుడపుడె సుప్తి మేల్కాంచు విపులనయన
దళము లరవిచ్చి లోకాల పులకరించి
అభినవవిలాసకోమలప్రభ వెలార్చి
తరుణమధుపసమూహసంవరణ మయ్యె.

ఆమెపొంగారువిరితేనె లానవచ్చు
తేటిగమిలోన కడసారితేటి నేను;
పరువు మాని, పాటమెమాని తెరచికొన్న
తరుణజీవమ్ముతో నామె దరిసినాడ.

నవవిలాసలాస్యమ్మున నరుగుదెంచి
ఇతరభృంగకుమారకు, లే నొకండ
కమలవనమున కూనిరాగము నడంచి
మందమందపుటాన పిరుంద పోతి.

మెరుగురెక్కలతుమ్మెదల్, మేలుపాట
జెలగుతేంట్లు, తేనియనిధుల్ కలుగు నళిన
మాజములు కొల్చికొనె నా సరోజరాజ్ఞి
ఏ నొదిగి మీటికొంటి నాఏకతంత్రి.

వెత సొలసి వ్రాలు సుమవిరహితల కతలు
జాలిపదజాలముల గీతమాల లల్లి
వెర్రిగాలిసొదలతోడ విపినవాటి
నాలపన సేయుపాంథగాయకుడ నేను.

కమలవనమున కనుల దిగ్భ్రమ మెసంగు
విమలగంభీరసౌందర్యసుమమ్ము మ్రోల
నడగి మడగు నీపాంథగాయకుని నేడు
పూలరాణి నెమ్మది తలపోయు నేలొ.

ఝుంకృతుల ద్విరేఫములు రంజనము గొల్పు
కొలువుకూటాన పద్మినిచెలి మృణాళ
నిలయమున వేయిరేకుకన్నులను విరిసి
నీరవుని నన్నరసె నిట్వనీరు కాగ!—

... ... ...

“ఓయువనుధువ్రతకుమార! ఊహాలల్లు
నీసుమధురతంత్రీరణన్నినదములకు
మామకీనసుధాపూర్ణమానసమ్ము
రాగసంబద్ధమై పాట నాగి వినెడి!

కన్నులరమోడ్చి విస్మృతిగర్భసీమ
లొరసి తెరచి లోలోగాథ లొక్కొక్కటె
సంచలద్దీర్ఘనిశితాంగుళాంచలముల
నేకతంత్రిక నీవేల నేకరింతు?

ఎన్నడో నిద్రలోమున్గియున్న కలలు,
పూర్వజన్మప్రణయ సానుభూతులేవో,
సుఖజలధిలో నడంగిన శోకరాగ
మేమొ నీయంగుళులు పెల్లగించు నేడు!

ఓయి మధుకర! నేడు నీ వీయగాథ
సంస్మరణశృంఖలమ్ముల సంతరించి
కైవసము జేసికొంటి వీ కమలవనము,
అన్యదుర్లభ్యమైన నాయాత్మగూడ!

... ... ...

# నవాబు—అతని కుమారుడు

(రష్యన్ గ్రంథకర్త మాక్సిమ్‌గోర్కీ వ్రాతనుండి తెనిగించబడ్డది.)

కూర్మా వేణుగోపాలస్వామి, శేషుబాయి గోపాలస్వామి

"ఒకానొకప్పుడు క్రైమియా దేశంలో మొసలేమా-ఎల్-అస్రాబ్ అనే నవాబు ఉండేవాడు. అతనికి టూల్యేక్-అల్లల్లా అనే కొడుకు ఉండేవాడు."

అని ఈమాటల్తో ఆఅంధుడైన టార్టార్ భిక్షుగాడు, చెట్టునానుకొని, ఆ ఊళ్లో జరిగిన పురాతనపుకథలలో ఒకటి చెప్పడం మొదలుపెట్టాడు. ఆకథచెప్పేవాడిచుట్టూ, రంగురంగుబట్టలువేసుకుని జరీటోపీలు పెట్టుకొన్న టార్టార్లు గుంపుగా చేరారు. పాడుపడిపోయిన ఏదోఒక భవనంతాలూకు రాళ్లు కొన్ని అక్కడ ఉంటే, వీళ్లంతా వాటిమీద కూర్చున్నారు. అప్పుడు సాయంత్రం. సూర్యుడు నెమ్మదిగా సముద్రంలో క్రుంకిపోతూ ఉన్నాడు; ఎఱ్ఱని సూర్యకిరణాలు ఆ పాడుపడిన స్థలంచుట్టూఉన్న ఆకుపచ్చని ఆకులగుంపుల్లోకి జొరబడ్డాయి; నాచుపట్టిన రాళ్లమీదనూ, క్రింద వ్రేలాడుచున్న పచ్చని లతలమీదనూ అక్కడక్కడ వెలుతురు గలుగజేసాయి. పెద్దపెద్ద వృక్షశాఖల్లో గాలి పాటపాడుతోంది. ఆచెట్లఆకులు, అగోచరమయిననదులు గాల్లో ప్రవహిస్తో ఉన్నట్లు కదులుతోన్నాయి. ఆఅంధభిక్షుకుని గొంతుక నిబ్బరం లేకుండా వణకుతూంది. మొద్దులాంటి ఆతనిముఖంలో ఉన్న ముడతలు, విశ్రాంతితప్ప మరోభావాన్ని కనబర్చడం లేదు. ఆతనికి కంఠతా వచ్చినమాటలు, ఒకదానివెంట ఒకటి ప్రవహిస్తో జరిగిపోయిన దినాల్ని, భావసమృద్ధితో నిండిన చిత్తరువులాగ, వినేవాళ్లకు కనపరస్తోన్నాయి.

ఆనవాబు వృద్ధుడు (అని అంధుడు చెప్పతూఉన్నాడు.) అయితేనేం, ఆతనికి జనానాలో చాలామంది ఆడాళ్లు ఉన్నారు. వాళ్లు ఆవృద్ధుణ్ణి ప్రేమించేవారు. ఎందుకంటే ఆతనికి బలం, కామం ఇంకా ఉండబట్టి. ఆతని లాలన కోమలంగాను, ఉద్రేకం పుట్టించేదిగాను ఉండేది. ఆడాళ్లు ఎప్పుడూ, ఎవరైనాసరే ముసలివాడైనప్పటికీ, ముఖం ముడతలుపడినప్పటికీ, లాలనయందు శక్తి ఉంటే వాళ్లను ప్రేమిస్తారు. అందం శక్తియందు ఉంటుందిగాని సుకుమారమైన శరీరంలోనూ, గులాబీవర్ణపు చెక్కిళ్లలోనూ ఉండదు.

వాళ్లంతా నవాబును ప్రేమించేవాళ్లు. అయితే తనమట్టుకు నీపర్ నుండి తీసుకొని వచ్చిన ఒకకోసక్ బానిసను దయతో

చూస్తూ ఉండేవాడు. తన పెద్ద జనానాలో అన్ని దేశాల ఆడాళ్లు మూడువందలమంది ఉండేవారు. వీళ్లందరికంటె ఈమె అంటే ఎక్కువ మోహం. వీళ్లంతా వసంత ఋతువులో పుష్పాలంత అందంగా ఉండేవారు. అంతా సుఖంగా కాలం గడుపుతూ ఉండేవారు. నవాబు రుచిగా ఉండే భోజన పదార్థాలు వాళ్లకు అందేటట్టు ఏర్పాటు చేస్తోండేవాడు. వాళ్ల ఇష్టం వచ్చినప్పుడు నాట్యం, ఆటలు ఆడనిస్తుండేవాడు.

ఈకోసక్ బానిసను తరచుగా తన కోట బురుజుకు రప్పించుకునేవాడు. ఆకోటబురుజులోనుంచి సముద్రము కనబడుతూఉండేది. అక్కడ స్త్రీయొక్క జీవితాన్ని సంతోష పెట్టడానికి కావలసినవన్నీ ఆతడు ఆయత్తపరిచాడు—ఫలహారాలు, ఖరీదుగలబట్టలూ, బంగారం, నవరత్నాలు, సంగీతం, దూర దేశాలనుండి తెప్పించిన అరుదైనపక్షులూ, మోహించిననవాబుయొక్క ఉద్రేకలాలనలు. ఈకోటలో ఆమెతో రోజులతరుపున సంతోషంగా కాలంగడపుతుండేవాడు. తనకష్ట జీవితాన్నుంచి, తనకుమారుడు, అల్గల్లా తనరాజ్యంయొక్క కీర్తి పోగొట్టడని నమ్మకంతో విశ్రాంతి పొందేవాడు. అల్గల్లా తోడేల్లాగ రష్యాదేశాన్ని ముట్టడించి, అక్కడినుంచి దోపడిగొట్టిన ఖరీదుగలవస్తువులను, క్రొత్తస్త్రీలను, క్రొత్తకీర్తిని తీసుకొనివచ్చేవాడు. తానువెళ్లినచోట్లల్లా అత్యంతభీతి, భస్మం, శవాలు, రక్తం విడిచివస్తుండేవాడు.

ఒకప్పుడు అల్గల్లా రష్యాను, ముట్టడించి తిరిగివచ్చినప్పుడు అతనిగౌరవార్థం గొప్ప ఉత్సవం చేసారు. ఆటలు, విందులు జరిగాయి. ఆదేశంమిర్జాలంతా వాళ్లదగ్గరకు వచ్చారు. భుజబలం చూపించడానికి ఖైదీలకళ్లను గురిచూచి తమవిల్లుల్తో బాణాలు కొట్టారు. వాళ్లు మధుపానంచేస్తో తన శత్రువులను భీతికలిగించేవాడున్నూ, నవాబురాజ్యానికి ఆధారమైనటువంటివాడున్నూ అయిన అల్గల్లాయొక్క పరాక్రమాన్ని స్తుతించారు. ఆవృద్ధనవాబు తనకుమారుని ప్రతాపానికి చాలాసంతోషించాడు. తాను అంతరించిన తరువాత తనరాజ్యం, బలంగలచేతులలోనే పడుతుందని ఆవృద్ధనవాబు తెలుసుకున్నాడు. ఇది తనకు అనుకూలంగానే ఉంది.

ఇది తెలుసుకోవడం అతనికి చాలా సంతోషంగా ఉంది. తనప్రేమయొక్క శక్తిని తనకుమారునికి చూపిద్దామనుకున్నాడు. ఆవిందుకువచ్చిన మిర్జాలందఱిముందఱ ఆతనితో మాట్లాడాడు. గిన్నె చేత్తోపట్టుకుని ఇలా అన్నాడు: "అల్గల్లా, నాప్రియమైన కుమారుడా, అల్లాకువందనాలు! మహమ్మదుకు వందనాలు!" వాళ్లంతా కలిసి మహమ్మదు మహిమనుగూర్చి పెద్దగొంతుకల్తో ఒకకీర్తన పాడారు. ఆతరువాత నవాబు ఇట్లుచెప్పాడు: "అల్లా మహిమగలవాడు! నాజీవితకాలంలోనే నాయౌవనాన్ని పరాక్రమవంతుడైన నాకుమారునిలో మళ్లీ ఇచ్చాడు. నాకన్నులు మూతపడి నే నంత

రించింతరువాత నేను మళ్లీ నాకుమారున్నో బ్రతుకగలనని నావృద్ధనేత్రాల్తో చూస్తున్నా. అల్లా ఘనమైనవాడు! మహమ్మద్ నిజముగా భగవత్ప్రేరితుడై పలుకువాడు! నాకుమారుడు మంచివాడు. ఆతనికి భుజబలం ఉంది; పరాక్రమం ఉంది. మనస్సు నిర్మలమైంది. అల్గల్లా, నీవు జనకుని చేతుల నుండి ఏంకావాలో కోరుకో. అడుగు, నీవు కోరిందంతా నేనిస్తా."

ఆవృద్ధనవాబు ఇలాచెప్పడం ఇంకా ఆపాడో లేదో, అప్పుడే టూలేయక్ అల్లల్లా మిలమిలలాడిపోతూన్న నేత్రాల్తో లేచి నిలబడ్డాడు. ఆతనికళ్లు రాత్రిపూట సముద్రం ఎంతనల్లగా ఉంటుందో, అంతనల్లగాను, కొండల్లోఉండే రాబందుకళ్లు ఎంతమండుతూ ఉన్న ట్లంటయో అంతమిరిమిట్లు గొలుపుతూనూ ఉన్నాయి.

'ఓ చక్రవర్తీ, నాతండ్రీ, నాకు ఆరమ్యా బానిసను దయచేయండి' అన్నాడు.

"నవా బేమీమాట్లాడక నిశ్శబ్దంగా ఉండిపొయ్యాడు. తనహృదయంలో బయలుదేఱిన వణుకు నెమ్మదిపడేవఱకూమాత్రం నిశ్శబ్దంగా ఉన్నాడు. ఈనిశ్శబ్దం తరువాత అతడు నిబ్బరమైన పెద్దగొంతుతో ఇలా అన్నాడు: 'తీసుకో! విందు అయింతరువాత నీవు తీసుకోవచ్చు.........'

సాహసించిన ఆ అల్గల్లా సంతోషంతో ఉప్పొంగిపోయాడు. రాబందు కళ్లవంటిఆతని కళ్లు గొప్పఆనందముతో మినుకుమినుకుమని ప్రకాశించాయి. నిలువునా నిలబడ్డాడు. తన తండ్రిఅయిన నవాబుతో ఇలా అన్నాడు: 'చక్రవర్తీ, నాతండ్రీ, నాకిచ్చిన బహుమానమెంతవిలువఅయినదో నాకు తెలుసును— నాకు తెలుసును. నేను నీబానిసను—నీకుమారుణ్ణి—నారక్తంతీసుకో, గంటకి ఒకరక్త బిందువుచొప్పున తీసుకో—మీకోసరం నేను ఇరవయిసారులైనా చస్తాను!'

'నా కేమీఅవసరంలేదు' అన్నాడు నవాబు. చాలాసంవత్సరాలు గొప్పపనులు చేయడంవల్ల కీర్తి సంపాదించాడు. అంత కీర్తిసంపాదించిన ఆతనివృద్ధశిరం ఇప్పుడు వక్షస్థలంమీదకి వంగిపోయింది.

త్వరలో విందు ముగిసిపోయింది. వాళ్లిద్దరు ఒకరిపక్క ఒకరు నిశ్శబ్దంగా నగరునుండి జనానాకు నడిచారు.

చీకటిగా ఉంది ఆరాత్రి. చంద్రుడు గాని,నక్షత్రాలుగాని కనబడ్డంలేదు. మేఘాలు మిక్కిలి దళసరియైన తెరలాగ ఆకాశాన్ని కప్పేశాయి.

చాలాసేపు వాళ్లు నిశ్శబ్దంగా వెళ్లారు. చిట్టచివఱకు నవా బిట్లా అన్నాడు:

'నాజీవితం రోజురోజుకు క్షీణిస్తూంది. నాముసలిగుండె కొట్టుకోవడం ఎప్పటికప్పుడు మెల్లనవుతూంది — ఆకోసక్ దేశపు చిన్నదాని ఉద్రేకపూరితాలైనలాలనలే ఇప్పుడు నాజీవితానికి కాంతి, ఉత్సాహం కలిగిస్తూ

ఉన్నాయి — చెప్పు, టొలెయక్, నాకు చెప్పు—ఆమె నీకు నిజముగా అంత అవసరమా? నా భార్యలలో ఒకవందమందిని తీసుకో—పోనీ అందఱినీ తీసుకో ఆమెను తప్ప.'

టొలెయక్ అల్గల్లా నిట్టూర్పు విడిచాడు. నిశ్శబ్దంగా ఊరుకున్నాడు.

'ఎన్నిదినాలు మిగిలి ఉన్నాయి నాకింకా? ఈప్రపంచంలో కొద్ది రోజులు మాత్రమే ఉన్నాయి నాకు. నాజీవితంలో ఆఖరు అనందం ఈరష్యన్ చిన్నదే—ఆమె నన్ను తెలుసుకొన్నది. నన్ను ప్రేమిస్తుంది. ఆమె లేకపోతే ఎవ్వరు ప్రేమిస్తారు?—నన్ను, ఈముసలాణ్ణి? ఎవ్వరూ? ఒక్కరు కూడా నన్ను ప్రేమించరు, అల్గల్లా ఒక్కరు కూడా!'

అల్గల్లా నిశ్శబ్దంగా ఊరుకున్నాడు.

'నీవు ఆమెను కౌగలించుకుంటున్నావనిన్నీ, ఆమె నిన్ను ముద్దుపెట్టుకుంటూ ఉన్నదనిన్నీ తెలిసియుండికూడా నే నెట్లా జీవింపగలను? టొలెయక్ స్త్రీకి మనం తండ్రి కొడుకులం కాము: స్త్రీకి మనమంతా మొగవాళ్లం. కుమారా, నాశరీరంలో పాత గాయాలన్నీ రేగి, వాట్లోనుండి నారక్తం అంతా స్రవిస్తే ఎంతో బాగుణ్ణు. టొలెయక్—ఈరాత్రితో నాజీవితం అంతరిస్తే ఎంత బాగుండును కుమారా!'

ఆతనికుమారుడు ఏం మాట్లాడలేదు. జనానాతలుపుదగ్గఱ వాళ్లు ఆగారు. చప్పుడు కాకుండా వాళ్లిద్దఱి తలలూ వక్షస్థలాల మీద వంగిపోయాయి. అలా ఆతలుపు దగ్గఱ వాళ్లు చాలాసేపు నిలబడ్డారు. వాళ్ల చుట్టూ చీకటిగా ఉంది. ఆకాశంలో మేఘాలు పరుగెత్తుతున్నాయి. గాలి చెట్లను కదిలించేస్తూ వాళ్లకోసరం పాటపాడుతూ ఉన్నట్లు ఉంది.

'తండ్రీ, నే నామెను చాలాకాలం నుండి ప్రేమిస్తున్నా.' అన్నాడు అల్గల్లా నెమ్మదిగా.

'నాకు తెలుసును, కాని ఆమె నిన్ను ప్రేమించుట లేదనికూడా నాకు తెలుసును.' అన్నాడు నవాబు.

'ఆమెను తలచినప్పుడు నాగుండె పగిలిపోతోంది!'

'నావృద్ధహృదయంమాత్రం దేన్తో నిండియున్నదిప్పుడు?'

మళ్లీ వాళ్లు నిశ్శబ్దు లయ్యారు. అల్గల్లా నిట్టూర్పు విడిచాడు.

"జ్ఞానివైన ఆముల్లా నాకు చెప్పింది నిజమే. పురుషుని కెల్లప్పుడూ స్త్రీ హానికరం. ఆమె చక్కందయితే ఇతరులకు ఆమెస్వాధీన పరచుకోవాలనే కోరిక పుట్టిస్తుంట. ఆమె భర్త అనుమానంచే బాధపడుతాడు. ఆమె కురూపిగా ఉంటే ఆమెభర్త ఇతరులను

చూచి ఓర్వలేకుండా ఉండి, అసూయచే బాధపడుతాడు. ఒకవేళ ఆమె అందగత్తె కాకుండాను, కురూపికాకుండాను ఉంటే, పురుషుడు ఆమె అందంగా ఉందని భ్రమ పడుతాడు. ఆతరువాత తాను తప్పుగా తలిచానని తెలుసుకొని, ఆమెవల్లనే బాధపడుతాడు—స్త్రీవల్లనే!'

'మనోవేదనకు జ్ఞానం ఒకమందుగాదు' అన్నాడు నవాబు.

'తండ్రీ, మనం ఒకళ్లనొకళ్లం చూచి కనికరించుకోవాలి.'

నవాబు తలయెత్తి, కొడుకునంక చూచాడు విచారంగా.

'మనం ఆమెను చంపేద్దాం.' అన్నాడు టొలెయక్. నవాబు ఒక్కనిమిషం ఆలోచించాడు. ఆతరువాత నెమ్మదిగా ఇలా గొణుక్కున్నాడు: 'ఆమెకంటె నాకంటె నీవు నిన్నే ఎక్కువగా ప్రేమించుకుంటున్నావు.'

'అవును, మీరుకూడా ఆలాగే!'

మళ్లీ వాళ్లు నిశ్శబ్దంగా ఊరుకున్నారు.

'అవును, నేను కూడాను' అన్నాడు నవాబు విచారంగా. విచారం అతన్ని పసిబిడ్డలాగ చేసేసింది.

'సరే, మనం ఆమెను చంపేద్దామా?'

'నేను ఆమెను నీకివ్వలేను-నేనుయివ్వలేను!' అన్నాడు నవాబు.

'నేను మరి బాధపడలేను; నా గుండె చీల్చేయి. లేదా ఆమెను నాకియ్యి.'

నవాబు ఊర్కున్నాడు.

'లేదా మనం సముద్రముమీద వ్రాలియుండే ఎత్తయిన పర్వతశిఖరాలపైనుండి ఆమెను క్రిందికి తోసేద్దాం.'

'మనం సముద్రముమీదవ్రాలియుండే ఎత్తయిన పర్వతశిఖరాలపైనుండి ఆమెను క్రిందికి తోసేద్దాం' అన్నాడు నవాబుకూడా కొడుకుమాటలు ప్రతిధ్వనిస్తూ.

ఆ తరువాత వాళ్లు జనానాలోపల వెళ్లారు. అప్పటికప్పుడే ఆమె తన సౌఖ్యదాయకమైన తివాచిమీద పండుకుని నిద్రపోతూంది. వాళ్లు ఆమెఎదుట ఆగి చూచారు. చాలసేపు వాళ్లు ఆమెవంక చూసారు. ఆవృద్ధనవాబు కండ్లవెంబటి కన్నీళ్లు కారిపోయాయి. నెరసిన గడ్డంమీదపడి, ముత్యాల్లాగ మెరిసిపోయ్యాయి. ఆతనికొడుకు మిరుమిట్లు గొలుపుతూఉన్న కండ్లతో చూస్తూ నిలబడ్డాడు. ఆకోసక్ చిన్నదాన్ని లేపుతూ, తన కామాన్ని అణచుకోడానికి పండ్లు పటపట కొరుక్కున్నాడు. ఆమె లేచింది. ఆమె ముఖం గులాబీవర్ణంగాను, సుకుమారంగాను ఉదయభానునివలె ఉంది. ఆమెకండ్లు విడుస్తూ ఉన్న పుష్పాల్లాగ తెఱచింది. అల్లల్లాను చూళ్లేదు ఆమె. తన ఎఱ్ఱనిపెదవులు అందిచ్చింది నవాబుకు.

'ముద్దు యివ్వరూ!' అంది.

'లే–నీవు మాతోరావాలి.' అన్నాడు నవాబు నెమ్మదిగా.

అప్పుడు అల్లల్లాను, తనరాజుకండ్లలో నీళ్లనూ చూచింది ఆమె; తక్షణమే కని పెట్టేసింది. అంతా గ్రహించుకుంది.

'నేనువస్తా' నంది ఆమె. 'నేనస్తా. నీకూకాదు. మరి అతనికీకాదు? ఇలా గేనా మీరు నిర్ధారణ చేసుకొన్నది? ధైర్యవంతులు ఈవిధంగా నిర్ధారణ చేసుకోవలసివచ్చింది! నేవస్తా.'

తరువాత ఆముగ్గురూ నిశ్శబ్దంగా వెళ్లారు సముద్రంవైపుకి ఇరుకైనదారుల్లోంచి. గాలి బిగ్గరగా అరచుచున్నట్లు వీస్తోంది.

ఆచిన్నది బలహీనంగా ఉండడంచే ఇట్టే అలసిపోయింది. అయితే ఆమె పౌరుషం గలది కాబట్టి వాళ్లకు చెప్పిందికాదు.

నవాబుకొడుకు ఆమెవెనుకబడి పో తూంది అని చూచాడు. 'భయం వేస్తూ ఉందా?' అన్నాడు.

ఆమెకండ్లు అతనిమీద అగ్నికణాలు రాల్చేసాయి. రక్తం స్రవిస్తూఉన్న తన పాదాలు అతనికి చూపించింది.

'నన్ను ఎత్తుకుని తీసుకెళ్లనియ్యి' అన్నాడు అల్లల్లా చేతులు చాపుతూ. కాని ఆమె వృద్ధరాజుకంఠంచుట్టూనే వేసింది తన చేతులు. నవాబు ఆమెను అవలీలగా పైకెత్తి ఎత్తుకెళ్తున్నాడు. ఆమె అతనిచేతుల్లో విశ్ర మిస్తూ, అతనికండ్ల కేమైనా పొడుచుకుంటా యేమో అనేభయంచేత చెట్లకొమ్మలు తప్పిస్తూఉంది. చాలాసేపు వాళ్లట్లా నడి చారు. చిట్టచివఱకు దూరాన్నుంచి సము ద్రపుహోరు విన్నారు వాళ్లు. అప్పుడు వాళ్లను వెంబడిస్తూఉన్న టోలయక్ తండ్రితో 'ఖుల్లాఅన్నాడు: 'నన్ను ముందఱ నడవనీ, లేకపోతే నాబాకుతో నీమెడ పొడిచెయ్యా లనేబుద్ధి పుడుతుందేమో!'

'నడువు. అల్లా నీకోరిక నెఱవేరుస్తాడో, లేక క్షమిస్తాడో. దైవయత్నం ఎలాగో అలా జరుగుతుంది. నీతండ్రినైన నేను నిన్ను క్షమి స్తున్నా. ప్రేమించడంఅనే దేమిటో నాకు తెలుసు.

చివఱకు సముద్రందగ్గఱకు వచ్చారు. వాళ్లముందఱ చాలాదూరంలో ఖాళీస్థలం ఉంది—నల్లగా దరిఅంచులేకుండా. సము ద్రపుకెరటాలు కొండలక్రింద పాడుతూ ఉన్నాయి. క్రింద చీకటిగా అయోమయంగా ఉంది. చలిగాను, భయంకరంగాను ఉంది.

'సెలవు' అన్నాడు నవాబు ఆచిన్న దాన్ని ముద్దెట్టుకుంటూ.

'సెలవు' అన్నాడు అల్లల్లా ఆమెకువంగి వందనంచేస్తూ.

ఆమె సముద్రపుకెరటాలు పాడుతూ ఉన్నస్థలంలోకి క్రిందకు వంగి చూచింది.

కొంచెం వెనక్కు తగ్గింది, తన చేతులు రొమ్ముకు అదుముకుంటూ.

'నన్ను క్రిందకు పడెయ్యండి.' అంది ఆమె వాళ్లతో. అల్లల్లా తన చేతులు ఆమె వంకకు బాధతో చాచి మూల్గాడు. నవాబు మాత్రం ఆమెను గట్టిగా తన వక్షస్థలానికి ఆనించుకొని ముద్దెట్టుకున్నాడు. ఆ తర్వాత ఆమెను తనతలపైకి ఎత్తి, ఆ ఎత్తయిన కొండ మీదనుంచి క్రిందికి తోసేసాడు.

క్రింద కెరటాలు ఒకదానికొకటి కొట్టుకొని పెద్దశబ్దంచేసి పాటపాడుతూ ఉన్నయి. ఈమహాశబ్దంలో వాళ్లిద్దరికీ ఆమె నీళ్లల్లో పడ్డశబ్దం వినపల్లేదు. వాళ్లిద్దర్లో ఒకరుకూడా ఏశబ్దంగాని, ఏకేకగాని విన్లేదు. నవాబు కొండలమీద కూలబడ్డాడు. అయోమయమైన చీకట్లో సముద్రం మేఘాలుకలిసే ఆస్థలంవంక మెల్లిగా క్రిందికి చూసాడు. అక్కడినుంచి కెరటాలు విరిగి చెదరినప్పుడు వచ్చే మందమైన ధ్వనిమాత్రం వినబడుతూ ఉంది. గాలి వేగం వచ్చి ఆతనిగడ్డంమీద వీస్తోంది. టోలయక్ ముఖం చేతుల్తో కప్పేసుకొని చలనం లేకుండా, మాటలాడకుండా రాయిలాగ ఆతనిప్రక్క నిలబడ్డాడు. ఈవిధంగా కాలం జరిగిపోతూంది. ఆకాశంలో మేఘాలు ఒకదానివెనుక ఒకటి గాలివల్ల తరుమబడి పరుగెత్తుతూ ఉన్నవి. అవి ఆ సముద్రముమీద వంగి ఉన్న ఆపర్వతశిఖరం మీదపండుకొన్న ఆవృద్ధనవాబుయొక్క తలపులవలె భయంకరముగాను, దుర్భరముగాను ఉన్నవి.

'తండ్రీ మనం వెళ్లిపోదాం.' అన్నాడు టోలెయక్. 'ఆగు' అని గొణుక్కున్నాడు నవాబు ఏదో వింటూఉన్నాడిలాగ. మళ్లీ కాలం జరిగిపోయింది. క్రింద కెరటాలు విరిగి చెదరినశబ్దం అయింది. గాలి కొండలమీద వీస్తూ చెట్లల్లోనుంచి అరుస్తోంది.

'తండ్రీ, మనం వెళ్లిపోదాం.'

'ఇంకాకొంచెం ఆగు.'

చాలాసార్లు టోలయక్ 'తండ్రీ, మనం వెళ్లిపోదాం' అన్నాడు. అయితే నవాబు మాత్రం తన ఆఖరురోజుల సంతోషాన్ని పోగొట్టుకొన్నస్థలంనుంచి కదలడం లేదు.

అయితే అన్నిటికీకూడా ఏదో ఒక అంతం ఉంటుంది! చిట్టచివఱకు లేచాడు నవాబు గభాలున పౌరుషంతో. లేచి, 'సరే వెళ్దాంపద' అన్నాడు బొంగురుగొంతుతో.

వాళ్లు బయలుదేరారు. కాని కొంచెం సేపట్లోనే నవాబు ఆగిపొయ్యాడు.

'అయితే నే నెందుకు వెళ్తున్నాను, టోలయక్! ఎక్కడికి' అని తనకొడుకును అడిగాడు. 'నాజీవితం అంతా ఆమెలో ఉన్నప్పుడు, నేనెందుకు జీవించాలి యిప్పుడు? నేను వృద్ధుణ్ణి. నన్నెవ్వరూ మళ్లీ, ప్రేమింపరు. ఎవ్వరూ ప్రేమించనప్పుడు ఈప్రపంచకంలో బ్రతకడం వట్టితెలివితక్కువ.'

'తండ్రీ నీకు కీర్తిభాగ్యం ఉంది.'

'ఆ మెముద్దుల్లో ఒక్కటిమాత్రం నా కియ్యి. నీకు ఆకీర్తి, భాగ్యం బహుమానం ఇస్తా; అవిఅన్నీ నశించాయి. స్త్రీయొక్క ప్రేమఒక్కటే ఎల్లప్పుడూ నిలుస్తుంది. మనుష్యునికి అటువంటిప్రేమ లభింపకపోతే ఉత్సాహం ఉండదు—అత డొకభిక్షుకునితో సమానము. ఆతనిబ్రతుకు దౌర్భాగ్యమైంది. సెలవు, కుమారా, అల్లా నిన్ను అనుగ్రహించుగాక! ఆతని ఆశీర్వాదం నీవు బ్రతికినన్నాళ్లు ఉండుగాక!' అని నవాబు సముద్రం వైపు తిరిగాడు.

'తండ్రీ! తండ్రీ!' అని అరచాడు టూలయక్. మఱి ఇంకేమీ అనలేకపోయాడు. మృత్యువువాతబడిన మనుష్యునకు ఏమీ చెప్పుటకు వీలులేదు. ఆతనిమనస్సుకు తిరిగి బ్రతుకుమీద ఆశను కల్పించుటకు ఎవ్వరూ ఏమీ చెప్పలేరు.

'నన్ను వదిలేయి......'

'అల్లా......'

'అతనికి తెలుసు......'

తొందరగా అడుగులువేస్తూ నవాబు కొండచిపఅకువెళ్లి, క్రిందికి దుమికేసాడు. ఆతనికొడుకు ఆతన్ని అడ్డుపెట్టలేదు—అడ్డుపెట్టడానికి అవకాశంలేదు. ఆమాత్రం కాలం లేదు. మళ్లీ సముద్రంలో ఏమీవినబడ్లేదు. ఏవిధమైన కేకగాని, నవాబుపడ్డశబ్దంగాని వినపడలేదు. కెరటాలుమాత్రం క్రింద విరిగి చెదరుచూఉన్నాయి. గాలి క్రమములేని పాటలు పాడింది.

చాలాసేపు టూలయక్ అల్గల్లా కొండ క్రింద చూసాడు. చిట్టచివర కిట్లా అన్నాడు గట్టిగా: 'ఓ అల్లా, నాక్కూడా అటువంటి ధైర్యమైన హృదయం ఇయ్యి!'

తర్వాత ఆతడు ఆచీకటిరాత్రిలోకి వెళ్లిపోయ్యాడు. అలా ఆనవాబు, ఖాన్ మొసలేమా-ఎల్-అస్రాబ్ నశించిపోయ్యాడు. టూలయక్ అల్గల్లా క్రిమియాదేశానికి రాజుఅయ్యి పాలించాడు.

---

# విజయనగరం - నగరసామ్రాజ్యముల పుట్టుపూర్వోత్తరములు*

తుంగభద్రాతీరాన ఆంధ్రకర్ణాటదేశాల సంధి స్థలంలో వెలసింది పూర్వం విజయనగరము. అది మహాసామ్రాజ్యమయి దక్షిణదేశాన్ని అంతనూ ఒక్కయేలుబడిక్రిందికి తీసుకువచ్చింది. విజయనగరసామ్రాజ్యమంటే కర్ణాటులకూ ఆంధ్రులకూ కూడా దర్పకారణమే. ఎవరికివారే ఇది మాదంటే మాదని పెనగులాడుతూ వున్నారు—ఆ సామ్రాజ్యం ఇప్పుడు లేకపోయినాను. ఈవిజయనగరాన్ని కట్టించినది తెలుగువారా కర్ణాటులా? ఈసామ్రాజ్యాన్ని వెలయింపజేసిన ప్రతిష్ఠ తెలుగువారికి రావలెనా, కర్ణాటులకు రావలెనా అన్న వివాదం ఇప్పటిది కాదు ఎప్పటినుంచో వస్తూవున్నది. విజయనగరం ఆంధ్రకర్ణాటసంధిప్రదేశంలో వున్నకారణంచేత ఈవివాదం తెగిందికాదు ఆంధ్రులకూ కర్ణాటులకూను. మేం తేలుస్తామని ముందుకు వచ్చారు చరిత్ర పరిశోధకులు. పాతరాతిశాసనాలన్నీ కడిగి భూతద్దాలతో పరిశోధించారు. అటకలమీదా, భోషాణాలలోనూ, కుండలలోనూ మాటుపడివున్న రాగిశాసనాల కవిలెకట్టలు కిందికి దింపి దులిపి శోధించారు. నాణేలన్నీ ఎడాపెడా పరిశీలించారు పాతతాటాకు గ్రంథాలూ, గాథలూ తెలుగువారు కట్టించినట్టే సాక్ష్యమిస్తున్నా నోరుమూసికొని ఒకమూలగా పడివుండండన్నారు వాటిని. ఇక తర్కవితర్కాలు మొదలుపెట్టారు. విషయం తేల్చామంటే తేల్చామన్నారు. హొయిసల మూడవ బల్లాళుడే విజయనగరం కట్టించాడు; ఉత్తరాన్ని తన సామ్రాజ్యానికి మహమ్మదీయదండయాత్రలవల్ల మోపం తగులకుండా, ఉపద్రవం రాకుండా మూడవ బల్లాళుడు కాపుంచినవారే విజయనగర సామ్రాజ్యాన్ని కట్టినారు అని తీర్మానించారు పరిశోధక పండితులు. హొయిసల మూడవబల్లాళుడు కర్ణాటుడు. ద్వారసముద్రం అతని రాజధాని. నగరాన్ని అతడు కట్టించినాడన్నా, అతనికొలువులో వున్నవారే విజయనగర సామ్రాజ్యాన్ని నిర్మించారన్నా ఇకేమున్నది వాదం కర్ణాటకంనైపునకే మొగ్గిందన్నమాట. హేమాహేమీలుగా పరిగణింపబడుతూవుండే డాక్టర్ యస్. కృష్ణస్వామయ్యంగారు ప్రభృతులే తీర్మానంచేస్తే ఇట్లా, ఎవరికి గుండెవుంటుంది వారిని కాదనడానికి? ఏమో ఈ విషయం వారిశాసనాలలో ఎంత లోతుగా చెక్కివుందో అనుకున్నారు ప్రజలు. పాడిందే పాటగా లోకానికి! అంతా ఆవాదానికే శ్రుతి కలిపినారు. అప్పటికీ మరికొందరు పరిశోధకులు ఈతీర్మానం సరియైనది కాదేమో అని అర్ధస్వనంతో అంటూనే వచ్చారు. కాని యీరొదలో ఆమాట పైకి తేలిందికాదు. అదీ కాక, మాకు నిర్దుష్టమయిన సాక్ష్యం వుంది, మామాట నిలబడి తీరుతుంది ఢిల్లీకివెళ్లినా అని చెప్పేటంత ధైర్యంకూడా లేకపోయింది వారికి. అందువల్ల ఇంతవరకు ఒకమోస్తరుగా వారివాదమే గడికట్టుకు కూర్చుంది నే నమ్మ అంటూను. ఇంతలో క్రొత్తగా పరిశోధకరంగాని కురికినారు ఫాదిరి హీరాసుగారు. విజయనగరాన్ని పాలించిన ఆరవీటివంశ మని మహా లావుపాటి పుస్తకం వ్రాశారు వారు. విజయనగరచరిత్రలో వారిది అందె వేసినచే యన్నారు ఆపుస్తకాన్ని చూచి. తలికోట (రక్షసతగ్గి) యుద్ధం తరువాత విజయనగర సామ్రాజ్యం అదృష్టరేఖ వక్రించిందో సరళంగా

---

* " Vijayanagara - Crigin of the City and the Empire."

(విజయనగరం - నగర సామ్రాజ్యముల పుట్టుపూర్వోత్తరములు). గ్రంథకర్త : డాక్టరు నేలటూరివెంకటరమణయ్యగారు, యం. ఏ., రాయల్ సైజున ౨౦౦ పుటల ఆంగ్లగ్రంథము. వెల రు. ౨.

ప్రకాశకులు : మదరాసు విశ్వవిద్యాలయమువారు.

సాగిందో తెలిసినవారే లేరు. విజయనగరచరిత్ర వ్రాసినవా రెందరున్నా అంతా యుద్ధం ముగిసినతరువాత తుంగభద్రలో చేతులు కడుక్కొని రోజుతూ ఇంటికి పోయినవారేకాని విజయనగర రాజపతాక ననుసరించిన వారు లేరు. అది యుద్ధరంగంలోనే భగ్నమయిందని వారివిమ్మకం. కాదయ్యా కాదు తరువాతకూడా విజయనగరసామ్రాజ్యం అప్పటిదినాలు చూచింది అని పాదిరి హీరాసుగారు వ్రాసేసరికి ఓహో అట్లాగా అని కళ్లు నులుముకొని తెరచిచూచారు. అటువంటి హీరాసు పండితునిపై విజయనగరచరిత్రవిషయంలో ఎంతటి విశ్వాసం వుంటుంది ప్రజలకు? అట్టి విశ్వాసం వుంటే అది న్యాయ్యమేమోకూడాను. ఈయన మైసూరు విశ్వవిద్యాలయంపక్షాన్ని రెండుపన్యాసాలుచేసి విజయనగరము కట్టినదీ, విజయనగరసామ్రాజ్యాన్ని వెలయించినదీ కర్ణాటులే అని శంఖారావం చేశారు: ఆవుపన్యాసాలు తరువాత పుస్తకరూపంగా వెలువడినవి. Beginnings of Vijayanagara History అని ఆ పుస్తకం పేరు. ఏవిషయం స్థాపించవలసివచ్చినా పట్టీయే. ఇల్లాగ పట్టీలు పట్టీలు! పట్టీలతో పుస్తకాన్నంతా పూదరకొట్టినారు ఫాదిరిగారు. విద్యారణ్యులకూ విజయనగరనిర్మాణానికీ సంబంధం లేదు — పట్టీ. విజయనగరానికి విద్యారణ్యులపేర విద్యానగరం అనే పేరు మొదటినుంచీ లేదు - పట్టీ. ఎన్నిశాసనాలలో విజయనగరానికి విద్యానగరం అనే పేరుంది? — పట్టీ. కొద్దివాటిలో ఉన్నదీ అంటే అవి తప్పుడుసృష్టులు — అవి రాగిశాసనాలే అయితే శృంగేరీస్వాములు తరువాత విజయనగరరాజులదగ్గర పలుకుబడికోసమూ, అగ్రహారలాభంకోసమూ తప్పకుండా సృష్టించినవే — సందేహంలేదు. విజయనగరసామ్రాజ్య నిర్మాత లెవరు? వారికీ హొయిసలరాజులకుగాని, వారికొలువుకాండ్రకు గాని సంబంధం కలదా? — పట్టీ. కంటికి నజరుగా కొట్టవచ్చినట్టు పట్టీలు కనబడ్డవి. అబ్బా! ఎంతపరిశ్రమ చేశారు హీరాసుగారన్నారు అంతాను, పుస్తకంపుటలు తిరుగవేసినవారు. ఇటూ అటూ బెసగనివ్వకుండా ముక్కుకు తాడుపోసి లాక్కువచ్చి నిలబెట్టినారు కర్ణాటకసిద్ధాంతాన్ని. చూడండి పట్టీలు - చరిత్రపరిశోధన అంటే ఆయనదే చెప్పాలి. పరిశోధనపద్ధతికి ఆయననే అనుసరించాలి. ఏమిపట్టీలు! ఏమి వాదనైపుణి! అని మెచ్చినవి ఆపుస్తకం విమర్శించిన పత్రికలు. గాబరాపుట్టదా అన్ని ఆకరాలకోటీ, అన్నిపట్టీలతోటీ వున్న ఆపుస్తకం చూస్తే. అంతేకాక వెండిబెత్తం తీసుకొని బరాబరుచేస్తూ ఆయనముందు నడుస్తున్నదర్యా 'విజయనగర ఆరవీటివంశం'. కృష్ణస్వామయ్యంగారు ప్రభృతులు చెప్పిన కర్ణాటకవాదం మరీ గద్దెక్కి బాసెన పెట్టుకేసికొని మరీగట్టిగా పొంకంగా కూర్చుంది. ఇంక నట దింపినా దిగ ననేరకంలోకి వచ్చింది. ఈ హీరాసుపండితుల పుస్తకంతో ఈవిజయనగరసమస్య తట్టి లేపినట్టయి మళ్లీ ముందుకు వచ్చింది. పత్రికలలో కలవర మెక్కువయింది. గచ్చువేసి కట్టివేశాం, ఇక కర్ణాటకవాదానికి చలనంలేదు అనుకొన్నారు అంతాను. ఆంధ్రవాదంవారు మిడుకరించడం మొదలుపెట్టినారు. సత్యం మనపక్షాన ఉన్నట్టుందే. దీనిని సిద్ధాంతం చేయడం ఎట్లాగ అని ఆవేదనపడ్డారు. "సత్యం బెద్దియొ తెల్పవే వరద సంస్థాపించు భద్రాత్మకా" అని వాపోయారు. చిచ్చరపిడుగులాగ ఉరికినాడు రంగంలోకి ఈ సందర్భంలో వెంకటరమణయ్య. ఆంధ్రవాదానికి వ్యూహం పన్నాడు. తాను మొనగాడయి నిలిచినాడు. "కంపిలి, విజయనగరము" అనే గ్రంథం వ్రాశాడు. ఆంధ్రవాదానికి రూపురేఖలు కల్పించాడు. నిర్భయంగా, ధైర్యంగా మావాదంలోనే సత్యముందని చేయి పైకెత్తినాడు. సత్యమూ లేదు, ఏమీ లేదు, చేతవాతకానివాదం. దింపు చేయిదింపు అని పత్రికలద్వారా చేతిమీద కొట్టినారు ప్రతిపక్షులు. తెలుగువారుతక్క ఆయనవాదం ఆమోదించినవారితరు లెవరూ లేరు. నిరుత్సాహపడలేదు, పో పెట్టెక్కువ తగిలినాను. వెంకటరమణయ్యగారు మళ్లీ నడుంకట్టినారు. దానిఫలమే ఈ "విజయనగరం — నగర సామ్రాజ్యముల పుట్టుపూర్వోత్తరములు". ప్రతివాదులవాదాలనన్నిటినీ ఖండించడమే కాకుండా తమవాదానికి బలంగా కొత్తఉపపత్తులుకూడా చూపించారు. ఈ

పుస్తకంతో ఆంధ్రవాదానికి కిరీటం అబ్బిందన్న మాటే. ఇక దీన్ని తోసిరాజును చెయ్యడం — కొత్త ఉపపత్తులూ, ఉపకరణాలూ ముందేవైనా అపూర్వ మయినవి దొరకితేనేతక్క — ఎవరికీ సాధ్యంకాదు. ఈవిధంగా ఈగ్రంథం చాలా గొప్పదనడానికి సందేహం లేదు.

కర్ణాటకకోటివారికి ప్రధానాధారం మహమ్మదీయచరిత్రకారుడు ఫెరిష్టావ్రాత. వరంగల్లు కృష్ణ నాయకుని పితూరీసందర్భంలో ఫెరిష్టావ్రాసిన దిది: 'ద్వారసముద్రంరాజైన బల్లాళదేవు తనరాజ్యాంసరిహద్దులలో ఒకగొప్పనగరం కట్టించి దానికి తనకొడుకు విజయుని పేరుపెట్టినాడు. నగరపదసహిత మయి యదియే యిప్పుడు విజయనగర మని వ్యవహరింపబడుతున్నది.' దీని కుపబలంగా తీసుకున్నవి ఇంకో రెండువిషయాలున్నవి: (౧) మొదటిహరిహరరాయలసోదరుడు మొదటి బుక్కరాయలు శాసనాలవల్ల హొయిసలదేశస్థిత మయిన హొసపట్టణంనుంచి రాజ్యంచేస్తూవుండినట్లు తెలుస్తుంది. (౨) హంపి(తుంగభద్రాతీరస్థ విజయనగరం, బళ్లారిజిల్లాలో వున్న దిది)లో హొయిసలశాసనం వకటి ఉన్నది. ఈనూటిని పొందికగా సమన్వయించి వ్యాఖ్యానాలు చేసి వారు ఏమంటున్నా రంటే,

(౧) బల్లాళదేవుడు కట్టించినాడని ఫెరిష్టా చెప్పే విజయనగరం కర్ణాటసామ్రాజ్యానికి రాజధానిఅయిన తుంగభద్రాతీరస్థవిజయనగర మే.

(౨) హొసపట్టణమంటే కొత్తగా కట్టినపట్టణ మన్నమాట. బల్లాళుడు విజయనగరాన్ని కొత్తగా కట్టించినాడు గనుక హొసపట్టణము విజయనగరమేకాని మరొకటయివుండదు. అది బుక్కరాయలరాజధాని.

(3) విజయనగరాన్ని స్థాపించిన హరిహరాదులు — సోదరులయిదుగురు — అసలు మొదట బహమనీ దండయాత్రల నరికట్టి తనరాజ్యము ఉత్తరము సరిహద్దును కాపాడుటకు మూడవబల్లాళుడు నియోగించినవారే; మొదట అతని కొలువులో నున్నవారే.

అని. అందువల్ల విజయనగరసామ్రాజ్యం స్థాపించినవారు కర్ణాటులు. విజయనగరం కట్టించినవారు కర్ణాటులు. ఇది కర్ణాటకవాదం సారాంశం.

వెంకటరమణయ్యగారు తమగ్రంథంలో పైవాదాన్ని చాలా సమర్థతతో డీకొని, యుక్తియుక్తంగా సహేతుకంగా సమాధాన మిచ్చి దాన్ని శతధా భిన్నం చేశారు. వారిప్రతివాదం - అనగా ప్రత్యుత్తర మన్నమాట — ఇది.

౧. మూడవబల్లాళునిరాజ్యం ఎప్పుడూ కూడా బళ్లారిజిల్లాలోకి వ్యాపించియుండలేదు. మూడవబల్లాళుని తాతగారు సోమేశ్వరుని కాలంలోనే (క్రీ. శ. ౧౨౩౩ - ౬౨) హొయిసలకర్ణాటులకు బళ్లారిజిల్లామీద అధికారం పోయింది ఇట్టి సందర్భంలో తనరాజ్యం కానిరాజ్యంలో బల్లాళుడు నగరం కట్టించడమేమిటి?

౨. కృష్ణనాయకుని పితూరీ ౧౩౪౪ లో నని ఫెరిష్టాయే చెప్తున్నాడు. బల్లాళుడు చనిపోయినది ౧౩౪౨ లో. బహమనీరాజ్యస్థాపన ౧౩౪౨ కు తరువాత ౧౩౪౭ లో కాని అంతకుపూర్వం కాదు. ఇటువంటప్పుడు బహమనీదండయాత్రల నరికట్టడానికేమిటి, బల్లాళుడు హరిహరాదులను నియోగించడ మేమిటి?

౩. హంపిలో హొయిసలశాసనం వున్నదన్న మాట సత్యమే. అది యెవరిది? హొయిసల సోమేశ్వరునిదికాని మూడవబల్లాళునిది కాదు.

౪. పైకారణాలవల్ల హొసపట్టణం విజయనగరమే అనడానికి ఎంతమాత్రమూ అవకాశం లేదు.

ఈవిధంగా ప్రతిపక్షులవాదం పూర్తిగా ఖండిత మయింది. తమవాదం నిలుపుకోవడానకు గ్రంథకర్తగారు కొత్తమోస్తరు ఉపపత్తులుకూడా చూపించినారు. విజయనగరరాజుల రాజ్యపద్ధతీ, రాజలాంఛనమూ ఎవరికి సన్నిహితంగా వుంటవి, ఎవరితో ఎక్కువ కలుస్తవి అని కనుక్కోవడమునకు ద్వారసముద్రం హొయిసలుల, దేవగిరియాదవుల, ఓరుగంటి

కాకతీయుల శాసనాలన్నీ తిరుగవేశారు వెంకటరమణయ్యగారు. కొద్దిపాటి తేడా వున్నా రాజలాంఛనాలు కాకతీయులవీ, విజయనగరంవారివీ కలసినవి కాని మరెవ్వరివీ కలవలేదు. ఇక రాజ్యపద్ధతిలో చూదామా అంటే విజయనగరసామ్రాజ్యంలో అమలులోవున్న రాజ్యవిభాగాలు — స్థలమూ, రాజ్యమూ, నాయంకరమూ అనేవి — ఒక్క కాకతీయుల తెలుగు రాజ్యంలోనే కనిపిస్తవికాని హొయిసలరాజ్యంలో కాని, యాదవరాజ్యంలోకాని కనబడవు. ఎక్కువ ఉపబలంకావా ఈసాక్ష్యం విజయనగరసామ్రాజ్యనిర్మాతలు తెలుగువారైనా అయివుండాలి, లేదా తెలుగువారితో వారికెక్కువసంబంధమైనా ఉండాలి అనడానికి? హొసపట్టణం విజయనగరమే అన్నవాదం ఖండించి, హొసపట్టణం ఇది అనికూడా నిర్ధరించారు గ్రంథకర్తగారు. ఇట్లు చేయడంలో హొయిసలదేశం సరిహద్దులు ముమ్మరందు నిర్ణయించారు, పెద్దపట్టేలిచ్చి వీరుకూడాను ఆదేశం ఇప్పటి మైసూరురాజ్యంలోనిదే అన్నారు. మైసూరుజిల్లా కృష్ణపేటతాలూకాలో హేమావతి నదిలోని ఓలంకమీద వున్న హొసపట్టణమే బుక్కరాయలశాసనాలలోని హొసపట్టణం అని నిరూపించారు. అక్కడ శిథిలమయిన కోటకూడా ఉన్నదట. ఈవిధంగా పుస్తకం చాలాప్రశస్తంగా వుంది, గ్రంథకర్తగారు పడ్డకష్టాన్ని, శ్రమని చాటుతూను.

పుస్తకం అంతా రెండుభాగాలు. మొదటి భాగంలో నగరనిర్మాతలెవరనేవిషయమునుగురించీ, రెండవభాగంలో సామ్రాజ్యనిర్మాతలెవరనేవిషయమునుగురించీ చర్చించారు. మూడవబల్లాళునిరాజ్యం బళ్లారిజిల్లాలోనికి వ్యాపించలేదని ఋజువుచేసే సందర్భంలో గ్రంథకర్తగారొకవిధంగా మూడవ బల్లాళుని సంపూర్ణచారిత్రం వివరించడమేకాకుండా రెండవబల్లాళుని కాలంనుంచి హొయిసలులకూ దేవగిరి యాదవులకూ గల రాజకీయసంబంధాలుకూడా పూర్తిగా తిరుగవేశారు. కాకతీయసామ్రాజ్యం పతనమయినతరువాత వర్ధిల్లిన వరంగల్లు, రాచకొండ, కొండవీడుచరిత్రలనుకూడా — మొట్టమొదటిమారు ఇంగ్లీషులో — సంగ్రహంగా తెలిపినారు. పుస్తకంచివర చేర్చిన అయిదనుబంధాలవల్ల పుస్తకంవిలువ మరింత హెచ్చిందనే చెప్పాలి. వీటిలో 'దొరవడి'ని గురించిన అనుబంధం ముఖ్యంగా ఎన్నతగింది. దొరవడి కంపిలరాజ్యాన్ని స్థాపించిన ముమ్మడి సింగయనాయకుని నివాసస్థలము. ఈ అనుబంధంలో దొరవడి రాజ్యవిస్తారం తెలుపడమే కాకుండా దొరవడి స్థలనిర్దేశంకూడా చేశారు. శాసనాలవల్ల హంపి దొరవడినాటిలోనిదని తెలుస్తూవుండడం చేత ఈనిర్దేశం చాలా ముఖ్యమయినది. ఈనిర్దేశంవల్ల హొసపట్టణం విజయనగరమే అన్నవాదానికి కాలు విరిగింది. అటు మూడవబల్లాళుడి రాజ్యం బళ్లారిజిల్లాలోకి వ్యాపించలేదని నిర్ధారణచేయడంవల్లా, ఇటు హంపియున్న దొరవడినాటిని నిర్దేశించేసి అది కంపిలి రాజ్యంలోదని నిరూపించడంవల్లా కర్ణాటవాదం మొండిపడి రెక్కలులేనిపక్షి యైనది. 'కన్యానాయకుడు,' 'ఆంధ్ర, కర్ణాటకములు,' 'విద్యానగరము' అనే అనుబంధాలుకూడా బాగున్నవి. ఇట్టిగ్రంథం తయారుచేసినందుకు గ్రంథకర్తగారు ప్రశంసాపాత్రులు.

ఈగ్రంథం చదివేటప్పుడు పునరాలోచింపవలసినట్టు కనపడ్డవిషయాలు కొన్ని యిక్కడ చెప్తాము. బర్నీప్రమాణాన్నిబట్టే కావచ్చు — మొదటిహరిహరరాయలు మొదట తురకమతంపుచ్చుకొని, మరల హిందువులలో కలసి విజయనగరరాజ్యం స్థాపించినాడనీ (పుట ౯౬), వర్ణాశ్రమధర్మపరిపాలకుడనీ, విద్యారణ్యులవారి భక్తుడనీ, వర్ణనలు పొందిన మొదటి బుక్కరాయలకు కలుబరిగె గెంసుసలా రనేతురక కొడుకనీ, అతడు బుక్కరాయలకొడుకు రెండవహరిహరరాయల కాలంలో వేలూరు గుళ్లు గోపురాలు తగలబెట్టినాడనీ (పుట ౯౬, ఫుట్నోటు) వ్రాస్తే కొంచెం పస్తాయించి పరకాయించవలసిఉంటుంది — యిదెంతవరకు నిజమూ అని. ఆనోజులలో ఇట్టిసంభవాలు అసాధ్యం కాకపోయినా నమ్మదగినవిగామాత్రం కనిపించవు. ఇవి యథార్థములే అంటే వీటిని ఋజువుచేయడానికి గ్రంథకర్తగారిచ్చిన సాక్ష్యం చాలదు. ఇంకాప్రమాణాలు ఎక్కువ కావాలి. ౯౮-వ పుటలో హరిహరుడు

శ్రీశైలప్రాంతం పాలిస్తున్నట్టు తెలుపబడింది కాని యిది సరికాదని తోస్తుంది. శ్రీశైలం రెడ్డిరాజ్యారంభం నుంచీ రెడ్డిరాజుల కిందే ఉన్నట్టు కనబడుతుంది. రెడ్లలో మొదటిరాజు వేమన్నగారు శ్రీశైలంలో సోపానాలు కట్టినాడని తెలుస్తుంది. అదీగాక, ఆయన శ్రీశైలసీమలోను, అమ్మనబ్రోలు సీమలోను వున్న కొన్ని గ్రామాలకు రివిన్యూసర్వే సెటిల్‌మెంటుచేసినట్లు క్రీ. శ. ౧౩౩౫ నాటి ఆయనశాసనమే వుంది. కనుక దీనినిగురించి కొంచెం ఆలోచించాలనుకొంటాం. గ్రంథకర్తగారు వ్రాశారు, వినుకొండ మొదట రెడ్డిరాజులకు రాజధాని అనీ, దానిని తరువాత అద్దంకికి మార్చినారనీని (పుట ౧౨౪). హరివంశం మొదలయిన గ్రంథాలవల్లా, శాసనాలవల్లా వేమారెడ్డికి అద్దంకే మొదటినుంచీ రాజధానిగా కనబడుతుంది. వినుకొండ సీమ క్రీ. శ. ౧౩౫౨ కు పూర్వం బుక్కరాయలకు స్వాధీనమయిందని వ్రాసి, యిందుకు రెండు శాసనాలు ప్రమాణం చూపినారు గ్రంథకర్తగారు. కాని యిది సరిగాదనుకొంటాం. ౧౩౫౨ కు తరువాతకూడా వినుకొండ సీమ వేమారెడ్డిక్రింద వున్నట్టే కనబడుతుంది. ప్రమాణంగా యిచ్చినశాసనాలలోని శకము ౧౨౬౪ సంవత్సరం పరీధావి. పరీధావి ౧౨౭౪-వ శకవర్షానికి సరిపోతుంది కాని ౧౨౬౪ కు సరిపోదు. అందువల్ల శకమే తప్పనీ, సంవత్సరమే సరియైనదనీ అనుకోవలసి వుంటుంది. అట్లయితే పరీధావికి సరియైనది క్రీ.శ. ౧౩౬౨. నెల్లూరుజిల్లా కనిగిరితాలూకా గోజలవీడు శాసనంలో ఉదాహృతుడయిన బుక్కరాయవొడయలును మొదటి హరిహరరాయల తాతగారైన బుక్కరాయ వొడయలే అంటున్నారు గ్రంథకర్తగారు (పుట ౯౯). విజయనగరాన్ని మొదటినుంచీ తెలుగురాజ్యం చేయడానికి ఇది గొప్పయెత్తే కాని వాదం నిలవాలంటేమాత్రం ఈశాసనాన్ని ఇంకా బాగా పరిశోధించి పనిచేయవలసి ఉంటుంది. ఓరుగంటిలో ప్రతాపరుద్రుడు రాజ్యం చేస్తూవుండగాను, ముప్పిడినాయకుడు గొప్ప సేనాధిపతి కందుకూరు నెల్లూరుసీమలు పాలిస్తూవుండగాను అన్ని బిరుదులతో ఈమండలేశ్వరుని (బుక్కరాయ వొడయల)శాసనం — ఇతనిశాసనం ఇది వక్కటే. మరి కనబడదు — కనిగిరి ప్రాంతంలో కనపడిందంటే కొంచెం ఆలోచింపవలసిన విషయమే. నిర్దుష్టమయిన ప్రతిబింబం తీసి యీశాసనాన్ని బాగా విమర్శచేసి సాధించి నిలబెట్టవలసిన విషయం అది. ప్రతాపరుద్రుడు క్రీ. శ. ౧౩౩౦ వఱకు రాజ్యం చేసినట్టు కందుకూరుశాసన మొకటి ఉదాహరించారు (పుట ౧౧౪). ప్రతాపరుద్రుడంతవరకు జీవించి ఉన్నాడా అని మాసందేహం. పైగా ప్రమాణంగా చూపించిన యీశాసనం చాలా చెడినది. దానిలో ౧౧, ౧౨, ౧౩ పంక్తులలో ఇట్లున్నది 'శ్రీవీరనరపతి ...... ప్టా(?)ధి కర్ణాటకబవదీశ్వ-అ?ప్రతాప శ్రీవీరప్రతాప రుద్రదేవ ......'అని. కర్ణాటకబవదీశ్వ అరి అన్నది కర్ణాటకలు బరిగీశ్వరఅన్న దాని అపపాఠమేమో అని మాసంశయము. ప్రతాపరుద్రుని కతని యేశాసనంలోనూ కర్ణాటకలుబరిగీశ్వర అన్న బిరుదం వున్నట్టు వినం. ఇచ్చిన తేదీనిగూర్చి కొంచెం ఆలోచించాలి. 'పౌర్ణమి — శశిపర్వణిషు' అని కూడా ఉన్నది. ఎట్లయినను, ఈశాసనంకూడా ఇంకా సరిగా శోధించి ప్రకటించేవఱకూ ప్రతాపరుద్రునికి ఈతేదీ ఇవ్వవచ్చునా అని కొంచెం సంశయింపవలసే వస్తుంది. రెండవ హరిహరునికాలంలో, మొదటిమారు ౧౩౬౪ లో విజయనగరంరాజు తెలింగానామీదికి దండెత్తివెళ్లినట్లు గ్రంథకర్తగారు తెలిపినారు (పుట ౧౨౧). పెదవేమగిరి కాలంలో విజయనగర సైన్యం రెండవమారు తెలింగానామీదికి దండెత్తి వెళ్లినట్లు వ్రాసినారు (పుట ౧౨౩). రెండవ దండయాత్ర సరిగా ఎప్పుడు జరిగిందో నిర్ణయింపడాని కవకాశం లేదనీ, బహుశా యిది ౧౩౮౦ కు పూర్వంజరిగి వుంటుందనీ అన్నారు గ్రంథకర్తగారు (పుట ౧౨౧). ఈరెండుదండయాత్రలన్నవి ఒక్కదానికే వర్తిస్తుందేమో ఆలోచించవలసివుంటుంది. కాపయనాయకుని దగ్గరనుంచి అనపోతానాయకుడు వరంగల్లు, భువనగిరి, సింగపురములు ౧౩౬౯ కి పూర్వం పట్టుకొన్నాడని ఉన్నది (పుట ౧౧౯). మొదటి అల్లాయుద్దీన్ హసన్ బహమనీషా కాపయనాయకుణ్ణి ఓడించి

భువనగిరి తీసికొన్నట్టు మహమ్మదీయచరిత్రలు చెప్పు తున్నవి. అతడు ౧౩౪౭ లో సింహాసనమెక్కి ౧౩౫౮ లో చనిపోయినాడు. అందుచేత బహమనీషా ౧౩౫౮ కి పూర్వమే భువనగిరిని కాపయనాయకుని నుండి తీసుకొనివుండాలి. అది మరల ఎప్పుడు కాపయ నాయకునివశమయినదో, అతని నోడించి అనపోతా నాయకుకు దాని నెట్లు తీసుకోవడం సంభవించిందో ఇంకా కొంచెం వివరంగా చెప్పవలసినఅవసరం వుందను కొంటాం—సంగ్రహంగానయినా రాచకొండచరిత్ర తెలిపినారుగనుక. కన్యానాయకుని గురించిన అను బంధంలో ఇచ్చినపట్టీలో, ౧౩౬౦ ఆంధ్రదేశాధీశ్వర బిరుదం వహించినకాపయనాయకుడి (latest) సంవ త్సరమని యిచ్చారు. అది కొప్పుల కాపయనాయకుని శాసనంకాని, ఆంధ్రదేశాధీశ్వర, ఆంధ్రసురత్రాణబిరు దాంచితుడయిన కాపయనాయకుని (Latest) సంవ త్సరం కాదనుకొంటాం. కొప్పుల కాపయనాయకుడూ, ఆంధ్రదేశాధీశ్వర కాపయనాయకుడూ వేరనుకుంటాం.

ఈపైనిచూపినవి పుసః ఆలోచింపవలసిన విష యాలని మాఅభిప్రాయం. వీటివల్ల పుస్తకం గణ్యత తగ్గిందని ఎంతమాత్రమూ అనుకోకూడదు. ఇవి నెరు సులుమాత్రమే. పుస్తకంవిలువ నివి యెంతమాత్రమూ తగ్గింపవు.

గ్రంథకర్తగారు ఇంకానొప్పపుస్తకాలు వ్రాసి ప్రతిష్ఠ గడించాలని కోరుకున్నాం.

(సో.)



గుత్తికోట

—టి. రామచంద్రరావు.

# "ప్రేమూపెండ్లి"

పాలంకి వెంకటరామచంద్రమూర్తి

౧

"మనుమరాలు పుట్టిందన్న ఆనందంతోపాటు జన్మనక్షత్రం మంచిదికాదన్న ఆదటుగూడా జనించింది మాఅమ్మకి. నరసింహంగారినికనుక్కుంటే అమ్మమ్మ గండం అని చెప్పేడేమో అని తోస్తోంది. పోనీ, పెద్దది కదా...ఆవిడ చెప్పినట్లు పీటలమీద కూర్చుని ఆకాస్త శాంతీ అయిందనిపించకూడదమా?" అంది బాలెంతరాలైన సౌభాగ్యమ్మ, మొగుడుతో.

"నీకూకూడా పిచ్చేనాఏమిటి? బ్రహ్మిగాళ్లు మేకల్లా అరుస్తూంటే ఆపొగలో ఘంటలతరబడినీ, ఎందుకోసమో తెలియకుండా ఎందుకూ పీటలమీద కూర్చోడం? మీఅమ్మకేమీభయం లేదులే!"

"పీకుతుంటూన్న అనుమానాన్ని నివారణ చేసుకోడానికే పీటలమీద కూర్చోడం."

"అల్లాగైతే, రోజూ లక్ష అనుమానా లుంటూనే ఉంటాయి. అవన్నీ నివారిస్తూ కూచోడమేనా మన పని? తొలిచూలుపిల్లగనక ఆనందంగా కావలిస్తే మన ఊరువెళ్లాక నలుగుర్నీ ఎరుగున్నవాళ్లని పిలిచి, ఓ టీపార్టీ ఇద్దాం."

"మనం ఊరువెళ్లాక సరే మీరుచెప్పినట్లు చెయ్యవచ్చు. కాని ఓమాటు పీటలమీదకూర్చుని క్రొత్తబట్టలతో లేస్తే మాఅమ్మ చూసి ఆనందిస్తుంది. పనిలోపని నామకరణంగూడా చేసెయ్యొచ్చు. మావాళ్లు ఎరుగున్న నలుగుర్నీ భోజనాలకి పిలుచుకుని ఆనందిస్తారు."

"నామకరణానికిక్కడ శాంతి చేసుకోక్కర్లేదు. అవధాన్లకి కట్నం ముట్టచెప్పి, బియ్యంమీద అక్షరాలు వ్రాస్తేనేకాని నామకరణం అవదా ఏమిటి? ఆటీపార్టీనాడే రంగయ్యనాయుడుగారిచేత ఒకప్రార్థన చేయించి, పేరుపెట్టించొచ్చు."

పురుషోత్తంముఖంకేసి ఓచూపు చూసింది సౌభాగ్యమ్మ. వాదించడంవల్ల ప్రయోజనం లేదని ఊరుకుంది.

మరునాడు పురుటిశుద్ధి, పురుషోత్తం 'భాగ్యం, ఇవాళ ఇంట్లో కాఫీకాచడానికి తీరుబడి లేనట్లుగా ఉంది. హోటలుకు పోయొద్దునా?' అన్నాడు.

'ఇల్లారండి ఒక్కమాటు' అని వినపడింది సౌభాగ్యమ్మకంఠస్వరం. పురుషోత్తం లోపలికి వెళ్లేడు. సౌభాగ్యమ్మ అనుపించలేదు అతనికి మొదట. ఎట్టశాలువా తెరగా అటూహదూ ఇటూహదూ పట్టుకుని భావమరదులిద్దరూ నిలబడ్డారు. నూనెతోనిండిన మూకుడొకటుం దక్కడ.

పురుషోత్తం మాట్లాడలేదు. 'పీటమీదకూర్చుని ఒక్కమాటు నూనెలో చూడండీ' అంది సౌభాగ్యం. 'నాన్ సెన్స్' అన్నాడు పురుషోత్తం అవమానింపబడినవాడిలా. భావమరదులముఖాల్లో రక్తం లేదు. సీతమ్మగారు అల్లుడికి అనుపించకుండా ప్రక్కకు తప్పుకుంది. 'అదిగో, అదిగో, అమ్మాయిని చూడండీ నిద్రలో ఎల్లా నవ్వుతోందో. త్వరగా! త్వరగా చూడండీ!' అంది సౌభాగ్యం. పురుషోత్తం అప్రయత్నంగా పీటమీదకి మోకాళ్లమైని వంగేడు. అతనికి ప్రతిబింబం అగుపడింది. "ఉత్తది. నవ్వూ లేదు ఏమీ లేదు!" అన్నమాటలు వెలువడ్డాయి అతనినోటమ్మట. తెర లాగేశారు మరదులు. "అస్తమానూ నవ్వుతూనే ఉంటుంది. ఈమాటు చూపిస్తా!" అని సౌభాగ్యమ్మ పిల్లని తీసుకుని పీటమీదనుంచి లేచింది.

౨

పురుషోత్తందగ్గరనుంచి ఉత్తరాలమీదఉత్తరాలొస్తున్నాయి, సౌభాగ్యమ్మనీ పిల్లనీ పంపమని. పురిటిశుద్ధినాడే తల్లీపిల్లలను తీసుకువెడదామని వచ్చేడు. సీత

మ్మగా రప్పుడు 'పునర్జన్మ ఎత్తింది. నాలుగు పథ్యాలు వంటపట్టేక తీసుకువెళుదుగాని' అంది. 'వీల్లే'దని కొంచెం పట్టుపట్టేడు కాని సౌభాగ్యమ్మ "నే నిప్పుడొస్తే మీహస్తపాకం చూపించవలసొస్తుందేమో!" అనే చిన్న సమస్యతో వదిలెయ్యడంవల్ల అత్తగారిమాట తీసివెయ్యకుండా వెళ్లేడు పురుషోత్తం అప్పుడు. మూడో నెలరావటంతోనే మంచిరోజు చూసి, సీతమ్మగారు సౌభాగ్యమ్మని ప్రయాణం చేసింది. బండి ఎక్కుతూంటే, ఆయిల్లాలు కూతురుదగ్గరకొచ్చి, నిమ్మళంగా 'అమ్మమ్మా, ఆతొమ్మిదోరోజున నీకువచ్చినదడ చూసి హడలిపోయాను. ఆవెంకటరమణమూర్తి దయవల్ల బ్రతికావు. ఉపేక్షచెయ్యక తిరుపతివెళ్లి మ్రొక్కుచెల్లించుకోండి" అంది. "అల్లాగేనమ్మా" అంది సౌభాగ్యమ్మ. "గుళ్లో దేముడని కొలిచేరాతికీ, నుయ్యంక్రింద మెట్టుగా ఉపయోగించేరాతికీ భేదమేమీలేదనే భర్తగారు తిరుపతిప్రయాణాని కొప్పుకుంటారా?" అని మనస్సులో ఆమె అనుకుంటూండగానే, అన్న పద్మనాభం "పోనియ్, బండి" అన్నాడు. చక్రాలు కదలిపోయాయి. సీతమ్మగారికి కన్నీ రడ్డమైంది. "చంటిపిల్లతో సుఖంగా అది వెళుతూంటే కంట తడికూడ" దని చెంగుతో కళ్లొత్తుకుంటూ సీతమ్మగారు లోపలి కెళ్లిపోయింది.

## 3

ఇన్విటేషనుకవర్లమీద ఎడ్రస్సులు రాయడం ముగించి, అతిథులలిస్టుతోపాటు వాటిని నౌకరుకుఱ్ఱవాడికిచ్చి, పురుషోత్తం వంటింటిదగ్గర కొచ్చాడు.

"నీఉద్దేశమేమిటో తేల్చేవు కాదు" అన్నాడాతడు భార్యతో.

"దీని కింత ఆలోచనెందుకండీ మీ అమ్మగారి పేరు పెట్టక?" అంది తొలచిపట్టుకొచ్చిన పెద్ద సత్తుగిన్నెలో పెరుగుపోస్తూ, ఆమె.

"'మీఅమ్మపేరే పెడదాం' అని నాచే అనిపించడానికి కాబోలు ఇల్లా అనడం?"

"కాదండీ. మాఅమ్మపేరు ఎల్లాగా పెట్టమనను. మాఅమ్మపేరుకంటే ముందుగా చచ్చి స్వర్గస్థురాలై ఉన్న అత్తగారిపేరుపెట్టాలి. అదిలోకాచారం. ముందుముందు అవకాశంఉంటే మా అమ్మపేరెల్లాగా పెడతాం."

"సింగినాదం. లోకాచారమేమిటి? ప్రతీదానికీ 'ఆచారం' 'ఆచారం' అంటావు."

"ఆచారంమాట అల్లాఉంచండి. పెద్దవాళ్ల పేరు పెట్టడంతోందే వాళ్లమీదఉన్న ప్రేమ, గౌరవం తెలియచెయ్యడం అన్నమాట."

"మాఅమ్మపేరుపెట్టకపోతే ఆవిడమీద గౌరవం లేదన్నమాటేనా ఏమిటి? పేరు పెట్టినంత మాత్రం ఊహు—ప్రేమ, గౌరవం కారిపోతాయి కాబోలు!"

"సరే, అల్లాగయితే ఏదో ఆలోచించి పెట్టెయ్యండి."

"ఇంతకంటే ఏమీతోచలేదన్నమాట."

"నేనేమిచెప్పినా మీకు నచ్చదు......పోనీ పార్వతీదేవిపేరో, లక్ష్మీదేవిపేరో పెడితే?"

పురుషోత్తం ఆలోచించాడు. 'పార్వతీ', అనేది మూడక్షరాల పదం. రెండక్షరాలకంటె ఎక్కువ ఫేషన్ కాదు. 'లక్ష్మి' అంటే బాగుంది. కాని అపేరు క్రమంగా 'లచ్చమ్మ' అని వాడుకలోకి వస్తుంది. 'ఇందిరా లోకమాతా మా రమా మంగళదేవతా.' ఇందులో రెండక్షరాలమాట 'రమ'. కాని ఇంతకీ 'లక్ష్మి' అనే అర్థంరావాల నెక్కడుంది? ఇంకా లక్షపేర్లున్నాయి. 'ఉమా కాత్యాయనీ గౌరీ శర్వాణీ సర్వమంగళా!' 'వాణి' కూడా మంచిపేరే...ఇల్లా అనుకుంటూ చటుక్కుని అనుకుంటూన్నదాని విమర్శించుకున్నాడు. 'ఇదేమిటీ తెలివితక్కువ? దేవతల పేర్లే పెట్టాలనుకోడమేమిటి? ఇదొకమూఢాచారానికి వశం అవడమన్నమాట.' అందుచేత ఆతలపు మారిపోయింది అయనలో. 'సావిత్రి, చంద్రమతి, లోపాముద్ర, సుకన్య,......' ఈజాబితా ఏకరుపెట్టుకున్నాడు. ఈపేర్లన్నీ పెద్దవిగానే తోచేయి. అంతేకాకుండా, ఈపేర్లు పెట్టడంలో అర్థమేమిటి? వాళ్లంతా ఆదర్శస్త్రీలనా? వీళ్లంతా పుక్కిటిపురా

ణాలలోవాళ్లేగా. ఆచరిత్రలు యథార్థం అవుతేగా అల్లాంటిస్త్రీలున్నారనుకోడానికి? 'సుశీల', 'సరోజిని'......పోనీ, 'ఝాన్సీ' ఎల్లాగుంటుంది? ఘట్టుగా ఉంటుంది. కాని ఈపేరు చాలామంది పెట్టేకారు... ఎన్నివిధాల ఆలోచించినా పురుషోత్తమానికి కూతురికి ఏపేరుపెట్టాలో తేలిందికాదు..."నీయొుహం నిన్నేమి సలహా అడిగినా యింతే..." అంటూ పైకివెళ్లేడు ఆయజమాని.

వేదవేదాంగాలు, శాస్త్రాలు చదివి, ఘోరమయినతపస్సుకూడా చేసి, విఫలమనోరథుడైన సిద్ధార్థుడు తుదకు అశ్వత్థవృక్షంక్రిందకు వచ్చి బుద్ధుడైనట్లు, పురుషోత్తం, వంటింటిదగ్గర మెదడుతో ఎంతోకుస్తీపట్టి లాభంలేక మిద్దెనిూది కెళ్లి ఒక్కనిమిషం ఆలోచించి సిద్ధార్థుడయాడు. కొలంబస్ అమెరికాను కనుపట్టినప్పుడు ఆరేడుపొందిన సంతోషానికి రెట్టింపుఉల్లాసంతో గబగబా క్రిందకొచ్చి 'భాగ్యం!' అన్నాడు పురుషోత్తం.

"ఏమండీ?"

"మనఅమ్మడు మూర్తీభవించిన మన అన్యోన్యానురాగం. దీనికి 'ప్రేమ' అని పేరు పెడదాం. 'ప్రేమూ' అని పిలుచుకోవచ్చులే. ఊఁ?"

సౌభాగ్యమ్మ తలెత్తకుండానే, "బాగానే ఉందండి." అంది.

సౌభాగ్యమ్మ 'అనెడ్యుకేటెడ్' అయినా తానుచెప్పిన వచనాల్లో ఉండే పరమార్థాన్ని సూక్ష్మంగా గ్రహించగలిగినందుకు సంతోషిస్తో పురుషోత్తం సంతృప్తి గనపరిచేడు.

## ౪

పురుషోత్తం భోజనం చేస్తున్నాడు. 'ఏమండీ?' అంది సౌభాగ్యం.

"ఏం?"

"ఉత్తరం వచ్చింది మావాళ్ల దగ్గిరనుంచి చూశారా?"

"లేదు. ఏమిటి విశేషాలు?"

"మా రామానికి కార్యముట."

"ఊహుం!"

పురుషోత్తం మాట్లాడకుండా భోజనం చేస్తున్నాడు. కర్తవ్యం ఎరుగున్నది గనుక సౌభాగ్యం 'మనల్ని అందర్నీ బయలుదేరిరమ్మన్నారు' అంది.

"అందుచేత ఇప్పుడు బయలుదేరుతాననంటావేమిటి?"

"వెళ్లక్కర్లేదు మరి? మావాళ్లయింట్లో ఇక ఇప్పటిలో జరిగే శుభకార్యం ఏమీలేదు."

"రైళ్లమీదా, పడవలమీదా ఈవేసంకాలంలో వ్యయప్రయాసలతో ఎందుకంతదూరం వెళ్లడం?"

"వ్యయప్రయాసలని ఊరుకుంటే బాగుంటుందా? వెళ్లకపోతే ఎల్లాగ? చెల్లెలికార్యం అవుతోన్నప్పుడే వెళ్లకపోతే ఇంకెప్పుడు పుట్టింటికెళ్లడం?"

"మీచెల్లెలి గర్భాధానానికి నువ్వెందుకూ? మనలో ఉండే గొప్ప 'న్యూసెన్సు' ఇదే. ఒక పిల్లకి శోభనం అవుతూంటే పదిమందీచేరి హడావిడిచేసి నానాగల్లంతూ చెయ్యడం. దెబ్బలాడుకోవడం...... ఇంతకీ ఇప్పుడిప్పుడే స్కూలుకు వెళ్లిరావడం అలవాటవుతోంది ప్రేమూకి. ఇప్పుడు దాన్ని తీసుకుపోతే 'ఇదిగో' 'అదిగో' అని ఎల్లాగైనా తిరిగి రావడానికి పదిహేనురోజులు పడుతుంది. ఈపదిహేను రోజులూ అడ్డగాడిదల్లాగ తిరిగే ఆపిల్లలతో కలుస్తే ఇంక దానికి స్కూలుమాట చెప్పక్కర్లేదు."

"దూరాన్ని పడున్నాము. ఎప్పుడో ఇల్లాంటి సందర్భాల్లో తప్ప ఇల్లుకదలడమే పడదు. ప్రేమూ పుట్టినతర్వాత ఏశుభకార్యం నేచూడేలేదు. అల్లాంటి సరదాలేమీ తీరేలేదు."

"శుభకార్యాలు చూడ్డం సరదా అవుతే, నాయుడుగారి తమ్ముడుకూతురి పెళ్లిట. ఇన్విటేషనొచ్చిం దప్పుడే. దగ్గిరకూడాను. వెళ్లిరా."

"చెల్లెలికి శోభనం అవుతే వెళ్ళడంగూనేనీ, నాయుడుగారింటోనేనా కాదు, ఆయన తమ్ముడింట్లో పెళ్ళికా వెళ్ళడం?" అనుకుంది మనస్సులో సౌభాగ్యం.

"ఆయనకి దేవస్థానంలో పెద్ద ఉద్యోగం. పలుకుబడున్నవాడు. పెద్దఫాయిలోవాడు. కావలిస్తే నీచావస్తానికి సరిపడేటట్లుగా టికేటసవగైరాలన్నీ నీకు బ్రాహ్మలింట్లోనే ఏర్పాటుజరుగుతుంది."

'దేవస్థానం' అనేటప్పటికి సౌభాగ్యమ్మకి వళ్లు ఝల్లుమన్నట్లు తోచింది. 'తిరుపతివెంకటరమణా, నీ దర్శనం చేయిస్తానని మా అమ్మ, ఈపిల్ల పుట్టినప్పుడు—అంటే అప్పుడే ఏడేళ్ళయింది—మొక్కుకుంది. నీ దర్శనభాగ్యం నేనెంతప్రయత్నంచేసినా లభించలేదు. నేదప్రయత్నంగా నిన్ను చూనేమార్గం లభిస్తోంది.'

"అప్పుడే కునికిపాట్లొస్తున్నాయేమి టీవేళ?" అన్నాడు పురుషోత్తం పరధ్యానంలో ఉన్న సౌభాగ్యాన్ని చూసి.

"దేవస్థానంలో పెద్ద ఉద్యోగం అన్నారు, ఏమిటండీ అది?"

"తిరుపతిదేవాలయానికి వచ్చే ఆదాయం, అయేవ్యయం తెలిపేలెఖ్ఖన్ని సరిమాడడం."

విగ్రహారాధనను దూషించే కుటుంబంలో వాడికి, వెంకటేశ్వరభగవానుని జమాఖర్చులు చూసే ఉద్యోగం అవడం కొంచెం అసభ్యంగా తోచిందామెకు.

౨

"'మాటన్నానుకదా' అని తీసుకొస్తే ఇల్లావేపు తోస్తున్నావు నన్ను. పెళ్లిచూశాం. వచ్చిన పనయింది. సాయంత్రానికి ఇంటికెళ్లకపోతే ఎల్లాగ? రేపు సోమవారం బడికదా ప్రేమకి? పైగా నా ఆఫీసు" అన్నాడు పురుషోత్తం.

"క్రిందతిరుపతి కొచ్చినవాళ్లు కొండమీద కెళ్లకుండా పోతారా ఎవరైనా? ఇది వేపడమా?"

"ఏడుమైళ్లెక్కాలి. అందులో మోకాలిపర్వతంట! అదెక్కితే మజా తెలుస్తుంది."

"నడవలేకపోతే డోలీలు కట్టించుకోవచ్చు."

"బ్రతికుండగానే నరవాహనమా?"

"ఎప్పుడూ ఇలాటిమాటలేనండీ మీకు? చెన్నపట్టణంలో, రిక్షాలెక్కి వెళ్లేవాళ్లేకామా చాలామంది? వాటికంటే తీసిపోయిందాఏమిటి డోలీ?"

"అదుగో, వాదించడంఅంటే కష్టం. ఆతర్కమే వద్దంట."

'వ్యవహారం చెడిపోతోం'దనుకుంది సౌభాగ్యమ్మ. "తర్కంకాదండీ, కొండమీద చూడవలసినప్రకృతి వైచిత్ర్యాలు చాలాఉన్నాయిట! పాపనాశం అనే చోట ఒకజలప్రపాతం ఉందిట! ఆప్రదేశం అంతా మనోహరంగా ఉంటుందిటండీ......నాకేం తెలుసు! ఇదంతా నాయుడుగారు ఎవరితోటో చెబుతోంటే విన్నానిందాకా."

"అల్లాగైతే వాళ్లెవరైనా వెళుతూంటే వెళ్లు. నేనుమాత్రం ప్రయాస పడదలచుకోలేదు. సాయంత్రాని కొచ్చెయి...జాగ్రత్త. నేనీరైలులో వెడతాను. పోని ప్రేమనుకూడా తీసుకెడితేనేం నాతో? ఎందుకూ స్కూలు చెడగొట్టడం రేపూ?"

ఈమాట వినేటప్పటికి సౌభాగ్యమ్మకి ఏమీ తోచిందికాదు. తాను రాకపోవడం సరిగదా, పిల్లను కూడా రానివ్వనంటున్నాడు భర్త. "నేనూ వెడతాను అమ్మతో" అంది ప్రేమ. సౌభాగ్యమ్మకి ప్రాణాలు లేచొచ్చాయి. "సరే" అన్నాడు పురుషోత్తం బయలుదేరుతో. "స్టేషనుకి కారుపంపడం మరచిపోకండి." అంది సౌభాగ్యం.

పాపనాశనం జలధారదగ్గరున్న ప్రకృతివైచిత్ర్యాలు చూడడానికి బయలుదేరినవాళ్లతో బాటు, సౌభాగ్యం, ప్రేమా వెళ్లేరు కొండమీదకి. ఆలయప్రాంతాలకు చేరుకున్నాక, సౌభాగ్యమ్మ, "ఏమిటో అనుకున్నా! బడలికగా ఉంది. ఈసత్రములో విశ్రాంతి

తీసుకుంటూఉంటా. మీరు నాలుగుచోట్లూ తిరిగి తిరిగిరండి" అని వెనకదిగడింది పిల్లలో. అనంతరం ప్రేమాను తీసుకుని దేవాలయంలోకెళ్లి, మెడలో పసుపుకొమ్ము కట్టుకుని మంగళసూత్రమును దేముని కర్పించి ఓనమస్కారం పెట్టింది.

అనుకున్న వేళకి మరునాటిమధ్యాహ్నానికి తల్లీ పిల్లా ఇంటికి చేరుకున్నారు, కొనుక్కున్న చందన బొమ్మలూ, ఇత్తడిసామగ్రీ పట్టుకుని.

౬

"ప్రేమా, పడుకోవమ్మా. పదిగంట లవొచ్చింది. జబ్బుకూడా చేస్తుంది అల్లా అల్లా మేలుకు చదువుతే." అంటోంది సౌభాగ్యమ్మ.

"పగలు చదువుతే చాలమ్మా. రాత్రిళ్లూ మేలుకు చదువక్కర్లేదు. కావలసొస్తే ఇంకా తెల్లవారగట్లలేచి చదువు."

"మీకేం? ఊరికే 'పడుకో' 'పడుకో' అని చంపుతారు. వాళ్ల శారద ఎల్లాగ ప్రయత్నం చేస్తోందో తెలుసా ఫస్టుమార్కు కొట్టెయ్యడానికి? ఒక్కమాటైనా ఆప్షనల్స్‌లో ఫస్టుగా రావాలనుకుంటూంది......అవును కాని క్వడ్రేటిక్ ఈక్వేషన్ (Quadratic Equation) ఇచ్చి దాని రూట్స్ (Roots) ఈక్వల్ (Equal) అన్న కండిషన్ (Condition) ఇచ్చి, సీ వాల్యూ (C'value) కనిపెట్టమన్నాడు. అప్పుడు సిస్క్వేర్ ఈస్ ఈక్వల్టూ ఫోర్ యేసీ (C2 = 4 a c) అన్నపద్ధతిలోనేనా చెయ్యడం?"

పిల్ల అడుగుతూన్నవిషయం తల్లికి తెలియదు. కాని ఆవిశాలనేత్రాలతో ప్రేమా, తండ్రి ఏమి చెపుతాడో అని ఆయనముఖంకేసి చూస్తోంటే ప్రత్యక్షమవుతోన్న ఓవింతసోయగాన్ని గమనిస్తో సౌభాగ్యమ్మ నిలబడిపోయింది. లెఖచెప్పేసి 'ఇంక పడుకో' అంటూ పురుషోత్తం ఈవలకొచ్చాడు. పురుషోత్తమాన్ని వెంబడించింది సౌభాగ్యమ్మ.

"ఏమండీ, ఊరికే ఇల్లా ఉపేక్షచేస్తున్నారు? పిల్ల ఏరోజుకారోజు ఎదగడం చూడటంలేదూ?"

"అందులో ఆశ్చర్యమేముంది? పిల్లలు ఎదగరూమరి?" అన్నాడు పురుషోత్తం టక్కరితనంగా.

"అందులో పెద్దఆశ్చర్యం ఉందని నేచెప్పటంలేదు. చక్కనిసంబంధం ఒకటి చూడవలసినకాలం వచ్చిందని చెపుతున్నా" అంది కొంచెం కోపాన్ని తెలియచేస్తో.

"అంటే?"

సౌభాగ్యమ్మకి ప్రాణం విసిగింది. "అంటే? అంటారేమిటి? గోవగా ఎదిగింది పిల్ల. రేపో ఎల్లుండో చటుక్కుని పెద్దదై ఊరుకుంటుంది."

"ఊరుకుంటుందికాని మీదపడి కొట్టదుకదా నిన్ను? అల్లాగయితే, ప్రమాద మేమీలేదుకదూ?" అన్నాడు పురుషోత్తం.

సౌభాగ్యమ్మ ఏమీ చెప్పలేక ఊరుకుంది. అఖరుకి "మీకేంతెలుస్తాయండీ ఆడదానిబాధలు? పిల్లికి చెలగాటం, ఎలక్కి ప్రాణసంకటం క్రింద ఉంది మన సంభాషణ. ఏంచెప్పినా వేళాకోళంకింద తోసేస్తే ఎల్లాగ?" అంది. ఆముఖంలో ఉన్నదైన్యాన్ని కనిపెట్టేడు పురుషోత్తం, "ఎందుకే అనవసరంఅయిన ఆదుర్దా? చక్కగా సరియైనఉత్సాహంతో చదువుకుంటూంది. స్కూలుఫైనల్లోకి వచ్చింది. అల్లాంటి ప్రేమాకి 'పెళ్లి' అని, చదువు చెడగొట్టడం ఏమిటి? 'పెద్దదైపోతుందేమో చటుక్కుని'? అన్నభయం ఎందుకూ? చెన్నపట్టణంలోకూడా ఎందుకూ ఈ భయాలు? సమర్తాడినపిల్లల్ని ఎంతమందిని చూడడంలేదూ మనం పెళ్లి అవకుండా ఉన్నవాళ్లని?" అన్నాడు.

"ఈఊళ్లో పెళ్లికాకుండా పెద్దవాళ్లయిన పిల్లలూ ఉన్నారు. వాళ్లని పెళ్లిచేసుకోడానికి సిద్ధంగా ఉన్నవాళ్లూ ఉన్నారు. కాని మనవాళ్లలో ఎవరూలేరు. మనకి మల్లేనే ఈఊళ్లో స్థిరపడిఉండినమన వాళ్లకుటుంబం ఏదైనా ఒకటుండి, వాళ్లల్లో ఈడైన

కుర్రవా డుంటే పెళ్లి పెద్దదయాకే చెయ్యొచ్చు. కాని అల్లాంటివా ళ్లెవళ్లూ లేరు. అందుచేతతొందరపడాలి."

"ప్రేమూ బి. ఏ. ప్యాసవనియ్ చెపుతాను! దానిసౌందర్యం, చదువూ చూసి, కళ్ల నద్దుకుని పెళ్లి చేసుకునేవాళ్లు లక్షమం దున్నారు. మనశాఖలో కాక పోతే అన్యశాఖాయిరి."

ఆముక్క విని అదిరిపడింది సౌభాగ్యమ్మ. 'అంత శ్శాఖావివాహ మేసి!'

పురుషోత్తం జందెం తీసిపారవెయ్యకపోయినా, బ్రహ్మసమాజంమీటింగుల కెళ్లడం, యుక్తాయుక్తాలు లేకుండా 'పూర్వాచారం' అన్నమాత్రాన్ని మండి పడ్డం, బ్రాహ్మణేతరులతో విందులు గుడుపడం—ఈ చేష్టలన్నీ సౌభాగ్యమ్మకి పరిచయమే. కాని ప్రేమూ వివాహవిషయంలో వరాన్వేషణ అన్యశాఖలో జరుగ బోతోందని ఆమె అనుకో లేదు.

అల్లాంటివివాహం జరుగుతే! ఇంకేముంది? వెలి! 'వెలి' అంటే అంతపట్టింపులేనిమాట నిజమే— కాని వాళ్లజానకిఅక్కయ్యగాని, రామంగాని వస్తా రా ఆపెళ్లికి? అన్నదమ్ములు, అక్కచెల్లెళ్లే రాకపోతే ఇంక బంధువుల మాట చెప్పక్కర్లేను కదా. పోనీ ఎవరూ పెళ్లీ పేరంటాలకి రాకపోవచ్చు............ కాని ఈ భావిదంపతుల మా టేమిటి? ఈ శాఖాసంకరంలో కలిగినసంతానం మా టేమిటి? అప్పటికి శాఖలన్నీ కలసిపోతాయేమో? ఇంతకీ నిశ్చయంకాని భావికాలంమీద ఆధారపడి వర్తమా నాన్ని ఉపేక్షచెయ్యడ మెందుకూ? ఇంతకూ అంత అవసరంలేదే ఎప్పటిదాకానో కనుపెట్టుకుని అప్పుడు అన్యశాఖలోంచి ఒకణ్ణి వెతికి తీసుకురావడానికి? బాల్యవివాహాలు నిషేధమే. కాని ప్రేమూకి పద్నాలుగో ఏడు వెళ్లిపోతోంది. అజ్ఞానికాకుండా చదువుకుం టూంది. చదువుకుంటూ, తగినవసతుండి యీడుకు తగిన కుర్రవాళ్లు స్వశాఖలో ఎంతమందో ఉన్నారు. కనుక, ప్రేమూకి పెళ్లిచెయ్యడం శ్రేయస్కరం ఇప్పుడు. ఇట్టిపరిస్థితుల్లో అన్యశాఖ కెందుకూ వెళ్లడం, కేవలం 'మార్గదర్శకులవుదాం' అనే ఉద్దేశం ఉంటే తప్ప? స్వశాఖలో వరాభావం లేనప్పుడు మార్గదర్శ కత్వంకోసం పాటుపడ్డం కొరవితో తలగోక్కోడం. దానివల్ల అనర్థాలు మెండుగా ఉంటాయి. 'నేను సంస్కర్తని' అనే అహంకారంతో కూడుకున్న ఉద్యమం ప్రేమూయొక్క భావిసౌఖ్యానికి హాని తేవచ్చు......

ఒకదానివెనుక ఒకటిగా ఆలోచనలు సౌభా గ్యమ్మమనస్సులో పరుగెత్తేయి. ఇదంతా భర్త విం టున్నాడనే తోచిం దామెకు. "కనుక నామాట విని వాళ్లచంద్రశేఖరాని కిచ్చి చేసేద్దాం పెళ్లి" అన్న దామె.

"అబ్బ! నాకు నిద్దరొస్తోంది చంపకు" అన్నాడు పురుషోత్తం.

౭

ప్రేమూ ఇంటర్మీడియట్‌లోకి వచ్చింది. యౌవన పుష్పం ఆమెలో వికసించి సౌరభాన్ని వెదజల్లుతోంది.

స్వశాఖలో వివాహంకాకుండా ఉన్నయువకు లందరికీ పెళ్లిళ్లవుతున్నాయి. ఒకొక్కశుభలేఖవచ్చి, సౌభాగ్యమ్మహృదయంలోని ఆశాలతలలో ఒకొక్కక్క దాన్నీ నిర్మూలిస్తోంది. 'కొంచెంకాలం ఆగ' మని చంద్రశేఖరంతల్లికి రహస్యంగా ఓ ఉత్తరం వ్రాసింది. ఆఖరుకి ఆపెళ్లి శుభలేఖగూడా చేరింది. అవును. అసలు అభిప్రాయాలేమిటో తెలియకుండా పురుషోత్తంమీద ఆధారపడి ఎంతకాలంఆగుతారు వాళ్లుమాత్రం?

సౌభాగ్యమ్మ ఏమిచేయగలదు? మగని కిష్టంలేని విషయాల్లో, తనమనస్సంతుష్టికోసం ఆచారవ్యవహా రాల్లో కొంచెం స్వతంత్రించినా, ఆమె అతనిమన స్సుకి కేవలం కష్టంతోచకుండా తనబుద్ధినై పుణ్యం చూపిస్తో గడుపుతోంది కాలం. కాని కూతురిపెళ్లి విషయంలో ఎటువంటిస్వతంత్రం తీసుకోగలదు? ధైర్యంచేసి స్వతంత్రించి చెయ్యడానికి, ఇదేమైనా ఆజ్యావీక్షణా, తిరుపతియాత్రా లాగ స్వల్పవిషయమా? ఇందులో తనబుద్ధినై పుణ్యం ఏమి కనుపర్చగలదు?

వివాహవిషయంలో ఏమాత్రమైన స్వతంత్రంజూపినా తనకు శాశ్వతమైన ఎడబా టన్నమాట భర్తతో.

తనభర్తకి “సంఘసంస్కారి” అని అనిపించుకోవాలనే ఈకోరిక ఏమిటో? సంఘంలో మంచివరుడు లేక పిల్లని ఏవృద్ధునికో, ఏ దౌర్భాగ్యుడికో ఇచ్చి కట్టిపెట్టవల సొచ్చినప్పుడు, త్యాగం చూపించి, సంస్కారి కావలసినదే. అవసరం లేనప్పు డెందుకూ సంస్కారం? చెడ్డకి సంస్కారం కాని మంచిదానిలోకూడా ఎందుకూ సంస్కారం? ఆయన, తిరుపతిలోఅయిన పెళ్లి పువ్వుల దండలతోటి, ప్రార్థనలతోటి జరిగిందని, అది చాలాఫస్టుగా ఉందనీ, ఎన్నిమాట్లో అభినందించారు. మంత్రాలుమాత్రం ప్రార్థనలుకావూ? ఈపెళ్లిలో మాత్రం తంతు ఏమి తగ్గిందీ?......

ఇల్లాంటి ఆలోచనలతో నిండిన మనస్సుతో ఒకనాడు సౌభాగ్యమ్మ గుమ్మంవగ్గర, లోపల చదువుకుంటూన్న ప్రేమాను చూస్తూ నిలబడింది.

ప్రేమా “అమ్మా, ఏమిటే అల్లాగ చూస్తున్నావు?” అంది. ఏమి చెప్పటానికీ తోచక, “ఊరికేనే. ఏమీలేదు” అంది తల్లి.

“నాకు కీతెలుగో పెద్దబాధయిపోయిందమ్మా. కాన్వెంటులో అరవమేష్టరు తెలుగుచెప్పడంచేత అశ్రద్ధచేశా ఈసబ్జక్టు. కాలేజీలో కంపల్సరీ అయిపోయింది. అంటే, ఇందులో మార్కులు సరిగ్గా రాకపోతే ఉంచేస్తారన్నమాట.”

“ఏదీ, నేనేమైనా చెప్పగలనేమో చూద్దాం. అడుగు నీకేంగావాలో” అంటి సౌభాగ్యమ్మ ప్రేమా దగ్గరకు వెళ్లి.

ప్రేమా తెలుగుసెలక్షన్సు ముందు పడవేసింది. “ఈపద్యాన్నీ, ఈపద్యాన్నీ కంపేర్ చేస్తూ కామెంటు వ్రాయాలిట. అంటే పోలిక చూపిస్తూ వ్యాఖ్యానం వ్రాయమన్నమాట.” అంది ప్రేమా.

ఆ రెండుపద్యాలూ చదివింది సౌభాగ్యమ్మ. “అమ్మాయీ, మొదట నే చెప్పినది వినేసి, నువ్వు ఎల్లాగ వ్రాసుకుంటే మార్కులొస్తాయో ఆలోచించుకుని ఆఫక్కిలో వ్రాసుకో...—మొదటి పద్యం చూడు. ఇది ప్రహ్లాదు డన్నది. ‘భగవంతుడు సర్వాంతర్యామి’ అని తండ్రికి చెపుతున్నాడు. ‘ఇందు గల డందులేడని సందేహము వలదు’ అనుచున్నాడు. ప్రహ్లాదుడు మహాభక్తుడు. తల్లిగర్భంలో ఉన్నప్పుడే విష్ణుభక్తి కుదిరిన దాతనికి. అందుచేత భగవంతుడున్నాడా లేడా అనేసందేహం ఎన్నడూ లేదు. ‘భగవంతుడు సకలచరాచరాంతర్వర్తి’ అన్న మనోనిశ్చయం ఆతనికి ఉండడంచేత ‘చక్రి సర్వోపగతుడు’ అని నిక్కచ్చిగా చెప్పినాడు. రెండవపద్యం చూడు’ ఇది గజేంద్రుడు చెప్పినది. ఈతడూ భక్తుడే. కాని ప్రహ్లాదునివంటి భక్తుడు కా డితడు. మొసలిచేత పీడింపబడుతూ కొన్ని సంవత్సరాలు దానితో యుద్ధంచేసి అప్పుడు భగవంతుడే రక్షించా లనుకుని ప్రార్థన మొదలెడతాడు. భగవంతునిస్వరూపం ఎల్లాంటిదో గజేంద్రునికి, ప్రహ్లాదునికి తెలిసినట్లు తెలియదు. ఆతనిజ్ఞానం అంతా వినికిమీద ఆధారపడి ఉంది. అందుచేతనే ‘కలడందురు దీనులయెడ,’ అన్నాడు. ‘దీనులయెడల ఉన్నాడు భగవంతుడు’ అని చెప్ప లేదాతడు. ‘దీనులయెడల ఉన్నాడంటారు’ అన్నాడు. ఆతడు ‘భగవంతుడున్నాడు’ అని నొక్కిచెప్పలేదు. ఏడిచి ఏడిచి, భగవంతుడు ఎప్పటికీ రాకపోతే, ఆఖరుకి “అ, కలడు కలండనెడివాడు కలడో లేడో” అనే అనుమానంలోకికూడా దిగేడు. ప్రహ్లాదుడికిమాత్రం ఇల్లాంటి అనుమానాలు ఎప్పుడూ లేవు...తెలిసిందా?” అంది సౌభాగ్యమ్మ.

ప్రేమా వింటూ అమ్మకేసి చూస్తోంది. అమ్మ పరవశురాలయి చెబుతోంది. “అమ్మ “అనెమ్యాకేపెడ్” అంటా డెందుచేతో నాన్న?” అనుకుంటూ ఆశ్చర్యపోయింది ప్రేమా.

ఇంతట్లో పురుషోత్తం వచ్చాడు 'ప్రేమూ, లేడీ వెల్లింగ్డన్ ఎస్సే కాంపిటీషన్ రిజల్టు' తెలిసిందా? అని అడిగేడు ఆయన.

"లేదింకా ? అందరూ ప్రైజు నాకే వస్తుందను కుంటున్నారు...నాన్నా ! ఒకటడుగుదాం అని మరచి పోతున్నా. మాక్లబ్బువాళ్లంతా టెన్నిస్ సింగిల్సుకు నన్ను పంపుతా నంటున్నారు. కంపీట్ చెయ్య మంటావా ?"

"తప్పకుండా వెళ్లు. నన్నడిగే దేమిటి ?" అన్నాడు.

౨

ఇంటర్మీడియెట్ క్లాసుచదవడం అయిపోయింది. ప్రేమూ పురుషోత్తంతో బి. ఏ., చదవనని చెప్పింది. 'మెడిసిన్' చదవాలని ఆమెకోర్కె.

"మెడికల్ పరీక్ష చాలాకష్టంగాదా ?" అన్నా డతడు.

"ఇంటర్లో సెకండు గ్రూప్‌లోకి మార్చెయ్య డంలో ఉద్దేశం మెడిసిన్ చదువుదామనేగా ?"

"అయిదేళ్ల కోర్సు. చాలాకాలం పడుతుంది. ?"

"అయిదేళ్ల కోర్సూ అయిదేళ్లకంటే ఎక్కువ పట్టదుకదా ?" అంది నవ్వుతూ ప్రేమ.

పురుషోత్తం ఏమీచెప్పలేదు. బి. ఏ., రెండేళ్లలో పూర్తిచేస్తే, ప్రేమూకు పెళ్లిచెయ్యవచ్చు అనుకున్నాడు. 'రెండేళ్లకంటే ఆలస్యం చెయ్యడం ఎందుకూ ?' అని ఉద్దేశపడ్డాడు. అందుకే చాలాకాలం పడుతుందన్నాడు. కాని తనఉద్దేశం ప్రేమూకి తెలియ నిచ్చేడు కాడు. కొంచెం సేపుండి 'సరే' అన్నాడు. తండ్రి ఏదో ఆలోచిస్తున్నాడని తెలుసుకుంది ప్రేమ. 'పోనీ, నీయిష్టం. బి. ఏ., చదువమంటే బి. ఏ., యే చదువుతా!' అంది. 'ఎందుకూ? వద్దు. మెడిసినే చదువు' అన్నాడు. 'ప్రేమూ ఇచ్ఛకి ఎందుకూ అడ్డు రావడం? దాని ఇష్టమొచ్చినదే చదువుతుంది. పెళ్లికేం? ఇంకో కొంతకాలం ఆలస్యమవుతుంది — అంతేగా?' అను కున్నాడు పురుషోత్తం.

౩

"హిందూ" మడతవిప్పి పేజీలు తిరగేస్తున్నాడు పురుషోత్తం. అందులో ఉన్న ఓఫోటోమీద దృష్టి సారిస్తో, "భాగ్యం" అని పిలిచేడు. సౌభాగ్యమ్మ వచ్చింది. "ప్రేమూబొమ్మ పడింది చూశావా?"

టెన్నిస్ రేకెట్టు చేతపుచ్చుకుని ప్రేమూ కుర్చీలో కూర్చుని ఉంది ఆబొమ్మలో. ప్రక్కనే ఓ యువకుడు నిలబడి యున్నాడు. వారిద్దరి మధ్యనూ వెండికప్పు ఉంది.

"ప్రేమూ, ఇతనూ ఓపక్షంలో ఉండి నెగ్గేరుట ఈపందెం!"

"ఎవరండీ ఇతను?"

"ఇందులో 'కోదండపాణి' అనిఉంది. ఇతన్ని గురించి ఎప్పుడో ప్రేమూ చెప్పినట్లు జ్ఞాపకం?... ప్రేమూ సరిగ్గా నీపోలికేసుమా! చిన్నప్పుడు నువ్వు ఇల్లాగే ఉండేదానవు. డ్రెస్సులో తేడాతప్ప, ఇంకే భేదం అనుపడదు."

సౌభాగ్యమ్మ లోపలికెళ్లి, తను ఆయీడప్పుడు తీయించుకున్న ఫోటో తీసుకొచ్చింది. తనఫోటోకి ప్రేమూఫోటోకి వ్యత్యాసం ఆట్టేలేదు......ఆఫోటోలో సౌభాగ్యమ్మ రెండేళ్ల వయస్సుగల ప్రేమూను ఒడిలో కూర్చోపెట్టుకొని ఉంది. సౌభాగ్యమ్మ ఫోటోలు రెండూ ఒకదానిప్రక్క ఒకటి పెట్టి, "ఏమండీ ప్రేమూ పెళ్లిచేసుకుంటే ఈపాటికి బిడ్డల తల్లి కావలసిందే." అంది.

పురుషోత్తం ఏమీ మాట్లాడలేదు. సౌభాగ్యమ్మ ఏదో చెప్పబోయింది. అంతలో జోడుచప్పుడయింది. లోపల ప్రవేశించే ప్రేమూని చూచి, ఆమె మాట్లాడ కూరుకుంది.

"అమ్మాయీ, కోదండపాణి ఎవరే ?"

"శివజ్ఞానంపిల్లైకొడుకు. ఇదివరకు చెప్పలేదూ నేను సింగిల్సుకి కంపీట్ చేసినప్పుడు ?"

"శివజ్ఞానంపిల్లై అంటే ఇద్దరున్నారు. పోలీస్ ఆఫీసరొకడూ..."

" అబ్బే, అతనుకాదండీ, క్రొనుప్రోసిక్యూటరు శివజ్ఞానంపిళ్లై. "

" ఇత నేమిటి లాస్టూడెంటా ? "

" కాదు. మాక్లాసే. చాలా తెలివైనవాడులే. అన్ని సబ్జెక్ట్సులోనూకూడా స్పెషలిస్టే. ఇంక టెన్నిస్‌లో చెప్ప నక్కరలేదు. మంచి 'గ్రేస్' చూపిస్తాడు ఆటలో. "

" నీతో సింగిల్స్ఆడి 'డిఫీటు' వుత ఇతనే కదూ ? "

" అవును...దానికేమిలే ! ఆవేళ ఎందుచేతో పాడుచేశామకాని, నెగ్గవలసినవాడే అప్పుడుకూడా... అన్నట్లు మరచిపోయా. రేపు బహుశః మనింటికొస్తా డాయన. 'ఫ్రెండ్సు' అందరికీ చిన్నటీపార్టీ ఒకటి 'అరేంజి' చేస్తున్నాడు. పెర్సనల్‌గావచ్చి ఇన్వైట్ చేస్తానన్నాడు నిన్ను. బహుశః రెండు గంటలకి రావొచ్చు. "

౧౦

కోదండపాణి మర్నాడు అనుకున్న వేళకి పురుషోత్తంగారింటి కొచ్చాడు. ప్రేమా తండ్రికీ, సహాధ్యాయుడికీ ప్రథమపరిచయం కలుగచేసింది. టెన్నిస్‌లో జయముపొందినందుకు కోదండపాణిని అభినందించాడు పురుషోత్తం.

" మిస్ ప్రేమాదేనండీ ఆట అంతా. నేను ఊరికే అక్కడ నిలబడ్డాను. మీరు మొన్న రాలేదనుకుంటా. వచ్చి ఉంటే మీకే తెలుసును. " అని ఇంగ్లీషునే మాట్లాడ్డం మొదలుపెట్టేడు కోదండపాణి.

" ఏమిటోనండి ! నాకు ఎప్పటికప్పుడే కుదరటంలేదు. సెక్రటరియట్‌లోంచి ఊడిపడేటప్పటికి ఆరుకూడా అయిపోతుంది ఒకొక్కప్పుడు. "

" అవునండి, అలాగే ఉంటుంది. ఒక ఆఫీసుకు హెడ్ అవుతే అంతేకామా. "

" మాప్రేమా చెపుతోంటే వినడమే కాని మిమ్మల్ని ఎప్పుడూ చూడనేలేదండీ. "

"తమన్ని నేను సమాజ్ హాలులో ఎప్పుడూ చూస్తూనే ఉన్నా. మీరు 'ఫలానా' అని కూడా తెలుసు. మిస్ ప్రేమాయేచూపించింది నాకు మొదట... నేడు చాలా సుదినం, మీతో మాట్లాడ్డానికి వీలయింది."

"ఇంకా ఏమైనా టోర్నమెంట్సుకి కడతారా?"

"కడదామనే ఉంది. మిస్ ప్రేమా కంపేనియన్‌గాఉంటే మాకెప్పుడూ దిగ్విజయమే!"

ముసిముసినవ్వు నవ్వేడు పురుషోత్తం.

"మిస్ ప్రేమాలాంటి కూతుర్ని కన్న తలితండ్రులజన్మ సార్థకం. కాలేజీలోనూ, టెన్నిస్ కోర్టులోనూకూడా సమానమైనప్రతిభ చూపిస్తోంది."

"అబ్బ! ఊరుకోవోయ్. ఉన్నవీ లేనివీ అల్లా కల్పించి చెప్పకపోతే ఏమీ?" అంది ప్రేమా.

సౌభాగ్యమ్మపట్టుకువస్తూన్న 'టీ'ని ప్రేమా అందుకుని టీపాయిమీద పెట్టింది. 'టీ'త్రాగి, కోదండపాణి తానియ్యబోయే టీపార్టీకి పురుషోత్తమాన్ని ఆహ్వానించి, వెడుతూ, ప్రేమకేసిచూస్తో " నువ్వు కూడా రావాలన్నమాటే సుమా" అన్నాడు నవ్వుతో.

"అల్లాగా, నాకు తెలియదే" అంది ప్రేమా.

పురుషోత్తంకూడా నవ్వేడు.

౧౧

ప్రేమా, కోదండపాణీకూడా పరీక్షలు ప్యాసవుతున్నారు. టెన్నిస్‌కప్పులు నెగ్గుతోనే ఉన్నారు. వాళ్లిద్దరికీ యమ్. బి. బి. ఎస్. డిగ్రీలు వచ్చాయి.

'ఇంక పెళ్లిచెయ్యాలి' అనుకున్నాడు పురుషోత్తం. 'ఇంక ఆలస్యం చేస్తే భాగ్యం బెంగకూడా పెట్టుకుంటుంది.' అమ్మాయిలో. ఆప్రశంస ఎల్లాగ తీసుకురావాలో రెండుమూడురోజులు ఆలోచించి పురుషోత్తం ఒకనాటి ఉదయాన్ని " ప్రేమా " అన్నాడు.

" ఏమినాన్నా ! "

"ఏమీలేదు......నీపెళ్లి సంగతిసురించి మాట్లాడుదా మనుకుంటున్నా......" రెండురోజుల్నించి ఆతనిమనస్సులో రాపాడుతోన్నా చివరికి పురుషో త్తం, ఆప్రశంస తీసుకురావడంలో సమర్థత చూపలేకపోయాడు.

"అవును. నేనే తొందరపడవద్దని ఆపుజేశా, పరీక్షలేవో తెమిలిపోతే మంచిదని. లేకపోతే ఇదివరకే ఆత డొచ్చి నీతో ఈసంగతినిగురించి మాట్లాడి ఉండును." అంది ప్రేమ రేకెట్టులో తెగిన స్ట్రింగు తీసి కొత్తది వేయబోతూ.

"ఆత డెవరు?"

ప్రేమా తండ్రికేసి చూసింది. ఆముఖంలో ఆశ్చర్యం అనుపిస్తోంది. నాన్న తెలియనివాడిలా నటిస్తున్నాడు. తనచేత చెప్పించాలని ఆతని ఉద్దేశం. సహజమైనసిగ్గుతో దృష్టిని రేకెట్టుమీదకు దింపి "కోదండపాణి" అంది ప్రేమా.

"కోదండపాణి!" అనే మాట్క వెలువడింది. ప్రేమా అదిరిపడి తండ్రికేసి చూసింది. పురుషోత్తం ముఖంవంచుకుని స్తంభితుడై కూర్చునే ఉన్నాడు. ప్రేమాకే ఏమీ అర్థమవటంలేదు.

పురుషోత్తం లేచి పైకివెళ్లేడు. మేడమీద గదిని కడిగిస్తోంది సౌభాగ్యమ్మ. 'భాగ్యం, ప్రేమా కొంప తీసేసింది. కోదండపాణిని పెళ్లిచేసుకుంటుందిట!" అన్నాడు పురుషోత్తం.

గడచిన ఎనిమిదిసంవత్సరాలలోనూ సౌభాగ్యమ్మ ఏదో సందర్భంలో కూతురివివాహాన్నిగురించి తలవని రోజు లేదు. గడచినప్రతిరోజూ ఆమెను సంఘాన్నించి దూరంచేస్తూంది. దీర్ఘకాలంనుంచి ఆమనస్సులో మెలసుతో ఉన్న ఆతలపు ఆమనస్సుని వాదప్రతివాదాల్లోకి దింపివేసింది. విమర్శమీదవిమర్శలు నడిచేయి ఆమనస్సులో. అల్లాంటిసమయాల్లో ఏమీతోచకతుదకు విధాతృవిధానం ఎల్లాఉందో! అని సమాధానపరుచుకుని ఊరుకునేది. నేడు భర్తనోటమ్మట వెలువడినవాక్యం ఆమె కాందోళన తీసుకురాలేదు. ఒక్కక్షణం కళ్లు మూసుకుని "విధాతృవిధానం ఎల్లాఉందో!" అనుకుంది. కళ్లుతెరచి పురుషోత్తంకేసి చూసింది ఆమె. "ఎందుకండీ, అంతగాభరాపడడం? చూడొచ్చు లెండి. ఆఫీసువేళవుతోంది. స్నానానికి లెండి" అంది అతి సౌమ్యంగా. దంపతులదృష్టులు మెట్లమీదికి తిరిగేయి. ప్రేమా అక్కడ నిలబడిఉంది.

పురుషోత్తం రెండుమెతుకులు కతికి, ఆఫీసుకు వెళ్లేడు. తల్లీ, కూతురూ భోజనానికి కూర్చున్నారు. ప్రేమ "అమ్మా"! అంది. "భోజనంచెయ్యి, తరువాత మాట్లాడుకోవచ్చు" అని సౌభాగ్యమ్మ ప్రేమాని మాట్లాడనిచ్చిందికాదు.

భోజనానంతరం, "ఇదుగో, అదుగో" అని సౌభాగ్యమ్మ రెండుఘంట లాలస్యం చేసింది. ప్రేమా గదిలోనే కూర్చుని 'అమ్మా' అనిపిలిచింది. ఆ అందమయినముఖంలో నే డోవన్నె తగ్గింది.

"అమ్మా!"

"ఏమమ్మా!"

"నేతెలియచేసినవిషయం నాన్నహృదయానికి దారుణాఘాతం అయినదికాదూ?"

"అబ్బే, ఏమీలేదు. నువ్వాట్టే ఆలోచించకు. దానివిషయం నాన్న వచ్చేక మాట్లాడుకోవచ్చు."

ప్రేమా దగ్గరగావచ్చింది. తల్లి మెడమీదనుంచి చెయ్యిరానిచ్చి, రెండవచేతితో ఆమె ముఖాన్ని దగ్గరకు లాక్కుని "అమ్మా, నాన్న ఆఫీసుకు వెళ్లిపోతూ నాకేసి చూచినప్పుడు ఆముఖాన్ని నే నెప్పుడూ ఇదివరకుచూడని విషాదం అనుపడింది ...... అమ్మా! నాన్నకి నామీదఉండే ప్రేమ అగాధ మయింది. నా ఇచ్ఛకి ఎప్పుడూ నాన్న అడ్డురాలేదు. చదువు చెప్పించాడు. నాబుద్ధి ఎటునడుస్తోంటే అటునడువనిచ్చాడు. క్లబ్బులో మెంబరుగా జేరనిచ్చాడు. టెన్నిస్ పంస్ లకు కట్టనిచ్చాడు. నాకోసం ఎంతో ధనం ఖర్చుపెట్టేడు. నన్ను నాటకాలకి, సినిమాలకి, టీ పార్టీలకి, మీటింగులకి తీసుకెళ్లేడు......నన్ను గాఢంగాప్రేమిం

చకపోతే, నాన్న ఇన్నివిధాల న న్నెందుకుచూస్తాడు? నేనేమిచెప్పినాకూడా ‘అవును నువ్వు సరిగ్గానే ఆలోచించావు’ అనేవాడు......ఈ పేమకు నేను విచ్ఛిత్తి వచ్చిందికాబోలు!”

ప్రేమూకళ్లల్లోనుంచి, రెండు వేడిచుక్కలు రాలి, తల్లి చేతిమీద పడ్డాయి. కళాశాలాపరీక్షల్లో అల జడిలేని హృదయంతో సమాధానములు వ్రాయగలిగిన ఆప్రేమూ, మెడికల్ కాలేజీలో తత్తరపాటు లేకుండా మృతకళేబరాలను కోయుటకు అలవాటుపడ్డ ఆప్రేమూ, టెన్నిస్‌కోర్టులో పురుషులతో హోరాహోరీగా పోరి పందెములు నెగ్గిన ప్రేమూ, ఇరువదిరెండేండ్ల వయసు గలప్రేమూ నేను తల్లిఒడిలో కూర్చుని ఒక బాలికలాగ ఏడవడం మొదలు పెట్టింది.

ఆమె కంటినీరు ఒత్తుతూ సౌభాగ్యమ్మ “అమ్మాయీ, వెర్రిఎత్తిందేమిటే నీకు? మీనాన్నకి నీ మీద ఉండేప్రేమలో ఎప్పుడూ విచ్ఛిత్తిరాదు. వివాహం అన్నివిషయాలకంటే కొంచెం ఆలోచించవలసినది కనుక, ఆయనకూడా ఆలోచిస్తున్నారు...‘మనం బ్రాహ్మలం. ఆంధ్రులం. వాళ్లు అరవదేశస్థులలో శూద్రులు. అందుచేత మనకీ వాళ్లకీ వివాహం కుదురుతుందా?’ అని నాన్నగారు ఆలోచిస్తున్నట్లున్నారు అంతే.”

“అమ్మా, నాన్న నిజంగా అల్లాగ ఆలోచిస్తాడంటావా? మేము వెళ్లినమీటింగులన్నింటిలోనూ ఇల్లాంటివి పాటించకూడదని చెప్పేవారు. నాన్న చదివే పుస్తకాల్లో వర్ణాశ్రమధర్మాలు ప్రస్తుతం వ్యక్తియొక్క స్వతంత్రాన్ని అడ్డుపెట్టే, పెట్టనిగోడలనికదూ ఉంది? మేము వెళ్లిన డిన్నర్లలో వర్ణాలు పాటించకుండా కలిసియే భోజనంచేశాము. మనింట్లోకూడా వర్ణం పాటించకుండానే కాదూ డిన్నర్లిస్తే? కనుక నాన్నకి ఇల్లాంటి అభ్యంతరం వస్తుందంటావా నా వివాహ విషయంలో?”

అతిహూగ్యంతో, మనస్సులో ఉన్నదున్నట్లు వెలిబుచ్చుతోంది ప్రేమూ. ఆమెకు హిందూమతంలో ఉన్నదురాచారాలు తప్ప ఆమతాన్నిగురించి ఏమీ తెలియదు. చదువు, ఆటలతో ఇన్నాళ్లు కాలం గడిపిందికనుక, సంసారానుభవంకూడా తక్కువ. ‘అరవదేశపు బ్రాహ్మణేతరుణ్ని వివాహమాడితే, ఏమైనా బాధలుంటాయా’ అనేతలపు ఆమెను ప్రవేశించలేదు.

సౌభాగ్యమ్మ, కూతురు యుక్తాయుక్తాలు తెలియకుండా మాట్లాడుతోందని అనుకోలేదు. ఆమె అతిసౌమ్యంతో ‘అమ్మాయీ, వివాహవిషయం తక్కిన విషయాలన్నిటికంటే బాగుగా ఆలోచించవలసినది కనుక పోనీ నాన్నతో ఇదివరలోనే సలహాచెయ్యలేక పోయావా?’

“అమ్మా! ‘వివాహం’ అనేతలపు నామనస్సులో మొదట రానేలేదు. అతడు, ఫస్టుమార్కొచ్చిన పేపరు పుచ్చుకుని, తక్కినస్టూడెంట్సు మెచ్చుకునేముఖాలతో చూస్తొంటే, చిఱునవ్వుముఖంతో వస్తున్నప్పుడు, అతనిలో ఒక సొంపు అగపడేది నాకు. అత టెన్నిస్‌ఆటలో ఒకవిధమయిన ‘గ్రేస్’ ప్రత్యక్షమయేది నాకళ్లకి. అతన్ని ‘నేప్రేమిస్తున్నా’ అని నేనెన్నడూ అనుకోలేదు మొదట. కాని క్రమంగా ‘వివాహం చేసుకోవాలి మనంకూడా’ అనేతలపు మనస్సులో ప్రవేశించినప్పుడు, నాకు సహచరుడుగా ఉండవలసినవాడు అతడే’ అనుకున్నా.” అంది ప్రేమూ.

తనలోపల ఉన్నటువంటి ఆవేదన పొంగి, హృదయాన్ని చీల్చుకుని భౌతికరూపంతో బయట కొస్తుందేమో అనిపించింది సౌభాగ్యమ్మకి. ఆబాధను ఆపుకోడం కష్టమనితోచి “ఉండమ్మా! లే! కుంపట్లో నిప్పువేస్తా కాఫీకి.” అంటూ నెమ్మదిగా లేచివెళ్లిపోయింది సౌభాగ్యమ్మ.

నాడు కాఫీ రుచించలేదు ప్రేమూకి. నాలుగు ఘంటలయింది. ‘క్లబ్బు’ కని బయలుదేరివెళ్లింది ఆమె.

క్లబ్బులో ఏమీతోచలేదు. తండ్రి ఆఫీసులోనే ఉంటాడు కదా ఇంకా అనుకొని ఆమె చెపాక్‌దగ్గర బస్‌దిగి సెక్రటరియట్ ఆఫీసుకేసి వెళ్లింది.

సముద్రపు టొడ్డుని కూర్చుని పురుషోత్తం, కూతురూ చాలాసేపు మాట్లాడుకున్నారు. పురుషోత్తం బ్రహ్మసమాజంఅంటే చాలా అభిమాన మున్నవాడే. కాని వేషభాషల్లో, నడవడికలో, ఆహారంలోనూ కూడా పూర్తిగా తమతో సంబంధంలేని ఒకణ్ణి ప్రేమూ వివాహం చేసుకోడం వెగటుగా అవుపిస్తోంది. అతడు అటువంటివివాహానికి తన సమ్మతిని చూప లేదు. తన అసమ్మతికికారణంగూడా చెప్పడు. చెప్ప లేదు.

అన్నిసందర్భాలలోనూ తనతో ఏకీభవించిన తండ్రి తన వివాహవిషయంలో అభిప్రాయభేదం కనుపరచాడు. తనక్షేమంకోసం పాటుపడే తండ్రితో, తాను తలపెట్టినవివాహం ఉచితమే అనికాని, కోదండపాణిని తక్క అన్యుని తనమనస్సును స్వీకరించదనికాని ప్రేమూ చెప్పదలచుకోలేదు. తండ్రిమనస్సు కామె ఈవరకూ ఎప్పుడూ కష్టం కలుగచెయ్య లేదు. ఆతడు తన్ను అతిగారాబంగా పెంచేడు. ఇప్పుడాహృదయానికి బాధ కలిగించడం మహాకృతఘ్నత.

కాని తన హృదయంలో అచ్చొత్తింపబడ్డ కోదండపాణి చిత్తరువును చెరిపివేయటం ఎట్లు? అతని ఆశలన్నీ భగ్నమయాయని అతనికి తెలియచేయడం ఎట్లు? ఈప్రశ్నలకి సమాధానాలు ఆమెకు సులభంగా గోచరిస్తాయని తోచలేదు.

౧౨

రెండుమూడునెలలు గడిచేయి. కోదండపాణి పురుషోత్తంఇంటికి ఒకపర్యాయం వచ్చాడు. మళ్లీ ఆత డగుపించలేదు.

ఒకనాడు పురుషోత్తం "భాగ్యం, ప్రేమూపెళ్లి మాట ఏమిటి?" అన్నాడు.

"ప్రస్తుతపరిస్థితుల్లో కోదండపాణి కిచ్చి వివాహం చేయడం యుక్తం" అంది సౌభాగ్యమ్మ.

'అది వెటకారమా?' పురుషోత్తం, భార్యకేసి చూశాడు. ఆవాక్యం ఆమెనుండి మనస్ఫూర్తిగా వెలువడిందే! ఆమెలోవచ్చిన ఆమార్పున కాత డాశ్చర్యపోయాడు.

ఆపరిస్థితులేవో సౌభాగ్యమ్మ పురుషోత్తమానికి తెలియచెప్పింది. పురుషోత్తమానికి ఏమీ తోచలేదు.

ఒకరోజు ఆలోచించాడు. ఏమీ తోచలేదు. రెండవదినంఅంతా ఆలోచించాడు. ఆతనికి కర్తవ్యం స్ఫురించలేదు. ఆఖరుకి "భాగ్యం, ఏమంటావ్?" అన్నాడు. "అంతకంటే మార్గం నా కనుపడటం లేదు" అంది సౌభాగ్యమ్మ.

పురుషోత్తం ప్రేమూ ఉన్న గదిలోకి వెళ్లేడు. "అమ్మా, కోదండపాణి రావడంలేదేమీ, మనింటికి? రావద్దని చెప్పినట్టున్నావుకదూ?" అన్నాడు ప్రసంగం ఎలాగ ప్రారంభించాలో తెలియక, ఆఖరుకి.

"అత డప్పుడే నెలాపదిహేనురోజులక్రిందటే ఇంగ్లం డెళ్లిపోయాడు. పేపర్లో పడినట్లుగాఉందే. నీకు తెలియదూ?"

"అల్లాగా? ఎందుకూ వెడత?"

"ఇంకా చదువుదామనే."

"ఇదివర కెప్పుడూ చెప్పలేదే మనతో!"

"హఠాత్తుగా పుట్టిందనుకుంటా ఈతలపు."

పురుషోత్తమానికి ఏమిచెప్పాలో తోచిందికాదు. కొంతసే పూరుకుండి, గద్గదస్వరంతో "అమ్మా, ఏదో వెట్టిఉద్దేశాలతో నీస్వతంత్రాని కడ్డువచ్చాను. కోదండపాణికి 'కేబుల్' ఇచ్చి వచ్చెయ్యమను. మీరిద్దరూ వివాహంచేసుకుని, ఇష్టమవుతే ఇద్దరూకలసి ఇంగ్లండు వెళ్లవచ్చు." అన్నాడు.

"నాన్నా, ఏదోఒకసమయంలో 'పరిణయం' అనేతల పుద్భవమయిందికాని, ఆలోచించిచూస్తే, దానివల్ల అనర్థాలు ఎక్కువనితోచాయి. ఎంతో చురుకుగా, ఉత్సాహంతో ఉన్న మిస్ సదాశివన్ పెళ్లి చేసుకున్నపిమ్మట, "ఏమమ్మా, ఇల్లాగున్నావేమిటి?" అని అడుగుతే, సంసారంలో ఉండేపరిస్థితులు మీకు తెలియవు" అంది అతిదీనంగా...నే నొక్కర్తెనేకదా మీకు? నేతక్క మీకు బిడ్డలు కలుగలేదు. నన్నతిగారాబంతో పెంచారు. వృద్ధాప్యంలో మీకు సేవ

చెయ్యవలసినపూచీ నాది. అందుచేత పెళ్లి చేసుకోకుండా ఉంటే..."

పురుషోత్తం అడ్డొచ్చాడామెమాటకు. "చదువు పూర్తిఅయాక వివాహం చేసుకుంటావని ఉపేక్షచేశానుకాని ఇల్లాంటిమాటలు వింటా ననుకోలేదు. కోదండపాణిని పెళ్లిచేసుకుంటా నన్నదానవు ఇంతలో మనస్సు మార్చుకోడం ఎందుకూ? నీస్వతంత్రాని కడ్డురాను. నాకు మీావివాహం సమ్మతమే. నేనిది మన స్ఫూర్తిగా చెప్తున్నమాటే..."

"నాన్నా, చదువు పూర్తి అయిందంటావు. చదువుకి పూర్తిఅవడంఅంటూ ఉందా ఎప్పుడేనా? 'స్వతంత్రాని కడ్డురాను' అంటున్నావు కాని నేను అవివాహితనుగానే ఉంటే నాకు స్వతంత్రత ఎక్కువకాదా? ...ఎల్లాగ జీవితం గడుపుతానో నేనని ఒకబాధ నీకుండవచ్చు. మెడిసన్ చదువుకున్నదాన్ని కనుక, బీదల కుచితంగా వైద్యం చేస్తా...నిన్నూ అమ్మనీ నేను వదలి ఉండను...ఉండలేను కూడాను."

ప్రేమా అప్రయత్నంగా ఎదురుగుండా ఉన్న గోడకేసి చూసింది. వ్రేలాడుతూన్న టెన్నిస్‌రేకెట్ ఆమెకు గోచరమైంది. ఆనాడు ఆమెచే తీసివేయబడ్డ తెగిన 'స్ట్రింగు' కు మారుగా కొత్తస్ట్రింగు పడకపోవుటచే ఆభాగం వెలితిగానే అగుపిస్తోంది.

పురుషోత్తం నిట్టూర్పువిడిచేడు. వెనక్కి తిరిగేడు. సౌభాగ్యమ్మ వంటింట్లోంచి వస్తోంది. ఆమె ముఖాన్ని చూడ్డాని కాతనికి సిగ్గయింది. "ప్రేమా మూర్తీభవించిన మాఅన్యోన్యానురాగం అనుకున్నా. కాని చివరకు ఆమె నాఅవివేకాన్ని ప్రతిబింబింపజేసే దర్పణం అయింది. బ్రహ్మచారిణి అయిఉన్నకూతుర్ని చూస్తోన్న కొద్దీసౌభాగ్యానికి రోతపుట్టకమానదు నేనంటే...... అయ్యో! ప్రేమాయొక్కమనస్సు ఎంతత్వరలో మారిపోయిందీ! అవును. ఏముందీ! పొంగుతూన్నపాలకి ఒక్క ఉప్పురాయి చాలుగా, విరిగిపోడానికి" అనుకున్నాడు.

తనకు కష్టజీవితం నాటితో ప్రారంభమవుతోన్నట్టుగా తోచిం దాతనికి.

---



ఉదయకాల దృశ్యము                                                  K. P. S.

# పాత పాటలు*

౧

ఇసకలో ఆడేటి కుసుమసిరిబాల
ఆబాలపేరేమి ఆనవాలేమి
ఆనవాలు అంబరస పేరుబాలయ్య.

౨

రమణయ్యచేతుల్లోది వజ్రాలగిలక
చూచిరా ఆమెలక చూరున్నపెట్టె
నాసాలబారేటి మీసాలమెలక
పాపకారిమెలక పారెయ్యిగిలక
దోసకారిమెలక దులిపెయ్యి గిలక.

౩

పంచదారగుప్ప పాలమీదితెప్ప
మాకు మావెంకటరమణయ్య ముద్దు
వరహాలకుప్పందు వచ్చెధనమందు
మామ సత్యం తెచ్చె మాణిక్యాలకంటె
అత్తసీతమ్మతెచ్చె అద్దాల అంగి
వెన్నారిముద్దందు వెలగపండందు.

౪

వెలదిరో వెంకటరమణ మెవరిపట్టందు
కాంతరో వెంకటరమణ కన్నతల్లందు
ఇచ్చిన దేవునిబోలు ఈశ్వరునిబోలు
బ్రహ్మదేవునిబోలు బాలల్లబోలు.

౫

పెదమామ తెచ్చిండు పెంచప్రలిదండ
నడిమిమామ తెచ్చిండు నాగభూషణాలు
చినమామ తెచ్చిండు చిలకల్లతొట్టె
అవి మావెంకటరమణకు అమరుకడియాలు.

౬

మందలకు పోవయ్య మామహరిణయ్య
మరువక తేవయ్య మచ్చావుపాలు
అవి తెచ్చి మారాజు వెంకటరమణకు పోసె.

౭

వెన్నపెట్టి నేకొందు వెండిపుస్తకము
వెన్నుడు పెద్దన్న వేదమ్ము చదువు
పాలుపెట్టి నేకొందు పైడిపుస్తకము
బాలుడు నడిపన్న భారతము చదువు
గరుజు యిచ్చి నేకొందు గంటల్లబండి
గానుడు చిన్నన్న గంట కట్టేము.

౮

నిద్రవి కన్నుల్లు మబ్బుమొగముల్లు
నిద్రపో బలభద్ర రాజకొమార
నిద్రకు నూరేళ్లు నీకు వెయ్యేళ్లు
నినుగన్నతండ్రికి నిండ నూరేళ్లు.

౯

తాతముత్తవ్వల తలిదండ్రులబోలు
తలిదండ్రిగారాబాన ఆడు వెంకటరమణ.

---

* ఈపాతపాటలు నేను శికందరాబాదులో ౧౯౩౧ వ సం. ఏప్రిల్ మాసంలో సేకరించాను.

—చేకుమళ్ల —కామేశ్వరరావు.

౧౦
తాతగారియింట్లో తానాడబోయె
తాతతో తాఆడు వెంకటరమణ
శ్రీమద్దికాయల్లు శ్రీలలాటాలు
చిలుకల్లు యేమనెనో చిన్నబోయేనో
హంసల్లు యేమనెనో చిన్నబోయేనో
హంసలతో వనమందు ఆడనేవద్దు.

౧౧
పుక్కిళ్లు సన్నాలు భుజకీర్తులు
చెక్కిళ్లు సన్నాలు చెవ్రలగున్నాలు
కాళ్లును సన్నాలు గజ్జలకడియాలు
వేళ్లును సన్నాలు ముద్దుటుంగ్రాలు.

౧౨
శ్రీరంగంవెళ్లేటి చిన్నవైష్ణవులు
అదిగోచూడరయ్యా గాలిగోపురము
గుళ్లోనుచూడరె రంగనాయికులస్వామి.

౧౩
లాలెమ్మరత్నాలు కీలెమ్మజడలు
కీలెమోఃకుపుసరులు వెంకటేశకురులు
మెడనిండ ముత్యాలు మేలుపతకాలు
తలనిండ పుట్టువెంట్రుకలు తనరారురాక
అష్టరావిరేక నొసలు మెరియంగ.

౧౪
జోలలకు చినపండు నీకరటిపండు
నినుగన్నవారికి పాలపండేను
పాలపండూ తిన్నపాలరుగవన్ని
వామైన న్యూరిపొయ్యి ఓగౌరిదేవి
ఖామ బాలయ్యకు వోకార మన్ని
ఇక సర్వకాయమియ్యి ఓసఖియదేవి
సర్వకాయం మాబాలయ్యకుసంతోషమన్ని.

౧౫
తంగేడుచెట్టుకే తూగుటుయ్యాల
ఉయ్యాలపట్టుక వూగె బాలయ్య
తంగేడుచెట్టుకింద వంగి ఆడివచ్చె
హంసాలు కోయిల్లు అవి లక్షవేలు
చిలకాలు పావురాలు శివ! లక్షవేలు
శ్రీరాము ఉండంగ మనకేటిభయమె
హనుమంతుడుండంగ మనకేటిభయమె.

౧౬
ఓచిన్నికుమార! నేకొందు నీకు
పుట్టుగజ్జలు కొందు పులిగోరు కొందు
పున్నయ్య మీనాన్న వచ్చె వూరుకుండు
కాళ్లగజ్జలు కొందు కంటె కమలాలు కొందు
కౌశల్య మీఅమ్మ వచ్చె యేడువకు
చీదర్లుచెయ్యకు చిన్నిబాలయ్య
చీదర్లు నిను బాసె సిరులు నినుబొందె
శ్రీలక్ష్మి వూయంగ వూగువుయ్యాల
ఉయ్యాల నీకమిరె వుగ్గు నీకమిరె.

౧౭
ముత్తెములబాలయ్య ముంగిటాడంగ
ముంతమామి డన్ని ముసిరె చిలకాలు
పగడములబాలయ్య పందిటాడంగ
పండుమామిడన్ని బ్రమిసె చిలకాలు
వజ్రములబాలయ్య వాకిటాడంగ
వట్టిమామిడన్ని వచ్చెచిలకాలు.

౧౮
బుద్ధిగలవాడమ్మ చిన్ని నాయన్న
భుజాన వేసిరె భుజకంఠమాల
వాసిగలవాడమ్మ చిన్ని నాయన్న
వాసియనివే సేరు వనమాల పేరు.

౧౯
కాకర చెట్టుకు కాయలందమ్మ
బాలయ్య చెవులకు పోగులందమ్మ.

౨౦
తుమ్మెద నీకళ్లు దూలాలమీద
బాలయ్య నీకళ్లు మగనాళ్ల మీద.

౨౧
ఊరికివుయ్యాల అమ్మనచ్చింది
కొమాళ్లుగలతల్లి కొనరె వుయ్యాల
కొడుకులగన్న చేడె కొనరె వుయ్యాల
ఏమిపెట్టికొందు వెండివుయ్యాల
చేటకొంగున చేరెడుముత్యాలు పోసి
ఉయ్యాల నేకొందు వుయ్యగకొందు
ఉయ్యాలచేరుల్లు వృత్తగదములు.

౨౨
చిరిదిండికా డమ్మ చిన్ని బాలమ్మ
పట్నాన తేరమ్మ పుట్నాలగోనె.

౨౩
ముద్దుమొగమున ముచ్చటలు ఆడె
మువ్వంపుదేవుడవు నీవు నాబాల
తాతముత్తవ్వల బోలు తలిదండ్రులబోలు
అయ్యముత్తవ్వలబోలు అయ్యల్లబోలు
బాలయ్యముద్దుల్లు మద్దికాయల్లు
మద్దికాయలుముద్దు మాటల్లుముద్దు
మామల్ల చంకను బాలయ్య ముద్దు.

౨౪
నాచిన్ని బాలయ్య నీచిన్ని మొగము
నీచిన్ని మొగమందు నిమ్మపండందు.

౨౫
వెన్నకు యేడ్చేవు మెత్తేవు గిన్నె
వెల్లావు కంపుదురు మీాఅమ్మ తాత
పాలకు యేడ్చేవు పట్టేవు గిన్నె
పాడిబర్రెలకంపు మీాఅమ్మ తాత.

౨౬
గౌనువెనకమోత యెవరిది మోత
చిన్ని నాబాలయ్యది గజ్జెల్ల మోత
ఊరువెనకమోత యెవరిది మోత
చిన్ని నాబాలయ్యది వుంగ్రాలమోత.

౨౭
పాలియ్యవుకదామె పండబెట్టవుకదామె
ఉగ్గు పొయ్యవుకదామె వూపవుకదామె
నీళ్లు చాలపోసి నీలంగి తొడిగి
నిమ్మపళ్లు వడికట్టి తిరిగి రమ్మనుము
చిన్న నాటివిరెండు చీటి అంగీలు
జీడిపళ్లు వడికట్టి తిరిగిరమ్మనుము
చిలుకల్లు తిన్నామె జీడివిపళ్లు
హంసల్లు తిన్నామె అంజూరపళ్లు
హంసతిన్న పండు హండాలుకట్టి
చిలుకతిన్న పండు చిక్కాన పెట్టు.

# జయపుర చిత్రములు

(K. R. R.)



రాళ్లగడ్డ ఘాటి రోడ్డు





౨. సుంకి ఘాటి రోడ్డు

# రసాయనశాస్త్రోపోద్ఘాతము : తర్జుమాసౌకర్యములు

కుప్పా ప్రసన్నాంజనేయులు

సంస్కృతభాష ప్రపంచమునందలి భాషలన్నిటి యందు మిక్కిలి విస్తారమైనదేకాక మిక్కుటమగు కట్టుబాట్లు గలదియు. ఇతరభాషలకంటె నీభాషయందు శబ్దార్థముల సంబంధము మిక్కిలి స్పష్టమై యున్నది. లాటిన్ మొదలగు కొన్ని పాశ్చాత్యభాషలయందు కొన్ని పదములకు ప్రకృతివిచక్షణ చేయబడియున్నను, సంస్కృతమునందువలె ప్రకృతిప్రత్యయములయొక్క యర్థముల పరస్పరాన్వయ మంత స్పష్టముగా నుండదు. సంస్కృతభాషాప్రవర్తకులు ప్రకృతులయొక్కయు, ప్రత్యయములయొక్కయు బరిగణనము జేసి, యేయే ప్రత్యయము లేయే యర్థములందు ప్రయోగింపబడు నదియు నిర్ణయము చేసియున్నారు. సంస్కృతభాష యందలి ప్రకృతిప్రత్యయములయొక్క గణపాఠములు చాలవిస్తారముగా నున్నవి. అందుచే నెట్టియర్థమునైనను సులభముగా సార్థకములగు సంజ్ఞలచే తెలుపుటకు సంస్కృతభాషయందు సాధ్యమగుచున్నది. మరియు నీభాషయొక్క నియమములనుబట్టి యవసరమగుతరి క్రొత్తక్రొత్తయర్థములను తెలుపుటకై క్రొత్తక్రొత్త పదముల నేర్పాటుచేయుటకు అవకాశములు గలవు.

ఇట్టియెడ భాషాంతరములనుండి మన మేదేని గ్రంథమునుగాని, శాస్త్రమునుగాని తర్జుమాచేయవలసి వచ్చినప్పుడు సాంకేతికపదజాలమువిషయమున నితర భాషలవారివలె శబ్దమునకు శబ్దము ననుకరింప నక్కర లేదు. ఆయాసంకేతపదములయొక్క యర్థముల విచక్షణఁజేసి వానికితగిన ప్రకృతిప్రత్యయములయొక్క సంయోజనముఁజేసి సంకేతముల నేర్పాటుచేసుకొన వచ్చును.

ప్రకృతము పాశ్చాత్యరసాయన (Chemistry) శాస్త్రమును మన మాంధ్రీకరించుటకు మనకుగల యవకాశముల గొంతవరకు చర్చింతము. ఈశాస్త్రము నాంగ్లభాషయందు కెమిస్ట్రీ యనుచున్నారు. కెమిస్ట్రీ యనుపదము గ్రీకుభాషయందలి 'కియో' (Quio=to pour, to drop) అను స్రవణార్థకమగు ప్రకృతినుండి నిష్పన్నమైనది. కాన సంస్కృతమున నీశాస్త్రమును 'రసాయనశాస్త్ర' మనుట యుచితముగానేయుండును. రసాయనశాస్త్రమనగా బదార్థములయొక్క సారభూతములగు ఆరంభక (Components) పదార్థముల గురించి చెప్పుశాస్త్రము. (రసః, అయనం = విషయః యస్య తత్ అనువ్యుత్పత్తిచే నీయర్థము తెలుపబడుచున్నది.) ఈశాస్త్రమునందు వర్ణింపబడు కొన్నితత్త్వములు (Elements) కార్బన్, నైట్రొజన్, పొటాసియమ్, సోడియమ్ మొదలగునవి పాశ్చాత్యరాసాయనిక శాస్త్రజ్ఞులచే నీనామములచే వ్యవహరింపబడుచున్నవి. ఈసంజ్ఞలను తర్జుమాచేయుటకు మనము కార్బనుకు కర్బనమనియు, నైట్రొజనుకు నత్రజని యనియు కేవలానుకరణముల జేయ నవసరములేదు. కార్బన్ అను శబ్ద మాంగ్లభాషయం దోషధులు మొదలగువాని దాహముచే గలుగు బొగ్గుపదార్థమును తెలియజేయును. ఈ బొగ్గుపదార్థమునం దెక్కువభాగముగ నుండు మషీప్రకృతిని పాశ్చాత్యులు కార్బన్ (Carbon) అని వ్యవహరించుచున్నారు. దీనిని మనము మషీక మనవచ్చును. (మషీశబ్దాత్ సంజ్ఞాయాం కన్) ఇట్లే నైట్రొజన్ అనుదాని ననుకరించి నత్రజన్ అన నవసరములేదు. ఆంగ్లభాషయం దీపేరు దీనికి నైటర్ (Nitre) అను లవణమువలన గలిగినది. మరియు భౌమవాయువు (Atmospheric air) నందు ప్రాణవాయువు (Oxygen) పోను మిగిలియుండునది నైట్రొజనే. ఇందు ప్రాణవాయువు దాహకమగుప్రకృతి గలది. మిగిలిన నైట్రొజన్ క్షారప్రకృతి గలదై యనేకక్షారముల నిష్పా

ఱించుచున్నది. కాన క్షారశబ్దము నీసమీరమువిషయ
మున రూఢముగా గ్రహించి దీనిని క్షారవాయు వను
చున్నాము. ఇంతవర కీసమీరమునకు మనదేశభాషల
యం దీనామముచే వ్యవహారము వ్యాప్తమైనూడ
గాన్పించుచున్నది. పొటాసియమ్, కొన్ని చెట్లయొక్క
బొగ్గులనుండి మొదట తయారుచేయబడుటచే నట్లు
పిలువబడియున్నది. (ఆంగ్లమున పాట్ అనగా కుండ.
ఆష్అనగా బొగ్గు. ఇనుపకుండలలో గొన్నిమొక్కల
యొక్క బొగ్గుల నుడకబెట్టుటచే పొటాష్ లభించును.
దానినుండి పొటాసియమ్ పేరును, పదార్థమును పొంది
యున్నది.) అందుచే మనము దీని నింగాలజమని
తర్జుమా చేయుచున్నాము. సోడియమ్ (Sodium)
అనునది సోడా (Soda) నుండి తననామమును పొంది
యున్నది. సోడా చౌటిమట్టినుండి లభించును గాన
సోడియమ్ (Sodium) ను 'ఊషజ' మని సంజ్ఞాకర
ణముజేయుచున్నాము. (ఊషా జ్జాయత ఇత్యూషజః.)

పాశ్చాత్యరాసాయనికశాస్త్రమునందు వ్యవహార
మునందున్న కొన్నిపదార్థములనామములు ప్రథమమున
నాపదార్థములు పాశ్చాత్యదేశమునందు దొరకిన ప్రదేశ
ములనామములనుండి యేర్పాటుచేయబడియున్నవి. (ఉ,
మెగ్నిషియమ్, మాంగనీస్ మొదలగునవి). ఈపదార్థములు
ప్రస్తుతము ప్రపంచమునందు చాలచోట్ల దొరకుచున్నవి.
కాన ప్రకృతభాషాంతరీకరణమునం దిట్టిపదార్థములకు
వానియొక్క గుణజాలములబట్టియే నామముల నొసంగు
చున్నాము. ఎట్లన మాంగనీస్ (Manganese) ప్రకృ
తిగాగల యనేకపదార్థములు నల్లగా కఠినములుగా
నుండి చాలవరకు మృద్భేద (Earths)ములైయున్నవి.
కాన మాంగనీసును మృత్స్న యని పిలుచుచున్నాము.
(స స్నా ప్రశంసాయామ్; అను సూత్రముచే మృచ్ఛబ్దము
కంటె స్నప్రత్యయము). మెగ్నీషియమ్ (Magne-
sium) అనులోహము సులభముగా దాహ్యమైమిక్కిలి
కాంతి నిచ్చుచు వెలుంగును. ఈవిశేష మీలోహమునకు
వ్యావర్తకముగా నున్నది. కాన దీనిని 'దీపక' మని
తర్జుమా చేయుచున్నాము. (కృత్యల్యుటో బహుళమ్;
సంజ్ఞాయాం కన్).

ప్రకృతభాషాంతరీకరణమునం దెక్కువ నామ
ములు పదార్థములయొక్క గుణజాలము (Properties)
నుబట్టియే నిర్ణయింపబడియున్నవి. కొన్ని పదార్థము లవి
ప్రస్తుతము దేశమునందు జెందియున్న వ్యవహారవ్యాప్తిని
బట్టి నిర్ణయింపబడియున్నవి. కొన్ని ప్రాచీనదర్శన
ములయందు మనప్రాచ్యశాస్త్ర ప్రవర్తకులచే వాడబడి
యుండుటచే తత్తత్ప్రకరణములకు సన్నిహితములగు ప్రక
రణములయందు వాడబడియున్నవి. దీనిచే విద్యార్థులకు
చదువరులకే కాక సంస్కృతాదిభాషలయందు సాహిత్య
పరిచయముగలవారికి గూడ నీ శాస్త్రము తెలుసుకొని
కృషిచేయుట కవకాశము గలుగును.

ప్రస్తుతము మనదేశమునందు పరిజ్ఞాతలు రెండు
రకములుగా నున్నారు. కొందరు పూర్వ సంప్రదాయ
ముల ననుసరించి చిన్నతనమున, శబ్దమంజరితో విద్యోప
క్రమముజేసి యనంతరము కావ్యముల జదివి, పిమ్మట
వ్యాకరణము, తర్కము, మీమాంస మొదలగుశాస్త్ర
ముల నభ్యసించి, ప్రాచ్యమగు వివేచనాశక్తికి అల
వాటుపడియున్నారు. మరికొంద రోనమాలతో బాటు
A, B, C ల యందు శిక్షింపబడి యాంగ్లపాఠపుస్తక
ములయందు ప్రారంభవిద్య నభ్యసించి యనంతరమున
పాశ్చాత్యశాస్త్రములయం దారితేరియున్నారు. వీరిలో
మొదటిపక్షమువారు ప్రాయశః పాశ్చాత్యాధిత్యము
నీర్ష్యాభావముతో జూచుచు తద్విద్యలగు పాశ్చాత్య
శాస్త్రము లన్నియు ప్రాచ్యశాస్త్రములనుండియే
యపహరింపబడె నందురు. రెండవ పక్షమువారీ
యాక్షేపమును సహింపక ప్రాచీనులు కేవలము నివృత్తి
పరులై, తపస్వులరై, ప్రకృతియొక్క విశేషములను
సూక్ష్మముగ విచారించియుండలేదని వాదింతురు. ఈ
రెండుపక్షములవారు నెక్కడ కలయుట సంభవించినను
కలహములే కలుగుచున్నవిగాని, యొకొక్క విషయ
మునందు, ప్రాచీను లెట్లు నిర్ణయముల జేసియున్నారో,
పాశ్చాత్యు లెట్లు నిర్ణయముల జేసియున్నారో, యీ
వాదములయందున్న భేదము లెవ్వి, రెంటియందును సమ
రసమును వాచ మేదైనను లభించునా లేదా ? యని
యుదాసీనభావముతో విచారణజేయుట యరుదుగా

నున్నది. వాస్తవమును విచారించినచో, ప్రాచీన పాశ్చాత్యవిజ్ఞానములకు సామరస్యము కుదురుటకు రసాయనశాస్త్రమునందు చాల అవకాశము గలదు. ప్రాచీన తంత్రములను సాంఖ్య, వైశేషిక, నైయాయిక, బౌద్ధ, మీమాంసాదులయందు మోక్షమనబడు నిరతిశయానంత సుఖము పరమప్రాప్యమనియు, నది ప్రపంచకారణ భూతములను పదార్థములయొక్క యథార్థజ్ఞానమువలన లభించుననియు, ప్రతిపాదనజేసి ప్రపంచ నిర్మాణము నొక్కొక్కమతమువా రొక్కొక్కవిధముగ నిరూపించియున్నారు. పాశ్చాత్యశాస్త్రములయందు ప్రపంచమునందలి పదార్థములయొక్క యారంభకరసముల ననుసరించి పరిశీలించునది రసాయనశాస్త్ర మొక్కటియే. అందుచే ప్రకృతశాస్త్రమునకును ప్రాచీనతంత్రములకును విషయసామ్యము కలదు. ప్రకృత భాషాంతరీకరణమునం దుచితమైనంతవరకు ప్రాచీనతంత్రములయందు వాడబడియున్న పారిభాషికపదములను సంగ్రహించియున్నాము. మరియు నీ యుపోద్ఘాతము కేవలము తర్జుమాసౌకర్యముల విచారణకొరకేకాక ప్రాచ్య పాశ్చాత్య విజ్ఞానములయొక్క సారూప్యవైరూప్య విచారణనిమిత్తముగూడ ప్రారంభింపబడియున్నది. కాన నుభయపక్షములవారును సుహృద్భావమునసే గ్రహింతురుగాక యని ప్రకృతము ననుసరింతము.

రసాయనశాస్త్రమునందు విమర్శింపబడు పదార్థములు, భౌతికశాస్త్రము (Physics)నందు, ఘనములు (Solids), ద్రవములు (Liquids), సమీరములు (Gases) అని మూడు విధములుగా విభజింపబడియున్నవి. వీనినే రాసాయనికులు లోహము (Metals) లనియు, నలోహము (Non-metals) లనియు, రెండు రకములుగా విభజించియున్నారు. ప్రకారాంతరముచే వీనినే యోషధములనియు, ననౌషధములనియు వివక్షజేసియున్నారు. ఇం దీయనంతరవిభాగమును బట్టి రసాయనశాస్త్రము ఔషధరసాయనశాస్త్ర (Organic Chemistry) మనియు, అనౌషధరసాయనశాస్త్ర (In-organic Chemistry) మనియు రెండువిధములుగా విడదీయ బడియున్నది. ఈవిభాగము ప్రాచీనాయుర్వేదశాస్త్రమునందలి యోషధీ రసవిమగంధక విభాగమును పోలియున్నది. ప్రకారాంతరముచే బదార్థములు ప్రకృతులు, లేక తత్త్వము (Elements) లనియు, పరిణామము (Compounds) లనియు రెండురకములు. ఇందు తత్త్వములనగా నసంకీర్ణలక్షణలక్షితములగు పదార్థభేదములు. పరిణామములనగా ననేకతత్త్వముల కలయికచే నేర్పడినవి. వీనియందు పరిణామములు మూడురకములు. ద్రావకము (Acids) లనియు, స్తబ్ధములు, లేక మూలము (Bases) లనియు, లవణము (Salts) లనియు. అందు ఆసిడ్ (Acid) అనునామము లాటిన్‌భాషయందలి Ac (ఆక్) అనగా సూక్ష్మము, లేక అగ్రము; Aceo (ఏకియో) యనగా పులియు, అనుప్రకృతులనుండి నిష్పన్నమైనదిగాన ఆసిడ్ అనుపదము రూక్షములై పుల్లగా నుండుపదార్థములను తెలియజేయును. ఈ పదార్థములు సాధారణముగా మనదేశమునందు ద్రావకములని వ్యవహరింపబడుచున్నవి. అందుచే నీపదార్థములను తెలుపుటకు వ్యాప్తమనువాడుకగల ద్రావకమనుపదమును త్రోసిపుచ్చి, యామ్లమనికాని, రూక్షమనికాని పిలుచుట యుచితముగా నుండదు. కాన వానిని ద్రావకము లనియే వ్యవహరింతము. మరియు ద్రావకముల కామ్లత్వ రూక్షత్వములేకాక ముందు శాస్త్రమునందు వివరింపబడబోవు ప్రత్యేకగుణజాలమంతయు, నామ్లపదముచే తెలుపుటకు సాధ్యముగాదు. బేస్ (Base) అనగా పాదుఅనియు, మూలమనియు నర్థము. స్తబ్ధములు ద్రావకములతోగూడి లవణముల నొసంగుచున్నవి; లవణములకు మూలములగుచున్నవికాన వీనిని 'మూలము' లని వ్యవహరింపవచ్చును. ద్రావకములకు గల రూక్షస్వభావమునకు వ్యతిరేకముగ వీనికి స్నిగ్ధ (జిడ్డు) స్వభావము గలదు. ఈస్నిగ్ధత్వము మూలములన్నిటియందును సమానముగా లేదు. కొన్నిటియందు మిక్కిలి స్ఫుటముగా నున్నది. ఇట్టివాటి నాంగ్లభాషయం దాల్కలీ (Alkalies) లందురు. ఆల్కలీయనునది పరాసుభాషయం దొకజాతి యోషధికి పేరు. ప్రథమమున, పొటాష్ (Potash) ఆల్కలీమొక్కయొక్క బొగ్గులనుండి తయారుజేయబడియుండెను. ఆల్కలీ లన్నిటియందును ఇంగాలజ

వికారమను పొటాష్ ముఖ్యతమమైనది. అందుచేతనే యాల్కలీల కాపేరు లభించినది. మనము వానిని ఐంగలికము లనుచున్నాము(ఇంగాలశబ్దాత్ ఠక్ ప్రత్యయః.)

లవణమనగా నాంగ్లభాషయందు సాల్టు (Salt) అందురు. లవణము సామాన్యముగా ప్రపంచమునందంతటను సముద్రతీరములందు దొరకుచున్నది. పరిశోధనాలయము (Laboratory) నందు దీనిని సోడాతో శంఖద్రావకమును చేర్చుటచే తయారుచేయవచ్చును. దీని యుపాదానాంశము (Molecule) నందు రెండణువులు గలవు. ఈరెండును లవణపుంజముయొక్క రెండు ప్రతీకములు (Radicals). మొదటిది సోడా సంబంధమైన యూషజాణువు (Sodium atom) లోహము. రెండవది శంఖద్రావకము సంబంధమైన యలోహాణువు. దీనిని సాధారణలవణ మందురు. లవణము లన్నిటియందును మిక్కిలి విశదమగురచన (Composition) గలది. ఇట్లే యొక్కొక్కయైంగలికముతో నొక్కొక్క ద్రావకము చేర్చబడినప్పు డొక్కొక్క లవణ మేర్పడుచుండును. ప్రతిలవణమును సాధారణలవణమంత విశదమగు రచన గలిగియుండదు. కాని దానితో గొప్పసాదృశ్యము గలిగి యుండును. ఎట్లన ప్రతిలవణమునందును రెండు ప్రతీకము (Radicals) లుండును. అందు మొదటిది యైంగలికసంబంధలోహమును, రెండవది ద్రావకసంబంధి యలోహభాగమును. ఈ సాదృశ్యమునుబట్టియే లవణములనెడిజాతి గుర్తింపబడుచున్నది.

రసాయనశాస్త్రమునందు ప్రస్తుతింపబడు పదార్థము లన్నిటియందును మిక్కిలి ప్రధానములైనవి ఆక్సిజన్ (Oxygen), హైడ్రోజన్ (Hydrogen) అనబడు రెండుసమీరములు. ఇందు మొదటిది ప్రథమమున గుర్తింపబడెను. దీనిని మొదట పరీక్షించిన లెవాయిజియర్ (Lavoisier)అను పరాసుశాస్త్రజ్ఞుడు. భూమవాయువునందే దీనిని పరికించెను. క్రమముగ నతడు దీనిని లోహములతోను, అలోహములతోను పరిణామమును (Combination) జెందు స్వభావముగలదిగా గనుగొనెను. పిమ్మట నతడు దానిసంబంధమగు అలోహపరిణామములు జలముతో గలసి ద్రావకము లేర్పడుచున్నవని తెలిసికొనెను. అతడు తన పరిశోధనా (Experiment) బాహుళ్యముచే ద్రావకములయొక్క యాశుస్వభావమునకు హేతువైన దీని సమీరమని నిర్ణయించి దానికి ఆక్సిజన్ (Oxygen) అని నామకరణము చేసెను. గ్రీకువ్యుత్పత్తిప్రకారము దీనికి ద్రావకము నిష్పాదనజేయునది యని యర్థము (Oxys=acid, gen=to generate)పాశ్చాత్యప్రపంచమున దీని కీనామముచే వ్యవహారము లభించినను తరువాత రాసాయనికులనేకులు ఆక్సిజన్ ఆరంభకముగాలేని ద్రావకము లనేకములు గలవని కనుగొనిరి. (కాబట్టి యీ సమీరము యొక్క సంజ్ఞవిషయమున మనము ఆక్సిజన్ అను పదము ననుకరించి యామ్లజని యనుట సమంజసము గాదు). ఈసమీరమును పరిశీలించిన ప్రాథమిక రాసాయనికు లందరును దీనిని భూమవాయువందలి ప్రాణపోషకమగు భాగముగా గుర్తించిరి. ప్రాచీనశాస్త్రజ్ఞులు గూడ ప్రాణమనెడు చైతన్యహేతు వగు వాయువును ప్రస్తావనజేసియున్నారు. కాబట్టి యీ సమీరమును ప్రాణవాయువనియే వ్యవహరించుట యుక్తము. దీని కిట్టివ్యవహారము దేశమునందు ప్రబలియున్నది.

హైడ్రోజన్ అనుసమీరము ప్రాథమికరాసాయనికులచే శంఖద్రావకము మొదలగుద్రావకములయందు తుత్తనాగము మొదలగులోహముల నుంచుటచే తయారు చేయబడెను. ఇది తనపరిమాణమునకు సమమగు పరిమాణముగల ప్రాణవాయువుతో గలసి పరిణామమును జెంది జలము నుత్పాదనము జేయునని లెవాయిజియరు (Lavoisier) కనుగొనెను. అందుచే నత డీసమీరమున కీనామకరణము చేసెను. (Hydro-=Water; gen=to generate).మధ్యకాలపురాసాయనికులు విద్యుదభిఘాతము (Eletrolysis) చే జలమును విపరిణమింప (Decompose) జేసి యొకటికి రెండుపరిమాణముల చొప్పున ప్రాణమును హైడ్రోజన్ అను సమీరమును నిష్పన్నములైనట్లు కనుగొనియున్నారు. కాన నీసమీరము జలమున కుపాదాన (Component) మగుటయే కాక జలముచే నిష్పాద్యముగూడ నగుచున్నది. అందు దీనిని మనము కంజవాయువని వ్యవహరించగలము.

(కం జనయతీతి, కాత్ జాయత ఇతివా కంజః, ప్రథమ కల్పే ణిచః అంతర్భావో ద్రష్టవ్యః) ఈ కంజప్రాణసమీర ములురెండును రసాయనశాస్త్రమునందు చాలముఖ్య మైనవి.

ప్రాణవాయువులతో గూడిన పదార్థముల జెప్పు శబ్దములలో పాశ్చాత్యరాసాయనిక శాస్త్రమునందు ఆయాపదార్థముల యందుండు ప్రాణముయొక్క పరిమితిని బట్టి రూపభేదములు ప్రసిద్ధములైయున్నవి. అందు సామాన్యముగా ప్రాణసంకరము (Compounds of Oxygen) లందు ప్రాణముయొక్క తరతమభేదములను ఆంగ్లభాషయందు ఐటంత (ite) ములచేతను, ఏటంత (ate) ములచేతను తెలుపుదురు. ఉ. సల్ఫైట్ (Sulphite) లనబడు పదార్థములయొక్క యారంభ కాణువులు గంధకముతో గలసి మూడుప్రాణాణువులను గలిగియుండును ($K_2SO_3$). సల్ఫేట్ (Sulphate) లనబడు పదార్థములయొక్క యారంభకాణువులు గంధక ముతో గలసి నాలుగుప్రాణాణువులను గలిగియుండును. ($K_2SO_4$) ఇట్టివానిని మన మీయసుర్ ప్రత్యయాంత ములచేతను, ఇష్ఠన్ ప్రత్యయాంతములచేతను తెలుప వచ్చును. ఎట్లన సల్ఫైటులను గంధకప్రాణీయసము లనియు, సల్ఫేటులను గంధకప్రాణిష్ఠములనియును పిలువగలము. ఆంగ్లభాషయందు సామాన్యము వికా రార్థమును తెలియజేయుటకు పదముల నైడంత (ide) ములుగా వాడుదురు. ఉ. ఆక్సైడ్ (Oxide), సల్ ఫైడ్ (Sulphide), కార్బైడ్ (Corbide) మొదలగు నవి. ఇట్టివానిని తెలుపుటకు మనము వికారార్థాణ్ ప్రత్యయాంతములనుకాని, సంబంధార్థదైవతకాదిచప్రత్య యాంతములనుకాని వినియోగింపవచ్చును గాన ఆక్సైడ్ అనగా ప్రాణీయమనియు, సల్ఫైడ్ అనగా గంధకీయ మనియు, కార్బైడ్ అనగా మాషీకమనియు పిలువ వచ్చును. సమాసగతములౌనప్పుడీపదముల ప్రత్యయాంత ములు గాకుండనే వాడవచ్చును. ఉ. రజతగంధకము, ఊషజప్రాణము, మషీక ప్రాణము మొదలగునవి. ఈపైపదార్థముల రజతగంధకీయమనియు, రాజితగంధక మనియు చెప్పవచ్చును. ఇట్లే క్షారద్విప్రాణీయము, తామ్రగంధకీయము ఊషజహరితము మొదలగు శబ్ద ములు ($No_2$, Cus, NaCl) మొదలగుపదార్థ ములకు ప్రతినామములని తెలియవచ్చును. రాసా యనిక శాస్త్రమునందు ప్రసిద్ధములై హైడ్రాక్సైడ్లు (Hydroxides) ననబడునట్టి యొకజాతిపదార్థములు గలవు. వీనిని గురించి క్రింది యనువాకమున ముచ్చ టింతము. ద్రావకములును (Acids), ఐంగలికము లును (Alkalies) విరుద్ధధర్మములుగల పదార్థములని చెప్పియున్నాము. ఇందు ముఖ్యభేదమేమనగా ద్రావ కములు ప్రాయశః అలోహములయొక్క ప్రాణీయములు జలముతో గూడుటచే గలుగుచున్నవి. ఐంగలికములు లోహములయొక్క ప్రాణీయములు జలముతో గలియు టచే నేర్పడుచున్నవి. హైడ్రాక్సైడ్ (Hydroxide) అనుపద మీయర్థమునే తెలుపుచున్నది. లాటిన్ భాష యందు హైడ్రో యనగా జలము. ఆక్సైడ్ అనగా వెనుక స్పష్టముచేయబడియున్నది. ఒకానొక ప్రాణీ యము జలముతో జేరగా గలిగిన పదార్థమని విశిష్టార్థము లభించుచున్నది గాన నీజాతిపదార్థముల మనము ప్రాణీ యాబ్జము లనుచున్నాము. ప్రాణీయ సహితాః ఆపః ప్రాణీయాపః; తాభ్యః జాయత ఇతి (ప్రాణీయాబ్జః) ఊషజప్రాణీయాబ్జ (Na OH) మనగా నూషజప్రాణీ యము($Na^2 O$) జలముతో గూడి సముహర్చు పరి ణామము. ఇట్లే యింగాలజప్రాణీయాబ్జము మొదలగు వానిని తెలియదగ్గది. కాని ప్రాణీయాబ్జ (Hydroxide) పదము రాసాయనికశాస్త్ర సంప్రదాయమున లోహ ముయొక్క ప్రాణీయముల జలపరిణామములయందు మాత్రమే వాడబడుచున్నది; అలోహముల ప్రాణీయ ములయొక్క జలపరిణామములయందు వాడబడుట లేదు. ఇవి ద్రావకశబ్దముచే తెలుపబడుచున్నవి.

పాశ్చాత్యరసాయనశాస్త్రమునందు పదార్థము లను ప్రత్యేకచిహ్నముల (Farmulae)చే తెలుపుదురు. ఈచిహ్నముల నాయాపదార్థముల నామములయందలి యొకటిరెండక్షరముల లేఖనముచే నేర్పాటుచేయుదురు. ఎట్లనగా కార్బన్ (Carbon) అనుదానిని అపదైక దేశమగు C యను అక్షరముచేతనే తెలుపుదురు. అట్లే

ఆక్సిజన్ అనుదానిని O అను అక్షరముచేత మాత్రమే తెలుపుదురు. ఇట్టిచిహ్నము లనేకపదార్థములయొక్క సంకరముల (Compounds) ను తెలియజేయునప్పుడును, సాంకర్యప్రక్రియా విశేషముల (Re-actions) ను లేఖనరూపమున తెలియజేయునప్పుడును ఉపయోగించుచున్నవి. ఎట్లన కార్బన్ ప్రాణవాయువుతో గలియునప్పు డొక్కొక్క మషీకాణువు రెండేసి ప్రాణాణువులతోఁగూడి మషీద్విప్రాణీయ మనెడి (Carbon-di-oxide) సమీరముయొక్క యారంభకాంశ మేర్పడుచున్నది. ఈయంశమును $CO_2$ అను చిహ్నముచే తెలుపుదురు. మషీద్విప్రాణీయముయొక్క ప్రసంగము గలుగునపుడెల్ల దీర్ఘమగు (Carbon-di-oxide) అను పదమును వాడుటకుబదులు $CO_2$ అను చిహ్నము (Formula) ను వాడుదురు. మరియు పైరెండు పదార్థములయొక్క సాంకర్యప్రక్రియ నిట్లు తెలుపుదురు.



$$C + O_2 \longrightarrow CO_2.$$

—> ఈశిలీముఖచిహ్నమును ప్రతిప్రక్రియాలేఖనమునందును వాడుదురు. ఈచిహ్నమున కెడమ భాగమున నారంభకపదార్థముల (Components) యొక్క చిహ్నములను, పరిమితులను వ్రాయుదురు. మరియు కుడివైపున తయారైన పదార్థముల యొక్క చిహ్నములను, పరిమితులను వ్రాయుదురు. శాస్త్రప్రచారముయొక్క సౌకర్యమునిమిత్తము మనముగూడ నిట్టి చిహ్నముల నేర్పాటుచేసుకొనవలయును. కార్బన్‌ను మషీకమనియు, ఆక్సిజన్‌ను ప్రాణవాయువనియు తర్జుమా చేసియున్నాముగదా! ఈపదార్థములను తెలియజేయు చిహ్నములుగా మ్ కారమును, ణ్ కారమును గ్రహింతము. (ఇట్లు గ్రహించుటకు సబబుల నీపదార్థములనుగురించి ప్రత్యేకముగా విమర్శించెడి యధ్యాయముల యందు వివరింతుము). ఈపదార్థములయొక్క యణుసంఖ్యలను తెలియజేయునట్టి యంకము లాయాచిహ్నములయొక్క కుడిచేతివైపు క్రిందిభాగమున నాంగ్లమున వ్రాయబడియున్నవి. మనము నట్లే తెలిపినచో పఠనము సుకరముగా నుండునట్లు తోచుటలేదు. ఈవిషయమున ప్రాచీనసంప్రదాయమును మనము లాభకరముగ ననుకరింపవచ్చును. ఎట్లన నంకముల ప్రాణాక్షరములచే తెలియజేయనగును. అచ్చులక్రమమునం దాయాయక్షర మెన్నవయక్షరమో, యా ప్రాణ మా యంకమునకు చిహ్నముగా స్వీకరింపవలెను. అనగా, అ=౧, ఆ=౨, ఇ=౩, ఈ=౪, ఉ=౫ ఇట్లన్ని యచ్చుల యంకెలను తెలియవచ్చును. ఈప్రకారమున పైప్రక్రియలోని C యను చిహ్నమును మ యనియు, O యను చిహ్నమును ణా యనియును తెలుపగలము. మొత్తము ప్రక్రియ నిట్లు తెలుపవలెను:—



మ + ణా —> మణా

సంస్కృతభాషయందు 33 హల్లులు గలవు. ప్రతితత్త్వమున తత్తదనుగుణమగు హల్లుచే తెలుపవలెను. ఒక్కహల్లుచేతనే తెలుపుటకు సందర్భించనిపక్షమున నేపదార్థమునుగాని వ్యంజనసంయోగముచే తెలుపవలెను. ఉ. ప్రకృతగ్రంథమునందు పాదరసమునకు ప్ అను చిహ్న మొసంగబడినది. వెండి (రజతము) త్ అను చిహ్న మొసంగబడినది. మషీకము మ్ అనియు, ధూమ్రము (Iodine) రేఫముచేత తెలుపబడియున్నవి. ఇట్టితరి తామ్రమనులోహమున కొక్కహల్లుచే చిహ్నము నేర్పాటుచేయుట సాధ్యముకాదు. ఏలనన తామ్రయను నామమునందున్న హల్లులన్నియు, పూర్వమే చిహ్నములుగా వాడబడియున్నవి. అందుచే తామ్రమును తెలియజేయుటకు 'త్ర' యనుసంయోగమును స్వీకరించుచున్నాము. ఇప్పుడు తామ్రగంధకీయ (Copper-Sulphide) మను పదార్థమును తెలుపుటకు ఈపదార్థముయొక్క పుంజము (Molecule) నందు ఎన్ని తామ్రాణువులున్నవో, యెన్ని గంధకాణువు లున్నవో తెలుసుకొనవలెను. ఒక్కొక్క జాతియణు వొక్కొక్కటి యున్నదని తెలిసినపిమ్మట తామ్రగంధకీయమును మనము తగ (CuS) యనుచిహ్నముచే తెలుపుచున్నాము. ఈవిధముగ సంజ్ఞలయొక్క విస్తరము నుత్తరగ్రంథమునం దప్పటప్పటికి తెలియజేయగలము.

# విశ్వప్రతిష్ఠ

యస్. యం. వేణు

**( Foundation of the Universe )**

ప్రపంచప్రతిష్ఠనుగూర్చి తెలిసికొనవలయు నని యెన్నియోవేల సంవత్సరములనుండి శాస్త్రనేత్తలు కృషిసలుపుచున్నారు. భూగోళ మెట్లు నిలిచియున్న దనువిషయమై మనపూర్వులు సిద్ధాంతరాద్ధాంతము లొనర్చినారు. చుట్టును ఆవరించియున్న యాకాశము నడుమ భూగోళ మే యాధారము లేక నిలిచియున్నది. భూమి, సూర్యుఁడు, చంద్రుఁడు, నక్షత్రములు మొదలైనవి ఒకదానికొకటికి గల యాకర్షణశక్తిచే నవి యాయాచోటులయందు నిలిచియున్నవి. భూగోళము సూర్యునిచే నమితముగా నాకర్షింపబడుచున్నది. ఆ యాకర్షణశక్తిని భరింపలేక రివ్వున నీగోళము సూర్యమండలములోనికి బోయి యావేడిమిచే దహింపబడవలసినది. కాని సూర్యునిచుట్టును భూమి యతివేగముగ తిరుగుచుండుటచేత నీ దురంతము నివారింపబడుచున్నది. భూగోళముయొక్క యునికి యిటులుండగా నద్దాని నిర్మాణమును గూర్చి చాలవఱకు తెలిసికొనవలసియున్నది. ఆధునిక పదార్థవిజ్ఞానరసాయనశాస్త్రము లీవిషయము మనకు గొంతకు గొంత వెలిపుచ్చినవి. ఈ శాస్త్రములు శక్తి ( Energy ), పదార్థము(Matter) లనుగూర్చి బరిశీలించి యాదియందలి వస్తునిర్మాణమును గూర్చి కొన్నిసిద్ధాంతములు జేయ మన కవకాశ మొసంగినవి. ఈపరిశీలన (Experiment) నూతనవిషయముల ననేకములను గనిపెట్టుటలో నెంతయో తోడ్పడినది.

సుమా రిరువది ముప్పదిశతాబ్దములకు పూర్వము గ్రీకుదేశస్థులు వస్తునిర్మాణమును గూర్చి యాలోచించి కొన్నివిషయములను గనిపెట్టిరి. భూగోళములోని యే వస్తువునైనను చిన్నచిన్నవిగా భాగింపవచ్చును. సీమసున్నపుముక్క నొకదానిని మనకంటికి గనబడనంత సన్ననిధూళిగా బిడుగగొట్టవచ్చును. ఒక గరిటెడు మంచినీటిని మనయొద్ద తగిన సున్నితమైన యాయుధము లుండినచో నెన్నియో లక్షల భాగములు చేయవచ్చును. అయినను ఈవిభాగమున కొక మితి యుండవలయును. భాగింపగా భాగింపగా చివరను మిగులగల మనకంటికి గనబడని అతిసూక్ష్మమైన బిందువు, మఱి అవిభాజ్యమైనది యొకటి తేలవలయును. దీనినే గ్రీకులు 'పరమాణువు' (Atom) అని పిలువసాగిరి. గ్రీకులు కనిపెట్టిన యితరవిషయములవలె 'పరమాణువాదము' (Atomic theory) సహితము చాల తెలివైనదే కాని యానాటి శాస్త్రము లంతవిరివిగా ప్రచారములో లేనందున నీ సిద్ధాంతముయొక్క ప్రాముఖ్యము తేలలేకపోయినది. ౧౯-వ శతాబ్దప్రారంభమున 'మ్యాంచెస్టర్ గార్డియన్' రసాయనశాస్త్రజ్ఞుడైన జాన్ డాల్టన్ గారు (Chemist of Manchester Guardian - John Dalton 1766-1844) ఈ'పరమాణువాద' (Atomic theory) ప్రాముఖ్యమును గనిపెట్టి ప్రపంచమునకు దెలియజేసెను. 'పరమాణు' (Atom) వొక పదార్థముయొక్క సూక్ష్మాతిసూక్ష్మమగు సన్నని ధూళిలోని యొకకణము. అది కంటికి గనబడదు. ఎట్టి సున్నితమైన సూక్ష్మదర్శినివంటి యంత్రముల సహాయము సహితము దానిని జూచుటకు నిష్ప్రయోజనము. ఇట్టి పరమాణువులలో నంతకంటె చిన్నవియగు మఱికొన్ని సూక్ష్మాణువు (Electrons) లున్నవి. ఇవియే యీగోళమునగల వస్తుసముదాయనిర్మాణమునకు సాధనకారి. వీనినిగూర్చి ముమ్ముందు వివరింతము.

పరమాణువు లొకటిరెండు చేరి యణు (Molecule) వగుచున్నది. అణువుల సముదాయము వస్తురూపముగ నేర్పడుచున్నది. ప్రాణవాయువు (Oxygen) యొక్క మూడుపరమాణువులు చేరిన యణువుల సముదాయము 'ఓజోన్' (Ozone)వాయు వగుచున్నది. ఒక

ప్రాణవాయు పరమాణువు రెండుజలవాయు (Hydrogen)పరమాణువులుచేరిన యణువుల సముదాయము నీరగుచున్నది. ఈవిధముగ పరమాణువుల సముదాయము అణువులగుచున్నది. అణువుల సంచయము వస్తురూపమగుచున్నది.




[1. జలవాయుపరమాణువు. 2. నీటియణువు. 3. ఒకరంగు వస్తువుయణువు. 4. బియ్యపుపిండిసంబంధమైన యొకయణువు. నిజస్వరూపములకంటె కోట్లకొలదిరెట్లు పెద్దదిజేసి యణువులయొక్కయు, పరమాణువులయొక్కయు చిత్రములు ఒకనారంజిపండు నన్నియేరెట్లు పెద్దదిజేయ నెంచినచో నది మన భూగోళమునకంటె పెద్దదిగా చిత్రాంతర్గతచిత్రములోఁ జూపినరీతి కానవచ్చును.]

ప్రతిపదార్థములోని యణువులు కదలక మెదలక ఒకేచోట నిలిచియుండుటలేదు. అవి వాయువేగమున నిటునైపునుండి యటునైపునకు సరితూనికస్థితిలో పరువులిడుచుండును. (They move about in equilibrium position with immense speed.) ఈయణువుల సంచలనము (Molecular movement) బ్రౌన్ (Brown) అనునాతడు గనిపెట్టుటచే బ్రౌనియన్ సంచలన (Brownian movement) మని దీనికి నామాంతరము గలదు. పదార్థములత్రివిధావస్థల కీయణువుల సంచలనవేగభేదములే కారణమని శాస్త్రజ్ఞులు తలచుచున్నారు. ద్రవపదార్థములోని యణువు లొకదానితో నొకటి చేరక దూరముగ కదలుచునే యుండును. ఈయణువులు వేడిమిచేత జెదరగొట్టవచ్చును. నీటిని బాగుగ కాచినయెడల దానిలోని యణువులు విడిపోవ నుంకించుటచేత నీరు వాయు (ఆవిరి) రూపమున వెలికివచ్చివేయును. వేడిమిని తగ్గించుచుబోయినచో వాయురూపమున నుండుదానిని ద్రవ్యరూపమున బడయవచ్చును. ఈనిదానము పైననే వాయుపదార్థములను ద్రవరూపముగ శాస్త్రవేత్తలు బడయగలిగిరి. ఇకముం దెన్నడైన సూర్యగోళమందలి మంటలు చల్లారినచో భూగోళమునందలి యుష్ణోగ్రత వ్యవకలనసంజ్ఞాయుక్తము రెండునండల శతవిభాగియంశములకు (Minus 200 degrees centigrade) తగ్గిపోయినచో భూమి చంద్రునియుష్ణమునకు సమానమగును. అప్పుడు మన మిపుడు పీల్చు గాలి ద్రవరూపము దాల్చి 3౹౹ అంగుళలవలకు మన గోళముచుట్టును అవరించుకొనును. అప్పుడు మనము ద్రవరూపముదాల్చిన వాయు మహాసముద్రములో మునిగిపోదుము. ఇప్పటి జలమహాసముద్రము లన్నియు నప్పుడు ఘనరూపము దాల్చిగాళ్లవలె నుండి సహింపరాని శీతలము గలిగియుండును.

ఘనపదార్థములోని యణువుల సంశ్లేష (Molecular cohesion) బలవత్తరమైనది. ఒకయంగుళము మందముగల యినుపముక్కలోని యణువులను వేరుచేయవలయునన్న ౩౹౹ టన్నుల పరిమితిగల బలమును ప్రయోగింపవలసియుండును. ఇట్టి పదార్థములో సహితము అణువులసంచలన మున్నది. ఒక చిన్న బంగారపుతునుకను దీసి పాదరసములో వేసినట్లయిన, ఒత్తడికాగితము సిరాను పీల్చుకొనునట్లు బంగారము పాదరసమును పీల్చుకొనును. దీని సచ్ఛిద్రతను (Porosity) బట్టి స్వరూపము ఘనపదార్థమువలెనున్నను దానిలోని యణువుల సంశ్లేష (molecular cohesion) యట్టే బలవంతముగా లేదని తెలియుచున్నది.

అణువులును, పరమాణువులును అగోచరములు. అయినను వాని యునికిని నిర్ధారణచేయుట సుసాధ్యము. వాని పరిమాణముసహితము రమారమిగా కనిపెట్టబడినది. ఒక గ్రెయినుప్రమాణముగల బంగారమును ౭౫ చదరపుఅంగుళములు గల ఒక పలుచనిరేకుగా గొట్ట వచ్చును. ఆరేకుయొక్క మంద మింతయని (.0000 00౨౭౨౫ అం.) గణితమూలముగ జెప్పవచ్చును. ఇదియు నణువుల పరిమాణము నిర్ధారణచేయుటకు చాల యధికమైన కొలత. పెర్రీన్ (Perrin) అను ఫ్రెంచి శాస్త్రజ్ఞుడు .0000000౨ అంగుళముల మందము గల నూనెపొర నొకదానిని నీటిపై బఱయగలిగెను. అతడు కొలతవేసిన యొక చిన్న నూనెబొట్టును నీటిపై విడిచి యది యెంతచోటు నాక్రమించుకొనునో దాని విస్తీర్ణము కనిపెట్టి దానివలన పొరయొక్క మందమును దెలిసికొనెను. .00000000౧ అంగుళము మందము గల పొర నొకదానిని బఱయగలిగినచో నది కనీసము రెండణువుల మంద (Two molecules thick) మైనను ఉండకతీరదు. ఇట్టి యనేకములైన పరిశోధనలవలన సరాసరి ప్రతియణువును .000000000౪ అంగుళము అడ్డకొలత గలదిగా నుండవలెనని సిద్ధాంతము చేయబడినది. ఒక ఘనశతాంశమీటరు (One Cubic centimeter) గాలిలో రమారమి 30,000, 000,000,000,000,000 అణువు లున్నవి. పరమాణువు లింతకంటె చిన్నవి. ఒకబిందువు (Full-stop) వ్యాసము (Diameter) మీద ౫,000, 000 'హీలియం' పరమాణువుల (Helium atoms) ను వరుసగా నొకటిప్రక్కన నొకటి పెట్టవచ్చును.

ప్రతిపరమాణువును ఒక మహాశక్తిస్వరూపము. (A form of atomic energy) అది వాయువేగ మనోవేగమున ప్రతివస్తువునందును పరువెత్తుచున్నది. మనచేతిలోని సీమసున్నపు ముక్క, యొక నిప్పుయోజకమను పెంకు, ఒకకాని – వీనిలోని పరమాణువుల వేగమును సంచలనముచేత నవి యొక్కొక్కటియు మహాశక్తికి నిధియైయున్నది. ఈశక్తినే 'గతిబల' (Kinetic energy) మందురు. ఈశక్తిని వానినుండి విడదీసి మానవుడు స్వప్రయోజనమునకు ప్రయోగించు కొన్నచో నెన్నియో యాశ్చర్యములను చేయవచ్చును. ఈపరమాణువుల కదలికచేత శూన్యస్థల (Vacuum) మనునది ప్రకృతి (Nature) యందు లేనేలేదు. అవి యొకచోటునుండి మఱియొకచోటికి అతివేగముగ పోవుచుండును. ప్రాణవాయువుయొక్క యణువులు శూన్యాంశ శతవిభాగ (Zero degree centigrade) యుష్ణపరిమితి గలయప్పుడు ఒకసెకెండు (Second) నకు ౫00 గజములచొప్పున పోగలుగును. అదేయుష్ణమందు జల వాయ్వణువులు సెకెండునకు ౧౫00 గజముల చొప్పున పోగలుగును. అట్టి నీటివాయ్వణువుల పోకడ నాపి యాశక్తిని మనము వినియోగపఱచుటకు సాధ్యమున్నచో ప్రతిమూడు గ్రాముల (Grams) నీటివాయువునుండి ఒకటన్ను బరువును ౪౦ అంగుళముల యెత్తునకు యెత్త గల శక్తిని బడయవచ్చును. ఈవివరము లన్నియు నిప్పుడు సులభముగ లభ్యములగుచున్న యంత్రసహాయముచేత గనిపెట్ట వీలగుచున్నది. సమానపరిమాణము గల తెల్లకాగితములు రెండింటిలో నొక్కదానిపై సీసపు పుల్లతో నాలుగక్షరములు వ్రాసి యారెండింటికిని ఒక సూక్ష్మమగు త్రాసు (Chemical balance) లో నిరు వైపుల నొక్కొక్కదాని నుంచిన నప్పుడే యక్షరము లుండు కాగితపుముక్కవైపునకు త్రాసు ఒరుగుటను కనుగొనవచ్చును. ఇంతకంటె ౪,000,000 రెట్లు తక్కువపరిమితిగలదానిని సహితము "స్పెక్ట్రొస్కోప్" (Spectroscope) అను యంత్రసహాయమున కనిపెట్ట వచ్చును. "బోలోమీటరు" (Bolometer) అను నొక యుష్ణమానము ఒకశతవిభాగియంశములో దశ లక్షాంశము (౧/౧000,000degree centigrade) నటువంటి యుష్ణపరిమితినిగూడ తెలుపగలదు. ఇట్టి యంత్రము లనేకములు సూక్ష్మపరమాణువుల (Electrons and Atoms) పరిమాణములను, వాని వేగమును దెలిసికొనుటలో నత్యంతసహాయకారు లగుచున్నవి.

పందొమ్మిదవ శతాబ్దాంతమువఱకు "ఏటంస్", "మాలిక్యూల్స్" (Atoms & Molecules) ను గూర్చి సరియైన నమ్మకము శాస్త్రలోకమున నల్లుకొనలేదు.

౧౮౯౮-వ సంవత్సరమున కనిపెట్టబడిన 'రేడియం' (Radium), అంతకు మూడుసంవత్సరములకు బూర్వము కనిపెట్టబడిన 'రాంట్జన్ కిరణములు' (Rontgen rays or X'rays) "ఏటంస్", "మాలిక్యూల్స్" ను గూర్చిన యంశములను సిద్ధాంతము చేసినవి. వానియందుండిన సందేహము లిప్పుడు బొత్తుగా నశించినవి. అయిన అవిభాజ్యములని యనుకొనుచుండిన 'ఏటంస్' నిశ్చయముగా భాజ్యములే. అవి సూక్ష్మాతి సూక్ష్మములగు మఱింత చిన్నచిన్న యణువుల సముదాయముచే నేర్పడుచున్నవి. వీనినే 'విద్యుత్ బిందువులు' (Electrons) అని పిలువసాగిరి. 'ప్రపంచములోని వివిధములైన వస్తువు లన్నిటికిని మూల మొక్కటే. అందుండియే వివిధపదార్థము లేర్పడుచున్నవి.' (One primordial substance from which all the varying forms of matter have been evolved or built up) అని రసాయనశాస్త్రజ్ఞుడగు 'ప్రౌట్' (Prout)గారు డాల్టన్ (Dalton) ఏటంసును మఱల కనిపెట్టి రుజువుచేసినప్పు డూహించిరి. ఫాదర్ సెచ్చి (Father Secchi), సర్ విల్లియం క్రూక్స్ (Sir William Crookes) మొదలైనవారు భిన్నాభిప్రాయములను వెలిబుచ్చిరి.

౧౮౭౯-వ సంవత్సరమున సర్ విల్లియం క్రూక్స్ ఒక విచిత్రమగు పరిశోధన సలిపెను. ఆతఁ డొక శూన్యమగు గాజుగొట్టము (Vaccuum tube) గుండ విద్యుచ్ఛక్తిని ప్రసరింపజేయగా నా గాజుగొట్టములోని యన్ని పక్షములను ఒకవిధమైన యాకుపచ్చని వెలుతురు నిగనిగలాడుచు వెలుగసాగెను. క్రూక్స్ శూన్యముచేసిన గాజుగొట్టములో గాలి యంతయు పూర్తిగా వెలికి లాగివేయబడలేదు. ముందుండినదానికంటె ౨౦,౦౦౦,౦౦౦ రెట్లు తక్కువగాలి యందున్నది. అట్టిగొట్టముగుండా విద్యుచ్ఛక్తిని ప్రసరింపజేసినప్పుడు ఋణధ్రువకిరణము (Cathode rays) లాగొట్టములోని గాలియొక్క "మాలిక్యూల్సు"ను ఆకుపచ్చని వెలుగుతో బ్రకాశింపజేసినవి. 'క్రూక్స్' దీనిని పదార్థముయొక్క "నాల్గవ యవస్థ" (Fourth state of matter) యని తలచెను. ఇరువది సంవత్సరముల యనంతర మెడలెగని పరిశోధనలవలన దీని నిజస్థితి బయల్పడెను. అవి ఋణధ్రువ కిరణ సంయుక్తములై ఒక సెకెండునకు ౧౦,౦౦౦ నుండి ౧,౦౦,౦౦౦ మైళ్లవఱకు గల వేగముతో పరువులిడుచున్న విద్యుత్ బిందువుల (These are the negatively charged electrons moving at a velocity of 10,000 to 100,000 miles per second) ప్రవాహమని నిస్సంశయముగ నేర్పడెను. ప్రతివిద్యుత్ బిందువు చాల సూక్ష్మమైనది. అది జలవాయు పరమాణువు (Hydrogen atom)లో ౧౮౦౦-వ భాగమంత చిన్నది. ఈవిద్యుత్ బిందువులు పరమాణువులనుండి చెదరగొట్టబడినవి. ఆ గాజుగొట్టములో నొక అల్యూమినియంరేకు నడ్డముగా బిగించినట్లయిన పైకిరణము లారేకుగుండా నిరాటంకముగా ప్రసరించుటను లినార్డ్ (Lenard) కనుగొనెను. తరువాత ౧౮౯౫-వ సంవత్సరమున రాంట్జన్ (Rontgen) మహాశయుడు 'X'rays' కనిపెట్టెను. ఇతడు లినార్డుగారి పరిశోధననుజేయుచు క్రూక్స్ గొట్టము నొక నల్ల వస్తువుతో గప్పివైచెను. ఉన్నటులుండి దాపుననుండిన యొకమందుతెర (Chemical screen) వెలుగసాగెను. క్రూక్స్ గొట్టమునుండి కిరణములు వెలికివచ్చినవి. రాయి రప్ప, కొయ్య గొణతె మొదలగు సమస్తప్రకాశ నిరోధకము లగు పదార్థము (Opaque bodies) లన్నియు నీ'రాంట్జన్' కిరణములకు దారినీయవలసినదే. సజీవుడగు మానవుని యస్థిపంజరము, బుద్ధితెలియని పిల్లవాండ్రు పొరబాటున మ్రింగివేసిన నాణెములు, యుద్ధసమయములో నొకసిపాయితలలో నిరుకుకొనిపోయిన తుపాకిగుండు మొదలైనవాని ఛాయాగ్రహణము సులభసాధ్యమైన దను సువార్త కొలదికాలములోననే నాగరికప్రపంచము నాశ్చర్యాంబుధిని ముంచివేసినది. ఈకిరణము లేవి? ఇది యొకపదార్థస్వరూపము గాదు; పదార్థభేదము గాదు; పదార్థసంబంధమైన యణువులును గావు. X'rays సమస్తపదార్థములందును జొరబడు శక్తిగలిగిన యొకవిధమైన వెలుతురు. వివిధములగు అలపొడుగు (Wave length) గల వెలుగులు భిన్నస్వభావములు గలవిగా

నుండును. 'ఈథర్' (Ether) లోని యలలచే 'ప్రకాశపుటలలు' (Light waves) ఏర్పడుచున్నవి. 'రాంట్జన్' కిరణముల యలపొడుగు చాల తక్కువ పరిమాణము గలది.



రాంట్జన్ కిరణ (X'CAYS) సహాయమునఁ దీయబడిన మాంసార్గళ-అస్థుల ఛాయాచిత్రము.

రాంట్జన్ కిరణములను వెలిబుచ్చు పదార్థములేవైన నితరము లున్నవేమో కనుగొనుటకు శాస్త్రజ్ఞులు మొదలుపెట్టిరి. ౧౮౯౬-వ సంవత్సరమున బెక్విరల్ (Becquerel) అనునాతడు స్వభావసిద్ధముగ ప్రకాశింపగల కొన్ని పదార్థములను దీసికొని వాని నుండి రాంట్జన్ కిరణములను బడయవచ్చునేమో యని యూహించుచు, యురేనియం (Uranium) చేరిన యొకవస్తువును గొంత దీసికొని యెండలో నుంచుట కొకవంక నుంచెను. కొంతసేపటి కది సూర్యునివెలుగులో నుండనావశ్యకత లేకయే నలువైపులను వెలుతురును ప్రసరింపజేయసాగెను. ఈవెలుతురు రాంట్జన్ కిరణములవలె ప్రవర్తించుట నాతడు కనుగొనెను. రాత్రిందివము లాయుప్పునుండి X'rays వచ్చుచునే యుండెను. యురేనియం యుప్పుయొక్క యిట్టి విచిత్ర ప్రవర్తన దానిలో గలిసియుండు నొకానొకవస్తువు ప్రభావముగ నుండవలయునేకాని యురేనియంయుప్పున కంతయు నిట్టిగుణ ముండ దనునూహ కొందఱికి దట్టెను. ఆయుప్పునుండి ప్రకాశవంతమగు పదార్థమునుమాత్రము వేరుచేయుటకు వారు సమకట్టిరి. ఈయుద్యమమునందు ప్రొఫెసర్ క్యూరీ, వారి సతీమణియు (Professor Curie and Mrs. Curie) ప్రప్రథమమున జయమందిరి. అత్యంతమగు కృషిచేత వీరు ఎనిమిదిటన్నుల యురేనియంయుప్పునుండి (Pitchblende - a form of oxide of Uranium) ఒక మిల్లిగరిమెడు పదార్థమునుమాత్రము వేరుచేయగల్గిరి. ఈక్రొత్తపదార్థము 'యురేనియం' కంటె పదిలక్షలరెట్లెక్కువప్రకాశవంత మైనది. దీనినే 'రేడియం' (Radium) అని శాస్త్రవేత్తలు నుడివిరి. స్వభావసిద్ధముగ ప్రకాశింపశక్తిగల పదార్థములు "రేడియోయాక్టివ్ ఎలిమెంట్స్" (Radio-active elements) అందురు. "రేడియోయాక్టివ్" అనగా పదార్థముయొక్క పరమాణువులు (Atoms) విద్యుత్ బిందువులు (Electrons) గా విచ్ఛిన్నము లగునని భావము. ప్రకాశించుచున్న ప్రతివస్తువును విద్యుత్ బిందువులను ప్రవహింపజేయుచున్నదని మనము చెప్పవచ్చును. మండుచున్న దీపము, గగనమునుండి కనులు మిరుమిట్లుగొలుపు విద్యుల్లత, ఆకాశమునందు మిణుకుమిణుకుమనుచున్న నక్షత్రములు ఇట్టి విద్యుత్ బిందువులను వేనవేలు ప్రవహింపజేయుచునే యున్నవి. సూర్యగోళమునుండి మనకు వచ్చు వెలుగు, వేడిమి, విద్యుత్ బిందువుల ప్రవాహములేకాక "అల్ట్రావైలెట్ రేస్" (Ultra-violet rays) అను నొక విచిత్రమైన వెలుతురుకిరణములు మనకు వచ్చుచున్నవి. భూమియందలి ప్రతిపదార్థమందలి విద్యుత్ బిందువులను వెలిపుచ్చు సామర్థ్యము ఈకిరణములకు గలదు. అవి భూమిని దాకునెడల సమస్తపదార్థములు నిజస్వరూపములను గోల్పోవును. కాని మనగోళము నావరించి

యున్న గాలి యీకిరణములను పీల్చుకొనుటచేత భూగోళమున నిట్టి యుపద్రవము నివారింపబడినది. విద్యుత్ బిందువుయొక్క విచిత్రమైన శక్తిని పరిశోధించుచు శాస్త్రవేత్త లెన్నియో వింతలను గనిపెట్టిరి. దానితో మన కిప్పుడు నిమిత్తములేదు.

'రేడియం' ఔషధలోకమున కత్యంతోపయోగకారి యైనది. రసాయనశాస్త్రజ్ఞులు దానిని గూర్చి మరింతవిరివిగ పరిశోధనలను కొనసాగించిరి. ఆకాలమున నిట్టి పరిశోధనలకు వలయు పరికరము లుంచుకొని యున్నవారిలో సర్. జె. జె. థాంసన్ (Sir J. J. Thomson), సర్ ఎర్నెష్టు ర్యూథర్ ఫోర్డ్ (Sir Ernest Rutherford), సర్ డబ్ల్యు రాంసే (Sir W. Ramsay), ప్రొఫెసర్ సాడ్డీ (Professor Soddy) మున్నగువారు ముఖ్యులు వీరి యనల్పకృషిచేత నైదు సంవత్సరములలోననే రహస్యము బైటబడెను. సమస్త పదార్థములకు మూలమగు నొక్కదానిని కనుగొనుటయే కాక ప్రకృతియందలి సమస్తశక్తులను గూర్చి చక్కగా నెఱుంగగల్గిరి. అల్పకాలములోననే క్రూక్సుగొట్టములోని ప్రకాశమును రేడియంప్రకాశమును అభిన్నములని శాస్త్రజ్ఞులు తెలిసికొనిరి. రేడియం వెదజల్లు కిరణములలో మూడువిధములగు కిరణము లున్నవని సర్ ఎర్నెష్ట్ ర్యూథర్ ఫోర్డు కనిపెట్టెను. ఆమూడింటికి ఆల్ఫా, బీటా, గామాకిరణము (Alpha, Beta, and Gamma rays) లని పేర్లిడిరి. 'ఆల్ఫా' కిరణములు ఒక సెకండునకు ౧౨,౦౦౦ మైళ్ల చొప్పున వెలువడు 'హీలియం' (Helium) వాయు పరమాణువు (Atoms) లని యాతడు తెలిసికొనెను. 'గామా' కిరణములు 'రాంట్జన్' కిరణములవంటి యొకవిధమైన వెలుగు. ఎట్టిప్రకాశనిరోధక (Opaque) పదార్థములలోనైనను ఆ పదార్థము యొక్క సాంద్రత, ద్రవ్యరాశి, గరిమల (Density, Mass and Weight) యందెట్టిమార్పును గలుగనీక నీగామాకిరణములు జొరబడగలవు. 'బీటా' కిరణములు 'రేడియం' పరమాణువులనుండి చెదరగొట్టబడు విద్యుత్ బిందు ప్రవాహమని శాస్త్రవేత్తలు తెలిసికొనిరి. ప్రతి పదార్థముయొక్క పరమాణువులలో విద్యుత్ బిందువులుండితీరును. వానిని చెదరగొట్టుమార్గము లనేకము లున్నవి. విద్యుత్ బిందువులు కనీస మొక సెకండునకు ౬౦౦ మైళ్ల వేగమున పరుగిడుచుండినగాని యవి తమ వ్యక్తిత్వమును నిలువబెట్టుకొనజాలవు. ఇవి యొక సెకండునకు ౧౦,౦౦౦ మైళ్లనుండి ౧,౦౦,౦౦౦ మైళ్ల వేగముగగూడ పోగలుగును. ఈ 'విద్యుత్ బిందువులు' విద్యుచ్ఛక్తి సంబంధమైన వని మొట్టమొదట "అయస్కాంతము" (Magnet) సహాయమున దెలిసికొనిరి. "బీటా" కిరణములు పోవుమార్గమునకు సమీపమున నొక అయస్కాంతము నుంచినచో నవి దీనిచే నాకర్షింపబడి సహజమార్గమునుండి తొలగుటను కనుగొనవచ్చును. ఒక్కొక్క 'విద్యుత్ బిందువు' యొక్కగరిమ (Weight) నీటివాయుపరమాణువులో ౧౮౪౫-వ వంతని ఇటీవల కనిపెట్టబడినది. రేడియంనుండి వెడలు బీటాకిరణములను గూర్చి ఆర్. కె. డంకన్ (R. K. Duncan) గారిట్లు వ్రాయుచున్నారు: "పనికిమాలిన యీచిన్నికణము ఉప్పునం దెంత యాశ్చర్య మున్నది. దానిగుణము నిదివఱకు మనపూర్వు లెన్నడును కలలో గూడ తలచి యుండరు. ఈయుప్పు సెకండునకు ౧౦౦,౦౦౦ మైళ్ల చొప్పున ప్రయాణముచేయు 'విద్యుత్ బిందువు'లను వెదజల్లుచున్నది. అడ్డు తగలకున్నచో నవి భూమి నొక సెకండులోపల నైదుసార్లు చుట్టిరాగలవు. ఇవి ఋణవిద్యుత్ప్రయుక్తములై యున్నవి. (These are charged with negative electricity) ఎట్టి ప్రకాశనిరోధకఘనపదార్థములోనైనను భౌతికరసాయన భేదములను పదార్థమునకు గలిగింపకయే నిర్లక్ష్యముగా నివి దూరిపోగలవు. (They can easily penetrate into any opaque body without making it suffer physical or chemical changes.) అంధకారమున నుండు నేవస్తువుమీదబడిన నావస్తువు నవి ప్రకాశింపజేయును. ఛాయాగ్రహణ శక్తియుతరస పూరితమైన యద్దము (Photographic plate) పై నవి సామాన్యమైన వెలుగువలె ప్రవర్తించగలవు. గాలి నవి విద్యుత్ వాహకము (Conductor of electricity) గా జేయగలవు. నీటియావిరిగలిసిన గాలి నవి మేఘములుగా

మార్చగలుగును. 'ఇది చేయగలదు అది చేయజాలదు' అని విద్యుత్ బిందువులను గూర్చి చెప్పుట యశక్యము. ముమ్ముందది మనుజున కెంతయుపయోగకారి కానున్నదో యెవ రూహింపగలరు ?"



విద్యుత్ బిందువు

[పరమాణువు చిత్రము ఇంచుమించుగా నిచ్చటమాపినరీతిగ నుండును. సూర్యుని చుట్టు తిరుగు ఇతర గ్రహములవలె ధనవిద్యుత్ ప్రయుక్తమైన పరమాణువుబీజము చుట్టును ఋణవిద్యుత్ ప్రపూర్ణములగు విద్యుత్ బిందువులు అతివేగముగ తిరుగుచుండును.]




పైనజూపిన కాలపరిమాణము రమారమిగా నుండును. వర్తులములోనిసంఖ్య పరమాణుగరిమ(Atomic Weight)ను సూచించును.

ఇంతదనుక పరమాణువులనుగూర్చియు, విద్యుత్ బిందువులనుగూర్చియు జెప్పిన యంశములు శాస్త్రలోకమున రక్తికెక్కినవి. ప్రపంచములోని ప్రతిపదార్థము యొక్కక్కపరమాణువు స్వయముగాగాని, బాహ్యప్రేరణవలనగాని విచ్ఛిన్నములై విద్యుత్ బిందువులను వెదజల్లుచునే యున్నదనుమాట స్థిరమైనది. విద్యుత్ బిందు సముదాయ మెట్లు పరమాణువగుచున్నదను నంశము శాస్త్రజ్ఞుల కెడతెగని పనిని కల్పించినది. ఒక ఘనసహస్రాంశమీటరు (One cubic millimeter) జలవాయువునందు కోట్లకొలది పరమాణువులు విచ్చలవిడిగా సంచరించుచున్నవి. వానిలోని యొక చిన్న పరమాణువునందు విద్యుత్ బిందువు లేవిధముగ నిమిడి యున్నవి ? ఈవిషయమున రెండువిధములైన సిద్ధాంతములు ప్రచారములో నున్నవి.

ప్రతిపరమాణువునకును బీజ (Nucleus) మొకటి యుండవలయును. దానిచుట్టును అనేకములయినపొరలలో నుల్లిపాయలపొరలలోవలె, "విద్యుత్ బిందువులు" వర్తులాకారముగ తిరుగుచుండవలయు నని జె. జె. తాంసన్‌గారభిప్రాయపడిరి. ఇది యందఱకు నచ్చలేదు. సూర్యునిచుట్టు తిరుగుచుండు ఇతరగోళములవలె పరమాణుబీజము (The nucleus of the atom) చుట్టును విద్యుత్ బిందువులు తిరుగుచుండవలయునని సర్. ఇ. ర్యూతర్‌ఫోర్డ్‌గారు నుడివిరి. ఋణవిద్యుత్ ప్రపూర్ణములైన (Negatively charged) యీ విద్యుత్ బిందువు లేబీజముచుట్టు తిరుగుచున్నవో యాబీజము ధనవిద్యుత్ ప్రయుక్తము (Positively-charged)గా నుండినగేకాని పరమాణుస్వరూప మశక్యమగును. ఈ బీజమును 'ప్రోటాన్' (Proton) అని శాస్త్రకారు లనిరి.

ఇటీవల ల్యాంగ్ మ్యూయరుగారు (Dr. Lang mueir) 'ప్రోటాన్' చుట్టును విద్యుత్ బిందువులు వర్తులాకారముగ తిరుగుచుండుట లేదనియు, నివి 'ప్రోటాన్' కు గొంతె దూరమునుండి యిటునటు కదలుచుండుననియు నుడివిరి. ఇందలి సత్యాసత్యముల నిర్ధారణ శాస్త్రవేత్తలకు వదలిపెట్టుదము.

అనేకవిద్యుత్ బిందువుల చేరికయే పరమాణు వనునంశ మిప్పు డెల్ల రెఱింగినదే. పరమాణువులోని విద్యుత్ బిందువు లూరక కదలుచునే యున్నందున, ప్రతిపరమాణువునందును ఒకమహాశక్తిగతిబల మనునది (Kinetic energy) యిమిడియున్నదనుట నిర్వివాదాంశము. విద్యుత్ బిందువుల సంఖ్యనుబట్టి ఆయాపదార్థముల ద్రవ్యరాశి (Mass) అనులోమానుబంధముగ (Direct ratio) నుండునని 'మోస్లీ' (Mosely) గారు నుడివిరి. ఒక్కొక్కపరమాణువులోని విద్యుత్ బిందువుల సంఖ్య యెక్కువయగుచో వానిచేరికచే నేర్పడు పదార్థ మెక్కువబరువుగలిగి యుండును. అవి తక్కువయగుచో నాపదార్థము తేలికగా నుండును. ఈయంశము గనిపెట్టుటకు చాల తేలికైనజలవాయుపరమాణువునుండి, యురేనియంపరమాణువువఱకు పరీక్షింపగా వీని మధ్యనుండు ఇతరసమస్తపదార్థముల కన్నిటికి నొకదానికొకదానికి వరుసక్రమసంబంధ ముండుట కనుగొనబడెను. జలవాయువునుండి ప్రారంభించి క్రమముగా బరువెక్కువయగు పదార్థములకు వరుససంఖ్యల నిచ్చుచో నిప్పుడు తెలిసియున్న బరువైనపదార్థ మగు యురేనియం ౯౨-వ పదార్థ మగును. ఈసంఖ్య యాపదార్థములోని విద్యుత్ బిందుసంఖ్యను సూచించుచున్నది. ప్రపంచములోని సమస్తనిర్జీవపదార్థములును, జీవజంతువులు మొదలు భూగోళఖగోళములు సహితము విద్యుచ్ఛక్తి రూపభేదములగు ధనఋణవిద్యుత్ప్రయుక్త బిందువులచే (Protons and Eectrons) నిర్మింపబడి యున్నవి. స్వభావసిద్ధముగ ప్రకాశించు వస్తువు లెల్లప్పుడును తమలోని విద్యుత్ బిందువులను చెదరగొట్టుచున్న వనుసంగతి తెలిసికొంటిమి. కొన్ని నాళ్లయనంతర మా పదార్థము తన వ్యక్తిత్వమును గోల్పోయి రూపభేదము నంద వచ్చును. ఇట్లే సుమారు ౫,౦౦,౦౦,౦౦,౦౦౦ సంవత్సరములకుపూర్వ మత్యంత తేజోవంతమైన స్వప్రకాశముచేత విద్యుత్ బిందువులను చాలవఱకు ధారబోసికొని 'సీసము'గా బరిణమించుచున్నది. ఇదివఱకు ఎఱిగియున్నదానిలో నత్యంతాల్పమైనదియు, నొకే విద్యుత్ బిందు వున్నట్లు నిరూపింపబడినదియు నైన జలవాయు పరమాణువు నానాట విద్యుత్ బిందువులను దనతో నైక్యముచేసికొని యెన్నియోకోట్ల సంవత్సరము లైన తర్వాత యురేనియంగా మార్పుజెందవచ్చును. ప్రపంచమున మన మిప్పుడు జూచు సమస్తపదార్థములు నిట్లే యొకవిద్యుచ్ఛక్తిప్రపూర్ణమగు అత్యంతాల్పమైన తృణమునుండి వచ్చినవే యగును. ఈతృణముయొక్క వయస్సునుబట్టి, దానితో జేరియుండు విద్యుత్ బిందువుల సంఖ్యనుబట్టి పదార్థభేదము గలుగుచున్నది. డార్విన్ (Darwin) వంటి జంతుశాస్త్రజ్ఞులు సూచించినరీతిగ జంతువులలో నెప్పటికప్పుడు కలుగుచున్న రూపభేద పరంపర (Evolution) నిర్జీవపదార్థములయందు సహితము కలుగుచుండునా? ఎన్నియోకోట్ల సంవత్సరములుగ జరుగుచున్న పై వివరించినమార్పుల పరిణామముగ జడపదార్థములనుండి (Inanimate) జీవకోటి యుద్భవించినదేమో!

విశ్వములో నిప్పుడు త్రివిధములుగా గన్పడు పదార్థము (Matter), ఈథర్ (Ether, శక్తి (Energy) యివియన్నియు నాదివస్తువగు నేదో యొకదాని త్రివిధావస్థలుగా నుండవలయును. పరమాణువులనుండి వెలువడు విద్యుత్ బిందువులు సెకెండునకు ౧౬౦,౦౦౦ మైళ్లవేగమున పోగల శక్తిగలవని తెలిసికొనియున్నాము. ఒకగ్రెయిను (Grain) లో ౬౦-వ వంతు రేడియం ఒకతుపాకినుండి వెలువడు గుండువేగమునకంటె ౧౦౦౦ రెట్లు అధికమైన వేగముగల ౩౦,౦౦౦,౦౦౦ విద్యుత్ బిందువులను ఒకసెకెండునకు వెదజల్లుచున్నది. ఈవిద్యుత్ బిందువేగమును తుపాకినుండునకు గల్పింపబూనినచో నందులకు ౧,౩౪౦,౦౦౦ పీపాయిల రంజకము (Powder) కావలసియుండునని లీబాన్ (Le Bon) నుడువుచున్నాడు. ఒకచిన్న

నాణెములో ౨౦,౦౦౦,౦౦౦ గుఱ్ఱముల శక్తి (Horse-Power) యిమిడియున్నది. కోట్లకొలది టన్నుల రాక్షసిబొగ్గునుండి మనము బడయగల శక్తిని ఏకొలది ఔన్సుల పదార్థమునుండియో పడయవచ్చును. ఈగోళమునందలి ప్రతిపదార్థమునందును ఇమిడియున్న యీ యపారమైన శక్తిని మానవుడు స్వప్రయోజనమునకెన్నడైన నుపయోగింపగలుగునా? అని యేనాడు సాధ్యమగునో యానాటికి ప్రపంచపరిస్థితులు మార్పుజెందును. ఇప్పుడు మన అయోమార్గయానమున కత్యంతావశ్యకమైన బొగ్గు, నీటియావిర, అనుదినము మన గృహములయందు మన జీవయాత్రకు గావలసిన సమస్త వస్తుసంచయ మప్పుడనవసర మగును.

---

పండుగ దినములలో





'మామ్యాసేన్' బర్మానర్తకి

G. S. A.



గుజరాతీ యువతుల 'గర్బ' నృత్యము

S. P. B.

# దుర్గావతి

మంగిపూడి వేంకటశర్మ

౧

చూడు, మాచిన్ని వనమున లేడికదుపు-మృగయుల భయంబువిడినాడి స్వేచ్ఛమీఱ
నలుగడల మేఁతమేయుచు మెలఁగుచుండెఁ-గలికిచూపులు మదిలోని కులుకుఁ దెలుప.

బోయఁ డొక్కఁడు వలపన్ని పోయి యిటకు-మగుడిరాకున్కి వానిలోఁ దగులుకొన్న
పక్షితతి మేఁతనీళ్లునుఁ బాసి నవసి-యున్నయట్లనె పడి చచ్చియున్న వివిగో!

చెలువుగాఁ బండి కోఁతకు సిద్ధమైన-చేలు కోయంగఁ గొడవల్లు చేతఁబూని
యేలొకో సంశయించుచు నింటిమొగము-పట్టిపోవుచునున్నారు పడుచువారు.

పశువు లల్లవె పొలముకాపరులు లేక-యదలకించు నరులు లేక, యళుకులేక
పచ్చికబయళ్లు విడనాడి పంటచేలె-స్వేచ్ఛగా మేయుచున్నవి చిత్రమేమొ?

పాలికాపులు తమచేయు పనులు విడిచి - యెట్టు లుండిన పనిముట్ల నట్టె విడిచి
పరుగుపరుగున నిండ్లకు నరుగుదెంచు - జాడ గన్పడు నదిగో యాచాయలందు.

నిండుచీకటి వెఱఁగొల్పు నిసినినైన-నొంటిగా నిర్భయంబుగా యువతులైన
పైనమును జేయఁ దగిన యీబాటలెల్ల-భయము గొల్పెడు నీవేళఁ బట్టపగలె.

ఆకసం బున్నదో లేదో యరసివచ్చి-చెప్పుమని మింటి కంపెడు చొప్పు దోఁప
పావురాయిల నెగురంగవైచుచుండు-బాలకులు గానరా రూరిబయలునందు.

వేడుకగ వీథులం దాట లాడరారు-బాలు రెవ్వరు, పాటలఁ బాడఁబోరు
బాలికామణు లెవ్వరుఁ బట్టణమున - ఉప్పతిలఁబోలు నేదియో ముప్పు నేఁడు.

ఆరతుల సిచ్చి పోయినా రంగడులకు - ఆటవిడుపుల నిచ్చినా రన్నిబడుల,
గరిడిసాలలు బీగాలఁ గట్టినారు - శిల్పశాలలకును స్వస్తిచెప్పినారు.

కనకకంకణకింకిణీక్వాణముతోడ - రాల్గరచు జంత్రగాత్రస్వరాళితోడ
తాళమర్దళనర్తన ధ్వనులతోడ-నెపుడు ఘోషిల్లుచుండెడు నృత్యశాల
లెల్ల నిటు చిన్నవోయిన వేమి చెపుమ?

పంజరంబులఁ బెంచెడు పక్షితతికి-పాటలును పద్యములు నేర్పుమాటటుండ
వేళకును మేతఁ బెట్టెడు విధిని మఱచి-నారు లున్నారు నూత్నసన్నాహములను.
సందడిగ రాజభటు లంద ఱిందునందుఁ-దిరుగుచున్నారు మిక్కిలి తీవ్రగతిని,
నారు వీరు ననక మగవారలెల్ల-చేరుచున్నారు బీరముల్ చెప్పుకొనుచు.
సామజంబులమీఁద, నుష్ట్రిములమీఁద - శకటములమీఁద సైనికప్రకరములకు
వత్సరగ్రాసమును మించు వస్తుసమితి-తోలుచున్నారు దుర్గమదుర్గములకు.
ఆయుధాగారములు, సామజాశ్వశాల - లగ్నిచూర్ణాలయంబులు నడ్డులేక
తెరువఁబడియున్నయవి; కోటబురుజులందుఁ - గ్రాలుచున్నది గొప్పఫిరంగిచాలు.
కడిదివిల్లమ్ములుఁ దుపాకిగములు దాల్చి-కాచియున్నారు భటులలంగములయందు;
కోటగుమ్మాల చెంగట గుములుగూడి-వేచియున్నారు సమరంబు వీరవరులు.
ఘోరరణమును సూచించు గొప్పధ్వజము-లెగురుచున్నవి కోటపై నెల్లయెడలు;
నెచ్చటకు నేగుదెంచిన నేది కనిన-నాహవోత్సాహమే కానవచ్చె నేఁడు.

౨

"ఔరా! అక్బరు దండయాత్రకని తా నాకస్మికం బిట్లు రాఁ
గోర్కెఁ గారణ మేమి? మేము తన కెగ్గుల్ చేయమే యెన్నఁడున్;
గారుణ్యంబును వీడి వాని ప్రజలన్ గారింపమే; మా యెడన్
వైరం బేటికిఁ బూనఁగావలయు గర్వస్ఫూర్తిఁ గాకుండినన్?
"'చండకరప్రతాపుఁ డురుశౌర్యకలాపుఁడు ఖండితారి వీ
రుండగు గోండుభూవరవరుండు గతించెఁగదా, తదీయపు
త్రుండు రణాంగణమ్మున నెదుర్కొనలేఁడుగదా, గధామహీ
మండల మేలు నయ్యబల మమ్ము జయింపఁగఁ జాలదేగదా.'
"అనుచున్ దా హృదయంబునందు దలపోయంబోలు; శౌర్యాగ్ని వ
ర్ధనులన్ మమ్ము గణింపఁబోలదె? బలా! రానిమ్ము, ఇమ్లేచ్ఛులే
ఘనులో, భారతపుత్రులే ఘనులొ లోకంబే పరీక్షించి న
చ్చినరీతిన్ బ్రకటింప నీరణమె సాక్షీభూత మౌఁగావుతన్.
"ఆహవమన్న జంకుదురె హైందవసుందరు లెందునైన? న
వ్యాహతవృత్తి మించి మహిషాసురుఁ ద్రుంపదె భద్రకాళి? బల్

సాహసలీలమై దశదశాస్యునిఁ జంపదె సీత? నూతనో
త్సాహ మెలర్పఁగా నరకదానవుఁ దార్కొని సత్య నొంపదే?

"పూతరసపుత్రకుల సుధాంభోధికౌస్తు-భంబు చందేలురాజు గర్భమునఁ బుట్టి
శూరమణియైన గోండుభూదారుఁబట్టి,-సమరమన సంశయింతునే చత్తుగాని?

"తెలియఁడే భారతీయుల తెంపుపెంపు?-తలఁపఁడే రాజపుత్రుల బలిమి కలిమి?
మఱచెనే గోండునృప విక్రమక్రమంబు?-ఎఱిఁగి వచ్చునె రాజ్యేచ్ఛ నిట్లతండు?

"దొరలున్ భృత్యులు వాహినీపతులు మంత్రుల్ పుత్రులున్ మిత్రులున్
కరు లశ్వంబులుఁ జావఁగావలె; ప్రజల్ కష్టంబు లొందన్వలెన్;
పరరాజ్యాక్రమణేచ్ఛ భూపతుల కాపత్తుల్ ఘటించున్గదా;
తురకల్ కాంక్షవహింప నేమిటికొ హిందూరాజ్యముల్ గెల్వఁగన్?

"మధురసుఖజీవనాకాంక్ష మానఁజేయు;-తెంపుగొనఁజేయు; ననుకంపఁ ద్రుంపఁజేయు;
నిరపరాధులనైన దండింపఁజేయు;-నిసిరో! రాజ్యేచ్ఛ యేమి చేయింప దికను?

"కటకటా! ఇంతదూర మీకటకమునకుఁ-గటికితురకల దండు రాఁగలుగు టేమి?
హిందువు లుపేక్షచేసి రానిచ్చుటేమి?-వచ్చుటేమి? నృపాలుర ద్రెచ్చుటేమి?
ఇచట సామ్రాజ్యమును బ్రతిష్ఠించుటేమి?

"ఏకదేశీయుల మటన్న యెఱుక లేక,-ఎల్లరము హిందువులమన్న దృష్టి లేక,
అన్నదమ్ములమన్న మర్యాదలేక,-హైందవులు మందు రైకమత్యంబులేక.

"కృత్రిమవృత్తులన్ మదిని గీల్కొనఁజేసి, పరస్పరంబు దు
ర్మైత్రి యొనర్చి, చెడ్డయును మంచియు లేక చరించి, స్వీయపుం
గోత్రవధం బొనర్చుకొని కుంఠితశక్తిని స్వస్వరాజ్యముల్
శత్రులపాలు చేసి మనక్షత్రియులెల్ల నశింతు రక్కటా!

"పూతరసపుత్రవంశసంభూతులైన - మానసింహాదులే యభిమాన మెడలి
మతము జాతియు నీతియు మంటఁగలిపి - బిడ్డలఁ దురుష్కులకు నిచ్చి భృత్యులగుచు
నున్నవారన్న నన్యుల నెన్న నేల?

"భారతపుత్రులార, రిపుభంజనతత్పరచిత్తులార, దు
ర్వారపరాక్రమక్రమవిరాజితనిర్మలకీర్తులార, మీ

శూరత ధీరతాగరిమఁ జూపెదు కాలము వచ్చె నేఁడు; గం
భీరతఁ బోరి శాత్రవుల బీరము బింకము మాన్పఁగావలెన్.

"విమతుల కాజిలో వెన్నిక పోరాడుధీరముఖ్యులు భారతీయు లనుచు,
పావనఖడ్గమే జీవనంబుగ నొప్పు పౌరుషవ్రతు లార్యవర్యులనుచు,
నాహవంబన్నఁ గల్యాణంబుగా నెంచు నతిసాహసికులు భారతు లటంచు,
మానంబుకై ప్రాణమైన నర్పించు గౌరవభాగ్యనిధులు హిందువు లటంచు,
మరణమన్నఁ దృణంబుగా మదిఁ దలంచి-ధన్యులగు మాన్యజనులు హైందవు లటంచు,
మనకుఁ గలిగిన కీర్తి ముమ్మడిగ వెలయ-నేఁడు మీ మీ ప్రతాపముల్ నెఱపవలయు.

"రణరంగమందుఁ బ్రాణము-పణముగ నిడి పోరి,జయమొ స్వర్గమొ గొని, ధా
రణిపై వెలయుట భారత-మణికిన్ దగుఁగాక, మూల మణఁగుట తగునే?

"వచ్చిన శత్రువున్ మరల వచ్చినదారిని బారఁదోలి రా
లచ్చిని బ్రోచి గౌరవ మెలర్పఁగ హాయి దలిర్పఁ గాలమున్
బుచ్చుట మేలొ? రాజ్యరమ వోవ, స్వతంత్రత చావ, దీనతన్
బొచ్చెము దోఁప బానిసలఁబోలె మెలంగుట మేలొ చెప్పఁడీ.

"శంకాతంకము లేక మ్లేచ్ఛు లిటు దేశంబున్ బ్రవేశించి న
ల్వంకల్ సొచ్చి కలంచి సాధుజనులన్ బాధించుచున్నారు; సా
హంకారోద్ధతిమై నెదిర్చి యవనోద్యద్గర్వ పాథోధి ని
ట్టింకుల్ చేసెడు మేటివీరుఁ డొకఁ డిన్నీ! లేఁడె యిన్సీమలోన్?

"చూడరు వృద్ధులంచు, దయఁజూడరు పిల్లలు పాపలంచుఁ జే
వీడరు చేడెలంచుఁ, బగవీడరు సాధువులంచుఁ, జంపఁగా
నోడరు కంటఁబడ్డ ప్రజ నుక్కడను మొక్కలమున్ గలట్టి యీ
పాడు తురుష్కజాతి రిపుపట్టణసీమలఁ జొచ్చువేళలన్.

"కోటలెల్లఁ గెలిచి, పేటలఁ బేలిచి, - తోటలెల్లఁ గాల్చి, దొడ్లు గూల్చి,
మూటముల్లెలెల్ల ముచ్చిలుచుందురు - కొల్లవేళ యవనకోటు లకట!

"మతముల్ చూడరు, ధర్మముల్ వినరు, సామంబుల్ ప్రయోగించి శాం
తత బోధించిన సమ్మతిన్ గనరు, గ్రంథాగారముల్ దేవతా

యతనంబుల్ నశియింపఁజేయుదురు, న్యాయాన్యాయ పుణ్యాఘప
ద్ధతులన్ గానరు సూనరుల్ యవనయోద్ధల్ జైత్రయాత్రోద్ధతిన్.

"సాహస మొప్పఁగా నెదిరి సంగరసీమను గెల్చి శాత్రవ
వ్యూహముఁ దోలకుండిన మదోద్ధతి రాజ్యము నాక్రమించి, బల్
సాహసవృత్తిమైఁ బ్రజలకుం గల స్వత్వములన్ హరించి, యు
త్సాహముఁ ద్రుంచి, రుద్ధగజతండముభంగిఁ గృశింపఁజేయరే?

"ఇంతకాలంబునుండియు స్వేచ్ఛమీఱు - సౌఖ్యముల నెల్లఁ గాంచుచు శాంతకలన
సంతసించెడు మీర లేసరణి నింక - సాహెబుల పాదదాస్యంబు సైతు రకట!

"ఏపగు రాజ్యకాంక్షమెయి నేడ్తెరమించఁగవచ్చు మ్లేచ్ఛసై
న్యాపగ నాఁపఁగాఁదగిన నాథుఁడు యోధుఁడు గానరాఁడె? హా!
తీపగుఁగాక ప్రాణములు, తెంపున మానముఁ గావరాదె? నే
నీ పగవాని మార్కొనఁగ నెంచెదఁ; దెల్పుఁడు మీతలంపులన్.

అని యిబ్భంగి సమస్తపౌరనిచయం బాలింప, మంత్రుల్ దొరల్
ఘనసేనాపతు లబ్బురం బెసఁగ, జలముగ్గర్జానినాదంబునన్
దన యాస్థానమునందు నింపుకొలువై దర్పంబునన్ బల్కుచుం
డిన దుర్గావతి పల్కు లెల్లరకు నుద్రేకంబుఁ గల్పించినన్.

భూపతులు మంత్రులును సే - నాపతులును సుభటులును జనంబులు శౌర్యా
టోపమున మెఱసి వీరా - లాపము లాడి రిటు సమరలాలసు లగుచున్.

"ఇంతమాత్రపు పనికి నీ వేటికమ్మ? - భృత్యులై మేటిమగవార లింద ఉండ;
రాజులేని కొఱఁత, యువరాజు చిన్న - వాఁడయిన లోటు గల్గనే నేఁడు నీకు?

"కొందఱు శత్రువులలోన గూడిరనుచు, -నోడి మఱి కొంద ఱూడనిబాడిరనుచుఁ,
దురకలకుఁ గొంత దేశంబు దొరకెననుచుఁ, -బగతుర విజృంభణముఁ జూచి వగవకమ్మ!

"దేవీ! దేశము గొడ్డుపోయెనె? మహాతీవ్రప్రతాపోద్ధతిన్
యావద్భూతలమున్ జయించి యశమున్ గన్నట్టి రారాజులన్
వేవేలన్ గని ధన్యమై వెలయు నిర్వీరంపు తీరంపు టా
ర్యావర్తంబున నగ్బరుం గెలుచు శౌర్యాంకుఁడు లేకుండునే?

" దేవీ ! దుర్నయుఁడైన యగ్బరు మదాంధీభూతుఁ డౌర్ల దురా
శావేశంబున వచ్చుఁగా, కతని జంజాటా లిర్ల సాగునే ?
లావుర్ల దూలిచి ముష్వత్రిప్వ లిడ కేలా మేము పోనిత్తు? మా
ర్యావర్తంబునఁ బడ్డవాఁడు మరల్ల బ్రాణాలతోఁ బోవునే ?

" పరమపావనచరితులౌ భారతీయ-శూరసింహేంద్రుల విశుద్ధశోణితంబు
లీశరీరంబులను బ్రవహించునంత-వరకు మము డాయనేర్చునే పిరికితనము ?

" చావు తప్పదుగాని భూజనుల కెల్ల-కలుగు నాలస్యముగనో వేగమ్ముగానో ;
కానఁ బ్రాణంబుమీఁదను గాంక్షచేసి-మానమును మంటఁగలుపఁడు మానధనుఁడు.

" తన్నుఁ గన్న తల్లిదండ్రులకొఱకును,-ప్రాణమట్లు చూచు పత్నికొఱకు,
జన్మభూమికొఱకు, స్వమతంబుకొఱకును-చచ్చుకంటె మేలిచావు కలదె?

" తమ పెద్దలచేఁ బావన-తమములగు శ్మశానములను, దమ పుణ్యక్షే
త్రములను, మఠముల మాలి-న్యము సేయుటకంటె మరణ మది మేలుగదా.

" ఈ తురకలకున్ భీతిలి-స్వాతంత్ర్యము బాసి భావిసంతతి కినుకన్
బూతులు తిట్టఁగ బ్రతుకఁగ-రోఁతపడున్ గాక యేనరుండు సహించున్?

" తల్లిదండ్రులు కూర్మిసంతానమునకు-దాఁచియిడునవి ధనము విద్యయును గావు;
ఆభిజాత్యంబు, స్వాతంత్ర్యవైభవంబు-దాఁచి యిడవలె గడన కందనివి కాన.

"ప్రాణముమీఁద లేశమును నాశ వహింపము మేము, మానసం
త్రాణ మొనర్ప దీక్ష నిదె తాల్చితి; మీశ్వరసాక్షి; నేఁడు మా
త్రాణముఁ దీర్చివైచి జగతిన్ జరితార్థుల మౌదు; మాజిలో
నేణములట్ల శాత్రవుల నేడ్తెఱఁ ద్రుంతుము; నమ్ము మమ్మరో!

" కొండలు పిండిచేసెదము; కొంకము, జంకము; అక్బరేల? యు
గ్రుం డిపు డెత్తివచ్చినను గూల్తుము, దూల్తుము; మానమండనుల్
గొండు లటన్న సద్యశము గొబ్బునఁ దెత్తుము, చత్తు; మట్లుగా
కుండి నఁ బందలై తొలఁగియుండము; యుద్ధము సిద్ధ మమ్మరో!

ఈవిధమున నెల్లరు శౌ-ర్యావహమతులై వచించునట్టి నుడుల్ దు
ర్గావతి కొమరుఁడు విని రో-షావేశము మీఱ సమరసంరంభుండై.

గద్దెపైనుండి లేచి, ఖడ్గమును దాల్చి,-శౌర్యరసమూర్తియై సభాస్థలిని నిల్చి,
సభ్యు లరుదంది మేలని సంతసింపఁ-బలికెఁ బటురోషగంభీరభాషణముల:

"తల్లీ, తల్లడ మందనేల ? యవనుల్ దండెత్తిరానిమ్ము; ప్రో
ద్యల్లీలన్ జనుదెంచి నే నొకఁడనే దర్పక్రమం బేర్పడన్
భల్లూకంబులు చీమలం బొదువు లేవంబట్టి సైన్యంబులన్
గల్లోలం బొనరించి త్రుంచెద లసత్ఖడ్గప్రహారంబులన్.

"పెంపుము నాయుత్సాహము;-నింపుము చల్లని కటాక్షనిచయంబును; దీ
వింపుము; సంతోషంబునఁ-బంపుము సెలవిచ్చి; రిపుల వ్రచ్చెద జననీ!"

అని శౌర్య మడర వేఁడిన - విని రాణి ముదంబు భయము విస్మయము మనం
బునఁ బెనగొనఁ దన నందనుఁ - గనుఁగొని బోధించెఁ బ్రేమ గడలుకొనంగన్ :

"చిన్నికుమారుండవు, ము - న్నెన్నఁడు రణసీమ లేమొ యెఱుఁగవు; నీవా
చెన్నటి తురకల మార్కొని - బన్నములన్ బడఁగ నేమిపని జనియించెన్ ?

"ఉన్నారు శత్రుసేనల - మన్నెగొనంగలుగు మేటిమగ లెందఱో; యీ
యన్నవకార్యముఁ దీర్పఁగఁ - బిన్నవు నీవేల? కోర్కి విడువుము తండ్రీ!"

తల్లిమాట కడుగుదాఁటనివాఁడయ్యు - నరులఁ ద్రుంచు వేడ్క యతిశయిల్లి,
హెచ్చరింప మరల నిట్లని వాక్రుచ్చె - నమితవినయ వినమితాంగుఁ డగుచు:

"మాతరో, మ్రొక్కెదను, నాదు మనవి వినుము;-రాచబిడ్డకు శరణము రణముకాదె?
పిన్నపెద్దతనంబుల నెన్నఁదగునె-శత్రుసంహారకార్యంబు జరుపునపుడు.

"చిమ్మచీకటిఁ జిమ్మదే చిన్నదివ్వె? - పెద్దకొండఁ బగుల్పదే పిడుగుతునక ?
గొప్పమేడను గాల్పదే నిప్పునెరుసు ? - మదగజముఁ జీల్పలేదె సింహంపుపిల్ల ?

"తేజమె ప్రాధాన్యంబై, - తేజరిలుంగాదె పగరఁ దెగటార్చునెడన్ ?
ఓ జననీ, వయసుఁ దలపం-గా జనునే? నాదు కౌతుకముఁ దీర్పఁగదే."

అను కొడుకుపలుకునకు రాణి యడ్డమగుచు-నేమియో చెప్పఁబోవంగ నింతలోనె
రయముమీఱంగ నొక్క గుజ్జంపురౌతు-వచ్చి దేవికి మ్రొక్కి విహ్వలతఁ బలికె.

"కదియన్ వచ్చినవాఁడు నేఁడిదె యసఫ్ఖానుండు భానుండు నా
నుద్ధమాతంగ తురంగసంఘములతో, మాద్యద్భటశ్రేణితోఁ,

గదనోత్సాహముతో, శతఘ్నితతితో, గర్వంబుతో; నుర్వ్యగ
క్కదలఁ మేదిని యీనినట్లు బలముల్ గన్పట్టె రాజేశ్వరీ!"

అని వచించిన విని రాణి యతిరయమున-సచివసామంతవరులను సైన్యపతులఁ, పౌరజనులను బాడగాంచి 'బవరమునకు-నాజ్ఞమీ' కని గట్టిగా నపుడు పలికె.

(సశేషము)

---

ఆంధ్ర దేశములో: కవిత్వము-పాండిత్యము





౫. గదబల నాట్యము





౬. కాండుల నాట్యము



౭. బొాండపర్జాలు
మగవారు. మలక౯గిరి తాలూకా.



౮. బొాండపర్జాలు
ఆడువారు. మలక౯గిరి తాలూకా.

# వయసు

ఏలేశ్వరపు కృష్ణమూర్తి,

వయస్సంటే మన నెత్తిమీద కొచ్చిన యేళ్లన్నమాట. ఎవరైనా మన కెంత వయస్సని ప్రశ్నించారంటే ఏమన్నమాట? మనం పుట్టినదగ్గరనుంచి వారు ప్రశ్నించే దాకా రమారమి ఎంతకాలం గడిచిందని తెలుసుకునేందుకు వారు ఉత్సాహం చూపించారన్నమాట. మాకులేని ఉత్సాహం మీ కెందు కనుకునే పెద్దలు అడిగినవారి రోగం చప్పగా కుదిర్చేనిమిత్తం ఒకయేడు తగ్గించి మరీ వయసు చెపుతారు. వయసు తగ్గినా బుద్ధి తగ్గదని వారి ధైర్యం. వయసుకీ యేళ్లకీ బాంధవ్యం పూర్వంనుంచి కుదిరింది. దాంతో లెక్కలు బాగారాని వారుకూడా ప్రతిమనిషి.ముఖంమీద అంకెలు వేసుకునేందుకు వీలుకలిగింది. వయసు మన కగపడని వస్తువే. కాని వయసునుబట్టి స్త్రీ పురుషులలో ప్రతిరోజు కలిగేమార్పులున్నవి. మార్పులను మనం చూచి వ్యక్తివయసు నిర్ణయించుకోగలుగుతున్నాం; పరిశోధకునికి ఈమార్పులు కరతలామలకం అనవచ్చును. వయసు ప్రతివారిమీద ప్రతిక్షణం పడిపోతోంది. వయసులేనిమనిషి లేడు. ఎవరూ మేము కొంచెంసేపు వుండివస్తాం అని వయసుకి వెనుకదిగబడడం లేదు; ముందు పరుగెత్తడం లేదు. బాలుడు బిగిసికూర్చున్నా వృద్ధు డవుతున్నాడు. వృద్ధుడు తపసుచేసినా బాలుడు కావడంలేదు. అందుచేత లోకంలో వృద్ధులకు బాల్యం అంటే ఆశ, ఆదరణ. లేకుంటే అరవయోపడిలోగాని షష్టిపూర్తి మహోత్సవము జరిపించుకోకుండా వారు వూరుకోడమేమిటి? పైగా తాతని 'తాతా' అని గట్టిగా అనిచూడండి, ముక్కునుంటుంది కోపం. దీన్నిబట్టి ప్రతివారి హృదయంలోను పడుచువా రనిపించుకోవా లనే భావం వేరులుపారి వుందనవలెను. కొందరిలో వయసొచ్చినా పిల్లచేష్ట లట్టేవుంటాయి. కాని వయసుని పట్టుకొని నిలిపివేశాం, ఎప్పుడు మేము పదునెనిమిదేళ్ల బాలకుమారులం అని ఎవరూ అన్నట్టులేదు. మూడు లోకాల్నీ—కాలాల్నీ—కనిపెట్టిన ముసలివారుకూడా 'ఆయుర్యాతి దినే దినే' అని నాలుగు దిక్కులు కలియజూచారు. శాస్త్రాలన్నీ కలియజూచే యీకాలంలో 'రిజొవినేష.'చేయించుకోండని ధైర్యం చెప్పేవారు కూడా వయసువిషయంలో వేడి నిట్టూర్పు విడిచారు. ఇంతకు వయసు ఒక అవస్థ. జీవితకాలాన్ని కొలిచేకొలమానం. బాల్యం, యౌవనం, కౌమారం, వార్ధక్యం అనే విభజనకు మూలం వయస్సే. కాలాతీతంతో అవస్థాభేదం యిట్టే కలుగుతుంది, నేటి బాలుడే రేపటి కులవృద్ధు.

ఎవరి వయస్సైనా తెలుసుకోవాలంటే నోరువిప్పి వాకబు చేయవలయును. మేము పరిశోధకులం నోరు తెరవం అంటే చేయ వలసినది వేరుపని—కళ్లు తెరవాలి. పురో హితుని తాటియాకుల కట్ట తీసి తీవ్రంగా పరీ క్షించాలి. పురోహితులు లేరు, తాటియా కుల కట్టలు లేవంటే శని విరగడైనట్టే. అప్పుడు గురువుని ఆశ్రయించాలి. స్కూల్ రిజిస్టరు తిరుగవెయ్యాలి. టీకాల రిజిస్టరు త్రిప్పిచూడాలి. చావుబ్రతుకుల రిజిస్ట్రారు ఆఫీసులో ఎవరికైనా రవంత ముట్టజెప్పి వివరం లాగాలి. మెడికలుసర్టిఫికేట్లను చూచి కనుక్కోవాలి. ఇన్స్యూరెన్సు పోలసీ తీసి చూడాలి. క్రైస్తవులైతే బాప్టిసమ్‌రిజిస్టరులో వివరం వుండకపోదు. పుట్టినరోజులు వ్రాసు కునే పుస్తకాలను పరికించాలి. ప్లీడింగ్సులో వయసు బ్రతిమాలి కనుక్కోవాలి. జాతకం నకలుంటే వయసు తేలుతుంది. నిజమైన వయసు నూటికి తొంభైతొమ్మిదిపాళ్లు దొరు కుతుందని దృఢంగా ముందు నమ్మాలి.

పుట్టుకతో ప్రారంభ మవుతుందన్నాం యేళ్ల లెక్క. అందుచేత జాతకం ఒకచేతి తోను, సిద్ధాంతిగారి పిలక ఒక చేతితోను పుచ్చుకుంటేగాని లెక్క తేలదు. జాతకం సరి యైనది లేకపోవడం తటస్థిస్తే — బందరు వుప్పెన దగ్గరనుంచో, క్రోధన కరువు దగ్గర నుంచో, చక్రవర్తిగారు సింహాసనం ఎక్కిన దగ్గరనుంచో, గోపెన్ దగ్గరనుంచో, గోదా వరి పుష్కరంనుంచో, ఆంధ్రాయూనివర్సిటీ ఒకచోట చతికిలబడ్డదగ్గరనుంచో, బీహారు భూకంపందగ్గరనుంచో యేళ్లను లెక్కపెట్టి పన్నెండుగళ్లుగీసే గణకశిరోమణు లుంటారు. మనలో ఎవరైనా పుట్టినయేట కరువులేదు, వుప్పెనా లేదు, గోపెన్ లేదు అంటే జాతకాన్ని యిఏటండీ అడ్డే వనే సమా ధానం ఎల్లాగు వస్తుంది. జాతకం కాగితం మీదకి, ఆయుర్దాయ భావం బుర్రలోకి క్షణంలో లక్షణంగా యెక్కుతాయి. జాతకుడు పూర్ణాయుర్దాయుడా, మధ్యాయు ర్దాయుడా, అల్పాయుర్దాయుడా అని చర్చ జరుగుతుంది. ఏ జాతకం సూత్రం ఆజాతకానిదే అని సిద్ధాంతిగారు ముందు నుంచి వదిలపడి ముమ్మారు సెలవిస్తారు. కాని మామిత్రుణ్ణి మూడునెలలక్రితం దారు ణంగా చంపివేశారుగదా, సిద్ధాంతిగారూ, దానికి సంజాయిషీ యేమిస్తారు అంటే వారు గురుస్మరణ, భగవన్నామసంకీర్తనం చేస్తారు. క్రిందిశ్లోకం వ్యాఖ్యానంతో వారినోటమ్మట సీటిప్రవాహంక్రింద బయటపడుతుంది.

"యే ధర్మకర్మనిరతా విజితేంద్రియా యే
యే పథ్యభోజనజుషో ద్విజదేవభక్తాః;
యే మానవా దధతి యే కులశీలయుక్తాః
స్తేషా మిదం కథిత మాయు రుదారధీభిః."

మనస్నేహితుని మాటెటున్నా యిప్పు డు మన్ని చంపుతున్నాడీయన అని మనం దూరంగా తొలగిపోతాం. ప్రతియుగంలోను

మనిషికి ఆయుర్దాయం మారిపోతోంది. కృత యుగంలో మనిషికి పరమాయుర్దాయం ౧౪,౪౦౦ యేళ్లుట. అదే త్రేతాయుగంలో నాలుగోవంతై పూరుకుందని వినికి. తగ్గిందని దేవతల కౌన్సిల్లో యేడ్చేసరికి ద్వాపర యుగారంభానికి ౭౦౦ యేళ్లు లెక్కకు మిగిలినవి. కలియుగంలో హెచ్చాలని యేడ్చేసరికి ౧౨౦ సంవత్సరాలు చాలని దేవతలు సమ్మతిచూపారు. అప్పుడు పెద్దలంతా ఏక కంఠంతో

'పాపీ చిరాయు స్సుకృతీ గతాయుః'

అని—ద్రాక్షపళ్లందని జంబుకంవాటంగా—పలికారు. ఇంతకు ఆయుర్దాయం గుణించడంలో సత్యాచార్యుని దొక సరణి. యవనుల దొకమతము. మణీందునిది, హారిది ఒకమార్గం. దేవలుని దొకదారి. నీలకంఠుని దొక నియమము. శ్రీపతి దొకసూత్రం. శ్రీధరాచార్యుని దొకవిధానం. వీటన్నిటిని పైదాటి మనపై బడునది సిద్ధాంతిగారి కప్పదాటు. సిద్ధాంతిగారు చస్తావంటే బ్రతకడానికి యెంత వీలుందో, బ్రతుకుతావన్నా చావడానికి అంతే వీలుంది. కాని ఒకవేళ మనం నలభయోపడిలో ఆయురైశ్వర్యాలతో తులతూగుతూంటే—సిద్ధాంతిగారి వాక్కు ఫలిస్తే—అది మనజాతకప్రభావం అంటామా, ఒక జాగీరు వారికి వ్రాసి యిస్తామా?

వయసు మనం కాగితంమీద యిష్టం వచ్చినట్లు కలంపుచ్చుకొని ఎర్రసిరాతో మార్చుకునేందుకు దేవుడు తెలివి, ప్రజ్ఞ యిచ్చి వేశాడు. కాని యింత తెలివిమంతులం,వయసు చిహ్నములను మార్చుకోలేనంత నిస్సహాయులం అంటే గుణ్డెర చేయకండి. పౌడర్లతోను, రంగులతోను, నిలువుటద్దంముందు నిలబడి వయసుని ఈక్షణం జయించామని మన గదిలో మనం అనుకోడం వట్టిభ్రమ. పైకనడం గట్టిభ్రమ. ఉద్యోగానికి అబ్బాయి చురుకైనవా డనిపించుకునేందుకు, పడుచుపిల్లనుకట్టబెట్టుకునేందుకు, యస్.యస్.యల్.సిలో ఏజ్ జెమ్షన్ పొందేటందుకు,ఐ-సీ-యస్ పరీక్ష కెగబ్రాకేందుకు, తప్పితే ఇరవైఐదు దాటకుండా ముప్పదియైదు గిట్టుబాటుచేసుకునేందుకు, మునసబీకోసం ముందంజ వేసేటందుకు, లేకుంటే మరోందుకు కాగితంమీద అంకెలు తడబడతాయి. కాని కలకత్తామెయిలులో 'దొంగలున్నారు జాగ్రత్త' అన్నారు. పైగా టిక్కట్టులేని పిల్లలుంటే చేత్తో చెవినందుకోమని పరీక్షపెడతారు. అదే బస్సులో అయితే పిల్లవాడి పిలకట్టుకొని క్రిందికి వెంటనే దింపినంతపని జరుగుతుంది. ఎన్ని దెబ్బలు తిన్నా, నాళ్లల్లోకల్లా చిన్ననాడే మేలు. జీవితంలో యౌవనం గొప్ప అవస్థ.

యౌవనాన్ని గురించి కవి నడిగితే

"వసంతయౌవనా వృక్షాః
పురుషా ధనయౌవనాః,

సౌభాగ్యయావనా నార్యో
యువానో బుద్ధియావనాః."

అని నిర్భయంగా చెప్పాడు. ప్రపంచంలో వృద్ధాప్యం అంటే నిరసన; నవ్వులాట. ముసలివారిని చెవులుపట్టుకొని ఆడిస్తారు. తలనెరిసిన పెద్దలుకూడా ఆవిషయం పైకి చెప్పకోరు సరికదా లోపాయికారీని నల్ల రంగు తలకు తెప్పిస్తారు. దీనినిబట్టి ఎంత ముసలివారికి పడుచుతనంమీద వుంటుంది కన్న అని చెప్పవచ్చును. ఈరోజుల్లోను వయసునిబట్టి మర్యాద, భయము, భక్తి చూపిస్తూనేవున్నాం. వృద్ధుల వచనం ఆప త్కాలంలో కళ్లకద్దుకుంటున్నాం. వారు

'దరిద్రే యావనం వృథా'

అంటే సెబాస్ అంటున్నాం. అరవైయేళ్ల యితే అసలు మసలు అంటే సమ్మ తించాం. వయసుతో కూడుకుంటుంది లోకానుభవం. తల ముగ్గుబుట్టవడం, పళ్లూ డడం, నడుమువంగడం, కర్ర చేతికిరావడం, దృష్టి మందగిలడం, జ్ఞాపకశక్తి పోవడం, ఒడలు ముడుతలుపడడం, బట్టతల కావడం, వుపకారవేతనం పొందడం ముసలితనం గురు తులు. లక్ష్మణకవి వ్రాసిం దదే.

"తనువు ముడుంగు బాదగతి
దప్పును దంతము లూడు జీకటుల్
కనుగవ వర్తిలుం జెవుడు
గ్రమ్మును జొంగలుగాఱుమోమునన్
జనములు మాట చేకొనరు
సన్నిధి జేరదు భార్య పుత్త్రికున్
గొనకొని శత్రునట్లు తిరు
గుం గడుగష్టము వృద్ధ దేహికిన్."

ముసలి మాష్టర్లకీ పడుచుకుర్రాళ్లకీ వయసులెక్కలతో యుద్ధం సామాన్యంగా జరుగుతుంది. ఈవుదాహరించే లెక్క ఒక పరీక్షలో ప్రత్యక్షమైంది. "మనుమడి వయ సుని మనుమడి వయసుపెట్టి గుణించి దానికి మనుమడి వయసు కలుపుతే తొంభైయేళ్ల తాతవయ స్సవుతుంది; మనుమడి వయ సెంతో సూక్ష్మపద్ధతిని కనుగొనుము" అని. ఈప్రశ్న చదివినకొంటెకుర్రాడికి బాధంతా మనుమడి మూలాన్ని అనిపించి, ఆ ముండాతాత ముందుగానైనా గుటుక్కు మన్నాడు కాదోయ్ అని లోలోన విల పించాడు. మాష్టరు పేకరుమీద పూర్ణానుస్వారం తీరుపుగా చుట్టి, 'వాజమ్మా యీలెక్క చేయలేవటోయ్' అని చెవి నులి మాడు. ఇది వయసులోభేదం. కవులకు లెక్కలే చాతకానట్టు పదములువాడి మని షిని చిత్రిస్తారు. ఇదో చమత్కారం. పాటలు వ్రాసేవారికి అంకెలు అందుబాటులో వుం డవు. అందుతే మెంకివయ సెంత?

ఇక డాక్టర్లు మెడికల్ పరీక్ష చేసి, పళ్ల నుబట్టి, దేహస్థితినిబట్టి, యెముకల్నిబట్టి వయసుకడతారు. యక్సురే వుపయోగిస్తారు. అనుభవాన్నిబట్టి పిల్లలకు సాధారణంగా

ఆరునెలలకో ఏడునెలలకో పళ్లు మొలవడం ప్రారంభిస్తాయి. ఒకయేడాదిలో ఆరుపళ్లు బయటపడతాయి. పదునెనిమిది నెలలు నిండే సరికి పన్నెండుపళ్లుండగలవు. రెండేళ్లగు సరికి సుమారు పదహారుపళ్లుండును. ముప్పది నెలలు నిండుసరికి యిరవైపళ్లుంటాయి. ఆరేండ్లప్రాయమగుసరికి అన్నిపళ్లు వచ్చి వేస్తాయి. ఇల్లా అనుభవంమీాద నడుస్తుంది వైద్యుల నడక.

ఎంతసేపు మీాగొడవేకానిమాకుకూడా సమానగౌరవం ఎందుకు చూపరని నారీ మణులు చింతించుట న్యాయం. వయసు ప్రధానంగా వారికే వన్నెతెస్తుంది. ఏకవీ, ఏకాలంలోనుకూడా వారిని వర్ణించకుండా వదలివేయలేదు. ప్రాయంపువయసు పాటింప దగినదే. కాదన్నట్టయితే యీాక్రిందిశ్లోకంలో

"యామినీపూర్ణతిలకా
సంగీతనిపుణా కృతా,
సాహిత్యవిద్యా త్వభ్యస్యా
యువత్యా ప్రౌఢయా తయా."

యువతి, ప్రౌఢ అనేపదములమీాద పెద్ద గీటు పెట్టి ఆమెవయసు కట్టండి. కవులు పాత్రపోషణ బాగాచేసింది లేనిది తెలుస్తుంది. వారుస్వభావవిరుద్ధంగా వ్రాయలేదు.'ఇంతుల్తోయము లాడువేళ మగవారేతెంతురా' అనీ, 'యేకాంతమునందునున్న జవరాండ్ర నెపం బిడి పల్కరించులా గింతియగాక' అనీ సందర్భాన్నిబట్టి, యీాడొచ్చినవారి మనోభావాన్ని గుర్తించి కవులు పోకడలు సాగించారు. కొందరు శాస్త్రకారులు స్త్రీప్రకృతి పురుషుని కెరుకపరిచారు. గారికి పళ్లుఫలాల మీాదుండునటదృష్టి.రోహిణికి పువ్వులన్నను, విడెములన్నను కడుప్రీతి. బాలకు చుంబనాదులమీాద, ఆలింగనముమీాద మనసు. తరుణికి వస్త్రాభరణాదులన్న తీపి. ప్రౌఢకు రతియం దభిలాష. వృద్ధకు తనపిల్లల లాలించిన ఆనందం. దీనినిబట్టి స్త్రీలస్వభావం మనసునం దుఃచుకొని మగవారు సంసార సాగరంలో క్రిందుమీా దవుతున్నారు.

ఇక నాటకశాలల్లో ప్రవేశిద్దాం. బాలురకు ఎప్పుడూ సగము రేళ్లేమో. నాటకం అంతటితోటీ మన కేమీా జోక్యం లేదు. ముఖ్యంగా పాత్రవయసు, పాత్రధారివయసు కంటో కన్నెట్టుకు చూద్దాం. పాత్రకి ఆంధ్రనాటక రంగంలో వయసు లేదు. దుష్యంతుడు ప్రవేశం — అంటే పాత్రధారి నోటమ్మట రాలేముత్యాల్నిబట్టి, వచనంలో యిమిడిన అర్థాన్నిబట్టి,పద్యంలో యిమిడిన సంగీతాన్నిబట్టి పాత్రవయసు ఎవరికి వారు చూడగానే నిర్ణయించుకోవాలి. దీనితో మీాసం తీసెయ్యాలని ఒకరు, రాగి మీాసం పెంచాలని యింకొకరు అభిప్రాయాలు వెలిబుచ్చుతారు. ఇంతలో పశ్చిమంకేసి చూడు, మెక్ బేత్ కి యిన్నేళ్లని షేక్స్పియరు వ్రాశాడా ఏమిటి అనే కేక మారు మ్రోగుతుంది. మనం రామరామ అనుకొని

దశరథుని వయసెంత అనే ప్రశ్న వేసుకొని
గద్గదస్వరాన్ని బట్టి ముసలి సుమా అను
కుంటాం. వేరొకచో దుష్యంతుడు రొట్టె కొరక
డాన్ని బట్టి దుష్యంతుని వయసు మనమే గ్రహిం
చుకుంటాం. రంగంలో అంకం, స్థలం నిర్దే
శించడం, ఒకరిని ప్రవేశపెట్టడం, మరొకరిని
రప్పించడం, కొంచెంసేపు రసవంతంగా
మాటాడించడం, కడకు అంతా నిష్క్రమిం
చడం, లేక తెరదించడంమటుకే గ్రంథకర్త
పని. గురజాడవారిదీ యిదేజాడ. వచనంలో
వున్న తదితర నాటకాలల్లో పాత్రలకూ
వయసు గ్రంథకర్తలు నిర్ణయించుకోలేదు.
మన కెందు కీబాధ్యత అని కాబోలు! పాత్రకి
వయసు ఏష్యంచేసేసరికి, నాటకంలో పాత్ర
ఎవరు వేసినా తెరలాగడ మవుతోంది;
తెర దించడమవుతోంది. పాత్రకి వయసు
లేనప్పుడు పాత్రధారి వయసు గమ
నించ మనడం నవ్వులాట క్రింద వుంటుంది.
ఐనప్పటికీ స్త్రీపాత్రవయసు గమనించ
మని కొందరు హెచ్చరిస్తూనే వుంటారు.
వారూ శకుంతలలో గౌతమిపాత్రని కళ్లారా
సినీమాలో చూచే సలహా యిచ్చివుంటారు.
స్త్రీపాత్ర లేందే ఆంధ్రనాటకరంగం నడవలేదు.
స్త్రీపాత్ర లుండి బాగా నడుస్తోందాఅంటే
ముఖం చిట్లించుకునేవారు, పళ్లు పటపట
కొరికేవారు, పెడమొఖము పెట్టేవారు,
గంభీరభావప్రకటన చేసేవారుముందుకొస్తారు.
స్త్రీపాత్రలను మగవారు ధరిస్తే గీసినగెడ్డం
ఆనమాలు పోదని కొందరన్నారు. సరే,
బాలుల్ని బ్రతిమాలి యిల్లాయిల్లా లజ్జ నటిం
చమ్మా అనీ, యిల్లా క్రీగంట చూడమ్మా
అనీ నూరిపోసేసరికి వారికి మీసకట్టు సిద్ధ
మవుతుంది. వయసుని అసింటా తీసి పార
వేయగలవారు లేరుకనుక ఈబాధలు వస్తు
న్నాయి. ఈశతాబ్దంలో స్త్రీపాత్రలను స్త్రీలే
ధరించవలెనని భావోదయం అయింది.
అయినా వయసుపట్టింపు పోలేదు. ముందు
పాత్రపోషణ స్త్రీలు బాగాచేయడం అంటే
ఏమన్నమాట? రంగంలో మధురవాణివేషం
వేయడానికి సిద్ధపడి, ముద్దెట్టుకునేందుకు
రామప్పపంతులువేసినవారికల్లా బుగ్గ ఒప్ప
జెప్పడానికి జంకకుండా వుండాలన్నమాట.
నేను మధురవాణిని, ఎవరు రామప్పపంతు
లైతేనేమి అనే భావోదయం కలిగిన స్త్రీలు
కొలది. తరుణవయస్కులు, నాట్యకళయం
దభిరుచికలవారు, భావోదయం కలిగినవారు
రానపుడు బాలురే యిప్పటికి స్త్రీల స్థానము
లాక్రమించుచున్నారు. ఎవరేపాత్ర ధరించి
నను పాత్రకు పాత్రధారికి యీడుజోడు
కుదురకున్న నాటకము బూటకము. ఇంతకు,
గ్రంథకర్తగారు పాత్రలకు వయసు నిరూపించి
నట్టయితే వేషంవేయుటకు పౌరు లెవరు సరి
పోరనా భయం!

పుట్టిన ప్రతిదానికి వయస్సుంది. చూ
చారూ, అందుచేతే తాడిచెట్టుకీ మీకూ
ముడిపెడతారు మిామిత్రులు. మొండికీ
బండకీ నూరేళ్లు ఆయుస్సు. పూర్వులు
నానాజంతువులకు, పక్షులకు పరమాయు

ర్దాయం నిర్ణయించారు. వైద్యనాథ దీక్షి
తుడు సుమారు క్రీ. శ. ౧౩౦౦ లోనే
యీవిషయాల్ని గురించి వ్రాసియున్నాడు.
పాములకు, కాకులకు, గ్రద్దలకు, కొంగ
లకు, గుడ్లగూబలకు పరమాయుర్దాయం
వెయ్యేళ్లట; డేగలు, ఎలుగుగొడ్లు, కోతులు,
కప్పలు మూడువందల యేళ్లు జీవించును;
మాంసభక్షకులకు నూటయాభైయేళ్లు జీవితం;
ఏనుగులకు, మనుష్యులకు నూటయిరువది
యేళ్లు పరమాయుర్దాయం; గుఱ్ఱమునకు
ముప్పదిరెండేళ్లుమాత్రమే; ఒంటెకు, గాడి
దకు యిరువదిఐదేళ్లు; ఎద్దులకు, ఎనుబోతు
లకు యిరువదినాలుగేళ్లు; నెమలికి యిరువది
యేళ్లు; మేకలకు, గొఱ్ఱెలకు పదునారేళ్లు;
బాతులకు పదునాలుగేళ్లు; రామచిలుక
లకు; కోయిలలకు పన్నెండేళ్లు; కోడిపుంజు
లకు, ఎనిమిదేళ్లు; పిగిలిపిట్టకు ఏడేళ్లు—అని
వివరించెను. దీనినిబట్టి ప్రకృతిశాస్త్రజ్ఞులు
పూర్వంనుంచి వయసు కనుక్కోనేందుకు
పూనుకున్నారని రూఢికాగలదు. ఇప్పుడూ
శాస్త్రవేత్తలు భూదేవి కెన్నేళ్లో, సూర్య
చంద్రాదుల కెన్నేళ్లో, తారల కెంతవయసో
కనుక్కొంటున్నారు. నడివయసున నుండక
పోతే దక్షకన్యలను చంద్రుడేల వరించును?

న్యాయశాస్త్రజ్ఞులు వయసువిషయం
ముందు వేసుకున్నారు. బుజ్జులు బద్దలు
కొట్టుకున్నారు. శాసనసభలలో అడుగెట్టే
మెంబరులకు వయసుపట్టింపు, ఏళ్ల పీకు
లాట వుండకూడ దన్నారు. దానితో
బోసినోళ్లు, బట్టతలలు ప్రవేశించి తమ
లోకానుభవం వృథాపోకుండా చట్టములను
— వారి చేతుల్లో వున్నంతవరకు —
బాగుచేస్తున్నారు. ఇక న్యాయస్థానాల్లో
వయసువిషయం చెప్పాలి. దాస్తే పనికిరాదు.
సాక్ష్యమిచ్చేందుకు పిల్లవాడు కోర్టుకి వస్తే
తంతు జాగ్రత్తగా పిల్లవాడిని బెదరగొట్ట
కుండా నడుపుతారు. మరీ మతిపోయిన
ముసలివారిసాక్ష్యం ఓమూల పారవేస్తారు.
మైనరునని ముందుకువచ్చినవారిని శ్రద్ధతీసు
కొని కాపాడుతారు. అనుమతి యివ్వలేని
వారు ఒప్పందం చేశారంటే అబ్బే వీల్లే
దంటారు. ఏడేళ్లైనా నిండనివాడు నేరంచేశా
డంటే 'శిక్షవెయ్యం అవతలకి తీసికొని వెళ్ల'
మంటారు. పన్నెండేళ్లు నిండనివానిమీద
నేరంమోపబడితే పిల్లాడు జ్ఞానంవచ్చినవాడా,
రానివాడా అని గుంజులాడి ముందు నిర్ణ
యించమంటారు. అనుమతిపొంది పదునెనిమి
దేళ్లవారిని చంపివేశారంటే నరహత్యేగాని
ఖూనీకాదు అంటారు. పదునాలుగేళ్లు నిండని
మగవాడిని పదునారేళ్లు నిండని ఆడపిల్ల
దానిని వాడెత్తుకుపోయాడు బాబూ అంటే
వాడికి ఖైదేస్తారు. వ్యభిచరించేనిమిత్తం
ప్రాయములో నున్నదానిని లేవదీసుకు
పోయినా గొప్ప నేరం అంటారు. ఇల్లా వయ
సునిబట్టి దేశంలో కట్టుబాట్లు పెట్టారు. శిక్ష
లలో కూడా వయసును పాటించెదరు. నేర

ష్ఠుడు మరీ లేత్రాయమువాడైతే రిఫర్మేటరీ లకు పంపి, మంచిబుద్ధిచెప్పి, రాజుగారే తల్లిదండ్రిలా కాపాడి, పనినేర్పి, మంచిపౌరుడవు కమ్మని దారి చూపుతారు. నలభైనై దేళ్లు నిండాక మనిషికి యేదండన వేసినా వేయండిగాని, కొరడాదెబ్బలు మాత్రం అంటించవద్దన్నారు. పెద్దల వయసు చూచే యీసంభావన వారికి చేరకుండా చేశారు.

ఇన్నివిషయాలుచెప్పి శారదాచట్టాన్ని గురించి చెప్పకపోతే మీా కూరుకోరు. ఇందులో పెళ్లికి యువతీయువకుల వయసు నిర్దేశింపబడింది. ఇంచుమించుగా పెళ్లే గర్భాధానముక్రింద పరిణమించాలని పెద్దలు నిశ్చయించారు. 'దీర్ఘాయుష్మాన్భవ' అని దీవించడం మన పని. శుభవాచకానికి గొంతుకకలుపరూ?

---



"చూడు నాన్న!" —కె. కృష్ణమూర్తి, తెనాలి.

## స్త్రీలపూర్వస్థితి

ప్రతిసంఘములోనుండు స్త్రీపురుషులను రెండు శాఖలును సమానసంఖ్యగ నుండుచు పరస్పర సాహాయ్యమువలననే వృద్ధికావలసియున్నవి. మఱియు స్త్రీల శారీరకమానసిక నైతికాభివృద్ధిపైననే వారిసంతానము పురుషుల యభివృద్ధియు నాధారపడియున్నది. అందుచే నీయుభయసంఘముల యభివృద్ధికి ననుకూలముగా నుండునపుడే న్యాయశాస్త్రము మొత్తముమీద సంఘవికాసమునకును, జాత్యున్నతికిని దోడ్పడును. అందు ముఖ్యముగా మనదేశమున పురుషులకన్న స్త్రీలు విద్య, ఆర్థికస్థితి మొదలగువిషయములందు సాధారణముగా చాలా వెనుకబడియుండుటచే, మనహిందూలా స్త్రీల విషయమున న్యాయముగా నుండదనియో, స్త్రీలింకను వెనుకబడుటయు, నట్లర్ధాంశము వెనుకబడుటచే మనజాతి యంతయు క్రమముగా క్షీణించుటయు సంభవించును. అందుచే హిందూలాలో స్త్రీలప్రస్తుతస్థితియు, అందు వెంటనే అవసరమగు మార్పులును క్రింద పరిశీలింపబడుచున్నవి. సందర్భోచితముగా మనస్త్రీలయు, నితర జాతిస్త్రీలయు స్థితి పోల్చబడుచున్నది. మనహిందూ జనులలో సమిష్టిఆస్తిహక్కు, వారసత్వము, వివాహము, దత్తత, మనోవర్తి మొదలగువిషయములను, పార్లమెంటువారి ఇండియా గవర్నమెంటు చట్టపు (Government of Indi Act) ౧౧౨-వ సెక్షను ప్రకారమును, మద్రాసు సివిల్ కోర్టుల ఆక్టు (Madras Civil Courts Act) ౧౬-వ సెక్షను మొదలగు ఆయా ప్రాంతముల ప్రత్యేకచట్టములనుబట్టియు మన బ్రిటిష్‌కోర్టువారు హిందూ ధర్మశాస్త్రప్రకారము, మతాచారములప్రకారము తీర్మానము జేయుచున్నారు. అందుకు మన ప్రాచీనధర్మశాస్త్రములును, పూర్వపు ఆచారములును మూలాధారముగ గైకొనబడుచున్నవి. అందుచే మనస్త్రీలప్రస్తుతస్థితి యెంతవఱకు ధర్మశాస్త్ర వచనములప్రకార మున్నదో తెలియుటకై వారిహక్కులకు సంబంధించిన కొన్నితీర్పులును, ప్రాచీనధర్మశాస్త్ర వచనములును గూడ అవసరమునుబట్టి ముందాయాస్థలములందు ఈక్రింద నుదాహరింపబడును. మన ప్రాచీన ధర్మశాస్త్రములందే స్త్రీల కుచితస్థాన మీయబడలేదనియు, నందుచే ప్రస్తుత మమలులో నున్న హిందూలా కూడ అట్లే యుండవలసివచ్చుచున్నదనియు జాలమంది యభిప్రాయము. ప్రథమమున స్త్రీల కాస్తి విషయమై యెట్టిస్వాతంత్ర్యము కూడదని చెప్పుచు అందుకు

'పితా రక్షతి కౌమారే భర్తా రక్షతి యౌవనే,
రక్షంతి స్థావిరే పుత్రాః న స్త్రీ స్వాతంత్ర్యమర్హతి'[౨]

(బాల్యమున తండ్రి, యౌవనమున భర్త, వార్ధకమున కుమాళ్లు, స్త్రీని పోషింతురు. స్త్రీ స్వాతంత్ర్యార్హురాలు కాదు) అను శ్లోకమును మనవారు కొందరుదాహరణముగా నిచ్చుచున్నారు.

మొదటిసంగతి-ఈశ్లోకమున ఆస్తి అధికారమును గూర్చి ప్రశంస యేమిాలేదు. మరియు ఈశ్లోకమునకు స్త్రీ, పితృపతిపుత్రుల పోషణయందే యుండవలె ననియు, ఎన్నడు స్వతంత్రత వహింపకూడ దనియు

---

౧. వారసత్వము మొదలగు వ్యవహారములను గూర్చిన మనుస్మృతి, నారదసంహిత మొదలగు ధర్మశాస్త్రగ్రంథము లనేకములున్నను ప్రస్తుతపుకోర్టులలో యాజ్ఞవల్క్యస్మృతి, అందుపైన శ్రీవిజ్ఞానేశ్వరవిరచితమగు మితాక్షరవ్యాఖ్యానమును ముఖ్యప్రమాణగ్రంథములుగా అంగీకరింపబడుచున్నవి. అందుచే ముఖ్యముగా యాజ్ఞవల్క్యస్మృతి మితాక్షరలోని వచనము లీవ్యాసమున తరుచుగా నుదాహరింపబడినవి.

౨. మనుస్మృతి, అ. ౯, శ్లో. ౩.

సాధారణముగా అర్థము చేయబడుచున్నది. కాని, వారిని పరాధీనలనుగానే ఉంచవలెననియేకాక, వారు సహజముగ సాంఘికముగ పరాధీనలగుటచే, తమ పుత్రికలను, తల్లిని, భార్యను పోషించుబాధ్యత పురుషులకు ముఖ్యముగ కలదను సూచనయు నీశ్లోకమున గలదు. అది ముఖ్యోద్దేశమనుట గూడ ననుచితముగా నుండదు.౧ "నస్త్రీ స్వాతంత్ర్యమర్హతి" అనగా 'స్త్రీకి స్వాతంత్ర్యము కూడదు' అని సాధారణముగా నర్థము చెప్పుచుందురు. "న + అర్హతి" అనగా "ధర్మము గాదు" అను నర్థమునగూడ ప్రయోగము కలదు.౨ అందుచే స్త్రీలకు యేవయస్సులోను తగురక్షణ నిచ్చుట పురుషులధర్మము. అట్లులేక ఆమెను స్వతంత్రముగా (నిరాధారముగా) విడిచివేయుట (పురుషులకు) ఉచితముకాదని అర్థము స్ఫురించుచున్నది. యాజ్ఞవల్క్యస్మృతిలో నీభావమునే దెల్పు "రక్షేత్ కన్యాం పితా..."౩ అనుశ్లోకములోని "నస్వాతంత్ర్యం స్త్రియాః క్వచిత్" అనువచనమును గమనింపవచ్చును. ఇందు స్త్రీలవిషయమై సూచనయును పురుషులబాధ్యతను గ్రహింపక స్త్రీలను పురుషులు కేవలము ఆస్తులవిషయమున పరాధీనలనుగా అనగా హక్కులులేకుండానే యుంచవలెనను భావమును దెల్పుట సవ్యముగా కన్పడలేదు. శ్రుతిస్మృతులకాలపు ఆర్యసంఘమున స్త్రీలు కేవలము పరాధీనలుగానే యుంచబడినట్లు ఆగ్రంథములలోని సంగతులనుబట్టియు కనబడుటలేదు. (అప్పటిసందర్భములను బట్టి స్త్రీలకు పరాధీనత సాధారణలక్షణమని స్మృతికారుల భావమని ఒకవేళ తలచినను మన మందుచే సిగ్గుపడ నక్కరలేదు. ఆకాలమున ఇంగ్లండులోను, యూరపులోని యితరదేశములందును స్త్రీలనుగూర్చిన నిబంధనలును, స్త్రీలస్థితియు మనదేశములోకన్న ఇంకను చాలహీనముగా నుండినది.) అంతమాత్రమున ఎల్లకాలమును స్త్రీల నాస్థితిలోనే ఉంచవలెనని భావించుటయు భావ్యముగాదు. స్త్రీలను సరిగా ఆదరించిననే శుభము కలుగుననియు, లేనిచో హానికలుగుననియుకూడ మన శాస్త్రములలోను, స్మృతులలో కొన్నింటిలోను "యత్ర నార్యస్తు పూజ్యంతే రమంతే తత్ర దేవతాః" మొదలగు ప్రసిద్ధశ్లోకములందు చెప్పబడినది.౪

## ౨. హిందూలాలో ప్రాంతీయ భేదములు

హిందువులలో స్త్రీలహక్కుల విషయమై మన దేశమందలి ఆయా ప్రాంతములందు కొన్ని స్వల్ప భేద

---

౧. మనుస్మృతిలోని పైన జెప్పిన "పితా రక్షతి..." అనుశ్లోకమున కనంతరమున్న "కాలేఽదాతా పితా వాచ్యో వాచ్యశ్చానుపయన్ పతిః, మృతేభర్తరి పుత్రస్తు వాచ్యో మాతురరక్షితా" అను శ్లోక సందర్భమును బట్టికూడ పురుషులబాధ్యతను బోధించుటయే యీశ్లోకముల ముఖ్యాభిప్రాయముగా కనబడుచున్నది.

౨. "నర్భిక్షే ధర్మకార్యేచ...న స్త్రియై దాతుమర్హతి" (యాజ్ఞవల్క్యస్మృతి, అ. ౨, శ్లో. ౧౪౦, వ్యవహారకాండ). "సంబంధ...... నార్హసిత్వం సంబంధినో మే ప్రణయం విహంతుం". రఘువంశము ౨-వ సర్గ. వాటిలో 'న + అర్హతి' అను శబ్దపు అర్థమును గమనింపవచ్చును. "తస్మాన్నార్హా వయం హన్తుం" భగవద్గీత అ. ౧, శ్లో. ౩౭.

౩. రక్షేత్ కన్యాం పితా, విన్నాం పతిః, పుత్రాస్తు వార్ధకే, అభావే జ్ఞాతయ స్తేషాం న స్వాతంత్ర్యం స్త్రియాః క్వచిత్. (యాజ్ఞ. అ ౧, శ్లో. ౮౫.)

౪. ఇప్పుడున్న మనుస్మృతిలోని కొన్ని శ్లోకముల భావము పరస్పరవిరుద్ధముగా కనబడుచున్నది. ప్రస్తుతమున్న మనుస్మృతిశ్లోకములలో మనువంతకుపూర్వ మెప్పుడో చెప్పినట్లు కొన్ని సంగతులనుగూర్చి ఉదాహరింపబడినది. అసలు మూలగ్రంథ మిపుడు ప్రత్యేకముగా నెక్కడను దొరుకుటలేదు. ప్రస్తుతమున్న మనుస్మృతిలోనే శ్లోకములు అసలుప్రాచీనగ్రంథములోనివో, యేవి ప్రక్షిప్తములో నిర్ణయించుట దుస్సాధ్యముగా నున్నది.

ములు కలవు.౧ ఆగ్నేయప్రాంతమందున్న బంగాళీలలో మాత్రము మితాక్షరకన్న జీమూతవాహనుని 'దాయభాగ' గ్రంథమే అధికప్రమాణముగ నంగీకరింపబడుటచే, వారిలో భార్య, కుమార్తె, తల్లి, పితామహితప్ప తక్కిన యేస్త్రీకిని ఏసందర్భమునను యెట్టివారసత్వపు హక్కును లేదు. వారిలో మేనల్లుడు మొదలగుకొందఱు భిన్నగోత్రసంబంధులు, అనగా కొందరు పురుషబంధువులకు మాత్ర ముచితిస్థాన మీయబడినది. మఱియు తండ్రి పోయినమీదట సోదరులు సమిష్టిలోనున్నను, వారిలో (కొడుకులేకుండా) పోయినవారి వాటా మన ప్రాంతమందువలె మిగిలిన సోదరులకు కాక, చనిపోయినవారి భార్యలకు (లేనిచో కుమార్తెలకు) దఖలుపడును. మిగిలిన మనదేశమంతటను విజ్ఞానేశ్వరుని మితాక్షరయే ముఖ్యప్రమాణగ్రంథము. అయినను కొన్ని యితరగ్రంథముల ప్రామాణ్యమునుబట్టియు, ఆయాప్రాంతీయాచారభేదమునుబట్టియు, ఆయాప్రాంతములందు కొన్ని భేదములు గలవు. అందుకు స్త్రీలకు సంబంధించిన కొన్ని సంగతులుమాత్రమిక్కడసూచింపబడుచున్నవి. "వ్యవహారమయూఖము" ప్రమాణముగనాదరింపబడుబొంబాయి గుజరాతుప్రాంతమున తక్కిన అన్ని ప్రాంతముల కన్న మొత్తముమీద స్త్రీల కెక్కువహక్కులు కలవు. అందుచే నక్కడిస్త్రీలస్థితి మిగిలినచోట్లకన్న ఎక్కువ బాగుగా నున్నది. మిథిల, కాశీ మొదలగు ఉత్తరదేశమందంతటను స్త్రీల హక్కులు చాల తక్కువగను,సంకుచితముగను ఉన్నవి. మన మద్రాసుప్రాంతమున మొత్తము మీద ఈరెండుపద్ధతులకు మధ్యరకముగా నుండును. ఉ. బొంబాయిప్రాంతమున సవతితల్లి, కోడలు, అన్నదమ్ములభార్యలు మొదలగువారుకూడ వారసులు. తక్కినప్రాంతములందెచ్చటను అట్టిహక్కులు లేవు. బొంబాయియందు అప్పచెల్లెళ్లకు, అన్నదమ్ములపిల్లలకు, మనుమరాండ్రకు వారసత్వమేకాక దానవిక్రయాధికారముకూడ కలదు. మనమదరాసుప్రాంతమున వారికి వారసత్వ-అనుభవపుహక్కు కలదుగానిదానవిక్రయాదిపూర్తిహక్కులు లేవు. ఉత్తరదేశమున నిదివఱకు వారలకు ఎట్టివారసత్వముకూడ లేనేలేదు. ౧౯౨౯-వ సంవత్సరపు హిందూవారసత్వపుశాసనముచేమాత్రము మనుమరాండ్రకు అప్పచెల్లెండ్రకు వారసత్వఅనుభవమును, మేనల్లుళ్లకు జ్ఞాతులకన్న ముందుగా హక్కును కలిగినవి. ఈ శాసనము అయినను బంగాళీలకు వర్తింపజేయకపోవుట ఒకగొప్పలోపము. అందుచే సోదరి, మనుమరాళ్లు, బంగాళీలలో నిప్పటికిని ఎట్టివారసులు కారు.

స్త్రీకి దత్తతాధికారవిషయమున బొంబాయి ప్రాంతమున, భర్త నిషేధించకపోయినచో భర్తపోయిన మీదట నెవరియనుజ్ఞయు లేకుండ దత్తత తీసుకొనవచ్చును. ఉత్తరదేశమున, మిథిలాప్రాంతమందు (బీహారు) వితంతువుకు దత్తత చేసుకొనుట కెన్నడు నధికారమే లేదు. కాశీ, కలకత్తాప్రాంతమందు భర్త యనుజ్ఞతో చేసుకొనవచ్చును. మనప్రాంతమున భర్త యనుజ్ఞయున్న సరిసరి, లేనిచో సన్నిహితజ్ఞాతుల యనుజ్ఞ పొంది వితంతువు దత్తత జేసుకొనవచ్చును.౨

---

౧. ఇందులో నైరృతిదిశనున్న మళయాళప్రాంతమందు 'మరుమగదాయ' (మరుమగన్ = మేనల్లుడు) పురూలు ప్రాచీనాచారప్రకార మమలులో నున్నది. అందుచే ఆప్రాంతమున మృతుని యావదాస్తికిని వానికుమారుల కన్నను, భార్యవగైరాలకన్నను మేనల్లుడే దగ్గర వారసు హక్కుదారు అగుచున్నాడు. అందుచే పురుషుల అప్పచెల్లెండ్రకు తమ జనకకుటుంబములో ఆధారమును, పలుకుబడియు చాలహెచ్చుగా నుండును. మిగిలిన మనదేశమంతటను 'మగదాయం' అనగా కుమారుడు మొదలగువారికే హక్కు వ్యాపించియున్నది. పంజాబులోని హిందువుల హక్కులు చాలవరకు ఆచారము (Customary Law) ను బట్టియే నిర్ణయింపబడుచున్నవి.

౨. స్త్రీదత్తతాధికారమునకు నియమ మేర్పరుచు "నస్త్రీ పుత్రం దద్యా త్ప్రతిగృహ్ణీయా ద్వా అన్యత్రానుజ్ఞానాద్భర్తుః" అను వసిష్ఠవచనము ఆయావ్యాఖ్యాతలచే వేరువేరువిధములుగా అర్థముచేయబడినది. ఆప్రకార మాయాప్రాంతములందు ఈవిషయమై విభేదము కలిగినది.

ఉత్తరదేశమంతటను, వంగదేశమందుగూడ కుటుంబ విభాగసమయమందు తల్లికి ప్రత్యేకముగా నొకవాటా వచ్చును. మనప్రాంతమందుమాత్రము అట్టియేర్పాటు లేదు.

భారతదేశమున హిందువుల ప్రమాణ వ్యాఖ్యానములందును, ఆయా ప్రాంతముల యాచారములందును ఇట్టిభేదము లుండుటకు కారణము లనేకవిధములుగా నూహింపబడుచున్నవి. మనధర్మశాస్త్ర మూలగ్రంథము లగు స్మృతులు క్రీస్తుపూర్వమునను, తరువాత అయిదవ శతాబ్దములోపుగను రచింపబడినట్లూహింపబడు చున్నది. అప్పటికి హిందూమత ముచ్చదశలో నుండినది. తరువాత ౧౧-వ శతాబ్దమువఱకును హిందూబౌద్ధ మతముల సంఘర్షణ మధికముగా నుండినది. ఆకాలమున ధర్మశాస్త్రవ్యాఖ్యానగ్రంథములు విశేషముగా రచింపబడలేదో, లేక అవి బౌద్ధరాజులచే నశింపజేయబడినవో తెలియదు. ౧౧-వ శతాబ్దమునుండియు ఉత్తరదేశమంతటను, మహమ్మదీయులదాడి యధికమై హిందూమహమ్మదీయజాతులమధ్య సంఘర్షణము హెచ్చుగా నుండినది. 'మితాక్షరా'గ్రంథకర్త యగు విజ్ఞానేశ్వరులవారు యతియైనను, ఇప్పటి యతులవలె నుండక వ్యాస, వసిష్ఠాదులవలె హిందూజాతియొక్క లౌకికాధ్యాత్మిక పరిస్థితుల పరస్పరసంబంధమును గ్రహించి ఆ శతాబ్దమున మనదేశ ముఖ్యపరిపాలకులలో నొకరగు (ఆరవ) విక్రమాదిత్యునికి గురువుగాను, సహాయకుడుగాను ఉండి అప్పటి చాళుక్యరాజధాని యగు కళ్యాణపురియందు వసించుచు, అనుభవశాలురై ప్రజోపయోగమునకై ప్రామాణికముగా నీ "మితాక్షర" యను వ్యాఖ్యాన గ్రంథమును వ్రాసినటుల తెలియుచున్నది. అప్పుడు చాళుక్యరాజ్యము చాలవృద్ధియై కొంతకాల మాంధ్రదేశమునకును వ్యాపించెను. అప్పటి కాప్రాంతమున మహమ్మదీయసంఘర్షణములేనందున హిందూ మతాచారములు నైజస్థితియందే యుండినవి. నీలకంఠభట్టుని వ్యవహారమయూఖము వ్రాయబడిన ౧౭-వ శతాబ్దమున మహారాష్ట్రరాజుల యాధిపత్యమున పశ్చిమదేశపు హిందూసంఘ మింకను ఉచ్చదశయందే యుండినది.

కాని ౧౩-వ శతాబ్దమునుండియు ఉత్తరహిందూదేశమంతటను, కొంతవరకు దక్షిణమునకుగూడ దేశపరాధీనతవలనను మహమ్మదీయులదాడిచే కలిగిన సంఘర్షణవలనను హిందువుల ఆచారమునందును, అందు ముఖ్యముగ స్త్రీలవిషయమునను చాలమార్పులు కలిగినట్లు కనబడుచున్నది. మహమ్మదీయులదాడి తరువాత నాప్రాంతములందు వ్రాయబడిన హిందూధర్మశాస్త్ర వ్యాఖ్యానగ్రంథములందు స్త్రీలహక్కులవిషయమున తెలుపబడిన సంకుచితాభిప్రాయములకు మహమ్మదీయ సంఘర్షణముచే గలిగిన సాంఘికవిప్లవమే కారణమని యూహింపబడుచున్నది. స్త్రీలందరును బహిరంగముగా వీధులలోకి రానీయకుండు ఘోషాలో నుండు నాచారముగూడ నాకాలమునుండియే ఉత్తరహిందూదేశమంతటను వ్యాపించినది. అట్లే కాశీ, మిథిల మొదలగుప్రాంతములందు స్త్రీలహక్కులు చాలసంకుచిత మొనర్పబడినవి. బంగాళాప్రాంతమందు జనసంఖ్యలో సగము మంది ప్రజలు ముసల్మానుమతములో చేరిరి. ఆపరిస్థితి చేతను, ముసల్మానుల ననుకరించుటచేతను అక్కడ తీవ్ర మగుమార్పులు జరిగినట్లు కనబడుచున్నది.

## 3. కుటుంబాస్తిలో హక్కు

ముఖ్యముగ ఆస్తిహక్కులవిషయమున హిందూస్త్రీలకును, ఇతరజాతిస్త్రీలకును చాలభేదము కలదు. సోవియటు (బాల్షివికు) రష్యాదేశములోమాత్రము భూమి మొదలగుఆస్తియంతయు నిప్పుడు చాలవరకు ప్రభుత్వమువారిదే అయి, ఎక్కడిఆస్తి అక్కడ గ్రామప్రతినిధులచే ప్రజలందరి యుపయోగమునిమిత్త ముపయోగింపబడుచుండును. అందు స్త్రీలకును పురుషులకును సమానాధికారములే కలవు. ఎట్టిభేదమును గమనింపబడదు. అక్కడ వ్యక్తులకు స్వంతఆస్తి యుండుట కవకాశము చాలతక్కువ. అట్లు స్వంతఆస్తి ఉంచుకొనుట, సంపాదించుట అగౌరవముగా భావింపబడి నిరుత్సాహపరుపబడుచున్నది. (అక్కడ అన్నివిషయములందును స్త్రీలకు సమానహక్కులు కలవు.)

ఇక ప్రపంచమందలి యితరజాతు లన్నిటిలోను వ్యక్తులకు స్వంతఆస్తి యుండుట ఆయాదేశములన్యాయశాస్త్రములమూలసూత్రముగా నున్నది. అట్టి హక్కు ప్రతిదేశమునకు కలదు. అయితే పూర్వపు ఆర్యజాతులందు ఇప్పటి రష్యాలోవలె గ్రామపంచాయతీసంఘములకు చాలఅధికార ముండినటులు గనపడుచున్నది.౧ ఇక సమిష్టికుటుంబపద్ధతి అప్పుడు సర్వత్ర వ్యాపించియుండుటచే ఆస్తి సాధారణముగా నాయా కుటుంబముల సమిష్టి ఆస్తిగానే యుండెడిది. పాశ్చాత్యదేశపు ఆర్యులలో నీస్థితి కొద్దికాలముననే మారిపోయి వ్యక్తికుటుంబమును, వ్యక్తిగతాస్తియు నంతటను వేగముగా అమలులోనికి వచ్చినవి. సంఘస్థితి మారినకొలది ఆస్తిహక్కులును మార్పబడినవి. అచిరకాలముననే ఆస్తిహక్కు విషయమునను, వారసత్వవిషయమునను అచ్చటి స్త్రీలు పురుషులతో రమారమి సమానాధికారములను సంపాదించిరి. ఈవిషయమున మన హిందూస్త్రీల స్థితి చాల వెనుకబడియున్నది. మహమ్మదీయస్త్రీలు మొత్తముమీద నీరెండుజాతులవారికి సుమారు మధ్యస్థితిలో నున్నట్లు చెప్పవచ్చును.

పూర్వకాల మంత బలవత్తరముగా లేకపోయినను ఇప్పటికిని హిందువులలో కొంతవరకు సమిష్టికుటుంబపద్ధతి అమలులో నున్నది.౨ కుటుంబాస్తిని మేనేజిమెంటు చేయుటకు విభజింప గోరుటకు అందలి పురుష-మెంబర్లకే అధికారము గలదు కాని స్త్రీల కధికారము లేదు.౩ పురుషమెంబర్లంవరకు సమిష్టిఆస్తిలో వాటా వచ్చునుగాని భార్య, తల్లి, కోడళ్లు, మరదళ్లు, కుమార్తెలు, అప్పచెల్లెళ్లు మొదలగువారికి కుటుంబాస్తిలో వాటా పంచుకొనునధికారము లేదు. అందువల్ల కుటుంబము సమిష్టిలో నుండగా అన్నదమ్ములు మొదలగుపురుషులలో నొకరు

---

౧ ప్రాచీనార్యదేశమున తరములతరబడిని విభాగము లేకుండా సమిష్టిగానే యుండుటచే కుటుంబమొక గ్రామమున పూర్తిగా వ్యాపించియుండెడిదనియు, ఆగ్రామపురుషు లందరకు గ్రామపు ఆస్తి అంతయు సమిష్టిఆస్తిగా నుపయోగపడుచుండెడి దనియు స్త్రీలు అన్యగోత్రీయుల వివాహమాడుటచే నితర గ్రామములకు పోవలసియుండిరనియు కొందరు చరిత్రకారుల యభిప్రాయము. హిందూధర్మశాస్త్రమందలి "సపిండ" అనగా ఒకే ఆహారాశయము లేక క్షేత్రము కలవారు అనియు, ఇట్లే "సమానోదక" అనగా నొకజలాశయము (చెరువువంటిది) కలవారనియు "సగోత్ర" ఒకేపశువుల బీడుకలవారుఅనియు, అందలి పిండ, ఉదక, గోత్రశబ్దములు ఆప్రదేశనియమమును ప్రథమమున సూచించెడివనియు, అందుచే సాధారణముగా ఆప్రాచీనకాలమందు సపిండు లేకగ్రామమందును, సమానోదకులు సమీపగ్రామములందును, సగోత్రు లింకను కొంచెము దూరము వరకును వ్యాపించి, నివసించుచుండినట్లును కొందరు విమర్శకు లూహించుచున్నారు.

౨. అన్నదమ్ములేకాక పినతండ్రి పెత్తండ్రి కొడుకులు తాతా సహోదరులు మొదలగువారు కూడ విభక్తులైనట్లు రుజువు అయితే తప్ప వారందరు సమిష్టిగా నున్నట్లే యెంచవలెనని, ఆరుజువు బాధ్యత విభక్తులమను గరిపై కలదనియు ఇప్పటికిని హిందూలా రూలు అయియున్నది. [౪౮ మద్రాసు ౨౫౪ పేజి P. C., ౫౩ అలహాబాదు ౩౦౦ P. C.] (ప్రీవీ కౌన్సిలువారి తీర్పుకు P. C అనుచిహ్నము వేయబడును). ఇందు లాజర్నలు పేరు ఏమియు వ్రాయక వాల్యూం నెంబరున్ను మద్రాసు, బొంబాయి మొదలగు కోర్టుపేరు మాత్రం వేసినచో నట్టివన్ని ప్రభుత్వప్రకటితము లగు ఇండియనులారిపోర్టులని అని తెలియుచున్నది. (ఉ. ౪౮ మద్రాసు ౨౫౪ అనగా ఇండియనులారిపోర్టు ౪౮-వ వాల్యూం మద్రాసు ౨౫౪-వ పేజీలోని తీర్పు) సులభముగా దొరుకునని అధికారయుక్తము లగుటచే వీలైనంతవరకు ఇండియన్‌లా రిపోర్టులలోని తీర్పులే ఉదాహరింపబడినవి.

౩. ౩౧ కలకత్తా ౪౭౬ (భార్యవిషయము), ౯ లాహోరు ౩౨౪ (తల్లి విషయము).

కాలముచేసినచో అతని భార్యకు కుటుంబాస్తిలో నెట్టి వాటాహక్కు లేదు. వంగదేశమున దాయభాగపద్ధతి వారికిమాత్రమే తండ్రి పోయినతరువాత మిగిలిన సమిష్టివాటాదార్లలో నొకరు చనిపోయినచో అతని వాటా భార్యకు వచ్చును.౧ కాని మిగిలిన మన దేశమందటను కోడలు, వదిన, మరదలు మొదలగువారు తమభర్తలు పోయినచో కుటుంబాస్తిలో తమ కెట్టి వాటా లేక చాలచిక్కులు పడవలసివచ్చుచున్నది. ఆకుటుంబమునకు తనఖాస్తియున్నచో నట్టివారా మెకు కొంతమనోవర్తిమాత్ర మిప్పింపవచ్చును.౨ తనఖాస్తి లేకపోయినను, లేక ఆస్తియున్నను, ఋణములుండి, ఋణదాతలు ఆకుటుంబాస్తులపై చర్య జరిగించినను,౩ లేక కుటుంబవాటాదారులే తమకుటుంబాస్తిని ఇతరులకు విక్రయించివేసినను,౪ ఆమె కేవలము నిరాధారురా లగును. భర్తవాటాతోలూను తనుఖాస్తి లేనిచో మామగారికిగాని,౫ బావమరదులు మొదలగువారికిగాని ఆమెను పోషించుబాధ్యతలేదు.౬ సవతికుమారుడుగూడ ఆమెను పోషించుటకు కులాచారప్రకారము బాధ్యతలేదు.౭ మరియు సమిష్టికుటుంబవిభాగసమయమున అన్ని ప్రాంతముల జనులలోను తనభర్త కొడుకులు పంచుకొనునప్పుడునూ భర్తపోయినపిమ్మట కొడుకులే పంచుకొనినను, కొడుకులతోబాటు తల్లికిగూడ సమానముగ నొకవాటా వచ్చును. ఈహక్కు స్మృతిగ్రంథములో గూడ చెప్పబడినది.౯ కాని మద్రాసురాష్ట్రమునమాత్రము ఆహక్కుగూడ లేదు.౧౦ కుటుంబవిభాగసమయమున కొడుకులకు వచ్చువాటాలో ౧/౪ వంతు కుమార్తెకు వాటా యివ్వవలెనని శాస్త్రాధారముగల నియమము కలదు.౧౧ ఇది వివాహములేని స్త్రీకని కొందరు అర్థము

౧. ౩౧ కలకత్తా ౨౧౪.

౨. ౮ పాట్నా ౮౪౦ P. C.

౩. ౧ కలకత్తా ౩౬౫.

౪. ౨౭ మద్రాసు ౪౫. మనోవర్తికి క్రమమైన హామీ దస్తావేజుగాని, హామీతో డిక్రిగాని ఆమెయుందుగా పొందియుంటేమాత్రం ఆహామీఆస్తి దరిమిలాను క్రయమైనను మనోవర్తికి భంగముండదు. ౪౩ మద్రాసు ౮౦౦.

౫. ౩౭ మద్రాసు ౩౯౬.

౬. ౨ బొంబాయి ౫౭౩, ౬౩౨.

౭. ౯ బొంబాయి ౨౭౯.

౮. ౩౨, కలకత్తా ౨౩౪, ౩౭ బొంబాయి ౫౪, ౫౨ అలహాబాదు ౫౯౬.

౯. యది కుర్యాత్సమానాంశాన్ పత్న్యః కార్యాః సమాంశకాః, నదత్తం స్త్రీధనం యాసాం భర్త్రా వా శ్వశురేణవా. (యాజ్ఞ. అ. ౨, శ్లో. ౧౬౬)

పితురూర్ధ్వం విభజతాం మాతా ప్యంశం సమం హరేత్. (యాజ్ఞ. అ. ౨, శ్లో. ౧౨౪) 'మితాక్షర'లోగూడ నీవాటాహక్కు పూర్తిగ నంగీకరింపబడినది. ౩౧ కలకత్తా ౨౬౨, ౧౭ బొంబాయి ౨౭౧, ౩ అలహాబాదు ౮౮.

౧౦. ౬ మద్రాసు ౧౩౦.

౧౧. అసంస్కృతాశ్చ సంస్కార్యాః భ్రాతృభిః పూర్వ సంస్కృతైః, భగిన్యశ్చ నిజాదంశా ద్దత్వాంశం తు తురీయకమ్. (యాజ్ఞ. ౨-౧౨౫) ఈశ్లోకవ్యాఖ్యానమున 'మితాక్షర'లో "అనేన దుహితరోపి పితురూర్ధ్వం అంశభాగిన్య ఇతి గమ్యతే" అని చెప్పి ఆమోదింపబడినది.

మనుస్మృతిలో గూడ "స్వేభ్యోంశేభ్యస్తు కన్యాభ్యః ప్రదద్యుః భ్రాతరః పృథక్; స్వాత్స్వాదంశా చ్చతుర్భాగం పతితాఃస్యు రదిత్సవః (మను. ౯-౧౧౮) అని అప్పచెల్లెళ్లకు ౧/౪ వ వంతు వాటా యివ్వవలెనుటయేగాక అట్లు యివ్వనలపని అన్నదమ్ములకు పాతిత్యము కలుగుననిగూడ చెప్పబడినది. సోదరులలో నొకరు వాటాలసమయమందు లేకపోవుట గాని, వారిలో నొకరు చనిపోవుటగాని జరిగినచో సోదరులును, సోదరీలుగూడ ఆయాస్తిని సమానముగా పంచుకొనవలెనని మనుస్మృతిలో చెప్పబడినది. "సోదర్యా విభజేరం స్తం సమేత్య సహితా స్సమం, భ్రాతరోయేచ సంసృష్టాః భగిన్యశ్చ సనాభయః." (మను. ౯-౨౧౨)

చెప్పిరి. ప్రస్తుత మామూలు లేదనే హేతువు జెప్పి మనకోర్టులలో ఆశాస్త్ర మంగీకరించ లేదు. అందుచే కుమారుడు గాని, భార్యగాని ఉంటే యెట్టి నిరాధారులైనను కుమార్తెకు వాటాహక్కు లేదు.

## ౭. వారసత్వము.

మనహిందువులలో ముప్పాతికవంతు పైగా ఆస్తి పురుషులదే యనిచెప్పవచ్చును. సమిష్టికుటుంబనియమమే కాక వ్యక్తిగతాస్తికి వారసత్వపునియమములలో పురుషునికి ప్రాధాన్యమునిచ్చుటగూడ నిందుకు కారణము. మహమ్మదీయులలోను, క్రైస్తవులలోను ఏకకాలమందే చాలరకపువారసులకు చెరికొంతవాటా వచ్చుటకుగూడ నియమములు గలవు. కాని మనహిందువులలో ఆప్పటి కత్యంతసన్నిహితులుగా ఎంచబడు ఒకేరకపువారసులే యావదాస్తిని పుచ్చుకొనవలెను. మనలో ఒకనికిగా స్తియావత్తు వానియనంతరము పుత్రులకు (పుత్రులనగా కొడుకులు, వారికొడుకులు, మునిమనుమలు) సంక్రమించును. పుత్రులున్నచో భార్యకుగాని, కుమార్తెలకుగాని మరియెవరికిగాని యెట్టిహక్కును లేదు. ఇట్లే పుత్రులు లేనిచో యావదాస్తియు, భార్యయు ఆమెయనంతరము కుమార్తెలు ఇట్లే వరుసను అనుభవించవలెను. క్రైస్తవునికి పిల్లలు, బంధువులు లేనియెడల యావదాస్తి, పోయినవాని భార్యకు సంక్రమించును.[౧] పిల్లలు లేక బంధువులున్నచో భార్యకు సగమువాటాయున్ను, బంధువులలో సన్నిహితులకు సగమును చెందును. సంతానమున్నచో భార్యకు ౧/౩ వంతు వాటాయును, మిగిలిన ౨/౩ వంతులు సంతానమునకును సంక్రమించును.[౨] మహమ్మదీయులలో పిల్లలున్నచో భార్యకు ౧/౮ వాటాయును తల్లిదండ్రులకు చెరి ౧/౬ వంతు వాటాయును, పిల్లలకు మిగతవాటాయును వచ్చును. పిల్లలు లేనిచో భార్యకు ౧/౪ వాటాయును, తల్లితండ్రులున్నచో వారికి ౧/౨ వాటాచొప్పునను, మిగిలిన వాటా అన్నదమ్ములు మొదలగు సమీపబంధువులకును వచ్చును. అట్టివా రెవ్వరు లేక భార్యమాత్రము మిగిలినచో యావదాస్తియు భార్యయే తీసుకొనవచ్చును. పిల్లలులేక తండ్రి ఉన్నచో భార్య వాటాపోగా మిగిలినదంతా తండ్రి తీసుకోవచ్చును. (అనగా మహమ్మదీయులలో సమీపసంబంధముకలవారి కందరికి చెరికొంతవాటా రాక తప్పదు. ఈపద్ధతిని ఆస్తి పంపకము బంధువులందరికి లాభకరముగ నున్నను, ఆస్తి చాల వాటాలుగా విభజింపవలసివచ్చుటచేత, తరుచు తగవులు గలుగుచుండును. అందువలన మహమ్మదీయుని ఆస్తి కొనుటయనగా దావాను కొనుట యను వాడుక గలదు.

పిల్లలలోను, బంధువులలోను ఆస్తి దఖలుపడుటలోగూడ ఆయాజాతులలో భేదముగలదు. క్రైస్తవులలో పిల్లలుగాని, బంధువులుగాని, స్త్రీపురుషభేదములేక సమానముగా పంచుకొనవలెను. అనగా కొడుకులకును, కుమార్తెలకును సమానవాటాలే వచ్చును. ఇట్లే మనుములు, మనుమరాండ్రు సమానహక్కుదార్లు. పిల్లలు, లేక సోదరులు, సోదరీలు ఉన్నప్పుడుగూడ వారందరు సమానవాటాదార్లే అగుదురు. ఇట్లే మేనల్లునికి వచ్చునంతవాటా మేనగోడలుకును పంచవలెను. అన్నపిల్లలే సమీపబంధువులగుచో అన్నకొడుకులు, అన్నకుమార్తెలుగూడ సమానముగువాటాలు పొందవలెను. అందుచే క్రైస్తవులలో పురుషులకు వచ్చునంత ఆస్తి స్త్రీలకును వచ్చును. మహమ్మదీయులలో పురుషుని వాటాలో ఆబంధుత్వమే గల స్త్రీకి సగమువాటావచ్చును. అనగా కొడుకు, కుమార్తెయున్నచో కొడుకుకు రెండువాటాలును కుమార్తెకొకవాటాయున్ను, ఇట్లే సోదరుడు, సోదరియున్నచో సోదరునకు రెండువాటాలును, సోదరికొకవాటాయును వచ్చును. హిందువులలో కొడుకులున్నచో భార్య, తల్లి, కుమార్తె

---

౧. ఇది మనదేశీయ క్రైస్తవులకు. ఆంగ్లదేశమున బంధువులెవరును లేకపోయినను, భర్తవిల్లువ్రాయక చనిపోయినచో నందు సగము దేవారసుల ఆస్తివలె ప్రభుత్వమునకు చెందును.

౨. ఇండియన్ - సక్సెషన్ ఆక్టు (౧౯౨౫ సంవత్సరం) ౩౩ మొదలు ౪౯ వరకు సెక్షనులుచూడుడు.

మొదలగువారి కెట్టివాటా లేకుండ యావదాస్తిపుత్రుడే (పౌత్రుడు, ప్రపౌత్రుడును, పుత్రశబ్దమున చేరుదురు) తీసుకొనవలెను. పుత్రుడు లేనిచో భార్య, భార్య లేనిచో కుమార్తె, ఆమెయులేనిచో దౌహిత్రుడు, అతడును లేనిచో తల్లి, యిట్లు తండ్రి, అన్నదమ్ములు, సోదరపుత్రులు, జ్ఞాతులు, బంధువులు మొదలగువారు వరుసను, ఒకరితరువాతనొకరు యావదాస్తిని పొందుదురు. ౧ అందుచే మృతునికి కొడుకున్నచో, భార్యకుగాని, తల్లికిగాని, కుమార్తెలకుగాని అందులో నెట్టివాటాయు రానేరదు. మఱియు కొడుకులు లేనిచో భార్యకు, ఆమెయు లేనిచో కుమార్తెకును ఆస్తి యావత్తును దఖలుపడి, వారి యావజ్జీవము అనుభవింపవచ్చును. కాని ఆయాస్తిని తనయిష్టమువచ్చినప్రకారము తనఖా, క్రయం, దానం వగైరాలు జరుపుటకు ఇప్పటి 'లా' ను బట్టి ఆమె కధికారము లేదు. ౨ మఱియు మృతుడు చేసినఋణము లున్నచో ఆఋణదారు లాబాకీలనిమిత్తమాఆస్తినంతను కోర్టుద్వారా వేలం వేయించి, కొనివేయవచ్చును. అప్పుడాస్తి, పోషణ కాధార మండదు సరిగదా కాపురమున్నకుటుంబగృహముకూడ క్రయమైపోయినను తాను ఇల్లువిడిచి యెవరిపంచకైన పోవలసి యుండును. ౩ అట్టి ఋణ-దారులబాధ కలిగినప్పుడు, మహమ్మదీయస్త్రీలకు, హిందూస్త్రీలకన్న నెక్కువ హక్కులు గలవు. చనిపోవుటకుముందు, పురుషుడు తన భార్యవగైరాలకు వారసత్వపుహక్కు లేకుండ యావదాస్తిని తన కభిమానముగల యెవరిపేరనైన విల్లుద్వారా దఖలుపరుపవచ్చును. మహమ్మదీయ-లాప్రకారం పురుషుడు జబ్బుచేసి కాలంచేయుటకుముందు వ్రాయు విల్లు, లేక దానపట్టాలో భార్యమొదలగుతనసమీపవారసులకు తనఆస్తిలో ౩ వంతైనను యిచ్చితీరవలెను. ఇట్లు ఇవ్వకుండా యావదాస్తి యితరులపేర వ్రాసినను అది లాప్రకారము చెల్లదు. (Law of marz-ul-mout) హిందువులలో పుత్రులు లేనివారికి వారసులవరుసయు హక్కును యాజ్ఞవల్క్యస్మృతిలోని యీక్రిందిశ్లోకముచే నిర్ణయింపబడుచున్నది.

పత్నీదుహితరశ్చైవ, పితరౌ భ్రాతర స్తథా,
తత్సుతో గోత్రజో బంధు శిష్యసబ్రహ్మచారిణః.
ఏషా మభావే పూర్వస్య ధనభాగుత్తరోత్తరః,
స్వర్యాతస్య హ్యపుత్రస్య సర్వవర్ణే ష్వయంవిధిః. ౪

ఇందు దుహితరః (కుమార్తెలు) అయినతరువాత 'చ' అనుఉపసర్గచే మితాక్షరప్రమాణముపైని దౌహిత్రులుకూడ జేర్చబడిరి. మరియు 'పితరౌ' అనుశబ్దము మాతాపితరౌ అని ఏకశేషసమాసముగా అన్వయింపబడి తల్లిదండ్రులుభయులు వరుసగా వారసులని యర్థము చేయబడినది. ౫ ఆయర్థము కోర్టులచే నంగీకరింపబడినది.

---

౧. పత్నీదుహితర శ్చైవ పితరౌ భ్రాతర స్తథా,
తత్సుతో గోత్రజో బంధుశిష్యసబ్రహ్మచారిణః.
ఏషా మభావే పూర్వస్య ధనభాగుత్తరోత్తరః,
స్వర్యాతస్య హ్యపుత్రస్య సర్వవర్ణే ష్వయంవిధిః.
యాజ్ఞ. ౨-౧౩౫,౧౩౬.

౨. ౧౧ మూర్స్ఇండియన్ అప్పీల్స్ ౧౩౯, ౪౮౫ (భార్య,)

మద్రాసు ౩౯౦ (కుమార్తె)

౮ మద్రాసుహైకోర్టురిపోర్టు ౮౮ (తల్లి)

మితాక్షర మొదలగుకొన్నిగ్రంథములలో వారికి సంపూర్ణహక్కులే చెప్పబడినను, మన ప్రస్తుత కోర్టులావచనముల నంగీకరింపలేదు. బొంబాయిప్రాంతమున కుమార్తెకు పూరాహక్కు అంగీకరింపబడినది.

౩. ౧౨ మద్రాసు ౨౬౦.

౪. (యాజ్ఞ. అ ౨ శ్లో ౧౩౫, ౧౩౬)

౫. బొంబాయిగుజరాతుప్రాంతమున 'వ్యవహారమయూఖ' ప్రమాణమునుబట్టియు, బంగాళీలలో 'దాయభాగ' ప్రమాణమునుబట్టియు తల్లికన్న తండ్రియే సపిండత్వముచే దగ్గరవారసు. ౬ బొంబాయి ౫౪౧; మిగిలిన అన్నిప్రాంతములందును తండ్రికన్న తల్లితోనే రక్తసంబంధ మధికమనుకారణమున మితాక్షరప్రమాణమును బట్టి తల్లియే తండ్రికన్నదగ్గరవారసు. ౩౭ అలహాబాదు ౧౧౪.

విజ్ఞానేశ్వరకృతమగు మితాక్షరయందు పైశ్లోకముపై వ్యాఖ్యానమును జూడుడు. ఈశ్లోకమునందలి "భ్రాతరః" అనుపదమునకు అన్నదమ్ములనిమాత్రమే అర్థము అంగీకరింపబడుచున్నది. కాని "భ్రాతరః స్వసారశ్చ భ్రాతరః" అని అన్నదమ్ములు, అప్పచెల్లెళ్లుకూడ వరుసగా వచ్చునట్లు ఏకశేషసమాసముగా అర్థము చేయుట కవకాశముగలదు. పాణిని అష్టాధ్యాయిలోని "పుమాన్ స్త్రియా" (౧-౨-౬౭), "భ్రాతృపుత్రౌ స్వసృదుహితృభ్యాం" (౧-౨-౬౮) అనుసూత్రములను బట్టి 'భ్రాతరః' అనగా అన్నదమ్ములు, అప్పచెల్లెళ్లనుకూడ శాస్త్రీయమైన వ్యాకరణనిష్పత్తి కలుగుచున్నది. ఇట్లే యీశ్లోకములోని 'తత్సుతః' అనుశబ్దముచే అన్నదమ్ములకొడుకులుకాగానే మేనల్లుళ్లుకూడ నుద్దేశింపబడినట్లు చెప్పవచ్చును. మఱియు 'పుత్ర' శబ్దముచే పౌత్రులవలెనే 'దుహితరశ్చ' అనుశబ్దముచే మనుమరాండ్రనుకూడ నని గ్రహించుట కవకాశము గలదు. ఇట్లు మనుమరాళ్లును, సోదరియు, భాగినేయులును జ్ఞాతులకన్న చాలదగ్గరవారసులని పైశ్లోకములోని శబ్దములవలననే గ్రహింపదగునని తోచుచున్నది. ఈశబ్దముల కాయర్థమే సరియనియు, స్మృతికారుల భావము ప్రకారమును, మితాక్షరప్రకారమును, సోదరులు లేనిచో సోదరీలు అనంతరవారసు లగుదురనియు, మితాక్షరపైని తాము వ్రాసినవ్యాఖ్యానములో బాలంభట్టియు, ౧ నందపండితుడును అంగీకరించిరనియు, అయినను ఇందులకొప్పుకొనమని నీలకంఠభట్టుడు వ్యవహారమయూఖములోను, ఈయనసమీపబంధువగు కమలాకరభట్టుడు వివాదతాండవమునను తెలిపిరి. నీలకంఠభట్టుడు అందుకు చెప్పినకారణము "విరూపైకశేషే మానాభావాత్" అనగా విరూపైకశేషసమాసము సబబు లేదనుట సరిగా కనబడదు. ౨ అందుకు స్పష్టముగా పైని చెప్పినవ్యాకరణసూత్రము లుండుటయేగాక యీ శ్లోకములోనే 'పితరౌ' అనుశబ్దమున కట్లే ఏకశేషమును వీరును అంగీకరించియే యున్నారు. అట్లయినచో సోదరులకును, సోదరీలకును ఏకకాలమందే హక్కు కలిగి యుభయులమధ్య వాటాలపంపకము కలుగునని కమలాకరుడు చెప్పుకారణములును తృప్తికరముగాలేవు. తల్లిదండ్రులవలెనే యిచ్చటను ఒకరితరువాత నొకరు అని అర్థము చేయవచ్చును. 'తత్సుతః' అనుచోట మేనల్లుళ్లు గావలసివచ్చుననుటయుప్రతిబంధకముగాలేదు. దూరజ్ఞాతులకన్న ముందుగా భాగినేయుల కాస్తివచ్చుట రక్తసంబంధమునుబట్టియు, దాయభాగ సిద్ధాంతమును బట్టియుకూడ న్యాయముగానే యున్నది. మఱియు పరాశరమాధవీయమున నుల్లేఖింపబడిన "యా తస్య భగినీ సా తు తతోంశం లబ్ధుమర్హతి, అనపత్యస్య ధర్మోయం అభార్యాపితృకస్య చ" అనుబృహస్పతివచనమును "చశబ్దేన భ్రాతృమాతృభావసముచ్చయః" అనుమాధవాచార్యులవారి ౩ వ్యాఖ్యయుకూడ సోదరికి ఈస్థానమునే సూచించుచున్నది. ఇంతేకాక స్మృతులలోను, మితాక్షరలోనుగూడ సోదరికిని, భాగినేయులకునుకూడ వారసత్వమునకు, జ్ఞాతులలోను, బంధువులలోనుగూడ మరియొకస్థలమేదియు కనపరచకపోవుటచే వారివారసత్వస్థానము సోదరులయనంతరము, జ్ఞాతులపూర్వము అని తలచుటయే భావ్యముగ నున్నది. ౪ ఈశ్లోకములో భ్రాతృపుత్రులు లేనిచో 'గోత్రజులు' అనంతరవార

౧. ఈ 'బాలంభట్టి' యను వ్యాఖ్యానగ్రంథమును 'లక్ష్మీదేవి' యను ధర్మశాస్త్రజ్ఞురాలగు స్త్రీ రచించినదని కొందరును అట్లుకాదు ఎవరోపురుషుడే రచించినాడని కొందరును చెప్పుచున్నారు.

౨. 'పితరౌ' అనుశబ్దమునకు మాతాపితరులు అని అర్థముచెప్పుటకు కూడ విరూపైకశేషసమాసమే చేయబడి అంగీకరింపబడినది. "పితా మాత్రా" అను పాణినిఅష్టాధ్యాయిలోని యీఅధ్యాయము (౧-౨-౭౦) లోని సూత్రము చూడుడు.

౩. విజ్ఞానేశ్వరులవలెనే మాధవాచార్యులవారుకూడ హిందూస్వతంత్రరాజులకు సలహానిచ్చుచుండిరి. వారు విద్యానగర(విజయనగరపు) సామ్రాజ్యప్రభువులమంత్రి. వారికే విద్యారణ్యులని నామాంతరమని కొందరును, విద్యారణ్యులువీరిసోదరులని కొందరును చెప్పుచున్నారు.

౪. ఈసందర్భమున ౯ M I A ౧౯౯ P C యును, ౪ బొంబాయి ౧౨౨ యును చూడవచ్చును.

సులు అని చెప్పబడినది. ఈగోత్రజశబ్దమునకు సగోత్ర సపిండులగుపురుషులని అధునికవ్యాఖ్యానములందు చెప్ప బడినప్రకారము ప్రస్తుతపు బ్రిటిషుకోర్టులన్నిటిలోను అంగీకరింపబడినది. కాని పూర్వకాలమున ఈయర్థమే యుండినదనుటకు వీలులేదు. "గోత్రజ" అనగా ఆ గోత్రమున, లేక వంశమున పుట్టినవారని శబ్దార్థము. దానికి సపిండులని యితరశాస్త్రకారులు అర్థముచేసి సపిండులలోగూడ సమీపమైనవారు సమీపవారసు లగుదురని చెప్పబడినది. మితాక్షరవ్యాఖ్యానము దీ శబ్దముపై వ్యాఖ్యానముచేయుచు, పితృసంతానమువారు లేనిచో, పితామహసంతానమునారును లేనిచో, ప్రపితా మహసంతానము యిట్లు వరుసగా సపిండులని గ్రహింప వలెనని చెప్పబడినది. ఇందలి సంతానశబ్దముచే పురు షులు, స్త్రీలుకూడ అర్థమగును. కాని కేవలపురుషులే యని అర్థముచేయ నవసరము కనబడదు. అనగా సపిండస్త్రీలుగూడ న్యాయముగా వారసత్వపుహక్కు కలిగియుందురు. ఈహక్కు 'వ్యవహారమయూఖ'లో నంగీకరింపబడి ఆప్రకారము బొంబాయిలోను, గుజ రాతులోను అట్లే అమలులో నున్నది.

వారసత్వేన దఖలుపడు ఆస్తుల విషయమున హిందూ స్త్రీలకును, మహమ్మదీయులు, క్రైస్తవులు మొదలగు ఇతరజాతులస్త్రీలకును వారివారి న్యాయ శాస్త్రములనుబట్టి గలభేదములలో రెండుముఖ్యమైనవి కలవు. క్రైస్తవుల లాప్రకారము రక్తసంబంధమునుబట్టి బంధుత్వమునన్నవారు పురుషులైనను, స్త్రీలైనను గూడ హక్కుదారు లగుదురు. (ఉ: అన్నకుమారునితోనే అన్నకుమార్తెయు సమానవారసు) మహమ్మదీయులలో స్త్రీకిని పురుషునితోపాటు వారసత్వపుహక్కు కలదు. కాని పురుషునికి వచ్చువాటాలో అర్థభాగమే స్త్రీకి వాటాగా పంచిపెట్టబడును. అట్టి బంధుత్వముగల పురు షులు లేనిచో యావదాస్తిని స్త్రీబంధునే తీసుకొని పూరాహక్కులతో అనుభవింపవచ్చును. మన హిందు వులలో రక్తసంబంధమునుబట్టి అత్యంత సన్నిహితులైన కొందరు స్త్రీలకు, అనగా భార్య, కుమార్తె, తల్లి, నాయ నమ్మ, మనుమరాలు, సోదరి–వీరలకు మాత్రమే వారస త్వపుహక్కు గలదు. సోదరియు, మనుమరాండ్రునుసంద ర్భములోను వారసు లగుదురా యనుసంగతి మన కోర్టు లలో చాలకాలమువరకు సందిగ్ధముగాను, వారికి వ్యతి రేకముగాను ఉండినది. ౨ యాజ్ఞవల్క్య స్మృతిలో "పత్నీ......భ్రాతర స్తథా" అను శ్లోకమునను, ఇతర ధర్మశాస్త్రగ్రంథములందును సోదరునిగూర్చియు, మను మరాండ్రను గూర్చియు స్పష్టముగా వక్కాణించ లేదనుటయే యిందుకు కారణము. కొంతకాలమైనమీదట సోదరి వారసుగా నెంచబడెను గాని జ్ఞాతులందరు లేనపుడుమాత్రమే అక్కచెల్లెళ్లకు హక్కు కలుగునని తీర్పు ఏర్పడినది. మేనల్లుళ్లస్థితియు నట్లే యుండినది. 3 అందుచే దూరజ్ఞాతులుగూడ ఏకకుటుంబజాతలగు సోదరిమొదలగువారి కాస్తిహక్కు లేకుండ అడ్డము

౧. "సపిండు" లనగా తండ్రివైపు ఏడవ తరము, తల్లివైపు అయిదవ తరములోపువారు. "పంచ మాత్సప్తమాదూర్ధ్వం మాతృతః పితృత స్తథా."

—యాజ్ఞవల్క్యస్మృతి. అ. ౧. శ్లో. ౫3.

౨. ౫ అలహాబాదు 3౧౧, ౧౧ M. I. A. ౮౦౨.

సోదరి సపిండురాలని ౨ బొంబాయి 3౭౭ లో బొంబాయిహైకోర్టువల్లను, సోదరిసపిండురాలుకాదు గాని దూరపువారసుమాత్రము అగునని ౭ మద్రాసుహై కోర్టు రిపోర్ట్సు ౭౭ ప్రథమపర్యాయము మన ప్రాంతము నను సోదరికి వారసత్వ మంగీకరింపబడినది.

3. సోదరీపుత్రుడు యేస్థితిలోను వారసుకాడని I. M. J. A 3౭౬ లో ప్రీవీకౌన్సిలువారిచే ఎంచబడి తరువాత 12. M. I. A. ౮౭౭ తిరిగి అతడు బంధు వుగా జ్ఞాతులతరువాత వారసగునని అంగీకరింపబడినది. భాగినేయుడు చనిపోయిన వాని పితృపితామహప్రపితా మహులకు తానును తర్పణాదులు చేసి వారికి ఉత్తమ గతి కలిగింపగలడను కారణమున నతనికి జ్ఞాతులకన్న సమీపస్థానమును జీమూతవాహను డిచ్చెను. ఇది బంగా ళీలలో నమలులో నున్నది.

వచ్చుట చాల అన్యాయకారణ మగుచున్నందున Hindu Law of Inheritance Act (II of 1929 అను చట్టము చేయబడి ఆప్రకారము జ్ఞాతులకన్న మనుమరాండ్రును, సోదరీలును, మేనల్లుళ్లును దగ్గరవారసులుగా ఏర్పాటుచేయబడినది. ఈ శాసనముప్రకార మైనను ఆస్త్రీలకు యావజ్జీవపుహక్కుమాత్రమే యుండును. ఈ ఆక్టు బంగాళీలకు వర్తింప దను నియమము గూడ చేయబడినది. మఱియు ఆస్త్రీకి కడపటి హక్కుదారు అగు పురుషుడు ౧౯౨౯-వ సంవత్సరమునకు పూర్వమే చనిపోయియున్నచో అట్టి ఆస్తులకు ఈ ఆక్టు వర్తించదని యిటీవల మద్రాసు హైకోర్టు వారు తీర్పునిచ్చిరి.[౧] (ఉ: ౬ సం.ల క్రిందట నొకడు చనిపోయి అతనిభార్యయో, కుమార్తెయో అప్పటినుండి అనుభవించుచు, యీ ఆక్టుకు దరిమిలాను ఆమె చనిపోయినను ఆయాస్తి యీ తీర్పుప్రకారము జ్ఞాతులకే పోవలెనుగాని సోదరి మొదలగువారికి చెందదు. ఈ ఆక్టు అట్టి కేసులకు వర్తింపదనుట కీతీర్పులో చెప్పిన కారణములు తృప్తికరముగ లేవు. ఈ తీర్పుచే నీ ఆక్టు ప్రస్తుతము చాల వరకు ఉపయోగము లేకుండ బోవుచున్నది.) వీరు లేనిచో యావదాస్తిని ఎంతదూరపు జ్ఞాతియైనను, తన జ్ఞాతిసంబంధమును రుజువుచేసుకుని యావదాస్తిని తీసుకొనవచ్చును. అట్టి జ్ఞాతికన్న చాల సమీపబంధుత్వమున్న స్త్రీలకు ఎట్టి హక్కులేదు. సరికదా, సపిండబంధుత్వముగల పురుషులుగూడ తమ బంధుత్వ సంబంధము మధ్యను ఒకచోటనైనను స్త్రీద్వారా సంబంధమైనచో వారికిగూడ జ్ఞాతిత్వపుహక్కులేదు.[౨] పాడుగుననూ పురుషులద్వారానే సంబంధముగలవా రెంత దూరపుజ్ఞాతులైనను వారు సగోత్రులను కారణముచే తమకన్న చాల సన్నిహితసంబంధము కలిగియున్న బంధువు లనగా భిన్నగోత్రసపిండులకన్న దగ్గర వారసులుగా నెంచబడుదురు. (ఉ: పదిహేనుతరముల దూరమున నున్నజ్ఞాతియగు పురుషుడు, మేనత్తకొడుకు, పెత్తల్లికొడుకు మొదలగు సన్నిహితాత్మబంధువులకన్న దగ్గరవారసు.) అందుచే స్త్రీలకే కాక వారిసంతతిపురుషులకుగూడ చాల నష్టము కలుగుచున్నది. మఱియు మేనత్త, పెత్తల్లి మొదలగు కొందరు సన్నిహిత బంధువులగు స్త్రీలు ఎట్టి పురుషవారసులు లేనప్పుడు మాత్రమే వారసులగుదురు. ఎంతదూరపు బంధువుగాని పురుషవారసు ఉన్నచో అంతకన్న సన్నిహిత సంబంధమున్నను స్త్రీబంధువులకు హక్కు లేదు.[౩] మఱియు హిందూలాప్రకారం అన్నకుమార్తెదగ్గరబంధువైనను ఉత్తరదేశమందు ఆమెగూడ ఎన్నడును వారసు కాదు. అనగా చనిపోయినవానికి అన్నకుమార్తెర, మేనకోడలు, వదినకోడలు ఉన్నను వారికెవ్వరికిని ఎన్నడును వారసత్వము రాదు. అనగా చనిపోయిన వానికి ఇక నెట్టిదూరజ్ఞాతులును, బంధువులును పురుష

౧. ౯ లావీక్లీ ౬౩.

౨. ౩౨ అలహాబాదు ౫౯౪.

౩. ౪౮ బొంబాయి ౫౬౯ P. C. (పెత్తండ్రికుమార్తెకన్న మేనత్తకుమారుడు దగ్గరవారసు. ౧౩ మద్రాసు ౧౦ (మేనత్తకన్న మేనమామ సమీపవారసు) ౪౫ బొంబాయి ౩౫౩ (అన్నకుమార్తెకన్న పినతల్లికొడుకు దగ్గరవారసు.)

౪. బొంబాయిప్రాంతమున మాత్రమే మృతుని కైగుతరములలోపుననుండు స్త్రీలందరు బంధువారసులుగా నెంచబడుచున్నారు. అన్న లేక తమ్మునికుమార్తెరు పూరాహక్కు లంగీకరింపబడినవి. మరియు మేనత్త సపిండురాలుగా నెంచబడుచున్నది. మన మద్రాసుప్రాంతమున అట్లు లేదుగాని స్త్రీబంధువులలో సోదరి, మనుమరాలు, అన్నదమ్ములు లేక అప్పచెల్లెళ్ల కుమార్తెలు, మేనత్త యావజ్జీవపు హక్కుమాత్రము గలబంధువులుగా నెంచబడుచున్నారు. కాశీ మొదలగు ఉత్తరదేశములం దాహక్కులుగూడ వీరికి లేవు. ౧౯౨౯ సంవత్సరపు హిందూవారసత్వచట్టపు హక్కులుమాత్రము వీరి కిపుడు అన్వయించును. వంగీయుల కదియూ లేదు.

లెవ్వరు లేకపోయినను ఆయాస్తిఅంతయు సర్కారు కైనను చెందవలసినదేగాని పైనచెప్పిన స్త్రీల కేసంద ర్భములోను చెందదు. ఒకస్త్రీకి చిన్నవయస్సునగనే భర్త కాలముచేసి తరువాత కొద్దికాలమునకు మామగారు లేక బావ, మరది ఎట్టిసంతానమును లేకుండ చనిపోయె ననుకొనుడు. చనిపోయినవాని కిక నెట్టిబంధువులును లేక పోయినను, కోడలుగాని మరదలుగాని, వదినగారు గాని ఒక్కరితమాత్రమే మిగిలినను ఆమె హిందూలా ప్రకారం వారసుకానందున ఆమె కాయాస్తి సంక్రమించక గవర్నమెంటుకే చెందును. ఇక దూరబంధుత్వముగల స్త్రీలసంగతి, పురుషవారసులభార్యలసంగతి వేరే చెప్ప నక్కరయే లేదు. ౧

స్త్రీవారసత్వ విషయమున 'హిందూలా 'కును యితర'లా'లకును ఇంకొక ముఖ్యభేదము గలదు. ఇతర'లా'లలో స్త్రీలు వారసత్వేన తమకు సంక్ర మించుఆస్తిని, తమ స్వంతఆస్తివలె విక్రయం, దానం వగైరాలు చేసుకొనుట కధికారముగలదు. కాని ప్రస్తుత హిందూలాప్రకార మట్లు లేదు. వారసత్వేన ఆస్తి పొందగల తల్లి, కుమార్తె, భార్య మొదలగు కొద్దిమంది స్త్రీలకు గూడ ఆయాస్తిని తమ కుచితమని తోచిన ప్రకారము తనఖావిక్రయం దానమువగైరాలు జరిగించ కూడదు. తమ యావజ్జీవము వాటిపై ఆదాయముమాత్ర మనుభవించి, కొన్నివిహితములు ముఖ్యములగు కుటుం బావసరములు మొదలగువాని నిమిత్తముమాత్రమే ఆ యాస్తులను సరియైన ధరకు అన్యాక్రాంతము చేయ వచ్చును. మఱియు తనభర్తకు సద్గతికలుగుటకు కొన్ని సమయములందు స్వల్పాస్తి దానము చేయవచ్చునుగాని విద్యాసంస్థలు, ఆసుపత్రులు మొదలగు సామాన్యముగా ప్రజోపయోగకరములగు కేవల ధర్మకార్యములకు వేటి కిని ఆమె తనకు సంక్రమించిన ఆస్తిని ఇచ్చుటకు హక్కు లేదు. ౨

---

౧. ౩౭ మద్రాసు ౭౯౩, ౧౮ మద్రాసు ౧౬౮.

౨. ప్రస్తుతపు లాప్రకారం భర్తకు ఉత్తమగతి కలిగించునవగు పనులనిమిత్తముమాత్రమే స్త్రీకి అన్యాక్రాంతము చేయుఅధికారము కలదు. ౪౩ అలహాబాదు ౪౬౩, ౪౧ అలహాబాదు ౧౩౦.

భార్య చేయు ధర్మకార్యములలో ఏవి భర్తకు సద్గతి కలిగించును, ఏవి కలిగింపవు అనుసంగతి నిర్ణయించుట కోర్టులకుకూడ కష్టముగా నున్నది.

౪౪ అలహాబాదు, ౫౦౩ P. C., ౩౩ అలహాబాదు ౨౫౫,

౪౩ కలకత్తా ౫౭౪, ౧౦ పాట్నా ౪౭౪.

# పార్టీప్రభుత్వము
## ( Party Government )

మలపాక వేంకటాచలపతి

రాజకీయప్రపంచములో ప్రజాస్వామిక ప్రభుత్వ ముత్తమోత్తమమని చాలా మంది ఒప్పుగుంటారు. అట్టిప్రజాస్వామిక ప్రభుత్వానికి పార్టీప్రభుత్వము పట్టుకొమ్మ.

"ప్రజాస్వామికప్రభుత్వము" (Democracy) అంటే ప్రజలను ప్రజలే (లేక వారి ప్రతినిధులు) ఏలుతారు. ఇట్టిప్రభుత్వానికి పార్టీప్రభుత్వం ముఖ్యావసర మైనది. పార్టీ ప్రభుత్వ మనగా రాజకీయంగా ఒకే అభిప్రాయము గలవారి ప్రభుత్వము ప్రతిఅభిప్రాయానికి అనుకూలురు, ప్రతికూలురు ఉంటారు. ప్రతిసంస్థలోనుగూడా ఇంతే... అట్లే రాజకీయసమస్యలలోకూడా అనుకూలురు, ప్రతికూలురు ఉంటారు. ఈవిధంగా పక్షీ ప్రతిపక్షు లేర్పడతారు. ఏఒక్కవ్యక్తి తన అభిప్రాయం, ఉద్దేశం ఆచరణలోకి రావాలంటే ఒంటరిగా ఏమీ చేయలేడు. కాని, సంఘంగా ఉన్నట్లయితే అట్టి అభిప్రాయాలు ఆచరణలోకి వస్తాయి. అందుచేత ప్రత్యేక వ్యక్తులు తమ అభిప్రాయాలతో ఏకీభవించే వ్యక్తులతో జేరి సంఘాలుగా ఏర్పడి ఎన్నికలలో అధికసంఖ్యను (Majority) సంపాదించి ప్రభుత్వమును నడప ప్రయత్నిస్తారు.

పార్టీ లనేకవిధములుగా ఏర్పడవచ్చును. ఆర్థికంగాను, ప్రత్యేకజాతుల బాగుకోసం, ఒక్కొక్కసమస్యకోసం, మతంకోసం — ఇంకా అనేకవిధాలుగా ఏర్పడవచ్చును. కాని ముఖ్యమైన పార్టీలు నాలుగింటిని సులభంగా గుర్తించవచ్చు.

(i) Radicals : ప్రస్తుత సంస్థల నన్నిటిని సమూలంగా పెరికివేయదలచువారు.

(ii) Reactionaries : పురాతనపద్ధతులకి మరల ప్రయత్నించేవారు.

(iii) Liberals : ప్రస్తుతసంస్థలను పరిష్కరించదలచేవారు.

(iv) Conservatives : ప్రస్తుత సంస్థల నట్లే యుంచదలచువారు.

పార్టీప్రభుత్వం బ్రిటిషువారియొక్క ప్రత్యేక సొమ్మని అంటారు. దాని నుపయోగించి అభివృద్ధిలోకి వారే తీసుకువచ్చారు. ఇది ప్రజాస్వామికప్రభుత్వంలోనే గాని రాచరికం (Monarchy), భూస్వామికం (Oligarchy) మొదలగు ఇతరప్రభుత్వాల్లో పనిచేయదు. 'రాచరికం' (Monarchy)లో రాజు తన యిష్టమువచ్చినట్లు పాలిస్తాడు. ప్రజల యిష్టానిష్టాలతో రాజుకి పనిలేదు.

భూస్వామికప్రభుత్వంలోకూడా అంతే. కాని ప్రజాస్వామికప్రభుత్వంలోను, పార్లమెంటరీ ప్రభుత్వంలోను పార్టీలు ఆటపట్టు. ప్రజలే పాలకులవడంచేత ప్రతినిధుల నెన్నుకోవడం, ఆప్రతినిధులలో అధికసంఖ్య (Majority)గల పార్టీప్రభుత్వ-పగ్గాల్ని పుచ్చుకోవడం, వారు శాసనసభ ( Legislature )లో తమ మాట నెగ్గేటట్లుగా అధికసంఖ్యాకులుగా నుండేటట్లు చూచుకోవడం జరుగుతుంది. ప్రజా బాహుళ్యము (Majority of the people) యొక్క అభిప్రాయం తెలుసుకోవడాని కింతకంటె అనువయిన మార్గం లేదు.

పార్టీలయొక్క కట్టుబాట్లు(Organization) వివిధదేశాల్లోను వివిధమార్గాలుగా ఉంటుంది. కాని అందరికి సామాన్యమైన కట్టుబాట్లను మనము గుర్తింపవచ్చు. ప్రతి పార్టీకి ముఖ్యనాయకు డొకడుంటాడు. అతని యొక్క ఉద్దేశాలకి, అతని పార్టీఉద్దేశాలకి తేడా ఉండదు. ప్రతిపార్టీలోనివారు ఆ పార్టీ యొక్క రాజకీయసమస్యలలోను, ఆశయాల్లోను ఏకీభావం పూనిఉంటారు. లేకపోతే ఆపార్టీనుంచి వెళ్లగొట్టబడి రాజకీయ-గబ్బిలాయి (Political Orphans) లవుతారు. అందుచేత ప్రతివాడు, అనగా రాజకీయంలో పాలుతీసుకుందామనే ప్రతివ్యక్తి ఏదో ఒక పార్టీకి చెందిఉంటాడు.

ప్రతిపార్టీయొక్క ఆశయం ఎక్కువ ప్రతినిధుల్నితనపక్షంలో చేర్చుకుని ప్రభుత్వ-పగ్గాల్ని పట్టుకుందామని. ఒక పార్టీప్రభుత్వాన్ని తీసుకోవడంతోటే తక్కిన పార్టీ (లేక పార్టీలు) నెగ్గిన పార్టీ నెట్లాగైన పదభ్రష్టుల్ని చెయ్యడానికి బ్రహ్మాండప్రయత్నాలు చేస్తుంది.

దేశంలో అనేకపార్టీ లుండొచ్చు నని యిదివరకు తెలుసుకున్నాం. రెండుపార్టీలు అనేకపార్టీలకంటె మంచివని కొందరి అభిప్రాయం. రెండుపార్టీలవల్ల నష్టాలు కూడా చూపిస్తారు చాలమంది. అనేకపార్టీ లుంటే ఏఒక్క పార్టీగాని అధికసంఖ్యగా (Majority) నుండలేదు. అందుచేత రెండుమూడుపార్టీలు కలసి ప్రభుత్వంగా ఏర్పడాలి. ఇట్లా పార్టీలు కలుపుగోవడం చాల కష్టం. లంచా లిచ్చి, ఉద్యోగాలు ఆశపెట్టి, వారి రాజకీయ ఆశయాల్ని తీరుస్తామని చెప్పి ప్రభుత్వ పార్టీ ఏర్పడాలి. ఎంతకష్టంగా ఏర్పడుతుందో అంత సులభంగా విడిపోతుంది. అందుచేత ప్రభుత్వానికి స్థిరత్వము (Executive Stability) ఉండదు. ఈవిషయం జర్మనీ, ఫ్రాంసులసందర్భంలో వర్తిస్తుంది. రెండేపార్టీ లున్నట్లయితే ఒకపార్టీ ఓడిపోవడం కష్టం. ఓడిపోయినా, రెండవపార్టీ ప్రభుత్వపార్టీ అవుతుంది.

బహు పార్టీల వల్ల లాభం, రెండు పార్టీలవల్ల నష్టంకూడా ఉంది. బహుపార్టీలలోనివారు నిష్పక్షపాతంగా ప్రభుత్వాన్ని విమర్శించవచ్చు. రెండుపార్టీలే ఉన్నప్పుడు ఒక్కఓటు ఎక్కువవచ్చినా ఆపార్టీ ప్రభుత్వ

పార్టీ అవుతుంది. ఆపార్టీ ప్రజాబాహుళ్యపు ఉద్దేశాల్ని (Opinion of Majority of the people) సూచిస్తుందని ఎవరు చెప్పగలరు? పైగా ఆపార్టీ భూస్వామికం (Oligarchy)గా కూడా మారవచ్చు. అనగా భూస్వామికమంత నిరంకుశంగా, నిర్భయంగా చరించవచ్చు.

పార్టీప్రభుత్వంలో నష్టాలు కలవు; లాభాలు కలవు. ప్రజాబాహుళ్యం ప్రజా ప్రభుత్వంలోనికి చాలామంది ప్రతినిధుల నెన్నుకోవలసియుంటుంది. ప్రతినిధులుగా నిలబడేవారు అనేకఅభిప్రాయాలకి, సమస్య లకి నిలబడుతారు. ‘ ఏ అభిప్రాయము గలవారిని అధికసంఖ్యాకులనుగా శాసనసభలకి పంపితేలాభం ?’ అనేది ప్రజాసామాన్యబుద్ధి కతీత మైనది. కనుక పార్టీలుగా ఏర్పడినవారు ‘ఫలానిసమస్యల్ని మేము ప్రభుత్వానికి వచ్చినట్లయితే పరిష్కరిస్తాము’ అని తమ తమ ఆశయాల్ని వివిధపార్టీలవారు ప్రజలకి తెలియపరుస్తారు. లేకపోయినయెడల వట్టి డాంబికులు, డబ్బుగలవారు పైకి వస్తారు. కనుక ప్రజల కందరకు తెలిసిన సంఘాలుగా (Recognized Clubs) పార్టీలు జేరి తమలో సమర్థుల్ని నిలబెట్టి ఎన్నుకొనునట్లు చేయుదురు. ఇందువలన ప్రజలు బూటకపువ్యక్తుల మాయమాటలకు లోబడుటకు తక్కువవకాశం కలుగుతుంది.

శక్తివంతుడు, బీదవాడు అయిన అభ్యర్థి స్తోమతి, లేక ప్రతినిధిగా రాలేక పోవచ్చును. అట్టివారు ఒకపార్టీలో జేరినట్లయితే ఆపార్టీ సహాయంతో నెగ్గవచ్చును.

ప్రజాస్వామికప్రభుత్వంలో ప్రభుత్వపు చేతల్ని వీరు బాగుగా విమర్శించ గలరు. ఇది రాచరికంలోగాని, భూస్వామికంలో గాని వీలులేదు. రా జెట్లు చేసిన అట్లేసాగుతుంది. కాదన్నవాడి పీక ఎగురుతుంది. కాని ప్రజాస్వామికంలో ప్రతినిధుల అధికసంఖ్యను బట్టి ప్రభుత్వం నడుస్తుంది. కాబట్టి ప్రతిపక్షు లెప్పుడును ప్రభుత్వపక్షాన్ని పదభ్రష్టుల్ని చెయ్యడానికి గోతులుతవ్వుతూంటారు. కనుక ప్రభుత్వపార్టీవారు అతిజాగ్రత్తగా నుంటారు. ఇట్లా ఒకరికొకరు భయపడడంచేత ప్రభుత్వం బాగా నడుస్తుంది. ప్రజలకికూడ రాజకీయజ్ఞానం (Political Knowledge) వృద్ధి అవుతుంది. ప్రభుత్వంయొక్క ప్రత్యేకాంగములు ఏకీభావంతో నడుస్తాయి.

పార్టీ జాతీయత (National) కోసమై ఏర్పడినట్లయితే దేశానికి లాభం. అట్లుగాక ప్రత్యేకఉద్దేశాలకోసమై (Sectional) ఏర్పడినట్లయితే నష్టం. ఇండియాలో పార్టీలు Sectional interests కోస మేర్పడినవని కొందరి అభిప్రాయం. నిజమే కావచ్చునుకూడా అట్లా (Sectional interests)కోస మేర్పడినట్లయితే ఎవరిసౌఖ్యం వారేగాని ప్రజాబాహుళ్యపుసౌఖ్యాన్ని చూచేవా రుండరు. ఇందుకోసమే అల్పసంఖ్యాకుల కధినివేశ మివ్వకూడదంటారు. అది ప్రస్తుతం వదలుదాం.

పార్టీ లుండడంవల్ల వ్యక్తిత్వానికి (Individuality) నష్టమని కొందరి అభిప్రాయం. ఏపార్టీగాని తనలోనివారి అభిప్రాయభేదానికి ఓర్వజాలదు. అందుచేత ప్రతి వ్యక్తికూడా తన వ్యక్తిత్వాన్ని చంపుకొని పార్టీయొక్క అభిప్రాయం (Policy) ఆచరించితీరాలి. ప్రభుత్వంలోనుంచి పోకుండా ఉంకడానికి ప్రభుత్వపార్టీ తానుచేసే తప్పుల్ని కూడా నిశ్శంకగా న్యాయమని వాదించాలి. ఎదిరిపార్టీ (Party in opposition) కూడా అట్లే ప్రభుత్వపుచేతలు మంచివని తెలిసియున్నప్పటికి విమర్శనమానదు. దీనివల్ల ప్రతిచిన్నవిషయం తర్కింపబడినప్పటికి పార్టీ చేతలు Sincereగా ఉండవు. ఈబలవంత బ్రాహ్మణార్థపు పార్టీ ఐకమత్యంమూలాన్ని సమర్థులైన రాజకీయవేత్తలు పార్టీలలో జేరడానికి, ప్రభుత్వంలో పాలు తీసుకోడానికి సిద్ధపడరు. ఈవిషయంలో Prof. Sidgwick చెప్పినమాటలు* నిజమైనవి. ఇది రెండుపార్టీల విషయంలో ఎక్కువ వర్తిస్తుంది.

పక్షాలుగా నుండి ప్రభుత్వపు బాగుపోయి కక్షలు వృద్ధిఅవుతవని కొందరి అభిప్రాయం. ఈవిషయం ఇండియాలోనిపార్టీలు నిరూపిస్తాయి. ఇందువల్ల దేశప్రేమకి బదులు పార్టీప్రేమ వృద్ధి యయి ఎంతసేపు 'మా కాయుష్యం, మా కారోగ్యం' అన్నముక్కేగాని వేరేజపం ఉండదు.

నష్టా లున్నప్పటికి సంస్కరించి పార్టీ ప్రభుత్వాన్ని బాగుచేయవచ్చు. ఒకసారి పప్పులో కాలు వేసినప్పటికి తర్ఫీదువల్లగాని ఏసంస్థ బాగుపడదు. ఎన్నికలవల్ల పూర్తిజేయబడే ఉద్యోగాలు తగ్గించి, పోటీపరీక్షలవల్ల ఉద్యోగాలు నియమించవచ్చు. పార్టీల కొట్లాటలతో తేలనిసమస్యల్ని, అనుమానం ఉన్న సమస్యల్ని ప్రజలందరికి విశదీకరించి వారి అభిప్రాయం తీసుకోవచ్చు (Referendum). ఎన్నికలలో 'డబ్బు ఇంతకుమించి ఖర్చుచేయకూడదు' అని నియామకమేర్పరచి, ఖచ్చితంగా ఎంత ఖర్చైనది బహిరంగపర్చవచ్చు. ఈవిధంగా పార్టీలనిసంస్కరించి ఉపయోగించుకోవచ్చు.

ఎంతవరకు పార్టీలు తమ స్వంతబాగుకోసం చూచుకోకుండా "ప్రజాబాహుళ్యానికి ప్రతినిధులము కాని ప్రత్యేకపార్టీకి ప్రతినిధులముకాము" అనుకుని అట్లా ఆచరిస్తారో అంతవరకు పార్టీప్రభుత్వంకన్న మించిన మంచిప్రభుత్వ ముండదు. కనుక పార్టీ లెప్పుడును దేశప్రేమనే చూరగొనవలెగాని ప్రత్యేకసంఘప్రేమకై పాకులాడ కూడదు. ఈ విషయం ఏదేశంలో పార్టీలు జ్ఞాపక ముంచుకుంటే ఆదేశప్రభుత్వం బాగుపడుతుంది.

---

*"Prof. Sidgwick Says: "The dual system seems to have a dangerous tendency to degrade the profession of politics: partly from the inevitable insincerity of the relation of a partyleader to the members of his own party, partly from the insincerity of his relation to the party opposed to him." See. Elements P; 528.

# చోళరాజులనాటి భిత్తిచిత్రములు*

కంచి శివరామమూర్తి

భారతదేశపు చిత్రకళను పరిశీలించువారికిని, ముఖ్యముగ దక్షిణదేశపు చిత్రస్థాపత్యాదికళల చరిత్ర మెరిగినవారికిని చోళశిల్పము పరంపరగ వచ్చిన పల్లవశిల్పరూపాంతర మేయని చక్కగ తెలిసినవిషయము. ఈరెండుశిల్పములను ప్రత్యేకించుటకు నిశ్చితమైన విభాజకోపాయము లభింపకున్నది. సుందరమైన చిత్రముల కల్పనయందును, తద్రచనయందును, రూపరేఖలయందును, ప్రమాణనిశ్చయమునందును, తగినవగలనమర్చుటయందును, చలనవిక్రాంతులం దేర్పడు పెక్కుస్థానముల జూపెట్టుటయందును ఈరెంటిలో భేద మేయ్యదియు కానరాకున్నది. అనుస్యూతముగ వచ్చిన పల్లవశిల్పమున నిమిడినది; తదాకారముగ నావిర్భవించినది. చిరంతన శిల్పశాస్త్రపద్ధతుల ధిక్కరించి కవితానిరంకుశత్వమున కొప్పుగా నెన్నుకొనబడిన పిచ్చిపిచ్చిస్వతంత్రకల్పనల కాధారమును పనికిమాలిన చిత్రకరబ్రహ్మల నవీనసృష్టియను చిత్రకరనిరంకుశత్వ మీ పురాతనశిల్పమునందు కానరాదు.

ప్రధ్వంసముచేతను, వేరువేరుత్రోవల శిల్పుల ద్రిప్పుటచేతను, వారియుత్సాహమును చెడగొట్టుటచేతను రెండుమూడు శతాబ్దములుగా లలితకళలు క్షీణదశ నొందింపబడినను తత్కాలమువరకైనను ధారాప్రవాహరీతిని అవిచ్ఛిన్నముగా వాని శాస్త్రసంప్రదాయములు కొంతవరకైన నిష్కల్మషముగా మన కందినందులకు మన కెంతయు సంతసము.

సకలశాస్త్రములందును మిక్కిలి నేర్పుగలిగినవారును, పరమరసికులును, నాట్య, చిత్ర, పుస్త, వాస్తు, గాంధర్వాదిలలితకళల పోషించువారును అగు భారతదేశపురాజుల ఏలుబడియందెట్టిశిల్పమును తప్పక అభివృద్ధి జెందక యుండదాయె. ప్రస్తుతము దట్టమైన చీకట్లు క్రమ్మి జనసంచారహీనమై యొప్పు బృహదీశ్వరస్వామిదేవాలయ గర్భగృహ ప్రదక్షిణ ప్రాకారములో గోడలయందు సాలెపురుగుపట్టులసందులనుండియు, చాలకాలముగ చేరియుండు దుమ్ములకప్పులనుండియు కొంతవరకు కనబడు చోళరాజులనాటి చిత్రకరనిర్మితములైన పురాతనచిత్రములు చక్కనిరేఖలచేతను, సొంపైన రంగులచేతను జూచువారికి మనంబుల పల్లవింపజేయునవిగ నున్నవి.

ఎల్లోరా ( Ellora ) లోను, కాంచీపురకైలాసనాథ దేవాలయము (Kailasanatha Temple in Conjeevaram) లోను డ్యూబ్రీలు (Professor Dubreuil) దొరగారికి కన్పించిన భిత్తిచిత్రములు ప్రతిదేవాలయమునను చిత్రముల వెదకుటకు పలువురను ప్రేరేపించినవి. పలువురు విఫలమనోరథులైనను శ్రీ గోవిందస్వామి గారికిమాత్ర మీ చోళశిల్పదర్శన మనుగుణకార్యఫలముగ లభించెను.

బృహదీశ్వరునిఅత్యున్నతగర్భగృహభిత్తుల నెల్ల నావరించియుండు ఈ బృహచ్చిత్రములలో సంస్కృతసాహిత్య ఫణితిశతప్రశంసాపాత్రమగు శితికంఠత్రిపురదాహమున చక్కగ శివుడాలీఢాసనమున రథారూఢుడై యత్యున్నతమానమున రచింపబడియున్నాడు. మిక్కుటముగ వెలుతురు నిచ్చు పెట్రోమాక్సు ( Petromax Lamp ) మొదలగు దీపముల సాహాయ్యముననే చిత్రము లక్షిగోచరము లగుచున్నవి. వానిలో కూడ నన్నియు కానరావు. నిస్సత్త్వులైన విజయనగరచక్రవర్తుల సంతతివారి కనధీనులైన సామంతులగు నాయకులు రాజ్యమేలినకాలమున విజయనగరశిల్పపద్ధతిని దట్టముగ వన్నియలుపూసి నూత్నచిత్రములు వ్రాయుటచే నాలవర్కీ పురాతనచిత్రములు కానరాకున్నవి.— [illegible]

* ఇందు ముద్రితములగు చిత్రముల బ్లాకులు 'త్రివేణి' వారిచే ఒసగబడినవి. [illegible]

విష్ణుధర్మోత్తరమున నుడివిన "రేఖాం ప్రశంసం త్యాచార్యాః" అనువచనమున కనుగుణముగ మనోహర రేఖాగర్భితములై నేత్రముల రంజించు చోళచిత్రముల నావేష్టించు నాయకులనాటి అననుగుణవర్ణరేఖాఖచిత చిత్రములు భారతదేశచిత్రరచన క్షీణదశప్రారంభము నట్లుగా సర్వజనరంజకమగు వర్ణరచనాంశయందుగూడ నాచిత్తరువులయం దించుకయంటుకొనియుండు మిక్కుటముగ విచ్ఛాయ గాంచిన వన్నెలు చోళమహీపతుల నాట నెటుల నుజ్జ్వలముగ నుండినవో అది ఊహ్యమే.

ఇటుపిమ్మట నిప్పు డీచిత్రముల ముఖ్యాంశలను



చిత్రము ౧

నాటివి. చోళచిత్రములయం దిట్టిశోభ రేఖామాత్ర గతము కాదు; అంశాంతరంబులందుగూడ కానవచ్చుచున్నది. "స్త్రియో భూషణ మిచ్ఛంతి" యనుదాని కనుగుణముగ లలనాహృదయముల హరించు భూషణాంశము—అనగా అలంకారాంశము—ఈ చిత్రములం దతిశయముగ గాన్పించుటంజేసి తల్లేఖకుల వివిధరత్నాభరణనిర్మాణకౌశలము ఎంతయు మన కాశ్చర్యము కల్పించుచున్నది. మూడవచిత్రమునందలి నర్తకస్త్రీలను, మొదటిచిత్రగతమగు మహాపురుషశీర్ష పంచకమున కిరీటములను జూచినయెడల భారతచిత్రకళయం దాభరణాంశ మెంతముఖ్యముగా గణింపబడెనో యని వెల్లడియగును. రెండవచిత్రమునగల గుఱ్ఱపుజోడింపులు చాల సుందరములై యొప్పుచున్నవి. ఇట్టియీచిత్రగత సౌందర్యము ముద్రితములైనవాని ప్రతిచ్ఛందములగు ఈ బొమ్మలలో అంశమాత్రమే కానవచ్చుననగా ఆచిత్రముల లిఖింపబూనిన నాకప్పు డెట్లు దుష్కరముగ కన్పించెనో అది సర్వేశ్వరుని కెరుక. "వర్ణాఢ్య మితరే జనాః" అను విచారింతము. మొదటి చిత్తరువున చిత్రము ౧ మిక్కిలి సుందరమైన మహాపురుషముఖపంచక మున్నది. ఉత్తమ దేవతాస్వరూపసోదరాయమానములును, ఉత్కృష్ట పురుషలక్షణగణ్యములునగు పద్మదళాయత నేత్రములును, సమసువృత్తతుంగనాసికయును, మృదుమంజుళబింబాధరోష్ఠమును, రుచిరచిబుకగండస్థలములును, కుటిల భ్రూకేశములును, చారుకర్ణపాశములును, బంధురకంధరమును ఇంపారుచున్నవి.

అశ్వారూఢ పురుషుని జూపు ద్వితీయచిత్రముకూడ సర్వాంశలయందు దతికుశలముగ లిఖితము. ఎడమచేత కళ్లెములంది కుడిచేత వేత్రమును ధరించురీతి మిక్కిలిసుందరముగ చూపెట్టబడియున్నది. నేషనల్ గాలరీ (National Gallery) లోని ఉక్కెల్లో (Paolo Uccello) అను చిత్రకరవిరచితమగు "సెయింట్ ఎగిడియోయుద్ధము" (Battle of St. Egidio) అను చిత్రమునందుండు గుఱ్ఱములవలెనే ఈచిత్రమునందును అశ్వము తక్కినప్రాచీనచిత్రము

వలె ఆధునికచిత్రరచనాకుశలతాంశయందు కొంతన్యూనతను పొందియుండినను మనము వానియందుండు కుశలరచనాతిరిక్తమగు మాధుర్యమునే గ్రహింపవలెను. ఇట్టి విషయములందు పౌరోభాగ్య మతిహేయము.

అను శ్లోకమున కనుగుణముగ నున్నవారు.

సుందరతరశరీరసామాన్యమునకును చారుతన్వంగుల శరీరములకును శోభావర్ధాపకంబులగు వివిధ గుణాలంకారముల సవిస్తరముగ సహృదయలీలయందు



చిత్రము ౩

మూడవచిత్రమున నాట్యకన్యకల శరీరసౌందర్యావహములగు తనుమధ్యమము, లతాకోమళాంగము, ఈషద్వ్యంగురశీర్షము, వివిధముద్రాంకితహస్తములు, అంగభంగరచనయు మాళవికాగ్నిమిత్రమున కవిసార్వభౌముడగు కాళిదాసుడు నుడివిన "ఛందోనర్తయితు ర్యథైవ మనసః శ్లిష్టం తథాస్యావపుః" అను ముక్కను స్మరింపజేయుచున్నది. ఈచిత్రమున శిల్పి మిక్కుటముగ ఆభరణజాలము నభిలిఖించినవాడు. ఇట్టిభూషణవిశేషశోభితలగు లలనాతిలకములు కథాసరిత్సాగరమున దైత్యతనూజయగు మహల్లికను వర్ణించు

'లలాటతిలకోపేతాం చారునూపురపాదికాం;
స్మేరదృష్టిం విధాత్రైవ సృష్టాం నృత్తమయీమివ,
కేశై రరాళై ర్దళనైః శిఖరై ర్బిభ్రతీం స్తనౌ;
ఉరోమండలినా నృత్తం సృజతీమివ నూతనమ్.'

వర్ణించి నిజలిఖిత తద్వ్యాఖ్యాయం దతిస్ఫుటముగ విశదీకరించిన రాజానకరుయ్యకుని,

'రూపం వర్ణః ప్రభా రాగ అభిజాత్యం విలాసితా;
లావణ్యం లక్షణం ఛాయా సౌభాగ్యం చేత్యమీ
గుణాః
రత్నం హేమాంశుకే మాల్యం మండనద్రవ్యయో
[జనా;
ప్రకీర్ణం చేత్యలంకారాః సప్తైవేతే మయామతాః.'

అను శ్లోకములభావ మీచిత్రమున స్ఫుటమగుచున్నది.

తత్సమీపమున తాళపరికలనా కుతూహలునిగా చిత్రించిన పురుషోత్తముని చిత్తరువునందు ప్రాచీనపద్ధతి ననుసరించి శిల్పి తన మహాపురుషలక్షణజ్ఞానమును చక్కగ చూపియున్నాడు. ఈచిత్రమున విష్ణురూపము నందును, తదితరరూపములందును ముఖ్యముగ గణింప

దగిన విషయము శరీరసన్నివేశములను అంగచలనములను చూపు. మధురరేఖల లేఖనమే. భక్తితేజోభాసురులను భక్తులిరువురిలో నొకడు కాంస్యతాళవాదనపరుడు. మరొకడు భగవదారాధనతన్మయుడు.

భారతభూమియం దెట్టిశిల్పమునందును ముఖ్యముగ కన్పడు సంస్కృతికావ్యములం దతివిశ్రుతులను కుబ్జవామనగణములలో గనబడు ఈ చిత్రగతమృదంగ వాదనపరుడైన కుతూహలావహకుబ్జకుని రూప మతి మనోహరము. "విస్మయాలోలిత మాళిః" అనియు

'(బ్రహ్మోక్తనాట్యశాస్త్రే)
గీతే మురజాదివాదనే చైవ,



అభిభవతి నారదాదీన్
ప్రావీణ్యం భట్టపుత్రస్య.'

అనియు భట్టపుత్రునిసరించి పరిహాసపూర్వకముగ దామోదరగుప్తుని కుట్టనీమతమున జెప్పినదానిని యథార్థపూర్వకముగ గణించినయెడల పై జెప్పినవెల్ల శరీరచ్ఛవి చలనమునందు శివగణముఖ్యాంశయగు సంగీతనాట్య శాస్త్ర పరతత్వజ్ఞానము నెంతయు వెల్లడిజేయు ఈ చిత్రగతవాదమునికి సరియగును.



చిత్రము ౮

యోగదక్షిణామూర్తి రూపమువలె కాన్పించు సుఖాసీన శ్రీకంఠుని చిత్రము (చి. ౮.) శాంతోదార గుణములచే మనంబు నాహ్లాదించుచు మృచ్ఛకటికలోని నాందీశ్లోకమగు

'పర్యంకగ్రంథిబంధ ద్విగుణిత
భుజగాశ్లేష సంవీతజానోః
అంతః ప్రాణావరోధవ్యుపరత
సకలజ్ఞాన రుద్ధేంద్రియస్య,
ఆత్మ న్యాత్మాన మేవ వ్యపగత
కరణం పశ్యత స్తత్త్వదృష్టేః
శంభో ర్వః పాతు శూన్యేక్షణ
ఘటిత లయబ్రహ్మలగ్నః సమాధిః.'

అను దానిని స్మరింపుచున్నది.

ఇట్టి సుందర దేవకుల చిత్రశాలాయమానం బైన నాయాలేఖ్యపంక్తిని విశేష కాలాభావమును బట్టియు, శరీరాస్వస్థతను బట్టియు, నే నింక నధికముగ చిత్రరూపమున వ్రాయనైతిని. అట్లయినను స్ఫటికమువలె విశదములగు జిజ్ఞాసుహృదయముల పవిత్రముజేయునవియు, శుద్ధ శిల్పక్రమపదవి యందు ప్రదీపమువంటివియు నగు ఈ సర్వజన నిరీక్షణాతిదూరంబు లై నిశీథప్రాయస్థలముల వెలుంగు భిత్తిచిత్రములు ముద్రితమైన చిత్రచతుష్టయముచేతనైన తమ శోభాసామాన్యము నెరుంగజేయునను నమ్మకము న న్నాహ్లాదించుచున్నది.

# కర్పూరతైలం

కర్పూరతైలంయొక్క ఉపయోగాలనేకం ఉన్నాయి. వాటిని తెలియనివారు చాలఅరుదు. తైలం చేసినతర్వాత మిగిలేమడ్డిని సబ్బులు, కాగితాల వార్నీషు, లక్క మొదలయినవస్తువులు తయారుచేసేటందుకు ఉపయోగపెడ్తున్నారు. కాని కర్పూరతైలంయొక్క యుత్పత్తినిగురించి తెలిసినవారు చాలకొద్దిమంది మాత్రమే.

దేవదారుచెట్లకు గాట్లువేసి ఆ గాట్లలోనుంచీ వచ్చే పాలతో కర్పూరతైలాన్ని తయారుచేస్తున్నారు. దేవదారుచెట్లుండేఅడవులు మనదేశంలో జమ్మూకాశ్మీరప్రాంతాల్లో జాస్తి. ఈ అడవులు జమ్మూకాశ్మీరం మధ్యనుండే రోడ్డుకు చేరువగానే రెండుప్రక్కలా ఉన్నాయి. బ్రిటిషుఇండియా, ఫ్రాన్సులలోవలెనే యిక్కడకూడా కర్పూరతైలం చేస్తున్నారు. ఇట్లా చేయడంవల్ల చెట్లు త్వరలో చెడిపోకుండా చాలా కాలంఉంటున్నవి. ఒకొక్కకూలివాడున్ను వెయ్యి చెట్లనుండి పాలనుతీయుచుండును. మొదట ఒకఅధికారి పదహారుఅంగుళాల అడ్డకొలతగల చెట్లకన్నిటికీ గుర్తు వేసి వరుసనెంబర్లు వేయును. తరువాత పనివాండ్రు బాడిసతో చెట్లమీద రొమ్ముయెత్తున ఒకటి లేక రెండు గాట్లను చెట్లనుబట్టి వేయును. మొదట, అరఅంగుళం లోతు, ఆరుఅంగుళాలపొడుగూ, నాలుగుఅంగుళాల వెడల్పూ గల గాట్లువేయును. సాధారణంగా వీరు ఈపనిని మార్చిఆరంభంలో ప్రారంభింతురు. గాట్ల క్రిందనే, ఆరంగుళాలపొడుగూ, రెండున్నరఅంగుళాల వెడల్పూ కలిగిన వంపైనయినుపరేకును అమర్చెదరు. గాట్లలోనుండీ వచ్చేపాలు రేకుగుండా వచ్చి నేలమీద యుండే కుండలో పడును. గాలికి దుమ్ముగాని యింకే మయినపదార్థాలుగాని కుండలోపడకుండునట్లు కుండల మీద ఒకమూతకూడా యుంచెదరు. నాలుగైదుదినాలకొకసారి పనివాండ్రువచ్చి కుండలలోని పాలను డబ్బీలలో పోసికొని, మరల గాట్లను కొంచెముచెక్కి రేకును కుండను ఎప్పటిమాదిరిగానే అమర్చిపోవుదురు. ఒకొక్కసారికి గాటును అరఅంగుళంవంతున పెద్దది చేసి పద్ధెనిమిదిఅంగుళాలను మించకుండా చేయుదురు.

పాలతోనిండిన డబ్బాలకు మూతలతికించి కూలీల చేత, గుర్రాలమీద, ఒంటెలమీద తీసుకొని రోడ్డు దగ్గరకు వచ్చెదరు. వీటిని అధికారులు తనిఖీచేసి నెంబర్లు వేసినతర్వాత మోటారులారీలమీద, బండ్లమీద వేసికొని జమ్మూరైలుస్టేషనుకు తీసుకొనిపోయెదరు. అక్కడనుండి లాహోరుదగ్గర యుండే Jallo Resin Factory వద్దకు పంపెదరు.

కాశ్మీరంప్రభుత్వానికి ఈదేవదారుపాలవల్లవచ్చే వరుంబడి కొయ్యలవ్యాపారంవల్లగాని, సున్నిలంవ్యాపారంవల్లగాని రావడంలేదు. ఇందువల్ల కాశ్మీరంలోని బీదవారి కనేకులకు జీవనోపాయంకూడ లభించింది.

అడవులలో పడియుండే పండుటాకులనూ, చెట్లకు గాట్లువేసేటప్పుడు క్రిందపడే చెట్లబెరడును చిన్నపిల్లలు తీసుకొనిపోయి దూరంగా పారవేయుదురు. అట్లు చేయనిచో నిప్పంటుకొని గొప్పప్రమాదాలు కలుగడానికి అవకాశంఉంది. ఎల్లప్పుడూ కొందరుపిల్లలీపని మీదనే యుందురు.

Jallo Resin Factory లో డబ్బాలలో యుండేపాలను పెద్దబట్టీలమీద కాచెదరు. అప్పుడు కర్పూరతైలాన్ని ఆవిరిస్వేదనం ( Steam Destillation ) వల్ల తయారుచేసెదరు. నూరుపాళ్లపాలకు పదిహేడుపాళ్లు కర్పూరతైలం వస్తుంది. ఇది అతిసులభంగా గాలికే యెగిరిపోతుంది. ఆవిరిస్వేదనంవల్ల తయారుచేయుదురు గనుక తైలం నీళ్లతోకలిసి వచ్చును. కాని నీటికన్నా తేలికగనుక నీటిపైకి తైలం తేలుతుంది. అందువల్ల సులభంగా తైలాన్ని వేరుచేయవచ్చు. స్వేదనపాత్రలో మిగిలియుండే గుగ్గిలాన్ని యినుపజల్లెళ్లతో వడియగట్టుదురు. ఈగుగ్గిలాన్ని జాడీలలో పోయగా అది గడ్డలుగట్టును.

G, S. A,

# వ్యవహారకోశము*

వంగోలు వేంకటరంగయ్య

'అధినివేశ స్వరాజ్యము' (Dominion Status) లోనను కొన్ని యుద్గ్రంథరచనలచే శ్రీ దిగవల్లి వేంకటశివరావుగారు ఆంధ్ర విద్వల్లోకమున ప్రసిద్ధులు. వృత్తిచే బెజవాడలో గొప్ప వకీలుగ నున్నారు.

ఈకోశమునకు "వ్యవహారకోశము" అని తెలుగున పేరు పెట్టినను ఇంగ్లీషు పర్యాయమున దీని కధికతరవ్యాప్తి ప్రతిజ్ఞ లున్నటుల స్ఫురించుచున్నది. ఇంగిలీషు పేరు "Dictionary of Technical Terms". "Technical Term" అనగా ఒక్కొకశాస్త్రజ్ఞునకుగాని, కళావిదునకుగాని తనతన విద్యాకళలందు ప్రయోగించు సంకేతపదములు గావచ్చును. వర్ణశబ్దము నొకదాని నుదాహరణముగ గొన్న నిది వ్యాకరణజ్ఞునికి అక్షరము కావచ్చును. అకారమన్నను అవర్ణమన్నను సమానమగును. ధర్మశాస్త్రవిచారావసరమున నీవర్ణశబ్దము బ్రాహ్మణాదివర్ణముల దెల్పును. చిత్రలేఖన ప్రపంచమున రక్తపీతాదులగు రంగుల కన్వయించుచున్నది. ఇటులుండుటచే ఈవర్ణశబ్దము పలువురకు పలువిధములగు నర్థముల స్ఫురింపజేయుచున్నది. అటులనే యింగిలీషున 'టరం' (Term) అనుపద మింకొక యుదాహరణముగ గొనదగును. ఇంగిలీషు వ్యాకరణమున వాడు, నేను, ఇల్లు, ఊరు, చెట్టు, పుట్ట, ఇత్యాదులన్నియు పదములుగావచ్చును. సంస్కృత వ్యాకరణజ్ఞులు చెప్పునట్లు తిఙన్తసుబన్తములు అన్నియు వారికి పదసంజ్ఞగలవి యగుచున్నవి. ఈ 'టరం' (Term) అనుమాటయె ఇంగిలీషుతర్కశాస్త్రమున తిఙన్తసుబన్తముల మించి ఇతరములకును పేరు గావచ్చును. ఇదే 'టరం' (Term) శబ్దము లాయరునకు అవధి, లేక గడువు అనునర్థమును సూచించుచున్నది.

"వ్యవహారకోశము" అనుదానికి గ్రంథకర్తయె "పారిభాషికనిఘంటువు" అని వివరణము చేసియున్నాడు. ఇక పారిభాషికము - సంకేతము - టెక్నికల్ (Technical) ఇవన్నియు ఏకార్థద్యోతకములా యను విచారము పొడమవచ్చును. ఇది పెద్దచర్చయగును. శ్రాద్ధములందు నిమంత్రితుల కర్ఘ్యపాద్యము లిచ్చునపుడు ఉపాధ్యాయుడు "శుక్రమసి" తీసికొని రమ్మనుట గలదు. 'శుక్రమసి' యనగా 'తెల్లగనున్నావు' అని శబ్దార్థము. ఆయుపాధ్యాయునికోశమున 'దర్భపుల్ల నొకదానిని నేతిలో ముంచి తెమ్మని స్ఫురణ యగుచున్నది. ఇచట "శుక్రమసి" సంకేతమా, పరిభాషయా, సంజ్ఞామాత్రమా, ప్రయత్నసంకోచమా? "ఇకో గుణవృద్ధీత్యాదికా పరిభాషా" యని పరిభాషాస్వరూపమును మహాభాష్యకారులు సూచించియున్నారు. గుణవృద్ధిశబ్దములకు లోకమునందుగల యర్థములకును వ్యాకరణ ప్రపంచమునందలి యర్థములకును సంబంధమేమియు నగపడదు. ఇత్యాదివిచార ప్రయోజన మెటులున్నను గ్రంథకర్తగా రుద్దేశించిన విషయప్రయోజనము సుస్పష్టముగ తెలియుచున్నది. కోర్టులో నొకవ్యాజ్యగాడు తన దావాఅర్జీలో నొక్క యింగిలీషుమాటనైన నుపయోగింపకుండ దేశభాషలోననే తన వ్యవహారమునంతయు జరుపగలిగి యుండుటయే ముఖ్యోద్దేశము. న్యాయసభలలో ప్రవేశింపబడు నభియోగములు సంకరభాషలో నుంటున్నవి. ఈ దావాకు 'రిస్ జూడికేటా' దోషము కలిగియున్నది. ఈదావాకు 'నాన్‌జాయిండరు అండు మిస్ జాయిండరు' దోషములున్న ఆపాదించియున్నవి. ఈదావాకు 'లిమిటేషన్ బారు'న్న అయినది. ఇత్యాదివాక్యములు పలుమారు చూడబడుచుండును. ఇట్టియాపదల నిర్వర్తింపజేసి దేశభాషాప్రాముఖ్యస్థాపనమే గ్రంథకర్తగారి ముఖ్యో

* గ్రంథకర్త: దిగవల్లి వేంకటశివరావుగారు, బి. ఏ., బి. యల్., క్రౌను ౨౬౭ పుటలు : వెల రు. ౧-౮-౦.

# 'కర్పూరతైల' చిత్రములు

G. S. A.

౧. దేవదారురసమును పట్టుటకు తయారగుచున్న కుండలు



౨. దేవదారురసమును పట్టుటకు అడవికితీసుకొనిపోవు కుండలుగల కావళ్లు



3. అడవులలోనుండి రోడ్డుకడకు దేవదారురసము గల కుండలను కొనిపోవుట



౪. దేవదారురసముగల డబ్బాలను నిలువచేయు డిపో-మోహనపురము

ద్దేశముగ నుండును. స్వరాజ్యసంపాదనాపేక్షగలవారం దరును ఇంతవరకును వీరితో నేకీభవించి ఈయుద్యమమును సఫలము జేయవలయును.

ఉద్దిష్టవిషయము బహుముఖములుగను బహుశాఖలుగను బహుశ్రమగను ఉండుటచే వీరి ప్రయత్నమును వీరు పూర్ణముగ సాధించిరని చెప్ప నలవిగాకున్నది కొన్నికొన్ని వ్యవహారప్రచారములకు సరియగు తెలుగుమాటలుగాని,సంస్కృతపదములుగాని మృగ్యములగుచున్నవి. "Negotiable Instruments, Insurance, Banking" లోనగు కొన్ని ప్రకరణముల క్రింద ఇంగిలీషు వాడుకఅయినవారికి ఇంగిలీషులో లభించునట్టి మాటలు తెలుగున దుర్లభములు. వాయ విషయములకు కోర్టువ్యవహారములకు రివిన్యూడిపార్టుమెంటునకు సంబంధించినట్టిపదములు ఈగ్రంథములో నున్నవానికంటె కొన్ని యెక్కువగ దొరకగలవు. అయితే మితిమీరిన గ్రంథశోధన కావలసియుండును. కౌటిలీయార్థశాస్త్రమునను, నారదస్మృతియందును, యాజ్ఞవల్క్యస్మృతియందును, శుక్రనీతిసారమునందును అనేకసంకేతపదములు దొరకగలవు. కొన్నిటిని గ్రంథకర్తగారు సంగ్రహించియున్నారు.

Res Judicata కు 'పూర్వన్యాయవిధి' అని వ్రాసియున్నారు. ప్రాఙ్నిర్ణయము, ప్రాఙ్న్యాయము ఇత్యాదులు మనగ్రంథములు నున్నవి. Arbitrator కు మధ్యస్థుడు, మధ్యవర్తి అనివ్రాసినారు. వాల్మీకిరామాయణములోనను, మాలవికాగ్నిమిత్రమునను ప్రాశ్నిక శబ్ద మున్నది. ఇది మధ్యస్థునికన్నను మంచిమాటగ నున్నది.

Appeal, Revision, Reveiw అనుమాటలకు సరియగుమాటలు దొరకజాలవు. బహుశః ప్రాచీన హిందూప్రభుత్వములలో ఆర్తుడు రాజునొద్దకుపోయి మొరబెట్టుకొనుటయు, ఆయన స్వంతముగనో, ప్రతినిధి ముఖముననో వివాదనిర్ణయము చేయుటయు నుండినది. రాజాజ్ఞపై మరియొకరాజుతో మొఱ్ఱబెట్టుకొనుట యుండదు.

సామ్రాజ్యము, భోజ్యము, స్వారాజ్యము, పారమేష్ఠ్యము, మహారాజ్యము, ఆధిపత్యము, సార్వభౌమత్వము-ఇవి ఉత్తరోత్తరాధిక్యము గలవిగ నుండిన నుండునుగాని ఒకనిపై నింకొకనికి అప్పీలు అనునది యుండెడు. ఒకటొకటి తనకు తాను స్వతఃపూర్ణము-కొంచె మించుమించుగ ఇట్టిపరిగణనమే శుక్రాచార్యుడు తననీతిసారమున జేసియున్నాడు. సామంతుడు, మాండలికుడు, రాజు, మహారాజు, స్వరాట్టు, సమ్రాట్టు, విరాట్టు సార్వభౌముడు ఈభేదములు వారివారి వరుంబడి మీద ఏర్పడినవై యున్నవి. విభుత్వములో న్యూనాధిక్యములనుబట్టికాదు.

Monopo'y, previlege, prorogative, franchise ఇత్యాదులు కొన్నిశబ్దము లున్నవి. వీటికిని మాటకు బదులుమాట దొరకదు.

ఈకాలమున నెట్టివానికిని జడ్జిమెంటు, డిక్రీ అను వ్యవహారపదములు నిత్యకృత్యపు వాడుకమాటలవలె నున్నవి. జడ్జిమెంటుకు తీర్పు అని వ్రాసినారు. డిక్రీకిన్ని తీర్పు అనునదే యున్నది. యథార్థములో నీరెంటికిని భేద ముండవలసినయక్కర లేదు. జడ్జిమెంటులోని ప్రయోగభాగము డిక్రీ అనుపించుకొనును. జడ్జిమెంటుకు శుక్రుడు 'జయపత్రము' అని పేరుపెట్టినాడు.

'యత్రోపన్యస్తసాధ్యార్థసంయుతం సోత్తరక్రియమ్,
సావధారణకం చైవ జయపత్రక ముచ్యతే'.

కొన్నికొన్నిపదములకు గ్రంథకర్తగారు దీర్ఘములును, విపులములును నగు వివృతుల జేర్చియున్నారు. ఇవి చాల యుపయోగకరములు.

ఉదాహరణములు — Cabinet system, Debenture, English Constitution, Jury system, Non-parliamentary Government, Parliament, Privy Council, Proportional representation, Reserve bank, Socialism, ఇత్యాదులు—

న్యాయనాతిరిక్తములకొరకు ఒకచిన్న యనుబంధము చేర్పబడియున్నది.

ఇట్టి ద్వైభాషికకోశముల కిది ప్రథమ ప్రయత్నము కాదు. పూర్వము మొగలాయిప్రభుత్వకాలములో ఆప్రభువుల కిట్టికోశములయక్కర కలిగినదో లేదో జెప్పనవకాశము లేదు. అయితే 'అయిని అక్బరి' వంటి యుద్గ్రంథమును జూడ నంతకుముందుండిన రాజ్యాంగపద్ధతులు, వ్యవహారవిధానములు పూర్ణముగ విమర్శింపబడి యుండవలెనని తోపగలదు. ఇంగ్లీషువారికి ఇండియాదొరతనము లభింప ప్రారంభించినప్పటినుండియు వీరు ఈ వ్యావహారికపదకోశముల దలబెట్టుకొనినటు లూహింప నవకాశము గలదు. ౧౮౦౫-౦౬ ప్రాంతముల బుట్టిన ఇండియా పరిపాలనాధికృతమగు పార్లమెంటువారి అయిదవరిపోర్టున (Fifth Report on the affairs of India) ఈ విచార మంకురించి దాని కనుబంధముగ నొక ద్వైభాషికపట్టిక రచింపబడినది. అప్పటినుండియు ఆంగ్లేయులు పలువు రిట్టికోశముల రచించియున్నారు. వీని కన్నిటికిని విల్సన్‌గారి 'గ్లాసోరి' శేఖరముగ నున్నది.

తెలుగునకు బ్రౌనుగారు, కన్నడమునకు కిట్టెల్‌గారు, రైస్‌గారు - మహారాష్ట్రమునకు మోర్‌హెడ్డు, అరవమునకు విన్‌స్లో ఇత్యాదు లీవిషయమున గొప్పసహాయముల జేసియున్నారు.

మనగ్రంథకర్తగారు ఇపుడు ఆంధ్రదేశమునకు శ్లాఘ్యమగు ఉపకారము జేసియున్నారు. ఈకోశ మిప్పటికి సర్వతః పూర్ణము గాకపోయినను ప్రయత్నము ఆదరణీయ మైయున్నది. వ్యవహారపరులేకాక కేవల భాషాభిమానులును దీనివలన గొప్పప్రయోజనము బొందగలరు. గ్రంథాంతమున ప్రపంచములోని నానారాజ్యములయొక్క రాజ్యాంగస్వభావము, విస్తీర్ణము, జనసంఖ్య, రాజధానిపట్టణము, అందలి చలామణినాణెములు, ఆనాణెములకు బ్రిటిషువారినాణెములగు షిల్లింగులు పెన్సులలోనికి గలమార్పు- ఇత్యాదివిషయములు గలపట్టిక యొకటి చేర్చబడియున్నది. ఇదియు చాలా ఉపయోగకరమైనది. ఇంగ్లీషువారి నాణెములతోబాటు బ్రిటిషుఇండియానాణెముల మతాబికు మొత్తముల దెలిపిన రెట్టింపుప్రయోజనముగ నుండును.

---



క మ్మ రి T. R. R.




## దీపస్తంభము

కొ. నరసింహాచారి

## (LIGHT HOUSE)

ఈ దీపస్తంభమునందు అయిదుభాగములు కలవు. వీటిని వేర్వేరుగా జేసికొని అన్నిటినిచేర్చి అతికించినయెడల దీపస్తంభమేర్పడును. మూడుభాగములు మాత్రమే పటమునందు కలవు. తక్కిన రెండును చిత్రము 1, 2లను బోలియుండి పరిమాణమునందు మాత్రము చిన్నవైయుండును.




### చిత్రము 1, అరుగు

ఈఅరుగు ఆరుప్రక్కలుకలది. A C K L. అను అట్టముక్కయందు A B C D అను ఆరు సమభాగములను గుర్తించుకొని (a, b, c, d, e, f) వాటిలో నొకదానికి చేరియుండునటుల D E F G H J అను ఆరుప్రక్కల రూపమును గుర్తించవలెను. చిత్రమునందలివిధముగ అతుకు తునుకలు (flaps) కూడ ఉండవలెను. ఆరుప్రక్కలను పాదమును మడిచి అతికించినయెడల చిత్రము 2 నందలి విధముగ తొట్టి ఏర్పడును.

చిత్రము 3. స్తంభముక్రిందినేల

స్తంభముక్రిందినేలకు చుట్టుగోడకలదు. ఇదియు ఆరుప్రక్కలు కలది. చిత్రము నందలివిధముగ A B C D E F అను ఆరు ప్రక్కలరూపమునువేసి దానిప్రక్కల కొక్కొక్క దానికిని చేరి A B G H వంటిగోడలను వేయవలెను. గోడలను మడిచి అతికించిన యెడల చిత్రము 4 నందలివిధమగు తొట్టి ఏర్పడును. ఈతొట్టిని రెండవ చిత్రపు తొట్టిపైపెట్టి అతికించ వలెను.

చిత్రము 5. స్తంభము

O అనుబిందువు(Centre) నుండి O A G అనునంపును (Sector) వేయవలెను. A G అను నంపును ఆరు సమభాగములుగా భాగించుకొని B C D E F వీటిని O అనుబిందుపుతో చేర్పవలెను. పిమ్మట O H J అనుభాగమును కోసి వేయవలెను. పిమ్మట ప్రతిభాగమునందును ద్వారములను చిత్రమునందలిరీతిగ కోయవలెను. అటుపిమ్మట ఈ అట్టముక్కను మడిచి చిత్రము 6 నందలివిధముగ స్తంభమునటె నతికించవలెను. ఈ స్తంభమును, ముందుచేయబడిన తొట్టియందు మధ్యభాగమున నిలువబెట్టి అతికించవలెను. అటు పిమ్మట చిత్రము 4 వంటి తొట్టిస్తంభము పైభాగమునకు సరియగునట్లు చిన్నపరిమాణము గల దానినిచేసి స్తంభముపై అతికించవలెను.

తర్వాతచిత్రము 1 వంటితొట్టి నిస్తంభముపై నుంచబడిన తొట్టిలో నుంచదగినంతచిన్నదానిని చేసి దానియొక్క ప్రతిప్రక్కయందును ద్వారములను కత్తిరించవలెను. ఈతొట్టిని దీపస్తంభముపై నుంచి అతికించిన



యెడల ఛాయాచిత్రమునందు జూపబడినట్టి దీపస్తంభము ఏర్పడును.

స్తంభమును చేయునపుడు చిత్రము 5 నందు O A G అను భాగమునందలి BCD EF అను ప్రదేశములను O తో చేర్చు రేఖలమధ్యనుండు కోణములు ఎంతచిన్నవైన స్తంభము అంత పొడవుగా చేయవచ్చును. అనగా O వద్ద నేర్పడు కోణములు చిన్నవిగా నుండినయెడల పొడవైన స్తంభమును చేయవచ్చును.



కాకినాడ రేవు



బ్రాహ్మమందిరము, కాకినాడ

H. S. R.

# ప్రణాళికలు

గరిమెళ్ల సత్యనారాయణ

## (PLANNINGS)

గొప్పకార్యం తలపెట్టుకున్నప్పుడల్లా ముందు, ఇండియాగవర్నమెంటుబడ్జెట్టులాగ, ఒక ప్రణాళిక వుండవలసినదే. వ్యవసాయవ్యాపారములకుకూడా ఇట్టిప్రణాళిక లుండాలి. వాటినే ప్లానింగ లంటారు రష్యా పంచవర్ష ప్రణాళికలను ప్రారంభించినప్పటినుంచీ ప్రతీదేశమువారూ ఇదేపని పట్టారు. జార్ల ప్రభుత్వములో రష్యాదేశము వ్యవసాయవ్యాపారములు రెంటిలోను వెనుకపడివుండి, దేశమంతా ఊసరక్షేత్రమై, ఫ్యాక్టరీ లల్పసంఖ్యాకములై, గనులు పనులుచేసేవారి ఆహారము లేక, జను లన్నవస్త్రహీనులై, బలవంతులు బలహీనులను కోటానుకోటిజనులను దోచుకుంటూ, విదేశములనుండి యెనలేని వస్తువులను దిగుమతిచేసుకుంటూ అంగరంగవైభోగము లనుభవిస్తూ ఒకవిధమగు సైనిక ప్రభుత్వమును చలాయిస్తూవుండేవారు. ఈ ఉప్పెనలో నుంచి తప్పుకుంటకు రష్యా సవరుప్రభుత్వమును నిర్మూలంచేసి కార్మికప్రభుత్వం పెట్టుకొని తమదేశమునకు తమస్వతంత్రరాష్ట్రముల సమ్మేళనమునకు కావలసినసరుకును తామే నిర్మాణముచేసుకొనుటకు, అందరికీ పనికల్పించడానికీ, విద్యావివేకములు పెంచడానికీ, ఆరోగ్యాభివృద్ధి చేయడానికీ, కమ్యూనిష్టుపార్టీవారిపై అభిమానమును హెచ్చించడానికీ, రోడ్డులూ రైళ్లూ పెంచి పరస్పరస్నేహబాంధవ్యము లుదయింపచేయడానికీ, ప్రణాళికమీద ప్రణాళిక వేసుకొని కార్యక్రమమును సాగించవలసివచ్చింది, సాగించింది, సాగిస్తూ వుంది.

తక్కినదేశాలకి రష్యాచేస్తున్న ఇతరప్రయత్నములు నచ్చినా నచ్చకపోయినా ఆర్థికప్రయత్నములు మాత్రము నచ్చుతున్నవి. నచ్చేదేమిటి, మానేదేమిటి. ప్రపంచమునంతటినీ ఆవరించియున్న ధరలమాంద్యం, నిరుద్యోగం, వ్యాపారస్తంభనము అనేవాగురులనుండి తప్పించుకుంటకు ఏవోకొన్ని ఉపాయములు పన్నకోక తప్పుతున్నదికాదు. బ్రిటిషువారు ప్రారంభించిన టారిఫు గోడలు, అటావాఒడంబడికలు, జపానుతో సంప్రతింపులు ఒకరీతిగా ఈజాతిలోనివే. రష్యాఅంటే తన దారిద్ర్యకర్మముకొద్దీ తనమార్గము త్రొక్కింది. ప్రపంచములో ఇతరత్రాకూడా యంత్రాలయములు వెలసి యెనుమతులే ప్రారంభించడంవల్ల బ్రిటిషుక్యాపిటలిష్టుల సరుకు విడుదలకానందువలన క్రొత్తమార్గము త్రొక్కి 'ప్రోటక్షనిష్టు' అయి అటావాకట్టె పెట్టుకోవలసినకర్మం దానికి పట్టింది. కాని బొండాలవాడు పార్లిపార్లి యేడ్చాడన్నట్లు అమెరికాకుకూడా యీ దరిద్రం తప్పింది కాదు. బ్యాంకులనిండా రొక్కము, కొట్లనిండా దినుసులు, గోడౌనులనిండా సరుకులు గల అమెరికాదేశములో ఈమూడుగూర్తులూ ఒకరినొకరు నమ్మి ఒకరిదగ్గరికొకరు పోగా ఎవరిగూట్లో వారు మూలుగుతూ ప్రజలందరి పొట్టలూ మాడ్చడము మొదలుపెట్టినవి. ఏమంటే ఏమిలాభము? ప్రజలు తిరిగీతీర్చగలరన్నహామీ లేదు కనుక బ్యాంకులవారు ఒక్కదమ్మిడీ పైకితీయక ఎవరికీ ఇవ్వక, వడ్డీలు లేకుండా వున్నవనీన్నీ, ప్రాతబాకీలు రాకుండా వున్నవనీన్నీ యేడుస్తూ కూర్చున్నారు. డబ్బులేక కొనుక్కునే ప్రజలు లేకపోవుటచేత ఫ్యాక్టరీలవారు సరుకులు పురుగులుపట్టనిస్తున్నారుగాని కావలసినవారి కీయనీయరు. రావలసిన బాకీలు రాక యియ్యవలసినవి తప్పక చిన్నచిన్న బ్యాంకీలన్నీ దివాలా! తయారైనసరుకే చెల్లక, కూలీలిచ్చుకోలేక ఫ్యాక్టరీలన్నీ లాకవుటు! ఇక వ్యవసాయపుదినుసులూ, ముడిదినుసులున్నా? యంత్రాలే పడుకుంటే వాటిమాట లెవరికికావాలి? ఆహారదినుసులు కొనుక్కొనుటకు డబ్బెవరిదగ్గర నున్నది? ప్రజలు చస్తే చావనీకాని దుడ్డియ్యమంటే ఏం డేవరు

పెడతారు? పండినపంటలకే యీగతి పడితే క్రొత్తగా పండించడాని కెవరికి నుండెలున్నవి? ఇట్టిపరిస్థితిలో ప్రజలు రష్యాలోలాగ సమిష్టివాదులై తిరగబడి దోచుకొని సరీగా పంచుకోవడంతప్ప వేరేత్రోవ లేకుండెను. అయితే అమెరికా పెట్టుబడిదార్లు ప్రభుత్వమువారు బ్యాంకర్లు రష్యావారంత మూర్ఖులు కారు. హిందూదేశం నాటుకోట్లు, ఆర్యవైశ్యులు, కళింగకోమట్లు లాగ ఏవొడ్డు కావొడ్డు కాచుకొని బాకీదార్లను నిలబెట్టి తాము నిలబడి మళ్లీక్రమంగా పిండుకొనేపద్ధతి వాళ్లు. వీళ్లందరినీ కూడకట్టుకొని ప్రెసిడెంటురూజువెల్టు సర్వాధికారత్వము పొంది ప్రజలందరిచేతా వొప్పిస్తూ క్రొత్తక్రొత్తయేర్పాటులు చేస్తూ రాజ్యాన్నంతటినీ కోలుకొనేటట్లు చేస్తున్నాడు. బ్యాంకులవాళ్లదగ్గర తాను పూచీపడి కోట్లకొలదిద్రవ్యము వడ్డీకవాడుతుండడంచేత వాళ్లు సంతోషిస్తున్నారు. ఈద్రవ్యముతో క్రొత్తరోడ్లుపోయించి, అడవులునరికించి యిళ్లు కట్టిస్తూవుండడంచేత ప్రజలకు పనిదొరికి, ధనముచిక్కి, తినుబడిపదార్థములు కొనక్కొగలిగి సుఖవసతులు లభించడంచేత వాళ్లు సంతోషిస్తున్నారు. వ్యవసాయదార్లకు లంచాలిచ్చి లక్షలకొలది యెకరములు సాగులు తగ్గించి చెల్లుబడికానిదినుసుల ఉత్పత్తిని తగ్గించి ఉన్నపాటిదినుసులవెలలు హెచ్చించి కొనుక్కొనేవాళ్లను సృష్టించడంవల్ల వారు సంతోషిస్తున్నారు. ఇళ్లూ వాకిళ్లూ కుదిరి, తిండితిప్పలూ దొరికి, పైగా కొంత డబ్బు మిగిలితే దానితో ప్రజలందరూ యంత్రకారుల దగ్గరనుంచి తయారగుసరుకును కొనుక్కుంటున్నారు కనుక, తమసరుకు కదులుతున్నదికనుక ఫ్యాక్టరీలవాళ్లు సంతోషించడమేకాకుండా క్రొత్తఫ్యాక్టరీలనుకూడా కట్టుకోగలుగుతున్నారు. వాళ్లకు నచ్చచెప్పి రూజువెల్టు వారిచేత పనిచేసేగంటలు తగ్గించి, కూలీలు హెచ్చించి, క్రొత్తవారిని పనులలో చేర్పించి నిర్వ్యాపారత్వమును తగ్గించగలుగుతున్నాడు. ఇదివరలో శ్రీమంతమైన అమెరికా చిక్కులు పడుతున్నదంటే సంతోషించేదేశాలన్నీ, కోలుకొంటున్న అమెరికా తమవస్తువులను తెప్పించుకొని తమదుస్థితిని కొంతతగ్గించకుండా తనలోతాను సరిపెట్టేసుకుంటున్నదే అని ఓర్వలేకుండా వుంటున్నారు. ఇదీ అమెరికాలో జరుగుతున్న ప్లానింగు, లేక ప్రణాళిక.

ఇవన్నీ మానవుడిప్రణాళికలు. మానవుడిప్లానులన్నీ తా ననుకున్నట్లే సాగుతూవుంటాయి అనుకోకూడదు. ప్రకృతిజన్యులమై పరిమితబుద్ధియోచనలు గల మనమే యిటువంటిఉత్కృష్టవిప్లవములూ, మార్పులూ తెస్తూవుంటే మనకంటే అనేకరెట్లు వెట్టినికారాలు కలిగినప్రకృతికి వీనిని పాడుచేయుట అనగా నెంత? లేదా సాయముచేయుట అనగా నెంత? రావణాసుర ప్రయత్నాలు చేస్తూవున్నరష్యాలో అనావృష్టి కలిగి తెల్లరొట్టెధర పెరిగి ఏప్రిల్ నెలలో ౧౦ లక్షలు జనులు మరణించినట్లు తెలుస్తున్నది. పండినపంటలు చెల్లక వాటికి ధరలు కల్పించుటకై భగీరథప్రయత్నము మీద లంచములిచ్చి గోధుమసాగుభూమిని లక్షలకొలది యెకరములు తగ్గించిన అమెరికాలో వేడిగాలులు వీచి పంటలు తగ్గి కాటకములు కలిగేసూచన లవుపిస్తున్నవి. కాని ధైర్యస్థైర్యములుగలప్రెసిడెంటు తగినప్రతిక్రియలు చేస్తానని చెప్పుతూ ప్రజలందరికీ ధైర్యోత్సాహములు పురికొల్పుతున్నాడు. జర్మనీ, ఇటలీ మొదలగు తక్కిన అయిరోపాదేశములన్నీ అనవసరపుపరుగులు పెట్టక, అయోగ్యముగా క్రుంగిపోక, వీలయినంత లేస్తూ సాధ్యమైనంతవరకు తమయోగమతులతో చుట్టూ యెగ ప్రాకుతూ అల్లకల్లోలము పడుతూవున్నవి. ఆసియా ఖండముచూస్తే జపానువిజృంభణమునకుఅంతూపొంతూ లేదు. జానాబెత్తెడుద్వీపాలలోనుంచి చీమలపుట్టలులాగ ప్రజలుపుట్టుకొస్తున్నారు. వారందరికీ భీషణసైనిక కవాతు. కొరియామాంచూరియాల నాక్రమించుకున్నది. చీనాను మ్రింగచూచుచున్నది. రష్యాపైకి పిల్లనూకుళ్లు దూకుచున్నది. అంతర్జాతీయసమితినేకాదు, అఖిల పాశ్చాత్యసమితిని కూడలగొట్టుచున్నది. యుద్ధనౌకలు, విమానములు పెచ్చుపెరుగుచున్నవి. దీనికితోడు ఉపద్రవమైనపంటలు పండిస్తూ, యంత్రాలతో సరుకును తయారుచేస్తూ ఎంతేసి టారిఫుగోడలనయిన అవలీలగా

దాచేసి కారుచౌకగా ప్రతీదేశంలోనికి డంచుతూ "ఇదం బ్రాహ్మ మిదం క్షాత్ర" మన్నట్లు "ఇదం యుద్ధం ఇదం వర్తక" మని ప్రళయతాండవం చేస్తున్నది. తక్కిన మనమూ, మన పెద్దన్నగారగు చీనా, తక్కిన చిన్నతమ్ముళ్లగు ఆఫ్ఘనిస్థానము, అరేబియా, పెర్షియా మొదలగు దేశముల మాటా నా? మన కాలోచనలు తక్కువలేవు కాని అంకుశా లెక్కువగా ఉండి అణచిపెట్టుచుండుటచేత అదృష్టవంతుల ఆటలన్నీ మనమీదే సాగి వచ్చి మన మధోగతులపాలై, అఘటనఘటనాసమర్థుడగు పరమేశ్వరు డెట్లాచేస్తే అట్లాగేకానీ అని పరిపూర్ణ వేదాంతులమై బాధలుపడుతున్నాము.

మనహిందూదేశమునకు తల్లిపట్టేకాని పిల్లపట్టేమీ లేకున్నది. మన మొఱ్ఱలన్నీ మొఱ్ఱలలాగే వున్నా, మనపై నవ్యాజప్రేమగల ప్రభుత్వమువారే మైనరుతరఫున బాధ్యతలన్నీ వహించి మనకోసం ప్లానింగులు చేస్తున్నారు. తలగలమగాళ్లంతా జైళ్లలో క్రుంగుతున్నప్పుడు మొలలేనిసభ్యుల నందరినీ ముఖ్యులుగా చేసి ఒక ఆర్డినెన్సుశాసనాలా, అట్టావాఒడంబడిక చట్టాలా, తెల్లకాగితాని కంగీకారపత్రాలా, వాని యిష్టమువచ్చినపత్రాలమీదల్లా బుల్లిదస్కత్తులూ, పెద్దదస్కత్తులూ పెట్టించుకున్నారు ఇందువలన దేశమునకు స్వాతంత్ర్యబంధన మేకాక, పరిశ్రమలకు రక్షణబంధనముకూడ తొలిగినది. అగ్గిపెట్టెలపరిశ్రమ అగ్గిపాలౌతోంది. పంచదారపరిశ్రమ పంచలపాలౌతుంది. బట్టలపరిశ్రమకా ఒకప్రక్కన జపాను కోత్రోవ యేర్పరచి ఒకప్రక్కన తమతలపులు బాహాటముగా తెరచుకొన్నారు. ఇట్టిసమయములో మనమిల్లులు కోలుకోవడం ఎట్లా? దీనికిసాయము సమ్మెలు. వానిని ముగించే ప్రయత్నములనుండి పరాఙ్ముఖత్వము. మిల్లుపరిశ్రమలనుసజీంచి అటావాఒడంబడిక వుండనేవుంది కనుక వేరేప్లానింగు చేయుటకు వీలేలేదు.

ఇక గృహపరిశ్రమల నుద్ధరించడానికి ప్లానింగు. గృహపరిశ్రమలు సాధారణముగా మిల్లుపరిశ్రమలతో పోటీకాగలేవు. మిల్లుపరిశ్రమలు హెచ్చితే గృహపరిశ్రమలు కూలపడతా యని గతరెండువందలసంవత్సరములనుండి జరుగుతున్న పారిశ్రామికవిప్లవమే తెలియపరుస్తున్నది.

మనదేశములో ఒకప్రక్కన గాంధీగారిఖద్దరుతత్త్వమువల్లనా, ఇంకొకప్రక్కన విదేశీమిల్లులు వస్తువుల దిగుమతి ఒడంబడికలవల్లనా స్వదేశీమిల్లులు క్షీణముఖము పడుతున్న విగనుక, యీగృహపరిశ్రమలవస్తువులైనా యిక్కడ వ్యాపింపజేసి వ్యవసాయకుల కుపవృత్తి కలిగించి సహాయముకలుగుతుందేమో అంటే అదీ మంచిఆలోచనే! హిందూదేశ మింకా పూర్తిగా మిల్లుతత్త్వములో పడలేదుగనుక, హిందూదేశస్థులకు ఇంకా గృహపరిశ్రమలవలన తయారయేవస్తువులను కొనుక్కొనుటయం దభిలాష వుందికనుక, అట్టిపదార్థములిక్కడ చెల్లించే యేర్పాటులు చేయడం, రెయిలువేరేటులు తగ్గించడం మంచియౌతే. కాని ప్రభుత్వమువారు తలపెట్టిన దిది కాదు. గృహపరిశ్రమలఅభివృద్ధికి సంవత్సరమున కెంతోకొంత స్వల్పమొత్తమును శాంక్షను చేస్తూ వుండడము, ఈవస్తువులే కొనుక్కొమని పాశ్చాత్యులను బ్రతిమాలుకొని వారికి వీటియం దభిరుచి పుట్టించుటకు ప్రయత్నించడము. ఈరెండవది యెప్పటికైనా సాగుతుందని ఏజ్యోతిష్కుడైనా పాశ్చాత్యదేశాల జాతకములు చూసి చెప్పగలడా? అయితే ఇందుకొరకు వాణిజ్యానుభవముగల పాశ్చాత్యధీమంతులను పెద్దజీతములమీద యేర్పాటుచేయడము, వారిక్రింద రాష్ట్రీయోద్యోగస్థులు, వారికి సెక్రెటరీలు, అనుచరులు మొదలగువారితో ఒకచిన్నడిపార్టుమెంటు మనకు తప్పదు.

ఇంకోచిత్రమైన ప్లానింగు. ఇది మనహిందూదేశమున కాహారభూతములైన వడ్లు, గోధుమలు, చెఱుకు మొదలగువానిని గూర్చించిన ప్లానింగు. మన మేమో ఇండోచీనా, సయాము, బర్మా మొదలగుదేశాలలో పండివచ్చుచున్న వడ్లను, బియ్యమును కొనుక్కొనుటకుగాను మనదేశపు వరి గోధుమలు మొదలగువానిని తగ్గించుకోవాలి. ఆదేశములలో అవి భూరిపరిశ్రమలవిధానంగా పండిస్తారుగనుక తక్కువగా పండించుటకు వీలులేదు. దిగుమతిసుంకాలు విధించకుండా వానిని మనకు చౌకగా

# 'కర్పూరతైల' చిత్రములు



౫. దేవదారురస మున్న డబ్బాలను తైలముతీయు బట్టీకడకు కొనిపోవు బస్సులు



౬. దేవదారు రసమును పోయుటకు డబ్బాలు

అంటకడతారు. లేకుంటే వారు మనమీద ప్రతిక్రియ చేసి యేమినష్టము తెచ్చిపెడతారో అనిదిగులు. అవి చవకగా వస్తున్నవికనుక మనరైతువాడి పంటచెల్లదు. వానినాపివేసినచో ఇతనిపంట మంచిఖరీదుకు చెల్లి శిస్తులు సంతోషముగా చెల్లించుకొని అప్పుసప్పు తీర్చుకుంటూ, ఆనందముగా వుండగలడు. అయితే రైతువాడు ఏలాగున్ననేమి? సర్కారుశిస్తు రాదన్న భయము లేదు. భూమి పండకపోయినా, పంట చెల్లకపోయినా అన్యత్రా కూలిచేసుకొనైనా తెచ్చి పన్ను చెల్లించాలి. లేకుంటే యిల్లూ వాకిలీ వేలాం. అవి లేనప్పుడు భూమివేలాం. క్రొత్తగా కొనుక్కొన్నవాడెక్కడనుంచైనా తెచ్చుకొని పన్ను కట్టుకోవాలి. లేకుంటే వాడిపనీ అంతే. ఈవిధంగా మాయదారి భూమిని నమ్ముకొని మనిషితరవాత మనిషి దివాలా అవుతున్నాడు. వీరిని రక్షించడానికి ప్రభుత్వం యేదైనా ప్లానింగు వేయవద్దూ? రాట్నాలొస్తున్నాయి బళ్లు తోవలోనుంచి తియ్యాం డన్నారుట. విదేశాలనుంచి చౌకబియ్యాలొస్తున్నాయికనుక మీమీవంశానుగతమైన పంటలను తగ్గించుకోండోయి అని ఒక సూచన వదిలేశారు. అలవాటైనపంట మానుకోవడం, అనుమానాస్పదమైనపంటలు వేసుకోవడం. ఇంతకూ ఈక్రొత్త పంట లేమిటో తెలియదు. దానిని విచారించేందుకు తగినఅనుభవజ్ఞులను ఉద్యోగస్థులను యేర్పాటుచేస్తారు. ఈసంగతులన్నీ మే 8-వ తేదిని సిమ్లాలో జరిగినపంటల నిర్ణయసభలో టంగున తెగిపోతుందనుకున్నాము కాని ఇదేమి రష్యా, జపాను, అమెరికా, జర్మనీల ప్లానింగా? అదుగో అంటే ఆర్నెల్లు.

ఈసమయంలో ఈఆలస్యమే చాలా ఉపకారంగా వుంది. అవకతవకఆలోచనలకు సాయం అతి శీఘ్రంకూడా అయితే బ్రతకగలమా? విదేశీవడ్లమీద మణుగుకు రు ౦-౧౫-౦ లు, బియ్యంమీద రు ౧-౪-౦ లు దిగుమతిసుంకం వేయవలసిందని ఒకరు సూచిస్తే వాళ్లు నిరాకొంప ముంచేయగలరని భోరుగారు హెచ్చరిక చెప్పేరు. మారకపురేటు మార్చి, నాణెములు హెచ్చించమంటే సాధ్యముకాదని త్రోసేశారు. క్రొత్తపంటలను గూర్చి ఆలోచించుటకు జనపనార, పత్తి, చెఱకు కమిటీలు పరిశోధనపనిచేస్తున్నాయి. మొత్తముపయిన ఈసభాసమావేశముకయిన ఖర్చులు దండుగైతే అయినవి కాని ఇందులో నష్టకరమైన తీర్మానములు ప్యాసు కాలేదు. వరిపంట ఇంకాహెచ్చించే ప్రయత్నాలు చేయరాదనుకున్నారు. అట్టిఆలోచన మన కసలేలేదు. గోధుమపంట తగ్గించాలన్నతీర్మానం కూడా నెగ్గలేదు. సభాఫలితము లిప్పటికేమీ లేకపోయినా, వీరికమిటీలు చేసేవిచారణలఫలితంగా ముందుముందు మంచిఫలితములు కలుగవచ్చునని సంతోషిస్తూ పత్రికారత్నములు అభిప్రాయములను వ్రాస్తున్నవి. ఇదీ మనఇండియా ప్లానింగు.

---



## కులస్త్రీలు - నాటకాలు

నాటకప్రదర్శనాలలో స్త్రీపాత్రలు కులస్త్రీలు అభినయించవచ్చునా కూడదా అని యిప్పు డొక పెద్ద ప్రశ్న. దీనిమీద సన్నసన్నంగానే అయినా కొంచెం ఘాటుగానే చర్చ జరుగుతోంది. కాని దీని పర్యవసానం కోసం యెవరూ కనిపెట్టుకుని ఉండడం లేదు. అనేకస్థలాలలో చాలామంది కులస్త్రీలు బాహాటంగా ప్రదర్శనాలు చేసేస్తున్నారు. కొందరు దంపతులు, కళకోసమే కావచ్చు, యిది వృత్తిగా పెట్టుకున్న వారుకూడా వున్నారు. ఇవతల కులస్త్రీల సంగతి యిలా వుండగా అవతల వేశ్యలున్ను జన్మసిద్ధమైన తమ హక్కును స్వాధీన భుక్తాలలోకి తెచ్చుకుంటున్నారు. అక్కడక్కడ కులస్త్రీలూ, వేశ్యలూ కలిసిన్నీ ప్రదర్శనాలు చేస్తున్నారు. ఈప్రదర్శనాల విషయంలో ప్రజల ప్రశంసలు పైస్థాయిలోనే పలుకుతున్నాయి. ప్రదర్శకురాండ్రకు ప్రత్యేకంగా ఆదరసత్కారాలు జరుగుతున్నాయి. ఇలాగ యీప్రశ్న ప్రశ్నగానే వుండగా విషయంమాత్రం ఆచరణలో అతిజటిలంగా పాకిపోతోంది.

* * * *

ఇంతకీ: ఇప్పుడీ ప్రశ్నకి అవసరం యేం వచ్చిందీ?

* * * *

కావ్యాలకు ఉద్దిష్టమైన ప్రయోజనం రసానుభవం. ఈ విషయంలో శ్రవ్యకావ్యాలకు కంటె దృశ్యకావ్యాలకు—నాటకాలకు వైశిష్ట్యం వుంది.

నాటకప్రదర్శనం అంటే ఇతివృత్తం జరిగిన కాలానికి, అది ప్రవర్తిల్లుతూ వుండిన చోటికి ప్రేక్షకులను తీసుకువెళ్లడం.

శ్రవ్యాలలో బుద్ధిని వినియోగించి, వూహలు పన్నితే గాని స్ఫురించనిపాత్రల హావభావాలు నాటకప్రదర్శనాలలో కంటికి కనబడడమూ, చెవికి వినపడడమూ, హృదయంమీద హత్తుకుపోవడమూ, తద్వారా రసానుభవం కలగడమూ ఏకకాలంలో సిద్ధిస్తాయి. నాటకాలంటే పండితులకూ, పామరులకూ సమానంగా మోజు కలగడానికి కారణం యిదీ.

కాగా, నాటకాలు రచించడంలో కవులకు కంటే, ప్రదర్శించడంలో నటులకు కౌశలం యెక్కువ కావాలి. ప్రేక్షకులకు, ఇతివృత్తంవల్ల మనోరంజనం కలిగించడం వొక యెత్తూ, కవిత్వంవల్ల హృదయోత్తేజనం కలిగించడం వొక యెత్తూ కనక నటులేమాత్రం అసమర్థులైనా ఉద్దేశం భగ్నమైపోతుంది. ప్రదర్శనం కృతకమై —రు—, అసభ్యమై జుగుప్సాకూడా కలుగుతాయి. ఇలాగ యిదేమీ తటస్థించకుండా ప్రేక్షకులకు ఆనందసంధాయకమైన రసానుభవం కలగాలంటే రంగపరికరాలూ, నటులూ నాటకేతివృత్తానికి మెలిచినట్లు సరిపోవాలి. నాటకప్రదర్శనంలో స్త్రీపాత్రలు స్త్రీలే అభినయించాలనడానికి విధాయకసూత్రం యిదీ. మహాకవు లనేకులు తమ నాటకాలలో నటీసూత్రధారసంభాషణద్వారా యీ విషయం స్పష్టంగానే ప్రతిపాదించి వున్నారు.

నాటకపాత్రకంటే త్రికరణయా భిన్నుడైన నటుడు యథాయోగ్యంగా పురుషపాత్రనే అభిన

యించడం దుర్ఘటంగా వుండేటప్పుడు స్త్రీపాత్రగా చెలామణీ కావడం యెన్నడూ సంభవించదు.

నడివయస్సులో వున్న నటుడు సమృద్ధమైన సాధనసామగ్రి నుపయోగించుకుని తన నైపుణ్యంవల్ల శతవృద్ధు పాత్రను ఆంగికంగానూ, వాచికంగానూ కూడా చాలావరకు చక్కగానే వొప్పించవచ్చు. కాని ఆనటుడే శతవృద్ధుగా నెగ్గుకువచ్చినట్టు బాలుడుగా చెలామణీ కాలేడు. పురుషుడు స్త్రీపాత్రని ధరించడం కూడా యిలాంటిదే.

ఏతావతా: స్త్రీలకూ, పురుషులకూ కష్టసుఖాలు సమానమే కావచ్చు.

సంకల్పాలూ, అభిలాషలూ, అనుభవాలూ యేకరాశిలోవే కావచ్చు. కాని యిద్దరికీ భౌతికంగా సామ్యం కుదరదు. లేదు కూడాను. స్త్రీ స్త్రీయే. పురుషుడు పురుషుడే. ఇద్దరికీ వుండే భేదం వొక్కమాటలో తేల్చాలంటే: స్త్రీ విలాసవతి. పురుషుడు గంభీరమూర్తి. పురుషుని మనస్సు యాభ్యుదయంకోసం కల్పనలు చేస్తూవుంటుంది. స్త్రీ మనస్సు ఆ అభ్యుదయాన్ని అనుభవంలోకి తెచ్చే యెత్తులు వేస్తూ వుంటుంది.

పురుషుని బుద్ధి చటాలున వొక నిశ్చయానికి రాలేదు. స్త్రీబుద్ధి కిందా మీదా పడుతూ కూచోలేదు.

పురుషుని హృదయం యెప్పుడోగాని మార్దవం వహించదు. స్త్రీహృదయం యెన్నడోగాని కాఠిన్యం పూనదు.

పురుషుని చూపులు సూర్యకిరణాల్లాగ దుర్నిరీక్ష్యంగా వుంటాయి. స్త్రీచూపులు మెరుపుతీగల్లాగ భ్రాంతి కలిగిస్తూ వుంటాయి.

పురుషుని శరీరం కదలితే రాజసం తలాయిస్తూ వుంటుంది. స్త్రీశరీరం చలిస్తే లావణ్యం పొంగిపోతూ వుంటుంది.

ఈలక్షణాలలో వ్యత్యాసం వస్తే పురుషుడు "ఆడంగిరేకలవా" డనీ, స్త్రీ "మగబీరు" డనీ యీసడింపు పెనచుకుంటుంది.

కాగా, పురుషుడు స్త్రీత్వాన్ని చూపించలేడు. స్త్రీ పౌరుషాన్ని వెల్లడించలేదు. కాదూ కూడ దని పురుషుడు స్త్రీవేషం వేస్తే ముస్తీబు చేసిన కొయ్యబొమ్మలా ఉంటాడు. స్త్రీ పురుషవేషం వేస్తే పులిచర్మం కప్పుకున్న మేకలా వుంటుంది.

ఇది యిలా వుండగా తెనుగుదేశంలో మొదణ్ణుంచీ వొక సంప్రదాయం వుంది.

వ్యభిచారదోషం వున్నా పెద్దలలో చాలామంది సభలలో వేశ్యలకు ఆదరం చూపుతారు; కాని స్త్రీవేషగాణ్ణి హీనంగా చూస్తారు. బంతికి రానివ్వరు.

పురుషుడు గొల్లవేషం గాని, భామవేషం గాని వేస్తే వారు ఆదరిమానాని కేనా వెళ్లరు.

ఈపట్టువల, సంప్రదాయం అంటే చెవి కోసుకునే పెద్దలలో యిప్పటికీ చాలా దృఢంగానే వుంది.

కాకపోయినా, పురుషులకంటే స్త్రీ లెప్పుడూ హెచ్చుగానే వుంటూండేటప్పుడు పురుషుడు స్త్రీవేషం యెందుకు వెయ్యాలీ? ఈవిధంగా స్త్రీల హక్కును పురుషు లెందుకు భంగపరచాలీ?

పైగా: పురుషుడు స్త్రీవేషం వెయ్యడం కళని మలినపరచడం వొక్కటే కాదు. స్త్రీజాతిని అగౌరవపరచడం కూడానూ.

అయితే: నాటకాలలో స్త్రీపాత్రలు స్త్రీలే అభినయించా లంటే సరే, కాని ఆపని కులస్త్రీలు కూడా చెయ్యవచ్చు నంటే యేలాగా?

నిజమే. ఇది వొకప్పుడు హేతుబద్ధమైన పూర్వపక్షమే. కాని ఆకాలం కాదిది. వృత్తివిభాగం సడలిపోయి చాలా రోజు లయింది. కృత్యవిభాగం కూడా మారిపోతూవున్న రోజు లివి. ఏది యెవరికి అనువో, దేన్లో యెవరికి రుచో, యెందులో యెవరికి లాఘవమో ఆపని చెయ్యడానికి వారి కిప్పుడు ఆక్షేపణలు లేకపోగా, పైగా, ప్రోత్సాహం కూడా కలుగుతోంది.

జమీందారుల కుటుంబాలకు, పండితుల వంశాలకు, ఆహితాగ్నుల కోవకు చెందిన చిరంజీవు లిప్పుడు తలపుకి వస్తే కూడా పెద్దలు చీదరించుకునే వృత్తులు అవలంబిస్తున్నారు. సంప్రదాయానికి, ప్రతిష్ఠకి, ప్రతిభకి, అభిజాత్యానికి, స్థితికి, పదవికి లోటు లేని యువకు లిప్పు డనేకులు కులాసాగా నాటకా లాడేస్తున్నారు. ఆడి "సెబాస్" అనిపించుకుంటున్నారు. బహూకరించబడుతున్నారు. కళాకుశలు లనిమాత్రమే కాక కళోద్ధారకు లనిన్నీ సత్కరింపబడుచున్నారు. ఇలాంటి స్థితిలో వారి స్త్రీలు వారితోపా టెందుకు కాకూడదో ?

కవులు నాటకాలలో ఉత్తమ స్త్రీపాత్రలు సృష్టింపవచ్చు. ఆ నాటకాలు ప్రదర్శింపబడేటప్పుడు ఉత్తమస్త్రీలు చూచి ఆనందింపవచ్చు. కాని వారు ఆనాటకాలలో పాత్రధారణం చెయ్యకూడదా ?

ఇదీ గాక :

కులస్త్రీలు — ఉన్నతకుటుంబాలకు చెందిన మానవతు లను యువతు లిప్పుడు అనేకమందితో కలిసి కూచుని కళాశాలలో విద్యాభ్యాసం చేస్తున్నారు. ఖండాంతరాలకు గూడా వెళ్లివస్తున్నారు. అజంతా సంప్రదాయా న్ననుసరించి స్త్రీల చిత్తరువుల చిత్రించి మెప్పు పొందుచున్నారు. స్థానికసంస్థలలో, నగరీయ సంఘాలలో, శాసనసభలలో, రాజకీయాందోళనంలో, సంఘసంస్కరణ కార్యాల్లో నిరాఘాటంగా పాల్గొంటున్నారు. జెయిళ్లకు వెళ్లి వస్తున్నారు. ఉద్యోగాలు చేస్తున్నారు. న్యాయవాదం, వైద్యం — ఇలాంటి వృత్తుల్లోగూడా వోహో అనిపించుకుంటున్నారు. ఇక నాటకాలలో వేషం వెయ్యడమా తప్పు? "వేస్తే ఆస్త్రీలకు శీలం నిలుస్తుందా?" వున్న కుళ్లు ఇదీ. వచ్చిన పుట్టిమునక గూడాయిదీ. వాస్తవంగా యిది కుంటిప్రశ్న. ఇది పురుషుల హృదయదౌర్బల్యానికి నిదర్శనం. తేలిక బుద్ధికి చిహ్నం. అసహనానికి గుర్తు. అశక్తిదుర్జనత్వానికి వుదాహరణ;పోనీ, యిలా సందేహించే పురుషుల శీలంమాట యేమిటి ?

ఏమంచ: శీలభ్రంశం పొందిన స్త్రీలు అన్నితాహతుల్లోనూ వున్నారు. అన్ని వృత్తుల్లోనూ వున్నారు. అన్ని రకాల్లోనూ వున్నారు. అన్ని కులాల్లోనూ, అన్ని మతాల్లోనూ, అన్ని జాతుల్లోనూ, అన్ని పరిస్థితుల్లోనూ వున్నారు. శీలపరిశీలనం సంఘధర్మాలకు సంబంధించింది. కాని కళకి సంబంధించింది కాదు. నాటకరంగంలో వున్నప్పుడు ఆమె కళావతిగాని ఫలానా కాదు. చంద్రమతీపాత్ర అభినయించే స్త్రీ చంద్రమతియెలా కాదో అలాగే శీలవతి కాకుండా కూడా వుండవచ్చు. అభినయిస్తూ ఉన్నంతసేపూ ఆమె చంద్రమతిగా వుందా లేదా? ఇంతే మనకి కావలసింది. ఆవేషం విప్పేశాక ఆమె యెవరో? మన పెవళ్లెవో? పోనీ ఆమె సొంతానికో అంటే యీ సంశయాత్మల సొంతం మాట యేమిటి ?

శాస్త్రి

---

## చుక్కయెదురు

బ్రిటిషువర్తకుణ్ణీ హిందూదేశపు వ్యవసాయకుణ్ణీ ఒకగదిలో కూర్చోపెట్టవచ్చు. పచ్చికైస్తవుణ్ణీ పరమ ఛాందసుణ్ణీ కలిపి ఒకబండిలో యెక్కింపవచ్చు. మహమ్మదీయ మౌలానాను మహామహోపాధ్యాయుణ్ణి ఒక గోష్ఠిలోకి తేవచ్చు. కాని, సంఘసంస్కారిని సనాతనుణ్ణి కలిపి సవ్యమైన పద్ధతిలోకి తేవడం బ్రహ్మదేముడికికూడా సాధ్యంకాకుండావుంది. సనాతనుడు శాస్త్రం అంటే సంస్కారి నీతివిరుద్ధ మంటాడు; సంస్కారి కాలానుగుణ్య మంటే సనాతనుడు వైదిక ధర్మవిరోధ మంటాడు. ఈ రెండుకక్షలూ, పలువురు పురాతన సంస్కారనాయకులు తలచినట్లు కాలక్రమమున నొకదాని కొకటి సుముఖములౌటకు బదులు విరోధములౌతూ బలతరము లగుచున్నవి. సనాతనులు పురాతనాచారకూపములలోబడి కుళ్లిపోతున్నారు కనుక శాసనాలు ప్యాసుచేసైనా వారిని బలవంతాన రక్షించాలని సంస్కారులకపూర్వమైన దయ. సంస్కారులు అవైదిక, కైస్తవ, మహమ్మదీయ అగాధ నరకకర దూరా

చారములలోనికి సంఘాన్ని ఈడ్చుకొని పోతున్నారని సనాతనుల కసహ్యం.

మొగాడు పెళ్లాం చస్తే పెళ్లాంచొప్పున చచ్చేదాకా పెళ్లాల్ని చేసుకుంటున్నాడా లేదా? ఇష్టం వచ్చినదాన్ని యిష్టం వచ్చిన వయస్సున చేసుకుంటే చేసుకుంటూ లేకుంటే మానుకుంటున్నాడా లేదా? ఇంగ్లీషులు చదివి క్రాపింగు లుంచుకుంటున్నాడా లేదా? పెళ్లాన్ని తన్ని విడాకు లిస్తున్నాడా లేదా? పత్నీవ్రత మని బిగ్గబిగి కూర్చుంటున్నాడా యేమిటి? ఆడవాళ్లకీ హక్కులు లేకుంటే యేంగాను, మన నాగరకప్రపంచంలో తలయెత్తుకొని పరువుగా బ్రతకగలమా వారికి మనతో నిర్విధమైన సరిసమానత్వం లేకుంటేనని ఒకపక్షమువారి వాదన. అదంతా ఎందుకు, శాస్త్రాలలో యేముందో చూడు, దానికి మేముచెప్పే అర్థాలే తప్ప వేరర్థా లొప్పము. ఆచార మన్నిటికంటె యెక్కువ ఉత్కృష్ట ధర్మము. దానిని మార్చడానికి మానవమాత్రుడికి వీలులేదు. అని ఇంకోపక్షం వారి వాదన.

యాగాలు, బలులు ఆచరించడం అహింసా తత్త్వానికి విరోధం, అనాగరిక పద్ధతి, క్రూరమూఢాచారము, దేవతాప్రీతి కలగదు; శాస్త్రాల్లో లేదు; ఉంటే ప్రక్షిప్తము; కాకుంటే చించేయాలి అని ఒకరిసిద్ధాంతము. అవి కేవలం లోకసంగ్రహంకోసం చేయబడుచున్నవి. అహింస కాదు. అట్లు చేయుట వలన చేసినవాళ్లకీ, చూసినవాళ్లకీ, చచ్చిన జంతువులకీ మోక్షం కలుగుతుంది. చేయకుంటే వర్షాలు కురవవు, పంటలు పండవు. కలరా, ప్లేగు, మశూచికాది దేవతలు నరులను, సమస్త జంతువులను, సమస్త ప్రాణికోటినీ నోర్లుకపోతవి. ఇటువంటివి కూడదనేది బౌద్ధ జైన నాస్తికభావము. శ్రుతిస్మృతిసమ్మతము కాదు అనేది ఇంకొకరి పట్టుదల.

అస్పృశ్యతాదోషము హరిజనుల రోమరోమాలని పట్టివుంది. వారి గాలి సోకితే, వారిమాట వింటే, వారి చూపు పడితే నరులు దేవతలుకూడా అపరిశుద్ధులై వర్ణసంకర మౌతుం దని ఒకవైపువారి తత్త్వము. అందరిదీ ఒకటే రక్తము, ఒకటే మాంసము, ఒకటే ఇంద్రియజ్ఞానము, ఒకటేబుద్ధి, ఒకటేఆత్మ, అందరూ కలగాపులగమై జాతి కుల మత ఆచార వ్యవహారభేదములు లేకుండా తిరగకుంటే సృష్టియొక్క పురోగమనము కుంటుపడి జాతి చీడపట్టి చైతన్యవిహీనమై నామావశేష మౌతుందని యింకోవైపువారి ప్రబోధము.

ఆబోతులూ ఆబోతులూ కుమ్ముకుంటూ వుంటే మధ్యన లేగలు చస్తున్నవి. పాలకోసమో, పెనిమిటికోసమో తెలియకుండా ఏణ్ణర్థంపిల్లలు ముండమోసి ఏడుస్తున్నారు ఏలూరువంటిపట్నాలలో పబ్లికుగోడ్డులు బలివేయబడినజంతువులరక్తమాంసములతో నిండుతూన్న కుంభకోణం బ్రాహ్మణులు యజ్ఞములపేరు పెట్టి నోరులేనిమేకలను చావజంపి నోరుమూస్తున్నారు. సంప్రదాయసిద్ధమనుకొని పదిపన్నెండేండ్లప్పుడు కన్యల వివాహాలు చేసుకోదలచుకొన్న మర్యాదస్థులు పెద్దింటివారు రావుబహద్దూర్లు, అసెంబ్లీ సభ్యులు, గవర్నమెంటు ఉద్యోగస్థులుకూడా శారదాకమిటీల ధాటికి భయపడి 'పరాసు'ప్రదేశములకు పోయి హడావిడిగా వివాహాలు చేసుకుంటూ జరీమానాలు చెల్లించుకోలేక అవమానాల పాలవుతున్నారు. అస్పృశ్యతానిర్మూలనప్రయత్నములు పరిపాలనప్రయత్నములు మూర్ఖులను కొట్లాటలలోనికీ, విద్వాంసులను నాయకులను అసెంబ్లీ ఎన్నికలవిషయములో కక్షలలోనికి దించుతూ ప్రభుత్వమువారికి బలము కూర్చుచున్నవి. అయినా ఆవేశా లెవ్వరికీ తగ్గలేదు. ఉభయపక్షములవారుప్రభుత్వమువారినాశ్రయించుకొనేపద్ధతిలోకి దిగి ప్రజలకు ఆత్మవిశ్వాసజ్ఞానమును, తమకార్యములను తాముపరిష్కరించుకొనేశక్తిని చెడుపుచున్నారు. జాతీయసంప్రదాయములతోబాటు జాతీయతాజ్ఞానమే తుడుచుకొనిపోయేసూచన లగుపించుచున్నవి. సంస్కారవాదులు చట్టాలుచేయుమనీ, మీరినవారిని శిక్షించుమనీ ప్రభుత్వమువారినీ కోర్టులనూ ఆశ్రయిస్తూ వుంటే సనాతనులు ఆచట్టములను చేయవద్దనీ, చేసినవి తీసీమనీ, సంస్కర్తలబారినుండి విక్టోరియావాగ్దానము

ప్రకారము తమ్ము రక్షించుమనీ సభలు, నల్లజండాలు, కాంగ్రెసుప్రతికూలప్రచారములూ తీర్మానాల ద్వారా విన్నపాలు చేసుకొంటూ బలపడుతున్నారు. ఆచారాలు, మఠాధిపతులు, విశ్వాసములు, మూర్ఖత్వములు ఒకరిని బలపరచుచున్నవి. ప్రస్తుతప్రపంచవిజృంభణము, ఆధునికప్రవక్తల స్వతంత్రబోధనలు, ఆధునికపాశ్చాత్యతత్త్వము ఇంకొకరిని పురికొల్పుచున్నవి. మొత్తముపైని స్వయమాలోచన, స్వయంశక్తిపోయి ప్రభుత్వాశ్రయము వైపు ప్రజలు మరలుకొనుచున్నారు. ప్రభుత్వము వీరి నిరువురను ఎగవేస్తూ దిగదీస్తూ అనవసరందగ్గర సాయం చేస్తూ, అవసరందగ్గర నిరోధిస్తూ మనఐకమత్యవిహీనతవల్లను పొందగలిగినంత అనుకూలము పొంది చేయగలిగినన్ని ఆక్షేపణలు చేస్తున్నది. శారదాచట్టమును తీసివేయుమని ఒకరూ, ౧౪ ఏండ్లలోపలి వివాహాలను క్రమీకేలపూచీలేకుండా రంకుతనాలు, దొంగతనాలు, హత్యలులాగ కాగ్నైజబులు నేరముగా మార్చుమని ఒకరూ హడావిడి పడుతున్నారని సనాతనులసభలు, మహానందిఆర్యవైశ్యసభవంటిసంస్కారసభలు తిలకించినవారికి తెలియగలవు. సనాతనులనగా సెంటో, చట్టాలలో పెట్టినొక్కలేమా అనిఒకరికి, ఇన్నాళ్లాయా మన మూరుకున్నాముకాని మనము మూడోకన్ను తెరిస్తే ఈ అవైదికనాస్తికసంస్కార కాంగ్రెసుపక్షాలని భస్మపటలముచేసీలేమా అని ఒకరికి కావేషీ లెక్కువౌతున్నవి. భారతదేశరాజకీయపరిస్థితులలో నెప్పటికంటె ఐకమత్య మెక్కువగా కావలసిన ఈదినములలో ఇట్టి విరోధములు, పట్టుదలలు, అహంకారములు తలలెత్తుకొని విరగబడుచుండుట చూస్తే దేశశ్రేయోభిలాషుల గుండెలు గుభేలుమనకమానవు. ఉభయకక్షులు ప్రజలు తమప్రక్కనే ఉన్నారని తలుస్తారు. ధర్మముగా అగుపించే ప్రతీఉపన్యాసకునికీ ప్రజలు స్వాగతమిచ్చి ఆదరముతో విని చప్పట్లు చరుస్తారు, చందాలిస్తారు, సభ్యులుగా చేరుతారు. కాక ప్రజాహితసేవచేస్తున్నామనేకీర్తీ, దానికి సంబంధించాయన్న సంస్థలో పదవీ, పేపర్లలో పడవాలన్న అభిలాష కళ్లుతెరచి వృద్ధిలోకి రావలెనని కోరుతున్న ప్రతీజాతికి ప్రథమలక్షణము. మన మిప్పు డిట్టిపవిత్రజాతీయతాదైవతముయొక్క ఉపస్తేజములో ఉన్నాము. కనుక విశేషము విచక్షణ చూపించలేకున్నా, ఏదోఒకపక్షములో చేరి పేరుప్రఖ్యాతులు గడింతామన్న ఉబలాటక ముంటున్నది. కనుక దేశీయనాయకులు, సంస్కారపరాయణులు సనాతనాభిమానులు పై ఆడంబరములవల్ల మోసపోక, ఒకరినొకరు బాగా గ్రహించుకొని ఈపక్షములను కక్షలుక్రిందికి మార్చక పరస్పర ద్వేషాభిమానములు విడనాడక, అభిప్రాయభేదములు తప్పవన్నప్పుడు ఒకరితో నొకరు కలిసియుండగలిగినంతనే వుండి లేనప్పుడెవరి యిష్టముప్రకారము వారు జీవించుటకు సంతోషముతో సమ్మతించి అనావేశప్రచారములు సాగించినచో, సంస్కార మాలస్యమైనను, అవసరమైనచో, సంభవించుటకును అవకాశమున్నది; సనాతనమతము, కొన్ని యిడుములు గుడిచినను, వర్ధిల్లుటకును అవకాశమున్నది.

భారతదేశమంటే ఒకవూరు, ఒకరాష్ట్రము, ఒకమతము, ఒకజాతీకాదు, కాబోదు. ఇందెన్నిమతములు, అభిప్రాయములు, విశ్వాసములు, ఆచారములైనను పరస్పరస్నేహముతో స్వతంత్రముగ వర్ధిల్లవలెననియే ఈశ్వరోద్దేశము కనుక, ఎవరిధర్మవిశ్వాసములప్రకారము వారు ప్రవర్తిస్తూ, ఇతరుల ధర్మవిశ్వాసములు తమ కించుక బాధాకరములుగా వున్నా సహిస్తూ మితనరీ ఆవేశాలు తగ్గించుకుంటూ, ఎవరిధర్మమును వారు బోధించుకుంటూ, ఇతరులు వినినా. వినకున్నా తిట్టకుంటూ, ఒకరివలన ఒకరికి ప్రాణహాని మానహాని కలిగినప్పుడుతప్ప మతవిషయములలో ప్రభుత్వమూ కోర్టులూ వున్నాయన్నమాటే మరచిపోతూ ప్రవర్తించకపోతే సివిలువిప్లవము రాకతప్పదు. సివిలువిప్లవము వచ్చేతీరాలి, లేకుంటే మనకు మోక్షము లేదనే వారికీసందేశ ముద్దేశింపబడినది కాదు.

నారాయణ.




## ఇకవచ్చేది ఆడరాజ్యం

ప్రస్తుతప్రపంచపుపోకడ చూస్తున్నవాళ్లకి మగవాళ్లబడాయిలన్నీ అంతరిస్తున్నట్లు గోచరం కాకమానదు. అయితోపాయుద్ధంధర్మమంటూ వృద్ధికిరాగల మగవారన్నిదేశాలలోనూ చచ్చి, వారితాలూకు ఉద్యోగాధికారస్థానాలన్నీ స్త్రీలచేతులకు చిక్కినవి. క్రొత్తగా పుట్టినమగవాళ్లకి ఆ స్థానాలన్నీ మాయబడినవి. హిట్లరు, ముసలోనీలాంటివారు ఆస్థానాలని బలవంతాన పురుషులకు ఇస్తున్నారు. అపకీర్తిపాలై నాగరికప్రపంచమందంతటా అసహ్యించబడి ఖండించబడుతున్నారు. రష్యామొదలగుతక్కినదేశాలలో స్త్రీలు గౌరవ పరిపాలకస్థానాలకి వచ్చి పురుషులనువారికి పూర్వముండిన ఆస్తిహక్కు, ఉద్యోగార్హత, సమరపౌరుషము మొదలగు సర్వస్వామ్యపుహక్కులనుండి తొలగించి వారితో సరియైనఅంతస్తుకో, అంతకంటె తక్కువస్థానముకో ఈడ్చేస్తున్నారు. పరమేశ్వరుడిచ్చిన గర్భధారణశక్తిగదా వారి కిన్నాళ్లాయాపురుషుల కూడిగంచేస్తూ బ్రతకమని క్రిందికి లాగేసింది. దానికిప్పుడు శాస్త్రకారులు ప్రతిక్రియలు కనిపెట్టుతున్నారు. సంతాన నిరోధక పరికరములు పెచ్చు పెరిగినాయి. పూర్వం జనసంఖ్య పెరిగిపోతుందోయి, వారికి తిండి దొరకదోయి అని అర్థశాస్త్రవేత్తలు భయపడేవాళ్లు. ఇప్పుడు జనసంఖ్య తగ్గుతున్నాదోయి అని యేడ్వవలసిన పరిస్థితులు సమకూడుతున్నవి. పురుషులపూచీ లేకుండా పిల్లలను పుట్టించడానికీ, మగపిల్లలో, ఆడపిల్లలో యెవరు కావలిస్తే వారినే పుట్టించడానికీ, పుట్టినమగపిల్లల నాడపిల్లలుగాను, ఆడపిల్లలను మగపిల్లలుగాను మార్చడానికీ కృత్రిమమార్గములు రష్యాలో కనిపెట్టబడుచున్నవి. ఈవిధానంవల్ల అసలు ఆడవాళ్లే యెక్కువగా పుడతారట. కనుక ఆడవాళ్లు విస్తారముగా ఆడపిల్లలనే పుట్టించుకొని, వారికి కావలసినంతమంది, అనగా యింట్లో వంటకూ, పెంటకూ, బట్టలుతుకిందుకూ, డవాలా బంట్రోతుపనులు చేసేటందుకూ సరిపోయినంతమందిమగవాళ్లనే పుట్టించుకొని భూలోకమంతా తమకొరకు పట్టంకట్టుకుంటారు. కొంతకాలం నాటికి పుల్లింగ మవసరమే లేక అంతా ఒకస్త్రీలింగమౌతుంది. ఇదేమీ బ్రహ్మసృష్టికాదు కనుక పుణ్యపాపములు, జన్మజన్మలు, వాటిఅనుభవాలు వుండవు. "యద్రాత్ర్యాత్ కురుతే పాపం, తద్రాత్ర్యాత్ ప్రతిముచ్యతే" అని యెప్పటికప్పుడు క్లీనుస్లేటు. అక్కర్లేని బొమ్మల్నీ, ప్రాతబొమ్మల్నీ పారేస్తున్నట్లు ఎక్కువ ఉపయోగంవల్ల, అతివాడుకవల్ల రద్దయినమనుష్యులను తుడిచి పారవేయడమేకాని యిప్పట్లాగ సకాలఅకాల మరణాలూ, చప్పన్నరోగాలూ, పరామర్శలూ ఏవీ వుండవుట.

ఇదంతా ఉత్తుత్తిజ్యోతిష్కులు చుక్కల్నీ సూర్యుల్నీ చూచి చెప్పిన అల్లాటప్పాజోస్యము కాదు. డాక్టరు ఎనీడుచార్లెసు అనునామె శాస్త్రీయముగ గుణించిచెప్పిన యాథార్థ్యసూచనము. ఈదివ్యదృశ్యము చూడదలచుకొన్న శ్రీమంతులు క్రొత్తక్రొత్తమందుల మూలముగ జీవితమారిపోకుండా వెలిగించుకుంటూ ఉండవచ్చును. సనాతనులు పునరావృత్తిరహితమైన మోక్షస్థానము నొక్కసారి కోరుకోకుండా యీకాలముకు మట్టుగ యేలాగైనా తిరిగీ పుట్టించవలసినదని బ్రహ్మదేముడి కొక దరఖాస్తు పెట్టుకొనివుంటే మంచిది.

'నారాయణ'

---

## మహాకాయ




ఈమెపేరు జోలిమెరీ.' కాలిఫోర్ని యా నివాసస్థలము. వయస్సునచిన్న. ఈమె తాను దినమునకు దినమునకు చిన్నదాన నగుచుంటినని, తలచుచుండునట. ఈమె తూనిక ౭౮౦ పౌనులు. (అనగా 1¼ బారువకుమించినదనుట.)

## ధర్మపత్ని

శ్రీ గౌరాంగావతారులగు

శ్రీకుసుమ హరనాథబాబావారి లేఖ

ప్రియసోదరా,

బూనేనునుండివచ్చినలేఖతో నీ లేఖ పోష్టుకార్డుల నందుకొంటిని. కష్టములతోడను, తొట్రుపాటుల తోడను ప్రారంభమగుజీవితము సాధారణముగ సుఖవంతమైనదిగను, సంతోషదాయకమైనదిగను పరిణమించునని ఆతనితో తెలియబలుకుము. ఈరహస్యమాతని వివాహజీవితమువలన గ్రహింపగలిగితిని. సారవిహీనమగు విషయములందు వ్యర్థముగ పాల్గొనవలదని ఆతనితో బలుకుము. ఆతని ధర్మపత్నియొక్క స్వభావగుణంబు లతిమృదులములు. ఆమె బిడియమును, ఆత్మగౌరవమును గల యబలారత్నము. ఆమె న్యాయబద్ధములుకాని కోరికలకు లోనవుటకు సిగ్గుభయముల నొందుచున్నదేకాని మఱియొండుకాదు.

ధర్మపత్ని యొకఆటవస్తువు కాదు. ఆమె నిజనామము సహధర్మచారిణి, అనగా మతసంబంధవిషయములందు సహకారిణి. స్త్రీలు ధనదేవతయగు లక్ష్మీదేవిప్రతినిధిరాండ్రు. ఏవిధముచేతనైనను స్త్రీల నలక్ష్యభావముతో చూచుపురుషుడు తన మంచియదృష్టమును నాశనమొనర్చుకొనుచున్నాడనుట నిస్సంశయము. స్త్రీ ప్రపంచసౌభాగ్యమున కాధారము; భక్తిప్రేమల కునికిపట్టు. స్త్రీలకహితముగ మెలంగినవారి భావము లుద్రేకపూరితములై పిశాచరూపములను దాల్చును. వారలాతరుణమున కాళి, రాక్షసి, పిశాచినీరూపములను దాల్చి ఘోరకృత్యములకు వెనుదీయక సర్వనాశనమునకు మార్గదర్శకులై లోకభయంకర లగుదురు. స్త్రీలనుచెంగ నాడువెడల వారిసూక్ష్మరూపములోనే లోకనాశనకరరూపమును ప్రతిబింబింపజేయుదురు. విశాలసముద్రమువలె సుందరమగు స్త్రీజాతియందు శోభావంతములగు జాతిరత్నములను కనుగొనవచ్చును. సంస్కృత్యభిరుచులుగల వివేకవంతు లట్టిరత్నముల సంపాదించి వారి జీవితముల తృప్తితో గడపుదురు. కాని దుర్బలహృదయులు, నీచులు కామోద్రేకముచే పురికొల్పబడి గ్రుడ్డివారలయి సముద్రమున మునిగి నాశనమగుచున్నారు. కావున మెలకువగలిగి అతిజాగ్రత్తతో ప్రవర్తించుము. కామోద్దీపనకరములగు నయనములతో స్త్రీల నెన్నడును చూడకుము. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు మువ్వరును స్త్రీలలో నైక్యమైయున్నారు. స్త్రీ నవమానించుట సర్వసంహారమును వరించుటయే. పూర్వచరిత్రలును, ఆధునికచరిత్రలును ఈవిషయములగూర్చి యతిస్పష్టముగ నిరూపించుచున్నవి. ద్రౌపదియొక్క అవమానమే కౌరవు లంతమొందుటకు ప్రబలహేతువు. సీతయొక్క అవమానమే రాక్షసజాతి నిర్మూలమగుటకు మూలకారణము. హెలన్‌యొక్క అవమానమే ట్రోయిపట్టణమును నాశనము గావించెను. సరోజినికి అవమానము లాపాదించుటచేతనే మహమ్మదీయపరిపాలన హిందూదేశమున నంతమొందెను. ఇటువంటి సుస్పష్టములగు నుదాహరణములు సాధారణముగ ప్రతిగృహమందును నిండియేయుండ వాటిని వెతకుటకొఱకు మీ రెంతమాత్రము చాలదూరము వరకు పోవ నవసరము లేదు. ఎచ్చట స్త్రీలు గౌరవింపబడరో యచ్చట శాంతి, సంతుష్టు లతిత్వరితముగ నంతరించిపోవును. నీ కింతగా శ్రద్ధవహించి చెప్పనదేమన నీధర్మపత్నిని ఆటవస్తువుగ పరిగ్రహించి మోసపోకుము. నీ వాదినుండియు జాగ్రతగ నుండనిపక్షమున జీవితము భయంకరమైనదిగను, నిష్ప్రయోజనమైనదిగను గోచరించునపుడు దుఃఖమొందుట సంభవించును. కావున నీవు అవివేకముగ సంచరించి మోస పోకుండ కాపాడుకొనుము. నీధర్మపత్ని నెంతమాత్రము ఐరోపాఖండమానినుల మాదిరిగను, బ్రహ్మసమాజపువారివలెతెరిబీయతు చేయుటకు ప్రయత్నింపకుము. హిందూధర్మపత్ని కుటుంబములో ప్రేమస్వరూపిణి. ఈవిషయమునంతగా చెప్పుటకు నాకుశక్తిగాని, ఇష్టముగాని లేదు. నీవు నన్నడిగినటువంటి చిక్కైన ప్రశ్నల నడుగుచు నన్నింతగా కష్టపెట్టకుము. సమాధానము చెప్పుటకు నే నంతజ్ఞానవంతుడను గాను. ఇట్టి ప్రశ్నలకు నావలన సమాధానము బడయుదువని నిరీక్షింపకుము. బాల్యపుచేష్టలకు లోనై నీధర్మపత్నియెడల నపరాధములను గావింప దలంచుచు మోసపోదు వనెడు భయము నాకు

జనించుచున్నది. ఈక్షణమునుండియు నతిజాగ్రత గలిగి మెలంగుము. ఆమెను ఆదర్శకపత్నిగా తయారు చేయుము. "భర్తృపరాయణత్వమే స్త్రీసౌందర్యము." అని మనంబున తలంపు గలిగియుండుము. ఆమె రూప రేఖాదిముఖవిలాసములు సుందరమైనవి యైనను, గాకున్నను నది యంతగా నావశ్యకమై యుండునని తలంపకుము. ఆమె మిగుల మంచిగుణములు కలిగియుండి నిర్మలహృదయముతో దుఃఖించుచున్న తల్లికిని పెద్దల యెడలను వినయ విధేయతలను జూపుచుండవలెను. మంచి చెడ్డలయందు సతతము పతికి సహకారిణిగ నుండునటుల హితమును గఱపుము. అట్లు మెలగ నేర్చినదే ధర్మపత్ని, సహధర్మచారిణి యనదగినది యగును. నయనానంద కరములగు బహుభార్యలను గలిగియుండవచ్చును కాని హృదయాహ్లాదిను లగు భార్యలను బడయుట కష్టము. నీయొక్క స్వధర్మమును మఱువక, మృదుమధురమై సాటిలేని శ్రీ కృష్ణనామమంత్రము ననవరతము మనమున స్మరింప మఱువకుము.

మీ

హర.

అనువాదకుడు, అరకట్ల బ్రహ్మం.

---



౨. కృష్ణదేవరాయలు.

## టైపు రైటరుతో తయారుచేసిన చిత్రములు.

౧. పక్షులు.



౩. కోడి.

౪. భావ ప్రకటనము.




వి. సత్యనారాయణమూర్తి.

## వేలంవెఱ్ఱి

వెనుకటికి ఓపెద్దమనిషి యిలా చేశాడట: నిండు పౌర్ణమినాడు రాత్రి నదిఒడ్డున ఇసుకలో పడుకుని చంద్రుడివేపు తదేకదృష్టితో చూడడం మొదలుపెట్టాడుట. స్నేహితుడొకడు వచ్చి, "ఒరే ఆలాగ చూస్తున్నావేమిటిరా?" అని అడిగేసరికి "నన్నుమాటాడించకుమీ యిప్పుడు" అని మరీ పట్టుదలగా చూస్తూ ఉన్నాడు. చంద్రుడులో ఏదో వింత బయలుదేరిందనుకొని ఆ రెండోవో పెద్దమనిషికూడా చూడ్డం మొదలుపెట్టాడు. ఇంకొకడు వచ్చాడు అక్కడికి. వాడుకూడా అలాగే చెయ్యడం మొదలుపెట్టాడు. ఎవడి మట్టుకు వాడే "నన్ను మాటాడించకుమీ యిప్పుడు" అని ఆనదిఒడ్డున పడుకుని తీవ్రంగా చంద్రుడికేసి చూస్తున్నారు ఊరంతా ఆనదిఒడ్డుకి దిమ్మతి అయింది. ప్రక్కవాడు చూస్తున్నాడుగదా యని ఎవడిమట్టుకు వాడే. అప్పుడు ఈ నాటకం ప్రారంభించిన పెద్దమనిషి లేచి నిలవబడి "వేలంవెఱ్ఱి అంటే ఇదే" అన్నాడు.

పదిమందీ ఏదీచేస్తే పదకొండోవాడుకూడా అదే చేస్తాడు. నలుగురూ "ఇది బాగా ఉంది" అని తీర్మానం చేస్తే అదే చలామణి ఔతుంది. ఒకదేశంలో "దేవుడున్నాడా లేడా" అనే మీమాంస వొచ్చినప్పుడు "దేవుడు లేడు" అని ఎక్కువమంది చేతులెత్తడంవల్ల ఆ దేశంలో దేవుడు లేడని శాసించారట.

నలుగురు ఏవేషం అందం అని అనుకుంటారో, ఏవేషం పెద్దమనిషితరహా అని పరిగణిస్తారో, ఏవేషం సభ్యత, గౌరవం యిస్తుందని ఆమోదిస్తారో ఐదోవాడుకూడా ఆవేషంతప్ప మరోవేషం దబాయించలేడు. ఈవేషాలు రోజురోజుకీ మారుతూఉంటాయి. పాశ్చాత్యదేశాల్లో, ఫ్రాన్సుదేశంలో ఒకయువతి క్రొత్తగా కుట్టించుకున్న గౌను పట్టుకుని సైకిల్‌మీద గబగబా యింటికి వెళ్లుతున్నది. మరోస్త్రీ ఆమెను ఆగమంటే, "ఇంకోనిమిషానికి ఈఫేషన్ ( Fashion ) మారిపోతే ఈగౌను నిష్ఫలమౌతుంది" అని నిల్చోకుండా పారిపోయింది. అమెరికాదేశంలో ఒకపడుచు సూర్యకిరణస్నానమునకై (అంటే ఎండలో నిల్చోడాని కన్నమాట) సముద్రపొడ్డునకు వెళ్లింది. ఆమెను అరెస్టుచేసి, ఆమెదుస్తుల పరిమాణం కొలుచుకున్నారు. ఎందుకంటే ఆ దుస్తులతో నలుగురిలో మసలడానికి, చట్టప్రకారం సబబో, అసబబో నిశ్చయించడానికి.

మనదేశంలో ఇంత విరుద్ధాలు జరుగకపోయినా మొత్తంమీద వింతలు అని చెప్పతగ్గవి మనకల్లెదుటే చూస్తూఉన్నాం. నాగరికతలో పాశ్చాత్యులపాటి ఔన్నత్యం ఇంకా మనం సంపాదించలేదు. అదీకొంత నయమే. స్త్రీలవేషంలో చాలామార్పులు ఈమధ్య కలుగుతూ వచ్చాయి. అందులో ముఖ్యంగా రవిక విషయంలో ఒక పదిసంవత్సరాలు ( 1914 - 1924 ) జాకట్టు అనేది అమలులో ఉంది. స్పష్టంగా వర్ణించాలంటే అది ఒక చిన్నచొక్కా అనుకోవచ్చు. దాని చేతులు ఆడదానికి గాజులవరకు వచ్చేవి. అరమం రెండు స్వర గజాల నుడ్డుయితేనేకాని బొటాబొటీగా చాలేది కాదు. క్రమంగాచేతులు మోచేతు లయాయి. 1925 సం. ఆప్రాంతాల్లో రవికలు మోచేతులుదాటి భుజాలదగ్గరకి వచ్చాయి. తర్వాత భుజాలుకూడా మాయమయిపోయినవి. రవికలు ఆఖరికి జెబ్బలు తెగవేసినట్టు అయినవి. ఇప్పుడు పావుగజానికి పది రవికెలు. కొన్నాళ్లకి స్త్రీలు రవిక విసర్జిస్తారేమో అని సందేహం తోస్తున్నది.

చీర, రవిక కట్టుకోవడం అందంకోసమా, శరీరం మానం కాపాడుకోవడానికా అనే సందేహం, ఇప్పటి కాలపు స్త్రీలవేషాలు పరికిస్తే, కలుగుతుంది. జుట్టువిషయంలో ముఖ్యంగా ఆడవాళ్లకి పట్టు ఎక్కువ. పుని స్త్రీ పడుచులని గురించే నేనుమాటాడుతున్నా. కాని కొందరు పాశ్చాత్యుల మోస్తరుగా కురుచజుత్తు ( Bobbed hair ) చేసుకుంటున్నారు.

ఒకదేశంయొక్క జాతీయత, వ్యక్తిత్వం, ఔదార్యం, శోభ గమనించాలంటే ఆదేశపు స్త్రీలను గూర్చి తెలుసుకోవాలి. సహజంగా స్త్రీకి పురుషుని కంటె పూర్వాచారం అంటే ఆపేక్ష యెక్కువ.

పూర్వులు ఉపయోగాన్ని గురించి వేషం నియమించే వారు. ఉపయోగం, ఆరోగ్యం మొదట. తర్వాత అందం. ఇప్పుడు అలాగకాదు. మొదట అందం (Fashion అంటే బాగుంటుంది), తర్వాత ఉపయోగం. ఫేషన్ అనేది క్షణభంగురం ఐపోతున్నాది రానురాను. ఈవాళది రేపు లేదు, రేపటిది ఎల్లుండి లేదు. దీన్నిబట్టి చూస్తే వేలంవెర్రి ఎక్కువవుతున్నట్టు తెలుస్తున్నాది. వేలంవెర్రికి వికారం మూలం. వికారం కలిగినప్పుడు బుద్ధి మందగిస్తుంది; తెలివి సన్నగిలుతుంది; వ్యక్తిస్వాతంత్ర్యం అడుగంటుతుంది; జాతీయత నశిస్తుంది.

గోపరాజు రామలక్ష్మి.

---

## అమడలు



ఈ యిరువురు బాలికలయందు స్వరూపమునవే కాక స్వభావమునను సర్వాంగీణముగ బింబప్రతిబింబ భావ మమరియున్నది. వీరివయసు నాలుగేండ్లు. ఏలూరులో నొక సంపన్న కుటుంబములోనివారు.

---

## శ్రీ. జి. యస్. అరండేలుగారు




దివ్యజ్ఞానసమాజ నూతనాధ్యక్షులు. శ్రీమతి బెసెంటుగారికి తరువాతివారు.

---

## నేటి రాజకీయాలు

రాంచీవెనుక పాట్నా, పాట్నావెనుక బొంబాయి నిద్రపోతూ వున్న రాజకీయాలను ఒకసారి లేపినవి. పెట్టుకొన్న గడువు దాటినతర్వాత రాజకీయాలను గాంధీజీ ఏతోవకు తిప్పుతారో చెప్పలేము. కాంగ్రెసువాదు లిపుడు కచ్చాలు బిగించికట్టి, కవున్సిల్లవైపునకు తొక్కుడుబిళ్లాడుతున్నారు. అనగనగా ఒకప్పుడు చెంపపెట్టులు తిన్న కౌన్సిల్లు ఇపుడు చెంపసరాలు ధరిస్తే చూడాలని వెల్లింగ్డనుగారు ముచ్చటపడుతున్నారు. Award లు, Pact లు మొదలైన హంసపాదులు ఏలా ఉన్నా,—రాజకీయాలతంతు దోబుచ్చి ఆటలా తేలుతున్నా, ఓటుహక్కు కొంత విస్తరిల్లుతుంది. పూర్ణపు బూరెవలె పూర్ణస్వరాజ్యం ప్రత్యక్షం అవుతుం దని లొట్టలువేసినప్రజలు 'జేవ్!,

మని చేతులు నులుపుకొని మూతులు తుడుచుకొన్నారు. "ఓటు ఇవ్వండి సోదరులారా!" అని గొంతుకున్న పెద్దలు ప్రేమ చూపుతూ పల్లెవాసులను అడుగుతారు. "ఓటంటేఏమిటండీ? ఇదుచ్చుకొని ఏం తెస్తారండీ" అని వారు అడుగుతారు. "అయ బెల్లం" అని పెద్ద లనరు. "చెన్నపట్నమూ, ఢిల్లీ చూచి తరిస్తాం; తారకం చదువుతాం; గొప్పవాళ్ళం అవుతాం!" అని వీరు పైకి చెప్పరు. పసుచు పిల్లకాయలూ, ముసలిపిల్లకాయలూ అన్నప్పుడూ అల్లరిచేస్తారేంటి? ఎక్కడికక్కడే ఎంకట లచ్చిమీ! అవ్వాయిలూ, తవ్వాయిలూ ఎందాకా పనికొస్తాయి? సంతోషం సగం బలం! స్వారాజ్య పతాన్ని నైటుహోలుసుల్లోఉంచి మనవాళ్లు ఇక్కడ డిబ్విడివ్విటుం అంటారు! చొప్పదంటుసవారికి కుంటి కాలాడు వాహనుడు! అవ్వకు అలంకారం తవ్వ! నుడ్డిగెచ్చకాయకు చొట్టముచ్చ ముద్దు! రామచిలక లాంటి నైటుపేపరును "హూత్! కాక్!!" అనటం కూడదంటున్నాయి గడుసుబుజ్జిలు. "దీనికి బ్రహ్మరథం పడితేనే ఉంది సౌభాగ్యం, లేకపోతే ఇహ పరాలు తుట్టుమని చక్కాపోతాయి" అన్నారు మొన్న రెడ్డినాయుడుగారు ఏలూరులో! మంచివల చేతబట్టే ఆయన మాటాడుతారు. మాదొడ్డనక్షత్రం మహాశయుడు గారిది. 'హరిల్లరంగా' అన్నది మద్రాసు మెయిల్. ఒహమాటు కయ్‌కయ్‌లాడి, తమచుట్టూతాము నానాలప్ప తిరిగి తెల్లకాగితం అంతతెల్లటిది కాదన్నారు శ్రీ శ్రీనివాసశాస్త్రిగారు. ఒకప్పుడు కారాలూ మిరియాలూ నూరిన మెద్రాసుమేలు శాస్త్రిగారిమీద శుభాక్షతలు చల్లి "రాజజామనోహరాయా!" అని ఇంచక్కటిపాట పాడిలది. "మాటలతో పనేముంది—కావలసింది క్రియగాని" అని మహమ్మదీయప్రముఖులు గుప్‌చుప్‌గా కొండెక్కి కూర్చుంటున్నారు. కాంగ్రెసువాదులూ, జస్టిస్టైట్సూ, లిబరల్సూ, ఆంగ్లోయిండియన్లూ, హిందుముసల్మానుసోదరులూ వదినా—మరదళ్లయి మూతులూ ముక్కులూ విరుచుకొంటూవుంటూ వుంటే, బొజ్జపెంచినచర్చిలుగారు చూచి సంతోషం పట్టలేక తమగుంపుతో చెమ్మచెక్క ఆడుతున్నారు.

రాబోవు రిఫారములద్వారా మనదేశములోనికి దిగుమతిఅయ్యే డెమొక్రసీ ఎటువంటిదైతేం గాక! డెమొక్రసీ పుట్టి పెరిగినచోట్లలో అదిపుడు 'అట్టట్టే!' అని వడకుతోంది! నేటి ఐరోపానుచూడండి—యీరకంప్రభుత్వానికి ఎదురుగా భూతకివలె పెద్ద క్వెశ్చన్‌మార్కు నిలబడింది. రష్యా, జర్మనీ, పోలండు, ఆస్ట్రియా, ఇటలీలకాండలు ఏలాపరిణమించినాయో ఎరగరూ? అచ్చటి రాజకీయ, ఆర్థిక పరిస్థితు లేలా వున్నాయో గోచరించుటలేదూ?

సీమటపాకాయలు పైకి కనపడకుండా డబ్బా క్రిందనుంచి చిటచిట లాడుతున్నాయి! అరుసులెక్క ధనికులు జవ్వలు వెలిగిస్తే, నిరుద్యోగులు పుట్టగోచీలు పెట్టుకొని చక్రపుసొట్టాలు తిప్పుకొంటూ తిరుగుతున్నారు! "ఒక్క బేపనపిత్రీ అంటిస్తే తెగులు కుదురుతుంది కుంకమ్మలకు" అంటున్నారు తెగతిని తెయ్యిమంటూవున్న కేపిటలిస్టులు. "ఎగుడుదిగుడులుదిగలాగేస్తాము; ప్రతియింటికి పచ్చతోరణాలు కడతాం; దేవాలయాలు కూలేసి, మనుష్యాలయాలు నిలబెడతాము; ఐదేళ్లప్లాను వేశాము. చిచ్చుబుడ్డిలోనుంచి మెరుపుల వర్షం కురిసిపోతుంది! చూడండి మజాకా." అంటున్నారు రష్యావాసులు. "నూరుచెప్పండి— వెయ్యి చెప్పండి. ఒక్కపెద్దఘటమే నెగ్గించుకొని రావాలి గాని వెయ్యిమంది కోతిగాళ్లు ఎందుకు" అని దిగువనున్నవారంటున్నారు. వెర్సే (Versailles) సంధిలో నేలగూలిం దనుకున్న మిలిటారిజమ్ పెరిగి శతసంతానాన్ని కంటోంది—ఎన్నెన్ని 'ఇజము'లో బయల్దేరాయి! —కమ్యూనలిజమ్, సోషలిజమ్, కేపిటలిజమ్, నాజీజమ్, ఫేసిజమ్, హిట్లరిజమ్ మొదలైనవి విజృంభించుతూ వున్నవి! "ఫేసిజమ్ మహాగొప్పది—అది మనదేశంలో వుండేది. మనభావాన్నే పడమటివాళ్లు లాగేరు" అంటున్నారు మధురనుండి బారిస్టరు జోసెఫ్ గారు. ఈ ఫేసిజమ్ కేపిటలిజమ్‌యొక్క Illegitimate బిడ్డసుమండీ అని ఒకపెద్దదొర బాకాఊదేడు. పనివాళ్లు పప్పునమలవలసినదే! జర్మనీస్థితిలోనికి దూరి చూస్తే కొందరు పనివాళ్లు పచ్చడవు

తున్నారేమో అని తోస్తుంది. మహారాజశ్రీ హిట్లరు గారి గొంతుకు చాలపెద్దది. అతనిది గడుసుబుఱ్ఱ. నాడి పట్టవలసిన చోటున అతడు పడతాడు. ప్రజలను స్వాధీనం చేసుకోవడంలో దిట్ట. భట్రాజుగిరీ చేసి దేశాన్ని గుప్పిట్లో పెట్టుకొన్నాడు! ఫాసిజమును అద్దాలలో పెట్టి పెంచుతున్న ముసోలినీగారూ, హిట్లరుగారూ "ఒప్పులకుప్ప" ఆడుకొందా మనుకొన్నారు! మొన్ననే యిద్దరూ చెయ్యి చెయ్యీ పట్టుకొన్నారు! ఎన్నెన్నో గుసగుసలు జరిగేయట. ఎంతో బాణసంచా వెలిగిపోయింది! ఇద్దరు మహాశయులూ ఐరోపాఖండం లో అఖండాలు వెలిగించారు! అట అమెరికాలో రూజ్‌వెల్టుగారు చక్రం తిప్పుతున్నారు! ప్లానుమీద ప్లాను, స్కీముమీద స్కీము పట్టవర్ధనాలు పెట్టుకొంటున్నాయి. "బ్రిటిషువారు ఋణమంతా యిచ్చి తీరాలి" అంటున్నారు అమెరికావారు. బంగారుతల్లి భారతమాత! పుస్తే పూసా దీసి బొంబాయిద్వారా రవానా చేస్తోంది! ముక్కుపోయిన నగలు ధరలను పెంచేస్తాయంటున్నారు మదరాసు విశ్వవిద్యాలయం లోని థామస్‌గారు "బాబులూ! రిజర్వుబ్యాంకంటో అహోరిస్తున్నాము. పెళ్లిపీటలు పైకి పంపి మనం బాజావాయించడం ఎందుకు?" అని కొందరు నాయకులు చించుకొంటే "ఫల్లయ్యాలూ! ఎందుకు కంఠశోష" అన్నారు కన్నుగల బుద్ధిమంతులు. ఏమైతేంగాక మనబంగారక్క బ్రిటిషువారికి అభయహస్తం యిచ్చి అమెరికా ఖజానాలో కైదీయై కూర్చుంటోంది. ధరలు పెరుగుతాయన్న దేవయ్యలు దెబ్బెక్కి మిడిగ్రుడ్లు తిప్పుతున్నారు! ఏలాగైతేనేం రూజువెల్టు డబ్బు రాబట్టుతున్నాడు! ఇండియాలోని నిరుద్యోగులులా మాడిమాడి తన నిరుద్యోగులను చావనీయక, కుంచాలకొద్దీ డాలరులు కొలిచి, పెద్దస్కీము ఏర్పాటు చేస్తున్నాడు! డిక్టేటరంటే మంచిడిక్టేటరు అనిపించుకొంటున్నాడు. పశ్చిమార్ధగోళంలో త్రిమూర్తులు వెలిశారు. డిక్టేటరుషిప్పు మోగుతోవుంటే సి. పి. రామస్వామిఅయ్యరుగారు 'తధికిణతోం' అంటున్నారు. ప్రపంచమహాపురుషులలో ఫస్టుమార్కు కెమల్‌పాషా గారిదన్నారు! కాదు ముసోలినీగారిదన్నారు సుభాష్ చంద్రబోసుగారు! "ఒకడిక్టేటరు కొండెక్కితేంగాక, తనవంటివానిని దేశానికిచ్చే తాను చస్తాడా? ఈమాదిరి ప్రభుత్వం నిత్యతారకమైతే ఏమవుతుంది ప్రజలపని? అంటున్నారు కొందరు రాజకీయవాదులు. డెమొక్రసీని ముందుబెట్టుకొని మంగళంపాడినారు రామస్వామి మొదలియారుగారు. ముత్తయిదులు ఎవరేమనుకుంటేంగాక, యిపుడు తేలిందేమిటి? డెమొక్రసి ఇంతకరకజ్జం తిని చతికలపడలేదూ? పెళ్ళేపకాయలు పేలుస్తూ, ఆటోక్రసీ వెలిగిస్తూ డిక్టేటరుషిప్పు నృత్యం చెయ్యడం లేదూ? "నూటయేభైయేళ్లనుంచి కండ పెంచుకొంటూన్న డెమొక్రసీని పన్నెండేండ్లబాలకుమార్తె డిక్టేటరుషిప్పు బోల్తాకొట్టుతోందే! ఆహా! బాలకొమార్తెకెంతఆకర్షణశక్తి ఉంది!" అంటున్నారు ముక్కుమీద వ్రేలుంచుకొని ఓబయ్యలు. రెండింటికీ దాంపత్యం కుదిరితే మంచిదంటున్నారు కొందరు పురోహితులు. "తాటకికి రామబాణాన్ని మొగుణ్ణిచేసే విశ్వామిత్రం ఎల్లాంటిదో ఎరగమేమిటి" అంటున్నారు మరికొందరు. రాజకీయాలు అగ్గిబరాటాలవుతోవుంటే, ఆర్థికరంగాలు నిప్పులు కక్కుతున్నాయి! కోటగోడల్లాగ టారిఫ్‌గోడలు నిలబడుతున్నాయి! గోడావల ఫిరంగిగుండ్లు మోగుతున్నాయి! గోడయీవల సుభిక్షంలో దుర్భిక్షం ఎగిరి గంతేస్తోంది! ధనమయంలో దరిద్రకొట్టుతనం తాండవమాడుతోంది! విలాసంలో వినాశనం! విడ్డూరం!

ప్రపంచమంతా ఒకేవాతూలంలో మునిగితేలుతూ ఉన్నది. పడమటిఖండంలోని వేడిగాడ్పులు ఇక్కడా కొట్టుతున్నాయి! ఒకప్రక్క కాంపిటిషన్, ఇంకొక ప్రక్క కో-ఆపరేషన్‌మంత్రం! ఒకప్రక్క శాంతిమంత్రం! ఇంకొకప్రక్క ఫిరంగిబొబ్బ! పీసుకాన్ఫరెన్సులూ, డిజ్ ఆర్మమెంటు కాన్ఫరెన్సులూ, లీగ్ ఆఫ్ నేషన్సువీథిలో శ్రీసూక్తం పాడుతూ, దొడ్డిలో శాకినీ, డాకినీ గాలి దయ్యంబులను ఆవాహనచేస్తున్నాయి! బాణాకఱ్ఱ తిప్పుతూ తీవ్రజాతీయత్వం, డిక్టేటరుషిప్పు నిలబడ్డాయి! "వంగిసలాం చెయ్యను. ఎప్పటికైనా

లేచినిలబడుతాను" అంటోంది డెమోక్రసి. "డెమోక్రసి యా? డిక్టేటరుషిప్పా?" అని మనపెద్దలు కొందరు మీమాంసపడుతున్నారు. "ముందు మొగభామ కనే బిడ్డను పుట్టనియ్యండి. బతికి, ఎంతకాలం బాగుంటుం దో తర్వాత జాతకం చెపుదాము" అంటున్నారు మరి కొందరు. ప్రపంచరాజకీయాలలాగే మనరాజకీయాలూ కలగూరగంపలా తయారైనాయి. ఏంచేసేదీ ఎవరికి పాలుపోదు. ఏదో ఒకటి చెయ్యాక తప్పదు. సమయా నికి పాపం హరిజనులు ఎదుటబడ్డారు. ఇక మనముందు నిలువబోయేది ముసుళ్ల పండుగో, ముద్దుకుడుముల పండుగో!

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి.

---

ఈతపందెములు




౧. కన్యాగురుకులమున చదువు బాలికలు

ఆరుమైళ్లు చుట్టుకొలత గల హుసేనుసాగరము (హైదరాబాదు) నీద తలపెట్టినవారు. వీరిలో సుశీలా దేవి (బంగారుపదకములుగల బాలిక) జయముగొనినది.

---

### ౨. ఆల్మడీన్ కన్య



ఆంగ్ల బాలిక. వయసు ౮ ఏండ్లు. ఇటీవల నీబాలిక కాలుమైలుదూరము పదునారునిమిషములలో నీదినది.

జి. ఎస్. ఏ.

---

### 3. బైరమ్మ



బెంగుళూరునగరం. వయస్సు ౧౦ ఏండ్లు. కడచిన ఏప్రిలు ౨౨-వ తేదిన పంద్రెండుగంటలసేపు ఎడతెగక ఈదిన బాలిక. ప్రక్కనున్నయత డామె గురువు.

బి. కె. సింగ్

---



# విమర్శనము

### బేతాళ పంచవింశతిక

క్రౌను సైజున ౧౯౬ పుటలు. వెల రు. ౦-౧౦-౦.

గ్రంథకర్త: మహోపాధ్యాయ, కళాప్రపూర్ణ, వేదము వేంకటరాయశాస్త్రిగారు-కీర్తిశేషులు. ప్రకాశకులు: వేదము వేంకటరాయశాస్త్రి అండు బ్రదర్సు, నెం. ౧ రు. మల్లికేశ్వరుగుడిసందు, లింగిశెట్టివీధి, జి. టి. మదరాసు. (రెండవముద్రణము)

బేతాళుడు విక్రమార్కునికి చెప్పిన ఇరువది నాలుగుకథలు, ముగింపుకథ కలిసి ఇరువదిఅయిదుకథలు ఇందు గలవు. దీనికారణముననే "విక్రమార్కుడు బేతాళుని సాధించి" మహత్త్వపూర్ణుడయి మించినాడు.

ఈ కథలకు మూలము "కథాసరిత్సాగరము." 'అతిసూక్ష్మనీతిబోధప్రజ్ఞామహితము' లీ కథలు. ఇవి 'మహిమోన్నతులయిన మన పూర్వుల దివ్యచారిత్రములను, వారి సదాచారసత్ప్రవర్తనములను' బోధించునవి; 'ఆహ్లాద జ్ఞాన విజ్ఞానముల' నొసంగునవి. విషయగౌరవమునకు దగిన విన్యాసగౌరవము వీని కమరినది. రచన మనుత్తమసాంప్రదాయసముంచితమని ఆంధ్రలోకమునకు దెలియును. విద్యార్థుల భాషాభివృద్ధి కద్వితీయ సాధన మీకథల పఠనము. నాలుగు-అయిదు-ఆరు ఫారముల విద్యార్థులు వీనిని తప్పక చదువవలసినవారు. పాఠశాలల అధికారు లట్టియవకాశమును వారికి గల్పించి వారి మాతృభాషాభివృద్ధి కుపకరింపవలసినవారు.

---

### THE NEW AGE

'A monthly Journal of Advanced Thought.'

సంపాదకులు: ఇ. కృష్ణయ్యరుగారు, బి. ఏ., బి. ఎల్.

3, కొండిచెట్టివీధి, జి. టి. మద్రాసు.

సంవత్సర చందా రు. ౪-౦-౦.

విడిపత్రిక వెల రు. ౦-౪-౦.

ఇటువంటి పత్రికల విమర్శించుట సులభసాధ్యము కాదు. విమర్శనార్థ మంపబడిన సంచికయందలి వస్తుగుణమును విమర్శింపవచ్చునే గాని పత్రికయొక్క గుణమిట్టిదని, యిందు ప్రకటింపబడు విషయము లెల్లప్పటికిని యిట్లే యుండగలవు అని ఎవరు చెప్పగలరు?

ఈ పత్రికయందు ప్రకటింపబడు విషయములను గురించి యిట్లు గలదు: "The 'New Age' proposes to serve as means of expression for those advanced thoughts in political, economic and social problems of India and the world that have not as yet received adequate attention or recognition in the country. * * * As such 'The New age' seeks to chalk out a new path for service and in the discharge of its duties it will never flag. Having as pointers, truth, courage and justice, it will advance the

cause of the down-trodden and the oppressed without fear or favour."

ఈ పత్రిక ఆశయాదర్శములు శ్లాఘనీయములు. వీటిని ముందిడుకొని పత్రికను నడిపినయెడల నిది దేశీయ పత్రికలలో అగ్రస్థాన మలంకరించుటకు సందేహము లేదు.

ఈ సంచికయందలి వ్యాసములు కార్ల్ మార్క్సు. హిట్లరు అనువారియందలి విషయములు విద్వల్లోకము నకు క్రొత్తవి గాకపోయినను నేటియువకుల నుత్తేజితుల గావింపగలవు. అర్థశాస్త్రము, రాజకీయములు మొదలయిన విషయముల గురించి యిందు ప్రకటింపబడిన వ్యాస ములు దేశస్థితిని తెలుపుచు దేశదుస్థితిని బాపుటకు కొన్ని మార్గముల నుద్బోధించుచున్నవి. 'రాజు'

---

## Is it a Crime ?

గ్రంథకర్త: హెచ్. డీ. రాజాగారు, క్రౌను ౨౨౮ పుటలు. వెల రు ౧-౦-౦.

శైశవావస్థయందే వివాహితయై, ఆవెంటనే తలి దండ్రులగోల్పోయి దూరబంధువులదగ్గరనుండి, వారి వలననే వేశ్యాగృహమునబడి మరల నెట్లో తప్పించు కొని తరించిన లీలావతి కథ యిందుగలదు. బొంబా యిలో బంధువులగృహమునందుండినపు డొకసారి హఠా త్తుగ రైలుక్రింద పడబోవునపుడు కృష్ణకాంతునిచే రక్షింపబడిన యాలీలావతిని రక్షకుడగు కృష్ణుడే వరించెను. ఆతని కీమెనిజస్థితి తెలియదు. కొన్నినాళ్లతరు వాత ఆబంధువులే మహిళయను వేశ్య కీలీలావతిని విక్ర యించగా అచటినుండిసయితము కృష్ణుడే యామెను తనస్నేహితుడగు కిశోరుని సాయమున రక్షించి చెర బడెను. కారాగృహవాసానంతరము కృష్ణుడే లీలను పరిణయమాడి సంఘమందలి మూఢదురాచారముల కాల దన్నెను.

వేశ్యాగృహమున బందిగానున్న లీలను పోలీసు వేషమునబోయి దొమ్మిచేసి తప్పించినందులకు కృష్ణ కాంతునికి కారాగృహవాసము విధింపబడినది. Is it a Crime అను గ్రంథనామము ఇందుండి వచ్చి నదా, లేక పరిణయమాడిన భర్త జీవించియుండగనే మరల నింకొకని వివాహమాడుటనుండి జనించినదా ? ఈరెండునుగాక మరి యేదియై యుండవచ్చు ఈ Is it a Crime అను నామకరణమునకు కారణము? ఈరెంట మొదటివిషయమును గొన్నయెడల It is a Crime అని అనవలసియుండున్నది. ఏలనన భోగము వారి చేజిక్కిన లీలావతిని విడిపించుటకు తామే పోలీసువేషముల ధరించి ఆపనిబూనుటను ఏప్రభుత్వ మైనను సహింపదు. పోలీసుద్వారా దర్యాప్తుచేయించి తప్పించినయెడ అంతయు బట్టబయలగునను కారణముచే కిశోరు డీపన్నాగము పన్నెను కాని బయట పడనే పడినది నుట్టంతయును.

ఇక రెండవవిషయము లీలావతి రెండవపెండ్లి. ఇది తప్పుగాదు. వరకట్నము పూర్తిగా చెల్లించబడ లేదనుకారణమున నామె త్యజింపబడినది. మరియు ఆవివాహము ఆమెకు స్వప్నగతవృత్తాంతము మాత్రమే. ఆసంబంధమునకు లీల ఒప్పుకొని యుండలేదు. లీలా కృష్ణుల పరస్పర సహజానురాగమే వారివివాహమునకు కారణము. లీల పరమపతివ్రత. కృష్ణుని ప్రేమించిన లీలకు ప్రపంచమంతయు తృణప్రాయమేయయినది.

గ్రంథనామ మిందుండి యుద్భవించినయెడల ఈ ప్రశ్నకు It is not a Crime అనునదే సరియయిన జవాబు.

సమయములబట్టి కొన్నికొన్ని రాజకీయవిషయ ములు, మతవిషయములు, సంఘమందలి కట్టుబాట్లు చర్చింపబడియున్నవి. అవియన్నియు గ్రంథకర్తగారి స్వీయాభిప్రాయములుగ పరిగణింపవలసియున్నవి. దేశ దుస్థితికి కారణములగువాటిని తొలగించి దేశమును సుఖి తముగ చేయవలయునన్న గ్రంథకర్తగారి సూచనల నవలంబింపకున్న వీలులేదా ? ఇదియొక అభిప్రాయము మాత్రమే.

పాత్రరచనావిధానము, కథావ్యూహము, శైలి మొదలయినవి గ్రంథరచనకు శక్తిచాలమిని చాటుచున్నవి. 'రాజు'

---

ఉపాఖ్యానమంజరి

క్రౌను సైజు, ౬౪ పుటలు, వెల రు. ౦-౫-౦.

గ్రంథకర్త: ధవళె వెంకటబలరామయ్యగారు, టీచరు, బారువ, గంజాం జిల్లా.

నాలుగు ఉపాఖ్యానములు - సత్యవ్రత, చిత్రకేతు, సావిత్రీ, భరతులవి - ఇందు వచనరూపమున నున్నవి.

---

(౧) అనుభవ పశువైద్య చింతామణి

డిమ్మీసైజు. ఇంచుమించు ౫౦౦ పుటలు. వెల రూ. ౪-౦-౦.

(౨) పశువైద్య వస్తుగుణ దీపిక

క్రౌనుసైజు. ౨౬౧ పుటలు, వెల రు. ౨-౦-౦.

(3) పశువుల ఛాయాపటములు

క్రౌను సైజున ౨౪ పుటలు, వెల రు. ౦-౪-౦.

గ్రంథకర్త: 'అభినవసహదేవ' డాక్టర్ యే జెల్ల శ్రీరాములు చౌదరిగారు, అంగలూరు, కృష్ణాజిల్లా.

---



గుత్తి కోట కొనకొమ్ము T. R. R.

# మనవి మాటలు

## నాటకకళ – ఆంధ్రావేశము

విషయతత్త్వమును గ్రహియించి, సాధక బాధకముల నాలోచించి, ఆచరణమార్గముల వివేకముతో నిర్ణయించి ఫలము నూహించి ప్రారంభించిన కార్య ముద్దిష్టఫలము నవశ్యము నొసగును; అట్లుకానిది విపరీత ఫలము నొసగును.

ఆంధ్రు లన్నిటను తెలియనివారుకారు; తెలిసినవారునుకారు. తెలియనిదానిని తెలిసికొనబోరు కాని తెలిసినయల్పమునకే విఱ్ఱవీగుదురు; తెలిసియో తెలియకయో కార్యముల నాచరింతురు; వాని మంచిచెబ్బరల నించయు నాలోచింపరు. ఊహాలేని ఉత్సాహము వారిది; ఊరటలేని ఉద్రేకమును. ఇది కారణముగా నాంధ్రనాటకరంగమునకు నేడొక పెద్దయనర్థము పొసగినది.

నాట్యకళాప్రపూర్ణ తాడిపత్రి రాఘవాచార్యులుగారికి నాట్యకళాప్రపంచమున గల స్థాన మున్నతము; నాట్యకళారహస్యజ్ఞానమును, తత్కళానుభవమును విశిష్టము. తదుపాసన స్వార్థరహితము; తద్వికసనశీలము. తద్‌జ్ఞు లెవ్వరు నీవిషయమును కాదనరు.

నాట్యకళాభిమానులవేడికోలున ఆచార్యులుగారు తృతీయాంధ్రనాటకపరిషన్మహాసభకు పెత్తనము వహించినారు. కడచిన రెండుమహాసభలకంటె నీమహాసభ యుత్కృష్టముగ జరిగినదన్నప్రతీతివారి కార్యనిర్వహణ కౌశలమునకు గొప్పనిదర్శనము.

ప్రజామిత్ర (౨౦-౬-౧౯౩౮) యందు శ్రీరాఘవాచార్యులుగారి కొక 'బహిరంగ లేఖ' ప్రకటితమయినది. నాట్యకళాభిమానులు, శ్రీ కే. వి. సుబ్బారావుగారు దానిని వ్రాసినవారు. వ్యక్తిపరముగ ఆచార్యులుగారి కళోపాసనావిధానమును, మహాసభాధిపత్యము పరముగ వారి కార్యనిర్వహణవిధానమును అందు విమర్శింపబడినవి. విమర్శనము విపరీత మార్గమున తీవ్రముగ నడచినది. దానిని గనిన ఆచార్యులుగారు వెంటనే మహాసభాధిపత్యముతోపాటు, తమనాట్యకళోపాసనమునకును స్వస్తిచెప్పి కూరుచున్నారు.

ఇట నిరువుర కార్యములు ననాలోచితములు: సుబ్బారావుగారిది ఊహాలేని ఉత్సాహము, ఆచార్యులుగారిది ఊరటలేని ఉద్రేకము ననవలసియున్నది. కాని కళాభిమానుల హృదయముకంటె కళోపాసకుల హృదయ మతికోమలము. సుబ్బారావుగారీరహస్యమును గుర్తించియుండిన వారివిమర్శనము సౌమ్యమార్గమును బట్టియుండెడిది.

విమర్శనమున రాఘవాచార్యులుగారి కళోపాసనమున గల యనేకలోపము లుద్ఘాటింపబడినవి. అవి నిజముగ ప్రమాదములో, ప్రమాణములో తేల్పగలసమర్థు లాంధ్రలోకమున నాచార్యులుగా రొక్కరే కనుపడుచున్నారు. నాటకకళవిషయమున విమర్శకు గురియైనవిషయము లనేకము లింకను ప్రపంచముననే వివాదగ్రస్తములుగ నున్నవి.

ఆంధ్రలోకమున నాట్యకళకు సంబంధించిన వాఙ్మయముకాని, ప్రదర్శనయోగ్యములగు నాటకములు కాని, అభినయకుశలులగు నటకులు - ఆచార్యులుగారువినా-గాని, సంస్కారులు, సహృదయులు నగుప్రేక్షకులుగానీ, ఇప్పటి కింకను గానరా రనుట సాహసము

కాదు. దీనినిబట్టి ఆంధ్రుల నాట్యకళారహస్యాభిజ్ఞత వెల్లడియగుచున్నది. వారు తమకు తెలియ ననుకొనునదంతయు నన్యానుకరణముకాని, స్వోపజ్ఞజన్యము కాదు. వారి తీవ్ర విమర్శనములుమాత్రము కళాశోషణమునకు వలె కళాపోషణమున కుపకరించునవి కావు.

నాటకములు బహునటాభినేయములు; ఏకనటాభినేయములు కావు. నటులెల్లరు సమర్థులుకానిచో ప్రదర్శనమువలన రససిద్ధి కలుగదు. అసమర్థులగు నటకుల నడుమ సమర్థుడగు నేనటకుని కళాకౌశలమును వన్నె కెక్కదు; కాని, వ్యక్తిగతమగు దాని యుని కికి, ఉత్కృష్టతకు నాశములేదు. అది సహృదయైకవేద్యము.

ఆంధ్రుల కైకమత్యమేవిషయముననుకుదురు టరుదు; ఆత్మపరిశీలన మంత కంటెను. ఎవరికివారు పెద్దలనుకొనుట వారికొక ప్రత్యేకలక్షణము. ఆలక్షణము నటకులలో మరియును పెద్ద. సంస్కారులయెడ నంతగగాకున్నను, అసంస్కారులయెడ నది యెంతయు దుస్సహము. తమకుదాము పెద్దలమను నటకులాచార్యులమాటను పాటింపరు. ఇక తదాచార్యత్వము నాచార్యులుగారు సాగించు టెట్లు? వారిని చక్కదిద్దుటెట్లు?

ఆచార్యులవలె పేరున కెక్కవలెనని నటకులనేకులు వారి ననుకరింతురు. కాని వారివలె కళారహస్యముల నధిగమింప నిచ్చగింపరు. అంధానుకరణ మనుకర్తృనుకార్యుల కుభయులకు నప్రతిష్ఠకు కారణము. ఆచార్యులుగారియెడ జనసామాన్యమున గొంత భాగమునకు నిరసనభావ ముప్పతిల్లుట కీ అంధానుకర్తలే కారకులు.

ఆచార్యులుగారి యాధిపత్యమున నాంధ్ర నాటకకళాపరిషత్తు కార్యక్రమమును నిర్ణయించినది; తన్నిర్వహణమునకయి పెద్ద సంఘము నొకదానిని నియమించినది. ఆంధ్ర దేశమున నాటకకర్తలు, నటకులు, నాటక కళాభిమానులు ననబడువారిలో ననేకు లాసంఘమున సభ్యులు. వారిలో నిద్దరు కార్యదర్శులు. కార్యాలయము చెన్నపురమున. నిర్ణయించిన కార్యక్రమమును కొనసాగించు భారమును వహింపవలసినవారు కార్యదర్శులును, సభ్యులును. అధ్యక్షులు తత్కార్యముల కంగీకారమును, వలసినచో సలహాలను ఈయవలసినవారు. అంత సంఘమును, కార్యదర్శులును, మహాసభ జరిగిన నాటినుండియు తమ పూచీని గుర్తింపక నిదురించునటు లున్నచో నధ్యక్షులు చేయుననేమి? తత్త్వమిదియైయుండ 'బహిరంగలేఖ' యొకటి ప్రథమకబళమున మక్షికాపాతము వలె నిపుడు సంప్రాప్తించినది. నాటకకళాసంస్కారమున కిడిన తొలియడుగుననే పాదము బెణకినది. దీనికి చికిత్స: ఆచార్యులుగారు ప్రశాంతమనస్కులయి తమ రాజీనామా నుపసంహరించుకొనుట; సంఘమును కర్తవ్య నిర్వహణమునకు పురిపెట్టుట; ఆంధ్రనాటక కళాభివృద్ధికి దాము వెనుకకట్టినకంకణము విప్పకియుండినచో క్రొత్తదానిని ధరించుటయు. ఆచార్యులుగారినాట్యకళాభిజ్ఞతకు,నాట్యకళోపాసనాసక్తికి నిది సమర్హమగు కార్యము.

"ప్రారబ్ధ ముత్తమగుణా నపరిత్యజంతి."



# స్వాభిప్రాయ విశేషములు

విశ్వలీలా విలాసపరిణామము లతివిచిత్రములు. ప్రళయనిర్మాణసాధనము లన్యోన్యాశ్రయములై విశ్వవిలాసపరిణామమున కాధారము లైనను భయంకరదృశ్యములు. మారణయంత్రములు శాంతిసాధనములుగను, నిర్మాణయంత్రాలయములు మారణసాధనములుగను పరిణమించుట విచిత్రకలాపములు. సకలరాజ్యములును శాంతిని బోధించుచు మారణయంత్రారాధనమును చేయుట చిరకాలసముపార్జిత మైన సంస్కారఫలము. "బ్రిటిషు ప్రభుత్వాధికారులు ప్రతికూల ప్రజాభిప్రాయము గలుగనంత వరకును సంగ్రామములు సంభవమగును." అని ఘోషించుట పశుబలారాధనఫలము. "జర్మను రాజ్య లక్ష్యము ప్రపంచశాంతి. జర్మనులు ప్రపంచశాంతిస్థాపనమున కాత్మార్పణమును జేయుటకు సిద్ధముగ నున్నారు" అని జర్మనునాజీనాయకులు ఘోషించుచు నాసురబలము నారాధించుట ఘోరసంస్కారఫలము. "మానవ ధర్మారాధనమునకై జాతులాత్మార్పణమును చేయుగాత!" యని ప్రకటించినాయకులును జర్మనునాయకులవలెను ఘోషించుచు సంగ్రామసన్నాహములనారాధించుట రాగద్వేషదేవతారాధనఫలము. సామ్రాజ్యబలమును పరాక్రమణపరపీడనములకు వినియోగించుట సామ్రాజ్యక్షేమమునకును, ప్రపంచశాంతికిని సాధనము గా జాలదు.

సకలరాజ్యములందును నాయకులును, పండితులును, రాజ్యాధికారులును, పీఠాధిపతులును, గాయకులును, కవీశ్వరులును "శాంతిరస్తు"నుసంకీర్తనమును జేయుచు రాగద్వేష కర్మారాధనమును జేయుచున్నారు. సంగ్రామకర్మారాధనము సంగ్రామఫలమున కుపయోగపడునటులు శాంతిఫలమునకు వినియోగపడుట యసంభవము. జర్మనియందు గతవారమున నాజీపక్షమవలంబించిన ఘోరదండనములు విశ్వవ్యాప్తమైన పాశ్చాత్య సంస్కారమునకు లక్ష్యముగ నున్నది. హిట్లరుగా రవలంబించిన దండనవిధాన మతిహేయముగ నున్నది. ప్రతిపక్షులైనను స్వదేశీయులను ఘోరదండనమునకు పాలుచేయుట స్వధర్మవిఘాతమునకె వినియోగపడగలదు. హిట్లరువర్గమవలంబించిన ఘోరదండనములు తాత్కాలికముగ నానందదాయకముగ నున్నను ప్రళయబీజములకు మూలము

లగుచు నాత్మవినాశనమునకు వినియోగపడ గలవు. పరపీడనాధారభూతమైన బల మెవరికిని క్షేమకరము కాదు. వర్తమాన విషాదావస్థయందు సకలజాతులకును ఆత్మరక్షణమునకు ఘోరమైన పరాక్రమణ పరపీడనములందుగల గౌరవవిశ్వాసము లాత్మనిగ్రహమునందు గలుగకున్నవి. ధర్మోపదేశము లన్నియును తమకుగాక నితరుల కేర్పడినవి. వివిధజాతులు చేయుచున్న తపస్సునకు ఫలము సుందోపసుందుల యుపాఖ్యానమువలె నున్నది. నాజీపక్ష ముపక్రమించిన దండనీతి భయచిహ్నములు కాని సత్త్వచిహ్నములు కావు. పరపీడనమున కేర్పడిన దండనీతి ఆత్మనాశనమునకే వినియోగపడుట ప్రకృతి ధర్మము.

మానవధర్మ సంస్థాపనమునకు ప్రపంచము చిరకాల మనుభవించిన దుఃఖవేదన నిరర్థకముగను గనుపడుచున్నది. హింసాపరమైన ప్రాకృత పశుబలస్థానమును విచిత్రములైన మారణయంత్రము లాక్రమించినవి. పశుబలచిహ్నములైన బాంబులు ధర్మ సంరక్షణసంస్థాపనములకు ప్రమాణము లైనవి. అభయాహింసాసాధ్య మైన శాంతికి భయహింస లారాధ్యము లైనవి. ఆయుధ విసర్జనమున కాయుధధారణము, శాంతికి సంగ్రామము, అహింసకు హింస సాధనము లగుట ధర్మసంహారమునకువలెను ధర్మసంస్థాపనమునకు నిదర్శనములు గావు. స్వపక్షరక్షణమునకు బెర్లినునందు నాజీనాయకు డుపయోగించిన దండనీతివలెను, స్వధర్మ రక్షణమునకు పునహాయందు సనాతను డుపయోగించిన బాంబుప్రయోగమును ప్రపంచము నావరించిన పశుబలసంస్కారమునకు పరమ ప్రమాణముగ నున్నది. హింసాపరమైన పశుబలారాధన సంస్కారపరాయణ మైన వర్తమానప్రపంచపరిస్థితులయందు, అహింసాపర మైన ఆత్మయోగము దురారాధ్యముగ నున్నది. స్వదేశోద్ధరణమునకును, ప్రపంచోద్ధరణమునకును, ధర్మోద్ధరణమునకును గాంధిమహాత్ము డుపక్రమించిన సత్యాగ్రహోద్యమము వర్తమాన విపరీత పరిస్థితులందు పరిహాసపాత్రమగుట ప్రకృతిధర్మము. ప్రపంచావృతమైన విపరీత పరిస్థితులందు గాంధిమహాత్ముడు సత్యాగ్రహోద్యమము నుపసంహారముచేయుట వర్తమాన ప్రపంచ పరిస్థితులకును, దేశపరిస్థితులకును సకలవిధములను తగియున్నది.

* * * *

### సత్యాగ్రహోద్యమము

పశుబలసంస్కారము నారాధించుచున్న ప్రపంచముమీదను సత్యాగ్రహము పదేండ్లక్రితము పిడుగువలెను పడినది. సత్యాగ్రహోద్యమమారంభమునందు సంభ్రమ సమ్మోహములను గలుగజేసినది. హింసాపరాయణమైనప్రపంచ సంస్కారమునం దహింసాధర్మప్రయోజనమును ప్రతిబింబింప జేసినది. ప్రపంచమునం దంతటను సత్యాగ్ర

హము మాఱుప్రయోగినను పశుబలపరాయణమైన ప్రపంచవ్యవహారములందు సత్యాగ్రహ ప్రయోగము సులభసాధ్యము గాకపోయినది. అసిధారావ్రతమైన సత్యాగ్రహ ప్రయోగము సాధకులైన మహాత్ములకు వలెను సామాన్యులకు సాధ్యము కాజాలదు. మహాత్ములకు సత్యాగ్రహ ప్రయోజనము సత్యారాధనమైనను సామాన్యులకు సత్యాగ్రహారాధనము విషయారాధనమునకు వినియోగపడుచున్నది. హిందూస్థానమునందు సత్యాగ్రహోద్యమమునందు లక్షలమంది చేసిన మహాత్యాగము ప్రపంచమునందు సంభ్రమమును గలుగజేసినను ఫలమాశాభంగమును గలుగజేసినది.

ప్రపంచవ్యవహారములందు జయాపజయములును, లాభనష్టములును సాపేక్షములు కాని నిరపేక్షములు కావు. సత్యాగ్రహ ప్రయోజనమును నిత్యమైన సత్యప్రయోజనముతో నిర్ణయించుట ధర్మము కాని తాత్కాలికమైన వ్యవహారప్రయోజనములతో నిర్ణయించుట ప్రయోజనకరము కాదు. సత్యాగ్రహోద్యమము ప్రపంచలక్ష్యమును పశుబలము నుండి ధర్మబలమునకును, హింసామార్గము నుండి అహింసావిధానమునకును మరల్చుటకు వినియోగపడి ప్రపంచమునం దంతటను అహింసాధర్మమునందు జిజ్ఞాస కలిగినది. మహాసంగ్రామములు, ఆయుధవిసర్జన సభలు, ధర్మోపదేశములు శాంతిసమితులు కలుగజేయజాలని మహాశాంతిపరివర్తనమును గాంధిమహాత్ముడు సత్యాగ్రహసాధనమునను పదేండ్లయందు చేయగలిగెను.

వర్తమానసమయమునందు విశ్వమానపరంగమునందు స్టాలిను, హిట్లరు, ముస్సోలిని, రూజువెల్టు, డివెలిరగారులు మొదలగు మహానాయకుల నడుమను గాంధిమహాత్ముడు పరంజ్యోతివలెను ప్రకాశించుచు ప్రపంచశాంతి కాశాకాంతులను ప్రసరింపజేయుచున్న విధము ప్రపంచలక్ష్యము నాకర్షించుచున్నది. గాంధిమహాత్ముడు నవయుగధర్మస్థాపనాచార్యుడై ప్రపంచమునందంతటను ధర్మవిజయ ధ్వజముల నారోహణము చేయుచున్నను ప్రపంచము గ్రహింపజాలకున్నది. గాంధిమహాత్ముని సత్యాగ్రహోద్యమము నిస్సహాయులైన భారతీయుల కాత్మవిశ్వాసమును గలుగజేసినది. బ్రిటీషుప్రభుత్వమునకు గాంధిమహాత్ముని సత్యాగ్రహ ప్రభావమును గ్రహించుట యవసరమైనది. సత్యాగ్రహ ప్రభావమును నిర్మూలము చేయుటకు బ్రిటీషుప్రభుత్వము యావచ్ఛక్తిని వినియోగించినను ప్రయోజనము గలుగకున్నది.

సహజమైన సత్యాగ్రహమును నిర్బంధ దండనములు, హింసలు నిర్మూలము చేయజాలవు. సత్యాగ్రహవిజయఫలములు బాహ్యచిహ్నములందు ప్రత్యక్షము గాకపోయినను ఆత్మబల విశ్వాసములందు ప్రత్యక్షమగుచున్నవి. బాహ్యవిజయములందు విశ్వా

సముగల ప్రభుత్వమునకును, నాయకులకును సంతృప్తిని గలుగజేయుటకు గాంధి మహాత్ముడు సత్యాగ్రహప్రస్థానము నాపుట నిందాస్తోత్రములకు పాలైనను సముచితముగ నున్నది. సత్యాగ్రహవిరామము ప్రభుత్వాధికారులకును సత్యాగ్రహులకును విషాదానందములను గలుగజేసినవి. సత్యాగ్రహ విరామము ప్రభుత్వమునకు నిరంకుశ పాశ బంధములను సడలించుటకును, సత్యాగ్రహులకు విశ్రాంతిని బడయుటకును సావకాశములను గలుగజేసినను, అభిమాన పిశాచము మాత్రము విడువకున్నది. ప్రభుత్వమునకును నాయకులకును సత్యాగ్రహాచార్యునకు గల ఔదార్య, విశ్వాసములు గలుగకున్నవి. ప్రభుత్వాధికారు లెప్పటివలెనే నిర్బంధ పశుబలమును నమ్ముచున్నారు. నాయకులు సంశయాత్ములై కర్మపరాఙ్ముఖులయియున్నారు. సత్యాగ్రహవిరామ ముభయులకును ఆత్మపరీక్షను జేసికొనుటకును ఆత్మశక్తిని వ్యక్తము చేయుటకును నవకాశములను గలుగజేసినది. లబ్ధావకాశములను కార్యసిద్ధికి వినియోగించుట పురుషార్థముకాని గతమునకు వగచుట పురుషార్థముకాదు.

పాట్నాయందు కాంగ్రెసు కార్యవర్గము నిర్ణయించిన కార్యవిధానమును, సత్యాగ్రహవిధానమునువలెనే కాంగ్రెసు నాయకులందరును భేదాభిప్రాయములను విడిచి యారాధించుట కాంగ్రెసు ప్రతిష్ఠకును, స్వరాజ్యసంపాదనమునకును సాధనముగా గలదు. గాంధిమహాత్ముని యామోదమును బడసిన కార్యవిధానము నాచరించుటయందు నాయకులందరును త్రికరణశుద్ధిగను పని జేయుట ధర్మమయి యున్నది. స్వరాజ్య సంపాదనమునకు సాధనములందు భేదమున్నను సాధకులందరును సమానముగను గౌరవపాత్రులు. చెన్నపురి సముద్రతీరమునందు జరిగిన మహాసభయం దీవిషయమును శ్రీయుత భూలాభాయి దేశాయిగారును, రాజగోపాలాచార్యులుగారును సువ్యక్తము చేసిరి. ప్రజాసంకల్పమును సువ్యక్తము చేయుటకు సత్యాగ్రహమువలెను వోట్లును ప్రమాణముగ నున్నవి. ప్రభుత్వాధికారులకు సత్యాగ్రహమునందు విశ్వాసము లేకపోయినను వోట్లయందు విశ్వాసము కలదు. ప్రభుత్వమునకు విశ్వాసపాత్రమైన వోట్లవిధానము నందును ప్రజల దృఢసంకల్పమును వ్యక్తము చేయుటకై కాంగ్రెసు స్వరాజ్యపక్ష కార్య విధానమునందును ప్రజలందరును పాల్గొనుట ధర్మముగ నున్నది.

* * * *

కాంగ్రెసు స్వరాజ్యపక్షము :

స్వరాజ్యపక్షము రాంచియందు చేసిన నిర్ణయములువలెను పాట్నానిర్ణయములును, పాట్నానిర్ణయములువలెను బొంబయినిర్ణయములును, బొంబయి నిర్ణయములువలెను భావినిర్ణయములును ఖండనమండనములకు పాలగుట వర్తమానపరిస్థితులందు సహజము.

గాంధిమహాత్ముడు కాంగ్రెసు వ్యవహారము లందు ప్రవేశించినతరువాతను రాజకీయవ్యవహారములందు నూతనశక మారంభమయినది. కాంగ్రెసువ్యవహారములందు సత్యాగ్రహోద్యమము ప్రారంభమయిన కాలమునుండియును ప్రపంచవ్యవహారములందు సంకల్పసిద్ధి కపరిచితమైనను సత్యమైన ధర్మసాధనముత్పన్నమైనది. గాంధిమహాత్ముని దిగ్విజయములు సత్యాగ్రహవిజయమునకు పరమప్రమాణములుగ నున్నవి. దేశదేశములందును సత్యాగ్రహప్రభావమును, మహాత్ముని ప్రతిష్ఠయును ప్రతిధ్వనిల్లుచున్నవి. కాంగ్రెసువ్యవహారములందు కాంగ్రెసు నాయకులును, ప్రచారకులును పొందిన సత్యాగ్రహశిక్షణము కాంగ్రెసువాదులను శాసనసభల కధికారులనుజేసినది. కాంగ్రెసుస్వరాజ్యపక్షము నిర్ణయించిన శాసనసభాప్రవేశవిధానమును ప్రజానాయకులకు పరీక్షగనున్నది. ఈపరీక్ష సులభమైనను నిరంకుశాధికారావృతమైన దేశపరిస్థితులందు ప్రజలకు దురారాధ్యముగ నున్నది. ప్రజలు కాంగ్రెసుబలమును సమర్థించుటకు వారి సమ్మతులను కాంగ్రెసు అభ్యర్థులకు సమకూర్చుట యవసర మగుచున్నది. నాయకులు ప్రజలయందు భేదాభిప్రాయములను గలుగజేయకుండుటకు కాంగ్రెసుకార్యనిర్వాహకసభ నిర్ణయించిన శాసనసభాప్రవేశమును సయితము నిరసించక ఆమోదించుట యవసర మగుచున్నది.

*　*　*　*

### ఎన్నికలు-అభ్యర్థులు

కాంగ్రెసువ్యవహారములందు కులతత్త్వములకును, మతభేదములకును, స్థలాభిమానమునకును, స్థితిభేదములకును నవకాశములు లేవు. అభ్యర్థుల నిర్ణయమునకు వారియర్హాతప్రమాణముకాని కులమతస్థితిగతులు ప్రమాణములు కావు. కులతత్త్వములు, మతాభిమానములు, ధనాధికారములు ప్రబలియున్న పరిస్థితులం దభ్యర్థులను నిర్ణయించుటయందపోహల కవకాశము లున్నను కాంగ్రెసు సెలెక్షనుబోర్డు తగినవారినే నిర్ణయించునని విశ్వసింపవలసియున్నది. ఎసెంబ్లి ఎన్నికల కభ్యర్థులుగను నిలువదలచినవా రందరును దరఖాస్తులను పంపుటయును, దరఖాస్తులను సాంతముగను పరిశీలించి అభ్యర్థులను నిర్ణయించుటయును దుర్లభముగాదు. సెలెక్షనుబోర్డుమీదనువలెను అభ్యర్థులమీదను గొప్పభారము కలదు. అభ్యర్థులందరును అభ్యర్థిత్వమునకు సమానాధికారులైనను సెలెక్షనుబోర్డునిర్ణయమును శిరసావహించవలసి యుందురు. గాంధిమహాత్ముని నిగ్రహత్యాగములు సత్యాగ్రహప్రస్థానమునందువలెను శాసనసభావ్యవహారములందును అభ్యర్థులకును, కాంగ్రెసు పక్షావలంబకులకును ఆదరణయోగ్యముగ నుండగలదు. ప్రపంచవ్యవహారములందు పశుబలారాధనపర్వము లంతరించుటకును,

సత్యాగ్రహపరాయణమైనశాంతిపర్వము స్థాపనమగుటకును ఉద్యోగపర్వములును, యుద్ధపర్వములును నెన్నియో కావలసియున్నవి. ప్రజానాయకులు కాంగ్రెసుకార్యవర్గము నిర్ణయించిన, గాంధిమహాత్ము డామోదించిన ఉద్యోగపర్వనిర్వహణమునందు వారి యావచ్ఛక్తిని వినియోగించుట పుణ్యము, పురుషార్థము.

---

Printed and Published by K. Nageswara Rao, at the Andhra Patrika Press, No.7, ThambuChetty St., Madras.
Editor: G. Subbaramayya.

# భారతి

## సచిత్ర మాసపత్రిక

అధిపతి

కా. నాగేశ్వరరావు

సంపాదకుడు

గన్నవరపు సుబ్బరామయ్య

సంపుటము ౧౧, సంచిక ౮

ఆంధ్రపత్రికా ముద్రాలయము, మద్రాసు

౧౯౩౪


విషయసూచిక

# చిత్రములు



☞ 'నేను-నా గ్రామఫోను' రెండుమారులు (౧౯౮ పుట, ౨౪౨ పుటలలో) అచ్చయినది

౩౨౦ వ పుటలోని వ్యంగ్యచిత్రము 'మీసము' కాని 'క్రాపులు' కాదు.—సం. భారతి.

---




సంపు. ౧౧ భావసంవత్సరము, శ్రావణమాసము (ఆగష్టు ౧౯౩౪) సంఖ్య ౮

# "కల్పలత"

కాళూరి వెంకటనరసింగరావు

౨

నీలపయోదఖండకమనీయతరాంచలచంచలాసము
న్మీలితయక్షగానముల నిస్సృతముల్ రసధార లీదు, మం
దాలసరాగభారవహయాత్రల సాగెడు నాదుజాలి ప
ద్యాలు; భవత్సుధాధరపథాశ్రయలిప్సల తేలనిత్తువా?
నీపదముల్ శరన్నిశల నిద్రల మేల్కొలుపున్, సుధాప్రహ్లాద
స్నాపితచంద్రరేఖికల చల్లనిసంకెల లూడ్చి, గాంగవీ
చీపరిషత్పయస్సు, శశిశేఖరహాళిజటాటవీదృఢ
శ్రీపరమానుబంధ మెడలించు భగీరథచిత్తవృత్తులై.
పున్నమరేల నీవు మృదుముగ్ధముగా మధుకంఠమెత్త, న
భ్యున్నతశీతపర్వతహిమోజ్జ్వలవీథుల విచ్చు నక్రపున్
తిన్నెల గౌరి బాడికొని తీయగ ముద్దిడ దివ్యదంపతుల్,
సన్నగ పారిజాతపరిషత్తుల మొగ్గలచాలు, నామెదన్.
ఆలాపింతు వొకొక్కమా రుభయసంధ్యాశోణదృక్కోణరా
గాలంకారములైన గీతల, సహస్రాచ్ఛిద్విపంచీశ్రుతి
వ్యాలోలాచ్ఛసువర్ణతంత్రుల కళల్ వర్షించి; మేఘోదయో
ద్వేలస్నేహతుషారముల్, ప్రసవపుత్రీస్వేదతారళ్యముల్.

ఉలికెదు సన్న వెన్నెలల కూరకె యోషధికన్యవోలె, సం
జల అపరంజిమేడలను జల్లున సోలెద చిమ్మచీకటుల్
తలకొని ముట్టడింప, మమతల్ మది తొట్రిల నెలిమబ్బుపం
దిళులను పల్కరింతు తరితీపుల చక్కనిచుక్కచూపులన్.

నీ తాటంకరుచిప్రవాహముల నన్వేషింతు, నాగేంద్రక
న్యా తారుణ్యకపోలచుంబిమణివిన్యాసద్యుతుల్; తామ్రప
ర్ణీ తారళ్యగభీరగర్భవికసన్నీరంధ్రశుక్తిచ్ఛవుల్;
భ్రాజిన్ మన్మథుచుంబనప్రతిఫలప్రత్యగ్రలజ్జాంకముల్.

నీవు దరస్మితాసవము నివ్వ యొనర్తువు, పాండుగండరే
ఖావరణమ్ములం, దధరకావ్యపుటాంతరశయ్యలన్, ద్రవ
ప్లావిత ప్రేమవిస్ఫురదపాంగములన్; బహుజన్మభోగయా
త్రావిరళానుభూతులకు నాచెదవో! గిరికొన్నప్రౌఢిమల్.

ఒక్కొకవేళ నీవు కుసుమోజ్జ్వలవౌదువు నైజవాసినన్;
చిక్కనపాలవెన్నెలల చేదుచు శారదనీరదంబులో
చిక్కిన నేను నీవయిని చిల్కెద సిద్ధధునీమరందముల్,
పక్కన నవ్వ కీవు తెలివమ్మెద నొడ్డెద వోరజూచుచున్.

నావయి జల్లి, సింహగిరినాథపదాబ్జసుధాభిషేక దీ
క్షాపరతంత్రవారిధరగర్భరుచిప్రియముల్, కటాక్షు ల
క్ష్మీపురుషార్థముల్, తనియ జేసితి; తజ్జలపాతపుణ్యరే
ఖాపరిపాక మీగు త్వదగాధదృగంచల కజ్జలచ్ఛవుల్.

ఏమనుకొంటివేమొ, "కదిలించినసంజియకావిమోవిపై
నీమనసున్న దేమొ?" యని నే నడుగన్ తొలి; తూగిరేగునీ
ప్రేమతరంగవీథి మెరపించిన దొక్కమరీచి మింట; ఆ
శామలినమ్ము నా ప్రణయసాహసమై పయిగ్రమ్మె చీకటుల్.

శ్యామలతామసీకుహరసంధుల జిక్కిన నాటి నీముఖ
శ్రీమధురేఖ, లోకపతిశీర్షనటచ్ఛశిరేఖలో కళల్
కోమలతల్ చిగుర్చునొ! నిగూఢములౌ ననశుక్లపక్షశో
భామృతహాసముల్ హృదయపర్వములం దెలయించునీరుచుల్.

నీవు జగత్ప్రభుం గొలువ నిల్వగ దేవగృహాంగణాన, సం
ధ్యావతి పచ్చికుంకుమపొడల్ సవరించు విహాయసాల; ఆ
శావలయమ్ము చుక్కలపసందున మొగ్గలమోజుచూపు; పూ
జావివశమ్ము నీహృదయశాంతియె విచ్చును తేటవెన్నెలై.

---

# అథర్వవేదము ౨

బుర్రా వెంకటసుబ్బారాయుడు

అనువృత్తము.

వైదికవాఙ్మయమునంతను రెండువిధములుగ విభజింప వచ్చును.

౧. శ్రౌతకర్మకు జెందినవి—త్రయీవిద్య, సోమయాగమునకు జెందినగ్రంథములు మొదలైనవి.

౨. గృహ్యకర్మకు జెందినవి—అథర్వవేదము, గృహ్యసూత్రములు.

ఈరెండువిధముల వాఙ్మయమును ప్రాచీనకాలము నుండియు నీసుజోడుగ నుండియున్నట్లు కనబడును. ఇందలి యాచారములు, కర్మలు హిందూయూరోపి యనుల కాలమునుండియుగూడ నుండెనని కొందఱి యభిప్రాయము. కొందఱు దీనికి సమ్మతింపక, భాషను బట్టి ఋగ్వేదాదులకంటె నథర్వము మిక్కిలి యర్వాచీనమని తలంచుచున్నారు. మఱికొందఱు కేవలము భాషను, శైలినిబట్టి యొకగ్రంథముయొక్క కాల నిర్ణయము చేయలేమనియు, ఋగ్వేదమున ప్రాచీనము లని తలంపబడుచున్న కొన్ని క్రియారూపములు, నామ ములు నర్వాచీనమని తలంపబడుచున్న యథర్వమున గూడ కానవచ్చుననియు, నథర్వముగూడ ఋగ్వేద మంత్రప్రాచీనమైనదే యనియు, గాని సూక్తములకూర్పు (Reduction) మాత్రము చాల నర్వాచీనమనియు బదులుచెప్పుచున్నారు. ఇట్టి భాషాభేదములు దేశభేద మునుబట్టికూడ నుండవచ్చునని వారి యుద్దేశము. (దీనిని ముందు వివరింతుము.)

అథర్వవేదసూక్తములును, గృహ్యసూత్రములును గూడ ప్రాచీనర్షులచే సమ్యక్పరిష్కృతము లైనట్లు కానరదు. అందుచేతనే సామాన్యకర్మ లన్నిటియందును గూడ మిక్కిలి పవిత్రములని యెంచబడుచున్న మంత్రము లుపయోగింపబడియున్నవి. వైదికదేవతలు సామాన్యగృహచ్ఛిద్రములయందు జోక్యము కలుగజేసి కొనుచున్నట్లు వీనియందు చెప్పబడినవి. (ఒకొక్క చో నీరీతి క్షుద్రకర్మలనుగూడ బవిత్రవంతములుగా నొనర్చుటకై యీఋషులు మిక్కిలి పాటుపడినట్లు అథర్వమునను, గృహ్యసూత్రములందును తేటతెల్లమగు చున్నది. ఇంతల కుదాహరణముగ మనకు ముందు జెప్పినట్టి కుంతాపసూక్తములు గలవు) ఈవైదిక దేవతల యందుమాత్ర మెట్టినూతనమను మార్పును రాక ఋగ్వేద మందు వీనికి గల గౌరవ మిచటకూడ నున్నను, వీని (దేవతల) సంబోధనము, ఉపయోగముమాత్ర మసందర్భ ముగా నున్నది. అథర్వమున దఱను శ్రౌతతాత్త్విక విషయముల ననుభవములోనికి దెచ్చికొని వానినిగూర్చి చర్చించుట జూచిన మననము, ధ్యానము విశేషముగా నుండినట్లు కనబడు బ్రాహ్మణోపనిషద్యుగమునకే యీ యథర్వముగూడ జెందియుండవచ్చునని తోచును. బ్రాహ్మణములందలి యాశయములే యథర్వమునందు జర్చింపబడుచున్నవి. ఇందు ముఖ్యముగా గమనింప దగినవి.—

౧. బ్రాహ్మణులు దమ కితరులకు లేనట్టి యుత్కృష్టములగు హక్కులు గలవని ధిక్కరించికొను చుండిరి. ఈవిషయమున నీమంత్రములతో నైతరేయ శతపథబ్రాహ్మణములను బోల్చిన నాబ్రాహ్మణములే యథర్వముకంటె బ్రాచీనములైనట్లు కనబడును.

౨. నైసర్గికస్థితి:—

అథర్వమున యమునావారణావతములును, అంగ మాగధములును నుదాహరింపబడినవి. దీనినిబట్టి యార్యు లీనాటి కప్పుడే తూర్పుగాను, నాగ్నేయముగాను వ్యాపించియుండిరని తెలియుచున్నది. ఇట్టిపరిస్థితులే మనకు బ్రాహ్మణములందును కనుపించుచున్నవి.

౩. జంతువులగూర్చిన విశేషములు:—

అథర్వములో వ్యాఘ్రమునుగూర్చి తఱచు చెప్ప బడియున్నది. దీనినిబట్టి యాకాలమునాటి కార్యులు వ్యాఘ్రములు విశేషముగా నుండు ప్రదేశమునకు (బహుశః వంగదేశమునకు) చేరియుండిరని తెలియ నగును. బ్రాహ్మణములుగూడ నిట్టిస్థితినే తెలుపుచున్నవి.

౪. సాంఘికసంస్థ లేర్పడుట:—

ఆర్యానార్యాదిజాతిభేద మేకాక, నార్యులలో నే బ్రాహ్మణక్షత్రియాద్యంతర్జాతిభేదముగూడ దేశమున బాగుగ వ్యాపించినట్లు కనబడును. (బ్రాహ్మణముల జూడుడు).

౫. శారీరకశాస్త్రము:—

అథర్వమున నార్యులకు మనుష్యులయొక్కయు, జంతువులయొక్కయు శారీరకశాస్త్రము బాగుగ తెలిసి యున్నట్లు నిదర్శనములు గలవు. బ్రాహ్మణములందు గూడ పురుషమేధాశ్వమేధచర్చలలో నీవిషయమే విశదమగుచున్నది.

సవితృత్వష్టల యుగపత్సంబోధనమును, వారినిద్దఱిని ప్రజాపతితో నైక్యము సేయుటయు గూడ మన మథర్వమునందును, బ్రాహ్మణములందును కాంతుము.

ప్రాయశ్చిత్తకూష్మాండాదిసూక్తములు బ్రాహ్మణములకంటెను నథర్వ మర్వాచీనమని సూచించు చున్నవి. కాని యీసూక్తము లాదినుండియు నథర్వ ముననుండక తరువాత తరువాత జేర్పబడియుండనగును. పైయారువిషయములలోగూడ "బ్రాహ్మణములకంటెను అథర్వము ప్రాచీనము" అని వాదించువారీ జవాబే యిచ్చుచున్నారు.

పైనుదాహరించిన వాదము లన్నియుగూడ సమంజసముగనే యున్నవి. అథర్వమున కొన్నివిషయములు బహుప్రాచీనములైనట్లును, కొన్నివిషయములు బహ్వర్వాచీనములైనట్లును, ఇట్లు రెండువిధములుగ నున్నవి. దీనికి ముఖ్యమగు కారణములు బహుశః యివియై యుండవచ్చును.—

(౧) కాలము గడచినకొలది నూతనవిషయములు మూలగ్రంథమున జేర్పబడియుండవచ్చును. (౧౯-వ, ౨౦-వ కాండ లీరీతినే చేర్పబడియుండును. మహాభారత మునగూడ నిట్లే కాన్పించును.)

౨. అథర్వణాచార్యులు తమ వేదమునకు వైదిక ప్రమాణము వచ్చుటకై ఋగ్వేదాదులయందు గన్పించు నట్టి తాత్త్వికాదివిషయములను తమ వేదమునగూడ నుదాహరింపగోరి యట్టిసూక్తముల గొన్నిటిని జేర్చి యుండిరి. ఇట్టియుద్దేశముతోనే వారు (ఆథర్వణులు) ఋగ్వేదమునందు బవిత్రములని యెంచబడు చున్న కొన్నిసూక్తములను, మంత్రములను నథర్వమున గూడ జొప్పించిరి.

౩. ఇందాదినుండియు నున్న ముఖ్యవిషయము లతిప్రాచీనములు. గృహ్యకర్మలు, స్త్రీకర్మలు, భైషజ్య కర్మలు, ఆభిచారికకర్మలు నిట్టివానిలో జేరినవి. కాల క్రమమున నట్టికర్మలు హేయముగ జూడబడుటచే వీనిని బాగుగ బరిష్కృతము చేయవలసివచ్చినది. అట్లు సంస్క రించునపుడు సంస్కర్తలకాలమునాటి కొన్నివిష యము లిందున నుద్దిష్టములై చొప్పింపబడినవి. అందుచే నతిప్రాచీనములగు విషయములకుగూడ నవీన రూపము వచ్చుటచే గాలనిర్ణయ మతికష్టమగుచున్నది. గృహ్యాదికర్మలగూర్చిన సూక్తములుమాత్రము ప్రాచీ నము లనువిషయము నిర్వివాదాంశము. దీనిగూర్చి ముందు చెప్పెదము.

## అథర్వమునకును గృహ్యసూత్రములకును గలసంబంధము

అథర్వవేదమునకును గృహ్యసూత్రములకును చాల సంబంధము కలదని యివరలో సూచించియుంటిని. శ్రౌతసూత్రములు, శ్రౌతకర్మయు త్రయీవిద్యపై నాధారపడియున్నట్లు గృహ్యసూత్రములు, గృహ్య కర్మయు నథర్వముపై నాధారపడియున్నవి. శ్రౌత వాఙ్మయమువలన మన కార్యుల యున్నతాశయముల గూర్చియు, మతాచారములనుగూర్చియు, తత్త్వజ్ఞాన

మునుగూర్చియు, దైవభక్తినిగూర్చియు, చాలవఱకు వారి సద్గుణములనుగూర్చియుమాత్రమే తెలియుచున్నది. కాని యార్యుల దైనికచర్యనుగూర్చిమాత్రము యాదృచ్ఛికముగదప్ప త్రయీవిద్యయందుగాని, శ్రౌతసూత్రములందుగాని విశేషించి కానము. ఆర్యుల దైనికజీవనము దెలిసికొనవలెనన్న మనము త్రయీవిద్యయందు యాదృచ్ఛికముగా జెప్పబడిన విషయములకు, అథర్వవేదమునందును గృహ్యసూత్రములందును వివరింపబడిన విషయములను జతచేసి పరీక్షించవలెను. ఇట్టిసంబంధము గృహ్యసూత్రములకు నథర్వవేదమునకు నుండుటచేతనే యథర్వవేదము గృహ్యసూత్రములకు మంత్రపాఠమువంటిదని కొందఱు విమర్శకు లనుచున్నారు. శ్రౌతవాఙ్మయము హిందూనాగరికతయొక్క యౌన్నత్యమునుమాత్రము చెప్పుచున్నది. సామాన్యహిందూప్రజలగూర్చికాని, హిందూగృహములందలి లోటుపాట్లను గూర్చికాని తెలిసికొనవలెనన్న మనము గృహ్యకర్మకు జెందిన వాఙ్మయము దిరుగవేయవలెను.

ప్రాచీనహిందువుని జీవితము సంస్కారమయమై యుండెను. ఆతని ననేకమూఢవిశ్వాసములు పీడించుచుండెను. ఇట్టి మూఢవిశ్వాసము లన్నియు నాతని మతమున పాదుకొనియున్నవి. సామాన్యముగ ప్రజలలో (హిందువులలో) నుండునట్టి యిట్టినమ్మకములను, నాచారములను చేకొని బ్రాహ్మమతమునకు (ఆర్యులమతమునకు) అవిరుద్ధముగా నుండునట్లు సంస్కరించి ప్రజలకు పఠనపాఠనములకు చులకనగా నుండునట్లుగ సూత్రములరూపమున క్రోడీకరించి, ప్రాచీన ఋషులు గృహ్యసూత్రము లను పేరట ప్రకటించిరి. ఆయాఋషుల దేశకాలభేదములనుబట్టి యిట్టిగృహ్యసూత్రములం దన్యోన్యభేదము గానవచ్చుచున్నది. దీనియందు సూక్తములును, మంత్రములును చతుర్వేదముల నుండి స్వీకరించి సందర్భమున కనువగునట్లుగ (కొన్నిచోట్ల నసందర్భముగగూడ నుదాహరింపబడినవి. ఇట్టి గృహ్యసూత్ర మేశాఖకు, నేవేదమునకు జెందిన నాశాఖనుండి, యావేదమునుండి పెక్కుమంత్రము లాగృహ్యసూత్రములం దుపయోగింపబడియున్నవి. కాని సమస్తగృహ్యసూత్రములునుగూడ నథర్వవేదమునుండి మంత్రములను తీసికొనుచున్నవి. విషయములసంగతి చెప్పనక్కరనే లేదు. ఈగృహ్యసూత్రములవలన, విశేషించి యథర్వమువలమున, ప్రాచీనహిందువులు దేవబ్రాహ్మణారాధనాతత్పరులుమాత్రమేకాక నాగరికతయందు గొన్నిలోపములు గల్గి భూతాదిభయముచే పీడింపబడి నీచమగు మంత్రవిద్యకు లోనై క్షుద్రదేవతారాధనతత్పరులైకూడ నుండిరని తెలియుచున్నది. మూఢవిశ్వాసములు వారిని (హిందువులను) గృహక్షేత్రములందును, పశువాహనాదులయందును, వివాహవాణిజ్యాదులందును, గ్రామసభలందును, నంతటను చుట్టుముట్టియున్నట్లు కనుపించును. ఇట్టివానివిషయమై గృహ్యసూత్రములలోకంటె నథర్వమున విశేషముగా కనుపించును. గృహ్యసూత్రములలో లేకుండ నథర్వమున గనబడు విశేషము లేమన,

౧. భైషజ్యవిషయములు (ఇవి గృహ్యసూత్రములలో నక్కడక్కడ కానవచ్చును. పారస్కర గృహ్యసూత్రమున తలనొప్పిపోవుటకు ఒకకర్మ చెప్పబడియున్నది.)

౨. బ్రాహ్మణుల యున్నతికై యేర్పడిన ప్రార్థనాదులు (గృహ్యసూత్రములం దీగౌరవము "తతో బ్రాహ్మణభోజనమ్" అని ప్రతికర్మకు నంతమున జెప్పబడిన విధియందుమాత్రము విశేషించి కానవచ్చుచున్నది.)

౩. రాజకర్మకు జెందిన విషయములు:—ఇవి గృహ్యసూత్రములందు గానరావు. కాని బ్రాహ్మణములందు విశేషముగ గలవు.

౪. స్త్రీలనుగూర్చిన విషయములు: (స్త్రీకర్మలు) గృహ్యసూత్రములలో సంస్కారసందర్భమున దప్ప వీనినిగూర్చి కానరాదు.

గృహ్యసూత్రములందు గృహస్థు సుస్థితుడై ప్రతిదినము గృహమున ననుష్ఠింపదగు నిత్యకర్మలుమాత్ర ముదాహరింపబడినవి. కాని యథర్వమున నైమిత్తిక కామ్యకర్మ లుదాహరింపబడినవి. అందుచే నథర్వ

మున నున్నచింత గృహ్యసూత్రములందు లేకుండుట సమంజసమే యగును. గృహ్యసూత్రములందు ప్రతిదినము గృహస్థునకు ముఖ్యమగునట్టియు, చేయవలసినట్టియు కర్మమాత్రమే యుద్దేశింపబడియుండుటచే నట్టియుద్దేశ మేమియు లేక రచింపబడిన యథర్వమున నాశ్చర్యజనకములగు పెక్కుచింతవిషయములు కానవచ్చుచున్నవి. జీవితమం దప్రసిద్ధమైనప్పటికిని, చరిత్రకర్త్యావశ్యకములగు జీవితమందలి క్షుద్రములగూర్చి మనకు దీనివలన దెలియుచున్నది.

## "అథర్వాము" "అంగిరసః" అథర్వాంగిరసః

అథర్వవేద మీమూడుపేళ్లతో పిలువబడుచున్నది. వైదికవాఙ్మయమున పెక్కుచోట్ల 'అథర్వ' మనుపేరను నొక్కచోటమాత్రము 'అంగిరసః' అనుపేరుతోడను నీవేదము పిలువబడియున్నది. కాని బహుశః యీరెండునామములతో తొల్లి రెండుగ్రంథములుండియుండెనని చెప్పుటకు కొన్నియాధారములు కలవు. (గోపథబ్రాహ్మణము జూడుడు.) ఈవేదములోని భైషజ్యాదిశాంతకర్మకు జెందిన సూక్తములు పైజెప్పిన 'యథర్వ' మనుగ్రంథమునుండియు, ఆభిచారకకర్మకు జెందిన సూక్తములన్నియు 'అంగిరసః' అను గ్రంథమునుండియు సేకరింపబడియుండనోపును. ఇట్టిభేదము మనకు వైదికసంస్కృతవాఙ్మయములయందంతటను కానవచ్చుచున్నది. ఈభేదమునకు కారణమును ఆభేద మేనాటినుండి వచ్చినదియును విచారింపనగును.

ఋగ్వేదమున అంగిరస్సుయొక్క యుగ్రతను గూర్చి చెప్పబడియున్నది. దీనినిబట్టి యీభేదము చాల ప్రాచీనమైనదని యూహింపదగియున్నది. కొంతకాలమునకు "అథర్వాంగిరస" శబ్దములు పర్యాయపదములై మఱికొంతకాలమునకు (బహుశః యీరెండుగ్రంథము లేకమైనపిమ్మట) అథర్వ మనునామము మాత్రము మిగిలెను. క్రమముగా అథర్వ మనునామము వింతగా, చివఱకు మంత్రవిద్య, అభిచారకకర్మ మొదలగువానినిమాత్రము తెలియజేయుచున్నది.

## వైదికసంస్కృతవాఙ్మయములయం దథర్వవేదముయొక్క ప్రశంస

౧. ఋగ్వేదము:—

ఋగ్వేదమున నథర్వముయొక్క ప్రశంసయే లేకున్నది. ఆర్యులాకాలమున మిక్కిలి పవిత్రమైనట్టియు, ముఖ్యమైనట్టియు సోమయాగాదులయందు, దేవతారాధనయందును నిమగ్నులై యుండుటయే యిట్టిమౌనమునకు కారణమైయుండును. అట్టికార్యములయం దాసక్తులైన యానాటి యార్యులకు అథర్వమునుగూర్చి ముచ్చటించునంతటి యవకాశము లేకపోవచ్చును. లేదా, మనము ప్రస్తుతము "అథర్వవేద" మని పిలుచునట్టి గ్రంథ మానాడిప్పుడు కాన్పించువిషయముల నన్నింటిని గలిగియుండక మఱియొకపేర పిలువబడియుండవచ్చును. అయినను "ఋచః సామాని జజ్ఞిరే, ఛందాంసి జజ్ఞిరేతస్మాత్, యజు స్తస్మా దజాయత" (ఋ X మం౯౦సూ౯) ఇత్యాదుల కొన్నిమంత్రములు ఋగ్వేదకాలమునాటికే ప్రజల కథర్వమునుగూర్చిన జ్ఞానముండెనని సూచించుచున్నవి. అథర్వణకర్మలనుఋగ్వేదకాలపు ప్రజలు నిషేధించియుండిరనుట కెట్టినిదర్శనములును లేవు. ఆకాలమున నథర్వము ప్రస్తుతమున్నస్థితిలో లేకున్నను నందలి కొన్నిసూక్తములైనను ముఖ్యముగ నం దుదాహరించిన ఆథర్వణాచారములు, కర్మలు ఋగ్వేదముతో సమకాలీనములుగాని, అంతకంటె ప్రాచీనములుగాని యైయుండవలెనని చాలమంది పండితుల యభిప్రాయము.

౨. అథర్వవేదము:—

అథర్వవేదమున అథర్వమునుగూర్చిన ప్రశంస యంతగా లేదు. ఆథర్వణరచయితలు తమ వైదికగ్రంథములయం దున్న గుణదోషములనుగాని, యితరవేదములవారు చేసిన నిందాపూర్వకవిమర్శననుగాని గమనించినట్లగపడదు. అట్టివిమర్శనలను వారెఱింగియే యున్నయెడల నిజమతస్థాపనకై పూర్వపక్షసిద్ధాంతముల జేసియే యుందురు. దీనినిబట్టి యట్టివిమర్శన లానాటికి లేకపోయియుండవచ్చునని తోచును. ఈవిషయముగూడ

నథర్వవేదముయొక్క ప్రాచీనతను తెలియజేయు చున్నది.

౩. శ్రౌతసూత్రములు:—

వీనియం దథర్వమునుగూర్చి విమర్శించుటకు దగిన యవకాశము లేమి దాని యుదంతమే లేదు. ఇందలి వచనము (సూత్రములు) మాత్ర మాథర్వణ మందలి వచనభాగమును బోలియున్నది. ఈ శ్రౌత సూత్రములలో పవిత్రతరములని యెంచబడు శ్రౌత కర్మలతో నీయథర్వమునకు సంబంధ మున్నట్లు చెప్ప బడకపోయినను నివి దాని ప్రమాణము నంగీకరించి యున్నట్లు కనబడును. అథర్వముయొక్క గౌరవ ప్రామాణ్యప్రాముఖ్యములఁగూర్చి యిచ్చట నేమియు చర్చింపబడియుండలేదు. కాని స్మృతులలోను, నుపని షత్తులలోనువలె నిచ్చటగూడ ఋగ్వేదాదిగ్రంథముల పట్టిక నిచ్చునపుడెల్ల నథర్వవేదమునకు తురీయస్థాన మీయబడియున్నది. అనగా నట్టిపట్టికలలో నథర్వము త్రయీవిద్యకు తరువాతను, ఇతిహాసపురాణములకు ముందుగను స్థానము నలంకరించుచున్నది. ఉపనిషత్తులు గూడ నీవేదముయొక్క గుణదోషముల లెక్కింపక, ఇందలి బ్రహ్మవిద్యనుగూర్చిన సంహితాభాగమును మాత్రము ప్రస్తుతించుచున్నవి. (ముండకోపనిషత్తును జూడుడు.)

౪. గృహ్యసూత్రములు:—

వీనికిని, అథర్వమునకును గల సంబంధమును గూర్చి యిదివరకు వివరించియుంటిమి. ఇందలి మంత్రములు చాలవఱకు కొద్దిపాఠభేదములతో నథర్వమంత్రముల బోలియుండును. కాని జనులచే నుపయోగింపబడుచు ప్రథమమున సంస్కారరహితములైన గృహ్యసూత్రములు, ఆర్ష సంబంధమున త్రయీవిద్య కనుగుణములగునట్లు పరిష్కృతములగుటచే నాథర్వణరూపమును గోల్పోయి త్రయీవిద్యకు జెందిన యితరగ్రంథములవలె నైనవి. ఇందుగూడ పట్టికలలో ఉపనిషచ్ఛ్రౌతసూత్రముల పట్టికలలోవలె నథర్వము చతుర్థస్థానమును బొందియున్నది. అథర్వ మప్పుడే వేదత్వమును (౪-వవేదమను నామమును) పొందుచున్నట్లు వీనిలో నచ్చటచ్చట కొన్నిసూచనలు గలవు.

౫. ధర్మశాస్త్రములు:—

ధర్మశాస్త్రములలో నథర్వముయొక్క న్యూనత స్పష్టీకృతమైనది. విషయముల స్వభావమువలననేమి, అందుదాహరించిన దుష్టాచారములవలననేమి, మొత్తము మీద నథర్వవేదము న్యూనభావము నందియున్నదని వీని మతము వీనియందు మంత్రవిద్య, అభిచారకకర్మ మొదలగువాని యాచరణకు ప్రాయశ్చిత్తము విధింపబడి యున్నది. ఇం దథర్వవేదనామగ్రహణము తఱచు చేయబడియుండలేదు. కాని యట్లు చేసియున్నపుడెల్ల నుపనిషదాదులలో నీయబడిన స్థానమే యథర్వమున కీయబడినది. శాంతికర్మల చేయుటకుగాని, యాగశ్రాద్ధాదులు చేయుటకుగాని రాజపురోహితు డథర్వవేదమున నారితేఱినవాడై యుండవలెనని ధర్మశాస్త్రములు విధించుచున్నవి. అందుచే పౌరోహిత్యవిషయమున జెప్పినదంతయు నథర్వవేదమున కనుకూలముగనే యున్నదికాని కొన్నిచోట్ల వైదికగ్రంథముల పట్టికలలో నథర్వవేదనామగ్రహణమే చేయకపోవుటవలన నథర్వవేదమునుగూర్చి వీని విమర్శ 'ఇదమిత్థ' మని యేమియు తెలియకున్నది. ఇట్లు మొట్టమొదట బాహాటముగా నథర్వవేదమునకు ప్రాతికూల్యమును తెలియజేయు గ్రంథములు రెండుమాత్రము కలవు.

అవి ౧. ఆపస్తంబధర్మసూత్రములు (II ౧౧-౨౯ ౧౦-౧౧ చూడుడు.)

౨. విష్ణుస్మృతి (V. ౧౯-౧ చూడుడు)

ఇవి యథర్వముయొక్క న్యూనతను స్పష్టముగ జాటుచున్నవి. సప్తవిధహంతకులలో మంత్రవిద్యల నభ్యసించువా డొకడని విష్ణుస్మృతియందు గలదు. మిగిలిన యథర్వాచరణలగూడ నీరెండుగ్రంథములును నిరసనబుద్ధితో జూచుచున్నవి. మంత్రవిద్య నభ్యసించువారి కింద దారుణమగు ప్రాయశ్చిత్తము విధింపబడి యున్నది. భైషజ్యకర్మ లాచరించువా రథఃపతితు లగుదురని వీనిలోను, బ్రాహ్మణములలోనుగూడ జెప్ప

బడియున్నది. మూలక్రియ నిషేధింపబడియున్నది. (ఈ 'మూలక్రియ' అనుపదము అథర్వాచరణముల సూచించుచున్నది.) అటులనే గ్రామక్రియ విషయ మునగూడ జెప్పబడియున్నది.

౬. మహాభారతము:—

దీనియం దథర్వవేద మీనాటికి వేదపదమును బొంది స్థిరముగా ప్రామాణ్యము గలిగియున్నట్లు నిద ర్శనములుగలవు. అథర్వాచరణముల నీయితిహాసము నిర సించుటలేదు. కాని త్రయీవిద్య యను పదము మాత్రము పూర్వమువలెనే తఱచు వాడబడుచున్నది. (III ౨౦౩-౧౫; V ౧౦౮-; ౧౦ మ. భా.) అథర్వమును గూర్చి ప్రత్యక్షముగ స్తుతి II ౧౧-౧౫; V ౧౮-౫; XII ౩౪౨-౯౩ III ౩౦౫-౨౦, శ్లోకములలో గలదు. కాని, కొన్ని యథర్వాచ రణలనుగూర్చిన దూషణకూడ కలదు. అట్టిదూషణ, భైషజ్యకర్మలనుగూర్చి XII ౩౬-౨౮; XII ౯౦-౧౩ శ్లోకములలోను, దుష్టస్త్రీలు మూలికామంత్ర ములతో జేయుకర్మలనుగూర్చి III ౩౯-౬ వ. శ్లోకము లోను గలదు.

౭. శేషించిన సంస్కృతవాఙ్మయము:—

మిగిలిన సంస్కృతగ్రంథముల దిలకించిన నథ ర్వము త్రయీవిద్యతో సమానమగు పదవిని, ప్రామా ణ్యమును పొందియున్నట్లు కనబడును. రామాయణ మునం దొకపర్యాయమును, దశకుమారచరిత్రయందు ద్వితీయతృతీయోచ్ఛ్వాసములందును కిరాతార్జునీయము నందు దశమసర్గయందు ౧౦-వ శ్లోకమునందును, సుశ్రుత సంహితయందు I ౮౯-౧౯; I ౨౨-౧౦ శ్లోకములలోను నథర్వము పేర్కొనబడినది. పురాణములయం దంత టను చతుర్వేదములు పేర్కొనబడినవి. బౌద్ధులును, జైనులును తమ వాఙ్మయములందు అథర్వాచరణముల దూషించుచు నెగతాళిచేయుచున్నారు. కాని యేలనో అమరుడు మాత్రము తన కోశమునం దథర్వమును బేర్కొనలేదు.

౮. అథర్వణుల యాచారకాండకు జెందిన గ్రంథములు:—

వీనిలో అథర్వమునకు గల కొన్ని విశిష్టములైన హక్కులనుగూర్చి చెప్పబడినది.

౧. యజ్ఞమునందు బ్రహ్మత్వ మథర్వణునిదై యుండవలెను.

౨. అట్లే రాజపౌరోహిత్యమునగూడ నాథ ర్వణులకు హక్కుగలదు.

౩. అథర్వవేదము త్రయీవిద్యతరువాతిదై, త్రయీవిద్యతో సమముగ ప్రామాణ్యము గలిగియున్నది.

ఈమూడువిషయములగూర్చి యీగ్రంథముల యందు నొక్కివక్కాణింపబడియున్నది. ఇతరవేద ముల బ్రాహ్మణాదులలో కొన్నిట వీనినిగూర్చిన ప్రసంగమే లేదు. కాని కొన్ని యీహక్కు లాథ ర్వణులవే యని యొప్పుకొనుచున్నవి. పైమూడుహక్కు లనుగూర్చి అథర్వణులు తమ గోపథబ్రాహ్మణము నందును, కౌశికసూత్రములందును విశేషముగ ప్రయ త్నించి చివఱకు సఫలమనోరథు లైరి.

## అథర్వవేదోన్నతికిని తదాచార్యుల ప్రాముఖ్యమునకును కారణములు

వైదికమతమండలి శ్రౌతకర్మయంతయు బ్రథ మమున (౧) హౌత్రము (౨) ఔద్గాత్రము (౩) ఆధ్వ ర్యము నని మూడుతెరగతులుగ నుండెను. ఇవియన్నియు నొకదానిపై నొకటి యాధారపడియుండిన కర్మవిభే దములైనను వీనియన్నిటియొక్కయు సాధ్య మొక్క టియే యైయున్నది అట్టిసాధ్యము యజ్ఞయాగాదులు పైజెప్పిన హౌత్రాదికర్మల విభేదత్రితయముయొక్క పూర్ణజ్ఞానమునకు సర్వవిద్య యని పేరు. కాలక్రమ మున నీసర్వవిద్యయే 'బ్రహ్మ' యనుపేర పిలువబడె గెను. ఇట్టి సర్వవిద్య నెఱిగినవాడు బ్రహ్మయని పిలువ బడుచుండెను. ఒకదృష్టిని జూచిన బ్రహ్మయనునది కూడ నొక వేదమేయనదగును కాని యీవేదము శేషిం

చినవానివంటిదికాదు. యజ్ఞరహస్యమునుగూర్చినట్టియు. దేవతల మాహాత్మ్యమును గూర్చినట్టియు, యజ్ఞకర్మను గూర్చినట్టియు జ్ఞానమే 'బ్రహ్మ.' ఇట్టి బ్రహ్మయే వేదము. ఇట్టిజ్ఞానము కలిగియుండవలసినవిధి యజ్ఞకర్మ కంతకును సర్వాధికారియగు బ్రహ్మపై నుండెను. ఇట్టి సర్వవిద్య తెలిసినవాడగుటచేతనే బ్రహ్మ, హోత మొదలగు నితరఋత్విక్కులు యజ్ఞకర్మలయందు జేయునట్టి తప్పులను సవరింపగలిగియుండెను. ఉపనిషత్తులు త్రయీవిద్యకును, నిట్టి బ్రహ్మవిద్యకును గల భేదమును సూచించుచున్నవి. ఈబ్రహ్మవిద్యనే మొదట తురీయవేదమని పిలుచుచుండిరి. కాలక్రమమున బ్రహ్మయనుపదార్థ మొకపురుషునిగా భావింపబడి 'బ్రహ్మ' యనగా నాత్మయనునర్థము వచ్చెను. ఈయర్థము వచ్చిన తరువాత నాత్మజ్ఞానమే బ్రహ్మవిద్యగ పరిగణింపబడుచుండెను. ఇట్లు నాల్గవవేదముగా బరిగణింపబడుచున్న బ్రహ్మవిద్యకును నథర్వవేదమునకును బ్రథమమున నెట్టిసంబంధమును లేకుండెను. బ్రహ్మవిద్య = బ్రహ్మవేదము. అనగా నథర్వవేదమనుసిద్ధాంతము అథర్వమునకు జెందిన బ్రాహ్మణాదులలో బయలుదేరెను.

సర్వవిద్య కేవలము నామమాత్ర ముండలేదు. దీనిని గ్రహించిన మహానుభావులుగూడ బ్రథమమున గొంతమంది యుండిరి. వీరు హోతమొదలగు ఋత్విక్కులవలె యజ్ఞతత్త్వము నంతటిని గ్రహించియుండి యాఋత్విక్కులు తప్పుత్రోవద్రొక్కిన మళ్లింపగల శక్తి గలిగియుండిరి. అందుచే బ్రహ్మవిద్యకు (=సర్వవిద్యకు) త్రయీవిద్యకు గల సంబంధమే బ్రహ్మకు నితరఋత్విక్కులకు నుండెను. నాల్గవనాడు 'బ్రహ్మ' యని సూచించుచు నాతనివేదము (= జ్ఞానము) ను గూర్చి ఋ.వే. X ౭౧-౧౧ మంత్రములో "బ్రహ్మవేదతి జాతవిద్యాం" అని చెప్పబడియున్నది. దీనినిబట్టి వేఱువేద మేమియులేదనియు, నాతడు జాతవిద్యను (= సర్వవిద్యను) తెలిసికొనియుండవలెననియు తెలియుచున్నది. ఇచ్చట నథర్వవేదమునుగూర్చిన ప్రసక్తియే లేదు. (అయినను నథర్వమును గూర్చియే యిది చెప్పబడెనని కొందఱు వ్యాఖ్యాతలు చెప్పుచున్నారు.)

అథర్వవేదము కంటె భిన్నమగు వైదికగ్రంథము లెవ్వియు గూడ నీబ్రహ్మపదవి ఆథర్వణునిదని చెప్పుటలేదు. మీదుమిక్కిలి కౌషీతకీబ్రాహ్మణము బ్రహ్మత్వము ఋగ్వేది దని చెప్పుచున్నది. ఆపస్తంబుడు బ్రహ్మను గూర్చి చెప్పుచు నాథర్వణుని మాట నెత్తలేదు. వైదిక శ్రౌతవాఙ్మయములో చాలచోట్ల మనకు వశిష్ఠుని వంశమువారు పారంపర్యముగ బ్రహ్మపదవి ననుభవించుచుండెడివారని తెలియుచున్నది. వశిష్ఠుని వంశము ఋగ్వేదమునకు జెందినదని ప్రసిద్ధమేకదా! (ఋగ్వేద సప్తమమండలము వీరిదే) సర్వవిద్యను సరిగా గ్రహింపగల్గినవా డెవడైనను సరియె బ్రహ్మగా నుండుట కర్హుడని బ్రాహ్మణములు చెప్పుచున్నవి. ఈపైవిషయములచే బ్రహ్మపదవి యాథర్వణునిది కాదనియు, ప్రథమమున బ్రహ్మవేదము (౪వ వేదము) అథర్వము కాదనియు స్పష్టమగుచున్నది. ఇకపై నథర్వణుల కట్టిపదవి యెట్లు వచ్చినదియు, నెప్పటినుండి వచ్చినదియు విచారింతము.

త్రయీవిద్యకు జెందినవారికి పృథక్కుగా హౌత్రాదిపదవులు గలవు. తమకుమాత్ర మట్టిపదవి యేమియు లేదుగదా యనుసీర్ష్యచే నాథర్వణులు బ్రహ్మపదవిని తాముపొందుటకై యనేకవిధముల పాటుపడజొచ్చిరి. వీరు మొదట వేదముయొక్క ప్రామాణ్యస్థాపనకై ప్రయత్నించి పిమ్మట బ్రహ్మత్వపదవికై పాటుపడిరి. మూడువేదముల ఋత్విక్కులకు మూడు పదవులుండెగదా, నాలుగవవేదమువారైన తమకు నాలుగవపదవియగు బ్రహ్మత్వము వంతుగా రావలెనని వీరి పట్టుదల. హోత ఋగ్వేదమున కెట్లో, అట్లే బ్రహ్మ చతుర్థవేదమునకు జెందియుండవలెను. చతుర్థవేదము అథర్వము; అందుచే బ్రహ్మత్వ మాథర్వణునకు రావలెను. ఈవిధముగ నాథర్వణులు బ్రహ్మవేదమనగా నాథర్వణమని ప్రకటించుకొనజొచ్చిరి. మంత్రవిద్యకు జెందిన యజుస్సు లన్నియు నింతవఱకు నాథర్వణుని చేతనే యుచ్చరింపబడుచుండెను. ఇది సహజముగ తమ పనియని యాథర్వణు లనజొచ్చిరి. తమ కార్యమును సాధించుటకై వీరు రాజసహాయమునుగూడ నపే

క్షించియుండిరి. వీరు రాజపౌరోహిత్యసందర్భమున రాజులకడ తమకు గల పలుకుబడి సహాయముచేసికొని తమ కార్యము సాధించిరి.

ఈరాజపౌరోహిత్యమునుగూర్చికూడ కొంచెము చెప్పవలసియున్నది. ప్రథమమున నాథర్వణుడే రాజపురోహితుడై యుండవలె నను నియమము లేకుండెను * కాని రాజపురోహితునకు కొన్ని యథర్వణాచారములు తెలిసియుండవలెను. అందుచే మంత్రవిద్య బాగుగ దెలిసినవారు నియోగింపబడుచుండెడివారు. ఆథర్వణులిట్టివిద్యలలో నారితేరినవా రగుటచే వారు నియోగింపబడుచుండిరి. కొంతకాలమునకు రాజపురోహితు డాథర్వణుడేయై యుండవలె నను నియమము వచ్చెను. ఇట్టి రాజపురోహితునకు బ్రహ్మకును సంబంధ మున్నట్లు కనబడును. వారిద్దఱి కార్యములయందును సామ్యము గూడ కలదు. ఇద్దఱునుగూడ వారివారి యజమానుల శ్రేయస్సునకై పాటుపడవలసియుండెను.

రానురాను బ్రహ్మపదవియొక్క ప్రాముఖ్యము తగ్గిపోజొచ్చెను ఆతడు చేయవలసిన పని హౌత్రాది కర్మలయందు తప్పులేకుండ జూచుటకదా! అట్టిచో హోత మొదలగువారు సమర్థులైనయెడల బ్రహ్మ యెట్టివాడైనను పరవాలేకుండెను. కాలక్రమమున త్రయీ విద్యనంతను జదిని సర్వవిద్యను గ్రహించి యజ్ఞముయొక్క తత్త్వమును గ్రహించి బ్రహ్మ యని పిలువదగిన ఋత్విక్కులుగూడ తక్కువకాజొచ్చిరి. అందుచే నెవనినో యొకనిని బ్రహ్మగా బెట్టుచువచ్చిరి. అట్టి బ్రహ్మ నామమాత్రము ఋత్విక్కై యుండును.

పైన జెప్పినవిధమున రాజపురోహితుడైన యాథర్వణునకు వివిధమైన యజ్ఞవిధు లంతగా దెలిసియుండక పోవచ్చును. అట్టిచో నాతడు రాజుల ( యజ్ఞములు విశేషముగా చేయించువారి ) సహాయమున నామమాత్రము బ్రహ్మయై యుండవచ్చును. తనకు గృహమునం దాప్తుడైన పురోహితుడు యజ్ఞమున బ్రహ్మయై యుండుట రాజున కిష్టమేయగును కదా! ఇట్లు బ్రహ్మత్వ మాథర్వణునకు వచ్చుటలో మిగతవేదముల వారి కాక్షేపణగూడ లేకుండెను. దీనినిబట్టి యథర్వవేదమునకు మొదటినుండియు శ్రౌతకర్మతో సంబంధము లేకుండెననియు, నట్టిసంబంధముకొఱకై పాటుపడి యాథర్వణులు విజయముగాంచిరనియు తెలియ నగును. ఈకారణముచేతనే యథర్వవేదమునకు శ్రౌతకర్మకు నంతగా సంబంధము కనబడదు శ్రౌతకర్మకు సంబంధము లేకున్న నర్థముకాని యేకొన్నిసూక్తములు గలవో యవియన్నియు నథర్వమున—శ్రౌతకర్మతో నిట్లు క్రొత్తగ సంబంధమువచ్చినపిమ్మట నథర్వణాచార్యులచే చేర్చబడియుండును. ఆసూక్తములంతగ ప్రాచీనములై నట్లుకూడ గన్పట్టవు.

## ఋగథర్వముల భాషాభేదములు

భాషను, శైలిని బట్టి ఋగ్వేదమునకంటె నథర్వము చాల అర్వాచీన మైనదని కొందఱు పండితులనుచున్నారు. భాషాభేదముమాత్రమున కాలనిర్ణయము చేయజాలమని యిదివఱకే చెప్పియుంటిమికదా! ఆసంగతినే యిచట నిదర్శనపూర్వకముగ ఋజువుచేయుచున్నాము. పైవాదము చేయువారు చెప్పు ప్రాచీనకాలమును తెలియజేయు క్రియారూపములు నామవాచక రూపములును, మనకు నవీనకాలమున రచింపబడినవని వారే చెప్పునట్టి గ్రంథములలో కానబడుచున్నవి. అట్లే వారు నవీన మైనవని చెప్పు రూపములు ప్రాచీనమైనట్లు కూడ నిదర్శనములు గలవు.

౧. పుంలింగఅకారాంతశబ్దముల ప్రథమాద్వితీయాద్వివచనప్రత్యయమగు 'ఔ' కారమును (రామౌ) అవేశబ్దముల తృతీయాబహువచనప్రత్యయమగు 'ఐస్'ను (రామైః) అర్వాచీనతను సూచించునని భాషావాదు

* ఈపౌరోహిత్య మాథర్వణునిదని యాథర్వణేతరగ్రంథములలో నెచ్చటను గానరాదు. పురోహితుడు ఆథర్వణాచారముల కొన్ని తెలిసికొనియుండవలె ననిమాత్ర మున్నది. ( ఐతరేయబ్రాహ్మణము VIII ౨౪-౨౫ చూడుడు. ) దశకుమారచరిత్రయందుకూడ నిట్లేయున్నది.

లనుచున్నారు. కాని యీయభిప్రాయము సరియైనది కాదు. హిందువులు యూరోపియనులు కలిసియున్న కాలమునగూడ నిట్టిరూపములు భాషలో నుండెనని యీక్రిందిరూపములవలన దెలియుచున్నది.

| | |
|---|---|
| Gothic | Ahtan |
| Lithuanian | Vilkais (=సం. వృకైః) |

౨. ఇట్లే యర్వాచీనములని తలంపబడుచున్న యీక్రిందిరూపములుగూడ కడుప్రాచీనములును, గొన్ని చారిత్రకయుగమునకుగూడ పూర్వమునుండి యుండెననియు నీక్రింద కనబఱచిన యారూపముల యన్య భాషలలోని రూపాంతరములవలన తెలియనగును.

| | | |
|---|---|---|
| (అ) హ్వయామి | Avesta | Zbayemi |
| (ఆ) కరోమి, కురు | ,, | Karemi |
| (ఇ) పన్థానమ్ | ,, | Pantanem |
| (ఈ) సర్వ (ప్రాచీనరూపము 'విశ్వ') | | Haurva |
| (ఉ) రజ్జు | Lith | Rezgu = braid |

3. పైవాదము సరియైనది కాదని ఋజువు చేయుటకు మనము అథర్వవేదము III. ౧౫ సూక్తమును ఋగ్వేదము X ౧౮౫-వ సూక్తముతో బోల్చి చూతము. ఋగ్వేదమున ద్వితీయమంత్రమున 'కురు' అను క్రియారూప మున్నది. అదేస్థలమున అథర్వమున 'కృధి' యనురూప మున్నది. పైవాదమువారు కృధి యనురూపము ప్రాచీనమనియు 'కురు' అర్వాచీన మైనదనియు చెప్పుచున్నారు. దీనిప్రకారము అథర్వ వేదము ప్రాచీనమును ఋగ్వేద మర్వాచీనమును నై యుండవలెను.

మఱియొకవిశేషము:—అదేసూక్తమున నైదవ మంత్రమున ఋగ్వేదమున 'భూత్వీ' యనియు, నథర్వ మున 'భూత్వా' యనియు నున్నది. పైవాదమువారి ప్రకారము 'భూత్వీ' ప్రాచీనరూపమును, 'భూత్వా' అర్వాచీనరూపము. అట్లయినచో ఋగ్వేదము ప్రాచీనము, అథర్వ మర్వాచీనము కావలెను. ఇట్లొకేసూక్త మున భాషాభేదమునుబట్టి చూచిన నన్యోన్యము వ్యతిరిక్తములగు నభిప్రాయములు పొడగట్టుచున్నవి. కాన భాషాభేదముపై నాధారపడిమాత్రము, కాలనిర్ణయము చేయరాదు. సాంఘికనైసర్గికరాజకీయాదివిషయముల తో భాషాభేదములగూడ జతచేసి పరీక్షించి కాలము నిర్ణయింపనగును.

మఱియు నథర్వముయొక్క భాష సంస్కృత మును బోలియున్న దనువిషయమువలనగూడ నథర్వవేద మర్వాచీనమని నిర్ధారణచేయలేము. ఎందుచేతనన నీయ థర్వమున లౌకికాచారములనుగూర్చి యున్నది. లౌకికా చారములనుగూర్చి యున్న భాష లౌకికభాషయగు సంస్కృతమును బోలియుండుట సహజము. ఈవిష యమే ఋగ్వేదదశమమండలము సందర్భమునగూడ చెప్పనగును. కాని ఋగ్వేదమునుండి సేకరింపబడి యథర్వమున గూర్పబడినట్లు స్పష్టముగా గనబడు సూక్తములవిషయమునమాత్ర మీవాదము సత్యమగును.

అథర్వముయొక్క కాలనిర్ణయము చేయుటకు దగిన యాధారములు లేవు. ఈగ్రంథము మఱియొక గ్రంథముకంటె ప్రాచీనమా, కాదా? యనువిషయ మునుగూడ నిర్ధారణచేయలేము. ఎందుచేతనన నథర్వ మున నున్న యాచారములు మంత్రవిద్య మొదలైనవి ప్రజలలో చారిత్రకయుగముకంటె పూర్వమునుండియు నుండెనని చెప్పవీలున్నది. అందుచే నట్టివిషయములు గల భాగమెల్ల చాల నర్వాచీనమైనది. కాని దుష్టమగు ఛందస్సు ఇతరగ్రంథములనుండి కొన్నివిషయములను గ్రహించి తమ గ్రంథమున జొప్పించుట, సందర్భము లేకుండ నన్యగ్రంథస్థమంత్రములు కలుపబడుట, మొద లగుకొన్నివిశేషము లాథర్వణుల గ్రంథములలో కను పించును. అట్టిభాగ మెల్ల అర్వాచీనము. అథర్వముకూర్పు నందు, ఋగ్వేదముకూర్పునందు గనబడు తెలివితేటలు, సూక్ష్మబుద్ధియు గనబడవు. ఇందు (అథర్వమునందు) మిక్కిలిప్రాచీనమగు భాగమున కుదాహరణముగ మనము IV. ౧౬-వ సూక్తమును తీసికొనవచ్చును. ఈ సూక్తము ఋగ్వేదమందలి మిక్కిలిప్రాచీనమగు సూక్తములకంటె గూడ ప్రాచీనమని చెప్పవీలున్నది. అథర్వము IV ౧౭-వ సూక్తముగూడ నిట్టిదే యగును.

అథర్వవేదమును బఠించువారు చాల యరుదని యిదివఱలో జెప్పియుంటిని. సంస్కృతవిద్యార్థులు వ్యాఖ్యానముల నాధారముగా జేసికొని యాథర్వణ మును కంఠతః కాకపోయినను, విమర్శపూర్వకముగా నైనను జదివినయెడల వైదికవాఙ్మయమునకు సేవజేసిన వా రగుదురు. పునఃపరిశోధన జేసినయెడల ననేక నూతనవిషయములు బయల్పడగలవు. ఇంకను నీవేదము నకు సంబంధించిన కొన్ని గ్రంథములు దుర్లభము లైయున్నవి. లభించిన గ్రంథములలోగూడ కొన్ని మంత్రములు మొదలగువాని యర్థ మూహింప శక్యము గాకున్నది. భాషావిజ్ఞానశాస్త్రమునను చరిత్రవిషయ మునను గూడ నథర్వవేదపునఃపరిశోధనవలన ననేకనూతన విషయములు బయల్పడగలవు. కావున నేమియు లాభము లేదనక అథర్వవాఙ్మయపఠనకై నడుము కట్టు కొనవలెనని సంస్కృతభ్రాతృకోటి కిదే నాప్రార్థన. ఋగ్వేదాదులవిషయముననంతగా నొక్కి చెప్పబని లేదు. వానికి దగు పోషణ గలదు. ఆశాఖకు జెందినవారు పెక్కుమంది కలరు. అందుచే పఠనపాఠములలోనున్నది. అథర్వమున కట్టివేవియు లేవు. అందు ముఖ్యముగ మన యాంధ్రదేశమున నథర్వవేదమునకు బోషణాదు లసలే లేవు. ఉత్తర హిందూస్థానమున నార్యసమాజము యొక్క యాదరణక్రింద గొన్నికొన్ని గ్రంథములు హిందీభాషయందును, నాంగ్లమునను ప్రచురింప బడినవి.

అథర్వవేదమునుగూర్చి ఆంగ్లమునందును జర్మను నందును కొన్నిగ్రంథములు గలవు. అథర్వవేదమును Whitney అను పండితుడు అక్కడక్కడ వ్యాఖ్యా నము జేయునట్టి విమర్శాపూర్వకమగు వాక్యములతో నాంగ్లమున ననువదించియుండెను. దానిని Whitney మరణానంతరము Lanman అనునాతడు ప్రచురించి యుండెను. Griffith అనునాతడుగూడ నాంగ్లములోని కథర్వము ననువదించియుండెను. Weber పండితుడు వీరందఱకు పూర్వమే యథర్వము ను ప్రచురించి యుండెను. కాని యిప్పుడిది అంతగా ప్రమాణముగా తీసికొనబడుటలేదు. ఈతడే జర్మనుభాషయందు Indische Studices అను గ్రంథ మున నథర్వమునుగూర్చి కొన్నివ్యాసములు వ్రాసి యుండెను. కాని యీపై గ్రంథముల * చాలవఱకు (ఆనాటికి ప్రచురింపబడినవానిని) పరిమాచి Maurice Bloomfield అను పండితుడు ఆంగ్లమున నథర్వ వేదమును, గోపథమును గూర్చి ఒక పెద్దవ్యాసమును (దాదాపు ౧౩౦ పేజీలు) వ్రాసెను. నేను చాలవఱ కీపుస్తకమునే నావ్యాసములో ననుసరించియుంటిని. ఈవ్యాసమును సామాన్యజనుల కథర్వవేదమునుగూర్చిన యుదంతమును జెప్పుటకై వ్రాసియుండుటచే అథర్వ మునుగూర్చిన వేఱువేఱు సిద్ధాంతములు, వాదములు మొదలగువానినిగూర్చి విశేషించి చెప్పలేదు. మిక్కిలి ముఖ్యమైన కొన్ని వాదములుమాత్ర ముదాహరింప బడినవి.

---

* అథర్వమునుగూర్చిన వ్యాసము లింకను చాలమందిచే వ్రాయబడినవి. వాని నన్నిటి నిచ్చట పేర్కొని యుండలేదు. ఈగ్రంథము లాంగ్లభాషతో బరిచయమున్నవారికొఱకై చెప్పియుంటిని. ఆంగ్లభాష తెలియని సంస్కృతవిద్యార్థులకు సాయణభాష్యమును, ఆర్యసమాజమువారిచే ప్రచురింపబడిన గ్రంథములునుగలవు. సాయ ణవ్యాఖ్యానము చాల ఉపయోగించును.

# గాంధారేయులు

దేవరపల్లి వెంకటకృష్ణారెడ్డి

ధార్తరాష్ట్రులు గాంధారికి జన్మించిన వారా, కారా యను విషయము నీవ్యాసమున చర్చించెదను.

"గాంధారియుం......గర్భంబు దాల్చి యొక్కసంవత్సరంబు నిండినఁ బ్రసూతిగా కున్నం బదరుచుఁ బుత్త్రిలాభలాలసయై యున్నయది, యప్పు డయ్యుధిష్ఠిరుజన్మంబు విని మనస్తాపంబున నుదరతాడనంబుఁ జేసికొనిన గర్భపాతం బగు డు."—ఆది. ౫ ఆ. ౯౮.

"దాని నెఱింగి పరాశర [మనో
సూనుఁడు సనుదెంచి సుబలసుతఁ జూచి
హీనవయి గర్భపాతము
గా నిట్టులు సేయు టిదియుఁ గర్తవ్యంబే."
—ఆది. ౫-౯౯.

"అని గాంధారిం బదరి తొల్లి వేదంబులు విభాగించిన మహానుభావుం డమ్మాంస పేశి నేకోత్తరశతఖండంబులుగా విభాగించి వీని వేఱువేఱ ఘృతకుండంబులం బెట్టి శీతల జలంబులం దడుపుచు నుండునది, యిందు నూర్వురు కొడుకులు నొక్కకూఁతురుం బుట్టుదు రని చెప్పి చనినఁ దద్వచనప్రకారంబు సేయించి" —ఆది. ౫-౧౦౧.

ఒక్కసంవత్సరము గడచిన పిండము సజీవమై యుండునుగదా! (ధర్మజాదులు ఇట్లె జన్మించిరి.) తొల్లి వేదంబులు విభాగించిన మహానుభావుండు ఖండంబులుగా విభాగించి భ్రూణహత్యకు ఎట్లు పాల్పడెను? శస్త్రచికిత్సయైనను మొదటి ప్రాణసంరక్షణ మునకేగదా! మఱియు ఘృతభాండంబుల జన్మింపవలసినవారు, గాంధారికి జన్మించినటుల పరస్పరవిరుద్ధమును గలదు. పరీక్షింపుఁడు.

"మఱియు దుర్యోధను జన్మానంతరంబున ధృతరాష్ట్రునకు వైశ్యాపుత్త్రిం డైన యుయుత్సుండు వుట్టె నంత గాంధారికి నొక్కొక్క దివసంబున నొక్కొక్కరుండుగాఁ గ్రమంబున (దుశ్శాసనాదులు) ......నూర్వురుకొడుకులు వుట్టిన." —ఆది. ౫-౧౦౭.

పిమ్మట, అనుజయై దుశ్శలయనుకూతురు పుట్టెను. ధృతరాష్ట్రునికి భార్య లెందరో కనుగొందము:—"ధృతరాష్ట్రుండును బరమోత్సవంబున గాంధారిని వివాహంబై, దానితోఁ బుట్టిన కన్యకల...పదుండ్ర నొక్కలగ్నంబున వివాహంబై మఱియును."—ఆది. ౫-౧౨.

"కులమును రూపము శీలముఁ
గలకన్యలఁ దెచ్చి తెచ్చి గాంగేయుం డీ
నలఘుఁడు ధృతరాష్ట్రుఁడు గుల
తిలకుండు వివాహమయ్యె దేవీశతమున్."
—ఆది. ౫-౧౩.

ధృతరాష్ట్రునితో సంసారము చేయుచున్న నూటతొమ్మిదిమంది భార్యలు గొడ్డుబోతులు కావలసివచ్చును. (గాంధారి, వైశ్య తప్ప) పేరుప్రతిష్ఠలుగల పదిమంది గాంధారి

చెల్లెండ్రు గొడ్డుబోతు లయ్యెదరా? ధృతరాష్ట్రుఁడు వారితో సంసారము చేయలేదేమో! అనిన వేదబాహ్యుఁడు కావలసివచ్చును.

"అనేకమంది భార్యలు గలవారు వారందరిని సమముగ పొందుచుండవలసినదె."

—౧౮౨ పుట-వేదకాలపుస్త్రీలు.

కావున వేదచోదిత మార్గావలంబియై ధృతరాష్ట్రుఁడుతక్కినభార్యలయందుసంతతిఁ బడసినాఁ డనుట యుక్తము. ఇఁక గాంధారి తాడనముచేనైన గర్భపాతముగాన వ్యాసుఁను కొన్ని శిశుచికిత్సలు జరిపి మాంస పేశమును బ్రతికించియుండునని సమన్వయించుకొనవచ్చును. ఈక్రిందిపద్యమును బరిశీలించిన గాంధారికి దుర్యోధనుడుమాత్రమే పుట్టినటులు కాన్పించును.

" అనిలజుపుట్టిన దివసము [రా
నన యట దుర్యోధనుండు నరనుత ధృత
ష్ట్రునకుఁ గాంధారికి న [శమునఁ."
గ్రగనందనుఁడు ఘనుఁడు పుట్టె గలియం

—ఆది. ౫-౧౦౫.

ఇంతేకాక :—

"హంసుండను గంధర్వవిభుండు ధృతరాష్ట్రుండయి పుట్టె. మఱియను వేల్పు గాంధారినై పుట్టె మఱియు నయ్యెద్దఱకుం గలియంశంబున దుర్యోధనుండు పుట్టెఁ బౌలస్త్యభ్రాతృవర్గంబు దుర్యోధనానుజశతంబై పుట్టె." —ఆది. 3 ఆ. ౭౮.

అనుజశతంబులో యుయుత్సుఁడు సవతి వంతువాఁడు కలఁడు. అతఁడు దుర్యోధనుఁడు, యీసంఖ్యలో చేరనిపక్షమున "ఏకోత్తరశత పుత్త్రులం బడసి" అను వాక్యము సార్థకము గాదు. (ఒకవేళ యుయుత్సుఁ డీ సంఖ్యలో చేరనిపక్షమున వ్యాసవరమునకు ప్రత్యక్ష విరోధ మేర్పడును.) మఱియు దుర్యోధనుని యంశయు, వారి తమ్ముల అంశయు భిన్నములు. ఇంతే కాక భిన్నోదరుఁడు గలఁడు :- మఱియు "దుర్యోధనుని జన్మాంతరంబున ధృతరాష్ట్రునకు వైశ్యాపుత్త్రుం డయిన యుయుత్సుండు పుట్టె." —ఆది. ౫-౧౦౭.

దుర్యోధనుఁడు "అయ్యిద్దఱకుం బుట్టె" నని స్పష్టముగ కలదు. కాని, పౌలస్త్య భ్రాతృవర్గంబును గురించి నిశ్చిత విధానము లేదు. మఱియొకచో కలదుగదా యనిన అది పరస్పరవిరుద్ధము— "ధృతరాష్ట్రువలన గాంధారియుం గృష్ణద్వైపాయనువరంబున గర్భంబు దాల్చి" —ఆది. ౫-౭౮.

కృష్ణద్వైపాయనువర ముండినను, ధృతరాష్ట్రునివలననే గర్భంబు దాల్చినదిగాన స్వాభావికమైన సంతానమునే బడసినది. వ్యాసుఁడును తనకు భ్రూణహత్య సంభవించు సంతానమును ప్రసాదించియుండి యుండఁడనిమనవి.

మహిమలకొఱకును, గాంధారి పాతివ్రత్యప్రభావముకొఱకును కథ యిట్లు వ్యత్యస్తమైనది. గాంధారికి దుర్యోధనుఁడు జన్మించెను. (గాంధారికి మనస్తాపముచే జన్మించినవాఁడుగాన వానియం దాలక్షణము ముద్రితమై యున్నది.) తక్కినవారు మిగతనూటపదిమంది భార్యలకుఁ గలిగియుందురు. కౌంతేయుల వృత్తాంతమును మఱియొకసారి విచారింతము.

# 3

1. **This my son was dead, and is alive again, He was lost and is found.**

2. Except Ye repent Ye shall all likewise perish.　　　　The Holy Bible

*　　*　　*　　*

ఆనందమునఁ దేలి యాడుచునుంటి;
ఆత్మేశ్వరిని గూడి, యంతంబు లేని
యానందవార్ధి మున్గాడుచునుంటి;
దివసములు రేలును జనియె నెన్నెన్నొ,
యెన్ని యేండ్లయ్యెనో యెఱుఁగను నేను,
ఆనందమునఁ దేలియాడుచునుంటి,
ఆత్మేశ్వరిని గూడి, యంతంబు లేని
యానందవార్ధి మున్గాడుచునుంటి.

*　　*　　*　　*

ముద్దుఁజూపులతోడ ముచ్చటల్ గొల్పి,
ముద్దుమాటలతోడ మురిపెముల్ గొల్పి,
ముద్దులమూటమై మ్రోల నిల్చుచును,
ముద్దులసుద్దుల మోహంబు గొల్పి,
యల్లారు ముద్దుగా నరయుచునున్న
యాత్మేశ్వరిని గూడి, యంతంబు లేని
యానందవార్ధి మున్గాడుచునుంటి,
నానందమునఁ దేలియాడుచునుంటి.

*　　*　　*　　*

*　　*　　*　　*

*　　*　　*　　*

చైత్రమాసంబునఁ జిత్రహారీతిఁ
గ్రొత్తపూవులు పూచెఁ గ్రొమ్మావిగున్న;
నిండుపున్నమనాఁటిపండువెన్నెలను
మావిగున్నను జూడ మనసయ్యె నాకు.

అమృతంబు గ్రోలెడునం దాలకుప్ప,
నేరుపుల్ సూపెడునెఱపాటకాఁడు,
తుమ్మెదనెయ్యుండు తోడయి వచ్చె.

గ్రొమ్మావిగున్న కన్గొనుచు నిద్దఱము
నానందపారవశ్యమున మున్గితిమి.

విరికన్నెలకు లోఁగి, సరసాలఁ దోఁగి,
యాకుసందుల డాఁగి, యమృతంబు ద్రాగి,
యేజాడఁ జూడఁ దానే యూచు రేఁగి,
యాడుచుఁ బాడుచు నానల్లనయ్య
విశ్వరూపముఁ దాల్చి వేడుకల్ సలిపె.

*　　*　　*　　*

నిండుపున్నమనాఁటి పండువెన్నెలను
విరికన్నియఁలతోడి సరసాలఁ గూడి,
పాడుచు, నాడుచుఁ బాఱులాడుచును,
విశ్వరూపముఁ దాల్చి, వేడుకల్ సూపి,
యానల్లనయ్య నా కానందమిచ్చె;
ఆనందమునఁ దన్మయంబయ్యె మనసు;

*　　*　　*　　*

కొంటెతనమ్ములకూర్మిచుట్టాలు
గాలిపిల్లలు మావికడ కేగుదెంచి,

గంతులు వైచుచుఁ బంతాలు మీరఁ,
బైంబడి, హాస్యాలప్రభ చూపి రపుడు.
గాలిపిల్లలఁగూడి మేలమ్ము లాడి,
వింతలతావులు వెనువెంట వచ్చె.
హాస్యాలమేలాల కలరెఁ జిత్తంబు,
తన్మయంబయ్యెఁ జిత్తం బంత నాకు,
అలరుఁ గన్నియలతో నాటాడి యాడి,
తుమ్మెద ద్రిమ్మరి యెమ్మెలు గ్రమ్మఁ
దావు లేతెంచిన తావులత్రోవఁ
బరుగెత్తి పోసాగెఁ బాటపాడుచును.
తుమ్మెద నెచ్చెలితో నేనుగూడఁ
బరుగెత్తుచుంటి నబ్రము నొందుచుంటి

* * * *

దూరాన నొకయింతి తోఁచె మా యెదుట;
పొగడపూఁబొదరింటఁ బూఁబాన్పుపైని
దూరాన నొకకాంత తోఁచె మాయెదుట.

* * * *

నాకన్న మున్నుగా నాదునెయ్యుండు
పరుగెత్తి, యాయింతిదరికి వే పోయి,
ఏకాంతముగఁ జెవి నేమేమొ చెప్పి,
మఱి కనంబడకుండ మాయమై పోయె;
పొదరింటిదరిగాఁగఁ బోయితి నేను.
కాని; నానెయ్యుండు కానరాఁడయ్యె.
ఎదుటఁ గన్పడుచున్న యింతిని జూచి,
యింద్రియంబులవెల్ల నింపునం బొల్చె.

* * * *

చూపులలో నుండి సాగియించుపాట
చెవుల కానందంబు సేయుచు నుండె.
చెవులతీరుననుండి యివురించుతళ్కు-
కనుల కానందంబు కలిగించుచుండె.
మోము తేటలనుండి పోలుపారు తీపు
నాల్క కానందంబు చిల్కుచునుండె.
ముక్కుసోయగమున మొనయుమార్దవము
తనువున కానందమును గూర్చుచుండె.
తనువు చాయలనుండి చనుదెంచు తావి
ముక్కున కానందమును గూర్చుచుండె.
ఆయంద మాచంద మరయుచునుండ,
నింద్రియంబులకెల్ల నేకత్వ మందె;
తనువెల్లఁ గనులయి కనుఁగొనుచుంటి.
తనువెల్లఁ గనులయి తనుఁజూచుచున్న
ననుఁజూచి, ముసిముసి నవ్వె నాయింతి.
నవ్వుచు నిలుచుండి ననుఁ జేరవచ్చె;
చేసాపి కౌఁగింటఁ జేర్చెను నన్ను;
అలరుఁబానుపుఁ జేర్చి యలరించె నన్ను;
ఎందు నేనుంటినో యెఱుఁగలేనైతి,
ఏమినైయుంటినో యెఱుఁగలేనైతి.

* * * *
* * * *

ఏకచిత్తంబున నింతితోఁ గూడి
యానందరూపుండనై వెల్గుచుంటి;
చైత్రంపుమాసానఁ జిత్రంపురీతి,
నిండుపున్నమనాఁటిపండువెన్నెలను
పూఁబొదరింటిలోఁ బూవుఁబాన్పునను,
పూఁబోణితోఁగూడి పోడుముల్ సలిపి,

నను నేనె మఱచి, యానందంపుఁ గడలి
మునుఁగుచుఁ దేలుచు, మునుఁగుచు నుంటి.

పిలిచినరీతిగాఁ బలుకుచునుండి,
చెప్పినపనులెల్లఁ జేయుచునుండి,
నిలుచుచుఁ గనుసన్న మెలఁగుచునుండి,
యడిగినదంతయు నందిచ్చుచుండి,
తనకునాకన్న వేఱనుమాట లేక,
తానెనేనయి, నేనెతానయినట్లు,
భేదమింతయులేని ప్రీతిఁజూపుచును,
పూఁబొదరింట నిర్వురము నిల్చితిమి.

ఇంటిని మఱచియు, నిల్లాలి మఱచి,
అంతయు నింతియే యైనచందాన
నాపూవుఁదీరంబునందు నిల్చితిని.

ఆనందమునఁ దన్మయంబయ్యె మనసు,
మనసార నింతి నక్కునఁ జేర్చుకొంటి,
ఇంతియక్కునఁ జేరి యిమిడి నేనుంటి.

నిలిచితి నక్కున, నిదురఁజొక్కితిని,
ముదమునఁ జొక్కితి, నిదురఁ జిక్కితిని;
మఱచితి లోకంబు, మఱచితిఁ దనువు,
నను నేనె మఱచి యానందమందితిని.

ఎంతసేపయ్యెనో యెఱుఁగను నేను,
ఎన్నినాళ్లయ్యెనో యెఱుఁగలేనైతి.
ఎదపైనిఁ జేవైచి నిదురపోయితిని.

* * * *
* * * *
* * * *

కలవచ్చె మంటలోఁ గాలుచున్నట్లు,
తెలివివచ్చె, భయంబు గలిగె నెమ్మదిని.

గడగడ వడకితిఁ గదలలేనైతి;
అటునిటు చూచితి, అడలుచునుంటి.

కౌఁగింటిలోఁ గాంత కనఁబడదయ్యె;
పొగడపూఁబొదరిల్లు పోయె నెయ్యెడకొ.

పడియుంటి నిసుకఁబూఁబొన్పునం గాదు.

మట్టమధ్యాహ్నన, వట్టి యెడారి,
బట్టబైటను నేను బడియుంటి నిసుకఁ
గాలినయిసుకపైఁ గదలుచునుంటి,
గడగడవడకుచుఁ గదలలేకుంటి;
వేడిగాలులు మీఁద వీఁచుచునుండె,
ఎండచే నొడలెల్ల మండుచునుండె.

* * * *
* * * *
* * * *

పేర్వెట్టి యింతిని బిలువనెంచితిని—
పేరెఱుంగను దానియూరు నెఱుంగ;
ఏమనిపిలుచుటో యెఱుఁగకయుంటి,
ఎమ్మెయి నఱచుటో యెఱుఁగలేనైతి,
"ఇంతిరో" యని పిల్వ నెంచితింగాని,
మాటయొక్కటియైన నోటరాదయ్యె.

తడిలేదు నోటఁ దత్తరమయ్యెఁ బైట,
నోటనుండినమాట బైటరాదయ్యె.

కాంత నన్నుఁ బరీక్ష కావింపఁబోలు;
గాకున్న నీరీతి కఠినత్వమున్నె?

కటకుఁ జూపులు లేవు కతసెప్పువేళ,
మొఱకుమాటలు లేవు మురినొప్పువేళ;
మురివేళ, కతవేళ, సరసాలవేళ,

మొఱకుగా లేదింత కఱకుగా లేదు:
కారణంబేమి యీకఠినత్వమునకు?
వచ్చు, వైళమవచ్చు; వచ్చు నన్జూచు;
వచ్చు నాకానంద మిచ్చును, మెచ్చు;
ననుచు నించుకసేపు మనమందుఁ దలఁచి,
యూరటఁ జెందితి; నువ్విళులూరి
కాని, వచ్చెడుజాడ కనఁబడదయ్యె,
వచ్చి కన్పడుజాడ పనుపడదయ్యె.

* * * *

నామాట వినువారు, ననుఁ జూచువారు,
నామొఱాలించువా రేమూల నెవరుఁ
గనుపట్ట రేమిచేయను దోఁచదయ్యె.

వేడినిట్టూర్పులు విడిచెను బయలు,
ననుఁ జూచి జాలిఁ జెందిన దేమొ బయలు;
మోమున నల్లనిముసుఁగిడెఁ బయలు,
ననుఁజూచి జాలిఁ జెందిన దేమొ బయలు;
కనుల నీ రింతంత కార్చెను బయలు,
ననుఁజూచి జాలిఁ జెందిన దేమొ బయలు;
బయలిజాలిని జూచి భయమింత తగ్గె;
లేవంగఁజాలితి, లేచి నిల్చుంటి;
అడుగిడఁజాలితి, నటుపోవుచుంటి.

ఎటుపోవుచుంటినో యెఱుఁగను నేను,
దవ్వుదవ్వుల సముద్రంబు కన్పడియె.

తకతక కెరటాలు తాండవంబాడె;
ఆకాశ మంత మేఘావృతంబయ్యె,
అంధకారము కప్పె నన్నిదిక్కులను;
ప్రళయఝుంఝూనిలప్రబల వేగమున
దారంగ తాండవధ్వని మిన్నుముట్ట;

* * * *

ఎటు చూడ దిక్కులే దెందు నేఁబోదు!
ఎటు వేడ దిక్కులే దెందు నేనుందు!
ఏమిచేయఁగనౌనో యెఱుకలేదయ్యె,
ఎట్లు నిల్వఁగనౌనో యెఱుక లేదయ్యె.

* * * *

క్రమ్మినచీఁకట్లు క్రమ్మినట్లుండె,
కప్పిన మేఘాలు కప్పినట్లుండె,
పడుచున్న చినుకులు పడుచునే యుండె,
వీఁచుగాలులతోటి లేచుకెరటాలు
పొంగి మీఁదికిఁ బొర్లి పొర్లి పడుచుండె.

నను ముంచి లోఁ సి కీడ్చునో తరంగాలు,
ననుఁ ద్రోసి మీఁది కెత్తునో గాలి?—

* * * *

ఏమిచేయఁగనౌనో యెఱుకలేదయ్యె,
ఏమనుకొననౌనో యెఱుక లేదయ్యె.

ఏడుపులోఁ గొంత తృప్తి కన్పట్టె,
మనసారఁగా నేడ్వ మనసు జనించె.

కనువారు వినువారు కనరానికతన
అఱచితిఁ; గట్టిగా నఱచుచునుంటి.

* * * *

గాలితోఁ బోయి మేఘాలతోఁ గలసి,
కెరటాలతోఁ బోయి, యిరులతోఁ గలసి,
నిట్టూర్పుగాలిలో నిండఁగాఁ జేసి,
కన్నీళ్లు కెరటాలఁ గలయఁగాఁ జేసి,
యేడ్చెద మనసార నేడ్చుచుండెదను.
కెరటాలతుంపురుల్ కెలనికి వచ్చి,
కారుచీఁకటి వచ్చి చేరువ నిల్చి,



‘ తాజ్ సుల్తానా ’ గోరి, బీజపురము

దీనిని ‘ ఇబ్రహీం రౌజా ’ అందురు. రెండవ ఇబ్రహీం క్రీ. శ. 1626 లో కట్టించినాడు. D. A. R.



'జోడ్ గుంబజ్'

వీనికి 'అక్కచెల్లెండ్రు' అనిపేరు.

ఇది ఖాను మహమ్మదు ([illegible]) అనువారల గోరీలు. D. A. R.

మేఘాలచినుకులు మేనిపైఁ జరచి,
ననుఁ బరామర్శింప—
వలదు వెన్నెల నాకు, వలదు చుక్కలును,
వేగుఁజుక్కను జూచు వేళయు వలదు;
ఇరులతోఁ దరఁగ తుంపురులతోఁ గలసి,
మొరయు చిన్కులఁగూడి మొరపెట్టుకొంచు,
ఏడ్చెద—ఏడ్చెద—ఏడ్చుచుండెదను.
చీఁకటి నెయ్యుండు చెంతఁగూర్చుండి,
ముచ్చటలాడుచు మురియుచునుండ,
వలిగాలిచుట్టంబు చెలిమితో వచ్చి,
యరలేనికూరిమి నరయుచు నిలువఁ,
గారుమబ్బుపడంతి కన్నీరు నించి,
జాలిఁ గొల్పుచుఁ జేరి సందిట నిముడ,
మన్ను మి న్నేకమై మలయుచందాన
దుఃఖంబులో నుండి దుముకుచునుండ,
నిచ్చకువచ్చిన ట్లేడ్చుకొంటాను.

ఓదార్చువారు లేకున్నకతాన,
ఏడ్చినమాత్రనే తృప్తిని గంటి,
ఓదార్పు నాకేల, యోర్పు నాకేల?
వెన్నెల నాకేల వెలుఁగు నాకేల?
నాకేల తారలు, నాకేల తరణి,—
చెలికాఁడు చీఁకటి చెదరి చూడంగ,
వలిగాలిచుట్టంబు కలఁగి చూడంగ,
మబ్బుతోఁ గాలంపుమల మెక్కుతాను;
కాలంపువెల్లువను గలసి,—పోతాను,
కాలమై కాలానఁ గలసిపోతాను;
గాలి—చీఁకటి—మబ్బు—

* * * *
* * * *

* * * *
* * * *

ఎదుటనున్న సముద్రము నీక్షించుచుంటి—
గాలివానకుఁ జిక్కి, కనువారు లేక,
ననుఁబోలె నేడ్చుచున్నవితానఁ దోఁచె.

ఏడ్చువారినిగూడి యేడ్చెడువారు
కనుపట్టఁ గలుగదే మనసుకుఁ దృప్తి?

ఇరువుర మైతిమి; ఏను సంద్రంబు—
ఆసముద్రంబుతో నంటి నీరీతి:

"మొదలు తుదయును లేక మొనసి చీఁకట్లు
నినుఁగప్పె సంద్రమా, ననుఁబోలె నిపుడు;
పొంగి, పైకుబుకుచుఁ బొర్లుచు వచ్చి,
దుఃఖంపుఁగెరటాలు తూలుచు నుండ,
నిట్టూర్పుగాలులు నిగుడఁజేయుచును,
ననుఁబోలె నేడ్చుచున్నావొకో నీవు;
చూడఁ జుట్టము లేక స్రుక్కుచు నుండి,
మ్రొక్క దైవము లేక మొరయుచు నిల్చి,
కనువారు వినువారు కనుపట్టకుండ,
ననుఁబోలె నొంటినున్నావె, యీవేళ?
ఇదియె మేలిదియె మే లిదె మేలు సుమ్ము,
మనసారగా నేడ్చి తనివొంద నగును.

నిన్ను నేనును, నన్ను నీవు నోదార్చు
కొనుచుఁగాలము ద్రోసికొనుచునుందాము."
సంద్రంబు ననుఁ జూచి జాలిని జెందె,
సంద్రంబుఁ జూచి నేఁ జాలిఁ జెందితిని.

ననుఁ గౌఁగిలింప సంద్రంబు తలంచె,
నేను సంద్రముఁ గౌఁగిలింప నెంచితిని.

వెలిగాలివాన, లోపలిగాలివాన
యొక్కరీతిగఁ గ్రమ్మి యొనరించె భయము,
వార్ధితో నీరీతిఁ బలికితి మరల—
"గాలి మెండయ్యె, మేఘాలు నిండయ్యె,
వాన తొండాలతోఁ బైఁబడుచుండె;
నీకు శక్యముకాదు నాకడ నిలువ,
నాకు శక్యము కాదు నీకడ నిలువ;
నీవు నాలోఁ జొచ్చి నిలువవచ్చెదవో,
నేను నీలోఁజొచ్చి నిలువవచ్చెదనో;
... ... ... ...; ... ... ...వద్దు,
నీవు నాలోన ... ... ... ... ...
... ... ... ... ... ...కలయఁగావద్దు.

నీవు నాయెదలోన నిలువఁగా లేవు.

కన్నీళ్లరూపాన కరఁగి, యుప్పొంగి,
పాటుతోఁ బోటుతోఁ బైకివస్తావు.

వ్యర్థమే యదిసుమ్ము వ్యర్థమే—నిజము.
నేను నీలోఁ జొచ్చి నిలువఁగగ్లెదను.
నీ కసాధ్యము నన్నుఁ బైకిఁ ద్రోయంగ.
నేను నీలోఁ జొచ్చి నిలువ, నిద్దఱము
దివ్యస్వరూపాలఁ దేజరిల్లెదము.
ప్రళయ మయ్యెదియాను - ప్రళయమే -
[యాను.

ప్రళయాన యోగనిద్రను దేలియాడి
నీయందు నిల్చు నారాయణునట్లు
నేను నీలో నిల్వ, నీకును నాకు
ననోన్యవైభవం బమరును జుమ్ము."

సంద్రంబు నాపైని జాలిని జెందె,
తరఁగలచేతుల బిరబిరఁ బిలిచె,
తరఁగలచేతుల బిరబిరఁ జాపె.

* * * *

ఆశయంతయు నింకె నడలు జనించె.

* * * *

"దరిదాపు కనరాదు, తడవేల నింక,
ఇదిగో నీలోఁ జొత్తు నేను, ననుఁ గొనుము."
పిలుచుమున్నీటిని బలుకరించితిని.
రాలుకన్నీటఁ దర్పణము లిచ్చితిని.
మున్నీటికౌఁగింట మునుఁగఁజొచ్చితిని.
కన్నీటికాలువల్ గార్పఁ జొచ్చితిని.
మున్నీరు జాలిచే నన్నాదరించె;
కన్నీరు జాలిచే మున్నీటఁ బెంచె;
కన్నీరు, మున్నీరు, న న్నావరించె,
కన్నీరు మున్నీటి కౌఁగిటం జేర్చె,
మున్నీటి కౌఁగిట మునుఁగుచునుంటి;
తరఁగచే సాపి, సంద్రము నన్నుఁ బట్టె,
ననుఁబట్టి మీఁది కెత్తెను సముద్రంబు.
మింటఁ దళుక్కను మెఱ పొండు మెఱసె.

తరఁగచేతుల సముద్రము నన్నుఁ బట్టి
యొడ్డుకు విసరిన యొప్పు కన్పట్టె,
విసరిన ననుఁబట్టి విసవిస నెవరో,
కౌఁగింటఁ బెట్టినకరణి కన్పట్టె.

* * * *

* * * *

* * * *

* * * *

విరిసెను మేఘాలు, వెలిసెను వాన,
వెన్నెల యంతట విలసిల్లుచుండె,
చిఱుగాలిలాస్యంబు సేయుచునుండె,
కెరటాలు నృత్యంబు జరిపించుచుండె ;
ఇసుకతిన్నియపైని నింతికౌఁగింటఁ
గూర్చుంటి—చిత్తంబు కుదుటను బడియె.

స్పర్శలో వింత కన్పట్టుచునుండె,
వెనుకకుఁ దిరిగి, మోమును గనుంగొంటి—
కాని, మోమును వంచి కాంచితి సిగ్గు.

పొగడపూఁబొదరింటి పొలఁతి కా దదియు;
వెన్నెలలోఁ గాంత వింతగాఁ దోఁచె ;
ప్రాఁతవింతలు క్రొత్తరీతిఁ బెంపారె.

కౌఁగిటిలో ముద్దు కనఁబడుచుండె.

చూపులలో ముద్దు సొగయుచునుండె.

గడగడ వడఁకితిఁ గాంచితి సిగ్గు,
గడగడ లాడితిఁ గంటిని భయము.

కౌఁగిలి తప్పించి, కాంతపాదములు
పట్టితి—పట్టితి—పట్టితి మరల.
"అపరాధి నపరాధి నపరాధి నైతి,
అపరాధినైతి న న్నాదరింపకుము."
కన్నీటఁ బాదాలు కడుగుచునుంటి,
అపరాధి నపరాధి నపరాధినంటి.

"ఆత్మేశ్వరీ, నీకు నపరాధి నైతి.

నీప్రేమ గుర్తింపనేరక యుంటి,
నీమహత్త్వ మెఱుంగనేరక యుంటి,
బైటిరంగులకు నే భ్రమలు చెందితిని,
బైటితీపులకు నభ్రంబు నందితిని,
నీముద్దు నీసుద్దు నేమఱిపోతి,
నిన్ను నే మఱచితి, నినుఁ జూడకుంటి.

తలఁపకయుంటి డెందమునందు నిన్ను,
నీ కెగ్గు చేసితి, నీచుండ నేను.

నీపాదసేవకు నేఁదగ నింక,
నీయింటిబంటనై నేనిల్చునట్లు,
నీసేవకులసేవ నేఁజేయునట్లు,
వరమిమ్ము, నాతప్పు లరయకు మింక,
నీదుపాదము లంటఁగాదు నాకింక ;
చేసితిఁ బాపంబు ; చేసెద సేవ,
నీసేవకులసేవ చేసి పాపంబు
తొలఁగించుకొందు, నన్ ద్రోసిపుచ్చకుము.

* * * *

తలవంచి, చేమోడ్చి, నిలిచితి నెదుట,
కన్నీటఁ బాదాలు కడుగుచునుంటి.

చేసాపి, కౌఁగిటఁ జేర్చె నన్ గాంత,
కాంత కౌఁగిట నన్ను గదియించి నిల్చె.

ఏలవిచారింతు విట్లు ప్రాణేశ,
వంత నీకేటికి వలదింక వినుము.

నను నీవు విడనాడియునికి నిజమ్ము,
నిను నేను విడనాడియునికి లే దెపుడు.

నినుఁ గనిపెట్టుకొంటిని, వెంట నంటి,
నిను విడనాడక నీమ్రోల నుంటి;
నీకష్టములు నేను నిలిచి కంచుంటి;
నీమొఱలన్నియు నిలిచి వించుంటి.

నీతోడఁ బలుకాడనేరక యుంటి.

నీకుఁ గన్పట్టఁగానేరక యుంటి,
కాని, నీవెనువెంట నే నంటియుంటి,
అకట! పశ్చాత్తాపమైన యందాక
నీతోడఁ బలుకాడ నేర్పు లేదయ్యె.

నీకుఁ గన్పట్టఁగా నేర్పులేదయ్యె
కాలంబె కలయంగఁ గారణంబౌను,
కాలంబె విడిపోవఁ గారణం బౌను.

కాలంబె విడఁజేసె, కాలంబె కలిపె,
వగపేల కాలంపుఁబనికి నీ కిపుడు!

నిన్నుఁ గాపాడంగ నే వేఁచియుంటి,
నన్ను మన్నింపంగ నేఁ గోరియుంటి,
నీపైని గూరిమి నిండారు నాకు,
నిండారుప్రేమతో నే నిన్నుఁ జూతు,
నేను నీవనుకొమ్ము, నీవె నేననుము,
ఏనును నీ వొక్కటే యనుకొమ్ము.

నీవు నాకౌఁగిట నిలువు మేవేళ,
నిన్ను నే నరయుచు నిలుతు నేవేళ."

అనుచు నీరీతి నన్ననునయించుచును,
చేయి చేఁబట్టుచుఁ జిఱునవ్వు నగుచు,
నింటికిఁ గొంపోయి, యింపుగావించె.

ఇంటి పట్టుకుఁ బోయి యింపునం బొదలి,
యాత్మేశ్వరింగూడి, హాయిఁ జెందితిని.

* * * *

నడుమ వచ్చినగొప్ప నడుమనే పోయె,
ఆత్మేశ్వరిని గొల్చు టది నాకు మిగిలె.
ఆత్మేశ్వరిని గొల్చి యలరుచు నుంటి.
ఆనందమునఁ దేలియాడుచు నుంటి.

* * * *

ఆనందమునఁ దేలియాడుచు నుంటి,
నాత్మేశ్వరింగొల్చి, యంతంబు లేని
యానందవార్ధి మున్గాడుచు నుంటి,
ముద్దుఁజూపులతోడ ముచ్చటల్ గొల్పి,
ముద్దుమాటలతోడ మురిపెముల్ గొల్పి,
ముద్దులమూటమై మ్రోల నిల్చుచును,
ముద్దులసుద్దుల మోహంబు గొల్పి,
యల్లారుముద్దుగా నరయుచునున్న
యాత్మేశ్వరిని గొల్చి, యంతంబులేని
యానందవార్ధి మున్గాడుచు నుంటి,
నానందమునఁ దేలియాడుచు నుంటి.

* * * *
* * * *
* * * *
* * * *

ఆత్మేశ్వరిం గొల్చి యంతంబు లేని
యానందరూపుండనై వెల్గుచుంటి.

# మాఘుని శాస్త్రపరిచయము

శ్రీమతి కోణకంచి త్రిపురాంబ

శిశుపాలవధను రచించిన మాఘకవి ఛంద శ్శాస్త్రమున తనకుగలకౌశలమును చతుర్థ సర్గయందు చిత్రించెను. అందు ప్రసిద్ధము లైన సమస్తవృత్తములును గలవు. చదువుటకు రానివృత్తమగు 'ఉద్గత'ను పదునైదవసర్గయందు బంధించి యాశ్చర్యము గొల్పెను. పందొమ్మిదవసర్గలో బంధకవిత్వ నైపుణిని గనుపఱచెను.

పరినిష్ఠితక్లిష్టరూపముల విరివిగ బ్రయోగించుటచే నీతనివాక్కున సౌశబ్ద్యమనుగుణము మెఱయుచుండును.

ఈకవికి వ్యాకరణమున మంచిపరిచయమును, అభిమానమును కలదు. మచ్చున కొకటి ప్రదర్శించెద.

'అనుత్సూత్రపదన్యాసా
సద్వృత్తి స్సన్నిబంధనా
శబ్దవిద్యేవ నోభాతి
రాజనీతి రపస్పశా' ౨-౧౧౨

సాంఖ్యవేదాంతములలో మంచియనుభవము గలదనుటకు తార్కాణము.

మైత్ర్యాదిచిత్తపరికర్మవిదోవిధాయ
క్లేశప్రహాణ మిహ లబ్ధసబీజయోగాః,
ఖ్యాతించ సత్త్వపురుషాన్యత యాధిగమ్య
వాంఛంతి తామపి సమాధిభృతో నిరోద్ధుం. ౪-౫౫

పదునాలుగవసర్గలో యాగవర్ణనఘట్టమున వైదికపద ప్రయోగములయందును, మీమాంసాశాస్త్రరహస్యవిజ్ఞానమునందును, వేదములలోని యాజ్యాపురోనుక్యల గుర్తించుటయందును, మురారిభవభూతుల ఛాయ నాశ్రయించి యొక్కొకతరి కాళిదాసుననుసరించుచుండును.

అశ్వశాస్త్రమున ప్రవీణుడు :

ఆవర్తినశ్శుభఫలప్రదశుక్తియుక్తా
స్సంపన్న దేవమణయో భృతరంధ్రభాగాః;
అశ్వాః పృథు ర్వసుమతీ మతిరోచమానా
స్తూర్ణం పయోధయఇ వోర్మిభి రాపతంతః. ౫-౪

తేజోనిరోధ సమతావహితేన యంత్రా
సమ్యక్కశాత్రయ విచారవతానియుక్తః;
ఆరట్టజ శ్చటులనిష్ఠురపాద ముచ్చై
శ్చిత్రం చకార పద మర్థపులాయితేన. ౫-౧౦

పంచమసర్గలోని మృగవర్ణనము విద్యార్థులకు కొండంత వినోదము గొల్పి సత్కవులకు మార్గదర్శకమై విమర్శకుల హృదయముల డోలా విహార మొనర్చుచుండును.

ద్వితీయసర్గయందలి బలరామోద్ధవుల పూర్వపక్షసిద్ధాంతములు చాల వినోదము

గల్గించుచున్నవి. బలరామునిబుద్ధికన్న ఉద్ధవునిప్రజ్ఞ మిన్నయైనది. 'ధర్మరాజు చేయు యజ్ఞమునకు బోనక్కరలేదు. శిశుపాలుని పైకి జైత్రయాత్ర వెడలవలె'నని బలరాముని వాదము. బలాబలముల గుర్తెరుగక శత్రువు నాక్రమింపదలచుట యవివేకము.

మావేది య దసా వేకో
జేతవ్య శ్చేదిరాడితి,
రాజయక్ష్మేవ రోగాణాం
సమూహా స్సమహీభృతాం.

౨-౯౬

అను నీతివాక్యముచేత జైత్రయాత్రకుస్వస్తి జెప్పి ప్రకృతము శిశుపాలుని వధింపదలచుట శ్రీకృష్ణస్వామికి తగదని నిరూపించు నుద్ధవుని సమయోచితప్రజ్ఞ గనుడు :

సహిష్యే శత మాగాంసి
సూనో స్త ఇతి య త్త్వయా ;
ప్రతీక్ష్యం యత్ప్రతిజ్ఞాయై
పితృష్వస్రే ప్రతిశ్రుతం.

౨-౧౦౮

ఆడితప్పుట పెద్దలకు న్యాయము గాదు. నూరుతప్పులను క్షమింతునని శిశుపాలుని తల్లి కభయహస్తమిచ్చి ఆతప్పుల కవకాశ మివ్వక యే వధింపదలచుట పరువుబోగొట్టు కొనుటకే యని నాయకుని తన కనుకూలము జేసుకొనుచున్నాడు.

రాజసూయయాగమునకు శిశుపాలుడు గూడ వచ్చును. కారు లఱచును. అపుడు వాని దండింపవచ్చును. అధికమైనచో ఖండింప ననువుగలుగు నని యుద్ధవాభిప్రాయము. ఉద్ధవునకు పవనవ్యాధి గలదు. నత్తిగలవారికి బుద్ధి యధికము. ఉద్ధవుని వాక్కులలో ననిర్వాచ్యమైన గాంభీర్యము గలదు. ఇతనికి శాస్త్రజన్యజ్ఞానముకన్న యనుభవ మెక్కువ. మితభాషి. ఉచితజ్ఞుడగు కృష్ణుడు తన యన్నమాట ద్రోసివైచి యుద్ధవునియుక్తిని మెచ్చి యాతని మార్గము ననుసరించెను. ఉద్ధవు డేలాటివాడైనను వీనిని మాటనేర్పరిగ జేసిన మాఘమహాకవి నీతిశాస్త్ర పారీణుడు.

———

# కావ్యాత్మవిచారము

బులుసు వేంకటరమణయ్య

భారతీయులగు నాలంకారికులు మానవ ధర్మములను కొన్నింటిని కావ్యమునం దారోపించియున్నారు. గుణాలంకారాదులు మనకెట్లో అట్లే కావ్యమునకును శోభాధాయకములని వారియభిప్రాయము. కాని మానవునియాత్మవలెఁ గావ్యమునందు ప్రధానమగునది యేవి? అనుప్రశ్నకు జవాబొసఁగుట కష్టతరము.

అలంకారశాస్త్రమునకుఁ బ్రథమాచార్యుఁడు నాట్యశాస్త్రకర్తయగు భరతుఁడే యని నిశ్చయింపఁబడియున్నది. భరతముని యాలంకారికుఁ డయ్యును, కావ్యసామాన్యవిషయమునుగాని, కావ్యాత్మవిషయమును గాని చర్చింపఁబూనుకొనలేదు అతనికి నాట్యవిషయనిరూపణమే ప్రధానలక్ష్యమైనది. భరతునిమొదలు ధ్వన్యాలోకమును రచించిన యానందవర్ధనాచార్యునివఱకు నడుమనుండిన ఆలంకారికులలో వామనాచార్యుఁడుతప్ప వేరెవ్వరును కావ్యాత్మవిషయము నెత్తుకొనలేదు. కావ్యమున కాత్మ యొక్కటి యుండవలసినట్లు వారు తలఁచినట్లయినను లేదు. వామనాచార్యుఁడు మాత్రము తన "కావ్యాలంకారసూత్రవృత్తి" యందు "రీతిరాత్మా కావ్యస్య" అని కొంచెము కదిపి యూరకొనెను. పైసూత్రమునుబట్టి వామనుఁడు కావ్యాత్మను నిశ్చయించెనని చెప్పవచ్చునని కొంద ఱభిప్రాయపడుదురు. కాని పరిశీలించిచూచినచో అతనిమతమున గుణముల కున్నప్రాధాన్యము రీతులకు లేదని తోఁచకమానదు.

ఆనందవర్ధనుఁడు లెస్సఁగ విమర్శించి ("కావ్యస్యాత్మా ధ్వనిః" అని) ధ్వనియే కావ్యమున కాత్మయని వివరించియున్నాఁడు. అతనితరువాతివారుకొంద ఱాతనిమతము నంగీకరింపకపోయినను, తమతమ మతములందు కావ్యమున కాత్మయగుదానిని ఏదో ఒకదానిని చెప్పుచునే వచ్చిరి.

భరతాదులు కావ్యాత్మను గుఱించి చెప్పకపోయినను, వారి గ్రంథములనుబట్టి కొంద ఱధునాతనాలంకారశాస్త్ర పరిశోధకులు, వారివారిమతములందుఁ బ్రధానములగువానిని నిశ్చయింప దొరకొనిరి. అట్టివారిలో పిశల్, జాకోబీ, నోబుల్ మొదలగు పాశ్చాత్యపండితులును, హరప్రసాదశాస్త్రి, కాణే, డే మొదలగు మనపండితులును ప్రధానులు. ఇప్పటి పరిశోధకులలోఁ జాలమంది మీఁదివారి మార్గముననే యనుసరించుచున్నారు.

భరతునిమతమున నాట్యమును, భామహుని మతమున అలంకారములును, దండి

వామనుల మతమున రీతులును, ఉద్భట, రుద్రటులమతమున అలంకారములును ప్రధానములని ఒకమాదిరి సిద్ధాంత మేర్పడి యున్నది. కొందఱు భరతుని మతమున రసము, ప్రధాన మని యందురు. దండి యలంకారవాదమునకుఁ జెందినవాఁ డని కొందఱును, గుణవాదమునకుఁ జెందినవాఁ డని మఱికొందఱును తలంతురు.

ఏగ్రంథమున నేవిషయ మెక్కువగ వివరింపఁబడునో దానియం దావిషయమునకుఁ బ్రాధాన్యముగలదని మన విమర్శకులు నిశ్చయించి యుండవచ్చును. భరతుని గ్రంథమున నాట్యచర్చయు, భామహోద్భట రుద్రటుల గ్రంథములం దలంకారచర్చయు నెక్కువగ నున్నవి.

దండి, వామనులమతమునఁ గ్రమముగ గుణరీతివిచారము తక్కువగ నున్నది. అయినను, దండి "ఇతి వైదర్భమార్గస్య ప్రాణా దశ గుణాః స్మృతాః" అని చెప్పుటచేతను, వామనుఁడు "రీతిరాత్మాకావ్యస్య" అని ప్రతిపాదించుటచేతను, ఆయామతములు, గుణ - రీతి - ప్రాధాన్య ప్రతి పాదకము లని అధునాతన విమర్శకుల యాశయము.

కాని యివియే సిద్ధాంతములని తృప్తి పొందక పరిశోధనలు చేసినచో మఱికొంత విషయము బయటపడఁగలదు.

కావ్యముయొక్క పరమప్రయోజనము రసము. రసప్రాధాన్యము లేని కావ్యము అధమ కావ్యమగును. కావున ఎవరి మతమున ఏదిప్రధానమైనను, రసమునకుఁ గల ప్రాధాన్యము మాత్రము తిరోహితము కాఁగూడదు. కొంత విమర్శకదృష్టితో చూచినచో మన యాలంకారికులందఱును ఏకగ్రీవముగ నీవిషయము నంగీకరించియే యున్నారని వారి గ్రంథములే చెప్పుచున్న వనవచ్చును.

౧. నాట్యశాస్త్రమున ప్రధాన విషయము నాట్యము. అయినను అందు రసమే ప్రధానము. రసతత్త్వమును సూత్రరూపమునఁ దెలిపి భరతుఁడు తత్ప్రాధాన్యమును తెలియఁబఱచియున్నాఁడు. అతఁడు చెప్పిన "విభావానుభావవ్యభిచారి సంయోగా ద్రస నిష్పత్తిః" అను రససూత్రమే పలువురకు మార్గదర్శకమై అనేకమతములు వెలువడుటకుఁ గారణమైనది. భరతుని మతమునఁ బ్రధానమగు నాట్యము రసాభిన్నమే యగునని ఆతనిహృదయమును బాగుగ గుఱుతెఱిగిన యభినవగుప్తాచార్యుఁడు వివరించియున్నాఁడు.[౧] కావున భరతుఁడు తాను ప్రధానమని యనుకొనిన నాట్యమునందే రసము నంతర్భవింపఁజేయుటచేఁ దన్మతమున రసప్రాధాన్యము లోపింపలేదని చెప్పవలెను.

౨. భామహుఁ డలంకార విషయముల నెక్కువగఁ జెప్పెను. కావ్యమునకు శోభను

౧. "వృత్తయః కావ్యమాతృకాః" ఇతి బ్రువాణేన మునినా రసోచితేతివృత్త సమాశ్రయే ణోపదేశేన రసస్యైవ జీవితత్వముక్తమ్." "...నాట్యంచ రసఏవేత్యుక్తప్రాయమ్." [లోచనః. పృ. ౧౯౨.]

గూరుచునవి యలంకారములే యని యతని మతము.[౨] అతఁడు రసమును తాను ప్రధానములని యనుకొనిన అలంకారములందే యంతర్భవింపఁ జేసి యున్నాఁడు.[౩] కావున నతని మతమునను రసమునకుఁ గల ప్రాధాన్యము వెలితికాలేదు.[౪] కాని యతని గ్రంథమున రసచర్చ తక్కువగను అలంకారచర్చ యెక్కువగను ఉన్నదని మాత్రము చెప్పవలసియున్నది.

౩. దండి భామహునిరీతిని అలంకారములనే ఎక్కువగఁ జెప్పియున్నాఁడు.దానింబట్టి యతనిమతమున నలంకారములే ప్రధానము లని కొందఱు తలంచిరి. కొందఱు దండి వివరించిన రీతివిచారమునుబట్టి చూచినచో రీతియే తన్మతమునఁ బ్రధాన మగునని తలంచిరి.[౫] అతఁడు వైదర్భ గౌడమార్గములను (రీతులను) రెండింటిని వివరించియున్నను సమగ్రగుణములు గల వైదర్భినే యంగీకరించి, గౌడిని నిరసించుటచే గుణములేఅతని మతమునఁ బ్రధానములనియు, అవియేప్రాణములని యతని యభిప్రాయ మనియుఁ గొందఱు తలంచిరి.[౬]

"భామహుఁడు వైదర్భగౌడరీతి భేదములు లేవని తన కావ్యాలంకారమునఁ జెప్పియున్నాఁడు. అతని మతమును ఖండించుచు దండి "రీతిభేదముఁ లేకపోలేదు. మతద్వయమునకుఁ జాల వ్యత్యాసము కలదు." అని చెప్పియున్నాఁడు ఇంత మాత్రమున నతఁడు రీతివాదమున కాచార్యుఁడని చెప్పఁబనిలేదు." అని కొందఱి సిద్ధాంతము. ఇది తగియున్నది.

దండి గుణమతప్రవర్తకుఁడని చెప్పుటయు సరికాఁజాలదు. అతఁడు "గుణములు వైదర్భమార్గమునకుఁ బ్రాణము" లని చెప్పియున్నాఁడు. కాని కావ్యమునకుఁ బ్రాణము లని చెప్పియుండ లేదు. అతని కావ్యాదర్శమున గుణవిచార మున్నంతమాత్రమున గుణములే యతనికిఁ బ్రధానములని తోఁచినదని చెప్పుట సరికాదు.[౭]

---

౨. "నకాన్తమపి నిర్భూషం విభాతి వనితాముఖమ్." [కావ్యా. ౧-౧౩.]

౩. 'రసవద్దర్శిత స్పష్టశృంగారాదిరసమ్..." [కావ్యా-౩-౬.]

౪. "యుక్తం లోకస్వభావేన రసైశ్చ సకలైః పృథక్." [కావ్యా. ౧-౨౧.]

౫. అస్త్యనేకో గిరాం మార్గః సూక్ష్మభేదః పరస్పరమ్; తత్ర వైదర్భ గౌడీయౌ వర్ణ్యేతే ప్రస్ఫుటాన్తరౌ. [కా. ౧-౪౦].

౬. "ఇతి వైదర్భమార్గస్య ప్రాణాః దశ గుణాః స్మృతాః; ఏషాం విపర్యయః ప్రాయో దృశ్యతే గౌడ వర్త్మని. [కా. ౧-౪౨]

౭. కొంతకాలము నేను దండి గుణవాదప్రవర్తకుఁ డని తలఁచియుంటిని. పిదప పరిశోధించి ఆయభిప్రాయమును మార్చుకొంటిని.

కావ్యమునఁ బ్రధాన మగురసము నతఁడు భామహునివలె నలంకారములందే యంతర్భవింపఁజేసెను. అతనిమతమున నలంకారములే ప్రధానములనియు, కావ్యమునకు శోభఁగూర్చునవి అవియేయనియుఁ దెలియుచున్నది.[1] ప్రధానములగు నలంకారములయందు రస మంతర్భవింపఁబడుటచే, దండి యలంకారమతప్రవర్తకుఁడైనను రసమునకుఁ గల ప్రాధాన్యము నడ్డుకొనలేదని నిశ్చయింపవలెను.

౫. ఉద్భటుఁ డలంకారమతమునకే ప్రాధాన్యము నొసంగి మీఁదివారిమార్గమునే బలపఱచెను. అట్లయినను, రసమునకుఁగల ప్రాధాన్యము నీతఁడు లోపింపఁజేయక, పైవారివలెనే దాని నలంకారములం దంతర్భవింపఁజేసియున్నాఁడు.[2]

పైవిషయములంబట్టి భామహుఁడు, దండి, యుద్భటుఁడును అలంకారవాదప్రవర్తకులనియు, వీరిమతమున రస మలంకారమగుచున్నదనియుఁ దెలియుచున్నది.

౬. వామనుఁడు ఉద్భటసమకాలీనుఁడు. కాని యితనిమార్గము మీఁదివారిమార్గముకంటెఁ జాల భిన్నమయినది. ఇతఁడలంకారప్రాధాన్యము నంగీకరింపలేదు.

ఇతఁడు "రీతి రాత్మా కావ్యస్య" అని చెప్పుటంబట్టి యితనిమతమున రీతియే కావ్యాత్మయని తేలుచున్నదని కొందఱి తలంపు! ఇతఁడు రీతిసామాన్యమునకుఁ గావ్యాత్మత్వము నంగీకరించియున్నయెడలఁ బయిమతమున కానుగుణ్యము కుదిరియుండెడిది. కాని వామనుఁడు రీతిసామాన్యమాత్మయగునని యంగీకరింపక ఒక్కవైదర్భినే యాత్మగాఁ గ్రహించియున్నాఁడు. అందులకు గుణసాకల్యమే కారణము. ఎక్కువగుణములు లేనిదగుటచే గౌడరీతి గ్రాహ్యము కాదు. ఈవిషయ మతనిగ్రంథమువలననే తెలియుచున్నది.[3] అలంకారసర్వస్వవ్యాఖ్యాతయగు సముద్రబంధుఁడు వామనుని మతమున గుణములకే ప్రాధాన్యముకలదని చెప్పియున్నాఁడు.[4] కావున వామనుఁడు రీతి

౧. "రసవద్రసపేశలమ్." [కావ్యా. ౨-౨౭౫].

"కావ్యశోభాకరాన్ ధర్మానలంకారాన్ ప్రచక్షతే, తే చాద్యాపి వికల్ప్యంతే కస్తాన్ కార్త్స్న్యేన వక్ష్యతి." [కా. ౨-౧].

౨. "రసవద్దర్శితస్పష్టశృంగారాదిరసోదయమ్." [కావ్యాలంకారసారసంగ్రహః, ౪ వర్గః].

౩. రీతి రాత్మా కావ్యస్య. ౬, విశిష్టా పదరచనా రీతిః ౭, విశేషో గుణాత్మా. ౮, సా త్రిధా వైదర్భీ-గాడీ-పాంచాలీచ. ౯, విదర్భాదిషు దృష్టత్వా త్తత్సమాఖ్యా. ౧౦, సమగ్రగుణా వైదర్భీ. ౧౧, ఓజః కాన్తిమతీ గాడీయా. ౧౨, మాధుర్యసౌకుమార్యోపపన్నా పాంచాలీ. ౧౩, తాసాం పూర్వా గ్రాహ్యా, గుణసాకల్యాత్. ౧౪, నపున రితరే-స్తోకగుణత్వాత్. [కా. సూ. ౧-౩-౬-౧౫].

౪. చూ. అలంకారసర్వస్వవ్యాఖ్య. త్రివేంద్రప్రతి, పు. ౪.

మతప్రవర్తకుఁడు కాక గుణమతప్రవర్తకుఁడని చెప్పుటయే యుచితము. మఱియుఁ బ్రధానమగు రసము నీతఁడు తనమతమునఁ బ్రధానములగు గుణములయందే (అనఁగా కాంతి గుణమున) అంతర్భవింపఁజేసి యున్నాఁడు.[౧] దీనింబట్టికూడ నితఁడు గుణప్రాధాన్యవాది యనియు, రసమున కీతనిమతమునఁగూడ ప్రాధాన్యము కలదనియుఁ దేలుచున్నది.

౭. రుద్రటుఁ డలంకారప్రాధాన్య వాది యని పెక్కురు తలంచుచున్నారు. అతఁ డలంకారములనుగూర్చి చాలవఱకుఁ జర్చించుటయే అందులకుఁ గల కారణమైనట్లు తోఁచుచున్నది. అంతమాత్రమున నతఁ డలంకారమార్గానుయాయి యని చెప్పుట యుచితము కాదు.

భరతుఁడు మొదలుకొని రుద్రటుని వఱకు నుండిన యాలంకారికులెవ్వరును రసమునుగూర్చి విశేషించి చర్చింపక పోయిరి. రుద్రటుఁడు మాత్రము తన కావ్యాలంకారమున రసచర్చకొఱకు నాల్గధ్యాయములను ప్రత్యేకించి యున్నాఁడు. ఇతనివఱకు రసములు తొమ్మిదని కొందఱు, ఎనిమిదని కొందఱు చెప్పియున్నారు. రుద్రటుఁడు తొలుత పదిరసములను ప్రతిపాదించి, పిదప మధురాదుల యాస్వాదము వలనరసములు కలుగుచున్నరీతినే భావము లన్నింటియొక్క యాస్వాదమువలనను పలువిధములగు రసములు కలుగుచున్న కారణమున నిర్వేదాదు లన్నియును రసములు కావచ్చునని నిరూపించి రసవిషయమునఁ దనకుఁగల యుదారాశయమును వెల్లడించియున్నాఁడు.[౨]

ఇంతేకాక మీఁదివారివలె నితఁడు రసమును వేఱొక దానియందు (కావ్యాంగమునందు) అంతర్భవింపఁజేయక స్వతంత్రముగనున్నదానినిగనే చెప్పియున్నాఁడు. కావున రసమునకుఁ బ్రత్యేకవ్యక్తిత్వము రుద్రటునితోడనే ప్రారంభమైనదని చెప్పవలెను. పై విషయములంబట్టి రుద్రటుఁడు రసమార్గమునకు దారిఁజూపిన సహృదయుఁడని చెప్పవలెను.

ఇంతవఱకును బరిశోధనలవలనఁ దేలిన విషయములు: తత్తన్మతములందుఁ గావ్యాత్మయొక్క స్వరూపము-చెప్పఁబడినవి. ధ్వన్యాలోకమును రచించిన యానందవర్ధనాచార్యుఁడాదిగాఁగల యాలంకారికులందఱును వాచ్యముగఁ గావ్యాత్మస్వరూపమును తెలిపి

---

౧. దీప్తరసత్వం కాంతిః. ౩-౨-౧౫.

దీప్తాః రసాః శృంగారాదయో యస్యసః, తస్యభావః దీప్తరసత్వం కాంతిః, యథా — "ప్రేయాన్ సాయ ముపాగతః......" ఏవం రసాన్తరేష్వ ప్యుదాహరణీయమ్. [కా. సూ. పు. ౩౬]

౨. "శృంగార వీర కరుణా బీభత్స భయానకాద్భుతా హాస్యః; రౌద్రః శాన్తః ప్రేయానితి మంతవ్యా రసాః సర్వే. రసనా ద్రసత్వ మేషాం మధురాదీనామి వోక్త మాచార్యైః; నిర్వేదాది ష్వపి త న్నికామమస్తీతి తేఽపిరసాః. [౩-౩,౪]

యున్నారు. కావున వారిమతములయెడ నభిప్రాయభేదములు ఎవ్వరికిని గలుగఁజాలవు.

౮. ఆనందవర్ధనునిమతమున ధ్వనియే కావ్యమున కాత్మ. ధ్వని వస్త్వలంకారరస భేదములచే మూఁడువిధము లనియు, నందు రసమే ప్రధానమనియు నతఁడు స్పష్టముగఁ జెప్పియున్నాఁడు. అతని మతమున వ్యంగ్యము ప్రధాన మగుటచేతను, రసము తదంతర్భూతమగుటచేతను రసము ముఖ్య మని చెప్పుటలో నతని కాటంకము లేదని చెప్ప వలెను.

౯. వక్రోక్తియే కావ్యమునకు జీవిత మని (ఆత్మయని) చెప్పిన కుంతకుఁడు రసమునకుఁ గల ప్రాధాన్యమును నిరోధింప లేదు. వక్రోక్తియనఁగా అతిశయోక్తి. అది యొక అలంకారము వంటిది. కావ్యమున రసము ముఖ్యమనియు, అలంకార మగు వక్రోక్తి యారసమును లెస్సగఁ బరిపోషించు ననియు నతని మతము. [1]

౧౦. వ్యక్తివివేకమును రచించిన మహిమభట్టు అనుమితివాదమున కాచార్యుఁడు. ఆనందవర్ధనునికిఁ బ్రతిద్వంద్వి. అతఁడు రసాదులు వ్యంగ్యములగునని చెప్పఁగా నితఁడు తన్మతమును నిరసించి అవి యనుమితము లగునని చెప్పి స్వమతమును సవిశేషముగఁ జెప్పియున్నాఁడు. రసము నితఁ డనుమితము నం దంతర్భవింపఁజేసినాఁడు. రసము కావ్యమున కాత్మ యగుననుటలో నితఁ డానంద వర్ధనునితో నేకీభవించుచునే యున్నాఁడు. [2]

౧౧. ఔచిత్యవిచారచర్చను రచించిన క్షేమేంద్రుఁడు ఔచిత్యవాదమునకు దారి తీసెను. ఈవాదమున కానందవర్ధనాచార్యుని సూక్తి ప్రబలాధారము. కావ్యమునఁ బ్రధానమగురసము నెంతపోషించినను, అది ఔచిత్యమునకు దూరమగునేని విరసమగునుగాని సరసముకాదని యతనియాశయము. [3] ఎవరు దేనికిఁ బ్రాధాన్యము నొసంగినను ఔచిత్యము ముఖ్యముగ నుండితీరవలెననుట తప్పదు.

క్షేమేంద్రుఁ డౌచిత్యమునకుఁ బ్రాధాన్యము నొసంగినను, రసమే కావ్యమునముఖ్యమైన దని చెప్పుచున్నాఁడు. రసము లేనిచో ఔచిత్యము దేనిని పరిపోషింపఁ గలదు? [4]

౧. చతుర్వర్గఫలాస్వాద మప్యతిక్రమ్య తద్విదామ్; కావ్యామృతరసే నాన్తశ్చమత్కారో వితన్యతే.
ఆయత్యాంచ తదాత్వేచ రసనిష్యంద సుందరమ్; యేన సంపద్యతే కావ్యం త దిదానీం విచార్యతే. [పు. ౬]

౨. కావ్యస్యాత్మని సంజ్ఞిని రసాదిరూపే నకస్యచి ద్విమతిః. [వ్యక్తి. ౧. విమ]

3. అనౌచిత్యా దృతే నాన్య ద్రసభంగస్య కారణమ్; ప్రసిద్ధౌచిత్యబంధస్తు రస స్యోపనిషత్పరా.
[ధ్వన్యాలోకః 3 ఉద్ద్యోతః]

౪. అలంకారా స్త్వలంకారా గుణాఏవ గుణాః స్మృతాః;
ఔచిత్యం రససిద్ధస్య స్థిరం కావ్యస్య జీవితమ్. [ఔ. పు. ౧].

భట్టనాయకుఁడు మొదలగువారి గ్రంథము లింతవఱకు మనకు లభింపలేదు. అయినను రససూత్రమునకు వారొనర్చిన వ్యాఖ్యానములంబట్టి రసము కావ్యజీవితమగుటలో వారి కెట్టియభ్యంతరము లేనట్లు నిశ్చయింపవచ్చును. దశరూపకారాదులు మీఁది వారిమతమునే యవలంబించియున్నారు.

పైనివివరింపఁబడినమతములన్నింటియందును ఆనందవర్ధనునిధ్వనివాదమే చివఱకు నిలిచినది. మమ్మటాచార్యుఁ డామతమునే యవలంబించి, నవీనాలంకారికులకు గొప్ప మార్గదర్శకుఁ డైనాఁడు. అతఁడును ధ్వని కావ్యాత్మయని చెప్పినను, రసమే ప్రధానమని కంఠోక్తిగ వివరించియున్నాఁడు.[1]

ఎవరు దేనికిఁ బ్రాధాన్యము నొసఁగియున్నను రసమునుమాత్ర మేమఱియుండలేదనియు, నదియే ముఖ్యమనుట సర్వమతసమ్మతమనియు తేలుచున్నది.

---

## శబ్దతత్త్వము

కవితిలక విద్వాన్ కంచనపల్లి కనకాంబా ప్రణీతము

తథ్యంబుగాఁగ 'ధాతా యథాపూర్వ మకల్పయ' త్తనుశ్రుతి కలుగుకెట్లు
బహుభాషలను నేర్చి పల్కుచుండెడువాఁడు పల్కు నొక్కొకరీతి ప్రజనుగూడి
ఒకభాషనుండి వేరొకభాష వచ్చునా నుచితంబె సర్వపరిచితి గలుగ
సమయానుసారంబు చక్కఁబల్కునుగాక యన్నియుండియు లోన నణఁగియుంట
సర్వరూపంబులు జలమునం దుండియుఁ బాత్రనుగూడ తత్ప్రతిమఁగాంచు
భంగి స్వర్ణంబు భూషలౌ భంగి నొక్క-యాత్మఁ డేగద విశ్వంబు నతనిలోనఁ
బుట్టు పెరుగు నడగును నా బూటకంబు-మనమ మరువకు శ్రీవిష్ణుమయము జగము.

---

[1]. "సకలప్రయోజనమౌళిభూతం సమనన్తరమేవ రసాస్వాదనసముద్భూతం విగళితవేద్యాంతర మానందం."
[కావ్యప్రకాశః, ౧ ఉల్లాసః].

## నేను, నా గ్రామోఫోను


ఆనందించాలని గ్రామోఫోను కొని యిప్పటి ఫేషన్ పాట రికార్డు వేశాను ఏదో అరుపు
వినబడి తలకాటెక్కినది చెవులు చిల్లులు పడ్డవి ఆపైని బూతు
కృతుల రికార్డులు పంపమని కంపెనీకి గట్టిగా వ్రాయగా, కృతులిప్పు
ఎవరూ వినరనీ, నాకేమీ తెలియదనీ జవాబిచ్చారు గ్రామోఫోనును చెరువులో- - - - - - - - -
తలిశెట్టి
రామారావు

# కవిత్వకళ*

కపిస్థలం శ్రీరంగాచారి

౧

వాఙ్మయమున నున్నది కవిత్వ మను నొక్క కళయే. సృష్టిచేయఁగల ఉత్తమరచనయే కవిత్వము.

ఇతరులెవ్వరును ఈయఁజాలనిదానిని మన కీయఁగలవాఁడే కవి. అనఁగా కవి ఇంతవరకును ఎవ్వరికిని తెలియనిదానిని తెలుపవలయునని కాదు. అది ఒకవేళ అసాధ్యము కావచ్చును. కాని, కవి యన్నవాఁడు తాను తలఁచి, తాను చూచి, తాను కనిపెట్టినదానినే— దానిని ఇతరులు కనిపెట్టియుండినను తప్పులేదు— మన కీయవలయును. ఆర్జవము, ప్రతిభ, శైలికలవాఁడే కవి. ఆర్జవమనఁగా కవి ఇతరులకు యథార్థమును తెలుపవలయుననికాదు; కాని తాను యథార్థమును తెలిసికొనవలయును. అతఁడు తనభావములను, తన యనుభవములనుమాత్రమే వర్ణింపవలయును. కవు లను కొనువారందరును తమ కిట్టియార్జవ మున్నదనుకొందురు. నిజముగ వారి కట్టిదేదియును లేదు. తమచేతనైనట్లు ఇతరులభావములను, ఇతరుల యనుభవములను మరల వర్ణించుట వారివాడుక. వారిపదములు సరాసరిగ నుండును. వారిపదములు ఎరవుతెచ్చికొనినవిగ నుండును. అది కళ కాదు. అది కవిత్వము కాదు. ఇట్టిఆర్జవము లేక వ్రాయఁబడినగ్రంథములు పనికిమాలినవి. గ్రంథకర్త తలఁపులను, భావములను వెలువరించుటకు ముందు, వానిని తానే కనిపెట్టవలయును. అట్టివానినేప్పు ఎంత కొంచెమయిననుకూడ, అతఁడొక కళోపాసకుఁడు; అతఁడొకకవి.

ఇట్టి ఆర్జవము గలవాఁడు లోకమునకు వెల్లడింపఁదగిన దేదైన తనవద్ద ఉన్నదా, లేదా యని తానే తెలిసికొనఁగలఁడు. అనఁగా తనకు ప్రతిభ యున్నదా, లేదా యని తానే తెలిసికొనఁగలఁడు. ప్రతిభయొక్క బాహ్యరూపమే శైలి. తాను చూచినదానిని, తాను తలఁచినదానిని, స్పష్టముగ, తనకు తోఁచినట్లు వర్ణించుటయే శైలి. ఆర్జవము లేనియెడల ప్రతిభ లేదు. ప్రతిభ లేనియెడల శైలి లేదు. ఇఁక, శైలి లేనియెడల ప్రతిభయు లేదు, ఆర్జవమును లేదు.

ఒకఁడు కవియా, కాఁడా అని తెలిసికొన వలసినయెడల, వానిశైలిని పరిశీలింపవలయును. వాఁడు పదములను అవిచేయుశబ్దములకొఱకే ఉపయోగించిన యెడలవాఁడు కవికాఁడు; పదముల చక్కఁదనముకొఱకే ఉపయోగించినయెడల, వాఁడు కవికాఁడు. ఇంత యేల? వాఁడు పదముల యర్థములకొఱకు గాక మరి దేనికొఱకు ఉపయోగించిననుకూడ, వాఁడు కవి కానేరఁడు. గ్రంథకర్తలందఱును ఇట్లు చేయుచున్నారని తలఁచుట గొప్ప పొరబాటు. చాలతక్కువమంది, ఒక్కొక్కతరమునందును ఒకరిద్దరు, ఆర్జవము కలిగి, ప్రతిభ కలిగి, పదములను వాని అర్థముప్రకారము వాడెదరు. మిగిలినవారందఱును సరాసరి పదములను వాడుదురు కాఁబట్టి, వారికళయు సరాసరియె. తెలిసియో, తెలియకయో ఇతరులమాటలను ఎరవుతెచ్చుకొనువ్రాఁతలలో కవిత్వమునకు చోటులేదు. ఒకకావ్యముయొక్క విలువను తెలిసికొనుటకు దానిశైలిని పరిశీలింపవలయును. నిజముగ తలఁపఁబడినతలఁపులు, నిజముగ అనుభవింపఁబడిన అనుభవములు, నిజముగ చూడఁబడినదృశ్యములు స్పష్టముగ వర్ణింపఁబడియున్నవా చూడవలయును. మనకండ్లను తెఱపించి, బలే అనఁజేయు వర్ణనలున్నవా చూడవలయును. చదివినయెడల అందలిదృశ్యములు మనకన్నులయెదుట నుండవలయును. అందలి భావములు మనయొడళ్లు పులకరించున ట్లుండవలయును. ఇట్లు లేనియెడల ఆగ్రంథము పనికిమాలినది. దానిని

* దీనినివ్రాయుటలో Richard Aldington గారి వ్యాసము నాకు తోడ్పడినది—క. శ్రీ.

వ్రాసినవాఁడు కవికాఁడు. కాఁబట్టి, ఆర్జవము, ప్రతిభ శైలి కలవాఁడే కవి. అతఁడు వ్రాసినదే కవిత్వము. అదియే వాఙ్మయమున నుండు ఒక్క కళ.

౨

ఈ కవిత్వమును రెండుగ విభజింపవచ్చును— Objective కవిత్వము, Subjective కవిత్వము అని. పురాణము, ప్రబంధము, నవల, నేఁటిచిన్నకథ, నాటకము—ఇవి Objective కవిత్వమునకు చేరినవి. నేఁడు మనలో ప్రబలియుండునదియే Subjective కవిత్వము. దానినే మనలో కొందరు భావకవిత్వ మనుచున్నారు. దీనిని ఆంగ్లమున Lyric, Ode, Elegy అని విభజించి యున్నారు. మనలోను ఇప్పుడిప్పుడు ఇట్టి విభాగము లేర్పడియున్నను వానికి పర్యాయపదములుమాత్రము మనలో వాడుకలో లేవు. కవిత్వము పద్యరూపమున నయినను, వచనరూపమున నయినను ఉండవచ్చును. ఇది మనలో చాలమందికి తెలిసినట్లు లేదు.

సరాసరి గణనియమమువంటివగు Metre, Rhythm లు కూడ తమభావప్రకటనమున కాటంకము లగుచున్నవని కొందఱు పాశ్చాత్యకవులు వానికికూడ జలాంజలి విడిచి, Vers libre అనునొక నూతనమార్గమున తమభావములను ప్రకటించుచున్నారు. వారిలో Mr. Ford Madox Huffer, Mr. F. S. Flint, Mr. D. H. Laurence, Laforgue, Rimbaud, Verhaeren, Romains, Spire మొదలగువారు సుప్రసిద్ధులు

వారికి గణములే ప్రతిబంధకములుకాఁగా మనవారికి గణములు, ప్రాసములు, యతులు ఇన్నియు చేరి భావప్రకటనకు ప్రతిబంధకములని వేరె చెప్పఁబనిలేదు.

అయిన మనవా రొకప్రశ్న అడుగవచ్చును— 'వారు పట్టిచేతగానివారు. వారుచేసినారని మనమును అట్లే చేయరాదు. మనపూర్వపుకవులందరు గణములు, ప్రాసములు, యతులతో ఎన్నిపురాణములు, ఎన్ని కావ్యములు వ్రాయలేదు?' అని. వారికి నామనవి. ఇది—మన పూర్వపుకవులు లెక్కలేని పురాణములు, కావ్యములు వ్రాసినమాట నిజమేకాని, అయ్యలారా! వానిలో ప్రపంచమునందంతటను పేరుమోసినవానిని వ్రేలుమడిచి చెప్పఁదుచూతము! అంతగేల? మన హిందూదేశమునంతటను ప్రఖ్యాతివడసినకావ్య మొక్కటియైన మనఆంధ్రభాషలో నున్నదా?

అదియే, సంస్కృతములోని గ్రంథము లనేకములు ప్రపంచమునం దంతటను పేరుమోసియున్నవి. దీనికికారణ మిదియని నాకు తోఁచుచున్నది—సంస్కృతములో యతిప్రాసముల నియమము, నిర్బంధములు లేవు.

శ్రీయుత వేదమల్లె రాజగోపాలరావుగారు తమఛందశ్శాస్త్రమున నీవిషయమయి కొన్ని సలహాల నిచ్చియున్నారు. అవిఇవి:—

౧. "యతిప్రాసములు మనోహరాభిప్రాయముల కడ్డమువచ్చునెడ, వానిని విడువవచ్చును.

౨. అప్పు డట్టిపద్యము నూతనపద్య మనిపించుకొనును.

౩. ఈనూతనపద్యములు మూడువిధములు.

౪. నూతనజాతులు, నూతనోపజాతులు, నూతన వృత్తములు నని.

౫. నూతనకందము, నూతనోత్సాహ మన్నగు నవి నూతనజాతులలోనివి.

౬. నూతనగీతాదులు నూతనోపజాతులు.

౭. నూతనచంపకమాలాదులు నూతనవృత్తములు.

౮. కేవలనూతనవృత్తములతోఁగూడఁ గావ్యనాటకాదులను రచియింపవచ్చును.

౯. లేదా సామాన్యపద్యములను నూతనపద్యములను నందుఁజేర్చవచ్చును."

వారు తెలిసినంతవఱకు వీరిమంచిసలహాల ననుసరించి యొవరును పద్యముల నింకను వ్రాయలేదు. మన కవు లీమార్గము ననుసరించి వ్రాయునెడల, వారు

ప్రతిభావంతులేని, నిజముగ మనభాషలో సద్గ్రంథములు వెలువడవచ్చును.

## 3

ఆంధ్రదేశమున నిప్పుడు ఇంటింటను కవులు. వ్రాయనేర్చినవారందఱును కవులే. దానికితగినట్లు పత్రికలున్నవి వానిని ప్రకటించుటకు. ఒకవేళ అవి ప్రకటింపకపోయినయెడల, ఆ 'కవులే' స్వయముగ ఖర్చుచేసి తమ 'కావ్యము'లను ముద్రించుకొనుచున్నారు. ఇట్టి 'కావ్యములు' పెచ్చుపెరుగకుండఁజేయుటకు దివ్యౌషధమువంటిది vers libre. దీనికి గణయతిప్రాస నియమము లేదు. సాధారణముగ దీనిలో ఇవి యుండనే యుండవు, అప్రయత్నముగ పడినప్పుడుతప్ప. కాఁబట్టి, దీనిని వ్రాయువాఁడు అర్థమును గమనించియే వ్రాయవలసియుండును. దీనిలో ఆర్జవము, క్లుప్తత, స్పష్టత విధిగా యుండును. గణములు, ప్రాసములు, యతులు ఉన్నయెడల, పనికిమాలిన 'కావ్యము' కూడ కొంతసేపు మనలను తలయూడింపఁజేయును. కాని Vers libre లో భావశూన్యత చూచునప్పుడే తెలిసిపోవును. కవులనుకొనువారందరును Vers libre లో కావ్యములు వ్రాయఁదొడఁగినయెడల, వారిలో ననేకులు వెంటనే తాము స్వప్నమునకూడ కవులు కాఁజాలరని తెలిసికొని యూరకుందురు. మంచికావ్యములుమాత్రమే అప్పుడు వెలువడును. మనకవులలో Vers libre లో వ్రాయువారు నాకు తెలిసినంతవఱకు శ్రీయుత శ్రీరంగం శ్రీనివాసరావుగారొక్కరే. వీరును Vers libre ను ఎల్లప్పుడును వాడుట లేదు; అప్పుడప్పుడు వాడుచుందురు. వీరికంటివారు Vers libre ను ఎల్లప్పుడును వాడుచుండుట మంచిది. Vers libre ఎట్లుండునో తెలిసికొనఁగోరువారు ఆంగీరస సంవత్సరము, ఫాల్గునమాసపు భారతిలో ప్రకటింపఁబడిన వీరి 'విద్యున్మాలికలు' అనుపద్యవ్యాసమును చూడవచ్చును.

వచనరూపమున కవిత్వముచెప్పుట దీనికంటెను మేలు. వచనకవిత్వము మనలో కొందరుచేయుచున్నారు. శ్రీయుత పూడిపెద్ది వెంకటరమణయ్యగారి 'ఉగాది'యు, శ్రీయుత పురిపండా అప్పలస్వామిగారి "వియోగభ్రమరము" ను, శ్రీమతి కృష్ణాకుమారిగారి 'నిశాకాంత'యును ఒకరకమునకు చేరినవి. శ్రీకుటుంబరాయశర్మగారి 'మెఱుపు', 'జాగ్రత'యు, శ్రీయుత పోలుకొండ భద్రయ్యగారి 'రత్నచ్యుతి'యు, శ్రీయుత శెట్టిపల్లి వేంకటరత్నంచౌదరిగారి "పరమేశ్వరా!" యును మరియొకరకమునకు చేరినవి. ఈకవిత్వమును మనవారు చాల అభివృద్ధి పఱుపవలయును.

శ్రీయుత చేకుమళ్ల రాజగోపాలరావుగారిసలహాల ననుసరించి వ్రాయఁబడినవ్యాసములను, Vers libre లో వ్రాయఁబడినవ్యాసములను, వచనకవిత్వమును 'భారతి' పత్రిక ఆదరించి, ప్రకటించుచువచ్చినయెడల ఆంధ్రకవిత్వకళకును, తన్మూలమున ఆంధ్రదేశమునకు చాలమేలు చేసినట్లగును.

---

# ఛందోదర్పణము—గిడుగువారి పీఠిక

దువ్వూరి సూర్యనారాయణమూర్తి

ఛందోగ్రంథములలో ననంతామాత్యుఁడు వ్రాసినగ్రంథమొకటి ఛందోదర్పణమనెడిపేరున నున్నది. ఇందు తత్పూర్వలాక్షణికులకన్న విశేషముగా యతులు, వృత్తములు ముఖ్యములను వ్యాకరణ విషయములు ననేకములు చెప్పఁబడినవి. సామాన్యముగా నీవిమర్శకయుగమున ప్రతిగ్రంథమునకును పీఠికలు వ్రాయఁబడుచునే యున్నవి. చిరకాలమునుండి తాటాకులపై లేఖనములు తప్ప నితరవిధముగ ముద్రణాదిసదుపాయములు లేమిని అట్టివ్రాత ప్రతులలో ననేకదోషములుంటను, వాని ననుసరించియే నేను ముద్రణము జరుగుటనుబట్టియు మూలగ్రంథస్థగుణదోషముల నిర్ణయించుటకై పండితులచేఁ టీకలు వ్రాయింపఁబడుట ముఖ్యకర్తవ్యమైనది. అందు లక్ష్యలక్షణవిరోధములు లక్షణమునందలి పొరపాటులు కవిప్రమాదములు మొదలగుననేకవిషయములు నిర్దుష్టముగాఁ జూపఁబడుచుండును. ప్రకృతముపయి ఛందోదర్పణమునకు శ్రీ గిడుగువేంకటసీతాపతిగారు పీఠికను వ్రాసియున్నారు. అందు వారనేకవిషయములను విమర్శించి చూపి ఛందోదర్పణమను నామమును సార్థకము చేసియున్నారు. కాని యందొకచిన్నవిషయమై తెనుఁగునకు మూలమైన సంస్కృతలక్షణమును వీరిచేఁ దిద్దఁబడినపీఠికాలక్షణమును, మూలమును గూడ సమన్వయించుకొనలేక పోయితిని. ఆవిషయమున "ప్రమాదో ధీమతామపి" అన్నరీతిని సీతాపతిగారు పొరపడిరా? లేక మనకు పరమార్థ మగోచరమైనదా అనుసందేహము నావ్యాసమునకు తావొసంగినది. అందువలన నావిషయమును నాకు తోచినరీతిని తన్నివృత్తికై వ్రాయుచున్నాను.

సీతాపతిగారు పీఠికయందార్యాప్రకరణమును గూర్చి వ్రాయుచు "నేటిఛందోదర్పణ ప్రతులలో ఆర్యాగీతుల లక్ష్యపద్యములు కనపడవు. లాక్షణికుల ఆచారమును అనుసరించి లక్ష్యలక్షణములను ఒకపద్యమందు ఇతరస్థలములలో చూపిన అనంతుడు ఆర్యాగీతులందుమాత్రము చూపించడా? అజ్ఞానముచేత కొందరు లేఖకులు అనంతుని ఆర్యాగీతులను కందములవలె నడిచేటట్లు "సవరించి" రూపుమాపినారు. అనవసరముగా అతికినమాటలు తీసివేసినయెడల వాటిలో లక్ష్యలక్షణములు రెండున్ను స్పష్టముగా కనపడగలవు చూడండి." అని చెప్పి వానిని సవరించి వానినన్నింటిని వ్రాసియున్నారు. అందు విపులచపలలవిషయమై నాకు విప్రతిపత్తి కలుగుటచే వానివాని సంస్కృతలక్షణములఁ జూపి వివరింతును.

"లక్ష్మైతత్సప్తగణా గోపేతా భవతి నేహ విషమే జః;
షష్ఠో౽యంచ నలఘువా ప్రథమేర్ధే నియత మార్యాయాః.

షష్ఠేద్వితీయత్పాత్పరకే న్లే ముఖలాచ్చసయతిపదనియమః;
చరమేర్ధే పంచమకే తస్మాదిహ భవతి షష్ఠోలః."

అని యార్యాలక్షణము. అనఁగా నార్యాప్రథమార్ధమునకు గాభజసనలములలో నేదున్ను, పైనొకగురువుండవలెననియు ౧, ౩, ౫, ౭, తావుల జగణ ముండరాదనియు నుండిన నారవస్థానమున నాజగణముగాని, నలముగాని యుండననుననియు లక్షణము. ఇఁక యతిస్థానమన్ననో నలము షష్ఠమందున్న ద్వితీయలఘువుకంటెను సప్తమగణము నలమైన మొదటి లఘువుకంటెను నిలుపవలెనని ప్రథమార్ధ లక్షణము. కాని "షష్ఠో౽యంచనలఘువా" అని చెప్పి వెంబడినే "షష్ఠే ద్వితీయతాత్ పరకే న్లేముఖలాత్" అని చెప్పిన నియమము చొప్పున నలఘువున్నపుడే యతినియమమును జెప్పెనుగాని జగణమున్నపుడు షష్ఠ స్థానమున యతినియమ మెట్లో చెప్పియుండ

లేదు. అది యాస్యాము. రెండవపాదమున నారవగణము నకు బదులుగా లఘు వుండవలెననియు, నైదవ స్థానమున లఘు వున్న మొదటి లఘువుకంటె యతి నిలుపవలెన నియు లక్షణమును చెప్పియున్నాఁడు. ఈ సంస్కృతమందలి "యతి ర్విచ్ఛేదసంజ్ఞకః" అనునట్టి విచ్ఛేద రూపయతికిన్ని తెనుఁగునఁగల యక్షరసాజాత్యరూపయ తికిన్ని సంబంధము లేనందున ననంతుఁడే యతినియమ మును బాటింపక వృత్తమును మాత్రమే గ్రహించియు న్నాఁడు. పైరీతిని పథ్యా ముఖచపలజఘనచపలలు నాని వాని సంస్కృత సామాన్య విశేష లక్షణలక్షితములై దిద్దఁబడినవి. ఇక విపులార్యాలక్షణమును జూతము. దీని లక్షణమున్ను వృత్తరత్నాకరమున "ఉల్లంఘ్య గణ త్రయ మాదిమం శకలయో ర్ద్వయో ర్భవతి పాదః, యస్యాస్తాం పింగళనాగో విపులామితి సమాఖ్యాతి."

అని చెప్పఁబడినది. అనఁగా నార్యయొక్క రెండుపాదములందును మొదటిశకలమునం దుండెడిగణ త్రయమునకు విచ్ఛేదముకాక అనఁగా తృతీయగణ భూతయతిక్రాంతిపదము సమాప్తినందక సగము మూడవ గణములోను, తక్కినను నాల్గవగణములోను జేరి శకల ద్వయమునకు నవినాభావసంబంధమును దెలుపుచున్న నయ్యదియే విపులార్య యనఁబడును. చూడుఁడు.

"ఉల్లంఘ్య గణత్రయ, మా
దిమం శకలయోః."

పైలక్ష్యమున మూడవగణస్థానమందు నిలిచిన 'ఆదిమం' అనెడిపదమునందలి 'ఆ' యనునది పైశకల మందు మిగిలి తక్కినది రెండవశకలమందు కలిసినది. ఇట్లే రెండవపాదమందునను జూచుకొనునది. దీనిలక్ష ణము సంస్కృతమున నిట్లుండ ననంతునిఛందమున నిట్లున్నది—

"ప్రకటసమపాదముల నిలు
వక శబ్దమునవలఁ జొచ్చివచ్చెననం ద
క్కక విపులార్యయనును సే
వకజనమందారధీర వనజదళాక్షా."

ఇయ్యది యార్యాలక్షణముయ్యు కందపద్య ములో నుండు టాచారము గాదని శ్రీగిడుగు సీతాపతి గారు పీఠికలో దీనిని

"ప్రకటసమపాదముల నిలు
వక శబ్దము నవలఁ జొచ్చివచ్చిన ద
క్కక విపులార్యయగును సే
వకజనమందార వనజాక్షా"

ఈరీతిని సవరించి లక్ష్యలక్షణయోజనఁ జేసి యున్నారు. పైవృత్తరత్నాకరునిలక్షణమురీతి నిందు సమపాదముల శబ్దము నిలువక నీవలకు రావలెననులక్ష ణము స్పష్టముగా లేదు. ఉన్న సమపాదములు రెండే. అందున్ను మొదటిసమపాదమునుండి శబ్ద మీవలకు వచ్చుట సంభవించునుగాని రెండవసమపాదమునుండి (నాలవపాదమగుటను) శబ్ద మీవలకువచ్చుట సంభ వింపదు. కావున నచ్చట "ప్రకటాసమంబులను" అని దిద్దుకొని అసమంబులను = విషమపాదములను, అనునర్థ మును గ్రహించిన విరోధ ముండదు. మఱియు సం స్కృతమున ప్రథమశకలములోనిపదము రెండవశకల మున జేరుట, మూడవశకలమునందలి పదము నాల్గవశకల మందు జేరుటయే నియమముగాని, యీ తెనుఁగున దర్పణ మందును, పీఠికయందునుగూడ రెండవపాదాంత్యమందలి పదము మూడవపాదములో కలిసి మొత్తముపై నాలుగు శకలములును గొలుసుకట్టుగ నుండవలె నను నియమము లేదు. ఇది తెనుఁగున యతినియమమును వీడి వేరురీతిని గ్రహించినట్లు స్వతంత్రనియమమా, లేక పార పాటా? లక్ష్యములుగూడ ప్రథితములు తెనుఁగున నాతిబహుళములు. ఒకవేళ నడుమకలుపు వైచ్ఛికమని యనినచో నదియే యొకవిశేషలక్షణముగాఁ జెప్పునపు డట్లితరపాదములలో నిట్లు సందేహము కలుగునట్లుగా వ్రాయుట యితరుల కద్దియు నొకనియమమువలెనే కను పింపకపోదు. అప్పకవీయమందుగూడ నీవిషయమును గూర్చి......

"క్షమ బేసికాలు సమపా
దములోఁ జొర శబ్ద మొకటి తనరింపన్

సమధికపథ్యాకందము
గమనిక విపులయన నలరు కందమగున్."

ఇట్లు చెప్పఁబడినది. ఇందు రెండుమూడుపాదములు ఖండముగనేయుండి పైకలిసియుండవలె నను వారినియమమును బాధించెడిని. కాని మూడవశకలము నకును నాల్గవశకలమునకును సంబంధము లేదు. ఆసంబంధము ప్రథమపాద శకలద్వయమునసే పైలక్ష్యమునఁ జూపఁబట్టెడి. ఇట్టిభేదములతోనున్న నిద్దానివిశేషలక్షణమేమో దుర్గ్రాహ్యముగా నున్నది.

ఇఁక చపలార్యనుగుఱించి విచారింతము. దీని లక్షణము రత్నాకరమున—

"ఉభయార్ధయో ర్జకారౌ ద్వితీయతుర్యౌ గమధ్యగౌ యస్యాః, చపలేతినామ తస్యాః ప్రకీర్తితం నాగరాజేన" అనికలదు. అనఁగా రెండు పాదములలోను ద్వితీయ చతుర్థములు జగణములై యుండవలెననియు, నవి గురుమధ్యగతములై యుండవలెననియు నద్దానిలక్షణము. చూడుఁడు. మొదటి శకలమందలి రెండవ గణము 'ర్ధయోర్జ'-ఇయ్యది మధ్యగురువు గాన జగణము. ఇయ్యది వెనుకనున్న 'యో' అనుగురువు తోడను, ముందు 'కా' అనుగురువుతోడను నాక్రమింపఁబడి గురుద్వయమధ్యగతమైనది. ఇఁక నాల్గవగణము 'ద్వితీయ' ఇదియు మధ్యగురువే కాన జగణమైనది. ఇదియు వెనుకను 'రౌ'అనెడి గురువుయొక్కయు, "సంయోగేపరేహ్రస్వం గురుః" అను సూత్రముచే "తుర్యౌ" అనునప్పుడు రేఫ యకారసంయోగముపరమగుటచే 'తు' గురువగునుగాన పైజగణ మీగురుద్వయమధ్యగత మైనది. ఇట్లే రెండవ పాదమందునుగూడ "తినామ" జగణము. ఇది వెనుక 'లే' అనుగురువుయొక్కయు, ముందు 'త' అను గురువుయొక్కయు మధ్యగతమైనది. కాన నియ్యది చపలార్య యగుటలో సందియము లేదు ఈవిషయ మనంతుఁడు

"వరుసను ద్వితీయ మంత్యము
స్ఫురణన్ మధ్యగజకారములును దగన్ రెం
డరయఁగఁ దనర్చు నేనిన్
సరవి నదియ హరి మురారి చపలార్య యగున్."

అని చెప్పఁగా దానిని పూర్వమువలెనే సీతాపతిగారు పీఠికలో,

"వరుసను ద్వితీయ మంత్యము
స్ఫురద్గమధ్యగ జకారములు దగ రెం
డరయఁగఁ దనర్చు నేనిన్
హరీ మురారి చపలార్య యగున్."

ఈరీతిని దిద్ది చూపియున్నారు. ఇది కేవలము సంస్కృతలక్షణములో విరోధించుచున్నది. చూడుఁడు. "ద్వితీయతుర్యౌ" అని వృత్తరత్నాకరము. దీనికి "ద్వితీయ మంత్యము" అని తెనుఁగునఁ గలదు. తుర్య మనఁగా చతుర్థము; నాలుగవది యని యర్థము. అంత్య పదమున కట్టిచతుర్థార్థకత్వము లేదుగదా? సరిగదా దేని యంత్యము? పాదాంత్యమా? లేక పద్యాంత్యమా? మఱియు సంస్కృతమున 'గమధ్యగౌ' అనుదానికి "స్ఫురద్గమధ్యగజకారములు దగ రెండు," అని తెనిగింపు. దీని కొకగురువుతోఁగాని పెక్కింటితోఁగాని కూడిన మొదటిజగణములు, అనునర్థము స్ఫురించుచున్నదిగాని గురుద్వయమధ్యగతజగణ మనునర్థము స్ఫుటముగా వచ్చుటలేదు. ఇది యిట్లుండ లక్షణమే మైన పొరపడిన దనుకొన్నను లక్ష్యదృష్టికైనను సీతాపతిగారు దిద్దినది చపలార్య కాలేదు. ఏలనన మొదటిపాదమందలి రెండవది 'ద్వితీయ' జగణము. దీనికి వెనుకటిది 'సు.' ఇది లఘువుగాని గురువు కానే కాదు. ఇఁక ముందున్న 'మం' అనునది సానుస్వారము గాన గురువైనది. కాఁగా గురుమధ్యజగణము రెండవది కాలేదు. నాల్గవదన్నదో 'స్ఫురద్గ' అనునది జగణము. దీనికి వెనుక 'ము' అని లఘువున్నదిగాని గురువు లేదు. అది సమాసముకామిని పదాంశమగుటను సంయోగపరమైనను గురువు కానేరదు. ముందుమాత్రము—'మా' అనునది గురువయ్యెను. ఐన నిదియు గురుమధ్యజగణము కాలేదు. ఇఁక రెండవపాదమందుగూడ 'తనర్చు' అనుజగణము గురుమధ్యస్థము కాక వెనుక 'గ' అను లఘువుతోఁ గూడియున్నది. నాల్గవజగణము 'హరీము' అనునదిమాత్రము వెనుక 'నిన్' అనుగురువుయొక్కయు, ముందు 'రా' అను గురువుయొక్కయు మధ్యగ

మైనది. కావున నీదిద్దినపద్యము నీరీతి కొంచెము సవరించిన సరిపోవునని నానమ్మకము—

"వరుసన్ ద్వితీయతుర్య
స్ఫురద్గమధ్యగజకారములు దగ రెం
డరలం దనర్చునేనిన్
హరీ మురారి చపలార్య యనున్."

ఇట్లు సరిపోవునో యీక్రింద వివరించి చూపుదును—

'సన్—ద్వితీయ—తు' సంయోగము పరముగాన గురుమధ్య ద్వితీయజగణము.

'ర్య—స్ఫురద్గ—ము' రెంటికిని సంయోగము పరమం దున్నది గాన గురుమధ్యచతుర్థజగణము.

'లన్—తనర్చు—నే.' రెండవపాదమందలి గురుమధ్య ద్వితీయ జగణము.

'నిన్—హరీము—రా.' రెండవ పాదమందలి గురుమధ్య చతుర్థ జగణము.

ఈపై రీతిని దిద్దిన సర్వలక్షణ సమన్వయముగా నుండును. అప్పకవిగూడ నీచపలార్యవిషయమున

"సమపదముల మొదలం జగ
ణము దగ యడుగునను ద్విగణలఘువు పై
సముకొను విరతియు పదిరేన్
లముల్ మకుంద చపలకు నమరున్."

అని లక్ష్యలక్షణములఁ జూపియున్నాఁడు. ఇదిగూడ సంస్కృతలక్షణముతో విరోధించుచున్నది. ఏమన సమపాదములలో మొదట జగణమైన చాలునట. అది గురుమధ్యము కా నవసరము లేదనియే యీతని మతమున్ను. లక్ష్యము గూడ "ణముంద" అని రెండవ శకలప్రారంభమును, "లముల్ము" అని నాలవపాద ప్రారంభమును జగణముతో సాగినవి. కాని మూలమునఁగల "గమధ్యగౌజకారౌ" అనుదానికి వ్యాఖ్యాతలు "ప్రథమ గణాంత్య తృతీయ గణాద్యయోః తృతీయగణాంత్యపంచమగణాద్యయోశ్చ గుర్వక్షరయోర్మధ్యం ప్రాప్తౌ జగణౌ విత్యర్థః" అనిన్ని, "ద్వితీయ చతుర్థౌ జగణౌ ద్వయోర్గుర్వోర్మధ్యగతౌ పూర్వాపరయోర్ద్విసురుగణయోర్వా సగణభగణయోర్వా మధ్యస్థితా విత్యర్థః" అనియు వ్రాసియున్నారు. ఈలక్షణ మెంతమాత్రమును దెనుఁగున కనఁబడదు. వీ రిట్లుమార్చుకొనుటకు కత మేమో తెలియదు. ఈరీతినే సీతాపతిగారుగూడ ద్వితీయాంత్యపాదములు జగణ మాదియందు గలవైన చాలునని యన్వయించుకొని దిద్దియున్నారు. దిద్దుటలో కందము మాత్రము మారినది. లక్షణముమాత్రము పూర్వులు సంస్కృతప్రామాణికలాక్షణికులమార్గము నంటక పెడదారిని పట్టెననుటలో సందియము లేదు.

మఱియు గ్రంథమందలి రెండుమూడుచిన్నలోటులనుగూర్చి వీరు పీఠికలో వ్రాయవలసియున్నది. వ్రాయలేదు. వాని నీక్రిందఁ జూపెదను.

త్రిపద:—"సరవి బ్రాసము నంది సురపతుల్ నలువురు
హరియు నైకార్కులు కలియ
జరుగు నిప్పగిది నొప్పు త్రిపద"

అని లక్షణము. అనఁగాఁ త్రిపద మొదటిపాదమునకు నాలు గింద్రగణములును, రెండింద్రగణము, లొక సూర్యగణముచొప్పున మిగిలిన రెండుపాదములకు లక్షణ మని యర్థము. ఇది లక్ష్యసృష్టికి విరుద్ధము, దీని మూడవపాదము—

'జరుగుని' సంయోగముపరముగాన 'ని' గురువు కాఁగా 'నగ' ము.

'ప్పగిదినొ'—సంయోగము పరముగాన 'నొ' గురువు. ఇదియు 'నగ' మే.

ఈపైనవచ్చుగణము సూర్యగణము కావలెను, అట్లుగాక 'ప్పుత్రిపద' అను 'నల' మైనది. నల మింద్రగణముగాని సూర్యగణము కాదు. కాన నంతిమ పాదమునను 'జరుగుని,' 'నగ' 'ప్పగిదిని,' 'నల,' 'త్రిపద,' 'న' ఈరీతి సవరించిన సరిపడును.

వితాళమనుచౌపద:—చౌపదలలో నంత్యనియమమున్నట్లు తల్లక్షణమునఁ జెప్పియున్నాఁడు. ఆనియమ మీవితాళ మనుచౌపదలలో "రెండు, ట్లుండు,

పిండు" అనివచ్చు ౧-౨-౪ పాదాంత్యనియమము మూడవదానికొసను రాలేదు. "అందు" అని పడినది. మఱియు మూడవపాదమందు గణభ్రష్టమైనది. కొంచెము దిద్దవలెను. లక్షణమున "హరిబిరుదులపిండు" అని యున్నది. పిండు = సమూహము. అనఁగా చాలగా నుండవలెనని యపార్థము రాకుండ "రెండు" అని యనిన చాలును. ఈవిషయములు పీఠికలో లేవు. మఱియు వృషభగమనమనురగడ:—దీనికి నొకసూర్య గణము, తరువాత నొకభగణము రీతిని పాదమున కెనిమిది గణములు. ఈలక్షణము మూడుపాదములలో సరిపడి క్రమముదప్పక వచ్చుచు నాల్గవపాదమందుమాత్రము పోయినది. చూడుఁడు. 'అనిమి' 'న' 'షాధిప' 'భ' 'లఘుయ' 'న' 'తినిషగ' 'నల' 'నలరు' 'న' 'వృష భగ.' 'నల'

ఇందు నాల్గవది క్రమప్రకారము భగణము కావలసి యుండ నలమైనది. ఆరవదిగూడ నిట్లే నలమైనది. తక్కినదంతయు సరిపడియే యున్నది. మూలమున "భగణముల" అనునో 'భసనల' అను నధికపాఠము నాపేజీక్రింద వ్రాయఁబడినది. అనఁగా భగణముగాని, నలముగాని, అనునర్థము వచ్చును. ఈరీతినున్న సరి పోవును.

మఱియు హరిణగతిరగడ:—ఇందు పాదమునకు రెండుయతులవంతున వచ్చునియమము మూడవపాద ములో పోయినది.

"నిరవుగానిరు మారులఘువుల
నెల్లవారును నొగిగణింపఁగ."

అని యధోరేఖాంకితస్థలముల నిర్యతిగా నున్నది. "భానుయుతనలభసగగంబులు" అను లక్షణములోని 'గగ'మునకు లక్ష్యమున తావు లేదు. గగముతో నున్నను నడక చెడదు. ఇట్టివిషయము లింక నచ్చటచ్చట స్వల్పములు కలవు. కాని పీఠికాకారులు గ్రంథమంతయు బాగుగ పరిశీలించి విశేషవిషయముల విమర్శించియే యున్నారు. ఇట్టిస్వల్పముల వీడుటన్న నంతయిబ్బంది లేకున్నను మూలభూతములై ప్రాచీనములైనట్టి యార్యా సంస్కృతలక్ష్యములవిషయమై లాక్షణికులలో భేదము లుండుటచే వ్రాయవలసివచ్చెనని విరమింతును.



విక్టోరియా మెమోరియల్ హాల్-కలకత్తా G. V. S. M.

# 'అలంకారమంజరి'*

దేశీయులచేతను, విదేశీయులచేతను ఏకకంఠముగ లెస్సయనిపించుకొన్న తెలుగు భాషకు స్వతంత్రమయిన భాషానుశాసనము గాని, కావ్యానుశాసనముగాని లేకపోయినవి. నాడు మొదలు నేటిదనుక తెలుగుభాష సంస్కృతాశ్రయమున మెలగి మించినది. సంస్కృతమువినా తెలుగు లేకపోయినది. భాషానుశాసనమున ఒకే సంస్కృతమర్యాదలు, ఒకే సంస్కృతచ్ఛాయలు! మరి కావ్యానుశాసనమా? సర్వస్వతంత్రమయిన కావ్యానుశాసనము తెలుగున నిదివరకు పుట్టలేదు. మొదటినుండియు సంస్కృతకావ్యానుశాసనమే తెలుగుకావ్యానుశాసనము నయినది. అలంకారశాస్త్రము మున్నదున్నట్లు తెలుగునకు దిగుమతియయినది. మేలుతరము వనివాసిగని చలామణియవుచున్న కావ్యాదర్శ, చంద్రాలోక, ప్రతాపరుద్రీయాదులు చాలవరకు తెలుగునకు దిగుమతి యయినవి. సంస్కృతభాషాపరిచితి యంతగా లేనివారికీతెనుగుపరివర్తనలు మిక్కిలి యుపకరించినవి.

ఇట్లు భాషయందు, భాషానుశాసనమునందు, కావ్యానుశాసనమునందు- అన్నిటను తెలుగుసంస్కృతములకు ఉపకార్యోపకారకభావము కుదిరినది. సంస్కృతవాఙ్మయము చాలవరకు తెనుగునకు వచ్చినది. నానాటికి తెలుగుభాష మెరుగు చూపినది.

సంస్కృతము దైవవాక్కు, తల్లిభాష. అపారమయిన, అపూర్వమయిన వాఙ్మయము దానియందు గలదు. కావుననే రసప్రలుబ్ధులు దానిని మెచ్చి యాదరించిరి. ఇది కేవలము రసప్రలోభమే కాక సహృదయతకూడ నవును. మంచి యెందున్నను గ్రహించుట సహృదయత్వమునకు లక్షణము. తెనుగు వాఙ్మయానుశాసకులు రసప్రలుబ్ధులు; సహృదయులు. సంస్కృతభాషకు గల ప్రాబల్యము, వైశిష్ట్యము వారి నాదెసకు ఆవర్జించినవి. కాని యీసహృదయతతోబాటు ఆత్మస్మరణముగూడ నుండిన బాగుండెను. ఇప్పట్టున వారి కాత్మవిస్మరణము కూడని పని యైనది.

ఉపోద్ఘాతరూపముగ నప్రస్తుతము, బహువిచార్యమునయిన యంశమును చేపట్టట యయినది. ప్రకృత మనుసరింతము.

ఈ 'అలంకారమంజరి' మమ్మటుని కావ్యప్రకాశమునకు సమగ్రము, యథామూలము నయిన- యనుకరణముగాదు గాని ముక్కాలుమువ్వీస మదియే యవును. రచ

* రచయిత: యస్. వి. రాఘవయ్యంగారు, యం. ఏ., బెజవాడ. క్రౌనుసైజున 300 పుటలు.

నావిధానమును అచ్చమదియే-సూత్రములు, వివృతి, యుదాహరణములు. మూలములోని కారిక లిందు సూత్రములయినవి. ఉదాహరణపద్యము లనుకరణములుకొన్ని, స్వయము కూర్చినవి కొన్ని. కావ్యప్రకాశానుకరణమే యయ్యును అదనుపడినచోటుల తదితర గ్రంథ పరామర్శమును చేయబడినది. మొత్తము మీద కావ్యప్రకాశముగీచిన గిరిగీతలలోనే నడచి 'అలంకారమంజరి' అలంకారశాస్త్ర విమర్శగ్రంథ మయినది.

అలంకారశాస్త్రసంజ్ఞవలెనే యలంకార మంజరి యనుపేరుగూడ ప్రాధాన్యవ్యపదేశమున నిర్దేశింపబడినది. కేవల మొక్క యలంకారములేకాక సమగ్ర కావ్యలక్షణములు నిందు పొందుపరుపబడినవి.

ఇందు మొత్తము తొమ్మిది సుమములు గలవు. మొదటిదానియందు కావ్యము, కావ్యసాధనములు, కావ్యభేదములును, రెండవదానియందు త్రివిధశబ్దములును, మూడవదానియందు త్రివిధార్థములును, నాలవదానియందు ధ్వనికావ్యము, తద్భేదములును, అయిదవదానియందు రసస్వరూపము, రసధ్వనులును, ఆరవదానియందు మధ్యమకావ్యమనబరగిన గుణీభూతవ్యంగ్యము, తద్భేదములును, ఏడవదానియందు అధమకావ్యము, తద్భేదములును, ఎనిమిదవదానియందు కావ్యగుణముల స్వరూపమును, తొమ్మిదవదానియందు అలంకారములును నిరూపింపబడినవి. విషయగౌరవము, వివృతిపరిశీలనము కారణములయి 'అలంకారమంజరి' ఆలంకారిక సహృదయలోకమున వాసిల్లగలదని యభివాంఛితము.

ఒక్కభాషను మరియొక్కభాషకు పరివర్తనముజేయుట యనునది సుళువయిన సంగతికాదు. ఇది సర్వసామాన్యమయిన మాట. ఇక శాస్త్రగ్రంథములమాట మరీ విశిష్టము. స్వతంత్రరచనలకెన్నిటికేని యుద్యమింపవచ్చును, తేరవచ్చునుగాని పరివర్తనములకు శ్రమ మిక్కిలి యవసరము. ఉభయభాషలయందును కుంఠితముకాని పాండితి యావశ్యకము. భాషా సంప్రదాయముల మెరుక వలయును. విషయపరిజ్ఞానము లెస్సయుండవలయును. ఇన్నింటిసాహచర్యమున జేపట్టిన పరివర్తనము కుదుటబడి సహృదయాదరమును చూరగొనును. కానప్పుడు పరివర్త్యవిషయమును కించపరచుట, జిజ్ఞాసువుల నపథమును పట్టించుట యవును. ఇవి రెండును కూడనిపనులని యభిప్రాయము.

ఉభయభాషలయందుగాదు, మూడు భాషలయందు చక్కని పరిచితి యలవరిచి కొన్న యీరచయితలు యథామతి, యథారుచి యీ 'అలంకారమంజరి'ని గూర్చిరి. ఉత్సాహముతో, తెంపుతో నీకార్యమునకు తలపడినారు; కూడినంతవట్టు రచన చక్కగా సాగించినారు. విషయము గంభీరమైనది, అపారమైనది. విభిన్నసంప్రదాయములుగల

భాష! ఈయవకాశములందు ఎట్టి ధీమంతుల కేని ప్రమాదములు తప్పవు. అట్టిప్రమాద ములు ఇందును-కొంచెమెక్కువగనే యుండ వచ్చును-ఉన్నవన్నచో వెలిగుపడనవసరము కనుపించదు. మరి వాటిని శృంగగ్రాహికగ నెన్నుట గ్రంథవిస్తృతికి హేతువగుట పొస గదు; కూడదుగూడ. గుణములనుమాత్ర మెన్నుట సహృదయునకు పాడి. అయినను రచయిత యాత్మావలోకనమునకైన నుప కరించు నను సౌహార్దమున గొన్నిటిని చూ పవలతును. రచయితయు నదేసౌహార్దమున నీ విమర్శనమును పాటించుట మంచిది. ఈ మచ్చుల జిత్తగించినచో నిట్టినెరసులు శాస్త్ర ములయం దెంతయుపేక్షింపదగినవో గోచ రమవును. కావుననే యిట్టిపట్టుల నప్రమత్తత కూడదంటిని.

'విశేషణము క్షీణశక్తి గలదగుటచే విశేష్య మభిధను పొందదు.'

('విశేష్యం నాభిధా గచ్ఛేత్ క్షీణశక్తి ర్విశేషణే'.)

'అభిధ, లక్షణ, వ్యంజన యని శబ్దము మూడు విధములుగ విభజింపబడినట్లే యర్థముకూడ వాచ్యము, లక్ష్యము, వ్యంగ్యమని మూడుతెరగుల బిలువబడు చున్నది.'

వాచకము, లక్షకము, వ్యంజకము నని శబ్దము విభజింపబడినదిగాని అభిధ, లక్షణ, వ్యంజన యనికాదు.

'మఱియు కావ్యశోభాకర్తారములైన ధర్మములే గుణములనియు, కావ్యాతిశయహేతుభూతములయినవే యలంకారము లనియు......'

(కావ్యశోభాకర్తారో ధర్మా గుణాః, తదతిశయహేతవ స్త్వలంకారాః)

'ఈకావ్యమునందు (అవరకావ్యమునందు) గుణ ములు ప్రధానము లగుటవలన నిది శబ్దార్థచిత్రముల చెలు వొందును.'

'గుణప్రాధాన్యత స్తత్ర స్థితి శ్చిత్రార్థశబ్ద యోః.'అవరకావ్యభేదములయిన శబ్దచిత్రార్థ చిత్రములయందు శబ్దార్థశబ్దములకు గుణత్వ మునను, ప్రాధాన్యమునను అవస్థితియని. అనగా శబ్దచిత్రమునందు శబ్దమునకు ప్రాధా న్యము, అర్థమునకు అప్రాధాన్యము (గుణ త్వము). అట్లే అర్థచిత్రమునందును అర్థము నకు ప్రాధాన్యము, శబ్దమున కప్రాధాన్యము. అంతేకాని శబ్దచిత్రమున అర్థచిత్రత్వము లేదని కాని, అర్థచిత్రమున శబ్దచిత్రత్వము లేదనికాని కాదు.

ఇవి స్థూలదృష్టికిగూడ నవుపించు కొన్ని. ఒక్కమారు సింహావలోకనము చేసి కొన్నచో రచయితకే యిట్టివి పెక్కులు పొడసూపును.

సహృదయు లీ 'యలంకారమంజరి'ని సౌహార్దమున పరిశీలించి, గుణములను గ్రహించి, దోషముల నెరుకపరచుచో రచ యిత వానిని దిద్దుకొనుట కవకాశము చిక్కును. రచయితయు, నేమరుపాటున దార సిల్లిన ప్రమాదములను సవరించుకొనుట తగవు. ఈ యుత్సాహమే యిబ్బడియయి వాఙ్మయసేవ నీవిధముగనే చేయుటయు తగవు.

పాఠకులును మందగతిని తెలుగున బడుచున్న శాస్త్రవాఙ్మయము నుపలక్షించియైనను 'అలంకారమంజరి'లోని ప్రమాదములను సవరించుకొనుట వారికిని భాషాసేవకర్తవ్యము నొడగూర్చును.

'అలంకారమంజరి'యు తనలోని చెడునలుసులను బయలుపడనీక, కావ్యప్రకాశమునకు తెలుగురూపమై స్వయము విలసిల్లి, కూర్పరికిని కీర్తిప్రతిష్ఠల నార్జించగలదు.

---

## మే ఘా లో క ము

గుఱ్ఱం వేంకటసుబ్రహ్మణ్యాం

నీలవపుర్విలాసరమణీయము మేఘము కాదు నందగో
పాలునిమూర్తి, చిత్రరుచి వజ్రధనుస్సును గాదు బర్హమ
న్మాళియ, స్వచ్ఛధార లసమానతదీయకృపామృతమ్ము, వ్యా
లోలసువర్ణరేఖలు విలూనధృతిం జను గోపికాంగనల్.

వ్యోమమె గొల్లపల్లియ, పయోదమె కృష్ణుఁడు లోకమోహనుం,
డీమహదాతపార్తి నమయించుటె రాక్షసనాశకర్మ, సౌ
దామిని రాధికారమణి, తా నవతారము దాల్చుచుండు గో
క్షేమకరుండు సర్వజనసేవితుఁ డిట్లు సనాతనంబుగన్.

ఉత్తరాశాంకమ్ము నొత్తెడుచిఱుమబ్బు బాలకృష్ణుఁడుసుమ్ము పాలుగాఱు
అమృతాంశుబింబమ్ము నల్లనఁ గబళించుచున్న నల్లనిమబ్బు వెన్నదొంగ
అద్రిపార్శ్వమ్ముల నాలమందలమధ్య నందహాయమబ్బు గోవిందుఁడౌను
శంపాపరీరంభ సంరంభహామబ్బు రాధికారమణుఁ డుల్లాసమూర్తి
మరులుగొల్పెడిత తెమ్మబ్బు మరునితండ్రి-వసుధ వసుమాలహామబ్బు వాసుదేవుఁ
డవుట నుతియింతు నీసరసాంతరాత్ముఁ-మాక్తికాధారు మానసోన్మాదహంసు.

---

# సుభద్ర

ఇరువంటి విష్ణురావు బి. ఏ. బి. యల్.

## ప్రథమాంకము

### రంగము ౧.

[వెంకటియింటిలోని దేవతార్చనపుగది. తూర్పువయిపుగోడకు జేర్చి మూలగా చిన్నమంటప ముండును. గోడలకు దేవులయొక్కయు, భక్తులయొక్కయు పటములు వ్రేలాడుచుండును. గదివుత్తరము వయిపున వంటయింటిలోనికి ఒకగుమ్మమును, తూర్పుగా దొడ్డిలోనికి ఒకగుమ్మమును, పడమటగా యింటి ముందరిభాగముకు ఒకగుమ్మమును కలవు.

మంటపముకు ఎదురుగా తూర్పువయిపు తిరిగి పుల్లావుధానులు విభూతిపూసుకొంటూ పూజచేసికొను చుండును. ౫౦ సంవత్సరముల వయస్సు గలవాడు. నున్నగా క్షౌరముచేయించుకొని, వెనుక గోష్పాదమంత జుట్టుమాత్రము మిగిల్చినాడు. పెద్దబొజ్జకలిగి విఘ్నేశ్వరునివలె జూపట్టుచుండును. బాసింపట్టు వేసుకొని కూర్చుండి, మొలకుచుట్టుకొన్న అంగవస్త్రము పైకి ఎగతీసుకొని యింకొక చిన్న తడిగామంచాతో చమట తుడుచుకొంటున్నాడు.]

(ముక్కుమూసుకొని బిగ్గరగా)

ఓం భోర్భువస్వః, ఓం తత్సవితుర్వరేణ్యం, భర్గో దేవస్యధీమహిః, ధీయోయోనః ప్రచోదయాత్—(హఠాత్తుగా) ఒసేయి పాడుముండా యిలారా—ఓం భువః, ఓం శివః, ఓం—చచ్చావాఏమి చే-ఓంతపః

(వంటయింటిలోనుంచి కన్నులు వత్తుకొనుచూ తడిసినబడ్డకట్టుకొని వంటజేయుచున్న సుభద్ర గొణుగుకొంటూ ప్రవేశించును. సుభద్ర పద్దెనిమిదేండ్లపడుచు పిల్ల. విధవఅగుటచేత తలపై సుడ్డ కప్పుకొనియున్నది. తెల్లనిదేహచ్ఛాయ కలిగి మిక్కిలి జాలికరముగా నుండును.)

సుభద్ర—పుట్టినప్పటినుండి ముండ ముండ అని తిట్టే యీగతికి తెచ్చావు.

పుల్లావు—ఏంచేవు కళ్లు నెత్తి కెక్కుతున్నాయే. నెఘవముండవు నోరుమూసుకొని పడివుండక (చిన్న దారపుపోగును చూపిస్తూ) ఏమిటది?

సుభద్ర—(వంగిచూస్తూ) దారములాగావుంది.

పుల్లావు—అలావుందీమాలకొంప. దరిద్రకొట్టు ముండవు. మడీలేదు. మైలాలేదు. తీసెయ్యి.

సుభద్ర—నేను మడికట్టుకున్నాను, ఎల్లాగ.

పుల్లావు—మళ్లీకట్టుకో.

(సుభద్ర తలవంచుకొని అనుమానిస్తూతీయును)

పుల్లావు—అదేదీ?

సుభద్ర—అదెవరు?

పుల్లావు—నీతల్లి.

సుభద్ర—చచ్చి స్వర్గానవున్నదికా.

పుల్లావు—అదికాదే, నీసవతితల్లి.

సుభద్ర—ఏమో (అని పెరటిలోనికి బోవును.)

పుల్లావు—(బిగ్గరగా) ఒసేయి, పిల్లా, పిల్లా, వింటేగా.....పిల్లా.

(ఒకనిముషానికి కమల వయ్యారముగా నడుస్తూ, ఒకచెయ్యి నడుముమీద పెట్టుకొని, యింకొకచేతిలోని గులాబిపువ్వును వాసనజూచుచూ, తిప్పుకుంటూ సన్నగా పాడుకొంటూ ప్రవేశించును. చెవులకు నీలపురాళ్ల పెద్దలోలాకులు పెట్టుకొని, వాలుజెడవేసుకొని, సిల్కు జాకెట్టు పట్టుచీరతో అతినాజూకుగా, అతిషోకుగా తేలుతూ ఎసురుతూ వస్తున్నట్లు వచ్చును.)

......"నేమ్రొక్కిన మ్రొక్కులు సఫలము లయితే, మగని కళ్లుపోతే-

నేమ్రొక్కిన మ్రొక్కులు సఫలము లయితే, యీ పాడుమగనికళ్లుపోతే (పుల్లావుధానులనుజూపించుచూ) ముంగిటవుండే మునీశ్వరునికి నే......"

పుల్లావు—నీతాడుతెగ, ఏమిటేపాట.

కమల—నాతాడు తెగితే సుభద్రకుమల్లేగుండు చేయిస్తారుకాబోలు. నాకు వద్దుబాబూ. కళ్లుపోయి నెయ్యేళ్లు వర్ధిల్లు, అంతేచాలు.

పుల్లావు—ఓసి నిన్తగలెయ్య. మొగుడుతో యిలాగటే మాట్లాడడము.

కమల—మొగుడు మొద్దులుకాను. గేదెలాగ అలా అఱిచావు ఎందుకు?

పుల్లావు—ఆసుభద్రముండకాస్త మయిలపడింది. నీవేమైనా మడితోవున్నావేమో ఆచెంబుయిలాగ యిస్తావేమో అని పిలిచాను.

కమల—లేచి తెచ్చుకోలేవూ. నవుకర్లుకావాలి కాబోలు.

పుల్లావు—(పొట్టచూపిస్తూ) ఎలాగే.

కమల—దొర్లవచ్చుగా.

పుల్లావు—నీమాటల కేమిలే. మడా మైలా.

కమల—కావలసినంతమడి.

పుల్లావు—ఇప్పుడు జడవేసుకొని పువ్వులు పెట్టుకొన్నట్లుంది.

కమల—(ఒకపాదమువీద గిర్రున ఒకచుట్టు చుట్టి) ఏదీ. ఎలావున్నాను ఇప్పుడు?

పుల్లావు—చక్కనిచుక్క. ఇలాగరా.

కమల—(అక్కడనుంచియే) వచ్చానుగా

పుల్లావు—దగ్గఱికి.

కమల—నాకుచెవుడులేదు, చెప్పు.

పుల్లావు—అదోరహస్యము. మాట.

కమల—అన్నట్లు మఱచిపోయాను, ఆకంసాలి వచ్చాడు. నా కోయిరవయిరూపాయిలుకావాలి

పుల్లావు—ఇప్పుడిరవయిరూపాయి లెందుకే.

కమల—ఆలోలాకులు పుచ్చుకొన్నానుగా.

పుల్లావు—ఇలాగవస్తే యిస్తాను.

కమల—ఇస్తే వస్తాను.

పుల్లావు—పెంకిభడవా, ఇదిగో, పెట్టె తీసి తీసుకో.

(అని తాళముచెవి చూపించును. కమల చేతిలోనిది లాగుకొనిపోవును.)

(ఇంతలో సుభద్ర ప్రవేశించును. ఆమెను జూచి)

పుల్లావు—ఏమిటాషికార్లు. ఈరోజింతకూడు పడేస్తావా లేదా. పదకొండు కావచ్చింది.

సుభద్ర—వంట అయింది. స్నానం చేసిరండి.

పుల్లావు—నీకేమి మతిపోతూవున్నదా ఏమిటి? మళ్లీ స్నానమెందుకు?

సుభద్ర—పిన్ని ముట్టుకొన్నదికదండీ.

పుల్లావు—ఓసి, నీఅదృష్టానికి తోడు నుడ్డిదానవు అవుతున్నావా ఏమిటే పారబ్ధం.

సుభద్ర—ఆపూజ లేమిటీ, యీచేష్ట లేమిటి.

పుల్లావు—ఓసి వెధవముండా (అని చేతిలోని వుద్ధరిణి సుభద్రపై గిరవాటువేసి వంటయింటిలోనికి పోవును. సుభద్ర తడిగుడ్డచెంగుతో నొసటకారుచున్న రక్తమును అద్దుకొనుచుండును.)

౨-వ రంగము

(వంటయింటికానుకొనియున్న కొట్టుగదిలో, శనగలబస్తాపై కూర్చుండి, చట్రములేని చిన్నఅద్దములో చూచుకొనుచు, నొసట తగిలినదెబ్బకు సున్నముపట్టించుకొనుచూ సుభద్ర యుండును. ఇంతలో కమల ప్రవేశించును.)

కమల—తల కాబొప్పిఏమిటమ్మా.

సుభద్ర—తలుపుతగిలింది.

కమల—(సుభద్రభుజముపై చెయ్యివేసి) అబద్ధాలెందుకు ఆడతావుసుభద్రా.

సుభద్ర—(జవాబుచెప్ప లేక ఏడ్చును.)

కమల—ఎందుకు సుభద్రా ఏడుస్తావు.

సుభద్ర—..................

కమల—చెప్పవు?

సుభద్ర—నే నెందుకుపుట్టానా అని.

కమల—నేను సవతితల్లిని అని కోపమా.

సుభద్ర—నా కెవ్వరిమీదకోపము లేదు.

కమల—నువ్వు నేను ఒక్క యీడువాళ్లముకదా. స్నేహితుల్లాగ వుండకూడదు సుభద్రా.

సుభద్ర—ఎందుకువుండకూడదుపిన్నీ.

కమల—మరి 'పిన్ని' అని పిలవటము మానేసి 'కమలా' అని పిలు.

సుభద్ర—అలాగే కమలా.

కమల—మరి ఎందుకేడుస్తున్నావో చెప్పు.

సుభద్ర—నేను పుట్టినందుకేనమ్మా.

కమల—అదికాదు. ఏదో కొత్తసంగతుంది.

సుభద్ర—నామఅనులమీద మనోవర్తికి నాన్న దావా చేస్తానంటున్నాడు.

కమల—అవును, అంటున్నాడు.

సుభద్ర—కోర్టెక్కటానికి సిగ్గేసి చచ్చిపోతూ వున్నాను.

కమల—అలాగే సిగ్గుగానే వుంటుంది.

సుభద్ర—ఏమూతిలోనో దిగాలనివుంది.

కమల—తప్పు, అలా అనకూడదు. ఎవరు చెప్ప వచ్చారు, ముందేమి జరగబోతుందో.

సుభద్ర—జరగవలసినవన్నీ ఎప్పుడో జరిగి పోయాయి. నాకింకా యీజన్మాన సుఖమున్నదా కమలా.

కమల—ఇంకా యాభై ఏండ్లు బ్రతకాలి. నిస్పృహచేసికొంటే ఎలా.

సుభద్ర—రోజులులాగవున్నాయి మరి.

కమల—భర్తలేక నీవు, భర్తవుండి నేను వైధవ్యము అనుభవిస్తున్నాము. ఒకరికొకరు తోడుగా లేక పోతే బ్రతకడమేలాగ.

సుభద్ర—ఒక్కొక్కసారి అందరిని చంపెయ్యాలని వుంటుంది.

కమల—అవును, అదిగో మీనాన్న గొంతుక వినబడుతూంది. వచ్చినట్లున్నాడు. పోదాం పద.

(నిష్క్రమి—)

౩-వ రంగము

(పుల్లావుధానులు, వీరావుధానులు ఏదో ఆలోచించుచూ, వీధి వసారాలోనికివత్తురు. వీరావుధానులుకు ౫౫ సంవత్సరములవయస్సుండును. చంకలో ఒక తడి అంగవస్త్రంచుట్ట చుట్టిపెట్టుకొని మాటిమాటికి తుడుచుకొనుచుండును. చొక్కాకాని, వుత్తరీయముకాని లేదు.)

పుల్లావు—దావాచెయ్యాలి ఏమైనాసరే.

వీరావు—తప్పదు.

పుల్లావు—వాళ్లని పాలెయ్యాలి. అప్పటికి కాని లొంగరు.

వీరావు—అవునవును.

పుల్లావు—ఎంతయిస్తారంటావు కోర్టువారుమనోవర్తి.

వీరావు—సాలుకిమూడువందలయినా యివ్వాలి.

పుల్లావు—మూడువందలే, మూ డు వం ద లు, సాలుకి, యికనేం. ఏదీ రేపే చేసేద్దాం.

వీరావు—డబ్బుచూసుకొంటే సరి.

పుల్లావు—ఎంతకావాల్సి వుంటుందేమిటి.

వీరావు—ఓనూరురూపాయిలు సర్దుబాటుచెయ్యి. సగంపయికూ గ్రంథం నడుస్తుంది.

పుల్లావు—నూరురూపాయిలు కావాలటయ్యా.

వీరావు—ఒక్కదమ్మిడీతగ్గితే పనిజరగదు.

పుల్లావు—ఈ ఖర్చులన్నీ ఆ ముండావాళ్లవల్ల వస్తాయా.

వీరావు—పైసాతోటి.

పుల్లావు—ఏమిటి, బండిఅద్దెతో కూడానా.

వీరావు—తమలపాకు కిళ్లీతో సహా మళ్లీమాట్లాడ కుండా.

పుల్లావు—మా దిట్టమయిన ప్లీడరుని మాట్లాడాలిసుమా.

వీరావు—సింహంలాంటివాడిని. బల్ల గుద్దాడంటే మళ్లీ ముక్కలయిపోవాలి. అల్లాంటివాడిని చూచిపెడుతా.

పుల్లావు—దిట్టమైనవాడివయ్యా వీరావుధానులూ.

వీరావు—కోర్టులలో నెరిసిపోయింది యీజుట్టు.

పుల్లావు—హరి, నీతస్సా, సరే, రేపు. (నిష్క్రమి)

## ద్వితీయాంకము

### ౧-వ రంగము

(ప్లీడరు పార్వతీశము కుర్చీలో జేర్లబడి గోళ్లుగిల్లుకుంటూ వూహాసముద్రములో వూగులాడుచున్నాడు. గదిఅంతయూ చక్కగా అలంకరించబడియున్నది. ఎత్తయినబీరువాలనిండా పుస్తకములున్నవి. బల్లమీద కూడ చాలాపుస్తకములు పేర్చబడియున్నవి. సోఫాలతోను, కుర్చీలతోను గది నిండియున్నది.

ఇంతలో 'ప్లీడరుగారూ' అని పిలుపు వినబడుతుంది. పార్వతీశము వులికిపడి సరిగా కూర్చుని కంటిఅద్దములు సవరించుకొని, పెద్దపుస్తక మొకటి తెఱచి చదువుచున్నట్లు నటించుచూ 'రండి' అనును.

పార్వతీశముకు ౨౫,౨౬ సంవత్సరములవయస్సుండును. సిల్కుచొక్కా తొడుగుకొని, చేతికి బంగారురిష్టువాచి పెట్టుకొని, నాజూకుగా, తెలివిగలవాడుగా కనిపించును.)

(వీరావుధానులు ప్రవేశించును.)

పార్వ—కూర్చోండి.

వీరావు—అయ్యా (కుర్చీలో కూర్చుండును.)

పార్వ—..................

వీరావు—మీ దీవూరేనాండి?

పార్వ—కాదు, రాజమండ్రి.

వీరావు—ఎంతకాలమునుంచి ప్రాక్టీసు చేస్తున్నారండి.

పార్వ—(సంకోచించుచూ) రెండేండ్లనుంచీ.

వీరావు—క్రిందటేడు మీదర్శనముకాలేదండి.

పార్వ—(వూరుకొనును)

వీరావు—మాదిభీమేశ్వరము లెండి. ఈ జిల్లాలో అన్నికోర్టులలోను తిరుగుతూ వుంటానులెండి.

పార్వ—అలాగాండి.

వీరావు—తణుకులో సోమేశ్వర రావుగారు, భీమవరంలో రామారావుగారు, నరసాపురంలో కాంతంగారు, ఏలూరులో వెంకట్రామయ్యగారు అందరూ నాకు ముఖ్యంగా కావలసినవారు. చాలా ఆప్తులులెండి.

పార్వ—అలాగాండి.

వీరావు—ఈవూరిలో ప్లీడర్లందరిలోను మీరు చాలాబుద్ధిమంతులని, బాగా చదువుతారని వాడుకపడిందండి అప్పుడే. అదృష్టవంతులు. ఏమైనా ఫయిలు వస్తూందాండి.

పార్వ—ఏదోవస్తూందిలెండి.

వీరావు—మిమ్మల్ని చూసేటప్పటికి ఆనందంగా వుందండి. మీకూ నాకూ కలిసింది. చూడండి నావల్ల ఎంతఫయిలువస్తుందో. అల్లాడి కృష్ణస్వామయ్యరు అంతవేగు తెప్పిస్తాను.

పార్వ—అలాగాండి.

వీరావు—మనోవర్తిదావాలలో ఫీజు ఎలాగ పుచ్చుకొంటున్నారండి.

పార్వ—(సంకోచముతో) సాలుకి మనోవర్తి ఎంతకోగుతారు.

వీరావు—మూడువందలరూపాయిలు.

పార్వ—(వెనుదీయుచూ) ఒక సంవత్సరము మనోవర్తి పుచ్చుకొంటున్నాము.

వీరావు—(చిర్రున కుర్చీ వెనుకకునెట్టి లేచినిలుచుంటూ) మూడువందలరూపాయిలు ఫీజే (అనిగదిని, పార్వతీశమును క్రిందికి పైకి కలయజూచును.)

పార్వ—(తగ్గి) ఇచ్చేవాళ్లదగ్గిర పుచ్చుకొంటున్నాము.

వీరావు—ఇవ్వనివాళ్ల దగ్గిర ?

పార్వ—ఇవ్వకపోతేపుచ్చుకోనేదేమిటి.

వీరావు—మాబోటివాళ్లని తోసెయ్యకండి—రోజులుచూడండి. కాని రోజులు. పార్టీలుమాత్రముఎక్కడినుంచి తెస్తారు. పదిరూపాయిలుయిప్పిస్తాను. చేసిపెట్టండి

పార్వ—పదిరూపాయిలా. చాలా తక్కువ. ముప్ఫయిరూపాయిలుయిస్తే చేస్తాను.

వీరావు—ముప్ఫయిరూపాయిలు యిచ్చేట్టయితే మీదగ్గిర కెందుకండీ రావటం (అనిలేచును.)

పార్వ—(నొచ్చుకొనును)

వీరావు—(వెళ్లిపోబోవును)

పార్వ—సొమ్ము వసూలు అయినతరువాత యిద్దురుకానిలెండి.

వీరావు—వసూలు అయితే మీసంగతి మఱచిపోతామా. ఏదో ముట్టచెపుతాములెండి.

పార్వ—సరే, పార్టీలుఏరీ.

వీరావు—పాపరుదావాకు ప్రస్తుతము ఖర్చులు ఏమాత్రమవుతాయండి.

పార్వ—పది రూపాయిలుంటే కథనడుస్తుంది.

వీరావు—మీరేమి చాలాఘోరంగా చెప్తున్నారేమిటండి. సరేలెండి. ఇదిగో పదిహేను రూపాయిలు ప్రస్తుతము. వాళ్లని మళ్లీ డబ్బు అడిగి బెదరకొట్టేయకండి. (నిష్క్రమి)

పార్వ—అలావుంది—యీ వుద్యోగము...... పోనీలే. యిదోవకాలతనామాఅంటూవచ్చింది. అదేచాలు.

(ఇంతలో వీరావుధానులు, పుల్లావుధానులు, సుభద్ర ప్రవేశింతురు)

పార్వ—కూర్చోండి.

(వీరావుధానులు, పుల్లావుధానులు కుర్చీలలో కూర్చుందురు. తండ్రివెనుక సుభద్ర నిలుచుండును.)

వీరా—వీరే ప్లీడరుగారు.

పుల్లావు—దీర్ఘాయుష్య సిద్ధిరస్తు.

వీరావు—చాలా గొప్ప కుటుంబములోవారు. మీ నాన్నగారు ఏమిపనిచేశారండి.

పార్వ—తహసీలుదారు.

పుల్లావు—ఆ! బాగున్నారాండి.

పార్వ—ఆ.

వీరావు—అదృష్టవంతులు, వారికేం...మీఅన్నగారికేమిపని అండి.

పార్వ—ఇంజనీరు.

వీరావు—పెద్దయింజనీరే.

పార్వ—ఆ.

వీరావు—చూశావా.

పుల్లావు—అల్లాంటి వుద్యోగస్థులతో ప్రాపకం వుండాలిగాని.

వీరావు—ఎక్కడా తప్పకుండా చదువుకు వచ్చినట్లుండండి.

పార్వ—ఎక్కడా. ౨౦ ఏండ్లకల్లా బి. ఏ. బి. యల్. ప్యాసయ్యా.

వీరావు—సరస్వతీప్రసన్నమంటే అదీ. ఎంత డబ్బువుంటే ఏమిలాభం.

పుల్లావు—కాదుమరీ.

వీరావు—ఇలాగంటి వారికి వుద్యోగస్థులంటే ప్రేమకూడా వుంటుంది.

పుల్లావు—కాదుమరి.

వీరావు—ఎప్పుడూ చూస్తూవుంటానుగా, కోర్టులో ఎంతచక్కగా ఆర్గ్యుమెంటు చెప్తుతారు అనుకొన్నావు. మొన్న రెండుగంటలు హోరాహోరీగా పోట్లాడుతున్నారు మునసబుగారితోటి. (పార్వతీశమువైపు తిరిగి) ఏమిటండి ఆదావా.

పార్వ—అదా, వారసత్వందావా. పదివేలరూపాయిల ఆస్తికోసం ౬ సంవత్సరాలనుంచి అలాజరుగుతూ వచ్చింది.

వీరా—ఏమయిందండి ఆఖరుకు. తీర్పుచెప్పారా.

పార్వ—ఆ మేమేగెలిచాము.

(అని సుభద్రవైపు జూచును. ఆతనిని జూచుచున్న సుభద్రతలవంచుకొనును.)

వీరావు—దిట్టమయినవారే. వయస్సుచిన్నదైనా బుద్ధిగొప్పది.

పుల్లావు—కాదుమరి.

వీరావు—మీదావాసంగతి ఏదీ బాబుగారితో చెప్పండి.

పార్వ—(కాగితము, కలము తీయును. సుభద్రవైపుతిరిగి) ఇందాకటినుంచి నిలుచున్నారు. కూరుచోండి అలాగ బల్లమీద.

పుల్లావు—(చెప్పుచుండును.)

పార్వ—వినుచున్నట్లు వ్రాయుచూ సుభద్రవైపు జూచుచుండును. (సశేషము)

# చీకటితప్పు

వేలూరి శివరామశాస్త్రి, శతావధాని

## ౧

### (క)

కర్మభూమియందలి కన్యకామణు లందఱవలెనే చూడమ్మకును ఎనిమిదవయేఁటనే తాళిపడెను. చాలమంది కన్యకామణులవలెనే తొమ్మిదవయేఁట తెగెను. 'ఇదిగోఁ బసుపు, అదిగో ముసుఁగు!'

చూడమ్మకు తల్లిదండ్రులు చేసిన పెండ్లి గుఱుతు లేదు. కాని తానును సుబ్బారావును చేసికొనిన పెండ్లి నేఁటికిని గుఱుతు. మగనిచావు గుఱుతులేదుకాని ఆదినములలో వియ్యాలవారును, తనతల్లియు చేసిన యుద్ధము హృత్కవిలె. విశేషించి నాఁడు తనతల్లి మాణిక్యము చేసిన ముద్దు చూడమ్మకాతాలో పెద్దపద్దు.

'ఓసి ముండాహాఁతురా! పూర్వజన్మంలో ఎవరితాడో తెంపావు, ఇప్పు డిల్లా తెంపుకున్నావు. అత్తిల్లు అవడోలుచేసి మాయింట్లో అంగడి పఱుచు క్కూచున్నావు' అని మాణిక్యము చూడమ్మను వేదాంతశాస్త్రముతో తిట్టెను.

సంఘమువారుగూడ నపు డూరక చూచుచుఁ గూరుచుండలేను. 'ఎన్నఁడూ లేని బాపనోరి ఆచారం మొదలుపెట్టితే జెడిసిక్కొట్టదూ?' అని వారు సనాతనమతముతో తిట్టిరి.

చూడమ్మతండ్రిపేరు రామస్వామిగుప్త. ఇంటిపేరు జనములవారు. అతనికి కోస్తావ్యాపారమును, బట్టల అంగడియు, వడ్డిమరయును గలవు. "చిల్లర శ్రీమహాలక్ష్మి" యని యతఁడు చిల్లర దుకాణమును విడనాడలేదు. చిన్ననాఁడే అతఁడు బి. ఏ. పరీక్ష ప్యాసాయెను. ఇంత లౌకికసంపత్తి యున్నను కొన్ని ప్రాంతములలోఁ గల 'మధ్యాహ్నపు మాదిగవాళ్లు' అను కళంకము నతఁడు తన యాచారముచే క్షాళన చేసివయిచెను. గర్భాష్టమములలో కన్యాదానముచేసి దానిఫలము నతఁడు దక్కించుకొనఁ గలిగెను గాని అల్లుని మాత్రము దక్కించుకొనలేకపోయెను. దేవుఁడు చేసినదాని కెవఁడేమి చేయఁగలఁడు?

తల్లి కనుఁగొనిన పూర్వజన్మదోషమును, సాంఘికులు కనుఁగొనిన పరధర్మావలంబనమును, తండ్రి కనుఁగొనిన దైవేచ్ఛయుఁ గలిసి లోకకల్యాణముగా మాఱి చూడమ్మపుస్తెను పుటుక్కున త్రెంపి వయిచెను.

తానును సుబ్బారావును గలిసి చేసికొనిన పెండ్లి నేఁటికిని చూడమ్మకు గుఱుతు. ఈపెండ్లిగుఱు తుండుటకు చాలఁ గారణములు గలవు. చూడమ్మకు సుబ్బారావు హంసాయీ. అతఁడు తండ్రిని బలిగొనిపుట్టెను. పదపడి గుప్తదంపతుల యింటిలో మగపిల్లలు లేని లోటును తీర్చెను.

పెండ్లి కాకమునుపు చూడమ్మసుబ్బారావులు పలుమాఱులు పెండ్లియాట లాడుకొనిరి. ప్రతి పర్యాయమును సుబ్బారావు ఏదియో కారణమున—సరియగు కారణమే కావచ్చును: కారపు పూసయో, జిలేబియో తక్కువ వచ్చియుండును గావున అతఁడు అలిగి పెండ్లిపీటఁమీఁదనుండి లేచిలేచి పోయెడివాఁడు. చూడమ్మ ఏఱుకొని ఒడిలో దాఁచికొనిన పది పెద్దపకోడీలు శుల్కముగా పుచ్చుకొనినపిదపనే కుదురుగా కూరుచుండెడివాఁడు.

### (ఖ)

చూడమ్మతలను మంగలవాని కప్పగింపవలసిన సుమహూర్తమునకు ముందు గుప్తదంపతులు చాల గడబిడలలో నుండిరి. 'భర్త ఆస్తి భార్యదా? లేక భార్య ఆస్తి భర్తదా?' అను వివాదము అపుడు సంభవించెను. 'భార్య ఆస్తి భర్తదే' అని శ్రుతిస్మృతి ప్రమాణములతో వియ్యపురాలు యుద్ధమునకు మోటు

కొానెను. "చనిపోయిన తరువాత మగనిహక్కు మన వదే" యని మాణిక్యమ్మయు అప్రమాణములతోడనే డీకొానెను. ఈతగవు తీర్చుటకు తలచెడిన తలిరుఁ బోడులు తలవెంట్రుకలంతమంది నిండోలగ ముండిరి.

"నీవు మాణిక్యమ్మను వెనకేసు కొస్తున్నావు, వాళ్లు ధనికులనిన్నీ, గ్రామబలమును చూచుకొనిన్నీ చెపితేసరా?" అని ఒకన్యాయవాదిని దెప్పఁగా "నీవు నాంచారును వెనకేసుకు రాలేదూ? ఫీజుకోసం నోరు పాడుజేసుకోగూడదు" అని మఱియొక న్యాయవాదిని చేతులుత్రిప్పెను. 'నీకు అరిచేతులో పళ్లున్నయ్యే!' అని యొకతె యనఁగా 'నీనాలుకలో నాభిఉన్న' దని మఱి యొకతె యనెను. ఇటు లాన్యాయవాదిను లందఱును న్యాయముకొఱకు ప్రాణములనయినను ఈయఁదలఁచు కొని యుండఁగా సుబ్బారావు దొంగవలె తొంగిచూచి పురుగువలె ప్రాఁకి చూడమ్మకడకు వచ్చెను.

చూడమ్మ ఆవివాదరసమున మునిఁగియుండెను. సుబ్బారావు వచ్చి మెల్లగా చూడమ్మను గిల్లెను. చూడమ్మ దద్దరిల్లి చూచెను. సుబ్బారావు తన అర చేతి వెనుకభాగమును మూతి కానించుకొని కన్నులను ముఖమును ఒక వింతభంగిగాఁ బెట్టెను. ఈ భంగివలన వియ్యాలవారి యీవేడుకకన్న పెద్దవేడుక యేదియో యొకటి కలదని చూడమ్మ గ్రహించి స్వరము తగ్గించి 'ఏమిటి?' అని యనెను. 'మాయింట్లో యెవళ్లూ లేరు. అక్కడ చాలపెద్ద తమాషావుంది. పకోడీలు కూడా ఉన్నయ్' అని భూదేవిని సాక్షిగా పెట్టుకొనినటులు నేలఁ జూచుచు సుబ్బారావు మెల్లగా ననెను.

చూడమ్మమొగము తామరపూ వయిపోయెను. లోఁగడ సుబ్బారా వెన్నఁడును అట్టిగౌరవ మాడుఁదాని కిచ్చియుండలేదు. కావున చూడమ్మ వెంటనే 'సైఁ' అనెను. సుబ్బారావు 'దబ్బున రా' అని ప్రాణపణ ముగా ప్రాఁకిపోయెను. చూచుచున్న చూడమ్మ కావిద్య వెంటనే వశ్యమాయెను. కొలఁది నిమిషములలోనే చూడమ్మ సుబ్బారావుమేడ యెక్కి అచట నున్న తమాషాయంతయుఁ జూచి విస్తుపోయెను: పసుపు బట్టలు! నల్లపూసలు! మంగళసూత్రము! అక్షింతలు! కొబ్బరి బొండములు! కారపుపూస! జిలేబి! పైని పకోడీలు!

చూడమ్మ 'ఇప్పుడు పెళ్లి చేసుకోవ్చా?' అని ధర్మశాస్త్ర మడిగెను.

'ఓ చేసుకోచ్చు. ఢంకామీఁద దెబ్బకొట్టి చేసు కోచ్చు. మనూళ్లో మొన్న చేసుకోలా రాధాగుపతి? ఊరేఁగుతుంటే మనం చూడఁబోయేతలికె మీఅమ్మ తలు పులు తియ్యలా?' అని సుబ్బారా వనఁగనే చూడమ్మ అతనిని కౌఁగలించుకొని గిర్రున తిప్పి తానును గిరగిర తిరిగెను.

వెంటనే వా రిరువురును పసుపుమధుపర్కములు ధరించిరి; పెండ్లిపీట లెక్కిరి; చెఱియొక కొంత సేపును పౌరోహిత్యము నెఱపుకొనిరి.

చూడమ్మ నడుమ నడుమనొక మెట్టికాయ తిని తనభార్యాత్వమును చక్కగా పరిపాలించెను. ఆనాఁడు సుబ్బారావు పీటమీఁదినుండి యొక యంగుళమేనియు జరుగలేదు. పకోడీలు నములుచు, వారు తలఁబ్రాల లోనికి దిగిరి. అవి వారితలలేకాక మేడక్రిందివారి తలలగూడ నభిషేకింపఁ దొడఁగెను.

ఇంతలో రసభంగ మాయెను. రసమువోలి యేమి? పెండ్లియే భంగము కావలసివచ్చెను. వా రాగది తలుపులు వేయుట మఱచిపోయిరి. పెండ్లియాట పకో డీలయాటలో పడినతరువాత వా రీదరిద్రలోకమును విస్మరించిరి.

అచట రాహుకాలము సమీపించెనని మంగల వాఁడు తత్తఱపడెను. గుప్తదంపతులు చూడమ్మకొఱ కిల్లంతయు గాలించిరి. 'ఎంతచిన్నకట్టై అయితే మాత్రం యేం? ఆఁడపుటక పుటితే తెలియదా? ఏనూయే చూసుకుందో, ఏగోయే చూసుకుందో' అని మాణిక్యమును, రామస్వామిగుప్తయు లోఁతు లోఁతు చోటు లన్నియు నెతకి వేసారి యీయింటి నూతి కడకు వచ్చిరి.

మేడమీఁదినుండి అక్షింతలు రాలుచుండెను. వా రదిచూచి గబగబ మేడ యెక్కిరి. వా రెంత లోఁతున వెదకిరో చూడమ్మ అంతయెత్తుననే యుండెను. వా రెంత యమంగళమును శంకించిరో అంత మంగళమునే చూచిరి.

చూడమ్మను సుబ్బారావు కిచ్చుటకు గుప్త విశ్వప్రయత్న మొనరించెను. 'చూడా, నీ వెవరిని చేసుకుంటావే?' అని అడుగఁగా 'సుబ్బారావును చేసుకుంటాను' అని పలికెడిది. కాని మాణిక్యము పడనీయలేదు.—'మేనఱికము మీఱుట మహాపాతకము' అని సనాతనముకదా! అందులో మాణిక్యము సనాతన మతమున అగ్రాణిముత్తైము!

వీరు సొంతముగా కట్టుకొనిన ఈమంగళసూత్రమును మాడఁదలఁచియు చూడఁజాలక గుప్త తన మొగముమీఁద గుడ్డవేసికొనెను. 'నీ కీపిశాచపు ఆట యెవరు నేర్పారే?' అనుచు పరుగెత్తి మాణిక్యము కూఁతురిముడ్డిమీఁద రెండంటించి 'ఈతడవ ఈ మేడ యెక్కిచూడు' అని ముక్తాయి యిచ్చెను.

చూడమ్మ ఏడువలేదుగాని సుబ్బారా వేడ్చెను. ఆయుత్సవము తనకుఁగూడ జరుగఁగలదనియో, లేక చూడమ్మకు జరిగిన దనియో యెవరు చెప్పఁగలరు?

మాణిక్యము జుట్టుపట్టుకొని చూడమ్మను ఈడ్చుకొనిపోయెను. వెంటనే సుబ్బారా వేడ్పుమానెను. ఇంతలో రాహుకాలము వచ్చివేసెను. దాని బలముననో, లేక యాపిన్నవారు లంగించుకొనిన లగ్న బలముననో నాఁటి కేళఖండనము నేఁటివలె కాఁగిపోయెను.

(౪)

మాణిక్యమున కింకను ఇరువదియయిదేండ్లు దాఁటలేదు, గుప్త కిరువదియాఱు దాఁటలేదు. ఈ పిన్నదంపతులనడుమ ఈ బాలవిధవ.

చూడమ్మ రామస్వామిగుప్త కల్లారుముద్దుబిడ్డ. తల్లి కోకిలవలె కని పాఱవయిచెను. దాది పాలిచ్చెను. తక్కినపోషణమెల్లయు కాకివలె తండ్రిదే. అట్టి తండ్రికి ఆబిడ్డ యిపుడు పెద్దపులి అయిపోయెను.

స్వర్గ, నరకలోకముల భూగోళ శాస్త్రము, అచట చనిపోయిన మగఁడుగాని భార్యగాని ఉండు చోటు, అచట నున్న భర్తలకును భూలోకమునందున్న భార్యలకును గలసంబంధము, విధవల వేషభాషలు వగైరాలు చక్కఁగా తెలియునటులు మాణిక్యము కూఁతురికి బోధింపఁ దొడఁగెను.

పెండ్లిలో మగనిమొగమును తిన్నఁగాఁ జూచిన గుఱుతు చూడమ్మకు లేదుగాని యిపు డీ తల్లి చెప్పిన పాఠమువలన తా నూహించుకొనిన మగనిరూపము ఎదుట నున్న చిత్తరువునంతె విశదమైపోయెను. మనోనేత్రమున ఆరూపము కానఁబడఁగనే చూడమ్మకు చెమట పోసెడిది. వెంటనే చూడమ్మ తండ్రికడకు పరుగెత్తెడిది.

రామస్వామిగుప్త ఈగాబరా గమనించి 'ఏమమ్మా, ఒడలంతయు చెమటపోసినది' అని అడుగఁగా చూడమ్మ ఏడ్చుటతక్క మఱియొకసమాధానము చెప్పఁజాలకపోయెడిది.

తల్లి నియమించిన యాహార మాఱునెలలు ఒంటపట్టఁగనే చూడమ్మశరీరమును ఎనాటమీ విద్యార్థులు శేరమాడఁ దొడఁగిరి. ధర్మశాస్త్రమునందు మిక్కుటమయిన శ్రుతపాండిత్యము కల ఆతూ్మరిసూరమ్మగారు ఒకనాఁడు మాణిక్యమును చూడవచ్చి ఆమె పరకాష్ఠకు విస్తుపోయి— వేషభాషలు వేయించవచ్చును గాని కడుపు మాడ్చఁగూడదు. ధర్మమును సాధించుటకు శరీరము ఉండవలయునుగదా!' అని విధవాధర్మరహస్యమును టూకీగా తెలిపిపోయిరి. తుద కీమయినపుభొమ్మకు మందు మాడవలసివచ్చెను.

హకీములును, భిషజ్మణులును, డాక్టరులును దొడ్డదొడ్డ మందులజాబితాలు వ్రాసియిచ్చిరి. లక్ష్మీదేవికి సూక్ష్మశరీరము లయిన ఆమందులు తుట్టతుదకు కర్మవిపాకమును సూచింపఁదొడఁగెను. కాని ఆరోగనిదానమును చూడమ్మయే ఒకనాఁ డిటులు కలవరించెను: "అమ్మొచ్చె అమ్మొచ్చె! ఈయాటొద్దు ఈయాటొద్దు!

పారిపోదాం పారిపోదాం సుబ్బారావుబావా చచ్చిపోతున్నా."

మాణిక్యము ఉలికిపడి లేచి ఈకలవరింత వినెను. నిదురపట్టక యటునిటు కొట్టుకొనుచున్న రామస్వామి గుప్త విని 'కలలోఁగూడ నీబెదురేనా ?' అని యనెను.

"మావాఁడుకదా యని చెప్పడానికి నోరు రాలేదండోయ్. వాఁడే దయ్యమయి పట్టుకున్నాఁడండోయ్! లేకపోతే పిల్ల ఇల్లా అయిపోతుందండోయ్! చచ్చిపోయినా వాఁడి కింకా మనసు తీర లేదండోయ్' అని మాణిక్య మొక దీర్ఘము తీసెను.

'కుంఫిణీవారి యేలుబడిలో దయ్యము లన్నియు ఆవిరిగా మాఱిపోయినవి.' అని గుప్త యనెను.

'మఱీ విడ్డూరం, అమ్మాయికి విభూతి పెట్టించండి.'

'శాశ్వతముగా పెట్టించితిని.'

'దయ్యాలు లే వంటారా ?'

'నేను కాదుగదా, నాకు ఆవల ఏకుతరముల వారుగూడ ఆవిషయమున జాత్యంధులు. ఒకవేళ నీకు భూతదృష్టి ఉండియుండవచ్చును.'

మాణిక్యము చిరాకుపడి చూడమ్మ మొగమును పరీక్షించుచుండెను. చూడమ్మ ఉలికిపడి చూచును గదా మొగములో మొగము పెట్టి చూచుచున్న తల్లి!

'అమ్మో చంపేస్తుంది సుబ్బారావుబావా ?' అని చూడమ్మ కంకపట్టుపట్టి యేడ్వఁదొడఁగెను. మాణిక్యము అది చూచి—'నారసింహమంత్రం పెట్టే ఆశాస్త్రుల్లుగారిని తీసకరండి' అనెను.

'నీ వెడముగా నున్నచో దయ్యము పాఱిపోవును.' అని గుప్త యనెను. మాణిక్యము రుసరుసలాడుచు దూరముగా తొలఁగెను గుప్త జోలకొట్టఁగా చూడమ్మ అనతికాలముననే నిదురించెను. గుప్తయు మఱి మాటాడక తనశయ్యా నాశ్రయించెను. మాణిక్య మేమి గొణఁగుకొనెనో వినఁబడలేదుగాని ఆమఱు నాఁటినుండియు రామస్వామిగుప్త కామె ప్రవర్తనలో కొంచెము మార్పు కానిపించెను.

(ఘ)

'ఏమిటి చూచుచున్నావు ?' అని గుప్త యడిగెను.

'దీని కలవరింతలకు భయమువేసి బడిలోనికిఁ బంపితిని. ఇంకను రాలేదు. అందుకు చూచుచున్నాను.' అని మాణిక్య మనెను.

'అటులనా ?'

ఆఁడపిల్లల బడినుండి చూడమ్మ తమయింటి సందువఱకు లేడివలె వచ్చెను. అచట ఆ బాలికకు మంద గుడి తగిలెను. గుమ్మముమీఁద కాలుఁబెట్టి తల్లిని జూచువఱకు కలకలలాడు చూడమ్మ మొగము కాటుక యయిపోయెను. మాణిక్య మా మార్పు గ్రహించెను.

చూడమ్మ లోనికేగి తన పుస్తకములు సర్దుకొనుచుండెను. తల్లి యచటి కేగి బట్టలు మార్పించి 'అమ్మాయీ, కాసేపు సుబ్బులు బావతో ఆడుకొనిరా' అనెను.

'నీవు కొట్టవూ?' అని చూడమ్మ యనెను.

మాణిక్యము నవ్వి 'కొట్టను' అని యనెను.

'నన్ను కొడితేమానే; బావను?'

'కొట్టనమ్మా కొట్టను. నిన్నూ కొట్టను; అతగాణ్ణీ కొట్టను.'

'నాన్న కొట్టరూ?'

'నాన్నా కొట్టరు. ఆభయం పెట్టుకోకు. ఆడుకోరాపో.'

'పొద్దుపోతే నే నివ్వేళ అక్కడే పడుకోచ్చా?'

'పొద్దు పోకుండా పిలుస్తాలే.'

'పోనీ బావని తీసుకో రావచ్చా?'

'అతని మామ రానియ్యడమ్మా. అదిగాక అతగాఁడు చదువుకోఁడూ?'

'పోనీ ఇద్దఱుమూ ఇక్కడే చదుకోమా?'

'సరేలే, ముందుపోయి ఆడుకోరా, నేను కేక వెయ్యంగానే రా యేం?'

తనతల్లి అనుకోనని అనుమతిని ఇటులు ఈయఁగనే ఆయింటికిని ఈయింటికిని నడుమనున్న యిఱుకు సందునఁబడి చూడమ్మ తుఱ్ఱుమనెను

సుబ్బారా వంతవఱుందే బడినుండి వచ్చెను. డాబామీఁద మూన్నాళ్లనుండియు నతఁ డొక నూయి త్రవ్వుచుండెను. నేఁ డది పూర్తిచేయుటయే కాక నలుదెసలకును కాలువలనుగూడ నేర్పాటుచేసెను. ఇప్పుడు పాతాళగంగదెచ్చి యాకాశగంగ చేయుటకు ఉపక్రమించెను. అంతలో చూడమ్మ యెదురాయెను. అతఁడా నాతఁ గూలెను.

'భయపడకు భయపడకు! మాఅమ్మ కొట్టనన్నది గా' అని చూడమ్మ యనెను.

'కొట్టదూ?'

'ఊఁహు.'

'ఎందుకు కొట్టరు?'

'పాపం నా మొగుడు చచ్చిపోయాఁడని.'

'ఔను పాపం ...... నీ మొగుడు చచ్చాడు కాదూ?'

'ఆఁ'

'అయితే చచ్చినవా ళ్లేమవుతారు?'

'ఇంతేనా? నీకు తెలియదూ? నిన్నడుగుదా మనుకుంటున్నాను'

'బళ్లో మాకింకా ఆపాఠం చెప్పలేదు.'

'అల్లాగా? మా అమ్మ కన్నీ తెలుసు. అంథా మా అమ్మ చెప్పినట్లే అవుతుంది.'

'పెద్దవాణ్ణయితే నాకూ తెలుస్తుంది.'

'రాత్రి ఏమయిం దనుకున్నావు? కొండంత కల వచ్చింది.'

'ఏది చెప్పు?'

'నేను మాఅమ్మ చెప్పిన స్వర్గలోకంలోకే ఎగిరిపోయాను. అక్కడ పాపం నా మొగుడున్నాడు. ఆ మొహం చూడంగానే నాకు చచ్చేటంత భయం వేసింది.'

'నన్ను పిలవకపోయావా?'

'పిలవలేదేం? నిజం చెప్పు!'

'నాకు వినబడందే?'

'వినఁబడ్డా లేదంటావు? ఆమట్టుగా అక్కణ్ణుంచి ఇక్కడికి, సరిగ్గా ఇక్కడికే కూలిపోయాను. ఎంత దెబ్బ తగిలిందనుకున్నావు?'

'జామా ఆయిల్ రాసుకోక పోయావా?'

'తెమ్మంటే నీవు తేందే చగురుడల్లే? సరే; ఆపాళంగా ఆడుకుందాం రమ్మని లాక్కోపోయావు. పెళ్లాట అయితే అమ్మొచ్చి అంటిస్తుందని అంటూ ఉండగానే అమ్మొచ్చింది. రా రా రా అని ఎంత మొత్తుకున్నా నీవు రాందే. అమ్మ రానేవచ్చింది; గొంతు పిసకనే పిసికింది. ఎందుకమ్మ నీతో ఆడుకోటం? చస్తూంటే చూస్తూ కూచుంటావు. జిళ్లాయిలు పెట్టేదా?'

'వొద్దు వొద్దు.'

చూడమ్మ జిళ్లాయిలు పెట్టుటకు మెలమెలగా వేళ్లు సవరించెను. సుబ్బారావు వెంటనే ఆవేళ్లను అంటించి 'ఇదుగో చూస్తూ కూచుంటా ననుకున్నావా? నిన్నెత్తుకోపోయి ఎగిరెగిరి అక్కడికిపోతాను.' అని వేలితో ఆకాశముచూపి 'అక్కడ్థ పెళ్లి చేసుకుంటాను. ఏం?' అనెను.

'చూదాంగా' అని చూడమ్మ అనుచుండగా మాణిక్యము బిగ్గఱగా 'అమ్మాయీ' అని పిలిచెను. సుబ్బారా వొక వెఱ్ఱిచూపు చూచెను. చూడమ్మ యిటులనెను. మాయింట్లో పడుకుందుగాని రావూ? పకోడీలు చేశారు.'



" అని వేలితో ఆకాశముచూపి......పెళ్లి చేసుకుంటాను ఏం అనెను."

'ఉఁహుఁ. ఇక్కడే పడుకుందాం ఉండు. ఇవ్వాళే వెనకటి లా కాకుండా మామయ్యచేత గదికి గడియలు వేయించేదాం.

'చూడా?' అని మాణిక్యము త్రిమాత్రాకాలము ఉపయోగించి పిలిచెను. ఆపిలుపునకు చూడమ్మ ప్రత్యుత్తరించిన 'ఆఁ.' అను అచ్చు హ్రస్వమో, దీర్ఘమో, లేక ప్లుతమో యేవైయాకరణుఁడును చెప్పఁజాలఁడు. ఫోనెటిక్సులో అది క్రొత్తస్వరము. అది సుస్వరమో, లేక అపస్వరమో యేగాయకుఁడు కనుఁగొనఁగలఁడు?

తమ కూఁతురి శరీరవీణ యెంతకంపించెనో ఆతలిదండ్రులు ఆస్వరమువలన కనుఁగొనిరి. దానికి ప్రతిఫలముగా చూడమ్మ సుబ్బారావుతోసహ తమ యింటికి వచ్చెను.

( ౫ )

చూడమ్మ విధవాధర్మమునుండి యిటులు మను ష్యధర్మములోఁ బడినతరువాత రామస్వామియిల్లు మరల నెప్పటివలె నాయెను. మయినపుబొమ్మగా మాఱిన చూడమ్మ మరల కుంచనపు బొమ్మయాయెను.

సుడ్డపేలికవలెనయిన రామస్వామి క్రమక్రమముగా కోలుకొనెను. మాణిక్యముయొక్క మనస్సే కాక శరీరముగూడ మాఱె నని రామస్వామి కనుఁగొనుట అరిది. ప్రతిదిన మెల్లప్రుడును చూచువారికి శరీరముయొక్క హానివృద్ధులు తెలియవు కదా! కాని క్రొత్తగా చూడవచ్చినవారికి అతి సులభముగనే ఆ సంగతి తెలియవచ్చెను. 'ఆయింటికి ఇఁక ద్వారబంధములు కొంచెము పెద్దవి చేయించుకొనవలసి యుండు' నని వా రనుకొనిరి.

'సంసారికి తన కుటుంబమే బ్రహ్మాండము. తన సుఖమేస్వర్గము; తనదుఃఖమే నరకము. ఇట్టికూఁతుండ్రు, ఇట్టి తలిదండ్రులు ఈ భరతఖండమున నెందఱు కలగో కదా! ఇట్టి భరతఖండము లీ విశ్వమున నెన్నియో! అందు ఈజీవియెంత? దీని సుఖమెంత? దీని దుఃఖమెంత? ఇది లీలయా, ఖేలయా? ఇది సత్యమా, అసత్యమా?' అని రామస్వామి యనుకొనెను.

చూడ బడి వదలిపెట్టి చూడఁజూడ చూడమ్మయాయెను. సుబ్బారావుబావగూడ సుబ్బారావుగారయిరి. చూడమ్మ యిపు డుపాధ్యాయులకడ నింత యింగిలీషును, ఇంత సంస్కృతము, నింత తెలుఁగును, ఇంత గానము, నింత చిత్రకళను, అభ్యసింపఁ దొడఁగెను.

సుబ్బారావుజేబులో నొకగడియారము బంగారుగొలుసుతోసహా ప్రవేశించెను. మనికట్టును మణి

యొకగొలుసు ఆంజనేయవిగ్రహముతో నలంకరించెను. అతఁడు హైస్కూలును వదలిపెట్టెను. అతని మామ గృహపరిపాలనము చేయఁబూనుకొనెను. అతఁడు చదువులకుఁ జెన్నపట్టణము ప్రవేశించెను.

చక్కగా సంసారము చేయుచున్న యిల్లాండ్రందఱవలెనే మాణిక్యమునకును రెండుమూడు కానుపులు వచ్చిపోయెను. మాణిక్యము మరల దృఢప్రతిజ్ఞతోడనే యుండెనుగాని రామస్వామిమాటమాత్రము చెప్పలేము.

కన్యలందఱవలె చూడమ్మ ఏకాంతమునందు తిలకము దిద్దుకొనును. కాని కొంచెమునేపు ఉంచుకొని అద్దములోఁ జూచుకొని పిదప చెఱిపివేసికొనును. తండ్రి తనకేతికోరి పంపిన వలువలలో మేలి వేటిధరించి వెంటనే విసర్జించును. అత్తగారు హరించినందువలన రెట్టిగా లభించిన నగలు దాల్చి తీసివేయును. వీనికన్నిటికిని శిరోభూషణముగా సరస్వతిని తలఁదాల్చును. 'దీని మగఁడు చావలేదు; ఎక్కడో కనఁబడకుండా ఉన్నాఁడు' అని మాణిక్య మొకానొకపుడు భ్రమించుచుండును.

ఒకనాఁటి ప్రొద్దున విధవోద్ధారకసభవారు ఒక పెద్దపద్దు కాకితముతో రామస్వామికడకు వచ్చిరి. రామస్వామి వారి కాతిథ్య మిచ్చెను. వారు దానికి బదులుగా అతనికి ఈపద్దుకాకిత మిచ్చిరి. రామస్వామి దానిని పరిశీలించి ఇంటిలోనికి పోయి కొన్ని కాకితములు తెచ్చి వారికి సమర్పించెను.

సభానాయకుఁడు ఆ కాకితములు విప్పెను—నూఱురూపాయలనోట్లు పది! సభానాయకునితోపాటు సభవా రందఱును తమసంతోషము నీ రీతిగా విశదీకరించిరి: 'అయ్యా, తమచేతితో తమ పద్దు వ్రాయింపుఁడు.'

రామస్వామి యిటు లనెను: "లక్ష్మీప్రసాదమయినతరువాత సరస్వతీప్రసాదమున కాసింతురా? సరస్వతిముందు; లక్ష్మివెనుక. లక్ష్మి ముందయినచో సామాన్యముగా సరస్వతి యుండదు."

చూడమ్మ యిపు డొక భావనాప్రపంచమును సృజించుకొనఁగలదు; ఆసృష్టిలోని మంచిసెబ్బరలను గ్రహింపఁగలదు; తా నందు విహరింపఁ గలదు. జీలకర్రయయినను, జీవగర్రయయినను ఆమెకు శేషించినదా భావనాప్రపంచమే.

ఇట్టి మనోలోకమున ఒంటిగా నున్న చూడమ్మ చనిపోయిన మగని బరువును మోయుచుండఁగా చూడఁజాలనటులు ఒకనాఁడు ఆప్రక్కనున్న మూగమేడ ముఖరితము కాఁజొచ్చెను.

## ౨

### (క)

పరీక్ష లగుటచే సుబ్బారా వింటికి వచ్చెను. సామాను సర్దుకొనినవెంటనే అతఁడు రామస్వామిగారి యింటికి వచ్చెను.

"సుబ్బారావు మమ్ములను మఱచిపోలేదు" అని మాణిక్య మనెను.

"శరీర మారోగ్యముగ నున్నదా? పేపరు సరిగా వ్రాసితివా" అని రామస్వామి యడిగెను.

"సుమారుగా వ్రాసితిని" అని సమాధానము చెప్పుచు సుబ్బారావు వారిరువురకును నమస్కరించి వారిదీవన లందుకొనెను.

తనగదిలోఁ గూరుచుండి యేదియో యాలోచించుకొనుచున్న చూడమ్మ ఒడలెల్లయు చెవులుచేసికొని ఆమాటల నాలకించెను. ఆతనిని చూచుటకు లేచియు మరలఁ గూరుచుండెను. సంతోష దుఃఖములు ఛాయాతపములవలె నామె నాచ్ఛాదించెను.

"చూడ ఇంటిలో లేదా" అని సుబ్బారావడిగెను.

"అది యెక్కడికి పోతుంది నాయనా? ఇంటిలోనే వుంది" అని మాణిక్యము సమాధానము చెప్పి "చూడా" అని పిలిచెను.

సుబ్బారావు మెడయెత్తి తలుపువంక జూచెను.

తల్లి పిలిచిన పిలుపునకు చూడమ్మ ప్రత్యుత్తరించిన "ఆఁ." అను స్వరము మందరమో, అనుమందరమో చెప్పుట దుస్తరము కాని సుబ్బారావుమాత్రము సుందర మనుకొనెను. కొంచెముసేపటికి చూడమ్మ మెల్లగా బయటికి వచ్చెను.

సుబ్బారావు చూడమ్మను జూచి రెండేండ్లు దాఁటెను. రెండేండ్లలో నెన్నేని మార్పులు జరుగవచ్చును. చూడమ్మ ఇపుడు వెనుకటి చూడమ్మ కాదు. చూడమ్మ శరీర మిపుడు పరిమళించు బంగారము. ఆ మోము మాటలు నేర్చిన చందమామ. ఆచూపులు మంత్రము లుచ్చరించు తూపులు. ఆనవ్వు వాడని పువ్వు. ఆపాదములు నడయాడు పద్మములు. ఆ మాట పాడని పాట. ఇట్టి చూడమ్మ యెట్టెదుటికి రాఁగనే సుబ్బారావుకన్నులు నిండిపోయెను. 'చూడమ్మ ఇంటిలో లేదా' అని యడిగిన సుబ్బారా విపుడు 'కిమన్యాస్తి'. చూడమ్మ అంతకంటె.

ఈమూగతనము తమ యిరువురకేకాక మాణిక్యమునకుఁగూడ సహింపనిదాయెను. రామస్వామి నిట్టూర్చి మెల్లగా మెల్లలోని కేగెను. ఆగోష్ఠిలోని దుఃఖమును ఏవమును సిగ్గును పోఁగొట్టుకొనుటకు చూడమ్మ చాల ప్రయత్నించియు విఫల యాయెను. ఇంతలో సుబ్బారావు ధైర్యము తెచ్చికొని "నిన్నుఁ జూచి రెండేండ్లయినది" అనెను.

చూడమ్మ మోమెత్తెను. ఈసుబ్బారావు వెనుకటి సుబ్బారావుబావ కాఁడు. అతని గండఫలకములు నిగనిగలాడుచుండెను. నూనూగుమీసములు గల అతని ముఖము చూడ ముచ్చటగా నుండెను. శరీరభంగియందును, మాటతీరునందును చమత్కారము వెలసెను. అతఁడాఁడరాజ్యమునుండి మగరాజ్యములో ప్రవేశించెను. ఇట్టి సుబ్బారావును జూచి రిచ్చపడి చూడమ్మ "రెండేండ్లకు రెన్నెలలు తక్కువ" అనెను.

ఇటులు నెలలతోఁగూడ లెక్కచెప్పుటవలన సుబ్బారావుముఖము ఆలోచనచే సుదీప్తమాయెను. మెల్లనుండి లోనికి వచ్చి రామస్వామి "ప్రొద్దున ఎప్పుడు తిన్నాఁడో! చీకటిపడకముందు వంటకానీ" అనెను.

"మ కేమి తొందర లేదు. అన్నము తినని నాఁడే కడుపు బరువెక్కును. మెల్లగా కానీండి సెలవు" అనుచు సుబ్బారావు వెళ్లిపోయెను.

( ఖ )

సుబ్బారావుకు ఆపూఁట ఆఁకలి యెక్కువగనే వేసెను. కాని పిలుపునకుముందు వెళ్లఁగూడ దను బిగుతనముకూడ నెక్కువగనే యుండెను. మాణిక్యము వంట చేసి పిండివంటకమునకు సెనగపిండి కలిపెను. బూంది దూయవలయునని యామెసంకల్పము. ఇంతలో అంపపుపొట్టువలె తఱిగిన ఉల్లిపాయలను చూడమ్మ అచటికి తెచ్చెను. దానిని జూచి మాణిక్యము 'అతనికి పకోడీ లిష్టమాయేమి?' అని యడిగెను. 'నీవు పకోడీలే తలపెట్టితి వనుకున్నాను; పోనీ అవీ ఇవీకూడా చేస్తేసరి" అని చూడమ్మ అనెను. "మీనాన్న ఉల్లి ముట్టరు. నీవే పకోడీలు చివరికి వెయ్యి" అని మాణిక్యము బూంది దూయఁదొడఁగెను.

చూడమ్మ భోజనశాల తుడిచి పీఁటలువేసి విస్తళ్లు పఱచెను. తల్లిపని అయిన తరువాత ఆమె పకోడీలు వండఁగూరుచుండెను. ఆమెమనస్సులోని సంతోషమును గర్భీకరించుకొనినటులు కొన్ని పకోడీలు పొంగెను. పరిహసించుచున్నటులు కొన్ని వంకరటింకరలాయెను. కోపమును సూచించుచు కొన్ని కరకరపాకమునఁబడెను. కొన్ని ప్రేమను విశదీకరించెను.

రామస్వామి జపగృహమునుండి వెలికి వచ్చి—"అమ్మాయీ, వంటఅయిందా?" అని అడిగెను. బాణలి క్రిందదింపుచు చూడమ్మ 'అయిం—ది' అని అనుచుండఁగ 'అయింది, సుబ్బారావును పిలవండి' అని మాణిక్యము అనెను. రామస్వామి దొడ్డిలోనికిఁ జని 'సుబ్బారావూ' అని ఆహ్వానించెను. "వచ్చె వచ్చె" నను ప్రత్యుత్తరముతోపాటు పట్టుతాపితాతో సుబ్బారావు వడివడిగా వచ్చెను.

మాణిక్యము వడ్డన చేసెను. అభిఘరించిన పిదప "చూడా, అతని విస్తట్లో పకోడీలు వడ్డించు" అని మాణిక్య మనఁగానే చూడమ్మ వచ్చి అతని విస్తరిలో వానిని జారవిడిచెను.

సుబ్బారావుదృష్టి చూడమ్మమీఁదికంటె వాని మీఁదనే యెక్కువగా ప్రసరించెను. తలుపుచాటున నున్న చూడమ్మ అతని యేకాగ్రదృష్టిని పరికించెను. పరితృప్తమగు నామెముఖము క్షణక్షణమున నొక్కొక్క కళచే నలముకొని క్రమక్రమముగా పదునారు కళలచే పరిపూర్ణమాయెను.

సాపాటు సాఁబాలు కాఁగానే భోజనశాల సభాశాలగా మార్పనియెడల ఆఁడవారికి చప్పగా నుండును. సంయమము లేనివారు దానిని రచ్చగా మార్పక కూరుచుండలేరు. ఇట్టివారిలో మాణిక్యము మేటి. "ఈ శారదాభిల్లుఁడు ముందు బతికేయెత్తు ఉన్నట్లు లేదు" అని ఆమె ప్రస్తావించెను.

కొద్దిరోజులనుండియు సుబ్బారావు మనుచరిత్రము చదువుచుండెను. దానిలోని 'శాంబరీభిల్లుఁడు' గుఱుతువచ్చి అతఁడు కొంచెము నవ్వెను. అపుడు అచటికి అతనిమామ వెంకటేశ్వర్లు వచ్చెను. చూడమ్మ పీట వేసెను. అతఁడు దానిమీఁదఁ గూరుచుండెను.

మాణిక్యము మరల నిటులనెను: "పెండ్లి ఎప్పుడు చేసుకుంటావు? బెండకాయ ముదిరినా బెమ్మచారి ముదిరినా పనికిరారు."

వెంకటేశ్వర్లు ఇటు లనెను: "సంబంధాలమీఁద సంబంధాలు వచ్చిపడుతున్నవి. పెండ్లిమాట అంటే ఇతగాఁడేమో పెండ్లికూఁతు రై పోతాఁడు."

"మాకు ఈమాటే తెలియదే" అని మాణిక్య మనెను.

"తెలిసి ఏమి లాభము? ముంగలికివచ్చిన లక్ష్మిని కాలితో తన్ని పాఱవేస్తున్నాఁడు. ఈయాన్నెల్లనుంచి ఱంచాలవారిసంబంధం అంటే మనలో కోరుకోఁదగినది గదా! వారువచ్చి దేవులాడి పోయినారఁట పాపం! పెలిగ్రాములకు వెచ్చపెటుతున్నారు ఎంతయినా! మీదగ్గిఱ ఈవర్తమానం పడేస్తే ఫలిస్తుం దని నాకు నమ్మకం" అని వెంకటేశ్వర్లు అనెను.

"అయితే ఇక లగ్ననిశ్చయం చేస్తాం. ఏమి సుబ్బారావూ మాటాడవు?" అని మాణిక్య మనెను. బదులు పలుకక పీటమీఁదినుండి లేచిన సుబ్బారావుకు తలుపుకడ నిలిచి గంభీరముగా నాలోకించుచున్న చూడమ్మముఖము కానిపించెను.

(౪)

సుబ్బారావు పెండ్లికి వచ్చిపడుచున్న సంబంధములన్నిఁటిని లెక్కవేయుటకు విసుకు పుట్టును. పెండ్లికూఁతుండ్ల ఫోటోగ్రాపుల కొక ఆల్బము చాలలేదు. కట్నములను, కానుకలను, మరియాదలను వ్రాయింపఁదలఁచుచో ఒకసుమాస్తాకు చేయితిరుగని పని.

సుబ్బారావుకు తల్లిదండ్రులు లేకపోవుటవలనను, ఉన్నమామయు చందమామ యగుటచేతను, తాను ఊరక కూరుచుండఁజాలకపోవుటచేతను మాణిక్యమునకు చేతినిండ పనిదొరకెను. సుబ్బారావతిబలవంతము మీఁద పెండ్లికూఁతుళ్ల ఫోటోలామెకు వశపఱిచెను. అందచందములను బాగోసులను నిర్ణయించుటకు మాణిక్యము చూడమ్మసహాయ మపేక్షించెను. చూడమ్మ ఆబొమ్మలను జూచి తానును ఒక బొమ్మ యయి పోయెను.

అల్లుఁడు పోయినపిదప చూడమ్మను వెంటవేసికొని మాణిక్యము అనేకపెండ్లిండ్లకు వెళ్లెను. చూడమ్మ వైధవ్యము పరిసిపోయి చాలకాల మాయెను. ఈసుబ్బారావుపెండ్లి హడావడియంతయు తనమీఁదుగనే జరుగవలెనని మాణిక్యము— ఊహ. కావున ఈ విచారము చూడమ్మకు విచారము కలిగించు నని మాణిక్య మూహింపలేదు.

చూడమ్మమనస్సు మొదట కొంచెము కలఁత నొందెను. పిదప దుఃఖమును వశపఱిచికొని చూడమ్మ ఆ



"చూడమ్మ ఆ ఆల్బమునే తెరచి ఒక్కొక్క బొమ్మనే తిరుగవేయఁ దొడఁగెను."

ఆల్బమును తెఱచి ఒక్కొక్క బొమ్మనే తిరుగవేయఁ దొడఁగెను. మాణిక్యమా బొమ్మల వంశావళిని సంపత్తిని వర్ణించి చెప్పుచుండెను.

మాణిక్యము చేయువర్ణనలో ఆకాశపాతాళములే కాని మధ్యమార్గము లేదు. అనుచో రంభ, కానిచో కాకి. అనుచో కోకిల, కానిచో గాడిదె. అనుచో లక్ష్మి కానిచో పెద్దమ్మ. ఇట్టివర్ణనలతో ఆఆల్బములో ముప్పాతిక మువ్వీసము కావచ్చెను. మునిసిపల్ ఆఫీసునుండి టంగు మని గంట వినఁబడెను. పెండ్లికూఁతుండ్ల చరిత్ర రచనమునందు తన్మయి యయి యున్న మాణిక్యము తలయెత్తి 'ఒకటి', 'రెండు', 'మూడు', 'నాలుగు', 'అయిదు', 'ఆఱు' అని లెక్కపెట్టి 'అమ్మ' అని తత్తఱపడి 'వంటవేళ అయినది' అని దులుపుకొని వడివడిగా స్నానశాలలోని కేఁగెను.

చూడమ్మ అచటనే కూరుచుండి మఱిరెండుమూడు బొమ్మలు తిరుగవేసెను. నాలుగవబొమ్మను తెఱచెను. అది ఫొటోగ్రాఫువలె లేదు. అది చేతగీచిన బొమ్మ. దానిని జూచుచున్న చూడమ్మ వ్రేలుగాని, కేలుగాని, కన్నుగాని, వెన్నుగాని కదలలేదు.

ఆ బొమ్మ తనను పోలియున్నటు లగపడెను. పరిశీలింపఁగా దానిపోలిక తనకు చాలదగ్గఱగానున్నటు లుండెను. చూడఁగా జూడఁగా అది తనచిత్తరువే.

చూడమ్మకన్నులార్ద్రములాయెను. ఆమె దీర్ఘముగా నిశ్వసించి ఆచిత్తరువును జూచుచు రెండుచేతులతోడను రెండుపెదవులను గభాలున మూసివయిచెను. ఆమె కనులుఆ యాల్బముఅట్టమీఁదికి వంగియుండెనే కాని ఆమె మనసు ఆచిత్తరువును గీచినవానిమీఁద నాటెను. అంతట ఆమె అదేరీతిగా లేచి మెలమెలగా గదిలోనికిఁ జనెను.

చౌరముచేసికొని సుబ్బారావు ఆగదిలోనికి వచ్చి చూచుసరికి ఆల్బములో వేలుపెట్టి కన్నీళ్లతో చెక్కిళ్లు తడిసి మొగము మెఱ్ఱబాఱి చూడమ్మ శయనించి యుండెను. ఆమె వడిగాలేచి గోడకేసి తిరిగెను. మరల సుబ్బారావుదెస మోము త్రిప్పఁగనే ఆ కన్నీళ్లు లేవు. మొగమున ఆ ఎఱ్ఱదనమును లేదు. సమ్మోహనవిద్యచే ఆమె క్రొత్తరూపెససినటు లాయెను. శైశవమునందలి 'చూడ' వలె నతని కపు డామె గోచరించెను. అతఁడు ఆమార్పునకు ఆశ్చర్యచకితుఁ డాయెను. చూడమ్మ యించుకయు సంకోచింపక యిటు లనెను—'ఆకుర్చి మీఁద కూర్చుండుఁడు.'

'చిత్తము,' అని సుబ్బారావనెను. చూడమ్మ యీమాటకు గొంచెము నవ్వి "మీరు 'చిత్తము' అన నక్కఱలేదు. అసలుసరిగాని కుంచాలవారిపిల్ల అన్నివిధము లా బాగుగనున్నది, మీరిక పెండ్లి చేసికొనుడు" అనెను.

'కుంచాలవారి మానమ్మను చేసికొనవలసిన దని యేనా మీయాజ్ఞ?'

'రిబెండు! నన్ను 'మీరు మీరు' అనియెందు కేమి? కుంచాలవారిపిల్ల మానమ్మ గాదా? బంగారు సుర నువలె నున్నది. కన్నులలా కలువరేకులవంత.'

ఈ మాటలు వినుచున్న సుబ్బారావుముఖము ఏ దేశమునకో పోయినటు లుండెను. విచిత్రమయిన నటన భంగిలో నతఁ డిటు లనెను—'చూడా! నన్ను కుంచాల పిల్లను చేసికొనుమందువా? చేసికొనుమందువా?'

ఆముఖభంగిని, ఆస్వరమును వినుచున్న చూడమ్మ కనులు ముకుళితములు కాఁ దొడఁగెను. ఆమె 'చేసి కొనుఁడు' అని చెప్పఁదలఁచుకొనెను గాని ఆకంఠము చెప్పనీయ లేదు. ఆమె రివ్వన వంటయింటిలోనికి పోఁబోఁచి తలుపులొడ్డ కరిగెను. సుబ్బారావు బాహులు సాఁచి ద్వారమున కడ్డముగా నిలువఁబడి 'పోనీయను' అనెను. 'తెరవాటుట కొట్టుట యేడనేర్చితివి?' అని చూడమ్మ యనఁగా 'మీకడనే' అని సుబ్బారా వనెను. అపుడు వంటయింట సంధ్యావందనము ముగించు చున్న రామస్వామి 'అమ్మాయీ విస్తళ్లువేయుము' అని యెలుఁగెత్తి పలికెను. చూడమ్మ వంగి సుబ్బా రావుచేతిక్రిందుగా తూనీఁగవలె రివ్వన నిర్గమించెను.

(ఘ)

వడ్డన సమాప్తిచేసి మడి గట్టుకొని యున్న మాతురుచేతికి నేతిగిన్నె యిచ్చి మాణిక్యము కంకము సవరించుకొని యిటు లనెను: "నాయనా సుబ్బారావూ, మాకు చూడ ఒకటే, నీవు ఒకటే కాదు. కొడుకు లేనిలోటు మాకు నిజంగా లేదు. నీ పెండ్లి ముచ్చట నా మీదుగా జరుపనిస్తే కొడుకును కననందులకు ఉండే లోటు భర్తీ అవుతుంది."

సుబ్బారావు మోమెత్తి యొకతూరి మాణిక్య మును, ఒకతూరి చూడమ్మను జూచి మరల తలవంచు కొనెను. మాణిక్యము మరల నిటు లనెను: "ఉన్న సంబంధాలలో కుంచాలవారి సంబంధముకంటె గొప్ప సంబంధము లేదు. ఆపిల్లా నీవూ కలిసివుంటే రంభానల కూబరులున్నట్లు ఉంటారు."

సుబ్బారావు చాలిన మోమెత్తి చూడమ్మను జూచెను. ఆమె మూఁగ నెఱ్ఱఁబారియుండెను.

"మాటాడవేమి?" అని మాణిక్యము మందల కించెను.

మాటాడకేమి? ఇదిగో మాటాడుచున్నాను— 'నేయి' అని సుబ్బారావనెను. చూడమ్మ నేతిగిన్నె తో సుబ్బారావును సమీపించెను.

"గమునుతేవమనఁగా ఇట్లా ఉండాలి. పెండ్లి మాట అనఁగా 'నేయి' అని సమాధానమా? నేతిని కట్టుకుంటావా యేమి? సరేకాని యేమే చూడా, ఇంతమంది పెండ్లికూఁతుండ్లను చూస్తిమికదా, కుంచాల వారిపిల్లవంటి పిల్ల మఱి కనఁబడునా? నీవు చెప్పు!" అని మాణిక్య మనెను.

"ఔను" అనుమాట పరవంకరలతో చూడమ్మ నాలుకచివరనుండి బయటఁబడుటయు, ఆమెచేతిలోని నేతిగరిటె సుబ్బారావువిస్తరిలోఁ బడుటయు ఒకతూ రియే జరిగిపోయెను.

మాణిక్యమునకును రామస్వామికిని దెలియకుండ సుబ్బారావా నేతిగరిటెను ముద్దుపెట్టుకొనెను. చూ డమ్మచేయి పులకలెత్తెను.

మాణిక్య మిటు లనెను: "ఏమయ్యా సుబ్బా రావూ మాటాడవు?"

"మాటాడ కేమమ్మా వినుము! ఆఁడవారు పసందు చేసిన పిల్ల మగవారి కెటులు నచ్చును? ఆఁడవారి కాఁడ వారందఱునూ బాగానే కానుపింతురు. మగవారికి మగ వారందఱును బాగానే కానుపింతురు. ఆఁడది మగవానిని

పసందు చేయవలయును ; మగవాఁడు ఆఁడదానిని పసందు చేయవలయును. ఏమందువు ? " అని సుబ్బారా వనెను.

"అలాగా ఇదో కొత్తమాట. ఇంగ్లీషు చదువులలో ఉన్నది కాఁబోలు. పోనీ, నీమాటే న్యాయం. మగవాళ్ల చేతనే పసందు చేయిద్దాము. ఏమండీ! మీరుచెప్పండి-కుంచాలవారిపిల్ల బాగుండునా బాగుండదా?" అనిమాణిక్యము మగనివంక తిరిగెను.

రామస్వామి యిటు లనెను—"నా కనులకు బంగారముగనే యున్నదికాని సుబ్బారావుకనులు ఏమిచెప్పనో ! "

చూడమ్మహృదయము తపతప కొట్టుకొనియెను. ఆమె తలుపుచాటున నిలుచుండి సుబ్బారావుముఖము నుండి ఏమిమాటలు వినఁబడునో యని దిగులు పడుచుండెను.

సుబ్బారావు చూడమ్మమొగము చూచెను. వెలవెలబారిన యామెమొగము శూన్యాకాశమువలె నుండెను. అందుకు లోలోన మురియుచు సుబ్బారావు ఇటు లనెను : " మామగారూ, ఎందు కింత డొంక తిరుగుడు? నేను బి. యే. ప్యాసుకానిది పెండ్లి చేసికొనను."

చూడమ్మముఖాకాశమున విదియనాఁటి చంద్రకళ కానవచ్చెను.

మాణిక్య మిటు లనెను : "ఈకాలపు కుఱ్ఱవాళ్లం దఱికినీ ఇదో ఫేషన్. మంచి సంబంధాలన్నీ పోగొట్టుకొని తరువాతతరువాత మాకు దాంపత్యసుఖము లేదని అసూయించడమే కాక అంగలతో చెప్పుకోవడంగూడా ఒక ఫేషన్. నాయనా సుబ్బారావూ, నీవు అంవటి వంటివాఁడవు కావు. నామాట విను. ఈ సంబంధం పోనీకు ! తరువాత పస్తాయిస్తావు."

సుబ్బారావు చూడమ్మముఖము జూచుచు నిట్టులనెను—"అత్తా, అంతపట్టు పట్టకు. బి. యే., ప్యాసు కానిదే పెండ్లిచేసికొననని నేను లోఁగడనే ఒట్టు పెట్టుకొంటిని. ఒకవేళ కుంచాలవారిపిల్ల యే వ్రాసిపెట్టియున్నను అప్పటికి పాసిపోదు. ఇపుడా పిల్లకు పదియేండ్లేకదా ! "

" ఎంత ఒట్టు పెట్టుకొంటివి ? ఒట్టూ లేదు పిట్టూ లేదు. తెలిసి తెలియని ఒట్లకు విలువేమిటి ? " అని మాణిక్య మనెను.

" అటు లనకు. ఒట్టు ఒట్టే" అని సుబ్బారావు అనెను.

రామస్వామి యిటు లనెను— "ఒట్టు పెట్టుకొనఁదగునా కూడదా అను విచారము ముందే ఉండవలయును. పెట్టుకొనిన తరువాత ఒట్టు ఒట్టే. "

మాణిక్య మిటులనెను : " మీరూ బాగానే చెప్పారు. " తలుపుచాటున దీర్ఘనిశ్వాస మొకటి బయలుదేరి భూమిని స్పృశించెను.

( ౩ )

సుమారు రెన్నెలలు గడచెను. బంధుగులయింట మడివంట చేయుటకు ప్రార్థింపఁబడి మాణిక్యమువెళ్లెను. నేఁటి కామె రాదు. కావున చూడమ్మ యంతయు సుబ్బారావు మనస్సైన కూరుచుండెను. అంత ఆగది లోనికి సాధికారముగాఁ బ్రవేశించి తపాలావాఁడు ఒక కట్టను బల్లమీఁద టప్పునఁ బడవయిచెను.

' అబ్బ! ' అని చూడమ్మ తలయెత్తి చూచెను. తపాలావాఁడు అంతలో ' సెలవు ' అని వెళ్లిపోయెను. చూడమ్మ పేపరు విప్పిచూచెను. పేపరంతయు అంకెలే.

చూడమ్మకు సుబ్బారావునంబరు తెలియును. వెంటనే ఆనంబరు కనఁబడెను. ఆమె తనసంతోషమును పైకి ఉబుకనీయఁదలఁచుకొనలేదు గాని వెంటనే ఆ పేపరు తండ్రికడకుఁ దీసికొనివెళ్లి " సుబ్బారావు బావ ప్యాసయినాఁడు " అనెను.

' అగును. అతఁడు ప్యాసగును ' అని రామస్వామి కొంచె మాలోచించుచు ' అతని కొక మంచి పారితోషిక మిచ్చిరమ్మ ' అని ఆదేశించెను. ఈమాట వినినంతనే చూడమ్మహృదయము జలదరించి వెను వెంటనే పులకించెను.

చూడమ్మ మరల తనగదిలోని కరిగి పారితోషిక మున కాలోచించుచుఁ గూరుచుండెను. ఏ పారితోషి కమునీయఁదను ఆమెకు పాలుపోలేదు.

"ప్రేమ కేది యొసఁగినచో పారితోషిక మని పించుకొనును? ప్రేమకుఁదగిన పారితోషిక మీ విశ్వ మున నేవస్తువు కలదు? ప్రేమకు తూఁగున దొక్క ప్రేమయే. రెండవ తక్కెడలో నీబ్రహ్మాండముల నన్ని టిని బెట్టితూఁచినను మొదటితక్కెడ చలింపదు" అని యిటు లామె తలపోయుచుండఁగా రామస్వామి మెల మెల్లగా వచ్చి 'ఏమమ్మా, ఏమి పారితోషిక మిచ్చి వచ్చితివి?' అనెను. చూడమ్మ తెల్లఁబోయి 'ఏమి యును లేదు' అనెను.

'అది యేమి? చీకటి పడినది. నీ కేమి కావల యునో చెప్పుము, తీసికొనివత్తును' అని రామస్వామి యనెను.

'పారితోషికమునకుఁ దగిన దీప్రపంచమున నా కేదియుఁ గానరాలేదు.'

రామస్వామి కొంచె మాలోచించి "అగు నగు" నని రెండుమాఱు లుచ్చరించి "పిచ్చిదానా! ప్రేమతో నేది యిచ్చినను పారితోషికమే. పత్రము, పుష్పము, ఫలము, తోయము — ఇది యంతయు పారితోషికమే. తుద కొక నూలుపోగేని పారితోషికమే యగును" అనెను.

"నిక్కమే నాకు తోఁచలేదు. కొండంత దేవ రకు కొండంతపత్రియెవతె తేఁగలదు?" అని చూడమ్మ యనెను.

"అగును ప్రొద్దుపోవుచున్నది. నీ కేవస్తువు ఈవలయునని యున్నది?"

"నాకు వస్తువు నిస్సార మనుపించుచున్నది. అయినను ఒక పూవిచ్చి నాసంతోషమునే పారితోషిక మొనరించి వత్తును."

"మంచిది" అని రామస్వామి తన ఆఫీసు గది లోనికి వెళ్లిపోఁగనే చూడమ్మ వేషభూషలచే క్రొత్త యై సుబ్బారావుమేడకు దారితీసెను. ఆదారిలో ఎన్ని యెన్ని సంగతులు తన హృదయమున గుఱుతుచే చిగు రెత్తెనో, ఆదారిలో తా నెంతసేపు నడిచెనో దాని కంతు లేదు. చూడమ్మ మేడయెక్కి గదివంక చూడఁగనే సుబ్బారావు లేచి 'స్వాగతము', అనెను. ఆమాటచే చూడమ్మయొడలు కంపించెను; నడక స్తంభించెను. 'ఎన్నాళ్లకిచటికి వచ్చితివి' అని సుబ్బారావెదురు వచ్చి చేయి పట్టుకొని బలవంతముగా గదిలోనికిఁ దీసి



కొనిపోయెను. స్వేదబిందువులచే ఆమెమోము పుష్పించెను. ఆచూడమ్మ తా నచట బందియయిపోయినటులు భయపడెను.

'ఇచటనే మన పెండ్లి, గుఱుతున్నదా?' అని సుబ్బారావనెను. సిగ్గుచే ఆరక్తమయిన ముగము వెంటనే నిరుఁగవున అవదాతము కాఁగా చూడమ్మ "అవును, ఇటనుండియే మాయమ్మ రెండుమెట్టె నన్ను జరజర లాగుకొనిపోయెను" అనెను.

"నాకన్న నీకే యెక్కుడు గుఱుతు ఉన్నట్టులున్నదే! సరేకాని మీయమ్మ అపుడు లాగుకొని పోఁగలిగెనుగాని యిపుడు లాగుకొనిపోఁజాలదు."

"అవును! ఇట్టివి ఆఁడవారికే యెక్కుడు గుఱుతు. దానికేమి? మీరు ప్యాసయినందులకు మా నాయనగారొక పారితోషిక మిచ్చి రమ్మని నన్నుఁ బంపిరి."

"వారికే తోఁచెనా?"

ఈమాటకు ప్రత్యుత్తరము బడయక సుబ్బారావు "ఏమి పారితోషికము తెచ్చితివి?" అని యడిగెను.

"తగిన పారితోషికమేదియు నాకుఁ గానరాలేదు. చేతులూఁపుకొనుచు నేనే వచ్చితిని." "భేష్ నాకు నీవే పారితోషికమవు" అని సుబ్బారావు హఠాత్తుగా చూడమ్మను చుంబించెను. ఆమె గండస్థలమంతయు గులాబీపూలనుత్తిమాయెను. అంతనామె పోవఁ బ్రయత్నింపఁగా సుబ్బారావడ్డువగిలెను.

"మీరింతగా నిర్బంధించుచుంటిరే; నాకు మీరేమి పారితోషిక మీఁగలరు?"

"నీకు నేను; నాకు నీవు."

"నిక్కముగా?"

"నిక్కముగా."

"ముమ్మాటికి?"

"ముమ్మాటికి."

"నేను విధవ నని మీరు మఱచియుందురు."

చూడమ్మ యిట్లు లనఁగనే సుబ్బారావామె ప్రక్క నిలువఁబడి యామెబుజముమీఁద బుజము వయిచి "ఇపుడో?" అని యనెను.

తలవని తలంపుగా సుబ్బారావుబాహువు తన మీఁదఁ బడుటచే చూడమ్మ నిస్సారమగు నీ ప్రపంచము నంతయుఁ గోలుపోయెను.

మన్మథుఁడు సమ్మోహనాస్త్రమును వేయు నను చుందురు. సుబ్బారావు బాహుపాశమును వేయునే వేసెను. బహుశా ఈరెండును ఆమెమీఁదఁ బ్రయోగింపఁబడియుండును ఏలనఁగా సుబ్బారావాగది తలుపులు వేయుట చూడమ్మ కిసుమంతయుఁ దెలియదు.

[ముందరిసంచికలో సమాప్యము.]

---

# భారతదేశమందలి బ్రిటిషుసైన్యములు—వానినిమిత్తవ్యయములు

మోచర్ల కృష్ణమూర్తి

బ్రిటిషుప్రభుత్వమువారు భారతదేశమున నిలిపియుంచుచున్న ఆంగ్ల సైనికనివహముల తరఫీయతు చేయుటకైన ఖర్చుల నెవ రెంత భరింపవలెననువివాద మీ యుభయదేశములకును చిరకాలముగా వచ్చుచున్నది. ఆఖర్చులను భారతదేశ మింతవరకును పైసలతో సహా చెల్లించుచున్నది. వీనినే "కాపిటేషను చార్జి" లనియు, "హోము ఎఫెక్టివు చార్జి" లనియు వ్యవహరించుచుందురు. ప్రతివత్సరమీ ఖర్చులకొరకు సుమారు రెండుకోట్ల రూప్యము లాంగ్లదేశమునకు ప్రవహించి పోవుచున్నవి. భారతదేశము ఏదో యొక పేరుతో బ్రిటిషుదేశమునకు చెల్లించుచున్న కప్పములలో నిది యొకటి యని చాలమంది యభిప్రాయము. ఈఖర్చుల నసలు భారతదేశమునుండి వసూలుచేయు సిద్ధాంతము అక్రమమైనదనియు, వానిలో కొన్నిపద్దుల నన్యాయముగ చేర్చుచున్నా రనియు ఉభయదేశములయందును చాలమంది ప్రముఖులు ఆక్షేపించుచుండిరి. ఈ వివాదముల పరిష్కరించుటకిటీవల నియమింపబడిన విచారణసంఘమువారి శిఫార్సులు, భారతదేశమున కవి యొనర్చిన న్యాయములవలన, అన్యాయములననుగూడ జాగ్రత్తగ పరిశీలింపదగియున్నవి. ఈ సంఘమునకును, ఇదివరకీ విషయమును విచారణచేసియున్న ఇతరసంఘములకును భేదము గలదు. ఈ సంఘమున సభ్యులుగ నున్నది ఇరుపక్షములవారిచేతను పేర్కొనబడిన న్యాయశాస్త్రప్రవీణులగు ప్రతినిధులు. బ్రిటిషుదేశముతరఫున ప్రివీకౌన్సిలరులగు టాంలిన్, డునెడిన్ ప్రభువులు సభ్యులుగ పేర్కొనబడిరి. భారతదేశముతరఫున న్యాయమూర్తులు సర్ షాడీలాలు, సర్ షామహమ్మదుసులేమాన్ గార్లు ప్రతినిధులుగనుండిరి. ఆస్ట్రేలియా దేశీయుడును, న్యాయశాస్త్రవిశారదుడును అగు సర్. రాబర్టు రాండాల్ఫు గారెన్ గారిని బ్రిటిషుప్రభుత్వమువా రధ్యక్షతకు నియమించిరి. అందుచే నీసంఘమువారి శిఫార్సులు మరింత ప్రాముఖ్యమును వహించుచున్నవి.

కాపిటేషను వ్యయముల సమస్య ఇంచుమించు ౧౬౦ వత్సరములుగా నున్నను భారతదేశ పరిపాలనను బ్రిటిషుప్రభుత్వమువారు స్వయముగ నిర్వహించుటకు పూనుకొనిన గత ౬౦ వత్సరములలో నావ్యయము చాల హెచ్చి భారతదేశమునకు మరింత దుర్భర మయ్యెను. ఈస్టిండియా కంపెనీవారు పరిపాలించుచున్నంత కాలమును, వారు, తమకు గావలసిన ఆంగ్లసైనికులలో చాలభాగమును తామే చేర్చుకొని తరఫీయతు చేసుకొనుచుండిరి. బ్రిటిషుప్రభుత్వమువారినుండి చాల తక్కువగమాత్రమే బదులు దీసుకొనుచుండిరి. బ్రిటిషుప్రభుత్వమువారు భారతపరిపాలనభారమును వహించినపిమ్మట ౧౮౬౦ సంవత్సరప్రాంతమున, సైనికనిర్మాణమున గావించినమార్పులవలన భారతదేశమునందుంచుటకవసరమగు ఆంగ్లసైన్యముల నన్నిటిని బ్రిటిషుప్రభుత్వపటాలములనుండియే తీసుకొనునటు లేర్పరుపబడెను. అదివరకు కంపెనీవారు ఆంగ్లసైనికులను స్వయముగ తరఫీయతు చేసుకొనినపుడు, ఒక్కొక్కసైనికునకు షుమారు ౨౬ పౌనులయ్యెడిది. బ్రిటిషుప్రభుత్వమువారి పరిపాలన వచ్చినతరువాత బ్రిటిషు యుద్ధాంగకార్యాలయమువారు సైనికులనంపుటకు ప్రారంభించినపిమ్మట ఒక్కొకసైనికునిచేర్చి తరఫీయతుచేయుటకైనఖర్చులక్రింద ౨౦౫ పౌనుల వసూలుచేయుటకు ప్రారంభించిరి. ఇంతవిపరీతముగ హెచ్చు 'రేటు' ను పుచ్చుకొనుటను, మేజరుబాల్ఫరు, ఫాసెటు మొదలయిన న్యాయరతులను ఆంగ్లప్రముఖులు నిరసించియుండిరి. ౧౮౫౭-వ సంవత్సరము భారతదేశపు సిపాయీల తిరుగుబాటు జరిగిన

తరువాత బ్రిటిషుప్రభుత్వమువారీదేశమున నుంచు బ్రిటిషుసైనికుల సంఖ్యనుగూడ చాల హెచ్చించిరి. ౧౮౫౭-వ సంవత్సరమునకు పూర్వ మీదేశమున సుమారు ౪౫ వేల బ్రిటిషుసైనికులు మాత్రమే యుంచబడుచుండిరి. ౧౮౬౦-వ సంవత్సరమున సైనికవిషయముల విచారణచేసిన రాయల్ కమిషనువారు, భారతదేశమున ౮౦ వేలసైనికులవరకు నుంచదగునని నిర్ణయించిరి. అప్పటినుండియు నింతవరకును - ఐరోపాసంగ్రామవత్సరములలో దప్ప - ఈదేశమున ౬౦ వేలకు తక్కువగాకుండ బ్రిటిషుపటాలముల నిలిపియుంచుచున్నారు. బ్రిటిషుప్రభుత్వమువారికి గల మొత్తముసైన్యములో మూడవవంతు ఈ దేశమున నిలిపియుంచబడుచున్నది. ఈవిధముగ బ్రిటిషుసైనికులసంఖ్యయును, వారితరఫీయతునకు చెల్లింపవలసిన ఖర్చులనుగూడ హెచ్చిపోవుటచే నిది భారతప్రభుత్వమువారికి గొప్ప ఆర్థికసమస్యగగూడ పరిణమించెను. తరఫీయతుఖర్చుల నిర్ణయించుటలో చేర్పబడుచున్న పద్దులనుగురించి బ్రిటిషు యుద్ధాంగకార్యాలయమువారికిని, భారతమంత్రికార్యాలయమువారికిని మొదటినుండియు చాలవివాదములు కల్గుచుండెను. అట్టి వివాదములవలన లెక్కలు సరిజూచుకొని సొమ్ము చెల్లించుటలో నాలస్యమగుచుండుటవలనను, ౧౮౬౦-వ సంవత్సరము సర్. అలెగ్జాండరు టుల్లాక్ గారియధ్యక్షతక్రింద నేర్పరుపబడిన సంఘమువారు కాపిటేషనుపద్ధతి నేర్పరచి సైనికులచేర్చి తరఫీయతు చేయుటకైన ఖర్చులక్రింద భారతదేశమునెందరుబ్రిటిషుసైనికులుందురో వారిసంఖ్యనుబట్టి తల ౧-కి ౧౦ పౌనుల చొప్పున ప్రతివత్సరమును చెల్లింపవలెనని నిర్ణయించిరి. ఆరేటుప్రకారమైనచో భారతదేశమందలి పటాలములలో నొక్కొకవత్సరము గల్గుచుండుఖాళీలను భర్తీచేయుటకు కావలసిన సైనికులచేర్చి తయారుచేయుటకగుఖర్చులు బ్రిటిషుప్రభుత్వమువారికి (ఒక్కొకనికి పౌ. ౨౦౫) ముజరా వచ్చునని యుద్ధాంగకార్యాలయమువారంగీకరించిరి. ౧౮౬౬-వ సంవత్సరమువరకట్లే జరిగెను. తరువాత ననేక మార్పులు జరిగెను. ౧౮౭౯-౮౦ సంవత్సరమున నార్త్ బ్రూకుకమిషనువారు కాల్బలమునకుమాత్రము "కాపిటేషను"రేటును ౭ పౌ. ౧౦షి. చొప్పున పుచ్చుకొనవలెనని నిర్ణయించిరి. ౧౯౦౯-వ సంవత్సరము రోమరుకమిషనువారీరేటును ౧౧ పౌ. ౮ షి. లకు హెచ్చించిరి. ౧౯౨౦-వ సంవత్సరమున నీరేటు తిరిగి ఒక్కమారుగా ౨౫ పౌనులకు హెచ్చింపబడెను. ఈవిషయముపై తిరిగి వివాదము లధికమగుటచే నవి పరిష్కరించుకొనబడువరకును ౧౯౨౮-వ సంవత్సరమునుండి సైనికశాఖకు సంవత్సరమునకు ౧౫ లక్షలపౌనులచొప్పునను, విమానదళమునకు ౧౧౦ వేలచొప్పునను, మొత్తముగా చెల్లింపవలెనని నిశ్చయింపబడెను. దానిఫలితముగ సర్. రాండాల్ఫు గారెట్ గారి యధ్యక్షతక్రింద నీ 'ట్రిబ్యూనలు' నియమింపబడెను.

భారతదేశమందలి బ్రిటిషుసైన్యముల వ్యయములకు సంబంధించిన వివాదములలో అయిదు విషయములు 'ట్రిబ్యునలు' వారియెదుట నుంచబడెను. అందు మొదటిది "కాపిటేషను చార్జి "లను గురించినది. ఈసందర్భమున ట్రిబ్యూనలువారు విచారణ చేయవలసిన యంశము లీ క్రిందివిధమున బ్రిటిషుప్రభుత్వమువారిచే నిర్వచింపబడెను. "భారతదేశమందుంచబడు బ్రిటిషు పటాలములలోనికి సైనికులను చేర్చి, వారికి శిక్షణ మొసగుటకగు ఖర్చులక్రింద భారతదేశ మింకను కొంత మొత్తము చెల్లించుచుండవలెనా ? చెల్లించుచుండవలెననినచో ఏపద్ధతిప్రకారమా మొత్తమును నిర్ణయింపవలెను ?"

పైనుదాహరింపబడిన "విచారణీయాంశముల" పరిశీలించినయెడల వానిలో మొదటియాంశము విచారణకెంత ముఖ్యమైనదో వెంటనే తెలియగలదు. తరఫీయతు ఖర్చుల చెల్లింపనే యక్కరలేదని నిర్ణయమగుచో తరువాత చర్చింపవలసిన విషయ మేద్దియు నుండదు. ఈవిషయము లాంఛనార్థము విచారణీయాంశములలో చేర్పబడినదిగాదు. భారతీయు లీ ఖర్చులను మొదటినుండియును తీవ్రముగ నాక్షేపించుచుండిరి. భారతదేశములందీ సైన్యముల నుంచినది నిజముగ భారతీయులకొరకు గాదు. భారతదేశము తిరుగబడి బ్రిటిషు



శుక్లసప్తమి
(శ్రీ కాశీనాథరావుగారి ప్రాచీన చిత్రసంగ్రహమునుండి)

పరిపాలనమునుండి తప్పించుకొనకుండ నణచియుంచుటకు, భారతదేశమున బ్రిటిషు ఆధిపత్యమును నిలువబెట్టుటకు, బ్రిటిషువర్తకమునకును, బ్రిటిషుధనస్వాముల పెట్టుబడులకును ఉపద్రవము గలుగకుండ కాపాడుటకు, ప్రాచ్యఖండమునం దెవరైన బ్రిటిషుఆధిపత్యమును ధిక్కరించి వారి సామ్రాజ్యమునకు భంగము గలిగింప నెంచిన నో వారిని పట్టి దండించి బుద్ధి గరపుటకు బ్రిటిషు సైన్యముల నీదేశమం దుంచిరి. బ్రిటిషు రాజకీయ నాయకు లీవిషయమున నేమాత్రమును దాపరిక మొనర్చలేదు. వారిలో చాలమంది ఈ విషయమును బహిరంగముగ ప్రకటించియుండిరి. ప్రస్తుతము బ్రిటిషు ప్రభుత్వ ప్రధానామాత్యు డగు రాంశే మెక్డొనాల్డుగారే తాము రచించిన గ్రంథమునందు "భారతదేశమందలి సైనికబలమంతయును గూడ బ్రిటిషు సామ్రాజ్య ప్రయోజనములకొర కుద్దేశింపబడినది గాని భారతదేశముకొరకుగాదు" అని అంగీకరించెను. ఈ విధముగ బ్రిటిషుప్రభుత్వమువారు స్వీయాధిపత్యముకొరకును, స్వలాభముకొరకును బ్రిటిషుసైన్యముల నీదేశమున నుంచినపుడు వాని శీతభక్ష్యములను భారతదేశముపై నంటగట్టుటే అన్యాయము. అంతటితో నాగక ఆసైనికుల చేర్చుటకును, శిక్షణ మొసగుటకును అగుఖర్చులనుగూడ భారతదేశమునుండి వసూలు చేయుట "కేవలము నిందితమగు పని" యని ఆర్జిలు ప్రభువు మొదలగుఆంగ్లనాయకు లెందరో నిరసించిరి. దాదాభాయినౌరోజీ, సర్. ఇ. వాచా, గోపాలకృష్ణ గోఖలే మొదలగుభారతీయనాయకు లీయన్యాయమును తొలగింపవలెనని ఆక్రోశించిరి. ఇది కేవల మన్యాయమేకాదు; బ్రిటిషుప్రభుత్వమువారు తమసామ్రాజ్యమం దితరప్రాంతములయం దనుష్ఠించుచున్న విధానమునకుగూడ విరుద్ధము. బ్రిటిషుప్రభుత్వమువారు తమ సైన్యమంతటిలో సగభాగమును, ఆంగ్లదేశమునం దుంచుకొని, మిగిలినసగభాగమును తమ సామ్రాజ్యమందు వేర్వేరుప్రాంతములందు నిలిపియుంచుచున్నారు. కాని ఒక్కభారతదేశమునుండితప్ప మిగిలిన యేప్రాంతమునుండియునుగూడ బ్రిటిషుప్రభుత్వమువారు ఈవిధముగ సైనికుల తరిఫీయతుఖర్చులగూడ ముజరా పుచ్చుకొనుట లేదు. ఇంతప్రధానమైనవిషయమును విచారణాంశములలో ప్రథమగణ్యమైనదానిని, ట్రిబ్యూనలువారేమాత్రమును విచారింపకపోవు టాశ్చర్యకరము. వారి నివేదికయందు సొంత మెక్కడనుగూడ ఈవిషయముపుచర్చయే కన్పింపదు. ఇందుకు కారణము దురూహ్యము. భారతప్రభుత్వమువారు మొదట నీఖర్చులనాక్షేపించియే యుండవలెను. లేనిచో నీసమస్య చేర్పబడియుండదు. తరువాత భారతప్రభుత్వమువారు పైకిదెలుప వీలులేని యేకారణమువలననో ఆయాక్షేపణను వదలుకొనియుండవలెను. లేక వారాక్షేపించినను ట్రిబ్యునలువారు పూర్తిగ నుపేక్షించియైన నుండవలెను. ఏది ఎటులనైనను—జరిగినలోపమువలన—భారతదేశమునకు తీరనిఅపచార మొనర్పబడెను. నిరుపేదలగు భారతీయులు — బ్రిటిషుప్రభుత్వమువారిపై బడుభారమును తగ్గించుటకు—రు ౨ కోట్లు సాలీనా చెల్లింపవలసివచ్చినది. భారతప్రభుత్వమువారీ ఖర్చులను పూర్తిగ ప్రతిఘటించునవకాశమును పోగొట్టుకొని వివరములగురించి వివాదపడుట జుట్టువదలి కాళ్లను పట్టుకొనినటు లున్నది.

కాపిటేషనురేటులనిర్ణయించుటలో నేయేఖర్చుల లెక్కలోనికి దీసుకొనవలయు ననువిషయము రెండవ యంశముక్రిందకు వచ్చును. ఇంతవరకును కాపిటేషను రేటు ఈక్రిందివిధముగ నిర్ణయింపబడుచున్నది. బ్రిటిషు ప్రభుత్వమువారు తమసైన్యమం దేటేట నేశాఖయం దెన్నిఖాళీలు వచ్చునో అంచనావేసెదరు. ఆఖాళీలను భర్తీ చేయుట కెంతమందిసైనికులు కావలెనో, అందుకొరకు మొదట నెంతమందిని చేర్చుకొనవలయునో లెక్కించెదరు. కావలసిన సైనికులసంఖ్యకంటె చేర్పవలసిన సైనికులసంఖ్య అధికముగ నుండును. శిక్షణము ముగియులోపల కొందరు పారిపోవుటయు, మరణించుటయు సంభవించుటచే నిది యవసరము. ఇట్టి 'పారు'నకుగాను బ్రిటిషుప్రభుత్వమువారు భారతదేశమున కంపిన

ప్రతిమువ్వురు సైనికులకు నల్గురఖర్చుల కాపిటేషనులో చేర్చియుండిరి. ఆ సైనికుల తయారుచేయుటకగు యావత్తు ఖర్చులను భారతదేశమును ఆంగ్లదేశమును తీసుకొను తయారైన సైనికుల సంఖ్యనుబట్టి ఇరుదేశములకును పంచెదరు. అటుల పంచగా భారతదేశము చెల్లింపవలసిన మొత్తమును, ప్రతివత్సరమునను భారతదేశమున పని చేయుచున్న బ్రిటిషుసైనికుల సంఖ్యనుబట్టి ధామాషాయిాన, తలకు ఎంతయగునో విభజించెదరు. అదియే కాపిటేషనురేటు. ఈరేటును నిర్ణయించుటలో చాల పద్దుల గురించి వివాదము లున్నను ఉభయపక్షములవారును గలసి, ముఖ్యముగ నీ క్రింది మూడు విషయములగురించి మాత్రమే నిర్ణయము నొసగవలసిన దని ట్రిబ్యునలువారిని గోరిరి. (౧) భారతదేశమున కంపబడు సైనికుల తయారుచేయుట కదనముగా నగు వ్యయముల మాత్రమే భారతదేశము చెల్లింపవలెనా, లేక అన్ని ఖర్చుల మొత్తములోను తనభాగమును చెల్లింపవలెనా? (౨) భారతదేశమున పనిచేసివెళ్లిన సైనికులు, బ్రిటిషు దేశములో రిజర్వులం దున్న కాలమునుబట్టి తరిఫీయతు ఖర్చులలో భారతదేశమునకు ముజరా రావలెనా? (3) సైనికుని తరిఫీయతు చేయుట కగు ఖర్చులను ౧౨ నెలలకు కట్టవలెనా, లేక ఆరునెలలకుమాత్రమేనా?

## అదనపుఖర్చులు

బ్రిటిషుప్రభుత్వమువారు తమస్వంతమునకు సైనికుల తయారుచేసుకొనవలసియేయున్నదిగదా. అందుకొరకు శిక్షణాలయములను, సిబ్బందిని ఏర్పరచుకొని వానిఖర్చుల భరించక తప్పదు. భారతదేశమునకుగాను మరికొందర సైనికుల తయారుచేయుట కదనముగ నెంత ఖర్చగునో దానినిమాత్రమే, బ్రిటిషుప్రభుత్వమువారు పుచ్చుకొనవలె నని భారతప్రభుత్వమువారి వాదన. అటులగాక మొత్తముఖర్చులుపంచుటవలన, బ్రిటిషు ప్రభుత్వమువారు తమఖర్చులగూడ భారతదేశమునుండి వసూలుచేసినవా రగుచున్నారు. ఇంతియగాక ఈ సైనికశిక్షణశిబిరము (డిపో)లు ఆంగ్లదేశమందుండుట వలన బ్రిటిషుప్రభుత్వమున కితరవిధములగు లాభములు గూడ గల్గుచున్నవి. ౧౯౩౪-వ సంవత్సరమున సాందుహర్ట్సు ప్రభువు, తరిఫీయతునందు సైనికులజీతములు భత్యములు తప్ప శిక్షణశిబిరముల కగుఖర్చులను భారతదేశమునుండి పుచ్చుకొనరాదని ఈస్టిండియా ఫైనాన్సు కమిటీయెదుట వాదించుచు, శిబిరములవలన బ్రిటిషు ప్రభుత్వమువా రందుచున్న ప్రత్యేకలాభములగురించి ఇటుల నుడివెను. "డిపోలలోని ఉద్యోగులు ఇతర కార్యములకుగూడ నుపయోగింపబడుచున్నారు. బ్రిగేటు డిపోలలోని ఉద్యోగులు ఆగ్జిలరీపటాలముల తరిఫీయతు చేయుటకుగూడ ఉపయోగింపబడుచున్నారు. అంతియగాక, ఒకజిల్లాలో 'డిపో' ఉన్నంతమాత్రమున నచట శాంతి సుస్థాపితమగును. ప్రత్యేకముగ నచట నొకపటాలము నుంచ నవసరములేదు. ఏదైన అల్లరి జరిగినయెడల డిపోలలోని ఉద్యోగులను, తరిఫీయతునందు సైనికులను గూడ పంపి అణచివేయవచ్చును. 'డిపో'లు చేయు పనులలో నిది చాలముఖ్యమైనది. ఆంగ్లదేశమునకెక్కువ లాభదాయకమైనది."

భారతదేశమున కట్టిలాభ మెద్దియుగల్గుట లేదు. అయినను వానిఖర్చులలో భారతదేశము మాత్రము మూడవభాగమును పూర్తిగ చెల్లించవలసియున్నది. ట్రిబ్యునలువారీ విషయమున భారతప్రభుత్వమువారి వాదనను పూర్తిగ నిరాకరించిరి.

## "రిజర్వు"లకు ముజరా

భారతదేశమున పనిచేసి తిరిగివెళ్లిన సైనికులు మొదటిరిజర్వునందున్న కాలమునకు వారిశిక్షణకు చెల్లింపబడిన మొత్తమున కొంతభాగమును ముజరా యొసగవలెనా, లేదా యనువిషయము రెండవది. ౧౯౭౦-వ వత్సరమున బ్రిటిషు ప్రభుత్వమువారు తమ సైనికనిర్మాణమున "లాంగుసర్వీస్" పద్ధతిని వదలి "షార్టుసర్వీసు" పద్ధతి నవలంబించినప్పటినుండియు నీ వివాదము సాగుచుండెను. "లాంగ్ సర్వీసు" పద్ధతియందు, పటాలమున చేరిన సైనికుడు ౧౨ వత్సరములు పనిచేసెడివాడు. "షార్టు సర్వీసు" పద్ధతియందు సైనికుడు పటాలములో ౭ వత్సరములు మాత్రమే పనిచేయును. తరువాత ౫

వత్సరములు మొదటితరగతిరిజర్వునం దుండవలెను. రిజర్వునం దున్న కాలమున నతడు పటాలములలో పని చేయ నక్కరలేదు. తన యిష్టమువచ్చిన వృత్తియం దుండవచ్చును. కాని ప్రభుత్వమువారి కవసరము వచ్చి నపుడు, ప్రభుత్వమువారి యుత్తరువుపై వెంటనే వచ్చి పటాలమున చేరవలెను. ఆయైదు వత్సరములును రిజర్వులోని సైనికులకు రోజు ౧ కి ౯ పెన్నీలు జీత మొసగబడుచుండును ఈ పద్ధతివలన బ్రిటిషుప్రభుత్వ మువారికి స్వల్ప వ్యయముతో, యుద్ధము వచ్చినతోడనే రంగమున కంపుటకు కావల నంతమంది సైనికులు సిద్ధ ముగ నుందురు.

ఈ పద్ధతిలో భారతదేశమునుండి తిరిగివెళ్లిన ప్రతిసైనికుడును, అయిదువత్సరములవరకు మొదటి "రిజర్వు"నం దుండును. ఈవిధముగ బ్రిటిషుప్రభుత్వము వారికి భారతదేశపు ఖర్చులమీద, ౬ వత్సరముల తరిఫీ యతు గలిగి ౫ వత్సరములు సేవచేయు సైనికులు లభించుచున్నారు. ఇక భారతదేశమునకో! లాంగు సర్వీసునందు వచ్చిన సైనికుడు ౧౧ వత్సరములు సేవ చేసెడివాడు. షార్టుసర్వీసులో వచ్చిన సైనికుడు ౭ వత్సరములు మాత్రమే పనిచేయును. అనగా అనంత రము తిరిగి తరిఫీయతుఖర్చుల నిచ్చి క్రొత్తసైనికుని దెచ్చుకొనవలెను. దీనివలన భారతప్రభుత్వమువారి ఖర్చులు ఇంచుమించు రెట్టింపు పెరిగెను. బ్రిటిషు ప్రభుత్వమువారు భారతదేశమునుండి వచ్చిన సైనికుని వలన ౫ వత్సరములు లాభమందుచున్నారు గనుక ఆ కాలమునకు దామాషాయీని శిక్షణవ్యయముల ముజరా యివ్వవలెనని భారత ప్రభుత్వమువారి వాదన. రిజర్వు లలోనివారు పటాలములలోనివారివలె పూర్తిగ నుప యోగపడుటలేదు. కనుక వారొనర్చుగల సేవను పటా లములందలి సైనికునిసేవతో సరిపోల్పరాదని యుద్ధాంగ కార్యాలయమువా రాక్షేపించిరి. కాని ట్రిబ్యునలువా రీవాదన నంగీకరింపక, మొదటితరగతి రిజర్వునం దున్న కాలమునకు బ్రిటిషు ప్రభుత్వమువారు భారతదేశమునకు ముజరా యొసగవలె నని నిర్ణయించిరి. 60 వత్సరము లకు నేటి కిపుడీ విషయమున న్యాయము గల్గినది.

## ఆరునెలలా, పండ్రెండునెలలా?

సైనికులశిక్షణముకొరకు భారతదేశ మారునెలల కగుఖర్చుల చెల్లింపవలెనా, పండ్రెండునెలలకు చెల్లింప వలెనా యనునది మూడవయంశము. ఇంతవరకును బ్రిటిషుప్రభుత్వమువారు, కాల్బలమున కారునెలలకును, ఆశ్వీక, శతఘ్నిదళములకు తొమ్మిదినెలలకును పుచ్చు కొనుచుండిరి. దాని నిపుడు ౧౨ నెలలకు హెచ్చింప వలెనని వారికోరిక. ఆధునికసంగ్రామములపరిస్థితుల బట్టి, సుశిక్షితులగుసైనికుని తయారుచేయుటకు ౧౨ నెలలుపట్టుననియు, కనుక భారతదేశ మంతకాలమునకు చెల్లింపవలెనని బ్రిటిషుయుద్ధాంగకార్యాలయమువారి మొదటి వాదము. భారతదేశమునకు సైనికుల నంపునది సెప్టెంబరునుండి మార్చినెలవరకు మాత్రమే. అందుచే ఆరు నెలల శిక్షణ ముగిసినపిదప, షుమారు నాల్గునెలలైనగడ చినగాని వారిని భారతదేశమునకంపుటకు వీలుండదు. కనుక ఆకాలమునకైనను, భారతదేశ మా సైనికులఖర్చుల ముజరాయొసగవలెనని రెండవవాదన. ఆరునెలలు తరి ఫీయతుగలవారే చాలునని భారతప్రభుత్వమువారనినను ౨౦ వత్సరములలోపువా రక్కరలే దనుచున్నారు. సామాన్యముగ బ్రిటిషుప్రభుత్వమువారి సైన్యములలో చేరువారివయస్సు దామాషాయీని ౧౮ వత్సరములు. అందుచే వారిని ౨౦ వత్సరములవరకును బ్రిటిషుపటాల ములం దుంచుకొనవలసివచ్చుచున్నది. దానికి పరిహార ముగనైనను భారతదేశము ౧౨ నెలలఖర్చుల చెల్లింప వలె నను నది మూడవవాదన. ఆరునెలలకంటె ఎక్కువ తరిఫీయతు నందినవారు తమ కనవసరమనియు, ఆరునెలల యనంతరము భారతదేశమునకు పంపువరకును వారిని తమ పటాలములయం దుంచుకొని పనిపుచ్చుకొన్నారు గనుక, ఆకాలమున ఖర్చులను బ్రిటిషుప్రభుత్వమువారే భరింపవలెనని భారతప్రభుత్వమువారివాదన.

ట్రిబ్యునలునందలి శ్వేతసభ్యులు ముగ్గురును ఏకా భిప్రాయులై, భారతదేశము ౯ నెలల ఖర్చులచెల్లింపవగు నని నిర్ణయించుచు అందుల కీక్రిందికారణముల దెలిపిరి. "యుద్ధాంగ కార్యాలయమువారివాదనయు భారతప్రభు త్వమువారి వాదనయుగూడ అతిశయోక్తి దోషమునకు

పాల్పడుచున్నవి. ప్రస్తుత సైనికనిర్మాణపరిస్థితులలో ఇరువదివత్సరములవయస్సుగలిగి ఆరుమాసములమాత్రమే తరిఫీయుపొందగలిగియున్న సైనికుల సరఫరా చేయజాలమని యుద్ధాంగకార్యాలయమువారనుచున్నారు. అట్టిస్థితిలో వారొసగిన ౧౨ నెలలశిక్షణము నందియున్న సైనికుల దీసుకొనుటకంటె భారతదేశమునకు గత్యంతరము లేదు. క్రొత్తగాచేరిన సైనికునివలన, శిక్షణము ముగిసిన పిమ్మట, రెండవయారు నెలలలో పటాలమున కేమియు నుపయోగము లేదని యుద్ధాంగ కార్యాలయమువారు గావించువాదన నిలువజాలదు. సంపూర్ణానుభవజ్ఞుడగు సైనికునియంత కాకపోయినను కొంతవరకైన నత డుపకరించును కనుక మొత్తమువీద ౯ నెలలశిక్షణమునకు భారతదేశము చెల్లించవలెను. తొమ్మిది నెలలకంటె అధికముగ శిక్షణమునందు శాఖలకు దప్ప ఇతరశాఖలన్నిటికిని ఇది వర్తించును." తమ నిర్ణయములకు వారింతకంటె నేకారణములను దెలుపలేదు. ట్రిబ్యూనలునందలి భారతీయ సభ్యులగు న్యా. షాడీలాలు. సులేమాన్ గార్లీసమస్య నద్భుత మగు తర్కనైపుణ్యముతో దీర్ఘముగ చర్చించుచు, ఇప్పటివలెనే ఇకమీద గూడ కాల్బలమునకు ఆరునెలలచొప్పునను, ఆశ్విక, శతఘ్ని దళములకు ౯ నెలల చొప్పునను, "ఎన్ సైను" లకు ౧౨ నెలల చొప్పునను శిక్షణకు లెక్కపెట్టవలెనే గాని దానిని హెచ్చించుట కేమాత్రమును అవసరము గాదని, న్యాయము గాదని నిరూపించిరి.

గత ౬౦ వత్సరములలో ఈప్రశ్ననే ఇంతవరకు అయిదు కమిటీలు విచారించియుండినవి. వారందరును గూడ ఆరుమాసములశిక్షణము చాలుననియే అభిప్రాయపడిరి గాని, హెచ్చింపవలసినదని భావింపలేదు. మొట్టమొదట ౧౮౬౧ లో కాపిటేషనురేటును నిర్ణయించిన టుల్లాక్ కమిటీవారు కాల్బలమునకు నాల్గున్నర నెలల శిక్షణము చాలునని లెక్కవేసిరి. ౧౮౭౨ లో సెకోంబీ కమిటీవారు దీనిని ఆరునెలలకు హెచ్చించిరి. ౧౮౭౮-వ వత్సరమున బారీకమిటీవారుగూడ ఇంచుమించు ఆనిర్ణయమునే బలపరచిరి. ౧౮౭౯ లో నార్త్బ్రూకుకమిషనువారీవిషయమును దీర్ఘముగ పరిశీలించి ఆరునెలలనే ఖాయపరచిరి. ౧౯౦౦-వ సంవత్సరము వెల్బికమిషనువారు ఆమూలాగ్రముగ విచారణచేసి, ఆరునెలలనిర్ణయమును మార్చ నవసరములేదని భావించిరి. ౧౯౦౪-వ సంవత్సరమున న్యా. రోమరుసంఘమువారీవిషయమును ప్రత్యేకముగ విచారించిరిగాని శిక్షణకాలమును హెచ్చింపవలెనని వారభిప్రాయపడినటుల గన్పింపదు. కాలముచేతను, అనేకవిచారణసంఘములచేతను ధ్రువపరుపబడిన ఆనిర్ణయమును సవరించి,౯ నెలలకు హెచ్చించుటకు చాలబలమగుకారణము లుండవలెను. అట్టివేవైన ఉన్నవేమో పరిశీలింతము

నిజముగ, భారతదేశమునకు గావలసిన సైనికులకు ఆరునెలలకంటె నెక్కువశిక్షణ మవసరమా యను విషయమును మొదట తీసుకొందము. ఇది సైనికవిషయములం దనుభవజ్ఞులగువారు నిర్ణయింపవలసినవిషయము. ఇంతవరకును, ౧౨ నెలలశిక్షణ మవసరమని చెప్పుచున్నది యుద్ధాంగకార్యాలయమునకు సంబంధించినవారే. భారతదేశీ యావశ్యకతలకు సంబంధించిన విషయములలో వారియభిప్రాయము ప్రమాణము గాజాలదు. తమ యావశ్యకతలు భారతప్రభుత్వమువారికే దెలియగలవు. ఆవిషయమునందు వారి యభిప్రాయమే ప్రమాణముగాని ఇతరులది గాదు. తమ సైనికుల కెంత తరిఫీయ దవసరమగునదియు నిర్ణయించు నధికారము భారతప్రభుత్వమువారిదే గాని తమది గాదని యుద్ధాంగ కార్యాలయమువారే తమ మెమోరాండమునం దంగీకరించిరి. తా మీవ్యవహారమున, భారతప్రభుత్వమువారి యేజెంటులముమాత్రమేనని కూడ దెలియజేసిరి. ఇక భారతప్రభుత్వమువారును, భారతసైనికావశ్యకతల నెరిగిన సైనికాధికారులునుగూడ ఆరునెలలశిక్షణము చాలునని ఖండితముగ ప్రకటించియుండిరి. సైనికవిషయములం దసమానమగు అనుభవముగల కిచినరుప్రభువు, సర్. బూచాంపుడఫ్, రాలిన్సనుప్రభువు, సర్. ఫిలిప్ చెట్వుడ్డుమొదలగు ప్రముఖు లందరారు నెలలు చాలునని దెలిపిరి. వీరు భారతీయులుగారు; బ్రిటిషువారు. ఆంగ్లదేశమున కెంతయో కీర్తిగడించి, బ్రిటిషుప్రభుత్వమువారిచే, ఆయాకాలములలో, భారతదేశమునందలి సైన్య

ములకన్నిటికిని ప్రధానసైన్యాధిపులుగ నియమింపబడిన, బాధ్యతనెరింగిన యధికారులు. భారతదేశావశ్యకతలు వారికంటె బాగుగ దెలియునని యెవ్వరును చెప్పజాలరు. చెట్‌వుడ్ గారు బ్రిటిషుకౌన్సిలునందు సభ్యులుగ నుండి, ప్రస్తుతము భారతదేశమున సర్వసేనాధిపతిగ పనిచేయుచున్నాడు. అట్టి ప్రామాణికులకు విరుద్ధముగ ట్రిబ్యునలునందలి మువ్వురును ౯ నెలల శిక్షణ మవసరమని యెట్లు నిర్ణయించిరో ఆశ్చర్యకరము. అంతియ గాదు. భారతప్రభుత్వమువారు తమ కారు నెలల శిక్షణ మందినవారు చాలుననియు, అవసరమగుచో, భారతదేశావశ్యకతలనుబట్టి, తరువాత భారతదేశమున మరి కొంత తరిఫీయతు నిప్పించుకొనెద మనియు, ఆరు నెలలకంటె నెక్కువ తరిఫీయతు గలవారు తమ కేమాత్రము నక్కర లేదనియు ఖండితముగ బల్కిరి. ఇందు కేవిధమగు సమాధానమును ఉండజాలదు. భారతప్రభుత్వమువా రక్కరలే దనుచుండ, వారి యేజంటులమని చెప్పుకొను యుద్ధాంగకార్యాలయమువారికి గాని, ట్రిబ్యునలువారికి గాని ౯ నెలల శిక్షణము బడసిన సైనికుల వారిపై బడవేసి హెచ్చుఖర్చుల చెల్లింపవలెనని నిర్బంధించుటకంటె విపరీతమగునది ఇంకొకటి ఉండజాలదు.

పోనీ, యుద్ధాంగ కార్యాలయమువారు, తమ బ్రిటిషు పటాలములలో ౧౨ నెలలకు తక్కువకాలము మాత్రమే సైన్యమునం దున్నవారిని సరియగుశిక్షణందని వారినిగ పరిగణించుచున్నయెడల, వారి వాదనయందు కొంచెమైన బల ముండెడిది. వా రటుల చేయుట లేదు. వారు శిక్షణాలయములయందు (డిపోలలో) నిజముగ శిక్షణ మొసగునది ౧౭ వారములు మాత్రమే. పిమ్మట వారిని పటాలములలో చేర్చెదరు. చేరిన ఆరు నెలలనుండియు నతడు పటాలమునం దితర సైనికు లందరితోపాటు సైనిక ధర్మముల నన్నిటిని నిర్వర్తించుచుండవలెనని సైనిక నిబంధనలలో స్పష్టముగ విధింపబడెను. యుద్ధము వచ్చినపు డతనిని కూడ రణరంగమున కంపెదరు. దీనినిబట్టి, బ్రిటిషు యుద్ధాంగ కార్యాలయమువారు ఆధునిక యుద్ధముల కంపబడు సైనికునకు ౧౨ నెలల శిక్షణ మవసర మనిగాని, ఆరు నెల లల్పమనిగాని స్వానుభవమం దేమాత్రమును భావించుట లేదని తెల్ల మగుచున్నది.

ఒకవైపున ఇరువది వత్సరములకు తక్కువ వయస్సుగలవా రక్కరలే దనియు, మరియొకవైపున ఆరు నెలలుమాత్రమే తరిఫీయతు నందిన సైనికులు గావలె ననియు కోరుటలో భారతప్రభుత్వమువారు అసాధ్యమగు కోరికను కోరుచుండిరని ట్రిబ్యునలు నందలి శ్వేతసభ్యులు తమ నిర్ణయమున కొకవిధమగు కారణముగ దెల్పిరి. ౨౦ వత్సరముల నిర్ణయము భారతదేశముకొరకే యేర్పడినదనుకొందము. కాని యుద్ధాంగ కార్యాలయమువారికి నిజముగ నంత యసాధ్య మగు విషయమా? తాము సాధారణముగ ౧౮½ – ౧౯½ వత్సరములలోని వారిని సైన్యములో చేర్చుకొనుచున్నామని యుద్ధాంగ కార్యాలయములవారు దెలిపి యుండిరి. అందులో నూటికి ౩౬ వంతులమంది ౧౯½ వత్సరములవారనిగూడ వారే అంగీకరించిరి. భారతదేశమునకు గావలసినది ౩౩⅓ వంతుమాత్రమే. ౧౯½ వత్సరములవారి కారు నెలల శిక్షణము ముగియువరకు ౨౦ వత్సరములు ముగియును. కనుక ౨౦ వత్సరముల వయోనిర్ణయము బాధ లేకుండగనే, ఆరు నెలల శిక్షణతో భారతదేశమునంపదగు సైనికులు, కావలసినంతి మందికంటె నెక్కువయే యుద్ధాంగ కార్యాలయము వారివద్ద గలరు. షాడీలాలు సులేమాన్ గార్లు సూచించినటుల “భారతదేశమునెడల సదభిప్రాయములును, భారతదేశమునకు సహాయ మొనర్చ నభిలాషాపూరితులును అగు యుద్ధాంగకార్యాలయమువారికి భారతదేశమున గావలసిన సైనికులను, ౧౯½ వయస్సున చేరిన వారినుండి ఆరు నెలల శిక్షణము ముగియగనే పంపుట కష్టసాధ్యము గాదు.”

౨౦ వత్సరములకు తక్కువవయస్సుగలవారిని భారతప్రభుత్వమువా రక్కరలే దనిరని ఆరోపించి, హెచ్చుకాలమునకు తరిఫీయతునకు ఖర్చుల నిచ్చుకొనవలెననుటకు యుద్ధాంగకార్యాలయమువారు దానినొకకారణముగ నుపయోగించుకొనజూచుచున్నటు

లున్నది. యుద్ధాంగకార్యాలయమువారి అద్భుత కల్పనాశక్తితప్ప ఆయారోపణ కాధార మెద్దియును లేదు. చిరుతవయస్సువారి నంపరాదని చాలకాలముక్రింద భారతప్రభుత్వమువారు సూచించియున్న విషయము నిజమే కాని అది భారతదేశముకొరకు గావింపబడినది గాదు. యుద్ధాంగకార్యాలయమువారు మరీబాలురను సైనికులుగ భారతదేశమున కంపుచుండుటచే, అచటి శీతోష్ణస్థితులు సరిపడక, వారి ఆరోగ్యము చెడిపోయి శైథిల్యము కలుగుచుండెను. అందుచే బ్రిటిషు సైనికుల యోగక్షేమములకొరకే భారత ప్రభుత్వమువారు మొదట నటుల సూచించిరి. ఆసూచనకు కారణభూతుడగు భారతసర్వసేనాని యగు సాండుహర్స్టుప్రభువు, ౧౮౭౪-వ సంవత్సరమున ఈస్టిండియా ఫైనాన్సు కమిటీ యెదుట సాక్ష్య మొసగుచు నావిషయము నిటుల స్పష్టీకరించెను. "చిరుతవయస్సువారగు సైనికుల నంపుట వలన యుద్ధముసంభవించినపుడు భారతదేశమునకు నష్టదాయక మనువిషయము నిజమే. కాని నేనాకారణముచే ఆక్షేపింపలేదు. బాలురగు నీసైనికులు పరదేశములందు శీతోష్ణస్థితి సరిపడక, ఆరోగ్యము గోల్పోయి, వ్యాధిగ్రస్తులై అల్లాడుచుండుట చాలవిషాదకరము. అట్టి బాలుర నంపుటకంటె, వారియెడల నొనర్పగల అమానుషమగు నపచార ముండదు." ఈకారణముచేతనే పార్లమెంటుసభవారు ౧౮౭౧-వ సంవత్సరమున ౨౦ సంవత్సరముల లోపువయస్సుగల సైనికులను స్వదేశమునందే యుంచవలెనుగాని, విదేశముల కంపరాదని నిషేధించుచు తీర్మానించిరి. ఇది ఒక్కభారతదేశమునకే గాదు. సామ్రాజ్యమునం దన్నిప్రాంతములకును వర్తించును. ఈకారణమును పురస్కరించుకొనియే ౧౮౭౧-వ సంవత్సరమున బ్రిటిషుసైనికశాఖను సంస్కరించినపుడు జనరలుమెక్డొగలు కమిటీవారు, క్రొత్తగా చేర్చుకొనబడినసైనికులనందరిని స్వదేశమునందలి పటాలములలోనే యుంచి, ఆపటాలములలో కొంతకాలము సేవచేసి, వయస్సు ముదిరినసైనికుల విదేశములకు పటాలములతో పంపవలెనని నిర్ణయించిరి. ఆవిధముగనే ఇప్పటికిని, ప్రాతసైనికులను మాత్రమే విదేశములకంపుపద్ధతి సాగుచున్నది. భారతదేశమున కంపబడుచున్న సైనికులవయస్సును పరిశీలించినచో ఈవిషయ మింకను ప్రత్యక్షముగ నిరూపితమగును ఇటీవల, స్టేటుకౌన్సిలునందు, ప్రభుత్వసభ్యుడొకప్రశ్నకు ప్రత్యుత్తర మొసగుచు, గతవత్సర మీదేశమున కంపబడిన సైనికులవయస్సు, దామాషాయీని ౨౧ వత్సరములనియు, ఇటీవల కొన్నివత్సరములలోకంటె నిది చాలతక్కువనియు తెలియజేసెను. సాధారణముగ వారివయస్సు ౨౨ వత్సరము లుండునని యెంచవచ్చును. ౨౦ వత్సరములకు లోనిర్ణయముచేత, తా మారునెలలు ముగియగనే సైనికుల నంపజాలకుంటిమని పరిహారము గోరుచున్న యుద్ధాంగకార్యాలయమువారి వాదన యెంత అసత్యమైనదో దీనివలన వెల్లడిగాగలదు. నిజముగ నానిర్ణయము తమకు బాధాకరమైనచో సైనికులను ౨౨ వత్సరములువచ్చువర కెందుకు నిలిపియుంచుకొనెదరు. ఈవిధముగ వయస్సు హెచ్చినవారిని పంపుచుండుటవలన నష్టపడునది భారతదేశము గాని, ఆంగ్లదేశము గాదు. ౨౧-వ వత్సరమువచ్చిన సైనికుడప్పటికే 3 వత్సరములసేవను ముగించియుండును. ఇక నాతడీదేశమునకు వచ్చి సేవచేయునది ౪ వత్సరములు. ఆరునెలలశిక్షణము ముగియగనే పంపబడియున్నయెడల అత డీదేశమున ఆరువత్సరములైన పనిచేసెడివాడు. అందువలన భారతప్రభుత్వమునకు సైనికుల రాకపోకల కగుఖర్చులు చాలవరకు తప్పెడివి. ఇందుకు భారతదేశమునకు పరిహార మొసగుటతప్ప, భారతదేశమునే పరిహారమడుగుట యుద్ధాంగకార్యాలయమువారి సాహసవైపరీత్యమునకు చిహ్నము.

భారతదేశమున కంపబడవలసిన సైనికులు ఆరునెలల శిక్షణానంతరము బ్రిటిషుపటాలములలో నుండుటవలన, బ్రిటిషు ప్రభుత్వమువారికి ముజరా రావలసిన నష్టము గల్గుచున్నదా యనిన అదియును శూన్యమే. పై నుదహరించినటుల క్రొత్త సైనికులను ఆంగ్లదేశమునందలి పటాలముల నుండి, ఆపటాములం దున్నవారిని విదేశముల కంపుపద్ధతివలన, బ్రిటిషు ప్రభుత్వమువారు స్వదేశమున నుంచుకొను సైన్యపు సంఖ్య ఏమాత్ర

మును హెచ్చ నవసరము లేదు. అసలు భారతదేశము నకు స్టీమ రెక్కువరకును, సైనికులలో నెవరును భారతదేశమునకని ప్రత్యేకింపబడుటయే లేదు. కనుక, శిక్షణానంతరము, భారతదేశమున కుద్దేశింపబడిన సైనికులు వేచియుండవలసియున్న దను వాదము గూడ కేవలము నిరాధారమైనది. ఆకారణముచే భారతదేశమున యుద్ధాంగకార్యాలయములవారి కేమి ముజరా యొసగనక్కరలేదు.

ట్రిబ్యునలువారు తమ నిర్ణయమునకు పాక్షికముగ నాధారముగ గైకొనిన క్రొత్తసైనికుల ప్రయోజనపు విలువను పరికింతము. సైనికుడు చేరిన ఆరునెలలకు తరువాత, బ్రిటిషు సైనిక నిబంధనల ప్రకారము, సైనిక ధర్మములనన్నిటిని నిర్వహించుటకు బాధ్యుడు. అతనిని (౧) శాంతిసమయమున దేశమునం దల్లరుల నణచుట కుపయోగించెదరు. (౨) పటాలముల విదేశముల కంపునపుడట్టివారినిగూడ పంపెదరు. సంవత్సరము తరిఫీయతు లేదని నిలిపియుంచరు. (౩) యుద్ధము వచ్చినచో, చేరి ఆరునెలలైన ప్రతిసైనికుడును, యుద్ధరంగమున కంపబడవచ్చును. ఇదియది యననేల ప్రాతసైనికులతోబాటు వీరును అన్నిపనులకు నుపయోగింపబడవచ్చును. ఇట్టి పరిస్థితులలో వీరు, ఇతరసైనికులతో సరిసమానమగు విలువగలవారు కాదని ట్రిబ్యునలునం దధికసంఖ్యాకు లెటుల నిర్ణయించిరో దురూహ్యము. రోమరుకమిటీయందు సభ్యులును, అటుపిమ్మట భారత సర్వసేనాధిపతియును అగు సర్. బూచాంపు డఫ్‌గారీ విషయమై ఇటుల నుడివియుండిరి. "సైనికుని జీవితమున రెండవదశయందు (డిపోలలో శిక్షణ ముగిసిన పిమ్మట భారత దేశమునకు పంపబడుటకు పూర్వము) భారతదేశమున కత డేవిధముగ నుపకరించుట లేదు. ఆంగ్లదేశమునకు మాత్రమె పూర్తిగ నుపకరించుచున్నాడు. యుద్ధము వచ్చినపుడే దేశమున సేవచేయు నను విషయమునుబట్టియే సైనికుని ప్రయోజనము నిర్ణయ మగును. అపుడే దేశమున కుపకరించిన ఆదేశమాతని ఖర్చుల భరింపవలెను. యుద్ధము వచ్చిన తోడనే, భారతదేశమున కంపబడవలసిన సైనికు లాపివేయ బడుదురు. వారందరును బ్రిటిషు పటాలములతో యుద్ధమున కంపబడుదురు." అని ౧౯౦౭ లో హాల్డేన్‌గారు పార్లమెంటులో ప్రకటించియుండిరి. కనుక భారతదేశమునకు స్టీమ రెక్కువరకును, ఈ సైనికులు బ్రిటిషు సైనికులుగనే పరిగణింపబడుచున్నారు. కనుక నీకాలమున కాసైనికులఖర్చులను బ్రిటిషుప్రభుత్వమే భరింపవలెను. ఈసిద్ధాంతమును బ్రిటిషుప్రభుత్వము వారుగూడ అంగీకరించిరే, సైనికులు ఆరునెలలశిక్షణను ముగించినపిమ్మట, భారతదేశమున కంపబడువరకెంతకాలము బ్రిటిషుపటాలమునం దుంచబడుదురో అంతకాలమునకును శిక్షణవ్యయముల భారతప్రభుత్వమునకు దామాషాయిని ముజరా యిచ్చుచున్నారు. "ఈసైనికుల నుపయోగించుకొనగల మనుకారణము చేతనే, బ్రిటిషుప్రభుత్వమువారు శాంతిసమయమున తమ పటాలములలో నంతమంది సైనికుల తక్కువగ నుంచుకొనుచున్నారు." భారతదేశముకొరకిక బ్రిటిషు ప్రభుత్వమువారు భరించుభార మేమి!

"ట్రిబ్యునలు"నం దధికసంఖ్యాకులనిర్ణయ మెంత యాధారరహితమైనదియును, షాడీలాలు సులేమాన్ గార్ల నోటునందలి ఈక్రిందివాక్యములవలన దెలియనగును. "యుద్ధాంగకార్యాలయమువారు మాయెదుట దాఖలుచేసిన వ్రాతమూలమగు మెమోరాండమునందు గాని, వారి న్యాయవాది గావించిన వాదనలయందు గాని యెచ్చటను పండ్రెండునెలల నంగీకరింపనిచో అంతకు తక్కువకాలమున కైన శిక్షణమున కగుఖర్చుల నిప్పింపవలెనని కోరియుండలేదు. భారతదేశము ౯ నెలలఖర్చుల చెల్లింపవలె నని నిర్ణయించుటకు మాయెదుట నేవిధమగునాధారమును లేదు." ట్రిబ్యునలువారి నిర్ణయ మెంతసువిచారితమైనది!

కాపిటేషను చార్జీలవిషయమున, ట్రిబ్యునలు చేర గావింపబడిన నిర్ణయములవలన, భారతదేశ మిక మీద నెంత చెల్లింపవలసియుండునో ఇంకను ప్రకటింపబడలేదు. యుద్ధాంగకార్యాలయమువారలెక్కల

నింకను తయారుచేయుచున్నారు. ట్రిబ్యునలునిర్ణయములవలన భారతదేశమునకు కాపిటేషనురేటులందు గల్గినలాభము అత్యల్పము. రిజర్వులకు ముజరాయొసగవలెనని వారు నిర్ణయించినను దానివలన భారతదేశమునకు గల్గులాభము, శిక్షణకాలమును ౬ నెలలనుండి ౯ నెలలకు హెచ్చించుటతో రద్దుచేయబడెను. ఇంకను, భారతదేశమున కేమైనలాభము మిగులునెడల, విమానదళమున శిక్షణవ్యయములగురించి, ట్రిబ్యునలువారొసగిన నిర్ణయముచే నదియు తుడిచివేయబడెను. అది మరియొకకథ.

---

## డాక్టరీ — అచ్చటచ్చట



# అంధ విశ్వాసములు

బందా వేంకటరత్నం

అంధవిశ్వాసముల జనని మూర్ఖత, జనకుడు భయము, సంతానము ఘోరదుఃఖము. ప్రేమ, విశ్వాసము లంధములని చెప్పుదురు. అది ఎన్నడును కాదు. ఐతిహాసిక ప్రమాణములనుబట్టియు వేదశాస్త్రములను విమర్శనదృష్టితో బరిశీలించినపిమ్మటను, ఏవిషయము విశ్వసింపబడుచున్నదో, ఏవిషయము వైజ్ఞానిక ప్రయోగశాలయందు సరిగా సిద్ధాంతీకరించబడి, మన విశ్వాసమునకు హేతువగుచున్నదో, ఏవిషయము ప్రత్యక్షప్రమాణ మను గీటురాయిపై పరీక్షింపబడి నూరింట తొంబదితొమ్మిదిముక్కాలుభాగము సత్యమగునో యదియే సరియగు విశ్వాసము; శేషము లంధవిశ్వాసములు.

ఈయొక్క విభేదాత్మకభావమును లక్ష్యమందుంచి విమర్శకులుగా, జ్ఞానులు నగు ప్రాణులు, స్త్రీలుగాని, పురుషులుగాని ఇక నంధవిశ్వాసము లన నేమి యని ప్రశ్నింపవచ్చును. ఈప్రశ్న కుత్తరమిచ్చుటయే యీవ్యాసము ముఖ్యోద్దేశ్యము. ఇప్పుడు నేను ముందు పుటలందు, అంధవిశ్వాసములయొక్క అపరోక్షస్పష్ట పరిభాషను జేసినపిమ్మట, అంధవిశ్వాసములన నెట్టివో ఉదాహరణములమూలమున పాఠకులకు తెలియజెప్పెద.

౧. ప్రత్యక్షప్రమాణముల నుపేక్షించి, లేక ప్రమాణహీనమగు విషయమును సత్యమని నమ్ముట.

౨. ఒకసమస్యను వేరొకసమస్యగా నెంచుట. ఎట్లన.—డాక్టరువైరోయనునాతని నెవడో నమ్మక మన నేమని ప్రశ్నించెను. "దేనిని నీవు చూడజాలవో అదియే నమ్మక" మని యాతడు ప్రత్యుత్తరమిచ్చెను. ఈప్రకారమగు ప్రశ్నోత్తరము లుపనిషత్తులందుకూడ గలవు. తరుచుగా సాధువులు, జ్యోతిష్కులు ఈవిధమగు జవాబులనే ఇచ్చుచుందురు. ఇదియే ఒకసమస్యను వేరొకసమస్యగా నెంచుట.

౩. కార్యకారణసంబంధముల నుపేక్షించుట.

౪. ఏదే నొకయవస్తుపదార్థము (మనస్సు, ఆలోచన, ఇచ్ఛ, శక్తి- ఈనాల్గును అథవా వీనిలో నొకటి) ప్రపంచ నియంత్రణ చేయుచున్నదనిగాని, సృష్టించుచున్నదనిగాని, నాశముచేయుచున్నదనిగాని నమ్ముట.

౫. వస్తురహితముగనే కేవలమనఃకల్పనచేతనే ప్రపంచము సృష్టింపబడిన దనుకొనుట, అథవాశూన్యమునుండి సర్వము సృష్టింపబడినదని, లేక ప్రాదుర్భూతమైన దనుకొనుట.

౬. పురుషబలము, లేక Force యందే భిన్నప్రకృతి(వాస్తవికజగత్తు)యొక్క యస్తిత్వ మున్నదని నమ్ముట, లేక పురుషబలమునందు ప్రకృతియొక్క యస్తిత్వము లేదని విపరీతాభిప్రాయము గల్గియుండుట.

౭. అనేకప్రకారము లగు నలౌకికములు, నసంభవములు నగు విషయములను నమ్ముట. ఇంద్రజాలము, మంత్రములు, చమత్కారములు మొదలగు నలౌకిక శక్తులను ( Supernatural ) నమ్ముట.

ఈ పరిభాషను మే మింకను పెంపొందింపగలము కాని వీనియం దన్నిటిసమావేశము గలదని యింతయే వ్రాయుట పర్యాప్తమని యెంచితిమి. అంధవిశ్వాసముల జననీజనకులు భయము, మూర్ఖత యనియు, వీనిసంతతి ఘోరదుఃఖమనియు జ్ఞాపక ముండుగాక. అంధవిశ్వాసము గలవా రడుగడుగున ననేకఘోరదుఃఖముల ననుభవించుట సంభవించుచున్నది.

ఒకానొక స్త్రీ వంటచేయుచున్న సమయమున బాగుగ నెండని పుల్లలు కాలుటలో "టప్‌టప్" అను ధ్వని కలుగుటను విని, "ఘూఘూ" ఎవ్వతెయో దుష్టురాలు నన్ను తిట్టుచున్న దని చెప్పును. తడిపుల్ల అగ్నిచే కాల్పబడునప్పుడు దానియందలి నీరు బయటికి

వచ్చుటచే ధ్వని యగుచున్న దని యమాయిక యగు
నా స్త్రీ తెలిసికొనజాలదు. కట్టెలు కాలుటలో ధ్వని
యగుటయందును, ఇతరులు తన్ను నిందించుటయందును
కార్యకారణసంబంధ మేమియు లేదు. ఈప్రకార
మగు అసంఖ్యాకము లైన మిథ్యాకల్పనలు గలవు.
ఎట్లన పెనమునుండి రొట్టె జారుటచే, ఎవరో అతిథి
వచ్చుననియు, శరీరావయవము లదరుటచే మేలు లేక
కీడు కలుగు ననియు, అరచేయి దురదపెట్టుటచే ధనము
దొరకుననియు, తీతువ లేక జీలుగుపక్షులు కూయుటచే
కీడు వాటిల్లు ననియు తరచుగా ననేకు లూహించు
చున్నారు. ఇదియే యంధవిశ్వాసము. ఒకమనుష్యుడు
ప్రయాణమై గృహద్వారమునుండి బయల్వెడలినతోడనే
యతని కెదురుగా నెవడైన కఱ్ఱ దీసికొని వచ్చుచున్న
ట్లగపడినను, అథవా ఒకేకన్నుగల గ్రుడ్డివాడు వచ్చినను
యత డపశకున మైనదని తలచును. నీరు నిండినకుండతో
నెవడైన ఎదురైనచో చాలమంచిశకునమైనదనుకొనును.
శకునము లేక అపశకునము ఏదియు ప్రకృతిప్రవాహము
నాపజాల దనియు, ఏదైన క్రొత్త కార్యమునుగాని
కారణమునుగాని ప్రకృతియం దుత్పన్నము చేయ
జాలదనియు, మరియు నీశకునములయందు లేక ఘట
నలయం దేదియు కార్యకారణసంబంధములను స్థాపింప
జాలదనియు ప్రజ లనుకొనుట లేదు. ఎందరో దూర
దృష్టిలేనియమాయకు లీశకునములకు జిక్కి తమయాత్ర
లను లేక ఇతరకార్యములను ఆపివేసి తరచుగా హాని
నొందుచున్నారు.

అనేకులు నీలము, మరకతమణి, వజ్రము, పగ
డము మొదలగురత్నములతోను, ఘడియలు దినములు
నెలలు మొదలగువానితోను, యింకను అనేకవిధములగు
ఇతరచిహ్నములతోను దౌర్భాగ్యసౌభాగ్యములసంబంధ
మును జోడించుచున్నారు. క్షురము చేయించుకొనుట,
బట్టలు విడచుట, క్రొత్తనగలు లేక వస్త్రములను
ధరించుట, మరియు వచ్చుటకు, పోవుటకుకూడ కొందరు
జను లేదో యొకదినమును, నక్షత్రమును లాభదాయ
కములనియు మరియు కొన్నింటిని హానిప్రదములనియు
తలచుచున్నారు. దినము, వేళ నక్షత్రాదికములకు,
మన భోజన, వస్త్రధారణ నివాసాదికములతో నెట్టి
ప్రాకృతికసంబంధ ముండగలదో యాలోచింపకున్నారు.
మంగళవారమున ధరించిన నూతనవస్త్ర మెందుకు
త్వరలో చినిగిపోవును? సోమవారమున ధరించిన
నెందుకు బహుదినములవర కుండును? శనివారమున
ధరించిన యాభూషణము లెందులకు దొంగిలింపబడును?
ఈదినములకును నక్షత్రములకును చోరులతో నెట్టి సంబం
ధము గలదు? ఎప్పుడు వీరియందు పరస్పరము
'కంట్రాక్టు' జరిగెను? దొంగలకును, దినములకును పర
స్పరసంబంధ మెట్లేర్పడగలదు? జను లీవిషయ
ములపై ధ్యానముంచుట లేదు. ఈకారణముచేతనే ప్రతి
మనుష్యునియందును యెంతోకొంత అంధవిశ్వాసము
యొక్క బీజము లగ్నమైయుండుట దృగ్గోచర మగు
చున్నది.

క్రైస్తవులలో పదమున్గురు మనుష్యులతో
కూర్చుండి భుజించుట యశుభమని యెంచబడుచున్నది.
పదమూడుసంఖ్యకు భోజనముతో నెట్టి సంబంధము
గలదు? చాలమంది శుక్రవారమును అశుభదినమని
యెంచుచున్నారుకాని మహమ్మదీయులుపవిత్రమనియు,
పుణ్యప్రదమనియు తలచుచున్నారు. ఈవిధముగనే
యూదులు శనివారమును, క్రైస్తవులు రవివారమును
పవిత్రముగ నెంచుచున్నారు కాని మనకు శుభాశుభ
ములనుబట్టి శుక్ర, శని, రవివారములతో నెట్టిప్రాపం
చికసంబంధమును దృగ్గోచర మగుట లేదు.

నేటికిని భారతదేశమునం దసంఖ్యాకులగు స్త్రీ
పురుషులు సూర్యచంద్రగ్రహణములచే రాజునకును,
ప్రజలకును మిక్కిలిహానికలుగుననియు దుర్భిక్షములు
సంభవించుననియు, తోకచుక్క బయలుదేరుటచే
మహామారి వ్యాపించుననియు, శ్రావణ పాడ్యమినాడు
వర్షించుటచేతను, చంద్రుడు గుడికట్టుటచేతను మంచి
వర్షము కురియు ననియు నమ్మువారు కలరు.

ఈ విధముగనే శుక్రాస్తసమయమందు యాత్ర
చేయుట, కేతు వుదయించుట, అనేక కార్యములకు
శుభప్రదము కానేరదు. ఈజను లుల్కాపతనముచే

వణకి పోదురు. భూకంపసమయమున ఈశ్వరప్రార్థనా ప్రవృత్తులయ్యెదరు. ఇవన్నియు మూఢవిశ్వాసములకు ప్రబల నిదర్శనములు. ఎవనిచేతిలోనైన నుప్పునుంచుట యెందుల కశుభప్రదమగునో, పటికిబెల్లము నుంచుట శుభప్రద మెట్లగునో, సిరాపడుట ఎందులకు శుభప్రద మగునో సిర్కా (మహమ్మదీయులు కల్లుతో తయారు చేయు నొక పదార్థము. దీనిని నిమ్మరసమునకు బదులుగా నుపయోగింతురు) ఒలుకుట యెందుల కశుభ మగునో, కారణ మింతవరకు నెవ్వరును చెప్పియుండ లేదు.

నాట్యశాలయందు ప్రవేశించు మొదటి ప్రేక్షకుడు మెల్లకంటిచూపుగా డగుచో నాటక నిర్వహణమునందు కృతకృత్యత ప్రాప్తింపజాలదని పాశ్చాత్య దేశీయు లెంచుచున్నారు. ఇందుచే ప్రేక్షకుల సంఖ్య తగ్గునని మొదటి మెల్లకంటి చూపుగల ప్రేక్షకుని బట్టియే తలంతురు ప్రథమప్రేక్షకుని తీక్ష్ణదృష్టివిశిష్టత జనులమనస్సులను వారింటియందుండగనే యెట్లు మార్చునో, దేనిచే నట్టి ప్రేక్షకుడు నాటకము జూచుటకు ప్రథమమున వచ్చుటచే ఇతరు లాగిపోయెదరో అనగా చాలతక్కువగా వచ్చెదరో లేక ప్రేక్షకులు రారనువిషయము ఎట్లు ప్రప్రథమమున తీక్ష్ణదృష్టిగల మనుష్యుని నాట్యశాలకు బంపునో తెలిసికొనుట మిక్కిలిదుస్తరము. ఈరెండుఘటనలయందును ఎవ్విధమగు ప్రత్యక్షకార్యకారణసంబంధమును గోచరింప జాలదు. ఈవిధమగు నేలకొలది శుభాశుభవిషయములు, శకునములు, పూర్వసూచనలు, భవిష్యద్వాణులు మొదలగునవి, గొప్పగొప్పదూరదర్శులు, మేధావంతులూ నగు విద్వాంసులను సైతము వ్యాకులపరచి చకితులనుజేయుచున్నవి. ఈవిషయములను చాతుర్యమనవలెనో...... మూర్ఖత్వమనవలెనో తెలియకున్నది.

గోరీలు, సమాధులు, వృక్షములు, పశుపక్షులు మొదలగువానిపూజవలనను, శిక్షరేకులు, తాయెత్తులు కట్టుటవల్లను, మహాత్ములవెంట్రుకలు, దంతములు, గోళ్లు, చితి లేక హోమభస్మముచేతను యేదైనకార్యము నెరవేరుటగాని యాగిపోవుటగాని తటస్థించునా? నక్క ఎముక లేక తోక, ఏనుగదంతము, పులిగోళ్లు ధరించుటచే రోగము లెట్లు పారిపోవునో, దాంపత్యప్రేమ యెట్లు వృద్ధిపొందునో, బాలకు లెట్లు నిర్భయులయ్యెదరో ఎవరును తెలిసికొనజాలరు.

భూతప్రేతపిశాచము లావేశించుట, బ్రహ్మరాక్షసులు పీడించుట మొదలగువాని యావిష్కారము నెవడే నొకరోగి మేధాశక్తి జేసియుండవచ్చును. ఈ కారణముచే ననేకులు—ఉన్మాదము, మూర్ఛ మొదలు గాగలరోగములుగలవారు ఔషధసేవావంచితులై మాంత్రికులచేతులలోబడి యకాలమున నే కాలకవలితు లగుచున్నారు.

నేడు మనము గొప్పవిద్వాంసులను, ముఖ్యముగా దివ్యజ్ఞానసామాజికులను, తమభాగ్యవక్రోక్తిచే స్వయముగ నీబంధురాంధకార కూపమునబడి, ప్రజలనుకూడ మట్టిలోకలుపుటకును, మరియు నీయంధకారమయ కూపమున నెట్టుటకును తత్పరు లగుచుండుట చూచుచున్నాము. ఎందరో ఎం.ఏ.లు, బి.ఏ.లు, తమవిద్యాబుద్ధులను దూరమునునుంచి, సాధారణజ్ఞానతర్కములకు తిలాంజలి నిచ్చి రాత్రింబవళ్లు భూతప్రేతముల రాగము నాలాపించుటయేగాక వార్తాపత్రికాపుటలను, తలయుదోకయు లేని ఈ ప్రసంగములచే కళంకితమొనర్చుటయే యానందమని యెంచుచున్నారు.

నేడీ వైజ్ఞానిక యుగమగు నిరువదవ శతాబ్దమున మూర్ఖులు దక్క వివేకులును, చతురులును, విద్యావంతులును, జ్ఞానులు నగు మనుష్యు లెవ్వరైన భూతప్రేతములు,రాక్షసులు, డాకినీ, శాకినీ, యక్షిణీ, పిశాచినీ, కూష్మాండ, భైరవ మొదలగునవి యేవ్యాధిగ్రస్తునినైన నీరోగిగా చేయుగల శక్తిసామర్థ్యములు గలిగియున్నవని నమ్ముదురా!

కుక్క లేక పిల్లివెంట్రుకలు, గుడ్లగూబ ఈకలు గాడిద దొర్లిన ప్రదేశమందలి ధూళి,ఘోర మగు నల్లని రంగు గల కాకిగూటిపుల్ల మొదలగువాని సద్గుణపరంపరలను, మేధాశక్తి నశించినవారుదక్క అన్యులెవ్వరు విశ్వసింపగల్గుదురు? రక్షరేకులు, తాయిత్తులు, భూతప్రేత

ములు మొదలగువాని కపటవ్యవహారము పురాతనకాలమందలి అంధవిశ్వాసులకును, అసభ్యవన్యజాతులకును మాత్రమే నచ్చును కాని, విద్యావంతులు జ్ఞానులు నగు మనుష్యులు వానిని నమ్మి తమ జీవితము నెట్లు నష్టపరచుకొనగలరు ? పూర్వకాలమందు జనులు జనార్దనునికి ధూపము వేయుటచే భూతములు పారిపోవుననియు, యొకానొకపక్షిగూడు ఇంటియందు వ్రేలాడగట్టుటచే పిశాచములు రావనియు గుడ్లగూబనేత్రములను దీపమునందుంచి ఆముదముతో కాటుకతీసి నేత్రములకు పట్టించినచో బిడ్డలకు చేతబడులు సోకవనియు, భూమియందు పాతబడిన ధనము కనబడుననియు నమ్ముచుండిరి. ప్రస్తుతకాలమందలి విజ్ఞానతేజస్సునందు పెరిగినజనుల శుద్ధపవిత్రమస్తిష్కములం దిట్టిసంగతులు ప్రవేశించుట దుర్లభమగుచున్నది. మనము అశిక్షితులగు గ్రామీణులను, అజ్ఞానాంధకారమున బడియున్న స్త్రీహృదయములను ఈప్రకాశమయయుగమందలి జ్ఞానతేజస్సుచే తేజోవంతము చేయుటయేగాక, యీయంధవిశ్వాసమనెడి విషాక్తసర్పమును భస్మీపటలము చేయవలయును.

ఈభూతప్రేతపిశాచము లాదిగాగల మిథ్యాకల్పనావిశ్వాసములే మాంత్రికులను సృష్టించెను. మాంత్రిక, మహామాంత్రిక, శాబర, మహాశాబర ప్రభృతులగుబంది పోటుగాండ్ర నవతరింపజేసెను. భేతాళుడు, కాళి, మహాకాళి, మారి, మహామారి, శాంబని, గంగానమ్మ, పోలేరమ్మ మొదలగునవి మూర్ఖులయుపాస్య దేవతలయ్యెను. మంత్రతంత్రములందును, చేతబడులయందును జ్ఞాతలగుదుష్టులును, మోసగాండ్రును వీరికి పూజారులైరి. ఈవంచకులు క్రమక్రమముగా వృద్ధులను యౌవనులుగా చేయుట, మారణ, మోహన, ఉచ్చాటన వశీకరణాద్యనేకకపటాడంబరముల రచించిరి. ఎందరో యమాయకులగుజనులు అలౌకికశక్తి నార్జించునిమిత్తము శవములసేవింప నారంభించిరి. చితాభస్మముల ధరించి నదీతీరముల రాత్రులు మంత్రములను జపించుటయందు ప్రవృత్తులైరి. మనము మననైయశక్తికానుభవముచే నివి యన్నియు కృత్రిమ కపటవ్యవహారములుగా దెలిసికొంటిమిగాని, భూతములచేతులలోనే సర్వోత్తమ పదార్థముల నిమ్పశక్తి గలదనియు, పాపములకు దూరముగా నుండువారు పరలోకమం దీశ్వరునిచే పురస్కరింపబడుటకుమం దీలోకమందే భూతపిశాచములచే సమస్తవస్తుసముదాయముచే పురస్కరింపబడుచున్నారనియు నమ్మజనులనేకులను మనము చూచుచున్నాము.

ఈయంధవిశ్వాసములకారణమున మనుష్యజాతి యిదివర కెన్నికష్టముల ననుభవించెనో యిప్పు డెన్నిటి ననుభవించుచున్నదో యూహించుట దుస్తరము. వీని ప్రతాపముచే గోస్వామితులసీదాసునివలె ఎందరు బాలబాలికలను మాతాపితలు బాల్యకాలమందే ఇలువెడలనడపిరో, రాజు లెంతమంది స్త్రీపురుషులను మాంత్రికులు, పిశాచము లనినమ్మి జీవించియుండగనే కాల్చివేసిరో లేక నీటిలోముంచి చంపిరో తెలియదు. ఇందుచే మానవసమాజమున కంతులేనినష్టము కలిగినది. ఇట్టియూహలకు లోనై యనేకులను కారాగారమున నుంచుటయేగాక వివిధములగు హింసలకును పాలుచేసిరి. ఈయత్యాచారములకు కారణ మంధవిశ్వాసమే. ఇట్టిఘటనలు లేనిదేశచరిత్ర మేదియు లేదు. మహమ్మదీయ, క్రైస్తవమతేతిహాసములుగూడ ఇట్టిఘటనా పరంపరలచె నిండియున్నవి. బైబిలుయొక్క క్రొత్త, ప్రాత నిబంధనములు రెండును మాయాకథనమునకు సాక్షులు. మిశ్రదేశపుగాథ, మోసేయొక్క కార్యములు, క్రీస్తుమనుష్యునినుండి భూతములను పారదోలి పందులపై ప్రయోగించుట మొదలగు విషయములను మనము బైబిలులో చదువవచ్చును. మహమ్మదువారు మతప్రచారము చేయునాటికి అరేబియా ప్రజలయందున్న వికృతాచార వ్యవహారములకును, క్రూరకృత్యములకును, పిచ్చినమ్మకములకును మేరలేకయుండెను. అరబ్బీలు తమకు ముందుగ జన్మించిన బిడ్డను దేవతలకు బలిగా నర్పించెడివారు. మహమ్మదు మహాశయుని ప్రచారముచే కొన్ని మూఢవిశ్వాసము లంతరించినను, ఇప్పటికిని మహమ్మదీయులయం దసంఖ్యాకములుగ గన్పట్టుచున్నవి. హిందువుల నధిక్షేపించు వీరియందు అంధవిశ్వాసములకు కొరతలేదు. వీరి మతగ్రంథములందు కూడ ననేకములు దృగ్గోచర మగును.

డాకినీలు, మంత్రతంత్ర ప్రయోగములు చేయు వారు అదివర కెన్నడును లేరు, ఇప్పుడును లేరు. మను ష్యుడు పిశాచములతో నెన్నడును వ్యవహరింపజాలడు. పూర్వు లీ విషయమున జాల పొరపాటునకు లోనైరి. నేటికికూడ ననేకులు పూర్వాచార పరాయణులును, మూర్ఖులును అలౌకికము లగు నీ శక్తులపై మోహితు లగు చున్నారు. ఇట్టిజను లెల్లప్పుడును అసంభవవిషయా న్వేషణము చేయుచుందురు. ఇందువలననే మతగ్రంథము లన్నియు నప్రాకృతిక విషయములతోను కల్పిత ఘటనలతోను నింపబడి యున్నవి. ఈగ్రంథములదృష్టి యందు ప్రపంచ మింద్రజాలమయము. ఆత్మలచే నృత్యము చేయించుట మంత్రవేత్తలకు బాలక్రీడా తుల్యము. ప్రస్తుతకాలమందు గూడ జనులు సంస్కరింపబడిన రూపముతో మృతాత్మలను బిలచుట వానితో సంభాషించుట మొదలగు కపటరచనచే కేవల మమాయకులగు ప్రజలకండ్లలో దుమ్ము జల్లుటయే గాక చాల మంది విద్యార్థికులను గూడ మంత్రముగ్ధులనుగా జేసి వేయుచున్నారు. ఏలనన యీ కపటపూర్ణమగు నింద్ర జాలాడంబరమును రచించువారు స్వయముగ విద్యార్థికు లును వాక్పటుత్వము గలవారును, సులేఖకులు నగుట యేకాక, మోసకృత్యములందు నెనుకటికాలపువారి కంటె చాల నధికముగ కుశలురు. కాని వీరిచే చూప బడిన ఘటనలయం దేవిధమగు నైసర్గికకారణ ముండ దనియు ప్రేతశాస్త్రవేత్త లేక యక్షిణీశాస్త్రవేత్త కోరినదెల్ల తత్కాలముననే జరుగజాలదనియు, తర్క శీలురు సత్యాన్వేషులు నగుప్రజ లెరిగియున్నారు. తనను పిశాచములకమ్మిన పైశాచీ విద్యాజ్ఞానముచే నేదియో కొంచె మంగవిన్యాసముచేయుట లేక అర్థహీనములగుశబ్దములను గొణుగుకొనుటచే కోరిన కార్యము వెంటనే ఘటితమగుచున్నది. ఏమి! ఈ వెర్రి!

ప్రపంచము కార్యకారణసంబంధమును మరచి, కపటము, మోసము, కృత్రిమప్రవర్తన, మిథ్యాచమత్కారములకు బానిసయైపోవుటచే జను లసత్యమాడుట కేమాత్రమును వెరువకున్నారు. జనులయందు, మిథ్యా విషయములను కండ్లారచూచినట్లు చెప్పి యమాయకు లగుప్రజలను మోసపెట్టునంతటి యసత్యసంభాషణ వ్యాపించినది. నేటికికూడ నితరులచే చెప్పబడినయసత్య సంభాషణములను కండ్లారచూచినట్లు సాక్ష్యమిచ్చుటకు వెరువని మహాపురుషులకు లోపము లేదు. చమత్కార మననేమి? చమత్కారమన ప్రాకృతికముతో అథవా సత్యముతో లేశమాత్రమును సంబంధములేనిదియు; తర్కజ్ఞానబుద్ధులతో, కార్యకారణ సంబంధములతో జోక్యములేనిదియు, కృత్రిమప్రకృతిగల నిర్మాతలచే ఇచ్ఛవచ్చినట్లు నిర్మింపబడువిషయము దక్క వేరొండు కాజాలదు.

ఖ్వాజామయీనుద్దీనుచిష్తీ అనునాతడు మొండి గోడపై నెక్కి 'ఓగోడా! నడువు'మనగా గోడ నడచెను. కమాలుఖాను అనునాతడు ఏనుగుపైగూర్చుండి ఏనుగు సహితముగా నొకనూతిలో లీనమై (అదృశ్యమై) సుఖముగ నివసింప నారంభించెను. ఒకానొక మహా శయుడు చంద్రునివంక వ్రేలు చూపి వ్రేలిని కదలించగా చంద్రుడు రెండుముక్క లయ్యెను. ఒకా నొక పీరు లేక మహమ్మదీయగురువు పండ్లు తోమిన పుల్లను రెండుగా చీల్చి భూమిపై నాటగా దానినుండి ఛాయాప్రదమగు నొక గొప్ప వేపచెట్టు బయలుదేరెను. ఒకానొకమహాత్ముడు గర్భమందుండిన బిడ్డకు సమస్త విద్యలను నేర్పెను. ఒకానొకస్త్రీకి నాసికనుండియే పుత్రుడు జన్మించెను. కన్య యగు మరియకు దైవబల ముచే క్రీస్తు జన్మించెను. ఒకానొక మతప్రవర్తకుని గుండెకాయను చీల్చి దేవతలు దానినుండి మనస్సును తీసి నీటితో కడిగి తిరిగి యథాస్థానమున నుంచి తత్ క్షణము స్వర్గమును చేరిరి. ఈవిధమగు మిథ్యావచనములు లక్షలకొలదిగ, ప్రాచీన మతగ్రంథములందు కానుపించు చున్నవి. వర్తమానకాలమందుకూడ చాలమంది మూర్ఖ లీవాక్కులను ప్రేమపూర్వకముగ నాకర్ణించుటయే గాక వానిని అక్షరశః సత్యము లని నమ్మి మోహితు లగుచున్నారు. సారాంశమేమన నెవడైనను ౨+౨=౫ గా చూపినచో నది యంకగణిత చమత్కారమగును. సమాన పరిమాణము గల వ్యాసపరిధులు గలవృత్తము నెవడైన నిర్మించినచో నది రేఖాగణిత చమత్కార

మగును. ఎవడైన నవలంబము లేని దండయంత్రమును నడపినచో నయ్యది యంత్రశాస్త్ర చమత్కారమగును. ఇవ్విధముగనే ఎవడైన నొకరాతిని మొదటి క్షణమందు౧౫ అడుగులును రెండవ క్షణమందు ౧౦ అడుగులును మూడవ క్షణమందు ౧౫ అడుగులును పోవునట్లు ఆకాశమందు విసరినచో దానిగతి విజ్ఞాన శాస్త్ర చమత్కార మగును. పాదరసముచే కుధాతువులు సువర్ణమగుట రసాయనశాస్త్రచమత్కారము. కండ్లలో నొకవిధమగు నంజనమును ధరించినతోడనే ప్రపంచమందలి భూగర్భితములగు నిధులు గోరించుటాదిగాగల ప్రసిద్ధములగు బూటకపువచనములు చమత్కారముల పేరిట ప్రసిద్ధినొందియున్నవి. మనుష్యుడు వీనినన్నిటిని విశ్వసింపవలయుననియు, యేమతమునం దిట్టి బూటకవచనముల బాహుళ్యము గలదో యట్టిమత మధికసత్యమైనదనియు, ఉచ్చకక్షకు చెందినదనియు విశ్వసింపవలెనని చెప్పువ్యర్థప్రలాపములన్నియు అంధవిశ్వాసములుగాక మరేమగును? సత్యవంతుడు, ధార్మికుడు, విశ్వాసియు నగుప్రతిపురుషుడును తనప్రజ్ఞకు నమస్కరించి దూరముగ తొలగవలెనా? ప్రకృతి నియమము లజ్ఞానమనియు మూర్ఖతయనియు నెంచి సుఖముగ కూర్చుండవలెనా? వర్తమానయుగజ్ఞానము మనకు క్రొత్తవిషయములను నేర్పుచున్నది. మనము ప్రకృతినియమముల నచలములని యెంచుచున్నాము. నైసర్గిక నియమములందు సామ్య సామంజస్యములను చూచుచున్నాము. వస్తువులందు కార్యకారణసంబంధము స్వభావసిద్ధముగ నున్నదని ప్రత్యక్షప్రమాణాధారములమూలమున విశ్వసించుచున్నాము. వస్తుస్వభావము నెవ్వడును మార్పజాలడు. సమానదశలందు సరిగా నొకేసమానఫలితమును చూచుచున్నాము. ఎక్కడనైన నేదేని భేదముసంభవించినచో మన మందులకు నవీన కారణమును వెదకుచుందుము. ఒకవస్తువునుండి యదే యాకారము గలవస్తు వుత్పన్నము కాగలదని మన మెరిగియున్నాము. 'ఏమియు లేదు' అనువాక్కుతో ప్రపంచము సృష్టింపబడజాలదు. అవ్యక్తభావముచే నేవస్తువును వ్యక్తము కాజాలదు. ప్రకృతియందేకార్యమును గ్రనిష్ఫలమగుట లేదు. మరియు ప్రతికార్యమునకు కారణముండును. వివేకియగుమనుష్యు డెవ్వడును చమత్కారములను అసంభవవిషయములను సత్యమని విశ్వసింపజాలడు. ఇదివర కెన్నడును చమత్కారము లుండియుండలేదు. ఇప్పుడును లేవు. ముందెన్నడునుగూడ నుండవు. మూర్ఖత్వమను ధరాతలముపై చమత్కారములను వృక్షబీజములు మొలకెత్తును గాని జ్ఞానప్రకాశముచే వాడి నశించును. మన మొకనైపున భూతప్రేతములు, రాక్షసులు, పిశాచములు ననువానిని ఆసురీశక్తిపేరిట సృష్టించితిమి. కొండొకనైపున దైవీశక్తిపేరిట దేవదూతలను సృష్టించుచున్నాము. వీనిపేరిటకూడ రక్షరేకులు, తాయిత్తులు తయారుచేయబడి అందర కివ్వబడుచున్నవి. జపమాలతో జపించుట, ఉపవసించుట, దినమున కొకపర్యాయమే భుజించుట, లేక ఒకానొక దినమున ఒకానొక విశేషపదార్థమును తినుట లేక తినకుండుటవలన నీదేవతలు ప్రసన్నులగుచున్నారు. విపరీతాచరణముచే వారప్రసన్నులు కాకపోయినను ఉదాసీనులుమాత్ర మగుచున్నారు. ఒకానొకదేవత బెల్లముచే చేయబడినయరిసెలచేతను, ఒకానొకరు సెనగపప్పుచేతను, ఒకానొకరు యవలరొట్టెకును, ఇంకొకరు నూనెచే చేయబడినయులవలగారెలకును, ఒకానొకరు మద్యమాంసములకును ప్రసన్నులగుచున్నారు. ఎంతని వర్ణింతును! ఈదేవతలయద్భుతలీలలు! వీరియాహార పదార్థములు! వీరి కిష్టమగురంగులు! వస్త్రములు! మరియు వీరి కనుకూలమగు క్రీడారంగములు! వీని వర్ణనచే లెక్కకుమీరినపుస్తకములు నింపబడియున్నవి. మీరు సిద్ధిపొందవలెనన్నచో కర్తవ్యమును ఒకానొక మౌల్వీసాహేబు, పాదిరీదొర, లేక పురోహితు నడిగి తెలిసికొనుడు! దుర్గ లేకయక్షిణీయొక్క సిద్ధిని పొందవలెనన్నచో యొకానొకదయ్యములపోతును సేవింపుడు. యంత్రవిద్య (యంత్రములువేయుట) నభ్యసింపదలచినచో ఒకానొకరోమనుకాథలికుఫాదరీగారి శిష్యుడవు గమ్ము. అసంఖ్యాకములగు భూతప్రేతములు, దేవీదేవతలు గలరు. ఒక్కొక్కరిపై నొక్కొక్కగ్రంథము లేక నిబంధన మీ కవశ్యము లభింపగలదు.

అప్పుడప్పుడు అసత్యములు, నిష్ప్రయోజనములు నగునీచరిత్రలవలన మనకు చాలదుఃఖము, అసహ్యము కూడ కలుగును. చూడుడు! భైరవునిరక్షరేకు ధరించుటచే భైరవుడు ప్రతిక్షణమును బిడ్డలను రక్షించునను వెర్రితనమును! ఈప్రకారమగు ననేక భైరవులు, ముసలమ్మలు, మాతలుగలరు. వారిపని కేవలము పసిబిడ్డలకంగరక్షకులుగా నుండుటయే గాక వారివారిరక్షరేకులను ధరించుప్రతిబిడ్డయొక్క రక్షణను చేయుటయే ఈలోకమందు వారు చేయవలసిన ఏకమాత్రకార్యమని తోచుచున్నది. అసంఖ్యాకములగు చిన్నచిన్నప్రదేశములందు నివసించులెక్కకుమీరినజనులు వెంటనే గాక వేరువేరుదిశలందు తిరుగుచున్న లేక పనిచేయుచున్న వారివెంట నొక్కొక్కభైరవుడు వారిరక్షణకై తిరుగుచున్నవిషయము నెవ్వరు చెప్పగలరు?

చంటిబిడ్డమంచముపై నిద్రించు లేకఆటలాడు సమయమున నాకస్మికముగ నవ్వినను లేక ఏడ్చినను వానికి పిచ్చిదయ్యము పట్టినదని యెంచబడుచున్నది. చెవియందు పోటుగలిగినతోడనే పిండితో చెవిచేయబడి మంత్రతంత్రములు జరుపబడుచున్నవి. మసీదులందును గోరీలు మొదలగువానియందును దీపములు వెలిగించుట, పుష్పమాలల నర్పించుట, దేవాలయములందు భక్ష్యముల నర్పించుట మొదలగువానిచే నీదేవతలు ప్రసన్నులగుచున్నారు. కోట్లకొలదిగాగల యీదేవతలచరిత్రమును పాఠకుల కర్పించుటకు చాలినంత సమయమును, మరియు నీచిన్నవ్యాసమునందు తగినంతస్థలమును లేకపోవుటయేగాక, నావద్దతగినసాహసమును కూడలేదు. ఈమాత్రమునకే నాకు నాస్తికుడనుఉపాధి ప్రాప్తింపవచ్చునను శంకపొడముచున్నది. వివేకులీస్వల్పమునుండియే యధికముగ గ్రహింతురుగాక.



గోదావరి-ఒకానొకదృశ్యము — H. S. R.

# రంగ గ్రామసింహ రత్తయ్య

మొక్కపాటి నరసింహశాస్త్రి

ఏది ఎలావచ్చేదీ, ఎప్పుడువచ్చేదీ, ఎందుకు వచ్చేదీ మన కేమీ తెలియదుకదా! నెట్టవేదాంతములోకి దిగా ననుకోకండి. మనజీవితములో మంచికో, చెడ్డకో, అనేకమార్పులు వస్తూఉంటాయి. ఈమార్పులకు కారణ మేమిటి. అని మనము ఎప్పుడేనా యోచిస్తామా! కారణం లేని కార్యము ఉండదుకదా. అలాఆలోచిస్తే ఎక్కడి వరకు లాక్కుపోతుందో ఊహించలేము. లేదూ, పోనీ మనము ఏపనేనా చెయ్యబోయేటప్పుడు దాని ఫలితము ఏమవుతుంది. ఇది ఎలాపరిణమిస్తుంది అని ఎప్పుడేనా ఆలోచిస్తామా మనం. అంటే పెద్దవ్యాపారాలూ, వుద్యోగాలూ, అలాంటి వాటిసంగతి కాదు నేను చెప్పేది. వాటినిగురించి ఎలాగూ ఆలోచిస్తాము. చచ్చేటట్లు రాత్రింబగళ్లు నిద్రహారాలు మానుకునికూడా ఆలోచిస్తాము. ఈవ్యాపారం చేస్తే ఇంతలాభము వస్తుందికదా. ఇంతవస్తే ఈ మేడ కడదామనో, ఈ భూమి కొందామనో, ఓబిరుదుకోసం ప్రయత్నిద్దామనో, కొడుకును ఇంగ్లాండు పంపిద్దామనో, శత్రువు లెవళ్లేనా ఉంటే వాళ్లను మాడ్చేద్దామనో, ఏవేవో ఆలోచనలు ఉంటాయి. ఉండకపోవు.

మామూలుగా నిత్యవ్యవహారంలో మనం చేసే ప్రతి చిన్నపనికి ఇంతసేపు ఆలోచిస్తామా అంట. అదీ నేననేది. కాఫీహోటలుకు వెళ్లేటప్పుడో, బీచికి షికారు వెళ్లేటప్పుడో, లేదా ఏదేనా మీటింగుకు వెళ్లేటప్పుడో, దాని ఫలితమేమిటని మనం దీర్ఘాలోచన చెయ్యం చూడండి. చేసీ ప్రయోజనం లేదనుకోండి. అదివాస్తవమే కాని ఒకొక్కప్పుడు ఇటువంటి స్వల్పా లనుకునే వాటివల్లనే జీవితంలో విపరీతమైన మార్పులు వస్తూవుంటాయి. తరువాత ఆలోచించు కుంటే మనకే ఆశ్చర్యము వేస్తుంది.

పాండవులు ఆనాడు జూదమాడేరోజున ఇలా వస్తుందని వాళ్లు ఊహించారా. లేదు. రోజూవాళ్లకి జూదము ఆడుతూఉండడము గెలుస్తూఉండడమో, ఓడుతూఉండడమో పరిపాటి అయిపోయింది మన క్లబ్బులో బేస్తుఆటలాగ. కాని ఆనాడు కాస్త ఆలోచించిఉంటే భారతయుద్ధం జరక్కపోయేది కదా. గయుడు ఎప్పుడూ షికారువెళ్లడమూ తాంబూలము వేసుకునో చుట్టకాలుస్తూనో ఉమ్మివేస్తూ ఉండడమూ అలవాటే కదా. ఆనాడు కాస్త పరాకుతగ్గించి, పక్షిలా మనము పైనఎగురుతున్నాము. ఉమ్మేస్తే ఎవరి నెత్తిని పడుతుందో అని కాస్త ఆలోచించిఉంటే పంత గాడిదగత్తగ కాకపోయేది కదా. నెపోలియను ఆరోజున.........ఆగొడవంతా ఎందుకులెండి. మా రత్తయ్య సంగతి చెప్పొచ్చి ఈగొడవలో పడ్డాను. వాడికి పాపం ఇలాగే అతిస్వల్పవిషయమువల్ల వాడి సంసారము ఛిద్రమయిపోయింది. ఈ పుట్టిములక కంతా కారణం ఆరోజున నాటకాని కెళ్లడం. రోజూ ఎంతమంది నాటకాలకూ సినీమాలకూ వెళ్లడంలేదు చెప్పండి. వాళ్ల అంపిరి కొంపలూ ఇలాగే కూలిపోయాయా, వాడిఖర్మ మిలాకాలింది కాని! మారత్తయ్యకు పాతికసంవత్సరాలు వచ్చేవరకూ ఎప్పుడూ నాటకం మొగము ఎరుగడు. నాటకాలపేరు చెపుతే వొళ్లు మండిపోయేది. వాడికి మేమెవరమేనా నాటకానికి వెడతామంటే ఎందుకలా డబ్బు తగలేసుకోడమని మమ్మల్ని చివాట్లు వేస్తూ ఉండేవాడు. అటువంటివాడు ఒకరోజున నాటకానికి వెళ్లడము సంభవించినది. ఇంకఎంతగోలా జరక్కుండా ఎలా ఉంటుంది.

గున్నయ్య అని మాకు ప్రాణస్నేహితుడు. వాడి అమ్మమ్మ చచ్చిపోతే ఆమధ్య, వాడికి కొంతవారసత్వం కలిసింది. ఏమాత్రమో రొఖ్ఖంకూడా చేతికొచ్చింది. ఆసంతోషంచేత —అమ్మమ్మ పోయినందుకుకాదు. డబ్బు చేతికొచ్చినందుకు— మాకు విందుచేశాడు.

పొద్దున్నే పరకడుపున ఫలహారంతో ప్రారంభించి, రాత్రి భోజనాంతంవరకూ చచ్చేటట్టు దట్టించి ఆప సోపాలు పడుతుంటే, రాత్రి నాటకంకూడా చూస్తేనే కాని ఈవిందు పూర్తికాదని, మమ్మల్ని చంపి, లాక్కుపోయాడు. రత్తయ్య—ఎంతగోలపెట్టినా మేము విని పించుకోలేదు. ఆయాసమన్నాడు, తలనొప్పిఅన్నాడు, నిద్రమేలుకుంటే జబ్బుచేస్తుంది అన్నాడు. నాటకం చూడకూడదని తనకు Principle అన్నాడు. ఆఖరుకు మాసున్నయ్య కాస్త బండముండావాడు లెంకి —ఇది పనికాదనుకున్నాడు. 'ఏడిచావు లేవోయి, ఇంక కట్టిపెట్టు సోది. పాదిరీలకూ, బ్రహ్మసామాజికులకూ, కాలేజీప్రిన్సిపాల్సుకూ, ఇంకా అలాంటిముసలాళ్ళకూ మతకాళ్లకూకాని, ముక్కుపచ్చలారని ముండకు నీకు అందులో కొత్తగా enrol అయిన advocate కు నీకు Princlpes ఏమిటి నీపిండాకుడు. ఊరు కుంటున్నకొద్దీ మహా చెలరేగుతున్నావు. నడువు" అని మారత్తయ్యకు నడవడానికి అవకాశము ఇవ్వకుండానే అమాంతం ఎత్తుకెళ్లి బండిలో కూలేశాడు. రత్తయ్య ఇంకమళ్లి నోరెత్తితే వొట్టు. ఆరాత్రి చింతామణి నాటకం. నటకులంతా సుప్రసిద్ధులు. బిరుదాంచితులు, మెడలిష్టులు, రికార్డులు ఇచ్చినవారూను. అందుచేత అంతా తలోఊరునుంచీ ఆరాత్రే దిగారు. నాటకం ఎంత అధ్వాన్నముగా ఉందో చెప్పలేను. యమబాధపడుతూ చివరవరకూ క్యాసాబియాంకాలులాగ కూచున్నాము. ఎన్నివిందులుచేసినా మాసున్నయ్య ఈఋణం తీర్చుకోలేడు. మారత్తయ్య పడ్డబాధ చెప్పనే అక్కరలేదు. బయటకి వచ్చినతరువాత సున్నయ్యని ఖూనీచేస్తాడేమో అని హడిలిపోతున్నాము. సున్నయ్యకూడా చాలాచిన్నపుచ్చుకుని, అనేకరకాలుగా క్షమార్పణలు చెప్తున్నాడు. అంతకంటె ఏమి చెయ్యగలడు పాపం. రత్తయ్య అంతా దిగమింగుకుని మౌనముద్ర వహించాడు. ఇంక జన్మలోమళ్లీ మాట్లాడడేమో అనుకున్నాం. అలా మాట్లాడకపోయినా బాగుండేది. వాడి సంసారము ఛిద్రం కాకుండానైనా ఉండేది.

రాత్రి ఎవళ్లకొంపలకు వాళ్లు చేరుకున్నాం. మరునాడు పొద్దున్న మళ్లీకలుసుకోలేదు. సాయంకాలము నాలుగుగంటలకే, క్లబ్బులో హాజరయ్యాము. నేను బిలియర్డురూములోకి వెళ్లాను. సున్నయ్య టెన్నిసుకోర్టులో వీరవిహారం చేస్తున్నాడు. రత్తయ్య పేపరుపుచ్చుకొని, వరాండాలో కూర్చున్నాడు. నేను కాస్సేపు బిలియర్డుబంతులు బద్దలకొట్టి పెఅర్ధరూపాయి పద్దు రాసుకుని వరాండాలోకి వచ్చేసరికి రత్తయ్యచుట్టూ ఒకవందమంది మూగినట్లు మూగారు. మా రత్తయ్య నదురూ బెదురూ లేకుండా కాంగ్రెసుఆరేటరులాగ లెక్చరు కొడుతున్నాడు. ఏమిటో విందామని దగ్గరకు వెడుదునుకదా క్రితంరాత్రి నాటకంగొడవ. ఎవరో మావాడిని కాస్త కదిపినట్లున్నారు. రాత్రినుంచీ అణిచిపెట్టినదంతా ఒక్కసారి కట్టతెగి మహాప్రవాహంలా బయటబడ్డది. మావాడి విమర్శన విన్నకొద్దీ నాకూ ముచ్చటేసింది. మామూలు పత్రికగొడవలా కాకుండా చాలా నూతనంగానూ, రసవంతంగానూ ఉంది. మావాడికి ఆమాత్రం రసికతగాని విజ్ఞానంకాని వివేకంగాని ఉందని అనుకోలేదు. తమపేరుకూడా పూర్తిగా సంతకమేనా చెయ్యలేనివాళ్లంతా నాటకవిమర్శలు చేస్తున్నరోజుల్లో పెద్దపాండిత్యం అవసరంలేదుకాని అయినా మావాడి విమర్శమట్టుకు చాలాబాగుంది. అంతావిని సభలో ఒకపెద్దమనిషి "ఏమండీ రత్తయ్యగారూ ఇదంతా కడుపులోపెట్టుకోకపోతే ఏపేపరుకన్నా రాయకూడదూ. చచ్చిపోతున్నాం ఈపాడునాటకాలతోటి. మీరు వ్రాసిఇవ్వండి. నేను పంపిస్తాను" అన్నాడు. ఎప్పుడూ ఏ Publicity కీ ఒప్పుకోనివాడు 'సరేను' అన్నాడు వాడు. అన్నట్టుగానే మరునాడు మావాడు వ్యాసం వ్రాసిఇచ్చాడు. ఆపెద్దమనిషి పత్రికకు పంపించాడు. సకాలంలో అచ్చుపడ్డది. ఆదెబ్బతో రత్తయ్య పెద్దనాటక విమర్శకుడయ్యాడు. ఇంకను ఆపూరు ఏకంపెనీవచ్చినా రత్తయ్యకు Complimentary Tickets పంపడము మొదలుపెట్టారు. టిక్కట్టు వాళ్లు పంపినతరువాత వెళ్లకపోతే బాగుండదని నాటకాలకు

వెళ్లడం ప్రారంభించాడు. మధ్యమధ్య విమర్శనలు వ్రాస్తూఉండేవాడు. కొన్నాళ్లయినతరువాత అందరికీ వ్యతిరేకంగా రాసేసరికి, అన్నికంపెనీలవారుకూడా పలుక్కున్నట్లు రత్తయ్యకు Free Ticket పంపడం మానేశారు. ఇలాసుండగా మావూళ్లో కొందరు పెద్దమనుష్యులు సంప్రతించుకుని, నాటకసమాజముఒకటి స్థాపించవలెనని తలపెట్టారు. ఈరోజుల్లో ప్రతివాడికీ అదో జబ్బుకాదూ. తను ఎలాఉండి ఏమైపోయినా, ప్రపంచాన్నో, దేశాన్నో, గ్రామాన్నో, అనమం పక్క ఇంటివాడినో ఉద్ధరిస్తున్నట్లు అనిపించుకోవలెనని ప్రతివాడికి సంకల్పము. ప్రస్తుతం నాటకాలసంగతేమీ బాగాలేదు. అందుకని అందరిదృష్టీ నాటకాలమీద పడ్డది. వాన్ని ఎలాగైనా ఉద్ధరించితీరవలెనని అనేకమంది ప్రయత్నాలు చేస్తున్నారు.

ఒక్క అరగంటసేపు బ్రహ్మ అవతలికితప్పుకుని, సృష్టివ్యవహారము తనచేతులో విడిచిపెడితే ప్రపంచమింత అధ్వాన్నంగా ఉండకపోనని ప్రతిమనిషీ. అనుకుంటూ ఉంటాడు మావూళ్లో కాలేజీఏక్టర్లు (అనగా కాలేజీలలో చదువుకునేటప్పుడు ఏపండుగకో వేషము వేసుకున్న బాపతు) క్లబ్బుఏక్టర్లు, ఏనివర్సిటీఏక్టర్లు, ఓల్డుబాయిస్‌డే ఏక్టర్లు, 'మనమే స్టేజ్ మీదకెడితేనా' అని ఊహించుకునే ఏక్టర్లు, ఇంకా అమాంబాపతూ ఇలాంటి వారంతా పాతికముప్ఫైమంది, టౌనుహాలులో సభ జరిపి, ఇటువంటి పట్నవాసంలో, ఒకనాటకసభ లేకపోవడము చిన్నతనంగాఉన్నదనీ, అందులో రత్తయ్యలాంటి విమర్శకాగ్రేసరులు, సుబ్బారావులాంటి నటకులు, నరసింహారావులాంటి పాటకులు, వెంకటశాస్త్రిలాంటి గ్రంథకర్తలు, ప్రసాదరావులాంటి చిత్రకారులు ఉన్నచోట,నాటకకంపెనీ లేకపోవడంకంటె హాస్యాస్పద మేముంటుంది అని అడిగాడు ఒకాయన. వెంటనే ఇంకొకరులేచి, తప్పకుండా సభ వెంటనేస్థాపించవలసినదని తీర్మానించాడు.

మావూళ్లో Grand oldman ఒకాయన ఉన్నారు. అన్నిఊళ్లకూ ఉంటారు లేండి. మా వూరాయన మరీ Grand అన్నమాట. ఇక్కడ అమ్మవారిజాతర మొదలు ఆర్టుఎక్జిబిషన్‌వరకూ ఏది వచ్చినా ప్రథమతాంబూలము ఆయనకు ఇవ్వడం ఒక ఆనుమాయితీ. ఇవ్వకపోతే ఏం ప్రమాదిస్తుందోఅని భయమనుకుంటాను అందరిని. అనగా అన్నిటికీ President పదవి ఆయనకు జన్మహక్కుగా ఏర్పడ్డది. ఈ సభకుకూడా అగ్రాసనాధిపత్యం వహించవలసినభారము పాపము ఆయన భుజాదండములమీదనే పడ్డది. మా రత్తయ్యను సెక్రటరీగా ఎన్నుకున్నారు. సకాలంలో సభ నాటకాలు ప్రదర్శించడము ప్రారంభించింది. మొదట ఒకఇంగ్లీషునాటకం తరువాత ఒక తెలుగునాటకం వేశారు. రెంటిలోనూకూడా మారత్తయ్యకుకూడా పార్టు ఇచ్చారు. మావాడికి ఏదివచ్చినా విపరీతమే. అమిత Serious గా తనపార్టుచదివి ఇంటిదగ్గర, వీధులోను, స్నేహితులదగ్గర ఎక్కడపడితే అక్కడ rehearsals మొదలెట్టాడు. నాయకురాలికంటె హంగుదారుల హంగామా ఎక్కువైనట్లు, కథానాయకుడికంటె వెయ్యిరెట్లు ఎక్కువబాధపడ్డాడు మావాడు. ఆనెలరోజులూ మధ్య మేమంతా చచ్చామంటే నమ్మండి.

ఎలాగైతే నేమి నాటకాలుపడ్డాయి. ఫరవాలేదు బాగానేఉన్న వనుకున్నారు అంతాను. రత్తయ్యకేవలం కబుర్లేకాకుండా, బాగానే ఏక్టుచేశాడన్నారు. అందరిదాకా ఎందుకు,వాడేఅన్నాడు. "వెధవలంతా తగలేశారు కాని లేకపోతే ఇంకాబాగుండేది" అని. అనగా నాటకం ఏమాత్రమేనా బాగుంటే తనవల్లనేనని. మరి రెండు నాటకాలయేసరికి మావాడికి 'రంగగ్రామసింహ' అనే బిరుదుకూడావచ్చింది. ఆబిరుదు ఎందుకువచ్చిందో ఎలా వచ్చిందో ఇప్పటికీ మాకు తేలలేదు. ఆవిషయంమావూళ్లో పరిశోధకు లింకా పరిశీలిస్తూనే ఉన్నారు.

అయ్యా ఆరాత్రి వాడి Tragedy కి ప్రారంభమనుకోండి. గొప్పనటకుడు కాతగ్గలక్షణాలన్నీ తన దగ్గర ఉన్నాయనీ, అవన్నీ తప్పకుండా Develop చెయ్యాలనీ, తనజీవితమంతా నాటకకళోద్ధరణకే వినియోగిస్తాననీ శపథంచేశాడు. రెండునిలువుటద్దాలు, ఒక

హార్మోనియము, బజారులో దొరికినన్ని నాటకాలూ సంపాదించాడు. కన్యాశుల్కము మొదలు కనకతార వరకూగల అన్నిరకాల నాటకాలలోనూ ముఖ్యపాత్ర లకు సంబంధించినభాగాలను వల్లెవేశాడు. "ఇన్ని నాట కాలూ వేస్తుందా మీకంపెనీ, ఒకవేళ వేస్తేమట్టుకు అన్నిటిలోనూ నీకే నాయకపాత్ర ఇవ్వడానికి వీలౌ తుందిగనుకనా ఎందుకాశ్రమంతాను" అని ఊరుకోలేక అడిగాను. 'వేసినన్ని వేస్తుంది మాకంపెనీ, తక్కినవి కొన్ని నేను Monoacting చేస్తాను' అన్నాడు. మళ్లిమాట్లాడితే Gramaphone records ఇస్తా నన్నాడు. లేకపోతే ఏహిందూస్తానీవాళ్లనో బెంగాలీ వాళ్లనో పట్టుకుని ఎవళ్లోనలుగురుఅమ్మాయిజగ్గాయిలను తీసుకుని టాకీలు తయారుచేయిస్తానన్నాడు. ఇంకనే మనగలము వాడిని. అక్కడనుంచి ప్రారంభమైనదండి వాడిజబ్బు. జబ్బంటే మరేమీకాదు. మనిషిలో ఒక విధమైన వింతమార్పు బయలుదేరింది. మాటలోను, చూపులోను, నడకలోను అంతామార్పే. ఊరికే మార్పని నేను చెపుతే నమ్మరు. ఆరోజుల్లో మీరు వాడినిచూచి తీరవలసింది.

కాస్త కాలుపొడుకుమనిషేమో స్వతహాగాను, వాడు మామూలుగా నడుస్తుంటే, పెద్దపెద్దఅంగ లేసుకుని, పరుగెడుతున్నట్టుగా ఉండేది. అలాంటి దిప్పు డదంతా మానేశాడు. అవతల కొంపలంటుకుని, ఇవతల పెద్దపులి తరుముకొనివచ్చినాసరే, మందగమనమేకాని, మామూలు నడకెక్కడా కనుపించడము మానేసింది. దుష్యంతుడువేషంలోఉన్న యడవల్లిసూర్యనారాయణ లాగనో, శివాజీవేషంలోఉన్న మాధవపెద్ది వెంక ట్రామయ్యలాగనో నడవాలని వాడిఆశయము. మాకు మట్టుకు వాడినడకచూస్తే, గోదావరినుంచి నీళ్లబిందె బుజాన్ని పెట్టుకుని, ఉమ్మెలలోనూ అంట్లలోనూ ఎక్కడ కాలుపడుతుందోఅని, ఎత్తిఎత్తి అడుగులువేశే బ్రాహ్మణవితంతువు స్ఫురణకొచ్చేది. అదివరకెప్పుడూ, క్లబ్బుకువస్తే పేపరుపుచ్చుకొని ఒకమూల కూర్చునే వాడు. ఇప్పుడలా కూర్చోడము మానేశాడు. ఏదో దీర్ఘాలోచన చేస్తున్న రాజువేషంలాగ వరాండాలో పచార్లు సాగించడము మొదలుపెట్టాడు. చూపు మామూలుచూపు మొదలేపోయింది కదా! ఎప్పుడూ కనుబొమలు ఎగరేస్తుండడమో, లేకపోతే ముళ్లు వేస్తుండడమో. దృష్టిఎప్పుడూ భ్రూమధ్యమందో నాసి కాగ్రమందుఉండడమేకాని, మామూలుచూపుఎప్పుడూ కనపడేదికాదు. మనతోటి మాట్లాడుతోంటేకూడా మనకేసి కాకుండా, మననెత్తిపైనుంచి అవతలఏదో చూస్తున్నట్లుగా Busterkeaton కుమల్లే చూడడము నేర్చుకున్నాడు. ఇంక ఎవరితోనేనా మాట్లాడవలసి వస్తే రాజు మంత్రితోనో లేక వేడుకచెలికానితోనో మాట్లాడుతున్నట్లో, తండ్రి, చెడిపోతున్నకొడుక్కి ఆఖరుసారి సలహాఇస్తున్నట్లో లేక సినీమాలో విలన్, ఏహోటల్లోనో తోటిదొంగను కూచోపెట్టి, రహ స్యంగా, ఇదీఇలాచేసి, అదిఅలాచేసి, వాడిని డొక్క బద్దలుచెయ్యాలనని బోధిస్తున్నట్లో, మాట్లాడడమేకాని, మామూలుధోరణి ఎక్కడాలేదుకదా. ఇంక కనుబొమ లెగరెయ్యడం, గుడ్లు మిటకరించడం, ముక్కులు పెద్దవి చేస్తోండడం, పెదవులు ఆడించడం, చేతులు ఝాడిం చడం ఇలాటివాటికి లేఖ్కేలేదనుకోండి. మాటకు ముందు చెయ్యి నొసటనుపెట్టుకుని 'హా' అని ఒకపెద్ద నిట్టూర్పు విడవడం. ఏదో ఆలోచించి అదేమీ లాభం లేదన్నట్లు తలతిప్పడం. మనమేదేనా చెపుతోంటే, మీసముమీద చెయ్యివేసి, 'ఎంతద్రోహము! తరువాత తరువాత' అన్నట్లు తలపంకించడము. ఇంకా ఇటు వంటిఅవలక్షణాలు ఎన్నో.

రోడ్డునడుస్తూ, హఠాత్తుగా నిలబడిపోయి "వీని నెన్నటికైన అధఃపాతాళమున కణగద్రొక్కి, నాకసి తీర్చుకొనక పోదునా' అన్నట్లు, వొళ్లు, పళ్లు, నుప్పిళ్లు బిగపట్టి, గుడ్లెర్రచేసి త్వరత్వరగా ఊపిరివిడుస్తూ నిల బడిపోయేవాడు. గోదావరిగట్టుననడుస్తూ పక్కనెవరేనా కుర్రాడుకూడాఉంటే, "ప్రేయసీ, చూచితే, ప్రకృతి రామణీయక"మని వర్ణిస్తోన్నట్లు, వాడిబుజముమీద చెయ్యివేసి, బుగ్గనిమురుతూ, రెండోచెయ్యి ఆకాశంకేసి జూపినిలబడిపోయేవాడు. ఇలా ఎన్నని చెపుతే మీకు తెలుస్తుంది. ఇదో జబ్బంటారా కాదంటారా.

మేము అనేకవిధాల,వేళాకోళం చేశాము. వెక్కిరించాము. ఏడిపించాము. తిట్టాము. తిన్నాము. ఏమి చేసినా వాడివేషముమట్టుకు మార్చ లేకపోయాము. భాషకూడా క్రమేణా గ్రాంథికంలోకి దింపడము మొదలెట్టాడు. ఏమిట్రా ఈవెర్రివేషమంతానని ఒకరోజున నిలదీసి అడిగాము. దానికేమీ సమాధానము లేదు. 'ఈశ్వరేచ్ఛ' అన్నట్లు ఆకాశంకేసి చేతులు చూపించాడు మాకు వొళ్లుమండింది. మండనూ. వాడితోటి మాట్లాడడానికి భయమాయె రోడ్డుననడవడానికి సిగ్గాయె. మాగున్నయ్యకుక్క, పందికొక్కని మెడ పట్టుకొని ప్రాణంపోయేదాకా ఝాడిస్తుందిమాశారు, అలాగ రత్తయ్య గొంతుకపట్టుకొని,పళ్లుగలగలలాడేటట్లు రెండుఊపులుఊపి, "ఏమిటీగోలంతాను, నిన్నుచూడ లేక మధ్య మేము చస్తున్నాము" అన్నాడు. ఆపశంగా నెత్తినచెయ్యిపెట్టుకొని "నన్నేల ఇట్లు హింసించెదరు. హా పరమేశ్వరా, నేనేమి అపకారమొనర్చితిని" అని యథాశాస్త్రీయంగా విలాపం ఆరంభించాడు. నోరుమూసి,"సరిగ్గాసమాధానము చెపుతావా లేకపోతే, మళ్లీ ఇందాకటి Dose repeat చెయ్యమన్నావా" అని ఒక్కఉరుముఉరిమాడు గున్నయ్య. దానితో హడిలిపోయి, "ఏమిట్రా నన్నుచంపుతారు. నేను ఎలా ఏడుస్తే మీకెందుకు. Acting అంటేఏమిటో మీరెప్పుడూ serious గా ఆలోచించినట్లు కనపడదు. Stage మీద మనము Act చేస్తోంటే, ఏదో బిగపట్టి ఏదోచేస్తున్నట్లుగా కాకుండా Natural గా ఉండాలి. లేకపోతే effective గా ఉండదు. Art lies in concealing art అన్నాడు. అందుకని మన నిత్యజీవనంలోకూడా, ప్రతిఆలోచనకూ మాటకు తగ్గ movements జాగ్రత్తగా ఆలోచించుకుని చేస్తుంటే, అది natural అయిపోయి, Stage మీద wonderful effect ఇస్తుంది- ఇంత serious గా thinkout చేసి practice చేసిన వాళ్లెవళ్లూమనలో లేకపోవడంచేతనే మననాటకాలు అలాతగులడుతున్నాయి" అన్నాడు.

"ఓరినాయనమ్మా, మనం మామూలుగా ఉన్నట్లు stage మీద ఉంటే బాగుంటుందికాని stage మీదఉన్నప్పుడు ఫలానప్పుడు ఇలాఅభినయిస్తే బాగుంటుందనుకొని ఊహించినదల్లా బయటకూడా చేస్తుంటే stage మీదనే హాస్యాస్పదంగా ఉన్నప్పుడు, రోడ్డుమీద ఎంతఅసహ్యంగా ఉంటుందో ఆలోచించు. ఇంక నీవెర్రివేషాలుకట్టిపెట్టి మామూలుగా బుద్ధికలిగి బ్రతికితివా సరేసరి. లేదూ, ఇంకనెప్పుడూ మాతో మాట్లాడవద్దు" అన్నాడు, గున్నయ్య. "ఏమీ నన్నేకాకినిచేసి, నష్టేశమునుంచిపోవుట మీకు ధర్మమేనా" అని అభినయమారంభించబోతుంటే, "ఒరేయిరండిరా. వీడితో లాభంలేదింక. వాడివరసచూస్తే కీర్తనకూడా పాడేట్లున్నా" డన్నాడు, గున్నయ్య. హడిలిపారిపోయాము అక్కడనుంచి.

అయ్యా, నడిరోడ్డుమీదా, క్లబ్బులోనూ, పరాయివాళ్లదగ్గరనే ఇలాఉన్నప్పుడు, సర్వస్వతంత్రమైన భార్యదగ్గిర వాడింట్లోసంగతి ఇంకనడిగారూ! ఆవిడ దగ్గర చేశేశృంగారాభినయాలూ, ఆవిడ ఎదుటకనపర్చే విరహవేదనలూ ఇన్నీఅన్నీకావు. బహుయోగ్యురాలు గనుక ఆఅమ్మాయి, ఎన్నాళ్లో ఓపికపట్టి ఊరుకుంది. ఎన్నాళ్లకూ మారకపోతే బ్రతిమాలుకుంది; కోపగించింది; పుట్టింటికి వెళ్లిపోతానని బెదిరించింది. ఏమి చేసినాసరే వాడిగుణము వాడుమానడే. ఒకరోజున నేను వాళ్లింటికివెళ్లాను ఆవిడ కాఫీతీసుకువచ్చి ఇచ్చి, "అన్నగారూ, మీబావగార్ని కాస్తమీరేనా మందలిద్దురూ,చచ్చిపోతున్నాను.సిగ్గేసిపోతోంది. లేకపోతే పిచ్చేమోఏమాటుఏ డాక్టరుకన్నాచూపించ నేనాచూపించండి ఈయనతోటి పడేబాధ ఇంతా అంతా కాదు. అస్తమానమూ అనిపాటలు కావు పద్యాలుకావు. వీధివీధంతా హోరెత్తిపోతోంది. నలుగురిలోనూ తలెత్తుకు తిరగ లేకుండా ఉన్నాను. అదికాకుండా కుర్రకుంక, మావాడు, కాస్తజ్ఞానమొస్తున్నరోజులు. వాడూ ఇలా పాడైపోతాడేమో నని హడిలిపోతో రోజూ వెయ్యి దేవుళ్లకి మొక్కుకుంటున్నాను. అన్నది" కళ్లొత్తుకుంటూను. నాకు ఆ అమ్మాయని చూస్తే చాలా జాలి వేసింది వాడైనట్లయినా, తర్జనిగడ్డముమీద పెట్టుకొని, "ఓసి వెర్రిదానా! ఎంతఅమాయకురాలవు. నావలన

పసివాడు చెడిపోవునా! అనగా నేను చెడితిననిగదా నీఅభిప్రాయము. చెడితినేయనుము. నే నెవరివలన చెడితిని. నాతండ్రివలననా లేక నీతండ్రివలననా. ఈలోకములో, ఒకరివలన ఒకరు చెడుటకాని, బాగు పడుటకాని ఎన్నటికినీ సంభవింపదు. వారివారి......" అని ఉపన్యాసము ఆరంభించాడు. "చూచారా అన్న గారూ ఇదీవరస. ఇంక నేను ఏనుయ్యో గొయ్యో చూసుకోవలసిందేకాని ఇలా బతకలేన"ని కంటతడి పెట్టుకుంది. నేను తలవాచేటట్లు చివాట్లేసివచ్చాను. అంతకంటె ఏమిచెయ్యగలము. చిన్నకుర్రాడు గను కనా, నాలుగు తగలనివ్వడానికి.

ఒకరోజు మధ్యాహ్నము నేవెళ్లేసరికి రత్తయ్య భోంచేస్తున్నాడు. అనగా విస్తరిదగ్గర కూర్చున్నాడు. మొదటివాయి అయింది. నేనెళ్లేసరికి కూరాఅన్నం కలుపు కుని, ముద్ద నోట్లోపెట్టకుని తుభుక్కున ఉమ్మేశి, అంటచేత్తోటి, నొసలుబాదుకుని, "కటకటా, ఎట్టిదురవస్థ! ఊరనిన్ని కూరలుండ, తా నీ దిక్కుమాలిన కాకరకాయ లేలకొనవలె, కొనెబో నన్నడుగకుండ ఈపాడుకూర నేలవండవలయు, వండెబో నాకిష్టము లేదని తెలిసియు నా కేలవడ్డింపవలయు, నాపై యను రాగముననో అసహ్యముననో వడ్డించెబో, మతిమాలి నే నేలతినవలయు, హా పరమేశ్వరా" అని ఆరంభించాడు "వెనవఉపన్యాసం కట్టిపెట్టి నోరుముయ్యవోయి" అన్నాను. "అన్నగారు చూశారా అండి ఈహంగామా వెధవకూరకోసం, ఈదిక్కుమాలిన నాటకాలతోటి తమకి ఇంట్లోకి ఏంకావాలో ఏముందో లేదో తెలుసుకోడానికి తీరికలేక పోయె. ఆడపేనుగుని ఎన్నిటికని చచ్చేది. కూర లేకపోతే అసలే తినలేరని, వాకట్లోకివచ్చాయికదా అని పుచ్చుకొని వండుతే, ఇంత అల్లరెందుకు. ఆఅంటచేత్తో ఆనెత్తి మొత్తుకోడ మెందుకు. నేనింక ఒక్కక్షణం ఇక్కడఉండను. మావాళ్లింటికి ఒంటిగంట బండిలోపోతాను.వాళ్లు కాస్త పిండాకూడు పడెయ్యలేకపోరునాకు. ఇది నాటకం కాదు ఇల్లనీ, నేను నాటకంలో స్త్రీవేషధారిని కాక మీభార్యననీ తెలివివచ్చినప్పుడు కాకిచేత కబురంపినా వస్తాను. అందాకా మట్టుకుమళ్లీఈనుమ్మంం తొక్కడ్చూడ" నని కళ్లనీళ్లుపెట్టుకుంటూ రెండుగుడ్డలు మూటకట్టుకొనికుర్రవాడిని తీసుకొని రైలుకు చక్కాపోయింది.

రత్తయ్య వెర్రిమొగము వేసుకొని దిగాలపడి కూచున్నాడు. "ఏమిరా ఇప్పుడేనా బుద్ధివచ్చిందా" అన్నాను. "అవునురాబ్రదర్. కొంచెము అతిగా వెడుతున్నాననే అనుకుంటున్నాను. మామూలుగా ఉందామనే ప్రయత్నిస్తున్నాను. కాని ఇదేబాగా అలవాటయిపోయి వదలడం లేదు. నువ్వు నన్నువదిలినా నేను నిన్ను వదలనన్నకథలాఉంది నాపని అన్నాడు. నాటినుంచీ మామూలుపంథాలోకిరావలెనని చాలాప్రయత్నం చేశాడు. కాని సాధ్యపడలేదు. అలాగే తంటాలు పడుతూ కొన్నాళ్లకు వెళ్లి భార్యను తీసుకువచ్చాడు.

ఇలాఉండగా కొన్నాళ్లకు, వాడి కుర్రవాడికి జబ్బుచేసింది. ప్రాణంమీదికి వచ్చిందంటే చూడ్డానికి వెళ్లాను. నేవెళ్లినకాశ్శేపటికే ప్రాణంపోయింది. అంతా గొల్లుమన్నారు. పదిమందీ మాగారు లోపల లోపల విచారించి విచారించి, ఆఖరుకు 'హాతనయా' అని ఒక్క పెద్దనిట్టూర్పు విడిచాడు. దుఃఖంలో మునిగిఉన్న భార్య, నిశ్చేష్టురాలై తెల్లబోయి భర్తకేశి చూసింది. జనమంతా వెలవెలపోయారు. రత్తయ్యకు ఇదేమీ తెలియలేదు. "తనయా నీ నగుమోముచూపి" అని ముఖం ఎత్తపోయేసరికి, 'ఆఁ ఆఁ' అని భార్య వాడినోటిమీద చెయ్యిఅడ్డుపెట్టింది. దానితో తెలివి తెచ్చుకున్నాడు. **జరగవలసినదంతా జరిగినతరువాత, ఆవిడ పుట్టింటికి వెళ్లిపోయింది. ఏడాది అయింది ఇంకారాలేదు. వాడు పాపం మునుపటిమనిషే కాదు. కాని ఎన్నిప్రయత్నాలుచేసినా ఇంకా మామూలుధోరణిలోకి రాలేదు.

చూడండి ఎంత స్వల్పవిషయం ఎంతవరకు వెళ్లిందో. ఆరోజున ఒక్కళ్లమేనా ఇంతవరకూ వస్తుందని కలలోనేనా అనుకోలేదుకదా.

# అనవసరపుఖర్చు

(టాల్‌స్టాయి)

అనువాదకుడు: త. ప్రకాశరాయుడు

ఫ్రాన్సు ఇటలీదేశాల సరిహద్దుప్రాంతంలో మధ్యధరా సముద్రం ఒడ్డున "మొనాకో" అనే చిన్నరాజ్య మొకటున్నది. ఈరాజ్యంలోవున్న జన సంఖ్య అంతాకలిసి ఒకచిన్నపట్టణంలో వున్నంత కూడా వుండదు. రాజ్యంలో జనాభా లెక్కపెడితే ఏడువేలుంటుంది. రాజ్యంలోవున్న భూమి అంతా ప్రజలకుపంచిపెడితే తలకొక యెకరంకూడా రాదు. ఐతేనేమి? ఎంతచిన్నదైనా ఇదీ ఒకరాజ్యమేకద! రాజ్యానికుండవలసిన అట్టహాసమంతా ఇక్కడనూ వున్నది. రాజుకొకభవనం, కొలువుకూటం, మంత్రులు, మతపీఠాధిపతి, రక్షకసైన్యం, సేనాధిపతులు మొదలైన రాజ్యాంగతంత్రమంతా వున్నది.

సైన్య మంతగా పెద్దదికాదు. సైనికదళమంతా కలిపితే అరవై మంది అరవైమందైనా, అదీ ఒక సైన్యమే అనిపించుకొన్నది. ఇతరదేశాలలోవలెనే ఇక్కడకూడ ప్రజలవద్దనుంచి రెండువిధాలైన పన్నులు వసూలయ్యేవి. పొగాకు, సారాయి మొదలగు నిషాద్రవ్యాలమీద పన్నొకటి; రెండవది తలపన్ను. ఇతర చోట్లవలెనే ఇక్కడకూడ పొగతాగుడూ, సారా తాగుడు వుండేది కాని తాగుబోతుల సంఖ్యమాత్రం స్వల్పంగావుండేది. అయితే యీస్వల్పరాబడిమీదనే రాజు ఆధారపడివుండవలసివస్తే వాటిమీదవచ్చే ఆదాయం తనకూ తనవుద్యోగులకూ తిండికి సరిపోయేది కాదు. తన ఆదాయం వృద్ధిచేసేటందుకు రాజు మరొక కొత్తమార్గం కనిపెట్టినాడు. ప్రజలందరినీ ఆకర్షించి డబ్బురాబట్టేటందుకు రాజొక జూదపుశాల కట్టించాడు. దినదినం అనేకు లక్కడచేరి జూదమాడేవారు. జూదర్లు ఆటలోగెలిచినా, ఓడినా అక్కడినిబంధనల ప్రకారం తామియ్యవలసిన రుసుము చెల్లించిపోవలసినదే. ప్రతిజూదరీ తాను ఆటలో పాల్గొన్నందుకే జూదపుశాలాధికారికి ముడుపు ముందక్కడపెట్టి మాట్లాడవలసినదే. జూదపుశాలాధికారి తనకు వచ్చిన లాభములోనుంచి రాజుకు చెల్లించే మొత్తమే చాలా వుండేది. రాజకంతయెక్కువ ఆదాయం రావటానికి కారణ మొకటున్నది. యూరపుఖండంలో కల్లా అప్పటికి మిగిలివున్న జూదపుకొలువు అదొక్కటే. అంతకు పూర్వం జర్మనీ దేశంలో చిన్న చిన్న రాజులు కొంద రిటువంటి జూదపుశాలలు కట్టించి ఆదాయం తీస్తూవుండేవారు కాని అప్పటికి కొద్ది సంవత్సరాలకుపూర్వం దేశమంతటా అవి నిషేధింపబడి యెత్తివేయబడ్డవి. అమితంగా జూదర్ల సంఖ్య హెచ్చిపోవటంచేత దేశానికికలిగిన తీరనినష్టమే అవన్నీ యెత్తివేయబడటానికి కారణం. ఒక్కొకడే జూదపుశాలకురావటం, అదృష్టముండకపోతుందా అని పందెం ఒడ్డటం, ఆటలో ఓడి తనకున్నదంతా పోగొట్టుకొనటం, తనదంతాపోయినతరువాత క్రమంగా యితరులసొమ్ము కూడ తెచ్చి జూదంలోపెట్టి అదికూడా పోగొట్టటం, తరువాత బ్రతుకుతెరువు కనిపించక నిస్పృహచెంది లోతు నీటిలోదిగిగాని, పొడుచుకొనిగాని, పేల్చుకొనిగాని ఆత్మహత్యచేసికొనటం—ఇట్లాజరుగుతూవుండేది. ఇటువంటిప్రమాదస్థితిచూచి సహించలేక జర్మనీప్రజలు ప్రభువు లీదుర్మార్గానికి పాల్పడకూడదని గట్టిగా నిరోధించారు. కాని ఒక్క 'మొనాకో' రాజుకుమాత్రం యెదురుచెప్పగలిగినవా శ్లెవ్వరూ లేకపోయినారు. అందుచేత ఈరాజు తానే సర్వాధిపత్యంవహించి తన వ్యాపారం నిరాటంకంగా జరుపుతున్నాడు.

అప్పుడు యూరపుఖండంలో యెవ్వడు జూదమాడదలచినా మొనాకో జూదపుశాలకుపోయి తా

నంములో గెలిచినా లేకఓడినా రాజుకియవలసినకట్నం మాత్రం సమర్పించి పోవలసినదే. ధర్మం తప్పకుండా కష్టించి పొట్టపోసుకొనేవాడు మేడలూ మిద్దెలూ కట్ట లేడనే సామెతమాత్రం నిజం. తానుచేసేది పాడుపని యనేవిషయం మొనాకోరాజుకు తెలియనిదికాదు. కల్లుసారాయిలమీదను పొగాకుమీదను పన్నువసూలు చేయటం మంచిపనికాదని అతనికి బాగాతెలుసును. కాని యేమిచేస్తాడుపాపం! తనదర్జాకు తగినట్లు జీవన యాత్ర జరిగితీరవలెకదా! కనుక ఇటువంటిమార్గాలవలం బించి బ్రతుకుతెరువుచూచుకుంటూ రాజ్యయంత్రం నడుపుతూ చేతనైనట్లల్లా డబ్బు పోగుచేసుకుంటూ వుండేవాడు. ఏదియెట్లున్నా రాజరికాని కుండవలసిన అట్టహాసమంతా, కర్మకలాపమంతా జరుగుతూనే వుండేది. ప్రపంచంలో అందరిరాజులవలెనే ఈ రాజుకుకూడ తనరాజ్యానికితగినట్లు దర్బారులు, బహు మతులు, శిక్షలు, క్షమాపణలు, సలహాసభలు, ధర్మ—చట్టాలు, న్యాయస్థానాలు—ఇవన్నీవున్నవి కాని యితరరాజ్యాలు పెద్దవి, ఇది చాలచిన్నది—ఇదొకటే వున్న భేదమల్లా.

ఇట్లావుండగా 'మొనాకో' రాజ్యంలో ఒకప్పుడొకనరహత్య జరిగింది. ప్రజలందరూ సామాన్యంగా శాంతిప్రియులవటంచేత ఆరాజ్యంలో అంతకు పూర్వమెన్నడూ యిటువంటిఉపద్రవం జరుగలేదు. న్యాయాధిపతులు యథావిధిగా సమావేశమైనారు. బహు శ్రద్ధతో కేసువిచారణచేశారు. కోర్టులో న్యాయమూర్తులుమాత్రమే కాదు, ప్రోసెక్యూటర్లు, జూరీ, బారిస్టర్లు, యింకావుండవలసిన ఆడంబరమంతా తయారయింది. బహుజాగ్రతతో విషయాన్ని చర్చచేసి న్యాయాన్యాయవిచారణచేసి చట్టప్రకారం నేరస్థునికి ఉరిశిక్ష విధించారు. అంతవరకంతా సరిగానేజరిగిందనవచ్చు. మరుసటిదినం కోర్టువారితీర్పు రాజుయెదుట పెట్టబడ్డది. రాజుకూడ కోర్టిచ్చినతీర్పు చదువుకొని శిక్షఖాయపరచాడు. "సరే, ఉరితీయవలసివస్తే మరి సందేహమెందుకు? అట్లాగేచేయండి!" అన్నాడు రాజు,

కాని తీర్పుఅమలుజరిపేవిషయంలో ఒకప్రతిబంధకంమాత్రం కలిగింది. అంతకుపూర్వమెప్పుడూ అక్కడ ఉరిశిక్షలు జరిగివుండకపోవటంచేత, ఆదేశంలో ఉరితీసే సాధనసామగ్రిగాని, ఉరితీయటంలో నేర్పు గలమనిషిగాని లేవు. మంత్రులందరూకలిసి మార్పుని విషయాన్నిగూర్చి తిరిగి యోచనచేశారు. ఆలోచన ముగించి ఈవిషయాన్నిగూర్చి ఫ్రెంచిప్రభుత్వానికి వ్రాశారు. ఉరితీసే సాధన సామగ్రినీ, ఉరితీయటంలో మంచి అనుభవంగల మనిషినొకణ్ణీ తమదేశానికి పంపమనిన్నీ, రెండింటికీ అయ్యేమొత్తంఖరీదు తెలియపరచమనిన్నీ జాబువ్రాసి పంపినారు. ఒకవారానికల్లా జవాబువచ్చింది. ఉరియంత్రమూ, ఉరిబిగించేమనిషీనీ సప్లయి చేస్తామన్నారు. రెండింటికీకలిసి ౧౬,౦౦౦ ఫ్రాంకులు చెల్లించవలసివుంటుందనికూడ ఆవుత్తరంలోనే వున్నది. జాబు రాజుయెదుట పెట్టబడ్డది. ఉత్తరం చూచుకుంటూ చాలా ఆలోచించాడు రాజు. "అబ్బా ౧౬ వేల ఫ్రాంకులే! ఈదౌర్భాగ్యుని బ్రతుకంతా చూస్తే అంతవిలువ ఉండదే! ఇంతకంటె చౌకలో పని జరగనేజరగదా? ౧౬ వేల ఫ్రాంకులంటే మాటలా? ప్రజలమీద క్రొత్తపన్నువిధించి వసూలు చేదామన్నా తలకు రెండున్నర ఫ్రాంకులకుపైగా పడుతుంది. ఈబరువు ప్రజలెట్లాభరిస్తారు? మీదు మిక్కిలి దేశంలో తిరుగుబాట్లు, దొమ్మీలుకూడా జరగవచ్చు" ననుకుంటూ కంగారుపడ్డాడు ప్రభువు.

కర్తవ్యమేమో తెలియలేదు. సలహాసభను తిరిగి సమావేశపరచాడు. సభ్యులందరు యోచనచేసి అటువంటి వుత్తరమే మరొకటి ఇటలీరాజుకు పంపటానికి తీర్మానించారు. ఫ్రాన్సుదేశానిది ప్రజాప్రభుత్వంకనుక రాజుల నిరంకుశపరిపాలనంటే వాళ్లకు గిట్టకపోవచ్చు. 'మొనాకో' వలెనే ఇటలీకూడ రాజుపరిపాలనలో వుండటంచేత తోడిరాజుయెడల సహజగౌరవం, అభిమానంవుంటవి. అందుచేత ఇటలీరాజు తమకోరికను మన్నించి తమకుకావలసిన సాధనసామగ్రిని కొంత చౌకగా పంపిస్తాడనే దృఢనమ్మకంతో ఉత్తరమొకటి వ్రాసిపంపినారు. వెంటనే జవాబువచ్చింది. తామడిగి

నట్లుగా ఉరియంత్ర మొకటి, బాగావురితీయగల మనిషిని తప్పకపంపుతామనిన్నీ, ప్రయాణపు ఖర్చులతోసహా మొత్తం ౧౨ వేల ఫ్రాంకులు అవుతుందనీ ఇటలీరాజు వ్రాసినాడు. ఇది కొంత చవక బేరమైనా ఇదికూడ బోలెడు ఖర్చుతో కూడుకొన్న వ్యాపారంగా కనబడ్డది. ఈ దుర్మార్గుని బ్రతుకంతా చూస్తే ౧౨ వేలు విలువేవుండదు! ఇదివరకున్న పన్నులకు తోడు యింకాప్రజలను బాధించి తలకు మరి రెండేసి ఫ్రాంకుల చొప్పున పుచ్చుకుంటేనే గాని యీ ౧౨ వేలూ పూడవు. ఇట్లాచింతిస్తూ రాజు తిరిగి సలహాసభ సమావేశపరచాడు. సభ్యులొకచోటకూడి ఆలోచించారు. వాదప్రతివాదాలు జరిగినాయి. ఇంత దుబారాఖర్చుకాకుండా తక్కువఖర్చుతో పని జర పటమెట్లాగనని చాలసేపు యోచనచేశారు. "సైన్యంలో పనిచేసే సిపాయి నొకణ్ణి అప్పగిస్తే యేదోఒకవిధంగా ఖైదీని కడతేర్చలేకపోతాడా? దీనికి ప్రత్యేకపుఖర్చు యేమాత్రమూవుండ" దని అభిప్రాయపడ్డారు సభ వారు. ఈవుద్దేశంతో సేనాధిపతినిరప్పించి యిట్లా అడిగినారు. "ఏమయ్యా, ఒకఖైదీతల నరికివేయవలసి వచ్చింది. మీసైన్యంలో ధైర్యస్థుడైన సిపాయినొకణ్ణి అప్పగించి పనియెట్లాగైనా జరిపించగలవా? యుద్ధంలో ముందువెనుకలు ఆలోచించకుండా మనుష్యులను చంప టమేకదా సిపాయీలవృత్తి! అసలు వాళ్లకు సైనిక శిక్షనిచ్చేదికూడ అందుకేకాదా?" ఈమాటవిూద సేనాధిపతిపోయి తనసైనికులనందరినీ అడిగిచూచాడు. కాని సైన్యంలో సిపాయొక్కడుకూడ ఆపనిచేయ టానికి ఒప్పుకోలేదు. "మా కావిషయాన్నిగూర్చి అను భవమేలేదు. ఉరితీయటమెట్లాగో మాకుతెలియదు. మాకునేర్పినవిద్యలలో ఆవిషయమెక్కడా రాలేదు." అని సైనికులన్నారు.

అప్పుడేమిచేయవలె? రాజుకేమీ పాలుపోలేదు. తిరిగి మంత్రులందరికీ కబురుపంపి రప్పించాడు. మంత్రులుకలసి తిరిగిచర్చచేసి, ప్రత్యేకంగా మరొక కార్యాలోచనసభను, దానికితోడు మరొక ఉప సంఘాన్ని నియమించారు. చివరకందరూకలిసి ఒక నిర్ణయానికి వచ్చారు. నేరస్థునికి విధించబడ్డ ఉరిశిక్షను జన్మఖైదుకింద మార్చటానికి తీర్మానించారు. ఈ మార్పువల్ల నేరస్థునికి కొంత సదుపాయంకలగటమేగాక తద్వారా రాజుయొక్క దయాగుణంకూడ వెల్లడి అవుతుందని అభిప్రాయపడ్డారు. ఇదిగాక యీవిధంగా ఖర్చుకూడ చాలతక్కువౌతుందని అంచనావేశారు.

ఈమార్పుకు రాజుకూడ వెంటనే సమ్మతిం చాడు. జన్మఖైదు ఖాయపడ్డది. కాని దీనికికూడ ఒక యిబ్బంది కలిగింది. జన్మఖైదీల నుంచటానికి వీలైన కొట్టు యెక్కడనూ లేకపోయింది. తాత్కాలికంగా ఒకరిద్దరు మామూలునేరస్థులను వుంచే చిన్నగదిమాత్రం ఒకటున్నది. చిరకాలపుఖైదీలను బంధించివుంచటానికి కట్టుదిట్టమైన కొట్టు ఒక్కటీలేదు. ఎట్లాగైతేనేమి, ఒకచోట గది ఒకటిచూచి దానితోనే కాలక్షేపం చేదామనుకొని ఖైదీని అందులోవుంచి రక్షకభటు నొకణ్ణి బయట కావలివుంచారు. ఖైదీని కనిపెట్టిచూస్తూ రాజుగారి వంటశాలనుంచి అన్నం తెచ్చి ఖైదీకి యిస్తూ వుండటం రక్షకభటునికి నియమింపబడ్డపని.

రాజుయొక్క ఆజ్ఞప్రకారం ఖైదీ కొట్టులో ప్రవేశించాడు. నెలతరువాత నెల గడిచింది. ఇట్లా ఒకసంవత్సరం పూర్తి అయింది. సంవత్సరం చివర ఒకనాడు రాజు తనజమాఖర్చుపుస్తకాలు చూచు కుంటూవుండగా అందులో అంతవర కెన్నడూలేని కొత్త ఖర్చొకటి కనబడ్డది. ఏటిపొడుగునా ఖైదీ పోషణకొరకు ఖర్చుపడ్డమొత్తమే అది. అదైనా స్వల్పంగాలేదు. ఖైదీపైనపెట్టిన రక్షకభటునిజీతమూ, ఖైదీకొరకైనతిండిఖర్చూ కలిసి ఆసంవత్సరానికి ఆరు వందలఫ్రాంకులకుపైగా తేలింది. అన్నిటికంటెవిచార కరమైనది మరొకవిషయం. ఖైదీయిప్పటికింకా యువ కుడు, దృఢకాయుడై మంచి ఆరోగ్యస్థితిలోవున్నాడు. ఇదంతాతలుచుకుంటే ముందుముందు చాలప్రమాదకర మైన పరిస్థితులేర్పడేటట్లున్నాయి. ఇకవిూదట యిట్లా జరగటానికేమాత్రమూ వీలులేదని చెప్పివేశాడు రాజు. తిరిగి మంత్రులందరినీ చేరబిలిచి వారితో యిట్లన్నాడు.

"ఈనిర్భాగ్యుని కడతేర్చేటేలిక ఉపాయమేదో ఒకటి వెంటనేకల్పించవలెమీరు. ప్రస్తుతపు యేర్పాటుప్రకారం అమితంగా డబ్బు ఖర్చైపోతున్నది." రాజుయొక్క ఆజ్ఞానుసారం మంత్రులందరూ తిరిగిసమావేశమై యోచించారు. అందులో ఒకమంత్రి మిగతవాళ్లతో యిట్లన్నాడు. "వినండి, నాకొకవుపాయం తట్టుతున్నది. ఖైదీమీద కావలివుంచిన రక్షకభటుని వెంటనే మనము పంపివేయవలె." "అదెట్లాగయ్యా? రక్షకభటుని తీసివేస్తే ఖైదీపారిపోడూ?" అన్నాడు మరొకమంత్రి. "పారిపోనియ్యండి, చావనియ్యండి! మనకేమి?" అన్నాడు మొదటిమంత్రి. ఈమంత్రిసలహా ననుసరించి చివరకు వ్యవహారమిట్లా పరిష్కరించి, ఈతీర్మానం రాజుకు తెలియపరచారు. రాజు మారుమాటచెప్పకుండ దీనికికూడ సమ్మతించాడు. సరే, రక్షకభటుని అక్కడనుంచి పొమ్మన్నారు. తరువాత యేమిజరుగబోతుందోనని కనిపెట్టి చూస్తున్నారందరూ. విపరీతమేమీ జరగలేదు. మర్నాడు ఉదయాన్నే భోజనంవేళకు ఖైదీ తనగదివిడిచి బయటికివచ్చి చూచాడు. తనకు పూటపూటకూ అన్నంతెచ్చియిచ్చే భటుడు కనిపించలేదు. తానే తిన్నగా రాజుగారి వంటయింటికిపోయి అన్నమడిగి తీసికొని, తిరిగివచ్చి గదిలోప్రవేశించి తలుపు వేసుకున్నాడు. ఆదిన మట్లాగడిచింది. మరునాడదే విధంగా జరిగింది వేళకు భోజనానికి పోయేవాడు. తిరిగివచ్చి లోపల కూర్చునేవాడు. పారిపోయేసూచనయేమాత్రమూ కనుపించలేదు. అసలు అటువంటితలంపే ఖైదీకివున్నట్లు కనుపించలేదు. ఇక చేయవలసినదేమిటి? ఎవరికీ యేమీ తోచలేదు. తిరిగి ఆలోచనచేశారు.

"ఇకమీదట వాణ్ణి ఇక్కడవుండనిచ్చేది లేదని నిర్మొగమాటంగా వానితో చెప్పివేయవలె" నన్నారు చివరకు. ఈవుద్దేశంతో న్యాయశాఖామంత్రి ఖైదీని తనయెదుటకు రప్పించాడు.

"ఏమిరా అబ్బీ! నీవింకాయెందుకు పారిపోవు? నీపైన కావలిభటులెవ్వరూ యిక్కడలేరు తెలుసునా? నీవుపోవచ్చు—నీయిష్టమున్నచోటికి పోవచ్చు. రాజుగారుకూడ యేమీ అనరు. పో—పో!" అన్నాడు మంత్రి.

ఇదివిని ఖైదీ జవాబిచ్చాడు: "రాజుగారేమీ అనరని నేనూ యెరుగుదును. అయితే నేనిప్పుడు పోయేదెక్కడికి? పోయి చేయవలసినదేమిటి? మీరు నాకు విధించిన శిక్షలతో నాబ్రతుకంతా ధ్వంసం చేశారు. ఇప్పుడుపోతే ప్రపంచంలో నాముఖంచూచేదెవరు? ఇది యిట్లుండగా ఒళ్లువంచి పనిచేసుకునే అలవాటేపోయిందినాకు. మీరు నన్ను ఖైదులోబంధించి యెంతైనా హీనంగా చూచారు. ఇదేనా మీకు ధర్మం?—చెప్పండి. మీకు మొదట నాకు ఉరిశిక్ష వేసినప్పుడు వెంటనే ఉరితీసివుండవలసింది. పోనీ అదైనా చేశారా?—లేదు. దానినిగూర్చి నేనూ యేమీ అనకుండా ఊరుకున్నాను. తరువాత ఉరిశిక్షను జన్మఖైదుగామార్చి, ఇక్కడపెట్టి, భోజనపు యేర్పాటుకూడా చేశారు. కొంతకాలానికి కావలిభటునికూడ తప్పించారు. తరువాత నా అన్నం నేనేతెచ్చుకోవలసివచ్చింది. మీరేమిచేసినా, యేమీ ప్రశ్నించకుండా పోనిమ్మని యెప్పటికప్పుడే ఊరుకుంటూవచ్చాను. చివరకిప్పుడు నన్నిక్కడనుంచి పూర్తిగాపొమ్మనే అంటున్నారు. దీనికి మాత్రం నేనొప్పుకొనను. మీరు నన్నేమిచేసినా సరే—మీయిష్టం! నేనుమాత్రంపోను."

ఇప్పు డెవరేమి చేస్తారు? సలహాసభను తిరిగి సమావేశపరచారు. 'ఇప్పుడు చేయవలసినపని యే' మన్నారు. గట్టిగా పొమ్మనిచెప్పినా పోనంటున్నాడు మనిషి. తీవ్రమైన ఆలోచనచేశారు. వాణ్ణి వదలించుకొనటానికి కొంత ఉపకారవేతన మేర్పాటు చేసియైనా ఖైదీనిపంపివేయటానికి నిశ్చయించారు. "ఇంతకుమించి వేరుమార్గం కనిపించదు. ఏదోఒకవిధాన్ని వీణ్ణి వదలించుకోవలెకదా మనం" అంటూ రాజుతో చెప్పినారు. సంవత్సరానికి ఆరువందలఫ్రాంకు లివ్వటానికి నిశ్చయించి ఈమాట ఖైదీతోచెప్పినారు.

"ఆలస్యంగాని బకాయిగాని లేకుండా యేనెల కానెల డబ్బుముట్టేవరకుమీద వెళ్లిపోవటానికి నా కభ్యంతరం లేదు" అన్నాడు ఖైదీ.

ఈవిధంగా పరిష్కారమయింది సమస్య. ఆ సంవత్సరపు జీతంలో మూడవవంతు ముందుగానే అడిగిపుచ్చుకొని రాజ్యంవిడిచి వెళ్లినాడు ఖైదీ. తిరిగి రాజ్యానికి సరిహద్దుప్రాంతంలోనే నివాసమేర్పరచుకొని, అక్కడ కొంతభూమికొని, కూరగాయలతోట వేసి పెంచుతూ సుఖజీవనం గడపటం ప్రారంభించాడు. అక్కడనుంచి 'మొనాకో' రాజధానికొక పావు గంటరైలుప్రయాణం. సరిగా నెలతిరిగివచ్చేసరికి రాజు కొలువుకుపోయి తనకురావలసినజీతమడిగి తెచ్చుకునేవాడు.

తలలునరికించటానికిగాని, లేక బ్రతికినన్నాళ్లూ చెరసాలలోకట్టి పారవేయటానికిగాని యెంతడబ్బయినాసరే ఖర్చుపెట్టుటకు వెనుదీయని మరి యేరాజ్యంలోనూగాక, మొనాకోరాజ్యంలో నేరంచేయటంచేతనే యీయువకుడెట్లాగో ప్రాణందక్కించుకొని బయటపడ్డాడు.

---



గుత్తికోట - గుఱ్ఱపు లాయములు T. R. R.

# హిందూలా - స్త్రీలహక్కులు

కోమాండూరి శఠకోపాచార్యులు

(అనువృత్తము)

## ౭. వారసత్వాస్తిలో స్త్రీలకు శాస్త్రీయపుహక్కు

వారసత్వపు ఆస్తిలో స్త్రీలకు అనుభవపు హక్కుమాత్రమే కలదుగాని, అన్యాక్రాంతముచేయుటకు వీలులేదనియు, మరియు వారియనంతరం ఆయాస్తితిరిగి అసలు పురుషునితరువాత వారసులకు సంక్రమించునుగాని యీ స్త్రీయొక్క వారసులకు రాదనియు, ప్రస్తుతపు హిందూలాఅయియున్నది.౧ అన్నికోర్టులలోను యిప్పుడు లా అట్లే అమలుజరుపబడుచున్నది. కాని మనధర్మశాస్త్రకారులకందరికిని పూర్వ మట్టియాశయమే యుండెడిదనుటకు వీలులేదు. అట్టిగ్రంథములన్నిటిలో ముఖ్యమగు యాజ్ఞవల్క్యస్మృతిలోని వారసత్వముకు నిర్ణయించు "పత్నీ దుహితరశ్చైవ" అనుశ్లోకములో స్త్రీవారసులకును పురుషవారసులకును అట్టి అధికారభేద మేమియు సూచింపబడలేదు.౨ మరియు నీస్మృతిపై ముఖ్యవ్యాఖ్యానమగు 'మితాక్షర' లో గూడ స్త్రీవారసులకు పూరాహక్కు లేదని వ్రాయబడక సంపూర్ణహక్కులున్నట్లే సూచింపబడినది. "స్త్రీధనపుటాస్తి" వివరణ సందర్భమునగూడ యితరులయొద్దనుండి సంక్రమించు కుటుంబ విభాగాదులయందు వచ్చు వాటాఆస్తికూడా పూరాహక్కుగల స్త్రీధనమే యనునని మితాక్షరలో చెప్పబడినది.౩ మనదేశములోని కొన్ని హైకోర్టు తీర్పులలోగూడ మొదట నీప్రకారమే తీర్పులుచేయబడినవి.౪ కాని యీఅన్నికోర్టులపై నత్యంతాధికారముగల ప్రీవీకౌన్సిలువారు మితాక్షరలోని పైవచనములను త్రోసివేసి స్త్రీకి తండ్రిమొదలగు పురుషులవద్దనుంచి

---

౧. ౪ కలకత్తా ౭౪౪ P. C. (తండ్రిఆస్తియందు కొమార్తెహక్కు)

౨౮ కలకత్తా వీక్లీనోట్సు ౧౦౫౦ P. C.

౨౩ మద్రాసులాజర్నలు ౨౩౩

(బొంబాయి ప్రాంతమునమాత్రము కొమార్తె గోత్రజసపిండురాలగును అనుఅభిప్రాయమువలన ఆమెకు పూరాహక్కులు అంగీకరింపబడినవి. ౩౪ బొంబాయి ౫౧౦ చూడుడు.)

౯ కలకత్తా ౭౨౫ (కొడుకుఆస్తియందు తల్లికిని అనుభవపుహక్కుమాత్రమే.)

౨. విభాగాధ్యాయ ప్రారంభశ్లోక వ్యాఖ్యానములో స్వత్వస్వామ్య స్వభావమును చర్చించుచో 'పత్నీ దుహితరశ్చైవ' అను శ్లోకము నుదాహరించి యచ్చట గూడ స్త్రీపురుషుల స్వామ్యములో భేదమును మితాక్షరాకారుడు సూచింపక ఒకేరీతి స్వామ్యమును చెప్పెను.

౩. పితృమాతృ పతిభ్రాతృ దత్త మధ్యగ్న్యుపాగతం। ఆధివేదనికాద్యంచ స్త్రీధనం స్మృతం॥ (యాజ్ఞ ౧-౧౪౬) ఈశ్లోకములోని 'ఆద్యం' అను శబ్దములో వారసత్వాస్తి వగైరాలుగూడ చేరును. "ఆద్యశబ్దేన రిక్థక్రయసంవిభాగ సంగ్రహాధిగమ ప్రాప్తం." మితాక్షర.

౪. ౨౨ అలహాబాదు ౨౫౩, ౨౪ బొంబాయి ౧౯౨ చూడుడు. ఇట్లే ఉత్తరదేశపు శాస్త్రాచారములప్రకారము విభాగములో తల్లివాటావచ్చు ఆస్తి ఆమెస్త్రీధనమని ౨౪ అలహాబాదు ౬౭ లో ఆహైకోర్టువారు తీర్పునిచ్చిరి. కాని దానికిని అంగీకరింపనట్టి ఆస్తియు ఆమెకు స్త్రీధనముకాదని ఆమెకందు అనుభవపుహక్కుమాత్రమే యుండునని ప్రీవీకౌన్సిలువారు, తీర్మానించిరి. ౩౪ అలహాబాదు ౨౩౪ P. C. చూడుడు.

సంక్రమించు ఆస్తిపైనను మఱియు స్త్రీలతాలూకు నారలస్త్రీధనాస్తియుగూడ వారసత్వేన సంక్రమించు నపుడు అందునుకూడ స్త్రీలకు ఆదాయపుఅనుభవపు హక్కుమాత్రమే ఉండునుగాని ఆస్తిఅన్యాక్రాంతము చేయుహక్కు లేదని తీర్పుజేసిరి.౧ ఈతీర్పులు తృప్తి కరములుగాలేవని గోలాబ్‌చంద్రసర్కార్, శాస్త్రి మొదలగువిద్వాంసులచే విమర్శింపబడినను ప్రీవీకౌన్సిలుకు అంత్యాధికార ముండుటనుబట్టి ఆప్రకారమే అమలు జరుగుచున్నది. శాసనసభద్వారా చట్టము చేయబడువరకును ఆప్రకారమే అమలుజరుగక తప్పదు. పైనిచెప్పిన యాజ్ఞవల్క్యస్మృతియు మితాక్షరియు మనదేశమందంతటను అందును ముఖ్యముగ మన మదరాసు రాష్ట్రమందును పరమప్రమాణముగ నంగీకరింపబడుచున్నది. దానితో కొన్ని విషయములందుమాత్రము భేదించు—జీమూతవాహనకృతమగు దాయభాగగ్రంథమట్టివిషయములందు బంగాళీలకుమాత్ర మెక్కువ ప్రమాణముగ నెంచబడుచున్నది. అక్కడకూడ జీమూతవాహనీయములో భిన్నాభిప్రాయము చెప్పబడని అన్ని సంగతులకును మితాక్షర ప్రమాణమే. ఇట్లు మితాక్షరయే మిగిలిన మనదేశమంతటికి వారసత్వాదివిషయములన్నిటి యందును పరమప్రమాణమనియు మితాక్షరలోని యభిప్రాయము స్మృతులలోని వచనముల ప్రకారము లేదని సందేహము తోచినను కూడ మితాక్షరయే కోర్టుల కనుసరణీయమనియు, యిదివరలో ప్రీవీకౌన్సిలువారు మరియొక సందర్భమున తీర్మానించి యుండిరి.౨ ఆచారమును, నియమమును, కాలక్రమమున మారుచుండుటచే, ప్రాంతభేదమును బట్టియు, కాలభేదమునుబట్టియు, పరస్పరభిన్నాభిప్రాయము గల స్మృతులవచనములను మితాక్షర వ్యాఖ్యానమునందు విజ్ఞానేశ్వరయతి సమన్వయముచేసెను. వారసత్వాస్తిలో స్త్రీలహక్కు ప్రీవీకౌన్సిలువారు త్రోసివేయునో, కాత్యాయనోక్తములగు రెండుశ్లోకములపై నాధారపడిరి.౩ కాని కాత్యాయనుని పూర్తిగ్రంథము చాల కాలముక్రిందటనే శిథిలమైపోయినది. 'వివాదరత్నాకరము,' 'వివాదచింతామణి' యనురెండు నవీనగ్రంథములలో కాత్యాయనునితాలూకు నాల్గైదుశ్లోకములు మాత్ర ముదాహరింపబడినవి. అందుపైన నాగ్రంథములలో చేయబడిన వ్యాఖ్యానములకు ప్రథమమున చేయబడినతర్జుమాలో పొరబాటుగా చేయబడినందున సంస్కృతజ్ఞానములేక యాపొరబాటు తర్జుమాపై నాధారపడిన జడ్జీలును పొరబాటుగా తీర్పునిచ్చి స్త్రీలకుండుహక్కులను తగ్గించివేయుట సంభవించినది.

---

౧. ౨౫ అలహాబాదు ౪౬౯,౪౭౬ P. C. చూడుడు. ౨౯ మద్రాసు.

౨. ౧౨ Moor's Indian Appeals ౩౯౭, ౪౩౫ పేజీ చూడుడు.

౩. భర్తృదాయం మృతేపత్యౌ విన్యసేత్ స్త్రీ యథేష్టతః, విద్యమానేతుసంరక్షేత్ క్షపయేత్ తత్కులేన్యథా. అపుత్రాశయనం భర్తుః పాలయంతీ గురౌ స్థితా, భుంజీతామరణాత్ క్షాంతా దాయాదా ఊర్ధ్వమాప్నుయుః. ఇది వృద్ధమనువుదని మనుస్మృతి ౯-౧౮౭ శ్లోకముపైన వ్యాఖ్యానమున కుల్లూకభట్టు డుదాహరించినాడు. 'దాయ' శబ్దమునకు గల 'ఇవ్వబడినది' 'వారసత్వాస్తి' అను రెండర్థములలో యిందేయర్థ ముద్దేశింపబడినదో భర్తృదత్తమగు స్థావరాస్తి నన్యాక్రాంతము చేయకూడదని వారదాదులు చెప్పియుండుటచే యిదియు దానికేవర్తించునని కొందరి అభిప్రాయము. ఈశ్లోకమునకు పొరబాటుగా మొదట తర్జుమాచేసిన ప్రసన్నకుమార ఠాకూరుగారు, వంగీయులు దాయభాగశాస్త్రము ననుసరించువారగుటచే పరాకున దాయభాగ సంబంధభావము నిందుజొప్పించి యుందురు. దాయభాగగ్రంథము బంగాళీలు తప్పతక్కిన వారికి ప్రమాణముకాదని యందరు నంగీకరించువిషయమే. 'దాయభాగ' మున నావిషయమందు స్త్రీ వారసులహక్కులు తగ్గించినను మరికొన్ని విషయములందు మితాక్షరలోలేనిహక్కులు స్త్రీలకు జీమూతవాహనుడు కలుగజేసెననుసంగతి జ్ఞప్తియందుంచుకొనవలెను.

కాత్యాయనుని మూలగ్రంథమంతయును సంస్కృతమున నుండి, మరియేభాషలోను లేనందున నాశ్లోకము లేసందర్భమునఏభావముతో చెప్పినది ప్రివీకౌన్సిలుజడ్జీలు గ్రహింపవీలు లేకపోయినది. మరియు నామూలశ్లోకముల, భర్త స్వయముగా భార్యకుదానము చేసిన ఆస్తి నామెభర్తజీవితకాలమునరక్షింపవలెననియు, భర్తయనంతరం తనయిష్ట ప్రకారం చేయవచ్చుననియు, ఆమె యావజ్జీవము అనుభవించి విడచినఆస్తిని అనంతరము దాయాదులు పొందుదురనియు, అర్థము కనబడుచున్నది. భర్తవలన వారసత్వముగా దఖలుపడిన ఆస్తిని ఉద్దేశించినను ఆమె అన్యాక్రాంతము చేయకూడదని యిందు స్పష్టముగ లేదు. అట్లు అనుభవపుహక్కు మాత్రమే ఆమెకు గలదను భావము నిందులో ఊహింతుమన్నను భర్తవల్ల భార్యకువచ్చిన వారసత్వమునకేగాని కుమారునివద్దనుండికాని, తండ్రి వగైరాలవద్దనుండికాని, స్త్రీలవద్దనుండిగానివచ్చు ఆస్తికిగూడ యీశ్లోకము నన్వయింపజేయుట కేవల మసమంజసము. పైయన్ని సందర్భములనుబట్టియు తండ్రికన్న, తల్లియే ముందువారసురాలనుట, కొడుకులు లేనప్పుడు యావదాస్తికి భార్యవారసనుట, మరియు స్త్రీధనాస్తి విషయమున. కుమారునికన్న కుమార్తెయు, దౌహిత్రి, దౌహిత్రుడు దగ్గర వారసులనుట మొదలగుకొన్నివిషయములందు హిందూస్త్రీల కితరజాతులస్త్రీలకన్న యెక్కువసదుపాయమున్నను, మొత్తముమీద వారసత్వవిషయమున నితరజాతుల స్త్రీలకన్న హిందూస్త్రీలస్థితి చాల హీనముగనున్నదనుటనిర్వివాదము. ఇందుకు కొంతవరకు మన శాస్త్రగ్రంథములు కారణమైనను కొంతవరకైన ప్రివీకౌన్సిలువారి పొరబాటుతీర్పులుకూడ కారణ మనకతప్పదు. స్త్రీలకు పురుషులతో సమానముగా వారసత్వపు అధికారమేగాక కొన్ని యితర సదుపాయములుకూడ గల అమెరికాలో మొత్తముమీద పురుషులవద్దకన్న స్త్రీల యొద్దనే యెక్కువ ద్రవ్యము కలదని యిటీవల లెక్కలవలన తెలియవచ్చినది. మన దేశపు సాంఘికపరిస్థితిని బట్టి కేవలమట్లుండుట యుచితము గాకపోయినను నితర దేశములందువలె స్వతంత్రజీవనమునకు దగు యవకాశములు లేని మనస్త్రీలకు మన'లా'లోని వ్యత్యాసమునుబట్టి యెట్టిఆస్తిలేక వారు తరుచు నిరాధారలనుటచే నిప్పటి "లా" లో గొన్ని సవరణలవసరమని తోచుచున్నవి. అందుకు కొన్ని సూచన లీవ్యాసము చివర వివరింపబడును. ఈ సూచించు సవరణలకు చాలవరకు ధర్మశాస్త్రముల యాధారముగలదు. మఱియు నీసూచింపబడు మార్పులలో గొన్ని యిదివరకే కొన్నిప్రాంతములందములలో నున్నవి. అయితే వానిని దేశమంతటికిని వ్యాపింపజేయుట భావ్యము.

## ౬. వివాహము

వివాహవిషయమున హిందూస్త్రీకి రజస్వల యగుటకుపూర్వమే తప్పక వివాహము కావలెనని శాస్త్రకారుల యభిప్రాయమని కొందరును, అట్లు తలచుటకు వీలు లేదని, అనగా రజస్వల ఐనతరువాత వివాహము చేయుట శాస్త్రసమ్మతమే యని కొందరును వాదించుచు భేదాభిప్రాయములు కలిగియున్నారు. ఉభయవాదములకు శాస్త్రవచనముల యాధారములు గలవు. కాని బ్రాహ్మణవైశ్యజాతులలోను, కొన్ని ఉన్నతశూద్రజాతులలోగూడ స్త్రీలకు వివాహమన నేమిటో తెలియనంతటి చిన్నతనముననే వివాహము చేయు నాచారము మనలో సర్వసాధారణముగనున్నది. ఈయాచారమువలన ప్రస్తుతకాలమున వివాహవిషయమున పెండ్లికుమార్తె కేవలము పరతంత్రురాలుగా నుండకతప్పదు. పూర్వమీవిషయమున స్త్రీ కొంత స్వాధీనురాలుగా నున్నట్లును, ఋతుమతి అయినతరువాత మూడు సంవత్సరములలోగా తండ్రి తగువరున కిచ్చి వివాహము చేయనిచో ఆపిల్ల ఆతరువాత తనంతట తానే తగువరుని వివాహముచేసుకొనవలెనని, అందువల్ల నెట్టిదోషము లేదని, మనుస్మృతిలో చెప్పబడినది.[౧]

౧. "త్రీణివర్షాణ్యుదీక్షేత కుమార్యృతుమతీసతీ;
ఊర్ధ్వంతుకాలాదేతస్మాద్విందేత సదృశంపతిమ్.
అదీయమానా భర్తార మధిగచ్ఛేద్యది స్వయమ్;
నైనః కించిదవాప్నోతి నచయంసాధి గచ్ఛతి."
(మనుస్మృతి అ. ౯, శ్లో. ౯౦, ౯౧.)

మఱియు స్త్రీ తనకు తగినసంబంధము దొరకనిచో వివాహము నసలే మానుకొనుటకును అవకాశముండినట్లు కనబడుచున్నది. ౧ కన్యాదానరూపమగు బ్రాహ్మవివాహము ప్రస్తుతకాలమున నుత్తమమైనదిగా తలపబడుచున్నది. ౨ ఇటీవల కొందరు తమపిల్లలకు కొంతి జ్ఞానము కలిగినతరువాతనే వివాహముజేయ యత్నించుచున్నారు. అతిబాల్యవివాహముల నిరుత్సాహపరుచుటకు, నిటీవల జేయబడిన శారదాచట్టమనబడు 3 ఆక్టు అట్టివివాహముల నిరుత్సాహపరచుటయేకాని నిషేధించుటలేదు. ఆ ఆక్టు అమలులోనున్నను బాల్యవివాహములు బహిరంగముగ జరుగుచునే యున్నవి. క్రైస్తవులలో అతిబాల్యవివాహములు లేవు. మహమ్మదీయులలో అట్టివివాహములు నిషిద్ధములు కాకపోయినను అట్టివివాహములు వారిలో చాల యరుదు. శాస్త్రప్రకారమును ఆచారప్రకారమును హిందువులలో భార్య తనకంటె పెద్దవానినే వివాహము చేసుకొనవలెను. ఇతరులలో నీ నియమము లేదు. (భార్య భర్తకన్న పెద్దదగుట క్రైస్తవులలో ఆచారవిరుద్ధముగ భావింపబడదనుటకు మనజార్జిచక్రవర్తిగారి వివాహమే తార్కాణము.) ఇతరులలో స్త్రీలకు భర్త చనిపోయినమీదట పునర్వివాహము నాచారసిద్ధమగనున్నది మనలో నది ౧౮౫౬ సంవత్సరపు ౧౫ నెంబరు హిందూ వితంతువివాహము చట్టము తరువాత న్యాయశాస్త్ర సిద్ధముగా నున్నను, సాంఘికముగ, అది సామాన్యముగా నాచారవిరుద్ధముగను, అగౌరవముగను ఎంచబడుచుండుటచే హిందువులలో ౫౦ యేండ్లకుపై బడినట్టి పురుషులకుగూడ ౧౨ యేండ్లలోపు వయస్సుగల చిన్నపిల్లలను వివాహమాడుచుండుట మన హిందూసంఘమునకు చాల హానికరముగ నున్నది. మఱియు క్రైస్తవులలో పురుషులుగాని స్త్రీలుగాని దంపతులుగా నుండుచున్నంతకాలము, ఉభయులలో నెవరును రెండవవివాహము జేసుకొనకూడదు. వైధవ్యముగాని కోర్టుద్వారా వివాహవిచ్ఛేదముగాని జరిగినమీదట పురుషునివలెనే స్త్రీకూడ పునర్వివాహము చేసుకొనవచ్చును. ఈవిషయమున వీరిలో స్త్రీపురుషులకు సమానాధికారముకలదని చెప్పవచ్చును. మనలో నీవిషయమున శాస్త్రము, ఆచారముగూడ పురుషునకు చాల సదుపాయముగ నున్నవి. హిందువులలో కొన్ని హీనజాతులలోతప్ప మిగిలినవారలలో స్త్రీ యెట్టిసమయమందును తన భర్తతో వివాహవిచ్ఛేదము చేసుకొనుటకును, భర్త తనబాల్యముననే మరణించినను గూడ పునర్వివాహముచేసుకొనుటకునుగూడ మనసంఘ మొప్పుకొనుటలేదు. ౪

---

౧. "కామమామరణాత్తిష్ఠేత్ గృహేకన్యర్తుమత్యపి,
నచైవైనాంప్రయచ్ఛేత్తు గుణహీనాయకర్హిచిత్."
(మనుస్మృతి. అ. ౯ శ్లో. ౮౯)

౨. బ్రాహ్మమేగాక గాంధర్వము మొదలగు యింకను ఏడువిధముల వివాహములు ప్రాచీనహిందువులలోనమలులోనుండినవి. వరునెన్నుకొనుటకును, వివాహముచేసుకొనుటకును గాంధర్వము మొదలగువాటియందు పెండ్లికాబోవు స్త్రీకధికస్వాతంత్ర్య ముండకతప్పదు.

3. Child Marriage Restraint Act 1929 శ్రీ శారదాగారు బాలికలవివాహపువయస్సు ౧౨ సంవత్సరములకులోపుగా నుండకూడదనియు, యీలోపున జేసినవివాహము చెల్లకూడదనియు తమబిల్లులో సూచించిరి. కాని ఆక్టులో ఆవయోనియమము ౧౪ సంవత్సరములుగా మార్చబడి వివాహము చెల్లకూడదను షరతు తీసివేయబడినది. మఱియు దానిని సరిగా నమలు జరుపు బాధ్యత ప్రభుత్వమువారు తమపై బెట్టుకొనక ప్రజలలో నొకరు పిటిషను పెట్టినమీదటనే విచారణ చేయవలెనను మొదలగు కొన్నినియమముల నేర్పరచిరి.

౪ మన ధర్మశాస్త్రగ్రంథములలోగూడ స్త్రీ పునర్వివాహమును సమర్థించువచనములు లేకపోలేదు. కలియుగమున ముఖ్యప్రమాణముగ నెంచబడు పరాశరస్మృతిలోని "నష్టేమృతేప్రవ్రజితే క్లీబేచపతితేపతౌ; పంచస్వాపత్సు నారీణాం పతిరన్యోవిధీయతే" అను ప్రసిద్ధశ్లోకమున భర్త కాలముచేసినమీదటను జీవించియున్నను కొన్ని ప్రత్యేకాపత్తులు కలిగినప్పుడునుకూడ స్త్రీకి పునర్వివాహము విధింపబడినది. ఇట్టి శ్లోకములే నారదస్మృతియందును కలవు. వివాహవిచ్ఛేదమును గూర్చి సర్ హరిసింగుగారు ఎసంబ్లీలో నొక బిల్లు

పురుషులన్ననో భార్యపోయినమీదట యెంతటి వయస్సునందైనను, యెంతకుటుంబ మున్నప్పుడైనను స్వేచ్ఛగా వివాహముచేసుకొనుటయేగాక, ఒక భార్యతో కాపురము చేయుచుండగానే తిరిగి నియమములేక యెందరు భార్యలనైనను వివాహముచేసుకొనుటకును, ఇదివరకున్న భార్యను విసర్జించుటకును అధికారంగలదు. మహమ్మదీయులస్థితి కొంత మధ్య రకముగానున్నది. వారిలో పురుషుల కేకకాలమందే నలుగురుభార్యలవరకు నుండవచ్చును. మరియు 'తలాక్' (వివాహవిచ్ఛేదము) అధికారము ముఖ్యముగ పురుషులదే. అయితే వారిలో భర్తపోయినమీదటను భార్య తిరిగి తనయిష్టమువచ్చిన పురుషుని వివాహమాడవచ్చును. అది ఆచారవిరుద్ధముగ పరిగణింపబడదు. కనుక మహమ్మదీయులలో తరుచు పైనచెప్పినసందర్భములందు పునర్వివాహము సాధారణముగా జరుగుచునే యుండును. ౨ బర్మాబౌద్ధులలోగూడ వివాహవిషయములందు స్త్రీల స్థితి హిందువులయంత కష్టముగ లేదు. వారిలో అవసరమగునపుడు, వివాహవిచ్ఛేదమునకును స్త్రీలపునర్వివాహమునకు అవకాశముకలదు. హిందువులలో భార్యయుండగా పునర్వివాహముచేసుకొనుచో ప్రథమ భార్యకు ఆధివేదనికమని వాటాఆస్తిని ఉచితముగా భర్త యివ్వవలెనని శాస్త్రనియమముకలదు. ౩ ఈ నియమము ప్రస్తుత మమలులో లేకుండుట విచారకరము.

## ౭. దత్తత

హిందువులలో పుత్రులులేనివారు మఱియొకపిల్లవానిని దత్తత చేసుకొనుటకు అధికారముకలదు. ఇట్టియేర్పాటు క్రిష్టియనులలోను, మహమ్మదీయులలోను లేదు. ఈ యేర్పాటువలన హిందూ వితంతువులకు కొంతసదుపాయము కలుగుచున్నది. అయితే భోగముస్త్రీలుదప్ప మరియెవరును ఆడపిల్లలను దత్తత చేసుకొనకూడదు. మగపిల్లవానినే చేసుకొనవలెను. ౪ మరియు భర్తయనుజ్ఞలేకుండ స్త్రీ దత్తత చేసుకొనకూడదని మనకుశాస్త్ర

మనుపాదించిరికాని దానికి ప్రజాసామాన్యపు అభిప్రాయ మనుకూలముగ నున్నటులతోచదు. వితంతువులు పునర్వివాహములు చేసుకొనవచ్చునని ప్రభుత్వమువారొక శాసనముగావించిరి. కానిజనసామాన్యపు ఆచారధోరణి యందుకు చాలవరకు ప్రతికూలముగ నుండుటచే వితంతువివాహములు విరివిగా జరుగుటలేదు. మరియు పునర్వివాహముచేసుకొనుస్త్రీ తనమృతభర్తవలన తనకు దఖలుపడిన యావదాస్తిని పూర్తిగా వదులుకొనవలెనని యీ ఆక్టులో షరతులున్నవి. అందువలనగూడ బీద వారిని వితంతువులు పునర్వివాహము చేసుకొనుటకు ప్రతిబంధకము కలుగుచున్నది.

౧. మద్రాసుహైకోర్టురిపోర్టు ౩౭౫.

౨. తలాక్ పద్ధతివలన మహమ్మదీయస్త్రీలకు ఒక కష్టముకలదు. భార్య అంగీకారములేకపోయిననుగూడ భర్త 'తలాక్' చెప్పి భార్యతో సంబంధములేకుండ చేసుకొనవచ్చును. హిందువులలో పురుషులట్లు వివాహవిచ్ఛేదము వీలులేదు గనుక హిందూస్త్రీ ప్రవర్తనలో లోపము లేనంతవరకు ఆమెకు యావజ్జీవముపోషణ జరుపు బాధ్యతే పురుషునకున్నది. మహమ్మదీయుడు తనభార్యతో వివాహవిచ్ఛేదము చేసుకొనుటచే నామెను ఇకముందు పోషించుబాధ్యతను తప్పించుకొనవచ్చును. ఆమె తిరుగ యితరులవివాహము చేసుకొనలేనిచో తన పోషణకు కష్టపడవలసివచ్చును అయితేముసల్మానుస్త్రీకి 'మహర్' అను కొంతసొమ్ము నిచ్చుటకు ఆమె వివాహకాలమునందే భర్తతో యేర్పాటుజరుగును. తలాక్ జరిగినప్పుడు యీ మహర్ సొమ్ము యిచ్చివేయవలెనని కోరి ఆసొమ్ము భర్తవద్దనుండి భార్య రాబట్టుకొనవచ్చును.

౩. ౧౨మద్రాసు ౨౧౪. ౩౭బొంబాయి౧౧౬.

౪. "అధివిన్నస్త్రియై దద్యా దాధివేధనికం సమమ్"                    (యాజ్ఞ ౨-౧౫)

'అధివిన్నా' అనగా పునర్వివాహము చేసుకొను పురుషుని ప్రథమభార్య.

"యస్యా ఉపరి వివాహః సా అధివిన్నా" మితాక్షరవ్యాఖ్యానము.

"యచ్చద్వితీయస్త్రీవివాహార్థినా పూర్వస్త్రియై పారితోషికం దత్తం తదాధివేదనికం" దాయభాగగ్రంథము.

నియమముగలదు.[౧] బాల్యమరణము మొదలగు కారణములచే భర్త యెట్టి యేర్పాటుచేయకుండనే చనిపోయినచో మనరాష్ట్రమందు ఆచారముప్రకారము అనంతరజ్ఞాతులవల్ల అధికారముపొందికూడ వితంతువు దత్తతచేసుకొనవచ్చునని మనకోర్టు లంగీకరించుచున్నవి. అయితే అనంతరవారసులు వితంతువు అనంతరము తమకు కలుగనున్న ఆస్తి కలుగుహక్కులను, ఈరీతిగా చేతులార వదలుకొనుటకు యిష్టపడుట సహజముకాదు కనుక సాధారణముగా వా రనుజ్ఞ యిచ్చుట సంభవింపదు. మఱియు వారిలో కొందరంగీకరించినను మిగిలిన వారంగీకరింపకపోవుటచే తరుచు అందుకై తగవు దావాలు వచ్చి ఉభయపక్షములవారికి చాల వ్యయప్రయాసములు, మనస్పర్థలు కలుగుచుండుట చూచుచున్నాము. ఈదత్తతాధికారమును గూర్చిన నియమములే తరుచు వ్యాజ్యములకు కారణములగుచున్నవి. దత్తత జరిగిన కొన్ని సంవత్సరములవరకు ఆదత్తత సరియైనదో కాదో కోర్టులలో తరచు తేలకపోవుటచే వారితో సంబంధించిన యితరులకుగూడ చాలచిక్కులు సంభవించుచున్నవి. అందుచే కోర్టులో సరియైన వివరములతో వితంతువు పెటీషను పెట్టుకొని కోర్టువారు ఆర్డరు యిచ్చేయెడల అందునుబట్టి దత్తతచేసుకొనుటకుగూడ అవకాశముండుట మంచిది.[౨] అందుచేతగువులు కొంతవఱకు తగ్గును. స్వీకరింపవలసినపిల్లవానిని దత్తతయిచ్చుటకువాని జనకమాతాపితృలకుమాత్రమే శాస్త్రప్రకారమధికారము గలదు.[౩] అందుచేతల్లిదండ్రులు లేని కుఱ్ఱవాళ్లను దత్తతచేసికొన్నచో ఆదత్తతయెంతమాత్రము చెల్లదు.[౪] అన్నలు, పెత్తండ్రులు మొదలగువారుతల్లిదండ్రులు లేని తమకుటుంబములోని కుఱ్ఱవాని నితరులకు దత్తతయిచ్చుటకధికారముండునో ఆకుఱ్రవాని నన్యకులములోనికి పంపి తమకుటుంబాస్తిలో వానికివాటా లేకుండజేయుటకై పినతండ్రి మొదలగు కుటుంబయజమానులు అట్టికుఱ్రవానినే నీచకులములోనికో, నిరాస్తిపరునికో దత్తత యిచ్చుచో ఆకుఱ్రవానికి శాశ్వతాపకారము సంభవింపవచ్చును. తల్లిదండ్రులే కుఱ్రవానిని దత్తతయివ్వవలెననునియమ మట్టి ప్రత్యవాయములేకుండ రక్షించును. కాని తల్లిదండ్రులు లేని పిల్లవానిని స్వీకరించుటలో కొంత సదుపాయము గూడకలదని తోచుచున్నది. తల్లిదండ్రులున్న కుఱ్రవాడు దత్తతయివ్వబడినను, అతనిధ్యానము సాధారణముగా జనకతల్లిదండ్రులపైననే యుండుటసహజము. వారు భయులు పోవువఱకు దత్తతతల్లిపై సరియగు అభిమానము కలుగుట కష్టము. మఱియు జనకతల్లితండ్రులు దత్తతకుటుంబాస్తిపై తామధికారము జేయుటకై సాధారణముగ నాపిల్లవానికిని దత్తతతల్లికిని మధ్య విభేదములుగల్పించి పిల్లవానిని తరుచు తమయధికారమునందే యుంచుకొందురు. అందుచే పరస్పర మనస్పర్థలును దత్తపుత్రశోకమును కలుగుచున్నవి. తల్లిదండ్రులు లేనివానిని స్త్రీ తనపుత్రునిగా స్వీకరించుచో ఆపిల్లవాడు నిరాధారుడు కాకుండా అతని కభిమానముతో పోషణచేయువా రేర్పడుదురు. మఱియు నాపిల్లవాని కన్యధ్యానమంతగా లేకుండుటచే తనయందుమాతృభావముండుట కవకాశమెక్కువయుండును గనుక యుభయులకు క్షేమకరముగనుండును. అట్టిపరిస్థితిలో పిల్లవాని జనకకుటుంబములోని పోషకులు తమయధికారమును దుర్వినియోగము చేయకుండ పిల్లవాని క్షేమము నాలోచించి ఆకుఱ్రవానిని దత్తతచేసికొనుటకు కోర్టువారు పరీక్షించిఅధికార మీయవచ్చునని రూలు నేర్పరచుట మంచిది.

---

౧. "నతు స్త్రీ పుత్రం దద్యాత్ ప్రతిగృహ్ణీయద్వాఽన్యత్రానుజ్ఞానాద్భర్తుః" అను వశిష్ఠవచనము దత్తతగ్రంథము లన్నిటియందును ఉదాహరింపబడినది. కాని ఆయావ్యాఖ్యాతలు దీనికి పరిపరివిధములుగా అర్థముజేసిరి.

౨. పూర్వము రాజాజ్ఞపొంది స్త్రీ దత్తతచేసుకొనుటకలదట. ఇప్పటికిని కొన్ని స్వదేశీసంస్థానములలో రాజుగారి అనుజ్ఞపైన దత్తతచేసుకొనుట, అట్టిది శాస్త్రీయముగ నెంచబడుట గలదు.

౩. "మాతాపితా వా దద్యాతాం యమద్భిః పుత్రమాపది,
సదృశం ప్రీతిసంయుక్తం సజ్ఞేయోదత్తకస్సుతః."
(మనుస్మృతి. అ. ౯ శ్లో. ౧౬౮)
"దద్యాన్మాతాపితావా యం సపుత్రో దత్తకోభవేత్"
(యాజ్ఞ. ౨-౧౩౩)

౪. ౪౪౪ మద్రాసు ౨౬౧.

# మధుర దేవాలయ చిత్రములు



౧. త్రిపురాసురసంహారము



౨. గజాసురసంహారము

స్తంభశిల్పములు - మధుర దేవాలయము

K. P. S.

## 3

చదరము విశాలమును గల్గి చదును గలిగి - తరులు గిరులును లేని మైదానమందు
హిందువులునుదురుష్కులు నెదురుకొనఁగఁ-గూడియున్నారు జయకాంక్ష కొనలుసాగ.

అసపుఖానుని సేనాచయంబులోన - కడిఁది విలుకాండ్రు కెలఁకులఁ గదిసి చెలఁగ
పెనుతుపాకులు దాల్చిన వీరవరులు - నిండుతెగువను మునుముందు నిలిచినారు.

ఈటెలును గత్తులును దాల్చు పోటుబంట్లు - వారివెనుక సరాసరిఁ జేరినారు.
వారి కవలనె యాశ్వికవార మెల్లఁ - దేకువ దలిర్ప వరుసలు దీరినారు.

రాణిగారి పటాలపురాజిలోన - నాశ్వికులు రెండుప్రక్కల నమరియుండ
బలుతుపాకులు దాల్చిన బాహుబలులు, - గట్టి విలుకాండ్రు మొగదలఁ గాచినారు.

కలుకుఁగత్తులు బల్లెముల్ మెఱయుచుండ - మెఱియలకు సాటిరాఁదగు మేటిమగలు
వారితరువాత శ్రేణులు దీరినారు - సామజము లెక్కివచ్చిన సాహసికులు
వారివెనుకల వెన్నంటి మీఱినారు.

*  *  *  *  *  *

కవచములును, శిరస్త్రాణనివహములును, - డాలుగమి, యీటెగుమి నల్గడలఁ జెలంగఁ
గడిమిమై మించు వ్యూహయుగ్మంబుఁ జూడ-నుక్కుసంద్రాలచందాన నొప్పమిగిలె.

ఆసముద్రంబులందు మత్స్యములఁబోలె - వేవెలుఁగుకాంతి నినుమడియై వెలుంగు
తళుకుఁ గత్తులు తళతళ దనరుచుండె - ఉద్దవిడి వాని వేఁటాడు గ్రద్దలనఁగ
నెల్లెడలఁ గేతనపటంబు లెగురుచుండె - సైన్యమున నుప్పతిలిన హేషలును, బృంహి
తములు, ఘాంకృతుల్, కలకలధ్వనులుగలసి - యంబుధితరంగఘోషము నవఘళించె.

*  *  *  *  *  *

రాణి దుర్గావతీదేవి రాణమెఱసి - పురుషసింహంబు వేష మొప్పుగ ధరించి
కటితలంబున గాసెకోకను బిగించి - కత్తళంబును నిశితఖడ్గమును దాల్చి
తళుకు లీనెడు పటుశిరస్త్రము వహించి - జవము గల్గిన యుత్తమాశ్వంబు నెక్కి-
సింహవాహనమున నధిష్ఠించి, శౌర్య - మురుల మహిషాసురునిపైకి హుంకరించి

దుముక నుంకించుచున్నట్టి దుర్గనోలె, - రంహాగతి మించు ఘనశౌర్యరాశివోలె
ప్రళయభీకర మృత్యుదేవతయుఁబోలె - సాటిజోటులు చూచి యాశ్చర్యపడఁగ
శూరశేఖరు లెంతయుఁ జోద్యపడఁగ - పగఱ గుండెలు బల్లునఁ బగులుచుండ
దుర్నిరీక్ష్యతేజంబునఁ దోఁచుచుండె.

*   *   *   *   *   *

రభస మెసఁగంగవచ్చి యారాణిమిన్న-భావమున ఘోరరోషాగ్ని ప్రజ్వలింప
కావిరాల్కన్నుఁగవ సగ్నికణము లొలుక-మలకలబలంబునొకమారు కలయఁజూచె;
చూచి మఱి యంతలోనె యాచూపులోన-నిబిడప్రేమానుకంపముల్ నివ్వటిల్ల
సొంతసేనలమీఁదికిఁ జూడ్కి బఱపె;-తలఁపునం దామె యపు డేమి తలఁచుకొనెనొ
కన్గొనల నొండురెం డశ్రుకణము లొలికె;-నొలుకు టెఱుఁగరు తనవార లొక్కరైన;
క్షణములో ధీరమై జాణతనము మెఱయ-శౌర్యసాహసముల రాశిచందమునను
దేజరిల్లుచు గమికాండ్ర దిక్కుచూచె;-చూచెనో యింక తిన్నగాఁ జూడలేదొ
వీరరస మొక్కపెట్టున వెల్లివిరియ-భేరికాహాళభాంకృతుల్ పిక్కటిల్లె;
శింజినీపుంజరవములఁ జెవులు సెడియె;-భటుల వీరోక్తులకు దిశల్ బద్ధలయ్యె;
బలుతుపాకుల నినదముల్ ప్రబలమయ్యె;-మొగలుల సేన లంతకుముందె తెలిసి
విక్రమోద్ధతిఁ జూప నుపక్రమించె.

ఇరువాగులవారును గ్రొ-ధరసావేశములు మిగుల, దర్పము లొప్పన్
బారిపారిఁ దుపాకిగుండ్లను-బఱపిరి పరిపంథి భయదభంగిఁ జెలంగన్.

బలుచిచ్చుబుడ్ల పువ్వుల-వలెనే, వడగండ్ల వానవలె, మిడుతల దం
డులవలెనె యెడములే కపు-డిల నిండఁగ గుండ్లు వడియె నిరుగడలందున్.

మెఱుపు వేగిరమును మఱపించి రివ్వన-వచ్చి వ్రచ్చి, గుదులు గ్రుచ్చి, రిపులఁ
గూల్చు నంపగములు గుంపులుగుంపులై-వచ్చిపడియె రెండు వహులయందు.

మించి పరాక్రమించిరి సమిద్ధచరిత్రులు రాజపుత్రు, లే
మంచు వచింపనేర్తు? నహహా! యపు డయ్యెడ రోషవిభ్రమా
భ్యంచితచిత్తులై అనెపినట్టి యవక్రసువిక్రమంబు, స్థై
ర్యాంచితశౌర్యధైర్యము, లుదంచిత సాహసచారుచర్యలున్.

ఓహరిసాహరిన్ గదలి యొక్కమొగిన్ దెగియేఁగి శాత్రవ
వ్యూహముఁ జొచ్చి వేకలఁచి యుగ్రతఁ బైఁబడి యోధయూథమున్
దేహము లంగముల్ విడఁగఁ ద్రెంచియుఁ ద్రుంచియు లిప్తమాత్రలో
నోహటిలంగఁజేసిరి జయోద్ధతి యోద్ధతతుల్ నుతింపఁగన్.

ఆసరదార్లఁ జూచి వెఱఁగందుచు మొగలు లెల్ల మెల్లగా
నోసరిలంగ సాగి రపు డొయ్యన వెన్కకు; రాజపుత్రు లు
ల్లాసము మీఱ వెన్దవిలి లాయుచు డాయుచు ఖండఖండముల్
చేసిరి; సింహనాదములు చేసిరి వీరవిహారహారులై.

ఈగతి శత్రులన్ గదుము చేష్టఁ జూపుచుఁ గొంతదూర మ
ట్లేగిన రాజపుత్రులకు నెంతయు వింతయు సంభ్రమంబునున్
వేగయి డెందమున్ గలప, నేలమె యీనినయ ట్లసంఖ్యముల్
మొగలుసైన్యముల్ కనులముందఱఁ దారసిలెన్ హఠాత్తుగన్.

కొండలం దుండి బలుగుండ్లు గురియసాగె;-పంటచే లెల్ల నలుగులు పంపఁదొడఁగె;
గుట్టలెల్ల తుపాకుల గుట్టలయ్యె;- పుట్టలెల్లను బాకుల పుట్టలయ్యె;
పొదల చాయల కత్తులు పొదలుచుండె;-తరులలోనుండి యీటెలు తరలుచుండె;
గర్తములయందు బల్లెముల్ కదలుచుండె;-కోనలెల్లను జెట్లనే యీనుచుండె;
గండశిలలెల్ల బాట్లనే కనుచునుండె;-ఎచటఁ జూచిన నెలవంక లెగురుచుండె;
క్షణములో నేల మొగలాయిసంద్ర మయ్యె- పారిపోయెడు మలకల బలఁగ మెల్ల
మదముమీఱ నెదుర్కొని కదుమఁజొచ్చె - అంతదాఁక రణోత్సాహ మతిశయిల్ల
ఘోరముగఁ బోరుచుండినగోండుభటులు-కనలుచు నసంఖ్యములుగాఁగఁ గ్రాలుచున్న
వైరిబలములఁ జూచి విహ్వలతఁ జెంద-తన బలంబుల యాకులతను గ్రహించి
ఖండితారిభటశ్రేణి గోండురాణి-శౌర్యపరవశయై, కటాక్షముల నగ్ని
కణము లొలుకంగ, నధరంబు కటము లదర-ఉరిమె నిట్టుల దన సేన పురికొనంగ:
"భండనోద్దండులార! ఓగోండులార! – కంటిరే ముష్కరతురుష్కకపటవృత్తి?
చూచితిరె యీపటానుల నీచబుద్ధి? – ఇట్టి దౌర్జన్య మెట్లు సహింపవచ్చు?
మలక లెక్కువ కల రంచు తొలఁగవలదు; – మనము తక్కువ కలమంచు మలగవలదు
వీరవరులార! వెనుకంజ వేయవలదు; – శూరవరులార! అరికి వెన్జూపవలదు;
పౌరుషము గల్గువానికి ప్రాణమెంత? – సాహసము గల్గువానికి చావదెంత?

పుట్టినది రాచపుట్టుక, పుట్టి చేతఁ - బట్టినది వీరఖడ్గంబు, పట్టి కేలఁ
గట్టినది వైరివిజయకంకణము, కాలఁ - బెట్టినది శత్రుమారణ బిరుద, మిపుడు
మెట్టినది యుద్ధమధ్యంబు, మించి నేఁడు - నెట్టివేయక ప్రతివీర నికరములను,
గట్టివేయక సంకెలగములలోనఁ, - గొట్టివేయక శిరములు గుట్టలుగను,
మట్టివేయక మగుడుట మగతనంబె? - ధీరులగు పూర్వుల చరిత్రఁ దెలిసికొనుఁడు;
తాతతండ్రుల శౌర్యంబుఁ దలఁచుకొనుఁడు; - శుద్ధమైనట్టి వంశంబుఁ జూచుకొనుఁడు;
నిర్మలంబైన మీకీర్తి నిలుపుకొనుఁడు; - మతముఁ దలపోసి, యభిమానవతుల నెంచి,
ధర్మమును దైవమును నమ్మి ధైర్యమూని-కఱకుతురకల మార్కొని తఱుమరయ్య;
చెఱకుగట్టులలాగున నఱుకరయ్య; - జీలుగుంబెండ్లవలెఁ బట్టి చీల్పరయ్య;
రాశిరాసులుగాఁ దలల్ రాల్పరయ్య," - అనుచువీరోక్తు లాడుచు నబ్బురముగ
తురకదండుల నుగ్గాడు దుర్గఁ జూచి - గోండువంశప్రకాండులు, భండన ప్ర
చండపండితు, లనివార్య శౌర్యధనులు,-శంక లడఁగించి, ధృతిఁ బెంచి, సాహసించి,
సంగరోద్రేకమున మించి చెంగలించి, - హుంకరించి మహోద్ధతి హుంకరించి,
శాతహేతులు మెఱయించి సంభ్రమించి-'జయమహాదేవ!హరహర! జయ!'యటంచు
కసిమసంగఁ దొడంగిరి కఱకు మిగుల.

* * * * * *

గోండుయువరాజు యువరాజమండనుండు - శౌర్యసింహకిశోరంబు ధైర్యసీమ
మహితసాహసగుణుఁ డభిమానధనుఁడు - తీక్ష్ణరూక్షేక్షణుం డయి తేజరిలుచు
నరుణకాంతులు మోమున నాడుచుండ - ఉదయగిరిఁ గ్రాలు బాలసూర్యునివిధాన
భద్రగజము నధిష్ఠించి ప్రౌఢి మెఱసి - తళుకు లీనెడు నిశితకుంతము ధరించి
వేడిమగలు గనుంగొని వెఱఁగుపడఁగ - తమ్మిమొనఁ జీల్చు నభిమన్యు ధాటిసూటిఁ
జెలఁగి వీరవిహారంబు చేయఁదొడఁగె.

* * * * * *

యవనభటులు మహోత్సాహ మగ్గలింప-జయము తమకబ్బునన్న నిశ్చయముతోడ
సంబరము లంబరము లంట సరభసముగ - అప్రతీపప్రతాపంబు లతిశయిల్ల
రోషరూపితులై రిపు భీషణముగ - 'దీనుదీన్' నినదంబుల దిక్కు లవియ

చెండి చెండాడసాగిరి గోండుభటుల;-ఉభయవాహినులకును మహోద్భటముగ
దేవదానవయుద్ధంబు తెరలెనంత.

*     *     *     *     *     *

గంధగజకంఠ ఘన ఘంటికాస్వనంబు-బృంహితధ్వానములఁ గూడి పిక్కటిల్లె;
పారశీకాశ్వగళకింకిణీరవంబు-కలితహేషావిరావంబు గలసి చెలఁగె.

భూరిశంఖనినాదముల్ బోరుకలగె;-వీరసింహోత్కటార్భటుల్ విస్తరిల్లె;
ఖడ్గసంఘట్టనధ్వనుల్ క్రందుకొనియె;-నారిటంకారశబ్దముల్ బూరటిల్లె;
భటుల హాహారవంబు లుద్భటము లయ్యె-శ్రవణపుటభేదనం బయి చెవుడువడియె.

సైన్యపదఘట్టనోత్థితక్ష్మారజంబు,-బలుతుపాకులనుండి వెల్వడెడు పొగలు
దివి నకాలాంబుదంబులఁ గవియఁజేసె.-ఆయుధంబుల రాయిడి నవతరించి
మెఱుఁగుగమి కన్నులను మిఱుమిట్లు గొలిపె;- చిమ్మనంగ్రోవి గుమినుండి చిమ్మినట్లు
కత్తిగంట్ల కవోష్ణరక్తంబు గురిసె;-బొమిడికంబులు పిట్టలఁబోలె వ్రాలె;
పుర్రె లెగిరెను కొబ్బరిపుచ్చలట్లు;-బాహువులు చెట్లకొమ్మల పగిదిఁ గూలె;
స్కంధములభంగిఁ బడియెఁ గబంధరాజి;-తునుకలై పోయె నడుములు,తొడలు,మెడలు;
వికలశకలంబులై త్రెళ్లె వ్రేళ్లు, గోళ్లు; - తుత్తునియలై తొరంగెను కత్తళములు ;
ఖండఖండములైపడెఁ గవచతతులు ; - విఱిగిపోయెను ఖడ్గముల్ విండ్లగములు ;
తునిగిపోయెను బల్లెముల్ తూణచయము ;-వ్రక్కలయ్యెను బాకుతుపాకుగుములు ;
ముక్కలయ్యెను చక్కని సెక్కియములు;- చాపకట్టుగ నొరగెను సామజములు
తుండతుండంబులై పడె తొండములును ; - తారుమారుగ వ్రెుగ్గెను వారువములు;
విటతటంబుగఁ దొరగిరి వీరభటులు ; - ఏరులై పారె శోణిత మెల్లయెడల;
వ్రేవు లెమ్ములు నెఱచులు ప్రోవులయ్యె ; పొలికలను పీన్గుపెంటలై తలఁకుఁ గొలిపె.

*     *     *     *     *     *

పలుచఁబడియెను గోండులబలఁగమెల్ల-గములుగములుగ నుండె మొగలులదళము
తురకలకు నోడి యిలుదూరు పిఱికిపురుగు-అరులు తారొ్కన మారొ్కనట్టి జడుఁడు
పౌరుషము లేని నిర్భాగ్యపూరుషుండు - మానధనమును గోల్పోవు హీనజనుఁడు
మరణమన్నను భీతిల్లు మనుజపశువు - మందునకునైన హిందువులందు లేఁడు.

*     *     *     *     *     *

తూర్ణగతి శత్రువులఁ ద్రుంచు దుర్గకడకు-రోజుచును గోండుభటుఁ డొక్కరుండు వచ్చి
'దేవి! యువరాజు మూర్ఛిల్లి తేరఁ' డనుచు-ఎలుగు రాల్పడ సంభ్రమ మెసఁగఁ బలికె.

పలుకుపలుకున క్రొవ్వాడిములుకు లడచు-నాభటుని పల్కులామె హృదంతరమున
నేమి భావవికారంబు లెసఁగఁజేసి - కలఁచెనో కాని యామాత కన్నుగొనల
నెగడె రెండశ్రుకణములు, నిగిడె నూర్పు, - విహ్వలత తోఁచె చెమటలు విస్తరించె,
కెంపుకాంతులు మోమునఁ బెంపుగాంచె, - కటము లదరెను ముడివడె కన్నుబొమలు,
అధరకిసలంబు చలియించె, నంతలోనె - శాంత ముదయించె, స్థైర్యము సందడించె,

నివ్వటిల్లె గభీరిమ నెమ్మొగమున; నప్పు డీరీతి భృత్యుని కనియె దుర్గ:

"వడిగ నిరపాయభూమికిఁ గొడుకుఁ జేర్చి-రక్షణము జేయుచుండుఁడు ప్రాప్తమున్న
బవరమున వెన్క జూతును భద్ర" మనుచు.-ఉగ్రరూపము ధరియించి యాగ్రహమున
వీరరసమెల్ల మూర్తీభవించినట్లు - కాళరాత్రి స్వరూపంబు గన్నయట్లు
చెలగి శతకంఠు మార్కొను సీతవోలె - కడిమి భండాసురు నెదుర్చు కాళివోలె
భయదగతి మించు మృత్యుదేవతయుఁబోలె - దుర్గ తలపడి రిపువీరవర్గములను
చంద్రహాసము జళిపించి సంభ్రమించి - సామజంబుల నశ్వరాజముల నరుల
జీలికలుగాఁగ మేనులు చీల్చిచీల్చి - చెక్కలుగ నంగముల నెల్లఁ జెక్కిచెక్కి-
రాసులుగ గండకండలు కోసికోసి - గుదులుగా దేహములు వడి గ్రుచ్చిగ్రుచ్చి
వ్రేటున బదారుతునుకలు వ్రేసివ్రేసి - తుటుములై యున్న పీన్గులఁ ద్రొక్కికొనుచు
ఎచటఁ జూచినఁ దానయై యెసఁగుచుండి - జ్వలితనిజకోపవహ్నికీలలకు నలక
రాహుతుల నాహుతులఁ జేసి రంహగతిని-శ్రాంతివివశాంగియై యున్న సమయమందు
ఒక్క కోలాహలము వెన్క నుప్పతిల్లె. - దేవి యది యేమొకోయని తిరిగిచూచు
నంతలోన "నసఫ్ఖానుఁ! డసఫ్ఖాను!-దేవి! దేవి!" యనెడు నార్తరావ మొకటి
కర్ణముల సోఁక నించుక కలఁత నొంది - "అతిపవిత్రంబు మద్గాత్ర మకట! యవన
పాణిసంస్పర్శనుండి కాపాడుకొనఁగఁ - జాలనే? యంచుఁ దన చేతి శాతహేతి
నయయొ! కోమలనిజకంఠమందుఁ జొనిపి - స్వభటపటలంబు హా! యని వనరుచుండ
వీరరిపుకోటి ముక్కున వ్రేలిడంగ - మానఖని శౌర్యసాహసమహితచరిత
హతవిమతమార్గ విజితాంతరారివర్గ - అవనతస్వర్గ సముపార్జితాపవర్గ
రచితచిరకీర్తిపటుదుర్గ రాణి దుర్గ - లలి మెరయ వీరశయన మలంకరించె.

* * * * * *

ఈశ్వరా! ఇంక చెప్పెడి దేమి కలదు?-చావఁగా మిగిలిన గోండుశౌర్యనిధులు
మ్లేచ్ఛకృతపరిభవ మాత్మ మెందుకొనఁగ-నిస్పృహత్వంబు రోసంబు నిండుకొనఁగ
చివరయోధుండు నిధనంబు చెందుదనుక - నరికృపాణాగ్నిఁ బడి మ్రగ్గి రనుటదక్క.

*　　*　　*　　*　　*　　*

ఎచట దుర్గావతి జగత్త్రియేద్యచరిత-వీరయజ్ఞంబులో దివి జారఁగొనెనో,
జబల్‌పురక్షేత్రమునం దపూర్వ-శిల్పశోభితమై త్యాగచిహ్నమైన
పావనసమాధి నేత్రోత్సవం బొనర్చు; - అతిభయానకమగు నాఁటి యాహవమున
పిఱుతివియ కన్మహాదేవి నెఱపినట్టి - అనుపమాద్భుతశౌర్యసాహసవిశేష
చర్య లాదృశ్యఖచితాచ్ఛచంద్రకాంత-రత్నరచితాక్షరము లక్షరములు చేయు;
ఆపవిత్రసమాధిపై నహరహమ్ము-కందళితభక్తి యాత్రికుల్ కాన్కలిడిన
గాజుతునకల రాసు లక్కజముగొలుపు; - అచటి నర్మదకెరటాలు, నచటి చేలు,
అచటి గిరికందరాలును, నచటి భూరు-హాల చాలును, పుష్పంధయాళి, పక్షి
పాళి, పవనంబు స్వరములు మేళవించి-నేఁటికిని నాఁటి సాహసనిధనకథనె
వీనుదోయికి నేప్రొద్దు విందువెట్టు;-శిశువులకు నవ్వ లమ్మ లాచిత్రకథనె
కుతుకముగఁ బాడి రేలు జోకొట్టుచుంద్రు - బిడ్డలకు తాతతండ్రు లాదొడ్డకతనె
వినిచి ధైర్యంబు శౌర్యంబు బెనుచుచుంద్రు;-ఆలమందలు మేపు గోపాలకులును,
ప్రజల యాచించు తంబురాపాటకులును,-చేలుగోయుచు నుండెడు సేద్యగాండ్రు
చేలములు నేయుచుండెడు సాలెవాండ్రు,-పడవలను లాగుచుండెడుపడుచువాండ్రు
ఆకథనె పాడి తన్మయు లగుచునుంద్రు;-శ్రోత లానందమునఁ దేలి చొక్కుచుంద్రు.

---

## నేను, నా గ్రామోఫోను


ఆనందించాలని గ్రామోఫోను కొని యిప్పటి ఫేషన్ పాట రికార్డు వేశాను ఏదో అరుపు
వినబడి తలవాటెక్కినది చెవులు చిల్లులు పడ్డవి ఆపైని బూతు
కృత్రిమల రికార్డులు పంపమని కంపెనీకి గట్టిగా వ్రాయగా, కృతురిప్పు
ఎవరూ వినరనీ, నాకేమీ తెలియదనీ జవాబిచ్చారు గ్రామోఫోనును చెరువులో..........
తంగెట్ల
రామారావు

# చైనాతూర్పురైల్వేవిక్రయము

(Sale of the Chinese Eastern Railway)

ఎస్. ఆర్. వడ్డాది

క్రీ. శ. ౧౮౯౬ లో చైనా తూర్పురైల్వే నిర్మాణానికి సంకల్పం జరిగినప్పటినుండి అది అలజడికి మూలకారణ మౌతూవచ్చినది. ౧౯౦౪-వ సంవత్సరములో జరిగిన రష్యా - జపానుయుద్ధమునకేకాక తరువాత యింకా ౩౦ సంవత్సరాలపాటు అంతర్జాతీయవిశ్వాసరాహిత్యానికికూడా కారణమైంది. ౧౯౨౯ లో చైనాకు, సోవియట్లకు జరిగిన యుద్ధానికి (Near war) కూడా యిదేకారణము. తిరిగి యిప్పుడు ప్రాగ్దేశములలో కలహాలకి కారణమవుతోంది. అందుచేతనే, రషియా, ఆరైల్వేలో తనకు సంబంధించిన సగము హక్కులు జపానున కమ్మదలచిన విషయము, లోకాన్నంతా ఆకర్షిస్తోంది.

మంచూరియా ప్రకృతచరిత్ర దీనినిర్మాణముతో ఆరంభించి దానితో అల్లుకుపోయినది. ౧౯౦౩ లో యీరైల్వేనిర్మాణము పూర్తిఅయినది మొదలు, మంచూరియాస్వీయ, అంతర్జాతీయ, రాజకీయ ఆర్థికవ్యాపారముల కన్నింటికి ఇది కేంద్రమయినది.

౧౮౯౬ లో ఇది కట్టుటకు ప్రయత్నములు జరిగిన మొదటిఒడంబడికనుబట్టి ఈరైల్వే ఒక ప్రత్యేక సంఘముచే నడిపింపబడాలనీ, దానిలోని షేరులన్నీ (Shares) చైనారష్యావారలే కొనదగుదురనీ, దాని అధ్యక్షుడు చైనానియమించిన ఒకచైనాదేశస్థుడుగావాలనీ, చైనా వాయిదాలప్రకారము నడపడంలో వచ్చే నష్టాలు, అసలుఇచ్చి రష్యావారివద్దనుంచివారిహక్కులు కొనుక్కోవచ్చుననీ, ౮౦ ఏండ్లయినతర్వాత చైనా ఆరైల్వేని సొంతము చేసుకొనవచ్చుననీ, మొదటి ఒడంబడికలో వుంది. షేరుహోల్డర్ల డివిడెండ్లు పంచుకోగా మిగిలినలాభము, చైనాకి రైల్వేకొనుక్కొనుట కివ్వవలసిన వాయిదామొత్తములలో చేర్చవలెననికూడ ఒడంబడిక (౧౮౯౬)లో ఉన్నది. రైల్వే తయారుచేయడానికి నడపడానికి అయ్యేడబ్బు రష్యావారే యిచ్చుకుంటూ ఉండాలి.

కాని నిజానికి రైల్వేఆధిపత్యంలో చైనాకు అంతగా నిమిత్తమే లేదు. జారిష్టు పాలకులు అన్నీ షేర్లు తామేకొనుక్కొని రైల్వేకి సర్వాధికారాలు తామే వహించి చైనావారిని నామావశిష్టుల్ని చేసారు. చైనావాడైన అధ్యక్షునివిధులు (Duties and functions)కట్టుదిట్టంగా నిర్వచనంచేసారు. ఇంతేగాకుండా వచ్చేలాభంలో, చైనా వాయిదాసొమ్ముకి ఏమీ మిగలకుండా పంచుకోవడం మొదలెట్టారు.

౧౮౯౬ ఒడంబడికప్రకారం అదికేవలము వర్తకానికై ఏర్పడ్డరైలుమార్గము. కాని రష్యా సైన్యము, ఎగుమతిదిగుమతులు నిరభ్యంతరంగా యీ రైల్వే మీదనే పోనివ్వాలనిమాత్రం నిబంధన పెట్టుకొన్నారు. ఎందుకంటే దీనిమీదవెళితే ట్రేన్సు సైబీరియను రైల్వే మీదకంటె ౫౦౦ మైళ్లు దగ్గర.

ఈయొడంబడికప్రకారమే రషియా నడుచుకున్నట్లయితే మంచూరియాలోను ప్రాగ్దేశమంతటిలోను పరిస్థితులు వేరుగావుండేవే. 'ఒడంబడికమీద సిరా ఆరిందో లేదో' అప్పుడే జింగోపక్షమువారు యీ రైల్వేని Harbin నుంచి డాల్నీ వరకు పొడిగించాలని వాదన మొదలెట్టారు. రష్యావారు రాజ్యాక్రమణ విధానము జరపడానికి దొరికినన్ని అవకాశాలు వెతకడం ఆరంభించారు.

ఈ అపనమ్మకము కలుగజేసే రష్యనులచర్య వల్ల చైనాకు వారిపైగలవిశ్వాసము చెడుటయేకాక, జపాను వీరిరాజ్యాక్రమణవిధానమును చూచి భయపడడం తటస్థించింది.

రష్యావారి యీచర్యమూలముననే, చైనా రహస్యంగా రష్యాతో స్నేహంగా ఉండటానికి, జపానుతోను సంబంధం లేకుండా ఉండడానికి సంధిచేసుకున్నా, రష్యాజపానుయుద్ధమందు (Russo-Japanese War 1904), జపానుసేనలకే చైనా సహాయంచేసింది. క్లాంటువిట్టిగారు విచారంతో చెప్పినట్లుగా "రష్యా అపనమ్మకమే, రష్యా జపానుచేతులలో ఓడిపోవటానికి కారణము."

౧౯౦౫లో జరిగిన పోర్ట్సుమత్ ఒడంబడిక (Treaty of Portsmouth) వలన చైనా వప్పుదలతో రష్యా జపానుకు, చాంగ్చునునుండి డైరన్ వరకూవున్న, చైనాతూర్పురైల్వేయొక్క దక్షిణభాగమున్ను, పోర్టుఆర్థరు, దక్షిణమంచూరియా, ఇచ్చివేసెను. చైనాతూర్పురైల్వే దక్షిణభాగము చేతికి వచ్చిన క్షణమునుండీకూడా జపాను రష్యానుత్రోసిరాజని తనఆక్రమణవిధానము సాగించడం మొదలుపెట్టినది. అదంతా వేరేకథ.

౧౯౧౯ లో కారాఖాను చీనావారికి ప్రతిఫలం లేకుండానే రైల్వేయిచ్చివేయుదునని ప్రకటన గావించినప్పుడే రష్యావారు మొదటిసారి చైనా తూర్పురైల్వే సంబంధములో ప్రత్యక్షముగా కనపడ్డారు.

కాని ౧౯౨౪ వచ్చేసరికి, రషియావారికి మంచూరియాలో పలుకుబడి, చైనావారు బోల్షివిక్కు ప్రతిపక్షులైన తమచుట్టుపట్లవారిని సాయం కోరటం, ౧౯౨౩ లో బ్రిటిషు లేబరుపక్షమువారు సోవియట్లని మన్నించడం అనేసంగతులవల్ల చైనావారు రష్యాతో రాయబారమును సాగించవలసివచ్చింది. ఈరాయబార ఫలితమే ౧౯౨౪ లో జరిగిన ఒడంబడిక. దీనివలన చైనాతూర్పురైల్వేకి రష్యాచైనాలు రెండూ ఆధిపత్యం వహించినవి. చైనా రైల్వేని కొనుక్కోవటం అనేవిషయాన్ని అలావుంచి చెరిసగముపద్ధతిమీద రెండుదేశాలు ఆరైల్వేని పాలించడము మొదలుపెట్టినవి. ఇంతలో, చైనా ఎంతకి రైల్వేకొనుక్కోవటం మొదలైన విషయాలు నిర్ణయించడానికి ఒకసమావేశము కావించాలని నిశ్చయించుకొన్నారు.

ఈయొడంబడికప్రకారముగూడా రైలుమార్గము కేవలము వర్తకం నిమిత్తమే నడవాలనీ, చైనాయొక్క క్రయాధికారము నటుంచి వచ్చిన లాభమంతా గూడా పాలకసంఘమువారి యధీనమందుండాలనీ నిర్ణయమైనది. కాలపరిమితిగూడా ౮౦ నుంచి ౬౦ సంవత్సరాలకి అనగా ౧౯౬౨ కి తగ్గించబడినది.

ఈ ౧౯౨౪లో చైనారష్యాలు చేసుకొన్న ఒడంబడిక ౧౮౯౬ లోని ప్రాత ఒడంబడికకంటె అంత మంచిదిగా కనుపించదు. ౧౮౯౬ లోని అసలు ఒడంబడిక, దానిచట్టాలున్ను, క్రొత్త ఒడంబడికకు విరుద్ధమున్ను చైనా అధికారానికి భంగకరములున్ను కానంత వరకు అమలులో వుంటవని గూడా ఈ ఒడంబడికలో ఉంది. 'This (agreement of 1924) provided that the original Contract of 1896 and Statutes of Chinese Eastern Railway in so far as they did not conflict with the new agreements or prejudice the sovereign rights of China should continue in effect.' క్రొత్తఒడంబడికకు, చైనా అధికారానికి ఏది బాధాకరమో, ఏదికాదో చెప్పడం చాలాకష్టం. అందులో పాలకసంఘసభ్యులు రాజకీయోద్దేశములపైన నియమింపబడడంచేత స్థితిగతులు మరీ పాడుకావలసివచ్చినది. ఈవిధంగా ఒక్కకలంపోటుతో జారిష్టుభూతము క్రొత్తపరిపాలనలోగూడా పునఃప్రతిష్ఠితమైనది. అసలు ఒకప్రభుత్వమే రైల్వేనినడపడం కష్టం. అటువంటి సందర్భములలో రెండుప్రభుత్వాలు ఒక్కటొకటి అయిదుగురుసభ్యులిని నియమించడం, వాటిలో చైనావాడికి రష్యన్ భాష తెలియక, రష్యావాడికి చైనీస్ తెలియకఉండే అవస్థలో రైల్వేనడపడం చాలా ఘోరం. ఇంతేకాక ఏదన్నా తగాదావస్తే దాన్ని రెండుప్రభుత్వాలకి తెలియజేస్తే వారు న్యాయంగా తీర్పుచెప్పాలి. ఇది మరీవిపరీతస్థితి.

ఈవిచిత్రమైన పద్ధతివలన తేలిన పర్యవసానమే చైనాకు రష్యాకు జరిగినయుద్ధము (Near War) ఇది ౧౯౨౯ జూలైలో ప్రారంభించి ఆసంవత్సరాంతంలో సేనాపతిచాంగ్‌హుసుషీలియాంగు ఓడిపోవడంతోగాని తీరిందికాదు.

ఇన్ని అవస్థలకుమూలమైనా చైనాతూర్పురైల్వే ౧౯౩౧ సెప్టెంబరువరకు బాగానే పనిచేస్తోవుండేది. ఇది రష్యావారికి రాజకీయంగాను, ఆర్థికంగాను మంచి లాభంగా ఉండేది. లోగడ చేయాలనుకొన్న సమావేశము జరగకుండా వుండటానికి సకలప్రయత్నములు జరిగినవి. ఈలోపల రైల్వేమీదవచ్చేలాభం మిక్కుటమవటంచేత పాలకసంఘంవారికి కొంచెం లోభం కలిగింది. మెల్లగా అప్పుడప్పుడుదాన్ని ఉభయపక్షంవారు పంచుకొంటూవచ్చారు. ఆంతరకారణాలేమో చెప్పలేముగాని చైనాక్రయవిషయము నిర్ణయించడానికి ౧౯౨౫లో కూడవలసిన సమావేశము మొత్తం మీద ఇంతవరకుజరగలేదు.

"మంచుకో" యొక్క ఆక్రమస్థాపనము మొత్తం మీదపరిస్థితులను చాలాకలతపెట్టింది. దోపిడి, రైలుదారి పాడుచేయడం, స్టేషనులుతగలబెట్టడం మొదలైన అత్యాచారాలు నిత్యం జరుగుతూవచ్చినవి. జపాను సైన్యం, 'మంచుకో' రక్షకవర్గం ఉచితంగా ప్రయాణం చేయాలనేవిషయం అధికారకవిధానంగా ప్రకటన చేయబడి బలవంతంగా ఆచరణలోకి వచ్చాయి. రష్యనులు, ఇతరులుఅగు ఉద్యోగుల్ని చంపడం, చావగొట్టడం, ఎత్తుకుపోవడం మొదలైనఘోరాలు జరిగినై. "నేడువలె ఎన్నడూగూడా ధనప్రాణాలు అపాయస్థితిలో ఉండలేదు" అని సోవియటులు ఘోషించారు. చైనారష్యా ద్వంద్వపాలనము నిలబెట్టడానికి, సంఘర్షణతగ్గించడానికి సాధ్యమైనదల్లా జరిగింది. కాని రష్యావారిఓర్పునకు ఫలితం మరింతఆక్రమణమేఅయింది. కొంతవివాదము కొద్దితగాదాలు జరిగినతర్వాత రష్యావారు పరిస్థితులను ప్రతిఘటించాలనుకున్నారు. జపాను కొంతధనం ప్రతిఫలంగాయిస్తే రైల్వేతో తమ సంబంధం వదులుకుంటామని రష్యావారు స్పష్టంగా చెప్పేశారు.

జపానువారీ బేరమును తిరస్కరించి 'మంచుకో' దాన్నికొంటే బాగుంటుందని సలహా చెప్పారు. దీనికి సోవియట్టులు అంగీకరించారు.

అప్పుడు నాన్‌కింగునుంచివచ్చిన సూచనలనుబట్టి మాస్కోలోఉన్న చైనారాయబారి "వర్తకంకోసం కట్టబడిన యీరైల్వేకి సంబంధించిన యేవిషయమైనా చైనాతో సంప్రదించకుండా రష్యావారు చేయరాదని అలాచేస్తే ౧౯౨౪ ఒడంబడికను అతిక్రమించినట్లు అవుతుందనీ అడ్డుపెట్టాడు. ఈఆక్షేపణకు "కొనేవారెవరయినా ఉంటే తమ అధికారాన్ని అమ్ముకోడానికి తమకు హక్కున్నదనీ, ఆరైల్వే పరిపాలనలో నుంచి విరమించినప్పుడే చైనాకు దానిమీద హక్కు పోయిందనీ, రష్యావారు సమాధానం చెప్పారు. మళ్లీ చైనావారు తాము ఆరైల్వేని కొనవలసియున్నట్లు ఒడంబడికలో ఉన్నదనీ, అందుకు ప్రతికూలంగా ప్రవర్తించడం దైవముఖంచూసి చేసికొన్న ప్రమాణమును ఉల్లంఘించడం అవుతుందనీ, ఆక్షేపణ తెచ్చారు. ఆ ప్రమాణంవివరం: ముం దెప్పుడుగాని ఈరెండు ప్రభుత్వాల్లో ఎవరుగాని, రెండవపక్షమునకు బాధాకరంగా ఉండే తీరున ఏవిధమైన ఒడంబడిక ఎవరితో చేసుకోగూడదనీ యీపాలకవర్గం తీర్మానం చేస్తోంది." (Article IV 1924 Agreement) అదీగాక చైనా అనుమతి లేకుండా రైల్వేపాలన బాధ్యత మంచుకోకి యిచ్చివేయడం ౧౯౨౮ లోని ప్యారిస్ ఒడంబడికకు విరుద్ధమవుతుంది. అలాచేయటము కయ్యానికి కాలుదువ్వుతూ ఉన్న ఒకపక్షానికి సహాయంచేయటానికిగాను ఎట్టి సంబంధాలు చేసుకోగూడదని అంతర్జాతీయసమావేశములో నిరసింపబడ్డ ఒకకుట్రను చేసినట్లుగా అవుతుంది అని కూడా అడ్డుచెప్పారు. ఇదీకాక ఈచైనాతూర్పురైల్వే నిర్మాణానికి బాధ్యులు మంచూరియాలోని కార్మికప్రజలనిన్ని అందుచేత వారిశ్రమకి కొంత తృప్తికలగడానికి ఆరైల్వేని వారే యివ్వటం ధర్మమనిన్నీగూడా చైనా

వారు సూచించారు. చైనాచూపిన చైనాతూర్పురైల్వే సంసర్భంలో చూపుతూవున్న దౌర్జన్యంవల్లను, 'జనీవాలో ఎంతెంతప్రయత్నాలు జరిగినా' పశుబలమే యింకా పైచేయిగాఉన్నదనిగ్రహించి సోవియటులు ౧౯౨౪ ఒడంబడిక (Article I) కున్నూ, ౧౯-౨౭ ఒడంబడికకున్నూ విరుద్ధంగావున్నా, ఆరైల్వేని జపానువారికి అమ్మివేయటానికే నిశ్చయించుకున్నారు. పైగా ఆరైల్వేనిర్మాణానికి ధనము పారిస్‌లో అప్పు చేశామనీ అందుచేత ఫ్రెంచిఋణదాతలకుగూడ దానిమీద కొంతహక్కుఉన్నదని సోవియట్లు చెప్పడం ప్రారంభించారు. నిజంగాకూడా టోకియోలోఉన్న ఫ్రెంచిరాయబారి ఫ్రెంచివారికి ఆరైల్వేమీదహక్కుఉండగా దాన్ని యితరులకు అమ్మటానికి వీలులేదని అడ్డుపెట్టాడని పత్రికలవల్ల తెలుస్తోంది. యథార్థం విచారిస్తే ఫ్రెంచివాళ్లకి దానిమీద హక్కున్నదనటానికి ఆధారమేమిటో, అసలు ఫ్రెంచివారి కాహక్కు ఎలావచ్చిందోమాత్రం తెలియకుండావుంది. అప్పుడప్పుడు రష్యావారు ఫ్రెంచివారికి వ్రాసిన అప్పుపత్రాల మినహాయించి వేరే ఆధారం కనబడడంలేదు. ఈఅప్పుపత్రాలయినా రైల్వేపరంగా వ్రాసినవికావు. ఏది ఎలాగయినా ఫ్రెంచివారిచ్చిన డబ్బుకుగాను చైనాతూర్పురైల్వేని వారికి తాకట్టుపెట్టివుంటేగాని వారికి దానిమీద ఎలాంటిహక్కువుండదు. సోవియట్టులు, చైనావారుచేసుకున్న ఒడంబడికజరిగిన కొద్దికాలములోనే మాస్కో యీవిధంగా చైనాతూర్పురైల్వే విషయంలో అక్రమంగా ప్రవర్తించటం చైనాకు పెద్దఆఘాతమైనది. సోవియట్టులు యిలాచెయ్యటము అన్యాయమని చైనావార్తాపత్రికలన్నీ యేకగ్రీవంగా నిందించినవి. చైనారష్యాలు స్నేహభావం నిరంతరం కోరే యూ జిన్‌ఛిన్‌గారుకూడా ఈ అక్రమాన్ని ఖండించారు.

సోవియటులు, రైల్వేకి ౨౫౦౦,౦౦౦రూబుల్సు అడిగారు. జపానువారు ౫౦,౦౦౦,౦౦౦ యన్‌లు యిస్తామన్నారు. ఏఆధారాలని పురస్కరించుకొని యీ బేరం జరిగిందో మనకు తెలియదు. మాస్కో, నానుకింగుల మధ్య జరిగిన ఒడంబడికకు ఉత్తర క్షణముననే జరిగిన యీ చైనా తూర్పు రైల్వే బేరము కేవలం డబ్బు అవసరంచేత జరిగినది కాదని మాత్రం చెప్పుకోవచ్చు. మంచూరియాలోని రష్యావారి ఆర్థిక, రాజకీయ, వైజ్ఞానిక సంబంధమంతా యీ రైల్వేనిర్మాణంతోపాటు పుట్టిపెరిగినదే. ఉత్తర మంచూరియాలో రష్యాకు గల పలుకుబడిని విచారించినప్పుడు చైనాతూర్పురైల్వేలో రష్యాసంబంధం తీసివేయడమంటే, పెస్సిఫిక్‌లోనుంచి ములికి తీసివేయడమన్నమాటే. ఒకసారి జపాను ఆరైల్వేమీద అధికారం సంపాదించినదంటే చీనాకు తూర్పున ఉన్న రష్యారాజ్యమంతా సంజుకున్నట్లుమాటే.

ఈమధ్య కొన్నివార్తాపత్రికలలో (Manchester Guardian, July 1. 1933) రష్యన్‌ప్రభుత్వము చైనాతూర్పురైల్వేనిమాత్రమేకాకుండా వ్లాడివాస్టకు, ఆమూర్‌పరగణాలు ఉత్తరశాఖలిన్ గూడా అమ్మివేయవలసిందే యని ప్రకటింపబడ్డ సూచనలవల్ల జపానువారి ఉద్దేశ్యాలెల్లావున్నదీ స్పష్టమవుతోంది.

చైనా తూర్పురైల్వేదారి, జర్మనీ ఫ్రేంసు వివాదస్థలమగు సార్‌కోలుఫీల్డులు, మరల రాబోవు సంగ్రామమునకు కారణభూతములవుతాయేమో నని భయమేస్తున్నది. అట్టివిషయాలగురించి ఆంధ్రులకు తెలియజేయాలని నాకు చాలాకాలంనుంచి ఉద్దేశముండి నేటికిది చాలప్రయాసముపై వ్రాయగల్గితిని- మహాసంగ్రామమునకు సార్జవోవధ ఎలామూలకారణం అయిందో ప్రాగ్దేశాలలో యుద్ధాలురావడానికిది ఆవిధంగా కారణమవుతుంది అని అనుమానము కలుగుతున్నది. అందుచే దీనిని ఆంధ్రులకు 'భారతి' పత్రికాముఖంగా అర్పించదలచుకొన్నా.

# మన యాహారము

గోటేటి జోగిరాజు

బియ్యము (Rice) యొక్కయు, గోధుమల యొక్కయు ఆహారయోగ్యతనుగురించి శ్రీముఖ సంవత్సర పుష్యమాససంచికయందు మూడవవ్యాసమునను, భావసంవత్సర వైశాఖమాససంచికయందు నాల్గవ వ్యాసమునను చర్చింపబడెను. ఇందితర తృణధాన్యములయొక్కయు తృణధాన్యములనుండి లభించు తవుడు, లేక పొట్టుయొక్కయు ఆహారయోగ్యతనుగురించి చర్చింపబడును.

## 3. ఇతరతృణధాన్యములు

ఆంధ్రదేశమున వరితరువాత తృణధాన్యజాతులలో విరివిగ నుపయోగింపబడుచున్నది జొన్న. ఇది దత్తమండలములందు ప్రజల ముఖ్యాహారద్రవ్యముగ నున్నది. నెల్లూరు, కృష్ణా, గుంటూరుజిల్లాలలోగూడ నిది చాలమందిచే నుపయోగింపబడుచున్నది.

జొన్నకు వెనుక హెచ్చుగ నుపయోగింపబడుచున్న తృణధాన్యములు గంటెయు, చోడియు, కొఱ్ఱయునైయున్నవి. ఇవి కొంచెమించుమించు సమానప్రాముఖ్యతను బడసియున్నవి. గంటె మెట్టజిల్లాలలో జాలభాగమునను, చోడి విశాఖపట్టణము, గంజాం, చిత్తూరు, అనంతపురముజిల్లాలలోను విరివిగ నుపయోగింపబడుచున్నవి. కొఱ్ఱ దత్తమండలములందు చాలమందిచే దినబడుచున్నది. చామ, వరిగ, ఊదఆరిక, మొక్కజొన్న యివి స్వల్పముగ నుపయోగింపబడుచున్నవి. ఈ ప్రాంతములందు పండింపబడకపోయినను యవలును, ఓట్సునుగూడ వైద్యులసలహాపైని కొందరు నాగరకులచే స్వల్పముగ నుపయోగింపబడుచున్నవి.

పైని పేర్కొనబడిన తృణధాన్యముల యాహారయోగ్యతనుగురించి తగినంతపరిశోధన యింకను జరిగియుండలేదు. ఆయాజాతుల సంఘట్టనమును తెలుపు అంకెలను లభించినంతవరకు సంగ్రహించి యీక్రింది పట్టికయందు జూపబడెను. వివిధప్రాంతములందును వివిధపరిస్థితులందును పండింపబడిన పలురకములను విరివిగ బరీక్షించినగాని ఆయాధాన్యముల నిజతత్త్వము తెలియదు. అయినను క్రిందిపట్టియందలి యంకెలు తెలుపు సంఘట్టనతారతమ్యములనుబట్టి వానిగుణాగుణములు కొంతవరకు చర్చింపబడును.

ఊదలలో తప్ప తక్కిన తృణధాన్యములన్నిటిలోను బియ్యము (సగటు) నందుకంటె హెచ్చు మాంసకృత్తులు గలవు. కాని ఆయాజాతులందలి మాంసకృత్తులు మానవ శరీరమున కెంతవర కుపయోగకరమో పరీక్షించినగాని వాని నిజమైన విలువ తేలదు. కర్బనోదజనితములు జొన్నలు గంటెలు, మొక్కజొన్నలు వీనిలో కొంచెమించు గోధుమలలో నున్నంతయున్నవి. వీనిలో గోధుమలలోవలెనే నారపదార్థము తక్కువ కాని బియ్యమునందుకంటె హెచ్చు ఖనిజములను కొంచెమించు గోధుమలందున్నంతయేయున్నవి. చమురుమాత్రము హెచ్చుగగలదు. తక్కిన తృణధాన్యములలో చోళ్లు కొఱ్ఱలు, చామలు, యివి వరిగలు, ఆరికలు, ఊదలు వీనికంటె మాంసకృత్తులను హెచ్చుగ గలిగియున్నవి. ఈ యారింటియందును, పైజాతులయందుకంటె కర్బనోదజనితములు తక్కువ. నారపదార్థమును ఖనిజములును చమురును హెచ్చు. ఇందువలన నివి జీర్ణమగుట కొంత కష్టము. అయినను శరీరమునకు వలయు ఖనిజద్రవ్యములను హెచ్చుగ నొసగుటవలనను, నారపదార్థము హెచ్చుగ నుండుటచే కర్బనోదజనితములు హెచ్చుగనున్న ధాన్యములకంటె నివి మలవిమోచనగుణము నెక్కువగ గలిగియుండుటచేతను కష్టపడి పనిచేసి జీర్ణము చేసికొనగలుగువారి కివి యాహారయోగ్యములని చెప్పదగును. మృదువగు వరియన్నమున కలవాటుపడినవారు వీనిని దినుచో

క్రమముగ నలవాటుచేసికొనినతప్ప వారిజీర్ణ కోశమునకు బాధగలుగుట సహజము. యవలందును, ఓట్సునందును మాంసకృత్తులు హెచ్చుగనున్నవి. అయినను నారపదార్థముకూడ వీనియందు హెచ్చుగనుండుటచే, మాంసకృత్తులు హెచ్చుగనున్నందువలన గలుగు మలబద్ధదోషము నిది తొలగించును. మొత్తపు యింధనశక్తియందు గంటె, జొన్న, మొక్కజొన్న, వరి, గోధుమ యివి కొంచెమించు సమానములని చెప్పవచ్చును. తక్కినవి వీనికి గొంచెము తీసిపోవును.

జొన్న సామాన్యముగ నన్నముగ వండి తినబడుచుండును. రొట్టెగా కాల్చితినుటయు గలదు. ఎట్లు తినినను పాతరవేసిన జొన్నలు శ్రేష్ఠము. సులభముగ జీర్ణమగును. జొన్నలను ప్రధానాహార ద్రవ్యముగ నుపయోగించువారు గోధుమ నుపయోగించువారివలెనే కొంత పప్పు, నేయి, కూరలు, మజ్జిగ, పండ్లు మొదలగువానిని గూడ తగినంత తినవలయును. (4 వ వ్యాసమును జూడుడు.) జొన్న 'మాల్టు' చేయుటకు మిగుల ననుకూలమయిన తృణధాన్యమని కోయంబత్తూరు వ్యవసాయ పరి

## తృణధాన్యముల సంఘట్టనమును తెలుపు పట్టిక

| ధాన్యజాతి | మాంస కృత్తులు | చమురు | కర్బనోద జనితములు | నార పదార్థము | ఖనిజములు | ఒక ఔన్సు యొక్క ఇంధనశక్తి-కాలరీలు | పరా |
|---|---|---|---|---|---|---|---|
| జొన్నలు | ౧౦.౮౭ | ౪.౧౩ | ౮౧.౦౬ | ౧.౭౨ | ౨.౨౯(a) | ౧౦౪ | ౨ - ౬ కలముల లోని |
| గంటెలు | ౧౦.౪౩ | ౫.౮౪ | ౮౦.౫౯ | ౦.౮౫ | ౨.౨౮(a) | ౧౦౪ | యంకెలు తేమను మినహా |
| చోళ్లు | ౧౦.౬౪ | ౫.౬౭ | ౬౭.౭౮ | ౭.౩౯ | ౮.౬౨(a) | ౯౧ | యించి లెక్క గట్టబడి |
| కొఱ్ఱలు | ౧౧.౬౦ | ౪.౮౦ | ౭౨.౫౩ | ౬.౭౭ | ౪.౪౦(b) | ౯౪ | నవి. ౭-వ కలములోని |
| చామలు | ౧౦.౧౩ | ౪.౦౧ | ౭౬.౮౪ | ౫.౧౨ | ౩.౮౯(b) | ౯౬ | యంకెలు నూటికి ౧౨½ |
| వరిగలు | ౮.౮౭ | ౨.౪౯ | ౭౩.౭౪ | ౮.౦౪ | ౬.౫౩(c) | ౮౮ | వంతుల తేమగల ధాన్య |
| ఊదలు | ౭ ౬౬ | ౪.౭౭ | ౭౩.౩౭ | ౮.౦౮ | ౬.౩౩(b) | ౯౨ | ముపై లెక్కబడెను. |
| ఆరికలు | ౮ ౮౨ | ౫.౦౧ | ౭౧.౫౨ | ౮.౧౧ | ౬ ౫౪(a) | ౯౨ | |
| మొక్కజొన్నలు | ౧౦ ౮౦ | ౫.౩౮ | ౮౦.౦౬ | ౧ ౫౯ | ౨.౧౫(a) | ౧౦౪ | |
| యవలు | ౧౨ ౩౩ | ౨.౩౩ | ౭౪.౦౭ | ౮.౨౬ | ౩.౦౨(d) | ౯౨ | |
| ఓట్సు | ౧౪.౮౩ | ౬ ౮౯ | ౬౧.౮౪ | ౧౨.౪౧ | ౪.౦౨(d) | ౯౨ | |
| గోధుమ (నాల్గురకముల సగటు) | ౧౧.౬౧ | ౧.౯౨ | ౮౦.౯౩ | ౨ ౪౮ | ౨.౭౮ | ౯౭ | |
| బియ్యము (౪౩రకముల సగటు) | ౮.౫౦ | ౧.౧౨ | ౮౮.౮౭ | ౦.౩౭ | ౧.౧౧ | ౧౦౦ | |

శోధనస్థానమందు రసాయనశాస్త్రజ్ఞులగు రావుబహద్దరు భాగవతుల విశ్వనాథ్‌గారు కనిపెట్టిరి. 'మాల్టు' చేయుటయనగా విత్తులను మొక్కకట్టి మొలక యించుక బయలు వెడలగనే వాని నెండబెట్టి పిండిచేయుట.

(a) From Wood's facts and figures.

(b) From Dr. Leathers Analyses,

(c) From Church's food grains of India.

(d) From Mukherji's Hand book of Indian Agriculture.

గింజలు మొలచునపు డందు పిష్టపదార్థమును త్వరలో జీర్ణము గావించు (చక్కెరగామార్చు) ద్రవ్య మొకటి యుద్భవించుటచే నిట్టిపిండితో రోగులకును పసిపిల్లలకును గూడ జావజేసి యీయవీలగును. విదేశములనుండి దిగుమతియగుచున్న 'బెంజర్సు' ఆహారము, హార్లిక్సు మాల్టెడ్ మిల్క్ మొదలగు యధికవెలగల ద్రవ్యములందీ మాల్టు చేరుచున్నది. పైనుండి లక్షలకొలది యాపాయలు విలువగల యీ యాహారద్రవ్యములను తెప్పించుకొనుటకు బదులు మనకున్న జొన్నలతోనే స్వల్పశ్రమతో యిట్టి యాహారమును సులభముగ దయారుచేసికొనవచ్చునని విశ్వనాథముగారిపరిశోధనలవలన దేలెను.* ఈమాల్టును తయారు చేయువిధానమును దెలిసికొనగోరువారిని ప్రతిసంవత్సరమును సెప్టెంబరునెలలో కోయంబత్తూరు వ్యవసాయ కళాశాలయందు తరిఫీయతు జేయుట కేర్పాటు చేయబడెను. జొన్నలు పేలాలు చేయుటకు మిగుల యనుకూలము. ఈపేలాలను కొంచెము వేరుసెనగపప్పుతోను, బెల్లముతోను కలిపిన యనుకూలమగు లఘ్వాహార మగును.

చోళ్లు తప్ప యితరతృణధాన్యములుగూడ చాలవరకు అన్నముగవండియె తినబడును. కొన్ని రొట్టెగ కాల్చి తినుటయుగలదు. చోళ్లు సామాన్యముగ నంబలిగ జేసి తిందురు. కొన్నిచోట్ల సంగటి (ముద్ద) గ జేసి తినుటగలదు. ఎట్లుతిన్నను వీనితోగూడ ౪-వ వ్యాసమున జెప్పినట్లు పప్పు మొదలగునితరదినుసులనుగూడ తగినంత దినవలెను. చోళ్లనుగూడ మాల్టుచేసి ఆపిండిని జావగ నుపయోగింపవచ్చును. ఈజావను పాలు బెల్లముతో గాని, మజ్జిగ ఉప్పుతోగాని చేర్చి పుచ్చుకొనవచ్చును. కాఫీకిబదులుఅలవాటుచేసికొని ఉదయమున దీనిని పుచ్చుకొనుచో మిగులనారోగ్యకరముగను, పుష్టికరముగను నుండును. లేకరి కాఫీని మానినపిమ్మట నైదుసంవత్సరములు దీనిని బుచ్చుకొనిచూచెను. వరియన్నమువంటి నాజూకుతిండి కలవాటుపడినవారు ఆరోగ్యమునుబడయుట కితరతృణధాన్యములను బుచ్చుకొనవలసివచ్చుచో వాని నిట్లు మాల్టుచేసి పుచ్చుకొనుటయే మంచిది. జీర్ణశక్తి మిగులతక్కువగ నున్నరోగులును, పసిపిల్లలును మాల్టుజావకుబదులు, మాల్టుగంజిని అనగా మాల్టును నీటిలోనుడకబెట్టి వడకట్టిన గంజినే పాలతోజేర్చి పుచ్చుకొనవచ్చును. పోతపాలపైబెరుగు చంటిపిల్లలకు పాలను నీళ్లును కలిపి కాచునప్పుడు అందు కొంచెము మాల్టు నొకగుడ్డలోమూటగట్టి వ్రేలాడదీసి పిమ్మట నీ మూటనుదీసివేసి యందలిసారముమాత్రము దిగిన పాలు నీళ్ల మిశ్రణము నిచ్చుట మంచిది.

## ౪. వరితవుడు, గోధుమపొట్టు

తృణధాన్యముల యాహారయోగ్యతననుసరించి వ్రాతముగించునపుడు పైనపేర్కొనబడిన రెండుద్రవ్యములననుసరించియు కొంత ప్రత్యేకముగ వ్రాయుట యవసరము. ఆహారమునకు చేబియ్యముయొక్కయు, పొట్టుదీయని గోధుమలయొక్కయు ప్రాశస్త్యతను గూర్చి ౩, ౪ వ్యాసములందు చర్చింపబడెను. ఇతర తృణధాన్యములను తినునపుడుగూడ వానిని పొట్టుతోనే ఉడికించి తినుట మంచిది. పొట్టు అనగా పైతుమ్ములు (ఊక) గాక బియ్యపుగింజను తవుడువలె అంటిపెట్టుకొను పొర. సామాన్యముగ నాజూకు, నాగరత వీనిపేరపొట్టునుదీసివేసిన తృణధాన్యములే యుపయోగపడుచుండుటచే నాహారమున B విటమిను లోపమును, ఖనిజద్రవ్యములలోపమునుగలుగుటయేగాక, నారపదార్థముకొరవడుటచే మలబద్ధమేర్పడి, శరీరము నానావిధరోగములకును నాస్పదమగుచున్నది. మెరుగుపెట్టినబియ్యము నుపయోగించుటవలననే చాలమంది కనారోగ్యము గలుగుచున్నదని చెప్పవచ్చును. ఇట్లనారోగ్యవంతులయినవారుచే బియ్యపుటన్నమునుగాని, పొట్టుతో నితర తృణధాన్యములతో చేసిన యన్నమునుగాని రొట్టెనుగాని తినుటయేగాక, ప్రతిదినమును కొంతవరితవుడును, గోధుమపొట్టును గాని రెండునుజేర్చిగాని యాదనముగ పుచ్చుకొనుచో శీఘ్రముగ నారోగ్యముగలుగును. లేకరి గత ౫ సంవ

---

* Leaflet No. 4 & 5 of the Madras Agricultural Department.

త్సరములనుండి వీనినుపయోగించి వీనిమేలును బాగుగ గనిపెట్టెను.

వరితవుడునందు మెరుగుపెట్టిన బియ్యమునందు కంటె ననేకరెట్లును, చేబియ్యమునందుకంటె రెట్టింపును B విటమినుగలదు. రాసాయనిక B విటమిను (Oryzanin hydrochloride C12 H11 NO4-SO2 2Hcl) వరితవుడునుండి తీయబడుచున్నది. తవుడు నఞ్జువ్యాధిగలవారికిని, అతిమూత్రవ్యాధిగలవారికిని మిగుల మంచిది. లేకరి నఞ్జుచే బాధపడుచు వైద్యులు కుదుర్చలేని స్థితిలోనున్న యొకర సంవత్సరములవయసు గల బాలునికి దినమునకు రెండుచిన్నచంచా (Tea-spoon) ల తవుడును పటికబెల్లపుపొడితో నిప్పించగా శీఘ్రముగ గుణముగలిగెను. ఇట్లే యితరరోగులకును నిది యిప్పించగా లాభముగనబడెను. అతిమూత్రవ్యాధి గలవారి కీతవుడుకషాయమును, అనగా కాఫీపొడివలెనే ఉడుకునీటిని తవుడుపై బోయుటచే నందలి సారమును సంగ్రహించిన నీటినిచ్చుటచే సగటున రక్తమునందలి చక్కెర నూటికి ౨౮% తగ్గెనని పరీక్షవల్ల దేలెను. *

తవుడునందు B విటమిను హెచ్చుగనుండుటయె గాక అందు ఖనిజద్రవ్యములుకూడ హెచ్చుగగలవు. స్ఫురమును, ఇనుమును ఇందున్నంత హెచ్చుగ మరి యేయాహారద్రవ్యమునందును లేవు. దినమునకు ౨-3 ఔన్సులు పుచ్చుకొనుచో మనుష్యునికి గావలసిన యీ రెండు ద్రవ్యములలో ముప్పాలికభాగము లభించును. తక్కిన యాహారమున తక్కిన మూడవవంతును ఉన్న చాలును. (మొదటి వ్యాసమునందు మొదటి పట్టికను చూడుడు) తవుడునందు మెరుగు పెట్టిన బియ్యమునందు కంటె నీద్రవ్యము ఇరువదిరెట్లును, చే బియ్యమునందు కంటె 9 రెట్లును పొట్టుతోనున్న గోధుమలకంటె నాల్గు రెట్లును ఉన్నవని లెక్కవేయబడెను. ఈరెండు ద్రవ్యములును మందుల రూపమున చాలమంది పుచ్చుకొనుచుందురు. అందుకు చాల ధనము వ్యయము చేయుచుందురు. అట్టివారు తవుడును దినుచో మందులకు ఒక రూపాయి వ్యయముచేయుటకు బదులు తవుడున కొక దమ్మిడీ వ్యయముచేసిన చాలును. తవుడునుండి ఈ ద్రవ్యములను జీర్ణము చేసికొనలేని స్థితిలోనున్న వారే అట్టి మందులను పుచ్చుకొనవచ్చును. అట్టి వారయినను చాలవరకు తవుడును నీటితో నుడుకబెట్టి ఆ గంజినిగాని పైని చెప్పిన తవుడుకషాయమునుగాని పుచ్చుకొనవచ్చును. దీనిని యిదివరలో చెప్పిన మాల్టు జావతోగాని, మాల్టు మూటతో కాచిన పాలతోగాని పుచ్చుకొనవచ్చును.

తవుడు నట్లే దినువారు దానిని వెన్నతోగాని నేతితోగాని కలిపి కొంచెము బెల్లమును లేక పటిక బెల్లపుపొడిని లేక తేనెనుజేర్చి పుచ్చుకొనవచ్చును. లేక అరటిపండు సపోటాపండు మొదలగు పండ్లను పిసికి దానిలో కలిపి తినవచ్చును. లేక కొంత అన్నముతోను, కూరతోను కలిపి తినవచ్చును. నిమ్మ లేక యితర పండ్ల రసముతోగాని, పాలు, పెరుగు వీనితోగాని కలిపి పుచ్చుకొనవచ్చును.

పచ్చి తవుడును దినుచో నది పరిశుభ్రమైనదిగ నుండవలెను. లేనిచో దానివలన క్రొత్తరోగములు సంక్రమింపవచ్చును. ఎవరియింట వారే తవుడును పరిశుభ్రముగ నుండునట్లు తయారుచేసికొన లేనిచో పచ్చి తవుడును తినుట క్షేమముగాదు. గచ్చునేలపై నేర్పరచిన దంపుడు గుంటపై రాళ్లమన్ను మొదలగు నవి లేకుండ శుభ్రపరచిన ధాన్యమును పైయాకు మాత్రము పోవునట్టుల మొదట దంపి, చెరిగి చేబియ్యము వేరుగదీసి, అంటింకను మిగులు వడ్ల గింజలను దీసివేసి, ఆచేబియ్యమును క్రరోటిలో దంపి, యందలి తవుడును కాగితములను పరచి వానిపై చెరిగి విడదీసి, సీసాలలో గాని డబ్బాలలో గాని బోసి జాగ్రత్త పెట్టవలెను. ఇట్లు తీసిన తవుడు కనరు రాకుండ 10-15 దినములు మాత్రమే నిల్వయుండును. అంతకుపైన నిల్వయున్నచో పుచ్చిపోవుటయు గలదు.

---

* No 993 Nutrition Abstracts and Reviews Vol 2-par 2.



౭. తిరుమలనాయకుని సౌధముపైనుండి కనుపించు మధుర          K. P. S.



అళగర్ దేవాలయము-మధురవద్ద          M. B. R.

ఇట్లు స్వంతముగ పరిశుభ్రమగు తవుడును తయారుచేసికొనలేనివారు, ఇతరులవద్దనుండిగాని మిల్లులనుండిగాని తవుడును సంపాదించి దానినీక్రిందివిధమున శుద్ధిచేసికొని పుచ్చుకొనవచ్చును. శుద్ధిచేయుటలో నందలి B విటమినుకొంతవరకు నష్టమయినను, అందు ఖనిజద్రవ్యములు నష్టమయిపోకుండుటచే విలువ యంతగా తగ్గదు.

లభించిన తవుడును మొదట సన్ననిపిండిజల్లెడతో జల్లించి ఊకచిట్టువగైరాలను దీసివేయవలెను. పిమ్మట నట్లు శుభ్రపరచినతవుడును ఒకపాత్రయందలి నీటిలో బోసి బాగుగగలిపి వదలినయెడల నందలి మన్నును యిసుకయు క్రిందికిదిగిపోయి మృదువగుతవుడు నీటిలో కలిసి తేలుచుండును. ఈపైనీటిని దీసి మరియొక పాత్రలో తేర్చిపోయవలెను. అడుగుయిసుకమన్ను కలిసి యిందులోనికి రాకుండ జూడవలెను. ఇంకను యేమైన మిగిలియున్నచో మరియొకటిరెండుసార్లిట్లు తేర్చిపోయవలెను. పిమ్మట తవుడుతోగూడిన యీ నీటిని గిన్నెలో ప్రొయ్యిమీదనుంచి నీరిగిరిపోయి ముద్దయగువరకును కాచవలెను. ఎప్పటికప్పుడు కావలసినతవుడు నిట్లు శుభ్రపరచుకొనుచో దానినిట్లు ముద్దగానుండు స్థితిలోతీసి, పైనిచెప్పినట్లు, రుచికరమగు నితర ద్రవ్యములలోజేర్చి తినవచ్చును. కాని ఒక్కసారి కొంత తవుడును శుద్ధిచేసి నిల్వయుంచుకొనదలచుచో నిట్లు ముద్దస్థితికివచ్చువరకు నుడికించినతవుడును బిళ్లలుగజేసి బిస్కట్లుకాల్చు పెట్టెలోపెట్టి కొంతకాల ముంచిన యెడల నందలితేమ యిగిరిపోవును. అపుడువానినితీసి డబ్బాలలోగాని సీసాలలోగాని నిల్వయుంచవచ్చును. ఇట్లు బిళ్లలుగాగాక, ముద్దకట్టినతవుడును జంతికల గొట్టముతో పళ్లెములలో జంతికలుగపోసి యాపళ్లెములను బిస్కట్లుకాల్చు పెట్టెలోనుంచిన బిళ్లలకంటె త్వరలో నిగిరిపోవును. నీటితోకలిసినతవుడు యిగిరి ముద్దకట్టుస్థితికి కొంచెముముందు, తవుడులో మూడోవంతు పరిశుభ్రమయిన గోధుమపాట్టునుబోసి కలిపినయెడల నామిశ్రణము త్వరలో ముద్దకట్టుస్థితికి వచ్చుటయేగాక, దానిని జంతికగబోసి బిస్కట్లుకాల్చు పెట్టెలో నుంచునెడల మరింతత్వరలో నందలితేమ యిగిరిపోవును. జంతికయు గుల్లగయుండును. దీనిని నలిపి డబ్బాలలోనికెక్కి నిల్వయుంచవచ్చును. నారపదార్థము హెచ్చుగగల గోధుమపాట్టుకూడ జేరుటచే వరితవుడుతోచేసిన జంతికపాడికంటె నిది విరేచనకారిగనుండును. ఇట్టి జంతికపొడి పచ్చితవుడువలెగాక ౨, 3 నెలలు చెడకుండ నిల్వయుండును. దీనిని తినుటకుముందు పైన కొంచెము వెచ్చనినీరుగాని, పాలుగాని చల్లుచో బిస్కట్లవలె మృదువుగ నగును. దానిని ప్రత్యేకముగగాని పాలు పంచదారతో లేక పెరుగు ఉప్పుతో కలిపిగాని తినవచ్చును. పైనిచెప్పిన రుచికరములగు నితరద్రవ్యములను కలిపియు దినవచ్చును. బిస్కట్లుకాల్చు పెట్టె లభించనిచో నొక మూతివెడల్పుగల కుండ లేక గోలెమును సంపాదించి అందు అడుగున కొంతయిసుకపోసి, దానిపై తవుడుబిళ్లలుగాని జంతికగాని వేసినపళ్లెమునుంచి కుండ మూతిపైన మరియొక పళ్లెమునుంచి కుండక్రింద మంటవేసినచో బిళ్లలుగాని జంతికగాని యారి గట్టిపడును. పిమ్మట డబ్బాలలో వేసియుంచవచ్చును. కుండపై నుంచిన పళ్లెముపైగూడ కొంతనిప్పువేసియుంచుచో లోని బిళ్లలుగాని, జంతికగాని మరింత త్వరలో నిగురును.

శేకరి యిట్లు తవుడుజంతికలను చేయుటకు ఒక యినుపపెట్టెను ప్రత్యేకముగచేయించెను. అది క్రింది పటమున జూపబడినట్లు చతురముగను (౧ అడుగు వెడల్పు ౧ అడుగుపొడవు) ౬ అం. ఎత్తును గల్గి యున్నది. నాల్గుఅరలుగ విభజింపబడెను. ఒక్కొక్క అరలో నొక్కొక్కపళ్లెము నుంచవచ్చును. పెట్టెను ప్రొయిపైనుంచి క్రిందమంటవేసినపుడు అడుగుఅరకు తగులు వేడిమిచే నందలిగాలి వేడియెక్కి ఒకప్రక్కను పైరేకునందున్న కన్నములగుండ పైయరకు బోవును. అచటిజంతిక పళ్లెముమీదుగా రెండవప్రక్కనుబోయి అచటినుండి పైరేకునందలి కన్నములగుండ మూడవ యరలోనికి బోవును. ఇట్లే నాల్గవయరపైకిబోయి తుదకు పెట్టెపైన అమర్పబడినగొట్టముగుండ పైకి పోవును. ఇందుష్ణవాయుసంచారము బాగుగనుండుటచే

జంతికలు త్వరలో యిగిరి పనిచురుకుగనగును. ఈపెట్టె వెల రు ౭-౮-౦ లు అగును.

పైనిచెప్పినట్లు బిస్కట్లవలె నిప్పవేడిమితో నిగర్చనవసరము లేకుండ మరియొకపని గూడ చేయవచ్చును. పైనిచెప్పిన ట్లుడికించిన తవుడు ముద్దను పళ్లెములలోగాని దంగెడలోగాదనిళ్ళ మైనగుడ్డనుపరచి దానిపై జంతికగొట్టముతో నిడివిగ




తవుడుజంతికలు చేయుపెట్టె
( మూతతీసివేయగ అరలు కనబడుచున్నవి )

త్రాళ్లవలెపోసి తీవ్రమగునెండలో నుంచినయెడల ౫, ౬ గంటలలో నందలి తేమ యిగిరిపోయి నలిపి డబ్బాలోని కెక్కించ వీలగును. ఇది మరలనొకటిరెండుసార్లెండబెట్టినచో కొంతకాలము నిల్వయుండును. లేక యొకసారి మూకుడులో పోసివేచి డబ్బాలో బోసికొనవచ్చును. ఎండకాలమున సులభముగ నిట్లుచేయవచ్చును. బాగుగ నారకుండ డబ్బాలోని కెక్కించినచో నది పులిసి బూజుకట్టి చెడిపోవును.

పండ్లు పాలుమాత్రమే తినియుండ నభిలాషగలవారు పైని చెప్పినట్లు పచ్చి తవుడు గాని, శుద్ధిచేసిన తవుడుగాని కొంత పుచ్చుకొననిచో సామాన్యముగ స్ఫురమును ఇనుమును చాలక క్రమముగ జబ్బుచేయవచ్చును. మరియు పాలను మృదువగు కండగల అరటి మొదలగు పండ్లను మాత్రమే దినుచో తగినంత నారపదార్థము లేకపోవుటచే మలబద్ధము చేయవచ్చును. ఈ లోపమును దీర్చుటకుగూడ నిది పనికివచ్చును. నూరుపౌనుల తూనికగలిగి దినమునకు 3-4 గంటలు లఘువ్యాయామము గలవాడు దినమునకు 12 అరటి పండ్లు (36 ఔన్సులు)ను, 6 నారింజ వగైరా యితర పండ్లను (24 ఔన్సులు) 12 ఔన్సుల పాలును 1½ ఔన్సు తవుడును తినిన చాలును. రెండరటిపండ్లకుబదులుగ గాని 4 నారింజపండ్లకు బదులుగగాని 2 ఔన్సుల సగము మదిరిన కొబ్బెరనుగాని 1 ఔన్సువేరుసెనగ గింజలను లేక జీడిపప్పును తినవచ్చును. లేక ఒక ఔన్సువెన్నను గాని ముప్పాతిక ఔన్సు నేతినిగాని జేర్పవచ్చును. హెచ్చుతూనిక గలవారును హెచ్చు పనిచేయువారును అందుకు తగిన ట్లాయాద్రవ్యములను హెచ్చుగదినవలెను. పర్యటనముచేయువారు పండ్లును పాలును ఎచటనైనను లభించును కాన, తమతో శుద్ధిచేసిన తవుడునుమాత్రము కొనిపోయిన చాలును. వంటవాని బాధయుండదు. వంటపూటి యిండ్లలోను కాఫీ దుకాణములలోను అపరిశుభ్రమగు నాహారమును దినవలసిన యగత్యమును ఉండదు.

గోధుమ పొట్టుకూడ వరితవుడువలెనే విలువగైనది. ఇందు తవుడునందున్నంత స్ఫురమును అందు ⅜ భాగము ఇనుమును గలవు. నారపదార్థ మెక్కువగనుండుటచే నంతకంటె నెక్కువ విరేచనకారి. పరిశుభ్రమగు గోధుమ పొట్టును తయారుచేయుటకు, రాళ్లు మన్ను మొదలగునవి లేకుండ శుభ్రముచేసిన గోధుమలపై కొంచెము నీరుచల్లి కొన్ని గంటలుంచి పిమ్మట కర్రరోలులో వానిని దంపి పొట్టును కాగితములనుపరచి వానిపై చెరిగి, మరల యెండబెట్టవలెను. బజారులో దొరుకుపొట్టును వరి తవుడువలెనే శుద్ధిచేసి తినవచ్చును. పైని చెప్పినట్లు 2 వంతులు వరితవుడును, 1 వంతు గోధుమపొట్టును కలిపి జంతికరూపమున నిగరబెట్టిన తినుట కనుకూలముగ నుండును.

ఇతర తృణధాన్యముల పొట్టును గురించి పరిశోధనలు జరిగియుండలేదు. కాని అవియు గోధుమపొట్టువలెనే విరేచనకారులుగ నుండుననియు స్ఫురమును ఇనుమును హెచ్చుగ గలిగియుండుననియు యూహింపదగియున్నది. కావున పొట్టును ప్రత్యేకముగ నుపయోగింపకపోయినను, ఆయాధాన్యములను వాని పొట్టునుదీసివేయకుండ దినుట మంచిది.

# నేటివిద్యావిధానము

కర్లపాలెం కృష్ణరావు

దేశదేశాలకు మనదేశము రాణిగావడముచేతను, మనదేశవాసులు సకలకళాప్రవీణులగు కీర్తికాములగుటచేతను, మన కాధిక్యతఅబ్బింది. "పృథివి నధిపులు నూతనప్రియులుగారె" అనేమాట మనకు బాగావర్తిస్తుంది. దానివలన కలుగబోయే మంచిచెడ్డల విచారణతో, మనవాళ్లకు పనిలేదు. నూతనమైతేసరి. ఇలా ఆశించడము మంచిదేగాని, క్రొత్తవాటికొఱకు పరుగెత్తి, ప్రాతవాటిని పోగొట్టుకోగూడదు. ఇందులో యింకోచిత్రముగూడా వున్నది. మనకు లభించేదానిలో నూతనత్వము నిజంగావున్నదా, లేదా, అనే ఆలోచనగూడా శూన్యమే. ప్రాతవస్తువైనా ఆకారముమారితే చాలు, Old wine in new bottles అన్నట్లు. ఇలా వెనుక ముందు లాలోచించుకోకుండా వుండడానికి, యింకోకారణముగూడా వున్నది. అనాదినుండి మనదేశము, సత్యమువిూద ఆధారపడివున్నది. మనపూర్వులంతా సత్యమార్గానువర్తులు. మోసమంటే యేమిటో తెలియక, యెవరుయేదియిచ్చినా, స్వీకరించడమూ, యెవరుయేదిచెప్పినా నమ్మడము, అలవాటు. ఈవిధము అన్నివిషయాల్లోను పరిపాటి అయిపోయింది.

దేశంలో క్రమక్రమంగా హూణవిద్య విస్తరించి పాశ్చాత్యనాగరికత వృద్ధియైనకొలది, శక్తిసామర్థ్యాలు నశించి, యువకులందరు, నిర్జీవప్రతిమలవలె, కళాకాంతులులేకుండా వుంటున్నారని,—నిరుద్యోగసమస్య పెచ్చుపెరిగిపోతున్నదనిన్ని, పిరికితనముతో గూడిన, సోమరితనము హద్దుమిాఱినదనిన్ని, పలువురు విద్యాధికులు తలంచుచున్నారు. ఇదెందుకు? ఇప్పటి మనదేశపు దౌర్భాగ్యపుస్థితికి కారణము యీవిద్యావిధానమేనని, నాస్వల్పబుద్ధికి తోచింది. ఈవిధానము, ఈబోధనాపద్ధతి పూర్తిగా మారితేనేగాని ప్రయోజనముండదు. Dr. Meyrick Boohe గారు Woman and Society, అనే గ్రంథములో "What is happening to the domestic life of the Anglo saxon race? It is the same tale, where the English tongue is spoken - More hotels, fewer homes - More divorces fewer children" అని చెప్పాడు.

సుభాషితగ్రంథములందు "నవదేత్ యావనీం భాషాం, ప్రాణైః కంఠగతైరపి"—

"గీ. గొంతులోనూర్పులుండినయంతవఱకు,
యవనభాష నెవండుమాట్లాడదగదు."

అని బోధగావించియున్నారు.

"విద్యమనల నేమిజేసింది? అన్నివిద్యలు నేర్చుకోవలసిందేగదా?" అని ప్రశ్నించేవాళ్లు చాలామంది వుంటారు. కాని, జాగ్రత్తగా ఆలోచిస్తే, నిజానిజాలు తెలుసుకోవచ్చు. విద్యాభ్యాసము తప్పని అనడానికి యెవరు సాహసించరు, గాని, ఈవిద్య మనకెంతవరకు అవసరము? దీనివల్ల మనకు గలిగే లాభమెంత?—అని ప్రశ్న.

కొన్నిసంవత్సరాలక్రిందట, మనలో ఇంగ్లీషు మాట్లాడేవాళ్లను చూస్తే, సామాన్యప్రజలందరు చాలా గౌరవించేవాళ్లు. ఒకప్పుడు ఒకవూళ్లో మొట్టమొదట బి. ఏ. ప్యాసయినవాణ్ణి ఊరేగించారుట. ఇప్పటి బి. యే. లు, వాళ్లంతటవాళ్లే ఉద్యోగాలకొరకు ఊరేగుతున్నారులెండి.—ఇంగ్లీషు రాజవిద్యగావడంచేత, ప్రథమములో మనవాళ్లకు యేమాత్రము ఇంగ్లీషువచ్చివున్నా, సర్కారువారు పిలిచి గొప్పగొప్పఉద్యోగాలు యిచ్చేవారు. ఆరోజుల్లో సర్కారులోగాని, ప్రజల్లోగాని, నౌకర్లకు మంచిగౌరవముండేది. అందువల్ల ప్రతివారు ఇంగ్లీషుచదువుకు సిద్ధమైనారు. అప్పటి విద్యావిధానము యిలావుండేదిగాదు. రానురాను మనకు

పాశ్చాత్యవిద్యతోపాటు నాగరికతగూడ పట్టుబడ్డది. ఈకారణమువల్ల మాతృభాషకు, వృత్తులకు హానిగలిగి, క్రమక్రమంగా సన్నగిల్లినయి. ఈవీలు ననుసరించి, బ్రిటిషుప్రభుత్వ మిచ్చట నాటుకొనజేయునట్టియు, కేవలము భారతీయులను బానిసలుగా జేయుటకు మాత్రమే వుపయోగపడునట్టి టువు, గ్రంథములను, విద్యాలయములందు పఠనీయములుగా బెట్టించారు. ఎన్నాళ్లు చదివినా తరగని బండ్లకుబండ్లుపుస్తకాలు మనవాళ్ల చేత కొనిపిస్తూ, యెన్నాళ్లుచదివినా, తుదకు యెందుకు పనికిరాని విద్య బోధిస్తున్నారు.

విదేశస్థుల గొప్పతనమును చాటుచూ, విదేశీయులపరిపాలనలో హిందూదేశమునకు గొప్ప లాభం కలిగిందనిన్ని, ఇంగ్లీషువారే విజ్ఞానవేత్త లనిన్ని బోధించేగ్రంథాలు స్కూళ్లలో పెట్టించారు. మనదేశ చరిత్రలు, విజ్ఞాననాగరికతలు, ఆచారవ్యవహారాలు, తెలియజేసే గ్రంథాలు, లేనేలేవు. ఒకవేళ వున్నవను కొన్నా, ఆగ్రంథస్థవిషయాలు మన ఆచారవ్యవహారాలకు సత్యదూరములు. ఈవిధంగా దేశమంతా ఇంగ్లీషుమయమైపోయింది. అధికసంఖ్యాకులు చదువుకొన్నవాళ్లుగావడంచేత, నౌకరీలు లభించక నిరుద్యోగసమస్య పెద్దదై పోయింది. నేటికొరకు యీవిద్య నభ్యసించామో, ఆ ఉద్యోగాలు లభించడము, రాను రాను దుర్లభమైపోయింది. కేవలము బానిసత్వమునకుమాత్రమే సహాయపడు యీవిద్య, నౌకరీలులేనప్పుడు మనకెందుకు పనికివస్తుంది? కట్టలుకట్టలుగా పెరిగివచ్చే గ్రంథాలు యేకేటూ, చదువుదూ, జీవితమంతా ధారవోసి, మడిమాన్యాలు కోలుపోయి, నామమాత్రావశిష్టులైన మన యువకులకు జీవనోపాధియేది? ఈవిద్య యింకెందుకు పనికివస్తుంది? ఈ విద్యాధికు డింకేమిపనిజేస్తాడు? మన ఆచారవ్యవహారాలు మంచిచెడ్డలు తెలుసుకోకుండా, నాలుగవజార్జికి యెంతమంది కొడుకులో తెలుసుకొంటే, ప్రయోజనమేమున్నది?

కాబట్టి, "ఇంగ్లీషుచదవడం, తప్పంటారా?" అని పశ్నించవచ్చు. తప్పని యెవరుచెప్పరు. దాని సారము పిండుదామనే తలంపులేకుండా, పరీక్షలు ప్యాసయి, డిగ్రీలుసంపాదిస్తే, ఉద్యోగాలు చేయవచ్చునుగదా, అనే ఆశవదలి, వ్యాపారమునకు, వ్యవహారమునకు చాలినంతవరకు, అవసరమైనంతవరకు, నేర్చుకొనుట మంచిది. ఇంగ్లీషువిద్యాభ్యాసమునకు యెంతశ్రద్ధతో శ్రమపడుతున్నామో, అంతశ్రద్ధతో, మాతృభాషను నేర్చుకోడానికి కూడా శ్రమపడాలి. జాతిగౌరవమును నిలుపదగినవిద్య, జీవయాత్రను సాగించుట కనుకూలపడేవృత్తులు, దేశమును బాగుచేసేకళలు, నేర్పేవిద్యాశాలలు మనకుకావాలి. మనదేశపద్ధతులకు కట్టుబాట్లకు అనుకూలపడుతూ, యువకులకు దివ్యతేజస్సును, బలపరాక్రమములను యిచ్చే వ్యాయామ క్రీడలు, మనకుకావాలి. ఇవన్నీ, యేవిధంగా మార్చుకోడానికి సాధ్య మవుతుందో అనే విషయాన్ని మరొకవ్యాసములో మనవిజేసుకొంటాను. మనదేశము మంచిస్థితికిరావలెనంటే, నేటి విద్యావిధానము మారిపోవలెననిమాత్రము చెప్పకతప్పదు.

---

చెన్నరాజధానియందు ౧౯౩౨-వ సంవత్సరము అక్టోబరు ప్రారంభము మొదలు డిసంబరు తుదివరకు గల మూడునెలల కాలమున ముద్రితములయి ప్రకటితములయిన

# ఆంధ్ర గ్రంథముల పట్టిక*

### అలంకారశాస్త్రము

అలంకారశాస్త్రచరిత్రము, భా. ౧— మేడేపల్లి వెంకటరమణాచార్యులు

### ఇతిహాసము

శ్రీమదాంధ్రమహాభారతము—(ప్ర) సి. పార్థసారథి, గుంటూరు

### కథలు—ఐతిహాసికములు, పౌరాణికములు

అరుంధతి—డి. కామయ్యభుక్త

ఉపాఖ్యానమంజరి—డి. వెంకటబలరామయ్య

నరకాసురుడు—డి. కామయ్యభుక్త

మహాపతివ్రతలకథలు—యం. అచ్యుతరామశాస్త్రి.

రాయబారము—డి. వెంకటకృష్ణరావు

శ్రీకృష్ణజననము—డి. కామయ్యభుక్త

శ్రీ భాగవతకృష్ణకథా సంగ్రహము నిర్వచనము—యం. కామాక్షయ్య

### —కల్పితములు

కలభాషిణి—దువ్వూరి వెంకటరమణశాస్త్రి

గలివరునౌకాయాత్రలు—(ప్ర) వెంకటరాంఅండ్ కో, ఏలూరు

జంతువులకథ—(ప్ర) క్రిశ్చియన్ లిటరేచర్ సొసైటి, మదరాసు

పిట్టయొక్క చావు—(ప్ర) క్రిశ్చియన్ లిటరేచర్ సొసైటి, మదరాసు.

పిల్లికథ, ఎలుసుబంటికథ—క్రిశ్చియన్ లిటరేచర్ సొసైటి, మదరాసు

భగ్నమనోరథము—యన్. బాలకృష్ణరావు

### కల్పము

చంద్రోదయోమావ్రతకల్పము—(ప్ర) సి. లక్ష్మీనృసింహశాస్త్రి, మచిలీపట్టణము

లక్షపత్రివ్రతకల్పము—(ప్ర) సి. లక్ష్మీనృసింహశాస్త్రి, మచిలీపట్టణము

### కావ్యములు

అద్భుతస్వయంవరమహాకావ్యము, భా. ౧, ౨—వి. లక్ష్మీనృసింహశాస్త్రి

అమరుకము—అమరుకకవి

విజయలక్ష్మీవిలాసము—శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి

విరజోపాఖ్యానము—సి. లక్ష్మీనారాయణశాస్త్రి

శ్రీమదాంధ్రవాల్మీకిరామాయణము—(అను) వావిలికొలను సుబ్బరావు

శ్రీరామాయణ సారోద్ధారే బాలకాండః— యం. నరసింహావధాని

### గణితశాస్త్రము

గణితశాస్త్రము, బుక్. ౧— వి. శ్రీనివాసాచారి

నవీనఆరంభగణితము—యస్. నారాయణఅయ్యర్

నవీనగణితము—పి. వి. సుబ్బరావు, ఆర్. వీరభద్రరావు

నూతనబాలగణితము—వి. వి. కృష్ణమూర్తి అయ్యర్

### గేయములు

అచలానందగోవిందపాట—బి. రంగసామిరెడ్డి

గాంధిగీత—డి. బలరామకృష్ణయ్య

---

* ఈ పట్టికయందుగల సంకేతపదముల వివరణము: అ.—అధ్యాయము. అను.—అనువాదము, అనువాదకులు. ప.—పద్యము. ప్ర.—ప్రకాశకులు. భా.—భాగము. వ.—వచనము. సం.—సంపాదకులు. సటీ.—సటీకము.

గ్రామఫోనుపాటలు—(ప్ర) జె. సుబ్బరాయులుశెట్టి, కడప
గ్రామఫోనుపాటలయాదర్శిని—(ప్ర) కె. వీరాసామి నాయుడు, అంబాజీపేట
చందలూరి శ్రీ మహాలక్ష్మీకీర్తనలు—జి. వెంకటేశ్వర రావు.
తెలుగుసీమ—డి. బలరామకృష్ణయ్య
తోహరారత్నమాలిక—కె. ఆర్. విజాపూర్కర్
నామసంకీర్తనము—(ప్ర) రామకృష్ణపూజామందిరము, కొత్తపేట
పతితపావనరాం—ఎ. హనుమయ్య
భక్తరత్నమాల—(ప్ర) భాగవత ప్రార్థనసమాజము, ఏలూరు
భజనతరంగిణి భా. ౧, ౨—ఐ. వెంకమాంభ
మాధవదాసచరిత్ర—కే. మాధవదాసు
శ్రీజ్ఞానపతిబోధనకథాకీర్తనలు, భా. ౧—యల్. ఉక్కప్పరావు
శ్రీ ఆత్మారామతత్త్వామృతము—యస్. వరదదాసు
శ్రీకృష్ణగురుబోధామృతమహోదయము—బి. కోటప్ప
శ్రీ పాండురంగబృందావన సంకీర్తనలు—ఏ. నారాయణదాస్
శ్రీబాలికాజనమనోరంజనిపాటలు—పి. సీతారామయ్య
శ్రీమత్ భగవన్నామములు, భా. ౧—(ప్ర) గోపాల కృష్ణమందిరము, అమృతలూరు
శ్రీరామకృష్ణప్రేమామృతము—యస్. వరదదాసు

## చ రి త్ర

హిందూదేశచరిత్ర—డి. అప్పారావు, ఆర్. సూర్య నారాయణ

## జీవితములు

తరిగొండ వెంకమాంబావిజయము—కె. విక్రాల రామ చంద్రాచార్యులు
భక్తముకుందజీవితము—వడ్లమాని సోమనాథశర్మ
రామకృష్ణపరమహంస జీవితకథ—తత్త్వానందస్వామి
శ్రీకృష్ణునిజీవితము—డి. సీతారామరావు

## జ్యోతిషము

ముహూర్తమార్తాండము—(ప్ర) సి. లక్ష్మీనృసింహ శాస్త్రి, మచిలీపట్టణము

## దండకము

దండకరత్నములు—(ప్ర) కె. వీరవెంకయ్య, రాజ మహేంద్రవరము

## నవలలు

అర్ధరాత్రపు వింత, మూడుహత్యలు—జె. వెంకటరాధా కృష్ణయ్య
ధనలక్ష్మి—యం. కామేశ్వరరావు
నారాజు—తాల్లూరి సుబ్బరావు
ప్రేమ—ఐ. విష్ణురావు
లలితకుమారి—వంగూరి సుబ్బరావు
వీరయువకులు—వి. కొండలరావు
శరణ్య—యస్. స్వర్ణమ్మ
హేమ—కె. గురుమూర్తి

## నాటకములు

అనసూయ—సి. మాణిక్యశర్మ
గృహ్యసౌఖ్యనాటకము—కె. యస్. కన్నికేశ్వర అయ్యర్
చంద్రగుప్తనాటకము—ముత్తరాజుసుబ్బరావు
ద్రౌపదీవస్త్రాపహరణము—డి. లక్ష్మీనరసింహం
పద్మవ్యూహము—సి. మాణిక్యశర్మ
పాండవాంకురము—ఏ. వెంకటచలపతిరావు
పాదుకాపట్టాభిషేకము—పప్పు సూర్యనారాయణ
ప్రాణసంరక్షణి—కె. జయరామరావు
భగ్నకుంభము—సి. సత్యనారాయణచౌదరి
మహాకవికాళిదాస—ఎ. హనుమంతరావు
మహిళామహోదయము—పి. వీరరాజుగుప్త
లక్ష్మణోర్వీసుత—జి. సోమయ్య
శ్రీమహాభక్తవిజయము—యస్. రామానుజరావు
సంగీతసావిత్రి—సి. వెంకటరామయ్య

సంగీతసావిత్రి—ఎ. సోమేశ్వరరావు
సంపూర్ణమహాభారతము—డి. గోపాలకృష్ణరావు
సతీసక్కుబాయి—కె. కామేశ్వరరావు
సతీసక్కుబాయి—వి. సూర్యప్రకాశరావు
సీతాకల్యాణము—డి. మాణిక్యం

## నీతి

కుమారనీతికథలు, భా. ౨, ౩, ౪—యం. రాధాకృష్ణమూర్తి
నీతిచంద్రిక—పి. చిన్నయ్యసూరి
నీతివాచకము, బుక్ ౨, ౩, ౪, ౫—యం. వెంకటరత్నం, యం. గురునాథశర్మ
నీతిశ్లోక రత్నావళి— (ప్ర) వేదం సూర్యనారాయణ శాస్త్రి, నెల్లూరు
బాలనీతి—టి. లక్ష్మీనృసింహరావు
బాలనీతికథలు, భా. ౧—ఏ. యల్. నారాయణ

## పరిశిష్టము

అంతఃపురరహస్యాలు—జె. వెంకటరాధాకృష్ణయ్య
(డాక్టర్) ఆనీబెసెంటుగారివర్ధంతి సందేశము—(ప్ర) ఆంధ్రథియసాఫికల్ ఫెడరేషన్, రాజమహేంద్రవరము
ఉపన్యాసము—(ప్ర) యం. రామకృష్ణరావు, నెల్లూరు
ఉపన్యాసదీపిక—పి. రామచంద్రరావు
ఏలూరుఅన్నవస్త్రవైద్య, విద్యాదానసమాజము ఏడవ రిపోర్టు—(ప్ర) సమాజమువారు, ఏలూరు
కిశోరవీరులతరిబీతువిధానము—పి. వెంకటరమణరావు
క్రొత్తతెలుగుబాలశిక్ష—డి. రామమూర్తి
గృహస్థాశ్రమతత్వము—రామతీర్థస్వామి
తులసీదళము—యన్. పేరిరాజు
దేశభక్తి—ఇ. సుబ్రహ్మణ్యం
నవనాగరికగ్రామము—కె. జాన్
నిజం—భమిడిపాటి కామేశ్వరరావు
నూతనపద్ధతి ఆంధ్రవాచకము, బుక్. ౧—ఏ. వి. నరసింహం
పడకటింటిముచ్చట్లు—యం. సుబ్బరావు
పిరదౌసి—జి. జాషువ
బాలశిక్ష—టి. కృష్ణారెడ్డి
మహర్నవమిపద్యములు అను దసరాపద్యములు—(ప్ర) డి. జగన్నాథం అండ్ సన్స్, రాజమహేంద్రవరము
మేలుకొలుపు—(ప్ర) రామకృష్ణ పూజామందిరము, కొత్తపేట
వాణివాచకము, తరగతి, ౪, ౫—జె. సర్వభద్రం, యం. వెంకటశాస్త్రి, సి. దీక్షితులు
శ్రీ తులసీబృందావనము—యస్. వరదదాసు
సబర్మతీ ఆశ్రమనియమములు—యం. కె. గాంధి

## పురాణములు

గజేంద్రమోక్షము—(ప్ర) ఎ. లక్ష్మణస్వామినాయుడు, రాజమహేంద్రవరము
రుక్మిణీకల్యాణము—(ప్ర) ఏ. లక్ష్మణస్వామినాయుడు, రాజమహేంద్రవరము

## మతము—హిందు

ఆగమవిచారపరామర్శము—వాడపల్లి కేశవాచార్యులు
భగవధ్యానక్రమము—(ప్ర) రామకృష్ణ పూజామందిరము, కొత్తపేట

## —ఇతరములు

క్రైస్తవ గృహశిక్ష—(ప్ర) క్రిశ్చియన్ లిటరేచరు సొసైటి, మదరాసు
బాబెలునుండి బేత్లేహేమువరకు—(ప్ర) క్రిశ్చియన్ లిటరేచరు సొసైటి, మదరాసు
రాయబారియు సాక్షియునైన పౌలుచరిత్ర—(ప్ర) క్రిశ్చియన్ లిటరేచర్ సొసైటి, మదరాసు
సర్వేశ్వరమహత్త్వము అనగాతోభ్య చరిత్రము—(ప్ర) జె. ఆలన్, నెల్లూరు
హమానుగర్వభంగము—బి. ఆనందం

## మాహాత్మ్యములు

గోదావరీ పుష్కర మాహాత్మ్యము—పి. కృష్ణమూర్తి శాస్త్రి

పద్మావతి శ్రీవేంకటేశ్వర క్షేత్రమాహాత్మ్యము—(ప్ర) క. సుందరాచార్లు, తిరుచానూరు

మహాలింగార్చనవ్రత మాహాత్మ్యము—(ప్ర) సి. లక్ష్మీనృసింహశాస్త్రి, మచిలీపట్టణము

వేంకటాద్రిమాహాత్మ్యము—వి. క. శేషాద్రి అయ్యంగారు

శ్రావణమాసమాహాత్మ్యము—(ప్ర) సి. లక్ష్మీనృసింహశాస్త్రి, మచిలీపట్టణము

శ్రీమదాంధ్రమాఘమాహాత్మ్యము—(అను) వి. శేషాచారి

శ్రీ వెంకటాచలదివ్య క్షేత్రమాహాత్మ్యము—(ప్ర) యం. రుద్రయ్యనాయుడు, తిరుపతి

## వేదాంతము

ఓంకారమే మోక్షదాయకము—(ప్ర) సి. అలివేలు మంగమ్మ, మదరాసు

గీతాబోధ—యం. క. గాంధి

జ్ఞానోదయము, భా. ౧—టి. సుబ్బరావు

భగవద్గీతామృతసారము, భా, ౬,౭—(ప్ర) యం. తుమ్మయ్యశెట్టి, మదరాసు

మహావాక్యరత్నప్రభావళిః—(ప్ర) సి. లక్ష్మీనృసింహశాస్త్రి, మచిలీపట్టణము

యథార్థభారతి—(ప్ర) వ్యాసాశ్రమము, ఏర్పేడు

విచారసంగ్రహము—(ప్ర) శాంతిఆశ్రమము, గంటసాలపాలయం

సద్యోముక్తిసూచని—శ్రీనిత్యానందస్వామి, ఏలూరు

## వైద్యశాస్త్రము

అష్టాంగహృదయము—(ప్ర) పి. వెంకటకృష్ణరావు, మదరాసు

ఆయుర్వేదవైద్యామృతము—డి. సోమలింగాచార్యులు

రసప్రదీపిక—యం. వెంకటాచారి

విషవైద్యము—జె. వెంకటరాధాకృష్ణయ్య

## వ్యాకరణశాస్త్రము

తృతీయపుష్పము—యం. రామచంద్రశాస్త్రి, పి. లక్ష్మీనారాయణశాస్త్రి

వర్తకబోధిని—నాళం రామలింగయ్య

సంగ్రహవ్యాకరణము—కందుకూరు వీరేశలింగం

## శతకములు

అమృతాంజనశతకము—క. నారాయణాచార్యులు

జానకీనాయకశతకము—యన్. గోపాలాచార్లు

శంకరశతకము—సి. శంభులింగకవి

శ్రీరామశతకము—బి. నారాయణ

శ్రీలోకపావనశతకము—సి. వెంకటసుబ్రహ్మణ్యం

శ్రీహరిశతకము—వీరబ్రహ్మశోభనాద్రికవులు

## సాంఘికము

సాంఘికశాస్త్రము—యం. కృష్ణమాచార్యులు

## స్తోత్రములు

ఆదిత్యహృదయస్తోత్రం—(ప్ర) ఏ. కన్నన్‌శెట్టి అండ్ కో, మదరాసు

నక్షత్రమాల—(ప్ర) టి. రామస్వామయ్య, మదరాసు

శివానందలహరి—(ప్ర) క. వీరవెంకయ్య, రాజమహేంద్రవరము

శ్రీరామగుణస్తుతి—చ. శ్రీరామశాస్త్రి

శ్రీరామ స్తవరాజము—వెంకటరావు

శ్రీ వేంకటేశ్వరవైభవము—టి. రామస్వామయ్య, మదరాసు

## హరికథ

గరుడగర్వభంగము—ఏ. వీరబ్రహ్మాచార్యులు

# నక్షత్రములు - ఖగోళ ధ్రువప్రాంతములు

గోబ్బూరు వెంకటానంద రాఘవరావు

Lift up your eyes on high, the heavens behold
The Sun rides flaming in his car of gold;
The Moon by night refulgent gilds the sky.
The starry host shines forth in majesty
The planets beam resplendent in their spheres.
Divinest harmony midst all appears.
Glorious the scene, and will the watcher find
Each orb a lesson to the enquiring mind.
Though silent all, those radiant armies tell
Of one great Hand that doeth all things well.

"నాయనా! కన్నులు పైకెత్తి ఆకాశమును పరికింపుము. స్వర్ణరథస్థితుడై సూర్యుడు అఖండతేజముతో ప్రజ్వలించుచు సగిభ్రమించుచున్నాడు. నిశాసమయమున చంద్రుడు పండువెన్నెలతో విశ్వమునకు మెఱుగుపెట్టుచు అత్యుల్లాసముతో వెలుగొందుచున్నాడు. నక్షత్రకోటులు నవరత్నములలాగున మహావైభవముతో నంబరమున మెఱయుచున్నవి. మిణుకుమిణుకుమను నక్షత్రములమధ్య గ్రహములు నిలుకడగన్న తేజస్సుతో రాజిల్లుచున్నవి. వివిధవికాసభాసురమైన యీ దివ్యదృశ్యమునందలి పాత్రలకన్నింటికి నెంతో పొందిక సుదిరి రమ్యమై యొప్పుచున్నది. ఓహో! ఏమి తేజస్తరంగ సముజ్జ్వలరంగము నేత్రపర్వము చేయుచున్నది? ఈమహాద్భుతప్రదర్శనము నిలకించి యోజించు జిజ్ఞాసువుల కొక్కొక్క తేజోబింబ మొక్కొక్కయంశమును బోధించుచున్నది. మనవలె మాటలాడకున్న నేమి? ఆబ్రహ్మాండకోట్లు సమస్తవిశ్వమును చక్కగా నిర్మించి నిర్వహించుచున్న పరాత్పరుని సృష్టికౌశలము ననంతముఖములతో ఘోషించుచున్నవి.

ఈ జ్యేష్ఠబహుళద్వాదశి మొదలు ఆషాఢబహుళద్వాదశి (July 8 మొదలు ఆగష్టు ౮) తేదీవఱకును, రాత్రి తొలిజాముస నగపడు గ్రహనక్షత్రాదులను పరిశీలింతము. (చూ. చిత్రము ౧.)

ఈనెలలో పాలవెల్లి (Milky Way) చంద్రవంకవంటి ఆకృతికలిగి ఈశాన్యమునుండి నైఋతిదిశకు అప్సరస, ఊర్వశీపురూరవసు, రాజహంస, వీణ, గరుడ, విష్ణుపద, శేష, ధన్వ, జ్యేష్ఠ, వృక, వేదిక, అశ్వతర మండలములమీదుగా వ్యాపించియున్నది.

తేజోవంతము లైన నక్షత్రములలో (First Magnitude stars) ఎనిమిదిమాత్ర మిపుడు కనబడుచున్నవి. ౧. మఘ, (Regulus) ౨. చిత్త (Spica), 3. స్వాతి (Arcturus) ౪. జ్యేష్ఠ, (Antares) ౫. బ్రహ్మ, (Vega) ౬. శ్రవణము. (Altair) ౭,౮ Alpha and Beta Centaurus. ఆషాఢశుద్ధఏకాదశి తొలియేకాదశి అనిచెప్పుదురు. నాటినుండి విష్ణుమూర్తి శయనసురుడగునని చెప్పుదురు. అనగా మహావిష్ణువు గగనమధ్యరేఖ (Meridian) ను దాటుదినము. మరిరెండుమాసములనాడు అనగా భాద్రపదశుద్ధఏకాదశినాడు పడమట అస్తమించును. దీనినే పరివర్తనఏకాదశి అందురు. పరివర్తన అనగా ఒత్తిగిలుట యనిఅర్థము చెప్పుదురు. అంతవరకును ఒకప్రక్క పండుకొనినవిష్ణుమూర్తి రెండవప్రక్కకు తిరుగునని చెప్పుదురు. ఖగోళార్ధములో పడమట అస్తమించి, దిక్కు మార్చి, పిదప కార్తికశుద్ధఏకాదశికి తూర్పున నగపడుట—అని మనము తెలిసికోవలయును. కార్తికశుద్ధఏకాదశి బోధనఏకాదశి—విష్ణుమూర్తి నిద్రమేల్కని తూర్పున సూర్యోదయమునకుముందు కనబడుదినము. ఆనాటితో చాతుర్మాస్యవ్రతముకూడ

ప్రాప్తియును. విష్ణుమండలనక్షత్రములగమనమునకును, ఏకాదశులకును గలసంబంధము ఇట్లు పరిస్ఫుటము చేయబడుచున్నది.

## ధ్రువప్రాంత నక్షత్రములు - గమనవిశేషములు

### ధ్రువచక్రము

చంద్రుడు భూమిచుట్టు తిరుగుచున్నాడు.




చిత్రము ౧.

ఈవ్యాసమునకు విశేషవిషయముగా ఉత్తరమున ధ్రువప్రాంతములందలి నక్షత్రవివరముల నరయుదము. భూమి తాను తిరుగుచు సూర్యునిచుట్టును తిరుగుచున్నది. భూమి తానుతిరుగుటవలన రాత్రి, పగలు అనుభేద

మేర్పడుచున్నది. సూర్యునిచుట్టు తిరుగుటవలన, మాస, ఋతు, సంవత్సర భేదములు కలుగుచున్నవి. ప్రతి దినమును, సూర్యుడు తూర్పున నుదయించి, పడమట నస్తమించుచున్నట్లు మనకు కనబడుచుండగా, భూమి సూర్యునిచుట్టు తిరుగుచున్నదని వ్రాయుట సరికాదని తోచవచ్చును రైలుబండిలో కూరుచున్నప్పుడు ఆలోపలివారికి పైనున్న భూమి, పొలములు, చెట్లు, చేనులు, మనుష్యులు వేవేగ కదలిపోవుచున్నట్లు తోచును. అది వట్టిభ్రాంతి. కదలుచున్నది రైలుబండి; అందులోనున్న మనుష్యులును ; అయినను గమనవేగముచేత లోపలివారు స్థిరముగా నున్నట్లును, వెలుపటి వస్తువులును, మనుష్యులును కదలుచున్నట్లును కనబడును. అది భ్రమ కాని నిజముకాదు. అట్లే సూర్యుడు కదలుట భ్రమ. సూర్యునిచుట్టు భూమి తిరుగుట నిజము.

పైరెండు గమనములేగాక, భూమికి విచిత్రమైన మరియొక గమనము కూడకలదు. అదేమనగా:—భూమియొక్క ఇరుసు (axis of the Earth) ఉత్తర ఖగోళముపైని సుమారు ఇరువదియారువేల సంవత్సరములకు ఒక వలయముపూర్తి చేయును. చిత్రము ౨. ఆ వలయమే ధ్రువచక్రము. మూడవ చిత్రములో పెద్ద చక్రములోపల,




చిత్రము ౨.

బ్రహ్మనక్షత్రమునకు దిగువ కనబడు చిన్న చక్రమే ధ్రువచక్రము. అది యిరువదియారు భాగములుగా విభజింపబడియున్నది. మన భూమియొక్క యిరుసు ఇందు ఒక భాగమునుండి ప్రక్క భాగము చూపుటకు కదలుటకు సరికి వేయి సంవత్సరములు పట్టును. ఈచక్రపు పరిధి పైనున్న యేనక్షత్రమును ఒకప్పుడు భూమి యిరుసు చూపుచుండునో ఆ నక్షత్రము ఆ కాలమున ధ్రువనక్షత్రముగా నుండును. ఆనక్షత్రము స్థిరముగా ఉత్తరమున నున్నట్లును, తక్కిన నక్షత్రములు గ్రహములు, లోనగునవన్నియు ఆధ్రువతారచుట్టును తిరుగుచున్నట్లును మన కగపడుచుండును.

నేటిమనధ్రువున కీస్థానము లభించుటకు ఇరువదియారువేలసంవత్సరములు పట్టెనని భాగవతము స్పష్టముగా తెల్పుచున్నది.

భాగవతము, చతుర్థస్కంధమున:—

౧౯ "వేదాహం తే వ్యవసితం హృది రాజన్యబాలక.

౨౦ "......భ్రాజిష్ణుర్ధ్రువక్షితి, యత్ర గ్రహర్క్ష తారాణాం జ్యోతిషాం చక్ర మాహితమ్.

౨౧ "మేఢ్యాం గోచక్రవత్స్థాస్ను పరస్తాత్కల్పవాసినామ్, ధర్మోఽగ్నిః కశ్యపః శుక్రో మునయో యే వనౌకసః, చరంతి దక్షిణీకృత్య భ్రమంతో యత్సతారకాః.

౨౨ ప్రస్థితేతు వనం పిత్రా దత్వా గాం ధర్మ సంశ్రయః, షడ్వింశద్వర్ష సాహస్రం రక్షితా వ్యాహితేంద్రియః.

ఆంధ్రభాగవతము, చతుర్థస్కంధము. ౨౮౯-౨౯౦.

"వ అది యెట్టిదనిన నెందేని మేధియందు పరిభ్రామ్యమాణగోచక్రంబునుంబోలె గ్రహనక్షత్రతారాగణజ్యోతిశ్చక్రంబు నక్షత్రరూపంబులైన ధర్మాగ్ని కశ్యపశుక్రులును, సప్తఋషులును, దారకాసమేతులై ప్రదక్షిణంబు తిరుగుచుండుదు రట్టి...ధ్రువక్షితియను పదంబు ముందట నిరువదియారువేలేండ్లు సనంభ్రాపింతువు."

ధ్రువచక్రరహస్యము, దానికాలమితి మన పూర్వు లెరుగుదురనుటకు ఇంతకంటె ప్రబలప్రమాణమేమి కావలెను?




చిత్రము 3.

[భూమి తనకుతాను తిరుగుచు, సూర్యునిచుట్టు తిరుగుటయేగాక, భూమియొక్క ఇరుసు (axis) ఉత్తర ఖగోళముపైని సుమారు ౨౬౦౦౦ ఇరువదియారువేలసంవత్సరములకు ఒక వలయము పూర్తిచేయును. ఆవలయమే ధ్రువచక్రము. పైచిత్రములో బ్రహ్మ దిగువనున్న చిన్నచక్రమే ధ్రువచక్రము. అది ఇరువదియారుభాగములుగా భాగింపబడినది. భూమిఇరుసు వేయిసంవత్సరములకు ఒకభాగమునుండి ఒకభాగమునకు కదులును.]

ఐదువేలసంవత్సరములక్రిందట ఇప్పటిధ్రువనక్షత్రము నరకును ఆక్రమించియుండెను. ఆనాటిధ్రువుడైన త్రము ధ్రువస్థానమున లేదు. ఆనాటిధ్రువస్థానమును నరకునిచుట్టు సప్తఋషులు, లఘుఋక్షము మొదలగు

నవి పరిభ్రమించుచుండుట నాల్గవచిత్రములో చూడ
నగును. అందలి 'న' గుర్తుగలచుక్క నరకాసురమండ




చిత్రము ౪.

[ఇప్పటికి సుమారు ఐదువేల సంవత్సరముల క్రిందట ధ్రువమండలము ఈపటమున నున్నట్లు కనబడుచుండెను.

న-నరకమండలములోని ముఖ్యనక్షత్రము. ఆనాటి ధ్రువు డిదియే. నాడు ఈచుక్క కదలకుండ ఉండెడిది. సప్తఋషులు లోనగు తారలు ఈచుక్కచుట్టు తిరుగుచుండెను.]

లములోని ముఖ్యమైనచుక్క అయియుండెను. అయ్యది ఉత్తరదిక్కున కదలక ఉండెడిది. దానిచుట్టు సప్తఋషులు లోనగుతారలు తిరుగుచుండెడివి. ఆచుక్క అపుడు మహోజ్జ్వలకాంతితో ఉత్తరాకాశమున మెఱయుచుండెను. కాలక్రమమున నది ధ్రువస్థానమునుండి తొలగిపోవలసివచ్చెను. కాంతికూడ తరిగిపోయినది. ఇపుడు మూడు నాలుగు తరగతులమధ్య చుక్కయొక్క తేజస్సు తప్ప మరేమియు లేదు. (only a third or fourth magnitude star) ఈచుక్కల సంపును పాశ్చాత్యులు Draconis Dragon అని చెప్పుదురు. మనవారు నరకాసురుడని చెప్పినారు.

(౧)నరకుడు యోగనిద్రాపరాయణుడైన నారాయణునకును, భూదేవికిని జనించినాడు. ధరాసూనుడు, Draconis అనునది ధరాసూనుడు అనుదాని వికృతియని తోచుచున్నది. Dragon అనునది ధరకన్నవాడు అని సూచించుచున్నది. ఉత్తర దిక్కున నొకప్పుడు విష్ణుపదమునకును, భూరేఖకును మధ్య నీచుక్కలు కనబడుటచేత నరకుడు భూదేవికిని, యోగనిద్రాపరాయణుడగు నారాయణునకును జనించినట్లు గాథలు కల్పింపబడుటకు అవకాశములున్నవి.

(౨) నరకాసురునికి పంచజన, హయగ్రీవ, నిశుంభ, మురాదులు సేనానాయకులని భాగవతము, హరివంశము తెల్పుచున్నవి. అందు మురుడు పంచముఖుడు. చూ. భాగవతము, దశమస్కంధము, ఉత్తరభాగము. ౧౬౦ - ౧౬౪.

"పంచశిఖుండైన మురాసురుండు నిదురపాలించి యావులించి నీల్గి లేచి జలంబులు వెడలి వచ్చి హరింగని ప్రళయకాలకీలికైవడి మండుచు దుర్నిరీక్ష్యుండై కరాళించుచు తనపంచముఖంబులం బంచభూతమయంబైనలోకంబు మ్రింగనప్పళించు చందంబునం గదిసి:—"

ప్రక్కపటములో, నరకాసురుని ఘోరరూపము వాని పరిచారకులతోకూడ చిత్రింపబడినది. అందు మురుడు (డెల్టా, సిగ్మా, ఎప్సిలాన్, రో, పై గుర్తులుగల) చుక్కలనియు, వానిపంచముఖములు నాకాశమున నిట్లు నేటికిని చూడనగుననియు విన్నవించుచున్నాను.

వానికుమారు లేడ్గురు:—(చూ. భాగవతము X ఉత్తరభాగము ౧౬౫, "వానిసూనులు జనకవధజనితశోకాతురులై తామ్రుండు, అంతరిక్షుండు, శ్రవణుండు, విభావసుండు, వసుండు, నభస్వంతుండు, నరుణుండు నననేడ్వురు...పీఠుండనియెడు దండనాథుం బురస్కరించుకొని" వెడలిరి. ఇందు

| | | |
|---|---|---|
| అంతరిక్షుడు | ఒమిక్రన్ | Draconis |
| శ్రవణుడు | ౪౬ | ,, |
| పీఠుడు | ౪౫ | ,, |
| తామ్రుడు | 3౯ | ,,Also b(బిగుర్తు) |
| వసువు | కై | ,, |
| అరుణుడు | గామా | ,, |
| విభావసుడు | బీటా | ,, |
| నభస్వంతుడు | న్యూ | ,, |

[చిత్రము ౫. ధ్రు-అనునది ఖగోళధ్రువము (celestial Pole). ధ్రు ౧-మన ధ్రువుడు. ఈచుక్క ఖగోళధ్రువ స్థానమున కతిసమీపముగా ఇక ౧౬౧ సంవత్సరములకు అనగా A. D. ౨౦౯౫ నాటికివచ్చును. ధ్రు ౨. క్రాంతి చక్రము (Ecliptic)యొక్క ధ్రువము. (Ecliptic Pole.) ]

అపునీ సుర్తులుగలచుక్కలుగా ఆకసమున నున్నారు. హయగ్రీవుడు గుఱ్ఱపుకంఠమువంటియాకారముతో క్రమముగా ౯౦-౫౦-౩౬, ఒమీగా సుర్తులుగలచుక్కల రూపమున కానవచ్చుచున్నాడు. పంచజనుడు జీటా, గూ, ఈటా, తీటా, అయోటానుర్తులుగల చుక్కల రూపముతో ఆకాశమున కానవచ్చుచున్నాడు. వీనిని సంహరించి శ్రీకృష్ణుడు పాంచజన్యశంఖమును గైకొన్నట్లు పురాణములు తెల్పుచున్నవి. ఈపంచజన హయగ్రీవ ముర నిశుంభాది సేనానాయకులతో నరకుడు జగద్భయంకరుడయ్యెను. అందును, మురుడు అదితిదేవికుండలములు రెండు హరించినట్లును, నిశుంభుడు ఊర్వశిని తెచ్చినట్లును, నరకుడు సప్తఋషులను మిక్కిలిపీడించినట్లును మన గ్రంథములు తెలుపుచున్నవి. ఈ యంశములు ఖగోళరీత్యా ఎట్లు అన్వయించుకోవలెనో చూతము.

## మురుడు అదితిదేవికుండలములు హరించుట

మననక్షత్రములలో పునర్వసు అదితిదైవత్యమని వేదవాఙ్మయము తెలుపుచున్నది. దేవతలందరకును అదితి దేవితల్లి. యజ్ఞము అదితిపూజతో ఆరంభమయి అదితి పూజతో అంతమగుచుండెను.

"అదితి ర్ద్యౌ రదితి రంతరిక్ష
మదితి ర్మాతా స పితా సపుత్రః
విశ్వేదేవా అదితిః పంచజనా
అదితి ర్జాత మదితి ర్జనిత్వమ్"

అని ఋగ్వేదము ౧౮౯-౧౦ ఋక్కుకలదు. ఈనాడు "Infinity" అను పదమువలన తెలియనగు భావము - అనగా అనంతము అనుభావము అదితిపదమువలన వ్యక్తమగుచుండెను. అనంతమగు కాలచక్రమునందు నరకుడు అధికారబలము చూపినకాలము సుమారు ౪-౫ వేల సంవత్సరము లుండును. ఆకాలచక్రమునందలి రేకులు అనగా రెండుమండలఖండములు (arcs of the wheel) హరింపబడినవి. నరకాసురుని ప్రచండసేనానియు, పునర్వసునక్షత్రమున కెదురుగానున్నవాడును నగు మురుడు ఆనక్షత్రాధిదేవతయు కాలస్వరూపియు నగు అదితి దేవియొక్క రెండుమండలఖండములు — (అవే కర్ణ




చిత్రము ౬.

భూషణములు, కుండలములుగా మనగ్రంథములు వర్ణించుచున్నవి.) మురుడు హరించుట యనునది ఆనక్షత్రముల గమనవిశేషములను గూర్చినఖగోళసత్యము.

## నరకుడు సప్తఋషులను పీడించుట

నరకుడు తనసేనానులలో నొకడగు నిశుంభుని పంపి ఊర్వశిని పిలిపించి దానిపొత్తు కోరెననియు, అది (సప్త) ఋషులను పీడించి హవిర్భాగములను పొందుమనియు పిమ్మట తానునువత్తునని తెలిపెననియు, అందు కంగీకరించి నరకాసురు డాఋషులను మిక్కిలిపీడించెననియు మనగ్రంథములు తెలుపుచున్నవి. హాస్యప్రియులైన బ్రహ్మశ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు ప్రసన్నయాదవనాటకములో, ఈఋషులు "బ్రదికియుండియు భూలోకమున ననుభవించిన నరకబాధను" జాలిగొలుపు నీక్రిందిపద్యమున వర్ణించినారు.

సీ. మొగము నెత్తురు గ్రమ్మ నెగసుంజీ దిగసుంజీ
బిరుసుగడ్డము లూడఁబెఱికినారు

క్రేలు పెన్నె జీజసల్ కేలునోయిని బూని
హుమ్మని యుయ్యాల లూఁగినారు
ఆజ్యమంతయుఁ ద్రావి యగ్ని హోత్రము లార్పి
హోమకుండంబుల నుమిసినారు
పారిపోవగనీక నోరు బ్రద్దలుచేసి
కుక్కమాంసము నోటఁగ్రుక్కినారు.
చెట్టులకు రెక్కలు విఱిచి కట్టినారు
చింతబరికలతో వెన్ను జెండినారు
నారగోచులు దిగలాగి నవ్వినారు
కూళలనుచు రక్కసిమూండకొడుకు లనఘ.

కవికల్పితభావము లటుండనిచ్చి ఖగోళమున నన్వయించుకొనినపుడు, 5 వేల సంవత్సరముల క్రిందట నరకాసురుడు ఘోరాకారముతో ఉత్తరాకాశమున ధ్రువ స్థానము నాక్రమించుకొనుటయును, నరకాసురపీడితు లైనట్లు సప్తఋషులు నరకుని చుట్టివచ్చుచుండుటయు నిశ్చయములు. మనవారు నరకుని ఘోరరాక్షసునిగా వర్ణించినారు. పాశ్చాత్యుల Draco చిత్రమును ఇట చూడనగును. పాశ్చాత్యగాథల ప్రకారము ఈఘోర సర్పమును త్రొక్కి పట్టి ఘోరయుద్ధముచేసి మడియించినవాడు Hercules. మన పురాణముల ప్రకారము ఆ రక్కసుని చంపి నరకబాధ తొలగించి రక్షించినవాడు యాదవకులేశుడు శ్రీహరి. ఈగాథయంతయు ఆకాశమున చిత్రింపబడి పురాణములలో వర్ణింపబడియున్నది. శ్రీ కృష్ణునిచే సంహరింపబడిన పిమ్మట నరకునికి తేజస్సుపోయినది. ఉత్తరాకాశమున ధ్రువస్థానము భ్రష్టమైనది.



చిత్రము ౭.

నరకు డాక్రమించిన ధ్రువస్థానమునుగూర్చి ఈజిప్టు పిరమిడులు ( Pyramids of Egypt ) తెలుపు సంగతులు:—

పైపటములలో నరకు డని 'న' అనునక్షర సంజ్ఞచే తెలుపు నక్షత్రమును పాశ్చాత్యులు తూబాన్ (Thuban) అని వ్యవహరించుచుందురు. ఆ చుక్క ఐదువేలసంవత్సరములకు పూర్వము ధ్రువస్థాన మాక్రమించియుండెనని చీఆప్సు పిరమిడుకట్టడము ( Great Pyramid of Cheops ) వలన తెలియుచున్నది. ఎట్లనగా:— ఆపిరమిడుకట్టడములో ఒకసొరంగము ( tunnel ) కలదు. ఆ సొరంగము ౩౮౦ అడుగులపొడుగు, ౪ అడుగులవెడల్పును, ౩౼ అడుగులవ్యాసము ( Diameter ) ను కలిగియుండెను. ఆ సొరంగము కట్టినవారు దాని నుత్తరముగా ఈచుక్కను చూపునట్లు నేర్పుగా నిర్మించినారు. అనగా ఉత్తరక్షితిజమునకు ౨౬°-౧౭ మినిట్లు వ్రాలియుండునట్లు పిరమిడ్ పీఠమునుండి దీనిని పైకి లేవదీసి కట్టినారు. కాబట్టి యీచుక్క దివారాత్రభేద మక్కర లేకుండ యీ సొరంగములోపలనుండి ఎప్పుడు చూచినను తప్పక కనబడుచుండెడిది. ఆచుక్క ఉత్తరముగా భావించుకొని తక్కిన దిక్కులు

నిర్ణయించుకొని, ఆ నిర్ణయప్రకారమే సరిగా ఆపిరమిడ్ కట్టబడినది.

## డ్రేకోనుగురించిన పాశ్చాత్యగాథలు

ఉత్తరదిక్కునకు పోవుకొలది యీచుక్కలు నేటిధ్రువునిచుట్టు తిరుగుచునేయుండును. వీటికి ఉదయము, అస్తమానము లేదు.

ఉత్తరమున జ్యూపిటర్ దేవునికి మంచి ఉద్యానవన ముండెను. అతనిభార్యయగు జూనో (Juno) దేవి పునస్సంధానసమయమున బంగారపు ఆపిల్ పండ్లు (golden apples) రెండు తెచ్చి అతనికి సమర్పించెను. ఆపండ్లే నేటిధ్రువరక్షకులు (Guardians of the Pole) అనబడు మన ధాత, విధాతనక్షత్రములు. ఆ పండ్లచుట్టును డ్రేకోసర్పమును కాపుపెట్టిరి. (ఉదయాస్తమానములు లేక ఎప్పుడును) ఈసర్పము ఆపండ్లను కాచుకొనిఉండెడిది. హెర్క్యులీస్ (Hercules) యోధుడీసర్పమును సంహరించగా జూనోదేవి ఆసర్పమును నక్షత్రమండలమును చేర్చెను.

ప్రాచీన నక్షత్రపటములలో హెర్క్యులీస్ యోధుడు తన పాదములతో ఈ సర్పమును త్రొక్కుచున్నట్లు చిత్రింపబడెను.

పాశ్చాత్యగాథలలో కూడ దేవదేవునికిని, అతని దేవికిని సంధానమైన తరువాతనే డ్రేకోసర్పము కనబడినది. మన గాథలలో నారాయణునికిని భూదేవికిని సమాగమమైన పిమ్మట నరకుడు జనించి, విశ్వభయంకరుడైనట్లు వర్ణింపబడినది.



'లాస్' జలపాతము-కూనూరు I. R. K. S.

## జిజ్ఞాస – బాల్యదశ

చిల్కపాటి సీతాంబ

చూడచూడగ నబ్బురంబై
సొంపుగుల్కు విశాలమౌ నీ
విశ్వనాటకరంగమును గా
వించె నెవ్వాడో.

వేలువేలుగ నన్నుబోలిన
బాలకులు బాలికలచే దగి
చాలశోభిలు ధరణి యెవ్వని
పాలనంబుననో.

తొగరుచిగురుల మెక్కి కడుసొం
పుగ కుహూకారముల కోకిల
లగణితంబుగ బాడు నెవ్వని
యమృతగాథలనో.

చిన్నికెరటా లనెడిసొంపగు
చేతు లెత్తి నదీమతల్లిక
సన్నసన్నల బిల్చు నెవ్వని
సమ్ముఖంబునకో.

చాల మిలమిలమెరయుబంగరు
చాయలను నాకసమునంతయు
బాలభానుడు బరపె నిదియే
ప్రభునియానతినో.

రాత్రి వెన్నెలగూడుకొని రే
రాజు వేడ్క నజాండమంతయు
బాత్రముగ సుధ గురియు నెవ్వరు
బనుపుకారణమో.

ప్రోవుగా ఋతుకాల మరయుచు
తీవెకన్నెలు వితవితంబగు
పూవుగుత్తుల దొడుగు నెవ్వని
పూజ సల్పుటకో.

ఆతపంబున కోడుజగములు
హాయినొందెదునట్ల మేఘుడు
ప్రీతి పందిరు లునిచె నెవ్వరి
బిలచి యనుపుటకో.

కమ్మతావుల సేకరించుచు
కడుముదంబున పిల్లతెమ్మెర
లిమ్ముగా నడయాడు నెవ్వరి
సమ్మతిని గొనియో.

ఆఅతో జతగూడి యెప్డు వి
హాయసంబున దిరుగుపక్షుల
కీకరణి కొరవోక నెవ రెఱ
నిచ్చి మన్పుదురో.

దరణిగర్భము వెడలి సస్యము
దానె ప్రబలెడి పుడమిపై నిటు
ప్రోడ యెవ్వరు బీజసంతతి
బోసి యుంచెనొకో!

అన్నిటికి దా ప్రభువరుండై
తిన్నగా జగమేలునాతడు
కన్నులకు గనరాకయుంటకు
కారణంబేమో.

---

# విష్ణుకుండినవంశము

భావరాజు వేంకటకృష్ణరావు

## ౧

విష్ణుకుండినరాజవంశ మాంధ్రదేశము నేలిన ప్రసిద్ధ ప్రాచీనవంశములలో నొకటి. ఆవంశ చారిత్రముగాని, కాలముగాని యెంతమాత్రము ఆంధ్రుల కింతవఱకు తెలియదు. విష్ణుకుండినులు ప్రసిద్ధగుణాధారభూతులు; ఆంధ్రదేశమునకు విశేషయశమును గొప్పదనమును సమకూర్చినవారు. వారిచరిత్రమును దెలుసుకొనుట ఆంధ్రులకు ముఖ్యావశ్యకము. ఆంధ్రులెవ్వరును ప్రాచీనాంధ్ర రాజవంశముల చరిత్రలు వ్రాయకుండుటయును, అన్యదేశీయులు వ్రాయబూనుటయును, అందు తప్పులు, అజ్ఞానవశమున దొరలినవి కొన్నియు, దురభిమానవశమున దొరలినవి కొన్నియు నుండుటయును, అందువలన ఆంధ్రులు, ఆంధ్రేతరులుకూడ నారాజవంశముల చరిత్రమును, అసత్యములతో నిండిన దానిని, దెలుసుకొనుటయును సంభవించుచున్నది. ఇది మిక్కిలి సంతాపకరమయిన వృత్తాంతము.

విష్ణుకుండినులనుగురించి పాశ్చాత్యులలో కీలుహారనుపండితుడు, డాక్టరు హుల్షు, డాక్టరు మూసాజొనెయి దూబ్రియులు మున్నగువారు వ్రాసినారు. దేశీయచరిత్రకారులలో స్వర్గీయులయిన కొమఱ్ఱాజు వేంకటలక్ష్మణరావుగారు, శ్రీమాన్ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు, వంగదేశీయుడగు దినేశచంద్రసర్కారుగార్లు వ్రాసినారు. వీరిలో దినేశచంద్ర సర్కారుగారిటీవల అజ్ఞానవశమున తప్పులతడక నొకదానిని యింగ్లీషు భాషలో రచించి "ఇండియను హిస్టారికలు క్వార్టర్లీ" పత్రికయందు ప్రకటించిరి. దానిని చదివినతరువాత సరియైనచారిత్ర మాంధ్రులకు తెలియుటావశ్యక మని తలంచి యీ వ్యాసరచనకు గడగితిని.

### చరిత్రాధారములు

విష్ణుకుండినరాజులశాసనము లింతవఱకు ఐదు మాత్రమే దొరికినవి. ప్రకటింపబడిన కాలానుసరణముగ నిచ్చట వాటిని వివరించెదను. అవియన్నియు తామ్రశాసనములు!

(౧) ఇమ్మడి విక్రమేంద్రవర్మ చిక్కుళ్ల శాసనము: ఇది విశాఖపట్నముజిల్లా గోలుగొండతాలూకాలో నున్న అమలాపురంగ్రామంచెంతనున్న ఉప్పరగూడెంశివారు కాపురస్తుడు పిండి నమ్మయ్యగారికి చిక్కుళ్లఅగ్రహారమునకు చెందిన అటికావనిచెరువులో మట్టిత్రవ్వించుచుండగా దొరికెనట! చిక్కుళ్ల అగ్రహారము తునిడివిజనులో నున్నది. ఈశాసనమును మొదట జయంతిరామయ్యపంతులుగారు సంపాదించిరి. కీలుహారనుపండితుడు చదివి సంపాదకీయవ్యాసముతో ఎపిగ్రాఫియాఇండికాయందు ప్రకటించెను. (ఎపిగ్రాఫియాఇండికా. సం. ౪, పుటలు ౧౯౩-౧౯౫; రేకుల ప్రతిబింబములుకూడ నందీయబడినవి.)

౨. ఇంద్రభట్టారకునిరామతీర్థం శాసనము: ఇది రామతీర్థమునందు నివాసముగానున్న నొకప్రసిద్ధవైష్ణవస్వాములయింట నుండగా లభించినది. దీనిపుట్టుపూర్వోత్తరములు సరిగా తెలియవు. హుల్షుపండితుడీశాసనమును చదివి సంపాదకీయవిషయముతో ప్రకటించినాడు. (ఎపిగ్రాఫియా ఇండికా సం. ౧౨, పుటలు ౧౩౩-౧౩౯; అందుకూడ రేకులకు ప్రతిబింబములీయబడినవి.)

౩. విష్ణుకుండి మూడవ మాధవవర్మ ఆంధ్రసాహిత్యపరిషచ్ఛాసనము, లేక పొలమూరిశాసనము. ఇది గోదావరిజిల్లా రామచంద్రపురముతాలూకా పొల

౧. ఇది కలకత్తాలో డాక్టరుకుమార నరేంద్రనాథలాగారిచే ప్రకటింపబడుచున్న ఆంగ్ల త్రైమాసికపత్రిక. ఈవ్యాసము ౯-వ సంపుటమునందు గలదు.

మూరుగ్రామమున మట్టికొఱకై పాటిమట్టి పెఱకును త్రవ్వుచుండగా పూర్వచాళుక్యాన్వయుడయిన మొదటి జయసింహవల్లభుని శాసనముతోపాటు కలసి యొక్క చోట దొరకియుండెను. ఇవిరెండును దుగ్గిరాల సూర్య ప్రకాశరావుపంతులుగారిమూలమున బయటపడుటయు, ఆంధ్రసాహిత్యపరిషత్కార్యాలయమును జేరుటయు కూడ సంభవించెను. ఇది పరిషత్కార్యాలయమున నుండగా కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారు చదివి యింగ్లీషున వ్యాఖ్యానమును వ్రాసి కలకత్తాయూనివర్సిటీవారి "ది జర్నల్ ఆఫ్ లెటర్సు" పదనొకండవ సంపుటమున బ్రచురించిరి ఈశాసనమును, లక్ష్మణరావుగారి సంపాదకీయవ్యాఖ్యానమును ఆంధ్రదేశచరిత్రకు ముఖ్యసాధనములని యెంచి, అచ్చటచ్చట ఇంచుకమార్పులతో సోమశేఖరశర్మగారు ఆంధ్రమున అనువదించి భారతి యందు ప్రచురించిరి. (ప్రమోదూతసంవత్సర భాద్రపద, కార్తీక మాస సంచికలు.)

౪. రెండవమాధవవర్మ యీపూరుశాసనము. (ఎపిగ్రాఫియా ఇండికా: సం. ౧౭, పుటలు ౩౩౭-౩౩౯. శాసనపురేకుల ప్రతిబింబములుకూడ ఇందు ఈయబడియున్నవి.)

౫. గోవిందవర్మకుమారుడయిన మూడవమాధవవర్మ యీపూరుశాసనము. (ఎపిగ్రాఫియా ఇండికా: సం. ౧౭, పుటలు ౩౩౪-౩౩౭ ప్రతిబింబములతో సహా.) ఈశాసనమును, దీనికి పూర్వోదాహృతమైన శాసనమును తెనాలి తాలూకా ఈపూరుగ్రామమున శ్రీమాన్ బృందావనం గోపాలాచార్యులుగారివద్ద నుండగా అ. రంగస్వామిసరస్వతిగారివలన సంపాదింపబడినవి. వాటిని చదివి వ్యాఖ్యానతాత్పర్యసహితముగా డాక్టరు హుల్ష్ ప్రకటించినాడు.

## ౨

## వంశానుక్రమము

లిపిపరిణామశాస్త్రమునుబట్టి పరీక్షించినపుడు పైనవివరింపబడిన ఐదుశాసనములలో నాల్గవది, రెండవ మాధవవర్మ ఈపూరుశాసనము మిక్కిలి ప్రాచీనమైనదని తోచును. ఈసిద్ధాంతమునే హుల్ష్‌గూడ అంగీకరించియున్నాడు.[౧] లిపియొక్కటేగాక, ఇందు గానవచ్చు ప్రాచీనతరమైన ప్రాకృతభాషాశాసనపు ఛాయలుగూడ నిది అన్నింటికంటె మొదటిశాసనమని తోపింపజేయుచున్నవి. ఇందు 'వర్మ' అనుటకుమారుగా ప్రాకృతభాషాశబ్దము 'వమ' యని వాడబడినది. ఇది యిందుల కొకఉదాహరణము. మరియు నీయైదుశాసనములలో రాజులపేరులను ఒకవరుసప్రక్క నింకొకవరుస నుంచి చదివి క్రమము ఏర్పఱుపజూచినపుడు ఈశాసనమే మొట్టమొదటిశాసనమని నిశ్చయమగుచున్నది.

ఈశాసనమందు దానపతివంశీయులు, పూర్వులీక్రిందివిధముగా వర్ణింపబడినారు.

౧. (మహారాజశ్రీ) మాధవవర్మ.
|
౨. శ్రీదేవవర్మ.
|
౩. (మహారాజశ్రీ) రెండవమాధవవర్మ. (దానపతి)

దీనికి తరువాత ప్రాచీనమయిన వని చెప్పదగినవి ఇంద్రభట్టారకుని రామతీర్థము, రెండవవిక్రమేంద్రవర్మ చిక్కుళ్ళశాసనములు. వీటిలో మొదటిదానియందు మూడుతరములును, రెండవదానియందు వరుసగా నాలుగు తరములును నీక్రిందివిధముగా దెలుపబడినవి:

| రామతీర్థంశాసనము: | చిక్కుళ్ళశాసనము: |
|---|---|
| మహారాజశ్రీ మాధవవర్మ | మహారాజశ్రీ మాధవవర్మ |
| \| | \| |
| శ్రీ విక్రమేన్ద్రవర్మ | శ్రీ విక్రమేంద్రవర్మ |
| \| | \| |
| మహారాజశ్రీ ఇన్ద్రవర్మ (దానపతి) | మహారాజశ్రీ ఇన్ద్రభట్టారకవర్మ |
| | \| |
| | మహారాజశ్రీ (ఇమ్మడి) విక్రమేంద్రవర్మ (దానపతి) |

౧. ఎపి. ఇండికా. సం. ౧౭ పుట. ౩౩౮.

పై రెండువంశక్రమములను పరిశీలించినపుడు రామతీర్థం శాసనపతియైన ఇంద్రవర్మయు చిక్కుళ్ల శాసనపతి జనకుడైన ఇంద్రభట్టారకవర్మయు నొక్క పురుషుడేయని తోచకమానదు. కావున చిక్కుళ్ల శాసనపతి రామతీర్థంశాసనపతియైన ఇంద్రభట్టారకవర్మ, లేక ఇంద్రవర్మయొక్క జ్యేష్ఠపుత్రుడని స్పష్టమగుచున్నది. ఈనిర్ణయము మరియొకవిషయమువలనకూడ ధ్రువపడుచున్నది. రామతీర్థంశాసనమందు శ్రీవిక్రమేంద్రవర్మ "ఉభయవంశాత్మజాలంకారభూతః" అని ప్రశంసింపబడియున్నాడు. ఈతడు రెండువంశములవారికి అలంకారభూతుడై జన్మించినాడట! ఈ రెండువంశము లేవియో చిక్కుళ్ల శాసనము దెలుపుచున్నది. అందీతడు "విష్ణుకుండి-వాకాటవంశ ద్వయాలంకృతజన్మనః" అని విష్ణుకుండి, వాకాటవంశములకు రెండింటికిని అలంకారముగా జనించినట్లు వర్ణింపబడినాడు. దీనినిబట్టి చూడ నీతనితల్లి వాకాటరాజపుత్రికయనియు, నీతనితండ్రి తాతలనాడు వాకాటరాజవంశముతో విష్ణుకుండినులకు సంబంధ మేర్పడియుండినట్లును స్పష్టమగుచున్నది. కావున రామతీర్థం చిక్కుళ్ల శాసనములు రెండునుకలిసి నాల్గుతరములవారిని వర్ణించుచున్నవని నిర్ణయింపవచ్చును.

ఇంక పైన తెలిపిన కోవకు మూలపురుషుడును వాకాటరాజపుత్రికను పెండ్లియాడినవాడును అగుమాధవవర్మమహారాజునకును, ఈపూరుశాసనపతియగు ఇమ్మడి మాధవవర్మమహారాజునకు నేమైన సంబంధమున్నదేమో, వారిరువురు నొక్కరో, లేక భిన్న పురుషులో ఆరయవలసియున్నది. ఈపూరుశాసనమునందు దానపతి "త్రికూటమలయాధిపతి ర్న్నయవినయసత్త్వసంపన్నో భగవచ్ఛ్రీపర్వ్వతస్వామి పాదానుధ్యాతో [విష్ణుకుణ్డినాం మహారాజో *] శ్రీమాధవవర్మా" అని వర్ణింపబడినాడు. రామతీర్థంశాసనమందుమాధవవర్మ "భగవచ్ఛ్రీపర్వ్వతస్వామిపాదానుధ్యాతః సకలమహీమణ్డలావనత సామన్త మకుటమణికిరణావలీఢ చరణయుగో విఖ్యాతయశః శ్రీమన్మహారాజ మాధవవర్మా" యని ప్రస్తుతింపబడినాడు. చిక్కుళ్లశాసనమందు వంశకర్తయగు మాధవవర్మ "శ్రీపర్వతస్వామిపాదానుధ్యాతో విష్ణుకుండినామేకాదశాశ్వమేధావభృథావధూత జగత్కల్మషస్య క్రతుసహస్రయాజినః సర్వమేధావాప్త సర్వభూతస్వారాజస్య బహుసువర్ణ్ణ పౌండరీక పురుషమేధవాజపేయయూ[ప]స్య షోడశిరాజసూయ ప్రాధిరాజ్య ప్రాజాపత్యాద్యనేకవివిధపృథుక్రతువరశతసహస్రయాజినః, క్రతువరానుష్ఠానాధిష్ఠితప్రతిష్ఠిత పరమేష్ఠిత్వస్య, మహారాజస్య సకలజగన్మండలవిమలగురు పృథుక్షితిపతిమకుటమణిగణనికరావనతపాదయుగలస్యమాధవవర్మణః" అని వర్ణింపబడినాడు. ఈతడే వాకాటరాజులజామాత. అతులబలపరాక్రమశాలియైన ఆంధ్రక్షమామండలాఖండలుడు. కావున ఈతడే ఈపూరుశాసనపతియని నిస్సంశయముగా నిర్ణయింపవచ్చును. ఈపూరుశాసనము ఇమ్మడిమాధవవర్మమహారాజుయొక్క ౪౭ ౧ వ రాజ్యసంవత్సరమున నొసగబడినది. నలుబదియేడుసంవత్సరములు, ఇంచుమించుగా అర్ధశతాబ్దము నిరాఘాటముగా భూచక్రము నేలగల్గినమహారాజశేఖరుడు కాని ఏకాదశాశ్వమేధములు, శతసహస్రక్రతువులు, రాజసూయాదియజ్ఞములు చేయజాలడు. విశేషించి ఈపూరుశాసనలిపికంటె రామతీర్థం శాసనలిపి ప్రత్యక్షముగా అర్వాచీనమైనది. ఆరెండింటికినడుమ నొకయర్ధశతాబ్దకాలము వ్యవధియుండవచ్చును. ఇన్ని కారణములవలన రామతీర్థం, చిక్కుళ్ల శాసనములందలి మూలపురుషుడైన మాధవవర్మయు, ఈపూరు శాసనపతి రెండవమాధవవర్మయు నొక్కరేయనుట సమంజసము. ఈ నిర్ణయమునుబట్టి మనము విష్ణుకుండిను వంశమునందు ఆరుతరములను నిర్ణయింపగలిగితిమి.

ఇక రెండుశాసనములు మిగిలియున్నవి ౩, ౫ లు; ఈ పూరు, పొలమూరుశాసనములు. ఈరెండును గోవింద

౧. ఇది ౧౭ అని దినేశచంద్రసర్కారుగారి యభిప్రాయము. కాని వారివాదము, పాఠముగూడ అసమంజసములగును.

వర్మకుమారుడైన మాధవవర్మచే నొసగబడినవి. ఈ రెండింటియందును వంశానుక్రమ మీక్రిందివిధముగా నొసగబడినది. ——

౨. ఈపూరుశాసనము (విజయరాజ్యసంవత్సరము ౩౭ వ నాటిది) | ౩. పొలమూరుశాసనము (విజయరాజ్యవర్షము ౪౮ వ సం. నాటిది)
--- | ---
* | ౧. శ్రీవిక్రమహేంద్రవర్మ
౨. గోవిందవర్మ | ౨. శ్రీగోవిందవర్మ (విక్రమాశ్రయబిరుదాంచితుడు)
౩. శ్రీమాధవవర్మ (దానపతి) |
౪. మంచ్యణ్ణభట్టారకుడు (ఆజ్ఞప్తి) | ౩. శ్రీమాధవవర్మ (జనాశ్రయబిరుదాంచితుడు) (దానపతి)

దానపతియైన ఈమాధవర్మ పైనతెలియవచ్చిన యిరువురి మాధవవర్మలకంటె భిన్నమైనవాడు. ఇతడు విష్ణుకుండినులలో మాధవవర్మపేరుగలవారిలో మూడవ వాడు; కావున నితని మనము ముమ్మడిమాధవవర్మయని వ్యవహరించెదము. ముమ్మడిమాధవవర్మకు పితామహు డైన "విక్రమహేంద్రవర్మ" పేరు "విక్రమేంద్ర వర్మ" యొక్క రూపాంతరమని తప్పక తోచును. అట్లయినచో నీవిక్రమహేంద్రవర్మను ఇపుడు మనకు పైనతెలియవచ్చిన యిరువురి విక్రమేంద్రవర్మాభిధాను లలో నెవరని నిర్ణయింపవలయునో తేలవలయును. మొదటి విక్రమేంద్రవర్మయు,నీవిక్రమహేంద్రవర్మయు నొక్కరేయన్నచో నొకయాక్షేపణ మనలనెదుర్కొ నును. ఈవిక్రమహేంద్రవర్మకు "ఉభయవంశాత్మజా లంకారభూతః" ఇత్యాది వాక్యములేవియు చేర్పబడి యుండలేదు. మీదు మిక్కిలి, విక్రమహేంద్రవర్మకు పొలమూరుశాసనము"విష్ణుకుండినో౽ప్రతిహతశాసనస్య స్వప్రతాపోపనత సామన్తమనుజపతి మణ్డలస్య, విరహిత రిపుషడ్వర్గస్య, విధివదుపచిత త్రివర్గస్య, విబుధపతి సాద్ధ్యశగవీర విభవబల పరాక్రమస్య" అని విశేషణము లను చేర్చియున్నది. వీటినిబట్టిచూడ విక్రమహేంద్ర వర్మ అప్రతిహతశాసనుడైన రాజశ్రేష్ఠుడనియు, స్వప్ర తాపముచేత శత్రువులను సామన్తులను ఇతరరిపురాజవర్గ మును జయించి సకలవసుమతీతలమును స్వాధీనమును చేసుకొన్నవాడనియు, దివిజపతిసమానుడైన బలవిభవ పరాక్రమసంపన్నుడనియు తెలియుచున్నది. ఈపొల మూరి శాసనలిపి రామతీర్థం యీపూరుశాసనములలిపి కంటె కొంచెము తరువాతకాలమునాటిదని స్పష్టముగా అగపడుచున్నది. కావున నీ విక్రమహేంద్రవర్మను రెండవ విక్రమేంద్రవర్మయని నిర్ణయించుట సమంజ సము ఇందుల కనుకూలముగ చిక్కుళ్ల శాసనము, తద్దానపతియైన యిమ్మడి విక్రమేంద్రవర్మ నీక్రిందివిధ ముగా, "శ్రీఇంద్రభట్టారకవర్మణః ప్రియజ్యేష్ఠపుత్రో గరిష్ఠః శైశవఏవ సకలనృపగుణాలంకృతః సమ్యగధ్యా రోపితసకలరాజ్యభారః పరమమాహేశ్వరో మహారాజః శ్రీమాన్ విక్రమేంద్రవర్మణః" అని వర్ణించుచున్నది. కావున నీఅయిదుశాసనములబట్టి తొమ్మిదితరములవంశ క్రమము నేర్పడుచున్నది.

## కాలనిర్ణయము

విష్ణుకుండినవంశమునందు తొమ్మండుగురుగలరు. వీరికాలనిర్ణయము చేయగలిగినచో నాంధ్రదేశమున వీరి రాజ్యపాలనమునుసరించి యిదివరకు తెలియనిచరి త్రాంశములను దెలుసుకొనగలుగుదుము. వీరికాలనిర్ణయ మునకు అభ్యంతర సాధనములు పొలమూరుశాస నమునందును, తచ్ఛాసనముతోపాటు దొరికిన పూర్వ చాళుక్యాన్వయుడగు మొదటిజయసింహవల్లభుని పొల మూరి శాసనమునందును గానబడుచున్నవి.

ముమ్మడిమాధవవర్మ పొలమూరిశాసనము, ఆ మహారాజుయొక్క ౪౮-వ ప్రవర్ధమానవిజయరాజ్య వర్షమున నీయబడినది. ఆనాడు ఫాల్గుణపూర్ణిమ, చంద్ర గ్రహణసమయము. ముమ్మడిమాధవవర్మ బహుళసైన్య సమేతుడై ప్రాగ్దిక్‌జిగీషాప్రస్థితుడై గోదావరిని దాటెను. రానున్నమహాసంకుల సంగ్రామములందు తనకు జయముగలుగుటకైకాబోలు కర్మరాష్ట్రములోని

కుండూరు వాస్తవ్యుడును, తైత్తిరీయ సబ్రహ్మచారియు, వేదచతుష్టయసమామ్నాతావదాతాననుడును, స్వకర్మానుష్ఠానపరుడును, గౌతమసగోత్రుడును అను శివశర్మకు గుద్దవాదివిషయములో జేరిన పులుంబూరు గ్రామమును సర్వకరపరిహారవివర్జితముగా నగ్రహారము నొసఁగి జనాశ్రయబిరుదాంచితుడైన మాధవవర్మమహారాజు ధారవోసెను. ప్రతిగృహీతతండ్రి పేరు దామశర్మ. తాత పేరు రుద్రశర్మ. ఇతడు వేదవేదాంగవేది. తండ్రికంటె అధికమైన గుణప్రజ్ఞలుగలవాడు దామశర్మ. దానమీయబడిన గ్రామము పులుంబూరని తెలుపబడినది. దానికీయబడిన సీమలనుబట్టి అది నేడు పొలమూరు అని పిలువబడుచున్న గ్రామమని నిస్సంశయముగా చెప్పవచ్చును. మరియు నీశాసనముగూడ నచ్చటనే లభించెను. పులుంబూరునకు దక్షిణమున మయిన్దవాటిక గలదు. నేడీ గ్రామము మహేంద్రవాడ యనబడుచున్నది. పొలమూరు తుల్యభాగనదియొడ్డున నున్నది. అచ్చట నొక తావు నింకను "గుర్రాలగాడి" యని చెప్పుచు జనులు చూపించెదరు. అచ్చోట పూర్వము గుర్రములను కడిగి నీరు పెట్టుచుండెడివారట. పొలమూరునందు పూర్వకాలమున అశ్వదళ మొకటి యుంచబడియుండెనట! ఇదియంతయు స్థలజ్ఞులు చెప్పువృత్తాంతము. శాసనమందు పులుంబూరు దళియవావితీరమందున్నదని తెలుపబడియుండుటబట్టి దళియవావి అనుపేరు తుల్యభాగనదికి ప్రాచీననామమై యుండవచ్చునని యూహింపవచ్చును. పులుంబూరు గుద్దవాదివిషయములో నున్నది. ఈవిషయసీమ నేటి రామచంద్రపురముతాలూకాకు సరిపోవుచున్నది. రామచంద్రపురమునకు సమీపమున నొక గుడివాడ కలదు. ఈప్రాంతమునకు "గుద్దవాదివిషయ" మనిపేరున్నట్లు పెక్కుశాసనములందు గన్పడుచున్నది.[౧] ఈ పొలమూరు శాసనమునుబట్టి మూడవమాధవవర్మ రాజ్యపరిపాలనకాలమున నలభైయెనిమిదవయేట ఫాల్గుణమాసమున చంద్రగ్రహణము కలిగె నని తెలియుచున్నది. దీనికిసరియైనతేది మనము కనుగొనవలయును.

విష్ణుకుండిన ముమ్మడి మాధవవర్మశాసనముతో కలిసి పూర్వచాళుక్యాన్వయుడగు మొదటి జయసింహవల్లభమహారాజు దానశాసన మొకటి యాతావునందే లభించెను. చిత్రముగ నీరెండుశాసనములును పొలమూరు గ్రామదానవిషయమునే దెలుపుచున్నవి. మరియు ఈ రెండింటిలోను ప్రతిగ్రహీతలకును దగ్గిరబంధుత్వ మున్నట్లుగూడ వివరించుచున్నవి. మొదటి జయసింహవల్లభుని వలన పొలమూరును అగ్రహారముగా బడసినవాడు గౌతమగోత్రుడును, వేదవేదాంగవిదుడును, దామశర్మపౌత్రుడును, తండ్రికంటె అధికమైనగుణసంపదగల శివశర్మపుత్రుడును తైత్తిరీకసబ్రహ్మచారియును వేదవ్యాఘ్రాలంకృతశరీరుండును, స్వకర్మానుష్ఠానపరుడును, మనపూర్వాగ్రహారికుడు నగు రుద్రశర్మ. ఈతడు అసనపురవాస్తవ్యుడని తెలుపబడినాడు.

పైరెండు పొలమూరుశాసనములందును పేర్కొనబడిన ప్రతిగ్రహీతలిరువురిదియు గౌతమసగోత్రము. రెండింటియందును దామశర్మయు, నాతనికుమారుడు శివశర్మయు గలరు. జయసింహవల్లభమహారాజుయొక్క శాసనమందు శివశర్మతనూజుడు రుద్రశర్మ ప్రతిగ్రహీత యగుటచేత మరియొకతరమెక్కువపూర్వ నిదియాయబడినది.

ఈరెండుశాసనములనుబట్టి ప్రతిగృహీతల వంశక్రమ మీవిధముగా నేర్పడుచున్నది.

గౌతమసగోత్రము, తైత్తిరీయశాఖ

*

(మొదటి) రుద్రశర్మ

|

దామశర్మ

|

శివశర్మ

(చతుర్వేది; కుండూరువాస్తవ్యుడు; పొలమూరు అగ్రహారికుడు)

|

(రెండవ) రుద్రశర్మ

(ద్వివేది; అసనపురవాస్తవ్యుడు; పొలమూరు అగ్రహారమును తిరుగ సంపాదించుకొన్నవాడు)

౧. వీరచోడుని చెల్లూరుశాసనము. S. I. I. Vol. I. p. ౮౯. No. ౩౯. మరియు S. I. I. Vol. IV. లోని దాక్షారామశాసనములు.

పైనల్వురిలో రుద్రశర్మ పూర్వాగ్రహారీకుడని చెప్పబడుటచేత పొలమూరుఅగ్రహారమునుబడసిన శివశర్మయు, రుద్రశర్మతండ్రి యగు శివశర్మయు నొక్కరే యని నిస్సందేహముగ తోచును. మరియు కొంతకాలము క్రిందటివరకు పొలమూరుఅగ్రహారమును అనుభవించుచు కారణాంతరములచే దానిని గోల్పోయి మరల జయసింహవల్లభునికృపవల్ల రెండవ రుద్రశర్మ సంపాదించుకొనగలిగినట్లు జయసింహునిశాసనము స్పష్టముగా దెలుపుచున్నది. ఇది మిక్కిలి ముఖ్యమయినవృత్తాంతము. మొదటిశివశర్మ బడసినదానకాలము సులభముగా నిర్ణయించుటకీజయసింహవల్లభునిశాసనము తోడ్పడుచున్నది. కావున ముందుగా నీరెండుశాసనములకును నడుమ వ్యవధి యెంతయుండెనో నిర్ణయింపవలయును.

శివశర్మ అగ్రహారమును బడయునాటికి చతుర్వేదముల నధ్యయనముచేసినాడు. వేదచతుష్టయమును సమగ్రముగా నభ్యస్తముగావించుటకు కనీసము నలుబదియేండ్లయినబట్టును గర్భాష్టకమందే వేదాధ్యయనమారంభించినాడని యూహించినను వేదచతుష్టయసమామ్నాతావదాతాననుడగుటకు శివశర్మకు ఏబదియేండ్లయిన నిండియుండవలయును. అప్పటికిగాని యాతడు గురుకులవాసమును ముగించియుండజాలడు. కావున అగ్రహారమును ప్రతిగ్రహించునాటికి ఏబదియేండ్లు దాటినవాడు గావలయును. అగ్రహారీకుడైన పిదప నాతడధమపక్షము పాతికేండ్లయిన దానిని భుక్తపరచుకొని యుండవచ్చును. పిమ్మట నాతనికుమారుడు దానిని యనుభవించియుండును. ఆతడే దానిని కొంతకాలమనుభవించి పోగొట్టుకొని పూర్వాగ్రహారీకుడని వ్యవహరింపబడినాడు. దానికైన నొకపాతిక ఏండ్లు పట్టవచ్చును. అట్లు మొదటి పొలమూరిశాసనకాలమునకును రెండవపొలమూరిశాసనకాలమునకును నడుమ నొక అర్ధశతాబ్దము గతించిపోయి యుండవచ్చును. మొదటి పొలమూరిశాసనము మమ్మడిమాధవవర్మవిజయరాజ్య సంవత్సరము ౪౦-వ యేట నొసగబడెను. రెండవపొలమూరిశాసనము మొదటిజయసింహవల్లభుని విజయరాజ్యవర్షము ౧౫-వ ఏట నీయబడినదని గవర్నమెంటు ఎపిగ్రాఫిస్టు రావుబహద్దరు హొసకొప్ప కృష్ణశాస్త్రిగారును,[1] నాల్గవయేట నొసగబడినదని రాళ్లభండిసుబ్బారావుగారును, [2] ౨౫వఏట నీయబడినదని మల్లంపల్లి సోమశేఖరశర్మగారును నిర్ణయించిరి.[3] నేనును శాసనపురేకులను పరీక్షించితిని. కృష్ణశాస్త్రిగారుకూడ ౧౫ సందేహముగానే చదివిరి. కాన నీశాసనము ౧౫-వ యేటనీయబడినదనియే నిర్ణయించెదను మొదటి జయసింహవల్లభునికాలము క్రీ. శ. ౬౩౩ మొదలుకొని ౬౬౩ వఱకునని ఫ్లీటుపండితుడు నిర్ణయించెను.[4] నా నిర్ణయప్రకారము ఆతడు క్రీ. శ. ౬౪౧ మొదలు ౬౭౩ వఱకు పరిపాలించెను.[5] నానిర్ణయమే యథార్థమైనదని యెంచినయడల జయసింహవల్లభుని పొలమూరిశాసనము ౧౫-వ ఏట నొసగబడినది. కావున క్రీ. శ. ౬౫౬-వ సంవత్సరమునాటిది కాగలదు. పైననుడివినప్రకారము రెండవపొలమూరిశాసనము మొదటిదానితరువాత ౫౦, ౬౦ యేండ్లకు ఒసగబడినదని యెంచినయెడల మమ్మడి మాధవవర్మయొక్క ౪౦-వ విజయరాజ్యసంవత్సరము ఇంచుమించుగా క్రీ. ౫౯౬ నకు సరిపోవుచున్నది. స్వామి కణ్ణుపిళ్లెగారి సహాయమున లక్ష్మణరావుగారు మూడవమాధవవర్మపేరొకొనిన ౪౦-వ విజయరాజ్యము నాటి ఫాల్గుణమాసములోని చంద్రగ్రహణము క్రీ. శ. ౫౯౪-వ సంవత్సరము ఫిబ్రవరి ౧౦-వ తేదినాటిదని సరిగా ఋజువుచేసిరి. ఈతారీఖుగూడ పైన మనము విశదీకరించిన సిద్ధాంతమునకు సరిపోవు చున్నది. కావున క్రీ. శ. ౫౯౪-వ సంవత్సరము ఫిబ్రవరి

---

౧. Report on South Indian Epigraphy, 1914, p. 10. and 85 para 7.

౨. J. A. H. R. S. Vol. IV p. 76.

3. ప్రమోదసంవత్సరకార్తీకభారతి ( సం. ౭ సం. ౧౧ ).

౪. Ind. Ant. Vol. XX pp. 12-13 ; 97.

౫. నేను రచించిన వ్యాసము ఇంకను ప్రచురింపబడలేదు. త్వరలో ప్రకటింపదలచినాను.

౧౦-వ లేది ముమ్మడి మాధవవర్మ ౪౮ సంవత్సరములోని దయినచో నాతని రాజ్యపాలనము ఇంచుమించుగా క్రీ. శ. ౫౪౬ సంవత్సరము ప్రారంభమై యుండవలయునుగదా! నలభయియెనిమిది యేండ్లు నిరాఘాటముగా పాలించిన ముమ్మడి మాధవవర్మ ఇంకెంతకాలము పరిపాలించెనో తెలియదుగాని, లక్ష్మణరావుగారూహించినట్లు చాళుక్యభూపాలుడు సత్యాశ్రయ రెండవపులికేశి వల్లభమహారాజు నాంధ్రదేశము జయించిననాటివఱకు జీవించియుండవచ్చునని ఒప్పుకొనవచ్చును. రెండవపులకేశి వేంగీదేశమును క్రీ. శ. ౬౧౧-వ సంవత్సరమున జయించెనని యావఱకే నిర్ణయింబడినది.[౧] అప్పటివఱకు ముమ్మడిమాధవవర్మ పరిపాలించుచున్నట్లు ఊహించుట కెట్టియాటంకములును గానరావు. కావున ఆమహారాజు క్రీ. శ. ౫౪౬ మొదలుకొని యించుమించుగా ౬౧౧ వఱకు అరువదియైదు సంవత్సరములు పరిపాలించెనని యూహించుకొనవచ్చును. ఇందసంభవమైన దేమియు లేదు. మాధవవర్మ సింహాసనస్థుడయినప్పటికి ఇంకను బాలుడై యుండవచ్చును.

ముమ్మడిమాధవవర్మకు మంచ్యణ్ణభట్టారకు డను ప్రియపుత్రు డుండెను. అతడు తనతండ్రి విజయరాజ్యశకము ౩౭-వ యేట నొసగిన ఈపురుశాసనమునందు (పైనఉదాహరింపబడినవాటిలో పదవది) 'ఆజ్ఞప్తి' గా పేర్కొనబడినాడు. పొలమూరిశాసనమున ఈతడు చెలుపబడలేదు. ఈత డొసగినదానశాసనము ఒక్కటియైన నింతవఱకు దొరకలేదు. ఈతనితరువాతివారివికూడ విష్ణుకుండినులశాసనములు లభించలేదు. కావున నితడు విష్ణుకుండివంశములో నంత్యపురుషు డని నిర్ణయింపవచ్చును. ఒకవేళ తండ్రిమరణానంతరము అపహృతమైన పైతృకరాజ్యమును మరల సంపాదించుకొనుటకై జీవితశేషమునంతయు పోరాటములతో గడపినను మంచ్యణ్ణభట్టారకుడు సింహాసన మెక్కినట్లు గానరాదు. తండ్రిమరణానంతరము ఎంతకాలము జీవించియుండెనో కూడ తెలియరాదు. ముమ్మడిమాధవవర్మ ౩౭-వ రాజ్యపాలనసంవత్సరమున నీయబడిన—అనగా క్రీ. శ. ౫౮౩ కావచ్చును—దానశాసనమునాటికి మంచ్యణ్ణభట్టారకుడు ఇరువదియేండ్లప్రాయమువాడని యెంచినచో తండ్రిమరణించునాటికి, అనగా క్రీ. శ. ౬౧౧ నాటికి ఇంచుమించుగా ఏబదియేండ్లవాడుగా నుండియుండును. ఈతనినోడించి పరిమార్చినతరువాతనే కుబ్జవిష్ణువర్ధనుడు వేంగీదేశమున సుస్థిరముగ చాళుక్యాన్వయరాజపీఠమును బాదుకొల్పియుండును. కుబ్జవిష్ణువర్ధనుని రాజ్యారంభకాలము ఫ్లీటుపండితుడు క్రీ. శ. ౬౧౫-వ సంవత్సరమని నిర్ణయించినాడు. చరిత్రకారులు పెక్కుమంది యాతనిసిద్ధాంతమునే యంగీకరించినారు కాని నానిర్ణయమునుబట్టి యాతడు క్రీ. శ. ౬౨౪-వ సంవత్సరమునగాని వేంగీరాజ్యాభిషిక్తుడు కాలేదు. ఈయూహ సరియైనదైనచో మంచ్యణ్ణభట్టారకు డంతవఱకు జీవించియుండి, పోయినరాజ్యమునకై యెడతెగక పోరాడుచుండెనని యూహింపవచ్చును. అటులయినచో నాతడు క్రీ. శ. ౬౨౩-౨౪-వ సంవత్సరములప్రాంతమున కాలధర్మము నొంది యుండవచ్చును.

మూడవ మాధవవర్మ సింహాసనమధిష్ఠించునాటికి బాలుడై యుండవలయును. లేకున్న ఇంచుమించుగా ౬౫ యేండ్లకాల మాతడు రాజ్యముచేయుట జరిగియుండదు. ఆతనితండ్రి గోవిందవర్మ అకాలమరణము వాతబడినకారణమునకాబోలు, బాల్యము గతించకమునుపే ముమ్మడిమాధవవర్మకు పట్టాభిషేకము జరిగెను. గోవిందవర్మ ప్రాయశః కొద్దికాలముమాత్రమే రాజ్యము చేసియుండవచ్చును. ఆతనిజీవితమంతయు యుద్ధములతో గతించిపోయినట్లు మాధవవర్మ పొలమూరిశాసనములోని "అనేక సమరసంఘట్టవిజయినః,........ విక్రమాశ్రయస్య శ్రీగోవిందవర్మ..." అని యున్న విశేషణవచనమునుబట్టి స్పష్టమగుచున్నది. మరియు మాధవవర్మ ౩౭-వ సంవత్సరమునాటి ఈపురుశాసనమందు "అపరిమితబలపరాక్రమస్య, పరమధార్మికస్య, ప్రణతసకలసామన్తస్యానేకగోహిరణ్యభూమిదానస్య,

౧. Ancient History of the Deccan: Dubrieul p. 113. Kopparam plates of Pulikesin II. Annals of Bhandarkar Institute, Vol. IV p. 43-54 (47.)

మహారాజస్య శ్రీగోవిందవర్మ—" అని విశేషణము లతో వర్ణింపబడినకారణమున ఇతడు కొంతకాలము రాజ్యమేలినట్లు విశదమగుచున్నది. 'మహారాజ'పదము ఇతనిపేరునకు చేర్పబడియుండుట యీయూహకు బల మిచ్చుచున్నది. కావున ఇతడు ఇంచుమించుగా నేఁబదియిదారుసంవత్సరములో పాలించిన ట్లూహించు కొనవచ్చును. (క్రీ. శ. ౫౪౦ - ౫౪౬)

గోవిందవర్మజనకుడైన రెండవవిక్రమేంద్రవర్మ రాజ్యకాలపరిమితిని నిర్ణయించుట కాతని చిక్కుళ్ల శాసనము ఆధారము. అది విజయరాజ్యసంవత్సరములు పది అగు గ్రీష్మమాసమున ౭-వ పక్షమున ౫-వ దిన మున ఒసగబడెను. ఈశాసనమందు రెండవవిక్రమేంద్ర వర్మ "శైశవ ఏవ సకల నృపగుణాలంకృతః" అనగా చిన్నవయసునాడే నృపశేఖరుని కుండవలసినగుణములు కలిగి శోభించినవాడని వర్ణింపబడినాడు. మఱియు "సమ్యగధ్యారోపిత సకలరాజ్యభారః" అనగా "సకల రాజ్యభారమును బూనినవాడును" అనికూడ తెలుప బడినాడు. ఈరెండువిశేషణములును కలిపి చదివి అన్వ యము చేసినపుడు, రెండవవిక్రమేంద్రవర్మ శైశవమున అనగా పదునైదు పదునారేండ్ల ప్రాయమునాడు యౌవరాజ్యాభిషేకమునొంది, కౌమారముననో, లేక నిండుజవ్వనముననో, రాజ్యాభిషేచనము గావించుకొని సకలవసుమతీరాజ్యభారము బూనియుండెనని యూ హింపవచ్చును. అప్పటి కాతనికి సుమారు ముప్పదియైదు సంవత్సరముల వయసుండునని యూహించుకొందము. ఇక చిక్కుళ్ల శాసనము ఆతని రాజ్యావసానకాలమున నొసగబడినదై యుండవచ్చును. కావున నాతనిపరిపాల నము ఇంచుమించుగా క్రీ. శ. ౫౩౦ సంవత్సరమున ప్రారంభమయి, ౫౪౦-౪౨ సంవత్సరములందు ముగిసి యుండెనని యూహించుట సమంజసము.

రెండవవిక్రమేంద్రవర్మతండ్రి ఇంద్రవర్మ, లేక ఇంద్రభట్టారకవర్మ యొక్క రామతీర్థంశాసనము ౨౮-వ సంవత్సరము నాటిది. ఇది ఆతడు కనీసము ౨౮ సంవత్స రములయిన పరిపాలించియుండునని సూచించుచున్నది. కావున ఆతనికి మనము ముప్పదియేండ్లరాజ్యకాలపరిమితి నిర్ణయించినను ఆక్షేపణ కలుగబోదు. అట్లయినచో ఆతని రాజ్యకాలపరిమితి క్రీ. శ. ౫౦౦ మొదలుకొని క్రీ. శ. ౫౩౦ వఱకుండవచ్చునని యూహింపవచ్చును. ఇంద్రభట్టారకుని తండ్రిపేరు మొదటివిక్రమేంద్రవర్మ. ఈతనికి చిక్కుళ్ల రామతీర్థంశాసనములు రెండింటియం దును "మహారాజ" విశేషణము చేర్పబడియుండలేదు. ఇది గమనింపదగినవిషయము. ఈతనిగూర్చి చెప్పబడిన విశేషణము ఒక్కటే గలదు. అది "ఉభయవంశాత్మజా లంకారభూతః" "విష్ణుకుండి-వాకాటవంశద్వయాలంకార జన్మనః" అని. ఈ కారణములబట్టి మొదటి విక్రమేంద్ర వర్మరాజ్యాభిషిక్తుడు కాలేదనునట్లుద్యోతకమగుచున్నది. ఈనిర్ధారణము ఇంకను రెండుకారణములబట్టిసంబద్ధముగా గన్పడుచున్నది. ఇతని తనూజుడు ఇంద్రభట్టారక వర్మకు "భ్రూభంగకర వినిర్ధూత సమగ్రదాయాదస్య" యని యొకవిశేషణము చిక్కుళ్లశాసనమునందు కన్పట్టు చున్నది. ఇతడు అధికాగ్రహావేశమున కనుబొమలు ముడుళింపజేసినంతమాత్రమున సమస్తదాయాదలోకమును చెల్లాచెదరై పోయెనట! ఇది నిశ్చయముగా యథార్థ మైనవిషయము గావచ్చును. ఇతడు పట్టాభిషిక్తుడు గాకుండ దాయాదులు కుటిలమతులై నిరోధించి ప్రతి ఘటించియుందురు. మహాబలపరాక్రమశాలియగుటచేత నింద్రభట్టారకుడు వారినందరినిజయించి పట్టముగట్టు కొనెను. అప్పటి కాతనితండ్రి గతించుటచేతనే దాయా దులు రాజ్య మాక్రమించుకొనదలచియుందురు. ఇంద్ర భట్టారకునితాత రెండవమాధవవర్మకు మొదటి విక్ర మేంద్రవర్మగాక ఇంకను తనయు లుండియుందురు. వారందరు తమపైతృకరాజ్యమును మొదటివిక్రమేంద్ర రాజ్యమునకు రాకుండ చనిపోయినకారణమున పౌత్రు డైన యింద్రభట్టారకునకు చెందనీయకుండ ప్రతిఘటించి యుందురు. మొదటి విక్రమేంద్ర వర్మరాజ్యము చేయలేదనుటకు ఇంకను మరియొకకారణము కలదు. ఇమ్మడిమాధవవర్మ ఈపూరుశాసనము ఆతని విజయ రాజ్యకాలమున ౪౮-వఏట వర్షఋతువునందు నేడవ పక్షమున నేడవదినమున నొసగబడెను. ఈవిషయమును బట్టి రెండవమాధవవర్మ నిస్సంశయముగా కనీసము

౩౭ ఏండ్లయినపరిపాలించినాడని నిర్ణయింపవచ్చును. విష్ణుకుండిన వంశమర్యాదనుబట్టి రెండవమాధవవర్మకు ఒకఅర్ధశతాబ్దము రాజ్యకాలపరిమితి యొసగినను దోష ముండదు. ఇట్లు తండ్రి యేబదిసంవత్సరములును, కొడుకు ముప్పదియేండ్లును పరిపాలించియుండ మొదటి విక్రమేంద్రవర్మ సింహాసన మధిష్ఠింపకమునుపే దివంగతు డయ్యెనని యూహించుట కట్టియాటంకమును గానరాదు. కాబట్టి విక్రమేంద్రవర్మ రాజ్యభారము పూనియుండలేదని నిర్ణయించి యాతనితండ్రి రెండవ మాధవవర్మకు క్రీ. శ. ౪౫౦ మొదలుకొని ౫౦౦ వఱకు రాజ్యకాలపరిమితి యేర్పఱచెదము.

రెండవమాధవవర్మ దేవవర్మకుమారుడు. దేవవర్మకుకూడ |నీమాధవవర్మ ఈపూరుశాసనమందు మహారాజపద ముపయోగింపబడి యుండలేదు. "క్షత్రియావస్కందప్రవర్తితోఽప్రతిమవిఖ్యాత పరాక్రమస్య" అని మాత్రము విశేషణ మొకటి చేర్చబడినది. ఈవిశేషణమునుబట్టి దేవవర్మ క్షత్రియులైన శత్రురాజులను నిర్జించుటలో అప్రతిమానపరాక్రమమును ప్రకటించినవాడని మాత్రము తెలియుచున్నది. ఇతడు మహారాజార్హాములయిన గోహిరణ్యభూమ్యాదిమహాదానములుగాని, యజ్ఞయాగములుగాని చేసినట్లు చెప్పబడియుండలేదు. కావున ఇతడు రాజ్యాభిషేకము నొందినవాడని తలచుటకు సావకాశము గన్పట్టదు.

ఇక మిగిలినవాడు మొదటిమాధవవర్మ. విష్ణుకుండివంశమునకు చెందినవారిలో చరిత్రకారులకు తెలియవచ్చినవారిలో నితడే ప్రప్రథముడు. ఇతని శాసనములేవియు లభింపలేదు. అయినను ఇతనినే మనము వంశకర్తగా భావించుకొనవలయును. విష్ణుకుండినులు సర్వస్వతంత్రమైన విశాలరాజ్యమును ఇతని నాడే ఆక్రమించుకొనియుందురనుట సమంజసము. ఇతడు మహారాజు; రాజపరమేశ్వరుడు. విష్ణుకుండివంశమునందు వంశపరంపరగా వచ్చుచున్న బిరుదువిశేషణములు తొలుత నీమొదటిమాధవవర్మకు జేర్పబడియున్నవి. మొదటి యీపూరుశాసనమందు ఇతనికి "ఏకాదశాశ్వమేధావభృథావధూత జగత్కల్మషస్యాగ్నిష్టోమ సహస్రయాజినోనేకసామన్తమకుటకూటమణిఖచితచరణకమల యుగలస్య" అని యాతనిమహారాజపదవిని రాజపరమేశ్వరత్వమును సూచించువిశేషణములు ఉపయోగింపబడినవి. దేవవర్మరాజ్యాభిషిక్తుడుకాలేదు గనుకను, మొదటిమాధవవర్మయే వంశకర్త గావునను, ఆతనికి కనీసము ౩౦ సంవత్సరములు, క్రీ. శ. ౪౨౦ మొదలుకొని ౪౫౦ వఱకు రాజ్యకాలపరిమితి నొసగుట సమంజసము.




(సశేషము)

* ఇట్లు పూవుతో గుర్తించబడినవారు రాజ్యాభిషిక్తులు కాలేదని యూహించుకొనవలయును.

# 'జ్యోతిషసర్వస్వ' పునర్విమర్శనము

తనికెళ్ల వేంకటసూర్యనారాయణ

భావసంవత్సరపు చైత్రమాసపు 'భారతి' లో మావిజ్ఞానతరంగిణీ గ్రంథమాల యొక్క మొదటిపుస్తకంగా ప్రచురించబడిన "జ్యోతిషసర్వస్వము" అనేగ్రంథాన్ని గురించి 'సోదరజ్యౌతిష్కుల' పేర ఒకవిమర్శన ప్రకటించబడినది. విమర్శకులు తమ పేర్లను తెల్పుటకు సాహసించలేకపోయినందుకు కారణం దురూహ్యంగా ఉంది. ఎవరైతేనేం, విమర్శనవ్రాయడంలో గ్రంథమందలి గుణదోషాలని నిష్పక్షపాతబుద్ధితో విచారించకుండా లేనిపోనిదోషాలను ఆరోపిస్తూ నిందాగర్భంగావ్రాసిఉండడంచేత ఈపునర్విమర్శనం వ్రాయవలసివచ్చింది.

క్రమమైనవిమర్శన అంటే, రంధ్రాన్వేషణచేసి, గ్రంథస్థవిషయాలు సందేహానికి తావీయకపోయినా వానిని సరిగా అర్థంచేసికోలేకపోవటంచేతనో, లేక యేవోకొన్నిహంశములను లోపాలక్రింద నమోదుచేసి గ్రంథకర్తను నిరుత్సాహపరుద్దామనే ఉద్దేశంతోనో నోటికివచ్చినట్లు సందర్భంలేని వ్యాఖ్యానాలు చేసి గ్రంథకర్తమీద తమకుగల అసూయయావత్తు వెళ్లగ్రక్కటం కాదన్నమాట అందరికీ తెలుసును. అల్లా విమర్శనచేయబోయేవాళ్లు అసలు విమర్శకులు కానేకారు.

గ్రంథమునుగూర్చి అభిప్రాయం ఇచ్చినవారినీ పీఠికవ్రాసినవారిని, గ్రంథరచనోద్యమాన్ని ప్రోత్సహపరిచినవారినిగూడ మా "సోదరజ్యౌతిషికులు" అధిక్షేపించియున్నారు. అసలు వీరు వ్రాయింపించిన రెండుపేజీలవిమర్శనంలోను ఒకపేజీకిపైగా పైవారిని, గ్రంథరచనోద్యమాన్ని అధిక్షేపించడంక్రిందనే వినియోగపర్చబడ్డది. పీఠిక వ్రాసినవారు "పుస్తకంచదివియున్నట్లయితే పుస్తకంలో గ్రంథకర్తచేసినతప్పులను చెప్పిఅయినా ఉండేవారు, లేక పీఠికలోవ్రాసిఅయినా ఉండేవారు" అని విమర్శకులు వ్రాసినారు. విమర్శకమహాశయులు చూపించినవిషయాలు నిజంగా తప్పులే అయితే పీఠికవ్రాసినవారు వాటిని తప్పులక్రింద పరిగణించి ఉండియుందురు. ఇంతకీ స్పష్టమైనవిషయాలను దోషాలక్రింద నమోదుచేసేటందుకు శ్రీ వెంకటరామయ్యగారు, అపరిపక్వమైనబుద్ధితో విమర్శచేయపూనుకొన్న నవీనవిమర్శకులకుమల్లే అవివేకులూ అసూయాపరులూ కారు. "ఇల్లాంటిపుస్తకాలు తెలుగులో కావలసినవాటికన్న చాలా ఎక్కువఉన్నవి. వెనకటివారులగాయితూ యీగ్రంథకర్తవరకు ఇల్లాంటిపుస్తకములు ఎంతమంది ఎన్నివ్రాసినారో లెక్కలేదు" అంటూ ఈగ్రంథంవ్రాయడం నిష్ప్రయోజనం అన్నఉద్దేశం కనపర్చినారు మా "సోదరజ్యౌతిషికులు." కాని వారు నాగ్రంథంతాలూకు మొదటిపుటలలో నేను చేసిన విజ్ఞప్తినిచూసిఉంటే ఇల్లా అనిఉండరు. జ్యోతిష్యమని యేవో కల్లబొల్లిమాటలు నాలుగు చెప్పుకుంటూ లోకాన్ని మోసగించి ధనాకర్షణచేసుకొనే జ్యౌతిష్క సహోదరులకు ఇలాంటిగ్రంథాలు ప్రతిబంధకాలగుట వల్ల నిష్ప్రయోజనములని వ్రాసినట్లు రూపిస్తున్నది. పైగా యిల్లాంటిపుస్తకాలు చాలాఉన్నాయట. అలా ఎన్నిఉన్నాయో, వాటిపేర్లేమిటో మా విమర్శకులు తెలిపియున్నచో బాగుండును.

ఇక గ్రంథస్థవిషయాలనన్నింటినీ దమ్మిడీఖర్చు అక్కరలేకుండా అరగంటలో ప్రతివారు నేర్చుకోవచ్చునట! అసలు ఈగ్రంథము "జ్యోతిషసర్వస్వము" యొక్క మొదటిభాగమనిన్నీ, 'జ్యోతిషము' ను గూర్చి తెలుసుకోదలచిన ప్రారంభకుల నుద్దేశించి వ్రాయబడినదనిన్నీ నేనే విజ్ఞప్తిలో వ్రాసియున్నాను.

ఈసంగతి మావిమర్శకులు గ్రహించలేనట్లు తోస్తున్నది. కాగా, జ్యోతిషము తెలిసినవారికి తెలియనివారికిగూడా యీగ్రంథం ఉపయోగించదన్నట్లు విమర్శన వ్రాసినారు. జ్యోతిషము బాగా తెలిసినవారికి వారన్నట్లు యీ గ్రంథంతోనేకాదు సరికదా మరియేగ్రంథంతోనూ నిమిత్తముండదు. ఎటొచ్చీ తెలియనివారికే దీని ఉపయోగం తెలుస్తుంది. ఈగ్రంథస్థవిషయాలు అరగంట సేపు యేజ్యోతిషీ దగ్గరనైనా కూర్చుంటే దమ్మిడీఖర్చు అక్కరలేకుండా నేర్వవచ్చునట. అలాగ గ్రంథస్థ విషయాలనన్నింటినీ తెలుసుకోడానికి వీలు ఉన్నది లేనిది, గ్రంథాన్ని ఒకమారుచదివిచూచిన సహృదయులకు తెలుస్తుంది.

ఇక గ్రంథంలో లోపాలక్రింద జమచేయబడ్డ వాటివిషయమై సమాధానములు ఆలోచిద్దాం.

౧. పంచాగముచూచుకొనేపద్ధతి విపులముగా వ్రాయడమునకు ముఖ్యకారణము ఈగ్రంథము ప్రారంభకుల నుద్దేశించి వ్రాయబడుటయే. ఈవిషయము విజ్ఞప్తియందు విశదీకరించియేయున్నాను.

౨. కాలసాధనవిషయంలో "అతిఖసరా" గా వ్రాసినానని ౧౫ పేజీలకు ఒకటే ఆక్షేపణ గావించినారు. గాని వివరంగా యేయేసందర్భాలలో లోపాలున్నవో విమర్శకులు చూపించలేదు. సర్కారువారు కాలనిర్ణయంవిషయంలో చేసిన పద్ధతియేదో, అది యెంతవరకు ఈశాస్త్రవిషయకమగు చర్చలలో అనుసరణయోగ్యముగా ఉంటున్నదో ఆసంగతి మావిమర్శకులే శెలవిత్తురుగాక! గ్రంథస్థములగు పద్ధతులకంటె సులభముగాను, సూక్ష్మముగాను సరియగుకాలమును నిర్ణయించగలమార్గము లేవైనా ఉంటే అట్టివాటిని మావిమర్శకులే, కాదు, ఎవరైననుసరే—మాకు తెలియజేసేపక్షంలో కృతజ్ఞతతో స్వీకరించడానికి సిద్ధులమే!

౩. లగ్ననిర్ణయం విషయంలో దినప్రమాణం ౬౦-౧౦ అనిన్నీ ఋక్షాద్యంతంవిషయంలో దినం ౬౦-౦ అనిన్నీ అపోహం కలుగుతుందికనుక ఈ విషయం గ్రంథకర్త స్పష్టంగా వ్రాసిఉండవలసినదని మావిమర్శకులు సలహానిచ్చినారు. సరియగు సావన దినము—అనగా ఒకసూర్యోదయముమొదలు మరుసటి సూర్యోదయమువరకు అగుకాలము—౬౦-౧౦ ఘడియల పరిమితిగలిగియుండుటచేతనూ, సామాన్యవ్యవహారములయందు ౬౦-౦ ఘడియల పరిమితిగల నాక్షత్రదినమే వాడుకయం దుండుటచేతనూ, లగ్ననిర్ణయము, దివారాత్రప్రమాణనిర్ణయము మొదలయినచోట్ల సావనదినప్రమాణమునున్నూ తిథ్యాదులయందు, నాక్షత్రదిన ప్రమాణమునున్నూ గ్రహించుట సంప్రదాయ మయినందున అట్లువ్రాయబడినది. ఈ సావననాక్షత్రదిన వైషమ్యం స్వల్పంగనుక సామాన్యముగా దినంఅంటే ౬౦-౦ ఘడియల పరిమితిగలకాలం అని గ్రహించబడుతూన్నట్టు ౨౩-వ పేజీలో స్పష్టముగా వ్రాయబడిఉంది. ఇంతేకాక ఈవిషయాన్నిగురించి యీ గ్రంథంయొక్క తక్కినభాగములలో విపులంగా వ్రాయనుద్దేశించినట్లుగూడా సదరు పుటలోనే వివరించబడి ఉండటం మావిమర్శకులకంటికి అగోచరం అయినట్లు స్పష్టపడుతూంది. ప్రారంభకులకు అనవసరమైనవిషయాలు చాలావరకు యీగ్రంథంలో బుద్ధిపూర్వకంగా విడిచిపెట్టబడినవి.

౪. ౪౮-వపేజీలో వ్రాయబడిన పద్ధతివలన రాశిచక్రమే తారుమారౌతుందని మరియొక యాక్షేపణ. ఆపేజీలోనే మొదటరాశియందు గ్రహములను గుర్తించుటకు మార్గమువ్రాయబడి క్రింద వీ రాక్షేపించిన ప్రకారాంతరము వ్రాయబడింది. అచ్చట లోకజ్ఞానం కొంచెమేనా ఉన్నవాళ్లు పొరపాటుపడుటకు వీలులేదు.

౫. గ్రంథంచివరను ఇయ్యబడ్డ 'టేబిల్సు' యొక్క ప్రయోజనం గ్రంథంలోకాని, ఆపథకాల దగ్గరగాని స్పష్టంగా వివరించలేదని మరియొకలోపం కనబర్చారు. గ్రంథస్థవిషయాలలో ముఖ్యమైనవాటిని పాఠకులు జ్ఞప్తియందుంచుకొనుట కష్టమగునని చివరను ఆయావిషయములను క్రోడీకరించి 'టేబిల్సు'గా వ్రాసినాను. ఆయా టేబిల్సుయొక్కవైనంయావత్తున్నూ గ్రంథమందు యుక్తమైనచోట్ల వివరణలనుగూడ వ్రాసియున్నాను. ముఖ్యముగా గ్రంథమందు ౧౦,౨౮,౩౧, ౩౨,౩౨,౧౮,౫౨,౫౫,౮౧ పుటలలో ౧ మొదలు

౭ వరకుగల తొమ్మిది టేబిల్సుయొక్కవైనం వ్రాయబడింది. ఈవిషయం గమనించకుండా మావిమర్శకులాక్షేపించడం చూస్తే వారికి తెలుగుతెలియదా అనే సందేహం పుడుతోంది.

౬. ఇక మూడవ టేబిలుయొక్క ప్రయోజనం పూర్తిగావివరించియుంటే ౮-వ టేబిలుతో అవసరమే లేదట. 3-వ టేబిలులోనియ్యబడిన లగ్నభుక్తుల(౫-వ కలము) ప్రయోజనాన్నిగురించిన్నీ అవితెలిసికొనే విధానాన్నిసూచించిన్నీ ముందుభాగాలలో వ్రాయనుద్దేశించియుండుటచేతనూ, చదువరులీగ్రంథస్థవిషయాలను సులభముగా గ్రహింపగల్గుటయే నాముఖ్యోద్దేశముగుటచేతను గణితబాహుళ్యం లేకుండా రాత్రి కాలనిర్ణయంచేసికొనేటందుకు ౮-వ టేబిలువ్రాయడం అవసరంఅయింది.

౭. నాలుగవ టేబిలులో నీయబడిన ఘటికాది ప్రమాణము ౬౬|3౭ ను బట్టి కాలసాధనచేస్తే ౧౧|౮ వచ్చుననిన్నీ, అది ఏసూర్యోదయమువద్దనుండి లెక్కించుటయో బోధపడలేదనిన్నీ వ్రాసినారు. అసలు మీనమాసంలో శ్రవణం శిరోగతమైయుండగా మనకు కనపడుట కవకాశమేలేదుకదా! అయినప్పుడు మావిమర్శకులను భ్రాంతిగొల్పిన ౧౧|౮ ఘడియలకాలముమాత్ర మెట్లువచ్చును?అందుచేత ఇచ్చట ఆసంశయమనవసరము. అయితే అనవసరమైన ఆశ్రవణమునకు ఎదురుగా ౬౬|3౭ ఘడియలను టేబిలులో ఏల వ్రాసినారని శంకింతురేమో? 33-వ పేజీలో వ్రాసినరీతిని, ఒకనక్షత్రము శిరోగతము కాకుండనుండి తొలిది మధ్యాహ్నరేఖ దాటియున్నపుడు ఆరెండిటి యంతరమునుబట్టి కాలము నిర్ణయము చేయవలసివచ్చునుగదా! అట్టిచోట్ల యీయంకె లుపయోగించును గనుకనే యవి యందు వ్రాయబడినవి.

ఇచ్చట విమర్శకులు పొరపాటు పడినారు. ఈగ్రంథములో నీయబడిన మిక్కిలియెక్కువ పరిమాణముగల లగ్నము వృశ్చికము. దీనిపరిమాణము ౫|3౫ ఘడియలు. విమర్శకు లుదాహరించిన ౬౬|3౭ ఘడియలున్నూ మీనమాసములోనివి. "ఈ మీనమాసములో చివరరోజున లగ్నంఅంతా భుక్తిఅయిపోయిందనుకొని పై ౫|3౫ ను ౬౬|3౭ నుండి తీసివేస్తే మిగతా ౧౧|౮ ఘడియలు............బోధపడలేదు." అని వారువ్రాసినారు. మీనమాసములో వృశ్చికలగ్నప్రమాణము తీసివేయమనడం వింతలకువింతగా కనబడుతోంది.

౮. ౫-వ టేబిలులో యియ్యబడ్డ దేశాంతర సంస్కారాలు యెక్కడనుంచో, దేనిలో చేరవలెనో బోధపడలేదని మరియొకయాక్షేపణ. ఈవిషయంలో మావిమర్శకులు నాగ్రంథంయొక్క 3౨-వ పేజీని చదవకుండానే తిరగవేసిఉండియుంటారు. ఎవరో పేరు ఊరులేని సామాన్యపు విమర్శకులకువలె మా "సోదర జ్యౌతిష్కు"లు గూడ గ్రంథం పూర్తిగా చూడకుండానే విషయాలను ఆక్షేపించడం ఎంతమాత్రం బాగులేదు.

౯. దినం విషయంలో వారికి చాలా 'తికమక'గా వుందట. జ్యోతిశ్శాస్త్రములో దినమునకు రెండర్థములున్నూ ఉన్నవి. "నాగనందాప్తసంయుక్తో దినీకృత్యాదినాన్వితః" అనేదగ్గర దినంఅంటే ఒకరోజుకి అర్థం. ఇక పంచాంగాలలో "దినం ౨౭|౧౯"...... అనేదగ్గర 'దినం' అంటే ఒక్కపగటికి అర్థం. అంచేత సర్వేసర్వత్ర దినశబ్దానికి సమయానుకూలమైన అర్థమునే సహృదయు లింతవరకు గ్రహించుచున్నారు.

౧౦. అచ్చుతప్పులు కావలసినన్ని యున్నవట. ఎచ్చటనైనా ఒకటిరెండు తప్పు లుండియుండవచ్చును. ఇది పేరుపొందిన ముద్రణాలయములయందుగూడ విధియైన యంశము. ఊరకనే 'అన్ని', 'యిన్ని' అని వ్రాయుటకన్న పేజీకి యిన్నితప్పులున్నవి అనిపేర్కొని అట్టితప్పులసంఖ్య పరిగణింపబడతగినదైనచో వ్రాసిన మంచిది. నాగ్రంథమందు ఎచ్చటనుగూడ అర్థభేదము గలిగించుతప్పులు లేనేలేవని నేను దృఢముగా చెప్పగలను. ఉండిన నొకటి రెండు. అంతే.

మా "సోదరజ్యౌతిష్కులు" గ్రంథముపై వ్రాసినవ్రాత యెంతసమంజసముగానున్నదో "సోదర జ్యౌతిష్కు"ల దృష్టితోగాక నిష్పక్షపాతదృష్టితో జూచినవారికే తెలియగలదని నామనవి.




## గాంధీ వేషగాడూ - సన్యాసీ!

ఎంతసేపూ మనం గాంధిగారిని అతనిశిష్యులైన మనదేశస్థులు, విదేశస్థులు పొగడుతూవుంటే విని ఆ'ం దిస్తాము కాని, తదితరుల కాతనిచర్య లేలాగ అర్థమౌతున్నాయో కాస్త విచారించకుండా వున్నాము. ఇట్లు విచారించడంవల్ల మన కట్టే లాభం లేకపోయినా కొంచెము సరదాగాను, తమాషాగానేనా వుంటుందని మా వూహ. పూర్వీకుల పిచ్చినమ్మకాలు, నవీనుల దంభప్రకటనలూ ముద్దకట్టి గాంధీగారి అవతారమెత్తాయని ఒక కెనడాదేశపు లేఖకుడు వ్రాసి ప్రకటిస్తున్నాడు.

పూర్వం ఆంగ్లోశాగ్జనుజాతిలో యెవడికైనా, యెవరైనా ఒకఅపకారంచేస్తే, అపకారం పొందిన నాడు చేసినవాడిసమ్ముంలో ఆ అపకారానికి ప్రతిక్రియగా ఏదో ఒకఉపకారం చేసేదాకా అభోజనం కూర్చునేవాడట. గాంధీగారి పద్ధతికూడా యిదేనట. అయితే పూర్వకాలంవాడు అమాయికంగా ఉపన్యాసం చేసేవాడు. గాంధిగారు అట్టి విషయ ప్రకటన వలన కలిగే లాభము నూహించుకొని, ప్రకటించబడుతుం దని తెలుసుకొని, ప్రకటించబడవాలనే వుద్దేశంతోనే చేస్తున్నట్లు యీవిలేఖరి అభిప్రాయము.

అతనిరాకలూ పోకలూ, సజ్జూ సరంజాం, తినడం మానడం, దర్శనం భాషణం - అంతా నాటకరంగంలోకంటేకూడా ఇనుమిక్కిలి పటాటోపంతోను, బడాయితోనూ యేర్పాటుచేయబడుతున్నాయనే అతని వూహ. ఇందు కుదాహరణంగా కొన్ని చర్యల నాతడెత్తిచూపించుతున్నాడు. గాంధిగారు గుండ్రబల్లసభకు వెళ్లినప్పుడు పదినిముషములపాటు అతని ఉపన్యాసమును ప్రపంచమంతా ఒక్కసారి వినడాని కేర్పాటులు జరిగాయి. ప్రపంచంలో అన్నిదేశాలవారూ చెవులు' నిక్కబెట్టుకొని ఎప్పుడువిందాము, ఏమిటి వింటాము అని యెదురుచూస్తున్నారు. ఇదిగో గాంధిగారు మాట్లాడుతున్నారని కంపెనీ ఎనౌన్సరు చెప్పినాడు. ఒక్క నిమిషము నిశ్శబ్దము. తరువాతవెల్లినది గాంధి కాదు, స్లేడుదొరసాని (మీరాబాయి)గారు వెళ్లి "మహాత్ములు సాయంకాలభోజనం చేస్తున్నారు. అతనికి శ్రమయియ్య వీలు లేదు. ఒక్కనిముషంలో వస్తారు మాట్లాడుతారు." కొంచెంసేపు మళ్లీ నిశ్శబ్దం. గాంధీగారు వచ్చారు మాట్లాడేరు.

ప్రపంచమంతటినీ కొన్ని నిముషములు కనిపెట్టుకొనేటట్లు చేయడం కాలకర్మవశాత్తున కాదనినీ, ఆవొక్కనిమిషం వారి వారి నాపడముల్లా గాంధీగారి సాయంకాలభోజనం, అందుకు భంగం కలగనీయకపోవడం, అతని అమూల్యోపదేశములు విని ఆనందించడం కొరకు ప్రపంచమంతా కూడా ఓర్చివేసి సహించగలగడం మొదలైనవిషయములకు ప్రకటనమీయుటకొరకేనని అతని వుద్దేశ్యము. లండనుసభకు వెళతాడో వెళ్లడో తుదదాకా తెలియనీయకపోవడం,ఆఖరుస్టీమరును హఠాథిగా గోచీగుడ్డతోటే, ఆడమేకలతోటి, పేద బిఛానాతోటే యెక్కడం యిల్లాటియెత్తేనని అతని అభిప్రాయం. చార్లీచాప్లీనునుగురించి మీఅభిప్రాయ మేమని యెవరో అతనిని అడిగితే "చార్లీచాప్లీ నెవరు?" అని అతడడిగినప్రశ్న వట్టినటన మనియు, ప్రపంచకంలోని పేపర్లన్నీ చూచే గాంధీగారి కత నెవరో తెలియకపోవడం దుర్ఘటమనియు ఇతని ఉద్దేశ్యము. పేపర్లలో వింతగా పడవాలనే అత నిట్లు చేస్తున్నాడట. గాంధిగారు భోంచేస్తే మానితే, పాను హెచ్చితే తగ్గితే, మొదలైన విషయాలన్నీ ఇంగ్లాండులోని, న్యూయార్కు



చిత్రము ౧



పినాంగునందలి చైనీయుల పాములగుడి లోపలిభాగములు

కొమ్మలపై పాములు గలవు

చిత్రము ౨

B. S.



మరకత బుద్ధదేవాలయ ద్వారము, బ్యాంకాకు.
విగ్రహము 1½ అడుగు ఎత్తు. విగ్రహము మరకతమయముకాదని ప్రతీతి. B. S.



బ్యాంకాకునందలి రాజభవనములలో నొకటి
ఇం దిపుడు శాసనసభ కలదు. B. S.

లోని పేపర్లమీద గోడలమీద పెద్దపెద్ద అక్షరాల తోను వెలుగులతోను ప్రకాశిస్తూవుంటుం దనే అతను మాటాడితే ఉపవాసవ్రతమును పూనుతూవుంటా డని కూడా ఇతను వ్రాస్తున్నాడు.

గాంధీ నటకుడైతే అయినాడు కాని సన్న్యాసి కాడా అని ప్రశ్న—సన్న్యాసికూడా ననియే ఇతని అభిప్రాయము. లేకుంటే అంత దుర్బలశరీరు డన్నేసి రోజు లుపవాసాలు చేసి యేలాగు బ్రతకగలడని అతని సందేహము. అతనిఆత్మ అందరిలాటిదీకాక కొంచెం విశిష్టమైనదనిన్నీ, అతనిపట్టుదల, నైతికశక్తి అతనిచేత నిట్టి అసాధారణకార్యములను చేయిస్తున్నాయి అనీ సిద్ధాంతము. తెల్లవాళ్లు దేవపుత్రులనీ, వాళ్ల నాగరీకత నల్లవాళ్లకి మప్పి వాళ్లనుద్ధరించడానికీ, వాళ్లదేశాలాక్రమించడానికీ, వాళ్ల సంపదలు కొల్లగొట్టడానికీ దేముడు వాళ్లను పుట్టించాడనీ, చిత్రవిచిత్రమైన కథలూ, ప్రచారాలు మనము చేసి లోకాన్ని నమ్మించుతున్నామా లేదా, మనలాటిప్రకటనలే అతనుకూడా చేస్తూ మన వేళ్లుపెట్టే మనకళ్లు పొడుస్తున్నాడని అతని వాదం. గాంధీది పూర్తిగా పాశ్చాత్యపద్ధతి కాదనీ, జన్మతః సిద్ధించే జాతియం దతనికి విశ్వాసముకలదనీ, అందువలన పంచముల నుద్ధరించి వారికి జాతి, లేక వర్ణము నిద్దామనే అతని సంకల్పమువలన అస్పృశ్యుల కెట్టిలాభమూ కలుగలేదనీ ప్రకటన ప్రధానార్థముగ రచియించబడు అతని పైపై యెత్తులవలన హిందూసంఘముయొక్క శల్యశల్యమును బట్టిపోయిన ఆచారవాసనలు వదలవనీ అతని అభిప్రాయము.

సరే, గాంధిగారిచర్యలను యెవరి తత్త్వాన్ని పట్టి వారు ఏలాగు అర్థముచేసుకున్నా వారి నేమీ అనకూడదు. గాంధిగారు సన్న్యాసైనా కావాలి, చమత్కార నటకుడైనా కావాలి కాని రెండుకూడా కాగలడన్నవారి తత్త్వంచూస్తే మనకు నవ్వు రాకమానదు. నటకులు సన్న్యాసివేషం వేయవచ్చును కాని వారిని మనము సన్న్యాసులనము. సన్న్యాసులు నాటకాలు చేస్తారేమో ఆదేశాల్లో కాని మనదేశంలో చేయరన్నమాట స్పష్టము. గాంధిగారి నిష్కళంక తపశ్చర్యలను మన అనుకూలములకు సరిపడేటట్లు వింతవింతప్రకటనలుగా ప్రకటించి లాభాలుకొట్టుకొంటూ, ఇటువంటి లాభాలకోరకే అతను కూడ గారడీలుచేస్తూన్నాడని స్థిరపరుస్తూ, ఆగారడీకి ఈసన్న్యాసానికి సంబంధం పెట్టడం బోడితలకీ మోకాలికీ ముడివేసిన ట్లుంటుంది!

—నారాయణ.

---

## ఆంధ్రసరస్వతీగ్రంథమాలా కార్యస్థానము
## ఆర్ష శకము

అయ్యా,

నేను నాకాగితములను సవరించుకొనుచుండఁగా చెన్నపురివిశ్వవిద్యాలయములోని ఆంధ్రభాషాపరీక్షల చరిత్రముకొఱకు వ్రాసిపెట్టుకొన్న శిథిలమైన కాగితములు కొన్ని కానవచ్చినవి. అందు ఈవిశ్వవిద్యాలయము పుట్టినదిమొదలుకొని ౧౮౬౮-వ సంవత్సరముదాఁక ఆంధ్రభాషకు ఎవ్వరెవ్వరు పరీక్షకులుగా నుండిరో తెలుపఁబడియున్నది. ప్రాతగిలిపోయి ఆనాఁటి విశ్వవిద్యాలయ నివేదికలు నేఁడు అలభ్యములుగా నున్నందున నేనుకూర్చుకొన్న యీశిథిలపత్రములోని నామములు మీపత్రికయందు ప్రకటించియుంచుట ఎందులకైన మేలని యీపట్టికను పంపుచున్నాను. దయచేసి ప్రకటింపఁగోరుచున్నాను.

| సంవత్సరము | భాష | బి. ఏ. పరీక్షకులు | ఎఫ్. ఏ. పరీక్షకులు | మెట్రిక్యులేషన్ లేక ఎంట్రెన్సు పరీక్షకు—పరీక్షకులు | రిమార్కులు |
|---|---|---|---|---|---|
| ౧౮౫౭ | అఱవము | — | — | రంగనాథశాస్త్రి | |
| | తెలుఁగు | — | — | డిటో | |
| ౧౮౫౮ | అఱవము | డాక్టరు జి. యు. పోప్ | — | డాక్ట జి. యు. పోప్ | |
| | తెలుఁగు | — | — | డిటో | |
| ౧౮౫౯ | అఱవము | డా. జి. యు. పోప్ | — | డా. జి. యు. పోప్ | |
| | తెలుఁగు | డిటో | — | డిటో | |
| | మళయాళము | — | — | డాక్టరు సుండర్టు | |
| ౧౮౬౦ | అఱవము | రివరెండు జె. బి. రాడ్జర్సు | — | — | |
| | తెలుఁగు | — | — | — | |
| ౧౮౬౧ | అఱవము | రివరెండు హెచ్. బవరు | — | — | |
| | తెలుఁగు | యస్. కృష్ణమాచారి | — | — | |
| ౧౮౬౨ | అఱవము | రివరెండు హెచ్. బవరు | — | రివరెండు హెచ్. బవరు | |
| | తెలుఁగు | రివరెండు జె. క్లే | — | రివరెండు జె. క్లే | |
| | మళయాళము | — | — | ఈ. థాంప్సన్, యమ్. ఏ., | |
| | కన్నడము | — | — | జె. గ్యారెట్టు | |
| (౧౮౬౨ లో కన్నడమునను, మళయాళములోను పరీక్షకులుమాత్రము నియమింపఁబడిరిగాని ప్రశ్నపత్రములు ఒసఁగఁబడలేదు). | | | | | |
| ౧౮౬౩ | అఱవము | వాల్టరు జోయెస్ | — | వాల్టరు జోయెస్ | |
| | తెలుఁగు | రివ. జె. క్లే | — | రివ. జె. క్లే | |
| | కన్నడము | — | — | జె. గ్యారెట్టు | |
| | మళయాళము | — | — | ఈ. థాంప్సన్, ఎం. ఏ., | |
| ౧౮౬౪ | అఱవము | రివ. హెచ్. బవరు | రివ. హెచ్. బవరు | రివ. హెచ్. బవరు | ఈ యేట |
| | తెలుఁగు | రివ. జె. క్లే | రివ. జె. క్లే | రివ. జె. క్లే | యఫ్. ఏ. పరీక్ష |
| | కన్నడము | — | జె. గ్యారెట్టు | జె. గ్యారెట్టు | ఆరంభమైనది. |
| | మళయాళము | జె. గార్తువైటు | జె. గార్తువైటు | జె. గార్తువైటు | |
| ౧౮౬౫ | అఱవము | వాల్టరు జోయెస్, హెచ్. బవరు | వాల్టరు జోయెస్, హెచ్. బవరు | వాల్టరు జోయెస్, హెచ్. బవరు | |
| | తెలుఁగు | మేజర్ ఆర్. యం. మాక్డొనాల్డు | మేజర్ ఆర్. యం. మాక్డొనాల్డు | మేజర్ ఆర్. యం. మాక్డొనాల్డు | |
| | కన్నడము | జె. గ్యారెట్టు | జె. గ్యారెట్టు | — | |

| సంవత్సరము | భాష | | | |
|---|---|---|---|---|
| | మళయాళము | — | యల్. గార్తువైటు | — |
| ౧౮౬౬ | అరవము | రివ. సి. ఇ. కెన్నెట్టు<br>వాల్టరు జోయెస్ | రివ. సి. ఇ. కెన్నెట్టు<br>వాల్టరు జోయెస్ | వాల్టరు జోయెస్<br>రివ. సి. ఇ. కెన్నెట్టు |
| | తెలుగు | — | రివ. జె. ఈ. షార్కీ | రివ జె. ఈ. షార్కీ |
| | కన్నడము | రివ. డి. సాండర్సన్ | రివ. డి. సాండర్సన్ | — |
| | మళయాళము | యల్. గార్తువైటు | యల్. గార్తువైటు | యల్. గార్తువైటు |
| ౧౮౬౭ | అరవము | రివ. హెచ్. బవరు | రివ. హెచ్. బవరు | వాల్టరు జోయెస్<br>రివ. హెచ్. బవరు |
| | తెలుగు | మేజరు టి. జి. యం. లేన్ | యనమండ్ర వెంకటరామయ్య | యనమండ్ర వెంకటరామయ్య<br>మేజరు టి. జి. యం. లేన్ |
| | మళయాళము | యల్. గార్తువైటు | యల్. గార్తువైటు | యల్. గార్తువైటు |
| | కన్నడము | — | జె. గ్యారెట్టు | జె. గ్యారెట్టు |
| ౧౮౬౮ | అరవము | రివ. హెచ్. బవరు<br>హెచ్. డబ్ల్యు. జోయెస్ | రివ. హెచ్. బవరు | సి. ఇ. కెన్నెట్టు, వి. కృష్ణమాచారి |
| | తెలుగు | మేజర్ టి. జి. యం. లేన్<br>యనమండ్ర వేంకటరామయ్య | యనమండ్ర వేంకటరామయ్య<br>మేజర్ టి. జి. యం. లేన్ | యనమండ్ర వేంకట రామయ్య<br>రివ. జె. క్లే |
| | కన్నడము | — | బి. యల్. రైసు | బి. యల్. రైసు |
| | మళయాళము | — | యల్. గార్తు. వైటు | యల్. గార్తువైటు |
| ౧౮౬౯ | అరవము | రివ. హెచ్. బవరు | పి. రంగనాథం మొదలియారు<br>రివ. హెచ్. బవరు | సి. ఇ. కెన్నెట్టు, వి. కృష్ణమాచా |
| | తెలుగు | యనమండ్ర వేంకటరామయ్య<br>వెలగపూడి సుందరరామయ్య | రివ. జే. క్లే<br>వెలగపూడి సుందరరామయ్య | రివ. జే. క్లే<br>వెలగపూడి సుందరరామయ్య |
| | కన్నడము | రివ. బి. యల్. రైసు | రివ. బి. రైసు | జె. గ్యారెట్టు |
| | మళయాళము | యల్. గార్తువైటు | యల్. గార్తువైటు | యల్. గార్తువైటు |
| ౧౮౭౦ | అరవము | రివ. హెచ్. బవరు<br>పి. రంగనాథమొదలియారు | రివ. హెచ్. బవరు<br>పి. రంగనాథం మొదలియారు | వాల్టర్ జోయెస్<br>వి. కృష్ణమాచారి |
| | తెలుగు | రివ. జె. క్లే<br>వెలగపూడి సుందరరామయ్య | రివ. జే. క్లే<br>వెలగపూడి సుందరరామయ్య | రివ. జే. క్లే<br>వెలగపూడి సుందర రామయ్య |
| | కన్నడము | రివ. బి. రైస్ | రివ. బి. రైస్ | జే. గ్యారెట్టు |
| | మళయాళము | యల్. గార్తువైటు | రివ. ఈ. డైయొట్జు | రివ. ఈ. డైయొట్జు |

| | | | | |
|---|---|---|---|---|
| ౧౮౭౧ | అఱవము | వాల్టరు జోయెస్<br>పి. రంగనాథం మొదలియారు | హెచ్. బవరు<br>సెవిల్ సుపిల్లె బి. ఏ. బి. యల్. | వాల్టరు జోయెస్<br>వి. కృష్ణమాచారి |
| | తెలుఁగు | రివ. జార్జ్ క్లే<br>వెలగపూడి సుందరరామయ్య | రివ. జార్జ్ క్లే<br>వెలగపూడి సుందరరామయ్య | రివ. జార్జ్ క్లే<br>వెలగపూడి సుందరరామయ్య |
| | కన్నడము | రివ. బి. రైస్ | రివ. బి. రైస్ | జె. గ్యారెట్టు |
| | మళయాళము | — | వి. అచ్యుతపణిక్కర్<br>రివ. సి. ముల్లర్ | వి. అచ్యుతపణిక్కర్<br>రివ. సి. ముల్లర్ |
| ౧౮౭౨ | అఱవము | డాక్టరు హెచ్. బవరు<br>యస్. సెవిన్సుపిల్ల | యస్. సెవిల్ సుపిల్ల | వి. కృష్ణమాచారి |
| | తెలుఁగు | రివ. జార్జ్ క్లే<br>వెలగపూడి సుందరరామయ్య | రివ. జార్జ్ క్లే<br>వెలగపూడి సుందరరామయ్య | రివ. జార్జ్ క్లే<br>వెలగపూడి సుందరరామయ్య |
| | కన్నడము | రివ. బి. రైసు | రివ. బి. రైసు | జె. గ్యారెట్టు |
| | మళయాళము | వి. అచ్యుతపణిక్కరు<br>రివ. సి ముల్లరు | వి. అచ్యుతపణిక్కరు<br>జె. ఆర్. థామస్ | వి. అచ్యుతపణిక్కరు<br>జె. ఆర్. థామస్ |
| ౧౮౭౩ | అఱవము | రివ. డా. బవరు<br>యస్. సెవిన్సుపిల్ల | రివ. డా. బవరు<br>పి. రంగనాథం మొదలియారు | వి. కృష్ణమాచారి |
| | తెలుఁగు | రివ. జె. క్లే<br>వెలగపూడి సుందరరామయ్య | రివ. జే. క్లే<br>యనమండ్ర వేంకటరామయ్య | రివ. జే. క్లే<br>యనమండ్ర వేంకటరామయ్య |
| | కన్నడము | రివ. బి. యల్. రైసు | రివ. బి. యల్. రైసు<br>స్టట్టాక్కు | రివ. బి. యల్. రైసు<br>స్టట్టాక్కు |
| | మళయాళము | వి. అచ్యుతపణిక్కరు<br>రివ. సి. ముల్లరు | వి. అచ్యుతపణిక్కర్<br>జె. ఆర్. థామస్ | వి. అచ్యుతపణిక్కరు<br>జె. ఆర్. థామస్ |
| ౧౮౭౪ | అఱవము | రివ. హెచ్. బవరు<br>పి. రంగనాథం మొదలియారు | రివ. హెచ్. బవరు<br>సెవెల్ సుపిల్లె | వి. కృష్ణమాచారి |
| | తెలుఁగు | రివ. జే. క్లే<br>యనమండ్ర వెంకటరామయ్య | రివ. జె. క్లే<br>వెలగపూడి సుందరరామయ్య | రివ. జె. క్లే<br>వెలగపూడి సుందరరామయ్య |
| | కన్నడము | రివ. బి. రైసు<br>జే. స్టట్టాక్కు | రివ. బి. రైసు<br>జే. స్టట్టాక్కు | రివ. బి. రైసు<br>ఏ. సుబ్బారావు బి. ఏ. బి. ఎల్. |
| | మళయాళము | వి. అచ్యుతపణిక్కరు<br>జె. ఆర్. థామస్, బి. ఏ. | వి. అచ్యుతపణిక్కరు<br>జె. ఆర్. థామస్, బి. ఏ. | వి. అచ్యుతపణిక్కరు<br>జె. ఆర్. థామస్, బి. ఏ. |

ప్రారంభమునందు ప్రశ్నపత్రములు ఆంగ్లమున నుండెడివి. ఉత్తరములును ఆంగ్లముననే వ్రాయఁబడుచుండెడివి. అందువలన ఆంధ్రద్రవిడములు రెంటికిని పాశ్చాత్యులు పరీక్షకులుగా నుండినను బాధలేకపోయెడిది. ౧౮౫౪ లో, అనఁగా చెన్నపురి విశ్వవిద్యాలయమువారి మొట్టమొదటిపరీక్షలో రంగనాథశాస్త్రిగారు తెలుఁగునకును, అరవమునకునుగూడ పరీక్షకుఁడుగా నియమింపఁబడినను అటువెనుక ౧౮౬౧ దాఁక భారతీయులకు ఈపదవిరాలేదు. కొన్నినాళ్లు పోపుదొరగారే రెండుభాషలకును పరీక్షకులై, ఆంగ్లములో ప్రశ్నపత్రము లొసఁగి, ఆంగ్లమున వ్రాయఁబడిన యుత్తరములనే పరీక్షించుచుండిరి. దేశభాషలందు ప్రశ్నపత్రములిచ్చుపద్ధతి రమారమి ౧౮౪౮ దాఁక కానరాదు.

చెన్నపురివిశ్వవిద్యాలయములో మొట్టమొదట యమ్. ఏ. పట్టమునందినవారు ఆంధ్రులైన శ్రీ వెలగపూడి సుందరరామయ్యగారు. అటువెనుక రంగనాథము మొదలియారుగారును యమ్. ఏ. పట్టమునందిరి. కాని వీరికి దేశభాషలలో మాత్రమే పరీక్షకపదవి యొసఁగఁబడినది. యనమండ్ర వెంకటరామయ్యగారు పురాణనామచంద్రికను రచించిన మహనీయులు. భరతవర్షములో ఆంగ్లవిశ్వవిద్యాలయములు పుట్టినదినములలో తెలుఁగుపరీక్షకు లెట్లుండిరో పైపట్టికలవలనఁ దెలియఁగలదు.

—తేకుమళ్ల రాజగోపాలరావు.

---

## రష్యాప్రభుత్వము – పత్రికాసంపాదకత్వము

రష్యాలో జీతాలు చాలాఅనుకూలంగా వుంటాయి. సాధారణపు కూలివాడికి కూడా నెలకి ౧౦౦ రూబులులిస్తారు. మహోన్నతోద్యోగికి ౪౦౦ కంటె ఎక్కువ యీయరాదు. పత్రికాసంపాదకుల కున్నంతేసి పుష్కలజీతాలు మరియెవ్వరికీ వుండవు దినపత్రికాసంపాదకులు కేవలం సంపాదకీయాలు వ్రాసేటందుకు నెలకు ౬౦౦ యిస్తారు. ఇదికాక వారు మరేమైనా వ్రాస్తే పంక్తికింతా అని నిర్ణయముంటుంది. ఈవిధంగా మరో ౩౦౧ సంపాదించవచ్చును. సహాయ సంపాదకులకు ౫౦౦ లు జీతము. విలేఖరులుకూడా యీవిధంగానే సంపాదించవచ్చును. సంపాదకుడికి రెండేసి గదులు, స్నానముగది, వంటిల్లు, హోటలుభోజనము, సినీమాలు, బట్టలు, కావలసినపుస్తకాలు అన్నీ తక్కినవారికంటె చౌకగా యిస్తారు. చేసినంతపని చేసుకోగా తక్కిన అన్నిశాఖలవారికంటె వీరికి విశ్రామమెక్కువ చిక్కుతుంది. లేకుంటే చక్కని ఆర్టికల్సురావని ప్రభుత్వము వారికి తెలుసును. ఎంపికమనుష్యులనుతీసి ఈవృత్తిలో వేసుకొని వారికిట్టి సౌకర్యముల నన్నిటినీ స్వేచ్ఛలుగా కూరుస్తారాదేశస్థులు. ఆదేశంలో నవలలు, ప్రబంధాలు, కవిత్వాలు మొదలైన వెవ్వరూ వ్రాయరు, వ్రాసినా చెల్లవు. ప్రాతచరిత్రలు పుక్కిటిపురాణాలూ అంతకన్న అక్కరలేదు. ఎంతసేపూ కార్మికరాచకీయాలు, ఆర్థిక విషయాలు, ప్రణాళికలు, యంత్రపరిశ్రమలు, విదేశప్రభుత్వముల బలాబలములు, క్రొత్తక్రొత్త సభలు సంఘులయొక్క పరిణామాలు మొదలైన కాలానుగుణ్య ప్రసంగాలే వ్రాసేది. ఇల్లాటివాదేశంలో వేడివేడి పెసరట్లులాగ చెల్లుతాయి.

స్త్రీలు యిందులో చేరకూడదని నిషేధ మేమీ లేదు. కాని వారు పురుషులలాగ సుఖజీవులు కారు. వారికెప్పుడూ చేతినిండా యేదైనా పని వుండాలి. సంసారాలబాధ అట్టే లేకపోయిన ఫ్యాక్టరీలలో పని, ఆఫీసులలో ఉద్యోగాలూ అంటేనే వాళ్లె కెక్కువ సరదా. ఇందులోకొస్తే వాళ్లె కెక్కువజీతాలు దొరుకుతాయి కాని వారి కెందుకూ అంతడబ్బు, అంత విశ్రామముకూడా ఎందుకు? ఏమైనా కొనుక్కుందామంటే చిత్రవిచిత్రమైన విదేశీవస్తువులతో కూడిన అందమైన దుకాణాలుండవు. ఎంతసేపూ కోఆపరేటివు స్టోర్సులే వుంటాయి. వాటిలో అత్యావశ్యకపదార్థాలే అమ్ముతారు. ఎవరేనా స్నేహితులయిండ్లకు వెళ్లి కులాసాగా మాట్లాడుకుందామంటే వాళ్లంతా ఏఫ్యాక్టరీలలోనో పనికిపోతారు. సినీమాలకు పోదామంటే రాత్రిళ్లుకాని అవి ఆడవు. అందుచేతను వారీవృత్తులలోకి రారు.

కాని బ్రాడుకాస్టింగు స్టేషనులలో వారు విస్తారముగా పనిచేస్తూవుంటారు. ఇవికూడా పత్రికలలాంటివే. పత్రికలలో అయితే అచ్చువేస్తారు. వీటిలోఅయితే ఆప్రసంగాలనే ఉపన్యసిస్తారు, పాడుతారు. ప్రజాభిప్రాయమును సృష్టించడానికి, సంస్కరించడానికి రెండూ ఒక్కవిధంగానే సహాయపడతాయి. ప్రతీహోటలులోను, పదిమందిపనివాళ్లు పడుకొన్నే గదిలోను ఒకలౌడుస్పీకరుంటుంది. దానిద్వారా ఎవరికి కావాలన్నా వద్దన్నా రష్యాప్రసంగాలు వినిపిస్తున్నే వుంటాయి. ఏరోజున, ఏ నెలలో, ఎంతపనిజరిగిందో, ఎంత హెచ్చిందో తగ్గిందో రద్దయిందో, ఎవరువానికి కారకులో, వారినెట్లువిచారణచేశారో, ఎవరిని తీసేశారో, కొత్తవారిని ఎవరిని వేశారో అంకెలు, అక్షరాలు, విలవలతోసహా చాటుతున్నే వుంటారు. చాలామంది వీనిని శ్రద్ధతో వింటారు. అలాగ వినని వాళ్లకి శ్రద్ధకలగడానికి సంగీతంకూడా మేళవించి యీ సంగతులే పాటలలో చెప్పుతారు. ఈలాటి చేరీజులన్నిటికీ పాటలూ, మద్దెలతాళాలు డాన్సింగుట్యూనులూ ఏమిటి అనిపిస్తుంది కాని, విషయం నచ్చక వినిపించుకోనివాళ్లకైనా పాటంటే సరదా లేచివస్తుంది. పల్లెటూళ్లకి పొలాల్లోకి కూడా కనెక్షను లుంటాయి.

పొద్దుటనుంచి సాయంత్రందాకా ఈ రేడియో కార్యక్రమము వుండనే వుంటుంది. పని చేసుకుంటూ చేసుకుంటూ వినవచ్చును. ఇవి ఒకమోస్తరు గోడ నోటీసులలాగ అయిపోయినాయి. దీనిలో కొంతభాగం పత్రికాప్రసంగ పఠనము. ఆపత్రిక యేమి వ్రాసిందో ఈపత్రిక యేలాగున ఖండించిందో యీకరువుపెడతారు. ఇందులో వెటకారం కొంత, కేలు సేయడం కొంత, వెక్కిరించడం కొంత, హాస్యంకొంత, సందర్భానుసారంగా కొన్నిపిట్టకథలు. దీనికిగా కొందరిని తరిఫీదుచేసి సిద్ధంగా వుంచుకుంటారు. ఎవడైనాసరే యెవరిమీదనైనాసరే తప్పుచూపించి చెప్పడానికి సిద్ధపడేలాగుంటే పోయి రేడియోలో ఊదీవచ్చును. ఏ డిపార్టుమెంటునైనాసరే ఇంకోడిపార్టుమెంటువారు విమర్శింపవచ్చును. ప్రెస్సుఆక్టుకాని సెన్సరుషిప్పు కానీ యేమీ అనరాదు. తప్పు చూపించబడితేచాలు, విచారణ ప్రారంభమై ఫలితం ప్రకటించబడుతుంది. సోవియటు ప్రభుత్వవిధానానికిమాత్రం యెవ్వరూ ఏమీ అనకూడదు.

ఆదేశంనిండా దినపత్రికలే కాని వారపత్రికలు మాసపత్రికలు చాలాతక్కువ. ఈవేళప్రసంగాలు రేపటికి ప్రాతగిల్లిపోతూవుంటే యీలాటిపత్రికలూ పుస్తకాలూ యెవరికి కావాలి? కేవలం పత్రికాసంపాదకులకుమాత్రమేకాక ఈరేడియోస్టేషనులలోని ఉద్యోగులకూ వాచకులకు ఉపన్యాసకులకు గాయకులకూ నటకులకూ కూడా పుష్కలమైన జీతాలుంటాయి. ఈపత్రికలను రేడియోలను పట్టుకొనియే, బోలెడంతడబ్బుఖర్చుపెట్టి, కమ్యూనిష్టుపార్టీవారు ౧౬. కోట్ల ప్రజల మనస్సులను తనప్రక్క కాకర్షించుకొని డిక్టేటరుషిప్పు చలాయించుతున్నారు. ఈప్రెస్సూ, రేడియో సంపూర్ణస్వాధీనంలో వున్నన్నాళ్లు ఈ డిక్టేటరుషిప్పుకు చలనముండకూడదు.

---

## అణువుల మహాత్మ్యం

అణువు (Atom) అన్నిటికంటే చాలా చిన్నదని అందరిఉద్దేశమున్నూ. ఇట్టిఅణువులు ఒకటి నొకటి సంఘటించుకొనివుంటేనే పంచభూతాత్మకమైన ప్రకృతి సృష్టిఅంతాయేర్పాటు అవుతున్నదని చాలామందికి తెలిసినవిషయము. ఈసంఘటనము భేదించబడ్డప్పుడొకమోస్తరు శక్తి వుద్భవిస్తుందనీ, ఈ శక్తితో యెంతటియంత్రములనైనా నడిపించవచ్చుననీ పాశ్చాత్యశాస్త్రజ్ఞుల అనుభవము. అది మనకు ప్రత్యక్షముగా కూడా కనిపించుచున్నది. ఇంతవరకూ ఈఅణుసంఘటనములనే మనము చీల్చుచున్నాము కాని అణువును చీల్చలేదు. కాని దాన్ని చీల్చుటకు సాధ్యమౌతుందనే అనేకశాస్త్రకారుల అభిప్రాయము. వారు తత్ప్రయత్నములయందు మున్నులై విజయపరంపరల నందుచున్నారు. ఈచాతుర్యము బాగా వశీకరణమైనచో మనము మతీమహాద్భుతమైనశక్తిని సృష్టించి అపూర్వ

మైనపనులు చేయించగలమని చాలామంది శాస్త్రవేత్తల అభిప్రాయము. కాని యిది కేవలము పిచ్చివాని వూహ యని లార్డురూథరుఫోర్డుగారి విశ్వాసము. అణువును భేదించగలమన్నమాట సత్యమే కాని దానిని భేదించుట కనంతమైనశక్తిని మనము ప్రయోగించవలెను. ఈశక్తికి ఆశక్తికి జమాఖర్చులు రాసి బేరీజుకట్టిచూస్తే మిగిలేది పూజ్యం—పైగా యేమైనా తెలివితక్కువపడితే అపాయంకూడా నిశ్చయము. ఈ ప్రయత్నాలవల్ల మన శాస్త్రీయానుభవము హెచ్చిందని మనము గర్విస్తే గర్వించవచ్చునుగాని దానివలన మనకేమో నూతనశక్తి ఎక్స్ట్రాగా లభించి మనమేమైనా జుఱ్ఱుకోగల మనేది వెఱ్ఱివూహ యని అతను శెలవిస్తున్నాడు. అణువును చీలిస్తే పరమాణువులు (electrons) యేర్పడుతవి. ఇట్టిపరమాణువు అణువులు ప్రకృతిశక్తివలన సంఘటనమును పొంది గ్రహతారకాదిమండలము లేర్పడుచున్నవి; సృష్టిచక్రము నడుచుచున్నది. ఇందుకే అవి నిర్మింపఁబడ్డవి, ఇది చూచి మన మాశ్చర్యచకితులము కావలెను కాని వాటిని తారుమారు తక్కిరిబిక్కిరిచేసే వ్యర్థప్రయత్నముల కర్థము లేదని అతనియూహ.

---

## మహాకావ్యరచన: ఖండకావ్యరచన

ఇది ఖండకావ్యములే కాని మహాకావ్యము లవతరించు కాలముగాదని కొందఱు విమర్శకు లందురు. మనుష్యజాతికంతయు నీన్యాయ మెంతవఱ కన్వయించునో చెప్పఁగల విశ్వదృష్టి నాకు లేదు. ప్రకృతము మన దేశమునమాత్రము ఇది చాలవఱకు సత్యమనక తప్పదు. ఎందుకనఁగా మహత్త్వము అను ధర్మము తక్కిన జీవితవ్యవహారములలో లేనిది కావ్యములందు మాత్ర మెట్లు పొడసూపఁగలదు? ఇప్పటి మన ఆశలు, ఆస్తులు, ఉద్రేకములు, ఓర్పులు—అన్నియు నల్పములు. మనలో నిజముగా వేదాంతము బ్రదికియున్నకాలమున ఉపదేశింపఁబడిన అల్పతృప్తి యిప్పుడు సిద్ధించినది. సముద్రమునకు సేతువుగట్టు సాహసమునకుఁ బూనువారికాలమున 'శతకోటి ప్రవిస్తర' మగు కావ్యమును రచించు యోచనజనించుట వింతకాదు. అట్లే అరకప్పు కాఫీతో ఆకలి తీర్చుకొనువారి చేతిపనులు చిన్నవిగా నుండుటయు నరుదుకాదు. కావ్యము లెట్టివో కార్యములు నట్టివేయగును. ఈమాట కావ్యపుఁ బ్రమాణమునకు మాత్రమేకాక యందలి వస్తువు, పాత్రములు, సన్నివేశములు మొదలగునన్నిటికిని అన్వయించును.

అనఁగా చిన్నకావ్యములు పరిత్యాజ్యము లని చెప్పరాలేదు. మహాకావ్యములు వ్రాయలేక పోయితిమే యని పరితాపపడవలసినదే కాని లఘుకావ్యములు వ్రాయుచున్నామే యని లజ్జపడవలసిన పనిలేదు. సృష్టిలో పిన్నపెద్దలు రెండును స్వతంత్రములు, ఆవశ్యకములు. గుణదోషములు రెండును రెంటను గలవు. గొప్పవస్తువునందలి గాంభీర్యము చిన్నవస్తువున కుండదు; చిన్నదానికిఁగల చెలువము గొప్పదానికిరాదు. పెద్దలకు మ్రొక్కులు, పిల్లలకు ముద్దులు. వస్తువు పెద్దదియగు నట్లెల్ల నయనాణ్యములుతగ్గును. చిన్నదియైనట్లెల్ల గౌరవగాంభీర్యములు కృశించును. రెండుగుణములును ఒకచోఁ జేరుట సృష్టిలోని యుద్దేశమే కాదేమో!

మన ప్రాచీను లీరెంటి తత్త్వము నెఱిఁగినవారు. కేవలము పరిమాణప్రియులై వారు మహాభారతమువంటి మహాకావ్యములనుమాత్రమే వ్రాసి యూరకుండలేదు. మేఘసందేశమువంటి మురిపెముల మూటలను వ్రాసిరి. ప్రాకృతములో సేతుబంధమువంటి గంభీరకావ్యములతో పాటు 'గాథ'లను రసఘుటికలను వేలకొలఁదిగా గాలికివిసరి భరతఖండము వీథివీథులందును వెలయించిరి. శృంగారనైషధము నూఱిన శ్రీనాథుఁడే సీమకమలములవంటి చాటుపద్యముల నెన్నింటినో వెదచల్లెను. ఇట్లే 'చాటు' కవితలు మహాకవితల కెందును వెలలో తీసిపోనివి. మఱియు అనేక మహాకావ్యములకంటె అనేక చాటువులలో రామణీయక మెక్కువయనుటయు అనుభవవేద్యము.

ఖండకావ్యములు మహాకావ్యములకంటె సులభముగా రచింపవచ్చునని తలఁచుటయు పొరబాటు. కొన్ని విషయముల వానికన్న నివి కష్టములును. మహా

కావ్యములందలి కథ, పాత్రములు మొదలగువాని మహత్త్వము మఱుఁగులో చిల్లర రచనాలోపము లెన్నియో తలదాఁచుకొనును. చిన్న కావ్యములలో నట్లుగాదు. అన్నియు చిన్నవి గావున ఇం దంగాంగ పరీక్ష యెక్కువ. కాఁబట్టి అత్యల్పలోపములనుగూడ గమనించి తొలఁగించుకొను శక్తిలేని కవి దీనికిఁ జేయివేసిన నగుబాట్ల పా లగును. ఇదిగాక గొప్పకావ్యములలో భావములకును, అభిప్రాయములకును తగినంత గొప్పతనమును, బలమును ఇచ్చి రూపుగొల్పుటకు వలసినంత పూర్వోత్తరసందర్భములను వివరించుట కవకాశ మున్నది. ఖండకావ్యములలో అతిముఖ్యమైన విషయములు తప్పఁ దక్కినవి విస్తరింప వీలు లేదు. సంగ్రహము వీనికిని, విస్తరము వానికిని స్వాభావికలక్షణము. పనికిమాలిన విస్తరము మహాకావ్యములలో నెంతదోషమో పనిచెఱుచు సంగ్రహము ఖండకావ్యములలో నంతకన్న దోషమగును. కావ్యము కొలఁతను తగ్గించుటలో నందలి విషయపు తీవ్రతనుగూడ తక్కువపఱచు నపాయముగలదు.

రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ

(ఆంధ్రభూమి—ఆగస్టు ౧౯౩౮.)

---

## క్రాపులు




క్రొత్తపల్లి సుబ్రమణ్యం




కాండీ సింహాసనము

సింహళమును పాలించిన ప్రాచీన కాండీరాజులది

G. S. A.



# విమర్శనము

### ౧. అన్యాపదేశశతకము, ౨. గీతాత్రయము

గ్రంథకర్త: సీరిపి ఆంజనేయులుగారు, అనంత పురము. క్రౌను, ౩౦,౪౦ పుటలు.

---

### యోగసంకలనము

అనువాదకులు : దౌల్తాబాదా గోపాలకృష్ణారావు గారు, కాకినాడ. డెమ్మి, ౧౫౧ పుటలు, వెల రు. ౧-౦-౦.

---

### ౧. దివ్యతేజోనిధులు

డెమ్మి, ౫౬ వెల రు. ౦-౪-౦.

### ౨. లోకనాటకము

కర్త: నే. గంగాధరము. డెమ్మి, ౬౪ పుటలు, వెల రు. ౦-౮-౦.

### 3. ఏకాదశీమాహాత్మ్యము

డెమ్మి, ౮ పుటలు, వెల రు. ౦-౧-౦.

శ్రీ మహాలక్ష్మి ధర్మపుస్తకభాండాగారము, కొంతమూరు, రాజమండ్రి పోస్టు.

---

### నూతన దశరాపద్యములు

కొంతమూరు బోర్డుస్కూలు ఉపాధ్యాయులచే వ్రాయబడినది. డెమ్మి, ౧౬ పుటలు. వెల రు. ౦-౧-౦.

---

### అహింసాపుష్పము

గ్రంథకర్త: సాయం వరదదాసుగారు, తెనాలి. క్రౌను, ౨౪ పుటలు, వెల రు. ౦-౧-౦.

---

### రిజర్వుబ్యాంకు

గ్రంథకర్త : కాశీనాగుని పూర్ణమల్లిఖార్జునుడు గారు, బుట్టయ్యపేట, బందరు. క్రౌను, ౫౦ పుటలు. వెల రు. ౦-౮-౦.

---

### గాయత్రీమంత్రార్థవివరణము

గ్రంథకర్త: ప్రణవానందగారు. ప్రణవకుటీరము, వీరభద్రపురము, రాజమండ్రి. క్రౌను, ౨౮ పుటలు. వెల రు. ౦-౨-౦.

---

### గీత

గ్రంథకర్త: యం. వి. గోవిందరావుగారు. క్రౌను, ౭౨ పుటలు.

---

### వేంకటేశ్వరశతకము

గ్రంథకర్త: పుల్లేవు, సత్యనారాయణగారు. క్రౌను, ౨౮ పుటలు.

---

11. 8- 20 3 ౨౧

## శ్రీమదాంధ్ర కిరాతార్జునీయము

(తృతీయభాగము)

గ్రంథకర్త: భువనగిరి విజయరామయ్యగారు, లోకల్ ఆడిట్ ఆఫీసు, గుంటూరు. డెమ్మీ, ౧౫౯ పుటలు. వెల రు. ౧-౮-౦.

## కువలయానందసారము

గ్రంథకర్త: బులుసు వేంకటరమణయ్యగారు.

ప్రకాశకులు: ఆర్. వెంకటేశ్వర్ అండ్ కో., ఆనంద ముద్రణాలయము, మదరాసు. క్రౌను, ౧౪౮ పుటలు.

## లీలావతీగణితము

( భాస్కరాచార్యులు )

సంస్కృతవ్యాఖ్యాన, ఆంధ్ర లీలావతీయుతము. డెమ్మీసైజు ౭౭౬ పుటలు. వెల ౫ రూపాయలు.

ప్రకాశకులు: వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండుసన్సు, ౧౪౨ ఎస్ప్లనేడు, మద్రాసు.

## భొబ్బిలి యుద్ధనాటకము

( రెండవకూర్పు )

గ్రంథకర్త: వేదము వేంకటరాయశాస్త్రిగారు. డెమ్మీ, ౧౦౮ పుటలు, వెల రు. ౧-౦-౦.

ప్రకాశకులు: వేదము వేంకటరాయశాస్త్రి అండుబ్రదర్సు. ౮ మల్లికేశ్వరగుడిసందు, లింగశెట్టివీథి, మదరాసు.

## శకుంతల

గ్రంథకర్త: నరహరిశెట్టి శేషగిరిరావుగారు, తూర్పువీథి, ఏలూరు. క్రౌను, ౧౩౩ పుటలు, వెల రు. ౦-౧౨-౦.

## దిలీప

(ఆటుస్థలకముల చిన్న నాటకము)

గ్రంథకర్త: శ్రీమతి చిల్కపాటి సీతాంబగారు, రంగనాయకులపేట, నెల్లూరు.

క్రౌను ౩౨ పుటలు. వెల రు. ౦-౬-౦.

## నవ్వుల తోట

( సచిత్ర హాస్యరస పక్షపత్రిక )

పదేండ్లక్రితము ఆగిపోయిన యీపత్రిక పునరుద్ధరింపబడినది. సంపాదకులు: కె. జి. గురుమూర్తిగారు, మదిలీపట్టణము. సంవత్సరము చందా రెండు రూపాయలు; విడిసంచిక రెండణాలు.

# మనవిమాటలు

## హిందీ—తెలుగు

తెలుగువారి హిందీచదువువలన తెలుగున కపకారము జరుగుచున్నమాట వాస్తవము. ఇదివఱ కింగ్లీషొక్కటియే తెలుగున కపకరించుచుండునది. ఇపుడు హిందీ దానికి శతగుణముగా నపకరించుచున్నది. ఈయపకార మాభాషలవలన నగుచున్నది కాదు. వానినిజదివిన తెలుగువారివలననే సంప్రాప్తమగుచున్నది.

తెలుగువారిది వివేచనలేని ఉత్సాహము; ఆత్మహితముదెలియని ఆవేశము. దీనివలన వారికి ఘాసగు ననర్థము లనేకములు.

తెలుగువారు హిందీ రాష్ట్రభాష కావలెననునిర్ణయము విన్నారు; హిందీప్రచారప్రారంభమును గన్నారు; అంతే, హిందీ చదువ ప్రారంభించినారు. ఇప్పటికి దక్షిణభారతమున హిందీచదివిన, చదువుచున్నవారిలో సగము మందికిపైగా వారు తయారయినారు. తెలుగు కూడ మానివేసి హిందీనిచదివినవారు వీరిలో ననేకులు. ఎన్నిభాషలువచ్చినను, మాతృభాషనే మాటాడవలయునన్న నియమము తదితరులకు; హిందీవచ్చినవారు హిందీలోనే సంభాషింపవలెననునియమము తెలుగువారికి. తెలుగేవలను; హిందీనే చదువు డనియు ప్రబోధించువారుకూడ పలువురు. ఊరూర హిందీపాఠశాలలు వెలసినవి తెలుగునాట. ప్రచారకులు ననేకులు. ఇదియంతయు తెలుగువారి నిరుపమ దేశోద్ధరణవాంఛను ప్రకటించుచున్నది. ఇది యెంతవరకు సఫలము కాగలదో ఊహించుట కిపుడు సాధ్యము కాదు; కాని, దీనివలన ప్రకృతము వారి మాతృభాషకుమాత్రము మహోపద్రవము కలుగుచుండుట నిక్కము.

హిందీచదివిన తెలుగువారు ఏదిమాటాడినను, ఏది వ్రాసినను అంతయును హిందీ సంప్రదాయములతో నింపివేయుచున్నారు. ఇందువలన వికృతస్వరూపము, విపరీతస్వభావము తెలుగునకు ఏరుపడినవి. దాని తీయదనము దిగజారిపోయినది; దాని వ్యక్తిత్వమునకే హానియగుచున్నది. 'దేశభాషలందు లెస్సయది' యను ఖ్యాతిగనిన తెలుగునకు నేటి కీతీరున చేటు వాటిల్లినది. దాని తీరుతీయములమేలితనమును తెలిసినసహృదయుల కిది దుస్సహము. కావుననే దేశమున నలజడి పుట్టినది. తెలుగుతెలుగుదనమును కాపాడుకొనవలెనను హెచ్చరికలు నలుమూలల మారుమ్రోయుచున్నవి. ఈప్రబోధము న్యాయ్యేతరముకానట్టి కర్తవ్యము.

హిందీ రాష్ట్రభాష యగుట కెవ్వరికిని విప్రతిపత్తియుండ బనిలేదు— దేశక్షేమము కోరని దేశీయు లుండరుకాన. హిందీయెడ ద్వేషము నుండ బనిలేదు. కాని ప్రతివారి

కిని మాతృభాషయెడ నాదరము బరమావశ్యకము; తదుద్ధరణము ప్రథమకర్తవ్యము. నాయకులు నిఖలభారతదేశమున కొకరాష్ట్రభాష కావలయునన్నారు దేశవ్యవహారముల నడపుకొనుటకు. వా రెవ్వరు నెన్నడు మాతృభాషలకు స్వస్తి చెప్పవలెనని శాసింపలేదు. తాము నట్లుచేయలేదు.

అరవలు, కన్నడులు, మలయాళులు, ఇతరులు హిందీని నేర్చుకొనుచున్నారు కాని వా రెవ్వరును తెలుగువారివలె మాతృభాషను పాడుచేసుకొనలేదు. వివేకులు స్వవిషయములయం దెప్పుడును జాగ్రత్త గలిగియే యుందురు.

తెలుగువారియజాగ్రత్త, యవివేకము వారిభాషకు నీతీరున చెరుపును కలిగించుటయే కాక దేశనాయకులకును అపకీర్తికళంకమును దెచ్చిపెట్టునవి. ఇకనయినను ప్రబుద్ధులయి తెలుగువా రీరెంటిని దూరముగ పోబెట్టుదురుగాక!

---

## భ్రష్టాంధ్రము

ఆంధ్రభాషావిషయమున సుప్రసిద్ధములయిన పక్షములు—గ్రాంథికము, వ్యావహారికము అనునవి—చాలకాలముక్రింద పుట్టినవి. అప్పటినుండియు గ్రాంథికపక్షమువారు—ప్రాచీనవాఙ్మయముమాట, వారియభిరుచిమాట యటులుండ—తాము ప్రయోగించుభాషయంతయు గ్రాంథికమే యని తలతురు. వ్యావహారికపక్షమువారు—తమయభిరుచిమాట యటుండ—తాము ప్రయోగించుభాషయంతయు వ్యావహారికమే యని తలతురు. ఈతలపు కేవలము పొరపాటు; భ్రాంతిమూలకమును. తొలివారిది గ్రాంథికముగాదు; రెండవవారిది వ్యావహారికమును గాదు. నికరముగ దేనినిగాని వాడుట కీ యిరుపక్షములవారికిని సాధ్యము కాకున్నది. రెండింటికలయికయే యుభయుల రచనలయందును గలదు. ఇది తెలియక ఈరెండుపక్షములును తమతమవాదములను నిలువబెట్టుకొనుటకయి హోరాహోరిగా పోరాడుచు మాత్రము నున్నవి. ఆంధ్రభాష ఈపోరాటమున నుభయపక్షములనడుమ బడి నలిగి రూపేరుపడకుండపోవుచున్నది. దీనినే నివర్తింపజేయజాలకయుండ 'గండస్యోపరి పిటకస్సంవృత్తః'—అనినట్లు నిష్కృతియే కనుపడని ఇంకొకదురవస్థ ఆంధ్రభాషకు సంప్రాప్తమయినది.

గ్రాంథికాంధ్రము (తత్సమతద్భవాంధ్రము లిం దంతర్భూతములు), దేశ్యాంధ్రము (ఇందుమండలమండలమునకును భేదముకానుపించును), గ్రామ్యాంధ్రము (గ్రాంథికవాదుల కిది అస్పృశ్యము. ఇదియును మండలమండలమునకును విభిన్నము చాలవరకు), ద్రావిడాంధ్రము (అరవదేశపుతెలుగువారు, తెలుగునేర్చినఅరవవారు వాడునది), కర్నాటాంధ్రము (కన్నడదేశపు తెలుగువారు, తెలుగువచ్చిన కన్నడులు మాటాడునది),

కేరళాంధ్రము (మలయాళమువారి వచ్చియు రాని తెలుగు—ఇది క్వాచిత్కము), ఊరుదూ-ఆంధ్రము (తురకలువాడునది), ఇంగ్లీషు ఆంధ్రము (ఇంగ్లీషు చదివిన తెలుగువారిది), వంగాంధ్రము — (శాంతినికేతనమునుండి వచ్చిన తెలుగువారు, బ్రాహ్మసామాజికులు వాడునది), హిందీఆంధ్రము (హిందీచదివిన తెలుగువారు వాడునది) ఇన్నియుకలసి ఆంధ్రత్వము భ్రష్టమయిన ఒకసంకరాంధ్రభాష బయలుదేరి ప్రవాహమువలె దేశమంతట వ్యాపించుచున్నది. దీనికి భ్రష్టాంధ్ర మను నామము సార్థకము. పైన పేర్కొనినద్రావిడాది భాషల శబ్దార్థసంప్రదాయముల సాంకర్యము, రచనావిధానసాంకర్యము నీభ్రష్టాంధ్రమునకు విలక్షణములు. ఈభ్రష్టాంధ్రమునకు ప్రచార స్థానములు దినవారపత్రికలు, మాససంవత్సర పత్రికలు; ఎలిమెంటరీ, సెకండరీ (ప్రారంభ, మధ్యమ) తరగతులపాఠపుస్తకములు. ఈ భ్రష్టాంధ్రమును గ్రాంథికాంధ్రవాదు లేమందురు? నన్నయ్యనాటి, ప్రబంధయుగము నాటి, తంజావూరురాజులనాటి, తరువాతి నాటి గ్రాంథికాంధ్రమువలెనే దీనిని నేటి గ్రాంథికాంధ్రమని తమపక్షమున చేర్చుకొందురా? వ్యావహారికమని దెబ్బలాడుదురా? అస్పృశ్యమని దూరమునకు తోలగుదురా? ఇక వ్యావహారికాంధ్రవాదు లేమందురు? శిష్టవ్యావహారికమని అంగీకరింతురా, అశిష్టమని ఆవలకు ద్రోయుదురా? లేక ఉభయవాదములవారును రాజీపడి ఆంధ్రమును ఇంకను, ఇంకను భ్రష్టముకాకుండ ఉద్ధరింతురా? ఉన్నవికదా ఉభయపక్షవాదులు తమతమభద్రముకొరకు నిర్మించుకొనినకోటలు—ఆంధ్రసాహిత్యపరిషత్తు, నవ్యసాహిత్యపరిషత్తు! చూతము ఏమిచేయనున్నవో!!

---

## నవ్యసాహిత్య పరిషత్తు!!!

రాజమహేంద్రవరంలో నవ్యసాహిత్య పరిషత్తు ద్వితీయసమావేశం (౧౯౩౩ సం. డిసెంబరు ౨౮,౨౯ తేదీలు) జరిగి నిండుగా ఆరునెలలయినా కాకుండానే తలవనితలంపుగా అనంతపురంలో (౧౯౩౪ సం. జూన్ ౧౭, ౧౮ తేదులు) దాని (నవ్యసాహిత్యపరిషత్తు) తృతీయసమావేశం జరిగినట్లు ప్రకటితమైంది. (అది ఒక కవిపండితసమ్మానసభ అని తర్వాత తేలింది.) దానికి సాహితీసమితి సభాపతి శ్రీ శివశంకరశాస్త్రిగా రధ్యక్షులు. ఆసమావేశంలో నవ్యసాహిత్యపరిషత్తు రెండవ సమావేశమప్పుడు జరిగిన తీర్మానాలమాట గాని, ఆనాడు నియమింపబడిన స్థాయి, ఉపసంఘాలు చేసిన కార్యాలమాటగాని ప్రస్తావనే రాలేదు. అయితే, రాయలసీమవారి మొక్కుబడిమాత్రం చెల్లినట్లయింది* ఇట్లా పరి

* నవ్యసాహిత్యపరిషత్తు రెండవసమావేశమప్పుడు తరువాతిసమావేశానికి రాయలసీమవారు అనంతపురానికి ఆహ్వానించారు. పరిషత్తు దానిని అంగీకరించింది.

షత్తు నియమాల నుల్లంఘించి, తారు మారుచేసి తా మేదో జరిపి దానిని నవ్య సాహిత్యపరిషత్తుసమావేశం అనడానికి సమావేశకర్తల కధికారం లేదు. అయితే ఇలాగ ఎందుకు చేశారు! అజ్ఞతఅయినా కావాలి, ఔదాసీన్యమైనా కావాలి. దీంట్లో ఇంకొక విశేషవిషయం ఉంది :

శ్రీ చిలుకూరు నారాయణరావు పంతులుగారియింట వారి పిల్లలకు పెండ్లివడుగులు జరిగినవి. పంతులుగారు శ్రీమంతులూ, స్వయంకవులూ, పండితులూ, కవిపండితాభిమానులూ కాబట్టి తమయింటి శుభకార్యాల సమయంలో కొందఱు (స్వాభిమతులూ, నవ్య సాహిత్యాభిమానులూ అగు) పండితులను, కవులను ఆహ్వానించి,గోష్ఠిజరిపి వారిని సమ్మానించారు.* ఇది పంతులుగారు స్వయంగా జరిపిందికాబట్టి దీనికి 'నవ్యసాహిత్యపరిషత్తు సమావేశం' అని పేరుపెట్టినా, పరిషత్తు నియమాలను దీనికి పట్టించడం ఇష్టం కాక పోయిందేమో! అది యుక్తమే. అయితే ఆపేరెందు కుంచారు? ఈ డిప్రెషన్ రోజులలో రాయలసీమవారిమాటను దక్కించడానికీ, వారి వ్యక్తిత్వాన్ని నిలబెట్టడానికీ ఎత్తిన ఎత్తని అనవలసివస్తూంది.

ఇందుకు ఉదారహృదయులగు పంతులుగారియెడ రాయలసీమవారు కృతజ్ఞులు కాక తప్పదు. కాని పరిషత్తుకుమాత్రం అప్రతిష్ఠ తప్పిందికాదు. అది మొదట 'అభినవాంధ్ర కవిపండితసభ' అనేపేరున పుట్టి కథలతో, కబుర్లతో, ఆటలతో, పాటలతో, మొదటి సమావేశం జరిపింది. రెండవసమావేశంలో పేరుమార్చుకొని నవ్యసాహిత్య పరిషత్తయి కొన్ని ఉద్దేశాలను ప్రకటించింది. అవికార్య రూపం పొందకుండానే మూడవమారు సమావేశంలో (అట్లా అంటూన్నారు కాబట్టి) ఇట్లా రద్దయిపోయిన వంటే అప్రతిష్ఠ కాక మరేమి?

ఈసమావేశంలో నడచిన కార్యక్రమాన్నిబట్టి చూచినా దీనిని నవ్యసాహిత్య పరిషత్తుసమావేశం అనడానికి సామంజస్యం

---

* శ్రీచిలుకూరి నారాయణరావుగారి పిల్లలపెండ్లి వడుగులకూ, నవ్యసాహిత్యపరిషత్తు తృతీయ సమావేశానికీ ఆహ్వానిస్తూ రెండుపత్రికలూ ఒక కవరులోనే భారతిసంపాదకుని పేర ప్రెస్సుటిక్కట్లవలె వచ్చినవి. దీనికి కారణం అప్పుడు ఊహ కందిందికాదు. తర్వాత ఈసమావేశానికి ఆహ్వానసంఘాధ్యక్షులయి నారాయణరావుపంతులుగారు తమస్వాగతోపన్యాసంలో ప్రకటించిన 'ఇట్టిపరిషత్తులు వార్షికోత్సవములుగా ఉండకూడదు. సాధ్యమైనంతమట్టుకు ఎప్పుడవకాశంకల్గితే అప్పుడే అవి యేర్పాటు కావలెను. ముఖ్యముగా కవిపండితుల నాదరించగల సంపన్నుల గృహములలో శుభకార్యముల యందు ఇట్టిసమావేశములు జరుగుతూ ఉంటే ఇట్టి పరిషత్తులవల్ల ఎక్కువప్రయోజనం కల్గుతుందని నా అభిప్రాయము: అట్టి అభిప్రాయంతోనే మే మీసభ నాహ్వానించినాము' అను తమ 'వేరు' అభిప్రాయంవల్ల విషయం స్పష్టమయిపోయింది. పూర్వకార్యక్రమాన్ని, నియమాలనూ పాటిస్తూ తరువాతి కార్యక్రమాన్ని సాగిస్తూ ఉంటే సమావేశాలు ఎన్నిమార్లు, ఏలాటిసమయాల్లో, ఎక్కడజరిగినా ప్రయోజనం కలుగుతూ ఉంటుంది ఏపాటిఅయినా సరే.

కనుపడదు. అధ్యక్షులూ, ఆహ్వానసంఘాధ్యక్షులూ ఇద్దరూ భాషావిషయంగానే ఎక్కువగా ప్రసంగించారు. ఆంధ్రసాహిత్య పరిషత్తుతో ఈపరిషత్తు స్పర్ధించడంలేదని స్థాపించడానికి చాల ప్రయాసపడ్డారు. 'సాహిత్య' శబ్దాన్ని తగిలించుకొన్న ఈ పరిషత్తులు భాషకోసం ఈవిధంగా వివాదాలతో కాలం గడపడం తెలుగుతల్లి దౌర్భాగ్యం అనక తప్పదు. ఆంధ్రసాహిత్యపరిషత్తుకు గ్రాంథిక భాష ప్రధానమయినట్లే ఈనవ్యసాహిత్యపరిషత్తుకూ వ్యావహారికభాష ప్రధానమైనదని ఈ సమావేశంవల్ల వ్యక్తమవుతూ ఉంది. ఇపుడు రెండిటికీ సామ్యం కుదిరింది. రెండిటి పేరులు నేతిబీరకాయవంటి వయిపోయినవి. ఈసమావేశంలో ముందుకార్యక్రమం ఈ క్రిందితీరున నిశ్చయింపబడింది:

"అధ్యక్షుడు:—తల్లావఝ్ఝల శివశంకర శాస్త్రి.

ఉపాధ్యక్షులు:—జి. ధర్మారావు. ఎం. ఏ., చింతాదీక్షితులు, బి. ఏ., ఎల్. టి., టి. వెంకటరత్నం, ఎం.ఏ., ఎల్.టి., బెజవాడ గోపాలరెడ్డి, బి. లిట్, పప్పూరి రామాచార్యులు.

కార్యదర్శులు:—ముద్దుకృష్ణ, కల్లూరి సుబ్బారావు.

'ప్రతిభ' అనేపేరుతో పరిషత్తు తరఫున మూడుమాసముల కొకసారి పత్రిక ప్రకటింపడానికి తీర్మానించినారు. మొదటిసంచిక అక్టోబరులో వెలువడుతుంది.

పరిషత్తు చతుర్థసమావేశ విషయమై శివశంకరశాస్త్రి ముద్దుకృష్ణగార్ల ఆహ్వానము అంగీకృతమైనది. (ఇందు స్థలనిర్దేశం లేదు; బహుశః ఏదయినా వారియింట శుభకార్యాల్లో జరుపుతారేమో.)

వాడుకభాషమీద అభిమానము ఉండి నవీనదృష్టి కలకవులు, గ్రంథకారులు, పత్రికా సంపాదకులు, సహృదయులు నవ్యసాహిత్య పరిషత్తులో సభ్యులుగా చేరవచ్చును."

ఈ నవ్యసాహిత్యపరిషత్తుచరిత్రనుబట్టి ఈ కార్యక్రమమయినా సాగుతుం దనడానికి వీలు కనపడకుండావుంది. ఇట్లా వైయక్తికంగా, ఐచ్ఛికంగా జరగడంకంటె సాముదాయికంగా, నియమవిశిష్టంగా జరగడమే శ్రేష్ఠము; ఉద్దిష్టకార్యసాధనాని కనుకూలము. కాబట్టి నవ్యసాహిత్యాభివృద్ధికాములందరూ ఐకమత్యంతో నవ్యసాహిత్యపరిషత్తు రెండవ సమావేశపు తీర్మానాలు సక్రమంగా జరిగేటట్లు పరిషత్తును పురికొల్పవలెను. పరిషత్కార్యక్రమ నిర్వహణానికీ, నిబంధనలను తయారుచేయడానికీ ఏర్పడ్డ సంఘాలు శ్రద్ధతో పనిచేసి పరిషత్తును స్థిరంగా నిలిచేటట్లు చేయవలెను. మరల ఈసంవత్సరాంతంలో మూడవసమావేశం జరపడానికి

పరిషత్తు ప్రయత్నించవలెను. ఊరుకున్నచో పరిషత్తుకు గౌరవం దక్కదు. దానియెడ ప్రజలకు విశ్వాసం కుదరదు. మరియు భాషా విషయాన్ని పరిత్యజించి సాహిత్యాభివృద్ధినే లక్ష్యంగా గ్రహించి తన పేరునకు సార్థక్యమును సమకూర్చుకోవలెను.

---



మాడరన్ మేనరికము



# సాభిప్రాయ విశేషములు

అంతయును పరివర్తనమే. ఏ క్షణమున నేమి రానున్నదియును తెలియకున్నది. విశ్వపరిణామమునకు సహజమైన దైవాసుర బలసంరంభము క్రొత్తకాకపోయినను భయంకరముగ నున్నది. నిన్నటిది నేడు, నేటిది రేపు పరిణమించుట సహజమైనను పరివర్తనామమె భయభ్రాంతులకు మూలముగ నున్నది. నేను నాది సకలసందర్భములందును అభిమానాహంకారములకు వలెను భయసమ్మోహములకును మూలములు. నేను నాది సనాతన మైనను అధునాతన మైనను సంరంభమునకు సాధన మగుచున్నది. మమకారాహంకారావరణములు పురాతనము లైనను, నవీనము లైనను దురభిమానావరణములై సంఘర్షణసంక్షోభముల కాధారములుగ నున్నవి. చిరకాలాభ్యస్తమైన నేను నాదివలెను అభ్యాసము కావలసిన నేను నాదియును స్వార్థస్వానుభవములందువలెను. పరమార్థ పరమాత్మానుభవములందు సార్థకము కాకున్నవి. ప్రకృతియం దీపరిణామము సహజముగను సంప్రాప్త మగుచున్నను ప్రత్యక్షసందర్శన సంస్మరణములు భయసమ్మోహములకు మూలము లగుచున్నవి. విజయనకు విశ్వరూపసందర్శనము గలుగజేసిన భయసంభ్రమములు చరాచర ప్రపంచమునకు సహజావస్థ లైనను ఎప్పటి కప్పుడు సకలజీవములకును భయభ్రాంతులకు మూలము లగుచు ప్రజ్ఞావాదములు ప్రబలుచున్నవి.

మమకారాహంకారములకు రంగములు రాజకీయము లైనను, సాంఘికము లైనను, ఆర్థికము లైనను, మతసంబంధము లైనను, వ్యక్తిగత మైనను, జాతిపరమైనను, లౌకిక మైనను, పారలౌకిక మైనను సంరంభసాధ్యములై సమ్మోహమును గలుగజేయుచున్నవి. వర్తమానప్రచురణయుగమునందు మమకారాహంకారములు దిగంతములందు మారుమ్రోగుచు మహాసమ్మోహమును గలుగజేయుచున్నవి. నాయకుల ప్రజ్ఞావాదములు, గర్వాభిమానములు, స్వోత్కర్షప్రలాపములు సామాన్యులకు క్రోధావేశములకు మూలము లగుచు విప్లవోద్యమములు సామాన్యము లగుచున్నవి. ప్రపంచావృతమైన పరివర్తనయుగమునం దేమూల నేమి సంభవించినను ఆశ్చర్య ముండదు. పరివర్తనములు, భయసంభ్రమములు, విప్లవములు, క్రోధా

వేశములు, స్వోత్కర్షలు, పరనిందలు ప్రజా గరణ పరమైన దేశములందు భయంకర దృశ్యములకు రంగము లగుచున్న విధమును యూరపురాజ్యోదంతములు వెల్లడి చేయు చున్నవి. జర్మనియందు పర్యాప్తంబైన నాజీ పక్ష విజృంభణము, హిట్లరువిజయములు ప్రపంచవ్యాప్తమైన ప్రజాగరణమునకును, తత్ఫలమునకును నిదర్శనములు.

* * * *

హిట్లరు విజృంభణము

మహారథుడైన హిండెన్బర్గుగారి మరణము హిట్లరుగారికి జర్మనియందు సంపూర్ణ రాజ్యాభిషేకమును సమకూర్చినది. హిట్లరుగారికి హిండెన్బర్గుఅంకుశముపోయి సకల వ్యవహారములందును పూర్ణాధికారము సమకూడినది. హిట్లరుగారు కోశాధ్యక్షుడు, సేనాధిపతి, రాజ్యాధిపతి, ప్రజానాయకుడు. హిట్లరుగారి ఆజ్ఞల కాటంకములు దుర్లభములు. హిట్లరుగారి యధికారము స్వాభిమానపరాయణమై సంహారమునకువలెను, నిర్మాణమునకు సాధనము గాకున్నది. చూపులకు నిరుద్యోగముపోయి వ్యవసాయ పరాయణత్వ మభివృద్ధిని పొందుచున్నను క్రియకు పరిశ్రమ వ్యాపారము లన్నియును మందగమనము చేయుచున్నవి. వ్యాపార పరిశ్రమలు నిషేధావరణములందు సన్నగిలుచున్నను నాజీ ఘోష విజృంభణముమాత్రము ప్రళయానలమువలెను సర్వత్ర వ్యాపించుచున్నది.

దేశవ్యవహారము లన్నియును ప్రజల హృదయదౌర్బల్యమునకును, నిస్సహాయ స్థితికిని నిదర్శనములు. హిట్లరుగారు తన సహచరులకు గల్పించిన ఘోరమైన రహస్య హత్యలు పాశ్చాత్యసంస్కారమునకును, జాతీయ దురహంకారమునకును, నియంత్రృనిరంకుశాధికారమునకును సహజఫలములు. ఆస్ట్రియాయందు గతమాసాంతమునందు సంప్రాప్తమైన పరివర్తనోద్యమము డోల్ఫసుహత్యాదులు నాజీదావానలవ్యాపనమునకు నిదర్శనములు. ఆస్ట్రియాయందు తిరిగి నిరంకుశాధికారము వెంటనే స్థాపింపబడినను సామ్యవాదపక్ష బలము నంగీకరించుట ప్రభుత్వమున కవసరమైనది. సకలానర్థములకును మూలమైన హాప్సుబర్గు వంశజులు తిరిగి సింహాసనాసీనులను జేయుటకు ప్రయత్నములు జరుగుచున్నవి. హిండెన్బర్గుగారి మరణము, డోల్ఫసుగారి హత్య, నాజీపక్షవిజృంభణము, హిట్లరుగారి సర్వరాజ్యాధిపత్యము యూరపు రాజ్యములందు మహాసంక్షోభమునకు మూలమగుట సహజమైనను సకలదేశావృతమైన విషాదయోగావస్థయందు ఫలము కాలగర్భమునందు గలదు. నాజీపక్షము కయ్యమునకు కాలుదువ్వుచున్నను దుర్బలత్వము ప్రతిబంధకముగ నున్నది. జర్మనుల శక్తిసామర్థ్యము లన్నియును స్వార్థారాధనమునకై వినియోగింపబడుచున్నను ఫలముమాత్రము సంశయాస్పదము. ఇటలీ, ఫ్రాన్సు, గ్రేటు బ్రిటను మొదలగురాజ్యములు చూపుచున్న

ప్రతిఘటనమునందు హిట్లరు పక్షప్రయత్నములు వామమార్గములను బట్టుటయందును విచిత్రము గనుపడదు. జర్మనుశాస్త్రజ్ఞులు మైరావణయజ్ఞములను జేయుచున్న విధానము లిటీవల పత్రికలయందు ప్రచురింపబడినవి. మరిడీమారెమ్మపూతులను సృష్టించి సర్వసంహారమును చేయుటకు శాస్త్రజ్ఞులు చేయుచున్న పరిశోధనలు నీలివార్తలైనను పశుబలపరాయణమైన వర్తమాన ప్రపంచ వాసనలకు నిదర్శనములుగ నున్నవి. ప్రపంచమునం దేమూలనైనను సంగ్రామదావానల మేక్షణమునం దైనను సంభవము కాగలదు. సకలరాజ్యములును సంగ్రామకర్మలను జేయుచు నానాజాతిసమితిని, ఆయుధవిసర్జనమును, శాంతిమంత్రములను జపియించుటమాత్రము విచిత్రముగ నున్నది. బ్రిటిషురాజ్యాధికారులుమాత్రము మాయాపులవలెను రాజ్యాంగనాటకముల నాడించుచు నానందించుచున్నారు. ప్రధానమంత్రి రామ్సె మెక్డొనాల్డుగారి నాటకము బ్రిటీషు రాజ్యాంగతత్త్వమున కనురూపముగ నున్నది. చర్చిలుహోరుగారులు, రోధరుమియరు మోస్లెగారులు, సైమనుబాల్డువినుగారులును మామూలు పాటను పాడుచు రాజ్యాంగనాటకముల నాడుచున్నారు.

* * * *

బ్రిటీషు రాజ్యాంగములు

బ్రిటీషుజాతీయప్రభుత్వము నిరాటంకముగను, వ్యవహారనిర్వహణమును జేయుచున్నవిధము సంభ్రమమును గలుగజేయుచున్నది. చర్చిలు రోధరుమియరు వర్గము వారి తంత్రములు సఫలములైనవి. వ్యాపార పరిశ్రమలందు వికాస మారంభమైనది. ఆయుధవిసర్జనసభ నిరర్థకమైనను బ్రిటీషు మంత్రాంగబల మవిచ్ఛిన్నముగ సాగుచున్నది. సకల రాజ్యములందును బ్రిటీషు మంత్రాంగవిజయము క్రియలయందు ప్రత్యక్ష మగుచు, స్వాధీనదేశములందే బ్రిటీషు రాజ్యాంగప్రతిభ నిరభ్యంతరముగను సాగుచున్నపుడు, పరాధీన రాజ్యముల విషయము విచారించుటయే యనవసరము. ప్రధాన మంత్రి రామ్సెమాక్డొనాల్డుగారు విశ్రాంతికి కనడాకు వెడలినపుడు కార్యభారమును బాల్డువినుగారి వశము చేసిరి. బాల్డువినుగారు విశ్రాంతికి వెళ్లదలచినపుడు రాజ్యాంగభారమును ఛాంబర్లిగారి వశము చేయదలపెట్టినటులు వార్తలు తెలుపుచున్నవి. జాతీయ పక్షబలమును, బ్రిటీషుప్రభుత్వపటుత్వమును ప్రశాంతమైన దేశస్థితి విశదము చేయుచున్నది. జాయింటు పార్లమెంటుకమిటి వ్యవహారములును నీ ప్రశాంతవాతావరణమునే వెల్లడిచేయుచున్నవి. గ్రేటుబ్రిటనునందును, హిందూస్థానమునందును రాజ్యాంగసంస్కరణముపట్ల నుత్సాహముపోయి నిరాశా నిరాదరణస్వభావము లేర్పడినవిధము నుభయదేశవ్యవహారములు విశదము చేయుచున్నవి.

* * * *

### జాయంటు పార్లమెంటుకమిటీ

పార్లమెంటు కమిటి రిపోర్టును సిద్ధము చేసినటులును న ంబరు 12-వ తేదిని ఇం గ్లాండు నందును, హిందూస్థానమునందును నేకకాలమునను ప్రచురింపబడునటులును వదంతులు గలవు. తెల్ల కాగితమును నల్ల కాగి తమును జేయుటకు తగిన సవరణలును, సంరక్షణలును, సదుపాయములును నిర్ణ యింపబడినటులు తెలియుచున్నది. ఇది భారతశాసనసభయొక్క ఎన్నికలకు సంబం ధించిన ఎత్తుగ నుండగలదు. విల్లింగ్డన్ప్రభు వీమెత్తునందుగల ప్రయోజనమును వారి సంప్రతింపులందు బ్రిటీషు ప్రభుత్వాధికారు లకు మనోగతము చేసియుందురు. నవం బరుమాసమునం దెన్నికల సమయమునందు జాయింటుకమిటిరిపోర్టు పిడుగువలెను వోట ర్లకును, అభ్యర్థులకును భయసమ్మోహము లను గలుగజేయగలదు. కాంగ్రెసుకార్య విధానము బ్రిటీషుప్రభుత్వమునందు కొంత సంచలనమును గలుగజేయుటయును సమ యానుకూలము. అభ్యర్థులకును, వోటరుల కును, నాయకులకును జాయింటుకమిటి రిపోర్టు వాదప్రతివాదములకును, కోపావేశ ములకును, లాభనష్టజాతకములకును సాధ నము గాగలదు. కాశీనగరమునందు కాం గ్రెసుకార్యనిర్వాహకవర్గము చేసిన నిర్ణయ ములిట్టి సందిగ్ధస్థితియందు కాంగ్రెసుప్రతిష్ఠను సమర్థించుటకు ధర్మానుకూలముగ నున్నవి.

* * * *

### కాంగ్రెసు - సాంఘికభేదములు

వర్తమాన మహా పరివర్తనయుగము నందు భిన్నమతములకును, సంఘములకును, వేషభాషాచారములకును స్థావమైన హిందూ స్థానమునందు భారతజాతీయైక్యభావమును స్థా పించవలసిన యవసరమును నాయకు లంద రును సంగీకరించుచు సమయము వచ్చినపుడు మాత్రము సాంఘికభేదారాధనము చేయ బూనుట దుశదృష్టము. కాంగ్రెసు హిందూ, మహమ్మదీయ,పార్శి,సిక్కు,క్రైస్తవాది మత సాంఘికవిభేదాతీతమైన భారతజాతీయసంస్థ. ఈమహాసంస్థయొక్క గౌరవమును కాపాడవల సినభారమన్ని మతసంఘములమీద నున్నను, ముఖ్యముగను ప్రబలమైన హిందూసంఘము మీద నున్నదనుట నిర్వివాదాంశము. బ్రిటిషుప్రభుత్వాధికారులు సాంఘికవిభేద ములను స్థిరతరము చేయుటకు పన్నిన మాహోపాయములను ప్రతిఘటించవలసిన భారము విశేషము హిందువులమీదను కలదు. శ్వేతపత్రము నిర్ణయించిన సాంఘికప్రాతినిధ్య మనర్థదాయక మనియును, న్యాయవిరుద్ధమని యును, వియోగసాధన మనియును నంద రును నంగీకరించుచున్నారు. సాంఘికప్రాతి నిధ్యనిర్ణయ మనర్థదాయకమైనను సామాన్య ముగను మహమ్మదీయులు దీనినామోదించిరి. మహమ్మదీయ నాయకులాశీర్వదించిన నిర్ణ యమును నిరసించుటవలనను స్వరాజ్య మున కవసరమైన హిందూమహమ్మదీయ సంయోగము దూరస్థమగుట సహజము,

సాంఘికనిర్ణయమును మార్చగల శక్తి హిందూమహమ్మదీయ సంయోగమువలననే కలుగవలయును కాని వియోగమువలనను కలుగజాలదు. కాంగ్రెసు భారతీయ కాంగ్రెసు; హిందూ కాంగ్రెసు కాని, మహమ్మదీయ కాంగ్రెసు కాని కాజాలదు. ఈ సత్యమునే కాంగ్రెసు కార్యనిర్వాహక సంఘము చేసినతీర్మానము నిర్ధారణ చేసినది. సకలానర్థములకును మూలమైన శ్వేతపత్రము నిర్గమించినపుడు సాంఘికప్రాతినిధ్య నిర్ణయమును నిర్గమించుచున్నది. హిందూ మహమ్మదీయులకు సంయోగము గలిగినపుడు బ్రిటీషు ప్రభుత్వనిర్ణయమును పోవుచున్నది.

స్వయంసహాయమువలనను సాధ్యము గావలసిన నిర్ణయమును పరావలంబనాధారమునను సాధ్యముచేయబూనుట కార్యసిద్ధికిని స్వధర్మనిర్వహణమునకును సాధనము గాదు. ప్రఖ్యాతనాయకుడైన మదనమోహన మాలవ్యాగారు కాంగ్రెసుప్రతిష్ఠను వెనుకకు బెట్టి హిందూసంఘప్రతిష్ఠ కగ్రస్థానమును గల్పింప దలపెట్టుట దురదృష్టము. కాంగ్రెసు విదేశీయప్రభుత్వముతో సంరంభమును దలపెట్టినపుడు స్వదేశీయుల సంయోగ సాహచర్యములు లేకను విజయము సాధ్యము కాదు. దేవేంద్రుడు దుర్యోధనాదులను బంధించినపుడు ధర్మజుడు భీమాదులకు జేసినహితోపదేశము వర్తమానపరిస్థితులకు తగియున్నది. భారతీయులందరును కలిసి శ్వేతపత్రమును ప్రతిఘటించి స్వరాజ్యమును సంపాదించుటకు బదులు వారి శక్తిసామర్థ్యములను సాంఘిక విభేదములనుబలపరుచుటకు వినియోగించుట నీతియును, న్యాయమును, ధర్మమును కాదు. మాలవ్యాగారి నిర్ణయము హిందూమహమ్మదీయ విభేదములనేకాకను, హిందువులందును అంతర్భేదముల నభివృద్ధిచేయుటకును, కాంగ్రెసు గౌరవప్రతిష్ఠలను సంకుచితము చేయుటకును వినియోగపడగలవు. గాంధిమహాత్ముడీపరమార్థమును వారి సందేశమునందు సువ్యక్తము చేసియుండిరి.

కాంగ్రెసు కార్యనిర్వాహక వర్గము కాంగ్రెసుపక్షావలంబకులు శాసనసభా ప్రవేశమును జేయవచ్చునని నిర్ణయించినది. ఈ వ్యవహారమును నడుపుటకు కాంగ్రెసు పార్లమెంటరీబోర్డున కధికార మొసంగినది. పార్లమెంటరీబోర్డునందు హిందువులు, మహమ్మదీయులు, సిక్కులు మొదలగువారు కలరు. బోర్డుసభ్యులు అభ్యర్థులను సాంఘికాది భేదములను పాటింపకను కాంగ్రెసు గుణకర్మభేదముల ననుసరించి నిర్ణయింతురు. మాలవ్యగారిందులకు విరుద్ధముగను పార్లమెంటు బోర్డును విడిచి జాతీయపక్షమును నిర్మింప గోరుట మెండమావులను నమ్మినటులున్నది. బ్రిటీషుప్రభుత్వపరిపాలనమునకు సహజమైన విభజనరాజ్యతంత్రమునకు మాలవ్యగారు సంకల్పించిన జాతీయపక్షనిర్మాణము దోహదము నొసంగగలదు. గతించిన ౫౦ ఏండ్లను కాంగ్రెసును సేవించిన మాలవ్యగారు

ప్రస్తుతము కాంగ్రెసుసేవను విడువక పోయి నను కాంగ్రెసుపార్లమెంటరిబోర్డును విసర్జించి ప్రత్యేకపక్షము నేర్పరుపగోరుట దుర దృష్టము. పారతంత్ర్యమునందుమునిగియున్న దేశమునందునాయకులకు సంశయాత్మత్వము సహజావస్థ. గతించిన ౪౦ ఏండ్లనుండియును జాతీయపక్షనిర్మాణమునకై పనిజేయుచున్న కాంగ్రెసుపక్షమునకు భిన్నమైన జాతీయ పక్షము నేవిధముగను మదనమోహన మాల వ్యగారును, వారి యనుచరులును నిర్మింప గలరో దురూహాముగ నున్నది. వర్తమాన సందిగ్ధావస్థయం దనవసరమైన సంరంభము ను మాలవ్యగారు తలవనితలంపుగను తెచ్చి పెట్టుట దురదృష్టము. ప్రజాలక్ష్యమును కాం గ్రెసు ప్రయోజనములనుండి హిందూ విభేద ములకును, హిందూమహమ్మదీయ విభేదము లకును మరల్చుట యన్యాయము. ఏమహా నాయకు లేమిచేసినను ప్రజలు మాత్రము కాంగ్రెసునకు సకలవిధములను తోడ్పడుదు రని విశ్వసింపవలసియున్నది.

*　　*　　*　　*

### కాంగ్రెసు-పక్షములు

కాంగ్రెసుసంస్థ స్వరాజ్యసంపాదనమున కేర్పడినప్రధానసంస్థ. స్వరాజ్యసంపాదన కేర్ప డినమూలసంస్థనుండి వెడలిన శాఖాసంస్థకు మూలసంస్థకు గల గౌరవప్రతిష్ఠలు గలుగ జాలవు. ప్రత్యేకసంస్థలు ప్రజాలక్ష్యమును ప్రధానసంస్థనుండి వియోగపరచుటకు విని యోగపడునటులు స్వపక్షపోషణమునకు వినియోగపడజాలవు. మాలవ్య ఆనెగార్లప్రక టనము శ్వేతపత్రమును, సాంఘికప్రాతినిధ్య నిర్ణయమును నిరాకరించుచున్నది. కాంగ్రెసు, రాజ్యాంగసంస్కరణముల ప్రారంభము నుండియును సంస్కరణవిధానమును, రౌండు టేబిలుసమావేశములను, శ్వేతపత్రమును,సాం ఘికప్రాతినిధ్యనిర్ణయమును, నిరాకరించినది. స్వయంనిర్ణయవిధానావసరమును ప్రతిపాదిం చినది. మాలవ్యవర్గమువారే ఆత్మవిశ్వాస మునువిడిచి సాంఘిక ప్రాతినిధ్యనిర్ణయమును బ్రిటీషుప్రభుత్వాధీనము చేసిరి. బ్రిటీషు ప్రభు త్వనిర్ణయము దేశానర్థములకు మూలమైనను సామాన్యముగను హిందువులతిరస్కారమున కును, మహమ్మదీయుల యాదరణమునకును పాత్రమైనది. ఆగాఖానుగారి భారతమహమ్మ దీయవిజయయాత్ర ప్రజలకును, నాయకుల కును వారికర్తవ్యమును సువ్యక్తము చేసినది. మహమ్మదీయులు సామాన్యముగను సాంఘిక ప్రాతినిధ్య నిర్ణయమును సవరణచేయుటకు నిరాకరించుచున్నారు. హిందువులకు వారి ద్వంద్వస్థితి ప్రతిబంధకమైనది. కాంగ్రెసు సంస్కార మొకమార్గమును, హిందూ సంస్కారము వేరొకమార్గము నుపదేశించు చున్నవి. దేశభక్తి కాంగ్రెసుసేవను, సంఘాభి మానము హిందూమహాసభానురక్తిని నిరూ పించుచు సమ్మోహమును గలుగజేయు చున్నవి. ప్రజానాయకులు సమ్మోహమును విడిచి కర్మయోగులు గావలసినసమయము నందు నాయకులు ప్రజలను సంశయముల

పాలుచేయుట విజయమునకు సాధనము కాజాలదు.

మాలవ్యగారు సకలపక్ష సమావేశము నెన్నిసారులో చేసి విఫలమనోరథులయినవిషయము చరిత్రాంశము. మాలవ్యగారు సంకల్పించిన జాతీయపక్షము సర్వపక్ష సమావేశమును దూరస్థముచేయుటకు వినియోగపడునటులు సఫలము చేయుటకు వినియోగపడదు. కాంగ్రెసు కార్యనిర్వాహక సంఘమును కాంగ్రెసు స్వరాజ్యపక్షమును నిర్ణయించిన ప్రకటనము భావికాలమునందైనను సర్వపక్ష సమావేశమునకును, రాజ్యాంగ విచారణసభకును నిమిత్తమగుట కవకాశములు గలవు. హిందూనాయకులాత్మగౌరవ విశ్వాసములను విడిచి శ్వేతభవనమునకు సాంఘికప్రాతినిధ్యనిర్ణయమును మార్చుటకు రాయబారమును పంపుట వ్యర్థప్రయత్నమని అనుభవైకవేద్యము. రాయబారములు ధర్మాధార రహితములై ప్రజా లక్ష్యమును నిరర్థకముచేయుట కుపయోగపడునటులు సార్థకము చేయుటకు వినియోగపడవు. ప్రత్యేకపక్షము లేనామరూపములను దాల్చినను అభిమానాహంకారావరణములందు సంకుచితములై సంకల్పసిద్ధికి నిరర్థకము లగుచున్నవి. భిన్నపక్షములవారు స్వపక్షాభిమానపరాయణులై కాంగ్రెసు స్వరాజ్యపక్షమును, కాంగ్రెసు కార్యనిర్వాహకసంఘమును, గాంధిమహాత్ముని నిందించుటకును, నిరసించుటకును బదులు స్వరాజ్యసంపాదనవిధానమును, భారతజాతీయ సంయోగ సాధనములను నిర్ణయించుట ప్రయోజనకరము, వివేకము, ధర్మము.

* * * *

గాంధిమహాత్ముడు—ప్రజానాయకులు

గాంధిమహాత్ముని ధర్మయాత్రలు ప్రజానాయకులందు స్వాయంసహాయదీక్షను, ఆత్మవిశ్వాసమును గలుగజేసినవిధమును సత్యాగ్రహోద్యమము, నిర్మాణ కార్యవిధానము, హరిజనోద్యమము ప్రత్యక్షము చేయుచున్నవి. మమకారాహంకారపరాయణమైన ప్రపంచవ్యవహారములందు గాంధిమహాత్ముని సత్యాగ్రహోద్యమ మపూర్వమైన సంచలనమును గలుగజేసినది. కులాభిమానులు, సంఘాభిమానులు, జాతీయాభిమానులు, ధనాభిమానులు, మతాభిమానులు, స్వరాజ్యకాములు ధర్మకర్మానుష్ఠానమునకు జిజ్ఞాసను జేయుటయవసరమైనది. గాంధిమహాత్ముడు అన్ని పాపములకును భైరవుడు కావలసివచ్చినది. గాంధిమహాత్ముడు ప్రభుత్వమునకు విప్లవకారుడు, విప్లవకారులకు నిరంకుశప్రభుత్వాభిమాని. సనాతనులకు హిందూమత ధ్వంసకుడు; సంస్కర్తలకు పూర్వాచార పరాయణుడు; హిందువులకు మహమ్మదీయపక్షపాతి; మహమ్మదీయులకు హిందూధర్మపక్షపాతి. మహారాజులకు సామ్యవాది, సామ్యవాదులకు మహారాజపక్షావలంబకుడు; ధనస్వాములకు కార్మికపక్షాభిమాని,

కార్మికులకు ధనస్వామిపక్షాభిమాని. ఆచార పాశబద్ధమై జడప్రాయమైన దేశమునందు గాంధిమహాత్ముని యవతరణము ఆశాంకుర ములను గలుగజేసినను, యోగసంసిద్ధిలేకను సందేహములకు మూలమైనది. మాలవ్య ఆనె గారల రాజీనామాలును, జాతీయపక్షనిర్మా ణాభిలాషయును దేశావృతమైన సంశయాత్మ త్వమునకు నిదర్శనములుకాని ఆత్మవిశ్వాస మునకు నిదర్శనములుకావు. ప్రపంచా వృతమైన మమకారాహంకారావరణములు మానవ ధర్మావరణములుగను పరిణమించు టకు ప్రపంచమంతయును దుఃఖవేదన ననుభవించుచున్నను ప్రయోజనము గలుగ కున్నది. హిందూస్థానమునందును మమ కారాహంకారాతీతమైన మానవధర్మావరణ నిర్మాణావసరమును, నిర్మాణ సాధనములను గాంధిమహాత్ము డుపక్రమించిన సత్యాగ్ర హము, నిర్మాణకార్య విధానము, హరిజన యాత్రాదులు విశదము చేయుచున్నవి. గాంధి మహాత్ముని నాయకత్వముక్రిందను కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గమును, కాంగ్రెసు పార్ల మెంటుబోర్డును ఎన్నికల సందర్భమునను చేసిన నిర్ణయములును నీ పరమార్థమునే వెల్లడిచేయుచున్నవి. ప్రజానాయకు లీ పర మార్థమును గ్రహించుటకుగాంధిమహాత్ముడు వార్ధాయందు వారముదినము లుపవాస దీక్షను బూనుచున్నాడు. గాంధిమహాత్ముని యుపవాసదీక్ష నిరుపద్రవముగ ముగియుట కును, ప్రజానాయకుల హృదయములు త్యాగపూర్వకమైన ధర్మపరాయణము లగు టకును భగవదనుగ్రహము గలుగుగాత!

---

Printed and Published by K. Nageswara Rao, at the Andhra Patrika Press, No.7, ThambuChetty St., Madras.
Editor: G. Subbaramayya.

# భారతి

## సచిత్ర మాసపత్రిక

అధిపతి

కా. నాగేశ్వరరావు

సంపాదకుడు

గన్నవరపు సుబ్బరామయ్యా

సంపుటము ౧౧, సంచిక ౯

ఆంధ్రపత్రికా ముద్రాలయము, మద్రాసు

౧౯౩౪


విషయసూచిక

త్రివర్ణచిత్రములు:—గౌరీశంకరులు; శుక్లనవమి; శుక్లదశమి.

సాధారణచిత్రములు :— మధుర శిల్పచిత్రములు ౭; రామేశ్వర దేవాలయము; కొడైకెనాలు చిత్రములు 3; ఉదకమండల చిత్రము ౧; మహాబలేశ్వర చిత్రము ౧; తలచేరి చిత్రములు ౨; మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు; కూనూరు: కొండప్రసారంగములో రైలుమార్గము; సుందరప్రదేశము; 'మాశిభవర్ణ' లక్నో; లక్నో విశ్వకళాశాల; అతిప్రమాణ మగు దీపస్తంభము - కద్రి; రాయచూరు యుద్ధము - కృష్ణదేవరాయలు; సయాము చిత్రములు ౨; శిలాశిల్పము; ఇనుపచెప్పులు; కొండకిందిబాట- ఉదకమండలము; సూర్యాస్తమయము; వ్యంగ్యచిత్రములు; ఇతరచిత్రములును.

---



సంపు. ౧౧ భావసంవత్సరము, భాద్రపదమాసము (సెప్టంబరు ౧౯౩౪) సంఖ్య ౯

## బలి

పెమ్మరాజు లక్ష్మీపతి

౧

మొలలోతురొంపిలోపల గొడ్ల వెనువెంట చేనంతయును దమ్ముచేసినాడు,
తనయాలితోగూడ తానును వంచిన నడుమెత్తకయ నారు నాటినాడు,
మానతిరిగినదాది మొక్కమొక్కకుజూడ్కి వరపుచు కలుపెల్ల పెరికినాడు,
రేయింబవళ్లు కన్మూయుట కుడుచుట మరచి మళ్లకు నీరు మలిపినాడు,
రెండుపుట్లొక్కయకరమే పండుననగ జేసి కోసి యొకచో కుప్పవేసి నూర్చి
రాసిగాజేసి దానిపై నాసలెల్ల నిలుపుకొని స్వామిరాకకై నిలిచినాడు.

జనుము సమంబుగా నెదుగు చక్కని చిక్కని చేనిమధ్య నూ
ర్చిన వలయంబులో కయిలుచేసిన సన్నని కృష్ణకాటుకల్
గొనబుగ రాసిచేసి కడుగుండ్రడగ గడ్డికడెంబువెట్టి రా
సిని గని పుట్లలెక్కలు రచించుచు నాలును దానుచొక్కుచున్.

ఐనను నమ్మగాదగినయట్టి యతండొకడేడి? యెక్కనా
కైనను చెప్పవైతివికదా యటువ్రాసిన నోటుమాట నీ
వైనను; మొన్న ఱోజరిగినట్టిది యే నెటులూహసేతు? నే
పూనొక రెండురోజు లిక నట్టులెపోయిన; సొమ్ము దుమ్మొకా.

సొమ్మగవేయుటకే మార్గమ్ములు కనిపెట్టుచుంద్రుగాని తిరిగి యా
సొమ్ము వసూలిచ్చెడు పాపమ్మునబోనొల్లడొకడు వసుమతిలోనన్.

ఇట్టి పాపబుద్ధు లిటు పుట్టుమనికిచే-కూడుగుడ్డ లేక మాడుచుందు
'రింత వదలివేయు డిది తీసికొనుడని' - కొంత యిచ్చుటయిన గొంతమేలు.

అని వేరుతీరుదోసగనను నాతని పలుకు ములుకు లర్థముగాకు
న్నను వానిమొగము తీరును - గని చేతులు కట్టి వినయగరిమ వెలయగన్.

'మాటలు చెప్పజాల మిక మాటలచాటున మాటులొగ్గు టా
టోటుతనంబు చూపు టకటాంకు గొనంబు లెరుంగమయ్య, మా
మాటలు సూటిమైన వొకమాటకు నొక్క యెయర్థ మొక్కటే
బాట యనేకమార్గముల బట్టగ విద్దెలునేర్చినారమే?

ప్రాణములు తీయువిషముండు పాములకును - చీలికలు రెండుగానుండు నాలుకలకు
ఒక్కటియె నాల్కమాటయు నొక్కటయ్య-మాకు భూసేవచేయు నమాయకులకు.

మీరో చిన్నలు లోకమ్ముతెలియ రేమేనన్న గోపింతు రె
వ్వా రేచందమువారలో యెరిగి సంభాషింపగాబోలు, మీ
వారెవ్వారును నెన్నడైన ననిరే పల్లెత్తు మాటైన, న
య్యో రామా! తమ రిట్లు పల్కనగునే యోజించు డయ్యా' యనన్.

మనమున కోపము రెచ్చగ - తనకన్నులజోడు చెవుల దప్పించుచు, నా
తనిదెస నెగ దిగ నిలువున - కనుగొని కనులెఱ్ఱవారి కణ కణ లాడన్.

'మాటలు నేర్చిన కుక్కవు - పోటుల కల కారుదున్న పోతువగుట యీ
నాటికి తెలిసెను ఛీ! ఛీ! - మాటల నటుకట్టిపెట్టుమా యికనైనన్.

మాటకు మాట తీర్చెదవ మాకును నీకును నెంత యంతరం
బేటికి నీకు నింతమద మేగతి దిట్టినవైన చెల్లు మా

బోటులు, నీవు నీపాగరుబోతు జవాబులు కట్టిపెట్టి మా
నోటు వసూలొసంగి పయినూరును వేయును నీతులాడుమీ!'

*   *   *   *   *   *

౨

అసలుజన్మ కొంత యధికారమిచ్చెను - ధనము దానిపై మదంబుబెంచె
పట్టణంపుచదువు!—'బదులుచెప్పుట తప్పు' - అనుచు 'నోటు'గూర్చి యనిమెనిట్లు:

'తాత గతించినాఁడపుడో తండ్రియుదా మరణించె మొన్న నీ
కోతల ముందునాటివరకుం గల యప్పులు లెక్కచూచి, మే
మాతరి నిండుమూలుకల యావును సంతకుదోలి సొమ్ము, ము
ప్పాతిక తెచ్చియిచ్చితి మబద్ధము కా దిది పోల్చిచూడుడీ!
పదిరూపాయలనేవో మందులకునై పంపించి, యావెన్క* డా
గుదొరం జేరగబిల్చి నేటికివి కైకొండంచు దా నిచ్చె నే
బది రూపాయల కాగితంబొకటి మీ 'బాబయ్య' గా నున్న యా
పదునైదున్ తమ బావగారి కిడి నా పద్దిట్లు వే తెమ్మనన్.
'దానికి నేమితొందర నిదానముతోడ వసూల్వ్రాయగా
నౌనది లెక్కచూడవలె నావలర'మ్మని చెప్పినారు మీ
మేనమరందిగా 'రిపుడు మించినదే మొకనాటిలోన నే
హూన'ని యానుకాదనక యట్టులె యింటికిబోతి నంతటన్.
అదిమెట్టి దొంగరోగమొ - తుదముట్టెను నాటిరాత్రితో నంతయు, నే
నుదయమున నేగునప్పటి - కదియంతయు గోలగోల యాసమయమునన్.
నమ్మిన నమ్ముడయ్యె మరి నమ్మక పోయిన నల్లియానుగా
కమ్మెయి నేడ్చువారిగనినంతట నాకును నేడ్పువచ్చె; నా
సొమ్మును కాగితమ్మున వసూలిడజేసెడుమాట దోచలే
దమ్మరునాడు వచ్చువర కప్పుడ మీరును వచ్చినారు కా.
అంత మీరు వారు నంద రొక్కమ్మడి - నేడ్వసాగినా రొకింతలోన
మిమ్ము విడచివచ్చి మీమేనమరదిగా - రపుడు నన్ను పెద్దయరుగుమూల.

* డాగుదొర = డాక్టరు.

నిలువబెట్టి 'మోరి! నీపద్దులోనింక - పదికొకింతలోపు బాకికలదు
యిచ్చినట్టిదాని కిదెవసూ లనిచెప్పి - వేలిముద్రను గొని వెడలు' మనియె.

అనిచెప్పగ 'ఏమేమీ!' - యనియురుముచు తనదుజేబునందలి నోట్సు
'కనుడిది యిందరు' ననుచును - తనచేతం దీసిచూపి తగ నిట్లనియెం.

'ఎగబెట్టినబాకీలకు - పొగబెట్టుట వంటిదిపుడు బొంకుట నీకుం
తగదిది బొంకినమాత్రన - నగునే యింగ్లీషురాజ్య మదియున్నదిరా.

"గవ్వమైన పోదు కాలు సేతులు కట్టి - పెట్టి ముక్కు నేలబెట్టి రాచి
నే వసూలుచేతు నిదిగో చూడుము! బలి - గోరుచుండె పత్ర మోరిదొంగ"!

చూడుడు న్యాయమంచు తనచుట్టును నున్న జనాళితోడ మా
టాడుచు కాగితంబు గనుడంచును చూడుడు వ్రేలిముద్ర నీ
జాడ నిశానిచూడు డిదె సాక్షులు చేసిన సంతకంబులం
జూడుడు పీడుపెట్టిన వసూ లెటనున్నదొ చెప్ప డిందుపై.

అనుచును దా నాకాగిత - మును వెనుకటి ప్రక్కజూపి బొంకెననుట కే
మనుమాన మింక నేమని - యనదగు? నాసొమ్ముపోవు నా యింతటిలో.

పదియునైదునుగావు రూక లొక డబ్బైయైదు తానిచ్చెనే?
అదియే నిక్కమయేని పత్రమున దా నావేళ వ్రాయింపడే
అదనుం దప్పగజేయు వెర్రి మెవడయ్యా! చేయిదాటించి నె
మ్మదిమై యామరునాడు వచ్చునటె? నమ్మం వచ్చునే యిన్నియున్.

మరియు నందులోన మాయమాట లికెన్ని ? - అమ్మగారివిడచి, యచటనున్న
నన్నువిడచి, మెవరో నామేనమరదితో - తాను నడపెనంట! తగవిదెల్ల!

ఎట్టుల నమ్మవచ్చు నివియెల్లను మాయలమారివృత్తికిం
బుట్టినయిల్లు పీడు, చెడుబుద్ధులు తాం జెడిపోవుకోసమే
పుట్టిన వెట్లు సందదికి పూతలుపెట్టుచు మాయగోడతా
గట్టెనొ చూడుడయ్య కనుకట్టుగ గారడివానిరీతిగా.

పదిరూపాయల కించుక - కొదువట, ఋణమెల్ల దీర్చుకొనెనట, నొక డె
బ్బది పయిన నయిదురూకలు! - అదియునుగొని మోసగించిరట వేరెవరో!

ఆమేనమరది నాతో - నేమియు తా జెప్పియుండ డీవిషయము, నే
నేమందు! పోయెమరునా - డే మదరాసున కపుడ చెప్పడే నిజమైనసన్.

ఐన నాకదేల యావల నతడును-మీరుకూడి క్రిందమీద బడుడు,
నగదురూపకముగ నాసొమ్ము నాకిమ్ము-లేక పొలమువదలి లేచిపొమ్ము!

* * * * *

అదరెను గుండెలు ఝల్లున-చెదరెను మానసము మేనచెమ్మట గ్రమ్మెన్
మొదటికి వచ్చెను ఋణమిది - తుదముట్టునె, లేక నేనె తుదముట్టుదునో!

తీరెను చాలభాగ మికతీరగనున్నది కొంచెమంచు నే
నూరటబొంది యుండితి నయో! ఋణమన్ పెనుత్రాచుపాముకున్
కోరలు వెండి మొల్చినవి గుండెగుభిల్లున కూలిపోయెదన్
భారము మీఁది, నన్నిచట పాలను ముంచిన నీటముంచినన్.

అనుకొన్నట్టులె కొంపగూల్చెనుగదా అయ్యయ్యొ ఆయయ్య యే
ననుమానించియు మిన్నకుండితిని, మీయందున్న విశ్వాసమే
నను నమ్మించిన దేమిసేతు నయయో నాగోయి నేత్రద్వికొం
టిని నాపిల్లలనోట నేటి కిటుమట్టిన్ గొట్టుకొంటింగదా.

నమ్మితి సేవచేసితిని న్యాయముదప్పక గోవునమ్మి మీ
సొమ్మును చేత బెట్టితి వసూలిడినట్లు నటించి, కండ్లలో
దుమ్మును కొట్టినా డిపుడు దూరపుపట్టణమందు నున్నవా
డెమ్మెయి బోవువాడ ఋణ మేగతి దీర్చెడువాడ దైవమా!

బ్రదుకెల్ల పోగుచేసిన - పదిడబ్బులవిలువ లేదు పదపడి యొకడౌ
బ్బదియైదు నెట్లుతీర్చెద - పదుగురుబిడ్డల నికెట్లు బ్రతికింతు నయో!'

అని బ్రతిమాలుచు నత డా-తనిపాదము లంట నతడు తన్నుట గని యా
తనిబిడ్డ లేడ్వసాగిరి - కనుగొనువారెల్ల కరుణ కరగిరి యతడున్.

'అందిన జుట్టుపట్టుకొని యందకయుండిన కాళ్లబట్టునీ
చంద మెరుంగమే! యిపుడు జాలిజనించెడు మాటలేల? నీ
వెందరబిడ్డలం గనుట మెవ్వరికో యుపకారము! యిప్పుడే
మందువు? సొమ్ము మానుమనియా? కలనైనఁ దలంపబోకుమా!

చచ్చినయాతని పెండ్లికి - వచ్చినదే కట్నమనుచు భావించెద నీ
విచ్చెదవా చచ్చెదవా - యిచ్చట నివి విడిచిపెట్టి యేగుము త్వరగా.

ఇవి సొమ్ముచేసుకొనియెద - కవులున కొకయేడు గడువుగల దైనను, నీ
వు వెడలి యేగుమిక మ-మ్ము వదలిపెట్టి వచ్చె బుద్ధియు నాకున్.

అని యీరీతిని 'స్వస్తి' చెప్పి యికపై నాలస్య మింకేల, యే
లనుమానించెదరయ్య నంచు లివియెల్లన్ బండ్లకెక్కించి వే
చనుడీ ప్రొద్దదె క్రుంకుచున్నదనుచున్ సాగించి యాబండ్లవె
న్కను తానేగెను; దిక్కులేని రయితొక్కండచ్చటన్ పిల్లలన్.

చెరియొకప్రక్కజేర్చికొని చెంపల కన్నులనీరు గార దు
ర్భరమగు దుఃఖభారమున వందురుచుండెను, వానిబాధ తా
మరసినయట్ల గడ్డితిను టల్లన మాని మొగంబులెత్తి శా
క్కరములు దీనదృష్టులను గన్గొనుచుండెను వాని నంతలోన్.

అతని దైన్యస్థితిని జూచి యవిసిపోయి - నట్టిగుండెలరక్తంబు నాకసమున
దెసల పైపైకిఁ జిమ్మినదేమొ యనగ - జగము మునిగెను సంజకెంజాయలోన.

తనకనులార సర్వవసుధాప్రజలెల్లరు చేయుకార్యముల్
కనుగొను కర్మసాక్షికి యుగంబులు కల్పము లట్టికార్యమం
దున చని యున్కిచే విసువుదోచియొ, యూరకచూచి యేగుటల్
తనకది నైజహానటనొ యథార్థమెరింగియు చెప్పడింతయున్.

3

కటికచీకటిరా కాసి కారుజడల - ముడులువిప్పుచు విరియంగబోసినటుల
నతని హృదయంబులోబలె నఖిలదిశల - యందు ప్రబలాంధకారంబులావరించె.

అంత పంటపండించిన యట్టి తనదు - రెండుచేతులు నరకిన ట్లుండెనపుడు
దేవునకు నైన తనబాధ తెలియజేసి - మొక్కుకొనెదు యుపాయంబు పుట్టకుండ.

అతనిభావంబు భూగర్భమందు, పడిన - కొలది లోతులు తెలియరాకుండు కారు
చీకటుల నంతకంతకు శీఘ్రగతిని-పోయి తలక్రిందుగా పడిపోవుచుండె.

నిలువ నాధారమగు నవనీతలంబు - అతనిపాదాలక్రింద లేసట్టిదయ్యె
కనుల బొటబొట నశ్రువుల్ కారుచుండె - భూమి కంపింప నీర ముప్పొంగునటుల.

తలపయి కూటికుండగల తట్టయు జంకను పిల్ల ముందువె
న్కల నెడపిల్ల లిర్వురును కల్గిన యాతనియాలువచ్చున
య్యలుకుచు గాంచినంత తనయంతికమందు మెలంగుచున్న పి
ల్ల లెదురువోయి వేడుక చెలంగగ తల్లినిగూడివచ్చుచో.

రేపుకొరకు నేడేవిచారింప నెరుగ - కపుడు దొరకిన దప్పడ యనుభవించు
నట్టి చిన్నతనంపు తియ్యందనంబు - చింద, చిందులుద్రొక్కునా కందువులను.

కాంచి యొకింత సంతసముఁ గాంచె; తళుక్కని మేఘమాలలో
చంచలవోలె నయ్యదియు చంచలమై లయమయ్యె, నన్నిటిన్
ముంచిన చిమ్మచీకటుల మున్గెను వానిమనంబు త్రోవగ
న్పించదు పిచ్చివానికరణిన్ తలపేది చరించుచుండగన్.

మినుకుమినుకని దూరాన మెరయుచుండు - చిన్ని చిన్ని చుక్కలయొక్క చిరువెలుంగు
లైన నతనికి గానరానట్లు, పైన - గ్రమ్మె నకాల కాలమేఘంబు లపుడు.

అతనియాలువచ్చి యంతంత నాపంట-కలను నాల్గుదెసలు కలయజూచి
తట్టదింపి యంత తనభర్త గనుగొని-'యేనిధాన్య మిప్పడేమియయ్యె;

'ఇంటికి దోలినావె యిట కేటికి నన్నిపు డిట్లు కూడు దె
మ్మంటివి? బండ్లతోచనక, యక్కట చీకటి సిట్టులొంటిగా
నుంటివిదేల' యన్న నత 'శోసి! తలంపగ నింకవెల్తు రీ
కంటికి గానరాదు; కలికాలము మాయలమారి; మారియే.'

అని జరిగినకథయంతయు - వినిపింపగ గుండెవగిలి విలపింప దొడం
గిన తల్లిజూచి బెగ్గిలి-ఘనముగ రోదనముజేయ గడగిరి బుడుతల్.

ఆధారం బొకయింత లేదు వ్యవసాయంబెల్ల వమ్మయ్యె, క్షు
ద్బాధల్ తీరెడు దారిలేదు, తనసంతానంబు గాపాడు వా
డే ధర్మాత్ముడు గానరాడు భువి గూడే లేదటంచున్ మహా
బాధన్ పొందినవాని డెందమిదినా వ్యాఖ్యానముల్ సాధ్యమే.

తెలవారిన యంతన యం-బలికై చిప్పలను చేత బట్టెడు తన పి
ల్లల గని యేమిడు, కన్నీ-రొలికించుటెగాక, యేమి యున్నది యింటన్.

నలువది యేండ్లు పైబడియె నల్వురుబిడ్డలతండ్రి!, తండ్రి తా
తలు కృషియందె మేనులు హతంబొనరించిరి, చేతులార వం
దలు మరివేలు పుట్టలను తానును పండగజేసె; గంజి నీ
ళులె కరవయ్యె నేడతని లోపమొ,? దైవములోపమో కటా !

దైవము చేసినా డనుచు దబ్బరలాడెద రేల చూడగా
నీవిధి కష్టమందు జనులెల్లరు కూటికి లేక మాడుటల్
కావరమెత్తి సోమరు లఖండసుఖంబుల మున్గితేలుటల్
దైవమొనర్చె నే నతడు దైవమొ, లేకొక పెద్దదయ్యమో !

దయ్యముకన్న క్రూరముకదా తలపోయగ మర్త్యసంఘ మ
య్యయ్యొ తలంప నెంద రిటు లన్నము బట్టయు లేక యార్తిమై
కుయ్యిడుచున్నవారొ కనుగొందురె? యెవ్వరికేమిపోయె? యీ
కొయ్యతనం బిదేమిటికొకో జనియించె హృదంతరంబులన్.

చేసినతప్ప లేదు, విధిచేతల కర్థము కానరా దనా
యాసకరంబుగా నసువు లార్చెడు మెత్తనికత్తు లంధవి
శ్వాసములేచి యీచదువుసంధ్యలు రాని జనాళినెల్ల రా
కాసులువోలె బోకడచు కాలమునం దిక వార్త లేటికిన్.

బ్రదుకది ద్రవ్యపూర్ణ ముచికపట్టున వ్రేలెడుకాయ దాని ప
ట్టు దొలగెనేని యప్పుడపదుర్ణ ధరపై; నిటులయ్యె మానవా
భ్యుదయము ద్రవ్యబద్ధమయిపోయె సమస్తము; క్షుద్రజంతులే
తుదకు సుఖంబు జెందెడి; నధోగతివట్టెడు మర్త్యపద్ధతుల్.

చీకటు లినుమడిగా దివి జీకాకుగ నల్లుకొనిన జీమూతములే
యాకృపణు భగ్నహృదయ-వ్యాకులతను బాహ్యజగముపై ప్రకటించెన్.

సకుటుంబంబుగ నర్ధరాత్రమున నాశాదీపికా శూన్యమై
వికలంబైన మనంబుతో నతడు స్తంభీభూతుడైపోయె, కా



౧. నటరాజు

మధుర దేవాలయము- స్తంభము, శిల్పము-ఒక టేరాయి.



౨. పొందామర కొలను
దక్షిణపుప్రైపు వసారా, మధుర.



3. మధుర దేవాలయమునందలి
కల్యాణమంటపము



౪. మధురయందలి
విశాల సరోవరము
మధ్యను సుందర మంటపము.

టుక మేఘంబులనుండి వెల్వడియె తోడ్తో దయ్యముల్ భూతముల్
వికటాభీలమహాట్టహాసములతో విస్ఫోధి గర్గోలుగర్.

తళతళమను మెరపులతో - పెళపెళ నురుములును పెటిలుపెటిలున పిడుగుల్
గలవాన రేగె, యుప్పెన - బలె నంతయు ముంచి ప్రబలపవనేరితమై.

కారుమేఘాల కటికచీకటులలోన - మెరయుచును, మెరయుచును నెత్తిమొత్తువాన
కోహటించుచు తలదాచుకొనుట కొక్క - యిరవుపెరవునుదోచ కయ్యేడ నతండు.

కడెమునందుండి సందెదుగడ్డిలాగి - సందొనర్ప తల్లియు పిల్లలంద రందు
దాగి తలదాచుకొనిరి అతండు వారి - కెడముగా నందె తనకయి యిరవుచేయు.

నంతలో రెండుచెక్కలైనట్లు ప్రేలి - లోక మొకసారిమెరసి తళుక్కుమనియె;
ఆవెలుగు తళుక్కుబెళుక్కులో నతనిజీవి-తాంధకారంబు కాంతిమయత్వమందె!

'మనుజుండు చెరుపగా మిగి-లినయది దైవంబు చెరచె లేదికధర్మం
బనునది హర! హర! యొకరై-నను మిగులరు, మాయపిడుగు నాశముచేసె.

అదియు గొంత మేలె, యారీతిజచ్చుట - బ్రదికియుండి యేమిబావుకొనును,
బ్రదుకెచావు, చావుబ్రతుకయ్యె, లేమిచే - ననిరి జనములు — ఔర! అర్థనీతి!'

---



సూర్యోదయం                                    R. R.

# కవి—ప్రకృతి

చిరుమామిళ్ల శివరామకృష్ణప్రసాదు బి. ఏ.,

పరాత్పరుని సృష్టిసౌందర్యమున కాలవాలమైన ప్రకృతియందు, కవికుమారుడు సదా మంగళప్రదము దృశ్యములనే గాంచుచుండును. స్వార్థమునకై ఖిసల హేయమగు కార్యముల నొనరించు మానవావళి యందు నివసించు కవి యప్పుడప్పు డోదార్పబడి ప్రకృతిమాతయొడిలో హృదయశాంతిని గాంచును. లోకమున సుకవి కోరునదేదియును లేదు. విలువగల ఆణిముత్యాలకోవకన్న, సెలయేటి నీటితుంపురులె, ఆతని నధికముగ నలరించును. అస్తమయ కాలములందలి కావిరంగు, నుబురులయందు దాగి గాన మొనరించు కోయిలకంఠరవము, పుష్పాడి కణముల పుక్కిటబట్టి కమ్మతావుల జిమ్ముచు, కలకలనవ్వు కలువకన్నెలకు లుకుంఠనము, కవికుమారుని తన్మయునిగా నొనరించును.

ప్రకృతి, కవికుమారుని దుఃఖసమయములం దోదార్చు మిత్రుడు, సంతోషసమయములం దుత్సాహమును రెట్టించుసఖుడు, అధికముగ నీతిని బోధించి సన్మార్గమును జూపుగురుడు.

కుసుమకోమలియొక్క తెలిమంచు ముసుగు నీడలయందు దోబూచులాడుచు, అళికుమారుని అవ్యక్త గానవాహినియం దుప్పళించు లేతతరగల నురుగుల మరుగున నుయ్యాలలూగుచు, సెలయేటిబోటి నాట్యమున కలరుచు, కవికుమారుడు ఇతరులకెరుకలేని యానందము ననుభవించుచున్నాడు.

ప్రకృతినుండి సేకరించిన నీతిని ప్రజలకు పంచి పెట్టి తన స్వార్థత్యాగమును విశదపరచుచున్నాడు. ఆతని కంటికొనలయం దవఘళించు కాంతిపుంజము, పలుకుల యందలరెడి తియ్యదనము, తలంపులయందుండు పవిత్రత, దేశకల్యాణమునకు దారిదీయును.

ఎన్నియో విధముల ప్రకృతిని కవికుమారు డారాధించుచున్నాడు. ప్రకృతినిగాంచి యున్నదున్నట్లు వర్ణించుట యొకవిధము. ఈపద్ధతి ప్రాచీనకవులయొక్కయు, ఆధునికకవుల యొక్కయు, గ్రంథములయందు విరివిగ గన్పట్టును.

ప్రకృతినివర్ణించు సందర్భములయందు మానవ ప్రపంచమునకు చెందిన విషయముల నందు జొప్పించి, వింతరీతి ప్రకృతిచిత్రమును పాఠకుని కనులయెదుట ప్రదర్శించు కళాప్రతిభలుగల కవులుగలరు. ఇది రెండవ విధము.

మానవాతీతములగు విషయములను, బోధింపవలసి వచ్చినపుడును, స్వార్థమునకై పాపకార్యముల నాచరింప నడుముగట్టిన మానవునకు నీతి గరుపవలసినప్పుడును, కవికుమారుడు ప్రకృతిపై నాధార పడుచున్నాడు. అర్థాంతరన్యాసాలంకారము, మొదలగువాని సహాయమున, ప్రాచీనులును, ఆధునికులును, పెక్కుస్థలముల యందు, విలువగల నీతిని ప్రకృతినుండి సేకరించి, మానవులకు బోధించి యున్నారు. ఇది మూడవ విధము.

ప్రకృతిని వర్ణించుచు, ఆవర్ణనము కథావస్తువున కెట్టి యంతరాయమును గల్పింపకుండునట్లు విచిత్రరీతిని, దానిని కథయందే లీనమొనరించి, కథవెంట, వర్ణనమును గూడ నడపించుట నాల్గవవిధము.

ప్రకృతినిగాంచి తన్నుదా మరచిపోయి, భావోన్మాదమున గానమొనరించుచు, ప్రకృతిలో తానపుడు లీనమగుటకు మిగుల యుత్కంఠను వెలువరించుట వేరొక విధము.

భావనాప్రపంచమునకు సృష్టికర్త యగు కవికి సాధ్యముకానిదేది? గ్రంథమునందలి మొదటిపుటలో 'ఊక్కుపుప్పొడిరాలు యుద్ధభూమిని', 'శూర జన కంఠ నిర్గతశోణితమును' జూపి పాఠకుని వణకింపగలడు; రెండవపుటలో 'చెలువము సౌరభంబు [illegible]

లేతగులాబిమొగ్గరుణ దులయును నాదుజవ్వనము దోసిట బట్టి భవత్పదాంబుజంబులకడ నిల్పితిం బ్రణయపూజకు వేళ యతిక్రమించె' నని 'ఆకార రేఖాసుజశ్రీకిం బట్టపురాణియైన యొకరాజీవాక్షి' చేపలికించి, యల రింపగలడు. ఇట్టి ప్రజ్ఞావంతుడగు కవికుమారు డేరీతి ప్రకృతిమాత నారాధించి, పైనవివరింపఁబడిన ప్రకృతి పరిశీలనమునందలి భేదములను తనగ్రంథములందు బ్రదర్శించెనో విచారింపవలసి యున్నది.

సంస్కృతవాఙ్మయమునందు, కాళిదాస భవభూతుల రచనములందు ప్రకృతివర్ణనములు హృద్యములుగ పొందుపరుపబడియున్నవి. ముఖ్యముగ ఉత్తర రామచరితనాటకమునందు భవభూతి తనప్రకృతిపరిశీలనానైశిత్యమును పెక్కుచోట్ల ప్రదర్శించియున్నాడు:

"శ్లో. కండూల ద్విపగండపిండ కషణోత్కంపేన
సంపాతిభిః ఘర్మస్రంసిత బంధనైః స్వకుసుమై
రర్చంతి గోదావరీమ్......"

ఆశ్లోకమువలన కవివర్యుని ప్రకృతివర్ణనమునందలి ప్రతిభ వెల్లడికాకపోదు. ఏనుగులు దురదచే బోదెలకు రుద్దుకొనుచున్నప్పుడు వృక్షములుకదలుటచేత వేడివలన తొడిమలు సడలియున్న సుమములురాలి నీటియందు పడుటవలన, ఆవృక్షములు గోదావరీనదిని పూజించుచున్నట్లున్నవి, అని వర్ణించుటలో కవి గనుపరచిన చాకచక్యము, ఆతనిపలుకులయం దిమిడియున్న సత్యము, పాఠకునకు సంతసము గూర్పకపోదు. మరియు,

శ్లో. నిష్కూజ స్తిమితాః క్వచిత్క్వచి దపిప్రోచ్చండ
సత్వస్వనాః స్వేచ్ఛాసుప్తగభీర భోగభుజగశ్వాస
ప్రదీప్తాగ్నయః, సీమానః ప్రదరోదరేషు విరలస్వ
ల్పాంభసోధఃస్వయంతృష్యద్భిః ప్రతిసూర్యకై రజ
గరస్వేదద్రవః పీయతే."

మొదలగు శ్లోకములందలి యౌచిత్యము తన్మయునిగా జేయును; ఎండవేడికిఅలసి, త్రాగ నీరులేక తపియించుచున్న తొండలకు నట్టడవిలో కొండచిలువల చెమట నీరుగాక మరేమి లభించును? ఈవర్ణనము బీభత్సముగా నున్నను, సత్యదూరముగాక కవివర్యుని పరిశీలనాప్రభావమును వ్యక్తపరచుచున్నది.

ఆంధ్రకవుల రచనములందును ఇట్టి చక్కని ప్రకృతివర్ణనలు పెక్కులు గన్పట్టుచున్నవి. ముక్కు తిమ్మనార్యుడు పారిజాతాపహరణమున:

"ఒక భృంగంబు పరాళినీ మదన
తంత్రోన్మాది ప్రాణేశ్వరిన్
మకరందాసవ మత్త నబ్జగృహసీ
మం బెట్టి తాబోయి సం
జకడన్ వచ్చి తదానమన్ముకుళమే
జూడం జోర ద్రాకయా
మికుడో నా దరిగాం గొలంకు రమకు
న్నేమెంత హీనంబొకో."

అని వర్ణించి, ఒకప్రకృతిరహస్యమును వెల్లడించుచున్నాడు. ఒకభ్రమరము ప్రాణేశ్వరిని అబ్జగృహసీమయందుంచి తనదారిబోయి సంజకడతిరిగివచ్చి, ముకుళితమైన పద్మమునందు చిక్కువడిన ప్రణయిని జేర నేయుపాయంబుదోపక, యామికునిరీతి గృహము (పద్మము) చుట్టునూ దిరుగ మొదలిడెనట! ఈరచనమునందలి చక్కదనమున కెవరు సంతసింపరు? ప్రొద్దుగ్రుంకినంతనే పద్మములు ముకుళించుననియు, అందు మకరందమును త్రాగి మత్తిలియున్న తుమ్మెద లందే చిక్కుబడియుండి, మరల తూరుపుకనుమలనుండి భాస్కరుడు తొంగి చూచినంతనే పద్మములు వికసింప, అందున్న తుమ్మెద లెగిరిపోవునని; ఒకప్రకృతిరహస్యము వెలువరింపబడినది. ఇం దెట్టి యసత్యమును లేదు; ప్రతిదినము జరుగుచున్న విషయమునే కవి; 'పరాళినీమదనతంత్రోన్మాది, ప్రాణేశ్వరిన్ మకరందాసవమత్త నబ్జగృహసీమం బెట్టి' తాను బోయెననియు, మరల తిరిగివచ్చి 'యామికుడో నాదరిగాన్' అనివర్ణించుచు, తుదిని, 'న్నేమెంతహీనంబొకో' అని నిట్టూర్పువిడుచుచు, భావనాప్రపంచమునందలి గాలి తరగలపై పాఠకుని, ఉయ్యాలలూపుచున్నాడు.

పింగళి సూరనార్యుడు, ప్రభావతీప్రద్యుమ్నమునం దొకచోట:

“మృదులపవనాహతి నొకింత గదలియాడు
పల్లవము మాటునను దోచు మొల్లమొగ్గ
చాలుగతి బుల్కబడి మోవిచాటున గన
బడుచు నింతి సల్వరుస కన్నాఖ్రింతిపలుచు.”

అని నుడివి, పాఠకునకు సంతసము గూర్చుచున్నాడు. ఈపైపద్యమునందలి భావమెంత సున్నితముగానున్నదో పదములంతె సుకుమారముగ నున్నవి. గుబురుగానున్న మొల్లపొద; పిల్లగాలి కల్లనల్లన కదలియాడుచున్న చిగురుటాకులు; చిగురుటాకులమాటున దాగియుండి కొలదికొలదిగ బయల్పడుచున్న మొల్లమొగ్గలు; పాఠకుని కన్నులయెదుట గానవచ్చుచున్నవి; అందలి సుకుమారమును చక్కదనమును, సొంపు తడియారని పదములనుండి యూటలూరుచున్న భావమును, ఆతడు చవిజూచుచున్నాడు. ఇది మిగులసూక్ష్మమగు విషయము; కాని ఇందధికానందమునుగూర్చు ప్రకృతి విలాసమొకటి దాగియున్నది. ఆచిగురుటాకుల, కులుకుందనమునందును, మొల్లమొగ్గల తొంగిచూపులయందును, అది నిండియున్నది; రసికుడగు కవియే దానిని గాంచగలడు.

ఆధునికాంధ్ర కవికుమారులయందును ప్రకృతి నీరీతి, ఆరాధించువారు లేకపోలేదు.

అది వర్షాకాలము. ఆకాశము మేఘావృతమై యున్నది. ఏవైపు తిలకించినను పచ్చనిపైరులే! కొండలపైనున్న వృక్షములు చిగురుబెట్టి ముచ్చటగనున్నవి. భూమినానుకొని యేకొన్ని మేఘములు వ్రేలాడుచున్నవి; మిన్ను విరిగిపడునవియే, పర్వతములు స్తంభములుగా నమర్పబడినవి. ఇట్టిదృశ్యమునుగాంచి యొక కవికుమారుడొనరించిన గానము నొకింతయాలకింపుడు:

‘తటములకు నాకసమునకంతరము లేక
నీలనీరదమాలలు వ్రేలుచుంట
నేలపై మిన్నుపడనీక నిలుపుచుండు
స్తంభములనంగ గిరులు దృశ్యంబులయ్యె.’

ఈభావచిత్రమునందలి సౌందర్యము కొనియాడదగినది. ప్రకృతినిగాంచి పరమసంతసమున కాలముగడుపు కవివర్యుని లేఖినినుండి, సత్యాకారములగుచిత్రములు వెలువడునా?

ఈక్రింది పద్యమునందలి భావము లత్యున్నతములు. తెనుగుబాసయొక్క తియ్యదనమునకు తియ్యదనముగూర్చు పదసామగ్రితో భావములను వ్యక్తపరచి తన ప్రకృతిపరిశీలనా వైశారద్యమును ప్రకటించుచున్నాడు; కవికుమారుడు;

“ఎలదేటి చిరుపాట సెలయేటి కెరటాల
బడిపోవు విరికన్నె వలపువోలె,
తీయని మల్లెపూదేనెసోనల పైని
తూగాడు తలిరాకుదోనె వోలె
తొలిప్రొద్దు తెమ్మెరత్రోవలో బయనమై
పరువెత్తు కోయిలపాటవోలె
వెల్లువలై పారు వెలదివెన్నెలలోన
మునిగిపోయిన మబ్బుతునుకవోలె
చిరుతతొలకరివానగా, జిన్నిసోనగ
బొంగి పొరలెడు కాల్వగా నింగికెగయు
కడలిగా బిల్లగ్రోవిని వెడలువింత
తీయదనముల లీనమై పోయెమెడద.”

తొలకరివానలోని సొగసు, పొంగిపొరలెడి కాల్వలోని కులుకుందనము, నింగికెగయు కడలిలోని గాంభీర్యము, ఎలదేటిపాటలోని తియ్యదనము, వెన్నెలలో కరగిన మబ్బుతునుకయొక్క మృదుత్వము, ప్రకృతిపరిశీలనాదక్షుడగు కవికి గాక ఇతరులకెట్లు తెలియగలదు? సామాన్యమానవు డిట్టివానిని గాంచినను, సంతసింపనేరడు; కృత్రిమపదార్థములందు ప్రీతిగలవా డిట్టివానిని గుర్తింపజాలడు.

“చందమామకు నదియేమి సంబరంబో?
ఆటసందడిలోనున్న యట్టివేళ
చెట్లకొమ్మల సందుల చెంతజేరి
యారిన చిగుళ్లలో మంచునీరువోసి
యెన్నియో ముత్తియముల గాపించుచుండు.”

ఇందొక ప్రకృతిరహస్యము వెలువరింపబడినది. తడిలేక సౌందర్యమును గోల్పోయిన చిగురుటాకులకు చక్క

దనముగూర్చ మంచునీరు పోయుచున్నాడట. చందమామ ! చల్లనివెన్నెల కుప్పతిల్లిన చిన్నినీటిబొట్లు, ముత్యములహారములవలె మెఱయుచున్నవట ! చిగురుటాకులలోనికి దూరి సర్వజ్ఞుడగు కవి యొకరహస్యమును వెలువరించినాడు.

ఇట్లే వెదకిచూచిన, ఆధునికాంధ్రకవుల రచనములందిట్టివి పెక్కులు గోచరించును. కొలదిదినములలో ప్రచురింపబోవుచున్న 'ఆధునికాంధ్రకవులు-సృష్టిపరిశీలనము,' అను వ్యాసమునందీవిషయమునుగూర్చి విపులముగ వివరింతునని, మనవిచేయుచున్నాను.

ఇంతవఱకు, ప్రకృతిని యున్నదున్నట్లు [అచ్చటచ్చట కొలది యతిశయోక్తులతో.] కవులెట్లు తమ గ్రంథములయందు పొందుపరచిరో క్లుప్తముగ వివరించితిని.

ప్రకృతిని వర్ణించునప్పుడు, మానవులకు చెందిన విషయములను ప్రకృతియం దాపాదింపజేసి, వింతరీతి కవులు తమ రచనానైపుణ్యమువలన ప్రకృతిమాత నేరీతి, ఆరాధించిరో విచారింపవలసియున్నది.

పారిజాతాపహరణమున, నక్షత్రవర్ణనము పప్ల కవియసమానమగు ప్రతిభను వెల్లడించియున్నాడు: చంద్రునకు చిలిపితన మాపాదింపబడినది, సైకతస్థలములందు బాలికలు ఉబుసుపోకకై, నిర్మించు కుప్పలకు, నక్షత్రములు పోల్చబడినవి. మరియు, విజయము నందివచ్చిన మగనిపై దీవెనప్రాలుచల్లు, వీరసతుల చెయిదము లిచట ప్రస్తరింపబడినవి. వెండిని తీగెలు తీయుట కేర్పడిన కమ్మచ్చురంధ్రము లిచటవర్ణింపబడినవి. ఇవియున్నియు మానవప్రపంచమునకు, చెందినవిషయములు; రసహృదయమునందలి భావమును పాఠకుని మనమునందు జొప్పించుటకు, కవి ప్రకృతియందు వింతవిషయముల నేరీతి ఆపాదించుచున్నాడో తిలకింపుడు :

"కార్కొన్నకటికిచీకటి మొగుల్మొత్తంబు
గురిసిన వడగండ్ల గుంపులనగ
గవజక్కవలు వాయ గరనాళముల జందు
రుండూదుపటికకంపుటుండ లనగ
వెల్లడి మిన్నేటియిసుమున నచ్చర
కోమలిడ్డ వెన్నెలకుప్పలనగ
చెలివివెన్నెల వెండితీవెలు నిగిడించు
చదలు కమ్మచ్చు బెజ్జములనంగ
జగముగెల్వంగ దండెత్తు మగనిమీద
లీలరతిచల్లు దీవనప్రాలనంగ
వేడివెలుగెండ్రగాగిన విన్ను మేన
నెక్కొను చెమటబొట్లు నాజుక్కలమరె."

ఇట్టిరచనమునం దాధునిక కవికుమారులును తీసిపోరు. కొండవీటి పొగమబ్బులను వర్ణించునపు డొకకవి రాజు కనుబరచిన రచనాపాటవము కొలది యిడరానిది. కొండలయం దచటచ్చట అతుకులుబడి నిలచియున్న పొగమబ్బుతునకల కాంధ్రాభిమాన మాపాదింపబడినది. అచ్చటి ప్రకృతిరమణీయతను ఆపొగమబ్బు లాకొండ చరియలలో దాగియుండినప్పటిశోభ, పాఠకున కెఱుక బరుపనలచి, అచ్చటిశిథిలదుర్గలక్ష్మికి పొగమబ్బులూడిగ మాచరించుచున్నవని వింతరీతి కవి వర్ణించుచున్నాడు. రాచసిరి యుడిగిపోయినంతనే తమగృహములను వదలి మానవులు మటుమాయమైరిగాని, అచ్చటి పొగమబ్బులు మాత్రము, అభిమానమును చంపుకొననేరక, తొల్లింటి వైభవమును మరచిపోనేరక ;

"ఒకసారి వలిపవుమ్మ చికిలిముత్యాల యం
చులవోలిక నుపత్యకల చరించు,
ఒకసారి జఘనభాగోపరిస్రస్తచే
ల విధాన గిరిమొదళ్ల బడిపోవు
ఒకసారి గిరిలక్ష్మి మొకముపై మొగలి
పుప్పొళ్లూదుకొన్నట్లు చెల్లరేగు
ఒకసారి స్వేదబిందుకములు రత్యంత
వేళా కుచావృత్తి విస్తరించు
చిరుతపొగమబ్బు లీకొండ సీమపలుచ
బడి, విశీర్ణమై, ధూతమై, తడిసి, రాచ
సిరి యుడిగిపోయినట్టి యాశిథిలదుర్గ
లక్ష్మి కొనగూర్చునెట్టి యలంకృతులను."

కన్నులకు గట్టినట్లు, గాలికి తేలిపోవు పొగమబ్బులను వర్ణించి, వానియందు ఆంధ్రాభిమానమును వ్యక్తపరచి, పాఠకునకు వానియెడ గౌరవమునుగూర్చిన కవివర్యుని కళాప్రతిభలు ప్రశంసింపదగియున్నవి.

మానవుని జీవితమునకు సత్ప్రవర్తనము వన్నెగూర్చును. సత్ప్రవర్తనము నలవరచుకొనుటకు, నీతిమూలాధారము. సద్గ్రంథముయొక్క ఆశయము పాఠకునియందు నైతికాభివృద్ధి నతిశయింపజేయుటయే; కావున కవి పాఠకున కట్టి యవకాశమును గల్పింపవలయును. ప్రవిమలమగు నీతిని బోధించుటకు కవికి యాధారములు పెక్కులు గానరావు. ప్రకృతిసూత్రము లెన్నడును విచ్ఛిన్నములు గావు. కావున ప్రకృతి నాధారపరచుకొని కవివర్యు డమూల్యమగు నీతిని బోధింపగలడు.

మేఘము లొకానొకసమయమునందు కొండల నావరించియుండుట యెల్లరకు తెలిసినవిషయమే. వేసవికాలములందు కొండలయందు వృక్షముల రాపిడివలన బుట్టినదావాగ్ని వర్షముల మూలముననే శమించును. ఈ విషయము నాధారపరచుకొని, ఎట్టిలుబ్ధుడైనను, తన్ను జేరవచ్చిన యుపకారికి ఆతిథ్యమొసగి గౌరవించును, అను నీలమువంటి నీతిని, కాళిదాసు యక్షునిచే మేఘునకు జెప్పించి, లోకమునందలి మానవులకుగూడ దీనిని బోధింపదొరకొనెను.

త్వా మాసారప్రశమితవనో
పప్లవం సాధు మూర్ధ్నా
వక్ష్య త్యధ్వశ్రమపరిగతం
సానుమా నామ్రకూటః;
నక్షుద్రోపి ప్రథమసుకృతా
పేక్షయా సంశ్రయాయ
ప్రాప్తేమిత్రే భవతి విముఖః
కింపున ర్య స్తథోచ్చైః.

ఇందొకనీతి వెలువరింపబడినది, ఒకప్రకృతిరహస్యము బయల్పరుపబడినది. లుబ్ధుడగు మానవు డిట్టిపలుకులను వినియైన తనగుణమును మార్పుకొనడా?

ఇట్లే, భర్తృహరి, కుజనసజ్జనుల మైత్రియందలి భేదములను వ్యక్తీకరింపదలచి, ప్రకృతినియమము నొక దాని నాధారపరచుకొని, దానిసహాయమున తన నీతిసూత్రమును వెలువరింపగలిగెను. ఈ ప్రకృతిసూత్రమెట్లు సర్వకాలములందు అజేయమై నిలువగలదో, అట్లే మానవప్రపంచమును పరీక్షించి, వెలువరచిన విషయముగూడ, నజేయమై వెలుగొందునని కవివర్యుని యాశయము:

"శ్లో. ఆరమ్భగుర్వీ క్షయిణీ క్రమేణ
లఘ్వీ పురా వృద్ధిముపైతి పశ్చాత్;
దినస్య పూర్వార్ధపరార్ధభిన్నా
ఛాయేవ మైత్రీ ఖలసజ్జనానామ్."

[ మొదలుజూచిన కడుగొప్ప పిదప సురుచ
అది కొంచెము దర్వాత నధికమగుచు
దనరు దినపూర్వపరభాగజనితమైన
చాయపోలిక కుజనసజ్జనులమైత్రి. ]

ఇందు, ప్రొద్దుటిపూటనీడ మొదలు పెద్దదిగానుండి క్రమముగా క్షీణించుననియు, మాపటిపూట నీడ మొదట జిన్నదిగానుండి, పిదప బెరుగుననియు, నొకప్రకృతిరహస్యము వెలువరింపబడినది. అట్లే దుర్జనులమైత్రి మొదట బెద్దదిగానుండి క్రమక్రమముగ క్షీణించుననియు, సజ్జనులమైత్రి మొదట జిన్నదై పిదప బెరుగుననియు నొకనీతి బోధింపబడినది.

సాలవంటికులమునం దుద్భవించినవానికి యొరులెట్టి నీచములగు విషయముల నాపాదింపజేసినను, వాని కులగౌరవమునకు లోటు రానేరదు; అనునీతిని ప్రకృతిసిద్ధమగు నొకవిషయమునకు బోల్చి, యొక యాధుని కాంధ్ర కవికుమారు డెట్లు సమర్థించుచున్నాడో గమనింపుడు:

"అక్కట, పండువంటి మరి
యాదకునెక్కిన మీకులీనతన్
దక్కవచేసి వ్రాసిన వి
ధంబున బద్దియముల్ ధ్వనించెడిన్
చక్కని మల్లికాసుమము
నన్ జరియించి మదద్విరేఫముల్
తెక్కలు రాచియందు సవ
రింపగ జాలునె నీలివన్నెలన్."

ఇం దుపమానోపమేయము లెంత ముచ్చటగ మేళవింప బడినవో తిలకింపుడు. ఇందలి యుపమానమును ప్రకృతి మాతయే కవికి సమర్పించియున్నది; దాని నాధారపర చుకొని అమూల్యమగునీతిని కవి లోకమున కెఱుకపరచి నాడు.

కథాసంవిధానమున కంతరాయము రాకుండునట్లు ప్రకృతివర్ణనమును గొనితెచ్చి, కథలోజరిగెన, జరుగ వలసిన విషయముల నందు ప్రతిబింబించునట్లు జేయుచు వింతరీతి కథను నడుపుట వేరొకవిధము. ఇందొకవైపు ప్రకృతివర్ణనము, వేరొకవైపు కథావస్తువు, జంటగా ముందునకు సాగుచు కవివర్యుని రచనాకౌశలమును వ్యక్త పరచును :

"ఆశీలవతి యట్టులగచాట్లుపడుట
చూడజాలగలేక సురలతో జెప్పి
తోడ్తెచ్చి యామెకు తోడుపడంగ
బూని యేగెనో నాగ భానుండు చనియె.

నిర్దోషురాలైన నెలతుకమీద
చెడునింద మోపిన చెనటిపై ప్రకృతి
కినిసెనోయన సంజకెంజాయలొలసె.

మచ్చరించినయట్టి మదవతిబుద్ధి
అంధకారనిమగ్న మగునన్న రీతి
నిబిడాంధకారంబు నిండెలోకమున.

* * * *

సవతిపై సాడ్డుగా సాహసంబడర,
తెల్లవారగ మడ్డుదీతు; నామగని
మనసుమెప్పింతు నామగడెల్లి నన్ను
కైకొను నేకుందుకందులులేక;
సరివారిలో నే మసలగందుననుచు
చిన్ని యాయెఱుకత చిత్తాంబుజమున
జనియించుచున్న యాశాజ్యోతులనగ
మెఱసె చుక్కలు మింటమినుమినుక్కనుచు.

* * * *

యపవాదుపుట్టించినట్టి తొయ్యలికి
తలక్షంపులనునేడు, తప్పదటంచు
గట్టిగానొక్క వక్కాణించునట్లు
కోళ్లు మువ్వరుసలగా గూసె గొంతెత్తి.

* * * *

తెలవారుమును మడ్డుతిరునాళ్లు చూడ
పల్లెపల్లెలనుండి పైనమైవచ్చు
ప్రజకు మార్గము జూప ప్రాగ్దిశారమణి
కడగిపట్టిన దొడ్డకరదీపమనగ
వెలిగె తూరుపుచుక్క వేగురుచుక్క."

ప్రకృతియంతయు జరుగబోవు విషయమునకే ఎదురు చూచుచున్నట్లు విశదపరచి, కథా వస్తువునందలి యుత్కృష్టతనుగూడ కవి వెలువరించుచున్నాడు.

ప్రకృతినిగాంచి కవి తన్మయుడై, అందు లీన మగుటకు నుత్కంఠను వెలువరించుట మరియొకపద్ధతి. ఏవనమునో తిలకించి, హృదయము పులకింప, తనకానంద మును గూర్చుచున్న చిగురుటాకులలో తా నొకడై యుండగోరుటయు గలదు :

"ఆకులో నాకునై పూవులో బూవునై
కొమ్మలో గొమ్మనై నునులేత రెమ్మనై
ఈయడవి దాగిపోనా
ఎట్లైన
నిచటనే యాగిపోనా ?

గలగలనివీచు చిరుగాలిలో గెరటమై
జలజలనిపాఱు సెలపాటలో దేటనై
ఈయడవి దాగిపోనా
ఎట్లైన
నిచటనే యాగిపోనా ?

పగడాలచిగురాకు తెరచాటు తేటినై
పరువంపు విరిచేడె చిన్నారిసిగ్గునై
ఈయడవి దాగిపోనా
ఎట్లైన
నిచటనే యాగిపోనా ?

తరులెక్కి యలనీలగిరినెక్కి మెలమెల్ల
జడలెక్కి జలదంపు నీలంపు నిగ్గునై

ఈయడవి దాగిపోనా
ఎవ్లైన
నిచటనే యాగిపోనా ?

ఆకలా దాహమా చింతలా వంతలా
ఈకరణి నెట్టినై యేకతమతిరుగాడ
ఈయడవి దాగిపోనా
ఎవ్లైన
నిచటనే యాగిపోనా ?

ఆంధ్రవాఙ్మయమున కలవడిన క్రొత్తపోకడలలో నిది యొకటి.

ఇట్లు ప్రకృతిలోలీనమై, ప్రకృతిపజ్ఞ పాఠముల నేర్చుకొనినకవి తోడివారలకేమని హెచ్చరించు చున్నాడో తిలకింపుడు:

"భావనాబలమున్నది ప్రకృతియున్న
దిష్టముండిన బనములకేమి కొఱత ?
వారిదవిహారనగశృంగపదము లరసి
స్వాదుజలపూర్ణ నదనదీపదము లరసి
సార్థకంబుగ భావించి సరసకావ్య
మొకటి వ్రాయుము! వ్రాయుము! సుకవిచంద్ర!

సమదకోకిల కలహాజిలేములలోన
భ్రమదిత మయూర కేకారవములలోన
బంజర శుకీశుకానులాపములలోన
ప్రకృతి యవ్యక్తమంజుల ధ్వనులు నెఱపి
వినుచునున్నది చెవియొగ్గి వినుము! వినుము!

రమణనొకసారి నీలాంబరంబుదాల్చి
చెలగి యొకసారి వెన్నెలచీరదాల్చి
పొసగ నొకసారి మంచుమేల్ముసుగుదాల్చి
లీల నొకసారి మేఘమాలికల దాల్చి
గడియ కొకరీతిగా నలంకారసరణి
నెరపుచున్నది ప్రకృతి నీనికటమందు
లసదలంకారముల లక్ష్యలక్షణముల
దెలిసియుంటె విశేమి కావలయు నీకు."

అని హెచ్చరించి ధన్యుడైనాడు. అందులకే:

"కవితబోలిన మధురవస్తువులు లేవు
కవులబోలిన ధన్యమానవులు లేరు."

అను సత్యమును లోకమున కెఱిగించి శాశ్వతయశస్సును సంపాదించుకొనినాడు.

---



హుగ్లీనది-కలకత్తా G. V. S. M.

# స్వర్గీయ బసవరాజు అప్పరాయని గీతములు

చతుర్వేదుల లక్ష్మీనరసింహం

' Death's little rift hath rent the faultless lute,
The singer of undying songs is dead. '

భావకవిసమ్రాట్టు అప్పారావుగారు. జీవితము గోచరాగోచరావస్థలకు ఎడములేక మిరుమిట్లుగొల్పిన మెరుపుతీగ; నిరంతరగానము సల్పిన కోకిల; ఎడతెగని మృదుమధురస్వనము లీనిన మురళి. పోయెను; అగోచరుడై పోయెను. వైరాగ్యమే శరణ్యము. భగవత్సాన్నిధ్యమున నాతని గీర్తించుటకై పోయినాడు. అయ్యో, అప్పరాయకవి మృతజీవుడు.

' The seasons change, the winds they shift and bear
The grass of yester year
Is dead; the birds depart, the groves decay:
Empires dissolve and peoples disappear;
Song passes not away—
Captains and Conquerors leave a little dust
And Kings a dubious legend of their reign;
The swords of Caesors they are less than rust
The poet doth remain.
Dead is Augustus, Maro is alive.

ఋతువులు మార్పుచెందును, వానితోపాటు ఋతుధర్మములునూ. ఒక సామ్రాజ్యము నశించి మరియొక సామ్రాజ్యమునకు తావొసంగును. కవిత్వమన్న స్థిరము! రాజుల పాంచభౌతికశరీరములు తిరిగి పంచభూతములలో లయమగును. మిగులునది వారిచరిత్రయే. వీరాధివీరుల ఆయుధములు తుప్పుపట్టి తునియలౌను. కవియన్న శాశ్వత బ్రహ్మపదవి నలంకరించును.

## కవిజీవితము

' ఆరువేలనియోగిబ్రాహ్మణుడు. కౌశికసగోత్రుడు. తండ్రి పిచ్చయ్యగారు. తల్లి వెంకమ్మ. జననము ౧౩-౧౨-౧౮౯౪. కృష్ణాజిల్లా పడమటగ్రామమున మేనమామలగు గోవిందరాజులవారియింట పుట్టి పెరిగెను.

స్కూలుఫైనల్ వరకు బెజవాడ C.M.S. హైస్కూలులో చదివి ౧౯౧౨ లో పరీక్షయం దుత్తీర్ణుడయ్యెను. తదుపరి చెన్నపురి రాజధాని కళాశాలయందు బి. ఏ. వరకు చదివి ౧౯౧౬ లో పట్టభద్రుడయ్యెను. కొన్నేళ్లు విశ్వదాత నాగేశ్వరరావు గారి చలవవలన 'భారతి, ఆంధ్రపత్రికలకు' సహాయసంపాదకుడుగా నుండెను. బి. ఎల్. చదువుట కుపపత్తికలిగిన తదుపరి ౧౯౨౪ లో

బెజవాడయందు న్యాయవాదివృత్తిని కాలక్షేపము చేసెను. ఊహాగానము చేయుచు గగన మార్గమున సంచరించువాని కీ వృత్తి యెట్లు సరిపడగలదు? ఏహ్యమైనదని దూరినాడు.

ఈకపటనాటకాల నేనింకనాడ
లేను, తెరదించుడీ, కొరగానినాలి
వేసములవేసి పొట్టకై మోసగించి
పరులయాచించి, లాలించి బతుకలేను.

అదేమికర్మమోగాని ఏ దేశమందైనను 'కవి' యనువాని వెనువెంట నుండెడిది లేమి. పాశ్చాత్యకవులుగూడ నట్టిసంకటములకు లోనౌచుండెడివారు. 'Grub street misery' అనుభవింపనివారు బహుకొద్ది. మనకవులలో, శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణ శర్మ గారు చెప్పినట్లు "ఆలిముక్కురకు ముత్యములేకపోయినను, ముంగిట ముత్యాల ముగ్గులు పెట్టెడివారు" అనేకమంది యుండెడివారు. రాజపోషణ యున్నను లేమి ననుభవించిన కవిశేఖరులు పెక్కుమంది గలరు. కవి సాధారణముగ లేమి వెంట జన్మించును.

"ఒక్కచిఱుపేదగుడిసెలో నుద్భవిల్లి
నాడు, కవికూన పదియవనాడు మంత్ర
సాని దెప్పిన దన్నముచాలదంచు
మంత్రమో! సర్గినాడొ బ్రాహ్మణుడువచ్చి"

నూటికి కోటికి అపవాదేమో గాని. అప్పరావుగారు గూడ పైదాని కపవాదు కారేమో.

౧౯౩౨-వ సంవత్సరములో న్యాయవాదివృత్తిచాలించి పత్రికానిర్వహణోద్యోగమున జేరనెంచి ఢిల్లీపోయెను.

అచటనుండి ఆంధ్రుల నిరాదరణము నెలుగెత్తి చాటించినాడు.

*   *   *   *

*   *   *   *

ఆంధ్రమాత నన్ను కాస్త ఆదరించి
[యున్నయెడల
ఇంత దూరదేశానికి యేల వలసరావల
[యును?

*   *   *   *

కానివేళ చేరదీసి కడుపునిండ తిండిబెట్టి
కనికరించె నీ ఢిల్లికన్న ఆప్తులెవరునాకు?

*   *   *   *

అని పొట్ట నిమురుకొనెనో లేదో! మనోవైకల్యము కలిగెను. ఢిల్లీనుండి బయలుదేరి బెజవాడకువచ్చి కుమ్మమూరు గ్రామములో చికిత్స చేయించుకొనెను. కాని లాభము లేకపోయెను. ౧౦-౬-౩౩ వ తేదీన ఈశ్వర సాన్నిధ్యమున కేగెను.

సంసారము

మేనరికము చేసుకొనెను. ఒక కుమార్తె కలిగెను. మరణించెను. బిట్టు శోకించినాడు; విషాద గీతము వ్రాసినాడు భగవంతుని దూరుచూ.

కత్తిబెట్టి పొడిచినావోయ్ దేవా!

*        *        *        *

నిలువ్రాన యిల్లు దోచేశావ్ దేవా!

*        *        *        *

వెలలేని మణి కాజేశావ్ దేవా!

తిరిగి తన్ను దూరుకొనినాడు.

*        *        *        *

*        *        *        *

బంగారు పండంటి పసి బాల కలిగె!
పెట్టి యెవరిని యేమి తిట్టుకున్నామొ
ఇచ్చినన్న దైవమూ మర్చి పోడాయె!

దోబూచులాడు దేవుడు మరల సుందర వదనారవిందమును చూపినాడు. ఇంతలోనె శోకము అంతలోనె ఆనందము.

వేద్రాది శిఖరాన వెలిగేటి జోతి
నాపూరి గుడిసెలో దీపమైవున్నె!

*        *        *        *

*        *        *        *

పరమాత్ముడౌ జగద్వ్యాపిపాపాయి
ఇరుకునా గుండెలో యిమిడిపోయేనె?

పాపాయి లీలలు పాడినాడు.

ఇంతలోనె వంత
వేద్రాదిశిఖరాన వెలిగేటి జోతి
మినుకుమని కాసేపు, కునికిపోయింది.

మానవుడు దేవదేవుని చేతియందలి కందుకము. గగనవీధి కెగురగొట్టును, వెను వెంటనే వైరాగ్యమును కలుగజేయుపతనమును కల్గించును. ఎగురునది భూమికి పడక తీరదు. చక్కిలిగింతతో కిచకిచలాడించును. గిల్లి ఏడ్పించును. ఇవియ ఆతని క్రీడలు.

కవిత్వము

భావకవిత్వమును మనవారు బహుభంగుల నిర్వచించియున్నారు. చివరకు భావములేనికవిత్వము భావకవిత్వమనిగూడ యనిరి. అసలు కవిత్వమన నేమి? నిఘంటుకారులు దీనిని వేర్వేరువిధముల నిర్వచించియున్నారు.

"Poetry is the embodiment in appropriate language of beautiful or high thought, imagination or emotion, the language being rhythmical, usually metrical and characterised by harmonic and emotional qualities, which appeal to, and arouse the feeling and imagination''

'Webster'

(ఉపయుక్తభాషలో సుందరములు, ఉన్నతములు నగు భావములను సమావేశపరచుటయే కవిత్వము. అందులో కల్పన, భావావేశము కూడ ఉండవలెను. భాష పద్యాత్మకముగను, పాఠకుల హృదయములో అనుకూలభావోద్రేకం కలిగింపగల దిగ నుండుట యవశ్యము)

భాష పద్యాత్మకముగ నుండవలెననునది గూడ కొందరిచే ఖండింపబడినది.

'There is poetry in prose, and prose in poetry'          'Chesterfield'

పద్యాత్మకముగనుండినను లేకుండినను, ఉపయుక్తమగుభాష, ఉన్నతములగు భావములు ఉండవలెను. అన్నిటికన్న ముఖ్యము భావోద్రేకమును కలిగింప గలిగియుండుట. అంతియేకాని ఛందస్సుపట్టింపులు పనికిరావు. ఏది ఛందోబద్ధముకాదు?

"Poetry is the art of expressing in melodious words the thoughts which are the creations of feeling and imagination"
'Chambers'

(మధురశబ్దములలో కల్పనను, భావప్రసూతములగు నూహాలను ప్రకటించుకళను కవిత్వమందురు.)

కవియన నెవడు?

ఛందోబద్ధముగ వ్రాసినంతనే కవులైన కవికానివాడెవ డుండును?

'Poets are all who love, who feel great truths and tell them; and the truth of truth is love' 'Bailey'

ప్రేమ, పరమ సత్యానుభవము కలిగి వాటిని ప్రకటింపగలుగువాడు కవి. సత్యములో పరమసత్యము. ప్రేమ.

కవిత్వ మెట్లుండవలెను?

'Poetry ought to be simple, sensuous and impassioned' 'Milton'

కవిత్వము సరళముగను, ఇంద్రియ గమ్యముగను, భావపూర్ణముగను ఉండవలెను.

ఇట్టి యంశములన్నియు అప్పరాయని కవిత్వమందు సహృదయునకు చూపట్టక మానవు. ఏవృత్తమం దున్న నేమి? కావలసినది రసము. అదియే మృగ్యమైన "కోమలై పుట్టితే నేమి? మా గాంధి" అనుదానితో అప్పరాయునికీర్తి యాకసమునంటినది. ఇట్లే జాతీయగీతములు చాల వ్రాసినాడు. సంపదకు చంకలుకొట్టినాడు. విచారముతో పిచ్చివానివలె నవ్వినాడు. చిత్తరంజనుని మరణమును గురించి 'ఊరేగింపు' అని వ్రాసినాడు.

రాచకీయగీతములు కొన్ని గలవు. అందు వ్యంగ్యములు స్ఫుటముగ వ్యక్తమగుట కష్టముగనున్నది. కాలోచితముగ వ్రాయబడినవిగాన నప్పటిపరిస్థితులనట్టి గ్రహింపనగునే కాని వేరుమార్గము కనుపించునటులలేదు.

భక్తిపరుడు బసవరాజుఅప్పారావుగారు ఈగీతములయందు వృత్తములు పలుతెరంగుల నడిపించియున్నారు. చదువునప్పుడు మనవెంట భావములు, భావములవెంట మనము పరుగిడునట్లుండును. అప్రయత్నముగా చిందులు తొక్కింపచేయునట్లుండును.

నల్లవాడే
గొల్ల
పిల్లవాడే
(పుట. ౧౦౮)

"పరమశివా యని నోటనిండుగా
పల్కవేమిరా యీవేళయినా"

అని భజగోవింద శ్లోకములు పాడినాడు.

"వొద్దోయీ వేదాంతము
వొద్దూవొద్దంటే వినవె!"

అని మిథ్యావాదులను భక్తిమార్గమున పడి పొండు అని దారిచూపినాడు.

'ఒక్కపరి కోకిలమ్మటులొక్కసారి
గరుడగంధర్వ కిన్నరీగానఫణితి
బాలపవనుడుపూల నుయ్యాలలూపునట్లు'

వినపడు కృష్ణమురళీగాన రస మాస్వాదించి చొక్కి ఝుంకార మొనర్చినాడు.

'The eyes that looked through life and gazed on God.'

లోక వ్యవహారములలో భగవంతుని చూడగల్గిన దృష్టి కలిగినవాడు.

యశోధరావిలాపమున అట్టియెడనుండు మనోవృత్తి (Pshychology) ని చిత్రించిన రీతి యద్భుతము.

మాధవీలత కింక
మంటికౌగిలి యేన?
కన్నిబాబా! నీకు
కలలైన రాలేద?

మరణావస్థయందు చక్కనివృత్తమున 'Charge of the light brigade'ను అనుకరించుచు

'ఇటు గాంచ మహాప్రళయమ్మే
అటు..................
ఈదిశ ఘోరదవానలమే
ఆదిశ...................'

'కుంకుమ పసుపులు మోముపై పూసు
కొందువేల పార్వతివలె సాధ్వీ
సంకరయువతులు నీ దేదీప్య
కుంకుమ తేజము మెచ్చెదరే?'

అని లోకమున నాగరికత పేర చేయు దురాచారములను గురించి వాపోయినాడు.

లైలామజ్నూను యంపు లైల మజ్నూనువద్దకుపోయినపుడు మజ్నూనుయొక్క ప్రేమాతిరేకమును ప్రౌఢముగ చిత్రించినాడు.

'లైలవా కళ్ల నీవెట్లు లైలవౌదు
.....................................
బోమె మజ్నూను ఆనందపురము జేర'

ఎంత లోతుంటుందో
యీసముద్రముచిట్టి
..............
నాప్రేమ లెఖ్ఖ, జమా

అని సముద్రునిగంభీరతను, చిట్టిప్రేమతో పోల్చి సముద్రుని గేలిచేసినాడు.

'ప్రేమ లెఖ్ఖాజమా' యనుటలో, పరవశత్వమును జెందిన ప్రేముడి లక్షణములు తేటతెల్లము. భావగాంభీర్యమున కనుగుణముగ పదసామగ్రిని (Choice of Words) ఏరుటయందు అప్పారాయ డసమానుడు.

కుతుబ్ మినార్, టాజ్ మహల్ అను రెంటియందును (భావములు), టాజ్ వలె సౌందర్యముగను, కుతుబ్ మినార్ వలె గగనతలము నంటుచూ భావసౌధము నిర్మించినాడు.

కామితమిచ్చే మామిడిపండూ
కవులకు మిగిలిందీ.

అంతకన్న మిగలవలసిన దేమున్నది? ఏమి మిగులగలవు. మిగిలినవి కవులపాలే.

ఇట్టిమహోన్నతభావములతో నిండినవి చాలగలవు.

శాఘోగీతములు, రవీంద్రునిగీతములు ఒకటి యర కాళిదాసునివి చక్కగా తర్జుమా చేయబడినవి.

'హితోపదేశ' మార్గము చిత్రముగ నున్నది. చాటొద్దా, నీకుమాటొద్దా యనుట వ్యతిరేకముగనున్నది ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారి హితోపదేశము "యింకను భావములు ప్రస్తరింపబడవల యు"నని.

ఆంధ్రవాయుసందేశము (వ్రాతప్రతి) కనబడకుండుట విచారకరము. మచ్చున కైనను మిగిలినందులకు సంతసము.

ధర్మప్పరాయని ధర్మము కని విననిది. అట్టిదాత లేడని యార్తిపొందునేమో యని (వార్తావహుడైనయాగంధవహుడు) అచ్చటి దాసీజనముల వర్ణించియున్నాడు.

వాలుజడ.....................
కల్లజేసి కౌతుకము చేసి జనుము.

ఇంద్రకీలాద్రి——

'పార్థుడా శైలశిఖరాన పాశుపతము
బడయ శివుగూర్చి ఘోరతపముచేసె.

అందుచే 'విజయవాడ' యను నామము వహించెనట.

ఇట్టిపద్ధతిని కాళిదాసుని యనుకరించుచూ ఆంధ్రదేశమందలి ముఖ్యమైన పట్టణాదుల వర్ణించియుండును.

ఇంత విమర్శ యనవసరము. కవి ఉద్రిక్తుడుకానిచో వ్రాయునది సున్న.

నన్నెవ్వరాపలేరీవేళ
.........................
నాథాటి కోర్వలేరీవేళ.

అని తనకవిత్వమును గురించి యాతడే యని నట్లు అదెంతయు సత్యము.

తుట్టతుదకు వారియనంతర మీసంపుటమును శ్రద్ధవహించి స్వల్పఖరీదున ఆంధ్రలోకమున కందజేసినవారికి వందనశతము.

———

# భాషాచరిత్రము-వ్యాకరణములు

కోరాడ రామకృష్ణయ్య

మానవచరిత్రమును అనగా నాయాజాతుల యొక్కగాని, వ్యక్తులయొక్కగాని చరిత్రమును దెలిసికొనుట కాయాకాలములయందు వ్రాయబడినవ్రాతలు - అనగా స్థానికచరిత్రలు, గ్రంథములు, శాసనములు మొదలగున వెట్లు సహాయకారు లగునో, అట్లే ఆయామానవులు వ్యవహరించు భాషయొక్క చరిత్రమును దెలిసికొనుటకు పైవానితోపాటు ఆయా కాలములయందు దానికేర్పడిన లక్షణము- లేదా వ్యాకరణములుగూడ విశేష సహాయకారు లగుచుండును. వార్తాపత్రికలు గ్రంథములు, మొదలగున వాయాకాలము లందలి జనులను జనసంఘములను గూర్చిన వివిధవిషయములను, వారి ప్రవృత్తులను, వానికిగల కారణములను, విమర్శించి యెట్లు ప్రకటించునో, వ్యాకరణము లాయా కాలములందు సర్వజనాంగీకారమును బొంది వ్యాప్తి గాంచి వ్యవహారమునందున్న భాషను వ్యాకరించి, దాని స్వరూపలక్షణములను విశదీకరించుచుండును. ఒకొక్క కాలమందలి భాషాస్వరూపమును వ్యాకరించి (Analyse) దానిలక్షణమును విశదీకరించు వ్యాకరణములను తాత్కాలికభాషావ్యాకరణము (Descriptive) లందురు. ఆయాకాలములందు బయలుదేరిన గ్రంథములు, శాసనములు పురాణవస్తుచిహ్నములు మొదలగు వానియందలి చారిత్రకవిషయములను సంగ్రహించి, సమన్వయము చేసి యాయాజాతివ్యక్తుల చరిత్రములు రచింపబడినట్లే ఆయాకాలములందు చెప్పబడియున్న యాయాభాషా స్వరూపలక్షణములను పరిశీలించి, యందలి విశేషములను సమన్వయించి యాభాషాచరిత్రము రచింపబడును. ప్రత్యేకజాతులచరిత్రము లందలి విశేషలక్షణములును వాని మూలకారణములను గనిపెట్టుటచే, మానవచరిత్ర నన్వేషించుటకు మార్గ మేర్పడును. అట్లే ఒకొక్కక్క భాషయొక్క భిన్నావస్థల విశేషలక్షణములను పరిశీలించి, దానిచరిత్ర నన్వేషించి, యితర సన్నిహిత భాషాలక్షణములతో సరిపోల్చి చూచినపుడు వానివానికి గల సంబంధములేగాక, మొత్తముపైని భాషాతత్త్వలక్షణమును గూడ దెలిసికొనుట కవకాశము గలుగును. ఇప్పటి భాషాతత్త్వశాస్త్రమంతయు నిట్లేర్పడినదే.

భాషయనునది దైవము మానవుల సౌకర్యముకొఱకనుగ్రహించినాడనియు నది పుట్టుకతోడనే సహజముగ వాని కలవడునట్టిదేగాని వానిచే సంపాద్యముకాదనియు నీ మొదలగు భావములు ప్రాచీనకాలమున ప్రబలియుండెడివి. మాదేవుడు గొప్పవాడు మేమే యాదిదేవుని సంతతివారము. మా మత గ్రంథములే దేవుని నోటిలోనుండి యూడిపడినవని ప్రగల్భములు చెప్పుకొనువారివలెనే తమభాషయే యీ లోకమున మొట్టమొదటి భాషయనియు, తక్కిన వన్నియు దానినుండి బయలుదేరినవేయని ప్రకటించికొనినవారును ప్రాచీనకాలమున కొందఱు గలరు. క్రైస్తవమత గ్రంథమగు బైబిలు తొలుత హీబ్రూ భాషలో రచింపబడియుండుటచే నాభాషయే దైవదత్తంబైన మొదటిభాషయనియు, నాదేవుని సంతతివారు కొందఱు బైబిల్ ప్రాసాదమును విడిచి నలువంకలకు నేగుటచే నాభాష భిన్నభాషలైనదనియు నా జనులు తలంచిన కాలమునుగలదు. ఇట్లే వేదములు పరమపురుషుని నిశ్వసితములనియు, వేదభాష దేవతలు మాటలాడు భాషయనియు జెప్పుట కలదు గదా. ఈ దేవతలభాషకు నిఘంటు నిరుక్తమును రచించి నట్టియు వ్యాకరించి లక్షణ మేర్పఱచినట్టియు యాస్కపాణినిపతంజలి మొదలగువారి కాలముననె నేటిభాషాతత్త్వశాస్త్రమునకు మూలబీజములు చల్లబడినవి. కాని యవి యీభారతావనియందు నాటుకొని మొలకలెత్తలేదు. పిదప వీనికిదగిన యూపాపభూమి

పాశ్చాత్యదేశమైనది. తగినకాలము ౧౮, ౧౯ శతాబ్దము లైనవి. అచ్చట నివి మొలకలెత్తుటకు గల ముఖ్యకారణము సంస్కృతభాషామృతవర్ష పాతమే. పెక్కువేల మైళ్ల దూరమునగల యూరపు దేశీయభాషాతత్త్వజ్ఞులకీగీర్వాణభాషాజ్ఞానము కలుగుటతోడనే, వారీభాషారూపములకును తమ భాషారూపములకును గన్పట్టిన సామ్యమును, సారూప్యమునుజూచి దిగ్భ్రమ జెంద సాగిరి. వేలకొలది పదములయందు గల సామ్యమేగాక, వ్యాకరణవిషయములందును గనబడిన సామ్యమునుబట్టి దూరస్థములైనను వీనికి సన్నిహితసంబంధ ముండనోపునని తలంచి, వీనికి సన్నిహితప్రదేశములందు గల భాషల స్వరూపలక్షణములను పరిశీలింప దొడంగిరి. అట్లు పరిశీలించినకొలది వారికి సమానలక్షణములే పొడకట్టుచుండుటనుబట్టి వారు యూరపు హిందూదేశమధ్యభాగమున గల భాషలన్నియు నేదోయొక ప్రాచీనకాలమున నొక మూలభాషకు సంబంధించినవై సాజాత్యసంబంధము గలవై యుండునని నిశ్చయింపగలిగిరి. ఈపద్ధతి ననుసరించి భూభాగమున నాయాదేశములందలి పండితప్రకాండు లాయాభాషా విశేషలక్షణములను సన్నిహితభాషాలక్షణ తులనాత్మక దృష్టితో పరిశీలించి వానివానికిగల సంబంధ బాంధవ్యములను నిర్ణయించుటలో దీక్షవహించి పనిచేయుటయేగాక, భాషాతత్త్వస్వరూపమునే కనుగొన యత్నించుటచే, నీకాలమున భాషాతత్త్వశాస్త్రమనునదికూడ నొక ప్రత్యేకశాస్త్రముగా నేర్పడుట తటస్థించినది. భిన్నభాషలకు గల సంబంధము నిర్ణయింప బడు సందర్భమున ప్రత్యేక భాషల చరిత్రము నన్వేషించుటయు నత్యావశ్యక మగుచున్నది. యూరపుఖండము పడమటికొననున్న యాంగ్లభాషకును ఆసియాఖండము దక్షిణభాగముననున్న సం సంస్కృతమునకును సాజాత్య సంబంధముకలదని నిర్ణయింపవలయునన్నచో నాభాషల ప్రత్యేకచరిత్రమును తెలిసికొనవలయును. ఒకభాషాచరితము నన్వేషింపవలయునన్నచో నాయాకాలములలో నది పొందిన మార్పులనుబట్టి దానిని యుగములుగా విభాగించి, యొక్కొకయుగమందు గలిగినమార్పులను గమనించి, యని యాయాకాలముల గలుగుటకు గల కారణముల నారసి యర్వాచీనయుగములందలి భాష పూర్వతర యుగములందలి భాషనుండి యెట్లేర్పడినదో చూపుచు దాని కాలక్రమ పరిణామము నన్వేషించి సహేతుకముగ నిర్ణయింపవలసియుండును. ఆంగ్లభాషాచరిత్రమును ప్రాయుగా ఆధునికాంగ్లము, మధ్యయుగాంగ్లము, ప్రాచీనాంగ్లము అను మూడుయుగములయందలి భాషకును గల భేదములను పరిశీలించి చాసరుకాలము నాటిభాష యేయేమార్పులను బొంది మధ్యయుగాంగ్లమై, యాధునికాంగ్లమైనదో, వ్యక్తము చేయుటయేగాక, చాసరునాటి భాషయైన నట్టిరూపుగలదై యుండుటకు గలకారణములేవో, దానికి తక్కిన ట్యూటానిక్ జర్మానిక్ శాఖాభాషలలో గల సంబంధ మెట్టిదో, తెలుపుచు, నీశాఖలకును తక్కిన ఇండోయూరపియన్ శాఖలకును గలసంబంధవిశేష మాంగ్లభాషాచరితమునకు సంబంధించినంతవఱకు సంగ్రహించి నిరూపింతురు. ఇట్లొక్కొకభాషాచరిత్రము నన్వేషింపవలెనన్న నా భాష కాయాయుగములయందు గలిగిన మార్పులను దెల్పు వాఙ్మయము, నాయామార్పులను క్రోడీకరించి వ్యక్తపఱుచు లక్షణగ్రంథములేగాక, సన్నిహితభాషాలక్షణముల పరిశీలనముకూడ నత్యావశ్యకంబగుచుండును.

ఇట్లుప్రత్యేకభాషాచరిత్రాన్వేషణమునకును, భాషాతత్త్వస్వరూపనిరూపణమునకును విశేషప్రయత్నములు జరుగుచుండినకాలముననే, దక్షిణహిందూదేశ భాషాతత్త్వమును వాని విశేషలక్షణములను గనుగొనవలయుననెడి కౌతూహలము కొందఱు పాశ్చాత్యపండితులకు గలిగినది. అట్టివారిలో కాల్డ్వెల్ పండితుడు ప్రధానుడని చెప్పవలసియున్నది. అయిన నీభాషలలక్షణమునుగూర్చి పరిశీలించినవారుగాని యాయాభాషాలక్షణగ్రంథములను రచించినవారుగాని యింతకుపూర్వము లేరని కాదు. ప్రత్యేకముగా నొక్కొక్కకాలమందలి యాయాభాషలను వ్యాకరించి వానికి లక్షణముల నాయాభాషలలో రచించినవా రనేకులు గలరు. అట్టివారు సామాన్యముగా సంస్కృతభాషాపండితులు, సంస్కృతభాషయందు విశేషాభిమానము కలవారు ననుటచేతనో, లేదా



౫. మధుర దేవాలయ మధ్యప్రాకారద్వారము
3౫ అడుగుల ఎత్తు. ౧౦౦౦ దీపములు వెలుగుచున్నవి.



౬. నృత్యము (మధుర దేవాలయము)
(శివకళ లుట్టిపడుచున్నది)



౭. స్తంభమధ్యగతమగు మధుర దేవాలయదృశ్యము
కొలను గోపురము.



రామేశ్వర దేవాలయము

M. B. R.

వారిలో నే యొక్కరికిగాని తాము లక్షణము చెప్పఁదలఁచిన భాష తప్ప తక్కిన దక్షిణ దేశభాషలలో మఱియొకదానిని గూర్చిన జ్ఞానము లేకపోవుటచేతనో ఆయాభాషల లక్షణగ్రంథములలో నద్దానికి సంస్కృతముతోగల సంబంధముమాత్రమే విశేషముగా తెలుపబడినదిగాని, యితరములగు దక్షిణదేశభాషలతో నద్దానికేమాత్రము సంబంధము గలిగినట్లును సూచింపబడియుండలేదు. ముఖ్యముగా నాంధ్ర కన్నడ వైయాకరణులు లాభాషలకు సంస్కృతముతో గల సంబంధమునుజూపి, సంస్కృతశబ్దము లాభాషలలో వ్యవహరింపబడునపుడు గలుగు మార్పులు మొదలగువానిని గూర్చి తెలుపుటలో ప్రత్యేకశ్రద్ధను వహించిరి. ఈభాషలనుగూర్చిన వ్యాకరణములను వాని వ్యాఖ్యానములను సంస్కృతభాషలోనే, తద్వ్యాకరణ సంప్రదాయానురోధముగా రచించినవారును లేకపోలేదు. ఈభాషలన్నియు సంస్కృతమునుండి వచ్చినవనియు, వానికిది తల్లియనియు, వీనికి జన్యజనకభావసంబంధము, లేదా, ప్రకృతి వికృతి భావ సంబంధము కలదనియు వక్కాణించిరి. కాని తెనుగు, కన్నడము, అరవము మొదలగువానికి పరస్పరమేమైన సంబంధముగలదా యను విషయమును విచారించుటకైన వారిమనసు పోలేదు. దీనికి ప్రధానకారణము సంస్కృతమందలి యత్యంతాభిమానము, దేశభాషలయందు నిరసన భావముతోపాటు లక్షణకర్తల కితరదేశభాషాజ్ఞానము లేకపోవుటయేయగును. ఇట్టిపరిస్థితులు గలుగుటచేతనే దక్షిణదేశభాషలకు పరస్పరసంబంధబాంధవ్య నిర్ణయము విషయమున కాల్డువెల్ దొరగారు ప్రథమాచార్యుడైనాడు. ఈతడు దక్షిణదేశభాషాలక్షణమును పరిశీలింప గడంగినపు డాతనికి సంస్కృతము మొదలగు నిండోయూరపియన్ భాషలకంటె విలక్షణమైనభాషలుగా గనబడినవి. ఈభాషలలో నాతడు గనిపట్టిన విశేషలక్షణములు సంస్కృతముతోడి జన్యజనకభావసంబంధమును సమర్థించునవిగా నాతని కగపడలేదు. కావున సంస్కృతాదులతో వీనికిగల సంబంధమును నిర్ణయించుటకుపూర్వము, ఈభాషలకు పరస్పరము గల సంబంధ స్వరూపమును, సాదృశ్యవిశేషములను కనిపట్టుటకై యీభాషాలక్షణములను సరిపోల్చి చూడవలయు ననుకౌతూహలము కలుగుటచే, వీనియందలి శబ్దజాలము నేకాక, వ్యాకరణవిశేషములను తులనాత్మకదృష్టితో పరిశీలించుచు ద్రావిడభాషాతరతమవ్యాకరణము (Comparative Grammer of the Dravidian Languages) అనుదానిని రచించెను. ఈగ్రంథ మాంగ్లభాషలో రచింపబడియుండుటచేతను, నీతడు విదేశీయుడగుటచేతను, దేశీయభాషాలక్షణకర్తలకు దీనియందంతగా నాదరము కలుగుట కవకాశములేకపోయినను, దక్షిణదేశభాషాతత్త్వపరిశీలనమువిషయమున నీత డవలంబించిన మార్గ ముత్తమమైనదనుటకు సందేహము లేదు. కావుననే యిది దేశీయులును విదేశీయులునగు భాషాతత్త్వవేత్తలదృష్టిని బాగుగా నాకర్షించినదని చెప్పవచ్చును.

కాల్డ్వెల్ పండితుడు విదేశీయుడు. దక్షిణదేశభాషలన్నిటిలోను కూలంకషమైన జ్ఞానముకలవాడని చెప్పుట కవకాశములేకపోవుటచే, నాతని గ్రంథమున నెచ్చటనైనను కొన్ని స్ఖాలిత్యములున్న నుండవచ్చును. అంతమాత్రముచే దక్షిణదేశభాషాతత్త్వపరిశీలనమువిషయమున నీతడే ప్రథమ మార్గదర్శకుడను విషయమున విప్రతిపత్తికి కారణములేదు. దేశీయలాక్షణికులలో నింతకాలమునుండియు నెంద ఱెన్ని వ్యాకరణములు వ్రాసినను, అవి తాత్కాలిక భాషావ్యాకరణములే (Descriptive Grammars) యయినవి గాని, భాషాతత్త్వసూత్రముల ననుసరించి రచియింపబడినవిగా లేదు. కాలక్రమమున భాష మాఱుచుండుట తటస్థించుటచే వెనుకటిరూపములకు మాఱురూపములు బయలుదేరి యవి సుప్రసిద్ధకవులచే బ్రయోగింపబడుచు వచ్చినను, అట్టివానిని లాక్షణికులు వెనుకటి లక్షణమునకేదో నూతనార్థము కల్పించి సమర్థింపజూచుటయో, లేదా అట్టిది సాగ్యముకానపుడు "శాస్త్రప్రయోగవచసోః శాస్త్రం బలవ దుచ్యతే" యనుసూత్రమును బ్రయోగించి సుప్రసిద్ధకవిప్రయోగమునైనను అలాక్షణికమని త్రోసిపుచ్చుటయో వీరుచేయుచున్న పనియైయున్నది. బాలవ్యాకరణ మొప్పుకొననికారణమున 'చేతురు కోతురు'

ఇత్యాను లనేకరూపములు పెక్కు కవులు ప్రయోగించి నను గ్రామ్యము లయినవి. దీనికి ప్రధానకారణ మీ లాక్షణికులకు తాత్కాలికభాషాస్వరూపమందలి దృష్టి యేగాని, భాషాచారిత్రకదృష్టి లేకపోవుటయే. అయితే వాస్తవముగా వీరు తాత్కాలిక భాషాస్వరూపమును వ్యాకరించి దానికి లక్షణమేర్పరుపదలచినవారుమాత్రమే యని తలంచినపుడు వీరికి భాషాచారిత్రకదృష్టి లేదనుట యసందర్భపుమాటగా గనబడవచ్చునుగాని, వీరికి భాషా తత్త్వపరిశీలనమునం దేమాత్ర మాదరమున్నను వీరి కాదర్శ ప్రాయులగు పాణిన్యాదివైయాకరణులవలెనే వీరును ప్రాచీనభాషస్థితి యిది నవీనభాష యిట్లు మాఱుటచే నీయీరూపములుగలదైనది యనియైన జెప్పియుందురు. పాణిని 'లోకే', 'వేదే' 'భాషాయాం' అనునీరీతివిభాగ మునైన జేసినవాడేకదా. ఈతనితరువాత భాష మాఱి రూపాంతరములు బయలుదేరుటచేతనేగదా కాత్యాయ నుడు పాణినిసూత్రములకు వార్త్తికములను జేర్పవలసివచ్చి నది. కాత్యాయనుడు వార్త్తికములచే సాధింపదలచిన రూపములను పాణిని చెప్పనంతమాత్రమున వ్యావహారిక ములని గ్రామ్యములని యాకాలమువారుగాని తరువాతి వారుగాని త్రోసిపుచ్చలేదుగదా. అట్లే సంస్కృ తాదులకంటె విశేషవ్యవహారమున నున్నదగుటచే నన వరతము మార్పులకు లోనగు నీదేశభాషారూపములను సుప్రసిద్ధులగు పలువురు కవులుప్రయోగించి శిష్టవ్యవహా రము గలిగినపుడు లాక్షణికు 'లీయాకాలమున నీరూపము లున్నవి. దీనివి యీకాలమున నిట్లుమాఱిన'వని చెప్పుటలో దోషమేమియు లేదు. తిక్కనప్రయోగించిన 'మూడ మంచు' పెద్దనార్యుడుప్రయోగించిన 'విందు' (=అతిథి అనేఅర్థములో)మొదలగు శబ్దములనేకము లీకాలమున వ్యవహారములో లేవు. మెయి, పొంటె మొదలగు విభక్త్యర్థద్యోతకశబ్దములు వాడుకలో లేవు; క్రొత్తవి వచ్చినవి. 'సేపు, ప్రొద్దు, మన్ను' మొదలగు ననాప విభక్తికములుగా నున్నశబ్దము లిపు డాపవిభక్తికములుగా బ్రయోగింపబడుచున్నవి. 'వజ్రములు' మొదలగు వానికి 'వజ్రాలు' అనురూపాంతరములుగా గ్రహిం చిన వైయాకరణులు - 'పట్టుకొనుము' అనుదానికి 'పట్టుకో' యనియు, 'చేసికొని'-అనుదానికి 'చేసుక' అనియు కాలక్రమమున గలిగిన రూపములను పలువురు కవులు ప్రయోగించినపు డంగీకరించవలసినదేగదా. భాషలో కాలక్రమమున నేర్పడుచు సుప్రసిద్ధకవులచే బ్రయోగింపబడి శిష్టవ్యవహారమందున్న విశేషరూప ములను సమన్వయబుద్ధితో సమర్థించుటకు లాక్షణికు నకు గొంత భాషాచారిత్రకదృష్టి యావశ్యకమగును. ఆంధ్రభాషాలక్షణమంతయు నన్నయ భారతము రచిం చిన కాలమునుండియు మనకు లభ్యములైన గ్రంథముల లోని భాషనుబట్టి యేర్పడినదేగదా. ఆభాషను వ్యాక రించినపుడు తేలినరూపములనుబట్టి వచ్చు, తెచ్చు, పుచ్చు మొదలగునవి ధాతువులుగా గ్రహింపబడినవి. కాని వీనినుండి యేర్పడిన రూపములు - రాన్, రాక; ఏతేరు, పురుసు - 'ప్రువ్వదిట్టు' మొదలగునవి కొన్ని కనబడుచున్నవి. ఆధాతువులకును, నీరూపములకును గల సంబంధమును దెలియని లాక్షణికుడు-వచ్చునకు- 'రా' ఆదేశముగల్గునని, తెచ్చునకు తే, తేరులగునని, యీరీతిగా లక్షణము కల్పించవలసియుండును. అది తాత్కాలికముగ రూపకల్పనమును సాధించుట కవలం బింపబడుపద్ధతియేగాని, యించుక విచారించినచో ని ట్లగుట కేదోకారణాంతర ముండుననియు, నీరూపముల పూర్వచరిత్రమును విచారించిన తెలియగల దనియు వీరు చారిత్రకదృష్టితో పరిశీలించిన పొడకట్టకపోదు. ఇట్టి చారిత్రకదృష్టి యేర్పడుటకు సన్నిహితభాషాజ్ఞాన మత్యావశ్యకము. ఈకాలమున నఱవ మించుక తెలిసిన వారు తెలుగులోని 'రాదు, రాను' మొదలగు రూప ములకును అఱవమునందలి 'వరాదు, వరేన్' మొద లగు రూపములకును గల సాదృశ్యమునుబట్టి వచ్చు ధాతువునకు మూలరూపము 'వర్' ఏమో అని యూహింపలేకపోరు. తెచ్చునకు మూలరూపము— 'తెర్-తర్' అనునది. అట్లే పుచ్చునకు మూలరూపము- 'పుర్'-మెచ్చునకు-'మెట్' - అగును. ఇంక ననేకశబ్ద ములలోని సాదృశ్య మఱవము, కన్నడము, తెలుగు భాషలను వ్యవహారమునైన నించుక దెలిసినవారికి పొడకట్టక మానదు. ప్రాచీనకాలమందైనను లాక్షణికు

లను పండితుల కనేకభాషలయందు పాండిత్యము గలిగి నట్లు మనము వినుచున్నాము. నన్నయకు కర్ణాటభాషా పాండిత్యము కలదని యూహింపవచ్చునుగదా. నారాయణభట్టుసహాయమే కలదు. భీమనాథర్వణాదులకు నింక తరువాతివారికిగూడ నితరదేశభాషాజ్ఞాన మలవడియుండును. కాని వారెవ్వరు నీభాషాలక్షణములను సరిపోల్చి చూడవలయు నను తలంపుగలవారు కాలేదు. ప్రాచీనుల మాట యటుండ నర్వాచీనుడును తమిళదేశమున నివసించి తమిళభాషాజ్ఞానము కలవాడై యాంధ్రమున నిటీవల పరమప్రమాణమై నెగడిన 'బాలవ్యాకరణము'ను నాంధ్రభాషాలక్షణ గ్రంథమును రచియించిన చిన్నయసూరిగారికి కూడ దీని కరవభాషతోడి సంబంధమేమైన గలదా యను సందేహమైనను గలిగిన ట్లగపడలేదు. ఆకాలమున భాషాతత్త్వశాస్త్రపండితులుగ నున్న శ్రీ శేషగిరిశాస్త్రిలుగారుమాత్రమే తమిళాంధ్రములకు గల సంబంధమును గొంతవఱకు వ్యక్తీకరింప యత్నించిరి. దీని కంతకు ముఖ్యకారణము ప్రాచీనకాలమున దేశమందు సంస్కృతభాషకు గలిగిన పలుకుబడి ప్రాబల్యమునే యైయున్నది. పండితులకు లాక్షణికులకు దానియందుగల గౌరవము దేశభాషలయందు లేకపోవుటచేతనే, ఆంధ్ర తమిళకన్నడవైయాకరణు లందఱును గూడ నాయా భాషాలక్షణములకు సంస్కృతముతోడి సంబంధమును జూపుటలో విశేషమును నాత్రమునుజూపిరేగాని, యీ దేశభాషలలో పరస్పరముగల సంబంధమును కనిపెట్ట యత్నింపజాలరైరి. భాషాతత్త్వశాస్త్రము వ్యాప్తి నొందుచున్నయీకాలమున భాషావిషయమున చారిత్రక దృష్టి పండితులకు గలుగకపోవుట శోచనీయము. తమిళాంధ్రకన్నడభాషాలక్షణముల నించుక తులనాత్మక దృష్టితో మనము పరిశీలించినచో ననేకవిషయముల వీనిలో వీనికి సామ్య మగపడుటయేగాక సంస్కృత భాషాలక్షణముతో విభిన్నత్వముకూడ పొడగట్టును. శబ్దములు సామాన్యముగా నీభాషలోనుండి యాభాషలోనికి నాభాషలోనుండి యీభాషలోనికి సులభముగా సంక్రమించుచుండును గావునను, ఒక్కొక భాషల్లో కాలక్రమమున గలిగెడి మార్పులనుబట్టి భిన్నభాషలలో విభిన్నములగు శబ్దముల కొకానొకకాలమున గొంత రూపసామ్యమేర్పడుట సంభవింపవచ్చును గావునను, సారూప్యమునుబట్టియే శబ్దముల సంబంధము నిర్ణయింపవలనుపడదు. (ఠ. తె. ప్రాపు - ఆంగ్ల. Prop, తె. మూతి; ఆంగ్ల. Mouth Etc.) వానిమూలరూపములను పూర్వచరిత్రము నన్వేషించి సన్నిహితభాషలలో దాని స్వరూపమును గని పెట్టిగాని సంబంధనిర్ణయము చేయరాదు. ఇందు కుదాహరణముగా నొకటి రెండు శబ్దములను గ్రహింతము. సంస్కృతమందు 'శయ, శ్రవ'శ్శబ్దములు గలవు. తెలుగు నందలి 'చెయ్యి' - 'చెవి' యనునవి వీనినుండి యేర్పడిన తద్భవరూపము లని సులభముగా జెప్పవచ్చును. వీనికి గొంతరూపసామ్యము నర్థసామ్యముగూడ కలదు. కాని బాగుగ పరిశీలించినచో వీని సంబంధమునుగూర్చి సందేహము కలుగకమానదు. "పంచశాఖ శ్శయః పాణిః" అని యమరనిఘంటువున శయశ్శబ్దము కలదు గాని దీనికి సంబంధించినశబ్దములు విశేషముగా నాభాషలో కనబడకుండుటయేగాక యిది 'శీఙ్ స్వప్నే' అను ధాతువు నుండి నిష్పన్నమైనట్లు చెప్పబడుట కూడ నంతసముచితముగా గనబడుటలేదు. 'స్వకీయంఘన మత్ర శేతే తిష్ఠతీతి శయః' అని లింగాభట్టీయము. ఘన ధనము దీనియందుండును గాబట్టి దీనికీపేరు వచ్చినదట! ఇంతేకాదు. హస్తపర్యాయంబగు నాంధ్రమునందలి 'చెయ్యి' శబ్దమునకు రూపాంతరము-వాస్తవముగా పూర్వరూపము-ఈభాషలోనే కకారాదియై యున్నది. కెయ్-కయి. దీనికి బహువచన రూపము- కేలు- ఈభాషలోనే గాక తక్కినదక్షిణ హిందూదేశభాషలన్నిటిలోను, నిది కై, కెయ్ అను రూపములు గలదయియేయున్నది. తమిళాంధ్రములలో కకారము తాలవ్యచకారముగా మాఱిన రూపములును గలవు. వీనిలో ధాతువుకూడ చేయు - చెయ్ అనునది గనే యున్నను కన్నడమున గెయ్-గెయ్యు అనురూపము గలదై యున్నది. ఈభాషలలో నీధాతువునుండి బయలు దేరినరూపము లనేకములు గలవు. కావున తెలుగులో నీకాలమున గనబడుచున్న చెయ్యి శబ్దమునకు శయః అనుదానితో గల్గిన యత్కించిత్సాదృశ్యమునుబట్టి యీ

రెంటికిని సాజాత్యము నిర్ణయింప వలనుపడదు. అట్లె శ్రవశ్శబ్దమునకును చెవిశబ్దమునకును. చెవికి కన్నడరూపము 'కివి'. వినుట అనుదాని సమానార్థకమగునది 'కేళ్' అను ధాతువుకలదు. ఒకవేళ శయశ్రవశ్శబ్దములకు ప్రాచీన ఇండోయూరపియన్ భాషలో కకారాదిరూపములున్నచో - ప్రాచీనఇండోయూరపియన్ కకారము ప్రాచ్యశాఖా భాషలలో 'శ'కారముగా మాఱుట కలదు. దీనిని బట్టియే కెంటుంభాషలని శతెంభాషలని విభాగము కూడ నేర్పడినది (ప్రా. ఇం-కెంటుం>అవెస్థా-శతెం; సం. శతం;) ప్రాచీనద్రావిడమునకును ప్రాచీన ఇండోయూరపియన్ భాషకు నేదైన సంబంధ మున్నదని చెప్పవచ్చునేమో కాని, యీ సంస్కృతాంధ్రరూపములకుమాత్రము ప్రకృతివికృతిభావ సంబంధ మున్నదని చెప్పుట పొసగదు. ఇట్లే యేతులు భాషలోనో 'అంజు' అనురూపమున్నదిగదా యని యిది 'పంచ' యను సంస్కృతశబ్దమునుండి పకారలోపముచే నేర్పడినదనుట యుక్తముకాదు. అంజుఅనుదానికి తక్కినభాషలలోని రూపములను గనుగొని, మూలరూపమునారసి దానిని పంచశబ్దముతో బోల్చుటయుక్తము. ఐందు, ఏను అనురూపములు ప్రాచీనద్రావిడరూపములుగా నున్నవి. వీనికి 'పెంక్వె' అను ప్రాచీనఇండోయూరపియన్ రూపముతోగాని, సంస్కృతరూపముతోగాని యెట్టి సంబంధ మున్నట్లగపడదు. ఇట్లే సంఖ్యాసర్వనామాదిశబ్దములును వర్ణములు, సంధి, విభక్తి, సమాసాదివ్యాకరణవిశేషములను ధాతువులస్వరూపమును పరిశీలించినచో నీభాషలలో పరస్పరముగల సామ్యము సంస్కృతముతోగల భేదము వ్యక్తము కాగలదు. ఈభాషలకుగల సమానలక్షణములను ముందు గనిపెట్టి తరువాత నితరకుటుంబభాషలతో పోల్చుట యుక్తముగా గనబడును. ఒక్కసంధివిషయమున జూడుడు. అ, ఇ, ఉ లంతమందు గల శబ్దముల కజాదిశబ్దములు పరమైనపు డీభాషలలో గలుగు సంధికార్యములెట్లు విభిన్నములై యున్నవో. ఈయచ్చుల కవియే పరమైనపుడవి సంస్కృతమున దీర్ఘములగుచున్నవి. అకు ఇ ఉ లు పరమైనపుడు ఏ, ఓ లేకాదేశము లగుటయు, ఇ ఉ లకు అకారాదులు పరమైనపుడు యవలాగమము లగుటయు సంభవించుచున్నది. ఒక్కతెలుగుననే కాక దక్షిణదేశభాషలన్నిటిలోను గూడ దీనికంటె భిన్నపద్ధతి యవలంబింపబడుచున్నది. అకారమునకు అ, ఇ, ఉ మొదలగువానిలో నేది పరమందున్నను వీని నడుమ నొక యకారముగాని, వకారముగాని యీభాషలలో నాగమంబగుచుండును. అనగా అ+ఇ=ఏ అ+ఉ=ఓ, అ+ఏ=ఐ, అ+ఓ=ఔ, అనునీరీతిగా మారుటకు బదులుగా ఆ+ఆ=ఆయా. (ఆవా) అయి, అయు, అని యగును. పదాంతమందలి హ్రస్వ 'ఉ'కార మచ్చు పరమైనపు డీభాషలన్నిటిలోను గూడ లోపమునే చెందుచున్నది. ప్రాతిపదికకు లేదా అంగమునకు విభక్తిప్రత్యయము పరమైనపుడు ఔపవిభక్తికప్రత్యయ మొకటి యాగమ మగుట యీ దక్షిణదేశభాషలలో సామాన్యముగా గలదుగాని (cf—తమి, కన్న. అత్తు; తె. ఇ, టి, తి cf-మరం-మరత్తాల్, నేయి-నేతి-పన్ను-పంటిచేత) సంస్కృతమున నట్టిదేమియు నగపడదు. తమిళమున సాధారణముగా నజంతశబ్దమునకు హలాదిశబ్దము పరమైనపుడు, పరమందున్న హల్లు ద్విత్వము జెందుట కలదు. (cf-విళా+కుటితు=విళాక్కుటితు). ఇట్టి సంధికార్యము సంస్కృతమున లేదు.

ఇట్లే క్రియావిభక్తి నామవిభక్తి మొదలగు వానియందలి రూపకల్పనవిషయమున సంస్కృతమునకును దక్షిణదేశభాషలకును విశేషవ్యత్యాస మగపడుచుండుటయే గాక యీభాషలలో నవలంబింపబడిన వ్యాకరణపద్ధతులలో విశేషసామ్యమును గానవచ్చుచున్నది. కావున నీభాషలలోసంధివిభక్తిసమాసకారకాదులవిషయమున నవలంబింపబడియున్న వ్యాకరణపద్ధతులను, సరిపోల్చి పరిశీలించి. వానిమూలసూత్రములను గనిపెట్టిన తరువాతగాని సంస్కృతాదిభాషల వ్యాకరణపద్ధతులతో పోల్చి వానికిగల సామ్యవైషమ్యములను గనిపెట్టుటకుగాని, వానితోడి సంబంధబాంధవ్యములను నిర్ధారణ చేయుటకుగాని వలనుపడదు. పెక్కువిషయముల సామ్యముగలవైన ట్లగపడుచున్న యీ దక్షిణదేశభాషల ప్రత్యేకచరిత్రమును, వీనికిగల పరస్పరసంబంధమును

ముందు నిర్ణయింపవలసియున్నది. అందుకుగా నాయా భాషలలో బయలుదేరిన లక్షణగ్రంథములతోడి సన్నిహిత పరిచయం బత్యావశ్యకము. ఆంధ్రభాషా లక్షణమును సోపపత్తికముగ దెలిసికొనుట కితరభాషా లక్షణజ్ఞాన మావశ్యకము. దానిచరిత్రము నన్వేషింపవలెనన్నచో నన్నయకు పూర్వ మాభాషాస్థితిని దెలుపు నాధారములు చాలతక్కువ. ఆకాలపు శాసనములు కొంతసాయము చేయగలవు. కాని యవి చాలకొద్ది. వానికిని పూర్వస్థితినిగూర్చి తెలిసికొనుట కీభాషలో నాధారము లేమియు లేవు. కావున సన్నిహితభాషా లక్షణములను బరిశీలించి వానికిగల సామ్యమునుబట్టి యూహింపవలసినదే. ఈకారణముచే నాంధ్రమునకు సన్నిహితవర్తులగు తమిళకన్నడభాషలలోని లక్షణగ్రంథము లాంధ్రమున వెలయజేయుట యాంధ్రభాషాచరిత్రము నన్వేషింపదలచిన వారి కందఱ కత్యావశ్యకమైన పనిగా కనబడుచున్నది. భాషాభిమాను లీవిషయమై పనిబూనుదురు గాక.

---



వెలుగు　　　　K. G.

# సుభద్ర

ఇరువంటి విష్ణురావు, బి. ఏ., బి. యల్.,

అనువృత్తము

## తృతీయాంకము

### రంగము ౧.

[కమల పడకకుర్చీలో పడుకొని అర్ధనిమీలితనేత్రయై సన్నటిగొంతుకతో పాడుచుండును.]

రేపువత్తువుగాని తూరుపుతెల్లవారె పోరా యీ వేళకు.

రేపువత్తువుగాని తూరుపుతెల్లవారె......

(పుల్లావుధానులు ప్రవేశించుచూ)

ఏమేవు, ఒసేయి, ఏయ్, ఏమిటేపాట.

కమల—(లేవకయే)

"నాపతిజూచిన రాపీడిచేయును
కాపురంబు నేను కడగండ్లపాలగును."

పుల్లావు—సంసారులయింటిలో యీ పాట లేమిటే. సిగ్గు. సిగ్గు, నోరుముయ్యి.

కమల—"కోపమూనకనాపయిన్ పరితాప భారము నాపరా, ఏపుమీర సుఖం బొసంగెద నా పురీ గోపాలబాల"

పుల్లావు—(నోరుమూయబోవుచూ) సానికంటే అధ్వాన్నముగా వున్నావేమిటి.

కమల—కాదుమరి. దానికిష్టమయితే యింకొకరితో యింకొకరితో పోతుంది. నేను యిష్టమొచ్చిన వారితో పోకూడదుకా.

పుల్లావు—ఓసి నీదుంపతెగ, ఏమిటేయీమాటలు.

కమల—ముసలిముండావాడివి. ఆ పొట్టేసుకొని నన్నెందుకు పెళ్లిచేసికొన్నావు?

పుల్లావు—ముద్దెట్టుకోటానికి (అని ముందుకు వచ్చును.)

కమల—(కాలిబొటనవ్రేలితో పొట్టమీద నెట్టుచూ) ముద్దుముండా వాడివి. సిగ్గయినా లేదు. సుభద్రచూస్తుంది.

పుల్లావు—పాడుముండ. నా కెక్కడ దాపరించిందిది, ముచ్చటయినాతీరకుండా.

కమల—నీకూతుర్ని అలాగ అనవచ్చుటయ్యా.

పుల్లావు—మొగుడొచ్చినముండ మూలకూర్చోక అలాయిలా తిరగడ మెందుకు.

కమల—మనబాధ వదిలిపోతుంది. దాన్నెవరికైనా యిచ్చి పెండ్లి చేసేద్దు.

పుల్లావు—ఏమిటే, వైధవ్యముండకు పెండ్లా. నీకేమి మతిపోయిందా ఏమిటి. పెళ్లామయిపోయావుగాని లేకపోతేనా......

కమల—అందులో బంగారపు బొమ్మలాంటి పెళ్లాము.

పుల్లావు—చక్కెరబొమ్మ—ఏదీ.

కమల—ఆ, పూరం. యింకొంచెం వెనక్కి—మొదటిపెళ్లా మెలావుండేది.

పుల్లావు—అబ్బె, సోమిదేవమ్మ, పెద్దబొట్టు పెట్టుకొని యింతలావుగా, యిలాగిలాగఅంటూవుండేది. (యింతలోపోష్టుబంట్రోతు "పుల్లావుధానులుగారూ—వుత్తరం" అంటూ వుత్తరము యింటిలోనికి గిరవాటు వేసిపోవును. కమల, ఎగిరిగంతేసి తీసుకొనును. వుత్తరము చదివిచూచి పుల్లావుధానులుపై గిరవాటు వేయును.

కమల—మీప్లీడరుగారి దగ్గిరనుంచి.

పుల్లావు—చంపేస్తున్నాడేమిటి—వారంవారానికేవాయిదా అంటాడు. తీరా వెళ్లేటప్పటికీ ఆమాట యీమాట చెప్తూ కూర్చుంటాడుకాని కేసు చప

వటం అంటూవుంటేనా. ఆకళ్ల జోడు సవరించుకోవడం, 'ఆస్పై' దిద్దుకోవడం. దానితో సరిపోతూంది.

కమల—ప్లీడరుగారికి పెండ్లయిందా.

పుల్లావు—పెండ్లి లేదు—పెడాకులు లేదు. కోట బ్రహ్మచారిలాగ వున్నాడు.

కమల—పాతికేళ్లువుంటాయా.

పుల్లావు—అంతేకూడావుండదు.

కమల—బాగుంటాడా.

పుల్లావు............

కమల—అలాగ చూస్తావేం.

పుల్లావు—ఏమిటీప్రశ్నలు, నీకెందుకు.

కమల—నాకెందుకేమిటి. సుభద్ర ప్లీడరుగారిని సరించి అడిగితే తప్పా. వాయిదా ఎప్పుడు.

పుల్లావు—సోమవారమట. సుభద్రకు పాఠం నేర్పాలిట, ఓరోజుముందుగా రమ్మన్నాడు. వాడి శ్రాద్ధం. ప్రతీసారి అంతే. పాఠమేమిటి రెండుమాటలు చెప్పడానికి.

కమల—ఆపాఠమేమిటో వినవే మరి.

పుల్లావు—దానిదుంపతెగ. నాకు ఒకటేనిద్ర.

కమల—యీమాటు నేను కూడ వస్తా.

పుల్లావు—నువ్వెందుకే.

కమల—చూడ్డానికి.

పుల్లావు—వద్దు. రావద్దు.

కమల—నామీద కన్నేస్తాడేమో అని భయమా.

పుల్లావు—ఏడిశావు. వూరుకోండూ. (అని లోపలికిబోవును)

(యింకొకవైపునుంచి సుభద్ర ప్రవేశించును)

సుభద్ర—ప్లీడరుగారిదగ్గిరనుంచి వచ్చిన వుత్తర మేదీ.

కమల—ఏమీరాలేదే.

సుభద్ర—పోష్టుబంట్రోతు వచ్చాడు.

కమల—వస్తే అన్నీ ప్లీడరుగారి దగ్గిరనుంచే వస్తా ఏమిటి.

సుభద్ర—వాయిదా ఎప్పుడో వ్రాస్తానన్నా రమ్మా.

కమల—ఎప్పుడయితే ఏమిలెద్దూ.

సుభద్ర—దావా పోదుటమ్మామరి.

కమల—బోసెక్కటానికి సిగ్గుకదే నీకు. వెధవ దావా పోనిద్దూ.

సుభద్ర—కోర్టులోనికెళ్లి సాక్ష్యము యివ్వ నక్కరలేదుటమ్మా.

కమల—ఎవరుచెప్పారు ?

సుభద్ర—వారే.

కమల—వారెవరే.

సుభద్ర—(సిగ్గుతో) ప్లీడరుగారు.

కమల—దిట్టమయినవాడు లాగ వున్నాడే.

సుభద్ర—దిట్టమా-మరీదిట్టమా.

కమల—అలాగటే.

సుభద్ర—నన్ను వుడికిస్తున్నావా—పో నీ లే (అని పోవును.)

కమల—సుభద్రా, మాట.

(అని యిరువురు లోనికిబోవుదురు.)

౨-వ రంగము

ప్లీడరుగారి ఆఫీసు గది

(పుల్లావుధానులు గుర్రు పెట్టుచూ, పొట్టమీద చేతులుపెట్టుకొని నిద్రపోవుచుండును. సుభద్ర ప్లీడరు గారి బల్లమీదనుండి మనుచరిత్రముతీసి చదువుచుండును. పార్వతీశము ప్రవేశించును.)

పార్వ—కూర్చోండి, లేవవద్దు. ఏమిటో చదువు చున్నారే.

సుభద్ర—(సిగ్గుతో పుస్తకము దాచబోవును.)

పార్వ—మనుచరిత్రమా (తలవెంట్రుకలనుపట్టు కొనిచూపుచూ) యిన్నిపుస్తకాలు చదివానుకాని యిల్లాంటిపుస్తకము చూడలేదు.

సుభద్ర...... ..........

పార్వ—మీరు నాతో మాట్లాడడము అల వాటుచేసుకొంటేనేగాని లేకపోతే తరువాత చిక్కొ స్తుంది.

సుభద్ర—నేను కోర్టులో సాక్ష్యం యివ్వ నక్కరలేదన్నారుగా.

పార్వ—అసలే లేకుండానా. గదిలోపార్టీలు ఎవ్వరూ జనంలేకుండా సాక్ష్యం పుచ్చుకొంటారు.

సుభద్ర—చంపేశారే.

పార్వ—ఏంభయము లేదు. మూడుముక్కలులో సాక్ష్యం పూర్తిచేస్తాను. యిలా వచ్చికూర్చోండి. ఫరవా లేదురండి. సాక్ష్యం కట్టుదిట్టము చేసికోవద్దుమరీ.

(సుభద్రవచ్చి ఎదురుగుండా కుర్చీలోకూర్చుండును.)

పార్వ—తలఎత్తండి. ఏదీ యిలాగ చూడండి.

(సుభద్ర తలఎత్తును. ఆమెముఖమును పరిశీలనగా చూచుచూ)

పార్వ—యీరోజులలోవస్తువులు పెట్టుకోకూడ దంటారుకాని, కొంతమందికి ఆభరణాలు ఎంత అంద మిస్తాయి అనుకొన్నారు?

సుభద్ర—(నెమ్మదిగా) అవును.

పార్వ—చూడండి. ఆతెల్లనిముఖానికి నీలపు రాళ్ల లోలాకులు పెట్టితే ఎలాగవుంటుం దనుకొన్నారు.

సుభద్ర—నాపిన్ని కమల నీలపురాళ్ల లోలాకులే పెట్టుకొంటూంది. చాలాబాగుంటూంది.

పార్వ—(జేబులోనుంచి చక్కని పేకట్టు తీయుచూ) యివి కాస్త పెట్టుకుచూడండి. మీ ముఖము అప్పుడెంత కళకళలాడుతూ వుంటుందో.

సుభద్ర—తప్పు. నేనుపెట్టుకోగూడదు.

పార్వ—ఒక్కక్షణము. మళ్లీ తీసెద్దురుగాని లెండి.

సుభద్ర—వద్దండి.

పార్వ—పెట్టుకోండి, చూద్దాం. (అని బల వంతపెట్టును.)

సుభద్ర—బాగుండదు. యీ వేషముమీద ఎలాగ.

పార్వ—మర్చిపోయాను చూశారా, Wig కూడతెచ్చాను. (అని Wig తీయును.)

సుభద్ర—తప్పండి. మానాన్న ఏమన్నాఅంటా డేమో.

పార్వ—ఒక్కక్షణము. మళ్లీ మీ నాన్న లేస్తాడు. (అని Wig తగిలించును).

(ఇంతలోపుల్లావుధానులు ప్రక్కకు ఒత్తి గిల్లుచూ) ప్లీడరుగారూ. రికార్డు చదువుచున్నారా. (అంటూ మరల నిద్రపోవును. సుభద్రా పార్వతీశ ములులికిపడుదురు.)

పార్వ—ఆ, మళ్లీ నిద్రపోతున్నాడు. తీసె య్యకు. యీలోలాకులు పెట్టనీ. (అని తానేపెట్టును)

పార్వ—భలేగాండుగావున్నది. (అనిజేబులో నుంచి యింకొక చిన్నపెట్టెతీసి) యిప్పుడు యీ వజ్రపురాయి ముక్కుబుడకకూడా పెట్టుకోండి, చూద్దాం. ఎలాగవుంటారో.

సుభద్ర—(ఆనందముచే ముఖము వికసించి అత్యంతసుందరముగా చూపట్టుచుండును. ఆతనివుత్సా హములో లీనమయిపోయి ముక్కుబుడకపెట్టుకోబోగా చెయ్యివణకును. యిరువురు కలసిపెట్టుదురు.)

పార్వ—(సంతోషముతో) ఎలాగవున్నారను కొన్నారుయిప్పుడు. భలే.అద్దములో చూద్దురుగానిరండి, (అని కుర్చీలోనుండిలేచి ఆమెభుజముపై వుత్సాహ ముతో చెయ్యివేయును. సుభద్ర కంపించుచున్న శరీర ముతోలేచును. యింతలో కుర్చీ బర్రున చప్పుడగును.



మహాబలేశ్వర దేవాలయము
K. G.



తలచేరి కోటగోడ
B. M. S.



తలచేరి కోట-సముద్రమువైపు
B. M. S.




3. కారల్టన్ హోటలు

కొడైకెనాలు S. S. S.



కోనేరు

ఉదకమండలము L. G.

(పుల్లావధానులు వులికిపడి లేచి కూర్చుండును. సుభద్రాపార్వతీశములను జూచును.)

పుల్లావు—సుభద్రా.

(సుభద్ర అదరిపడును.)

పుల్లావు—(ప్రయాసతో నిలబడి) కోపముతో కంఠస్వరమువణకుచుండగా, ఏమిటే, ఏమిటీవేషము. ఓసి క్యోమ్- దౌర్భాగ్యపుముండా నీకేమి పోయేకాలము వచ్చిందే. (అంటూ మీదపడి జుట్టు (Wig) పీకి పారవేయును. చెవులులోలాకులు పీకబోగా సుభద్ర నొప్పిచే కెవ్వుమనును.)

పార్వ—పుల్లావుధానులుగారూ, నింపాదిగా—అలాగలాగితే చెవి తెగిపోదూ.

పుల్లావు—కేసు చదువుచున్నానని యిదా నీవు చేస్తున్నది. నీప్రాక్టీసు తగులడిపోను. నీప్లీడరీ దగ్ధమైపోను. నిక్షేపములాంటిపిల్లను పాడుచేశావుగదరా. నీచదువు చట్టుబండలుగాను. నావంశమంతా చెడిచేశావుగదరా. చూడు నిన్నేమిచేస్తానో.

పార్వ—గట్టిగాఅరవకండి. ఎవరైనావింటారు.

పుల్లావు—ఎవరైనావింటారా? వినాలి. అందరూవినాలి. నీనోటిలో యింతగడ్డిపెట్టాలి. నిన్ను బజారులోకి యీడ్పించకపోతేచూడు. నేను బ్రాహ్మణ్ణి కాను.

పార్వ—నేనేమిచేశానయ్యా, అలాగింజుకుంటావు. నీకూతుర్ని పెళ్లి చేసికోవాలనివుంది.

పుల్లావు—రామ, రామ. విధవా వివాహము. నీజిహ్వపడ. నీనోటిలో పురుగులుపడ. నీవంశము హతమైపోను. కేసు యిచ్చినంతమాత్రాన అవమానము చేస్తావా. నిన్నుచూడు ఏమిచేస్తానో, హతమార్చేస్తాను. (సుభద్రతో) అలా మిటకరించిచూస్తావేం. రా పోదాము (పార్వతీశముతో) చూడు. జడ్జీగారితోచెప్పి నిన్నేమిచేయిస్తానో. మర్యాదవుండక్కర్లే. ఒక్కక్షణముకన్నుమూస్తేపట్టపగలు—ఏమి రోజులు. ఎంత దారుణము. (అని తనమూటలాగుకొని ఛంకనుబెట్టుకొని) మూకాగితాలుయిలాపారెయ్యి. నీగడపతొక్కితే చూడు. ఏమిదారుణము. హోరి ముండావాడా (అని సుభద్రను యీడ్చుకొంటూ నిష్క్రమి.)

పార్వ—పిల్లాపోయింది. ప్రాక్టీసుపోయింది. (అని విచారముతో బుర్రగోకుకుంటూ నిష్క్రమి.)

## చతుర్థాంకము

పుల్లావుధానులు యిల్లు.

(కమల చేతిలోని చేతికఱ్ఱ (Walking stick) చివరతో పుల్లావుధానులు పొట్టమీదపొడుస్తూ)

కమల—పొడుస్తా. Back, Back, యింకా, యింకా, ఆ—యిప్పుడుమాట్లాడు.

పుల్లావు—ఓసి పాడుముండా, మూడువేలం నీ మొఖానపోశానుకదే. మూడుముద్దులయినాయివ్వ లేదు.

కమల—నీ మొఖానికి ముద్దులుకూడాను.

పుల్లావు—చిన్నపిల్లవుకదా అని గారాబముగా ముద్దుముద్దుగా చూస్తూంటే మితిమీరిపోతున్నావే. యివన్నీ సరసాలు క్రింద చూచుకొంటున్నానుగాని లేకపోతేనా, ఎముకల్లో సున్నంలేకుండా చితకకొట్టేద్దును.

కమల—అల్లాగా.

పుల్లావు—యింకా పెద్దదానవు అవుతావు. బుద్ధి వస్తుంది అని అనుకొంటున్నాను. బాగాతరఫీదే అవుతున్నావు. జాగ్రత్త.

కమల—Shut up.

పుల్లావు—(నవ్వుతూ, గర్వముతో) ఓసినిన్తగలెయ్యా, యింగ్లీషుకూడాను.

కమల—(చేతికఱ్ఱతో పొట్టమీదపొడుస్తూ) యీబొజ్జలో ఎన్నివేలరూపాయిలు వున్నాయి.

పుల్లావు—(సగర్వముగా)యిరవయివేలు రొఖం.

కమల—భళీ.

పుల్లావు—పదివేలు వడ్డీవ్యాపారముంది.

కమల—యింకనేం.

పుల్లావు—నూరుఎకరాలు మాగాణివుంది.

కమల—అబ్బో, దిట్టమయినవాడివే.

పుల్లావు—అంతా నేను సంపాదించినదే.

కమల—ఎంత గొప్పపనిచేశావు.

పుల్లావు—అంతా నీకిస్తా, కొంచెంపోకుచేస్తేను.

కమల—పోకుచెయ్యటల్లే యిప్పుడుమాత్రం.

పుల్లావు—నాతో.

కమల—నే చెప్పినట్లు వింటూంటే కావలసినంత పోకుచేస్తాను.

పుల్లావు—కూర్చోమంటే కూర్చుంటాను, గెంతమంటే గెంతుతాను.

కమల—ఏదీ. యిక్కడికి ఒక్కగెంతుగెంతు. రెండయితే దెబ్బలే.

పుల్లావు—హూప్ (ఎగిరిగంతువేసి ముందుకు తూలిపోవుచూ కమలను పట్టుకొనును.)

కమల—అణగారిపోతున్నాను, వదులు.

పుల్లావు—గెంతానుకదాకమలా, ఒక్క ముద్దు పెట్టుకోనియ్యవు.

కమల—(కుడిబుగ్గలోనికి గాలిపోనిచ్చి వుబ్బి పెద్దదిచేసి వ్రేలితో బుగ్గమీద చూపించును)

పుల్లావుభావలు గట్టిగా ముద్దుపెట్టుకొనును.

కమల—నేనుఒకటి చెప్తానుచేస్తావు.

పుల్లావు—ఒకటేంటి వెయ్యిచేస్తాను.

కమల—ఒట్టు.

పుల్లావు—గాయత్రీసాక్షిగా.

కమల—గాయత్రికాదు. నామీదఒట్టేసి అను.

పుల్లావు—నీతోడు.

కమల—సుభద్రను యింటిలోనుంచి వెళ్లగొట్టాలి.

పుల్లావు—(ఆలోచించుచుండును.)

కమల—ఇంతే, కబుర్లు.

పుల్లావు—వంటఎవరుచేసిపెట్టుతారా అనిఆలోచిస్తున్నాను.

కమల—కట్టుకొన్న పెళ్లాన్ని నేనుచేస్తాను. లేకపోతే పెట్టుకొన్న దాసీది అప్పి చేస్తుంది.

పుల్లావు—ఓసిసీ బండపడ. దాసీది వంటచేస్తే ఎల్లాగే.

కమల—పడుచుపెళ్లాన్ని కట్టుకొని ఆచారమంటేఎల్లాగ. అందుకే నువ్వంటే అసహ్యం నాకు.

పుల్లావు—పోనీ వంటదాన్ని పెడుతానులే. అయితే ఆసుభద్రముండ ఆ ప్లీడరుగాణ్ణి కాస్త పెళ్లి చేసికొంటుందేమో.

కమల—ఏట్లో దిగనీ మనకెందుకూ, మన సరసాలకు మాటిమాటికి అడ్డం వస్తూవుంటుంది.

పుల్లావు—వాళ్లు మళ్లీ పెండ్లిచేసికోవటం ఎందుకంటాను. ఏకో రహస్యంగా వుంచుకొని తంటాలు పడకూడదు. అపఖ్యాతిరాకుండా వుంటుంది.

కమల—అబ్బా, వాళ్లు ఎలాగపోతే మనకెందుకు. మనకి శని వదిలిపోతుంది.

పుల్లావు—చూద్దాములే.

కమల—చూద్దామేమిటి. అది ఒక్కరోజుంటే నేనువుండను, తెలిసిందా.

పుల్లావు—అయితే యిప్పుడే పంపించేస్తాను.

కమల—దానిమొఖాన ఓ పదివేలు పారేసి యింట్లోంచి పొమ్మను.

పుల్లావు—సరి. సరి. దానిమొఖానికి పదివేలు కూడానా.

కమల—నీకూతురుకిమా యింతకీ. ఎవరైనా ఏమైనా అనుకోరూ.

పుల్లావు—ఆపార్వతీశము ముండావాడు కాస్త కాజేస్తాడేమో.

కమల—వాళ్ల గొడవ మనకెందుకంటేను.

పుల్లావు—సరేలే. కాని డబ్బుసంగతే...

కమల—ఇదిగో మళ్లీ.........యిష్టమయితే యీబుగ్గకూడ ముద్దుపెట్టుకోవచ్చు.

పుల్లావు—భళీ. యింకనేం.

(తెర.)

౨-వ రంగము

(సుభద్ర కొంగుపట్టుకొని ముందు సుభద్ర నడచుచుండగా వెనుక పార్వతీశము ప్రవేశించును.)

పార్వ—సుభద్రా, సుభద్రా—నామాట విను.

సుభద్ర—ఊహు.

పార్వ—తప్పులేదు. సుభద్రా యీ రోజులలో అందరూ ద్వితీయవివాహము చేసికొంటున్నారు.

సుభద్ర—.................

పార్వ—నే నెంతో ప్రేమించు చున్నాను సుభద్రా. జాలి కలుగటల్లేదు.

సుభద్ర—నాచీరవదలండి, ఎవరైనా చూస్తారు.

పార్వ—చూస్తేనేం. నే నేమయినా తప్పు చేస్తూంటేనేగా.

సుభద్ర—మీదగ్గిఱకువచ్చే ఆడపార్టీలనందఱిని యిలాగే అవమానపఱుస్తున్నారా.

పార్వ—(చీరచెంగువదలుతూ) అవమానమా—పార్టీ అని అసలువుంటేగా.

సుభద్ర—మాదేనా ప్రథమ-కేసు.

పార్వ—అవును.

సుభద్ర—పెద్దప్లీడరుగారుఅన్నారే.

పార్వ—కానని యిష్టములేదా.

సుభద్ర—మీప్రాక్టీసుకు నాయిష్టముకు సంబంధమేమిటి.

పార్వ—సుభద్రా, నిన్ను బలవంతముచెయ్యను. నాప్రేమ తెలియజేయుటకూడ తప్పని ఎరుగుదును. అయిననూ......అయిననూ..... సుభద్రా, నీహృదయమున ఆనందముతోబాటు ప్రేమకూడ నశించి పోయినదా.

సుభద్ర—(మొఖము త్రిప్పుకొనును.)

పార్వ—సుభద్రా, పెండ్లి చేసికొన్నతరువాత హింసబెట్టెదనని భయపడుచున్నావా, నే నట్టితుచ్ఛుడనుగాను. నన్ను నమ్ముము. నీకెట్టిమనఃతాపము కలుగకుండా నెత్తిమీదపెట్టుకొని సుఖపెట్టెదను, సుభద్రా.

సుభద్ర—మానాన్న చంపేస్తానన్నాడు.

పార్వ—చంపెయ్యటానికి దగ్గిఱకు రానిస్తేగా.

సుభద్ర—మీకు బోలెడుచిక్కులు వున్నాయి. మిమ్మల్ని వెలివేస్తారు; ఎవ్వరూ మీయింటికిరారు.

పార్వ—మరీమంచిది. యిరువదినాలుగుగంటలు ఎడతెగక మనమిద్దఱమేవుందాము.

సుభద్ర.................

పార్వ—మాట్లాడవేమి సుభద్రా.

సుభద్ర.................

పార్వ—సై అను సుభద్రా.

సుభద్ర.................

పార్వ—మౌనము అంగీకారసూచనగాభావించవలసివుంటుంది సుభద్రా.

సుభద్ర.................

పార్వ—(వెనుకనుంచికౌగిలించుకొని, ముఖము త్రిప్పి ముద్దుబెట్టుకొనును.)

సుభద్ర—కోర్టులోకూడ యింతచాకచక్యంగా మాట్లాడితే ప్రాక్టీసురాకపోతుందా.

పార్వ—నీ నవ్వుముఖముచూస్తూ ప్రపంచాన్నే జయిస్తా.

(యింతలో 'సుభద్రా' అని పిలుపు వినబడును)

సుభద్ర—(తొందరగా) నమస్కారము చేయుచూ, అయ్యా శలవు. (అని పారిపోవును.)

పార్వ—ప్రేమిస్తున్నట్లు తేలింది. వివాహానికి ఒప్పించట మెల్లాగో—అయినా కాచుకుకూర్చుంటా.

(నిష్క్రమి.)

## పంచమాంకము

పుల్లావుధానులుయిల్లు.

(కమలపాడుకొంటూ ట్రంకుపెట్టె సర్దుకొంటూ వుంటుంది.)

ఓరి ఓరి బండివాడా - వగలమారి బండివాడా
ఓరోరి బండీవాడా - వగలమారి బండీవాడా
..............................
నీవుపోయెదారిలోన - నిమ్మచెట్టువున్నదిరా
నీవుపోయే దారిలోన - నిమ్మచెట్టూ వున్నదిరా
నిమ్మచెట్టుకాడ - నీలుఃపుటద్ద మున్నదిరా
గాజులంగాడికాడ - పూసలంగాడికాడ
గాజులంగాడికాడ - పూసలంగాడీకాడ
..............................

(బిగ్గరగా)

ఏయ్ ఒరేయి, యిదిగో ఒరేయి,
..............................
చెవులోకి పోగుల్ తేర - చేతికి మురుగుల్ తేర
కొప్పులోకిపూలు తేర - పెట్టుకోను నగలు తేర
ఓరోరి.

(పుల్లావుధానులు ప్రవేశించును)

ఎమిటే, ఎవరినే పిలుస్తూంది.

కమల—ఎవర్నేంటి, నిన్నే.

పుల్లావు—నన్ను ఒరేయి అని పిలుస్తావా.

కమల—నన్ను ఒసేయి అని పిలవటల్లే.

పుల్లావు—సరే. నీతోవాదం ఎందుకు—ఎందుకు పిలిచావు.

కమల—నీగామంచా, రాగిచెంబు, సర్దుకోవూ.

పుల్లావు—ఎక్కడికే ప్రయాణము.

కమల—బొంబాయికి.

పుల్లావు—బొంబాయికెందుకే తీరికూర్చుని.

కమల—నాకు వుద్యోగమయింది.

పుల్లావు—ఏమిటే.

కమల—నెలకి రెండువందలరూపాయ లిస్తామన్నారు.

పుల్లావు—ఎవరు, ఎందుకు, నన్ను వుడికిస్తున్నావా.

కమల—లేదు. చూచుకో (అని వుత్తరము మీదవేయును.)

పుల్లావు—ఏమిటో చెప్పనూ.

కమల—నేను 'టాకీ' స్టారును.

పుల్లావు—ఏమిటే, టాకీ ?

కమల—'టాకీ' స్టారును, సినీమా, సినీమా వుందే. సినీమాలో వేషం వేస్తాను.

పుల్లావు—చాల్లే హాస్యాలు.

కమల—హాస్యాలుఏమిటి, నిజంగానే. యీ రోజు మా నాన్నని వెంటబెట్టుకొని వస్తున్నానని వ్రాసేసాను అప్పుడే.

పుల్లావు—మీనాన్న ఎవరు, చిన్నప్పుడే చచ్చాడుగా.

కమల—నేనెత్తే నాతో వస్తావా లేదా.

పుల్లావు—వస్తాను.

కమల—అందుకే మా నాన్నతోగూడ వస్తున్నానని వ్రాశాను.

పుల్లావు—నాకేమీ బోధపడడము లేదు. మీ నాన్న ఏడీ.

కమల—వట్టి తెలివితక్కువ పెద్దమ్మ. ముసిలి ముండావాడివి. నిన్ను మొగుడనిచెప్పుకొంటే నవ్వుతారని మా నాన్న అన్ని చెప్పుతాను.

పుల్లావు—ఓసిని న్తగలెయ్య. నీకుపరువుతక్కువ లే.

కమల—బొంబాయిలో పరువుతక్కువ కాదుమరి,

పుల్లావు—నీవువెళ్లటానికి వల్లకాదు.

కమల—నేను వెళ్లితీరుతాను.

పుల్లావు—నిన్ను కదలనియ్యను.

కమల—నేను చెప్పకుండా లేచిపోతాను.

పుల్లావు—అప్పుడే ఎవర్నో చూచుకొన్నావన్న మాట.

కమల—యింతవరకూ లేదు. అలా కిటికీదగ్గిఱకు వెళ్లి కన్నుగీటానంటే లక్షమందివస్తారు.

పుల్లావు—అన్నంతపని చేశేముండవే.

కమల—(ఎగిరి ముద్దుపెట్టుకొనును. యింతలో సుభద్ర ప్రవేశించును.) చూశారా. మంచిపట్టులో రసాభాసం చేస్తుంది.

పుల్లావు—(కోపముతో) నీకేనీా బుద్ధిలేదూ. గా ఏండ్లు ముడ్డి క్రిందవేసుకొని, పశువు.

సుభద్ర—నేనేంచేసాను.

పుల్లావు—ముండామోపిఅయి యింట్లో పడి వుండడమే. యింకేమికావాలి.

సుభద్ర—ముసలిముండావాడికి అంటగట్టి...

పుల్లావు—పైగా పొగరుపోతుతనముకూడానా. ఎదురు తిరగటంకూడానా. (కఱ్ఱఎత్తును. కమల వారించును) ఓసి వెధవముండా, పో. నాయింట్లోంచిపో—మళ్లీ నీమొఖం చూపించావంటే చూడు. (అని లోపలికిపోవును)

సుభద్ర—(ఏడ్చుచుండును. కమల ఓదార్చును)

కమల—ఏడవకుసుభద్రా, సంతోషించవలసిన సమయమిది.

సుభద్ర— కన్నతండ్రేయిలాగ మాట్లాడుచున్నప్పుడు యిక జీవించడము ఎందుకుకమలా.

కమల—తండ్రికి ప్రేమలేనప్పుడు ప్రేమించు నారిదగ్గఱకేపోవాలి సుభద్రా.

సుభద్ర—నన్ను ప్రేమించేవాళ్లు ఎవరున్నారు. ఏనుయ్యో గొయ్యో చూచుకోవాలమ్మా.

(యింతలో పార్వతీశము గబగబ ప్రవేశించును)

పార్వ—యింతట్లోనే మఱచిపోయావా సుభద్రా.

సుభద్ర—మీరెలాగవచ్చారు.

పార్వ—ప్రేమ మోహము అనే రెక్కలుకట్టుకొని ఎగిరివచ్చాను. యిద్దఱము ఎగిరిపోదాము పద.

(నిష్క్రమి.)

---



దేవాలయము-పక్షితీర్థంకొండ                                            K. G.

# 'కువలయానందసారము'*

గన్నవరపు సుబ్బరామయ్య

కావ్యపఠనమునకు పరమార్థము సహృదయహృదయానందము. రసోదయము వలన నది కలుగును. అట్టి రసోదయమున కుపస్కారకములగు కావ్యాంగము లన్నియు కావ్యమున కలంకరణములు. అలంకారములు, గుణములు, రసములు, ధ్వని మొదలగునవి కావ్యాంగములు. వానిని శాసించునది కావ్యానుశాసనము. అదియే అలంకారశాస్త్రము.

కావ్యాంగములలో కావ్యవిశిష్టతాపాదకము లలంకారములని కొందరు, గుణములని ఇక కొందరు, రసమని మరికొందరు ననిరి. వీని నన్నిటిని 'త్రోసిరాజు' చెప్పి వేరొక కొందరు కావ్యవిశిష్టతా పాదకము ధ్వనియే యని ప్రకటించిరి. ఈధ్వనివలనను సహృదయు లాకాంక్షించునదిరసము. కావున రసమతమే బహుమాన్యము.

ఇట్లు బయలుదేరిన భిన్నమతముల వారిలో నలంకారప్రధానవాదు 'లలంకారములు కావ్యశోభాధాయకము' లనిరి. తన్మతమున 'నలంకారము' లన నన్ప్రాసాదులగు శబ్దాలంకారములు, ఉపమాదు లగు నర్థాలంకారములును. ఇంచుమించుగ నవి యన్నియు కృత్రిమకల్పనములు. ఉక్తిచాతుర్యము వాని యుత్పత్తికి మూలము. అవి శబ్దార్థపర్యవసన్నములు. వానివలన రసనిష్పత్తి హేతు వగు కావ్య హృదయము తత్త్వము ప్రకటితము కాజాలదు. కావున నా 'అలంకార'శబ్దము కావ్యాలంకరణములగు కావ్యాంగము లన్నిటియందు ననువర్తింపవలెను. సర్వాంగసంపన్న మయినపుడు కావ్యము సమతిశయ శోభాసమంచిత మయి సహృదయహృదయాహ్లాది కాగలదు. కేవల శబ్దార్థాలంకారసంపన్న మగుకావ్య మట్టిది కానేరదు.

ఈ శబ్దార్థాలంకారములయందు కొన్ని సుందరమగు కావ్యశరీరమునకు కొండొక యెడ నొకింత శోభను సమకూర్చుటయు గలదు. అంతమాత్రమున వానిని 'కావ్యశోభాధాయకము' లనుట సముచితము కాదు. అట్టివానికి కావ్యాంగములలో ప్రాధాన్యమును లభింపదు. కాని తత్సంపాదనమునకయి తత్సంప్రదాయవాదులు పడిన పాటు లిన్నియు నన్నియు కావు.

ఈ యలంకారప్రాధాన్యవాదపక్షపాతము కారణముగ తదనుయాయులు వారి వారి పాండిత్యప్రకర్షకును, ప్రతిభాపాటవమునకును, కల్పనాకౌశలమునకును అనురూపముగ నొకళ్లొకళ్లనుమించునభిలాషతోనప్పటనప్పట నలంకారములకు వైవిధ్యమును కల్పించిరి.

* క్రౌను సైజు పు. ౧౮౦ లు. ప్రకాశకులు: ఆర్. వెంకటేశ్వర్ కంపెనీ, మదరాసు. వెల రు. ౧.

వానియందు కొన్ని సూక్ష్మాతిసూక్ష్మవిభేద ములను పురస్కరించుకొని యనేకములుగ విభక్తములయినవి. ఇట్లు విభక్తములయిన యలంకారములు శబ్దార్థోభయ ప్రధానము లని మూడు తెఱగు లయినవి. మఱియు వానిలో కొన్నిటికి న్యాయ, వ్యాకరణాది శాస్త్రముల ప్రసక్తియు గలిగినది. నాడు నాటికి సంఖ్యాబాహుళ్యమును, అన్వయ క్లిష్టతయు వానికి సంప్రాప్తము లయినవి. పెక్కింటి లక్ష్యలక్షణ సమన్వయజ్ఞానమును సర్వపండితసామాన్యముకాని ప్రతిభకు సయితము నసాధ్యమయినది. వీనివలన కావ్య శోభ పెరుగుటకుమారుగ తరుగజొచ్చినది. ఈవిషయమున సహృదయు 'లలంకారభూయిష్ఠములగు కావ్యము లధమము' లని తమ సునిశ్చితసిద్ధాంతమును ప్రకటించిరి.

కావ్యశోభాధాయకమగు నలంకార శాస్త్రమునకు సంబంధించిన వాఙ్మయము సంపూర్ణముగ సంస్కృత భాషయందు గలదు. భరతునిదొట్టి జగన్నాథపండితుని వఱకు ననేకు లనేకగ్రంథములను రచియించిరి. వానియం దలంకారములనే నిర్వచించునవియు, వాని ప్రస్తావమునే తలపెట్టనివియు, అధికముగనో, అల్పముగనో కావ్యాంగముల నన్నిటిని వివరించునవియు గలవు. అలంకారములనుమాత్రము నిర్వచించునవి ఉద్భటాలంకారము, అలంకారసర్వస్వము: ఇవి ప్రాచీనములు; కువలయానందము, అలంకారకౌస్తుభము:. ఇవి అర్వాచీనములు. ఈగ్రంథములు తత్కర్తలయలంకారాభిమానపక్షపాతములకు ప్రకృష్టనిదర్శనములు. వీని యందు తత్తత్పూర్వాలంకారిక మతఖండన పూర్వకముగ స్వస్వమత ప్రతిష్ఠాపనము కావింపబడినది.

వీనిలో కువలయానందము కేవల మర్థాలంకారములనునిరూపించునది. ఇది వ్యాఖ్యాన రూపమగు గ్రంథము. దీనికిమూలము జయదేవకృతమగు చంద్రాలోకమునందలి అర్థాలంకారప్రకరణము. మూలమునందలి లక్ష్య లక్షణములు సుబోధములు. తద్వ్యాఖ్యారూపమగు కువలయానందము దానివలె సుబోధము కాదు. ఇది పూర్వమతవిమర్శలు, ఖండనములు, చర్చలు, శంకలు, తన్నిరాసములు మొదలగు ననావశ్యక విషయములనేకములతో నిండి క్లిష్టముగ పరిణమించినది. కాని, తత్కర్తయగు నప్పయదీక్షితుని యఖండపాండిత్య వైభవమునకు నికషోపలమయి వెలసినది. అలంకారవాఙ్మయమున చంద్రాలోకమునకు (అర్థాలంకారప్రకరణమునకు) దరువాత అలంకారతత్త్వజిజ్ఞాసువులకు బహూపకారకమగుగ్రంథ మీకువలయానందమే.

ఆదినుండియు సంస్కృత వాఙ్మయావలంబనముననే యాంధ్రవాఙ్మయ మభివృద్ధి నొందినది. ఆంధ్రకావ్య ప్రపంచ మంతయు సంస్కృతకావ్య ప్రపంచమునకు ప్రతి బింబము. ఇతివృత్తము, ఛందస్సు, కావ్యలక్షు

## 'కువలయానందసారము'*

గన్నవరపు సుబ్బరామయ్య

కావ్యపఠనమునకు పరమార్థము సహృదయహృదయానందము. రసోదయము వలన నది కలుగును. అట్టి రసోదయమున కుపస్కారకములగు కావ్యాంగము లన్నియు కావ్యమున కలంకరణములు. అలంకారములు, గుణములు, రసములు, ధ్వని మొదలగునవి కావ్యాంగములు. వానిని శాసించునది కావ్యానుశాసనము. అదియే అలంకారశాస్త్రము.

కావ్యాంగములలో కావ్యవిశిష్టతాపాదకము లలంకారములని కొందరు, గుణములని ఇక కొందరు, రసమని మరికొందరు ననిరి. వీని నన్నిటిని 'త్రోసిరాజు' చెప్పి వేరొక కొందరు కావ్యవిశిష్టతా పాదకము ధ్వనియే యని ప్రకటించిరి. ఈధ్వనివలనను సహృదయు లాకాంక్షించునదిరసము. కావున రసమతమే బహుమాన్యము.

ఇట్లు బయలుదేరిన భిన్నమతముల వారిలో నలంకారప్రధానవాదు 'లలంకారములు కావ్యశోభాధాయకము' లనిరి. తన్మతమున 'నలంకారము' లన నను ప్రాసాదులగు శబ్దాలంకారములు, ఉపమాదు లగు నర్థాలంకారములును. ఇంచుమించుగ నవి యన్నియు కృత్రిమకల్పనములు. ఉక్తిచాతుర్యము వాని యుత్పత్తికి మూలము. అవి శబ్దార్థపర్యవసన్నములు. వానివలన రస నిష్పత్తి హేతు వగు కావ్య హృదయము తత్త్వము ప్రకటితము కాజాలదు. కావున నా 'అలంకార' శబ్దము కావ్యాలంకరణములగు కావ్యాంగము లన్నిటియందు నువర్తింప వలెను. సర్వాంగసంపన్న మయినపుడు కావ్యము సమతిశయ శోభాసమంచిత మయి సహృదయహృదయాహ్లాది కాగలదు. కేవల శబ్దార్థాలంకారసంపన్న మగుకావ్య మట్టిది కానేరదు.

ఈ శబ్దార్థాలంకారములయందు కొన్ని సుందరమగు కావ్యశరీరమునకు కొండొక యెడ నొకింత శోభను సమకూర్చుటయు గలదు. అంతమాత్రమున వానిని 'కావ్య శోభాధాయకము' లనుట సముచితము కాదు. అట్టివానికి కావ్యాంగములలో ప్రాధాన్యమును లభింపదు. కాని తత్సంపాదనమునకయి తత్సంప్రదాయవాదులు పడిన పాటు లిన్నియు నన్నియు కావు.

ఈ యలంకారప్రాధాన్యవాదపక్షపాతము కారణముగ తదనుయాయులు వారి వారి పాండిత్యప్రకర్షకును, ప్రతిభాపాటవమునకును, కల్పనాకౌశలమునకును అనురూపముగ నొకళ్లొకళ్లనుమించునభిలాషతో నప్పటనప్పట నలంకారములకు వైవిధ్యమును కల్పించిరి.

* క్రౌనుసైజు పు. ౧౬౦ లు. ప్రకాశకులు: ఆర్. వెంకటేశ్వర్ కంపెనీ, మదరాసు. వెల రు. ౧.

వానియందు కొన్ని సూక్ష్మాతిసూక్ష్మవిభేద
ములను పురస్కరించుకొని యనేకములుగ
విభక్తములయినవి. ఇట్లు విభక్తములయిన
యలంకారములు శబ్దార్థోభయ ప్రధానము
లని మూడుతెఱగు లయినవి. మఱియు
వానిలో కొన్నిటికి న్యాయ, వ్యాకరణాది
శాస్త్రముల ప్రసక్తియు గలిగినది. నాడు
నాటికి సంఖ్యాబాహుళ్యమును, అన్వయ
క్లిష్టతయు వానికి సంప్రాప్తము లయినవి.
పెక్కింటి లక్ష్యలక్షణ సమన్వయజ్ఞానమును
సర్వపండితసామాన్యముకాని ప్రతిభకు సయి
తము నసాధ్యమయినది. వీనివలన కావ్య
శోభ పెరుగుటకుమారుగ తరుగజొచ్చినది.
ఈవిషయమున సహృదయు 'లలంకారభూ
యిష్ఠములగు కావ్యము లధమము' లని
తమ సునిశ్చితసిద్ధాంతమును ప్రకటించిరి.

కావ్యశోభాధాయకమగు నలంకార
శాస్త్రమునకు సంబంధించిన వాఙ్మయము
సంపూర్ణముగ సంస్కృత భాషయందు
గలదు. భరతునిదొట్టి జగన్నాథపండితుని
వఱకు ననేకు లనేకగ్రంథములను రచియిం
చిరి. వానియం దలంకారములనే నిర్వచించు
నవియు, వాని ప్రస్తావమునే తలపెట్టనివియు,
అధికముగనో, అల్పముగనో కావ్యాంగముల
నన్నిటిని వివరించునవియు గలవు. అలంకార
ములనుమాత్రము నిర్వచించునవి ఉద్భటా
లంకారము, అలంకారసర్వస్వము: ఇవి ప్రాచీ
నములు; కువలయానందము, అలంకార
కౌస్తుభము:, ఇవి అర్వాచీనములు. ఈగ్రంథ
ములు తత్కర్తలయలంకారాభిమానపక్ష
పాతములకు ప్రకృష్టనిదర్శనములు. వీని
యందు తత్తత్పూర్వాలంకారిక మతఖండన
పూర్వకముగ స్వస్వమత ప్రతిష్ఠాపనము
కావింపబడినది.

వీనిలో కువలయానందము కేవల మర్థా
లంకారములనునిరూపించునది. ఇదివ్యాఖ్యాన
రూపమగు గ్రంథము. దీనికిమూలము జయ
దేవకృతమగు చంద్రాలోకమునందలి అర్థా
లంకారప్రకరణము. మూలమునందలి లక్ష్య
లక్షణములు సుబోధములు. తద్వ్యాఖ్యా
రూపమగు కువలయానందము దానివలె
సుబోధము కాదు. ఇది పూర్వమతవిమర్శలు,
ఖండనములు, చర్చలు, శంకలు, తన్నిరాస
ములు మొదలగు ననావశ్యక విషయము-
లనేకములతో నిండి క్లిష్టముగ పరిణమించి
నది. కాని, తత్కర్తయగు నప్పయదీక్షితుని
యఖండపాండిత్య వైభవమునకు నికషోపల
మయి వెలసినది. అలంకారవాఙ్మయమున
చంద్రాలోకమునకు (అర్థాలంకారప్రకరణ
మునకు) దరువాత అలంకారతత్త్వజిజ్ఞాసువు
లకు బహూపకారకమగుగ్రంథ మీకువల
యానందమే.

ఆదినుండియు సంస్కృత వాఙ్మయావ
లంబనముననే యాంధ్రవాఙ్మయ మభివృద్ధి
నొందినది. ఆంధ్రకావ్య ప్రపంచ మంతయు
సంస్కృతకావ్య ప్రపంచమునకు ప్రతి బిం
బము. ఇతివృత్తము, ఛందస్సు, కావ్యలక్ష

ణములు, అధికభాగము శబ్దజాలము-అంతయు సంస్కృతసామగ్రి. ఆంధ్ర వాఙ్మయమునకు సంస్కృత వాఙ్మయముతో ని ట్లవినాభావ సంబంధ మేరుపడిపోయినది.

సంస్కృతమున కావ్యవాఙ్మయమునకం టె శాస్త్రవాఙ్మయ మధికము. ఆంధ్రమున నట్లు కాదు. దాని కాదర్శము, నాశ్రయము సంస్కృత మేయయ్యును కావ్యవాఙ్మయమే యధికముగ నుత్పత్తిచెందినది. శాస్త్రవాఙ్మయము చాల తక్కు వయినది. పందొమ్మిదవ శతాబ్దము చివరవరకు నది యట్లె యుండినది. ఈ యిరువదవ శతాబ్దమున మాత్రము ఇంచుక శాస్త్రవాఙ్మయమునకు వికాసము కలుగుచున్నది.

ఆంధ్రమున కావ్యసృష్టి పదునొకండవ శతాబ్దమున నారంభ మయినది. తరువాత పదునాల్గవ శతాబ్దమువరకు ననేకకావ్యములు వెలువడినవి. అప్పటివరకును ఇతర శాస్త్రములు లేకపోవుటమాట యటుండ కావ్యగుణదోష నిర్ణాయక మగు నలంకార శాస్త్రమున నయిన నొకగ్రంథముకూడ లేక పోయినది. పదునైదవ శతాబ్దియందున విన్నకోటపెద్దన, స్వపూర్వాంధ్రకవి సంప్రదాయమునకు విరుద్ధముగ కావ్యరచనము నేలనో కట్టిపెట్టి, 'కావ్యాలంకారచూడామణి' అను కావ్యానుశాసకగ్రంథమునురచియించినాడు. ఇదియే ఆంధ్రాలంకారవాఙ్మయమున నాద్యగ్రంథము. దీనికి 'దండి' పండితుని కావ్యాదర్శము, విద్యానాథుని ప్రతాపరుద్రీయము స్థూలమూలములు. కావ్యాదర్శము నందు వలెనే, ఇతర లక్షణములతోపాటు ముప్పదియా రలంకారము లిందు సోదాహరణములుగ నిర్వచింపబడినవి; ఉభయగ్రంథములకంటె భిన్నము లగు కావ్యానుశాసక గ్రంథముల మతములు సయితము నిందు పేర్కొనబడినవి.

దీనికి దరువాత, వివిధాలంకార భూయిష్ఠములగు ప్రబంధము లెన్నియో వెలువడిన పిదప పదునారవశతాబ్దమున 'నరసభూపాలీయ'మను పేరుగలది రెండవ కావ్యానుశాసకగ్రంథము పుట్టినది. దీనిని భట్టుమూర్తి ప్రతాపరుద్రీయము ననుసరించి స్వేచ్ఛమెయి రచియించినాడు. ఇందు మూలమునందలి నాటకప్రకరణము విడిచిపెట్టబడినది. కాని తక్కినలక్షణములును, మూలమునందువలె డెబ్బదియారలంకారములును సోదాహరణములుగా వివరింపబడినవి.

అనంతరము పదునెనిమిదవశతాబ్దిచివరవాడగు అడిదముసూరకవి చంద్రాలోకమున నలంకార ప్రకరణమును తెనిగించినాడు. పై మూడుగ్రంథములును పద్యాత్మకములు. అవి యంతగ సౌమ్యరచనములు కామిని పెక్కెడల లక్ష్యలక్షణసమన్వయము దుర్బోధముగ నేరుపడినది. అసమర్థపరిష్కరణము, అసంస్కృతముద్రణము దానికి తోడగుటచే నవి -నేటిముద్రితగ్రంథములు- మరియును దుర్బో

ధము లయినవి. ఈ అనువాదగ్రంథముల కంటె వానిసంస్కృతమూలములే సుగమము లని నిస్సంశయముగ జెప్పదగును.

నాల్గవది 'కువలయానంద ప్రకాశిక.' దీనికి విశేషముగ వ్యాప్తిలేదు. దీనియునికియే పలువురకు దెలియదు. దీనికి మూలము కువలయానందమున నాద్యములగు నూరలంకారములు. మూలమున శ్లోకములు పద్యములుగను, వృత్తి వచనముగను రచియింపబడెను. దీనిని కటికెనేనిరామయ మూలానుక్రమముగ నాంధ్రీకరించినాడు. రచనము సంస్కృతభూయిష్ఠ మగుటచే ప్రౌఢమయ్యును మధురముగ నున్నది. గ్రంథకర్త పద్మనాయకకులమువాడు. ఇతనితండ్రి సూరశౌరి; తాత నరసరాయడు; ముత్తాత గోపరాయ మహీవల్లభుడు. ఇతని కాదిగురువు కనకాద్రి, కులగురువు ప్రతివాదిభయంకర వేదాంతాచార్యుడు. "అతి విచిత్ర రసగుణాలంకార బంధురాతిప్రబంధ నిర్మాణచాతురీధురీణు" డగు నీతడు, 'పానుగంటి వెంకయ', 'కాశి వేంకటనరసయ' అనువారల ప్రేరణమున 'ప్రబంధనిర్మాణాయత్తచిత్తు'డయి 'అకలంక రంగార్యుని' సాహాయ్యముతో నీగ్రంథమును షట్పత్రయాత్మకముగా రచియించినాడు. ఉపమాలంకారము మొదలు దీపకాలంకారము వరకు మొదటిదిగను, తరువాత విషమాలంకారమువరకు రెండవదిగను, తదుపరి హేత్వలంకారము (నూరవ అలంకారము) వరకు మూడవదిగను షట్పములు విభజింపబడినవి. కవికాలమును గాని, గ్రంథరచనకాలమును గాని నిర్ణయించుట కాధారములేవియు కానరావు. ఈగ్రంథము ౧౮౯౩ - వ సంవత్సరమున నచ్చువడినది. దీనిని శ్రీ వెలుగోటి ముద్దుకృష్ణయాచేంద్రబహదరువారు (ఇప్పటి వెంకటగిరి మహారాజావారి పినతండ్రి గారు) వెంకటగిరియందే ముద్రింపించి ప్రకటించినారు. కావున నీగ్రంథకర్త వెంకటగిరి సంస్థానాధీశుల బంధుకోటిలోని వాడును, వెంకటగిరి నివాసుడును కావచ్చు నని యూహింపదగును. సంస్కృతాలంకారవాఙ్మయమున కువలయానందమువలె నాంధ్రాలంకారవాఙ్మయమున నీగ్రంథము మేలుబంతి యనదగియున్నది. దీనిఅచ్చుప్రతులు * కూడ నేడు లభింపవు. ఇది విపుల వివరణాదులతో మరలమరల ముద్రితమయి ఆంధ్రలోకమున బహుళప్రచారమును గాంచదగినది.

అలంకారములను నిరూపించు గ్రంథములీ నాలుగుమాత్రమే యానాటి కాంధ్రవాఙ్మయమున వెలువడినవి కాన్పించుచున్నవి. అలంకారప్రసక్తిలేని గ్రంథములు మరికొన్ని గూడ ప్రాచీనము, లాంధ్రీకృతములు కలవు. కాని వాని కెక్కువ ప్రసిద్ధిలేదు.

ఇటీవల - అనగా ఇరువదవ శతాబ్దారంభము మొదలు-వేరువేరు పేరులతో చంద్రాలోకమున కనువాదములుకొన్ని పుట్టినవి. మరియు పదేండ్లకీవల నితరప్రాచీన కావ్యాను

* అచ్చుప్రతి యొకటి చెన్నపురి ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమున నున్నది.

శాసనగ్రంథముల కనువాదము లొకటి వెంట నొకటిగ బయలు దేరుచున్నవి. రస హృదయులగు నేటిపండితులు పలువు రలంకార వాఙ్మయావశ్యకతను గుర్తించి తత్ప్రచనమునకు దొరకొనినారు. ఉత్కృష్టకావ్యానుశాసనగ్రంథమగు సాహిత్య దర్పణమును మహోపాధ్యాయులు, కళాప్రపూర్ణులు వేదము వేంకటరాయశాస్త్రిగా రాంధ్రీకరించి నారు. ఇందు మొదటి ఆరుపరిచ్ఛేదములు నచ్చయినవికూడ. అనువాదము గద్యరూపమున యథామూలము, ననుత్తమము నయి యున్నది. ఇట్లలంకారశాస్త్ర వాఙ్మయము నానాటికి నాంధ్రమున నభివృద్ధి నొందుచున్నది.

ఈ కువలయానందసార మాంధ్రమున క్రొత్తదనముతో క్రొత్త వెలువడిన యలంకార గ్రంథము : రచయిత, శ్రీ బులుసు వెంకటరమణయ్యగారు, 'ఉభయభాషా సాహిత్య విద్యాప్రవీణు'లు. అలంకారశాస్త్ర తత్త్వాన్వేషణమున ప్రత్యేకము కృషిచేసి అలంకారగ్రంథరచనమున కధికారము గడించుకొనినవారు. వీరు కువలయానందమునందలి తొలి నూరలంకారముల నిట్లు 'కువలయానందసార' మనుపేర సంధానించినారు.

ఈగ్రంథమున నలంకారలక్షణములు (చంద్రాలోకమునందలివి) యథామూలముగ పద్యరూపమున ననువదింపబడినవి. తద్వివరణము గ్రంథకర్త స్వీయము. తత్తదలంకారముల యుదాహరణములు చాలవర కాంధ్ర పద్య వాఙ్మయమునుండి సేకరింపబడినవి. ఇది యీగ్రంథమున కబ్బిన క్రొత్తదనము. తక్కిన వానిలో గొన్ని వృత్తియందలి యుదాహరణములకు, మిగిలినవి మూలము (చంద్రాలోకము)నందలి యుదాహరణములకు ననువాదములు. మూలగ్రంథమునందలి చర్చావిశేషములు గ్రంథాంతమున ననుబంధింపబడినవి. శాస్త్రగ్రంథానువాదములకు - తత్రాపి పద్యాత్మకము లగువానికి - అనివార్యమగు నన్వయ క్లేశదోషమంతగాలేని యీగ్రంథము ననువాదము మూలానురూపమయి సరళముగ నున్నది. అలంకారశాస్త్ర ప్రవేశమున కిది యనుకూలద్వారము. దీని ప్రయోజనమును సహృదయులు దెలియజాలుదురు.

గ్రంథకర్త వయసున చిన్న; పాండిత్యమున పెద్ద; అలంకారముల నాణెము నెఱిగిన ప్రోఢ. ఆంధ్రవాణి కింకను అందని యమూల్య ప్రాచీనాలంకారసంచయమునుండి యొకొక్కదానిని కైకొని ఆమె మదీ కెక్కునట్లు నవ్యపరివర్తనమున మెఱుగెక్కించి యామెకు దొడిగి తదాశీస్సులకు బాత్రుడగుగాక!

---

# 'కావ్యాత్మ*'

తిరుమల వేంకటరంగాచార్యులు

'జిహ్వ కొక్కరుచి, పుఱ్ఱె కొకబుద్ధి' యని విశ్వపరిచితిగలవారి సత్యవాక్కు. ఉల్లేఖాలంకార మిట్లేర్పడినదే. తత్త్వము సంస్కృతాలంకార సారస్వతమును కలికపుగన్నులతో జూచువారికి తెల్లమయినది. గ్రహీతృ, గ్రహణభేదములను బురస్కరించుకొని సంస్కృతాలంకార సారస్వతమున కావ్యాత్మ పలుపోకలు పోయి విరివియైన చరిత్రను సంపాదించుకొన్నది. రస, అలంకార, గుణ, రీతి, ధ్వని, వక్రోక్తి, అనుమాన, ఔచితులు వారివారి రుచిభేదమును బట్టి కావ్యాత్మలైనవి. సహృదయుల కివియన్నియు నుపపన్నములే యయి గోచరించును. కాదనుట రుచిభేదమును దిద్దజూచుట. కావున నెవరిమతమును వారికే వదలి సమగ్రఘత చరిత్రమును ఎరుకపరచుకొని, విమర్శించుకొని, తనమనస్సునకు సమ్మతమయిన పంథను తాను ననుగమించుట సహృదయునకు పాడి. ఒక్కమతమునకే గుదికట్టి, దానినే అంటగట్టుకొనియుండు డనుట సాగస్వతాభివృద్ధిని గాంక్షించువారికి తగవుకాదు.

అలంకారసారస్వతము తెలుగున నెన్నియో విధముల వికాసమును గోరుచున్నది. రోజులును ఎన్నియో భంగుల మార్పుదలలను చూపుచున్నవి. నేడు మనకు లభించిన అలంకారసారస్వత మంతయు కేవల మనువాదరూప మయినది. ఎవరి మనస్సునకు పట్టినరచన వారి యనువాదమునకు పాత్రమయినది. ఆయనువాదములును వ్రేళ్ల లెక్కయిడదగినవి. అందును ప్రాచీనములని చెప్పదగినవి నరసభూపాలీయము, కావ్యాలంకారచూడామణి యను రెండే. దీనికిముందు తెనుగున అలంకారసారస్వతము లేదనియే చెప్పవచ్చును. తరువాత నిటీవల కొందరు మరికొన్నిటిని అనువదించినారు. ఇప్పుడిప్పుడే మనవారికి అలంకారశాస్త్రసమగ్రత గుర్తుకు వచ్చినది.

వైయక్తికత్వము, పరిపూర్ణత కొరవడిన యీ సారస్వతమున వైయక్తికత్వము, పరిపూర్ణసాహితి యలవరిచికొనుట కష్టమయినపని. మనకు సర్వవిధముల మూలమయి యొప్పిన సంస్కృతాలంకార సారస్వతమును సమగ్రముగ, పాశ్చాత్త్య విమర్శనదృష్టితో పరిశీలించి, భావించుకొనుట నేటి సారస్వతప్రియులు కోరునది. అప్పటికిగాని యందలి గుణాగుణముల నెరుంగుటకుగాని, దానిని మరింత వికాసపరుచుటకుగాని యవకాశములు తక్కువ. పాశ్చాత్త్యరచనా

---

*రచయిత: యస్. వి. రాఘవఅయ్యంగారు, యం ఏ. బెజవాడ. ప్రకాశకులు: ఆంధ్రగ్రంథమాల, చెన్నపురి. క్రౌనుసైజు. వెల రెండురూపాయలు.

ప్రణాళికలు, వారి విమర్శనపద్ధతి యీఅవకాశములను హెచ్చించును.

అలంకార శాస్త్రమునకు ప్రథమాచార్యుడు భరతముని చంద్రుడు. తత్పూర్వము దీనివాసనలు చూచాయగ గోచరించినను సరియైన యొక్క యాకృతి, యొక్కపంథ యుండినట్లు లేదు. భరతుని మొదలు మొన్నటి జగన్నాథపండితుని దనుక నీశాస్త్రము శాఖోపశాఖల విస్తరిల్లి బ్రహ్మాండమయినది. పలువురు పలువిధముల కావ్యలక్షణములను నిరూపించిరి. వెవ్వేరు లక్షణముల ప్రసంగమున నెటులున్నను శరీరముగ నిర్వచించుకొన్న కావ్యమునకు ఆత్మవంటి దేది యనుటలో నొక్కొక్క రొక్కొక్క త్రోవ బట్టిరి. అందరు నన్నికారణములను జూపుచు నన్నియాత్మలను చూపిరి. దేని కది యుపపన్నమే యవును. ఇది యంతయు కేవల మొక్క మార్గప్రదర్శనమే కాని యను శాసనముమాత్రముగాదని సహృదయులు భావింపగలరు. వికాసాభ్యుదయములు కోరిన నెవరు ఎవరిని అనుశాసింపగలరు ?

అలంకార శాస్త్రము రస మతముతో నారంభమయి పోయిపోయి ధ్వనిమతముతో చట్టున నిలిచిపోయినది. అదియే నిజమునకు కావ్యాత్మ యని పలువురకు తట్టినది. పలువురు దాని ననుగమించినారు. సర్వమతలక్షణసమంచిత మదియే యని నమ్మినారు: ధ్వనికావ్యమే ఉత్తమకావ్య మని యంగీకరించినారు. ఆధునికులకును ఇదియే విశిష్ట సమ్మతమైనది. నిజమున కదియే కావ్యాత్మ కాగలిగినది.

కాని యీ సాహిత్య శాస్త్రమునకు అలంకారశాస్త్ర మని పేరెట్లు వచ్చినది? ప్రాధాన్యవ్యపదేశమునగదా ! మరి, దీనికిని ధ్వనిమతమునకును సమన్వయము కుదుర్చవలసి యున్నది.

అలంకారశాస్త్రమును సమగ్రముగ పరిశీలించి, అందు వెలసిన యన్ని మతముల తత్త్వము నెరుంగుట తచ్ఛాస్త్రాభ్యుదయ వికాసములకు మొదటిమెట్టు. పాశ్చాత్త్య సంస్కృతి కారణముగ మన దృష్టి యిప్పుడిప్పుడే చరిత్ర, విమర్శలవైపు పరలుచున్నది. ఇది కారణముగా సారస్వతమున క్రొత్త వికాసము పొడచూపుచున్నది. అభ్యుదయమున కిది ప్రథమలక్షణము. 'గుణాః పూజాస్థానం.' ఆంగ్లమున నెన్నియో విమర్శగ్రంథములు వెలువడినవి. పాశ్చాత్త్య సంస్కారమంతగాలేని మన యాలంకారికులు కవి వ్యక్తి పడక ప్రాతదారినే యుండిపోయినారు; ఇటీవలివారి కయినను ఏతాదృశ సాహిత్యావశ్యకత గోచరించలేదు. సంస్కృతాలంకారిక సిద్ధాంతపరిజ్ఞానము, ఆంగ్లవిమర్శన సూత్రాలంబనము, వాని సాయమున ప్రాచీనాధునిక కావ్యముల పరిశీలన, సమన్వయమునను వీని వలన సారస్వతమునకు గలుగగల లాభములు వారిమది కెక్కలేదు. ఈ కొరత కంతటికిని కారణము తెలుగున నట్టి గ్రంథములు

లేమియే.'కొరతపడినభాగమునుపూర్తిచేయుటయే భాషాసేవకునకు పరమకర్తవ్యము.'

శ్రీరాఘవయ్యంగారీకర్తవ్యము నూహించినారు; కర్తవ్య నిర్వహణమున కుత్సహించినారు.ఫలముగ ప్రకృతమయిన యీ 'కావ్యాత్మ'పైలోపమునుదీర్చిదిద్దవెలువడినది.'భరతమునిచంద్రుని నాట్యశాస్త్ర రచనాకాలము మొదలు జగన్నాథ పండితుని రసగంగాధర రచనాసమయమువరకునుకావ్యాత్మ విచారమేరీతి పెంపొందినదియు' చరిత్రరూపముగ, విమర్శరూపముగ నీగ్రంథమున లెస్సనిరూపింపబడినది.ఇట్టి రచనలకు పరమావశ్యకమయిన 'సంస్కృతాంధ్రాంగ్ల సారస్వత త్రయ సాహిత్య' ముప్పతిల్ల రచయిత యీగ్రంథమును రచించి సారస్వతప్రపంచమునకు క్రొంగ్రొత్తవికాసమును గూర్చినాడు. ఇది యలంకారశాస్త్ర విమర్శ గ్రంథముగను, చరిత్ర గ్రంథముగను సహృదయాలంకారికుల సమాదరమునకు పాత్రమగుననుటలో సందేహము లేదు. ప్రాచీనాలంకారిక మతము లన్నియు నిందు సమగ్రముగ గోచరించును.

గ్రంథమంతయు మొత్తము రెండుభాగములు ప్రాచీనమతములు, నవీన మతములు నని. రసాలంకారగుణరీతి మతములు ప్రాచీనములుగను, ధ్వనివక్రోక్త్యనుమానౌచితీమతములునవీనములుగను విభాగింపబడినవి. తొలిదాన రసమతము, అలంకారమతము, గుణమతము, రీతిమతము, రసమతసమాలోచనము ననిపంచ ప్రకరణములు. మలిదాన ధ్వని మతములు, ధ్వనినాశక మతములు, వక్రోక్తి మతము, అనుమానమతము, రసాలంకారమత సమ్మేళనము, నవ్యమతము నని యారు ప్రకరణములు. ఒక్కొక్క ప్రకరణమునను నుపప్రకరణములు గలవు. ఈవిధముగ నిదిసమగ్ర కావ్యాత్మచరిత్ర మననొప్పియున్నది.

దారి క్రొత్తదగుటచేతను, తొలుదొలుత నే వెలువడి దారి చూపిన వగుటచేతను ఈ 'కావ్యాత్మ' పలువురాంగ్లవిద్యావిశారదులు వ్రాసిన రచనలను ఆధారముగ గొని నిబంధింపబడినది. అందును ఎక్కువగా సుశీలకుమారడేగారి రచనాప్రణాళికయే దీని మేలుబంతి యయినది. డేగారి సంస్కృతాలంకార చరిత్రము (History of Sanskrit Poetics) ద్వితీయసంపుటము వీరికి మిక్కిలియుపకరించి, విషయమును సమకూర్చినది. విషయ మాగ్రంథములపరిచితి గలవారికి నూతనముగాకపోయినను తక్కువారలకు ఇది క్రొత్తదే యవును. అచుంబితార్థసంపత్తి గలిగిన యీ గ్రంథమును గూర్చిన రచయిత నభినందించి తెలుగువారు దీనికి హృదయపూర్వకస్వాగత మిత్తు రని నమ్మిక.

ప్రహతమార్గములందే, నడవ నేర్చిన వారికే ఒక్కొక్కప్పుడు ఒడుదుడుకులు గలిగి కాళ్లు తడబడుచున్నప్పుడు అప్రహత మార్గములందు నడవబూనినవారికి తడబడుననుట వింతకాదు. విషయగౌరవము నుపలక్షించిదోషములను దూరీకరించి,గుణములను గ్రహింప సహృదయ పాఠకులను గోరెదను.

'గుణదోషౌ బుధో గృహ్ణన్నిందుక్ష్వేడా వివేశ్వరః,
శిరసా శ్లాఘతే పూర్వం పరం కంఠే నియచ్ఛతి.'

---

## రామచంద్రకవి

**మా**రేపల్లి రామచంద్రశాస్త్రిగారికి బారసాల నాఁడు అమ్మ-నాయనలు పావనముఖమునఁ బెట్టిన పేరునకన్న పదుగు రాప్తులు ఆత్మప్రియముగాఁ గట్టిన 'కవి' పట్టమే గణుతి కెక్కినది. ఏ శుభ ముహూర్తమున, ఏ యమృతవాక్కున వెలువడెనో కాని కవిగారివాసి గంజాము, విశాఖపట్టనమండలముల కెగప్రాకి, కోనసీమవెంట గోదావరిదాఁటి వేఁగిసీమ చేరినది. కృష్ణాతటము గడచి కొండవీటిసీమఁబడి, నల్లమలఁ జొచ్చి, రేనాటివఱకుఁ బాఁకినది. ఈయన పురిటిల్లు కృష్ణాతీరము౧; పురుషకారము సముద్రతీరము.౨ విద్యార్థిదశ పడమటినుండి తూర్పునకు నడచినది; విఖ్యాతి తూర్పునుండి పడమటికి నడచినది. వీథిబడి చదువు ముగిసినది. విలాయతీ చదువు మొదలయినది. బసలో కావ్యపాఠములు, బడిలో 'గార్డ్‌వేట్' రీడరులు — తిన్నఁగా సాగినవి. ప్రబంధపఠనమున నభిరుచి కుదిరినది. పడమటి చదువునఁ బాదు గదిరినది. స్థాయి దొరకినకొలఁది సాహిత్యవ్యాసంగము ముదిరినది. ప్రవేశపరీక్షతోఁ౩ బడమటిచదువునకు ఆశ్వాసాంత మయినది. సర్కారునౌకరులోఁ జనిగానక చదువులబడియొజ్జకొలువున కొప్పినాఁడు.

అయ్యవారినని అహంతకుఁ జోటీయఁడు. విద్యార్థిబృందమున నొకఁడుగ వినోదించినాఁడు. తల్లివలెఁ జనవిచ్చినాఁడు. తండ్రివలె దయచూపినాఁడు; తప్పున్న పట్టున దండించినాఁడు. పాలకుని కొడుకును, పాటకుని కొడుకును ఒక్కకంటఁ జూచినాఁడు. కోపము వచ్చినతఱి కాలదండమును మిగిలి కంటిచూపు తీవ్రత చూపెడిది. చూపులన కాని తాపులఁ దప్పులు దిద్దఁడు. చెప్పుటవలనకన్న చేతలవలనన చరిత్ర ( Character ) గఱపువాఁడు. సాధువృత్తికి మరపుటయ చదువులని ప్రయోజనముగా భావించువాఁడు.

బడిలో విద్యార్థులకొలువు; బయట నిమ్నజాతుల కొలువు. పగటినౌకరిలో పుచ్చుకొన్న గ్రాసము పాటకప్రజనుల రాత్రిబడులకై వెచ్చము. చాలనికొఱఁతకు చందాలబిచ్చము. అధమజాతిపిల్లలకు విద్యాశాలలు, అరిపేదలను నశక్తులకు అన్నసత్రము, సానిబిడ్డలకు, సంసారులనుగఁ జేయననువగు సంస్కారణముల నుద్దేశించి, 'సంగీతమానినీసమాజము', కళాపిపాసువులకు 'కళాభిలాషకసమితి', కవితావిలాసులకు 'కావ్యమాలిక' కళాప్రదర్శనములు, నాటకప్రయోగములు, చేతిపనులు, మొహర్రమునఁ బొల్గొను హిందూజనసామాన్యమునకు వేసాలమోజు తీర్చుకొని శివాలాడుకొనుటకు శ్రీరామోత్సవములు—ఇన్నియు నొక్క చేతిమీఁదుగఁ బొడమినవి; వడిదుడుకులంబడక నడచినవి. కవిగారి నిమ్నజనోద్ధరణము స్వమతప్రియత్వమును కాలేజిపాలకవర్గమునకుఁ గిట్టదు. పనిఁబూనినదానిని వలదనిన బ్రహ్మరుద్రాదులను సైతము సరకుసేయుట కవిగారికిఁ గ్రొత్త. కాలేజీయూడిగమో, కష్టజీవులవరవుడమో రెంటనొకటి వదలవలయు నటియాటతటిమినది. ఒకటి భృతికై ధరించినది. మఱొకటి రతికై వరించినది. అది ధనసమార్జనమునకు; ఇది ధర్మపరిరక్షణమునకు; అది లౌకికము. ఇది యలౌకికము. బ్రదుకున పేదటికము; భావమున రాచటికము. తుదకు కాలేజికొలువుముద్రను తుడిచికొన్నాఁడు.

---

౧. కృష్ణామండలము, నందిగామ తాలూకాలో నొక గ్రామము.

౨. విశాఖపట్టనము.

౩. మెట్రిక్యులేషన్.

పటావిక్షేపణముచేసినాఁడు. సహప్రసన్నాధికోత్సాహముతో సమాజకైంకర్యతత్పరుఁడైనాఁడు. కవికావ్యరచనావినోదము నానాముఖములఁ బ్రసరించినది. కళాపరిషత్తునకుఁ గార్యజీవన మిచ్చినాఁడు. నటకులను దిద్దినాఁడు. నాటకములను ప్రబంధించి ప్రయోగింపించినాఁడు. ప్రాచీనవాఙ్మయసంప్రదాయమునెడ భక్తి విడుగడు. అర్వాచీనసంస్కారమునెడ రక్తి తఱుగదు. ఆ భక్తికి ఈరక్తికి యుక్తి ఘటించినాఁడు. 'రసాత్మకంకావ్య' మ్మనిన పట్టుపట్టినాఁడు. పట్టినదానినిఁ జేతలోఁ జూపెట్టినాఁడు. సొంతతెలివు సొంతపుంతనుంచి నడపించినాఁడుగాని ఎరవుబేరముల కెగఁబడఁడు. రసలుబ్ధుఁ డనిపించుకొన్నాఁడు. దేశమునకన్నమున్న భాషకుఁ బరాధీనత పాయవలయు నన్నాఁడు. తెలుఁగుపలుకునకు సొంతబ్రదుకేర్పడవలయునన్నాఁడు. పట్టుపట్టినాఁడు. తెలుఁగుమనుగడఁ గాఁపాడుటకు వ్యాకరణరచనకుఁ గడంగినాఁడు. సంస్కృతాదినిఘంటువులలోని శబ్దములను జవిరిక్రుచ్చి యెత్తుటతోఁ దీరదని, భాషలపరస్పరసంబంధాదిమర్యాదల నెఱిఁగి, మాటలమఱువులంబట్టి, పలునాడులలో బ్రదికియున్న పలుకుఁజాలులనుజేర్చి నిఘంటువుంగూర్చి తెలుఁగుసీమకొక మేలికానుక వెట్టఁ బనిగొన్నాఁడు. సగమునకు మిసుల సాధించినాఁడు. కవిగారికన్న కార్యకరణదీక్ష ముందుబుట్టినది. ఆయన మనసునంటిమాట, మాటవెంట మనసు కదుపుకుదుపులేక సూటిగ నడచెడివి.

౧౯౨౧-వ సంవత్సరమున కరాళగహ్వరముం దెఱచి జూలువిదల్చినకాంగ్రెసుసింహమునెదుట తన కట్టినదీక్షాకంకణము నేఁటిదాఁక విడువఁడు. ఈయన కాంగ్రెసుఉద్యమమున కరఁగినాఁడు. కాఁపురమునే కాంగ్రెసుగమార్చినాఁడు. గడగట్టి కాంగ్రెసుప్రచారము సాగించినాఁడు. నెలలతరబడి జరగవలయు పని నిమిషములమీఁద నిర్వర్తించినాఁడు. పూర్వము తన వేసినమార్గమున, తననేటి నిమ్నజాత్యుద్ధరణాదికాంగ్రెసుప్రచారము, పూర్ణప్రవాహముమీఁది పూదెప్పపయనముగ సాగినది. పోలీసులు కేసు తగిల్చినారు. ఖైదుకుఁ బంపినారు. కారాగారవాసము నాశ్రమవాసముగ ననుభవించినాఁడు. కన్నడము, అరవము, హిందీ అలవఱుచుకొన్నాఁడు. పలుసీమలనుండి ప్రోవైన తోడిఖైదీల నేస్తమబ్బినది. వారివారిమాటలను ఏర్చి తననిఘంటువునకు సరకు కూర్చుకొన్నాఁడు. ఇపుడు కాంగ్రెసు గ్రంథమును గట్టిపెట్టి నిఘంటురచనాసమాధిం బ్రవేశించినాఁడు.

దైన్య మెఱుఁగఁడు; దారిమొఱఁగఁడు; ప్రజ్ఞ దొఱఁగఁడు; ప్రసన్నతఁ దఱుగఁడు. పాడికై ప్రాఁపు బలిపెట్టుఁగాని, ప్రాఁపుప్రోపులకై పాడిఁ దెగఁదీయఁడు. ధర్మానుగతమను కర్మశీలుఁడు. కర్మశీలత పొత్తుబాయని కార్యశూరుఁడు. పల గొన్న జాడలనెల్ల వైలక్షణ్యము బఱపినాఁడు. “వజ్రాదపికఠోరాణి మృదూని కుసుమాదపి” అను భవభూతి సూత్రమునకు ఈరామచంద్రుఁడును పాత్రమయినాఁడు. సార్వభౌమునైన శాసింపఁగల సమ్యగ్భావుఁడు–సాధుశీలుఁడు. నిశ్చయజ్ఞానమునకుఁదగిన నియతవృత్తి, నియతమున కనువైన నిత్యస్వాధీనత, స్వాధీనతకు నెలవడిన నిస్పృహత నిర్మమత్వము–ఈయనయందు అన్యోన్యము ఆధారాధేయము లయినవి. పుచ్చుకొన్నను ఇచ్చినను ఒక్కటే ఉల్లాసము. వచ్చెనని పొంగుటగాని, పోయెనని క్రుంగుట గాని యుండదు. కర్తృత్వము తనదికాదన్న యెఱుకగలఁడు. ప్రభునిసరసను, పాకివాని దండను ఒక్కటే సంతుష్టి.

సనాతనాచారపరాయణుఁడుగఁ దోఁచు సంస్కర్త. సంసారిగఁ దోఁచు సన్న్యాసి. బహిర్వ్యాపృతి నటించు నంతర్ముఖుఁడు. నూనూగు మీసాలతో మొదలుపెట్టిన ప్రజాహితైకోద్యమదీక్ష, మీసాలు తెల్లవడి సెలవు పుచ్చుకొన్న పిమ్మట నేఁటిదాఁక తన్ను వదలదు. తాను దానిని వదలఁడు. సారస్వతమునను సమాజమునను సజాతీయసంస్కరణములకై కడంగెనుగాని, ప్రాతపద్ధతులంజంపి క్రొత్తరీతులు నింపఁగోరఁడు. మార్చుటకేకాని ఆర్చుట కొప్పఁడు. ఇంటిమర్యాద దిద్దుటకేగాని పొరుగింటి సాంగెము [1] దురుగ

౧. సాంగెము=ఆచారము; ఆనవాయితి: పడమటిసీమలో పరిపాటియైనమాట. సాంగెము=సాంఘ్యశబ్దభవము కాబోలును! అప్పుడును 'ఆచారము' అనునర్థమునకు భంగముకలుగదు. ఆచారములు సంఘములకు చెందినవే. సం. భారతి,

నొల్లఁడు. దయాసారమువహించినను దౌష్ట్యమునుసహింపఁడు. అంతఃకరణము ప్రమాణముగ వర్తించునేకాని, ఆప్తులకేని మోమోడి చరింపఁడు. తనప్రాకృతకళేబరము అప్రాకృతజ్యోతికి ఆశయమయినది. మృష్టముగా భోజనము గోరఁడు. సుఖశయ్య గోరఁడు. బ్రదుకుటకుఁ బట్టెడు మెతుకులు; మానమునకు బారెడుబట్ట. ఇవి జీవనమునకు వలయునవి. పస్తుండియు భక్ష్యభోజ్యముల నారగించినంతతుష్టి, కులకరాలఁబండియు, సుఖ్ఖకొట్టినిద్రబడయువాఁడు. మనుగడనెల్ల ప్రకృతిజననికి మీఁదుగట్టినాఁడు. తల్లిదండ్రులకడుపున గన్నులను చల్లపఱిచినాఁడు. కోటిలోనొకఁడుగ లెక్కింపవలయువాఁడు. ఋషికల్పుఁడు. ఇట్టివారికాన్పన తెలుఁగుగడ్డ పున్నెముఅపంటకాదా!

భావసంవత్సర శ్రావణ శు ౧౦ ఆదిత్యవాసరమున విశాఖపట్టనపౌరవర్యులు శ్రీవారి షష్ఠిపూర్తిసందర్భము ౧౧౧౬ సమర్పించుకొని ధన్యులనుట విని సంతసించితిని. పాల్గొననోచమికి వగచితిని! నావంతు ఒక్కనమస్కారము అర్పించుకొని కృతకృత్యుఁడ నను కొందును.

"శీలంబు, మైత్త్రి, కరుణ, య
లోలుపభావము, తితిక్ష—లోనగు మునిలో
కాలంబనీయసద్గుణ
జాలంబు దమంబుతోప సంపద అనఘా"

అని 'శాంతి' వాక్యము ననుసంధింతును.



దుప్పిక  S. M.



సుందరప్రదేశము

—సూర్య



కొంకణము : ఖాండాలా సొరంగములో రైలుమార్గము

I. R. K. S.

# తగిలినవేలికే తగులుతుంది

(నాలుగోభాగం *)

వేలాల సుబ్బారావు, బి. ఏ.,

౧

కోనడూపిరితో కొట్టుకొంటూవున్న శవకల్పమైన వెంకయ్యశరీరాన్ని దగ్గరే వున్న జనరల్ ఆస్పత్రిలోచేర్చి తమ ఔదార్యానికి తమ్ముతామే అభినందించుకొంటూ—యూరపియనులు కాబట్టి, ఆనవాలు పట్టడానికి వీల్లేని అటువంటిసమయాల్లో దేశీయుల్లాగు పారిపోకుండా ఆస్పత్రిలోచేర్చడమే గొప్పఔదార్యం-చింతాక్రాంతులై వెళ్లిపొయ్యారు దొరలు వారు వెళ్లదలచినపూర్వోక్తసముద్రతీరపు మైదానానికి, అక్కడివారికి ఈఘటనావృత్తాంతం తెలియచేసి సెలవుదీసుకొని వళ్లీవస్తామనిచెప్పి, రావలసినవైద్యులూ, అధికారులూ, పోలీసులూ అంతాచేరి విచారణ ఆరంభమయ్యేసరికి తమవాఙ్మూలాలను ఇవ్వడానికి. దేశీయులే అయివుంటే ఏనిప్పుడుల్లో అటకాయించేదే అక్కణ్ణుంచి కదలకుండా. కాని తెల్లతోలూ. అందులో మిలిటరీదొరలు. స్వయంరాజులు, స్వయంమంత్రులు. పేరుకే కాని గవర్నర్లుకూడా అసమర్థులే వారిని ఆపడానికి ఒకొక్క సమయంలో, అందుకనే వారికి అనుకూలంగా ఉండేలాగే ఉత్తరువులను జారీచేస్తూఉంటారు. ఇంతకూ తమ పదవియొక్క స్థిరస్థితిత్వానికి ఆధారభూతులు వారే (మిలిటరీ) అయినీ. గవర్నరుగజాలకే దిక్కులేనప్పుడు ఇక పోలీసుమశకాలవోలెక్కా? ఏసుండెబెట్టుకొని ఆపగలరు మిలిటరీదొరలను పోలీసువారు. దొరలు వెళ్లిపొయ్యారు మళ్లీవస్తామని.

చచ్చినవాళ్లుచావగా తత్సంబంధులైన బ్రదికివున్నవాళ్లది మహాదారుణమైన చావు. అయిన బంధువులుసైతం దగ్గిరికిరాకుండా మొగం దప్పించుకొని పోయే మదరాసుమహానగరం- అందులో ఘుమ్మడరిద్రులు- దానిలోనూ జీవనంకోసం పొట్ట చేతబట్టుకొని ఏమారదేశాన్నుంచోవచ్చిన అనాథలు- అందుననూ ఇంటికంతా ఆధారమైన యజమాని మగవాని చావు- అదైనా ఉన్నచోట స్వాభావికంగా గాదు- నట్టనడివీధిలో ఏమోటారుక్రిందనోపడి హఠాత్తుగా ప్రాణంపోయినవాడికి అంత్యక్రియలు జరిగించాలంటే నిజంగా బ్రదికున్నవాళ్లకు జీవన్మరణమే కాని మరోటి కాదు. రాములూ, నాగులూ పాపం మిత్రఋణం కొదువనేది లేకుండా తీర్చుకొన్నారు ఈ మహావిపత్తిసమయంలో సర్వవిధాలాతోడ్పడి వెంకమ్మకూ.

దొరలు వెంకయ్యదేహాన్ని ఆస్పత్రికి దీసుకొని పోతూవున్నక్షణమందే అక్కడికి రావడం తటస్థించిన మరోబండిమీద అరటికాయలను ఎక్కించుకొనిపోయే ఏర్పాటుచేసి తమవట్టిబండిని లాక్కొనిపోయి ఆస్పత్రి దగ్గరవుండమని నాగులునుపంపి రాములు యకాయకి ఒకేటీకిపరుగెత్తాడు వెంకమ్మకోసం. అనిర్వాచ్యరాలు అన్నంవండే ప్రయత్నంలో వుంది. సగం చచ్చిన మొగంతో రాములు జరిగిందంతా చెప్పకుండా మోటారుకిందపడ్డాడనీ వెంకయ్య, ఆస్పత్రికి మోసుకొనిపొయ్యారనీ నోరుతడబడుతూ కంగారుగాచెప్పి నిలుచున్నమనిషిని నిలుచున్నట్లుగా బయల్దేరదీశాడు. నోరు ఎండిపోతూవుంటే, గుండె దడదడకొట్టుకొంటూ వుంటే కాళ్లుచచ్చుబడిపోతూవుంటే ఏడుస్తూ బస్సు మీదపడి కొన్నినిమిషాల్లో ఆస్పత్రిచేరింది వెంకమ్మ కొడుకును వెంటేసుకొని కాని ఏంప్రయోజనం! ఆస్పత్రి గేట్లు టంగిన బిగిసివున్నాయి. ఇటువంటి ఆకస్మిక ఘటనాల్లో ఆప్తబంధువులు దగ్గిర ఉండి ప్రాణం కొటుకులాడుతూఉండే దేహిగొంతులో ఇన్నినీళ్లు పోయడానికైనా వీలులేని వైధవనియమాలూ, రెస్యు

* దీని మూడవభాగము శ్రీముఖ మాఘమాస (ఫిబ్రవరి, 3౮) సంచికయందు ప్రకటితము.

లేమనులూ జనోపకారార్థమని ఏర్పడ్డ ఈమహాసంస్థలలో. ద్వారందగ్గరికాపలాజవాన్లు యమకింకరుల్లాగు అడ్డగించారు లోపలికిపోనివ్వకుండా వీళ్ల యమాయకపుమొగాలనుచూసీ. ఇంత ఆత్రంగా పరుగెత్తుకొని వచ్చినప్పటికీ కార్యం లేకపోయింది. మోటార్లమీద వచ్చేవాళ్లకు ఏమీసంబంధంలేకపోయినాసరే, లోపల వాళ్లబంధువు లెవరూ లేకపోయినా సరే, వాళ్లమూలాన్ని తమకు (జవాన్లకు) ఒక్కదమ్మిడీదొరికే ఆశ లేకపోయినా సరే, ఆ శ్రీమంతులమోటార్లు అంత దూరంలో ఉండగానే సుభాలున దెరుచుకొంటాయి గేటుతలుపులు. కాని దిక్కులేనిదరిద్రులకే లేనిపోని కట్టుదిట్టాలన్నీ. కాళ్లావేళ్లాబడి బతిమాలుకొన్నారు. ఏమైనాకావలిస్తే చేతిలో పెడతామన్నారు. కస్సుమన్నారు, బంట్రోతులు ఆమాట అనేసరికి రాములు, ఎక్కడాలేని కోపంవచ్చింది జవాన్లకు. మంచినీళ్ల ప్రాయంగా లంచాలుగొట్టేమహానుభావులు ఒక్కొక్క పర్యాయం సమయంగనిపట్టి అట్టిపని కెదురు తిరుగుతూ వుంటారు. కేవలం తాము నిస్పృహులమనీ, నీతిమంతులమనీ లోకానికి చాటుకోడానికి. వీళ్ల గ్రహచారమా అన్నట్లు ఆసద్బుద్ధి ఇప్పుడేకలిగింది జవాన్లకు. ఇక చేసేదేమిటి! తనజీవితసర్వస్వం తననెల్లప్పటికి విడిపోవడానికి సిద్ధంగావుందని ఈదీనురాలి కేం తెలుస్తుంది! లోపల ఏంజరుగుతూ ఉందో, ఏంకట్లు కడుతున్నారో, ఏంకోస్తున్నారో, ఏంచేస్తున్నారో అని అనుకొంటూ క్షణక్షణం పెరిగిపోతూవున్న సంతాపం చేత కంపిస్తూ మొగాన్ని గుడ్డవేసుకొని ఏడుస్తూ కూర్చుంది. ఆమె నిస్సహాయదీనావస్థకు అక్కడున్న వాళ్లందరకూ జాలికలిగిందిగాని ఆజవాన్లకు చీమకుట్టిన మాత్రమైనా లేదు. నిజానికి వీళ్లొకవిధంగా శవవాహకతుల్యులు. దయాదాక్షిణ్యాలూ, నీతిధర్మాలూ వీళ్లకు బొత్తిగా ఉండవు. ఈకాలంలో ఇటువంటి మహాపురుషులు ఒక్క ఆస్పత్రిగేట్లవద్ద మాత్రమేకాదు. ధార్మిక రాజకీయాదిసమస్తసంస్థలలో వున్నారు నానావిధనామరూపభేదాలతో. అందుచేతే నిరుపేదల మొరలు అరణ్యరోదనాలై వారికష్టాలు నానాటికీ మితిమీరి పోతూవున్నాయి. అస్తు.

ఆసమయంలో వచ్చారు వాజ్మూలం ఇవ్వడలచిన దొరలు మైదానాన్నుంచి మళ్లీ. రాములూ వెంకమ్మా వాళ్లకాళ్లముందు పడ్డారు. అక్కడున్నవాళ్లూ వెంకమ్మ ఫలానిమనిషని చెప్పి వేడుకొంటే భార్యాబిడ్డలను వదలడాని కాక్షేపణఏమిటని బంట్రోతులను చీవాట్లుపెట్టి గేటును తెరిపించి తమవెంట వీళ్లనుకూడా తీసుకెళ్లారు తామూ అక్కడికే పోతూవుండడంచేత. కాని ఏంలాభం! అదృష్టంలు ద్వారంవద్ద అడ్డు తగులకుంటే కొనప్రాణంతోవున్న పతినైనా చూసెదేమో. ఈమె అక్కడికి చేరేటప్పటికి అన్నీ అయిపోయినాయని తెలిసింది. కళ్లకు అంధకారంకమ్మి స్మృతితప్పి విరుచుకొని పడిపోయింది నేలమీద. వెంటనే నర్సులిద్దరు పరుగెత్తుకొనివచ్చి ఈమెకు ఉపచారంచేయడం మొదలెట్టారు. కష్టంమీద ఎంతోసేపటికి తెలివివచ్చిఏడుస్తూ కూర్చుంది. మరల కొంతసేపట్లో స్మారకం దప్పింది. మళ్లీ స్మృతి గలిగించారు నర్సులు. కొంతసేపు తెలివీ, కొంతసేపు తెలివితప్పడం ఈక్రమం ఏర్పడింది. ఇక ఈమెదుఃఖానికి అంత మెక్కడిది!......

ఇవతలవైద్యులు కొరోనరును గూడా పిలిపించారు. దొరలవాజ్మూలాలూ, సాక్షుల సాక్ష్యాలూ, ఆస్పత్రిడాక్టర్ల పరీక్షలూ పరిశీలనలూ, కొరోనరు విచారణలూ అన్నీ యథావిధి పూర్తిఅయి శవంవీరిపరమయ్యేసరికి రెండుగంటలు దాటాయి. తీర్పు మర్నాడు చెప్పుతామన్నారు. కాని ఇక్కడ వీరితీర్పెవరికి గావాలి. బయట కనిపెట్టుకొనిఉన్న తమబండిమీద అమృతశరీరాన్ని పడుకోబెట్టి సగంతెలివితో దానిమీదపడివున్న వెంకమ్మతోసహా ఇల్లుచేరారు రాములూ నాగులూనూ. ఈ ఇద్దరుబంధువులు నడుంకట్టి శ్రమపడి చేసిన ప్రయత్నాలమూలకంగా తరువాత జరుగవలసిన క్రియలన్నీ క్రమంగా జరిగిపోయినాయి. విభక్తంలాగు చక్కాస్థిభద్రక్రియకలోపడివున్న ఆత్మాంశం మహదాత్మలో అంతకుముందే కలిసిపోయింది. మిగిలిఉన్న తమతమ అంశా

లనః పంచభూతాలు పంచుకొన్నాయి. ఒక్కక్షణం క్రిందఉన్నది ఇప్పుడు ఉన్నట్లేలేదు. మహావిచిత్రం.

వెంకమ్మదేహస్థితి భయానకమౌతుంది. తెలివితో ఉన్నంతసేపూ పిల్లవాణ్ణివొళ్లో పెట్టుకొని చూసేవాళ్లకు హృదయవిదారకంగా విలపిస్తుంది. "హా! నా కర్మ మింతలో ఇట్లాకాలుతుందని ఒక్కనాడైనా అనుకోలేదు. నే నెంతటిమహాపాపినో అంతిమవేళ దగ్గరఉండడానికైనా నోచుకోలేదు. ఏంకోరికఉందో మనసులో. ఒక్కమాటయినా చెప్పకుండా పొయ్యార"నిఏమేమో తలుచుకొని ఏడుస్తుంది. ఒక్కరోజులోనే రూపమంతా మారి భిక్షుకిలాగయింది. అన్నపానాలు వర్జించింది. రెండురోజులు గడిచాయి. మూడురోజులు కడిచిపోయినాయి. దినక్రమేణా దుఃఖం ఉపశమించ వలసింది. కాని ఇచట ప్రకృతినియమానికి వైపరీత్యం కలిగింది. పిల్లవాడు సోముడే చెంతలేకుంటే ఈపాటికీ దివ్యభవనంకూడా కూలిపోయి వుండేదే అన్నారు ఆమెను ఓదార్చడానికి వచ్చి పోతూఉండిన వృద్ధమాతలందరూను. కాని ఈ ప్రేమమయమూర్తి నిలిచి వుంటుం దనే ధైర్యం ఏమాత్రం కలగడంలేదు ఎవరికీ. జీవితనాధుని ప్రాణవాయువులు ఈ పుణ్యవతి శరీరపుష్పాశయాన్నుంచి ఆకలి దప్పులనే సువాసనలను ఆకర్షించుకొనిపోయినాయి కాబోలు నిర్జల నిరాహారాలుగానే గడిచిపొయ్యాయి మూడు రోజులూ. ఇరుపొరుగులఉన్న దయామయులైన నిరుపేదలు- భాగ్యవంతులైనవారికళ్లకు గర్వాహంకారాల పొరలు కప్పిఉండడంచేత అటువంటి అనాథలు కనుపడరుకాబట్టి—తెచ్చిఇచ్చే అన్నంనీళ్లను పిల్లవాడికి పెట్టించేది తాను తాకనైన తాకేదికాదు. దుఃఖమంటే ఏమిటో ఎరుగని అపసిమంక ఆకలిపట్టజాలక ఇతరులు తెచ్చియిచ్చేదాన్నే ఆప్యాయనంగా దిని బిక్కమొగంతో తల్లిదగ్గరచేరి ఆమె ఏడుస్తూవుంటే తానూ ఇంతసేపు ఏడ్చి ఏడ్చి అలసి అక్కడేపడి నిద్రపోతూవుండేవాడు. పంచభూతాత్మకమైన దేహానికి పాంచభౌతికద్రవ్యాం శాలుపడుతూ ఉంటేనే దేహధర్మాలు సాగుతూవుంటాయి. అన్యథా అవిఉండవు. అన్నంనీళ్లూలేనికారణంచేత నిద్ర మటుమాయమైపోయింది. అందుచేత కేవలం శోకమూర్ఛలకే గురియైపోయిం దీభిక్షుకిశరీరం ఇప్పుడు. నాలుగోనాటిరాత్రి ౧౧-౩౦ గంటలు దాటిఉండవచ్చు' భూగోళమండలిపూర్వార్థం సమస్తం నిద్రామగ్నంగా సర్వత్ర నిశ్శబ్దరాజ్యం. మూడురోజులనుంచీ నిరంతరంగా అనుభవిస్తూఉన్న శోకపరితాపంచేత కలిగిన ఆయాసంవల్లనో లేక అవశ్యంభావియగుటవలననో నాలుగోరాత్రి రెండుజాములు సమీపిస్తూఉండగా ఈమె రవంతకళ్లుమూసింది. కలలో గనుపించింది వెంకయ్యరూపం. తనకోసం ఇంతేగాదుఃఖించక ధైర్యంకలిగి ఉండవలసిందనీ, త్వరలోనే ఇద్దరమూకలుసుకొందామనీ ఏవేవో ఓదార్పుమాటలుచెప్పి "పిల్లా" బాసుండిన దినాల్లో తనప్రియురాలిని ఖులాసాగా వెంకయ్య పిలుచుకొనేపేరిది "ఇష్టంలేకపోయినా బలవంతంగా మిమ్మల్ని విడవ్వలసి వచ్చింది. తప్పించుకోడానికి శక్యంకాలేదు" అని ప్రక్కనపడివున్న పిల్లవాణ్ణి చేతితో సంకేతంచేసి చూపిస్తూ "నీవుకూడా ఈపసివాణ్ణివదిలితే వీడికిక దిక్కెవరు! మన ఇద్దరిప్రతిబింబం ఈదేహం. ఈమొక్క మనపరానికాధారం. ఇది పెద్ద వృక్షమై ఇచ్చే ఛాయాదానాలద్వారా మనకూ మన పూర్వులకూ ఆత్మశాంతి కలుగాలి. దీన్ని ఒక సురక్షితమైనచోట నాటేవరకు నీకు కాపాడకతప్పదు. ఇదే నామనస్సులోని కోరిక. ఇంతవరకెప్పుడూ నా కోరికలను తిరస్కరించినదానవు కావు. ఈ నాఅభిలాషనుకూడా పాలించు" అని అంటూనే ఆరూపం మాయమైపోయింది. చప్పున ఉలిక్కిపడింది వెంకమ్మ శరీరం. కొన్నినిముషాలుమాత్రమే కావచ్చు, ఇన్నాళ్లకు తడవుగా ఐహికంమరచి, తనమీదపడ్డ పిడుగుమాట మరచి, నిప్పులేకే శోకాతిరేకంచేత ఆపాదమస్తకంవ్యాపించి మంటలు పుట్టిస్తూఉన్న సంతాపదాహాన్నిమరచి స్వప్ననిద్రలో మహానందం పొందుతూవున్న ఈమెకు పెనిమిటిరూపం అదృశ్యం కావడంతోటే చప్పున మెలకువకలుగగా తనభయంకరదుర్దశ స్మరణకు వచ్చి మరల కన్నీటిధారలు పొడకట్టాయి. మహాదీనంగా తనప్రక్కనే పడి నిద్రబోతూవున్న పిల్లవాడి మొగం

చూసేసరికి మరింత కడుపుతరుక్కొనిపోవ వాణ్ణి చేర దీసుకొని వెక్కివెక్కి ఏడుస్తూ కలలో కన్పడి చెప్పిన పెనిమిటిమాటలను తలుచుకొని అవి యాతని యాజ్ఞలూ కోరికలని "బ్రతికిఉంటా, నాయనోయ్. బ్రతికి ఉంటా" అని అప్రయత్నంగా నోట ఉచ్చరించింది తడబడుతూ.

౨

వెంకయ్య స్వరూపం కలలోకన్పడి చెప్పినసంగతులే తనపెనిమిటి మనస్సులోని కోరికలనే విశ్వాసంచేతనైతేనేమి పుత్రమోహంచేతనైతేనేమి వెంకమ్మ తనదుఃఖాన్నంతా దిగమ్రింగుకొని జీవనయాత్ర సాగించడానికి నిశ్చయించుకొంది ఈశ్వరుడనుగ్రహించినంత కాలం. కాని జీవనం గడిచేది ఎట్లా. ఎటుచూడబోయినా అంధకారం. ఏమీ గోచరం కావడం లేదు. భర్త పోయినచింతాగ్నికి తోడుగా జీవికచింతాగ్ని కలిసింది ఈమెశరీరాన్ని మరింత కృశింపచేయడానికి. స్వదేశానికి వెళ్లడానికి అసలే మనసు ఒప్పిందికాదు. వెంకయ్య బ్రతికిఉన్నంతవరకూ మళ్లీ ఎప్పుడైనా స్వదేశంలోకివెళ్లాలనే ఆశమాత్రం ఉండేది. ఇప్పుడది మొదలంటా నాశనమైపోయింది. తనకు స్వదేశమే లేదనుకొన్నది. తనపెనిమిటి గతించినచోటే, అతని శరీరం బూడిదె అయినచోటే తనదేహము బూడిదకావాలని సంకల్పించింది మనస్సులో. వీరయ్యకు ఉత్తరం వ్రాయించమని చాలాసార్లు చెప్పిచూశాడు రాములు. అతనికీ తమకూ ఇదివరలో జరిగివుండిన ప్రసంగాలను బట్టీ, అతను వ్రాస్తూవచ్చిన వుత్తరాలనుబట్టీ, అతనికో జాబువ్రాయిస్తే ఎట్లాఉండేదో కాని తన దురవస్థను దలచుకొని అతనికేమీ వ్రాయించడానికి సమ్మతించింది కాదు.

వెంకయ్య చెమటనోడ్చి సంపాదించినదాంట్లో తమఇంట్లో ఏలాగో ఒకలాగున సరిపెట్టుకొంటూ కష్టసమయంలో ఎప్పుడైనా అక్కరకు వస్తుందనే ఆశతో కొంతడబ్బును మిగుల్చుకొని తానుకాపురమున్నది ఎందుకూగాని వట్టి అరక్షితమైన తడికెల, కొబ్బరాకుల కొంప అని తానుపనిచేస్తూఉండిన ఏజంటు పరంగా ఇచ్చి దాచుకొంటూ వచ్చినాడు. ఆసంగతి ఈమెకూ తెలుసు, రాములుకూ తెలుసు. ఏజంటు మంచి పెద్దమనిషిగా గన్పించి వేలకొలది రూపాయలతో వర్తకమూ మొదలైనవి సాగిస్తూఉన్నందున తనఈముష్టిరూపాయలకు ఆసిస్తాడా అనే నమ్మకంతో ఇచ్చిన పైకానికి రశీదులేవీ తీసుకొన్నవాడు కాదు వెంకయ్య. కాని కాలవైపరీత్యం. అతనుపోయిన అయిదోనాడో ఆరోనాడో అతనిఉత్తరక్రియలకు డబ్బుకావలసి రాములు పోయి అడిగితే అదివరకెప్పుడో దాచుకొన్నది అతనికి అప్పుడే ఇచ్చివేశాననీ, ప్రస్తుతమతనితాలూకు తనదగ్గర ఒకదమ్మిడీఅయినా లేదనీ సిగ్గూబిడియమూ లేకుండా చెప్పివేశాడు ఖండితంగా- మహాఅన్యాయం ఘోరం. శవవాహకసదృశులు అనేకచోట్ల అనేక నామరూపాలతో ఉంటారని ఇంతకుముందే వ్రాశాను. పెద్దపెద్ద పట్నాల రైల్వేగోదాములలో పార్సెళ్లరవానా బట్వాడాలకుచెందిన కంట్రాక్టులుతీసుకొని పరిశ్రామికులనోళ్లలోదుమ్ముకొడుతూ,వాళ్ల కాయకష్టంద్వారాధనంకూడబెట్టే ఈఏజంటునామకులూ ఒకవిధమైన శవవాహకులే. వీరికి దయాదాక్షిణ్యాలూ, న్యాయమూ, ధర్మమూ అంటూ ఏవీఉండవు. ఏవిధానైనా వీరికి గావలసింది ధనము. పార్శెళ్ల యజమాన్లవద్ద బండ్లబాడిగలకనీ, కూలీలకనీ పదులూ, పదిహేన్లచొప్పున రూపాయలను దీసుకొని మోసుకొనిపోయే అసలుకూలీలకు ఆన్నే అణాలోలేక ఇంకనూతక్కువో ముట్టజెప్పి తక్కిన సొమ్మును తామే కొట్టివేస్తుంటారు. కూలీలకూ బళ్లవాళ్లకూ ఈరహస్యాలన్నీ తెలుసూ. కాని అనాధలు ఏంచెయ్యగలరు! ఏజంటుతో విరోధం తెచ్చుకొంటే తమ కాలేకడుపునకు ఆకూలీడబ్బులైనా దొరకవనే భయమూ. కల్లాకపటమెరుగని అమాయకులైన పనివాళ్లను ఈప్రకారం దోచుకొని కూడబెట్టిన పాపపు ధనంతో మేడలూ మిద్దెలుగట్టించుకొని నానాభోగాలను, కీర్తిసన్మానాలను పొందుతూవుంటారు ఏజంట్లు. సంఘంలో ఇటువంటివారికే అగ్రతాంబూలం. ఆహా

తులై సపరివారంగా వేంచేసి ఇటువంటివారి దివ్య భవనాలయందే విందారగించిపోతూవుంటారు గవర్నరులూ, మండలాధికారులూ. తత్ఫలితంగా ప్రజోపకారార్థం పాటుపడే మహానుభావులనిమిత్తమని ఏర్పడిన రావుబహద్దూరిత్యాది బిరుదులు ఇటువంటి ప్రజాహిత కారకులకే లభిస్తూ ఉంటాయి.

కొండంత పెనిమిటిపోయి ఏడుస్తూఉంటే తన వద్దనమ్మకంగా పనిచేసిన యతనిభార్య అని అభిమానం ఉంచి కనికరించి, ఓదార్చి ఆమెకుసాయపడి దుఃఖం తీర్చవలసినదానికిమారుగా రాతపోతలూ రసీదులూ లేవనే నెపంతో, తన్నే నిమాచేయజాలదనే నమ్మకంతో ఆయమాయకురాలిడబ్బును హరించడానికి బూనుకొన్న ద్రోహి, పాతకి మహాచండాలుడీ ఏజంటు. రసీదులు ఉన్నప్పటికీ కాలూచెయ్యి ఆడనిఘోరవిపత్తిసమయం, మహాశోకావస్థ, ఏంచేస్తుంది పాపం. ఆఖరుకు తమ బండిని అమ్మి ఆవచ్చినడబ్బుతో ఏలాగో కార్యంజరిగి పొయ్యేలాగు చేసింది. బండిని అమ్మిననాడు ఈమె పడిన మనోవేదన దేవునకే ఎరుక. పెనిమిటిశరీరాన్ని దాహక్రియకు తీసుకొనిపోయిననాడు విలపించినంత మహాఘోరంగా విలపించింది కొన్నవాళ్లు బండిని లాక్కెళ్లుతూఉంటే చూసి, దానిని దానియజమానిని తలచుకొని. కాని ఆవచ్చినడబ్బుతో అవసరకార్యాలు ఏలాగో జరిగిపొయ్యాయి. ఈప్రకారం ఉన్నది యావత్తుపోగా తల్లీ కొడుకు మిగిలారు నానావిధ కపట మాయావాగురసమావృతమైన లోకంలో జీవనయాత్ర గడపడానికి, సర్వథా నిరాధారులు.

సరిగ్గా ఇదేసమయంలో వీళ్లు కాపురమున్న గుడిసెఖామందులు వచ్చేనెలకు ఇవ్వాలిసిన అద్దె ముందు అడ్వాన్సుఇస్తేనే కాని అక్కడ ఉండడానికి వీల్లేదన్నారు. ఇదివరకు ఉదాహరించినవాళ్లవలె అన్ని అంశాల్లో అనిచెప్పడానికి వీల్లేదు. కాని సగమువంతు అంశాలలో సిటీలలోని ఇండ్లఖామందులు—ఇళ్లసుఅద్దెలకిచ్చేవాళ్లు శవవాహకుల పట్టీలో చేరవలసినవాళ్లే. వీళ్లకూ దయాదాక్షిణ్యాలేమీ ఉండవు అద్దెలను రాబట్టుకొనేచోట. కాపురాలున్న వాళ్లకష్టసుఖాలతో, వాళ్ల ఇబ్బందులతో, సౌకర్యాలతో వీళ్ల క్షేమాత్రం జోక్యంలేదు. సరిగ్గా నెలనెలకూ అద్దె చేతులలో పడడమే వీరికి కావలసింది. కొందరు ఖామందులకు వేరే జీవనోపాయాలేమీ ఉండవు. పెద్దలు కట్టించిన ఇండ్ల అద్దెలతోనే నిర్వాహకం చేసుకొంటూ ఉంటారు. అటువంటివాళ్లు అద్దెలవిషయమై కొంచెం ఖచితంగా ఉండడం కొంతవరకు ఒప్పుకోతగిందే. కాని పుష్కలంగా కలిగినవాళ్లకూ ఇదే జాడ్యం. కాబట్టే వీళ్లు అర్థాంశశవవాహకులు. ఒకప్రక్క జీవనానికే మార్గం లేనప్పుడు ఇంటిఅద్దె కెక్కణ్ణుంచి తెస్తుందీ దరిద్రురాలు వెంకమ్మ. సమస్తసౌఖ్యాలకూ దూరమై అల్లాడుతూవున్న ఈమెను ఇప్పుడీపాడుగుడిసెలోనైనా ఉండనిచ్చిందికాదు ఈమెను పట్టిన దౌర్భాగ్యదేవత.

ఈకథాసందర్భాలు జరిగినరోజుల్లో ఎలెక్ట్రిక్ రైళ్ళ ఆవిర్భావం అయి ఉండలేదు మద్రాసు పట్నంలో. ముందెప్పుడో రాబోతాయని అనుకొంటూ వుండేవాళ్లు అంతా. దక్షిణఇండియా రైలువారి ఫోర్టు స్టేషను ఇప్పుడున్నచోట గాక కోటకు ఉత్తరంగా హైకోర్టుకు దక్షిణంగా ఉండేది. మనుష్యులెక్కే రైలు బండినే చిన్నస్టేషనుగా ఏర్పరుచుకొని దాంతోనే కాలంవెళ్ళబుచ్చుకొంటూవుండేవారు రైలువారు లుబ్ధుల్లాగు. ఈబండి స్టేషనుకు ఇటోముప్పాతిక ఫర్లాంగూ, అటోముప్పాతిక ఫర్లాంగుమారము వ్యాపించి ప్లాట్ఫారముంది. వాటిపొడుగునా కటకటాలుండేవి. ఈకటకటాలకు దక్షిణాన్ని తూర్పుపడమరలుగా వ్యాపించి వుంది ఈకథయొక్క మూడోభాగంలో విశదీకరించిన కృతాంతకేళీరంగపు నాలుగోనెంబరుశాఖ. ఈశాఖారంగానికి రెండుప్రక్కలా ఉండేవి పెద్దపెద్ద మర్రిచెట్లు. ఈచెట్లక్రింద సంసారాలుచేస్తూ ఉండేవారు ఎందరో మొదటినెంబరుగృహస్థులు వారివారి కుటుంబాలతో. వీళ్ళను, వీళ్ల ఉనికిని, నివాసాలను, చరస్థిరాస్తులనుగురించి ఇదివరకే వ్రాసివున్నాను కాబట్టి ఇప్పుడు మరల వ్రాయడం అసంగతం. చాలామందికి దిగంబర

నిర్మిత పటమండపాలే నివాసగృహాలు. ఈమర్రిచెట్లలో ఒకదానిక్రిందికి తెచ్చిదించాడు అద్దెను అడ్వాన్సుగా ఇవ్వజాలనందున ఆగుడిసెనుంచి బయటికి వెడలనడిస్తే గుడ్డాపాతా రోడ్డుమీద పడేసుకొని దుఃఖిస్తూ కూర్చున్న తల్లికొడుకులను రాములు నిజమైన ఆపద్బాంధవుడు.

ఇకఇప్పుడు రాములును గురించి కొంచెంవివరంగా చెబుతాను వినండి. ఇతడూ భారతీదేవి మొదటినెంబరు పుత్రరత్నమే. మాచర్లసీమ ఇతనిజన్మభూమి. ఇంటిదగ్గర స్వగ్రామంలో ముసలితలిదండ్రులు దప్ప మరెవ్వరు లేరు. పొట్టకోసం పట్నంచేరిన ప్రాణుల్లో ఒకడు. వెంకయ్య దగ్గరచేరకపూర్వం దినాలు ఎట్లాగడిచాయోగాని అతని జట్టిలో కలిసిందిమొదలుకొని రాములుకు రెండుపూటలా కడుపునిండా అన్నం దొరుకుతూవచ్చింది. బావా అక్కా అని వెంకయ్యా వెంకమ్మలను పిలుచుకొంటూ చాలాచనువుగా వుండేవాడు. ఇతడూ, నాగులూ, వెంకయ్యా ముగ్గురుకలిసి రోజల్లాకష్టపడి సంపాదించు కొనేడబ్బులను నాలుగు సమభాగాలుచేసికొని ఒండి వాడుకాబట్టి వెంకయ్యకు రెండుభాగాలిచ్చి చెరో భాగం తక్కిన ఇద్దరూ తీసికొంటూఉండేవాళ్లు. పగటిపూట లాకాలేజి ఆవరణంబైట చెట్లక్రిందా, రాత్రిపూట ఎలెక్ట్రిక్‌దీపాన్ని ఆశ్రయించి ఆప్రాంతాలందే అన్నం అమ్ముతూఉండే ఏపెద్దమ్మదగ్గరో అన్నం కొనుక్కొని అక్కడేకూర్చుండి తిని ఎక్కడ అనువైనచోటుదొరికితే అక్కడే పడి నిద్రపోతూవుండడం మామూలు. ఎప్పుడైనా అక్కా బావలదగ్గరకూడా తింటూవుండేవాడు పండగాపర్వమై వాళ్లు మరీమరీ బలవంతంచేస్తే. ఇట్లు జీవననిర్వాహకం చేసుకొంటూ మిగుల్చుకొనే తృణమో పణమో వెంకయ్యవద్దనే దాచుకొని నెలారెండునెల్లకు ౫, ౬ రూపాయలు పోగైనతర్వాత ఆమొత్తాన్ని అడిగితీసుకొని ఇల్లు కదల్లేని తనతలిదండ్రులకు పంపుతూవుంటాడు. వెంకయ్య తనడబ్బూ, రాములిచ్చిందీ కలిపి ఏజంటుపరంగా ఇచ్చేవాడు. కాబట్టి రా. బ. గారు దిగమింగిన వెంకయ్య రొక్కంలో ఈదరిద్రుడి నెత్తుటికూటి అంశంకూడా ఉంది. కాని వారిది అగస్త్యజఠరాగ్ని. ఇటువంటి వాతాపి అంశాలు ఎన్ని జీర్ణమైపోయినాయో ఆమహోదరంలో. వెంకమ్మకూ తెలుసు ఈసంగతి. బండిని అమ్మిననాడు వచ్చినపైకం ఇంకా ఖర్చుపడకముందే, "నాయనా, నీపైకంమాట ఏమంటావు! మనలనందరినీ ముంచాడుకదా ఏజంటు" అని ఆసంగతి ఎత్తేసరికి తనకప్పుడు డబ్బు అవసరంలేదనీ, అగత్యంగా కావలసిన దాని కర్చుపెట్టుకోమనీ చెబుతూ "అక్కా! వెంకయ్యగాని, నీవుగాని ఆడబ్బును దిన్నారా పెట్టారా! అంతా ఏజంటే కాజేశాడాయె. ఈ యవస్థలో ఏమొగంపెట్టుకొని నిన్ను డబ్బు అడగనూ! దినవారాలు గడవనీ తర్వాత చూసుకోవచ్చులే" అని ఆమె వద్ద డబ్బును తీసుకొనక ఓదార్చి, ధైర్యంచెప్పి యామెకు తోడ్పడిన మహోదారఆత్మ రాములు. చింకిచాపలనూ, చినిగినగోనెపట్టాలను, సీనారేకులను ఇంకా చిల్లరవస్తువులను పోగుచేసి వెంటనే తల్లికొడుకులకు సరిపొయ్యేలాగు క్షుద్రకుటిని గజమెత్తుదాన్ని తయారు చేసి వాళ్లకు తలదాచుకోదానికి వెరవుగల్పించిన దయామయుడితడు.

సకలవిధసంపదలతో తులదూగుతూ, స్వదేశంలో, స్వంతగ్రామంలో బంధుమిత్రాదులతో కిటకిటలాడుతూ వుండే స్వంతగృహంలో, విహరించే ఉల్లాసవంతమైన, సహజసుందరమైన ఈతన్వంగిని ఏకళ్లతో చూశాడో అవేకళ్లతో ఇప్పుడీవిదేశంలోని క్షుద్రకుటిలో సర్వథా నిరాధారమైన, చింతాసంతాప ఉపవాసాలచేక్షీణించిన కృశాంగినిగా జూశాడు కాలపురుషుడు సర్వవ్యాపి. కాని ఆకళ్లనుండి ఒక్కనీటిబొట్టయినా వెలువడిందికాదు. ఆశ్చర్యం.

ఏదో ఒకజట్టీలోచేరితేనే కాని రాములువంటి అనాథలకు ప్రతిరోజూ కూలీ దొరకదు. వెంకయ్య పోయినతరువాత ఇతనికి జట్టీ ఎక్కడా సందర్భించలేదు. సర్కారునౌకరీ దొరకడం ఎంతకష్టమో అంతకన్నా ఎక్కువకష్టం ఏదో జట్టీలో భాగందొరకడం. కాబట్టి ఒక్కనాడెక్కడైనా కూలీదొరికితే రెండురోజులు ఎక్కడా దొరికేదికాదు. అట్లా తంటాలు

పడుతూకూడా తనఅక్కను ఉపవాసాన్నుంచి తప్పించాలని ప్రయత్నిస్తూ ఉంటాడు ఈపరోపకారి. కాని ఆమె ఈదరిద్రుణ్ణి పస్తుంచడానికి సహించేది కాదు.

ఈచెట్లక్రింద కాపురాలుచేసేదరిద్రులకు సమస్త విధాలా కొదువచేశానుగదా అని పశ్చాత్తాపం పొందాడు కాబోలు భగవంతుడు సంతానవిషయంలో ఆ నిందను పోగొట్టుకోడానికి పూరాపూరా ప్రయత్నంచేసి సర్వప్రథమంగా నెగ్గాడుకూడాను. ఏ ఆస్పత్రులు, ఏడాక్టర్లు, ఏనర్సులూ, మంత్రసాన్లు లేకుండానే నిరుపద్రవంగా పిల్లలను ఈనుతూ ఉంటారు చెట్లమీదిపక్షుల్లాగే చెట్లక్రింద ఈయనాథపక్షులుగూడా. సంధ్యాసమయాలందు ముఖ్యంగా సకలప్రాణులూ వానివాని ఇండ్లకు చేరే వేళకాబట్టి ఈచెట్ల యనుగునుంచి పైవరకూ లేచే ప్రాణిసంచయాలరొదలు పల్లెటూళ్ళలోని సంతరొదలను తలపులోకి తెస్తూఉంటాయి. ఈసంసారాలకు చెందిన పిల్లసన్యాసులనేకులు గుంపులుగుంపులుగాగూడి ఆడుకొన్నతిసే తావులనుగనిపట్టి-ప్రయాణీకులు బస్సు లెక్కి దిగేచోట, ట్రాములు ఆగేచోట, రైలుస్టేషనుకు పోయేమార్గాలు, గుళ్లూ గోపురాలముందు, మసీదులదగ్గర ఇత్యాదులు ప్రధాన యాచన్థలాలు- వచ్చిపొయ్యేవారిని అయ్యాపైసా అని యాచించడం మామూలుచేయిచాచి, మరోచేత్తో పొట్టలను నులుముకొంటూ. ఈబాలసన్యాసిమండల్లో ఒకదాంట్లో చేరాడు సోముడు తల్లి కెరుకలేకుండానే. వాడికి నాలుగు పైసాలు దొరికాయి. అవి తీసికెళ్లి తల్లికిస్తే అవివచ్చిన విధానం అడిగి తెలిసికొని ఆమె మహాకరుణంగా వాపోయింది. కాని అనన్యగతికావస్థ. అప్పటికే రెండురోజుల నుంచి పస్తుపడివున్న జీవాల గంజినూకలకు ఆ అణా డబ్బులే ఆధారమైనాయి.

3

రాత్రి సుమారు ౯ గంటలసమయం. వాషర్మన్ పేట హైరోడ్డుమీది ఒకానొక నెంబరు ఇంట్లో కాపురమున్న భార్యాభర్తల కీసంభాషణం జరుగుతూవుంది.

" ఇక ఈనెలలో మనంపడాలిసిన కష్టాలకు మేర ఉండదు. పిల్లలూ మనమూకలిసి ఉపవాసాలు చేయాలిసిందే తప్ప వేరోదారి కన్పించడంలేదు." అని విచారాక్రాంతమైన దీనముఖంతో అన్నాడు ఇంపీరియల్ బాంకీక్లర్కు రామారావు. ఆయన కెదురుగుండా కొంచెం దూరాన ౭, ౮ నెలల బిడ్డకు పాలిస్తూ కూర్చుంది ఆయనభార్య సుందరమ్మ. మరికొంత వ్యవధానంలో పిల్లలిద్దరు నేలపైపరచిన పక్కలమీదపడుకొని నిద్రబోతున్నారు. పెనిమిటిమొగంమీదికంటె పదిరెట్లెక్కువదైన్యమూ ఆత్రమూ ఈమె ముఖంమీద నటిస్తూ ఉన్నాయి.

" ఏ అదృష్టవంతుడికి దొరికాయో! చూడంగానే మహానందంపొందుతాడు. కళ్లుచల్లబడుతాయి" అంది ఆమె.

" తక్కిన బాకీలన్నీ ఏలాగున్నా రెండుమూడు గండగత్తెరబాకీ లున్నాయి. వాటికేంగతా అని ఆలోచిస్తూ ఉన్నాను. ఇరవై రూపాయలు చెల్లించాలి ఇన్ష్యూరెన్సుకంపెనీకి నాలుగైదురోజుల్లో. ఎక్కణ్ణుంచి తేగలనూ. ఆవాయిదాతప్పిందా రెండేళ్లనుంచి ఇంతవరకు చెల్లించిన రొక్కమంతా స్వాహా అయిపోతుంది. " అని నిట్టూర్పువదలుతూ అన్నాడు రామారావు.

" ఇప్పటిపోను ఖరీదునుబట్టి ఎనభై రూపాయలు. గంగలోకలిసిపోయినాయి " అంది ఇంటి అవిడ.

" ౧౫ నో తారీఖువస్తూఉంది పెద్దపులిలాగు. పిల్లవాళ్ల జీతాలుచెల్లించడానికి ఆఖరురోజు. ఆనాటికి ఇవ్వకపోతే జుల్మానాలు అంటగట్టి మరినాలుగురోజులు గడిస్తే అసలుపేరే కొట్టిపారేస్తారు. మళ్లీ పేరువ్రాయించాలంటే సంవత్సరపు జీతమూ అచ్చుకోవాలి. " అని వాపోయ్యాడు ఇంటియజమాని.

" అన్నీ అట్లాంటి అవసరాలే. దేన్నిమానుకోగలం. తిన్నట్లా కుడిచినట్లా " అని దిగులు మొగంవేసుకొని చూస్తూఉంది.

"వీటిని అన్నిటిని మించిన నెత్తిమీదికుంపటి. తలుచుకొంటె వొళ్లు జల్లుమంటుంది. ఆకసాయీ మార్వాడీబనారసీదాసు నాపరువు దక్కనీయడు. అప్పు డేదో గొంతుమీదికి కత్తివచ్చి ఏముహూర్తాన అతనివద్ద అప్పుచేశానో ఎప్పుడూ ఏదో ఒక ఆటంకమే దాన్ని మరల తీర్చివేస్తామంటే. పోయిన నెలలోనే నామీద దావాపడేయడానికి సిద్ధమయితే అతని రెండుచేతులూ పట్టుకొని ప్రార్థించి ముందునెలలో తప్పకుండా కొంత ఇస్తాననిచెప్పి అతన్ని ఒప్పించేసరికి నాపెద్దలు దిగి వచ్చారు. ఇకనతడు ఊరుకొంటాడనుకోవడం వట్టి ఆశ. రచ్చకీడ్చక మానడు."

"అయ్యో నాకర్మమా."

"ఎంతకఠినుణ్ణో! ఆఫీసులో జీతంతీసుకొనే సమయాన్ని ఒకస్నేహితుడు ఎంతోప్రాధేయపడి పది రూపాయలు అప్పివ్వమని అడిగాడు అతనిభార్య నీళ్లాడడంచేత ఇంట్లో చాలాఇబ్బందిగావుందని. వీలు కాదంటే కాదన్నాను. నిజానికి వీలుకాదుకూడా. కాని ఇచ్చివుంటే ఆరూపాయలైనా దక్కివుండేవి కదా అని ఇప్పుడేమో వెధవాశ."

"ఇట్లా కొంపమునుగుతుందని తెలిస్తేగదూ!"

"కాషియరుగారు ఇచ్చినవానిని ఇచ్చినట్లు చిన్నగుడ్డలోబిగించి కట్టి కోటులోతట్టుజేబులో వేసు కొన్నాను. మహాఆశ్చర్యంగా మటుమాయమైపోయింది. మూటకుమూటా."

"ఏదొంగసన్నాసైనా కాజేశా డనుకోడానికి బయటిజేబులలోగూడ గాదు. ఎంత నిర్భాగ్యులం."

"సాయంకాలం ఆరున్నరగంటలై ఉండవచ్చు. వాతావరణం మసకమసగ్గా ఉంది. దీపాలుకొన్ని వెలి గించారు కొన్ని లేదు. బజారులోని మందుల అంగడికి వెళ్లి బేరం కుదరనందున ఇంటికివద్దామని బయల్దేరాను. బ్రాడ్వేమొదట వాషర్‌మన్‌పేటట్రాం సిద్ధంగా ఉంది. జనులు ఆడావిడిగా ఆడా, మగా అనే వివక్షలేకుండా ఒకరిమీదఒకరుపడి నెట్టుకుంటూ ఎక్కుతూవున్నారు. నేనూ ఎక్కబోతూఉంటే ముష్టిఎత్తుకొనేవా డెవడో "అయ్యా! ఒక్కపైసా" అంటూ వెంటబడ్డాడు. ఏమైనా ఇద్దామని బయటి రెండు జేబులూ వెదికాను. ఏమి దొరికాయికాదు. జేబులు వెతకడంవల్ల మరింత ఆశపడి తప్పకుండా ఇస్తానని నిలుచున్నవాణ్ణి పొమ్మన జాలక లోతట్టుజేబులో ఏమైనాదొరకవచ్చునని చేయి వేసి అందులో ఉన్నవన్నీ బైటకులాగాను తొందరగా. అడుగున ఒకకాణీ దొరికింది. దాన్ని ముష్టివాడిచేతులో పడేస్తూ ఉండగానే కండక్టరు విజిల్ ఊదాడు. ట్రాం కదిలింది బయటికి దీసిన వాటినన్నింటినీ ఆచేతిలోనే జేబులో కుక్కుతూ రెండోచేత్తో కటకటాలు పట్టు కొని లోపలప్రవేశించడానికి దోవదొరకనంత ఇరుకుగా జనం క్రిక్కిరిసి వున్నందున ప్లాట్‌ఫారం బోర్డుమీద అట్లే నిలవబడ్డాను చాలాదూరంవరకూ. నిజంగా నా కాసమయంలో అమూట ధ్యానమే లేదు కర్మం. రాయ పురం ఆస్పత్రిముందు బండిఖాళీఅయినందున లోపలికి వెళ్లి కూర్చున్నాను. టెర్మినస్‌దగ్గర ట్రాం దిగి ఇంటికి వస్తూ స్టోర్సులో ఇవ్వాలిసిన బాకీని ఇచ్చేద్దామని లోపలికెళ్లి లెక్కజూడమని మూటకోసం జేబులో చేయివేద్దునుగదా ఏముందీ. మూటా లేదు. ముల్లే లేదు. గుండెగుభేలుమంది. వెదికిందాన్నే వెతుకుతూ ఉన్న జేబులన్నీ ఘాలించాను వ్యర్థం. వొళ్ళంతా చెమటలు పట్టింది. నెత్తి వేడెక్కింది. రొమ్ముల్లో ఏదో అడ్డం పడ్డట్టయింది. పిచ్చెత్తినవాడులాగు వికారపు చూపులు చూసుకొంటూ స్టోర్సువానితో ఏమీ చెప్పకుండానే వెనక్కుపరుగెత్తి టెర్మినసు చేరాను. నేను దిగినట్రాం ఎప్పుడోవెళ్లిపోయింది. మరోట్రాంమీదపడి బ్రాడ్వే చేరాను. దారిపొడుగూనా పరకాయించి చూస్తూనే పొయ్యాను, మూట ఎక్కడైనా కంటబడుతుం దని. బ్రాడ్వేలో ఎక్కినచోట దిగి అడుగడుగూ పరిశో ధించాను ఇటు శ్రీరాములునాయుడు పార్కువరకూ, అటు మందుల షాపువరకూ. వృథా. ఎవర్నడగనూ, ఏమని అడగనూ! ఆఖరుకు ప్రాణంవిసికి కొంప చేరు కొన్నాను. ఈ ఇన్స్యూరెన్సు కంపెనీలు, ఈ స్కూలు మార్వాడీపోట్లూ లేకుంటే ఇంకో ఎనభై పోయినా

లక్ష్యంచేసేవాణ్ణే కాదు. ఏం చెయ్యనూ. అని నెలజీతం పోగొట్టుకొన్న విధానమంతా చెప్పుకొచ్చాడు భార్యతో రామారావు.

ఈపట్నపు మాహాత్మ్యమేమిటో దరిద్రుల జీవనాలేగాదు. మధ్యమశ్రేణి గృహస్థుల జీవనాలూ ఒడిదుడుకులతోనే నడుస్తూఉంటాయి ముఖ్యంగా ఇతర స్థలాలనుంచివచ్చి ఇక్కడ నౌకరీసంపాదించుకొని అద్దె ఇండ్లలో కాపురాలుచేసే వాళ్లవి. లోభదేవతాపూజారులమాట ఏమోకాని తక్కినవారిలో చాలామందికి నెల తిరిగేసరికి చేతిలో రాగిడబ్బైనా మిగలదు. రవంత ఉదారాశయంగలగృహస్థు అయితే ఇక చెప్పవలసిందేముందీ ఆదాయానికి రెండింతలు అప్పయి కూర్చుంటుంది నెలజీతంవచ్చేసరికి. పిల్లాజల్లాకలవాళ్ల పని మరీ అన్యాయం.

సంభాషణానంతరం భార్యాభర్తలిద్దరూ ఏదో ఎంగిలిపడ్డారుకాని సరీగాభోజనంకూడా సయించలేదు. "పోయినసొమ్ము తెచ్చిఇచ్చినవారికి మంచిబహుమతి ఇవ్వబడు" నని వార్తాపత్రికలలో ప్రకటనంజేయించి ఈవిషయమై పోలీసుకమీషనరు ఆఫీసులో రిపోర్టు చేయాలని నిశ్చయించుకొని శయనించారు. రాత్రి ఏలాగో గడిచిపోయింది. అయిదుగంటలు అయీ కాక మునుపే వచ్చి తలుపుకొట్టాడు "అమ్మా! పాలూ" అంటూ కాఫీకిపాలుపితికి ఇచ్చేమునుసామి. సుందరమ్మ లేచి తలుపుతెరచుకొనివచ్చి పాలుపోయడానికి గిన్నె ముందుపెట్టుకొని గడపమీదకూర్చుంటే అతను పాలు పితుకుతూ "అయ్యగారికి నిన్న జీతాలువచ్చివుంటాయి. గొడ్లకు మేతబొత్తిగా అయిపోయింది. ఈనెలకు ఇవ్వవలసిన దానికితోడుగా ఇంకో రెండుమూడు రూపాయలు ఎక్కువ దయచేయించాలని చెప్పండి అయ్యగారితో" అని ఇంకా ఏమో చెప్పబోతూఉంటే మధ్యనే ఆపి "మున్నా! నీకు ఇవ్వాలిసిందే ఇవ్వలేమేమో ఈనెలలో. నిన్న అయ్యగారు జీతంతీసుకొని వస్తూవుంటే యావత్తు మొత్తం ఎక్కడో జారిపడిపోయింది. రాత్రిన్నుంచీ ఏమీతోచడంలేదు. ఈనెల ఎట్లాగడుస్తుందా అని దిగులుపడుతున్నాం" అని అంది. ఈమాటలకతని గుండెల్లో రాయిపడి పాలు పోసి మొగంతేలేసుకొని వెళ్లిపోయినాడు. తరువాత ఒకగంటకు దొడ్డితుడిచే మనిషివచ్చింది. "అమ్మగారూ జీతం ఇప్పించండమ్మా" అంటూ సాయంత్రంరా, అయ్యగారు ఇంకానిద్రనుండి లేవలేదని సుందరమ్మ చెబితే "అడగంగానే ఇచ్చేది లేదుగదా. వందలకు వందలకు రూపాయలు ఖర్చుపెట్టుకొంటూ వుంటారు. మాముష్టిజీతాలకాడ వస్తాయి ఎక్కడాలేని రేపు మాపులూ" అని మెల్లగా గొణుక్కొంటూ పోయింది. ఆమనిషి నాలుగైదు ఇండ్లు దాటిపోయిందో లేదో మరోవేపునుంచి ప్రత్యక్షమయ్యాడు నెత్తిన గుడ్డల మూటపెట్టుకొని జీతాలువచ్చేనాటికి మాత్రం సకాలంలో క్రమంగా గుడ్డలనుతెస్తూ, తర్వాత సకాలం, క్రమమంటే ఏమిటో ఎరుగని చాకలిదేవత "గుడ్డలు లెక్కట్టుకొని డబ్బులు ఇప్పించండమ్మా" అంటూ. "గుడ్డలమూట అక్కడపెట్టిపో. అయిదారు రోజులు కొంచెం తాళితేగాని పైకంరాదు ఈనెలలో. గొప్ప అనర్థం సంభవించింది." అన్నదీమె.

"ఏమిటండీ! ప్రతినెలలోకూడా ఏదో ఒక ఇబ్బంది అంటూవుంటారు" అని అనగా ఈమె "గ్రహచారం మరి. ఇబ్బందికలిగితేనే అనేది. ఒకటి రెండు రోజులు వెనకాముందూ. ఇంతలో నీడబ్బెక్కడాపోదు."

"డబ్బుపోతుందని కాదు. మేమూ రేవులకు పన్నుచెల్లించాల త్వరలో. లేకపోతే గుడ్డలను ఉతకనివ్వరు. అందువల్ల ఆలస్యమైతే మళ్లీమీరే గుడ్డలను సరిగ్గా తేవడం లేదంటారు. మీరంతా ఇస్తేనేకదా మేమూచెల్లించేది. ఎక్కణ్ణయినా చూసి ఇప్పించండి మళ్లీవస్తాను" అని వెళ్లిపోయినాడు. చాకలి వీధి మలుపు దాటాడోలేదో నెయ్యిపోసేసెట్టి హాజరయ్యాడు. రాత్రంతా సరిగ్గా నిద్రలేక చల్లగాలికి తెల్లవారే సమయాన్ని కొంచెం నిద్రగూర్కిన రామారావు వచ్చి పోయేవారి మాటలన్నింటివలన మేలుకొని బయటికి రావడంతోటే సెట్టిగారిదర్శనమైంది. అతని జూస్తూనే ఇతను "గురవయ్యా" ఇదే యతనిపేరు—"ఈ నెలలో

మహాప్రమాదం జరిగింది" అని డబ్బుపోయిన సమాచారం తెల్పి "ఎక్కడయినా మళ్లీ రూపాయలు చూసేవరకూ ఓపికపట్టాలి, లేకపోతే వీల్లేదు" అనిఅన్నాడు ఆపెద్దమనిషి మొగం చిట్లించుకొనడంలోనే తన మనోభావాన్ని ఎరుకపరచి వెళ్లాడు. ఈప్రకారం తెల్లవారుగట్ల మొదలుకొని ఇళ్లే కూరగాయలవాళ్లు, పెరుగువాళ్లు, తమలపాకులవాళ్లు, స్టేషనరీ దుకాణదార్లు, గుడ్డలకొట్టువాళ్లు ఎందరో డబ్బు పుచ్చుకోవలసినవాళ్లు ౯ గంటలవరకూ వచ్చిపోతూనే వున్నారు. ప్రతివాళ్లకూ ఏదో సమాధానం చెప్పి పంపిస్తున్నారు భార్యాభర్తలు. ఇంటి అద్దెవాళ్లు, స్టోర్సువాళ్లు, మార్వాడీలు మొదలగు పెద్దపద్దులవాళ్ల దాడి ఇంకా ఆరంభం కాలేదు. వీళ్లతో ఏప్రకారంచెప్ప గలనో యని ఆలోచించుకొంటూ కూర్చున్నాడు ఇంటిముందు వసారాలో చాపమీద. రామారావు. ఇంతలో పోస్టుజవాను వచ్చి ఒక కవరును వీరిచేతికందిచ్చి పోయినాడు. దానిని విప్పి చూస్తే ఈక్రిందిప్రకారవుంది.

"అన్నయ్యా! నమస్కారాలు.

ఉభయకుశలోపరి.

నీపిల్లలతో నీవక్కడ తంటాలుపడుతూ వుంటే మధ్య నీకీతొందర గల్పించాలని నా ఉద్దేశం కాదు. కాని వేరోదారి కనుపడక నీ కీకష్టమివ్వడానికి పాల్పడుతూ ఉన్నాను క్షమించు. నా రెండోకూతురు చిరంజీవి లలితకు– "అంతామనఅమ్మరూప మేరా, ఆమే మళ్లీ మనఇంట్లో ఈరూపంగాపుట్టిం"దని నీవు ఎత్తిముద్దాడినదానికి–అయిదారు నెలలనుం చీవొళ్లు బాగాలేదని నీకిదివరకు తెలిసేవుంది నేను అప్పటప్పట వ్రాసిన వుత్తరాలద్వారా. కాని వారంరోజులకిందట అకస్మాత్తుగా తీవ్రజ్వరం తగిలి ప్రక్కలు ఎగవేయడం, ఆయాసం ఆరంభమైనాయి. అప్పుడు నేను ఇంట్లోగూడా లేను. ఏదోపనిమీద పరాయివూరికి వెళ్లి రాత్రి ౯ గంటలకు ఇంటికి వచ్చేసరికి పిల్లను చేతుల్లో పెట్టుకొని ఏడుస్తూ కూర్చున్న చి. నీమరదలను కొంచెం ఓదార్చి వెంటనే బిడ్డను ఆస్పత్రికి తీసుకొనివెళ్లాను. కాని పిల్లదాని అవస్థచూచి నాకే స్మృతి తప్పిపోయింది ఆస్పత్రి చేరేసరికి. ఎరిగినవాళ్లు నన్ను గుర్తించి కళ్లునూసుకొని పడివున్న నాచేతుల్లోని బిడ్డను లోపలికి తీసుకొనిపోయి పరీక్షించి, మందుతాగించి, నా వద్దకు తీసుకొనివచ్చి నన్ను లేవదీసి "మీపిల్లకేమీ భయములే"దని చెబుతూ మందుసీసా, ప్రిస్క్రిప్షన్ చీటీ ఇచ్చారు. ఆటుమీద కొంతధైర్యంతో ఇంటికిపోయి పిల్లను తల్లికి వప్పగించాను. కాని జబ్బుఏమీ నయమైనట్లు కానరాలేదు. క్రమంగా దినాలు గడచినకొలదీ దగ్గూ, గురకా, ఆయాసం, ప్రక్కలెగర వేయడం ఎక్కువైనాయి. ఇప్పుడు నీళ్లుకూడా తాగడంలేదు. పిల్ల క్షీణించిపోతూ వుంది. అసలు వ్యాపారపుమాంద్యంరోజులూ, అందులో దీని అస్వస్థతమూలంగా బొత్తిగా పడిపోయింది నావర్తకపు పని. దానికి తగినమందు వేయించుకోడానికి గూడా పైకంలేదు చేతులో. జాడ్యం పెరిగిపోతూ ఉంది. దేహస్థితి పాడవుతూఉంది. బలం బొత్తిగా క్షీణించింది. ఇందువల్ల తల్లిమనస్సుకూ శాంతిలేదు. కాబట్టి కష్టమిస్తున్నందులకు క్షమించి ఈవుత్తరం చూచిన తక్షణం రు. ౨౫ లైనాపంపి ఆపత్తిలో ఉన్న నన్ను రక్షించు. దానికి మంచి మందూ మాకూ చూసుకొంటాను. అన్యథా నాతల్లి నాకు దక్కదేమో. అంధకారంలో వున్నాను. అన్నయ్యా! పుత్రికాభిక్షం పెట్టు.

నీప్రియసోదరుడు, కళ్యాణం."

ఈ వుత్తరంతో ఉన్న మతికూడా చలించిపోయింది రామారావుకు. కళ్లవెంట నీళ్లుగార్చుకొంటూ ఆబిడ్డను కాపాడమని సమస్తదేవతలకూ మ్రొక్కుతూ గోడకు చేరగిలపడిపోయినాడు.

౪

దరిద్రులంటే లోకువ ప్రత్యక్ష భూతాలకే కాదు అదృశ్యాలకుగూడా. అందుచేతనే వెతుక్కొంటూ వచ్చిపట్టుకొని ఆలింగనం చేసుకొంది తల్లికొడుకులను (వెంకమ్మ - సోములు) వీళ్ళ దుర్భాగ్యదేవత ఎక్కడో ఏచెట్లక్రిందనో పడివుంటే. వీళ్ళ కీ కోట స్టేషనుప్రక్క చెట్లక్రింద నిండుపస్తులతో అర్ధాన్నా

లతో ఎన్నో రోజులు గడవలేదు. ఉన్నట్లే ఉండి ఒక నాటిరాత్రి రెండుజాములు దాటింతర్వాత ఆరంభమైంది ప్రచండమైన గాలివాన. ఆనాటి సాయంకాలం నిర్మలంగావుంది ఆకాశం నాలుగువైపులా. రాత్రి పది గంటలప్పుడు కూడా దేదీప్యమానంగా ప్రకాశిస్తూ వున్నాయి నక్షత్రరాసులు ఎటుమాసినా ఆకాశమంతటా పోతవెండితునకల కుప్పల్లాగు. రాత్రి కింతట వానరాబోతుందని అనుమానమైనా కలిగిందికాదు ఎవరికీ. సామాన్యజనుల కేమిటి! మద్రాసు అబ్జర్వేటరీలోని వాతావరణస్థితిపరివర్తనవేత్తల కైనా గోచరించింది కాదు ఈమిడిమేలపు అకాలవర్షా సంపాతపు సూచన. ఏనాగపట్నంప్రాంతల్లో సముద్రంమీద పోగయిందో తుపాను హఠాత్తుగా పశ్చిమోత్తరంగా దౌడు సాగించి, దారిలో అడ్డంతగిలిన స్థలాల నన్నింటినీ పోలీసులాఠీప్రహారవిజృంభణవినిర్మిలసత్యాగ్రహ రం గా లు గా మార్చుకొంటూ యకాయకి చెన్నపట్నంమీదబడి విలయసంహారకార్యం మొదలెట్టింది. హోరుమని గంటకు ౬౦ మైళ్ళవేగంతో చెలరేగి వీస్తూఉన్న వాయువులో ఒకవిధమైన విరావరోదనధ్వను లుద్భవించి పంచభూతాలు మూలుగుతున్నాయా అనిపించింది భీకరంగా. వర్షాసంపాతపుధ్వని ఆవాయువేగ ధ్వనితో నేకీభవించి అన్యశబ్దమాత్రాన్ని రూపుమాపింది. ఎలెక్ట్రిక్ స్తంభాలనేకప్రదేశాల్లో అనంతశాయీవినోదాలను ప్రదర్శిస్తున్నాయి. అతిమదిరాసేవనంచేత వొళ్లుతెలియక నేలమీద కుప్పగాలివున్న త్రాగుబోతుల్లాగు భూమిమీదపడి వున్నాయి పెద్దపెద్దవృక్షాలు. ఎలెక్ట్రిక్ తీగలు తెగి కరెంటునిలిచిపోవడంచేత దీపాలన్నీ ఆరిపోగా కన్ను పొడుచుకొన్నా గానరాని గాఢాంధకారం. ఉండి వుండి ఎప్పుడో తళుక్కుమనే మెరుపు దీన్ని మరింత గాఢం చేస్తూఉంది. వర్షం తెరలుతెరలుగా కురుస్తూ ఉంది. ఒక్కొక్కతెర కుంభాలతో నీరుదిమ్మరించినలాగే. ధారాసంపాత భూతలసంఘర్షణంచేత రెండు మూడుగజాలఎత్తున పొగలులేస్తున్నాయి. ఒక్క అర గంటలో జలమయం. మరో అరగంటలో హైకోర్టు మొదలుకొని రటన్ బజారువరకు ఒకటేప్రవాహం.

రైలుపట్టాలు ఫోర్టుస్టేషనుమొదలుకొని మెడికల్ కాలేజి వరకూ నీళ్లలో మునిగిపోయ్యాయి. గాలివాన ఆరంభంకాగానే మెలకువకలిగిన చెట్లక్రిందనివసించే మొదటి నెంబరు అనాథలు ఎటుమొగం అయితే అటే పరుగెత్తారు కాని పోవాలనుకొన్నచోట్లకు పోయిచేరారో లేదో తెలియదు. ఇక కొంచెం నిదానించిమాసి పోదామని ఆగినవాళ్ల సంగతి ఫైసలా. ఎక్కడివాళ్లక్కడే చిక్కుపడ్డారు. గాలీవానా రెండూకలిసి వీళ్లను మొగంపైకెత్తనిచ్చాయికాదు. ప్రాణాలను బిగబట్టుకొని ఉన్నవాళ్లున్నచోట కూచోవలసిందే తప్ప వేరో మార్గం దొరకలేదు వీళ్లకు. ఎంతో కష్టపడి కట్టుకొన్న ఈయనాథులగుడిసెలు గాలిపటాల్లాగు ఎగిరిపోయినాయి, వీళ్ల కుండలూ సామానులూ కొండవాగులక్రింద పరిణమించిన రోడ్ల ప్రవాహాల్లోబడి తలక్రిందులవుతూ దొర్లుతూ పోతూవుంటే సార్జెంటుదొరలకేకాక వానదేవుడికికూడా ఈయనాథలమీద ఇంత అవ్యాజకారుణ్యమెందులకా అనిపించింది. రాములాసమయంలో అక్కడలేడు. కూలినాలీ విచారించుకోడానికి ఎక్కడికోపోయివున్నాడు. పాపం అతనుశ్రమపడి నిర్మించిన గుడిసె ఒక్కగాలివిసురులో ఎగిరిపోయింది తల్లీకొడుకులను బట్టబయలుజేసి. వెంకమ్మకెటుపోవడానికీ, ఏమి చేయడానికీ తోచిందేకాదు. అసలామె కాన్పులమే కొత్తది. ఎక్కడ, ఎటు, ఏమున్నదీ తెలియదు. కుత్తుకబంటిదుఃఖంతో నిండేవుంది, ఇకదుఃఖానికి తావెక్కడ ఆమెఉదరంలో. అనాథరక్షకుడే తన కికరక్షకుడని సమస్తభారమూ అతనిమీదనే వేసి గుడిసె ఎగిరిపోవడంతోటే చేతికందిన పక్కబట్టలనన్నింటినీ తనమీదగప్పుకొని కొడుకును కడుపునకదుముకొని ఒకవేళ మీదినుండి ఏమైనాపడేయెడల వాడిమీద బడకుండా ముందు తనమీదే పడేలాగు వంగికూర్చుంది. ఈమె యంతఃకరణ నీతరుణంలో విలక్షణదశాపరిణామాన్ని పొందింది. భయవిస్మయచింతాశోకావేగాటులు ఈమెశరీరాన్నుంచి ఎగిరిపోయినాయి. సంకల్పవికల్పాలు నశించాయి. అగమ్యం, అవర్ణనీయమైన ఏదో యోగావస్థవంటిది ప్రాప్తించింది. ప్రాణ ముండికూడా

సంజ్ఞారహితమైన రాతిప్రతిమలాగు బిడ్డను అక్కున చేర్చుకొని కూర్చుంది. వాయువేగంచేత విరిగిపేలగూలే వృక్షశాఖల ఫెళఫెళారావాలు ఈమెకు శ్రవణగోచర మౌతూనే వున్నాయి. కాని ఈమె వాటిని లక్ష్యం చేస్తున్నట్లే అనుపడదు. సమస్త ఇంద్రియాలూ బాహ్యప్రపంచాన్ని మరవడంచేత నిశ్చలావస్థ ఏర్పడింది ఏకారణంచేతనైతేనేమి. ఈమె శరీరాన్ని రాసుకొని రెండుప్రక్కలా నీళ్లు పారుతున్నాయి. వీపుమీద ఫైరింజనుధారలాగు ఒకటే ప్రపాతం. విరిగిన కొమ్మలు ఈమెచుట్టుప్రక్కల పడుతున్నాయి. ఒకమహాశాఖ ఫెళఫెళమంటూ గూలింది ఈమె ప్రక్క కేవలం అడుగుదూరంలో. భూమి అదిరింది కాని ఈమె చలించలేదు. ముఖం వెలుపలికి చూపించడానికైనా సాహసింపజాలని అట్టి మహోపద్రవకరమైనవేళలో వచ్చాడు రాములు దిక్కులేని ఈ తల్లికొడుకుల రక్షించడానికి, ఈతుపాను వర్షంలో వీళ్ళ గతి ఏమైందో అని దిగులుపడుతూ, పర్వతనిర్ఝరులుగ మారిన వీధులనూ, రోడ్లనూ మహాప్రయాసంతో దాటుకొని. గుడిసెలెక్కడా కానరానందున మెరుపు వెల్తురులో ఆచెట్టును గుర్తుపట్టుకొని పోయి కేకలు వేయగా కొంతసేపటికి కామెకు స్పృహకలిగి వినపడి మూలిగింది. ఇతడు దగ్గిరకుపోయి పిల్లవాని తాను దీసుకొని అతి ప్రయాసంతో మోకాలిబంటినీళ్ళలోగుండా నడిపించుకొనిపోయి హైకోర్టువసారాలో చేర్చాడు. అంతకు ముందే అక్కడ ఎట్లో చేరగలిగిన తమ సహగృహస్థులతో చేరుకొని కూర్చున్నారు వీళ్లుకూడా తమ గుడ్డపాతలను పిండుకొని ఎప్పటికైనా తెల్లవారుతుందా అని అనుకొంటూ.

ఈప్రకారం పంచభూతాలప్రకోపం నాలుగైదు గంటలకాలం సర్వసంక్షోభ మయ్యేలాగు విజృంభించి, మానవులు స్వసౌఖ్యాలనిమిత్తం నిర్మించుకొన్న సకల సామగ్రులను, సదుపాయాలను విధ్వంసం గావించి, నానావిధ శస్త్రాస్త్రయంత్ర బలోపేతమైన అఖండ సామ్రాజ్యబలాన్ని మించిన బలం ప్రకృతికి గలదని వాగ్రూపాన్ని గాక క్రియారూపంగా జాటి తాత్కాలికప్రభుత్వవర్గానికి, ఎల్లప్పుడు ఒకేవిధమైన ఉద్దండత సాగడం అస్వభావమని లోకానికి తెలియజేయుటకా అనినట్లు అనంతరం శాంతమార్గానికి దిరిగింది. ఇంతకూ సమస్తప్రపంచాన్ని అదృశ్యంచేసి ఒకవిధమగు భయభ్రాంతిని కలిగించే అంధకారం పటాపంచలైంది. దట్టమైనచీకట్లో జోరునవర్షం కురుస్తూ ఉన్నంతసేపూ శరీరాలను పరిత్యజించి పరుగెత్తిన చెట్లక్రింది యనాథల ఐహికాశలు వెలుతురురాగానే మళ్లీ వాటివాటి ఆశ్రయాలను జేరుకొని వాటిని యథాపూర్వం కార్యరంగాల్లోకి దించాయి. మళ్లీ ఆరంభమయ్యాయి దేహధారణ పోషణకార్యాలన్నీనీ.

అందరితోపాటు తల్లికొడుకులనుగూడ యథాపూర్వస్థానం చేర్చాడు రాములు. కాని "ఛిద్రేష్వనర్థా బహులీభవంతి" అన్నట్లు రాత్రంతా కుంభవృష్టిలో తప్పుడడినందున అదివరకే దుఃఖోపవాసాలచే కృశించిపోయి ఉన్న వెంకమ్మకు శీతజ్వరం ఆరంభమైంది. దానికి మందూ మాకూ లేదు. పట్నంలో దరిద్రులకు సాయపడే ధర్మాత్ములైన డాక్టర్లు ఉండవచ్చు ఎక్కడో. కాని వీళ్లకాసంగతి తెలియదు. అదిగాక మంచిదశలోఉన్నప్పుడే మందులను వాడనిమనుష్యులు, ప్రస్తుతావస్థలో చెప్పవలసిందేముంది. ఏమైతేకానిమ్మని శరీరాన్నే లక్ష్యంచేయకుండా ఉన్నప్పుడు మందులచింత ఎవరికి? ఈమె ఆపేరే తలపెట్టలేదూ. మర్నాడు మరింత ఎక్కువజ్వరం తగిలింది. ఒక్కొక్కప్పుడు ఒళ్లే తెలియకుండా పోయేది. మూలుగుతూ పడుకొనివుంది. ఇంతలో పరుగెత్తుకొంటూవచ్చాడు సోముడు ఏబ్రాడ్వేలోనో కాన్లలను అడుక్కోడానికి వెళ్లినవాడు. నాలుగుకాన్లకంటె ఎక్కువ దొరకలేదనిచెబుతూ "అమ్మా! డబ్బులమూట దొరికిందే రోడ్డుప్రక్కకాల్వలో. లోపల కొత్తకాన్లు మెరుస్తున్నాయిచూడు" అని ఒకచిన్న మూటను ఆమెచేతికిచ్చాడు ఆకాన్లతోపాటు. గట్టిగా ముడివేసివుందిమూట. దాని ఊడదీసిచూస్తే కళ్లను మిరుమిట్లుగొలుపుతూ శౌరీలు మెరుస్తున్నాయి. వాటిని చూడడంతోటే ఈమెకు హృదయకంపన మెక్కు

నైంది. లోపించివున్న భయవిస్మయ సంభ్రమాదులు మళ్లీ ఆవేశించాయి. తనజ్వరాన్నిగూడా గమనించక లేచికూచోని వాణ్ణి బుజ్జగిస్తూ "ఎక్కడ దొరికింది నాయనా! నిజంచెప్పవూ" అని పెక్కుమార్లు అడిగి "రోడ్డుప్రక్కని నీళ్లుపారేకాలవలో" నని వాడు ఒకే విధంగా చెప్పినందున విశ్వసించి కళ్ల వెంటనీళ్లుగ్రమ్ముతూ వుంటే తుడుచుకొంటూ కూర్చుంది ఏదోదీర్ఘాలోచనలో మునిగి. ఇంతలోకే రాములు వచ్చాడు. ఆతని చూస్తూనే దగ్గరకుపిలిచి ౫ శారీలను అతనికిజూపించి మూటగట్టి "అయ్యో! ఏనిర్భాగ్యుడివో ఇదిపాపం! ఏకుటుంబీకుడు వీటిని పోగొట్టుకొని ఎంతఘోషిస్తున్నాడో. నాయనా! వీటిని ఈక్షణం పోలీసుకచేరికి తీసుకొనిపోయి అక్కడివారికి విప్పిచూపించి వాటిని వాటియజమానికి చేరేవుపాయంచేసి రా. నీవు మరలి వచ్చి ఆసంగతిచెప్పేవరకు నామనస్సు శాంతించదు. పాపం ఎంతదుఃఖిస్తున్నాడో ఆపెద్దమనిషి ఇప్పటికే. ఒకటా రెండా ౭౦,౮౦ రూపాయలుచేసే పెద్ద కాసులు నాయనా. త్వరగా వెళ్లు" అని ఆందోళనం సూచించేవేగంతో కూర్చుంది ఆదేవి. దైవాసుర ప్రకృతుల రెండింటిసమ్మేళనమైన ఈదేహానికి దివ్యత్వాన్ని కలుగజేసేవి ఇటువంటి నిస్స్వార్థపు దివ్యాచరణలేగా.

రాములామూటను పట్టుకొని హైకోర్టుపోలీసుస్టేషనుద్వారందగ్గిరికి వెళ్లేసరికి లోపల తనిఖీచేసుకొని వెలుపలికివస్తూఉన్న కమీషనరుగారు ఎదురయ్యారు. రాములాయనకు సలాంపెట్టి ప్రక్కనున్నవారిచేత తనసంగతీ తానెందుకువచ్చింది తెలియచేసి మూటనువిప్పి ౫ పౌనులనూ ఆయనచేతిలో పెట్టాడు. తనవద్దకా విషయమై అదివరకే రిపోర్టువచ్చిఉన్నందున వీటివిచారణావగైరాలకేమీ ఆలస్యంపట్టలేదు కమీషనరుకు. ఇంపీరియల్‌బాంకి మేనేజరు వెరిఫికేషన్‌తో ఆసొమ్మును రిపోర్టుచేసినవారి కిప్పించమని తనక్రింది అధికార్లకు ఆజ్ఞఇచ్చి వెళ్లిపొయ్యాడతను. సమయానికి కమీషనరు అక్కడ తటస్థపడడం రాముల అదృష్టం. అన్యథా ఈసంగతి తెలియని ఏచిల్లర అయ్యవార్లో అయితే రాముల కెన్నితంటాలు పడాలిసివచ్చేదో.

❦

రాములు ద్వారా పౌండ్లు కమీషనరుగారికి చేరినమరునాడు ఉదయం ౯ గంటలకు ఆఫీసుకుపోవాలని బయలుదేరి రామారావు గుమ్మంలోకి రావడంతోనే పోలీసుజవాను ఎదురుగావచ్చి "మీరు కమీషనరుగారివద్ద రిపోర్టుచేసిన బాపతు పౌండ్లు దొరికాయి కాబట్టి హైకోర్టుపోలీసుస్టేషనుకు బోయి వాటినిపుచ్చుకొనవలసినది" అని ఇచ్చిననోటీసును చూచుకొని ఒళ్లు దెలియని మహానందంతో లోపలికి పరుగెత్తి భార్యకీ వర్తమానం తెలియజేసి సొమ్ముపోయిననాడు వెనక్కు పరుగిడినదానికి రెట్టింపు వేగంతో, రెట్టింపు ఉత్కంఠతో, రెట్టింపు గుండెదడతో పోలీసుస్టేషను చేరాడు. ఈయన ముందుగా తన నామధామాలన్నీ ఎరుకపరచి రిపోర్టుచేసివున్నందున ధనంలభించడంలో ఆలస్యమేమీ జరుగలేదు. అక్కడ ఆహూతుడై ఇతనికంటే ముందే వచ్చి కనిపెట్టుకొనివున్న బాంకిమేనేజరు వెరిఫై చేయగా ౫ పౌండ్లు ఈయనచేతిలో పడ్డాయి. ఈయనకప్పుడు ౫౦౦ పౌండ్లుదొరికినలాగైంది. మనస్సులోనే భగవంతుని స్మరించుకొని నమస్కరించాడు. గోతిలో పడుతూవున్న తన్ను బయటికి లాగిన ఉదారాత్మను చాలగ దలచుకొని తనద్రవ్యాన్ని తెచ్చిఇచ్చిన యతనికి కొంచెమో గొప్పగనో బహుమతి నివ్వదలచియున్నందున అక్కడఉన్నవారిని పౌండ్లు ఎట్లా లభించా యని అడగగా వారు బయటనిలుచోని వున్న రాములును జూపించారు. అతన్నిపోయి ప్రశ్నిస్తే అతడది దొరకిన వైనం జెప్పి వెంకమ్మదగ్గరకు పిలుచుకొనిపోతూ దోవలోనే టూకీగా ఆమె సంగతంతా ఎరుకపరచాడు. ఆ చెట్టుక్రిందికి దీసుకొనిపోయి "ఇదిగో ఈమె మీపౌండ్లను మీకు అందేలాగున చేయమనీ, అంతవరకూ తన మనస్సుకు శాంతిఉండదనీ చెప్పింది. జ్వరం ఎక్కువై ఇప్పుడు దేహంకూడ తెలియకపడివున్న" దని ఆమెను జూపించాడు రాములు రామారావుకు. ఈయనకామెను

జూచినవెంటనే ఆశ్చర్యం కలిగింది. పుష్కలంగా ధనం గల ఏ ధర్మాత్ముడికో, వార్తాపత్రికల్లోని తన లేఖను జూచిన యతనికి దొరికినందున తనసొమ్ము తనకు దక్కిందని ఇంతవరకూ ఇతని అభిప్రాయము. కాని సర్వథా తద్వ్యతిరేకమైన ఏదరిద్రురాలో అనుకోలేదు. కాబట్టి ఈమె ఎంతటి ఉదారహృదయయో యని యోచనకలిగింది ఈయనకు. హరించుకోజాలక పంపించా అనుకోడానికి అందుల కనేక మార్గాలున్నాయి. పైగా ఈమెముఖమే చెబుతూవుంది అట్టిఉద్దేశాలే లేని వట్టి అమాయకురాలు దేవతా అని. అన్నంలేక కృశించి పోయినప్పటికీ, దారిద్ర్యంచేత మలినాంబరయై ఉన్నప్పటికీ, జ్వరాధిక్యంచేత కందివున్నప్పటికీ ఆ సాధ్వి మొగం చూడడంతోటే అనురాగయుక్తమైన శ్రద్ధాభక్తులు జనించాయి రామారావుమనసులో. దారిలో రాములుచెప్పినసంగతులు వీటిని మరింత దృఢపరిచాయి. అటువంటి ఉపకారబుద్ధి కల ఉత్తమసతి దేహాన్ని అట్టి అపాయకరమైన దశలో ఆ చెట్టు క్రింద వదలడానికి ఆయన అంతరాత్మ ఒప్పింది కాదు. ఆ నాడు ఆఫీసు మానుటకు నిశ్చయించుకొని జ్వరము నయమగు నంతవరకూ ఆమెను తమ ఇంటి యందే ఉంచుకొందునని రాములుకు నచ్చచెప్పి గుర్రపుబండి నొకదాన్ని దెప్పించి రాములూ మరికొంద రాడవాళ్ల సహాయంతో ఆమెనాబండిలో పరుండచేసి సోమునితో సహా తనఇంటికి దీసికొనిపోయి భార్యకు వప్పగించాడు సంగతంతా ఆమెతో చెప్పి. ఇటువంటికార్యాల్లో పెనిమిటికి వెనుకపడేది కాదు సుందరమ్మ ఆమెవెంటనే సిద్ధమైంది ఈరోగిపరిచర్యకూ. అక్కడచేరిన కొంత సేపటికి ఒళ్లుతెలిసి, నాల్గువేపులాచూసి, దిగ్భ్రమచెందివున్న వెంకమ్మతో జరిగిందంతా తెలిపి రాము లాదంపతులను జూపించగా కృతజ్ఞతాసూచక నేత్రాలతో చేతులుమోడ్చిందీమె వారికి. వారునూ రాములుద్వారా ఈమెకథనంతా బాగాతెలుసుకొని ఎంతోదుఃఖించారు. రెట్టింపుశ్రద్ధాభక్తులతో ఆమెకు ఉపచారం చేయసాగారు మందూవగైరాలను ఇప్పించీ. కాని కాలం మితిమీరిపోయింది. వీరు పోయించేమందులూ, చేయించేవైద్యాలూ, సేవోపచారాలు, అకాలంలో కురిసినవర్షంలాగు నిష్ఫలమైపోతున్నాయి. వీళ్లు పడే పాట్లన్నీ గ్రహిస్తునేవుంది వెంకమ్మ. కృతజ్ఞతతో వందనాలుచేస్తుంది తనకొరకంతగా శ్రమపడవలదని. క్రమంగా శరీరబలంతోపాటు స్వరం చాలా సన్నగిల్లి పోయింది. శోషలూ మూర్ఛలూ ఎక్కువైనాయి. ఉన్నట్లేఉండి ఒకనాడీమెదశ మరింత భీకరమైంది. రామారావు ఆఫీసుకు సెలవుపెట్టి దిన్నబోయికూర్చున్నాడొకప్రక్కన. సుందరమ్మ మరింత ఆందోళనతో ఆమెప్రక్కనే కూచొనివుంది. తల్లిని ఆనుకొని సోముడుకూర్చున్నాడు. కొంచెం దూరంగా రాములు గోడకు జేరగిలబడిఉన్నాడు. అందరిమొగాలు చింతావ్యాకులాలతో నిండిఉన్నాయి. ఆయాస మారంభమైంది వెంకమ్మకు. ఆసమయంలో వచ్చాడు. వీరయ్య బయటనుంచి రామారావుగారు ఉండేది ఇక్కడేనా అనిఅడిగి అవునని లోపలినుండి జవాబుదొరకడంచేత, పట్నంనుంచి వెంకయ్య ఉత్తరంకోసం ఎదురుచూసి చూసి, వ్యర్థంగా, వీళ్లసంగతి ఏమిటో కనుక్కొందామని స్వగ్రామంవదలి ఈనగరంచేరాడు ఇతను ఒకరోజు క్రిందే. కాని ఒకేరిలో తనకు తెలిసివున్న అడ్రెసు ద్వారా ఫోర్టుస్టేషను ప్రక్క, చెట్లక్రిందికిపోయి అక్కడివాళ్లు పోలీసుస్టేషనుకుపంపగా స్టేషనులో దొరికిన ఎడ్రెసుబట్టి ఈ ఇంటిని కనుక్కోడాని ఇతనికి పూరాదినమన్నరపట్టింది. రామారావుకు తన్నెరుగించుకొని లోపలప్రవేశించాడితను. అచటి మొగాలనూ వెంకమ్మస్థితిని చూసేసరికి ఇతనిగుండె నీరైపోయింది. అమ్మా, అమ్మా! అని దగ్గరకుపోయిపిలువగా కొంచెం కదిలింది. "నన్ను చూడమ్మా! నేను వీరయ్యను" అనగా కళ్లువిచ్చి ఇతని పరాకాయించిచూసి ఎప్పుడు వచ్చావు అన్నాయని హీనస్వరంతో అడిగి అతను అప్పుడేయని జవాబివ్వగా ఆయాసంతో మరల కళ్లు మూసుకొని మళ్లీ తెరిచి "మంచిసమయంలో వచ్చావు. అన్నా! నేనిక ఎక్కువ బ్రతుకను. కాని నాదిగులు తీరింది ఆయనకోరికను నెగ్గించానని". అని ఆయాసపడుతూనే కొడుకును దగ్గరకులాక్కొని వాణ్ణి వీరయ్య

చేతుల్లో పెడుతూ "అన్నా నీవానాడు బ్రతికించావే వాడేవీడు. ఇక తల్లిదండ్రిలేని అనాథపిణ్ణి నీకు ఒప్పగిస్తున్నా. ఇక ఈదిక్కు లేనివాడి భారమంతా నీదే" అని అందరివైపు చూస్తూ ఎక్కిలింత రాగా కళ్లుమూసింది. ఆసాధ్వివి అవే ఆఖరుమాటలు అవే ఆఖరు చూపులు. ఒప్పగింతలు. అంతవన్మహా భూతాంశంలోపడి కొటుకులాడుతూ ఉండిన అనంతాంశం అనంతంలో లీనమైపోయింది కొంత సేపటికి. కరెంటుపోయిన భవనమైంది శరీరం.........

వీరయ్య పాపం ఇక్కడి సంగతులు బొత్తిగా తెలియనందున ఎన్నెన్నికోరికలో పెట్టుకొని వచ్చాడు బావనూ చెల్లెలినీ తన మనసార ఆనందపరచాలి అని. వాళ్ళ భౌతికశరీరాలకు చేసే ప్రాప్తం లేకపోయినా వాళ్ళఆత్మలకు సంపూర్ణశాంతిసౌఖ్యాలూకలిగే సమస్త విధులనూ చేయించి సోముణ్ణి వెంటబెట్టుకొని స్వదేశానికి వెళ్లిపొయ్యాడు. రాములకు ఇంకా మద్రాసునీళ్ళ రుణం ఉండడంచేత అతను రమ్మన్నా పోలేదు.

---

"జ్యోతిష ప్రభావము" గూర్చి వ్రాయమనగా మా చిత్రకారుడీ చిత్రమును వ్రాసిపంపె



# సరోజినీ స్వాగతము

రాయప్రోలు సుబ్బారావు




౧

చైత్రపల్లవముల సరిక్రొత్త రుచులలో
పరిమళం బెగఁబోయు బాలమామిళ్లలో
తియ్యగా రాగాలు తీసేటికోయిల
నేర్పెనేమొ సరోజినీదేవి! నీకు
హృదయంగమశిరీష మృదుమంజుఘణితి.

౨

తామరతూండ్లలో ధవళతల్పము మీఁద
అలలూఁప హాయిగా నాడుచూ పాడుచూ
విశ్వమోహనరీతి విహరించుకలహంస
నేర్పెనేమొ సరోజినీదేవి! నీకు
ముద్దులమూటలౌ మురిపెంపునడల.

౩

పన్నీటి సెలయేళ్లు ప్రవహించినట్లుగా
సన్నతంతులవీణ సవరించినట్లుగా
పాడినా వానంద బంధసుందరగీతి
స్వాదుపదావళీ సామ్రాజ్యమునకు
రాణివై కవనకళ్యాణివై దేవి!

౪

పాలెండిపోయిన పాడియావులఁ జూచి
పూతపూవనిగొడ్డు బోఁతులీవెలఁ గాంచి
అనుతాపమాలలన్ ఆగ్రహజ్వాలలన్
వర్షించితివి సుప్తభారతుల్ లేవ
కామాక్షివై మహాకాళివై నీవు!

౫

దౌర్భాగ్యభారత తంత్రతంతులు త్రెంప
సౌభాగ్య భారతజాతకమ్ము రచింప
స్వచ్ఛందదూతివై సౌందర్యమాతవై
భోగిపండుగ పాలుపొంగింపవచ్చి
నావు సరోజినీదేవీమతల్లి !



శుక్ల నవమి
(శ్రీ కాశీనాథరావుగారి ప్రాచీన చిత్రసంగ్రహమునుండి)

# లంచము

ఉభయభాషాప్రవీణ మిన్నికంటి గురునాథశర్మ

నేనొకరోజున పడకకుర్చీలో పండుకొని లంచమనుపదమున దంత్యాక్షరమున్నది గాన యిది తెలుగుదేశంలోనే ఉన్నదాయేమి? అని యోచించుచుండ లంచ్ (Lunch) అను ఇంగ్లీషుపదము స్మృతికివచ్చినది. కేసువిచారించి యిప్పుడే కోర్టువారు లంచికి ప్రైవేట్ రూములోనికి పోయినారు. వచ్చిన తర్వాత తీర్పు చెపుతారంటారు. కనుక లంచ్‌లోనుండియే (ఆంధ్ర మజంతభాష.గాన) లంచము పుట్టినదాఅని మరల అనుకొంటిని. అట్లయిన పాశ్చాత్య దేశాల్లోతప్ప ఇతరదేశాల్లో లంచాలుండకూడదు గదా. ఉంటున్నట్టు కన్పించుచున్నవే. కనుక అన్ని దేశాలకు సంబంధించిన సంస్కృతభాషలో దీనికి ప్రకృతిపదము వుండవలె. అట్లయిననే అన్ని దేశాలల్లో లంచముండటాని కవకాశమున్నది. కనుక సంస్కృత భాషలో 'లంచః' అనుపద ముండితీరవలె. (పుంలింగానికిగాని అంతపౌరుష ముండదులేండి) కాగా లంచః అనుసంస్కృతపదభవమో లేక సమమో లంచమైయుండును. (తద్భవమేఅనుకుందాం) ఇంతఆలోచనలో నామనస్సుకు శ్రమకల్గిందిగాన చప్పున కూరుకుపట్టెను. అప్పుడు కలలోకూడా యిదేఆలోచన. అయితే ధోరణిమాత్రం మారింది. కలల్లో రంగాలు మారటం అందరికనుభవమేగా.

అబ్బబ్బా! యీలంచం దేవత యెప్పుడుపుట్టిందో ఏలోకంలోపుట్టిందో కాని ప్రాణుల నల్లల్లాడించుచున్నది. వ్యవహారాలు తారుమారుచేస్తున్నది. నందిని పంది, పందిని నంది సల్పుతున్నది. ఒకటేమి ప్రస్తుత మీలంచందయ్యమే రాజ్యమేలడం.

అయితే దీని కవస్థాభేదాలున్నాయి. ఒకచో గౌరవింపబడుతున్నది. ఒకచో హీనంగా చూడబడుతున్నది. ఒకచో మారుపేరు పెట్టుకొంటున్నది. ఒకచో రూపం మారుస్తున్నది.

ఇది చిన్న మొదలు పెద్దవరకు వ్యాపించివున్నది. పిపీలికమొదలు బ్రహ్మవరకు నంటిపెట్టుకొనివున్నది.

ఇచ్చినవాడును పుచ్చుకొన్నవాడును ఉభయులు నేరస్థులే అని ఒకశాసనం కాంట్రాసెప్టిక్ మాదిరి అడ్డం వేశారు ప్రభుత్వంవారు దీని కుత్పత్తియే లేకుండటానికి. అయితే "అన్యథా చింతితం కార్యం దైవమన్యత్ర చింతయేత్" అన్నట్లు అసలు పుట్టకుండా వుండడానికి శాసనంచేస్తే అదేశాసనంపుట్టింది; బయటికి రాకుండటానికిగూడ బాగావుపయోగించింది.

కనుక కొందలు దీనినెఱిగియే యెఱుగమందురు. కొంద ఱెఱుగక యెరుగమందురు. కొందరియం దిది గుప్తముగా దాగియుండును.. కొందఱియందు బహిరంగంగా నాట్యంచేయుచుండును. (ఈస్థితిలో నిది నామరూపముల మార్చుకొనును నిత్యంగా) కొందరికిది తమయందున్నదని తెలియదు. కొందరి కున్నదనితెలిసినను లజ్జవొడమదు. అని యొకనాసహపాఠితో (ఈయన కొద్దికాలంక్రిందనే ప్రేతయైనాడు) కలలో చెప్పి ఏమయ్యా! ఈలంచం యేకాలానవున్నదని అడిగితిని. ఆయనగూడా దీన్నిగురించియే చెప్పవచ్చెగాబోలు నన్ను తేరిపారజూచి యనుభూతమును జ్ఞప్తికి దెచ్చుకొన్నట్లు నటించి యిట్లు పల్కమొదలుపెట్టెను.

"పిచ్చివాడా! ఏకాలాన వున్నదనుమంటివా? బ్రహ్మమువలె యిది త్రికాలాబాధ్యమైంది సుమీ ఇది దేవతలు–మనుష్యులు—జంతువులు స్థావరములు పుట్టకపూర్వమేవున్నది. చదువలేదా "సదేవ సోమ్యే దమగ్ర ఆసీత్" అని. సృష్టికిపూర్వమే యిది వున్నదయ్యా. దీనితర్వాతనే సృష్టియంతయు. కనుక ఉపనిషత్తులన్ని దీని నేలా పొగడుతున్నవో చూడు. "భీషాస్మాద్వాతః పవతే భీషోదేతిసూర్యః" (తైత్తి) వాయువు వీచుచుండుటయు సూర్యు డుదయించుచుండుటయు దీనికి భయపడేనయ్యా.

"నాన్యోఽతోఽస్తి ద్రష్టా" (బృహ) దీని నన్యు డెవడూ చూడలేడు. చూచి పట్టుకోలేడన్నమాట. ఎవరన్నా చూస్తుండగా లంచమిస్తారటయ్యా. "యదేవ విద్యయా కరోతి శ్రద్ధయోపనిషదా తదేవ వీర్యవత్తరం భవతి" (ఛాం) తెలివితోడను శ్రద్ధతోడను రహస్యం గాను దీనిం జేస్తే తప్పకుండా పనిజౌతుంది.

"కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషే చ్ఛతం సమాః,
ఏవం త్వయి నాన్యథేతోఽస్తి నకర్మ లిప్యతే నరే.
(ఈశా)

లంచాలు పుచ్చుకొంటూ నూరేండ్లు జీవింపగోర వలెను. ఇట్లుచేస్తే నీకు పాపకర్మం అంటదుగూడ. ఇంతకంటె మరొక శ్రేయస్సాధనం లేదు.

"జనకోహ వైదేహో బహుదక్షిణేన యజ్ఞే నేజే" (బృ) జనకమహారాజు బహుదక్షిణలుగల యజ్ఞము ననగా చాలా పెద్దలంచాలిచ్చి యజ్ఞం చేసినాడట. చివరకు బాదరాయణులవారును "పురుషార్థోఽతః శబ్దా దితి బాదరాయణః" బ్ర. సూ. ఈలంచముశబ్ద ముచ్చరిస్తే చాలు పురుషుల కర్థముచేరుతుంది అన్నారు బాదరాయణులవారు. ఇట్లే యెన్నెని శబ్దప్రమాణముల మూపింపవచ్చును. అయితే వాటి కదిగాదయ్యా అర్థమని యెదిరిస్తావేమో ఛాందోగ్యోపనిషత్తునిండా లంచాలకథలు గలవు. ఒకటి చూపిస్తా చూడు. నాలుగో అధ్యాయము. సంవర్గవిద్య చెపుతానని జానశ్రుతిని లంచం తెమ్మని ఆలంచం తక్కువైతే తిరగ్గొట్టి కొట్టి పిదప స్ఫూర్తిగా తెస్తే రైక్వుడంగీకరిస్తాడు.

... .. "తంహాభ్యువాద రైక్వేదం సహస్రం గవామయం నిష్కోఽయ మశ్వతరీ రథ ఇయం జాయాయం గ్రామో యస్మిన్నాస్సేఽన్వేవ మా భగవః శాధీతి"

— జానశ్రుతి వచ్చి అనుచున్నాడు. ఓరైక్వా! ఇవిగో వెయ్యావులు. ఇదిగో వెలగలరత్నం. ఇదిగో గుఱ్ఱబ్బండి. ఇదిగో నాకూతురు దీనిని పరిగ్రహింపు. ఇంకా నీకేవూరు కావలెనో కోరుకో యిస్తా. ఇవి తీసికొని నాకు సంవర్గవిద్య చెప్పుమంటాడు. ఇంకా నీకేమిదృష్టాంతం కావలె.

జైమిన్యాచార్యులవారు కర్మసిద్ధాంతం చేసారు గదా. కర్మంటే లంచమేనని అనుకో. పైగా లిఙ్ లోట్ తవ్య ప్రత్యయాలున్నదే వేదం అనుట యెందుకో తెలుసునా. లంచంపెట్టు పెట్టు అని చెప్పుటకే. ఇష్టులు చేయటంయెందుకు. పురోడాశం-చరువు-వపలాజలు మొదలైనవాటిని అగ్నిహోత్రుడిద్వారా దేవతలకు లంచంపంపటం యెందుకు? స్వర్గానికి రానివ్వడానికేగా. ఇది లంచంకాదా? కాస్త ఆలోచించు.

పైగా ఒక్కొక్కరి కొక్కొక్క కోరిక. ప్రతివాడూ మేకంచంపి తమకుపెట్టితే సరే మాదగ్గరకు రా అంటాడు. ("ప్రాజాపత్యాం తూపరమాలభేత" ప్రజాపతి దేవతాకమగు మేకను ఛేదింపవలయు) రెండు మూడుతరాలదాకా పెట్టకపోతారా యిక వస్తానన్నవాడిదగ్గర జుల్మానాతో సహా నాల్గుమేకల్ని వసూల్ చేస్తారు నిక్కచ్చిగా దేవతలు. 'ఆదిత్యాః కూర్మః' కొందరికి తాబేలు కావాలెనట (ఈమధ్య కోనసీమలో ఒకాయనకు తాబేలు లభింపకపోతే చేపను తెచ్చి పాతేసి సీలలుకొట్టి పనిజరుపుకొన్నాడు.) "బ్రహ్మచార్యవకీర్ణీ గర్దభమాలభేత" కొందరు బ్రహ్మచార్లేవో చీకటి తప్పుచేస్తే గాడిదను లంచం తెమ్మంటారు వాడి పాపం పోగొట్టుతామని. "తస్మాత్పూషా ప్రపిష్టభాగోఽదంతకోహి" సూర్యుడికి పండ్లులేవుగాన గట్టిరొట్టె పెట్టితే కొరకలేక పిండిముద్ద పెట్టమన్నాడు. "స ప్రజాపతిర్వపాముదఖిదత్" కొందరికి నరునివప కావాలసివచ్చిందట. "తరతి బ్రహ్మహత్యాం యోఽశ్వమేధేన యజతే" కొందరికి మంచిగుఱ్ఱం కావలెనట. ఇట్లే కొందరికి పులి. కొందరికిపాము. ఇట్లా చాలారకాల లంచాలు దేవతల కున్నవిలేండి.

దేవత లేమిటయ్యా! నిన్ను పుట్టించిన భగవంతుడో కొబ్బరికాయనో, నమస్కారాన్నో యిస్తేనే (మళ్లీ మనఃపూర్వకంగా వుండాలె) నీకు వరాలిచ్చేది. నీవేదైనా యివ్వనిది ఆయన యేమైనా నీకిస్తున్నాడా? పరీక్షించిచూడు. బీదవాడిదగ్గిరకూడా కృష్ణుడు స్నేహి... డటుకులు లంచంతిన్నాడు. ఇంకా యేం చెప్పేది?

ద్వైతవిశిష్టాద్వైతులమంటూరే వీరుకూడా దేవుడికి భక్తి లంచమిమ్మంటారు. వీండ్లేయేమిటి? వీండ్ల దేవుడో "పత్రంపుష్పంఫలంతోయం యోమేభక్త్యా ప్రయచ్ఛతి" అని తమలపాకుతొడిమదగ్గిరనుంచి లంచం తెమ్మంటాడు. ఇంకా యితరులసంగతి చెప్పవలెనా?

అద్వైతులో అంటావా? వాండ్లుకూడా రెడీ. అయితే వాండ్లశగడంతోశే కొంచె పేచీపెట్టికాని యివ్వరు. అదీ యిదీ యిమ్మంటే 'నేతినేతి' అదిలే దిదిలేదంటారు. కొంచెం సేపటికి "నేహానానాస్తికించన" అని ఒకడిగ్రీ క్రిందికిదిగి చాలాలేవయ్యా అంటారు. అప్పటికి తత్త్వం బోధపడుతుందిగాన పిదప మటి లాభంలేదని 'తత్త్వమసి' అంటారు. మీసామ్మే మాసొమ్ము. మాసామ్మే మీసొమ్ము. ఉభయులకు భేదంలేదని కల్పుకుంటాడు. పని చెడిపోతుందేమో నని అడిగిందంతాయిచ్చి లంచాలవల్ల నీప్రాణం విసిగింది గనుక దేవుడికిదణ్ణంపెట్టి నాలంచమేననే నాతాత్పర్యం.

ఇట్లాకలే దమ్మన భరాటుకొట్టగా నేను నివ్వెఱపడి బదులుకుబదులిస్తేకూడా లంచమేనా? నమస్కారంచేసినా లంచమేనా అంటిని. అప్పుడాయన మరల యిట్లుసాగించెను.

లంచమనేకవిధాల ఉంటుంది. నీకొకటికావలసి తదుపలబ్ధికిచేయు ప్రయత్నమంతా లంచమే. లంచాలు రూపాయలరూపకంగానే ఉండ నక్కర్లేదు. కాఫీ హోటల్లో యిడ్డెన్లుగా ఉండవచ్చు. పరాంగనలో వారచూపులుగా వుండవచ్చు. బండిలో కందెనగా వుండవచ్చు. మానవునిలో ఆశగావుండవచ్చు. చుట్టకు నిప్పు, రైలుకు బొగ్గు, మోటారుకు పెట్రోలు, కలముకు సిరా, పొట్టకన్నము, చేని కెరువు లంచము. ఒకప్పుడిది కాగితాలుగాను, వాక్కులుగాను, నవ్వులుగాను, చూపులుగాను, చేష్టలుగాను వుండవచ్చును. లంచానికొకరూపమేమిటి?

గొడ్డుచర్మానికి కత్తెకుతంగేడుచెక్క, శాస్త్రులు గారిముక్కుకు చిటికెడు పొడుము, రైతునోట్లోకి వేలెడుపొగాకుతుంపు, చెకుముకురాయికి కొంచెము బూరుగుదూది, వడగాలికి నీళ్లలోదడిసిన వట్టివేళ్లతడిక లంచము.

అందరికికోరిక లొకరూపాన వుండునా? ఒకడికి ధనంకావలె. ఒకడికి మనిషికావలె. ఒకడికి వస్తువు కావాలె. ఒకడికి కీర్తికావలె. ఒకడికి చదువుకావలె. అబ్బా ఎన్ని అని చెప్పను "లోకోభిన్నరుచిః" కదా. ఎవరికికావలసింది వారు సంపాయించుకుంటారు. మన మొకప్రయోజనార్థ మొకదానిని వాడికిచ్చుట లంచము కాదా? అది వాడికిచ్చినగాని మనపని కాదే అప్పుడది లంచముకాక మరేమనును.

పత్రిక తనకువచ్చుట కొకవ్యాసముపంపుదురు. వ్యాసముపంపిన పత్రికపంపుదురు. అదిలంచముకాదా! (కొందరు వ్యాసానికి డబ్బేతీసుకుంటారులెండి) కాఫీ హోటల్సులో గ్రామఫోన్ పెట్టుదురు. షోడాదుకాణాలల్లో ఆనుడుకుర్చీలు వేతురు.

సినీమాలల్లో నగ్నస్త్రీల నాట్యముచూపింతురు. షాహుకార్లకొట్లలో వూదుకడ్డీలు వెలిగింతురు. ఇది లంచముకాదా? ఆలోచించితేనేకాని అర్థంకాదు. (సెనేటుకు స్టాండయ్యేఆయన) పేరు రిజస్టరు చేయించుకోండోయీ డబ్బు నేనిస్తానని బిషప్పుల పేర్లు రిజస్టరుచేయించుట లంచమై సొమ్ముచేయించిననేకాని భార్య మూతినాకనియ్యనన్న లంచముకాకపోయిందా. పదివేలరూపాయలుపోసి బోర్డు కధ్యక్షుడైనచో నది లంచమై వేయిన్నూటపదార్లిచ్చినగాని 'నేను మీపిల్లను పెండ్లాడను'నుట లంచముకాకపోయిందా? మీస్కూల్లో మాబొక్కపెట్టిస్తే మాస్కూల్లో మీబొక్కపెట్టిస్తానన్న లంచమై మావాడి కుద్యోగమిప్పిస్తే మీకు మా బజారువోట్లన్ని యిప్పిస్తానన్న లంచం కాకపోయిందా?

అప్పుడు నేనునవ్వి అట్లయిన సృష్టియంతయు లంచాలమీదనే జరుగుమన్న దన్నమాట అంటిని. ఆయన యిట్లనె. అవును, కాకేమి? ప్రతిఫలాపేక్ష లేక ఏజీవి ప్రవర్తింపుచున్నది.

యజ్ఞంలోభాగము లంచమిచ్చియేగదా దేవతలు చెదలు పురుగులవలన విష్ణువును నిద్రలేపించిరి. గరుడుడు

నమృతము లంచమిచ్చియేకదా కద్రువనుండి వినతా దాస్యము తొలగించె. కిష్కింధారాజ్యమిస్తే నేకా సుగ్రీవుడు రామునికి సాయపడ్డది. ఇట్లాకథల్లోకి దిగితే చాలావున్నవి. ఇప్పటిసంగతి దేవులాడుదాము.

ఒకప్పు డవసరమునుబట్టి ఒకప్పు డిచ్చువానినిబట్టి ఒకప్పుడు పుచ్చుకొనువానినిబట్టి లంచాలు చిన్నవిగాను పెద్దవిగాను వుండును. “సింహోమదద్విరదమస్తకమాంస భోజీ” అన్నట్లు పెద్దఅధికారులు పెద్దలాక్లే కొట్టుదురు. ఎండినయెముకలను గొఱుకు కుక్కలట్లు చిన్నవాండ్లు చిన్నలంచాలే కొట్టుదురు. చిన్నజవాను చుట్టపీక లంచమడిగిన అట్టెండరు అర్ధరూపాయియడుగును. చూడవయ్యా!

అపరాధినిపట్టియిచ్చిన ఐదువేలిత్తుమని మాకు తోచ్పడినచో మాన్నెమిత్తునని ప్రభుత్వమువారందురే! దీనిపేరేమి? పెద్దవుద్యోగస్థులు వస్తూవుంటే రైలు స్టేషన్లోకేపోయి మెడలోదండవేతురే—కారుతీసుక వచ్చా దయచేయండి అందురే. పెద్ద వూరేగింపులు, స్వాగతాలు, విందులు, సమ్మానసభలు చేతురే. వెళ్లేటప్పుడు వీడ్కోలుసభలు, స్తుతిపద్యాలు, జరుపుదురే. వీనిపేరేమి? పెద్దఅధికారివస్తే రాజులు లక్షలకులక్షలు వారిపాదాలక్రింద పోతురే, దీనిపేరేమి? (ఎస్టేటు పరిపాలన బాగాలేదనకుండా.)

అధికార్ల యిండ్లల్లో వడుగో - పెండ్లో - ఏదో అయితే-నేతిడబ్బాలు-పెరుగుకావళ్లు-కూరగాయలకుప్పలు-ఇవిగాక కట్నాలు కానుకలు చెల్లింతురే వీనిపేరేమి? ఇవి నజరానాలు బహుమానాలు కాబోలును. పిన్నలుచేస్తేనే లంచాలు కాబోలును?

నెలకు నూరో నూటయేభైయో జీతంతీసుకొను ఇన్స్పెక్టరుగారు దారిబత్తెము బండిచార్జీలు-పైఖర్చులు-కూడ తీసికొంటూ 15-0-0ల బడిపంతులు తనకు గారెలపలహారము పెట్టలేదని పొరుగూరికి బండికట్టి పంపలేదని గుట్టుపెట్టుకొని ఇన్స్పెక్షనురిపోర్టులో చెడరాసిపోవును (బడిబాగున్నాగాని). తాలూకాబోర్డు ప్రెసిడెంటుగారు తనఎలెక్షనుకు రెండుమూడువేలు ఖర్చుఅయినవని (లంచాలుపెట్టితేకాదూమరి) బడిపంతుళ్లదగ్గరనుండి (గుమాస్తాలనున్నూ వదలిపెట్టడు వీలైతే జవానులదగ్గరకూడా) సంవత్సరానికి కొక నెలజీతము వసూల్ చేసుకొంటాడు. ఇయ్యకపోతే సస్పెన్షన్ వుండనేవున్నది. పర్మెనెంటుకానివాండ్లను తొలగించియు పర్మెనెంటుఅయినవాండ్లను కొన్నినెలలు సెలవు పెట్టించియు తన కొక నెలజీతమిచ్చినవాండ్లకుద్యోగాలిస్తాడు. ఇయ్యనివాడెవడైనావుంటే ఇకవాడికి నెలకు రెండుసాళ్లమార్పు. T. A. వీండ్లకివ్వరని నీకుతెలుసుగా. మఱియు ట్రైనింగైనవాండ్లకుకూడా సెంట్రల్ క్లాసట. దీనికి అమడవిడుకోశులనుంచికూడా మాష్టర్లు రావలె వస్తే. నేర్చుకుంటేది లేదుగాని రాకపోతే జుల్మానాతప్పదు. ఆజుల్మానాడబ్బు మింగేసేదేసుమా. లెక్కల్లోకన్పడదు. ఇదిగాక గుమాస్తాలు సెలవుచీటీని మంజూరుచేయుటకుగూడా సగముజీత మడుగుతారు. నోరెట్లావస్తుందో. పోనీ ఒకతడవయిస్తే విశ్వాస ముంటుందా అంటే ఎప్పటికప్పుడు కొత్తే. మీ దేయూరని అడగటమే. పనిబడ్డప్పుడెల్లా పైసా లాగటమే. పైగా సంవత్సరానికొక మామూలు. ప్రెసిడెంటువారింట్లో వున్నారా అంటే వాకిట్లో జవాను చెయిచాపుతాడు. ఏమిటయ్యా అంటే. “పోపోవయ్యా అరవక. ఎందుకట్లా పెద్దగా అరుస్తావు” అని దబాయిస్తాడు మనల్నేవాడుపెద్దగా. జీతము బట్వాడాచేసేజవాను నెలనెలకు బేడో పావలో బిగపట్టుకుంటాడు. ఏమంటావు వీటిని. ఈతాలూకాబోర్డులు పాడుగానుచచ్చిపోతున్నారయ్యా మేష్టర్లు. ఎటువంటికాగితమైనా సరే యేండ్లు గడిచినా బయటికిరాదయ్యా ఎట్టిమాపంది. యెట్లా యేడవను? ప్రెసిడెంటుతోచెపితే గుమాస్తామొహాన ఏమైనా పారవెయ్యకపోయినావా అంటాడు. కంచెయే చేనుమేసినగలదె దిక్కు?

ఇక పట్నానికి బోదామా. ఈ రో డ్డెక్కడికి పోతుందయ్యా అని చెన్నపురిలో ఒకఅరవ్వాయన్నడిగితే బీచీకిపోతుందని చెప్పి చెయిచాపి వెంటబడి యేమైనాచెప్పినందు కిమ్మని పీడించుతాడు. ఇవ్వకపోతే చివరకువిసిగి తిట్టుకుంటూపోతాడు. ఏమంటావు దీన్ని.

హైస్కూళ్లల్లో అంత్యపరీక్షలు నెలో రెణ్ణెల్లో కద్దనగానే పిల్లలు టీచర్లదగ్గర యెంతడిగినా యిచ్చి ట్యూషన్ చెప్పించుకొన చేర్తారు. దీనిభావమేమి తిరుమలేశ! వోటుచేయుటకు రెండు మూడు రోజులుగద్దనంగా వోటర్లను కాఫీహోటళ్లల్లో మేపుచు మోటార్లలో త్రిప్పుచు అదివరకు సుబ్బాయ సూరాయ అనేవాండ్లప్పుడు సుబ్బారావుగారు సూర్యారావుగారూ అని మర్యాదగా పిలుస్తూ వోటుచేయుటకు మహావైభవంతో పిల్చుకపోతారు ఎలెక్షనుకు స్టాండైనవాళ్లు. ఒకవేళ అడిగితే వోటుకు యాలంపాటపడుతుందికూడ. వోటు చేసినపిదప వీడిమొగంగూడా చూడరు. ఏమంటావు దీన్ని. ఆచూకీచిక్కినా అర్థం యెదపెట్టితే మర్డర్ కేసైనామాపైపోతుంది(పత్తాలేకుండా).ఏమంటావుదీన్ని? పేపర్లు దిద్దుచున్నపుడెన్నిరకాల, మాష్టర్లు లంచాలు కాజేస్తారో ఎరుగుదువా? నూటి కెనభైవచ్చువానికి 15నో 20మో వేసి తప్పినావనిచెప్పి ప్యాసుచేయిస్తాను. ఏమిస్తావనియడుగుట ఒకరకం. నిజంగా నూటికి పదిరాగా, తప్పినాడేమిస్తావు ప్యాసుచేయిస్తాననుట ఒకరకం (తర్వాత పిల్లవాణ్ణిపిలిచి ఏవోతంటాలుపడుతాడు తనతప్పులేకుండా) వీటికంటేముందు ప్రశ్నలే చెప్పి (పరీక్షలోవచ్చేవి) సంపాయించుట ఒకరకం. తానొకరికిమధ్య ఏజెంటుగావుండి సందట్లో తాను గూడా ఒనుపుకొనుట ఒకరకం. మార్కులువేస్తానని చెప్పియు, వెయ్యకుండా డబ్బుతీసుకొనుట ఒకరకం. మార్కులు వేయడానికి తనకువీలులేకున్నను వీలున్నదనిచెప్పి తీసికోటం ఒకరకం. స్నేహితుడవు నీవు వొచ్చిచెప్పావుగాన తప్పించుకోలేక నాగొంతుకువచ్చినా వేసినానని వట్టిమాటలుచెప్పి పిదప వానివలన లాభంపొందటం ఒకరకం. అబ్బా! ఈరకాలచెప్పలేను. ఇంకా ఎన్నోరకాలున్నాయి. ఏమంటావు వీటిని.

ఈరకాలన్ని డిపార్టుమెంటులలోనూ వున్నవి. అయితే ప్లీడర్లదగ్గరమాత్రం బహిరంగంగా లంచం ఉయ్యాలవూగుతుంది. నిలువుదోపిడే ఆరంభంనుండి. వకాలత్ వ్రాసినదగ్గరనుండి. విలేజిమున్సబుగారికి దస్కతుచేసినందుకు. అందులో వాలంటియరుకు భాగము. ప్లెయింటువ్రాసినందుకు ముందుమడుపు. ప్లీడరు ఫీజుగాక కాగితాలఖర్చుక్రింద కొంతతెమ్మంటారు. దావానెంబరుపడ్డందుకుగూడ (ఏవోవంకపెట్టి గుమాస్తా తిరగ్గొట్టకుండా). వాయిదావేస్తేఫీజు.వాయిదాఎప్పుడండీ అని అడగవొస్తే కోర్టులో కనుక్కోవాలె. వాడికేదన్నా తగలెయ్యకపోతే చెప్తాడా. ఇయ్యకపోతే రేపురా మాపురా అంటూ ౪ రోజులుతిప్పుతాడు.నాల్గు రోజులకు ఫ్రూటుహాలిరుత్తలు పోతుందిగదా ఒకరూపాయయియ్యి. రూపాయనీకులాభం. వెంటనేవాయిదా తేదీ చెప్పిపంపుతాను అంటాడు ప్లీడరు గుమాస్తా. ఇక ఫైల్ జప్తువచ్చిందా అంటే తొలకరివానే అందరికి తేయి పచ్చబడుతుంది. పైఖర్చులకని౫౦మో ౫౦మో గుంజుతారు. ఒకప్పుడేమిటి? అడుగడుగునా గుంజుతారయ్యా జలగలానున. ఏం చెప్పమంటావు? ఆరుమాసాలకొక భారతంచాలదు. ప్లీడరుగారికి తెలియదా అంటావేమో. అందరూ దొంగలే. కొందలు ప్లీడర్లే గుమాస్తా మామూలు తమఫీజుతోబాటు వసూల్ చేసి యిస్తారు కేసు గెల్చినా ఓడినా. కేసుతెచ్చినందుకు పైరివేట్లకు ప్లీడర్లే లంచాలిస్తుండిరిగా. ఈమధ్య ఒకాయన పైరివేట్లుండగూడదు కోర్టుకు రాకూడదని శాసించాడు. ఆమాట్లోనే దాని అశక్తత ద్యోతమగుచున్నది కాదా? అయితే యిప్పటికూడా తెరఅవతలి కలకలమంతా యీపైరివేట్లదే. నాకు విసుగువచ్చి ఐతే యేమంటావయ్యా నీవంటేని. ఆయన యిట్లనెను అనేదేమున్నది లోకమిట్లు జరుగవలసినదే.

పీర్లపండుగమామూలుసామీ అని రీడింగురూములో జవాను హెచ్చరించును. ఇయ్యకపోతే గృహలక్ష్మిలో బొమ్మచింపుకపోయినాడని దొంగతనము మీదపడవేసి ఆచాయలరాకుండా చేయును. దసరా పండుగవచ్చిందయ్యా అని వుత్తరమిచ్చి పోస్టుబంట్రోతు పండ్లిగిలించును. ఇయ్యకపోతే మనియార్డరు వచ్చినపుడు ౦-౧-౦ బిగపట్టి మిగిలినది యిచ్చి స్వస్తి చెప్తాడు. పిల్లవాడివొడుగువచ్చిందండీ యని పోలీసు సాహేబుగారు చిన్నపంచదారపొట్లమందిచ్చి టోపీ

కుచ్చులువేలాడుచుండ పింగాణిపళ్లెం పట్టుకొని వాకిట్లో దర్జాగా నిలువబడుతాడు. ఇయ్యకపోతే రోడ్డుకు కుడి పక్కన నడిచాడనో అందరు నడిచేచోట గోచిప్పి కూర్చున్నాడనో మరునాటికి కేసుబనాయిస్తాడు. సంవత్సరాదినాడు పెండ్లానికి లంచమీయవలసిందే మల్లెపూలు. లేకపోతే ఆరోజున పాత్రలకు సొట్టలు రాసేవున్నవి. అబ్బాయికి చిలకొక్కతీని మహానవమికి లంచమీయవలసిందే. లేకపోతే వా డన్నమతినడు సరేకదా ముద్దువచ్చినా యెత్తుకోనివ్వడు. కంట్రాక్టులో పైయాయనకు భాగమివ్వవలసిందే (మిగిలినా మిగలకపోయినా. సాధారణంగా మిగిలేటట్టే యిప్పిస్తాడుగా) లేకున్న మరుసటేడు నీళ్లువదలుకోవలసిందే. తనఇంటిముందు దీపంవేయించవలసిందే. లేకపోతే ముందువచ్చే మ్యునిసిపల్ ఎలెక్షనులో ఆయన కోటీవ్వడు వోటుకు. ముందుగాపోగి పాంతుచెల్లించవలసిందే లేకపోతే గవర్మెంటుఆసుపత్రిలో నీళ్లేమందు. (మంచినీళ్లుకూడా కావు.) గ్రామమునసబైనజోసెఫ్ గారు (నాన్‌కోఆపరేషన్ రోజుల్లో అయినాడులెండి) వస్తూంటే మంచాలమీదనుంచి లేవవలసిందే. లేకుంటే మొదటికి స్త్రీకే వాయిదారాకముందే అన్నంవండుకొను చెంబుతప్పేల జప్తుచేసి తీసుకపోతా డింట్లోజొరబడి దూరంగావుండమనే బ్రాహ్మలయిండ్లల్లో. కరణంగారెంతవేస్తే అంతచందాయివ్వవలసిందే లేకపోతే పరాయివాడిసిస్తుకూడా వీడేయిచ్చుకోవాలసి వస్తుంది ఉపయోగించుకోకపోయినా రెండవకారు నీటితీరువతోకూడా. సర్వేయర్లడిగినంత చప్పున ధారపోయవలసిందే తేకుంటే ౨౦-౩౦ సెంట్లవతలివాడికి కల్పిరాయి పాతిపోతారు వాడిలోఐక్యమై. (ఉభయులుఇస్తే యిదివరకున్నచోటనే రాయివుంచి పోతారు. తగ్గించకపోవడమే మీకు లాభమని దాష్టీకంగాచెప్పుతూ.) పైరివేటువచ్చి రోజూఅడుగుతున్నా పొగాకాకుడ యివ్వవలసిందే. లేకపోతే శెట్టికి ఇన్ కంటాక్సు తగిలించాడన్నమాటే ఆకాశరామన్న అర్జీపెట్టి. మాష్టరుగారు క్లాసులోకి రావడంతోటే పిల్లలు నిల్చోవలసిందే (వాండ్ల కిష్టంలేకపోయినా) లేకపోతే ఏదోవంకపెట్టి పాఠమొప్పగించినా బల్లమీద నిలువబెట్టుతాడు లౌక్యంగా. కంపెనీయేజంటు చెప్పినంత చెల్లించవలసిందే లేకపోతే తానిన్ష్యూర్ చేసిన డబ్బు ఎగిరిపోయిందన్నమాటే. గుడ్సుక్లర్కుకు మామూలివ్వవలసిందే లేకపోతే రైలులో వచ్చిన బుట్టల్లోని పండ్లు మాగి కుళ్లిపోవును. అథవా వచ్చినా చిల్లిబుట్ట లివతలికి వచ్చును. బుకింగ్‌క్లర్కుకు పైడబ్బు వదలుకోవలసిందే టిక్కట్టిచ్చి చిల్లరరాలేదని అంటాడు. (రైలుపోతుందనో ఒత్తిడికాగలేకనో వెళ్లుతాముగా). పోస్టుమాష్టరును మంచిచేసుకోవలసిందే లేకపోతే డిపార్టుమెంటల్‌గాపోయినా D. E. O. శాంక్షన్ చేసినా ప్రావిడెంటుఫండులోనుంచి "లోను" నివ్వడు యిరవైయేండ్లనాటి దస్కతుకంటె యిప్పటిదస్కతులో అక్షరాలు పెద్దవిగా వున్నవని. రైలు వచ్చినపుడు తన అనుమతిమీదనే ప్లాట్‌ఫారంమీదికి పోయినా (మిసెస్ మిత్తును రైలెక్కించడానికి) తిరిగి వచ్చినపుడు పైరా పచ్చాచూసి టిక్కట్టేది? డబ్బుగట్టు. ఫ్రం గుంతకల్లు అంటాడు టిక్కట్‌కలెక్టరు ఏదోవిధంగా సమాధానపడ్డదాకా. కలకత్తానుండి బిరుదుకొనుక్కున్న ఒకాయన చచ్చిచెడి ఒకగీతపద్యంవ్రాసి, తాన తననీన నీళులలో చేర్పడంజూచునట్లు అచ్చులో తనపేరును చూచుకోవాలెనన్న ఆశతో పత్రికకు పంపితే సహాయ సంపాదకుడా ఆదుర్దాను కనిపెట్టి పత్రికలో ప్రకటింపక, ఏదో ఒకమాటచెప్పిందాక. అటూఇటూచూస్తూ మనలను చూడనట్లుంటాడుగాని నెత్తిన శఠగోపం పెడతాడా పళ్లెంలో కానీడబ్బువేసిందాకా పూజారి. ఎంత బతిమలాడుచున్నా ఉపదేశంచేస్తాడా గొప్పప్రభావంగల గురువైనప్పటికిన్ని దక్షిణపడ్డదాకా (ఆడవాండ్లయితే ఏదోచేస్తాడులేండి ఒంటరిగా దక్షిణలేకుండా) మజూరీతీసికొంటూ బంగారంలోకూడా ఒకకొంతకాజేయకుండా కంసాలి ఊరుకోడే—కూలిగాక బహుమతియిస్తానన్నా. కొనేటప్పుడు కట్టెలోను కంపలోను రాతిలోను అప్పలోను మేస్త్రీ సంగ్రహింపకుండనుండడే — ఒకకానీయెక్కువయిస్తాను గట్టిది తెమ్మన్నా కొరికెపాటికొమ్మలు నీరుగలియని పెరుగు

తేరే-అసలు రేటుకంటె పైనయిచ్చేదనన్నా పూంట కూలమ్మ సున్నపునీరు చల్లకుండానుండదే — సంవత్స రాలకొద్ది వాడుకగాపోయించుకొనుచున్నా (యింటి ముందుపిదికినా) గోపికలు పాలల్లోనీరుకల్పకుండా వుండరే — కోటికుమ్మరించినా వెలయాలు నిలుకుగా వుండదే — ఫారెస్టుపంచాయతీలకుగానీ యింకావేటి కైనా ప్రెసిడెంట్లుగావున్నవాండ్లు నంజకుండావుంటా రనేనా నీతాత్పర్యం. ఈకలికాలంలో అందులో ఇంతడిప్రెషన్‌లో. జీతం బత్తెం లేనికొల్వు ఈడబ్బు లేనిరోజుల్లో ఎవరు చేస్తారయ్యా కీర్తికోసం, ఏ బిల్డింగ్ కట్టించడంలోనో తప్పుడువోచర్లు సృష్టించి దిగ మింగకుండా.

నాకొడుకుక్కు జడ్జీపనియిప్పించు. నీవివ్వవలసిన యిరవైయైదువేలబుణం వదలుకొంటానంటూ డొక బంగాలీబాబు (పనిఐందిలేండిచివరకు). నేను లక్షరూ పాయలవ్రతం పట్టాను మళ్లీ. అది పొగుకాంది నిర్రం పను. రైతుకింతఅని వసూలుచేయండి అని కరణాలకు తాకీదులంపుతా డొకఆంధ్రుడు. (ఈయన వ్రతో ద్యాపనచేసిన తర్వాతనే డిస్మిసు అయినాడులేండి). ఉభయపార్టీలదగ్గర సంచులు కాజేస్తూ విచ్చలవిడిగా సంచరించి మూడుతరాలవరకూ మూల్గుతుండే డబ్బు సంపాయించి బలవంతాన రిటైర్ అయినాడులేండి ఒక మహారాష్ట్రుడు (ఏజీ-బార్-కాకపోయినా) "సీ-మై-వైఫ్-యీజ్-వెరీ-బ్యూటీఫుల్" అంటూ నోట్లో వూటవూరించి పెద్దవుద్యోగం సంపాయించుతా డొక అరవ్వాయన. (నంబూద్రీలల్లో వుండలేదా అని మన స్సులో అనుకొని)

చదువరులారా ఒకమనవి. ఈప్రకారం ఆయన చెప్పుతూ నిమిషనిమిషానికి మారుతుండేవాడు. మొదట నాతోకూడా ఉపనిషత్తులు చదువుకొన్న స్నేహితుడే కాని చివరచివరకేదో దయ్యంలాగా కనుపించడం మొదలుపెట్టాడు. ఇక ఆయనచెపుతుంటే వినడమేకాని తిరుగుచెప్పలేక పోయ్యాను. ఇన్నిసంగతులెట్లా జ్ఞాప కంవున్నవి కలకదా అంటారేమో. వ్యాసులవారు సంజ యునికి వరమిచ్చినట్లు ఆయన నాకు జ్ఞాపకం వుండే టట్టు వరమిచ్చిపోయినాడు. వినండి తర్వాత. ఆయన ఒకనాటకం చూపించాడు.

"అయ్యా! నమస్కారం."

"ఎవరు వారు?"

"చిత్తం నేనే."

"నేనే అంటే—ఎందుకొచ్చావ్?"

"చిత్తగించాలె — టైపినింగుకు అప్లికేషన్ పెట్టుకొన్నా. కాస్తమీదయ......"

"చాల్‌చాల్ లేవయ్యా! అరవ్వాకు. వ్రాసు కొంటున్నాను పో-పో-ఏమి టాగోల?"

"చిత్తము. స్వామీ. కోప్పడకండి. ఏదో—"

"ఏదోఏమిటయ్యా—ఏదో ( — వెళ్లమంటే (అని మొగమెత్తిచూచి) ఆఁ. ఏదోఏమిటి?"

"అయ్యా! ఏదోమీదయ. మీపుణ్యమెక్కడికి పోతుంది?"

"ఎక్కడికిపోతుంది? మాతోనేవుంటుంది. వుండబట్టే వుద్యోగంవుంది. ఇటువంటిపుణ్యానికేమి లేఁ. డబ్బుండాలెగాని దానధర్మాలు చేసుకొంటే పుణ్యంరాదూ."

"చిత్తం - బాబూ - మీకు తెలియందేముంది? నేనూ పిల్లలుగలవాడను. ఇప్పటికి నాలుగేండ్లనుండీ అప్లికేషన్ పెట్టుకొంటున్నాను."

"అవునయ్యా, నిజమే. సంగీతానికి చింతకా యలురాలునా..."

"అయ్యా! బీదవాడను..."

"చెప్పేది వినవేమయ్యా. కాగితాలతో పను లవుతవిటయ్యా పిచ్చవాడా ఎన్నిఅప్లికేషన్‌లు పెట్టితే మాత్రం."

"అయ్యా-వేదంకూడా చదువుకున్నబ్రాహ్మణ్ణి. దానపాత్రుణ్ణి"

"అయితే బ్రాహ్మణార్థాలుచేసికో - పో-" (బ్రాహ్మడికెవడిస్తాడు షీట్ అనిగొణుగును)....

"అయ్యో వేదంచదువుకొని బ్రాహ్మణార్థాల కెళ్లాహరోవ్వడం? పొట్టజరక్క బడైనాచెప్పకుందామని......"

"మాకుగూడా పొట్టజరగడంలేదు. జీతం జీతం ఇన్షూర్యాన్సుకం పెనీలకు కట్టడానికే సరిపోతుంది. ఇక తిండియేలా. దమ్మిడీవచ్చే సమపాయంలేదు."

"చిత్తం. ఈశ్వరుడిప్పించకపోతాడూ?"

"ఎవరిచేత యిప్పిస్తాడయ్యా - మా కిచ్చేవాండ్లెవ్వరూలేరు. పనిచేయించుకొనేవాండ్లేకాని."

"చిత్తము. ఏదో నాశక్తికొద్దీ—"

"చాలుచాలు. ఇకకట్టిపెట్టు. మహాయిస్తే మాత్రం ఏమిస్తావయ్యా నీవు. ఒకవేళ ఆపాదుకూటి కాశపడితేమాత్రం."

"ఏదో—అయ్యా! మీఋణం వుంచుకోను. ట్రైనింగుకానిది టీచరుగా నుండనీయరు. టీచరుగావుండంది ట్రైనింగుషీటివ్వరు. దిక్కుతోచడం లేదు. ఏమిరూల్సోకానీ-మీరు ట్రైనింగుషీట్ ఇప్పిస్తే—"

"అయితే సర్వీస్ ఏమైనా వున్నదా?"

"చిత్తము బాబూ. నాలుగునెల లున్నది."

"లాభంలేదు. ఇక మాట్లాడకపో. రెండేండ్లు మూడేండ్లు సార్వీసు కలవాండ్ల అప్లికేషన్ లెన్నో వున్నవి."

"చిత్తము. మీరు చేయదలచుకొంటే ఏరూల్సు లడ్డంవచ్చును? మీరు సర్వస్వతంత్రులుఅని వింటాను."

"బాగుంది. నీకోసం యిప్పుడు పనిఅంతామాను కొని కష్టపడమంటావు?"

"కష్టే ఫలీ అన్నారుగా స్వామీ"

"ఏమిఫల మయ్యా?"

(అనుచుండగా ౪ నారింజపండ్లు బల్లమీదికి దూకినవి). (ఆయన నవ్వి) "ఈఫలమా? సరే అణా కష్టమేనటయ్యా యిది."

"స్వామీ! షీట్ రావాలెకానీ—"

"ఆఁ. కానీ; కానీ యేమిటి? ఇంకా పైన కానీయిస్తావా?"

"కాదు స్వామీ నాకు తోచింది సమర్పించుకుంటా."

"అవునులేవయ్యా! ఇటువంటివాండ్లనెందరినో చూచాను. పనియైన తర్వాత కనబడుతామటయ్యా మేము?"

"అయ్యో! మీకు కనపడక యెక్కడికి తప్పించుకొనిపోతాము. "పులినోటినుండి యొక యిమ్మల విడివడిపోయి దాని ముండటికే గోవులు మరలివచ్చునేలా తలపోతలు" ప్రొద్దునలేచినప్పటినుండి మీతోనే కదా మాబ్రతుకువున్నది."

"ఈమాటల కేమిలేవయ్యా!"

"స్వామీ ఆలాఐతే యిదిగో తాంబూలం. ఇది మీకష్టానికి తగ్గదికాదు. అయినా నాఆత్మతృప్తికి సమర్పించుకొంటున్నాను. కొండంతదేవునికి కొండంత పత్రి యెవరియ్యగల్తారు?"

(ఆయన తాంబూలంలోని వరహా చూచి)

"పోపోవయ్యా. వ్రతంచెడ్డా సుఖం దక్కలేదన్నట్లు పాపానికి పాలుపడ్డా పొట్టకు చాలకపోతే ఏలాగయ్యా! పోనీలే. బ్రాహ్మణుడవు. నా చేతనైన సహాయం చేస్తానులే. పో. పో. ఊరికచేస్తే ఫలం యెక్కడికి పోతుంది."

"కాదుస్వామీ. అంగీకరించాలె."

"చేస్తాపోవయ్యా! నీది నీదగ్గర నే వుంచుకో. పో. ఎవరైనాచూచినా నవ్వుతారు."

"చిత్తం. మీఋణంమాత్రం నాకెందుకు?"

"ఆలా ఋణంతీర్చుకోవాలెననే వుంటే పాతికకంటె తక్కువ నాతో మాట్లాడవద్దు. ఎందుకు గంటసేపు నవ్వు."

"అమ్మయ్యో!—"

"అమ్మయ్యో ఏమిటయ్యా! నాల్గునెల్లకుస్టయిపెండు లేదనుకోరాదు (స్టయిపెండు యిచ్చేరోజుల్లో) అదిగాక యీస్టయిపెండుతీసివేసి నెలకైదు జీతంపెడితే మాత్రం నేనంటే నేనని వచ్చి పడదటయ్యా జనం. ఏదో నీపెట్టెలో ముకుపిచ్చేలాగున గాభరాపడుతావు. పో. నాటయమంతా పాడుచేసావు. ఇక మాటల్లేవు" (అని తలుపేసుకొంటాడు) మరునాడువచ్చి పాతిక చెల్లించి ప్రైవేటు చదువుతాడు.

మరల ఒకవ్యక్తిగా కన్పడి యిట్లనియె. నాటకం చూచావుగా. ఇంకావిను. కొందఱు I. P. గుమాస్తా గారిదగ్గరకెళ్లి ఏలాగైనా నాపిటీషన్ను గెలిపించాలె. అంటే ఆయనగారు 'ఉండవయ్యా! ఇంట్లో తండులాలు నిండుకొన్నవి. ప్రధానద్రవ్యం అదిలేకపోతే ఎలా. నెలకు, సన్నరకం, నాణెమైనవి (ఢిల్లీభోగాలన్నట్టుంది) బస్తాబియ్యం ఎగిరిపోవును. ఏదో దోవ చూచుకోవలెనా? అక్కర్లేదా? నీపని చేస్తూకూర్చుంటే పొయిలోపిల్లి లేవడంఏలా" అనగనే వుండండి స్వామీ యిప్పుడేవస్తాననిచెప్పి వెళ్లి బస్తాబియ్యంపట్టించుకొని వచ్చి (అప్పుడు బస్తా 21 అమ్మతున్నది) యింట్లో వేయించును ఆయాగం తుకుడు. ఇదోరకం.

కొందఱు పనిచేసిపెట్టి "ఏమయ్యా మీరు పట్టుబట్టలబేరం చేస్తారా? అయితే మీకు నాణెం బాగా తెలుసునుకాబోలు. ఎందుకంటే మాఆబిడ కొర్నాటు పట్టుచీర కావాలెనంటున్నది." ఇంతలో ఆయన గ్రహించి దానికేంభాగ్యం లేండి అని మర్నాటికి కొర్నాటును కొంపచేర్చును. ఇదోరకం.

"ఇప్పుడు బజార్లో మిరపకాయలధర ఎట్లా వున్నదో" అనిఅడుగగనే మరునాటికి మిరపకాయల పెండె యింటిదగ్గర దిగుమతి. ఇదోరకం.

"0-8-0లు బిళ్లలంపినగ్రంథ ముచితముగాపంపబడును." ఇదోరకం.

"పుస్తకమునకు బదులు పుస్తకమంపెదము" ఇదోరకం.

"మాగ్రంథమాలకు చందాదారులుగండు. సంవత్సరానికి వేయిపేజీలు వొప్పజెప్పెదము. చందా రు 3-౦-౦ మాత్రమే. పోస్టుఖర్చులుకూడా మావే." ఇదోరకం.

"రూపాయసంభావనయిస్తేనే బ్రాహ్మణార్థానికి వచ్చేది. అవసరమైనవాండ్లొకరోజు ముందుగానే అప్లికేషన్‌లు పంపాలె" అని వాకిటిముందుబోర్డు". ఇదోరకం.

కసితీర్చుకొనుటకు తిరునాళ్లలో ఒత్తిడిగానున్నప్పుడు వెనుకనుండి విరోధినికొట్టి పారిపోవు దుర్బలుల వలె కొందఱు మనిషిని చాటుచేసికొని లంచాలుకొట్టుదురు. కొందఱు హస్తాహస్తి, ముష్టాముష్టి లంచాలతో పోరాడుదురు.

ఒకడు బండబూతులుతిట్టి దౌర్జన్యంగాను ఒకడు పిల్లులదగ్గరి రొట్టెను కోతివలె వంచనగాను, ఒకడు బుజ్జగించి మెత్తగాను లంచాలు రాబట్టుదురు.

కొందఱు చురుకైన ఆడవాండ్లమూలకముగా లంచాలు దోపుదురు. కొందఱు పెళ్లామనుపుచ్చుకొను తండ్రులు మావాడితో చెప్పుతానులే అని మాట కట్టుదురు.

పిల్లి పాలుత్రావుచు తన్నెవ్వరు చూస్తుండలేదనుకొనునట్లు కొందఱు లంచగొండులు తలంతురు.

ఎంతమాంసంతినేవాడైనా పేగులు మెళ్లోవేసుకోనట్లు, కన్నతల్లికైనా కనుమరుగుండాలెనన్నట్లు ముత్తంమీద లంచం కొంచెం రహస్యంగానే తిరుగుచుండును. అని ఆయన మరల నాప్రథమస్నేహిత రూపము ధరింప నాప్రాణం లేచివచ్చి యీలంచాలు పొయ్యేమార్గం ఏదైనావున్నదా అని మెల్లగాఅంటిని. ఆయనవెంటనే లేకేమి? హిట్లరుచేపినట్లు కుటుంబమును పోషించు నొకయుద్యోగివుంటే ఆకుటుంబంలోనే మరొకరి కుద్యోగ మీయరాదనియు, కుటుంబానికి సరిపోవుడబ్బుకంటె యెక్కువవుండరాదనియు గట్టిగాశాసించి అమలుజరిపితే లంచందేవత అదృశ్యమైపోతుందని గట్టిగా అఱచెను. ఉలిక్కిపడి లేచితిని. ఇది కలగనుక ఎవ్వరూ పట్టిచూచుకోవద్దు.

## భావ ప్రపంచము

శతావధాని చల్లా పిచ్చయ్యశాస్త్రి

కలదు భావప్రపంచం బొకండు సర్వ
దేశములు నందుఁ గన్పించు దేశికులును
శిష్యులును భావవిదులును జెలఁగి సతము
దీనిఁ దిలకించుచుందురు తృప్తిఁగొనరు
ఎదురనుండిన వస్తువు నెపుడు కాన
రాదొ. గంభీరనిస్స్వానరవము నెపుడు
చెవికిఁ జేరదొ, యపుడ నిస్సీమమైన
తద్విలాసము నెఱితోఁచు దానిపొంత
గాంతలకుఁ జూచునంత శృంగార మెసఁగి
పరుగులిడు బాలకులమీఁదఁ గరుణఁజూపి
హుమ్మనెడు దుర్హృదులను వీరమ్ము నెఱపి
పోవు ధీవృత్తివాది కద్భుతముఁ గొలిపి
శాఖ నూగెడువాని హాస్యమ్ముఁ జేసి
ప్రక్కఁదిగునట్టి లేతకు భయముఁ గొలిపి
ధర్మ మెఱుఁగనియెడల రౌద్రమ్మునూది
పాత్ర మెఱుఁగనివాని బీభత్సపఱచి
క్రమ్ముకొనునట్టి వికృతి శాంతమ్ముఁ బూని
నదులు తొమ్మిది ప్రవహించు నట్టనడుమ
స్థాయి గిరులొప్పు వాని పార్శ్వములఁ జెలఁగు
గుహల వినఁబడుఁ బ్రణవంబు సహచరంబు
మంగళధ్వనియొకఁడు త న్మహిమ మెఱుఁగ
నలఁతి కగునొక్కొ సంస్కార మందకున్న
మఱియొకవిశేష మెసఁగు నచ్చులకొనల
నొక్కచో నారికేళంబు లొక్కయెడను
కదళికలు నొక్కట ద్రాక్ష ఘనరసమునఁ
జెంపు సేయంగ మురిపంపు జొంప మగుచుఁ
చిలుకపలుకులు చెవుల త్రుప్పులను దులుప
మత్తకోకిలగీతి మైమఱపు గూర్ప
హంసరుతములు నెమ్మది హాయిఁగొలుప
వనమయూరనినాదముల్ మనముఁ గొనఁగ
మధురమధుమాధవీలతా మండపముల
భ్రమరవిలసితములు మహాప్రమద మెసఁగ
అలసగతి మందమారుతా యాతములును
చిత్తకుసుమ వికాసమ్ము సేకరింప
ప్రథితకావ్యోపవన మొండు పరగుచుండు
నాయికానాయకులు మహానందమునను
దిరుగుచుందురు దివసాంత తరుణమందు
చంపకోత్పలమాలికాసముదయముల
రుచిరవనమంజరుల మనోరూఢి వెలయ
జగములానందరసమున సొగియఁజేయఁ
బండువెన్నెల నవశైలిమండపముల
మధురగీతుల మాధవు మదనదేవుఁ
గొలుచుచుందురు కోర్కులు కొనలుసాగ
ఇట్టి భావప్రపంచమ్ము నేలువాఁడు
సకలకలల నెఱింగిన జాణ లోక
వృత్త మెఱిఁగిన దిట్ట యీ వెలయు ప్రకృతి
కైవసమ్మొనర్చిన ఘనుఁడు స్థూల
సూక్ష్మముల గుర్తెఱింగిన సూరి సతము
ప్రమదమునఁ దోఁగువాఁడు నిర్మలుఁడు గర్మి
ఈశ్వరాయత్తచిత్తుం డనితరబుద్ధి
సర్వసముఁడు మహాత్ముండు శాంతియుతుఁడు
వశ్యవాక్కనునగు కవివరుఁ డొకండె.

# విష్ణుకుండీ వంశము

(అనువృత్తము)

భావరాజు వేంకటకృష్ణరావు

## ౩

### విష్ణుకుండిరాజ్య స్థాపనము

విష్ణుకుండీయుల రాజ్యాధికార మాంధ్రదేశమున క్రీ. శ. అయిదవశతాబ్దాదిని నాటబడి క్రీ. శ. ౪౩౦-వ సంవత్సరమునాటికి సుస్థిరముగా నెలకొల్పబడినదని యూహింపవచ్చును. ఈయూహకు బలకారణములయిన వృత్తాంతములు ఒకటి రెండు గలవు. క్రీ. శ. ౩౪౦-వ సంవత్సరప్రాంతమున గుప్తవంశసార్వభౌముడు సముద్రగుప్తచక్రవర్తి దక్షిణదిగ్విజయయాత్రకై వెడలివచ్చి వేంగీశుడైన హస్తివర్మను జయించినట్లు తెలియుచున్నది. ఆనాడు వేంగీశుడైన హస్తివర్మమహారాజు పెదవేగిశాసనపతియైన హస్తివర్మయని చరిత్రకారులు నిర్ణయించినారు. ఈశాలంకాయన హస్తివర్మగాక మరియొకహస్తివర్మ యీ వేంగీ ప్రాంతము నేలినట్లు గానరానందున సముద్రగుప్తుడోడించిన హస్తివర్మ శాలంకాయనవంశజుడని నిర్ధారణచేయవచ్చును. శాలంకాయనవంశమున, నింతవఱకులభించినశాసనముల బట్టి ఆర్గురురాజులు కనబడుచున్నారు. వారిరాజధాని వేంగినగరము. వారు భగవచ్చిత్రరథస్వామి పాదానుధ్యాతులమని చెప్పుకొనిరి. వీరివంశచరిత్ర మరియొకమారు విపులముగా వ్రాయుదుము. అయినను ప్రస్తుతమునకావశ్యకమైన చారిత్రమునుమాత్ర మిచ్చుట దెలుపుదుము. ఇంతవఱకులభించిన శాసనములబట్టి శాలంకాయన రాజవంశము నీక్రిందివిధముగా నేర్పఱుపవచ్చును.

౧ దేవవర్మ.*
క్రీ. శ. ౩౦౦ — ౩౨౫
|
౨ హస్తివర్మ.*
క్రీ. ౩౨౫ — ౩౪౦
|
౩ మొదటి నందివర్మ
క్రీ. శ. ౩౪౦ — ౩౬౦
|
౪ చండవర్మ — మరికొందరుపుత్రులు.
క్రీ. శ. ౩౬౦ — ౩౯౦.
|
౫ రెండవ నందివర్మ.*
క్రీ. శ. ౩౯౦ — ౪౨౦.
|
౬ స్కందవర్మ.*
క్రీ. శ. ౪౨౦ — ౪౩౦.

హస్తివర్మ క్రీ. శ. ౩౩౬ – ౩౪౦ సంవత్సరములనడుమ సముద్రగుప్తునిచే నోటువడినవాడుగావున, ఆతనిరాజ్యకాలము క్రీ. శ. ౩౪౦ సంవత్సరముతో ముగిసెనని తలపవచ్చును. ఈతని మరణకాలమునకును (క్రీ. శ. ౩౪౦) స్కందవర్మ కడపటిరాజ్యసంవత్సరమునకును (క్రీ. శ. ౪౩౦) నడుమ తొంభయియేండ్లు గలవు. ఎల్లప్పుడు ఎడతెగనిసంగ్రామములతో మునిగి తేలుచున్న శాలంకాయనరాజవంశములోని కడపటినల్గురుమహారాజులకును ఇంచుమించుగా తరమునకు ఇరువదియేండ్లచొప్పున రాజ్యకాలపరిమితి నిర్ణయించుట అసమంజసముకానేరదు. శాలంకాయనులచరిత్ర యింకను స్పష్టముగా తెలియదు. అయినను వీరిలో చివరవాడైన స్కందవర్మపరిపాలనమున విష్ణుకుండివంశస్థాత

* పూవుగుర్తుపెట్టినవారి దానశాసనములు మాత్రమే ఇంతవఱకు లభించెను.

రైన మొదటిమాధవవర్మ, వేంగీరాజ్యమును జయించి తనరాజ్యమును తూర్పుదెసగా, క్రీ. శ. ౪౩౦ నాటికి వ్యాపింపజేసియుండెనని యూహించుకొనవచ్చును.

విష్ణుకుండీయుల రాజ్యస్థాపనకాలము క్రీ. శ. ఐదవశతాబ్దాదియని నిరూపించితిమి గావున, వారు ఏరాజవంశమును, ఊడబెఱికి తొలుత రాజ్యము ఆక్రమించుకొనిరో, వారు తొలుత యేలినదేశభాగమేదియో నిర్ణయింపవలయును. మనకుదొరికిన విష్ణుకుండిశాసనములలో నతిప్రాచీనమైనది రెండవమాధవవర్మ ఈపూరుశాసనము. అది 'అమరపురము' నుండి ఆజ్ఞాపింపబడినది. తద్దానపతి "త్రికూటమలయాధిపతి" యని విశేషణముతో దెలుపబడినాడు. హుల్షుపండితుడు అమరపుర, త్రికూట, మలయములు మూడింటిని గుర్తించలేకపోయెను. లక్ష్మణరావుగారు అమరపురము అమరావతి కావచ్చునని యూహించిరి. మాధవవర్మ మహారాజు 'శ్రీపర్వతస్వామి పాదానుధ్యాతు' డని చెప్పుకొనుటచేత హుల్షుపండితుడు 'శ్రీపర్వతము' శ్రీశైలమని నిర్ణయించినాడు. కీలుహారను పండితుడుకూడ నిట్లే భావించినాడు. అమరపురమును అమరావతితో ముడిపెట్టుటంత సంభావ్యముగాతోచదు. కీలుహారను పండితు డూహించినట్లు 'విష్ణుకుండి' శబ్దము గుంటూరుజిల్లాలోని 'వినుకొండ' గ్రామనామమందు స్ఫురణకు వచ్చుచున్నది. విష్ణుకుండిశబ్దము విన్హుకుండి, వినుకుండి, వినుకొండ, కావచ్చును. ప్రాకృతాంధ్రమందు 'విష్ణుకుండి' పదము 'విన్హుకుండి' 'వినుకుండి' అని యుచ్చరింపబడుచుండవచ్చును. విష్ణుకుండి నగరమువారగుటవలన ఈరాజవంశమువారు విష్ణుకుండివారయిరి. విష్ణుకుండి నగరము, లేక నేటి వినుకొండ, పూర్వము విష్ణుకుండిరాజులకు మొట్టమొదటి రాజధానియై యుండనోపు. ఈ విష్ణుకుండినగరమునకు అమరపురముఅని కూడ పేరుండియుండవచ్చును. అమరపురము విష్ణుకుండిపురమగుటచేత జనులు అమరపురమను పేరు మరచిపోయి విష్ణుకుండిపురము, లేక విణ్హుకుండిపురమనియు, సంక్షిప్తముగా వినుకొండయనియు వాడుట అలవాటు చేసికొనియుందురు. వినుకొండస్థలము చాలా ప్రాచీనమైనదగుటబట్టి యీయూహ మరింతసమంజసముగా తోచుచున్నది. ఈయూరిచుట్టును విషమములయిన గిరిదుర్గములు మూడుగలవు. వీటి అన్నిటిలో మిక్కిలి ప్రాచీనతమమైనది పడమటికొండపైనున్నది. ఈ నగరప్రాంతమున పురాతనమైనవస్తుసంచయము విశేషముగా గలదు; పరిశోధింపదగినది చరిత్రకారుని కత్యంతోపయోగకరమైన నూత్నవిషయము లనేకము లిచ్చట దొరకగలవు. ఇచ్చట కొండలపై నింతవఱకు చరిత్రకారుడుచూడని ప్రాచీనశిలాశాసనములు పెక్కుగలవట! ఇచ్చటి పురాతన నగరప్రాంతమును త్రవ్విచూచినచో విష్ణుకుండిరాజులచిహ్నములు తప్పక గన్పింపగలవు.

వినుకొండ ప్రాచీనఅమరపురమని నిర్ణయించితిమి గావున త్రికూట మలయములుకూడ నీప్రాంతముననే యుండవలయునని యూహింపవలయును. లేకున్న హుల్షుపండితుడు తలచినట్లు త్రికూటము బొంబయిప్రాంతపునగముగాను, మలయము పడమటికనుమలుగాను భావించుట కేవల మసంభావ్యమగును. ఇంచుమించుగా వేయిమైళ్లదూరముననున్న గిరులకు ఆంధ్రదేశములోని విష్ణుకుండిమాధవవర్మ అధిపతియని చెప్పుకొనుట హాస్యాస్పదమైన విషయము. లేదా యీ త్రికూట మలయాధిపతి విశేషణమునకు వేరొకఅర్థముండవలయును. ఆంధ్రదేశచరిత్ర, ఆంధ్రభూగోళశాస్త్రము, స్థలవర్ణనములు మున్నగునవి నేటిఆంధ్రుల కసలుతెలియని దౌర్భాగ్యవశమున త్రికూటమలయములను మనము గుర్తించలేకున్నాము. వినుకొండకు సమీపముగా నరాసరావుపేటకు నైరృతిదిక్కున ౮ మైళ్లదూరమున కోటప్పకొండయని యొక యూరు గలదు. దానికి పూర్వము కావూరని పేరుండెను, ఆయూరికి సమీపమున కొండపై నొకశివాలయమున్నది. ఆకొండకు కావూరి కోటప్పకొండయని పేరు. త్రికూటేశ్వరుడు, లేక కోటప్పయను పేరుతో శివు డిచ్చట పూజింపబడుచున్నాడు. మహాశివరాత్రినాడు కోటప్పకొండపై మహోత్సవముజరుగును. నేటివ్యవహారమునందు కోటప్పకొండయని పిలువబడుచుండినను పూర్వమీగ్రామము కావూరనియు, నిక్కడనున్న కోటప్పకొండ త్రికూట

మనియు, నిందు వేంచేసియున్న మహేశ్వరమహా
దేవుడు త్రికోటీశ్వరుడనియు పిలువబడుచుండెను.[౧]
మరియు నీత్రికూటనగము శ్రీశైలగర్భమనికూడ స్థలపురా
ణము వాకొనుచున్నది. కావున మాధవవర్మ పేర్కొనిన
త్రికూటనగము కావూరికోటప్పకొండయనుటకు సంది
యములేదు. శాసనములను సంపాదించు ప్రభుత్వో
ద్యోగీయులు ఇక్కడదేవాలయమునందు గల పదిశాసన
ములనుమాత్రమే గుర్తించినారు. ఇంకను పెక్కుశాస
నములీనగప్రాంతమున నున్నట్లు స్థలజ్ఞులవలన దెలియ
వచ్చుచున్నది. కావున కావూరుకోటప్పకొండయే
త్రికూటగిరికావలయును. "మలయ" మనుపేరు ఆంధ్ర
దేశమున తూర్పుకనుమలు వ్యాపించియున్నంతవఱకు,
ఆపర్వతపంక్తులకు ఇరుపార్శ్వములందున్న సమస్తదేశ
మునకు మలయమనిపేరు. మలయప్రాంతమన్న పదము
నేటివ్యవహారమున మన్యప్రాంతమునియైనది. మలయము
యొక్క రూపాంతరమే మన్యము. ఈమలయప్రాం
తము గోదావరిజిల్లాయందు గలదు; విశాఖపట్టణము
గంజాంమండలములందు గలదు; గుంటూరు, కడప,
కర్నూలుమండలములందును గలదు. గుంటూరుజిల్లాలో
పల్నాడంతయు మలయప్రాంతమే. పల్నాడునకు
దక్షిణముగానున్న రేనాడంతయు అటుశ్రీశైలముపర్యం
తముకూడ మలయమే. ఆప్రాంతపుకొండలకు నల్ల
మలకొండ లనియు, ఎఱ్ఱమలకొండ లనియు పేరులు
గలవు. మలయమనునది కొండప్రాంతమునకు వాడిన
పదమని శాసనములవలన దెలియవచ్చుచున్నది.[౨] అసలాం
ధ్రదేశములోని పర్వతపంక్తులకు ఇంగ్లీషులో ఈస్టరను
ఘాట్సు అను పదమునకుసరియైన అనువాదముచేసి
తూర్పుకనుమలని మనము వాడుచున్నాము. "తూర్పు
కనుమ" లని వాడుకచేయుటాదిగా మలయములన్న
మాట మరచిపోయితిమి. విష్ణుకుండిమాధవవర్మ తొలుత
నేలిన మలయప్రాంతము శ్రీపర్వతముతో ముడిపెట్టబడి
నదిగావున, అది గుంటూరు, కర్నూలుజిల్లాల కొండ
ప్రాంతమని యూహింపవచ్చును. దీనినిబట్టి విష్ణుకుండిన
వంశస్థాపకుడైన మొదటిమాధవవర్మ యేలినరాజ్యము
నేటిగుంటూరుజిల్లాలోని పశ్చిమభాగమందుజేరిన నరసా
రావుపేట, వినుకొండ, పల్నాడుతాలూకాలును,
కర్నూలుజిల్లాలోజేరిన కంభం, మార్కాపురం, నంది
కొట్కూరుతాలూకాలును, అటు పడుమటగా కృష్ణా
నదికావలియొడ్డుననున్న నల్గొండపరగణాయును కలిసిన
దేశభాగమని యూహింపవచ్చును. ఈ దేశమునకు నడు
మగా కృష్ణానదిప్రవహించుచున్నది. పాఠకుడు విష్ణు
కుండిరాజ్యవిస్తీర్ణతను వేరొకచోటనీయబడిన చిత్ర
పటమునందు గాంచగలడు. కృష్ణానది కిరుపార్శ్వము
లందు "తూర్పుకనుమ" లనబడు మలయపర్వతశ్రేణులు
ఈశాన్యమునుండి నైరృతిగా బారులుతీర్చియున్నవి.
ఈమలయపర్వతములందు ఆంధ్రుల కత్యంతప్రీతికరము
లయిన శ్రీశైలము, త్రిపురాంతకము, త్రికూటగిరి, శ్రీ
పర్వతము మున్నగుపావనములయిన మాహేశ్వరపీఠములు
గలవు.

## ౪

## విష్ణుకుండి వంశచారిత్రక విశేషములు

మొదటిమాధవవర్మ విష్ణుకుండిరాజ్యమును
స్థాపించి 'మహారాజ' పదవినిబొంది స్వతంత్రుడై
పరిపాలన మారంభించినది క్రీ. శ. ౪౨౦-వ సంవత్సర
ప్రాంతమని యింతకుముందు వివరించియుంటిమి. విష్ణు
కుండుల వ్యుత్పత్తియు, వారు తొలుత రాజ్య మెట్లు
సంపాదింపగల్గినదియు చరిత్రకు బాగుగా తెలియవచ్చుట
లేదు. లక్ష్మణరావుగారు "ఎట్లయినను, గుప్త, వాకాట
కులతోడి సంబంధమూలముననే విష్ణుకుండిప్రభువులు
పైకివచ్చిరనుట స్పష్టము. మొదటిమాధవవర్మ తొలుత
గుప్తులయొద్దనో, వాకాటకులయొద్దనో సేనాధిపతిగ
నుండి తనపరాక్రమమూలమున ప్రముఖుడయ్యెనని
నానమ్మకము. అతడు దక్షిణహిందూదేశ జైత్రయాత్రలో
సముద్రగుప్తునిఅనుసరించిన సేనాధిపతులలోనొక్కడో,

౧. S. I. I. Vol. IV. Nos 915—925.

౨. Cp. No. 31921-22 ; S. I. I. Vol. V. No. 116.

లేక అతనితోచేరిన దక్షిణహిందూదేశసాహసికుడై, యతని కళింగరాజ్యప్రతినిధిగ వెనుక నిలిచిపోయిన వాడో యైనను ఆశ్చర్యము లేదు" అనివ్రాసిరి. ఈ యూహలకు ప్రమాణములు లేవు. ఇదియంతయు లక్ష్మణ రావుగారు కట్టజూచిన గంధర్వనగరము. లక్ష్మణరావు గారు విష్ణుకుండిరాజుల కాలనిర్ణయము సరిగాచేయలేదు. వారు మొదటిమాధవవర్మ కాలనిర్ణయమును చేయబూని నపుడు శాలంకాయనులకుగూడ ఆంధ్రదేశచరిత్రయందు స్థానమున్నదనుటమాట మరచిరి. ఇంకను ఇట్టిరాజ వంశములు పెక్కులు గలవనుమాట వారికితోచలేదు. మీదుమిక్కిలి సముద్రగుప్తుని దండయాత్రకును, శాలం కాయనులలో కడపటివాడైన స్కందవర్మకును నడుమ కనీసము తొంభయిసంవత్సరము లున్నవనుమాట వారు పరికింపలేదు. ఇన్నివిషయములు వారు యోజించు కొనకుండ మొదటి మాధవవర్మను ఇంచుమించుగా శాలంకాయన హస్తివర్మకు సమకాలికునిజేసిరి. గుప్త వాకాటవంశముల చరిత్రము వారినాటికి సరిగా తెలియ రాలేదు. ఇన్నికారణములబట్టి లక్ష్మణరావుగారి యూహలు అసంబద్ధములు, సత్యదూరములు. ఇక నెక్కడినుండివచ్చి రీవిష్ణుకుండిరాజులని యోజింపవల యును. ఈప్రశ్నకు సమాధానము దుర్లభము. అయినను ప్రాచీనాంధ్రదేశపుచారిత్రకగాథలందు కొంత ఆధా రము గనబడవచ్చును. వేంగీశాలంకాయనులకు సమకాలి కులు, కృష్ణకు దక్షిణ,నైరృతిప్రాంతములనున్న నేటి గుంటూరు, నెల్లూరుజిల్లాలలోని కొన్నిభాగములు ఏలు చుండినవారు కందరపురాధీశ్వరులయిన ఆనందగోత్ర జులు గలరు. విష్ణుకుండివంశమాక్రమించుకొన్న చిన్న రాజ్యము ఆనందగోత్రమువారి రాజ్యమునకు సరిగా పశ్చిమముననున్నది. కావున వారు తొలుత ఆనంద గోత్రజులకు సామంతులుగా నుండి, యొక చిన్న సీమను పరిపాలించుచు, కొంతకాలమునకు వారిని ధిక్కరించి యుందురు. అప్పటికి కందరపురాధీశ్వ రులరాజ్యము కాలవశమున బలహీనమై యుండును. క్రీ. శ. నాల్గవశతాబ్దము సగముగతించునాటికి పల్లవ సామ్రాజ్యము మహోచ్చదశకు వచ్చి యుండెనో! ఆనాడు ఆంధ్రదేశమున కృష్ణానది కిరుపార్శ్వ ములందును బృహత్పలాయనులు, ఆనందగోత్రజులును పరిపాలించుచుండిరి. బృహత్పలాయనాదుల నోడించి శాలంకాయనులు పల్లవులసాహాయ్యమున వేంగీభూమికి అధీశ్వరులయిరి. ఆనందగోత్రజులు బృహత్పలాయనుల వలె నతిశీఘ్రముగ నాశమునొందక, కొంతకాలము వారినెదిరించియుందురు. దక్షిణమున పల్లవమహారాజ్య ము, ఉత్తరమున శాలంకాయనవేంగీరాజ్యమును ఒత్తిడి కలుగచేయుచుండ నిస్సహాయులై ఆనందగోత్రీయులు క్రుక్కి కాలవశమున అంతమొందియుందురు. ఆసం కులసమయమున విష్ణుకుండీయులు, తరుణమువచ్చియుం డెనుగావున అదివరకు చిన్నసామంతరాజ్యముగా నున్నదానిని విస్తరింపజేసి పరభూముల నాక్రమించి వాకాటకప్రభువులవలె స్వాతంత్ర్యము ప్రకటించి యుందురు. అట్లు విష్ణుకుండిరాజ్యమును తనబలపరా క్రమాతిశయముచే స్థాపించినవాడు మొదటిమాధవవర్మ. ఇతడు పల్లవ, శాలంకాయనవాకాటకాదులవలె 'మహా రాజ'పదవిని పొంది రాజ్యమేలినాడు.

లక్ష్మణరావుగా రూహించినట్లు, విష్ణుకుండీయుల కును జౌత్తరాహులయిన వాకాటకులకును ఆదినుం డియు నేదోయొకకొంతసంబంధ ముండినట్లు తోచు చున్నది. విష్ణుకుండీయులు ఆంధ్రులు; వాకాటకప్రవర సేనుడు (క్రీ. శ. ౨౭౫ – ౩౪౪) ఉత్తరాంధ్రభూము లను జయించినపుడు విష్ణుకుండీయులు వాకాటకులకు సామంతులయియుందురు. వాకాటక–విష్ణుకుండీయుల సంబంధము విష్ణుకుండీయులశాసనములందు మొదటినుండి యు గానుపించుచున్నది. విష్ణుకుండీయులు, వాకాటకు లకు మొదట సామంతులయి, పిమ్మట వారి నెదిరించి స్వతంత్రులయి, పరాక్రమాతిశయముచే ప్రఖ్యాతు లయిననాడు వారితో వైవాహికసంబంధమును కలుపు కొనియుండిరి. రెండవమాధవవర్మ యీపూరుశాసనమందు "శ్రీవిష్ణుకుండినాం మహారాజస్య శ్రీమాధవవర్మా" అని యున్నది. ఇది వాకాటకసంప్రదాయము. వాకాట కులలో ప్రవరసేనాదులు రెండు, నాలుగు అశ్వ మేధములు చేసినవారని చెప్పుకొనిరి. వారిననుసరించి, వారికంటె నధికులమని చెప్పుకొనుటకై, ఏకాదశ

దిగ్విజయములు చేసినను చేయకపోయినను విష్ణుకుండి రాజులు ఏకాదశాశ్వమేధములు చేసినట్లు వర్ణించుకొనిరి. మొదటిమాధవవర్మ పదనొకండశ్వమేధయాగములు చేసెనో లేదోగాని, చేసినట్లు రెండవమాధవవర్మయిపూరు శాసనము ఆతనిని "ఏకాదశాశ్వమేధావభృథావధూత జగత్కల్మషస్య, అగ్నిష్టోమసహస్రయాజినః, అనేక సామంతమకుటకూటమణి ఖచితచరణయుగలస్య, మహారాజస్య" అని వర్ణించుచున్నది. మొదటిమాధవవర్మ శాసనమొక్కటియు నింతవఱకు లభింపలేదు. ఆతని బిరుదుగద్య యెట్లుండెనో తెలియదు. కాని, వాకాటక సంప్రదాయము ననుసరించి తొలుత తనవంశమునకు మహారాజవంశలాంఛనమైన బిరుదుగద్యను సంస్కృతమున వ్రాయించినాడు రెండవమాధవవర్మయని నిశ్చయముగ జెప్పవచ్చును. వాకాటకులవలెవిష్ణుకుండీయులు వాజపేయ అగ్నిష్టోమాదిక్రతు సహస్రయాజులు. ఇవి యన్నియుపూర్తిగా ప్రగల్భములును, వట్టియాడంబరవాక్యములునుగాజాలవు: విష్ణుకుండినులకును వాకాటకులకు మొదటినుండియు నొకసంబంధముండినట్లు ఇవి నిస్సంశయముగా సూచించు చున్నవి. వాకాటకులు కొందఱు, క్రీస్తుశకమునకు పూర్వమునుండియు ఆంధ్రదేశమునకు వచ్చుచు బోవుచుండినవారని అమరావతియందు క్రీ. పూ. ౧౫౦ నాటి వాకాటక గహపతి (గృహపతి) యొక్క ప్రాకృత శిలాశాసనము సాక్ష్యమొసగుచున్నది. ౧ కావున విష్ణుకుండీయులకును వాకాటకులకును సంబంధముండెననుట నిస్సంశయము. అగ్నిష్టోమ, వాజపేయ సహస్రక్రతుయాజినులనుటబట్టి విష్ణుకుండీయులు వాకాటకులవలె బ్రాహ్మణులుగాని, బ్రాహ్మణప్రాయులు గాని కావలయును.

౧. మొదటిమాధవవర్మ. (క్రీ. శ. ౪౨౦-౪౫౦) ఇతనిగురించి చరిత్రయేమియు దెలియరాకపోయినను, ఇతడే విష్ణుకుండి వంశకర్తయనియు, రాజ్యనిర్మాతయనియు నితనిపౌత్రుని ఈపూరుశాసనమునుబట్టి యూహింపబడును. అతులబలపరాక్రమశాలియగుటచే విశాలమైన శత్రురాజ్యము నాక్రమించుకొని "అనేక సామంతమకుటకూట మణిఖచితచరణయుగలుడై మహారాజపదవిని బొందినాడు. ఇతడే విష్ణుకుండులలో మొదటిమహారాజు. సర్వతంత్రస్వతంత్రుడయిన రాజపరమేశ్వరుడు. ఏకాదశాశ్వమేధ సహస్రయాజియని వర్ణింపబడిన కారణమున నతని రాజ్యకాలమంతయు యుద్ధములతో గడచిపోయెననియు, నితడు దిగ్విజయము చేసి పెక్కుసార్లు శత్రుసంహారము చేసినాడనియు నూహింపవచ్చును. ఈతడానందగోత్రులను జయించి యుండుననని యీవఱకే సూచించితిమిగాని, వారిలో నెవరిని యోడించి యేవంశము నిర్మూలముగావించెనో నిర్ణయింపలేము. ఇంతవఱకు ఆనందగోత్రులయిన అత్తివర్మ (హస్తివర్మ) దామోదరవర్మలను ఇద్దరురాజులే శాసనములబట్టి తెలియవచ్చుచున్నారు.౨ మరియు శాలంకాయనులలో కడపటివారైన రెండవనందివర్మ, స్కందవర్మలను గూడ జయించి వారిరాజ్యములోని సీమలను గొన్నింటిని ఆక్రమించుకొని యుండవచ్చును. స్కందవర్మ మరణానంతరమున మొదటి మాధవవర్మ వేంగీదేశమునుగూడ తనరాజ్యములోనికి దెచ్చుకొని యుండును.

౨. దేవవర్మ:--మాధవవర్మకుమారుడైన దేవవర్మ "క్షత్రియావస్కంద ప్రవర్తితాప్రతిమవిఖ్యాతపరాక్రమస్య శ్రీదేవవర్మ" అని క్షత్రియవీరులను ఓడించుటలో అప్రతిమానమైనపరాక్రమమునుజూపి విఖ్యాతి జూపినట్టివాడని యీపూరుశాసనము దెలుపుచున్నది. ఇతనికి 'మహారాజ' పదము చేర్చని కారణమున, ఇతడు రాజ్యాభిషిక్తుడు కాకపూర్వమే మరణించి యుండెనని తోచుచున్నది. ఇతడుజయించిన క్షత్రియ వీరులెవ్వరో విచారించుటకు సాధనములుచాలవు. కాని పైనివివరించినరీతిని, ఇతడాకాలమున నాంధ్రదేశమును బరిపాలించుచుండినపల్లవశాలంకాయన, ఆనందగోత్రాది రాజవంశము లనేకములను నిర్మూలనముగావించి తనతండ్రి విష్ణుకుండ్యాధిరాజ్యము సుస్థిరముగ బాదుకొల్పుటకు తోడ్పడితనమహాపరాక్రమమును జగద్విఖ్యాతముచేసినాడు. వాకాటరాజులు తమరాజపుత్రికను దేవవర్మకుమారుడైన రెండవమాధవవర్మకిచ్చి విష్ణుకుండులతోడి వియ్యా

౧. Ep. Ind. Vol. XV p. 267. No. 27.

౨. Ep. Ind, Vol. XVII. p. 327.

మును, నెయ్యమును కూడ నభిలషించుటజూడ క్రీ. శ. అయిదవశతాబ్దము సగము గతించునాటికి, అనగా మొదటిమాధవవర్మ మరణించునాటికి విష్ణుకుండీయులాంధ్రదేశమున ప్రబలులై, విశాలరాజ్యమును స్థాపించి యుండిరని యూహింపవచ్చును. వాకాటకరాజులకాలమింకను తృప్తికరముగా నిర్ణయింపబడలేదు. మూసాయిప్రభృతులు, డాక్టరు కృష్ణస్వామిఅయ్యంగారు, కాశీప్రసాదజాయస్వాలు మున్నగువారు తమసిద్ధాంతములు వివిధముగా ప్రతిపాదించినారు. వీటినన్నిటిని పరిశీలించినపుడు మొదటిమాధవవర్మయొక్క అవసానకాలమునాటికి సమకాలికుడయిన వాకాటకమహారాజు నరేంద్రసేనుడని తోచును. ఈతనిపితామహుడైన రెండవ రుద్రసేనుడు మరణించినతరువాత కుమారులు ఇరువురును దివాకరసేన, దామోదరసేన — ప్రవరసేనులు, బాల్యావస్థదాటనివారగుటచేత వారిజనని ప్రభావతీగుప్తమహాదేవి సంరక్షకురాలుగా రాజ్యభారము బూనియుండెను. రెండవప్రవరసేనునికాలమున వాకాటకరాజ్యము బలహీనమయ్యెను. అతనికుమారుడు నరేంద్రసేనుడు ఎనిమిదవయేట రాజ్యాభిషిక్తుడయ్యెను. దీనితో వాకాటకరాజ్యము పతనలనారంభించెను. ఈ నరేంద్రసేనునిరాజ్యకాలము క్రీ. శ. ౪౩౫ మొదలుకొని ౪౬౦ వఱకు నుండవచ్చునని, జాయస్వాలుపండితుడు నిర్ణయించినాడు.[౧] ఈ కాలనిర్ణయము సమంజసముగానున్నది. వాకాటకులు బలహీనులయి దక్షిణమున ఆంధ్రదేశమున బలవంతులయియున్న విష్ణుకుండీయులతోడి నెయ్యము, వియ్యమునుగూడ కోరియుండిరి. కావున రెండవమాధవవర్మ పెండ్లియాడినది నరేంద్రసేనుని తనయగాని, అగ్రజగాని కావచ్చును. లక్ష్మణరావుగారామెపేరు చంద్రావతియైయుండవచ్చునని యొక విచిత్రమైన యూహచేసిరి. నరేంద్రసేనునకొక యగ్రజుడుండినట్లును, వీరిరువురకును మొదటినుండియు వైరమేగాని మైత్రిలేనట్లును తెలియుచున్నది.[౨] ఈ నరేంద్రసేనుడు అన్ననోడించి పైతృకరాజ్యమునకు చిన్ననాడే మంత్రిసేనాపతులసహాయమున పట్టముగట్టుకొనెను.

తనరాజ్యమును సుస్థిరముగాజేసుకొనుటకై ఇతడు కదంబరాజకన్యక అజ్ఝితభట్టారికామహాదేవిని పెండ్లియాడి కుంతలాధీశునితోడను, తనకూతునో తోబుట్టువనో విష్ణుకుండిరాజపుత్రు డయిన రెండవమాధవవర్మకిచ్చి ఆంధ్రదేశాధీశునితోడను బంధుత్వము కలుపుకొని వారలసహాయమున సుస్థిరముగ రాజ్యమేలెను. ఒకవంక వాకాటకరాజులతోడిబంధుత్వమును, మరియొకవైపున కుంతలేశ్వరునినెయ్యమును తనకు సాహాయ్యముగానుండ రెండవమాధవవర్మ చిన్ననాటనే పట్టాభిషేకము చేసుకొని అజేయుడై ఆంధ్రదేశములోని విశేషభాగమును జయించి విశాలరాజ్యమును స్థాపింపగలిగెను.

౩. రెండవమాధవవర్మ (క్రీ. శ. ౪౫౦ మొదలుకొని౫౦౦ వఱకును)– రెండవమాధవవర్మకాలమునాటికే శాలంకాయనవేంగీరాజ్యము నామమాత్రావశిష్టమైనట్లు తోచుచున్నది. ఆనందగోత్రజులరాజ్యముకూడ నిర్మూలింపబడియెను. పల్లవులకోవకు జెందని బృహత్పలాయనులరాజ్యము అంతకుముందే అస్తమించెను. విష్ణుకుండీయులు ఇంచుమించుగా కర్మరాష్ట్రమును, వేంగీభూమిని గూడ కలిపి ఒకవిశాలరాజ్యమును స్థాపించుకొనగల్గిరి. చదువరి యిప్పటిరాజ్యాంగవిధానము ననుసరించి విభజింపబడిన బ్రిటిషు కృష్ణాగోదావరులనడుమనున్న కృష్ణాగోదావరిజిల్లాలు మూడును మాత్రమే కలిసి పూర్వపు వేంగీదేశమైయుండెనని భావింపగూడదు. పూర్వపు వేంగీదేశము పడుమటను తూర్పుకనుమలుదాటి యిప్పుడు నిజాంరాజ్యములోచేరిన వరంగలు (ఓరుగల్లు) సుబాలోనికి చాలాదూరము వ్యాపించియుండెనని యూహించుకొనవలయును. ఇంతపెద్దరాజ్యము ఆక్రమింపగల్గినారు గావుననే విష్ణుకుండీయులతోడి నెయ్యము వియ్యముగూడ వాకాటకు లభిలషించిరి. రెండవ మాధవవర్మకాలమున విష్ణుకుండివంశము తమ పూర్వపురాజధానియైన విష్ణుకుండిపురమను నామాంతరముగల అమరపురమును విడిచిపెట్టిరని తోచుచున్నది. రాజ్యము విస్తరించినకారణమున ఇమ్మడి మాధవవర్మ

[౧] J. B. O. R. S. Vol. XIX. p. 79.

[౨] Balaghat plates of Narendrasena ; Ep. Ind. Vol- IX. p. 268—270.



'మాశి భవన్' లక్నో.

ఔధ్ మహారాజు సాయంసమయ ఉద్యానమున నున్నది. వి. ఆర్. చిత్ర.

తనరాజధానిని మార్చుకొనియుండెనని యూహింప వచ్చును. మాధవవర్మకు పూర్వము విజయవాటికయని పేరుతోనుండిన నేటి బెజవాడ రాజధానిగా బరగు చుండెననుటకు ప్రబలనిదర్శనమొకటి కనబడుచు చున్నది. ఒకానొక మాధవవర్మనుగురించి బెజవాడ మల్లేశ్వరస్వామిగుడిలోనున్న పదమూడవశతాబ్దమునాటి యొకశిలాశాసన మొకచక్కనికథను దెలుపుచున్నది.౧ ఆకథలోని మాధవవర్మ విష్ణుకుండివంశీయుడని దెలుప బడకున్నను బెజవాడప్రాంతమును ఏలిన పూర్వపు రాజులలో విష్ణుకుండీయులలో తప్ప మాధవవర్మాభిధా నులు మరియొకరాజవంశమున లేరు. కావున శాసనము నందు పేర్కొనబడిన మాధవవర్మ విష్ణుకుండివంశము లోనివాడనియే నిర్ధారింపవచ్చును. అసలాకథ నిజమా యన్నవిషయము సందేహింపనక్కరలేదు. యథార్థము కావచ్చుననుటకు కొన్నిహేతువు లాకథయందే గలవు. ఆకథయిట్లున్నది: కలియుగమున అత్యంతపురాతనకాల మున, ౧౧౭-వ శకవర్షమున మాధవవర్మయను ప్రసిద్ధు డైన రాజొకడుండెను. ఆతనికుమారుడు "తింత్రిణీ జీవిని" యైన (అనగా చింతచిగురు, చింతకాయలు అమ్ముకొని జీవనముగడపుకొను) ఒక స్త్రీయొక్క బిడ్డను అన్యాయముగ జంపెను. హతభాగినియైన యా పేదరాలు మృతశిశువును రాజసభకుగొనిపోయి ధర్మ భిక్షగోరెను. అంతట మాధవవర్మ యా ఆడుదాని గోడు విని, న్యాయమును పరిపాలింపగోరి కుమారునికి మరణదండనము విధించెను. మహారాజుయొక్క పరమ ధార్మికబుద్ధి కెంతయు సంతోషించి బెజవాడ మల్లేశ్వ రుడు ఒకగడియసేపు కనకవృష్టి గురియించెను. మల్లే శ్వరమహాదేవుని కృపచేత నాపేదరాలి బిడ్డడును, రాకు మారుడునుగూడ పునర్జీవితులైరట! ఈరీతిని మల్లేశ్వర మహాదేవుడు మాధవవర్మకీర్తి నీలోకమున సుప్రతిష్ఠిత మొనరించెను. ఈచిత్రవృత్తాంతమును శ్రీనాధుని భావ మఱదియగు దగ్గుపల్లి దుగ్గనకవి (౧౫-వ శతాబ్దపువాడు) తన నాసికేతోపాఖ్యానమున ఇట్లు వర్ణించియున్నాడు:

సీ. "చతురంగబలములు జయవాడదుర్గాంబ
వరమునం బడసి, దుర్వారలీల
జగతీస్థలంబెల్లసాధించి, జయశాస
నములు దిగ్దంతిదంతములసలిపి,
పేదబాలునకుఁగా బ్రియసుతమోహంబు
పట్టక బెజవాడఁబాడి నిలిపి,
కలయంగఁ బురమునఁ గాంచనవర్షంబుఁ
గురియించి, దేవతాకోటి పొగడ
వసుధనెగడిన, మాధవవర్మ........."

ఇంతకుపూర్వపు శాసన మొకటి ఒకానొక మాధవ వర్మను పేర్కొనుచున్నది గలదు. అది ౧౨-వ శతాబ్ది నాటిది; అది రెండవ కాకతిప్రోలరాజు అనుమ కొండశాసన మనబరగుచున్నది.౨ అందు ప్రోలరాజు ప్రెగ్గడయైనబేతరసుభార్య మైలమదేవి క్రీ.శ. ౧౧౧౭-వ సంవత్సరములో "కదలలాయబసది" యను జినాలయ మును కట్టించెను. దానికి మహామండలేశ్వర ఉగ్రవాడి మేళరసుకూడ కొంతభూమిని దానమొసంగెను. ఈ మేళరసు మాధవవర్మవంశోద్భవుడని తెలుపుకొనెను. ఇతడాకాలమున అనుమకొండసీమకు పరిపాలకుడుగా నుండినట్లు తెలియుచున్నది.

శాసనములలోని వృత్తాంతములు ఇట్లుండ కాలా నుగతములయిన గాథల నెత్తికొందుమేని "మాధవవర్మ" ను గురించి తెలుగుదేశమున తరతరములుగ వినవచ్చు కథ లనేకములుగలవు. ఇవి కేవలము చారిత్రరచనకు ప్రామాణికములుకావు; గాని ఉపయుక్తములుగా నుం డును. స్థానికపురాణములలోని "ఏకశిలానగరవృత్తాం తము", కాచసర్వప్పకృతమైన "సిద్ధేశ్వరచరిత్రము", కూచిమంచి జగ్గకవిరచితమైన "సోమదేవరాజీయము" మొదలగునవి కాకతీయవిజృంభణమునకు పూర్వము అనేకశతాబ్దములక్రిందట అన్మకొండసీమనేలిన యొకా నొకరాజవంశమునకు మూలపురుషుడైనట్టి యొక 'మాధవ వర్మ'ను పేర్కొనుచున్నవి. ఇవి యామాధవవర్మతండ్రి

౧. Ep. Celt No. 536 of 1909 A. R. (A. S. R. 1910. p 71-72).

౨. Ep. Ind. Vol. IX p. 256.

సోమదేవరాజని చెప్పుచున్నవి. మాధవవర్మవృత్తాంతము కొంత ఆగాథలయందు గలదు గాని, దాని నిచ్చట విస్తరించి విమర్శించుటకు తావు చాలదు; సమయమును గాదు. ఆగాథయంతయు చిందరవందరగా దుర్గ్రాహ్యముగా నున్నది. కాని, యందు చేర్కొనబడిన మాధవవర్మ విష్ణుకుండిమాధవవర్మ అయిన కావచ్చుననుటకు కొన్ని హేతువులు గన్పట్టుచున్నవి.

చిత్రముగ నీకథయందు మాధవవర్మ అనుమకొండ ప్రాంతమునకూడ నేలినవాడనుట జూడ మాధవవర్మ యేలిన దేశభాగమున నిప్పటి ఓరుగంటిపరగణాగూడ చేరియుండెననుట స్పష్టము. మాధవవర్మ శాలివాహనశకము ౨౩౦ మొదలుకొని ౩౯౧ వఱకు, అనగా ఇంచుమించుగా క్రీ. శ. ౩౦౮ మొదలుకొని ౪౬౯ వఱకు నూటయఱువదిసంవత్సరములు పాలించినట్లు పైగాథలో తెలుపబడినది. ఒక్కరాజు నూట యఱువదిసంవత్సరములు పరిపాలించెననుట ఎంతఅవిశ్వసనీయమైన అతిశయోక్తియో, శాసనకథ యొసంగిన శాలివాహనశక కాలపరిమితికూడ నంతే అవిశ్వసనీయమైనది. కాని అందు తెలుపబడిన శక కాలము మాధవవర్మయొక్క ప్రాచీనతను, నూటయఱువదిసంవత్సరముల రాజ్యకాలము, మనము పైననిర్ణయించినరీతిని విష్ణుకుండివంశము ఆంధ్రదేశము నేలిన కాలపరిమితిని ఇంచుమించుగా సూచించుచున్నవి.

రెండవ మాధవవర్మ రాజ్యారంభకాలమునుండి మొదలు ఆంధ్రదేశమును చాళుక్యులుజయించి తమ రాజ్యమును స్థాపించునాటివఱకును (క్రీ. శ. ౪౫౦–౬౨౦) లెక్కించినయెడల నడుమ సుమారు నూటడెబ్బదిసంవత్సరములుగలవు. ఈకాలమున ప్రసిద్ధులయిన యిరువురు మాధవవర్మలు గలరు. వారిరువురిరాజ్యకాలములును గలిసిన యొకశతాబ్దము సులభముగా దాటిపోవుచున్నది. మరియు విష్ణుకుండినులలో మాధవవర్మాభిధానులే కడుప్రసిద్ధులు గావున పైనవివరించిన గాథలలోని మాధవవర్మ రాజ్యపాలనము నూటఅరువది యేండ్లును విష్ణుకుండిన రాజ్యకాలమునకు సరిపోవుచున్నది.

ఇంతవఱకు మనము ప్రస్తుతవిషయమును దాటి వచ్చితిమి. అయినను మొదటి ప్రతిపాదింపబడినట్టిది, రెండవమాధవవర్మకు బెజవాడ రాజధాని యన్నవిషయము పైనివ్రాసినవాటినిబట్టి విశదమగుచున్నది. రెండవ మాధవవర్మ బెజవాడరాజధానిగా నాంధ్రభూమినంతయు నేలినవాడగుటచేతనే యాతని పరమధార్మికవృత్తిని ఆచంద్రార్కస్థాయిగా సుప్రతిష్ఠితముచేయగల వృత్తాంతము బెజవాడయందు నేటివఱకు శిలాశాసనరూపమున నిలచియున్నది. ఆతడు చన్నతరువాత వేయి,పదిహేను వందలయేండ్లవఱకు నాతనివంశజులు ఆరాజచంద్రుని సంస్మరించుచు నేయున్నారు. మాధవవర్మమహారాజుయొక్క కుమారుడును చింతకాయలు అమ్ముకొనిజీవించెడు పేదరాలికొడుకును మరల బ్రతికిరని చెప్పెడు మాటలు కేవలము అతిశయోక్తులు. అవి కవిసమయములు. కాని మాధవవర్మమహారాజుయొక్క రాజ్యము దినదినాభివృద్ధినొందియుండుటయు, దేశము సువర్ణవృష్టి కలిగినట్లు సౌఖ్యావహమైయుండుటయు, నా భూభర్త పరమధార్మికుడని ప్రఖ్యాతిబడయుటయు మాత్రము నిస్సంశయముగా చరిత్రాత్మకములైన వృత్తాంతములని విశ్వసింపవచ్చును.

ఈమాధవవర్మ సామాన్యనృపాలుడుగాడని యాతనిగురించిన చిక్కుళ్ల శాసనములోని విశేషణములు జెప్పుచున్నవి. అతడు పదనొకండశ్వమేధయాగములుగావించి అవభృథస్నానము చేసినాడు. సర్వమేధయాగముచేసి సర్వభూతప్రపంచమునకు స్వారాజ్యపదవి సంపాదించినాడు; బహుసువర్ణ, పౌండరీక, పురుషమేధ, వాజపేయ, యూధ్య, షోడశి, రాజసూయ, ప్రాధిరాజ్య ప్రాజాపత్యాద్యనేక వివిధక్రతుసహస్రయాజి యాతడు. శ్రేష్ఠములయిన అనేకక్రతువులను అనుష్ఠించుటచేత రాజలోకమున పరమేష్ఠితత్వమును ప్రతిష్ఠింపగలిగినవాడు; సకలజగన్మండల విమలగురు పృథుక్షితిమకుట మణిగణ నికరావనతపాదయుగలము కలవాడు; శ్రీపర్వతస్వామి పాదానుధ్యాతుడు; త్రికూటముల యధిపతి; విష్ణుకుండ్యధిరాజు; నయవినయసత్వసంపన్నుడు; మహారాజు.

ఈతడు యమనియమస్వాధ్యాయ క్రియాసంపన్నులయినట్టి అగ్నిశర్మ, ఇంద్రశర్మాభిధానులను నిరువురు బ్రాహ్మణులకు విజయరాజ్యసంవత్సరము ४८ అనునేట వర్షఋతువున నేవపక్షమునందు సప్తమదివసమున 'కళిక' గ్రామమును అగ్రహారముగా దానము చేసెనని యితని ఈపురుశాసనము తెలుపుచున్నది. మరియు మాధవవర్మమహారాజు స్వయముగా నీశాసనము నాజ్ఞాపించినట్లు అందు గన్పడుచున్నది.

४. మొదటి విక్రమేంద్రవర్మ: రెండవ మాధవవర్మకు బూర్వమే యాతనిపుత్రుడు మొదటి విక్రమేంద్రవర్మ మరణించెనని యీవఱకే యూహించితిమి పైన నుడివిన శాసనపుకథలోని వృత్తాంతమును విశ్వసించిన యెడలగూడ విక్రమేంద్రవర్మ తండ్రివలన మరణదండనము నొందినాడని తెలియుచున్నది. ఇతడు వాకాటకనరేంద్రసేనుని దౌహిత్రుడు గావచ్చునని యిదివఱకే సూచించితిమి. ఇతనికి "ఉభయవంశాత్మజాలంకారభూతః" అన్నవిశేషణముకంటె ఇతరములు చిక్కుళ్ల రామతీర్థంశాసనములు రెండింటి యందును గూడ తెలుపబడియుండలేదు. పేరునకు మాత్రము "శ్రీవిష్ణుకుణ్డి పార్థివోదతోదితాన్వయతిలకసముద్భూతు"డనియు, 'సత్పుత్రు'డనియు విశేషణములు రెండింటినిమాత్రము రామతీర్థంశాసనము తెలుపుచున్నది. కావున నితడు రాజ్యము చేయకయే తండ్రికంటె ముందుగా మరణించియుండును.

५. ఇంద్రభట్టారకవర్మ (క్రీ. శ. ५०० మొదలుకొని ५३० వఱకును.): ఇతడు మొదటి విక్రమేంద్రవర్మ కుమారుడు. తనతాత రెండవమాధవవర్మ మరణానంతరము (క్రీ. శ. ५००) పట్టము గట్టుకొనెను. ఈ రెండవమాధవవర్మకు, విక్రమేంద్రవర్మగాక నింకను కొందరుతనయు లుండిరని తోచుచున్నది. మరియు వారందరు, ఇంద్రభట్టారకుని రాజ్యాభిషేకమును ఆటంకపఱచినట్లుగూడ కన్పట్టుచున్నది. ఇంద్రభట్టారకుడు దాయాదకులము నెల్ల ద్రుంచి నిరాతంకముగా రాజ్యభారమును తానొక్కడు బూనగలిగెను. ఈవృత్తాంతమును చిక్కుళ్లశాసనములో నింద్రభట్టారకుని కుపయోగింపబడిన "భ్రూభృంగకరవినిర్ధూతసమగ్రదాయాదస్య" అనువిశేషణము స్పష్టపఱచుచున్నది. సకలదాయాదకులమునుగూడ కనుబొమలు ముడిచినమాత్రాన నోడించినాడని అతిశయోక్తిగా చెప్పినను రాజ్యారంభకాలమునందు ఇంద్రభట్టారకుడు సింహాసనమును నిలువబెట్టుకొనుటకై దాయాదులతో కొంతకాలము పోరాడియుండెనని యూహింపవచ్చును. ప్రకాశించుచున్నటువంటి వాడియైన ఖడ్గధారా ప్రభావముచేత నాతడు అశేషజగన్మండలమును జయించి యాక్రమించుకొని తనయధిరాజ్యమును ప్రతిష్ఠించినాడు. ఆతడు అప్రతిమానబలపరాక్రమసంపన్నుడు. సమస్తరిపులోకమునకు బలునైన శత్రువు. విష్ణుకుండి మహారాజ్యము విస్తరింపజేసి కడుదక్షతతో పితామహ, ప్రపితామహులవలె ముప్పదిసంవత్సరములు సుస్థిరముగా నేలినవాడు.

అన్నిటికంటె చిత్రమైనవిషయము నొకదానిని చిక్కుళ్ల రామతీర్థాలశాసనములు ఇలనిగురించి తెలుపుచున్నవి. ఇంద్రభట్టారకుడు "అనేకచతుర్దంత సమరశతసహస్రసంఘట్టవిజయీ" అని యితనిరామతీర్థం శాసనమును, "అనేక చతుర్దంత సమరసంఘట్టద్విరదగణవిపులవిజయః" అని యితని కుమారుని చిక్కుళ్లశాసనమును ఆతనిగూర్చి తెలుపుచున్నవి. అనగా, అనేకశతసహస్ర సంగ్రామములందు, అనేకగజసైన్యములతో శత్రువుల నెదిరించి విజయముగాంచినవాడని అర్థము. చతుర్దంతమని తూర్పుదిక్కునకధిపతియైన యింద్రుని గజమునకు పేరు. కీలుహార్నను, మాసామూర్తియలు గార లూహించినట్టుగా చతుర్దంతగజములతోడి యుద్ధములు, విష్ణుకుండి ఇంద్రభట్టారకుడు తూర్పుదేశము నేలునట్టి యొక పేరుగలరాజుతో యుద్ధములుచేసి జయించినవాడని స్ఫురింపజేయుచున్నది. పృథ్వీమూలుని గోదావరిశాసనములో నొక ఇంద్రభట్టారకుని గూల్చుటకు మితవర్మకుమారుడైన ఇంద్రాధిరాజు అనేకమంది రాజులసహాయము గూర్చుకొని సుప్రతీకమను ఏనుగునెక్కి కుముదద్విరదమును గొట్టి భువనీతలము నంతయు తన జయశబ్దముతో ప్రతి

ధ్వనులీనునట్లు చేసెనని చెప్పబడినది. ౧ అం దీవిధముగ నున్నది:—

"అవాప్త చతుర్దంత సంగ్రామ విజయస్య; మితవర్మప్రియతనయేన సరభస మిన్ద్రభట్టారక సము పాటనాభిలావ సముదిత ప్రముదితాశేష నృపతి కృత తుములసమరాధిరూఢ సుప్రతీకానేకాభిముఖ సమద కుముద ద్విరద నిపాతనాధిగత భువనతల వితతవిపుల విశుద్ధయశసా శ్రీమదిన్ద్రాధిరాజేన......"

పైవాక్యమునందు మనోహరమైన యుపమానములో నొక చరిత్రాంశమును శాసనకారుడు చిత్రముగా నిమిడ్చినాడు. అధిరాజు ఇంద్రవర్మ సుప్రతీకము నధిష్ఠించినాడట. సుప్రతీకము ఈశాన్యదిశనున్న ద్విరదమునకు పేరు. సుప్రతీకము నధిష్ఠించిన యింద్రాధిరాజు యీశాన్యదిశ నేలువాడని అర్థము తోచుచున్నది. ఆంధ్ర దేశమున కీశాన్యమున కళింగభూమి గలదు. కావున ఇంద్రాధిరాజు కళింగాధీశుడు కావలయుననుట స్పష్టము. ఆతడు కుముదము అనగా నైరృతిదిక్కున నున్న గజము నధిష్ఠించిన ఇంద్రభట్టారకుని అనేకమంది సంతుష్టహృదయులైన రాజులసహాయమున బరిమార్చెను. కళింగమునకు నైరృతిగా వేంగీదేశమున్నది. కావున కుముదమధిష్ఠించిన ఇంద్రభట్టారకుడు విష్ణుకుండి ఇంద్రభట్టారకుడు కావలయు ననుట నిస్సంశయము. డుబ్రియలు ఈ కుముదము నధిష్ఠించిన యింద్రభట్టారకుడు విష్ణుకుండివంశజుడని నిరూపించుచున్నాడు. ౨ కాని ఫ్లీటు చాళుక్యఇంద్రరాజుతో కారణములు చూపింపకయే నిర్ణయించుచున్నాడు. ౩ ఫ్లీటుగారి నిర్ణయము అసమంజసమైనది. పృథ్వీమూలరాజు పేర్కొన్న ఇంద్రాధిరాజు కళింగాధీశ్వరుడు, గాంగవంశ్యుడు. ఇంద్రభట్టారకుడాంధ్రదేశాధీశ్వరుడయిన విష్ణుకుండి వంశతిలకుడు. ఈనిర్ణయ మిటీవలదొరకిన యొకతామ్ర శాసనమువలన కూడ బలపడుచున్నది. అది గాంగకులతిలకుడయిన ఇంద్రవర్మ జిర్జింగితామ్రశాసనము ౪ ఆశాసన లిపి చికుక్కళ్ల రామతీర్థంశాసనముల లిపిని స్పష్టముగా బోలియున్నది. మఱియు ఆశాసనపతి యింద్రరాజునకును పృథ్వీమూలుని గోదావరిశాసనమందు పేర్కొనబడిన ఇంద్రాధిరాజునకును కొంతపోలిక గనబడుచున్నది. జిర్జింగిశాసనపతి మహారాజు, రాజపరమేశ్వరుడు, త్రికళింగాధిపతి, అనేకచతుర్దంతసమరసంఘట్టవిజయుడు; ఆశాసన మాతనివిజయరాజ్యవర్షము ౩౯-వ ఏట, వైశాఖమాసమున, సప్తమదివసమున ఆజ్ఞాపింపబడెను. అనేకచతుర్దంత సమరసంఘట్ట విజయములు విష్ణుకుండియింద్రభట్టారకునకును, కళింగగాంగ ఇంద్రాధిరాజునకునుకూడ సామాన్యవిశేషణములు. కావున ఇంద్రభట్టారక, పృథ్వీమూల, ఇంద్రవర్మమహారాజులు ముగ్గురును సమకాలీనులగుట నిస్సంశయము. ఇంద్రభట్టారకుడు తనముప్పదిసంవత్సరములరాజ్యకాలమునందు గాంగఇంద్రవర్మను చతుర్దంతయుద్ధములం దెన్నిసారులయిన నోడించియుండవచ్చును. ఆతనిరాజ్యకాలమంతయు ననేకసమరసంఘట్టములతోడనే గడచిపోయియుండును. కాని ఇంద్రభట్టారకుడే కళింగాధిపతిని యోడించినాడనుటకు రామతీర్థంశాసనము ప్రబల ప్రమాణము. చివరకు విష్ణుకుండి ఇంద్రభట్టారకుడు కళింగాధీశునిచేత నోడింపబడి వీరస్వర్గము నొందినాడని జిర్జింగి, గోదావరి శాసనములు వాకొనుచున్నవి.

ఆశాసనము ఆరాజచంద్రుని విజయరాజ్యవర్షము ౨౭-వ ఏట జ్యేష్ఠమాసమున శుక్లసప్తమినాడు ఆజ్ఞాపింపబడెను. దత్తగ్రామము పటకిరాష్ట్రములోని పేరువాడ అనునది. పటకిరాష్ట్రము నేటివిశాఖపట్టముజిల్లాలోని చీపురుపల్లి తాలూకాకు పూర్వపు పేరని ఫ్లీటుపండితుడు నిర్ణయించినాడు. ౫ కావున పటకివిషయము

౧. Jour. Bom. Br. R. A. Soc. Vol. XVI p. 114 ff. Text lines 16—21.

౨. Ancient History of the Deccan, pp. 91-92.

౩. Ind. Bom. Br. R. A. S. Vol. XVI P. 114 ff.

౪. J. A. H. R. S. Vol. III. p. 49 ff.

౫. Ind, Ant. Vol. XX p. 16.

కళింగదేశములోనిది. ఇంద్రభట్టారకుడు ఇంద్రవర్మాదులనోడించి, కళింగదేశములోని దక్షిణభాగమును చాలవఱకు ఆక్రమించుకొనెను. తనరాజ్యమాప్రాంతమున సుస్థిరముగ నెలకొల్పబడియెననుటకు తార్కాణముగ నుత్తరమున పటకివిషయములోని గ్రామము నొకదానిని అగ్రహారముగా స్వపుణ్యఫలాభివృద్ధికొఱకై మాండిరసగోత్రుడును, తైత్తిరియసబ్రహ్మచారియునగు నగ్నిశర్మయను నొకబ్రాహ్మణపూజ్యునకు సర్వకరవివర్జితముగావించి దానమిచ్చెను. ఆదానవిషయమును స్వయముతానచ్చటికేగి యాజ్ఞాపించెను.

పైవిషయములన్నియుజూడ ఇంద్రభట్టారకుడు విష్ణుకుండ్యాధిరాజ్యమును కళింగదేశములోనికి బహుదూరము వ్యాపింపజేసిన మేటి పరాక్రమశాలియని తోచును. పరభూముల నాక్రమించుటకు ప్రయత్నించి విజయముగొన్నవాడు గావున భూమిపతులనేకు లాతనికి శత్రువులయిరి. కావుననే యాతని రాజ్యమును పెల్లగించివేయుటకు రభసముతో పెక్కుమంది మూలుని గోదావరిశాసనము దెలుపుచున్నట్లు, పృథ్వీరాజులు త్రికళింగాధిపతియగు ఇంద్రవర్మ తలపెట్టినంతనే వచ్చి చేరిరి. ఇంద్రభట్టారకు డవారితప్రతాపుడు. స్వబాహుబలముచే విశాలమైనరాజ్యము నాక్రమించుకొనెను; పెక్కుమంది మనుజపతులను సామంతులనుగావించి మొక్కులందిన మేటిఘనుడు, మహారాజు, రాజపరమేశ్వరుడు. ఆతనిరాజ్యము దక్షిణమున గుండ్లకమ్మ మొదలుకొని యుత్తరమున నాగావళివఱకును, పశ్చిమమున ఓరుగంట్లు, అన్మకొండ, మెదుకుసీమల వఱకును వ్యాపించియుండెను. అతనిరాజ్యమున కుత్తరపు సరిహద్దు వాకాటకరాజ్యసీమలు. దక్షిణమున కాంచీపురపల్లవులరాజ్యము. పశ్చిమమున కదంబుల కుంతల రాజ్యము. ఈశాన్యమున కళింగగాంగుల త్రికలింగ రాజ్యమును సీమలు.

---



కూనూరు J. R. K. S.

# హిందూలా—స్త్రీల హక్కులు

కొమాండూరి శఠకోపాచార్యులు

(అనువృత్తము)

## ౮. మనోవృత్తి

ఆస్తి హక్కు లేని కొందరు స్త్రీలను పోషించుటకు హిందూలాలో కొన్ని నియమములు కలవు. వృద్ధులగు తలిదండ్రులు, యోగ్యురాలగు భార్య, చిన్నకుమారుడు స్వయముగా పోషణకర్త్వాలు.[౧] కాని యీరూలు అమలులో కొన్ని చిక్కులు కలుగుచున్నవి. తల్లివృద్ధురాలైననే ఆమెను పోషింపవలెననుటచే నామెపోషణ విషయమున కోర్టులును, తనయ్యలమున కొంతవరకు కుమారుడునుగూడ నశ్రద్ధవహించుటయు, కోర్టులామెను తరుచు తృణీకరింపజూచుటయు, నిదిగూడ కొంతవరకు గృహకల్లోలములకు గారణమగుచుండుటయు మనమెరుగుదుము. విధవయగు తల్లి పునర్వివాహము జేసుకొనుట సాధారణముగ లేదు. అన్యకుటుంబమునకు తనపోషణ నిమిత్తము వెళ్లుట సహజముగాదు. ఆమెకు సాధారణముగ ద్రవ్యార్జనయుండదు. అందుచే కేవలము కొడుకు కోడండ్ర దయపై నాధారపడనక్కర లేకుండ వృద్ధురాలుకాకపోయినను పోషణపొందుట కామె కధికారముండుట యుచితము. భార్యను భర్త హింసపెట్టి వెడలగొట్టిన మాత్రమే, ఆమెకు భర్తవల్ల ప్రత్యేకభరణమునకధికారము కలదు.[౨] భార్య వీలైనంతవరకు భర్తతో కలిసియుండుట యేయుభయులకుమంచిది. కాని భార్యయిష్టమునకు వ్యతిరేకముగాను తగుకారణము లేకుండను, భర్త యింకొక స్త్రీనిగూడ వివాహముచేసుకొనుట మనలో గలదు. అప్పుడు యిద్దరుభార్యలలో, భర్తప్రేమ గోల్పోయిన భార్యస్థితి చాలకష్టకరముగా నుండకతప్పదు. అయినను ఆమెకు ప్రత్యేకభరణముగోరుట గాని, వేరుగా కాపురముండుటకుగాని అధికారం లేదు. ఈసందర్భమున గూడ 'లా'లో సవరణ యవసరము. మఱియు తనభార్య కాపురముచేయుచుండగా తాను పునర్వివాహముచేసుకొనకుండ పెళ్లికిముందు పెళ్లికుమార్తె తరపు వారితో పరతుకొప్పుకున్నను, అట్టిషరతు శాస్త్రవిరుద్ధమగుటచే, 'బైండు' చేయదనియు, పురుషుడట్టిషరతునుగూడ నిరాకరణచేసి, తగుకారణము తెలుపకయే తనకిష్టమువచ్చినంతమంది స్త్రీలను తిరిగిపెండ్లిచేసుకొనవచ్చుననియు, అట్లుతడుచేసినను, ప్రథమభార్య తనతోనే యుండకతప్పదనియు హిందూలాలో రూలు యేర్పడియున్నది.[౩] భార్య కాపురముచేయుచుండగనే అకారణముగ పురుషుడు ద్వితీయ, తృతీయ వివాహములు చేసుకొనుచుండుటకు ధర్మశాస్త్రములో నెచ్చటను వచనము కన్పడదు. అట్టిస్థితిలో ద్వితీయవివాహమునకు న్యాయమైనకారణమున్నపుడే అట్టిషరతునుల్లంఘింపవచ్చుననియైనను రూలునేర్పరచుట యవసరము. ఇట్టిరూలు లేకపోవుటచే శ్రీమంతులస్త్రీలును, ముఖ్యముగ స్వదేశసంస్థానములలో పట్టపురాణులవంటి వారలుగూడ పడుబాధలు వర్ణనాతీతములు. అట్టివారికి అధివేదనికపు ఆస్తినిచ్చు శాస్త్రనియమము నమలులో నుంచుట చాలమంచిదని తోచుచున్నది. మఱియు పోషణవిషయమై ఆస్తిసంబంధము లేకుండా భర్తకు స్వంతబాధ్యతయే కలదనియు అందుచే కుటుంబాస్తినంతను, కుటుంబగృహమును గూడ, భర్త స్వయముగా అన్యాక్రాంతముచేసినను, భర్త పరారిఅయిపోయి అతనిఆస్తి ప్రభుత్వమువారు జప్తుచేయించినను, ఆయాస్తిపైన భరణముకోరుటకు భార్యకు

---

౧. వృద్ధౌచ మాతాపితరౌ సాధ్వీ భార్యాసుతశ్శిశుః,
అప్యకార్యశతం కృత్వా భర్తవ్యామనురబ్రవీత్.
—మనుస్మృతి.

౨. ౪౮ మద్రాసు ౮౧౨.

౩. మద్రాసు హైకోర్టు రిపోర్ట్సు ౩౬౫.

౪. ౨౮ కలకత్తా ౬౫౧.

హక్కు లేదని తీర్మానముచేయబడినది.[౧] మఱియు భర్తజీవించియున్నచో అట్లు భర్తవిసర్జించినను, పోషింపలేకపోయినను ఆమె భర్తబంధువులుగాని, ఆమె పుట్టింటివారికిగాని, ఆమెను పోషించుభాధ్యత లేదు.[౨] మఱియు అత్తవారింట పోషణకాధారములేని స్త్రీలను తమపుట్టింటివారైనను పోషింపవలసియున్నది.[౩] అట్టిపోషణబాధ్యత లేదని బొంబాయిహైకోర్టువారున్నా[౪], కలదని మద్రాసు, కలకత్తాహైకోర్టులవారున్నూ[౫] తీర్పుల నిచ్చియున్నారు. భర్తకుటుంబమున తనను పోషింపదగినవా రున్నప్పుడు, వారిపైన తనచేతనైన చర్య జరిపించుకొనవలసినదేగాని, తనపుట్టింటివారివలన పోషణకోరుటకు స్త్రీకధికారములేదు. అతిబాల్య వివాహకారణముచే మనసంఘమున పెండ్లికుమారుని తండ్రిస్థితినిబట్టి ఆకుటుంబములోనికి పిల్లనిచ్చుచుందురు. దురదృష్టమున ఆపిల్లభర్తసమిష్టిలోనున్నప్పుడే తన ఆర్జనలేకయే చనిపోవుటయు తటస్థించుచున్నది. అట్టి స్థితిలో నాపిల్లమామగారికి పిత్రార్జితాస్తి యుంటే మాత్రమే ఆపిల్లను పోషింపవలసి యుండుననియు, అట్లు కుటుంబాస్తిలేక స్వార్జితాస్తి యెంతయున్నను మామగారు అట్టిస్థితిలో తనకోడలికి భరణ మీయవల సినయవసరము లేదని మనకోర్టులు తీర్మానించు చున్నవి.[౬] ఇందుకుకారణము తండ్రికి పూర్వులవల్ల పారంపర్యముగా దఖలుపడిన ఆస్తిలోనే కొడుకులకు వాటా కలదనియు తండ్రి తాలూకు స్వార్జితభూమిలో కొడుకులకు తండ్రి జీవిత కాలమందు యెట్టిహక్కు లేదనియు, కొడుకులకే హక్కు లేనందున వారిభార్యలగు కోడలుకు ఆభూమిపై పోషణహక్కు ఉండదనియు కారణము చెప్పబడు చున్నది.[౭] కాని యీఅభిప్రాయము ఆపిల్లల విషయ మున నన్యాయముగా నుండుటయేగాక ధర్మశాస్త్రి భావమునకు వ్యతిరేకముగాకూడ నున్నదని నా యభి ప్రాయము. తండ్రిస్వార్జితాస్తిలో కొడుకులకు సమిష్టి హక్కు లేదని ప్రస్తుతపురూలు ఉన్నమాట వాస్తవమే కాని యిందుకు యాజ్ఞవల్క్యస్మృతిలోని "పితృ ద్రవ్యావిరోధేన......" అను శ్లోకము ఆధారముగా చెప్పబడినది.

అందుకు యిదిగాక బలమగుప్రమాణవచనము కనబడదు. ఈశ్లోకము సోదరులస్వార్జితము నుద్దేశించి నదేగాని తండ్రిఆస్తిని ఉద్దేశించినది కానట్లు కనబడుచు న్నది.[౮] తండ్రిచరాస్తిలో కుమాళ్లకు సమిష్టిహక్కు లేదనియు, తండ్రిస్వార్జితమైనను, స్థిరాస్తిలో తండ్రి కాలమందుగూడ కుటుంబాస్తిగానే యెంచవలెననియు ఆయాస్తివలన కుటుంబమువారును, సపిండులును,

---

౧. ౧౦ లాహోరు ౨౬౫.

౨. ౯ బొంబాయిహైకోర్టు రిపోర్ట్సు ౨౮౩.

౩. పితృపుత్ర, స్వసృభ్రాతృ, దంపత్యాచార్య [శిష్యకాః,
ఏషా మపతితా న్యోన్యత్యాగీచశతదండభాక్.
(యాజ్ఞ ౨-౨౩౭)

ఈ క్రిందినారదవచనమువల్ల భర్తకుటుంబము వారే పోషించుటకు ముఖ్యబాధ్యులనియు వారు లేనిచో పుట్టింటివారు పోషించవలెననియు, కన బడుచున్నది. "మృతేభర్తర్యపుత్రాయాః పతిపక్షః ప్రభుస్స్త్రియాః, వినియోగేఽర్థరక్షాసు భరణేచ స ఈశ్వ రః. పరిక్షీణేపతికులే నిర్మనుష్యే నిరాశ్రయే, తత్సపిండే షుచాసత్సుపితృపక్షః ప్రభుస్స్త్రియాః.

౪. ౨౩ బొంబాయి ౨౯౧.

౫. ౨౩ మద్రాసు లా జర్నలు ౨౨౩, ౨౮ కలకత్తా ౨౭౮, ౧౯-౨౬ కలకత్తా ౪౮౬.

౬. ౩౭ మద్రాసు ౩౯౬.

౭. ౩౧ మద్రాసు ౩౩౮, ౫ కలకత్తా వీక్లీ నోట్సు ౫౪౯.

౮. పితృద్రవ్యావిరోధేన యదన్యత్స్వయమార్జితమ్,
మైత్రమౌద్వాహికంచైవదాయాదానాంనతద్భవేత్.
(యాజ్ఞ, ౨-౧౧౯)

ఈస్మృతిలో తండ్రిజీవితకాలమున ఆస్తివిభా గముసంగతి ముందుగా ౧౧౫, ౧౧౬, ౧౧౭ శ్లోకము లలో చెప్పబడినది. వాటిలో స్వార్జితాస్తిలో కొడు



రాయచూరు యుద్ధము-కృష్ణదేవరాయలు

౫ అ. పొడవు, ౭౹ అ. వెడల్పుగల అట్టపయినున్న ఏకవర్ణచిత్రమున కిది ప్రతిక.

—శ్రీ ఉయ్యూరు జమీందారు

పోషింపబడవలెననియు, శాస్త్రకారుల యభిప్రాయము కనబడుచున్నది.[1]

అట్టిస్థితిలో మామగారికి కోడలిని పోషించుటకు లా ప్రకారము బాధ్యతలేదనియు, ఆబాధ్యత నైతికమనియు, కోర్టువారు చెప్పు అభిప్రాయము సరిగా తోచదు. మరియు నైతికబాధ్యత (Moral responsibility)నుబట్టి న్యాయశాస్త్రబాధ్యత (Legal liability) ఉండవలెనని నవీనులు తలచుచున్నారు. కాని మన ప్రాచీనులభావ మట్టిదిగా కనబడదు.

## ౯. మార్పుకు అవసరము

మన ప్రస్తుత 'లా'లో స్త్రీలకు తగుచు అన్యాయము జరుగుచున్న దనుసంగతిని కోర్టువారును, శాసకులును గుర్తించుచున్నారు. కాని ప్రస్తుతకోర్టులలో స్త్రీల హక్కులనుగూర్చి యివ్వబడి అమలులోనున్న తీర్పులు మనధర్మశాస్త్రముల యభిప్రాయమట్టిదను కారణమున, నాటికి తీర్పు చేయబడినవి. ఇప్పుడా రూలుమార్పుతో ధర్మశాస్త్రములభావమునకు వ్యతిరేకముగా నుండునను కారణమున నా 'లా'నుమార్చుచు శాసనము చేయుట కెవరును సాధారణముగ నంగీకరించుటలేదు.[2] కాని యీ వ్యాసములోని విషయములనుబట్టి మన ప్రాచీనధర్మశాస్త్రములలోనే కొంతవఱకభిప్రాయభేదముకలదనియు, ప్రస్తుతముకూడ మనదేశములో నాయా ప్రాంతములందు స్త్రీలహక్కులలో కొంతభేదము కలదనియు, మరియు ధర్మశాస్త్రములలో (స్త్రీలకై చెప్పిన) హక్కులుకూడ మనకోర్టులలో తగ్గింపబడినవనియు, కొన్ని తీర్పులలో ధర్మశాస్త్రవచనముల నిజభావము సరిగా గమనింపబడనందున తీర్పులు స్త్రీలహక్కులకు వ్యతిరేకముగా నీయబడినవనియు పాఠకులకు తెలియగలదు. అందుచే స్త్రీలహక్కులవిషయమై శాసనముల ద్వారా యిప్పుడు జరుగవలసినమార్పులు కొన్ని యీ క్రింద సూచింపబడుచున్నవి.[3] సాధారణముగా ధర్మ

కులకు వాటాలేదను ప్రశంస చేయలేదు. తరువాత "విభజేరన్ సుతాః పితుర్ధ్వం రిక్థ మృణం సమమ్..." నుండి (౧౧వ నుండి) శ్లోకములలో తండ్రియనంతరం సోదరులు చేసుకొను విభాగసందర్భమున పితృద్రవ్య సంబంధములు లేకుండ సంపాదించుకొనినవాటిలో దాయాదులకు వాటాలేదని యీశ్లోకమున సోదరుల విషయమున చెప్పబడినది. ఇందులో 'దాయాదానాం' అనుమాటకు మితాక్షరవ్యాఖ్యలో 'భ్రాతౄణాం' (అన్నదమ్ములకు) అని అర్థముకూడ వ్రాయబడియుండుటచే నాసంగతి స్పష్టమగుచున్నది.

౧. "స్థావరం ద్విపదంచైవ యద్యపి స్వయమార్జితమ్, అసంభూయ సుతాన్ సర్వాన్ నదానం నచ విక్రయః. యేజాతా యేప్యజాతాశ్చ యేచగర్భే వ్యవస్థితాః, వృత్తిం తేఽపేక్షకాంక్షంతి వృత్తిలోపో విగర్హితః. అవిభక్తా విభక్తావా సపిండాః స్థావరే సమాః" ఇట్లు స్థిరాస్తి స్వార్జితమయినను అందు కుమాళ్లతో కలియక తండ్రియొకడే అన్యాక్రాంతము చేయకూడదనియు, సపిండులకందు హక్కు కలదనియు, కుటుంబములో కలుగబోవువారికికూడ అందువల్ల పోషణ కావలెననియు స్పష్టముగా చెప్పబడినది. ఇందువిషయమై 'మితాక్షర' లో చర్చచేయబడి "తస్మాత్... "స్థావరేషు స్వార్జితే పిత్రాదిప్రాప్తేచ పుత్రాదిపారతంత్ర్యమేవ" అని సిద్ధాంతము చేయబడినది.

౨. ప్రభుత్వమువారి కుచితమని తోచినప్పుడు మనధర్మశాస్త్రనియమములను ప్రభుత్వమువారు మార్చి శాసనములద్వారాకూడా అనేకవిషయములందు సవరణ చేసియేయున్నారు. వివరములు భారతి ౧౯౩౩ సం.రం ఆగష్టుసంచికలోనున్న "హిందూమతాచారములు: ప్రభుత్వపు అధికారబాధ్యతలు" అనువ్యాసమున చూడవచ్చును.

3. మలబారుప్రాంతపు సంఘనిర్మాణము కొంతవఱకు భిన్నముగుటచే ఆప్రాంతమునకు వీనిలో కొన్ని సూచనలు వర్తింపనవసరముండదు. నేను సూచించినట్లు కుమార్తె తల్లి మొదలగువారి వారసత్వాస్తియందు వారికి సంపూర్ణహక్కును చట్టముద్వారా అంగీకరించే యెడల ఆయాస్తి స్త్రీధనాస్తి వారసత్వమునకు ప్రస్తుతమున్న రూల్సుప్రకారం వారికుమార్తెలు వగైరాలకే సంక్రమించుటచే పురుషవారసులకు కొంత

శాస్త్ర వచనాధారములుగలవియు, కొన్ని ప్రాంతములం దివరకే అమలులోనున్నవనియు, న్యాయములైన వను మార్పులుమాత్రమే యిందు సూచింపబడినవి. అవి మన హిందూదేశమందలి ఆయాప్రాంతములందున్న హిందువులందరికి వర్తించునటుల చేయుట యావశ్యకము.

## ౧౦. సూచనలు

౧. సవతితల్లి, కోడండ్రు, వదినలు, మరదళ్లు, అన్నదమ్ముల కుమార్తెలు, మేనకోడండ్రు మొదలగు సమీపబంధుత్వముగల స్త్రీలుగూడ వారసులుగా నిర్ణయింపబడవలెను. వారిని దూరపుజ్ఞాతులకన్న సమీప వారసులుగా నెంచుట న్యాయ్యము. (నీలకంఠభట్టుని వ్యవహారమయూఖప్రకారము బొంబాయిప్రాంతమువారంపరు నిదివరకే వారసులుగనున్నారు. అన్నదమ్ముల పిల్లలు మొదలగువారు కొందరు మనప్రాంతమున వారసులుగ నున్నారు.)

౧ అ. సపిండుల భార్యలుకూడ వారసులుగా చేర్చబడవలెను. (బొంబాయిప్రాంతమున మాత్ర మట్టి హక్కు యిప్పటికే కలదు. మన ధర్మశాస్త్రప్రకారం వివాహమువలన స్త్రీలు భర్తకుటుంబమువారి సగోత్ర సపిండులగుచున్నారు. జాతాశౌచమృతాశౌచాదులు సపిండులభార్యలకుకూడ యిప్పు డమలులో నేయున్నవి. ఆచారకాండలోవలెనే వ్యవహారకాండలో గూడ అమలుజరుపుట న్యాయ్యము.)

౨. స్త్రీధనాస్తి వారసత్వేన కుమార్తె, మనుమరాలు మొదలగు స్త్రీలకు సంక్రమించుచో వారసత్వేన అట్టిఆస్తిని పొందుస్త్రీకి దానియందు పురుషులవలె సంపూర్ణపుహక్కు ఉండుట.

3. తల్లిదండ్రులు మొదలగువారియొద్ద నుండి అనగా జనకకుటుంబమునుండి వచ్చుఆస్తియందు కూడ, కుమార్తె మొదలగుస్త్రీలకు పూర్తి యగు హక్కులుండుట.

(ఈ ౨, 3 బాపతుఆస్తులు వ్యవహారమయూఖ ప్రమాణమునుబట్టి బొంబాయిప్రాంతమున నట్లే అమలులో నున్నది. ముఖ్యప్రమాణమగు మితాక్షరప్రకారముకూడ ఆయాస్తులు స్త్రీధనమే యగును. ఇందుకు వ్యతిరేకముగా ప్రీవీకౌంసిలువారు ఇచ్చిన పొరబాటు తీర్పువల్ల లామారినందున దాని నిట్లు సవరించుటుచితము. ఇట్టిరూలు సర్వత్ర చేయుటకంగీకారము లేకపోయినను సమీపజ్ఞాతులు లేనప్పుడైనను స్త్రీవారసులకు ఇట్టి ఆస్తులన్నిటిలో పూరాహక్కులుండుట న్యాయము. ఇట్టి ఆస్తి స్త్రీధనంగా యెంచేయెడల స్త్రీధనాస్తికి వారసత్వపు హక్కు కుమార్తెలతోబాటు, కుమాళ్లకు కూడ సమానహక్కులుండునట్లు యేర్పాటుచేయుట యుచితమని తోచుచున్నది.)

౪. వివాహముచేసుకొనకుండా ఉండెడి స్త్రీలకు తమ అన్నదమ్ముల కుటుంబాస్తిలో ౧/౪ వంతునో లేక మరికొంతవాటానో యిచ్చుట.

(ఇందుకును మనుస్మృతి, యాజ్ఞవల్క్యస్మృతి మొదలగుప్రమాణగ్రంథముల యాధారముకలదు.)

౫. భర్త కాలముచేసినపిదప భర్తకుటుంబమందు మనోవర్తిపొందుటకు అవకాశము లేనిచో, జనకకుటుంబమువారు వాటాగాని లేక మనోవర్తిగాని యివ్వవలెను. అట్లు వీలులేనిచో పోషింపవలెను.

(ఇందుకును లోగడచెప్పిన నారద, యాజ్ఞవల్క్యాదుల ప్రమాణమును, కొన్నితీర్పులును కలవు.)

---

యన్యాయము సంభవింపవచ్చును. అట్టినష్టములేకుండుటకై యీమార్పుతోపాటు స్త్రీధనాస్తి కుమార్తెలతోపాటు కుమారునకుగూడా సమానవాటాగా సంక్రమించునట్లు శాసనమునుమార్చుటకు కూడసూచించితిని. నేను సూచించినట్లు తల్లి తనస్త్రీధనాస్తిని, కొడుకులు తమ అప్పచెల్లెళ్లతోబాటు సమానవాటాలుగా పంచుకొనుటకును శాస్త్రప్రమాణముకలదు.

"జనన్యాం సంస్థితాయాంతు సమంసర్వేసహోదరాః;
భజేరన్ మాతృకంరిక్థం భగిన్యశ్చ సనాభయః॥
(మనుస్మృతి అ౯ శ్లో ౧౯౨)

౬. కుమారుడు చనిపోయినచో కోడలును మామ గారు తనస్వార్జితాస్తిలోనుండికూడ పోషింపవలెను. లేక ప్రత్యేకముగ మనోవర్తియివ్వవలెను.

(ఇందుకు యాజ్ఞవల్క్యాదుల ప్రమాణముగలదు.)

౭. పిల్లలులేనిస్త్రీ దత్తత చేసుకొనదలచినచో సన్నిహితజ్ఞాతు లంగీకరింపకపోయినను, ఆమె చేయ దలచిన దత్తత ఉచితమనితోచినచో కోర్టువారు విచా రణపైన దత్తత కధికారము నిచ్చుట.

(ఇందుకుకొన్ని సంస్థానములలో నాచారముకలదట)

౮. కోర్టువారు పిటీషనుపైన విచారణచేసి తల్లి దండ్రులులేని పిల్లవానినికూడ దత్తతచేసుకొనుటకు స్త్రీకధికారమిచ్చుచో నాదత్తత శాస్త్రీయముగా నెంచుట. (పూర్వము 'కృత్రిమ' స్వయందత్తపుత్రుల పద్ధతి యుండినది. అందుచే మాతాపితరులులేని పిల్ల వానినిగూడ పుత్రునిగాస్వీకరించుటకు వీలుఉండినది.)

౯. సమిష్టి కుటుంబములోని వాటాదారులలో నొకడు కాలముచేసినచో నప్పుడు అతడు విభక్తుడై పోయినటుల యెంచి అతని వాటా యతని భార్యకు జెందచేయుట.

(ఇది జీమూతవాహనీయమున సమర్థింపబడినది. బంగాళీలలో నమలులో నున్నది.)

౧౦. ౧౧ సంవత్సరములుదాటిన ఆడుపిల్లలకు వివాహముచేసినను, ఆవివాహము లాప్రకారము చెల్ల కూడదను నియమము.

(కొన్నిసంస్థానములలో నిట్టి వయోనియమము గలదు. కొన్ని ధర్మశాస్త్రములలో గూడ ౧౨ సంవ త్సరములు వయస్సువచ్చినవారికే వివాహము చేయవలె నని చెప్పబడినది.)

౧౧. భార్య కాపురముచేయదగుస్థితిలోనుండగా పురుషు డింకొకవివాహము చేయదలచినచో నందుకు దగుకారణముల దెల్పుచు ముందుగా కోర్టువారి అనుజ్ఞ పొందియే చేసుకొనవలెను. అట్టిస్థితిలో ప్రథమభార్యకు సమానవాటాఆస్తిని పంచియిచ్చు టుచితమని కోర్టు వారికి తోచినచో నట్లామెకు నిప్పించవలెను. ఆస్తి వీలులేనిచో ప్రత్యేకభరణమును, వీలగుచో నామెకు ప్రత్యేక నివాసమేర్పరుపవచ్చును.

(ఆధివేదనికము, యాజ్ఞ. ౨-౧౫ అందుపై మితాక్షరవ్యాఖ్య చూడుడు.)

౧౨. యావజ్జీవపు అనుభవపుహక్కుగల ఆస్తిలో కొంతభాగమును విద్యాలయములకుగాని ఆసుపత్రి మొదలగు ప్రజోపయోగకరములగు యితరసత్సంస్థలకు గాని యిచ్చుటకు స్త్రీకధికారముండవలెను. (ఇందుకు సంబంధించినతీర్పులు చాలసందిగ్ధముగ నున్నవి. ౮ M. J' A. ౫౨౯; ౪౩ కలకత్తా ౫౭౪; ౪౪ అలహాబాదు ౫౦౩ P. C. చూడుడు.)

౧౩. యావజ్జీవపుఅనుభవహక్కుగల ఆస్తిని స్త్రీ ప్రతిఫలమునకు క్రయము, లేక తనఖాజరిగించుచో, రిజి ష్టరు దస్తావేజు వ్రాసెనేని, అది రిజష్టరుఅయిన ౧౨ సం.ర ములలో అనంతరవారసులు దానినిరద్దుచేయుటకు దావా లేనియెడల, ఆక్రయము, లేక తనఖాసవ్యమైనదిగా నెంచబడవలెను. (ఇట్టినియమములు లేకపోవుటచే క్రయ ములు జరిగిన ౫౦, ౬౦ సం.రములకుగూడ తగవులు వచ్చుచుండుటయు, వారసులఅశ్రద్ధచే చిరకాలమువఱకు హక్కులు అస్థిరముగానుండుటయు జరుగుచున్నవి.)

౧౪. ౫౦ సం. రములపై వయస్సువారును, తనకుపిల్లలుండగాను, పునర్వివాహము చేసుకొనువారట్టి వివాహమునకై చేయుఖర్చు యెంతమాత్రమును కుటుం బాస్తిపై జెందుచేయకూడదని రూలుయేర్పరచుట.

(వివాహము సంస్కారముగా అవసరమైనపుడే శాస్త్రప్రకార మాఋణము కుటుంబమువారినందరిని జెందుచేయును.)

౧౫. తండ్రిపోయినమీదట కుటుంబాస్తివిభాగ ములో, తల్లికి, సవతితల్లికి, కొంత వాటా యివ్వ

వలెను. (ఇది మితాక్షరవ్యాఖ్యానాలలో స్పష్టముగా నంగీకరింపబడినది. ఉత్తరదేశమున నిట్లు అమలులో నున్నది.)

౧౬. మితాక్షరప్రకారము స్త్రీలకుగలహక్కును ౧౯౩౭ ఆక్టుప్రకారం బంగాళీలకుగూడ వర్తింపచేయుట. ఈ ఆక్టుకుపూర్వం ఆయాపురుషుహక్కు-దారు చనిపోయి స్త్రీవారసు స్వాధీనంలో ఆస్తి ఉన్నకేసులకుగూడ యీ ఆక్టు వర్తింపవలెనని ఆక్టు సవరణచేయించుట.

(ఈఆక్టుకట్టి అమలు యున్నదని లాహోరు నాగ్పూరు హైకోర్టులును, లేదని మద్రాసు హైకోర్టును అభిప్రాయపడెను.)



కష్టజీవులు

—చిత్రకారుడు: తోట వెంకటేశ్వరరావుగారు బందరు.

వెనుకటి సంచికలలో ప్రకటించిన 'మాతరణ మేనరికము'ను వీరు చిత్రించినదే.




## రెయిల్వే ఎంజిను

కొ. నరసింహాచారి

ఈ రెయిల్వేఎంజినునకు నాలుగుచక్రములు, రెండుఇరుసులు, ఒకపీఠము, బాయిలరు అనగా నీరుఉడుకునట్టి భాగము. ఇందు

(1) పీఠమునకు 12 అంగుళముల నిడివియు 6 అంగుళములవెడల్పును గల గట్టి అట్టను తీసికొని, దానియందు చుట్టును ఒకయంగుళము వెడల్పునకు గీతలువేయవలెను. తర్వాత చిత్రము A యందలిరీతిగ మూలలను కత్తిరించివేసి, నాలుగుప్రక్కలను తొట్టివలె మడిచి అతికించవలెను. దీనియందు 1, 2, 3, 4 అను రంధ్రములను ఇరుసునకుగాను చేయవలెను.

(2) చక్రములు రెండు దారపుబండ్లను (చిత్రము B) దీసికొని వాటిని సగమునకు కోసికొనవలెను. అపుడు నాలుగుచక్రము లేర్పడును. పిమ్మట రెండు పేముతునుకలను, చక్రములందలి రంధ్రములలో వదులుగా దూరదగినంత సన్నమైనవాటిని దీసికొనవలెను. పేమునకుబదులుగా వెదురుబద్దలైన మెడల గుండ్రముగా చెక్కుకొని యుపయోగించవచ్చును. ఇవి చిత్రము A యందలి పీఠముయొక్క వెడల్పు 4 అం. ల కన్న కొంతఎక్కువ పొడవుకలిగి యుండవలెను. అపుడు పీఠమునందలి రంధ్రములగుండా ఇరుసుయొక్క కొనలు కొంచెము వెలుపలికి వచ్చియుండును. ఇరుసులయొక్కకొనలు నాలుగుప్రక్కలుగా చెక్కుకొనవలెను. మొదట ఒక్కొక్క ఇరుసునందు రెండుచక్రములను దూర్చి, ఇరుసుకొనలను పీఠము అడుగుభాగమున రంధ్రములగుండా వెలుపలికి వచ్చునటుల నమర్చుకొనవలెను. పిమ్మట వెలుపలికివచ్చియుండు ఇరుసుకొనలందు రెండు చీలలను కొట్టవలెను. (చిత్రము C 1) పీఠము అడుగున, చక్రములు గోడలకు ఆనుకొని సులభముగా తిరుగునంతస్థలమును వదలి చక్రములు ఇరుసుమధ్యకు జరుగకుండుటకు రెండుచీలలను (చిత్రము C 2) కొట్టవలెను. ఈవిధముగా రెండు ఇరుసులను పీఠమునకు అమర్చవలెను.

(3) బాయిలరు ( చిత్రము D ) 6 అంగుళముల వెడల్పును 9 అంగుళముల పొడవును గల సన్నని అట్టను దీసికొని దానిని 6 అంగుళముల నిడివిగల గొట్టముగా చుట్టుకొని రెండు అంచులను చేర్చి అతికించుకొనవలెను. ఈగొట్టపువ్యాసము సుమారు 3 అంగుళము లుండును. దానిని పీఠముపై ముందు ఒకయంగుళమును, వెనుక మూడంగుళములును స్థలమును వదలి అతికించవలెను. గొట్టము ముందు భాగమును మూయుటకు దగినంత వలయపు తునుకను కత్తిరించుకొని దానితో గొట్టమును ముందు తట్టు మూసి మూతపడిపోకుండుటకు రెండు మూడు కాగితపుతునుకలను ( చిత్రము J 10 వలె ) అతికించవలెను.






















(4) డ్రైవరుండుచోటు ( చిత్రము E) దానికప్పు ( చిత్రముF )

ఒక గట్టియట్టముక్కను దీసికొని దానిని చిత్రము E యందలిరీతిగ కత్తిరించవలెను.

ఇందు 4 భాగము బాయిలరుగొట్టముయొక్క వెనుకటి తెరచియుండుభాగమును మూసి యుండును. ౨,౨ భాగములు, ప్రక్కలగును. ఈఅట్టను చిత్రము J ౨ వలె పీఠముపై బాయిలరువెనుక నతికించవలెను. తర్వాత మరియొకఅట్టముక్కను దీసికొని చిత్రము F వలె కత్తిరించుకొనవలెను. దానిని చిత్రము J యందలి ౨ భాగమునకు కప్పుగా 3 వలె నమర్చి అతికించవలెను.

పైరీతిగ ముఖ్యమగు భాగములనుచేసి అతికించినతర్వాత తక్కిన కొన్నిచిన్నచిన్న భాగములను అమర్చవలెను. చిత్రము H Cow Catcher అనునది దీనిని చిత్రము నందలిరీతిగ కత్తిరించుకొని ఎంజనుముందు భాగమున పీఠమునకు అతికించవలెను. (చిత్రము J. 8) బండ్లు డీకొట్టుకొనునప్పుడు వాటికి అపాయముకలుగకుండుటకై ముందు వెనుకల రెండుదిమ్మె లుండవలెను. ఇందు లకు, చిన్నదారపుబండ్లను రెండుగా కోసి ఒకేరీతిగ నుండు రెండుతునుకలను పీఠము ముందున, నతికించవలెను. (చిత్రము J. 7)

పిమ్మట 4, 5 అనుభాగములకు రెండు అట్టముక్కలను గొట్టములుగా చేసికొని బాయిలరుకు అతికించవలెను.

4 అనునది పొగపోవుగొట్టము. 5 దీప ము. 6 నకుగాను ఒక చిన్నభరిణె మూతను అతికించవచ్చును. 9, 9 అనునవి చక్రములు.

ఇట్లు అన్నిభాగములను అతికించిన పిమ్మట ఎంజిను పూర్తి యగును.

ఇకముందు వ్యాసములందు రెయిల్వే సంబంధమగు ఇతరరకములబండ్లు, కట్టడ ములు, వంతెనలు చేయురీతి విశదముగా చెప్పబడును గాన అన్నిటిని గమనించుచు వచ్చినయెడల ఒక రెయిల్వేస్టేషనును కట్ట వచ్చును.



---

౧

వీడేనమ్మా కృష్ణమ్మ
వీడే వీడే కృష్ణమ్మ
కాళ్లా గజ్జెలు చూడండి
మొల్లోగంటలు చూడండి
మెళ్లోహారము చూడండి
తల్లో పింఛము చూడండి
వీడేనమ్మా కృష్ణమ్మ
వీడే వీడే కృష్ణమ్మ
వీడే అల్లరికృష్ణమ్మ.

౨

శ్యామలదేహము చూడండి
తామరకన్నులు చూడండి
సుందరవదనము చూడండి
మందహాసము చూడండి
వీడేనమ్మా కృష్ణమ్మ
వీడే వీడే కృష్ణమ్మ
వీడే అల్లరి కృష్ణమ్మ

౩

పొన్నలు ఎక్కే కృష్ణమ్మ
వెన్నలు మెక్కే కృష్ణమ్మ
వేణువు నూదే కృష్ణమ్మ
గోవుల కాసే కృష్ణమ్మ
వీడేనమ్మా కృష్ణమ్మ
వీడే వీడే కృష్ణమ్మ
వీడే అల్లరి కృష్ణమ్మ.

౪

అలుకుడుచెయ్యక నడవండి
అల్లరి కృష్ణుని పట్టండి
పట్టండి పట్టండి
పట్టుకు కృష్ణుని విడకండి
కరువుతీరగా చూడండి
కౌగిలిలో చెరపెట్టండి
వీడేనమ్మా కృష్ణమ్మ
వీడే వీడే కృష్ణమ్మ
వీడే అల్లరి కృష్ణమ్మ.

# లోకదృష్టియం దాత డున్మత్తుడే!

గు. దుర్గాబాయి

## ఆ విషయ మెంతో ఆశ్చర్యజనకమును, కరుణావంతమును!

౧

ఇరువురు ఒక్కకళాశాలయందలి విద్యార్థులు. యువకు డుల్లాసప్రియుడు. రూపసౌందర్యహావభావవిలాసములు అతనిముఖమున మూర్తిమంతములై యుండును. అతనిమాటలు వినుటకు తోడిసహాధ్యాయులందరు నువ్విళ్లూరుచుందురు.

యువకుడు కేవలము సౌందర్యవంతుడే కాడు; తరగతిలో ప్రథముడు; ఆటలలో కేప్టెన్. తర్కసభలలో అతనియభిప్రాయమే సర్వోన్నతము. సాహసమొనర్చి యేపనినైన సాధించుటయం దతడసమాన ప్రతిభాశాలి. ఉపాధ్యాయుల కందర కాతడు అంతరంగికమిత్రుడు.

ఇట్టిసకలగుణసంపన్నుడగుయువకుడు యువతీమనముల నాకర్షించెననుటలో అతిశయోక్తి యేమున్నది? నారీహృదయములతో క్రీడించుట యాతని కొకలీల! మధుచుంబిభ్రమరమునకువలె పుష్పమునుండి పుష్పమునకు తిరుగుటయే అతనిప్రకృతి. బంధనమున కాత డతీతుడు! అతనిని బంధించుట కేరూపవతియగు తరుణికి సాధ్యము? అతనినిగూర్చి పలువిధములుగ భావించుట అతని తమ కల్పనాపుష్పకవిమానాసీనుని చేసి తాము విహరింపగోరుట తోడిసహాధ్యాయినుల ఆనందక్రీడ లయ్యెను. కాని ఫలితముమాత్రము వేరయ్యెను.

ఈనారీపుష్పములయందలి మధువు నాఘ్రాణించుచు సంచరించుచున్న ఈయువకభ్రమరముహృదయము నొకతరుణియందు లగ్నమయ్యెను. ఈయువతీయువకులు నొకజాతివారు కాకుంటయే ఇందలిచిత్రము. భిన్నదేశముల వారిజన్మ; భిన్నజాతుల వారివృత్తి; భాష కూడ భిన్నమే. కాని విధాత యామెను స్త్రీజాతి కొకతలమానికముగ సృజించెను. ఇతరుల నవలీలగ నాకర్షింపజాలనట్టి గాంభీర్య మామెస్వభావము. వస్త్రభూషణాద్యలంకారములచే బాహ్యము క్షణకాలమున నాకర్షించుట యామెప్రకృతికి విరుద్ధము.

"మీ పెన్సి లొకమారు దయయుంచి యిచ్చెదరా" అనుక్షుద్రప్రశ్నలతో ఇతరుల పరిచయము కలుగచేసుకొనుటకు ఆమె ఇష్టపడెడిది కాదు. యువకులదృష్టులకు అంతఃపురచారిణివలె నుండుటయే ఆమె యుద్దేశ్యము.

కాని మధువును దాచియుంచిన దాని తీపి చెడునా! అట్లే ఈ అనాడంబరయగు యువతి లజ్జాదృక్కులు యువకుని హృదయమున మహేంద్రజాల మొనర్చిన ట్లయ్యెను.

"నీవు నాస్నేహ మంగీకరింతువా" అని యువకుడు ఒకనా డామె నడిగెను. యువతి సిగ్గున తలవంచెను. "మాటకు ప్రత్యుత్తర మిచ్చినంతమాత్రమున నోటినుండి ముత్యములు రాలునా" యని యువకు డనెను. "ఏది యగుట యసంభవమో దానినే మీరు అడుగుచుండ నేనేమని ప్రత్యుత్తర మీయగల" నని యువతి పలికెను.

"అసంభవమనునది నిఘంటువున లేదు. ఇచ్ఛాశక్తివలననే అనేక అసంభవకార్యములు సంభవములగుచున్నవని విజ్ఞానులు చెప్పెదరు" అని యువకు డనెను.

యువతి మారుపలుకలేదు.

"ఏమి నాప్రసంగము నీ కిష్టము లేదా?"

"నా కెవ్వరిప్రశ్నలకు ప్రత్యుత్తరమిచ్చెడిసాహసము లేదు, సామర్థ్యమును లేదు. అందులకే న న్నంద

రును అహంకారిననియు, ఒంటిపిల్లి రాకాసియనియు అనుచుందురు. నా సుఖస్వార్థముల కొరకై మిమ్ము లను మీతల్లితండ్రి బంధుస్వజనములకు దూరమునొనర్చి కుటుంబమునం దొకవిప్లవతరంగమును లేవనెత్తి నేనే దానికి మూలకారణమని చెప్పి 'స్వాధీనభర్తృక' యను 'ట్రేడుమార్కు' (Trade Mark) వేసి యానందించుట నాయుద్దేశ్యము కాదని మీ రెరుంగ గోరెదను. నేటి ఆధునికయువతుల వేయి కొకతెయైనను నా అభిప్రాయమున శకీభవింపదని నే నెరుంగుదును" అని యువతిపలికెను.

"దీనినే టిపికల్ ఇండియన్ వుమెన్ మెన్టాలిటీ (Typical Indian women Mentality) అని అందురు. నేను ఈ అసభ్యభావమును అంగీకరింపను. నీవు బి. ఎ. తరగతియందు చదువుచుంటివి. నీవంటి విద్యావతినోట ఇట్టిమాటలు శోభింపవు. జాతి దేశ భావముల యందు ఎట్టిభేదములున్నను ప్రేమకుమాత్రము భేదములు లేవు. తమసంతానమునకు వారివివాహవిష యమున సంపూర్ణాధికారమొసంగని తలిదండ్రు లొకతలిదండ్రులా? ఏక ప్రతివ్యక్తికిని తానిష్టమువచ్చినటుల వివాహ మొనర్చుకొనుట కభ్యంతర ముకలుగజేసెడిసమాజ మొకసభ్యతా సమాజమని పేర్కొనబడునా? అట్టి పాశవికసమాజమును చూర్ణముచేసి తలితండ్రులవిషదృష్టులకు గురియై తినన్నను నాకుభయము లేదుసుమా!"



"నాయుద్దేశ్యము అంగీకరింపకున్న నేనునూ......సరియేచూతములెండు."

"ఏమీ మీఆదర్శమున నన్ను కన్వర్టు (Convert) చేయదలచు కొన్నారా? మనము ఒకరినొకరు ప్రేమించుకొనుచుంటి మని ఒకరి యాదర్శ మొకరికి ఇష్టము కావలె నా! సంఘమున Revolt చేసి నన్ను పరిణయమాడితిరని గర్వము మీకున్నను మీ జన్మదాతలగు తలి దండ్రుల శుభాశీర్వాదములేని మన వివాహము పరిపూర్ణానందము పొం దనేరదని నానమ్మకము. నా యీ సందేహమును మీరు అనాగరికమ న్నను నాకు సమ్మతమే."

"యుక్తి నాయొద్ద వెదకినను కాన్పింపదు. నీవిశ్వాసమే నీసర్వ స్వము. ఇంతకూ నారీస్వభావము!"

"మీరు మీతలిదండ్రుల కీవిష యము ముం దెరిగింపుడు. వారు మన వివాహమున కంగీకరింపకున్న

మీరు నావారైనను, నేను మీదాననైనను మనశాంతి సౌఖ్యములు శాశ్వతముగ వర్ధిల్లజాలవు. మీవలెనే నేనును వారికి చక్షుశ్శూలము నయ్యెదను. నాభర్తయే కాక వారితలిదండ్రులు, ఆత్మీయులు, సుఖదుఃఖములు కూడ నానియే కావలెనని నాకోరిక."

యువకుడు తెల్లబోయెను, పాశ్చాత్యమనో భావము కలిగినయాతడు ఎన్నడును ఒకవాస్తవికభారత నారినుండి ఇట్టి ప్రత్యుత్తరము పొందగలిగెద నని యూహింపలేదు.

"ఈవిషయము నీవు బాగుగ నాలోచింపుము. రేపే తండ్రిగారికి ఉత్తరము వ్రాసెదను. కర్తవ్యము కొరకుగాని ముఖప్రీతికొరకు కాదుసుమా. వారు నా యుద్దేశ్యమున కంగీకరింపకున్నచో నేనును.........
........................."

"సరియే మాతములెండు"

౨

రామకృష్ణుని లేఖ పొందిననాటి తలిదండ్రుల యానందమునకు మేర లేదు. ఆహా! మాతృవాత్సల్యము ఎంతకోమలమోగదా! అన్యదోషములు తిలమాత్రమైనను వారు సహింపలేరుగాని తమసంతానదోషములు కొండంతలైనను వారికి గోరంతలుగ కన్పట్టును. రామకృష్ణుడు వారియేకమాత్రసంతానము. ఎందరో ధనవంతులకన్యల, సుందరీరత్నముల నాత డుపేక్షించి 'నాచదువుపూర్తియైననేకాని వివాహమాడ'నని పట్టుపట్టి కూర్చుండెను. కాని నేటికి తనంతట తా నిష్టపడి వ్రాయుట వారికి యెంతయో వింతగ నుండెను. యువతి వంశపరిచయమునందుమాత్రము వారి కొకింత సందేహము కలిగినను పుత్రునిమీదిమమత దాని నావలకు ద్రోసెను. ఎంతశీఘ్రముగ వివాహమైన నంత మేలని వారెంచి వారి సమ్మతి నాతని కెరిగించిరి.

యువతి బాల్యమునందేమాతాపితృవిహీన యయ్యెను; ఒకచిన్నపల్లెయం దామెజననము. ఇరుగుపొరుగున నున్న ఒకదరిద్రవృద్ధహస్తముల నిడి యామెతల్లి అసువుల బాసెను. ఏడెనిమిది వత్సరములు వచ్చుసరి కాబాల కాకుగ్రామపాఠశాలయందలి చదువు సమాప్తి నొందెను. తన కంతిమదినములు సమీపించు టెరింగి వృద్ధ ఆబాల నేగొప్పసంస్థయందైన ప్రవేశపెట్టవలెనని యోచించెను. దేశమున దీనబంధు వీరేశలింగంపంతులు వారి జయజయధ్వానములు చెలరేగుచుండెను. ఆంధ్రదేశవిద్యాసాగరులవారే పంతులువారు. ఆబాల జన్మగాథ యంతయు వారి కెరింగించి ఆవృద్ధనారి యామెను వారిహస్తముల నిడెను. పద్మకు వివాహ మొనర్పక ఉన్నతవిద్య నలవడజేసి సమాజసేవకురాలుగా నొనర్పవలెనని వారియుద్దేశ్యము. ఆమె కమ్మకులసంజాత. ఇదియే యువతిజీవితసంగ్రహము.

తల్లిదండ్రులసమ్మతి నెరింగించుచు రామకృష్ణుడు పద్మ కుత్తరము వ్రాసెను. పంతులుగా రీమెకు కన్యాదాతలగుట కంగీకరించిరి. యువకుడు ధనవంతుల పుత్రుడు; యువతి ధనవంతులపాలితకన్య. వివాహము చాలవైభవముగ జరిగినది.

౩

బహుకాలరూపమగు బీజము ఫలవంత మగు వృక్షమై తనకట్టెదుట సాక్షాత్కరించినప్పుడు కలిగెడు ఆనందమే రామకృష్ణునకు వాంఛితపత్నిని పొందిన నాడు కలిగెను. ఆతని సుఖస్వప్నము సఫలమయ్యెను. అంతర్జాతీయ వివాహమైనను రామకృష్ణుని బంధుబాంధవులందరు వివాహమున కేతెంచిరి. మిత్రులెందరో వధూవరులకు సుస్వాగత మొసంగిరి.

అది మొదటికలయికరాత్రి. పద్మరామకృష్ణునకు పరిచితయైనను నా డామె నూతనకళేబరము ధరించి యున్న ట్లాతనికి గోచరించెను. వస్త్రపుష్పాలంకారాదులచే అలంకరింపబడినయామె ఆనాడు మూర్తీభవించిన సౌందర్యదేవతవలె నొప్పారుచుండెను. యువకుని పిన తల్లికూతురు యిందు "పద్మ సిగ్గుచూచిన ఆధునికస్టేజ్ (Stage) యందు ప్రాచీనాభినయమువలె నున్నది. పాపము! ఆమె యెన్నడును మా యన్ననే చూచి యుండలే" దని పరిహాసించెను.

"ఈమాటల కన్నిటి కేమిగాని, నీవు సంగీత ప్రియుడ వందురు. ఏదీ యొక్కరాగ" మని సరోజిని రామకృష్ణు నడిగెను.

"ఆ...నేనును మరచిపోతినిసుమా." "ఆరామకృష్ణా! నీవు నేడొక్కపాటయైన పాడకున్న మే మెవ్వర మీగదివిడిచి వెడలువారము గాము. ఆలోచించుకొ" మ్మని యిందు సరోజినితీర్మానమును బలపరచెను.

ఎట్టకేలకు రామకృష్ణునికి పాడక తప్పినది గాదు. ఫ్లూటు చేతగొని 'నసుమోముకన లేని' కృతి వాయింప దొడగెను. పద్మవంతు వచ్చెను. రామకృష్ణుడు మరళి వాయింప పద్మ మృదుగాత్రముతో రెండుభక్తిగీతముల బాడెను. "You are very fortunate to have a nightingale" అని స్నేహితులు రామకృష్ణుని పొగడిరి. "వేయిప్రయత్నము లొనర్చినను మాపద్మ పాడిన ట్లితడు పాడజాల" డని చెలులు పలికిరి. "నేటియుగము నారీయుగము. ఎచ్చటజూచినను నారీప్రభావమే. అందు గానవిద్య వారిహక్కు గదా" యని రామకృష్ణు డనెను. 'Good night' అనిచెప్పి స్నేహితులు సెలవుగైకొనిరి.

౪

"పద్మా! మనోభీష్టము నెరవేరెనా?"

"అబ్బా మీయల్లరి తగ్గదా!"

"కాదు. నాతలిదండ్రులు నీరూపసద్గుణముల జూచి ముగ్ధులైరి. కోరి వేడి రామకృష్ణుడొకఅప్సరసను పత్నిగ పొందినాడు. మేమెంచినవాడికెక్కడ సరిపడు నని అమ్మ యనెను."

"మీతలిదండ్రులవంటి తలిదండ్రులను బడసిన వారిదేగదా పుణ్య" మని పద్మ యనెను.

"నీవంటిస్త్రీరత్నమును పొందినవానిభాగ్యమో మరి!"

పద్మ కృత్రిమకోపమభినయించుచు, "అబ్బా! ఊరకుండుడు మీయల్లరి కంతులే" దనెను.

"పద్మా! Sincere గా కోరిన నాకోరిక భగవానుడు పూర్తిగావింపకయుండడుసుమా" యని రామకృష్ణుడు పద్మశిరస్సును తనయొడియం దుంచుకొని ఆమెకపోలముల నిమురుచు పలికెను.

"ఆమాట వేరేచెప్పవలయునా? మనయిర్వుర కలయిక యిందులకు ప్రబలతమమగు సాక్ష్యముగాదా?" అని పద్మ యనెను.

"గొప్పఆఫీసరుగాని, దేశనాయకుడుగాని, సంస్కర్తగాని యగుట నా కిష్టములేదు. జీవనశిల్పి యగుట నాముఖ్యాదర్శము. విధాతసృష్టి ఉద్యానమందు నేమాలాకారుడ నయ్యెద. ఇట్లే నాజీవితము గడచి పోవును. అంతియేకాదా? పద్మా".

యువతి ప్రత్యుత్తర మిడలేదు.

"పద్మా! నీవు మాటకారి వెప్పుడయ్యెదవో కదా! ఒకేకళాశాలయందు చదువుకొంటిమి. నావద్ద నీ కీజడత్వ మేల.?"

"టిపికల్ యిండియన్ ఉమన్ మెంటాలిటీ" యొక్కడకు పోవును. షెల్లీ, షేక్స్పియరు చదివిన మాత్రాన జన్మగతప్రకృతి మారునా ఏమి? మీఛాయిస్ (Choice) దోషమేగాని నాదోష మేమియును లేదు"

యువకు డీమాటలకు పులకితుడైపోయెను. తన ప్రథమప్రణయచిహ్నమగు చుంబనము నామె యధరమందు ముద్రిత మొనర్చెను.

కృత్రిమకోపము నభినయించుచు, పద్మ "పురుషుడు చాలస్వార్థపరుడు. స్త్రీని పూర్తిగ తనపిడికిట బంధించిననేగాని ఆతనికి తృప్తికలుగనేరదు. ఆటు పిమ్మటమాత్రము కంటకభూయిష్ఠమగును. ఇందులకే గాబోలు సామాజికవివాహబంధనలు, చట్టముల నిర్బంధము; చూడండి! ఎందరో పురుషులు తమభార్యలవద్ద యెంతయో ప్రగల్భముల కొట్టెదరు. ఆమెచనిపోయిన పదియవదినముననే పునర్వివాహమునకు సిద్ధపడెదరు. కొందరు లోకనిందాభయమున వివాహము గావించుకొనకున్నను మార్జాలవైష్ణవత్వమును పొందుచున్నారు. ఇందుకు మీరు సమ్మతింతురా? లేదా?".

"పద్మా! నిజమే. నేనుమాత్ర మట్టివారిశ్రేణి యందు చేరనుసుమా! అయినను త్రికాలజ్ఞుడగాను. ఏమికానున్నదో! ఏమిచేయనుంటినో?

ఈమాటలుపలుకుసరికి రామకృష్ణునికి ఏది గా కత్తివ్రేటువలెబాధింపదొడగెను. ఆతనికండ్లశ్రుపూరితము లయ్యెను. శరీరము కంపింపదొడగెను.

ఆతడత్యంతప్రేమతో నామె నాలింగనమున గారవించెను. పవిత్రతమమగు నొకపదార్థమును స్పృశించుచున్నటు లాతనికి దోచెను. భోగలాలసకు లోనగుట కాతని అంతరాత్మ వెనుదీసెను. భక్తి, శ్రద్ధ, గౌరవము భోగలాలసస్థానము నాక్రమించెను.

"నాకంబళి గొనివచ్చి కొంచెము కప్పుడు" అని పలికిన పద్మ ఆకస్మికపుపలుకుల కాత డదిరిపడెను.

"ఆతనితలయం దొక పెద్దపిడుగు పడినట్లయ్యె! పద్మా, చలివేయుచున్నదా! ఏమి మాటలాడవు?"

చలిచే ఆమెశరీరము వడకిపోవుచుండెను. రాత్రి అంతయు అటులనే గడిచెను. నూతనదంపతులకు ఆనందపూర్ణమగుప్రభాతము కాలేదు. అభిశాపప్రభాత మయ్యె!

ౠ

ఉదయాస్తమానములగతి చాలతీవ్రముగ నుండె. రోగులకు రాత్రి మరియు కాలరూపమువలె నుండును. డాక్టర్లు, బంధువులు, స్నేహితులు వచ్చుచు పోవుచు నుండిరి. రామకృష్ణునితలిదండ్రులు ఆహారనిద్రలు మరచి పద్మ కుపచారములు సేయదొడంగిరి. Temperature Normal కు వచ్చినగాని స్నానమొనర్పను, భోజనము కావింపను అని అతడు పట్టుపట్టెను. ఆతనిస్వభావము ఎవ్వరికిని గోచరమగుట లేదు. పద్మపల్కులుకూడ నాతని సంకల్పచ్యుతు నొనర్పజాలవయ్యె.

అది ప్రాతఃకాలము! పద్మనాడి చాలతీవ్రముగ కొట్టుకొనసాగెను. కంఠస్వరముకూడ మారిపోయెను. రామకృష్ణుడు ఆమెశిరమును తనవొడి నిడికొని రెప్ప వాల్పక చూచుచుండెను. హీనస్వరముతో తడబడు వాక్కులతో భర్తచేతిని తనహృదయమున నిడుకొని, "నా సమయము సమీపించుచున్నది. మీకొరకేకాని నాకొరకు సుమంతయు దుఃఖము లేదు. పత్నీసుఖము మీ కావంతయైనను కలుగజాలదు. మీరు...పునర్వివాహము...గావించుకొండు..." కంఠము రుద్ధమయ్యెను.

"పద్మా, నాజీవితము దుఃఖభాజన మొనర్చుటకే నా నీవు జన్మించితివి? పరిహాసమున కనిన పలుకులు నిక్కవము లయ్యెనా!" అతనికండ్లు అశ్రుపూరితము లయ్యెను.

"పునర్జన్మమే సత్యమైన మిమ్మే పతిగ బొందవలెనని నే నాభగవంతుని వేడుచున్నాను." అని ఆమె సంజ్ఞారూపముగా వ్యక్తపరచెను.

యువకు డామెవంకనే చూచుచుండెను. భ్రమరమును వంచించి అనాఘ్రాతపుష్పము వృంతచ్యుతమై పోయెను. రామకృష్ణునిహృదయజ్యోతి యారిపోయెను.

నాలుగుదినముల కనంతరము ఒకపార్సిల్ ఆతనికి వచ్చెను. Presidency College యందు ప్రథమముగ B. A. పరీక్షయందు ఉత్తీర్ణయైనందున University Senate మెంబర్లందరు ఆదరపురస్సరముగ పద్మకు పంపినస్వర్ణపదక మది. ఈఆకస్మికఘటనవలన యువకునిపుండు మరల రేగెను. ఆహారనిద్రలు, విలాసభోగములు అతనికడ నిష్ఫలము లయ్యెను. గృహమునందుండియే యాతడు సన్యాసి యయ్యెను. బాహ్యజగత్తున నాతడు విరాగి యయ్యె. అతినిర్జనమగు ఆంతరంగిక ప్రపంచమున నాతడు తనమృతపత్ని స్మృతి సమాధి యందు గూర్చుండి అశ్రుపాతము నొనర్పసాగెను.

ఇట్లనే దినములు జరుగుచుండెను ధ్యానతన్మయుడగు యోగివలె నాతడు కన్పట్టుచుండెను. తన నిర్జనకుటీరమున ఏకాకియై కూర్చుండి అతడు లిపీ? సౌధరచన నొనర్పసాగెను. మాలాకారుని కుటీరరాణి అగాధమగు సముద్రమున మునిగిపోయెను. కుటీరరాణికి ప్రతి ప్రకృతిరాణి యాతనిమెడయందు పూలమాలికల వైచుచుండెను. యువకుడు శిల్పియయ్యెను.

కలకలరవ మగు నదీ ప్రవాహములయం దాతడు తన ప్రియురాలి కంఠస్వరమును వినుచుండెను. మందమలయసమీరమున నాతడు ప్రియురాలి కేశసౌరభ మాఘ్రాణించుచుండెను. కలువలరేని స్నిగ్ధజ్యోత్స్నను ప్రియురాలిచే తనస్పర్శల నొసంగుచుండె. మార్తాండుని తీవ్రప్రకాశ మాతనికి ప్రియురాలి చక్షుర్జ్యోతివలె దోచుచుండె. వర్షాముసం దాత డశ్రుజలముల గార్చు ప్రియురాలిమూర్తిని కాంచుచుండె.

గ్రీష్మ ఋతువందలి తీవ్రసంతాపమునకు ప్రియురాలి క్రోధపూరిత దృక్కులకు భీతుడైనట్లు మెలగుచుండె. హేమంతఋతువు నందలి శుష్క ప్రేయసీ మూర్తిని తలచి వ్యధితమనస్కుడగుచుండెను. వసంత ఋతువునందలి గర్వోల్లసితయగు ప్రియురాలి ఆలింగన సౌఖ్య మనుభవించుచుండె.

ఆతని కుటీరరాణి తిరిగి జీవించెను. ప్రకృతి ప్రేరణలచే ఆమె ప్రతినిమేషమున నాతనివద్దకు వచ్చుచుండెననియే యాతని విశ్వాసము.




" వర్షమునం దాత డశ్రుజలములఁగార్చు ప్రియురాలిమూర్తిని గాంచుచుండెను "

లోకదృష్టియం దాత డున్మత్తుడు.

---

# వలసరాజ్యములందు భారతీయశిల్పకళ



తలిశెట్టి రామారావు

## 3. కాంభోజము

భారతీయు లీప్రాంతములందు స్థాపించిన రాజ్యములలో చంపా మొదటిదైనను, తరువాత యేర్పడిన కాంభోజము దీనిని మించిన రాజ్యమైనది. ఇచ్చటి శిలానిర్మాణము లిప్పుడు ప్రపంచమున హిందువులకీర్తిని వేనోళ్ల గొనియాడజేయుచున్నవి; భారతీయుల సనాతననాగరికతకు నూతనమైన గౌరవమును చేకూర్చుచున్నవి.

ఇచ్చటి ప్రజలు ఖ్మేరులు, కాంభోజులు అని పిలువబడుచున్నారు. వీరు చైనా, తిబెత్తు ప్రజలజాతికి జెందినవారనియు, క్రీస్తు పుట్టిననాటికే యీప్రాంతముల నాక్రమించియుండిరనియు శాస్త్రజ్ఞులు నిర్ణయించి యున్నారు. వీరి నాగరికత యెట్టిదో యిప్పుడు తెలిసికొనుట సాధ్యము కాకయున్నది. ఇంచుమించుగ ననాగరికులై యుండిన యా ఖ్మేరులకు భారతీయులు తమనాగరికతను ప్రసాదించి హిందూమతమును నేర్పి రాజ్యమునకు పాలకులై యాదేశమున కంతకుపూర్వము లేని యశము నార్జించిరి.

కాంభోజమునకు హిందువు లెప్పుడువెళ్లిరో యింకను నిర్ధారణముకాలేదు. కౌండిన్యుడను బాహ్మణుడు నాగిణియను రాజకుమార్తెను పరిణయమాడి కాంభోజరాజ్యమున కధిపతియయ్యెనని యొకకథకలదు. ఒకచోళరాజునకును నాగిణికిని పుట్టిన సంతతివారు పల్లవులని చెప్పుటకలదు. కాన నిచ్చట మొదట రాజ్యాధికారమునుపొందినవారు పల్లవులు పాలించినదేశమువారని కొందరియూహ. వీరు క్రీ. శ. మొదటిశతాబ్దమున నిచ్చటకు వచ్చిరని కొందరుచరిత్రకారులు నిర్ణయించిరి. కాంభోజమునగల మహానిర్మాణములందు నాగశిల్పచిత్రములు విరివిగ గనబడుటవలనను నాగపూజ యిచ్చటను జావాయందును విశేషముగ కానవచ్చుటవలనను ఆప్రాంతములవా రీకథను నిజమని నమ్మియుండవచ్చును.

“తక్షశిలప్రాంతములం దొకమహారాజుపాలించుచుండెను. ఆతనియువరా జొక యపరాధమును చేయుటచే స్వదేశమునుండి వెడలగొట్టబడి కాంభోజదేశమును చేరుకొని నూతనరాజ్యమును స్థాపించెను” అని మరియొకకథను కాంభోజులు చెప్పుకొనెదరు. ఇచ్చటి దేవాలయములలోకొన్ని కాశ్మీరదేవాలయములను పోలియుండుటచేతను, ఆకాలమున (క్రీ. శ. నాల్గవశతాబ్దమున) కాశ్మీరమునందును, పశ్చిమహిందూదేశమునందును అరాచకములు ప్రబలమై యుండుటవలనను ఈకథకు కొంతప్రాముఖ్యము కలుగుచున్నది. “కాంభోజము”ను దేశమొకటి కాశ్మీరప్రాంతములం దుండుటచే యీవాదమునకు మరియొకయాధార మేర్పడినది. శ్రుతవర్మయను హిందూరాజు నాల్గవశతాబ్దము కాంభోజముయొక్క సింహాసనము నధిష్ఠించెను. ఈతని పేరు పల్లవరాజుల పేరువలె నున్నది. కౌండిన్యసోమవంశమును సూచించునట్టుల నీతనిది సోమవంశము. కనుక శ్రుతవర్మపల్లవుడై యుండుట కడు సంభవము.

ఆ పిమ్మట కాంభోజచరిత్ర మించుమించుగ చంపాచరిత్రమువలె నుండును. వీరును అన్నామ

రాజ్యముతో యుద్ధముల ననేకములను చేసిరి. చంపాతో కొంతకాలము యుద్ధములను, కొంత కాలముమైత్రిని చేయుచుండిరి. ఈరెండురాజ్యములును వివాహమువలన రక్తసంబంధము నేర్పరచుకొనినటుల కానవచ్చును. వీరెట్టిఘనకార్యములనుచేసిననేమి, పదు నైదవశతాబ్దమునాటికి రాజ్యమునుగోలుపోవుటయేకాక వీరినిర్మాణము లరణ్యావృతములై మరుగుపడిపోయినవి. దేశము మరలయనాగరికస్థితికి పడిపోయినది. లోకమీ దేశమును పూర్తిగ మరచిపోయినది.

క్రీ. శ. ౧౮౫౮-వ సంవత్సరమున ఫ్రాంసుదేశపు శాస్త్రజ్ఞుడగు మహోటుహూతెనములైన వృక్షాదిజాతుల కొరకు కాంభోజపుఅడవులందు వెదకుచుండ "అంకోరు వాటు" అను మహానిర్మాణమునుచూచి యాశ్చర్యమున మునిగిపోయెను. ఇంతటి పట్టణమీదట్టమైన యడవులం దుండుట యెటులసంభవించెను? ఎచ్చటను శిథిలము కాలేదు. ఎంతచూచిన నెచ్చటను మానవచిహ్నములు లేవు. దేవతలిచ్చట నివాసమేర్పరచుకొనిరా? విస్మిత సంశయములకులోనై యాతడచ్చట బసచేసి, పరిసర ప్రాంతములనువెదకి, యాదేవాలయరాజముయొక్క రూపమును, పునాదులచిత్రము (Ground Plan)ను వ్రాసి కొంతవర్ణనను లిఖించెను. ఈపనిపూర్తి కాకపూర్వమే యాతడు జ్వరపీడితుడై యచ్చటనే మరణించుటచే యీవిషయము పూర్తిగ ప్రపంచమునకు వెల్లడియగుట కొంతయాలస్యమైనది. కాని యీతడీనిర్మాణముపైకి లోకులదృష్టినాకర్షించి, మహోపకారమునుచేసి చిరస్మర ణీయుడయ్యెను. తరువాత అడోల్ఫ్ బాస్టియ నీప్రాంత ములకువెళ్లి నిర్మాణములవర్ణనలను గ్రంథరూపమున బ్రచు రించెను. జె. తామ్సను అంకోరుపునాదిచిత్రమును, ముప్పదిఛాయాచిత్రములను తయారుచేసితెచ్చెను. ఆ పిమ్మట ఫ్రాంసుదేశీయులయాధిపత్యముక్రింద శాస్త్ర జ్ఞులు రెండుసారులువెళ్లి యీప్రదేశమునుగూర్చి విపుల ముగవ్రాసిరి. వీరిలోముఖ్యులు కెప్టెన్ డుడార్టుడిలాగ్రే లెఫ్టినెంటుగార్నియరు, కెప్టెనుడెలాపోర్టియనువారలు. నోమ్‌పెన్హ్ (Pnompenh) నందలి కాంబోడియా వస్తుప్రదర్శనశాల కధిపతిగనుండిన జార్జిగ్రాస్లియరు అను మహాపండితు డీకట్టడములనన్నిటిని పూర్తిగబరి శీలించి గ్రంథించిభాషయం దనేకములు గ్రంథములను రచించి, యమూల్యములైన విషయములను మనకొరకు సంగ్రహించెను.

ఇచ్చటి శాసనములన్నియు పల్లవులకాలమునాటి శాసనములను పోలియున్నవి. వీటియందలి సంస్కృత భాష నిర్దుష్టమైనది. అక్షరరచన సుందరమైనది. చాము లవలె కాంభోజులకును వేదములు, పురాణములు, కావ్య ములు మొదలగు హిందూగ్రంథములతో మంచి పరిచయ ముండినది.

కాంభోజమును హిందూరాజ్యమై యుండెను. అచ్చటచ్చట పాడుపడియున్న దేవాలయము లన్నియు హిందూనిర్మాణములనుట నిస్సందేహము. బౌద్ధనిర్మాణ ములు లేకపోలేదు. అంకోరుదేవాలయమునం దిప్పుడు కొంతమంది బౌద్ధు లారాధనము జేయుచుండుటచే నది యాదినుండియు బౌద్ధుల కొరకుద్దేశింపబడినదే యని కొందరు తలచిరి. ఇచ్చట విహారము, చైత్యగృహము, స్తూపము మొదలైనవి లేకపోవుటయే కాక శిల్పమునం దును బౌద్ధమతచిహ్నములేవియు కానరాలేదు. అశోక చక్రవర్తి కొందరు బౌద్ధసన్యాసుల నిచ్చటికి బంపె ననియు, బుద్ధఘోషు డిచ్చటికి వచ్చియుండెననియు కాంభోజమునగల బౌద్ధమతావలంబకులు చెప్పుచున్నను వారీదేశమునందు తమమతమును నిలువబెట్టుటకు చేసిన ప్రయత్నముల చిహ్నములు చాలస్వల్పముగ గానవచ్చు చున్నవి. ఐదవ శతాబ్దమునుండియు బౌద్ధులచ్చట వాస మేర్పరచుకొని పదమూడవశతాబ్దమునాటికి కొంత పలుకుబడిని కలుగజేసుకొనిరి. హిందూరాజ్యము ప్రబ లమై యుండినప్పుడైనను ప్రజలందరు హిందూమతమును స్వీకరించిరని చెప్పుట కాధారములు లేవు. కాని ఖ్మేరుల పూర్వపుమతము హిందూమత మంతటిపటుత్వము కలది కాకపోవుటచే హిందూమతముయొక్క యాధిక్యమును స్వీకరించి తమమతాభిమానములను, దృక్పథమును చాల వరకు మార్చుకొనిరనుటకు సందేహము లేదు. కనుకనే హిందూరాజులంత సుస్థిరముగ నాదేశమును పాలింప

గలిగెను. చంపాయందువలెనే యిచ్చటను శివమతము మిగుల యాదరణమునకు వచ్చెను.

హిందూరాజుల పాలనములో కాంభోజదేశము సంపదల కాకరమైయుండెననియు ప్రజల దైనిక జీవనమునకు కావలసిన సదుపాయము లుండెననియు చెప్పుటకనేకములు నిదర్శనములుకలవు. ఆరాజులభక్తిని, సంపదలను అచ్చటనిర్మింపబడిన మహాదేవాలయములు వేనోళ్ల చాటుచున్నవి. దేశమునం దనేకములగు మంచిమార్గములు నిర్మింపబడినవి. ఒకమార్గము మూడువందలమైళ్ల పొడవైనది. ఇది ఎత్తుగ రాళ్ల పేర్పుతో పూర్వమురోమనులు నిర్మించిన సుప్రసిద్ధ మార్గములవలె బలముగనున్నది. దీని కనేకములగు చక్కనివంతెన లుండెనట. ఒకవంతెన పొడవు ౪౦౦ అడుగులు, వెడల్పు ౫౦ అడుగులట! దీని కిరుపైపుల చక్కనినాగశిల్పచిత్రములతో నలంకరింపబడిన చిన్నగోడలు, మూరులున్నవి. ఇట్టి



చిత్రము ౧

చక్కనిరాజమార్గములనేకము లుండెననుటకు శిల్పములందు కానబడుచున్న శకటముల, శకటచక్రములచిత్రములు తార్కాణములు. ఒక్కొక్కచక్రముయొక్క అడ్డుకొలత 3 అడుగులుమొదలు ౫ అడుగులవరకు నుండెను. చక్రమునకు పదునారురేకులుండెను. ఇవి సన్నముగ నుండుటచే లోహముతో నిర్మింపబడినవని యూహింపవలసియున్నది. స్నానముచేయుటకు రోముదేశపు జలాశయములకు సౌందర్యమునందును, వైశాల్యమునందును మించినవి అంకోరునందుండెనని కొందరు పరిశోధకుల యభిప్రాయము.

కాంభోజమునందు పూర్వము ఖ్మేరులెట్టి శిల్పకళ నెరుగరు కాబోలును. వాటిచిహ్నము లేమియు నిప్పుడు కానరావు. కర్రతో గృహములను కట్టుకొను విధానముమాత్రము శిల్పమునం దచ్చటచ్చట కానవచ్చుచున్నది. కొన్నిస్థలములందు దేవాలయములచెంత దారునిర్మాణము లుండెను కాని యవి యిప్పుడు శిథిలములైపోయినవి. చైనా మొదలగు దేశముల శిల్పుల పలుకుబడివలననో, ఖ్మేరుల రక్తములం దప్పటికినుండిన తమ సనాతన జాతీయతయొక్క ప్రాబల్యమువలననో, ఆదేశపుపరిస్థితులకు సరిపడునటుల నుండుటకో యచ్చట ప్రవేశపెట్టబడిన క్రీ. శ. ౫, ౬, ౭ వ శతాబ్దములలోని హిందూ నిర్మాణ విధానము పిమ్మట కొంతమారిపోవుట వలన ౯వ శతాబ్దముతరువాత కట్టబడిన భవనములకును, హిందూదేశపు భవనములకును కొంతభేదము కానవచ్చుచున్నది. హిందూశిల్పుల శిష్యులైన ఖ్మేరు శిల్పు లిట్టిమార్పులను కలుగజేసినను మొత్తముమీద హిందూశిల్పసంప్రదాయములనునిర్మాణమునందును, రచనయందును, విషయమునందును మానలేదు.

కాంభోజమునకు మొదటిముఖ్యపట్టణముగ నుండిన వ్యాఘపురమువద్ద కోటచిహ్నములును, నందిస్తంభమును గలవు. సముద్రమునకు సమీపమున చిన్నదేవాలయములనేకములుండెను. ఇవియన్నియు గుప్తులశిల్పరచన ననుకరించియున్నవి. హిందువులు జావా, చంపాదేశముల

నాక్రమించినప్పు డీప్రాంతములకువచ్చి నివాసము నేర్పరచుకొనియుండుట కడుసంభవము కాన నివి యన్నియు నాదేశమున మొదటికట్టడములై యుండును. ఐహోలువద్దగల "లాడ్ ఖాన్" దేవాలయమును బోలినది హన్ చెయిపగ్గర గలదు. ఇందు అనంతశాయియొక్క చతుర్భుజవిగ్రహము కలదు. ఆంధ్రదేశమున గానవచ్చు దేవాలయములవంటివిచ్చట రెండుగలవు. ఇంపలి మకర తోరణము, హంసప్రతిమాలంకారములు సుందరముగ నున్నవి.

ప్రెయికుక్ అనుచోట సుమారేబది చిన్నదేవాలయములు చక్కనివి కలవు. వీటియందును మకరతోరణములు, తదితరశిల్పాలంకారములు కలవు.

వీటికి దక్షిణమున బేయాంగువద్ద ఇటుకలతో గట్టబడి అచ్చటచ్చట రాళ్లతో నలంకరింపబడిన చక్కనిదేవాలయము సాంపుపడియున్నది. ఈ చెంతనే మహర్షియై (ఋషి ?) ఆశ్రమముకలదు. ఇది పూర్వము హరిహరాలయమై యుండెను. నిర్మాణమునందును, అలంకారములందును సమానములై కొండమీదనున్న పల్లవులనాటి దేవాలయమును పోలి యున్నదట.

కులేనుపర్వతాగ్రమున కొన్ని దేవాలయములును, పెద్దగజవిగ్రహమును గలవు.

ఆరవశతాబ్దానంతరము దేశమునం దరాచకములు ప్రబలమయినటుల కానవచ్చును. ఈరెండు శతాబ్దము లందు నిర్మింపబడిన దేవాలయములు కాని, మలచబడిన విగ్రహములుకాని పేర్కొనదగ్గవి కానరాలేదు. తొమ్మిదవ శతాబ్దమునాటి కీసంక్షోభమువలన దేశమునం దెట్టి మార్పులుకలిగెనో కాని యాపిమ్మట నిర్మితములైన దేవాలయములందు కొన్ని మార్పులు కనబడుచున్నవి. తొలుతని పూర్తిగ హిందూసంప్రదాయముల ననుసరించియుండ, క్రొత్తవి యచ్చటి పరిస్థితులబట్టి నాగరికతను కాంభోజదేశమునకు సరిపడునటుల మార్చుకొనిన హిందూదృక్పథమున కనుపడునటుల నున్నవి. ఈమార్పుల వలన నిర్మాణవిధానము ఉత్తమకళాసంప్రదాయములను కొంతవరకు విడనాడినవని తలంపరాదు. హిందూచిత్రరచనయను కళాత్రిభువనమోహిని కాంభోజమునందు పుట్టినిల్లను భారతదేశ మెరుగనియలంకారములను ధరించి నూతనశోభతో విరాజిల్లినది. ౭, ౮ వ శతాబ్దములందు కాంభోజు లీమెను తమకీర్తి నావరింపలే దను చింతచేత గాబోలు తొమ్మిదవ శతాబ్దమున తమ కుశాగ్రబుద్ధికి సాధ్యమయిన నూతనాలంకారముల నన్నిటిని జేర్చి, యామె యునికికొరకు ప్రపంచమునం దంతటను పేరు వడసిన మహానివేశనములను గట్టించి ధన్యులైరి.



చిత్రము ౨

కాంభోజమును క్రీ. శ. ౮౦౨-౮౬౯ వ సంవత్సరములలో పాలించిన రెండవజయవర్మ జావానుండి వచ్చి ఇంద్రపురమును ముఖ్యపట్టణముగ జేసుకొనెననియు, ఆపిమ్మట అమరేంద్రపురము (బాంటియె చ్మార్), హరిహరాలయము (ప్రాహ్ ఖాన్), మహేంద్రపర్వతము (బెంగ్

మెయలీయ) అను మరి మూడు ముఖ్యపట్టణములను గట్టించెననియు చరిత్రవలన దెలియుచున్నది.

అమరేంద్రపురనిర్మాణమున క్మేరులు మొదట పూర్తిగ రాళ్లతో గట్టుట ప్రారంభించిరి. తమజాతీయ రుచులను ప్రవేశపెట్టిరి. అగడ్తలమీది వంతెనకిరువైపుల నుండవలసిన గోడలకు బదులుగ నాగసర్పములను అసురులు, దేవతలు మోయుచున్నటుల నిర్మించిరి (చి. ౧.) ఈనగరమునకు నాలుగుద్వారత్రయము లుండెను. గరుడ వాహనములు, ఎత్తైనకుంద్రనిలోనికప్పు, ఉన్నతశిఖరములు, నాగరూపాలంకృతములైన చూరుమీదిభాగములు, అర్ధశిలాప్రతిమలతోనిండిన వసారాగోడలు నీ నగరనిర్మాణమున గమనింపదగినవి. ఇట్టివన్నియు హిందూదేశమున విశేషముగ కానవచ్చుటచే క్మేరులు ప్రత్యేకముగ బ్రవేశపెట్టిన నూతనవిషయములని చెప్పుట యందు సత్యములేదు.

హరిహరాలయ మమరేంద్రపురమును పోలియున్నది. దీనియగడ్తలవెడల్పు సుమారు ౧3౨ అడుగులు. వీటిపైనున్న వంతెనల కిరువైపుల చక్కనిపెద్దమనుష్యులు పాములను మోయుచున్నటుల గోడలు కలవు. నగరప్రాకారము సుమారు ౨,౮౦౫ అడుగులపొడవును, ౨,౪౭౫ అడుగులవెడల్పును గలది. నలువైపులనున్న ద్వారత్రయములపై లోకేశ్వరునియొక్కయో, శివుని యొక్కయో శిరస్సురూపములు మలచబడినవి. గోడలపై గరుడవాహనము లతిచక్కనివి కలవు. ఇప్పుడు శిథిలమైయున్న లోనిదేవాలయముయొక్కశిఖర మతియెత్తైనది. దీనినలువైపుల చిన్ననిర్మాణము లనేకములు కలవు.

ఈనగరమునకు తూర్పున సుమారు ౯,౯౦౦ అడుగుల పొడవును, 3,300 అడుగుల వెడల్పును కల యొకసరస్సుకలదు. దీనిమధ్యగల ద్వీపమున నియక్‌పియను అనబరగు అతిసుందరమయిన దేవాలయముకలదు. పెక్కుతలల నాగుపాములు దీనిని చుట్టియున్నటుల గలదు. కాంభోజనృపులు నాగినీ – సోమవంశమువారు కనుక నాగశిల్పమున కీనగరమునం దిట్టి ప్రాముఖ్యము కలిగెనని కొందరి యభిప్రాయము. రోగనివారకుడని ప్రసిద్ధిపొందిన బౌద్ధులదేవుడగు లోకేశ్వరునియందును, శివునియందును వారికికల నమ్మక మీ నాగప్రతిమలకు కారణమని యీమధ్య నొకరు వ్రాసిరి. మహేంద్రపర్వత మొకానొకప్పుడు ప్రజలతోను, ఐశ్వర్యములతోను విరాజిల్లుచుండినది.

వీటికన్నిటికిని మించిననగరము అంకోరుతోము (అంకోరు = నగరము; తోము=పెద్ద). అగస్త్యసంతతి వాడనని చెప్పుకొనుచుండిన మొదటిఇంద్రవర్మయును, అతని సుప్రసిద్ధమైనరాణి ఇంద్రాదేవియు నీనగరనిర్మాణమును ప్రారంభించిరి. "బాకు"వద్ద నిర్మించినయూరు శిఖరములును, "లోలై"శిఖరములును "బేకాంగు"శివాలయమునగల నలువదిసింహప్రతిమలును, పెద్దవగుగజముల ప్రతిమలును ఇంద్రవర్మని కీర్తిని శాశ్వతముగ నిలువబెట్టగలవు. ఈతనియనంతరము యశోవర్మడు అంకోరునగరమును తొమ్మిదవశతాబ్దాంతమున పూర్తిచేసి క్రీ. శ. సుమారు ౯౦౦-వ సంవత్సరములో తనముఖ్యపట్టణముగ జేసుకొనెను. అంకోరునగర ప్రాకారముయొక్క చుట్టుకొలత సుమారు ౪౦,౦౦౦ అడుగులు. దీనినావరించియున్న యగడ్తవెడల్పు సుమారు 3,300 అడుగులు. అగడ్తపైనున్న యైదువంతెనల కిరువైపులను నాగసర్పమును మోయుచున్న విగ్రహములు కలవు. ఒక్కొక్కసర్పము నేనుబదిమంది మోయుచున్నటుల గలదు. కాన నీయైదువంతెనలమీదను ౫౪౦ విగ్రహము లున్నవి. ఈవంతెనలపై బోయినయెడల ద్వారత్రయములకు జేరుకొందుము. ఒక్కొక్కద్వారత్రయముపైనున్న శిఖరముయొక్కయెత్తు ౭౭ అడుగులు. వీటిపైమానవుల ముఖములు, మూడుతలలయేనుగులు శిల్పితములైయున్నవి. నాలుగుద్వారములనుండి పోవుమార్గములు నగరముమధ్యనుగల మహాశిఖరమువద్ద గలియును. ఐదవమార్గము రాజభవనమునకు బోవును. అగస్టసుచక్రవర్తి కాలమున రోము పట్టణమునను హేనిబాలు కాలమున కార్తేజిపట్టణమునను ఉండిన జనసంఖ్యకుమించిన ప్రజ లీనగరమున నుండిరని యంచనావేయబడినది. నెబుకాడ్నెజారు పాల

నమ్ముక్రింద శేవిలోనినూపైన నింతటివైశ్వర్యములతో తులతూగ లేపట!

రాజగృహమిప్పుడు కాలగర్భమున లీనమైపోయి నది. దీనినావరించి రెండుప్రాకారములును, అగడ్తయు గలవు. ఒకవైపున చక్కనిసింహద్వారము కలదు. చెంతనే యాయావరణమునందుగల "ఆకాశవిమానముల"నుభవనము కొంతచెడియున్నను నిలచియున్నది. ఇది మూడంతస్తులు కలది కాని మీదియంతస్థు మాత్రము వాసయోగ్యము. ఇచ్చటనే రాజు పౌరాణికమయిన "నాగిణి"తో శయ నించుచుండెనని ప్రతీతి. మీదికి పోవుటకు మూడు వైపుల చక్కనిసోపానపంక్తులు నిర్మింపబడినవి. దగ్గ రనే చాలాభాగ మాక్రమించియున్న డాబా చాలా సుందరమయినది. దీనిపొడవు సుమారు ౧,౧౫౦ అడు గులు. ఒకవైపున "నాగ" కుడ్యముకలదు. పైకెక్కుట కైదుమెట్ల పంక్తులు కలవు. మెట్లవరుసలకు మధ్య మున్న గోడభాగములు సింహ, గరుడ, అశ్వముల యొక్కయు, సైనికులయొక్కయు, యుద్ధవినోదముల యొక్కయు శిల్పముతో నతిరమ్యముగ నలంకృతములై యున్నవి. డాబాయందొక ఎత్తైనభాగము రాజుల, రాణుల, అప్సరసల శిల్పచిత్రములతో విరాజిల్లుచున్నది. రాజిచ్చటనే సభలను చేయుచుండెనేమో? ఇచ్చట నొకవ్యక్తియొక్క విగ్రహముకలదు. ఇది యశోవర్మని దని కొందరి యభిప్రాయము. ఈప్రాంతమునకు దగ్గరనే యొకసుందరమయిన యాలయము కలదు.

నగరప్రాకారమునకు మధ్యను సుప్రసిద్ధమయిన "బేయాను" దేవాలయముకలదు. ఈదేవాలయప్రాకార మున తూర్పునగల పెద్దద్వారముచెంత నొకవేదికయు, వేదికనలువైపుల "నాగకుడ్యములు"ను కలవు. లోపల వలయాకారములైన లోకప్పులతో నాలుగంగణములు కలవు. వీటికంటెయే యర్ధవలయాకారములైన కప్పు లతో మరియొకయంగణములవరుసకలదు. మొదటియం గణమును ఎండ,వర్షములనుండి కాపాడుటకు రెండవ యంగణము చక్కనియుపాయము. ఇట్టియేర్పాటే దేశము నను సనాతనభవనములందు గానరాదు.* పెద్దయంగణ


చిత్రము 3

ములలో రెండు ౫౩౦ అడుగుల పొడవైనవిగను, తక్కినరెండు ౪౬౫ అడు గులపొడవైనవిగను (అన్ని యుగలవి ౧,౯౯౫ అడు గులగును) ఉన్నవి. స్తంభ ములన్నియు చదరముగ, నతిసుందరముగ గలవు. ఇవికాక లోపల మరి కొన్ని యంగణములు కలవు. వీటన్నిటి లోపలిగోడలపై దేవతలు, పౌరాణిక కథలు, బ్రాహ్మణులు, ఋషులు, రాజులు, రాణులు, భవనములు, సైనికులు, ఏనుగులు, అశ్వములు, రథ ములు, నావలు, చేపలుపట్టుట, విక్రయశాలలు మొదలగునవన్నియు మలచబడినవి. ఇవి నాటి కాంభోజుల నాగరికతను, దైనికజీవనమును తెలియ జేయుచున్నవి. రచనయందు లోతుగ చెక్కడములేక పోవుటచే భారతీయరచనతో సరిపోల్చినయెడల కొంత భేదము కానవచ్చును కాని సుందరముగనున్నది. ఇట్టి శిల్పాలంకారములు అంగణకుడ్యములందేకాక దేవాలయ ములందన్నిభాగములందును గలవు. అంగణములకుగల చిన్నద్వారములనుండి లోనికిపోయినయెడల మూడవ వరుసగ. చిన్నయంగణములు కానవచ్చును. వీటినికూడ దాటినయెడల దేవాలయముయొక్క ముఖ్య శిఖరము కలదు.

ఇదియు, దీనిననుసరించియున్న చిన్నశిఖరములు (అన్నియుగలవి ౫౦) ఒకయెత్తైనవేదికవంటి నిర్మాణ ముపైగలవు. ఒక్కొక్కశిఖరముమీద నాలుగుముఖ ములు మలచబడినవి. శిఖరాగ్రమున నైదవముఖము పూ ర్వముండెనేమోకాని యివియన్నియు విరిగియుండుటచే నిశ్చయముగ చెప్పుటసాధ్యముకాదు. ఈముఖములు నరు

* రెండువరుసల యంగణములు నేకశిలానిర్మాణముగ నుండును. రాతిఫలకము లొకదానిపై నొకటిచేర్చి తావును ప్రయత్నించినను కనుగొనుటకు వీలులేనంత బాగుగ నమర్చిరట. ఇంతచక్కగ నంత పెద్ద నిర్మాణములను సాధించిన యాశిల్పులు ధన్యులు.

ర్మను బ్రహ్మవనియు, బ్రహ్మయొక్క యారాధన కాంభోజమున జరుగుచుండెనని కొందరు పూర్వమభిప్రాయపడిరి




చిత్రము ౪

కాని యీశిఖలింగములు ముఖలింగముల యాకారములో లేక లోకేశ్వరునియాకారములోయని యిప్పుడు పరిశోధకు లభిప్రాయపడుచున్నారు. ప్రధానశిఖరమున మధ్య నొకగర్భగృహమును, దానిననుసరించి పండ్రెండుగర్భ గృహములును కలవు. ప్రధానగృహమున పూర్వము దేవరాజలింగము బహుశయుండెను. చిన్నగృహము లందు కాంభోజనృపతుల, వారిభార్యల ప్రతిమలుండి నవి. ఈదేవాలయమున విష్ణువు, శివుడు, దేవిమొదలగు హిందూదేవతల విగ్రహములు, బౌద్ధవిగ్రహములు, గ్రామ దేవతావిగ్రహములు, దైవత్వమారోపింపబడిన నరుల విగ్రహములు ముప్పదినాలుగుండినవని శాసనములవలన తెలియుచున్నది.

అంకోరుతోమునకు నాలుగుమైళ్ల దూరముననున్న అంకోరువాటు (నగరదేవాలయము) యొక్క నిర్మాణము క్రీ. శ. ౧,౧౧౩-౧,౧౫౩ లో పాలించిన రెండవ సూర్యవర్మని కాలమున పూర్తియయినటుల కానవచ్చును. ఈవిషయమయి నిశ్చయముగ జెప్పుటకు శాసనములెవ్వియు లభించలేదు కాని ౧,౦౯౦-౧,౧౪౬సం. లో శివభద్రేశ్వరాలయము నిర్మితమగుచుండెనుట కాధారములు కానవచ్చుటచే అంకోరువాటు తొలుత శివభద్రేశ్వరాలయముగనుండెనని చరిత్రకారులనుకొనుచున్నారు. "అంకోరువాటు" అను పేరు తరువాత దీనికి కలిగియుండవచ్చును. ఇటీవల నిది బౌద్ధారాధన కుపయోగపడుచున్నను హిందూదేవాలయముగ నిర్మింపబడుటనిశ్చయము. శిల్పచిత్రములందు బౌద్ధమతమునుగూర్చి యొకటియైనను లేదు. సూర్యవర్మనిగురువును, మిగుల ప్రతిభాశాలియు నగు దివాకరుని యాజమాన్యమున నీమహాదేవాలయము నిర్మితమయ్యెగాబోలును.

ఈకట్టడము నిర్మాణమునందును, పరిమాణము నందును కళారాధకులను, నిర్మాణతత్త్వజ్ఞులను ముగ్ధలను జేయుచున్నది. దేవాలయమును, దానిననుసరించియున్న యంగములనుకలసి సమభుజచతురముగనున్నవి. ఒక్కొక్కవైపు మైలుపొడవగుటచే ప్రాకారమంతయు నాలుగుమైళ్లపొడవుగనున్నది. దేవాలయమున కంటియున్న రెండవప్రాకారము పొడవు ౧,౧౦౦ గజములు, వెడల్పు ౧,౦౭౦ గజములు. చుట్టునున్న యగడ్తయొక్క వెడల్పు ౨౩౦ గజములు. పశ్చిమమునగలవంతెన కిరువైపుల "నాగకుడ్యములు" చక్కనివికలవు. దీని కెదురుగనున్నద్వార మలంకారములతో ౬౦౦ అడుగుల వెడల్పుగ నున్నది. మధ్యనున్నద్వారమున కిరువైపుల నున్నద్వారములును, తరువాతనున్న యంగణములును కలసి యతిరమ్యముగ నున్నవి. ఒక్కొక్కద్వారము ఏనుగులు,రథములు సునాయాసముగ పోగలుగునంతటిపెద్దది. కాంభోజుల శిల్పనైపుణ్యమును ప్రపంచమున శాశ్వతముగ నిలుపుట కీమూడుద్వారములును, వాటిచుట్టునున్న యలంకారములును చాలును. ఇట్టిద్వారములు రెండు ప్రాకారములందును నాలుగువైపులగలవు.

దేవాలయప్రాకారములు మూడు. వంతెనవైపున నున్న ద్వారముదాటి లోపలికిబోయినయెడల నిరువైపుల రెండుచక్కనిభవనములు కానవచ్చును. ఇవి పుస్తకాలయములుగ నుండెనట. మధ్యనున్నత్రోవకిరువైపుల నాగ




చిత్రము ౫.

విగ్రహములుకలవు. ప్రధానద్వారమునకును, దానికిరు వైపులనున్న ద్వారమునకును అంటియున్న కట్టడము నాలుగులోగిళ్లుగ విభజింపబడినది. ఈలోగిళ్లు నీటితో నప్పుడప్పుడు నింపబడుటచే చక్కనిచిన్న జలాశయము లుగ మారుచుండినవి. కప్పుపైడాబాకలదు. లోపలివైపున గోడలమీద పౌరాణికకథలు శిల్పితములైయున్నవి.

వీటిని దాటి వెళ్లినయెడల మరియొక ప్రాకారము కలదు. దీనిలోపల దేవాలయమును, శిఖరములును, పెద్ద మెట్లవరుసయు కనబడును.

ఇచ్చటి శిఖరములన్నియు తొమ్మిది. మధ్యనున్న శిఖరముయొక్క యెత్తు సుమారు ౨౧౫ అడుగులు. కుడ్యభాగములన్నిటిపొడవు 3,000 అడుగులకు తక్కువ యుండదు. ఇందుగలదేవతల, మనుష్యుల, జంతువుల చిత్రములు 30,000 ఉండునట. రామాయణయుద్ధము, దేవాసురులయుద్ధము, విష్ణువు దానవులతో జేసినయుద్ధము, సముద్రమథనము, రాణులు, రాజకుమార్తెలు, మహాభారతమునందలి కథలు, ఇవి యనియనేల పురాణములందు వర్ణింపబడినఘట్టములలో నధికాంశములిచ్చట గాననగును. సముద్రమథనముగూర్చి చిత్రము విపులముగ, సుందరముగ నున్నది. ఒకచోట నుత్సవము కలదు. రాజొకపల్లకిపై కూర్చొనియుండనిరువైపుల పతాకము లనుబట్టి సేవకులు నడచుచున్నారు. దీని దిగువను



చిత్రము ౬

దూరమునుండి చూచినయెడల యాలయమునిర్మాణమున నైక్యతగలిగి, యద్భుతముగ గానవచ్చును. శిఖరము లన్నియు నాయాచోట్ల నమరియుండుటచే తాజమహలున గానవచ్చు వెలితియిచ్చటలేదు.

అంకోరువాటుయొక్క నిర్మాణమెంతటియద్భుతమో, శిల్పచిత్రములు నంతవిరివిగనున్నవి. శిల్పితములైన న్యాయాధిపతియు, తదితరులును గలరు. శిక్షబొందినవారు నరకమునబడి బాధలబడుచున్నటుల నింకను క్రిందభాగమునగలదు. యుద్ధమును జూపుచిత్రములన్నియు వీరావేశమును చిలుకుచున్నవి. ఆధ్యాత్మికచింతయం దివి బోరోబుదురు శిల్పములనుమించియున్నవట!

దేవాలయపుఁలోఁగిళ్లలో దగ్గరనేయున్న తాలీ సాబ్ అను మహాసరస్సుయొక్క నీటితో నింపబడు చుండుటచే నాకాలమున నీదేవాలయ మంతయు నతి రమ్యముగ, వింతగ గనబడుచుండెను.

అంగణములందుగల స్తంభము లతిసుందరముగ నున్నవి. లావునకును, పొడవునకును కల పరిమితి, మీద నుగల దిమ్మలపొందిక, శిల్పాలంకారములు, అన్నియు



చిత్రము ౭

గలసి వీటి సౌందర్యమునకు తోడ్పడుచున్నవి. అజంత యం దిట్టివి కలవుకాని వీటికవి తీసికట్టేయగును. ఇట్టి స్తంభము లిచ్చటయనేకము లుండుటచే కాంభోజ శిల్పుల సౌందర్యసృష్టిని వేయినోళ్ల జాటుచున్నవి.

నాగ-సోమవంశమును తెలియజేయుటకో లేక నాగపూజయెడల కాంభోజులకుండిన యాదరణమును వ్యక్తపరచుటకో అంకోరునందు పాముల ప్రతిమలు లెక్కకు మించినవి కలవు. కప్పు రెండుచూరులు కలియు మూలలం దైదుతలల లేక ఏడుతలల పడగకాన వచ్చును; ఇట్టి మూలలు వందలకొలది గలవు. ప్రతి



చిత్రము ౮

చూరును పడగలతోరణము. కప్పు పైభాగము చూరు చోట్ల నెల్ల పడగలు ప్రత్యక్షము; ఇట్టిమార్పులు వేల కొలది గలవు. పిట్టగోడలు సర్పములు. కప్పులయంచులు సర్పములు. అజంతచిత్రకారులు స్త్రీల నలంకారముగ నెటుల రచించిరో కాంభోజులటుల సర్పముల నలంకారములుగ మలచిరి.

నాగపూజవిశేషముగ గలచోట్ల దేవాలయము లకు కన్యలనర్పించుట యాచారముకనుకనే యిచ్చట గోడలమీద నప్సరసల లేకసుందరాంగులచిత్రము లనేకములు కలవని కొందరిమతము. కారణమేదియైనను ఈ శిల్పచిత్రము లన్నియు నతిమనోహరముగ నున్నవి. హిందూదేశమునందువలె నిచ్చటిస్త్రీల ప్రతిమలందును వికలాంగులు, వృద్ధులు, పిల్లలు గానరారు కాని యంగ విన్యాసమునందును, అలంకారములందును, రూపము నందును వీరు ప్రత్యేకాకారమును దాల్చియున్నారు. హిందూశిల్పరచన యీదేశమున బొందిన మార్పులలో నివి కొన్ని. ఎనిమిదవశతాబ్దమునకుపూర్వము హిందూ శిల్పులచే కాంభోజమునందు మలచబడిన విగ్రహము లందు జీవశక్తులు కేంద్రీకరింపబడియున్నటుల నుండును. ఈవిషయమై తరువాత ఖ్మేరశిల్పుల ప్రతిమలు వెనుక బడియున్నవి.

అంకోరుతోమునకు దక్షిణమున మూడంతస్థుల కట్టడమొకటి కలదు. మీదియంతస్థునకు పోవుటకు పెద్ద మెట్లవరుసకలదు. దగ్గరనే యశోధేశ్వరలింగ మొకటి

దొరకినది కనుక నీనిర్మాణము యశోవర్మని శ్మశానముపై గట్టబడినదని యూహించిరి. తూర్పున రెండాలయములు కలవు. వీటికి కొంతదూరమున యశోవర్మని పితృపితామహుల యాత్మలశాంతికొరకు ఉమామహేశ్వరాలయములు నిర్మింపబడినవి. వీటికి నాలుగుశిఖరములు కలవు.

క్రీ. శ. ౯౨౮-౯౪౪ సం.లో పాలించినయైదవ జయవర్మయును, రెండవహర్షవర్మయును అంకోరునకు చాలాదూరమున లింగపురమను రాజనగరమును నిర్మించుకొనిరి. కాని యిప్పుడిచ్చట కొన్నిలింగములును, దేవాలయములును, చిన్నశిఖరములు కొన్నియు మాత్రము మిగిలియున్నవి.

౯౪౪-౯౬౮ సంవత్సరములలో పాలించిన రాజేంద్రవర్మయు మరల అంకోరుతోమును రాజధానిగ జేసుకొని యానగరము ననేకవిధముల నభివృద్ధిజేసెను. ఒకద్వీపమున బ్రహ్మ, విష్ణు, శివ, పార్వతి శివలింగముల కైదుదేవాలయముల నిటుకలతో నిర్మింపజేసెను. ఈ నృపుడు శైవుడైనను బౌద్ధాలయముల ననేకములను కట్టించెను.

ఆరవజయవర్మయు "విమానమును" బోలు దేవాలయమును బేయంసువద్ద నిర్మింపజేసెను. ఇందు "నాగకన్యములు", మహాభారతరామాయణాదిగాథల శిల్పచిత్రములు కలవు. దీనిపై పెద్ద చక్కని శిఖర ముండెనట. యాపు శివసుబ్రహ్మణ్యమను శిల్పి దీనిని నిర్మించెనట.

మొదటి సూర్యవర్మయు (క్రీ. శ. ౧౦౦౨-౧౦౫౦) కూడ ననేకములగు హిందూబౌద్ధనిర్మాణములకు కారకుడు. శివకపాలేశ్వర దేవాలయ మితనినాటిది. ఈకాలమున నొక యాలయమున శివుని యొక్కయు, బుద్ధునియొక్కయు పూజ జరుగుచుండినది. బుద్ధుడు విష్ణువుయొక్క యవతారముకాదా ?

అంకోరువాటు ఇంతకుపూర్వమే ప్రారంభింపబడి, యిటీవల బూర్తి చేయబడుటచే నిదియే యాఖరు నిర్మాణముగ బరిగణింపబడుచున్నది. ఆ పిమ్మట పేర్కొనవలసిన దేవాలయము లెవ్వియు నిర్మితము కాలేదు. పదునైదవశతాబ్దమునాటికి కాంభోజముపై సిరికికోపమువచ్చుటచే దేశ మనాగరికులచేతులబడియనాగరికమున కావాసమైనది.

కాంభోజమునందు హిందూశిల్పరచన యనేకములగు మార్పులను చెందినది. గోడల కమర్చుటకు వీలైన రంగుల మృత్తికాఫలకములు చైనానుండి ప్రవేశపెట్టబడినవి. రానురాను పల్లవుల శిల్పరచనమునందు గానబడు మకరతోరణములు, ప్రతిమలనుంచుటకు కట్టబడు గూళ్ల సౌందర్యము, హంసలు మృగ్యములైనవి. స్తంభనిర్మాణమునను భేదము కానబడుచున్నది. బేయానువద్ద కానవచ్చుశిఖరములందలి మనుష్యుల ముఖములు, నాగకన్యములు, గరుడవాహనములు క్రొత్తగ బ్రవేశపెట్టబడినవి. వ్యక్తిరచనమునం దెట్టిమార్పు ప్రవేశించినదో యప్సరసలచిత్రమున గాననగును.

రాజుల, రాణుల, భక్తులప్రతిమలు దక్షిణహిందూదేశమున గలవుకాని కాంభోజమున వీటి యుపయోగము వేరురూపమును దాల్చినది. రాజులయొక్కయు, వారిపితృపితామహులయొక్కయు విగ్రహములను దేవాలయములందునిల్పి, యాప్రతిమలకు తగిననామములనిచ్చి దైవత్వమొకవిధమున నారోపించి, పూజ జేయించుచుండిరి. యశోవర్మని విగ్రహమును యశోధేశ్వరుడను నామముతో దానికొరకు ప్రత్యేకముగ నిర్మింపబడిన యశోధేశ్వరాలయమున ప్రతిష్ఠజేయబడినది. ఈయాచారము జావాయందు నుండెను. నృపుడు దైవసమానుడు, దేవరాజు అనునమ్మకము ప్రబలమై యుండెను. కనుక నృపులపేర శివలింగాకృతులను గూడ దేవాలయములందర్చన చేయుచుండిరి. తత్కారణమున కాంభోజమున రాజుల, పట్టపురాణుల విగ్రహము లనేకము లుండినవి; యిప్పటికిని కొన్ని లభించుచున్నవి. ఇటుల దొరకిన వాటిలో నేడవశతాబ్దమునాటి హరిహరుని ప్రతిమ సహజముగను, సుందరముగను ఉన్నది.

కాంభోజనృపులు సాధారణముగ శైవులైనను వైష్ణవదేవాలయములనుకూడ విశేషముగ నిర్మింపజేసిరి,

సం|| డెం డవశతాబ్దమునాటికి కొందఱు రాజులు బౌద్ధ మతమును స్వీకరించిరి. కాని బౌద్ధచైత్య, విహార, స్తూప ముల నేలనో నిర్మింపజేయలేదు. అంకోరుతోము మొద



చిత్రము ౯

లైన నగరములందలి హిందూదేవాలయములచెంత చిన్న బౌద్ధాలయములనుమాత్రము కట్టించిరి. కొన్ని హిందూ దేవాలయములందే బౌద్ధమతమునకు జెందిన వేల్పులకు బూజచేయించుచుండిరి. ఆనాటికే శత్రురాజుల ప్రాబల్యము హెచ్చుటచే గొప్పబౌద్ధనిర్మాణములను కట్టించుట కవకాశములు లేకపోయియుండును. అంకోరు వాటునందలి కుడ్యశిల్పచిత్రములలో నొకటినేటికి నసంపూర్ణముగ నుండిపోవుట కీపరిస్థితులే కారణమైయుండవలెను.

దేవాలయ ప్రాకారములచుట్టు పెద్ద యగడ్తలు త్రవ్వబడుటచే ప్రతి దేవాలయము నొక కోట వలె నుండెను. హిందూమతమును సహింపజాలని యన్యమతముల వారిబారినుండి వీటిని రక్షించుట కిటుల నిర్మించిరా? ఎన్నికట్టుబాట్లను చేసిననేమి, హిందూరాజుల చేతినుండి రాజ్యలక్ష్మి జారిపోయిన పిమ్మట యగడ్త లెండిపోయినవి. దేవాలయములు జనరహితములైనవి. అతివైభవముగనుండిన చోట్లయందు దరణ్యములు పెరిగినవి. మంగళవాద్యములకు బదులు వన్యమృగముల యరపులు వినవచ్చినవి. మైళ్ళకొలది కనబడునంతటి యెత్తైన శిఖరములు శిథిలములైనవి. లోకమే వీటినిమరచిపోయినది.

కాని యాపూర్వులమైశ్వర్యము, మతదీక్ష, కళారాధనసూత్రము మరల సగౌరవముగ స్మరింపబడు చున్నవి. పతితులైన హిందువులను పూర్వమువలె ఘనకార్యములను చేయుటకు పురికొల్పుచున్నవి.

కాంభోజనాటకవిధానము, సంగీతము, నృత్యము, పాత్రలు నగలుచేయువిధానము, పట్టునూలు వస్త్రముల నేత మొదలగునవి యిప్పటికి ప్రజల యిహపరసౌఖ్యములకు సహాయపడుచున్నవి. ఇవియు కాలగర్భమున విస్మృతములు కాకుండుటకు కాంభోజకళాసమితివారు (Societie des Arts Cambodgiens) పోషించుచున్నారు. భారతీయులు ఈవిషయమై కొంత శ్రద్ధ వహించినయెడల సనాతన హిందూనాగరికతయొక్క యంగములలో నొకదానిని కాపాడినవా రయ్యెదరు.

---

# పార్లమెంటరీ విధానం—డిక్టేటరు షిప్పులు

క. రామగోపాలరావు

౧

"పార్లమెంటరీవిధానాన్ని మచ్చిక చేసుకున్నాం" అని ఐదవ ఫాసిస్టుకాంగ్రెసు ముందర తనప్రతిభ చాటుకున్నాడు ముస్సోలినీ. ప్రస్తుతం యూరపులో ప్రధానత్వం వహించిన రాజకీయతత్త్వాని కీమాటలు చక్కని లఘుటీక అని చెప్పవచ్చు.

పంతొమ్మిదవ శతాబ్దంలో-గత మహాసంగ్రామానికి పూర్వంవరకూకూడా - సర్వోత్కృష్ట రాజకీయ సంస్థగా పరిగణింపబడిన పార్లమెంటరీవిధానం, తరువాతకాలంలో తీవ్రమైన అగ్నిపరీక్షకి పాలయి, సర్వాధికార పదవులకి (డిక్టేటరుషిప్పులు) తా వొసంగిన వృత్తాంతం సకారణంగా తెలుసుకోడమే ఈవ్యాసం యొక్క ముఖ్యోద్దేశం.

ఇందుకుగల కారణాలని రెండు ప్రధానతరగతులుగా విభజింపవచ్చు. ౧. స్వతస్సిద్ధంగానే పార్లమెంటరీ విధానంలో ఉన్న లోపాలు. ౨. మారిన పరిస్థితులు.

ప్రపంచ రాజకీయపరిణామం గమనిస్తే రెండు ప్రధానోద్యమాలు - ఒకదానితరువాత ఒకటి - నిరంతరాయంగా పరిభ్రమిస్తూండడం గోచరిస్తుంది - ఘటన (Revolution), ప్రతిఘటన (Reaction).

ఏసంస్థ అయినా మొట్టమొదట మానవాభ్యుదయానికి ప్రయోజనకారిగా ఉండాలనే నిర్మించబడుతుంది. లేకపోతే, ప్రజామోదంపొంది, పదికాలాలపాటు ఆచరణలో ఉండడం దుర్లభం.

తాత్కాలిక పరిస్థితులవల్ల ఏర్పడి అవి మారిపోవడంతోటే-లేక, ఆసాధ్యలక్ష్యం సిద్ధించడంతోటే-అంతమయే పరిణామాన్ని 'ఉద్యమం' అనిచెప్పవచ్చు. కాని, ఈతాత్కాలిక పరిస్థితులే రూపాంతరాలు చెంది ప్రతినిత్యం ప్రత్యక్షమాతూండడంచేత ఈఉద్యమమే ఒక సంస్థగామారి కొంత స్థిరత్వం సంపాదించుకోవచ్చు; లేదా, నిత్యమైన పరిస్థితులకే అనుకూలంగా నిర్మింపబడి ఉండవచ్చు. కాని, ఈరెండవపద్ధతిలో, నిర్మాతలఉద్దేశ్యం ఎల్లాఉన్నా పరిస్థితులు మారడం తప్పకపోవడంచేత, ఆసంస్థకూడా మారాలిసుంటుంది.

ఏఒక్కసంస్థాకూడా— ఉన్నదున్నట్టుగా— సర్వకాలసర్వావస్థలయందు సంఘావసరాలని సముచితరీతిని ఆదరించలేదు. ఎందుచేతనంటే, లాస్కీ పండితుడు చెప్పినట్టు సంఘం నిత్యనూతనం; నిరంతర పరిణామ సమన్వితం. ఒకసంస్థకి కారణభూతాలైన పరిస్థితులు మారడంతోటే—నూతనపరిస్థితులు తటస్థపడడంతోటే - ఆసంస్థలోమార్పు అవసరమాతుంది - మారినా క్రొత్తపరిస్థితులకి అనుకూలించకపోతే, మరొక నూతనసంస్థే అవసరమాతుంది. ఈఅవసరం ఫలప్రదం అయేవరకూ - నూతనవాతావరణంలో ప్రాతవిధానం ప్రాకులాడడమనే పీకులాట ఏర్పడడంవల్ల - కొంత అశాంతి బయలుదేరుతుంది. మారిన అవసరాలు, మారిన పరిస్థితులు - వీటిముందర పూర్వసంస్థకి చెందిన శాసనాలు, అధికారం అంతా కూడా నిరంకుశప్రాయంగానూ, ప్రజాభ్యుదయాన్ని నిరోధించేదిగానూ పొడకట్టి మార్పును ఆహ్వానిస్తాయి. ఇదే ఘటన (Revolution) కి, తదనంతరం ప్రతిఘటన (Reaction) కి అవకాశం. ఈరెండు పరస్పర విరోధశక్తులమధ్యా కొంతవరకు తల్లడిల్లి, క్రొత్తపాతలమన్వ ఒకనిలకడస్థానం చేరుకుంటాయి పరిస్థితులు - మళ్లీ కొంతకాలంవరకూ.

పార్లమెంటరీవిధానంలోని స్వతస్సిద్ధలోపాలు గమనించేముందు ఆవిధానంయొక్క పుట్టుక, తదనంతర పరిణతికూడా ఏవిధంగా పైసత్యాలకి ఉదాహరణలుగా ఉన్నాయో స్వల్పంగా తెలుసుకోడం అవసరం.

ఈవిధానానికిపూర్వం ప్రబలంగాఉన్న రాజత్వసంస్థ (The institution of monarchy) ప్రజల

యొక్క ధనమానప్రాణాలు రక్షించి శాంతిభద్రతలు సంస్థాపించడానికే మొట్టమొదట అమలులోకొచ్చింది. ప్రజాభ్యుదయాన్ని గుర్తించి ప్రభువులు వర్తించినంత కాలం ఇబ్బంది లేకపోయింది. కాని, కాలక్రమాన్ని ఆవిధంగా గుర్తించడానికి తగిన ఇచ్ఛ, సమర్థతకూడా రాజులలో సన్నగిల్లాయి. రాజులు తమ బాధ్యతలు మరిచిపోయి, హక్కులు ఎక్కువజ్ఞాపకం ఉంచుకోడంతోటే, ఆసంస్థయొక్క ప్రజోపయోగస్వభావం తగ్గజొచ్చింది. అదీగాక, జాతీయప్రభుత్వాలు స్థాపింపబడి ఒకవిధంగా స్థిరమైనశాంతిభద్రతలు నిర్వహించేటానికి రక్షకభటాదివర్గంలాంటి విధానం ఒకటి ఏర్పడడంతోటే, రాజు లేనంతమాత్రాన సంఘం విచ్ఛిన్నమైపోయేపరిస్థితులు పోయాయి. అంటే, నిరంకుశప్రభువుల అవసరంకూడా కొంత సన్నగిల్లిందని చెప్పవచ్చు. దేశంలో తమ అధికారంస్థాపితమై, అల్లరులు లేకుండా గడిచిపోతున్న సందర్భం ఏర్పడడంవల్ల, దేశాంతరాల మీదికి పోయింది భూనాథులదృష్టి. తత్ఫలితంగా, దేశాలమధ్య, జాతులమధ్య యుద్ధాలు బయలుదేరాయి. వీటిని బయలుదేరదీయడంలో తమతమప్రజల అభ్యుదయంకంటె, వ్యక్తిగతమైన వారివారి అధికారవాంఛలే ఎక్కువ ప్రోద్బలించాయి ఈజాతీయప్రభువుల్ని. ఈసంగ్రామాలకి కావలసినధనంకోసం పన్నులు ఎక్కువ కావలిసివచ్చాయి. ఈయుద్ధాలవల్ల తమకి ఎక్కువలాభం కలగకపోడమే కాకుండా, జననష్టం, ధననష్టం భరించలేకపోయారు ప్రజలు. అదీగాక, వేరు పరిస్థితులలో ఏర్పడిన 'జమీందారీ'పద్ధతి (Feudalism) ఇంకా మిగిలిపోయి జమీందారులు, మతాధికారులు మొదలైన ధనవంతులు పన్నుల కతీతులైపోవడంచేత, చెల్లించలేని ప్రజాసామాన్యంమీదే పడింది నూతనభార మంతా. ఆర్థికమైన ఈకారణానికి ఇతరకారణా లనేకం తోడ్పడ్డాయి. తత్ఫలితంగా రాజత్వసంస్థ మాలి ప్రజాస్వామికప్రభుత్వం అమలులోకొచ్చింది, పార్లమెంటరీ విధాన రూపంతో.

కాని, పైన చెప్పబడ్డఘటన, ప్రతిఘటన అనే శక్తుల ఉత్పీడనలేనిదే, ఒక్కసారిగా ఈమార్పురాలేదు. ఇంగ్లండులో ఈ క్రొత్త, పాతల సంఘర్షణ కాలక్రమాన్ని జరిగింది. క్రమక్రమంగా రాజాధికారం ప్రజాయత్తమై, తుద కిప్పుడు నామమాత్రంగా మిగిలింది. 'ఫ్రాన్సు'దేశంలోకూడా, మొదట ౧౭౮౯ లో మహత్తరవిప్లవం బయల్వెడలి రాజత్వసంస్థ తుడిచిపెట్టుకుపోయినా, ౧౮౭౦ వరకూ కూడా మరలమరల పునరుద్ధరింపబడుతూనే ఉంది. అప్పటిదాకా సుస్థిరమైన 'రిపబ్లిక్' స్థాపించబడలేదు.

ఇంతవరకు, పార్లమెంటరీవిధానంయొక్క జన్మవృత్తాంతం కొంత తెలుసుకున్నాం. ఇంక, ఈవిధానం కూడా తన ప్రాముఖ్యమును గోల్పోవడానికి కారణాలు తెలుసుకోవాలి.

స్వతస్సిద్ధంగానే, ఈ పద్ధతిలో కొన్ని లోపాలున్నాయని పైన వివరించాను. అందులో ముఖ్యమైనది ప్రాతినిధ్యతత్వం.

ప్రజాస్వామికప్రభుత్వానికి పుట్టినిల్లనదగిన గ్రీకుదేశంతోమాత్రం ఈలోపానికి తావులేకపోయింది. ఎందుచేతనంటే, ఆదేశంలో ఒక్కొక్క పట్టణమే ఒక్కొక్కస్వతంత్రరాజ్యంగా ఉండేది. అందువల్ల, ప్రతినిధుల అవసరం లేకుండా ప్రజలే శాసనసభగా ఏర్పడి రాజ్యాంగం సాగించడం సాధ్యమయింది. కాని, అధిక విస్తీర్ణత కలిగి, కోట్లకొలది జనసంఖ్యగల దేశాలలో ఈవిధమైన ప్రత్యక్ష ప్రజాస్వామికవిధానం (Direct democracy) అసంభవమని వేరే చెప్పనక్కరలేదు. కాబట్టి, దీనికిబదులు వేరొకపద్ధతి- ఆచరణయోగ్యమైనది- అవసరమైంది. ఆపద్ధతే ప్రాతినిధ్యప్రభుత్వం (Representative Government). అనగా, ప్రజలందరితరఫునా కొందరు ప్రతినిధులుమాత్రమే రాజ్యాంగం నిర్వహించే భారం వహించడం.

వీలుకోసం దేశం కొన్నిభాగాలక్రింద (Electoral districts) విభజింపబడుతుంది. ఈభాగాలనుంచి ప్రజలచేత ఎన్నుకోబడిన ప్రతినిధులు ఒకసభగా ఏర్పడతారు. ఈసభకి ఒక నిర్ణీతజీవితకాలం- ఏమూడేళ్లో ఏ ఐదేళ్లో- ఉంటుంది. ఈలోపుగా వీరు కొన్ని కొన్ని

శాసనాలుచేసి నిర్వాహకవర్గం (Executive) ద్వారా అమలులో పెడతారు. అంటే ప్రజలే తమ అభ్యుదయంకోసం, తమ ప్రతినిధులద్వారా, ఈశాసనాలు నిర్మించుకుంటున్నారని ఈసిద్ధాంతంయొక్క తాత్పర్యం. ఈతాత్పర్యంయొక్క నిజానిజాలు, ఈనిర్ణీతమైన గడువులో శాసనసభ్యులు ఎంతకాలం, ఎంతవరకు, నిజమైన ప్రజాభిప్రాయానికి ప్రతినిధులుగా ఉంటున్నారనే ప్రశ్నమీద ఆధారపడిఉంటాయి.

మానవమేధస్సు సచేతనమైనదవడంచేత, సంఘాదశరాలు మారుతూండడంచేత, ప్రజాభిప్రాయం ఎప్పుడూ ఒకలా ఉండదు. అందుచేత 'ఎలెక్షను' కాలంలో ప్రజాప్రతినిధులైనవారు తరువాత కాకపోవచ్చు. అదీకాక, ప్రతినిధులదృష్టిలో చూచినా, ఏదోఒక ప్రణాళికమీద ప్రజామోదం పొంది ఎన్నుకోబడినవారు, తరువాత-ఏకారణంచేతనైతేం-అభిప్రాయాలు మార్చుకోవడంచేత నిజమైన ప్రజాప్రతినిధులు కాకపోవచ్చు.

ఇంకొకవిషయం: 'ప్రజాభిప్రాయం' అనేమాటకి ప్రస్ఫుటమైనఅర్థం లేదు. వార్తాపత్రికలద్వారా బహిర్గతమాతూ,జనసామాన్యహృదయంఎల్లప్పుడూకూడాశాసనసభలలో ఉన్న ప్రతినిధులకి సరియైనమార్గం సూచించుతుందనేమాట నిజమే కొంతవరకు. కాని, పెద్దపెద్ద ధనస్వాములు ఈవార్తాపత్రికలని హస్తగతం చేసుకుని తమ లాభంకోసం, తమ అభిప్రాయాలనే ప్రజాభిప్రాయాలుగా ప్రచారంచేసి-తమ అభ్యున్నతిని అరికట్టే ఎట్టిభావాలూకూడా పైకి రానివ్వకుండా- ప్రభుత్వాన్ని తమకి సుముఖం చేసుకుని దేశానికి హానిచెయ్యడానికి చాలా అవకాశం ఉంది; అల్లాజరిగింది; జరుగుతోంది కూడా.

ఒకవేళ, వార్తాపత్రికలు అల్లాంటి దుర్వినియోగానికి పాల్పడకపోయినా, సర్వసాధారణంగా అవి అధికసంఖ్యాకులపక్షాన్నే వహించి ప్రచారం చేస్తాయి. ఆ హడావుడిలో అల్పసంఖ్యాకుల అభిప్రాయాలు అరణ్యరోదనమైపోయి సంపూర్ణదేశాభ్యున్నతికి ఆటంకం కలగవచ్చు. ఈభయంచేతనే, అల్పసంఖ్యాకసంఘాలుశాసనసభలో తమకి కొన్ని 'సీట్లు' ప్రత్యేకించబడాలని కోరడం తటస్థిస్తుంది.

అల్లా ప్రత్యేకించబడినంతమాత్రాన్ని, ఆ శాసనసభయొక్క ఆమోదంపొందిన చట్టాలన్నీకూడా, ప్రజాభ్యుదయానికి సహాయకారులుగా ఉంటాయని చెప్పడానికి వీలులేదు. ఎందుచేతనంటే, పైజెప్పిన కారణాలవల్ల శాసనసభ్యులు నిజమైన ప్రజాప్రతినిధులు కాకపోవడం సంభవం అవడంచేత, అధిక సంఖ్యాకులైన శాసనసభ్యుల ఆమోదంపొందినచట్టం, అధికసంఖ్యాకులైన జనసామాన్యంయొక్క ఆమోదాన్ని పొందకపోవచ్చు.

అదీగాక, 'మెజారిటీ వోటు' మీద నిర్ణయాలు చెయ్యడంలోనే లోపం ఉంది. ఎల్లాగంటారా, ఒక చిన్నిఉదాహరణ తీసుకోండి- ఒకశాసనసభలో ౪౩౭ గురు సభ్యులున్నారనుకుందాం. ఏదోఒక చట్టంమీద ౨౧౮ మంది ప్రతికూలురుగానూ, ౨౧౯ మంది అనుకూలురుగానూ వోటు చేస్తారనుకుందాం. శాస్త్రప్రకారం 'మెజారిటీ' ఆమోదించడంచేత ఆచట్టం శాసనంగా మారి అమలులోకొస్తుంది. కాని, నిజానికి 'మెజారిటీ'లో అర్థంలేదని స్పష్టమౌతోంది. ఇటువంటి ఇబ్బంది గమనించే కొన్నిదేశాలలో కొన్నికొన్ని ముఖ్యనిర్ణయాలు చెయ్యాలిసొచ్చినప్పు డుండవలసిన మెజారిటీ మొట్టమొదట రాజకీయప్రణాళికలోనే శాసించి ఉందుకున్నారు.

పార్లమెంటరీవిధానంలోని స్వతస్సిద్ధలోపాలలో ముఖ్యమైనది ఇంకొకటుంది. ఉదాహరణపూర్వకంగా విచారిద్దాం.

ఒకదేశంయొక్క జనసంఖ్య ౩౦ లక్షలనీ, దాని ప్రధాన శాసనసభకి ఎన్నుకోబడే ప్రతినిధుల సంఖ్య ౩౦౦ లనీ అనుకుందాం. ఈ మూడువందలమందీకూడా పైజెప్పబడినరీతిని మూడువందల విభాగాలనుంచి ఎన్నుకోబడ్డారని ఊహిద్దాం. అంటే, సగటున ౩౦,౦౦౦ మంది జనులకి ఒకప్రతినిధి ఏర్పడతాడన్నమాట. సగటున ౩౦,౦౦౦ మంది జనసంఖ్యగల ఒక్కొక్క విభా

గంలోనూ ఏ ౫౦౦ మందో సాంఘికవాదంలాంటి ఒక ప్రత్యేకాభిప్రాయానికి చెందినవారనుకుందాం. ఒక్కొక్క విభాగమే తీసుకువిచారిస్తే ౩౦,౦౦౦ మందిలో ౫౦౦ చాలా అల్పసంఖ్య అన్నమాట నిజం. కాని దేశం మొత్తంమీదచూస్తే ఈ ప్రత్యేకాభిప్రాయానికి చెందిన వారే ౩౦౦ × ౫౦౦=౧౫౦౦౦౦ మందిఔతున్నారు. కాబట్టి న్యాయతహా, పైన సూచించిన ఉజ్జాయింపు ప్రకారం ఈ ప్రత్యేకాభిప్రాయానికి ౧౫౦౦౦౦/౩౦౦౦౦ = ౫ గురు ప్రతినిధులేనా ప్రధాన శాసనసభలో ఉంటేనే గాని, అది నిజమైన ప్రజాప్రతినిధిసభ అనిపించుకోదు. కాని, ఈఅభిప్రాయానికి చెందినవారువివిధప్రాంతాల్లో చెదిరిపోయిఉండడంవల్ల వీరి తరఫున ఒక్క ప్రతినిధి కూడా శాసనసభని అలంకరించకపోడం తటస్థిస్తోంది. అంటే సుమారు ౧౫,౦౦౦ కి ఏమాత్రం పైబడిన అనుచరవర్గంగల (అప్పుడు వీరు ౩౦,౦౦౦ లో మెజారిటీ ఔతారుగాబట్టి) అభిప్రాయానికైనా ప్రాతినిధ్యం ఇస్తున్న దేశంలో ౧౪ లక్షల అనుచరులున్న అభిప్రాయానికి ప్రాతినిధ్యమే శూన్యమవడం తటస్థిస్తోందన్న మాట!

ఇంతవరకు పార్లమెంటరీ విధానంలో—ప్రాతినిధ్యప్రభుత్వపద్ధతిలో—స్వతస్సిద్ధంగానే ఉన్నలోపాలుకొన్ని టూకీగా తెలుసుకున్నాం. కాని, ఈపద్ధతి పతనం చెందడానికి రెండవముఖ్యకారణం మారిన పరిస్థితులని వ్యాసాదినే పేర్కొన్నాను. ఈ మార్పు ఎటువంటిదో ఇప్పుడు కొంత పరిశీలిద్దాం.

౧౭౫౦ ప్రాంతాల్లో ఇంగ్లండుదేశంలో ఆరంభించి ౧౯ వ శతాబ్దాంతం అయేసరికి ప్రపంచకంలో చాలాభాగం ఆవరించి లోకాన్నంతా తన మహత్తుచేత తల్లడిల్లచేసిన పారిశ్రామిక విప్లవమే (Industrial Revolution) ఈపరిణామానికంతా కీలకమనవచ్చు.

మానవ జీవితానుభూతిని గ్రామ, పట్టణ, దేశ పరిమాణాలకి అతీతంచేసి యంత్రమూలకమైన నాగరికత ద్వారా అంతర్జాతీయసభ్యతని సాధ్యంచేసిన మహత్తర పరిణామమే పారిశ్రామికవిప్లవం. రైలు, పొగఓడ తరువాత తరువాత టెలిగ్రాఫ్, టెలిఫోన్, వైర్లెస్—ఇవి రాకపోకల్ని ఉత్తరప్రత్యుత్తరాల్ని పూర్తిగా మార్చివేసి ప్రపంచానికి ఆర్థికంగా ఒక ఏకత్వం సమకూర్చాయి. ఈపరిణామం ఊహాతీతపరిమాణాలకి ప్రాకిపోయిన వర్తకవ్యాపారాలకి ఒకవిధంగా ఫలితం. మరొకవిధంగా కారణం అయింది. కోట్లకొద్ది పెట్టుబడితో ప్రపంచమంతా వ్యాపారం సాగిస్తున్న పెద్దపెద్ద వర్తకసంస్థలు హద్దులేకుండా విజృంభించి 'జమ్షెడ్ పూర్' లాంటి పట్టణాలుగాకూడా ఏర్పడిపోయిన పెద్దపెద్ద ఫ్యాక్టరీలు, ముడివస్తువుల విషయంలో తన స్వయంపూర్ణత (Self-sufficiency) ని విడిచిపెట్టి కేవలం పారిశ్రామికదేశంగానే ఉండగలిగిన ఇంగ్లాండులాంటి దేశాల ఆర్థికస్థితి ఇవన్నీకూడా ఈవిప్లవంమూలాన్నే సంభవమయాయి. అంటే పరిశ్రమలు, రాకపోకలు, వర్తకవ్యాపారాలు, ఒక టేమిటి జీవితవిధానరీతులన్నీకూడా తమ అల్పపరిమితిని విడిచిపెట్టి అద్భుతమైన పరిణామాన్ని చెందిపోయాయన్నమాట.

ఎన్నిమార్పులు తీసుకొచ్చినా కేవలం ఆర్థికవిషయమైన ఈపారిశ్రామికవిప్లవానికి రాజకీయసంస్థఅయిన పార్లమెంటరీవిధానానికీ సంబంధమేమిటనే సందేహం కలగవచ్చు. మన సౌకర్యంకోసం, సంఘజీవితాన్ని ఆర్థికమనీ, రాజకీయమనీ, మత సంబంధమైన దనీ- ఈ విధంగా విభజించి విమర్శించడం మామూలైనా, నిజానికి ఇటువంటి విభజన సహజమైనదికాదు. పదివైపుల నుంచి చూస్తే పదివిధాలుగా గోచరించినా సరోవరం ఒకటే అయినట్లు సంఘజీవితంకూడా ఒకటే. వివిధదిశలనుంచి దర్శించేవారికి వివిధరీతుల వ్యక్తమౌతూంటుంది-అంతే. అందుచేత చెరువులో ఏమూల రాయిపడేసినా, ఆఅలలు చెరువంతాకూడా వ్యాపించినట్లే, సంఘ జీవితంలో ఏమూల మార్పుప్రవేశించినా, మిగతామూలలకు కూడా కొంతవరకు వ్యాపించకతీరదు.

ఐతే, ఈపారిశ్రామికవిప్లవం ఏవిధంగా, ఎంతవరకు రాజకీయతత్త్వాన్ని మార్చడానికి కారణభూతమైంది? అనేప్రశ్న ఇప్పుడు మనకి విచారణార్హం.

కొట్టమొదటి సంగతి ప్రభుత్వవ్యాపారపరిమితి (Scope of state activity) విజృంభించింది. ఇది

వరకునుంచీకూడా కేవలం శాంతి భద్రతలు కాపాడ డానికి మించి ప్రభుత్వం ప్రజాజీవితంలో ఏమాత్రం కూడా జోక్యం కలిగించుకోకూడ దనే అభిప్రాయం ప్రబలిఉండేది. ప్రజాస్వామిక తత్త్వానికి ప్రధాన దివ్య మైన వ్యక్తిస్వాతంత్ర్యసిద్ధాంతాని కిది రూపాంతర మని చెప్పవచ్చు. ఆర్థికంగా ఈసిద్ధాంతమే 'లెయిసాఫేర్' అనే పేరుతో ఏడమ్‌స్మిత్తువంటి ఆంగ్ల ఆర్థిక శాస్త్ర వేత్తలచేత ప్రతిపాదింపబడింది. "ప్రభుత్వం అనవసర జోక్యం కలుగజేసుకోకుండా తొలగిఉంటే ప్రతివ్యక్తీ తనబాగు తాను చూసుకుంటాడు. సంఘం అంటే వ్యక్తులసముదాయమేకాబట్టి మొత్తంమీద దీనికి ఫలి తంగా సంఘాభ్యుదయం చేకూరుతుంది" అని వారి సిద్ధాంతం. చాలాకాలం ఈ సిద్ధాంతం- ముఖ్యంగా ఇంగ్లండులో-ఆచరణలో ఉంది. వాణిజ్యంలోనూ, పరిశ్రమలలోనూ సంపూర్ణ స్వేచ్ఛవల్ల అనేకలాభాలున్నా యని ఆర్థికశాస్త్రవేత్తలు రాసిపోసిన రాతల కంతు లేదు.

కాని, పారిశ్రామికవిప్లవం ప్రారంభించినప్పటి నించీకూడా ఈసిద్ధాంతానికి ధాకా తగిలింది. క్రొత్తలో పెట్టుబడిదారులు (Capitalists) స్త్రీలను, బాలురను కూడా తమ ఫ్యాక్టరీలలో నియోగించి వారి శక్తికి మించినకాలం పనిచేయించడం, కూలిడబ్బులకి బదులు తామే నిర్వహిస్తున్న షాపులలోని వస్తువులు ఇష్ట మొచ్చిన ధరకి అంటకట్టడం అనే 'ట్రక్'పద్ధతివల్ల పని వాళ్లని తమక్రిందే ఉంచుకొని కష్టాలుపెట్టడం తగిన జాగ్రత్తలేకపోవడంవల్ల గనులు మొదలైన ప్రదేశాలలో అపాయాలు సంభవించి పనివాళ్లు మరణిస్తూ ఉండడం మొదలైన దురభ్యాసాలు ప్రబలంగా ఉండడంచేత ప్రభుత్వం జోక్యం కలిగించుకోక తప్పిందికాదు. ఇవి తొలగించడానికే అనేక 'ఫ్యాక్టరీ శాసనాలు' (Factory acts) అవసరమయాయి ఇంగ్లండులో. అదీగాక, రైల్వేలవిషయంలో ఇంతకంటె ఎక్కువ జోక్యం కలుగజేసుకోడం అవసరమైంది. రానురాను, జర్మనీవంటిదేశాలలో ప్రభుత్వం సంపూర్ణంగా పరిశ్రమ లకి సహాయపడి వాటి అభ్యున్నతికి తోడ్పడడంచేత, ఇంగ్లండువంటిదేశాలుకూడా తమ స్వేచ్ఛాసిద్ధాంతాన్ని కొంత వెనకబెట్టక తప్పిందికాదు. ఇల్లా ప్రభుత్వ వ్యాపారపరిమితి క్రమక్రమంగా అభివృద్ధిచెంది తుదకు వ్యాపారపరిశ్రమలను ప్రభుత్వం తనంతటతానే ఎందుకు నిర్వహించకూడదనే ప్రశ్న (State Capitalism) బయలుదేరింది.

దీనిమూలాన్ని అనేక లాభా లున్నాయి. పై జెప్పబడిన 'లెయిసాఫేర్' సిద్ధాంతిప్రకారం పరిశ్రమ లలోనూ, వాణిజ్యంలోనూకూడా నిరంతరమైన పోటీ (Competition) చెలరేగుతుంది. తత్ఫలితంగా సప్లయి చెల్లుబడికి మించిపోయి వర్తకమాంద్యం సంభవిస్తుంది. ఎందుచేతనంటే, ఒకసరుకుకి ఒకసంవత్సరంలో ఎంత చెల్లుబడి ఉంటుందో అంచనా తెలిసినా ప్రతి పోటీదా రుడూకూడా దీనిలో ఎక్కువభాగం తన 'పాళే' బడు తుందనే అభిప్రాయంతో ఉత్పత్తిచేస్తాడు. ఆఖరికి చూస్తే చెల్లుబడికంటె ఉత్పత్తి ఎక్కువై ధరలు పడి పోతాయి. అదీగాక ఇల్లాంటి పోటీవల్ల నష్టపడి తన వ్యాపారం ఒదులుకుపోవాలసినవాడు ఎల్లప్పుడూకూడా తన అసమర్థతవల్లే తొలగించబడ తాడనడంపారబాటు. ఇతరపోటీదారులుమల్లే కేవలం తక్కువధరకి అమ్మడం కోసం తన సరుకులు కల్తీచెయ్యడానికి ఇచ్ఛగించని న్యాయసుద్ధవడంవల్లే నష్టపడొచ్చు అనేకమంది పోటీ దార్లుండడంతోటే వారి పోటీవల్ల వస్తువు తక్కువ ధరకి లభిస్తుందనే మాటకూడా (ఇది పోటీదార్లుండడం వల్ల వచ్చే మూడోలాభంక్రింద చెప్పబడుతుంది సాధా రణంగా) సత్యదూరం. ఎంతతగ్గించినా ఉత్పత్తిచెయ్య డాని కయేఖర్చుకంటె తక్కువచెయ్యడానికి వీల్లేదు. ఆపైనికూడా ఈపోటీదార్లు తమలో తాము కొంత ఒడంబడిక చేసుకొని ధర పెంచొచ్చు - పోటీవల్ల కలిగే ఈనష్టాలన్నీకూడా పైజెప్పబడినరీతిని ప్రభుత్వమే పరి శ్రమకి పూనుకుంటే తొలగించబడతాయి. అదీ గాక, ఇందుమూలాన్ని వచ్చేలాభం పెట్టుబడిదార్ల స్వంతఆస్తి అయి బీద,గొప్పవ్యత్యాసాలనిఇనుమడింపచెయ్యకుండా తక్కువపన్నులరూపేణా జనసామాన్యంయొక్క అభ్యు దయానికి తోడ్పడి, ధనంవల్లకలిగే సాంఘిక వ్యత్యా

సాలు తొలగించడానికి చాలామట్టుకు సహాయకారి కావచ్చు.

ఈవిధంగా ప్రభుత్వమే ఒక పెద్ద పెట్టుబడిదారుగా మారాలంటే, పెట్టుబడిదారుకుండే లక్షణాలు కొన్ని అలవరుచుకోవాలి. కాని ప్రాజాస్వామికపద్ధతి క్రింద నడుపబడే ప్రభుత్వంలో ఈలక్షణాలు చాలామట్టుకు లోపించడంచేత ఈక్రొత్తబాధ్యతను వహించడానికి ఆవిధానం సమర్థంకాదని తేలుతోంది. కొన్ని ఉదాహరణలు చూద్దాం: ఈసంవత్సరం ఒక కోటి రూపాయలు అధికంగావెచ్చిస్తే మరి నాలుగైదేళ్లలో తనవ్యాపారం ఎక్కువఅభివృద్ధిచెంది, ఎక్కువ లాభదాయకం అవడానికి వీలుందని తోస్తే, పెట్టుబడిదారు వెంటనే ఆబాధ్యత వహిస్తాడు. అతని అంచనా పొరబాటయి కొంతనష్టం సంభవించినా అతనికతడే బాధ్యుడవడం మూలాన్ని ఇబ్బందిలేదు. లాభం రావడానికి ఏమాత్రంవీలున్నా బహుశా వచ్చేనష్టాన్ని పరిగణించకుండా ఒకనిర్ణయానికి రావడానికి అతను తక్కువ కాలం తీసుకుంటాడు. అదే, ఇంగ్లండులాంటి పార్లమెంటరీ దేశంలో ప్రభుత్వంక్రింద నడిచే వ్యాపారం ఐతే, మొట్టమొదట పార్లమెంటు, తరువాత బహుశా ఒకకమిటీ, మళ్లీపార్లమెంటు — ఈవిధంగా కాలం గడిచిపోతుంది: ఒక నిర్ణయానికి వచ్చేటప్పటికి బహుశా ఆ అవకాశంకాస్తా దాటేపోతుంది. అదీగాక, జర్మనీదేశంయొక్క పారిశ్రామికాభివృద్ధి గమనిస్తే, యుద్ధంలో జయానికి సైనికశిక్షణ ఏవిధంగా అవసరమో, అల్లాగే పారిశ్రామిక విజయానికికూడా ఎక్కువ శిక్షణ (డిసిప్లిన్) అగత్యమని తేలుతుంది. అంటే ఒకవిధమైన ఆర్థికసర్వాధికారత్వం ఏర్పడాలన్నమాట. పరిశ్రమలలోగాని, వర్తకవ్యాపారాలలోగాని ఇవేళ ఒకక్రొత్తత్రోవ తొక్కాలంటే కాలయాపన కాకుండా పనిజరగాలి. దీనికి, తమ తెలివితేటలచేత పారిశ్రామిక నాయకత్వం వహింపగలిగిన వ్యక్తుల కార్యవిషయాలలో సంపూర్ణస్వేచ్ఛ ఉండాలి. కాని, వీరే ఒకపార్లమెంటరీ ప్రభుత్వంక్రింద పనిచేసేవారైతే, మాటిమాటికి తమప్రవర్తనను ప్రజలకో, వారి ప్రతినిధులకో దాఖలుపరుచుకొని వారి ఆమోదం పొందితేనేగాని, ముందడుగు వెయ్యడానికి వీలుండదు. ఈకారణాలచేతనే, ఎక్కువశిక్షణ, ప్రతివచనరహితమైన ఆజ్ఞాపరిపాలన, అవసరమైన యుద్ధం మొదలైనవి నిర్వహించడానికి ప్రజాస్వామిక ప్రభుత్వానికి ఎక్కువ సమర్థత ఉండదని 'కార్డినల్ న్యూమెన్' వంటి యోచనాపరులు నిర్ణయించారు.

ఇదేగాక, అర్హతనూ శక్తిసామర్థ్యాలనూ బట్టి కాకుండా కేవలం సేవాకాలాన్ని (Seniority) బట్టి ప్రమోషన్లివ్వడం, చేసేపనిని బట్టికాకుండా పదవియొక్క గౌరవాన్నిబట్టి జీతాలు నిర్ణయించడం, తరుచు 'ట్రాన్సుఫర్లు' చేస్తూ ఆయా ఉద్యోగులాయా ప్రదేశాల స్థితిగతులతో ఎక్కువ పరిచయం చేసుకోడానికి వీలులేకుండాచెయ్యడం - మొదలైన అనుమాయితులవల్ల పారిశ్రామికాధికారం వహించడానికి ప్రభుత్వం - అందులోనూ, ప్రజాస్వామికప్రభుత్వం - సంపూర్ణంగా సమర్థంకాదని వ్యక్తమౌతోంది.

ఈవిధంగా పార్లమెంటరీప్రభుత్వం వహించలేని ఒకక్రొత్తబాధ్యతను తెచ్చిపెట్టడంవల్లనే కాకుండా, ఇంకోవిధంగాకూడా పారిశ్రామికవిప్లవం ప్రజాస్వామికప్రభుత్వంయొక్క పటుత్వాన్ని తగ్గించింది. అదే విధంగానంటే, ఆర్థిక శత్రుత్వాలనీ, తన్మూలకంగా జాతీయద్వేషాలీలన్నీ పెంచి, ఒకవిధమైన యుద్ధతత్త్వం (War mentality) పెంచడంవల్లనే. పారిశ్రామిక విప్లవానంతరం వర్తకవ్యాపారాలు ఊహాతీతపరిమాణాలకి విజృంభించాయని ఇదివరకే పేర్కొన్నాను. అంతకు పూర్వం వివిధదేశాలమధ్య రాకపోకలు, వర్తక వ్యాపారాలు లేవనికాదు దీనిఅర్థం. బాబిలోనియా, ఈజిప్టు, భారతదేశనాగరికతలు వాటివాటి కాలాలలో ఆర్థికౌన్నత్యాన్నికూడా అనుభవించాయి. అప్పటికి తెలిసిన ప్రపంచ భాగాలలో వర్తకవ్యాపార ప్రధానస్థానాలుగా గణుతికెక్కాయి. కాని, అనివార్యంగా కాలగర్భంలో విలీనమయిపోయాయి. తరువాత రోమకసామ్రాజ్యంకూడా కొన్ని శతాబ్దాలపాటు అటువంటి ఔన్నత్యాన్నే అనుభవించింది. గత-వ శతాబ్దంలో స్పెయిన్, పోర్చు



‘ప్రా పతోం చెడి’ అను ఘంటాకృతి బౌద్ధస్తూపము

దీని ఎత్తు సుమారు ౩౮౦ అడుగులు. న కోన్ పతోం నగరము—సయాము B. S.



సూఫన్ నదినుండి నగరమునడుమ ప్రవహించు ‘క్లాంగ్ చేడిబుచా’కాలువకు కట్టబడిన గొప్పవంతెన, నకోన్ పతోం నగరము—సయాము B. S.

గల్ దేశాలు, ౧౭ వ శతాబ్దంలో హాలండుదేశం, ౧౭, ౧౮ శతాబ్దాలలో ఫ్రాంసుదేశం - ఒకదానితరువాత ఒకటి క్రమంగా ఆర్థికనాయకత్వాన్ని వహిస్తూ వచ్చాయి. ప్రస్తుతప్రపంచనాగరికతలో - పారిశ్రామిక విధానంలో - అగ్రగణ్యత వహిస్తున్న అమెరికా, ఇంగ్లండు, జర్మనీ దేశా లాకాలంలో తమ ప్రాముఖ్యత నింకా స్థాపించుకోలేదు. పారిశ్రామిక విప్లవమే ఈదేశాల నూతన ఔన్నత్యానికి ప్రాతిపదిక అనిచెప్పవచ్చు. నిజానికి, స్వతంత్రసమరవిజయం పొందిన ౧౭౭౬-వ సంవత్సరంతోగాని అమెరికాయొక్క ప్రత్యేక ఆర్థిక పరిణామం ఆరంభంకాలేదు. హిందూదేశ స్వదేశసంస్థానాలవలెనే మూడువందల చిల్లర స్వతంత్రరాష్ట్రాలుగా విభజింపబడి ఐకమత్యమనేది ఎరుగకుండా తల్లడిల్లిన జర్మనీకూడా ౧౮౭౦-వ సంవత్సరప్రాంతాలలో గాని 'బిస్మార్కు'మంత్రి పరిశ్రమవల్ల ఒకబలమైనఏకసామ్రాజ్యంగా ఏర్పడలేదు. ౧౮౮౨ ప్రాంతాలలోగాని తన పరిశ్రమ లభివృద్ధిచేసుకొని ఇతర దేశాలతో పోటీపడడానికి సంసిద్ధంకాలేదు. ఇంక ఇంగ్లండువిషయం:

ఆర్థికంగా ప్రధానస్థానం వహించకపోయినా ఆంగ్లవర్తకులు ౧౬, ౧౭ శతాబ్దాలలోనే దేశాంతరాలతో-ముఖ్యంగా ప్రాక్దేశాలతో వర్తకవ్యాపారాలు సాగిస్తూండేవారు. పొగఓడ, రైలు మొదలైన సౌకర్యాలులేని ఆకాలంలో రాకపోక లెంతకష్టంగా ఉండేవో వేరే చెప్పనక్కరలేదు. కాని ఈవర్తకంవల్లవచ్చే లాభం చాలాఎక్కువవడంచేత కష్టనష్టాల కోర్చి, వీరీ వ్యాపారం సాగించేవారు. అప్పుడు ఇంగ్లండుకీ ఇతర దేశాలకీ యుద్ధాలుజరగకపోలేదు. ఐనా అవన్నీ కూడా సముద్రంమీద బ్రిటీషువారి అధికారం స్థాపించుకోడానికేగాని రాజ్యకాంక్షతో కాదు. సముద్రాధికారం ఎందుకంటే వారి వర్తకవ్యాపారాలు నిరాటంకంగా జరగడంకోసమే. అంతేగాని సామ్రాజ్యం స్థాపించే ఉద్దేశం ఆంగ్లవర్తకులకుగాని, ఆంగ్లప్రభుత్వానికిగాని సుతరామూలేదని చెప్పవచ్చు. కాని, ఈవర్తకకాంక్ష సామ్రాజ్యకాంక్షని ఏవిధంగా పురికొల్పినదీ ఈమార్పు హిందూదేశవిషయంలో ఎల్లాంటి ఫలితాలు తెచ్చిపెట్టినదీ జగద్విదిత చరిత్ర.

ఆఫ్రికా, ఆస్ట్రేలియా, కెనడామొదలైన వలస రాజ్యాలు గత శతాబ్దాంతంవరకూ తప్పనిసరిగా మెడకుకట్టుకున్న గుదిబండలుగా పరిగణించబడినా, రైలుసహాయంచేత శీతోష్ణస్థితులు జయించి ఈదేశాల లోపలిభాగాలు (ఇదివరకునుంచీ అరణ్యాలుగానూ, రొంపినేలలుగానూ ఉన్నవాటిని) నివాసయోగ్యాలుగా చెయ్యబడడంతోటే, వలస రాజ్యాల విషయంలో బ్రిటనుదృక్పథం మారింది. తనపరిశ్రమలికి కావలసిన ముడిసరుకు లీదేశాలనుండి సప్లయిచేయించుకుని, తన ఫ్యాక్టరీలలో తయారైన సరుకులు వాటికమ్మి - రెండు విధాలా ఉపకారం పొందవచ్చుననే ఊహ అప్పుడు తట్టింది బ్రిటీషురాజకీయవేత్తలకి. అందులోనూ, స్వతంత్ర రాజ్యంగా ఏర్పడిన అమెరికా, నూతన జాతీయత విజృంభిస్తున్న జర్మనీ, తమతమ పరిశ్రమల్ని అభివృద్ధి చేసుకుని ప్రపంచవర్తకంలో బ్రిటనుతో సమానంగా పోటీపడుతున్న సందర్భంలో, ఇల్లా ద్వివిధంగా ఉపయోగపడే వలసరాజ్యాలుండడం ఎంతలాభమో బ్రిటను గుర్తించింది. అప్పటినుంచే ప్రారంభం అంతస్సామ్రాజ్య ఒడంబడికలు, 'ఇంపీరియల్ ప్రిఫరెన్సు' మొదలైన విధానాలద్వారా ఇతరదేశాలమీద ఆర్థికంగా పైచెయ్యి వెయ్యడానికి ప్రయత్నాలూకూడా.

సహజంగా, ఇతరదేశాలలోకూడా ఎల్లాగైనా కొన్ని వలసరాజ్యాలు స్థాపించుకుంటేగాని, తమ నూతన పారిశ్రామికాభివృద్ధికి తగిన సౌకర్యాలుండవనే అభిప్రాయం ప్రబలింది. ముందనుకుంటేం, అనుకోకపోతేనేం, 'రవి అస్తమించని' ఒకసామ్రాజ్యం లభ్యమైంది బ్రిటనుకి. 'ఆస్ట్రేలియా', 'కెనడా' మొదలైనదేశాలు క్రమక్రమంగా అన్ని విషయాలలోనూ తమకి స్వేచ్ఛ సంపాదించుకొని, తల్లి దేశంయొక్క ప్రత్యక్షపరిపాలననుండి తప్పిపోతున్నా, ఇతరదేశాలకంటె బ్రిటనుకే ఎక్కువ సదుపాయాలు కల్పించడం సహజం. అదీగాక ఒక ప్రత్యేకఖండ మనదగిన

హిందూదేశ మింకా పోష్యసామ్రాజ్య (Empire in trust) తరహాను దాటకపోవడంచేత, ఆదేశ ఆర్థికనీతి నిర్ణయించడంలో స్వయంనిర్ణయసూత్రం వర్తించదు. అమెరికాకు వలసరాజ్యాలంతగా లేకపోయినా దేశమే చాలా పెద్దదవడంచేత వలసరాజ్యాలవల్లవచ్చే లాభాలన్నీ కూడా పొందడానికి అవకాశం ఉంది. ఫ్రాన్సుకు కూడా వలసరాజ్యాలున్నాయి. ఇంక ప్రధాన పారిశ్రామిక దేశాలలోకల్లా ఈ సౌకర్యం లేనిది జర్మనీ. తత్ఫలితం కొంతవరకు ౧౮౭౦ ప్రాంతాలలో జరిగిన ఆఫ్రికా పంపకాలలోనూ, మొన్నటి ప్రపంచయుద్ధంలోనూ వ్యక్తమైంది.

ఈవిధంగా నూతన పరిస్థితులు కల్పించి రాజ్యకాంక్ష పెంచడంవల్లనే పారిశ్రామికవిప్లవం ఒకవిధమైన యుద్ధతత్త్వాన్ని ప్రచారంలోకి తీసుకొచ్చిందని పైన వివరించాను. ఈవిధమైన పరిణామంవల్ల రెండు విధాలుగా పార్లమెంటరీ-లేక ప్రజాస్వామికప్రభుత్వ-విధానంయొక్క ప్రాముఖ్యము తగ్గుతుంది. (౧) పైన చెప్పినట్లు యుద్ధనిర్వహణానికి ఈపద్ధతి పనికిరాకపోవడంచేత యుద్ధం జరుగుతున్నంతకాలమేనా ఈవిధానం వెనుకబడి ఒకవిధమైన సర్వాధికారత్వం ఏర్పడుతుంది. గత సంగ్రామకాలంలో బ్రిటనులో ఏర్పడిన యుద్ధమంత్రిపరిషత్తే (War Cabinet) ఇందుకు ఉదాహరణ. (౨) యుద్ధానంతరమందు కూడా మళ్లీ పరిస్థితులన్నీ పూర్తిగా చల్లబడేవరకూ ఈపార్లమెంటరీ విధానం దిగ్విజయంగా సాగడానికి అవకాశం లేదు. ఎందుచేతనంటే జాతీయద్వేషా లింకా రగుల్తున్నంతసేపు అశాంతి ప్రబలంగా ఉంటుంది. అనుమానం, అన్యోన్య శత్రుత్వం చెలరేగుతూంటాయి, ప్రస్తుతం యూరపులోని పరిస్థితు లిందుకు తార్కాణం. ఇటువంటి వాతావరణంలో ప్రజాస్వామిక ప్రభుత్వమార్గం కంటకయుత మైపోతుంది. కారణ మేమిటంటే ప్రజాస్వామిక ప్రభుత్వతత్త్వమే. ఒకప్పుడు ఇటాలియను ప్రధానమంత్రిపదవి నలంకరించిన 'నిట్టీ' చెప్పినట్లు అన్ని రాజకీయవిధానాలలోనూ, ప్రజాస్వామిక ప్రభుత్వవిధానం ఆప్రజలయొక్క నైతికమానసికోన్నతిమీద ఆధారపడి ఉంటుంది. గత యూరపియను సంగ్రామంలాంటి సంగ్రామంవల్ల ఈఔన్నత్యాన్నుంచి పతనం సంభవించడంతోటే అన్యోన్య స్వేచ్ఛా సమత్వ గౌరవంమీద ఆధారపడిఉండే ఆవిధానం అసంభవమై సర్వాధికారత్వం ఏర్పడుతుంది.

ఈవిధంగా సహజలోపాలకితోడుగా నూతనపరిస్థితు లేర్పడి క్రొత్తలోపాలని వ్యక్తం చెయ్యడంవల్ల పార్లమెంటరీవిధానం ఈశతాబ్దారంభంనుంచీ ముఖ్యంగా గతసంగ్రామానంతరంనుంచీ తన ప్రాముఖ్యమును గోల్పోయింది. ఆ సహజలోపా లెటువంటివో ఆ పరిస్థితుల మార్పు ఎటువంటిదో ఈ వ్యాసంలో క్లుప్తంగా వివరించాను. ఈవిధానం తన ఉన్నతస్థానాన్ని గోల్పోయిన తర్వాత దానికి బదులుగా ప్రస్తుతం యిరోపా దేశంలో - ఒకవిధంగా పాశ్చాత్యదేశా లన్నిటిలోనూ కూడా-ప్రచారంలోఉన్న సర్వాధికారపదవుల తత్త్వం తరువాతివ్యాసంలో విచారిద్దాం. ఈ పదవులు కేవల నూతన పరిణామాలా? వాటి తత్త్వం ఎటువంటిది? వాటిలో రకాలెన్ని? వాటిచరిత్ర ఎటువంటిది? అవి ఎంతవరకు నిలవడానికి వీలుంది? ఈపద్ధతిక్రింద పరిపాలన ఎల్లా ఉంది? దాని ఫలితాలేమిటి?—మొదలైన ప్రశ్న లప్పుడు మనకి విమర్శనార్హా లౌతాయి.

---

# హస్తివర్మ నర్శింగపల్లి తామ్రశాసనము

మల్లంపల్లి సోమశేఖరశర్మ

ఆంధ్రదేశచరిత్రము విషయమున అత్యంతాభిమానమును, శ్రద్ధను వహించుచున్న మస్మిత్రులు శ్రీ షైరి అప్పలస్వామి నాయడుగారు * కొంతకాలము క్రిందట ఈశాసనమును బరిశీలించి ప్రకటించునిమిత్తము నాకడ కంపిరి. పంపునపుడు దీని పూర్వోత్తరము నిట్లు తెలిపినారు: "కంబకాయగ్రామమునకు దక్షిణమున సుమారు అరమైలుదూరములో నుండిన నర్శింగపల్లిగ్రామమునకు పశ్చిమునైపు పెరటిగుడ్డెలలో ఆగ్రామనాయుడుగారగు యాళ్ల సూరన్నాయుడుగారు పల్లము కొరకు మన్ను త్రవ్వించుచుండగా ఒక మంటికుండలో నిది గుడ్డతో చుట్టబడి దొరకినది. ఆగుడ్డ ముట్టుటతోడనే తుత్తునియలై ఎందుకు పనికిరాకపోయినది. ఆవెంటనే ఆతామ్రశాసనమును సూరన్నాయుడుగారు స్వాధీనపరుచుకొని దానిని చింతపండు మస్గతో ఉడికించి స్వచ్ఛపరుచుటకు తంటాలుపడినారు. నాకీసంగతి తెలిసి వారిని కలసికొని వారివద్ద తీసుకొంటిని". దేశచరిత్రమునందుగల యభిమాన మీవిధమున శ్రీ నాయుడుగారి నీ శాసనసంపాదనమునకు బ్రేరేచినది. ఇంకను ఇట్టి యభిమానముతోనే శ్రీనాయడుగారు నూతనశాసనసంపాదనమునకయి ప్రయత్నింతురుగాక!

## ఆకారాదికములు :

ఈశాసనమున మూడురేకులు కలవు. ఒక్కొక్క రేకుపొడువు ౬.౨౫ అంగుళములు, వెడల్పు ౨.౭౫ అంగుళములు. వీటిని మూడంగుళముల వ్యాసము గల కడియముగుండా దూర్చి కడియపుకొనలను . ౭౫ అంగుళము వ్యాసముగల యొకగుండ్రని రాజముద్రిక దిగువభాగమున తాపటముచేసి యీశాసనమును భద్రపఱిచినారు. రేకులను చదువునిమిత్తము కడియము కోయబడినది. అంచులకంటె పల్లముగనుండు ముద్రికోపరితలమున ఏదియో యొకలాంఛనము చెక్కబడినది కాని బొత్తిగ అరిగిపోయి యది యేదియైనది తెలిసికొనుటకు వీలులేకయున్నది. ఆనవాలునుబట్టి చూడగా లాంఛనము ప్రాయికముగ వృషభమయియుండునని తోచును. హస్తివర్మ ఉర్లాం[1]శాసనమునవలెనే యిందలి యక్షరములును లోతుగ చెక్కియుండుటచేత శాసనము సురక్షితమయి చక్కనిస్థితియందున్నది. హస్తివర్మ ఉర్లాం శాసనమునందువలెనే యీశాసనమునగూడ మొదటిరేకు మొదటిపెడ వ్రాత యేదియు లేదు; కడపటిరేకు రెండవపెడ రణభీతునిశాసన మిదియని తెలుపు రెండుపంక్తుల శ్లోకముమాత్రము కలదు. ఒక్కొక్కపెడకేడేసిపంక్తులచొప్పున మిగిలినపెడలన్నిటిమీద ౨౨ పంక్తులవ్రాత కలదు. సురక్షితములయి సుస్థితియందు దొరకిన మొదటి కళింగగాంగరాజుల శాసనములలో నిది యొకటి.

## లిపి, భాష :

ఇందలిది వేంగీతెలుగు — కన్నడలిపి, గుడిచుట్టి గుడిలో మరల నొకచిన్న సున్న వ్రాయుట 'ఈ' దీర్ఘమునకు గుర్తు. త, భ, న లకు విశేషము భేదము లేదు. ఏ, ఖ, ఘ లను పం. ౨౭,౫,౩౦ లందు చూడదగును. ఉపధ్మానీయము బండిరగుర్తువలన జూపబడినది (పం. ౧౫). వెలుపలిగిలకతో గూడిన క, త, ద, న, ణ, మ, య, వ వర్ణములు ద్విత్వముం జెందినవి. ఒక్కయుండియు వారు దేశచరిత్రనిర్మాణకారణములయిన యిట్టి శాసనములమీద ఓకన్నువేసియుంచుట ప్రస్తుతింపదగినవిషయము.

* ఇదివఱకు నాచే భారతిలో ప్రకటితములయిన దేవేంద్రవర్మ కంబకాయ శాసనమును, మూడవ వజ్రహస్తుని చికాకోల వలస, బొడ్డపాడు తామ్రశాసనములునుగూడ శ్రీఅప్పల స్వామినాయడుగారి కృషిపరిశ్రమలభ్యములే. తీరిక దొరకని పనులయందు నిమగ్నులయి

1. ఆంధ్రపత్రిక, రౌద్రి (౧౯-౨౦) ఉగాది సంచిక.

పవర్ణమునకుమాత్రము ద్విత్వము రాలేదు. శాసనభాష సంస్కృతము: శాసనముచివర వాడుకగ వ్రాయబడు వ్యాసగీతాశ్లోకములును (పం: ౨౨ - ౨౬), శాసన లేఖకుని నుతించి తెలుపు శ్లోకమును (పం: ౨౬ - ౨౯), కడపటిరేకు రెండవపేడ నున్నశ్లోకమునుదక్క మిగిలిన శాసనమంతయు గద్యమున నున్నది.

శాసనవిషయము :

ఈశాసనము కళింగమును బరిపాలించిన గాంగవంశపురాజగు హస్తివర్మది. ఈరాజు దివవుకు ఉర్లాం శాసన మొక్కటియే బయలుపడినది. ఇది యీతని రెండవశాసనము. ఉర్లాంశాసనమువలెనే యిదియు కళింగ గాంగరాజప్రశస్తితో నారంభ మగుచున్నది. ఉర్లాం శాసనమునకును దీనికిని ప్రతిగ్రహీత, దత్తగ్రామముల విషయమున దక్క నేదియు భేదము లేదు. ఈ శాసనము కూడ సర్వర్తు రమణీయమయిన కళింగనగరమున నుండియే యొసంగబడినది. హస్తివర్మ సకలభువన నిర్మాణైక సూత్రధారుడగు భగవంతుడు గోకర్ణస్వామి పాదపద్మములకు నమస్కరించుటవలన పోగొట్టబడిన కలికల్మషము కలవాడు; వినయనయసంపదల కాధారమైనవాడు; తనఖడ్గధారా పరిస్పందనముచేత సకలి కలింగ రాజ్యమును బొందినవాడు; చతుస్సముద్రతరంగ మేఖలయయిన భూమండలమున విఖ్యాతమయిన నిర్మలకీర్తి గలవాడు; అనేకయుద్ధములందు జయముగాంచినవాడు; గాంగామలకులప్రతిష్ఠుడు; ప్రతాపాతిశయము చేత వంచబడిన సామంతరాజుల శిరస్సులందుగల మణుల ప్రభామంజరీపుంజముచేత ప్రకాశించుపాదములు కలవాడు; మాతాపితృపాదానుధ్యాతుడు; పరమమాహేశ్వరుడు. అట్టి మహారాజగు హస్తివర్మ బుద్ధమంచిభోగికునిచేత ప్రతిబోధితుడయి, తన తలిదండ్రుల యొక్కయు, తన యొక్కయు పుణ్యాభివృద్ధికొఱకు వరాహవర్తనీ విషయమునందలి రోహణకి యనుగ్రామమున ఆఱుమడకల (అరకల) భూమిని వేఱుపఱచి దానిని నాలుగు నివేశనములతోగూడ భగవానుడయిన సప్తసముద్ర శాయియు, సప్తసామోపగీతుడును, సప్తలోకైక నాథుడును, రణభీతోదయనామధేయుడును అగు నారాయణునికి (విష్ణువునకు) బలిచరుసత్రప్రవర్తనము నిమిత్తమును(బలి యనగా పూజార్థమయినకానుక, చరు వనగా హవ్యము, అనగా దేవతలకిడదగినయన్నము,సత్రమనగా అన్నప్రదాన గృహము — వీని నిమిత్తమును), ఖండస్ఫుటిత సంస్కారము నిమిత్తమును పన్నులన్నియు గొట్టివేసి ఆచంద్రార్కప్రతిష్ఠగా దేవాగ్రహారము చేసి, తన తలిదండ్రుల యొక్కయు,తనయొక్కయుపుణ్యాభివృద్ధికొఱకు నొసంగెను (పం. ౧-౧౬). ఈవిషయమును దెల్పుటకే యీ శాసనము పుట్టినది. పిదప ఈ దాన మిచ్చిన భూమికి సరిహద్దులు తెలుపబడినవి (పం. ౧౭-౨౧). అటుతరువాత వ్యాసగీతాశ్లోకములు కలవు (పం: ౨౨ - ౨౬). ఈ శాసనము హస్తివర్మప్రవర్ధమాన విజయరాజ్య సంవత్సరము ౭౯-వ యేట (ఏకోనాశీతి), జ్యేష్ఠశుక్ల ద్వాదశి దినమున నీయబడినది (పం: ౨౬-౨౮). హస్తివర్మ మహారాజుస్వముఖాజ్ఞ ననుసరించి యీరాజసింహుని శాసనమును భానుచంద్రుని కుమారుడయిన వినయచంద్రుడు వ్రాసెను (పం: ౨౮-౨౯). కత్తివరయొక్క యొరపిడివల్ల నూరివేయబడిన శత్రు సమూహము గలవాడును, అడ్డులేని యాజ్ఞగలవాడును అగు రణభీతుని శాసన మిది (పం: ౨౯ - ౩౦).

ఉర్లాంశాసనమునకంటె ఈ శాసన మొక్క యేడు ముందటిది. ఈరెండుశాసనముల ననుసరించియు హస్తివర్మ రణభీత, రాజసింహబిరుదాంచితుడని తెలియవచ్చుచున్నది. మనశాసనమున విష్ణువు రణభీతోదయ నామధేయుడని పేర్కొనబడుటవలన ప్రాయికముగ హస్తివర్మయే తనబిరుదనామమున విష్ణువును ప్రతిష్ఠించి యుండవచ్చును. ఇట్లయినచో పరమమాహేశ్వరుడని కీర్తింపబడిన హస్తివర్మ చాల మతసహనము కలవాడని, శైవవైష్ణవమతములను రెంటిని సమానముగ నాదరించెనని నిశ్చయింపవచ్చును.

రాజసింహుడని ఖ్యాతి గాంచిన హస్తివర్మ రణభీతబిరుదము వహించుట విచిత్రము. కళింగము నేలిన గాంగరాజులలో నితనికి దక్క మఱియెవ్వరికి నిట్టి బిరుదము లేదు. శాసనముల ననుసరించి ఇతనికి పిదప రాజ్యమేలినట్లు చెప్పదగు ఇంద్రవర్మకు రాజసింహ

బిరుదముమాత్రమే కలదు. హస్తివర్మ కొక్కనికే ఇట్టి బిరుద ముండుటకు గారణము దురూహముగ నున్నది.

భీతపదాంచితము లయిన యిట్టి బిరుదములు ప్రాచీనకాలమున కొంగోదమండలమును (ఇది యిప్పటి గంజాము జిల్లాయందలి యుత్తరభాగమునుండి మహానదికి దక్షిణతీరమువఱకు వ్యాపించిన ప్రదేశము)పాలించిన శైలోద్భవవంశజులకు గలవు. రెండవ మాధవవర్మ బుగుడాశాసనము[2], ధర్మరాజదేవుని కొండెడ్డ[3] నివినా[4]శాసనములను బట్టి శైలోద్భవుల వంశావతారక్రమమిట్లు :

శైలోద్భవుడు
:
రణభీతుడు
|
సైన్యభీతుడు
:
అయశోభీతుడు
|
సైన్యభీతుడు అను రెండవ మాధవవర్మ
|
అయశోభీతుడు అను మధ్యమరాజదేవు
|
మానభీతుడు అను ధర్మరాజదేవు

రెండవమాధవవర్మ గంజాముశాసనము[5] ననుసరించి అతని వంశావతారక్రమ మిట్లు :

మొదటి మాధవవర్మ
|
ఆయశోభీతుడు
|
రెండవ మాధవవర్మ(దాత)

ఈకడపటిభూపతి గుప్తశకము ౩౦౦ ల కాలమున, అనగా క్రీ. శ. ౬౧౯-౬౨౦-వ సంవత్సరమున నొక బ్రాహ్మణునికి దాన మొసంగెను. దీని ననుసరించి పైనిచ్చిన వంశావతారికయందలి మొదటి సైన్యభీతుడు (రణభీతునికుమారుడు) మొదటిమాధవవర్మ కావచ్చును. అట్లయిన రణభీతుడు మొదటిమాధవవర్మ తండ్రియనుట కవకాశము కలదు. ఈపద్ధతిననుసరించి తరమున కిరువదియైదు సంవత్సరముల లెక్కను చూడగా రణభీతుడు క్రీ. శ. ౫౪౫-౫౫౦ ప్రాంతమువా డగును. ఇతడు ముందా హస్తివర్మ ముందా? రణభీతుడే హస్తివర్మకంటె పూర్వు డన్న హస్తివర్మ కీబిరుదము ఎందుకు ఎప్పుడు వచ్చినది? ఈ విషయములు పరిశోధకు లాలోచింప వలసినవి.

శైలోద్భవవంశజులవి కాక కేవలము భీతనామాంచితుల శాసనములు రెండు కాన్పించుచున్నవి. ఇవి రెండును ఎనిమిదవ శతాబ్దినాటి తెలుగులిపిలో తెలుగు బాస నున్నవి. వీటిలో గుంటూరుజిల్లా నర్సారావుపేట తాలూకా కోటప్పకొండయందున్న దొకటి[6] యిట్లున్నది :

స్వస్తి శ్రీసంసారభీత దేవరపిడప నరలోక భీత తత్పురుషత్రయిలోకభీత.

గంజాముజిల్లా పర్లాకిమిడితాలూకా ముఖలింగమునం దున్న రెండవశాసన[7] మిట్లున్నది :

శ్రీసంసారభీత దేవర దేవభూమి ప్రదక్షిణే పోయివచ్చె. వీరి శిష్యుడు త్రయిలోకభీత.

పూర్వోక్తవిషయముల నన్నిటిని గమనించినచో నీవిషయమున నింకను పరిశోధన యావశ్యకమని తేలుచున్నది.

స్థలనిర్దేశము :

దానమిచ్చినభూమి వరాహవర్తని విషయములోని రోహణకి గ్రామమునందలిది. వరాహవర్తనీవిషయము ప్రాచీనకళింగాధిపతులగు దేవేంద్రవర్మ[8], ఇంద్ర

2. Ep. Ind., Vol. III, p. 41.
3. Ep. Ind., Vol. XIX, p. 265.
4. Ep. Ind., Vol. XXI, p. 34.
5. Ep. Ind., Vol. VI, p. 143.
6 S. I. I., Vol. IV, No. 992.
7. S. I. I., Vol. V, No. 1127.
8. Ep. Ind., Vol. XIII, p. 212.
Ep. Ind., Vol. XVIII, p. 311.
Ep Carn., Vol IX, Bn. 140.
Ind. Ant., Vol. XIII, p. 273.

వర్మల[9] శాసనములందును, అర్వాచీన కళింగాధిపులగు వజ్రహస్త,[10] రాజరాజ[11], అనంతవర్మచోడగంగదేవుల[12] శాసనములందును పేర్కొనబడినది. పూర్వోక్తశాసనములం దుదాహృతములయిన తామరచ్చెరు, తామరచెరువ, సిద్ధార్ధక, సింహపుర, సిద్ధతా గ్రామములును, ఖోన్న (కొర్ని), ఓంబరవెల్లి (వమరవెల్లి), తోనేంగి (తోనంగి), ఖోల్లిర (కొర్లాం), తూలువు (తూలుగు), గార (గార) గ్రామములును ఈవిషయములోనివే. తామరచ్చెరు, తామరచెరువు లిప్పటి తామరపల్లి యనియు, సిద్ధతా గ్రామము ఇప్పటిసిద్ధాంత మనియు నిశ్చయింపదగునేని ఈగ్రామము లన్నియు శ్రీకాకుళము తాలూకాయం దున్నవేయగుటచేత ఇప్పటి శ్రీకాకుళము తాలూకాకె పూర్వము వరాహవర్తనీ విషయమను పేరు చెల్లుచుండెనని యూహింపదగియున్నది. శకవర్షము ౧౦౬౩ నాటి యొకశాసనమున[13] తులగామ యనుగ్రామముకూడ వరాహవర్తనిలోనిదిగనే చెప్పబడినది. ఈ గ్రామము టెక్కలితాలూకాయందలి 'తలగాం' అని నాయూహ. ఇది సరియయినయెడల టెక్కలితాలూకాయందలి కొంతభాగమున కయినను వరాహవర్తని యన్న పేరు వర్తించుచుండినట్లు నిశ్చయింపదగును. కావున రోహణకి గ్రామము శ్రీకాకుళము తాలూకాయందే యుండవలెను. శ్రీకాకుళము తాలూకా కంబకాయగ్రామమునకు నైరృతదిశగా, సుమా రేడు మైళ్లదూరమునను, శ్రీకాకుళమున కీశాన్యదిశగానున్న సింగుపురమునకు సుమారు మైలుదూరమునను రోణంకి అను పేరుగల గ్రామ మొకటి యున్నది. ఇదియే శాసనోక్తమయిన రోహణకి యయియుండునని నాయూహ. ప్రస్తుత మీగ్రామము (రోణంకి) రెవిన్యూ లెక్కలలో స్వతంత్ర గ్రామముగగాక సింగుపురమునకు మజరా (అనగా సింగుపురమునకు జేరినపిల్లగ్రామము)గ నున్నట్లు అప్పలస్వామినాయడుగారు తెలుపుచున్నారు.

శాసనకాలము :

ఈశాసనము ప్రవర్ధమాన విజయరాజ్య సంవత్సరము 'ఏకోనాశీతి', అనగా డెబ్బది తొమ్మిదిని, జ్యేష్ఠ శుద్ధద్వాదశినా డొసంగబడినది. అక్షరరూపముననే కాక ఈసంవత్సరము ౭౦ ౯ అని ఇట్లు అంకముల రూపమునగూడ తెలుపబడినది. శాసనమున నిచ్చిన రెండంకెలలో కుడివైపు అంకె తొమ్మిదికిని, ఎడమవైపు అంకె డెబ్బదికిని గుర్తులు. జ్యేష్ఠ శుద్ధద్వాదశి కూర్మజయంతీపుణ్యకాల మయినది. అందువలన దాన మొసంగినదియు, దానపట్టా నొసంగినదియు ప్రాయికముగ నొక నాడే యని యూహింపదగును.

గాంగశకవత్సరములు ప్రవర్ధమాన సంవత్సరములని, ప్రవర్ధమానవిజయరాజ్య సంవత్సరములని, గాంగేయవంశప్రవర్ధమానవిజయరాజ్య సంవత్సరము లని, గంగ-కదంబవంశప్రవర్ధమాన సంవత్సరములని కళింగ గాంగ శాసనములందు పేర్కొనబడినందున మన శాసనమున దెలుపబడిన ౭౯ గాంగశకవత్సరముగనే గ్రహింపదగును. శాలివాహనశకమున గాని, క్రీస్తుశకమున గాని గాంగశకఆరంభవత్సరము తెలిసిననే తక్క మనకిప్పుడు తెలిసిన కాలపరిగణనమున ౭౯ ఏసంవత్సరమయినదియు దెలియదు. ఈ యారంభసంవత్సరమును నిర్ణయించుటకు ఇంతవఱకు గొన్ని ప్రయత్నములు జరగినవి కాని నిర్వివాదముగను, నిర్దుష్టముగను ఈసమస్య యింకను పరిష్కారము కాలేదు. ఈవిషయమున నింతవఱకు జరగినప్రయత్నములనుగుఱించి, యందలిసాధకబాధకములనుగుఱించి ముందుసెలలో వ్రాసెదను.

9. Ep. Ind., Vol. III, p. 127.
Ind. Ant, Vol. XIII, p. 120.

10. Ep. Ind., Vol. IX, p. 94.

11. Jour. Andh. Hist. Re. Soc., Vol. VIII.

12. భారతి, సంపుటము: ౫, సంచిక, [illegible].

13. S. I. I., Vol. No. 1064.

# మూలము[1]

మొదటిరేకు : రెండవపెడ

౧. స్వస్తి సర్వర్త్తురమణీయా ద్విజయకలిఙ్గనగరాత్సకలభువన
౨. నిర్మ్మాణైకసూత్రధారస్య భగవతో గోకర్ణ్ణస్వామినశ్చరణకమల
౩. యుగలప్రణామాదపగతకలికలఙ్కో వినయనయసమ్పదా
౪. మాధారః స్వాసిధారాపరి(రి) స్పన్దాధిగతసకలకలిఙ్గాధిరాజ్య
౫. శ్చతురుదధితరఙ్గమేఖలావనీతలప్రవితతామలయశాః అనేక
౬. సమరసంఙ్ఘో భజనితజయశబ్దో గాఙ్గామలకులప్రతిష్ఠః ప్రతా
౭. పాతిశయానామిత [2] సమస్తసామన్తచూడామణిప్రభామఞ్జరీ

రెండవరేకు : మొదటిపెడ

1 నాదగ్గఱనున్న రేకుల ననుసరించి. 2. ప్రతాపాతిశయానమిత°. అని చదువవలెను.

౮. పుఞ్జరఞ్జితచరణో మాతాపితృపాదానుద్ధ్యా(ధ్యా)తః పరమమాహేశ్వరః

౯. శ్రీమహారాజో హస్తివర్మ్మా। వరాహవర్త్తనీవిషయే రోహణకాం

౧౦. సర్వ్వసమవేతా న్కుటుమ్బిన స్సమాజ్ఞాపయతి విదితమస్తు వో య

౧౧. థాస్మిన్గ్రామే షణ్ణాం హలానాం భూశ్ఛేదీక్ర(కృ)త్య చతుర్న్నివే

౧౨. శనసహితా భగవతే సప్తార్ణ్ణ(ర్ణ)వశాయినే సప్తసామోప

౧౩. గీతాయ సప్తలోకైక నాథాయ రణభీతోదయాభిధానాయ

౧౪. నారాయణాయ బలిచరుసత్రప్రవర్త్తనాయ ఖణ్డస్ఫుటిత

రెండవ రేకు : రెండవ పెడ

౧౫. సంస్కారాయ చ సర్వ్వకరై ప్పరిహృ త్యాచన్ద్రార్క్కప్రతిష్ఠం దేవాగ్రహారం

౧౬. క్ర(కృ)త్వా మాతాపిత్రోరాత్మనశ్చ పుణ్యాభివృద్ధయే బుద్ధమఞ్చిభోగికేన ప్రతి

౧౭. బోధితై రస్మాభి ర్ద్దత్తా[॥*] తద్విదిత్వా న కేనచిత్పరివాధా [3] కార్య్యా[।*]

౧౮. సీమాన్తలిఙ్గానిచాత్రపూర్వ్వేణాస్యగ్రామగర్త్తా[।*] దక్షిణేన

౧౯. వరన్దకః[।*] పశ్చిమేన విషయగర్త్తా కురవకమూలసహితా[।*] ఉత్త

౨౦. రేణసహతాలవాటికయేతి। [।*] భవిష్యద్రాజభిశ్చాయన్దాన

౨౧. ధర్మ్మోను పాలనీయ స్తథాచ [వ్యాసగీతాః] శ్లోకా నుదాహరన్తి[।*]

౩. °పరిబాధా° అని చదువవలెను.

మూడవ రేకు : రెండవ పెడ

౨౨. బహుభి ర్వసుధా దత్తా బహుభి శ్చానుపా[లితా యస్య యస్య]
౨౩. యదా భూమి స్తస్యతస్య తదాఫలం[॥*] స్వదత్తా మ్పరదత్తా[ం]వా యత్నాద్ర
౨౪. క్ష యుధిష్ఠిర మహీమ్మహీమతాం శ్రేష్ఠ దానాచ్ఛ్రేయోనుపా [లనం] [॥*]
౨౫. షష్టింవర్షసహస్రాణి మోదతే దివి భూమిదః ఆక్షేప్తాచా
౨౬. నుమన్తాచ తాన్యేవ 4 నరకేవసే దితి। [।*] ప్రవర్ధమాన విజయరాజ్యసంవ
౨౭. త్సరాః ఏకూనాశీతి 5 ౭౦ ౯ జ్యేష్ఠశుక్లద్వాదశ్యాం।[।*] ఇదం వినయచన్ద్రేణ
౨౮. భానుచన్ద్రస్యసూ[ను][నా*] శాసనంరాజసిఙ్హస్య లిఖితం స్వముఖాజ్ఞయా।[।*]

మూడవ రేకు : మొదటి పెడ

౨౯. మణ్డలాగ్రాగ్రనిష్పేషనిష్పిష్టారాతి[సంహ]తేః
౩౦. శ్రీమతో౽ప్రతిఘాజ్ఞస్య రణభీతస్యశాసనమ్[॥*]

---

4. ఇచ్చట లేఖకుడు మొదట 'వి' వ్రాసి దానిని 'వ'గ దిద్దెను. 5. ఏకోనాశీతి అని చదువవలెను.

# నక్షత్రమండలము

గోబ్బూరు వేంకటానంద రాఘవరావు (కవితాసమితి)

(భావ సంవత్సర భాద్రపదమాసము)

ఉత్తరము




దక్షిణము

[ ఈ పటమును తలమీదుగా ఆయాదిక్కులు సరిపడునట్లు పట్టుకొని ఖగోళమును పరిశీలింపవలెను.

ఇందు జూపబడినట్లు నక్షత్రాదులు

సెప్టెంబరు 8 తేదీని రాత్రి 8-25 నిమిషములకును

,, 15 ,, ,, 8-52 ,,

సెప్టెంబరు 22 తేదీని రాత్రి 7-57 నిమిషములకును

,, 30 ,, ,, 7-26 ,,

అక్టోబరు 7 ,, ,, 6-58 ,,

కనబడును.]

"These are Thy glorious works, Parent of good

Almighty, Thine this universal frame,

Thus wondrous fair; Thyself how wondrous then?

Unspeakable, who sitest above these heavens,

To us invisible, or dimly seen

In these Thy lowest works; Yet these declare

Thy goodness beyond thought and power divine".

("ఓసర్వశక్తుడా! సజ్జనకుడా! ఈ విశ్వాకారము నీప్రతిభాకల్పితము. సౌందర్యశోభితము, వికాసభాసురము నైన యీవ్యక్తము నీమహిమాణుమాత్ర ప్రదర్శనము. నీవు దేవదేవుడవు. అమిత సద్భావసంపన్నుడవని నిరూపించుట కిది చాలును. ఇదే ఇంత దిగ్భ్రమ మొదవించుచున్నదే! మా కగోచరమై అనంతబ్రహ్మాండకోటుల కావల నేంచేసియున్న నీదివ్యస్వరూప మెట్టిదో ఊహించుకొనుటకు భావము, పలుకుటకు మాట — తొడగక మౌనముతో మ్రాన్పడియున్నాము.")

ఈభావసంవత్సర భాద్రపదమాసమునందు రాత్రి తొలిజామున నగపడు ఖగోళవిశేషముల నారయుదము.

## పాలవెల్లి (Milky Way)

ఇది ఉత్తరసమీపపు టీశాన్యమునుండి దక్షిణసమీపపు నైరృతివఱకు గొప్ప అర్ధమండలాకారములో చక్కగా వ్యాపించియున్నది. దాని మనోహరదృశ్యము నొక కవిసత్తము డిట్లు వర్ణించినాడు:

"A broad and ample road where dust is gold,

And pavement stars, as stars to thee appear

Seen in the galaxy, that Milkyway

Which nightly as a circling Zone thou see't

Powdered with stars"

నక్షత్రములతో చదునై, విస్తారమై, విశాలమై, బంగారువలె కాంతిమంతమైన ధూళితో ధూసరితమై వలయాకారముతో నాకాశమువిూద తోచు వీథియే పాలవెల్లి. రేణువులట్లు అతిసూక్ష్మములయ్యు అందలి చుక్కలు ధవళధవళమైన తేజస్సుతో మెఱయుచుండును.

## First Magnitude Stars

ఈమాసములో రాత్రి తొలిజామున మిక్కిలి తేజోవంతములైన చుక్కలు ఐదుమాత్రమే కానవచ్చును. :—౧. స్వాతి, ౨. బ్రహ్మ, 3. శ్రవణము, ౪. జ్యేష్ఠ, ౫. ఇంద్రద్యుమ్నుడు.

## గ్రహములు

కుజు డీమాసములో పుష్యమి, ఆశ్లేష, మఘ నక్షత్రములలో సంచారము గనుక రాత్రి తొలి జామున కనబడడు. శుక్రుడు మఘ, పూర్వఫల్గుని, ఉత్తరఫల్గునీ నక్షత్రములలో సంచరించును. గురుడు చిత్రలో నున్నాడు కావున తొలిజామున కొంతవఱకు పడమట కనబడుచుండును. శని ధనిష్ఠలోనున్నాడు. తప్పక కానరాగలడు. ఈమాసములో మరియు 19-9-34 తేదీని భాద్రపద శుద్ధ ఏకాదశి పరివర్తన ఏకాదశి. శ్రీ మహావిష్ణువు ఒత్తిగిలుట—పడమటనుండి తూర్పునకు మరలుట—అను విశేషము; 22-9-34 న దక్షిణ విషువన్ దినము.

ఇకనక్షత్రములు:—పడమట చిత్ర అస్తమించినది. స్వాతి, విశాఖ త్వరలో నస్తమింపనై యున్నవి. వాయవ్యమూలను సప్తఋషులు కొందర స్తమించినారు. మిగిలినవారు త్వరలో అస్తమింతురు. తూర్పున చ్యవనుడు, అశ్విని, శింశుమారమునందు కొంతభాగము, యుగంధరకమఠము ఉదయించినవి. ఆగ్నేయమున

ప్రావారకర్ణఘూకము, నాళీకజంఘుబకము పొడచూపు చున్నవి. దక్షిణమున మయూరముతో బాణాసురుడు బాసుగా కానవచ్చుచున్నాడు. ఈశాన్యభాగమున భృగు పరశువుండలము ఉదయించుచున్నది. పులోముడు కూడ గ్రుడ్లు మిటకరించుచు పొడచూపినాడు. దిగు వను ఇంద్రమదయును, రేవతియును ఉన్నారు. వీటి కావల పేద్వహూశ్వము ( Pegasus ) నందలి ఉత్తరా భాద్ర, పూర్వాభాద్ర నక్షత్రములు నాలుగు మంచపు కోళ్లవలె మెఱయుచున్నవి. మధ్యను పాలవెల్లిలో రాజహంసయు, క్రౌంచెముప్రక్కగా ధనిష్ఠ, శ్రవణ నక్షత్రములు మెఱయుచున్నవి. మీనమునకు, పాల వెల్లికి మత్స్య కుంభ, మకర రాసులును, ధనుస్సును కానవచ్చుచున్నవి.

## ఉత్తరాకాశమున

ఊర్వశీపురూరవసులను గూర్చి కొంత వివ రింపవలసియున్నది. నారాయణుడను ఋషియొక్క ఊరువునుండి జనించినది కావున నీయప్సరస ఊర్వశి యనుపేరున బరగుచున్నది. ఈయూరువు రూపము



ఊరువు : ఇందునుండి ఊర్వశి ప్రభవించినది.

ఈనెలలో చక్కగా కానవచ్చును. ప్రాచీనకాల ములలో అనేకదేశములవారు దేవాలయాదులలో చిత్రిం చిన ఖగోళచిత్రములలో ఉత్తరదిశాకాశమున నిట్టి రూపము తెలుచుగా కానవచ్చుచున్నది. Grimaldi దొరవారు తయారుచేసిన ప్రాచీన ఖగోళచిత్రవివర ములలో 9-11 పుటలలో బాబిలోనియను చిత్రముల లోను, 27-వ పుటలో ఫొనీష్యన్ చిత్రములలోను, 81-వ పుటలో మిత్రవిషయక చిత్రములలోను కాలు ( Leg ) రూపుగల ఖగోళచిత్రములు గలవని వివరించి యున్నారు.

ఊర్వశి జన్మకథనము పురాణములలో వర్ణింప బడినట్లు ఆకాశమునందు ఉత్తరదిశను నక్షత్రరూపమున చిత్రింపబడియున్నది.

ఊర్వశీపురూరవసులగాథ ఋగ్వేదము X మండ లము 95-వ సూక్తమునందు వర్ణింపబడియున్నది. మరియు X 22-14 లో ఊర్వశీపురూరవసుల పుత్రుడైన విశ్వా యువు పేర్కొనబడియున్నాడు. భాగవతము నవమ స్కంధమునందు ఊర్వశీపురూరవసుల పుత్రులు, వారివంశమును 387 మొదలు 422 వఱకు వివరముగా వర్ణింపబడియున్నవి. అందు ఊర్వశీపురూరవసులకు నాయువు, శ్రుతాయువు, సత్యాయువు, రయుడు, జయుడు, విజయుడు నను పుత్రులు గలిగినట్లు చెప్ప బడినది. విజయునకు పదునొకండవతరమువాడను గాధికి సత్యవతి యను కూతురుండెను. ఆమె భృగువంశజాతు డను రుచికునికి భార్యయయ్యెను. ఆదంపతులకు జమ దగ్నియు, జమదగ్నికి పరశురాముండును జననమైరి. కావున ఊర్వశీపురూరవవంశజులకు భార్గవులతో సంబంధము కలిగి జమదగ్నియు, పరశురాముడును జనించి రని భాగవతమువలన స్పష్టము. ఈయంశము ఖగోళమునందును పరిస్ఫుటమగుచున్నది.

పురూరవసుపుత్రులలో నొకడు, ఋగ్వేదము నందు విశ్వాయువని పేర్కొనబడినవాడు, భాగవతము నందు శ్రుతాయువని పేర్కొనబడిన ట్లగపడు చున్నది. ఈ విశ్వాయువునే పాశ్చాత్యులు సిఫియస్ రాజు (King Cepheus) అని చెప్పుచున్నారు. దీనినే 'ఆల్ఫా సిఫియస్'అని గుర్తింపవచ్చును. ఈనక్షత్ర

ఊర్వశీమండలము (Cepheus)

[కప్పా—విజయుడు.

తీటా—జయుడు.

డెల్టా—రయుడు.

మ్యూ—సత్యాయువు.

సు—నక్షత్రములసమ్హులు.

* ఉల్కలు రాలుచోటు,
7-13 అనగా జూన్ 7-13 తేదీల మధ్య ఇక్కడనుండి ఉల్కలు రాలునట్లు కనపడును.

20. జూన్ - 20 వ ప్రాంతమున ఇటనుండి ఉల్కలు రాలున ట్లగపడును.

గామా—ఊర్వశి.

బీటా—పురూరవసు (త్రేతాగ్నులను ఏర్పరచినాడు)

ఆల్ఫా—విశ్వాయువు (భాగవతము శ్రుతాయువు అని చెప్పుచున్నది.) ఇక ఐదువేల సంవత్సరములకు ఇదియే ధ్రువస్థానము కాగలదు. ఈశ్రుతాయువునే పాశ్చాత్యులు సిఫియస్ రాజు (Cepheus King) అని చెప్పుచుందురు.]

మండలమున కంతకును పాశ్చాత్యులు సిఫీయస్ అని పేరుపెట్టినారు. కాని మన వేదపురాణగాథలనుబట్టి, దృశ్యేమునుబట్టి ఈమండలమును ఊర్వశీమండల మనుటయే యుక్త మని తోచుచున్నది.

పురూరవసు త్రేతాగ్నుల నేర్పరిచినాడు. "అందు జాతవేదుడను నగ్ని సంభవించె" నని భాగవతము తెల్పుచున్నది.

నక్షత్రపటములలో మూలకు దిగువ దక్షిణమున వేదికామండలమొకటి కానవచ్చును. పాశ్చాత్యు లీవేదికను **Ara the Altar** అని తెలుపు చున్నారు. దక్షిణాకాశమున నిట్టి వేదికారూపముగల నక్షత్రములున్నట్లు **Grimaldi** దొరగారి గ్రంథమున వివరము లున్నవి.

ఆగ్రంథముయొక్క ౧౦,౧౧,౧౨,౧౪ పుటలలో బాబిలోనియాఖగోళచిత్రములలో క్రమముగా ఒకటి, మూడు, ఐదు, నాలుగు సంఖ్యలు గల అగ్ని వేదికలు చూపట్టుచున్నవి. ౨౧-వ పుటలో ఈజిప్టు దేశపు చిత్రములలో ఒక అగ్నివేదిక ఉన్నట్లు కలదు. మిత్రవిషయక ఖగోళచిత్రములలో ౭౯-వ పుటలో ౯ అగ్నివేదికలును, ౮౦-వ పుటలో ౭ అగ్నివేదికలును, ౮౨-వపుటలో౧ అగ్నివేదికయు ఉన్నట్లు చూపబడినది.

౧౫౭-వ పుటలో అనుబంధములో ఈజిప్టు దేశపువేదికా చిత్రముకటి పట్టికలో చేర్చబడినది.

జ్యేష్ఠానక్షత్రసమీపమున, అనగా ఇంద్రునిసమీపమున మూల దిసవనున్న వేదికామండలము చాల ముఖ్య




వేదికామండలము

(Ara The Altar)

మైనది. దాని స్వరూపము విడిగాను, వేదికారూపము స్ఫురింపజేయునట్లుగాను వేరువేరుగా రెండుపటములలో పైన ఈయబడినది. ఇయ్యది Milky way దట్టముగా నున్నచోట నుండుటచేత ఈ అగ్ని వేదిక నుండి తెల్లనిపొగ వెడలుచున్నట్లుకూడ స్ఫురించునని కూడ Proctor గారు Myths and Marvels of Astronomy అను గ్రంథమునందు తెల్పియున్నారు.




వేదికామండలమునందలి నక్షత్రములు, వేదిక యొక్క రూపమును, అందునుండి వెడలు పొగను సూచించు చిత్రము.

భగవద్భక్తులు సమిధలు, సాంబ్రాణి మొదలగునవి వేదికలో వేసి అర్చించునపుడు వెడలు శ్వేతధూమము పాలవెల్లి తెలుపులో లీనమై సాంద్రముగానించుట చూడ నద్భుతమై యుండును.

# పాత పాటలు

నేదునూరి గంగాధరం

౧

నిండుపున్నమునాడు పండువెన్నెలగాచు
స్వల్పగ్రహణంనాడు చందమామనుమింగు
దిగుదిగునాగన్న దివ్యసుందరనాగ
దిగకున్నమంత్రాన దింపెదనాగ
నాగదిగురా నాయన్నదిగురా నాగ దిగురా.

౨

చితుకుచితుకు జొన్నకూడు చింతాకుపులుసు
నీలికాకరాకు తోరణాలు
కందిపప్పు పూరణాలు
డేకవయ్య పెళ్లికొడక
సంధ్యాలగ్నం ముందరికొచ్చింది
అందలమ్మ ముందరికొచ్చింది.

౩

ఓలోలి కోలవెంకి
నీమొగుడు చంద్రిగాడు
కోలాటంవెయ్యబోతే
విరిగింది ఈతముల్లు
కారింది రక్తకల్లీ.

౪

చెరుకుతోట పున్నాన్ని
చేతిగాజులుపోయె
వేళ్లవుంగరాలు పోయె
ఎక్కడేసేవు బుచ్చిరెడ్డి చెరుకుతోట.

చెరుకుతోట పున్నాన్ని
తలపై రాగిడి పోయె
తలపై మొగలిరేకుపోయె
తమలపాకు పోయె
పాపిడిబిందీలు పోయె
ముక్కున నత్తు పోయె
అడ్డబాస పోయె
మెడలో పట్టెడ పోయె
నడుము వడ్డాణము పోయె
దండ గడియాలు పోయె
చేతి మురుగులు పోయె
కాళ్ల కడియాలు పోయె
వేళ్లచుట్లు పోయె
ఇంత పెద్దరంతు అమ్మో
ఎక్కడేసేవు బుచ్చిరెడ్డి చెరుకుతోట.

దొడ్డి దూడలు పోయె
కాడి యెద్దులు పోయె
ఇల్లు గుల్లయి పోయె
ఒళ్లు గుల్లయి పోయె
ఉల్లము తల్లడించి
కొల్లపెట్టించేను
ఎక్కడేసేవు బుచ్చిరెడ్డి చెరుకుతోట
ఎక్కడేసేవు బోడిమామ చెరుకుతోట.

౫

చిప్పచిప్పగోళ్లు
చెల్లాయి గోళ్లు

చిట్టి పాపగోళ్లు
చిన్నారి గోళ్లు
ముద్దు తల్లిగోళ్లు
ముత్యాల గోళ్లు
మాపాప గోళ్లు
మంద్రగబ్బ గోళ్లు.

౬

ఇసకలో యిసకపుట్టు యింద్రజలంపుట్టు
పసిపిల్లతల్లులకు పాల జలంపుట్టు.

౭

కొండేల మారికి కొడుకుపుట్టాడు
కోటిపల్లి సోమన్న పేరుకొచ్చాడు.
తాసికలమారికి తవ్వపుట్టింది
తాళ్లూరి జియ్యన్న పేరు కొచ్చాడు.

౮

ఉత్త ఉత్తపండు ఉత్తరేణిపండు
దానిమ్మపండు దబ్బపండు.

౯

నల్లనల్లనివాడ! నావెంకటేశ!
నన్ను సుంకమడుగ న్యాయమా నీకు
తిరుపతి రమ్మంచు తెలిపెదవు కలలో
తెలిపి సుంకమడుగు దేవుడవా నీవు?

౧౦

పున్నపువెన్నెల పూనికాయంగ
రవ్వల్ల కాముడా రాకు మావాడ
మదిలోన కన్నెల మర్యాదచూడు
చిలుక, తుమ్మెదదండు బలిసికొలువంగ
పువ్వువిల్లు చేబూని బూకరించెదవు
పెళ్లి కానివారమని ఉల్లమున యెంచు.

౧౧

అత్తవారిల్లంటె అక్కయ్యనీకు
అద్దంవంటి మొగము అగ్గితాకింది
కోడరికముచేసి వేరుండునపుడు
అద్దాన్ని పోలును అక్క నీమొగము.

౧౨

పసిబిడ్డలేడిస్తె పాలు కారేను
పసిబిడ్డలతల్లులకు భయాలు లేవు
ఏరుదాటి కొమ్మ వస్తుందంటు
బాలల కన్నతల్లి కెంతో భయాలు.

౧౩

అమ్మ నన్ను కనకే
దొమ్మరాడి కియ్యకే
చాపచుట్ట మంటాడు
చంక పెట్టమంటాడు
ఇల్లెక్కమంటాడు
విద్దాలు చెయ్యమంటాడు.
గెడ యెక్కమంటాడు
గంతులు వెయ్యమంటాడు
అమ్మ నన్నుగనకే
దొమ్మరాడి కియ్యకే.

౧౪

ఆరిచేనుకాడ అన్నకన్నపట్టి
అప్పని ననుబిల్చు అల్లు డబ్బాయి

పత్తిచేనుకాడ బావకన్నపట్టి
పిన్నని నను బిల్చు భీము డబ్బాయి.

౧౫

చుక్కలలోకల్ల సొమ్ములెట్టింది
సూరన్నకిల్లాలు చంద్రన్న వదినె
మావూరిలోకల్ల సొమ్ము లెట్టింది
వీరన్నకిల్లాలు వెంకన్న వదినె.

౧౬

రాచవారియిళ్ళలో భూషణాలు వెలుగు
మాయింట అబ్బాయి కన్నుల్ల వెలుగు
భూషణాలుపెట్ట భూమియందు వెలుగు
భూపతి తమ్ముడు కలిమి జగమెల్ల వెలుగు.

౧౭

తవ్వెడుబియ్యం దంచితే తవుడెట్లు వచ్చు
దరిద్రగొట్టు చెట్టపడితె ధన మేలవచ్చు
నీళ్లమిద చెంగేస్తే నిద్రేలవచ్చు
నిర్భాగ్యుడి చెట్టపడితె సుఖమేలవచ్చు.

౧౮

అరసోల అరగిద్దె వూరేగిరాగ
అరిసికళ్ల మెల్లమ్మ నీకు నివ్వాళి
చిక్కట్టి దువ్వెన వూరేగిరాగ
చీపిరికళ్ల చిలకమ్మ నీకు నివ్వాళి
చీపురుపుల్లలు రెండు వూరేగిరాగ
చికిలికళ్ల పుల్లమ్మ నీకు నివ్వాళి.

---



గోదావరి వంతెన　　　　V. S R.

# నవ్యసాహిత్య పరిషత్తు

రాజకీయము కానివ్వండి, మతసంబంధము కానివ్వండి, భాషావిషయం కానివ్వండి, వచ్చేవిప్లవాలు పరిశీలిస్తే స్థూలంగా నాలుగు దశలు కనుపిస్తాయి. మొట్టమొదటిది ఉన్నపరిస్థితులతో అసంతృప్తి, వాటిని ఎట్లాగైనా మార్చవలెననేటి తలంపు కలగడమూను. అసంతృప్తి అందరికీ కలిగినా, ప్రజాసామాన్యానికి, సాధారణంగా ఉండే బద్ధకంచేత 'ఏమిచేస్తా'మని ఉదాసీనత వహిస్తారు. ఎట్లాగైనా వీటిని మారుస్తేనే కాని వీలులేదనే ఆలోచనా, తీవ్రమైన ఆవేదనా, ఆవేశమూ ఏకొద్దిమందో బుద్ధిమంతులకు కలుగుతుంది. అక్కడనుంచి వారు నిద్రాహారాలు మానుకుని, దీన్ని గురించి ఆలోచిస్తూ ప్రచారం సాగిస్తారు. వీరి ఉద్రేకం ఇతరులకు కూడా కలిగి కొంత బలగము ఏర్పడ్డతరువాత యుద్ధరంగంలోకి దిగుతారు.

వారికి తగినంతబలం చేరేవరకు రాజకీయంలో అయితే, వారిని జైళ్లకు పంపిస్తారు. మతసంబంధమైతే మతద్రోహులనీ, నాస్తికులనీ సంఘం వెలివేస్తుంది. భాషావిషయంలో అయితే వారు మూర్ఖులనీ, అజ్ఞానులనీ హేళన చేస్తారు మిగతావారు.

తగినంతప్రచారం సాగి, బాగా బలంచేరిన తరువాత వీరొకపార్టీగా బయలుదేరి వాగ్వాదము మానేసి తమ ఆదర్శాలను కార్యరూపంగా పరిణమింపచేస్తారు.

ఇలా కొంతకాలంగా జయప్రదంగా జరిగిందంటే, ప్రజామోదమూ, ఆదరణా పొంది అగ్రస్థానం ఆక్రమించి, అల్పసంఖ్యాకులు, బహుసంఖ్యాకులై అధికారంలోకివచ్చి, తమకార్యం తమ ఇష్టానుసారం సాగిస్తారు మనభాషావిషయంలోకూడా ఇంతాజరిగింది. గురజాడవారూ, గిడుగువారూ, వారిశిష్యులూ, ఒకపదిసంవత్సరములపాటు జరిపిన ఘోరసంగ్రామము వర్ణించడానికి ఇది సమయముకాదు. వారు అంతకుముందూ, ఆపదిసంవత్సరములూ పడ్డశ్రమ, ఖర్చుపడ్డసొమ్ము, పొందిన పరాభవములూ పరమేశ్వరునికే ఎరుక. అయితేనేమి, జయము పొందగలిగారు.

రెండవస్టేజిలో, శ్రీ శివశంకరశాస్త్రిగారి యాజమాన్యంక్రింద సాహితీసమితి బయలుదేరింది. వారికి వాదనలతోనూ, ఉపన్యాసాలతోనూ పనిలేకపోయింది. ఒక్కటే ఆలోచన. వ్యావహారికభాషావాదంలో బలముంటే, పుస్తకాలు వ్రాసిపడేస్తే ప్రజలు అంగీకరిస్తారు. అవి చదువుతారు. లేదూ, ఇంకో పదిసంవత్సరాలు వాదించినా ఇంతేనని నిశ్చయించుకుని ఒకపత్రిక సాగిస్తూ, గ్రంథరచన ప్రారంభించారు. వారి ఆదర్శము, కేవలము, వ్యావహారికభాషలో వ్రాయడమేకాకుండా, మనదేశంలోనూ, ఇతరదేశాల్లోనూ ఉండే సారస్వతస్వరూపాలను తెలుసుకుని, జీర్ణించుకుని ఆవిజ్ఞానముతో ఆంధ్రభాషకు నూతనాభరణములు కల్పించి నూత్నతేజస్సు తేవలెననడంకూడాను. పద్యరచనలోను, కథారచనలోను, నవలారచనలోను, హాస్యరచనలలోను, నాటకరచనలలోను క్రొత్తదారులు తీశారు. వారిచర్య చూవత్తూ ఆంధ్రులకు పరీక్షలాంటిది.

వీరూ చాలా ఇబ్బందులు పడ్డారు. పాతస్నేహాలు వదులుకోవలసివచ్చింది. కొంతడబ్బు ఖర్చుపెట్టవలసివచ్చింది. బొడ్డూడని పసికూనదగ్గరనుంచి వెక్కిరింతలు, వేళాకోళాలు చేస్తూంటే, కిక్కురు మనకుండా నిందకు ప్రతినింద చేయకుండా ఓపికపట్టి తమ చేతనైనట్లు భాషాసేవ చేశారు. సుమారు ఏడు సంవత్సరములు కష్టనిష్ఠురాలు పడ్డతరువాత రాజమహేంద్రవరంలో బహిరంగంగా తమ ఆదర్శములను వెల్లడిస్తూ తమ శక్తిసామర్థ్యాలను చూపుతూ మూడు నాలుగు సభలు జరిపారు. అదివరకు తెలియక ఎంత హేళన చేశారో అంత ఆదరించారు రాజమహేంద్ర పౌరులు. అది స్వల్పవిషయము. కాని ముఖ్యమైన దేమిటంటే ఆంధ్రమహాజనులు ఈనూతనపక్కీలను ఆమోదించారు.

ఇంక మనలో ఉన్న గొప్ప లోటేమిటంటే- మన్నించండి, ఉన్నమాట చెప్పినందుకు—అసహనమూ, అనుకరణమూను. సాహితీసమితి ఉచ్చలోకి వచ్చినది మొదలు, ఎన్ని సమితులు బయలుదేరినాయో లెక్కలేదు. మూడుముత్యాలసరాలు కూర్పగలిగిన మొగాడల్లా ఒకసమితి ప్రారంభించడములోకి దిగింది. ఈ ఇన్నిసమితులవారూ కలిశో, ప్రత్యేకంగానో సాహితీసమితిని, వారిరచనలనూ, అచ్చువేయించేపద్ధతులనూ మాత్రమే కాకుండా వారిజుట్టూ, కట్టూ బొట్టూ ఇత్యాదులనుకూడా నిందించనివారు, అథవా హేళనచెయ్యనివారూ లేరనే చెప్పవచ్చు. కాని వారిలో నూటికి నూరుమందికిసాహితీసమితివారి పరవళ్లే శరణ్యమంటే అతిశయోక్తి కాదు. సరే, కానివ్వండి. దానివల్ల ఎవ్వరికీ బాధలేదు. (ఇలా అన్నాననిమట్టుకు ఎవ్వరూ బాధపడవద్దు. నన్నేమీ అనవద్దని మనవి.) ప్రధానాంశమేమిటంటే, ఈనూతనాదర్శనాలు ప్రజాహృదయమును ఆకర్షించకలిగినాయి. అనుకరణము కానివ్వండి ఏమి కానివ్వండి, యువకు డన్నాడల్లా ఆంధ్రసాహిత్యంలో నూతనత్వం కావలెనంటున్నాడు, దానికోసము తగినంత కృషిచేస్తున్నాడు. ఇది చాలా శుభసూచన. యువకులే అన్నమాటేమిటి, పెద్దలూ చాలావరకు తలలూపుతున్నారు. ఇంక మన భాషావిప్లవము మూడవ దశకి వచ్చింది. వ్యక్తిప్రయత్నములు తగ్గించి, సంఘముగా కృషి చెయ్యవలె. నానాసమితులూ ఏకముకావలె. అందరి శక్తిసామర్థ్యములూ కేంద్రీకృతంచేసి, ఏకముఖంగా పోనివ్వాలి. అప్పుడు మన ఆదర్శములు పూర్తిగా కొనసాగి దిగ్విజయాన్ని పొందగలము.

ఏదో Definite గా లేకపోయినా చూచాయగానైనా ఇటువంటి ఊహతోటే ననుకుంటాను, నవ్యసాహిత్యపరిషత్తు బయలుదేరింది. కవి పండితసభ అనేపేరుతో మొదట బరంపురంలో సభ జరిగింది. ప్రయోజనమేమో తేలలేదు. ఫలితం శూన్యం. కాని ఏమిలేకపోయినా, అక్కడ కొందరికి అంతశ్శైతాలూ, వారు వేరేసభ ఏర్పాటుచేసుకోడానికి ప్రయత్నాలూ జరిగినాయి. తరువాత నేమిజరిగిందో నాకు గుర్తులేదు. తరువాత సుమారు సంవత్సరానికి రాజమహేంద్రవరంలో మళ్లీ సభ జరిగింది. అక్కడ దానికి నవ్యసాహిత్యపరిషత్తు అనే నామకరణం చేశారు. కొందరు ఉద్యోగులను ఏర్పాటుచేశారు. స్వల్పంగా కార్యక్రమం నిర్ణయించారు.

సభ్యులు లేనిదే సభ ఉండదుగదా! అటువంటిదానికి అధికారులుండి చేసేదేమిటి. ఇందులో సభ్యత్వానికి ఎటువంటి అర్హత ఉండవలెనో నిరూపించబడలేదు. ఏవిధమైన నిబంధనలూ ఏర్పాటైనట్లు కనుపించదు. సభజరిగింది. వచ్చినవారు విందులారగించారు. ఓపికఉన్నవారు ఉపన్యాసాలిచ్చారు. కొందరు తమతమపద్యాలను, కథలను— పాతవీ క్రొత్తవీ— చదివినారు. ఆరుమాసములు తిరగకుండా మళ్లీ సభజరిపారు. ఎందుకో తెలియదు. ఈ ఆరుమాసములలోను ఎంతమంది సభ్యులను చేర్చారో తెలియదు. అప్పుడు ఎన్నుకోబడ్డ అధికారులు ఏమి చెయ్యవలెననుకున్నారో, ఏమిచేశారో తెలియదు. మళ్లీ ఈసభ ఎందుకో, ఆ అధికారులలో ఎంతమంది ఈసభకు వచ్చారో తెలియదు. అయ్యా ఎందుకీ భాగోతం? క్షమించండి నిర్మొహమాటంగా అడిగినందుకు.

ఈమూడుసభలకూ అయినఖర్చు, పడ్డశ్రమ వృథా అనక తప్పదు. దానికి కారణమేమిటంటే, వాటిని తలపెట్టినవారికి కాని, జరపినవారికి కాని ఇదమిత్థం అని ఒక కార్యక్రమమంటూ లేకపోవడమనుకుంటాను. ఇంక మనకు ఉత్సవాలు దండోరాలు అవసరంలేదు ఇప్పట్లో. రెండుఉపన్యాసాలూ, మూడుకథలూ, నాలుగు పద్యాలూ ఏడాదికోసారి నలుగురూ కూడి చదువుకున్నందువల్ల ప్రయోజనం లేదు. అవి ఎప్పుడో పత్రికల్లో పడనూపడతాయి, మనము చదవనూ చదువుతాము. దానికి వార్షికోత్సవము అవసరంలేదు.

ఈపరిషత్తుపేరు సార్థకం చేసుకుని, చిరస్థాయిగా ఉండి, ప్రారంభమైన సారస్వత విప్లవాన్ని జయప్రదంగా కొనసాగించాలంటే ఒక నిర్మాణకార్యక్రమం

ఉండాలి. ఇంతసేపు ఊరికే బాతాఖానీ వేశాననుకోకుండా ఉండగలందులకు నాబుద్ధికి తోచిన సలహాలు సూక్ష్మంగా సూచిస్తున్నాను. దీనికి ఫీజుకాని, గ్రంథస్వామ్యముకాని లేదు. వీలైతే పరిషత్తువారు గ్రహించవచ్చును.

౧. ఈపరిషత్తు నవ్య ఆంధ్రసారస్వతమును దిగంతములకు వ్యాపించేటట్టు చెయ్యవలె. అందుకు మొదటి పని దీని నొక Registered body గా చెయ్యవలె.

౨. ఆంధ్రసారస్వతములో నవ్యత్వమును అపేక్షించే ప్రతిఆంధ్రునీ కాంగ్రెసులో చేర్చినట్లు బేడో, పావలో తీసుకుని ఇందులో సభ్యునిగా చేర్చవలె.

౩. వెంటనే గ్రంథప్రచురణశాఖ ఒకటి ప్రారంభించి సభ్యులలో సమర్థులైనవారిని ఏరి, ప్రస్తుత నాగరికతకూ, విజ్ఞానమునకూ అగత్యమైన ప్రతివిషయమునుగురించీ మొట్టమొదట చిన్న పుస్తకములు, తరువాత ఎక్కువ విపులంగానూ తయారు చేయించి ప్రచురించవలె. నాలుగైదుసంవత్సరములలో ఫలానావిషయాన్ని గురించి తెలుగులో పుస్తకం లేదు అనే లోటు లేకుండా చెయ్యవలె.

౪. ఇంగ్లీషులోనూ, తెలుగులోనూ అన్ని విషయాలను గురించి సంపూర్ణమైన గ్రంథాలయము ఒకటి ఏర్పాటుచెయ్యవలె.

౫. సభ్యులలో కొందరిని ప్రచారకులనుగా నియమించి వారు ఆంధ్రదేశంలో ప్రతిపల్లెకూ వెళ్లి వివిధ విషయాలనుగురించి ఉపన్యాసాలిచ్చే ఏర్పాటు చెయ్యవలె.

౬. ఇందులోనే లలితకళలకు అన్నిటికీ స్థానముండవలె.

౭. సమర్థులైనవారికి ధనసహాయము చేసి కొన్ని కొన్ని విషయాలలో మనదేశంలో కాని, విదేశాలలో కాని పరిశోధన చెయ్యడానికి ఏర్పాటు చెయ్యవలె.

ఇంకా ఇలాటివెన్నో చెయ్యవలసి ఉన్నాయి. ఇటువంటి ఉద్దేశాలేవీ లేకపోతే, ఏకార్యమూ సాధించలేకపోతే పరిషత్తెందుకు? ఆ పేరుకు తగదు. ఈచేసే ఖర్చుకు తగదు. సంవత్సరానికి మూడురోజులు పదిమందితో సభజరపడానికీ, నాలుగుకథలూ పద్యాలతోటి మూడుమాసముల కొకపత్రికవెయ్యడానికి పరిషత్తెందుకూ? ఏమో నాకు మట్టుకు హాస్యాస్పదంగా ఉంది. కష్టం వ్యయప్రయాసలతోటి కూడుకున్నదంటారా? అవును, అందుకనే పరిషత్తు. లేకపోతే ఎందుకూ. నేనూ పెడతాను రేపో పరిషత్తు. ఇప్పుడున్నవానికంటె దీని విశేషమేమిటి?

పెద్ద పేరు పెట్టడం, కష్టపడకుండా ఖ్యాతి కావాలనడమూ మనఆంధ్రుల లోపాల్లో ఒకటి. ఆకళంకం ఇటువంటి పరిషత్తుకు రాకూడదనే అభిమానంచేత ఇంతదూరం చెప్పవలసివచ్చింది. అంతేనే కాని మరొకటి కాదని నామనవి.

——నవ్యసాహిత్యప్రియుడు

# వాన్ హిండింబర్గు

జరుగుమిల్లి సాంబశివరావు

స్వార్థత్యాగి, ఆధునిక జర్మనీపునర్నిర్మాత, జర్మనీ దేశోద్ధారకుడు, ధీరశాంతుడు, ప్రేమమూర్తి, సత్యస్వరూపుడు, నిష్పాక్షిక స్వభావుడు, అచంచల స్వామి భక్తి పరాయణుడు, అద్వితీయ పితృ దేశ సేవానిరతుడు, ట్యానన్బర్గు రణవిజయుడు, 'హిండింబర్గు పంక్తి' విఖ్యాతియశుడు, ఐరోపామహాసంగ్రామమున మిత్రమండలిని తల్లడిల్లజేసిన పరాక్రమశాలి వాన్ హిండింబర్గు తేజోరాశి ౧౯౩౪ ఆగస్టు, ౨-వ తేదిని అస్తమించినాడు.



వాన్ హిండింబర్గు.

విశ్రాంతిని కోరు వృద్ధాప్యమున స్వీయ సౌఖ్యమును తృణప్రాయముగ తిరస్కరించి పితృదేశ రక్షణ ధురాయణుడై ౧౯౧౪ సంవత్సరమున నడుము బిగించి స్వామిభక్తి తత్పరుడయి కెయిజరు చక్రవర్తిమాట జవదాటకుండ రణరంగమున దురికి శత్రుకోటిని చీకాకు పరచినాడు. జర్మనీయుద్ధమున పద్మవ్యూహములను పన్నినాడు. హిండింబర్గు పంక్తియే పద్మవ్యూహమను పేర బరగుచున్నది. నేటికి కూడ హిండింబర్గు పంక్తి యన్న చారిత్రమున, నిఘంటువులయందును 'అభేద్య పంక్తి' యని గ్రంథస్థమైనది.

అచంచల రాజపక్షపాతి అయినను, రిపబ్లికు ప్రభుత్వాధ్యక్షపదవిని స్వీకరించి పరిపాలనమును దిగ్విజయముగ సాగించి అన్ని పక్షముల భక్తి విశ్వాసములను చూరగొన్నాడు. రెండుసారులు జర్మను ప్రజలు అన్ని పక్షములవారును లక్షోపలక్షలుగ హిండింబర్గును రిపబ్లికు ప్రభుత్వాధ్యక్షునిగ ఎన్నుకొనుటయే ఆతని నిష్పాక్షిక పరిపాలనము, సమానదృష్టికిని, ప్రమాణము. రిపబ్లికుప్రభుత్వమున రాజుపక్షమువారిని మంత్రులుగ నియమించెను.

౨౦ సంవత్సరముల క్రిందట జర్మను సామ్రాజ్య విజయము ప్రకటింపబడిన ఆ వెర్సెయిల్సు అద్దాలగదిలోనే జర్మనీపతనపు టొడంబడికలో విధిలేక కంటతడి బెట్టుచు ఇతడు సంతకముపెట్టి కాలమునకు కట్టుబడినాడు. కాని తాను విగతజీవుడగులోపుగ జర్మనీ మరల నలుగురిలో సమానగౌరవమును బడయునటుల చేసి తీరెదనని బద్ధకంకణుడయినాడు. అన్నమాటను నెరవేర్చినాడు. జర్మనీకి జాతిసమితిలో స్థానమును సాధించినాడు. ఐరోపామహాసంగ్రామమునకు జర్మనీయేఉత్తరవాది యని కావించిన తీర్మానమును వెర్సెయిల్సు ఒడంబడికనుండి రద్దుచేయించినాడు.

హిండింబర్గు మరణమునకు జర్మనీతోపాటు యూరపు అంతయు వగచుచున్నది. ఆత డస్తమించు

టచే మరల యూరపునకు చేటు మూడునని యూరపు అంతయు గజగజ వడంకుచున్నది. హిండింబర్గు ఉన్నంత కాలము యూరపు హాయిగ నిద్రించెను. హిండింబర్గు జర్మనీలో అన్ని పక్షములవారికిని, హిట్లరు నకును అంకుశముగ నుండెను. ఈ అంకుశము ఇపుడు అంతరించుటచే హిట్లరు ఎట్టి విపత్తును దెచ్చిపెట్టునో యని ఫ్రాంసు భయపడుచున్నది. బాల్కను రాజ్యములు దిగులొందుచున్నవి.

హిండింబర్గు సంపూర్ణనామము పాల్టర్ హాన్సు ఫాన్ డెర్ కెర్డోస్ఫు వాన్ హిండింబర్గు. ఇతని జననకాలము ౧౮౪౭. జన్మస్థానము పోసెన్. హిండింబర్గు జనకుడు సైనికోద్యోగి. జనని భిషగ్వరుని పుత్రిక. హిండింబర్గు సైలీషియా సైనిక కళాశాలయందును, బెర్లిను ప్రధాన సైనిక కళాశాలయందును శిక్షణమును బడసెను. ౧౮౬౬ లో ౧౯ సంవత్సరమున నతడు సైన్యములో చేరెను. డాన్జిగు మూడవ కాల్బలమునకు లెఫ్టినెంటుగ నియమింపబడెను. ఆస్ట్రియాతో పోరి గ్రాంటజు రణరంగమున ఇతడు క్షతగాత్రుడయ్యెను. ౧౮౭౦ లో ఫ్రాంకో జర్మను యుద్ధములో ప్యారిసును ముట్టడించెను. ౩౧ సంవత్సరముల ప్రాయమున ౧౮౭౮ లో హిండింబర్గు సేనాధిపత్యమును వహించెను. ౪౦-వ సంవత్సరమున ౮ పటాలములకు అధికారి ఆయెను. ౧౮౯౭ లో మేజరు జనరలు పదవిని బొందెను. ౧౯౦౦ లో లెఫ్టినెంటు జనరలుగ నియమింపబడెను. ౧౯౧౧ లో సైనిక వృత్తినుండి విరమించెను. విరమించిన మూడుసంవత్సరములకే మరల హస్తమున ఖడ్గమును ధరించి దేశ ఋణమును, స్వామి ఋణమును తీర్చుకొనెను. ౬౮ సంవత్సరములు నిండినను గట్టి యోధునివలె అకుంఠిత పరాక్రమముతో రణమున బోరుసల్పెను. ఇతని రణనైపుణ్యము ప్రపంచ మంతటను ఆశ్చర్యమును కలుగజేసెను.

రష్యనులు తూర్పు ప్రష్యాపై దండెత్తిరి. కైజరు చక్రవర్తి హిండింబర్గును సేనాధిపతిగ నియమించెను. లొలుత నాతడు నిరాకరించెను. కైజరు బ్రతిమాలగ ఎట్టకేలకు రైలుబండిలో నున్న లూడెన్డార్ఫు సేనానితో ఆలోచించి రైలుస్టేషనువద్ద నుండి తంతిమూలముగ కైజరునకు తన సమ్మతిని తెలియజేసెను. రష్యాసేనలను అస్త్రప్రయోగము లేకనే పలాయనమొనర్చునటులజేసెను. దీనినే మసూరీ లేక్సు యుద్ధమనెదరు. మసూరీలేక్సు చిత్తడినేల. ఆ రొంపిలో రష్యా సైన్యములు దిగబడునటుల హిండింబర్గు వ్యూహమును పన్నెను. మొదట సేనానులు, సైనికులు హిండింబర్గుపన్నుగడకు నవ్విరి. ఇతనికిని మతి లేదా యని శంకించిరి. కాని తరువాత తామే పార బడితిమని తెలుసుకొనిరి. లూడెన్డార్ఫు సేనాని ఈ యుద్ధమున హిండింబర్గునకు కుడిభుజముగ నుండెను. మసూరిలేక్సు యుద్ధానంతరమున పోలండుతో పోరి హిండింబర్గు జర్మనీకి విజయము చేకూర్చెను. ౧౯౧౬ లో హిండింబర్గు సర్వసేనాధిపతి ఆయెను. ౧౯౧౮ లో హిండింబర్గు లూడెన్డార్ఫులు యుద్ధమున ఓడిపోయిరి. ఇక సమరమొనర్చి ప్రయోజనము లేదని వీరు గ్రహించి తమ సైన్యములను రణరంగమునుండి ౧౯౧౮ లో మరలించిరి.

తరువాత హిండింబర్గు హనోవరులో నివసించుచుండెను. అపుడాతడు తన జీవితచరిత్రను లేఖల రూపమున వ్రాయుచుండెను. ఆ లేఖలు ౧౯౨౦ లో గ్రంథస్థమాయెను.

౧౯౨౫ లో జర్మనీరిపబ్లిక ప్రభుత్వాధ్యక్షుడు పరమపదించెను. ఆతని స్థానమున హిండింబర్గు ఎన్నుకొనబడెను. వృద్ధాప్యమని సంశయింపక ౭౮ సంవత్సరముల వయస్సున దేశారాధనమే ప్రధానమని తల పోసి రాజ్యపాలనాభారమును నిర్వహించుటకు హిండింబర్గు పూనుకొనెను.

హిండింబర్గు వెర్సెయిల్సు ఒడంబడికను సంతకము చేసెనని లూడెన్డార్ఫు హిండింబర్గును బహిరంగముగ ద్రోహియని ఖండించెను. కాని హిండింబర్గు చలింపలేదు. ఆవంతయు కినుక వహించలేదు సరికదా, లూడెన్డార్ఫుఅసమర్థతచే జర్మనీ అపజయము గాంచెననియు, అందుచే ఆతనిని దండించవలెననియు

దేశమంతయు కోరగా హిండింబర్గు నీచమానవులవలె సమయము దొరికెను గదాయని తన పగను లూడెక్ డార్ఫుపై సాధించలేదు. అందాతడు తన ధర్మమును చక్కగ నిర్వహించెను. కాని ఆతని తప్పేమియు లేదనెను. నేనును లూడెక్ డార్ఫును కలిసి పోరుటచే నేనుకూడ లూడెక్ డార్ఫుతో ఉత్తరవాది నగుదు ననెను. కాన నన్నుగూడ దండింపవలసియుండును. దీనివలన ఆతని కెదురాడజాలక లూడెక్ డార్ఫును వదలిపెట్టిరి. అపకారికి నుపకారము చేయువాడు ధన్యుడు సుమతీయనునది హిండింబర్గునందు సార్థకమాయెను.

హిండింబర్గు పట్ల జర్మనులు తమ భక్తి విశ్వాసములను జూపుటకు ఆతని ౮౦-వ జన్మదినోత్సవమునకు హిండింబర్గునిధియని అయిదులక్షలపౌనులను ప్రోగుజేసి హిండింబర్గుగారికి సమర్పించిరి.

౧౯౩౦లో హిండింబర్గు డిక్టేటరుగ నియమింపబడెను. ౧౯౩౨లో అధ్యక్షపదవికి రెండవసారి హిట్లరు హిండింబర్గుకు పోటీ వచ్చెను. హిండింబర్గు గెల్చెను. హిట్లరు ఓడెను. ౧౯౧౮ జర్మనీ యుద్ధమున తనపై కుట్రలను బన్నిన వాన్ ప్యాఫెనును హిట్లరు చంపింపనుండ హిండింబర్గు వ్యాధిగ్రస్తుడై యుండియు హిట్లరును వారించి ఆతనికి ప్రాణదాన మొనర్చెను. ౧౯౩౨లో ప్యాఫెనును హిండింబర్గు ప్రషియా డిక్టేటరుగ నియమించెను. రిపబ్లికను పక్షపాతిని వాన్ క్లీవరును ఛాన్సెలరుగ నియమించెను.

౧౯౩౨ జూలై ౩౧-వ తేదీని జరిగిన 'రిచిస్టాగు' ఎన్నికలలో హిట్లరుపక్షము గెల్చెను. కాని ఆతనికి స్వతంత్రబలము లేకుండుటచే ప్యాపెనుతో మంత్రివర్గము నేర్పరచవలెనని హిండింబర్గు హిట్లరును కోరెను. కాని హిట్లరు అంగీకరించడాయెను. ఆందోళనము కూడదని హిండింబర్గు హిట్లరును హెచ్చరించెను. హద్దుమీరినచో "పాతాళహోమము" గావించెద ననెను.

హిట్లరుపక్షమువారు మంత్రివర్గముపై విశ్వాసరాహిత్య తీర్మానమును ప్రవేశపెట్టిరి. మంత్రివర్గము ఓడిపోయెను. అయినను హిండింబర్గు లక్ష్యము చేయలేదు.

౧౯౩౨ నవంబరు ఎన్నికలలో హిట్లరు పక్షబలము తగ్గెను. కావున సంయుక్త మంత్రివర్గ మేర్పడెను. ఇందు నాజీలు, జాతీయవాదులు కలిసిరి. ఈలోపుగ వాన్ ష్లీషరు విప్లవమును సాగించుటకు ప్రయత్నించుచున్నాడని తెలిసి ఛాన్సిలరుపదవినుండి ఆతడు తొలగింపబడెను. హిట్లరు అధికసంఖ్యాకులచే ఎన్నుకొనబడుటచే ఛాన్సిలరుగ నియమించబడెను. ఈ ష్లీషరునే హిట్లరు మరల ఆతడు విప్లవమును తలపెట్టెనని తెలిసి మొనమొన్న హతమార్చినది.

౧౯౩౨లో రిచిస్టాగు సమావేశమైనపుడు హిండింబర్గు సర్వసేనాధిపతి దుస్తులతో దేవళమున ప్రవేశించి రాజకుటుంబమునకు జోహారులొనర్చి తన స్వామిభక్తి పరాయణతను ఇంకొకసారి వెల్లడించెను. అవసానకాలమున కూడ కెయిజరునకు కృతజ్ఞతను తెలిపెను.

రిపబ్లికు పతాకమును తొలగించి సామ్రాజ్య పతాకమును, స్వస్తిపతాకమును విరాజిల్లజేసెను. ఎన్నటికైన జర్మనీ కెయిజరుగాని ఆతని కుటుంబపాలనమున గాని నుండవలెననే హిండింబర్గు నిశ్చితాభిప్రాయము. తదనుగుణముగ తనమరణశాసనమున కెయిజరు సంతతి వారి నెవరినైన ప్రభుత్వాధ్యక్షునిగ నియమించవలెనని కడపటి కోర్కెగా తెలిపెను.

౧౯౩౩ మార్చిలో హిండింబర్గు నాల్గేండ్లవరకు హిట్లరును డిక్టేటరుగ నియమించెను.

హిట్లరు అన్న హిండింబర్గునకు పంచప్రాణములు. జర్మనీ భావిభాగ్యోదయకర్త హిట్లరే యని అతడు తన మరణశాసనమున తెలిపెను. రీచి ప్రభుత్వమును, కెయిజరును హిట్లరే ఉద్ధరించువాడనెను. ఇంతకాలము హిండింబర్గు సూత్రధారుడుగనుండి జర్మనీని నడిపించెను. తాను నిష్క్రమించుసరికి తన స్థానమున హిట్లరును నియమించెను.

ఆసింహస్వరూపము, ఆగంభీరవిగ్రహము, ఇక కన్పించదు. సైన్యములు బారులుదీర్చి నిలబడి హిండింబర్గునకు ప్రణామములొనర్చు వేళ ఆజానుబాహుడగు

ఆతని మూర్తిని జూచినవార్లకు ఆ గంభీర మూర్తి మరపునకు రాదు. జర్మనీని కష్టసమయమున సురక్షితముగ నడిపించగల్గిన గొప్పవ్యక్తి ఆతడు. ప్రపంచశాంతికి తోడ్పడిన ఆతని మరణమునకు ప్రపంచమంతయు శోకించుచున్నది. యుద్ధానంతరము యుద్ధము మరపునకు రాకుండ హిండింబర్గు తోడ్పడెను. ఆధునిక కాలమున రణధీరులలో ఎవరును ప్రపంచమంతయు ఆశ్చర్యమొందునట్లు రాజ్యభారమును ఇంత గొప్పగా నిర్వహించినవారు లేరు. హిండింబర్గు మనసునకు తోచినటుల చేయువాడే కాని ఒకరేమనుకొనెదరో యని జంకువాడు కాడు. ఒరుల ఆగ్రహానుగ్రహములను పాటించువాడు కాడు. రాజకీయములందు స్వోత్కర్ష ఎంతమాత్రము నెరుగడు. నిరాడంబరుడు. కార్యసాఫల్యమే ఆతని పరమావధి. రాజసేవ, ప్రజాసేవ ఆతని లక్ష్యములు.

జర్మను యుద్ధానంతరమున ౧౯౧౮ లో మిత్రమండలి కెయిజరును ఉరిదీయుటకు ప్రయత్నింపగా ఆసంగతి తెలిసి హిండింబర్గు కెయిజరుకు మారు తనను ఉరిదీయవలెనని తెలిపి తన యకుంఠిత స్వామిభక్తిని వెల్లడించినాడు. పరిస్థితులెంత నిరుత్సాహకరముగ నున్నను ఆతనికి ఆవంతయు దిగులు లేదు. కార్యోత్సాహమే ఆతని దివ్వె. జర్మనీ యన్న మరల భయభక్తులను కలుగజేసినాడు హిండింబర్గు. గనుకనే సింహబలునివలె మొక్కవోని ధైర్యముతో నిలబడి 'పితృదేశ'మును కాపాడి తన ఋణములను తీర్చుకొనెను.

హిండింబర్గు తనకండ్లయెదుట జర్మనీ విజృంభణమును సర్వవ్యాప్తిని గాంచినాడు. తన కన్నులయెదుటనే ౧౯౧౮ లో జర్మనీపతనమును జూచినాడు. మరల దానిని ఉద్ధరించినాడు.

దారి తెన్ను లేక అధఃపతితమై జర్మను దేశము యొక్క సైనికులు, ప్రజలు జోహారు లొనర్చుచు కనుసన్నల మెలగుట హిండింబర్గు కార్యదీక్షను, కార్యదక్షతను వేయినోళ్ల బొగడుచున్నవి.

౧౯౨౫ విదేశపత్రికలన్నియు హిండింబర్గుపై ధ్వజమెత్తెను. దారుణముగ ప్రతికూల ప్రచారమును సాగించెను. హిండింబర్గువంటి ఉపద్రవకరుడు లేడనినవి. రక్తపిపాసగల వేటకుక్కవంటివాడనినవి.

హిండింబర్గు ౮౬ సంవత్సరములు జీవించెనన్నమాటగాని ఒక్కనాడుకూడ నాటకములను జూచి ఎరుగడు. తుదకు ౧౯౨౫ లో పోట్సుడాంనందు కెయిజరు సొంత నాటకశాలయందు ౧౯౧౪ యుద్ధమునకు పూర్వమున్న ప్రతిభను ప్రకటించి ఆనందించుటకు గావింపబడిన ప్రభుత్వనాట్య ప్రదర్శనమునకు కూడపోలేదు.

తనరాయబారులకు, మంత్రులకు ఏడాదికొకసారి విందొసగుట తప్ప మరేమియు ఆతడు చేసియెరుగడు. బెర్లినులో హిండింబర్గు అరుదుగ వసించెడివాడు. అవకాశము చిక్కినపుడెల్ల ఆతడు తన స్వగ్రామమునకు పోయెడివాడు. పల్లెలయందే సుఖముగ కాలమును గడుపుచుండెడివాడు.

జర్మనీలో తనతో అధ్యక్షపదవికి పోటీసల్పిన ప్రత్యర్థులకు కూడ వారి ప్రచారమునకు వలయు సౌకర్యముల నన్నిటిని కలుగజేసెను. ప్రత్యర్థుల బ్రాడ్‌కాస్టు ఎన్నిక ప్రచారమునకు సమ్మతింపదని తనపక్షమువారెంత వలదన్నను వారి మాటను పెడచెవినిబెట్టి ప్రత్యర్థులకు న్యాయమును కలుగజేసిన న్యాయమూర్తి హిండింబర్గు.

హిండింబర్గు ఉషఃకాలముననే నిద్రనుండి లేచును. తిండిపోతురాయడు కాడు. అతి స్వల్పముగ భుజించువాడు. రాత్రి ౯ గంటలు దాటి ఎన్నడును పరుండి ఎఱుగడు. రణరంగమున నున్నను ౯ గంటలు సరికి శయనించవలసినదే. శరీరసాధకమును చేయువాడు. భోగలాలసుడు కాడు. ఇకాకారణంబుల జేసియే వృద్ధాప్యము వచ్చినను ఆతడు ఉక్కుతునుకవలె చెక్కుచెదరక కార్యభారమును నిర్వహించగల్గెను. ఇట్టి గొప్పవ్యక్తిని ప్రపంచము కోలుపోయి తీరనివిచారమునకు గురియైనది.

---



# విమర్శనములు

**హిందూలా : సమష్టికుటుంబము**

గ్రంథకర్త : చాగంటి శేషయ్య గారు.

ప్రకాశకులు : హిందూధర్మశాస్త్ర గ్రం. నిలయము. కపిలేశ్వరపురము, తూర్పుగోదావరి, వెల రు. 3.

గ్రంథవిషయము గ్రంథహృదయము; గ్రంథరచనము గ్రంథముఖము. హృదయమునకు ప్రతిబింబము ముఖము. ప్రత్యేకగ్రంథరచనావిధానము ప్రత్యేకగ్రంథవిషయము ననుసరించియుండును. కళారచనము కాంతివంతమైయుండును. శాస్త్రవిషయము తెల్లబట్టవలెనుండును. 'లా' భౌతికశాస్త్రము. హృదయకుంజమందుగాక ఇది మేధస్స్థానమందు బుట్టినది. ఇది రంగులెరుగదు. దీని రూపము స్పష్టమైనది.

భావసూత్రములు దీసి గీతికలల్లుట నిఘంటుకర్త పనిగాదు. ఓపిక ఎత్తయియుండెనేని, అందుండి బహుశబ్దముల నీతడు లోకముపై రువ్వగలడు. ఈపనియందు ఆరితేరినవ్యక్తి గొప్పపండితుడు కావచ్చును; కష్టమునకు వెనుదీయని సేవకుడును గావచ్చును; కాని ఇతడుకవివిహంగముకాడు. వ్యవహారనిర్వహణమునకు చేతికబ్బియను 'లా' రచనము గంభీరమైనది కాకున్నను నిఘంటురచనమువంటిదికాదు. అయినను దీని కథ దూరమైనది కాదు.

'లా' భౌతికశాస్త్ర మంటిమి కాదా? నిఘంటువో? ఇదిశాస్త్రమును కాదు, కళయును కాదు.—దీనియందు సృష్టికి తావులేదు. కవిత్వసులభభావనాశక్తికి భౌతికశాస్త్రమున నెలవులేకున్నను, స్వతంత్రవిచారమునకును, సహజవిజ్ఞానవిజృంభణమునకును ఎంతేనిచోటున్నది. 'లా'వంటి భౌతికశాస్త్రము మఱొకటి లేదు. తక్కినభౌతికశాస్త్రములు అచేతనవస్తువులతోడను, చేతికందక సుదూరమునను్న దృశ్యములతోడను ప్రసక్తిగలిగియుండ, మనసును, బుద్ధిని కలిగి, విభిన్నప్రవృత్తులందు మసలు మనుజునితో ప్రసక్తి గలిగిన అద్భుతశాస్త్రము 'లా', మనశ్శాస్త్ర, నీతిశాస్త్ర, తర్కశాస్త్రములు కలిగిన గాని శాసనశాస్త్రగ్రహణము సాధ్యముకాదు. పట్టివడ్లను తెచ్చి శాసనశాస్త్రసూత్రమనువాడు సరకులేనిలాయరు. నీతిశాస్త్ర, మనశ్శాస్త్రము తెలుగనిన్యాయవాది ఆవిరియంత్రములను నడపుటకు పనికివచ్చునేమో గాని భువనముల నంతరంగమున సదియించుకొని మసలు మనుజుని నడుపుటకు పనికిరాడు. శాసనసూత్రములు చచ్చినమోడులుగాక జీవనసంచారముగల భావములు. ఈనిబంధనములు సద్యోగర్భముదాల్చిన 'లా'గ్రంథముల శిశువులు కావు. ఇవి ఎన్నియో అవతారము లెత్తి చూపట్టు దైవతములు. వ్యక్తిజీవనమునకును, సంఘజీవనమునకును రాపిడి గలుగనీకుండ ఇవి రక్షణమార్గమును చూపును. సూక్ష్మపరిశీలనము, అంగాంగ విభజనము, అనావశ్యకభాగ విసర్జనము, అగత్యాంశ సంసృష్టి మున్నగు ఘట్టములందు మునిగి, నిండిన కుండలై చేతికందునవి నియమములు. పరిశీలించితిమేని వీనియందు తత్త్వపరిజ్ఞానము తొణకుచుండును. ఎంతో వెలుతురును హృదియందిముడ్చుకొనిన చిన్ని దీపికలవంటిది ఈనిబంధనములు. పరికించితిమేని శాసన సూత్రములు విశాల హృదయమును కలవని గ్రహింపజాలుదుము.

మెయిన్, గోలప్‌లాలుల 'హింమాలా'లలో కొంత గభీరత్వము కలదు. రోజూకావలసిన పప్పుఉప్పు శముల కీవిజ్ఞానఘోష ఏల యనువారికి మెయిన్ పుస్తకము నచ్చదు. సూక్ష్మములో మోక్షము కావలెననువారికిని, కోర్టుకంతునకు అక్కరను సరుకుతో సంతృప్తి పడువారికిని, విషయమందు గ్రుంకులిడనోల్లక చల్లగ పరీక్షలందు తేలవలె నని వాంఛించు విద్యార్థులకును పనికివచ్చు పుస్తకములు వేఱు. హెచ్. బేనర్జీయొక్క 'హింమాలా' ఈపుస్తకశ్రేణిలోనిది. ముల్లా-హిందులా విశేషముగ విద్యార్థుల కుపయోగించునదియే. చెప్పినదే చెప్పుట ఇతనికి వాడుక. విద్యార్థులకు కావలసిన దిది. లాసూత్రములు కలకంఠముక్కలు కావు. క్రొత్తవారిపట్ల ఇవి బంతరాళ్లు. ఎన్నో సమ్మెటపోటులు పడనిదే ఇవి తొలుత కొరుకుడుపడవు. ఇది ఎఱిగిన గడుసువాడు కావున ముల్లా అట్లు వ్రాసినాడు. కొంతదనుక గాక విశేషముగా ప్రజ్ఞాధురీణుడు ఎమ్. ఆర్. జయకరు ముల్లాహింమాలారచనలో పాల్గొనియున్న యెడల విద్యార్థుల సంతరణశక్తి కది మించియుండెడిది.

తెలుగులో శ్రీ చాగంటి శేషయ్యగారు వ్రాసిన ఈ'హింమాలా'పుస్తకము నిత్యకృత్యములకు పనికివచ్చు పదార్థముల 'కొట్టుగది'. సమష్టికుటుంబమునుగురించి వ్రాయనగున దింతియేయని తెలుపజాలను. గ్రంథమందు విషయపఠనము విపులమైయుండుట మెచ్చదగినది. గట్టి పనికి లొంగని నిఘంటుకర్తవలె శేషయ్యగారు పట్టుపట్టి కలము సాగించిరి. జనసామాన్యమునకై శ్రమించు మహనీయులలో నొకరు వీరు. పామరులకు వలసినది అతలసుతలరసాతలములనుండి పొంగిపొరలు న్యాయశాస్త్రపరిజ్ఞానము కాదు. వారభిలషించునది అద్భుతానందములను రేకెత్తించు మహోన్నతమైన సంజీవిపర్వతము కాదు. చిన్ని 'సంజీవిపుడక' వారికి పదివేలు. న్యాయశాస్త్రసూత్రము లెఱుగక అనవసర వ్యాజ్యములలోనికి దిగుచు, ధనవ్యయమునకును, కాలహరణమునకును, మనస్తాపమునకును గురియగు అభాగుల కీపుస్తకము రక్షణహస్తము నీయగలదు. గ్రంథమందు దోచుచున్నది. విజ్ఞానసౌరభముగాక ఘర్మధారయే యైనను, పల్లెప్రాంతములందు మసలునది కావున దీనిప్రాశస్త్యము విశేషమై యుండును.

హింమాలా Civil Procedure Code, Criminal Procedure Code, Evidence Act లవంటిది కాదు. పండినపంటకు తావు కాజాలునది హింమాలా! తీయని తిండికి పత్రము కాగలుగునది హింమాలా!! తిండిగాని, తీపిగాని, పండుగాని, పంటగాని కోరువారి కీగ్రంథము కొరగాదు. ఇది నోరూరించునది కాదు. పనిజరుపుకొనుటకు అక్కరయగు సూత్రముల దస్తర మిది. దృష్టాంతముల మోపుకూడను. చాలబరువు కలది. ఎంతో ఓపిక ఉన్నగాని ఇట్టిపని జరుగనేరదు. విషయమును పిడికిలియందు బట్టగలిగిన శ్రీ శేషయ్యగారిప్రజ్ఞ ప్రశంసనీయమైనది.

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి

---

## కవిత్రయావేదన

ఇది, యొకపద్యరూపమగు విమర్శగ్రంథము. గ్రంథకర్త: పండిత పెనుమెచ్చ సత్యనారాయణరాజుగారు. క్రౌను ౬౮ పుటలు. చక్కని అచ్చు. మంచికాగితము, వెలం-౮-౦. ప్రకాశకులు: పి. ఎస్. రాజు బ్రదర్సు, తెణుకు.

గ్రంథకర్త గ్రాంథికభాషాభిమాని. తదుద్ధరణమునకయి దీక్ష బూనినవారిలో నొకరు. నేటి భావకవిత్వమనినను, వ్యావహారికభాషయనినను ఏమాత్రము గిట్టనియాతఁడు. "గ్రామ్యగ్రాంథికభాషలకుఁ గలయిక ఘుమరనట్లే ప్రాచీన నవీన కవిత్వములకును నెయ్యంబు వేయేండ్లకైనియుఁ బొసఁగ" దని యాతని మతము.

నేటి భావకవిత్వమున భావము పూర్ణానుస్వారమనియు, భావకవు 'లసూయ' లనియు, వ్యావహారికభాష "గ్రామ్య" మనియు గ్రంథకర్త పలుతావులఁ దనయభిప్రాయమును ప్రకటించెను. ఇప్పటివారు గ్రాంథికాంధ్రము పట్లఁజూపు ననాదరణమునకు దురపిల్లి దాని నుద్ధరించుకొఱకే యీగ్రంథరచనకుఁ గడఁగెను.

తన కోరిక సఫలమగుటకుఁ గథాకల్పన యొకటి పరమసాధనమని యెంచి కవి యిందు కవిత్రయము

వారిని పాత్రలఁగఁ బ్రవేశపెట్టి వారిని భాషాస్థితికి దురపిల్లఁజేసెను. "కవిత్రయము"వారి "ఆవేదన"యే యింపలిప్రధానవస్తువు. వారు తమ భారతవాఙ్మయమునకుఁ గలిగినయిడుములకు కటకటంబడి, తమవాఙ్మయము నుద్ధరింప సమర్థుఁ డెవ్వరని యాలోచించి తుదకు జయపురాధీశ్వరుఁడును, గ్రాంథికభాషాభిమానియు నగు శ్రీ విక్రమదేవవర్మప్రభువుకడ తమగోడు వెల్లడించిరి. ఆ ప్రభువు "భూచక్రము నేలువారి నుతిసల్పుచు గ్రంథములెల్ల వారికై చక్రులుగాఁ దలంచి యిడు సన్మతులౌటను దొంటిదృష్టిమైఁ బ్రక్రియభంగమొందకయ వచ్చిరి నాకడ కొడ్లఁగాంచకే——" "అమరనొకమాట చెప్పెద నయ్య! తమకుఁ దానఁగల సామరస్యము దారయెఱిఁగికొనుఁడు, లోభిత్వమును నాకు గొనకొని తసలుపకయ త్రికాలవేదులు విపులమతులు—" "ఆయతి విశ్వదాతఁగన నంతయుఁ జొప్పడు, వంతరాదగూఁ బోయినపోకగా నతనిపొంతకుఁ బొందు మఱొక్కరీతి నాశ్రియుకుఁ డెంచఁబోఁడు తమసెప్పినచొప్పునఁ బ్రాక్తనాంధ్రమే యేయెడ వృద్ధిఁ గాంచఁగను నెంతటికైనను నాతఁడొప్పఁడే!" నావును "వారలు భావములం దుత్తలించి పయనంబగుచు" "ఆంధ్రభారతీపత్రిక లాంధ్రగ్రంథమాల విజ్ఞానసర్వస్వమోలి నాల్గుభుజములై యడరఁ దెలుంగుపాలఁతిఁ గాచు" దేశోద్ధారకుని, విశ్వదాతను, శ్రీనాగేశ్వరరాయుని జేరి మొఱపెట్టుకొనిరి. అపుడు "విశ్వదాత యతిమోదమునఁ బొంగి" "తమతలంపు వట్టి తప్పు, కింతటినుండి నడచువాఁడ" నని నొడివెను. కవిత్రయమువా రాతనిని దీవించి "వ్రేల్మిడి చనిరి". ఇన్నాటయొక్క పద్యములతోఁ బుస్తకముఁ బూర్తియయినది.

"ఇందు" కవి "సొంత మేదియు లేదు. భాషాద్రవ్యమను, భావరత్నములును కవిత్రయము వారివ. మిగిలినసొత్తు" ఎవ్వరిదైన నేమి?

"అవియె శబ్దములును నవియె భావములైనఁ బదునొక్కకథనె పాడనిమ్ము, కూర్పునేర్పుచేతఁ గ్రొత్తవౌ కావ్యముల్......" అని కవియు తృప్తిఁజెందెను.

ఇందు వ్యావహారికభాషాభిమానులు, భావకవులు, భారతముపై ప్రతికూలవిమర్శనలు చేసినవారును దూషింపఁబడిరి. భారతవిమర్శకులదూషణ యిందు ఔచితిని కోలుపోయినది. గ్రంథకర్త తాను గ్రాంథికభాషాభిమానులని తలఁచిన కొందఱు పండితకవులను ఇందు పొగడెను.

వ్యావహారికభాష "గ్రామ్య" మనుకొను గ్రంథకర్తప్రయోగములుకూడ కొన్ని వ్యాకరణవిలక్షణములు కలవు.

విశ్వదాత గ్రాంథికభాషను సముద్ధరింప కవిత్రయమువారికి అభయమొసఁగిన ట్లిందున్నది. ఎవ రేది కోరినను "లే"దనుట ఆయనస్వభావము కాదు. దేశోద్ధారకుని వ్యావహారి కాంధ్రాభిమానము వేవిధముల తెలుఁగుమాగాణమున వ్యక్త మగుచునే యున్నది. ఆయన చతుర్భుజములును గ్రాంథిక వ్యావహారికభాషలను రెండింటిని సమానముగనే ఆదరించుచున్నవి. ఇఁక కవిత్రయమువారి యాశయ మా చతుర్భుజునివలన, ఆ విశ్వదాతవలన ప్రత్యేకముగ నెట్లు తీరనున్నదో!

బు. వేంకటరమణయ్య

---

S. S. L. C. Public Examination 1935.

Full notes on Telugu "A."
Deitailed and Non-detailed Texts.

కర్తలు: విద్వాన్, ఎమ్. శ్రీపతిశాస్త్రి, పండిత, ఎమ్. ఎన్. వెంకయ్యశర్మ, పండిత, కే. ఎస్. రంగస్వామిగార్లు. క్రౌను ౨౭౬ పుటలు. పీచుకాగితము. వెల రు. ౧.

ప్రకాశకులు: లిటిల్ ఫ్లవర్ కంపెనీవారు; ౩౧౭, లింగసెట్టివీథి, జార్జిటవును, మదరాసు.

ఇందు స్కూలుఫైనలు డిటైల్డు తెలుఁగు టెక్స్టునకును, నాన్-డిటైల్డులో ఒకటియగు 'విభ్రమతరంగిణి'కిని అర్థవివరణాదులు కలవు. గ్రంథములయు, గ్రంథకర్తలయు చరిత్రము, కాలము, వ్యాకరణవిశేషములు, విశేషార్థములు ఇందు గ్రంథకర్తలచే విద్యార్థుల కుపకరించురీతిని వివరింపఁబడినవి. మఱియు, పాఠ్య

గ్రంథభాగమున లేనివియు, పరీక్షల కుపయోగించునవి యు నగు ఛందోవ్యాకరణాలంకారవిషయములు గ్రంథాదిని సంగ్రహింపఁబడినవి. ఇది పరీక్షార్థులకు మిక్కిలి ఉపయోగకరము.

బు. వేంకటరమణయ్య

---

## నిరంజనాంజనము

డిమ్మీసైజు. పుటలు ౨౦. వెల రు. ౦-౮-౦.

గ్రంథకర్త: కొమ్మూరి సంగమేశ్వరకవిగారు.

ఇది 'వడ్డెపాటి నిరంజన'కృతమగు "విశ్వకర్మబ్రాహ్మణ వంశాగమము" అను గ్రంథము విమర్శ. 'విశ్వకర్మబ్రాహ్మణుల సుస్పష్టబ్రాహ్మణత్వము'ను తొలి గ్రంథము సమర్థించుచుండ దానిని రద్దుచేయుచు మరియొక మార్గమున నడచుచున్నది మలిగ్రంథము. కావున 'విశ్వకర్మబ్రాహ్మణవంశాగమ దుర్వాదగర్వనిర్వాపణ' మను నామాంతర మీగ్రంథమునకు దగినది. ఇట్టి గ్రంథముల యుత్పత్తికి కులాభిమానము, కక్షలు కారణములు. ప్రకృతము పెక్కు బ్రాహ్మణేతర జాతులవారు 'బ్రాహ్మణ'శబ్దసంపన్నులు కాఁగోరి తమ తమ జాతులను 'బ్రాహ్మణ'కందమునుండి చిగిర్చినవానినిగా కథలను కల్పించుకొనుచున్నారు. ఎందుకో ఈ యుబలాటములు! ప్రకృతము 'బ్రాహ్మణు' డధోగతి నున్నాడు. వెనుకటి మహత్త్వము లేదు; పలుకుబడి లేదు; గౌరవము లేదు. తినతిండియు, కట్టుగుడ్డయు లేదు. 'బ్రాహ్మణ' శబ్దము ప్రసాదించిన సౌభాగ్యమే యిది నేటి బ్రాహ్మణునికి. ఇట్టి 'బ్రాహ్మణ'శబ్దమును దగిలించుకొని ఏమి బావుకొనుదురో, బ్రాహ్మణేతరులు! వెనుక బ్రాహ్మణునకు సర్వవిధముల నాధిక్యమున్ననాఁడిట్టిగట్టిప్రయత్నము చేసియుండినచో కొంత ప్రయోజన ముండెడిది. నేటి ప్రయాసకు ఫలము శూన్యము.

---

### ౧. తూలిక

క్రౌనుసైజు, పు. ౯౨, వెల ౧౦ అణాలు.

ఇందు ఏడుకథ లున్నవి. అన్నియు అనువాదములు. ప్రకటితపూర్వములుకూడ కొన్ని. కథలు ఆస్తికతను, నీతిని, ధర్మమును బోధించునవి.

### ౨. సంధ్య

క్రౌనుసైజు, పు. ౯౨, వెల ౬ అణాలు.

'టాల్‌స్టాయి' కథ కనువాదము. మానవ జీవితమున కావశ్యకమగు గొప్పపరమార్థమును ప్రబోధించునది.

శ్రీ ముద్దా విశ్వనాథము ఈరెండుగ్రంథములను రచియించెను. రచనము మృదులము, మధురము. చాలవరకు తెలుగుదనము నలవరచుకొనినది. భావములకు, భాషకు ఆనురూప్యము కుదిరినది. రానురాను విశ్వనాథముగారి రచనములకు పేరు గెక్కుచున్నది. తెనుగువచనవాఙ్మయమున వీరిరచనములు చోటుచేసుకొనుచున్నవి. వీనియుపయోగమును తెలుసువారు పొందదగుదురు. అచ్చు, కాగితము, బైండు అందముగ నున్నవి.

వ్యాసకుటీరము, మేలుపాక, ఎలమంచిలి, విశాఖపట్టణముజిల్లా.

---

## విదేశయాత్రికులు: ప్రాచీనాంధ్రదేశము

క్రౌను. పు. ౨౧౬. వెల రు. ౧-౪-౦.

గ్రంథకర్త: భావరాజు వేంకటకృష్ణరావు, బి. ఏ., బి. యల్., రాజమహేంద్రవరము.

ఇది 'ఆంధ్రదేశము: విదేశయాత్రికులు' అను గ్రంథమునకు 'పరిష్కృత ద్వితీయముద్రణము.' కావున నిది యాంధ్రులకు పరిచితపూర్వము. 'ప్రథమ ముద్రణమున దొరలిన తప్పులను పెక్కింటిని ఈరెండవ ముద్రణమున పరిష్కరించితిని. నావ్యాఖ్యానమునగూడ అచ్చటచ్చట కొంచెము సంస్కరించితిని.' ఈమాటలు గ్రంథకర్త పీఠికయందలివి. వెనుకటి ముద్రణముతో పోల్చి చూచినవారికి దీని తత్త్వము తెలియఁగలదు.

ఆంధ్రదేశచరిత్రకు సంబంధించినవ్యాసము లనేకములు గ్రంథకర్తవి, పత్రికలయందు ప్రకటితము లయినవి. చరిత్రప్రామాణ్యమునకును, రచనాచమత్కారమునకును అవి నిదర్శనములు. శైలియందు పాఠకుని పొం

గించు శీని యున్నది. ద్వితీయ ముద్రణ భాగ్యమును గాంచగలిగిన ఈగ్రంథము ప్రశస్తిని వేరుగ చెప్ప బని లేదు. ఆంధ్రదేశమున విద్యాలయములయందు చరిత్ర పఠనమున కిట్టిగ్రంథము లావశ్యకములు. తమ దేశము యొక్కయు, తమ పూర్వులయొక్కయు చరిత్రను దెలుపు నీగ్రంథము సకలాంధ్ర జనసామాన్యమును తప్పక చదువవలసినది.

---

## ఆశ్చర్యచూడామణి దర్పణము

క్రౌను. పుటలు ౪౪. వెల రు. ౦-౮-౦.

గ్రంథకర్త: కోగంటి దుర్గామల్లికార్జునరావు, ఉభయభాషాప్రవీణ. ఆంధ్రోపాధ్యాయుడు; బోర్డు హైయర్ ఎలిమెంటరీస్కూలు, అంగలూరు.

'శక్తిభద్ర'విరచితమగు 'ఆశ్చర్యచూడామణి' 'ఉభయభాషాప్రవీణ-ఫైనల్'కు పాఠ్య గ్రంథముగా నుండినది. దానిని గ్రంథకర్త చదివినపుడు వ్రాసికొనిన నోట్సు (ముఖ్యవిషయములను గురువుగారు చెప్పినవి కాబోలు) నిట్లు పుస్తకరూపమున ప్రకటించినారు. దీని ప్రయోజనముమాట ఎట్లున్నను వెలమాత్రము చాల అధికము. రెండణా లయినను అధికమే.

---

## క వి రా య లు

క్రౌను, పు. ౨౬, వెల రు. ౦-౪-౦.

గ్రంథకర్త: కొత్త వీరభద్రయ్యచౌదరి, సంగం జాగర్లమూడి పోస్టు, తెనాలితాలూకా.

ఇది పృథ్వీరాయచాందుభట్టులకథ. దీనికిమూలము శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిలగారి వీరపూజ. దీనిని విద్వాన్ నాగలింగము వేంకటేశ్వర శాస్త్రిగారు దయతో బరిష్కరించినారు.

గ్రంథకర్త 'విశేషోత్సాహము'న కిది ఫలము. ప్రయోజనము నంతియే. ఇందు సంస్కృతశబ్దములు, సమాసములు ఔచిత్యదూరములయి జడిగొని రాలినవి. వెల ఒక్కయణాయైనను అధికమే.

---

# గ్రంథ స్వీకారము

## దీర్ఘరోగ చికిత్సాసారము

క్రౌను ౧౩౨ పుటలు, వెల రు. ౧-౮-౦.

గ్రంథకర్త: డాక్టరు పాలపర్తి నరసింహారావు గారు, ప్రకృతిచికిత్సావైద్యులు, దీర్ఘరోగవైద్యశాలాధికారి, వేటపాలెం, గుంటూరు జిల్లా.

---

## ౧. శ్రీ మయూరధ్వజోపాఖ్యానము

(మూడాశ్వాసముల ప్రబంధము)

డెమ్మిసైజు, ౧౯౯ పుటలు, వెల రు. ౧.

## ౨. సౌందర్యచక్రధరీయము

(నీతిదాయకమగు ప్రహసనము)

డిమ్మిసైజు, పుటలు ౪౪, వెల రు. ౦-౧౨-౦.

ఈరెండు గ్రంథములు చక్రాల నృసింహకవి విరచితములు. వీరు గుత్తినివాసులు.

---

## ఆంధ్ర కావ్యాలంకార సూత్రవృత్తి

డిమ్మిసైజు, పు. ౧౪౫, వెల తెలియరాదు.

గ్రంథకర్త: న్యాయశిరోమణి వేదాల తిరువేంగళాచార్యులు, సంస్కృతాంధ్రపండితుడు, ఆంధ్రక్రైస్తవకళాశాల, గుంటూరు.

---

## పాశురపరిమళములు

క్రౌనుసైజు, పుటలు ౪౦, వెల 3 అణాలు.

రచయిత: మాడభూషి మఠం వేంకటాచార్యులు గారు, బి. ఏ, ప్లీడరు, తిరుపతి.

---

## ఆహారశాస్త్రము ( మొదటి భాగము )

క్రౌనుసైజు, ౨౦౭ పుట, వెల రు. ౧-౮-౦.

ఆంధ్రసరస్వతీగ్రంథమాల, ౨౨-వ కుసుమము.

ప్రకాశకుడు: తేకుమళ్ల రాజగోపాలరావుగారు, ౧౨౦, వెల్లాలవీధి, పురశైవాకము, చెన్నపురి

---

## రాజ్యపాలనాశాస్త్రము

సరస్వతీగ్రంథమాల—౩౬-వ పుష్పము.

క్రౌను సైజు, పుటలు ౧౧౬, వెల రు. ౧.

గ్రంథకర్త : శనివారపు సుబ్బారావు.

ప్రకాశకులు : సరస్వతీ గ్రంథమాల సంపాదకుడు, కాకరపఱ్ఱు.

---

## శారద లేఖలు (రెండు సంపుటములు)

క్రౌను. ౨౦౦ + ౧౦౩ పుటలు. వెల అమూల్యము.

గ్రంథకర్త్రి: కనుపర్తి వరలక్ష్మమ్మ, బాపట్ల, గుంటూరు.

---

## శ్రీమత్కన్యకావిజయము

(మూడాశ్వాసముల పద్యగేయాత్మక కావ్యము)

క్రౌను. పుటలు ౭౦. వెల అమూల్యము.

గ్రంథకర్త:పసుమర్తి కృష్ణమూర్తి.చెన్నపురిలో ఎగ్మూరున నున్న 'లోద్ర' ముద్రాలయమున ముద్రితము.

---

# ప త్రి క లు

## ఆంధ్రసారస్వతపరిషత్పత్రిక

సంపుటము ౧, సంచిక ౧.

సంపాదకుడు : సాహిత్యవిశారద, కోన వెంకటరాయశర్మ, నరసరావుపేట.

సాలుచందా : రు. ౨-౦-౦ ;

విడిసంచిక వెల రు. ౦-౬-౦.

---

## రంగభూమి (విశేషసంచిక)

(కన్నడపత్రిక)

౯-వ సం. సంచిక ౧. (సెప్టెంబరు ౧౯౩౪)

సంపాదకుడు : యం. యస్. సుబ్రహ్మణ్యశాస్త్రి.

ప్రకాశకులు : అమెచూర్ నాటక సంఘము, బెంగుళూరు సిటి.

---

## మక్కళపుస్తక - సంక్రాంతియ సంచిక శ్రీముఖ సంవత్సరము

(కన్నడపత్రిక)

సంపాదకులు: సి. అశ్వత్థనారాయణరావు, బి.ఏ., బళేపేట, బెంగుళూరు సిటి.

---

## అతిప్రమాణమగు దీపస్తంభము, కద్రి

కద్రి మంగళూరునం దొకచిన్నయూరు. కొండలమయము. అచట నొక ప్రాచీనదేవాలయ మున్నది. అందు నెలకొనిన దైవము మంజునాథస్వామి. ఆలయమున కెగువ తొమ్మిది పవిత్రతీర్థము లున్నవి. దేవాలయమున కెదుర నతిప్రమాణమగు లోహమయ దీపస్తంభమున్నది. అది ధ్వజస్తంభముకూడ. దీనిఎత్తు డెబ్బది అడుగులు. దీనిని గురించినగాథ యొకటి అక్కడ యిట్లు వాడుకలో గలదు: ఒకడు స్తంభమునందలి దీపములను క్రిందినుండి పైవరకు వెలిగించుచుపోవునప్పటికి స్తంభము వేడెక్కి వానికి దిగుటకు సాధ్యముకాకపోయెనట. అపుడు వాడు మంజునాథస్వామిని ధ్యానించి, ఆయనపయి భారమునువైచి ప్రక్కనున్న తీర్థములలో నొక్కదానిలో కురికి యక్షతగాత్రుడయి వెలికి వచ్చెనట.

---

# మన వీమాటలు

## హిందూదేశచరిత్రము *

ఆదికాలమునాటిభారతీయు డలౌకికప్రతి భావంతుడు. ఆతనిలక్ష్యము విశ్వశ్రేయము. తత్సంపాదనమునకయి యాతడు ప్రపంచము నందలియితరదేశము లింకను కన్నుదెరవజా లనిస్థితిలో ప్రకృతిమాత పరిచిన పాన్పుకల యందు పరుండియుండిననాడే తనదేశమును వివిధవిజ్ఞానసంపదకు నిలయమును చేసినాడు. అచటినుండి యమేయకాంతులను విశృంఖల ముగ విరజిమ్ముచు వెలువడిన సాంద్రవిజ్ఞాన చంద్రికలవెలుగున కన్నులొకింత దెరచి చూడగలిగిన నేటియాప్రపంచము స్వాతిశయ ప్రకటనమున విర్రవీగుచున్నది. మాననీయ మగు నాప్రాచీనభారతీయుని యౌన్నత్య మాచరణమూలమున దెలియవలసినది. అతనికి స్వాతిశయప్రకటనముగిట్టదు. ప్రత్యేక ముతనచరిత్రమునుగాని, తనదేశచరిత్రమును గాని యాతడు రచియింపమి కదియేకార ణము. కాని తచ్చరిత్రమంతయు నాత డార్జిం చియుంచిన యమూల్యానంతవిజ్ఞానప్రపంచ మున నిమిడియున్నది. దానిని ప్రజ్ఞాచక్షువులు వెదకి వెలికి తీయజాలుదురు. ఆవిజ్ఞానప్రపం చమే యాతని మహోన్నతచరిత్రసౌధము నకు పునాదియయి మించునది.

తరువాత, దేశాంతరాదుల సంబంధ ములుకారణముగ భారతీయునకు చరిత్రజ్ఞాన మావశ్యకమని బోధపడినది. కావుననే ప్రత్యేక ముగ గాకున్నను, నాడునాట వెలువడుచు వచ్చిన సంస్కృత ప్రాకృతాది వాఙ్మయము లయందును, జైనబౌద్ధవాఙ్మయములయం దును, దేశభాషాగ్రంథములయందును చరి త్రాంశములు ప్రవేశించుచువచ్చినవి. మఱియు శాసనములు, వైదేశికులవ్రాతలు, స్థానిక వృత్తములు, వంశావళులు మొదలగుచరిత్ర ప్రధానరచనములును వెలువడినవి. వాని యందలి చరిత్రాంశము లనేకములు, తత్ప్రస క్తములగు పాత్రముల మైశ్వర్యాధికార వాంఛలకు, మతాభిమానములకు బలియయి తారుమారయినవి. ఒండొంటికి సామరస్యము కుదురమిని వానిలో పెక్కింటి యాథార్థ్య మును విశ్వాసానర్హ మయినది. ఇట్టియాధా రములనుగొని మొదటిమొదటిచరిత్రకారులు కొందఱు పరిశీలనమునకు, సత్యాన్వేషణపరి శ్రమకు ప్రాల్మాలి, స్థూలదృష్టికి గోచరము లగువానికి ఊహలతో సంబంధమును గుదిర్చి చరిత్రము నల్లినారు. అది యొకయదుకుల బొంత అయినది. దానికి దరుచు నున్న యదుకు లూడుచుండెడివి; లేనియదుకులు

---

* హిందూదేశచరిత్రము, మొదటిభాగము-హిందూమహాయుగము. క్రౌనుసైజున ౨౮౫ పుటలు, వెల రూ. ౧-౦-౦. ప్రకాశకులు : ఇండియన్ పబ్లిషింగ్ హౌస్ లిమిటెడ్, కొండిసెట్టి వీథి, చెన్నపురి.

కూడుచుండెడివి. దానిరూపమున కే యొకొ క్కపుడుమార్పాటునుకలుగుచుండెడిది. దాని కిట్లు నిలుకడ లేకపోవుటయే కాక, ప్రామాణ్యమును కొరవడిపోయినది. కొన్ని రాజకీయతంత్రములు కారణముగ యథార్థవిషయములకు గొన్నింటి కన్యథాకరణము ననివార్య మయినది. ఇట్టి చరిత్రవాఙ్మయమునకు ప్రథమావతారభూమి ఆంగ్లభాష యయినది. ప్రకృతము చదువులబడులలో బాలురకొరకు వెలువడిన చరిత్రవాఙ్మయమంతయు ప్రాయశః పైతీరు రచనమునకు సంగ్రహరూపములే.౧

తరువాతి చరిత్రప్రియుల నిరంతరసత్యపరిశీలనమువలన పూర్వచరిత్రములు లోపములు బయలుపడినకొలది సంస్కరింపబడుచు వచ్చినవి. రానురాను పరంపరలుగ బహిర్గతము లగుచున్న అపూర్వచరిత్రాధారము లింకను చరిత్రకు ప్రాభవమును, ప్రాముఖ్యమును, ప్రామాణ్యమును సమకూర్చుచున్నవి. అదియొక ప్రత్యేకవాఙ్మయశాఖగను పరిగణింపబడినది. దేశీయులు, విదేశీయులునగు అనేకు లనేకముఖముల దానిని విస్తరిల్ల జేయుచున్నారు. ఇపుడిపుడు సమగ్రము కాకున్నను నమ్మదగినదాని సజీవాకృతి యొకటి గోచరించుచున్నది. ఇంకను జరుగుచున్న పరిశోధనములవలన దానికి నిండుదనము కలుగగలదనియు తలపదగియున్నది. ఇట్లు బయలుదేరుచున్న చరిత్రవాఙ్మయమంతయు ఇంకను ఆంగ్లముననే యిల్లు కట్టుకొని కూరుచున్నది కాని దేశభాషలయందు ప్రవేశమును గనజాలకున్నది.

విద్యాలయములయందు పై తరగతులవారికిని శాస్త్రాదివిషయబోధనము దేశభాషలయందే కావింప దలపెట్టిన నేటికాలమున నాయాశాస్త్రముల వాఙ్మయము తప్పనిసరిగ దేశభాషలయందుత్పత్తి చెందవలసియున్నది. అందుకు గావలసిన ప్రయత్నములును కొలదిగ సాగుచున్నవి. ఆప్రయత్నములవలన ననలువిడిచిన చరిత్రశాఖకు తొలిఫల మీ 'హిందూదేశచరిత్రము'. ఇది హైస్కూలువిద్యార్థులకు క్రొత్త 'ఏ' గ్రూపు సిలబసు ననుసరించి రచియింపబడినది. ఇంగు 'హిందూమహాయుగము' మాత్రము కలదు. ఇది హిందూదేశచరిత్రమున మొదటిభాగము. పరిశోధనమున కందిన వేలకొలది సంవత్సరములపూర్వపు టాదికాలమున నుం

౧. దేశచరిత్రలు, చరిత్రకథలు, చరిత్రవాచకములు, చరిత్రపాఠములు మొదలయిన నానానామరూపభేదములతో వీనిసంఖ్యదినదినము నకు పెరిగిపోవుచున్నది. వీనికి సంస్కరణముకూడ లేదు. ఈపొల్లుపుస్తకములే యిప్పటికిని విద్యార్థులకు చరిత్రాభ్యాసారంభమునకు గతియై యున్నవి. వీని జన్మవులవలన చరిత్రజ్ఞానము తప్పుదారిని బడిపోవుచుండుట అనుభవసిద్ధము. వీనిని పూర్తిగా తొలగించి సరియయినవానిని, అప్పుడప్పుడు వెలువడుచున్న నూతన చరిత్రాంశములచేర్చుచు బయలుదేరదీయవలెను. వానియోగ్యతను నిర్ణయించుటకు సమర్థులగు చరిత్రపండితులసంఘ మొకటి యేరుపడవలెను. ఆసంఘము పరిశీలించి అంగీకరించినవానినే పాఠశాలలలో ప్రవేశపెట్టవలెను. ఇట్టి యేర్పాటును విద్యాశాఖాధికారులు చేయవలసియున్నారు.

డియు క్రీ. శ. పదుమూడవ శతాబ్దమున, సంపూర్ణముగ హిందూదేశము మహమ్మదీయులచేత బడునాటివరకుగల కాలము హిందుమహాయుగ మనబడునది. ఆకాలము నందలి చరిత్రయంతయు నిందు సంక్షేపముగ వర్ణింపబడినది.

సామాన్యముగ దేశచరిత్రమున కాయా కాలముల వారిప్రాభవము, నాగరికత, మతములు ప్రధానాంగములు. వానివలన తల కెక్కిన అహంకారము మూలమున హైందవేతరజాతులు హింసాద్వేషాదులకు లోనయి తమచరిత్రములను కలుషితముల జేసికొనినవి. హైందవజాతిచరిత్రమాత్ర మట్టిది కాదు. హైందవహృదయము దయామయము; ధర్మపరాయణము ; మానవకల్యాణము నాకాంక్షించునది. తత్కార్యము లన్నియు నాకాంక్ష్య సాధనాసక్తములు. క్రౌర్యము, ద్వేషము, హింస దానిని జేర నెన్నడు సాహసింపవు. అది నిత్యజాగరూకమయి వానిని కడుదూరమున నేయుచును. హృదయ మట్టిదికావుననే తచ్చరిత్రము మహత్త్వ పూర్ణమయి నిఖిలప్రపంచమాన్య మయినది. అదియే అతని యీనాటి పతనమునకును హేతువయినది కాని తన్మహత్త్వమున కేనాటికిని హానిలేదు. అది శాశ్వతము. ఈ గ్రంథమున నాదినుండియు హైందవుని అట్టి యనుత్తమమహత్త్వమే వర్ణింపబడినది.

ఆదిమనివాసులగు ననార్యులచరిత్రతో నీగ్రంథము ప్రారంభ మయినది. అది మొదలుకొని క్రమముగ ఆర్యులు, వారి సభ్యత, వారిరాజ్యములు, మతములు, వేద సూత్ర వాఙ్మయపరిణామవికాసములు, జైన బౌద్ధమతముల ఉత్పత్తివ్యాపనములు, మగధ మౌర్యగుప్త సామ్రాజ్యముల ప్రాభవాదులు, అనుపమ వీరవతంసములనబడు రాజపుత్రుల విక్రమచరిత్రాదులు, దక్షిణాపథమునందలి హొయిసల, చోళ పాండ్యాదుల రాజ్యచరిత్రములు, ఆయాకాలముల నాయాసామ్రాజ్యాధీశులప్రాపున వెలసిన వాఙ్మయసంసృష్టి మతపరిణామ కళాకౌశల నాగరకతా విశేషాదులు, ఆదినుండియు, హిందూదేశసంపదను కొల్లగొనునాశతో దండయాత్రలను గావించిన పారసీకయవనాది విదేశజాతుల చరిత్రములు మొదలయినవి వర్ణింపబడినవి. హైందవుని 'ధర్మసంరక్షణ' నిరతి కారణముగ 'కట్టకడపట' 'కాకతీయాంధ్రుల త్రిలింగసామ్రాజ్యము' మహమ్మదీయ మహానలమున బడి క్రుగ్గి 'భస్మీభూత' మయి పోవుటతో నీ 'హిందూ మహాయుగము' తుదముట్టుచున్నది. కాని, 'తపశ్శాలియయిన విద్యారణ్యమునీంద్రు' 'డభిమంత్రించి' 'తుంగభద్రానదీతీరమున విజయనగరసామ్రాజ్య విభూతిని నాలుకొల్పు'ట 'కించుక యాపవిత్రభస్మము'ను మాత్రము చివర మిగిల్చినది. గ్రంథ మింతకు పదింతలయినను సమగ్రవర్ణనమునకు సాధ్యముకాని యిందలి చరిత్ర యంతయు నింతసంగ్రహముగ నుండుటకు విచారమగుచున్నది. కాని ప్రకాశకుల నియమములకు

కట్టుబడవలసియుండుటచే నిట్లు సంగ్రహింపక తప్పినదికాదు. ఇందలివిషయము సంగ్రహావయ్యానుసానుపూర్వికముగ నమరియుండుటచే నిది ఆంధ్రచరిత్రవాఙ్మయమున అనిదంపూర్వమను గౌరవమునకు పాత్రమగు చున్నది.౧

హిందూదేశమునకు మహత్త్వమును గడించిన విషయముల వర్ణనము 'లాహో'కొలుపుచు చదువరులకు గన్నులకు గట్టినట్లుండును; కోలుపోయిన వెనుకటి గొప్పదనము సంపాదింప పురికొల్పుచుండును. రచనము తిన్నదనము, తీయదనము గలిగి మేలిమి గులుకుచు మదిమెచ్చజేయు చుండును. విషయగౌరవమునను, రచనా సౌందర్యమునను ఆంధ్రచరిత్ర వాఙ్మయమున నద్వితీయ మగు స్థానము నలంకరించిన ఈ యుత్తమ గ్రంథమును రచియించి ఆంధ్రలోకమును తనకు ఋణపడ జేసికొనిన యాత డెవ్వడోకాడు. ఆంధ్రలోకమునకు సుపరిచితు డయిన

**శ్రీమల్లంపల్లి సోమశేఖరశర్మ;**

తన జీవితమును చరిత్రాన్వేషణము కొరకు సమర్పించిన సుకృతి. 'డిగ్రీ'లకొలత కందని ధీశక్తి యాతనిది. తత్పరిశోధనల ఫలములు ప్రమాణబద్ధము లని సుప్రసిద్ధ చరిత్రకారుల మన్నలను బడసినవి. ఇట్టి ప్రామాణికుని లేఖిని ప్రసవించిన గ్రంథప్రామాణ్యమును గూర్చి ఏమి చెప్పినను ద్విరుక్తప్రాయ మగును. ఆతని యనన్యసామాన్య చరిత్ర పాండిత్యమును గ్రంథము సహస్రముఖముల ఘోషించుచున్నది. చరిత్ర రచనయం దీతని మించగల సమర్థు డాంధ్రులలో నింకను గానరాడని నిశ్శంకముగ చెప్పనగును. ఇది సత్యకథనము.

చిరకాల పరిశోధనమున సిద్ధహస్తుడగు గ్రంథకర్త సేకరించియుంచిన యమూల్యచరిత్రసామగ్రి అపరిమితముగ నున్నది. దానినంతయు వినియోగమునకు దెచ్చు టాతనికొక్కనికి సాధ్యేతరకార్యము. అదియంతయు నిరుపయోగముగ నుండిపోవుట దేశచరిత్రకు గొప్పనష్టము. ఆతనిసామర్థ్యమునకు దగిన యవకాశము లభించినచో నాత డపూర్వ చరిత్రవాఙ్మయమును బహురూపముల రచియింపగలడు.

ఇటీవల నాంధ్రమున శాస్త్రవాఙ్మయమును, రచియింపజేయ దలపెట్టిన ఆంధ్రవిశ్వవిద్యాలయము ఈ గ్రంథకర్తను చరిత్రవాఙ్మయరచనకు నియమింపదగును. అటులగునేని ఆతడార్జించియుంచిన చరిత్ర విజ్ఞానము సార్థకమగు నుపయోగమునకు రాగలదు.

---

౧. గ్రంథమున వర్ణింపబడిన రాజవంశముల యందలి రాజులపేరులు, వారికాలములు, ముఖ్యములగు చరిత్ర సంఘటనములకాలమును మొదలగువానిపట్టికలును, గ్రంథస్థనామముల కకారాదిపట్టికయును లేమి గ్రంథమున కొక లోపము. చరిత్రగ్రంథముల యుపయోగము సుకరమగుట కిట్టిపట్టిక లావశ్యకములు. సంగ్రహరూపమగు నిట్టి గ్రంథమునకు దదావశ్యకము బహుగుణితము. కావున పట్టికల నింకనైన తయారుచేసి గ్రంథాంతమున జేర్చుట లెస్స.

విశ్వవిద్యాలయములన కళావిజ్ఞానము లకు నిలయములు. అట్లగుట కవి విజ్ఞానసంపన్నులయాశ్రయమును బహుమానపురస్సరముగ సంపాదించుకొనవలయును. వారివలన సమకూర్చిన విజ్ఞానమును జిజ్ఞాసువులగు విద్యార్థులకు పంచియిఁజవలయును. అట్లుచేసిన నే విశ్వవిద్యాలయములకు సార్థకత సిద్ధించును. ప్రపంచమున విశ్వవిద్యాలయములు పట్టములనే కాక, పాండిత్యమును గౌరవించుచున్నవి. ఇచట కేవలపాండిత్యమును గౌరవించుటయేకాదు. తత్పాండిత్యమువలన నధికలాభమును గలుగుచున్నది. ఆంధ్రవిశ్వవిద్యాలయ మీసలహాను బహుమానించుగాక!

ఈపుస్తకము స్కూల్ ఫైనల్ విద్యార్థుల కొరకుద్దేశింపబడినను ఆంధ్రులెల్లరు విధిగ చదువవలసినది. చరిత్రజ్ఞానశూన్యుడీకాలమున ననాగరకుడుగఁ బరిగణింపబడుచున్నాడు. ప్రపంచచరిత్రము నంతను కాకున్నను, తన దేశచరిత్రమును సంగ్రహముగనైనను తెలియనివాడనాగరకుడు కాకపోవు టెట్లు!

గ్రంథము వెల ఒకరూపాయ మాత్రము. దీని నీతీరుబడి పుస్తకములతో పోల్చి చూచిన నిది కారుచౌక యనక తప్పదు. గ్రంథకర్త సామర్థ్యమును నెట్లో గుర్తించి యాఁజనిచే నిట్టి యమూల్యగ్రంథమును రచియింపజేసి, దాని నల్పమూల్యమునకు విక్రయించి ఆంధ్రలోకమున కుభయవిధముల నుపకరించిన ప్రకాశకులు తదభినందనముల కెంతయు బాత్రులు.

గ్రంథకర్త పాండిత్యమున కనురూపమగు పదవియు, పురస్కృతియు లభించునేని ఆంధ్ర చరిత్రవాఙ్మయము నిండుదనమును సంతరించుకొనగలదు; ఆంధ్రవాణి నూతనాలంకారశోభిత కాగలదు; ఆంధ్రదేశము పేరుకీర్తుల వెలయగలదు. ఇదియే కోరదగినది. ఇంతకన్న నిక కావలసిన దేముండును?

---

'మహాకావ్యరచన: ఖండకావ్యరచన'

ఆంధ్రభూమి (ఆగస్టు ౧౯౩౮ సంచిక) నుండి ఉద్ధరించి కడచిన భారతి సంచికలో 'కలగూరగంప' శీర్షికయందు ప్రకటించిన 'మహాకావ్యరచన: ఖండకావ్యరచన' అను వ్యాసము పుట్టుపూర్వోత్తరములను తత్కర్త శ్రీరాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు లేఖామూలమున నిట్లు తెలిపినారు:

"ఆంధ్రభూమినుండి భారతిప్రకటించిన ఖండమహాకావ్యములు పేసు అనంతపురము "కవికుమారసమితి" వారి 'క్రొక్కారు మెఱుగు' అనుకావ్య సంపుటికి వ్రాసిన పీఠికలోనుండి త్రుంచిన తునుక. ఆపత్రికవారు దానిని ప్రకటింపలేదు. మమ్మెవరిని అడుగను లేదు. మనపత్రికల ప్రతిభాత్వ మింతలక్షణముగా నున్నది.

రా. అ. కృ."



# సాభిప్రాయ విశేషములు

"పశ్చిమరణరంగమునందంతయును ప్రశాంతముగ నున్నది" అని మహాసంగ్రామము భయంకరముగనున్న సమయమునందు బ్రిటీషుప్రభుత్వాధికారులు ప్రచురించినవిధమును శ్రీ విల్లింగ్డనుప్రభువుగారి భారతశాసనసభయందలి కడపటి ప్రసంగము స్మరింపజేయుచున్నది. విల్లింగ్డను ప్రభువు మూడు నెలలు లండనునగరమునం దధికారులతోను, వర్తకవ్యాపారస్థులతోను సంప్రతించి తిరిగి అధికారమును స్వీకరించిరి. విల్లింగ్డను ప్రభువు, లండను పోవుటకు కారణము రాజ్యాంగసంస్కరణముల విషయమై ప్రభుత్వాధికారులతోను, తదితరులతోను సంప్రతింపులని సర్వత్ర తెలిసినవిషయము. భారతశాసనసభాసభ్యులు, ప్రజలును నీవిషయమై రాజప్రతినిధి యేమిచెప్పునో యని గంపెడాశలతో వేచియుండిరి. రాజప్రతినిధి ప్రధానవిషయము నెప్పటివలెనే తెరచాటుననే యుంచుట ప్రజాహృదయమునందు నిరాశను గలుగజేయుట సహజము. భారతశాసనసభను, నిర్బంధశాసనములను నిర్మించి శాంతిని స్థాపించినందుల కభినందించుటయును, కాంగ్రెసు సత్యాగ్రహమును విరమించి శాసనసభాప్రవేశము నామోదించినందులకును నభినందించియానందించిరి. వీరియభినందనానందములు పిల్లి కన్నులు మూసుకొని పాలుత్రాగినరీతిని నున్నవని ప్రాజ్ఞులందరును నంగీకరించుదురు. నిర్బంధముల సాధనమునను ఇర్విను ప్రభువు సాధింపజాలని ప్రశాంతస్థితిని విల్లింగ్డనుసాధించినట్లు గర్వించుట ఆత్మవంచనమునకువలెను ఆత్మశక్తికి నిదర్శనముకాదు. నిర్బంధములు ప్రజాశక్తి నెల్లకాలమును స్తంభింపజేయజాలవు. స్తంభింపజేయగలిగినను భారతప్రభుత్వమునకును, బ్రిటీషుప్రజలకును సత్తువలేని నిరాశాపూరితులైన ప్రజలవలన నేవిధమైన యుపకృతియును కలుగదని ఇర్విను ప్రభువు తెలిపిన సత్యమును విల్లింగ్డను ప్రభువు విస్మరించుట నీతియును, ధర్మమును కాదు. ప్రపంచమునం దెప్పుడును నెచ్చటను సంభవముకాని విషయము భరతవర్షమునందును సాధ్యముకాదు. ముప్పదిమైదుకోట్ల ప్రజలను ప్రజలసంయోగసాహచర్యముల మూలమునను పాలించుట ప్రయోజనకరము కాని నిర్బంధముల మూలమునను పాలించుట సకలవిధములను నిరుపయోగము. గతించిన మూడేండ్లయందును భారతశాసనసభ దేశా

నర్థములకు వినియోగపడినటులు దేశక్షేమ మునకు వినియోగపడని విధమునకు నిర్బంధశాసనములు, ఒటావానిర్ణయములు, రిజర్వుబ్యాంకు, మారకపురేటు, సుంకముల నిర్ణయములు, లీమోడియొడంబడిక, సైనిక శాసనము, పన్నుల నిర్ణయములు మొదలగు విషయము లనేకములు ప్రమాణములు. ప్రభుత్వపక్షాభిమానులు, శ్రీయుత ఎ. రామస్వామిమొదల్యారుగారే "గండభేరుండుల స్థానమును రాంబందు లాక్రమించినవి" అని భారతశాసనసభవిషయమై ఒకసందర్భమునం దాక్షేపించి యుండిరి. విల్లింగ్డను ప్రభువుగారి యాజ్ఞలనునిర్వహించినభారతశాసనసభ వారి యభినందనములకు పాత్రమగుటయందు విచిత్రమేమియును కనుపడదు. విల్లింగ్డనుప్రభుత్వ మవలంబించిన రాజ్యాంగవిధానము భారతీయుల సంప్రతింపుల కేవిధమైన యవకాశము లను గలుగజేయదని బ్రిటీషుజాతీయ ప్రభుత్వవైఖరియును వెల్లడిచేయుచున్నది. జాతీయ పక్షప్రభుత్వము స్వీయబలమును స్వదేశము నందును, విదేశములందును ప్రజాశయములను నిర్మూలము చేయుటకు వినియోగించిన విధమును గతించిన మూడేండ్లచరిత్రయును చాటుచున్నది.

*   *   *

జాతీయప్రభుత్వము - ప్రజలు

జాతీయప్రభుత్వ మవలంబించిన రాజ్యనీతి పశ్చిమరణరంగమునందలి ప్రశాంతస్థితిని బోలియున్నది. స్వదేశమునందు వ్యాపారపరిశ్రమల నభివృద్ధిచేయుట కేర్పడిన ఒటావా నిర్ణయములును, స్టర్లింగువిధానము, సుంకముల నిర్ణయము నిరర్థకములైనను సమర్థించుటమాత్రము తప్పనిసరి యైనది. ఒటావా నిర్ణయములు కనడాకు గలుగజేసిన లాభములను గ్రేటుబ్రిటనుకు గలుగజేయ లేదు. ఆస్ట్రేలియా ప్రతిఘటించుచున్నది. సుంకముల నిరోధము వ్యాపారపరిశ్రమలను క్షీణింపజేసినను, ధనస్వాములకు రక్షణమేర్పడినను, ప్రజాసామాన్యమునం దసంతృప్తి వ్యాపించినది. స్టర్లింగువిధాన మసాధ్యమై డోలరు ఫ్రాంకుల మారకపు రేటులు పెరిగినవి. జాతీయప్రభుత్వ నాయకులు, హెండర్సనుగా రెంత మొరపెట్టినను, ఆయుధ విసర్జనసభను నిరర్థకము చేసిరి. నానాజాతి సమితియును నామమాత్రావశిష్టముగ నున్నది. ప్రపంచమునం దంతటను సన్నగిలిన బ్రిటీషు ప్రతిష్ఠ హిందూస్థానమునందు మాత్రము విజృంభించినది. ఒటావానిర్ణయములు బ్రిటీషువ్యాపారపరిశ్రమల రక్షణమున కనుకూలముగను, హిందూస్థానమునకు ప్రతికూలముగను పరిణమించిన విధమును విషయావలోకనము వెల్లడిచేసినది. జర్మని, ఇటలీ, జపాను, హాలండు మొదలగు రాజ్యములు హిందూస్థాన వ్యాపారమునకు ప్రతిబంధకములను గల్పించినవి. హిందూస్థానమునుండి విదేశముల కెగుమతులు క్రమముగను క్షీణించుచున్నవి. గ్రేటుబ్రిటనుకు పోయెడి ఎగుమతులు లెక్కలోనివికావు. దిగుమతులందును

సుంకములు ప్రతిబంధకములను గల్పించు చున్నవి. పౌను-రూపాయ మారకపు రేటు ఎగుమతుల వ్యాపారమునకు ప్రతికూలముగ నున్నది. రక్షణసుంకములు బ్రిటీషువ్యాపార మున కనుకూలములైనను హిందూస్తాన వ్యాపారమునకు ప్రతికూలములైనవి. రిజర్వు బ్యాంకు బ్రిటీషుప్రయోజనముల రక్షణము నకు స్వర్ణదుర్గముగ నేర్పడినది. లీమోడిదూది యొడంబడిక లాంకాషైరు బట్టలకు లాభించి నటులు హిందూస్తానపుదూదికి లాభించ లేదు. ఆర్థికవిధానములును, శాసనములును బ్రిటీషు ఎగుమతులకును దిగుమతులకును లాభించు నటులుహిందూస్తానపు టెగుమతులకును దిగు మతులకును ఏరీతిని లాభించుటలేదనిభారత శాసనసభా సభ్యులును, ఆర్థికపండితులును పెట్టినఘోష లరణ్యారోదనములుగను పరిణ మించినవి. ఏవిధమునను చూచినను భారత శాసనసభ దేశమునకుజేసిన యుపకారము మృగ్యముగ నున్నది. కాంగ్రెసుప్రతిష్ఠను, ప్రజలశక్తిని క్షీణింపజేయుటకు దోడ్పడిన భారతశాసనసభ ద్వంద్వ ప్రవృత్తియందు విశ్వాసముగల విల్లింగ్డన్ప్రభువుగారి ప్రాగ ల్భ్యలకు పాత్రమగుటయందు విచిత్రము లేదు. సభ్యులును దేశమును ఆతురతతో జూచు చున్న రాజ్యాంగములపట్లను రాజప్రతినిధి తెలిపినభావములు పూజ్యములు.

* * * *

రాజ్యాంగసంస్కరణములు

జాయింటు పార్లమెంటరికమిటి వెంటనే నివేదికను తయారుచేయుటకు పడుచున్న శ్రమను విల్లింగ్డన్ప్రభువుగారు ప్రశంసించి నను కాలయాపనము జరుగుచున్నదని యంగీ కరింపవలయును. నివేదికలోని విషయములు కొంతమైనను విల్లింగ్డన్ప్రభువుగారికి క్రొత్తది కాదు. కేంద్రప్రభుత్వమునం దేమి మార్పులు జరుగునో, ఎప్పుడు క్రొత్త శాసనసభ ఏర్ప డునో భారతశాసనసభాసభ్యులకు దెలుపుట యాశాజనకముగ నుండును. రాష్ట్రసభలు ౧౯౩౬-వ సంవత్సరమునం దేర్పడునని వారి ప్రసంగము గ్రాహ్యము చేయుచున్నది. పార్లమెంటరికమిటినివేదిక నవంబరు మాస మునందు వెలువడునపుడు గుట్టు బయటపడ గలదు. సంస్కరణముల నాచరణమునందు బెట్టుట కధికారవర్గము చేసెడి ప్రయత్నము లన్నియును ప్రజామోదము లేకను ఫలప్రద ములు గాజాలవు. శ్వేతపత్రమువలెను పార్ల మెంటరికమిటిరిపోర్టును అన్ని పక్షములవారు ను నిరాకరించుట సహజమని దేశపరిస్థితులు తెలుపుచున్నవి. రానున్న భారతశాసనసభ యందు పార్లమెంటరికమిటినివేదిక నిరాక రింపబడుట సంభవము. కాని రాజ్యాంగాధి కార వ్యామోహము మహానుభావులనుసయి తము సంశయాత్ములను జేయుట సహజము. భారతశాసనసభయందు పాల్గొనుటకు నిర్ణ యించిన కాంగ్రెసు రాష్ట్రీయ శాసనసభల యందును ప్రవేశించి పనిజేయుట కనుమతిం

చుటయందు విచిత్రము కనుపడదు. విల్లింగ్డను ప్రభువు సూచించిన సక్రమాందోళన విధానము సకలవిధములను సఫలము కాగలదని విశ్వసింపదగియున్నది.

*  *  *  *

కాంగ్రెసుపక్షములు

ప్రపంచవ్యవహారములం దంతశ్శత్రువులు గలుగజేసెడి యుపద్రవమును బాహ్యశత్రువులు గలుగజేయజాలరు. ముప్పదిమైదుకోట్ల భారతీయులశక్తి దుర్జేయమైనను అంతర్భేదములు ప్రజాశక్తిని నిర్వీర్యము చేయుచున్నవి. అంతశ్శత్రువులు లేనపుడు బాహ్యశత్రువులు సహజముగ నంతరించుచుందురు. హిందూస్తానమునం దింతవర కెన్నిపక్షములున్నను కాంగ్రెసు పక్షము మాత్రము ప్రబలమైన సంయోగము గల పక్షముగ నేర్పడి ప్రజాశక్తిని వికసింపజేసినది. గతించిన పదేండ్లయందును గాంధిమహాత్ముని నాయకత్వము ప్రజాశక్తిని విజృంభింపజేయుటకును, జాతీయైక్యమును సాధించుటకును వినియోగపడిన విధము ప్రపంచేతిహాసములందు గంభీరాధ్యాయమై ప్రపంచలక్ష్యము నాకర్షించినది. త్యాగయాత్రయం దంతర్భేదము లంతరించి ప్రజాహృదయమునందు కార్యదీక్ష జనించి ప్రభుత్వమునకును భయకంపములు గలిగినవి. హిందూమహమ్మదీయ భేదములు, బ్రాహ్మణ బ్రాహ్మణేతరభేదములు, సవర్ణావర్ణభేదము, దక్షిణోత్తరభేదములు, కార్మికధనస్వామిభేదములు, జాతీయస్వతంత్రపక్షభేదములు మొదలగు భేదములు కొంతవర కంతరించి భారత శక్తిస్వరూప ముదయించినది. నవశక్తి స్వరూపోదయకాంతులు ప్రజలకును, నాయకులకును, ప్రభుత్వాధికారులకును భయసంభ్రమములను గలుగజేసినవి. త్యాగమునందు సాధ్యమైన శక్తి భోగమునందు సాధ్యముకా దని ప్రపంచేతిహాసములు సహస్ర ముఖములను బోధించుచున్నవి. ప్రభుత్వము చతుర్విధోపాయములను ప్రజాశక్తిని స్తంభింపజేయుటకు యావచ్ఛక్తిని వినియోగించినది. గాంధిమహాత్ముడు వికసింపజేసిన ధర్మబలమును ప్రతిఘటించుటకు ప్రభుత్వ మవలంబించిన రాజ్యతంత్రములందు విల్లింగ్డను ప్రభువుగారికి దక్కిన దనుట నిర్వివాదాంశము. మానవులకు సహజమైన ధనాధికారలోభములు ప్రభుత్వనిర్బంధములు అంతర్విభేదములు ప్రభుత్వబలమును వృద్ధిచేయుటకును, ప్రజాబలమును స్తంభింపజేయుటకును వినియోగపడినవి. త్యాగమూర్తులైన కాంగ్రెసుపక్షావలంబనులందె భేదాభిప్రాయములు ప్రవేశించినవి. కాంగ్రెసు స్వరాజ్యపక్షము, కాంగ్రెసుజాతీయపక్షము, స్వతంత్రపక్షము, లిబరలుపక్షము, సాంఘికపక్షము, కార్మికపక్షము, కమ్యూనిస్టుపక్షము మొదలగుపక్షము లుద్భవించినవి. హిందూ మహమ్మదీయ మతభేదములు, సనాతనసంస్కారణాభిప్రాయభేదములును పక్షభేదముల కుత్తేజమును గలుగజేసినవి. స్థానికప్రయోజనములును, కులభేదములును పక్షభేదములకు

భయంకర రూపమును గల్పించుచున్నవి. శాసనసభల ఎన్నికలకన్నను కాంగ్రెసు సంఘముల ఎన్నికలందు సంక్షోభ మధికమైనది. కాంగ్రెసుప్రతిష్ఠకు భంగము కలిగి కాంగ్రెసుబలము క్షీణించుచున్నది. స్థానిక సంస్థలు కాంగ్రెసుపక్షమువారి లక్ష్యమును త్యాగమార్గమునుండి లాభమార్గమున కాకర్షించినవి. స్థానికసంస్థలను ప్రత్యక్షముగ నారాధించినను, పరోక్షముగ నారాధించినను వ్యక్తులకును, సంఘములకును, పక్షములకును లక్ష్యభేదము లుదయించి కాంగ్రెసు పక్షబల సంయోగములు శిథిలము లగుచున్నవి. గౌరవచిహ్నమైన కాంగ్రెసు నామరూపధారణము పరిహాసపాత్రమగుచున్నది. సుప్రసిద్ధనాయకులును, దేశభక్తాగ్రేసరులునునైన పూలవ్య వల్లభభాయిగారలకే భేదాభిప్రాయములు గలిగినపుడు సామాన్యులమాట చెప్పవలసిన యవసరము గనుపడదు. కాంగ్రెసు పక్షావలంబనులందు గలిగిన యసంతృప్తి గాంధిమహాత్మునకు జిజ్ఞాసకుమూలమైనది. గాంధిమహాత్ముని జిజ్ఞాస యేరూపమును దాల్చునదియును వార్తా సమావేశమునందు తేలుట సంభవము.

* * *

గాంధిజీ – యోగము

గాంధిమహాత్ముడు కాంగ్రెసువ్యవహారములం దుపక్రమించిన అనాసక్తయోగము సామాన్యులకు దురారాధ్యము. ఆసక్తయోగమునకు పరిచితమైన ప్రపంచవ్యవహారములందు త్యాగపరమైన సత్యాగ్రహము దురారాధ్యము. సత్యాగ్రహము సర్వత్ర ప్రత్యక్షముగనున్న బ్రహ్మపదార్థమువలెను దురారాధ్యమేకాకను దుర్గ్రాహ్యమును. బ్రహ్మజ్ఞులవలెను సత్యాగ్రహులును వెలయుట ప్రకృతిధర్మము. నిరపేక్షమైన సత్యాగ్రహము వివిధసందర్భములందును ధర్మాధర్మ ప్రమేయము లేకను సత్యాగ్రహము సామాన్యులకు శరణ్యమైనది. సత్యాగ్రహ దుర్ణయములకు గాంధిమహాత్మునకు పాపములకు భైరవునకు వలెను ప్రాయశ్చిత్తము శరణ్యమైనది. గాంధిమహాత్ముని ప్రాయశ్చిత్తోపవాసములు సత్యాగ్రహమునకు సంప్రాప్తమైన యపకీర్తికి నిదర్శనములు. గాంధి యోగీశ్వరుడు సంభవమైనను ధనుర్ధరులైన సత్యాగ్రహులు దుర్లభులు. ప్రజాలక్ష్యము నాయకుల లక్ష్యము దురారాధ్యమైన సత్యాగ్రహమునుండి సుఖారాధ్యమైన స్థానికసంస్థలకును, శాసనసభలకును మరలినవి. సత్యాగ్రహనాయకుడైన గాంధిమహాత్ముడు వార్తాయందు చేయనున్న నిర్ణయము కాంగ్రెసుపక్షావలంబులకును, ఇతరనాయకులకును సమాదరణీయమై దేశక్షేమమునకు వినియోగపడుటకు భగవదనుగ్రహము గలుగుగాత !

Printed and Published by K. Nageswara Rao, at the Andhra Patrika Press, No 7, ThambuChetty St., Madras,
Editor: G. Subbaramayya

# श्री नागेश्वररावजी ।

श्री व्रजनन्दन शर्मा.
(हिन्दीप्रचारक, आन्ध्रदेश)

"Man's life is a bundle of difficulties."—

यह वाक्य जब मेरे अस्थिर दिमागमें पैठा, तो सहसा मेरी नज़र वक्ताके चेहरेपर पड़ी। मैंने देखा कि उसके मुखपर सचमुच ही उन (difficulties) के चिह्न सिकुड़नोंके रूपमें विद्यमान हैं। अन्त तक मैं बड़ी धीरतासे उस व्याख्यानको सुनता रहा। उसी क्षणसे वक्ताके प्रति मेरे हृदयमें जो श्रद्धा और आकर्षण पैदा हुआ, वह आज तक बना हुआ है, बल्कि बढ़ रहा है। यह वक्ता श्री काशीनाथुनि नागेश्वरराव थे। उनका सौम्य स्वभाव, भोलाभाला हँसता हुआ मुखमंडल, निरभिमान व्यवहार तथा नम्रतापूर्ण सम्भाषण—एक बार सामने आते ही आकर्षित कर लेता है।

उनकी विशाल कीर्ति, विराट् धन-सम्पत्ति और दानशीलता उनके मुखमंडलसे नहीं झलकती। साधारण खादीका कुर्ता और टोपी उनकी व्यवहार-कुशलता और चातुरीका प्रदर्शन भी नहीं करती। कोई कुशल सामुद्रिक पंडित भी शायद इस बाह्य कला-विहीन व्यक्तिको देखकर यह नहीं बता सकेगा कि इसका अन्तर-प्रदेश इतना कलापूर्ण होगा, और यह इतना बड़ा कला-उपासक होगा। तीक्ष्ण बुद्धिवाले व्यक्तिके लिए भी यह कल्पना कठिन होगी कि यह विभूतिधारी, प्राचीन आचारवाला मनुष्य अपने हृदयमें इतनी क्रान्तियों और सुधारोंको जगह देता है। श्री नागेश्वररावजीकी यही विशेषता है।

अनेक बातोंमें नागेश्वररावजीके बाह्य और अन्तरमें विलक्षण पार्थक्य है। मुझे तो उनका चेहरा देखकर दया आती है, क्योंकि दुनियाकी सारी दीनता और शान्ति उन्होंने ही ले ली है। वे शैव हैं, इसीलिए शायद उन्होंने व्यापारिक, राजनीतिक तथा सामाजिक उलझनोंके हलाहलको महादेवकी तरह कंठगत कर के अधरोंपर स्मित हास्य विकसित कर रखा है। यदि कोई याचक, जो इनसे अपरिचित हो, इनके सामने खड़ा कर दिया जाय, और उससे कहा जाय कि ये बड़े लक्ष्मीपात्र और दानी हैं, तुम इनसे याचना करो, तो वह शायद वैसा करनेमें हिचकिचायेगा। क्योंकि नागेश्वररावजीके चेहरेपर अन्य दानियों और लखपतियोंकी तरह अभिमान और आडम्बर नहीं है। एक वार एक गाँवमें कई सभाएँ थीं। नागेश्वर राव भी उनमें से एकके सभापति थे। हम सब लोग बैठे थे। कोई कार्यक्रम न था। मामूली गप-शप हो रही थी। इतनेमें एक किनारेसे एक महिला उठीं और अपनी कन्या-पाठशालाके लिए कुछ चन्दा उगाहने लगीं। वे अभी नागेश्वररावजीसे दूर थीं। मुझे जहाँ तक याद है, किसीने भी ५) से ज्यादा नहीं दिया था। एकाएक मैंने नागेश्वररावजीकी तरफ़ देखा, तो वे कुछ घबराये-से प्रतीत हुए। मैंने समझा शायद उनकी जेब खाली है। दो ही मिनटमें वह महिला उनके सामने आ पहुँचीं। नागेश्वर रावजीका मुखमंडल उस समय देखने लायक था। पशोपेशके समय तथा विवश-ताके समय मनुष्यकी आकृति कैसी हो



त्यागमूर्ति नागेश्वररावजी

जाती है, इसका उदाहरण मैं स्थायी रूपसे देता, यदि मेरे हाथमें उस समय हैण्ड कैमरा होता। किन्तु शीघ्र ही मुझे आश्चर्य-सागरमें डूबना पड़ा। क्षमा-याचना करते हुए नागेश्वररावजीने एक सौका एक नोट, जहाँ तक हो सका छिपाकर, उक्त महिलाके हाथमें रख दिया। अगर कोई मामूली आदमी होता, तो कितने प्रदर्शनके साथ वह धन देता और कितनी पत्रिकाओंके कालम काले करवाता। 'नेकी कर और कुएँमें डाल'— यही है नागेश्वररावजीकी दान-शीलताकी विशेषता।

नागेश्वररावजी आन्ध्र-देशके कृष्णा ज़िलेके 'यलकुरु' गाँवमें एक आचार-परायण शैव ब्राह्मणके घर १ मई सन १८७० को पैदा हुए। आन्ध्र-देशके आचारपरायण ब्राह्मणोंके परिवार और विचार कैसे होते हैं — यह



कांग्रेस-नेता नागेश्वररावजी

'विशाल भारत' के पाठक मेरे पहलेके लेखोंसे जान चुके हैं। यह कहनेकी आवश्यकता नहीं कि नागेश्वररावजीके पिता श्री बुच्चय्याजी तथा माता श्रीमती श्याम-लाम्बा देवी प्राचीन विचारकी रही होंगी। अबसे ७० वर्ष पहलेकी विचार-धारा कैसी थी, यह भी कल्पना करनेकी बात है। खासकर दक्षिणके वैष्णव और शैवोंकी रूढ़ि-पूजा तो पराकाष्ठापर पहुँच चुकी थी। ऐसे ही विचार और वातावरणमें उनका लालन-पालन हुआ। यलकुर्रु एक छोटा-सा गाँव है। यहाँ धान बहुतायतसे होता है। उनके पिता कुछ ब्रह्मोत्तर भूमिके स्वामी थे। पढ़ने-लिखनेमें वे प्रारम्भसे ही तीक्ष्ण थे। उस समय अंगरेज़ीका इतना प्रचार न था। अंगरेज़ीदां लोगोंकी पूछ थी। अतएव माताने उन्हें अंगरेज़ी पढ़ानेकी ठानी। माँकी इच्छा रही होगी कि बेटा पढ़-लिखकर कोई बड़ी नौकरी—मैजिस्ट्रेटी या तहसीलदारी—करेगा; पर पुत्रने कुछ और ही किया। वे इस छोटेसे बालकको लेकर मछलीपट्टम चली आईं, जहाँ वे हिन्दू-स्कूलमें भर्ती किये

చమత్కారైకసారాభి
రుద్యానస్యేవ జాతిభిః'

—ఇక నమిసాధువు చెప్పుతూఉన్నదో మరి:—

'అపశబ్దనిరాసశ్చ యద్యపి వ్యుత్పత్తిద్వారేణైవ కృత స్తథాపి మహాకవీనామ ప్యపశబ్దపాతదర్శనాత్ తన్నిరాసాదరఖ్యాపనాయ పునరభి యోగః. తథాపి పాణినేః పాతాలవిజయే మహాకావ్యే...'సంధ్యా వధూం గృహ్య కరేణ' త్యత్ర గృహ్యేతి క్త్వో ల్యబా దేశః. తథా తస్యైవకవేః...
గతేఽర్ధరాత్రే పరిమందమందం...
...అపశ్యతీ వత్సమి వేందుబింబమ్...
ఇత్యత్రాపశ్యతీతి లుప్తంతీనకారం పదమ్'...

పదునాలుగవశతాబ్దములోవాడు విద్యాధరపండితుడు ఏకావళిలో వ్రాస్తూన్నాడుకదా...

'పాణినిప్రముఖై స్తైస్తైః
శబ్దశాస్త్రవిశారదైః;
ఇహతావ త్త్రిధా శాస్త్ర
మభ్యధీయత తత్రచ.

శబ్దప్రధానం వేదాఖ్యం
ప్రభుసమ్మిత ముచ్యతే;
ఈషద ప్యన్యథాభావే
దృశ్యతే దురితం యతః,

ఇతిహాసాదికం శాస్త్రం
మిత్రసమ్మిత ముచ్యతే;
అ స్యార్థవాదరూపత్వాత్
కథ్యతేఽర్థప్రధానతా.

ధ్వనిప్రధానం కావ్యంతు
కాంతాసమ్మిత మీరితమ్;
శబ్దార్థా గుణతాం నీత్వా
వ్యంజనాప్రవణం యతః.' అని: కాని, పాణిని అష్టాధ్యాయిలో, పైవిభాగక్రమము ఎక్కడా కనబడదు, ధ్వనితమైనా కాలేదు. కనుక జాంబవతీవిజయకారుడు, కావ్యారంభమునందు ఈప్రశంస చేసిఉండాలని,..తప్పకుండా......అనుకోవలసి వస్తూంది.

పాణినికి ఇటీవలి వ్రాతగాళ్లు ఆతడూ, ఆతని అనుయాయులున్నూ...కాత్యాయనుడూ,పతంజలిన్నీ... అలంకారశాస్త్రంలో అంశాలుగాఉన్న కావ్యదోషములను దరిదాపుగా అన్నిటినీగూర్చి ప్రస్తావించినారని ఋజువుచేయ ప్రయత్నించారు. మాటవరుసకు, వ్యక్తివివేకవ్యాఖ్యానకారుడు...

'యదేతదిహ గ్రంథకృతా విచారసరణి మాశ్రిత్య విధేయావిమర్శాదిదోషపంచక ముద్భావితం నత త్రాద్యతనపురుషమాత్ర బుద్ధిప్రణయ నాసూయయానాదరః కరణీయః, పూర్వైర పేవంవిధదోషోద్భావనరూపస్య విచారస్య ప్రణీతత్వాత్. తథాహి 'దాస్యాః పుత్ర' ఇత్యాదా వాక్రోశే షష్ఠ్యా అలుకం ప్రతిపాదయతా శాస్త్ర (సూత్ర) కృతా విధేయావిమర్శః సూచితఏవ తథా 'స్వామీశ్వరాధిపతిదాయాద...' (౨. ౩. ౩౬) ఇత్యత్రసూత్రే 'నహిభవతిగవాం స్వామీ అశ్వేషుచ' ఇతివదతా భాష్యకృతా స్ఫుటమేవ ప్రక్రమభేదః ప్రతిపాదితః తథా 'కృఞ్చాను ప్రయుజ్యతే లిటి' (౩-౧. ౪౦) ఇత్యత్రానుప్రయోగస్యానుశబ్దపర్యాలోచనయా వ్యవహితపూర్వప్రయోగం 'తంపాతయాం ప్రథమమాస' (రఘు ౬-౬౧) ఇత్యాదౌ నిషేధతా, చాదీనాంచ 'నహిభవతిచవృక్షః' ఇత్యాదినా ప్రయోగనియమాఖ్యాపనేనద్యోతకత్వంకథయతా అస్థానప్రయోగలక్షణః క్రమభేదః కటాక్షితఏవ తథా 'కర్మధారయమత్వర్థీయాభ్యాం బహువ్రీహి ర్లఘుత్వాత్ స్యాత్' ఇతివృత్తిలాఘవంచింతయతా కాత్యాయనేన పౌనరుక్త్యమపి ప్రకాశితమేవ. తథా 'ఈషదసమాప్తౌ... (౫. ౩. ౬౧) ఇత్యత్ర ప్రతిజ్ఞానసమధిగమ్యం సూత్రకారోక్తం రూపకలక్షణ మథ దూషయతా ప్రకృత్యర్థసదృశే కల్పబాదివిధానమితి ప్రతిజ్ఞానసమధిగమ్యార్థభూతా ముపమాం వ్యవస్థాపయతోపమాశ్రయేణ వాచ్యావచనమపి ద్యోతితమేవ. ఏతేన రూపకాశ్రయేణావాచ్యవచనమపి ద్యోతితమేవ. తదేవంమహావిదుషాం మార్గ మనుసృత్య సహృదయశిక్షాదరాయ విచారయతోఽస్య నకశ్చిత్ పర్యనుయోగలేశస్యావసర ఇత్యల మతిప్రసంగేన...'

(పే. ౧౫-౧౬)

అని పెనవేస్తున్నాడు కాని, లోకంలో అందరూ ఏకంగా అనుకునేమాట ... వ్యాకరణజ్ఞుడు, లెక్క ప్రకారం, కావ్యంలో బాగోగులుఎంచడానికి కాని... స్వయంగా రచించడానికి... అసలే.. కాని, పనికి రాడు...అనేది, దీనికి పోటీతగులుతూ ఉన్నది. ధర్మ దత్తుడు అన్నట్లు—

'సవాసనానాం సభ్యానాం
రసస్యాస్వాదనం భవేత్;
నిర్వాసనాస్తు రంగాంతః
కాష్ఠకుడ్యాశ్మ సన్నిభాః.'... నిర్వాసనాః అనగా నైయాకరణులు, మీమాంసకులు అనిఅట!—ఈపాటే క్షేమేంద్రుడూ కవికంఠాభరణములో సాగించినాడు.

'యస్తు ప్రకృత్యాశ్మ సమాన ఏవ
కష్టేనవావ్యాకరణేన నష్టః;
తర్కేణ దగ్ధోఽనలధూమినావా
హ్యవిద్ధకర్ణః సుకవిప్రబంధైః. (౧-౨౨)

నతస్య వక్తృత్వసముద్భవ స్స్యా
చ్ఛిక్షావిశేషైరపి సుప్రయుక్తైః;
న గర్దభో గాయతి శిక్షితోఽపి
సందర్శితః పశ్యతి నార్క మండః. (౧-౨౩)

కుర్వీత సాహిత్యవిదః సకాశే
శ్రుతార్జనం కావ్యసముద్భవాయ;
నతార్కికం కేవలశాబ్దికంవా
కుర్యాద్గురుం సూక్తివికాస విఘ్నమ్.' (౧-౧౪)

ఈశ్రుతిలోనే కలిసి...

'నైవవ్యాకరణజ్ఞ మేతి పితరం...
...కవితాకన్యా వృణీతే స్వయమ్'

...పై సుభాషితానికి పక్కతాళంవేస్తూ...మరి ఒకటి కూడాను—

'సంపర్కేణ కుతర్కాణాం
తర్కవ్యాకరణస్పృశామ్;
ఉడ్డీయతే రసః ఖండైః
పావకేనేవ పారదః.'

వాస్తవమునకు ఎంత ఆరాతీసినా, పసందైన కవిత్వము చెప్పగల తాహతు ఉన్న ఉత్తమకవిగానూ, ఏకకాలంలోనే నైయాకరణిగానూ ఉండగల సత్తా ఉన్న మహామహుడు ఎవరూ కనబడటము లేదు. కాళిదాసు...సందేహమేమీ లేకుండా...వ్యాకరణంసంగతి తువముట్ట చూసినవాడే... ఆతని గ్రంథాలలో చాలా చోట్ల వ్యాకరణోపమలు పొటకరిస్తూ ఉంటవి కదూ, కాని, ఎన్నడునూ శబ్దరూపములతోనే చెలగాటలో మేనుమరచిపోలేదు — సూత్రములు రచించడములో తెలివితేటలను వినియోగించసలపనూ లేదు; వెనుకటికి చాలాబాగా అన్నారు.

'యః స్యాత్ కేవల లక్ష్యలక్షణరతో
నోతర్క సంపర్కభృ
న్నాలంకారవిచారచారుధిషణః
కావ్యజ్ఞశిక్షోజ్ఝితః,
తస్మాచ్చే ద్రసశాలి కావ్య ముదయే
దేకాంతతః సుందరం
ప్రాసాదో ధవల స్తదా క్షితిపతేః
కాకస్య కార్ష్ణ్యా ద్భవేత్.'

కనుక, పాణినిపేర చలామణి అవుతూఉన్న కొన్నికొన్ని తీయనిపద్యములకు, వ్యాకరణాచార్యునికీ కర్తృకారకబాంధవ్య నిర్ణయము చేయడమునకు ఇంత కన్న సరిఐననిదర్శనములు కావలసిఉంటవి:

ఇక, క్రమముగా...పద్యములసంగతి—

'అసౌ గిరేః శీతలకందరస్థః
పారావతో మన్మథచాటుదక్షః;
ఘర్మాలసాంగీం మధురాణి కూజన్
సంవీజతే పక్షపుటేన కాంతామ్.' ౧.
(సదుక్తికర్ణామృతము ౨౧).

['ఘర్మాలసాంగీం'—అపాణినీయము.

'మధురాణికూజన్...' సంస్కృతంలాగానే తోచడంలేదు! అవ్యయములకు సర్వథా ఏకవచన రూపమే వ్యావహారికము గనుక 'మధురంహికూజన్' అనిఉండవలె సరిఅయినపాఠము: అన్వయక్రమసౌలభ్య

ముకొరకు 'విశేషణమాత్రప్రయోగో విశేష్యప్రతిపత్తౌ' అన్న వామనసూత్రమును ఆసరాతీసుకుని సరిపెట్టుకొనవచ్చును.

ధాతుపాఠములో 'వీజ' అను ధాతురూపమును పాణిని ఇయ్యలేదు. కనుక 'సంవీజతే' అన్నది అపాణినీయమైన ప్రయోగము. ఆపైన 'గిరేః శీతల కందరస్థః'- ఈవిధమైన పేలవపురచన పాణినికి చూస్తూ చూస్తూ ఎవరు అంటకడుతారు ?

ఏది ఎలాగున్నా, ఈపద్యము చాలాచక్కగా ఉన్నది. ప్రతిపదమున్నూ అత్యుత్తమవ్యంగ్య ద్యోతక మర్యాదను వెలయించుతూ మాఘుని 'సోమముతాపపి తాః స్మ భృశేస్వేదః' (౬-౬౧) అన్న పద్యమును తలపు వచ్చేటట్టు చేస్తూవున్నది. ఛందము ఉపజాతి]:

'ఉద్బద్ధేభ్యః సుమారం ఘనజనితతమః
　　పూరితేషు ద్రుమేషు
ప్రోద్గ్రీవం పశ్య పాదద్వయనమితభువః
　　శ్రేణయః ఫేరవాణామ్;
ఉల్కాలోకైః స్ఫురద్భిర్నిజవదనపతీ
　　సర్పిభి ర్వీక్షితేభ్య
శ్చ్యోతత్ సాంద్రం వసాంభః క్వథితశవవపు
　　ర్గంధలేభ్యః పిబంతి.'౨ (స. క. 3౬3)

[ఆఫ్రెట్, 'ఉద్బద్ధేభ్య' అని చదివి, 'సుమారమ్'తో అన్వయించినాడు — 'ఉద్బద్ధేభ్యః' అని బాట్లింకు యోజన; ఈపాఠమే సరిఅయినదని తోస్తూ ఉన్నది.. ఈలాటి దూరాన్వయ విధానము సంస్కృతములో చాలా అరుదైనప్పటికిన్నీ : (ఐనామాఘంలో—

'ఆవృతాన్యపి నిరంతర ముచ్చై
ర్యోషితా మురసిజద్వితయేన;
రాగిణా మితఇతో విమృశద్భిః
పాణిభి ర్జగృహిరే హృదయాని.' (౧౦. ౫౬))

పాశ్చాత్యపండితులు సాధారణముగా 'క్వథిత'ను 'కుథిత' అని తప్పు ఎందుకు చదువుతారో తెలియకుండా ఉన్నది. ఆఫ్రెట్, 'వసాంభః...క్వథితశవవపుః' అనే పాఠాంతరమును ఉల్లేఖించినాడు, మరిన్నీ మాలతీమాధవములో...తప్పకుండా, దీనికి మాతృక ఐ ఉంటుంది... క్వథనపరిగలన్మేదసః' (౫. ౧౫) అని ఉన్నది:

'క్వథిత' (కాకబారుతూఉన్న... పచనము చేయబడుతూఉన్న, అని అర్థము) అన్నదే సరిఅయిన పాఠము అనడమునకు ఎంతమాత్రమున్నూ సంకోచము లేదు..

'ఉల్కాలోకైః'—నక్కలు రాత్రివేళ ఊళ పెడుతూంటే, వాటినోటివెంట, మంటవస్తుందని సంప్రదాయము :

ఉదా: రఘు ౧౬.౧౨—'వదన్ముఖోల్కావిచితామిషాభిః
　　సవాహ్యతే రాజపథః శివాభిః': మరిన్నీ భాగవతం ౧. ౧౪. ౧౨ 'శివైష ఉద్యంత మాదిత్య
　　మభిరౌ త్యనలాననా!]

'చంచత్పక్షాభిఘాతం జ్వలితహుతవహ
　　ప్రౌఢధామ్నశ్చితాయాః
క్రోడా ద్వ్యాకృష్టమూర్తే రహమహమికయా
　　చండచంచుగ్రహేణ;
సద్యస్తప్తం శవస్య జ్వలదివ పిశితం
　　భూరి జగ్ధ్వార్ధదగ్ధం
ప శ్యాంతఃప్లుష్యమాణః ప్రవిశతి సలిలం
　　సత్వరం గృధ్రవృద్ధః.'3 (స: క: 3౬౪)

['క్రోడాద్వ్యాకృష్టమూర్తేః'—ద్వితీయ స్వరపదము స్పష్టముగా, ప్రతిలో గోచరించనందున పీటర్సన్, బాట్లింక్‌ను అనుసరించి 'క్రోడవ్యాకృష్టమూర్తేః' అని పాఠము ఇచ్చినాడు: 'క్రోడాద్వ్యాకృష్టమూర్తేః' అన్న ఆఫ్రెట్ పాఠము ఉత్తమముగా ఉన్నది; అదే అసలుది కూడా ఐఉండవచ్చును: ఈ రెండుపాఠములకున్నూ, 'సాపేక్షత్వేపిగమకత్వాత్ సమాసః'—ఈనిబంధనమును ఆసరాగా తీసుకోవలెను. 'అహమహమికయా'— ఇచ్చట ఉచితముగా కనబడటము లేదు: అదీకాకుండా అపాణినీయము కూడాను:]

పై రెండుపద్యములలోను శ్మశానవర్ణనము, ప్రగాఢముగా ఒనరింపబడినది. బహుశః రెండిటికినీ కవి ఒకడే కావచ్చును. ఈస్రగ్ధరలు రెండిటికినీ, మాలతీ

మాఘవమునందలి వర్ణనముతో చాలాపోలికలు కనబడు తూ ఉన్నవి. స్పష్టముగా పాణినికి చాలా తరువాతివి అని చెప్పవచ్చును.

కల్హారస్పర్శగర్భై శ్శిశిరపరిచయాత్
కాంతిమద్భిః కరాగ్రై
శ్చంద్రే ణాలింగితాయా స్తిమిరనివసనే
స్రంసమానే రజన్యాః ;
అన్యోన్యాలోకినీభిః పరిచయజనిత
ప్రేమనిష్యందినీభి
ర్దూరారూఢే ప్రమోదే హసితమివ పరి
స్పష్ట మాశాసఖీభిః. ౮ (స: క: ౮౧౧)

[ స్రగ్ధరావృత్తము : ఏసంస్కృతమహాకవి లేఖిని నుండి యైననూ జాలువారు యోగ్యతతో ఒప్పుచున్న చక్కనిరచన : వృత్తనిర్ణయమును పట్టీ, శయ్యనుబట్టీ, పాణినికర్తృకము ఒక్కనాటికి కా దనిచెప్పవచ్చును. ఏకవియో, లేక ఆలంకారికుడో సమాసోక్తికి లక్ష్యముగా దీనిని రచియించి ఉండవచ్చును. అసలు ఎత్తుగడలో...'శిశిరపరిచయాత్ కాంతిమద్భిః' సరిగా అర్థం కావడంలేదు. శిశిరపరిచయలాభమున అవి కాంతిమంతము లేలా అవుతవో తెలియకుండా ఉన్నవి. 'శిశిరపరిచయాత్'ను, 'కల్హారస్పర్శగర్భైః'తో అన్వయించుకున్నా...ప్రక్రమభంగమని తెలిసీకూడా ... అర్థము అనువుగా కుదరడములేదు. ఆఫ్రేట్ ఈ పద్యమును, 'ఉపోఢరాగేణ...'తో సరిపోలుస్తూన్నాడు.]

౨ పాణౌ పద్మధియా మధూకకుసుమ
భ్రాంత్యా తథా గండయో
ర్నీ లేందీవరశంకయా నయనయో
ర్బంధూకబుద్ధ్యాధరే ;
లీయంతే కబరీభరే నిజకుల
వ్యామోహజాతస్పృహా
దుర్వారా మధుపాః కియంతి తరుణి
స్థానాని రక్షిష్యసి.౫

(స : క : ౨. ౬౦౬)

[భ్రాంతిమదలంకారమునకు చక్కనిఉదాహరణముగా ఉపచరిస్తూన్నది ఈశార్దూలవిక్రీడితము :

ఈపద్యము 'శార్ఙ్గధరపద్ధతి'లోను, 'పద్యరచన'లోను అచలకవిదని వ్యవహరింపబడినది : 'సుభాషితావళి', 'కవీంద్రవచన సముచ్చయము'లలో ఎవరి పేరూ లేదు : శ్రీధరదాసు సదుక్తికర్ణామృతములో మాత్రమే పాణినిపేర ఉల్లేఖింపబడినది : అచలుడు మహాకవి : బహుశః ఇది ఆతడురచించినది అయిఉండవచ్చును :

'నీలేందీవర... పునరుక్తిదోషము పడుతున్నది: 'ఫుల్లేందీవర...ఉచితమైనది.]

పాణౌ శోణతలే (తమే ?) తనూదరి దర
క్షామాకపోలస్థలీ
విన్యస్తాంజనదిగ్ధలోచనజలైః
కిం మ్లాని మానీయతే ;
ముగ్ధే చుంబతు నామ చంచలతయా
భృంగః క్వచిత్ కందలీ
మున్మీలన్నవమాలతీపరిమలః
కిం తేన విస్మర్యతే.౬

(స : క : ౨. ౨౮౦ :
కవీంద్ర వ : స : (కస్యాపి) ౩౬౪)

* * * *

౨. సుభాషితావళిలో (౨౦౩౭) ఈపద్యము పేరులేకుండా ఉదాహృతమైనది (కస్యాపి): పాఠములో కూడా భేదమున్నది...

ఫుల్లేందీవరశంకయా నయనయో ర్బంధూకబుద్ధ్యాధరే
పాణ్యోః పద్మధియా మధూకకుసుమ భ్రాంత్యా తథా గండయోః ;
లీయంతే కబరీషుబాంధవజనప్రీతి ప్రబద్ధస్పృహా
దుర్వారా మధుపాఃకియంతి భవతీస్థానాని రక్షిష్యసి:

ముఖాని చారూణి ఘనాః పయోధరా
నితంబపృథ్వోఽళ్లజఘనోత్తమశ్రియః;
తనూని మధ్యానిచ యస్య సోఽస్యగాత్
కథం నృపాణాం ద్రవిడీజనో హృదః. ౭
(స : క : ౨. ౮౮)

[అచ్చుపడ్డపుస్తకములలో, మూడవపాదంలో చివరమాట 'సోఽభ్యగాత్' అని ఉన్నది: హృదః అన్న పదము షష్ఠితో అన్వయము కావడము లేదు: కనుక, 'సోఽస్యగాత్' అని సవరించితే బాగుంటుంది. రెండవ పాదములో భగ్నప్రక్రమదోషము ఉన్నది: మరిన్నీ, 'నితంబపృథ్వ్యళః' — 'జఘనోత్తమశ్రియః' — ఈసమాసరచన ఏమీ హాయిగాలేదు. ఆఫ్రేఖ్ట్ అన్నట్లుగా 'హృదః'కు బదులు 'గృహాన్' అని మార్చడము — ఆలాచేయడమునకు వీలులేదు: 'హృదమ్'— బాట్లింక్‌సవరణ ఏమాత్రమున్నూ ఉచితముగానూ, అర్థవంతముగానూ లేదు.

ఈతరుణంలో ఇంకోవిషయము చెప్పవలె... ద్రవిడశబ్దము పాణినికి పరిచితము కాదు.

పద్యముయొక్క సందర్భము ఏమిటో తెలియక పోవడం చిక్కుగా ఉన్నది. సదుక్తి కర్ణామృతములో 'దాక్షిణాత్యస్త్రీ' క్రింద ఇది ఉన్నది.

—'చక్కని ఆకృతులున్నూ, విలాసములున్నూ కలిగిన ద్రవిడసుందరులను, రాజులు ఏలా మరచిపోగలరు' అని కవి అభిప్రాయమైతే... బహుశః ఆలాగే ఐఉండవచ్చునని తోస్తుంది...'సోప్యగాత్' పద్యమునకు మెరుగుపెడుతుంది... 'అగాత్' బదులు 'నిరగాత్' ఉండవలెననే అనుకొన్నా.

ఆలాకాకుండా,

అంత...పీనపయోధరములూ ... నితంబములూ కలిగిన భామలు, రాజుల హృదయాల్లో ఎలాప్రవేశింపగలరు' అని కవిభావమైతే...సాధించడమునకు రెండుత్రోవ లున్నవి:—'హృదః' అనేది 'హృదయ'కు ద్వితీయాబహువచనమని ('హృంది'కి బదులు ఛందోసౌలభ్యంకోసం వాడినదిగా) అనో, లేక బాట్లింక్ చూపిన పాఠమునో అంగీకరించవలె.

చిత్తంతు స్వాంతం హృదయం
　చేతోహృన్మానసం మనః' — అని అమరంలో

హృచ్ఛబ్దము నపుంసకవాచిగా ఉన్నా (దానికి రెండునైపులా నపుంసకశబ్దములే ఉండిన కారణమున) వామనుడు స్పష్టముగా అది స్త్రీవాచక మని చెప్పినాడు.

భాద్యాః పూరుడు కాకుప్రియంగు
హృత్ స్నాయు రజ్జుతంతు తనుః.
(లింగానుశాసనము-కారిక ౨౩)

కనుక వామనుడిమతాన్ని అనుసరించి 'హృదః' అని ద్వితీయాబహువచనముక్రింద మన్నించడంసాధువు అవుతున్నది.

ఈలా సరిపెట్టుకునే సందర్భములో—

'ముఖాని చారూణి'— 'తనూని మధ్యాని' ఈప్రయోగములు విశిష్టార్థోపేతములుగా గోచరించడము లేదు.]

గతేఽర్ధరాత్రే పరిమందమందం
గర్జంతి యత్ ప్రావృషి కాలమేఘాః;
అపశ్యతీ వత్సమి వేందుబింబం
తచ్ఛర్వరీ గౌరివ హుంకరోతి. ౮

(రుద్రట కావ్యాలంకారములో (౨.౮) నమిసాధువు పాణినిజాంబవతీవిజయములోనుంచి ... అని ఉదహరించినాడు. భోజునిశృంగారప్రకాశములో పేరు లేకుండా ఉన్నది. 'కాలమేఘాః'కు నీలమేఘాః అనీ, 'తచ్ఛర్వరీ'కి 'తంశర్వరీ' అనీ పాఠభేదములతో.)

[పాణినీయవ్యాకరణమును అనుసరించి 'పరిమందమందం'...సమాసమును సాధించడము కష్టం: 'పరిమందమ్' అనికాని, 'మందమందమ్' అని ఐనా చెప్పవలసివస్తుంది:

ఈసందర్భంలో ఒకసంగతి చెప్పాలి...మాఘకవికి 'పరిమంద...' అనేమాట చాలఇష్టము. శిశుపాలవధ తొమ్మిదోసర్గలో మూడుసార్లు ఉపయోగించి

నాడు. (శ్లో. ౩,౨౭,౨౯). ఆసర్గంలోనే 'మందమ్' ౬౧ శ్లోకములోనూ 'పరిముగ్ధతామ్' ౩౨శ్లో. లోనూ, 'పరిమూఢతామ్' ౭౦ శ్లో. లోనూ...'పరిమంథరాభిః' శ్లో. లోనూ ౭౦ వాడుకచేసినాడు.

'అపశ్యతీ'... చూడగానే వ్యాకరణదుష్టమని తెలుస్తూన్నది: 'శప్శ్యనోర్నిత్యమ్' అనేసూత్రం ప్రకారము 'నుమ్' విధాయకము గనుక:

కాని, రచనావిన్యాసము ముచ్చటగా ఉన్నది.]

ప్రకాశ్య లోకాన్ భగవాన్ స్వతేజసా
ప్రభాదరిద్రః సవితాపి జాయతే;
అహో చలా శ్రీ ర్బలమానదా మహో
స్పృశన్తి సర్వంహి దశావిపర్యయే. ౯

(సుభాషితావళి ౧౯౦౮)

[ఉత్తరార్ధము... సుభాషితావళిలో ముద్రితమైన ఈపద్ధతినే ఐతే అర్థరహితముగా ఉన్నది. కాని 'శ్రీర్బలమానదాప్యహో'... 'దశావిపర్యయాః' అనిన్నీ, మూడు, నాలుగుచరణముల చివరిమాటలను సవరిస్తే, వివరణమునకు వీలుగా అనువవుతుంది.]

తన్వంగీనాం స్తనౌ దృష్ట్వా
శిరః కంపయతే యువా;
తయో రంతరసంలగ్నాం
దృష్టి ముత్పాటయ న్నివ. ౧౦

...కవీంద్రవచనసముచ్చయము (౧౬౮)లో ఈ పద్యము పాణినిపేర ఉన్నది. పేరులేకుండా, దశరూపకం (౪.౫౩) లోను, అలంకారతిలకము (పే. ౧౪) లోనూకూడా ఉదాహృతమైనది. తిలకములో, మొదటిపాదమునకు, "స్తనా వాలోక్య తన్వంగ్యాః" అనీ, మూడవదానికి 'తయో రంతరనిర్మగ్నామ్' అనిన్నీ మార్పులు ఉన్నవి: తిలకకారుని మతము, పూర్వార్ధము సమస్యారూపమని.

[వ్యాకరణ, అలంకారశాస్త్రములదృష్ట్యా, ఈ పద్యము బహుదోషకలుషితముగా కాన్పిస్తూఉన్నది. అసలు మొదట 'తన్వంగీనాం' అనేపదము విశిష్టార్థప్రాచుర్యమును పలయించేదిగా ఉద్దేశింపబడలేదని తోస్తూన్నది, చూడగా; సర్వకీర్తిరచనను విమర్శిస్తూ, క్షేమేంద్రనుహాకవి నిరూపించినట్లు...ప్రత్యేకంగా అర్థసిద్ధికి సౌలభ్యముకోసరము కాకుండా, కవియమకప్రియత్వమే ఆతనిచేత ఈలాటిపనులుచేయిస్తూంటుంది... చేయించింది 'సుందరి'. కాని, అలాగే, అతిలోకమోహనసౌకుమార్యసంపదను లక్షీకరించే మరిఏపదమైనా సరే ఇక్కడ ఉచితముగా ఉంటుంది. విప్రలంభయోగమున విరహాతిశయముచేత చిక్కి సగమైనచిన్నదాని పరంగా ఐతే, 'తన్వీ' లేక 'తన్వంగీ' ఎక్కువ ఉచితముగానూ, సార్థకముగానూ ఉంటుంది. ౩

౩. అత్ర తన్వ్యా ఇతిపదం కేవలశబ్దానుప్రాసవ్యసనితయానిబద్ధం, నకాంచి దర్థౌచిత్య చమత్కారకణికా మావిష్కరోతి. సుందర్యా ఇత్యత్ర పద మనురూపంస్యాత్, అన్యానివా నిరతిశయ రూపలావణ్యవ్యంజకాని. తన్వీపదంతు విరహ విధురరమణీజనే ప్రయుక్త మర్థౌచిత్యశోభాం జనయతి.

ఔచిత్యవిచారచర్చ, పే ౧౧౭.

...'అయమవశ్యం గృహప్రవేశో దేశాంతరాదాగతస్య అవధార్యమాణో రసపుష్టిమాధత్తే.అతఏవతన్వీతి...'

అమరుశతకం ౧౪-వ పద్యానికి...(దీర్ఘా వందనమాలికా విరచితా దృష్ట్యైవ నేందీవరైః...స్వైరేవావయవైః ప్రియస్య విశత స్తన్వ్యా కృతం మంగళం ౧౪) వ్యాఖ్యరచిస్తూ కుమారార్జునవర్మదేవుడు, ఈలా అనడంలో, అతని అభిప్రాయముకూడా క్షేమేంద్రుడిలాగానే అనితోస్తూన్నది.

—కాళిదాసులో...'తన్వీ స్థితా కతిచిదేవ పదానిగత్వా' అనీ, అమరుకంలో 'తన్వ్యా స్త్వద్య తు నిర్భరప్రణయితా మానో౽పిర మ్యోదయః' అన్నప్పుడున్నూ, ఇద్దరుకవులూ, తన్వీఅనేమాటను చక్కని పిల్లఅనేఅర్థములో వాడినారు: కనుక పాణిని(?)చేసినప్రాపంలో పాలుపంచుకునేందుకు ప్రసిద్ధులు మరిఉన్నారు, అలాగైతే;

ఐనా ఇంకోమాదిరిగా, కవిని సమర్థిస్తూ ఈలా చెప్పవచ్చును—

'తన్వంగీ' పదప్రయోగము ఇక్కడ చాలా ఉచితంగా ఉన్నది.

ఏలాగంటే, ఆపిల్లల 'అస్తినాస్తివిచికిత్సా హేతుశాతోదరము'లకున్నూ, విపులప్రయోధర భారముకున్నూ ఉండేవిపర్యాసమును...కొద్దీగొప్పల తేడా... నొక్కి చెప్పుతూన్నది.

...తరువాతపదము 'స్తనౌ' అనేదికూడా... ఆప్రయోగముకూడా...... సంస్కృతవాఙ్మయములో ఇలా తరుచు కనబడుతూన్నా...

ఉదా. (శిశుపాలవధము, ౩-౧౪) ... "ప్రకాశ కార్కశ్యగుణౌ దధానాః స్తనౌ తరుణ్యః పరివవ్రురేనమ్..."

నైషధము (౧౪-౧౫)...'తత్కర్ణా భారతీ యూనా విరహాత్ ధిమజాగరామ్; అధ్వని ధ్వనిభి ర్వ్యైర నుకల్పై ర్వ్యనోదయత్... [తత్ కర్ణా = తేషాం దేవానాం కర్ణా] ...శాస్త్ర...మర్యాదకు ఎదురువస్తూన్నది.

ఈద్వంద్వాలని సమర్థించడమునకు, వామనుడు 'స్తనాదీనాం ద్విత్వవిశిష్టా జాతిః ప్రాయేణ' అనేసూత్రం ఏర్పాటుచేసి వృత్తిలో, ఉదాహరణంగా...'స్తనయో స్తరుణీజనస్య' అని చెప్పినాడు.

కాని ద్విత్వవిశిష్టత్వము ద్రవ్యమునకుకాక, జాతికి ఏలా అవుతుందో ఆతనికే తెలియలేదు. వ్యాకరణ రూపములను, ఈలాటివి, అంగీకరించి వివరించడమునకు, జైనులమతమును అవలంబనముగా చేసుకున్నాననీ అనివేసినాడు. ౪

నిజానికి, పాణినిదే ఈపద్యమని వామనునికి తెలిసి ఉన్నపక్షంలో, ఆతడాలా విశ్వసించినట్లైతే... 'స్తనౌ' అనేద్వంద్వాన్ని, ఈలాటివిషయములకు జ్ఞాపకముక్రింద ఇచ్చివేసేవాడే. తనకు నమ్మకములేని సిద్ధాంతాన్ని ఊతగా, వ్యాకరణరూపాల్ని సమర్థించవలసినదుర్యోగం పట్టకపోయేదే... ఆపన్నవాటుపని చేసేవాడేకాదు మరి.

ఇక చర్చించవలసినపదము—'కంపయతే'

—నిగరణచలనార్థేభ్యశ్చ (౧-౩-౮౭) అనే పాణినిసూత్రమును అనుసరించి కారకంలో నిగరణ, చలనార్థకములైన క్రియాపదములు ఆత్మనేపదులు. (సిద్ధాంతకౌముది పే. ౪౬౫ నిర్ణయసాగరప్రతి) కనుక పాణినిమతానుసారంగా సరియైనరూపము 'కంపయతి' కాని 'కంపయతే' కాదు: కాశికలోకూడా (సి. కౌ. లోనూ) 'కంపయతి' ఈసూత్రముక్రింద ఉదాహరింపబడినది. ముగ్ధబోధ (౭౬౫) లో 'కంప' ...'కంపానార్థేజ్' అన్నసూత్రములో స్పష్టముగా చెప్పబడినది. పాణిని, తననిబంధనలనే త్రోసిపుచ్చి, మారుత్రోవ తీయడంగాని, భాష్యకారుడు అక్కరకువచ్చే ఈప్రయోగమును జ్ఞాపకము అని తీసుకుని ఈలాటి చిక్కుసందర్భములు వచ్చినప్పుడు చూపకమునకు పెట్టుకోక వదిలివేయడముగాని, నిజంగా, చిత్రంగా కనబడుతూన్నది.

సందేహం లేకుండా, 'కంపయతే' అని ప్రయోగం భాసకాళిదాసాదిపూర్వకవులరచనలలో కనబడుతూన్నది.

ఏకోదకత్వం ఖలు నామ లోకే
మనస్వినాం కంపయతే మనాంసి.

(పంచరాత్రము ౨. ౬.)

హస్తం కంపయతే...

(మాళవిక...౪. ౧౫)

కాని అది అపాణినీయమే ఏలాగైనా:

అర్థగౌరవము, రచనాచమత్కృతీ ఎంతగొప్పగా ఉన్నా, మనసులో మనసు ఉన్నవాళ్లెవరునూ, ఈ

౪. అథ కథం ద్విత్వవిశిష్టత్వం జాతేః? తద్ధి ద్రవ్యే నజాతౌ, అతద్రూపత్వాత్ తస్యాః. నదోషః, తద్రూపత్వాత్ జాతేః. కథం తద్రూపత్వం జాతేః? తద్ధి జైనా జానంతి. వయంతు లక్ష్యసిద్ధౌ సిద్ధపరమతానువాదినః. న చైవ మతిప్రసంగః, లక్ష్యానుసారిత్వాత్ న్యాయస్యేతి. —కావ్యాలంకారసూత్రవృత్తి (౫. ౧. ౧౪)

పద్యమును పాణినికి అంటగట్టడమునకు ఊహించరు...]*

విలోక్య సంగమే రాగం
పశ్చిమాయా వివస్వతః;
కృతం కృష్ణం ముఖం ప్రాచ్యా
నహి నార్యో వినేర్ష్యయా. ౧౧.

(సుభాషితావళి ౧౪౭౬.
శా. ప. (కస్యాపి) ౩౫౪౬).

[కీత్ పండితుడు, 'రాగమ్'ను 'వివస్వతః'తో అన్వయించినాడు: కాని, ఈక్రమము సరియైనది కాదు. ఎందుచేతనంటే పద్యములో ప్రాక్ప్రతీచీముఖములలో తేడా...విపర్యయం ... చూపించడం ఉద్దేశం, — సూర్యుడనే ప్రియుణ్ణి కలుసుకోగానే, పశ్చిమదిక్సతి చెక్కిళ్లు, వ్రీడారుణరాగరంజితములవుతవి. కాని, ఈ దృశ్యం సపత్ని ... ప్రాగ్దిశాకాంతచూసి భరించలేనిది. అసూయావశంచేత...ముఖము, నల్లపడిపోతుంది.

సమాసోక్తి, అర్థాంతరన్యాస, విరోధ, శ్లేషాలంకారముల చక్కనికలయిక, ఈరచనాముఖమున, మనోహరదృశ్యమును ప్రదర్శిస్తూఉన్నది.]

ఐంద్రం ధనుః పాండుపయోధరేణ
శరద్దధానా ర్ద్రనఖక్షతాభమ్;
ప్రసాదయంతీ సకలంకమిందుం
తాపం రవే రభ్యధికం చకార. ౧౨.

[...సుభాషితావళి. ౧౮౧౫:—వామనుడు కా. సూ. వృ. ౪. ౩. ౨౭—వ్యక్తివివేకము. పే ౭౫— ధ్వన్యాలోకలోచనము.— అలంకారసర్వస్వము పే. ౧౮౪.— విశ్వనాథకవిరాజు...

ఇంకా చాలాచోట్లకూడ వాడబడినది.]

... ... ... ...

శుద్ధస్వభావాన్యపి సంహతాని
నినాయ భేదం కుముదాని చంద్రః;
అవాప్య వృద్ధిం మలినాంతరాత్మా
జడో భవేత్ కస్య గుణాయ వక్రః. ౧౩.

(సుభాషి...౧౯౬౭)

కుపాః కుపాకృత్య
ప్రసభమపహృత్యాంబుసరితాం
ప్రతాప్యోర్వీం కృత్స్నాం
తరుగహనముచ్ఛోష్య సకలమ్;
క్వ సంప్రత్యుష్ణాంశు
ర్గతఇతి సమాలోకనపరా
స్తటిద్దీపాలోకా
దిశిదిశిచరంతీవ జలదాః. ౧౪.

---

౫. ఈపద్యము... పేరులేకుండా... చిత్రమీమాంసలో ఫలోత్ప్రేక్షకు లక్ష్యముగా ఉదాహరింపబడిఉన్నది: (పే ౯౬). దానిలోనిపాఠము తిలక, దశరూపకములలోనిపాఠములతో సరిగాఉన్నది:

శార్ఙ్గధరపద్ధతిలోకూడ ఈలాగే పేరుతెలియకుండా కనబడుతూన్నది (౩౯౫౦)... 'రుచా వాలోక్య తన్వంగ్యాః'. . ఈభేదముతో:

రెండవచరణము... మళ్లా, కవినామము చెప్పకుండానే. . దుర్ఘటవృత్తిలోనూ ఉపయోగింపబడినది.

—కథం 'శిరఃకంపయతే యువా'? — అనేనపరస్మైపదిత్వాత్. ఉచ్యతే. . చిన్త్యమ్. . ఇతి భాగవృత్తిః. శిరఃకంప్యయతే ఇతివాపాఠఃకర్తవ్యః. శిరః కంపే అయతేగచ్ఛతీత్యర్థః. అయగతావితి తస్యరూపమ్.

(దు: వృ. ౭. ౩. ౮౭)

కనుక, భాగవృత్తికారుడు విమలమతికి,. . ఆకాలమునాటికి... ఈపద్యము పాణినిదని తెలియదన్నమాట: ఆతడు ఆలాఅంగీకరించినవాడుకాడు: నిజమునకు పాణినిరచనయే ఐనసందర్భములో, చిన్త్యమని కఠీమని చెప్పకుండా, జ్ఞాపకముక్రింద తీసుకునేవాడే!

[సభ్యాలంకరణ సంయోగశృంగారము (౬-౨౪-౨)
సుభాషితరత్నాకరము ౩.౫౫—(కస్యాపి)
శా. ప. ౩౪౬౯—
పద్యరచనా. ౧౧.౩౫—
సుభాషి...౧౭౬౫.

కవీంద్రవచనసముచ్చయము ౧౨౯ (కస్యాపి)

సదుక్తికర్ణామృతము ౨. ౪౧౨ ... (ఓంకంఠ నాథస్య)

సూక్తిముక్తావళి ౧౧౯. ౨]

*          *          *

అథాసనా దాస్త మనింద్యతేజా
జనస్య మార్గోజ్ఝితమృత్యుభీతేః
ఉత్పత్తిమ ద్వస్తు వినా శ్యవశ్యం
యథాహ మిత్యేవ మిహోపదేష్టుమ్. ౧౫.

(సుభాషి ౧౯౯౮)

[పాణిని ఎన్నడైనా, 'అనింద్యతేజాః' అని విశేష్యరూపమునుగాని, 'అవశ్యం' 'వినాశి'నీ కలిపి... 'జనస్య'...తత్ భవతద్ధితార్థకరూపమును 'ఉపదేష్టుమ్'తో కానీ వాడిఉంటాడా ?]

సరోరుహాక్షీణి నిమీలయంత్యా
రవౌ గతే సాధు కృతం నలిన్యా;
అక్ష్ణాం హి దృష్ట్వాపి జగత్ సమగ్రం
ఫలం ప్రియాలోకనమాత్రమేవ. ౧౬.

(సుభాషి...౧౯౯౯)

(...'అక్ష్ణాం'కు 'మోహాత్' అని మరియొకపాఠము)

['దృష్ట్వా' అని క్త్వా..ఉపయోగించడము—సమానకర్తృకయోః పూర్వకాలే (౩. ౪. ౨౧) అనే పాణినిసూత్రమునకు వ్యతిరేకముగా ఉన్నది:[౬]

పాణినివంటివాడు, 'ప్రియాలోకనమాత్రమ్'నకు 'ఏవ' కలపడం.. బంగారమునకు పైపూత పూసినట్లుగా...కెందామరకు రంగువేసినట్లుగా... అనవసరంగా.. హాస్యాస్పదముగా ఉన్నది.]

నిరీక్ష్య విద్యున్నయనైః పయోదో
ముఖం నిశాయా మభిసారికాయాః;
ధారానిపాతైః సహ కింను వాంత
శ్చంద్రోఽయమి త్యార్తతరం రరాస. ౧౭.

(సుభాషి. ౧౯౪౩ — కువలయానందము (కస్యాపి ?) అలంకారకౌస్తుభము...పే. ౨౫౪ ప్రతాపరుద్రీయ రత్నాపణము...)

[పాణినికాలములో అభిసారికా అనేనాయికా లక్షణభేదనామము అమలులో ఉన్నట్లు తోచదు.]

[౭] ఉపోఢరాగేణ విలోలతారకం
తథా గృహీతం శశినా నిశాముఖమ్;
యథా సమస్తం తిమిరాంశుకం తయా
పురోపి రాగాత్ గలితం నలక్షితమ్. ౧౮.

(సదుక్తి ౧.౪౧౨—సుభాషి... ౧౯౬౯—శా. ప. ౩౬౩౪.

---

౬. సమానకర్తృకయో ర్ధాత్వర్థయోః పూర్వకాలే విద్యమానాద్ధాతోః క్త్వాస్యాత్. క్త్వాతు, అవ్యయకృతో భావే...భుక్త్వా వ్రజతి... (కౌముది: ౩౩౨౦)

౭. పోలికకు—అంగులీభిరివ కేశసంచయం సన్నిగృహ్య తిమిరం మరీచిభిః;
కుట్మలీకృతసరోజలోచనం చుంబతీవ రజనీముఖం శశీ.        కావ్యాదర్శటీక. పే ౯౯
చంచచ్చంద్రకరస్పర్శ హర్షోన్మీలితలోచనః;
అహోరాగవతీ సంధ్యా జహాతి స్వయ మంబరమ్.        —రామాయణము

సదుక్తికర్ణామృతములో (౨.౧౪౬.౧) ఈ పైపద్యము 'యువరాజు' పేరున ఉన్నది.. 'నిశాకర కరస్పర్శ' అని అందులోని పాఠము.

జల్హణుని సూక్తిముక్తావళి ౧౩౯.౨.
చేరునకాకుండా...
సుభాషిత రత్నాకరము. ౩౩-౧,౧౬౯,౨.౨౭—
ధ్వన్యాలోకము. పే ౩౫—
అలం. సర్వస్వము. పే ౪౩—
అలంకారతిలకము—పే ౩౬
వ్యక్తివివేకము. పే ౨—)

... ... ... ...

అస్తి ప్రతీచ్యాం దిశి సాగరస్య
వేలోర్మిగూఢే హిమశైలకుక్షౌ;
పురాతనీ విశ్రుతపుణ్యశబ్దా
మహాపురీ ద్వారవతీచ నామ్నా. ౧౯

(పాణిని జాంబవతీవిజయకావ్యము రెండోసర్గలోనిదని దుర్ఘటవృత్తిలో ఉదాహరింపబడినది.
—దు: వృ ౪.౩.౨౩)

[అసలు పురాతనంగానే...కావ్యరచనావసరములలో యఙ్లుగంతరూపములు వాడవచ్చునా, అది కూడదా అనేవాదము ఉండనేఉన్నది...

...ప్రసిద్ధశ్చ తథా ఛాందసో యఙ్లుగితి ప్రయోగశ్చ చిరంతనైః పద్యేగద్యేచ కావ్యాఖ్యాయికాదౌ వికటపదోపన్యాసప్రధానై రపి కవిభి ర్నకృతో దృశ్యతే.'

అని పదమంజరిలో (౨.౪.౭౪) హరదత్తుడు వ్రాసినాడు. కాని, ఈప్రయోగస్వాతంత్ర్యము వేదములతోనే సరిపెట్టుటకు కాశిక ఒప్పుకోనదు:

భాగవృత్తికారునిమతము 'బోభవీతి' మాత్రమే కాక, మిగిలిన యఙ్లుగంతరూపములన్నీ వైదికములే అని—...—ఏవం తర్హి సిద్ధేసతి యత్ హుశ్నుగ్రహణం తత్ జ్ఞాపయ త్యాచార్యో యఙ్లుక్ భాషాయాం భవతీతి. కిమేతస్యజ్ఞాపనే ప్రయోజనమ్? । బోభవీతి చేచ్చిదీతి ఇత్యేతత్ సిద్ధంభవతి భాషాయా మపి.'

అని భాష్యకారుడు అంటున్నాడు. (౬.౪.౮౭)

పతంజలి, వామన, విమలమతి, హరదత్తాదులు, పాణిని పద్యములోని జాఘటీతి (౨.౨) మాటైనా తల పెట్టక పోవడము చాలా వింతగా ఉన్నది.]

అనేన యత్రానుచితం నరాణాం
పురాతనం సాజలతం మహీక్షితామ్;
దదర్శ నేకుం మహతో జరంతయా
విశీర్ణసీమంత ఇవోదయశ్రియా. ౨౦

(పాణినికావ్యము నాలుగోసర్గలోనిదట:
దు. వృ ౪. ౩. ౨౩)

[పద్యము పదుగూ లేకా, పాపుగా పాడైపోయినది: అర్థంచేసుకోవడమునకు ప్రయత్నించడము వృథ]

త్వయా సహార్జితం యచ్చ
యచ్చ సఖ్యం పురాతనమ్;
చిరాయ చేతసి పుర
స్తరుణీకృత మద్య మే. ౨౧

(ఆకావ్యములోనిదే ... పదునెనిమిదవసర్గలోనిదని దు: వృ: సాక్ష్యము)

'పురః'అని దుర్ఘటవృత్తి అచ్చుప్రతిలోఉన్నా, 'పునః' అని దిద్దుకుంటేనేకాని అర్థము కాదు:

ఈమూడుపద్యములున్నూ, దుర్ఘటవృత్తిలో, సంస్కృతకవుల 'పురాతన' శబ్దప్రయోగసాధుత్వమును నిరూపించుటకు ఉదాహరింపబడినవి:

శరణదేవుడు — దుర్ఘటవృత్తికారుడు — ఏమంటాడా...

---

౪. 'భాగవృత్తికారస్తు బోభవీత్యేవ నఛాందసమితిమన్యతే' (కాతంత్ర పరిశిష్టము ౧.౩౨)

—ఇహ చకారేణ బహుళగ్రహణ మనుకృష్యతే నతు ఛందసీతి. తేన భాషాయామ్ అనచ్యపి యఙ్ లుక్, లాలపీతి, వావదీతీతి జయాదిత్యః. చకారాత్ బహుళం ఛందసీతి సర్వమనువర్తతే. తేన బాహుల్యాదనచ్యపి ఛందస్యేవ యఙ్ లుక్. భాష్యేతు హుశ్నుగ్రహణజ్ఞాపకబలాత్ బోభవీతీ త్యేవపదం భాషాయాం సాధు నాన్యదితి భాగవృత్తికారః. భాషావృత్తి ౨. ౪. ౭౪.

—'దధతః పురాతనమునే ర్మునితామ్' అనే భారవిప్రయోగము సబబైనదేనా?—'పురాణప్రోక్తేషు బ్రాహ్మణకల్పేషు' అనేపాణినిసూత్రముప్రకారం 'ట్యు', 'ట్యుల్' కలపడమునకు వీలు లేదుకదా ('పురా' అనగా తత్రభవః అనేభావములో 'పురాణ' దానినుంచి సాధించి పాణిని వాడినా...'సాయంచిరం... (పా ౪.౩.౨౩) అనేసూత్రమును అనుసరించి అవ్యయములకు 'ట్యు', 'ట్యుల్', పరాదేశములు లభించినా, 'పురా' విషయములో.. అది అవ్యయమైనా, ఆసూత్రంపని చేయదు కనుక 'పురాతన' అనడం దోషము)

కాని, జవాబుఏమిటంటే, 'అబాధకాన్యపి నిపాతనాని భవంతి' అనేపరిభాష ననుసరించి, 'పురా'కు ట్యు,ట్యుల్ చేర్చవచ్చును: భాగవృత్తికారుడు...'పురాతనమిని రీత్యాదయః కాలదుష్టా ఏవాపశబ్దాః' అని అంటున్నాడు. ఐతే, అలాకాదు: 'పూర్వపదాత్ సంజ్ఞాయా మగః' (౮.౪.౩) మీదభాష్యంలో ఉన్నది మరి...అన్నృగయనాదిభ్యః (౪.౩.౧౦౫) అనేసూత్రం ప్రకారము ఋగయన, లో 'న' కు బదులు 'ణ' రాలేదని, అన్నృగయన అనిసూత్రములో స్పష్టముగా దంత్య 'న' వలన తెలుస్తూన్నా, 'అగ' అని ప్రతిషేధము 'అబాధకాన్యపి...పరిభాషను జ్ఞాపకము చేస్తూన్నది: పాణిని జాంబవతీవిజయములో.. మూడుచోట్ల.. 'పురాతన' అన్నమాటను ఉపయోగించినాడు కదా. కయ్యటుడు, ఏలాగైతేనేమి, సర్వాదీని సర్వనామాని (౧.౧.౨౭) సాహాయ్యంతో దీనిని పృషోదరాదులలో చేర్చి సమర్థించినాడు.

భాగవృత్తికారుని మతమును పరిభాషావృత్తి కూడా అంగీకరించి స్థిరపరుస్తూన్నది: అంటున్నాడు, సీరదేవుడు—'...అన్యేత్వాహుః నేయం పరిభాషా, నాపి భాష్యకారవచనమ్' బాధకాన్యేవ నిపాతనానీతి 'సర్వాదీని—' ఇత్యాదిసూత్రే వ్యాఖ్యాతమ్. అతఏవ తత్రైవ సూత్రే భాగవృత్తిః – 'పురాతనమునే ర్మునితామ్' (కిరాత ౬.౧౬) ఇతి, 'పురాతనీర్నదీ'రితి (మాఘ ౬.౬౦) చ ప్రమాదపాఠా వేతౌ గతానుగతికతయా కవయః ప్రయుంజతే, న తేషాం లక్షణం చక్షుః.' (పరిభాషావృత్తి ౧౩౯-౪౦)

—'అబాధకాన్యపి...'పరిభాషను కల్పించినది బహుశః జయాదిత్యుడు (కాశికాకారుడు)ఐ ఉండవచ్చును: అచ్చుప్రతిలో.. కాశికలో.. 'పురాణఇతి నిపాతనా త్తుడభావః' నవాత్యంతబాధైవ. తేన పురాతనమిత్యపి భవతి'...ఇది సరియైనపాఠము కాదని, న్యాసునివలన తెలుస్తూన్నది..."పురాణఇతికోయంశబ్దః. యావతా, 'సాయంచిరమ్...' ఇత్యాదినా ట్యుట్యులోః సన్నియోగేన తుటి కృతే పురాతనమితి భవితవ్యమ్ ఇత్యత ఆహ – 'పురాణఇతినిపాతనా త్తుడభావః. యద్యేవం, నభవతి పురాతన మిత్యాహ—నచేత్యాది. నను బాధకాన్యేవ నిపాతనా నీత్యలో భవితవ్యమేవ బాధకేనేతి— అబాధకాన్యపి. అబాధకాన్యపిభవంతి. ఏతచ్చ 'శదేరగతౌ తః (౭. ౩. ౪౨) ఇత్యత్ర ప్రతిపాదయిష్యతే'

పురుషోత్తమదేవుడు 'లలితపరిభాష'లో చెపుతున్నది కూడా ఈవిషయమునకు ఊతగాఉన్నది.

—'అబాధకాన్యపి...', నేయం పరిభాషా నాపి భాష్యవచనమ్. బాధకాన్యేవ నిపాతనాని భవంతీతి వ్యవస్థాపనా ద్భాష్యే. జయాదిత్యేనతు లక్ష్యస్థిత్యనురోధా దయం దర్శితః— 'అబాధకాన్యపి...' ఇతి. తేన, 'పురాణప్రోక్తేషు బ్రాహ్మణకల్పేషు' ఇతి నిపాతన స్యాబాధకత్వాత్... 'సాయంచిరమ్...' ఇతి పురాశబ్దాత్ ట్యుట్యులౌ తుడాగమశ్చ భవతి. తేన, 'దధతః పురాతనమునే ర్మునితా' మితి భారవేః, 'పురాతనీర్నదీ' రితి మాఘస్య చ ప్రయోగ ఉపపన్నో భవతి.'

—'పురాణప్రోక్తేషు... అనే సూత్రవివరణమున, 'శబ్దకౌస్తుభము' లో భట్టోజీకూడా ఈలాగే అభిప్రాయపడినాడు:

జయాదిత్యభట్టోజీలుకాని.. పాణినిమతానుయాయులు మరెవ్వరునూ కాని, ఆతనిప్రయోగములు ఇన్ని కనబడు తున్న సందర్భములో, 'పురాతన' శబ్దసాధుత్వమును నిర్ధారించడమునకు ఒకదానినైనా తీసుకోకపోవడం వింతగా ఉన్నది: భాగవృత్తికారుని విమర్శావివరణమునుబట్టి విజయకావ్యము ఆనాటికి లేదని, స్పష్టపడుతూన్నది:] ......

హరిణాసహ సఖ్యం తే
బోభూత్వితి యదబ్రవీః ;
న బాభుటీతి యుక్తా తత్
సింహద్విరదయో రివ. ౨౨

(కాతంత్రపరిశిష్టములోనూ (౧.౩౩)—మనో రమ (గణప్రదీపవ్యాఖ్య) లోనూ (౨౪౧)—భాసా వృత్తిలోనూ (౨.౪.౭౪) జాంబవతీవిజయములోనిదిగా ఉదహరింపబడినది)

[ప్రక్రమము దుష్టముగా ఉన్నది: 'తత్ 'ను —'హరిణా...బోభూతు' అనేవాక్యమంతటితోనూ అన్వయించుకోవలెను. కాని, 'ఇవ', 'సింహద్విరద యోః' తరువాత అధ్యాహార్యమైన 'సఖ్యమ్'తో అన్వ యించవలసివస్తూంది: — అర్వాచీన వ్యాకరణ నిబంధ నము లన్నిటిలోనూ ఈపద్యము కనబడుతూన్నది: కాని విశేష మేమి అంటే, జినేంద్రబుద్ధి, వామన జయాదిత్యాదులకు గాని, ఇంకా ప్రాచీనులకు గాని, దీనిసంగతి తెలియదు]

అహో అహం నమోమహ్యం
యదుద్ధృత్యే సుమధ్యయా,
ఉల్లాస్యనయనే దీర్ఘే
సాకాంక్ష మహ మీక్షితః. ౨౩

('భాసావృత్త్యర్థవివృతి'లో, సృష్టిధరుడు ... 'ఇతిజాంబవతీవిజయకావ్యే జాంబవతీదర్శనోత్తరం శ్రీ కృష్ణస్యోక్తిః'—అని ఈపద్యమును ఉదహరించినాడు.
(భా. వృ. వి. ౧. ౧. ౧౫)

సుభాషితావళిలో (౧౨౪౩) కొంచెం మార్పు తో, పేరులేకుండా ఉన్నది, ఈలా...

అహో అహం నమో మహ్యం
యదహం వీక్షితో౽నయా;
బాలయా త్రస్తసారంగ
చపలాయతనేత్రయా.

—సూక్తిముక్తావళిలో.. ఈపద్యము చీయకుని పేరున ఉన్నది.)

* * * *

కరీంద్ర దర్పచ్ఛిదురమ్
మృగేంద్రమ్....... ౨౪

(భాసావృత్తి (౩. ౨. ౧౬౨)—సుపద్మమక రందము (౪.౧.౧౩౬) .. (ఇతి జాంబవతీవిజయకావ్యే పాణినిః)— సుపద్మవృత్తి. (కస్యాపి)—రామతర్క వాగీశుని ముగ్ధబోధవివరణము (సూ ౧౧౧౪)

[జయాదిత్య మతమును అనుసరించి చూడగా, 'కురచ్' కర్మకర్తృవాచ్యమునసే విద్, భిద్, ఛిద్ లకు చేర్చవచ్చును అని తోస్తూన్నది: జినేంద్రబుద్ధి అభిప్రాయమునూ అంతే: వామనుడు, కావ్యాలంకార సూత్రవృత్తిలో...'భిదురాదయః కర్మకర్తరిచ' అనే సూత్రమురచించి, 'భిదుర' 'ఛిదుర' ప్రయోగములకు చాలాఉదాహరణము లిచ్చినాడు: కాని, అర్వాచీన వైయాకరణులకు సుపరిచితమైన 'కరీంద్రదర్పచ్ఛిదు రమ్...' అక్కడ చేరలేదు.

—హరదత్తుడు, మాఘములోనుంచే కాని, జాంబవతీ విజయమునుండి లక్ష్యములు తీసుకోలేదు: ..('మాఘస్తు శుద్ధేకర్తరి ప్రయుంక్తే—'సురమత్సరచ్ఛిదురయాదుర యాచితమంగనాః')

—'ఛిదిభిదివిదాం కురః' అనేవరరుచిసూత్రము మీద వృత్తిలో దుర్గాసింహుడు వ్రాసినాడు..'ఛిది భిదోః కర్మకర్తర్యేవాభిధానాత్,.. కేచి దకర్మకర్త ర్యపి, దోషాంధకార భిదురః, దృష్టారిపక్ష చ్ఛిదుర ఇత్యపి...'

పాణినే నిజముగా జాంబవతీవిజయకావ్యనిర్మాత అయినట్లు ఉంటే, వామనహరదత్తాదులు, ఆతనిరచ నలో గోచరించేప్రయోగాధారములను వదిలివేసి ఊరు కునేవారని.. ఊరుకున్నారని— అనుకోవడమునకైనా వీలున్నదా.]

'...పయః పృషన్తిభిః స్పృష్టా
వాంతి వాతాః శనైః శనైః. ౨౫

(రాయముకుటుని, అమరకోశటీకలో ఉదా హృతమైనది.

...తథాచ 'పయః...శనైః' ఇతి జాంబవతీ విజయకావ్యమ్ (౧. ౬. ౬) — రఘునాథచక్రవర్తి

కూడా.. పేరువేయకుండా- ఈపద్యార్థకమును లక్ష్యముగా వాడినాడు)

*　　*　　*

స సృక్కణీ ప్రాంత మసృక్ప్రదిగ్ధం
ప్రలేలిహానో హరిణారి రుచ్చైః. ౨౬

(రాయముకుటుని సాక్ష్యమే ఆధారము ఈ పద్యార్థకమునకు పాణిని కర్తృత్వముకూడ:— 'ససృక్కణీ ఇతిపాణినేఃజీబంతతాచ.' చక్రవర్తి కవినామము చెప్పలేదు.

రుద్రై ర్బలాఢ్యైః వృషభాధిరూఢైః
సపార్షదై రంబర మాపుపూరే. ౨౭

(చివరపాదము రాయముకుటుడు ఉదహరించినాడు...'సపార్షదై...పూరే ఇతి జాంబవత్యాం పాణినిః' ...రఘునాథచక్రవర్తి.. రెండుపాదములనూ ఇచ్చినాడు తనవ్యాఖ్యలో-పేరుచెప్పకుండా.)

సంధ్యావధూం గృహ్య కరేణ గాఢమ్. ౨౮

నమిసాధువు, రుద్రటకావ్యాలంకారవాఖ్యలో పాణినిదని పేర్కొనినాడు...గృహ్యాకరేణ.. భానుః' అని ఆతనిపాఠము—సంక్షిప్తసారము వృత్తిలో కుమార నందీ (కృదంతపాదము.. ౪౭౪)...దుర్గాదాసూ, పేరు లేకుండా.. ఇచ్చినారు:)

పాణినివంటి...శివప్రసాదాత్ విశుద్ధమతి.. వ్యాకరణాచార్యుడు: 'గృహ్య' అని దుష్టప్రయోగము చేసి.. 'సమాసేఽ నఞ్పూర్వే క్త్వో ల్యప్' అన్న తన నిబంధనసే అతిక్రమిస్తాడని ఎవరైనా తలచడానికైనా వీలున్నదా?...'క్త్వా' అవసరమైనచోట 'ల్యప్' వాడినట్లు అష్టాధ్యాయిలో ఎక్కడనైనా నిదర్శనములున్నవా?

—'వ్యాకరణాచార్యుడూ, విజయకవీ, ఒకడా, వేర్వేరా, పాతాళవిజయ, జాంబవతీవిజయములు ఒకే కావ్యమునకు నామములా కావా అనేవిషయములు నిర్ధారణ చేయుటకు ...స్పష్టమైన ఆధారములు లేకపోవడముచేత.. వీలులేదు..' అని తామస్ ౧౮౮౭లో, కవీంద్రవచన సముచ్చయము భూమికలో వ్రాసినాడు: మేము; విపులముగా... కవిపాణిని, వ్యాకరణాచార్యుడూ భిన్నులనీ, జాంబవతీ పాతాళవిజయములు.. ఒకకావ్యమే ననీ బుజువుపరచగలిగినా మనకుంటాము:

పాణినినిగురించి చాలావిషయములు తెలియచెప్తూ,౯ ఆతనిసూత్రములను ప్రయోగసౌలభ్యార్థము, విస్తృతించి వివరించినమహాభాష్యము.. ఆతనికావ్యమునుండి లక్ష్యములను, జ్ఞాపకరూపమున గ్రహించలేదేమో?.. అవి చాలా అమూల్యములు కాదూ: చివరకు పాణినికావ్యముపేరైనా ఎత్తలేదుకదా?

పతంజలి ఒకడేకాదు — భర్తృహరి, జయాదిత్య, వామన, జినేంద్రబుద్ధి, కయ్యట, హరదత్త, మాధవ, భట్టోజీ, నాగేశాదులు సుప్రసిద్ధులు...

౯. -సర్వే సర్వపదాదేశా దాక్షీపుత్రస్య పాణినేః -ఆకుమారంయశః పాణినేః- పాణినేః సూత్రకారస్య- శోభనాఖలు పాణినేః సూత్రస్యకృతిః- ఉపసేదివాన్ కౌత్సః పాణినిమ్.

౧౦. వైయాకరణి కావ్యరచనకు పూనుకుంటే శాస్త్రప్రసిద్ధపద ప్రయోగవిధానమూ... రచనాకర్కశత్వమూ.. 'పెట్టనిసొమ్ములుగా' అమరిపోతవి: పారుష్యమ్ (పద) వైయాకరణభూషణ మని ఆలంకారికుల అభిప్రాయము:

-'వైయాకరణాదౌ వక్తరి ప్రతిపాద్యేచ రౌద్రాదౌచ రసే వ్యంగ్యే కష్టత్వం గుణః-　　మమ్మటుడు
-'వైయాకరణముఖ్యేతు ప్రతిపాద్యేఽవక్తరి, కష్టత్వం దుశ్శ్రవత్వంవా...　　విశ్వనాథుడు
ఉదాహరణముగా:— భట్టోజీ, శబ్దకౌస్తుభము మొదటవేసినపద్యము:-
విశ్వేశం సచ్చిదానందం వందేహం యోఽఖిలం జగత్, చరీకర్తి బరీభర్తి సంచరీహర్తి సర్వదా.
కాని, ఈమాదిరి రచనాసారుప్యము పాణిని పద్యశ్లోకములలో ఎక్కడా (జాంబవతీవిజయములోనివన్న వాటిలో తప్ప) గోచరించదము లేదు.

———

పాణినితరఫువారు... ఎవరున్నూ, పాణినికావ్యము పేరు ఎత్తి కాని, దానిని ఏవిధముగానూ ఉపయోగించుకొని కాని ఉండలేదు: నిజముగా 'ఝాఘటితి' వంటిరూపములు వాళ్లకు చాలా లాభించేవి కాదూ?

ఇక, తరువాత, — జాంబవతీవిజయములోనివి కాకుండా... పేరు లేకుండా... ఉదాహృతములైన పద్యములనిండా... పాణిని చూసినట్లయితే, ఉలికిపడి మొగము తేలవేసే ప్రయోగములు ఉన్నవి:

వ్యక్తివివేకకారుడు అన్నట్లు.. 'స్వకృతి ష్వాయం త్రితః కథ మనుశిష్యా దన్య మయ మితి నవాచ్యమ్. వారయతి భిష గపథ్యాదితరాన్ స్వయ మాచరన్నపి తత్'...మాదిరి, పాణిని, స్వనియమములను అతిక్రమించి, అష్టాధ్యాయని రచించిఉంటాడు: కనుక, వ్యాకరణము.. అనుమతించని.. ప్రయోగములను చేసిఉండటంలో ఆశ్చర్య మేమీ లేదనడం...ఉచితంగా లేదు:

సూత్రకారులను విమర్శించేటప్పుడు.. భాషా విషయకంగా...కొంచెం కుడిఎడమగా పోవాలి: వాళ్లు ...ఏమైనాసరే... ఎన్ని అక్షరాలలో... ఎంతతక్కువలో... సూత్రం కుదించగలమా అనేధోరణిలో ఉండే రకము: 'అర్ధమాత్రాలాఘవేన పుత్రోత్సవం మన్యంతే వైయాకరణాః' అని పరిభాషోక్తికూడా ఉన్నదికాదూ? అందువల్లనే పతంజలి 'ఛందోవత్ సూత్రాణి భవంతి' అని చెప్పినాడు... 'హేతులక్షణయోః'కు ...'లక్షణహేత్వోః' అనీ, 'అభ్రసముద్రాత్'కు 'సముద్రాభ్రాత్' అనిన్నీ పాణిని వాడినదికూడ ఇందుచేతనే: ఈలా ఆతడు ప్రత్యేకఉద్దేశ్యముతో.. చేయాలనేచేసినాడుగనుక... 'అశ్వారూఢాః కథం చాశ్వాన్ విస్మరేయుః సచేతసః' అనేఆక్షేపణ అనువర్తించదు: కాని ఈసడలింపు కావ్యనిర్మాతలవిషయంలో లేదు: 'చ్యుతసంస్కృతి' సర్వథా వారిపట్ల నిష్కృతిలేని, నిత్యదోషము., అని తెలిసిఉండీకూడ, చూస్తూచూస్తూ పాణిని, 'గృహ్య' 'అపశ్యతీ' వాడిఉంటాడని అనుకోవడమునకు వీలులేకుండా ఉంది: మహిమభట్టుఇచ్చిన.. ఉపమానము ఇక్కడ ఉపయోగపడదు.. (వారయతి... స్వయమాచరన్నపి తత్') ఎందుచేతనంటే, శిష్టవ్యవహారసిద్ధమైన భాష గ్రామ్యమునకు భిన్నముగా ఉంటుంది: శిష్టుడైనపాణిని 'గృహ్య' 'అపశ్యతీ' మొదలుప్రయోగములను కలలోనైనా తలపెట్టిఉండడు.

పాణినిపేర ప్రచారములోఉన్న పద్యములను, రెండుభాగములు చేయవచ్చును: జాంబవతీవిజయములోనివని వాడుకలోనున్నవాటిలో — వ్యాకరణవిశేషములు కొన్ని కనబడుతూండటముచేత... ఆశాస్త్రములో కొంచెం ప్రవేశముఉన్న ఆతడు రచించిఉండవచ్చును: — మిగిలినవి... అలంకారములకు లక్ష్యభూతములుగా ఉన్నవి; ఏ'శాస్త్ర కర్కశవచోవిలాసుడు' కాకుండా, ఆలంకారికుడైనకవి రచించినవి ఐఉంటవి:

పాణిని కవి అని మహాభాష్యములో ఎక్కడా ప్రశంసలేకపోవడమూ—జాంబవతీవిజయములో లభించే ప్రయోగములను జ్ఞాపకములుగా ఎంచుకోకుండా.. ప్రాణినిమతానుయాయులైన ప్రసిద్ధవైయాకరణులందరునూ లక్ష్యప్రయోగములకోసరము వెదుక్కోవడమూ.. చివరకు ఏదోవిధముగా వ్యాకరణవిరుద్ధములైన ప్రయోగములను.. సమర్థించడమూ — ఒకసంగ్రహగ్రంథములో, పాణినిపేర ఉన్నపద్యములు ఇంకోదానిలో మరియొకకవిపేర ఉదాహృతములు కావడమూ—కొన్ని పద్యములలో, చాలాఇటీవలికవులరచనల ఛాయలు అమరడమూ— జాంబవతీవిజయముపేరుక్రింద లేనిపద్యములు ఏవీ, వ్యాకరణప్రయోగవైశిష్ట్యముకలవి కాకపోవడమూ— కొన్నిపద్యములలో, పాణినికూడా కలవరపడే ... ప్రయోగము లుండటమూ — ఇటీవలి... పాణినికి చాలాతరువాతకాలమునాటి... అలంకార శాస్త్రగ్రంథములోని లక్ష్యశ్లోకములుగా రచింపబడినట్లుగా కొన్ని పద్యములు కనపడటమూ—

ఇవన్నీ చూడగా.. ఈపద్యములన్నీ పాణిని(కవి) రచించినవి కావని స్పష్టముగా తెలిసిపోతూన్నది: షుమారు ఏవేయిసంవత్సరములక్రిందనో...ఎవరో సామాన్యుడు జాంబవతీవిజయాన్ని.. (పాతాళవిజయము?)... వ్యాకరణపుతికమకలన్నీ కూర్చి రచించి, దానిని ప్రసిద్ధవ్యాకరణాచార్యుడు పాణినిపేరునకు అంటగట్టి ఉంటాడు:

(తెలుగులో వ్రాసినది-మల్లాది రామకృష్ణశాస్త్రి)

---

## 'సూదంటురాయి'

కుందుర్తి నరసింహారావు

[ఢిల్లీ. మహమ్మద్ తుఘ్లక్ పాదుషా ఉద్యానవనం దూరంగాకనబడుతూవుంటుంది. కొద్దిగా బయలుదాటిందాక యివతల చెరసాల. చెరసాలలో కొంచెం చీకటిచీకటిగా వుంది. బుక్కప్ప ఒకపక్క చాపమీద నిద్ర పోతున్నాడు. హరిహరప్ప గోడకానుకుని నిలుచున్నాడు.]

హరిహరప్ప

గుడ్లగూబలై కూర్చున్న ప్రజలకు మేము కనిపించము. ధన రాసులు మా చేతి లో వుంటే, అప్పుడు కనిపిస్తాము; ఓ! దూకుతారు మీదికి; అందరికీ అవసరమే; పండగ వచ్చిందంటే ప్రతివాడికీ దానం కావాలి; ప్రభువుగారి సొత్తుతో ప్రతిసోమరి పోతూ ఆడుకోవాలి — ఇప్పుడో? ధనా గారం చేతిలోనుంచీ పోయింది; తల్లివంటి దేశం దూరమైపోయింది. ఎక్కడఆనెగొంది, ఎక్కడ ఢిల్లీ? అక్కడ మేము కోసినతలలు కొన్ని ఆకాశానికెగిరి యిటువైపు వచ్చినవి కాని, అవిగూడా యింతదూరం యీకట కటాలదాకా పారిపోయిరాలేదు: మేము వచ్చాము! తురకతలలకంటే పారుబోతుల మైన, మామీద ప్రజలకింకా అభిమానం వుంటుందా?—తమ్ముడూ!

* * *

ఇంకాలేవలేదు. శత్రువుల చెరసాలలో వీడికి నిద్రపట్టింది...ఒకవేళ — ? (తొంద రగాపోయి బుక్కప్పగుండె పరీక్షించి యివ తలికివస్తాడు.)

వీడి గాయాలకు నిద్రపట్టలేదు; అవి యింకా కంట నీరు పెడుతూనే వున్నవి పోయిన దేశంకోసం; అవును: మనుష్యుడి దేహం మీది గాయాలకూ, వాడిదేశానికీ చాలా స్నేహం. ఎన్నిగాయాలుతింటే అంత చేటు ఆస్నేహం పొంగిపోతూవుంటుంది. మొదటి దెబ్బ తినబొయ్యేవాడికి దేహంమీది మో హం యింకా వెనక్కి వెనక్కి లాగుతూ దేశప్రేమకి అడ్డుతగులుతూవుంటుంది; దెబ్బలు తిన్నకొద్దీ, దేహం పల్చబడ్డకొద్దీ, ఆ దేహానికి పుట్టినబిడ్డలు ఎర్రనికన్నీళ్లు కాలువలుగా కార్చినకొద్దీ, జాలీ భక్తీ బలమై, దేశస్వ రూపం హృదయంమీద అచ్చుపడిపోతుంది. దేహం సంపూర్ణంగా నాశనమైపోయిందాక వాడు అసలు దేశస్వరూపమే అయిపోతాడు; అంటే, వాడు అంతగా ప్రేమించిన ఆ దేశ ప్రజలందరిలో కలిసిపోతాడు; వాళ్లందరి లోనూ ఆవేశమనే అవతారం ధరిస్తాడు. ఆరహస్యం గ్రహిస్తే యిక ఉత్సాహం మెవ డికి పుట్టదు, చెప్పండి? ఇట్లా ఒకపురుగు లాగా వుండేజీవితం తమాషాగా చాలించి తక్షణం దేశప్రజలందరిలోనూ కలిసి విశ్వ

రూపం ధరించటానికి అవకాశంవుండగా ఎవడు వూరుకుంటాడు, చెప్పండి? నాకూ మావాడికీ అదే మొదట్నించీ ఆశ. అందుకనే ఆపిచ్చితల్లి బెత్తెడు తెలుగునేలకోసం బెంగపెట్టుకొని తుఘ్లక్ సైన్యాలతో యిన్నాళ్లూ ప్రాణాలకుతెగించి కుస్తీపట్టి, చచ్చీ చెడీ, చివరికి — తమ్ముడూ!

[బుక్కప్ప ఒకపక్కకు పొర్లుతాడు.]

ఇంకాచిన్నతనం. పోట్లాడటం నేర్చాడు గాని, ప్రపంచమంటే యేమిటో సరిగా తెలుసుకోలేదు. అందుకనే యింకా దాని మీద ఆశ. ఆప్రపంచమేమిటో కాస్త అనుభవంలో తగిలి దానిబండాలం బయటబడ్డదాకగాని యిక దానిమీద వెగటుపుట్టదు. సామాన్యం! చచ్చిపోవటమంటే యేమిటో నేర్చుకున్నాడుగాని, సౌఖ్యమనేది యింకా, పాపం, చవిచూడలేదు. అందుకనే దానిమీద కాస్తకోరికవున్నది వీడికి; ఖర్మంజాలక రాజ్యమేవస్తే కవిత్వానికీ కాంతాల్లోకానికీ, రెండుమేడలు కట్టించి తయారుగా వుంచేవాడే. దానిపసా కాస్త తెలియాలి ముందు. ఏతాతదగ్గిరినుంచీ వచ్చిందోగాని వీడికి గానం అన్నా, కవిత్వంఅన్నా కొంచెం అభిలాష.

[దూరంగావున్న పాడుపాడుద్యానం లోనుంచి ఒకకోయిల పాడుతుంది.]

హరిహరప్ప

ఛిఛ్ఛీ! కోయిలను మనదేశంలోనుంచీ వెళ్లగొట్టాలి. (బుక్కప్ప మేలుకుంటాడు.)

బుక్కప్ప

ఏమిటి, అన్నయ్యా, అంటున్నావు?

హరిహరప్ప

మనదేశంలోనుంచీ కోయిలను తరిమెయ్యాలిరా యిక—

బుక్కప్ప

కొన్నాళ్లదాకా—

హరిహరప్ప

దుర్మార్గం! ఉక్కులాంటి కుర్రాళ్ల నిట్లా పాడుచేస్తుందిది! ఇక నువ్వెందుకు పనికొస్తావురా? — బుక్కా! నేను పెద్దపులిలాగా వందసారులు బొబ్బలుపెడితే లేవలేదే, ఇది ఒక్కసారి రాగంయెత్తగానే లేచి కూర్చున్నావు!?

బుక్కప్ప

చూడు: పడ్డన్నాళ్లు పడతాం శ్రమ. పగలల్లా పోట్లాటలోనే బ్రతికినా, అన్నా, ఎప్పుడన్నా నాలుగుగడియలు హాయి అనేది లేకపోతే యెట్లా, చెప్పు! దాన్ని కాస్త బతకనిద్దూ, మనకు విశ్రాంతి యిస్తూ వుంటుంది అప్పుడప్పుడు—

హరిహరప్ప

(పటపటా పండ్లుగొరుకుతూ) విశ్రాంతి? (పైదుగోడలుకదిలేట్టు) వి—శ్రాంతీ? (కటకటాలు వూగి విరిగిపడేంత బిగ్గరగా) నీకు వి—శ్రాం—తి క్కావాల్రా? నీకు—క్షుద్రకీటకంలాగా—వెధవ్వి—ఒక్కడివి నీకు

విశ్రాంతి కావాలా? ఎందుకు? ఏంచేసు కుంటావు దాన్ని? పశువా! పోట్లాడుతూ, జీవంతో తళతళలాడుతూ చచ్చిపోతావా? విశ్రాంతితో సుఖంగా మూలకూచోని శవం లాగా బతికుంటావా?

బుక్కప్ప

ఓ... క్షమించు. నాకేదో నిద్రలో కల వచ్చింది. అందుకని మరిచిపోయింది, క్షమించు. ఏమికల అనుకున్నావు? మల్లిక్ సాయబు మీద మనవాళ్లంతా తిరగబడ్డారుట; పాదుషా మనల్నే మళ్లీ అక్కడికి పంపిస్తాడట.

హరిహరప్ప

ఏమిటీ? మనప్రజలు తిరగబడ్డారూ? అంటే—

బుక్కప్ప

వాళ్లకు ఇంకా మనం జ్ఞాపకం ఉన్నా మన్నమాట. మనతల్లి యింకా మనల్ని మరిచిపోలేదన్నమాట.

హరిహరప్ప

అవును, అవును. నాది పొరపాటు. ఇంకా బిడ్డలే మరిచిపోవాలిగాని, కన్నతల్లి మరిచిపోమ్మన్నా పోతుందా?— క్షమించు, అమ్మా, అమ్మా!

శాంతినిలయ, సాధుశీల, సత్యరూపిణీ
తల్లీ
జగన్మోహినీ—

అచ్ఛగౌతమీ తరంగహారధారిణీ
మ్లేచ్ఛరాజ సైన్యభయదమృత్యుమేదినీ
తల్లీ
శాంతినిలయ!

కటకృష్ణాకిరణా, తుం
గాభద్రాచరణా!
నిటలఘటితసురకరపుట, నిగమవేదినీ—
తల్లీ
శాంతినిలయ!

---

# ఆ హ్వా న ము

రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ

మాసిపోవని చైత్రమాస తారుణ్యంబు వలసినప్పుడు చూడ వలతురేని,
నలుదిక్కులందు తేనెలు జల్లు పూవుల నిండు నవ్వులను మన్నింతురేని,
తాపముల్బాపు శీతల గర్భములుగల్గు చెట్ల యౌదార్యమాశింతురేని,
సాజాత్య వైజాత్య సంశయాభిన్నమౌ నేకాధికార మిచ్చింతురేని,
కంటకములకు వెరువక, కష్టమనక-దూర మీదారియని వెన్కద్రొక్కకుండ
రండు సురభిళ వాఙ్మయారామమునకు-భారతీపూజ సేయ నుదారులార.

(సాధన — ౨౬-౮-౧౯౩౪)

---

# శిల్పి

చింతా దీక్షితులు

## ౧

శిలావిగ్రహాలలోనూ, దారువిగ్రహాలలోనూ భగవంతుని సాక్షాత్కారింపచేసుకొనే ప్రజలు గల దేశమది. అట్టి విగ్రహాలలో భగవదంశ కనిపించేరోజు లవి.

ఆదేశమును ఒకమహారాజు పరిపాలిస్తున్నాడు. ఐహికసంపత్తుతోపాటు పారమార్థికబుద్ధికూడా ప్రజలకు సమకూర్చవలెననే కోరికగల మహారాజతడు. మహారాజుకోరికను సఫలీకృతము చేయడమే జీవితపరమార్థముగా ఎంచుకొనే ప్రజలు వారు.

పురోహితుల ఆశీస్సుల బలమును పొంది మహారాజు సంకల్పములు మంత్రుల ద్వారా సత్కార్యములుగా ఫలించి ప్రజలసంతోషమునకు పాత్రమయ్యేవి.

ఒకనాడు మహారాజు మంత్రులతోనూ, పరివారముతోనూ తనరాజ్యమంతా సంచారముచేశాడు. ప్రజల సంతుష్టి చూచి అతని మనస్సులో కూడా సంతుష్టి పొడుకొన్నది. కాని, తనరాజ్యములో అన్ని దేవాలయములలోనూ ప్రజలు పురుషవిగ్రహాలనే ఎందుకు కొలుస్తున్నారో అతనికి తెలిసింది కాదు. ప్రజలు కొలిచే పురుషవిగ్రహాలలో అధికసంఖ్య అందమైనవే. సౌందర్యోపాసకుడైన మహరాజుకంటికి అందమైన స్త్రీ దేవతావిగ్రహ మొక్కటీ గోచరించక పోవడానికి కారణ మేమిటో.

మంత్రుల నడిగాడు. చెప్పలేకపోయారు. కాని ఈసమస్య పరిష్కరించేభారం మంత్రులదే కాబట్టి వారాపనికి పూనుకొన్నారు.

## ౨

ఆరాజ్యములో అందమైన విగ్రహాలన్నీ చేసే శిల్పి ఒక్కడే ఉన్నాడని మంత్రులు విచారించగా తేలింది. రాజ్యములో అందమైనపురుష విగ్రహాలన్నీ చెక్కినవా డతడే.

రాజాజ్ఞ అయినదని శిల్పితో చెప్పారు. ఒక పూరిగుడిసెలో, తన ఔన్నత్యాన్ని తాను గుర్తించని ఆశిల్పి ఉన్నాడు. అర్ధనిమీలిత నేత్రాలతో కూర్చుని తాను చెక్కే విగ్రహరూపాన్ని తన మనస్సునుండి ఎదురుగాఉన్న రాతిబండమీదికి దింపడానికి యత్నిస్తున్నాడు. ఆయత్నములో యోగిధ్యాన మున్నది; భక్తుని ఆవేశ మున్నది.

ధ్యానించదగ్గ విగ్రహాలను ప్రజలకు చెక్కిఇవ్వడమే అతని జీవితధర్మము. బాల్యదశలో అందు కొరకే ప్రయత్నించాడు. తనతండ్రి ఉపదేశమూ అదే. యౌవనములో ఆధర్మమునే నిర్వహిస్తున్నాడు. తన గురువు ఉపదేశమార్గమూ అదే.

అతడు చెక్కిన హనుమంతుడు ప్రజలపూజలందివారిని వీర్యవంతులనుగా చేస్తున్నాడు. అతడు చెక్కిన శ్రీరాముడు ప్రజల మ్రొక్కులుగొని వారికి అభీష్టములు ప్రసాదిస్తున్నాడు. అతడు చెక్కిన శ్రీకృష్ణుడు ప్రజలస్తోత్రములను స్వీకరించి వారికి ముక్తి దయ చేస్తున్నాడు.

ఆదేవతలను సృష్టించిన అతనికి ఆదేవతలు సంతుష్టిని ప్రసాదిస్తున్నారు. కుటుంబయాత్ర సునాయాసముగా చేసికొనుటకు ప్రజలాతనికి తోడ్పడుతున్నారు.

రాజుగారి ఆజ్ఞ అయినదిగనుక అతడు రాజుగారి కొలువుకు వచ్చాడు.

## ౩

"ఈరాజ్యములో శిల్పివి నీవేనా?"

"నే నొకడను మహారాజా."

"అగ్రహారములో శివలింగము నీచేతదేనా?"

"అవును మహారాజా."

"బ్రాహ్మణవాడలో శ్రీరామవిగ్రహమో?"



నదియొడ్డున శివాలయము

వెంకటగిరి—నెల్లూరుజిల్లా.

M. K. R.

"నేను చెక్కినదే మహాస్వామీ."

"సిరివరములో హనుమంతుని చెక్కినది?"

"నేనే మహాస్వామీ."

"కలనాడులో శ్రీకృష్ణుని ఎవరుచేసినది?"

"తమ దాసుడే మహాప్రభూ."

"దీపపురంలో సూర్యవిగ్రహము చెక్కినది?"

"తమ దాసుడే మహాప్రభూ."

"నీవు చేసిన దేవతాస్త్రీవిగ్రహముల పేర్లు చెప్పు."

"నేను......మహారాజా."

"ఏవిగ్రహాలు చెక్కావు?"

"నేను స్త్రీవిగ్రహాలు— మహాస్వామీ."

"చెప్పు ఏవిగ్రహాలు చెక్కావు?"

"నేను దేవతాస్త్రీల విగ్రహాలు ఏమీన్నీ—"

"చెక్కలేదా."

"లేదు మహాప్రభూ."

"ఏవీ చెక్కలేదా?"

"లేదు మహారాజా—ఒక్కటి తప్ప."

"ఒక్కటి చెక్కావా?— ఎవరిదీ?"

"చెప్పమని సెలవా? ప్రభూ?"

"చెప్పు."

"నాతల్లిది."

"నీతల్లిది దేవతాస్త్రీవిగ్రహమా?"

"ప్రజలకు కాదు మహాప్రభూ! నాకే అది—"

"అది ఎక్కడ ఉన్నది?"

"అందుకోసమే నేను దానిని పూజించుకొంటున్నాను. ప్రజలకు దానితో ఏమిపని మహారాజా?"

"మీ ఇంటనే ఉంచి పూజించుకొంటున్నావా?"

"చిత్తము మహారాజా."

"నీవు చెక్కిన ఇతరవిగ్రహాలవంటిదేనా అది?"

"అందమున వాటిలో సమానమైనదే కాని నాకది అమూల్యము."

"ప్రజలకుమాత్రము తమతల్లులను పూజించుకోవాలని ఉండదూ?"

"ఉండదా మహారాజా."

"వారికి ఆకోరిక నీవల్లనే ఫలించవలెనుగాదా."

"చిత్తము స్వామీ."

"ఇకముందు వారికోరికకూడా తీరుస్తావుకదా."

"అది నాకు సాధ్యమా తండ్రీ."

"జగజ్జనని పార్వతిలేదూ, సరస్వతిలేదూ, రమాదేవి లేదూ—ప్రజలుకూడా తమ తల్లులను కొలిచే అవకాశం వారికియ్యవా?"

"అది నాకు సాధ్యమా తండ్రీ?"

"ఎందుకు కాదు?"

"శక్తిలోపము మహాప్రభూ."

"అందమునకు పరమావధి పురుషవిగ్రహాలలో చూపిన నీకు శక్తి చాలదనడం భగవంతునియెడల అపచారం చేసినట్లు కాదూ?"

"చిత్తము స్వామీ."

"భగవంతుడు ప్రసాదించినశక్తి ప్రజలకోసం వినియోగించకపోతే దానివల్ల పాతిత్యం చుట్టుకోదూ?"

"చిత్తము స్వామీ."

"నిన్ను కన్నతల్లిని పూజార్హముగా చెక్కిన నీచేతికి జగజ్జననిని చెక్కడానికి తాహతు వచ్చినట్టే కదా."

"చిత్తము స్వామీ."

"ముగురమ్మల విగ్రహాములనూ చెక్కి ప్రజలలో మాతృభక్తి పెంపొందింప చేస్తావన్నమాటేనా?"

"స్వామీ ఒకమనవి."

"కలకాలమూ నీవిగ్రహాలు పరమునకు బాటలు కట్టవలసి ఉన్నది."

"స్వామీ ఒక......"

"ఒక ఏడాది గడువు."

"స్వామీ......"

"ఇక సెలవుతీసుకోవచ్చును."

"చిత్తము స్వామీ."

## ౪

రాజాజ్ఞను పొందిన శిల్పి రాజుగారి అనుగ్రహమూ, ధనమూ సంపాదించవలె ననే కోరికతో తన కార్యానికి పూనుకోవలసినదే కదా. అత్యుత్తమమైన శిలాఖండములూ, సరియైన పరికరములూ సమకూర్చుకొనవలెను కదా. భయభక్తులతో పనికి పూనుకోవలెను కదా.

రాజాజ్ఞపొందిన ఆశిల్పి యింటికి వచ్చాడు. నిరంతరమూ శిల్పకార్యములో నిమన్నుడైఉండే ఆశిల్పి శిల్పకార్యము పూర్తిగా కట్టిపెట్టాడు. ఏకాంతస్థలములో ఏకాగ్రమనస్సుతో కూర్చున్నాడు.

ఒకనెల గడిచింది. రెండు నెలలు గడిచాయి. మూడు నెలలు గడిచాయి. అతడు ఏకాంతస్థలమును విడవలేదు. మనస్సును ఏకాగ్రముగానే ఉంచుకొన్నాడు.

అతని కుటుంబ పోషణము మహారాజుగారు చేస్తున్నారు.

నెలలు గడచిపోతున్నవి. శిలాఖండములు సంపాదించవలెననేబుద్ధి కలగనేలే దతనికి. పరికరములు బాగుచేసుకోవలెననే కోరికే లేదాతనికి.

సంవత్సరము పూర్తికానున్నది. మహారాజుగారే దేశదేశాలనుంచి మంచిమంచిరాళ్లు తెప్పించి అతని యింటికి చేర్పించారు. మంచిమంచి పరికరములు తమ పనివాళ్లచేత చేయించి శిల్పియింటికి చేర్పించారు. శిల్పి వీటిని చూచి చిరునవ్వు నవ్వాడు. ఏడాదిగడువూ గడిచిపోయింది. రమ్మని రాజాజ్ఞ అయినది శిల్పికి.

## ౫

"శిల్పీ."

"చిత్తము స్వామీ."

"విగ్రహములు పూర్తి అయినవా?"

"స్వామీ ఒక్క మనవి."

"నీశక్తి నీవు గ్రహించలేకపోయావు కాని పురుష విగ్రహాలపట్ల వికసించిన నీశక్తి స్త్రీ విగ్రహము లంటే లుప్తమయిపోతుందా? అందముగా అమరినవా విగ్రహాలు?"

"స్వామీ—దాసుణ్ణి క్షమించవలెను."

"క్షమించడ మెందుకు. నిన్ను బహూకరించడానికి ఈరోజున సర్వమూ ఆయత్తము చేశాను."

"స్వామీ—ప్రభులపట్ల అపచారము చేసిన ఈ దాసుడు ప్రభువులు విధించే శిక్షకు తల యొగ్గియున్నాడు."

"ఏల శిక్ష?"

"స్వామీ—ఒక్క మనవి."

"ఏమది?"

"గడువు దాటిపోయింది. రాజాజ్ఞమీరాను..."

"విగ్రహములు పూర్తికాలేదా?"

"ఆపనికింకా పూనుకోనేలేదు మహారాజా."

"రాజాజ్ఞ ధిక్కరించావన్నమాట."

"చిత్తము."

"నీకుటుంబభృతి ప్రజాధనముతో నేనే చేశాను గదా."

"అది నేనెరుగుదును స్వామీ."

"అందుకు బదులు రాజుకు నీ వేమి సేవచేసినట్లు."

"స్వామీ!—ఒక్క మనవి."

"కుశలుడవైన నీవు విగ్రహాలు మొదలు పెట్టనైనా మొదలుపెట్టకపోవడానికి కారణము?"

"అదే మనవిచేసుకోబోతున్నాను."

"కానీ."

"ముగ్గురమ్మల విగ్రహాలు చెయ్యమని తాము సెలవిచ్చారు."

"అవును."

"వారు మన తల్లులు."

"అవును."

"వారు స్త్రీలు."

"అవును."

"నేను సామాన్య పురుషుణ్ణి."

"కావచ్చును."

"ఇంద్రియములు బలమైనవి—స్వామీ."

"అవును."

"నావంటి సామాన్య పురుషుడు ఊహా కందని స్త్రీదేవతల విగ్రహాలు చెయ్యపూనుకోగలడా స్వామీ?"

"నీకు నైపుణ్యములో లోటు లేదు."

"లేదుస్వామీ—భగవంతుని దయవల్ల."

"చేయవలెనని కోరిక, భావన ఉన్నవి."

"ఉన్నవి స్వామీ."

"ఇంక?"

"మహారాజా, మనవి చేసుకొంటున్నాను. చిత్తగించండి. మాతృభావం దేవతలపైని కలగకుండా వారి అవయవాలు ఎట్లా ఏర్పరించగలను ప్రభూ; వారివిగ్రహాలు ఎట్లా చెక్కగలను? విగ్రహం చెక్కే వేళ నామనస్సు వికలమయితే నాకు నరకము రాదా? దేవతాస్త్రీల అప్రతిమానసౌందర్యములో నేను నాతల్లి సౌందర్యము చూడగలననే ధైర్యము నాకు లేనినాడు నేను శిలాఖండము తాకగలనా? వారికి అవయవాలు ఏర్పరచేటప్పుడు నాచేతులు శిశుహస్తములు కానిదే నేనెట్లా ఆదేవతావిగ్రహాలు మలచగలను? నా కాదేవతలు తల్లులుకావాలి, ఆదేవతలకు నేను శిశువును కావాలి; లేకుంటే ఆసౌందర్యమును చూచిన నామనస్సుకు చాంచల్యము కలిగితే ఆసౌందర్యమే నన్ను బలిగా తీసుకోదా? అట్టి విగ్రహములు ప్రజాపూజకు అర్హమవుతవా?"

"శిల్పీ—నీకింకొక సంవత్సరము గడువు."

"చిత్తము, స్వామీ"

"నీతోపాటు నేనూ నిత్యమూ తల్లులను ప్రార్థిస్తూ ఉంటాను."

"చిత్తము స్వామీ."

"నీ కోరిక నెరవేరుతుంది."

"చిత్తము స్వామీ."

"నీవే అట్టి విగ్రహాలు చెక్కవలెను. తప్పితే ఎవరు చెక్కగలరు?"

"చిత్తము స్వామీ."

"నీ కౌశల్యమునకు నీభక్తిని జోడించు."

"చిత్తము స్వామీ."

"ప్రజల హృదయములతోపాటు నా హృదయమున్నూ మాతృపూజకై తొందరపడుతున్నది."

"చిత్తము స్వామీ."

## ౬

మహాత్కార్యమును నియోగించిన మహారాజు రాచకార్యములలో మునిగి తేలుతూ ఉన్నాడు. కాని శిల్పి సర్వమునూ పరిత్యజించి ముగ్గురుతల్లులమీదా మనస్సు నిలిపి వారి అనుగ్రహము పొందడముకోసమై నిరీక్షిస్తున్నాడు. నెలలు గడచిపోయినవి. రాజుగారు పెట్టినగడువుకూడా దాటిపోయింది. రమ్మని రాజాజ్ఞ కాలేదు. శిల్పి వెళ్లలేదు. సంవత్సరములు గడచిపోవుచున్నవి. రమ్మని రాజాజ్ఞకాలేదు. శిల్పి వెళ్లలేదు. శిల్పికి ముసలితనము వచ్చినది. రాజుగారి సంగతే మరిచాడు. కాని తల్లుల ప్రేమకు పాత్రమౌతున్నాడు.

ఒళ్లు ముడతలు పడ్డది. దృష్టి తీక్ష్ణముగానే ఉన్నది. చేతులకు వణుకులేదు. బాహ్యదృష్టిలేదు.

ఏకాంతస్థలములో ఆముసలిశిల్పి పరికరాలు చేత బట్టి బండరాళ్లు మలుస్తున్నాడు. తల్లుల రూపములు మనస్సులో పదిలముగా నిలుపుకొని వాటిని భద్రముగా శిలలోనికి అవతరింప చేస్తున్నాడు. ఆనాటి కానాడు ముసలితనము హెచ్చుతున్నది. దేహము దుర్బలమవుతున్నది. ఆనాటికానాడు ముసురమ్మల విగ్రహాలూ రూపములు పొందుతున్నవి. జీవకళలు వహిస్తున్నవి. ప్రజాపూజ కువ్విళ్లూరుతున్నవి.

ముసలివానిలో శైశవ మంకురించి పెరిగెనది. పెదవులకు మందహాసము వచ్చినది. హృదయమునకు నైర్మల్యము కలిగెనది. అతని చేతులద్వారా అతని హృదయమందు ప్రతిష్ఠితమైఉన్న తల్లులరూపములు అతడు మలిచినవిగ్రహములలోనికి దిగజారినవి. ఆవిగ్రహములలో అవి కాపురముండ మొదలుపెట్టినవి.

చారులవల్ల విన్నాడు మహారాజు, ముగ్గురమ్మల విగ్రహాలూ ప్రజాపూజకు సిద్ధముగాఉన్నవని. అమితముగా సంతోషించాడు. శిల్పిని బహూకరించవలెననీ, మహావైభవముతో విగ్రహములను ప్రతిష్ఠచేయించవలెననీ తలచాడు మహారాజు.

కాని శిల్పిఎక్కడ ?

తనదేహమునూ, తనఆత్మనూ అతడు తనతల్లులకు ధారపోశాడు. ప్రజాదృష్టికి గోచరముకాకుండా తన తల్లులలోనే అతడు నిత్యమూ కాపురముంటున్నాడు. మహావైభవముతో విగ్రహప్రతిష్ఠ జరిగెంది.

పండితులు వచ్చి ఆవిగ్రహాలను చూచారు. ఆవిగ్రహాలకు మొక్కుకొన్నారు. తల్లులు నిత్యనివాసం చేసుకొన్న ఆవిగ్రహాలు తల్లులే అన్నారు వారు. రాజుగారి కోరికపైని పండితులు శాస్త్రరచనకు సాధనాలు సంపాదించుకొన్నారు.

అప్పుడే పుట్టింది శిల్పశాస్త్రం.

---



ఏకాంతము S. S. S.

# 'కడుపుమంట'

ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రి

## 'మాదాకవళం అమ్మా'

శ్రావణభాద్రపదాలు— భోరుమని వాన— హోరుమని గాలి. అది పట్టణమే— ఆవీథిభాగ్యవంతులమేడ లున్నదే— ఏతలుపూ తీసిలేదు— ఏ సంచలనమూ వినిపించదు. పొరపాటున తీసిఉంచిన కిటికీలోనుంచి రేకరేకగా దీపపుకాంతి బాగా తడిసి మెత్తబడినరోడ్డుమీదా— గలగలమని కొత్తనీటితో పొర్లే మురుగుకాలవమీదా పడుతున్నది. రాత్రి తొమ్మిదిగంట లయింది. వర్షోద్రేకం తగ్గింది కాని గాలిహోరు వింటే గుండెలు ఆగిపోతాయి. చెట్లసంక్షోభ చూస్తే చాలా జాలీ—భయం పుడుతుంది. ఆవర్షానికి ఆమెగుడ్డపేలికలు తడిసి ఎక్కడివక్కడ అంటుకుపోయినవి. జుట్టు కొనలనుంచి నీరు కారుతున్నది. ఎడనెడ చరాలున మెరసే మెరుపుకాంతిలో ఆకలితో మండుకొనిపోయే ఆమెకళ్లూ—చేతులోని 'అల్యూమినియం' చిప్పా కనబడుతున్నవి. రోడ్డుమీద పెద్దజువ్విచెట్టు ఆగాలికి ఊగిఊగి ఎక్కడ విరిగి తనమీదపడుతుందో అని పరుగెత్తుకునివస్తూంటే పాపం కాలుజారి పడిపోయింది. ఒళ్లంతా బాడి—

ఆవీథిలో మొదటిమేడదగ్గర ఆగింది. గొంతు సర్దుకొని "మాదాకవళం అమ్మా?" "దిక్కుమాలినదాన్ని బాబయ్యా" అంటూ సమీపించింది.

* * * * *

మద్రసోపేతముగ భోంచేసి ఆయింటిదంపతులు మేడయెక్కి గంట అయింది. అడుగున భూలోకం ఉన్నదనీ, దానిమీద కొన్నిప్రాణులు తిరుగుతాయనీ వారికి తెల్లవారితేగాని తెలియదు. పరిమళద్రవ్యాలతో తాంబూలం, పన్నీరు, సెంట్లు, పందిరిమంచం— ఆనిర్భాగ్యురాలిమాటలు వినిపించే సమయమేనా అది? తమతో బుట్టువులయిన దురదృష్టజీవుల వేదన అర్థమయే వేళేనా అది? లేదు—జవాబులేదు - చలి - ఒణుకు. కడుపులో మహాబడబమంట. ఆగలేక తలుపుతట్టింది— చప్పునవిడింది. ఏమిటి? వీథితలుపుకాదు, పక్కకిటికీ. "నీకేం బుద్ధిలేదూ? అర్ధరాత్రివేళ అన్నం అమర్చుకుని ఎవరు నీకోసం సిద్ధంగా కూచున్నారు? ఛో! అవతలికి, అరుగులు తడిపెయ్యకు." అన్నాడు వారి నౌఖరు. మళ్లీ బాటపట్టింది. ఎటుచూసినా కారుచీకటి— కొంచెందూరంలో చిన్న వెలుగు రోడ్డుమీద— ఆమహాప్రళయంలో అంత వెలుగే కొంత అన్నం ఆమెకు. లేనిసత్తువ, రాని ఉత్సాహమూ కూర్చుకొని అక్కడకు ఎలాగో వెళ్లి వాలింది.

చక్కని పెంకుటిల్లు, గృహయజమాని ఉద్యోగి, డ్రాయరుముందు కూచుని మధ్యాహ్నం చూసిన 'న్యూస్ పేపరే' మళ్లా చూస్తున్నాడు. ఇంకా లోపల ఎవరూ నిద్రపోలేదని తెలుస్తున్నది. వీథితలుపు చేరవేసి ఉంది. సందులోనుంచి దీపపుకాంతి రావచ్చు. అస్పష్టంగా పక్కను మాటలువినిపిస్తున్నవి. బహుశః ఆయన స్నేహితుడు కావచ్చు. ఉండి ఉండి ఉద్యోగి—"ఆహా బీహారుప్రజలకు ఎంతకష్టదశ ప్రాప్తించిందోయి, కొన్ని వేల కుటుంబాలు కుంకటివేళ్లతో ఊడ్చుపెట్టుకుపోయినవట. ఎంతమంది పాపం కడుపులు చేతబట్టుకుని పక్షుల్లా మలమలమాడుతూ అల్లాడుతున్నారో—ఏం భూకంపమోయి కొంపతీసిందిగాని—మిత్రుడు—మన సోదరులకు మనంకాకపోతే ఎవరు సహాయపడతారు. తప్పక మనం కూడ కష్టపడి బీహారునిధి వసూలుచేసి పంపుదాం" అన్నాడు. వెంటనే వీథిలో—

"బాబయ్యా!"

ఉద్యోగి—"ఏం?"

"కడుపుమంటకు పట్టెడు కబళం బాబయ్యా."

"ఛో—రేపొద్దున్న రా!"

"కాళ్లు తేలిపోతున్నయి—రెండురోజులనుంచి అన్నం ఎరగను నాయనా!"

"చెప్పింది వినిపిస్తోందా, లేదా?"

"అంతవరకూ ప్రాణం నిలిచేదెట్లా తండ్రీ?"

"నిలవకపోతే నీఖర్మం చావు! ఏం చెయ్యమంటావు ?"

వడాలున తలుపుమూసినాడు గృహాధిపతి. ఒక్క నిరుపేదరాలికి పట్టెడుఅన్నమే కరువైపోయిందిఆమహాపట్టణంలో.

రెండవవీథికి వెళ్లింది. మూడవవీథికి వెళ్లింది. ఎవ్వరూ తలుపయినా తీయలేదు. ఎవ్వరూ కరుణించలేదు. ఆమెహృదయమూ, గర్భకోశమూ ఒక్కసారి భగ్గున మండుకొనిపోయినవి. ఆవేదనతో అరచి అరచి ఈప్రపంచాన్నీ, ఈ దయా సానుభూతీ లేని పాషాణ భాగ్యవంతులనూ శపించి పతాలున పగిలిపోదామనుకున్నది. ఆభీకరదృశ్యం చూడలేక కారుమేఘాలు కళవళపడి అరుస్తూ పరుగెత్తుతున్నవి. ఒకటి రెండు మూడుగా చెదరిపడి నక్షత్రములు తళతళ మెరుస్తున్నవి. పాపం ఆమెచేతిలోని 'అల్యూమినియం' చిప్పవేపు చూసింది. ఏడ్చుటకు నీరైనాలేని ఆపమ్మనేత్రములనుండి ఒక నీటిబొట్టూ, ఒకరక్తబిందువూ ఆ చిప్పలో ఉట్టిపడినవి. అన్నంతో నిండుతుం దనుకున్న చిప్ప అశ్రువులతో నిండింది. నిరాశగా చిప్ప తలపై బోర్లించుకొని ఆరోడ్డు వెంటే నక్షత్రకాంతికి తోవ చూచుకుంటూ పోతున్నది. ఎక్కడికిపోతుందో తెలియదు. చలితో వజవజ వణుకుతూ ఉండిఉండి ఆకాశంవేపూ, చుక్కలవేపూ చూస్తుంది.

అయ్యో! ఈ భాగ్యవంతుల మేడనీడల్లో, ఈ ఉద్యోగస్థుల తిట్లల్లో- జువ్విచెట్ల వేళ్లల్లో — రోడ్డు పక్కల కుక్కల్లో— బతకమనా జగత్పిత అయిన భగవంతుడు ఇట్లాంటిప్రాణులను సృష్టించాడు. వీళ్లకీ అన్యాయం ఎవరు చేశారు??? కడుపునిండా భోంచేసి కాఫీతాగి-ఇంకా తాగి- కాలుకదపలేక కార్లల్లో పడిపోయే గొప్పవారికి ఆగొప్పతనం, ఆమేడలూ ఆబట్టలు ఆబంగారం - ఆతళుకూ - ఆ గౌరవం-ఎలావచ్చాయి? వీ రిలాగే పుట్టారా? వా రలాగే పుట్టారా? ఏమిటీ అన్యాయం-ఏమి టీసృష్టి తెలిపితక్కువ-ఏమి టీఎగుడు దిగుడు కలతగొట్టు లోకం.

'ఉండడే ఒకదేవు డంటూ
ఉన్న ఊర్కొనునే?'

"గెందబనీజావుంగేసయ్యా' లేరీగోదు మే — సయ్యా తెరీ—గో—దూ—మే=గెందబనీ"

ఆరోడ్డుమలుపులో జట్కాబండ్లు నిలిచే తావు పక్కను షేక్ ఇషేకు రొట్టెలకొట్టు.

శిథిలమయిన పెంకుటిల్లు — ఒకచెంపను కూలుతున్నది. చవుడుదేరిపోయిన పెద పెద్ద అరుగులు. ఖాళీగా ఉన్న జట్కావాలా లందరు ఆ అరుగులమీద చేరి కొరడాలు తిప్పుకుంటూ ఏదో బాతాఖానీ కొడుతూ ఇషేకుచేసిన తాజారోటీ, గరమ్ చా ఖర్చుచేస్తూ ఉంటారు. ఈవేళ బ్రహ్మాండంగా-గాలీ-వాన రేగినందువల్ల ఒంటెద్దుబండినాయళ్లూ- జట్కాసాహేబులూ ఖాళీగాఉండడంచేత ఇషేకుకొట్టుఅరుగులికి మహావైభవంపట్టింది. చుట్టలు- బీడీలు-M. S. M. B. N. R. ఇంజన్లలాగ గుప్పుగుప్పున పరుగెత్తుతున్నవి. అందుచేత ఇషేకుకొట్టు ఇంకా మూయడానికి వీలయిందికాదు. మామూలుగా అయితే ఇంతకి గంటక్రితమే అతడు కొట్టు మూసి ఉండును. ఇప్పుడు కొంచెం తెరిపిఇవ్వడంచేత సభికులు ఒకొక్కరే దారిపట్టారు. కనక ఇషేకు పాడుకుంటూ కొట్టుసర్దుకుంటున్నాడు. చల్లగా ఈపాట భిక్షుకిచెవికి సోకింది. ఆరిపోతున్న ఆకలిమంట గుప్పునరేగి మండజొచ్చింది. ఘాటైనతురకపాట క్రొత్తసారాఅంతవికారం, ఉద్రేకం, తామసమూ కలుగజేస్తుంది. ఆపాటవినగానే ఆమెకు భయంవేసి ఒళ్లు గజగజవణికింది. వాంతివచ్చేటంతబాధ కలిగింది. కాని కాళ్లు కదులుతూనే ఉన్నవి.

మనిషివాసన తగిలితే చాలు. ఏహృదయానికేనా దయఉండదా— ఏమనస్సుకేనా ఆకలిబాధ అర్థంకాదా అనీ ఆమెఆశ. మెల్లగా ఎలాగో రొట్టెల కొట్టుగుమ్మందగ్గర నిలిచింది. ఏమైనా అడుగుదా

మని గొంతుఎత్తింది. కాని బిగుసుకుపోయింది. ఏదో అడ్డుపడినట్లయింది. ఎంతచించుకున్నా మాట రాలేదు. అర్ధరాత్రి — పట్టణమంతా నిశ్శబ్దం — నిర్మానుష్యం. విన్నది తురకపాట. అయినప్పుడు దిరిశెనపువ్వువంటి భారతస్త్రీహృదయం - ఎంత తల్లడ పడిపోతుంది. ఎంత సంక్షుభితమవుతుంది. ఎట్టకేలకు "బాబయ్యా" అని గొంతుపెకలించుకుని ఉట్టిపడింది.

"కౌన్ రే? భైకో! ఆతాహూ—" ఆమె తలపై పిడుగుపడింది.

చరచర వచ్చినతోవనే పోదామనుకున్నది. కాళ్లు తిరిగిపోయినవి. అరుగుమీద చదికిలబడ్డది. ఏదైనాగానీ— ఇతన్ని—ఏమైనా అడుగుదాం—ఏజాతి అయితేనేం? మంచివారు ఎందులోమట్టుకు ఉండరు? జాతీ నీతీ ధారాళంగా వెలిగిస్తున్న హిందువులఇళ్లంట తిరిగితిరిగి తిన్నదేమిటి అనుకున్నది. ఇషేకు ఇవతలకువచ్చాడు. మిలమిల మెరిసే చుక్కలవెలుగులో అస్పష్టంగా ఆమె ముఖమును చూశాడు. ఆవెలుగుచీకట్లమధ్యలో మల్లెపూవుల్లా పరిమళిస్తున్నాయి ఆమెకళ్లు. నాచుకప్పిన కలవపువ్వువలె ఆమెముఖం వివృతముకాలేదు. ఇషేకు లోపలికివెళ్లి లాంతరుతెచ్చాడు. భిక్షుకి గుడ్డపేలికలను సరీగా సర్దుకునికూర్చున్నది. "ఎవరమ్మా నీవు— ఏమి కావాలి నీకు" అన్నాడు ఇషేకు. తలఎత్తకతీరదు. తలఎత్తక జవాబుచెబితే అవినయం స్ఫురిస్తుంది. "బాబూ పట్టెడుకవళంకోసం ఊరంతా తిరిగాను. ఎవ్వరూ కనికరించలేదు. రెణ్ణాళ్లనించి తిండిలేదు" అన్నది. ఇషేకు నిదానించి ఆమెనుచూశాడు. ఎన్నడో తాను ఈమెను ఎరుగును. ఇంతవరకూ బాహ్యప్రపంచంలో పట్టిన గాలివాన ఇప్పుడు ఇషేకుతలలో పట్టింది.

"త చ్చేతసా స్మరతి నూన మబోధపూర్వం
భావస్థిరాణి జననాంతరసౌహృదాని"

* * * * * *

సుమారు పదేళ్లవుతుంది.

విజయనగరంకొత్తపేటలో 'రిజర్వైరు' కు సమీపంలో ఒకపెద్దరావిచెట్టుంది. ఆచెట్టుకి ఉత్తరంగా తెలగా అప్పలస్వామిఇల్లు. 'వాటరువర్క్సు'లో అతనికి చిన్ననౌఖరీ. ఎనిమిదిరూపాయలుజీతం— ఎందుకూ చాలదు పాపం. ఒకప్పుడు అతనిస్వగ్రామం అయిన అలమండలో ఇరవైగాళ్ల ఎడ్లతో వ్యవసాయం— పెద్దని—రెండు అంటుమామిడితోటలు— నలుగురు తమ్ములూ, నిత్యకల్యాణం పచ్చతోరణంగాను ఉండి అప్పలనాయుడుగా రనిపించుకున్నవాడే. తమ్ముల అప్రయోజకత్వంవల్లా, ఋణాలవల్లా, యావదాస్తీ శ్రీరామరక్ష అయిపోయి దిక్కులేక రెండవభార్య సూరమ్మతో విజయనగరంచేరి ఆ తక్కువజీతంతోనే కాలంగడిపేవాడు. సూరమ్మ తెలివయినపిల్లకావడంచేత ఎక్కడికి అక్కడే సర్దుకొని లేమిలేకుండా ఆదంపతులు హాయిగా బతికేవారు.

రావిచెట్టుకింద జట్కాబళ్లు ఆగుతాయి. షేక్ హాజరతుకి ఒకజట్కా ఉంది. అతడు పెద్దమనిషి. అతనికి ఒకతమ్ముడు. పైలాపచీస్. పక్కమెడబొత్తాల చొక్కా, వదులు ఇజారు, రాడీక్రాపు. రావిచెట్టు వేళ్లమీదకూచుని ఏవేవో తురకపాటలు పాడి మత్తెక్కించేవాడు. సూరమ్మను చూసినప్పుడల్లా అతని పాటలో కొత్తసంగతులూ, గొంతులో మంచిబిగువూ, మనస్సులో మంచి ఉత్సాహమూ కలిగేవి. ఏమీ తోచకపోతే రావిచెట్టువేళ్లమీదకు చేరేవాడు. సూరమ్మ కోసం గంటలకొలది ప్రతీక్షించేవాడు. ఆమె ఇతని నెప్పుడూ చూసిఉండదు. హిందూస్తానీపాటలంటే ఆమెకిష్టంలేదు.

హాజరతులేనప్పుడు ఒకసారి ఇతడు తప్పతాగి జట్కాతోలుతూ ఒకపెద్దఉద్యోగిబండిలో డీకొల్పి బండీ, గుర్రం అమ్మితేగాని తీరనంత జరిమానాతిని చెప్పకుండా ఎక్కడికో పారిపోయాడు.

అప్పలస్వామికి ఏదో అవసరంకలిగి ఒక మారు వాడీదగ్గర ఇరవైరూపాయలు ఇంటిమీద అప్పు తెచ్చాడు. తనజీతంమీద తీర్చుదా మనుకున్నాడు.

మారువాడీ అప్పూ, న్యూమోనియాజ్వరం మనిషిని ఇక తేల్చడం సున్న. వడ్డీకివడ్డీ మారువాడీచిఠాలో

పెరుగుతూనే ఉన్నది. అప్పలస్వామి చేయి సర్దుకోలేక పోయాడు. అకస్మాత్తుగా ఒక నాడు కలరావల్ల చచ్చిపోయాడు. సూరమ్మ దిక్కులేని నిర్భాగ్యురాలై పోయింది. తినతిండిలేదు. కట్ట గుడ్డలేదు. ఏకాకి - ఆడది. సంచికవళమే జీవనోపాధి. విజయనగరం విడిచి వెళ్లి పోయింది.

*     *     *     *     *

తలవనితలంపుగా జరిగిన ఈఅద్భుత సన్నివేశానికి నివ్వెరపడిపోయాడు ఇషేకు. తాను పూర్వం విజయనగరంలో రావిచెట్టుక్రింద పాడుతూ చూసిన గులాబిపువ్వు లాంటి సూరమ్మేనా తనఎదుట దిక్కుమాలి, చింపిగుడ్డలతో కనిపిస్తున్నది- నమ్మలేకపోయాడు. అతని నరాలు తంబురాతీగెల్లా బిగుసుకుపోయినవి. "ఏఅమ్మా నీకేం ఫర్వాలేదు. నాలుగు తాజారోటీ ఇస్తాను తిను. ఒక ఖండ్వాఇస్తాను. కట్టుకో— ఈరాత్రికి ఇక్కడే పడుకో" అన్నాడు. సూరమ్మకి అయిదుప్రాణాలు లేచి వచ్చాయి. ఆహా నాలుగురొట్టెలు -కడుపునిండుతుంది. ఆబట్టకట్టుకుంటే ఈచలిఅంతా పోతుంది- కాని- -ఈరాత్రి ఇక్కడ పడుకోడం ఎందుకూ??? ఛీ -ఛీ – ఆమెకేదో తోచింది, కళ్లు భగ్గున మండినవి. ఇన్నాళ్లూ, గుడ్డలేకపోయినా, కూడు లేకపోయినా, ఎన్నికష్టాలువచ్చినా కాపాడిన మానధనం నేడీకరకు తురకకు కొల్లపెట్టవలసిందేనా? అప్పలస్వామి ఏడుస్తూ కనిపించినట్టయింది. బోరుమని అతనిని కౌగలించుకుని ఏడవబోయింది. ఏడవడానికి తగిన సత్తువ ఏదీ- కొయ్యబారిపోయినది. ఇషేకువచ్చి ఆమె చేయిపట్టుకొన్నాడు. ఆమె ప్రతినరములోను తాచుపాములు బుసకొట్టి హృదయంలోకి పరుగెత్తినవి. కాని ఆకలిమంట అన్నిటిని ఆహుతి చేసుకున్నది.

"అమ్మా, లే, ఏంభయంలేదు. తాజారోటీ లోపలఉంది, రా. ఈఖండ్వా పుచ్చుకో" అని ఆమెను లేవదీసి లోపలికి తీసుకొనివెళ్లి తలుపువేశాడు.

---

## చెల్లాయి పెళ్లి కట్నం

చావలి బంగారమ్మ

సిరియనందగు చెల్లి
సరసంపుసభలోను
పరువైన లేనవ్వు
పెదవులందోగాడ—

భావాలె పూవులై
పరిమళించెడు దండ
పతికంఠసీమ నిడు
తరి నట్టెచూడగా—

ఒకరిబొమ్మొకరిదై
కనులలో కరగిపో
మరలి రాలేనిదై
...   ...   ...   ...

తెలియజెప్పగలేని
తేజస్సు లల్లేను
పాల్తాగుబిడ్డ లే
పలుకులో తీపల్లె—

వర్ధిల్లు ఓ తల్లి
వర్ధిల్లు కల్యాణి
వర్ధిల్లు జయలక్ష్మి
వర్ధిల్లు డమ్మా!

---

# పిచ్చిబుచ్చమ్మ

కొత్తపల్లి సూర్యారావు

చింతపట్లవారి త్యాగ మెఱుఁగనా! కస్తూరివారి యింటిపేరుబండారము తెలియదా! కొంగ జపము క్రొత్తదా! పింగళివారి పేకి నాచుట్టమే. ముసుఁపలబుచ్చయ్యకుటుంబములోనిదానను. మునుపటి యాకుటుంబములు వేఱు. ఇప్పటి కుటుంబములదారి వేఱు. తాటియాకుకుటుంబము, నత్తగుల్లకుటుంబము, గడబభాషాకుటుంబము. తలుపున్నచోట నెల్లఁ గప్ప తాళముండునా! ఆక్షేపణలే యీకాలములో నెక్కుడు. తాముచేయుపనులు వారిపనులకంటె హీనములు—చీమ కాలంతతప్పు పట్టుకొని యేనుఁగుకాలంతతప్పు చేయుచున్నారు. అసును. ఎవ్వరిపీఁ పెవ్వరికిఁ గనఁబడినది. పురాణకుటుంబము, ప్రబంధకుటుంబము, నాటకకుటుంబము, నవలాకుటుంబము. నవలాశబ్ద మెప్పుడుపుట్టినది? మొదట రాజశేఖరచరిత్రవిమర్శనములో బైలుదేఱినది. దానిపుట్టు కెఱుఁగరు గాని దాని నెఱుఁగనివారు లేరు. అంతకంటె ముందున్న దనువారితో పందెము! అన్నిటికిఁ గప్పతాళము లుండెనా బియ్యము గడును బుట్టనిండును. తలగీసి, దిగపారఁగాదు — ఉప్పులాను నిలువఁబెట్టి కొలువ వచ్చును. విశ్వామిత్రసృష్టి బైలుదేఱుచున్నది. అందఱును దుర్బలులే. అంగుష్ఠప్రమాణముగల వాలఖిల్యాదుల కుటుంబములు, ఒక్కపురుషుఁడే పురాణములో నొకరీతిని వర్ణింపఁబడును. ప్రబంధములో నొకరీతిని-అతఁడే నాటకములో నెట్లుండునో మీరు దినదినము చూచుచున్నారుగదా. నవలలోఁ జెప్పవలసినదే లేదు. అద్భుతములు స్వభావవిరుద్ధములు నుండఁగూడదు గనుక తద్దినమునాఁడు పవిత్రమువలె వ్రేళ్లనడుమ సిగరెట్టలంకారముక్రిందఁ బరిగణింపఁబడుచున్నది. సన్నాయకలక్షణములుపోయి సాధారణపురుషుఁడుగా గ్రహింపఁబడును. చెప్పుదెబ్బల మారీయని నానోట గడ్డిపెట్టినను సరియేగాని, అత్తమాట యెవ్వతె వినుచున్నది. పొట్టిబాతు లీఁదఁగలవు. కుక్క మొఱుగును. గాడిద బూడిదలోఁ బొరలును. ఎవ్వ రెఱుఁగని రామాయణమిది! మాటమీఁద మాట వచ్చును. వసుచరిత్రము చింపివేయుమన్నావా! మఱిపత్రికలలో నెక్కడఁజూచినను విరహము, వియోగము, ముద్దు, కౌఁగిలింత, భ్రమరము—తానుబెట్టుకొనని దొకటిచ్చుమా, మాయాఁడువాండ్రే సిగ్గువిడిచినారు. మగవారిమీఁదనైన మేలే, మామీఁదనే పురుషులు దుండగపుదారిని బద్యములు చెప్పుచున్నారని తామే తమ్ముమ్ను వర్ణించుకొనుట, అవికలులేని బొమ్మలు వేసికొనుట, పత్రికలలోనికిఁ బంపుట—నేనా పిచ్చిదానను నన్నన్నవారా! ప్రాంచద్భూషణబాహువును దప్పు పట్టి — ఇప్పటికవి — ఏదీ తలుపువగ్గిరసా పెట్టు— ఉఊఁ ఒక్కముద్దు. అని పత్రికలలో నెక్కించుచున్నాఁడు. తెనుఁగుమీఁటి వాని నన్నిభాషలలోనికిఁ దర్జుమాలా. ఆఁడుదానికే పుట్టినది. లంకాయాగము మూలఁబడవేసి నాకోడలు—నోవలుపుచ్చుకొన్నది. పిలిచినఁ బలుకదు. ఉండత్తా! రాజేశ్వరి యెట్లుతప్పుకొన్నదో జయపాలునిచేతులలో నుండి— ప్రకరణము పూర్తిచేసి పుడకలు తెచ్చెదనని యేమోచెప్పును. బెజవాడలో విజయసేనుఁడు — రాజమహేంద్రములోఁ గామపాలుఁడా. ఇది స్వభావమేనా. పేరు లిప్పటివేనా. ఎప్పుడైన నున్నవా. పలుపుక్రింద జాబులా. గదులపెట్టెలోఁ బ్రేమలేఖలా. ఆవకాయలచిట్టట్టుక యుత్తరములు చదువుకొనుటకు రహస్యస్థలమా. ఆహా! నవలా నీది యిప్పటి రాజ్యము. నాబుద్ధి చంచలమఁట — మఱిచలించినయెడలఁ బండ్రెండవయేఁటఁ బెండ్లియైనది — పదుమూఁడవయేఁట వారు దేశాంతరము వెళ్లినారు. ఇప్పటికిరాలేదు. ఇప్పుడు తిరుగఁబడి చెప్పుదెబ్బలు కొట్టుచున్న చెట్టంతకొడుకును— తురకలలోఁ గలిసిపోయిన కూఁతురు—నేను వీరి నెట్లుపెంచినానో దైవమునకెఱుక— గంపంతకన్నులతోఁ జూచుచున్నాఁడు నాదేవుఁడు.— ఈయూరు దాఁటి

పోయితినా, యీవీథినిడిచితినా, యీయింటిపట్టు దిబ్బయినను విడిచితినా. వేఱొక్కచోటికిఁ బోయితినా. నాకుఁ జలనబుద్ధియున్నదా. చంచలమేదీ! నాజోలి యెవ్వరికి గావలసినది. నన్నెవ్వరు పెంచినారు. నాలెక్కలు నేను—దేవునకుఁ గాదు మీకన్నులకు నే నిప్పుడు బరువుగానున్నానా. ఎవ్వరికిఁ బుట్టినావురా—యన్నట్లు—మాకుఱ్ఱవాఁడు తెగనీలిగియెగసిపడుచు నిల్లుపట్టఁడు. సిగ్గులేక— తనుదునమ్మా యనియన్నింటిలోఁ దానే—ఇపుడిపుడు నేను బైటఁ దిరుగుటకు సిగ్గుపడుచున్నాను. వీనికేమమ్మా. ఆధైర్యము! పెంచినమాట నిజమే కాని నానగలన్నియుఁ బుచ్చుకొని బుంగలోఁ బెట్టినాఁడు, మునసబుతో మాటలాడుదుమని చెవి నిల్లుగట్టుకొని చెప్పినను—పోరినను—వాఁడు కార్యదర్శి, తాను ప్రధాని—నాదిబ్బలాగున్నది. డబ్బు లేదుగా. పూఁటగడచు దిక్కులేదురా యని బతిమాలుకొన్నను—నాదిక్కుమాలినయల్లుఁడు కొంపవిడువఁడు. మీకు నవ్వులాటే—నామొగము. ఇంకను అత్తాశ!— వల్లకాదు. ఎన్నిబుద్ధులు చెప్పినను మొగముమీఁదఁ జిక్కగాఁ బేఁడనీళ్లు చల్లిపోయినది. పంచను బడియుండవే—అన్నాను. దినదినము సిగపట్లగోత్రము— ఉప్పరివదినెతో—నేనుండలేనే యన్నది. మనయింటఁ బనిచేసిన తురక—లోకువపడిపోయెదవే యంటిని— నేను క్రొత్తగా నిపు డెవ్వరిమీఁదఁ బ్రేమ దెచ్చుకొందునే తల్లీ! యని నోటినిండఁ బలికి జమీనాబీ వేషము వేసినది. కరణముగారు చేయించి పెట్టినది. జంగముదేవరకు విధిలేక యిచ్చివేసి బెంగతో నేడ్చుచున్న నామిద్దెటుంగరము — నాకొమార్తెముక్కుతురక బులాకి చూచినపుడెల్ల జ్ఞప్తికి వచ్చును.—కుఱ్ఱవాఁ డెక్కడికో పోయినాఁడు. కనఁబడుటలేదని నామనుమనిగూర్చి కూఁతురు వచ్చిచెప్పినది. కాలుగాలినపిల్లిలాగునఁ దిరిగి తోళ్లసాపులోఁ బట్టుకొని యింటికిఁ బంపినాను. ఇంక మా “వెధవ” కనఁబడవలయును. ఎద్దువంటిపెండ్లమును బెట్టుకొని కుఱ్ఱకుంకలాగున వీథులవెంటఁ దిరుగుటకు సిగ్గులేదా. ఏమందురు. మన వాండ్రు—కఠినవాక్యము లాడఁగూడదన్నారు నిజమే.

“వెధవ” యేనిఘంటులో నున్నది. విధవా శబ్దమునకు మాఱుగా వాడియుండరు. తర్వాత క్రమముగా మనవారు తెలియక మార్చి విధవాపరముగా నుపయోగించి వెధవ, వెధవకలము, వెధవకొంప యనుచు సర్వమును దన్మయము చేయుచున్నారు. “వ్యధ్వ” అనలేక దానిని వికారము చేసినారు. ఓరివ్యధ్వా అంటే ఓరి తప్పుదారిని నడచువాఁడా, చెప్పినమాట విననివాఁడా. వ్యధ్వః-దురధ్వః, కదధ్వః=కాపథః-విధవాశబ్దము నోటినిండ మనవారు పూర్వ ముచ్చరించియుండరు వ్యధ=వెత యైనది. వ్యధ్వః-వెధవయైనది. ఇది నాపిచ్చి బుచ్చెమ్మ తలఁపు. మాలపల్లెలోనుండి తెరవెళ్లి మావాఁడు చేతిలోనిడబ్బు చెల్లువడుకు రాఁడు. ఎన్నిమతములు స్వీకరించినను సమ్మతమైన మతము దొరకలేదు. లోకమందఱితోపాటుగాని నేనొక్కతెను గానుగదా. చాలశ్రమపడి యిన్ని సంకరములు చేసితినిగాని, మావదినె నీడపట్టున నుండి సునాయాసముగ విందులకుఁబోయి యన్నిమతములు నుప్పుగలిపినది. ఉప్పరికోడలు నాపై నధికారమా, ఇన్నాళ్లకు! నాకేదో యింత తిండిదారిచూపిన వేఱింటి కాఁపురము పెట్టెదను. నాకొడుకునకై వీథులవెంటఁ దిరుగుచున్న నేను పిచ్చిదానను, బతిమాలినదాన నంట. వీరందఱు నాకంటెఁ బెద్దలా! నేను రథముక్రిందికి రహస్యముగాఁ బోవుదానను. నాకంటె వీరు ముందుగాఁ బోయి యక్కడఁ కథలు చెప్పుకొందురు. చెవరనాడుకొనుట యెందుకని నేను మెత్తవడినకొలఁది నామీఁద వీరు నల్లేలుమీఁదిబండ్లా. పిచ్చిముండను. నాకుఁబిసాళమెత్తెనా—ఎనిమిదోపన్నము పారాయణ మొదలుపెట్టెదను. ఏమి! మాటలాడరు! నన్నుఁ బోషింపలేమని భయపడియే లేచిపోయినారా. మీరు రండు, వచ్చితిరా, మిమ్ముఁ బువ్వులలోఁబెట్టి పూజించుకొందును. నెత్తిమీఁదఁ బెట్టుకొని తిరుగుదును. ఎంతపెంచినను,కొడుకు లెవ్వరికో మావెంకమ్మపిన్నిలాంటివారికిఁగాని పనికి రారు. ముప్పు గడపరు. మీకును నాకును గలకాలము సంబంధము విడువదు. ఎంతపెట్టినను పైవారు పైవారే, ముసలితనము వచ్చినది. మీకు విధాయకము. ఏదో పిచ్చికళమీఁదనే వీరి నందఱును దిట్టుచున్నా. ననుకొను

చున్నారు గాని — నిజముగా నాకు మీరు లేకయే పిచ్చియెత్తినది. మీ కొఱకే నాకు మతి పోయినది. రాముఁ డేమన్నాఁడు — "భద్రం తస్య సుమా నుషస్య" అన్నాఁడు-రండు. వివాహబంధము పచ్చాకు బొట్టువలెఁ బరలోకములోఁగూడ విడువదు. నేనెంత చెడినను మీపేరు చెడలేదు. మీపేరుపెట్టియే నన్నుఁ బిల్చుచున్నారు. నాకదియే మీమీఁది ప్రేమకుఁ బ్రబల సాక్ష్యము. ఈ సంకరకాలములో మమ్ముఁగూర్చి సభలు, ఉత్సవములు సమారాధనలు వచ్చినపుడు ధర్మశాస్త్రచర్చ, మాకొఱకు, సంతర్పణవడ్డనలోనికి మావాఁడు పోకున్న వడ్డనసాగదు. ఎందుకు వీరి శ్రీముఖములు. పరాశరమాధవీయములు, "ఉదరనిమిత్తం బహుకృతవేషం" ఇదే మాతప్పు. ఇదే నా పిచ్చి.

ఇతి శ్రీః

---

# నీడబొమ్మలు

కొ. నరసింహాచారి




1. దుప్పి.
2. ఒంటె.
3. పామాయిమేక.
4. లామామేక.
5. బాతు.
6. పంది.
7. తోడేలు.
8. మేక.
9. కుందేలు.
10. ఏనుగు.
11. ఎద్దు.
12. ఎలుగుబంటి.
13. కుక్క.
14. శీతాకోకచిలుక.
15. గాడిద.

---

# ఫోటో

ఏలేశ్వరపు కృష్ణమూర్తి

తెల్లవారి ఫోటో తెలుగువారి ఛాయాచిత్రం ఒక్కటే. మాట భేదంగాని. మనలో దేనికైనా సాహసించి ఒప్పుకునేవారు, ఒప్పుకోనివారు రెండుతెగ లుంటారు. ఇప్పటికీ పూర్వాచారపరాయణులు కొందరు ఫోటో తీయించుకుంటే ఆయుక్షీణం అని గట్టిగా లోపల నమ్ముతారు. ఫోటో తీస్తామంటే పైకి బిగ్గరగా నోనో అంటారు. ఈకాయం కేవలం అశాశ్వతమైనటువంటిదన్నీ, అపవిత్రమైనటువంటిదన్నీ, అట్టిదాని ఛాయని పట్టుకు దేవులాడడం కూడనిపని అని వారి ఆత్మనిగ్రహం. దేహం ఎల్లాగూ శాశ్వతం కాదుగదా, అందుచేతనే ఫోటో అనేది తీసి చిరస్థాయిగా యీ భూమిమీద పారవేస్తే ఎందుకైనా మంచిదని తీయించుకునేవారి పట్టింపు. ఇంతకు ఫోటో అంటే సరే అనేవారు బాగా సింగారించుకుంటేగాని కదిలిరారు. వ్యక్తిముఖమునకు యీమాత్రం నాగరికం అబ్బేసరికి — పల్లెటూరుమాట అటుంచండి — ఫోటో తీయించుకోవడం రానురాను సాంఘిక మర్యాదగా కూడా మారింది! దానితో నిలుచుంటే ఫోటో, కూర్చుంటే ఫోటో అవుతోంది. దీనికితోడు కాస్త గొప్పతనంకూడా వుంటే ఫోటోనిమిత్తం రోజూ గుంజిళ్లుతీయడం ఎక్కువైపోతుంది. ఏకాకిగానైతేనేమి, జోడాగా నైతే నేమి, మిత్ర బృందముతో నైతే నేమి, పెద్ద గుంపుగా గుమిగూడితే నేమి అందరికీ సమానాదరం చూపేదే యీ ఫోటో. అంత మందిని కడుపులో యిముడ్చుకుంటోంది. స్థూలకాయు లున్నా భరించలేనని ఫోటో మొరపెట్టడం లేదు. భూదేవిని పోలింది ఓరిమికి. అందుచేతనే జనం కూడా ఫోటోకి సమానాదరం చూపుతున్నారు. మచ్చుకి మీఫోటో వుందంటే, మీఅంతపొడుగు లేకపోయినా, మీఅంతలావు లేకపోయినా, మీ రూపం దాల్చి సరిగ్గా మీజుట్టుతో — మరీ సన్యాసిరకానికి పిలకజుట్టుకూడా ఎరువులెండి — మీనల్ల కోటుతో, మీ కళ్ల జోడుతో, మీకాళ్ల కిర్రుచెప్పులతో, మీకమలాల జోడుతో అప్పుడప్పుడు మీకే యిల్లా లోకోద్ధారణ నిమిత్తం యిల్లా మరోఅవతారం ఎత్తేశక్తి వుందా అనిపించుతుంది. శ్రీమన్మహావిష్ణుమూర్తి లెక్కకు పదిఅవతారములతో శాంతించాడు కాని మీరు వారికంటె ప్రతిభాశాలు రనిపించుతుంది. కాని పులిమీద పుట్ర అన్నట్టు, మీరు క్షణానికి ఎనిమిది అవతారాలవంతున పంతంమీద ఎత్తినా రూపాయిడబ్బులకు మూరెడుకాగితంమీదకు అవలీలగా లాగివేయగల ప్రవీణు లిప్పుడు అవతరించారు. ఏదో జ్ఞాపకార్థమనీ, విలాసార్థమనీ, కార్యక్రమమనీ, తప్పనిసరియనీ, తద్దినంలాంటి విధియనీ, ముందు ఎవరికివా రనుకున్నా ఫోటోలోపడి కాళ్లుచేతులు విరుచుకోకుండా వారివారి చిలకకొయ్యలకు తీవిగా వ్రేలాడుతున్నారు. తద్దినాలమాట సంశయించినా, వారి తాతముత్తాతలకు యిదే సత్కారము చూపుతున్నారు. ఎంత కుటుంబమున్నా గోడకు నిలవేస్తున్నారు. ఏమాత్రం మందమారుతం వీచినా అట్టే అంతా ఆనందిస్తున్నారు. మరో వింత ఏమి టంటే వారితోపాటు వారి మిత్రులుకూడా చేతు లొగ్గారు. వారు ఎండకెండి, వానకు తడుస్తే వారి మిత్రులుకూడా వారితోపాటే వుంటున్నారు. ఇంత స్నేహభావానికి మూలం ఫోటో. ఫోటోకి మూలం స్నేహభావం. తీసినప్పటినుండి ఫోటో తియ్యబడుతుందని కొందరుప్రాజ్ఞులంటారు. దానికి తగినట్టు ఫోటోను పొట్ట నెట్టుకునేందుకు యేడెవపురుగులో పట్టుబడుతున్నాయి.

మనలో ఒకమూల కాలుచెయ్యి దగ్గరగా పెట్టుకోవడం గిట్టనివా రెందరులేరు ? వారిచిత్రాలు వార్తాపత్రికల్లో కెక్కి దేశసంచారానికి పూనుకుంటున్నాయి. పత్రికల్లో పడేది ఫోటో కాదనకండి. ఫోటో అనే అందం. ఈ చిత్రాల్లో విదేశ గమనం కోసం దేవులాడే చిత్రాలు కొన్ని. ఉన్నతవిద్యాని సత్త

సముద్రాలు దాటి గణించుకువచ్చేవి కొన్ని. ఒకటి రెండురావు పత్రికల్లో! విమానమెక్కి మెడ విరుచుకున్నవారి చిత్రం ఒక్కవైపు. పులుల జంపిన పురాధీశుల ఛాయాచిత్రం ఒక చాయ. ప్రపంచము నుద్ధరించుచున్న ప్రముఖుల ముఖము లొకచోట. వీథిమొగల నిలవేసే రాతిప్రతిమ లొకప్రక్క. పెళ్లాడబోయే పడతుల పటిమ లొకవంక. సుప్రపుసందెముల గాడిదగత్తర యొకతావున. పరీక్షలల్లో పైకి తలలెత్తినవా రొకమూల. పట్టభద్రుల పంతులు పతానీవేష మొకదరి. రాజకార్యధురంధరుల రాకపోకల చిత్ర మొకయెడ. దివానుబహదూరు లొకదిక్కున. ఆత్మత్యాగు లొకతట్టు. ఇల్లా పురోన్ముఖుల సొంపు, పురాభిముఖుల పెంపు, నూతనోద్యోగుల శోభ, గౌరవార్థపు విందు విభవం, సన్మానపత్ర సంపుటముల కళాసౌందర్యం, నూతన భవనముల సొగసు, క్రొత్తవంతెనల విడ్డూర్యం, వూరేగింపుల వుత్కృష్టత, వుత్సవాల వింతనడక అన్నీ కనులపండువుగా చూస్తూంటాం. ఇక కూలిన యిండ్ల చిత్రం, దగ్ధమైన పేటల చిత్రం, మందుసుంకు మూలాన్ని మడిసినవారి చిత్రం, వరదలు తుడుపెట్టిన వూళ్ల చిత్రం, బస్సు డీకొవడం చిత్రం, తదితర ఘోరవిప్లవములచిత్రం ఎంతవద్దని ప్రార్థించినా అప్పుడప్పుడు చూస్తూంటాం. సమితుల సమావేశా లుంటాయి. మహిళామండలి మహాత్మ్యాలుంటాయి. కళోపాసకులు కంటి కగపడతారు. ఇల్లా బ్రతికినవారి చిత్రాలేకాకుండా కీర్తిశేషుల చిత్రాలూ పడతాయి. చూచిన దృశ్యం చూపకుండా చూపునది దినపత్రిక. వారపత్రిక. మాసపత్రిక. తదితరపత్రికలు. మరోవిషయం. ఆహ్వానసందర్భం అంటే నడివీథులలోనో, సాగనంపు సమయమంటే రైలువే ప్లాటుఫారంమీదో, పెళ్లివిషయంఅంటే పందిట్లోనో, నాటకంతంతు అంటే రంగంలోనో, మహాసభ అంటే వేదికమీదనో ఎక్కడో ఒకచోట యింట్లోనో, బయటనో, తోటలోనో, దొడ్లోనో ఫోటో తీయించుకుంటాం. ఇక ఏ సంస్థకైనా రజతోత్సవం సమకూడినప్పుడో, ఏ ప్రముఖుడికైనా వీడ్కోలుపు జరిగేటపుడో, ఏఆటలోనైనా గెలుపొందిన తరుణంలోనో, ఏఎలెక్షనుయుద్ధంలో జయమొందినపుడో, ఏ పట్టప్రదానోత్సవానంతరమో, ఎందుకో ఒకందుకు ఫోటోతీసేసమయానికి ఎవరైనా తటస్థపడ్డారంటే అది వారి తప్పేమాత్రం కాదు. వారి నన పని లేదు. ఫోటోలో వుంది ఆ ప్రభావం. ఆ అత్యంతాకర్షణ శక్తి. కా దంటే యువతీయువకుల ప్రేమకు ఎన్ని ఫోటోలు కారణం కాలేదు. ప్రేమవిషయమెటున్నా పెళ్లివిషయం వారు తలపెట్టినపుడు జన్మనక్షత్రం సాధించి, పంచాంగం తిరగవేసి, సిద్ధాంతిగారి దయకు పాత్రులై గణం నిర్ణయింప పనిలేదు. ఫోటోను బాగా ఎగాదిగాచూస్తే ఆవ్యక్తిది దేవగణమా, మానుషగణమా, రాక్షసగణమా అని వ్యక్తపడుతుంది. ఫోటోలో దైవగణానికి చెందేట్టు నటించే రాక్షసగణా లుంటాయి. కొందరు దేవగణానికి చెందినా, పైకి వచ్చి రాక్షసగణంలా వుంటారు. అందుచేత ఫోటోకి దణ్ణంపెట్టి ముమ్మాటికి నమ్మకున్నవారు రూపంపరిశీలిస్తారు. గణంగుణం అదృష్టవశాత్తు కలుస్తే సంతోషిస్తారు. లేకున్నా సంతోషిస్తామంటారు కొందరు. కాని మానుష రాక్షసములు మృత్యుప్రదమనే నిరూపణ పనిలేదన్నంత మాత్రంతో నట్టేట్లో కలిసిపోతుందా? ఏమో.

దృష్టికలవారికే ఫోటో జ్ఞానదాయకం. ఆనందదాయకం. కొంచెంగా దృష్టి లోపం వున్నవారికి కూడా యిది కొంత సహాయభూతమే. అంధునికి ఫోటో అర్థంలేని ముక్క. ఎందుకంటే చక్షుద్వారేణా బుర్రలోకి చాలావిషయాల్ని చల్లగా ప్రయాసం లేకుండా ఎక్కించేది ఫోటో. మనం ఎంత బాగా చూచినా ప్రపంచంలో మన కంటి కగపడేది కొలదిమాత్రమే. అట్టివో, మనం ప్రత్యక్షంగాచూడని విషయాల్నిగురించి, పరోక్షంగా విదేశాలల్లో జరిగే విషయాల్నిగురించి, మనం చూడలేని వృత్తాంతాల్ని గురించి తెలిపి మన యథార్థానుభవాన్ని పెంపొందించే సాధనాలల్లో ఒకటి యీఫోటో. ఇంతకు ఫోటో తీయడం అంటే ఒడ్డు, పొడుగు, లావు — కొండొకచో కొన్నిటన్నులభారం— కలిగిన మానవులను క్షణంలో సునాయాసంగా అరచెయ్యంత సమక్షేత్రంలోకి జేబు

లో బాగా యిమిడేట్టు చేసుకోవడ మని తాత్పర్యం. ఫోటోలో మనిషిలోవున్న జీవం వుండదు; చేతులాడవు. నోరు పడిపోతుంది. కాళ్లుకదపడం బహుకష్టం. అందు కనే కొందరు ఫోటోతీసి మమ్మల్ని చంపవద్దనడం సమంజసమేమో! కాని ఫోటోలో మిగిలేది మనిషి రూప మనవచ్చును. కళ అట్టే వుంటుంది. దీనిని పెంపొందించేవారు ఫోటోగ్రాఫీ కళ అంటారు. కాదు, విశేషంగా కృషి వుండాలి దీనికి, యిది శాస్త్రం అం టారు మరికొందరు. ఫోటో ఎల్లాను కాలిమీద కాలు వేసుకొని కూర్చున్నంతమాత్రంతో ఆనిర్వహించడం లేదు.

ఫోటో తియ్యాలంటే ముందు ఎదురుగుండా దృశ్యముండాలి. అది మనిషవనీండి. మానవనీండి. ఈ దృశ్యం అనేది వెలుగుంటేనే దృశ్యం అవుతుంది. లేకుంటే అదృశ్యం అవుతుంది. ఈ దృశ్యాలు చేత నములనీ అచేతనములనీ, చలనములనీ అచలనములనీ, స్వాభావికములనీ అస్వాభావికములనీ వుంటాయి. మామూలుగా ప్రకృతిదృశ్యాలు స్వాభావికములు; ప్రత్యక్షములుకూడాను. దృశ్యం దూరంగావున్నమాత్రం తో ఫోటోరాదు. ఏ ఆసామీకైనా ఫోటోతీయాలనే సంకల్పం లేకపోతే ఎన్ని దృశ్యాలున్నా నిరర్థకం. ధనవ్యయం అమితం అని కొందరు వెనుకడుగు వేస్తాం టారు. గనుక లోభికిట తావులేదు. అందుని యిది వరకే వెడలగొట్టితిమి. ముఖ్యంగా తీసేవారికి ఏదో ఒక ఆశయము వుండాలి. ఈకళను పెంపొందించడానికి జీవితం ధారపోయడం ఒక లక్ష్యం. ధనార్జన ఒక లక్ష్యం. ఫోటోతో చరిత్రకు ప్రాణంపోయడం ఒక లక్ష్యం. పత్రికలో పోటీపరీక్షలుంటే పేరు గణించు కోవడం మరొకలక్ష్యం. ఇల్లా లక్ష్యభేదాన్ని బట్టి ఫోటో తీయడంలో మార్పుండకపోదు. వేలుచూపి అదుగో పురాతనదేవాలయ మదుగో అంటే దానిమెడ చరిత్రకారుని దృష్టి వేరు. కళోపాసకుని దృక్పథము వేరు. భక్తుని ఆశయము వేరు. నభోమార్గమున నల్లాడు వైమానికుని లక్ష్యము వేరు. దానితో యింత దేవా లయ ముంటే కళోపాసకుడు కెమెరా నొకప్రక్కకు త్రిప్పును. భక్తుడు వేరొకవంకకు త్రిప్పును. వైమానికు డొకవైపునకు త్రిప్పును. పత్రికావిలేఖరి దొకదిక్కు. ఈవిధముగా దిక్కులేనన్ని దిక్కులకు త్రిప్పి ఎవరికి తోచినట్లు వారు ఫోటోలు తీయుదురు. కాన ముందుగా ఫోటో ఏలక్ష్యంతో తీయబడిందని గుర్తిస్తే ఫోటో విలువ హెచ్చుతుంది—చరిత్రకారునికి చరిత్రాత్మకం గాను, కళోపాసకునికి కళగాను, భక్తాగ్రేసరునికి భక్తి గాను, పత్రికావిలేఖరికి పత్రికగాను!

ఇక, ఎన్నిలక్ష్యాలున్నా, ఎంతవెలుగున్నా, ఎంతమనోహరము లగు దృశ్యములున్నా, ఎంత సంకల్ప మున్నా యంత్రం చేతులో లేకుంటే పని జరుగదు. ఈయంత్రాన్నే కెమెరా అంటారు దొరలు. కెమె రాతోపాటు యితరపరికరములు కూడా అత్యవసరమే. సాధారణంగా ఓఛాయాచిత్రం అమరాలంటే తీసేవారు, తీయించుకొనేవారు, బాగా పనిచేసేయంత్రం, తగిన కాంతి వుండాలి. కాదంటే ఎంతకళగల ముఖమైనా కాగితంమీదకి ఎక్కదు. ఓరూపానికి ప్రతిరూపం తయారుకాదు. ఫోటోతీయడంలో చలనచిత్రాలనీ, కాంపొజిట్ ఫోటోగ్రాఫీ యనీ, కారికేచరింగ్ ఫోటో గ్రాఫీ యనీ, ట్రిక్ ఫోటోగ్రాఫీయనీ, రంగుల ఫోటో గ్రాఫీయని, రకరకాలగా యంత్రాలు అమరుస్తారు. సాధారణంగా ఫోటోకి అన్నీ అమర్చడం, ఛాయని తీయడం, వుత్పత్తి చేయడం, అచ్చొత్తడం, కడగడం, చిత్రాన్ని స్ఫుటపరచడం, కడకు చట్టం కట్టడం జరిగే పనులు. జరగవలసినపనులు. అటుపైన చిలకకొయ్యకు వెయ్యడం మీ యిష్టం.

ఈ ఫోటో అనేది నేర-పరిశోధకులకు అత్యం తోపకారి. యథార్థవాది. వాస్తవమును కనుగొనుటకు సహకారి. పరిశోధకునికి ఎప్పుడు నేరము నాకట్టుటే పని. నేరస్థుని నిర్ణయించుట నీతి. నేరము జరిగిన సం దర్భముల గ్రహించుట ధర్మము. నేరపు వివరముల న్యాయస్థానముల కెఱుకపరుచుట విధి. నేరగానిని న్యాయాధిపతిముందు నిలబెట్టుట యతని బాధ్యత. ఉన్నది వున్నట్టుగా, ఏవిషయము మరుగుపరచకుండా,

దిగమ్రింగకుండా, మార్చకుండా, సృష్టించకుండా, కోర్టువారికి తెలుపుట వాని కర్తవ్యము. ఏలననగా నేర పరిశోధకుడు చెప్పువిషయముల నెంపరో న్యాయాన్వేషణకై గ్రహింపవలసియున్నది. పబ్లిక్ ప్రాసిక్యూటరు నేరమును నిరూపించి నిందమోపవలసియున్నది. డిఫెన్సువకీలు ముద్దాయిని వెనుకేసుకొని రావలసియున్నది. జూరీ అప్పుడప్పుడు కునికిపాట్లుపడినా తుద కీవిషయంలో గిల్టీ, నాటుగిల్టీ అనే రెండు ముక్కల్లో ఒకటి చిత్తానుసారం ఏరుకోవలసియున్నది. ఎసెసరులు జరిగిన దంతా నవల అనే భ్రమను పోగొట్టుకోవలసియున్నది. నేరము విషయం విచారణచేసి శిక్ష వేయడం న్యాయమూర్తి పని యైయున్నది. అట్టిచో, ఎరుగనివన్నీ ఎరిగినట్టు, తెలియని వన్నీ తెలిసినట్టు, నేరాన్నిగురించి గుర్తించనివన్నీ గుర్తించినట్టు, చూడని వన్నీ చూచినట్టు అంతా భావించుకోవలసిన విషమ సందర్భంలో సత్యమును తెలుపవలసినది పరిశోధకుడే. పరిశోధకునికిమాత్రము నిజము పరీక్షగా తెలియునా? మనలో ఎంతటివారికి మాట తడబడుచుండును గదా. అట్లే పరిశోధకుడును. మనదేశమున రక్షణ శాఖాధికారులే నేర-పరిశీలనకు పూనినపుడు వారి బాధ్యత రెట్టింపైనది. వారు నిజమాడిననే ప్రభువు మెచ్చును. ప్రజ మెచ్చును. న్యాయాన్వేషణకుగాను కంకణము కట్టుకొన్న కోర్టువారికి నేరపరిశీలనలప్పుడు తీసిన ఫోటోల నిచ్చుటతో పరిశోధకుని మాటల కెక్కుడు ప్రమాణ మేర్పడును. రక్షణశాఖలో ఒక్కొక్కరికి ఫోటోగ్రాఫీ తెలిసియుండుట శ్రేయస్కరమనుట సత్యము. నిజమాడుటే నీతిపథము.

పరిశోధకుడు ఏమెక్కించాలి ఫోటోలోకి అనే విషయం చూద్దాం. ఒకరు చచ్చిపడిన స్థలం, దొమ్మి జరిగినస్థలం, హత్యలు జరిగినస్థలం, ప్రసవానంతరం పిల్లలపారవేసిన స్థలం, ఆకస్మికంగా రోడ్డుమీద జరిగే విపత్తులు, రైళ్లుఢీకోవడం, పేలిన యింజను బోయిలర్లు, కూలినవంతెనలంటే, పడినపాక లంటే, కన్నపుచోరీ జరిగిన చోటంటే, బందిపోటు జరిగిన బంగళాలంటే, తప్పుడునాణాలు తయారయే స్థలమంటే, పట్టింపులు వచ్చిన పంటకాలువలంటే ఫోటోతీయాలి. అంటే పరిశోధకుడు ఎప్పుడు వంతెనలుకూలుతాయా, ఎక్కడ రైళ్లు ఢీకుంటాయా, ఎప్పుడు ఫోటోతీయనా అని నష్టజాతకం గుణిస్తూ కూర్చోవాలని కాదు. యుక్తాయుక్తములను యోచించి నేరము జరగిన తావున వీలైనన్ని ఫోటోలు తీయాలి. చెరిగిపోయే అడుగు లంటే, వేలిముద్రలంటే, రక్తపుమరకలంటే వున్నప్పుడు జాగ్రత్తగా వాటికి స్ఫుటమైన చిత్రాలు తీయాలి. గాయపుమచ్చలు, పుండుమచ్చలు, మొటిమలు, పులిపిరికాయలు, కాల్పుడు మచ్చలు, అమ్మవారుమచ్చలు ఫోటోలో బాగా కనబడుతాయి. గాయాలకు ముఖ్యంగా ఫోటో తీయాలి; ఎందుకంటే ఆ మనిషి కర్మం చాలక గుటుక్కుమన్నా గాయం ఎల్లాటిదో, ఏ ఆయుధంతో పడిందో గుర్తించేందుకు వీలుంటుంది. గోడల్ని భూమిని పరీక్షించవలసినపుడు వాటిని సూక్ష్మదర్శని యంత్రంలో పెట్టి చూడడం అసంభవం కనుక వాటికి ఫోటో తీయడం వుత్తమం. సూక్ష్మదర్శనిలో కనబడే వాటికి ఫోటో తీయడం మొదట ప్రారంభించింది డాక్టరు జెసెరిక్. ఈక్రొత్తపద్ధతిలో శాస్త్రజ్ఞులు వారిసాక్ష్యములను బాగా బలపరుచుకుంటూ వచ్చారు. దస్తూరీవిషయాల్లో యీపద్ధతి లాభకర మనిపించింది. దస్తూరీలకి ఫోటో తీసి తారతమ్యం కనిపెట్టింది మొదట పారిసులో జెసెరుకు. బెర్లినులో గోబెర్టు. వియన్నాలో ఈడరు. తుడుపులు, గీట్లు, దిద్దులు, వంపులు, చెరుపులు, సవరణలు, బాగా బయటపడినవి. వ్రాతల్లో తేడాలు, పోలికలు, మెలికలు, సందేహాలు, నానుపుళ్లు ఫోటోతీసి కనుక్కుంటున్నారు. ఫోటోలో రంగులు బాగాపడవు. ఎరుపురంగుచీర ధరిస్తే ఒత్తుగా నల్లగా పడుతుంది. నీలిరంగుది ధరిస్తే తెల్లతెల్లగా పడుతుంది. ఈమోసాన్ని ముందాలోచించి మరీ ఫోటోలోకి దిగండి!

తలచే తలంపులు ఫోటో సరిగ్గా లాక్కోగలదా అంటే సుప్రసిద్ధనటకులు ఓయంటారు. సినీమాలకు ఫోటోగ్రాఫీయేగా వన్నె తెచ్చిపెట్టింది.

ఫోటో తీయడంతో పరిశోధకుని పని సరికాదు, ఫోటో తీసిన తేది, స్థలం, సమయం, గంటలు, ఆనాటి శీతోష్ణస్థితి, వెలుగు, దృశ్యమున్న దిక్కు—లేకుంటే దిక్కు లేని ఫోటోలు తయారవుతాయి—ఛాయాప్రదర్శనకాలం, కెమెరా వివరం, యంత్రానికున్న అద్దపు బిళ్ల సత్తా, చిత్రానికి దృశ్యానికి గల వృద్ధిహారణదోషం వివరం పూర్ణంగా వ్రాసుకోవాలి. ఫోటోలను పరిశోధకుడు దిద్దిసరిచేయడం (re-touch) గొప్ప దురభ్యాసం. తెల్లవారుతే రాజబాట చాలారస్తాగా వుంటుందని తోచినపుడు, నేరం రాత్రిపూట నడివీధులో జరిగినపుడు నేరస్థానాన్ని సూర్యోదయాత్పూర్వమే మెగ్‌నీషియం లైటు వెలిగించి ఫోటో తీయడం విదేశములలో పరిపాటి. ఆఫోటోను ఎవరు చూచినా తిరిగి రంగస్థలాన్ని కంటో కన్నెట్టుకు కలియజూచినట్టుంటుంది. సత్యాన్వేషణ కీపాట్లు డిటెక్టివు పడవలెను.

మనిషిని గుర్తించేందుకు ఫోటో సులభోపాయం చూపింది. పోలికపట్టేందుకు ముఖాముఖిగా ఎదురుగా తీసినచిత్రాలు మెలుగు. పార్శ్వముఖ ఛాయాచిత్రాలు మంచివే. ఎవరినైనా వెనుకపాటున పోల్చడం కష్టం; కాని ముఖముచూచి సులువుగా పోల్చుకోవచ్చును. ఈ విషయము జ్ఞాపకమం దుంచుకొని జుట్టు, కట్టు, బొట్టు, కళ్లు, ముక్కు, చెవులు బాగాచూచి మనిషికి మనిషికి గలభేదం పరిశోధకుడు గ్రహించాలి. మనిషిని ఎన్ని సార్లుచూస్తే గుర్తించగల మనునది గొప్పచిక్కుప్రశ్న. దీర్ఘంగా ఆలోచిస్తే గుర్తించుకోడానికి ముఖ్యంగా వెలుతురుండాలనీ, దృష్టిలోపం లేకుండా వుండాలనీ, వేడి, గాలి, వాన, సూర్యరశ్మి, పొగ, మంచు, మన్ను లాటివి దృష్టినడ్డకుండా వుండాలనీ తేలుతుంది. అన్నీ సవ్యంగా వుంటే, పట్టపగలు తెలిసినవారిని ౫౦-౯౦ గజాల దూరాన్ని కనుక్కోవచ్చును. మనకు తెలిసిన వారికి ఆనమాళ్లుంటే ౧౧౦-౧౬౫ గజాల దూరాన్ని పోల్చవచ్చును. ఇకబాగా తెలియనివారిని ౨౭-౩౩ గజాలదూరాన్ని ఆనమాలు పడతాము. ఒకేసారి చూచినవారిని ౧౬ గజాలదూరాన్ని పట్టుకుంటాం అని శాస్త్రజ్ఞులు సెలవిచ్చారు. అటుపైన నిండు పౌర్ణమి నాడని, శూన్య అమావాస్యనాడని, కటిక ఏకాదశి నాడని, యితరులను గుర్తించుకోవడం ఎవరికి వారు చేయవలసిన పని.

తుద కొకముక్క. పారిసుపట్నంలో ౧౮౭౧ లో వుత్తరాలను పావురములద్వారా దూరదేశములకు పంపుతూవచ్చారు. ఇదే పీజియను పోష్టు. ఉత్తరము నకు సరియగు ఫోటో ప్రతి negative; తీసి దానిని పావురముల తోకలకంటించి తోలివేసేవారు. ఆకపోతములు గమ్యస్థానము చేరగానే హితులు లేఖను సరిజేసి కొని వర్తమానమును గ్రహించుచువచ్చారు. మనదేశమునకు సందేశములు క్రొత్తకాదు. ఏలనందురా—

కృప నెటకేంపరనే కీరోత్తముకులార
వజ్రపురికి బోవు వారె మీరు?

అని ప్రద్యుమ్నుడు ప్రశ్నలువేసి, శుక మభ్రమార్గంగా పోతూంటే చూచి—

ఓపక్షివర విను మాపురి శుచిముఖి
యనుపేరి యొకరాజహంసి యుండు
నది యున్నచోటు నీ వరసి యీపత్రిక
యందింపవలయు మత్ప్రార్థనమున.

వార్తాహరణ యోగ్యాయోగ్య వివేకము లేక యుండెనుగా. ఈపత్రిక ప్రేమజాబు. గాననే

పక్షి పేరవ్రాసే పత్రిక యనిపెడు
నట్టివాడు భ్రాంతు డనుట ధ్రువము.

అని కవివ్రాశాడు. కాని యీపత్రిక ఫోటోప్రతి అని ఏమాత్రం తెలిసినా మనం పారిసుకంటె యీ పద్ధతిని ముందు సాధించామని గర్వపడవచ్చును. అప్పటి పరిస్థితి లెటులున్నా మనది ఫోటోయుగం. నేర-పరిశోధనలకు విదేశములలో పునర్జీవ మిచ్చినది ఫోటోగ్రాఫీ. మనదేశములో పాలకులకు పాలితులకు దీనియెడ నిరసన. ఏలనో?

---



హేమకూటపర్వతము, దానిపైగల జైనదేవాలయములు

హంపిశిథిలములు M. K. R.

## శారదలేఖలు—కనుపర్తి వరలక్ష్మమ్మగారు

మొక్కపాటి నరసింహశాస్త్రి

కొన్ని సంవత్సరముల క్రితము, మొదటిసారి నేను శ్రీమతి వరలక్ష్మమ్మగారి కథ చదవడము సంభవించినప్పుడు — ఆకథ పేరిప్పుడు జ్ఞాపకములేదు — ఇది నిజంగా స్త్రీ వ్రాసినదేనా; లేక, ఇప్పుడు చాలామంది చేస్తున్నట్లుగానే ఏపురుషుడో వ్రాసి తన భార్యనో; సోదరినో, స్నేహితురాలినో advertise చెయ్యడానికి ఆడపేరు పెట్టి పత్రికకు పంపినాడా అనేసందేహము కలిగినది. ఏమంటే మగవారిలో పెద్ద పేరుగల కథకుల వ్రాత కేమాత్రమును తీసిపోలేదు సరిగదా ఆకథ, కొన్ని విషయాల్లో అంతకంటె చాలా బాగుందికూడాను. కాని అంత బాగా వ్రాయగలిగిన మగవాడెప్పుడూ తనపేరు మరుగుచేసుకొని స్త్రీపేరు పెట్టడని వెంటనే నిశ్చయించుకున్నాను. ఆతరువాత ఈమె పేరుతో ఏకథకనుపించినా శ్రద్ధగా చదవడము ప్రారంభించాను. వాటి అన్నిటిలోనూ స్త్రీ హృదయం చక్కగా వ్యక్తమవుతూ ఉండేది. స్త్రీకిమాత్రము సాధ్యమైన అనేకకళలు, మెరుగులు (Touches and Finishes) కనుపించినవి. తప్పకుండా ఇవన్నీ ఆవిడ వ్రాసినవేనని నిశ్చయించుకున్నాను. ఒక్కమారైనా, మనస్సులో అటువంటి సందేహమునకు తావిచ్చినందుకు శ్రీమతి వరలక్ష్మమ్మగారిని క్షమించమని వేడుకుంటున్నాను.

నేడు ఆమెచే అప్పుడప్పుడు గృహలక్ష్మిలో వ్రాయబడిన శారదలేఖల సంపుటము చదవగలిగాను. ఆమెదర్శనభాగ్యము నాకెప్పుడూ లభించలేదు. అది నాజన్మకొక కొరంతగా భావిస్తున్నాను. అనేకమంది కవయిత్రులను, వేదాంతినులను, ఉపన్యాసకురాండ్రను చూడడము, వారి రచనలను చదవడము, వారి ఉపన్యాసములను వినడమూ సంభవించింది. కాని వారెవ్వరునూ నా ఆదర్శమున కందలేదు. వారిలో రెండే రకాలు. అటు కేవలము వెర్రి సనాతనమో, లేక కేవలము పాశ్చాత్యానుకరణవ్యామోహములో పడ్డ అధునాతనమో. మధ్యరకం లేదు.

శ్రీమతి వరలక్ష్మమ్మగారి శారదలేఖలు చదివినపిమ్మట, ప్రస్తుత మాంధ్రదేశమునకే కాక అఖిలభారత దేశమున కాదర్శకురాలుగా ఉండవలసిన దీమె యని తోచింది.

అనుకరణమనేది మనకు నేడు వచ్చింది కాని ఇదివర కెన్నడూ ఎరుగము మనం. యుగయుగాలనుంచీ అనేక రాజ్యాలూ, నాగరికతలూ, సంప్రదాయాలూ మనదేశానికి వచ్చిపోతూఉండేవి. ఎప్పుడు ఏదివచ్చినా, మనదేశపు పద్ధతి ఏమిటంటే కొత్త ఏదేనా వస్తే, ఇప్పటివలె కళ్లుమూసుకుని దాన్ని అనుకరించకుండా అందులో ఉండే మంచిని గ్రహించి, తన నాగరకతాపద్ధతులతో మేళ

వింపచేసి మెరుగుపెట్టడమే. ఆంగ్లేయులు వచ్చినపిమ్మటమాత్రము ఆపద్ధతి పోయి, మన స్వస్వరూపము మరచిపోయి, ఐనదానికీ కాని దానికీ ఆభరణములు తీసివేయడము మొదలు డైవోర్సువరకు అన్నిటిలోనూ వారిని అనుకరించడ మౌతోంది. వరలక్ష్మమ్మగారు భారతీయసంప్రదాయము ననుసరించినది కాని, ఆధునికానుకరణపద్ధతి నవలంబించలేదు.

శ్రీమతి వరలక్ష్మమ్మగారు, పూర్వాచారపరాయణు లైన బ్రాహ్మణ కుటుంబములో జన్మించినది. ఆధునికపద్ధతులను కొంత చదువుకున్నది. కాని మామూలు కంటె ఎక్కువగా సంస్కృతాంధ్రాంగ్లముల యందు పాండిత్యము సంపాదించినది. పూర్వాచారమంతా పూర్తిగా నశిస్తేనేగాని దేశం బాగుపడ దనే బ్రాహ్మసామాజికులు పాలపర్తిసోదరులకు తోబుట్టువు. జన్మజన్మముల నుంచీ వస్తున్న హిందూధర్మ మాచరణీయమా, లేక తన సోదరు లహర్నిశాదు లుపదేశిస్తున్న సంస్కార మాచరణీయమా అనేవిషయము ఎన్నిసంవత్సరము లీమెమనస్సును క్షోభపెట్టిఉంటుందో ఊహించవలసినదేకాని చెప్ప నలవికాదు. తుదకు భారతధర్మమే పరమోత్కృష్ట మని నిశ్చయించుకున్న మహనీయురాలు. ఇక విదేశముల నుండి ఏసంస్కారము వచ్చినా, హిందూ ధర్మమనే గీటురాయిమీద గీసి పరీక్షించి, మంచిదయితే గ్రహించడమూ, లేకపోతే త్రోసివెయ్యడమూను. ఉత్తమోత్తమ మైన పద్ధతి అవలంబించింది మహానుభావురాలు. సనాతనమూ అధునాతనమూ అని అంధకారంలో దారితెలియక అల్లాడే సమయములో శారదలేఖలు వ్రాసి దారిచూపించింది.

పూర్వస్త్రీలవలె కేవలం పురాణాలు పుచ్చుకు కూర్చోకుండా, ఆధునికస్త్రీలవలె మీటింగులు, కాన్ఫరెన్సులు, కమిటీలు, Matern ty centres, Childwelfare centres తో కాలయాపన చెయ్యకుండా స్త్రీల కవసరమైన ప్రతివిషయాన్నిగురించి, సంకురాత్రిముగ్గులు, శారదాచట్టం స్త్రీలు నాటకాలలో వేషా లెయ్యొచ్చునా కూడదా, డైవోర్సుబిల్లు, తీర్థయాత్రలవల్ల లాభం, ప్రకృతిసౌందర్యం, బంగారంరవాణా, ఒకటేమిటి అన్నివిషయాలూ బహుశ్రద్ధగా యోచించి, స్వతంత్రాభిప్రాయాలను నిర్భయంగా పాఠకులకు నచ్చేటట్లుగ వెలిబుచ్చినది శారదలేఖలలో. ఏసంస్కార మభిలషించినా హిందూధర్మమనే పునాది మరిచిపోకుండా, ఈమహనీయురాలివలెనే మన ఆంధ్రవనితలు తమ జీవితములను దిద్దుకుంటే, పూర్వపు ఔన్నత్యమునూ, ఖ్యాతినీ సంపాదించుకోగలరని నావిశ్వాసము.

తెలుగులో ఈమాదిరి పుస్తకా లిదివరకు లేవు. శ్రీమతి వరలక్ష్మమ్మగా రింకా ఇటువంటి పుస్తకా లనేకములు వ్రాసి తమ సోదరసోదరీమణుల అజ్ఞానాంధతమస్సులను దిగంతములకు పారదోలెదరని నమ్ముతాను.

పరమేశ్వరుడు వీరి కాయురారోగ్యైశ్వర్యములు ప్రసాదించుగాక!

# వరదగోదావరి

అడివి బాపిరాజు

ఉప్పొంగిపోయింది గోదావరీ
తాను
తెప్పున్న ఎగిసింది గోదావరీ
ఉప్పొంగి...

వడులలో సుళ్లలో గర్వాన వళ్లతో
పరవళ్లుతొక్కుతూ ప్రవహిస్తు వచ్చింది
ఉప్పొంగి...
కిన్నెర్ల మీటించి శంఖాలు పూరించి,




కొండల్లో ఉరికింది కోనల్లు నిండింది
ఆకాశగంగతో హస్తాలు కలిపింది
ఉప్పొంగి...

అడవివృక్షాలన్ని జడలలో తురిమింది,
ఊళ్లు దండలగుచ్చి మెళ్లోన తాల్చింది
ఉప్పొంగి...

శంకరాభరణరాగాలాపకంఠమై
ఉప్పొంగి...
నరమానవునిపనులు శిరమొగ్గి వణికాయి,
కరమెత్తి దీవించి కడలికే నడిచింది,
ఉప్పొంగిపోయింది గోదావరీ,
తాను
తెప్పున్న ఎగిసింది గోదావరీ.




‘కన్నా, ఏమిటిచేస్తున్నావ్’

# బొబ్బిలియుద్ధనాటకము*

బులుసు వేంకటరమణయ్య

కావ్యమునకుఁ బరమప్రయోజనము రసానందము. రసస్ఫూర్తికి శ్రవ్యకావ్యములకంటె దృశ్యకావ్యములే అనుకూలద్వారములు. సులలితరీతిని శీఘ్రముగ రసీభావమును కలిగించుట దృశ్యకావ్యముల విశేషగుణము. కాళిదాసాదిమహాకవుల కీర్తి సుప్రతిష్ఠితమగుటకు వారు రచించిన కావ్యములు కాక నాటకములే మూలకారణములు. కావ్యతత్త్వమును గుఱుతెఱుఁగుటకు నికషోపలమగు నలంకారశాస్త్రవాఙ్మయమున నాటకమునకుఁ గల ప్రాధాన్యము కావ్యములకు లేదు. ఆశాస్త్రమున నాటకలక్షణమే అగ్రపీఠము నలంకరించినది.

తెలుఁగున ఆపద్ధతి తారుమారయినది. ప్రబంధములకును, అందును పద్యకావ్యములకును గలగౌరవము నాటకములకు లేకపోయినది. ఇంచుమించుగ ఇరువదవశతాబ్దారంభము వఱకు—ఆంగ్లవాఙ్మయవాసన ఆంధ్రులను పూర్తిగ అంటుకొనవంతవఱకు—తెలుఁగు నాటకము కన్నుతెఱువలేకపోయినది. వెనుకటివారు కొందఱు సంస్కృతనాటకములను పరివర్తింపఁబూనినను, పద్యకావ్యరూపమునవే తెనిఁగించిరి. నాటకరూపపరివర్తనము వారికి కిట్టకపోయినది. అందులకు కారణము మృగ్యము.

ఆంధ్రనాటకయుగమునకు భాషాంతరీకరణమే ప్రథమపాదము. వెలువడిన నాటకములలోను, వెలువడుచున్న నాటకములలోను పరివర్తనములే ప్రచురములు; స్వతంత్రములు అల్పములు. అందు దేశచరిత్రమును—ఆంధ్రదేశచరిత్రమును సంబంధించినవి బొత్తిగ తక్కువ.

గతించినకథలను కన్నులకుఁ గట్టించుటలో స్వతంత్రనాటకములకుఁ గల నైపుణ్యము భాషాంతరీకృతులకు లేదు. అందును సహృదయుని అమూల్యభావముల కుత్తేజము కలిగించి—ఆతనిహృదయము నుప్పొంగించి, ఉత్సాహోద్రేకములను కలిగించుటకు దేశచరిత్రనాటకములదే పెట్టినపేరు.

ప్రదర్శనోద్దిష్టమగు నాటకము ఏకముఖముగ రసావిర్భూతిఁ గలిగించుటకుఁ గల ముఖ్యసాధనములు నాలుగు—జనరంజకమగు కథావస్తువు, కవితాశిల్పము, సుశిక్షితులగునటులు, సహృదయులగుప్రేక్షకులును. ఇందేదికొఱవడినను నాటకము రక్తికట్టదు. నాటకము రక్తికట్టుటలో సగముబరువు కవిది.

---

* గ్రంథకర్త: మహోపాధ్యాయ కళాప్రపూర్ణ వేదము వేంకటరాయశాస్త్రిగారు; డెమ్మీ ౧౦౮ పుటలు. వెల రు. ౧. ప్రకాశకులు: వేదము వేంకటరాయశాస్త్రి అండ్ బ్రదర్సు, ౪. మల్లికేశ్వరగుడివీథి, మన్నడి, మదరాసు.

అతని కవితాశిల్పము సౌందర్యమును కోలు పోయినను, అతఁడు రచనకుఁ దీసికొనిన యితివృత్తము జనాకర్షకము కాకున్నను, అట్టినాటకరచన నిష్ప్రయోజనము.

రసానుగుణముగను, పాత్రానుగుణము గను ఇతివృత్తమును మార్చి, పాత్రోచితమగు భావను గూర్చి తన కవితాశిల్పమునకు మెఱుఁగుకూర్చుకొనునధికారము కవికి సహజముగఁ గలదు. కావుననే అతఁడు నిరంకుశుఁ డయినాఁడు. తనకుఁగల అధి కారగౌరవములను గుఱుతెఱుఁగక తల్లడిల్లు కవికి కవితాకళోపాసనార్హత పూజ్యమే.

కాళిదాసాదులు తమకుఁగల యధికార మును గుర్తించినారు; ఇతివృత్తమును ఇతి హాసమార్గమునుండి మరల్చినారు; పాత్రాను గుణముగ వాడుకభాషను వాడినారు; కళ లను పరిపోషించినారు; కవిలోకమున గణ నీయులు తామేయని ఘంటానాద మొనర్చి నారు. కాని తెలుఁగువారి దృష్టియే వేఱ యినది. నాటకరచనాప్రారంభకాలమున వెలువడిన తెలుఁగునాటకములందలి పాత్ర ము లన్నింటికిని ఔచిత్యవిదూరముగ గ్రాం థికభాషయే యుపయోగింపఁబడుచుండెడిది. రచన పద్యప్రచుర మయినది. వచనముకూడ శబ్దాలంకారభూయిష్ఠమై ప్రబంధమార్గమున నే పరుగిడుచుండెడిది.

పైవిషయములను గమనించుచు పద్య ములను, పాత్రములను, కథను సంగ్రహించి ప్రదర్శనానుకూలముగ వ్రాయఁబడు నాట కము సహృదయహృదయంగమ మగును.

ఆంధ్రనాటకయుగప్రవర్తకు లెవరయి నను యథార్థమగు నాటకరచనకు కడంగి నాటకకళ నుద్ధరించినట్టివారిలో ప్రథ ములు శ్రీవేదము వేంకటరాయశాస్త్రిగారు. ప్రాచీనపద్ధతిని వెలయు వీరి భాషాంతరీకరణ ములును, నూతనపద్ధతిని వెలయు స్వతంత్ర నాటకములును తెలుఁగువాఙ్మయమునకు అమూల్యాలంకారములు. నాటకరచనమున గమనింపవలసిన యంశములను గమనించి రచించువారిలో శ్రీ శాస్త్రిలుగారిది మేలు చేయి. కావుననే వీరి "ప్రతాపరుద్రీయనాట కము", "బొబ్బిలి యుద్ధనాటకము" వెలు వడిన యచిరకాలముననే ఆంధ్రావనినంతట వ్యాపించి మేటికీరితి గడించుకొనినవి; గడించు కొనుచున్నవి. ఈ చరిత్రనాటకద్వయము ననుసరించి వెలువడిన అనుకరణములు—నవ లలు, నాటకములు—అసంఖ్యాకములు.

"బొబ్బిలియుద్ధనాటకము" దశాంకపరి మితము; వీరరసప్రధానకము. దీనికి ఆకర ములు రెండు సులభములు: పెద్దాడమల్లేశ కవిపాటయు, రంగరాట్చరిత్రమును. తదా ధారమున, నాయక – రసాద్యనుగుణముగ చరిత్రమునకు సంబంధింపని కొన్నిమార్పుల నొనరించి శ్రీశాస్త్రిలుగా రీనాటకమును వెలువఱచినారు.

ఇందలి నాయకుఁడు రంగారాయుఁడు. ప్రతినాయకుఁడు విజయరామరాజు. తదనుగుణముగ నిందు నాయకుని — తత్పక్షమువారి పరాక్రమమును, ప్రతినాయకుని పిరికితనమును వర్ణింపఁబడినవి. ఆ కారణముగ — హఠాత్తుగ ఫ్రెంచిసేనయు, తురుష్కసైన్యమును, విజయనగరవాహినియు లెక్కలేని యుద్ధోపకరణములతో తమ్మెదిరింపవచ్చినపుడు — మానప్రాణులై శత్రువులను శరణుఁజొరక తమ యల్పసైన్యముతోను, ప్రజలతోను ఎదిరించి వైరుల ఫిరంగిగుండుదెబ్బలకు గుండెనిచ్చి వీరస్వర్గము నలంకరించినవారు బొబ్బిలివారు. కావున వారు మహావీరులుగ వర్ణింపఁబడినారు. స్వయముగ బొబ్బిలివారి నెదిరింప సాహసములేక బూసీ, హైదరుజంగుల తోడ్పాటు కోరిన విజయరామరాజు పిరికిపందగ వర్ణింపఁబడినాఁడు. ఇది రసాద్యనుగుణముగఁ జేయఁబడినమార్పు. కాని బొబ్బిలివారందఱు ఇందు వర్ణింపఁబడినంత వీరులు కారు; విజయరామమహారా జిందువర్ణింపఁబడినంత పిరికిపందయును కాఁడు. ఇది చరిత్ర తెలుపు యథార్థవిషయము.

కథావస్తువునందువలె పాత్రోచితమగు భాష నుపయోగించుటయందుఁ గూడ ఇం దాచితి పరిగణింపఁబడినది. ఫ్రెంచిసేనానాయకుఁడగు బూసీదొర తెలుఁగు తెలియనివాఁడు కావున అతనిసంభాషణమున గ్రాంథికభాష యుపయోగింపఁబడినది. అతని దివాను హైదరుజంగు తురక తెలుఁగుమాటలాడుటయు ఉచితము. కాని గోలకొండ రాయబారియగు "హసేనాలి" తురకతెలుఁగును విడిచి గ్రాంథికాంధ్రమును వ్యవహరించుట కొంతవిచిత్రముగఁ దోఁచును. కాని "హసేనాలి" బొబ్బిలివారిఁగూర్చి సదభిప్రాయము కలవాఁడగుట నుత్తమపాత్రమగును. అపు డుత్తమపాత్రల కుపయోగింపఁబడు గ్రాంథికభాష నాతఁడు వ్యవహరించుట విరుద్ధముకాదు.

శ్రీశాస్త్రులుగారి స్వతంత్రనాటకముల లోని యితివృత్తము విపులమై ప్రదర్శనమున కందుబాటులో నుండదనియు, పాత్రప్రవేశ మెక్కువయనియు కొందఱు తలఁపవచ్చును. ప్రదర్శనమున కనుకూలింపని నాటకములు చిన్నవయినను, అందు పాత్రప్రవేశము తక్కువయినను ప్రయోజనము మృగ్యము. ప్రదర్శనానుకూలములగు నాటకములు ఎంతవిపులముగనున్నను, అం దెన్నిపాత్రము లున్నను హానిలేదు. నాటకమును సంపూర్ణముగఁ బ్రదర్శింప నసమర్థులగునటులు తమ యిచ్చకు వచ్చినట్లు కొన్నిరంగములను ప్రదర్శించుటను మానవచ్చును. అట్లువిడుచుట కనువుగనే శ్రీ శాస్త్రులుగారి నాటకములు రచింపఁబడినవి. ప్రదర్శనాసాధ్యమగు విషయము లందు మృగ్యములు.

శ్రీ శాస్త్రులుగారిపద్యములు చాలవఱకు నారికేళపాకము కలిగి నాటకానుగుణముగ నుండునని కొందఱి తలంపు. ఈనాటకమునఁగల పద్యములు ద్రాక్షాపాకముననే పడినవి.

శ్రీ వేంకటరాయశాస్త్రిలుగారు మహోపాధ్యాయులు; కళాప్రపూర్ణులు; సర్వతంత్రస్వతంత్రులు; విద్వద్వతంసులు; విశేషించి కవిశిరోమణులు. అట్టివారిని గూర్చి విశేషించి వ్రాయుట దివిటీతో దినకరుని చూపుటయగును.

"బొబ్బిలి యుద్ధనాటకము" ప్రథమ ముద్రణము ౧౯౧౬ సం. న జరిగినది. శ్రీ శాస్త్రిలుగారు "దీనిని పలుమార్లు తమ" శిష్యులచే "ప్రదర్శింపించుచు, ఆయాప్రదర్శనకాలములయందు తమ చిత్తమునకు రసము అందునట్లుగా మరలమరల అచట నచట మార్చుచు, తుదకు ఇపుడు గ్రంథము ముద్రితమైయుండుఉత్కృష్టస్వరూపమునకుఁ దెచ్చి పునర్ముద్రణోచితంబుఁ గావించి యుండిరి. ఆయాసవరణలనెల్ల" వారు "కావించినరీతినే" "కావించి" శ్రీ శాస్త్రిలుగారి మనుమలు, శ్రీ వేంకటరాయన్‌గారు ఈ రెండవముద్రణమును 'నెలవేర్చినా'రు. వారిటులనే యింకను శ్రీ శాస్త్రిలుగారి మిగిలినగ్రంథములనన్నింటిని నిరంతరము ముద్రింపించి, ప్రకటించుచు అమూల్యమగు ఆంధ్ర వాఙ్మయసేవ నొనర్చుచుందురు గాక!

---



స్నానము — కె. గోపాల్.

# విష్ణుకుండి వంశము

భావరాజు వేంకటకృష్ణరావు

(అనువృత్తము)

౫. ఇంద్రభట్టారకవర్మ (శేషము): ఇంద్రభట్టారకునికిని వాకాటకులకును, కళింగాంగాదిరాజ వంశములకును నడుమ ఎడతెగని వైరానలము వర్ధిల్లుచుండినట్లు తోచుచున్నది. పూర్వముండిన వాకాటకులతోడి నెయ్యము వియ్యముకూడ నింద్రభట్టారకుని కాలమున అడుగంటెను. వాకాటకసింహపీఠముపై నధిష్ఠించిన హరిసేనుడు ఇంద్రభట్టారకునికి విరోధి యైనట్లూహించుటకు అవకాశములు గలవు. డూబ్రియలు, పండితుడు,[౧] జాయసప్వాలుగారు[౨] లు నిర్ణయించిన రీతిగా హరిసేనుని రాజ్యకాలము క్రీ. శ. ౪౯౦ మొదలుకొని ౫౨౦ సంవత్సరములు నడుమ నని అంగీకరింపవచ్చును. హరిసేనుడు దేవసేనుని కుమారుడు నరేంద్రసేనుని మనుమడు. దేవసేనుడు భోగలాలసుడై యథేచ్ఛగా నుండగోరి రాజ్యమును కుమారుని కభిషేకించెను. హరిసేనుడు వాకాటకులలో ప్రసిద్ధుడైన కడపటి రాజు. అతడు కుంతల, అవంతి, కలింగ, కోసల, త్రికూట, లాట, ఆంధ్రాదిదేశములు జయించి, వాకాటకసామ్రాజ్యము నొకసారి మరల విజృంభింపజేసెను.[౩] హరిసేనుడు ఇంద్రభట్టారకుని నొకసారి యోడించియుండిన నుండవచ్చును. కాని యాతడు ముందే చనిపోవుటచూడ విష్ణుకుండ్యధిరాజు వాకాటకులయొక్క తాత్కాలికమైన జయమును తుడిచివైచియుందురని యూహింపవలయును.

వాకాటకహరిసేనుడు ఇంద్రభట్టారకుని నోడించినది క్రీ. శ. ౫౦౦ సంవత్సరప్రాంతమని యూహింపవచ్చును. విష్ణుకుండినులకు వాకాటకులతోడి వైరము కూడ పూర్వోదాహృతమైన వైవాహిక సంబంధమువల్లనే కలిగియుండవచ్చును. హరిసేనుడు ఇంద్రభట్టారకుని దాయాదుల పక్ష మవలంబించి విరోధియై యుండును. అందువలన ఆతడు ఇంద్రభట్టారకుని సింహాసన మెక్కకుండ జేసి కొంతకాలము ఆంధ్రదేశమును పరిపాలింపజూచెను. ఆకాలమున ఇంద్రభట్టారకునిప్రత్యర్థి హరిసేనునికి సామంతుడై యుండును. ఆకారణమున హరిసేను డాంధ్రభూమిని సయితము జయించినట్లు ఆతని మంత్రి హస్తిభోజుడు అజంతాశాసనమునందు ప్రగల్భములు వ్రాయించినాడు.[౪] చివరకుహరిసేనుడు ఇంద్రభట్టారకు నెదిరించి నిగ్రహింపలేకపోయినాడని విశ్వసింపవలయును.

ఇంద్రభట్టారకుడు హరిసేనుని విజృంభణ మడుగంటినపిదప కళింగదేశము అల్లకల్లోలమైయుండుట గాంచి, యా దేశభాగము నాక్రమించుకొనియుండును. కళింగదేశము నేలిన రాజవంశములనామములు గొన్ని యిటీవల దొరికిన కొన్ని తామ్రశాసనములబట్టి తెలియుచున్నవి.

పృథ్వీమూలుని గోదావరిశాసనము; ఇరువురు రాజులను పేర్కొనుచున్నది: విఖ్యాతుడైన ప్రభాకరమహారాజును, ఆతనికుమారుడు పృథ్వీమూలరాజును, వీరిరువురును ఇంద్రభట్టారకునికి సమకాలికులు, విశేషించి శత్రువులు. వీరిలో తండ్రికి 'విఖ్యాత', 'మహారాజ' అనువిశేషణములు చేర్చి శాసనము వాకొనుచున్నది. దీనినిబట్టిచూడ ప్రభాకరుడు ప్రబలుడై విష్ణుకుండినులకు ఇంద్రభట్టారకుని రాజ్యారంభకాలమున విశేషముగ నొత్తిడి కలిగించియుండెనని యూహింపవచ్చును. ప్రభాకరుడు చివరకు విష్ణుకుండ్యధిరాజుచే

---

౧. Ancient History of the Deccan. p. 76.

౨. J. B. O. R. S. vol- XIX. p. 79.

౩. Arch Surv. West Ind. Vol IV p. 124. .అజంతాగుహలలో ౧౬ వ దానిలో శాసనము.

౪. A. S. W. I. Vol IV, 125. pp. 17-18

నోడింపబడి, మృతుడైయుండును. ఆకారణమున, పృథ్వీమూలుడు, ఇంద్రభట్టారకుని ప్రతిపక్షులను గలసి పగసాధించుకొనెను. ఆతనిశాసనము ఇంద్రభట్టారకుడు హతముగావింపబడిన తరువాతనే యాజ్ఞాపింపబడినట్లు కూడ స్పష్టముగా దెలియుచున్నది. అది పృథ్వీమూలుని విజయరాజ్యవర్షములు ౨౫-వ యేట వైశాఖమాసమున తృతీయదివసమున నొసగబడెను.[౧] పృథివీమూలుడు దానమిచ్చిన గ్రామము తాళుపాకవిషయములో విళెంది, రెంగుంట, కంపాఱు, తుకుర అను నాలుగు గ్రామముల నడుమనున్న చూయిపాక. దానిని ४3 అథర్వణశాఖీయులగు బ్రాహ్మణులకు అగ్రహారముగా ధారవోసెను. ఈదానమును తనకు అధిపతియైన యింద్రాధిరాజుచే నాజ్ఞాపింపబడి, యాతని తల్లిదండ్రుల పుణ్యావాప్తికొఱకు చేసెను. ఇంద్రాధిరాజు మణుల్కుడి వాస్తవ్యుడు; మితవర్మకు ప్రియతనయుడు; ఇంద్రభట్టారక సముత్పాటనాభిలాషుడు; ద్విజాత్యన్వయపయోధి సంభూతుడు; చతుర్దంత సంగ్రామ విజయుడు. ఇట్టివాని నాశ్రయించుకొని, పోయిన రాజ్యమును పృథివీమూలుడు మరల సంపాదించుకొనెను. అందువలననే తనకు "పరానుగ్రహ మాత్ర ప్రయోజన ప్రతిపన్నైశ్వర్యగురుభారః" యని యొక విశేషణమును తనశాసనమందు చేర్చుకొనెను.[౨] పృథివీమూలుని వంశముపేరెచ్చటను దెలుపబడలేదు. మరియు నాతనిరాజ్య మెచ్చటనుండెనో యింతవఱ కెవ్వరును నిర్ణయింపలేదు. దత్తగ్రామము తాళుపాక విషయములోనిది. తాళుపాక తాటిపాక గావచ్చును. తాటిపాక తూర్పుగోదావరిజిల్లా రాజవోలుతాలుకాలో నున్నది. పూర్వమీతాళుపాక ఈప్రాంతమునకు ముఖ్యపట్టణమని తెలియుచున్నది. శాసనముగూడ తూర్పుగోదావరిజిల్లా యందే దొరకెను. కావున పృథివీమూలునిరాజ్యము తూర్పుగోదావరిజిల్లాభాగమని నిర్ణయింపవచ్చును. ఆతనివాసకము కాందాళియని తెలుపబడినది. దీనిని నిరూపించుట దుస్సాధ్యము. కాందాళి కందారమును తలపునకు దెచ్చుచున్నది. ఏకశిలానగర వృత్తాంతము, సిద్ధేశ్వరచరిత్రము మొదలగునవి యొకకందారము, లేక కాందారమును ఉదాహరించుచున్నవి.[3] ఈ నగరము తొలుత మాధవవర్మజనకుడైన సోమదేవరాజునకు ముఖ్యపట్టణమై యుండెను. సోమదేవుని రాజ్యము అనుమకొండసీమ (అనగా నిప్పటి ఓరుగల్లు సుబా) యందు వ్యాపించి గోదావరి నంటియుండెను. కొంతకాలమయినతరువాత సోమదేవరాజు కటకాధీశుడైన బల్లహునిచే నోటువడి హతుడై కాందారమును గోల్పోయెను. సోమదేవరాజుపై బల్లహునకు దీర్ఘక్రోధముండినందున కాందారమున కోటలుత్రవ్వి, కవాటములు విరిచి మేడలుగూల్చి అంతఃపురమును నేలమట్టము గావించెను. పిమ్మట కొంతకాలమునకు కాందారము పునరుద్ధారణము నొందెను; గాని మాధవవర్మ యచ్చట పట్టాభిషేకము చేసుకొనలేదు. అది శత్రుహస్తగత మయిపోయెను. కావున నీకాందారము గోదావరిచెంత నెచ్చటనో యుండియుండవచ్చును. కాందారము, విజయ-కాందాళియై యుండవచ్చునా?[४] కాందాళి రాజధాని యని తెలుపబడలేదు. కేవలము వాసకమనియే తెలుపబడెను. కావున పృథివీమూలుని రాజ్యము గోదావరిచెంతను అంటియుండెనని తోచును.

ఇంకొకయూహ కాందాళినిగురించి పొడముచున్నది. కాందాళియనునది రాజమహేంద్రవరమునకు తొలిపేరయియుండవచ్చునా యని సంశయము కలుగుచున్నది. రాజమహేంద్రవరమనుపేరు తన్నగరస్థాతయైన రాజమహేంద్రాపరనామకునివలన గలిగెను. కావున

౧. J. B B. R. A. S. Vol-XVI p. 114.

౨. J. B. B. R. A. S. Vol. XVI p. 144. శాసనములోని ౮-౯ పంక్తులు.

3. ఆంధ్రులచరిత్ర; రెండవభాగము, పుటలు ౧3౫-౧3౮.

४. కాందాళి అను పేరు నేటిమాధ్వులలో శ్రీవైష్ణవులలో కొందరికిగల "కందాళం" అను ఇంటిపేరును తలపునకు దెచ్చుచున్నది. ఈకాందాళము నుండి వలసబోయిన బ్రాహ్మణులు కందాళంవారు అయి యుండవచ్చును.

నంతకుపూర్వము నా మహాగ్రామమునకు 'కాంధాళి' యనిపే రుండుటలో అసమంజస మేమియు తోచ కున్నది.

ఈయూహయే సరియైనదైనచో నేటి తూర్పు గోదావరిజిల్లాయంతయును, గోదావరి కెనువనున్న మలయప్రాంతమును, అనగా బస్తరురాజ్యమునకు దక్షిణముగానున్న సీమయును అటు వరంగలుసుబాలోజేరిన మంత్రకూటము, లేక మంథెనప్రాంతమును గలసిన దేశ మంతయును పృథ్వీమూలుని రాజ్యముగానుండినట్లు నిశ్చయింపవచ్చును.

ఇంద్రభట్టారకుని శత్రుకోటిలో జేరినవారిలో పిష్టపుర, దేవపురములు రాజధానులుగా, పిష్టపురము మొదలుకొని యుత్తరమును పలకిరాష్ట్రిమువఱకు గల దేశము నేలిన వసిష్ఠకులజు లుండవచ్చును. చదువరి మున్నొకసారి హెచ్చరించబడిన విషయము జ్ఞప్తియుంచుకొని నేటిబ్రిటిషు రాజ్యాంగవిధానము ననుసరించియున్న దేశ విభాగములను మరచిపోవలయును. ఈ వాసిష్ఠకులమునకు దేవరాష్ట్రము జన్మభూమి; దక్షిణపురాజధాని పిష్టపురము; ఉత్తరమున రాజధాని దేవపురము. ఇది ఎక్కడనున్నదో యింకను తెలియవచ్చుటలేదు. దేవరాష్ట్రము ఎలమంచి కలింగములోనిది. [౧] నేటివిశాఖపట్టణమండలములో నడిమిభాగమునకు పూర్వము దేవరాష్ట్రమనిపేరు. ఇందు జయపురసంస్థానముగూడ చేరియుండెను [౨] దేవరాష్ట్రమునకు పడమటిదిక్కున బస్తరురాజ్యముసీమ. వసిష్ఠకులజులు ప్రబలిననాడు వారి రాజ్యము పిష్టపురము వఱకును, ఉత్తరమున నాగావలీనదీ పర్యంతమును వ్యాపించెను. ఇంతవరకు వీరిశాసనములు రెండుమాత్రమే లభించెను. అవి రెండును అనంతవర్మ మహారాజుచే నొసంగబడినవి. వాటిని "అనంతవర్మ సిరిపురముశాసన "మని తెలుగున భారతియందును, అనంతవర్మకిందొప్పశాసనమని యింగ్లీషున ఆంధ్రేతిహాస పరిశోధక మండలివారి పత్రికయందును మండ నరసింహముగారు ప్రకటించిరి. [౩] సిరిపురముశాసనము "మహాశ్వయుజ సంవత్సరమున మాఘపౌర్ణమాసి" యందు చేయబడినది మహాశ్వయుజ సంవత్సరమనుపేరు సురూదయాబ్ద సంప్రదాయము ననుసరించి యీయబడినది. ఈశాసనలిపి ఇంద్రభట్టారకుని రామతీర్థముశాసన లిపిని ఇంచుమించుగా బోలియున్నది. కావున నీమహాశ్వయుజ పౌర్ణమాస్యకై మనము ఆరవశతాబ్దమునందే వెదకుకొనవలయును. ఈరెండు శాసనములందీక్రింది విధముగ వంశవృక్షము మూడుతరములుమాత్ర మీయబడియున్నది:

వాసిష్ఠకులము

*

౧. శ్రీమహారాజగుణవర్మ

|

౨. శ్రీమాన్ మహారాజప్రభంజనవర్మ

|

3. శ్రీమహారాజ అనంతవర్మ

దానపతిఅనంతవర్మ'కళింగాధిపతి'యని చెలుపుకొన్నాడు. ఇతడు సిరిపురముశాసనమును దేవపురము నుండియు, కిందొప్ప శాసనమును పిష్టపురాధిష్ఠానము నుండి విజయరాజవర్ష'ములు ౧3 అనునేట ఉత్తరా

౧. C. P. No. 14 of 1908-09; text lines. 27,39.

౨. శిరిపురము, కిందొప్పశాసనములందీయబడిన దత్తగ్రామములు, వాటి సీమగ్రామములు ఈ యూహకు ప్రమాణములు.

3. మొదటిది: భారతి ప్రజోత్పత్తి-సం. భాద్రపదము (సం. ౮. సం. ౬ పుటలు.) ౮౫౧-౮౫౫ ; రెండవది J. A. H. R. S. Vol. VIII. p. 153-160. ఈ రెంటినిగూడ మండ నరసింహంగారు తృప్తికరమైన సంపాదకీయ వ్యాసములో ప్రకటింపలేకపోయిరి. ఇటువంటి మిక్కిలి ముఖ్యమయిన శాసనములు ప్రకటించుటకు గావలసిన పాండిత్యముకంటె నుబలాటము చారిత్రకప్రియుల కుండకూడదు. ఈశాసనముల కాలనిర్ణయమును నరసింహంగారు చేయజాలకపోయిరి. తప్పుచరిత్రలను చుట్టబెట్టి వ్రాసిరి. ఇది మిక్కిలి సంతాపకరమైన విషయము.

యణపుణ్యకాలమందును ఆజ్ఞాపించెను. అనంతవర్మ "స్వభుజవిక్రమోపార్జితభూః" అని చెప్పుకున్నాడు. ఆవిశేషణమునకు వెనుక "ప్రజాహిత రతః" అని కూడ చేర్చుకొన్నాడు. స్వభుజవిక్రమముచేత భూమి నాక్రమించుకొనె ననుటజూడ అనంతవర్మ అపహృతరాజ్యమును మరల సంపాదించుకొనెనా యని యూహ వొడముచున్నది. ఇతడు ఇంద్రభట్టారకునికి సమకాలికుడైనను, అర్వాచీనుడైనను, ప్రాచీనుడైనను విష్ణుకుండినులతో మాత్రము వైరముండినవాడని నిస్సంశయముగ దెలుపవచ్చును. ఇంద్రభట్టారకు డీశాన్యముగా కళింగదేశములోని పటికిరాష్ట్రమునుసయితము ఆక్రమించుకొనెను గావున నీనాస్థికులమునకు చెందినరాజు లాతనిచే నోడింపబడియుందురు.

ఇక మూడవవారు కలింగ గాంగులు. వీరియుసంత మీవరకే జిర్జింగిశాసనమునుబట్టియు, పృథివీమూలుని గోదావరీశాసనమునుబట్టియు సూచనగా మనకు దెలియవచ్చినది.

ఈరెండుశాసనములందును పేర్కొనబడిన ఇంద్రవర్మలిద్దరు నొక్కరేనాయను సంశయముకలుగవచ్చును. కానిఆసంశయము నిరాధారమైనది. అధిరాజ ఇంద్రవర్మ ద్విజాత్యన్వయపయోధి సంభూతశితరశ్మియనియు, రసదృక్కనియు, అవాప్తచతుర్దంత సంగ్రామవిజయుడనియు, మితవర్మప్రియతనయుడనియు పృథ్వీమూలుని శాసనము వర్ణించుచున్నది. జిర్జింగిశాసనము దానపతి యింద్రవర్మను "గాంగామలకులగగనతలసహస్రరశ్మిః, అనేకచతుర్దంత సమరవిజయః విమలనికోశ నిస్త్రింశ ధారాసమాక్రాంత సకలసామన్త నృపతి మండలాధిపతిః, త్రికలింగాధిపతిః, శ్రీమహారాజఇంద్రవర్మా" అని యిత్యాదివిశేషణములతో వర్ణించుచున్నది. అధిరాజఇంద్రవర్మ 'మణలుక్కుడి' వాస్తవ్యుడని మొదటి శాసనము వాకొనుచున్నది. జిర్జింగిశాసనము దంతపురమునుండి ఆజ్ఞాపింపబడినది. మితవర్మకు మొదటిదానియందు రాజపదవి లభించినట్లుగా మహారాజపదము విశేషణముగా నుపయోగింపబడలేదు. రెండవదానియందు ఇంద్రవర్మ తనతండ్రి పేరు చెప్పకొనలేదు. అయినను లిపిసామ్యముతోపాటు బలవత్తరమైన ప్రమాణము "అనేకచతుర్దంతసమరవిజయు" డన్నవిశేషణమునందు కన్పడుచుండుటవల్ల, నిక్కముగా విష్ణుకుండి ఇంద్రభట్టారకుని బరిమార్చిన అధిరాజ ఇంద్రవర్మ జిర్జింగి శాసనపతి యని నిర్ణయింప వీలగుచున్నది. ఇంద్రభట్టారకు డిరువదియేండ్లు, ముప్పదిసంవత్సరములు నిరాఘాటముగా కాళింగనృపులనెల్ల నోడించి రాజ్యపాలనము చేయుటవలన పెక్కుమందిరాజులు, పూర్వోదాహృతులు మొదలయినవారు విష్ణుకుండివంశముయొక్క 'అధిరాజ్యమును' ఊడబెఱుకుటకు విశ్వప్రయత్నములు చేసియుందురు. అందును పెక్కుసార్లు ఓడింపబడి యుందురు. అందువలననే యింద్రభట్టారకుని రామతీర్థ చిక్కుళ్ల శాసనములు, "అనేక చతుర్దంత సమరశతసహస్రసంఘట్టవిజయీ" యని దర్పముతో వర్ణించుచున్నవి. రెండవమాధవవర్మ ప్రతాపానలమున శోషిల్లిపోయిన కళింగరాజు లనేకులు ఇంద్రభట్టారకుడు పట్టాభిషిక్తుడు కాకుండ దాయాదులకు ద్రోహచింత కలిగించి విష్ణుకుండిరాజ్యమును కలగుండుపఱచియుందురు. ఇన్నికారణములవలన ఇంద్రభట్టారకుని రాజ్యకాలమంతయు సమరసంఘట్టములందే గడచిపోయెను. అయినను, విష్ణుకుండిన రాజ్యము ఇంద్రభట్టారకుని కాలమున నాగావలీతీరమువరకు నుత్తరముగా వ్యాపించియుండెను. ఆతని బరిమార్చుటకు నృపాలురు పెక్కుమంది అభిలాషతోనుండి, అధిరాజఇంద్రవర్మ ప్రస్థానభేరి మ్రోయించి ఆహ్వానించినంతనే యాతనికి సాహాయ్యము చేయుటకు సంతోషస్వాంతులయివచ్చి, ప్రాతపగలు దీర్చుకొనిరి. ఈ వృత్తాంతము క్రీ. శ. ౫౩౦ - వ సంవత్సరప్రాంతమున జరిగియుండవచ్చును. మరియు కళింగాధిరాజు ఇంద్రవర్మచే జిజ్జిక (జిర్జింగి) గ్రామమును అగ్రహారముగా బడసిన ప్రతిగృహీతలు, విష్ణువృద్ధసగోత్రులు, తైత్తిరీయస బ్రహ్మచారులు అయిన అగ్నిస్వామి, రుద్రస్వాములు అనువారలు. వారిరువురును తండ్రికుమారులు. వాకాటకరాజులది విష్ణువృద్ధస

గోత్రము. * వాకాటకులకు ప్రాతబంధువులు విష్ణుకుండినులు. అట్టియెడ విష్ణువృద్ధసగోత్రీయులైన బ్రాహ్మణులకు ఇంద్రవర్మ తన 'బలవర్ధనార్థము' సర్వకరపరిహార వివర్జితముగా నొక గ్రామము దానముచేయుట చూడ ఇంద్రభట్టారకుని దాయాదులు, కుల బ్రాహ్మణులు రాజద్రోహము చేసియుండి రని యూహించుటకు అవకాశము కలదు.

ఇందు మరియొకవిశేషముగూడ కన్పట్టుచున్నది. హరిసేనుని మరణానంతరము వాకాటక సామ్రాజ్యము నీటిలో నానిన మృణ్మయపాత్రవలె కరగిపోయెను. వాకాటక సామ్రాజ్యవినాశమునకు కారణభూతులయిన వారిలో దక్షిణమున నాంధ్రులు విష్ణుకుండినులును, కలచుర్యులును, ఉత్తరమున కన్యాకుబ్జపురాధీశ్వరులయిన మౌఖరీయులును ఇంతవఱకు దెలియవచ్చిన వారిలో ముఖ్యులని యూహింపవచ్చును. రాజ్యోపహతులైన వాకాటకరాజవంశము నాశ్రయించుకొన్న విష్ణువృద్ధసగోత్రీయులను బ్రాహ్మణవంశము విష్ణుకుండి ఇంద్రభట్టారకునిపై పగదీర్చుకొనదలచి, యాతనికి ప్రబలవిరోధులై త్రికళింగాధిపతిని ఆశ్రయించి యుందురు. అందువలననే అధిరాజ ఇంద్రవర్మ తన బలము వృద్ధియగుటకును, తాను నిశ్శంకగావర్ధిల్లుటకును 'బలవర్ధనార్థము'ని విష్ణువృద్ధసగోత్రీయులను బ్రాహ్మణులకు ఆశ్రయమిచ్చి పోషించెను.

ఇంద్రభట్టారకుడు సతత భూమి, గో, కన్యా, హిరణ్యప్రదాన ప్రతిలబ్ధమైన పుణ్యముచే జీవితము సౌఖ్యముగా గడపినాడు. శ్రీపర్వతస్వామిపాదానుధ్యాతుడై, యీశ్వరార్చనపరుడై పరమమాహేశ్వరుడని ప్రఖ్యాతినొందినాడు. చతుస్సముద్రములమధ్య నున్న 'అశేషనృపతిమకుటమణిమయూఖవిచ్ఛురిత పాదపంకజముల'చేప్రకాశించినాడు. ఇతనిరాజధాని యేదియో తెలియరాదు. కాని విజయవాడయే అయియుండుననుటకు సందియములేదు. రామతీర్థంశాసనము పురనిసంగమవాసకమునుండి స్వయముగా ఇంద్రవర్మచే నాజ్ఞాపింపబడినది. ఇదియొక విశేషము. పురనిసంగమనునది ఏనగరమునకు ముడిపెట్టవలయునో తెలియరాకున్నది. అయ్యది పలకిరాష్ట్రమునకును దత్తగ్రామమునకును సమీపముగానుండుట తటస్థించినగాని రాజు స్వయముగా తనదానశాసనమును ఆజ్ఞాపించుట జరిగియుండదు. కావున పురనిసంగమము పలకిరాష్ట్రమునందే యుండవలయునని తోచుచున్నది. ఒకవేళ రామతీర్థమే పూర్వము పురనిసంగమమని పిలువబడుచుండెనేమో? ఇది భావిపరిశోధనలవలన దెలియవలయును.

౬. రెండవ విక్రమేంద్రవర్మ; క్రీ. శ. ౫౩౦-౫౮౦: పైనవ్రాసిన వృత్తాంతములబట్టి యింద్రభట్టారకునియనంతరము గాంగఇంద్రవర్మాదులవలనవిష్ణుకుండిన రాజ్యము కొంత భంగపాటు నొందె నని యూహించుకొనవచ్చును. విక్రమేంద్రవర్మయింద్రభట్టారకునిజ్యేష్ఠతనయుడని చిక్కుళ్ల శాసనము దెలుపుచున్నది. "సమ్యగధ్యారోపిత సకలరాజ్యభారః" అని యుపయోగింపబడిన విశేషణము విక్రమేంద్రవర్మ స్వప్రజ్ఞాధిక్యముచే రాజ్యభారమును బూనియుండినట్లు తోపించుచున్నది. ఇందుల కనుకూలముగ కళింగాధీరాజఇంద్రవర్మాదులు విష్ణుకుండిన రాజ్యమును కూకటివ్రేళ్లతో పెల్లగించి నాశనమొనర్చుటకు మహాప్రయత్న మొనరించి చాలవఱకు సఫలీకృత మనోరథులయిరని పృథివీమూలుని శాసనము సూచించుచున్నది. ఈ విక్రమేంద్రవర్మ కాలమున తొలుతవిష్ణుకుండినులుకళింగ దేశములోని రాజ్యభాగమును కొంత గోల్పోయి యుండవచ్చును. చిక్కుళ్లశాసనము విక్రమేంద్రవర్మచే లెందులూరు వాసకమునుండి యాజ్ఞాపింపబడెను. అది విజయరాజ్య వర్షము ౧౦ అగునేట గ్రీష్మఋతువునందు ౭ వ పక్షమున పంచమదివసమున జరిగెను. పరమమాహేశ్వరుడైన విక్రమేంద్రవర్మ నట్టుపాటివిషయములో జేరి, కృష్ణబెణ్ణానదియొడ్డుననున్న రావిరేవ గ్రామమునకు దక్షిణపూర్వదిశగానున్న రేగొణ్ణంఅనుగ్రామమును, సోమగిరీశ్వరనాథుడని పేరుగల త్ర్యంబకమహాదేవునికి సకలజగత్రయనాథునికి దేవభోగముగా ధారవోసెను. మహారాజుగారి వచనమునందు గౌరవము కలిగి యీ

* J. B. O. R. S. vol. XIX p. 63.

యాజ్ఞను పాలింపవలసినదని విక్రమేంద్రవర్మ తన రాజధానియైన కెందుకూరునుండియే యాజ్ఞాపించెను.

ఈశాసనమందు పేర్కొనబడిన గ్రామనామాదికములలో కృష్ణబెణ్ణానది తప్ప మిగిలినవి మనకు పరిచితములయినవి గావు. కృష్ణవేణ్ణానదియొడ్డుననున్న గ్రామమని తెలుపుచుండుటచేత నట్టృపాటివిమండలము నాతవాడివిషయమని నిరూపణచేయవచ్చును. రేగొణ్ణమును గుర్తించుటకు వీలులేకుండ నది బేచిరాకయిపోయినది. కాని రావిరేవగ్రామము నందిగామతాలూకాలోని రావిరేల గావచ్చును. రేగొణ్ణంతోపాటు సోమగిరీశ్వరనాథుని యాలయముగూడ కాలగర్భమున కలిసిపోయెను. కావున నేడు వాటిపేరులును వినబడకున్నవి. కెందుకూరు నేడు దెందులూరను నామముతో బరగుచున్నది. ఏలూరునకు సమీపముగానున్న దెందులూరే పూర్వము విష్ణుకుండి నృపాలురకు రాజధానిగానుండెను. కెందుకూరువాసకమునకు రాజధాని మార్చినది ఇంద్రభట్టారకుడో, విక్రమేంద్రవర్మయో నిర్ణయింపసాధ్యముకాదు. దెందులూరు గ్రామముచెంత ఒక మైలు చదరము మేర పాడువడిన కోటదిబ్బలు ముప్పది నలుబదిఅడుగులు ఎత్తుగలిగి నేటికిని కాన్పించుచున్నవి. ఈకోటదిబ్బలను త్రవ్విచూచినయెడల శాలంకాయన, విష్ణుకుండి రాజవంశములయొక్క చిహ్నాలు తప్పక కాన్పింపగలవు.

౭. గోవిందవర్మ. క్రీ.శ.౫౪౦ (?) మొదలుకొని ౫౪౭ వఱకు: విక్రమేంద్రవర్మయు, నాతనికుమారుడు గోవిందవర్మయు గలసి యీవరకువేసిన లెక్క ననుసరించి క్రీ. శ. ౫౩౦ మొదలుకొని ౫౪౭ వఱకు పదిహేను, పదహారుసంవత్సరములకంటె నెక్కువకాలము పరిపాలించియుండరు. గోవిందవర్మమరణానంతరము ఆతనికుమారుడు మూడవమాధవవర్మ బాలుడుగా రాజ్యాభిషిక్తుడైయుండవచ్చుననికూడ దెలిపియుంటిమి. ఆతడు యుక్తవయస్కుడై విష్ణుకుండినరాజ్యమును మరల పూర్వస్థితికి తేగలుగుటకు కనీస మొక పాతిక ముప్పదియేండ్లయిన బట్టియుండవచ్చును. (క్రీ. శ. ౫౭౫) ఈమధ్యకాలమున క్రీ. శ. ౫౪౦ మొదలుకొని ౫౭౫ వఱకు ముప్పది యైదుసంవత్సరములు విష్ణుకుండి రాజవంశము కడగండ్లపాలయ్యెననుటకు హేతువులు గన్పట్టుచున్నవి. ఈకాలమున బాదామిచాళుక్యులు, విజృంభించి కదంబులను, వారిసామంతులయిన గాంగులను నోడించి కుంతలదేశమునందు సుస్థిరమైన రాజ్యమును స్థాపించిరి. కదంబులు విష్ణుకుండినులకు వాకాటకులతోడి పూర్వపు బాంధవ్యము కారణమున మిత్రులైయుండిరి. తమ మిత్రులకు గలిగిన యాపదమూలమున విష్ణుకుండినులుకూడ రెండవవిక్రమేంద్రవర్మ, గోవిందవర్మలకాలమున పూర్వరీతిని విజృంభింపలేకపోయిరి. మరియు, కళింగమున గాంగవంశము విజృంభించి సకలకళింగమును ఆక్రమించుకొనజూచుచుండెను. వాసిష్ఠులు మొదలయిన రాజ వంశములు పృథివీమూలరాజాదులు విష్ణుకుండినులకు ప్రతిపక్షులగుటచే కళింగముతోడి వైరము వేంగీశ్వరులకు ప్రాణసంకటముగా నుండెను. దక్షిణమున పల్లవుల ప్రాబల్యము పెరిగి విష్ణుకుండినులకు ప్రక్కలోనిబల్లెమువలె నుండెను. శాలంకాయనుల పీచమడచిన విష్ణుకుండినులకు వారుగర్వభంగము చేయదలచి నూతన రాజవంశమగు చాళుక్యులతో సంబంధ బాంధవ్యములు గలుపుకొనిరి. అట్లు నాలుగు ప్రక్కలను గూడ శత్రువుల వైరానలము ప్రజ్వరిల్లుచుండినకతన విష్ణుకుండినుల వేంగీరాజ్యము రెండవ విక్రమేంద్రవర్మ, గోవిందవర్మల రాజ్యకాలముననుం, తరువాత మరికొంతకాలమువఱకును గ్రుక్కియుండి తలదాచుకొనవలసివచ్చెను. ఆదుష్టకాలమున విష్ణుకుండిన మహారాజులు సంగ్రామరంగమున అకాలమరణమువాతబడియుందురు. రెండవ విక్రమేంద్రవర్మకంటె, నతని కుమారుడు ఎక్కువ ప్రజ్ఞాధికుడుగా కన్పట్టుచున్నాడు. గోవిందవర్మ రాజ్యమేలినకాల మతి స్వల్పమయినను ఆతనికి వాడబడిన విశేషణములు ఆతని మహత్తరమయిన శక్తిసామర్థ్యములను జాటుచున్నవి. ఆతడు అనేక సమరసంఘట్ట విజయుడనియు, పరనరపతి మకుటమణిమయూఖావదాతచరణయుగళుడనియు, విక్రమాశ్రయుడనియు, పొలమూరిశాసనము వర్ణించు

చున్నది. అపరిమిత బలపరాక్రముడనియు, పరమధార్మికుడనియు, ప్రణత సకలసామంతుడనియు, అనేక గోహిరణ్యభూమిదాను డనియు, మహారాజనియును ఈపూరుశాసనము దెలుపుచున్నది.

రెండవ విక్రమేంద్రవర్మకాలమునను, తరువాత గోవిందవర్మకాలమునను జ్ఞాత్తరాహులయిన మౌఖరీయులతో మహావిపత్కరమైన వైరానలము ప్రబలుచుండినట్లు కన్పట్టుచున్నది. ఇందులకు కారణములు మన కిపుడు తెలియరావు. మౌఖరీయులు కన్యాకుబ్జము (ఇది గంగానది కుపనదియైన కాలీనదిమీద, లక్నోజిల్లాయందున్నది.) రాజధానిగా కోసలమును పరిపాలించుచుండిరి. వారి రాజ్యము దక్షిణమున వింధ్యపర్వతములవఱకు వ్యాపించియుండెను. మౌఖరివంశజులలో నాల్గవవాడగు ఈశానవర్మ అందరికంటె గొప్పవాడు. పరాక్రమశాలి. ఆతని రాజ్యకాలము క్రీ. శ. ౫౩౫ మొదలుకొని ౫౮౫ వఱకు అయియుండవచ్చునని డాక్టరు హీరానందశాస్త్రి మున్నగు చారిత్రక పండితులు నిర్ణయించినారు.[౧] ఈశానవర్మను గురించి యాతని కాలమునాటిదైన హరహాశిలాశాసనము.[౨] ఈ క్రిందివిధముగా దెలుపుచున్నది—

"జిత్వాంధ్రపతిం సహస్రగణితత్రేధాక్షరద్వారణమ్,
వ్యావల్గ న్నియుతాతిసంఖ్యతురగా న్భంఖ్త్వారణీశూలికాన్,
కృత్వా చాయతిమోచితస్థలభువో గౌడా న్సముద్రాశ్రయా,
నధ్యాసిష్టనతక్షితీశచరణః సింహాసనం యో జితీ."

వేలకొలది మదించిన ఏనుగుల సైన్యముగల ఆంధ్రపతిని, బలాఢ్యమైన అశ్వసైన్యముగల శూరికులను, గౌడులను జయించి, శత్రునిర్మూలనముగావించి, రిపుభయము లేకుండచేసుకొని, పిదప ఈశానవర్మ పట్టాభిషేకము చేసుకొన్నాడట! ఈశానవర్మతండ్రి ఈశ్వరవర్మ మరణించినతరువాత యీశానవర్మ పట్టాభిషేకము చేసుకొనకుండ ఆంధ్రపతి, ఆంధ్రదేశాధీశుడు ఆటంకపఱచియుండెనని పూర్వోదాహృతమైనశ్లోకము ధ్వనింపజేయుచున్నది. ఆంధ్రోర్వీశునకును జ్ఞాత్తరాహులైన ఈశ్వర, ఈశానవర్మలకును తొలుత వైర మెట్లు సంప్రాప్త మయ్యెనో ఎఱుగరాకున్నది. గుప్త-వాకాటకుల యనంతరము మౌఖరీయులు ఉచ్చదశకు వచ్చియుందురు.

పూర్వోక్త హరహాశిలాశాసనము, ఈశ్వరవర్మను వర్ణించుచు, నాతడు శత్రురాజులతోడి యుద్ధములు చేయుచు శ్రేష్ఠములయిన క్రతువు లాచరించుటకు భూమిపై పుట్టినాడని తెలుపుచున్నది. ఈవాక్యములనుబట్టి ఈశ్వరవర్మకాలము సదా యుద్ధములతో గడచిపోయిన ట్లూహింపవచ్చును. ఆయుద్ధములందు మౌఖరీయులకు శత్రువులయినవారితో గలిసి ఆంధ్రపతులను విష్ణుకుండ్యధిరాజులు ఈశ్వరవర్మతో చిరకాలము పోరాడియుందురు; తుదకు ఆతని మరణానంతరము ఈశానవర్మపట్టాభిషేకమునకుసయితము విపర్యయము కలిగించియుందురు. ఈశ్వర, ఈశానవర్మలకు రెండవ విక్రమేంద్రవర్మ గోవిందవర్మలు సమకాలికులుగా గన్పడుచున్నారు. కావున నీశ్వరవర్మను జంపి, ఆతని తనయుని పట్టాభిషేక విపర్యయము కలిగించినవాడు గోవిందవర్మయని నిర్ణయింపవచ్చును. గోవిందవర్మ 'విక్రమాశ్రయాపరనాముడు.' 'అపరిమితబలపరాక్రమస్య' అని యీపూరుశాసనమును, "అనేక సమరసంఘట్టవిజయినః" అని పొలమూరిశాసనమును గోవిందవర్మను వర్ణించుచున్నవి. కాని ఆతని రాజ్యకాలము కడు స్వల్పము. కావున ఆతడే యీశానవర్మయొక్క విరోధియనియు, తుద కాతనిచే నోడింపబడి, మరణించినాడనియు నూహింపవచ్చును.

౮. మూడవమాధవవర్మ; క్రీ. శ. ౫౩౬ మొదలుకొని ౬౧౧ వఱకును: గోవిందవర్మ తనూభవుడైన మూడవమాధవవర్మ శైశవమునందే రాజ్యాభిషిక్తుడయ్యును విష్ణుకుండినులలో కడుగొప్పవాడుగా గన్పట్టు

౧. Ep. Ind. Vol XIV pp 110-120.

౨. పూర్వోక్తము.

చున్నాడు. విష్ణుకుండినభానుకిరణములు ఇంద్రభట్టారకునివెనుక కొంతకాలము మరుగువడినను మూడవమాధవవర్మ సింహాసనమెక్కిన కొంతకాలమునకు మరల ఇనుమడించిన తీక్ష్ణముతో ప్రకాశించెను. విష్ణుకుండినులలో మాధవవర్మాభిధానులందరు ప్రచండశౌర్యబలపరాక్రమసంపన్నులు,శక్తిత్రయోపేతులు. వారిలో వంశకర్తయగు మొదటిమాధవవర్మకంటె రెండమాధవవర్మ మహత్తరమైన ప్రజ్ఞాదికములను ప్రకటించినాడు. అతనిని మించి, మహోజ్జ్వల ప్రతాపముతో విశాల మహారాజ్యమును ఆక్రమించుకొని చిరకాలము సుస్థిరముగ పరిపాలన మొనరించి శాశ్వతమైనకీర్తిని గడించినాడు మూడవ మాధవవర్మ.

మూడవమాధవవర్మకు పశ్చిమమున కుంతలమందు వాతాపిచాళుక్యులకు మూలపురుషుడైన మొదటిపులకేసి వల్లభుడును (క్రీ. శ. ౫౪౦-౫౬౬), ఆతనితనయులు కీర్తివర్మ (క్రీ. శ. ౫౬౬-౫౯౦) మంగళేశులును (క్రీ. శ. ౫౯౦-౫౯౫) ౧, దక్షిణమున కాంచీపురపల్లవులలో సింహవర్మయు (క్రీ. శ. ౫౫౦-౫౭౫), నాతనికుమారుడు రెండవసింహవిష్ణువును (క్రీ. శ. ౫౭౫-౬౦౦), ఆతనితనయుడు మహేంద్రవర్మయు (క్రీ. శ. ౬౦౦-౬౩౦) సమకాలికులుగా గన్పట్టుచున్నారు. ౨ ఉత్తరమున కళింగగాంగులలో హస్తివర్మయు (క్రీ. శ. ౫౭౦-౫౮౦), తరువాత ఇమ్మడి ఇంద్రవర్మయు (క్రీ. శ. ౫౮౦-౫౯౫) ను సమకాలికులుగా గన్పట్టుచున్నారు. గాంగశకము క్రీ. శ. అయిదవశతాబ్దాంతమందు ప్రారంభింపబడినట్లు ఊహింపబడుచున్నది; కావున గాంగశకము ౮౦ యేడవనాటి హస్తివర్మయు ౩, ౮౭, ౯౧ సంవత్సరములనాటి రెండవయింద్రవర్మయు ౪ విష్ణుకుండిన మూడవమాధవవర్మకు సమకాలికులగుచున్నారు.

కాంచీపురపల్లవులతోడను, బాదామిచాళుక్యులతోడను మూడవమాధవవర్మ కెట్టి సంబంధము లుండెనో యూహించి చరిత్రవ్రాయుటకు ప్రామాణికములయిన సాధనములు మన కిపుడు చాలవు. ఇంతవఱకు లభించిన శాసనములబట్టి మాధవవర్మ తన రాజ్యకాలములో మొదటిభాగమున కాంచీపురపల్లవులతోడను, రెండవభాగమున కళింగాధిపతులయిన గాంగరాజులతోడను పోరాడుచుండి, కడకు దిగ్విజయము చేసి సకలారిరాజభయంకరుడై అలరారి ఆంధ్రదేశమును ఇంచుమించుగా ౬౫ సంవత్సరములు పరిపాలనమొనర్చినట్లు తెలియుచున్నది. మొదటనుండిన కాంచీపురపల్లవులతోడి వైరము తరువాత సఖ్యముగా పరిణమించి వర్ధిల్లినట్లూహించుకొనుటకు సాధనములుకలవు: కాంచీపురాధీశ్వరుడైన సింహవర్మ-నందివర్మకుమారుడితడు-మాధవవర్మయెడ స్నేహభావముతో నుండినాడని తెలుపుటకు ఆతని యమరావతి శిలాశాసనము ప్రమాణమిచ్చుచున్నది.* డూబ్రియలుపండితుడీసింహవర్మను విష్ణుగోపునికొడుకుగా నిర్ణయించినాడు ౬; కానినిక్క

౧. Fleet: Dynasties of the Kanarese Districts, p. 336.

౨. ఈ కాలనిర్ణయము డూబ్రియలు పండితుడు చేసిన కాలనిర్ణయమునుబట్టి (Ancient History of the Deccan, p 70) కొంచెము సవరించిచేయబడినది.

౩. Ep. Ind. vol. XVIII, p. 330.

౪. రెండవ ఇంద్రవర్మ సంతబొమ్మాళిశాసనము (J. A.H.R.S. vol. IV. pp. 21-24.) కళింగగాంగు లుదాహరించిన గాంగశకవర్షారంభమును సరిగా నెవ్వరును ఇంతవఱకు నిర్ణయింపలేదు.

౫. S. I. I. Vol. I. No. 32. p.25-28. ఈశాసనములో నీయబడిన వంశక్రమము ఇతర పల్లవ రాజు లిచ్చిన కొన్ని వంశవృక్షములతో సరిపడకున్నది; అందువలన దీనిని జాగ్రతతో పరిశీలించి అంగీకరింపవలయునన్నమాట నిజము. కాని యీశాసనలిపి ఏడవ శతాబ్దికి పూర్వమునాటిదని స్పష్టముగా గోచరించుటచేత నిందు పేర్కొనబడిన సింహవర్మ మాధవవర్మకు సమకాలీనుడని విశ్వసింపవచ్చును.

౬. Ancient History of the Deccan, p. 70.



విహారభూమి S. S. S.



తిరుప్పరంకున్రడం కొండ, దేవాలయము; కొలను S. S. S.

ముగ నందివర్మతనయుఁడైనట్లు కన్పట్టుచున్నాఁడు. ఇతఁ "డనేకరాజన్య శిరోమణి ప్రభావిభాసిత కల్పాయిత శార్వరాస్థితు" డనియు, "అష్టాదశలక్ష హయ ద్విరద పదాతి సైన్యములకు అధిపతి" యనియు అమరావతి శాసనము దెలుపుచున్నది. ఈవీరుఁడు చిరకాలము రాజ్యోపభోగముల ననుభవించి మేరుహిమవత్పర్వత శిఖరములకు తీర్థయాత్ర వెడలెను. అంతట చిరకాలము అఖిలదేశమును పర్యటనము చేయుటవలన కలిగిన శ్రమ నపనయించుకొనుచు, కొన్నిదినములకు స్వదేశమునకు మరలి వచ్చెను. అట్లు మరలివచ్చుచు, భాగీరథినిగాంచి గోదావరిని అధిగమించి, కృష్ణవేణిందాటి ధాన్యకటకమునకు వచ్చెను. అచ్చట వీతరాగుఁడై బుద్ధభట్టారకుని సందర్శించెను. అచ్చట కుతూహలముతో అఖిలక్షేత్ర రక్షణనియుక్తాధిదేవతలను సవినయముగా సందర్శించి ఏకాంతముగా తథాగతుని ధర్మమార్గమును ఆకర్ణించెను. పిమ్మట భగవానునియెడ భక్తికలిగి మణికనకరచితమైన విచిత్రబుద్ధప్రతిమను చేయించి యచ్చట నెలకొల్పెను.* అనంతరము సింహవర్మ భగవానునికి అభివందనమొనరించి స్వదేశమునకు జనెను. విష్ణుకుండినులతో సఖ్యముననుండినగాని సింహవర్మ కృష్ణా, గోదావరీనదుల దాటి, అమరావతియందున్న బౌద్ధదేవుని విహారమును సందర్శించి బౌద్ధధర్మమును స్వీకరించి యుపాసకుఁడగుట సంభవింపనేరదుకదా!

మూఁడవమాధవవర్మకు యుక్తవయసు వచ్చినది మొదలు, పితృపితామహప్రపితామహులకు కళింగగాంగులవలన గలిగిన పరాభవమునకు తగినసమయము చూచి పగ సాధించుకొనవలయునన్న అభినివేశ ముండినట్లు కన్పడుచున్నది. మితవర్మకుమారుఁడును, త్రికళింగాధిపతియునగు అధిరాజ ఇంద్రవర్మ యింద్రభట్టారకుని నోడించి గాంగవంశమును కళింగదేశమునందు శాశ్వతముగ నిలుపుటకు బునాదులువేసెను. ఈతని జిర్జింగిశాసనము ప్రవర్ధమాన విజయరాజ్యవర్షములు ౩౯-వ యేట నాజ్ఞాపింపబడియెను; గావున నితఁ డించుమించుగా నలువదియైదుసంవత్సరములు (క్రీ. శ. ౪౯౫-౫౪౦) రాజ్యముచేసియుండెనని యూహింపవచ్చును. ఈతఁడు రెండవవిక్రమేంద్రవర్మకాలమునవో, లేక యాతని తనయునికాలమునవో మడిసియుండవచ్చును. గాంగశకము ౩౯-వ ఏఁడు మొదలుకొని ౮౦-వ సంవత్సరమునాటి రాజసింహాపరనామధేయుఁడను హస్తివర్మకాలమువఱకు నేలిన గాంగరాజుల నామములయిన వినబడవు. ఈ నడిమికాలమున — అనగా ఇంచుమించుగా క్రీ. శ. ౫౪౦ మొదలుకొని ౫౮౦ వఱకు నలుబదిసంవత్సరములు — గాంగరాజుల చరిత్రమేమియు వినబడదు. ఈకాలమున కనీసము రెండుతరములవారైన కళింగమును బరిపాలించియుందురు. ఈకాలమున దంతిపురమును విడిచిపెట్టి, గాంగరాజులు మరియొకనగరమును నిర్మించుకొని దానికి కళింగనగరమని పేరిడి యచ్చటికి తమరాజధానిని మార్చుకొనిరి. ఇందులకు కారణములు మృగ్యములు. గాంగశకము ౮౦ యేట, హస్తివర్మ తన ఉర్లాంశాసనమును కళింగనగరవాసకమునుండి యాజ్ఞాపించెను కావున నీనలువదిసంవత్సరములును వేంగీశ్వరులకు, కళింగాధిపతులకు నిరంతరయుద్ధములలో గడచిపోయెనని యూహింపవచ్చును. ఈయుద్ధములందు విష్ణుకుండినులే తుదకు విజయు లయిరనుటకు కూడ హేతువులు గలవు. ఈకాలమున విష్ణుకుండ్యధిరాజ్యపీఠము నెక్కిన గోవిందవర్మను గూర్చి పాలమూరి శాసనము అనేకసమరసంఘట్టవిజయు డనియు, పరనరపతి మకుట మణిమయూఖావదాత చరణయుగళు డనియు, విక్రమాశ్రయుఁడనియు దెలుపుచున్నది. ఈవిశేషణములు వట్టిఅతిశయోక్తులు కాజాలవు. అనేకసమర సంఘట్టములందు విజయము గాంచుటవలన పరనృపతులచేత మొక్కులందినవాఁడని వర్ణింపబడినాఁడు. ఈ పరనృపతులు కళింగగాంగవంశజు లని యూహించుట కాటంకమేమియులేదు. మరియు మూఁడవ మాధవవర్మయీపూరుశాసనము ఇతఁ డమితబలపరాక్రముఁడని తెలుపుచున్నది. ఈవృత్తాంతములు యథార్థములని హస్తివర్మ

* ఈ బుద్ధదేవుని ప్రతిమయు, శాసనముంగూడ చెన్నపురికి గొంపోవబడి మ్యూజియమునం దుంచబడి యున్నవి. కౌతుకమతులు చూడవచ్చును.

ఉర్లాంశాసనములోని యొక విశేషణము సూచించు
చున్నది. ఈశాసనములో గాంగవంశజుల "ప్రశస్తి"
వాక్యములకును, మొదటి యింద్రవర్మ జిర్జింగిశాసనము
లోని ప్రశస్తివిశేషణములకును అంతయు వ్యత్యాసమే
కన్పట్టుచున్నది. ఇంద్రవర్మ త్రికళింగాధిపతి;
హస్తివర్మ కావిశేషణము లేదు. అంతే కాదు.
ఉర్లాం శాసనమునందలి ప్రశస్తి మొట్టమొదట
హస్తివర్మయే వ్రాయించినట్లు తోచుచున్నది. *
హస్తివర్మ తన వాడియైన ఖడ్గధారచే శత్రుహస్త
గతమైన సకల కళింగాధిరాజ్యమును జయించుకొన్నా
డనియు, అనేక సమరసంక్షోభజనిత జయశబ్దు
డనియు, విశేషించి గాంగామలకులమును ప్రతిష్ఠించిన
వాడనియు, ప్రతాపాతిశయముచేత సామంతలోకమును
వశపఱచుకొనినవాడనియు చెప్పుకున్నాడు. "గాంగా
మల కులప్రతిష్ఠః" అని చెప్పుకొనుటచేత నాతనికి
పూర్వము గాంగకులము నామమాత్రావశిష్ట మయ్యెనని
తెలియుచున్నది. మరియు "స్వాసిధారాపరిస్పందాధి
గత సకలకలింగాధిరాజ్యస్య" యని అనుటచేత నాతని
పితృపితామహులు కళింగాధిరాజ్యమును బోగొట్టు
కొన్నారనియు, తాను దాని పరాక్రమముచేత మరల
నాక్రమించుకొనినాడన్న వృత్తాంతమునూడ సూచిత
మగుచున్నది. కావున పైన దెలిపిన విషయములవలన
రెండవ విక్రమమహేంద్రవర్మ, గోవిందవర్మలకాలమున
గాంగులు త్రికళింగాధిరాజ్యముతోపాటు కళింగరాజ్య
మునుగూడ గోల్పోయినట్లు స్పష్టమగుచున్నది. కాని
గోవిందవర్మయొక్క యకాలమరణమును, తరువాత
సింహాసన మధిష్ఠించిన మాధవవర్మయొక్క బాల్యమును,
హస్తివర్మకళింగరాజ్యమును మరల జయించుకొనుటకు
మంచితరుణము నొసగెను. పాపము హస్తివర్మ చిర
కాలము రాజ్యోపభోగముల ననుభవించ లేదు. ఆతని
రాజ్యకాలము పదిహేను వత్సరములకు మించియుండ
బోదు. ఆతనివెనుక రెండవ ఇంద్రవర్మ పట్టాభిషిక్తు
డయ్యెను. అతడు ప్రాయశః, హస్తివర్మకు తమ్ముడై
యుండవచ్చును. ఈతనికిగూడ హస్తివర్మకున్న బిరు
దములన్నియు గలవు. వీ రుభయులుకలసియే కళింగాధి
రాజ్యమును మరల సంపాదించి, గాంగామల కులమును
ప్రతిష్ఠచేసియుందురు; ఒకరు చన్న వెనుక, నింకొకరు
రాజ్యభాగము బూనియుందురు. ఇందుకు తార్కాణ
ముగ ఇంద్రవర్మ యిచ్చిన నాలుగు శాసనము † లలోని
మాములుప్రశస్తివిశేషణములు, హస్తివర్మ ఉర్లాం
శాసనములలోని ప్రశస్తియు నొకయక్షరమైన పొల్లు
వోకుండ నొక్కరీతిగా నున్నవి. ఈ రెండవ యింద్ర
వర్మగూడ కొద్దికాలమే పరిపాలించిన ట్లగపడుచున్నా
డు. ఈతడు మూడవమాధవవర్మ పొలమూరి శాసనకాల
మునకు కొంచె మావలనో, లేక యీవలనో మరణించి
యుండవచ్చును.

హస్తివర్మ, యింద్రవర్మ లిరువురును చిరకా
లము విష్ణుకుండినులవలన ఒత్తిడి గలుగకుండ అతిశయ
ప్రతాపముతో కళింగరాజ్యమును రక్షించియుందురు.

మూడవమాధవవర్మ కళింగదేశముపై జైత్ర
యాత్రవెడలినట్లు ఆతని పొలమూరిశాసనము దెలుపు
చున్నది. అది క్రీ. శ. ౫౯౪ ఫిబ్రవరి ౧౦-వ తారీఖున
నొసగబడినదని యీవఱకే తెలిపితిమిగదా. మాధవవర్మ
ప్రాగ్దిగ్జిగిషయా ప్రస్థితుడై, గోదావరిని దాటెను.
అంతట ఫాల్గునమాసమున చంద్రగ్రహణమురాగా నొక

---

* ఈవిషయము నిచ్చట విపులముగా చర్చించు
టకు తావుచాలదు; మరియొకమారు 'గాంగశకా
రంభకాల నిర్ణయము'నందు దీనిని సంపూర్ణముగా చర్చిం
చుచున్నాను.

† ఈతని నాలుగు శాసనము లేవియన: ౧.
అచ్యుతాపురశాసనము, గాం. శ. ౮౭ నాటిది. (ఎపి
గ్రాఫియా ఇండికా సం ౩. పుట ౧౨౭) ౨. సంత
బొమ్మాళి శాసనము, గాం. శ. ౮౭ వ నాటిది (జె.
ఎ. హెచ్. ఆర్. యస్. సం. ౪. పుట ౨౧.) ౩.
పర్లాకిమిడిశాసనము, గాం. శ. ౯౧. నాటిది (ఇండి
యను ఆంటిక్వేరి. సం. ౧౬. పుట ౧౩౧.) ౪. నర్సింగ
పల్లి తామ్రశాసనము (భావసం. భాద్రపదసంచిక
భారతి, ౪౬౧-౪౬౭.)

బ్రాహ్మణవర్యునికి పులుంబూరు అగ్రహారముగా దానమిచ్చెను. ఆగ్రామవాస్తవ్యులకు తదశాసనము నాజ్ఞాపించుటకై హస్తికోశ, వీరకోశులను ఆజ్ఞప్తులుగా నియమించెను. మాధవవర్మకు తూర్పుదిక్కునయున్న రాజ్యములను జయించవలయునని యభిలాష మొట్టమొదటి మారు ఆతని ౪౦-వ రాజ్యసంవత్సరమున కలిగెను. అంతకుపూర్వ మాతనికి శక్తి చాలియుండకపోవచ్చు ననుట పైన వ్రాసిన గాంగరాజులవృత్తాంతమునుబట్టి స్పష్టము కాగలదు. ఇపుడతనికి మంచితరుణము తటస్థించియుండవలెను. బహుశః ఇప్పటికి రెండవ యింద్రవర్మ మరణించియుండవలెనో పును.

మాధవవర్మ కళింగమును జయించి గాంగవంశమును కంపింపజేసి తనరాజ్యమును మరల కళింగదేశములోనికి విస్తరింపజేసినట్లు కన్పడుచున్నది. కళింగాధిపతి రెండవ ఇంద్రవర్మతరువాత నించుమించుగా ముప్పదియేడు సంవత్సరములవఱకు మరల గాంగరాజులచరిత్రయేమియు వినబడదు. ఇంతవరకు దొరికినవాటిలో రెండవ యింద్రవర్మయొక్క గాంగశకము ౯౧ వ సంవత్సరమునాటి శాసనముతరువాతది మూడవ ఇంద్రవర్మయొక్క ౧౨౮ వ సంవత్సరమునాటి శ్రీకాకుళశాసనము.౧ ఈరెండుశాసనముల నెంతపరిశీలించినను ఈ యిరువురి యింద్రవర్మలకు గల బాంధవ్యము ఎఱుకపడకున్నది. కాని తాతగారిపేరు మనుమనికి పెట్టెడి యాచారము కళింగగాంగవంశమున గానబడుచున్నది; గావున రెండవ ఇంద్రవర్మకు మూడవ ఇంద్రవర్మ పౌత్రుడై యుండవచ్చు నని యూహింపవచ్చును. మూడవ యింద్రవర్మ జనకునిపేరు దానార్ణవుడని తెలియుచున్నది.౨ దానార్ణవునికి ఈ యింద్రవర్మశాసనములందు మహారాజపదవిశేషణ ముపయోగింపబడి యుండలేదు. దీనినిబట్టిచూడ రెండవ ఇంద్రవర్మయనంతరము, ముప్పదియేడుసంవత్సరములవఱకు గాంగులరాజ్యము కడుదీనదశయందుండెనని యూహింపవీలగుచున్నది. మరియు విష్ణుకుండిన మాధవవర్మచే గాంగరాజ్యము పెకలింపబడు నంతటి విపత్తు సంభవించెనని యూహింప వీలగుచున్నది. ఈ కళింగ యుద్ధములందు మాధవవర్మ త్రివరనగరాధీశ్వరుని సహాయము బొందియుండును. త్రివరనగరము చేదిదేశాధీశ్వరు లయిన కలచురివంశపురాజులకు ముఖ్యపట్టణము. వాకాటకరాజుల వైభవము అస్తమించినతరువాత చేదిరాజ్యమును కలచురిరాజులు ఆక్రమించుకొనిరి. మాధవవర్మ కలచురిరాజకుమారితలను పెండ్లియాడినట్లు[3] ఆతని ఈపూరిశాసనములోని "త్రివరనగర భవనగతయువతీహృదయానందకరః" అను విశేషణమునుబట్టి ద్యోతకమగుచున్నది. ఈ విశేషణమే "త్రివరనగర భవనగత పరమయువతీ జనవిహరణరతిః" అని పొలమూరిశాసనమున కూడ కన్పట్టుచున్నది. ఈమాధవవర్మకు కూతునిచ్చిన త్రివరనగరాధీశుడైన .కలచురిరాజెవ్వరో ఊహింప ప్రస్తుతము సాధ్యము కాదు.

కళింగరాజ్యముపై దండెత్తి జయించుటాదియైన వృత్తాంతము పూర్వోదాహృతములయిన స్థానికపురాణములందును, తెలుగుకావ్యములందును వినబడుచున్నది. కాని జనులు పరంపరగా చెప్పుకొనుచు వచ్చిన గాథలందు, విష్ణుకుండిన మాధవవర్మల ముువ్వురిని గూర్చిన వృత్తాంతము లన్నియు, వివరణలేక సదిగ్రుచ్చబడి అన్నియు నొక్క మాధవవర్మకే ముడిపెట్టబడియున్నవి. కావున వాటిని విమర్శించి విడదీసి వివరించుట చరిత్రకారుని పని. విష్ణుకుండిన మాధవవర్మలలో కడపటి

---

౧. Ind. Ant. Vol. XIII p. 128.

౨. Ep. Ind. Vol. XIV p. 362.

3. మాధవవర్మ త్రివరనగరాధీశుని కుమార్తెలను పెండ్లియాడినట్లు పైవాక్యమువలన అర్థమగుటలేదని కొందరు వాదనచేయవచ్చును. రెండవ విశేషణమందు "పరమయువతి" యని యుండుటచేతను, రాకుమారితలకు యువతిశబ్ద ముపయోగింపబడుటచేతను, ఆ యువతులు మాధవవర్మకు భార్య లనియే యూహించుట సమంజసము.

మాధవవర్మయే అందరికంటె కడు గొప్పవాడు. ఆతని దివ్యచరిత్రము, ఆతని దివ్యనామము నేటివఱకు సంస్మరింపబడుచున్నది. పంద్రెండవశతాబ్దమువాడైన మహామండలేశ్వర ఉగ్రవాడియ మేళరసు తాను మాధవవర్మ వంశజుడని చెప్పుకొనెనని యీవఱకే తెలిపి యుంటిమి గదా!* ఆతడు అనుమకొండశాసనమున "అష్టౌ దంతి సహస్రాణి దశకోటీచవాజినా మనంతం పాదసంఘాత మిత్యేతే మాధవవర్మ వంశోద్భవ రప్ప శ్రీ మన్మహామండలేశ్వర నుగ్రవాడియ మేళరస" అని తన గూర్చి చెప్పుకొన్నాడు. దీనినిబట్టి చూచిన మాధవవర్మ ఎనిమిదివేల యేనుగులకును, పదికోట్లగుఱ్ఱములకును, అనంతమగు కాల్బలమునకు నధిపతి యని తెలియుచున్నది.

దూబగుంట నారాయణకవి మహాసేనాధిపతి తమ్మరాజు బసవరాజేంద్రునకు పంచతంత్రియను కావ్యమును కృతియిచ్చెను. బసవరాజచమూపతి ఉత్కలదేశాధీశులయిన గజపతులకు సేనాని. పదునైదవ శతాబ్దమువాడు. ఈబసవరాజు మాధవవర్మవంశోద్భవుడని యాకావ్యపీఠికయందు చెప్పబడినాడు. అందు మాధవవర్మ ఇట్లు అభివర్ణితుడై యున్నాడు.

ఉ. "మును బెజవాడదుర్గమున
ముగ్ధతనంబున మెచ్చఁజేసి పెం
పున రథ, దంతి, వాజి, భట
భూరి బలంబులచేఁ గళింగ భూ
జనపతిఁద్రుంచి వేసతి
సంతతికై మహిఁ బాడినిల్పి క్ర
మ్మనఁ జిరకీర్తులంగనిన
మాధవవర్మ..............."

రథ, దంతి, వాజి, భట, భూరిబలములు గలవాడని వర్ణింపబడుటచేత నీమాధవవర్మయు, అనుమకొండశాసనమున మేళరసునకు పూర్వుడుగా జెప్పబడిన మాధవవర్మయు నొక్కరై యుండనోపుదురు.† ఈ మాధవవర్మ కళింగభూజనపతిపైకి విశేషసైన్యములతో జని యోడించి హతునిచేసెనన్న వృత్తాంతము పోలమూరి శాసనపతి మూడవమాధవవర్మకు సరిపోవుచున్నది. కావున వీరిరువురు నొక్కరై యుండనోపుదురు.



* Ep Ind. vol. IX. p, 256 Appendix.

† మా మిత్రులు మల్లంపల్లి సోమశేఖరశర్మగారుకూడ నీ యభిప్రాయమునే వెలిబుచ్చియున్నారు. భారతి, ప్రమోదూత భాద్రపద సంచిక చూడుడు.

# కళింగగాంగశకము

మల్లంపల్లి సోమశేఖరశర్మ

౧

దక్షిణ హిందూ దేశమున రాజ్యముచేసిన గాంగవంశములు రెండు: ఒకటి కళింగ దేశమును, మఱియొకటి మైసూరు దేశమును పాలించినవి. కళింగము నేలినవారికి కళింగ గాంగులని, మైసూరువారికి పశ్చిమగాంగులని చరిత్రప్రసిద్ధి. కళింగగాంగులకు పూర్వగాంగులనియు బేరు. ఈ వ్యాసమున నుద్దిష్టమయినది కళింగగాంగ చారిత్ర విషయము.

పూర్వగాంగుల పరిపాలనము కళింగమున నెప్పు డారంభమయినదియు మనకు దెలియదు. వీరిశిలాశాసనములు, తామ్రశాసనములు అనేకములు దొరకినవి. శిలాశాసనములు క్రీస్తుశకము పదునొకండవశతాబ్దినుండి మాత్రమే కానవచ్చును. తామ్రశాసనము లంతకుపూర్వపువి, అటుతరువాతివికూడ దొరకినవి. పదునొకండవశతాబ్ది నుండి మాత్రమే కళింగగాంగభూపతులు తమ శాసనములందు శకవర్షములను బేర్కొనుచువచ్చిరి. అందువలన కళింగగాంగచారిత్రమున పదునొకండవశతాబ్ది యొకఘట్టము. అంతకుపూర్వపువారు శకవర్షములు పేర్కొనకయుండుటకు, తరువాతివారు పేర్కొనుటకు ఏదో గొప్పకారణము - అది యింతవఱకు తెలియరాకపోయినను - ఉండుటసహజము. మొట్టమొదటిమాఱు ప్రాతపంథను విడనాడి తన శాసనములందు శకకాలమున సంవత్సరములను వేయుచువచ్చిన మొదటి మహీపతి వజ్రహస్తుడు; అనగా గాంగచారిత్రమున ప్రాతపంథవారికి, క్రొత్తపంథవారికి వజ్రహస్తుని రాజ్యము సరిహద్దన్నమాట. వజ్రహస్తుని పూర్వులను పూర్వ (ప్రాచీన - Early) గాంగులని, తరువాతివారిని పరగాంగులని (Later Gangas) చరిత్రకారులు వ్యవహరించుచున్నారు. పరగాంగులలో వజ్రహస్తుడు ప్రథమగణ్యుడు.

వజ్రహస్తునికొడుకు రాజరాజు; ఇతని కొడుకు అనంతవర్మ-చోడగంగు. వజ్రహస్తునివి, ఇతని మనుమడు అనంతవర్మ-చోడగంగువి తామ్రశాసనములు చాల దొరకినవి. రాజరాజు తామ్రశాసన మొకటిమాత్రమె బయలుపడినది. వీరిశాసనముల ననుసరించి వజ్రహస్తునికి, అనంతవర్మ-చోడగంగునకు అనంతవర్మ బిరుదము కలదని, రాజరాజు దేవేంద్రవర్మ బిరుదాంచితుడని తెలియవచ్చుటయే కాక వీరు ముప్వురిలో వజ్రహస్తుడు శ. ౯౬౭కి సరియయిన క్రీ. శ. ౧౦౪౫లోను[1], రాజరాజు శ. ౯౯౨కు సరియయిన క్రీ. శ. ౧౦౭౦లోను[2], అనంతవర్మ-చోడగంగు శ.

1. Ep. Ind., Vol. IV, p. 183.
2. Jour. Andh. Res. Soc., Vol. VIII, p. 166; Jour. Bi. Or. Res. Soc., Vol. XVIII.

౯౯౯కి సరియయిన క్రీ. శ. ౧౦౭౭లోను[3] పట్టాభిషిక్తులయిరను ముఖ్యవిషయముకూడ నిర్ధారణమయినది. వజ్రహస్తుని తామ్రశాసనము లతనికి పూర్వము అయిదుతరముల వఱకు గాంగవంశావతారక్రమము నభివర్ణించుటయేకాక యతనికి పూర్వులుగ నావంశవృక్షమున పేర్కొనబడిన రాజు లెవ్వరెవ్వ రెన్నెన్నియేండ్లు పాలించినది కూడ తెలుపును. దీనిననుసరించి ప్రాతశాసనాది రాజకీయపత్రములను బరిశీలించి పూర్వరాజపట్టికను తయారుచేయించిన ప్రథమగాంగపృథ్వీపతి వజ్రహస్తుడని స్పష్టపడుచున్నది. ఈతని శాసనములనుబట్టి ఇతనికి పూర్వము వజ్రహస్తనామాంకితు లిర్వురు రాజ్యమేలియుండుటచేత నీతడు ముమ్మడివజ్రహస్తు డగుచున్నాడు. ఈతనిశాసనములందు మొదట పేర్కొనబడినవాడు గుణమహార్ణవ మహారాజ తనయుడయిన ప్రథమవజ్రహస్తుడు. కళింగభూమి నితనికాలమునకు పూర్వపు రాజులు (? గాంగులు) అయిదు ఖండములుగ దమలో దాము పంచుకొని పరిపాలించుచుండ, ఈ ప్రథమ వజ్రహస్తుడు శత్రువులను భూరిపరాక్రమమువలనను, భుజబలమువలనను జయించి మరల నాయయిదు ఖండములను ఏకముచేసి అఖండ కళింగమును నలువదినాలుగేండ్లు పరిపాలన మొనరించెను. మూడవ వజ్రహస్తుడు తన వంశావతారక్రమము నీ ప్రథమవజ్రహస్తునినాటి నుండియే యభివర్ణించుట కాతడొనర్చిన మహాకార్యమే కారణమయి యుండవచ్చును. తునకలు తునకలుగ నున్న కళింగము నేకీకరణముకావించి అఖండ గాంగసామ్రాజ్యమును నెలకొల్పి ప్రతిష్ఠావహుడయిన మొదటి వజ్రహస్తుని కట్టి ప్రాముఖ్యము నొసంగుట సముచితమేకదా! దత్తగ్రామ, ప్రతిగ్రహీతలవిషయమును విడిచినచో రాజరాజుశాసనము తండ్రిశాసనమునకు సరియయిన నకలు. ఇక అనంతవర్మచోడగంగు తామ్రశాసనములన్ననో, వాటిని రెండురకములుగ విడదీయవచ్చును. మొదటివజ్రహస్తుని తండ్రియైనగుణమహార్ణవునినుండి వంశావతారమును దెలుపునవి ఒకరకము; ఇంకను అంతకుపూర్వపు రాజుల సంతతిక్రమ, రాజ్యకాలాదులను దెల్పి సమగ్రగాంగవంశావతారక్రమము నభివర్ణించునవి మరొకరకము. ప్రక్కపుట చూ:

అనంతవర్మచోడగంగుశాసనముల ననుసరించి తెలియవచ్చిన గాంగవంశావతారక్రమమున మొదటి, రెండవ, మూడవ మొదలగు సంఖ్యావాచకపదములను కుండలీకరణమున జూపియుండలేదు. అందుకు కారణము శాసనములందే యవి యుపయోగింపబడుట వలన. ఈసందర్భమున చోడగంగుశాసనములందలి కొన్నిపంక్తుల నిట నుదాహరించుచున్నాను, అవసరముగనుక. రెండవరకము శాసనములన్నిటిలో పాఠ మొక్కతీరుననే యుండుటచేత, ఏశాసనముననుండి యుదా

3. Ind. Ant., Vol. XVIII, p. 161; భారతి, సం. ౨, పుట. ౧౦౧.

హరించిసను ఉదాహరింపవచ్చును. అందు వలన, కొన్నిపంక్తులు కొర్ని శాసనమున నుండిరి :[4]

"తత్సూను ద్వితీయో వజ్రహస్తః పంచదశసమాః క్షమా మరక్షత్ । తస్యానుజ స్తృతీయః కామార్ణవో ర్ణవమేఖలా మేకోనవింశతి సంవత్సరాణ్ (స)మవర్ధయత్ ।......తత్సుతో గుణార్ణవ స్సప్త వింశతి మబ్దా నబ్ధిరశనాం వశమనైషీత్ ।తదాత్మజః పోతాంకుశః పంచదశవత్సరాణ్ మహీ న్నిస్సపత్నా మకార్షీత్ । తత స్త ద్భ్రాతుస్సుతః కలింగలాంకుశో ద్వాదశ వత్సరాణ్ కలింగా నలంచకార । తత స్తస్య పితృ భ్రాతా సప్తవర్షాణ్ గుణ్డమరాజో మహీ మణ్డలమణ్డనో బభూవ । తస్యానుజ శ్చతుర్థః కామార్ణ్ణవః పంచవింశతింవర్షాన్ వసుంధరా మనుబభూవ । తయోః కనీయా న్వినయాదిత్యో వర్షత్రయం ధరిత్రీ మత్రాయత । తత స్తజ్జ్యేష్ఠస్య కామార్ణ్ణవస్య సుత శ్చతుర్థో వజ్రహస్తః పంచత్రింశత మబ్దకాణ్ మహీ మిభమదజలధారాభి రభ్యషించత్ ..." (పం: ౬౩-౭౫)

## గాంగవంశవృక్షము

'క' — (వజ్రహస్తుని శాసనముల ననుసరించి)




4. భారతి, సం. ౨, పుటలు ౧౦౯-౧౧౦.

* ఈ సంఖ్యలు పరిపాలకక్రమమును దెలుపును.

§ కుండలీకరణమునను్న యీసంఖ్యలు ఆయారాజు లెంతెంతకాలము రాజ్యమేలినది తెలుపును. నెలలని వ్రాసిననేతక్క ఈ సంఖ్యలను సంవత్సరములుగనే గ్రహించునది.




వజ్రహస్తుని శాసనములయందలి వంశా వంశావతారికను 'చ' యని వ్యవహరిం వతారికను సౌకర్యముకొఱకు 'క' యని, తము. 'క', 'చ' లలో గానవచ్చు అనంతవర్మ చోడగంగుశాసనముల యందలి వ్యత్యాసము లివి:

(౧) 'క' యందలి ద్వితీయవజ్రహస్తుడు 'చ' యందు నాలుగవ వజ్రహస్తు డగుచున్నాడు.

(౨) 'క' యందలి ద్వితీయకామార్ణవుడు 'చ' యందు అయిదవ కామార్ణవు డగుచున్నాడు.

(3) 'క' యందలి మూడవవజ్రహస్తుడు 'చ' యందు అయిదవ వజ్రహస్తు డగుటయే కాక అతనిజనకులుకూడ మారిరి. 'క' ననుసరించి మూడవవజ్రహస్తుని తండ్రి ఆరుమాసములుమాత్రమే పరిపాలనము నెరపిన ద్వితీయ కామార్ణవ తనూభవుడు కాగా, 'చ' ననుసరించి యతడు పంచమకామార్ణవుని ద్వైమాతుర సోదరుడగు మధుకామార్ణవుని కుమారుడగుట విచిత్రము. ఇంతటి సమగ్రగాంగ వంశావతారక్రమమును దెలిపిన అనంతవర్మ చోడగంగుకు తన తాతతండ్రినిగూర్చి తెలియదందమా? వజ్రహస్తునికే తనజనకునిగూర్చి తెలియదందమా?

(౪) ఇంకను పూర్వపుతరములకు పోయి న-చో గుండమరాజ, నాలుగవకామార్ణవ, వినయాదిత్యులతండ్రిని 'చ' రెండవగుణార్ణవుని జేయగా, 'క' మొదటివజ్రహస్తుని జేయుచున్నది. ఇక 'చ' యం దుదాహృతులయిన 'పోతాంకుశ', 'కలింగలాంకుశులు' 'క' యందు గానరారు.

(౫) 'చ' యందలి ద్వితీయవజ్రహస్తుడు వినయాదిత్యజనకు డగు రెండవగుణార్ణవుని పితృవ్యుడును, మూడవకామార్ణవుని జ్యేష్ఠ సోదరుడు నగుచున్నాడు.

పైవ్యత్యాసము లటులుండ, గమనింప వలసిన మఱియొక విషయము కలదు: అనంత వర్మచోడగంగుశాసనములందలి వంశావతారికయందు వజ్రహస్తనామాంచితులు ద్వితీయ, చతుర్థులేకాని తృతీయుడు పేర్కొనబడియుండలేదు. ఈవిషయము నింతవఱ కెవ్వరు గమనించినట్లులేదు. పేరుచెప్పకుండ వదలివేసిన కలింగలాంకుశుని జనకుడే ప్రాయికముగ మూడవవజ్రహస్తుడు కావచ్చునని నాఅభిప్రాయము.

ఇక చరిత్రవిశేషములను బరిశీలించిన చో, ('క') వజ్రహస్తశాసనములవలన, ఇదివఱలో నుడివినట్లు, మొదటివజ్రహస్తుడే అయిదు ఖండములుగ చీలిపోయిన కళింగము నంతను శత్రువులను జయించి యొకటికావించి యేలినట్లు తెలియుచున్నది.

కాని యీవిషయమును అనంతవర్మ చోడగంగుశాసనములు తెలుపకపోయినను కళింగము మొదట నాలుగుఖండములుగ (అయిదుకాదు) విభక్తమయినట్లు తెలియగలదు. చోడగంగు శాసనములు మొదట పౌరాణికవంశకథనముతో ఆరంభమగును. అకథనమునంతమున ప్రగల్భు డనువానికి కోలాహలుడు పుట్టినట్లును, ఇతడు గంగవాడి విషయమున కోలాహలమను పురమును నిర్మించినట్లును, అతనికి విరోచనుడు కలిగి

నట్లును జెప్పబడెను. విరోచనుని యనంతర మున గాంగవంశజులు౮ గుమంది రాజులు కోలాహలపురమున పరిపాలనము నెరపిరి. పిదప నావంశమున వీరసింహుడు జనించెను. ఇతనికి కామార్ణవ, దానార్ణవ, గుణార్ణవ, మారసింహ, వజ్రహస్తులని యయిదుగురుకొడుకులు పుట్టిరి. తనపినతండ్రి తన రాజ్యము నాక్రమించుకొనినను అతనితో విరోధింపక యారాజ్యమును విడిచి కామార్ణవుడు తననలువురిసోదరుల తోను బయలుదేరి తూర్పుదిశ కరిగి మహేంద్రగిరిమీది గోకర్ణస్వామి నారాధించి, ఆస్వామియనుగ్రహమున ఛత్ర, చామరాది రాజ్యచిహ్నములను బడసి, పిదప శబరాదిత్యుని జంపి కళింగమును గైకొనెను. దంతాపురము (దంతపురము) ఇతనిరాజధాని. తనకు సంతానము లేనికారణమున గా వచ్చును దానార్ణవుని యువరాజును గావించి కామార్ణవుడు మిగిలిన తనసోదరులలో గుణార్ణవుని కంబవాడివిషయమును, మారసింహునకు సోదామండలమును, వజ్రహస్తునికి కంటకవర్తనియు నొసంగెను.

అనంతవర్మ-చోడగంగుశాసనములం దభివర్ణితమయినది దానార్ణవుని వంశావతారక్రమము. కామార్ణవుడు కళింగమును జయించి తనసోదరుల కంబవాడివిషయాదుల నొసంగినట్లు చెప్పబడుటవలన నామండలములు కళింగమునందలి విగనే గ్రహింపదగును. ఇట్లు భిన్నరాజపరిపాలిత మయిన కళింగఖండములనే 'క' యందలి ప్రథమవజ్రహస్తుడు భుజబల పరాక్రమములవలన జయించి యేకీకరించి పాలించినట్లు చెప్పుట యుచితము. అయితే 'క' యందు గాంగవంశజులు త్రికళింగమును పాలించినట్లు చెప్పబడగా 'చ' యందు వారు కళింగాధిపతులుగనే అభివర్ణితులగుట గమనింపవలసిన విషయము.

'క' యందలి రెండవవజ్రహస్తునిగూర్చి చెప్పబడినవిషయ, మనగా నతడు వేయిమదగజములను దానముచేసె నన్నసంగతి 'చ' యందును (నాలుగవవజ్రహస్తుని విషయమున) వర్ణింపబడినది.

వజ్రహస్తునిశాసనములవలన దెలియనివి, ఒక్క-చోడగంగుశాసనములవలననే తెలియవచ్చునవి పైని కళింగఖండవిషయచర్చ యందు కొన్ని తెలుపబడినవి. మిగిలిన వివి: దానార్ణవుని పరిపాలనము ననంతరమున అతని కుమారుడు నగరము అనుపురమును రాజధాని కావించుకొనెను. అచ్చట నొక మధూకవృక్షముననుండి పుట్టిన ఈశ్వరునకు మధుకేశుడను పేరుపెట్టి యొకపెద్ద దేవాలయము కట్టించెను. ఈసందర్భమున గంజాంజిల్లా పర్లాకిమిడితాలూకాయందలి ముఖలింగము ప్రాచీనశాసనములందు (పరగాంగులనాటివి) కాలింగదేశనగరమని, కాలింగావనినగరమని, కలింగనగరమని, నగరమని వ్యవహరింపబడె ననియు, అచ్చటిదేవునికి మధుకేశ్వరుడని, నగరానవీటి మధుకేశ్వరుడని నామములు గలవనియు జ్ఞాపకముంచుకొనదగును.

చోడగంగుశాసనములు చెప్పు మరి యొకవిశేష మేమన, మూడవకామార్ణవుడు జయింపనిచ్చగోని వచ్చిన యేడుగురుసుభ టుల నొక్కబాణముతో గడతేర్చెనని.

వజ్రహస్తునియొక్క, అనంతవర్మచోడ గంగుయొక్క శాసనములలో నిచ్చిన వంశావ తారికలకు గల భేదమును జూచి చోడగంగు శాసనములవలన దెలియవచ్చు వంశావ తారిక సరియయినదికాదని, వజ్రహస్తుడే ముందటివాడు గనుక అతనిశాసనములలో నిచ్చిన యవతారికయే విశ్వసనీయమయిన దని వాదించుచున్నారు కొందఱు. కాని యిది యనాలోచితము. ముందటివా రగుటకు వెనుకటివా రగుటకు తాతామనుమ లిరువురికి గల యంతరము ముప్పదితొమ్మిదిసంవత్సర ములే. ఇందు వెనుకముందు లేమి? ఈకారణ మును పురస్కరించుకొని చోడగంగు తెలి పిన వంశావతారిక నెగురగొట్టజూచుట అయు క్తము. అదియటులుండ, చోడగంగువంశావ తారిక యంతయు వట్టికల్పన మనుట యుక్తము కాదు; ఏలయన, పూర్వాపరగాంగులకు పరస్ప రము సంబంధముకలదన్నది ఇపు డెల్లరు నంగీకరించుచున్న విషయమే. పూర్వ గాంగ శాసనప్రదాతల తండ్రులలో దానార్ణవ, గుణార్ణవ, కామార్ణవ నామాంచితులు కొం దఱు కలరు. ఈ కడపటియిరువురును వజ్ర హస్తుని శాసనములలో పేర్కొనబడ్డవారే కాని దానార్ణవుడు చోడగంగు ('చ') వంశా వతారికయందుమాత్రమే కానవచ్చును. అట్టిచో నావంశావతారికను సృష్టియని యెట్లు త్రోసివేయగలము? మఱొకవిషయము — చోడగంగుశాసనములవలన వినయాదిత్యు నికి వజ్రహస్తశాసనములందు పేర్కొన బడిన గుండమరాజ, కామార్ణవు లే కాక పోతాంకుశునితోను, మన మీది వఱలో తృతీయవజ్రహస్తుడు కావచ్చునను కొన్న, పేరుచెప్పని మరియొకనితోను గలిసి మఱియిద్దరు సోదరు లున్నట్లు తెలియును. వజ్రహస్తశాసనముల ననుసరించి వట్టికల్పన మని యీ యిరువురిని కొట్టివేయుట సులభమే కాని అట్లుచేయ వీలుకనబడదు. పోతాం కుశు డొక డుండినట్లు శాసనప్రమాణమే కలదు. శకవర్షము ౧౨౦3 నాటి అనంతవర్మ వీరశ్రీనారసింహరావుతుదేవర సింహాచల ము శాసన మొకటి[5] యతడు గంగవంశ మున రాజులకు రాజ్యాభివృద్ధిగా శ్రీ నర సింహనాథునికి పోతాంకుశదేవు డిచ్చిన రెం డూళ్లు పూర్వదత్తము ప్రతిపాలించి యిచ్చి నట్లు తెలుపుచున్నది. ఈ విషయ మింతవఱ కెవ్వరును గమనించినట్లు కనబడదు.

పై కారణములవలన రెండువంశావతారి కలకు — వ్యత్యాసము లేకారణములవల్ల కలి గినను — సమన్వయింప బ్రయత్నించుటయే కర్తవ్యము. ఈదృష్టితో మధుకామార్ణవునికి

5. S. I. I., Vol. VI, no. 1118.

సంతానములేక పెంచుకొన్నకారణముననో యేమో వజ్రహస్తుడు చోడగంగు వంశావతారికయందు అతనికుమారుడుగ దెలుపబడినాడని సరిపెట్టుకొనవచ్చును. కామార్ణవ, గుండమరాజ, మధుకామార్ణవసోదరులతండ్రి రెండువంశావతారికలయందునువజ్రహస్తుడే-ఒకదానిప్రకారము నాలుగవవాడయిననేమి, వేఱొకదానిప్రకారము ద్వితీయుడే యైననేమి—. రెండింటిలోను ఈవజ్రహస్తుని తండ్రి కామార్ణవుడే. పినతండ్రి పెదతండ్రులు వరుసగా వినయాదిత్య గుండమరాజులే. చోడగంగు వంశావతారికయందిక అధికము పోతాంకుశుడును, అతనిసోదరుని తనయుడు కలింగలాంకుశుడును జూపబడినారు. మూడవ వజ్రహస్తుని విషయమున పై సమన్వయము కావించుకొనినచో ఇంతవఱకు రెండువంశావతారికలకు భేద మేమియు గాన్పింపదు. వజ్రహస్తుడు తెలుపని మఱికొందఱను — అత డేమి కారణముననో విడిచిపెట్టినవారిని — అనంతవర్మచోడగంగు పేర్కొనుట తప్పనుకాదు. అట్లుపేర్కొనినందువలన అత డిచ్చిన వంశవృక్షము విలువ చెడుటయులేదు. ఇక నున్నపెద్దతేడా వినయాదిత్యాదుల జనకునివిషయముననే. వినయాదిత్యుని తండ్రి నొకటిగుణమహార్ణవుని జేయగా, మఱియొకటి వజ్రహస్తుని జేయుచున్నది. మన మిదివఱలో చేసిన యూహననుసరించిచూచినచో 'క' యందు తండ్రిగా నుండిన వజ్రహస్తుడు 'చ' యందు కుమారుడు (పోతాంకుశసోదరుడగు తృతీయవజ్రహస్తుడు) అగుచున్నాడు. ఇంత మాత్రమున అనంతవర్మచోడగంగువంశావతారికయంతయు అవిశ్వసనీయమని త్రోసివేయుట అధర్మము.

---



నల్లనిఅంచ S. M.

# చెఱకు

యం. లక్ష్మీకాంతం

చెఱకు మన మనాదినుండియు నెరిగినపంటయే. అది మనకు దేశీయమైనదని చెప్పుటకు పెక్కు నిదర్శనము లున్నవి. పూర్వ మెకప్పుడు రెల్లువలెనుండి, తరతరములనుండియు సాగుచేయబడి, చెఱకు ఇప్పటి కీస్థితికి వచ్చినది. ఇప్పు డీపంటకు అనేకకారణములవలన గొప్పప్రాముఖ్యము వచ్చినది. జూన్ ౭, ౮-వ తారీఖులలో జరిగిన పంటల ఏర్పాటుసభ (Crop-planning Conference) లో ప్రతిరాష్ట్రముకూడ చెఱకు నభివృద్ధిచేయ నాతురతయున్నట్లు సూచించెను. ఈపంట ఇంతముందునకు వచ్చుటకు కారణము లేవన:—

౧. చెఱకుకు ఎక్కువ యెరువువేయవలెను. తరువాత వచ్చుపంట లందువలని లాభమును పొందును.

౨. ధాన్యము, గోధుమలు అమ్ముటకు మనము ఇతరదేశములపై నాధారపడవలెను. చెఱకు, చెఱకునుండివచ్చు పంచదార మున్నగునవి అమ్ముడుపోవను భయము మన కక్కరలేదు. మనకు ౧,౦౦౦,౦౦౦ టన్నుల పంచదార ఏటేట కావలెను. ఇప్పుడు ౭౫౦,౦౦౦ టన్నులు మాత్రమే మనదేశములో తయారగుచున్నది. కనుక మనము చెఱకుపంట నెక్కువగా పండించవలెను.

౩. ఈ పంట చాలా లాభము నిచ్చువానిలో నొకటి. దీనిఆకు పశువులకు మేతయగుచున్నది. నవంబరునుండి మార్చివరకు సాధారణముగా సోమరులైయుండు డెల్టాజిల్లా రైతులకు చెఱకుకోత, బెల్లము చేయుట మున్నగునవి చాలా పనిని కల్పించును; జీవనోపాధి నొసగును.

౪. ఏపరిశ్రమలోనైనను, సాధారణముగా ముడివస్తువుల ఖరీదు తయారైన వస్తువుల ఖరీదుకన్న చాల తక్కువగా నుండును. (ఉదాహరణ: ఉక్కు తయారుచేయుట కుపయోగింపబడు గనిలోనుండి తీయబడిన ఇనుముధర ఉక్కుఖరీదులో ౧/౧౦ వ వంతు కూడ నుండదు.) కాని పంచదారపరిశ్రమలో పంచదార ఖరీదులో ౨/౩ వ వంతు చెఱకుగడలదే. కనుక చెఱకు పండించు రైతులకు మంచిలాభము. మిగిలిన ౧/౩ వ వంతులో కొంతడబ్బు పంచదారమరలలో పనిచేయు పాటకజనమునకు లభించును. ఏపంటలోను, ఏపరిశ్రమలోను ఇంతలాభము బీదరైతులకుగాని, పాటకపు జనులకుగాని ఉండబోదు. ముఖ్యముగా వ్యావసాయికమైన మనదేశమునకు చెఱకువంటి పంట చాలా లాభదాయకము. అట్టి ప్రాముఖ్యము పొందిన చెఱకుసాగువిషయమై మనరాజధాని పరిస్థితుల కొంచె మవలోకింతము.

హిందూదేశములో ఈపంట ముఖ్యముగా సంయుక్తపరగణాలలోను, బీహారు, ఒరిస్సా, పంజాబు, పశ్చిమోత్తరపరగణాలు, బొంబాయి చెన్నరాజధానులలోను పండింపబడుచున్నది. ఉత్తర హిందూస్థానములోని చెఱకు సన్నముగా నుండును. మనరాజధాని, బొంబాయిరాష్ట్రములలోని చెఱకు లావుగా నుండును; ఎక్కువనీరు నాసించును. చెన్నరాజధానిలో ఈపంట విస్తీర్ణము ౧,౧౮,౧౦౫ యకరములు. ఇందులో ౩-వ వంతు విశాఖపట్నంజిల్లాలో నున్నది. తూర్పుగోదావరి, బళ్లారి, దక్షిణఆర్కాటు, చిత్తూరు, కోయంబత్తూరు జిల్లాలు ఒక్కొక్కటి ఏడెనిమిదివేల యకరములు పండించును. గంజాం, తిరుచునాపల్లి ఒక్కొక్కటి సుమారు ౫౦౦౦ యకరములు, దక్షిణకానర, సేలము, ఉత్తరఆర్కాటుజిల్లాలు ఒక్కొక్కటి ౩,౫౦౦ యకరములు, అనంతపురము, మధుర ౨,౦౦౦ యకరములు చొప్పున ఈపంటక్రింద సాగుచేయుచున్నవి. మలబారు, నెల్లూరు, కృష్ణాజిల్లాలలో ౧౮౦౦ యకరములకంటె ఎక్కువ ఈపంటక్రింద లేదు. ఇప్పుడిప్పుడు ఈపైరు నెక్కువచేయుటకు ప్రయత్నములు చురుకుగా చేయుచున్నట్లు విందుము.

## నే ల

రేగడిఇసుక సమ్మిళితమైన నేల (Loam)లో చెఱకు దివ్యముగా వర్ధిల్లును. ఆనేలకడుగున, నీరు క్రిందకు పారుట కవకాశమిచ్చు ఒకపార గుల్లగా నున్నది యుండవలెను. నీరు నిలుకడగా చాలాసేపు నేలలో నిలువరాదు. అటుల నీరునిలచినయెడల విత్తనముబాగా మొలకయెత్తదు. పంట బాగాపెరుగదు. రాబడి తగ్గును. మరీ ఇసుకవలెనున్న భూమిలో ఈపంట పండించుట చాలాకష్టము. నీరు చాలా అవసరము. ఎరువు ఎక్కువ వేయవలయును. ఇట్టిభూమిని బాగుచేయవలయు నన్న నీలిఆకు (నీలిమందు మొక్కఆకు) జనుముఆకు మున్నగు నవి భూమిలోనికి దున్ని కప్పివేయవలెను. అవి కుళ్లి మంచి యెరువగుటయేగాక నేలలో విడివిడిగానున్న అణువుల నన్నిటిని దగ్గరగా చేర్చును. అపుడు భూమికి ఎక్కువనీరు నిలుపుకొనుశక్తి గలుగును.

## పైరులమార్పు

పల్లపుభూములలో చెఱకు,వరి చెరియొక సంవత్సరము వేయుచుందురు. గోదావరి, కోయంబత్తూరు జిల్లాలలో కొన్నిప్రదేశములలో రెండు సంవత్సరములు వరి,ఒకసంవత్సరము చెఱకు, రెండుసంవత్సరములు వరి, మూడుసంవత్సరములు అరటిమొక్కలు, పండింపబడు చున్నవి. కోయంబత్తూరులోనే తమలపాకులు చెఱకు కూడ ఒకదానితరువాత నొకటిగాని, మధ్య వరిపంటతో గాని సాగుచేయబడుచున్నవి. హాస్ పేట తాలూకాలో ఒకేపొలములో ప్రతివత్సరము చెఱకు నాటుటకూడకద్దు.

తోటభూములలోవేయు ప్రతిపంటయును చెఱకుకు వెనుకగాని, ముందుగాని రావచ్చును. హిందూపురము తాలూకాలో పొగాకుతరువాత వచ్చు చెఱకు బాగాపండునను నమ్మకము గలదు. చోడి మున్నగు పంటలు చెఱకుకు సాధారణముగా ముందువచ్చును.

## రకములు

చెఱకులో చాలారకములున్నవి. కొన్ని నమలుట కుపయోగకరమైనవి. కొన్ని బెల్లము తయారుచేయుట కుపయోగింపబడును. కోయంబత్తూరుజిల్లాలో ముఖ్యముగా సాగుచేయునది 'పూవన్', 'వెళ్లై' అనునవి. పూవన్ నమలుట కుపయోగింతురు. దానినుండి చేసిన బెల్లం నల్లగానుండును. వెళ్లై మంచిబెల్లము నిచ్చును గాని ఎక్కువ నీరు తీసికొనును. హాస్ పేటలో పొట్టకబ్బు, జవారికబ్బు అను రకములు పండింపబడు చున్నవి. కోయంబత్తూరులో ప్రభుత్వమువారు చెఱకు నభివృద్ధిచేయుట కేర్పరచినశాఖవారు కొన్ని మంచి చెఱకుల నుత్పన్నము చేసిరి. వాటిలో ముఖ్యమైనవి కో ౨౧౩, ౪౦౭,౪౦౨,౪౨౧, ౪౧౪, ౭౧, ౨౫౦. వీటినికూడ నూటికి ౩౯ మంది వాడుచున్నారు. కో. ౨౧౩ కు అంతగా నీరు అవసరములేదు. సామర్లకోట, అనకాపల్లీ మున్నగు దేశములలో దీనిని పండించి చూచిరి. వానగాక, రెండుమూడుసార్లు నీరుపెట్టి దీనిని పండించవచ్చును.

## విత్తనముల నాటుటకు భూమిని తయారు చేయు విధము

సాధారణముగా భూమిని బాగుగా దున్ని అది వరకుపంటయొక్క దుబ్బులను తీసివేయవలెను. కొన్ని ప్రదేశములలో (గోదావరిజిల్లా) గడ్డపలుగుతో భూమిని త్రవ్వుట కద్దు. దక్షిణ ఆర్కాటులో తమలపాకుల తర్వాత చెఱకువేయునపుడు, తమలపాకుల తీగలున్న గట్లను, వాటిప్రక్కనున్న బోదులను పారతో త్రవ్వి సమము చేయుదురు. ప్రతిచోట సాధారణముగా అడ్డముగాను, నిలువుగాను ౪, ౮ మార్లు దున్నుదురు. హాస్ పేటలో నాలుగుసార్లుమాత్రమే దున్నుదురు. హిందూపురములో ౮ లేక ౧౨ సార్లు దున్నుదురు. మధ్యమధ్య, నాగలిని మానివేసి భూమిని సమము చేయుటకును, గట్టలను పగుల్చుటకును గుంటకను తోలుదురు. ఇనుపనాగళ్లలో మొదట 'విక్టోరి' అనుదానితో దున్ని, 'మన్ సూన్' అనుదానితో తరువాతదున్ని భూమినితయారు చేయవచ్చును.

## ఎరువులు

గోదావరిలో సాధారణముగా ఆకు ఎరువు (Green manure) వేయుట అలవాటు. ఆకు దొరకనప్పుడు పేడ మున్నగునవి వేయుదురు. పొలము దున్నునపుడు (౧-వ సారిగాని, ౨-వ సారిగాని) ఈ ఎరువు జల్లికలిపి దున్ని వేయుదురు. కోయంబత్తూరులో మాగాణిభూములలో పేడవేయుట అరిది. ఆకుగాని, చెరువు మన్నుగాని వేయుదురు. తోటభూములలో తప్పక గొర్రెపెంట వేయుదురు.

ఎరువు దున్నివేసిన తరువాత గోదావరిజిల్లాలో పొలమంతయు సన్నచీలికలుగా విభజింపబడును. ఈ చీలికలు పొలముమిట్టపల్లములమీదను, నైశాల్యము మీదను ఆధారపడియుండును. భూమి సమతలముగా నున్నయెడల మూడునాలు గడుగుల కొక బోది త్రవ్వుదురు. ఇది మురుగునీరును నిలుకడగా నుండనీక కొనిపోవును. దక్షిణఆర్కాటుజిల్లాలో ఈమళ్లు చిన్నచిన్నవిగా చేయుదురు. వాటిలో చిన్నచిన్న గట్లు, చాళ్లు (**Ridges & furrows**) చేయుదురు. కోయంబత్తూరులో బాగా పొడుగుగా గట్లు, చాళ్లు చేయబడును. గట్టుకుగట్టుకు ౨½ మొదలు 3 అడుగులదూరముండును. హాస్పేటలో మామూలు నాగలికి ఒక చిన్నబల్ల కట్టి దున్నుదురు. అపుడు తయారైనగట్లు చాళ్లు పారతో సరిచేయుదురు. గట్టుకుగట్టుకు ౧½ అడుగుల దూరము. గట్లు చాళ్లు తయారుచేయుటకు ఇనుపనాగళ్లు కలవు.

## విత్తనములు - వాటిని నాటుట

చెఱకుగడలు విత్తనములవలన పెంపొందింపబడుటలేదు. ఈమొక్కకు గింజ లున్నసంగతి కొద్దియేండ్ల క్రితమువరకు ఎవరికిని తెలియదు. గడను చిన్నముక్కలుగా నరికి పాతిపెట్టుదురు. ఒక్కొక్కముక్కలో సాధారణముగా మూడుకణుపు లుండును. కొన్నిచోట్ల గడ నంతయు నరికి ముక్కలు పాతిపెట్టుదురు. ఈవిధముగా చేసినయెడల అన్నిముక్కలు మొలకెత్తవు. కొన్నిచోట్ల తలలుమాత్రము (మొదటి ౨ అడుగులు) నరికి పాతిపెట్టుదురు. ఇప్పుడున్న ముక్కలు మొలకెత్తును. ఇది మొదటిపద్ధతికన్న మంచిది. రెండింటిలోను కొన్ని లోపము లున్నవి.

మనము తిను పంచదారకు 'సుక్రోసు' అనిపేరు. దానిలో 'గ్లూకోసు', 'ఫ్రక్టోసు' అను రెండు రకముల పంచదార లుండును. గ్లూకోసు చెఱకుగడ తలలో (మొదటి ౨ అడుగులు) యెక్కువగా నుండును. అది యెక్కువగా నున్న ముక్కలన్నియు మొలకెత్తును. అందువలన తలలలో నున్న ముక్కలనే పాతవలెను. కాని చెఱకుతలలను నరికినప్పుడు అందులో పురుగులున్నది లేనిది పరీక్షించుట కష్టము. ఆపద్ధతిలోని లోప మిదియే. చెఱకుగడ అంతయు నరికి ముక్కలు పాతినయెడల వాటిలో పంచదార యెక్కువగా నుండును. చద లెక్కువపట్టును. అందువలన గడ తలలు నరికి పాతుట మంచిది. విత్తనములకొరకు చెఱకును చిన్నచిన్న పొలములలో పల్లెటూళ్లకు దగ్గరగా నాటుదురు. వరిపంటకు ఆకుమడులవలె నివి యుపయోగపడును. ముక్కను నాటుటకు పూర్వము దానిలో కణుపుదగ్గర మొగ్గ ఉన్నది లేనిది చూడవలెను. మొగ్గలేనిది మొక్కరాదుగదా. చదలబారినుండి తప్పించుటకు వాటిని క్రూడ్ ఆయిల్ ఇమల్షన్‌లో ముంచి పాతిపెట్టుదురు. పాతిపెట్టుటకు పూర్వము గంజాంలో ౧౨ మొదలు ౨౪ గంటలవరకు నీళ్లలో ముక్కలను ముంచుదురు. అపుడు పంచదార చాలవరకు పోవును. చదలబాధ తగ్గును. తల్లిపరంబలో ఈముక్కలు ఆవుపేడలో ముంపబడును. తరువాత వీటిని చిన్నచిన్న పోగులుగా ఒకమంచెమీదవేసి, వరిగడ్డి కొంచెముకప్పి, ప్రతిదినము కొద్దిగా నీళ్లుపోయుదురు. అప్పుడు మొలకలు పైకివచ్చును. ఆముక్కలను తీసికొని పాతిపెట్టుదురు. దక్షిణకనరాజిల్లాలో తలలు నరకి వాటిని ఒక వారముదినములు వడలనిచ్చెదరు. తరువాత కట్టలుకట్టి ఒకరోజు నీళ్లలో నుంచెదరు. తదుపరి కట్టలు విప్పి, నీడలోపెట్టి, మొలకలు బయటికి వచ్చుదనుక ప్రతిదినము నీళ్లుపోయుదురు. తరువాత భూమిలో పాతిపెట్టుదురు. గోదావరిలో ఈముక్కలను చింపరవందరగా పడవేసి భూమిలో పాతుదురు. గట్లుచాళ్లుచేసినచోట చాళ్లలో

ముక్కలు నిలువుగాగాని, అడ్డముగాగాని వేసి గట్టుతవ్వి నీటిని కప్పుదురు. అదివరకు గట్టున్నచోట చాలు, చాలున్నచోట గట్టు వచ్చును. చాలులో నీరువచ్చును. గోదావరి, కోయంబత్తూరు, గంజాంజిల్లాలలో చాలా ముక్కల నుపయోగింతురు. (యకరమునకు ౩౦ మొదలు ౪౦ వేల వరకు) బళ్లారి, హాస్‌పేట మున్నగు చోట్ల చాలతక్కువ (౬-౧౦ వేలే) సాధారణముగా ఎచటనైన సరే పొలమునకు మొదట నీరుపెట్టి తరువాత ముక్కలు నాటుదురు. గోదావరిజిల్లాలో ఫిబ్రవరి, మార్చి నెలలలో విత్తనములు నాటుదురు. కోయంబత్తూరులో ఫిబ్రవరిలోగాని, ఆగస్టులోగాని నాటుదురు. మాగాణిభూములలో సాధారణముగా ఆగస్టునెలలో నాటుదురు.

## నీరు

కోయంబత్తూరులో చెఱకు ఎక్కువగా నూతినీటిమీద ఆధారపడియుండును. దక్షిణఆర్కాటులో చెరువులమీదను, గోదావరిలో కాలువలమీదను, విశాఖపట్నంలో వీటన్నిటిమీదను చెఱకు నీటికొరకై ఆధారపడియుండును. ౮ మొదలు ౧౦ రోజుల కొకసారి ఈ పైరుకు నీరుపెట్టవలెను. చెఱకుపంటకు కనీసము ౭౦ మొదలు ౧౦౦ అంగుళములనీరు కావలెను. ముక్కలు పాతిన మూడువారములకు మొలకలు పైకి వచ్చును. కొన్నిచోట్ల మొలకలు పైకిరావు. అటువంటి ప్రదేశములలో పాతుటకు మొలకెత్తిన ముక్కలు కొన్ని సిద్ధముగా నుంచుకొనవలెను.

## తరువాతి సాగుబడి

పంట ఎదుగుచున్నప్పుడు ఎరువువేయుట ఈ రాజధాని అంతటను అలవాటు. విశాఖపట్నం, కోయంబత్తూరులో కొంతభాగము మొదలగుచోట్ల జిల్లేడు, గానుగ, నీలి మున్నగు చెట్లయొక్క ఆకులను మూడవమాసములో వేయుదురు. ఇపుడు కోయంబత్తూరు జిల్లా అంతా వేరుశనగపిండి, అమ్మోనియమ్ సల్‌ఫేటు కలిపి రెండుదఫాలుగా (౩, ౪ మాసములలో) వేయుచున్నారు. గోదావరిజిల్లాలో ఆముదపుపిండి యకరమునకు ౧౬౦౦ పౌనులచొప్పున వాడుచున్నారు. దక్షిణ ఆర్కాటుజిల్లాలో యకరమునకు ౨,౦౦౦ పౌనుల వేరుశనగపిండి వేయుదురు. సాధుపుగా ఎరువువాసవలె నన్న ఆకు, పిండి కలిపివేయవలెను. ఒకయకరము చెరకుకు ౧౦౦ పౌనులు నత్రజని అవసరము. దీనినిబట్టి అంచనావేసి ఎరువు ఎంతెంత గావలెనో నిర్ణయము చేయుదురు.

ముక్కలుపాతిన పదిరోజులకు ఒకసారి పొలమంతయు తొల్లికతో తవ్వవలెను. ఇది పైన గట్టిగానున్న మట్టిని ఛేదించి మొలకలు పైకివచ్చుటకవకాశము నిచ్చును. ఒక నెలదినము లైనతరువాత కలుపుదీయుటకు ఇంకొకసారి త్రవ్వవలెను. తరువాత పంట ఉన్నంత కాలములో రెండుసార్లు తొల్లికతో పనిచేయుట, రెండుసార్లు కలుపుతీత అవసరము. బళ్లారిలో తొల్లికతో మాత్రము పనిచేయరు. కలుపుతీయుదురు. నెలకొకసారి మొక్కలమొదలులో నున్న మట్టిని పైకెగద్రోయవలయును. గోదావరిజిల్లాలో చెరకుఆకును గడచుట్టు చుట్టుట, వాసములను చెఱకుగడలకు పోటీపెట్టుట అలవాటు. అచట గాలి అధికము. గడలు చాలా ఎత్తుకు పెరుగును. అందువలన ఇది అవసరము. హాస్‌పేటలో ఆకు మాత్రం గడచుట్టు చుట్టుదురు. గోదావరిలో మొక్కకు ౪-వ నెల వచ్చువరకు దానినుండి వచ్చు పిలకలను తీసివేయుదురు. ఇదిగాక కార్తికమాసములో పొలమును తప్పక తొల్లికతో తవ్వుదురు. ఇవిరెండు చేసినయెడల పంట తొందరగా తయారగునని అచటివారి నమ్మకము. హిందూపురములో ఆకులు గడచుట్టు చుట్టుటయే గాక ఒకమొదలులో నున్న గడలనన్నిటిని త్రాటితో కట్టుదురు. ఈమొదళ్ల నొకదానికొకటి కట్టుదురు. ఈతాళ్లచుట్టు చెరకుఆకులనుగూడ చుట్టుదురు.

పైరు కోయుటకు సిద్ధముగానున్నపుడు:

౧. గడమీద ఆకులన్నియు దగ్గరదగ్గరగా మొలచును. ౨. ఆకులు కొంచెము పెల్లదనము వహించును. ౩. గడనుకోసి సూర్యకాంతి కెదురుగా పెట్టినయెడల కోయబడినప్రదేశము మెరయును. ౪. రసము కొంచెము

బంకగానుండును. కోతకుపూర్వము ౨౦ రోజులు బాగా నీళ్లుపెట్టుదురు. గడలు బాగాఉబ్బును. అప్పుడు కోత మొదలుపెట్టుదురు.

యకరమునకు ౧౦,౦౦౦ పౌనుల బెల్లం గోదావరిజిల్లాలో లభించును. కోయంబత్తూరులో ౮౫౦౦ పౌనుల బెల్లము వచ్చును.

కోయంబత్తూరులో కోత, మరలో గడలను ఒత్తించుట, రసమునుగాచి బెల్లముచేయుట మొదలగు పను లన్నిటికి ౨౫౦ పౌనులకు (పొదికి) రెండు లేక మూడురూపాయలు పుచ్చుకొందురు. ౦-౧౨-౦ లేక, రు ౧-౦-౦ ఇచ్చిన మర, రసముకాచుటకు పెద్దపెనము మున్నగునవి అద్దెకు దొరకును. మూడురోలర్లుగలినెవ ఇనుపమరయే ఇప్పుడు ప్రతిచోటను ఉపయోగింపబడుచున్నది. అది చాలఉపయోగకరమైనది. ఒకగంటకు ౨౫౦ మొదలు ౩౦౦ గడలవరకు ఒకమర ఒత్తును. ౧౦౦కి ౮౯ మొదలు ౯౦ వంతులు గడలో రసముండును. ఈరసములో ౧౦౦కి ౬౦ మొదలు ౭౯ వంతులవరకు మరలో ఒత్తుటవలన లభించును.

ఈరసమును కాచకపూర్వము కొంచెము సున్నం వేయుదురు. వేయకపోయినయెడల బెల్లము గడ్డకట్టదు. రసము కాచునప్పుడు అందులోనున్న మురికి, నలకలు ముద్దగా పైకి తేలును. వీటిని పెద్దగరిటలతో తీసివేయవలెను. రసమును ౧౧౮° సెంటిగ్రేడువరకు కాచవలెను. తరువాత అచ్చులలో పోసినయెడల బెల్లము గడ్డకట్టును.

## జబ్బులు, పురుగులవలనినష్టము

చెఱకుకు చదలు ముఖ్యమైన శత్రువులు. ముక్కలు పాతకపూర్వము క్రూడ్ఆయిల్ ఇమల్షనులో ముంచినయెడల వీటిభయముండదు.

౫ రకముల కొంగళి పురుగులు గడలలోనికి తొలిచికొని వాటినినాశనముచేయును. ఇవి చిన్నమొక్కగానున్నప్పుడే ఎక్కువ చెరుపు చేయును. చిన్నమొక్కలను పరిశీలించి పురుగులున్నయెడల పీకివేసి కాల్చివేయవలెను. చెరకు ఈగ అనునొక పురుగున్నది. ఇది ఆకులను తినివేయును. ఇవివున్న ఆకులను జాగ్రత్తగాతీసి తగులబెట్టవలెను. చెఱకుమీద 'మొసాయిక్' అను ఒకతీవ్రమైన రోగము గలదు. ఆకులన్నియు తమ ఆకుపచ్చదనమును గోల్పోవును. ఆవిధమైన మొక్కలన్నిటిని పీకివేసి కాల్చివేయవలెను. ఆజబ్బులేని ప్రదేశములనుండి ముక్కలనుతెప్పించి నాటవలెను. ఆజబ్బును ధిక్కరించగల రకముల నుత్పన్నము చేయ ప్రభుత్వవ్యవసాయ శాఖాధికారుల నడుగవలెను. ఇంకను ఎఱ్ఱకుళ్లు (**Red Rot**), అనాసకాయజబ్బు (**Pineapple disease**) అను రోగము లున్నవి. వీటి కన్నిటికి జబ్బులేని ప్రదేశమునుండి ముక్కలు తెప్పించుకొనుట, జబ్బుఉన్న మొక్కలను నాశనముచేయుట, ముక్కలు పాతకపూర్వము క్రూడ్ఆయిల్ ఇమల్షనులో ముంచుట, కొన్నిఏళ్లు ఆప్రదేశములో చెఱకువేయకుండ యుండుట మున్నగునవి ప్రతీకారములు.

## పంట కగుఖర్చు

(సుమారు ౧ యకరమునకగు ఖర్చు)

| | | రూ. |
|---|---|---|
| విత్తనములు నాటుటకు, భూమిని తయారుచేయుటకు | ౩ మొ. | ౨౦ |
| మొదట ఎరువువేయుట, పరచుట | ౩౫ మొ. | ౪౦ |
| ముక్కలు, పాతుట (౧౫౦౦౦) | | ౪౦ |
| తరువాతవేయు ఎరువు | ౫౦ మొ. | ౬౦ |
| కలుపుతీత, తొల్లికతో త్రవ్వుటకు, మన్నెగత్రోయుటకు | | ౪౦ |
| గడలుకొట్టుటకు, ఒత్తించుటకు, బెల్లముచేయుటకు | | ౮౫ |
| నీరు నూతినుండి పెట్టిన | | ౮౫ |
| తాశీలైనయెడల | | ౧౦ |

మొత్తము పంటపండించుటకు సుమారు ౧౭౯ రూపాయ లగును. గడకొట్టించి ఒత్తించి బెల్లం నూతినీటి సహాయముతో తయారుచేసినయెడల ౩౩౯ రూపాయ లగును. కాలువనీరైనయెడల ౨౮౪ రూపాయ లగును.

ఇంతసొమ్ము చిన్నచిన్నరైతులు పెట్టుబడి పెట్ట జాలరు. కొన రైతులు కొంతమంది ఒకసహకారసంఘముగా నేర్పడి, ఈపంటకనుఖర్చులు ఆసంఘమునుండి పుచ్చుకొనుచు, పంటపండించవచ్చును. పంట నమ్మనప్పుడుకూడ మంచిలాభమున కమ్మవచ్చును. ఈపైరుకు వచ్చు జబ్బులను, పట్టు పురుగులను నాశనముచేయుటకు అనుభవజ్ఞులగువారిని సంఘముతరఫున రప్పించిన అందరిరైతుల కష్టములు తొలగును. గవర్నమెంటువారి వ్యవసాయశాఖోద్యోగులతో రైతులు తమసంశయములనుచెప్పి వాటిని నివృత్తిగావించుకొనవలెను. ప్రభుత్వమువారు సిండివాహింఘర్నెసు అనుదానిని కట్టించి దానిమీద పెనమువేసి రసముకాచమని సలహానొసగుచున్నారు. అది చాలమంచిది. మామూలుగా కాచుటకు అగుఖర్చుకంటె చాలాతక్కువ అగును. ఈవిధమైన కొత్తమార్గములను మంచివాటిని అనుసరించుచు రైతు లాభముపొందుటకు పెక్కుఅవకాశము లున్నవి. జాగ్రత్తగా సేద్యముచేసి సహకారసంఘములో సభ్యుడై, చెఱకుపండించు ప్రతిరైతు బాగుపడుననుట కెంతమాత్రము సందియము లేదు.



శాఖామృగము

—సూర్య.

# చీకటితప్పు

వేలూరి శివరామశాస్త్రి

(శ్రావణ భారతినుండి అనువృత్తము)

## 3
### (క)

నిమేష మనియు, కాష్ఠ యనియు, కల యనియు క్షణ మనియు నీరీతిగా కాలజ్ఞులు కాలమును విభజించి చూపిరి. కాని ప్రేమ యొకటి వచ్చిపడి యీ విభాగమును తాఱుమాఱు చేసివయిచుచున్నది. అనురక్తుల కాలమానమునందు యుగ మొకనిమేషము. వియుక్తుల కాలమానమునందు నిమేష మొకయుగము. ఈ వియుక్తులు స్వవిషయమున సగుణబ్రహ్మగారి కాలమానములోనివారు.

కాలమంతవడిగాఁ బరుగెత్తు నన్న మింకొకటి చూడమ్మసుబ్బారావులకు కానిపింపలేదు. సుబ్బారావుకు సెలవులలో శేషించిన యిరువదిరోజులే. ఈ యిరువదిరోజులును ఇట్టేమాయమయిపోవును. పిమ్మట వారికి కానిపించునది శూన్యము.

నడుమనడుమ చూడమ్మ తాను సుఖము చూరగొనె నని మురియుచుండెను. ఆమె యుపాధ్యాయుల యుద్దేశముమాత్రము వేరు. ఏలయనఁగా ఆమె తనపాఠములయెడ శ్రద్ధ చూపుట లేదు. రేపురేపులలో ఆమె జరిపిల్లిపెట్టుచుండెను. కావున శరీరమున సుఖములేదని వారనుకొనిరి.

ఇట్టిసుఖాసుఖములతో మొత్తమువిూఁద సుఖముతోడనే వారియిరువురకు ఆయిరువదిరోజులును దీర్ఘమయిన ఒకపగలుగా గడఁచిపోయెను.

సుబ్బారావు-ఉపయోగమునకుఁగాను ప్రాఁత చింతకాయపచ్చడియు, నిమ్మకాయబద్దయు, దబ్బకాయబద్దయు మాణిక్యము జాడీలలో భద్రపఱిచెను. ఆతిసరా చూచుకొనొ చూడమ్మ ఆవకాయయు, మాగాయయు, మెంతికాయయు జాగ్రత్తపఱిచెను. వేలువిడిచిన మేనమామ వేంకటేశ్వర్లు సుబ్బారావువస్త్రములను ట్రంకుపెట్టెలలో సర్దిపెట్టెను.

రాత్రి మేలుబండికి అతనిపయనము నిర్ధారితమాయెను. మిత్రులు కొంద ఱతనికి సుఖప్రయాణమాసించి చనిరి. 'ఈపయన మీరోజునకయినను ఆఁగిపోయినచో బాగుండిపోవు' నని తలఁచువారిలో నొకతెయగు చూడమ్మకడకు రామస్వామి వచ్చి 'అమ్మా! ఈరెండువందలరూపాయలనోట్లు, ఈచిల్లర బావకిచ్చి రైలుకు పంపిరమ్మ' అని చెప్పెను. వెలవెలఁబోయిన మోమును చూడమ్మ వెంటనే సరిచేసికొనెను. తండ్రిచేతినుండి మెల్లగా ఆకాకితములను దీసికొని బల్లమీఁదఁ బెట్టెను. రామస్వామి వెళ్లిన కొంతసేపటికి బయలుదేఱి అటిటుచూచి సుబ్బారావుకడ కేగెను.

సుబ్బారావు ద్వారశాఖలకు రెండుచేతుల నానించి నిలువఁబడియుండెను. అతనిచూపులు చక్రవాళమున కావలఁ బఱుచుండెను. కనిపించినను కనిపింపకున్నను అతఁడు కాంచునది శూన్యము. ఆ శూన్యమును నిత్యకల్యాణము పచ్చతోరణముగా మార్చుచు నతనియెదుట చూడమ్మ యావిర్భవించెను. సుబ్బారావామెను తనలో నైక్యముచేసికొనుటకో, లేక తానే ఆమెలో నైక్యమగుటకో రివ్వున ముందరికి పరుగిడెను. చప్పున చూడమ్మ తప్పుకొనెను. అతఁడు నిలువఁబడెను. ఆమె అతనిపాదములమీఁద వ్రాలెను. చూడమ్మముఖము సుబ్బారావుపాదములమీఁద నుండెను. తనపాదములు తడిసిపోవుచున్నటులు అతనికిఁ దెలిసెను. తెలియఁగనే అతఁడు — 'ఎందుల కీయకాల వర్షము? పాదములందు గంగను పుట్టించి నన్ను శ్రీమహావిష్ణువును చేయఁదలఁచితివా?' అని యనెను.

ధ్వనిలేకుండ గంగాప్రవాహ మప్పొంగుచుండెను. సుబ్బారావు వంగి యామెను లేవఁదీసి బాహు

వులలో బంధింప నుద్యోగించెను. ఆమె తప్పుకొని మొగము త్రిప్పుకొనెను.

సుబ్బారా విటులనెను — 'ప్రయాణము మాని నై చెదను.'

'వలదు. నాకోర్కి అది కాదు.'

'మఱి యేది?'

'మన పెండ్లికి సుముహూర్త మెపుడు?'

సుబ్బారా వీమాటకు డంగుపోయెను. ఏల యనఁగా 'బి. యే. ప్యాసుకానిది పెండ్లాడనని ఒట్టిడు కొంటి' నని లోఁగడ తాఁజెప్పినమాట కల్లమాట. కాన నది యిపుడతనికి వెంటనే తోఁపలేదు. కావున నేమియుఁ తోఁచక అతఁడు దిక్కులుచూచుచు నిలువఁబడెను.

'వినఁబడలేదా?' అని చూడమ్మ ఖంగున పలికెను. సుబ్బారా వపు డిటులు పలకకూర్చుకొని—వినఁబడకేమి? నీతలిదండ్రు లంగీకరించచో నాయడ్డేమి? 'ఊరికుండుము, ఊరిపసుపు; ఊఁగు దేవరా యనినచో ఊఁగకేమి?' అని యనెను.

ఈసా మెతకు చూడమ్మమొగము చిల్లెను. వెంటనే శాంతపడి 'నాతలిదండ్రు లంగీకరింపనిచో?' అని యామె ప్రశ్నవై చెను.

'వారు నన్ను పెంచిరి. ఈమాట గుఱుతుఉంచుకొనుము. మఱియు ఒకటి మఱచితిని. బి. యే. దాఁటనిది పెండ్లి చేసికొనననని ఒట్టిడుకొంటిని. కావున అది నేటిమాట కాదు.'

'నాఁటి మాటయే.'

'నాఁటికి నేఁడు బజానాయేల? అంతగా వలయునెడల నేనే తాకట్టు. ఉండు మందువా ఉందును; పొమ్మందువా పోదును. నీవు వత్తువా యేనుఁ గెక్కినటులు సంతసింతును.'

చూడమ్మయేకాగ్రతను భంగించుచు వాకిట నున్న మోటారుకారు కఱచునటు లఱచెను. చూడమ్మ ఉలికిపడెను. సుబ్బారావు నవ్వి యామె నాలింగనము చేసికొనెను.

'మంచిది. రైలువేళ అయినది. నాయనగారీ రెండువందల పయిచిలుకు మీ కిమ్మనిరి' అని చూడమ్మ రెండునోట్లను, కొంతపైకమును సుబ్బారావుజేబునఁ బడవయిచెను.

చూడమ్మ లేఁజెక్కులమీఁద సుబ్బారావు ప్రణయచిహ్నములు పడెను. చూడమ్మయు రాఁబోవు వియోగమునకు తగినంత పాథేయ మాతిథేయముగా నొసఁగెను.

(ఖ)

"ఏమండీ, పెండ్లి చేసి విడిస్తే మనభారం పోతుందికదా, అతనిభారమంతా మోస్తూవున్న మీరే పట్టినట్టు ఇల్లా ఊరుకుంటే ఎల్లా?" అని మాణిక్యమనెను.

"అవును. నేనూ అనుకుంటూనే వున్నాను. ఇపుడతనికి వస్తూన్న సంబంధాలకా అంతూ పొంతూ లేదు. నీవు చేసే ప్రోత్సాహానికిహూడా మితీమేరా లేదు. కాని అతగాఁడు బి. యే. మీఁద చూపెట్టుకుని,హూచున్నాఁడాయిరి" అని రామస్వామి అనెను.

"అదుగో మీరుగూడా అల్లాఅంటారే? లోకులేమంటారు? లోకులదాఁకా యెందుకు? మనకు మాత్రం తోఁచడం లా? అతనితలిదండ్రులే ఉంటే, ఉపేక్షిస్తారా? మనఅమ్మాయిని అతని కిద్దామని మీరంటే నేనే కంకపట్టుపట్టి చెడఁగొట్టి చేతులారా వైధవ్యం కొనుక్కొచ్చాను."

"ఆమాట నిజమే. ఎంతయినా మనం తలిదండ్రులం కాముగదా! ఈకాలంవారందటికీ బి. యే పిచ్చి. ఇదిపోందే పెండ్లాడరు. పెళ్లిచేసుకోమని పట్టుపటితే మనకే శత్రువులయి హూచుంటారు. పిడప పట్టపగ్గాలు ఉండవు."

"ఈమాట లన్నీ నిజమే. అతనిభారం మనమీఁద ఉండఁబట్టి మనం లోకానికి జంకాలె. ఆకుంచాల

వారూ, మంచాలవారూ మనమీఁదపడి యేడుస్తారు. వాళ్ల కీసంగతు లేమి తెలుస్తవి? పోనీండి. అతను పెద్దవాఁ డయినాఁడుకదా! అతనిడబ్బూ, అతనివ్యవహారమూ అతని కప్పగించెయ్యండి. దానితో మన పూచీ తొలఁగిపోతుంది."

"తొలఁగించుకోడానికి మూడుచిటికెలు పట్టదు. సరికాని బి. యే. ప్యాసుకానిదే పెండ్లాడనని అతఁడు పట్టుపట్టడానికి హేతువేమిటో నీవు కనిపెట్టావా?"

"అందులో ఏమంత అర్థంఉంది?"

రామస్వామి తనభార్య తెలివిమాలినతనమునకు వగచి యూరకుండెనుగాని మాణిక్యము ఊరకుండనిచ్చు మనిషి కాదు. 'దానిహేతు కేమిటి, దానిహేతువేమిటి? కొంచెం చెప్పండి, కొంచెంచెప్పండి' అని మాణిక్యము రామస్వామివెంటఁబడెను. రామస్వామి తట్టుకొనలేక యిటులనెను: నిన్ను నే నొకటి అడుగుతా. ఇది శాంతంగా ఆలోచింపఁదగిన విషయం. ఇష్టంఉంటే ఇయ్యకోవచ్చు, లేకుంటే లేదనవచ్చు. అంతేకాని కయ్యానికి దిగరాదు.'

'ఎంతమాటన్నా రెంతమాటన్నారు? కయ్యానికి దిగుతానా? అందులో మీతోనా? మీరుమొటితే మీవేలు ముద్దెట్టుకుంటాను.'

'అడవిజంతువులను పెంచినా కొన్ని మనిషిని నమ్మవు. దగ్గఱకు రానీయవు, అవిరావు. అందుకని వాటితో ఎప్పుడూ భయమే.'

'అమ్మ చూచారా? నన్ను పందినిగానూ, పిల్లినిగానూ వెక్కిరిస్తారా? పోనీండి! మీకనిపెట్టటాలు నాకేమీ అక్కఱలేదులెండి.'

'చూచితివా? ఈకాస్తకే శాంతినికోలుపోతివే! తొందరపడి అసలుసంగతే అనేసివుంటే చెవులే మెలిపెట్టేదానవో, విడాకులే ఇచ్చేదానవోకదా!'

'ఇఁక మీ రాసంగతి చెప్పకపోతే చెవులూ మెలేస్తాను, విడాకులూ ఇస్తాను'.

'అయితే విను. మనబస్తీలో అనేకమంది రెండోపెళ్లి చేసుకుంటున్నారు. నీకళ్లముందు ఒకవంద అయివుంటవికదా! వీట్లనుగుఱించి నీవుద్దేశం ఏమిటి?'

'ఇదా? ఏమిటో ఏమిటో అనుకున్నాను. నాకు మొదట విడ్డూరంగానే వుంది. ఇపుడిపుడు పరిసిపోయింది. నిజం చెపితే ఏమనుకుంటారో గాని చూడను గూడా ఏ మహానుభావుఁడయినా చేసుకుంటాఁడేమో అని వుంది. తీరా పెళ్లిచేస్తే వెలివేస్తారనే భయమూ వుంది. నిజంగా చెయ్యడం ఒకయెత్తు; వెలిపడడం ఒక యెత్తు.'

'మనము ఎప్పుడూ అట్టిదానిని తలపెట్టఁ గూడదు. పెండ్లిగాని, చావుగాని ఒకేమాటు.'

'ఈమాటలువేదాంతాలుగాని సంసారాలుగావు. చేసేవి సంసారాలున్నూ, చెప్పేవి వేదాంతాలున్నూ నాకు పనికిరావు. మీరు నన్ను విడిచిపెట్టినా సరేకాని నిజం చెప్తాను. 'నామనస్సు ఎన్నోసార్లు చలించింది. మీమనస్సు ఎప్పుడూ చలించలా? నిజం చెప్పండి.'

'మనసంగతులు తరువాత మాటాడుకుందాము.'

'అలా అయితే విధవాసభవారికి వేయిరూపాయిలు మీరెందు కిచ్చారు?'

'రాధాగుప్త ఊరేఁగుతుంటే నీ వెందుకు తలుపులు మూశావు?'

'అది నాకు సరికొత్త. తరువాత తరువాత తెలిసివచ్చింది. మొదట పాతక మనిపించింది. ఇపుడు పుణ్యమనిపిస్తూంది. ఈవిధవ పసికాయలను చూస్తూవుంటే, అందులోమనపిల్లని చూస్తూవుంటే చెయ్యకపోవడమే పైగా పాతకమని తోస్తూంది. ఇది నామాట. మీరు వేయి రూపాయ లెందుకిచ్చారో చెప్పండి!'

'మంచిదని తోఁచియే అప్పు డిచ్చాను. ఇపుడు నాకది చెడ్డదిగా తోస్తూంది.'

'ఇంట్లో పిల్లని పెట్టుకోనిచూడానా?'

'అవును. ధర్మము పరీక్ష చేస్తుంది. అపుడే మనము నిలఁబడాలి.'

'విడాకు లిస్తే నేనుబతకలేను. చెప్పేస్తాను గాని చల్లగా విచారిస్తావా?

'అదిగో రెడ్డొచ్చె మొదలాడి.'

'నేనూ ఈమాటే అంటాను. ఎవరి ఆచారం వారికిధర్మం. ఈపరీక్షకే నిలఁబడాలి.'

'మన అమ్మాయికి పెండ్లి చేయమంటావా యేమిటి?'

'మహారాజల్లే. ఇపుడు వెలివేసినా భయంలేదు. వెలికుటుంబాలు వేయికి పైఁగా ఉన్నవి. వీళ్లే మనకు చుట్టాలవుతారు.'

'ఒకవేళ సుబ్బారావే చేసుకుంటాఁడేమో?'

'అయితే ఇహ లేందేనికి? అతఁడు నాతప్పు దిద్దిపెట్టాఁడన్నమాట.'

'చూడఅభిప్రాయం ఎల్లావుందో?'

'ఎన్నఁడును మీ అభిప్రాయమునకు వేరుగా ఉండదు' అనుచు చూడమ్మ తలిదండ్రులకడకువచ్చెను.

'తథాస్తు' అని మాణిక్య మనెను. 'దేనిని గుఱించి నాయభిప్రాయమునకు శంకించుచున్నారు?' అని చూడమ్మ ప్రశ్నింపఁగా 'ఏమియు లేదేమియు లే' దని రామస్వామి వెళ్లిపోయెను. పిదప చూడమ్మ తల్లిని ప్రశ్నించెను. ఆమెయు సమాధానము చెప్పలేదు. చూడమ్మ మరలమరలఁ బ్రశ్నించియు మాణిక్యముకడ ప్రత్యుత్తరమును పడయఁజాలకపోయెను.

(౫)

గోడమీఁద వ్రేలాడుచున్న చింపుడు కాలెండరు తీసికొని చూడమ్మ రమారమి ఎనుబదికాకితములు చింపి వయిచెను. రెండురోజు లామె పళ్లబిగువుమీఁదఁ గూరుచుండెను. మూఁడవనాఁ డామెకు భావజ్వర మంకురించెను.

దైనందిన మామె యొక లేఖ వ్రాసి దాఁచికొనుచుండెను. ముక్తాహారము చేతఁబూని రాత్రులందు సుబ్బారావుజపము చేయుచుండెను. ఆమెశరీరము కుషించెను. లావణ్యకాంతి యినుమడించెను.

ఇటులు పదిదినములు గడఁచెను. చూడమ్మ లజ్జను జయించి టపాలోవేయుటకు ఒకయుత్తర మిటులు రచించెను: "వెంటనేవచ్చి చూచి పొండని వ్రాయుటకంటె మఱేమియు వ్రాయఁజాలను."

టపాలో పడఁబోయియు ఈయుత్తరము రెండు మూఁడు తడవలు జంకి చేతిలోనే నిలిచిపోయెను. జంకుపుట్టినపిదప నన్నిఁటికిని కలుగునవస్థయే ఆయుత్తరమునకును కలిగెను. పిదప శాశ్వతముగా అది చూడమ్మ పెట్టెలో చోటు చూచుకొనెను.

చూడమ్మ కించుమించు మతిపోయెను. ఒకప్పు డేమియును చేయదు. ఒకప్పు డేమియో చేయఁబోయి మానును. ఎవరయినను తనతో మాటలాడవచ్చినచో రెండుమాట లయినతరువాత మూఁడవమాటకు ముఖము చిట్లించుకొనును. ఆమెకు శరీరము బరువాయెను. నిద్ర మఱచిపోయెను. కలవచ్చినచో బాగుండుననుకొనెను. లోఁగడలేని యీ క్రొత్తవింతల ననుభవించి యనుభవించి చూడమ్మ తనయాత్మను సాక్షిగానియమించి యీమనోలీలను చూడ నభ్యాసము చేయఁదొడఁగెను.

ఇటులు గడచుచుండఁగా సుబ్బారావుకడనుండి చూడమ్మ కొకయుత్తరము వచ్చెను:—"నేనిక్కడ మీ నాయనగారి స్టేట్ ఖయిదీని. వాయుభక్షణకోసం రోజూ ఒకసారి కాలేజీకి తీసుకోవెళ్లి మళ్లీ ఖయిదులోకి తీసుకోవస్తున్నటులు కనఁబడుతూంది.

—నీవుగనుక రమ్మనిరాస్తే పరీక్షలూ గిరీక్షలూ అవతలపారేసి బందీఖానాగోడలు దూకి నీశయ్యమీఁద వాలతాను. ఏమంటావ్? 'ఏమంటావ్?' అనిరాస్తే 'వచ్చివాల మంటా'వని నాకు తెలుసు. అయినా ఏమి రాస్తావో చూడాలని చాలాచాలా లోభంగా వుంది."

చూడమ్మ ఈయుత్తరమును తత్తఱముతోఁ జదివికొని పుస్తకములో దాఁచికొనెను. ఇటులు దాఁచికొని గదివెలుపలికివచ్చి నలుదెసలును పరికించెను. పరికించి లోనికేగి మరలఁ జదివి ఆయుత్తరమునంచెలి

వాక్యము లన్నియు కంఠస్థములయిపోయినను ఆమె యాచీటిని పలుమాఱులు చదివికొనెను. ఆయక్కర ములు సుబ్బారావుకు ప్రతిబింబములా, లేక అతనిని చూపఁగల దుర్బిణియంత్రములా ?

చూడమ్మ యిటులు చదివిచదివి చూచిచూచి లెస్సగా నాలోచించెను. ఏకాగ్రముగా నాలోచించినపిదప దానినిటులు క్రియారూపము కావించెను :

"నేనే రాఁదలఁచియుండఁగా నింతలో మీరేవచ్చి వాలుదుమని వ్రాసితిరి. మనమేకాక మనయభిప్రాయములుగూడ నొక్కటగుటవలన నాకుఆనందోద్రేకము కలిగెను. నాతోపాటు మీరును ఈయానందమును పంచుకొందురుగాక ! కాని మన మీయానందమును ఇపుడు మనసులో ననుభవింపవలసియేయున్నది. ఏలయనఁగా మనయిరుగుపొరుగువారు మంచివారు కారు. విశేషించిమాతలిదండ్రులు. పెండ్లిచేసికొనవలసియుండఁగా మన మిటులు రహస్యముగా తొందరపడఁగూడదు. ఈమాటలు పరుషములని నేనెఱుఁగుదును. మీచూడ బాల్యమునుండియు పరుషభాషిణియనిమీ రెఱుఁగుదురు. కావున క్షమింపఁగలరు. మీసెలవుదినము వడిగా వచ్చుటకు సూర్యచంద్రులను ప్రార్థించుచున్నాను."




"ఆమె యాచీటిని పలుమారులు చదువుకొనెను"

చూడమ్మ యీయుత్తరమును టపాలో పడవేసెనేకాని వేసినమఱునిముసమునుండియు ఏడ్చుచునే కూరుచుండెను. 'లోకులు కాకులు. ప్రేమ యొక్క యోగ్యతాయోగ్యతలను నిర్ణయించుటకు వీరి కేమి యధికారము ? వీరు దానికి ముందంజ యెట్లు వేయఁగలరు. 'Fools rush where angels fear

to tread ' అని అనుకొనుచు చూడమ్మ లోలోపలనే కుమిలిపోయెను.

ఇటు లామె వియోగతపస్య చేయుచుండఁగా నొకనాఁడు తాను చింపివేసిన క్యాలెండరుమీఁది అంకె గల తేదీ వచ్చెను. ఆమఱునాఁ డామె కెక్కుడులేని సంతోషమును వచ్చెను.

(ఘ)

'నా నోరు ఊరకుండఁజాలదు. నేను కథల కాచిని' అని సుబ్బారా వనెను.

'నన్ను క్షమింపవలయును. మీరు మరల కాలేజీకివెళ్లఁగానే 'మీమాటలు చెవులార ఆలకింపక పోతినే 'యని దుఃఖింతును. కావున వేయిమోములతో మాటలాడుఁడు' అని చూడమ్మ యనెను.

"నీవు 'పెండ్లి' యని వ్రాసితివి గుఱుతు కలదా"

'కలదు.'

'పెండ్లి యను ఆచారము ప్రేమ కగౌరవము కాదా?'

'లెస్సగా విచారించినచో అది గౌరవము. సగుణము నారాధించినచో తత్త్వమున కట్టి యగౌరవమో అట్టి యగౌరవమే యనినచో నాకిసుమంతయు ఆపత్తి లేదు.

'జంతువులు పెండ్లాడుచున్నవా?'

'మనము జంతువులము కాము'

సుబ్బారావు తల పంకించి యిటు లనెను— 'ఆహార నిద్రాదులలో పశువులకును మనకును ఏమి భేదము?'

'ఆహారాదికర్మలలో భేదము లేదుకాని సంఘ శ్రేయమునకు మానవుఁడు దాంపత్యధర్మమును సృజించుకొనెను. దాంపత్యము సంఘసమష్టిపురుషుని శిల్పము.'

సుబ్బారావుకు పైమాట తోఁచక యిటు లనెను: ప్రేమ చంచల మగునా కాదా?'

'శిక్షితము కాని మనస్సు చంచలము. అందలి ప్రేమయు చంచలమే కావచ్చును. కాని దానిమాట నే నింకను స్ఫుటముగా చెప్పఁజాలను. కాని నే నిఁక దాని గుఱించి విచారింపను. దానితో నాకు పని లేదు.'

'పోనీ. నీమాట వలదు. లోకముమాట?'

'ఎన్నిరకములు కావలసి యున్నవో అన్నిరకములును లోకమునఁ గలవు. వాని కన్నిటికిని స్మృతులు పీనల్‌కోడ్డులు సాక్ష్యము.'

'సరియ. సురవమ్మగుస్త పునర్వివాహము చేసికొన్నది కదా! ఏడాది తిరుగక ముందే కలరా తగిలి అతఁడు చనిపోయెను. అతఁడుపోయిన నెల లోపుగనే ఆమె మరల పెండ్లాడెను. ఇట్టివార లెందఱో కలరు గదా! వీరి ప్రేమ చంచల మందువా యేమందువు?'

'చంచలము కా దని యెవ రందురు?'

'ఈసురవమ్మ పెండ్లిండ్లు నీవు సమ్మతములేనా?'

'ఆసురవమ్మ కీచూడమ్మ సమ్మతితో ఏటి పని?'

'ఆమెకు లేకపోవుఁగాక! మనలోమాట?'

'ఒకరిపెండ్లికిఁగాని, ప్రేమకుఁగాని 'మనలో మాటలు' ఉండవు. అచట ఇతరులకధికారము లేదు. నోరు పాఱవైచుకొనువారికే అచట ప్రవేశము.'

'ఒకరికి తీపియిష్టము. ఇంకొకరికి అనిష్టము. అట్టి ఇష్టానిష్టములు మనలో మనముచెప్పుకోఁగూడదా?'

'చెప్పుకొనవచ్చునుగాని వీరి యిష్టానిష్టములవల్ల వారితీపి ఉపాదేయతానుపాదేయతలఁ జెందదు. వారి తీపి వారిదే. వీరియిష్టము వీరిదే. వీరి యిష్టానిష్టములకు ఈమాత్రము ప్రామాణ్యమే యిచ్చినయెడల దానిగుఱించి మాటాడుటకు నాకు సంకోచములేదు.'

'మంచిది. ఇఁక మాటాడుము.'

'వినుఁడు! ఏఁడాదికాదుగదా ఒకనిమిషమేని కాఁపురముచేసిన యనుభవము నాకులేదు. అనుభవము లేని పుట్టువిధవ ఈయెడ నేమిచెప్పఁగలదు? అన్ని ఖండములందును, అన్ని దేశములందును ఓపిక ఉన్నంత

# శ్రీరంగపట్టణ చిత్రములు

(కె. సుబ్బరాజు)



౧. హైదరుగోరి





౨. హైదర్ గోరికి పోవుత్రోవ

వలకు నిరాఘాటముగా పెండ్లిమీఁద పెండ్లి, పెండ్లి మీఁద పెండ్లి చేసికొనుచునేయున్నారు. ఆ చేసికొనిన వారే దానితత్త్వమును వెల్లడింపవల్సిలు. అయినను అనధికారముగా ప్రవేశించి నా ఉద్దేశమును తెలుప వలసివచ్చినచో 'అది నాకు అసమ్మతమే' అని మాత్రము దెలుపవలసివచ్చును.'

'భేష్' అని సుబ్బారావు చూడమ్మవీపు తట్టి బలాత్కారముగా ముద్దిడుకొనెను.

'నాయుద్దేశము తప్పా?'

'కాదుకాదు' అని సుబ్బారావు బిగ్గరగా నవ్వఁదొడఁగెను. వీథిలో నేరికిని వినఁబడకుండుటకు చూడమ్మ అతనినవ్వంతయు తనవోష్ఠద్వయముచే అరి కట్టెను.

(౮)

సెలవులుముగిసి సుబ్బారావు కాలేజికి వెళ్లుటయు, కన్యకాపరమేశ్వరిపూజలు వచ్చుటయు తటస్థించెను.

కన్యక యేఁటేఁటను రామస్వామియింట షోడశోపచారములతో ఆతిథ్యము గొనుచుండెను. 'పై యేఁటిమాట యెటులుండునో' యని అనుకొనినదానివలె అపుడు కన్యక తన విరాడ్రూపముతో నందఱకును దర్శన మిచ్చెను.

అచట వైశ్యులకును విప్రులకును విరోధములేక పోవుటచే బాపనసోమిదమ్మలు విజయంచేసిరి. పూచిన తంగేళ్లవంటి ముత్తయిదువులు ఈరెండుకులములవారును కర్మజ్యేష్ఠత ననుసరించియు, కులాధిక్యమును పాటించియు, ధనాధిక్యమును చిన్నపుచ్చకయుఁ గూరుచుండిరి. ఈ ముత్తయిదువులందఱిలో మగఁడులేని ముత్తయిదువు చూడమ్మయొకతెయే.

ఒకసోమిదమ్మయు, ఒకదీక్షితులును పౌరోహిత్యము నడపుచుండిరి. కన్యకాపరమేశ్వరి తనభక్తకోటిని కరుణించుచున్నటులు కానిపించుచు పూలతోడను, కుంకుమతోడను కలకలలాడుచుండెను.

సభవారిలో గుసగుస లారంభ మాయెను. తల్లి కంటె పూఁటురే ఎత్తరిగా ఉఁదే?' అని ఒక ముత్తయిదు వనెను.

'బ్రహ్మచర్యంలో ఉంది ఆమహత్తు' అని యింకొక ముత్తయిదువు అనెను.

'మన్మథబ్రహ్మచర్యంలోనా?' అనియింకొకతె అనఁగనే నవ్వి మఱొకయామె 'చదువుకుంటూందిలే' అనెను.

'చదువుకోవడం యేమిటమ్మా? పెద్దశాస్త్రుల్లూ, పెద్దరావూగూడా అయిపోయిందిట' అని యింకొకయామె యనెను.

'పాపం ఏమయితే యేం లాభం? వైధవ్యమవగా!' అని ఇంకొకతె యనెను.

'అదేమిషీ? ఆమనిషిమీఁద వైధవ్యచిహ్నం ఏమయినా కనఁబడుతూందా?' అని మఱొకతె యనెను.

మాణిక్యము కుడిప్రక్కనున్న సోమిదమ్మలు చయనమ్మలు మొదలగు బాపనముత్తయిదువుల గుంపునుండి మెలమెల్లగా ఈమాటలు వెలువడెను: 'ఎంతెంతగా ఆత్మూరివారి ఆచారమని అంగలు వేసినా కట్టుబొట్టాలన్నీ కదలిపోయినవమ్మా. ఆవేష మేమిషి? నొష్టన ఆకుంకు మేమిషి? ఆనగ లేమిషి? ఆ చదువేమిషి?' అని ఒకసోమిదమ్మ ఒకచయనమ్మతో ననెను.

'మగఁడులేని పిల్ల కాఁబట్టి రోజు కొకపెళ్లి చేసేట్టుంది మాణిక్యం' అని ఆచయనమ్మ అనెను.

ఈమాట లన్నియు మాణిక్యమునకు వినఁబడెనని ఒకదీక్షితమ్మ కనిపెట్టెను. తన కిపుడు మంచిసమయము దొరకెనని గ్రహించెను. గ్రహించి — 'ఈలాటి పుట్టురత్నాలకు చేస్తేం?' అనెను.

వెంటనే సోమిదమ్మ దీక్షితమ్మమొగముమీఁద సమాధానము చెప్పవచ్చెను గాని మాణిక్యముమొగము కనిపించుటచే వెనుకకు తగ్గెను. కర్మజ్యేష్ఠతవలనఁ గలిగిన ఆధిపత్యముయొక్క మానమర్యాదలను కాపాడు

కొనుటకు పిలిచికొనుండ లేని చయనమ్మ మాత్రము కలుగక గనే జవాబు చెప్పఁగలిగియు చూడమ్మనుజూచి కొంత తగ్గి 'అన్ని పిచ్చికళలూ మన బ్రాహ్మలలోనే ఉన్నయ్' అనెను.

'మీ అమ్మ మేనమామకూఁతురు విధవావివాహం చేసుకొని యెన్నాళ్లయింది?' అని దీక్షితమ్మ యనెను.

దీక్షితమ్మ యిటులనఁగనే చయనమ్మ జంయి మని లేచెను. చయనమ్మ జంయిమని లేవఁగనే దీక్షితమ్మ తెయ్యి మని యాడెను. వారిరువురును ఇటులు బుగ్గలుపొడుచుకొనుచుండఁగా మాణిక్యము వారినడుమకు వచ్చెను.

'నేనంటే మీ అత్తగారు కాళ్లు కడిగి నెత్తిమీఁద చల్లుకునేది. నాకెన్నోదానాలు ముట్టఁజెప్పేది. అటువంటి నాతోటి లడాయివేసుకుంది యీదీక్షితమ్మ' అని ఆచయనమ్మ మాణిక్యముముందు మనవిచేసికొనెను.

'అసలుసంగతి చెప్పవేం? లేనిది వ్రాసుకోవస్తే యేం మర్యాద? మాణిక్యమ్మక్కగారి యింట్లో నా వారిదికాదూ ఆశ్చర్యం? ఇవ్వాళటేమటు కివ్వాళ మాణిక్యమ్మక్కగారు స్వయంగా వచ్చి మమ్మన్ని పిలిచారుకాదూ?' అని ఆదీక్షితమ్మ ఆచయనమ్మమీఁద కెగఁబడెను.

'ఇందులో వివాద కేముంది?' అని మాణిక్యమ్మ అనఁగనే దీక్షితమ్మయు, చయనమ్మయు 'ఆ! యేవుంది? వడ్లగింజలో బియ్యపుగింజ' అని యనిరి.

ఇంతలో దీక్షితులు లేచి—'సహస్రశీర్షం దేవమ్' అని మంత్రపుష్ప మారంభించెను. దానితో ఈపులు లన్నియు లేళ్లయిపోయెను. అందఱును లేచి నిలువఁబడి ధ్యానముచే ఒకరయిపోయిరి.

పూజాశేషము పూర్తియయినతోడనే అందఱికిని పసుపుకుంకుమలును, చందన తాంబూలములును ముట్టెను. ముత్తయిదువులందఱును ఇనుమడిసంభావనలతో నింట్లకేఁగిరి.

దీక్షితమ్మ దిగ్విజయము చేసినటులే మమ్మకిసరసతో లేచెను. దాని కినుమడిసంభావనతో చయనమ్మ లేవలేక లేవలేక లేచెను. చయనమ్మ యిటులు వెళ్లుచుండఁగా మాణిక్యమామెకడ కరిగి—'ఏమండో! ఈపసుపూ ఈకుంకుమా ఈచీరా ఈరవికా మీ అమ్మ మేనమామగారి కూతురి కిప్పించండేం' అనిచెప్పి చూడమ్మచేత వానినన్నిఁటిని ఆచయనమ్మచేతులలోఁ బెట్టించెను. చయనమ్మ వానిని గ్రహించుటకు మొదట కొంచెము సందేహించెను గాని చీరమీఁది జరీ కనఁబడఁగానే చేతులు జాఁపకుండఁజాలకపోయెను.

౪

(క)

'మొన్నటిపూజలలో వచ్చిన ముత్తయిదువలందఱూ అమ్మాయినెత్తిమీఁద తలో అక్షింతలుంబా వేసిపోయినా'రని నీవుచెప్పినదగ్గిఱనుంచీ అమ్మాయిని గురించి మనం చాలాజాగ్రత్తపడాలని తోస్తూంది అని రామస్వామి అనెను.

మొగము చిట్లించుకొని పెదవి దాటకుండ నవ్వి మాణిక్య మి... లనెను — 'అవును, తొందరగా ముహూర్తం అయిం దనిపించాలి.'

పుత్త్రికాపునర్వివాహమునకు మాణిక్య మంగీకరించు నని మొదట రామస్వామి కలలోఁగూడ నను కొనలేదు. ఆమె నంగీకరింపఁజేయుటకు విశ్వప్రయత్నము చేయవలసివచ్చునని అతఁడు భావించియుండెను. ఇట్టిస్థితిలో మాణిక్యమే ముందడుగు వేయుటచే ఆమెమనఃపరివర్తనమును తెలిసికొనుటకును, ఆమెమనోబలమును పరీక్షించుటకును అతనికి కుతుకము కలిగెను. కలిగి యిటు లనెను. '—ఈపెండ్లిముచ్చట అమ్మాయి దగ్గిఱనుంచి రావాలికాని మనదగ్గిఱ మొదలు కాఁగూడదు. ఇం కొకటి. పెండ్లిమాట తలపెట్టకముందే ఈముత్తయిదువలు ఇట్లాదూసుకుంటున్నారు. ఇక చేసేవేస్తే మనలను వెలివెయ్యరా?'

'అట్టిస్వాతంత్ర్యం అమ్మాయిలకూ అబ్బాయిలకూ ఇంకా మనం ఇవ్వలేదు. ఇది ప్రాచీనాచారా

లహా, నవీనాచారాలహా యుద్ధసమయం. కొన్ని శతాబ్దాలు పటుతుంది ఈయుద్ధం.

'మనస్సు చలించిం తరువాత ఆఁగదు. ఈ పెండ్లిముచ్చట అమ్మాయిలసగ్గఅనుంచే రావాలని మనం హూచుంటే వాళ్లపిల్లలకు బారసాలలే చేయవలసివస్తుంవి.

'ఇఁక వెలిఅంటారు. అసలికి స్వాగతం. అవె లే సత్యజీవితానికి పరిహద్దవుతుంది.'

ఈమాటలు విని రామస్వామి లోలోన 'మాణమ్మ వివాహకాలంనాఁటి మనిషియేనా యిది? నగలకు పోట్లాడిన వియ్యపురాలేనా యిది? దీనికి ఈసంస్కారం హూఁతురువైధవ్యం వలననేనా, మఱొక కారణము వలననా? ఈ పునర్వివాహానికీ దీని జీవితానికీ వంతెన యేదో దాన్ని కనుక్కోవాలి' అని తలపోసి యిటులనెను — 'నామనస్సు ఎన్నోసార్లు చలించిందని వెనుక నీవంటివే, దానికీ దీనికీ ఏమయినా సంబంధం ఉంటే అది చెప్పఁదగినదయితే—



"అనిచెప్పి మాణమ్మచేత వాని నన్నిటిని ఆచయనమ్మచేతులలోఁ బెట్టించెను."

మాట ముగియకముందే అందుకొని మాణిక్యమిటులనెను: 'అది మీతోఁగాకపోతే మఱి యెవరితో చెప్పుకుంటాను? మీరు నన్ను చాలాసార్లు 'మంచిదానవు' మంచిదాన'వని ప్రశంసించారు. ఆప్రశంస ప్రతిమాటూ

నాహృదయంమీఁద ఒక సుత్తిదెబ్బ వేసిపోయింది. ‘జీర్ణ మన్నం ప్రశంసంతి భార్యాంచ గతయౌవనాం’ అనేమాట నావిషయంలో నిజం.

‘నామనస్సు ఎన్నోసార్లు చలించింది. అవును. నాశరీరం పునాసమామిడల్లే అకాలంలో వికసించింది. ఆ వికాసానికి లోపల ఎంత కాఁక ఉన్నదో అది నాకే తెలుసు. ఆఁడదాని మనస్సు కొంచ మయినా తెలియని మానెర్రిబాగులనాయన నన్నప్పుడు అత్తవారింటికి పంపకపోయినాఁడు. ఆయన నన్ను కన్నవాఁడయినా ఈరాయి ఆయననెత్తిని వెయ్యక తప్పదు.’

మామగారినెత్తిమీఁద రాళ్లింకను పడకుండుటకుఁగాను జాగ్రత్తపడి, రామస్వామి ‘మంచిది’ అనెను. ఆమంచిదితో దారికివచ్చి మాణిక్య మిటులు చెప్పఁదొడఁగెను:—

‘అపుడు మాకు బొంబాయిలో వర్తకం. కాఁపరం కొన్నాళ్లక్కడా, కొన్నాళ్లిక్కడా. చెన్నపట్నం మీఁదుగా దారి. మేమందఱమూ సెకండుక్లాసుబండిలో వెళుతున్నాము. వంగవోలులో మాబండిలోకి పద్దెనిమిదేండ్ల కుర్రవాఁడొకఁడు ఎక్కికూచున్నాఁడు.’ అని చెప్పి మాణిక్యము మగనికేసి చూచెను.

ఆమొగమునం దెచటను నేత్రసంకోచము గాని, బొమముడిగాని, పెదవివిఱుపుగాని లేదు. దీనికి ఆమె అక్కజపడి యిటులనెను:—‘సిగ్గులేని నామాటలు వినటానికి మీకు జుగుప్సగాని, క్రోధముగాని, నిర్వేదము గాని కలుగనిచో మెల్లగా మనవిచేసుకుంటాను.’

రామస్వామినవ్వి యిటులనెను: ‘నా కివేమీ కలుగలేదు, కలుగవు. మన స్తత్త్వాన్ని నీవు చెపుతున్నట్టుందిగాని నిన్నుగుఱించి చెప్పుకుంటున్నట్టు లేదు. కాఁబట్టి నిస్సందేహంగా చెప్పవచ్చు.’

ఈమాటలు విని మాణిక్యము ఇటు లనెను:— ‘అటువంటిమొహం నే నెన్నఁడూ చూడలేదు. దాని ఆకర్షణవంటి ఆకర్షణ యమపాశాలకుఁగూడా లేదు.

‘చంద్రునికేసి మన మందఱం చూస్తాం. చంద్రుఁడుకూడా మనలను చూచినట్లేవుంటాఁడు. కాని ఆమొహం నన్ను చూడలేదు. నాకు అభిమానమూ, అహంకారమూ కలిగినవి.

‘అట్టిసమయములో చిత్తజల్లులాగా అతనిచూపులు ఒక్కసారి నామీఁదపడి వెనక్కి మళ్లినవి. నా అభిమాన-అహంకార-స్థానములలో కొంచెము సిగ్గూ (కొంచెమెందుకంటే నాకసలుసిగ్గులేదు), గర్వమూ చోటు చేసుకున్నవి.

‘మళ్లా అతను నన్ను చూడాలనే గర్వంతోటి నే నతనిని చూడఁదలఁచుకోలేదు. కాని చూడకుండా ఉండఁగలిగే ధైర్యం పోయింది.

‘చాంచల్యానికి అన్నీ దారులే. మా సెకండుక్లాసుబండీలోపల టాపు (Top) నడుమ అద్దమొకటి తాపటముచేయఁబడి ఉంది. ఆ అద్దములో అతనిప్రతిబింబము అక్షరాలా కనఁబడుతూ ఉంది. అతన్నీ, అతని ప్రతిబింబమునూ చూస్తూ కూచున్నాను. లోకం ఉన్నదనేమాట నేనెఱుఁగను. ఇట్లా చూస్తూఉండఁగా ఉండఁగా తలవెనుక టక్కుమని దెబ్బ తగిలింది. మా అమ్మ కొట్టిం దనుకున్నాను గాని చూస్తునుగదా కాదు. రైలుపెట్టె. స్టేషనువచ్చింది, రైలాఁగింది.

‘రైలుసాగింది. మళ్లా ఆచంద్రుఁడు ఈ తారకమీఁద ఒక్కకిరణమైనా విసరలేదు. కేవలం నేనే కళ్లుతీసుకొన్నాను. ఆమొహం ఎంతగంభీరం, ఎంత గంభీరం! అదోసముద్రం.

‘అతఁడు నన్నిల్లా ఏడిపించి రేడిపించి నా మొహం చూడకుండానే నెల్లూరులో దిగిపోయాఁడు.

‘నాగర్వం కరఁగికరిఁగి ఎన్నేళ్లదాఁకానో కన్నులలో నీరుగా మాఱి జాఱిపోయింది. తుద కొకనాఁడు మీమొహం కనిపించింతరువాతకూడా ఆకళంకం పోలేదు. కాఁబట్టే అనుకుంటున్నాను — ఆ కాలంలో పుట్టిన ఈచూడకుకూడా మనసు చలిస్తుంది, తల్లి చాఱి?’ అని.

‘కాఁపరాలు చేసేవాళ్ల మనస్సు లన్నీ ఇనుముతో చేయఁబడినా మామనస్సులుమాత్రం నీళ్లవంటి చంచలపదార్థంతో చేయఁబడినవి. మాజాతి వేఱు;

మేము వేఱూ అని అనిపిస్తుంది. ఈపతితను చేసుకోఁబట్టి మీకుగూడా ఇంటులో పాలు పంచుకోక తప్పదు.

'మీమనస్సు ఎపుడూ చలించలా? నిజం చెప్పండి' అని మిమ్మలను నేనొకసారి అనివున్నాను. అది పతితలనోళ్లల్లోంచి రాఁదగిన మాటే. ఆమాట అన్నందులకు మాత్రం క్షమించండి.

'ఇంతకుముందు చెప్పిన నాచాంచల్యానికి మీ క్షమాభిక్ష వేఁడుకోను. ఎందుకంటే అది క్షమాపణకు విషయమే కాదు. ఒకవేళ అయితే అంతర్యామి ముందు నిలువఁబడి ఆభిచ్చం అడగాలి' అని మాణిక్యము గడగడ వడఁకుచు స్తంభించిపోయెను.

మాణిక్యము హృదయము రామస్వామికి తెలిసెను. కాని ఆమె అంతర్యామిముందే ఉన్నదో, లేక తన ముందే ఉన్నదో అతనికి చాలసేపటివఱకు తెలియలేదు. తనముందే ఉన్నదని రామస్వామికిఁ దెలియఁబోవుముందు ఆమెకనులనుండి బాష్పములు ప్రవహించెను. ఆమెహృదయము తేలికయేయాయెనో, బలువే ఆయెనోకాని పిదప, మగనిముందు నిలువఁజాలక పోయెను. ఆమె పడకటింటిలోనికిఁ జని తలుపులు మూసికొనెను. అచట నామె యానందించుచున్నదో, దుఃఖించుచున్నదో రామస్వామికే యెఱుక!

(ఖ)

పిమ్మట పదినాళ్ళవఱకును తనమాటలకు ప్రత్యుత్తర మిచ్చుటకు మాణిక్యము రామస్వామి కవకాశ మొసఁగలేదు. తుట్టతుద కొకనాఁ డవకాశము దొరకించుకొని రామస్వామి యిటులనెను:

"వినుటకుమాత్రమే అధికారమిచ్చి క్షమించుటకు సంబంధములేని నీతాలూకు కొన్ని మాటలు చెప్పితివే అటువంటివిన్నీ, వాని తలదాఁటినవిన్నీ అయిన నాతాలూకు మాటలుగూడా కొన్ని ఉన్నవి. వాటితో నా పని ఉక్కిరిబిక్కిరి అవుతూంది."

ఈయుపోద్ఘాతము విని 'నేను నాసంగతి వారికి విన్నవించినపుడు వారు సెలవిచ్చుమాటలను నిషేధించుటకు నాకు వీలుండదు' అని యనుకొని మాణిక్యము మాటాడవూరకుండెను. రామస్వామి మాణిక్యముమౌనమునకు ఉత్సాహము బలసి యిటులు చెప్పఁదొడఁగెను:

"మనస్సు చంచలం అనేమాట మనకేకాదు, భగవంతునికికూడా బాగా తెలుసు. 'మనో దుర్నిగ్రహం చలం' అని ఆయన అర్జునుడికి ఒత్తా సిచ్చాఁడు. అయితే దానిని చంచలం కాకుండా చేసుకోవాలి. దానికి సంతతాభ్యాసమున్నూ, వైరాగ్యమున్నూ మంఁదని అయనే చెప్పాఁడు.

"ఇప్పు డుండే మనుష్యులందఱికీ వాళ్ల వాళ్ల సంకల్పాలు సమకూరేలాటి ఇష్టారాజ్యం ఒకటి సృజించి చూస్తే ఎవనిపెండ్లాము వానిదికాదు, ఎవతె మగఁడూ దానివాఁడు కాఁడు. అంతా తాఱుమాఱు అయిపోతుంది. ఆకాశపాతాళాలు తలక్రిందు లయిపోతవి. రహస్యంగా రగులుతున్న విరహాగ్నులన్నీ ఒక్కసారి చల్లాఱుతవి. వ్యభిచారం ఉజా డయిపోతుంది.

"ఆయిష్టారాజ్యంలో అందగాళ్లూ,అందగత్తెలూ ఓవారంరోజులు ఏకపత్నీవ్రతాలూ, పాతివ్రత్యాలూ పరిపాలించవచ్చు. ఎంచేతంటే అదేపనిగా కూచుంటే ప్రేమకు అంతకంటె నిలుకు ఉండదు.

"వాళ్లమాట లల్లావుండఁగా అందంలేని మగాళ్లకూ ఆఁడాళ్లకూ బలాత్కార బ్రహ్మచర్యమే గతి కావలసి వస్తుంది. అందంలేని ఈ ఉభయులూ అందంగలవాళ్లను బతిమాలుకోకాతప్పదు; వాళ్లచేత అవమానం పొందకాతప్పదు.

"అందగాళ్లలోనూ అందకత్తెలలోనూ కూడా అందచందాలలో ఉండే తేడాచేతనో, మఱేవాసనచేతనో కాని తా నొకతెను ప్రేమిస్తే అది తనను ప్రేమించదు; అది యొకనిని ప్రేమిస్తే వాఁడు దానిని ప్రేమించఁడు. అందువల్ల వాళ్లలోకూడా నవాబుల్లే చాలామంది పెళ్లాలుకల మగవాళ్లూ, ద్రౌపదుల్లే చాలామంది మగలు కల ఆఁడవాళ్లూ ఉంటారు. వీళ్లందఱికంటె ఎక్కువగా పెళ్లికానివాళ్ల జనాభా హెచ్చవుతుంది. ఇల్లా ఉండఁగా పెళ్లిచేసుకున్న దంపతు

లలోఁగూడా ఓవారంరోజులలో వివాహాలు పుట్టుకో వస్తవి. ఇటువంటి ఈయిష్టారాజ్యం చూస్తే అరాచకం కంటె ఎక్కువ అని అనిపిస్తుంది.

"కాఁబట్టి ఈ చాంచల్యమును చంపివేయడమే మొదటిపక్షం. ఇది మహాత్ములకే చెల్లింది.

"ఒకనియమానికి లోఁబడి నిగ్రహించుకోవడం రెండోపక్షం. దీనిపేరే గార్హస్థ్యం. 'పెండ్లయినా చావయినా ఒకేమాటు' అని చెప్పే మనువంతగొప్పవారికే ఇది చలామణీ అవుతుంది.

"చాంచల్యానికిలోఁబడిపోవడంమూఁడోపక్షం. పశువులలోటే కీటాలలోటే అట్టే తేడాలేని మనవంటి మానవకోటికి ఈపక్షం, ఇందులోఁకూడా ఒకనియమము ననుసరించి నిగ్రహం అవసరంగనుకనే పునర్వివాహం.

"చాంచల్యంమాత్రమే నీకు కలిగింది. పతనం కూడా నాకు కలిగింది. ఈతప్పొకటి కాయమని రోజు రోజూ నేను పతితపావనుని ప్రార్థిస్తున్నాను."

ఇటులుపలుకుచు పలుకుచు రామస్వామి రాతి బొమ్మవలె స్తంభించిపోయెను. అతనిచూపులు తిరః ప్రసృతములాయెను. శరీరము గగురుపొడిచెను.

ఇట్టిరామస్వామిని అదిమాచుచుండఁగా మాణిక్యమునకును పూనకము వచ్చినటు లాయెను. ఆమె హృదయము ద్రవించి స్రవించుచున్నటులు కనులనుండి బాష్పములు బయలువాఱెను. ఆమె లేచి ఆకసము దెసఁ జూచి తలవాల్చి మోఁకారించి—"ఓ ప్రభూ! నా కులాభిమానాన్ని నూల్చివెయ్యి! ఉత్తరజన్మములో నన్ను నీచకులంలో పుట్టించు! తెచ్చి పెట్టుకొన్న ఎక్కువతక్కువలలోనికిన్నీ, తెచ్చి పెట్టుకున్న పాపపుణ్యాలలోనికిన్నీ నన్నుదింపకు" అని పలవించెను.

తేనె జాఱిపోవఁగా గేలికపడిన పూరేకులవంటి కనురెప్పలెత్తిచూచిన రామస్వామికి ఆమాణిక్య మొక గణాచారివలె కానిపించెను. వారిరువురును ఒకరి నొకరు చూచుకొనిరి. వా రిరువురును ఒకరి చూపులలో మఱియొక రోలలాకి ఒడ్డెక్కిరి. ఇరువురును లోలోపల నిటు లనుకొనిరి కాఁబోలు:—'నాలుకా! మాటలాడకుము! మానసమా! ఆలోచింపకుము! ఓ ప్రభూ! కేవలము నీవే మాకు ఆదేశింపుము.'

---

# దిద్దుపాటు

---

వెనుకటి సంచిక పు. ౮౫౯ మొదటి కత్తెమున ౧౦ శీర్షికను '౧౧ సంవత్సరములు దాటిన' అనుదానికి '౧౧ సంవత్సరములు దాటని' అని దిద్దుకొనవలెను.

భా. సం.

# ఉక్కు పరిశ్రమ: కొన్ని అంశములు

బారు గోవిందరావు

ప్రతిదినమును మనము లోహముతో జేసిన పదార్థముల నెన్నిచోట్లనో చూచుచున్నాము. వానినిదిలకించినప్పుడు వాని ప్రాముఖ్యమును, మానవుని జీవయాత్రలో వాని యుపయోగములును మనకు స్ఫురింపక మానవు. ఉక్కు పరిశ్రమ యనినంతనే దేశవ్యవహారముల నెఱుగజాలిన ప్రతి భారతీయుని తలంపున "తాతా వర్తకసంఘము" వారి యినుప కర్మాగారము నిలుచును. దేశీయపరిశ్రమలలో మిక్కిలి సుప్రసిద్ధమైనదియు, గొప్పదియు నై జంషెడ్‌పురమున "తాతాకంపెనీ" వారి లోహ పరిశ్రమ విరాజిల్లుచున్నది. దీని ప్రాశస్త్యమును, హిందూదేశపు టార్థికసౌధములో నీ పరిశ్రమస్థాన ప్రాచుర్యమును ముఖ్యముగ గమనింపవలసిన విషయములు. ఈపరిశ్రమవిధానమును, దాని బాహుళ్యమును, నితర దేశీయ పరిశ్రమలపై దీని శక్తి ప్రాబల్యమును బాఠకుల కిందు తెలుపబడును.

మొట్టమొదట నొకచో నొక పరిశ్రమ వృద్ధి కావలయునన్న కొన్ని సదుపాయము లా పరిశ్రమ కచ్చో నుండవలయును. సహజమై, స్వాభావికమై, నైసర్గికమైన ముడిపదార్థమును సరళమై సులభమై సరసమగు రాకపోకల సదుపాయమును, చవుక యగు కూలియు, విస్తారమై విరాళమైన బజారును పరిశ్రమాభివృద్ధికి ముఖ్య కారణములు. ప్రపంచములో ప్రశస్తిగాంచిన పరిశ్రమల కీసదుపాయములు విస్తారముగ గలవు. కావుననే యవి మిక్కిలి తీవ్రముగ నెగడుచున్నవి. పేరుపొందిన పరిశ్రమల యభివృద్ధిని మనము చక్కగ గమనించినచో నవి యన్నియు నాయాదేశములలో కొన్ని కేంద్రము లందుమాత్రమే పెంపొందుచున్నవని మనకు దోచును. దీనికి కారణము లనేకములు కలవు. వానిలో నార్థిక సంబంధము కలవి ముఖ్యములు. పరిశ్రమాభివృద్ధికి కావలసిన సదుపాయములకుదోడా పరిశ్రమ ప్రపంచములోని విస్తారమగు బజారుధరల పోటీల కెదురీది నెగ్గవలయును. వీనింబట్టి పరిశ్రమాభివృద్ధియు, క్షీణతయు నిర్ణయింపనగును.

ఉక్కు పరిశ్రమకుదగిన సాధనసంపత్తి మనదేశమున కలదా యని యడుగవచ్చును. ముతకలోహము, "కోకు" అను నొకవిధమైన రాతిసిబొగ్గు (Coking Coal), సున్నపురాయి లోహపరిశ్రమకు ముఖ్యసాధనములు. మనదేశములో నివియన్నియు విరివిగ చిక్కును. కడచిన 30 సంవత్సరములుగ నీవిషయమై చేసిన పరిశోధనలవలన నింతవఱకు మూలబడిన యీసాధనసంపత్తి హిందూదేశములో మిక్కిలి విస్తారముగ గలదనియు, నీదేశము ప్రపంచమునకంతటికి వలయు సామగ్రిని సరఫరాచేయు మూలస్థానములలో నొకటిగ నెన్నుకొనబడవలయుననియు దేలినది. ముతకలోహము మనదేశమంతటను, ముఖ్యముగ మధ్యపరగణాలలోను చిక్కును. "లోహమేఖల" (Iron Belt) యని పిలువబడు సింహభూమ మండలమును, దానిపరిసరముల నుండు ఓడ్రదేశములోని కియోంఘర్, బోనే సంస్థానములును విలువగల ముతకలోహమున కునికిపట్టులు. ఈప్రాంతమున త్రవ్వబడు ముతకలోహములో నూటికి ౬౦ పాళ్లు లోహముకలది రమారమి సంవత్సరమునకు 300 కోట్ల టన్నులు చిక్కును. ముతకలోహము సంవత్సరమునకు ౧,౫౦౦,౦౦౦ టన్నుల వంతున నిక వేయివర్షముల వఱకు మనదేశమునకు కావలసినంత యుత్పత్తియగునని పరిశోధకులు వచించినారు. దీనికిదోడితరలోహపు సామగ్రియగు మాగ్నెటైటు (Magnetite), laterite మన్ను, లోహపురాయి మున్నగునవి సమృద్ధిగ నలవడును.

ముతకలోహమంతవిస్తారముగ కోకింగుబొగ్గు చిక్కుటలేదు. ఐరోపా, అమెరికాదేశములలోని గనులలోనుండి వెలువడు బొగ్గునకంటె మనదేశములోని బొగ్గు కొంత తగ్గురకముది. బెంగాలు బీహారు ఒరిస్సా

రాష్ట్రములలో నుండు బొగ్గుగనులనుండి సాలుకు ౨౩,౦౦,౦౦౦ లక్షుల టన్నుల బొగ్గు త్రవ్వబడుచున్నది. రాణిగంజి, జారియా ప్రాంతములుమాత్రమే ౮౦౪,౦౦౦ లక్షులటన్నుల కాధారమైయున్నది. వీనికి తోడు అస్సాములోనుండు నాలుగుగనులును, మధ్యపరగణాలలోనుండు మూడు గనులును దాదాపుగ ౧౦,౦౦౦ లక్షులటన్నుల బొగ్గును సరఫరాచేయును. కోకింగు బొగ్గు సాధారణముగ ౩౦౦ కోట్ల టన్నులును, మట్టరకంబొగ్గు ౨౦౦ కోట్ల టన్నులును తయారు కాగలదు. మట్టరకంబొగ్గునుండి "కోకింగు" బొగ్గు తయారు కాజాలదు. ఈసాధనసంపత్తివలన నీపరిశ్రమ పాశ్చాత్యదేశములలోకన్న మనదేశములో నెన్నియోమట్టులు సరసముగ వృద్ధికాగలందులకు నైసర్గికానుకూలములు కలవు. వానిలో ముఖ్యములైనవి మూడు: ౧. అమెరికా ఐరోపాదేశములలో ముతకలోహపుగనులు, బొగ్గు గనులు ఒకప్రదేశములో లేవు. మనదేశములో నవి దాదాపుగ నేకదేశమున నున్నవి. ౨. పాశ్చాత్యదేశములలో నీ లోపక్వసామగ్రిని పరిశ్రమకేంద్రములకు జేర్చుటకు రైలు ఖర్చు లెక్కువయగుటయేకాక ౨౦౦ మైళ్ల దూరము నుండి ప్రయాసతో దీసికొనిరావలసివచ్చును. మన దేశములో "తాతాకంపెనీ" వారు ముతకలోహమును ౫౦ మైళ్లనుండి టన్నుకు ౭౪ అణాల చొప్పున తీసికొని వచ్చుచున్నారు. బొగ్గును టన్నుకు రు. ౧-౫-౬ వంతున ౧౦౦ మైళ్ల నుండి చేర్చికొనుచున్నారు. ౩. ఈ చేతకువలయు సున్నపురాయి యత్యుత్తమ మగునది ప్రపంచములోని యుత్పత్తిలో నర్ధము మనదేశమందే త్రవ్వబడుచున్నది.

ఇనుపసామగ్రుల దయారుచేయుటలో కార్మికుల వేతనములు ప్రపంచములో నన్నిదేశములకంటె మనదేశములో సరసమగుటచే నీసామగ్రులు జపానుకును, అమెరికాపశ్చిమతీరపుదేశములకును నెగుమతి యగుచున్నవి. ఘనతలోను, గుణములోను హిందూదేశపు పరిశ్రమ యన్ని దేశములవానికంటె మిన్నయని యనిపించుకొనినది. అనాదిగ మనదేశమున వ్యవసాయమే చేతిపనియై యుండుటచే నేర్పరు లగు కార్మికుల నారంభమున మన మితరదేశములనుండి రప్పించుకొనవలసి వచ్చినది. ప్రకృత మెన్నియో మహుంగు లీ యననుకూలము నశించినది. సరసమగు సాధారణపుకూలీ వలసినంత సిద్ధముగ నున్నది. రాకపోకల సదుపాయము లున్నవని మున్నే చెప్పియుంటిమి. ఇకమీద తయారగు వస్తువులకు తగినంత గిరాకి (Demand) యున్నదా యనిన నితరదేశములలోవలె లేదనియే చెప్పవలయును. యంత్రములు, గట్టిరకపు టినుపసామానులు, మోటారు బండ్లు మొదలగునవి మనదేశములో తయారగుట కింకను కొన్ని సంవత్సరములు పట్టును. వీనిజోలికి పోకయే మన దేశమునకు సంవత్సరమునకు ౩౫ లక్షులటన్నుల లోహపు సామగ్రి కావలసియున్నది. ఈ గిరాకికి తగిన సరఫరా చేయుటకు "తాతాకంపెనీ"వారి శక్తిసామర్థ్యములకు తోడు పరిపాలకుల కించిదాదర మనుకూలించినది. విద్యుచ్ఛక్తి ప్రతిశాఖలోను ప్రసరించుచుండుటచే నినుప సామగ్రి గిరాకికలది యగుచున్నది. బొంబాయి, మద్రాసు నగర పరిసర ప్రదేశములలో జి. ఐ. పి., యస్. ఐ. ఆర్. రైల్వేకంపెనీవారు విద్యుచ్ఛక్తి మూలమున రైలుబండ్ల నడుపనుద్యమించినది మొదలీయుక్క సామగ్రు లపారముగ గావలసివచ్చుచున్నవి. అమెరికాదేశములోని యిండ్లననుసరించి మనదేశములో నైత మినుపసామగ్రులతో నిండ్లను కట్టుట కుపక్రమించుచున్నారు. ఇనుపసామగ్రియొక్క వినియోగ మీమూలమున దినదినాభివృద్ధి బొందుచున్నది.

ఇన్నిసదుపాయము లుండినను తాతావర్తకసంఘమువారు తొలుదొల్త నష్టమునకే పనిచేయుచుండిరి. ఈదుస్థితి కనేకకారణములు కలవు. మన ప్రభుత్వమువారిందుపైవిధించిన తీరువ (Tariff)ను గుఱించి వెనుక విచారింతము. తాతాసంఘమువారి యార్థికపారిశ్రామిక చారిత్రమును సావధానముగ జదివిన నీ ప్రబలతర పరిశ్రమ ప్రభుత్వమువారి ప్రాపులేనిదే విదేశీయులపోటీల నెదుర్కొనగల దని మనము నిరాఘాటముగ జెప్పవచ్చును కాని పరిస్థితులు మారుచున్నవి.

ప్రాయికముగ జనసామాన్యమునకు వలయు పరిశ్రమాంశముల, మనదేశపు టార్థికపు గట్టడములో నీపరి

శ్రమస్థానమును చెప్పితిమి. ప్రపంచపరిశ్రమచరిత్ర నెరిగినవారి కిందొక ముఖ్యాంశము పొడసూపును. దేశములలో నొకపరిశ్రమాభివృద్ధి కిరవగు నైసర్గికసంభవితానుకూలము లపారముగనుండిన నా చేతిపని పెంపొందును కదా? పనిలోని పట్టుదల, ఆచరణలోని యనుభవము, వీనికిదోడు ప్రత్యేకపరిశ్రమ యాయుద్యమము నున్నత స్థితికి గొనివచ్చును. పరిశ్రమకేంద్రము లెచ్చటనైన నెలకొనగలవు సదుపాయము లుండిన. ఒక బొగ్గగని, యొక ముతకలోహపుగని, యొకనూనెబావి యొకచో నుత్పన్నములైన నాదేశపు బారిశ్రామిక, ఆర్థికవ్యాపార పరిస్థితుల గాక నూతనోద్రేకమును, శోభను గూర్చుటయే కాక దేశభావిపురోభివృద్ధి కెన్నియోవిధముల దోడ్పడును. అమెరికాఖండమున "రాక్ ఫెల్లర్" "కార్నిజీ" "ఫోర్డు" మున్నగుప్రముఖులు వారి మేధాశక్తిని కార్యరూపమున జూపినప్పు డిట్టి నూతనభావోద్రేక మెట్టి తీవ్రతం జెంది దేశభాగ్యోదయమునకు దోడ్పడినదో స్ఫురింపగను. ఈనవీనోద్రేకము చిన్నచిన్న చేతిపనుల సమ్మేళనమునకు, వానికేంద్రీకరణమున కాదికారణమై అమెరికా, జపాను, జర్మనీ దేశములలో పూల్సు (Pools), సిండికేట్లు (Syndicates), ట్రస్టులు (Trusts), కార్టల్సు (Cartels) అను సంస్థల కావ్పడము నొసంగెను. వీని ననుకరించి, పాశ్చాత్య వ్యాపారసంస్థల ననుసరించి మనదేశములోని వర్తక ప్రముఖులు కొన్ని కేంద్రసంస్థల స్థాపింప నుపక్రమించుట శుభసూచకము. శుభ సూచకంబును, సౌభాగ్య దాయకంబును నగు నుద్యమము జంషెడ్ పురమున "తాతా వర్తకసంఘము" మూలమున కార్యరూపము దాల్చిన దని చెప్పవచ్చును. ఆరంభములో వారేయిడుముల గుడిచిరో, వారెట్టి పరీక్షలం జేసి నిశ్చితమతులై పరిశ్రమాభివృద్ధికి మార్గదర్శకులైరో విచారించుట మనపనికాదు. కాని పాఠకుల కిట్టి యసమానదేశీయపరిశ్రమలోని ముఖ్యాంశముల నెఱిగించుట ప్రకృతము ననుసరించుట.

తాతాసంఘమువారి లోహపుగర్మాగారము కలకత్తా నగరమున నాగ్నేయమున నూటయేబది మైళ్ల దూరమున ముతకలోహములకు బుట్టినిల్లగు "సింగ్ భం" మండలములోని జంషెడ్ పురమున గలదు. ఇది ౧౯౦౭ సంవత్సరమున స్థాపింపబడెను. మరుసటియేట కర్మాగారపు కట్టడములు ప్రారంభింపబడెను. మట్టరకపుటినుము (Pig Iron) ౧౯౧౨, ౧౯౧౩ సంవత్సరములోనే కర్మాగారమునుండి తయారుకాబడెను. ఐరోపామహాసంగ్రామసమయమున నీకర్మాగారపువృత్తమున కూడలు బలిసినవి. కొన్నిశాఖలు ౧౯౨౪ లో నభివృద్ధియైనవి. అప్పటినుండి యీకర్మాగారము దినదిన ప్రవర్ధమాన మగుచున్నది.

సాధారణముగ సాలునకు ౬౦౦౦౦౦ టన్నుల మట్టరకము ఇనుమును, ౪౦౦,౦౦౦ టన్నుల చొక్కపు లోహమును తయారుచేయగల కర్మాగారమునకు మూలధనము పెట్టుబడి ౧౫ కోట్లు కావలయునని ప్రముఖుల యభిప్రాయము. దీనియాథార్థ్య మాసియాఖండములోని సంయుక్తలోహ వ్యాపారసమ్మేళనమువా రొసంగిన యందాజులవలన తెలిసికొననగు. తాతాసంఘమువారి కర్మాగారపు స్థానికవ్యయము ౧౯౨౪ సంవత్సరములో ౨౨ కోట్లయ్యెను. పరిశ్రమపై బెట్టుబడినంతటిని సాధారణముగ నూటికి ౭ వ వంతు వడ్డీతో జేర్పబడినదని యెంచుకొనినను వత్సరమునకు ౧౨౦ లక్షలగును. ఈ మొత్తమంతయు గర్మాగారములోనుండి వెలువడు సామగ్రుల యమ్మకముచే దీరవలయును. వీనికి దోడు స్థానికవ్యయము సంవత్సరమునకు ౨౨౫ లక్షలగును. ప్రతిసంవత్సరము చలామణిలోని మూలధన మధమపక్షము ౩౫౦ లక్షలుండవలయును. ౪,౨౦,౦౦౦ టన్నుల లోహమును తయారుచేయుటలో ౨౪౦ లక్షల రూపాయలు వ్యయము కావలసి యున్నది. ఈఖర్చుల బూడ్చుకొనుటకును, పెట్టుబడిపై గొంత రాబడిని తీసికొనుటకును టన్ను లోహమును ౧౭౦ రూపాయలకైన నధమపక్షము విక్రయింపవలయును.

ఆరంభదశలో తాతాసంఘమువా రనేకకష్టనష్టములకు పాల్పడిరని ముందే చెప్పియుంటిమి. విదేశలోహపుసామగ్రుల దిగుమతిచే ధరలు సరసమయ్యెను. పోటీధరల కెదుర్కొనజాలక పరిశ్రమాభివృద్ధికై

"డిబెంచర్ల" (Debentures) మూలమున ధనమును ప్రోగుచేయవలసి వచ్చెను. ధరలు మందగించెనే కాని కార్మికవ్యయము తక్కువకాలేదు. బొగ్గువ్యాపారస్థులతోను, రైల్వేకంపెనీవారితోను వ్యాపారసదుపాయములకై యొడంబడికల నిడుపుగ జేసికొనవలసివచ్చెను. ఋణసంచలంబులగు ధరల హెచ్చుతగ్గులలోనివన్నియు విపరీతముగనే పరిణమించెను. ఒడంబడికలు నిరర్థకములయ్యె. ౧౯౨౩ నుండి ౧౯౩౩ వఱకు టన్ను యినుము ౧౨౨ నుండి ౧౪౫ రూపాయలపర్యంతము విలువయుండుటచే వ్యాపారములో నీ కంపెనీవారి కించుక నష్టము కలిగెనన్న పరిశ్రమ తృప్తికరముగ బనిచేయుట లేదనుట నిర్వివాదాంశము. ఇన్నికష్టములపాలై యుండినను శాఖోపశాఖలుగ గర్మాగార మభివృద్ధిజెందెను. వివిధవస్తుసామగ్రుల దయారుచేయు యంత్రాగారములు నెలకొల్పబడినవి. గోడలలో గొట్టు మేకులు మొదలు గొప్పగొప్పకట్టడములలో వినియోగించు దూలములనేమి, వ్యవసాయపు గొరముట్లనేమి, కర్మాగారములలోని యంత్రములనేమి రైలుపట్టాలు, బండ్లు, డబ్బీలు, స్తంభములు వేయేల సర్వజనోపయోగములగు వాని నన్నియు దయారుచేయు యంత్రశాఖలు నెలకొల్పబడెను. ఈ కంపెనీవారు ౧౯౨౪ సంవత్సరమున ౧౬౪ వేలటన్నుల సామానుల తయారుచేసిరి. ౧౯౩౧సం. ౪౩౩ వేల టన్నులు తయారయ్యెను; ౧౯౩౩ లో ౪౨౬ వేల టన్నులు వెలువడెను. రకమువారీగ విశదీకరించిన సాలుకు ౫౦౦ వేల టన్నులు సాధారణముగ తయారగుచున్నదని విశదమగును.

పరిష్కృతములగు ఇనుపసామాను లన్నియు మనదేశములోనే వినియోగమగుచున్నవా యనునది తర్వాతిప్రశ్నము. ౧౯౨౩ సంవత్సరములో ౭౩౯.౬౧ వేల టన్నుల యినుపసామగ్రి మనదేశములోనికి దిగుమతియయ్యెను. దానిలో ౧౮.౬% తాతాకంపెనీవారిది దేశములో ఖర్చుకాబడెను. ౧౯౨౬ లో ౧౦౦౪.౬ వేల టన్నులలో తాతావారిభాగము నూటికి ౩౮.౩ వ వంతు. ౧౯౨౯ లో దిగుమతియైన ౧౦౮౭.౮ వేల టన్నులు మనదేశములో వినియోగమయ్యెను. దీనిలో తాతాకంపెనీవారి వంతు ౩౫.౪%. ౧౯౩౧ సంవత్సరములో ౬౨౮.౨ వేల టన్నులలో తాతాకంపెనీవారి భాగము ౬౫.౪% అయ్యెను. ౧౯౩౩ వ యేటిలో దిగుమతియైన ౫౮౪.౧ వేల టన్నులలో వీరిది ౮౨.౩%. దీనినుండి దేశములో వినియోగింపబడు లోహపు సామగ్రిలో తాతావారి చేదారము దినదినప్రవర్ధమానమగుచున్నదనియు, విదేశవస్తువుల దిగుమతి సన్నగిలుచున్నదనియు నూహింపనగును. స్వదేశవినియోగమునకుదోడు వీరు విదేశములకుకూడ వీరిసామగ్రుల నెగుమతిచేయుచున్నారు. ప్రభుత్వమువారు మాత్రము సవతితల్లిప్రేమను చూపుచున్నారు. పరిశ్రమబాహుళ్యమునకును, వ్యాపారవిస్తారమునకు రానున్న యేడుసంవత్సరములలో కంపెనీవారి స్థాయికవ్యయము దాదాపుగ ౫౫౪ లక్ష. లగునని సూచనలు కనబడుచున్నవి.

తాతాకంపెనీవారి కర్మాగారములోని కార్మికపరిస్థితులు కొంతవఱ్ఱునకు దృప్తికరముగ నున్నవి. ఉత్పత్తిశాఖకును, నుపయుక్తశాఖకును చేరిన పరిచారకవర్గమువారిసంఖ్య ౧౯౨౫ లో ౨౬,౨౯౦; ౧౯౨౯ లో ౨౨,౭౫౩; ౧౯౩౨ లో ౧౭,౧౧౩. కార్మికులలో నెలజీతగాండ్రును, వారపువేతనాపరులు, దినకూలివారు, ఒడంబడికపై సగటున ప్రతిఫలాపేక్షులును గలరు. పరిచారకవర్గమువారి వేతనమమాత్రము ౧౯౨౮ వ సంవత్సరములో ౧౪౬.౮ లక్షల రూపాయ లయ్యెను. ౧౯౨౯ లో ౧౬౩.౧౫ లక్ష లయ్యెను. ౧౯౩౧ లో ౧౪౩.౭ లక్షలు. ౧౯౩౩ లో ౧౩౧ లక్షలరూపాయ లయ్యెను. పరిశ్రమసంఘము ప్రారంభమునుండి నేటివఱకును నొడంబడికదారుల ప్రతిఫలము మాత్రమే మిక్కిలి యధికముగానుండి కేవల కార్మికపరిచారకవర్గమువారికే కొలదియో ముట్టుచుండుట శోచనీయము. మేధావంతులగు సాంకేతికపరిభాషకులు పరిశ్రమాభివృద్ధికై వలయువారు మనదేశములో ననాదిగనుండమిచే విదేశీయులను నియమించి యత్యధిక ప్రతిఫలము వారికి జూపెట్టవలసి వచ్చెను. క్రమక్రమముగ నీపరిభాషకులసంఖ్య సన్నగిలుచుండుటచే టన్ను ఇనుముకు తగులుబడి (Total manufacturing

expense) తగ్గుటయు భావిదేశపురోభివృద్ధికి శుభ సూచకము

ఎడారులలోని ఫలవంతప్రదేశములటుల నుద్భవించిన తాతానగరము దిలకించినవారి కీర్తిపట్టణ నిర్మాణ గల మేధాశక్తియు, గౌశలమును, దూరదృష్టివివేచనయు, వేయేల వారి సర్వంకష ప్రజ్ఞయు గోచరింపక మానవు. పాశ్చాత్యదేశములలోని ప్రబలతరపరిశ్రమ కేంద్రసంస్థల స్థాపకులుకూడ తాతానగరమును దిలకించి విస్మయులు కావలసినదే. ఈ నగరమున ౧౯౩౧ వ సంవత్సరపు జనాభాలెక్కలప్రకారము ౭౩,౬౩౭ మంది నివాసము న్నారు. వీరికివలయు నవనాగరికతా సూచకము లగు సౌకర్యములన్నియు నిందు గలవు. కార్మికులకు, పరిచారకవర్గమువారికి, పరిపాలకసంఘమువారికి, ప్రయాణీకులకు వసతులును, జనోపకారకము లగు వైద్యశాలలు, పాఠశాలలు, పఠనమందిరములు, వినోదార్థము నెలకొల్పబడిన సినీమాలు, నాటక రంగస్థలములు వేయేల నాగరికతాజీవన సహుపాయములన్నియు నిందుగలవు. ప్రాయికముగ గార్మికవర్గమువారి వాసములలో గలుగు లోపము లీపురమున మచ్చునకైన లేవు. ఇంటిమీద ఇల్లులేదు. రోగోత్పత్తిదాయకములగు మురికి ప్రదేశములు చూతమన్నను కానరావు. తాతాసంఘమువారికి జేరినగృహములసంఖ్య ౧౯౩౧ లో ౫,౪౦౧. వీనిలో ౫,౩౬౦ ఇండ్లుకంపెనీయుద్యోగులతో నిండియుండెను. మిగిలినవి తాతానగరములోని ప్రభుత్వపుటుద్యోగులకుపయుక్తమయ్యెను. వీనికి దోడు కంపెనీలో బనిచేయు వారికి గొందఱకు వారస్వంతనిలయము లున్నవి. పరిచారకవర్గమువారి వసతులకై కంపెనీవారు వెచ్చించిన ద్రవ్యము సాధారణముగ ౧౦౦.౫ లక్షల రూపాయలు. వసతులకద్దెలుకూడ మిక్కిలిసరసము. మాసమున కైదు రూపాయలు మొదలుకొని సౌకర్యములబట్టి యధికముగ నుండును. ప్రతిసంవత్సరము మరమ్మతులకు, నూతన గృహనిర్మాణములకు విరివిగ నీసంఘమువారు ధనమును వెచ్చించుట వీరి యుదారస్వభావమును ప్రకటించుచున్నది.

ఈనగరములో వివిధశాఖలలో నిపుణుల బరిభావకుల దయారుచేయుట కొక ప్రత్యేకసంస్థ కలదు. జర్మనీ, అమెరికా మొదలగు దేశములనుండి శాస్త్రవేత్తలగు నిపుణుల రప్పించి వారిచే దేశీయుల వివిధశాఖా ప్రయోక్తలుగ జాగరూకతతో తరిఫీదు చేయించుచున్నారు. ప్రత్యేకసంస్థలలో తయారుకాబడి యారితేరిన కార్మికప్రముఖుల నియోజకమున కంపెనీలో బనిచేయు విదేశీయులసంఖ్య తగ్గుచున్నది. విద్యార్థివేతనముల నిచ్చి ప్రముఖుల బ్రయోజకులజేయుచు వారు వారిశాఖలలో బ్రావీణ్యముగడించినతర్వాత నిర్ణీత కాలము వారి యంత్రాగారములో బని చేయునట్లు వారితో నొడంబడిక చేసికొనుచున్నారు. ఇచ్చటినుండి వెలువడు ప్రముఖులు మనదేశమునందును, విదేశములందును గొప్పగొప్ప యుద్యోగములలో నున్నారనిన తాతాసంఘమువారి యుద్యమ మెట్టిప్రాచుర్యము నొందినదో తెలిసికొననగును. జపానులోని చేతిపనుల పరిస్థితు లతిబాల్యమున నందుతరి వారిదేశీయుల నన్యదేశముల కంపి యందలి యంత్రశాలలలో సాధారణపు గార్మికులుగ బనిచేయ ప్రవేశపెట్టి యందలి మర్మముల దెలిసికొన నుద్బోధించిరి. అటుల తయారైనవారు తమ దేశమునకుపోయి తమవారి కందలి మర్మముల దెలిపి పరిశ్రమాభివృద్ధిం జేసిరి. ఈ విధముగ సాధించిన వ్యాపారవిజ్ఞానముచే నిప్పుడు జపానుదేశ మనన్యసామాన్య వైభవోపేతయై విరాజిల్లుచున్నది. ఇటుల విజ్ఞానసంపాదనాసూత్రమును మనదేశీయు లభ్యసించి యాచరించిన మనదేశము ధన్యతం జెందును.

తాతావర్తకసంఘమువారి యార్థికపరిస్థితులు సుస్థిరతరముగ నున్నవి. వ్యాపారసంస్థల నెలకొల్పుటలో బెట్టుబడిదారులదృష్టి రాబడిపైనుండినను సంఘసంస్థాపనానంతరమే లాభవిభజనమునకై యెదురుచూచుచుండుట సాహసము. మొదట నీసంఘమువారు ప్రతికూలవాతావరణములో బనిచేయవలసివచ్చె నని మున్నే చెప్పియుంటిమి. ఆర్థికనిపుణు లెట్టి నూతన మార్గముల వెదకినను ప్రపంచపరిస్థితులచేతను, సంతర్జాతీ యార్థిక సంక్షోభములచేతను పెట్టుబడిపై రాబడి యంతనుత్సాహ

కరముగ లేదు. అనాదిగ బనిచేయుచుండి వేయిసాకర్యములు గలిగినను, ప్రభుత్వమువారి ప్రాపు కలిగియు లాంకషైరులోని నేతపరిశ్రమయే ప్రకృతపు టార్థికవిప్లవములో నుజ్జునుజ్జగుచున్నదనిన నేపోషణయు లేని దేశీయవ్యాపారసంస్థల స్థితుల నడుగవలయునా? బహుకాలముగనుండి కొంతవఱకు వ్రేళ్లు నాటజేసిన మన దేశపునేతపరిశ్రమ యెటుల భంగపడుచున్నది. ఎటుజూచినను విషమపరిస్థితులు ప్రబలుచున్నను తాతా వర్తకసంఘమువారు రాబడిని పెట్టుబడిదారులకు పంపకము చేయకపోలేదు. వారి సంఘపుపాళ్లు (Shares) ధరలుగలిగియుండుటయే గాక గిరాకికలవియై యున్నవి. " Financial Times " పత్రిక వీరి సంఘపుపాళ్ల హెచ్చుతగ్గులను ప్రచురించుచున్నది. ౧౯౨౬ లో నుత్తమ మను పాళ్లపై ( Cumulative preference shares and cumulative second preference shares ) ౬౩.౮ లక్షల రూపాయలకు, ౧౯౨౯ లో ౯ లక్షలను ౧౯౩౦ లో ౨౧.౭ లక్షలను ౧౯౩౩ లో ౩౯.౨ లక్షలను పెట్టుబడిదారులకు పంపకము చేసిరి. సాధారణపుపాళ్ల (Ordinary shares) పై నేమియు లాభమును పంపకము చేయలేదు. దానివలన ప్రజలు కంపెనీవారిపై నాందోళనము సలుపలేదు. వీరి యార్థిక సుస్థిరతపై ననుమానము లెవ్వరికిని కలుగలేదు. దినదిన ప్రవర్ధమానమై దేశోద్ధారక మగు ప్రబలతర పరిశ్రమ నెవ్వ రేవగింతురు ?

ఆశ్రయము లేనిదే, రక్షణ లేనిదే, పోషణ లేనిదే ఎంతటిగొప్పసంస్థయైనను నిలువజాలదు. మీదుమిక్కిలి విదేశప్రభుత్వముక్రింద దేశీయపరిశ్రమ లసలే నిలువ లేవు. మనదేశపు ప్రభుత్వమువారిప్రాపు తాతాసంఘమువారి కావశ్యకమా ? అవశ్యమగుచో నెంతవఱకీచేతిపనిని ప్రభుత్వమువా రాదరించుచున్నారు ? విచారింతము. రక్షణ యవశ్యమని తలచి ౧౯౨౩ సంవత్సరములో నఖిలభారతశాసనసభవా రెగుమతి దిగుమతి సరకులపై సుంకమును వసూలుచేయుటలో సలహానొసంగుటకుగా నొకసంఘమును నియమించుటకై తీర్మానించిరి. దీనినే టారీఫ్‌బోర్డు ( Tariff Board ) అందురు. ఈ సలహాసంఘమువారు మన దేశములోని యుక్కుపరిశ్రమపరిస్థితుల విచారించి మూడునివేదికల ప్రభుత్వమువారి కందజేసిరి. వానిలో బ్రభుత్వమువారి ప్రాపు నభిలషించు దేశీయపరిశ్రమలు కొన్నినిబంధనలకు లోనై యుండవలయు ననియు, నట్టినిబంధనలకు తాతా కంపెనీవారి యుక్కుపరిశ్రమ లోనై యున్నదనియు, దీని నవశ్యము రక్షింపవలయుననియు సూచించిరి. మన దేశములో తయారుకాబడని యుక్కువస్తువ్యాపారమున కీపరిరక్షణ యేమాత్రమును విరోధముగ నుండరాదని శాసించుటచేతను, ప్రాయికముగ భాగస్వాముల శ్రేయోభిలాషయే యాదర్శముగ నెంచికొనక కొనువారియొక్కయు, వినియోగదారులయొక్కయు ( Purchaser and Consumer ) నక్కరను మనసునందుంచుకొనుటచేతను ప్రభుత్వమువారి పరిశ్రమపరిరక్షణ మంత ఫలోన్ముఖము కాలేదు. దీనికి దోడొక వ్యాపారసంస్థను పోషించి సర్వస్వతంత్రవ్యాపార ( గుత్త - Monopoly ) మొకరి కియ్యరాదను ప్రభుత్వమువారి పరిపాలనా సూత్రముకూడ కొంతమట్టున కీచేతిపనియభివృద్ధి కాటంకము కలిగించినది. కొన్ని సమయములందు జర్మనీ, బెల్జియం, ఫ్రాన్సు మొదలగు దేశములనుండి దిగుమతియైన లోహపు బదార్థపు ప్రవాహము మన దేశములోని బజారుల ముంచివేయకుండునట్లు ప్రభుత్వమువారు శాసింపవలసివచ్చెను. దిగుమతుల సంపూర్ణముగ నరికట్టలేదు. విపులతరోపయోగమగు నీపరిశ్రమను పూర్తిగ రక్షించి సరకుల విలువ లోకరికే విడుచరాదను మర్యాదకు లోబడి యెగుమతిదిగుమతుల శాసించుటకన్న దేశీయపరిశ్రమకు విరాళరూపమున ధనసహాయ మొనర్చుటకు దొరతనమువా రంగీకరించిరి. ఎగుమతిదిగుమతులలో వస్తువుల విలువను (Ad valarem)బట్టి సుంకము విధించుటకంటె తూనికపై (Specific) విధించుట యుక్తమని టారీఫు సంఘమువారి సలహాను ప్రభుత్వమువా రామోదించిరి. (౧౯౨౮ సంవత్సరమున టారీఫుసంఘమువారి "ఏ" అనుబంధమును చూడుడు) ఉక్కు సామానులమీద ౧౦% మొదలు ౨౫% వరకు దిగుమతిపన్నులు వేయ

బడెను. అనుకూల వాతావరణ మలవడినను, పరిరక్షణ యబ్బినను, నైసర్గికసౌకర్యము లుండినను ప్రారంభదశ యందు ప్రతిపరిశ్రమయు గొంతత్యాగమునకు సిద్ధపడ వలయును. ప్రభుత్వమువారి ప్రాపు కలుగదేని, దేశీయ ఉక్కుపరిశ్రమకు బాలారిష్టదోష మంటియుండిన దేని మనదేశపు టార్థికస్థితి కది యెట్టి విప్లవకారియై యుండునో! వేనకువే లుద్యోగములు లేక దేశద్రిమ్మరులై యుండురు. నైసర్గికములగు ఉత్పత్తి యనుకూలములుగల ముతకలోహము రాతిసిబొగ్గు విలువలేక యేమూలనో నణగియుండును. అనేక సంవత్సరములనుండి పడిన శ్రమ మన్నుపాలై యుండును. దేశములోని యార్థికసంపదలో, వ్యాపారపు టుత్తరాపేక్షలలో సంక్షోభము కలిగియుండును. దేశమంతయు నిరాశావేశమున నుండియుండును. శ్రీమంతులు, ధనవంతులు, పెట్టుబడిదారులు విస్మయులై విభ్రాంతులై నమ్మకములేక, ధైర్యములేక నూతనోద్యమములపై పెట్టుబడిని పెట్టుటకు వెనుదీసియుందురు. వేయేల? దేశీయ వ్యావహారిక ఆర్థికవిషయకచారిత్రమును నింకొకవిధమున వ్రాయవలసి యుండెడిది.

మొదటి సుంకపుశాసనము (The first Tariff Bill) కొంత సహాయకారి యగుటచే తాతాసంఘమువారును, తదితర లోహవ్యాపారులును ప్రభుత్వమువారి నధికతరరక్షణకై యాందోళన సలుప సమకట్టిరి. ప్రభుత్వమువారు టారీఫు సంఘమువారి సలహా నపేక్షించిరి. వీరి సలహానుండి ఉక్కుపరిశ్రమరక్షణ రెండవశాసనము (Steel Protection Act) ౧౯౨౪ లో వెలువడెను. ఇది పరిశ్రమాభివృద్ధికి సహాయకారి కాదయ్యెను. దేశవిపరీతపరిస్థితులకు ప్రపంచవిషమపరిస్థితులు తోడయ్యెను. ధర లొక్కుమ్మడితగ్గుటచే తయారుకావలసినవస్తుసంచయము సన్నగిల్లెను. అంతర్జాతీయార్థిక సంక్షోభకు దోడు నాణెముల చలామణిలోని యేర్పాటులు విచ్ఛిన్నములై విపరీతముగ పరిభ్రమించెను. సరుకులధరలు ఐరోపా మహాసంగ్రామపు పూర్వధరలకంటె క్షీణించెను. ప్రతి దేశమువారును వారివారి దేశీయపరిశ్రమ పరిరక్షణాయత్తులై స్వార్థపరాయణులై తమతమ దేశములలో వలయు కట్టుదిట్టముల శాసించుకొనిరి. ఈవిప్లవపరిస్థితులలో తాతాకంపెనీవారు వారి కార్మికవర్గముయొక్క ప్రబలతరమైన సమ్మెకట్టు కెదుర్కొనవలసివచ్చెను. వ్యయములతగ్గించి, దండుగఖర్చుల నణచి, మితవ్యయసూత్రమును పాటించి, స్వతంత్రమును విడనాడక సార్థకత్వమును (Efficiency) వీటబుచ్చక ప్రయోజకత్వమును పట్టువిడువక శ్రద్ధతో మెలకువతో జాగరూకతతో తాతాకంపెనీవారు తమశక్తిసామర్థ్యముల వినియోగించి పనిచేయుచుండుటకు వారిప్రకృతపు బరిస్థితులే ప్రబలసాక్ష్య మిచ్చుచున్నవి.

పరిశ్రమ పరిరక్షణప్రణాళిక విజయము నొందుటకు ముఖ్యకారణములు మూడు: ౧ వస్తువుల యుత్పత్తికను తగులుబడి, ౨. ఉత్పత్తిపరిమాణము, 3. ఉత్పత్తియైన వస్తువుల బజారులో తగిన విలువకు విక్రయించుటకు సదుపాయము. ప్రపంచములోని యుక్కుపరిశ్రమయే ౧౯౨౪ సంవత్సరమునుండి నూతనపథమును త్రొక్కినది. ఉత్పత్తి పరిమాణము ౧౯౨౯ లో మిక్కిలి యున్నతస్థానము నంటినది. అధికతరోత్పత్తిచే ధరలు మందగించి గిరాకి లేక ౧౯౩౨ లో సరుకులు స్తంభీభూతమయ్యెను. ఈకారణములచే తాతాకంపెనీవారికి ఇండియాప్రభుత్వమువారొసగిన చేయూత నిరర్థక మయ్యెను. "టారీఫుబోర్డు"వారు బ్రిటీషుసామ్రాజ్యములో తయారుకాబడు లోహపుసామగ్రికి సామ్రాజ్యేతరవస్తుసంచయమునకును సుంకములలో వ్యత్యాసమును సూచించిరి. ఒటావా సమ్మేళనము (Ottawa Conference)లోని తీర్మానములు మన దేశీయవస్తువులను సంరక్షించునని యాశయ ముండెను. కాని ప్రత్యక్షప్రమాణములు వానిని నేతిబీరకాయవంటివని నిరూపించినవి. బ్రిటిషుసామ్రాజ్యములో భాగములు అన్యోన్యదేశపురోభివృద్ధి కని తీర్మానము లుండుటయే కాని యాచరణలో నన్యోన్యత లేకపోవుటయే కాక మన దేశపు బరిశ్రమలకు న్యూనత యలవడినది. ఇట్టి విపరీత

విషమ పరిస్థితులలో దమకు గలుగుచున్న నష్టముల సోదాహరణముగ సమగ్రముగ మన ప్రభుత్వము వారికి తాతాకంపెనీవారు నివేదించుకొనిరి. మొదటి సుంకపు శాసనము (౧౯౨౪)లోని మూడవ యాశ్వాసములో పరిశ్రమల కొసగిన యాదరణమునకు విరుద్ధముగ విదేశ లోహపుసామగ్రులు మనదేశములోనికి దిగుమతి యయ్యెడు పక్షమున విచారించి పునః రక్షణార్థము హెచ్చు సుంకముల విధించునట్లు ప్రభుత్వమువారు శాసించవలయునని చెప్పబడియున్నది. ఉక్కు పరిశ్రమరక్షణ శాసన మీయధికార మాలోచనా సంఘసహాయము డను రాజప్రతినిధి కొసగినది. కాని యీ యధికారమును చలాయించి పరిశ్రమకు వలయు రక్షణము ఇండియా ప్రభుత్వమువారుగాని, రాజప్రతినిధి కాని యొసగకుండుట శోచనీయము. నూతన పరిరక్షణ ప్రణాళిక నుపపాదించుటలో నికమీద నిట్టి విపరీతపరిస్థితుల గమనించుట యుక్తము.

ఈవ్యాసమును వ్రాయు సమయమున టారీఫ్ బోర్డువారీవిషయమై యాలోచింప నుద్యమించినారు. వారు లోహపు బరిశ్రమపరిస్థితుల మీదుమిక్కిలి తాతాసంఘమువారు పడుచున్నకష్టముల గమనించి సలహాల నొసంగుదురని యాసింతుము. ఇంతకుము న్నీ సంఘమువా రొసగిన సలహాల ననుసరించి మితవ్యయ సూత్రము నాచరణలోనికి దెచ్చి యంత్రాల నభివృద్ధి యొనర్చినారని తెలిసికొని బోర్డువారు సంతసింతురు గాక. వ్యక్తిస్థపరిస్థితులలో వ్యాపారప్రణేతలయొక్కయు, నార్థికప్రబోధలయొక్కయు ఆశయములు సంపూర్ణ ఫలోన్ముఖములు కాజాలవని యెఱిగి దయార్ద్రమనస్కులై దూరాలోచనాపరులై సంపూర్ణ స్వాతంత్ర్యపరిరక్షణకు వలయు సలహాలనిచ్చి దేశోద్ధారణ చేయుదురుగాక. టారీఫ్ సంఘమువారు, ప్రభుత్వమువారుకూడ నీసలహాలను విశాలమైనబుద్ధితో నుదారచిత్తులై యాలోచించి సంపూర్ణ పరిరక్షణశాసనమును నెగ్గించి ప్రజలవిశ్వాసమునకు పాత్రులగుదురుగాక. ఆరంభమునుండి విపరీతపరిస్థితులలో సైతము పనిచేసి దేశగౌరవమును నిలువబెట్టిన తాతాసంఘపరిపాలక వర్గమువా రభివంద్యులు మనకెల్లరకును. వారి యంత్ర శక్తికి దోడు ప్రభుశక్తి నలవడజేసి యుత్సాహశక్తి జూపించి వారియుద్యమమును కొనసాగించి దేశసేవ యథోచితముగ జేయుదురుగాక.



# జాంజిబారునందలి భారతీయులు-వారి స్థితిగతులు

చావలి వెంకటహనుమంతరావు

౧

జాంజిబారులోని భారతీయులవిషయమై కొంత కాలమునుండి పత్రికలలో హెచ్చుగ చదువరులు చూచియుందురు. భారతీయులకు వ్యతిరేకముగ కొన్ని చట్టములు జాంజిబారు ప్రభుత్వమువారు చేసిరనియు, వాటివలన భారతీయుల స్థితిగతులు చాల కష్టదశకు వచ్చిన వనియుకూడ చాలమందికి తెలిసియుండవచ్చును. జాంజిబారులోని భారతీయులనుగురించియు, పైన తెల్పిన చట్టములవలన వారికి కల్గిన నష్టమును గురించియు కొన్ని విషయము లీక్రింద పొందుపర్చుచున్నాను:—

జాంజిబా రనునది తూర్పుఆఫ్రికాలోని ఒక భాగము. చిరకాలమునుండి అరబ్బీసుల్తానులు దానిని పరిపాలించుచున్నారు. యుద్ధానంతరము ఆప్రాంతము బ్రిటిషువారిరక్షణక్రిందకు తీసుకొనిరాబడెను. పేరునకు ప్రస్తుతముకూడ సుల్తాను కలడు కాని, పరిపాలన యంతయు బ్రిటిషురెసిడెంటుద్వారా జరుగుచున్నది. ఈ రెసిడెంటుకు సలహానిచ్చుటకు ఒకకార్యనిర్వాహక వర్గమును, ఒకశాసనసభయుకూడ కలవు. శాసనసభలో అధిక సంఖ్యాకులు అధికార సభ్యులు; ఇద్దరు భారతీయులు కూడ దానిలో సభ్యులుగ నియమింపబడుచుందురు. స్వదేశీయులకు అరబ్బులకుకూడ దానియందు ప్రాతినిధ్యము కలదు. జాంజిబారునందు సుమారు ఇరువదియైదు సంవత్సరముల క్రిందట మొట్టమొదట భారతీయులు ప్రవేశించుట మొదలిడిరి. అరబ్బీసుల్తానులు వారిని మర్యాదచేసి వా రచ్చటకు ప్రవేశించుటకు ప్రోత్సహించిరి. భారతీయులు వారి ధనమును, తెలివితేటలను ఉపయోగించి జాంజిబారు దేశమును బాగుపరచుటకును, అచ్చట వర్తకవ్యాపారము అభివృద్ధిచేయుటకును, పరిశ్రమలను ప్రోత్సహించుటను తోడ్పడుచుండుటచే వా రచ్చటకు కష్టములేకుండ ప్రవేశించుటకు వీలాయెను. సుమారు ఒకకోటిరూపాయలు, భారతీయులు జాంజిబారునందు వివిధపరిశ్రమలందు, ముఖ్యముగ లవంగముల పండించు పరిశ్రమయందు వెచ్చించినట్లు తెలియుచున్నది. స్వదేశీయులకు అరబ్బులకు భూములను బాగుచేయుటకును, పంటలు పండించుటకునుకూడ భారతీయులు అప్పుల నిచ్చియున్నారు. అన్నివిధములుగను భారతీయుల స్థితి కొంతకాలము వరకు బాగుగనే యుండెను. వారికిని స్వదేశీయులకు అరబ్బులకును కూడ ఎట్టి మనఃస్పర్ధలుకాని, స్నేహభావమునందు లోపముకాని లేకుండ యుండెను.

౨

కాని సుమారు మూడునాలుగు సంవత్సరముల నుండి ఈస్నేహభావములందు కొంతమార్పు కన్పించుట మొదలిడెను. ఈమార్పునకు ముఖ్యకారణము లేవన, జాంజిబారునందు నివసించుచుండిన యూరపియనులకు భారతీయులయెడల గల అసూయయే. భారతీయుల భాగ్యమును, వారి అభివృద్ధియు చూచి యూరపియనులు వారి నాదేశమునుండి యేవిధముగనైన వెడలనడచినగాని తమ అభివృద్ధికి వా రాటంకముగ నుందురని గ్రహించి దానికి మార్గములను వెదకుట ప్రారంభించిరి. ఈప్రయత్నములలో వారికి ముఖ్యముగ కాన్పించిన మార్గము భారతీయులకును, అరబ్బులకును ఇదివరకుండుచువచ్చిన సఖ్యమును చెడగొట్టి, వారిద్దరిమధ్యను కలహములను కల్పించుట. పైకిమాత్రము వారు చేయుచున్నదంతయు స్వదేశీయులకు అరబ్బుల బాగుకొరకై చేయుచున్నామని వారు చెప్పుచున్నమాట నిజమే కాని వారి నిజోద్దేశ్యము తమస్వంతలాభమే అనియు, స్వంత అభివృద్ధియే యనియు తలంచుట కవకాశము లెన్నేని కలవు. తూర్పు ఆఫ్రికాయందలి ఇతరభాగములలో,

ముఖ్యముగా కెన్యా, యుగండా, టాంగనాయికా మొదలగు ప్రదేశములలో యూరపియనులు భారతీయులను పెట్టుచున్న కష్టములను చూచిన జాంజిబారునందు వారు తలంచినపని భారతీయులకు వ్యతిరేకముగమాత్రమే యనియు స్పష్టముకాదా?

౩

ఈసందర్భములో భారతీయులకు వచ్చినకష్టములనుగురించి కొంత చెప్పవలసియున్నది. భారతీయులు జాంజిబారు అరబ్బులకు అవసరమగు అప్పుల నిచ్చిరని చెప్పియుంటిమికదా? ఆ అప్పులను వారు తీర్పలేక పోవుటచేత వారిభూములను తమ అప్పులక్రింద భారతీయులు జమకట్టుకొనుట మొదలుపెట్టిరి. ౩, ౪ సంవత్సరములనుండియు ప్రపంచమునంతటిని ఆవరించియుండిన ధరల మాంద్యమువలన అరబ్బులు తమ అప్పుల నసలే తీర్పలేకుండపోయిరి. కాలక్రమేణ జాంజిబారు నందలి అరబ్బుల భూములు భారతీయుల యాజమాన్యముక్రిందకు వచ్చుట తటస్థించెను. అదియు కాక లవంగములు జాంజిబారునందు పండు వస్తువులలో ముఖ్యమైనదనికూడ పైన చెప్పియుంటిమి. ఈ లవంగములను పండించువారు అరబ్బులైనప్పటికిని, వాటి నితరదేశముల కెగుమతిచేయువారు భారతీయులే యనియు, కాన ఆవర్తకమునందు వచ్చులాభమంతయు భారతీయులే పొందుచున్నారనియు గూడ యూరపియనులకు కష్టముగ నుండెను. జాంజిబారునందు లవంగము లెక్కువగ పండుచున్న విషయము నిజమే కాని దాని వలన నెక్కువలాభమును భారతీయవర్తకులు పొందుచున్నా రనునది నిజముకాదు. లవంగముల వర్తకము చేయువారు హెచ్చు పన్నును చెల్లించవలసియున్నదనియు, జాంజిబారునందు వాటిని పండించుట కగు ఖర్చు ఎక్కువయనియు, మనము జ్ఞాపక ముంచుకొనిన భారతీయులు అరబ్బులు పొందవలసిన లాభముల నన్నిటిని వారే పొందుచున్నారనునది నిజము కాదని స్పష్టమగును. కాని యేవిధముగనో భారతీయులకు కష్టములను కల్పించి, వారికి జాంజిబారునందు నివసించుట కష్టమనిపించి, అచ్చటనుండి వారిని లేచిపోవునట్లు చేయుటయే ప్రధానోద్దేశ్యముగా గల జాంజిబారుప్రభుత్వము వారి కీవిషయములను గమనింపవలసిన అవసరమేమి? కాన వారు చేసినదేమన అధికారసభ్యులచే నిండియున్న జాంజిబారు శాసనసభవారిచే కొన్నిచట్టముల నేర్పాటు చేయించిరి. వాటియందు ముఖ్యమైనవి రెండు కలవు: ఒకటి జాంజిబారునందు ఎవరు కాని బ్రిటిషురెసిడెంటు యొక్క అనుమతి లేనిదే వ్యవసాయపు భూములను అప్పులకొరకై అమ్ముటకాని, కొనుటకాని చేయకూడదు; రెండవది లవంగములవర్తకము చేయువా రెవరును ప్రభుత్వమువద్దనుండి లైసెన్సు పొంది వాటిని ఎగుమతిదిగుమతులు చేయకూడదు. ఈ రెండుశాసనములందును కూడ భారతీయుల పేరు లేనిమాట నిజమే. అదియుకాక బ్రిటిషురెసిడెంటు భూములను అమ్ముట, కొనుట విషయములలో అన్ని పక్షములవారి కష్టములను విచారించుట కధికారము కల్గియున్న మాటకూడ నిజమే. కాని జాంజిబారునందు అప్పుల నిచ్చువారు ముఖ్యముగ భారతీయులేగాన ఆ చట్టములు వారికే యెక్కువనష్టము కల్గించునని వేరుగ చెప్పవలయునా? రెసిడెంటుకు ఇట్టినష్టములు వచ్చినసందర్భములలో నష్టమును సరిచేయుట కధికారముండినప్పటికిని ఆ అధికారము భారతీయుల కనుకూలముగ వినియోగింపబడు నని తలంచుట కెట్టి అవకాశములును లేవు.

౪

పైనచెప్పిన రెండుశాసనములను ఏర్పాటుచేయుట వలన జాంజిబారు ప్రభుత్వమువారు తమ భారతీయ వ్యతిరేకతను పూర్తిగ వెళ్లగక్కిరి. ఇవి భారతీయులకు వ్యతిరేకములుగ చేయబడినవని తెల్పుట కింకొక నిదర్శన మేమన జాంజిబారులో ఇదివరలో అట్టర్నీ జనరలుగానుండి ప్రస్తుతము శాసనసభలో సభ్యుడుగా నున్న ఐరోపియనుడే వాటినిట్లు వర్ణించెను: "ఇప్పటికి మూడు సంవత్సరములనుండియు తెలిసియో, తెలియకయో, ఉద్దేశ్యముండియో, ఉద్దేశ్యము లేకయో, ఈ ప్రభుత్వమువారు భారతీయులకు వ్యతిరేకమగుపద్ధతులను అనుసరించుచున్నా" రని ఆతడు శాసనసభయందు

భూముల అమ్మకపుచట్టముపై చర్చల సందర్భములలో చెప్పియుండెను. జాంజిబారునందలి భూములు స్వతహా హక్కుదారులు అరబ్బులే అనియు, వారి భూములను అప్పులకొరకై జమకట్టుకొనుటవలన వ్యవసాయపు భూములన్నియు విదేశకామందులచేతులలోనికి పోవుటయు, స్వదేశీయులు భూమియందు పనిచేయు వట్టి కూలీలుగ మారుటయు తటస్థించుచున్నదనియు, అట్టి మార్పులవలన కలుగునష్టములను తప్పించుటకే ఈచట్టములు చేయబడినవనియు ప్రభుత్వముతరఫున వాదించువారు తెల్పుట సహజము. హెచ్చువడ్డీలపై అప్పుల నిచ్చుటయు, దానివలన అప్పులు పుచ్చుకొనినవారికి తీరనినష్టము వాటిల్లజేయుటయు తప్పని అంగీకరింతుము. వ్యవసాయదారులకు వ్యవసాయముకొరకై పుచ్చుకొనిన అప్పులపై వడ్డీలు తగ్గింపవలెనని మన దేశమందుకూడ మన మాందోళన చేయుచున్నాము. కాని అట్టి హెచ్చువడ్డీరేట్లవలన వచ్చు నష్టములను తగ్గించుటకు మార్గము న్యాయసభలద్వారా వాటిఅన్యాయమును ప్రకటించి నష్టపరిహారము పొందుటయే. అట్లుకాక ప్రభుత్వమువారు తమ అధికారము నుపయోగించి ఒక్కసారిగ ఒకసంఘమునకు చెందినవారినందరిని తీరనినష్టమునకు పాల్జేయుట అన్యాయమని యెల్లరును ఒప్పుకొనకతప్పదు.

ఇంక రెండవచట్టమునుగురించి చెప్పవలసినదేమన, భారతీయులకు వర్తకములో నష్టముకల్గించుటయే దాని ప్రధానోద్దేశ్యము. ఇదివరలోనే ఆవర్తక మంతలాభకరముగ లేదు. మడగాస్కర్ద్వీపమునుండి దిగుమతి యగు లవంగములకన్న తక్కువఖరీదునకు ఎగుమతియగుటచే వాటిపోటీవలన జాంజిబారువర్తకమునకు నష్టము కలుగుచున్నది. ఈసందర్భములలో ఇంకను ఎక్కువ అడ్డంకులను ఏర్పాటుచేసిన వారు చేయగలిగినది అక్కడ వర్తకమును చాలించుకొనుటయే.

౫

పైన వ్రాసినదానినిబట్టి జాంజిబారుభారతీయుల స్థితిగతులను గురించి కొంతవరకు తెలిసికొనుటకు వీలగును. ఆపరిస్థితులు చాల క్లిష్టముగ నున్నవని వేరుగ చెప్పనక్కరలేదు. పైన సూచించిన శాసనములు ఆమోదింపబడకపూర్వము జాంజిబారు భారతీయసంఘమువారు ఇండియాప్రభుత్వమువారికిని ఇతర అధికారేతర సంఘములకును ఆశాసనములనుగురించి తెలియజేసి తమకు సహాయము చేయవలసినదని కోరిరి. కాని వీరేమిచేయుటకును ముందే అతితొందరగ ఆ చట్టము లామోదింపబడుటయు, ఆచరణలోనికి తీసుకొనిరాబడుటయు కూడ తటస్థించినది. అదియుగాక ఇండియాప్రభుత్వము వారు స్వంత బాధ్యతపైన జాంజిబారు ప్రభుత్వమును ఎట్టి అసమ్మతినికాని నేరుగ తెల్పుటకు వీలులేదు. వారెట్టి అసమ్మతి తెలుపదలచినను లండనునందలి వలసరాజ్యములమంత్రిద్వారా చేయవలసియున్నది. హిందూదేశమునకు బ్రిటిషుసామ్రాజ్యమునందుగల హీనస్థానమునకిదియొక నిదర్శనము. ఇండియాప్రభుత్వమువారు వారు చేయవలసిన విధిప్రకారము తమ అసమ్మతిని తెల్పిరి. అదియుకాక జాంజిబారునందలి నిజస్థితిని తెలిసికొనుటకు తమ ఉద్యోగస్థునొకనిని జాంజిబారునకు పంపిరి. అతని రిపోర్టువచ్చినతరువాత దానిపై మరల నింకొకసారి తమ తీవ్ర అసమ్మతిని తెల్పుట వారివిధియై యున్నది. జాంజిబారుభారతీయులకు జరుగుచున్న అవమానము, నష్టములనుబట్టి మనము నేర్చుకొనవలసిన విషయమేమన హిందూదేశమునకు స్వాతంత్ర్య మున్నగాని విదేశములందలి భారతీయుల కిట్టికష్టములు తప్పవనునది.

---

# సబ్బు పరిశ్రమ

సబ్బును మనము ప్రతిదినము ఉపయోగించు చుందుము. మనదేశమున సబ్బును మరీ యెక్కువగ వాడుచున్నారు. సబ్బును ఎక్కువగా తయారు చేయుటయందును మనదేశమే మొదటిది. కాని స్నానాదికముల కుపయోగపడు సబ్బు విదేశములనుండియె విశేషముగ మనకు వచ్చుచున్నది.

"Cleanliness is next to Godliness" అనువాక్యమున కెక్కువ ప్రాధాన్యమున్న మనదేశమున సబ్బున కవసరము క్రమేణ వృద్ధియగుచున్నది. కావున మనదేశమున అధికముగా సబ్బుపరిశ్రమాభివృద్ధికి అవకాశము కలదు.

సబ్బుపరిశ్రమ మనదేశమున సర్వసామాన్యముగ వృద్ధిచెందుచున్నది. కాని మనదేశమున చవుకరకమయిన సబ్బుమాత్రమే యెక్కువగ తయారగుచున్నది. అందే మన మనస్సంతయు లగ్నమైయున్నది. ఒకమణుగు నూనెనుండి ఒకమణుగుపదిహేను సేర్ల స్వచ్ఛమైన సబ్బు వచ్చును. అదే చవుకరకమయినదైనయెడల దానియందు నిరుపయోగమైన వస్తువులు-పిండి, ఉప్పు, నీరు మొదలయినవి-ఎక్కువగా నిలిచిపోవును.



౧. సబ్బును కాచు పాత్ర

సబ్బుపరిశ్రమ విశ్వవిద్యాలయములలో చాల ముఖ్యమైన పారిశ్రామిక రాసాయనిక విద్యయందొకశాఖగా ఏర్పడుచున్నది. లాహోరునందలి Forman Christian College విద్యార్థులు సబ్బు చేయుటయందెట్లు పని చేయుచున్నది ఇందలి చిత్రములమూలమున తెలియగలదు.

సబ్బు చేయునపుడు మిగులునది గ్లిసరీను. ఈగ్లిసరీనును వేరుచేయువిధమే సబ్బుచేయుట యందలి వివిధసందర్భములుగ విభాగించవచ్చును.

## సబ్బును చేయువిధానము

౧. తయారగు సబ్బునుండి గ్లిసరీనును వేరు చేయుట.

౨. గ్లిసరీనువచ్చినను సబ్బునుండి వేరు చేయబడకుండుట.

౩. గ్లిసరీను రానపుడు, జనించు ఆమ్లమును క్షారముతో పోగొట్టుట.



మరుగుటకుకొన్ని దినములు పట్టును.

గ్లిసరీనును, సబ్బును, ఎక్కువయిన కాస్టిక్ సోడాను వేరుచేయుటకు ఉప్పును చేర్చెదరు. సబ్బు పైకి తేలును. తక్కినవి క్రింద మడ్డిగ నిలుచును. దీనికే "గ్రెయినింగు" అందురు. తరువాత 'లై' అను దానిని గొట్ట

౨. సబ్బును బారులుగా కోయుట

ఈ విధానములలో మొదటిపద్ధతి యెక్కువగా అమలులోనున్నను కడపటిపద్ధతికే ఈ దినములలో ఎక్కువవ్యాప్తి గలుగుచున్నది. అదియే అన్నిపద్ధతులను మించగల దని తోచుచున్నది. కడపటి పద్ధతిప్రకారము వచ్చు గ్లిసరీను చాల స్వచ్ఛమైనది. నూనెనుండి ఆమ్లమువచ్చును. ఆ ఆమ్లమునుండి వచ్చు సబ్బు స్వచ్ఛమైనది. ఇందు ఖర్చుసయితము స్వల్పము.

సాధనసంపదలు సరిగలేనందున, సబ్బుపరిశ్రమ సరిగ తెలియనందువలనను మనదేశమున రెండవపద్ధతినే ఎక్కువగ సబ్బును చేయుచున్నారు.

గ్లిసరీనును వేరుచేయు విధము: సోపు "కెటిలు"నందు లెక్కప్రకారము నూనె, కొవ్వు పోసెదరు. ఆ కెటిలులో ఆవిరిగొట్టము లుండును. "లై" అను కాస్టిక్‌సోడానీరును కొద్దికొద్దిగ అందుబోయుదురు. తరువాత ఆవిరి వేడితో నీటినికాచి యుడకబెట్టెదరు. "సెపోనిఫికేషన్" సులభముగ పూర్తియగుటకు, ఎక్కువగ కాస్టిక్‌సోడానీటిని బోయుదురు. ఇవి



3. 'చిప్పింగ'



౪. స్నానాదికముల కుపయోగించుసబ్బులను తయారుచేయు యంత్రము

"లై" ని వేరు చేయుదురు.

తరువాత సబ్బును నీటితో కలిపి బాగుగ కాచెదరు. తరువాత అనుభవపరులు సమయము గుర్తించి, అందలి అపరిశుభ్రవస్తువులను తీసివేసి సబ్బును చేయుదురు.

సువాసన ద్రవ్యములను, రంగులను సబ్బుతో కలుపుటకు 'క్రచ్చర్' అను యంత్రములను ఉపయోగించెదరు. కలియబెట్టుటకు కొన్ని కాడలు సయితము యంత్రమందే కలవు.

వేడిగానున్న సబ్బును చట్టములలో పోసి గట్టిపడినతర్వాత ప్రక్కలనుండి తీయుదురు. ఒక యంత్రసాహాయముతో ఆ సబ్బులు పలకలుపలకలుగా కోయుదురు. మరియొకయంత్రముతో మరీ చిన్నబిళ్లలుగా కోయుదురు. కవిమ్మలఒత్తిడిచే సబ్బుబిళ్ల లేర్పడును.

## స్నానాదికముల కుపయోగించుసబ్బులు

ఈసబ్బులను తయారుచేయు విధానమునకు చాలకాలము పట్టును. వీటియందు నీరు తక్కువగనుండును గనుక యివి యెక్కువకాల ముండును. ఎండిన సబ్బుబారులను "సోప్ చిప్పర్ తో" చెక్కి ఆవిరివేడిలో ఎండించెదరు.

ములగుండా గ్లిసరీనును శుభ్రపరుచు పాత్రముల లోనికి పోవునట్లు చేయుదురు.

చేరిన సబ్బును నీటితో కలిపి యుడికించెదరు. సబ్బును ఇంకను శుభ్రపరచుటకు మును పటివలెనే మరియొకటిరెండు సార్లు కాస్టిక్ సోడాతో ఉడుకబెట్టి



' [illegible] ప్లాడరు '

అంతకుపూర్వము నూటికిపదునాలుసపాళ్లుండిన నీరు మూడుపాళ్లకు తగ్గును. తరువాత రంగులు, సువాసనలు కలిపి యంత్రములలో వేసి నూరెదరు. ఈవిధముగా తయారయిన సబ్బు యంత్రముల రోల్సునుండా బయటికివచ్చును. మంచి రకమయినసబ్బు కావలసినచో ఈవిధముగ ఏడెనిమిదిసారులు చేయవలెను.

సబ్బుముక్కలను ప్లాడరులోవేసి త్రిప్పగా సబ్బంతయు ఒకపలకయందలి రంధ్రముల నుండా దారములవలె బయటికి వచ్చును. బయటికిరాగానే ఈ దారములను ఒత్తి ఒకబారు మాదిరిగ చేసి తరువాత దానిని చిన్నబిళ్లలుగా కోసి ముద్రలు వేసెదరు.

(G. S. A.)



౭. సబ్బులకు ముద్రలువేయుట



# మన స్థితిగతులు

కర్లపాలెం కృష్ణరావు

ఇప్పుడు ?

అప్పుడు...?

ఈమార్పు లాభదాయకమా ?

వ్యాపారము మందగించింది. వృత్తులు నశించినయి. జీవనాలు పడిపోయినయి. తన్మూలకంగా నిర్వ్యాపారులైన యువకు లనేకులు తప్పుదారి ద్రొక్కి చెడిపోతున్నారు. దేశం అన్నివిధాల అధోగతిపాలైంది. కాని, చదువుకొన్నవారిసంఖ్యమాత్రం మునుపటికంటె పెరిగింది. ఈ చదువే పైనాటికన్నిటికి మూలకారణమని కొందరివాదన.

ఇందలి యథార్థం తెలుసుకోవాలంటే, తీవ్రాలోచన అవసరము.

మొన్న మొన్నటిదాక—అంటే, మొదటిసత్యాగ్రహోద్యమానికి పూర్వమువరకు మనలో చదువుకొన్నవాళ్లసంఖ్య చాలాస్వల్పం. ప్రజలలో ధనవంతులనేకులున్నా, అమాయకులుగా నుండేవాళ్లు. ధర్మానికి నీతికి చాలామట్టుకు కట్టుబడివుండేవాళ్లు. రాజశాసనాలి కెంతభయపడేవారో, పూర్వాచారాలన్నా, అయ్యవార్ల (అగ్రజాతుల) మాటన్నా, అంతభీతావహులై యుండేవాళ్లు. చిన్న చిన్న గ్రామనౌకర్లకు, పోలీసుబంట్రోతులకు కూడా, జనసామాన్యం వంగి వంగి సలాములు పెడుతుండేవాళ్లు.

ఆరోజుల్లో సంఘకట్టుబాట్లు మహాకఠినంగా వుండేవి. చాకింటిగుడ్డలు పసుపునీళ్లు చల్లితేనేగాని పనికిరావు. విద్యార్థులకు స్కూలుదుస్తులు వేరు—ఇంట్లో ధరించేవివేరు. ఆచారవ్యవహారాలను పాటించనివారిని నేరస్థులుగా భావించేవారు. ఇంతెందుకు? సముద్రయాన మొకగొప్పతప్పు. సీమకు వెళ్లివచ్చిన వారిని సంఘ మానాడు బహిష్కరించింది.

ఆనాడు నాటకసంఘాలు అక్రమసంఘాలు. నాటకాలువేసేవాళ్లను జూస్తే ప్రజలు అగౌరవించేవారు. ఏయువకుడైనా ధైర్యంజేసి నాటకంలో వేషంవేస్తే, ఆనాటిలగాయితూ అతన్ని "నాటకాల్లో దిరిగే సోమారి" అని తేలికమాట లనేవారు.

పురుషులసంగతే యిలావుంటే, ఇక స్త్రీల సంగతి అడుగనే అక్కరలేదు. వాళ్లకు పూర్తిగా నిర్బంధావాసమే.

అప్పటి గోల యిది...

ఇప్పుడో ?

అంతా తారుమారైంది. విద్యాధికులసంఖ్య అప్పటికంటే చాలాపెరిగింది. నానాదేశ విజ్ఞాననాగరికతలు ముదిరినయి. మనయువకులు అన్నిరాజ్యాలకు యెక్కారు. అన్నిటికి తయారైనారు. చదువుకోసం ధనధనేతరాలు ధారవోశారు. భయభక్తులు నశించినయి. ఎంతపెద్దఉద్యోగికైనా, మామూలుగా జనసామాన్యం భయపడరు సరేగద,—అవసరమైతే ధిక్కరిస్తారుగూడాను. సంఘకట్టుబాట్లను, దురాచారాలను ప్రతివారు సునాయాసంగా దాటేస్తున్నారు. తీవ్రంగా విమర్శిస్తూ, వ్యతిరేకప్రచారం చేస్తున్నారుగూడాను.

స్త్రీలుగూడా ముందంజవేశారు. పురుషులకంటే మేము తక్కువేమిటని, అన్నివిషయాల్లోను ప్రత్యక్షమవుతున్నారు. నిజంగా, రాణిస్తున్నారుగూడాను.

కాని,... వీటన్నిటితోపాటు, నీతినియమాలు కూడాచెడిపోయినమాటవాస్తవమే...చెడిపోకతప్పదు.

ఒకచోట తరిగితేనేగాని, మరియొకచోట వృద్ధిగాదు. ఇది సృష్టిరహస్యము. అవ్వా కావాలి, బువ్వా కావాలి అంటే యెలావస్తుంది?

దేశంలో ధనికులసంఖ్య తగ్గిపోయింది. విద్యాధికులసంఖ్య పెరిగింది—సంఘసంస్కర్తలు ప్రబలమైతే, పూర్వాచార పరాయణులు సన్నగిల్లారు. అన్నిటిలోను అఖండమైన మార్పువచ్చింది.

ఈ మార్పుకు కారణం, ఈవిద్యయే నంటారా? అని అంటే?

సందేహము లేదు. చాలాభాగమంతే.

కసాయివాడు పెంచిన చిలుక కసాయిమాటలు మాట్లాడదూ?

ఆత్మవంచన—అవినీతి—అక్రమము—అశక్తి—అహంకారము— మోసము— మన్నసునవన్నీ యీ విద్యలోనే మిళితమైయున్నయి.

ఈనాటి విద్యాధికుడెన్ని యబద్ధాలకైనా వెరవడు. ఏకోదరసోదరుడైనా, మోసగించుటకు వెనుదీయడు సరేగదా, తన్ను తానే నమ్మడు.

కాబట్టి, ఈవిద్య మనకు లాభదాయకం గాదంటారా?... అనిఅంటే?

కాదని యెవరూ అనలేరు.

కష్టసుఖాలవలె, లాభనష్టాలు కలిసేవుంటయి. చీకటివెన్నంటే, వెన్నెలవుంటుంది.

ఎలాగంటారా?

ఇతరదేశాలతో సంబంధ బాంధవ్యాలు కలుగడానికి ఈవిద్య కారణంగాదూ?

ఇతరదేశాలతో సరిసమానంగా మనంకూడా వుండాలని ప్రయత్నించడానికి కారణం యీవిద్య గాదూ? ఇతరుల వ్యాపారరహస్యాలు తెలుసుకొని మనంకూడా వ్యవహరించడానికి కారణ మీవిద్య గాదా?

ఒకటేమిటి—అన్ని విషయాలలోను ఇతరులను జూచి మనము దిద్దుకొంటూనే యున్నాము.

పరులు మనల ననుసరిస్తున్నారా, లేదా? అంటే? లేదని చెప్పలేము.

కాబట్టి, సహజంగా కొన్నికీడులు, కొన్ని మేళ్లు వుంటయి.

సరే... అయిందేమో అయింది... ఇకముందుగ తేమిటంటే?

విద్యాధికులబుద్ధి మారిపోవాలె.

అందరికి ఉద్యోగాలెక్కడ దొరుకుతయి? చదువు కేవలము ఉద్యోగాలకోసము మాత్రమేకాదురా బాబూ అని విద్యాధికులు గ్రహించాలె. మేజాలు తుడిచే నీచవృత్తికి పాలుపడకుండా, యెవరికివారు, దీర్ఘంగా ఆలోచించుకొని, తలకొకదారి చూచుకోవాలె.

డిగ్రీలు లేనివాళ్లుకూడా, మనలాంటి మనుష్యులే, మనకంటె తెలివిగలవాళ్లే అని విద్యాధికులుభావించాలె.

మనసుంటే మార్గమున్నది. ప్రప్రథమంలో కష్టపడ్డా పిదప సుఖంరాకపోదు.

కృషిచేసేవాడికి అనేకమార్గాలున్నయి.

ఎన్నిరకాల వ్యాపారాలులేవు? ఎన్నివృత్తులు లేవు? ఎన్ని చేతిపనులు లేవు? బుద్ధిబలముంటే గోచరించవూ?......

కాని... ఇందుకు ధనవంతుల సహాయ మవసరము. ఉన్నధనవంతులు స్వల్పసంఖ్యాకులైనా, శక్తి కొలది విధిగా తోడుపడవలసిందే...అప్పుడు అన్ని చిక్కులు తీరిపోతయి.

సంపన్నులధనంతో, విద్యాధికుల బుద్ధిబల ముపయోగిస్తే దేశం బాగుపడుతుంది.

ధనవంతుల కీయాలోచనలు రుచించవంటారా? ధనవంతు లిందులకు సమ్మతించకపోతేనా? కొన్నాళ్లకు మిట్టపల్లా లేకమవుతయి... కాక తప్పదు.

పరిస్థితులే ఆపనిచేయమని బలవంతపరుస్తయి.

అప్పుడెవరేమి అనుకొన్నా ప్రయోజనము లేదు. పదిమందితో చావు పెళ్లితోసమానమంటారా?

సరే...చెప్పేదేమంది?

---

## చెన్నరాజధానియందు 1933 సంవత్సరము జనవరి ప్రారంభము మొదలు మార్చి తుదివరకు గల మూడునెలల కాలమున ముద్రితములయి ప్రకటితములయిన

# ఆంధ్ర గ్రంథముల పట్టిక*

### ఐతిహాసికములు

శ్రీమదాంధ్రమహాభారతము— (ప్ర.) ఆంధ్రగ్రంథ మండలి, తెనాలి.

శ్రీమదాంధ్రవచన మహాభారతము, వా. ౩,౪—(ప్ర.) వి. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్, మదరాసు.

### కథలు, ఐతిహాసికములు, పౌరాణికములు

కర్ణచరిత్రము—వి. చినసీతారామశాస్త్రి.

కేయూరబాహుచరిత్రము—ఎ. శేషగిరిరావు.

గణేశ్వరాభ్యుదయము—యస్. వెంకటసుబ్బరావు.

సహుడు—కె. సత్యనారాయణ.

దశకుమారచరిత్రము—(అను) వి. తిరుమల వెంకటవరదాచారి.

నలచరిత్రము—సి. రాఘవాచార్యులు.

పంచపాండవులవనవాసము—పి. పిచ్చయ్యశాస్త్రి.

పంద్రెండురాజులకథలు అను శ్రీకృష్ణబోధామృతం—జె. వెంకటరాధాకృష్ణయ్య.

పాండవాజ్ఞాతవాసము—ఏ. నాగభూషణరావు.

పురాణపురుషులు—డి. సీతారామరావు.

బాలరామాయణము—(ప్ర.) యం. వి. పాపయ్య నాయుడు, చిత్తూరు.

బాలరామాయణము—యస్. వెంకటరామయ్య.

భోజకాళిసకథలు, భా. ౨—యం. వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రి.

శాద్ధనీరుడు—వి. వి. కృష్ణశర్మ.

భక్తకథావళి—వి. రంగస్వామిఅయ్యంగారు.

భక్తాగ్రేసరుడు—యన్. సూర్యనారాయణమూర్తి.

భీష్మవిజయము—ఏ. అరుణాచలశాస్త్రి.

మహిమాంగనలు, భా. ౧, ౨—కె. సత్యనారాయణ.

లక్ష్మణుడు—కె. సత్యనారాయణ.

విక్రమరాఘవము—పి. శ్రీరాములురెడ్డి.

సీతావిజయము—దాసరి లక్ష్మణస్వామి.

హనుమానుడు—కె. సత్యనారాయణ.

హరిశ్చంద్రచరిత్రము—యం. సీతారామరావు.

### —కల్పితములు

కథాగుచ్ఛము—కె. సత్యనారాయణరావు.

జీవకారుణ్యకథలు—యన్. సి. రంగస్వామి అయ్యంగారు.

నవకథామంజరి—పి. రాజశేఖరం, ఏ. పార్వతీశం.

నాలుగుకథలు—(ప్ర.). ఏ. లక్ష్మణస్వామినాయుడు, రాజమహేంద్రవరము.

బాలకథాకౌముది—డి. సీతారామరావు.

బాలకథావళి—డి. పిచ్చయ్యశాస్త్రి.

భట్టివిక్రమార్కునికథలు—వి. యస్. నారాయణరావు.

### —చారిత్రకములు

అళియరామభూపాలుడు—టి. శివశంకరం.

విష్ణువర్ధనుడు—చిలకమర్తి లక్ష్మీనరసింహం.

### కామశాస్త్రము

కామశాస్త్రము—కె. సత్యనారాయణచౌదరి.

### కావ్యములు

పద్మినీపరిణయము—సి. సీతాంబ.

బొబ్బిలిపట్టాభిషేకము—తిరుపతి వెంకటేశ్వరులు.

---

* ఈ పట్టికయందుగల సంకేతపదముల వివరణము: అ.—అధ్యాయము. అను.—అనువాదము, అనువాదకులు. ప—పద్యము. ప్ర.—ప్రకాశకులు. భా.—భాగము. వ.—వచనము. సం.—సంపాదకులు. సటీ.—సటీకము.

శశాంకవిజయము—యస్. వెంకటపతి.
సారంగధర—చేమకూర వెంకటకవి.
హంససందేశము—పి. వెంకటరామరావు.

## గణితశాస్త్రము

గణితజ్ఞానబోధిని, తరగతి, ౪—కే. వి. రామదాస్.
నూతనపద్ధతి గణితము—కె. యస్. సుబ్రహ్మణ్యం.
పసిడికాలపుగణితము, బుక్. 3, ౪—టి. యస్. రాఘవయ్యార్.
బాలురగణితము—కె. యస్. శ్రీనివాసాచార్యులు.
మాపులిగణితశాస్త్రము, ఫారం. ౧—జి. రంగరావు నాయుడు, పి. సత్యనారాయణ.

## గేయములు

అధ్యాత్మరామాయణకీర్తనలు—సుబ్రహ్మణ్యకవి.
కన్యలకనకదుర్గసంకీర్తనలు—కె. ఆదినారాయణ.
కలికాల శృంగారపాటలు—ఏ. నరసింహదాస్.
కీర్తనలు—జి. నాగలింగాచారి.
కీర్తనలు, పద్యములు—(ప్ర.) జి. పుల్లయ్యా, కడప.
నూతనగ్రామఫోనుకీర్తనలు—(ప్ర.) గృహసరస్వతిబుక్ డిపో, కడప.
పాండురంగబృందావనకీర్తనలు—కె. ఆర్. కేశవదాసు.
పాండురంగ విఠల్ భగవాన్ నామములు, భజనకీర్తనలు. భా. ౧—(ప్ర.) టి. రామకృష్ణయ్యా, చిలకలపూడి.
పిల్లలపాటలు — (ప్ర.) సాధనపబ్లిషింగ్ హౌస్, అనంతపూరు.
పూజాకీర్తనలు—జె. తులసమ్మ.
బ్రహ్మానందకీర్తనలు—ఆర్. సీతన్న దాస్.
భజనకీర్తనలు—(ప్ర.) జి. పుల్లయ్యా, కడప.
మేలుకొలుపుపాటలు—(ప్ర.) జి. అప్పలస్వామి, విజయనగరము.
రామనామామృతకీర్తనలు—జె. వెంకప్ప సోమయాజి శర్మ.
శ్రీకుసుమహరగీతావళి భా. ౧—(ప్ర.) పి. దుగ్గమల్లికార్జునరావు, ద్వాగకతిరుమల.
శ్రీచంద్రకేతుమహారాజుకథ—ఆర్. చినకోటమహారాజు.
శ్రీమద్రామాయణకీర్తన—యల్. వెంకటఅప్పారాయశర్మ.
శ్రీలనవీనమంగళహారతులు—బి. వీరాస్వామిదాస్.
హరిభజనకీర్తనలు—బి. రామదాసు.

## చరిత్ర

ఆంగ్లచరిత్ర, భా. ౧—పి. సత్యనారాయణ.
బాలురఆంధ్రదేశచరిత్ర—వి. శ్రీనివాసరావు, యం. నరసింహరావు.
బ్రిటనుచరిత్ర—యన్. టి. ప్రసాదరావు, యం. నూరుద్దీన్.
హిందూదేశచరిత్ర—పి. సత్యనారాయణ.
హిందూదేశచరిత్ర—డి. అప్పారావు, ఆర్. సూర్యనారాయణ.
హిందూదేశచరిత్రము—టి. సూర్యప్రకాశరావు.
హిందూదేశచరిత్ర భా. ౧—కె. జగన్నాథం.

## చట్టము

దస్తావేజులమతలబులు—కె. కృష్ణరావు.
మదరాసు ఫారెస్టు పంచాయత్ కోడ్—(ప్ర.) గారి బ్రదర్స్, మదరాసు.
మదరాసు సహకారసంఘముల ఆక్టు — (ప్ర.) సి. శేషయ్యా, కపిలేశ్వరపురము.

## ఛందశ్శాస్త్రము

అప్పకవీయము—(ప్ర.) వి. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్, మదరాసు.

## జీవితములు

తెలుగుకవులు—యం. వెంకటరత్నం.
భక్తజీవితము—పి. శ్రీకృష్ణయ్యా.
మరపురాని అన్నపూర్ణ—డి. చెంచయ్యా.
మహాభక్తవిజయము—కె. కామేశ్వరరావు.

సక్కుబాయిచరిత్రము—(ప్ర.) పి. వీరయ్య, మచిలీపట్టణము.

## త ర్క శా స్త్ర ము

తర్కసంగ్రహము—(ప్ర.) యం. రామలింగయ్య, తెనాలి.

## దండకములు

పోలేపల్లి అమ్మవారి మహాత్మ్య దండకము—యన్. విజయగోపాలకవి.

## న వ ల లు

నేనూ, మాకాంతం—యం. నరసింహరావు.

రామప్రియ—టి. కృష్ణమూర్తి.

లీలాకుమారి—యన్. కామేశ్వరరావు.

సేవాశ్రమము—(ప్ర) ఏ. లక్ష్మణస్వామినాయుడు, రాజమహేంద్రవరము.

## నాటకములు

చిత్రవిచిత్రసావిత్రి—సి. సాక్షిగోపాలస్వామి.

తుఖారాం—యస్. వీరబ్రహ్మకవి.

మిత్రదోహము—కె. వెంకటహనుమయ్య.

ముద్రారాక్షసము—(అను) పి. వెంకటసూర్యగోపాలం.

రంగూన్ రౌడి—యస్. రామానుజరావు.

విజయసింగు—సి. వెంకటరమణయ్య.

శ్రీరామచక్రవర్తి అనబడు కోసలసామ్రాజ్యము—బి. వి. సుబ్బరావు.

షేబరాణి—యస్. యస్. సుబ్బయ్య.

సత్యహరిశ్చంద్ర—కె. కామేశ్వరరావు.

సారంగధర—కె. కామేశ్వరరావు.

## నిఘంటువులు

ఆంధ్రవిజ్ఞానసర్వస్వము, వా. ౧—కె. వి. లక్ష్మణరావు.

మేదినీకోశము — (ప్ర.) వి. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్, మదరాసు.

## నీ తి

నీతిదీపావళి, భా. ౧-౪—బి. లక్ష్మీపతిశాస్త్రి,

నీతిప్రబోధిక—పి. కృష్ణమూర్తినాయుడు.

నీతివాచకము, బుక్. ౬,౭—యం. వెంకటరత్నం. యం. గురునాథశర్మ.

సన్మార్గవిజయము—జె. శేషాద్రిశర్మ.

సుభాషితము—కె. సత్యనారాయణచౌదరి.

## ప రి శి ష్ట ము

ఆదాయవ్యయపట్టిక—(ప్ర) యం. సాంబమూర్తి, బెజవాడ.

ఆరుకోట్ల తిరుగుబాటు—బి. సూర్యనారాయణమూర్తి.

ఆరోగ్యమాధవము—సి. రామసుబ్బరాయుడు.

ఇరువదినాల్గవ సంవత్సరాదిసంచిక — (ప్ర.) కె. నాగేశ్వరరావు పంతులు, మదరాసు.

కలియుగకలికాలవినోదచిందు—ఏ. నరసింహదాసు.

కలివిచిత్రానందరత్నావళి—ఏ. నరసింహదాస్.

కవిసార్వభౌమాభ్యుదయము— (ప్ర.) యన్. సత్యనారాయణకవి, రాజమహేంద్రవరము.

కళావంతులసేవాసంఘము—(ప్ర.) కె. వీరన్న, అమలాపురము.

కావ్యమాల, భా. ౧,౨ — (ప్ర.) యం. యస్. శర్మ అండ్ కో, తెనాలి.

గద్యపద్యసంగ్రహము భా. ౧—(ప్ర.) జి. జే. సోమయాజి.

గుంటూరుమండలగ్రంథాలయచరిత్ర — (ప్ర.) వి. వి. శ్రేష్ఠి, వేటపాలెం.

గోముఖవ్యాఘ్రమహాశయ అపూర్వప్రతిష్ఠాభూషణం—(ప్ర.) శ్రీరామచంద్ర బుక్ డిపో, రావిపాడు అగ్రహారం.

జన్మభూమి— (ప్ర.) స్వదేశప్రచారమండలి, విశాఖపట్టణము.

జ్యోతిషసభావృత్తాంతసంగ్రహము— పి. కృష్ణమూర్తిశాస్త్రి.

దసరాపద్యములు—యం. రామకృష్ణరావు.

దేవీవాచకము— అప్పల కామేశ్వరశర్మ, టి. తిరుమల రావు నాయుడు.
దైవజ్ఞపరిషత్ ప్రథమసభావృత్తాంతము — (ప్ర.) యస్. వెంకటరమణదైవజ్ఞశర్మ, రామచంద్రపురం.
నన్నెవరుపుట్టించిరి—సి. సింహాచలం.
నర్సులసహకారము—(ప్ర.) మిస్. మాడె, మిస్. డేని యల్, ఒంగోలు.
నిబంధనలు—(ప్ర.) వి. వి. గిరి, జాంపన్‌పూరు.
నాఎలక్షను అనుభవము—నై. వేంకటరత్నం.
నాల్గవపాఠముపుస్తకము—చిలకమర్తి లక్ష్మీనరసింహం.
నూతనపద్ధతి ఆంధ్రవాచకము, తరగతి, ౬,౭,౮ — ఏ. వి. నరసింహం.
పడకటింటిముచ్చట్లు—నై. కృష్ణరావు.
పద్యగద్యముక్తావళి—(ప్ర.) జె. తులసమ్మ,పిఠాపురం.
పాండురంగవాచకము తరగతులు,౧,—౫—వి. బుచ్చి రామయ్య, యన్. సూర్యనారాయణశాస్త్రి, యన్. సుబ్బరాయశాస్త్రి.
భక్తమందారము—టి. సత్యానందరావు.
భద్రాచలము—వి. శ్రీరామశాస్త్రి.
మనదేశపువాచకము, తరగతి, ౨—(ప్ర.) సి. కుమార స్వామినాయుడు అండ్ సన్స్, మదరాసు.
మన్మథసామ్రాజ్యము—నై. కామేశ్వరరావు.
మితవ్యయము—కె. లక్ష్మీనారాయణ.
యాత్రాస్థలములు—(ప్ర.) పూర్ణయాత్రా స్పెషల్ ట్రైన్ సర్వీస్ కొ, విశాఖపట్టణము.
రాలినపూలు—టి. సీతారామరావు.
లక్ష్మీవాచకపుస్తకము, తరగతి, ౪—బి. శేషగిరిరావు.
వాణీవాచకము, తరగతి, ౨—జె. సర్వభద్రం, యం. వెంకటశాస్త్రి, సి. దీక్షితులు.
వివేకచింతామణి—(ప్ర.) రావుబ్రదర్స్, తెనాలి.
శృంగారపద్యములు—(ప్ర.) గృహసరస్వతిబుక్‌డిపో, కడప.
సుమవల్లి—(ప్ర.) కె. వి. సుబ్బరావు, కాకినాడ.
స్నేహలతాకవితాసంఘము—వి. రామసుబ్బరాయుడు.
స్వప్నము—యన్. కామేశ్వరరావు.
హంపిక్షేత్రము—కొడాలి వెంకటసుబ్బరావు.
హరిజనసేవ—యం. కె. గాంధీ.
హృదయవిహంగము—ఆర్. లక్ష్మీనరసింహశాస్త్రి.

## పురాణములు

శ్రీమదాంధ్రభాగవతము—(ప్ర.) వి. రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్, మదరాసు.

## ప్రకృతిశాస్త్రము

శాస్త్రపాఠములు—కె. రామయ్య.

## ప్రబంధము

నృసింహపురాణము—ఎఱ్ఱాప్రగడ.

## భూగోళశాస్త్రము

తూర్పుగోదావరిజిల్లా భూగోళము—యం. సుబ్రహ్మణ్యం.
నందిగామ తాలూకా భూగోళము—ఏ. బాలత్రిపుర సుందరమ్మ.
నూతనభూగోళశాస్త్రము, బుక్, ౩—బి. రామచంద్ర రావు.
ప్రాథమిక హితచర్య, తరగతులు, ౧-౪—యల్. వెంకటనరసయ్య.
భూగోళశాస్త్రము—పేరి సూర్యనారాయణ.
వాణీభూగోళశాస్త్రము, బుక్. ౨,౩—ఎ. రామ చంద్రరావు. వె. అప్పారావు
వీరవిల్లి తాలూకాభూగోళము—డి. అప్పలరాజు.

## మతము, హిందు

ఉభయమతసజాతీయత—బుర్రా శేషగిరిరావు.
శ్రీ త్రిపురాంతక క్షేత్రచరిత్ర—రామకృష్ణ మృత్యుంజయకవులు.
శ్రీ మహాబిలచరిత్రము—పి. సూర్యనారాయణ.
శ్రీరామావతారతత్త్వము, వా. ౩—జె. శేషాద్రిశర్మ.
హిందూమత ప్రశ్నోత్తరము—శివధ్యానానందమహర్షి

## —ఇతరములు

ఏస్తేరుచరిత్ర—డి. మోసస్.
క్రీస్తుగలవారు, లేనివారు—సాధుసుందరసింగ్.
క్రీస్తునుగూర్చినస్వానుభవము—(ప్ర.) బిషప్ డార్నకల్.
జపమాలిక—(ప్ర.)డార్నకల్ డయోసిసాన్ కౌన్సిల్, డార్నకల్.
విమలజ్ఞానోపదేశములు—ఏ. గలటి.
సువార్తప్రకటనాపఠనములు—(ప్ర.) బిషప్, డార్నకల్.
సువిశేషపుపాట—(ప్ర.) రెవ్. జె. ఆలన్, నెల్లూరు.

## మా హా త్మ్య ము లు

అన్నదానమాహాత్మ్యము—వి. నరసింహభక్త.
శ్రీకారెంపూడిపీర్ల మహాత్మ్యము — సైయద్ అబ్దుల్ రహీం.
శ్రీసింహాచలక్షేత్రమాహాత్మ్యము — (ప్ర.) ఏ కృష్ణమూర్తిబ్రదర్స్, విశాఖపట్టణము.

## రా జ కీ య ము

గాంధీమహాత్ముని లండను ఉపన్యాసములు — (ప్ర.) బి. సత్యనారాయణరావు.

## వే దా ం త ము

ఆంధ్రీకృతేన్యాయదర్శనము భా. ౧—క. సోమశేఖరశాస్త్రి, డి. వెంకటరమణశాస్త్రి.
ఓంకారము—మలయాళస్వామి.
తత్త్వజ్ఞానతోహరారత్నమాలిక — కే. ఆర్. విజాపూర్కర్.
ధన్యమణిహారము—యస్. కుప్పుస్వామయ్య.
ధర్మజిజ్ఞాస— యస్. సూర్యనారాయణ.
ప్రశ్నోపనిషత్తు — (ప్ర.) వి. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్, మదరాసు.
బ్రహ్మజ్ఞానబోధిని—బాలసుబ్బరామదాసు.
భగవద్గీత—(ప్ర.) కె. వీరవెంకయ్య.
యోగసంకలనము వా. ౧ — (అను) డి.గోపాలకృష్ణరావు.
సాంఖ్యసూత్రప్రబోధిని—వి. రామకోటయ్య.

## వై ద్య శా స్త్ర ము

గుణానుపానబోధిని — (ప్ర.) గంజాం ఆయుర్వేదిక్ ఫార్మసీ, గంజాం.
గోసాయిచిటికలు—(ప్ర.) పి. అప్పలస్వామి, బెజవాడ.
దేహతత్త్వనిర్ణయము—(ప్ర.) వి. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్, మదరాసు.
పరమౌషధి—యం. వెంకటసుబ్బన్న చౌదరి.
బైరాగిచిటికలు —(ప్ర.) పి. అప్పలస్వామి, బెజవాడ.

## వ్యా క ర ణ శా స్త్ర ము

ఆంధ్రభాషాభూషణము—కేతనకవి.
ఆంధ్రశబ్దచింతామణి—(ప్ర.) వి. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్, మదరాసు.
తెనుగులక్షణము, బుక్ ౧—౩ — పూతలపట్టుశ్రీరాములురెడ్డి.
ప్రారంభవ్యాకరణము—యస్ సుబ్రహ్మణ్యశాస్త్రి.
లఘుసిద్ధాంతకౌముది—(ప్ర.) వి. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్, మదరాసు.
వ్యాకరణబోధిని, తరగతి, ౪, ౫—పి. రామకోటయ్య.
శ్రీమదభినవాంధ్రవ్యాకరణసర్వస్వము—జి. సత్యనారాయణశాస్త్రి.
సరళవ్యాకరణము భా. ౩—కె. వి. కృష్ణమాచార్యులు.

## శ త క ము లు

నరమాయశంకరశతకము—యం. వీరయ్యదేవర్.
మానసబోధశతకము—నంజుండయ్య.
రాఘవశతకము—యస్. సుబ్బరావు.
వట్టిమాయశతకము—జి. నారాయణరెడ్డి.
వాయునందనశతకము—కె. వెంకటరాజేశ్వరరావు.
విశ్వేశ్వరశతకము—కె. రాఘవకవి.
శంకరశతకము—సచ్చిదానందయోగి.
శ్రీ కృష్ణశతకము—పి. వెంకటరామారావు.

శ్రీ పార్థసారథిశతకము—పి. శ్రీరంగనాథస్వామి.

శ్రీ లక్ష్మీనారసింహ ప్రభుశతకము—శి. వెంకట రామయ్య.

శ్రీ వెంకటేశ్వరశతకము—శే. శేషశాస్త్రి.

సూర్యనారాయణశతకము—జె. వెంకటేశ్వరులు.

## సాముద్రికశాస్త్రము

సోమనాథరేఖాశాస్త్రము భా. ౧—(ప్ర.) వి. సోమనాథశర్మ, కాకినాడ.

## సారస్వతము, భాష.

ఆంధ్రవాఙ్మయచరిత్రసంగ్రహము—(ప్ర.) వి. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్, మదరాసు.

నాటకమర్మము—పి. వి. సుబ్బరావు.

సారస్వతవ్యాసములు—ఏ. ఆంజనేయులు.

## స్తోత్రములు

క్రొత్తకైవారము—సి. పరబ్రహ్మం.

ప్రకృతిప్రకాశికాతోహారాముక్తావళి—కె. ఆర్. విజాపూర్కర్.

బాలకోటేశ్వరతారావళి—జే. పాపయ్యశాస్త్రి.

మహేశా—(ప్ర.) వి. వి. కవులు.

రామబాల్యసంస్తుతి—వి. శ్రీరామశాస్త్రి.

రామామృతము—వి. రామసుబ్బరాయుడు.

వట్టెము శ్రీవేంకటేశ్వరనక్షత్రమాల — కె. యల్లమందరాజు.

విశ్వరూపి—కె. నరసింహరావు.

శివతారావళి—వి. రామసుబ్బరాయుడు.

శ్రీపాండురంగనవరత్నమాలిక—బి. పీరాస్వామిదాస్.

శ్రీప్రార్థనరామాయణము— కె. వెంకటరత్నం.

శ్రీసీతారామస్మరణ—కె. వెంకటహనుమయ్య.

శ్రీసూర్యస్తవనక్షత్రమాల—పి. సూర్యనారాయణకవి.

## హరికథలు

త్రినాథచరిత్ర-హరికథ—బి. రామదాసు.

జయప్రద హరికథ—కె. యల్లమందరాజు.

శ్రీమత్సంగీతానంద రామాయణము — కె. భోగలింగదాసు.

శ్రీయాళచరిత్ర హరికథ—బి. రామదాసు.

---




## కాగితపుబొమ్మలను నిలువబెట్టుట

కొ. నరసింహాచార్యులు

మట్టిబొమ్మలను, పింగాని బొమ్మలను బొమ్మలకొలువున సమర్చి పెట్టువిధమున కాగితపుబొమ్మలనుగూడ కొలువున సమర్చ వచ్చును. బొమ్మలు ఒంటరిబొమ్మలుగానైన నుండవచ్చును. లేక యొకకథను తెలియజేయు సముదాయముగనైననుండవచ్చును. మొదట బొమ్మలను ప్రత్యేకముగా కత్తిరించుకొని ప్రతిదాని నొక అట్టతునుకపై నదికించవలెను. బొమ్మయొక్క క్రిందిఅంచు వెడల్పుగా నుండవలెను. అతికిన బొమ్మలు చక్కగా ఆరిన వెనుక (చిత్రములు 1, 2 a b c d) చిత్రములందు చూపినవిధముగ ఏటవాలు గీతలు వేసియుండు భాగములను కత్తిరించివేయవలెను. క్రిందియంచు మాత్రము నేరుగా e f రేఖల వెంబడి కత్తిరించవలెను. అపుడు బొమ్మ చక్కగా నిలువదగియుండును. ఇంత మాత్రమున బొమ్మలు నిలువజాలవు. వాటికి వెనుకభాగమున కొంతఆధారము నేర్పఱుచవలెను.

Figures 1–11: labels a, b, c, d, e, f; 1, 2, 3, 4, 5, 6, 7, 8, 9, 10, 11; F

ఈ ఆధారములను మూడువిధములుగ జేయవచ్చును. చిత్రము 3 వంటి అట్టతును కను దీసికొని (ఇది బొమ్మయొక్క ఎత్తున కన్న కొంచెముతక్కువగా నుండవలెను). దానియందు a అనిగుర్తించియుండు భాగమును బొమ్మయొక్క వెనుకతట్టు అతికించవలెను. b భాగము స్వేచ్ఛగనే యుండును. (చిత్రములు 4. 8) ఇదియొకవిధము. చిత్రము 5 వంటి తునుకను దీసికొని అందు a భాగమును బొమ్మకు వెనుకప్రక్క నదికించి, b భాగమును స్వేచ్ఛగా వదలవలెను. (చిత్రములు 6,7) ఇదిరెండవవిధము.

చిత్రము 9 యందలి విధముగ నొక గుండుసూదిని బొమ్మక్రిందియంచువద్ద నిలువుగాబెట్టి దానిపైన నొకచిన్నకాగితమును గాని, సన్నని అట్టముక్కనుగాని అతికించవలెను. ఈబొమ్మను నిలువబెట్టవలెనన్న ఆ సూదిని క్రిందగ్రుచ్చి నిలువబెట్టవలెను. (చిత్రము 10)

మనకు చిక్కెడు అందమగు బొమ్మల నన్నిటిని ఈవిధముగా జేసికొని బొమ్మల కొలువునందు ఉపయోగించుకొనవచ్చును. ఇందలి ఛాయాచిత్రము ఒక ఆఫ్రికాదేశపు అడవిప్రదేశమును జూపును. ఈదిగువ చిత్రము నందు వెనుకనుండునది (Background) అడవియందలి వృక్షములను తెలుపు ఒక పెద్దపటము. దానిని ఒకపెద్ద గట్టిఅట్టపై నతికించవలెను. దానికి ఆధారపుతునుకలు ప్రత్యే



కసుగా, లేక అట్టకుచేరియే కుడి యెడమల యందు రెండుభాగములు వదలబడియున్నవి. ఈభాగములను వెనుకకుమడిచి బొమ్మను నిలువబెట్టవలెను. చిత్రము 11 నంబరు p అనునది బొమ్మయు, a, b లు దానికిరుప్రక్కలను ఆధారపుతునుకలును అయియున్నవి.

ఈపటమును వెనుక నిలువబెట్టి దానికిముందుప్రక్క నానావిధములగు వన్య మృగములయొక్కయు, అడవిజాతిమనుష్యుల యొక్కయు బొమ్మలను పైప్రకారముగా ఆధారములతో కూడినవాటిని నిలువబెట్టవచ్చును. ఈదృశ్యమునందు ఏనుగు, ఖడ్గమృగము, కోతులు, మొసలి మొదలగుమృగములును, వాటినివేటాడు స్త్రీ, గోలును, వారిగృహమును కలవు. బొమ్మలను అమర్చునపుడు వాటి వాటికితగిన స్థానములను గ్రహించి, కొన్నిటిని కుడిప్రక్కను, కొన్నిటిని ఎడమప్రక్కను, కొన్నిటిని ముందుభాగమునను, కొన్నిటిని వెనుకను పెట్టవలెను. అపుడు ఈసముదాయమంతయు నొక స్వాభావికదృశ్యము (Natural scen ry) వలె కాన్పించును.



---



పాలేరు K. R. R.

# ఇండియాలో కో ఆపరేషన్ ప్రచారము

డి. చంద్రమౌళి

కో ఆపరేటివు ప్రచారములో గవర్నమెంటువారు ప్రథమప్రవేశము కలిగించుకొన్నది ౧౯౦౪-వ సంవత్సరముగా కనబడుచున్నది. ఆసంవత్సరములో కోఆపరేషన్నుగురించి పదియవనెంబరు శాసనముకూడ చేయబడినది. అంతకుముందును సర్ ఫ్రెడరిక్ నికొల్సన్‌గారి ప్రయత్నములవలన ౧౮౯౫-వ సంవత్సరము మొదలు గవర్నమెంటులో ఈవిషయమై ప్రచారము జరిగినటులున్నూ తెలియుచున్నది. ౧౯౦౪-వ సంవత్సరపు శాసనముక్రింద తీవ్రప్రచారముజరిగిన ట్లగపడదు. ఈ ఆక్టు ౧౯౧౨-వ సంవత్సరపు రెండవనెంబరు ఆక్టు వలన రద్దుకాబడి కొత్తఆక్టు అమలులోనికి వచ్చినది. మితవ్యయపద్ధతులను, స్వప్రయత్నపద్ధతులను, వ్యవసాయదారులకు, పాటకపువృత్తులవారికి, మితాయము గలవారికి వ్యాపింపజేసి వారిని వృద్ధిజేయవలయు ననుట ఈశాసనముయొక్క ముఖ్యోద్దేశమై యుండినది. ఈ యుద్దేశములు చాలశ్లాఘ్యములేయైనను గడచినయిరువది సంవత్సరములలో నేపాటి ఫలప్రదములయిన వని విచారించినచో ఫలభాగ మిప్పటికి పొడమాపలే దని చెప్పనగును. కోఆపరేటివుడిపార్టుమెంటువారి రిపోర్టుల వల్లగూడ ఈప్రచారములఫలమిప్పటికి అంకురించినటుల కానరాకపోవుటయేగాక ఏబాధలనివారణకొరకు ఈ శాసనములు పుట్టినవో ఆదురాచారములు, కష్టములు అట్లట్లే యున్నటులగూడ తెలియు చున్నది. దీనికి తార్కాణకావలయునన్న మదరాసుప్రెసిడెన్సీ కోఆపరేటివుసొసైటీలరిజిస్ట్రారు శ్రాస్త్రీగారు ౧౯౩౩-వ సంవత్సరం మార్చినెలలో యిచ్చిన మదరాసుయూనివర్సిటీలెక్చరువలన తేటపడగలదు. ఒకపద్ధతి జయప్రదముగను సుఫలప్రదముగను జరుగుచున్నదా యని కనుగొనుటకు దానిననుష్ఠించువారిస్థితియే గొప్ప సాక్ష్యము కాగలదు. ఈ కో ఆపరేటివుఉద్యమ మెవరెవరికి ఉద్దేశింపబడినదో వారువారు దీనివలన నేమాత్రమైన బాగుపడిరా? ప్రాతబుణముల విముక్తి చేసికొనగలిగిరా? క్రొత్తబుణముల జేయవలసిన అక్కరలతొలగించుకొనగలిగిరా? ఇత్యాదిప్రశ్నములకు రాగల జవాబు కడుశోచనీయముగ ఏర్పడు చున్నది. ఈ కో ఆపరేటివుసొసైటీలలో అప్పుపొందుట విశేషకష్టము కాదనియూ వడ్డీరేటు కొంచెము సులభముగా నుండు ననియు ఎవరో యొక జామీన్‌దారుడు దొరకిన చాలు ననియు ఇత్యాదిభావములు జనులకు కలిగి యున్నవి. కొంతవరకు ఇవి నిజములేగాని పర్యవసానములో వీటి ఫలితార్థము నాలోచించిచూచిన ఇతరసాహుకారుల దగ్గర అప్పుపుట్టుటకంటే యిందుఅధికతరమైన లాభము గాని గుణముగాని లేదని తేలుచున్నది.

అప్పు సులభముగా దొరకు ననువిషయములో అప్పునిచ్చుటకు సాహుకారు ఇష్టపడినయెడల యింత కంటే త్వరితముగ పైకము చేతికిరాగలదు. సాహుకారు తనపెట్టెలోనిడబ్బు తీసియిచ్చుటయే విలంబము. కో ఆపరేటివుసొసైటీలలో ఎంతత్వరగావచ్చినను అధికారులలో సర్క్యులేషన్ కావడము, దరఖాస్తు మంజూరు కావడము మొదలగు ఆలస్యములు కొంతవరకైన జరుగగలవు. కొన్నిసందర్భములలో అప్పుపుట్టుటకు నెలలు సంవత్సరములుకూడ పట్టు చున్నది. ఆవశ్యకతానావశ్యకతల విచారముచేయక అర్జీలవరుసక్రమాన్నిబట్టి అప్పుల నిచ్చుటయే ఆచారము. దీనిలోగల కోఆపరేషను ఏమిటి?

వడ్డీరేటువిషయములో అప్పు తీసుకొనునపుడు సాహుకారురేటుకైనను కొంచెము తక్కువగనే యగుపడినను డిస్కౌంటుమీద, డిక్రీలమీద సామాన్యముగ సాహుకార్లరేటే యగుచున్నది—అనగా నెలఒకటికి నూటికి ఒకరూపాయకన్నను కొంచె మెక్కువయగుచున్నది.

నెలఒకటికి రూపాయకు రెండుదమ్మిడీలలెక్కను నూటికి నెలకు రు ౧-౦-౮ లు అగుచున్నది. కనుక ఈవిషయములోనను అంతగణనీయమైన మేలు పర్యవసానములో యగపడదు. సాహుకారులలోనను సంవత్సరము ఒకటింటికి నూటికి ఆరుమొదలు తొమ్మిదిరూపాయలవరకు వడ్డీరేటుతో యిచ్చేవారు చాలమందియున్నారు. ఇక డిఫాల్టు కలుగకనే కో ఆపరేటివుఅప్పు తీర్చబడినయెడల కొంచెములాభముండునేమోగాని అనుభవములో సివిల్ కోర్టులలో దాఖలయ్యేటన్ని మనీదావాలు ( Money-Suits ) ఈ కో ఆపరేటివువారును తాము ఎన్నుకొనే ఆర్బిట్రేటరుమొద్ద దాఖలుచేయుచున్నారు. ఒకసంవత్సరపు కో ఆపరేటివుశాఖయొక్క పరిపాలనపురిపోర్టు చూచినయెడల దావాలసంఖ్య సులభముగ తెలియగలదు. ఆసంఖ్య సివిలుకోర్టుల సంఖ్యకు తగ్గినదికాదనియు తెలియగలదు.

ఈసందర్భమున హెచ్చరింపవలసినవిషయమింకొకటి గలదు. కో ఆపరేటివుదావాలలో కోర్టుఫీజు వకాలతు వకీలుఫీజు తగులునటుల లేదు. ఇది ఒకలాభమే గాని యితరవిషయముల కొన్ని అసౌకర్యములును గలవు. తుదకు వారంటుఅములుకొరకు సివిలుకోర్టుకు రావలసినదే.

అప్పుతీసుకొను ఆసామి అప్పును చెల్లించగల వసతులు కలవాడా కాడా యనువిచారములేక జామీన్‌దారు డొకడు దొరకిన అప్పుపుట్టుట యొకవిధమున నొకసౌకర్యమనదగును గాని దీనియందును బాధయొకటి గలదు. జామీను ఇచ్చినఆసామి మొదటిఅప్పు పుట్టిన నాడో ఆమరునాడో మొదటియప్పునకు ఈడను మొత్తమునకు తానొకదరఖాస్తు పెట్టును. ఆదరఖాస్తునకు మొదటివాడు జామీన్‌దారు డగును. ఈప్రకారము ప్రధానఅధమర్ణుడు ప్రతిభువుడు ( Principle Debtor and Surety ) అనులోమ విలోమములుగ పదవుల మారుచుందురు. ఈ రెంటిలో ఏదిచెల్లకపోయినను ఏకమూలికాప్రయోగముగ ఇద్దరికి ఒక్కపెట్టున కష్టమేర్పడును. ఈవిషయమున జూడ అప్పుసులభముగ దొరకుట ఒకసౌకర్యమనదగును. కో ఆపరేటివుపక్షమునుండి ఆలోచించిన ఈపద్ధతిమీద అప్పులనిచ్చుట శ్రేయస్కరము కాదనితోపగలదు. సామాన్యపుసాహుకారియైనను ఇట్లనోశ్యప్రాతిభావ్యముమీద (Suretyship) యెంత మాత్రమును అప్పుయియ్యనొల్లడని స్పష్టముగ చెప్ప వచ్చును.

సర్కారువారు కర్షకులయొక్కయు పనిపాటుల వారియొక్కయు ఎడతెగని దారిద్ర్యమును, ఋణగ్రస్తతను, నివారింపవలయుననియు ఎన్నెన్నియోవిధముల ప్రయత్నించుచున్నారు. భూవృద్ధికొరకు అప్పులు ఇచ్చుటనుగూర్చి శాసనము ( Land improvement Loans Act ) కర్షకుల అప్పులశాసనము, మరియు ఆయాప్రదేశములకు సంబంధించిన పైరెండుశాసనముల స్వభావముగల శాసనములును గవర్నమెంటువారు చేసిరి. 'డెక్కన్ అగ్రికల్చరిస్టు రిలీఫ్ఆక్టు', 'మదరాసు యెస్టేట్సులాండు ఆక్టు', 'బెంగాలు టెనెన్సీ ఆక్టు,' 'అవుధ్ టెనెన్సీఆక్టు' ఇత్యాదులును ఈగణములో చేర్పదగియున్నవి. బొంబాయి, బెంగాలు, అవుధ్-షీట్లసమాచారము మనకంతగ తెలియకపోయినను మదరాసు ప్రెసిడెన్సీలో **Land Improvement Loans Act, Agriculturist Loans Act,** న్ను ఏపాటి ఘనకార్యములు చేసినది మనకు తెలియును. ఈరెండు శాసనములక్రింద యివ్వబడిన అప్పులు ఇరువదియేండ్లు ముప్పదియేండ్లు వాయిదాలమీద తీరతగియుండినను బాకీ మొత్తము వడ్డీసహా అంతదీర్ఘకాలముమీద పంచిపెట్టబడి శిస్తుతోపాటు వాయిదాలప్రకారము కొద్దికొద్దిగ చెల్లించబడులాగున ఏర్పాట్లుండినను క్రమముగ చెల్లించిబాపసడినవారుగాని భూమిఅభివృద్ధులు నిష్కపటముగ జరిగించినవారుగాని అరిది. ఒకానొకఆసామి తన భూమిలో పెద్దభావి త్రవ్వించుకొనుటకనుపేరుపెట్టి పైనచెప్పిన తకావీఅప్పు కష్టముమీద పొందుటయు, సర్కారుదాఖలాకు అలీవిమాలినఒకపెద్దబావిని చట్రాతినేలలో మొదలుపెట్టుటయు దానిని పూర్తిచేయకయే యిల్లుకట్టుకొనుటకో, కూతురిపెండ్లికో ఆ అప్పుతీసుకొన్నపైకము వినియోగించుటయు గలదు. భావిపని పూర్తిగాక మొత్తలువిరుగబడి పూడికతీయించుటకు

కూడ శక్తిలేక భూవిసాదుపడుటయు, సర్కారు అప్పు తీరకపోవుటయు పర్యవసానముగా భూమి వేలమువడుటయు, అప్పుతీసుకొన్న సంసారి ఎప్పటియట్ల ఋణగ్రస్తుడై నిలుచుటయు చూచుచున్నాము.

ప్రస్తుతపు కో-ఆపరేటివుసమాజముల వ్యాపకమును పైనచెప్పినదానికంటె మేలగుఫలితముల జూపుచున్నదా ?

ఫలితములసంగతి అటుండగ, ఈనాటి ఈ కో-ఆపరేటివుసొసైటీలు ఆపేరునకు ఏటుల అర్థములో తెలియరాకున్నది. కో-ఆపరేటివు అనగా అన్యోన్య సహాయమువంటి తాత్పర్యము. ఈ సొసైటీలు నిర్వర్తించు కార్యభాగములలో కో-ఆపరేషను ఏమున్నది? అడిగినవానికి అప్పునిచ్చుట కో-ఆపరేషన్‌గదా అందురు గాబోలు. లోకములోని ఋణదాతలందరు ఈ విధమున కో-ఆపరేటర్సే యనుదురు. అప్పిచ్చువాడు లేనియూర కాపురముచేయవలదని ఏప్రాతకాలమునవో పుట్టిన సుమతిశతకము ౧ గూడ యుపదేశించుచున్నది. కాబట్టి ఈ అనాదిప్రసిద్ధిగల ఋణదాతలందరిని మొదటి రకము నికరమైన మహా-కో ఆపరేటర్లు అనవలసియుండును. ఇట్లుండగా యిట్టి కోఆపరేషనుకు సర్కారుశాసనము కావలసివచ్చినదా ?

మీదుమిక్కిలి ఈకోఆపరేషనుకు కొరమాలిన గౌరవములు కొన్ని గలవు. వీరిదావాలకు స్టాంపులేదు. వీరిపత్రాలకు స్టాంపులేదు. రిజిస్ట్రేషను లేదు. కో ఆపరేటివు సొసైటీవారిడబ్బు ఖర్చులేకనే సర్కారువారి జీతములమీద కో ఆపరేటివుసొసైటీల రిజిస్ట్రారు, అసిస్టెంటురిజిస్ట్రార్లు, ఇన్‌స్పెక్టర్లు లోనగుసిబ్బంది, గవర్నమెంటువారితనిఖీలు, ఈ విశేషమర్యాదలన్ని వీరికి గలవు. లోకమున నందరుఋణదాతలవలె వీరు ఒక ఋణదాతలైయున్నారు. లోకమున కొన్ని కొన్ని బ్యాంకులలో డిఫాల్కేషన్సు ( ద్రవ్యాపహారములు ) జరిగినట్లు ఈ కోఆపరేటివు డిపార్టుమెంటులోనను జరుగుచున్నది. వీరు ఏమిమహత్తరమైన లోకోపకారము చేయుచున్నారు ? చేయగలిగియున్నారు ? అన్ని బ్యాంకులవలెనే వీరును డబ్బు చేర్చిపెట్టుకోవడము, రిజర్వుఫండు పెట్టుకోవడము, ఆస్తి ఏర్పరచుకోవడము ఈ మొదలగుపనుల చేయుచున్నారు. ఇప్పటికి దేశమున ఈ కోఆపరేటివు ప్రచారమువల్ల కలిగిన మేలిదియనియు, అట్టిమేలు ఇంక యేవిధానమువలనను లభింపదగినదికాదనియు చెప్పదగిన విషయమొక్కటిగలదా ? ఈ సొసైటీలు అనుభవించే అసాధారణములగు హక్కులు ఇతరబ్యాంకులు, నిధులు లోనగువాటికి యున్న యెడల అవియు ఇతోధికములగు అభివృద్ధులను జూపగలిగియుండును.

కేవలము అప్పులివ్వడము, డిపాజిట్లను పుచ్చుకొనడముగాక ఈప్రచారము అన్నివిధములగు ద్రవ్య వ్యాపారములకు అడ్డము తెగులు చున్నది. వీరికిని ల్యాండుమార్టుగేజిశాఖలు, లైఫు ఇన్సూరెన్సుశాఖలు ఏర్పడియున్నవి. వడ్డీరేటు కొంచెము తక్కువయైనమాత్రమునగాని, లైఫుపాలసీలమీద ప్రీమియం కొంచెము తక్కువయైనమాత్రమునగాని, ఆవ్యాపారములు కో ఆపరేషను అనిపించుకొనజాలవు.

నిజమైన కో-ఆపరేషను (అన్యోన్యసాహాయ్యము) ఎట్టిదిగ నుండవలయుననిన అన్యోన్యసాహాయ్యము ముఖ్యముగ గలిగియుండవలెను. ఉదాహరణము: అయ్యవారు గ్రామములోనిపిల్లకాయలకు చదువుచెప్పిన యెడల గ్రామములోని పదునెనిమిదిఫణాలవారు తమ తమవృత్తులఫలముల నాయయ్యవారికి కలుగచేయుట, ఊరిలోని చాకలిమంగల్లు వారింట తమతమచేతవచ్చిన పనులను చేయుటయు అందుకీడుగా అయ్యవారు వారి పిల్లలకు చదువుచెప్పుటయు నిజమైన కో-ఆపరేషను కాగలదు. వడ్లుపండించినవాడు తనవడ్లను ప్రత్తిపండించినవానికిచ్చి వానియొద్ద ప్రత్తితీసికొని నూలువడుకుకొని గుడ్డలునేయించుకొనును. అటులనే ఒక్కొక్క

---

౧. అప్పిచ్చువాడు వైద్యుడు,
ఎప్పుడు నెడతెగకపారు నేరును ద్విజుడున్,
జొప్పడిన నూర నుండుము,
చొప్పడకున్నట్టియూరు చొరకుము సుమతీ.

వృత్తియందు నేర్పరియైనవాడు తనితరుల కానేర్పు యొక్క ఫలమును అబ్బచేయుట కో-ఆపరేషను కాగలదు. అట్టికో-ఆపరేషను నాటుకొని వ్యాపించినయెడల డబ్బుతో ఎవరికిని అక్కరయుండదు. అన్నివిధముల సమృద్ధికలిగి దేశము సుభిక్షముగ నుండగలదు. ఇపుడు లోక మనుభవించేడి(పెమను (హీనత) కలుగజాలదు. ఇట్టి అన్యోన్యసాహాయ్యమువలన జనులకు అకృత్రిమమైన అన్యోన్యసాహాయ్య మేర్పడగలదు. ఇదియే పూర్వపు గ్రామనిర్మాణవిధానములకు ముఖ్యావలంబనమయి యుండినది. ఇప్పటికిని కొన్నికొన్ని పల్లెలలో వడ్లు పండించుకొన్నవాడు తనకు పండినధాన్యములో యితరవృత్తులవారి కిచ్చి వారివలన తన సేద్యపుసామానులు, తనయింటిరిపేర్లు, తన కూతురిపెండ్లికి మేళములు, తానుసరించుటకు చలవమడతలు ఏర్పాటు చేసుకొనుచున్నారు. కో ఆపరేషను అనగా ఇట్లుగదా యుండవలెను. అప్పులిచ్చుచో డిఫాల్టువడ్డీలు పెంచుకొనుచు కాలముగడుపుచుండు వార్ధుషికులా కో ఆపరేటర్లు—అన్యోన్య సహాయపరులు.?

పైనచెప్పినవిధమున ఒకరొకరు తనపంటనో, తననేర్పరితనమునో ఇతరులకు తెలియపరిచి వినిమయరీత్యా (Exchange) జరిగేవిధమయిన కో-ఆపరేషను ఇప్పటి కో-ఆపరేటర్లు తలపెట్టినవారే కారు. ప్రస్తుతపు సందర్భముల పైవిధమగు వినిమయపద్ధతి కష్టమయినదియని యనవచ్చును. కాని యూరోపియను దేశములలో కొన్నిచోట్ల వస్తువులు చౌకగానున్న కాలములో కో-ఆపరేటివుఫండుతో కొనుటయు అట్లుకొనబడినవస్తువును లాభములేకనే కో-ఆపరేటర్లకు కొనిన ధరలకు ఇచ్చుటయు కలదు. ఇందును ద్రవ్యమే ప్రధానాంగముగ నున్నను ఇదియొకవిధమయిన కో-ఆపరేషను అనుకొనవచ్చును. ఈపద్ధతి మనదేశమున నేల ప్రవేశపెట్టకూడదు? కాని గవర్నమెంటువారి బుజ్జగింపున బొ(ర)పెంచుకొనుచుండు మన కో-ఆపరేటివు సొసైటీలు ఈప్రచారమునైన తలపెట్టుకొనునట్లులేదు. కొన్నిచోట్ల కోఆపరేటివుస్టోర్సు అనువ్యాపారము ప్రారంభింపబడినవి గాని ఎచటను అవి గట్టెక్కినట్లు కానరాదు. ఒక్కొక్క కో ఆపరేటరును తనషేర్లమూలధనముకంటే ఎక్కువగ స్టోర్సులో వెచ్చముపట్టుటయు బాకీలు చెల్లించకపోవుటయు అచిరకాలములోననే లిక్విడేషను అమలు సాగించుటయు నూటికి పదిరూపాయలుకూడ రాక ముగించుకొనుటయు కొన్నిచోట్ల జరిగినది.

ఈసందర్భము లన్నియు చూడ ఇపుడు జరుగుచుండే కోఆపరేటివుపద్ధతి సరియైనమార్గమున నడచుచుండలేదని స్పష్టపడగలదు. లోకులందరిదగ్గర డిపాజిట్లు తీసుకొని యితరుల కప్పునిచ్చుటయందు కో ఆపరేటివుసూత్రము ఏమాత్రము లేదని చెప్పవచ్చును. మనదేశములో ఊరూర వర్ధిల్లుచుండు ఋణదాతృ మహాగణమునకు కో-ఆపరేటివుమువ్మెంటు అనునొక సభ్యానిచేర్పినట్లగుచున్నదే కాని కో-ఆపరేటివుఆక్టు ఉద్ఘోషించిన సిద్ధాంతవాక్యముల ప్రచారముమాత్రము లేదు. ఇటీవల అణ్ణామలైవిశ్వవిద్యాలయములోజరిగిన యెకనామిక్ కాన్ఫరెన్సు సందర్భమునను శ్రీమదరాసు గవర్నరుగారి శ్రీవచనమునందును ఈభావమే గన్పరచిరి.

కో-ఆపరేషనులో దోషాన్వేషణముచేయుటయే పని కాదు. దానియుద్దేశమును నెరవేర్చి అది లోకోపకారమగునటుల ప్రవర్తింపచేయవలయును. ఆకార్యము రాజధానులలోను గొప్పగొప్పపట్టణములలోను సాధ్యము కాకపోవచ్చును. జననివేశములకు ప్రథమబీజములగు పల్లెటూళ్లలో దీనిని సాగింపవచ్చును. అందుకు ముఖ్యమగు వ్యవస్థాపనము గ్రామపునర్నిర్మాణమే కావలయును. గ్రామమును నొకకనిష్ఠపరిమాణము (Ultimate Unit) గ గ్రహించి యీ అన్యోన్యసహాయోద్యమము నందు ప్రవేశపెట్టినయెడల అది జయప్రదముగ వర్ధిల్లగలదు. అట్లు ప్రవేశపెట్టుట యాఊరివారిడబ్బును తెచ్చి యూరిలో అప్పులిచ్చి కొల్లపెట్టుటగాదు. ద్రవ్యమను దుర్వ్యక్తితో నక్కరలేకయే ఊరిజనులకు వారివారికి కావలసినవిషయముల ఆయావిషయాభిజ్ఞులచే నిర్వర్తింపచేయవలయును. ఇట్టిభావములు ఎచటనయిన వర్ధిల్లుచున్నవా యన నేటిరుష్యాలో అనుష్ఠింపబడుచుండు సోవి

యటుపద్ధతియే ఇందుకు నిదర్శనముకాగలదు. డబ్బుఅను నది వస్త్వంతర కార్యాంతర సిద్ధికి సాధనమేగాని అదియే సాధ్యాంశము గాజాలదు. కాబట్టి యీసాధనములేకనే సిద్ధిఅగునటుల చేయుట అన్యోన్యసహాయోద్యమము యొక్క పరమార్థముగదా. ఈవిధమున కో ఆపరేషను జరుగునెడల లోకమున అతృప్తికి, అసూయకు, పరస్పరద్వేషమునకు అవకాశ ముండదు. ఊరిలోని ప్రతి వానికిన్ని యితరులతో పనిగలిగియుండును. అగతిక ముగ అందరికి ఐక్యభావముగలిగి గ్రామమనకొక తుష్ట పుష్టమగు కుటుంబమువంటిదై విలసిల్లగలదు. డబ్బు యొక్క ఆవశ్యకత తగ్గినగాని క్షేమముపుట్టదు. ద్రవ్య మను వస్తువుపై నాధారపడియుండువరకును ప్రపంచ గార్హస్థ్యము శాశ్వతఋణమున నుండునేగాని ధనపక్ష మున కెప్పటికిని ఎక్కజాలదు. ఏలనన యేవిధమున నూరురూపాయలు నూటపది కాగలదు. ఋణదాత తా నప్పిచ్చినమొత్తమునకు పైపెచ్చు వడ్డీకోరుచున్నాడు. నూరురూపాయలు ఎప్పటికిని నూరుగనేయుండును కాని నూటపది గాజాలదు. ఈపైపది గడించుటకు ఇంకొక యాకరమున సంటబెట్టవలెను. పైనయూహింపబడిన వినిమయవిధానమున నూరు, నూటపదిగ పిల్లలుబెట్టవల సినయక్కర లేదు. బడిపంతులు ఒకసంసారిబిడ్డకు చదువుచెప్పిన పంతులింటిపెండ్లికి సంసారి పాలుపెరుగు తెచ్చియిచ్చును. చాకలివాడు సున్నము కొట్టిపోవును. కుమ్మరి కుండల తెచ్చియిచ్చును. ఇట్లు వారువారు వారి వారికి కరగతములగు వస్తువులగాని పనులగాని యొండొరు లకు సమకూర్చుకొనుటచేత ద్రవ్యముతో నక్కరలేక పోగలదు. కో-ఆపరేటివు సొసైటీలవారు వారియుద్య మము ఫలవంత మగునటుల జేయవలయునన్న వినిమయ పద్ధతిని బోధింపవలయును.

ఒకసంసారి ఒకకో-ఆపరేటివుసొసైటీలో నూరు రూపాయలు అప్పుతెచ్చుకొని ఒకయిల్లు కట్టించుకొనెననుకొందము. ఆనూరురూపాయలు గృహరూపమున మారిపోయినవి. రేపు ఆసంసారి యీకో-ఆపరేటివు సొసైటీకి అప్పుచెల్లించవలసినపుడు ఆయింటి నింకొక సాహుకారునకు కుదువబెట్టి అప్పుతెచ్చి చెల్లించవలసినదేకాని తా నప్పుతెచ్చుకొన్న నూరురూపాయల నభివృద్ధిచేసి తాను తెచ్చుకొన్న అప్పు చెల్లించినగదా యథార్థమైన ధన్యత. ఒకఅప్పు చెల్లించుట కింకొక చోట అప్పుతెచ్చుకోవలసియుండినయెడల కో-ఆపరేషన్‌వలన ప్రయోజనమేమి? ఇపుడు కో ఆపరేటివు సొసైటీలు పనిచేయుకీతిలో యితరఋణదాతల యొక్కయు, సాహుకార్లయొక్కయు వ్యాపారము మట్టువడినదని యేర్పడగలదా? అట్లుకానిచో యిది వరకుండిన ఋణదాతృగణమునకు కో ఆపరేటివుసొసైటీ ఒకఅధికసంఖ్య యగుచున్నది. కనుక యేయేవిధానముల చేత ఈయుద్యమము సార్థకమై ప్రజోపయోగమై అధమర్ణతా ( Indebtedness ) వినాశకరమై లోకోప కారకము కాగలదో ఆపద్ధతుల విజ్ఞు లాలోచించి అన్వర్థమగు కో ఆపరేషన్నను స్థాపింపవలయును.



# తేజస్తరంగములు: తేజఃకణములు

వసంతరావు వెంకటరావు, యం. యస్.

(Light-waves, & Light quanta)

సూర్యు డూహాతీతమగు మహాపరిమాణము గలిగి ప్రజ్వలించు నగ్నిగోళము. దానినుండి తేజోష్ణప్రసారములు నిరంతరము వెలువడుచుండును. అందు, తేజఃప్రసారమునే తేజఃకిరణము లందుము. సూర్యకిరణము లొకచిన్నరంధ్రముద్వారా గదిలోబడి నప్పు డవి సరళరేఖలు (Straight lines) గ నున్నట్లు కాన్పించును. వానిమార్గమున కడ్డముగ నేదైనవస్తువు నొకటి పట్టుకొనినయెడల, భూమిపైబడిన ఛాయ వస్తువుయొక్కయాకారమునే కలిగియుండును. కిరణములు సరళరేఖలుగనున్నగాని, ఏవస్తువుఛాయ దాని యాకారమునే దాల్చుట సంభవింపనేరదు.

అతివేగముగ బర్విడువస్తువు సరళమార్గము నవలంబించుట కాసక్తిచూపునట్లుండుటచేత, ప్రప్రథమమున శాస్త్రజ్ఞులు తేజఃకిరణములందు "తేజోఘుటికలు" (Light corpuscles) కలవనియు, నవి యూహింప శక్యముగానంతవేగముతో తేజోరాశినుండి పర్విడుచున్నవనియు తలంచిరి. వారిలో నగ్రగణ్యుడగు న్యూటన్ (Newton) మహాశయు డీభావములనే వృద్ధిగావించి "తేజోఘుటికాసిద్ధాంత" (Corpuscular theory of light) మనుపేరిట నొకవాదమును ప్రతిపాదించెను.

తేజఃకిరణములు సర్వావస్థలయందును నిర్వక్రముగ బోజాలవు. అద్దముపైబడిన కిరణములు తిరిగిపోవుచున్నవి. జలతలముపైబడిన కిరణము లొకింతవంగి, జలములో మరల సరళమార్గమున బోవుచున్నవి. ఈకారణములచేతనే యద్దములో ప్రతిబింబమును జూడగలుగుచున్నాము; నీటిలోపెట్టిన తిన్ననికఱ్ఱ జలతలముకడ వంగినట్లు కాన్పించుచున్నది. వీనిలో మొదటి దృగ్విషయమును "పరావర్తన" (Reflection) మనియు, రెండవదానిని "వక్రీకరణ" (Refraction) మనియు వ్యవహరించుచున్నారు.

తేజఃకిరణముల పరావర్తనము, వక్రీకరణముల గూర్చిన సూత్రములు న్యూటన్ కాలమునకే యెరుగుదురు. ఈవిషయములతోగూడిన సంకేతమును ముందుగ నెరుంగవలయును. కిరణపరావర్తనములో నెచ్చట కిరణములుపడునో యాస్థానమును "పతనబిందు" (Point of incidence) వందురు. పతనబిందువువద్ద లంబరేఖ (Normal)ను గీచిన, దానికిని పతనకిరణము (Incident ray)నకును మధ్యనేర్పడుకోణమును "పతనకోణ" (Angle of incidence) మందురు. పరావర్తన కిరణము (Reflected ray)నకును లంబమునకును నడుమనున్నకోణము "పరావర్తనకోణ (Angle of reflection) మందురు. ఇట్లే, కిరణవక్రీకరణములో పతనకోణ మేర్పడు చున్నది. పతన బిందువు కడ గీచిన లంబరేఖకును, వక్రీకరణకిరణమునకును నడుమనున్న కోణము "వక్రీకరణకోణ" (Angle of refraction) మనుచున్నది. మరియు పరావర్తనములో పరావర్తనకోణము పతనకోణముతో సమానముగానుండును. వక్రీకరణములో పతనకోణముయొక్క జ్యాపిండము (Sine) వక్రీకరణకోణముయొక్క జ్యాపిండముతో స్థిరనిష్పత్తిలోనుండును.

జలతలముపైబడిన కిరణములన్నియును వక్రీకరణ మొందుటలేదు. వానిలోగొన్ని పరావర్తన మొందుచున్నవి; లేకున్న నీటిలోప్రతిబింబములు కాన్పింపజాలవు. ఐనచో గొన్నివక్రీకరణమును కొన్ని పరావర్తనమును బొందుట కేమైనకారణ ముండవలయును. కిరణములలో నేకరాశిఘుటికలే యున్నయెడల నవి వివిధమార్గముల నవలంబించుట కవకాశములేదు.

లేకున్న, ఘుటికలపరిమాణములో భేదమున్నదనుట కెట్టియాధారములును లేకపోయినవి. క్లిష్టమగు నిట్టి యవస్థలం జిక్కువడిన న్యూటన్ మహాశయుడే పరస్పర వైరుధ్యమును సమర్థించుటకు పడినకష్టము వర్ణనాతీతము. యోచించి యోచించి, యెట్టకేలకు, జలతలమున కొకవిపరీతమైన సామర్థ్య మున్నదనెను. ఒక క్షణమున కిరణములకది దారినొసగుచు మరియొకక్షణమున మూసికొనిపోవుచున్నదనెను. జలతలము తెరచియున్నప్పుడు నీటిలో జొరబడు తేజోఘుటికలే వక్రీకరణకిరణము లగుచున్నవి; అదినిరోధించినపుడు తిరిగి పోవు ఘుటికలే పరావర్తనకిరణము లగుచున్నవి.

తేజఃకిరణములు పరిశుద్ధసరళరేఖలుగ చరించుచున్నట్లు స్థూలదృష్టికి గోచరించుచున్నను, సూక్ష్మముగ పరిశీలించిన నొక్కొక్కప్పు డవి వంగుచున్నట్లు కాన్పించును. పెద్దవస్తువుయొక్క ఛాయ దాని యాకారమునే దాల్చి స్ఫుటముగా నుండును. దీపమున కెదురుగ నేదైన నొక తెరదగ్గర పేకముక్కను పట్టుకొనినచో దానిఛాయ స్ఫుటముగా తెరపై బడును. అట్లే యొక సన్ననితీగముక్కను పట్టుకొనినచో దానిఛాయ స్ఫుటముగా గాన్పించదు. జాగ్రత్తగా తెరను పరిశీలించిన యెడల సామాన్యముగ నుండవలసినఛాయకు బదులుగ నలుపుతెలుపుగల పట్టీలొకదానిప్రక్క నొకటి చూడనగును. కిరణము లాతీగవద్ద వంగినవనుట కీ పట్టీలే తార్కాణము. మరియు, అట్టముక్కలో నొకరంధ్రము చేసి, దీపమువద్దనుంచినచో తెరపై వర్తులాకారముగల వెలుతురు స్ఫుటముగాపడును. రంధ్రమును తగ్గించిన కొలది వర్తులముయొక్క స్ఫుటత్వము తగ్గుటే కాక, తుదకు ఏకకేంద్రవృత్తములును(Concentric Circles), వానిలో నలుపుతెలుపుగల వృత్తాకారములును గోచరించును. అనగా ఇందుకూడ తేజఃకిరణము లెట్లో రంధ్రముయొక్కపరిధి (Circumference) వద్ద వంగినవని స్పష్టమే.

తేజోఘుటికలను ఘనపదార్థము లాకర్షించుచున్నవనుట కీవిషయములే ప్రమాణములని న్యూటన్ వాదించెను. కాని, ఈదృగ్విషయములను పూర్తిగ సమర్థింపజాలకపోవుటచేతను, వీనినిగూర్చి శాస్త్రజ్ఞులు ప్రబలముగ కృషి సలుపకపోవుటచేతను, కొంతకాలము గడచినతరువాత తేజస్సు తరంగములవలె నున్నదనుకొనినచో సరియైనసమాధానము దొరకునట్లు తోచినది. అంత కొందరుశాస్త్రజ్ఞులు తేజస్సు సముద్రతరంగములవంటి తరంగములుగ నున్నదనిరి. సముద్రతరంగములు సామాన్యముగ కొన్నిగజములు పొడవుండును. ఈపొడవునే "తరంగదైర్ఘ్య" (Wave-length) మందురు. తేజస్తరంగములదైర్ఘ్య మతిస్వల్పము. కొన్నివేలతరంగదైర్ఘ్యములు కూడినగాని యంగుళమొకటి కాజాలదు.

సముద్రతీరమునసున్న పర్వతము తరంగములను పూర్తిగ నిరోధింపగలదు. అదే యొకసాధారణపు శిలయైనచో తరంగము లచట విడిపోయి, శిల రెండువైపులనుండి తీరమునుజేరి మరల కలిసికొనును. ఈవిధమునసే స్థూలమగువస్తువేదైన తేజస్తరంగముల నాపగలుగుచున్నది ; సూక్ష్మమగుతీగయైనచో తేజస్తరంగములు దానిరెండువైపులనుండి బైటకువచ్చి మరల కలియుచున్నవి. ఇట్లొకసారి విడిపోయి మరల కలియు తరంగముల పరస్పర "సంఘర్షణము" (Interference) వలన నలుపు తెలుపు గల పట్టీ లొకదానిప్రక్క నొకటేర్పడుచున్నవి. కావున "తరంగసిద్ధాంత"మే (Wave - theory) తేజోఘుటికాసిద్ధాంతముకన్న శ్రేష్ఠముగ దోచినది. ఇట్లు, ౧౮-వ శతాబ్దము తేజస్సును ఘుటికాసమూహముగ భావింపగా, సూక్ష్మపరిమాణముగల దృగ్విషయముల నిది సమర్థింపజాలదని గ్రహించిన ౧౯-వ శతాబ్దము తేజస్సును తరంగపరంపరలుగ భావించినది.

ఈమార్పుతో కష్టములు గట్టెక్కలేదు. పట్టకము (Prism) పైబడిన సూర్యకిరణములు విచ్ఛిన్నమై సప్తవర్ణములుగ బహిర్గమించుచున్నవి. అవియే ఎరుపు, నారింజ, పసుపుపచ్చ, ఆకుపచ్చ, నీలము, నీలి, నీలలోహితము. సముద్రతరంగములట్లు తేజస్సు తరంగములుగ

న్నయెడల విచ్ఛిన్నమైన సూర్యకిరణములలో గల తేజస్సంతయును "సప్తవర్ణి" (Spectrum)లో నీల లోహిత ప్రాంతముననే కాననగునని చూపవచ్చును. అంతేగాక, అతినీలలోహిత (Ultra-violet) తరంగ ములకు శక్తి (energy)ని గ్రహించుట కత్యంత సామ ర్థ్యముండుటచేతను, నిరంతర మవి తమముఖముల దెరచు కొనియుండుట చేతను, బ్రహ్మాండములో నున్న శక్తి సర్వస్వమాకాశమున సంచరించు నీలలోహితప్రసారము గనో, అతినీలలోహిత ప్రసారముగనో మారిపోవును. కాని, అట్లు కాకుండుటకు కారణముతరంగసిద్ధాంతము తెలుపజాలదు.

తేజోఘుటికా సిద్ధాంతము సమగ్రముగ లేదని కదా తరంగసిద్ధాంతముకూడ నిర్దోషముగ లేకపోవు టచే శాస్త్రసామ్రాజ్యమున కళవళ ముద్భవించినది. అప్పుడు "కణసిద్ధాంతము" ( Quantum Theory ) బయల్వెడలెను. ఇది తేజస్సును సూక్ష్మ ఘుటికలుగ భావించిన న్యూటన్ నిరవశేషదోషాయత్తుడు కాడని చూపినది. తరంగములుగ తలంపబడుచున్న తేజస్సు నిశ్చితమను " తేజఃకణములు " ( Light Quanta ) లేక " తేజఃఖండములు " (Photons)గ విభజింపబడు చున్నదని ఋజువయ్యెను. అట్టివిభజన కష్టసాధ్యము గాదు. శరవృష్టినెంత సునాయాసముతో వేర్వేరుశర ములుగ భాగింపవచ్చునో, తేజఃకిరణమునుసైత మట్లే విభక్తరూపములుగ భాగింపవచ్చును. ఈ యభిప్రాయ మును ౧౯౦౦ సంవత్సరములో ప్రొ. మాక్సుప్లాంకు గారు (Prof. Max Planck) తొలుత సూచించిరి. ఉష్ణప్రసారమునుగూర్చి వారు ప్రబలముగ యోచించి నప్పుడు శక్తిస్వల్పమగుఖండములుగా బ్రసరింపబడు చున్నదనియు, ఈఖండములన్నియును కణములతో నేర్పడుచున్నవనియు, ఏఖండమును పరిశీలించిన నయ్యది కణమున క్కిన్నియో కొన్ని రెట్లుండుననియు, కణములో భిన్నము లుండవనియు కనుగొనిరి. ఈ కణమునకే ' h ' అనిపేరిడిరి. తేజస్సుష్ణమువలె నొకవిధమగు శక్తిగనుక దాని యందు ఖండములుగలవు. ఈఖండములందును పూర్ణాం కములుగల కణములే సర్వదా కాన్పించుచున్నవి.

అంతమాత్రమున తేజస్సు తన తరంగస్వభావ మును విడిచిన దనుకొనరాదు. ఒక్కొక్క తేజఃఖండ ముతో నిర్దిష్టపరిమాణముగల తరంగదైర్ఘ్యము కలిసి యున్నది. మనమెరిగిన పరిమాణముగల ఖండములున్న తేజస్సు పట్టకముపైబడినప్పుడు, దానితోగూడియున్న దైర్ఘ్యముగల తరంగములెట్లు ప్రవర్తించునో యిది సైత మట్లే వర్తించుచున్నది. తేజఃఖండమునకును, దానితోగూడియున్న తరంగదైర్ఘ్యమునకును సంబంధ మున్నది. పెద్దతరంగదైర్ఘ్యముగల తేజస్సులో చిన్న ఖండములున్నవి ; చిన్నతరంగదైర్ఘ్యముగల తేజ స్సులో పెద్దఖండములున్నవి. మరియు, ఏఖండమును ప్రత్యేకముగ విచారించినను దానిలోనున్న శక్తి సము చ్చయ మద్దానితోగూడియున్న తరంగ దైర్ఘ్యమునకు విలోమ సంబంధము ( Inverse Proportion ) లో నుండుటచేత తేజఃఖండముయొక్క తరంగదైర్ఘ్యము నుండి శక్తిపరిమాణమును, శక్తిపరిమాణమునుండి తరంగ దైర్ఘ్యమును సర్వదా కనుగొనవచ్చును.

ఈయుద్దేశము లాధారపడియున్న నిదర్శనములను సంగ్రహించుట కిప్పు డవకాశము లేదు. ఇయ్యది, పరి శోధనశాలాపరికరములందు తేజ స్సవిచ్ఛిన్నఖండము లుగ సంచరించుచున్నట్లు నిస్సందేహముగ బ్రకటించు చున్నది. నేటివరకు కొనరించిన యవలోకనముల (Observations)లో నేదియును తేజఃఖండములందు భిన్నములు గోచరించినట్లు వివరింపలేదు; అట్టిభిన్నము లుండునేమో యని సందేహించుటకైన తగిన కారణ ములు,చూపవయ్యె. ఈయుద్దేశములు సులభముగ బోధ పరచుకొనుటకు రెండు దృష్టాంతములు దీసికొనెదము.

అనుకూలమైన పరిస్థితులందు పదార్థముపైబడిన కిరణప్రసారము దానిలోనున్న పరమాణువు (Atom) లను భేదింపవచ్చును. విచ్ఛిన్నమైన పరమాణువుల బరీ క్షించినయెడల ప్రత్యేకపరమాణువును భేదించుటకై యెంతశక్తి వ్యయమైనదో తెలిసికొనగలము. తేజఃకిర ణమును సేనాసమూహము, ద్రవ్య ( Matter ) మను సేనాసమూహముతో సంగ్రామమున డీకొనుచున్నట్లే దృశ్యము నూహింపవచ్చును. ద్రవ్యసైన్యమందు పరమా

ణువులను ప్రత్యేకసైనికు లున్నట్లు చిరకాలమునుండి యెరుగుదుము. యుద్ధరంగమును పరిశీలించినప్పు డొక చిత్రమైన విషయము స్పష్ట మగుచున్నది. తేజఃకిరణ సైన్యమున గూడ తేజఃఖండములను ప్రత్యేక భటులున్నట్లును, వీరు ద్రవ్యపరమాణుసైనికులతో సంకులయుద్ధమునకు గడంగుచున్నట్లును గాన్పించు చున్నది.

X-కిరణములు (X-rays) విద్యుత్కణముల (Electrons)పై బడినప్పు డెట్లుపరిణమించునో యను విషయమును చికాగో (Chicago)లో ప్రొ. కాంప్టన్ గారు (Prof. Compton) పరిశీలించిరి. X-కిరణములలో ప్రత్యేకమగు తేజఃఖండము లున్నట్లును, అవి యుద్ధరంగమున దుపాకిగుండ్లకైవడి వేర్వేరుగ విరజిమ్మబడి వానిమార్గముల కడ్డముగనున్న విద్యుత్కణముల నన్నిటిని ఢీకొనుచున్నట్లును కనబడెను. ఇట్లు విద్యుత్కణములకును తేజఃఖండములకును వాటిల్లురాపిడి యందు తమ నియమితమార్గములవీడి తేజఃఖండము లొందుచున్న వ్యావృతులనుండి (Deflections) ప్రత్యేకవ్యక్తియొక్క శక్తి గణించుట కవకాశమగును. ఈప్రయోగములో నుపయోగించిన X-కిరణముల తరంగ దైర్ఘ్యము తెలుసును. దానినుండి తేజఃఖండము యొక్క శక్తి ప్రత్యేకముగ కనుగొనవచ్చును. ఇట్లు తేజఃఖండముయొక్క శక్తిని రెండువిధములుగ కనుగొనుట కవకాశమైనది. ఈరెండుఫలితములును సమానముగ నున్నవి. ఇది రెండవదృష్టాంతము. కావున, తేజస్సులో ఖండము లున్న వనుట కెట్టిసందియ ముండరాదు.

కాని, ఈయభిప్రాయ మెట్టివిషమావస్థ కల్పించునో చూడవలయు. వేర్వేరుమార్గముల నవలంబించు రెండుభాగములుగ నొకకిరణపుంజమును విభజించుట కనేకవిధానము లున్నవి. కిరణపుంజమం దనేకకిరణము లుండుటచే నది రెండుభాగములగుట వింతకాదు. కాని, కిరణపుంజమునకు బదులుగ నొక తేజఃఖండమునే దీసికొని పరిశీలించినయెడల నేమగునో చూచెదము. తేజఃఖండము భిన్నముకాజాలదని యిదివరకే తెల్పి యుంటిమి. కావున, దాని నుపయోగించినప్పు డది యవిభాజ్యమగుటచే నొకేసారి రెండుమార్గముల నవలంబింపజాలదు. రెండింటిలో దానికి వీలుగానున్న యేమార్గము నైన నెంచుకొనవచ్చును. అట్టి సమయమున నే మార్గమున బోవుట కధికావకాశమున్నదో చెప్పగలుగుదు మేమో గాని, నిశ్చయముగ నొకమార్గమునాశ్రయించక తప్పదని దృఢముగ చెప్పలేము.

తేజస్సును కేవలఘుటికలుగ భావించిన ౧౭-వ శతాబ్దమును, శుద్ధతరంగములుగ దలంచిన ౧౯-వ శతాబ్దమును ప్రస్తుత శాస్త్రీయాభిప్రాయములబట్టి సమానముగ దోషావహము లనవచ్చును; లేదా, కావలసినచో రెండును సత్యసమంచితము లనవచ్చును. ఏమన, తేజస్సును నానావిధప్రసారములును ఏకకాలమున తరంగములుగను, కణములుగను వర్తించుచున్నవి. ప్రొ. కాంప్టన్గారి ప్రయోగములలో విద్యుత్కణములపై బడ్డ X కిరణములు ప్రత్యేకమగు కణముల వర్షమట్లు కాన్పించుచున్నవి; ప్రొఫెసర్లులవే, బ్రాగ్ (Profs. Lave & Bragg) మొదలగువారి ప్రయోగములలో X కిరణములే ఘనస్ఫటికము (Crystal) పైబడి సర్వవిధముల తరంగపరంపరలవలె వర్తించుచున్నవి. ఇట్లు, కిరణప్రసారము లేక్షణమున నెట్టి వృత్తికి గడంగునో నిశ్చయముగ జెప్పజాలము.

తే:ఃకిరణములచరిత్ర మింత విచిత్రముగానుండ, ద్రవ్యముయొక్క నూతనచరిత్ర మత్యద్భుతముగా నున్నది. బంగారము, వెండి మొదలగుమూలపదార్థములలో (Elements) దేనినైన మనసామర్థ్యము కొలది భాగించి ముక్కలుచేయగా తుద కవిభాజ్యమగు పరమాణువులు మిగులునని పూర్వకాలశాస్త్రజ్ఞులే కనుగొనిరి. పరమాణువును తునియలుచేయజాలమని నిరూపించిరి. కాని, అది భిన్నమగుచున్నదని గతశతాబ్దాంతమున సర్ జె. జె. థామ్సన్ (Sir. J. J. Thomson) మొదలగువారు కనుగొనిరి. దానిలో విద్యుత్కణములు, ధనవిద్యుత్కణములు (Protons) గలవనియు, నయ్యది నిర్మాణములో సూర్యమండలమును బోలి యున్నదనియు విశదమైనది. ప్రతిపరమాణువునందును

సమానసంఖ్యగల విద్యుత్కణములు ధనవిద్యుత్కణములు నుండుటచే నది విద్యుత్స్వభావము చూపించజాలదు. అందుగల ధనవిద్యుత్కణములును, అంతకు తక్కువ సంఖ్యగల విద్యుత్కణములును కలిసి కేంద్రబీజ (Central nucleus) మేర్పడును. మిగిలినవిద్యుత్కణములు గ్రహములవలె కేంద్రబీజముచుట్టు కక్ష్యల (Orbits)లో తిరుగుచుండును. ఎంతయో ఘనముగ నున్నదనుకొను చున్న ద్రవ్యము, తుదకు, విద్యుద్ఘుటికలతో నేర్పడు చున్నది. ఇటీవల, విద్యుత్కణములుకూడ తేజఃఖండ ములవలె నొకమారు కణములుగను, మరియొకమారు తరం గములుగను ప్రవర్తించుచున్నవని కనుగొనబడినది.

తేజోఘుటికాసిద్ధాంతము సమగ్రముగ లేదని తరంగసిద్ధాంతము కల్పించినపుడు కిరణపరావర్తనము, వక్రీకరణము మొదలగువిషయములు తరంగము లెట్లు వాటిల్ల జేయుచున్నవో విశదీకరించుటకు ప్రొ. ఫ్రెనెల్ (Prof. Fresnel) మొదలగువారు చాల కష్టపడిరి. తేజఃప్రవర్తనము నేనివిషయములలో ఘుటికలు నిర్వ హించుకొనలేకపోయినవో, అందెల్ల తరంగపరంపర జయప్రదముగ తనపాత్రను పోషించుకొనినది. ఇటీవల నొనరించిన యవలోకనముల బట్టి విద్యుత్కణమును సూక్ష్మగోళముగా భావించినయెడల దాని నడవడి సం పూర్ణముగ సమర్థించుట కవకాశము లేకపోవుటచే లూయిడీబ్రాయిలీ( Loius de Broglie )ష్రాయిడింగర్ (Shrodinger) మొదలగు శాస్త్రప్రవీణులు దానినొక తరంగపరంపరగ నిరూపించుటకు ప్రయత్నించిరి. తత్ఫ లితముగ"తరంగయంత్రశాస్త్ర"(Wave mechanics) మను నొక నూతనశాస్త్ర శాఖ బయల్వెడలినది.

సమగ్రభూతలముపైబడ్డ బంతి త్రుళ్లినప్పు డది యద్దముపైబడిన కిరణములవలె వర్తించుచున్నది. కావున కిరణములవలె బంతికూడ భూమినుండి "పరావర్తన" మొందుచున్నదనవచ్చును. కాని, విద్యుత్కణము తరంగ పరంపరగ నున్నదనుట కీయుపమానము సాహాయ్య మొనర్పజాలదు. కావలసినచో బంతినే తరంగపరం పరగ భావించుకొనవచ్చును. కాని స్పష్టముగ గంటికి గోచరించుబంతిని తరంగపరంపరగ తలంచుకొనుటకు మానస మియ్యకొనదు. అటుగాక, అట్టి ప్రయోగ ములో నొక విద్యుత్కణ ముపయోగించి, దాని వర్తనము పరిశీలించి, సర్వవిధముల నది తరంగపరం పరగ వర్తించుచున్నట్లు కనుగొనినప్పు డది కఠినమగు సూక్ష్మగోళమే యనుట కెట్టియాధారము లుండజాలవు. స్థూలముగ గంటికిగాన్పించుబంతిని తరంగపరంపరగ భావింపజాలమని వాదించిన వాదించవచ్చును; కాని, నేటివర కెట్టిమహత్తరశాస్త్రజ్ఞునకైన దృగ్గోచరము కాక సామాన్యముగ "విద్యుత్కణ" నామమున వ్యవ హరింపబడుచున్న వస్తువొకటి తరంగపరంపరవలె నటించుచున్నట్లు నిదర్శనములున్నప్పు డానిదర్శనము లను సరకుజేయక దానిని కఠినగోళమనియే భావించె దమనుట న్యాయముగాదు. అట్టి తిరస్కారభావము న్యాయవిరుద్ధమేగాక కేవల మశాస్త్రీయము. మరియు, కఠినగోళమును తరంగ పరంపరయును వేర్వేరుఫలితము లొసంగువిషయములను పరిశీలించినయెడల విద్యుత్క ణము కఠినగోళమో తరంగపరంపరయో నిర్ణయించుట సులభము.

విద్యుత్కణములు యథార్థముగ కఠినగోళము లైనచో, చదునైనలోహతలముపైబడినవి సమగ్రభూతల ముపైబడ్డ కందుకములవలె పరావర్తన మొందవలసి యున్నవి. విద్యుత్కణప్రవాహము పడిన లోహతల మును పరిశీలింపగా, తరంగపరంపరలుకలుగజేయు నాకారములు దానిపై కాన్పించుచున్నవి. మరియు సూక్ష్మమగు రంధ్రమునుండి బహిర్గమించు విద్యుత్కణ వాహిని విరివిగాంచి అట్టిస్థితిలో తేజస్తరంగములు కలుగజేయు దృశ్యములవంటి దృశ్యములనే కలుగజేయు చున్నవి. ఈ రెండువిషయములలో విద్యుత్కణము లను తరంగపరంపరలుగ భావించినగాని, ప్రయోగ ములందలి ఫలితములను సమర్థించుట కవకాశము లేదని తెలియుచున్నది. వానిని కఠినగోళములుగా భావించిన చాల దృగ్విషయములను బోధపరచుకొనజాలము, కాని, తరంగములుగా భావించినప్పు డెట్టివిషయము గ్రహించుటకును కష్టము లేదు.

జి. పి. తామ్సన్ (G. P. Thomson), డేవిస్సన్ (Davisson), గెర్మర్ (Germer) మొదలగుశాస్త్రజ్ఞులు విద్యుత్కణముల పరావర్తనము వక్రీకరణమనదగు విషయములను పరిశీలించిరి. సమానాంతర (Parallel) కిరణపుంజముగ బర్వెడుచున్న విద్యుత్కణములు లోహతలము పైకిని, లోహతలమందలి సూక్ష్మరంధ్రములోనికిని పంపబడినవి. వీనిఫలితములు యుక్తముగ నమర్పబడిన ఛాయాకర్ష దర్పణముల (Photographic plates) పై లిఖింపబడినవి. ఆ చిత్రములను పరిశీలింపగా సూక్ష్మమగు కఠినగోళము లొసగు చిత్రములవలెలేవు. అనగా విద్యుత్కణములు తరంగములవలె ప్రవర్తించినవి. విద్యుత్కణము తరంగ సరంపరయైనచో, అది నిశ్చయమైన తరంగదైర్ఘ్యమును కలిగియుండవలెను. పర్విడుచున్న విద్యుత్కణముతో గూడిన తరంగదైర్ఘ్యము స్థిరముగానుండదు. అది దాని రాశిపైని వేగము (Velocity) పైని ఆధారపడి యున్నది. కావున దానిరాశి (Mass), వేగములనుండి తరంగదైర్ఘ్యమును గణింపవచ్చును. పైప్రయోగము లందలి చిత్రములనుండి ప్రత్యేకముగా తరంగదైర్ఘ్యము గణింపవచ్చును. ఈరెండు సంఖ్యలును సమానముగా నున్నవి. కావున, నిస్సందేహముగ విద్యుత్కణములు సైతము తరంగములట్లు నటించుచున్నవి.

ఇట్లు తేజస్సును నానావిధ ప్రసారములును ఖండములట్లును తరంగములట్లును దోచుచున్నవి. స్థూలముగ గోచరించు ద్రవ్యముహూడ తరంగములతో నేర్పడుచున్నది. జ్ఞాన మభివృద్ధియగుచున్నకొలది, ఎట్టి సూక్ష్మవిషయము నైన పరిశీలించుటకు తగిన యుపకరణములను మానవుడు కల్పించుచున్నకొలది బ్రహ్మాండమంతయు తరంగమయముగా దోచుచున్నది. అంతమాత్రమున శాస్త్రజ్ఞుడు భయపడి సత్యాన్వేషణము మానడు. తానాశ్రయించిన పథము దుర్ఘటమగుచున్నకొలది వాని యుత్సాహమును, పట్టుదలయు మరింత బలమగును. జ్ఞానవాహిని పలుమారులు వెనుదిరిగినది. భవిష్యమున నెట్టి నూతనభావము లుద్భవిల్లునో చెప్పజాలము. జాగరూకులమై గమనించవలయును.

---



పర్యవేక్షణ శిఖరము-గుత్తి T R R.

## సంగీతప్రియులకు, సంగీతవిద్వాంసులకు

# బహిరంగలేఖ

హెచ్. పి. కృష్ణరావు, బి. ఏ.,

స్వరముల సాహాయ్యమున అనేకభావములను విస్ఫుటము చేయునదియే సంగీతకళ. దానికి పంచదారవంటి మాధుర్యము గలదు. అనేకసంగీత విద్వాంసులు ఆకళయొక్క బాహ్యగుణములతో తృప్తి నొందుచున్నారు గాని స్వరసమ్మేళనమువలన మన స్సునం దెట్టిసంచలనము కలుగునదియు వారాలోచించుటలేదు. స్వభావసిద్ధములగు ప్రకృతిస్వరములన నెవ్వి? వికృతిస్వరములన నెవ్వి? ఈపరిభాష యెట్లు వచ్చినది? ఆయాభావములలోని భేదము లేమి? సరిగమ పధనియను సప్తస్వరముల భావములెవ్వి? కళ్యాణి, తోడి, భైరవీ రాగాలాపము లెట్టి మనోభావములకు కారణమగుచున్నవి? ఆనందము, శోకము అను భావ ములు కలుగుట కెట్టి రాగములు పాడవలయును? ఇటు వంటి ముఖ్యాంశములను పండితులు ఉపేక్షించు చున్నారు. ఈవిషయమును ఇంకను విశదపరుపవలయు నన్న ఒకసాధారణ గాయకుని విషయము గమనించిన యెడల తెలియగలదు. సామాన్యగాయకునకును—భార తీయుడుగాని, యూరోపుఖండవాసిగాని—వంటవాని కిని సామ్యము గలదు. ఎట్లన: వంటవానికి తా నుప యోగించెడి సంబారముల గుణములుగాని, వంటకముల రాసాయనికస్వభావములుగాని తెలియవు. కాని అతడు బహుపక్వముగా వండి మెప్పుపొందగలడు. అట్లే సామాన్యగాయకుడును. సంగీతము విరసమైనప్పుడు విరక్తిని గలిగించునేగాని వంటవాని చేతగానితనమువలన మాత్రము ముప్పు కలుగవచ్చును. ఇట్లువ్రాసి సంగీత కళనుగాని, తత్కళాభిజ్ఞులనుగాని నిరసించవలయు నను భావ మేమాత్రమును లేదు. ఈ పైప్రశ్నములకు సమా ధానము చెప్పుట సంగీతవిద్వాంసుని ప్రథమకర్తవ్యము. రెండుదశాబ్దులనుండి తీవ్రమైన పరీక్షకు గురియై తేల్చ బడిన యీసూత్రములు 'సంగీతతత్త్వవిచారము' (The Psychology of Music) అను గ్రంథమున గలవు. అవి యీక్రింద పొందుపరుపబడియున్నవి.

(౧) శంకరాభరణరాగ (బిలావల్) స్వరములు (Diatonic Major) స్వభావసిద్ధములగు ప్రకృతి స్వరములు. అవి ఆనందారోగ్యముల సూచించును.

నాదము, నాళప్రకృతి, మనస్సు అనువాని యొక్క స్వభావములనుండి పైవిధముగా చెప్పవచ్చును. ఈస్వరకంపనములచే గలుగు భిన్నాంశములు సులభ ములు. ఇవన్నియు పరస్పరానుగుణ్యము కలవి.

(౨) అట్టిస్వరముల సమ్మేళనముచే గలుగునది ఆనంద, సౌఖ్య, వీర్య, గాంభీర్యాది భావములేకాని శోకముగాదు.

(3) శంకరాభరణరాగస్వరములచే నుత్పత్తి యగునది స్వభావసిద్ధమగు ఆరోగ్యమున కాధారభూత మైన మానసికానందము. దీనికి భిన్నములయినవి వికృతి స్వరములు. అవియే శోకాత్మకములు.

ఆవికృతిస్వరకంపనములు క్లిష్టములై అన్యోన్య విరుద్ధములై, మనోవైకల్యమునకు కారణభూత మగు చున్నవి. "మధురగానము నాలకించినపుడు నాకెపు డును సంతోషము గలుగదు" అని జెసికా వచించినట్లు, ఈస్వరముల వినినపుడు దుఃఖభావములు తప్ప వేరొండు మన హృదయములయందు జనించవు. ఒకొక్కపుడు అనురక్తివలన ఆనందబాష్పములు వచ్చుటగలదు.

(౪) మిగిలిన ౭౧ జనకరాగములు ప్రకృతి వికృతిస్వర సమ్మేళనమువల్ల దుఃఖభావముల గలిగించు చుండును.

హరికాంభోజిరాగములో, కైశికి 'ని' పాదము నకు 'గా'ంధారము వివాదిగనున్నది. కల్యాణిలోని

'మ' మిగత అన్ని స్వరములకును వివాదిగ నున్నది. ఇట్లే అన్ని రాగములలోనను.

(౭) సంగీతమందు తాళము, గమకము, ధ్వని యనునవి ఒకొక్కపుడు రాగస్వభావమును మార్చి మెరుసుపెట్టుట కలదు. కొన్ని యెడల తద్విపరీత మను టయు కలదు.

(౮) సంగీతమునకు భాష లేదు. భాష సంగీత మున కొక అంగమున్మాత్రమే యగును. ఒకొక్కసారి భాష సంగీతభావమును తారుమారుచేసి మనస్సులను తప్పుదారి త్రొక్కించుటయు గలదు.

(౯) సంగీతము భావప్రధానమైనది. అది రసము కాదు. నవరసముల ప్రకటించెడిశక్తి నాట్యమందును, సాహిత్యమందును గలదు. సందర్భోచితముగ రసము విభా వానుభావ వ్యభిచారిభావములందు లీనమైయుండును.

(౧) శార్ఙ్గదేవుని సంగీతరత్నాకరమందు ఈ విషయములు రసశాస్త్రసంప్రదాయమునకు ప్రతిహతముగ నున్నది.

(౯) శ్రీరాగము, కల్యాణి, నాటరాగములలో వికృతిస్వరములు కలవు కావున అవి శుభదాయకములు కావు.

(౧౦) రాగములపేర్లు రూఢములు. ఆపేర్లయందలి యర్థమునకును, ఆరాగములవలన గలుగు భావముల కును ఏమాత్రమూ సంబంధములేదు.

(౧౧) రాగములు పాడుటకు కాలనియమములు నిర్దేశింపబడలేదు. పాడుట గాయకుని మనోభావముల బట్టి యుండును. అన్ని వేళలయందును, ఆయారాగము లందుండు వికృతిప్రకృతిస్వరములబట్టి రాగములు మనో రంజకములుగ నుండును. అట్లుండుట స్వభావసిద్ధము. చక్కరయందలితీపి, కైవ్వానాయందలిచేదువలెనే రాగ ములందలి మాధుర్యమును సర్వథావర్తించును.

(౧౨) గానము అగ్నిని ప్రజ్వలింపచేయను లేదు; వర్షమును కురిపించను లేదు. ఈశక్తి దేవగానమైన 'మార్గి'విధానమునకే గలదు. 'దేశి'విధానమందు గాయకుని మనశ్శక్తినిబట్టి యుండును.

(౧౩) ఎల్లప్పుడును మనస్సు మెట్లవరుసను శారీరకవిశ్రాంతికిని మానసికవిశ్రాంతికిని మధ్య తేలియాడు చుండును. మనశ్శారీరకతత్త్వమునుబట్టి యోచించిన యీస్థితి సంగీతస్వరముల నడకవలెనే యున్నది. మానవుడు త్రాగి మత్తుగొనినపుడును, జయముగొని పరవశుడైనపుడును, జ్వరపీడితుడైనపుడును, వానిమనస్సు కొంచెముగానో, గొప్పగానో, సహనములోనో, అసహనముతోనో వర్తించునట్లు, సంగీతము వినునపుడును మనసు ఆనందవిషాదములలో, స్థితినిబట్టి వికసించుచు, సంక్షోభించుచునుండును. కల్యాణి, తోడిరాగములు మనయందు కలిగించు భావములు శోకభూయిష్ఠములు గనే యుండును. రాగముయొక్క స్వరమునుబట్టి కొద్ది భేదములు గలుగవచ్చును.

ఈ గూఢభావముల సూక్ష్మభేదముల నర్థించుటకు చిరకాల పరిశ్రమ అనుభవము ఆవశ్యము. గీటురాయి పైన గీచినంతనే బంగారువన్నెను సామాన్యుడు గాని బంగారునగల ధరించువారుగాని తెలిసికొనలేరు. ఈసై పుణ్యము ప్రాజ్ఞునికిమాత్రమే గలదు. అట్లే సంగీత మందును.

(౧౪) ఈసూత్రములు హిందూస్తానీ సంగీతము నకుగూడ అన్వయించును. ఒకేరాగమందు తీవ్రకోమల స్వరములు స్వేచ్ఛగా పాడుటవలన ఈఖత్తు చాలమాధుర్యముగ కనుపించును.

(౧౫) పదియవశతాబ్దమువరకు యూరోపియ సంగీతముకూడ నిదే ప్రకారముండెను కాని ఆతర్వాత 'డైఫోని'పద్ధతి అవలంబింపబడినది. తరువాత కొంత కాలమునకు **Descantus** వలన స్వరభావములు మరింత బిగింపబడెను. పదునేడవశతాబ్దమందు 'రామ్యూ' అను సంగీతవిద్వాంసుడు మేళవిధానము (**Standard of Harmony**) అనుదాని నేర్పరచి తత్త్వశాస్త్రమునకు బదులు గణితనియమముల జొప్పించి 'డాక్టరు నెస్టు హార్ప్'గా రన్నట్లు సంగీతమును ధ్వంసము చేసినాడు.

గాన మాధుర్యము, మేళము, అనుపదముల నిర్వచన మేమి? మానవుని కంఠస్వరమందు దుదయించెడి సంగీతమున మాధుర్యము గలదనవచ్చును. దాని స్వరూపము మనశ్శారీరకతత్త్వములబట్టి యుండును. మేళము విశ్వమంతయు వ్యాపించియుండు దైవబల ప్రేరితమైన వాక్కునందు గలదు. అయినను ఇందు మూలమున కొన్ని భావములు అద్భుతమగు రీతిని ప్రకటిత మగుటయు గలదు. భారత సంగీత విధానము తనపరిమితిలోనను చాలస్వాభావికముగనే యున్నది. పాశ్చాత్యవిధానము కృత్రిమమైనది. Donald Francis Torey యిట్లనుచున్నాడు: "సంగీతమునకు భాష కళాకల్పితమే. ఆభాష స్వభావసిద్ధమైనట్లు గన్పించును." ప్రాక్పశ్చిమవిద్వాంసులు ఒకరితత్త్వము నొకరు గ్రహించుకొనలేక పోవుచున్నారు.

## లేఖోద్దేశము

(౧) సంగీతవిద్వాంసులు తమశాస్త్రపరిశోధనానుభవ సహాయముతో నందలిసూత్రముల సత్యాసత్యముల చక్కగ బరిశీలించవలయునని ప్రార్థన.

(౨) ఇందుకు భిన్నమగు వాదములున్నయెడల వానిని సహేతుకముగ ఆధారముల చూపవచ్చును.

ఏరాగమునైనను ప్రతిభాశాలురగు గాయకులు పాడి ఎట్టిభావములైన ప్రకటించగలరని పైసూత్రముల కొందరు భారతీయులు త్రోసిపుచ్చుచున్నారు. కుండనొకదానిని చేయుటకు బంకమన్ను సంగతియటుంచి నను, ఉక్కు, ఇత్తడి, రాగి, వెండి, బంగారములు సయితము ఉపయోగపడగలవు. కాని ఆయాలోహములు తమస్వభావగుణముల గోల్పోవుటలేదు. బంగారుతో సూదినిగాని, కుండనుగాని, కటారిగాని, ఫిరంగినిగాని చేయవచ్చు అందుమూలమున బంగారుయొక్క ప్రత్యేకత నశించిపోవుటలేదు. ఆలాగుననే ప్రతిరాగమునకును ప్రత్యేకతగలదు. ఒకేరాగముమూలమున అనేకభావముల వెలిబుచ్చినంతనే దానిస్వభావము మారుచుండుటలేదు. కొందరు మార్గ దేశీవిధానముల నుత్తరుగరు. హనుమంతుడు, నారదుడు, శ్రీకృష్ణుడు మొదలైనవారి దివ్యగానముయొక్క ప్రభావము సామాన్యులగానమువలనను గల్గునని పొరబడుచున్నారు.

సంగీతవిద్వాంసుడు శాస్త్రసమ్మత మగు గానమును, సాధారణవిధమగుగానమును కనుగొని మెలంగ గలిగినయెడల ఈలేఖోద్దేశము సగము ఫలించినట్లె యగును. తత్త్వశాస్త్రమునకును, సంగీతశాస్త్రమునకును బాంధవ్యము క్రమేణ కలుగగలదు. సృష్టిచిత్రముల ప్రతిబింబింపజేయుటయే లలితకళల ముఖ్యోద్దేశము. భౌతిక, శారీరక, మనస్తత్త్వ శాస్త్రముల సాయములేనిదే సంగీత మాయుద్దేశమును సాధించుకొనజాలదు.

ఇందునుగురించి విమర్శలుగాని, అడుగవలసిన ప్రశ్నలుగాని యున్నచో వ్రాయించినయెడల జవాబు బడయగలరు.

6th Road, Chamarajpet, Bangalore City.



# నక్షత్రమండలము

(భావ ఆశ్వయుజమాసము)

గో॥ బుఱ్ఱారు వేంకటానంద రాఘవరావు (కవితాసమితి)

ఉత్తరము




దక్షిణము

[ ఈ పటమును తలమీదుగా ఆయాదిక్కులు సరిపడునట్లు పట్టుకొని ఖగోళమును పరిశీలింపవలెను.

ఇందు జూపబడినట్లు నక్షత్రాదులు
సెప్టెంబరు 8 తేదీని రాత్రి 8-25 నిమిషములకును
,, 15 ,, ,, 8-52 ,,
సెప్టెంబరు 22 తేదీని రాత్రి 7-57 నిమిషములకును
,, 30 ,, ,, 7-26 ,,
అక్టోబరు 7 ,, ,, 6-58 ,,
కనబడును.]

The Heavens declare the glory of God. And the firmament showeth his handiwork.

(భగవంతుని మహామహిమను మింట ప్రకాశిత మగుచున్నది. అతని మహోన్నత సృష్టికౌశలము ఆకాశ రంగమున ప్రదర్శింపబడుచున్నది.)

No unregarded Star
Contracts its light
Into so small a character,
Removed far from our human sight,
But if we steadfast look
We shall discern
In it, as in some Holy Book,
How man may heavenly knowledge learn.

(బహులక్షలకోట్లమైళ్లు దూరమువనుండి మానవుని కంటికి దృశ్యాదృశ్యముగా తేజో(అ)ణువు మాత్రము గా కనబడు ప్రతినక్షత్రమును, ఊరక చూచునపుడు సంకుచిత తేజముతో చిన్న చుక్కలాగున కనబడినంతమాత్రమున నేమి? నిదానించి గమనించినపుడా చిన్నచుక్కయే (వేదాది) పవిత్రగ్రంథములవలె స్వర్గీయవిజ్ఞానమును మనలకు విదితము చేయుచునే యున్నది.)

ఈ భావ సంవత్సర ఆశ్వయుజమాసమునందు రాత్రి తొలిజామున నగపడు ఖగోళవిశేషముల నరయుదము.

## పాలవెల్లి (Milky way)

ఈమాసములో పాలవెల్లి ఈశాన్యదిశ నారంభించి ఆర్చియనబడు (Arch) మండలఖండము వలె వంగిన యాకారముతో భృగుపరశు, అప్సరస, పురూరవసు, రాజహంస, గరుడ, ధన్వి, వృశ్చికరాసుల మీదుగా నైరృతిదిశకు వ్యాపించియున్నది. ధనురాకారముతో ఇట్లువ్యాపించిన యీధవళదృశ్యమునకు మధ్యభాగమున రాజహంసమండలము కానరాగలదు. అటనుండి పాలవెల్లి రెండుశాఖలుగా చీలినది. ఆ శాఖలమధ్య నల్లగ చాయాపధము గమనింపదగియుండును.

## మొదటి తరగతి చుక్కలు

## (First Magnitude Stars)

ఈ మాసములో మిక్కిలి తేజోవంతము లైన చుక్కలు నాలుగుమాత్రము రాత్రి తొలిజామున నగపడును. అవి యేవేవి యనగా:—

౧ వీణామండలములోని బ్రహ్మ (Vega in Lyra).

౨. వృశ్చిక రాశిలో జ్యేష్ఠ (Antares in Scorpio).

3 గరుడమండలములో శ్రవణము (Altair in Aquila).

౪. ఇంద్రద్యుమ్న (Fomalhaut).

## గ్రహములు

ఈనెల ౧3-వ తేదీని గురుడు పశ్చిమమున నస్తమించును. మరియు ధనిష్ఠ రెండవపాదమందు వక్రగతుడై యున్న శనియొక్క వక్రగమనము ఈనెల ౨౭-వ తేదీతో అంతమొందును. అటుపైని శని, ఋజుగతితో ధనిష్ఠ ౨-వ పాదమున చరించును. తక్కిన గ్రహములు ఇపుడు కానరావు.

పడమటిదిశను స్వాతి అస్తమించినది. విశాఖ,అనురాధా, నక్షత్రములు త్వరలో అస్తమింపనైయున్నవి. వాయవ్యమున శేషశాయియైన శ్రీమహావిష్ణువు త్వరలో నస్తమింపగలడు. అతని నాభికమలమునజనించిన బ్రహ్మ (Vega) నక్షత్రమును, బ్రహ్మముఖమునందున్నట్లు వర్ణింపబడు సరస్వతిచేతిలోని వీణ (Lyra) చుక్కలును మరికొంతతడవు కానరాగలవు ఈవాణీహిరణ్యగర్భులకు వాహనమైన రాజహంస (Cygnus) నభోమధ్యరేఖ (Meridian) ను గడచి పడమటకు వ్రాలియున్నది. ఇప్పటికగపడు పాలవెల్లికి ఈ రాజహంస ఇంచుమించుగా మధ్యనున్నదని చెప్పనొప్పును.

దక్షిణమున వృశ్చికరాశి త్వరలో నస్తమింపనై యున్నది. మిత్ర దేవతాకమైన అనూరాధయును, ఇంద్ర దేవతాకమైన జ్యేష్ఠయు, తేలుకొండెలో మూలయును చక్కగా చూడనగును. వీటిప్రక్కను ధన్వియు, దానివాహనమైన చిలుకయు, ఆదిగువనే బాణాసుర మయూరములును కానవచ్చుచున్నవి. శని ధనిష్ఠలో నున్నాడు. మకర, కుంభరాసుల దిగువ ఇంద్రద్యుమ్న మహారాజును, నాళీకజంఘుబకమును, ప్రావారకర్ణ ఘూకమును, యుగంధరకమఠమును చక్కగా కానబడుచున్నవి. కమఠము కడనే త్రికోణ దక్షిణధ్రువము భావించుకోవలెను. ఆగ్నేయదిశను ధుంధుడును, శింశుమారమును ఉదయించినవి.

ఉత్తరమున ధాత, విధాత, మిత్ర, అగ్ని, మహేంద్ర, కశ్యపులతోను, తోక చివరను ధ్రువునితోడను ఉదయాస్తమానములు లేని లఘుఋక్షము మెఱయుచున్నది. లఘుఋక్షమునకు వాయవ్యమున నరకాసురుడు సపరివారముగా చుట్టుకొనియున్నాడు. ధ్రువుని దిగువను, ఊరువు ననుసరించి ఊర్వశీపురూరవసులు మెఱయుచున్నారు.

మధ్యను వసుదేవతాత్మకమైన ధనిష్ఠయు, దానికి తూర్పుగా, వేద్యశ్వము (Pegasus) చతురస్రము నందలి పూర్వాభాద్ర, ఉత్తరాభాద్రా నక్షత్రము అవల తూర్పున రేవతియును కానవచ్చుచున్నవి. తూర్పున మేషము, అనగా అశ్విని, భరణి, కృత్తికానక్షత్రములు ఉదయించినవి. అశ్వినికి ఎగువను, అనగా ఈశాన్యమున చ్యవన, ఇంద్రమద నక్షత్రములును, అప్సరస మండలమును చక్కగా ఉదయించి మెఱయుచున్నవి. భృగుపరశుమండలము ఇప్పుడే ఉదయమైనది. ఆదిగువను గ్రుడ్లు మిటకరించుకొనుచు Blinking Demon అని చెప్పబడు పులోముడు (Algol) కానవచ్చుచున్నాడు. ఈపులోముడు గ్రుడ్లు మిటకరించుకొనుచున్నాడని పలుసారు లీవఱకు వ్రాసియుంటిమి. ఈరక్కసుడు ఇట్లు గ్రుడ్లు మిటకరించుకొనుచున్నట్లు అగుపడుటకు కారణము చూడవలసియున్నది:—

మన సూర్యచంద్రులే విశ్వములో తేజోవిషయమున మహాఘనులయినట్లును, తక్కిన చుక్కలన్నియు వట్టిపనికిమాలిన వయినట్లును భావించి, ఈ చుక్కలయందు కేవల నిరాదరభావముతో, మనకవులు కొందరు

“ అలఘుతేజులౌ సూర్యచంద్రులకె గాక
గ్రహణ మందునె మింటిచుక్కలకు నెల్ల? ”

అని ప్రశ్నించినారు. సూదిమొన మోపినపుడు తోచు చుక్కబొట్లవలె సూక్ష్మములై తోచుచు ఆకాశమున మిణుకుమిణుకుమనుచుండు నక్షత్రములు “కడు చిఱుతలగుట” చేత వాటికి గ్రహణయోగ్యత లేనే లేదని ఆకవుల భావము. సిద్ధాంతశాస్త్రపరిశోధకు లాభావము నంగీకరింపరు. క్షణమునకు లక్ష యెనుబదియారువేల మైళ్ల వేగముతో అఖండత్వరతో వ్యాపించు వెలుగు మన కతి సమీపమున నున్న చుక్కలనుండి మనకు చేరు సరికి బహు సంవత్సరములు పట్టునని నిర్ధారణ కాబడినది, దూరపుచుక్కలనుండి వెలుగు మనభూమిని చేరుకొను సరికి వందలు-వేలు- సంవత్సరములు పట్టుచున్నది. ఊహింపరానంత దూరమున నుండుటచేత ఈ చుక్కలు బహు చిన్నవిగ కనబడుటచేత అవి చిన్నవేనని మనము భ్రమపడరాదు. పరిమాణ విషయమునను, తేజోవిషయమునను కొన్ని చుక్కలు మన సూర్యునికంటె వందలు-వేలు-రెట్లు అధికమైన తేజస్సు, పరిమాణమును గల బ్రహ్మాండగోళములు. అగస్త్యుడు, జ్యేష్ఠ, ఆరుద్ర, మఘ, చిత్ర, రోహిణి మొదలగు బ్రహ్మాండ గోళముల యెదుట మనసూర్యు డొక ఆవగింజ - ఒక మిణుగురు పురుగు మాత్రమేనని మనము గ్రహింపవలెను. చంద్రుడు మన సూర్యునికంటె చాల చిన్నవాడు. అయినను బహు సమీపమునం దుండుటచేత పెద్దగా కనబడుచున్నాడు.

## పులోమ నక్షత్రము

ఇది భృగుపరశుమండలమునదిగువను, ధ్రువనక్షత్రమంత కాంతితో మెఱయుచుండును. ఇట్లు రెండురోజులన్నర—సుమారు ౫౯ గంటలు మెఱసినతరువాత ఆచుక్క కాంతి మందము అగును. మరి నాలుగున్నర గంటలకు, ఆచుక్క కాంతిలో రెండువంతులు తరిగిపోయి

ఒక మూడవవంతుమాత్రము మిగులును. మరి మూడుగంటలన్నరకు ఆచుక్క ఎప్పటితేజముతో, అనగా మన ధ్రువనక్షత్రమంత కాంతితో మెఱయుచుండును గ్రహణమునకు గ్రహణమునకు మధ్య అంతరము ౨ దినముల ౨౦ గంటల ౪౦ నిమిషముల ౫౩ సెకెండ్లు. ధ్రువనక్షత్రమంత తేజముతో ప్రకాశించుచు, మధ్య మధ్య గ్రహణబాధచే కాంతి తరుగుచు, హెచ్చుచు




పులోమనక్షత్రమునకు గ్రహణముపట్టుట.

[1. పులోమ చుక్కలజతలో తేజోవంతమైన చుక్క. ఇదే అసలు చుక్క. దీని వ్యాసము మన సూర్యునికంటె ౩ సుమారు పెద్దది.

2. నల్లచుక్క. ఇది ఇంచుమించుగా మన సూర్యునియంత పెద్దది.

3. నల్లచుక్క అసలు చుక్కచుట్టును తిరిగి వచ్చుచుండు అండవృత్తము.

ఈ నల్లచుక్క అడ్డమువచ్చుటచేత తెల్లచుక్క కాంతి హీనమై కనపడును.]

నుండు పులోమనక్షత్రము దూరముననుండుటచేత ఒక్క చుక్కలాగున కనబడుచున్నను, నిజమునకు అది చుక్కల జత. అందొకటి కాంతివంతమైనది. రెండవది నల్ల చుక్క. తేజోవంతమైన దాని వ్యాసము పదునొకండు లక్షల ఇరువదివేలమైళ్లు. మనసూర్యుని వ్యాసము సుమారు ఎనిమిదిలక్షలమైళ్లు. కాబట్టి పులోమ నక్షత్రయుగ్మములో తేజోవంతమైన చుక్క వ్యాసము మన సూర్యుని వ్యాసముకంటె 3 వ వంతు హెచ్చుగా గలదు. కాబట్టి అయ్యది మనసూర్యునికంటె చాల గొప్పగోళము. ఆ జతలో రెండవది నల్లచుక్క ఆ నల్లచుక్కయొక్క వ్యాసము ఎనిమిదిలక్షల నలుబదివేలమైళ్లు. అనగా అది ఇంచుమించుగా మన సూర్యునియంతగోళము. ఇది తేజస్సుగల చుక్కచుట్టును అండవృత్తమార్గమున తిరిగివచ్చుచున్నది. అట్లు తిరిగివచ్చుటలో అసలు చుక్కయొక్క తేజఃప్రసారమునకు అడ్డమైనందున ఆ చుక్కయొక్క తేజస్సు తరిగిపోయినట్లు మనకు కనబడును. అటంకము ఆరంభమైనదిమొదలు నివారణయగువరకు సుమారు ఎనిమిదిగంటలు పట్టును. నల్లచుక్క కనబడదు. యంత్రసహాయముచేత గూడ దాని నీసరికి ఎవరును చూడలేరు. అయినను దానిఉనికి స్థిరమగుటయేకాక దాని పరిమాణముగూడ సరిగా నిర్ధారణచేయబడియున్నది. దానికి కారణభూతుడు John Goodricke అనుపిన్నవాడు.

అతడు మూగవాడు, చెవిటివాడు. అయినను పులోమనక్షత్రమునందు సక్రమముగా గోచరించు తేజోభేదములను బహుసూక్ష్మముగా పరికించినాడు. అందుకు హేతువేమియని యోజించినాడు. మన చంద్రుడు మన భూమినిచుట్టును, భూమి మొదలగునవి సూర్యునిచుట్టును పరిభ్రమించునట్లే నల్లగోళ మొకటి పులోమ ముఖ్యనక్షత్రముచుట్టు తిరుగుచున్నదనియు, ఆచుక్కకు నల్లచుక్క అడ్డమువచ్చుటచేత గ్రహణము కలిగి, తేజోభేదములు కనపడుచున్నవనియు సరిగా నూహించినాడు. ఆవిషయమై సహేతుకమైన వ్యాసము వ్రాసి ఇంగ్లండుదేశపు Royal Society వారికి పంపినాడు. వారీతనికి Copley Medal అను గొప్ప పతకము నిచ్చి బహూకరించినారు. పాపమాపరిశోధకుడు ౨౨ సంవత్సరముల పిన్నవయసులోనే కాలము చేసినాడు. ఇట్టిపనివాండ్రు బహుకాలము జీవించిన పక్షమున తనగుట్టు బయలగునేమో నని ప్రకృతికి భయముకలిగికాబోలు—వీనిం బోలు ఉగ్రమేధావుల నెంతోకాలము జీవింపనీయదు.

పిమ్మట Potsdam University లో వోగల్ పండితుడు (Prof. Vogel) ఈపరిశోధన సాగించినాడు. కాంతివిభాజకయంత్రము (Spectroscope) తో పులోమనక్షత్రపు కాంతిని పరిశోధించినాడు. తేజము గల చుక్కచుట్టు నల్లచుక్క పరిభ్రమించుటలో మనభూమి

నైపు వచ్చునపుడు (While approaching our Earth) కలిగించు చిత్రవర్ణము (Spectrum) యొక్క స్వభావమును, భూమినుండి దూరముగాపోవునపుడు (While receding from the Earth) కలిగించు చిత్రవర్ణముయొక్క స్వభావమును లెస్సగా గమనించినాడు. ఈయంశము సుబోధకమగుటకు ధ్వని శాస్త్రమునుండి యొకయుదాహరణము చూడదగును. ఒకడు శబ్దముచేయుచుగాని, పాడుచుగాని మనలను సమీపించుకొలది, ఆశబ్దము మనకు స్ఫుటముగాను, బిగ్గరగాను వినబడును. కాని దూరమగుకొలది స్వరము హీనమై అస్పష్టమగును. అట్లే నల్లచుక్క పరిభ్రమించుటలో, మనవైపు వచ్చునపుడును, పోవునపుడును కలిగించు తేజోభేదములను బట్టి మారుచుండు స్ఫుటత్వభేదముల నాధారముచేసుకొని, వోగెల్ పండితుడు ఆగోళపు గమనవేగములను నిర్ణయించెను. నల్లచుక్క మనవైపు వచ్చునపుడు క్షణమునకు ౨౮ మైళ్ల చొప్పునను, దూరముగా పోవునపుడు ౨౬ మైళ్ల చొప్పునను కదులుచున్నట్లు అతడు నిశ్చయించెను. సగటున క్షణమునకు ౨౭ మైళ్ల చొప్పున నల్లచుక్క తెల్లచుక్క చుట్టును పరిభ్రమించునట్లు నిర్ధారణచేసి, గణితపద్ధతులను బట్టి, కానరాకున్నను నల్లచుక్క పరిమాణాదులను గూడ నిర్ణయించెను. ఇట్లు కానరాని నల్లచుక్కలు బహువిశేషముగా గలవనియును, అవి యడ్డువచ్చుచుండుటచేతనే నక్షత్రములయందు తేజోభేదములు కలుగుచున్నవనియు శాస్త్రజ్ఞుల యభిప్రాయము. కాబట్టి సూర్యచంద్రులకేగాక ఆకాశముమీద కొన్నిచుక్కలకైనను గ్రహణములున్నవి. అట్టిచుక్కలలో పులోము డగ్రగణ్యుడు. పులోమునిలో నేనాడేవేళకు తేజోభేదములు గలుగునో ఆవివరములన్నియు మనగ్రహణవివరములవలెనే జ్యోతిషగ్రంథములలోను, పత్రికలలోను, ముందుగానే ప్రకటింపబడుచున్నవి. ఆవేళనుబట్టి మన గడియారములనుకూడ సరిగాదిద్దుకోవచ్చును. తప్పిన యెడల మనగడియారములు తప్పుకాలము చూపవచ్చును గాని, క్షణమైన వ్యత్యాసములేకుండ, పులోమునిలో తెల్లచుక్కకు నల్లచుక్కమూలముగా గ్రహణారంభవిమోచనములు కలుగుచుండును.

ఇట్లే ఒకొక్కచుక్కవలన మనము నేర్చుకోవలసినదెంతో గలదు.

---




## ఎవరిగోరీ వారే కట్టుగుంటారు

అనవిజాతులు అజ్ఞానజాతులలో ఉండే కొన్ని సల్లక్షణాలు మనకాశ్చర్యం కలిగిస్తాయి. ఉత్తరధ్రువము వద్ద ఎప్పుడూ మంచు పేరుకొనివుంటుందనీ, అచ్చట ఎస్కిమోలు అనే ఒకమోస్తరు మనుష్యులుంటారనీ, వారు మంచుయిండ్లలోనే నివసిస్తారనీ, వారికి కావలసిన జంతు ఆహారమైన సమృద్ధిగా దొరకక ఆరేసి నెలలు పస్తు పడుక్కుంటారనీ మనకందరకూ తెలుసును. మన లాటివాళ్లమైతే అక్కడకి వెళ్లడానికే భయపడతాము గాని తెల్ల వాళ్లు గుండెలుతీసిన సాహసము కలవారు కనుక యెక్కడకైనా వెళ్లగలరు. బోర్గుల్యాండు అనే నార్వేదేశస్థుడు అచ్చటికి వెళ్లడమే కాకుండా, అక్కడవుండే ఒక కన్యను చూసి మోహముపట్టలేక 'పెళ్లి కూడా' చేసుకున్నాడు. అక్కడి ఆచారాలను గురించి అతను బెట్రాము బార్కరు అనే పత్రికా విలేఖరికి కొంతవరకు చెప్పితే, బార్కరుగారు మనకందరికీ తెలియడానికి వానిని ప్రకటించారు.

అక్కడపుట్టినవారందరికీ చచ్చేదాకా తిండి చిక్కదు. 'ఇటెన్సివుకల్టివేషను' పెట్టిన మన ట్రాపికలుదేశాలలోనే జనసంఖ్య యెక్కువైపోతున్నాదని సంతాననిరోధమార్గా లుపదేశించి సాధనాలను అర్థశాస్త్రకులు సరఫర చేస్తూవుంటే అక్కడ ఆహారము చిక్కకపోవడము ఆశ్చర్యముకాదు. మనవాళ్లు అసలే పిల్లలను పుట్టించవద్దంటారు. బహుశా యీసాధనాలు దిగుమతి కాకపోవడముచేతను కాబోలు, వారు ముసలివారైనకిరువాత మరెందుకు బ్రతికివుండడమని బొందితో కైవల్యంలాగ బొందితోనే గోరీ ప్రవేశం చేస్తారు.

మనలోచావంటేభయం - చచ్చిపోతామేమోఅని ముసిలాళ్లు, చస్తారుకాబోలునని వాళ్లచుట్టాలు యేడ్చే యేడ్పులకు, వినియోగించే మందులకు, అద్యోఖర్చులకు అంతులేదు కాని అచ్చటివారికి బాల్యము యౌవనము ముదిమివలె మరణమునాలుగో అవస్థ. ఒక అవస్థలోనుంచి ఒక అవస్థలోకి పోతే విచార మెందుకు, పైగా సంతోషించవాలిఅని వారిఉద్దేశ్యము. బాల్యంలో బారసాల, యౌవనములో పెళ్లి, పెద్దతనంలో పిల్లలను గనడం— యేలాటి ముచ్చటలో ముదిమిలో గోరీలో దూరడం అల్లాటి ముచ్చటే. పెద్దవాళ్లు భూలోకపదార్థములకు ప్రాకులాడక మరణసన్నద్ధులై తమగోరీ తామే కట్టుగుంటారు. పిల్లలు సాయము చేస్తారు. మంచిముహూర్తము చూచి మనపిల్లలను మనము చదువులకు వుద్యోగములకు శృంగారించి ఆశీర్వదించి పంపించునట్లే వారుకూడా యేదోఒకరీతిని పెద్దవారి నందులో పెట్టి కొన్నాళ్లకు సరిపడు అహారపదార్థముల నందులో పెట్టి మూసేసి నవ్వుకుంటూ యిళ్లకు వచ్చేస్తారు. ముసిలాళ్లు కూడా అక్కడకు నవ్వుకుంటూనే పోతారు. పిల్లలు తల్లిదండ్రులకు చేయవలసిన కర్తవ్యములు, కర్మలు అన్నిటిలోను ఇట్లు పాతిపెట్టడ మనేది ఒక ప్రధాన కర్మ. ఇట్లు చేయకపోతే పితౄణము తీరదు.

అక్కడ వారికి వేరేరోగాలు రావడము, ఆస్పత్రిలో వేయడము, చావడము లేదు. భీష్ములవారిలాగున ఇచ్ఛామరణము. పెద్దవాళ్లయినతరువాత నెప్పుడు చావాలంటే అప్పుడే చావవచ్చు. మగవారికికాని ఆడవాళ్లకు కాని వైధవ్యబాధ, వియోగబాధ, పునర్వివాహ బాధ లేదు. ముసిలిదంపతు లిద్దరూ అయిదువతనం పెట్టుకొని నూతనగృహప్రవేశం చేసినట్లు ఏక ముహూర్తములో సమాధిలో ప్రవేశిస్తారు. ఉత్తరధ్రువానికి యిల్లరికం

వెళ్లిన బోగ్గులాండుగారు తన మామగారికీ, అత్తగారికీ అట్టీకర్మ ఆచరించినట్లు చెప్పి బార్కరుకు ఆతావును చూపించినాడు. తాను భార్యకూడా ముసలివారై నారు కనుక గోరీ సిద్ధము చేసుకున్నట్లు చెప్పినాడు. వారి పిల్లలు తమ కావిధముగానే అంత్యకర్మ చేస్తారు. నాగరకులు దీనిని మూర్ఖాచార మనవచ్చును, సదాచార మనవచ్చును. కాని, ఆమరణనిర్భీతిభావ మత్తమోత్తములకు గూడ అభ్యసనీయమనడానికి సందేహము లేదు!

—నారాయణ.

---

## శైపుయంత్ర చిత్రములు

నరిగొండ సత్యనారాయణ మూర్తిగారు

గూడూరు.



కీ. శే. ఎ. రంగస్వామి అయ్యంగారు

హిందూపత్రికా సంపాదకులు.

## హిందూ - జావానీయ సారస్వతము

ప్రాచీన హైందవ-జావానీయ సారస్వతముల సంబంధమును గూర్చి డా. ఆర్. సి. ముజుందారుగారు 'ఇండియన్ కల్చర్' అను పత్రికయందొక ప్రశస్తమయిన వ్యాసమును ప్రకటించిరి. ఈక్రిందగలది అందలి తునుక:

"ఇదివరకు వర్ణితము లయిన పద్య రచనములు 'కాకవిన్'శాఖకు చెందినవి. అవి యన్నియు ప్రాచీన జావానీయభాషయందు రచియింపబడినవి. వానియందలి విషయము చాలవరకు భారతీయ ఇతిహాస పురాణములనుండి కైకొనబడినది. పైన చెప్పబడినవికాక ఇతరములగు 'కాకవిన్'లు అనేకములు గలవు. వాని రచనాకాలము నెట్లును, రమారమిగనైన చెప్పజాలము. వానిలో గొన్నిటి సంగ్రహవివరణము నీక్రింద నొసగుచున్నాను:

౧. ఇంద్రవిజయము: వృత్రవిజయము; అల్పకాల మింద్రపదము నధిష్ఠించిన నహుషునివధము ఇందలి యితివృత్తము.

౨. పార్థయజ్ఞము: అర్జునుడు తపశ్చర్యచే శివుని మెప్పించి,అస్త్రాదులను పొందినకథ ఇందు వర్ణితమయినది.

౩. విఘ్నోత్సవము: దీనిని బౌద్ధుడొకడు రచియించెను. విఘ్నోత్సవుడను యక్షరాజు విక్రమక్రమము. ప్రధానముగ రాక్షసరాజగు సుప్రసేనునితో నాతనియుద్ధము ఇందు వర్ణితమయినది.

౪. వ్రతాశ్రయము: అదేవృత్తము. తరువాతి రచనము.

౫. హరిశ్రయము: లంకాధీశుడగు మాల్యవంతునిధాటి కోడి దేవతలు తొలుత శివుని, తరువాత విష్ణువును శరణుచొచ్చుట, విష్ణువు మాల్యవంతుని చంపి అమృతప్రభావమున యుద్ధనిహతులగు దేవతలను బ్రదికించుట ఇందలి కథ.

౬. హరివిజయము: మందరమునుగొని దేవతలు సముద్రమును మథించినగాథ యిందు వర్ణింపబడినది.

౭. కాలయవన(న) నాటకము: కంసుని చంపినందుకు కృష్ణునియెడగల పగను దీర్చుకొనుటకయి ద్వారకపయి దండెత్తి, పలాయితుడగు కృష్ణుని కాశ్రయమయిన ముచికుందునిచేత చివరకు భస్మీభూతుడయిన కాలయవనునియొక్క చరిత్రము విష్ణుపురాణము ననుసరించి వర్ణింపబడినది. తరువాత రైవతకపర్వతముపయి వృష్ణులు, అంధకులు ఉత్సవమును చేసికొనుచున్న కాలమున అర్జునుడు సుభద్రను అపహరించుకొనిపోయిన గాథయు వర్ణితమయినది.

౮. రామవిజయము: ఇందలి యితివృత్తము కార్తవీర్యార్జునుని పరశురాముడు జయించుట.

౯. రత్నవిజయము: తిలోత్తమ కారణముగ తలపెట్టబడిన సుందోపసుందుల యుద్ధ మిందు వర్ణింపబడినది.

౧౦. పార్థవిజయము: మహాభారతమునందలి యితివృత్తము ననుసరించి ఇరావన్నీలకుమారుల వనగాథ వర్ణితమయినది.

౧౧. పేరుతెలియని అసంపూర్ణగ్రంథ మింకొకటి యున్నది. అందుదయనకథ భిన్నవిధమున వర్ణితమయినది. పాండవవంశమున నుద్భవిల్లిన శతసేనునకు ఉదయనుడు,యోగంధరాయణుడు అనువా రిద్దరు కొడుకులు. వారిలో ఉదయనుడు అవంతిరాజపుత్రి యగు అంగారవతిని అపహరించుట-ఇది అందలి కథాశరీరము."



# ఆంధ్రాభ్యుదయము



శ్రీ నాగేశ్వరరావు

కాశీ విశ్వవిద్యాలయాంధ్రవిద్యార్థిసంఘ సమ్మానసందర్భమున.

పి. శేషగిరిరావు.



An Introduction to Indian Civics

క్రౌను, పుటలు ౩౧౦, అచ్చు, కాగితము, బైండు అందముగనున్నవి. వెల రూ. ౨-౦-౦

కర్త: కే. కృష్ణయ్యంగారు, బి.ఏ., ఉపన్యాసకులు: నేషనల్ హైస్కూలు, బెంగుళూరు.

ప్రకాశకులు: సత్యశోధన పబ్లిషింగ్ హౌస్, ఫోర్టు, బెంగుళూరుసిటి.

'సివిక్సు' తో పరిచయము కలిగించుపొత్తమని గ్రంథకర్త వాకొనినాడు. అతడనినట్లు తొలిపలుకు మాత్రమే ఇదియని తలపరాదు. విపులాంశములను కనులయెదుట బెట్టుచున్నను, సివిక్సులో సముచిత పరిజ్ఞాన మొసగు గ్రంథమిది. ఇంతవఱకు ఈవిషయమును గూర్చి ఇంగ్లీషులో తోచినపుస్తకములం దిది అగ్రస్థానము నందదగినదనుట అత్యుక్తి కాదు.

దేశకాలపరిస్థితులను గుఱించిన ఉదంతము ప్రజలందఱికిని విశదమైయుండవలెను. ప్రత్యేకవ్యక్తిజీవనమునకును, జాతిజీవనమునకును ఈపరిస్థితులతో సన్నిహిత సంబంధము కలదు. ఈసంబంధము నెఱుగనివారు చీకటియందు గ్రుంకులిడుదురు. అధునాతనయుగమున మనదేశమందు క్రొత్తక్రొత్తసమస్య లెన్నో తలసూపినవి. వీనిని పరిష్కరించుపట్ల ప్రతిమనుష్యుడును జరుపవలయు కర్తవ్యమెంతేని యున్నది. సముచితవిషయపరిజ్ఞానమువలనగాని ఈకర్తవ్యము నెరవేరజాలదు.

మతభాషాదిభేదము లెన్నోయున్నను, భారత హృదయమున నేకైకభావశైవలిని ప్రవహించుచున్నదని గ్రంథకర్త తెలిపినాడు. జూరిస్ ప్రూడెన్సు తెలుపు నిబంధనములనుబట్టి చూచినయెడల భారతసీమయందు జాతి (Nation)యనున దేమియు లేదని తెలుపు లాతివారి కిది చక్కనిజవాబు. ప్రపంచ మేధావులు ఈభావమును పలుమాఱు వ్యక్తీకరించి యుండిరి. "This unity transcends the innumerable diversities of blood, colour, language, dress, manners and sect" అని సుప్రసిద్ధ చరిత్రకారుడు Vincent Smith తెలిపినాడు. తన "Hindu view of life" లో రాధాకృష్ణుడు ఈభావమునే వ్యక్తీకరించినాడు Sir Francis Young husband తన "Dawn in India" లో ఈ యభిప్రాయమునే తెలిపినాడు. "There is an inner cohesion among the Hindus from the Himalaya to Cape Comorin. The Spirit of cultural unity has spread through a large part of the land and racial stocks of varying levels of culture have become steeped in a common atmosphere" (Vide: page 287) వీరి పలుకుల ప్రతిధ్వనినే గ్రంథకర్త రెండవ అధ్యాయమున వినిపింపగలుగుట ఆనందకరము. భారత ప్రాచీన మహత్త్వమును తెలుపుచు (నాల్గవ అధ్యాయము) సంయుక్త కుటుంబము, వర్ణాశ్రమ విధానము, గ్రామ సంఘములవలన గలిగిన మేళ్లను గ్రంథకర్త ఉగ్గడించినాడు. వీనికతన ప్రభుత్వమువారికి దుష్టశిక్షణ, శిష్టరక్షణములు చులకనలాయెనని తెలిపినాడు. నేటి

పరిస్థితులందీమేల్లు కుండేటికొమ్ము లాయెనని యతడు తెలిపియుండవలసినది. ౨౦౩ పేజీలు దాటనిచ్చి, వర్ణములనుగుఱించి తెలుపుచు వానియం దిపుడు తోచిన దొసగులను రెండుమాటలలో చెప్పినాడు. నేటిప్రభుత్వ విధానమునుగుఱించి తెలుపుటలో మోమోటము విడిచి, ఈత డుచ్చరించిన వాక్కులు గమనార్హములు! "భారతదేశముయొక్క ఆదాయములో ౫౫ కోట్ల రూకలు రక్షణమునకై వెచ్చపడుచున్నవి" (౬౬-వ పుట) "భారతదేశము తన కేపిటలును కోల్పోయినది; తన పరిశ్రమలను కోల్పడినది; ఋణపడినది; గభీరదారిద్ర్యములో మునిగియున్నది. అయినను అత్యంతవ్యయభూయిష్ఠమైన ప్రభుత్వమును పోషింపవలసివచ్చుచున్నది" (పుట ౨౩౭) ఆంగ్ల, అమెరికను, ఫ్రెంచి రాజ్యాంగ విధానములనుగుఱించి గ్రంథకర్త తెలిపిన తబిసీల్లు (Constitutional Law) చదువువారికి తొలిమెట్టు కాగలవు. ఆంగ్ల రాజ్యాంగ విధానమునకు ఆయువుపట్టయిన "Checks and balances" పద్ధతిని గ్రంథకర్త ఉల్లేఖించియుండిన బాగుగ నుండెడిది. భారత రాజ్యాంగములను కొంతవఱకు బట్టబయలుచేయగలిగినాడు. మైసూరు ప్రభుత్వమును గుఱించిన ఉదంతమును ఆరాష్ట్రవాసిగాన విపులీకరించినాడు. ఈపూనిక ప్రశంసనీయమైనది. సేవాధర్మమును భారతీయులకు క్రైస్తవమతము బోధించినదని అపోహపడువారికి మూడవ భాగములోని తొలి అధ్యాయము చక్కనిపాఠమును తెలుపుచున్నది. Jurisprudence పాఠకులకు జటిలమైయుండు Rights and Duties ప్రకరణమును అరటిపండొలిచినట్లు తెలిపినాడు గాని Rights లోని భేదములను (Rights in Rem and Rights in Personam) తెలుపుట అనావశ్యక మని యోజించినాడు. హక్కుల నెఱుగగోరువారు రీవ్యత్యాసమును తెలిసికొనుట మంచిది. డెమొక్రసీలో నేడుపొడసూపిన చిక్కులను నొక్కిచెప్పుతఱి, డిక్టేటరు షిప్పునరానురాను కేకెత్తు అరిష్టములను గ్రంథకర్త వివరింపవలసియుండెడిది. భారతదేశమున నుదయించిన నూతనభావోద్యమమును విమర్శించుతఱి, భారత మహాపురుషులను పెక్కండ్రను గ్రంథకర్త చదువరుల కనుల యెదుట బెట్టినాడు. ఈసందర్భమున నాతడు తెలిపినఅంశములు మిగుల హృదయంగమములు. పురపాలక, స్థానికసంఘములనుగుఱించియు, సర్వతోముఖమైన ప్రజాపునరుద్ధరణమును గుఱించియు, నలసపోయిన భారతీయులను గుఱించియు, రాజ్యాంగస్వత్వములకై వివిధజాతులవారు ప్రవర్తించు పెనగులాటను గుఱించియు గ్రంథకర్త తెలిపిన భావములు క్రొత్తలు కాకున్నను, ఇవి ఆచరింపబడనంతదనుక వీనిని గుఱించిన పునరుక్తిదోష ముండదు. భారత అర్థశాస్త్రాంశములను గ్రంథకర్త చవిచూపగలుగుట సంతోషకరము. నాలుగవభాగములోని నాలవఅధ్యాయము అమూల్యమైనది. సంఘజీవనమున దోచిన దురాచారములను దెలిపి, భారతభావిభాగ్యమంతయు యువకులశ్రమపై ఆధారపడియున్నదను శ్రీసూక్తమును వినిపించినాడు గాని, నేటియువకులదుర్గతిని గుఱించిగాని, అది మాపుటకు ప్రభుత్వమువారును, దేశనాయకులును నిర్వహింపవలయు కర్తవ్యమునుగుఱించిగాని గ్రంథకర్త ఏమియు దెలుపలేక పోయినాడు.

ప్రస్తుతభారతవాతావరణమున నిట్టి పుస్తకములెన్నెని అక్కరైయున్నవి. ఇట్టివి మాతృభాషలో గోచరింపవలెను. భగవద్గీతను పంచిపెట్టుటకున్న, కోట్లకొలది ఇట్టిపుస్తకములను భారతదేశమున పల్లెలందు మహనీయులు పంచిపెట్టవలెను. గీతగోవిందములతో కాలక్షేపము చేసి, దుర్విధిని దూరుటకంటె అరిష్టనివారకమైన పరిజ్ఞానమందుట శ్రేయమని గ్రహించి, బహుళసంఖ్యాకులైన గ్రామప్రజలిట్టిపుస్తకములను పఠింతురుగాక. లక్ష్మీప్రసన్నులైన ప్రచురణకర్తలు డిటెక్టివుబుక్కుల పిచ్చినుండియు, రైల్వేబుక్కుల వెఱ్ఱినుండియు మరలి ప్రజలకు పనికివచ్చు నిట్టిగ్రంథములను ప్రచురించి దేశముపట్ల దమకుగల ఋణమును దీర్చుకొందురా? ఇకనైనను తమధర్మమును తాము గుర్తింతురా?

—జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి

## వ్యాసావళి

కర్త: ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రి, ఉభయభాషాప్రవీణ, తెలుగుపండితుడు, రామచంద్రపురం, తూర్పుగోదావరిజిల్లా. వెల రు. ౦-౪-౦

ఈ 'వ్యాసావళి' లో ౧. సీతమ్మశోకము, పాపరాజు, ౨. గురజాడవాల్మీకి, ౩. రెండునక్షత్రాలు, ౪. 'శబరీ' సమాలోకనం, ౪. 'వకుళమాలా' పరిశీలనం. అనే విమర్శవ్యాసాలున్నవి. వీటిలో ౧, ౫ 'భారతి' లో, ౩ 'కృష్ణాపత్రిక' లో ప్రకటితము లయినవి. ౨, ౪ అప్రకటితములు.

మొదటిది పాత్రౌచిత్యపరిశీలనం. రెండోది గురజాడ అప్పారాయకవిత్వపరిశీలనం. మూడోది కవి (కాళిదాసభవభూతుల) సామర్థ్యపరిశీలనం. నాలుగోది, అయిదోది గ్రంథవిమర్శలు—'శబరి' ప్రదర్శనయోగ్యం కాదనడమూ, 'వకుళమాల' కుల్లును వెళ్లబెట్టడమూ.

మొదటినాలుగూ సార్వకాలికప్రయోజనంకలవి. చివరది తాత్కాలికప్రయోజనం కలది. అది పత్రికలో ప్రకటితం కావడంతో దానిప్రయోజనం తీరిపోయింది. 'వకుళమాల' వాడి, ఎండి, పొడి అయి గాలిలో కలిసిపోయింది. దానిని చేర్చడంవల్ల 'వ్యాసావళి' గౌరవం తగ్గింది. అంతేకాదు, పాఠకుడికి పనిచేటుకూడా.

విమర్శ అభినవమార్గంలో మెలకువ మీరి నడచింది. విమర్శకు కావలసినపాండిత్యమూ, సమీక్షా, సహృదయతా వీనిలో కనుపడుతున్నవి. 'పిండితాంశం' 'ఖచ్చితంగా' చెప్పబడింది.

ఆంధ్రసారస్వతం అభివృద్ధికావాలంటే ఇలాటి విమర్శలు పరంపరలుగా బయలుదేరవలెను. నేటి విమర్శకులలో హనుమచ్ఛాస్త్రిగారికి వీటివల్ల మంచి పద్దుపడింది. దాన్ని గట్టిగా నిలుపుకోగలసామర్థ్యంకూడా వారికున్నదని వారి యీవిమర్శలు చెప్పుతూఉన్నవి. ఆ సామర్థ్యాన్ని సార్థకంచేసుకుంటే ఆంధ్రసారస్వతం ఒక్కమెట్టయినా ఎక్కడానికి వీలవుతుంది.

---

## సింహావలోకన కందశతకము

కర్త: చక్రాలనరసింహకవి, నుస్తి. భగవంతుని నుతించు నూట తొమ్మిది కందపద్యము లిందున్నవి. శతకసామాన్యమగు మకుట మిందులేదు. ఒక అణా తపాలుబిళ్లను పంపినవారికి పుస్తకము పంపబడును.

---

## శ్రీ వేంకటరమణకృతులు

కర్త: కృతి పదప్రవీణ, పలుకూరి వేంకటరమణయ్య, టీచరు, మహారాజకళాశాల, విజయనగరము.

ఇందు వేంకటేశాంకితములగు కృతులు ౩౮ గలవు. అవి భక్తిభరితములు.

---

## దీనిపేరేమిటి?

### నవ్వులతీవ, మూడోపువ్వు

కర్త: కాంచనపల్లి వేంకటరంగారావు. "ఈ చిన్నపొత్తము పిన్నవయస్కులకై నిర్దేశింపబడినది" ఇది గ్రంథకర్తమాట. "ఈయన (గ్రంథకర్త)రచనలో నొప్పి కలిగించని హాస్యముతోపాటు శ్రీచింతాదీక్షితులుగారికథలలో ప్రత్యేకముగా గోచరించుబాలుర మానసతత్త్వపరిశీలనముకూడ గలదు." అనునవి పరిచయకర్త వేదులకృష్ణమూర్తి (ఉభయభాషాప్రవీణ) గారిమాటలు. 'దీనిభావ మేమి తిరుమలేశ!' అనవలసిఉన్నది. ఇందులో పిన్నవస్కులవి మదికట్టె మాటలు. ఈ చిన్నపుస్తకము వెల ఒక అణా.

---

## చెన్నకేశవశతకము

కర్త: గరిమెళ్లకృష్ణమూర్తి. ఇందు నూటరెండు వృత్తము లున్నవి. 'చెన్నకేశవా!' అనునదిమకుటము,

నోడింపబడి, మృతుడై యుండును. ఆకారణమున, పృథ్వీమూలుడు, ఇంద్రభట్టారకుని ప్రతిపక్షులను గలసి పగసాధించుకొనెను. ఆతనిశాసనము ఇంద్రభట్టారకుడు హతముగావింపబడిన తరువాతనే యాజ్ఞాపింపబడినట్లు కూడ స్పష్టముగా దెలియుచున్నది. అది పృథ్వీమూలుని విజయరాజ్యవర్షములు ౨౫-వ యేట వైశాఖమాసమున తృతీయదివసమున నొసగబడెను.[౧] పృథివీమూలుడు దానమిచ్చిన గ్రామము తాళుపాకవిషయములో విశెండి, రెంగుంట, కంపాఱు, తుకుర అను నాలుగు గ్రామముల నడుమనున్న చూయిపాక. దానిని ౪౩ అథర్వణశాఖీయులగు బ్రాహ్మణులకు అగ్రహారముగా ధారవోసెను. ఈదానమును తనకు అధిపతియైన యింద్రాధిరాజుచే నాజ్ఞాపింపబడి, యాతని తల్లిదండ్రుల పుణ్యావాప్తికొఱకు చేసెను. ఇంద్రాధిరాజు మణుల్కుడి వాస్తవ్యుడు; మితవర్మకు ప్రియతనయుడు; ఇంద్రభట్టారక సముత్పాటనాభిలాషుడు; ద్విజాత్యన్వయపయోధి సంభూతుడు; చతుర్దంత సంగ్రామ విజయుడు. ఇట్టివాని నాశ్రయించుకొని, పోయిన రాజ్యమును పృథివీమూలుడు మరల సంపాదించుకొనెను. అందువలననే తనకు "పరానుగ్రహ మాత్ర ప్రయోజన ప్రతిపన్నైశ్వర్యగురుభారః" యని యొక విశేషణమును తనశాసనమందు చేర్చుకొనెను.[౨] పృథివీమూలుని వంశము పేరెచ్చటను దెలుపబడలేదు. మరియు నాతనిరాజ్య మెచ్చటనుండెనో యింతవఱ కెవ్వరును నిర్ణయింపలేదు. దత్తగ్రామము తాళుపాక విషయములోనిది. తాళుపాక తాటిపాక గావచ్చును. తాటిపాక తూర్పుగోదావరిజిల్లా రాజవోలుతాలుకాలో నున్నది. పూర్వ మీతాళుపాక ఈప్రాంతమునకు ముఖ్యపట్టణమని తెలియుచున్నది. శాసనముగూడ తూర్పుగోదావరిజిల్లా యందే దొరకెను. కావున పృథివీమూలునిరాజ్యము తూర్పుగోదావరిజిల్లాభాగమని నిర్ణయింపవచ్చును. ఆతనివాసకము కాందాళియని తెలుపబడినది. దీనిని నిరూపించుట దుస్సాధ్యము. కాందాళి కందారమును తలపునకు దెచ్చుచున్నది. ఏకశిలానగర వృత్తాంతము, సిద్ధేశ్వరచరిత్రము మొదలగునవి యొక్కకందారము, లేక కాందారమును ఉదాహరించుచున్నవి.[3] ఈ నగరము తొలుత మాధవవర్మజనకుడైన సోమదేవరాజునకు ముఖ్యపట్టణమై యుండెను. సోమదేవుని రాజ్యము అనుమకొండసీమ (అనగా నిప్పటి ఓరుగల్లు సుబా) యందు వ్యాపించి గోదావరి నంటియుండెను. కొంతకాలమయినతరువాత సోమదేవరాజు కటకాధీశుడైన బల్లహునిచే నోటువడి హతుడై కాందారమును గోల్పోయెను. సోమదేవరాజుపై బల్లహునకు దీర్ఘక్రోధముండినందున కాందారమున కోటలుత్రవ్వి, కవాటములు విరిచి మేడలుగూల్చి అంతఃపురమును నేలమట్టము గావించెను. పిమ్మట కొంతకాలమునకు కాందారము పునరుద్ధారణము నొందెను; గాని మాధవవర్మ యచ్చట పట్టాభిషేకము చేసుకొనలేదు. అది శత్రుహస్తగత మయిపోయెను. కావున నీకాందారము గోదావరిచెంత నెచ్చటనో యుండియుండవచ్చును. కాందారము, విజయ-కాందాళియై యుండవచ్చునా ?[౪] కాందాళి రాజధాని యని తెలుపబడలేదు. కేవలము వాసకమనియే తెలుపబడెను. కావున పృథివీమూలుని రాజ్యము గోదావరిచెంతను అంటియుండెనని తోచును.

ఇంకొకయూహ కాందాళినిగురించి పొడముచున్నది. కాందాళియనునది రాజమహేంద్రవరమునకు తొలిపేరయియుండవచ్చునా యని సంశయము కలుగుచున్నది. రాజమహేంద్రవరమను పేరు తన్నగరస్థాతయైన రాజమహేంద్రాపరనామకునివలన గలిగెను. కావున

---

౧. J. B B. R. A. S. Vol-XVI p. 114.

౨. J. B. B. R. A. S. Vol. XVI p. 144. శాసనములోని ౮-౯ పంక్తులు.

3. ఆంధ్రులచరిత్ర; రెండవభాగము, పుటలు ౧౩౫-౧౩౮.

౪. కాందాళి అను పేరు నేటిమాధ్వులలో శ్రీవైష్ణవులలో కొందరికిగల "కందాళం" అను ఇంటిపేరును తలపునకు దెచ్చుచున్నది. ఈకాందాళము నుండి వలసబోయిన బ్రాహ్మణులు కందాళంవారు అయియుండవచ్చును.

నంతకుబూర్వము నా మహాగ్రామమునకు 'కాండాళి' యనిపే రుండుటలో అసమంజస మేమియు తోచకున్నది.

ఈయూహయే సరియైనదైనచో నేటి తూర్పు గోదావరిజిల్లాయంతయును, గోదావరి కనువనున్న మలయప్రాంతమును, అనగా బస్తరురాజ్యమునకు దక్షిణముగానున్న సీమయును అటు వరంగలుసుబాలో జేరిన మంత్రకూటము, లేక మంథెనప్రాంతమును గలసిన దేశమంతయును పృథ్వీమూలుని రాజ్యముగానుండినట్లు నిశ్చయింపవచ్చును.

ఇంద్రభట్టారకుని శత్రుకోటిలో జేరినవారిలో పిష్ఠపుర, దేవపురములు రాజధానులుగా, పిష్ఠపురము మొదలుకొని యుత్తరమును పడకిరాష్ట్రమువఱకు గల దేశము నేలిన వసిష్ఠకులజు లుండవచ్చును. చదువరి మున్నొకసారి హెచ్చరించబడిన విషయము జ్ఞప్తియుంచుకొని నేటిబ్రిటిషు రాజ్యాంగవిధానము ననుసరించియున్న దేశవిభాగములను మరచిపోవలయును. ఈ వాసిష్ఠకులమునకు దేవరాష్ట్రము జన్మభూమి; దక్షిణపురాజధాని పిష్ఠపురము; ఉత్తరమున రాజధాని దేవపురము. ఇది ఎక్కడనున్నదో యింకను తెలియవచ్చుటలేదు. దేవరాష్ట్రము ఎలమంచి కలింగములోనిది.[1] నేటివిశాఖపట్టణమండలములో నడిమిభాగమునకు పూర్వము దేవరాష్ట్రమని పేరు. ఇందు జయపురసంస్థానముగూడ చేరియుండెను.[2] దేవరాష్ట్రమునకు పడమటిదిక్కున బస్తరురాజ్యముసీమ. వసిష్ఠకులజులు ప్రబలిననాడు వారి రాజ్యము పిష్ఠపురము వఱకును, ఉత్తరమున నాగావలీనదీ పర్యంతమును వ్యాపించెను. ఇంతవరకు వీరిశాసనములు రెండుమాత్రమే లభించెను. అవి రెండును అనంతవర్మ మహారాజుచే నొసంగబడినవి. వాటిని "అనంతవర్మ సిరిపురముశాసన"మని తెలుగున భారతియందును, అనంతవర్మకిందొప్పశాసనమని యింగ్లీషున ఆంధ్రేతిహాస పరిశోధక మండలివారి పత్రికయందును మండ నరసింహముగారు ప్రకటించిరి.[3] సిరిపురముశాసనము "మహాశ్వయుజ సంవత్సరమున మాఘపౌర్ణమాసి" యందు చేయబడినది మహాశ్వయుజ సంవత్సరమను పేరు గురూదయాబ్ద సంప్రదాయము ననుసరించి యీయబడినది. ఈశాసనలిపి ఇంద్రభట్టారకుని రామతీర్థముశాసనలిపిని ఇంచుమించుగా బోలియున్నది. కావున నీమహాశ్వయుజ పౌర్ణమాస్యకై మనము ఆరవశతాబ్దమునందే వెదకుకొనవలయును. ఈరెండు శాసనములం దీక్రింది విధముగ వంశవృక్షము మూడుతరములుమాత్ర మీయబడియున్నది:

వాసిష్ఠకులము

*

౧. శ్రీమహారాజగుణవర్మ

|

౨. శ్రీమాన్ మహారాజప్రభంజనవర్మ

|

౩. శ్రీమహారాజ అనంతవర్మ

దానపతిఅనంతవర్మ'కళింగాధిపతి'యని చెలువుకొన్నాడు. ఇతడు సిరిపురముశాసనమును దేవపురమునుండియు, కిందొప్ప శాసనమును పిష్ఠపురాధిష్ఠానమునుండి విజయరాజవర్ష'ములు ౧౩ అనునేట ఉత్తరా

---

౧. C. P. No. 14 of 1908-09; text lines. 27,39.

౨. శిరిపురము, కిందొప్పశాసనములం దీయబడిన దత్తగ్రామములు, వాటి సీమగ్రామములు ఈ యూహకు ప్రమాణములు.

౩. మొదటిది: భారతి ప్రజోత్పత్తి-సం. భాద్రపదము (సం. ౫. సం. ౬ పుటలు.) ౭౫౧-౭౫౮; రెండవది J. A. H. R. S. Vol. VIII. p. 153-160.

ఈ రెంటినిగూడ మండ నరసింహంగారు తృప్తికరమైన సంపాదకీయ వ్యాసముతో ప్రకటింపలేకపోయిరి. ఇటువంటి మిక్కిలి ముఖ్యమయిన శాసనములు ప్రకటించుటకు గావలసిన పాండిత్యముకంటె నుబలాటము చారిత్రకప్రియుల కుండకూడదు. ఈశాసనముల కాలనిర్ణయమును నరసింహంగారు చేయజాలకపోయిరి. తప్పుచరిత్రలను చుట్టబెట్టి వ్రాసిరి. ఇది మిక్కిలి సంతాపకరమైన విషయము.

# మనవిమాటలు

### దేశభాషాబోధకులు - విద్యాలయములు

మనదేశమున విద్యాలయములయందు దేశభాషాబోధకులకు ఇతరబోధకులకు గల గౌరవముకాని, పలుకుబడికాని లేదు. విద్యార్థులు సయితము వారిని లెక్కపెట్టకుందురు. దీనికి కారణములు రెండు: పాఠశాలలయందు దేశభాషలకు ప్రాధాన్యము లేమి; దేశభాషాబోధకులకు తదితర బోధకులకుండు వేతనము లేమి.

ఇతరదేశముల విద్యాలయములయందు దేశభాష ప్రధానము; విదేశభాష లప్రధానములు. మనదేశమున విదేశభాష ప్రధానము; దేశభాష లప్రధానములు. వానిని చదువవలెనను నిర్బంధమున్నను ఆచరణముతీరు వేరుగనున్నది. కావుననే విద్యార్థులకు దేశభాషలయెడ ననాదరమును, వానిని బోధించువారియెడ తిరస్కారభావమును. విద్యాలయముల విద్య నభ్యసించిన వారిలో నూటతొంబదియైదుగురకు దేశభాషాజ్ఞానము శూన్యమను విషయ మందరకు దెలిసినదియె.

విద్యాలయములయందు స్కూలుఫైనలు తరగతివరకు విదేశదేశభాషలతోపాటు శాస్త్రాదివిషయము లనేకములు నిర్బంధముగ బోధింపబడుచున్నవి. విద్యార్థులకు వానియం దభిరుచి యున్నను లేకున్నను, జ్ఞానము—తుదకు పరిచయమయినను—కలిగినను కలుగకున్నను, తరువాతి జీవితమున వానిలో పెక్కింటివలన నింతయయిన నుపయోగమున్నను లేకున్నను తద్బోధనము నియతమగుటవలన నన్నియును సమప్రధానములగుచున్నవి. తద్బోధకులు నాయావిషయముల పండితు లయియుండవలెను. పండితశబ్దము జాతిసామాన్యవాచకము. కాని వెనుకటిదినములలో దేశభాషాబోధకులపాండిత్య మపరిమితము; కొలతకందనిది. ఇతరవిదేశభాషాశాస్త్రబోధకులపాండిత్యము పరిమితము; కొలిచిపెట్టినది. ఒక్కొకవిద్యాలయమునను విదేశభాషాబోధకులు పెక్కురుండుటవలన వారికి బోధనప్రయాసము తక్కువ. దేశభాషాబోధకులు తక్కువగ నుండుటవలన—పెక్కువిద్యాలయముల నయిదారు తరగతులకు నొక్కడే బోధకుడుగ నుండును—బోధనకాలము, ప్రయాసము ఎక్కువగు చున్నది. ఇట్లు పాండిత్యము, ప్రయాసము దేశభాషాబోధకుల కధికమయ్యును, వేతనముమాత్రము తదితర బోధకుల వేతనముకంటె మిక్కిలి తక్కువగ నున్నది. దీనివలన దేశభాషాబోధకులకును, దేశభాషలకును తీరని హాని కలిగినది.

'దేశభాషాబోధకుల పాండిత్యమునకు కొలత లేదు. తదార్జనమునకు వ్యయప్రయాసములు తక్కువ. కాన ఇతరబోధ



'విక్టోరియా మెమోరియల్' భవనము - కలకత్తా R. N. N. R.



సఫ్దర్ జంగ్ గోరి - ఢిల్లి

సఫ్దర్ జంగు కొడుకు, షూజా - ఉద్ - దౌలా దీనిని క్రీ. శ. ౧౭౫౩ లో కట్టించినాడు. సఫ్దర్ జంగు అనునది అహమద్‌షా మంత్రిగనుండెను [illegible] R. N. N. R.



బ్రాహ్మణగుహ : బాదామి - బీజపూరుజిల్లా, బొంబాయిరాష్ట్రము
ఇందు క్రీ. శ. ౫౭౮ సం. నాటి శాసన మున్నది.                D. A R.



బాణశంకరి దేవాలయము - తటాకము

బాదామి కారుమైళ్ల దూరమున నున్న పరేశగడమున నున్నది. ఏటా, జనవరి నెలలో ఇక్కడ పెద్ద ఉత్సవము జరుగును. యాత్రికులు పలువు రపు డిక్కడకు వత్తురు.                D. A. R.

కులతో వీరికి సామ్యము లేదు. వీరికి స్వల్ప వేతనమే చాలును' అనునది ఒకపక్షము. ఇది ప్రాచ్యవిద్యాపరీక్షలపుట్టుకకుపూర్వము మాట. అవి యిప్పటికి రెండుపదులయేండ్ల నుండి అమలునకు వచ్చి దేశభాషాపాండిత్య మును కొలిచి పెట్టుచున్నవి. నికరమయినను కాకున్నను వారిపాండిత్యము కొలతపెట్టబడి నది కావున ఇతరబోధకులతో వారికి సామ్యము కుదిరినది. కాని వేతనమునమాత్ర ము సామ్య మింకను కనుపడునంత లేకున్న ది. విద్యాలయములయందు దేశభాషలకు ప్రాధాన్యము, తద్బోధకులకు తదితరబోధ కులతో నన్నిటను సమానమగు ప్రతిపత్తియు లేనంతవరకు దేశభాషల కభివృద్ధి గగన కుసుమము.

తమ యీస్థితిని విద్యాలయాధికారుల కు తెలుపుకొని దానిని చక్కపెట్టుకొను కోరి కతో దేశభాషాబోధకులు ఏడేండ్లనాడు రాజమహేంద్రవరపురమున 'ఉపాధ్యాయపం డితపరిషత్తు' అను పేర నొక పరిషత్తును నెల కొలిపిరి. అదిమొదలుకొని ఏటేట మహాసభల ను జరుపుచు తమకోరికల నధికారులకు తెలు పుకొనుచు నున్నారు.విద్యాలయములయందు దేశభాషల కెక్కుడు ప్రాముఖ్యము, తమ కితరబోధకులకు గల సౌకర్యములు, వేత నము నుండవలయునని వారు ముఖ్యముగ కోరుచున్నారు. వారి యీ పునః పునర్ని వే దనము లరణ్యరోదనప్రాయము లగుచున్నవి.

ఏదో యొకప్పుడు (౧౯౩౮-వ సంవత్స రపురాయబారము) చేసిన ప్రయత్నమున నొకమూల నొకకొందర కొకింత లాభించినను అది చెప్పుకొనదగినంతదిగ కనుపించదు. ఈవిషయమునుగూర్చి పర్యాలోచింపబడునని ప్రభుత్వమును తరుచు గట్టిగా చెప్పుటయు కలదు కాని యింకను చేసినది మృగ్యము.

మొనమొన్న నీపరిషత్తు ఆంధ్రవిశ్వ కళాపరిష దాంధ్రోపన్యాసకులు శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారి పెత్తన మున ప్రభుత్వముకడ కొక రాయబార మంపినది. దేశభాషాబోధకుల కన్నితరగతుల విద్యాలయములయందు సహాయాంగ్లబోధ కుల వేతనముతో సమమగు వేతనము; పాఠ్య గ్రంథనిర్ణయసంఘముననను, సలహా సంఘము నను నెక్కుడు ప్రాముఖ్యము; సంస్కృతము నను, దేశభాషలయందును స్కూలుఫైనలు, ట్రెయినింగు పరీక్షలకు ప్రశ్నపత్రముల నిచ్చు నధికారము పరిషత్తుకోరికలలో ప్రధానము లు.మరికొన్ని సామాన్యసౌకర్యములును కోర బడెను. అవియన్నియు కోరదగినవి; కోర వలసినవి; నెరవేరవలసినవియు. ఇది న్యాయ్యము.

ఇటీవల దేశభాషలద్వారమున శాస్త్రా దులబోధన మంగీకరింపబడినది. కొన్నివిద్యా లయములయం దాపద్ధతి మొదలుపెట్టబడి నదికూడ. తదనుకూలవాఙ్మయసంసృష్టియు సాగుచున్నది. ఇదియంతయు దేశభాషాభ్యుద

యారంభమును సూచించుచున్నది. దేశభాషాబోధకుల ఆయతిని, గౌరవమును వారు కోరినతీరున పెంపొందజేసిననేకాని యీ యారంభము ఫలప్రదము కాజాలదు. కావున నీపరిపన్నివేదనము ననుసరించి ప్రభుత్వమును, విశ్వవిద్యాలయములును, దేశభాషాబోధకులకోరికలను సత్వరముగ దీర్చి దేశభాషాభివృద్ధి నొనరించి దేశీయుల మన్ననలకు పాత్రములు కావలయును.

---



కొబ్బరితోట K. R. R.

Printed and Published by K. Nageswara Rao, at the Andhra Patrika Press, No.7, ThambuChetty St., Madras.
Editor: G. Subbaramayya.



పెచాబురి నగరము – సయాము

నగరమునడుమ ప్రవహించు పెచాబురినది కాలువయగు సపాంగ్‌చాంగ్ వంతెననుండి.



ఖోవాంగ్-గుట్ట

పచాబురి నగరమువద్ద–సయాము.

B. S.



# సాభిప్రాయ విశేషములు



విశ్వమంతయును నేకముఖమునను పరిణామమును పొందుచున్నను భిన్నత్వమాత్మపరిణామమున కారాధ్యముగ నున్నది. ఏకత్వము దేశకాలపాత్రావరణములం దనేకభావనామరూపపరిణామమున సంరంభమునకు మూలమైనను నానందసాధనముగ నున్నది. ప్రవృత్తియందు భిన్నత్వమునందు గల వ్యామోహా మేకత్వమునందును, సంరంభమునందు విశ్వాసము శాంతియందును గలుగకున్నది. డార్వీను ధర్మములందుగల విశ్వాసాభిమానములు బౌద్ధధర్మములందు గలుగకున్నవి. విషయారాధనమునందును, సగుణారాధనమునందు గల యోగము భావారాధనమునందును నిర్గుణారాధనమునందును దుర్లభముగ నున్నది. కామారాధనము జీవయాత్రకు పరమార్థముగ నున్నది. నానాజాతి సమితి వ్యవహారములందును, సామ్రాజ్యవ్యవహారములందును, సామాన్య రాజ్యాంగములందును, మత మీమాంసలందును సాంఘిక వ్యవహారములందును, సాహిత్యకళారాధనములందును, ఆర్థికవిషయములందును, కామారాధనమునందును భౌతికధర్మమునకు గల ప్రపత్తి ఆత్మధర్మమునకు గలుగకున్నది. వ్యక్తులకు, సంఘములకు, జాతులకును ఆత్మోద్ధరణమునకు పరాక్రమణమునందును పరపీడనమునందును గల విశ్వాసాభిమానములాత్మత్యాగమునందును ఆత్మోపలబ్ధియందును గలుగకున్నవి. విషయాసక్తమైన ప్రవృత్తిమార్గమునందు ఆత్మాసక్తమైన నివృత్తిమార్గమును సాధ్యముచేయుటకు మహత్తరమైన సాధన మవసరమగుచున్నది. మహాసంగ్రామానంతరము ప్రపంచశాంతికి స్థాపితమైన నానాజాతిసమితియును నివృత్తిమార్గము నుద్ధరించుటకు సాధనముగ నేర్పడిన విధమునకు గాంధిమహాత్ము డుపక్రమించిన సత్యాగ్రహప్రస్థానమును నివృత్తిమార్గమును స్థాపించుటకు సాధనముగ నున్నది.

* * *

నానాజాతిసమితి

గతమాసమునందు జినీవా యందు గూడిన నానాజాతిసమితి వ్యవహారము లీపరమార్థమునకు వ్యాఖ్యానములుగ నున్నవి. సమితిసమావేశమునందు గూడిన రాజ్యములన్నియును శాంతి స్వస్తి వాచకములను

జెప్పుచు సంరంభ కర్మల నావరించుచున్నవి. సకలజాతులును శాంతిసాధనమైన నివృత్తి మార్గమునకు బదులు ప్రచండమైన ప్రవృత్తి మార్గము నారాధించుచు మహా ప్రళయ మార్గము నవలంబించుచున్న విధమును వివిధ జాతుల వ్యవహారములును, నానాజాతి సమితి వ్యవహారములును విస్పష్టము చేయుచున్నవి. ప్రధానరాజ్యములైన గ్రేటుబ్రిటను, ఫ్రాన్సు రాజ్యములు సంగ్రామసన్నాహముల కసార మైన వ్యయమును జేయుచున్న విధమును వారి వ్యయపత్రములు వెల్లడిచేయుచున్నవి. గ్రేటుబ్రిటనునందలి ఆయుధాగారాధిపతులు అమెరికావర్తకుల ద్వారా సంగ్రామ సామ గ్రిని, శత్రుమిత్ర భేదములు లేకుండను విక్ర యించుచు సంగ్రామ దావానలమును వ్యా పింపజేయుచున్న విధమును గుప్తపరిశోధనలు విశదము చేయుచున్నవి. ఒకవైపున జపాను నకును, రెండవవైపున చీనాకును యూరపు వర్తకులు మారణసామగ్రిని విక్రయించుచు పత్రికలందును, నానాజాతిసమితిసమావేశము లందును శాంతిప్రకటనలను జేయుట యూర పురాజ్యములను ప్రపంచము నావరించిన యుధర్మప్రవృత్తికి ప్రమాణముగ నున్నది. యూరపురాజ్యము లనవరతము చేయుచున్న సమరారాధనము సమరఫలమును సమకూ ర్చునటులు శాంతిసస్యములను సమకూర్ప జాలదు. నాజీ విజయములు కెయిజరు ప్రగ ల్భములవలెను సంగ్రామానల ప్రారంభము నకు అగ్నిహోత్రమును పూర్వము వలెనే సమకూర్చుట సంభవము. ముస్సోలినీగారు సంగ్రామధ్వజారోహణమును జేయుటకు సం సిద్ధులై యున్నటులు నిత్యమును ఘోషించు చున్నారు. ఆస్ట్రియాదేశముపూర్వమువలెనే సంగ్రామక్షేత్రముగను పరిణమించుట సంభ వము. వివిధ రాజ్యములును రహస్యసంధులను జేసికొనుచు పూర్వమువలెనే సంగ్రామపక్ష ములుగ నేర్పడుచున్నవి. ప్రపంచ మంత యును సంగ్రామోన్మాదభరితమై సంగ్రామ ధ్వనులతో ప్రతిధ్వనిల్లుచున్నను సంగ్రామా రంభమున కన్ని జాతులును భయపడు చున్నవి. నానాజాతిసమితి యవలంబించు చున్నధర్మము, శ్వేతజాతులదండనీతిధర్మము కాని మానవుల స్వాతంత్ర్య ధర్మనీతి కాదు. శ్వేతరాజ్యములు పరాక్రమణ మూలమునను ప్రపంచమునందు గలుగజేసిన మహాసంక్షో భమును శాంతింపజేయవలసినభారము శ్వేత రాజ్యములమీద నేయున్న విధమును ప్రపంచ వ్యవహారములు వెల్లడిచేయుచున్నను శ్వేత జాతులందు హృదయపరివర్తనము దుర్లభ ముగ నున్నది. శ్వేతేతరజాతులు నిరంతర దాస్యమే శ్వేతజాతులకు తరణోపాయ మని శ్వేతజాతులనాయకులు ఘోషించు చున్నా రు. ఆసియాఖండవాసుల యభ్యుదయము శ్వేత జాతుల యోగక్షేమములకు ప్రతిబంధకమని నాయకు లందరును చేయుచున్న ఘోష యన్యాయ మైనను శ్వేత ప్రజామోదమును బడయుచున్నది. శ్వేతేతరజాతుల నిర్బంధ విషయములందు చర్చిలు, రామ్సే మాక్డొ.

నాల్డు, బాల్డువినుగార్ల కుముసోలినీ, హిట్లరులు వెనుదీయరు. ఆఫ్రికా, జపాను, చీనా, హిందూ స్తానముల యభ్యుదయముపట్లను యూరపు రాజ్యములు చూపుచున్న ప్రతిఘటనము సుందోపసుందోపాఖ్యానముగను పరిణమిం చుట ప్రకృతిధర్మము. గ్రేటుబ్రిటనునందు కన్సర్వేటివు పక్షము, నిరర్థకమైన శ్వేత ఛత్రము పట్లను సయితము చేయుచున్న హడావడి, ప్రపంచశాంతికిని యోగక్షేమ ములకును శ్వేతజాతులవలంబించుచున్న భేద దండనీతులకు పరమప్రమాణములు. ఆసియా ప్రబోధవిజృంభణములు శ్వేతజాతులకు సింహ స్వప్నములుగ నేర్పడినవి. జపాను, చీనా, హిందూస్తానములను శాశ్వతముగను వణచి పెట్టుటకు యూరపురాజ్యము లవలంబించు చున్న రాజ్యనీతి పరమాసహ్యముగ నున్నను ప్రతీకారము దుర్లభముగ నున్నది. శ్వేత రాజ్యముల స్వార్థదుర్గమై నానాజాతిసమితి యందు శ్వేతేతరజాతులకు పుట్టుగతులు లేవు. నానాజాతి సమితినుండి చీనాజపాను రాజ్యములు నిష్క్రమించినవి; హిందూస్తా నము గ్రేటుబ్రిటనుకు పరివార రాజ్యముగ నున్నది. ప్రపంచశాంతికి స్థాపితమైన నానా జాతి సమితికి బట్టిన దురవస్థయె యూరపు రాజ్యముల నావరించిన భయసంభ్రమముల కును వినాశావస్థలకును నిదర్శనముగ నున్న ది. నానాజాతి సమితియందు రుష్యా రాజ్య మును ఆఫ్గనుస్తానురాజ్యమును జేరుట గ్రు డ్డిలో మెల్లగనున్నది. స్వాతంత్ర్యదాహ ముతో పరితపించుచున్న ౫౦ కోట్ల జనుల స్వాతంత్ర్యము సిద్ధించనంతవరకును ప్రపంచ వ్యవహారములందు సంరంభమువలెను శాంతి సంభవము కాదని స్వప్రయోజన పరాయ ణులు సయితము గ్రహించుట వివేకము. శాంతిసౌఖ్యములకు నిగ్రహమునకు గల శక్తి సామర్థ్యము లాగ్రహమునకు దుర్లభములు. గాంధిమహాత్ము డుపక్రమించిన సత్యాగ్రహ ము, శాంతిసాధనమైన ఆత్మనిగ్రహప్రభావ మును, పరాక్రమణ బీభత్సమును సువ్యక్తము, చేయుచున్నది. స్వార్థారాధన పరములైన పక్షములు, కక్షలు, మతములు సంరంభము నకువలెను శాంతికి వినియోగపడజాలని విధ మును పక్షముల వ్యవహారములు వెల్లడి చేయుచున్నవి.

* * *

పక్షములు–కక్షలు

ప్రవృత్తియందు ధర్మసంస్థాపనసంరక్షణ ముల కాధారభూతములైన పక్షసంస్థలు వర్త మానయుగమునందు ధర్మనాశనమునకు విని యోగపడుట దురదృష్టమైనను సంభావ్య ములుగనున్నవి. ప్రజాస్వామ్యత్వమునందును నిరంకుశత్వమును స్వాధికారమును సద్విని యోగమునకు వలెను దుర్వినియోగమున కును వినియోగించుట కవకాశములు గలవు. జీవయాత్రను జేయుటకు జీవజాలములకు సహజసిద్ధమైన పరాశక్తి వర్తమానకాలము నందు ప్రచండరూపములను దాల్చుచున్నది.

భౌతికశాస్త్రపరిజ్ఞానము పరాశక్తికి సంహార సాధనములను పరికల్పించి ప్రళయతాండవ మున కవకాశములను సమకూర్చినది. ఈ యవకాశములను వివిధపక్ష నాయకులును, ధర్మదేవతారాధననిమిత్తమునను స్వప్ర యోజనపరాయణత్వమునకై వినియోగించుట పరమానర్థములకును మూలమగుచున్నది. ధర్మదేవతస్థానమును పక్షప్రయోజనము లధిష్ఠించినవి. దురహంకార దురభిమానములు ధర్మచిహ్నములుగను పరిణమించినవి. ధనాధికారములు పక్షమునకు పరమార్థములైనవి. ప్రపంచావృతమైన మహాప్రబోధమున కిది సహజఫలమైనను మహాసంరంభమునకు సాధన మగుచున్నది. పక్షనాయకులయహంకారాభిమానములు పక్షానుచరులందు విపరీతపరిణామమును పొదుచున్నవి. మతస్వాముల మతావేశము, రాజ్యాంగవేత్తల రాజ్యతంత్రములు, కులాభిమానుల కులతత్త్వములు, ధనస్వాముల ధనలాభాదులు కామార్థమూలములైన పక్షప్రయోజనములకు వినియోగపడుచు ధర్మార్థమును దుర్లభము చేయుచున్నవి. జస్టిసుపక్షనాయకులప్రచారములును, జాతీయపక్షనాయకులప్రచారములును, కాంగ్రెసునాయకుల ప్రచారములును, పక్షవాదములు ధర్మనాశనమునకు వినియోగపడుచున్న విధమును విశదము చేయుచున్నవి. గాంధిమహాత్ము డుపక్రమించిన సత్యాగ్రహప్రయోజనావసరమును ఎన్నికల బీభత్సమును హ్యాద్గతము చేయుచున్నవి.

* * * *

**ఎన్నికలు - పక్షములు**

ఎన్నికలందు పక్షనాయకులు చేయుచున్నప్రచారములును, అవలంబించుచున్న వ్యవహారవిధానమును దేశావృతమైన దుర్నయములకు నిదర్శనముగన్నది. ధర్మనిర్ణయమున కేర్పడిన ప్రజలసమ్మతులు పక్షాభిమానమునకును, ధనార్జనమునకును, అధికారోపార్జనమునకును వినియోగపడుచు ఆత్మనాశనమునకు సాధనములగుచున్నవి. ఎన్నికలందు కనకవర్షమునకును, పక్షపాతములకును, తంత్రములకును గల ప్రతిపత్తిధర్మమునకు గలుగకున్నది. స్థానికసంస్థల నావహించిన దుర్నయములు అసెంబ్లిఎన్నికలకును సంక్రమించుట దురదృష్టము. జమ్నాదాసు మెహత మదనమోహన మాలవ్య గోవింద వల్లభపంతుగారులును, సత్యమూర్తి రామస్వామి మొదల్యారుగారులును, వెంకటాచలం చెట్టి షణ్ముఖం చెట్టిగారులును, చేయుచున్నప్రచారములును, గాంధిమహాత్ము డుపక్రమించిన సత్యాగ్రహావసరమును విస్పష్టము చేయుచున్నవి. ఎన్నికలప్రచారవ్యవహారములును సంరంభమునకువలెను శాంతికి సాధనము గాకున్నవి. గాంధిమహాత్ము డుపక్రమించిన సత్యాగ్రహోద్యమము ప్రపంచ

శాంతి కవసరమైనవిధమును విశ్వయానలోకనము విశదము చేయుచున్నది.

* * * *

గాంధిజయంతి

గాంధిమహాత్మునకు ౬౭ ఏండ్లు నిండి ౬౮-వ యేడు ప్రారంభమైనది. గాంధిమహాత్ముని జయంత్యుత్సవములను జరుపుటయందు ప్రజలు చూపిన యుత్సాహమును కార్యపరత్వమును నిత్యమైన సత్యాగ్రహ విజయమునకు నిదర్శనములు. హరిజనులు, ఖద్దరుప్రియులు, కాంగ్రెసుపక్షావలంబనులు, ఇతరప్రముఖులు జయంత్యుత్సవములను జరిపినవిధము, సత్యాగ్రహమూర్తిమైన గాంధిమహాత్ముని పట్లను ప్రజలకుగల పూర్ణవిశ్వాసమును వెల్లడిచేయుచున్నవి. గాంధిమహాత్ము డుపక్రమించిన సత్యాగ్రహప్రస్థానము ప్రపంచవ్యవహారములందుశాంతిసాధనమునను తరణోపాయమును నిరూపించుచున్నది. నానాజాతి సమితికిని, పక్షములకును, ఎన్నికలకును స్వధర్మనిర్వహణమునకు సత్యాగ్రహము పూర్ణయోగ సాధనముగ నున్నది. ప్రపంచ వ్యవహారములందు పూర్ణయోగసాధ్య మయిన శాంతిమార్గము నుపక్రమించిన గాంధిమహాత్ముడు లోకోత్తరపురుషుడు పరమపూజ్యుడై జయంత్యుత్సవముల కర్హతను గలిగియున్న విధమును దిగంతవ్యాప్తమైన యుత్సవములు, భజనలు, సమారాధానములు, సంతర్పణలు, సంబోధనలు, సంకీర్తనలు సహస్రముఖములను ఘోషించుచున్నవి. గాంధిమహాత్ముని దివ్యసందేశమును ప్రపంచవ్యవహారములందు సకల సందర్భములందును సంకల్పసిద్ధికి శాంతిసాధనముగను పరిణమించుటకు భగవదనుగ్రహము గలుగు గాత!

---

Printed and Published by K. Nageswara Rao, at the Andhra Patrika Press, No.7, ThambuChetty St., Madras.
Editor: G. Subbaramayya.

# భారతి

## సచిత్ర మాసపత్రిక


అధిపతి

కా. నాగేశ్వరరావు

సంపాదకుడు

గన్నవరపు సుబ్బరామయ్య



సంపుటము ౧౧, సంచిక ౧౧

ఆంధ్రపత్రికా ముద్రాలయము, మద్రాసు

౧౯౩౪

# విషయసూచిక

# చిత్రములు



సంపు. ౧౧ భావసంవత్సరము, కార్తికమాసము (నవంబరు ౧౯౩౪) సంఖ్య ౧౧

# ప్రేమ నిరాకరణము

'శేరాజు'

"హిమనగముపై నుంటి,
ఇల్లుత్రోవ గనకుంటి,
ఎదుట నొకవాల్గంటి
నిట్టె నే గనుగొంటి!—
ఆమెకనుపాపలో
అళులు నర్తింపగా,
ఆమెకనుబొమలపై
అహియుగం బాడగా,
చెక్కిళ్లు గుంటవడ,
చిఱునవ్వు కానబడ,
నను జేరి తనచేయి
నామీదవైచినది.—
ఒడలు పులకింపగా,
ఊహపలికింపగా,
"ఎవ్వతెవు నీ"వనుచు
నే నామె నడిగితిని.—

* * *

"నీ కాపులోనుందు,
నీ చూపులోనుందు,
నీ తలపులోనుందు,
నీ వలపులోనుందు,
నేవరూథిని యనెడి

నెలతుకను! నీసఖిని!
నన్నేలుగకుందువా?
నాదుమానసచోర!"

*　*　*

"నిత్యాగ్నిహోత్రుడను,
నే బ్రవరుడనువాడ,
ఏకపత్నీవ్రతుడ
ఎట్లేలుంగుదు నిన్ను?
పరసతివి నీవిట్లు
భాషింపజెల్లునే?"

*　*　*

"నాథ! నాపలుకులను
నమ్మవే యొక్కింత!
నీపాదమాన! నే
నిజమునల్కుచునుంటి.
అమరకన్యకగాని
అన్యకాంతను గాను,
నినుగాక యితరులను
నేనువలచి యెఱుంగ,
ఏలుకొనుమాయింక,
హృదయేశ్వరా, నన్ను!!"

*　*　*

"ఏకపత్నీవ్రతుడ
నే బ్రాహ్మణుడగదా!
నీమగలు పెక్కండ్రు
నీవు వేశ్యవుగదా!
ఇంతి! యిటుమాటాడు
టేటిన్యాయము నీకు!"

*　*　*

"సుందరా! నామన
స్సును హరించితివేల?
ననుదాసిగా జేసి
కొనకున్న మనజాల!
మనసిజుని బాధ కో
ర్వనిదాన! నీదాన!
పాలింపవా యింక,
ప్రాణేశ్వరా! నన్ను!!"



*　*　*

"పున్నెంపుద్రోవలో
పొరపాటు లిడబోకు!
పరభామలను మాతృ
భావంబుతో గాంతు
పాడియా నీ కిట్టి
పలు కాడ టోయింతి!
తెరువు జూపింపుమా
అరుణాస్పదము బోదు!"

*　*　*

"ఏగుటే మాన్యమో!
ఏలుటే పుణ్యమో!
కఠినమానస! నీకు
కనికారమే లేదు;
నిన్నే తలంతునే!
నిన్నే భజింతునే!
నే బ్రేమరాశినే!
నీపాదదాసినే!!"

*　*　*

అనలంపుటార్పులో
ఆచాన మూర్ఛిల్లె;
అదియె మార్గంబుగా
అరిగె నాబ్రాహ్మణుడు.

# వేణీసంహారము-దుర్యోధనుఁడు

దువ్వూరి సూర్యనారాయణమూర్తి

వేణీసంహార మను నాటకమును రచించిన వాఁడు భట్టనారాయణుఁడు. ఈతఁడు తన నాటకమున భారతగాథలోని యొక ఘట్టమును గ్రహించి కొన్ని మెఱుంగులు దిద్ది చక్కఁగా వ్రాసియున్నాఁడు. ఏదియో నవ్యత లేక పాడినదే పాడుచున్న సహృదయులు సంతోషింపరుగదా? ఈతఁడేకాదు, నాటకకర్త లందఱుగూడఁ దమ నాటకములఁ బ్రఖ్యాతోత్పాద్య మిశ్రత్వభేదములచే నితివృత్తములలోఁ గ్రొత్తదారులు త్రొక్కియే యున్నారు. అందులోఁ, బ్రదర్శనమునకు యోగ్యమగునట్లు కొన్నిమార్పులు, నాయకాపకర్షాధాయకములగు క్రియల యన్యథా పరివర్తనమువలనఁ గొన్నిమార్పులు, నైతిక బోధకముగాఁ గొన్నిమార్పులు, కవిదృష్టి ననుసరించి కొన్ని మార్పులు జరుగుచుండును. అందు మిగిలినమార్పులకన్నఁ గవిసృష్టివలనఁ గలిగిన మార్పులు కొన్నిచోట్ల విచిత్రముగా నుండును. మఱికొన్ని పట్టులఁ బక్షపాతముగాఁ గనఁబడుచునేయుండును. కాని సహృదయ కవిసృష్టికిఁ గొన్ని స్థానములఁ దిరుగులేకున్నను వారి నిరంకుశత్వ మెంతటిపాత్రకైనను హీనావస్థ చేకూర్చుచున్నది. 'అట్టి దురవస్థ వాస్తవముగాఁగాని, ప్రకృతిసిద్ధముగాఁగాని యేపాత్ర యెన్నఁడును బొందియుండదేమో?' అనుసందేహము పాఠకులకుఁ గలిగించుచుండును. ఈ మార్పు కలిగించుటకు మున్నా వ్యక్తిలో నేవియో కొన్ని లోటులుండవచ్చును. అంతమాత్రమున నాపాత్ర నాటకకవులచేఁ దృణప్రాయముగాను, పరిచారక వినింద్యముగాను, మందబుద్ధిగాను, కొన్నిఘట్టములఁ జివరకుఁ బశువుగాను బోషింపఁబడుచున్నది. అందువలన నాటకమునకుఁగాని, కవిత్వమునకుఁగాని, పాత్రలకుఁగాని స్వాభావికత్వము (Naturality) తగ్గుచున్నది. అట్టిపాత్ర చివరకు నశింపఁదగిన దైనప్పటికి మొదట దానికి నెనలేని గౌరవస్థాన మిచ్చి యాస్థానమున కెంత మాత్రము తగనిదానినిగా మొదటినుండియే ప్రవర్తింపఁ జేయుటలో నీషణ్మాత్రమైనను స్వభావము గనుపట్టదు. అట్లయినఁ బ్రధాన నాయకున కుత్కర్ష వచ్చుటయు, నుపనాయకుని కపకర్ష వచ్చుటయుఁ, దన్మూలమున లోకమున కేదైన నీతిని బోధించుటయు నెట్లని యనవచ్చును. ఈరీతిగాఁ బ్రధాన నాయకునిచే నుపనాయకుఁడు మున్ముందు జయింపఁబడునను నూహ యున్నను మన లక్షణకర్తలు చెప్పినట్లు జయింపఁబడు నుపనాయకునే సమృద్ధిగా వర్ణించి యంతటి వానిని జయించెనని ప్రధాననాయకునికి

నుత్కర్ష తేవచ్చును. దీనినే

"అశక్యాప్రతిపక్షస్య వర్ణయిత్వా గుణాన్ బహూన్,
తజ్జయా న్నాయకోత్కర్ష వర్ణనం న మతమ్...."

ఇట్లని చెప్పియున్నారు. ఈవిధి యాలో చింపఁగా నశింపఁదగిన యుపనాయకుఁడు మహారాజుగాఁగాని, చక్రవర్తిగాఁగాని యుండునపు డాతని Status నకు భంగము రాకుండ వర్ణించుచు నాపాత్రస్థానమున స్వభావము చెడనీయక, యసంభవములు కలుగనీయక,యఘటనఘటనల నంటఁగట్టక ప్రధాన నాయకునిచే నోడునట్లు చేసినచో నుభయ పాత్రతారకముగా నుండి నాటకీయ సౌందర్యము చెడక నీతిబోధకు భంగముురాక యుండుననియే భావమని నాయూహ. అట్లని యుపనాయకుని దుర్దోషాదుల విడువవలెనని కాదు. మహారాజ భూతోపనాయకస్థానమునసే వాని నుంచి తత్సంభవములుగానే వర్ణింపవచ్చును.

ముద్రారాక్షసమున చాణక్యుని నావులించినఁ బ్రేవులు లెక్కపెట్టువానినిగాను, రాక్షసుఁడంతవానిని స్వపరజనభేదమును గూడ గ్రహింపలేనివానినిగాను, పరాకు మనుష్యునివలెను, బుద్ధిహీనునివలెను కవి వర్ణించియున్నాఁడు. ఇం దొక్కొక్కచోట రాక్షసునిగూర్చి వర్ణించిన వర్ణన కవినిగూడ తిట్టించును. ప్రకృతమున వేణీసంహారమున దుర్యోధనునిగూర్చి యీవిషయమై కొంత పరిశీలింపవలసియున్నది.

ఇందు ద్వితీయాంకమున కంచుకిపాత్రను ప్రవేశపెట్టి మహారాజు చెప్పిన పనియంతయు నేకరువుపెట్టించినాఁడు. భానుమతిని వేదకించుసందర్భమున సఖముూలమున నామె వృత్తాంతమును దెలిపి దుర్యోధనోపాలంభనము నెత్తించినాఁడు. "భర్తకు జయము కలుగుటకును, సుఖము కలుగుటకును నా మహాపతివ్రత వ్రతములు, దేవతారాధనలు సలుపుచుండ నీమహారాజదుర్యోధనున కీ స్త్రీలోలత్వమేమోకదా! ఇట్టి సుగుణవతి కట్టివానిని భర్తగాఁ గల్పించిన దేవుఁడే నిందు్యఁడు" అని కంచుకిచే ననిపించెను. అనఁగాఁ బ్రారంభమునుండియు దుర్యోధన పాత్రకు న్యూనత్వము చేకూర్చువిధ మిది. ఈప్రసంగము ప్రత్యక్షముగాకపోయినను కవి కాపాత్రయందున్న భావము తెల్లమేగదా!

అంత దుర్యోధనునిఁ బ్రవేశపెట్టి "యేనాద్య ద్రోణకర్ణజయద్రథాదిభిః హతమభిమన్యు ముపశ్రుత్య సముచ్ఛ్వసితమివ న శ్చేతసా" అభిమన్యుఁడు గతించుట పాండవబలము సగ మడఁగినట్లు సంతోషపెట్టి తోడనే కంచుకిచే "దేవ! నైన మతి దుష్కర మాచార్యస్య శస్త్రప్రభావాత్ కర్ణజయద్రథయోర్వా. కానా మాత్రశ్లాఘా" "బాణము చేతలేని పసిపిల్లవాఁడు పదిమంది మీవీరులచేఁ జంపఁబడె ననుటలో నేమి గొప్ప కలదయ్యా! నీమొహం. ఇదో పెద్దగొప్పనుకుంటున్నావ్" అని పలికించి యున్నాఁడు. కంచుకియనఁగా నేముదు

సలిమో, యే నపుంసకుఁడో యైయుండును గదా! దుర్యోధనమహారాజునీచపాత్ర చేఁ బై రీతిఁ బలుకఁబడుట రాజమర్యాదగానున్నదా?

మరల దుర్యోధనుని నోటినుండి "స్వబలేన నిహంతి సంయుగే నచిరాత్పాండుసుత స్సుయోధనమ్" అని రాఁగానే కంచుకి కర్ణముల మూసికొని "శాంతం పాపం ప్రతిహత మమంగళమ్" అనఁగా రాజు మరల "కిం మయోక్తం" అని ప్రశ్నింపఁగా "నిహంతి సంయుగే నచిరాత్పాండుసుతం సుయోధనః, ఏతద్విపరీత మభిహితం దేవేన" అని లేనిపోని మహాప్రపత్తి రాజుదగ్గర చూపించియున్నాఁడు. ఇంత రాజభక్తి,యింత విధేయత కలవాఁడు వెనుక కుండ బ్రద్దలు గొట్టినట్లు మాట్లాడుట దుర్యోధను నగౌరవించుటయే. మఱియు నచ్చటనే "భానుమతీ నిష్క్రాంతేతి వ్యాక్షిప్తం మే మనః. ఆదేశయ యత్ర సా భానుమతీ"అని యాతనిని మరల భార్యచేఁగూడఁ దిట్టించుటకు స్త్రీలోలత్వమును గట్టిపెట్టియున్నాఁడు. దానిని

"మయాపున ర్మందధియా"

"మాం ప్రత్యాయయితుం

విమూఢహృదయం"

"దోషం పశ్యసి కిం ప్రియే

పరిజనోపాలంభయోగ్యే మయి"

అనెడి మాటలచే తానే నిందించుకొనునట్లు సృష్టించియున్నాఁడు. ఈ సంవిధానమందు స్వదూషణ మంతదోషావహము గాకున్నను నాతని లోకువను తెలుపుచున్నదిగదా!

మఱియు "స్వయమే వార్ఘ్యపాత్రం గృహీత్వా దదాతి, స్పర్శసుఖ మభినీయ కుసుమాని భూమౌ పాతయతి" ఇత్యాదికార్యములచే నాతని స్త్రీలోలత్వము పెంపొందించి తుద కీదాస్యము చాలక "దేవి, అనిపుణః పరిజనోఽయ మేవంవిధే సేవావకాశే, తత్ప్రిభవ త్యనుశాసనే దేవీ !"అని చేసిన యపరాధము క్షమించుమనియు, నిట్టిపనులలో నన్ను బాగుగా తరిఫీదుచేయుమనియు పలికించినాఁడు. అంతకును నీస్త్రీలోలత్వము చాలక

"ప్రభవతి మమ పాణ్యో

రంజలి స్త్వం స్పృశాస్మాన్"

"వక్త్రేందుం తే నియమముషితా

లక్తకాగ్రాధరం వా

పాతుం వాంఛా పరమసులభం

కిన్ను దుర్యోధనస్య"

"అయి సుందరి! ఏతావంతఏవ మనోరథాః, యదహం దయితయా సంగతః స్వేచ్ఛయా విహరామీతి."

ఇత్యాదిప్రసంగములచే నవ్వాల స్వవంశవిచ్ఛేదకమగు భయంకరయుద్ధములు జరుగుచుండఁ దనకు సంబంధమే లేనట్లుగా రాజును సంచరింపఁజేసినాఁడు. ఈపాత్ర కింతయపకర్ష తెచ్చుట కింతపశుప్రాయత్వము కల్పించుట యనవసరమేమో!

చతుర్థాంకమున

"నను భో! హతవిధే కృపావిరహిత!

[భరతకులవిముఖ!

అపినామ భవే న్మృత్యుః

నచ హంతా వృకోదరః"

(చావు ప్రతిమనుష్యునకును దప్పనేరప్పదు. కాని నాకు భీముని చేతిలో మాత్రము మరణ ముండకూడదు) అని దుర్యోధనుని యుద్ధో త్సాహమును జెడఁదీయుచు

"ఘాతితాశేషబంధో ర్మే

కిం రాజ్యేన జయేనవా"

(ఐననావారి నందఱను జంపుకొన్న నాకు రాజ్య మెందులకు? జయ మెందులకు?) అనిపించినాఁడు. తరువాత కర్ణునిచే,

"తద్దుఃఖప్రతికార మేహి భుజయో

ర్వీర్యేణ బాష్పేణవా"

(ఆ సీతమ్మని కాపాడ లేకపోయితిమి. కావున నట్టిదుఃఖమునకుఁ బ్రతీకారము నీభుజ బలముఁజూపి శత్రుల నిర్జించెదవో, కడి వెఁడునీళ్ల కేడ్చెదవో, ఏదియో యొనర్పుము) అని కఠినముగాఁ బలికించినాఁడు. ఇంతలో మరల లేనిపౌరుషము రప్పించి యుద్ధమునకు సన్నద్ధుని చేసి ధృతరాష్ట్రగాంధారీ సంజయ ప్రవేశమును జేయించి యాప్రయత్నమునకు విఘ్నము కల్పించుచు "అహమపి తాత సందర్శనం పరిహర న్నేకాంతే తిష్ఠామి" అని రాజమర్యాద కయోగ్యమగు మాట పలి కించినాఁడు.

ఇఁక పంచమాంకమున

"విజయతాం మహారాజః"

"కిం నపశ్యసి మహారాజః"

"ప్రతిబోధయితుం మహారాజమ్"

ఇత్యాదివచనములచే కవి దుర్యోధనుని మహా రాజస్థానముననే యుంచి తల్లిదండ్రులయొద్ద "అప్రక్రియమాణాభావే కి ముపకరణేన (ఇతి రోదితి)" అని బోరున నేడిపించినాఁడు. సంజ యాదులు సంధివిషయమై యెంతచెప్పినను దాని పెడచెవిని బెట్టించి యొండిధైర్యము కల్పించి,

"భీమం చితు నపిటిపామి కృపణ

స్సంధిం విదధ్యా మహమ్"

"సంజయ! అద్యా ప్యుపదేష్టవ్య మస్తి?"

"కర్ణో హత స్సపది తత్ర శరాః పతన్తు"

ఇత్యాదులచే మరల యుద్ధోత్సాహమును గల్పించినాఁడు. ఇంతలో వీరందఱును గలసి యున్నచోటికి భీమార్జునుల రప్పించి వారిచే కవిగా రెంతమృదువుగా నమస్కారము చేయించియున్నారో చూడుఁడు—

"అర్జునః—

సకలరిపుజయాశా

యత్ర బద్ధా సుతై స్తే

తృణమివ పరిభూతో

యస్య గర్వేణ లోకః,

రణశిరసి నిహంతా

తస్య రాధాసుతస్య

ప్రణమతి పితరౌ వాం
మధ్యమః పాండుపుత్రః.

భీమః :—

చూర్ణితాశేషకౌరవ్యః
క్షీబో దుశ్శాసనాసృజా,
భంక్త్వా సుయోధనస్యోర్వో
ర్భీమోఽయం శిరసాంచతి."

అని హృదయవిదారకముగాఁ బలికించినాఁడు. ఇది తల్లిదండ్రులకు నమస్కరింపవలసినవిధి కాఁబోలు? లేక భయపెట్టుటో? ఇట్లే కవిగారు పాండవులమొఁద మాటలచేతను, నుద్దేశములచేతను, భాషచేతను, క్రియలచేతను గూడ వారినే పెద్దగా వర్ణించుట పక్షపాతమని మెవరనరు?

ఆరవయంకమున పాంచాలకుఁడను వానిచే ధర్మరాజునొద్ద యుద్ధవిశేషములఁ జెప్పించుచు దుర్యోధనుఁడు జలస్తంభన విద్యచే నొకమడుగులో దాఁగియున్నాఁడనియుఁ గల్పించి భీమాదులచేఁ దిట్టించి యంతకును నిరభిమానినిగా దుర్యోధను నొనర్చి భీమునిచేఁ జెలువు నవలోడింపించి "భీమబాహుమంథరముచేఁ దరవఁబడిన చెలువనెడి సముద్రమునుండి దుర్యోధనకాలకూటమును" పైకి లేవనెత్తి వానిచేతనే,

"అరరే! మారుతే! కిం భయేన ప్రలీనం దుర్యోధనం మన్యతే భవాన్" అని యనిపించి పాండవులను జంపకుండ ప్రచ్ఛన్నముగాఁ దిరుగుట న్యాయము కాదని పాతాళమున విశ్రమింపఁబోయితి నని యబద్ధమాడించినాఁడు. ఈ సంవిధానమంతయు దుర్యోధను నధోగతిపాలుచేయుటకేకాక మఱెందులకు? మొత్తముపైఁ బాండవుల నందఱనుగూడ నెంతయౌచిత్యముగా వర్ణించెనో దానిలోని శతాంశమైనను దుర్యోధనునిమొఁద కవి చూపింపలేదు. మొదటినుండియు విచారములో సంతోషము, సంతోషములో బెంగ, బెంగలో నవివేకము, నవివేకములోఁ బౌరుషము, ఇంతలో నబద్ధములు భీతి, వెనుకకా ముందుకా యని తొట్రుపాటు,స్త్రీలోలత్వము నిన్నిదుర్గతులు దుర్యోధనునికే కల్పించి యాపాత్ర నధమాధమస్థితిలోనికిఁ దెచ్చినది కవిదృష్టియే. ఇదంత స్వాభావికముగా నుండదు. అట్లని ప్రధానకథాభాగమును మార్చుటయే కూడదని నాయభిప్రాయము కాదు. ఆమార్పునందే పాత్రయొక్క స్థానమును గాపాడుచు వర్ణించి యీదకాపాత్రను కావలసిన స్థితికిఁ దీసికొనివచ్చిన శోభావహముగా నుండునని నాయూహ.

---

ఈవ్యాసమునందంతట నాయకుడు, ఉపనాయకుడని వాడబడినది. దుర్యోధను డుపనాయకుడా? ప్రతినాయకుడుకదా! లేక ప్రతినాయకు డనుదానికే ఉపనాయకుడని పొరపాటుపడిరా! —భా. సం.

కథ వ్రాయడంలాగే కథ చెప్పడంకూడా ఒక మనోజ్ఞకళ. కథలు వ్రాయడం ఆచారం పూర్వంలేదు. అసలు "కథ"అంటే సంస్కృతభాషలోచెప్పబడ్డదానికే అర్థం. శ్రవ్యానికీ దృశ్యానికీ ఉన్న తారతమ్యం, చదూకున్న కథకీ విన్నకథకీ వుంది. చదివినంత నే రంజింపజేసే కథ, తగిన కథకుని "ముఖతా"వింటే నెయ్యిరెట్లింకా బాగుంటుంది. రాజాస్థానాల్లో ప్రభుసన్నిధిని కేవలం కథలు చెప్పడానికని ఉద్యోగు లుండేవారు పూర్వం.

బొబ్బిలికథ గజ్జెకట్టుకుని పాడే "కోమటిపల్లి" ముసలిదాసరిని విన్నపిమ్మట వెంకటరాయశాస్త్రిగారి నాటకం తీసిక ట్టనిపిస్తుంది. సందర్భానుసారమైన ఆవేశం, ఉద్రేకం కథకుడు తన కథనంలోనే ప్రదర్శిస్తాడు. ఆ దాసరిని చూచి Mono-action నేర్చుకోవాలి మన నటకులు.

ఒక సుల్తానుగా రెవరో పూర్వం, ఎడతెగని కథ చెప్పేవా డుంటే కావాలని కోరేరుట! అతణ్ణి పిచ్చివారిలో జమకట్టేరు ప్రజలు. నిజానికి, అత డత్యంతకళాపిపాసు వని నానమ్మకం. చెప్పదలచి, చెప్పగల కళాభిజ్ఞు డున్నప్పుడు, కథకి అంత మేమిటి! అనంతమైన యీసృష్టియే ఒక పెద్దగాథ కాదూ? వాల్మీకికావ్యం శతకోటిప్రవిస్తర మనడంలో, దాని అనంతత్వమే సూచించారు.

పూర్వం—అనగా ఒకటిరెండు దశల క్రిందటివరకూ — విజయనగరప్రాంతంలో "మధురకవిసూరీడు"అని ఒకాయన ఉండేవాడు. విస్మృతకళాజీవులలో ఇత డొకడు. ఉత్త పామరుడు. బడిచదు వెరుగని బ్రహ్మచారి. అక్షరజ్ఞానమైనా సున్న. కాని కథలు చెప్పడంలో అద్భుతప్రతిభ. పిల్ల లతణ్ణి చూసేసరికి కథ చెప్పమని గంతులెయ్యడం, పెద్దవాళ్లుకూడా చెవులు రిక్కించుకుని వినడం పరిపాటి. నిజంగా, అతడికి భాషాపరిజ్ఞానం వుంటే "మధిర"వారిని మరుగుపరిచివుండును. పైగా ఆశుకథనం! ఆరంభించినతర్వాత కథ యెప్పుడు కావాలంటే అప్పుడు రక్తి చెడకుండా అతి Naturalగా ముగింపుచెయ్యడం అతనికొక్కడికే చెల్లింది. బంధువులిండ్లలో స్థావరంగా వుండి, రోజులవెంబడిని ఒకటే తరగని కథ చెపుతూవుంటే, ఆకథావాహినిముందు రైనాల్డ్సుసైతం దిగదుడుపు!

అలాగు కథలుచెప్పేవా రిప్పు డరుదు. ఇప్పుడు వ్యవహారంలో మిగిలినవి, హరిదాసు హరికథ చెప్పడం, పురోహితుడు వ్రతకథ చెప్పడం. ఈ రెండూ తటస్థపడినప్పుడు మనం వినకతీరనివి. వీటిలో హరికథను బహుళంగా ప్రదర్శించినది నారాయణదాసుగారు. భక్తికూడా ప్రదర్శనానుకూలమైన రసముల్లో చేర్చినా డీయన. ఇతని ననుకరించిన దాసు

లందరూ హరికథ అంటే హాస్యం చెప్పడం, అదీ చేతగాక హాస్యాస్పదం చెయ్యడంలోకి దించేరు. హరికథలో 'హరి' అంతముఖ్యంగా ఉండాలని వీరి అభిప్రాయం కాదు. కథ వల్లించివుంటే, మధ్యమధ్య యేకాఫీహోటలు భోగట్టాలో, 'కపిలవాయి' ప్లేట్లో, సందర్భం లేకపోయినా బలవంతానైనా దూర్చి కాలక్షేపం చేదామని వీరి ఊహ.

ఇక రెండోవి వ్రతకథలు. వీట్లో వినడాని కేమీ ఉండదు. శివుడు పార్వతితోనో, కుమారస్వామితోనో చెప్పినట్లు, అడివిలో వున్న ధర్మరాజుకి (మరి యేరాచకార్యమూ లేదుకనుక) సూతమహర్షి చెప్పేడని యే స్కాందపురాణంలోనో చెప్పినట్టు, పాత సాతాన్ప్రతిలో వున్న తప్పులతడక ఉన్నదున్నట్టూ అర్థంపొందిక లేకుండా అవధాన్లుగారు చదివితే, విని ఆనందించి పుణ్యం వాళ్లో పడ్డట్టు నటించి మనం అక్షతలువేసుకుంటే (నెత్తిమీద; నోట్లోకాదు!) అప్పటికి కథ సమాప్త మౌతుంది. సత్యనారాయణ వ్రతం మీరు ప్రతినెలా చేసుకున్నా, కథ మీకు 'కంఠతా' వచ్చినా, అదేకథ మళ్లీ మళ్లీ వినకతప్పదు. అయితే, ఇవన్నీ ఫలశ్రుతికోసం పుట్టినవి. ఆముదం పుచ్చుగుంటే విరేచన మౌతుందని మనల్ని నమ్మించటానికి—"పూర్వం వినాయకుడు కడుపునొప్పితో బాధపడుతూండగా నారదమహర్షులవా రొచ్చేసరికి, 'మహాత్మా! నీవు త్రికాలాబాధ్యుడవు. నీకు తెలియని దేమీ లేదు. ఈవిధంగా వున్న నాకు సాధన మేమిటో సెలవియ్యాలి' అనేసరికి నారదులవారేమి షంటూవున్నారంటే, "ఓ వక్రతుండము గల గణాధిపా, వేకువగట్లనే లేచి యథాశక్తిగా శుద్ధిచేసినదిగాని, పిల్లలకు పట్టేదిగాని, లేదా అధమం బండికందెనకు పెట్టేది కాని, ఒక సోలడు అంగుటి కంటకుండా పుచ్చుకుంటివట్టాయనా, సమస్తకల్మషములను హరించి అంతమున సాయుజ్యము నిచ్చును. పూర్వం ఒకానొకప్పుడు హరిశ్చంద్రమహారాజు యిదేవిధంగా........" అంటూ యెందుకో అంత రణగొణధ్వని? ఆకథ వినకపోయినా, పుచ్చుకున్న ఆముదం దానిపని అది చేస్తుందే? వ్రతకథ లందుచేత కేవలం నామమాత్రానికే కథలు.

పండితపామరవిచక్షణ లేకుండా జనులందరూ ఆరాధించగల కళాస్వరూపం కథ. భూపతన మైనపిమ్మట తన పరిసరంచూచి అర్థంచేసుకునే వయస్సువచ్చేసరికి, బిడ్డకు కథ కావాలి. జోలపాటతో నిద్రపోవడం మానేస్తున్నా దనేసరికి బిడ్డకు తల్లి కథచెప్పడం ఆరంభిస్తుంది. ఇంగ్లీలో Fairy Tales అన్నీ అలాటివే. తెలుగులో మనకి పారంపర్యం (Tradition)వల్ల వొస్తూన్న యిలాటికథ లున్నాయి. వాటి కర్త లెవరో తెలియదు. తెలుసుకొని ప్రయోజనంలేదు.

తెలుగుబిడ్డకు "పేదరాసిపెద్దమ్మ" అనే వ్యక్తి Queen Mab. చిన్ననాడు, అవ్వఅన్నం తినిపించుతూనో, నిద్రపుచ్చుతూనో చెప్పే

ప్రతికథలోనూ పేదరాసిపెద్దమ్మ తప్పదు. అనగనగా ఒకఊరనేసరికి ఆవూరికి రాజుండడం ఎలాగు తప్పదో, ఆవూళ్ళో "ఒక"పేదరాసిపెద్దమ్మ అలా గుండకతీరదు. ఆమె ప్రయోజకత్వం, ప్రతిభా మెలాటివో కాని, రాజుకొడుకైనా ఆమెపంచకు రాకతప్పదు. ఒకానొక్కప్పుడు ఆరాజుకే "ఏడుగురు"కొడుకులుంటారు. వాళ్లు వేటకు వెళ్లి యేడుచేపలు తెచ్చేరంటే "చేపలవేట"యేమిటని యేబిడ్డా ప్రశ్నించదు. ఆవయస్సలాంటిదో, లేక కథాకాల మలాంటిదో! గడ్డిపువ్వలూ, గొడ్డళ్లూ, చిలకలూ, చీమలూ, సమస్తమూ మనుషుల్తో మాట్లాడుతాయి. పెళ్లినాడు చీమకి పప్పూ అన్నం మెవరో కుర్రాడు పెట్టకపోతే,మధ్యని రాజుకొడుకు తెచ్చిన చేప (యేడింట్లోఒక్కటి!) యెండకపోవడమేమిటి? కార్యకారణసమ్మంధం మథించివిడిచే ముదరవయస్సుకి అవన్నీ అసందర్భం, ఊసుపోని మాటలు! విమర్శన సహించని శుద్ధతత్త్వస్వరూపమైన పసికూన కాకథ వేదాంతములో ప్రథమపాఠం!

"ఈగ యిల్లలుకుతూ పేరుమరచిపోవడం"కథ అద్భుతమైన ఊహాపరిణామం. పనిపాట్లలో మునిగి కాలం వెళ్లబుచ్చుతూ, ఉన్నపాటున మనపేరు మనం మరిచిపోగలిగితే యెంతగమ్మత్తుగా వుంటుందో చూడండి! వ్యవహారలోకంలో నిత్యజీవితం యెంతకరకుదో కాని, స్వప్నంలోనైనా మన వ్యక్తిత్వం మనకు మరుపురాదే! తనపేరు తనే మరిచినకన్న ఆనందానుభూతి ఉందా? అది సర్వసాక్షిత్వమే, విశ్వసామ్రాజ్యపట్టాభిషేకమే! ఈగ అలాగు మరిచిపోయి."నే నెవరు? నాపే రేమిటి?" అని విశ్వమాతను, పేదరాసి పెద్దమ్మ నడిగితే, ఆమెకుమాత్రం యేం తెలుస్తుంది? ముసలిది. తన కొడుకు నడగమంది. తర్వాత "కొడుకుచేతి గొడ్డలీ, గొడ్డలికొట్టీ మానూ, మానుమీది రామచిలుకలూ..." ఇలాగు ప్రపంచమంతనీ అడిగింది!

* * *

బిడ్డకు అప్పటికీ నిద్రపట్టకపోతే ఆనారోగ్యస్థితి అన్నమాట.

తెలుగురక్తం పంచుకున్న ప్రతిశిశువుకీ పేదరాసిపెద్దమ్మ అంటే అవ్యాజమైన ఆదరం వుంటుంది; ఒక్కవిషయానికితప్ప బంగార్లాగ చేతి కందుకువచ్చే 'చుక్కలసుందరి'ని ముసిలిపెద్దమ్మ చీపురుకట్టతో అంతదెబ్బ వెయ్యడమేమిటి? తన వీపుకి తగుల్తే, నెమ్మదిగా, ఒక్క రవంత మీదికి పోడవకూడదా? కోపిష్టిమనిషి! డాబామీది కెక్కినా మనకి నేడందివుండేదేమో? ఈ దుష్టతనానికి మాత్రం ఆమెని లోకం క్షమించ లేదు!

* * *

ఇలాంటి కథలన్నీ మన హృదయఫలకాలమీద వ్రాసి విడిచిపెట్టినవారు మాతృదేవతలు. శిలాశాసనాలు కొన్నియుగాలకు చెదిరి రూపు మాసిపోవచ్చునుగాని, వీటికి మాత్రం విస్మృతిలేదు. మాతాశిశుసంబంధమే వీట్లో ఇంతమధువును నింపింది!



౨. విషయనిర్ణయసభనుండి తిరిగివచ్చు మహాత్మ గాంధీప్రభృతులు
మహాత్మునిప్రక్క నున్నవారు శ్రీ నారిమనుగారు, ఆహ్వానసంఘాధ్యక్షుడు.

# 'సాహిత్యదర్పణము'*

తిరుమల వేంకటరంగాచార్యులు

"వాచామేవ ప్రసాదేన లోకయాత్రా ప్రవర్తతే."

'వాఙ్మయజ్యోతియే లేకుండినచో నీ ముల్లోకములును కారుచీకటి గ్రమ్మి యుండవలసినదే. అందువలననే శబ్దము బ్రహ్మమయినది; కనుకనే శబ్దమున కింతటి వ్యాపకత్వప్రయోజకత్వములు అబ్బినవి. ఈ శబ్దబ్రహ్మముయొక్క తురీయభేదమయిన వైఖరియే మనుష్య వ్యవహారరూపమును దాల్చినది. ఈతీరున వాక్కులే లోకయాత్రా ప్రవృత్తికి నిబంధనము లయినవి.

ఆవాక్కులే, ఆవాక్కులయొక్క అర్థములే సముదితములై, సంపృక్తములయి గుణాలంకారసాహిత్యమునను, దోషహానమునను కావ్యమయినది. కావున కావ్యముగూడ లోకయాత్రాప్రవృత్తికి నిబంధనమన్న మాటయే. ఈకావ్యము ఛందోబద్ధముగానే యుండవలయునన్న నియమమేమియు లేదు. కవికర్మయంతయు కావ్యమే.

---

ఈకావ్యమునకు ప్రయోజనములు 'తొంబదితొమ్మిది' మనవారు పేర్కొనిరి. కావ్యము యశముగూర్చునట! ధనమును సంపాదించిపెట్టునట! వ్యవహారజ్ఞానమును గలుగజేయునట! అమంగళములను దొలగించునట! వెంటనే పరమానందమును గూర్చునట! ఎవరి కీ ప్రయోజనములు? కావ్యమును గూర్చు కవికా, దానిని పఠించుసహృదయునకా? కావ్యప్రయోజనము లివ్వియని యొకపట్టికను తయారుచేసినారేకాని కావ్యమువలన లాభము పొందవలసినవా డెవడు, కావ్య మెవరికిగా నుద్దిష్టమయినది, ఈచెప్పిన ప్రయోజనము లెవరికి చెందుచున్నవి అను విచారణకు గడంగినవా రెవరును కనుపించ లేదు. పెద్దలు చెప్పిన ప్రయోజనములలో ఒక్క వ్యవహారజ్ఞానము-వ్యుత్పత్తి-, పరమానందములుమాత్రమే సహృదయుడయిన పఠితకు చెందునవి. తక్కినవి కావ్యస్రష్టకు కవికి చెందునవి. వ్యుత్పత్తిపరమానందములు గూడ కవికి గలుగవచ్చునుకాని కవిగాగాక, సహృదయు డగు పఠితగానే కవివానిని పొందగలడు. లేక, ఒకవేళ, ఈప్రయోజనము లన్నియు కవిసాత్తేయన్నచోస్వార్థపరమయిన యీకావ్యమునుండి లోకము పొందగల మేలేమి? కాదుకాదు, ప్రజావ్యుత్పత్తిని, ప్రజాపరమానందమును ఉద్దేశించియే కావ్యములు మెలగవలెను.

'...ప్రజానాం వ్యుత్పత్తి
మభిసంధాయ సూరయః,

---

* అనువాదకులు: కీ. శే. శ్రీమహోపాధ్యాయ, కళాప్రపూర్ణ వేదము వేంకటరాయశాస్త్రిగారు. ప్రకాశకులు: వేదం వేంకటరాయశాస్త్రిగారు, వ మల్లికేశ్వరసన్నిధి, జి. టి. మదరాసు.

వాచాం విచిత్రమార్గాణాం
నిబబంధుః క్రియావిధిమ్.'

ఈకావ్యము దేశతః, కాలతః మేరమీరిన ప్రభేదములను పొందుచుండును. కాని యెన్ని ప్రభేదములను పొందినను, ఎన్నిమార్గముల నడచినను కావ్యప్రయోజనములలో నేడు గాదుగదా, మరియెన్నటికిని మార్పుగలుగ జాలదు. కాని యేతాదృశమహోత్కృష్ట ప్రయోజనోద్దిష్టమయిన కావ్యములను నిర్మిం చుటయందు ఎంతటి నిరంకుశులయినను కొన్ని మార్గములను, హద్దుపద్దులను గలిగి మెలగుట విధి. ఈవిధిని ప్రాచీనులు లెస్స అనుసరించిరి. ఆధునికులకును, తరువాతివారికిని గూడ ఈవిధి మీరరానిది. ఈకొన్ని మార్గములే, ఈకొన్ని హద్దుపద్దులే కావ్యలక్షణములు; ఆలక్షణము లిట్టివని శృంగగ్రాహికగ బేర్కొను గ్రంథములు కావ్యానుశాసనములు; అట్టి గ్రంథములను నిర్మించువారు కావ్యానుశాసకులు. ఈ కావ్యానుశాసకుల యీలక్షణవాఙ్మయమునకే అలంకారశాస్త్రమని, సాహిత్యమని పేర్లు ప్రథితములయినవి.

కవియైనవాడు ఈలక్షణములకు కట్టుబడి, దేశమును, కాలమును పాటించి, కావ్యమునుగూర్చి, సహృదయానందమును సాధించి, తాను యశోర్థములను బడయగలడు. కానినాడు అట్టికావ్యములవలన నిర్దిష్ట విపరీతప్రయోజనములు గలుగుటయేకాక కవియు నపహాసముపాలవును.

కాని, యీనాడు విచిత్రమార్గముల వెలువడుచున్న కావ్యములకు మనప్రాచీన లక్షణములు సమన్వయపడవు. అవి సమన్వయపడవలయునన్న పట్టింపుగూడవారికిలేదు. ప్రాచీనమంతయు వారికి వెగటు. కాని ఆ కావ్యములు లబ్ధప్రతిష్ఠములయి, అవి కట్టుబడిన నీతినియమములకు అనుశాసకగ్రంథములు వ్రాయు తెగువగలిగినవారు కలుగునంతదనుక మన ప్రాచీనలక్షణములే చిరరాజ్యము నేలగలవు. ఒకవేళ అవి లబ్ధప్రతిష్ఠములయి, అనుశాసకగ్రంథములు వెలసినను పూర్వాచారపరాయణుల నయినను వర్తమానలక్షణవాఙ్మయము తన యేలుబడిలోనే యుంచుకొనగలదు. అంతటి సమయమే వచ్చునని మనము సంభావించినను నానవ్యలక్షణముగూడ ప్రాచీనలక్షణవృద్ధి,హ్రాస, రూపాంతరమే కాకతప్పదు. ఎట్లును కవియగువానికి, తద్రచనలను పఠించి యానందింపవలసిన సహృదయునకును వర్తమాన లక్షణపరిజ్ఞాన మావశ్యకము.

ఆంధ్రవాఙ్మయమున కావ్యవాఙ్మయము విస్తారముగ నున్నను లక్షణవాఙ్మయ మేకారణముననో కొరవడియుండినది. ఉండినకొంతయును యీనాల్లక్షణపరిజ్ఞానమునకు అనువయినదిగ నుండలేదు. మన కన్ని తెరగుల నాదరణీయమైన సంస్కృతమున నావాఙ్మయము విస్తారముగగలదు, వాస్తవమే. కాని సంస్కృతమునేర్వని తెలుగువారి కది యెట్లుపకరింపగలదు ? కావున. నావాఙ్మయమంతయు తెలు

గురు పరివర్తింపబడినగాని ఫలముండదు. ఇప్పు డిప్పుడే యాలోచము తోఁచి యర్థములు ఆవా ఙ్మయమును పరివర్తించుచున్నారు. ఇదియెల్ల రీతులయందును భాషకును, దేశమునకును శ్రేయోదాయకము. భాషాభివృద్ధియేకదా, దేశాభివృద్ధికి సూచకము!

సాహిత్యదర్పణ మనునది యొకలక్షణ నిబంధనము. యావదుపయుక్తకావ్యలక్షణమీమాంసయు నిమిడియుండుటచేత నిది సమగ్ర సాహిత్యశాస్త్ర మనజెల్లును. సాహిత్యతత్త్వ మంతయు దీనివలన నెరుగవచ్చును. ఉపపాదనశైలియం దిది విద్యానాథుని ప్రతాపరుద్రీయమును బోలియున్నను దానికిని దీనికిని కొండంతమేరగలదు. విషయవిచారమునను, శైలిని ఇది దానికన్న నెంతో మెరుగు. శైలి సరళము. సులభముగ నర్థము చేసికొనగల యుపపాదనము. దీనిని రచించినవాడు విశ్వనాథుడు. ఇతడు ౧౪-వ శతాబ్దిని వెలసెను. ఇతనితండ్రి చంద్రశేఖరుడు. ఇతడు కవిరాజు; ఆలంకారికచక్రవర్తి; ధ్వనిప్రస్థాన పరమాచార్యుడు; మహాకులప్రసూతుడు; బహువేత్త; సహృదయుడు. ఇతని యితర రచనములు—౧. రాఘవవిలాసము, (మహాకావ్యము), ౨. కువలయాశ్వచరితము (మహాకావ్యము), 3. చంద్రకళ (నాటిక), 3. ప్రభావతి (నాటిక), ౫. ప్రశస్తిరత్నావళి (షోడశభాషామయము), ౬. నరసింహవిజయము, ౭. కావ్యప్రకాశదర్పణము.

ఇట్టి యీ సాహిత్యదర్పణమున కింతదనుక తెలుగున పరివర్తనములేదు. శ్రీకళాప్రపూర్ణ, మహోపాధ్యాయ వేంకటరాయశాస్త్రిగారి యీపరివర్తనమే మొదటిది. శాస్త్రిగారు బహుశ్రుతులు; బహుభాషావేత్తలు; కవులు; విమర్శకులును. అట్టి వీరి చేతులబడిన యీయనువాదమును ప్రత్యేకించి పరిశీలింపవలసిన యవసరముండదు. వారి పాండితిని, వారి విమర్శకతను, వారి కవితను లోకము బాగుగ నెరుగును. కావున దీని నాంధ్రసారస్వతలోకమునకుపరిచయపరచుట మాత్రము చాలును. అనువాదము వారికి సహజమయిన ప్రౌఢమార్గమును బట్టినను అర్థముచెడక, దోషదూరమయి యున్నది. వీరి యనువాదమున మరొక్కవిశేషము. మూలములోని యుదాహరణ శ్లోకములకు పద్యములనే రచించక పాఠకుల సౌలభ్యమునే మనసున నిడుకొన్నవారగుటచేత వానిని వచనముగానే మార్చినారు. అన్నివిధములను ఇది మూలమున కనురూపమయి, తెలుగు లక్షణవాఙ్మయమున నున్నతపదము నందదగి యున్నది.

దశపరిచ్ఛేదాత్మకమయిన యీ గ్రంథమును ప్రకాశకులు పరిమితి పెద్దదవునన్న భయముచే రెండుసంపుటములుగా విడదీసినారు. ఈతొలిసంపుటమున అయిదుపరిచ్ఛేదములు గలవు. రెండవసంపుటముగూడ

అచిరకాలముననే బయలువెడలగలదని యాసించుచున్నాను.

ఇట్టి మహోపకారిరచనను మూలబడ ద్రోయక కొంత కాలయాపనమయినను ప్రకటించినందులకు ప్రకాశకులకు ఆంధ్రలోకము కృతజ్ఞమయియుండగలదు. భాషాపోషకుల, భాషాభిమానుల యాదరమున నీకృతి శాస్త్రిగారి నామధేయముతోపాటు చిరము వెలయుగాత.



ప్రథమశిక్ష —సూర్య.

# స్థానిక కూటములు*

వంగోలు వేంకటరంగయ్య

ఈగ్రంథకర్త టి. శివశంకరం పిళ్లగారు దాదాపు నలువదేండ్లుగ స్థానిక పరిపాలనలయందును, దేశీయమహాసభా ప్రచారములందును కృషి సలుపుచుండిరి. వీరికిగల చిరంతన లోకానుభవముల ఫలముగ సర్వజనోపయుక్తమగు నీగ్రంథమును వ్రాసిరి. వీరు బహుశ్రుతులు, విద్యాధికులు, ప్లీడరువృత్తి నుండువారు. దేశాంతర పర్యటనముల జేసి నానావిదేశపద్ధతుల గ్రహించినవారు. "స్థానిక కూటములు" అనగనే యెల్లవారికిని యిది లోకల్ బోర్డులు లోనగువాని గూర్చినదని తెలియకపోవచ్చును గాని గ్రంథమున నొక పుట చదువగనే గ్రంథోద్దేశము తేటపడగలదు. డిస్ట్రిక్టుబోర్డులు, తాలూకాబోర్డులు, యూనియన్ పంచాయతీలు, గ్రామపంచాయతీలు లోనగువాని విషయమై తెలియదగిన దంతయు ఈచిన్నపుస్తకమున తేటతెలుగు మాటలతో చదువగలవారికేమి, చదువరాకున్నను వినగలవారికేమి విషయము చక్కగ బోధపడునట్లు వ్రాయబడియున్నది. గ్రంథము పద్ధతులను విభాగమున రచింపబడినది. అధ్యాయములు, ఆశ్వాసములు, ప్రకరణములు అనుటకంటె ఈగ్రంథమునకు పద్ధతి విభాగము యుక్తముగ నున్నది. కడపటనొక చిన్నయనుబంధమునుసంక్రమణసూత్రములు అనుపేర ట్రాన్సిటరి రూల్సును జేర్పబడియున్నవి. కొన్నికొన్ని ఇంగిలీషుపదములకు మనభాషలలో సరియైన పదములు కుదురుట లేదు. "ట్రాన్సిటరి" అనునది యందొకటి. శివశంకరంగారు "సంక్రమణ" యని వాడిరి. బహుశః "ప్రాతక్రొత్తసందు" అనునర్థమున "శాసనసంధి" యని వ్రాయగూడునా? ఇటులనే "కార్పొరేషన్" అనుభావమునకును సరియైన పదములేక "చ్యుతి", లేక "స్థావరముగ జీవించుసంస్థ" యని సమర్థించిరి. బాగుగనే యున్నది గాని దీనికిని ఒక్కమాట కుదిరిన బాగుండును. "స్థిరమూర్తి", లేక "స్థిరవ్యక్తి" యనదగునా? "కేంద్ర" శబ్ద ముత్పత్తి ననుసరించి ఇంగిలీషు "సెంట్రల్" అనుదానికి సరిపోవచ్చునుగాని, మన "కేంద్ర"కును ఇంగిలీషు "సెంట్రల్"కును భావభేద మున్నది. ఇంగిలీషు "సెంట్రల్" అనునర్థమున మనకు "నాభి", లేక "మూల" అనునవి పరిచితములుగ నుండగలవు. ఇట్టి వింకను కొన్నిగలవు. ఎలెక్షన్ పాకలకు "బూతులు"అను నింగిలీషు మాటమె వాడబడియున్నది. అచ్చతెనుగున "బూతు"నకు నీచమగుతిట్టు పర్యాయము గలదు.

* ఈపొత్తము క్రౌను ఆకృతిన దాదాపు ఇన్నూరు పుటలు గలది. వెల ఒకరూపాయ.

ఈగ్రంథమున కొన్ని దేశవాళీ మాటలున్నవి. సందర్భముల ననుసరించి అవియు సుగమములు కాగలవు. "దిద్దు"నకు "తిద్దు" అనియున్నది. "మెటికలు" (మెట్లు), "తిక్క" (పిచ్చి), "సజా" (శిక్ష), "నటన" (మారు వేషము), "కాంతాళము" (ఈర్ష్య) ఇత్యాదులు. పంచమ్యర్థమున "తో" ప్రత్యయము గల తృతీయాంత మందం దగపడుచున్నది. ఇట్టివన్నియు స్వల్పవిషయములు; గ్రంథములోని సంగతుల దెలిసికొనుట కడ్డము తగులవు. మొత్తముమీద రచన బహుసులభముగ నున్నది. ఏయంతస్థులోనివారి కుద్దేశింపబడినదియో ఆయుద్దేశము పూర్ణముగ నెరవేర్పగలదు.

ఈగ్రంథము కీర్తిమూర్తు లగు దివాన్ బహదూర్ పట్టు కేశవపిళ్ల సి. ఐ. ఇ. గారి కంకితమై యుండుటయె దీనియుద్దేశప్రయోజనము ప్రకటించుచున్నది. కేశవ పిళ్లగారికి స్థానికపరిపాలన మన ఉగ్గుతో బెట్టిన విద్య వంటిది. దాదాపు ఏబదేండ్లు వీరు దీనావన కంకణబద్ధులై గుత్తిప్రాంతముల వెలసి తమ జీవితప్రయోజనమును ధారవోసిరి. "యేన యేన వియుజ్యంతే ప్రజా స్నిగ్ధేన బంధునా సన పాపాదృతే తాసాం దుష్యంతఇతి ఘుష్యతాం" యను మహాధీరబిరుదము వీరికి చెల్లినది. వీరు మదరాసు శాసనసభలో ప్రవేశించిన ప్రథమదశయందు వీరి "నవధీరణము" జేసినవారే వీరి ప్రాభవ మాహాత్మ్యర్జవముల గ్రమక్రమముగ దెలిసికొని అత్యంతముగ గౌరవము జేసిరి. వీరి "దివాన్ బహదర్", "సి. ఐ. ఇ."లె ఇందుకు చాలిన సాక్ష్యమియ్యగలవు.

ఈ గ్రంథమునం దేమూల జూచినను ప్రజాహితమె యగుపడుచున్నది. మన జానపదులు ఇంకను రాష్ట్రమున తమకు గల స్వత్వమర్యాదల బూర్ణముగ తెలిసికొనజాలక మన ఇడుమల మనమే నివర్తిజేసికొన గలిగియుండియు "పరోదదాతి"యను దుర్భ్రమలో నుండుటను జూచి కడుంగడు విషాదము జెందిరి. అనేకారోద్యోగులు ప్రజాసేవకులుగాని ప్రజాధినాథులు గా రనుభావమును బూర్ణముగ నిష్పన్నము జేసిరి. ఈభావము నతిక్రమించినవారిలో మన పిళ్లగారు ప్రథములుగారు. శుక్రనీతిసార మను రాజనీతి మహానిధి యేనాడు బుట్టినదో నిర్ణయింపనలవిగాకున్నది. మహాభారత రచనకంటె ప్రాచీనమని కొందఱియూహ. ఆగ్రంథమున భగవంతుడు శుక్రుడు ప్రభు విభుత్వముల వ్యాఖ్యానించుచు "స్వభాగభృత్యా దాస్యత్వే ప్రజానాంతు నృపకృతః" యను రాజనీతి మూలసూత్రమును ప్రకటించి యున్నాడు. విజ్ఞులగు మనపిళ్లగారు దీని జూచియే యుందురు. ఇట్టిభావములు మనప్రజ కంకురించి విస్తరించి స్వరాజ్యలాభమునకు ముఖ్యసాధనములు కావలయుననియే వీరి యాశయము స్వరాజ్యసంపాదనకు వలయు సాధన సంపత్తి

మన చేతుల నుంచికొనియే మెడయందు వ్రేలు చుండు కంఠాభరణమును కనుగొనలేక లోక మంతయు వెదకు వెడగు వేదాంతివలె మనము పొరలాడుచున్నార మను నభిప్రాయము బోధితమగుచున్నది. ఇందేమియు తప్పలేదు. మన మునిసిపాలిటీలును, లోకల్ బోర్డులును స్థానికపరిపాలనారూపమున స్వరాజ్యసంవిధానములను మన కలవర్చుచున్నవని పిల్లగారి గమకమై యున్నది. ఈసదుద్దేశ సాధనకై స్థానికపరిపాలనయన నెట్టిదో దానియందుగల గుణదోషము లెట్టివియో దాని నేయేవిధమున మార్జితపరుపదగునో, యేయేమార్పులచే దాని కధికతరమగు ప్రయోజన ప్రాకాశ్యములు గల్గింపనగునో ఇత్యాదివిషయముల పిల్లగారు సాంగోపాంగముగ వివరించి తేటతెల్లముగ దెలిపియున్నారు.

ఈగ్రంథమునందలి మొదటిమూడుపద్ధతులందును సామాన్యముగ ప్రభుత్వలక్షణములును, ప్రభుప్రజాసంబంధములును వివరింపబడి యున్నవి. నాల్గుమొదలు దశకపర్యంతము స్థానికకూటములు (Local Boards) వాని నిర్మాణ, సాధన, నిర్వహణ, పర్యవేక్షణాది పద్ధతులతో నొప్పియున్నది. పిదప ఫలస్తుతి యను నొక ప్రకరణ మున్నది. దీనిఫలశ్రుతి యనుట బాగుగ నుండును. పిల్లగారు పౌరాణికధ్వని కోడిరి కాబోలు.

మొత్తముమీద ఈగ్రంథము మహోపకారక మనదగును. దీనిని పాఠ్యగ్రంథముగ నంగీకరించినందున పాఠ్యగ్రంథనిర్ణాయకసమితి వారును వంద్యులగుచున్నారు. రత్నగర్భ యగు నురవకొండవాస్తవ్యులు శ్రీమంతులును, ధీమంతులును నగు రాజమాన్య రాజపూజిత మిడతల చెన్న బసవప్పగారివంటి ఆఢ్యుల యాదరాభిమానమువలనను ఈగ్రంథము నకు వ్యాప్తి యెక్కువ కాగలదు. ఇది యెంతయు సంతసింపదగిన విషయము. బసవప్పగారొక్కరె నన్నూరుప్రతుల దెప్పించుకొనిరి. వీనినెల్ల వారు సద్వినియోగమున వ్యాపింప జేయదగుదురు. ఇట్టి గ్రంథములు ఇంకను బయలువెడలి ప్రజకు స్వస్వరూపస్థితిని దెలుప వలయుననియు, ఇదియె మంచి యదననియు గ్రంథకర్తగారె సంక్రమణసూత్రములను కడపటియధ్యాయమున నుడివియున్నారు. ఈరూపమున గాకున్నను కొంచె మందుకు సాజాత్యము లగు విషయములతో కొన్ని ప్రకటింపబడియున్నవి.

"గ్రామపునర్నిర్మాణము" అనుపేర నెల్లూరివారు అన్నమరాజు శ్రీరాములుగారొకగ్రంథమును తేటతెలుగు మాటలతో వ్రాసి ప్రకటించియున్నారు. వ్యాసరూపమున కొందఱు "భారతి"యందు వ్రాసియున్నారు. ఆద్యంతములను సమన్వయముజేసి యవతారాది ఫలప్రవచనముతోటి విలసిల్లు గ్రంథమిదియె మొదటిదిగ నున్నది. ఆంధ్రమహాజనులు దీని నాదరించి ప్రోత్సహించినయెడల ఇతోధికము లగు విషయములగూర్చి పిల్ల

గారు వ్రాయ నిచ్చగింతురు. అందుకు వీరు దక్షులును అగుచున్నారు.

ఈ విమర్శలేశమును కేవల మంగళ మూర్తియేగాక మంగళకరుడును నగు (శివ శంకరం) పిల్ల మాటలచేతనే సమాప్తిజేయు టకు కుతూహలమగుచున్నది.

* "యజ్ఞమనగా, యజ్ఞశాల, అగ్ని హోత్రము, ఋత్విక్కులు, వేదఘోష బ్రాహ్మణభోజనములతో మాత్రము కాదు. జనహితమే గురిగాగల స్థానిక కూట మొక్కొక్కటియు దేశమెల్లెడల పర్వియుండు యజ్ఞశాలలు. ప్రెసిడెంటు యజమాని, వోటర్లు, మెంబర్లుగా నుండువారు ఋత్విక్కులు. స్వార్థమే యజ్ఞపశువు. పరహితమే యజ్ఞదీక్ష. ఇట్టి యజ్ఞమే ఇహపరములకు మార్గము."

---



బజారు

—సూర్యం.

* ఫలస్తుతి – పుట – ౧౨౭.

# పెద్దనతరువాతి ప్రబంధకవులు

పానుగంటి లక్ష్మీనరసింహారావు

పెద్దన ప్రథమప్రబంధనిర్మాత. ఇతని తరువాతి ప్రబంధకవులలో రామరాజభూషణుని మొదలు కొని పెద్దన ననుకరింపనివా రెవరును లేరు. మనుచరిత్ర పిల్లలు కొన్ని, పిల్లలపిల్లలు కొన్ని, మేనల్లురు కొన్ని, మేనమామబిడ్డలు కొన్ని, ప్రతిబింబములు కొన్ని బయలుదేరినవి. పెద్దనకు కొడుకుండెనట. ఆతడు జీవితకాలమున నేమిచేయునని రామరాజభూషణునిభార్య పెద్దనభార్య నడిగెనట. శ్లేషకవిత్వము చెప్పుకొనియైన బ్రదుకునని పెద్దనభార్య ప్రత్యుత్తర మిచ్చెనట. రామరాజభూషణునిభార్య సిగ్గుపడెనట. ఇట్లుండగా వసుచరిత్రములోని శ్లేషలు అనేకు లనుకరించిరి. అది కవిత్వమనియే యిప్పటికి అనేకుల యభిప్రాయము. రసగ్రహణముకలిగి కవితాస్వభావ మెఱిగిన కొందరి యభిప్రాయము మఱియొకలాగున నున్నట్లు వినుచున్నాము. ఎటులైననేమి, పిల్లవసుచరిత్రలు, పిల్లపిల్ల వసుచరిత్రలు తుపాకిరవ్వలవలె, అచ్చుగుద్దినప్రతులవలె బైలుదేరుటవలన నెంతగందరగోళమైన నైనది.

ప్రబంధములలో దప్పకుండ యిరువదిరెండు వర్ణన లుండవలెనని కొందర మతము. పందొమ్మిది తోనే సరిపుచ్చవచ్చునని మరికొందరు. ఎటులైననేమి యీవర్ణనలన్ని యుండితీరవలసినవి. బ్రహ్మవిష్ణుశివ మూర్తులయు,వారిభార్యలయు వర్ణన,వినాయకునివర్ణన, కృతికర్తవర్ణన, తన వర్ణన, పురవర్ణన, బ్రహ్మక్షత్రియ శూద్రుల వర్ణన, పుష్పలావికుల వర్ణన, కుకవినింద, షష్ఠ్యంతములు, సతివిరహవర్ణన, చంద్ర, మన్మథ, వాయుమధుపాదుల వర్ణన, వేటవర్ణన, నాయికానాయక సమావేశము, విదూషకునిచే సమావేశపరుపబడుట, వారిద్దరు చేసిన సంభోగవర్ణన, ఒక్కసంభోగము సరి పోవు ననుకొంటిరా, చాలదయ్యా, పునారతివర్ణన, అక్కడనుండి నిత్యవిధిసంభోగవర్ణన, సుతులు గలిగిన మొదల సుతవర్ణన, తరువాత మంగళము, తరువాత గద్య. ఇది ముందు, అది వెనుక; అది వెనుక, యిది ముందు-ఇటులు ఈవర్ణనలన్నియు నుండవలెను.

వసుచరిత్రకారుని కవితనుగూర్చి:—ఇతని పద్యములు కొన్ని చిత్రమైన శ్లేషలుగల్గియున్నవి. ఇతడు మంచి గాయకుడు. ఇతని పద్యముల నిప్పటికి తాళములువైచుచు, కీర్తనలవలె పాడువారుకొందరున్నారు.

"ఆజాబిల్లి వెలుంగువెల్లికల డా
యక లేక రాకానిశా
రాజశ్రీసఖమైన మోమున బటా
గ్రం బొత్తి యొగ్గెత్తి యా
రాజీవానన యేడ్చె కిన్నరవధూ
రాజత్కరాంభోజ కాం
భోజీమేళవిపంచికారవసుధా
పూరంబు తోరంబుగన్."

సురభిమాధవరావుగారు వసుచరిత్రకు దాసులు. ఈయన వసుచరిత్రకారుని పద్యములకు పద్యములు వ్రాసినాడు. 'ఆజాబిల్లి' యనుపద్యమునకు పాఠాంతరపద్యమును జెప్పినాడు. "నాయిక యేడ్చె భూపాళికరాగంబునన్" అని చెప్పినాడు. అనగా తెల్లవారగట్ల పాడు భూపాలరాగమని యర్థము. భూపాలునియందలి నిర్వ్యాజమైన ప్రేమ యని భావము. అందుచేత వెనుకటి పద్యముకంటె మాధవరావుగారు బాసుగా మెరిగించినా డని కొందరి యభిప్రాయము. కవిహృదయ నట్లే సంతోషించియుండెను. అట్లు మెరిగించుట లేదుగాని తరిగించుటమాత్రము జరిగినది. వీలయందురా, కాంభోజీరాగము ఏడ్పున కర్హమైన రాగము. పద్యము రోదనవర్ణనముగలది. కావున సంగీతశాస్త్రానుసారముగ రోదనార్హమైన రాగము వాత దుంచినాడు; కాని మాధవరావుగా రీయంశమును

దెలియలేక భూపాలరాగమని ఫిరాయించినారు. అది ఏడ్పురాగము కాదు. భూపాలరాగము తెల్లవారగట్ల పాడవగినది. ప్రభువులను నిద్రనుండి లేపుటకు ఉపయోగింపబడును. నిద్రలేచి నరముల యుద్రేకముతో ఉత్సాహముగ నుండుటకు భూపాలరాగ మక్కరకు వచ్చును; కాని ఏడ్పునకు బనికిరాదు. అందుచేత సురభి మాధవరావుగారి యేడ్పు దొంగయేడ్పు. ఈ సందర్భమున రామరాజభూషణుని మరియొకపద్యమును వినుడు:

"వాలారుం గొనగోళ్ల నీవలసతిన్
వాయించుచో నాటకున్
మేలంబైన విపంచి నిన్న మొదలున్
నీవంటమింజేసియా
యాలాపంబెయవేళ బల్కెడు ప్రభా
తాయాతవాతాహతా
లోలత్తంత్రుల మేళవింపగదవే
లోలాక్షి దేశాక్షికిన్."

నాటరాగస్వరము స,గ,మ,ప,ని,స, స,నిపమగస్స; దేశాక్షిమీద గీతమే చెప్పెదను. మగరిమగరిస, సనిధ సారి, మగరిసనిధప, ధధపమగరిగ, గపధపధపధసనిధ సారి. దేశాక్షి భూపాలవంటిదే. దేశాక్షిపల్కెడు దానికి బదులుగా నాట పల్కుచున్నది. ఇందు వలన తెలియదగిన దేదనగ, ఆనాటి వీణలకు మెట్లు ఏరాగమున కారాగము సర్దుకొనదగినవే. ఇప్పటి వీణలకు కదలని మెట్లు యెట్లోయొకట్లు. కాని యీచిత్రమేమి. గాలిచే తీగలు కదలినంతమాత్రమున నాటరాగము పల్కుటేమి. చేతబట్టుకొని శ్రుతితీగలను, తంబురతీగలను వాయించుచు ఆయామెట్ల నుంకించి నొక్కినగాని పల్కునా. విరుద్ధముగ లేదా? అదేమి మాట? మహతియను వీణ 'ఓం' అని పల్కెడిదికాదా యని యాక్షేపింతురా? గాలిచేత తీగ గదలినయెడల రాగము పల్కదుగాని ధ్వనియగుట కేమి? రామరాజ భూషణుడు ఇట్లు వ్రాసియుండెనేమి? అతడు గాత్రజ్ఞుడేకాని జంత్రజ్ఞుడు కాడేమో యని యనుకొనవలసి వచ్చినది. శ్లేషార్థములలో నితని వర్ణనాశక్తినిగూర్చి చెప్పెదను. స్త్రీతొడలను వర్ణించుచు పద్యము చెప్పినాడు:

"సతియూరుద్యుతి జెందబూని నిజదు
శ్చర్మాపనోదక్రియా
రతిబాధో లవపూరితోదరములై
రంభేభహస్తంబు లు
న్నతతిన్ వీడె మరుద్విభూతిగదళిన్
దగ్దోషమాచంచలో
ద్ధతశుండాతతి బాయదయ్యె నదెవో
తద్వైరమూలం బిలన్."

ఇందులోని గాథయేమనగా, కదళీవృక్షము, కరితుండము గిరికయొక్క తొడలతో పోలుటకై తపము చేసెను. ఎందుకు? కదళికి, తుండమునకుగల దుశ్చర్మము పోవుటకై. కానిగాలితాకుటవలన,అనగా మరుద్విభూతి వలన కదళికి ఊరుసామ్యము సిద్ధించినది. అదిగాక మరుద్విభూతియనగా దేవతావైభవముచేతనని భావము. అట్టి గాలితాకుడువలనగాని, దేవతా ప్రాభవము వలనగాని తుండమునకు దుశ్చర్మమువదలలేదు.కదళివిషయమై దుశ్చర్మమునగాపైదొప్పలు, తుండమువిషయమై బొల్లి, కఱకుదనము,ముడుతలు. కదళి తపస్సున కృతార్థత నొందినది; కాని తుండ మట్లుకాలేదు. అందుచేతనే తుండము కదళితో వైరపడెను. అదియే నారి వైరమునకు మూలమని కవి సెలవిచ్చినాడు. ఇదియేమయ్యా, సతితొడ లెట్లున్నవో చెప్పక తుండము అరటిచెట్లను పీకివేయు చున్నందులకు కారణము జెప్పినావు. తొడలు అరటిబొందల వలెను, తుండమువలెను నున్నవను మాటయే కాని అందుకు భేదమేమైన నున్నదా? ఈమాత్రము దాని కీపద్య మెందులకు?

"సైర్వవిహారధీరలను
సారసలోచన లున్నచోటికిన్
భోరున లాతివారు చన
బూనినచో రసభంగమంచునే
జేరక పూవు దీవియల
చెంతనె నిల్చి లతాంగిరూపుక

న్నారగ జూచివచ్చితి న
వాంబురుహాంబక నీకు దెల్పగన్."

(స్వతంత్రలైన స్త్రీలు (సారసలోచనలు) ఉన్న చోటికిన్ భోరున లాతివారు చనబూనినచో రస భంగమంచు నేజేరక పూవుదీవియలచెంతనె నిల్చి లతాంగి రూపు కన్నారగ గాంచి వచ్చితి నవాంబురుహాంబక నీకు దెల్పగన్.) భోరున లాతివారు. చప్పున అనగా సెలవడుగకుండ పైవారు—ఇచ్చట 'భోరున' యన్నది ప్రాసముకొఱకు—వచ్చినయెడల రసభంగ మగునట. అనగా వారి కింతవరకున్న సంతోషము, సుఖముభంగ మగుననియర్థము. అదిగాక 'రస' అనునక్షరములు భంగ మగునట: అనగా సారసలోచనలు అన్నదానిలో 'రస' పోయినయెడల సాలోచన లగుదురని భావము. ఆఁ! ఎవ్వరు వీరు చెప్పునా యని యాలోచనభావమున స్త్రీ లుందురని కవియభిప్రాయము. అట్లు వారి కిబ్బందిగా నుండునని చేయక నేను పూలచెట్లమాటున డాగి లతాంగిరూపు గంటిని. పూవుదీవియలలో ఆమె యొకపూదీగెగనుక లతాంగియన్న విశేషణము బాగుగా నున్నది. రూపు అనగా మంగళసూత్రము గాదు. రూపు కన్నెలు ధరించునది. అందుచేత నీసతిపై నీ పెండ్లియాస అడియాసకాదని విదూషకుడు వసురాజా బహద్దూరులో బల్కెను. ఆవురావురని వేచియున్న యాయశ్వరాసితో గ్రంథాలిగానివలె పెండ్లియైతేనా, పెండ్లియైతేనా అని యెగిరెగిరిపడి స్త్రీరోగబాధాకరు నితో కొంచెము హెచ్చుతగ్గు సముడగు వసురాజుతో జెప్పెను.

ఇతని కవిత్వమార్దవము చూపుటకై రెండు మూడు పద్యములు:

చెలికత్తెలు ఇంకను వసురాజు రాలే డని యాతురతతో గిరికకు నివేదించిన పద్యము-

"ఇన్నగరాజు జూడ వసు
ధేశ్వరు డెన్నడు వచ్చు వచ్చి యా
క్రొన్ననతీవజొంపముల
కోనకు నెన్నడు డిగ్గ డిగ్గి యా
కన్నియ గన్నులార కుచ
కుంభున నెన్నడు గాంచు కాంచి తా
నెన్నడు గారవించు చెలు
లెన్నడు గాంతు రభీష్టసంపదల్."

మంటికి కత్తి, కత్తికి కంప, కంపకు రొట్టె, రొట్టెకు ముండ, ముండకు డోల్, డోల్ బజా అని అనకాపల్లి బులుసుపాపయ్యశాస్త్రిగారి ముక్తపద గ్రస్తాలంకారోదాహృతగద్య శ్రాద్ధమువలె నుండక యీ పద్యము మిగుల సొంపుగ నున్నది. ఇట్టిదో, ఇంతకన్న మిన్నయో అను నొక్కపద్యము చెప్పెదను:—

"ఏమేమీ జగతిన్ గఠోరములు శై
లేంద్రంబులౌగా వదీ
యామేయస్వయభేద·యంతకు గఠో
రాకారుడౌనే కదా
యామేటిన్ ధృతివాపి చూపులనె యా
టాడించునా రెంతవా
రో మీనేక్షణ దా నెరుంగ దెశదా
రూఢ.ప్రభావోన్నతుల్."

ఓహో! రామరాజభూషణా! శేషుడి శిరస్సు వంపింపవలసిన పద్యము జెప్పితివయ్యా. ఇంత మృదులత, ద్రాక్షపాకము నీసొమ్మేనయ్యా! మహాకవీ!

"నాళీకాకరతీరసారకదళీ నారంగపూగావళీ
పాళీవాసితమైన కోన గని యాబల్లోనలో గానలో
లాళిప్రేరకరత్నకోరక మయూ ఖాళీసమాలీఢమా
కేళీధామముగంటిభూరమణయాకేళీనివాసంబునన్."

ఇతడు బహుప్రశస్తకవి. అయిననేమి? పనికి మాలిన శ్లేషములకై బోయి యేమో యైనా డని చెప్ప వలసివచ్చినది.

ఇకగాను ముందు శిష్టు కృష్ణమూర్తిగారు, ఆయన తరువాతి ప్రబంధకవులగూర్చి చెప్పెదను.

# అర్ధరాత్రము

జి. జాషువ

ప్రళయకాలాంబుదంబు లంబరమునేలి
యుఱుముచున్నవి, భువన మట్టూఁతలూఁగ
గుసగుసలువోవుచున్నది కువలయంబు
కలదు గాఁబోలు నెత్తుటి గాలివాన.

మంచిరోజు లెందు మాయమైపోవునో
కలహభేరి మ్రోసెఁ గంఠమెత్తి
కలవరించు రాజ్యముల హడావుడిఁ జూచి
మృత్యుదేవి వీణె మీటుకొనియె.

నేఁడో! రేపో! రక్తపుఁ
గూడుగుడిచి, యేమి పాడుకొనునో భాషా
క్రీడావతి, యేదేశము
పాడువడునో, యెంతకీడు వాటిల్లెడినో.

పోటమరించిన పోరాటముల నెపమునఁ
బ్రసవవేదనవడు ధరావలయమునకు
జననమందునో! లేదో ప్రశాంతిశిశువు
మలయునో లేదో యానందమారుతంబు.

ఈ కలహాసహోన్మదమహీవలయంబు, పిశాచయోగ్యమై
చీఁకటికోనమై, యశుభ చిహ్నితమైన నిశీథమందు న
య్యో! కనుమూసి, తూలిపడి యున్నది, ముక్తకరాళఖడ్గమై
యేకడ డాఁగెనో! తెలియ దిద్ధపరాక్రమగర్వబీజముల్.

కలకలలాడుసంపదల కౌఁగిట నూయెలలూఁగు ధారణీ
శులు శయనించినారు, రణ శూరుల కత్తుల కాపలాలలో
బలిసిన గుడ్లగూబల రవంబున నీ నడురేయి, యే యమం
గళములు వల్కెనో! పగిడి కంటులు నవ్వెఁ గికాకికధ్వనిన్.

# సారంగధరనాటకం

చింతా దీక్షితులు

## ౧

[ఏకాంతగృహములో రాజరాజు కూర్చున్నాడు. ఏభై సంవత్సరముల వయస్సుండవచ్చును. తల నెరుస్తోంది. ముఖము ముడతలుపడబోతున్నది. ఉప్పాడజరీ సెల్లా కట్టుకొన్నాడు. కుడితినీ తొడుక్కున్నాడు. గోడలమీద అనేక రకాల చిత్రాలు వ్రాసిఉన్నవి. దిండును జేర్లాబడి కూర్చుని ఆచిత్రాలకేసి చూస్తూ ఏదో ఆలోచిస్తున్నాడు.]

రాజరాజు

శివుడు గంగను వివాహం చేసుకోలేదూ? శ్రీకృష్ణుడు ఎనమండుగురిని పెళ్లిచేసుకోలేదూ? నేను మళ్లీ పెళ్లాడితే వచ్చే ఉపద్రవం ఏమిటి? త్రికాలజ్ఞులైన పురోహితులు, అందువల్ల నాకు శాశ్వతమైన అపకీర్తి వచ్చి లోకములో స్థిరస్థాయిగాఉంటుందని చెప్పుతున్నారు. శివుణ్ణీ, శ్రీకృష్ణుణ్ణీ చిత్రాలుగా వ్రాసినట్లే నన్నూ గోడలమీద చిత్రాలుగా వ్రాసి ఆక్షేపిస్తారో ఏమిటో? ఈవయస్సులో నాకు ఈకోరిక ఎందుకు కలగాలో? ఇదంతా పురాకృతకర్మఫల మేమో? ఎంత దులుపుకొందామన్నా వదలిపోకుండా ఉంది ఈకోరిక. కీర్తి వచ్చినా, అపకీర్తి వచ్చినా, తలపెట్టిన ఈ కార్యము చెయ్యకుండా ఉండలే ననిపిస్తోంది. నిన్న గోదావరిమీద విహారముచేస్తూంటే తటాలున ఈ కోరిక మనస్సులో ప్రవేశించింది. త్రికరణశుద్ధిగా గోదావరిని ప్రార్థించాను. మార్కండేయస్వామినైపు తిరిగి మొక్కాను, నాకు కర్తవ్య ముపదేశించమని. నా కోరిక ఉచితమైనదే అని నా మనస్సు కప్పుడు తట్టింది. అయినా అబ్బాయిగారి అభిప్రాయం ఏమిటో తెలుసుకోవాలి:

[ఏకాంతగృహమునుంచి బయటకు వచ్చుస్తు. వసారాలో తివాసీలూ, దిండ్లూ, వాటిమీద పరిచిన ముఖమల్ దుప్పట్లూ ఉన్నవి. పశ్చిమంగా గోదావరి కనిపిస్తూ ఉంటుంది. సేవకుడు చల్లాడను తొడుక్కొని, అంగీ వేసుకొని, తలపాగా చుట్టుకొని ఒక ప్రక్క నిలిచి ఉంటాడు. రాజరాజు పెదవులకేసి చూస్తూ ఉంటాడు సేవకుడు. రాజరాజు ఒకదిండుదగ్గిర కూర్చుని గోదావరికేసి చూస్తూ దిండుమీద జేర్లాబడి]

రాజరాజు

అబ్బాయిగారిని నాయనగారు రమ్మంటున్నారనిచెప్పు

సేవకుడు

బుద్ధి, బుద్ధి, మహారాజా.

రాజరాజు

సారంగుని రమ్మను.

సేవకుడు

చిత్తం, మహారాజా. (సేవకుడు వెళ్లును)

రాజరాజు

అబ్బాయిగారిని ఏమని అడిగేది? అబ్బాయిగారు ఆ పిల్లనే చేసుకొంటానంటే ఒకవేళ! నా అభిప్రాయం తెలిస్తే ఎప్పుడూ అలాగ అనడు. అయినా చారులవల్ల అతని అభిప్రాయం గ్రహిస్తే బాగుంటుంది. అబ్బాయిగారి మనస్సుకు వ్యథకలిగించి నే నెందుకు ఇట్టి సౌఖ్యము లాశించడం ?

సేవకుడు

(ప్రవేశించి) యువరాజావారు వేంచేస్తున్నారు మహారాజా.

[సేవకుడు తొలగి దూరముగా నిలుచును. సారంగధరుడు ప్రవేశము. నిగనిగలాడే శరీరము. మొలకమీసము. ఉప్పాడ సెల్లా కట్టుకున్నాడు. పట్టుకండువా వల్లెవాటుగా వేసుకొన్నాడు. చెవులకు వజ్రాల తమ్మెట్లు. చేతులకు కెంపుల కడియాలు. గిరజాల జుట్టు. నడినెత్తిమీద ముడి.]

రాజరాజు
రండి, అబ్బాయిగారు కూర్చోండి.

సారంగధరుడు
(తండ్రిసమీపాన కూర్చొని) నాయనగారి ఆజ్ఞ అయినదని సేవకునివల్ల విన్నవించగా వచ్చాను.

రాజరాజు
ఏమిటివింతలు చూస్తున్నారు ఇంతదాకా.

సారంగధరుడు
గోదావరిలో మన నావికులు బలాబలములు చూచుకొంటున్నారు. రాళ్లు నింపిన పడవను తాడుకట్టి ఆతాడు పళ్లతో పట్టుకొని గోదావరి ఈదుకుపోతున్నాడు ఒకడు. ఆపడవను గోదావరిమధ్యకు తీసుకుపోయి వదులుతాడట. వాడితో పందెంవేసినవాడు మళ్లీ ఆవిధంగానే ఒడ్డుకు తీసుకువస్తాడట ఆపడవను.

రాజరాజు
యువరాజుగారు ఆపందెము చూస్తున్నారా?

సారంగధరుడు
ఆయిద్దరికీ చేరినూరువరహాలూ బహుమానం చేస్తానన్నాను—సరిగా వారు కార్యం నెరవేరిస్తే. నాయనగారు అలాగ ఉత్తరంగాచూస్తే అదిగో అక్కడ కనిపిస్తుంది.

రాజరాజు
(అటు చూడకుండా) అబ్బాయిగారితో ఒకమాట చెప్ప దలచాము.

సారంగధరుడు
ఆలకిస్తున్నాను నాయనగారూ.

రాజరాజు
అబ్బాయిగారికి ఇదివరలో చేసిన వివాహప్రయత్నము రద్దుచేసి మళ్లీ పునఃప్రయత్నము చేయదలచాము. అబ్బాయిగారి అభిప్రాయ మెలా ఉంటుందో తెలుసుకో కోరుతున్నాము.

సారంగధరుడు
తల్లినీ, తండ్రినీ దేవతలుగా భావించి వారిఆజ్ఞలు శిరసావహించడమే నా ధర్మముగా భావించుకొంటున్నాను నాయనగారూ.

రాజరాజు
మహారాణీగారి అభిప్రాయ మేమిటో?

సారంగధరుడు
మాతాజీవారు నాయిష్టమునకు వ్యతిరేకముగా నడవరు. అయినా మాతాజీవారితో మనవిచేస్తాను.

రాజరాజు
మనవిచేసి పర్యవసానం తెలియజెయ్యండి.

సారంగధరుడు
(లేచి వెడుతూ) చిత్తం.

[సారంగధరుడు వెళ్లిపోవును. సేవకుడు సమీపించి రాజరాజు పెదవులను కనిపెట్టుచుండును.]

రాజరాజు
(సేవకునివేపు చూస్తూ) దక్షిణభవనము ప్రవేశించబోతున్నాము.

[సేవకుడు వడివడిగా పోవును. రాజరాజు బద్ధకముగా లేచును. ఇంకొక సేవకుడు చడావులు తొడుగును. ఒక దాసీ మెళ్లో ముత్యాలహారాలు వేసి పట్టుసెల్లా బుజం మీద వేయును. రాజు దక్షిణభవనమునకు నడుచును.]

* * * * *

చేటిక
మహారాజావారు ఇట్లా దయచేయవలెను. ఇటు ఇటు.

రాజరాజు
కుంకుమవతి చిత్రాంగి మాతో ప్రసంగించడమునకు యిష్ట పడ్డదా?

చేటిక
పుష్పములు చేతపట్టుకొని వేచియున్నా రమ్మగారు. అదే చిత్రాంగిఅమ్మవారి శాల.

రాజరాజు
మంచిది.

[చేటిక వెళ్లిపోవును. చిత్రాంగి పదిహేనేళ్ల పిల్ల; బటువుతో చేరెడుచెంపన దాసీ జింకపిల్లలా ఉంది. రాజరాజురాక చూచి పువ్వులపళ్లెం చేత్తోపట్టుకొని, గోడవేపు ముఖంపెట్టి నిలబడింది.]

రాజరాజు

కాబోవు చిన్నరాణీగారికి క్షేమమా?

చిత్రాంగి

(పువ్వులపళ్లెం కిందకు జారవిడిచి మాట్లాడకుండా నిల్చుచుండును.)

రాజరాజు

మా కుమారరత్నము మా అభిప్రాయంలో ఏకీభవించాడు. దేవేరిగారి అభిప్రాయమున్నూ మాకు వ్యతిరేకముగా ఉండదు. మీ సమ్మతికూడా ఉంటే నేను ధన్యుణ్ణే.

చిత్రాంగి

వలలో చిక్కిన పిట్టల్లో వండుకుటకు కలవాటి అన్నాడట బోయవాడు.

రాజరాజు

దేశములు జయించిన రాజుకు ఒక్క ముగ్ధహృదయమును జయించడము కష్టసాధ్యము కాదనుకుంటాను.

చిత్రాంగి

జయాపజయముల తీరు ముగ్ధల కెట్లా తెలియును?

రాజరాజు

నా సామ్రాజ్యము నీవశము; భోగములు నీవశము; నవరత్నరాసులు నీవశము; నా సమస్తమూ నీవశము; నా హృదయము నీవశము— నీ సమ్మతి నా వశము చెయ్యలే..?

చిత్రాంగి

చిన్నతనపు మోటుమాటలను క్షమించవలెను ఈ అబలను మహారాజావారు. సిరిరా మోకాలొడ్డే ముగ్ధను మాత్రం కాను నేను.

[క్రిందపడ్డ పళ్లెంలోకి చెదిరిన పువ్వులు ఎత్తి రాజరాజుకు సమర్పించును. రాజరాజు సంతోషముతో స్వీకరించును.]

రాజరాజు

మంగళసూత్రధారణమునకు గళము సవరించుకో. మళ్లీ వస్తా చిన్నిరాణీగారూ!

చిత్రాంగి

చిత్తం.

[రాజు వెళ్లిపోవును. చిత్రాంగి తన కాలతలుపు మూసుకొని ఆలోచనలో మునిగిఉండును.]

చిత్రాంగి

రాజుకు మంగళసూత్రము కట్టుటకు గళము ఇస్తా. యువరాజుకు దేహమూ, హృదయమూ.

* * * * *

సారంగధరుడు

మాతాదేవారు నాయనగారితో స్వయముగా మాట్లాడదలచినట్లు విన్నవించమన్నారు.

రాజరాజు

ఎక్కడ ఉన్నారు?

సారంగధరుడు

ఉత్తరభవనములో తూర్పువైపున ఉన్న ఉద్యానములో లతాకుంజమున ఒంటరిగా కూర్చున్నారు.

రాజరాజు

దారిచూపండి.

సారంగధరుడు

తామొక్కరూ రావలసినదనే మాతాదేవారి అభిప్రాయము.

రాజరాజు

మంచిది.

* * * * *

[బాణము నచ్చుకొన్న ఆడపులిలాగ రత్నాంగి పొదరింట కూర్చున్నది. నలభైఏళ్ల వయస్సు. ఒంటిమీద ఆభరణాలు తక్కువగా ఉన్నవి. పట్టుచీర కట్టుకొన్నది. పట్టు ఉత్తరీయముతో దేహమును కప్పుకొన్నది. దూరమున రాజరాజును చూచి నిలుచున్నది. రాజరాజు సమీపించగానే అతని పాదాలకు నమస్కరించి నిలబడ్డది. రాజరాజు ఒక చలువరాతి అరుగుమీద కూర్చున్నాడు. రత్నాంగిని కూర్చోమంటే కూర్చోలేదు.]

రాజరాజు

దేవేరిగారికి కుశలమా ?

రత్నాంగి

స్థిరచిత్తుని వివాహమాడిన యువతికి చిత్తశాంతి ఉంటుంది. చంచలచిత్తుని భార్యకు ఎక్కడిది కుశలము ?

రాజరాజు

కోప మెరుగని దేవిగారి నావేశించిన ఈ కోపమునకు జన్మస్థాన మేదో?

రత్నాంగి

పతికి హితము బోధించని సతికి నరకమని పెద్దలు చెప్తారు. కాబట్టి మనవిచేస్తున్నాను.

రాజరాజు

నీతివాక్యములు వినివిని చెవులు చిల్లులుపడ్డవి. రాజ్యభారమున్నా, కుటుంబభారమున్నా మాతో సరిసమానముగా పంచుకొన్న దేవిగారితో ఒక్కమాట మాత్రమే చెప్పదలచాము.

రత్నాంగి

చక్రవర్తులవంటి మహామహులని నే నెంచుకొంటూన్న మహారాజుగారికి నేటికి నేను హితోపదేశము చెయ్యవలసివచ్చెగదా అని వగస్తున్నాను. అబ్బాయిగారి వివాహము రద్దు చెయ్యడమా! మహారాజుకూడా మనుష్యుడే. అతడుకూడా హద్దుమీరరాదు.

రాజరాజు

నాసంకల్పమునకు యువరాజుగారి—మన కుమారరత్నము సమ్మతి ఉన్నది. చిత్రాంగి ఇష్ట మున్నది. మాకు అపేక్ష ఉన్నది. దేవిగారిసమ్మతికూడా ఆశిస్తున్నాము కాబట్టి దేవిగారు ఎట్టిఅభ్యంతరమూ చెప్పకూడదు

రత్నాంగి

బుద్ధిని పెడదారిని పెట్టే వయస్సు కాదు మీది. ధర్మమును హత్యచేసే చదువుకాదు మీరు నేర్చినది. నీతిని విస్మరింపచేసే బోధలు కావు మీమంత్రులవి. మీకష్టసుఖములు పంచుకొన్న నాసతీత్వమునకు నే నెట్టి కళంకమూ తీసుకురాలేదు. మహారాజా, ఎక్కడినుండి వచ్చినది ఈ అధర్మసంకల్పము మీకు ?

రాజరాజు

న్యాయకార్యములు చేయడములోనే అలవాటుపడ్డ నా బుద్ధికి నేడు అధర్మసంకల్పము ఎట్లా పుట్టగలదు దేవీ!

రత్నాంగి

ఎప్పుడూ వర్షములుకురిసే మేఘములనుండి పిడుగులు పడడం లేదా— వినండి, మహారాజా వినండి— ఈ సంకల్పమే మన రాజ్యమునకు ముప్పుతెస్తుంది. మన సౌఖ్యమునకు అంతరాయము కలిగిస్తుంది. మన వంశమును మంటకలుపుతుంది. నాకడుపులో చిచ్చుపెడుతుంది— విడవండి మహారాజా, విడవండి ఈసంకల్పం........
........ ... . ....

౨

రాత్రివేళ నే నొక్కడనే కూర్చుని వ్రాస్తున్నాను సారంగధర నాటకం. ఇంతవరకూ వ్రాసేసరికి అర్ధరాత్రి అయినది. ఇంట్లో అందరూ నిద్రపోతున్నారు. గోడమీద గడియారముమాత్రము టక్కు టక్కుమని కొట్టుకొంటోంది. అప్పుడప్పుడు కుక్కలు మొరుగుతున్నాయి. అప్పుడప్పుడు మోటారు బండ్లు దూరమునుంచి మొరుగుతూ పోతున్నవి. రత్నాంగి వాక్యములు ముగించి రాజరాజువాక్యములు వ్రాయబోతున్నాను. బుర్ర వంచుకొని కాగితముమీద దృష్టినిలిపి ఆలోచిస్తూన్న నేను ఉలిక్కిపడ్డాను. నా కల మెవరో గట్టిగా పట్టుకొన్నారు. తలమెత్తి చూచాను. ఒక ముసలిమనిషి నా యెదుట నవ్వుతూ నిలబడ్డాడు. ఇతడు ఎక్కడనుంచి వచ్చిఉంటాడని నాలుగు వేపులా చూచాను. వేసినతలుపులు వేసినట్లే ఉన్నవి. దీపము యథాప్రకారం వెలుగుతోంది. గడియారము

యథాప్రకారము టక్కుటక్కుమని కొట్టు కొంటోంది. ఆశ్చర్యముతోనూ, భయము తోనూ అతనికేసి చూచి "ఎవరు మీా" రని ప్రశ్నించాను. ముసలివాడు నవ్వి "నన్ను గుర్తించలేవా" అన్నాడు. నే నెట్లా గుర్తించగలను ? నే నెన్నడూ చూచినమనిషిలాగ లేడాతడు. ఈకాలపు మనిషిలాగే లేడు. శతాబ్దులను చీల్చుకొని బయటపడ్డ మనిషి లాగ ఉన్నాడు. "చెమ్కీ-కోటూ, చెమ్కీ-షరాయీ, అట్టకిరీటమూ పెట్టుకుంటే గాని గుర్తించలేవుకాబోలు" అన్నాడు.

"ఎవరుమీారు" అని మళ్లా ప్రశ్నించాను.

"పోనీ ఉప్పాడసెల్లా, కుడితినీ, చెడావులూ ఉంటే గుర్తించికుందువేమో" అన్నాడు.

"ఎవరు మీారు? ఇక్కడికి ఎట్లా వచ్చారు? కావ్యరచనకి విఘ్నము తెచ్చిన మీాకు పాపము చుట్టుకోదా" అన్నాను.అని అనుమానపడ్డాను. ఇతడే రాజరాజుకాబోలు ననుకొన్నాను.

"అవును నేను రాజరాజునే" అన్నాడాయన.

"అయితే మీారు నాకలంలోనుంచి దిగారా, ఈకాగింతలోనుంచి లేచారా? ఎట్లా వచ్చారిక్కడికి? నేను సృష్టించిన నాటకపాత్రలకి దేహమూ, ప్రాణమూ వచ్చినవా?"

రాజరాజు—వస్తే రాకూడదా? అందులో ఆశ్చర్యం ఏమిటి?

నేను—మీాకు ఆశ్చర్యం లేకపోవచ్చు. నాబోటివానికి ఆశ్చర్యమే.

రాజు—వెయ్యిసంవత్సరాలక్రితం ఉన్న రాజులను లాక్కువచ్చి నీయిష్టం వచ్చినట్లు ఆడించడంలో ఆశ్చర్యం లేదూ? వారి అంతఃపురాల్లో చొరబడి వారి స్త్రీలచేత అవాకుల్లూ చెవాకులూ పలికించడంలో ఆశ్చర్యం లేదూ? దేశకాలాలని జయించినట్లు ఊహించుకొంటున్నారుకాబోలు మీాకాలపువాళ్లు?

నేను—ఔచితి తప్పకుండా చరిత్రలోని పురుషులచేతా, స్త్రీలచేతా సంభాషణ చేయించడములో తప్పేమిటి? తమ తమ సామర్థ్యాలనుబట్టి కవులు భిన్నభిన్న రీతులుగా వారిచేత మాట్లాడించవచ్చు నిజమే కాని..............

రాజు—వాచాలత్వముకూడా ఈ కాలపువాళ్ల లక్షణముగా ఉంది. అయితే నీవు నాటకంవ్రాస్తున్నావు కాదూ చచ్చిన రాజులూ, రాణీలూ లోకువగా దొరికేరు గదా అని! నేను పాలించేకాలములోనే మమ్ముగురించి యీాలాటి నాటకాలు వ్రాస్తే నీకు ఎటువంటి శిక్ష.........

నేను—ద్వీపాంతరవాసం కాబోలు—అందుకనే వ్యక్తిస్వాతంత్ర్యముగల ఈరోజులలో వ్రాస్తున్నాను.

రాజరాజు
రండి, అబ్బాయిగారు హాజరైనారు.

సారంగధరుడు
(తండ్రిసమీపాన కూర్చొని) నాయనగారి ఆజ్ఞ అయిన
పని సేవకుడు విన్నవించగా వచ్చాను.

రాజరాజు
ఏమిచింతలు చూస్తున్నారు ఇంతదాకా.

సారంగధరుడు
గోదావరిలో మన నావికులు బలాబలములు చూచుకొం
టున్నారు. రాళ్లు నింపిన పడవకు తాడుకట్టి ఆతాడు
పళ్లతో పట్టుకొని గోదావరి ఈదుతున్నాడు ఒకడు.
ఆపడవను గోదావరిమధ్యకు తీసుకుపోయి వదులుతా
డట. వాడితో పందెంవేసినవాడు మళ్లీ ఆవిధంగానే
ఒడ్డుకు తీసుకువస్తాడట ఆపడవను.

రాజరాజు
యువరాజుగారు ఆపందెము చూస్తున్నారా?

సారంగధరుడు
ఆయిద్దరికీ చేరినూరువరహాలూ బహుమానం చేస్తానన్నా
ను—సరిగా వారు కార్యం నెరవేరిస్తే. నాయనగారు
అలాగ ఉత్తరంగా చూస్తే అదిగో అక్కడ కనిపిస్తుంది.

రాజరాజు
(అటు చూడకుండా) అబ్బాయిగారితో ఒకమాట చెప్ప
దలచాము.

సారంగధరుడు
ఆలకిస్తున్నాను నాయనగారూ.

రాజరాజు
అబ్బాయిగారికి ఇదివరలో చేసిన వివాహప్రయత్నము
రద్దుచేసి మళ్లీ పునఃప్రయత్నము చేయదలచాము.
అబ్బాయిగారి అభిప్రాయ మెలా ఉంటుందో తెలు
సుకో కోరుతున్నాము.

సారంగధరుడు
తల్లినీ, తండ్రినీ దేవతలుగా భావించి వారిఆజ్ఞలు శిర
సావహించడమే నా ధర్మముగా భావించుకొంటు
న్నాను నాయనగారూ.

రాజరాజు
మహారాణీగారి అభిప్రాయ మేమిటో?

సారంగధరుడు
మాతాశ్రీవారు నాయిష్టమునకు వ్యతిరేకముగా నడవరు.
అయినా మాతాశ్రీవారితో మనవిచేస్తాను.

రాజరాజు
మనవిచేసి పర్యవసానం తెలియజేయ్యండి.

సారంగధరుడు
(లేచి నడుస్తూ) చిత్తం.
[సారంగధరుడు వెళ్లిపోవును. సేవకుడు సమీపించి
రాజరాజు పెదవులను కనిపెట్టుచుండును.]

రాజరాజు
(సేవకునివేపు చూస్తూ) దక్షిణభవనము ప్రవేశించబోతు
న్నాము.
[సేవకుడు వడివడిగా పోవును. రాజరాజు బద్ధకముగా
లేచును. ఇంకో సేవకుడు చడావులు తొడుగును. ఒక
దాసీ మెళ్లో ముత్యాలహారాలు వేసి పట్టుసెల్లా బుజం
మీద వేయును. రాజు దక్షిణభవనమునకు నడుచును.]

* * * * *

చేటిక
మహారాజావా రిట్లా దయచేయవలెను. ఇటు ఇటు.

రాజరాజు
కుంకుమవతి చిత్రాంగి మాతో ప్రసంగించడమునకు యిష్ట
పడ్డదా?

చేటిక
పుష్పములు చేతపట్టుకొని వేచియున్నా రమ్మగారు.
అదే చిత్రాంగిఅమ్మవారి శాల.

రాజరాజు
మంచిది.
[చేటిక వెళ్లిపోవును. చిత్రాంగి పదిహేనేళ్ల పిల్ల;
బటులుతో చెంగుచెంగున దాటే జింకపిల్లలా ఉంది.
రాజరాజురాక చూచి పువ్వులపళ్లెం చేత్తోపట్టుకొని
గోడవేపు ముఖం పెట్టి నిలబడింది.]

రాజరాజు

కాబోవు చిన్నరాణీగారికి క్షేమమా?

చిత్రాంగి

(పువ్వులపళ్లెం కిందకు జారవిడిచి మాట్లాడకుండా నిల్చుండును.)

రాజరాజు

మా కుమారరత్నము మా అభిప్రాయంలో ఏకీభవించాడు. దేవేరిగారి అభిప్రాయమున్నా మాకు వ్యతిరేకముగ్గా ఉండదు. మీసమ్మతికూడా ఉంటే నేను ధన్యుణ్ణి.

చిత్రాంగి

వలలో చిక్కిన పిట్టల్ని వండుకుంటాకు సెలవా అన్నాడట బోయవాడు.

రాజరాజు

దేశములు జయించిన రాజును ఒక్క ముగ్ధహృదయమును జయించడము కష్టసాధ్యము కావలసినేంటావు.

చిత్రాంగి

జయాపజయముల మీరు ముగ్ధల కెట్లా తెలియును?

రాజరాజు

నా సామ్రాజ్యము నీవశము; భోగములు నీవశము; నవరత్నరాసులు నీవశము; నా సమస్తమూ నీవశము; నా హృదయము నీవశము— నీసమ్మతి నావశము చెయ్యవేం?

చిత్రాంగి

చిన్నతనపు మోటుమాటలకు క్షమించవలెను ఈ అబలను మహారాజావారు. సిరిరా మోకాలొడ్డే ముగ్ధను మాత్రం కాను నేను.

[క్రిందపడ్డ పళ్లెంలోకి చెదిరిన పువ్వులు ఎత్తి రాజరాజుకు సమర్పించును. రాజరాజు సంతోషముతో స్వీకరించును.]

రాజరాజు

మంగళసూత్రధారణమునకు గళము సవరించుకో. వెళ్లి వస్తా చిన్నిరాణీగారూ!

చిత్రాంగి

చిత్తం.

[రాజు వెళ్లిపోవును. చిత్రాంగి తన కాలతలుపు మూసుకొని ఆలోచనలో మునిగిఉండును.]

చిత్రాంగి

రాజుకు మంగళసూత్రము కట్టుటకు గళము ఇస్తా. యువరాజుకు దేహమూ, హృదయమూ.

* * * * *

సారంగధరుడు

మాతాజీవారు నాయనగారితో స్వయముగ్గా మాట్లాడ దలచినట్లు విన్నవించమన్నారు.

రాజరాజు

ఎక్కడ ఉన్నారు?

సారంగధరుడు

ఉత్తరభవనములో తూర్పువైపున ఉన్న ఉద్యానములో లతాకుంజమున ఒంటరిగా కూర్చున్నారు.

రాజరాజు

దారి చూపండి.

సారంగధరుడు

ఇక మెుక్కరూ రావలసినదనే మాతాజీవారి అభిప్రాయము.

రాజరాజు

మంచిది.

* * * * *

[బాణము గుచ్చుకొన్న ఆడపులిలాగ రత్నాంగి పొదరింట కూర్చున్నది. నలభైఏళ్ల వయస్సు. ఒంటిమీద ఆభరణాలు తక్కువగా ఉన్నవి. పట్టుచీర కట్టుకొన్నది. పట్టుఉత్తరీయముతో దేహమును కప్పుకొన్నది. దూరమున రాజరాజును చూచి నిలుచున్నది. రాజరాజు సమీపించగానే అతని పాదాలకు నమస్కరించి నిలబడ్డది. రాజరాజు ఒకచలవరాతి అరుగుమీద కూర్చున్నాడు. రత్నాంగిని కూర్చోమంటే కూర్చోలేదు.]

రాజరాజు

దేవేరిగారికి కుశలమా ?

రత్నాంగి

స్థిరచిత్తుని వివాహమాడిన యువతికి చిత్తశాంతి ఉంటుంది. చంచలచిత్తుని భార్యకు ఎక్కడిది కుశలము ?

రాజరాజు

కోప మెరుగని దేవిగారి నావేశించిన ఈ కోపమునకు జన్మస్థాన మేదో?

రత్నాంగి

పతికి హితము బోధించని సతికి నరకమని పెద్దలు చెప్తారు. కాబట్టి మనవిచేస్తున్నాను.

రాజరాజు

నీతివాక్యములు వినివిని చెవులు చిల్లులుపడ్డవి. రాజ్యభారమున్నూ, కుటుంబభారమున్నూ ప్రీతితో పరిపూర్ణముగా పంచుకొన్న దేవిగారితో ఒక్కమాట మాత్రమే చెప్పదలచాము.

రత్నాంగి

చక్రవర్తులవంటి మహామహు లని నే నెంచుకొంటూన్న మహారాజుగారికి నేటికి నేను హితోపదేశము చెయ్యవలసివచ్చెగదా అని వగస్తున్నాను. అబ్బాయిగారి వివాహము రద్దుచెయ్యడమా! మహారాజుకూడా మనుష్యుడే. అతడుకూడా హద్దుమీరరాదు.

రాజరాజు

నాసంకల్పమునకు యువరాజుగారి—మన కుమారరత్నము సమ్మతి ఉన్నది. చిత్రాంగి ఇష్ట మున్నది. మాకు అపేక్ష ఉన్నది. దేవిగారిసమ్మతికూడా ఆశిస్తున్నాము కాబట్టి దేవిగారు ఎట్టిఅభ్యంతరమూ చెప్పకూడదు

రత్నాంగి

బుద్ధిని పెడదారిని పెట్టే వయస్సు కాదు మీది. ధర్మమును హత్యచేసే చదువుకాదు మీరు నేర్చినది. నీతిని విస్మరింపచేసే బోధలు కావు మీమంత్రులవి. మీకష్టసుఖములు పంచుకొన్న నాసతీత్వమునకు నే నెట్టి కళంకమూ తీసుకురాలేదు. మహారాజా, ఎక్కడినుండి వచ్చినది ఈ అధర్మసంకల్పము మీకు ?

రాజరాజు

న్యాయకార్యములు చేయడములోనే అలవాటుపడ్డ నా బుద్ధికి నేడు అధర్మసంకల్పము ఎట్లా పుట్టగలదు దేవీ!

రత్నాంగి

ఎప్పుడూ వర్షములుకురిసే మేఘములనుండి పిడుగులు పడడం లేదా— వినండి, మహారాజా వినండి— ఈ సంకల్పమే మన రాజ్యమునకు ముప్పుతెస్తుంది. మన సౌఖ్యమునకు అంతరాయము కలిగిస్తుంది. మన వంశమును మంటకలుపుతుంది. నాకడుపులో చిచ్చుపెడుతుంది— విడవండి మహారాజా, విడవండి ఈసంకల్పం.........
....... .... . ....."

౨

రాత్రివేళ నే నొక్కడనే కూర్చుని వ్రాస్తున్నాను సారంగధర నాటకం. ఇంతవరకూ వ్రాసేసరికి అర్ధరాత్రి అయినది. ఇంట్లో అందరూ నిద్రపోతున్నారు. గోడమీద గడియారముమాత్రము టక్కుటక్కుమని కొట్టుకొంటోంది. అప్పుడప్పుడుకుక్కలు మొరుగుతున్నాయి. అప్పుడప్పుడు మోటారు బండ్లు దూరమునుంచి మొరుగుతూ పోతున్నవి. రత్నాంగివాక్యములు ముగించి రాజరాజువాక్యములు వ్రాయబోతున్నాను. బుర్ర వంచుకొని కాగితముమీద దృష్టినిలిపి ఆలోచిస్తూన్న నేను ఉలిక్కిపడ్డాను. నా కలమెవరో గట్టిగా పట్టుకొన్నారు. తలమెత్తి చూచాను. ఒక ముసలిమనిషి నా యెదుట నవ్వుతూ నిలబడ్డాడు. ఇతడు ఎక్కడనుంచి వచ్చిఉంటాడని నాలుగువేపులా చూచాను. వేసినతలుపులు వేసినట్లే ఉన్నవి. దీపము యథాప్రకారం వెలుగుతోంది. గడియారము

యథాప్రకారము టక్కుటక్కుమని కొట్టుకొంటోంది. ఆశ్చర్యముతోనూ, భయముతోనూ అతనికేసి చూచి "ఎవరు మీ" రని ప్రశ్నించాను. ముసలివాడు నవ్వి "నన్ను గుర్తించలేవా" అన్నాడు. నే నెట్లా గుర్తించగలను? నే నెన్నడూ చూచినమనిషిలాగ లేడాతడు. ఈకాలపు మనిషిలాగే లేడు. శతాబ్దులను చీల్చుకొని బయటపడ్డ మనిషిలాగ ఉన్నాడు. "చెమ్కీకోటూ, చెమ్కీషరాయీ, అట్టకిరీటమూ పెట్టుకుంటే గాని గుర్తించలేవు కాబోలు" అన్నాడు.

"ఎవరుమీరు" అని మళ్లా ప్రశ్నించాను.

"పోనీ ఉప్పాడసెల్లా, కుడితినీ, చెడావులూ ఉంటే గుర్తించికుందువేమో" అన్నాడు.

"ఎవరు మీరు? ఇక్కడికి ఎట్లా వచ్చారు? కావ్యరచనకి విఘ్నము తెచ్చిన మీకు పాపము చుట్టుకోదా" అన్నాను.అని అనుమానపడ్డాను. ఇతడే రాజరాజుకాబోలు ననుకొన్నాను.

"అవును నేను రాజరాజునే" అన్నాడాయన.

"అయితే మీరు నాకలంలోనుంచి దిగారా, ఈకాగింతలోనుంచి లేచారా? ఎట్లా వచ్చారిక్కడికి? నేను సృష్టించిన నాటకపాత్రలకి దేహమూ, ప్రాణమూ వచ్చినవా?"

రాజరాజు—వస్తే రాకూడదా? అందులో ఆశ్చర్యం ఏమిటి?

నేను—మీకు ఆశ్చర్యం లేకపోవచ్చు. నాబోటివానికి ఆశ్చర్యమే.

రాజు—వెయ్యిసంవత్సరాలక్రితం ఉన్న రాజులను లాక్కువచ్చి నీయిష్టం వచ్చినట్లు ఆడించడంలో ఆశ్చర్యం లేదూ? వారి అంతఃపురాల్లో దూరబడి వారి స్త్రీలచేత అవాక్కులూ చెవాకులూ పలికించడంలో ఆశ్చర్యం లేదూ? దేశకాలాలని జయించినట్లు ఊహించుకొంటున్నారు కాబోలు మీకాలపువాళ్లు?

నేను—ఔచితి తప్పకుండా చరిత్రలోని పురుషులచేతా, స్త్రీలచేతా సంభాషణ చేయించడములో తప్పేమిటి? తమ తమ సామర్థ్యాలనుబట్టి కవులు భిన్నభిన్న రీతులుగా వారిచేత మాట్లాడించవచ్చు నిజమే కాని..............

రాజు—వాచాలత్వముకూడా ఈ కాలపువాళ్ల లక్షణముభాగ ఉంది. అయితే నీవు నాటకం వ్రాస్తున్నావు కాదూ చచ్చిన రాజులూ, రాణీలూ లోకువగా దొరికేరు గదా అని! నేను పాలించేకాలములోనే మమ్ముగురించి యీలాటి నాటకాలు వ్రాస్తే నీకు ఎటువంటి శిక్ష.........

నేను—ద్వీపాంతరవాసం కాబోలు—అందుకనే వ్యక్తిస్వాతంత్ర్యముగల ఈరోజులలో వ్రాస్తున్నాను.

రాజు—ఏవో కొత్తమాటలు కూడా నేర్చుకొన్నట్లున్నారు నారాజమహేంద్రవరం ప్రజలు — అయితే కవీ — నిన్ను ఎవరు వ్రాయమన్నారు ఈనాటకం?

నేను—ఎవరు వ్రాయమనడం ఏమిటి? ఒకరు వ్రాయమంటే వ్రాయాలా, లేకుంటే మానాలా?

రాజు— ఓహో వ్యక్తిస్వాతంత్ర్యము కాబోలు ఇదన్నీ!

నేను —అయితే ఎవరు వ్రాయమనాలి?

రాజు—నిన్ను పాలించే రాజు వ్రాయ మన్నాడా?

నేను—లేదు, నన్ను పాలించే రాజుకు తెలుగురాదు.

రాజు—నీఇష్టదేవుడు వ్రాయ మన్నాడా?

నేను—దేవు డెలా వ్రాయమంటాడు?

రాజు—స్వప్నములో దర్శనమిచ్చి.

నేను—ఓహో అదా! లేదు.

రాజు—సరే, ఎవరూ వ్రాయమన లేదు—పోనీ ఎందుకోసం వ్రాస్తూన్నట్లు?

నేను—ఎందుకోసమేమిటి?

రాజు—ఏమిటా? లోకములో ధర్మము పెంపుచేయవలెననా? నీతి బోధించవలెననా? ఆనందము యివ్వవలెననా?

నేను—ముందుగా ఇవన్నీ అనుకొంటే గాని వ్రాయకూడదా? నానాటకానికి ఈ ప్రయోజనములన్నీ ఉండవచ్చు, కొన్ని ఉండవచ్చు, అసలే లేకపోవచ్చు.

రాజు—మరి ఎందుకు ఈ వ్రాతలు—

నేను—కోకిల ఎందుకు కూయడం, సెలయేరు ఎందుకు పరిగెత్తడం.........

రాజు — నువ్వు కూడా కూస్తూనూ ఉన్నావు, పరిగెడుతూనూ ఉన్నావు, తింటూనూ ఉన్నావు, కంటూనూ ఉన్నావు. పైపెచ్చు ఈనాటకం వ్రాయడ మెందుకంట?

నేను—ఎందుకో వ్రాస్తున్నాను. ఎందుకు మీా కీగోడవంతా?

రాజు— ఏదో కారణం ఉండకుండా ఉండదు. ధనము నాశించా? కీర్తి నాశించా? ఎందుకు వ్రాస్తూంట?

నేను— ఈ కాలంలో ధన మిచ్చేదాతేడీ?

రాజు—మరి కీర్తికా?

నేను—చదివేవా డుంటేగదా కీర్తో, అపకీర్తో!

రాజు— వ్రాసింది చదివేవాడు లేకపోవడానికి వ్రాతలోపమైనా కావాలి, ప్రజలలో అజ్ఞానము ప్రబలిఉండనైనాడుండాలి— అసలు చదివేవాళ్లు లేనేలేరంటావా?

నేను—చదివేవాడు ప్రతీవాడూ విమర్శకుడు—విమర్శకుడంటే బోయవాడు — అతడు విమర్శించే కావ్యం తాచుపాము. అతని పాండిత్యం దుడ్డుకర్ర.

రాజు—సరే బాగానేఉంది — కాని నువ్వు వ్రాయడమెందుకో బోధపడిందికాదు. నీకే బోధపడ్డట్టులేదు. అయితే వ్రాసి దీనిని ఏమిచేస్తావు? పండితసభలో చదువుతావా? కాశీకి పంపుతావా పండితాభిప్రాయంకోసం? ఏమి చేస్తావు?

నేను—పత్రికకు పంపుతాను.

రాజు—పత్రికేమిటి?

నేను—మాసపత్రిక.

రాజు—ఓహో, అదా! తెలిసింది. ఈ మాటు తెలిసింది— నువ్వు వ్రాయడానికి ప్రయోజనం పత్రికకు పంపడము—బాగానే వుంది. అయితే అట్లా పంపడంవల్ల ముక్తా మోక్షమా, పుణ్యమాపురుషార్థమా... ...

నేను—మహారాజా, మీ ప్రశ్నలకు నేను సమాధానం చెప్పలేను. నన్ను వదలి పెట్టండి. ఈకాలపు నాగరీకముకూ, ఆచార ములకూ నే నొక్కడనే జవాబుదారీ అను కొన్నారా? నాకూ మీకూ కాలములో వెయ్యిసంవత్సరములంతర మున్నది. కాలము తెచ్చిపెట్టిన మార్పులకు నేను ఉత్తరవాది నెట్లా అవతాను? అయినా నే నొక్కడనే వ్రాశానా మీ చరిత్ర నాటకంగా? ఎంద రెందరుకవులు వ్రాశారుకారు? యక్షగానాలు వ్రాయలేదా? పాటలు వ్రాయలేదా? కావ్యాలు వ్రాయలేదా? పదములు కట్ట లేదా? నేటికే మీకు నేను దొరికానా దండించి అడగడానికి?

రాజు—అయితేనీవువ్రాసేకథ చరిత్రే— నిజముగా జరిగిన చరిత్రే అంటావా? రాజ మహేంద్రవరంలోనే జరిగిం దంటావా? ఆంధ్రసామ్రాజ్యమేలిన రాజు వట్టి దౌర్భా గ్యుడని నమ్ముతావా? ఆతనికి ఒకరాణీ నంటకట్టి ఆరాణికి వ్యభిచార మంటకట్టు తావా? నీ పూర్వీకులను, నీ వంశస్థులను పాలించి వారికృతజ్ఞత నందిన ఈరాజు నీకు తృణముకన్న తేలికఅయినాడా? తెలుగురాజు అనేనా అభిమానంలేదా?... ... ...

నేను— వృద్ధసంప్రదాయములోని కథ ఇది—అయినా నన్నెందుకు దండిస్తావయ్యా బాబూ?

రాజు—నువ్వు పెద్దమనిషివీ, చెప్పిన మాట వినే స్వభావము కలవాడవ్రా అని...

నేను—అయితే నిజమైన కథ ఏమిటో చెప్పండి-నిజముగా జరిగిన చరిత్ర.

రాజు—మళ్లీ నాటకం వ్రాస్తానంటా వా? ఈవ్రాతపిచ్చి ఎక్కడినుంచి వచ్చి పడ్డది ఈకాలపువాళ్లకి? చచ్చినా మాకు శాంతి లేకపోయిందిగదా! కవీ, చేసుకో డానికి ఇంకోపనేమీ లేదూ నీకూ?

నేను—ఇదిమాత్రం పనికాదూ? నష్ట సంతానాల్లో ఒకటి కృతి............

రాజు—శాస్త్రవాసన కూడా తగిలిందీ నీకు? అగ్నిహోత్రుడికి వాయువు సహాయం ఉన్నట్లే!

నేను — పూవుకు తావి అబ్బినట్లు కాదో?

రాజు—అయితే, కవీ! ఒక మాట అడుగుతాను—పళ్లతో తాడు పట్టుకొని రాళ్లపడవ గోదావరిలో లాక్కుపోవడం ఏమిటి?

నేను—మీకాలంలో ప్రజలు బలాఢ్యులని నిరూపించడానికి అట్లా వ్రాశాను.

రాజు—బలాఢ్యులని చెప్పడానికి వేరేమీ తోచలేదూ నీకు? సాముగరిడీలు లేవూ? మల్లయుద్ధాలు లేవూ? గుర్రాలూ, ఏనుగులూ లేవూ స్వారిచేయడానికి?......

నేను—ఇదొకరకం.........

రాజు—దీనివల్ల ప్రయోజనం? యుద్ధాలలో పళ్లతో ఒకరినొకరు పీక్కుతినేవారనుకొన్నావా? ఎందుకీపళ్లబలం—సెనగలు నమలడానికా, శత్రురాజుకోటతలుపులు ఎలకల్లాగ కొరికివెయ్యడానికా? ఎందుకిది? ఈ పళ్లతో పడవ లాగడంతెలివితక్కువ ఏమిటి?

నేను—మాకాలంలో ఇప్పుడు గాజుపెంకులు నమలేవాళ్లున్నారు. ద్రావకాలూ, విషాలూ తాగేవాళ్లున్నారు. రోజులతరబడి నీటిలో ఈదేవాళ్లున్నారు. గాడిదల్లాగా, కుక్కల్లాగా కూసేవాళ్లున్నారు. ఒంటికాలిమీద ఎన్నిరోజులో నిలబడేవాళ్లున్నారు. జుట్టుకు బండికట్టుకు లాగేవాళ్లున్నారు. ఏనుగున్ను ఛాతీమీద నిలబెట్టేవాళ్లున్నారు.

రాజు—ప్రయోజనం? ఇహానికైనా, పరానికైనా పనికివచ్చే పనులేనా ఇవి?

నేను—చెప్పినా మీకు బోధపడదు మహారాజా.

రాజు—సరి; మిగిలిన నీనాటకపాత్రలు కూడా నీతో మాట్లాడాలని తొందరపడుతున్నారు.

నేను—బాబోయి!

౩

రాజరాజు అదృశ్యం కాలేదు. ఒక ప్రక్కకు వెళ్లి కుర్చీలో కూర్చున్నాడు. తల యెత్తి చూతునుగదా నాయెదుట సారంగధరుడూ, చిత్రాంగీ, రత్నాంగీ, సేవకులూ, చేటికలూ అందరూ నవ్వుకొంటూ నిలబడ్డారు. చిత్రాంగీ, రత్నాంగీ మాత్రం మేలిముసుగులు వేసుకొన్నారు. వారి నవ్వులు కనబడలేదుకాని వినబడ్డాయి. సగం చచ్చిన నన్ను ఈజనం అంతా—నా నాటకపాత్రలందరూ ఇంకా ఏమిబాధ పెడతారో అని భయము పట్టుకొన్నది. సారంగధరుడు ముందుకు వచ్చి చేతులు జోడించి—

సారంగధరుడు—కాషాయ దండములు ధరించినంతమాత్రము చేత నే యతిపూజ్యుడు. కవినామమును ధరించినవాడవు కాబట్టి నీకు నమస్కారము చేస్తున్నాను.

నేను—కాళ్లూ, చేతులూ మళ్లీ మొలిచినట్లున్న వే నీకు—నా నాటకం విషాదాంతం చెయ్యాలనుకొన్నాను.

సారంగ—విషాదాంతం అంటే అదో విధమైన నాటకమా?

నేను—అవును.

సారంగ—ధనంజయుడు దానికిలక్షణం చెప్పాడా?

నేను—ఏమో!

సారంగ — నాటకం నాటకం అంటు న్నావు, దశరూపకాలలోనూ ఒకటైన నాటకమేనా? కాకుంటే ఆపేరు ఎందుకుపెట్టావు?

నేను—నాటకంఅంటే రూపకమే.

సారంగ—దశవిధాల్లో ఏది ఇది ?

నేను—ఏమో, ఆగోడ వంతా నాకు తెలియదు. ఇది డ్రామా.

సారంగ—ఆహా, అలాగా! కవీ, నీవు ధనంజయుడి దశరూపకం చదువుకొన్నావా?

నేను—నాటకాలు వ్రాసేవాళ్లందరూ దాన్ని చదవాలని నిర్బంధమా ఏమిటి?

సారంగ—నిర్బంధములేదు. కాని చదివితే రూపకలక్షణాలు తెలుస్తవిగదా!

నేను—ధనంజయుడికి ముందు నాటకాలు ఎవళ్లూ వ్రాయలేదా, వాళ్లేపుస్తకాలు చదివారు?

సారంగ—నీ కిసదుపాయం ఉన్నది కాదూ?

నేను —సదుపాయంకాదు సంకెళ్లు.

సారంగ— చదవకుండా నాటకమని పేరుపెట్టి నీవువ్రాసిన ఈ రూపకము ఏతర గతిలో చేరవలసివుంటుంది.

నేను—ఆగోడవ నాకెందుకు? నా తర వాత ఇంకో ధనంజయుడు పుట్టి రూపకాలని మళ్లీ విభజిస్తాడు. అప్పుడు దశరూపకాలే అంటాడో, చతుర్దశరూపకాలే అంటాడో, వింశతిరూపకాలే అంటాడో!

సారంగ—అయితే దశరూపకం చదవ లేదన్నమాట.

నేను— చదవకేమి, చూచాను.

సారంగ—ఎవరు పాఠం చెప్పారు?

నేను—ఒకరు పాఠంచెప్పడం ఎందుకు? నేనే చూచాను తెలుగుటీక ఉన్న గ్రంథం.

సారంగ— భేష్! పోనీ ప్రతాపరుద్రీయం చదివేవా?

నేను—ఏదో కొంచెం.

సారంగ— అప్పకవీయమైనా, పోనీ, చదివేవా ?

నేను—అప్పకవీయ మంటే నీ కభిమానంకాబోలు, నీపే రెత్తుకొన్నాడు కాబట్టి అప్పకవి.

సారంగ— అయితే దానివాసన కొంచెం కొట్టినట్లు ఉన్నది.

నేను— ఊరికే చూచానన్నమాటే కాని ఆపుస్తకాలన్నీ నేను చదవవలసిన అగత్యం కనపడ్డంలేదు.

సారంగ—నాటకం వ్రాయవలసిన అగత్యం కనిపిస్తోందా నీకు? నీకు సమకాలికులైఉన్నట్లయితే ఎవళ్లదర్శనమైనా నీకు దొరకదో అట్టివాళ్లను, దివంగతులైన అట్టివాళ్లను నీచేతి కీలుబొమ్మలుగా త్రిప్పవలసిన అగత్యం కనిపిస్తోందా నీకు? దేశమర్యాదలూ, కాలమర్యాదలూ, భాషామర్యాదలూ, కావ్యమర్యాదలూ—ఏమీపాటించకుండా కాళిదాసుపదవికి ఆశించవలసిన అగత్యం కనిపిస్తోందా నీకు?

నేను—మీపూర్వాచారాలు, ముక్కిపోయిన మీచాదస్తపుఅభిప్రాయాలూ మాకిప్పు డవసరంలేదు.

సారంగ—రాజులూ రాణీలూ లోకువయ్యారా నీకు? దేవుళ్లకైనా దిక్కులేకుండా ఉందా మీ కాలంలో? నీ మనోదార్బల్యము నీ నాటకపాత్రలైన రాజులకీ, దేవుళ్లకీ ఎందు కారోపిస్తావు? పనిలేకుంటే భగవన్నామము పారాయణచేసుకోరాదూ?

నేను—ఇంతకీ ఈనాటకానికి నువ్వే కారణం.

సారంగ—నేనా?

నేను—ఆ, నువ్వే! నీమూలాన్నే ఈ కథ యింతగా పెరిగింది. చిత్రాంగికోరిక కిక్కురుమనకుండా నువ్వు చెల్లించే ఉన్నట్లయితే, ఈనాటకమూ లేకపోను; అర్ధరాత్రివేళ నాతో ఈఘర్షణా లేకపోను.

సారంగ—హరిహరీ! దేశం ఎంతగా తగులడింది?

నేను—కథంటూ ఒకటుంటేగదా కవి నాటకం వ్రాస్తాడు. కవిదా ఆతప్పు?

సారంగ— ఉచితానుచితములు తెలియనివాడితో ఇక నే వాదించను. కాలం ఎంతమారిందీ!

* * * *

రత్నాంగి — నాయనా, కవీ, ఒక్కమాటమాత్రమే చెప్పదలచాను.

నేను—చెప్పమ్మా! వీళ్లందరూ ఇన్ని మాటలు చెప్పగాలేంది నువ్వు ఒక్కమాట చెప్పితే ఏమి?

రత్నాంగి—అసూర్యంపశ్యలమైన రాణివాసాన్ని సభలకు ఎక్కించకు నాయనా! సారంగధరుడికోసం ఎప్పుడో ఒక్కమారు విచారించాను, దుఃఖించాను — వాస్తవమే. మీకవుల ధర్మమా అంటూ నాకు ఈదుఃఖానికి అంతంలేకుండా ఉంది. ప్రతీఊళ్లోనూ ప్రతీరోజునా అడ్డమైనవాళ్ల ఎదుటా మీ ఇష్టంవచ్చినట్లు నన్ను ఏడ్పించడం న్యాయమేనా మీకు—

నేను—నిజంఏడ్పుకాదమ్మా—ఇదంతా నాటకం.

రత్నాంగి—మీకు అలాగే ఉంటుంది నాయనా! ఆదుఃఖాలన్నీ నాకుతీరిపోయాయి నాయనా! ఇప్పుడు మే మంతా సుఖంగా

ఉన్నాము. మమ్మల్ని వదిలిపెట్టి ఇంకేమైనా వ్రాసుకోండి నాయనా,.........

నేను—ఆడవాళ్లకి ఏమని సమాధానం చెప్పగలను?

రత్నాంగి— సమాధానం అక్కర్లేదు నాయనా; వెడతాముమేము—ఈ చిత్రాంగి కూడా రెండుమాటలు అడుగుతుంది.

నేను—అడగమనండి. అన్నిటికీ సిద్ధంగా ఉన్నాను.

చిత్రాంగి—నాయనా, నీకుపెళ్లయిందా?

నేను—లేదు, అయింది. ఎందు కాగోలంతా నీకు?

చిత్రాంగి— నాగోల నీకు కావాలా నాయనా? 'సిరిరా మోకాలొడ్డే ముగ్ధను మాత్రంకా'నని కాదూ వ్రాశావూ?

నేను—ఏదో వ్రాశాను — నాటకం కాబట్టి.

చిత్రాంగి— నీకు పిల్లలున్నారా?

నేను—ఎందుకంట ఆ ప్రశ్నలు?

చిత్రాంగి—నీకు తల్లి ఉందా?

నేను—ఈపెంకెప్రశ్నలకు నేనుజవాబు చెప్పను.

చిత్రాంగి—నీతల్లీ, నీభార్యా, నేనూ ఒక్కటే మనుష్యతెగకు చెందినవాళ్లము సుమా.

నేను—అయితే?

చిత్రాంగి—అయితే ఏమీలేదు. ఆసంగతి నువ్వు మరిచావేమోనని చెప్పాను.

నేను—నాటకంలో పాత్రలందరూ ఏ తెగవాళ్లో, నాబంధువులూ మిత్రులూ ఏయే తెగలవాళ్లోచూచుకోవడమేకాబోలునాపని?

చిత్రాంగి—అయితే నీఅభిప్రాయంలో నేను వారస్త్రీనా, రాణీనా?

నేను—కావ్యములో వారస్త్రీవీ, నాటకాల్లో రాణీవీని.

చిత్రాంగి—నాటకాల్లో రాణీ నెట్లాగయ్యెనో?

నేను—అది కవియిష్టం!

చిత్రాంగి—అయితే కవియిష్టాన్నిబట్టి పురుషులు స్త్రీలుగాను, స్త్రీలు పురుషులుగాను, కులస్త్రీలు కులటలుగాను, కులటలు కులస్త్రీలుగాను ఎలాగబడితే అలాగ మారవచ్చునన్నమాట!

నేను—అవును.

చిత్రాంగి—అయితే చారిత్రకనాటకం అంటూ రెందుకు?

నేను—కవిఉపజ్ఞనుబట్టి, దానివెన్నంటి రావలసిన ప్రతిభనుబట్టీ కథ మారుతుంది.

చిత్రాంగి—అర్థంలేని మాటలు ఆట్టే ఉపయోగించకు నాయనా: నీతినీ ధర్మాన్నీ బట్టి మారుతూంటే బాగుండదూ?

నేను—లలితకళకూ నీతికీ సంబంధం లేదు.

చిత్రాంగి—తొండముదిరి ఊసరవెల్లి అయింది. అంతకంటె నాటకం చూచేవాళ్ల అభిరుచులనుబట్టి మారుతూ ఉంటవంటే బాగుంటుందేమో?

నేను—ఏమన్నా నాకేమీ అభ్యంతరం లేదు.

చిత్రాంగి— నాటకం వ్రాయవద్దంటే మాత్రం అభ్యంతరం అనుకొంటాను.

నేను— బాబోయి, నేను నాటకం వ్రాయను. మీనాటకం అసలే వ్రాయను. రాసిందానికి యిదిగో లెంపలు వాయించుకొంటున్నాను. వెళ్లండి, మీరంతా వెళ్లండి, నాకు మతిపోతోంది, వెళ్లండి, వెళ్లండి. మీ దేవుళ్లకి పదివేలదండాలు!

* * * * *

చిత్రాంగి నవ్వి వెనక్కి తప్పకొంది. రాజరాజూ, రత్నాంగీ, చిత్రాంగీ, సారంగధరుడూ చూస్తూండగానే గాలిలో కరిగిపోయారు. నవ్వుతూ దణ్ణాలు పెడుతూ ఒక చేటికా, ఒక సేవకుడూ మాత్రం నిలిచిఉన్నారు.

"వెళ్లండి, మీరూ వెళ్లండి, ఎందుకింకా నిలబడతారు" అన్నాను విసుగుతో.

సేవకుడు—బాబయ్యా, ఒక్కమనవి. తమరు నాటకంరాస్తే ఆశేదో అన్నారని కోపం సెయ్యకండి—బాబయ్యా, మా మీదో నాటకం రాయండి—మే మేమీ అనము.

చేటిక—నాపేరు లీలండి; మామయ్య పేరు సుందరయ్యండి—

సేవకుడు—లీలాసుందరీయం అని పేరెట్టండి బాబయ్యా, కలకాలం మీ పేరు సెప్పకుంటాం.

నేను—మీకథ?

సేవకుడు — కథెందుకు బాబయ్యా? ఆరికథ మా తెలిసేరాశారా మారాజా? మా కథకూడా మీకు తోసినట్లు రాయండి!

చేటిక—మరవకండి బాబయ్యా, నాటకం రాయండి- ముల్లగూరమ్మ సల్లగా రచ్చిస్తాది మిమ్మల్ని.

సేవకుడు— తోలుబొమ్మల నాటకం రాసినా సరే బాబయ్యా.

చేటిక — ఈదినాటకం రాసినా సరే, మారాజా!

సేవకుడు, చేటిక — బాబయ్యా, దణ్ణాలు. లీలాసుందరీయం. మరిసి పోకండి.

వాళ్లూ గాలిలో కరిగిపోయారు. నేనూ, నాగదీ మిగిలాము. దీపం వెలుగుతూనే ఉంది. గడియారం టక్కుటక్కుమంటూనే ఉన్నది.

* * * *

"ఇదిగో, ఏమండోయి, ఏమి టీకలవరింతలు? కుర్చీలో నిద్దరోతూ ఒక్క టేకలవరింతలు? దీపం మండిపోతోంది లేవండి."

ఉలిక్కిపడి లేచాను.

"సారంగధర నాటకం రాస్తానన్నారు. ఇదేనా ఏమిటి రాయడం?"

"చచ్చినాసరే సారంగధరనాటకం ఇంక రాయను. రాయను. ముమ్మాటికీ రాయను."

"ఎందుకొచ్చిం దీతిక్క? మరేనాటకం రాస్తారు?"

"ఏనాటకం రాయను.........రాస్తే, రాస్తే లీలాసుందరీయం రాస్తానేమో? వాళ్లకంతే శాస్తి."

"అదేమిటి?"

"నీకు తెలియదు ఊరుకో."

"ఒళ్లు బాగులేన ట్లుంది. ఉమాపతీ మాత్రలేనా వేసుకోండి."

---



3. అబ్దుల్ గఫూర్ నగరము

(మహాసభా ప్రదేశము)



౮. కార్యనిర్ణయసభకు పోవుచున్న మహాత్ముడు



౯. మహాత్మ రాజగోపాలాచార్యులు సంభాషణము

విద్వాన్, కవితిలక కంచనపల్లి కనకాంబ

నాంది

శా. ఆనందంబున రాజశేఖరుకృపన్
హంసశ్శివస్సోహమన్
ధ్యానంబున్న నిరంజనుం డెయగు స
త్యంబిద్దిమీకేల నా
చానై పుణ్యము జీవయాత్రనడుపన్
సద్ధర్మమున్ బూనుఁడీ
నానాజన్మజ వాసనల్ విడువుఁడీ
నారాయణుం గొల్వుఁడీ
లోనోంకారము శారదాకృతియమీ
లోలత్వముం బాసినన్
మేనే దేవళమంచుఁ దెల్పుగురుఁడే
మిమ్మెల్లగన్ బ్రోచుతన్.

*   *   *   *

(నాంద్యంతమున సూత్రధారుఁడు.)

సూ—నటీ! యలంకరించుకొనుట యైన చో నొకసారి యిటురమ్మ.

నటి—(ప్రవేశించి) ఆర్యపుత్రా, ఇదిగో వచ్చితిని. ఏమి సెలవు?

సూ—దేవీ, శ్రీ తిరుపతి వేంకటేశ్వరస్వామి బ్రహ్మోత్సవసందర్శన కుతూహలులై భక్తాగ్రేసరులు నానాదేశంబులనుండి వచ్చి యీ సభ నలంకరించి యున్నారు. మనవలన నేఁటిరేయి భగవద్భాగవతప్రతిపాదకంబగు నొక్క రూపకంబుఁ జూడఁగోరియున్నారు సుమా!

నటి—ఇట్టిపరివత్తు నేఁటికాలంబున లభించుట మనయదృష్టవిశేషము.

సూ—(సభ నవలోకించి) ఇపు డేనాటకమును బ్రదర్శించి యీసాధుబృందము నానందవార్ధి నోలలాడింపఁగల్గుదుమో నాకుఁ దోఁపకున్నది.

నటి—ఏమి యీభ్రాంతి! ఈ భాగవతోత్తముల బ్రహ్మానందభరితులఁజేయుటకై హంసవిజయ నాటకమును బ్రదర్శింపఁ దొల్లి సంకల్పించియు మఱల నిట్లు కింకర్తవ్యతామూఢులగుదురేల?

సూ—భ్రాంతియు, మఱపును బ్రహ్మాదులకేని నొక్కొక్కతఱిఁ దప్పవుసుమా! సర్వము సిద్ధపఱచితివి కదా! కాని నీవేమియో యాలోచించున ట్లగపడుచున్నావు. నిజమేనా!

నటి—చక్కఁగ గ్రహించితిరి. హంసవిజయ నాటకమును రచించిన దెవ్వరు?

సూ—

గీ. వ్రాసె గ్రంథమన్న వా రెవ్వరందురు
పేరు విన్నఁ బేర్లుపెట్టుచుంద్రు
కృతులు పల్కెనన్నఁ జూచెదమని వాని
యుక్తియుక్తమైన నొప్పుకొంద్రు.

అయినను నీవడిగితివి గానఁ జెప్పెదను వినుము:

క. కాంచనపల్లి కులంబునఁ
గాంచనగర్భుండు నిలిపెఁ గాంచనచేలున్
గాంచనమై లోనిల్పెడు
నంచితకవయిత్రి జీవయాత్రాకర్త్రిన్.

క. ఆకవికులతిలకంబు న
నేకుల్ ప్రార్థింప భక్తినేర్చిన యట్లా
లోకారాధ్యుని చరితం
బీకల్పనమందుఁ దెలిపె హితముగ నార్యా.

నటి—ఆర్యపుత్రా! ధన్యురాలను. కొంతకాల ముక్రింపటు నీమహానాటకమునకుఁ బాత్రలందఱను సిద్ధపఱచియు ననురూపమైన పరివత్తు లభింపమిం జేసి ప్రదర్శింపకయుంటిమి. తనుసమయ మేతెంచినది. జాగేల? ఇప్పు డేబుతువును గూర్చి గానము చేయుదును?

సూ—శ్రీవేంకటేశ్వరస్వామి ప్రీతిగా బ్రహ్మాది సురలెల్లఁగావించు నీబ్రహ్మోత్సవమున కాధారభూత మైన శరదృతువే కీర్తింపఁదగినది. వేఁడుగనేల?

నటి—

క. ఆకాశము సహృదయహృద
యాకాశము మబ్బుపోక హరిపదతీర్థం
బేకడఁ జూడ నగస్త్యుని
రాక శివార్చనమునకు శరన్నిశలందున్.

గీ. పరమహంసవేద్య పదహంసకోజ్జ్వల
హంసయాన రాజహంసయాన
నలినభవునికొమ్మ నారాయణుని కోడ
లమ్మ లోకములకు నాత్మ మాకు.

సూ—బాగు! బాగు! శరదృతువును గానము సేయుమనఁగా, నిది శారదోపాసనాసమయం బగుటఁ జేసి శారదా స్తవముకూడ నొనర్చితివి.

గీ. ధీరజనమానసంబున దేవునట్లు
బాలరూపున వేంకటేశ్వరుని లీల
వాణి చూడామణినిఁ బద్మభవునిఁబోలె
బళిర! నీగీతమున లయబ్రహ్మఁ గాంతు.

## ప్ర థ మాం క ము

### ప్రథమ రంగము

(ప్రవేశము—వీణమీటుచు సరస్వతి)

[శహనరాగము - జంపెతాళము]

సరస్వతి—

ద్వి. శృంగారరసపూర, శ్రీవేదసార
మంగళం తేబాల, మదనగోపాల.

శ్రీశేషగిరిరాజశేఖర శ్రీశా,
కాశీప్రయాగాది ఘనతీర్థవాసా.

దివ్యాయ, భవ్యాయ, దీనావనాయ,
నవ్యనీరదకాయ నారాయణాయ,
కాంతాయ, శాంతాయ, కళ్యాణదాయ,
మంతవ్యరూపాయ, మామకాప్తాయ.

(ప్రవేశము బ్రహ్మ,పాటబాడుచుండఁగఁనే. ప్రక్కనుండి యాలకించి పారవశ్యము నటించి, ప్రకాశముగా)

బ్రహ్మ—నేఁటి గానమాధుర్య మపూర్వముగ నున్నది.

క. పంచమమునఁబాడుచు మ్రో
యించుచుఁ దంత్రికలను బరమేశ్వరునిన్ ధ్యా
నించుచుఁ బ్రపంచముల్ క
ల్పించు సరస్వతినిఁజేరి లీలసుఖింతున్.

(అని పరిక్రమించి యెదుటఁజూచి, నివ్వెరపడి) ఏమి! ఈసాహసము. నేనిచట పెట్టివానివోలె గానమాధుర్యమునఁ జొక్కుచుంటిని. ఈనాతి పరబ్రహ్మానందమునఁ దేలుచున్నది.

క. పరపురుషుని శిరమున నిడి
తరుణీమణి శాంతిమీటుఁ దంత్రికలహాహో
తరమా భరియింపఁగ నీ
కరణిన్ నిజభార్య చేయఁగాఁ బురుషునకున్.

(ప్రకాశముగ) సుందరీ, పరబ్రహ్మప్రీతికిఁ బోలెఁ బాడఁబడు నీగీతము పరబ్రహ్మప్రీతికి నయ్యెఁగా,

సరస్వతి—నాథా! ఏమిట్లాడుచున్నారు? పరబ్రహ్మ భజనం బొనర్చు మిమ్ము సదాసేవించు నాకు వాక్యమందలి శ్లేషార్థము గోచరింపకున్నది.

బ్రహ్మ—పరబ్రహ్మను శిరసావహించి, యెడ లెఱుఁగక గానముసేయుచు నాప్రోల నిట్లవినయముగఁ జమత్కారముగఁ బల్కెదవుగా! మేలు.

సర—(నవ్వుచు) ఇదియా! తెలిసినది. దేవా! మన్నించి నన్నుఁజిన్నపుచ్చక కన్నారఁగాంచుఁడు. మున్ను నాకు శిరోభూషణంబుగఁ దా మనుగ్రహించిన జీవమణిం బ్రతిబింబించిన దేవరరూపంబును గాంచి కాదుగదా యిట్లనుట.

బ్ర—(చక్కఁగ నవలోకించి) దేవీ క్షమింపుము. (అని లజ్జనటించుచు) ఎట్టి మోసమాయెను. నీమనసెంతె నొచ్చెనోకదా! నాకు భ్రాంతియు, నీకు దోషశంక యుఁగల్గించు నీజీవమణి కించుక జడత్వంబొక్క ముహూర్తంబు ఘటించుఁగాక.

హంస—(ప్రక్కను మెలఁగుచు నవ్వుచుండును.)

బ్ర—ఈహంస మమ్ముల్లసమాడుచున్నదిగా! అనవ్వునకుఁ గారణమేమి?

హంస—స్వామీ! మావంటి యల్పులకుఁ గలుగవలసిన భ్రాంతి దేవరకుఁ గల్గి యింతలేసి మాటలు పుట్టెఁగదా యని నవ్వువచ్చినది. మన్నింపవలయు.

బ్ర—నాసన్నిధానబలమునఁ గలిగిన యావంత తెలివియుఁ బట్టఁజాలక నన్నే నవ్వునంతటి స్థితి వచ్చినదిగా! బాగుబాగు! "ప్రమాదో ధీమతా మేవ" ప్రమాదమనుట ధీమంతులకేకాని యడుగడుగునకుఁ బొరపడువారి విషయముకాదు. భ్రాంతిలోఁగల బాధల నరయఁజాలక యిదియె సరుదోషముగ నెంచితివి. నీవు నీజీవమణితోఁ బాటు కొంతకాలము భ్రాంతింబడుదువుగాక. ఈపదరుఁబోతుతనమున కొకమా రింతపని యైనఁగాని తెలియదులెమ్ము.

హం—(సరస్వతితో) అజ్ఞత బాలుఁడుసేయు నపచారంబులు మీరు సైఁపకున్న గలికలదే.

సర—నాథా, పరిహాసమునకైనను మీనోట మాటజారిన నిక్కంబై చెల్లుఁగదా!

గీ. ఎప్పుడాశ్రయించు నీజీవమణి నన్ను
నిన్ను మోయుచుండు నిజము హంస
జడత, భ్రాంతి దలఁపఁ జనుసెట్లు వీరికి
భక్తవరులఁ బ్రోవఁ బ్రభుఁడ వీవ.

బ్రహ్మ—ఏమీ నీయాశ్రితపక్షపాతము.

క. ఏకాంతభక్తరక్షణ
మోకంజదళాక్షియింత యొప్పునె నీకుఁ
సాకంబకుటఁగ మనచే
బోకడ లెవ్వైన వారిఁబొందునె యఘముల్.

మన యాశ్రితులకు సర్వత్ర శుభంబె కాని యన్యం బెట్లగును. ఈ నీ శిరోమణి మహాయోగినియై, యీహంసయు రాజర్షియై, లోకమునకు జ్ఞానప్రదాతలై మహోపకారంబు సేయంగలరుసుమా. కళ్యాణి! ఏదీ నీగానము నేఁడు కేవల మానందపారవశ్యము కలుగఁజేయుచున్నది. మఱియొక్కపాట పాడుము.

సర—

మోహన - ఆటతాళము

గీతము-జయజయశ్రీరామ-జయసార్వభౌమ
జయజయ గుణధామ-జయపుణ్యనామ
జయజానకీరామ- జయరంగధామ
జయదితిజవిరామ-జయరఘురామ
జయసర్వలోకేశ-జయహృషీకేశ
జయభక్తపరిపోష-జయ నృపభూష
జయరామ,జయకృష్ణ-జయజగద్రక్ష
జయరాధికాలోల-జయగోపబాల.

(తెరపడును.)

## ద్వితీయరంగము

[తిరుపతికొండదారి]

యాత్రికులు—గోవిందా! గోవిందా! అడుగడుగుదండములవాఁడా! ఆపద మ్రొక్కులవాఁడా! గోవిందా! ఏడుకొండలవాఁడా! గోవిందా! గోవింద!

(అనుచుఁ జేగంటలు వాయించుచుఁ బోవుచు, దెరలోఁ బాట వినపడఁగా ధ్యానముచేయుచు, కనులు మూసికొని నిలువఁబడియుందురు.)

(తెరలో దూరమునుండి)

కాంభోజి - అటతాళము

చూచి! మోసపోవుచుండెదవు! శ్రీని! (చూచి.)
శ్రీనివాసులసేవింపవే. మనసా.

శ్రీవేంకటేశుని సేవంక లేకుండ -
సేవింపఁగలవారు, సిద్ధులేయైనారు చూ.

పరిపరివిధములఁ బరుగిడఁగానేల
పరమునిహమునొక్కపట్టునఁజేకూర. చూ.

కొండ లేడింటిపైనుండి దాసులకనుల
పండువొనర్చెడు దండిగురుమూర్తిని. చూ

చదువులన్ని యుఁజదివి తుదిసెవనిపదములు
దుదిపదమనకు నైమదిభజియింత్రతని చూ.
మనసు కనిపెట్టని మందులకై చూపు
నుభయమెుసంగెడియభయహస్తంబును.చూ.

హరిదాసులు—శ్రీ మద్రమారమణగోవిందా! హరి! గోవిందా! శ్రీమదాంజనేయ వరదగోవిందా! హరి! గోవిందా! శ్రీ ప్రహ్లాదవరదగోవిందా! హరి! గోవిందా! శ్రీమదక్రూరవరదగోవిందా! హరి! గోవిందా!

(తెరలో)

చం. స్థిరపరిపూర్ణశాంతిశమ
చిత్తమునన్ గను దేశికోక్తినిన్
బరగక వాసనాత్రయము
పాలయి భ్రాంతినిఁబోవు జీవులన్
బరమ నికృష్టులౌ జనుల
పంచఁ గృశింపఁగఁజేసి, యవ్వలన్
గరుణ నహంపదార్థమును
గాదిలిచుట్టమవౌచుఁ దెల్పె దో
తిరుపతి వేంకటాచలపతీ
సుమనస్సుగతీ రమాపతీ.

హరి—మేఘగంభీర నిస్వనంబుతో వినంబడు నిమ్మహావాక్యము లేమహాభాగునివో కదా!

(ప్రవేశము రాజపురుషుఁడు)

రాజపురుషుఁడు—(స్వగతము) ఓహో! మహారాజు భక్త్యుద్రేకమున నంబరీషుని మఱపించువాఁడనుటకు సందేహములేదు. ఎంతపారవశ్యమునఁ బాడుచున్నాఁడు. (ప్రకాశముగా) అదుగో! మహారాజ రాజాధీశ్వర శ్రీకళ్యాణపురాధీశ్వర ధర్మవీర ధర్మప్రతాప శ్రీరాజశేఖరమహారాజుగా రదే స్వామిదర్శనార్థమై సామాన్యమానవునివలె వినీతవేషమున వచ్చుచున్నాఁడు. ఓరాజపురుషులారా! హెచ్చరిక గలిగి యుండుఁడు. "మీయధికారవ్యసనముచే మాయాత్రికుసౌకర్యములు చేయువారలు పోలె యాత్రికులకు, దీక్షాపరులకు, వ్రతస్థులకు, సాధువులకు, స్వామికైంకర్యపరాయత్తచిత్తులగు సజ్జనులకు నించుకయేని శ్రమ కలిగించకుండునది. పక్షపాతము లేక భిక్షుకులకు భోజ్యపదార్థములను, వస్త్రములను వలయురీతి నొసంగుఁడు. మార్గమున పానీయశాలలలో సర్వజనులకు నుదకప్రదానము సేయింపుఁడు. సంస్థానసంచారవైద్యులచే యాత్రికులకు, సన్యాసులకు, గోసాయిలకుఁ దాత్కాలికౌషధప్రదానముచే నుపచారము సేయింపుఁడు. స్నానఘట్టములయందు, స్వామి గరుడోత్సవకల్యాణోత్సవాదులయందు జాగరూకులై స్త్రీబాలవృద్ధులకు నొత్తిడికలుగకుండ మూఁక నాఁచియాఁచి నడిపించుచుండవలయును." అనునీరాజసందేశమును నెలుగెత్తి రాజపురుషులందఱకుఁ బ్రకటింపుమని నాకు సెలవయినది. కాన దీనినెల్లరుకుఁ బ్రకటింపఁబోవుదును.

(ఎదుటఁజూచి) శ్రీమహారాజుగారు, శ్రీరాణిగారు, మంత్రిగారు, పరివారము నీమార్గముననే వచ్చుచున్నారు. (అనుచు తనదారిని పోవును.)

(రాజశేఖరుఁడు ప్రవేశించును)

రాజ—("స్థిరపరిపూర్ణశాంతి" అనుపద్యమును జదువును. శిఖరదర్శన సుఖము ననుభవించుచు) ఆర్త త్రాణపరాయణా! వెంకటరమణా!

శా. సంకల్పంబులుఁ గర్మముల్ ఫలములున్
సర్వంబు నీవౌట నే
నింకన్ జేయఁగనున్న దేది యిలలో
నేకాంతభక్తిన్, భవ
త్కైంకర్యంబొగిఁ జేయఁగల్గునటు సం
కల్పించి మేలెంచి నా
వంకన్ జూడుము వేంకటేశ, వరదా
వాత్సల్యవారాన్నిధీ.

(ధ్యానపారవశ్యమున నుండును.)

సుదర్శనుఁడు—వెంకటరమణా! సాధుశరణా! సజ్జనతరణా!

మ. భగవద్భాగవతుల్ హితుల్, నిలయ మీ
బ్రహ్మాండమ్మానంద మిం

పసు సాదంబు ప్రశాంతి యింతి రసయుం
డామ్నాయ సారంబునై
తను సంసారసుధాబ్ధిఁ బండునుగదా,
తాత్పర్యసంపత్తిఁ బ
న్నగభూషుంబలె నీవుభక్తుఁడొకఁడే
నారాయణా త్వత్కృపన్.

భక్తులు—గోవిందా! గోవిందా! (అని ముందు నకు సాగుదురు. దంపతులు పసపుబట్టలతో భిక్ష మెత్తుచుఁ బాడుచుఁ బ్రవేశింతురు.)

హిందూస్థానీతోడి-అట

భవతిభిక్షాందేహి నైదేహి! నఃపాహి! ఏహి.
హరిచరణామృతసారాం
తవకరుణాకలితాసారాం. ఏహి.
కర్తుకామానందభుజో
నఃకిలకల్యాణి త్వంహరిదాసానుదాసాన్.
ఆశాపాశవిముక్తయే
ముక్తిమొసగుపుత్రాణాంఆసు. ఏహి.
(పాటపాడుచు నిష్క్రమింతురు.)

సుద— మహాప్రభూ! భక్త్యావేశపరవశుల నీ జనులం జూడుఁడు. ఏడుకొండల నేడు మెట్లెక్కిన ట్లవలీలగా నెక్కిపోవుచున్నారు. (భక్తులు నిష్క్రమింతురు.)

(భక్తుఁడు మేన విభూతి దాల్చి చిరుతలు చేతఁబూని పాడుచుఁ బ్రవేశించుచున్నాఁడు).

నాదనామక్రియ-ఆదితాళము

వాదమేలరా! జీవా! గురుపాదంబది గనలేవా?
వాదమేల మర్యాదవిడిచి
బ్రహ్మాదులనైనను నాదరింపకిటు. వా.
భేదము, ఖేదము, మోదములేనిది
రాదది శాస్త్రవివాదముచే నన. వా.
హరియేజగమని గురువులుదెలుపఁగఁ
బరమపదంబిది, మరణమిఁ కెక్కడ. వా.
తెలిసినధీరులు తెలివిలయింపఁగ
నిలుతురు భువిఁజెన్నిధులను బోలుచు. వా.
అంగజజనకుఁ డ్రిలింగపీఠమున దు
స్సంగము బాసినసాధుల గనుఁగొన. వా.

(చివరపాదము చదువుచుండఁగా రాజశేఖ రాదులు కలిసికొందురు.)

రాజ—సాధుపుంగవా! మీగీతంబునకు మిక్కిలి ప్రీతుండనైతి. శ్రీగురుచరణారవిందామృతపానమత్తతచే వెడలునది గాని, యిది సామాన్యమగు పాటకాదు. "త్రిలింగపీఠ"మంటిరి అది యెక్కడనుండును. జిజ్ఞాసువులఁ దరియింపఁజేయు సజీవపీఠంబులు నేఁడును గలవే? ఆసురుపీఠంబు నలంకరించు నమ్మహానుభావుం డెవ్వఁడు? ఈవిషయమెఱుఁగ నామనంబు మిక్కిలి వాంఛించుచున్నది.

భక్తుఁడు—జిజ్ఞాసగలవారల కెల్లకాలంబులను జ్ఞానప్రదులు సిద్ధముగనే యుందురు. వాంఛ నొసంగిన దేవుండు వస్తువు నీయఁడా.

ఆ.వె. ఒక్కచిత్తమందు నొక్కసంకల్పించి
సర్వమయుఁడు దానిఁ జక్కఁజేయ
నితరలోకమందు హితబుద్ధికల్పించు
గట్టికోర్కె సిద్ధికలుగు శుభము.

ఆ.వె. తనకొకఁడు సహాయమును జేయనేరఁడు
పట్టిప్రాకులాడు వట్టిభ్రాంతి
గట్టిభక్తిలోనఁ బుట్టజేసిననాఁడు
హరియొసంగును సకలార్థసిద్ధి.

వ్యవహారలంపటుండవగు నీబోటికిఁ బారమార్థికులజాడ యెట్లు తెలియఁగలదు.

రాజపురు—జాగ్రతగ మాట్లాడుము. నీ యెదుట నున్నవారు కళ్యాణపురాధీశులు, శ్రీ రాజశేఖర మహారాజుగారని తెలియుము.

భక్తుఁడు—ఔఁగాక,. నేనేమి తప్పంటిని. మహారాజులయ్యు నింతసమీపముననున్న గురుపీఠమును గుర్తింపకయుంటయు, దానిం బోషింపకుంటయుఁ జూడఁ

పారమార్థికులవిషయమై వారియక్కఱ తెలియుట లేదా? నేనన్నదో "కలౌ వేంకటనాయకః" అన్న ప్రమాణమునుబట్టి తచ్చరణారవిందముల నాశ్రయింపుటంజేసి యీకలిరాజుల నంతగాఁ బాటింపను.

క. కరిరాజును, సురరాజును
గిరిరాజుని యల్లుఁబ్రోచు కేవలు నెపుడా
గురురాజు కరుణఁగొలిచితి
నరరాజుల గొల్వుమన్న నా వశమగునా.

ఆవేంకటప్రభువు నెంతటిమహారాజులయ్యును దీనులై వేఁడవలయువారలే కదా!

శ్లో. శ్రీవేంకటేశాంఘ్రియుగాశ్రితానా,
మస్మాక మానందభుజాం గురూణామ్,
సత్సేవకానాం, భవతారకాణాం,
కిం దీయతే దీనజనేన కామ్యమ్.

(రాజునై పునకుఁజూచి) సద్గురుసందర్శనమే ఫలముగా, శ్రీవేంకటరమణమూర్తిని సేవింపుఁడు. నేను గురుకార్యధురంధరుఁడనై పోవుచుంటిని. ఇక్కడఁ దడయరాదు. (అని తొందరగా నడచిపోవును.)

ధర్మాంబ—నాథా! కంటిరే ఆబ్రాహ్మణుని నిస్పృహత! మహారాజుమాటలాడుచున్నను సరకుచేయక గురుకార్య పరతంత్రుఁడై వెడలిపోయెను.

రాజ—దేవీ! బాహ్యశత్రువుల గెల్చు రాజుల కన్న నంతశ్శత్రువులగెలుచు నిట్టివారే ధీరులుసుమా! బ్రహ్మవిద్యకుఁ గావలసిన ధీరత్వములో సగ ముండిన క్షాత్రమునకుఁ జాలునని పెద్దలందురు. ఈవిషయమున నమాత్యుని యభిప్రాయమేమో!

సుదర్శనుఁడు—నిక్కము మహాప్రభూ!
"తస్యధీరాః పరిజానంతి యోనిం" అనియు
"కశ్చిద్ధీరః ప్రత్యగాత్మాన మైక్షత" అనియు
"ధీరులు నిరపేక్షులు" అనియు,
"వెలిపగఱ గెలుపుగెలుపే" అనియుఁ బెద్దలందురు.

రాజ—అమాత్యవర్యా! ఎంతచక్కఁగ నుడివితివి. మనకు సద్గురుదర్శనభాగ్యముకన్న మిన్నయున్నదే!

ఉ. రాజులమైన నేమి? కవి
రాజుల సన్నుతిఁగన్న నేమి? ఘో
రాజులగెల్వ నేమి? సుమ
హాయశమొందిన నేమి? బ్రాహ్మ్యమౌ
తేజముదాల్చు యోగివరు
ధీరతఁగొల్చుటకున్ సమంబె? వే
యోజనలేల! మంత్రి! ఘన
యోగము సద్గురుమూర్తియోగమే.

స్వామివారి సుప్రభాతసేవాసమయము మించకుండఁ బోవుదమురండు. (అని మువ్వురు నిష్క్రమింతురు.)

[రాజదంపతులతో మాటాడకయే వారివెంటఁ జనుచున్న యువకులు, జిల్లాజడ్జి నీలకంఠశాస్త్రి, మునసబు సీతాపతిపంతులు ప్రవేశింతురు.]

జడ్జీ—పంతులుగారూ, వింటిరికదా రాజమంత్రుల సంవాదము. జిజ్ఞాసువులు ధీరులు కావలయునఁట. ధీరశబ్దము బ్రహ్మవేత్తలకే చెల్లునఁట. బ్రహ్మవిద్యాసంపాదనమునకై వలయు ధైర్యస్థైర్యములలో సగముండిన క్షాత్రమునకుఁ జాలునఁట. అదియునుంగాక మనమందఱము రాజయోగము ఘనయోగ మనుకొనుచుండఁగా రాజైనవాఁడు ఘనయోగము శ్రీగురుమూర్తియోగమే యనెను. ఉద్యోగధర్మములో శ్వవృత్తికి వినియోగించుకాలము పోఁగాఁ బురమందిరములో పుష్క ప్రియములకును, దామసవార్తాశ్రవణమునకును, వినోదములకును జెల్లిన సమయము పోఁగాఁ బదింటఁ బదునొకండవదిగా మన మపుడపుడు విచారించు వేదాంతమున కిట్టిస్థానమొసఁగినారు.

సీతాపతి—శాస్త్రిగారూ! శ్రద్ధాభక్తుల యావశ్యకతయేమో నాకు గోచరింపలేదు. ఎట్టివిషయమైనను దెలివిచే గ్రహింపలేమా! గురుశుశ్రూషకు విషయ

గ్రహణమునకు నెట్టి సంబంధమో నాకు బోధపడదు. అన్నింటికంటె మిన్న యని వీర నుకొను సద్గురుకటాక్షమనునదియేమో నే నూహింపలేకున్నాను. నా యనుభవము చెప్పుచున్నాను. సాయంకాలముపూటఁ బురమందిరములో గీతోపన్యాసములు విన్నాను. నేను గొందఱువకీళ్లను జేరి చందాలుపోసుచేసి యొక్కపండితుని బిలిపించి భాష్యశాంతిచేసితిమి. కాని నాకు భ్రాంతి పోలేదు. శాంతియు రాలేదు. మఱియు నొక్కొకరిచుట్టుఁ దిరిగి నీచముగా నాశ్రయించి విసుగు పుట్టించి స్వప్రయోజనమునకునై, స్తోత్రపాఠములు చేయు కుక్షింభరు లను నీ దీనగురువు లాశ్రితుల నెట్లుధీరులుగాఁ జేయఁగల్గుదురోకదా! చనవుచే లోనున్న మాట చెప్పినందుకు క్షమింపుఁడు.

జిల్లాజడ్జి— పంతులుగారూ! మీతోఁ జర్చఁ జేయ నిచ్చలేదు కాని నాకుఁ దోఁచినమాట చెప్పుచున్నాను. అభిమానము వదలఁజాలని శిష్యులకు నను గ్రహింప సమర్థత చాలని గురువులు దొరకుచున్నట్లున్నది. మనవంటి లౌకికుల శ్రద్ధకును, మనకు దొరకు నట్టి బోధకుల శక్తికిని సరి. మొన్నఁ బురమందిరమున మనము విన్నవిషయము జ్ఞప్తియం దున్నదా! వేంకటేశ్వరస్వామిసన్నిధి కనతిదూరంబున జాబాలితీర్థంబున జయంతాశ్రమ మొండు కలదఁట. అందుఁ బరమహంస యను మహానుభావుం డొకడు గూఢుండై యుండునఁట. ఆతం డసాధారణ ధీశక్తిసంపన్నుం డనియుఁ, బరంపరాగత సద్గురుసంప్రదాయవిదుండనియుఁ జెప్పిరి. ఆతం డసాధ్యుం డయ్యె నొక్కసభకును రాఁడనియు, నొకపత్రికకు వ్రాయఁడనియు, నొక్కసంస్థానంబునకేని జని సమ్మానమును బొందఁడనియు, నతిధీరుఁ డనియు నాతనిశిష్యులు గొనియాడుచుందురు. మఱికొంద ఱాతఁడు తత్త్వయోగ నిపుణుఁ డనియు, నాచిలినిఁ బట్టి పోవుచుండుననియు, నర్థులయెడల నతివయార్ద్రహృదయుఁడనియు నందురు.

గీ. వజ్రములకన్న నవి యెక్కువకఠినములు
కుసుమములకన్న నెక్కుడు కోమలములు
నెవఁడు తెలియంగనర్హుఁ డీయవనియందు
నార లోకోత్తరుల హృదయముల నెందు.

అని భవభూతివచనము కలదుకదా! లోకాతీతపదవియం దున్నట్లు నటింపుచు లోకసామాన్యముగనైన నుండనేరక, లోకవిరుద్ధము లగు కృత్యములఁ జేయు మన కాఘునుని వర్తన మెట్లు బోధపడఁగలదు! అదియునుం గాక,

గీ. అటుచరింపఁగఁడగు యోగియైనవాఁడు
సాధుధర్మంబునకు నవిరోధముగను
మదినిఁబొంగుచును జనావమానమునకుఁ
జెలిమికై మూఁకచుట్టును జేరనట్టు.

సీతా— శాస్త్రిగారూ! పూర్వాచరణమందలి యభిమానముచేత మీమనమునను యాదర్శము లాతని కడ నుండు ననుకొనుచున్నారు. రాజుగారి మాటలధోరణినిఁబట్టి వా రాతని దర్శింతురని తోఁచుచున్నది. కావున మనము సుప్రభాతదర్శనమగుటయె తడవుగ నాయోగినిఁ జూడఁబోవుదము. నాకెంతకాలమునుండియో యాతనినిఁ బట్టిచూడవలయునని యున్నది.

శాస్త్రి— నాకును నాతనిని దర్శింపఁ గుతూహలము చిరకాలమునుండి కలదు. పోవుదము రండు! సుప్రభాతదర్శనమునకు వేళమించును.

## తృతీయ రంగము

[వేంకటేశ్వరసామిసన్నిధి. సుప్రభాతసమయము. గడితలుపులు వేసియుండును. ద్వారమునకు ముందు భక్తులు, నర్చకులు పాడుచుందురు.]

మేలుకొలుపు – భూపాలరాగము – అట

ద్విపద: రామపరంధామ! రవివంశసోమ!
స్వామి సీతారామ! శరణు శ్రీరామ!!
కువలయపతిరామ, కోదండరామ
కవిజననుతరామ కల్యాణరామ
శ్రీరామ శివరామ శేషాద్రిధామ
సూరిజనస్తోమ సుజనాభిరామ

వేదాంతవేద్య సద్వినుత శ్రీరామ
మేదినీపతిరామ మేలుకోరామ.

(ధర్మాంబ, రాజశేఖరుఁడు, సుదర్శనుఁడు ప్రవేశింతురు)

భక్తుఁడు—

క. కౌసల్యామె సుప్రజను
మ్మో సామీ లెమ్మువేగ నుదయించు నినుం
డీ సంధ్యాసమయంబునఁ
జేసెదు దైవాహ్నికంబు శ్రీనరసింహా.

గీ. మేలుకొమ్ము లెమ్ము మేలుకో గోవింద
గరుడకేతనుండ త్వరగ లెమ్ము
వేగలెమ్ము లేవవే కమలాపతి
ముజ్జగమ్ములకుఁ బ్రమోదమెసఁగ.

గీ. సకలలోకజనని సౌందర్యఖని మధు
కైటభారిహృదయ కమలనిలయ
శ్రీనివాసురాణి శ్రితజనప్రియదాన
శీల సుప్రభాత మాలకింపు.

(గుడితలుపులు తెఱవఁబడును. అర్చకుఁ డారతి నిచ్చును. అందరు పాడుదురు.)

మంగళహారతి, కేదారగౌళ-అట

ద్విపద—

ఆనందరూపాయ హంస వేద్యాయ
జ్ఞానాధికరణాయ కైవల్యదాయ
దశరథతనయాయ ధర్మరూపాయ
కుశలవజనకాయ కోమలాంగాయ
మంగళం మంగళం
మావల్లభాయ మంగళం.

భూరికల్యాణాయ బుధసేవితాయ
సారసనేత్రాయ సద్భూషణాయ
శ్రీగిరినిలయాయ శ్రీనివాసాయ
భోగీంద్రతల్పాయ పురుషోత్తమాయ
మంగళం మంగళం
మావల్లభాయ మంగళం.

రాజశేఖరుఁడు—

క. కరుణాకరుఁడవుకావా!
పరహృదయం బరయలేవ! వాంఛిత మీరే
వఁిరమావల్లభ! నిన్నే
కరణిఁ బ్రార్థింతు నూరక భజింతు సదా!

ఉ. చేసినలోకజాల మటి
చేతను నిల్పి రమింపలేమినో
వేసమునందుఁ బ్రీతినో ప్ర
వీణత లేమినో వేఱులేమినో
దోసమటంచు నీమదిని
దోఁపమినో యిటు చిత్రమూర్తివై
దాసునిభంగి నొక్కయెడ,
దైవతమట్ల మఱొక్కచోట నా
యాసము నొందుచుండుట ద
యాపర నీ కిది క్రీడయేసుమీ.

(సేవముగియును. తెరవ్రాలును. రాజశేఖరాదులు దేవాలయద్వారముముందు బరిక్రమించి మంటపమున నుపవిష్టులైయుందురు. క్షేత్రపురోహితులు, పారుపత్తెముదారును ప్రసాదము, చందనము పుచ్చుకొని రాజుగారి నాశీర్వదించుటకై ప్రవేశించుచున్నారు.)

రామనారాయణుఁడు—(జనాంతికము) శ్రీ వేంకటేశ్వరస్వామివారి యనుగ్రహమున నేటికి శ్రీ మహారాజుగారు నాయింటవిడిసిరి. అష్టకష్టములఁబడి పరసంపాదించి, పూర్వక్షేత్రవాసులతోఁ బోరాడి పేరుగాంచినందులకు నేఁడు నాపంటపండినది. కిట్టని వారికడుపులలో మంటమండినది. ఈబ్రాహ్మణులతో రాజసన్నిధికేఁగి యాశీర్వాదము చేయుదును. (రాజును సమీపించును.)

పారుపత్తెముదారు—ఏలినవారు చిత్తగింపుఁడు. ఈపళ్లెరంబున స్వామివారిచందనము, శ్రీపాదరేణువు కలవు. ఇవియే వివిధ పణ్యారములు.

రాజు –(పళ్లెరమునందుకొనికన్నుల కద్దుకొనును. బ్రాహ్మణులవంకతిరిగి యభివాదనమొనర్చి) విప్రోత్తములారా! మీదర్శనమునఁ గృతార్థుఁడనైతి.

బ్రాహ్మ—మహారాజ! విజయీభవ!

రామనా—మహాప్రభూ! దేవర యాత్రాక్రమ మంతయుఁ బూర్తియైనది. ఇవియే స్వామివారి యభయ హస్తములు. ఏలినవారి కటాక్షము మాశ్రితులపైఁ జూపింప వలసిన సమయమిదియే. అక్షతలు స్వీకరింతురుగాక. (విప్రులవంకఁ జూచి) ఉపక్రమింపుఁడు.

బ్రాహ్మణు—"శతంజీవే శరదోవర్ధమానః, శత మనంతంభవతి. శత మైశ్వర్యంభవతి ........."

రాజ—(అక్షతలుగ్రహించి) రామనారాయణ గారూ! ఈతీర్థరాజమున దర్శింపవలసిన విశేషము లింకను గలవా?

రామనా—లేకేమి! పెద్దలు పెరుమాళ్లని యన్నారు. అనతిదూరమునను్న జాబాలితీర్థమున జయంతాశ్రమ మొండుకలదు. అందుఁ బరమహంసాభి ధానంబున నొక్కమహానుభావుండు నివసించు. ఆల యములోని మూర్తియు, నాశ్రమములోని మూర్తియు నొక్కండే. ఇచట నెల్లరకు దర్శనము. అచట ధన్యు లకు భక్తాగ్రేసరులకు, నిరహంకారశిరోమణులకు మాత్రమే దర్శనము. ఈదేవుండు మాటలాడఁడు. ఆ దేవునిమాట లమృతంపు తేటలు; బూటకపు బండితులకు బల్లెంపుపోటులు.

రాజ—విప్రపుంగవులారా! అనుజ్ఞనొసంగుఁడు. అమాత్యపుంగనా? ఈరామనారాయణులు చేసిన సౌక ర్యములకు మేమెంతయుఁ దృప్తినొందితిమి. కావున నీతనికి గృహదానముఁ జేయఁదలంచితిమి. ఈతనిని మన కీక్షేత్రమునఁ బురోహితునిగ నియమింపుము.

సుద—చిత్తము!

బ్రాహ్మణు—సమస్తసన్మంగళానిభవంతు. శ్రీ వేంకటాచలయాత్రా పరిపూర్తిరస్తు. పునర్దర్శనప్రాప్తి రస్తు.　　(అందఱు నిష్క్రమింతురు.)

## చతుర్థ రంగము

[జయంతాశ్రమము

ఆశ్రమోపవనము. సాయంకాలము]

పరమహ—

క. ఓపరమపురుష నీకృప
నీప్రాపేగోరి మనము నిజధర్మంబుల్
గాపాడఁగ బ్రణవంబను
దేపల్ భవవార్ధి దాటితిల్ భక్తులతోన్.

ఆనందః ఆనందః ఆనందో బ్రహ్మ! బ్రహ్మానంద

(అని యానందస్మరణముచేయుచుండును. ప్రవేశ ము రామస్వామి, బిళ్లజవాను, వంగి పరమహంసకు నమ స్కారముచేయును.)

పరమ—ఏమిరా! రామస్వామీ బాగున్నావా! ఏమిటువచ్చితివి.

రామ—నాపుణ్యము బాగుండి తమదర్శన మీ నిమిత్తముగా లభించినది. మునసబుగారును, జిల్లాజడ్జిగా రును దమసన్నిధికి వచ్చుచున్నారు.

పరమ—అభ్యంతరమేమి? రమ్మను.

రామ—చిత్తము. (అని చేతులునలుపుకొనుచు నిలఁబడును).

పరమ—ఏదియోచెప్పఁదలఁచుకొని బాధపడు చున్నావు? ఏమది?

రామ—తమ సన్నిధిలో నాకేటికి సందేహము! వా రధికారుల మనుకొనుటయే కాని తమసంగతిఁ దెలిసి కొను నధికారము వారికిలేదు. తమతోఁ దుల్యముగ నేలపైఁ గూర్చుండుటకు సంకోచింతురు. ఒక చాపకు సెలవీయఁగోరెదను. మీఁద దేవరవారి చిత్తము (అని లజ్జించి నిలువఁబడును).

పరమ—(నవ్వుచు) పో! పర్ణశాలకుఁ బోయి బాలకుల నడిగి యొకటి తెచ్చుకొమ్ము. (స్వగతము) పాప మీతఁడు పెద్దలకు సేవచేసినవాఁ డగుట నిట్లు నలుగుచున్నాఁడు. ఆనందః ఆనందః ఆనందో బ్రహ్మ బ్రహ్మానంద (అని స్మరణ చేసికొను చుండును).

(ప్రవేశము: శాస్త్రిగారు, పంతులుగారు)

రామస్వామి— (జడ్జిగారిని, మునసబుగారిని జూచి) దయచేయుఁడు. పరమశివుని మెఱపించు నా

సగుదేవుల నరయుఁడు. (ఉభయులు చాపపైఁగూర్చుండుదురు.)

పంతులు—తమరేనా పరమహంసగారు.

పరమ—(ఊరకుండును.)

పంతులు—తమ కేశాస్త్రముపై నభిమానము?

పరమ—అభిమానము వదలుమని శాస్త్రములు ఘోషింపుచుండఁగా నాకెందులకు నొకదానిపై నభిమానము?

పం—తమకు జీవనోపాయ మేమి? ఏఁడాది కే మాత్రము మీ కాదాయము వచ్చును?

పర—మీరు న్యాయాధికారులు కదా! తమ యొద్దఁ బరిష్కారమగు వ్యాజ్యముల విలువలో నొక సామాన్య బ్రాహ్మణుని యాదాయము మీరు వినఁదగినంత గొప్పదిగా నుండునా? ఈవిచారణవలన నాకుఁ బ్రయోజనకారి కాదు. తమకును యోగ్యముగాదు. అదియునుగాక బ్రాహ్మణునియోగ్యత యాతని యాదాయముపై నాధారపడియుండదు. "అసంచయవాన్" అనియు, "నశ్వస్తనికవృత్తి" యనియు పెద్ద లందురు. నేనును వైదిక మార్గమునం దున్నవాఁడను. మఱియు నధర్మమార్గము నవలంబించి జీవించుచున్నాఁడ నని నాపై నెవ్వరు నభియోగముఁ దెచ్చియుండలేదు. రక్షకుండైన చక్రి యందఱను బోషించుచుండఁగాఁ దమ కీ శ్రమయేల? ఆయువే యన్నమొసంగును. ప్రారబ్ధమే శరీరమును బోషించునునమాటలు క్రొత్తలుకావు.

పంతులు—(రోసముతో) మీరు న్యాయసభలో నధికారులముందఱ నిట్లుచెప్పఁగలరా?

పరమ—మీచేతనైనయెడల నొక్కసారి ప్రయత్నించిచూడుఁడు. అపుడెట్లు సమాధానముచెప్పుదునో చిత్తగింతురుగాక.

శాస్త్రి—పంతులుగారూ! తమరూరకుండుఁడు. స్వామీ! అపచారమును మన్నింపుఁడు. మీరు పెద్దలిక్కడ నున్నారని పురమందిరములోఁ గొందఱివలన వినిమిమ్ము దర్శింప బయలుదేఱి వచ్చిన సంకల్పమునకును మా మిత్రుని యసంబద్ధసంభాషణమునకును సంబంధమేమియు లేదు. మన్నింపుఁడు.

పరమ—పెద్దలసన్నిధికిఁ బెరుమాళ్ల సన్నిధికిఁ బృథివీపతిసన్నిధికి రిక్తహస్తములతోఁ బోరాదను శాస్త్రము మీరెఱుఁగరా! ఇది పరమార్థమో వ్యవహారమో తెలియరాదు. వ్యవహారమునమాత్ర మీ పరిపాటి లేదా?

[శాస్త్రి, పంతులు ఉభయులు నొకరిమొగము నొకరు చూచుకొనుచు జనాంతికముగా,]

పంతులు—శాస్త్రిగారూ, ఆమాటలకు సమాధానము చెప్పఁదోఁచుటలేదు. నోరెత్తకుండ యుక్తియు, శాస్త్రమును జూపు నీహనుమంతుని ముందఱ నా కుప్పిగంతులు సాగలేదు.

శాస్త్రి—చా లింతటితో! వారిని క్షమాపణవేఁడుటకన్న సాధనాంతరము మనకు లేదు.

(పరమహంసవైపునకుఁ దిరిగి) క్షమింపుఁడు, క్షమింపుఁడు.

పరమ—పత్రఫలపుష్పాదులమాటనటుండనిండు. పెద్దలనుకొను బ్రాహ్మణుని జూచినపుడు రెండుచేతులు జోడించుటకేమి యాటంకము. మిమ్ముల ననసేల? ప్రస్తుతవిద్యావిధాన మిట్లున్నది.

క. శైష్యోపాధ్యాయికచే
బుష్యాదులుమున్నుఁ గాంచి రిహపర సుఖముల్
పోష్యము గావని కలిని మ
నుష్యాఘము లదివిడిచి వినోదింత్రు గదా.

పంతు, శాస్త్రి—(పరమహంసకుఁ బ్రణమిల్లి)

క. నాస్తికతఁ బాపుటకు నీ
శాస్త్రిం జేసితివి యోగిచంద్ర నరేంద్రా
స్వాస్తికిఁక భవచ్ఛైలి ను
పాస్తింజేసెదము పరమభక్తిక్ శాంతిక్.

స్వామీ! కించిజ్ఞులము. మాయవజ్ఞ మన్నింపుఁడు. పెద్దలదర్శన మూరకపోవదు. తమ బోధామృతమును

గ్రోలఁ దత్తరపడుచున్నవారము. మంచిమాటలు సెల విచ్చి మమ్ముఁ గృతార్థులఁ జేయుఁడు.

పరమ—ముందు సేనడుగు మాటలకు సమాధాన మలిండు. మీమనస్సున నున్నదున్నట్లు చెప్పిన విని భరించువాఁడుగాని, మీతో సర్వథా సత్యమును జెప్పు వాఁడుగాని, మీస్నేహితులలో నెవరైనఁగలరా! స్నేహి తుఁడు లేని జన్మమ్మును, దిక్కులేనిచావును సమమ్మ గదా! కొన్నిపనులకొఱకుఁ గొందఱు గూడినంతమాత్ర మున నది యథార్థమైన స్నేహమా! సత్యమునకు, సౌజ న్యమునకు నంతర మెంతయో కలదు. మీరు నిర్ణయించు కొన్న గమ్యస్థాన మెద్ది?

మేము సద్వాదుల మగుటచే నున్నదున్నట్లు సమ యోచితముగఁ బల్కుదుమే కాని లోన రాగద్వేషము లుండవు. మామిడిపండు మధురమనిపల్కుట ప్రియము చేతనుగాదు. వేప చేఁదనుట దానియందలి ద్వేషము చేతనుగాదు. జ్వరితునకు మామిడిపండును నిషేధించుట, సంవత్సరాదియందు వేపచేదును స్వీకరించుట యనుభవ ములోనివియే కదా? తత్త్వయోగము సాధువులకు ధర్మము.

ఇన్నిమాటలేల? అనుబంధచతుష్టయ మనుసం ధింపక మెలఁగరాదు. మీ యధికార మేమి? మనకు సంబంధ మేమి? విచార్యమాణ మగు విషయ మేమి? దానివలనఁ గలుగుప్రయోజన మెద్ది? యోజింపుఁడు. బుద్ధిమంతులు మీరుభయులును జీవితముయొక్క పరమ ప్రయోజనమును గుఱించియు, సన్మిత్ర లక్షణమును గుఱించియుఁ జక్కఁగ విచారించుకొని సావకాశముగఁ బైయాదివారమునాఁ డిచటకు రండు. ఈవిచారణలో మీమానసంబును బ్రసన్నమగును. ప్రశాంతమగు హృద యము బోధమును గ్రహించుయోగ్యత కలిగియుండును.

ఉభయులు—మహాప్రసాదము, మహాప్రసాదము.

(ప్రవేశము: బాలకుఁడు)

బాల—స్వామీ! ద్వారమందు వేచియున్నారు, తమదర్శనార్థమై కల్యాణ పురాధీశ్వరులు, రాజశేఖర మహారాజుగారు.

పరమ—గోష్ఠీ మందిరములో వారిని బ్రవేశ పెట్టుము. సేనును వచ్చుచున్నాను.

ఉభ—తమకుఁ గార్యాంతరములు కలవు. మా యపరాధముల మన్నించి మా కనుజ్ఞ నొసంగుఁడు. పోయివచ్చెదము. మీకటాక్ష ప్రసారము మాపైఁ బడు టచే ధన్యులమైతిమి. (అని మరల నమస్కరించి వెడలి పోవుదురు).

పరమ—(ఆనందస్మరణముఁ జేయుచుఁ బరిక్ర మించును.) (స్వగతము) కల్యాణపురాధీశ్వరుఁడు రాజ శేఖరుఁడా? ఈతఁడు కడుధన్యుఁడు. యోగ్యుఁడు. తత్త్వార్థి. ఇక్కలికాలంబున రాజైనవాఁడు పరమార్థ దృష్టి కలిగియుండుట లోకమునకును గల్యాణమే. (అనుచు గోష్ఠీమందిరమునకుఁ బోవును.)

(తెర తెలువఁబడఁగా గోష్ఠీమందిరమున రాజ శేఖరాదు లుపహారములతోఁ బరమహంసను నిరీక్షించు చుందురు. పరమహంస ఆనందస్మరణముతోఁ బ్రవే శించును.)

[గోష్ఠీమందిరము]

రాజశే—(ఉపహారముల సమర్పించి)

క. మదిఁగల శంకలు గ్రుంకఁగ
సుదయించితి మమ్ముఁ బ్రోవ నుత్సాహమునన్
గద మిత్రవరుఁడ వీవే
సదమల కరుణాంతరంగ సద్గురులింగా.

(సాష్టాంగనమస్కారము చేయును. ధర్మాంబయు నను సరించును)

పరమ—("ఓమ్ ఆనందః ఆనందః ఆనందో బ్రహ్మ బ్రహ్మానందః" అనుచు నమస్కరించిన వారి మస్తకములపై హస్తమునుంచి యాశీర్వదించును.)

సుదర్శ—స్వామీ! ఈ దీనునిఁ గరుణింపుఁడు. (నమస్కరించును.)

క. అందఱకుఁ జెడ్డనైతిని
ముందఱగతిఁ జూచుకొనక మోహమునన్ వీ

రండబ మెప్పించుటలోఁ
బొందక బడసేల చాలుఁ బో పైపూఁతల్.

క. సద్యోగమె నా కిఁకఁ దను
నుద్యోగం బంచు నెంచి యుత్తమగోష్ఠిన్
సద్యః ఫలితంబు సదా
హృద్యంబగు సాధుసేవ నే జీవింతున్.

పరమ— (ఆనందస్మరణము చేయుచు నతని నాశీర్వదించును. అందబను గలయంగనుంగొని)

మహారాజా! నీవు ధన్యుఁడవు. నిశ్శంకముగ నుండుము. నన్నె ఱిఁగివచ్చుటయె నీపరిపూర్ణత తెలియ పఱచెడిని. "నారుద్రోరుద్రమర్చయేత్" "బ్రహ్మైవసన్ బ్రహ్మాప్యేతి."

వత్సా! నాసన్నిధికి నీవువచ్చుట నిమిత్తమాత్రము. లోకమునందుఁగోరఁదగిన వానేకము లుండఁగ నందును నీవు రాజవయ్యుఁ బరమపురుషార్థమునకై గురువుల నన్వేషించుటచే నీ యధికారము ప్రకటితమయ్యె. శివునకు శక్తివోలె నీయర్ధాంగి నీకుఁ బురుషార్థ ప్రదాయిని యగు. సత్కులీనుఁడు బ్రాహ్మణుఁడు నను రక్తుఁడు నగు నీమంత్రియు నీకు సర్వప్రయోజనముల యందును శివునకుఁ గేశవునిమాడ్కిఁదోడ్పడఁగలవాఁడు. రాజవగుటచే నర్థసంపత్తికి లోపములేదు కదా! అంగసంపత్తియు నీకుఁ బరిపూర్ణముగఁ గలదు. నీకు నిస్సందేహముగఁ గార్యసిద్ధి కలుగును.

రాజశేఖరుఁడు — దేవర కటాక్షమున నా కన్నియుఁ గలవు. కాని

క. విసిగితి దుర్విషయంబులఁ
బసచెడి ప్రాణంబులుండు భవ దావాగ్నిన్,
వ్యసనము నశియింపదు నీ
సెస బుద్ధిన్ ద్రిప్పకున్న ధీసంపన్నా.

స్వామీ! రాజునౌటచే బహుముఖంబుల భోగంబులకై యితరులవలె నుద్యమింప నక్కరలేకయే, యన్నియు నాకు సిద్ధముగానుండియున్నవి. కాని నా కవియేవియు రుచించుటలేదు. ఆచారక్రమమున సేవకు లొనరించున వన్నియు నసహ్యముగ ననుభవించుచున్నాను. ఇంచుకేనియు మనశ్శాంతిలేక తహతహపడుచున్నాను.

పరమ—కుమారా! సమస్తదుఃఖములకు నహంకార మమకారంబులు హేతువులు. తాను లేననియుఁ, గలది బ్రహ్మమే యనియు నారూఢజ్ఞానము కలుగుటతో నహంకార మణఁగిపోవును. ఈశ్వరేచ్ఛానుసారంబుగ నటించుపాత్రలు గాని, మదీయులనుకొనువారిలో నా కెట్టి సంబంధమును లేదు. నాకు స్వాతంత్ర్యమును లేదు. ఈసత్యము తెలిసికొనుటయే మమకారరాహిత్యమునకు మార్గము. గాయత్రీమంత్రార్థము ననుసంధించి జంకుమాని పురుషుండు తానీశ్వరేచ్ఛానుసారముగ నిర్విచారముగ సంచరింపఁగలఁడు. అట్టిస్థితి వచ్చువఱకు నెట్టివారలకైనను సర్వాంగీకరణ మత్యావశ్యకము.

తాము సర్వజ్ఞులయ్యును శ్రీరామచంద్రమూర్తి వశిష్ఠుని, శ్రీ కృష్ణభగవానులు సాందీపుని, జనక మహారాజు పంచశిఖుని నాశ్రయించి పరతత్త్వమును గాంచుట జనులకు గురువుయొక్క యావశ్యకత తెల్పుటకేకదా.

'విదుష ఆత్మత్వాత్' పండితుఁడే, యనఁగా సద్గురుఁడే యాత్మస్వరూపుఁడు. కావున "నెవ్వఁడు సంకల్పములను బ్రేరేపించునో" యను గాయత్ర్యర్థము "ధియః యః నః ప్రచోదయాత్" 'యః' = ఎవ్వఁడు అనుష్ఠానమున సద్గురువును మనిదికొని కింకరుఁడై దేశికవచనము కర్తవ్యముగఁ జేసికొనిన ధన్యుఁడే కృతకృత్యుఁడు. అప్పు డహంకార మమకారములకుఁగాని, పాపపుణ్యములకుఁగాని తావులేదు.

రాజశేఖరుఁడు, సుదర్శనుఁడు—చిత్రము, చిత్రము.

పరమహంస—నాయనా! తత్త్వ మెఱుఁగుట కష్టము. ఆఁకలి తీక్ష్ణముగాఁ గలవానికి నన్నమును, గాలి క్రిందనొక్కి గట్టిగఁ దోమిన యిత్తడిపాత్ర కగ్నియోగమునఁ దగరమును, దహతహపుట్టి, తత్త్వవిదునకై వెదకి, వెదకి సాక్షాత్కరించిన సద్గురువు నర్థించిన శిష్యునకు.

బోధమును యుక్తమై యొప్పియుండును. జిజ్ఞాసలేని వానికి నెంతనొక్కి చెప్పినను వినఁడు. దీనికి శాస్త్రజ్ఞానముతోఁ గాని సాధనములతోఁ గాని పనిలేదు.

ఉ. నీవు నిమిత్తమాత్రముగ
నిల్వుము సర్వము సిద్ధమంచు నా
నావిధవాసనల్ తొలఁగ
నవ్వలరోక్తులఁ గృష్ణుఁడర్జునుః
గావఁగ సర్వముః దెలిపెఁగాదె,
వివేక మొకింతఁ గల్గినా
జీవులకిద్ది చాలదొకొ
శ్రేయముగూర్పఁగఁ శ్రీసుఁజేర్పఁగః.

"జాతస్యమరణం ధ్రువ"మ్మని తెలియదా ?మన కంటెఁ బెద్దలును జిన్నలును సమవయస్కులును మన కనులయెదుట నెందఱు చనలేదు. చావు తప్పనిదనియు, జీవుఁ డస్వతంత్రుఁడనియుఁ బ్రతివానికి దెలియును. ఎంత విసుగుపుట్టినవాఁడైనను జావలేక బ్రదుకుచున్నాఁడు. కాలమువచ్చినప్పుడు బ్రదుకుపై నెంత యాసకలవాఁడైనను బ్రతుకలేక చచ్చుచున్నాఁడు.

మరునాఁడు పదునొకండుగంటల కొకనికి నురి శిక్షవిధింతురన్నపు డాతని కానాఁడు రాత్రి నిద్ర పట్టునా ? కన్నబిడ్డల ముద్దుముచ్చట లరయునా ? భక్ష్యముల భుజింపనిచ్చగించునా ? కాంతతోనైనఁ గలసి మాటలాడునా ? బోనులోని పులివలె తహతహ పడుచు విశ్రాంతిలేమి సర్వము నేవగించుకొనును. తన వకీలునుండి సందేశ మేదైనవచ్చినఁ దన్నది రక్షించునని దానికిమాత్రము స్వాగతమొసంగును. ఇంతయారాటము మఱునాఁ డురిశిక్షయనియే కదా ? తా నాయభియోగ మునందు వకీలు తెలివిచే గెలువవచ్చును. క్రిందిసభ తీర్పును బైసభవారు త్రోసివేయ వచ్చును. పైసభయందును నేరము స్థిరపడినను చక్రవర్తిగారవ్యాజకరుణచేఁ దన్నురక్షింపవచ్చును.

తప్పిపోవుట కెన్నియో యవకాశములున్న, వ్యావహారికమైన రాజదండనము విషయ మింతభయము కలదే, మృతివిషయమై చేసికొన్న యేర్పాటులేమి రామకృష్ణాద్యవతారములకే తప్పినదికాదు. ఇఁక మన మెంత? ఏఖట్వాంగపరీక్షితులకో తప్ప మరణమెప్పుడు సంభవించునో యేరికినిఁ దెలియదు. అది తప్పునదికాదు. ఇంతయారూఢముగఁ దెలిసినట్టి యనివార్యమైన విపత్తున కేమి ప్రతీకారముచేసితిమని యీజీవులు హద్దుమీఱి ప్రవర్తించుట ?

రాజ—స్వామీ ! అనుగ్రహింపుఁడు. కొన్ని దినములనుండి సంసారదవానలజ్వాలల బాధ మిక్కుటమై రాజనీతి ననుసరించి చేసినసహస్రపాపంబులు భూతంబులవలె మనంబును బాధింప విశ్రాంతిదొరుకక వచ్చి మీచరణంబుల శరణుచొచ్చితిని. "రాజ్యాంతే నరకం ధ్రువ" మ్మని కలదుకదా ? నాగతియేమి ? తరణోపాయం బనుగ్రహింపుఁడు.

పరమహంస—వత్సా ! వెలువకుము. నూరేండ్లు బ్రదికినను మృత్యుతత్త్వమును దెలిసికొనక, మరణించినట్లయినవాఁ డకాలమరణము నొందినవాఁడే. భయవిరహితమార్గమును దెల్పు గురిని నాశ్రయించి, యద్దాని నవలంబించి, నిశ్చింతతో నానందముతో నీదేహమును వదలగలఁవాఁడే మృత్యుంజయుఁడు. "అంతే మతి స్సా గతిః" అని పెద్దలందురు.

గీ. ఆగమములు దెల్పునంతేమతి స్సాగ
తియనియంత మెపుడొ తెలియదుగద,
రామభక్తిపరత రంజిల్లుసన్మతి,
కేల దానిచింత యీసుచెంత.

ఇంక కర్మక్షయ మెట్లగుననఁగా, చెప్పెదను వినుము. నేరములెన్ని మోపఁబడినను, సాక్ష్యమెంత యుండినను, ధర్మశాస్త్రములు కఠినశిక్షకుఁ దాను పాత్రుఁడైనట్లు తెలుపుచుండినను నేరముచేసినవాఁడు మృతినొందినట్లయిన శిక్ష ననుభవించువాఁ డుండఁడు. అటులే, సద్గురుకటాక్షముచే "తత్త్వమసి", "అహం బ్రహ్మాస్మి" అనువాక్యముల ననుభవమునకుఁ దెచ్చుకొని జీవన్ముక్తుఁడుకాఁగా, కర్మఫలము నశించి తాను శ్రీబ్రహ్మానందము నొందును.

స్రగ్ధర—
నేనుం జీవుండనంచున్, నిజముగఁ దనకున్
నిత్య మీదుఃఖమంచున్
దీనుండై సంచరించున్ దినమొకగతితో
దీవ్రవైరాగ్య మబ్బున్
జ్ఞానం బొక్కండుకల్గన్ గలవలెఁదలఁచున్,
గాదె తజ్జన్మ గాథల్
జ్ఞానం బిట్లీయఁగా నొక్కఁడు గురువరుఁడై
కానవచ్చున్ హరీచ్ఛన్.

ఈబోధము నేమరక యాత్మారాముఁడనై యానందమూర్తినై యుండుము. (అనఁగా నందఱు సాష్టాంగనమస్కార మొనర్పఁగా, యందఱ నాశీర్వదించును).

సుదర్శనుఁడు—.

క. శ్రీసీతారామపదా
బ్జాసాదితమానసేంద్రియారామాంతః
ప్రాసాదయోగనిద్రా
భాసురతరపరమహంసభక్తవతంసా.

రాజశేఖర—స్వామీ!

ఉ. ఊచినచొప్పునన్ గదలి,
యూరక నిల్పినయప్పు డాత్మలో
డాచి సమస్తవృత్తులఁ ద
టాలున జీవుఁడ నేనటం చధ
ర్మాచరణ ప్రవృత్తిగల
యప్పుడు నిన్నుస్మరించుచుండ వే
మోచనమబ్బఁజేయవె న
మోస్తు గురో భవతే కృపానిధే.

పరమ—రాజశేఖరా! నీవు కృతార్థుఁడవైతివి. నిన్ననుసరించియుంట నీభార్యయుఁ గృతార్థురాలు. నీ మంత్రియు నీకుఁ బరమమిత్రుఁడై యిహపరములకుఁ దోడ్పడఁగలఁడు. ఇచ్చట మీరందఱును బాంచరాత్ర దీక్షను గడుపుకొని తరువాత రాజధాని కరుగుఁడు.

తల్లీ! ధర్మాంబా! నీవు మహాపతివ్రతవు నీగర్భంబున లోకమునకంతకును, భక్తాగ్రేసరుండును జ్ఞానప్రదుండును నగు ధీగుం డుద్భవింపనున్నాఁడు. భర్తృసేవను భగవద్భాగవత కైంకర్యము నేమరకుండుము.

ధర్మాంబ — ధన్యురాలను.

పాట, శ్రీరాగము-ఆదితాళము

ఆనందమానందమాయెను, బ్రహ్మానంద మానంద మాయెను.

రాజశేఖ — దురభిమానమంతయు తొలఁగి పోయెను-బ్రహ్మజ్ఞానమె సంసార మాయెను - మహామౌనమె నిత్యజపమాయెను-స్వాధిష్ఠాన చిజ్జలధియందు స్నానము జేసితి—

అందఱు—ఆనందమానందమాయెనుబ్రహ్మానంద మానందమాయెను.

సుద—సాధనసంపత్తిలభించెను-గురు
నాథుఁడు ననుగరుణించెను-బహు
మేధావిగాననుభావించెను-ప్రకృతి
బాధలెల్లను దొలఁగించెను-కామ
క్రోధాది శత్రువుల ఖండించినిలచితి. ఆ.

అందఱు—ఆనంద మానందమాయెను........

[తెర వ్రాలును.]

---

# చీకటితప్పు

**వేలూరి శివరామశాస్త్రి**

(ఆశ్వయుజ భారతినుండి అనువృత్తము)

## ౪

### (౫)

"సుబ్బారావు ఆటపాటలలో ఎంత దిప్పకాయో చదువుసంధ్యలలో అంత మొదటిపిల్లకాయి. అతఁడు విద్యార్థులకే కాదు సనాతనే కాదు అనునాతనే కాదు, ఒకటేమిటి అన్నిసంస్థలకునూ లీడర్. చదువతనికి ఖేల. అతఁడే ఈచచ్చుపుచ్చు పరీక్షలలో తప్పితే ఇఁక ప్యాసుకాఁగలవాళ్లెవళ్లు?" అని మైత్రమ్మ వ్రాసిన ప్రత్యుత్తరము చూచుకొని చూడమ్మ తనమనసు పదిల పఱచుకొనెను.

మైత్రమ్మ వ్రాసిన ఈయుత్తరములోని అక్షరము లన్నియు నెంత సత్యములో అవి అంత అసత్యము లనియు చెప్పవచ్చును. ఏలనఁగా ఆసంగతుల కీడుగ సంగతులనుగూడఁ జేర్చనిచో అతని సంపూర్ణస్వరూప ములో సాఁబాలయినను పూర్తి కాదు.

తలిదండ్రులు లేకపోవుటచే అనుజ్ఞలు లేని ధనికులగు యువకులను వలచు స్వాతంత్ర్యలక్ష్మి అతని మెడలో వరమాల్యము వైచెను. పట్టణనివాసమువలనను, సంస్కారమునకు తోడుగా ప్రకృతవిద్య ప్రసాదించిన విజ్ఞానమువలనను, పరిసరములవలనను అతఁడు విధినిషేధ ముల బాధలను చవిచూడలేదు. అతనికి దేనికిని లోపము లేదు. అతఁడు తన యిష్టమును కొనసాగించుకొనఁ గలఁడు. తా నెవరికిని దేనికిని బద్ధుఁడు కాఁబనిలేదు. అతనికి సంసారబాధ లేదు. ఎవరిభయమును లేదు. అతఁడు కొన్నిటిలోనయినను అన్నిటి నెఱుఁగఁడు. కాని అన్నిటిలోని కొంత యెఱుఁగును. అతనికి వలసి నంత గుండెనిబ్బరము కలదు. అతఁడు చక్కఁగా నవ్వఁ గలఁడు. తీవ్రముగా వాదింపఁగలఁడు. తనపక్షము సమర్థించుకొనఁగలఁడు. లెస్సగా చదువఁడు. కాని పరీక్షలు ప్యాసు కాఁగలఁడు. ఇంద్రియములు కొంపోవు దారిలో వెనుకడుగువేయక పోఁగలఁడు. వీని అన్నింటి వలనను సుబ్బారావు ఆర్ట్సుకాలేజీలకన్న మిలిటరీకాలే జికి ఎక్కువపనికివచ్చునని చెప్పవచ్చును కాని యీ మాటగూడ సిద్ధాంతముచేయుటకు వలనుపడదు. ఏల నఁగా అందము ఎచట విలువకలదో అట్టి దినుసు కంటఁ బడఁగనే అతఁడు సులభముగా ఓడిపోవును.

కాని ఈ ఓటమియే అతనిమతములో విజయము. ఎటు లనఁగా చచ్చి మృత్యువును జయింపవలయుననుట యుపనిషన్మతము—'వినాశేన మృత్యుం తీర్త్వా'. ఈ యోటమికూడ విజయమగునని పుట్టఁబోవు హైందవసో ల్జరులు అనుమతించుచో అపుడితఁడు యోధకళాశాలకు సమర్థుఁడని అంగీకరింతముగాక!

సుబ్బారావుకు వయసు వచ్చెను. దానితో పాటు వాసన లన్నియు పల్లవించెను. అతనికన్ను కడు వాడిదైయైనది. అతఁడు దానితో జనారణ్యములోని కుఱుకును. అందలని చూపుతుమ్మెద వాలని కొమ్మలే యుండవు.

అందగత్తెలు పలువురు తనకొఱకు వెచ్చనూర్తు రని యతనినమ్మిక. తానే వారిని మిగుల వలచె నని తనకు తెలియదు. కొందఱు తనకు లేఖలు వ్రాయుదు రని అతని ధీరత. తన హృదయమునందలి యొకపొరలో తాను వ్రాసిన మోహాక్షరము లున్న వని యతఁ డెఱుఁ గఁడు. ఇటు లతని కౌతుకవృక్షము కడుదవ్వుగా వేరులు పాఱి కొమ్మలచే సాగెను. చూడమ్మసౌందర్యసర్వ స్వమును నిశ్శేష మొనరించుటకు కొండంతాశతో అతఁడు రైలు దిగెను. దిగి ఏకాయెకి రామస్వామి యింటికే వెళ్లెను.

సుబ్బారావు కానిపింపఁగనే మాణిక్యమును, రామస్వామియు ఐకకంఠ్యముగా 'పేపరు సరిగా వ్రాసి

తివా?' అని యడిగిరి. 'చేతనయినటులు వ్రాసితి' నని యతఁడనెను. పిదప చూడమ్మ ప్రయత్నముకన్న నెక్కువ అయిన మాణిక్యముప్రయత్నముచే రామస్వామియింట విందులును విశేషములును, అచ్చటలును ముచ్చటలును చక్కఁగా జరిగెను. రామస్వామి వాత్సల్యమును, మాణిక్యము గౌరవమును, చూడమ్మ బెదరుచనవును అతని కీమాటు ఆనందము కలిగించెను. వారు ఏకకుటుంబీకుల వలె మమేకముగా నుండిరి.

సంఘదేవతయొక్క కుటిలకటాక్షమువలన చూడమ్మకు సాహసము మెండాయెను. సుబ్బారావుమోటారుమీఁద ఆమెదే అగ్రపీఠము. అతని భోజనభాజనముల కామెదే అంకురారోపణము. సుబ్బారావులోభలత కిదియంతయు ఎరువాయెను.

వారు సౌందర్యమును గుఱించియు, ప్రేమను గుఱించియు, సృష్టినిగుఱించియు ప్రసంగించుకొనిరి. క్రొత్తగా కనుగొనఁబడిన హైడ్రోజన్, ఆకాశవక్రత, క్లోరిన్, బ్రహ్మాండవ్యాసము ఈమొదలగునవిగూడ వారి ప్రసంగమునుండి తప్పించుకొనిపోలేదు.

సుబ్బారావుమోటారు ఒకనిర్జనప్రదేశమున ఆఁగెను. ఆలోచనలలో మునిఁగి తేలుచున్నటులు గాలి మెల్లగా వీచుచుండెను. ప్రత్యుత్తరములేని ప్రశ్నప్రవాహమువలె అచటి నది ప్రవహించుచుండెను. మోహినిచేతిలోని సుధాభాండము పగిలి నలుదెసల వ్యాపించినటులు వెన్నెల యలముకొనెను.

చూడమ్మకు సప్తఋషులును, అరుంధతియు దర్శనమిచ్చి యానందమొసఁగి యామెదృష్టి నాకర్షించెను.

'ఏమిటి చూచుచుంటివి?'

'ఆరంజోతి, మంచపుఁగోళ్లు.'

సుబ్బారావులేచి 'ఇదే మనమంచము, ఇదుగో వసిష్ఠుఁడు' అని చూడమ్మను తనకరపంజరమున బంధించెను. ఆమె తన యునికినే మఱచెను. ఆవెన్నెలలో వారికి పడకటిల్లయన ఆయావిరిబండి వేసుజామున గృహప్రవేశ మొనరించెను.

(ఘ)

ఆపట్టణమునందలి క్లబ్బులో నాలుగు వ్యూహములు కలవు—౧. ఉద్యోగివ్యూహము. ౨. సంస్కారవ్యూహము. 3. సనాతనవ్యూహము. ౪. స్వతంత్రవ్యూహము.

ఉద్యోగివ్యూహమున వయసుడిగిన ఉద్యోగస్థులును, పించనుదారులును, ఎమెమ్మెల్సీలును, బోర్డుల ప్రెసిడెంట్లును, ధనికులును కలరు. అందలివారికి ఇంచుమించు ఇతరవ్యూహమువారితో పని లేదు. వీరిలో వీరికి సౌభ్రాత్రము కలదు వీరికి వీరి చీట్లపేక యేమో, వీరిచదరంగమేమో! ఇటులయినను ఇచట ఇచ్ఛాశక్తి పుట్టిన చో పట్టణమున క్రియాశక్తి కలుగును.

సంస్కారవ్యూహమువారందఱును ఇంచుమించు నడిప్రాయమువారు. కొందఱు తెంటర్మీటు బి. యే. వఱకు డేఁకి కాలదోషము పట్టినవారు. కొందఱు యెస్సెస్సెల్సీలు, యెల్లెంపీలు. కొంచెము సంస్కృతము, కొంచెమింగ్లీషువచ్చిన కొంచెగాండ్రును కొందఱు. చాలమంది బడితెబాజావారును కలరు. వీరు భాషను మతమును సంఘమును క్లబ్బును సర్వమును సంస్కరింపఁజూతురు. వీరికి ప్రయోజనము, తర్కము, సయెన్స్ ఈమూఁడును ప్రమాణము.

సనాతనవ్యూహము ద్వివిధము—౧. ఉదారసనాతనవ్యూహము. ౨. సనాతనవ్యూహము.

ఉదారసనాతనవ్యూహములోనివారు పలువురేఁబదికిపైఁబడిన పించన్‌దారులు థియాసఫిస్టులు సత్సంగులు చైతన్యులు. కొంచెగాండ్రును ఈవ్యూహమున లేకపోలేదు. ఉద్యోగములు దొరకకపోవుటచే విరక్తి కలిగిన పెద్దచదువులవారు ఇందుఁగలరు.

స్వయంపాకము రుచిగా నుండకపోవుటచే క్లబ్బుకుసంబంధించిన కాఫీశాలలో రుచియగు చోటు వలసినంత లేకపోవుటచే 'రూమ్‌డి ఆర్థడాక్స్' వద్ద, అనఁగా ప్రాయిముందు గజముచోటులో స్వతంత్ర్యవ్యూహమువారు సర్వసమత్వముచూపిపోయినపిదప వీరు భుజిం



౬. ఖాదీప్రదర్శన ప్రారంభోత్సవసమయమున నుపన్యసించుచున్న శ్రీమతి సరోజినీదేవి



౭. కార్యనిర్ణయసభయం దుపన్యసించుచున్న మహాత్ముడు



౬. జాతీయపతాకోత్సవము



౭. అధ్యక్షపీఠమునుండి ఉపన్యసించుచున్న
శ్రీ రాజేంద్రప్రసాద మహాశయులు

తురు. క్లబ్బుకు సంబంధించిన నాటకశాలలో స్త్రీలు ధరించిన స్త్రీపాత్రములు చూచి ఔచితిని గ్రహింతురు. కాని స్త్రీలకది నిషిద్ధమని యందురు. ప్రతిదానికిని ప్రమాణము దొరకకున్నను 'సతాం హి సందేహపదేషు వస్తుషు ప్రమాణ మంతఃకరణప్రవృత్తయః' అను మాట నంగీకరింతురు. మానవునిలో దేవత్వ మంతర్ముఖముగను, మానవత్వము బహిర్ముఖముగను, పశుత్వ మీ రెంటినడుమను ఉన్న దని వీరి నమ్మకము.

సనాతనవ్యూహము కలగూరగంప. ఇందు సంస్కృతయెమ్మేలు, స్కూల్ ఫైనల్ శిరోమణులు, విద్యాప్రవీణులు, తెలుగు, సంస్కృత, ఉభయటీచర్లు, అనక్షరులు వగైరాలు కలరు. వీరు శతాబ్దులనుండి వచ్చుచున్న సంప్రదాయములకు రక్షకభటులు. ధర్మాచారములకు వీరు తేడా పాటింపరు. నోరాచరు. మనుష్యుఁడొకమర. ఈమరను నడిపించునది భూతకాలము. వీరికి 'రూమ్ డి ఆర్థడాక్స్'తో ఐహికముగాఁగాని, ఆముష్మికముగాఁగాని సంబంధము లేదు. వీరికి పరధర్మము, పరభావ, పరకీయము సర్వమును మ్లేచ్ఛము.

స్వతంత్రవ్యూహములో పనిపాటలు లేనివారు హెచ్చు, స్త్రీలు లొచ్చు. పెద్దపెద్ద చదువులు చదివిన వారు వీరితరువాత. చదువులు తప్పినవారు పిదప. సెలవులలో ఇంటికివచ్చినవారు పిమ్మట.

ఆబ్రహ్మస్తంబపర్యంతమును వీరివిమర్శమునకు లక్ష్యము. వీరికి ఇచ్ఛాశక్తిక్రియాశక్తు లొకతూరియే కలుగును; ఒకతూరియే మడుగును. సంస్కారవ్యూహమువారికి వీరు అప్పీలు (Appeal). మానవుఁడు ఒప్పు చేయుట కెటు లధికారియో తప్పుచేయుటకును అటులనే యధికారియని వీరియభిప్రాయము. తప్పు తెలిసినపిదప దిద్దికొనకుండుట వీరిలో లేదు. వీరు భూతకాలమునందలి మేలునుగ్రహించి కీడును ఉచ్ఛేదింతురు. వీరి యెడమచేతిలో 'సైకో ఎనాలిసిస్', కుడిచేతిలో 'సయెన్స్'. మానసక్షేత్రమున యడుగుపొరలోఁ బడి మొలవని విత్తులను వీరు సాగుచేయుదురు. నిన్నటివఱకును మనఃపద్మమున కాఁపురమున్న దేవతలకును, దయ్యములకును వీరు చేట దెబ్బ కొట్టిరి. సూర్యనారాయణమూర్తివారి యేడుగుఱ్ఱములకును కళ్లెములుకోసి తన్ని తగిలి శివారిని సాగఁడిగాఁ జేసిరి. శ్రీమహావిష్ణువుమూవురుభార్యలలో నొకతెయయిన భూదేవిని ఆదిశేషునిపడగలమీఁదినుండి దింపి మట్టిముద్ద యొనరించిరి. ఈమట్టిముద్దను సెకండుకు పందొమ్మిది మైళ్లవంతున పైనెగడిచుట్టును పరుగులెత్తించిరి. ఇంద్రునిచేతి వజ్రాయుధమును లాగి ఎలెక్ట్రిసిటీని ఇచ్చిరి. సృష్టిపనినుండి బ్రహ్మగారికి సెలవొసఁగి పరిణామమున కాపని పెట్టిరి. సృష్టియొక్క వ్యాసము ఇంచుమించుగా ౬౨౯౫౬౩౩౭౦౦౦, ౦౦౦,౦౦౦,౦౦౦౦ మైళ్లు ఉండునని అనుమానించిరి. వర్తమాన భవిష్యత్తులమీఁద వీరు భావనారాజ్యము (**Utopia**) కట్టిరి.

ఈవ్యూహములలో ఏరెండు వ్యూహములకును మతైక్యము లేదుగాని సనాతనవ్యూహము వినా మిగిలిన వ్యూహములకు భిన్నభాండాశనము లేదు.

లోకకల్యాణమునకుఁగాను శ్రీ మహావిష్ణువు వ్యూహచతుష్టయముతో విరాజిల్లుచున్నటులు పట్టణకల్యాణమునకు ఆక్లబ్బు ఈవ్యూహచతుష్టయముతో విరాజిల్లెను.

బస్తీలలో పనిపాటలు లేని ధనికులు ధనానామనుష్యులు లేక జంట్లిమన్లు అయిపోవుదురు. సుబ్బారావిటులయిపోవుటయేగాక క్లబ్బులో మెంబరుగిరీ సంపాదించి దేవత్వమునుగూడఁ బడయఁగలిగెను. అంతటితో సతిఁ డాఁగఁదలఁచుకొనలేదు. తనయెటుకలో చదువు వచ్చినట్టియు రానట్టియు ఆఁడంగులను క్లబ్బుదేవులనుగాఁ జేయఁబూనుకొనెను. స్వాతంత్ర్య సంపాదనముకొఱకు గాలికన్న వడిగాఁ బరుగిడు క్లబ్బుదేవులు కొందఱు తమ యజరత్వామరత్వములను నిలుపుకొనుటకు రెండుపూఁటల నమృత మారగింప క్లబ్బును కాఫీక్లబ్బుగా మార్చివేసిరి.

ఈక్లబ్బుకు వెనుక నున్న యావరణములో వ్యూహము లన్నియు విడిసెను. వేదికలచుట్టును కుర్చీలు సుంద్రముగా వేయఁబడెను. దివియలు వెలుఁగుచుండెను.

ఘోరాభిజ్ఞ ప్రమోంత వినఁబడఁదొడఁగెను. స్వతంత్ర వ్యూహమునందలి పురుషసింహముల గర్జనములలో కోమలుల కలకంఠములు ప్రేక్షకుల కర్ణముల నాకర్షించుచుండెను. ఉదారసనాతనవ్యూహమునందు పాశ్చాత్య సిద్ధాంతము లన్నియు సిద్ధాంతలేశసంగ్రహమున ఇతికింపఁబడుచుండెను. "నెలకు ముప్పదిమంది విధవలు ఇస్లాముమతమునఁ జేర్పఁబడుచుండి" రని సంస్కార వ్యూహమువారు దుఃఖించుచుండిరి. పెద్దవ్యూహములో బ్రిడ్జిపయారసుచుండెను. చదరంగములో రాజ్యములు తలక్రిందు లగుచుండెను. క్లబ్బు ఇటులు కలకలలాడి పోవుచుండెను.

జడ్జీగారును, కుంచాల అంకమయ్య యెమ్మెల్సీ గారును చదరంగ మాడుచుండిరి. అంకమయ్యగారిది చాల గొప్పయెత్తు. కాని ఆనాఁడతఁడు పరధ్యానముగా నుండెను. జడ్జిగారు స్వరముతో 'రాజు' అని అనీ అనకముందే అంకమయ్యగారు "అహహహ, ఒకపక్క శారదాబిల్లు, ఒకపక్క ఇంటివాళ్లు, ఈనడుమ నన్ను నలిపేశారు" అని పిమ్మట "నాఆట కట్టింది" అని కుర్చీకి జేరగిలఁబడిపోయిరి. జడ్జిగారు పకాలున నవ్వి "ఇవ్వాళ మీ గ్రీలోకంలో ఉన్నట్టు లేదు. ఈ యాటంతా మీకు పెళ్లిపటె కనఁబడుతూంది" అని యనిరి. "ఔనండీ! జరిమానా సర్కారుకట్టించిన లెక్క చూచుకున్నా యెమ్మెల్సీ పని పటతా రనే సందేహం" అని అంకమయ్యగారు మఱియొకయాటకు బలగమును సర్దఁదొడఁగిరి. 'మునిసిపాలిటీవారి జాతకాలు చూలుత' వని జడ్జీగా రనిరి.

మఱునిముసమున నే ఈమాట నూతిలో రాతివలె సంస్కారవ్యూహములో పడెను. 'పెద్దవాళ్లకు మతి మతోతూంది. పిల్లకు పదేళ్లు లేవు పెళ్లఁట. సుబ్బారావు విడోమ్యారేజిచేసుకోని కళ్లు తెరిపిస్తాఁడు' అని వారంద ఱైకకంఠ్యముగా తమ అసమ్మతిని వెల్లడించిరి.

పరువాత ఈవార్త ఉదారవ్యూహమునకు ప్రాఁకెను. వారెల్లరు తాముగూడ తాంబూలములు పుచ్చికొనినటులు సంతసించిరి. పిదప సనాతనులకు తెలిసెను. "రామస్వామి విధవోద్ధారకసభవారి కిచ్చిన వేయినూటపదార్లలో ప్రతిపమ్మిడికిన్నీ, మాణిక్యము చూపమ్మచేత చయనమ్మగారి మేనమామహాఁతురి కని పుట్టచెప్పించిన చీరరవికలలో ప్రతిపూలుపోసుకున్నా విలపించేట్టు చేశాఁడు సుబ్బారావు" అని వారు సుబ్బారావుయోగ్యత నభినందించిరి.

స్వతంత్రవ్యూహమువా రీమాట విని అంకమయ్య అనభిజ్ఞతకు ఆశ్చర్యపడి "అతఁడిదివఱకే చూపమ్మను వరించాఁడు. పెండ్లి అనేది మామతంలో 'చేసుకోవాలి' అని లేదు. అయినా దీనిసత్యాసత్యాలు సుబ్బారావునే కనుక్కుందాం" అని అతనికొఱకు కన్నెత్తి చూచిరి. ఇంతవఱకును వారినడుమనే యున్న సుబ్బారావిపు డేఁడీ?

( ౫ )

లతలను జూచి చెట్లును, చెట్లను జూచి లతలును విఱుగఁబూచెను. అదేమి చోద్యమో కొండతంగేళ్లంతయు పూవు లయిపోయెను. ఎక్కడినుండియో గాలికి పరిమళము పుట్టుకొని వచ్చెను. ఋసులక్ష్మికి తఱుసు లేవనిపించెను.

ఒకానొకపుడు తనకు స్వాభావికాహారమయిన పండును మానవుఁడపుడు రుచిచూచెను. శరీరములందు తేజము కానిపించెను. ప్రాణములు చంచలము లాయెను. మనోమయకోశము చిగిర్చెను.

జ్యోతిష్కులయు, పంచాంగములయు ప్రాబల్యము హెచ్చెను. గ్రహములకు లేని బలమును లంచములు సంపాదించిపెట్టెను. దానివల్ల లగ్నమాత్రమునకు వినియోగము కలిగెను. గృహప్రవేశములతోడను, వడుగులతోడను, వివాహములతోడను పక్కణములును, పల్లియలును, పత్తనములును కలకలలాడెను.

రామస్వామియింటిముందు సనాయిపాటయు, పిల్లఁగ్రోవిపాటయుపర్యాయముగా వినఁబడఁదొడఁగెను. ఆమేడలో ఒక పెండ్లివారు విడిసిరి. ఇల్లు వాకిలి మేడ దొడ్డి సమస్తము జనముచే కిటకిటలాడుచుండెను.

చావడిలో అరగజ మెత్తను, ఇరువదిగజముల చదరమునను బల్లయొకటి వేయఁబడెను. దానిమీఁద మూరెఁడెత్తు పఱుపును, పెద్దదిండ్లును పఱుపఁబడెను. దానిమీఁద పెండ్లికొడుకు అధిష్ఠించెను. అతనికదలికకును నిమేషమునకును నిశ్వాసమునకును అర్థమెఱిఁగిన బంట్లును బంధువులును మిత్రులును ఆయాయాపనులు సాధించుచుండిరి. చూచుచున్న మాచమ్మ కాపెండ్లికొడుకు కేడుదీవుల యావలినుండి దండెత్తివచ్చిన రాచకొడుకువలె కానిపించెను.

మేడమీఁదిచావడి అలంకారమందిరముగా మారెను. దానికిరుప్రక్కలనున్న గదులు స్నానశాలలాయెను. అలంకారాగారమునందలి పెద్దబల్ల చీరలచే రైకలచే జాకెట్లచే బ్లౌజులచే బాడీలచే అంగడియయిపోయెను. అప్పుడే జలకమాడి వచ్చిన జలజాక్షుల అవయవములనుండి సొలుకొంచు పలురకముల సబ్బుల యుగ్రగంధము మానవులకేకాక దానవులకును దగ్గు రప్పించుచుండెను. నిలువుటద్దములకడ నిలిచిన మేజాలన్నియు రకరకముల పౌడర్లయు, స్నోలయు, సెంట్లయు పెట్టెయలచే నిండెను. ఇట్టులు ఆ సౌందర్యాంగనామణులందఱును విదేశవస్త్రములు తాల్చి విదేశాంగరాగము లలఁదుకొని (వారిశరీరస్వత్వముగూడ వారిభర్తలదేయగునెడల స్వకీయమని చెప్పఁదగిన దేదియు లేదు.) వివాహపూర్వరంగమును సిద్ధపఱిచిరి.

పురుషుల స్నానశాల క్రింద. వారియలంకారగ్రంథమంతయు వసారాలో. సబ్బుగూడ వారికిని నాగరికతలో ఒకయంగము. విశేషించి పెండ్లికి వచ్చిన యేగ్యంసర్వుఁడు కుంకుడుకాయల పులుసుతో తనపోటుదనము నితరులకు చూపెట్టును?

పిన్నవారందఱును తమతమ చిన్న మంగలిపెట్టెలను ముందిడుకొని చేయద్దముల నెదుట నిలువఁబెట్టి సొంత మంగళకర్మతో అంగరాగములతో తమకును ఆఁడువారికిని అంతగా భేదము లేకుండ అలంకరించుకొనిరి. వారందఱును కాంగ్రెసుకు చందాదారులే కాని మాంచెస్టరుకు వారి యంగములే పునాదులు. గ్లాస్గోమిల్లులు వారి నగ్నతకు రక్షచేయును. ఆయము వలనఁ గలిగిన పరలోకబాధను వారు కన్యకాపరమేశ్వరి మీఁద పాఱవేయుదురు.

ఇట్టులు లక్ష్మి తాండవమాడుచున్న యీ వివాహవైభవము చూడఁగనే మాచమ్మహృదయములో నొకానొక యావేశతరంగము చెలరేఁగెను. అంతట నామె యేరికిని గానరాలేదు.

మాణిక్యము ప్రొద్దుటినుండి సాయంకాలమువఱకును పెండ్లివారిలో ఎచటఁజూచినను తానయై తిరుగుచుండెను. పెండ్లివారామెకు మార్చుచుట్టములు. ఈ తిరునాళ్లలో ఆతల్లి తనకూఁతురిమాట మఱచెను.

సంధ్యాసమయ మతిక్రమించెను. విద్యుద్దీపములు వెలుఁగుచుండెను. పెండ్లిపెద్దలు వలువలను వెండిబంగారములను నగకట్టును వెలికిఁదీసి సర్దుచుండిరి. అప్పుడు వియ్యపురాలొక నగలపెట్టె తెచ్చి నాణెము చేయుటకు మాణిక్యముముందు పెట్టెను. అవియన్నియు కన్యకాపరమేశ్వరిరూపమును వ్యక్తీకరించుచుండెను. మాణిక్యము వానిని మెచ్చుకొనెను. వానిని తన కూఁతురికి చూపఁదలఁచెను. ఇంటిలో నెచ్చటను కానరాకుండుటచే దాసిని సుబ్బారావుగారియింటికిఁ బంపెను. దాసి వెనుదిరిగి వచ్చి 'పొద్దుటినుంచీ యిక్కడికి రాలేదన్నారండీ' అని చెప్పెను.

మాణిక్యముగుండె గుభేలుమనెను. వెనుక తాము మాచమ్మనుపలికినవిషయము గుఱుతుపడలెను. వెంటనే అంతటను వెదకెను. కూఁతురు కానరాకుండుట భర్తకుఁ జెప్పెను. అతఁడును వెదకి వెదకి విఫలుఁడాయెను.

ఇంతలో దాసివచ్చి 'అమ్మాయిగారు ఆమూల సామానుకొట్లో ఉన్నారండీ! ఆయమ్మను మాస్తే భయమేసి పరుగెత్తుకొచ్చాను' అని విన్నవించెను.

'ఉరి పెట్టుకోలేదు గద' అని రామస్వామి దంపతులు దీపము తీసికొని గబగబ పరుగెత్తిరి. ఆదీపపరిమండలము సమీపించునంతలో తాను వ్రాసి వినోదించుచున్న తమ పెండ్లిచిత్తరువును దాఁటి లేచి నిలువఁ

బడి— 'అమ్మా చోటు లేక యిచట కూరుచుంటి' నని గద్గదస్వరముతో పలికెను.

మాణిక్యము దీప మెత్తెను. ఆమె ముంగురులు తడిసియుండెను. అసలే పెద్దవయిన కనులు మఱింత పెద్దవయి ప్రత్తికాయ లాయెను. చెక్కులు జేగురుపులుమఁబడినటు లుండెను. ఈయాకారమునకుఁ గల యర్థమును గ్రహించి మాణిక్యము కూఁతురిని కౌఁగలించుకొనెను. ఆమెకంఠమునుండి అస్పష్టముగాబయలు దేఱిన రోదనధ్వని ఉహుహుహు అని శరీరకంపముగా పర్యవసించెను.

రామస్వామి యీ శోకమును పట్టఁజాలక యిటు లనెను—'అమ్మా! ఇంటిలో నొకగదియేని కాళీగా లేదు. నీగదిగూడ నిండిపోయినది. ఈరాత్రి బావగారి యింట మనవిడిది. ముందు నీ వచటికి వెళ్లుము.'

ఈమాటకు చూడమ్మగుండె లదరెను. ఆమెను కౌఁగిలించుకొనియున్న మాణిక్య మాయదరుయొక్క బలవేగముల పరిమాణమును లెస్సగా గ్రహించి యిటు లనెను—'అమ్మా! మనకు ఈపూఁట పాచకుఁ డక్కడ వంట చేస్తున్నాఁడు. మాకుఁగూడా ఇక్కడ పిసరంత చోటు లేదు. మేమూ అక్కడికే వస్తున్నాము. నీవు ముందు మంచాలవారి యింటికి పద.'

౫

(క)

దేశపురాజులు దక్షిణమున కొనయూపిరితో నున్నంతవఱకును ప్రజలు తమబంగారమును తీసికొని పోయి టంకసాలలో నాణెములు కొట్టించుకొని ఉపయోగించుకొనుచుండెడివారు. ఈవిషయమున రాజులకెట్టి హక్కుకలదో ప్రజలకును అట్టి హక్కుకలదు. ఏదేశములోఁగాని, యేకాలములోఁగాని ఆనాణెము తనలో నుండు ప్రాణమును, అనఁగా బంగారపు వెలను కోలుపోయెడిది కాదు. ౧

తురకరాజులు వెండినిగూడ నాణెము చేసిరి. వీరిసమయముననే నాణెములందు ద్వైతమత మారంభమాయెను. అపుడు వెండినాణెముయొక్క వెలయు, బంగారునాణెముయొక్క వెలయు వానిలోని లోహములవెలయంతయే యుండెడిది. వాని మాఱకముగూడ లోహములవెలనే యనుసరించెడిది.

కుంఫిణీవారుగూడ లాభమును కనిపట్టి ౧౮౩౫ సాలున ఒకతులమెత్తు తూకము గల వెండిరూపాయను ముద్దరకొట్టిరి. అంతటితో హిందూదేశమున బంగారునాణెము అనఁగా బంగారువిత్తనము నాశనము కాఁదొడఁగెను. ౨ పిదప వెండినాణెములే పైరు చేయఁబడెను. ఈరీతిగా ద్వైతవిధ్వంసము (Bimetalism) కలిగి నాణెములకు అద్వైతసిద్ధి (Monometalism) కలిగెను.

సీమలో బంగారునాణెములకే ప్రచారము కలదు, భరతఖండమునందు వెండినాణెముకే అనుజ్ఞ కలదు. భరతఖండము సీమకు పలురకముల పన్నులు కట్టవలెను. ఎగుమతి చేయవలెను. దాని కెక్కుడు దిగుమతి చేసికొనవలెను. తా నిక్కడనేయుండి తనకు సీమలోఁ గల సొంతయింటిని భరింపవలెను. ౩ తాను సీమలో డబ్బు నిలువచేసికొనవలెను. ౪ తనను పరిపాలించిపోయిన

౧. ఈవ్యవహార మమలులో నున్నయెడల మాఱకపుచిక్కులు కలిగించుకొనుట కవకాశ ముండదు. భరతఖండము దివాలాతీయదు.

౨. ౧౮౭౧ సాలున జను లాందోళనముచేయఁగా మొహరు తలచూపెను. కాని ౧౮౯౩ లో రద్దుచేయఁబడెను. ౧౮౭౪ సాలుమొదలుకొని ౧౮౯౪ వఱకు మరల బంగారునాణె మేర్పాటు చేయవలె నని ప్రజలు ప్రార్థించుటయు, తెల్లవారిలో పెద్దమనుష్యులు (రాయల్ కమిషన్) బంగారునాణె మేర్పాటుచేయుట మంచి దని పరిష్కరించుటయు, ముఖ్యమంత్రిగూడ పనిచేయుటయు జరిగెనుగాని సర్కారువారికిమాత్రము దయరాలేదు.

౩. Home Charges.

౪. Gold Standard Reserve. Paper Currency Reserve ఈ. మొ. అనంతము.

వారికి పింఛను లీయవలెను. ఇటు లెన్నియో రీతులుగా సీమకును భరతఖండమునకును లావాదేవీలు కలవు.

భరతఖండము సీమకు ఈయఁగలిగెనది వెండి నాణెము. సీమకు కోటిపౌను లీయవలసియున్నయెడల సీమయొక్క బంగారునాణెములకు సరిపోవు నన్ని రూపాయల నీయవలసియుండును. అపుడు వెండిబంగారముల లెక్క కట్టవలసియుండును. వానివెలలు రేపటికి మాపటికి మాఱుచుండును. తడవతడవకు వెలకట్టుటచే ఆలస్యము, విసుకు మొదలగు చిక్కులు కలుగుచుండును. ఈఅపాయము లేకుండుటకు దొరతనమువారు ౧౮౭౨-౩ సంవత్సరములనడుమ కాఁబోలు 'రూపాయ ఇంత' అని ఒకయేర్పాటు కావించిరి. ఆ'యింత' అంతటితో ఆఁగ లేదు. ౧ ఆఁగదు. ఆఁగుటకు వీలును లేదు. రూపాయ విలువ ఒకషిలింగు ఒకటిన్నర పెన్నులనుండి రెండు షిల్లింగులవఱకును అపుడపుడు మాఱుచు వచ్చెను. ఇంతియకాదు. నాఁటిరూపాయయు మాఱుచువచ్చెను. నాఁటిరూపాయి బండబ్బాయి. నేఁటిరూపాయ అల్లరి పిల్లకాయ.

సీమకు యుద్ధమువలనఁగాని, వాణిజ్యమువలనఁగాని, మఱిదేనివలనఁగాని చిక్కులు కలిగినపుడు దాని యోగక్షేమములకొఱకు హిందూదేశమున నున్న రూపాయి ఉలికిపడుచుండును. ౨ ౧౯౧౯ సాలున రూపాయ రెండుషిలింగు లాయెను. దానితో హిందూదేశమునకు ఎగరొప్పు పుట్టెను. ౧౯౨౭ సాలున రూపాయ షిలింగు ఆఱుపెన్నులాయెను. అది నాఁటనుండి నేఁటివఱకును మాఱలేదు.

౧౯౨౭ సాలున భారతలక్ష్మియొక్క ఫాలఫలకమున భాగ్యాక్షరములు వ్రాయు బ్రహ్మమహిమవలనను, టంకసాల యను మాయాగృహమువలనను, రేషియో లేక మాఱక మను ఇంద్రజాలమువలనను హిందూదేశమునం దెక్కడి సర కక్కడ గుట్టలు పడిపోయెను. దేశపుసరకుకు వెల హెచ్చెను. అది దేశములోనే అమ్మకము కానపుడు లాఁతిదేశములలో కాదుగదా! సీమసరకుకు వెల తగ్గెను. డబ్బు కనఁబడినంతవఱకును అది యిచట విడుదల యాయెను. ఈరీతిగా ఎగుమతి ఆఁగెను. దిగుమతి సాగెను. దానివలన ఉన్నంతవఱకు డబ్బు ఊడ్చుకొనిపోయెను.

క్రమముగా పంటల వెల పడెను. సేద్యమునకు విత్తనములవెల మళ్లుట కష్ట మనిపించుచుండెను. దేశాంతరములనుండి చౌకగా బియ్యము మొదలగునవి దిగుమతి కాఁదొడఁగెను. ఇటులు సేద్యగానికి ఎడా పెడా దెబ్బలు తగిలెను.

పంటలు గల కాటక మిటులు భయంకరముగా వ్యాపించెను. భూదేవి వెల కోలుపడెను. వడ్డీవ్యాపా

---

| | ర. | షి. | పె. |
|---|---|---|---|
| ౧. ౧౮౭౨-౩ నడుమ | ౧-౦-౦ = | ౧- | ౩ |
| ౧౮౯౩ లో (కొంతకాలము) | ౧-౦-౦ | ౧- | ౧౪ |
| పిమ్మట ౧౯౧౭ వఱకు (సుమారు పాతికేండ్లు) | ౧-౦-౦ | ౧- | ౪ |
| ౧౯౧౯ | ౧-౦-౦ | ౨- | ౦ |
| ౧౯౨౭ | ౧-౦-౦ | ౧- | ౬ |

౨. ౭౫౦౦ పౌనుల వెలగలబట్టలను హిందూదేశపు సాహుకారొకఁడు కొనుగోలు చేసె ననుకొందము. అపుడు రూపాయ ఒకషిలింగు ఆఱుపెన్ను లుండుచో లక్షరూపాయ లీవలసియుండును. వెంటనే రూపాయ షిలింగు నాలుగుపెన్నులయి కూర్చున్నచో లక్షమీఁద పండ్రెడువేల అయిదువంద లీయవలసివచ్చును. రెండు పెన్నులమాఱకపు తేడాతో పండ్రెండువేల పైచిలుకెక్కువాయెను.

హిందూదేశ మేఁటేఁట హోమ్‌ఛార్జెస్ క్రింద సుమారు మూడున్నరకోట్ల పౌనులు సీమ కీయవలెను. రూపాయ రెండు షిలింగులసింహాసనముమీఁదినుండి గబాలున షిలింగు నాలుగుపెన్నులకు దిగినచో సుమారు పదియేనుకోట్ల యేఁబదియయిదులక్షల రూపాయ లెక్కువ యీయవలసియుండును. ఈరీతిగనే రిజర్వుబాంకుకని, పింఛన్లకని, దిగుమతి కని భరతఖండ మిచ్చునది సుమ్మడికాయ. పుచ్చుకొనునది ఆవగింజయు లేక పోఁగా చేతిది వదలును. ఇదీ మాఱకపు రహస్యము.

రము చేయువారు నాశపోయిరి. ఋణగ్రస్తులు ఋణదాతలకు దొంగలయిరి. కర్షకులకు కాలుసేతు లాడక పోయెను. మరలు ఆఁగెను. సాహుకారులు దివాలా తీసిరి. ఈ క్షామబాధ ధనములేని మనుష్యమాత్రుని బాధింపఁగా, ధనికుఁడగు రామస్వామిని బాధింపకుండునా?

అతఁడు రెండుమూడు నెలలలో చిల్లరదుకాణమునకును మరలకును గలిగిన నష్టమును సవరించుకొనఁగలిగెను. మరలను మూసివయిచెను. కోస్తా వ్యాపారమును ఎత్తివేయుటకు చెన్నపట్టణమున తనకున్న అంగడిని సరకును చూచి సిబ్బందితో ఆలోచింపఁ దలఁచెను.

అతనికి ఈ క్షామబాధకన్న మఱియొక పెద్దబాధ కలదు. అల్లుఁడున్నాఁడు, కూఁతురున్నది. కాని పెండ్లి మాట తలపెట్టుటకు వీలులేదు. కాన నతఁడు దీర్ఘముగా నాలోచించి కొన్నాళ్లపాటు కాఁపుర ముండుటకు చెన్నపురికి ప్రయాణము కట్టెను.

చెన్నపట్టణము చేరిన మఱుసటి రోజుననే చూడమ్మ మైత్రమ్మను కలిసికొనఁగోరెను. కాని అది యొనఁగూడకపోయెను. మగనికి విడాకు లిచ్చి ఆమె బొంబాయిలో మఱియొక వరుని అన్వేషించుచున్నదని సుబ్బారావువలన చూడమ్మ విని పరితపించెను.

( ఖ )

సుబ్బారావుతండ్రి వీరేసు. రామస్వామితండ్రి వెంకటేసు. ఈ యిరువురది ఉమ్మడి వ్యాపారము.

మహాయుద్ధము జరుగుచున్న సమయమున ఇనుప వర్తకము విరివిగా చేసి వీరు లక్షలార్జించిరి. ఎవఁడో గోసాయి యిచ్చిన పసరు పూసి యినుపరేకులను వీరు బంగారపు రేకులుగా మార్చిరని లోకు లనుకొనిరి.

వెంకటేసు కుబేరుని జయింపఁగోరినటులు పరలోకమున కరిగెను. పిదప రామస్వామి తండ్రి సాగించిన వాణిజ్యమున కందుకొనెను. రామస్వామి సత్యసంధతకును, సూక్ష్మబుద్ధికిని అబ్బురపడి వీరేసు విడిపోలేదు.

కొలఁదికాలములోపలనే వీరేసుకు జబ్బు చేసెను. అతఁడొకనాఁడు రామస్వామిని పిలిచి 'అబ్బాయీ! దిక్కులేని నాకుర్రవాణ్ణి, వాఁడివాటాను నీచేతిలో పెట్టి ఎన్ని కష్టాలువచ్చినా మావాఁడికీ,మావాఁడివాటాకూ నష్టం కలిగించవని నమ్మి నేను మీనాయనగారిలో వాటా పుచ్చుకోడానికి పోతున్నాను. నీవు ఇందుకు ఒప్పుకోకపోతే నా కక్కడ వాటా సులభంగా దొరకదు' అని చెప్పెను.

ఇది అంత సులభముగా ఒప్పుకొనఁదగినదియు కాదు, ఒప్పుకొనకుండఁదగినదియు కాదు. కావున రామస్వామి మిన్నకుండెను.

వీరేసు ప్రాణములు పోలేదు. అవి అతనినేకాక చూడవచ్చిన చుట్టాలనుగూడ బాధింపఁదొడఁగెను. 'ఉమ్మడివర్తకాలలో లాభనష్టాలు సమంగా పంచుకుంటారుగాని ఎవ్వరూ లాభాలే పంచిపెట్టరు. ముసలివాళ్లు డబ్బుమీఁద తీపిచేత ప్రాణాలు వదలలేక అలా కొట్టుకుంటారు'... కాస్త అల్లాగే నని రామస్వామి తలఊపితే ముసలాఁడు సుఖంగా ప్రాణాలు వదులుతాఁడని అందఱును అనిరి. రెండుమూడురోజులు చూడలేక చూడలేక రామస్వామి ఒప్పుకొనెను. రామస్వామి ఒప్పుకొనఁగనే వీరేసు వెంకటేసులో వాటా పుచ్చుకొనెను. నాఁటినుండి నేఁటివఱకును వారివాణిజ్యము ఉమ్మడిగనే వచ్చుచుండెను.

౧౯౨౯—౩౦ సాలులయందు లోఁగడ నిలువ చేసియుంచుకొనిన వడ్లు బియ్యము ప్రత్తిబట్టలు మొదలగు సరకంతయును వారి ఉమ్మడిలక్ష్మికి నాడలు పుట్టించెను. పెట్టుబడులకు చేఁటలంత చేలు కట్టుకొనవలసి వచ్చెను. ఈయవలసిన అప్పులను పైసలతో చెల్లింపవలసివచ్చెను. మహాయుద్ధమువలనను, వండినాణెములవలనను, మాఱకపుమాయవలనను లక్ష్మికి క్షయ అంకురించుటచే కొనువారు లేక కోస్తాసరకంతయు గోదాములలో క్రుళ్లిపోఁదొడఁగెను.

రామస్వామి చెన్నపట్టణమున కాలుపెట్టినది మొదలు గుమాస్తాలచే చుఱుకుగా పనిచేయించి లెక్క

లన్నియు తయారు చేయించెను. చదువునకు భంగము కలుగు నని యింతవఱకును సుబ్బారావునకు ఈ విషయ మిసుమంతయు తెలుపలేదు.

మాణిక్యము పట్టుపట్టి సుబ్బారావును పూఁటకూళ్లయింటికి పోకుండఁజేసెను. అతఁ డెక్కడతప్పి పోవునో యని చూడమ్మ అతనిచదువులలో కొంత పాలుపుచ్చుకొనెను.

ఈవ్యాపార మంతయు పెండ్లికూడితీఱవలయు నను నిర్బంధమే యని సుబ్బారా వనుకొని నవ్వుకొనెను. 'రామస్వామిగాని మాణిక్యముగాని తుదకు చూడయుఁ గాని యీ ప్రస్తావన చేయనిదే నే నేలకల్పించుకొన వలయును? కంపకు లేని దురద చేమ కేల?' అని యతఁడు తలపోసెను.

అంతలో సెలవులు వచ్చెను. సుబ్బారావునకు ఇంటికి పోవలయు నని లేకున్నను నాలుకమాత్రము ఆ కాసంతమాటను వెడలఁగ్రక్కను.

మాణిక్య మిటు లనెను—'ఇల్లంతా ఇక్కడే వుంటే అక్కడికి వెళ్లడ మేమిటి? అదీగాక ఇవి కొద్ది రోజులసెలవ లాయె. వెళ్లడమూ రావడమూ హడావుడే కాని అక్కడ మ కేవిధా విశ్రాంతి ఉండదు. అదిన్నీ కాక అక్కడ పూఁటకూళ్లమ్మ మెతుకులు తినిపించడం నాపనిగాదు. ముఖ్యంగా ఈకారణంచేత నే నక్కడికి వెళ్లనియ్యను.'

చూడమ్మ రహస్యములో నిటు లనెను—'వెళ్లఁ దలఁచుకుంటే తొందరగా వెళ్లండి. మే మిక్కడ ఉన్నామన్ని మాత్రం జ్ఞాపకం ఉంచుకోండి.'

సుబ్బారా విటు లనెను—'జ్ఞాపకం ఉంచుకోక పోయినా ఎల్లాగో కాలేజికి రావాలసివొస్తుంది. ఏం?'

చూడమ్మ యిటు లనెను—'జ్ఞాపకం ఉంచుకోక పోవడ మనేదే కలిగితే ఇక్కడ ఉండీకూడా జ్ఞాపకం ఉంచుకోకుండా ఉండచ్చు.'

నవుకరు వచ్చి—'అయ్యా, తమర్ని రామస్వామి గారు ఒకసారి దయచెయ్య మన్నారు' అని మనవి చేసెను. ఆమనవితో సుబ్బారావుమొగము సుద్దవలె తెల్లఁబడెను. వెంటనే యతఁడు చూడమ్మకేసిచూచి 'ఇదిగో వస్తున్నాను పద' అని అనెను.

సుబ్బారావు వచ్చునప్పటికి బండెఁడు లెక్కల పుస్తకముల నడుమ రామస్వామి కూరుచుండియుండెను.

అతఁడు సుబ్బారావును జూచి 'కూర్చో' అనెను. సుబ్బారావుగుండెలు దడదడ కొట్టుకొనెను. అతఁడు దీర్ఘాలోచనతో కూరుచుండెను.

రామస్వామియిటులనెను—'మీ నాయనగారూ మా నాయనగారూ చాలా గడించి మనకు ఇచ్చి కాలం చేశారు. మీ నాయనగారు పరంపదిస్తూ నీ విషయం లోనూ నీకాతావ్యాపారాల విషయాలలోనూ నన్ను నమ్మారు. వారు నామీఁద ఉంచిన నమ్మకానికి నీవు ఇపుడు పరీక్షకుఁడవు కావాలి. ఎంచేతనంటే ధరలు పడిపోయినవి. ఆర్థికరాజ్య మరాచక మయిపోయింది. వ్యాపారము దివాలాలోకి వచ్చింది.'

'మిమ్మల్ని నేను పరీక్షచేసేపాటివాఁడనా? అది అల్లా ఉంచి ముందర చేయవలసిన పని యేమిటో చెప్పండి.'

'ఈ లెక్కలన్నీ చూచి చక్కగా మనసుకు పట్టించుకో. తరువాత నా అభిప్రాయం చెపుతాను. నీఅభిప్రాయమూ చెబుదుగాని. లెక్కలుచూచు కొన్నతరువాత అసలు ఎవరి అభిప్రాయాలతోటీ పని ఉండదు.' అని రామస్వామి సుబ్బారావుచేతికి కాతా పుస్తక మిచ్చెను.

చివరయంకెలు చూడఁగనే సుబ్బారావుగుండె దడ ఆఁగెను. వీరేసు చనిపోయిన తేదీమొదలు నేఁటి వఱకు వచ్చిన లక్షలకొలఁది నష్ట మంతయు వెంకటేసు వాటాకుమాత్రము కట్టఁబడెను. వీరేసు చనిపోవు తేదీ నాఁడు ఉన్న మూలధనము వడ్డీతో నిలువయుండెను.

సుబ్బారావునకు గుండెదడ అడఁగుటయేకాక ఆశ్చర్యము కలిగెను. పిమ్మట లోఁతుగా ఆలోచించి లోపల ఇటు లనుకొనెను: "ఇది రామస్వామి ఐహి

కాన్ని ఆముష్మికాన్ని కూడా సంపాదించడానికి ఎత్తిన ఎత్తు. నష్టమంతా తాను పంచుకొని లాభమంతా నా కిచ్చినా రేపిదంతా తనకూతురే అనుభవిస్తుంది. రామస్వామికి సర్వస్వమూ వాకట్లోంచి పోతూందికాని వెంటనే దొడ్డిదారిని తిరిగివస్తూంది.'

ఇటు లతఁడు రామస్వామిఎత్తును గ్రహించి పైకి ఇటు లనెను: 'నష్టమంతా మీరేకట్టుకుంటే ఇక ఉమ్మడివ్యాపార మనేది నేతిబీఱకాయ. కాఁబట్టి నష్టములో నాకు ఎట్లా పాలు లేకుండా పోతుంది?'

'నాయనా! వివేకవంతులు మాటాడవలసిన మాట చెప్పినందుకు నిన్ను ఆశీర్వదిస్తున్నాను కాని మీ నాయనగారు పోతూపోతూ—మావాఁడికీ మావాఁడి వాటాకూ ఎంతకష్టం కలిగినా నష్టం కలిగించ వని నమ్ముతున్నాను—అని నిన్నూ నీవాటాను నా కప్పగించారు. నే నందుకు అచ్చుకున్నాను. అదుగో చూడు మీనాయనగారు పోయినతేదీని కాతాలో తలమీఁద ఆవాక్యములే కనఁబడుతుంది' అని రామస్వామి కాకితము తెఱచి యిచ్చెను.

సుబ్బారావు విప్పారిన నేత్రములతో ఆయక్షరములు చదువుకొనెను. అతనికనులు చెమర్చెను.

(౪)

రామస్వామిచేత ధర్మమును నాలుగుపాదములతో నడిపింపఁగలందులకు సుబ్బారావు పూనుకొనుటచే నతనికి ఇంటిదెస మొగముపెట్టుటకు వీలుకలుగ లేదు. అతఁడు రామస్వామిసత్యసంధతను మాణిక్యము ముందును, చూడమ్మముందును బహిరంగముగా చాటెను. తుదకు ఇసుమంతయు బలవంతము లక్కఱలేకయే తనతండ్రి పోవునాఁటికి నిలువ యున్న ధనమును వడ్డితో కలిపి పుచ్చుకొనెను.

సుబ్బారా విందులకు చాల లుకలుకలు పడవలసివచ్చు నని లోలోపల బాధపడుచుండెనుగాని అప్రయత్నముగా ఆపని నెఱవేఱెను. ఈలాభమంతయు అల్లునికి అరణ మని అతఁడు లోలోపల నవ్వుకొనెను.

"సుబ్బారావుకు నష్టము పంచుకుండుట తెలివితక్కువ. విశేషించి కూఁతురిపెండ్లిమాట కనుఁగొనకుండ ముందుగానే ఈపని చేసి కూరుచుండుట శుద్ధతెలివితక్కువ. వ్యాపారస్థుఁడును, అందులో పెండ్లి చేయవలసినవాఁడును ఈపని చేయుటయా?" అని మాణిక్యము కాదారము తెచ్చుకొని మగనితో చెప్పఁదలఁచుకొనెనుగాని యాలోచించి యాలోచించి "చూడమ్మ పెండ్లి యంతయు ఇందులో ఇమిడియున్న" దని తెలిసికొని కాదారమును తిప్పుకొనెను.

'ఒక పెద్ద మొత్తమునకు దావాపడుటకు సిద్ధముగానున్న' దని వచ్చినతంతిని చూచి రామస్వామి వెంటనే యింటికి బయలుదేఱిపోయెను. కుటుంబములో నెల్లుట కతని కింకను వీలు చిక్కలేదు. చెన్నపట్టణములోని ఆఫీసును సిబ్బందిని ఎత్తివేయవలయును. సుబ్బారావు ఋణశేషమునకు ఇల్లు, వాకిలి, అంతయును అమ్మవలయును. మింజుమలె సుబ్బారావే కట్టుకొనఁగలఁడని అతని అభిప్రాయము.

సుబ్బారావు కాలేజికి పోఁదొడఁగెను. సంతోషబలమున నతఁడు రెండుమూడురోజులలో ఊరిపోయెను. పరీక్షలు సమీపించుచుండుటచే నతఁడు నిర్విచారముగా విద్యావ్యాసంగము చేయఁదొడఁగెను.

చూడమ్మ చిక్కెను. ఆమెకపోలములు పాలలో తుడువఁబడినటు లాయెను. శరద్రాత్రియందలి వేసజామున పండఁబాఱిన వెన్నెలడా లొకటి యామెశరీరమునండి వెలువడెను. విషయములలో రసమును, భూతములలో భూమియు నామె నెక్కువగా నాకర్షించెను. క్రమక్రమముగా గమనమునందు మాంద్యము హెచ్చెను. సుబ్బారావును చూడఁగనే యామె కెన్నఁడును లేని సిగ్గు పుట్టుకొనివచ్చెను. మఱునిమసమునే తగ్గి యామె యతని నదేపనిగా చూడదొరకొనెను. ఇటువంటి కూఁతురిని జూచి మాణిక్యము మిగుల భయపడెను.

సుబ్బారా వొకనాఁడు చూడమ్మను జూచి యిటు లనెను — 'పరీక్షలు పరుగు లెత్తుకొని వచ్చుచున్నవి. నా కిచట చదువు సాగదు. దీనికి నీవే సాక్షివి.

వే యొకచోట గదియొకటి అద్దెకుఁ దీసికొనవలయు నని యున్నది.'

చదువు సాగనిమాట నిక్కమే. వేఱొకచోటికి వెళ్లినచో తనకు తన తలిదండ్రులముందు చులకఁదన మెక్కుడగుటయు నిక్కమే. ఇపు డీచులకఁదనమును భరించుటకంటె పరీక్షలో అతని అపజయమును భరించుట చాలఁ గష్టము. కావున చూడమ్మ నట్టునట్టుగా ఈక్రింది నియమములతో అంగీకరించెను: '౧. గది దాపుగా ఉండవలయును—ఇంచుమించుకనఁబడుచుండు నటులు. ౨. ఆహారమును ఉపాహారమును తన చేతినుండియే గ్రహింపవలయును. ౩. నిద్రకు ప్రొద్దుపోఁగొట్టుకొనకుండ కంజాయింపుగా చదువుకొనవలయును.'

సుబ్బారా వీ నియమములకు కడు సులువుగా లోఁబడిపోయెను. అంతదవ్వును అంతదాపును కాని మేడ యొకటి తీసికొనెను.

మాణిక్య మిందుల కంగీకరింపఁజాలకపోయెను గాని చూడమ్మ నచ్చఁజెప్పుటచే ఒకటిరెన్నాళ్లలో సమ్మతించెను. మంచిరోజు చూచి సుబ్బారావు నూతన గృహప్రవేశ మొనరించెను.

అతఁడు పది పదియేనురోజులలోనే చూడమ్మ నియమావళి నుల్లంఘించెను. అతఁడు రాత్రి రెండుగంటలవఱకును కంటిలో పుస్తకము పెట్టుకొని కూరుచుండెను. పూఁటకూళ్ల యింటినుండి అన్నపానముల రావించుకొనఁ దొడఁగెను.

చూడమ్మ మిగుల ప్రయత్నించి వంటలక్కచేత తానే అన్నపానము లంపఁగలిగెనుగాని నిదురకు ప్రొద్దుపోకుండ చేయఁజాలకపోయెను. ఈనియమమునుమాత్ర మతఁ డుల్లంఘించు టామె కుల్లాసజనకమే యాయెను.

మాణిక్య మిందులకు లోలోపలనే కంకుకొనెను గాని యిసుమంతయు పొక్కలేదు. ఋణములు, నష్టములు, కష్టములు, వంశగౌరవము లోనగువాని బాధలన్నిఁటిని ఆమె లోలోపలనే యనుభవించుట చక్కగా నేర్చుకొనెను.

(ఘ)

'సత్యసంఘుఁడు సత్యసంఘుఁ'డని లోకులేకాక ఋణదాతలుగూడ రామస్వామిని కొనియాడిరి. 'ధర్మరాజు' అని కొందఱు అతనికి బిరుదిచ్చిరి. 'కలియుగ జాజలి' యని కొందఱు కీర్తించిరి.

చెన్నపురినుండి వచ్చిన సుబ్బారావు రామస్వామి ప్రస్తావించినంతమాత్రముననే చెన్నపట్టణములోని మేడలు మిద్దెలేకాక యిచటిమేడలను మిద్దెలను తన ఋణముక్రింద కట్టుకొని ఊరివెలుపట తన కున్న యొక చిన్న పూరింటిని రామస్వామికి దానము చేసెను.

ఈరీతిగా అప్పులలో మునిఁగిన రామస్వామికి జుట్టుమాత్రము కనఁబడెను.

లోకమునం దెపుడును రెండుపక్షము లుండకపోవు కావున "మేడలను మిద్దెలను మరలను మాయచేసి లోకులకు కట్టి, ఒకటి కాదు, రెండు కాదు, పదిలక్షల డబ్బు కూఁతురిపేర దాఁచుకున్నాఁడు. నష్టమంతా తానే పంచుకున్నాఁడని ఘోషేకాని రేపు కూఁతురి ద్వారా లాభమంతా నుంజుకుంటాఁడు" అని కొందఱు అనకమానలేదు.

రామస్వామి రెండుపక్షములకును తలయొగ్గి సుబ్బారావు తన కొసఁగిన ఇంటియందు కాఁపురము పెట్టెను. కొలఁదికాలములో కూఁతురిని భార్యను తీసికొనిరాఁదలఁచెను.

సుబ్బారావు పరీక్షలో గెలుపొందుట ముందు చూచినది చూడమ్మ. ఆమె తానే ప్యాసయినటులు సంతసించెను. మాణిక్య మంతకంటే.

చూడమ్మ వెంటనే సుబ్బారావునకును, రామస్వామికిని తంతియిచ్చెను. దానికి ప్రతిఫలముగా వారి సంతోషమును ఆమె తంతివలననే యందుకొనెను.

కన్యలుకలవారు పలువు రతనిపరీక్షలో విజయముకొఱకు కాచుకొనికూరుచుండిరి. అతనికి తల్లి లేదు తండ్రిలేఁడు. పైవా రెవరును లేరు. అతఁడు బంగారుపిచ్చుక. పైఁగా పట్టభద్రుఁడు. ఎవ రతనికి పిల్లనిచ్చుట

కుదుర్చుకొనెదరు? ఎవరైన యతనిని చేసికొనవలయు నని యుబలాటపడెదరు?

అతనియింటిలో కన్యకలసంత యేర్పాటుచేయఁబడినట్టు లయిపోయెను. పల్లెలనుండి బస్తీల నుండి తండ్రులతో అన్నలతో తమ్ములతో కన్యలు వచ్చిపడు చుండిరి. 'సుబ్బారావుకు పెండ్లికూఁతురు ఇదివఱకే స్థిరపడిపోయింది. కట్నంకూడా ముట్టింది' అను ప్రవాదము కన్యాదాత లందఱును వినుచుండిరిగాని వారి ప్రయత్నములనుమాత్రము వారు మానలేదు.

పలనాటినుండి చెంచయ్య యను లక్షాధికారి పెండ్లికావలసిన తన కూఁతురిని, పెద్దకూఁతురిని, పెద్ద కొడుకును తీసికొని సుబ్బారావు సంతకువచ్చెను. కన్య చెంచయ్యవెనుకను, పెద్దకూఁతురు పెద్దకొడుకులు ముందును నిలువఁబడియుండిరి. కన్యకు పంద్రెండేండ్లు ఉండవచ్చును. పెద్దకూఁతురికి ఇరువది. ఆమె భర్త చిన్ననాఁడే పోయెను. దానివలన ఆమెశరీరమున బంగారునెనుసు రెట్టిగా నుండెను. శరీరముగూడ హృష్టపుష్టముగా నుండెను. పెద్దకొడుకు పదునెనిమి దేండ్లవాఁడు. అతనికి మెదడు తిన్నగా పెరుఁగలేదు. దాని లోటును శరీరము భర్తీచేసికొనెను.

చెంచయ్య ఇటు లనెను—'వీఁడు మాపెద్దోఁడు. చదువుసంధ్యలు తక్కువ. కాకున్నా మాపల్లెటూళ్లల్లో మీచదువులు దిసమతి కావుగదాండి! ఇది నాపెద్దపిల్ల; తల చెడింది. ఇదండి నాసంసారపు ముచ్చట.

'నా కాతా అంతా కట్నం పెటతాను. నడవళ్లన్నీ నడుపుతాను. ఇంకా తమ కోరికలు తెలపండి' అని నాణెమును చూచుకొనఁగలందులకు తన వెనుక దాఁగియున్నను పట్టుపగటిని నట్టనడిరేయినిగాఁ జేసి వయిచుచున్న తన కూఁతురిని మెల్లగా చేపను లాగినటులు ముందరికి లాగెను.

విధవపిల్ల తనయింట వంటలక్క యగుననియు, పెద్దపిల్లఁడు పాలేరుపని చేయఁగలఁడనియు సుబ్బారావు గ్రహించెను. ఇది యంతయు ఆర్థికముగా వాటముగనే యున్నదని యతఁ డనుకొనెనుగాని కన్య కానిపింపఁగనే అతని సౌందర్యబోధ కవమానము కలిగెను. ఏలయనఁగా చెంచయ్య దేశవాళీమనిషి. స్వస్థాన వేషభాషలలో అతనికి లోభము మెండు.

పెండ్లికూఁతురి శిరస్సుమీఁద సూర్యుఁడును చంద్రుఁడును కలరు (బంగారపునగలు). బ్రహ్మరంధ్రము దిగువ అర్ధచంద్రుఁడు. జడక్రింద భూగోళములవలె జడకుప్పెలు. చెవులకు జూకాలు. ముక్కున అడ్డబాస. ఏఁబది సేర్ల బంగారపుకమ్ములు ఒడలంతయు ఓతప్రోతము లయియుండెను. ఆబంగారముఁలోనుండి ఒకానొక నలుపు నిప్పులోనుండి పొగవలె కానిపించుచుండెను.

'చూడమ్మ సౌందర్యాగారమున కీపిల్ల దిష్టిపిడత' అని సుబ్బారా వనుకొనెను. ఇటు లనుకొనినను అతని యాకారముగాని, యింగితముగాని యిసుమంతయు తొణకలేదు. 'ఆలోచించి ఉత్తరము వ్రాయింతును' అను మామూలుమాట అతఁ డవఁగనే చెంచయ్య పిల్లికూనవలె వెడలిపోయెను. ఇటు లొకరొకరే తమతమ కన్యకలతో తిరిగిపోవుచుండిరి.

ఒకనాఁడు కుంచాల అంకమయ్య కూఁతురి సౌందర్యమును ప్రదర్శించుటకు సాహసించి సుబ్బారావింటికి వెళ్లెను. సుబ్బారా వెదురువచ్చి యెమ్మెల్సీని లోనికిఁ గొంపోయెను. 'అంకమయ్యగారి కూఁతురు అన్నివిధాలా చూడకు చెల్లెలు' అని అతఁ డనుకొనెను.

రెండుమూడు గంటలసేపు వారు మాటలాడుకొనిన మాటల సారాంశము ఇది: 'నాణెము చెలామణియాయెను. కాని బేరము తెగలేదు. అదియును తొందరగనే తెగఁగలదు. ఏలయనఁగా పెండ్లికొమార్తమాతామహి చాల ధనవతి. ఆమె కెవరును లేరు.

పెండ్లి పరాసురాజ్యమునందుఁగాని, మొగలాయి రాజ్యమునందుఁగాని ఒకరోజు జరుగును. అయిదురోజులింటికడ జరుపు పెండ్లికగు నెచ్చములో ఈయొకరోజు పెండ్లినెచ్చమును తీసివేయఁగా మిగిలిన ధనము పెండ్లికొడుకుకు చేతికట్నము. మగపెండ్లివారినెచ్చ మంతయు ఆఁడుపెండ్లివారే భరింపఁగలరని వేఱుగా తెల్పనక్కఱ యుండదు.'

(౫)

తంతి అందినవెంటనే సుబ్బారావు స్వయముగా వచ్చి పాణిగ్రహణము చేయఁగలఁడని చూడమ్మ ఆసించెనుగాని దానికిబదులుగా రామస్వామివచ్చెను. సుబ్బారావు రాకున్నను అతఁడు పరీక్షలో గెలు పొందినందులకు వారు విందు కావించుకొనిరి.

తనకూఁతురు ఇంటికిపోవుద మని నోరు పాఱవయిచుకొనకముందే రామస్వామి పయనము తూఁగించెను. నిదుర లేకరయే వారందఱును మూడవతరగతిబండినుండి దిగిరి. రైలుదిగఁగనే చూడమ్మకును మాణిక్యమునకును ఆశ్చర్యవిషాదము లుదయించెను. ఏలయనఁగా వారి సొంతమోటారు స్టేషనుకురాలేదు. అది రాకపోయినను సుబ్బారావయినను తనకారు తీసికొని రాలేదు. మఱియొక విశేష మేమనఁగా రామస్వామి గుర్రపు బండినయినను కాదు, ఎద్దుబండిని బాడుగకు కట్టించెను. ఇంకొకవిచిత్ర మేమనఁగా బండి తమయింటిదారిని బోక మఱియొకదారిని బడిపోవుచుండెను.

'బండీ పాఁతపేటలోకిపోతూంది, జనములవారి వీథిలోకి పోనీ' అని మాణిక్యమనెను.

బండివాఁడు నొచ్చుకొని యిటులనెను—'అయ్యగోరు పాఁతపేటకు తోల మన్నారండీ.'

'పాఁతపేటలో ఏముంది?'

బండివెనుక తలవంచుకొని నడచి వచ్చుచున్న రామస్వామి యాతూరి యిటులు సమాధానముచెప్పెను: 'మనయిల్లు సుబ్బారావుకు కట్టి అప్పు తీర్చాను. పాఁతపేటలో ఒకయిల్లు అతఁడు మనకు ఉచితంగా ఇచ్చాఁడు.'

మాణిక్యముసుండెలలో రాయిపడెను. ఆమె కన్నులనుండి జలధార లారంభించెను.

బండివాఁడిటు లనెను—'అయ్యోరు దర్మరాజులు కామట్టి దమ్మిడీలతో ఋణాలు తీర్చేశారు. బాపనయ్యగారు దివాలాతీసి రెండులచ్చల ఆస్తిపరులయ్యారు. రత్తంగోరుమటుక్కు రత్తంగోరు ఉన్నవీ లేనివీ కలబోసి పదిలచ్చలికి లెక్కచెప్పిఅయిదులచ్చలు అంకాలుగారి యెనకేసుకూర్చుకుండారు. రాంసాంయిగోరు సత్తెఅరిచ్చందుడి కాలంవోరు కామట్టి సుబ్బారావుగారు వొద్దన్నా లాబాలు ఆయన కిచ్చేసి యీరేసుగోరికి తామిచ్చినమాట నిలఁబెట్టుకున్నారు. దర్మరాజులల్లే అరణ్యావాసం మొదలెట్టి మాబస్తీకల్లా సత్తావతారంగా మాపేటలో వెలిశారు. మాకు మీరే దేవతలు. దుక్కపడకుండమ్మా దుక్కపడకండి. కట్టకాలం.'

ఈమాటలు విని మాణిక్యము కన్నీటిని కొనగోటితో చిమ్మివేసెను. 'చెడ్డకాఁపురమునకు ముప్పేమిటి?' అని యామె లోలో ననుకొనెను.

కొంతసేపటికి వారిబండి యొకసందిలో ప్రవేశించెను. దారి కిరువైపులను మేఁకలును, గొఱియలును పరుండియుండెను. చెడిపోయినబండ్లు అటునిటు పడియుండెను. కమ్మరకొలిమిలోని బూడిదె ఎగిరి వచ్చి కన్నులను, ముక్కులను కమ్ముకొనుచుండెను. ఆప్రదేశమేనాఁడును మునిసిపాలిటీవారి మొగ మెఱుఁగదు.

బండి యాఁగఁగనే రామస్వామి యింటితాళము తెఱచెను. చూడమ్మయును మాణిక్యమును ఆయింటిలోనికి పోవెఱచినటులు వాకిటనే కొంతసేపు నిలిచిరి. బండివాఁడు సామాను లోపలఁ బెట్టినపిదప తలవంచుకొని తల్లిబిడ్డ లిరువురును గృహప్రవేశ మయిరి.

బండివాఁడు బాడుగ అడుగకుండఁగనే వెళ్లిపోవుచుండెను. రామస్వామి వెలుపలికి వచ్చి వానిని పిలిచెను. పిలుపు వినఁబడఁగనే యతఁడు చుఱుంతవడిగా బండితోలుకొని అదృశ్యుఁడయిపోయెను. అనంత మను ఆశూన్యమునందు నిలువఁబడిన రామస్వామికనులనుండి బాష్పములును, కంఠమునుండి యొకానొక ధ్వనియును వెలువడి వెంటనే నిరుద్ధమాయెను.

సూర్యచంద్రు లిరువురును కట్టివేయఁబడిన ఆ యింటిలో నెన్నఁడును ఎండకన్నెఱుఁగని ఆతల్లిబిడ్డలెటులు ప్రొద్దు గ్రుంకించిరో వారికే తెలియవలయును.

పగలంతయు సూర్యునిచే పరిశోధింపఁబడిన ఆయిల్లంత యు నిపుడు చంద్రునిపర మాయెను.

ఈ పరిణామ మంతయు చూడమ్మను కదలించఁ జాలియుండలేదు. సుబ్బారావును చూడఁబోవ తలి దండ్రుల యనుమతి నడుగుట ఆమెకు కొంచెము లేత గాఁ దోఁచినను అది విధి యాయెను. ఆమె కోరుటయే తడవుగా వారి యంగీకారమును బడయఁగలిగెను.

క్రొత్తగా వెల్లవేయఁబడిన రెండుమేడ లావెన్నె లలో తళతళలాడుచు ఆమెమీఁద గాంభీర్యమును ప్రక టించెను. మాటాడకుండ మేడ యెక్కుచు చూడమ్మ నిండుగంగవలె కలకలలాడెను.

చంద్రుఁ డుదయించెను. నిండుఁబున్నమ. పండు వెన్నెల. తలిదండ్రుల యాశీర్వాదము. కోరుకొనిన కొమరుఁబ్రాయమువాఁడు. గంధర్వకన్యవలె చూడమ్మ మేడయెక్కెను.

సుబ్బారావు వెలవెలపోయి గాంభీర్యము తెచ్చు కొని చేతులు జాఁపుచు ఎదురువచ్చెను.

'అక్కడనే అక్కడనే' అని చూడమ్మ తర్జని తో చూపెను. జంకి సుబ్బారా వచటనే నిలువఁబడెను.

'మన పెండ్లికి సుముహూర్త మెప్పుడు?' అని చూడమ్మ అనెను.

'ఇంకా నీకుపెళ్లేమిటి, బారసాల చేయాలి గాని.' అని సుబ్బారా వనెను.

'తమరు ఏమిచేయింపఁదలఁచికొనినను చేయింపఁ గలరు. కాని లోఁగడ మీరు ఇచ్చిన మాటను చెల్లింపఁ గోరెదను.' అని చూడమ్మ యనెను.

సుబ్బారావు శుభలేఖ యొకటి తీసి చూడమ్మ చేతిలోఁ బెట్టి యిటు లనెను—'నేనే వచ్చి మిమ్మల్ని పిలవాలని అనుకుంటుండంగా నీవే వచ్చావు. అదల్లా ఉండనీ,

అంతఅగా మీనాయన లవుతారా? దానికేం గాని పెండ్లిమాటలే రాకమునుపు నీవు నాతో చీకటి తప్పు చేశావు. ఇఁకముందు ఇంకోళ్లతోఁగూడా చేస్తా వంటానికి ఇదే పరమప్రమాణం. ఇటువంటి నీకు పెళ్లేమిటి?



# న్యాయము

మొక్కపాటి నరసింహశాస్త్రి

'కలడందురు దీనులయెడ ......
కలడు, కలండనెడువాడు కలడో లేడో!'

నేను మొట్టమొదట కుప్పడిని చూచింది ఒకవేసంగి నాటి మధ్యాహ్నము. అది వైశాఖమాసము. రోహిణి కార్తె. మధ్యాహ్నము ఒంటిగంటప్పుడు, ఎక్కడెక్కడో తిరిగి తిరిగి, కాళ్లు మంటలెత్తి నిమ్మళంగా రాయపేట ఆసుపత్రిదగ్గరకు చేరుకున్నాను. ఇంకా ఒకమైలు నడవవలసిఉన్నది. చెన్నపట్నంలో తిండికి లేకపోతే ఒకపూట ఉపవాసమున్నా ఉండవచ్చు కాని, తిరగడానికి డబ్బులేకపోతే మహాఅవస్థ. నాకు ఎప్పుడూ దరిద్రమే కాని, ఆనాడు మరీ ఒక్కకానీకూడా దగ్గరలేక, తిరగకతప్పక మైలాపూరు వెళ్లవలెనని పట్నంనుంచి బయలుదేరి నడక అందుకుని, రాయపేట చేరేసరికి పెద్దలదర్శనం కావడం ప్రారంభించింది. రక్షాహీనమైన పాదం రోడ్డుమీద పెట్టేసరికి నసాళంఅంటేది. అదీకాకుండా ఎండకు కరిగిఉన్న తారు పాపకర్మలా పాదాన్ని పట్టుకుని వదలకపోవడం. ధనాభావముచేత అప్పుడప్పుడు కలిగే అవస్థకే ఇంత బాధపడుతుంటే, ఎప్పుడూ ఇన్ని బాధలూ అనుభవించవలసిన దరిద్రు లెలా బ్రతకగలుగుతున్నా రనే ఆలోచన పోయింది. దారిద్ర్యం అనుభవిస్తేనేకాని దరిద్రుల అవస్థ పూర్తిగా ఎలా తెలుస్తుంది!

ఒక్కక్షణం అక్కడ చెట్టునీడను నిలబడి మరి ముందుకు సాగుదామని నిశ్చయించుకున్నాను. అది ఆదివారం. ఆపైన మట్టమధ్యాహ్నము. నీడనుకూడా ౧౧౦ డిగ్రీలకు తక్కువకాని వేడి. అందుచేత రోడ్డు నిర్జనంగా ఉంది. ఎక్కడా ఏవిధమైనవ్యాపారమూ లేకపోవడముచేత కొంత నిశ్శబ్దంగాకూడా ఉన్నది. ఒక్క ట్రాముకారు మట్టుకు, చాలా అయిష్టంగా ఉన్నట్లు గణగణలాడుతూ నెమ్మదిగా పాకిపోతోంది. సృష్టి అంతాకూడా స్తంభించిపోయినట్లుగా ఉంది. బళ్లస్టేండుదగ్గర గుర్రాలు కునికిపాట్లు పడుతున్నాయి. బళ్లవాళ్లు కొందరు అక్కడనే పడుకున్నారు. చెట్టుకిందమట్టుకు ఒకపదిమంది కూర్చున్నారు. వాళ్లమధ్యను ఒకడు కూర్చుని ఖులాసాగా కబుర్లు చెపుతున్నాడు. నేను దగ్గరకు చేరాను. ఈ ఎండా, ఈచెమటా, ఈతాపమూ అన్నీ మరిచిపోయి ఇంత నిర్విచారంగా కబుర్లు చెపుతున్నవాడిని చూస్తే నాకొకవిధమైన ఈర్ష్య బయలు దేరింది. ఇంతబాధలోనూ అంతసుఖంగా ఎలా ఉండగలుగుతున్నాడా ఆ మనిషి అనుకున్నాను. నేను దగ్గరకు వెళ్లేసరికి వాడు Police Seargent ను అనుకరిస్తూ, అతనికిమల్లే మాట్లాడుతూ, ఏవేవో అరవంలో చెపుతున్నాడు. నాకు బాగా అర్థం కాలేదు. వింటున్నవాళ్ళంతా చాలా సంతోషిస్తున్నారు. భాష అర్థంకాకపోయినా వాడి అనుకరణంలో నేర్పు చూస్తే నాకూ సంతోషంగానే ఉంది. కొంచెంసేపు అలాగే నిలబడ్డాను. సార్జంటు ఫార్సు అయినతరువాత దొరసాని, తరువాత సోల్జరు, ఇంకా ఎవరెవరినో Imitate చేస్తూ మధ్యమధ్య తమాషాగా కబుర్లుచెపుతూ కాలక్షేపం చేస్తున్నాడు కుప్పడు. వాడు రిక్షాలాగేవాడనీ, వాడిపేరు కుప్పడనీ దరిమిలాను తెలుసుకున్నాను. కబుర్ల మధ్యను ఒక్కసారి కన్నెత్తి నాకేసి చూచి, తెలుసువాడి నని గ్రహించి, "ఏమి సామీ బండికావలెనా" అన్నాడు. అక్కరలేదన్నాను. మళ్లీ వాడి ధోరణిలో పడ్డాడు. కొంతసేపైనతరువాత నేనింకా అలాగే నిలబడడము చూచి, 'ఏమి సామీ సూస్తావు. ఏమో పేదవాడు. పనిఏమీ లేదు. ఏదో కతలు చెప్తాను' అన్నాడు నవ్వుతూ. 'బాగుంది కానియ్యి. నేనూ విందామనే నిలబడ్డాను. మంచి నటకుడవు కావలసినవాడవులా ఉన్నావు చూస్తేను. నెమ్మదిగా ఏసినీమాకంపెనీలోనైనా చేరరాదా' అన్నాను.

నేను వేళాకోళం చేస్తున్నా ననుకున్నాడు. 'ఆహా. అదంతా మనకెందుకు సామి. ఏదో ఆండవక ఈ మాదిరి ఉండేహా అని రాసినాడు. అట్లా ఉండవలసింది దానె సామి. అదంతా మనఇష్టమా' అన్నాడు. 'అవును నిజమే నీవు చెప్పింది' అని నాదారిని నేను పోయాను.

మామూలురిక్షావాలాముఖంకంటె విలక్షణమైన ముఖము, తెలివిగల మందహాసముతో మిలమిల లాడే కళ్లు, పాతికసంవత్సరములు పడ్డపాటుతో కడ్డీబారిన కాయశరీరము, ఉంగరాలు చుట్టుకుపోయి వొత్తుగా పెరిగిన నీగ్రోవెంట్రుకలు, శుభ్రమైన కాకీ నిక్కరు, కాకీ చొక్కా, హేటుతోను కుప్పడు రిక్షావాలా లందరికీ గురువు.

ఒక్కసారిచూస్తే మరపురాని ముఖం; అయిదారుభాషలలో అడ్డంకులేని వ్యవహారభాషాజ్ఞానానికి తోడు లండనుపోలీసులనుకూడా అవమానపరుపజాలిన స్థానికచరిత్రజ్ఞానము కుప్పడిది. ఎంతచిన్నవస్తువైనా నాసరే వూళ్లో ఎక్కడ దొరకుతుందో అడగడమె తడవుగా చెపుతాడు. ఖుషీకావలిస్తే పట్నంలో ఏయేజాతి ఆడవాళ్లు (Professionals కానివ్వండి, Amateurs కానివ్వండి) ఎక్కడెక్కడున్నారో నిమిషంలో యాకరు పెట్టకలడు. ఇన్నివిశేషాలు వాడిలో ఉన్నా వాడి దగ్గర ఒక్క మరీగొప్పవిశేష మేమిటంటే, డబ్బుదగ్గర తగాదాలేదు. మీరు ఎంతఇస్తే అంతా సంతోషించి పుచ్చుకుంటాడు. రహస్యంలోమాట ఇంకొకటిఏమిటంటే, పట్నంలోఉండే గొప్పఇళ్ల Scandals అన్నీ వాడికి జిహ్వాగ్రాన్నే ఉంటాయి. నెమ్మదిగా కదుపుతే, రహస్యంగా అన్నీ చెప్పుతాడు.

ఇన్ని సుగుణాలు వాడిలో ఉండడముచేత పెద్దలంతా వాడిని Patronise చేసేవాళ్లు. అందుచేత మామూలు బళ్లవాళ్లకుమల్లే, మనిషి కనబడగానే, 'రిక్షా సామి' అని వెంటపడేవాడు కాడు. నాకుమట్టుకు మొదట వాడిని చూచినప్పటినుంచీ ఒకవిధమైన అభిమానం ఏర్పడింది. నేనెప్పుడూ వాడిబండి ఎక్కకపోయినా, వాడికీ నేనంటే ఒకవిధమైన గౌరవంగా ఉండేది. నాసంచారాల్లో తరుచు కనపడుతూ ఉండేవాడు. వాడు నా కోసలాంకొట్టడం, నేను వాడి యోగక్షేమం విచారించడమూ మామూలైపోయింది.

ఒకరోజు ఉదయం సుమారు పదకొండుగంటల వేళ Mount Road లో కనపడ్డాడు. నేను Tram కోసం నిలబడ్డాను. కుప్పడు నెమ్మదిగా ఖాళీబండి లాక్కునివస్తున్నాడు. నన్ను దూరాన్నించే చూచి గబగబ నాదగ్గరకువచ్చి, సలాంచేసి, 'ఎక్కడసామీ పోతావు' అన్నాడు. 'రాయపేట' అన్నాను. 'రా సామీ. పోతాం. ఎప్పుడూ నాబండి ఎక్కనేలేదే' అన్నాడు. దగ్గర డబ్బులేదన్నాను. ప్రొద్దుటినుంచీ బోణీ కాలేదు. ట్రాంకు ఇచ్చే అర్ధణా తనకిచ్చి బోణీ చెయ్యమని బలవంతపెట్టాడు. మొగమాటపడి రిక్షాలో ఎక్కను. నెమ్మదిగా బాతాఖానీ చేస్తూ రాయపేట చేర్చాడు. అనేకమందినిగురించి అనేకసంగతులు చెప్పాడు. రాజకీయవేత్తలు, పెద్దఉద్యోగస్థులు, వ్యాపారస్థులు, సనాతనులు, సంస్కారులు, ఒకరకం ఏమిటి అన్నిరకాలవారూ ఆరిక్షాలో కూర్చుని, చీకటిపడ్డ తరువాత ముఖం చాటుచేసుకుని, ఏయేఇళ్లకు వెళ్లినదీ, తన కెంత ఇచ్చినదీ, ఆ ఇళ్లల్లోవాళ్ల కెంత ఇచ్చినదీ, ఇంకా ఎన్నెన్నో సంగతులు చెప్పాడు. నేను నిర్ఘాంతపోయాను. వాడు న్యాయస్థుడుగనుక సరిపోయిందికాని రెండుముక్కలు వ్రాయడమేవచ్చి వీళ్లగుట్టంతా బయటపెడతానని తలూకఉత్తరం వ్రాసిపారేస్తే, వాడు లక్షాధికారి అయేవాడుకదా అనుకున్నాను.

'నీఇల్లు ఎక్కడ' అన్నాను. 'నేను పేదవాడు సామీ. నాకు ఇల్లెక్కడసామీ' అని రాయపేటఆసుపత్రి సమీపంలో ఉన్న బళ్లస్టాండు పక్కన చింతచెట్టుకింద రెండుకుండలు, రెండుపొయ్యిలూ, ఇంకా అటువంటి చిల్లరసామాన్లూ చూపించి అదే తనఇల్లన్నాడు. రిక్షాలో పరుపులు వేసుకొని అక్కడనే పడుకుంటానన్నాడు. వర్షమువస్తే పక్కనున్న బళ్ల Stand లో పడుకుంటానన్నాడు. భార్యా, ఒకపిల్లవాడూకూడా ఉన్నారని చెప్పాడు. భార్యకూడా ఓపికఉన్నప్పుడు ఏదో కాస్త

కూలిపని చెయ్యడమో, సాయంకాలం బీచిని, వేరుశనగ పప్పులు అమ్మడమో, లేదా ఏవో పల్లీచవకరకం అమ్మడమో చేస్తూ రోజూ ఒకపావలో అర్ధో సంపాదిస్తుందని చెప్పాడు.

'మరి మీరిద్దరూ చెరో దారినీ పోతే, మీసామాను ఎలా' అన్నాను. 'సామీ, మాకు సామాను ఏమి ఉంటుంది? ఉన్నదేమో అక్కడనే పడవేస్తాము. ఎవరికి కావాలి మాకుండలూ, పొయ్యిలూ, డబ్బాలూను. ఏ పూట వస్తువు ఆ పూట తెచ్చుకునేవాళ్లమే కాని ఏదీ ఒక్కసారి కొనుక్కుని నిలవచేసుకోలేము కదా! బీదవాని సామానుజోలికి ఏదొంగారాడు. దొంగన్న మాటేమిటి, దారేపోయే కుక్కకూడా దరికిరాదు. మాకేమి భయంసామీ' అన్నాడు. 'అవును నిజమే. పేదవాడు పేదరికాన్ని గౌరవిస్తాడు. నోరూ బుద్ధీ, లేని జంతువులుకూడా పేదరికాన్ని గౌరవించి మిమ్మల్ని బాధించవు. అహంకారపూరితులూ, ధనమదాంధులూ లోడి మానవులుమట్టుకు పేదరికమంటే సహించరు. లక్ష్యము చేయరు' అన్నాను. 'ఏమో సామి, వారిని అనేది దేనికి? ఆండవరు దయఉండవలెకాని. అది లేకపోతే ఎవరు ఏమిచేస్తారు.' అన్నాడు.

౨

ఈసంభాషణ జరిగి వారంరోజు లవుతుంది. ఒక రోజుసాయంకాలము నేను తిరువళిక్కేణినుంచి పట్నానికి బీచిరోడ్డున నడుస్తూ వస్తూన్నాను. సుమారు ఏడు గంటలవుతుంది. ఇనుపవంతెన దాటి పదిగజాలు వచ్చేసరికి అక్కడ ఒకసుమారు ఇరవై సంవత్సరాల ఆడపడుచు ఒకచంకను చిన్న ఖాళీగంప పట్టుకుని, ఒకచేత్తో మూడేళ్ల చిన్న పిల్లవాడిని పట్టుకుని, ఎదుటనున్న జంఖానాక్లబ్బు దీపాలవైపూ, వచ్చేపొయ్యే మోటార్లవైపూ పరధ్యానంగా చూస్తూ వొయ్యారంగా నిలబడిఉంది.

ఏవర్ణమో తెలుసుకోడానికి శక్యంకాని చెన్నపురి వీథులలో సామాన్యంగా కనపడే జాతిపడుచు, నల్లని నిగనిగమెరిసే తనుకాంతి, పిటపిటలాడుతున్న లేత యౌవనశరీరం, ఒకమోస్తరు కళాకాంతులతో కలకలలాడే ముఖం, కొంచెము చిరిగిపోయినా, చక్కగా కట్టబడిన జపానుఅద్దకపు చీరా జాకట్టూను. ఆధునికపద్ధతిని అమర్చబడి పూలతో అలంకరింపబడ్డ తలకట్టు, వెనుకవైపున, వెన్నెలలో మిలమిలలాడుతున్న సముద్రము, నీలాకాశానికి ముత్తికకప్రభలు కల్పించిన పూర్ణచంద్రబింబము, ఎదుట, నింగినుంచి నేలకుజారిన నక్షత్రాలలాగ లెక్కలేని విద్యుద్దీపాలు. మధ్యను ఆనందంతాండవిస్తున్న ముఖంతో నల్లముత్యంలా మెరుస్తూ ఈపేదపడుచు, అదంతా ఒక్కక్షణం ఒకపెద్దచిత్తరువులా తోచింది. ఏజాతి అయితేనేమి, ఏవర్ణమైతేనేమి, వీటివలన సహజంగా వచ్చే శరీరచ్ఛాయకాని, రూపలావణ్యాదులుగాని ఆపిల్లలో ఏమాత్రమైనా కొరతగా ఉంటే, ఆమె యౌవనమూ, ఆనందమూ, సంతృప్తీ ఆలోపాలను కప్పిపుచ్చినాయి. ఒకయూరేషియను యువకుడు నెమ్మదిగా ఆమెముందునుంచి నడుస్తూ ఆమెముఖంకేసి చూచాడు. ముందుకు నడుస్తున్నవాడు మళ్లీ వెనక్కుమళ్లి ఆపిల్లముఖంకేసి తేరిపార చూస్తూ నెమ్మదిగా నడిచాడు. ఆపిల్ల ఏమి ఆలోచిస్తోందో, ఎందుకో చిరునవ్వునవ్వింది. ఆయువకుడు, తన్నిచూచి నవ్వుతోంది అనుకుని ఆమెయెదుటనే నిలబడి తనూ నవ్వుతూ ఆమెను పలకరించాడు. ఆమెముఖంలో నవ్వుపోయి కోపం కనపడ్డది.

**"Oh! Common you are not angry dear"** అన్నాడు ఆమెదగ్గరగా వెళ్లి. ఆమెకు కోపమెక్కువయింది. కొంచెం భయంకూడా కలిగింది. అతన్ని తిట్టడమారంభించింది. ఆయువకుడు, కొంచెం తాగికూడా ఉన్నాడేమో, ఇదంతా వేళాకోళ మనుకున్నాడు. ఆకోపావేశంలో ఉన్న అమ్మాయి, అతనికళ్లకు మరీ అందంగా కనపడ్డది. **My dear Helen or Joan of Arc, you are not afraid of me. Common darling. Don't worry. It will be alright'** అని జేబు గలగలలాడిస్తూ ఆమెచెయ్యి పట్టుకో బోయాడు. అనేకవేల శతాబ్దాలనుంచి వస్తూన్న హిందూస్త్రీల శీలమంతా ఆపిల్లలో ఆ క్షణమందు మూర్తీభవించింది.

కళ్లతో నిప్పులు కక్కుతూ, నోటితో శపిస్తూ, చంక నున్న గంప నేలకు జారవిడిచి, చెయ్యి చాచి రెప్ప పాటులో ఛళ్లున ఒక్క లెంపకాయ తన బలంకొద్దీ ఆ యువకుడి దవడమీద తగులనిచ్చింది. ఆదెబ్బకు గూబ గుయిమని ఉంటుంది. ఒకటిరెండు దంతములుకూడా కదిలిఉంటా యనుకున్నాను. ఈ వేడుక చూస్తున్న నాకు చాలాసంతోషం కలిగింది. అతను ఒకమాటు

మనవాళ్లది. ఎలాగా అని ఒక్కక్షణం తటపటా యించాను.

ఇంతల్లోకే, కుప్పడు ఎవరినో రిక్షాలో ఎక్కించుకొని గబగబా లాక్కొస్తూ, దెబ్బలాట దూరాన్నించి చూచి, కొంచెము వేగం తగ్గించాడు. దగ్గరకు వచ్చి వాళ్లకేసి చూచాడు. మరుక్షణం రిక్షా విడిచి, ' ఇదోవస్తిని సార్ ' అని బంకిలో మనిషికి క్షమాపణ చెప్పుకుని ఒక్క అంగలో, దెబ్బలా సతున్న వాళ్ల దగ్గరకు ఉరికి, వెనుకనుంచి ఆ యువకుడి కంఠం పట్టుకున్నాడు. దానితో వాను ఖంగారుపడి ఆడ మనిషిని విడిచి పెట్టాడు. రిక్షావాడూ, కుప్పడూ, ఆ ఆడమనిషిని పారిపొమ్మని అరవంలో చెప్పారు. ఆఅమ్మాయి మళ్లీ తిరిగన్నా చూడకుండా పరుగు చ్చుకుంది, పిల్లాడితో సహా.




" వెనుకనుంచి యువకుడి కంఠం పట్టుకున్నాడు "

దవడతడుముకొని, పాకం ముదిరిందనుకొని **'You devil, I will teach you'** అని అమాంతం ఆపిల్లను గట్టిగా పట్టుకుని ముద్దెట్టుకోబోయాడు. పక్కనున్న చంటిపిల్లవాడు ఏడవడ మారంభించాడు. దారేపోయే వాళ్లు నవ్వుకుంటూ చక్కాపోయారు. నేనేమి చెయ్యడానికీ తోచలేదు. లోపల రక్తం ఉడికిపోయింది. పోయి కలియబడి ఆయూరేషియన్నును నాలుగుతన్నుదామా అంటే, ఏమి గంపరగోళ మవుతుందో. అది అటుంచగా నలుగురూ నాలుగురకాల వ్యాఖ్యానాలు చేస్తారు. ప్రతికార్యానికీ నిందారోపణచేసే స్వభావము

ఇక్కడ పిల్లిద్దరూ కలియబడ్డారు. మాకుప్పడి ధైర్యసాహసాలికి మెచ్చుకొని వాళ్లంతా కళ్లుచేసుకుని ఆదెబ్బలాట చూస్తూ అలాగే నిలబడిపోయాను. ఇంతలోకే, చూస్తూఉండగానే, పెద్దగుంపు చుట్టూ మూగారు. ఈసందట్లో రిక్షాలో పెద్దమనిషి చల్లగా జారాడు. కుస్తీ ఘోరంగా జరుగుతోంది. మొత్తంమీద రిక్షావాడిదే పై చెయ్యిగా ఉంది. ఒక్కక్షణంలో దొరగారు చిత్తైపోదురు. ఇంతలోకే ఎక్కడినుంచి వచ్చాడో, యముడిలాగ, ఒక పోలీసుజవాను చక్కావచ్చాడు. కుప్పడిని ముందు రెండు చేతిబెత్తంతో తగలనిచ్చి



౧౦. మహాత్ముడు నూలువడుకుటను పరిశీలించుచున్న శ్రీ అబ్దుల్ గఫూర్ ఖానుగారు



౧౧. విషయనిర్ణయసభయం దుపన్యసించుచున్న శ్రీ టంగుటూరు ప్రకాశంపంతులుగారు



౧౨. కార్యనిర్ణయసభయందలి స్త్రీ మండలి



౧౩. ట్రెయినింగు పొందుచున్న స్వచ్ఛంద సేవికలు

దొరని విడిచిపెట్టమన్నాడు. గత్యంతరం లేక, ఎంతో అయిష్టంతో దొరని విడిచిపెట్టాడు. దొర నిమ్మళంగా వొళ్లుదులుపుకుని, కాలరూ, టై సవరించుకుని రిక్షా వాడు అనవసరంగా తన్ని Assault చేశాడని నేరం చెప్పాడు. ఈయన్ను Station కు వచ్చి Report ఇమ్మన్నాడు జవాను. తను రిక్షాలో కూర్చుని, దొరను పక్కను కూర్చోపెట్టుకుని, కుప్పడిని రిక్షాలాక్కుని Po'ice Station కు నడవమన్నాడు.

## 3

మరునాడు కుప్పడు రిమాండులో ఉండగా ఒకసారి వెళ్లి చూచివచ్చాను. నేను చేసేది ఏమన్నా ఉంటే చేస్తానన్నాను. ఏమీ అక్కరలేదన్నాడు. ఆమరునాడు మేజస్ట్రీటు కోర్టులో విచారణ ప్రారంభమయింది. కోర్టువారే కుప్పడికి వకీలుని ఏర్పాటు చేశారు.

ఒక ఆడమనిషిదగ్గర కానీకి వేరుశెనగపప్పు కొన్నాననీ, చీకటిచాటున కానీకి అర్ధరూపాయి ఇచ్చాననీ, వెంటనే నాలుగడుగులు వెళ్లి ఆతప్పు తెలుసుకుని వెనక్కువచ్చి, ఆమనిషిని అడుగుతే, ఇవ్వకుండా తిట్టడం ప్రారంభించిందనీ, అందుకని తను ఆమనిషి చెయ్యిపట్టుకుని డబ్బుకోసం నిర్బంధం చేస్తూండగా వెనుకనుంచి కుప్పడువచ్చి నిర్హేతుకంగా తన్ని కొట్టి అవమానపరచాడనీ దొరగారు వాఙ్మూలం ఇచ్చారు. ఆ ఆడమనిషికోసం ఎంతవెతికినా ఎక్కడా దొరకలేదు. అందుకని కుప్పడిమీదమాత్రం Hurt Case బనాయించారు. విచారణలో కుప్పడిని అడిగారు 'కొట్టిన మాట నిజమేనా' అని.

'చిత్తం' అన్నాడు.

'ఎందుకు కొట్టావు?'

'నేను రాకముందు ఏమిజరిగిందో నాకు తెలియదండి. నేను ఆదారిని నడుస్తుండగా ఈ దొరగారు ఆపిల్లను గట్టిగా పట్టుకుని బలవంతాన ముద్దుబెట్టుకోబోతున్నారండి. అదిచూచి నాకు కోపమువచ్చి, వొళ్లు తెలియలేదండి, దగ్గరకు వెడితే ఈయన తాగి ఉన్నట్టుకూడా తెలుసుకుని ఆమనిషిని విడిపించడానికి ఈయన్ను కొట్టవలసివచ్చిందండి.'

'ఆడదానికి అవమానం జరుగుతోందని పౌరుషం వచ్చిందా?'

'చిత్తం.'

కోర్టువారు నవ్వి, 'ఓహో! ఏమి మహానుభావుడండి' అన్నారు. అంతా నవ్వారు.

'నీవు రిక్షాలాగుకుంటావు కాదూ?'

'చిత్తం.'

'పగలేనా రాత్రులుకూడానా?'

'రాత్రులుకూడానండి.'

'రాత్రులు ఎక్కడికేనా భోగంవాళ్ల యిళ్లకు ఎవరినేనా తీసుకువెడుతూ ఉంటావా?'

'చిత్తం.'

'ఆడవాళ్ల మానరక్షణకోసం దెబ్బలాటకు దిగినవాడవు, అది నీకు తప్పుగా తోచలేదేమి?'

'అయ్యా, అది వాళ్లవృత్తి. బండిలాగడం నా వృత్తి. అక్కడికి వెళ్లేవారు చాలా చదువుకున్నవారు, ధనవంతులు, తమబోటి ప్లీడర్లు, జడ్జీలు, ఉద్యోగులు అన్నిరకాలవారూ ఉన్నారండి. ఆతప్పొప్పులు వారి కంటె నాకెక్కువ ఎలా తెలుస్తాయండి. అది పాపమయితే ఆ పుణ్యాపాపములు అనుభవించేవారు వారు కాని నేను కాదండి. నాకు ఆపూట పొట్ట, న్యాయంగా ఎలా గడుపుకోనా అనేకాని తక్కినది నా కెందుకండి. బండిలో కూర్చున్నవారు ఎక్కడకు తీసుకువెళ్లమంటే అక్కడకు వెళ్లడమే నాపనండి.'

ప్లీడరుగారు కొంచెము తెల్లబోయి అటువంటి ప్రశ్న లింక అడగకూడ దనుకున్నారు.

'కేవలం ఆడమనిషిమీద దయేనా......లేకపోతే...ఆమనిషిని...నువ్వు ... ఎరుగుదువా అంతకు ముందు'

'ఎరుగుదు నండి.'

ప్లీడరుగారు ఒక్కసారి ఛాతీ పెద్దదిచేసి,

'ఓ, అదాసంగతి. అలా దార్లోకి రా.'

'చిత్తం నేనెప్పుడూ దారితప్పలేదండి.'

'నోరుముయ్యి. వెంకెసమాధానం చెప్పావంటే ఖబడ్దార్' అని కోర్టువారు మందలించారు.

'అయితే నీకేమైనా చుట్టమా ఆమనిషి?'

'చిత్తం, నాభార్య అండి'

అంతా ఒక్కసారి నిర్ఘాంతపోయారు. ప్లీడరుగారు పెద్దనవ్వు నవ్వి,

'నీభార్యా! అలాగేమి. ఎంతకాలమయింది వివాహమయి?'

'నాలు గేళ్లయిందండి'

'నీ ఇల్లెక్కడ?'

'మాకు ఇల్లేమిటండి. రాయపేట ఆసుపత్రిదగ్గర చెట్టుకింద ఉంటామండి.'

'నీవు ఆమనిషిని పెండ్లిచేసుకున్నట్లు ఋజువు చెయ్యగలవా?'

కుప్పడు తెల్లపోయాడు. నాలుగేళ్ల క్రితం ఎక్కడనో ఏచెట్టుక్రిందనో జరిగినవివాహానికి, పురోహితుడా, బాజాలా, భజంత్రీలా, సాక్ష్యాలా, సంపన్నాలా, ఊరేగింపులా, ఎలా ఋజువు చేసుకోగలడు. ఆమాటకొస్తే ఎంతమంది బీదవాళ్లు తమ వివాహాలను ఋజువుచేసుకోగలరు. చేసుకోలేరు గనుక పెళ్లి కాలేదనడం ధర్మమా?

వీధులలో చెట్లక్రింద బ్రతికే రిక్షావాడికి పెళ్లేమిటనుకున్నారు; కుప్పడిని హేళనచేశారు; దూషించారు. ఆఖరుకు దొరనుకొట్టినమాట రూఢిగనుక కోర్టువారు గట్టిగా మందలించి రెండుసంవత్సరములు కఠినశిక్ష విధించారు. నేను మళ్లీ కుప్పడిని ఒకసారిచూచి అప్పీలు చేసేటట్లయితే నాకు చేతనైనసహాయం చేస్తానన్నాను.

'అప్పీలుచేసినా ఇంతే నండి. పేదవాడి మాట ఎవరు వింటారండి.'

'మరి నీ బండిలో మామూలుగా ఎక్కి తిరిగే వారు పెద్దలు అనేకమంది ఉన్నారుకదా. వారివల్ల నేమీ ఉపకారం కాదా' అన్నాను.

'నాబండి ఎక్కానని పబ్లికుగా చెప్పుకోడమే వారికి సిగ్గండి. అందుచేత యెవ్వరూ మాట్లాడరండి' అన్నాడు.

నేను విచారంతోటే, సిగ్గుతోటే తలవంచుకుని ఇంటికి వచ్చాను.

౪

ఈఅన్యాయపు న్యాయానికి కారణభూతుడైన యువకుడు తక్కువజాతి యూరేషియను. తలిదండ్రుల నెరుగని నిర్భాగ్యుడు. చిన్నప్పటినుండి ఎవరి అదుపు ఆజ్ఞలూ లేక, తన ఇష్టము వచ్చినట్లు, విచ్చలవిడిగా తిరిగి, కొంచె మించుమించుగా యాచనవల్ల కాలక్షేపం చేసుకునేవాడు. కాని చిన్నప్పటినుంచీకూడా, చేతి పనులేవన్నా నిమిషంలో చేసే నేర్పు ఉండేది. వడ్రంగం, పేమునేత, కమ్మరం, ఏదైనాసరే. అన్నిటికంటే ఎక్కువ మరలతోకూడుకున్న వస్తువేదైనాసరే, అవసరమైతే క్షణంలో బాగుచేసేవాడు. వీధులలో దొరికిన సీనారేకుముక్కలూ, మేకులూ ఏరుకొచ్చి, ఏదో ఒక చిన్నవస్తువు చూస్తుండగా తయారుచేసేవాడు. ఈ తెలివితేటలు ఆధారంచేసుకుని క్రమేణా ఒకటోరకమైన Motor Mechanic గా తయారయ్యాడు. అయితేనేమి, మంచి పనివాడినని అహంభావమూ, పొగరుబోతుతనమూ జాస్తిగా ఉండడముచేత ఎక్కడా ఒక్కచోటా స్థిరంగా ఉండలేకపోయేవాడు. దీనికి తోడు త్రాగుడొకటి చిన్నప్పటినుంచి అలవాటయింది. నాలుగుడబ్బులు కనపడేసరికి అది అయిపోయేదాకా తప్పతాగిఉండేవాడు.

ఈకథ జరిగేనాటికి ఈవూళ్లోనే ఒక ఇంగ్లీషు మోటారుకంపెనీలో, నెలకు నూరు రూపాయలు

సంపాదిస్తూ ఉండేవాడు. ఆరోజున బీచిన జరిగిన గందరగోళమంతా తెల్లవారేసరికి ఆఫీసులో ఇట్టే పాక్కిపోయింది. సరే ఇంక కోర్టూ కేసూ గందరగోళం తోటి సంగతంతా అందరికీ విశదమయింది. కాని కంపెనీలో బంట్రోతుమొదలు యజమానివరకూ ఎవ్వరూ ఇతను చెప్పినమాట నమ్మలేదు. యజమాని ఇతన్నిపిల్చి 'కంపెనీ దాటి బయటకు వెళ్లినతరువాత మీ రేమిచేసేదీ మాకు అవసరము లేదు కాని ఇకముందు క్రిమినల్ కేసులలోనూ, మేజస్ట్రేటు కోర్టులోను, **Police station** లోనూ హాజరుకావలసిన అగత్యం కలుగచేసుకుంటే వెంటనే ఉద్యోగం తీసివేస్తాను. ఈమాటు కోర్టువారి అభిప్రాయం ఎలా ఉన్నా, నీ కథయందు నాకెంత మాత్రం విశ్వాసంలేదు. కాని ఇది ప్రథమ తప్పిదం గనుక మన్నించాను. ఇకముందు జాగ్రత' అనితీవ్రంగా మందలించాడు.

ఆఫీసులో అందరికీ తనమీదను అనుమానంగానూ, కోపంగానూ ఉన్నదని తెలుసుకొని ఈఉద్యోగం కాకపోతే మరొకటనుకొని, పనికి వెంటనే రాజీనామా ఇచ్చాడు. పనికోసం ఖాళీగా తిరిగే రోజుల్లో మళ్లీ ఈపిల్ల ఏమయిందా, ఎప్పుడేనా తిరిగి కనుపిస్తుందా అని చాలాసార్లు అనుకుని పదిపదిహేనురోజులు బీచిదగ్గరా అక్కడా వెతికాడు కూడాను. ఎక్కడా కనపడలేదు. ఉద్యోగం అంతకంటే దొరకలేదు. దగ్గర డబ్బంతా అయిపోవచ్చింది. ఏమైనా కొన్నాళ్లు పారిపోతే బాగుంటుంది అనుకున్నాడు.

అక్కడనుంచి దేశాటన ప్రారంభించాడు. కొన్నికొన్ని దుష్కార్యాలకు ఫలము వెంటనే కనుపిస్తుందనుకుంటాను. రెండుమూడు సంవత్సరములపాటు ఎన్ని ఊళ్లుతిరిగాడో, ఎన్నెన్ని బాధ లనుభవించాడో లెక్కలేదు. చేతులో పని ఉంది కనుక రోజూ ఏ రూపాయో కళ్లచూచేవాడు అందుకని తిండిలేక మాడక పోయినా ఈరూపాయ తాగుడికే చాలేదికాదు. ఎక్కడా నిలకడైన ఉద్యోగం దొరక్క ప్రాణం విసిగి మళ్లీ చెన్నపట్టణం చేరుకున్నాడు. తేనాంపేటలో మకాం పెట్టి, మౌంటురోడ్డుసాపులో కూలిపని చేయడం ప్రారంభించాడు. ఒకరోజు పనికోసం తిరిగి తిరిగి ఎక్కడా ఏమీ దొరక్క మధ్యాహ్నం కాళ్లీడ్చుకుంటూ బసకు పోవడానికి బయలుదేరాడు. **Spencer company** దగ్గరకు వచ్చేసరికి తన ముందుగా రోడ్డు దాటి **Spencer** కు ఎదురుగా ఉన్న సందులోకి వెడుతున్న ఆడమనిషి ఒకతె కనుపించింది. ఎందుకో అప్రయత్నంగా ఆమనిషిని పరకాయించి చూచాడు. నాలుగుసంవత్సరముల క్రితం ఒకనాటి సాయంకాలము బీచిన జరిగిన సంగతంతా హఠాత్తుగా మానసాకాశంలో తళుక్కున మెరిసింది. ఆకాంతిలో ఈఆడమనిషిరూపు స్పష్టంగా కనుపించింది. తనదారి మానుకొని ఆమనిషిని వెంబడించాడు. ఆ సందులోనుంచి **Madras club** పక్కనుంచి **Tram line** వరకూ వచ్చి రాయపేటఆసుపత్రిదగ్గర బళ్లస్టాండువరకూ ఆమనిషివెనుకనే వెళ్లాడు. ఆమనిషి వెనక్కి తిరి చూడలేదు. ఈ మనిషి తన్ను వెంటాడుతున్నట్లు తెలుసుకోలేదు.

ఈపిల్ల నివాస మిక్కడకదా అనుకుని అవసరము వచ్చినప్పుడు అక్కరకు రాకపోతుందా అనుకుని తనదారిని తను చక్కాపోయాడు.

ॐ

పరమేశ్వరుడు మానవుడికి ప్రసాదించిన అల్పాయుర్దాయంలో, న్యాయముపేరు పెట్టి, తోటిమానవుడు ఒక రెండుసంవత్సరాలు తగ్గించాడు. వాడి అపరాధమేమిటంటే, తనభార్యమానమును కాపాడడానికి ప్రయత్నించాడు. దరిద్రుడి కాఅధికారంకూడా లేదు కాబోలు. ఆరెండుసంవత్సరాలూ కుప్పడు జైలులో పడినపాట్లు అన్నీ ఇక్కడ వర్ణించడ మెందుకు ? అక్కడ అధికార్లు వాళ్లచేత చేయించే చాకిరీ, తిట్టే తిట్లూ, కొట్టేదెబ్బలూ ఎవరెరుగరు. అందులో కుప్పడిలాంటి దరిద్రుడూ, స్వతంత్రుడూ పడవలసిన పాట్లు మామూలుకంటె పదిరెట్లు ఎక్కువంటే నమ్మండి.

ఇక్కడ వాడిభార్య పొద్దున్న రిక్షావాళ్లకూ ఇంకా అలాటివాళ్లకూ ఫలహారము చేసి అమ్ముకుంటూ సాయంకాలం బీచిని మామూలుగా వేరుశెనగపప్పూ,

బఠాణీలూ అమ్ముకుంటూ పిల్లవాడికీ; తనకీ తిండి లోపం లేకుండా గౌరవంగా కాలక్షేపం చేసుకుంటూ కుప్పడు ఎప్పుడు విడుదలై వస్తాడా అని రోజు ఒక యుగంగా గడుపుకుంది. కుప్పడికి రెండుసంవత్సరాలూ రెండుయుగాల్లా ఉన్నా మొత్తంమీద గడిని బయటపడ్డాడు.

మళ్లీ యథాప్రకారంగా జీవితం ప్రారంభించాడు. ఇంక రోజూ కనపడ్డ పోలీసుజవాన్లల్లా 'ఏమిరా ఈమాటు ఎవరినికొడతావు!' అనీ, 'ఇన్నాళ్లు ఎవరినీ కొట్టకుండాఎలాఉన్నా'వనీ అనుక్షణం వేపుకు తినడము మొదలుపెట్టారు. అన్నిటికీ నోరుమూసుకుని సమాధానం చెప్పకుండా తిరుగుతుండేవాడు. మాట్లాడకపోయేసరికి 'పాపం, ఈరెండేళ్లల్లోనూ పొగరంతా అణిగినట్లుంది' అనేవాళ్లు.

రెండుమూడు సంవత్సరాలు ఇలాటి అవమానాలన్నీ ఓర్చుకుని, అహార్నిశాదులు కష్టపడి, కొంతడబ్బు దాచుకొని తను స్వంతంగా ఒకరిక్షా కలకత్తాలో మోస్తరుది కొనుక్కున్నాడు. దాన్ని అస్తమానం తుడుస్తూ, కడుగుతూ, **Polish** చేస్తూ చూసుకుని మురిసిపోతూఉండేవాడు.

కొత్తబండి కొని నెలరోజు లవుతుంది. కనడా నుంచి దేశసంచారం చెయ్యడానికి ఒక ధనాఢ్యుడు బయలుదేరి ఇండియా వచ్చాడు. మద్రాసుచేరి రెండు రోజు లయింది. ఆరాత్రి హొటేల్లో భోజనంచేసి, కొంచెంతాగి బయటకువచ్చాడు. కుప్పడు కనపడ్డాడు. దొరగారు రిక్షాలో కూర్చుని ఊళ్లోఉండే అన్నిజాతుల భోగంవాళ్లిళ్లకు తీసుకువెళ్లమన్నాడు. కుప్పడు నవ్వుకుని సరేనని బయలుదేరాడు. డబ్బు ఇంతని బేరమాడుకోలేదు. దొరలతోటి బేరమెందుకు? వారెంత ఇస్తే అంతా పుచ్చుకోడమే. సాధారణంగా ఓపావలాఅర్ధో యెక్కువిస్తారు గాని మామూలు కెప్పుడూ తక్కువుండదుగదా! ఎక్కేగుమ్మమూ దిగే గుమ్మమూగా రాత్రి పండ్రెండుగంటలవరకూ తిరిగారు. రాయపేట తంగసాలప్రాంతం పరశువాకం తిరిగి పూంతమల్లిరోడ్డుకు దారితీశారు. హొటేలుదగ్గరకు చేరారు. బండి ఆపబోయాడు కుప్పడు. 'అప్పుడే ఆపడమేమిటి, ఇంకా ఒంటిగంటేనా కాలేదు. ఇంకా నేటివ్ వుల ఇళ్లకెక్కడికేనా తీసుకువెళ్ల'మన్నారు దొరగారు. సరేనని కుప్పడు తేనాంపేటకు దారితీశాడు.

౬

నవలల్లోనూ, నాటకాల్లోనూ కూడా అసంభవమనుకునే సంఘటనలు కొన్ని మామూలుజీవితంలో సంభవిస్తూ ఉంటాయి. అఘటనఘటనాసమర్థుడైన పరమేశ్వరుని కేది శక్యము కాదు! నుంగంబాకంలో ధర్మరాజుజాతర అని పదిరోజులు పెద్దఉత్సవాలు జరుగుతాయి. కడజాతివాళ్లందరకూ తిరునాళ్లు ఆపదిరోజులూను. ఆఖరునాడు రాత్రి గణాచార్యులంతా నిప్పులు తొక్కుతారు. ఆసంబరం చూడడానికి ఎక్కడెక్కడినుంచో వేలకొద్దీజనం విరగపడతారు. ఆరాత్రి ఈవేడుక చూడడానికి కుప్పడిభార్య కూడా వెళ్లింది. ఉత్సవం చూచి ఇంటికి మళ్లేసరికి సుమారు ఒంటిగంట కావచ్చింది. గబగబ **Botanical gardens** దగ్గర పూంతమల్లిరోడ్డుకువచ్చి ఉత్తరంగా మళ్లింది. పది అడుగులు ముందుకువేసేసరికి తనదారికడ్డుగా ఒక యూరోపియను నిలబడ్డాడు. ఇతనూ సినిమాకు వెళ్లి అక్కడా అక్కడా తిరిగి తేనాంపేటలో తనబసకు వెళ్లుదామని వస్తూ ఎవరో ఈఆడమనిషినిచూచి ఫలానాఅని గుర్తించి తలవంచుకుని వస్తున్న మనిషిదారి కడ్డుగా నిలబడ్డాడు.

ఆడమనిషి తలఎత్తిచూచి వీడిని ఆనవాలు తెలిసికుని పారిపోబోయింది. ఇతగాడు చెయ్యిపట్టుకున్నాడు. విదలించుకుని బూతులుతిడుతూ పరుగెత్తింది.వీడు తరుముకొని వెళ్లాడు. అర్థరాత్రివేళ, నిర్జనంగా ఉన్న రోడ్డుమీద ఈ ఆడదానికి దిక్కెవ్వరు? కేకలువేస్తే మట్టుకు ఎవరికేనా నిద్దట్లో వినపడతాయా? వినపడితే మాత్రం ఇవతలికి వస్తారా? ఏమీ తోచక పక్కను **Rest shed** ఉంటే అందులో ఎవరేనా ఉండకపోతారా అని అందులోకి పరుగెత్తింది. దానిదురదృష్టవశాత్తూ అందులో ఎవరూ లేరు. ఇంతలోకే వెనకనుంచి ఆమనిషివచ్చి గట్టిగా సందిట్లో పట్టుకుని 'ఈ

మాటు ఎక్కడికిపోతావు' అన్నాడు. పెద్దపెట్టున కేకవేస్తూ విడిలించుకోడానికి అనేకవిధాల ప్రయత్నించింది.

ఈకేకలు దూరాన్నించే వినపడి కుప్పడు గబగబ రిక్షా లాక్కొచ్చాడు. దగ్గరకు రాగానే కంఠం తన భార్యదేనని పోల్చుకున్నాడు. వెంటనే బండి అక్కడే ఆపేసి, Shed లోకి పరుగెత్తాడు. నాలుగైదు సంవత్సరముల క్రితం బీచిని జరిగినకథే ఇక్కడా జరగడం చూశాడు. ఆనాటిమనుష్యులే ఈనాడూను. అమాంతంగా వెనుకనుంచి యూరేషియనుపీక పట్టుకొన్నాడు. వాడికి ప్రాణం పోతోంది. ఆడమనిషిని విడిచిపెట్టాడు. ఇంకొక్కక్షణంలో ఆకాస్తా ఊపిరీపోను.

'You damned scoundrally son of a nigger, what the hell do you mean' అని బండిలో దొరగారు కోపావేశంతో ఇక్కడికి పరుగెత్తుకొచ్చారు. పరిస్థితులుచూచి సంగతిగ్రహించి వాళ్లిద్దరినీ విడిపించారు. యూరేషియన్ను నాలుగు తిట్టి పొమ్మన్నాడు. వాడు కుక్కలా తోకముడుచుకుని చక్కాపోయాడు.

దొరగారు ఆడమనిషిని ఎగాదిగా చూచి, 'ఎవరీమనిషి' అన్నారు. 'నాభార్య' అన్నాడు కుప్పడు. 'అలాగా, ఫరవాలేదు. బాగానే ఉందే. మానీగ్రోపిల్లలకంటె బావుంది' అన్నాడు. కుప్పడికి విపరీతమైన కోపమొచ్చింది. దొరగారు ఒక్కక్షణం ఆలోచించి జేబులోనుంచి రెండునోట్లు తీసి కుప్పడికిచ్చి, 'నువ్వు అవతలకుండు. ఆమనిషిని ఇక్కడఉండనియ్యి' అన్నాడు. కుప్పడు తనకోపాన్నంతనూ దిగమింగుకుని, 'ఇది నాభార్యసార్. అటువంటి మనిషికాదు' అన్నాడు గట్టిగా. భార్యవైపు తిరిగి వెళ్ళమని సంజ్ఞచేశాడు. దొరగారు 'Don't be a fool man' అని ఇంకోనోటుతీసి, కుప్పడిమీద పారేసి వాడిభార్యను పట్టుకోపోయాడు. కుప్పడు వొళ్లుమండి ఆలోచన లేకుండా సాగదీసి దొరగారిని చెంపకాయకొట్టాడు. 'You dirty nigger dog, you dare' అని జేబులోనుంచి తుపాకి తీశాడు.



"కుప్పడు ఒక్కడుగు......వెంటనే కాల్చారు"

అది లాక్కుందామని కుప్పడు ఒక్కడుగు ముందుకువేసేసరికి దొరగారు వెంటనే కాల్చారు. మారుమాట లేకుండా కుప్పడు చెట్టు కూలినట్లు నేలమీద పడి ప్రాణాలు విడిచాడు.

ఈ చప్పుడికి దగ్గర ఇళ్ళలోవాళ్లు, కొంతమంది, గొడ్డుపక్కన పడుకున్న వాళ్లు కొంతమంది, దూరాన్ని వస్తూ

వున్న ఉత్సవ జనం కొంతమంది పాతికమున్నైఫ మంది చుట్టూ మూగారు. దొరగారికి వీళ్ళంతా తన్ని చంపుతారేమో నని ఒక్కమాటు భయంవేసింది. కాని వాళ్ళంతా వట్టి పిరికిపందలని వెంటనే తెలుసుకుని ధైర్యంగాను 'దగ్గర పోలీసుస్టేషను ఎక్కడఉంది? నేను రిపోర్టుచేస్తా'నన్నారు. చేతిలో పిస్తోలు అందరిపైనా తిప్పి, దానితో అంతా వెనక్కు తగ్గారు. ఒకధైర్య శాలి పోలీసుస్టేషనుకు తనతో రమ్మన్నాడు దొరగారిని. సరేనని ఆయన ఈమనిషి ననుసరించాడు. స్టేష నులో తను రిక్షావాడిని తుపాకితో కాల్చినట్లు దొర గారు రిపోర్టు చేశారు. మనిషి ఫలానాచోట ఉన్నా డన్నారు. తనబస ఫలానాచో టన్నారు. మర్నాడు కోర్టుకు వస్తానని దర్జాగా అవతలకు నడిచారు. సాంత కుడిని పోనివ్వకూడదు. రిమాండులో ఉంచాలనని ఎవ్వ రికీ తోచలేదు.

మరునాడు దొరవారు కోర్టుకు హాజరయ్యారు. **Native Judge** తన్ను విచారించడానికి అర్హతలే దని ముందు అడ్డుపెట్టివను పడేయించాడు తన ప్లీడరుచేత. తనదారిని తనింటికి చక్కాపోయాడు. సరే కేసు సెషన్సుకోర్టులో యూరోపియనుజడ్జిదగ్గర వేశారు.

తను కెనడాదేశస్థుడననీ, గ్రంథకర్తననీ, ఈ దేశంలో పరిస్థితులు స్వయంగా తెలుసుకోడానికి వచ్చా ననీ, మద్రాసువచ్చి మూడురోజు లయిందనీ, ఆరాత్రి ఈవూరులో **Night life study** చెయ్యడానికి బయలు దేరాననీ, రిక్షావాడు తాగిఉండి దారిపొడుగునా పేచీ పెడుతూ ఆఖరుకు అక్కడ తన్ను దిగ పొమ్మని తన జేబులో పర్సు కాజెయ్యడానికి ప్రయత్నం చేశాడనీ, దూరదేశంలో అర్ధరాత్రివేళ నిస్సహాయుడనై ఉండ డముచేత వాడిని బెదిరించడానికి పిస్తోలు తీశాననీ, అది వాడు లాక్కోవడములో పొరపాటున పేలిందనీ, దాని వల్ల వాడు చనిపోయాడనీ, ఇటువంటి అవాంతరము వచ్చినందుకు చాల విచారిస్తున్నాననీ దొరగారు స్టేటుమెంటు ఇచ్చారు.

కుప్పడిభార్య వచ్చి యథార్థము చెప్పింది. కాని దానికి సాక్ష్యమేది? ఆయూరోపియ నెక్కడా విపు లేకుండా పోయాడు. ఈమనిషిమాట నమ్మేది ఎవరు?

ఇంకొకమనిషి ఎవరోవచ్చి తను ఆసమయాన్ని ఉత్సవం చూచి ఆదారిని వెడుతున్నాననీ దొరగారికీ కు ప్పడికీ జరిగిన సంభాషణా, ఆయన వీడిని చంపడమూ చూచాననీ చెప్పాడు. కోర్టువారూ, దొరగారూ, వారి వకీలూ నవ్వారు. అర్ధరాత్రివేళ దారే పోతూ వాళ్ళ మాటలు అక్కడ పొంచిఉండి వినడము ఎంత అసంభ వము? అక్కడుంటే, పోనీ చంపుతోంటే చూస్తూ మొద్దులా నిలబడ్డావా అని వకీలు హేళన చేశాడు. పాపం ఏమిచెప్పగలడు సమాధానం. బహుశా ఈ మని షికీ ఆచమనిషికీ ఏమైన సంబంధ మేమో నన్నారు. పుణ్యానికి వెడితే పాపం ఎదురయిందట. తన చేతులో చచ్చిపోయినట్లు స్వయంగా పోలీసువారికి రిపోర్టుచేసిన న్యాయస్థుడూ, విద్యావంతుడూ అయిన దొరగారి మాట కాదని, రోడ్డోపోతున్న అనామకుడిమాట కోర్టు వారు ఏలా విశ్వసిస్తారు. అటువంటివాడు న్యాయం పలుకుతాడని అనుకోడ మెలాగు. వేరే సాక్ష్యా లేమీ అక్కర్లేదని శలవిస్తూ దొరగారికి వందరూపాయలు జరి మానా వేసి ఆసొమ్ము కుప్పడికి భార్యా అనేమాట నిజ మయితే ఆమనిషి కివ్వవలసిన దనీ, లేకపోతే కోర్టు లోనే జమకట్టవలసిందనీ తీర్పు చెప్పారు. దొరగారు కోర్టువారికి అనేకవందనము లర్పించి, నూరు రూపా యిలనోటు విసిరిపుచ్చుకుని అవతల పారవేసి ఆయన దారిని ఆయనపోయాడు.

వెధవరిక్షావాడు ఒక డుంటేనేమీ పోతేనేమి! ఒకడు లోటొచ్చినంతమాత్రాన కాలచక్రం ఆగిపోదు కదా! వాడినిగురించి శ్రద్ధతీసుకొని పేచీపెట్టేవాళ్లు ఏపార్టీవారూ **Congress, Justice, Socialists, Communists** ఎవ్వరూ లేరు కదా. ఇంతకూ వాడు బ్రతికిఉండి ఈ వెధవరిక్షా ఎన్నాళ్ళు లాగుతే వంద రూపాయలు సంపాదింప గలుగుతాడు. బ్రతికిఉన్న కంటె చచ్చే ఎక్కువ సంపాదించా డన్నారు కొం దరు పెద్దలు. వీడి చావువల్ల వారికీ కొంత పక్క

బెదురు వదిలిందేమో! దొరగారు చాలా ధైర్యశాలనీ, పెద్దమనిషి అనీ చాలామంది అభిప్రాయపడ్డారు. ఊర కుక్కలూ, ముష్టివాళ్లూ, రిక్షావాళ్లూ మొదలైన Dirty fellows వల్ల City అంతా Ruin అయిపోతోందన్నారు కొందరు క్లబ్బులో.........

కుప్పడుపోయి ఆరుమాసాలు కావచ్చింది. నా ఆప్తులలో ఒకరు పోయినట్లు కొన్నాళ్లు చాలా బాధ పడ్డాను.

ఒక రోజున Paper చూస్తుండగా Indian India అని కొత్తపుస్తకం వచ్చిందని దానిపై విమర్శ చూచాను. Mother India కంటె పదిరెట్లు ఘండాలంగా ఉందని వ్రాయబడి ఉంది. ఈగ్రంథం రచించిన వారు Canada దేశస్థులు. సుప్రసిద్ధ గ్రంథకర్తలు. నాడు కుప్పడిని చంపినవారు. మూడువారాలు హిందూదేశంలో ఉండి ఇక్కడ అన్నిరకాల జనంతోనూ కలిసిమెలిసి తిరిగి వారి కష్టసుఖా లన్నీ స్వయంగా (మూడువారాలలో) విచారించి ఈగ్రంథం వ్రాశామని గ్రంథకర్తగారు పీఠికలో వ్రాశారు. గ్రంథ సారాంశ మేమిటంటే, హిందూదేశస్థులు పరమ దౌర్భాగ్యులనీ, దరిద్రులనీ, పిరికివాళ్లనీ, విద్యావిహీనులనీ, నీతిదూరులనీ, వ్యభిచారులనీ, మతముపేరిట ఎన్నైనా ఘోరాతిఘోరాలు చేస్తారనీ, దుర్బలులనీ, రోగపీడితులనీ ఇలాటి వెన్నెన్నో వారి స్వానుభవమువల్ల (మూడు వారాలలో) తెలుసుకున్నవన్నీ వ్రాసి, పైకారణాలచేత హిందువులు స్వరాజ్యానికి ఇంకా వందసంవత్సరాలకైనా పనికిరారనీ, ఢంకామీద దెబ్బకొట్టిచెప్పారు.

... ... ... ... ... ... ...

పాపము శమించును గాక !

ఆమరునాడు పేపరు చూస్తూంటే ఒక సుప్రసిద్ధరచయిత, దేశసంచారి, ధనికుడు, కెనడాదేశస్థుడు Motor బండిలోనుంచి పడి చనిపోయాడని ఉంది. ఏ కార్యానికి, ఏవేళ, ఏ ఫలం అనుభవించవలసిఉంటుందో!

---

## చాటుధార

కైలాసవాసి జనమంచి వేంకటరామయ్య

కవిమాత్రుండను రెండుతెక్కల గవాక్షంబట్లు వీక్షింపఁగన్ ;
గవి, శిల్పిం గుడితెక్క తోడుపడఁగన్ దాక్షిణ్యభావంబుతో ;
నవుదున్ ద్రష్టను గూడఁ జిత్రముగ నేఁ డా తల్పు చిల్లిం గనన్
సవిశేష ప్రతిపత్తి గల్గుఁ గవి ప్రజ్ఞాచక్షుఁ డైనప్పుడే !

---



శుక్ల త్రయోదశి

(శ్రీ కాశీనాథరావుగారి తంజాపుర ప్రాచీనచిత్రసంగ్రహమునుండి)

# పట్టాభి సీతారామయ్య

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి

ఆంధ్రసీమ ఎడారికాదు. కనులుకోరంగించు ప్రజ్ఞ నీనినది తెలుసునేల. మహాపురుషులని ఎన్నబడు అన్యరాష్ట్రీయులకు నీడువచ్చు వీరులు ఆంధ్రావనిలో బుట్టిరి. ఈ ప్రజ్ఞావంతులలో కొందఱు



పట్టాభిసీతారామయ్యగారు

తమ్ముదా మెఱుగరు. మఱికొందఱు తమశక్తి నెఱింగియు, తమమానికములను తమ మానసమంజూషము లందే ఉంచదగినవని సంతృప్తిపడుదురు. మితిమీఱిన అడకువవెనుక వీరు నిలిచియుండ, దరచించి, పృథ్వీ సమ్ముఖమున వీరిని నిలిపి తమప్రజ్ఞ ఇట్టిదని గర్వపడ వలె ననునాశ ఆంధ్రులకు లేదు. ఆంధ్రులు వీరపూజా ధురంధరులే. కాని, వీరిపూజాపేక్షమందు ఆంధ్రమహాపురుషులకు తావు లేదు. నిండుపండులుగాక వట్టి బెరడుకాయలే తమపెరడులందు త్రోచునని తెలుగుల అపోహ. వ్యక్తిత్వహీనత్వమును, రాష్ట్రహీనత్వమును ఈ అపోహ కిరుపట్టులందు గల లోతుకందకములు. తెలుగుతోటలో కుసుమించు ప్రత్యేకనక్షత్రములపై కన్నువేయక కాలుమబ్బులకవ్వల, నెందో మిణుకు మిణుకుమను చుక్కలకు వీరు చూడ్కు లప్పగింతురు. ఇంతియేకాదు. తమకాలనులో వెలయు రాయంచలను చూడక దూరపుచెర్వులందలి కొక్కెరలకు మ్రొక్కుటకు వారు మక్కువపడుదురు.

పట్టాభి ఆంధ్రుడు ప్రజ్ఞగలఆంధ్రుడు. తన్నుదా నెఱిగిన మనీషిగాని, తనవస్తువను గుర్తింపని మారుతి కాడు. మఱుగునబడియుండవలెనని ఈ మహాశయుని ఆశయము. తమకోహినూరులను దిడ్డిగంతలందు దాచ బెట్టి, నడివీథియందు నిలువగల ఆంధ్రులలో పట్టాభి వెలుగు ఎట్లు కనుబడును?

## పట్టాభి ప్రత్యేకవ్యక్తిత్వము

శక్తిగలవ్యక్తు లెందరో ఉన్నారు. ఆవ్యక్తు లందఱు ఒకఎత్తు; పట్టాభి ఒకఎత్తు. ఈతనివ్యక్తిత్వము విస్తారమైనది.

మనుష్యశక్తి శాఖోపశాఖలుకలది. ఒకశాఖను బట్టి, తుదిరొబ్బను చేరినవారు కొందఱున్నారు. వీరి శక్తికితోడు వీరిని గుర్తింపగలబుద్ధి పాడనూపి, విశాల విశ్వమున వీరికి మాయనికీర్తి దెచ్చినది. శక్తులన్నింటి నొక్కడు పిడికిట బట్టలేదు. ఈపనికి సాధారణముగ

నీతనిప్రకృతి అడ్డుగట్టయి నిలుచును. శక్తులకు తావులు మేధస్సును, హృదయము. సాధారణముగ హృదయ మేధస్సు లెవ్వనియందును సరితూగవు. మేధస్సు శాస్త్రములకు పట్టుగొమ్మ; హృదయము కళలకు ఆటపట్టు. మేధస్సునకు దూరదృష్టి యున్నది; హృదయమున సాహస మధికము. మేధావులందు ఆనందవ్రతు లెందఱుందురు? కళోపాసకులలో సైంటిటిస్టులు సున్న కాదా? కళోపాసకులకును, పండితప్రకాండులకును నెయ్యమును వియ్యమును నున్నవని ఎన్ని దృష్టాంతములు చూపగలరు? మేధస్సు కైలాసమున కెనయైనది. హృదయము దివ్యబృందావనమే. కైలాసము గగనచుంబితనగరశిఖరముపై నున్నది. బృందావనము? కనులెదుట పరిఢవిల్లు సౌందర్యము. బృందావనవిహారు లెందఱో పిల్లంగ్రోవి మోవినిదాల్చి, మధురమంజుల గీతికలచే శతాబ్దులను, సహస్రాబ్దులను తనిపిరి. కైలాసవీథిపై మనసుచే కుప్పిగంతులు వేయింపగలమానవు లెన్నెన్నో నిగూఢాంశములను సృష్టిపేటికనుండి దెచ్చి, బట్టబయలుచేసిరి. వీరి దొకతెగ, వారి దొక తెగ. ఈరెండుతెగలతోను చుట్టరికము కలదని చెప్పుకొనగలవాడు పట్టాభి. కావుననే ఈతనిశక్తి ప్రత్యేకమైన దంటిని.

పట్టాభిజీవనమును ఎదుటబెట్టి పుంఖానుపుంఖముగ పరిశీలించితిమేని ఇతడు మేధస్సును, హృదయమును గల వ్యక్తియని యెఱుగకమానము. కాని దొడ్డదైన ఈతనిహృదయము ఈతని మేధస్సునకు సరిరాదని తోడ్తోడనే గ్రహింపగలుగుదుము. పట్టాభియందలి ఈరహస్యమును బయలుపెట్టగలితినేని, ఈ వ్యక్తి ఎవరో ఆంధ్రపృథ్వికి దెలుపజాలితి నని ఆనందింతును.

భౌతికశాస్త్రపరిజ్ఞానమున పట్టాభి గట్టివాడు. ఈతనివృత్తి కెమిస్ట్రీయందు బుట్టినది. వాడిమెదడుగలవాడే సైన్సునందుగాని, ఇందుండి ఉద్భవించిన మఱే విజ్ఞానశాఖయందుగాని విశేషప్రజ్ఞ సంపాదింపగలడు. సాహిత్యమందును పట్టాభి అసామాన్య-అభిజ్ఞత నందినాడు. హృదయరహితునకు సాహిత్యము రాదు. సాహితీకన్య ఎన్నడును పూలచెండును చేబూనియుండును. చెండుండవలయుచోటు ఎడందే! హృదయమున మాల్యమునైచి యామె 'నేను నీదాన' నను. సాధారణముగా సాహితీవధూటి సైన్సు నారాధించువారికివరి చేరదు. ఆమె పట్టాభిని చేరినది; వంగసీమయందు మఱియొకవ్యక్తిని వరించినది.—ఇతడు ప్రఫుల్లచంద్రరాయ్. ఇద్దరకును కొంతభావనాశక్తి కలదు. ఇద్దరును మేఘవీథులం దెగరజాలరు. కాని ఇరువురును భావనాకుంజములందు బంధితులై కళాకామినికవుంగిలియందు చిక్కువడు ఆనందవ్రతులు కారు. నడుముగట్టి కార్యరంగమున నుఱుకువీరులు; క్లిష్టపథములందు నిలిచి కటికిరాళ్లను ముక్కలుచేయగల చక్కని కూలివాండ్రు; ఆకుమడులందు మునిగి గట్టికమతము చేయజాలు కాపులు; లోతుగోతులందు దిగి బురదయందు దిగబడి అందుండి నిర్భాగ్యులను లేవనెత్తు సేవకులు. గట్టుపై నిలిచి వీరత్త్వశ్రీ గీతగోపింపములు పాడరు. పైనుండిచూచి, మేఘుని పిలిచి నెచ్చెలియొద్దకు దూతనై పొమ్మని మహాకావ్యమునకు చేయుచేసికొనరు. పట్టాభిప్రఫుల్లులు కాళిదాసుషెల్లీలు కారు. వీరికిగల భావనాశక్తి కొంతయే అంటినిగదా! వీరికళోపాసనము పరిమితి గలది. ముందుపుట్టువున గోపికలగుటకు నీభవమున నర్హతజూపిన మునులు వీరు. ఆనందవ్రతులై వీరు "గీతాంజలుల" ను ఆలాపించి యున్నయెడల దిక్కామినులు వీరిముందు సాక్షాత్కరించుకొనియుండెడివి. కాని భారతక్రియాంగణము కొంత కుక్కగొడుగులతో నిండియుండెడిది.

## పట్టాభివక్త

పట్టాభికి గొప్పవక్త యనుపేరు కలదు.

వక్త ఎవరు? కవికి సైదోడు. రూపులు వేఱుగాని ఇద్దరహృదయములు నొక్కటే. ఆరితేఱిన కళోపాసకుడే అద్భుతమైన వక్త కాగలడు. కవియంతరంగమునుండి ఉప్పొంగు భావపరంపరలకును, వీణాహృదినుండి తెరలుతెరలై పొంగెడి సంగీతమూర్ఛనములకును, కడలికడుపునుండి లేచు కెరట్ల దొంతరలకును భేదము లేదు. గభీరసింధువునుండియే మహోన్నత

వీచిక లుప్పతిలును. విజ్ఞానగభీరుడైన వక్తహృదయము నుండియే ఉన్నతవాగ్వీచికలు పొంగి పొరలును. కెరటములు ఇటుకలవంటివి కావు. ఇటుకలందు హెచ్చుతగ్గు లుండవు. గర్జనలు సలుపు అలలును, గుసగుసలాడు చిరుతెరగలునుగూడ వారాశి యందు అనంతగీతము నాలాపించును. వీణాతంత్రుల నుండి బిలబిలలేచి, దిగిదెస బంతెంచు సంగతితతు లందును తీయనైన నీయనులోమక్రమము దోచును. వక్తహృదయమునుండి యుప్పొంగు భావములందుగూడ ఆరోహణ, అవరోహణక్రమ ముండును. వక్తవాక్కులును, గాయకుని సంగీతసంగతులును, కవిచంద్రుని పదపంక్తులును నొకటేభావనావేశము గలిగి శ్రోతలమనసుల నుఱ్ఱూత లూగించును. తన వాగ్డోలికలందు సభ్యుల నూగింపజాలువక్తయే మహావక్త. గ్లాడ్ స్టన్ ఇట్టిశక్తి గలవాడు. సురేంద్రున కీప్రజ్ఞ యుండెడిది. బీసెంటు సతి ఈయద్భుతకళయం తారితేజినది. కవితాకోకిలయు, వక్తృతాకోకిలయు నైన సరోజిని ఈప్రజ్ఞ యందు ముందంజవేసినది. ఇక మనపట్టాభి? గ్లాడ్ స్టన్ తెలిపినట్లు వక్తకుకావలయు ముఖ్యలక్షణములలో నొక్కటైన విషయవిజ్ఞాన మీతని కధికముగ గలదు. పట్టాభి సగముచదివిన చట్టుబండ కాడు. తాను మాటలాడువిషయమును—ఇది కటికిరాతిని పోలునదైనను—చలిమికేముద్దచేసి గుటుక్కున మ్రింగగలవాడు. విషయపరిజ్ఞానమునకు తోడు ఈతని కెంతేనిభాషాదార్ఢ్య మున్నది. శరపరంపరలుగ నీతడు మాటలు విసరివేయగలడు. కాని ఈతనిహృదయమునుండి యుప్పతిలునవి భావనావేశముగాక తీవ్రావేశము. పువ్వులేవు లీతనినాల్కనుండి జలజలరాలవు. సౌరభముగాని, మాధుర్యముగాని, హాస్యరసముగాని అందుసున్న. తనమాటల నగ్గిపై నుడుకబెట్టి వేడిపొగల నీతడు గుండెనుండి గుప్పమనిపించును! చెప్పనేల? ఇతడు అగ్నికణములనే క్రక్కును. గ్రీకుకథలందు దోచు (Eg. The greyt Bulls Which appear in the story of jason and the Golden Fleece) భయంకరవృషభములట్లు నిప్పుక్రక్కి కుమ్మమ నీతడు ముందుల కురుకును. నీరెండబోలు వెలుతురుగాని, ఇంద్రధనువున కనరయైనతళుక్కుగాని ఈతనిపల్కులందు కానరాదు. ముక్కంటికనుకొలుకులవలె నెఱ్ఱవారి ఈతనివాక్కులు శ్రోతలమనసులం దగ్గి బుట్టింపజాలును. పట్టాభి ఉపన్యాసించుచుండ నెదుటికుర్చీలు పరమహంసలట్లు తన్మయనృత్యము చేయవు. ఆత డానందమును ధారవోయక, అద్భుతమును, ఆవేగమును, ఉద్రేకమును పుట్టించి ఎదుటి కంబములను ముందుల కుదాయించును. మహావక్తకుండవలయుసరుకు పట్టాభిలో గలదు. కావున నీతడు మహోగ్రమైనఉపన్యాసము లీయగలడు. ప్రళయభయంకరమూర్తియై నిలువగలడు! ప్రత్యర్థుబడబాలవలపై "అమ్మో!" అనిపింపగలడు! పట్టాభిరాముడు, అగ్గిరాముడు కాగలడు! ఖండనభీముడు కాగలడు! రంగస్థలమందు నిలిచి ఈత డెన్నడును వీణియను చేతుల బూనలేదు. బందరువాసి గాన బందరుతూటాలనే ఈతడు పట్టినాడు. వానితో నీతడు సంతృప్తిపడడు. చింతబరికెలను, కొరడాలను, తారాజువ్వలను, ఎంతెంతోమందుగుండుసామానును ఎడతెగక ఈతడు ప్రయోగింపగలడు. లాయరుయోధులును, వారిని పుట్టించిన జేజెమ్మలును లోకలు జాడించి, ఈతనిముందునుండి "బాబో!" యని పారిరి. పోరునందును, మోటుదనమందును కళయుండునా? పట్టాభిఉపన్యాసమునకును, సౌందర్యోపాసకుల ఉపన్యాసమునకును పోలిక లేదు. ఈతనిధోరణియే వేఱు. ఈతనిమాటలతీరు తీవ్రపుస్తకపఠనమువలె నుండును. మహావక్త ప్లాటుఫారము మీద చమువరియై నిలువడు. రంగస్థలముమీది కుశలపునివలె ఈతడు వర్తించును. రసానుభూతి నీత డెఱిగి శ్రోతలం దట్టియనుభూతిని పుట్టించును. వారల నీతడు నవ్వించును; ఏడ్పించును; ఉద్రేకించును; తనభావనముపై వారి నిష్టమువచ్చినపగిది నూగించును. ఒకటే పుంతను పట్టు పట్టాభి కీశక్తులు లేవు. ఇతని ధోరణియే వేఱు. **Cratorical modulations** గాని, **Oratarical whispers** గాని ఈత డెఱుగడు. లాల్ మోహనపాలు లట్లుగాని, బెసెంటు సురేంద్రులట్లుగాని కళోపాసనమందు మనసుంచి వక్తృతాకళ

నీత డభ్యసింపలేదు. ఆపద్మవక్త కీయవను తొలి తాంబూలమును పట్టాభి కిచ్చుటకు సమ్మతింపను.

## పట్టాభి ప్రతివాదిభయంకరుడు

పట్టాభికి చిరకీర్తి నియ్యగలుగునది డిబేటు నందలి ఈతనిశక్తి. డిబేటు వక్తృత్వమువంటికళ కాదు. దీనికివలసినవి సూక్ష్మదృష్టి, గభీరపర్యాలోచన, విషయ విభజనము, స్పష్టోచ్చారణము, తీవ్రవిమర్శనమును. ఇది సైన్సునకు సంబంధించినశక్తిగాని ఆర్టునకు సంబంధించి నది కాదు. ఇందు కావలసినది వెలుంగు గాని రంగు కాదు. వంకరటింకరలులేని పదపంక్తిగాని సంగీత మూర్ఛనము కాదు. ఇందులకు వలసినది వాడిమెదడు. డొంకవలె నల్లుకొనియున్న అంశములను చొరుచుకొని పోయి కూడివచ్చుసరుకును చేర్చి, కూడని సరుకును పాఱవేయునది వాడిమెదడు. లోతును, ఎత్తును, సాంద్రతయు దీనిదృగ్జాలమందు నిలిచియుండును. ఎదుటి వాని దీర్ఘకథనమునందలి ఒక్కమాటనైనను దాటి పోనీక, ఆయుపన్యాసమును ఛిన్నవిచ్ఛిన్న మొనరించి, అందలి దోషముల నెదుటబెట్టి కత్తిమొనలపోలు వాక్కులచే వానిని పరపరగోసి అబద్ధమును చెండాడి నిజమును నిలుపగలుగు డిబేటునకు సహకారికాగలుగునది పదునుగలమెదడు. డిబేటునకు కడంగువానిపని ఇంతటితో ముగియదు. తాను చేకొనినవిషయమం దనివార్యముగ దోచులోపములకు చక్కని ముసుగువెట్టి నివార్యము లైన దోషములను త్రోసివేసి, ఎదుటివానిపోటు ఇట్లుండునని ముందే యూహించి, అందులకు వలయు డాలును సిద్ధముచేసికొని, తనశక్తుల నన్నిటిని దా బట్టిన విషయమందు కేంద్రీకరించి, తాను కాంక్షించినఫల మునకు రహదారు లేర్పఱుచు సూత్రములను ప్రయో గించి, వానికి బలమొసగునధికారములను (Authorits) ముందు నిలిపి సముచితవిజ్ఞానమును విజృంభింపజేసి, తన యుద్దేశమునకు 'జయ' పెట్టగలిగినపుడు ఇతనికర్త వ్యము ముగియును. వక్త డిబేటరు కానక్కరలేదు. డిబేటరు వక్త కానక్కరలేదు. వక్త డిబేటరు కావచ్చును. డిబేరుటరు వక్త కావచ్చును. రెండుతీరుల శక్తి గలవారి సంఖ్య మిగుల నల్పమైనది. మోతీలాలు వితలభాయిపటేలులు వక్తలుకారు. వీరు కళోపాసకు లనుట శుద్ధతప్పు. కాని డిబేటునందు వీరి కఖండప్రజ్ఞ యుండెడిది.

పట్టాభి కిట్టి ప్రజ్ఞయున్నది. ప్రథమశ్రేణిలోని వక్తకాకున్నను, కళోపాసకుడైన వక్త కాకున్నను పట్టాభి గొప్పవక్త యనుటకు వక్త వాదుల ద్విగుణశక్తుల గుండెలందు నదియించి, ఈతడు నిలిచినపుడు, ఈతని కెదురై, ఈతనితో పోరు సలుపుటకు ఒక్క శ్రీహూ కాదు, వేయిమందిశ్రీహూలకైన, పదివేలపేటేలులకైన సాధ్యముయ్యెడిది కాదు. గజాసురునిపొట్ట చీల్చి లో నడంగిన శివుని వెలుపలబెట్టిన గంగిరెద్దువలె, ఎదుటివానిని కుమ్మికుమ్మి "శివమ్" ను వెలిదీసి, దాని నీతడు 'సత్యమ్' దాపల జేర్చును. పదునుమట్టెగలచేస పెద్ద యోడను డీకొనునట్లు, ఎత్తైతోచిన ఎదుటి వ్యక్తి నీతడు మార్కొనును. ఏకశోన్నతవంగా పర్వతశిఖ రము తలనిలుచుకొని దాపల జేరజూచువానిపై బడు శాసన ప్రతికక్షపై పట్టాభి పడును. పైన దెలిపిన ఐడియల్ డిబేటరునకు వలసిన లక్షణములు చూపుటకు వలసినతరుణము పట్టాభి కెన్నడును లభించియుండలేదు. ఇతడు న్యాయవాదియై యున్నచో అట్టితరుణములు లభించియుండెని. ఏదేని ముఖ్యమైన బిల్లు నుపపా దించు శాసనసభాసభ్యుడై యున్నచో అట్టి యవ కాశము లెన్నో ఈతనికి చేకూరెడివి. శాసనసభలం దీతనికి నమ్మకము లేదు. నాడును లేదు, నేడును లేదు. మచ్చునకై ఈత డొకమాఱు ఢిల్లీ శాసనసభయందు ప్రవేశించియున్నచో ఈత డెట్టి డిబేటరో పృథ్వికి దెలిసియుండెడిది. ఎసెంబ్లీకి నిలువుమని మిత్రులు కోరినపుడు, ఇతడు 'ఉహూ?' అనివేసినాడు. ఒక్కశాసనసభల డిబేట్ల సంపూర్ణాంశములే ప్రచురణ మందును. కాంగ్రెసు కమిటీల వాదప్రతివాదములలో మాత్రము పట్టాభి పాల్గొనినాడు. కొలదినిముసములలో మాత్రము ఈతనికి తనపని ముగింపవలసివచ్చెడిది. ఈతని ధీశక్తి సంపూర్ణ విజృంభణ మందదగునవకాశము కమిటీ మీటింగులలో నెట్లుచిక్కును? ఒకగాయకుని శ్రేణి

క్రింది జోదై, ఒకవైశ్యసంయమీంద్రుని భాష్యకారుడైన పట్టాభి స్వతంత్రించి ఎన్నడు నీకమిటీమీటింగులలోనైనను ఒకవిషయమును,—కనది యనునొక విమయము నుపపాదించి ఎఱుగడు. తాను నమ్మిన అంశమును అక్కున గట్టిగ నొక్కిపట్టి, ప్రతిఘటించు మహావీరుల నీతడు చీల్చి వదలినాడు. డిబేటుకత్తులగొన్నింటినిమాత్రము ప్రదర్శించుట కీతని కవకాశము చిక్కినది. ఒకటి రెండుదృష్టాంతములను పరికింపుడు.

౧౯౨౨ నవంబరు ౨౦ తేదీని All indja Congress Committee కలకత్తాలో చిత్తరంజనుని యింట గలసికొనినది. గాంధిగారపుడు జెయిలులో నున్నారు. కాంగ్రెసుదిగ్గజములన్నియు రస్సాలోష్ఠులో చేరుకొన్నవి. అధ్యక్షుడు దేశబంధుదాసు. అతనికుడి వైపున నున్నవాడు మోతీలాలు. ఆతనిప్రక్క నుపవిష్టుడైనాడు జయకరు. జయకరుప్రక్క నున్నవాడు గౌరీశంకరమిశ్ర. దాసున కెడమప్రక్కన గూర్చునినాడు వి. జే. పటేలు. పటేలుప్రక్కనున్నాడు అలిగరునుంచి వచ్చిన ఒక ముసల్మానుయోధుడు. ఆతనిదాపున నున్నాడు మాలవ్యాపండితుడు. ఎదుటగూర్చున్న తల్లి కస్తూరీబాయి. ఆమెపొంతనున్నది సరోజినీదేవి. ఆమె కనతిదూరమందున్నాడు మహారాష్ట్రియులఅభయంకర్. వానిజేరియున్నాడు కేల్కార్. కేల్కారుప్రక్క గూర్చున్నాడు వల్లభాయిపటేలు. ఆతనిదాపల నున్నవాడు ఛోటామాలవ్యా. ఇందఱికడుమ గుడిగోపురమువలె దోచినాడు విజయరాఘవాచారి. అతని కనతిదూరమున నుపవిష్టుడైనాడు పట్టాభిసీతారామయ్య. అధ్యక్షుడైన చిత్తరంజనుడు సర్వమాట్టని ఎల్లరెఱుగుదురు. వాదవక్తృత్వములందు బ్రొమ్మ్ చేనుగుల బోలువారిని నేలనుగూల్చినమహాయోధుడు. గట్టితనమందును, గడుసుతనమందును, గండుతనమందును మోతీలాలు మోతీలాలు నకేసాటి. ఉండియుండి అతడను యుక్తిమాటలకు తిరుగు లేదు. జయకరు? న్యాయశాస్త్రమందును, ఆంగ్లమందును, సంస్కృతమందును అసాధారణప్రజ్ఞ సంపాదించినవిద్వాంసుడు. వేడిసీసము నొలకబోయులీల నుపన్యసింపగల ధీరుడు. అభయంకరో? గొంతుకలో, ఈతడు పాలునకు సోదరుడు. నామము సార్థకము జేసికొనిన మహాయోధుడు. ఎల్లరకును విగ్రహతుల్యుడై పూజలందు నాతనిపై వేడిమాటలు ప్రయోగించుటకు జంకని బండబాబు. మాలవ్యాపండితుడు? ఝుకీవేగమున రెండుగంటలసేపు ఉపన్యసించి, శ్రోతలను విసిగించు మనీషి. కేల్కారు? వక్తకాడు కాని హాస్యభాండము. నాడు ఉగ్రుడై, లోనిచేవను కొంత చూపించినాడు. వల్లభాయ్? నెనరుపుట్టించునట్లు చల్లగమాట్లాడు కర్మవీరుడు. పెద్దపటేలు? ఉపన్యసించుచు ఒక్కొకమాటపై నత్తిదెబ్బలువేయుటలో శ్రీనివాస అయ్యంగారికి పెద్దన్నయ్య. ఇతడు వక్తయనుట అబద్ధము. కాని కెవ్వుకెవ్వున కేకలువేయుచు, ఎదుటివానిని చెళ్లుచెళ్లున గొట్టినట్లు మాట్లాడి, డిబేటులో జయధ్వజమెత్తగల దిట్ట. విజయరాఘవాచారి? శారీరకముగ నీతడు మహామహావ్యక్తులలో మొదటివాడు. ఇతడు వక్తకాడు. కాని మోతీలాలుతో దండపట్లు పట్టి ఒక్కొకప్పుడు డిబేటులో ఆతనిని చిత్తుచేయగల గట్టిఘటము. ఇతనికడుపులో దొడదొడ లాడునది సాంబారు కాదు. అక్కరకు వచ్చు విజ్ఞానముయొక్క రసము. ఛోటామాలవ్యా? బడామాలవ్యా తరిఫీదు పొంది చక్కగ మాటలాడజాలు యువకుడు. సరోజిని? పోలిటిక్స్ పేరు చెప్పి కవిత్వమును గురిపించు భారతసీమంతినీచూడామణి. ఇక మనపట్టాభి? వెనుకకొంతబట్టతల గలవాడు. అంతకుముందీబ్రాహ్మణుని లక్ష్యించి ఎఱుగను. కలకత్తా ఆల్బర్ట్ ఇన్‌స్టిట్యూట్ రిసెప్షనురూములో అప్పటి కైదేండ్లనుండి ఈతని 'జన్మభూమి' సంపాదకీయములను కంఠస్థము చేయుచుండువాడను. అతనికల మెట్టిదో యెఱుగుదును; నాలుక యెట్టిదో యెఱుగను. ౧౯౨౦ సెప్టెంబరులోని అవసర కాంగ్రెసు ప్లాటుఫారముమీద కెక్కిన ఆంధ్రుడు దుగ్గిరాల గోపాలకృష్ణయ్య. అతడు నాలుగుమాట లుచ్చరింపగనే గంటమ్రోగించి లజపతి వానిని వెనుకకు లాగినాడు. రాజకీయములందు గోపాలకృష్ణు డపుడు బాలకుడు. పట్టాభి అపుడు 'రాష్ట్రము'మీద కానుపించునని ఆశపడితిని. నాఆశ ఫలింపలేదు. రెండేండ్లు కడచిన

పిదప దాసుగృహమున ఆతని గాంచితిని. ఉదయము ఎనిమిదిగంటలు మొదలు రాత్రి పదిదాటువఱకు నాడు వాక్యుద్ధములు జరిగినవి. చెవు లప్పగించి ఎల్లర ఉపన్యాసములను "సర్వంస్వాహా!" చేసికొంటిని. పట్టాభిపై కన్ను వేసి కూర్చుంటిని.

నాడు డిబేటు మిగుల తీవ్రమైయుండెను. బొమ్మకేనుగులు ఢీకొనినవి. మాలవ్యావిఠలభాయిపటే లులు కుస్తీపట్టిరి! సరోజినీ జయకరులు పోరాడిరి. కెల్కారు లేచి, దాసు వలదనువఱకు ఎండోయున్న శంకరాచార్యునిపై (ఈత డిపుడు పూరీమఠాధిపతి) తూపులు వదలినాడు. ఎప్పటట్లు సైఫ్రూ విజయరాఘవాచార్యులు "ఉసుకో! ఉస్కో!!" అనుకొనిరి! అభయంకర్ మోతీలాలుప్రక్కచేరి గర్జించినాడు. దాసుకొంపలోనే ఫలహారములు కొట్టి, సుహృదయులు ద్విగుణీకృతబలముతో హుంకరించిరి. సభాంగణమున సుప్తవాయువులు లేచినవి అపుడు ఎనిమిది గంటలైనది. పట్టాభివంతు! పట్టాభిలేచినాడు. ఈతని యెదుట నున్నవారు పదునెనిమిది అక్షౌహిణులకు తుల్యులు. భీష్మద్రోణకర్ణాశ్వత్థామలట్లు దాసుసైఫ్రూపటేలు మాలవ్యాలు పట్టాభిని ఢీకొనిరి! గాండీవము నెక్కువెట్టి పాశుపతమునుసంధించి చరచర ముందులకు సాగినాడు పట్టాభి! ఎదుటి యోధులు అలెగ్జాండరు మర్దిమనుచేగూడ "నమో్మ!" యనిపించిన భారతీయులు! పట్టాభియో? భారతీయులందలి ఆంధ్రుడు. మోతీలాలు దాసులు అడ్డుమాటలుమాటిమాటికివిసరునారు. వారి బాణములను మధ్యమార్గమందే తుత్తునియలు చేసినాడు పట్టాభి. తుదకు బుద్ధిగలపుత్త్రవానివలె మోతీలాలు చల్లగ చతికిలపడి తనసుండెలు తాను రాసికొనినాడు. దాసు చాలసేపటివఱకు వెనుకంజవేసినాడుకాడు. పట్టాభివదలు ఆగ్నేయాస్త్రములను చాలవఱకు నోర్చినాడు. ఒకటి రెండుమాటలలో కోర్టువిజ్ఞానము చూపినాడు. పట్టాభి డంగుపడలేదు. "A lawyer can visualise anything as he pleases" అని పట్టాభి ముందల కుటికినాడు, అపుడు దాసు నుతంవేసికొన్నాడు. పట్టాభి గెలుపుసిడె మెత్తినాడు! తోడి ఆంధ్రునిచూచి "శభాస్! శభాస్!!" అంటిని.

౧౯౨౩ కాకినాడ కాంగ్రెసుగోష్ఠిమీద పట్టాభిని చూచితిని. సహజప్రజ్ఞతో నీత డుపన్యసించినాడు. ౧౯౨౭ డిశంబరుతుదను మోతీలాలు అధ్యక్షత వహించిన కాంగ్రెసులో పట్టాభికై వెదకితిని. కలకత్తాపార్కు సర్కసు చిన్నడేరాలో నీతను పొడగట్టినాడు. చిన్నసమావేశములందే ఈతడు తన ఈడెలను రువ్వుచుండును. గాంధిజీ, అన్సారి, శ్యామసుందర చక్రవర్తి మున్నగువారు కాంగ్రెసుపెండాలున కనతి దూరమందు ఉదయమున జేరుకొనిరి. చెన్నపురిలో జరిగిన All Parties Conference నకు అధ్యక్షత వహించిన బీసెంటుసతిగూడ నాటిసభ నలంకరించినది. అలహాబాదునుండి చింతామణి వచ్చినాడు. విజయరాఘవాచారిసైఫ్రూలు ఢీకొనిరి. కాంగ్రెసు సెక్రటరి జనహరుపై పల్వురు ప్రశ్నలవర్షము కురిపించిరి. పట్టాభి నాడు మహోగ్రుడై నాడు. పరిహాసమందారి తేటిన ఒకవంగదేశీయుడు నాల్గురసగుల్లలు తెచ్చి పట్టాభిచేతియందుంచినాడు. ఎగిరెగిరి కొట్టు కోడిపుంజువలె నిలబడినది. హేమాహేమీలు "అమ్మయ్యా!" అనుకొనిరి. పొట్టేలుపోట్లకు విఱిగి చెక్కలైన రాతి పలకలట్లు ప్రతికక్షులగుండియలు అవియ గొండొకవడి పట్టాభి తడసినాడు. తోడిఆంధ్రు డుద్దండుల నాగిస లాడించినందులకు మరల శభాస్ అంటిని.

డిబేటులో పట్టాభి భారతవర్షమున అజేయుడు. విదేశముల కరిగి అచటి వాదప్రతివాదములం దితడు పాల్గొనియున్నయెడల, జగద్విఖ్యాతిని సంపాదించి యుండువాడు. శ్యామసుందరచక్రవర్తి "మీపట్టాభి చాలగట్టివాడే" యని హజూరిమల్ లేన్‌లో ఆతనికలిసికొని నపుడు పలుమారు పలికినాడు. అన్యరాష్ట్రీయులను ప్రశంసించుట వంగీయులప్రకృతికి విరుద్ధము. ఒకవంగదేశీయుడు తోడితెలుగుబిడ్డను మెచ్చినందులకు నేను మిగుల సంతసంపడువాడను.

## పట్టాభి, వ్రాతగాడు

ఆంగ్లరచనమందు సిద్ధహస్తులైన భారతీయులలో పట్టాభియొకడు. ఇంగ్లీషువచ్చిన ఐదుసురాంధ్రులలోను ఈతడొక్కడుండనుట నిస్సంశయము. వీరి వ్యక్తిత్వము వీరిశైలియందు చెల్లమగును. రాధాకృష్ణుని శైలియందు మినుకులీను భావము లుండును; రామలింగారెడ్డి శైలి రసవాహినికి వేఱుపేరు. వేంకటరత్నమునాయని శైలి పెద్దపెద్ద బెల్లపుటచ్చుల గోడ; చింతామణి శైలి జిగియును, బిగియును గలది; వడికిని వాడికిని పట్టాభిశైలి పెట్టినపేరు. ఈతని ఇంగ్లీషు ఇంగ్లీషు ఇంగ్లీషువలె నుండునుగాని, తెలుగుఇంగ్లీషువలెను, బంగాలీ ఇంగ్లీషువలెను నుండదు. తన పాండిత్యమును ప్రకటింపవలెనని ఈతడు మాటలు దొరలింపడు. గత శతాబ్దాంతమున పుట్టినవాడేయయ్యు, గతశతాబ్దరచనాపద్ధతుల నారాధింపడు. ఆంగ్లసాహిత్యమం దీతనికి విశేషపరిచయ మున్నట్లు ఈతనిరచనలు స్పష్టము చేయును. చదువరి మనసును విసిగించు మొండిపాండితి ఈతని శైలియందు జూపట్టదు. జీవము గలిగి అది చప్పున చదువరి మనసును పట్టును.

పట్టాభి తత్త్వశాస్త్రమును తరచియుండలేదు.

సాహిత్యమునకు, తత్త్వశాస్త్రమునకు గల సంబంధము మహత్తరమైనది. సాహితీసుందరికి ఏడుగడయగు మగడు తత్త్వశాస్త్రము! ఈ వధూటికి గభీరతామహత్త్వము లిచ్చునది తత్త్వశాస్త్రము!! చెప్పనేల? సాహితికి చిరజీవనము నిచ్చునది తత్త్వశాస్త్రము!!! సహస్రాబ్దులు దుల్లిపడినను, భారత సాహితి ధ్రువనక్షత్రమై వెలయుచుండుటకు కారణమది తత్త్వదృష్టి గలిగి, దివ్యజీవనమును గడపుటే. తత్త్వదృష్టి వెలుగని లేఖిని చిత్రప్రతిమలను చిత్రింపగలదేమో కాని, జీవముగల పాత్రలను సృష్టింపనేరదు. మానవులును భావములును సాహిత్యపృథ్వియందు నిలుచుగాని, వట్టి మెఱుగులుగలబొమ్మలు నిలువవు. బాహ్యప్రపంచముమీదనే దృష్టిని తాపటము చేసి, అంతరంగావని జూడని రచయిత జీవనము మూడునాళ్లముచ్చటే. మనుష్యజీవనము మంచుకొండవంటిది. కొండయందలి తొమ్మిదిపాళ్లు సాగరసలిలమందు మునిగియుండును. వెలుపల దోచునది పదవపాలుమాత్రమే. మనుష్యజీవనమహత్త్వము సంపూర్ణప్రతిమయట్లు ఎదుట గనబడునది కాదు. నిహితమైన బ్రహ్మాండమును పృథ్వీపురోభాగమందు పెట్టగల మగవాడే ఆదర్శరచయిత యని తెలుపుదును. భారతలేఖినులకు సహజముగ గొంత తత్త్వదృష్టి యుండును. పట్టాభికలమునకును గొంత కలదనిఆతనిరచనమును,జీవనమును దెలుపుచున్నవి. ఉన్నతాశయములతో జీవనమును చిఱుతప్రాయమునుండియు సంధించి, వానిచరితార్థతకై పెక్కుసిలుగుల నెదుర్కొనుటకు నడుము గట్టిన పట్టాభి తనకలమును అబద్ధపుసిరాయందు గాక సూపుగాని ఆదర్శప్రభాపూరమందు ముంచినాడు. మనుజుని వ్యక్తిత్వమునకు రచనమునకు, వ్యత్యాసము లేదు. పట్టాభిరచనమందే పట్టాభిజీవనచరిత్రము ప్రతిబింబించుచు నుండును. పట్టాభి మక్కువమెయి కళోపాసనము చేయువాడును, గభీరతత్త్వసింధువున గ్రుంకు లిడినవాడును కాడు. కావున ఆతనిరచనము చక్కనిదే యయ్యు, కాలవిహాయసమున నక్షత్రమండలమట్లు వెలుంగునది కాదు. ఇట్టిరచనములను సృష్టింపగల కలములు నేడు భారతభూమియందు మూడుమాత్రమున్నవి. ఈకలములను చేతబుట్టిన మహాద్భుతప్రజ్ఞాధురంధరుల (౧) రవీంద్రుడు, (౨) రాధాకృష్ణుడు, (3) అరవిందుడు. వీరినిమించిన కళోపాసకులును, తత్త్వవేదులును, రచయితలును ప్రస్తుతపృథ్వియందు లేరు. వీరిరచనలు, వీరివాక్కులు సృష్టితుదివఱకు నిలుచును. వీనిని చూడగలకన్నులున్నచోటున, వీనిని గ్రహింపగల మనసున్నతావున, వీనితో రాసక్రీడలు సల్ప గల హృదయము లున్నతావలమున వీనికి చిరపూజ జరుగుచునే యుండును. ఆశారహితుడై, సంతృప్తియందు మునుగడ కడపువాడై, ఒకటిగాక పదిశాఖలుపట్టి వానిపై నుఱుకులెత్తి, సముచితవిజృంభణమునకు తనశక్తియందలి సగపాలునకుమాత్రము తరుణమిచ్చి వెనుక నిలిచిన వ్యక్తియై, చేతికి చిక్కినతరుణములను, ప్రజ్ఞను ప్రస్ఫు

టింపజేయు ప్రదేశములను పదవన్ని కృష్ణాజిల్లాలయం దొకదిక్కింతయందు కాళ్లుముడుచుకొని కూర్చునియున్న వింతకానిసిరియైన పట్టాభి కీవనరచనమును, దానికి చాయా ప్రతిమయై నిలుచు నాతని సాహితీరచనమును పైన చెలిపినముప్పగ ద్వివిధరచనములతో బుజమొడ్డి నిలుచునవి కావు. వ్యాసములు వ్రాయుటకును, కొంతకాలము జీవించియున్న "జన్మభూమి"కి సంపాదకీయముల నొసంగుటకునుమాత్రము పట్టాభి తనకలమును ప్రయోగించినాడు. భీమునకు ముష్టివలసినవి పత్థ్యపు మెతుకులా? భీమునకు నిలువవలసినది మూలదొడ్డియంటా? తనకలము ప్రజ్ఞ నెఱిగిన పట్టాభి, ముప్పదేండ్లకుమున్నే కలముపట్టిన పట్టాభి తనకలమున కీయందగుసని ఈమాత్రమా? తన భావనాదిగ్వలయమునకు హద్దుపద్దు లేర్పఱుచుకొనిన పట్టాభి, నక్షత్రమండలము దాటి ఎపరజాలు తన మూమ్కులయొక్క రెక్కలు విఱిచి, ఒకప్రక్క నిలిచినపట్టాభి తనకలమువలన తా నమరత్వ మందదలచుకొనలేదు. ఇతడు గ్రంథకర్తయని యెవ్వరైన దలతురేమో! కావుని నొక్కి చెప్పగును.

## పట్టాభి, వ్యవహర్త

సాహిత్య జ్ఞానమందును, వచనరచనమందును, భౌతికశాస్త్రగ్రహణమందును, క్రియాకౌశలమందును, ప్రజాసేవయందునుమాత్రమేగాక వ్యాపారసై పుణ్యమునందును గూడ పట్టాభి ప్రఫుల్లచంద్రులకు కొంత పోలిక యున్నది. ప్రఫుల్లచంద్రుడు సైన్సునుగాని, సాహిత్యమునుగాని చవిమాడకమున్ను గృహపరిశ్రమల మీదను, వ్యాపారముమీదను మనసు నిలిపినాడు. ముక్తారామ్‌బాబు వీథిలో విద్యార్థిజీవనమును గడపిన ప్రఫుల్లచంద్రుడు విశేషసమయమును అర్థశాస్త్రజటిలాంశములను పిడికిట బట్టుటకై వెచ్చపెట్టినాడు. అర్థశాస్త్రము నిమిషనిమిషము పెరుగుమహాశాస్త్రము. ఈశాస్త్రమున పట్టాభి కొఠాజీగాని, షాగాని కాకున్నను, ఇంచాతడు చాలప్రజ్ఞ సంపాదించినాడు. రాజకీయవేత్తలని భారతదేశమున నేడెన్నబడువారందఱు రాజకీయ, అర్థశాస్త్రములను గుప్పిటబట్టినవారు కారు. అట్లు పట్టగలిగినవారు కొలదిమంది ప్రధాన నాయకులే. వారిలో పట్టాభి యొకడు. సాహిత్యమం దభిరుచిగలవానికి వ్యాపారమున దలనొప్పి. సర్వతోముఖశక్తిగల పట్టాభి వ్యాపారనిర్వహణమున నందినచేయి అనిపించుకొనినాడు. ఆంధ్రబ్యాంకు, ఆంధ్ర ఇన్స్యూరెన్సు కంపెనీ, భారతలక్ష్మీబ్యాంకు, లేండుమార్టిగేజ్ బ్యాంకు, కో-ఆపరేటివు బ్యాంకు, మున్నగు సంస్థలకీతడు శంకుస్థాపన మొనరించినాడు; మిసల చాకచక్యముతో వీనిని నడుపుచున్నాడు. ఆంధ్ర చరకాసంఘమునకు కార్యదర్శియై చక్కని కృషిసలిపి, పల్లెవాసులకు తలలోని నాలుకయైనాడు.

## పట్టాభి, రాజకీయవేత్త

దేశారాధనమే పరమావధి యని యెంచిన మహాపురుషులలో పట్టాభియొకడు. ఆశగాని, ఆడంబరముగాని లేని ఈసేవకుడు రాజకీయములలోనికి నేడేఅడుగునెట్టలేదు. యువకుడైయుండగనే గాంధీ లో నితడు నడుముగట్టి ముందల కుఱికినాడు. ఉఱికిన పదేండ్లలో పరుసవేది నిచ్చు తనవైద్యవృత్తికి నీరు వదలినాడు. ఒక సురేంద్రునివలెగాని, ఒకపాలువలెగాని దృష్టియందు నిలుపుకొనిన ఆశయములకు హంసపాదులు నిర్మించినవాడుకాడు పట్టాభి. దేశసేవయందును, రాజకీయజ్ఞానమందును ఇటీవల పేరందిన కొందఱు మహానాయకులకీత డగ్రగణ్యుడు. దాసు రాజకీయములం దడుగిడినది గాంధీం లో. అం దాతను శ్రమింపజాలిన దైదేండ్లు. దాసువెనుక నెహ్రూవచ్చి, దినినుండి దాసుపిలుపకొలదియేండ్లలో అతని ననుగమించినాడు. జవహరు నిన్నగాక మొన్నటివాడు. శ్రీనివాస అయ్యంగారు ఒకందుకు రాజకీయాలలో ప్రవేశించి, గోహాటినుండి మరలి పని ముగిసినదనుకొని తనకుదాను "జయ్!" అనుకొని తిట్టుపాగ దాల్చి తోంటిపనిలోనికి దిగి తన సంచులు తాను లెక్కించుకొంటున్నాడు. దేశాయిగారు నేడుదయించినజ్యోతి. సాంబమూర్తి ప్రకాశం ప్రభృతుల రాజకీయవయస్సు నాలుగేండ్లు మాత్రమే. వీరికంటె రాజగోపాలాచారి పెద్దవాడు కాడు. అనుభవమందుగాని, అభిజ్ఞతయందు గాని వీ రెవ్వరును

పట్టాభి కీడురారు. వీరు పట్టాభి ప్రేమాల విద్యార్థులగుట కర్హులని గొంతెత్తి తెలుపుదురు. కాంక్షించియుండి నచో, పట్టాభి ప్రధాననాయకులలో నొక్కండనిపించు కొనువాడు. ఇట్టికాంక్ష ఇతనికే కాదు ఏ ఆంధ్రునకును లేదు. తమ్ముతాము గౌరవించుకొనక గౌరవకాంక్షపై కన్నునిలుపనివారికి గౌరవ మెంనుండి లభించును? దేశ దాస్యవిముక్తికై ఆంధ్రు లెంతయో త్యాగము సలిపిరి. కాని ఇంతవరకు ఒక్క ఆంధ్రుడును కాంగ్రెసున కధ్యక్షుడుగా లేదు. ఇందక్కజము లేదు.

తనజాతికిని, తనకును వెనుకబెంచి ఏర్పడినపుడు, పట్టాభి మిన్నకొనియేయుండును. ఒకప్పుడు యువకుడైన తెన్నేటి విశ్వనాథము కొంతగొణిగినాడు. కాని పట్టాభి? "మేముపోయి, చోటులకై అడుగుకొనము" అని భీష్మించుకొని కూర్చున్నాడు.

భాషానుసారమైన రాష్ట్రవిభజనము కాంగ్రెసు అధీనమం దుండవలెనని పట్టాభి శ్రమించి కృతకృత్యుడైనాడు. ౧౯౧౭[?] లో ప్రత్యేకమైన తెలుగుగడ్డకై ఈతడు తమిళులతోడను, బెసంటుతోను పోరినాడు; నెగ్గినాడు. ప్రత్యేకించి తనజాతీయుల కీతడు చేసిన దొడ్డపని అది. రాష్ట్రవిభజనమున నీతడు కావించిన కృషిని మన్నించి, భారతీయు లీతని ౧౯౨౯[?] లో 'లింగ్విస్టిక్ లీగ్'నకు అధ్యక్షునిగావించి గౌరవించిరి. భారతీయ లోకము ఆంధ్రునకు చేసినతొలిమర్యాద అది. పదంపడి వంగరాజకీయవాదులభేదములను పరిష్కరించుటకు న్యాయమూర్తిగా పట్టాభి ఎన్నుకొనబడినపుడు ఆంధ్రుడందినగౌరవము తేటపడినది. గంపలకొలది అన్యరాష్ట్రీయులు తమబుజ్జలపై కురిపించు పువ్వుల నందికొనుటకు వంగీయులు ఎగిరి గంతులువేయుదురు. ఒక్కొక్కపుడు తమపాదములకు తాము మ్రొక్కుకొని ఆనందింతురు. అన్యరాష్ట్రీయుడు తీర్పుచెప్ప నెదుట నిలిచినపుడు, "నీవెవరవు పుల్లయ్యా!" అని సాగనంపుటకు వీరు సంశయింపరు. అంధకారమును, ఆలోకమును ఒక్కచోటున నెట్లుండును? ఆంధ్రత్వసాహిత్యమును, ఆత్మగౌరవమును ఒకేనెలవున నుండజాలునా?

జాతీయవిద్యపై పట్టాభికి ప్రేమమెండు. హనుమంతరావు దివంగతుడైనపిదప ఆంధ్రజాతీయకళాశాలకు అండయైనవాడు పట్టాభి. జాతీయవిద్యపట్ల ఆంధ్రులకుండినఅభిమానము నేడించుమించుగ నడుగంటుటచే నేడు జాతీయకళాశాలయందు కొన్నిపుంజీల విద్యార్థులుమాత్ర ముండిరి. దీనికిగల ఆర్థికదార్ఢ్యము సన్నగిలినది. హృదయదార్ఢ్యము వీడని పట్టాభి దీని నట్టిట్టులాడనీక గట్టిగబట్టియున్నాడు. విశాలహృదయుండగు రామకోటీశ్వరరావు దీనికి ప్రిన్సిపాలైయుండి, తనజాతీయధర్మమును నిర్వహించుకొనుచున్నాడు.

గాంధిజీపాంచజన్యధ్వానమును వినినంతన పట్టాభి చరచర ముందులకు సాగివచ్చినాడు. మహాత్ముని మంత్రమందలి పటుత్వమహత్త్వము లిట్టివని ఆంధ్రపృథ్వి కెఱుకపఱచినాడు. "జన్మభూమి" మూలమున నన్యరాష్ట్రములందు ప్రచారముసాగించినాడు. కొంతకాలము చెఱ ననుభవించినాడు. "దేశభక్తులందు ఇతడు లెస్స" అని ఒకఅన్యరాష్ట్రీయు డెన్నడేని అనియున్న యెడల, ఈత డొకబిరుదుపసదన మందియుండునాడు.

## పట్టాభి, మేధాశాలి

తీక్ష్ణబుద్ధిగల పట్టాభి ఆంగ్లసాహిత్యమందును, వైద్యవిద్యయందును, అర్థశాస్త్రరాజకీయశాస్త్రములందును మాత్రమేకాక ఇతరవిజ్ఞానశాఖలందుగూడ కొంతపరిచయము సంపాదింపగలిగినాడు. తెలుగునందు గూడ నితడు ధారాళముగ నుపన్యసింపగలడు. కొంత కాలము తెలుగుసహకారపత్రికను నిర్వహించినాడు. హిందీయందుగూడ నీతడు చక్కగ మాటలాడగలడు; ఉర్దూతమిళములను చవిచూచివదలినాడు. ఒకవిద్వాంసుని నిక్కంపుటోతు కనుగొనవలెననిన, నట్టింటనున్నపుడాతని నకస్మాత్తుగా పట్టవలెను. ఏదేనిధోరణిలోనికి మెల్లగ దింపవలెను. తీగెలాగినయెడల డొంక లేచివచ్చును. ఎవ్వనిపాండితి గాని అంతరంగమున దొంగయై దాగియుండదు. మీదిరాతిని తొలగించినంతన గంగోదకము లోని యూటనుండి ఉబికివచ్చులీల, విద్వాంసునిమనసునందలి భావ

స్రోతము తెరలుతెరలై పొంగివచ్చును. పట్టాభి ప్రసంగము పాంచాలనీమవంటిది. ఈ నీమయం దైదు ఉపనదులుండుట ప్రపంచ మెఱుగును. పట్టాభిప్రజ్ఞ ఐదుతరగతులు కలసిన పాఠకులు గ్రహించియేయుందురు. ఈ వైదింటిని అనుసరించు శ్రోతలకు జ్ఞానసింధువు గోచరమగును. ప్రసంగకౌశలమున పట్టాభికున్న ప్రాముఖ్యము అనల్పము. పట్టాభి చక్కనిజ్ఞాపకశక్తిగల మనీషి. వేసావారును, చిలకమర్తివారును, భోగరాజువారును సైదోడులు.

## పట్టాభి, మనుష్యుడు

పట్టాభి వక్తయనుడు; వ్రాతగాడనుడు; వాదనాకుశలుడనుడు; వ్యవహర్త యనుడు. మనుష్యు డనిపించుకొనినపట్టాభియే పట్టాభి. ఇతడు నాస్తికుడను నొక వదంతియుండెడిది. షెల్లీ ఎట్టినాస్తికుడో, ఇతడును అట్టినాస్తికుడే ఏమో! షెల్లీవ్రాతలు బోధపఱుచుకొనినవారలు అతడు నాస్తికుడో, ఆస్తికుడో ఎఱుగుదురు. పట్టాభిజీవనమును పరికించినవారు అతడు ఆస్తికుడో, నాస్తికుడో ఎఱుగుదురు. గాంధికి శిష్యుడైన వ్యక్తి నాస్తికుడైనచో, అతడు 'జూడస్ ఇస్కేరియట్' అయియుండును. ఆచార్యునితోబాటు తానును శిలువనుచేబూని, తనదేశీయులదృష్టి నాకర్షించియుండువాడు కాడు. దైవభక్తుడును, ఆశావాదారాధకుడును అనవరతము కనులెదుట దివ్యదృశ్యమును చూచుచుందురు. అంధకారమందు దిగబడినను వీరు తమభావివిజయము నెడల విశ్వాసముంచితీరుదురు. నాస్తికుడు విశ్వాసరహితుడు. పట్టాభిక్రియలను, పట్టాభిరచనలను పరికించినవారు, అతడు ఆదర్శోపాసకుడనియు, ఆశోపహతుడై పడియుండక అనంతవిజయమును పూరించు యోధుడనియు గ్రహింపజాలుదురు. *

*పట్టాభి వాక్కులను గమనింపుడు: "When we speak of the Religion of patriotism or elevating politics to the plane of Religion, we merely make the sordid politics of the day sacred, the compartmental politics of the day comprehensive, the competitive politics of the day co-operative" Vide Pattabhi's article with the caption "Has Congress failed?" recently contributed to the "Amrita Bazaar Patrika" Pooja Number. ఈవాక్కులతో రాధాకృష్ణునివాక్కులను పోల్చిచూడుడు. "Religious idealism seems to be the most hopeful political instrument for peace The world must be imbued with a love of humanity. We want religious heroes who will not wait for the transformation of the whole world but assert with their lives if necessary the truth of the conviction on earth ore family' (Vide Radhakrishnan's famous book Kalki, page 96). "We rest but to wake up. We are passive only to become active once again" (Vide Pattabhi's article "Is Gandhi played out?" which appeared in the first issue of the "Twentieth Century") దీనితో నీవాక్కులను పోల్చిచూడుడు: "A period of rest ensues during which the unconscious may work effectively" (Vide: C. E. M. Joad's "Counter attack from the East" page 102) ఈపల్కులనుకూడ పరికింపుడు: Intelectual inaction seems to be the prelude to the intuitive flash We must allow the intellect to be fallow, let the object soak into the subsoil of our mental life and elicit its reaction to it" (Vide Radhakrishnan's "An Idealist View of life" page 179) పట్టాభివచనములును గమనింపుడు: "Every failure is only seemingly such and is in reality but a step to success", "Success itself is but the last phase of a series of failures". "We teach simplicity to our people and with simplicity of living comes sublimity of thought, ideas of self-respect, self-sufficiency, self-reliance and self-realization." ఈవాక్కులవలన పట్టాభియొక్క మానసికగ్రథన మెట్టిదో తేటపడును.

తనఆశయమును చేరుపట్ల వలసినశక్తి నందుటకు ప్రతిమానవుడును తనలోపములతో తాను పోరుసలిపి, సంఘజీవనమునకు తనజీవనమును అనుబంధించి, సంఘ స్ఖాలిత్యముల కెదురేగియు, సంఘమునుండి త్రాడు త్రెంచుకొనక వేరువమెయి వర్తింపవలెను. విజయ జీవననిర్వహణమునకు వలసినఅనుభవము ఒక్కనాటితో చేజిక్కదు. కఠినమైనజీవకళాయం దారికేఱునంతదనుక, మానవుడు తనశిరమును బొప్పిగట్టించుకొనుచుండవలెను. ఇతఁడెంతేనిమనఃక్లేశము నందవలెను. "నారాష్ట్రమున నాకు పలుకుబడిలే" దని పట్టాభి ౧౯౨౦లో కలకత్తా యందు పలుకుట వినియుంటిని. ఒకప్పుడు ఈతని వేధించినపరిస్థితు లెన్నోఉండియుండును. పొట్టపడక, నేలగూలక పైకిలేచినవారు మహాపురుషులందు లేరు. ఒకప్పుడు తలపైబడు జనుస్వామూళి, పదంపడి గౌరవ హేమభస్మమగునని రవీంద్రు డనినాడు (Vide: Rabindranath's famous essay on "Nationalism") నేడు పట్టాభి ధూళ్యావలుంఠితుడుగాక బంగారువంటిప్రజాదరణము నందుచున్నాడు.

పట్టాభిప్రజ్ఞకు అతడందిన పేరు చాలినదికాదు. ఇందులకు అతఁడాంధ్రుడైపుట్టుట ఒకకారణము. రెండవ హేతువు ఇతడు కీర్తియెడల రోతగలిగినవింతమానిసి యగుట. పట్టాభికి మహాపురుషలక్షణము లున్నవనుట నిస్సంశయము. తాదలచినదానిని నమ్మి ఇతడు ముం దంజవేయును. తనతలపుల నెఱిగి, తనపలుకులు విని, తనచెయువులు చూచి ఒరులు సంతసింతురనికాని, క్రోధకణములను హృదయములందు రవులజేసికొందురని కాని యోజింపక ముక్కునకు సూటిగా నీతడు పోవును. ప్రత్యుపకృతి నభిలషించి ఈతడుపకార ములు చేయడు. గట్టిపొదుపరియను పేరందియు ఎదుటి దుఃఖమును, దారిద్ర్యమును పాపుట కీతడు హృదయ మంజూషను తెఱచివేయును. వేయి నెరవులు రోసి సాహాయ్య మపేక్షించువానికి, ఇతడు తోడ్పడితీరును. అసాధ్యక్రియ నీతడు సాధించి తీరును. తనకు "తందాన" యను నవగ్రహములను తన మట్టును చేర్చుకొనుట ఈతఁడెఱుఁగడు. ఎత్తులువేయుట ఈతని ప్రకృతికి ప్రతికూలము. ఒకరిని వశమొనర్చు కొనవలెనని ఇతడు పొగడ్తలోనికి దిగడు. ఏమోమా టము లేక, కుండ బ్రద్దలుకొట్టినట్లు మాటలాడి, ఇతఁడెందఱిప్రోవనో తెచ్చుకొన్నాడు. ఎందఱికన్ను బుస్సులకో తలయొడ్డినాడు. పట్టాభి లౌకికమెఱిగినవ్యక్తి కాడు. ఇతనిస్పష్టవాక్కు, ఇతనిశుభ్రహృదయమునుండి వెడలునదని గ్రహింపనేరక, ఎందఱో ఇతనికి ప్రతి కక్షులై నిలిచిరి. ఒకరిదూషణకై జంకక, ఒకరిభూష ణకై ఉబ్బి తబ్బిబ్బులాడక, ఒకరిజోహారునకై, ఒకరి సంప్రీతికై, ఒకరిసేవకై, ఒకరిఉపకారమునకై ఆతుర పడక, ఒకరియడుగులకు మడుగులొత్తక, ఇతడు తన పనిని తాను నిర్వర్తించుకొనును. సత్యాగ్రహఫలితము చేకూఱ లేదని నిట్టూర్పులు విడువడు. చీకటిక్రమ్ముకొనుచున్నను తనయత్నములకు వెలుంగు బాసటయగునని ఈతడు నమ్మను. జైలునుండి వచ్చినమర్నాడు దురదృష్టమును, అంతఃకలహమును, నిరుత్సాహమును, నిరాశయును, అత్యాచారమును పులులవలె కాంగ్రెసుపై వ్రాలియున్న ముహూర్తమందు విజయముమీది ఆశను పోద్రోలక, తానవలంబించిన కార్యవిధానముమీదివిశ్వాసమును సడల నీక, ధైర్యమును చిక్కబట్టి, చరచర నడిపించి కరిగి పికెటింగునకు కడంగి మరల జైలుదెస పదములు సాగించి నాడు. రోగపీడితుడయ్యు, ఆపదను "హా! హా!!" యనిపిలచుటకు సంశయింపనిధీరుడు పట్టాభి. వలచి యుండినచో, ఇతఁడైశ్వర్యవంతుడై యుండువాడు; కీర్తివధూటిని వశపఱచుకొనియుండువాడు. వృద్ధి లేనంత దాను వలచివచ్చినపు డీతడు పెడమొగము పెట్టినాడు. ఈపని అవివేకమని కొందఱందురు.

మహాపురుషులక్రియలొక్కొకపుడు పిచ్చిపనుల వలెను, వివేకరహితచర్యలట్లును పొడగట్టును. కాలము కడచినగాని ఈక్రియల నిజరూపము తేటపడదు. మహా పురుషునకైనను పదస్ఖలనము సహజము. మహాపురుషు డును ఒకమానవుడే. బొంబాయి క్రానికల్ పత్రికా సంపాదకత్వమును స్వీకరించి, పృథ్వినాలుగుమూలలతో సంబంధముగల మహానగరమున నివాస మేర్పఱుచుకొని, ఒకమాఱు సముద్రము దాటియుండినచో, తాను విశేష

ప్రతిభ నందుటయేగాక, పట్టాభి తనజాతి కెంతేని పేరు దెచ్చియుండువాడు. తనయున్నతికి దిగదుడుపని నపుడది తనజాతికి బలాధారగునని ఈతడు గ్రహించి యుండకపోవచ్చును.

సాహస మొక్కొకపుడు మొండిసాహస మగు నట్లు, తెగువ యొక్కొకపుడు కూడనితెగువ యగులీల, త్యాగ మొక్కొకపుడు తీవ్రాచరణ మనిపించుకొను నేమో! మానమేమములు లెక్కించుట త్యాగిపని కాకుండుట నిక్కమే. త్యాగికైనను కన్నులుండును కదా! మహార్ణవము నీదుటకై ముందుకు దుమకవలయు నేని కనులుమూసికొని సుడిగుండమునందే ఈతడు లంఘింపవలెనా? త్యాగమునకు ఊగిసలాట ఘోర విరోధియే! కాని దూరదృష్టి దానికి వైరియని యోజించి, నిముసములో గ్రుగ్గిపోవుట మహాత్యాగమని తలచువాడు త్యాగతత్త్వమును గ్రహించిన వాడు కాడని నాయుద్దేశము. దూరదృష్టి త్యాగమునకు విరోధియగుట నిక్కమగునేని, అది పృథ్వి నుండి బహిర్గతము కావలెను. పదునొకండుగురు యువకులను దోకొని ఘోరమృత్యువును ఆహ్వానించిన ఇటలీమహాపురుషుడు తనకర్జమునకు కనులుంచి ముందుల కురుకవలసెడిది. మహాత్యాగముసలిపెన ఏసు కూడ, తనముహూర్త మాసన్నమగువఱకు తలడసి యున్నాడు. ప్రాణములను కాపాడుకొనుటకై పగతుర దరినుండి పాఱినాడు. ("Therefore they sought again to take him; but he escaped out of their hand, and went away again beyond Jordan into the place where John at first baptized; and there he abode." Vide; Verses 39&40 Gospel of St. John) చచ్చి విజయధ్వజమెత్తిన ఏసు లెందఱున్నారు? ఇట్టిఏసుల కజస్రము కేలుమొగిచెదను. ఇట్టిఏసుల కంటెగూడ బ్రదికి విజయమంది, చచ్చి దిగ్విజయ మందిన ఏసులు ఘనతరప్రజ్ఞగలవారని నాతలంపు. రాజకీయములకు కావలసినది వట్టి మతావేశమేకాదు, దూరదృష్టియు గూడ తప్పక వానికవసరమైనదని నొక్కి చెప్పుదును. గంగపొంగి ఒక్కొకపుడు ఆర్యావర్తమును ముంచివేయును. పట్టాభిమేఘస్సుకంటె, పట్టాభి హృదయము చిన్నదియేయయ్యు, అది మహావేశమున పొంగి, మేఘశ్శిఖరమునుగూడ రెండుమూడుతూరులు ముంచివేసినది! వాడిమెదడుగలపట్టాభి తుదిరొబ్బను చేరలేవంటినిగదా! మెదడుకొనయందే అద్భుతమరీచీ సంశోభితంబైన సూక్ష్మదృష్టి దివ్యపుష్పమట్లు ప్రస్ఫుటించును.

చేశిక్కిన చక్కనిపరుణములను దూరముగ గిరవాటువేసిన పట్టాభి మొండితనమును ప్రదర్శించెనుగాని త్యాగము చూపలేదని నొక్కివక్కాణింతును. వానిని బట్టి యాతడు భూప్రదక్షిణము చేసియుండవలసినది. కాని పట్టాభి సామాన్యుడుకాడని యెఱుగుదును. నిన్నటి లోపములను నేడు నేలగూల్చి, రేపటివిజయమునకై వానిని మెట్లులుచేసికొనుట మహాపురుషుని లక్షణము. పట్టాభి నేడు యువకుడై నిలిచినాడు. స్వరాజ్యభవనమును దృష్టియం దిడికొన్నాడు. (Vide: "Has Congress failed?" last paragraph) ఈ సౌధమున కీత డెట్టి మెట్లులు కట్టునో పరికింతముగాక.

పట్టాభి నూతనతేజమందిననాడే రుచిచుంబన మంది వికసించు పూలలీల, ఆతని ఆశయములు కుసుమించును. నాడే ఆతనిహృదయ మానందసౌరభమున డోలీ యాడును. నాడే పట్టాభి ఆంధ్రప్రజ్ఞ చూపినవాడగును. నాడే పట్టాభి పట్టాభిరాము డనిపించుకొనును.

# విష్ణుకుండి వంశము

(అనువృత్తము)

భావరాజు వేంకటకృష్ణరావు

. . . . . . . . . . . . . . . . . .

మహాడవమాధవవర్మ అపరిమిత బలపరాక్రమసంపన్నుడనియూ, మహారాజాధిరాజనియూ, రాజపరమేశ్వరుడనియు నీవఱకే తెలిపియుంటిమి. ఆతని ప్రజ్ఞాదికములను, గుణాతిశయములను ఆతని యీపూరు, పొలమూరు శాసనములు మనోహరముగ వర్ణించుచున్నవి. ఈపూరుశాసనము మాధవవర్మ, స్మృతి, మతి, బల, సత్త్వ, ధైర్య, వీర్య వినయసంపన్నుడనియూ, సకలమహీమండలమనుజపతి ప్రతిపూజితశాసనుడనియూ, స్వభుజబలవిజిత సకలసామంతాతులబల వినయ, నయ, నియమసత్త్వ సంపన్నుడనియూ, సకలజగదవనిపతిప్రతిపూజితశాసనుడనియూ, అగ్నిష్టోమసహస్రయాజియనియూ, హిరణ్యగర్భప్రసూతుడనియూ, ఏకాదశాశ్వమేధావభృథావధౌతజగత్కల్మషుడనియూ, సుస్థిరకర్ముడనియూ, మహారాజనియు తెలుపుచున్నది. ఈవిశేషణము లన్నియు కేవలము స్తుతిపాఠకవచనములని మనము నిరసింపరాదు. ప్రాచీనభారతీయ రాజనీతిశాస్త్రమును, తద్ధర్మమును తెలిసినవారి కీవిశేషణములు నిశ్చయముగ యథార్థములని గోచరించును. నేడు మనము 'మహారాజ' పదమును నిరర్థకముగ వాడుచున్నాము ప్రాచీనరాజధర్మము నెఱిగినవారి కీ'మహారాజ'పదము సరియైనఅర్థము స్ఫురింపజేయును. అనేకమందిమనుజపతులను, సామంతరాజులను తనవశులుగాజేసికొని తనయాజ్ఞలను పూజించి పరిపాలింపజేయగల్గినవాతడే 'మహారాజ' పదమునకు అర్హుడు. 'మహారాజ' పదము క్రీ. శ. తొమ్మిదవ శతాబ్దమువఱకు దక్షిణాపథమం దంతటను ఆయర్థము నందు వాడబడుచుండెను. అనేకమంది రాజశ్రేష్ఠులపై తన పరమేష్ఠిత్వమును స్థాపించిననాడు ఆమనుజపతి మహారాజని తలుచుకొనుచుండెను. క్రీ. శ. తొమ్మిదవ శతాబ్దమునుంచి 'మహారాజ' పదమును ఆయర్థమునందు రాజనీతిజ్ఞులు వాడుట మాని దానికిబదులు 'మహారాజాధిరాజ' అనియూ, 'రాజాధిరాజ' అనియూ, 'పరమభట్టారకు'డనియూ, 'రాజపరమేశ్వరు' డనియు మొదలయిన విశేషణములు పెక్కింటినిచేర్చివాడసాగిరి. కావున విష్ణుకుండినులనాటికి మహారాజపదము "మహారాజాధిరాజ," "రాజపరమేశ్వర" "పరమబ్రహ్మ" ణ్యాదివిశేషణములందు గల విశేషార్థముతోగూడ నుపయోగింపబడు చుండెనని యూహించుకొనవలయును.

ఇంచుమించుగా నిట్టివిశేషణములనే పొలమూరు శాసనముగూడ తెలుపుచున్నది. అం దాతని బిరుదు గద్య యిట్లున్నది:

"అతులబలపరాక్రమ, యశో దానవినయసంపన్నో; దశశతసకలనరణీతలనరపతి; రవసితవివిధదివ్య త్రివరనగరభవనగతపరమయువతీజనవిహరణరతి; రనన్య నృపతిసాధారణదానమానదయాధర్మ, ధృతిమతి, క్షాన్తి, కాన్తిశౌర్యౌదార్యగాంభీర్యప్రభృత్యనేకగుణసంపజ్జనిత రయసముత్థితభూమండలవ్యాపి విపులయశాః; క్రతుసహస్రయాజీ; హిరణ్యగర్భప్రసూతిః*; ఏకాదశాశ్వమే

* "హిరణ్యగర్భ ప్రసూతిః" అన్న విశేషణమునకు నింతవఱకు సరిగా నెవరును సరియైన యర్థమును చెప్పలేదు. హుల్షుపండితుడు "హిరణ్యగర్భ" మను నది మహాదానములలో నొకటియనియు, 'హిరణ్యగర్భప్రసూతిః' యనగా హిరణ్యగర్భ మను మహాదానము చేసినవాడనియు నర్థము చెప్పుచున్నారు. (ఎపిగ్రాఫియా ఇండికా, సం. ౧౪, పుట ౩౩౪, నోటు ౪.) ఇది సంప్రదాయవిరుద్ధమైన వ్యాఖ్యానము. ఇట్టి విశేషణమే దామోదరవర్మ మట్టిపాడుశాసనమందు "అనేక హిరణ్యగర్భోద్భవోద్భవస్య" యనియు (ఎ. ఇ. సం. ౧౪, పుట ౩౨౪, పంక్తి ౨-౩); అత్తివర్మ గోరంట్ల శాసనమందు "అప్రమేయహిరణ్యగర్భప్రసవేన" (ఇండి

ధావభృథస్నానవిగత జగదేనస్కః; సర్వభూత పరిరక్షణచుఞ్చుః; విద్వ, ద్విజ, గురు, విప్ర, వృద్ధ, తపస్వి జనాశ్రయః; మహారాజః................... మహీతలనృపతిభాస్కరః; పరమబ్రహ్మణ్యః"

విష్ణుకుండినులలో పరమబ్రహ్మణ్యుడని పిలుచుకొన్నవారిలో కడపటివాడును, మొదటివాడును కూడ నీ మాధవవర్మయే! ఇది యాతని రాజపరమేష్ఠిత్వమును మాత్రమేకాక హిరణ్యగర్భప్రసూతిత్వమునుగూడ దెలుపుచున్నది.

ఈపూరుశాసనమును మూడవమాధవవర్మ విజయ రాజ్యవర్షములు ౩౭ అగునేట గ్రీష్మఋతువున ౧౫-వ దివసమున నాజ్ఞాపించెను. అప్పుడాతడు కుడావాడ విజయస్కంధావారవాసకమునం దిడిదియుండి, గుద్దాది విషయములోని విలెంబలిగ్రామమును తన వంశవిభూతి కొఱకై శ్రీవత్ససగోత్రుడును, బ్రాహ్మణుడును నగు అగ్నిశర్మకు సర్వకరపరిహారముగా అగ్రహారముగావించి ధారవోసెను. ఆవృత్తాంతమును ఏతద్విషయనివాసులయిన సర్వజనులకు తెలియబఱచుటకును, అచ్చటి రాజపురుషులు తనశాసనమును యథావిధిగా పాలింపవలసినదని ఆజ్ఞాపించుటకును ప్రియపుత్రుడైన మఞ్చ్యణ్ణభట్టారకుని "ఆజ్ఞప్తి"గా నియమించి పంపెను. ఈపూరుశాసనములో పేర్కొనబడిన గ్రామములు మూడును నేడుగుర్తించుటకు సాధ్యపడకున్నవి. ఐనను గుద్దాదివిషయము గుద్దవాదివిషయము కావచ్చును. కృష్ణాజిల్లాలో నొక గుద్దవాదివిషయమును, గోదావరిజిల్లాయం దొక గుద్దవాదివిషయమును, విశాఖపట్నంజిల్లాలో నొక గుద్దవాదివిషయమును గలవు. వీటిలో మూడవది పూర్వము కళింగదేశములో జేరిన దేవరాష్ట్రములో నున్నది.౨ ఈమూడింటిలో ఈపూరుశాసనోదాహృతమైన గుద్దవాదివిషయ మేదియో నిర్ధారణచేయ సాధ్యము గాకున్నది. ఒకవేళన ఆగుద్దవాదివిషయము కళింగములోనిది కావచ్చుననుటకు ప్రమాణములు కన్పట్టుచున్నవి. విశాఖపట్నంజిల్లా గోలుగొండతాలూకా పూర్వము దేవరాష్ట్రములో జేరియుండెను. ఈ గోలుగొండ తాలూకాయందు కురువాడయను ఒకగ్రామమును, గోలుగొండ (యేజన్సీ) మన్యంతాలూకాయందు వెలింబయిలు

---

యను ఆంటిక్వేరి సం ౯. పుట ౧౦౨, పంక్తి ౩) అనియును గలదు. "హిరణ్యగర్భప్రసూతిః" అనగా బ్రహ్మదేవునియందు బుట్టినవాడని యర్థము. (హిరణ్యగర్భుడనగా బ్రహ్మదేవుడు) క్షత్రియుడైన మహారాజు పట్టాభిషేకమునొందినపిదప నొక వైదికకర్మవలన హిరణ్యగర్భప్రసూతి యగుచున్నాడు. హిరణ్యగర్భప్రసూతియైనందువలన పరమబ్రహ్మణ్యు డగుచున్నాడు. మనుజపతి జాతముచేత క్షత్రియు డయ్యును ఈ సంస్కారమును బొందినతరువాత బ్రాహ్మణు డగుచున్నాడని స్మృతివాదము. పట్టాభిషేకము జరిగిన తరువాత మహారాజు గోగర్భమునుండి జన్మించునట్లు హిరణ్మయమైన గోవును దెచ్చి మంత్రోచ్చారణపూర్వకముగ నొకతంతు జరిపి జాతకర్మను జరిగింతురు. గోగర్భమునుండి జన్మించిననరుడు బ్రాహ్మణసముడగునని వేదములు, స్మృతులు, ధర్మశాస్త్రములు ఘోషించుచున్నవి. మహారాజును హిరణ్యగర్భప్రసూతిని చేయు సంప్రదాయము నేటికి తిరువాన్కూరులో నున్నది.

౧. విజయస్కంధావారశబ్దమునందు 'విజయ' పదము కేవలము మంగళవాచకముమాత్రము. రాజు యుద్ధానంతరము రాజధానికి మరలివచ్చునపుడుగాని, యుద్ధమున కేగుచున్నప్పుడుగాని సైన్యసమేతుడై విడిసియుండు విడిదికి 'స్కంధావార' మని పేరు. ఈస్కంధావారము నిజమునకు తాత్కాలికముగ నిర్మింపబడిన యొక మహానగరము; రాజధానియని కూడ చెప్పవచ్చును. ఇతడుండు రాజాంతఃపురమునకు వాసకమని పేరు. పూర్వము, మహారాజులు తమ విజయ స్కంధావారములను మహాగ్రామములచెంత నుండిన విశాలమయిన బయళ్లమీద నిర్మించుచుండిరి. ఈ మహాగ్రామములు దేవభోగములుగాని, బ్రాహ్మణుల కిచ్చిన అగ్రహారములుగాని కాగూడదు.

౨. Copper plate grant of Chalukya Bhima I (C. P. No 14 of 1908-09.)

అను నొక గ్రామమును గలవు. విలెంబలి నెలింబయలును, కుడావాడ కురువాడయును గావచ్చును. ఈ యూహయే యథార్థమైన దగుచో మూడవమాధవవర్మ ఇచ్చిన గ్రామము కళింగదేశమునందలి దేవరాష్ట్రములోని దనుట స్పష్టము. కళింగదేశమును దాటి చైత్రయాత్ర వెడలి శత్రువుల బరిమార్చివచ్చువేళ కాబోలు మాధవవర్మ ఈదానమును ఆజ్ఞాపించినాడు.[౧]

మూడవమాధవవర్మ క్రీ. శ. ౬౧౦-౧౧ సంవత్సరము నడుమ, రెండవసత్యాశ్రయ పులకేశివల్లభుని ఆంధ్రదేశ దండయాత్రయందు ఓటువడి, హతుడై యుండవచ్చునని కొమర్రాజు లక్ష్మణరావు, మల్లంపల్లి సోమశేఖరశర్మగారల యొక్క అభిప్రాయము. ఇందేమియు అసంభవము కానబడదు. పైన నుడివినదాని బట్టి కళింగదేశమున గాంగులరాజ్యము క్రీ. శ. ౬౦౦-౬౨౦ సంవత్సరములనడుమ క్షీణదశనుండి, దిక్కుమాలి యుండెనని తెలియుచున్నది. ఇందులకు గాంగశకము ౯౧-వ యేడు మొదలుకొని ౧౨౯-వ సంవత్సరము వఱకు నొకశాసనమైన లభించకుండుట బలమయిన ప్రమాణము. ఆకాలమున మూడవమాధవవర్మ ఆంధ్ర, కళింగముల రెండింటిని నేకచ్ఛత్రాధిపత్యమున పరిపాలించుచుండెను. అట్టియెడ కళింగము దైన్యస్థితియందుండుట గాంచి సత్యాశ్రయుడు తూర్పుదెసకు దిరిగి, దక్షిణకోసల కళింగరాజ్యముల జయించి, విష్ణుకుండిన మాధవవర్మను ఎదుర్కొని యుండనోపు. అయ్యవొళె శాసనము-౨లో కూనాలపుర యుద్ధవర్ణనము విష్ణుకుండినుల కొలనుపురమును తలపునకు తెచ్చుచున్నది. సత్యాశ్రయుడు పిష్టపురమును సాధించి పిమ్మట కూనాలపురమున కేగెనని యందు తెలుపబడి యున్నది. కూనాలమును,కొలనును కొల్లేరనుటకు సందియమేమియు లేదు. సత్యాశ్రయుడు తా నోడించిన శత్రువుల పేరులు తెలుపకుండుట మిగులఆశ్చర్యకరము. మహాపరాక్రమశాలియు, యోధాగ్రేసరుడును నగు మూడవమాధవవర్మ మరణించిన వెంటనే విష్ణుకుండినులు ఏలుచుండిన ఆంధ్రదేశము పులకేశివల్లభునకు సులభముగా కైవస మయ్యెనని యూహింపవచ్చును. అందులకు సత్యాశ్రయ వల్లభేంద్రుని కొప్పారంతామ్రశాసనము ప్రబలప్రమాణము.

౭. మంచ్యణ్ణభట్టారకుడు — క్రీ. శ. ౬౧౦ మొదలుకొని ౬౨౮ వఱకును: ఇతడు తండ్రి వెనుక జీవించియుండెనో లేదో, నిర్ధారణచేయుటకు వీలుగానరాదు. అయినను కుబ్జవిష్ణువర్ధనుడు క్రీ. శ. ౬౨౮ సంవత్సరమువఱకు చాళుక్యరాజ్యమును ఆంధ్రదేశమునందు స్థాపింపజాలకపోవుట జూడ మంచ్యణ్ణ భట్టారకు డంతవఱకు జీవించియున్నాడని యూహింపవలసివచ్చుచున్నది. సత్యాశ్రయు డాంధ్రదేశమును బాలింప తనకు సేనానియు, నాప్తభృత్యుడు నగు పృథివీధ్రువరాజును ప్రతినిధిగా నియమించి చనియుండును. ఇతడే కొప్పారంశాసనమున కాజ్ఞప్తి. మంచ్యణ్ణ భట్టారకుడు, చాళుక్యభూపాలు డాంధ్రదేశసీమల దాటినంతనే ధ్రువరాజు నెదుర్కొని ఘోరసంగ్రామమునందు ఓడించి హతేముగావించియుండును. ఆతడు పోగొట్టుకొనిన పైతృకరాజ్యమును మరల సంపాదించుకొనుటకై విశ్వప్రయత్నములు చేసియుండుననుటకు సందియము లేదు. పృథివీధ్రువరాజు మరణించినతరువాత సత్యాశ్రయుడు తనకు ప్రియానుజుడును, యువరాజు నగు కుబ్జవిష్ణువర్ధనుని వేంగిదేశమునకు బంపియుండును. కుబ్జవిష్ణువర్ధనుడు వేంగిమహీరాజ్యమును సంరక్షించుకొనుటకండె, తనకొకరాజ్యమును స్థాపించుకొనదలచి యాంధ్రదేశము మీదికి వచ్చియుండును ఈయూహయే సరియైన దయినచో కుబ్జవిష్ణువర్ధనుడు క్రీ. శ. ౬౧౫ మొదలుకొని ౬౨౮ వఱకు నైదారు సంవత్సరములు వేంగీరాజ్యమునకై మంచ్యణ్ణభట్టారకునితో ఘోరముగ బోరాడి, యతని నోడించియుండవలయును.

---

౧. ఈశాసనము విశాఖపట్నంజిల్లానుండి రెండు జిల్లాలు దాటి గుంటూరుజిల్లాకు ఎట్లు పోజాలియుండునని చదువరులు సందేహింపనక్కరలేదు. ప్రతిగృహీత కుటుంబములు అరిష్టములు కలిగినపుడు వలసబోవుచు వీటిని గొంపోయియుందురు.

౨. Ep. Ind. Vol. VI. p. 1. Verse 17.

పైన నుడివినరీతిని మంచ్యణ్ణభట్టారకుడువిఫలమనోరథుడై, దైవోపహతుడై క్రీ.శ. ౬౩౩-౪ సంవత్సరప్రాంతమున మరణించియుండవచ్చును. ఆసంవత్సరమునందే కుబ్జవిష్ణువర్ధనుడు స్వతంత్ర చాళుక్యరాజ్యమును ఆంధ్రదేశమున స్థాపించెను.౧ మంచ్యణ్ణభట్టారకుని మరణములో విష్ణుకుండిన్యధిరాజ్యము కూలంకషముగ నాశమొనరింపబడెను. ఆతని మరణముతో నాంధ్రదేశమున కుబ్జవిష్ణువర్ధను నెదిరింప శక్తిగల ప్రత్యర్థి లేకుండబోయెను.

౬

'విష్ణుకుండి 'శబ్దోత్పత్తి, ఇతర విషయములు

విష్ణుకుండిశబ్దముయొక్క వ్యుత్పత్తి మనకు సరిగా తెలియదు. వినుకొండ యను తెలుగుదేశపు గ్రామనామము ఇంతకుమునుపే వచించినట్లు సంస్కృతమున 'విష్ణుకుండి' గా నుండియుండవచ్చును. అంతేకాని నా మిత్రులు కొమఱ్ఱాజు వేంకటలక్ష్మణరావుగా రూహించినట్లు "వినుకొండయను తెలుగుపదమును పరిపాలకవంశమువారని మెప్పించుటకు పండితులు విష్ణుకుండిగా సంస్కరించియుందు"రని యూహించు టసంభావితము. ఇందు లక్ష్మణరావుగారు నిక్కముగా పొరబడిరి. క్రీ.శ. ౪,౫ శతాబ్దములందు "వినుకొండ", విన్హుకుండియని పదగనో, లేక విష్ణుకుండియనిపదగనో తెలుపుశాసనాధారము లేవియు గానరావు. అట్టియెడ వినుకొండయే మొదటి వ్యుత్పత్తిపదమనియు, దానినుండి 'విష్ణుకుండి'యని సంస్కృతశబ్దమును పండితు లూహించిరనుటయు కేవలము సాహసము. విష్ణుకుండిపదమునుండియే 'విన్హుకుండి', వినుకొండి, వినుకొండ మొదలయినవి జనించి ప్రాకృత తద్భవము లయ్యెననుట సమంజసము. "వినుకొండ" "విష్ణుకుండి"గా మారెననుట కాధారములు లేవు. వినుకొండ పూర్వము విష్ణుకుండిగావచ్చు నని మొదట డాక్టరు కీలుహారనుగారు ప్రతిపాదించిరి.౨ విష్ణుకుండి వాస్తవ్యులయిన కారణమున, 'విష్ణుకుండి' వంశనామ మయినది. శాసనములందు "విష్ణుకుండినాం" అని వంశనామము గానబడుచున్నది. ఇట్లే వాకాటకులు 'వాకాటకానాం' అనియు, పల్లవులు 'పల్లవానాం' అనియు, కదంబులు 'కదంబానాం' అనియు సమకాలికులు తెలుపుకొనిరి. తెలుగుదేశమున గ్రామనామము ఇంటి పేరుగా నుంచుకొనుఆచారముకలదని అందరికిని దెలిసిన విషయము. లక్ష్మణరావుగారు "ఒకవేళ నీవిష్ణుకుండి వంశజులు తాము విష్ణుకుండమునుండి యుద్భవించినట్లు చెప్పుకొనవచ్చు"నని వ్రాసిరి. ఈవ్రాత కేమియు నాధారము లేదు. ఇట్టి విపరీతపు వ్యుత్పత్తిగాథను విష్ణుకుండినులు కల్పించుకొనియుండలేదు. విష్ణుకుండి వాస్తవ్యులగుటచేత స్వనగరనామమును వంశనామముగా చేసికొని "విష్ణుకుండివంశమువారైన" అని అర్థమిచ్చు "విష్ణుకుండినాం" అనుపదమును శాసనములందు వాడియుండిరి. లక్ష్మణరావుగారు పొరబడినట్లు 'విష్ణుకుండి' వంశజులు అగ్నికులక్షత్రియులు గారు. వీరు మొదట బ్రాహ్మణులు. తరువాత క్షత్రియులయిపోయిన వాకాటకులతోడి సంబంధమువలన సుక్షత్రియులైరి. మరల కొంత కాలమునకు హిరణ్యగర్భప్రసూతులై, బ్రహ్మణ్యత్వమును సంపాదించుకొని బ్రాహ్మణసము లయిరి. మొదట అగ్నిష్టోమాదిసహస్రక్రతువులను చేసిరి. రెండవమాధవవర్మ ఈపూరుశాసనమునందు క్షత్రియులు నిస్సారముగా జూడబడినట్లు దేవవర్మ కుపయోగింపబడిన "క్షత్రియావస్కంద ప్రవర్తితాప్రతిమ విఖ్యాతపరాక్రమస్య" యను విశేషణము సూచించుచున్నది. విష్ణుకుండిను లెక్కడను తమ గోత్రమునుగాని, వ్యుత్పత్తికథను గాని తెలుపుకొనియుండలేదు. అట్టియెడ లక్ష్మణరావుగారు

౧. నేను ఫ్లీటుపండితుడు చేసిన కాలనిర్ణయమును అంగీకరించుటలేదు. ఆంధ్రుల చరిత్రలోని చాళుక్యయుగమునుగూర్చి యొకగ్రంథమును వ్రాసితిని. అందు చాళుక్యుల కాలనిర్ణయమునుగూర్చి ప్రథమప్రకరణమున విపులముగ చర్చించితిని. అందుకుబ్జవిష్ణువర్ధనుడు క్రీ.శ. ౬౨౪ వ సంవత్సరమున వేంగీమహీరాజ్యమునకు అభిషిక్తుడయ్యెనని నిర్ధారణచేసితిని.

౨. Ep. Ind. Vol. 1V. p. 195.




౧. పాతకోట-ఢిల్లీ

దీనిని క్రీ. పూ. ౧౪౩౦ సం. న పాండవాగ్రజు డగు ధర్మరాజు కట్టించెనని ప్రతీతి. ౧౫౪౦ క్రీ. శ. సం.న హుమయూను దీనిని మరమ్మతు చేయించెను. షెర్‌షా కట్టించిన మసీదుకూడ ఇందు కలదు.



౨. షెర్‌షా మసీదు-ఢిల్లీ పాతకోటలో



షెర్‌షా దీనిని ౧౫౪౧ సం. న కట్టించినాడు.

R. N. N. R.

విపరీతపుటూహలు చేసి 'విష్ణుకుండి' గోత్రనామమైయుండవచ్చునని యూహించుట పొరబాటు. విష్ణుకుండిగోత్ర మేప్రవరకాండయందును, వారే యనినట్లు, గానరాదు. వినుకొండకు సమీపముగా నున్న శ్రీపర్వతము వారి కులదైవతమునకు నిలయము. దానికే నాగార్జునకొండయని పేరు. ఈ యూహ యిటీవల దొరికిన నాగార్జునకొండశాసనములబట్టి నిర్ధారణ మగుచున్నది.౧ శ్రీపర్వతమును, శ్రీశైలమును ఒక్కటి గావు. అవి వేర్వేరు పర్వతములు. రెంటింటికిని నడుమ ఎనభయిమైళ్లదూర మున్నది. శ్రీపర్వతస్వామి ఎవరో ఇంకను నిర్ణీతముకా లేదు.

విష్ణుకుండినులకు బూర్వ మీప్రాంతమును ఇఖాకు వంశీయులు పరిపాలించిరి. వారు శ్రీపర్వతస్వామి పాదానుధ్యాతుల మని చెప్పుకొన లేదు గాని వారి శాసనములందు వారు బ్రాహ్మణోచితములయిన అగ్నిహోత్ర, అగ్నిష్టోమ, వాజపేయ, అశ్వమేధాది వేదోక్తములయిన క్రతువులు చేసిన విషయములు గానవచ్చుచున్నవి. ఇఖాకు (ఇక్ష్వాకు) కులజుల పరిపాలనమున మొదట అభివృద్ధికివచ్చిన విష్ణుకుండి వంశజులు తమ ప్రాత యేలికల వంశమర్యాదలనే అనుకరించి యుందురు. ఇఖాకులవలె విష్ణుకుండినులు బుద్ధభగవానునే అర్చించియుందురు. ఆనాటికి బౌద్ధ, బ్రాహ్మణులు ప్రభువులయి, ఏలికలయినపుడు వారు పునరుద్ధారణము నొందిన వేదోక్తములయిన క్రతువులను కాలానుసరణముగా నాచరించి యుందురు. బ్రాహ్మణ ధర్మమును, వేదోక్త కర్మలును దేశమునందు ప్రబలినతరువాత శ్రీ పర్వతస్వామి భగవాను డయిన బుద్ధుడు మహాదేవుడై శివు డయినాడు. బ్రాహ్మణమతావలంబను లయిన విష్ణుకుండినులు అచిరకాలమున వేదవిహితమైన బ్రాహ్మణధర్మము నంగీకరించి క్రమసహస్రములను ఆచరించిరి.

విష్ణుకుండినుల శాసనములందు వారికాలమునాటి రాజ్యాంగవిధానమును దెలుపు పదములు గొన్ని గానవచ్చుచున్నవి. ఈపదములు తొలుత మాధవ మాధవవర్మ ఈపూరు, పొలమూరుశాసనములందు గానబడుచున్నవి; కావున విష్ణుకుండినుల రాజ్యాంగము ఆమహారాజు కాలమునాటికి పరిణతి నొందినట్లు ఊహింపవచ్చును. ఈపూరుశాసనమునందు దానము "సర్వరాజపురుషైః పరిహర్తవ్యః; పాలయితవ్యః" అని యున్నది. ఆప్రాంతమం దుండు రాజపురుషు లాదానము సర్వకరవివర్జితముగా నొసగబడిన దని యెరిగి, యావిధముగా పాలింపవలయునని యావాక్యముల కర్థము. రాజకార్యములను నిర్వహించువారు రాజపురుషులు. వా రెవ్వరో తెలుసుకొనుటకు పొలమూరుశాసనము తోడ్పడుచున్నది. అందు "...... విషయే, విషయ మహత్తరాన్, అధికార పురుషాంశ్చ ఇదు మర్థ మాజ్ఞాపయతి"; ఆవిషయమం దున్న విషయ మహత్తరులను, అధికారపురుషులను మహారాజు ఆజ్ఞాపించుచున్నాడు. ఈవిషయమహత్తరులును అధికార పురుషులు నెవరు? మహత్తరశబ్దమురామాయణమునందుకూడ "గ్రామఘోష మహత్తరాః" అని కానవచ్చుచున్నది. దానికివ్యాఖ్యాత గోవిందరాజు "గ్రామే, ఘోషే చ వర్తమానా మహత్తరాః" అని విశదీకరించి, "మహత్తరాః" అనగా నక్కడ ప్రధానభూతులయినవా రని అర్థమిచ్చినాడు.౨ కావున మహత్తరు లనగా నచ్చట, నప్పటికి ప్రధానపురుషులుగా ప్రజలచేనెన్నుకొనబడినవారుగాని, మహారాజుచే నియోగింపబడినవా రనిగాని అర్థము చెప్పవచ్చును. ప్రకృతమందు "విషయమహత్తరాః" అను పదమునకు "ఆవిషయమునందు మహారాజుచే నియోగింపబడిన ప్రధాని," అని అన్వయము చేసుకొనవలయును. దామోదరపుర తామ్రశాసనమునందు "మహత్తరులు", "అష్టకుల అధికరణము" మొదలయినవారు పేర్కొనబడిరి.౩ అధికరణము లచ్చట భూముల వృత్తిని తరములను నిర్ణయించి, వాటిపై చెల్లవలసిన కరముల (పన్నుల) నేర్పరిచి విషయాధ్యక్షునకు నివేదింపవలసిన బాధ్యతగల రాజపురుషు లయియున్నారు. అట్టివారిపై

౧. Ep. Ind. Vol XXI. pp. 1-26.
౨. K.P. Jayaswal: Hindu Polity, p. 105.
౩. Ep. Ind. Vol. XV. p 36.

యధికారముగల మహత్తరులు ప్రధానులు గ్రామమున కొక్క రుందురు. ఈమహత్తరులు గ్రామములందు చెల్లవలసిన భూమిపన్నులు మొదలయిన సర్వకరములను పరిగ్రహించి రాజకోశమునకు బంపవలసిన బాధ్యతగల రాజపురుషులు. ఇట్టి నియోగముగలవారు గావున సర్వ కరపరిహారముగా నొసర్పబడి దానముచేయబడిన పొలమూరు అగ్రహారమును, అగ్రహారములను పాలింపవలసిన రీతిగా పాలించుటకు విషయమహత్తరులను అధికార పురుషులను మహారాజుచే నావిధముగా నాజ్ఞాపింపబడిరి. అధికారపురుషు లనగా మహత్తరులక్రింది యధికారు లనియు, రాజుచే నియోగింపబడినవా రనియు నర్థము చేసుకొనవచ్చును. అయినను ఈ శబ్దార్థము ఇంకను విచారింపవలసి యున్నది. మాధవవర్మ పొలమూరు శాసనమున కాజ్ఞప్తులు "అత్ర హస్తికోశ వీరకోశౌ, మహామాత్ర యోధయోః" అవి చెప్పబడినది. జయసింహుని పొలమూరు శాసనము కూడ "ఆజ్ఞప్తి రత్ర హస్తికోశవీరకోశౌ" అని హస్తికోశ, వీరకోశులు ఉభయులను ఆజ్ఞప్తిగా పేర్కొనుచున్నది. ఈహస్తికోశ, వీరకోశు లుభయులును పృథివీమూలుని గోదావరిశాసనమందుగూడ "సర్వైరేవ పరిపాలనీయో విశేషేణ హస్తికోశ వీరకోశాభ్యాం" అని ఉదాహరింపబడి యున్నారు. పృథివీమూలుని శాసనమునకు అజ్ఞప్తి మహారాజు; అతడే స్వముఖమున తొలుపాకవిషయములోని యావన్మంది రాష్ట్రికూట ప్రముఖులకును తన దానవిషయమును ఆజ్ఞాపించెను. దానమును రాజు పరోక్షమున ఆజ్ఞాపించవలసినపు డాజ్ఞప్తి యుండు ననుట దీనివలన విశదమగుచున్నది. కావున నీ "హస్తికోశ - వీరకోశు" లెవరో ఆరయవలసి యున్నది. లక్ష్మణరావుగారు వీరిని కేవలము సైన్యాధికారు లనుటకు వీలు లేదని భావించినారు.[౧] ఈయూహ సరియైనదిగా తోచుటలేదు. డాక్టరు ఫ్లీటు "వీరిరువురును గజదళమునకును గొప్పపరాక్రమకార్యములకు ప్రఖ్యాతి గన్న వీరనికాయమునకును చెందవలసిన ధనమును జాగ్రతపఱచి, యాదళములకు వినియోగించు నధికారులు" అని వ్యాఖ్యానము చేసినాడు.[౨] అదియును తృప్తికరముగా కన్పడదు. పొలమూరు శాసనమునందలి కడపటిపంక్తులందు "మహా-మాత్రయోధయో స్తేషాం శ్రేయః కీర్తి రిదం మహత్" అనియు, నంతట రెండు పంక్తులావల "ఇత్యేవ ముభయగణౌ స్వీకృత్య పరిపాలయేత్" అని యున్నది. ఈదానమును పరిపాలించు భారము మహామహత్తరులను, యోధులును అయిన హస్తికోశాధ్యక్ష, వీరకోశాధ్యక్షులపై గలదని పైవాక్యములు సూచించుచున్నవి. ఇచ్చట "గణ" శబ్దమును, "కోశ" శబ్దము నొకేయర్థమునందుపయోగింపబడినట్లు తోచును. గణమనగా సాంకేతికార్థమున నొక సైనికనికాయమని చెప్పవలయును. వాచస్పత్యము గణమునకు "౨౭ రథములు ౨౭ గజములు, ౮౧ తురంగములు, ౧౩౫ నుగు పదాతులు కలిసిన సైన్యసమూహము" అని అర్థము చెప్పుచున్నది. విష్ణుకుండినులనాడును తత్పూర్వమును ఆంధ్రరాజుల సేనలందు రథబలము తీసివేయబడియెను. కావున గణమునకు మరియొక అర్థము చెప్పుకొనవలయును. ప్రస్తుతము సాంకేతికార్థమును వదలి ఒక నికాయమని అర్థము చేసుకొందము.

కావున "హస్తికోశ-వీరకోశులు" అను పదములకు గజసాహిణి, దండనాయక అను అర్థములు చెప్పుకొనవలయును. ఒక్క హస్తికోశమందు సాంకేతికార్థమున నెన్నిగజము లుండెనో, ఒక వీరకోశమం దెంతమంది పదాతు లుండిరో తెలుసుకొనుటకిపుడు సాధనములు చాలవు.

ఈ రెండుపదములును వరుసగా మూడుశాసనములందు గానవచ్చుచున్నవి. మూడింటియందును గూడ దాత యుద్ధానంతరముననో, జైత్రయాత్రకై వెడలునప్పుడో దానము నాజ్ఞాపించినట్లు గలదు. పృథివీమూలుని గోదావరిశాసనము యుద్ధానంతర మొసగబడినది. మాధవవర్మ పొలమూరుశాసనము జైత్రయాత్రకు వెడలుచు విజయస్కంధావారమున విడిసినపు డొసగబడినది. జయసింహవల్లభుని పొలమూరిశాసనము యుద్ధానంతరము విజయస్కంధావారమునుండి యాజ్ఞాపింపబడినది. ఈమూడింటియందును సేనానులు ఆజ్ఞప్తులుగా నియమింపబడుచుండుట చూడ తమయాజ్ఞలను పాలించుటకై విషయమహత్తరులు, రాజపురుషులు, అధికారులు మొదలయినవారు భయభక్తులు గలిగి ప్రవర్తించుటకు మహారాజులు సేనలను బంపుచుండిరని యూహింపవచ్చును.

౧. భారతి ప్రమోదూత కార్తికసంచిక.

౨. Jour Bom. Br. R. A. S. Vol. XVI p. 117.

# విష్ణుకుండులకు సమకాలికు లయిన రాజవంశములు ; వారికాలము

| కాలము (క్రీస్తుశకము) | విష్ణుకుండినులు | వాకాటకులు | కదంబులు | పల్లవులు | కళింగగాంగులు | సాలంకాయనులు | వాసిష్ఠీయులు | చాళుక్యులు |
|---|---|---|---|---|---|---|---|---|
| ౩౫౦-౩౭౫ | | పృథివీసేనుడు (౧) | | స్కందవర్మ | | నందివర్మ | | |
| | | రుద్రసేనుడు (౧) | | | | | | |
| ౩౭౫-౪౦౦ | | ప్రభావతీగుప్త మహాదేవి, | కాకుస్థవర్మ | కుమారవిష్ణు (౧) | | చండవర్మ | | |
| | | | శాంతివర్మ | | | | | |
| ౪౦౦-౪౨౫ | మాధవవర్మ (౧) | (దివాకర, దామోదర | మృగేశవర్మ | బుద్ధవర్మ | | నందివర్మ (౨) | | |
| ౪౨౫-౪౫౦ | దేవవర్మ | సేనులు.) ప్రవరసేను | మాంధాతృవర్మ | కుమారవిష్ణు (౨) | | స్కందవర్మ | * | |
| ౪౫౦-౪౭౫ | మాధవవర్మ (౨) | డు (౨) నరేంద్రసేనుడు | రవివర్మ | సింహవర్మ | మితవర్మ | ═══ | గుణవర్మ | |
| ౪౭౫-౫౦౦ | విక్రమేంద్రవర్మ ఇంద్రభట్టారకుడు | పృథివీసేనుడు (౨) (దేవసేనుడు) | హరివర్మ | సింహవిష్ణు (౨) | ఇంద్రవర్మ (౧) | ప్రభాకరుడు | ప్రభంజనవర్మ | |
| ౫౦౦-౫౨౫ | | హరిసేనుడు | కృష్ణవర్మ (౨) | నందివర్మ | హస్తివర్మ | పృథివీమూలుడు | అనంతవర్మ | |
| ౫౨౫-౫౫౦ | రెండవ విక్రమేంద్ర గోవిందవర్మ [వర్మ | | | సింహవర్మ | ఇంద్రవర్మ (౨) | | | పులకేశి (౧) |
| | | | | | | | | కీర్తివర్మ (౧) |
| ౫౫౦-౫౭౫ | మాధవవర్మ (౩) | | | సింహవిష్ణు (౩) | ఇంద్రవర్మ (౩) | | | మంగళేశుడు |
| ౫౭౫-౬౦౦ | మంచన్నభట్టారకు[డు | | | | | | | పులకేశి (౨) |
| ౬౦౦-౬౨౫ | | | | మహేంద్రవర్మ (౧) | | | | కుబ్జవిష్ణువర్ధను[డు |

* పల్లవుల వంశక్రమము ఇంకను తృప్తికరముగా నిర్ణయింపవలసి యున్నది.

# రసాయనశాస్త్రోపోద్ఘాతము

కప్పా ప్రసన్నాంజనేయులు

(తరువాయి)

ప్రాచీనశాస్త్రములయందు మాన (Units) నిర్ణయములను ప్రకృతిసిద్ధములగు పదార్థములచే జేసియున్నారు. దైశికమానములు, కాలమానములు మొదలగువానియం దొక రెప్పపాటునుగాని, యొక వితస్తి (జేన)నిగాని భూమికగా గ్రహించి దానిని శతసహస్రాద్యంశలుగా విభజించి, యిట్టి సూక్ష్మవిభజనచే లభించు దానిని పరమాణువుగా నిర్ణయముచేసి, దానినిబట్టి ద్వ్యణుకత్ర్యణుకాదులను వివేచనచేసియున్నారు. వీనియొక్క యావృత్తిచే నిమిషము, ఘటిక, ముహూర్తము మొదలగు ఉత్తమపరిమాణముల నేర్పాటుచేసిరి.

పాశ్చాత్యప్రపంచమున ప్రప్రథమమున మానములు ప్రకృతిసిద్ధములగు పదార్థములబట్టి, నిర్ణయింపబడలేదు. ప్రామాణికమానములు (Standard Measures) దేశపరిపాలకులచే తమ రాజధానులయందు హిరణ్యాది (Platinum) లోహఖండరూపములుగా నుంచబడియుండెను. వాని యనుకరణములచే దేశమునందు మాన వ్యవహారము ప్రభుత్వపరిశీలనముచే నియమింపబడి సాగుచుండెడిది. ఇట్టిమానములు మొదటితరగతిమానములంతే సరియైనవి (Correct) గావు. ఏలనన నివి శీతోష్ణములచే మార్పుజెందుచుండుటయేకాక దేశోపప్లవములు జరుగునప్పుడు నష్టముకాకుండగల వనునమ్మకము లేదు. అందుచే నాధునికపాశ్చాత్యశాస్త్రజ్ఞు లిటీవల తమ మానముల మొదటిపద్ధతిప్రకారము సంస్కరించుకొనియున్నారు. దైర్ఘ్యమానమును భూమండలముయొక్క మధ్యరేఖనుండి ధ్రువమువరకు గల దూర మనగా భూపరిధియొక్క నాల్గవభాగమున కోటితమాంశముగ గ్రహించి దానిని మీటర్ (Metre) అనియున్నారు. మీటర్ అనగా మానము అనియర్థము; కాన దీనిని మనము మానమనియే వ్యవహరింతము. ఇట్లే భారమానమున నొకఘనశతాంశపరిమాణము (Cubic centimetre) గల జలముయొక్క భారమును వ్యవస్థగా గ్రహించి దానిని గ్రామ్ అనియున్నారు. గ్రామ్ అనగా మాషము; కాన దీనిని మనము మాషశబ్దముచేత నే వ్యవహరింతము.

క్రియామానములు, విద్యున్మానములు మొదలగువానియందు ఆధునికపాశ్చాత్యశాస్త్రజ్ఞు లాయావిషయముల ప్రకటింపజేసిన శాస్త్రజ్ఞునినామము నే గ్రహించిరి. క్రియామానమును జోల్ అనియు, విద్యుద్రాశి (Quantity of electricity) మానమును కోలోంబనియు, విద్యుత్ సత్త్వ (Electro-motive force) మానమును వోల్టుఅనియు, విద్యుత్ప్రవాహమానమును ఆంపియరనియు పిలుచుచున్నారు. తేజోరాశి (Quantity of heat) మానమును కాలరీ యనుచున్నారు. ప్రకృతము మనము వీని కన్నిటికిని తగిన ప్రకృతిసిద్ధపదార్థములతోటి సంబంధముగల నామముల నేర్పాటు చేయుదము. కాలరీయన నుష్ణత యని వ్యుత్పత్త్యర్థము. మనము దీనిని 'మరీచిక' యనగలము. మరీచిక యన నొకఘనశతాంశముపరిమాణముగల జలముయొక్క స్పర్శ (Temperature) నొకమితి (Degree) ప్రమాణము హెచ్చింపగల కిరణమునకు పేరుకాగలదు. కోలోంబనగా $63 \times 10^{17}$ కంజాయముల (Hydrogen ions) యం దుండు విద్యుదావేశము (Electric charge). ఈకోలోంబును మనము 'శంప' యనగలము. శంప యన $63 \times 10^{17}$ కంజాయముల విభజనచే గలుగు మెరుపుతీగకు పేరుకాగలదు. క్షణమున కొక కోలోంబు విద్యుత్తుయొక్క ప్రవాహము ఆంపియ (Ampere) రనబడుచున్నది. దీనిని మనము సరిత్ (ప్రవాహము) అనగలము. క్షణమున కొక శంపవిద్యుత్తును ప్రవహింప

జేయు విద్యుత్ప్రవాహ మొక సరి త్తనబడును. ఒక సరిత్తుప్రవాహమును వహింపజేయు ప్రవాహముయొక్క ఆయవ్యయధ్రువముల (Positive & Negative poles) యొక్క విద్యుత్స్థాయుల (Potentials) భేదము వోల్టనబడుచున్నది. ఈవోల్టును మనము 'సత్త్వము' అనగలము. (సత్త్వమన హెచ్చుస్థాయిచే గలుగు బలము). ఇతరమానముల సంజ్ఞ లుత్తరగ్రంథము నందు తెలియజేయబడగలవు.

ఇంతవరకు రసాయనశాస్త్రముయొక్క తర్జుమా సౌకర్యములనుగురించి విచారించియుంటిమి. ఇకమీద సృష్టిపరిణామముచివయమున ప్రాచ్యప్రతీచ్యపండితుల యొక్క విచారణలయందలి సారూప్యవైరూప్యములను కొంతవరకు విచారింతము.

ప్రతిచేతనమునకును ప్రకృతిపరిశీలనయందు శ్రద్ధ సహజము. ఇట్టిపరిశీలనచే ననుక్షణమును ప్రతిజీవియు తన జ్ఞానసంచయమునకు క్రొత్తక్రొత్తవిషయములను జేర్చుకొనుచున్నది. ఇట్టిజ్ఞానములే మహాపురుషులచే ననుగతములుగా జేయబడి లేఖోపలేఖనముచే సంగ్రహింపబడి శాస్త్రము లగుచున్నవి. ఒక్కొక్కవిషయమున నానాజీవులయొక్క పరిశీలనపద్ధతులు వేఱువేఱుగుచున్నవి. పాశ్చాత్యశాస్త్రజ్ఞులకును, మన పూర్వులకును ప్రకృతిపరిశీలనయందు చాలాభేదము కలిగెను. మనపూర్వు లందరును సాంఖ్యబౌద్ధవైశేషికాదిభేదములు గలిగియుండియు, పరమప్రాప్యమనునది శాశ్వతసుఖ (మోక్ష) మని సిద్ధాంతీకరించి యది మానసికమగుటచే తదనుగుణమగు పరిశీలనములనే కావించియుండిరి. అందుచే వీరి పరిశ్రమలు మంత్రతంత్రప్రధానము లైయున్నవి. పాశ్చాత్త్యులన్ననో బాహ్యవిషయసంపాదనచేతనే యానందము సాధ్యమనెడి ప్రాకృతానుభవమును ప్రధానముజేసుకొని హెచ్చుగా విషయములందు పరిశ్రమమొనర్చిరి. వీరి ప్రయత్నములు యంత్రతంత్రభూయిష్ఠములు. అట్టిప్రయత్నములచే వారు వెలయించిన శాస్త్రములన్నిటిలో పదార్థములయొక్క తత్త్వమును గ్రహింపబూనుకొన్నది యొక రసాయనశాస్త్రమే. ఈశాస్త్రమునందు తచ్ఛాస్త్రప్రవర్తకులు ప్రకృతియందలి పదార్థముల నన్నింటిని 92 అసంకీర్ణలక్షణలక్షితములగు తత్త్వములు (Elements)గా నిర్ణయించిరి. అవియు వారి మతప్రకారము తత్తత్పరమాణ్వారబ్ధములు. ఈయారంభకాణువు లవిభాజ్యములు. వాటి నుండియే యేతత్త్వముగాని ప్రారంభమగును. తిరిగి సూక్ష్మవిభాగమువలన నాయణురూపమునే బొందును గాని యంతకంటె సూక్ష్మస్థితి నెప్పుడును (రసాయన ప్రక్రియలందు) జెందదు. ఈవాదమును డాల్టన్ అను నాతడు ప్రథమమున నణువాద మను పేరుతో ప్రచురించెను. మనదేశమునందు నైయాయికులయొక్కయు, వైశేషికులయొక్కయు మతములు దీనితో సరిపోవుచున్నవి. ఆధునికరాసాయనికులు డాల్టన్వాదమును పూర్వపక్షముచేసి యణువులు విభాజ్యములని నిరూపించుచున్నారు. ఆధునికులు నేడు కనుగొనుచున్న విశేషములబట్టి యేర్పడగల రాసాయనికమతము, ప్రాచీన సాంఖ్యవేదాంతమతములతో పోలికగలిగియున్నది. ఈ విషయమును ముందు విపులముగా విచారించగలము.

రాసాయనికులు 92 తత్త్వములని చెప్పిన పదార్థములు ప్రాచీనమతములయందు పేర్కొనబడిన పంచభూతములనెడి యైదుతత్త్వములందే క్లుప్తమగుచున్నవి. పాశ్చాత్త్యసంప్రదాయమున పదార్థములను ముఖ్యముగా రెండువిధములుగా విభజింతురు: స్థాణువు (Matter) లనియు, శక్తు (Energy) లనియు. పైన జెప్పబడిన 92 తత్త్వములును స్థాణువులలోని జాతిభేదములు. శక్తులనగా, విద్యుత్తు (Electricity), అయస్కాంతశక్తి (Magnetism), క్రియాశక్తి (Work), ప్రభ (Light), ఉష్ణత (Heat) యను నైదువిధములు. ప్రాచ్యమతములయం దుష్ణత, ప్రభ యనునవి తేజస్సనెడి యొక ద్రవ్యముయొక్క గుణము లని చెప్పబడియున్నది. వాయువు వీటికంటె సూక్ష్మతత్త్వమని వీరి యభిప్రాయము. పాశ్చాత్త్యమతము ప్రకారము వాయువు బరువుగల స్థాణువు. మఱియు నాకాశము శూన్యరూపమైనది. ప్రాచీనమతములయం దాకాశము శబ్దమనెడు గుణమున కాశ్రయమగు ద్రవ్యము. రాసాయనికమతమున నహంకార, మహ, ద్దవ్య

క్తము లనెడు సూక్ష్మతత్త్వము లతిరిక్తపదార్థములుగా గుర్తింపబడుటలేదు. ఈపక్షములయందలి సాధుత్వాసాధుత్వములను ముందు విచారింతము.

డాల్టన్ తరువాత నణువాదమును కొంతసంస్కరించినది అవగాడ్రోయనునాతడు. ఇతడు పుంజవాదమనుపేర క్రొత్తవాదమును ప్రతిపాదించెను. మషీకమును (Carbon), పెనసళ్లలో లేఖకపదార్థముగా వాడబడు గ్రాఫైట్ అనబడు పదార్థమును, రత్నమును, ప్రథమపరిశీలనమున భిన్నతత్త్వములుగా దోచును. వాని గుణములయం దేమాత్రమును సామ్యములేకుండుట సర్వానుభవసిద్ధముగదా! వీనిని ప్రాణవాయువుతో గలిపి కాల్చుటచే నొకేవిధమగు మషీద్విప్రాణీయ ($CO_2$) మనెడి బొగ్గుపులుసువాయువు నిష్పన్నమగుచున్నది. అందుచే నీపదార్థములు మూడును నొకేప్రకృతిగలవని నిర్ణయమగుచున్నది. మూడు నొకేప్రకృతిచే ఆరబ్ధములైనచో మషీక మంతకాంతిహీనముగను, రత్న మంత కాంతివంతముగ నుండుటకు కారణమేదో యుండవలయునుగదా! ఈవిషయ మవగాడ్రోకు పూర్వమగమ్యముగా నుండెను. అవగాడ్రోయొక్క పుంజవాదముచే నిది సులభముగా సమర్థింపబడినది. పుంజవాదమనగా, ప్రతితత్త్వముయొక్క యణువులును మహత్పరిమాణముగా గూడుటకుపూర్వము రెండేసిగాని, మూడేసిగాని, యంతకంటె ఎక్కువసంఖ్యచొప్పునగాని గూడి యొక్కొక్కపుంజము (Molecule)గా నేర్పడును. ఈపుంజములయొక్క కూడికచే మహత్పరిమాణ మేర్పడుచున్నది. అందుచే రెండుపదార్థములొకేతత్త్వపు అణువులుగలవైనను, వానియొక్క పుంజములం దుండెడి యణువులసంఖ్య భిన్నమగుటచే భిన్నగుణములుగల వగుచున్నవి. ప్రకృతము మషీకమును, లేఖినీమషీకమును, రత్నమును ఒకేమషీతత్త్వముగలవైనను, వాని యారంభకపుంజములయందలి మషీకాణువుల సంఖ్య వేఱువేఱుగా నున్నది. ఈభేదమే యాపదార్థముల గుణభేదమునకు కారణము. డాల్టన్ అవగాడ్రోలయొక్క వాదములచే పాశ్చాత్యరాసాయనికుల ప్రయోగములయం దుద్భవించిన చిక్కులన్నియు విడిపోయెను; కాన నెవ్వరును వారిని పూర్వపక్షము చేసియుండలేదు.

ఈసందర్భమున పాశ్చాత్యప్రాచ్యప్రజ్ఞలకు గల స్ఫుటమగు తారతమ్య మొకటి ప్రకటమగుచున్నది. పాశ్చాత్యశ్రద్ధ సహజముగ విషయాభిముఖము. విషయముల వృద్ధిపరచుటకొరకే పాశ్చాత్యశాస్త్రజ్ఞుడు విచారించుచుండును. ఆతని ప్రవృత్తి యేయానయంత్రమును నిర్మింతుమా, యేవాయుగామినిని వెలయింపజేతుమా, యేజలాంతర్గామినిని సృష్టింతుమా, యేవినూత్నవార్తాహారిణీవిశేషమును కనుగొందుమా యనియుండును గాని యింతవరకు ప్రబలియున్న మతసిద్ధాంతము లెవ్వి? వానిని పూర్వపక్షముచేసి రీత్యంతరముల ప్రతిపాదన జేయ సాధ్యమగునా లేదా యని బుద్ధిపరిశ్రమ జేయుటకు బూనుకొనదు. అందుచే అవగాడ్రోయొక్క పుంజవాదమున నొక్కరైన నొకవికల్పమునైన నూహించియుండలేదు. ప్రాచీనుల శ్రద్ధ సహజముగ నంతర్ముఖమైనది. ప్రాచీనశాస్త్రజ్ఞుడు తన సిద్ధాంతముల సదా మననముజేయుచు, వానియం దేదేని వికల్పము తోచిన దాని సమర్థించుటకై యుక్తుల నన్వేషించుచు బుద్ధిపరిశ్రమచే నానందముబొందుచుండును. సాంఖ్యులు ప్రకృతిపరిణామమును కొన్నియుపపత్తులచే సమర్థించి దాన ననంతములగు వికల్పములజేసి నైయాయికు లారంభవాదమును, వైశేషికు లారంభవాదమును, సౌగతులు మరియొకవాదమును, మరియు మీమాంసక, వేదాంత్యద్వైతాచార్యాదిభేదములచే ననేకవాదముల వెలయించియున్నారు. ఈవాదములయం దుపవాదభేదములు లెక్కకుమీఱియున్నవి.

అవగాడ్రోయొక్క వాదమున వికల్పము నుద్భావనజేయుటకు సాధ్యమగునా యని శంకగలుగవచ్చును. ఇట్టిశంకను తొలగించుటకై సాంఖ్యమతము ననుసరించి పుంజవాదమున నొకపూర్వపక్షమును గావింతము. రత్నమషీకాదులయొక్క గుణభేదమును తుల్యప్రకృతికత్వమును సమర్థించిన పుంజవాదమును మఱికొంత విస్తరించి భిన్నభిన్నతత్త్వములు (elements) గా గ్రహింపబడు పదార్థములయొక్క యణువులు సూక్ష్మతమము లగు

పరమపరమాణువులచే నారబ్ధములనియు, తత్త్వముల యందలి భేదము వాని యణువులయందున్న యొకేజాతి పరమపరమాణువుల సంఖ్యాభేదముచేత గలుగుచున్న దనియు, నూపపాదముచుచుండు 92 తత్త్వముల నేల నంగీకరింపవలయును? ఈవిధముగ నవగాడ్రోయొక్క సమకాలీను లెవ్వరును ప్రశ్నించియుండలేదు. స్వభావముచే పాశ్చాత్త్యప్రతిభ దీర్ఘాలోచనము జేసి సూక్ష్మములను పక్షప్రతిపక్షముల విచారించుటకు బూనుకొనదు. వారి విషయాన్వేషణ శైలియందేదైన పరిస్థితి తమ యూహకు వ్యతిరేకముగా నేర్పడినప్పుడుమాత్రమే వారావిషయమును కొంత విచారించుటకు బూనుకొందురు. అంతవరకు పాశ్చాత్త్యప్రపంచమున నిలిచియున్న సిద్ధాంతములచే క్రొత్తగా వెలసిన విషయ ముపపన్నము గానప్పుడే, వా రొక్కక్షణము నిలచి యాలోచింతురు. ఇతరపరిస్థితులయందు కేవలవిచారణలు చేయుటకు వారికి తీరికలేదు. అవగాడ్రోయైనను పుంజవాదమును స్వతంత్రముగ నాలోచనజేసియుండలేదు. గేలుసాక్ అనుశాస్త్రజ్ఞుడు కొన్ని సమీరపరిశోధనలు (Experiments with gases) చేయగా వాని ఫలితములు డాల్టన్ న్యాయములకు వ్యతిరేకముగ గాన్పించెను. అంత నీరెంటిని సమన్వయముచేయవలసిన సందర్భ మవగాడ్రోయొక్క మననమునకు భూమిక యాయెను. ప్రకృత మవగాడ్రోవాదమున మన మొనర్చిన పూర్వపక్షము నొకయాధునికరాసాయనికునకు తనప్రయోగములయం దచింతితముగా గలిగెను.

ఇటీవల ఒకానొక పాశ్చాత్త్యశాస్త్రజ్ఞుడొక చీకటిగదియం దొకబింబశోధనము (Photo-development) చేయబోగా నాచీకటిగదియందు యాదృచ్ఛికముగా నున్న 'యురేనియమ్' అనుపదార్థము వాని చిత్రములు చెడిపోవుటకు కారణమైనట్లు గ్రహించెను. ఈయురేనియమ్నుండి యేదోయొక సూక్ష్మాతిసూక్ష్మమను పదార్థము ప్రసరించుటచేత తన వ్యతిరేకపటములు (Negative plates) చెడిపోయినట్లతడు కనుగొనెను. పిమ్మట నతని శ్రద్ధ యురేనియమునుండి ప్రసరించుచున్న నూతనపదార్థమువైపునకు మరలింపబడెను. కొంతకాల మతడు పరిశీలించగా బయటికి ప్రసరించుచుండిన పదార్థము విద్యుత్తనియు, విద్యున్నిష్క్రమణానంతరము యురేనియమ్ సీసముగా మారియుండెననియు తెలుసుకొనెను. అంతవరకు యురేనియం రాసాయనికులచే తత్త్వముగా నంగీకరింపబడెడిది; కాని యీక్రొత్త యావిష్కారము వారియందు వాదోపవాదముల గలుగజేసి, క్రొత్తపరిశీలనముల చేయ పురికొల్పెను. పిమ్మట వారు యురేనియమేకాక మరికొన్ని పదార్థములుగూడ నట్లే విద్యుదావిష్కారమొనర్చి తుదకు సీసముగను, మరికొన్ని పదార్థములుగను మారినట్లు తెలిసికొనిరి. ఇటీవలిసంవత్సరములయం దిట్టిపరిశోధనలు చాల హెచ్చుగా జరుగుచున్నవి. వాటి ఫలితాంశములుగ నణువులు విభాజ్యములనియు, అందు శరీరభూతమగు ప్రధానపదార్థము ప్రొటానులనబడు ఆయవిద్యుత్తుచే నేర్పడుననియు అంగభూతమగునట్టి యప్రధానపదార్థము ఎలెక్ట్రానులనబడు వ్యయవిద్యుత్తుచే నేర్పడుననియు, రాసాయనికప్రక్రియలందు గలుగు తేజఃపరివర్తనములకు కారణము వ్యయాయముల వ్యత్యాసమనియు నిర్ణయించుచున్నారు. ఈనిర్ణయములచే స్థాణుశక్తిరూపము పదార్థమునకంతకు నుపాదానమగు పదార్థ మొక్కటియేయని తెలియుచున్నది. మరియు నీసిద్ధాంతము ప్రాచీనసాంఖ్యవేదాంతసిద్ధాంతముల కవిరోధముగ నేయున్నది. పైరెండుతంత్రములయందును ప్రపంచపరిణామ మీక్రిందివిధముగ నిరూపింపబడియున్నది.

ప్రపంచపరిణామమునకు హేతువగునట్టి యుపాదానపదార్థ మొక్కటియే. దీనిని ప్రధాన మందురు. ప్రధానము సత్త్వరజస్తమోభేదములచే మూడువిధములు. కర్మసంస్కారరూపమగు రజస్సుచే ప్రలయస్థాయీభావమున నున్న ప్రధానము సత్త్వతమస్సులుగా విభజింపబడును. విభజింపబడిన సత్త్వతమస్సుల పునస్స్థాయీభావప్రయత్నమందలి సంఘర్షణయే సృష్టమగు ప్రపంచరూపమున వ్యక్తమగుచున్నది. ఈసంఘర్షణలయం దనేకసత్త్వస్థాయులు గల పదార్థము లేర్పడుచున్నవి. సత్త్వస్థాయియొక్క క్రమము ననుసరించి పదార్థముల నీక్రిందివిధముగ విన్యసింపవచ్చును:—

ప్రధానము — మహత్తత్త్వము — మనస్తత్త్వము — ఆకాశము — వాయువు — తేజస్సు — జలము — పృథివి. ఈపదార్థములయొక్క పరస్పరసంయోగవియోగములచే నసంఖ్యాకములగు పదార్థభేదము లేర్పడుచున్నవి.

కొద్దియాలోచనముచే నీవాదములకును రాసాయనికవాదమునకు గల సాదృశ్యము స్ఫుటముకాగలదు. ప్రాచ్యప్రతీచ్యమతముల నీక్రిందివిధమున సమన్వయము చేయ సాధ్యమగుచున్నది. సత్త్వరజస్తమోగుణముల యొక్క వ్యత్యాసముచే గలుగు ప్రధానముయొక్క యగ్రవిభాగమునం డేర్పడు సాత్త్వికాణువులు ఆధునిక రాసాయనికులచే వర్ణింపబడిన ప్రోటానులు, లేక నాయవిద్యుద్రేణువులు; తామసికాణువులు ఎలెక్ట్రానులు, లేక వ్యయవిద్యుద్రేణువులు. దీనియొక్క సంయోగప్రస్తారముచే సమీరప్రవఘునరూపములగు 92 తత్త్వము లేర్పడుచున్నవి.

(సశేషము)

---

## సంప్రార్థనము

పిలకా గణపతి

శుష్కవంశాలవలె శూన్యరక్తమ్ము లౌ,
హతసర్పములవోలె జలనరహితమ్ములౌ
మామంజు హస్తాల వందనములే!
మాజనని!
కర్పూరదీపనీరాజనములు!!

తడుముకొనుమా గ్రుడ్డి తల్లిదండ్రులనెల్ల
పాలకై రక్తాలు కారునట్లేడ్చుమా
పసికందువులను నీపాదాల బడవైచి
కనులు రెండును మూసికొని పోరికేగెదము
నీకంఠమందార రజముతో మానొసట
తిలకమును దిద్దుమమ్మా మాజనని!
దీవించి పంపుమమ్మా!

మాభగ్నఫాలాల బుసబుసని పొంగేటి
రక్తమ్మె నీపాదలాక్షారసమ్ముగా
మామంజుహృదయనాళాలె దీపికలుగా
పూజింపవత్తుమమ్మా! నీపాద
సుమములై పోదుమమ్మా!

మండుటిసుకలలో ముండ్లపాదలెల్ల యీ
భిక్షుకులు సంక్రందపుకరుణ రోదనలతో
గర్భాలయమ్ములో గంటలే మ్రోగ
ద్వారాలపై దలలు మోదికొనుచున్నారు!
ఒకసారి చూడఘావమ్మా మాజననీ!
కరుణ వీక్షింపుమమ్మా!!

# ఆహారశాస్త్రము*

వం. పద్మరాజు

(మొదటిభాగము)

ప్రతిదినమును మనము భుజించు ఆహారమున ఎట్టిగుణము లుండునదియు మన మెరుగము. కాని ఏనాడు ఎవరు పరీక్షించి తెలిపిరో, కొన్నికొన్ని ఆహారద్రవ్యములు మాత్రము మనకు లాభకారులని కొందరందురు. కాకరకాయలో ఇనుము భాగము ఎక్కువ. కనుక దానిని భుజించుటవలన రక్తము పరిశుద్ధము కాగలదని పెద్దలు చెప్పెదరు. అట్లే యితరకూరలు, ఆహారద్రవ్యముల విషయమును. అయితే ప్రతివస్తువు దేహారోగ్యమున కుపకరించినరీతినే యింకొకవిధముగ యపకరించుటయు గలదు. ఒకవైద్యు డొకసారి బజారుకుపోయి తుదకు ఉత్తచేతులతో యింటికి వచ్చెనట. కారణమేమనగా బజారులోని కూరలలో ప్రతియొకటియు, ఏదో ఒకవిధముగ దేహారోగ్యమునకు పనికివచ్చినను మరియొకవిధమున అపకారహేతువగుట నితడు తెలిసి ఒకకూరను సయితము కొనిరాలేదట. ఒకసమయమున అమృతతుల్యమగునది యింకొకసమయమున విషప్రాయము లగుటకు కారణము మనదేహతత్త్వమే. ఒకరికి సరిపోవు నాహారము మరియొకరికి కిట్టదు. దీర్ఘరోగములతో బాధపడువారికి భోజనములో కొంత మార్పు కలిగినంతనే ఆరోగ్యము కలుగుటయు కలదు.

దేహారోగ్యమున కుపకరించు వస్తువులు మనయాహారపదార్థములం దున్నవి. కాని మనదేశములో అందును మనతెలుగుజిల్లాలలోనివారి యాహారమునందు దేహారోగ్యమున కుపకరించు వస్తువులు బహుస్వల్పములుగ నిర్ణయింపబడినవి. ఇట్టివస్తువులలో విటమినులు ప్రధానములు. ఈ విటమినువాదమే సత్యమైనదైనచో మనయాంధ్రజాతి యిప్పటికెపుడో నిర్మూలమై పోయి యుండవలసినదే. ఎందువల్లననగా మనయాహారములందు విటమినులు చాలతక్కువ యని లెక్కలవలన తేలినది. మనము తినెడి బియ్యపుఅన్నమునందు ఈ విటమినులు కడుస్వల్పముగా నున్నవి. ఇంతేకాక మనము కూరలు వండుకొను పద్ధతివలన అందలి విటమినులన్నియు నశించిపోవుచున్నవి. ఇట్లు మనయాహారము సారములేనిదగుటచే మనము దుర్బలులమై ఆరోగ్యవిహీనుల మగుచున్నాము.

మనయాహారముల సత్వములకనుగొనుటకు శాస్త్రవేత్తలు మొదట అట్టి ఆహారములను కోళ్లు, కుందేళ్లు, మేకలు, కుక్కలు, ఎలుకలు మొదలయినవాటికి పెట్టి, ఆయాజంతువులు ఈ ఆహారములను తినుటవలన వాటి యారోగ్యమం దెట్టి మార్పులు గలుగునో అట్టిమార్పులే మనయందును ఆయావస్తువులను భుజించుటవలన కలుగునని నిర్ణయించిరి. మనలో ఒకరిదేహతత్త్వమునకును మరియొకరి దేహతత్త్వమునకును సామ్యములేక ఒకనికి సరిపడు నాహారము మరియొకనికి సరిపడక (అనగా అనారోగ్యము కలుగుట) పోవుచుండ యిట్టి నిర్ణయములు జనసామాన్యమున కంతయు వర్తించునన్నంత మాత్రమున మన మెట్లు విశ్వసింపగలము.

మనము భుజించిన యాహారము జీర్ణమైనతరువాత కొంత రక్తముగ మారును. కొంత కండరములలోనికి పోవును. కొంతభాగము మెదడును చేరును. కొంత భాగము ఎముకలను చేరును. ఇట్లు మనము భుజించెడి యాహారమందలి కొంతభాగము, దేహము పెరిగి, మనము జీవించియుండుటకు సాయపడుచున్నది. కాని సామాన్యులమగు మనకు ఏ ఆహారపదార్థమువలన రక్తమువృద్ధియగునో, ఎట్టివస్తువుల భుజించిన ఎముకలకు బలముకలుగునో అను మొదలగు విషయములు తెలియవు. ఆవిష

---

* ఇది ఆంధ్రసరస్వతీగ్రంథమాల యిరువదిరెండవగ్రంథముగా శ్రీ తేకుమళ్ల రాజగోపాలరావుగారిచే ప్రకటింపబడెను. గ్రంథము క్రౌనుసైజున ౨౮౮ పుటలు గలిగియున్నది. వెల రు. ౧-౮-౦ లు.

యము తెలియకపోయినను మనము భుజించెడి ఆహారము తనపనిని నిర్వర్తించుచునే యున్నది. విటమినులు, ప్రోటీనులు, మొదలగునవి మనయాహారములం దత్యల్పములు కాన మన కనారోగ్యముకలిగి త్వరలో విగతజీవుల మగుదుమా. యను ప్రశ్నకు సమాధానమేమి? మన ఆంధ్రదేశమందందరును కొంచెమించుమించు ఒకరకమయిన ఆహారమునే భుజించుచున్నారు. వారి ఆహారములందలి లోపములవలన ప్రత్యేకము వారికి కలుగుచున్న రోగములెవ్వి? భారతదేశమున మనుష్యుని ఆయుఃపరిమితి దాదాపు ౨౩ సంవత్సరములనియు, పాశ్చాత్యుల ఆయుఃపరిమితి ౪౦ సంవత్సరములకంటె కొంచె మెక్కువయనియు లెక్కలు వేసియున్నారు. ఆయుఃపరిమితిలోని ఈభేదమునకు మనయాహారములు మాత్రమే కారణము లగుచున్నవా? దీనికి ఆహారమే కారణమనుటకు వీలులేదు. ఎందువల్లననగా మనదేశమందలి వివిధప్రాంతములవారు వివిధములయిన ఆహారముల భుజియించుచున్నారు.

ఈ ఆహారశాస్త్రమునందు ఆహారద్రవ్యములవి యెవ్వి, ఏవిధమున మనదేహమున కుపకరించునదియు, ఏ పదార్థమం దేసత్వము ప్రధానమైనదియు, ఆయావస్తువులను మనమెంతమాత్రము భుజింపవలయును అను ఇత్యాదివిషయములు చక్కగ చర్చింపబడియున్నవి. ఇందుకు కావలసిన లెక్కలు సయితమివ్వబడియున్నవి.

మనదేహములందలి జీవోష్ణము (Animal heat) వలన దేహము కృశించిపోయిన దానిని మనము తినెడి ఆహారములవలన పూరించుకొనవలసి యున్నది. మనము ఏపనిచేయక ఊరకయున్నను, దేహమందలి ఉష్ణము వలన శరీరము కృశించిపోవుచునే యున్నది. జ్వరము వచ్చినపుడు మనము చిక్కిపోవుటకు, శరీరమందలి అధికోష్ణమును, కృశించినభాగమును పూరించుటకు తగిన యాహారమును తినకుండుటయు నేకారణములు. కృశించిపోయిన దేహభాగమును పూరించుటకు వలయు ఆహారపదార్థము లెవ్వి? అవి ఏవిధముగ దేహపునర్నిర్మాణమున కుపకరించును, అను మొదలుగాగల విషయములన్నియు ఈ గ్రంథమున బాగుగ విశదీకరింపబడియున్నవి. ఏదేశస్థు డెట్టి యాహారము తిన్నను జీవోష్ణము అందరియందును సమానముగనే యుండును. సామాన్యస్థితియందు ప్రతియొక్కని రక్తతాపము సుమారు ౯౮ f గనే యుండును. ఆహారశాస్త్ర సహాయమున దేహతత్త్వమును తెలిసికొనగలిగినంతలో ఇట్టిస్థితి కేమయిన సమాధానమున్నదా?

మనము భుజించెడి యాహారము జీర్ణమయ్యెడి విధానము సరిగ యిట్టిదని తెలియగలమా? జీర్ణమైన ఆహారము రక్తముగ మారునప్పటి స్థితి యెట్టిది? ఈ విషయములన్నియు మన మెరుగవలసినవే.

ఈ గ్రంథమందు సామాన్యముగ ఆహారద్రవ్యముల స్వభావములన్నియు విపులముగను లెక్కల మూలమునను విశదీకరింపబడియున్నవి. ఇట్టిగ్రంథములకావశ్యకత మెండుగ గలదు. ప్రస్తుతము పాఠశాలలలో, శారీరశాస్త్రము ఆరోగ్యశాస్త్రము మొదలయినవి నిర్బంధపాఠములయి యున్నవి. ఆహారశాస్త్రము వీటికి ఎందును తగ్గినది కాదు. ఆహారశాస్త్రమును 'ప్రత్యేకముగ పాఠశాలలో గరుపవలయును. శారీరశాస్త్రమును చదివినంతమాత్రమున, దానిని చదివినవారి దేహస్థితి చదువనివారి దేహస్థితికన్న బాగుగనున్నదా యనవచ్చును. విషయము తెలిసియుండినయెడల లోపములను సులభముగ గ్రహించి దిద్దుకొనవచ్చును. ఇందువలన మనకు అప్పుడప్పుడు కలుగు చిన్నచిన్న బాధలను వైద్యుని సహాయము లేకనే మనమే కుదుర్చుకొనగలుగుచున్నాము.

సారములేని ఆహారమును భుజించి నానాటికి క్షీణించిపోవుచున్న మనదేశస్థుల కిట్టి గ్రంథములయొక్క ఆవశ్యకతను నిర్ణయించుట సాధ్యముకాదు.

# మనయాహారము

గోటేటి జోగిరాజు

౬

భావసం. శ్రావణమాస సంచికయందు జొన్న, చోడి మొదలగు చిరుధాన్యములయొక్కయు, వరితవుడు గోధుమపొట్టు యొక్కయు ఆహారయోగ్యత చర్చింపబడెను. ఇందు కాయధాన్యముల (పప్పుదినుసుల) యొక్కయు, చముఱుదినుసులయొక్కయు విలువను గూర్చి వ్రాయబడును.

## ౮. కాయధాన్యములు

ఆంధ్రదేశమున విస్తారముగ నాహారముగ నుపయోగింపబడు కాయధాన్యములు కందియు, పెసరయు నైయున్నవి. మినుము వీనివలె నిత్యాహారముగ నుపయోగింపబడకపోయినను, ప్రతిదినము కొద్దిగొప్ప పోపులలో నుపయోగింపబడుటయేకాక, పిండివంటలలో తరుచుగ నుపయోగింపబడును. సెనగకూడ పిండివంటలలో తరుచుగ నుపయోగింపబడుచుండును. దీని యుపయోగము ఉత్తరదేశమున హెచ్చు. అనుమును, బొబ్బరయుకూడ బీదలచే పప్పుదినుసుగ గొంతవరకుపయోగింపబడుచున్నవి: బోడసెనగలు, మిటికలు, యివి రెండును కొన్ని ప్రదేశములందు స్వల్పముగ నుపయోగముననున్న మరిరెండు పప్పుదినుసులు. ఉత్తరహిందూస్థానమున బటానీలుకూడ నుపయోగింపబడుచున్నవి. ఉలవ ప్రధానముగ పశ్వాహారమైనను, మానవులచేగూడ నప్పుడప్పుడు పప్పుదినుసుగ నుపయోగింపబడుట గలదు. సామాన్యముగ కూరకుపయోగింపబడు చిక్కుడుకాయలు ముదిరి యెండినపుడు వానిగింజలుగూడ పప్పుదినుసుగ నుపయోగింపబడుచుండును. ఇటీవల నీదేశమున ప్రవేశపెట్టబడిన సీమ అనుప (Soy bean) గింజలు ఆహారమునకు మిగులయోగ్యముగ నెంచబడుచున్నవి.

ఆయాకాయధాన్యజాతుల సంఘట్టనమును దెలుపు అంకెలు సాధ్యమైనంతవరకు సంగ్రహించి యీప్రక్కపుటలోని పట్టికయందు జూపబడెను.

కాయధాన్యములందు తృణధాన్యములందుకంటె సుమారు రెండుమొదలు రెండున్నర రెట్లవరకు మాంసకృత్తులుగలవు. ఇందువరిబియ్యమునందుకంటెసుమారు ౩,౮ రెట్లు మాంసకృత్తులు గలవు. కర్బనోదజనితములు తృణధాన్యములందుకంటె కొంతతక్కువ. చముఱును సీమ అనుమునందు తప్ప తక్కిన వానిలో తక్కువయే. మొత్తపుయింధనశక్తి తృణధాన్యములందుకంటె నూటికి సుమారు ౧౧ వంతులు హెచ్చు. తృణధాన్యములనే తినుచో శరీరమునకు వలయు మాంసకృత్తులు లభింపకపోవుటచే మానవాహారమున పప్పుదినుసులుకూడ తప్పక జేరవలసి యుండును. రెండువంతుల తృణధాన్యముతో నధమమొకవంతయినను పప్పుదినుసును జేర్చుట యవశ్యము.

...

ఆయా కాయధాన్యములలో కంది చాలమందికనుకూలించును. ఇందు మాంసకృత్తులు తక్కినవానిలోకంటె కొంచెము తక్కువ. కొంచెము వేడి చేయును. వరియన్నము దినువారి కింతమాత్రము వేడిచేయు పప్పుదినుసును దినుటమంచిదే. ఆంధ్రదేశమున చాలజిల్లాలలో నిదియే ప్రతిదినము వాడబడుచుండును. కందితరువాత విస్తారముగ వాడబడు పప్పుదినుసు పెసర. ఇది వేడితత్త్వములవారి కుపయోగించును. కందికంటె బలమైనది. జీర్ణశక్తి తక్కువగ గలవారికి సరిపడక పోవచ్చును. తక్కినకాయధాన్యములు కంది, పెసరలవలె నిత్యాహారమున నుపయోగించుటరుదు.

కాయధాన్యములందు మాంసకృత్తుల విలువ వాని మొత్తపు పరిమితినిబట్టియే గాక అందలి ప్రధానమగు మాంసకృత్తు లేక కృత్తులయొక్క స్వభావమునుబట్టి యుండును. మొత్తముమీద కాయధాన్యములందు మాంసకృత్తులు పాలయందును, కోడిగ్రుడ్లయందును గలమాంసకృత్తులంత శ్రేష్ఠములు గావని కనుగొనబడెను. కాయధాన్యములలోనే యీవిషయమై విశేషతారతమ్యములు గలవు. తెల్లయెలుకలపై జరిగిన యొక పరిశోధనలో

## కాయధాన్యముల సంఘట్టనము

| కాయధాన్యజాతి | | మాంస కృత్తులు % | చమురు % | కర్బనోద జనితములు % | నార పదార్థము % | బూడిద % | ఒక ఔన్సు ఇంధనశక్తి కాలరీలు |
|---|---|---|---|---|---|---|---|
| 1. కంది | a | 19.54 | 1.49 | 68 27 | 6.43 | 4.23 | 102 |
| 2. పెసర | a | 23.67 | 1.19 | 63.48 | 4.24 | 4.59 | 105 |
| 3. ,, | b | 28.00 | 1.69 | 60.36 | 4.74 | 4.29 | 106 |
| 4. ,, (పచ్చపెసర) | c | 24.88 | 3.03 | 60.54 | 6.50 | 4.93 | 107 |
| 5. ,,(బంగారుపెసర) | c | 26.86 | 2 26 | 61.85 | 4.77 | 4.29 | 06 |
| 6. మినుము | a | 25 25 | 2.45 | 62.07 | 5.34 | 4.89 | 105 |
| 7. ,, | d | 26.63 | 1.19 | 63.33 | 4.23 | 4.59 | 107 |
| 8. సెనగ | a | 20.01 | 4.77 | 64.35 | 7.11 | 3.50 | 110 |
| 9. అనుము | a | 23.36 | 1.37 | 62.61 | 7.19 | 4.69 | 103 |
| 10. సీమఅనుము (Soybeans) | e | 32.00 | 15.67 | 31.67 | ? | ? | 119 |
| కాయధాన్యముల సగటు (మొదట 9-టికి మాత్రము) | | 24.24 | 2.17 | 63.32 | 5.62 | 4.41 | 106 |
| తృణధాన్యముల సగటు | | 10.71 | 4.18 | 75.63 | 5.47 | 4.15 | 96 |
| బియ్యము (వరి)4 3 రకముల సగటు | | 1.12 | 8.50 | 83.87 | 0.37 | 1.11 | 100 |

మొదటి 9 జాతుల విషయమునను 2, 6 కలములలోని యంకెలు తేమను మినహాయించి లెక్కగట్టబడినవి. 7-వ కలములోని యంకెలు నూటికి 10 వంతుల తేమగల దినుసుపైన లెక్కగట్టబడినవి.

నాయా కాయధాన్యములందలి మాంసకృత్తుల విలువయందీక్రింది తారతమ్యములు గనుగొనబడెను: *

| కాయ ధాన్యము | అందలిమాంస కృత్తుల విలువ | కాయ ధాన్యము | అందలిమాంస కృత్తుల విలువ |
|---|---|---|---|
| సెనగ | ౭౮ | బటానీ | ౬౨ |
| కంది | ౭౪ | మినుము | ౬౦ |
| బొబ్బర | ౭౨ | మెటికలు | ౫౭ |
| ఉలవ | ౬౭ | అనుము | ౫౭ |
| పెసర | ౬౪ | | |

బటానీలయందలి మాంసకృత్తులవిలువను పాలు, మాంసము, మొదలగువానియందలి మాంసకృత్తుల విలువతో పోల్చిచూచుటకు జరుపబడిన మరియొక ప్రయోగమున నీక్రింది తారతమ్యములు కనిపెట్టబడెను.†

| ఆహారపు వస్తువు | అందలిమాంస కృత్తులవిలువ | ఆహారపు వస్తువు | అందలిమాంస కృత్తుల విలువ |
|---|---|---|---|
| ఎద్దుమాంసము | ౧౦౪ | బంగాళాదుంప | ౭౯ |
| ఆవుపాలు | ౧౦౦ | మట్టుబచ్చలి (Spinach) | ౬౪ |

a. Woods facts and figures.

b. Yu-Indian jour. of Agric. Science Vol. II part VI.

c. Church.

d. Leather.

e. Food by Robert mc Carrison.

* S. P. Niyogi-Paper read at the India Science Congress 1932 Abstract No. 27.

† Thomas (1909) Queensland Agrl. Journal 1st Jan 1931 p. 389.

| | | | |
|---|---|---|---|
| చేపలు | ౯౫ | బటానీలు | ౭౬ |
| బియ్యము(వరి) | ౭౭ | గోధుమపిండి | ౪౦ |
| పూగోచి(Cauliflower) | ౭౪ | మొక్కజొన్న | ౩౫ |

పై యంకెలను బట్టి చూచినచో మాంసాహారమునందును, పాలయందును గల మాంసకృత్తులు సులభముగ వంటబట్టు నని తేలును. మాంసాహారమును దిననివారు, పాలును, కంది మొదలగు నిలువయయిన మాంసకృత్తులు గల పప్పుదినుసులను దిని తమకు వలయు మాంసకృత్తును సంపాదించుకొనవచ్చును. సీమఅనుములోని మాంసకృత్తులు కూడ మానవశరీరమున కనుకూలమయినవని యిటీవల కనుగొనబడెను. వీనిలో కొన్నిరకము లిపుడు అనకాపల్లి, చామర్లకోట మొదలగు వ్యవసాయస్థానములందు పరీక్షింపబడుచున్నవి. పప్పుదినుసులు మాంసకృత్తులను మెండుగ నొసగుటయేగాక ఖనిజద్రవ్యములనుగూడ విస్తారముగ నొసగును. ఈదేశమున పండింపబడుచున్న జాతులందలి ఖనిజముల విలువ నింకను ఎవరును నిర్ణయించి నట్లులేదు. ఇతరదేశములందు జరిగిన నిర్ణయములనుబట్టి యీక్రిందియంకెలు లెక్కించి వ్రాయబడెను:

ఒక ఔన్సులోని ముఖ్యఖనిజద్రవ్యములు
౧౦౦ పౌనుల తూనికగల

| పప్పుదినుసు | మనుష్యునికి వలయు పరిమితిలో నూటికి - పాళ్లు | | |
|---|---|---|---|
| | సున్నము | స్ఫురము | ఇనుము |
| ౧ పటానీలు (Peas) | ౪.౯ | ౧౧.౨ | ౧౩.౮ |
| ౨. చిక్కుడుగింజలు(Beans) | ౯.౮ | ౧౪.౧ | ౧౭.౫ |
| ౩. మసురిపప్పు(Lentils) | ౬.౪ | ౧౩.౩ | ౨౩.౧ |
| ౪. లైమాచిక్కుడు (Lima bean) | ౪.౨ | ౧౦.౨ | ౧౭.౭ |
| సగటు | ౬.౩ | ౧౨.౩ | ౧౭.౫ |
| ౫. గోధుమ | ౩.౭ | ౯.౧ | ౯ ౧ |
| ౬. వరి (బియ్యము) | ౦.౬ | ౬.౩ | ౫.౫ |
| ౭. ఆవుపాలు | ౬.౨ | ౨.౪ | ౦.౫ |

ఈదేశపు పప్పుదినుసులలో కూడ ఖనిజద్రవ్యములు పైపట్టికయందలి సగటు ననుసరించి యుండవచ్చునని యూహింపదగియున్నది. కావున పప్పుదినుసులను మాంసకృత్తులనిమిత్తమేగాక, ఖనిజద్రవ్యముల నిమిత్తము (ముఖ్యముగ స్ఫురము, ఇనుము-వీని నిమిత్తము) కూడ తినవలసియుండును. ఇందులకు వీనిని సాధ్యమైనంతవరకు పొట్టుతోనే తినుట మంచిది. సీమ అనుములో సున్నముకూడ హెచ్చుగనుండునని యిటీవల కనిపెట్టబడెను.

పప్పుదినుసులలో విటమిను A స్వల్పముగను, విటమిను B మధ్యమ పరిమితిగను నుండును. విటమిను C శూన్యము. కాని గింజలను మొలకట్టి తినుచో అందీ లోటుగనున్న విటమిను కూడ పుట్టును. కావున పప్పుదినుసులను వండితినుటకంటె చైతన్యముగల గింజలు మొక్కకట్టి తినుటయే శ్రేష్ఠము. ఇట్లు తినుచో నాహారమున విటమిను C నొసగు పండ్లుగాని, కూరలుగాని తక్కువయినను ఆలోపము చాలవరకు దీరును.

## ౮. చమురుదినుసులు

మానవాహారముగ నుపయోగింపబడు చమురుదినుసులలో నూవులు దక్షిణఇండియాలో ప్రధానమయినవి. ఇటీవల వేరుసెనగకూడ చాలప్రాముఖ్యమునకు వచ్చెను. కొబ్బరతోటలుగలచోట్ల కొబ్బెరకూడ విరివిగ నుపయోగింపబడుచున్నది. దత్తమండలములందు కొన్నిచోట్ల కుసుంబాలును, గంజాం విశాఖపట్నం ఏజన్సీలలో వలిసెలును కూడ నుపయోగింపబడుచున్నవి. లభించుచోట్ల జీడిపప్పుకూడ కొంత తినబడుచున్నది. ఉత్తరహిందూస్థానీలు ఆవాలుకూడ చాలవిరివిగ నుపయోగించుచున్నారు. యూరపుఖండమందు ఆలివ్ నూనె ప్రశస్తముగ నెంచబడుచున్నది. సీమబాదంగింజలను ధనికు లుపయోగించుచున్నారు.

వెన్నయు, నేయియు జంతుసంబంధ మయిన చమురుదినుసులు. వీనినిగురించి పాలు, పెరుగు వగైరా శీర్షిక క్రింద చర్చింపబడును.

ఈక్రిందిపట్టికయందు లభించినంతవరకు కొన్ని చమురుదినుసుల సంఘట్టనము తెలుపబడెను.

| దినుసు | | 1 ఔన్సులో గల మాంసకృత్తులు (గ్రాములు) | చమురు (గ్రాములు) | కర్బనోదజనితములు (గ్రాములు) | ఇంధనశక్తి (కాలరీలు) | ఒక ఔన్సుగల ఖనిజద్రవ్యముల పరిమితి. 100 పౌనుల మనుష్యునికి వలయు పరిమితిలో % సున్నము | స్ఫురము | ఇనుము | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. నూవులు | a | 6.08 | 15.48 | 4.92 | 183 | | | | a. Wood's facts and figures. |
| 2. వేరుసెనగలు | b | 7.80 | 10.92 | 6.90 | 155 | | | | |
| 3. ,, | c | 8.72 | 14.78 | 3.96 | 184 | 4.4 | 12.8 | 5.6 | |
| 4. ,, | a | 9.[illegible]6 | 15.50 | 4.12 | 1[illegible]3 | | | | b. Food by Robert mc Carrison. |
| 5. కొబ్బెర (ఖరిడీ) | | 2.75 | 19.76 | 4.99 | 209 | | | | |
| 6. ,, ముదిరినది | | 1.61 | 14.31 | 7.90 | 167 | | | | |
| 7. ,, సగముముదిరినది | | 1.00 | 8.10 | 4.75 | 96 | 0.4 | 3.0 | 0.3 | c. Food and Nutrition (American Red-cross text book). |
| 8. బాదంగింజలు | b | 5.26 | 15.96 | 4.30 | 182 | | | | |
| 9. ,, | c | 6.50 | 16.8[illegible] | 5.50 | 200 | 11 | 10.8 | 8.0 | |
| 10. జీడిపప్పు | | 5.96 | 18.80 | 1.80 | 2[illegible]0 | | | | |
| 11. కుసుంబా | | 4.28 | 8.6[illegible] | 7.34 | 123 | | | | |

సామాన్యముగ నూవులు, కొబ్బెర, వేరుసెనగ, కుసుంబా మొదలగువానినుండి చమురునుతీసి దానినే వాడుచుందురు. చమురు కర్బనోదజనితములకంటెను, మాంసకృత్తులకంటెను సుమారు ౨¼ రెట్లు హెచ్చు యింధనశక్తి నిచ్చును. ఒకఔన్సుబియ్యము ౯౯ కాలరీల యింధనశక్తినే యొసగగా, ౧ ఔన్సు నూనె సుమారు ౨౫౦ కాలరీల యింధనశక్తి నొసగును. కావున నాహారములో చమురు మిగులబలమైన యాహారము. జీర్ణమగుటయు కష్టము కావున స్వల్పముగనే తీసికొనదగును. విస్తారముగ శరీరపరిశ్రమగలవారికి కడుపు బరువెక్కకుండ వారు చేయుపనికి దగినశక్తి నిచ్చుటకు చమురు మంచిది. అయినను సామాన్యముగ దినమునకు ౨,3 ఔన్సుల చమురునకు మించి యాహారమున జేరుట మంచిదికాదు. ఆహారమునందలి యన్ని పదార్థములందలి చమురుమొత్తమును అందలి కర్బనోదజనితములయొక్క పరిమితిని రెట్టింపుచేసి మాంసకృత్తుల పరిమితిలో సగము కలిపినయెడల వచ్చు మొత్తమును మించకూడదు.

ఆయాదినుసులనుండి తీయు చమురుయొక్క యింధనశక్తి కొంచెమించు సమముగనే యుండును. కాని వాని సంఘట్టనములందు కొన్ని భేదములుండుటచే వానియందు కొన్ని గుణభేదములు గలుగును. సామాన్యముగ గింజలనుండి తీసినచమురు, వెన్న, నేయి వీనియంత యారోగ్యకరముగ నెంచబడుటలేదు. గింజలనుండితీయబడు చమురులలో, నూవులనూనె, కొబ్బెరనూనె ప్రశస్తముగ నెంచబడుచున్నవి. వేరుసెనగనూనె అంత ప్రశస్తముగ నెంచబడుటలేదు. కాని యీవిషయము ఇంకను పరిశోధన జరుగవలసియున్నది. అలవాటు చేసికొనుచో ఏదియు శరీరమున కనుకూలించుననియే చెప్పవచ్చును. కొబ్బరిచెట్లను తాటిచెట్లను

నూవులను, వేరుసెనగగింజలను చెరిసగముగ గలిపితీసిన చమురుగాని, ప్రత్యేకముగ వేరుసెనగ నూనెనే గాని వాడుట కలవాటుపడుచున్నారు.

ఆయాజాతుల చమురును ఆహారమున నుపయోగించుటకు బదులు గింజలనే యుపయోగించుచో నందువలన శరీరమునకు మాంసకృత్తులు కూడ విస్తారముగ లభించును. చమురుగింజలందలి మాంసకృత్తులు, ఆహారపువిలువయందు కాయధాన్యములందలి మాంసకృత్తులకు దీసిపోవును. వేరుసెనగలందలి మాంసకృత్తులుకొన్ని కాయధాన్యములందలి మాంసకృత్తులకంటెను శ్రేష్ఠముగ నెంచబడుచున్నవి. నూవుపప్పును, కొబ్బెరను తరుచు కూరలలోను, ఇతర వంటకములలోను వాడుటగలదు. జీడిపప్పును, బాదంగింజలను తీయని పిండివంటలతో జేర్చుట గలదు. ఇటీవల వేరుసెనగకూడ ఇట్లుకొంతవరకుపయోగింపబడుచున్నది. కొబ్బెరయు, బాదంగింజలను, జీడిపప్పును, వేరుసెనగగింజలను ప్రత్యేకముగ దినవీలగును. కడపటిరెంటిని వేచిన కమ్మగ నుండును. కాని పచ్చివిగ దినుట శ్రేష్ఠము. వేరుసెనగలను మొలకకట్టి తినుట మరింత శ్రేష్ఠము. ఇందువలన నివి సులభముగ జీర్ణమగుటయేగాక నందదివరకు లేనివిటమిను C క్రొత్తగ నుత్పన్నమగును.

చమురుదినుసులు కాయధాన్యములకంటెను, తృణధాన్యములకంటెను సుమారు రెట్టింపుబలము (యింధనశక్తి) గలవగుటచే నవి జీర్ణమగుట కష్టము. మరియు నందు కర్బనోదజనితములు మిసుల తక్కువ. కావున వీనితో తృణధాన్యములను గాని, బెల్లము, చక్కెర, తేనె మొదలగు నితర కర్బనోదజనిత ద్రవ్యములనుగాని చేర్చి పుచ్చుకొనుట మంచిది. బెల్లమును పాకముబట్టి అందు వరి, జొన్న మొదలగువాని పేలాలను, నూవుపప్పు, వేరుసెనగ, కొబ్బెర, జీడిపప్పు మొదలగు చమురు దినుసులను జేర్చి యుండలుచేసి తిను ఆచారము కొన్నిచోట్ల గలదు. ఇది చాలయనుకూలమును, చౌకయునగు నల్పాహారము.

అతిమూత్రవ్యాధిగలవారికి చమురుగింజలు మిసుల ననుకూలమగు నాహారము. చమురుగింజలలో ముఖ్యముగ జీడిపప్పునందు కర్బనోదజనితములు మిసుల తక్కువగను, మాంసకృత్తులును, చమురును హెచ్చుగను నుండుటచే, వీనిని తగుమాత్రముగ కొంత యితరాహారములతోపాటు తిని జీర్ణముచేసికొనగలుగుచో, వైద్యసహాయ మవసరములేకయే యారోగ్యముగ కాలము కడపవచ్చును. ఈ విషయము ముందు విపులముగ జర్చింపబడును.

చమురుతీయగా మిగులు పిష్టమునుకూడ నాహారముగ నుపయోగించుటగలదు. నూవుపిండి, కొబ్బెరపిండి యిట్లు తరుచుగ నుపయోగింపబడుచున్నవి. వేరుసెనగపిండికూడ నిట్లుపయోగింపదగును. వీనిలో చమురు చాలవరకు తీసివేయబడినను, కొంత మిగిలియుండును. మాంసకృత్తులు మెండుగనుండును. కర్బనోదజనితములు తక్కువ. కావున వీనిని మాంసకృత్తులు తక్కువగనున్న యాహారద్రవ్యములతో కలిపితినవలెను. ఈక్రింద ఆయాజాతుల తైలపిష్టముల సంఘటనము తెలుపబడెను.

౧ ఔన్సునందు గల

| జాతి | మాంస కృత్తులు | చమురు | కర్బనోద జనితములు | మొత్తము ఇంధనశక్తి |
|---|---|---|---|---|
| | గ్రాములు | గ్రాములు | గ్రాములు | కాలరీలు |
| నూవుపిండి | ౧౧.౮ | ౩.౦ | ౯.౬ | ౧౧౧ |
| వే. సెనగపిండి | ౧౬.౬ | ౨.౮ | ౭.౬ | ౧౧౫ |
| కొబ్బెరపిండి | ౬.౨ | ౩.౮ | ౧౫.౫ | ౧౧౭ |

## అట్లతద్ది

శ్రీపతి త్ర్యంబకరావు

అది శాస్త్రమనుచు నా యరికాల గోరింటచుక్క బెట్టినయట్టి సొబగులెల్ల
నొండు ప్రక్క బఱుండ నోపమి గూర్కు రా లేదంచు బొంకెడు లీలలెల్ల
*గోంగూర మరచిపోకుమటన్న వేకువ జిరు చపేటములిచ్చు చెలువులెల్ల
నోరగా నుయ్యాలలూగుచు ననుగాంచి చెంగున దుముకు మెరుంగులెల్ల
ప్రేమగలవారి కంటు గోరింటయనుచు - నస్మదంఘ్రి పరీక్షించు నాత్రమెల్ల
గన్నులకు గట్టినట్లుగా గానుపించు - శారదాంగన మాయింటి చక్కి దిరుగ.

---



మదనపల్లి చిత్రాలయము —వాసు.

---

* ఆంధ్రదేశమున కొన్ని జిల్లాలలో గోంగూరపచ్చడి తెల్లవారుజామున విధిగా స్త్రీలు భుజింపకున్న ముసలి మగడు వచ్చునని చెప్పుదురు.

# ఢిల్లీ చిత్రములు



౫. రాజప్రతినిధిభవనము



౬. శాసనసభాభవనము



౮. జంతర్ మంతర్ (నక్షత్ర పరిశోధనశాల)

జయపుర మహారాజు జయసింగు దీనిని కట్టించినాడు. ఇది ఇంకను పాడుకావున్నది. కాని నీడముల్లును, అంశములును గుర్తింపబడు మండలము, కైవారమును పెక్కు నోటుల మెరవలు పడినవి.



౭. కుతుబ్ మినారు

దీనిని కుతుబ్ ఉద్దీను ఐబక్ ౧౨౦౦ సం. న ప్రారంభించెను. అతని తరువాత రాజ్యమునకు వచ్చిన షంస్ ఉద్దీను అల్టామష్ ౧౨౩౦ సం. న ముగించెను. దీని ఎత్తు అ. ౨౩౮, అం. ౧. అడుగున దీనివ్యాసము అ. ౪౭, అం. ౩. పైన అ. ౯. దీనికి ౩౭౯ సోపానము లున్నవి.

R. N. N. R

# వలసరాజ్యములందు భారతీయ శిల్పకళ



తాడిశెట్టి రామారావు

## ౪. శ్యామదేశము

తొలుత శ్యామదేశమున కాంభోజమునందువలె ఖ్మేరులు, టిబెత్తు-చైనాజాతివారు నివసించుచుండిరి. ఈదేశము క్రీస్తు మొదటిశతాబ్దములందు కొంత కాంభోజుల పరిపాలనమునకును, మిగిలినది యితరుల పరిపాలనమునకును లోబడియుండినది. చంపా, కాంభోజముల నాక్రమించిన పిమ్మట కాంభోజముద్వారాను, నావికాయానమువలనను హిందువులు వచ్చి ఇప్పటి శ్యామదేశములో దక్షిణభాగమున నొక ప్రబలమైన హిందూరాజ్యమును స్థాపించి, ముఖ్య పట్టణములుగ సుఖోదయ (సుఖోతాయి), సజ్జనాలయము (సవాన్కాలోకు)లను నిర్మించుకొనిరి. పండ్రెండవ శతాబ్దమున నీరాజ్యము ప్రబలమై, హిందూనాగరికతయొక్క వ్యాప్తికి చేయూతయొసగినది. క్రీ. శ. ౧౨౧౮ లో శ్రీఇంద్రాదిత్యుడు సింహాసనము నధిష్ఠించెను. ఈతనిమూడవపుత్రుడగు రామరాజు ౧౨౮౩ లో రాజయి, శ్యామభాష కక్షరములను గల్పించి, నూతనదేవాలయములను, భవనములను నిర్మించి, రాజ్యమును వ్యాపింపజేసి కీర్తిని గడించెను. ౧౩౪౭ లో సింహాసనము నెక్కిన శ్రీ సూర్యవంశరాముడు మహాపండితుడు. బౌద్ధభిక్షులను, బ్రాహ్మణులను బోషించి, విహారములను, స్తూపములను, ఒకవైష్ణవాలయమును నిర్మింప జేసెను. మహాస్వామి సంఘరాజను బౌద్ధసన్యాసిని సింహళమునుండి మహావైభవముతో రప్పించి, బౌద్ధమతమును స్వీకరించి, యనేకములగు మహాకార్యములను చేసెను. ఈతనికాలముననే అనూరాధపురమునద్ద నున్న మహాబోధివృక్షముయొక్క శాఖను శ్యామదేశమునకు గొనిపోయిరి. ఈతనితో సుఖోదయవంశ మంతమొందినటుల గానవచ్చుచున్నది.

ఈరాజ్యమునకు దక్షిణమున లావాపురి (నవపురి=లాంబూరి) యను మరియొక హిందూరాజ్య ముండినది. ద్వారావతి దీనికి ముఖ్యపట్టణము. కొంతకాలమునకు బహుశః, క్రొత్తవంశమీరాజ్యమున నధికారమునకు వచ్చుటవలన గాబోలును, ద్వారావతి సానోయను మారుపేరుతో పిలువబడుట కలిగినది. ఇంత (౧౨౯౬) లో కాంభోజదేశము తాయి ప్రజల దాడివలన బలహీనమైనది. ఆతరుణముననే సయ్యామసైన్యము కాంభోజులపై దండయాత్రవెడలి, యుద్ధమున జయించి, శ్యామదేశము యొక్క స్వాతంత్ర్యము స్థాపించిరి. ఆనాటినుండియు ద్వారావతి అయోధ్యయను మారుపేరుతో విరాజిల్లినది.

అయోధ్యకు మొదటిరాజగు రామాధిపతి సువర్ణదోలుడు ౧౩౫౦ లో సింహాసనము నధిష్ఠించి యనేకములగు భవనములను, దేవాలయములను నిర్మింపజేసెను. ఈవంశజులు తాయిసంతతివారైనను హిందూత్వమును పూర్తిగ స్వీకరించుటచే దేశమంతయు హిందూరాజ్యముగ మారిపోయినది. ౧౩౬౦ లో రాజ్యాధికారమును వహించిన మహానాయక పరమరాజాధిరాజు బౌద్ధమతావలంబకుడై యుండినటుల శిలాశాసనములవలన దెలియుచున్నది. ౧౩౯౮ లో రాజైన రామరాజు బౌద్ధదేవాలయమును నిర్మింపజేసి యందు కంచు బుద్ధవిగ్రహమును ప్రతిష్ఠచేసి, చైత్యగృహమును, పుస్తకభాండాగార

మును సన్యాసుల సౌకర్యముకొరకు ప్రసాదించెను. వర ఫీరరాజు ౧౭౮౨ లో సింహాసనమునకు వచ్చినవెంటనే బర్మారాజు దేశముపైకి దండెత్తివచ్చెను. నాటినుండియు శ్యామదేశప్రతిభ తగ్గుటయును, ౧౭౬౭ లో అయోధ్యను బర్మాసైన్యము నాశనము చేయుటయు కలిగినది. కాని శ్యామదేశముయొక్క స్వాతంత్ర్యమునకు భంగము కలుగలేదు ఆసిమ్మట బేంకాంగు రాజనివాసమై యిప్పటికిని సయాముయొక్క ముఖ్యనగరముగ నున్నది.

హిందూరాజ్యములై యుండిన చంపా, కాంభోజములనుండి మొదట హైందవు లిచ్చటికి వచ్చిరి. కనుక సయాముప్రజలు బౌద్ధమతమును కాక హిందూమతమునే తొలుత స్వీకరించిరని చెప్పవచ్చును. సయాము చరిత్రమును, ఆచారములును ఈవాదమును బలపరచుచున్నవి. అచ్చటి రాజులందరును హిందూనామములను వాల్చి; హిందువులవేల్పులకనేకములగు దేవాలయములను నిర్మింపజేసిరి. ఇప్పటికి బేంకాంగునందొక దేవాలయము నాశ్రయించుకొని ఎనుబదిమంది బ్రాహ్మణులు నివసించుచున్నారు. సయాముదాజదర్బారున ఉత్సవములందు వీరు ప్రాముఖ్యమును వహించుచుందురు. శుభముహూర్తములను వీరే నిర్ణయించుచుందురు. నూతననగరములకు, దేవాలయములకు, రాజగృహమందు జన్మించినవారికి సంస్కృతనామముల నిడుచుందురు. "రెక్నా" అను హోలికోత్సవమును, "తిబ్‌చిన్‌చా" అను డోలికోత్సవమును, "లోయికదాంగ్" అను దీపోత్సవమును వీ రిప్పటికిని జేయుచుందురు. సయాముదాజుల యిలవేల్పుయొక్క దేవాలయకుడ్యములపై రామాయణకథ మలచబడియున్నది. నేడును శిల్పులు యముని, సూర్యుని, యింద్రుని విగ్రహములను నిర్మించుచుందురు.

కాని ప్రజ లిప్పుడు బౌద్ధమతావలంబకులు. సుమారు లక్షమంది బౌద్ధభిక్షులచ్చట కలరని యంచనా వేయబడినది. కాంభోజమునుండి క్రీ. శ. ౭౨౨ లో నీ మత మిచ్చట ప్రవేశపెట్టబడినను, తరువాత చాలకాలమువరకు విశేషముగ నాదరమునకు రాక, తుదకు సూర్యవంశరాముని కాలమున జాతీయమతము కాగలిగినది. సయామునందలి బౌద్ధమతమున హిందూమత సంప్రదాయములు విశేషముగ గలవు. ఈ మార్పులతో భారతీయ నాగరకత యాదేశమున నిప్పటికిని నిలిచియున్నది.

కాన సయామునందు కానవచ్చు హిందూబౌద్ధమతములకు జెందిన పురాతన నిర్మాణము లన్నియు హిందూశిల్పరచన ననుకరించుచున్నవి. కానురాను దేశీయుల రుచులందు కలిగిన మార్పుల ననుసరించి నిర్మాణమునందును మార్పులు కలుగుచువచ్చినవి. ఆధునిక యుగమున బేంకాంగునందు కట్టబడిన దేవాలయము




౧. వాట్‌చెంగ్ దేవాలయము, సయాము

లన్నియు భారతీయ నిర్మాణవిధానములకు దూరములై సౌందర్యరహితములై యున్నవి కాని వీటియందు అలంకారములుగ గల వివరములన్నియు హిందూశిల్పానుకరణములే. ఆంధ్రదేశమున గానబడు దేవాలయ శిఖరములందు పొడవునకు సరిపోవు వెడల్పు, అంతస్థుల పొందిక, అలంకారములుగగల శిల్పచిత్రముల యేర్పాటు కనుల కానందముగ గానబడును. శ్యామదేశమునందలి నూతనాలయములందు మొదలు పెద్దదిగను, కొంచెమెత్తునకే సన్నముగ పరిణమించి పైనొక స్తంభమువలెను ఉండుటవలన వెలితిగ గనబడును. చైనానిర్మాణవిధానము ననుకరించుటవలన నిట్టిమార్పు కలిగినది.

చాలకాలమువరకు శ్యామదేశము కాంభోజుల యాధిపత్యముక్రింద నుండెను. కనుక నిప్పటికి మిగిలియున్న శిల్పనిర్మాణములం దధికాంశమేవి కాంభోజమునకు జెందినవో, యేవి శ్యామదేశమునకు జెందినవో చెప్పుట దుర్లభము. చెంతబును అనుచోట నీతరగతికి జెందినవి కొన్ని కనబడుచున్నవి. ఇచ్చట రాజగృహముల చిహ్నములు కలవు. మకర తోరణములతోను, గరుడవిగ్రహములతోను అలంకరింపబడిన ద్వారబంధ మొకటి కానబడినది. లొపాపురివద్ద నిటుకలతో గట్టబడిన దేవాలయము నీజాతికి జెందినదే. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరు లిచ్చట ఆరాధనమును బడయుచుండిరనుటకు నిదర్శనములు కలవు కాని తరువాత బౌద్ధాలయముగ మార్చబడుటచే నాగచ్ఛత్రములను దాల్చియున్న బుద్ధవిగ్రహము లనేకము లమర్చబడినవి దక్షిణదేశమున గనబడు గోపురములవంటివి ములంగసింగు, పెచ్చాబురి వద్ద గలవు. గరుడులు, ద్వారపాలురు మొదలగు హిందూ శిల్పాలంకారము లనేకము లిచ్చట గాననగును.

హరిపుణ్యపురము (లాంపున), సుఖోదయ, సజ్జనాలయములవద్దగల హిందూనిర్మాణములు గుప్తుల రచన ననుసరించి మనోహరముగ నున్నవి. ఈప్రాంతములం దవనులలో ననేకనిర్మాణము లికను మరుగుపడియుండుటచే నిర్మాణవిధానము రానురాను నెటుల మార్పుచెందినదో చెప్పుట కాధారములు చాలకున్నవి. ఇప్పటికి నిలిచియున్నవాటిలో పదునొకండవశతాబ్దమునకు పూర్వపు వన్నియు శిలానిర్మాణములు. వీటిలో సజ్జనాలయమువద్ద నున్నవి మొదట గట్టబడినటుల గనబడుచున్నవి. ఈ ప్రాంతములలో కొంతమేరమున మూడు పాడువడియున్న దేవాలయములును, శివలింగములును, కంచు రాతితో మలచబడిన విగ్రహములును కలవు. కంచువిగ్రహములను సింహళమునుండి తెచ్చిరి కాబోలును. ఇచ్చటి విగ్రహములకు ఎత్తయిన కనుబొమలు "అజంత నయనములు", చిన్న పెదవులు ఉండుటచే కాంభోజ శిల్పులు నిర్మించినవి కావని నిస్సందేహముగ జెప్పవచ్చును. రానురా నీసుందరశిల్పరచన మారి, యాచారప్రాయముగ బరిణమించుటచే తరువాత మలచబడిన




౨. బుద్ధుడు
(రాతిపై చెక్కడపుపని)
౧౧-వ శతాబ్దము నాటిది, సయాము

విగ్రహము లింతసుందరముగ లేవు. సూర్యవంశ రామ మహాధర్మరాజాధిరాజు (౧౩౫౪ - ౧౩౭౭) సింహళమునుండి సంఘరాజను బౌద్ధభిక్షువును రప్పించినపిమ్మట నిర్మింపజేసిన దేవాలయముపైగల జాతకకథల శిల్పచిత్రములు సుందరముగ, బరుహుతు, బోరొబుదరు శిల్పములను స్మరింపజేయునవిగ నున్నవి. సంఘరాజు పరివారములవచ్చిన సింహళదేశపు శిల్పులు వీటిని సృజించి యుండవచ్చును.

వాట్మహాప్రసాత్ అనుచోట రెండు విగ్రహభాగములు కనబడినవి.

ములంగుప్రారోట్ అనుచోట ఏనుగుల, మకరముల, బుద్ధుని విగ్రహములును, స్నానద్రోణితో గూడియున్న లింగమును లభించినవి. బుద్ధుడు సింహాసనము

కూర్చొనియుండ నప్సరసయు, నైదుసురు భక్తులును కుడియెడమలందున్నటుల నొక శిల్పచిత్రము కలదు. అప్పటి శ్యామరాజకీయ పరిస్థితుల నీవ్యక్తికూటమి వ్యక్తీకరించుచున్నదని కొందరియూహ.

ములంగు సుఫానువద్ద నొక పెద్ద బుద్ధవిగ్రహమును, కొన్ని స్తూపములును కనబడినవి.

కాంచనపురి (కాంచనబురి) ఖవొవద్ద బుద్ధుడాసీనుడై యున్నటుల విగ్రహము కలదు.

బుద్ధుడు తపస్సుచేసి, కృశించి యెముకల ప్రోవువలె నున్నటుల పంజాబులో నొక గాంధార విగ్రహము కానబడినది. ఆధ్యాత్మిక ప్రాముఖ్యముకల విగ్రహములందు వెలితియుండకూడదని హిందువుల యభిమతము. బుద్ధుని యాధ్యాత్మిక జీవనమున వెలితి లేదు. ఈ విగ్రహము హిందూశిల్ప సంప్రదాయములకు వ్యతిరేకముగ నుండుటచేతను, మరెచ్చట నిట్టిది లభింపకపోవుటచేతను చిత్రకళావిమర్శకుల దృష్టి నాకర్షించినది. ఈ నాటికి గాంధారమువంటి వలసరాజ్యముగు శ్యామదేశమున రాజపురి (రాట్పురి=రాట్ బురి)వద్ద మరియొకవిగ్రహ మట్టిది లభించినది.

తియయను స్థలమునగల దేవాలయపు గోడలపై నొకవైపున బౌద్ధశిల్పములును, మరియొకవైపున హిందూశిల్పములును ఉండ, మధ్య నున్న గూటిలో బుద్ధవిగ్రహము కలదు. లోపల శివుని, విష్ణువుని విగ్రహములు కలవు. ఇది హిందూఆలయ మనియు, దశావతారములలో బుద్ధు నొకయవతారముగ బరిగణింపబడుటచే నిటుల గూటి నలంకరించుటమాత్రము కలిగె ననియు కొందరి యభిప్రాయము.

వీంసుశ్రాను ఆనుచోట నొకచక్కని విష్ణువిగ్రహము లభించినది.

శ్రీతమ్మరాడ్నగరము (నాఖోను శ్రీ తమ్మరాటు) వద్ద స్తూప, విహారముల స్తంభములు మాత్రము మిగిలియున్నవి. అప్సరసలు బుద్ధుని స్వర్గమునకు గొనిపోవునటుల, బుద్ధు డశ్వారూఢుడై యున్నటుల శిల్పములు కలవు.

అయోధ్యయందు చక్కని దేవాలయములు పాడువడియున్నవి. ఆనాటికే శ్యామదేశమున శిల్పసైపుణ్యము




౩. అయోధ్య దేవాలయపు శిఖరము

క్షీణింపజొచ్చినది. పరిపూర్ణత భారతీయ శిల్పరచనయొక్క ప్రధానసూత్రములలో నొకటి. కాంభోజశిఖరములనుబోలు శిఖరములనుగలిగియున్నను, హిందూనిర్మాణములందు పూర్ణతతగ్గి, రచనయొక్క యలసటను సూచించునటుల ఇవి నలంకారరహితములై యున్నవి. భారతీయ శిఖరనిర్మాణము తొలుత నిట్టిమార్పును చెంది, యిప్పుడు బేంకాంగునందు నిర్మింపబడిన దేవాలయ నిర్మాణరూపమును దాల్చినది. హిందూవిజ్ఞానాంకురముల కొరవులేకపోవుటచేత, తాయి తిబెత్తుప్రజలు ప్రవేశింపజేసిననూతన వాతావరణమున శిల్ప మిట్టి పరిణామము నొందినది.

టాకువపా, మెగ్యు, వాట్ ప్రాకియొ యను ప్రదేశములందు కొన్ని హిందూ, బౌద్ధ విగ్రహములు కలవు.

బేంకాంగు వస్తుప్రదర్శన శాలయందు గణేశ, విష్ణు, లక్ష్మీ, శివ, బుద్ధుల కంచువిగ్రహములు భద్ర

పరుపబడినవి. వీటియందు కొన్ని హిందూశిల్ప సంప్రదాయముల ననుసరించియుండుటచేతను, నటరాజ విగ్రహ మిచ్చట కానవచ్చుటచేతను, కంచుచేత ఆనాటికి శ్యామదేశమున లేకపోవుటచేతను ఇవియన్నియు దక్షిణహిందూదేశమునుండి యెగుమతియైనటుల నున్నది. రానురాను శ్యామశిల్పులు లోహములతో విగ్రహములను చేయుట నేర్చుకొనిరి. ఈదేశీయవిగ్రహములు అంగవిన్యాసమునందును, అలంకారములందును భారతీయ శిల్పకళ యాదేశమున పొందిన మార్పులను బాగుగ వ్యక్తపరచుచున్నవి.

శ్యామదేశమున భారతీయ చిత్రరచనయు లేకపోలేదు. సచిత్రములైన సనాతనగ్రంథములు కొన్ని లభించివి. క్రీ. శ. ౧౩౬౧ నాటి దేవధర్మజాతక చిత్రమును మచ్చునకు చూచినయెడల నచ్చటిరచనయొక్క



౮. దేవధమ్మజాతకము
౧౩౬౧ క్రీ. శ. వర్ణచిత్రము, సయామ

సైఖరి తెలియును. అయోధ్యరచనానుసరణముగ పతాకలమీదను, దేవాలయకుడ్యములమీదను జాతకకథలు, బుద్ధునిరూపములు చిత్రితములై యున్నవి. దేవాలయముల ద్వారములమీదను, కిటికీలమీదను, పుస్తకముల "అట్ట" దారుఫలకములమీదను, గ్రంథములనుంచుకొను పెట్టెలమీదను లక్కతో మంచిచిత్రములు వ్రాయబడియున్నవి. ఇట్టి రచనయందు శ్యామసోదరు లతిప్రవీణులైరి. తురుష్కస్థానము, టిబెత్తులందు లభించిన భారతీయచిత్రముల నివి పోలియున్నవి. చైనా సంపర్కమువలన నేర్పడిన పింగాణిమీద చిత్రించుటయందీ వలసరాజ్యమువా రతిప్రవీణులైరి. సజ్జనాలయము వద్దను, తదితరస్థలములందును లభించిన పింగాణి పాత్రలపై పద్మములు, ఫలములు, పక్షులు, దేవతలు, నరసింహవిగ్రహముల చిత్రము లతిసుందరముగ నున్నవి. ఈరచనావిధానము చైనాకు చెందినదైనను, శైలియందు శ్యామదేశమున నాయాకాలములం దామోదమును బడయుచుండిన హిందూచిత్రశైలి ననుసరించియున్నవి.

జలతారు, పట్టు, నూలు వస్త్రముల నేతయందు శ్యామదేశము ప్రసిద్ధికెక్కినది. హిందూదేశమున వాడుకలో నున్న పంచెలు, పురాతన కచ, కుచబంధములు నిచ్చట నేయుచుండిరి. మదిలీపట్టణపు అద్దకపుబట్టలిచ్చటి కెగుమతి యగుచుండినవి.

నగలను చేయుటయందును శ్యామదేశము భారతదేశము ననుకరించినటుల కానవచ్చును. ఉంగరము లతిచక్కనివి కలవు. ఖడ్గములు మొదలగు ఉక్కువస్తువులపై లోహపులత లమర్చుటకూడ వీరికి తెలిసియుండెను.

శ్యామదేశపు నాట్యమునందును హిందూదేశముయొక్క పలుకుబడి కానవచ్చుచున్నది. "కోను" అను నాటకరూపమున రామాయణము ప్రదర్శింపబడుచున్నది. "లేఖానుప్రతి" అను నాట్యముయొక్క పుట్టుక భారతనాట్యశాస్త్రముయొక్క ప్రారంభమును జ్ఞప్తికి దెచ్చును.

భారతదేశము నిర్వీర్యమగుటతో తక్కిన వలసరాజ్యములందువలె శ్యామదేశమునందును భారతీయ నాగరికతకు తావు లేకపోవుచున్నది. పరిస్థితు లిప్పటివలె నున్నయెడల మచ్చునకైనను "హిందూత్వము" శ్యామదేశమునను లేకుండ మాయమగుట నిశ్చయము.

## తారుణ్యదశ

శ్రీకరంబై చెలువముల నా
 లోకమోహాసమైన కాముక
లోకములు విలసిల్ల నెవ్వరు
 సాకుచుందురొకో. ౧

కొమ్మలును యౌవనులు నైజపు
కోర్కె లలవడ వలచు, వీరల
కిమ్మెయిని ప్రణయంపుతత్త్వము
 లెవరు గఱపిరొకో. ౨

బాలభానుని దలచునంతనె
పద్మినీసతి యలరు, వీరల
కోలి ప్రణయపువిద్దె నేర్పిన
 యొజ్జ యెవ్వరొకో. ౩

చంద్రికను విడనాడ కెప్పుడు
చందమామ చరించు, వీరికి
పొందు వీడక సంఘటించిన
 ప్రోడ యెవ్వరొకో. ౪

అలరుకొమ్మల గండుతుమ్మెద
వలచి తేనియగ్రోలు, వీరికి
కలయికలచవు లీవిధంబున
 దెలుపువా రెవరో. ౫

స్వాంతమున ప్రేమాంకురంబులు
అంతకంతకు మొలచె నెయ్యపు
టింతులను భజియించు భాగ్యము
 నిచ్చు ఘను డెవరో. ౬

నీరముల గురిపించు మేఘుడె
కోరికలు విలసిల్ల నెయ్యపు
వారిజాక్షుల నీన డిందుకు
 కారణం బేమో. ౭

కరుణ నా కిటు ప్రణయతత్త్వము
గఱపు నోజ్జయె కామినీజన
పరిసరంబుల ప్రణయగాథల
 బల్కు డేలనొకో. ౮

గరిమ బాహ్యాంతరములను సుమ
శరునితత్త్వమె దోచ నీతడె
పరమ మగు నద్వైతయోగము
 గఱపు గురు డేమో. ౯

చెలగి వేడుక ప్రణయసౌధము
చేరి కోరిక లుల్లసిల్లగ
నలరువిల్తుని గొల్చు యోగము
 తెలుపు గురు లెవరో. ౧౦

యోగమార్గము లన్నిటికి సం
యోగమే పరమార్థ మను మధు
నాగమంబున బరగుతత్త్వం
 బదియె మదినిండెన్. ౧౧

ఎందు గన్గొనవైనభువి నా
నందమే బ్రహ్మం బటంచని
డెందమున బరమాత్మయే ముద
 మంద బోధించెన్. ౧౨

చిత్రశాల:

# భావశబలత

## తాడిపర్తి రాఘవాచార్యుఁడు

మున్నంగి......శర్మ

తాడిపర్తి రాఘవాచార్యులు

తెలుఁగుసీమనెల్ల నెళవు-నెప్పులఁ గన్నవాఁడు. లెక్కకందిన తెలుఁగుబిడ్డ. తాడిపర్తి నరసింహాచార్యపండితుఁడు అయ్య; ధర్మవరమువారింటి యాఁడుబిడ్డ అమ్మ. 'ఆంధ్రనాటకపితామహుఁడు' * అమ్మతోఁ బుట్టినవాఁడు—మేనమామ. తండ్రివంక పండిత వంశము; తల్లి పుట్టినిల్లు విద్వత్కుటుంబము. చిన్ననాఁట గోలె స్వేచ్ఛావాయువులం బెరిగినాఁడు. అమ్మ-నాయనలకట్టిన గుమ్మముపంకే. పదునాఁడేండ్లకే పదుచు పటాలములతోఁ జాల్వాలు. మేనమామగారి 'సరస వినోదినీసభ' మెఱయుచున్న దినములు. తనకు ఒడ్డు-పొడవులకు అనువైన ఒకూర మబ్బినది. పలుచని నలుపుమైచాయమెఱుపునఁ దొలకరిమెఱుపులు తలసూపినవి. నెడఁద నుదుటునకుఁ గనులు వెన్నెలకుప్పలు. కనుదోయి విరివిలో గంతులిడు చిలిపిచూపులు. ముక్కు, మొగముతీరు చక్కఁగ నమరినది. పలుకుడేఁట ననుకరించు పాటతీఁపియుఁ బొసఁగినది. నటునకు వలయు నలువుజెలువులెల్ల తులకించినవి. వగలమాటచేతలు నగలై జిగజిగలాడినవి. చూపులఁ జాఱగొను స్పృహణీయత. నాటకాలమరులు నడినెత్తి కెక్కినది. అహోరాత్రము లదేరంధి. వేపాలకు దినవాఁక వేదన తగ్గదు. పగలు బడి; సందకాడ సంగడికాండ్రతో సికారు; నసుఁగు మొదలు నడురేయివాఁక నాటకపుగొడవ.

మూఁడవఫారము మొదలు ముస్సల్మాన్ విద్యార్థుల దోస్తి ముదిరినది. ఉరుదుమీఁది ప్రీతి ఉబ్బటలూర్చినది. 'అలీఫ్ బే పే'లతో షురూచేసి పహిలే దూవంకితాబులు పరిసమాప్తి చేసినాఁడు. మఱుసంవత్సరముననే మాతృభాషకు బదిలీగా 'ఉరుదుఇలం' ఫిరాయించినాఁడు. అగపడిన ఉరుదుకితాబులనెల్లఁ ఆస్థతోఁ జదివినాఁడు. రామాయణముమీఁదికన్న 'రసూల్ సవాఉమ్రీ' (రసూల్ జీవితము)మీఁద సరదా బడాయించినది. కావ్యపఠనముమీఁది కన్న 'ఖసస్ అంబియా' (ప్రవక్తలకథలపొత్తము)మీఁద ఖాతరీఛెడాయించినది. 'తిరుప్పావై' (విశిష్టాద్వైతద్రావిడవేద సంగ్రహము) మీఁదికన్న 'దీవాన్' (భజనలకీర్తనల) మీఁద మజా ఖులాయించినది.

పదనైన తెలివి. పాఱచూచుటతడవుగా పాఠము వచ్చెడిది. సంధానములు, సాగతీతలు అక్కఱలేకయే

* కీ. శే. ధర్మవరము రామకృష్ణమాచార్యులు.

వలపుగత్తెయై వాణి వద్దఁ జేరెడిది. పదునైదవ యేఁడు దాఁటెనో లేదో ప్రవేశ పరీక్ష (Matriculation Examination)కుఁ దీసుకున్నాఁడు— పాసైనాఁడు. పైచదువునకు పట్నమునకుఁ బయనమైనాఁడు. నాటకపు పొత్తు లేక నడకసాగని వ్యాసంగము కలాశాలలో, వేసాలపంపు 'సుగుణ విలాసము'నఁ గుదిరినది. పాడుచు ఆడుచు పట్టభద్రుఁ డైనాఁడు.

లాకాలేజి ప్రవేశించినాఁడు. లగాయించి రెండేండ్లలో లాయరుపట్టా పుచ్చుకున్నాఁడు. మదరాసుకాఁపురానికి మంగళహారతు లిచ్చి బళ్లారిబస్తీలో బల్లగట్టినాఁడు. ఆరాఘవుని బాహ్యప్రయోగ మెక్కప్పుడు ప్రేటుతప్పి యుండినా, ఈరాఘవుని పరీక్షాయోగమున నెప్పుడు నూటి తప్ప లేదు. సునిశితమయిన బుద్ధి—ధీశాలి!

విస్తరముందు విధిలేక గీచుకున్న నామము పడసాలదాఁటుటతో పరారి చిత్తగించెడిది. తలకు పగిడి, తనువునకు అంగరొక్కా, పాదాలకు పాపోసులు ముస్తాబులయినవి. లాల్చీ తొడిగినాఁడు; లపేటా చుట్టినాఁడు; లుంగీ కట్టినాఁడు; రూమీకుచ్చుటోపీ పెట్టినాఁడు. తాటికాయంతె తలముడి తండ్రిగారి చరమక్రియలతో సెలవుపుచ్చుకున్నది. కత్తిరింపు జుల్ఫాలు ఖాయషీరైనవి. పైవేసముతోఁ గూడ పరిషియన్ మిలాఖత్తైనది పక్తు ఆఫ్ఘన్ తస్వీర్ తయ్యారీ అయినది. పుట్టినది పరమనైష్ఠికదంపతులకు; పట్టినది పక్కా పఠాన్ ఛహల్—స్వతంత్రుఁడు!!

నాటకాలసంసారముతో నాల్గుదశలు గడచినవి. మదరాసుచదువునకు వెడలక పూర్వమే మామగారితో శతించి "సరసవినోదిని" దెస నైముఖ్యయోగ మూనినాఁడు. కోలాచలముకవి కోపునఁజేరి "సుమనోరమ" నుద్ధరించినాఁడు. 'షేక్స్పియర్' నాటకము లాడినాఁడు. 'కామెంటరీస్' (వ్యాఖ్యలు) చదివి కర్తృభావము తెలిసినాఁడు. తెలిసినంతవట్టు తేఁటపఱిచినాఁడు. 'షయలాక్' పాత్రమున సహజకర్కశుఁ డనిపించుకొన్నాఁడు. 'మూర్' భూమికలో పుట్టుమొఱకుగా నటించినాఁడు. భావ పాశ్చాత్త్యము; పాత్రధారి భారతీయుఁడు. నాటకము ఆంగ్లము; నాలుక ఆంధ్రము: శక్తికొలఁది సమగ్రతఁ జాటినాఁడు. భారతీయుల పసదనములతో ఆంగ్లేయుల అభినందనముల నందినాఁడు. తెలుఁగు-కన్నడములయందలి సహజాభిరుచికి కృషియుఁ దోడైనది. కవనధోరణియుఁ బొడమినది. తెలుఁగు-కన్నడములం గాక, హిందీయందును నాటకములు ప్రయోగించినాఁడు. అన్నిటను జౌననిపించుకున్నాఁడు. దశరథపాత్రమునకన్న దనుజసార్వభౌముఁ డను హిరణ్యకశిపునిపాత్రను బోషించినాఁడు. నలపాత్రమునకన్న బృహన్నలపాత్రము నొప్పించినాఁడు. గోపన్న నటనమునకన్న గోల్కొండ తానాశహ నటనమున కౌశలముఁ జూపినాఁడు. సిరియాలవేషమునకన్న శివాజీవేషమున నప్రతి యనిపించుకున్నాఁడు. పార్థివునకన్న పఠాన్ రుస్తుమును సాక్షాత్కరింపఁ జేసినాఁడు. సాధువునకన్న యోధునకు మెఱుఁగుపెట్టినాఁడు. భక్తుని రీతికన్న పౌరుషవంతుని రీతిలోఁ బ్రశస్తిఁగాంచినాఁడు. విరాగి నటనకన్న విలాసపూరుషుని నటన మెచ్చించినాఁడు. రాజువేసము మొదలుగా రంగేలీరాడీ వేసములవఱకు మార్పులు చూపిన నేర్పఱి. అంతఃపురమందలి బిగువుగ, ఆహార్యరంగమందలి శూరుఁడుగ పైబురఖా ఫిరాయి ప్రమాత్రమున ఫరక్ చూపఁగల జాణ. చిల్లరమల్లరవేసాల లోను జేజే యందినాఁడు. ఆరితేఱిన నటుఁడని పేరు మ్రోఁగినాఁడు. "రంగ్ భంగ్ కె లోటా" పదముతో నభినయించి గత్తికట్టించినాఁడు. రసము మెఱపించి సదస్యము మైమఱపించినాఁడు. ఉపజ్ఞఁ దేఁచినాఁడు; వైలక్షణ్యము వీఁచినాఁడు. ప్రతిభకు దీక్ష కృతపడినది. అనుకరణమున కాశయ మైనాఁడు. ఒడలు విఱుచుకొన్నాఁడు. ఉడుపులఁ జింపికొన్నాఁడు. విజాతీయాభినయమునకు, వికారపుచేఁతలకుఁ జోటిచ్చినా, మేటితనమునకు లోటు రానీయఁడు. తెలుఁగునాట్యరంగమున కొక దీపరాజమై వెలుఁగుచున్నాఁడు — నటశేఖరుఁడు!!!

తెలుఁగుసీమలో నీతఁడు మేళముగట్టని పట్టనము కడమపడదు. సెలవులు తడవుగా చెలాయించినాఁడు

నట్టువులజట్టుతో దోరా. ఏసంస్థకు పైసాకావలెననినను రాఘవాచార్యులకు ఆహ్వానము. విధిలేని పట్టులందప్ప ఆహ్వానముల నుపేక్షించుట ఆయన కలవాటులేనిపని. బెజవాడలో సమితి; బెంగళూరులో ట్రూపు; పట్నములో సమాజము; బల్లారిలో శాఖా-అన్నీ తనవే. పైపెచ్చు పాతనేస్తమును బట్టి "సుగుణవిలాసము" నకు, అభిమానముకొలంది, "ఆంధ్రసభ" కు, అమెచ్యూర్స్ డ్రమాటిక్ అసోసియేషనులకు అవసరముపడినపుడు అనుకొనుచుండువాఁడు. ఇన్నిటినడుమ కుమ్మరిసారె వలె గుడుగుడుగుంచములాట. బల్లారిలో వకీలు వ్యవహారము; బయటియూళ్లలో నాట్యవిహారము. పైసా కోస మిక్కడ; ప్రఖ్యాతికోస మక్కడ. వసతి ఇక్కడ; వల పక్కడ. విత్తము రావలె; వినోదము కావలె. మోమోటమి చెల్లవలె; మోజు తీఱవలె. విత్తరహితమగు వినోదము, వినోదలుప్తమగు విత్తము పాటికెక్కవు. కళాసమాధిని సురిగి కాఁపురము మఱువరాదు; కాఁపురమును మరిగి కళావిలాసము దొలఁగఁగాదు. కాఁపురముతో కళోపాసనము, కళోపాసనముతోఁ గాఁపురము పరస్పరము ఉచ్ఛ్వాస నిశ్వాసములా ప్రాణికి. కళలోఁ గాఁపురము, కాఁపురములో కళ మేఘాలలోని మెఱుపులు. కాఁపురము కళయైనది; కళ కాఁపురమైనది. వృత్తికి తల తాకట్టు; చిత్తము కళకు దఖల్ పట్టా.—కళాజీవి !!!!

నాట్యప్రపంచమున నవ్యసంస్కారముం దలపెట్టినాఁడు. మగవానికి కోకకట్టించి ఆఁడుదానిగ మార్చి రామచంద్రుని రమణీమణీ యని, భీమారావును భామారత్నమా యని సంబుద్ధులతో సరసాలాడుచు మాయనాట్యములాడినన్నా ళ్లాడినాఁడు. మాయ బ్రదుకు హేయముగఁ దోఁచినది. మన సొగ్గక మార్గ మెట్టినది. మగువను మగవాఁడుగ, మగవానిని మగువగ మార్చుటచేఁ బ్రకృతి తారుమారై మనోహరకళకు మారణయోగ మగునని గ్రహించినాఁడు. గ్రహించినదానిని ఘంటాపథముగఁ జాటినాఁడు. కళారహస్యదూరుల కనుబొమగంటులకు, మూతిముడుపులకు, ముక్కుచిట్లింపులకు; పెడమొగములకు; పెదవివిఱుపులకు సస్మితాలోకనములతో చక్కని జవాబిచ్చినాఁడు. కార్యరంగమున నుఱికినాఁడు. తన ఇల్లాలిని; తనబిడ్డను; తన తలఁపునఁ గలిసిన తరుణీమణులను తయారుచేసినాఁడు; రంగ మెక్కించినాఁడు; రాచబాట ఏర్పఱిచినాఁడు. కళాభిరతి పొంగిన కాంతాలలామలకు రంగభూమి శాస్త్రక్రీడయైనది. ఆచార్యుని యుద్యమమునకు అభిజ్ఞుల సభాజనములు (Congratulations) ఆశీర్వాదములయినవి. ఈనూతనసంస్కరణ విమానము తెలుఁగు-కన్నడ సీమలలో మెఱవడి బయలుదేఱినది. సంకల్పము సాఫల్యమయినది. తెలుఁగుసీమ భావిఇతిహాసమున తనదిగా నొక అధ్యాయము భద్రపఱుచుకొన్నాఁడు ఆచార్యుఁడు.—సిద్ధసంకల్పుఁడు!!—పురుషుఁడు !!!!!

బళారిపురియందలి తన పరార్థవాదిబల్లకు త్రిదశోత్సవము సమీపించినది. ఒడమితో వెచ్చము పఱుగు పందెము వేసికొన్నది. వృత్తికి వలయు వక్తృత్వము, వక్తృత్వమును వెలయించు వాదచాతుర్యము కన్పఱిచినాఁడు. చమత్కృతినిఁ గులికించు సమయస్ఫురణ సఱచినాఁడు. పార్టీలమన్నన, ప్రాడ్వివాకు (Judges) ల యెన్నిక ప్రాకులాడకయ ప్రాప్తించినవి. గవర్నమెంటువకీ లయినాఁడు. గణ్యముగాఁ దనపదవిని నిర్వర్తించుచున్నాఁడు—అదృష్టజాతకుఁడు !!!!!!

అంతరదృష్టికిఁ గాని ఆచార్యుని చిత్తవృత్తి యగపడదు. అతని యంతఃకరణప్రవృత్తి ఆముష్మికముఖమునకు మరలినది. 'పంచదశి'*కి శాంతిచేసియు బాలవ్యాకరణ పరిచ్ఛేదముల పాఠము మానఁడు. ప్రాయ మెక్కుకొలఁది పడుచుదనము నిక్కుచున్నది. తనువును పెత్తనము నొక్కుచున్నకొలఁది, మనసున పిల్లతనము పరువల్లు ద్రొక్కుచున్నది. బాలక్రీడాచాపల్య మింకను ప్రక్కకొత్తిగిలదు. ఆత్మక్షేత్రమున నంకురితములయిన ధార్మికప్రవృత్తులకు తారానాథ పండితుని సాహచర్యము తొలకరిజల్లు అయినది. పెద్దల వద్దికన్న

* ౫౦ సం. ముల వయస్సు.

పిన్నలయుద్ధితో విద్దెమాడుటయు ముద్దు ఆచార్యునకు. రాజులచెంత వెలిఁగినాఁడు; రంగేలీలపొంత మెలఁగినాఁడు. విరాగితోడను విషయకింకరునితోడను వృత్తిభేదములేక వర్తించినాఁడు. ధనికుఁడని గౌరవింపఁడు; దరిద్రుఁడని గదరింపఁడు. పరేంగితజ్ఞతయందును, ప్రకృతిలోభనము నను ముక్కాకలఁ దీరిన పండితుఁడు. ప్రకృతివిలాస లాలసత్వమున ప్రజ్ఞ మాటువడనీయఁడు. విద్యావిభవ మున వినయశీలము మొఱఁగనీయఁడు. భావసంఘర్షణ యందు ప్రసన్నత తొలఁగనీయఁడు. ఐహికభోగపరా యణత్వమున అతిలోకభావమును మసుఁగనీయఁడు. కళోపాసనముదక్క కడమజోలి పట్టదు. మఱుఁగు-మలుపులఁ జొరఁడు; చింతల వంతలఁ జివుకఁడు. చిర మరలఁ జిక్కఁడు. మనసువలె మాట చల్లనిది. మాట వలె మనసు సరళమైనది. మాటకు మన్నన యిచ్చి నాఁడు; దయతో ధర్మము నతికినాఁడు. తగులములేని సంసారియందు తాపసవృత్తినిఁ గన్నాఁడు. తనివిగల బిచ్చగానిలో ధరాతలేంద్రత్వముం దర్శించినాఁడు. పరహితానురక్తుఁడగు పామరునియందు ప్రాజ్ఞతఁ బరి కించినాఁడు. వేదురునందు వేదాంతిలీలలఁ దిలకించినాఁడు. కడచిన బ్రదుకు కలగా నెఱిఁగినాఁడు. 'మధుర భావము'ను* మతముగా స్వీకరించినాఁడు. తనయుపాస్యయగు కళాధిదేవతకు సాయుజ్య ప్రసాదనమునకై ప్రపత్తి పట్టినాఁడు—జిజ్ఞాసువు!!!!!!!

పెనఁగులాటలు పెంచుకొని పేర్లు సాఁగదీసికొను పెద్దలనఁబడువారికి బుద్ధిగఱపుటకుఁ గాఁబోలు, విశాల విశ్వమునఁ దన యల్పత్వము గ్రహించి, తన్నుఁ జిన్న పుచ్చుకొని తనపేరును చిన్నపుచ్చుకొన్నాఁడు; 'ఆచార్య'త్వము కృత్రిమముగా నెఱిఁగినాఁడు; ముక్తుఁడై 'రాఘవుఁ' డైనాఁడు. అనాథలకై అశ్రువులు రాల్చి ఆశ్రయణసౌకర్యములం గలిగించినాఁడు. అధమజాత్యుద్ధరణమునకై అంతఃకరణము నిచ్చినాఁడు. తలతోఁ గూడ హృదయము వికాసమందినది. గాంధీచరిత్ర ఆదర్శమైనది. కదరువ్రతము బూనినాఁడు. శృంగార రసతరంగిణియందలి అలంకారప్రకరణముతోఁ బ్రారబ్ధ మయిన జీవనము పరిపాకము జెంది కరుణముగ నావర్తించి "శాంతి" పర్వమునఁ దొలిపుట త్రిప్పినది.

'ఉదారచరితానాం తు వసుధైవ కుటుంబకమ్' అనిన సూక్తి జీవమంత్రమయినది. ఆసుధాకరము కళాధిదేవతకు రాఘవుని జీవనకళ పరివేషముసుఁ గాత!

---

## స్వీకృతి

కొంపెల్ల జనార్దనరావు

ఇటు వలపు కోరగించినదో నీమదిత్రోవ  
ఒకతిట్టు ఒకతిరస్కృతి మీటిపుచ్చావు.  
అది నీకు ఎడదసిరి  
కదలి దూకాడింది  
అది మెదల కట్టేటి  
తంతిబడి మ్రోగింది  
అని కడుపులోతులో  
కౌగిలించాను.

అపు డొక్క మెరుపు మెరిసింది.  
వెలుగులో తీండ్రించి  
వెలుగు చించిన రేఖ  
అపు డొక్క మెరుపు మెరిసింది.  
అది నీవు భరియించ  
గలవో లేవో కాని,—  
అపు డొక్క మెరుపు మెరిసింది.

---

* భక్తియోగమునందలి పరిపాకము : రాధా - మాధవసంబంధము.

# నక్షత్రమండలము

గొబ్బూరు వేంకటానంద రాఘవరావు (కవితాసమితి)

(భావసంవత్సర కార్తికమాసము)

ఉత్తరము




దక్షిణము

[ఈ పటమును తలమీదుగా ఆయాదిక్కులు సరిపడునట్లు పట్టుకొని ఖగోళమును పరికింపవలెను.

ఇందు జూపబడినట్లు నక్షత్రాదులు
నవంబరు 8 తేదీని రాత్రి 8-52 నిమిషములకును
,, 15 ,, ,, 8-24 ,,
నవంబరు 22 తేదీని రాత్రి 7-57 నిమిషములకును
,, 30 ,, ,, 7-25 ,,
డిసెంబరు 6 ,, ,, 7- 1 ,,
కనబడును.]

Trees in their blooming,
Tides in their flowing,
Stars in their circling,
  Tremble with song.

God on his throne is
Eldest of Poets,
Unto his measures
  Moveth the Whole.

దివ్యసింహాసనాసీనుఁడైన భగవంతుఁడే ఆదికవి. ఆతని కావ్యగీతములకు విశ్వమంతయు సరిగా తాళము వేయుచు నృత్యము సలుపుచున్నది. ఆతని గానకళా ప్రభావతన్మయములై పూచెడు చెట్లు, పొంగి పారెడి జలరాసులు, భగణము గావించు నక్షత్రములు క్రమము తప్పని చలనము పొందుచున్నవి.

ఈభావసంవత్సర కార్తికమాసమున అనగా నవంబరు ౮ వ తేదీ మొదలు డిసెంబరు ౭ వ తేదీవఱకు ఖగోళవిశేషములను పరిశీలింతము.

## పాలవెల్లి (Milky Way)

పాలవెల్లి ఈమాసపు తొలిజామున తూర్పున నుండి పడమటకు ధనురాకారముకలిగి వ్యాపించి యున్నది. తూర్పునుండి ఉత్తరమునకు ఉన్నత్తుగా లేచి, ఉత్తరమునుండి పడమటకు వంగివాలును. తూర్పునుండి రాజహంస (Cygnus) మండలమువఱకు ఒక్కపట్టీవలెనుండి, అటనుండి పడమటకు రెండు భాగములుగా చీలిపోవును. ధవళధవళములైన ఆ రెండు భాగముల మధ్యను ఛాయాపథము గలదు. ఈమాసమున పాలవెల్లి, తూర్పున ఆర్ద్ర, సారథి (Auriga) మండలము మొదలు భృగుపరశు (Perseus) అప్సరస (Cassiopea) పురూరవసు (Cepheus) రాజహంస (Cygnus) గరుడ (Aquila) ధను (Sagittarius) మండలముల మీదుగా వ్యాపించియున్నది.

## First Magnitude Stars

ఈమాసము రాత్రి తొలిజామున మిక్కిలి తేజోవంతములైన నక్షత్రములు ఎనిమిది కనబడుచున్నవి. అవి యేవేవి యనగా:—

౧. వీణామండలములో బ్రహ్మ. (Vega in Lyra)

౨. గరుడమండలములో శ్రవణము (Altair in Aquila.)

౩. ఇంద్రద్యుమ్నుడు (Fomalhaut)

౪. సారథిమండలములో బ్రహ్మహృదయము (Capella in Auriga)

౫. రోహిణి (Aldebaran)

౬. Orion లో { ఆర్ద్ర (Betelgeaux)
౭. { యమున సమీపమున రిగెల్ (Rigel)

౮. ఆగ్నేయాకాశమున శంతనుడు (Acherner)

## ఉత్తరదిశా నక్షత్రములు

లఘుఋక్షము అనబడు చిన్న యెలుగులోక చివరను ధ్రువుడును, లోకలో అగ్ని, మహేంద్ర, కశ్యపులును చక్కగా కనిపించుచున్నారు. ఈ చుక్కలతో కూడిన చిన్నయెలుగు ఇంకను పశ్చిమముఖముగానే ఉన్నది. ధ్రువుని సమీపమున కొంచెము ప్రక్కగా ఊర్వశి పాదముతోసహా కనబడుచున్నది. పురూరవసు పాలవెల్లిలో కనబడుచున్నాడు. సప్తఋషులిపుడు కనబడరు. పడమట శిరస్సుతో నరకుడును, వాని బలగమును బ్రహ్మకు కొంచెముదూరములో కనబడుచున్నారు.

## పడమట

శ్రీ మహావిష్ణుస్వరూపము పూర్తిగా అస్తమించినది. విష్ణునాభికమలమున జన్మించిన బ్రహ్మయు, అతని ముఖమున వీణాపాణియైన సరస్వతియు, ఆవాణీహిరణ్యగర్భులకు వాహనమైన రాజహంసయు పశ్చిమమున నిక నస్తమింపనై యున్నారు. పశ్చిమదెసను భూమ్యాకాశసమాగమము, బ్రహ్మసరస్వతీసమాగమము, పాలవెల్లిలో రాజహంసధావళ్యము,ఇవన్నియు నేటిపశ్చిమాకాశమున శరత్కాలపు మనోహర-అద్భుతదృశ్యములు.

## నైరృతి

బ్రహ్మసోదరుడైన మన్మథుడు, అనగా ధన్వి కూడ త్వరలో నస్తమింపనైయున్నాడు.

## దక్షిణాకాశమున

మకరము, నాళీకజంఘమనుబకము, ప్రావారకర్ణ ఘూకము, యుగంధరకమఠము, దినవశరాలి, వీటితో కూడిన ఇంద్రద్యుమ్నుడు దక్షిణాకాశమున ప్రాముఖ్యముతో వెలుగుచున్నాడు.

ఈశరత్కాలపు విశేషములు శ్రీనాథమహాకవి భావమరిది యగు దగ్గుపిల్లి దుగ్గయ్యాకవి రచించిన శివకంచి మాహాత్మ్యమునందు బహురమ్యముగా నీక్రింది పద్యములో వర్ణింపబడినవి:

సీ. బంధూకమోఱమించె బరువయ్యెగేదంగి
కడిమి పుష్పితమయ్యె గ్రంథిపూచె
నర్జునంబలరారె నరవిందములు గ్రుస్సె
భూస్థలి సేరులు పుక్కిలించె
గండూపదములుబ్బె గలగె హంసచయంబు
నటియించె గప్పలు నమిలిచెలగె



చాతకంబులుమించె సాగరంబెడయించె
హరిగోపములతోడ నాటెవేళ్లు
మత్తభృంగంబులకుడేనె రిత్తయయ్యె
గండుగోయిలమూతలు కట్టువడియె
చూలుకొనె స్వాతికొక్కెర జూటి బొదవె
విష్ణునకు నిద్రపోయెడువేళయయ్యె.

ఈపద్యము రచించిన దుగ్గయకవి ఇప్పటికైదారు వందల సంవత్సరముల క్రిందటివాడు. ఇందు క్రిందగీతలుంచబడిన ఆఖరుపాదములు రెండును నేను వ్రాయుచున్న ఖగోళవర్ణనమును చక్కగా ధృవపఱుచుచున్నవి.

### "చూలుకొనెస్వాతి"

స్వాతినక్షత్రము పడమట అస్తమించినది. ఇక త్వరలో తూర్పున నుదయముకాగలదు. కాబట్టి తూర్పుదిక్కు అనే స్త్రీ చూలాలయి, స్వాతిని గర్భమునం దిడుకొనియున్నదనియును, త్వరలో స్వాతి జన్మింపకలదు, అనగా ఉదయము కాగలదు అనియు కవి రమ్యముగావర్ణించినాడు. సూర్యోదయాత్పూర్వము నక్షత్రాదులు తూర్పున నుదయించుటను Heliacal rising అని పాశ్చాత్యులు వ్యవహరింతురు. ఈ భావమునే మనదుగ్గయకవి 'చూలుకొను' అనుపదము వాడి చక్కగా విశదముచేసినాడు.

### "కొక్కెర జూటిబొందె (బొదవె)"

కొక్కెర అనగా కొంగ, ఈకొంగనక్షత్రముల



సంపు దక్షిణాకాశమున ఇపుడు ప్రాముఖ్య రూపము. పాశ్చాత్యదేశములలో ఈచుక్కలసంపునకు గ్రస్ (Grus) అని పేరు. 'గ్రస్' అను లాటిన్ పదమునకు కొంగ అని అర్థము. ఈకొంగరూపము వెనుకటిపుటలోని నక్షత్ర పటములో చక్కగా కాననగును.

ఈకొంగ మనపురాణకథలలో మిక్కిలి ప్రసిద్ధమైయున్నది.

(౧) ఇంద్రద్యుమ్నమహారాజుపేరు భూమిమీద మాసిపోయినదో లేదో, ఇంద్రద్యుమ్నుడు దివమునందుండవలెనో, అధఃపతితుడు కావలెనో, నిర్ణయించుటకు దేవతలు ప్రశ్నించిన పక్షులలో నొకటి నాళీకజంఘుబకము. దీనినిగూర్చి ఈవఱకు కొంత ముచ్చటించియున్నాము. మరల వేరొకసారి ముచ్చటింతము.

(౨) భారతమునందలి బకాసురునికథ. బకాసురు డను రక్కసుడొకడు ఏకచక్రపురసమీపమున నుండెడివాడట. వా డాయూరిమీద పడి మనుష్యులను భక్షించుచుండెడివాడట. అపు డాయూరివారు ఆరాక్షసునితో నొకయేర్పాటు చేసుకొని, దినమున కొకబండి యన్నము, భక్ష్యములతో నొకమనుష్యుని పంపి, వానిని తృప్తిపొందునట్లు చేసెడివారట.

క. బకు డేకచక్రపురమున
ప్రకటితముగ దినము నొకరి భక్షింపంగా
ఒకరైన విడువజాలరు
సుకుమారక జన్మభూమిసుఖమెట్టిదియో.

అని చాటువుగూడ విననగుచున్నది. ఈ బకాసురుని భీముడు సంహరించినట్లు భారతమున కలదు. ఈకథ ఆకాశమున నక్షత్రరూపమున చిత్రింపబడినదని నావిన్నపము.

భీముడు వాయుదేవునంశమున జన్మించినవాడు. నక్షత్రములలో స్వాతినక్షత్రము వాయుదైవత్యము. "స్వాతీనక్షత్రం వాయుర్దేవతా" అని శ్రుతి. స్వాతి ఇపుడు పడమట అస్తమించియున్నది. తూర్పున ఉదయము కాలేదు. స్వాతి అనగా భీమసేనుడు కనబడనంతవఱకే బకాసురుని విజృంభణము. భీముడు కనబడగానే బకుడు దుమ్ములువిరిగి చచ్చినాడన్నమాటే కాబట్టి స్వాతి కనబడనంతవఱకే బకుని మిడిసిపాటు! స్వాతికనబడగానే బకునికి అంత్యకాలము ప్రాప్తమగుచున్నది. ఈయంశమునే దుగ్గయ్యకవి పైపద్యములో 'కొక్కెరజూటి బొంగ'అని సొగసుగా వర్ణించినాడు.

"విష్ణునకు నిద్రపోయెడి వేళయయ్యె"

శ్రీ మహావిష్ణువునకు ఆషాఢశుద్ధ ఏకాదశినాడు నిద్ర ఆరంభమగును. నాటినుండి చాతుర్మాస్యము. అదే శయనైకాదశి. పిమ్మట భాద్రపద శుద్ధఏకాదశి పరివర్తనఏకాదశి. ఖగోళార్థములో పడమటనుండి తూర్పునకు తిరుగుటయే యీపరివర్తన. పిమ్మట కార్తికశుద్ధ ఏకాదశినాడు విష్ణువు ఉదయమునసే నిద్రమేల్కొనును. అదే బోధనైకాదశి.

"తతో విష్ణుః చాతుర్మాస్యేషు సుప్తవాన్,
క్షీరోదధౌ జాగ్రతో సా నేకాదశ్యాంతు కార్తికే."

వైష్ణవు లానాడు బోధనైకాదశీవ్రత మాచరించి,

"ఉత్తిష్ఠోత్తిష్ఠ గోవింద ఉత్తిష్ఠ గరుడధ్వజ,
ఉత్తిష్ఠ కమలాకాంత త్రైలోక్యంమంగళంకురు."

అని,

"ఇత్యుక్త్వా శంఖభేర్యాది ప్రాతఃకాలేతు వాదయేత్,
వీణావేణు మృదంగాది నృత్తగీతాది కారయేత్."

మంగళవాద్యములు మ్రోయింతురు.

మరియు నొకవిశేషము. విష్ణువు శేషశాయి. కార్తిక శుద్ధ ఏకాదశినాడు సూర్యోదయాత్పూర్వము ఒకవారమునకు ముందు అనగా చవుతినాడు సూర్యోదయాత్పూర్వము శేషుని శిరము కనబడును. అదియే **Heliacal rising of the constellatian serpens.** ఇట్లు శేషుని శిర మానాడు కనబడగానే, మనదేశస్థులందరును నాగులచవుతిపండుగ చేయుదురు. 'ప్రాతర్యావాణా ప్రథమాయజధ్వం' అని శ్రుతి. సూర్యోదయాత్పూర్వము ఏదేవత ఏనాడు మొదట కనబడునో ఆనాడు ఆదేవతను మొదట పూజింపవలెను. ఆశ్రుతి ప్రమాణము ననుసరించియే మనవారు నాగులచవుతినాడు

నాగపూజచేసి, పుట్టలలో పాలుపోసి, చలిమిడి, చిమ్మిలి నైవేద్యములుచేసి నాగులగావంచాలు సమర్పింతురు. ఇదంతయు ఖగోళమున నక్షత్రగమనమును పట్టియే జరుగుచున్నదని స్పష్టమేకదా ?

## తూర్పున

ఒరయన్ యోధుడు ఉదయమైనాడు. వాని పటకాలే మనరైతులు గొల్లకావిడిచుక్క లని చెప్పుదురు. ఒరయన్ యోధుని పాదమని చెప్పదగిన రిగెల్ (Rigel) చుక్కసమీపమునందే యమునానది పుట్టి వంకరగా ప్రవహించుచుపోవును. ఆగ్నేయమున శంతనుడు (Acherner) ఈనదికి ఆఖరున కలడని పాశ్చాత్యులందురు.

## ఈశాన్యము

సారథిమండలము బాగుగా ఉదయించినది. అజశాబకములతో బ్రహ్మహృదయము మిక్కిలి కాంతితో మెఱయుచున్నది. వాయవ్యదిగ్భాగమున బ్రహ్మయు, ఈశాన్యమున బ్రహ్మహృదయమును ఒకదానితోనొకటితుల తూగుచున్నట్లు తెల్లని తేజముతో మెఱసిపోవుచున్నవి. ఆదినుఁ భృగుపరశుమండలము చక్కగా కానవచ్చుచున్నది. ఆక్రింద నే పులోమరక్కసుడు గ్రద్దమీట కరించుకొనుచున్నాడు.

## మధ్యను

భృగుపరశుమండలమునకును, పురూరవసునకును మధ్య పాలవెల్లిలో అప్సరసలు వెలుగుచున్నారు. ఆదిను వను ఇంద్రమద (Andromeda), చ్యవన, అశ్వినీ, భరణి, రేవతి, ఉత్తరాభాద్ర, పూర్వాభాద్ర, ధనిష్ఠ నక్షత్రములు తూర్పునుండి పడమటకు వ్యాపించియున్నవి. ఇంద్రద్యుమ్న, భాద్రపదా నక్షత్రముల మధ్య కుంభరాశిగలదు. ధనిష్ఠలో దినుఁ శనియున్నాడు. మృగశిరార్ధమువఱకుగల వృషభమును, రేవతి దినుఁ శింశుమారమునను పరస్పర విరుద్ధజంతువులను రథమునకు పూనుకొని అశ్వినులు తమ అనన్యసామాన్య ప్రతిభను వెల్లడించుకొనుచున్నారు.

## గ్రహములు

శుక్రునికి వృశ్చికరాసిలోను, కుజునికి సింహకన్యారాసులలోను, గురుడు స్వాతిలోను ఉండుట చేత, ఈనెలలో రాత్రి తొలిజామున మనకు కనబడవు.

## ఉల్కాపాతములు

ఈనెల ౧౪-౧౬ తేదీలమధ్య సింహరాశిలో గొప్ప ఉల్కాపాతము కనబడును. మఘలో పల్లకీ బొంగు అనదగు చుక్క లున్నచోటినుండి ఉల్కలు రాలినట్లు కనబడును. ౧౭-౨౩ తేదీలమధ్య మెల్లగాను, ఉజ్వలముగాను, ఇంద్రమదప్రాంతములో ఉల్కలు రాలగలవు. ఈయుల్కలు పూర్వపు తోకచుక్కల తునకలని మనము మరువరాదు.

---



# కృ ష్ణా భి సా రి క

అడివి బాపిరాజు

శ్రీ తీర్థాల్రక్రుంకాను దేవుళ్లకొలిచాను
సౌందర్యజ్వలితం నీదుమోము చాశైపో
మెరాజా !

ఎన్నాళ్లు తిరిగేను
ఎన్నాళ్లు వెదికేను ?
నాథు డేడమ్మాని వీథిలో ప్రశ్నిస్తె
అడుగోని వాళ్లు గుళ్లో చూపించారు
రాతిబొమ్మ నన్ను రాతికళ్ల నవ్వె
ఎన్నాళ్లు తిరిగేను
ఎన్నాళ్లు వెదికేను
అడవిలోనే నీవు కనుపిస్తివని గాలి
కలకంఠరాగాన్ని కల్యాణి పాడింది;

నీలంచీర కట్టి నీలం రైక తొడిగి,
నగలూ వెలుగుల తొడిగి వగలూర కైసేసి,
కలలూర జడముడిచి కనకాంబరా లుంచి,
కమ్మని అత్తరు లలది కస్తూరి బొట్టెట్టి,
పళ్లేన పూలుంచి పళ్లూ భక్ష్యా లుంచి,
కృష్ణాభిసారికనై తృష్ణలూర వెడితి,
నాథునిజాడ లేదు, నవ్వైన వినపడదు,
మొదలే నరికినతరువు మోడై పడిపోయాను ;
నానాథ దయలేద నాప్రభూ ! నా ప్రభూ !
ఎన్నాళ్లు తిరిగేను,
ఎన్నాళ్లు వెదికేను?

# జపాను ఋజువర్తనము

గ. సత్యనారాయణ

జపాను బాగా నవనాగరికమై బలిష్ఠమై కీర్తివంత మయినదంటే, మనలో చాలామంది వుద్దేశ్యం అది బాగా పాశ్చాత్యుల ననుకరించగలిగినదనే తప్ప మరొకటి కాకుండావుంది. మనదృష్టి ముందుగా వారి స్త్రీలు జుట్టు కట్టు ప్రవర్తన మొదలగువానిలో పూర్వాచారములను త్రెంచుకొని ఉద్యోగరంగములోనికి దుముకుటవిూదికి ప్రసరిస్తుంది. కాఫీహోటళ్లలో వారే వడ్డిస్తారు, బస్సులు వారు నడుపుతారు, రైలుటిక్కట్లమ్ముతారు, బట్టలు మొదలగు దుకాణాలలో వారే వస్తువులను ప్రదర్శిస్తూ వెలలు చెప్పుతారు, ఫ్యాక్టరీలలో కూలికి పోతారు, సినీమాలలోను, టాకీలలోను నటిస్తారు, వైద్యంచేస్తారు, విమానాలు నడుపుతారు, బడులలో పాఠాలు చెప్పుతారు, జుట్లు కత్తిరించుకుంటారు, రంగురంగుల ఫ్రాకులు, గౌనులు, 'కిమానో' అనేరకం దుస్తులు ధరిస్తారు, స్వయంవరాలు చేసుకుంటారు, విడాకు లిచ్చుకుంటారు, రాజకీయాలలో దూరుతారు, యుద్ధాలకి వెళుతారు, సర్వవిధములైన స్వాతంత్ర్యాలు పురుషులతో సమానంగా అనుభవిస్తారు. పరిశ్రమలలో ఆదేశస్థులు పాశ్చాత్యులను తలదన్ని అన్నిరకములైన వస్తువులను వారికంటె తక్కువ వెలలకు ప్రపంచపు బజారులన్నిటిలో అమ్ముతున్నారు. సైన్సులో, పడవలు, విమానములు, ఆయుధములు మొదలగువానిని నిర్మించడములో పడమటివారితో సరాసరిగా తులమాగి వారికి గుండెలమీద కుంపటియైనారు. రాజకీయములలో జినీవా సభవారి యెత్తులకు పైయెత్తులు వేస్తున్నారు. విదేశాక్రమణములోను సామ్రాజ్యవిస్తీర్ణములోను ఎట్టి ఆటంకములనూ లక్ష్యముచేయకుండా ముందుకు త్రోసుకొని వస్తున్నారు. మనకు స్థూలంగా గోచరించేవి యీ పైచిహ్నములు మాత్రమే.

కాని యీసంపదనుమించిన ఒకసూక్ష్మసంపద, శీలసంపద వారికున్నదనిన్నీ అందువల్లనే వారు పాశ్చాత్యులను మించుచున్నారనిన్నీ మనలో చాలామందికి తెలియదు. వారికున్న ఋజువర్తనము, సత్యశీలము ప్రపంచములో బహుకొద్దిలెక్క జాతులవారికి మాత్రమే ఉన్నవని మనలో అనేకులకు తెలియదు. ఈ ఋజువర్తనము వారికి బడులలోను, కాలేజీలలోను నేర్చుకొనుటవల్లకాని కోర్టులలో విధించబోయే శిక్షలవల్లకాని లభించినది కాక స్వతస్సిద్ధమైనట్లు తోస్తుంది. ఇన్ని కాలేజీలు, పాశ్చాత్యవిద్య, పాశ్చాత్యపారిశ్రామిక వాణిజ్యజీవనము మొదలైనవి విజృంభించుచున్న కాలములో కూడా ఆశీలము చెడక మరింత మనోహరముగా వికసించుచుండుట చూస్తే మన కాశ్చర్యము వేస్తుంది. మైసూరుహైకోర్టు న్యాయమూర్తి ఎ. యస్. ఆర్. చారిగారు ఈమధ్యను ఆదేశమువెళ్లి ఇట్టి యోగ్యతను వారిలో కనుగొని మిక్కిలి ఆశ్చర్యపడినారు.

లంచములు, అసత్యములు, కృత్రిమములు మొదలైనవి పెద్దపెద్ద ఉద్యోగస్థులలోను రాజకీయవేత్తలలోను లేకపోవడము లేదు కాని, మన మాలోచించవలసినది అసంఖ్యాకమగు జనసాధారణమును గూర్చి. లేమి నీమమును చెరుస్తుంది. దరిద్రులు అకార్యములను చేయుదురు అనుకొనుటకు కూడా అక్కడ వీలులేదు. జపానులో పెద్దపెద్ద భాగ్యవంతులున్నా కొన్నితావులలో మనదేశములోకంటెనూ దరిద్రులు లేకపోవడము లేదు. మధ్యతరగతి సంసారు లెట్టినీతివంతులో వారును అట్టి నీతివంతులే. ఈనీతివర్తనము వారికి వారి మతవిశ్వాసములవల్లనే లభించిన దనుకోవాలి.

జపానుదేశములో మనదేశములోలాగున మంటిగోడలు, ఇటకగోడలు లేవుగదా, అన్నీ అట్టగోడలే

గదా, పబ్బని బద్దలతో చేసిన కట్టు కిటికీలుగదా, తలుపులకు తాళములు వేసుకొనేవారు వేసుకుంటారు. లేనివారు లేదుగదా, పగలల్లా పిల్లలూ పెద్దలూ స్త్రీలు చదువులకో, కూలీలకో, ఉద్యోగములకో పోతారు గదా, అయినా యిల్లి దోపిడులు దొంగతనములు అన్న మాట వుండదట. పట్ణాలలో ట్రాముకారులలో వేల కొలది జను లెక్కుతూ దిగుతూ వుంటారు. టిక్కట్టు కలెక్టర్లకు టిక్కట్లు కత్తిరించి యిచ్చినందుకు, కొనుక్కొన్నవారెవరో లేనివారెవరో గుర్తు పట్టేందుకే అవకాశం వుండదట. మనదేశములో అయితే అవకాశం దొరికితే చడీచప్పుడూ లేకుండా దిగిపోతాము. వారు టిక్కట్లుతప్పకుండా కొనుక్కుంటారు. కొనుక్కొంట కవకాశం లేనివారు తాము దిగిపోయేముందర బండి నాపి, టిక్కట్టుకొని, కత్తిరింపించి, రద్దయిన టిక్కట్టును ఒకపెట్టెలో పడేసి మరీ దిగుతారు. (ఆదేశంలో చెన్నపట్ణంలోలాగ టిక్కట్టు పట్టుకొని దిగిపోకుండా ఒకపెట్టెలో పడీవలసిన పద్ధతి ఉంది.) రైలుస్టేషనులలో కూడా అంతే. టిక్కట్టుకలెక్టర్లు నామకాగా వుండడమే తప్ప, దొంగప్రయాణికు లెన్నడూ వారికి చిక్కరు. టోకియో, మాత్సువా, దైమారు మొదలగు పెద్దపెద్దపట్టణాలలో, బట్టలదుకాణాలు యెనిమిదేసి అంతస్తుల మేడ లుంటాయిట. వానిలో బట్టల మడతలు ప్రోవుప్రోవులై పడివుంటాయి. ఎవరికి కావలసినది వారు తీసుకోవడం, దానిమీద వున్న ఖరీదు యిచ్చేసి, రసీదు పుచ్చుకొని దిగిపోవడం. వందల కొలది జనులు బేరాలకి వస్తూ పోతూ వుంటారు. కాపలాకుఱ్ఱవాళ్లేనా వుండరు. ఎవడైనా కమ్కా_ర్తి వాడు రెండుమడతలను చంకలోనో సంచీలోనో పెట్టేసుకుంటే కనిపెట్టేవారే వుండరుట. అయినా అట్లెవ్వరును చేయరట. పైగా రాత్రిళ్లీ కొట్లకు తాళాలు వేయడం తలుపులు మూయడంకూడా వుండదట. వర్తకులు ఠీకుగా ఒకటేఖరీదు చెప్పడం తప్ప బేరం చేయడంలో కాలహరణ మేమీవుండదు.

వారి సత్యశీలమెట్టిదో భూతదయయు అట్టిదే. జంతుప్రదర్శనశాలలు ప్రతీనగరములోను వుంటాయి. అక్కడే తినుబండారముల దుకాణములుకూడా వుంటాయి. పేదాసాదా వాటిని చూడడానికి వెళ్లుతారు. దుకాణాలవద్ద మనుష్యు లుండరు. ప్లేట్లు లుంటాయి, ఖరీదుచీట్లు వుంటాయి. ఖరీదునాణెమును అక్కడ వుండే స్లాటులో పడేసి ప్లేటు తీసుకొని యేనుగులకో, లేళ్లకో, కోతులకో, పులులకో తినిపించేస్తారు. అంతే కాని యెవ్వరూ ఊరికే తీసుకోరు. సాయంకాలము గుమాస్తాలు వచ్చి లెక్కలు చూచుకుంటే రొక్కము సరీగ్గా సరిపడుతుంది.

జపానుదేశము గత యాభయిసంవత్సరాలలోను అంత శ్రీమంతమైనా, ప్రజలుమాత్రము పాశ్చాత్య దేశాలలోలాగ భోగలాలసులు, జిహ్వాచాపల్యము కలవారు, కష్టమంటే వెఱచువారు కాలేదు. నాటకాలు, సినీమాలు మొదలగు ప్రదర్శనాలకు వెళ్లేవారైనా కేవలము వేడుకకొరకు,లోకజ్ఞానముకొరకు వెళుతారు కాని అదో వ్యసనంకింద వెళ్లరు. స్త్రీలు శిశువులను వీపులకు కట్టుకొని వాటిని చూడడానికి వెళ్లుతారు. హాస్యరసమొలికే రంగములు ప్రదర్శించబడుతున్నప్పుడైనా ఆడవాళ్లు పెదవులు విప్పి పళ్లిగిలించి చెవులు చిల్లులు పడేటట్లు నవ్వక, ఆట మూసేసి వస్తారుట. మగవాళ్లూ అంతే. పడమటిదేశాలలో అయితే గోడలు ప్రతిధ్వనించేటట్లు నవ్వుదురు. ఇక పిల్లలు కిక్కురుమనరు, ఏడవరు. వాళ్లను కట్టిపెట్టిన పటకాలు నొక్కిపెట్టు తున్నా కాని మిణుకుమని చూస్తూవుంటారు. మన దేశంలో అయితే అసలు నాటకంకంటె పిల్లల యేడుపులు, తల్లుల సమాధానపరచడమే పెద్దనాటకమై ప్రేక్షకుల దృష్టి అంతా ఆడవాళ్ల గ్యాలరీమీదకే వాలుతుంది. కాని ‘ జపాను స్త్రీలు నవ్వరు, జపాను పిల్లలు యేడవరు ’ అని చెప్పింది ఒక ఆవిడ.

కలరా, మలేరియా, ప్లేగు మొదలగు అంటువ్యాధులు వస్తే, ఏయేవస్తువులు తినరాదో తినవలసినవైనా యెన్నిసారులు మాత్రమే తినవాలో ప్రకటించేస్తారు. ప్రజలావిధముగానే వర్తిస్తారు. వచ్చినరోగము వచ్చినట్లే పోతుంది కాని వ్యాపించడానికి మరి అవ

కాశం వుండదు. ఇట్టిశిక్షణము, విధేయత వారికి లోక వ్యవహారములయందే కాక మతవ్యవహారములయందు కూడా వున్నది. ఆదేశంలో పూర్వం జనసంఖ్య తక్కువగాను, భూమి విస్తారముగాను వుండేది. చనిపోయిన వారిని ప్రాతిపెట్టి దానిచుట్టూ ఎక్కువస్థలము నావరణముగా వుంచేవారు. ఎక్కడచూచినా రుద్రభూములే. ఇప్పుడు జనసంఖ్య పెరిగినది. వ్యవసాయమునకు భూమి చాలదు. వ్యర్థముగా చాలా భూమి రుద్రభూమిక్రింద నమోదై వుండెను. ఆవరణలు తీసివలసినదనీ, కొంచెము జాగాలో పట్టునన్ని శవములను ప్రాతిపెట్టవలసినదనీ, వారి తాలూకు బుగ్గిని మాత్రము తీసుకొనిపోయి దేశాచారముప్రకారము ఇండ్లలో పితరులపూజలు చేసుకోవలసినదనీ శాసనము ప్యాసు చేసినారు. మనదేశంలో అయితే సనాతనులందరూ 'మామతాన్నంతటినీ తగలేస్తున్నారు. రాణీగారి శ్రీముఖం చించేస్తారా?' అని కేకలువేసిపోదురు. కొట్లాటలు యుద్ధాలు కూడా వచ్చేసియుండును. కాని ఆదేశంలో యెవ్వరూ కిక్కురు మనలేదు. ఈ శాసనమువలన దేశమునకు రెండులాభములు కలిగినవి. వ్యవసాయమున కావిస్తారము భూమి చిక్కి ప్రజలార్థికముగ బాగుపడినారు. దేశమా యెక్కడపడితే అక్కడ రుద్రభూమియై ప్రేతకళలాడుతూ, అనారోగ్యకరముగా కంపుకొడుతూ వుండక జనావాసములూ స్మశానములూ వేరువేరుగా యేర్పడ్డాయి.

ఈవిధమైన సుఖమునెడల నపేక్ష, దుఃఖమునెడల నుపేక్ష ఒక్కొక్కసందర్భములో మరీ విపరీతముగా కనుపించుతుంది. ఒకయువకుడూ ఒక యువతీ పరస్పరము ప్రేమించుకొనిరి. ఏకారణం చేతనో భూమి మీద మరి జీవింపనొల్లక ఆత్మహత్య చేసుకొనగోరి అగ్నిపర్వత శిఖరమునెక్కి క్రిందనున్న మంటలలోనికి దుముకగోరిరి. అట్లు గెంతడములో సరిగా మంటలలో పడక సగము త్రోవలో రాళ్లమధ్య చిక్కుపడి క్రిందకు పడలేకుండా, మీదికి పోలేకుండా విషమస్థితిలో వుండిపోయినారు. ఇదే భయంకరదృశ్యమైతే, ఇంతకంటెను ఆశ్చర్యకరమైన విషయము వేఱొకటి. ఆత్రోవను పోవుచూ వారిని చూచిన తోడి దేశీయులు వారిని తప్పించుటకు ప్రయత్నముచేయుట మాని "వారికిష్టమై వారట్లా పడినారు, పాపము. మనమెందుకు తప్పించవలె" నని ముభావముతో పోవుచున్నారు. వారికతి చావూ కాకుండా బ్రతుకూ కాకుండా యెట్టి అవస్థలో వుంటుందో వూహించుకోవచ్చును. ఎవరో డిపార్టుమెంటులువారు మెల్లిగా వారిని తప్పించినారట.

ఏదైనా దేశము జర్మనీయే కానీండి, ఫ్రాన్సు, ఇటలీ, ఇంగ్లండు, జపాను మొదలుగాగల మరి యేదైనా కానీండి వృద్ధికి వచ్చినదంటే దానికి ఏవో కొన్ని ఆర్థిక భౌతిక కారణాలు మనకు స్థూలంగా కనిపించుతాయి కాని, నిజంగా ఆలోచించితే వారి శీలమునకు సంబంధించిన కొన్ని మానసిక సుగుణములు, ప్రవర్తనములు దానికి ఆంతరంగికకారణములుగా వుంటాయి. ఆంగ్లేయుల ప్రతిభకు వారు సముద్రపు దొంగలు కావడము, మహమ్మదీయుల విజృంభణమునకు వారు కత్తిపట్టుకొని నరకడము, జర్మనులగొప్పకు వారి శాస్త్రజిజ్ఞాస కారణాలని మనము స్థూలముగా అనుకుంటాము. కాని వారి శీలములను పరిశీలిస్తే, వీటికన్నిటికీ కారణమైన యేదో ధర్మానురక్తి వుండితీరవాలి. మనభారతదేశము వృద్ధికి రావలెనన్న మనయొక్క వివిధజాతిమతభేదముల కంతర్గతమై సర్వసాధారణమైన యుత్కృష్టధర్మమేదో గుర్తించి, యోగులు, సాధకులు, కవులు, ప్రచారకులు, నాయకులు ఆతీగను కదిలించి ఆలాపన ప్రారంభించి పాటసాగించితే తక్కిన భౌతికవిభూతులన్నీ వాటంతట అవియే దాని చుట్టూ మూగుకుంటూ వస్తాయి! కేవలము ఆదేశముల వాలకాలూ ఈదేశముల వాలకాలూ పరిశీలిస్తూ వారి లాగ నౌదామని పైపైనిరంగులు మార్చుకోవడంలో కాలయాపనం చేయకుండా, ఆధర్మమేమిటో గుర్తించవాలని మనకు స్థిరమైన సంకల్పమే వుంటే దానిని కనుక్కోవడము దుర్ఘటము కాదు. కనుక సంస్కారు

లము, సనాతనులము, రాజకీయవాదులము, ఆర్థికవాదులము, ఆర్యుల మనుకొనేవారము, అనార్యుల మనుకొనేవారము, ఆదిమనివాసులు అనంత రాగంతుకులు అని చరిత్రకారులచే పిలువబడి విశ్వసించువారము, ఇక ముందల్లా ఈదేశముతోనే మనకు ముడి అని భావించుకొనేవారమందరమూ, ఈ ఆర్యావర్తమునకు, ఇందలి నివాసమువలన దీనిధర్మము ఎంతో కొంతవరకు పట్టి తీరవలసిన యిందలి ప్రజలమగు మనము సామాన్యమైన ఆధర్మమేదో గుర్తించుటకై ప్రయత్నము చేయుదము గాక!

---

### "ప్రేమ" అనే రోగముయొక్క చిహ్నములు



# పాత పాటలు

నేదునూరి గంగాధరం

లక్షాధికారివి నీవు అన్నయ్యా
నీకు లక్ష్మితోడు నీవు నాకుతోడు. ౧

అల్లుడల్లూడంటె వాళ్లు మండేను
అల్లు డత్తకు తెచ్చు అద్దాలరవికె
విప్పకొని తొడిగితే నిప్పలురాలు
మళ్లీతొడిగితేను మల్లెలురాలు. ౨

'వీథిలోకి విద్వాంసు లాడవచ్చినారు
అమ్మ! నేవిద్వాంసులఆటచూడవెళతా'
'కూతురా! నీవల్ల గుణముగలిగుంటె
విద్వాంసులుగారమ్మ బుద్ధిమంతులు' ౩

చిటపటచిటపట మెటికెలు విరుచుచు
చిటికెలువేయుము బొటకనవేలా
చూడూచూడని చూపుడువేలా
ఊరూఊరని ప్రారించకుమీ
పొడవుగనున్నా నడిమీవేలా
చుట్టూతిరుగుచు సున్నలుచుట్టూ
ఉంగరమున్నా ఉంగరంవేలా
అటుఇటుఆడుచు నాట్యముచేయి
చిన్నాచిన్నా చిటికెనవేలా
ఒక్కటిఅంటూ లెక్కాపెట్టు. ౪

చిట్లపొట్లకాయ చిమ్మనేరెడుకాయ
గొల్లపుచ్చకాయ గోరుచిక్కుడుకాయ
అత్తకుపెట్టుదు అల్లం నేతిందు బెల్లం
కొత్తకుండల్లాల్లా గోధుమల్లాల్లా
పాతకుండల్లాల్లా పసిబిడ్డల్లాల్లా
పేపే గుర్రం పెండ్లికి పోయె
తామరగుంటు నీరొచ్చె
గారాబూరా దసుక్కు
సూదా దబ్బనమా. ౫

చేతకానిపనులు చేసితే రోత
నీతిమాలినచోట నిలుచుంటెరోత. ౬

అల్లము తిన్నాడు బెల్లములాగ
ఆలినేలినాడు ఆరాములాగ. ౭

చుట్టాలుకలరని చూడవెళ్లితే
మంచాలుదిగలేదు మాటాడలేదు
వచ్చినచుట్టాల్ని వాకిట్లోపెట్టి
వడ్లవాయిపెట్టారు వదినకన్నవారు. ౮

కృష్ణస్వామి నలుపు కృష్ణమ్మ నలుపు
కృష్ణమ్మ అవతారాన అన్నల్లు నలుపు
రామస్వామి నలుపు రామన్న నలుపు
రామావతారాన అన్నల్లు నలుపు. ౯
కోనా కోటల కొడుకులెందరు
ముదుసలిముత్తయిదువ మనుమలెందరు. ౧౦

వడ్డాదికొండమీద వడ్లెండబోసి
రాచిలుక పోచిలుక వడ్లుదంచుదాము
అల్లంవారి కుక్క వచ్చి కూడుముట్టంగ
కూడుముట్టినచోట కుంకమ్మురాలు
మనము తిన్నకూడు మల్లెల్లురాలు
రాచిలుక పోచిలుక వడ్లుదంచుదాము
పోదాము మనమింక పొద్దుపోయింది. ౧౧

'గట్టమ్మటవెళ్లేన పొట్టికోమటి
మాయప్ప బాలింత పసు పిచ్చివెళ్లు
మాయన్నపూజారి పువ్వు లిచ్చివెళ్లు
మావదినపునిస్త్రీ పుస్తె లిచ్చి వెళ్లు'
'గట్టమ్మట వెళ్లేవు ఓబాపనయ్య
ఆకు లక్కడబెట్టి కడ వెత్తవయ్య'
'కడవెత్తినందుకు ఏమిలంచమ్మ'
కర్ణపువ్వులు లంచమ్మ కడవ లంచమ్మ. ౧౨

ముక్కుపుడకపెట్టింది ముక్కు తిప్పింది
ముసలివాడిభార్యకు ఎంతగర్వమ్మ. ౧౩

బండమ్మ బండి ఆలకుచ్చులబండి
సుబ్బారాయడి పెళ్లంట చూచివద్దాము
రండి. ౧౪

ఆలకింతము రండి ఆడుకొందము రండి
ఆకులు పాకులు తెండి ఆయన కిద్దము రండి
చెట్లదగ్గిరకు రండి చేమంతిపువ్వులు తెండి
పందిరిదగ్గరకి రండి మల్లెపువ్వులు తెండి. ౧౪

ఓరోరి బ్రహ్మన్న ఓరోరి బ్రహ్మన్న
నక్కలకాలవదాటి కిందపడ్డావు
సూదిపడిపోయింది సోదికెళ్లావు
ప్రయాసపడ్డావు డబ్బుఖర్చయ్యె. ౧౬

ఈవేళ మావడ్లు నలగవు కాబోలు
ఎలుపూడిసంతకు వెళ్లవు కాబోలు
ఏగాణివెల్లుల్లి జీలకర్ర తేరు కాబోలు
ఎగరేసితాళింపు పెట్టను కాబోలు. ౧౭

* అద్దగోడమీద ముద్దపసుపు
అందిపుచ్చుకో బూచమ్మ
కూతురిని నేనేగాదా
బుద్ధిమంతురాలను నేనేకాదా
ఆకులుపాకులు నావేకాదా
అంగలగుర్రాలు నావేకాదా
తోలుకురా చిన్నన్న
దొడ్డిపెట్టుపెద్దన్న
కట్టివెయ్యి బుల్లిబాబు
పాలుపితుకు పెద్దబాబు
చల్లచెయ్యి పిన్నమ్మ
చల్దిపెట్టు మాయమ్మ ౧౮

తెల్లగుర్రాన్నెక్కి వెళ్లేవురాజ!
ఏఅత్తకడిగింది చిన్నిపాదంబు
ఆడబడుచుకొడుకని వారల్లుడని
నీళ్లుబోసి కడిగితేను నిష్ఠూరమని
ఆవుపాల కడిగింది అల్లుడిపాదంబు. ౧౯

---

* పొట్టిగోడ




కొ. నరసింహాచారి

## కాగితపు చాపలు

ఎట్టి అల్లికయందును పడుగు, పేక యని రెండువిధములు చేరవలెను. పడుగు అనగా నేతయందలి నిడుపు నూలు. పేక యనునది నేతయందలి అడ్డనూలు. కాగితపు చాపలందు నూలునకు బదులుగా కాగితము ఉపయోగింపబడును. ఇందు పడుగుతునుక లన్నియు నొకే కాగితమున కోయబడి ఒకదానికొకటి కొనలయందు చేరియుండును. పేకతునుకలు వేర్వేరుగా నుండి వివిధవర్ణములతో నుండవచ్చును.
















పడుగుకాగితము

చిత్రము 1 యందలి విధముగ నొక a b c d అనుకాగితమును సుమారు 8" × 6" పరిమాణము గలదానిని దీసికొనవలెను,

దానియందు అంచులచుట్టు ఒక అంగుళము వెడల్పున వదలి e f g h అనునొక దీర్ఘచతురమును (6" × 4") గుర్తించుకొనవలెను. అందు e f, g h అను రెండు వెడల్పుప్రక్కలందును పాతిక అంగుళపు గుర్తులు i k m, j l n అనువిధముగా గుర్తించవలెను. fh, ij, k l, m n, అనువిధముగా రేఖలను b d కి సమాంతరముగా e g వఱకు వేయవలెను. ఈరేఖలవెంబడి వాడియగు కత్తితో కోతలు వేయవలెను. అపుడు ఈతునుకలన్నియు కుడియెడమప్రక్కలందు చేరియుండి మధ్యభాగమునమాత్రము వేర్వేరుగా నుండును. ఈ తునుకలు సరిసంఖ్య గలవిగానైనను, బేసిసంఖ్యగలవిగానైనను ఉండవచ్చును.

పేకతునుకలు

మనకిష్టమగురంగులకాగితమున పడుగుతునుకల వెడల్పునకు, అనగా పాతిక యంగుళము వెడల్పును, a b కి సమమగు పొడవును గల తునుకలను వేర్వేరుగా కత్తిరించుకొనవలెను. (చిత్రము A)

తర్వాత నొక చీపురుపుడక (చిత్రము 2 a)ను దీసికొని దానికొనను కొంత చీల్చి ఆచీలికయందు పేకతునుకనుపెట్టి(చిత్రము 2, b) అల్లికను ప్రారంభించవచ్చును. పేకతునుకను పడుగుతునుకలకు క్రిందునను, మీదునను తీసికొనుచుపోయిన అల్లిక యేర్పడును. (చిత్రము 1 w)

చిత్రము 3, a యందు పేకతునుక ఒక పడుగుతునుకమీద ఒకతునుకకు క్రిందుగను ఇదేవిధముగా ఒక్కొక తునుకను మాత్రము క్రిందుమీదు పలచుచు పోవుటవలన నేర్పడిన రూపము. చిత్రము 3 b యందు పేకతునక మొదట నొక పడుగుతునకకు పైనను ఒకపడుగుతునకకు క్రిందను తర్వాత రెండు పడుగుతునకలకు పైనను ఒకతునకకుక్రిందను పోవలెను. ఈచాపలందు తెల్లగానుండుభాగములు పడుగుతునుకలయొక్క భాగములు. నల్లగానుండునవి పేకతునుకలు పోవురీతిని తెలుపును. చిత్రము 4 నందలి చాపయందు మొదటిపేకతునుక a, b, c, d అను పడుగు తునుకలకు క్రిందుగను తక్కినవాటికి మీదుగను పోవును. తక్కిన తునుకలను అల్లురీతి చిత్రమున సులభముగా తెలియును. అల్లికయందు పడుగుపేకల సంఖ్యను మార్చుచు వచ్చిన దానికి తగినట్లు చాపల రూపము మారుచు వేర్వేరు విధములు ఏర్పడును. చిత్రములు 5, 6 ఇట్లేర్పడిన వేరురూపములు. చిత్రము 6 ఒక పెద్దచాపకు దృష్టాంతము. పడుగుకాగితము మన యిష్టము వచ్చిన పరిమాణమున నుండవచ్చును.

పేక లన్నిటిని అల్లినవెనుక చాప నంతయును మరియొక కాగితముపై నతికించిన యెడల పేకలు వీడిరావు. తర్వాత నీచాపను అద్దపుచట్టమునందు గూడ బిగించవచ్చును.




## గ్రంథవిస్తరభీతి

కర్త: జాన్‌సన్‌కవి.

అనువాదకర్త: మల్లవరపు సుబ్బారావు, బి. ఏ బి. ఇ డి.

ఆధునికయుగంలో గ్రంథరచన మితిలేకుండా వున్నది. ఏవేళ చూద్దామన్నా, నూత్నగ్రంథాలనుగురించి క్రొత్తక్రొత్త ప్రకటనలు వెలువడుతున్నాయి. ఈ గ్రంథాలు మన్ని మనపూర్వీకులకంటె సులభముగా విజ్ఞానము సంపాదించగలమని మురిపిస్తున్నాయి.

వీటిని వ్రాసే కవిసమూహాలవల్ల మనసౌఖ్యమూ, విజ్ఞానమూ, ఎంతవరకు అభివృద్ధి చెందుతున్నాయో నిశ్చయించడం అంత తేలికైన పని గాదు.

మనకు ఇంతకుపూర్వం తెలియని విషయాలు ఎవరు బోధిస్తారో వారు నిస్సందేహముగా గురువులే— అందుచేత పూజనీయులే.

ఎవరు మనకు ముచ్చటగొల్పే రీతిని హృదయ రంజకంగా విజ్ఞానాన్ని బోధిస్తారో, వారిని ఉపకారులని భావించవలసినదే. ఎవరు ఒకఅమాయకపు అనుభవంతో మానవజీవితాన్ని అందచేస్తారో, వారిని మిత్రులవలె ఆదరించాలిసిందే.

కాని, రంజింపచేయడానికిగాని, బోధించడానికిగాని ఏఆశయమూలేకుండా, తమ గ్రంథసంపుటాలతో ఈ ప్రపంచాన్ని నింపేసేవారు కొందరున్నారు. ఈ కవులలో, ఏవో రెండుగ్రంథములు దగ్గరుంచుకొని మూడవది కూర్చడం తక్క వేరొకపని ఉండదు, వారికి. ఆకూర్పులో కూడా, వారికి స్వంతసామాగ్రి లేకపోవడం సరికదా, ఇదివర కాగ్రంథములలో ఆకవులు చూపిన పరిశీలనాశక్తి కూడా ఉండదు. అట్టికూర్పులన్నీ నిష్ప్రయోజనములని నేను చెప్పను. ఎందుచేతంటే, శాస్త్రం తీసుకోండి. అందు అనేకవిషయాలు తరచుగా అనేకగ్రంథాలలో చెదరివుంటాయి. ధీశాలురైన రచయితలు, అప్పుడప్పుడు ప్రధానాంశం వదలి, ఎక్కడో మారుమూలలనున్న విషయములపై సందర్భానుసారంగా వారి అభిప్రాయాలు వెలిబుచ్చుతారు. అవి మామూలుశాస్త్రచర్చలకంటె ఎక్కువ విలువైన వయిఉంటాయి, తరచుగా. అవి ఇంకా ఇప్పటికికూడా ఎవరికీ తెలియకపోయి ఉండవచ్చు. ఎందుకంటే, వాటికేశీర్షికలలో ఆవిషయములు ఉన్నట్టు సూచింపబడక పోవడంవల్ల. ఎవరైతే ఉచితమైన శీర్షికలక్రింద అట్టివిషయాలు సేకరిస్తారో వారు నిజంగా గొప్పసేవ జేసినవారవుతారు. అట్టివారు ఈసేకరించడంలో అంతగా కష్టపడకపోయినా, ఇతరుల అభివృద్ధికి తోడ్పడినవారవుతారు. ఎక్కడో ఇదివరకు విడిగా వ్రాయబడినవి సేకరించడంవల్ల ఆవిషయాల్లో ఆశక్తి గలవారు, సావకాశంగా వాటిని బట్టి క్రొత్తవి పరిశోధించడానికి వీలుంటుంది.

కాని ఈమధ్య ఏకధారక్రింద ప్రవహించిన కొన్ని సేకరింపులు, ఎక్కువ కాలమూ, చర్చా, ధనవ్యయములతో కూడినవైనప్పటికీ, కావలసిన అవసరములను తీర్చడంలేదు.

"దుష్టసంఘానికి నిబంధనలు అనేకం" అన్నారు, వెనకటికి ఒకరు. అలాగే "మూర్ఖయుగములో గ్రంథము లనేకం" అంటే, ఎంతవరకు సమంజసమో నాకు తెలియదు. గతకాలపు విజ్ఞానధనము పూజానైవేద్యములు లేక బూజు పట్టిఉన్నా, స్వయంశక్తియుక్తులు గల గ్రంథకర్తలకు తగినంత ప్రోత్సాహం లేకపోగా,

ఈపూర్వసుగాంద్రవహా, గ్రంథచోరులహా ఎక్కువ ఆదరణ చూపుతున్నారు, చాలామంది. ఇదివరకు గ్రంథరూపంలో ఉన్న విషయాలే మన సోమరితనంచేత మనం తెలిసికోలేకపోగా, వారు వాటితో గొప్పవా రవుతున్నారు. అయినప్పటికీ ఇట్టి గ్రంథకర్తలు విచ క్షణలేకుండా, వాఙ్మయవీథినుండి ఆవలకు తరుమ బడడం లేదు. సత్యము సౌందర్యమువలెనే వేషం మారుస్తూ ఉంటుంది. అసత్యమే వివిధమనములకు బోధించాలంటే వివిధములైన వేషగాండ్రు కావాలి. ఎవడైతే, కాలప్రభావముచే వెనుకకు నెట్టబడిన విజ్ఞా నాన్ని మానవ దృక్పథమునకు తెస్తాడో, వాడు నిజంగా వాఙ్మయాన్ని అభివృద్ధిపరుస్తున్నాడన్నమాట. జాతుల యొక్క ఆచారవ్యవహారాలు మారుతూ ఉంటాయి గనుక నూతన విషయాసక్తులు కావలసి ఉంటాయి. క్రొత్త వూహాకల్పనలు అవుసర మవుతాయి. ఎవడైతే అప్పటి కాలపు అభిరుచికి సరిపోయేటట్లు వ్రాస్తాడో, వానికి ఎప్పుడూ పెక్కుమంది-అంతకంటె ధీకార్యము చూడనివారు-పాఠకు లుండవచ్చును.

రచయితలందర్నీ ఏదో ఒక క్రొత్తవిషయం చెప్పమని నిర్బంధించడం అంటే, కవులసంఖ్య తగ్గిం చడం అన్నమాట. మంచి సారవంతమైన బుద్ధిబలము కలవార్ని క్రొత్తవిషయాలుమాత్రమే చెప్పండీ అంటే, అతడు వ్రాసిన పెక్కుసంపుటాల గ్రంథాన్ని నాలుగు పుటలలోకి క్లుప్తంచేయడం అన్నమాట. అలాగైనా అక్కడ తప్పనిసరిగా కొంత కథనము ఉండకతీరదు. చెప్పిన భావాన్నే పదేపదేసారులు వెలిపుచ్చుతూన్న గ్రంథాలతో భాండాగారములను ఎంతమాత్రమూ నింపకూడదు. అలాచేస్తే ఒకేజాతి పుస్తకములను, వింతవింతరీతిగా అలంకరిస్తున్నా మన్నమాట.

ఈ రెండోతరగతి వ్రాతగాళ్లు కావించిన మంచిగాని, చెడుగాని అట్టేకాలము మన్నేదికాదు. ఇవి వేషాలూ, అభిరుచులా మార్పులమీద బయలుదేరు తవి గనుక సాధారణంగా క్రొత్తవేషాలు, క్రొత్త అభి రుచులు రావడంతోనే, అవి అదృశ్యమవుతాయి.

ఏజాతిలోనైనా తరతరాలవరకూ ఖ్యాతినిల్పుకొన్న కవులసంఖ్య తక్కువ. ఎంచేతంటే, అప్పటి అభిరుచి, తాత్కాలికవాంఛ, లేక తాత్కాలికసంతుష్టి చేకూర్చ డమే తప్ప, మరొక ఇతరస్వశక్తి, సాహసంగల కవుల సంఖ్య తక్కువ గనుక.

కాని ఈకవులు భవిష్యత్కీర్తిని గురించి వైరా గ్యం దాల్చినా, వారు ఇప్పుడు చేసేహానీ, అల్లరీ మాత్రం తగ్గించాలి. వారు శాశ్వతకీర్తి సంపాదించ లేకపోయినా, ఇప్పుడు నిరపాయంగా ఉండాలి. వారు ఇతరులకు చెప్పేముందు, వారికి వారే చెప్పుకోవ డానికి ప్రయత్నిస్తూ, వారిశక్తి, పలుకుబడీ సత్కా ర్యాలకై ఉపయోగించాలి.

కాని వాఙ్మయముయొక్క ప్రస్తుతస్థితి ఎలా వుందంటే "ఒకగొప్ప గ్రంథము ఒకగొప్ప ఉపద్రవ" మని వూహించిన ఆపూర్వపురుషుడు "పెక్కుగ్రంథ ములు పెక్కు ఉపద్రవాలని" అనుకోవలసినంత స్థితి వచ్చింది.

ఒక సంవత్సరం కూర్చొని ఒకపెద్ద సంపుటం వ్రాసిన గ్రంథకర్తా, గంటగంటకూ ప్రకటనపుస్తకాలు తయారుచేసేవాడూ, ఇద్దరూ కూడా మానవజీవితాన్ని సమానంగా వృథాపుచ్చుతున్నారని ఆతని యూహ. వారిద్దరికీ ఏమాత్రమూ భేదం లేదంటాడు. పైబడి చీల్చుకుతినే అడవిజంతువుకీ, కాళ్లతో తన్నుకుపోయే గ్రద్దకూ ఎంత తేడావున్నదో, వీరిద్దరికీ అంతే తేడా ఉందంటా డతడు.

---

## చక్రవర్తిశబ్దము

ఈశబ్దమును గురించి వివేచనవేయుచు నొక వ్యాసము 'విశాలభారత'(౧౯-౩౩ మే)లో ప్రకటింపబడి నది. దానిని అనువదించుచు వాకాటి రాధాకృష్ణయ్యశెట్టి గారొకవ్యాసమును పంపినారు. దానిసారాంశమిది:—

ఈశబ్దమున కర్థమేమి? మనవారే యర్థములో దీనిని వాడినారు?

అమరసింహుడు దీనికి పర్యాయపదముగా సార్వభౌమశబ్దమును పేర్కొన్నాడు. కాళిదాసు రఘువంశచక్రవర్తులను వర్ణించుచు 'ఆసముద్రక్షితీశానాం' అనునొకవిశేషణమును వారికి తగిలించినాడు. రాజశేఖరుడు కావ్యమీమాంసలో ఈశబ్దమును వివరించుచు నిట్లు చెప్పినాడు: "దక్షిణాత్సముద్రా దుదీచీం దిశం ప్రతి యోజనసహస్రం చక్రవర్తిక్షేత్రమ్. తతఃపరం దివ్యాద్యాః" అని. అనగా దక్షిణసముద్రముమొదలుకొని ఉత్తరముగా వేయియోజనములదాక గల భూమికి చక్రవర్తిక్షేత్రమనెదరట! దానితరువాతిది దివ్యభూమియట! ఈ చక్రవర్తిక్షేత్రమునకు ప్రభువు చక్రవర్తి. మరియొకచోట ఆయనయే ఈ భారతవర్షము ఇంద్రద్వీపము, కశేరుమంతము, తామ్రపర్ణము, గభస్తిమంతము, నాగద్వీపము, సౌమ్యము, గంధర్వము, వరుణము, కుమారీద్వీపము నని తొమ్మిదిభాగములుగ నున్నదని, కుమారీద్వీపమునుండి యుత్తరముగా వేయియోజనములనేలను జయించినవాడు చక్రవర్తి యని చెప్పినాడు. ఈరెండంశములను పర్యాలోచించగా తేలునదేమన, చక్రవర్తిక్షేత్రమునకు ఉత్తరసీమ బిందుసరము, దక్షిణసీమ కుమార్యగ్రమునని. కుమారీపురమునకే కుమార్యగ్రమని యిప్పటివ్యవహారము. కాని బిందుసరస్సెక్కడనున్నదో తెలియదు. హిమాలయమున కుత్తరమున నది యున్నట్లు పురాణములు చెప్పుచున్నవి. ఈ హిమాలయపర్వతములోనే యొకచోట కైలాసమున్నదనియు, అది ఈశ్వరవాసస్థానమగుటచే దేవతలక్కడ వసింతురనియు నందురు. ఇందువలన 'తతఃపరం దివ్యాద్యాః' అన్నదానికిగూడ నర్థము చెప్పవచ్చును. మహాభారతమును బట్టికూడ ఆనాడు ఎవరును హిమాలయమును దాటి యెరుగరని తెలియుచున్నది. అర్జునుడుకూడ తీర్థయాత్ర వెడలుచు హిమాలయమునుదాటి పోబోగా నక్కడి ద్వారపాలకులచే నిరోధింపబడెనట!

ఈ యన్నిసందర్భములను పోల్చి, కలిపిచూడగా మనకు నిష్కర్షగా తేలునదేమనగా, చక్రవర్తియనగా సంపూర్ణభూమండలము నేలువాడనికాదు అర్థము; మరి కావ్యమీమాంసలో చెప్పినట్లు కుమార్యగ్రము మొదలు ఉత్తరము మంచుకొండ ప్రాంతపు బిందు సరోవరము వరకు పాలించువాడని. "అయినప్పుడు సార్వభౌమశబ్దమునకు దీనికి నెట్లు జతపడుట! సర్వభూమీశ్వరుడు కదా సార్వభౌము డవును?" అనిన నిట్లు సమన్వయపరచవచ్చును. ఆనాడు హిమాలయోత్తరదేశము దివ్యస్థానముగ భావించినందువలన నందు మనుష్యులు నివసింపజనదనియు, హిమాలయదక్షిణదేశమే మనుష్యవాసయోగ్యమనియు తలచియుండబోలును. కాక, మనదేశమునకు ఆదేశమునకు గల దివారాత్రపరిమితినిబట్టికూడ ఆదేశము దివ్యస్థానముగ నెంచుట సమంజసము. కనుక మనుష్యవాసయోగ్యమైన యీదేశమే సర్వభూమిగ నెంచినారు. అట్లు కాకపోయినను మరియొకయుపపత్తినిగూడ చెప్పవచ్చును. 'బ్రాహ్మణులందరికిని భోజనము పెట్టుడు' అనుచో ఇంటికివచ్చినవారికే భోజనము కాని యావద్దేశవర్తిబ్రాహ్మణులకుగాదు. కావున సంపూర్ణవస్తువుయొక్క అంశముగూడ సంపూర్ణవస్తువుగానే వ్యవహరింపవచ్చునని మహాభాష్యకారుడు చెప్పినట్లు ఇక్కడను అన్వయించుకొనుట సులభము. ఈ ప్రకారముగనే 'ఆసముద్రక్షితీశ'శబ్దమునకును సమన్వయము చెప్పవచ్చును. హిమాలయముమొదలు దక్షిణమహాసముద్రమువరకు నేలువాడు ఆసముద్రక్షితీశుడు.

ఇక మిగిలిన దొకశంక: 'బిందుసరమునుండి కుమార్యగ్రమువరకుగలభూమి చక్రవర్తిక్షేత్రమవునా? ఈరెంటికిని అంతరము వేయియోజనములుకలదా!' అని. ఈశంకగూడ నాలుగుక్రోసులు ఒకయోజనమనక రెండుమైళ్లొక యోజనముగ భావించినచో సులభముగ తోసివేయవచ్చును. యోజనశబ్దమునకీయర్థముపపన్నమవునా యన్నసంశయమువలదు. రామాయణములోవర్షశబ్దమునకు దినమని, సుశ్రుతసంహితలో యుగశబ్దమునకు అయిదు సంవత్సరములని యర్థముచెప్పినట్లే దీనికిని ఈయర్థమును జెప్పుకొనుట తప్పుకాజాలదు.

---

## రుయ్యకుని రచనలు

పేరుమోసిన యాలంకారికులలో నొక్కడయిన రుయ్యకుని రచనములలో ఇప్పటికి మనకు లభించినవి మూడుమాత్రమే. ఇతడు పది యలంకారగ్రంథములను రచించెను. తక్కిన విల్లేయుత్పన్నములు కావలెనో, లేక ఎప్పటికయినను వానికి సూర్యాలోకము పొందు భాగ్యము కలదో తెలియదు. ఇప్పటికి తెలిసినంతవరకితని రచన లివి:

౧. అలంకారమంజరి—ఇది తనదిగా రుయ్యకుడే అలంకారసర్వస్వమున జెప్పియున్నాడు. (తత్ర రసాదిధ్వని రలంకారమంజర్యాం దర్శితః)

౨. అలంకారవార్తికము—రుయ్యకునిదని జయరథుడు తన అలంకారసర్వస్వవ్యాఖ్య విమర్శినిలో చెప్పినాడు. (అనేనైవచాశయేన అత్రాలంకారవార్తికే గ్రంథకృతా వైశిష్ట్య మస్యా దర్శితమ్.)

3. అలంకారసర్వస్వము—బొంబాయి కావ్యమాలవారును, తిరువనంతపురము సంస్కృతగ్రంథావళి వారును దీనిని ప్రకటించినారు. దీనికి జయరథుని విమర్శినియు, సముద్రబంధుని శబ్దనిబంధనమును, విద్యాచక్రవర్తి అలంకారజీవనియు వ్యాఖ్యలు గలవు.

౪. అలంకారానుసారిణి—రుయ్యకకృతముగా జయరథునిచే నాలుగుసారులు పేర్కొనబడినది. ఇది ప్రత్యేకముగ నలంకార గ్రంథము. ఇందుమాలారూపకాది కావ్యాలంకారములు కొన్ని సమగ్రముగ చర్చింపబడి యున్నవి. కొందర న్నట్లిది జల్హణుని సోమపాల విలాసమునకు వ్యాఖ్యమాత్రము కాదు.

౫. కావ్యప్రకాశసంకేతము—మమ్మటుని కావ్యప్రకాశమునకు వ్యాఖ్య. ఇది రుయ్యకునిదని జయరథుడు వ్రాసియున్నాడు.

౬. నాటకమీమాంస—మహిమభట్టుని వ్యక్తివివేకమునకు వ్యాఖ్య యగు వ్యక్తివివేకవిచారములో వ్యాఖ్యాతయగు నీరుయ్యకుడు దీనిని స్వోపజ్ఞోద్భూతముగా పేర్కొన్నాడు.

౭. బృహతి—వ్యక్తివివేకము ననుసరించి తన్నిర్మాత రుయ్యకుడు బృహతి యను నొక విపుల గ్రంథమును రచింపసమకట్టెనని తెలియుచున్నది.

౮. వ్యక్తివివేకవిచారము—రుయ్యకుడే వ్యక్తివివేక విచారమును రచించినట్లు జయరథుని అలంకారసర్వస్వవిమర్శినిలో సూచనకలదు వ్యక్తివివేకమున కిది వ్యాఖ్య. ఇది అసమగ్రముగ ప్రచురింపబడినది. ఈ వ్యాఖ్యాత పేరు తెలియుట లేదు. కాని రుయ్యకుడే యనుటకు ప్రబలప్రమాణములు గలవు.

౯. శ్రీకంఠస్తవము—అలంకార సర్వస్వమున నీగ్రంథము స్వనిర్మితముగా రుయ్యకు డుదాహరించుకొని యున్నాడు.

౧౦. సహృదయలీల—నాలుగుల్లేఖముల చిన్న గ్రంథము. ప్రథమోల్లేఖమున నాకర్షణీయములగు రమణీమణుల రూపవర్ణప్రభాదులగు దశగుణములు నభివర్ణింపబడినవి. ద్వితీయమున ముక్తాస్వర్ణ రత్నాత్మకములగు వివిధాలంకారములు, నారీమణులు ధరించు పుష్పములు మొదలగునవి వర్ణింపబడినవి. తృతీయమున రామణీయకమునకు సారభూతమగు యౌవనముగూర్చి వివరింపబడెను. చతుర్థమున సౌందర్యాతిశాయులగు సామగ్రులను గూర్చి విచారింపబడెను. కావ్య మాలవారు దీనిని ప్రచురించినారు.

౧౧. సాహిత్యమీమాంస—ఇది అలంకార సర్వస్వమునందును, వ్యక్తివివేకవిచారమునను ఉదాహరింపబడినది. విద్యానాథుడుకూడ దీని నుదాహరించి యున్నాడు.

౧౨. హర్షచరిత వార్తికము — అలంకారసర్వస్వమునందును, వ్యక్తి వివేకవ్యాఖ్యయందును నీగ్రంథము పేర్కొనబడినది. హర్షచరితమునకు ఇది వ్యాఖ్య.

[ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక (సం. ౨౩: సం. 3) లోని యీయుణ్ణి వేంకట వీరరాఘవాచార్యులుగారి 'రుయ్యకుని కృతులు' అనుదానినుండి]



## దిలీప

ఈ నాటకము క్రౌనుసైజున 32 పుటలు గలిగియున్నది. వెల రు. 0-8-0. (గ్రంథకర్త్రి): చిల్కపాటి సీతాంబ, రంగనాయకుల పేట, నెల్లూరు.

రఘువంశ ప్రథమద్వితీయసర్గాంతర్గతకథాంశముల నాధారపరచుకొని శ్రీమతి చిల్కపాటి సీతాంబ గారీయేకాంక నాటకమును రచించిరి. ఇందు అంక రంగవిభక్తి లేనందున నీనాటక మారుస్థలకములుగ విభజింపబడియున్నది. సంతానార్థులయి సుదక్షిణా దిలీపులు తమ కులగురువగు వసిష్ఠుని యాశ్రమమునకు పోయి చేరినదిమొదలు పుత్రవరప్రాప్తియై వీరు తిరిగి రాజధానిం జేరినపర్యంతము గలచరిత్ర నీనాటకమున కాలంబనము. ఇది కేవలము రఘువంశానువాదమని చెల్లదు. ఔచిత్యము ననుసరించి కవయిత్రి స్వతంత్రించి చేర్చినభాగములును కొన్ని గలవు. ప్రథమస్థలకము దేవి చేటీజనముగు నిపుణికాబుద్ధిమతికల సంభాషణమును, మూడవస్థలకము వసిష్ఠశిష్యులగు గౌతమ సువ్రతులసంభాషణమును, తరువాతిభాగమున సుదక్షిణారుంధతుల సంభాషణములును అమూలమయినను ఈమె పన్నుకొనిన నాటకసరణి కివి యొప్పి అమూల్యము లయి యున్నవి. నందినీధేనువును సింహము బట్టుకొనినఘట్టమున సింహదిలీపుల సంవాదములు, ఉక్తిప్రత్యుక్తులు బహుచమత్కారముగ నిర్మింపబడియున్నవి. రఘువంశమూలమున నీరెండుసర్గల జదివిన వారు కాళిదాసప్రయోగముల గొన్నిటి నీమె తన పద్యములలో నిమిడ్చికొనియుంటజూచి అత్యంతానందసంభ్రమముల బొందగలరు. ఈమె జేసిన నీహారనగవర్ణన పోతనామాత్యుని కవిత్వమునందలి సహజసంపద ననుకరించుచున్నది. పద్యము సీసమయ్యును బహు లఘు లలితపద విన్యాసముల నలరారియున్నది:—

ప్రబలాకృతిని నభోభాగంబునకుఁ దాఁక
మిన్నందు వెల్లనౌ మేనితోడఁ
బైనుండి ధరణికిఁ బ్రవహించి లలిమించు
నమల గంగా ప్రవాహంబుతోడఁ
నాదిత్య చంద్ర తారాది సద్గ్రహరాజి
సిగపూలవలె వేడ్కఁ జెలువుసూపఁ
సెలయేటికాలువల్ చిలువభూషలరీతి
నందంద బాఱుచు నంద మెసఁగఁ
బ్రమథ సిద్ధ వియచ్చరపాళి కెపుడు
సేవ్యమై సర్వలోక సంభావ్యమనుచు
ధరణి వెలసిన నయ్యష్టతనుని పోల్కి
హరిమై తోఁచె నార నీహారనగము.

(స్థ. 4)

సింహముచేతను, సింహ దంష్ట్రాగ్రస్తమగు గోవు చేతను రంగముపై మనుష్యవాక్కుల మాటలాడింప యత్నింపక నీకవయిత్రి ఆయావాక్యముల "తెరలో"న నుండి పలికించినది. గొప్పగొప్ప నాటకములందు 'నేపథ్యే' యనుచిహ్నముతో కొన్నికొన్ని మాటలు వెడలుచున్నవి. బహుశః నేపథ్యతంత్రవిశారదు లీ చిన్న నాటకము నందలి "తెరలో"ని మాటలను సింహముల నేర్పున బలికింతురుకాబోలు. గోవునుబట్టిన సింహముపై బాణ ప్రయోగము జేయనున్న దిలీపునివర్ణనము కడుహృద్య

ముగ నున్నది. పద్మినీపరిణయ సముద్రమథన నాటకాది గ్రంథములచే నీయమకవితాసంపద ప్రసిద్ధమై యుండి నది. ఈక్రొత్తనాటకమువలన నీమె కవిత్వప్రౌఢిమ కొక నూతనోత్తేజము గలుగుచున్నది.

రఘువంశములోని "అజవిలాపము" మొదలగు కొన్ని ఘట్టముల కనురూపములగు చిత్రలేఖనము లేర్పడి యున్నవి. ఈ దిలీపోపాఖ్యానము నధికరించి కావ్యము గాని, చిత్రలేఖనముగాని యున్నటుల లేదు. దీనిని దృశ్య ప్రబంధరూపమున వెలయింపజేసిన కీర్తి ఈకవిరాణి కాణయాచి యనదగును.

ఈ నాటకము కథాసందర్భనిర్మాణమున నేమి, భాషాలాలిత్యమున నేమి, నాటకసంవిధానకౌశలమున నేమి అత్యంత సమ్మానపాత్రమై యున్నది.

స్థాలీపులాకముగ మచ్చున కీక్రిందిపద్యము లుదాహరింపబడుచున్నవి—

స్థలకము ౨:—

జిలిబిలిమాటలున్ మురువు
చిందెడి తిన్నని తొక్కుపల్కులున్
గలకలనవ్వులున్ వెలయ
గన్నులపండువు సేయునట్టి ము
ద్దుల పసిపాపలన్ శిగము
దువ్వుచు బిగ్గ గవుంగలించు ధ
న్యుల సుకృతంబుకన్న ధర
నున్నదె పుణ్యము లెంచిచూడగన్.

స్థలకము ౫:—

దిలీపవాక్యము :—
హిరణ్యగర్భతుల్యుడై మ
హిన్ ప్రకాశమొందు మ
ద్గురున్ మదిన్ గణింప కిందు
గోవుఁ బట్టఁబోవు నిన్
భరింపరాని మత్కరోగ్ర
బాణవృష్టి నింపి యో
దురాసదా నినున్ బడంగ
ద్రోతు నీ ధరాస్థలిన్.

సింహవాక్యము:—
ధరావరేశ నీవు దుష్టదానవాళికెల్ల భీ
కరుండ వౌదుగాని మున్ను కాలు ధిక్కరించు నా
హరుండు ప్రేమ బ్రోచు నన్ను నడ్డుసేయ జాలుదే?
దురాగ్రహంబువీడి, నీదు త్రోవ బొమ్ము నెమ్మదిన్.

సింహవాక్యము :—
నీవు సుఖంబునున్న ధర
జీవరసంపద సర్వలోకముల్
బ్రోవగజాలు దీసురభి
వోయిననేమి కొఱంతగల్గు నీ
భూవలయంబునంతకును
భూతదయన్ మదినెంచి యూరకే
చావగనెంతువే విభవ
సంపదలన్ విడనాడి బేలవై.

---

## ఆత్మచరితము

క్రౌను పు. ౬౦. వెల లేనిది.

ఏడిదము సత్యవతి అను నొక వితంతుయువతి దయనీయమగు తనచరిత్రము నిందు మనసు ద్రవించునట్లు చెప్పినది. రచనము వచనము; అది మృదులము. ఈయమ పతిప్రేమ, పతిభక్తి అపరిమితము.

---

## ఆంధ్రపుత్రతారావళి

గ్రంథకర్త: బాలకవి కోగంటి దుర్గామల్లికార్జునరావు, తెలుగుపండితుడు, బాలికాపాఠశాల, అంగలూరు. అంటరానితనము నడగార్చుట ౨౭ శేలికపలుకుల ఆటవెలదులతో నిందు ప్రబోధింపబడినది. వెల ౦-౨-౦.

---

౧. ఆత్మతత్త్వక్రమాభ్యాసవిధి

వెల ౦-౪-౦.

౨. పీఠికాపురకుంతీమాధవ అష్టావింశత్యుత్తర శతమత్తేభ శార్దూలవృత్తములు

వెల ౦-౨-౦.

3. శ్రీమత్కుక్కుటేశ్వర రాజరాజేశ్వరీ దండకము

వెల ౦-౨-౦.

గ్రంథకర్త: మల్యాల వీరరాజు, పిఠాపురము. పేరులనుబట్టియే గ్రంథములయందలి విషయ మిది యని తెల్లమగుచున్నది.

---

సహకారవస్తునిలయోద్యమము

(Co-operative Store Movement)

పుటలు ౧౫౦ + ౬౪, వెల ౧-౦-౦.

కర్త: దిగవల్లి వేంకటశివరావు, ప్రకాశకులు: కృష్ణాజిల్లా, కో-ఆపరేటివు ఫెడరేషన్, బెజవాడ.

ఈ గ్రంథములో సహకారోద్యమముయొక్క స్వరూపస్వభావములన్నియు పరిపూర్ణముగా చర్చింపబడినవి. కాబట్టి, దీనిని 'సహకారోద్యమము' అని యుండిన బాగుగనుండెడిని. సింహావలోకనము, రాక్డేలు సహకారోద్యమచరిత్ర, సహకారవస్తు నిలయోద్యమము-పట్టణములు, సహకారవస్తు నిలయోద్యమము-గ్రామములు, సహకారోద్యమసమస్యలు అను ఐదుభాగములు గల గ్రంథమిది. మరియు, భారతదేశస్థితిగతులు-లోకస్థితిగణనము (Statistics) అను అనుబంధముకూడ ఉన్నది. సహకార మనగానేమి? అది ప్రజలకు ఎట్లు తోడ్పడగలదు? ఏయేదేశములం దది ఎట్లెట్లు ప్రజాసేవచేయుచున్నది? మన గ్రామపునర్నిర్మాణమునకును, మన ప్రారిశ్రామికాభివృద్ధికిని సహకారోద్యమము ఎట్లు తోడ్పడగలదు? మొదలగువిషయములు ఎన్నో ఆంగ్లగ్రంథములను పరిశీలించి, విపులముగా, సులభశైలిలో ఈ యుత్తమగ్రంథమున చర్చింపబడియున్నవి.

విజ్ఞానపిపాసువులును, దేశోద్ధారకులును అగు ఆంధ్రులెల్ల దీనిని చదివితీరవలెను. ఇట్టి గ్రంథములను చదువనివారు విజ్ఞానమయమగు వర్తమానకాలమున నుండ తగనివారు.

కపిస్థలం శ్రీరంగాచారి

---

మహర్షి దేవేంద్రనాథ ఠాకూరుగారి జీవితచరిత్ర

పుటలు. ౮౬, వెల ౦-౮-౦.

అనువాదకుడు: ఆకురాతి చలమయ్య, ప్రకాశకులు: శాంతికుటీరగ్రంథమాల, పిఠాపురము.

దీనిలో రవీంద్రనాథఠాకూరుగారి తండ్రి మహర్షి దేవేంద్రనాథ ఠాకూరుగారి జీవితము చక్కగా వ్రాయబడినది. శైలిప్రయత్నపూర్వకము. భావములోను, అచ్చులోను అక్కడక్కడ తప్పు లున్నవి. ఆంగ్లమెరాని ఆంధ్రయువతీయువకులును, బాలబాలికలును చదువదగినది.

కపిస్థలము శ్రీరంగాచారి

---

# గ్రంథ స్వీకారము

---

I ఆంధ్రశబ్దతత్త్వము (రెండుభాగములు)

డెమ్మిసైజు, పుటలు ౧౨౨, ౯౧.

II Notes on Aryan & Dravidian Philology (Vol. I)

డెమ్మిసైజు, పుటలు ౨౦౪.

III అర్ధానుస్వార తత్త్వము

ఫూల్‌స్కేపుసైజు

గ్రంథకర్త: కీ. శే. తాళపెల్లి మిరాదార్ యం. శేషగిరిశాస్త్రులు, యం. ఏ.,

గ్రంథములు దొరకుచోటు: వేపను వేంకటరాయన్‌గారు, ౪. మల్లికేశ్వరసుడిసందు, జి. టి. మదరాసు.

---

## తాళలక్షణము

క్రౌను పు. ౮౧. వెల ౦-౮-౦.

గ్రంథకర్త : సంగీతవిద్వాన్ వింజమూరి వరాహ నరసింహాచార్యులు, సంగీతగ్రంథమాల, బ్రాహ్మణపేట, కాకినాడ. (తూ. గో.)

---

## ఆధునికమానసికచికిత్స

## (Modern Psychotherapy)

క్రౌనుసైజు, పు. ౧౩౭. వెల రు. ౧-౪-౦.

గ్రంథకర్త : చిల్లరిగె సేతుమాధవరావు, గాంధీనగరము, బెజవాడ.

---

## శ్రీరామవిజయము (పూర్వకాండము)

డెమ్మీసైజు. పు. ౧౩౬. వెల ౦-౧౨-౦.

గ్రంథకర్త : కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రి, కాకినాడ.

---

## మందారవతి (సంస్కృతనవల, నాగరిలిపి)

క్రౌనుసైజు, పు. ౧౨౬. వెల తెలియదు.

గ్రంథకర్త: కపిస్థలం కృష్ణమాచార్యులు, బి.ఏ., యల్. టి.

ప్రకాశకులు : వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్సు, చెన్నపురి.

---

## విష్ణుమాయానాటకము (ప్రబంధము)

రాయల్ సైజు పు. ౨౮౦ వెల, రు ౨-౮-౦.

గ్రంథకర్త : చింతలపూడి యెల్లనార్యుడు (రాధామాధవకవి.)

పరిష్కర్త : కోరాడ రామకృష్ణయ్య, యం. ఏ. ప్రధానాంధ్రోపన్యాసకుడు, మదరాసు విశ్వవిద్యాలయ ప్రాచ్యపరిశోధనాలయము.

ప్రకాశకులు : మదరాసు విశ్వవిద్యాలయము, మదరాసు.

---

## విజయ

## (సచిత్రమాసపత్రిక)

డబుల్ క్రౌనుసైజులో షుమారు ౩౨ పుటలతో వెలువడుచుండును. కాలచక్రపరిభ్రమణమున దశదిశల నుదయించుచున్న నవీనవిజ్ఞానచంద్రికల నుజ్జీవింపజేయుట ఈపత్రికయాశయము. సంవత్సరచందా ఒకరూపాయ. విడిప్రతిక ౦-౧-౬.

సంపాదకులు : కానుకలపాటి కృష్ణమూర్తిగారు, విజయనగరము.

---

# మనవి మాటలు

## ఆంధ్రవిశ్వకళాపరిషత్తు
## గ్రంథ పారితోషిక నిర్ణయము

రెండేండ్లకు పూర్వము (౧౯౩౭ సెప్టెంబరు నెలలో) ఆంధ్రవిశ్వకళాపరిషత్తు తేటతెనుగున రచింపబడిన, ఉత్తమమయిన ఒక విజ్ఞానవిషయక (Every day Science) గ్రంథమునకును, ఒక ఆరోగ్యవిషయక (Public Health and Sanitation) గ్రంథమునకును, ఆధునికాంధ్రజీవితప్రతిబింబమగు ఒక నవలకును ప్రత్యేక మేడువందల యేబదేసిరూపాయలవంతున పారితోషికము నొసంగ సంకల్పించి, ఆవిషయమును ప్రకటించియుండినది. ఆప్రకటనమువలన గలిగిన ప్రోత్సాహము కారణముగా నాంధ్రసహృదయులచే రచియించి పంపబడిన ఆయావిషయముల గ్రంథములలో బహుమానార్హములను గ్రంథముల నిర్ణయము కడచిన నెలలో ప్రకటింపబడినది.

కళాపరిషత్తుకు అందిన విజ్ఞానవిషయకగ్రంథములుపదింటిలో శ్రీ గొబ్బూరు వెంకటానందరాఘవరావు (బి. ఏ., ప్లీడరు, ఎలమంచిలి) గారి గ్రంథమును, ఆరోగ్యవిషయకగ్రంథములు పంద్రెండింటిలో శ్రీ డాక్టరు గుళ్లపల్లి నారాయణమూర్తి (యల్.యం.యస్., అనకాపల్లి) గారి గ్రంథమును, నవలలు ముప్పదింటిలో శ్రీ విశ్వనాథ సత్యనారాయణ (యం. ఏ., బందరు) గారి 'వేయిపడగలు' అను నవలయును, శ్రీ అడవి బాపిరాజు (బి. ఏ., బి. యల్., వకీలు, భీమవరము) గారి 'నారాయణరావు' అనునవలయును బహుమానార్హములయినవి. తొలిరెంటికిని చెరి ౭౫౦ రూపాయలును, నవలలు రెండిటికిని చెరి ౫౦౦ రూపాయలును బహుమతినీయ నిశ్చయింపబడినది. ఈతీరున ఉన్నతవిద్యాపీఠమగు విశ్వకళాపరిషత్తుచే బహూకృతులయిన తత్తద్గ్రంథకర్తలాంధ్రుల ప్రశంసల కత్యంతము పాత్రులు. ఆంధ్రులవిజ్ఞానవికాసముకొరకే పుట్టువుగనిన ఆంధ్రవిశ్వకళాపరిషత్తున కీగ్రంథబహూకరణకార్యము కేవలము స్వధర్మనిర్వహణము. స్వధర్మనిర్వహణము ప్రశంసార్హముగాదు. కాని యాత్మగౌరవమున కాధిక్యమును గూర్చునది. అనువత్సరగ మీతీరుననే ఆంధ్రవిద్యాధికులను సబహుమానముగ గ్రంథరచనమునకు పురికొలుపుచు ఆంధ్రులకు వాఙ్మయమును, విజ్ఞానమును సమకూర్చుచు పరిషత్తు తన గౌరవమును వృద్ధి పొందించుకొనుచుండుగాక!

ఏతత్కార్య నిర్వహణక్రమమున విశ్వకళాపరిషత్తు అవలంబించిన మార్గము విమర్శకు కొంత తావునిచ్చుచున్నది.

ఒక్కొక్కవిషయమున నుత్తమమయిన గ్రంథమున కొక్కొక్కదానికి పారితోషిక మొసగవలయుననునది ఆది నియమము. ఉత్తమమయినది లేనియెడల పారితోషిక మీవలసినది పనిలేదు. రెండేపద్ధతులు; క్రమమయినవిధము.

నవలలో రెండు బహుమానార్హములుగ నిర్ణయింపబడినవి. ఇక, రెండును ఉత్తమములేయని వేరుగ చెప్పబనిలేదు. ఉత్తమమయినదానికి ౭౫౦ రూపాయల నీవలెననునది నియమము. కాని ఒకొక్కదానికి అయిదేసివందలు మాత్రమే యీబడెను. రెండును బహుమానార్హములగుటచే నుత్తమములును, నిర్ణీతమయిన పారితోషికము తగ్గింపబడుటచే మధ్యమములును అగుచున్నవి. ఒక్కదానికే యేకకాలమున ఉత్తమత్వ మధ్యమత్వప్రాప్తి అసంభావ్యము. ఇది యటుండ, బహుమాన మీయ సంకల్పించినది ఒకదానికే. రెండిటికిచ్చుటకు అర్థతః అధికారములేదు. అయినను బహుమతిని పంచిపెట్టునధికారము విశ్వకళాపరిషత్తునకు గలదని ఒక పరతు ఆపద్ధర్మముగా కల్పించుకొనబడినది. దానిని పురస్కరించుకొనియే యీపంపకము జరిగియుండవలెను. కాని యట్టి నియమ ముచితమయినదికాదు. మఱియు దీనివలన పరీక్షకుల బహుమా

నార్హ్యానిర్ణయసామర్థ్యమును శంకింపవలసివచ్చుచున్నది. ఇంకను, పంపకము తప్పని సరియయినప్పుడు ౨౫౦ రూపాయలనే చెరు సగముగా పంచవలసినది. కాని, అట్లుకాలేదు. ఒక్కొక్కదానికి అయిదేసివందలీయ బడెను. మొత్తమును పొడిగించుటకు ఇష్టపడిన పరిషత్తు ఒక్కొక్కదానికి ౨౫౦ రూపాయల వంతున నేల యీయరాదు? అట్లుచేసినయెడల పరిషత్తుతాహతుకును, గ్రంథ కర్తృగౌరవమునకును చాల తగియుండునుగదా!

ఇట్లు చేయుటవలన పరిషత్తు రచయితలను గొప్పజేసితినని తలపవచ్చునుగాని నిపుణమతు లెవ్వరు నట్లు తలపజాలరు. వారికి దీనిని రచయితలను కొంచెపరచుటగా భావింపకతప్పదు. కాబట్టి నవలారచయితల కిరువురకును ౨౫౦ రూపాయల వంతున పారితోషికము నిచ్చి సమ్మానించుట పరిషత్తునకు ధర్మము. ఇంచుక యోపికపట్టి పరికించినయెడల నాంధ్రదేశముననే, యాంధ్రులలోనే, అధికవ్యయ మక్కర లేకుండ పలువురు సమర్థులగు బోధకులు దొరకగలిగియున్నను ఖ్యాతినిగోరి రాష్ట్రాంతర, దేశాంతర, ఖండాంతరముల నుండి అత్యధికవ్యయముతో బోధకులను కొనితెచ్చుకొనుచున్న ఆంధ్రవిశ్వకళాపరిషత్తు సమర్థులని తానే నిర్ణయించిన, ఆంధ్రులయిన యీ నవలారచయితలను సమ్మానించుటకయి యిక నొక యేనూరురూపాయలను వ్యయముచేయుటకు వెనుదీయునేని తప్పక పరిహాస పాత్రము కాగలదు.

తొలుత, బహూకృతగ్రంథ ముద్రణప్రకటనాది కార్యములు విశ్వకళాపరిషత్తు ఇచ్ఛాధీనమనియు, పరిషత్తు వానిని ముద్రించి, ప్రకటించునెడల వాని విక్రయ ధనమునుండి ముద్రణాదులకయినసొమ్మును, గ్రంథ కర్తలకు పారితోషికముగ నిచ్చినధనమును మినహాపెట్టగా మిగిలినదానిని—యేపాటిదైన నిలువయున్నయెడల—పరిషత్తు, గ్రంథకర్త చెరిసగముగ పంచుకొనవలయుననియు, పారితోషికము నిచ్చినతరువాత నారు నెలలలోపల కళాపరిషత్తు పుస్తకములముద్రణాదికార్యములను తలపెట్టకయున్నచో నపుడు తన్ముద్రణావకాశము గ్రంథకర్తలకు గలదనియు ప్రకటితమయ్యెను. ఈపద్ధతి గౌరవమార్గమునుగాక వర్తకసరణి ననుసరించి యుండునదయినను గ్రంథకర్తల యంగీకృతిని బడసినది. ఇపు డానియమమునకును భంగము వాటిలినట్లు విశ్వకళాపరిషత్తు గ్రంథకర్తల కందజేసిన లేఖలవల్ల తెలియవచ్చుచున్నది. పరిషత్తు నిర్ణయమం దిటులు గలదు: 'పారితోషికధనము నవలలకు మూడేసివందలవంతునను, తక్కిన రెండిటికి నాలుగేసివందలవంతునను వెంటనే యొసగునట్లును, గ్రంథకర్తలు గ్రంథములను ముద్రించి ఆరేసిప్రతులు పరిషత్తుకు అందజేసినపిదప తక్కిన సొమ్మును ఇచ్చునట్లును.' మొదటినియమముల ప్రకారము, గ్రంథములను పరిషత్తు ముద్రించినను ముద్రింపకున్నను గ్రంథకర్తలు ముద్రింపవలయునన్న నిర్బంధముమాత్రము లేకుండినది. ఇంతేకాదు, పారితోషికము సంపూర్ణముగ లభించునవకాశము నుండినది. ఇపుడు గ్రంథములను పరిషత్తు ముద్రింపకపోవుట యటుండ గ్రంథకర్తలు ముద్రించియే తీరవలయునను నిర్బంధము కలిగినది. దీనినిబట్టి గ్రంథములు ముద్రితములయిననేకాని తక్కినసొమ్ము యీయబడదనియు విస్పష్టమగుచున్నది. అయిన, గ్రంథములను ముద్రింపకున్నచో ముందు ఇచ్చిన సొమ్మును వాపసుచేయవలయునను నియమముమాత్రము లేమి శ్రద్ధిలోనెల్ల. ఇంతకును పరిషత్తు ఇచ్చు పారితోషిక ధనముతో గ్రంథములను ముద్రించుకొని వాటిని అమ్ముకొనుటకయి గ్రంథకర్తలు ప్రయాసపడవలసియుండుట తప్పదు. పరిషత్తుమెప్పును గనవలయునని గంపెడాసతో బహుకాలము పరిశ్రమించి ఏరులవంటి గ్రంథములను రచియించిన గ్రంథకర్తల కొసంగు పారితోషికధనము గ్రంథరచనాప్రయాసమునకే చాలనిదయియుండ ఇట్లు ముద్రణవిక్రయణాదుల ప్రయాసమును వారిపయిబెట్టుట పరిషత్తునకు దగనిపనియనుట తెగువ కాదు. కాబట్టి, విశ్వకళాపరిషత్తు పారితోషికధనమునంతయు పూర్తిగా గ్రంథకర్తల కందజేసి గ్రంథ ముద్రణవిక్రయణాధికారమును బడసి నికరాదాయమున గొంతపాలు ('రాయల్టీ') గ్రంథకర్తల కిచ్చుచుండు నేర్పాటు చేసికొనుట్ల తగినపని. పరిషత్ప్రకటిత గ్రంథ

ములకు ప్రచారముగూడ నెక్కువగ నుండగలదు. మరియు నిట్టిచేత విశ్వకళాపరిషత్తునకు, తద్బహూకృత గ్రంథములకు, తద్రచయితలకు విశేషముగ కీర్తిని తేగలదు.

---

## పండితపూజనము

ఆంధ్రుల కన్నిటను ఆవేశ మధికమే. అగుగాక. అదియు కొన్నింట నావశ్యకము, ప్రశంసాపాత్రము ననుచున్నది.

కొన్నేండ్లనుండియు నాంధ్రులకు పండితపూజనమునం దావేశము మెండుకొన్నది. పండితులను, కవులను, కళాకుశలులను కొందరను పూజించినారు; ఇంకను పెక్కురను పూజింపవలసియున్నారు.

పూర్వము పండితపూజనము రాజధర్మములలో నొకటిగ పరిగణింపబడినది. అప్పటి రాజులు స్వధర్మనిరతులు, విద్యాధికులు, విద్యాప్రియులు, పండితపక్షపాతులు, పండితపూజాతత్పరులు. తదాదరణపోషణములు కారణముగా పండితమండలులు ప్రాభవసంపన్నము లయియుండెడివి. ఆనాటి పండితుల జీవితము చీకుచింతల నెరుగనిది. వారు నిత్యసారస్వతవినోదముల దేలియాడు చుండెడివారు. ఆవినోదములలో వారార్జించియుంచినారు నేటివారికి-కాదు, ఎల్లనాటివారికిని అమూల్యమగు వాఙ్మయసంపద.

ఈకాలమున నట్టిప్రభువులు లేరు. పండితులు విరళముగ నున్నను వారి పాండిత్య ముదరపోషణమునకు వినియోగపడుచున్నది. ఇక వారివలన కాగల వాఙ్మయాభివృద్ధి యేసాటియో యూహించుకొనవచ్చును. నేడెకొందరో వాఙ్మయసేవకు పూనుకొని రన్నదానికి ప్రజాదరణమే కారణము. అట్టియాదరణమునే డాంధ్రదేశమునందలి పండితులయెడ నాంధ్రులు కలిగియున్నారు. ఇది ఆంధ్రదేశమునకు, వాఙ్మయమునకు నభ్యుదయప్రాప్తిసూచకము.

ఇపు డాంధ్రులు మరల నలువురుపండితులను పూజింపదలపెట్టియున్నారు. కొంచెము ముందువెనుకలుగ నీపూజనము జరుగనున్నది. ఈనలువురును సుప్రసిద్ధులు; ఆంధ్రదేశమునకు కీర్తిని, ఆంధ్రవాఙ్మయమునకు పుష్టిని సమకూర్చినవారు. వీ రాంధ్రులకు పరమపూజ్యులు ఈనలువురు పూజ్యశ్రీయుతులు ౧. తాతా సుబ్బరాయశాస్త్రిగారు, ౨. కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు, 3. పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు, ౪. మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు.

### ౧. తాతాసుబ్బరాయశాస్త్రిగారు

తెలుసునాటి సంస్కృతపండితులలో మేటి. పండబారిన వీరి పాండిత్యము పలుతావుల ప్రశస్తిని గనినది. వీ రభిమానించి అంతమును గన్నవి వ్యాకరణాలంకారశాస్త్రములు; తరచితరచి లోతుగనుగొనినది ధర్మశాస్త్రము; అన్నిటను తత్త్వమునుదేల్చి అరచేత నిడుకొనినది ప్రతిభ; గహనవిషయముల గరతలామలకములుగ గాంచగలిగినది ప్రజ్ఞాచక్షువు; ఒలిచి చేతనిడిన అరటిపండు బోధనము; అతిలోక మయినది లౌకికజ్ఞానము.

ఉపాధ్యాయవృత్తి యాలంబనముగ జీవితరంగమున నడుగిడినా డీయభిజ్ఞుడు. ఉపాధ్యాయవతంస మనిపించుకొనినాడు. ప్రధానోపాధ్యాయు డయినాడు. ప్రభుత్వాదరమునకు పాత్రుడయి 'మహామహోపాధ్యాయ' బిరుదాంచితుడైనాడు. ఈయన యద్వితీయబోధనసామర్థ్య మా బిరుదమునకు సార్థకతను సంపాదించినది. బోధనమే యీ మహామహోపాధ్యాయునకు జీవితపరమార్థమయినది.

ఈ యుపాధ్యాయునితోడ శాస్త్రముల నభ్యసించి పండితఖ్యాతిని గాంచిన శిష్యప్రశిష్యపరంపర పరస్సహస్రము. వీరి శిష్యవాత్సల్యము కొలదియిడరానిది.

ఈయన నిరంతరకార్యదీక్ష కారణముగ విజయనగర సంస్కృతకళాశాల గురుకులమయి ఆంధ్రదేశమునకేకైకమగు నుత్తమాలంకారమయినది.

కనుల వెలుగు, మొగము తేటదనము, మది మెత్తదనము, మాటతీయదనము పరిణతమైన యీయన మేనిసొబగునకు తోడుగనితోడవులు.

ఈసుణముల ప్రోవు తెలుగుతల్లి యనుగుబిడ్డడు; ఆమెలాలనపాలనముల తేజున మించినవాడు; కాని యామెపలుకుల నొప్పరికించినాడు. ఇది యీయన నంటిన మచ్చ. ఇకనయిన దీనిని మాయించికొనవచ్చును; మించినదిలేదు. శేషజీవితమును ఆరితేరిన తన సాహిత్యాలంకార పాండిత్యపు బండారువును వెచ్చించి, తెనుగువాణికి క్రొత్తతొడుగుల దొడిగి తెలుగుతల్లి ఋణమును దీర్చికొనవచ్చును. తల్లి ఋణమును దీర్చుట పిల్లలకు-అందును సమర్థులగువారికి-విధి. అపుడీ పూజ్య శ్రీయుతుని పూజ్యత బహుగుణము కాగలదు.

## ౨. కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు

బహుభాషల, బహుముఖముల పరిణతిగాంచినది వీరి పాండిత్యము. యుక్తులపయి యుక్తులుపన్ని ప్రతిపక్షపక్షమును పడద్రోయజూచుటయందద్వితీయ మయినది వీరి విమర్శనశక్తి. మతివలెనే నిశితము, విపులము నయిన వీరి విమర్శన మల్లసమున నురియాడు చుండును. అయ్యది పాతవేషములనే తాల్చుచు, పాత బాటలయందే పరువులు బారుచుండునదయినను విషయసంగ్రహణమునను, పరమార్థనిర్ణయమునను సునిపుణ మయియుండునది. నేటి తెలుగునాటివిమర్శకులలో ననేకులు వీరి కేకలవ్యప్రాయులగు శిష్యులు.

వీరు కవులు నగుదురు. వీరి కవితయందును విమర్శకే ప్రాధాన్యము.

వాఙ్మయనౌకకు విమర్శచుక్కాని. అట్టి విమర్శకార్యమునే జీవితపరమార్థముగ భావించి ఆంధ్రవాఙ్మయసేవజేయుచు మాన్యతను గడించుకొనిన యథార్థవిమర్శకాగ్రేసరుడీవృద్ధదోషజ్ఞుడు.

## 3. పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు

వీరు పండితులలో పెద్ద; కవులలో కడుపెద్ద; కళావేత్తలలో కడుంగడుపెద్ద. బహుభాషలయందు ప్రౌఢమయినది వీరి పాండిత్యము. బరువున, పరువున పెరిమెవడసినది వీరికవిత్వము. వీరి రచనములు లోకవృత్తమును యథాస్థితముగ ప్రతిబింబింపజేయు దర్పణములు. అన్యాపదేశముగ, నలవోకగ అంతిపురముల వయినను అలతినేతలను, గుట్టుమట్టులను పదుగురిలో బెట్టి రచ్చపట్టుదురు. వీరి గద్యపద్యరచనముల రెంటను కవితావాహిని హాస్యరసము నురుసల గ్రక్కుచు సమవిభక్తముగ, సముచితముగ ప్రవహించుచుండును. అందు పయిపయి దొరలుచున్న పదముల బరువున భావము లుక్కిరిబిక్కిరియగుచుండును.

వీరి గద్యరచనములకంటెను నాటకములు రసవంతములు. గద్యరచనములయందు చమత్కారము ప్రాయికముగ ముదుకహాస్యముపూతతో వెగటుగొలుపుచుండును. నాటరచనములయందలి చమత్కారము ప్రాయికముగ సరసహాస్యమువలెవాటుమరుగుననుండి వన్నెల జిలుకుచుండును.

వీరు అఖండమగు 'సాక్షి'ని సంతరించుకొని ఆంధ్రసాహిత్యరంగమున విజయమును ప్రకటించినారు. అనేకనాటకములను రచియించి ఆంధ్రసాహిత్యనాటకరంగములకు రెండిటికిని ప్రాభవము గూర్చినారు. ఇదియంతయు నాపండితకవి యాంధ్రవాణి కొనరించిన సేవ; ఆంధ్రులకు కావించిన మహోపకృతి. ఈసుకృతి యిపుడారపండినపండు.

## ౪. మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు

వీరు కవి, తేనె లొలికింపగలరు; పండితుడు, పలుకులపొలకువల తెలియగలరు. దగ్గరబాసలతో, దూరపుబాసలతో తెనుగునకు గల చుట్టరికమును పోల్చిచూచి తెలుగుమేలిమిని వీరు తెలిసికొనినారు. తెలుగు పుట్టువును వెలిపెట్టగల నిఘంటువును రచియింప తలపెట్టియున్నారు. అట్లే వ్యాకరణమును రచియింప మొదలిడినారు. ఇవి రెండును తెనుగుభాషకు, తెనుగువారికి నేడు-క్రొత్తపాతలకలయికకాలమున-పరమావశ్యకములు.

తాము మొదలిడిన ఒజ్జరికమునకు స్వస్తిచెప్పి స్వతంత్రులయినారు. వాఙ్మయతత్త్వాన్వేషణమునకై మనుగడను వినియోగించుచున్నారు.

వీరివాఙ్మయసేవను మిక్కిలి మించినది దేశసేవ. ప్రజాహితకార్యములకు, అందును నిమ్నజాత్యుద్ధరణమునకు తమ్మర్పించుకొన్నారు. కాంగ్రెసు నాదేశమునకు కట్టువడి కొనితెచ్చుకొనిన కారాగారవాసము వీరికి వాఙ్మయారాధనమున కుపకరించినది. అచ్చట అన్యరాష్ట్రభాషల నేర్చినారు.

వీరిహృదయము మృదులము, నిత్యసంతుష్టము. శీలము నిష్కళంకము, ఆదర్శప్రాయము.

రూపమునను, వయసునను ఏరుపడిన నిండుదనము వీరియెడ పూజ్యభావము నింకను వృద్ధిజేయును.

పైన పేర్కొనిన పాండిత్యాదిగుణ విశేషములచే నీ నలువురు నాంధ్రులకెల్లరకు పూజ్యులు. వీరిని సమ్మానింప ప్రత్యేకముగ ప్రయత్నములు దేశమున సాగుచున్నవి. ఈప్రయత్నముల నాంధ్రులెల్లరు సఫలము చేయవలసియున్నారు.

నివురుగప్పిన నిప్పుకలవలె నింకను ఎందరో పండితులు, కవులు దారిద్ర్యపీడితులయి ఆంధ్రదేశమున మారుమూలల నడగియున్నారు. అట్టివారికి గూడ నాంధ్రసహృదయు లప్పుడప్పుడు హస్తావలంబన మొసగి ముందునకు దెచ్చి వారిచేత వాఙ్మయసేవ చేయించుకొనదగుదురు. దీనికయి నిఖిలాంధ్రదేశసంబంధియగు సంస్థయొకటి యుండు టావశ్యకము. సంపన్నులగు సహృదయులు యథేష్టముగ ధనమునొసగి యట్టిసంస్థను నెలకొలిపి నిరంతరము కవిపండిత సత్కారమును గావించుచుండుట ధర్మము. అంతగా సంపన్నులుగానివారును యథాశక్తి నీకార్యమునకు సాయపడదగుదురు. ఇట్లు చేసినచో అచిరకాలముననే ఆంధ్రవాఙ్మయప్రాభవము మిన్నుముట్టగలదు.

---

## హిందీభాష - మదరాసుకార్పొరేషను పాఠశాలలు

మదరాసుకార్పొరేషను ఎట్లయినను ప్రాథమికపాఠశాలలలో హిందీనేర్పుట కవకాశమును కలిగింపవలెనని కోరుచున్నది.* వెనుక నొకమారు ప్రయత్నించెను కాని ప్రభుత్వ మందుకు నిరాకరించెను. స్థాయిసంఘము వలదనుచున్నను ఈమారు గట్టిపట్టుపట్టియున్నది. దీనికి ప్రతికూలపక్షమును గలదు.

'మాతృభాష యగు నరవమునే[1] బాలురు బాగుగ నభ్యసింపలేనపుడు హిందీభాషనుగూడ పాఠశాలలో ప్రవేశపెట్టుట తగ'దనునది ప్రతికూలపక్షవాదము. 'హిందీ దేశభాష ఇంకా కాకపోవుటచేతనే సంస్కరణములుకూడ ఇవ్వబడుట కాలస్యమగుచున్న' దనియు, 'హిందీభాష రాకపోయినచో మనము దేశమంతట తిరుగజాల' మనియు, 'హిందూదేశస్థులందరు హిందీభాషను నేర్చుకొను టావశ్యక' మనియు, 'హిందీభాష బాగురానందున తాము కొంత చిక్కుపడితి' మనియు, 'ఉత్తరహిందూస్థానమున సంచారము చేయవలెననిన హిందీభాష చాల ఆవశ్యక' మనియు అనుకూలపక్షవాదము. హిందీ చదువవలెననుట కివి యాదినుండియు గల సామాన్యకారణములు. కొంచె మాలోచించి చూచినయెడల ఇవి యేవియు నిలువజాలవు. సంస్కరణముల ఆలస్యమునకు ప్రభుత్వనిశ్చయము, స్వార్థము, వైమత్యము పెచ్చుపెరిగిన అసంఖ్యములగు పార్టీల దౌర్బల్యము కారణములు. కాని హిందీరామి కారణముకాదు. దేశమంతట తిరుగుటకు పెక్కుదేశ విదేశభాషలు రావలయునుకాని ఒక హిందీభాష వచ్చిన చాలదు. హిందూదేశమున ననేకభాష

---

* ౨౮. ౧౦. ౩౮ నాటి కార్పొరేషనుసమావేశమున.

౧. శ్రీ టి. యస్. నటరాజనుగారిమాట యిది. చెన్నపురమువా రందరును అరవలే యనుకొన్నారీయరవమహాశయులు. చెన్నపురి ప్రజలలో ఇంచుమించు సగముమంది తెలుగువారు. తక్కినసగమున అరవవారెక్కువవంతు. కన్నడులు, మలయాళులు మొదలగువారు తక్కినవంతున జేరుదురు. ఇన్నిభాషలవారున్నను ఒక అరవముమాత్రమే కార్పొరేషనుబడులలో నేర్పబడుచున్నది. తక్కిన భాషలను నేర్పుటకు చాలిన సౌకర్యములు లేవు. అట్టి సౌకర్యములను కార్పొరేషను తప్పక కలిగించవలెను.

లున్నవి. ఆయాభాషలవారిలో పదవవంతువారయిన ఆయాభాషలను చదువగలిగియుండరు. ఇట్టిస్థితిలో హిందూదేశస్థులందరు హిందీని చదువుట యెట్లును సాధ్యము కాదు. హిందూముసల్మానులకు ఐకమత్యము లేకపోవుటకు కేవలము విభిన్నమగు మతము కారణముకాని ఉభయులభాష యొకటి-ఆయొకటి హిందీ-కామి కారణము కాదు. అనేకరాష్ట్రములయందు హిందువులకు ముసల్మానులకు భాష ఒక్కటే యయ్యును ఐకమత్యము మాత్రము కుదిరినదికాదు. కావున అనుకూలపక్షమువారు చూపిన కారణములనుబట్టి హిందీని పాఠశాలలలో ప్రవేశపెట్టవలసిన ఆవశ్యకత లేదు.

నిరంతరమును పౌరులకు క్షేమాభ్యుదయములను సమకూర్చుచుండుట కార్పొరేషనునకు పరమధర్మము. కావున పౌరసంతతికి-ముఖ్యముగ పేదలకు - నియతముగ విద్యలభించి జ్ఞానవంతులగుటకు ఉచితముగమాత్రమే కాక ప్రారంభవిద్య నిర్బంధముగను ఉండవలసినది. ప్రకృతము కార్పొరేషనుప్రారంభవిద్య నిర్బంధమయినది కాదు. విధానముకూడ తృప్తికరమయినది కాదు. దానివలన ప్రయోజనము మృగ్యము. దీని ననుసరించి విదేశభాష-ఇంగ్లీషు, మాతృభాష యొకటి-ప్రాయికముగ నన్నిబడులలో అరవమే నేర్పబడునది; ఇదికాక లెక్కలు, భూగోళము, చరిత్ర, ఆరోగ్యశాస్త్రము, ప్రకృతిశాస్త్రములు, చిత్రలేఖనము మొదలగువిషయము లనేకములు నిర్బంధముగ నేర్పవలయును. ఈతీరు ప్రారంభవిద్య మొదటి అయిదు తరగతులతో అంత మొందుచున్నది. అప్పటికి భాషలలోగాని, తక్కిన విషయములలోగాని బాలురకు ప్రవేశము కలుగబోదు; తుదకు వానిపరిచయమయినను సరిగా కలుగదు. ప్రారంభవిద్యకు లేని నిర్బంధ మిట్లు వీని కేర్పడినది. ఇట్టివిధానముగల ప్రారంభవిద్య పరమార్థమునకు, మానసిక తత్త్వమునకు దూరమయి విద్యార్థుల తరువాతి జీవితమునకు నిరుపయోగమగుచుండ, ఈప్రాంతము బాలురకింతయైన ప్రయోజనములేని హిందీనికూడ అందు చేర్పవలెననుట 'గోరుచుట్టుపయి రోకటిపోటు' వంటిది.

తీవ్రప్రచారము, విశేషాభిమానము కారణముగ హిందీ ప్రజలను విశేషముగ ఆకర్షించుచున్నది. దానివలన మాతృభాషయెడ వారు విముఖులగుచున్నారు; అందును, ఇందునుగూడ జ్ఞానము కుదురక 'రెంటికిం జెడిన రేవడు' లగుచున్నారు. ఇది తమ మంచిసెబ్బరలను దెలియగల పెద్దలమాట. మంచిసెబ్బరలను దెలియజాలని పసిపిల్లలవిషయమున దీనిప్రభావము చేయగల యుపద్రవమును చెప్పవలనుపడదు.

ప్రారంభవిద్యావిధానమున వారివారి మాతృభాషకు, లెక్కలకుమాత్రము ప్రాధాన్య ముండవలెను. ఇంగ్లీషుగాని, తక్కినవిషయములుగాని అనావశ్యకములు. వానికిబదులు నేర్చువారి అభిరుచినిబట్టి చేతిపనులను నేర్పవలయును. అయిదుతరగతులు గడచునప్పటికి వీనియందు మంచిజ్ఞానము కుదురును. తరువాతిజీవితమున కదియెంతయో యుపకరింపగలదు. ఇట్టి యుపయోగకరమగు సంస్కరణము నేటి ప్రారంభవిద్యావిధానమున కావలసియున్నది

భారతదేశమునకు రాజకీయములు, జాతీయములునగు పెక్కుకారణములను పురస్కరించుకొని యొక జాతీయభాష కావలసియుండుననియు, అది హిందీయగుట సుకరమనియు నేనాడో నిశ్చయింపబడెను. ప్రజాహితములగు అఖిలభారతదేశీయ కార్యవ్యవహారములను నడుపవలసినవారు, వానిని ఆయాప్రాంతముల ప్రజలకు బోధపరిచి ప్రచారమునకు దేవలసినవారు నాజాతీయభాషను నేర్చినజాలును. భారతీయులాబాలవృద్ధము దానిని నేర్వవలసిన యవసరము కనుపడదు.

నేర్వవలసినవారికి నేర్పుటకు దక్షిణభారత హిందీప్రచారసభ పుట్టియున్నది; ఏటా వేలకొలది మందికి హిందీ నేర్పుచున్నది; నేర్చినవారిని పరీక్షించి హిందీజ్ఞానమును నిర్ణయించుచున్నది. ఇటీవలిపరీక్షల ఫలితములు మొన్న ప్రకటితమయినవి. ప్రాథమిక, మాధ్యమిక, రాష్ట్రభాషాపరీక్షలకు మూడింటికి దరఖాస్తుపెట్టినవారు ౮౦౮౩ మంది. (అనగా వీరందరును హిందీచదివినవారేయనుట.) సభ పుట్టిననాటినుండియు నీవిధముగ హిందీనేర్చినవా రెన్నియో వేలమంది

యున్నారు. ఇంకను ఎందరో నేర్వగలరు. పరీక్షల మాటలేక హిందీ నభ్యసించెడువారును వేలకొలదిగ నున్నారు. చదువకయే హిందీ నర్థముచేసికొనగలవారు, మాటాడగలవారు నిక యెన్నియోవేలమంది. ప్రచారకులు నెందరో తయారగుచున్నారు.

ఇట్లు హిందీనేర్పినవారిలో నెందరు ప్రజాహిత ములగు దేశీయకార్యముల నాచరించుచున్నారు? ఆచరిం చుటయందుకేకాక, అందుకు తగినవారిని తయారుచేయు టకు హిందీప్రచారసభ నడుముకట్టియున్నది; చాలును. ప్రారంభపాఠశాలలలో దానిని నేర్పుటకు సౌకర్య ములను గలిగించబడిలేదు. పనిలేనిదానిని తెచ్చిపెట్టి కుర్రవాండ్రకు ఎక్కువబాధకలిగించుట అక్రమము. కాబట్టి కార్పొరేషను హిందీభాషను పాఠశాలలలో ప్రవేశపెట్టించవలెనను ప్రయత్నమును విరమించుకొనుట శ్రేయము, వివేకమును.

---

## సెకండరిపాఠశాలలు – పండితులజీతములు

జిల్లాబోర్డులయు, మునిసిపలుసంఘములయు పాఠ శాలల దేశభాషాపండితులు పెద్ద జీతములకోసము బ్రహ్మాండమంత ప్రయత్నముచేసి కొండంతాశతో కనుపెట్టుకొనియుండిరి. వారియాశ చివర కడగారి పోయినది. వారు చేసినప్రయత్నమంతయు బూడిదలో హోమ మయినది.

పాఠశాలల ఉపాధ్యాయుల జీతముల క్రమము నిట్లు నిర్ణయించి ప్రభుత్వము ప్రకటించెను.

“మదరాసు ౧౯౨౦ స్థానికసంస్థలచట్టము ౬౪ (3) సెక్షను ౧౯౩౧ రెండవ సవరణచట్టము ప్రకారము గల అధికారముల ననుసరించి, జిల్లాబోర్డుల పాఠశాలలం దున్న ఉపాధ్యాయులకు, ప్రాతవారికి, క్రొత్తగ చేరు వారికిగూడ ప్రభుత్వమువారు యీ దిగువ వేతనముల రేట్లు నిర్ణయించుచున్నారు:—

| | |
|---|---|
| హైస్కూలు హెడుమాస్టరులకు | రు. ౧౧౦-౧౦/౨-౧౪౦ |
| మిడిలు స్కూలు హెడుమాస్టరులకు | ౧౦౦-౫/౨-౧౨౦ |
| ఎల్. టి. అసిస్టెంటులకు | ౬౫-౫/౨-౧౦౦ |
| సెకండరీ గ్రేడు ట్రెయినింగు అయిన ఉపాధ్యాయులకు | ౩౦-౨/౨-౫౦ |
| పండితులకు | ౩౦-౨/౨-౪౦ |
| జిమ్నాస్టిక్కు మాస్టర్లకు | ౨౫-౨/౨-౪౫ |
| డ్రాయింగు మాస్టర్లకు | ౨౫-౨/౨-౪౫ |
| వృత్తివిద్యోపాధ్యాయులకు | ౩౫-౨/౨-౪౫ |
| డ్రిల్లు మాస్టర్లు, డ్రాయింగు, కుట్టు పని, ఉపాధ్యాయినులు, సంగీతపు అమ్మగార్లు | ౩౦-౨/౨-౫౦ |
| ట్రెయినింగు కానివారికి (గ్రాడ్యుయేట్లకు) | ౨౫ |
| సెకండరీ గ్రేడు | ౨౦ |
| ఇతరులు | ౨౦ |

ఈ వేతనములు సెకండరీ పాఠశాలలు, ౬ వ ఫారమువరకు నున్న పాఠశాలలందుండు ఉపాధ్యాయి ములకుగూడ వర్తించును. పూర్తిగ తరగతులు లేని హైస్కూలులో మిడిలుస్కూలు హెడుమాస్టరులకు మాత్రమే ఈనిబంధనలు వర్తించును. ప్రస్తుత మున్న ఉపాధ్యాయులలో-యీరేట్లకన్న యెక్కువ ప్రస్తుతము గైకొనుచుండువారికి, ప్రత్యేకముగ అలవెన్సు లేమియు ఒసంగబడవు. ఈ ఉత్తరువు నవంబరు ౧ వ తేదీ నుండి అమలునకు వచ్చును.

మునిసిపలు సంఘములుగూడ, తమచేతి క్రింద నుండు సెకండరీ పాఠశాలలందు ఉపాధ్యాయులకు యీ రేట్లే అనుసరింప సలహాచేయబడిరి.”

దేశభాషలపండితులకు జరిగిన అపకారము దీని వలన తేటతెల్లమగుచున్నది. దీనికంటె పూర్వమున్న పద్ధతియే కొండొక మెరుగయినది. పండితుల కిది యప కారము; దేశభాష కళనిపాతము. ఇది దీని పర మార్థము.

పూర్వము దేశభాషలపయి చవతికల్లీ సున్నపు కంటిచూపు. ఇపుడు చిల్లంగిప్రయోగము. ఇక పాఠ శాలలో నవి తలయెత్తజాలవు.

ఇది కేవల మన్యాయము. ఇంతకంటె పాఠశాలలయందు దేశభాషాబోధనమును బొత్తిగ మాని వేయుటయే యుత్తమము; విద్యాశాఖవ్యయ మింకను తగ్గిపోవును.

ఇదివరకు పండితులది ప్రాకులాట. ప్రయాసకు దగిన ఫలములేమి యందుకు కారణము. అది యారీతిగ తెల్లవారిపోయినది. ఇపుడు దేశభాషలకే తెగులు తగులుకొన్నది. ఇక ప్రజలదే పీకులాట. తగిలిన తెగులును మాయజేయుదురా? క్రమముగ ముదురుచుండ జూచుచు నూరకకూరుచుందురా? ఏమిచేయుదురు?

దీని కనేకచికిత్స లున్నవి. అందులో నొకటి ముఖ్యమయినది:

ప్రధానపండితులకు యల్. టి. అసిస్టెంటులకు వలె ౬౫-౫|౨-౧౦౦ గ్రేడును, సహాయపండితులకు * ౪౫-౨|౨-౬౫ గ్రేడును ఇచ్చుట. విద్యాశాఖవారీసూచన ననుసరించి తమ ఆర్డరును మార్పుచేయుదురా! ఇక కావలసినదేమి?

వృత్తివిద్యోపాధ్యాయులకును † ఈ సహాయ పండితుల గ్రేడును నిర్ణయించు టావశ్యకము.



ఆనందము D. S. R.

* మిడిల్‌స్కూలుపండితులకును ఈగ్రేడు నీయవలెను. మిడిల్‌స్కూలులో ఒకభాషకే ఒకరికంటె ఎక్కువమందిపండితులు ఆవశ్యకమయినపుడు ప్రధానపండితున కీగ్రేడును, తక్కినవారి కందరికి సమానముగనే ౩౫-౨|౨-౪౫ గ్రేడును ఇవ్వవలెను.

† షార్టుహ్యాండు, టైప్‌రైటింగు, కమర్షియల్ కరస్పాండెన్సు బ్యాంకింగు వగైరాలు నేర్పువారికి మాత్రమే ఈగ్రేడు. వడ్రంగము, నేత మొదలగు కేవలము చేతిపనులనే నేర్పువారికి ప్రకృతము నిర్ణయించిన గ్రేడు చాలును.

# ఆంధ్ర నాటక కళాపరిషత్తు నాటకరచన పోటీ నిబంధనలు

కడచిన డిసెంబరు నెలలో చెన్నపురిలో జరిగిన తృతీయాంధ్ర నాటక కళాపరిషన్మహాసభ వారు తెలుగుభాషలో రచింపబడెడి యుత్తమ నాటకమునకు 1116 రూ. బహుమతిగా నొసంగుటకు తీర్మానము కావించిరి. పోటీకి నాటకములను పంపు గ్రంథకర్తలు పంపవలసిన నిబంధనలు.

1. పోటీకి పంపబడు నాటకము స్వతంత్ర రచనయై యిదివరకు ప్రచురింపబడనిదిగను, ప్రదర్శింపబడనిదిగను ఉండవలెను.

2 (ఎ) నాటకవస్తువు వర్తమానకాలమునందలి ప్రజల జీవితమునకును, ఆధునిక పరిస్థితులకును సంబంధించినదియై యుండవలెను. ఇతివృత్తము సాంఘికముగ గాని, మత విషయముగ గాని, రాజకీయముగ గాని యుండవచ్చును

(బి) సంఘ విద్వేషమును పుట్టించునట్టి భాగము లేవియు నందుండరాదు. ప్రజాశాంతి భద్రతలకై నిర్మింపబడిన చట్టములకు గాని, నిబంధనలకు గాని ప్రతికూలముగ నుండరాదు.

(సి) జీవించియున్న వారి జీవితములను నాటకమున ప్రదర్శింప జేయరాదు.

(డి) స్వగతము లుండరాదు తప్పనిసరియగుచో నే సందర్భమునైన క్లుప్తముగ నుండవచ్చును.

(ఇ) పాత్రల సంభాషణలు దీర్ఘముగ నుండరాదు. ఉపన్యాసధోరణి కూడదు.

3. నాటకము మొత్తము మూడుగంటలలో ప్రదర్శింప దగినదై యుండవలెను. అందు వచన భాగము మాత్రము రెండుగంటలకు మించరాదు. వరా:—వచనభాగము పోను తక్కిన గంట సంగీతమునకు గాని, రంగమునకు రంగమునకు మధ్యనుండెడి విరామములకు గాని ఉపయోగపడును.

4. (ఎ) నాటకము మూడు మొదలు అయిదంకముల వరకు కవి యిచ్చ ప్రకార ముండవచ్చును. ఒక్కొక్క అంకమునకు మధ్యను సుమారు పదినిమిషముల విరామ మొసంగబడును.

4 (బి) ఒక్కొక అంకము ఒక్కొక రంగముగా ఉండవచ్చును. రంగమును మార్చి వేరు రంగమును ఏర్పాటుచేయు సందర్భములందు కాలహరణము జరుగని పక్షమున నొక అంకమును రెండుమూడు రంగములుగా విడదీయవచ్చును.

(4)-సి. సాధ్యమైనంతవరకు ప్రధాన స్త్రీ పాత్రలు మగ్గురికి మించి యుండరాదు.

5. నాటకమున పెక్కు పాత్రలను సృష్టించుటవలన ప్రదర్శనము కష్టసాధ్య మవును గనుక వీలైనంతవరకు పాత్రల సంఖ్యను తగ్గించుటకు గ్రంథకర్తలు ప్రయత్నింపవలయును.

6. నాటక మందలి భాష సుబోధకముగను, పాత్రోచితముగను ఉండవలెను.

(బి) సంగీత ముండదగిన తావులయందే పద్యములను, పాటలను వ్రాయవలెను.

(సి) పద్యములనుగాని, పాటలనుగాని, సంభాషణరూపముగ మాత్రము వ్రాయరాదు.

7. నాటకము డబ్బుసరి కాగితముపైన, ఒకే వైపున, విడివిడిగ, సిరాతో వ్రాయవలయును. గ్రంథకర్త పేరు వ్రాతప్రతియం దెక్కడను ఉండరాదు.

8. గ్రంథకర్తలు పోటీకి గాను పంపెడి ఒక్కొక్క నాటకమునకు కనీసము రెండు ప్రతులనైనను 1935-వ సంవత్సరము జూలై నెల 31-వ తేదిలోపుగ పరిషత్కార్యాలయమును చేరునట్లు పంపవలెను. వ్రాతప్రతుల యందెక్కడను గ్రంథకర్త పేరుండరాదు గాని గ్రంథకర్తయొక్క పేరు, పూర్తివిలాసము, పంపినపుస్తకము పేరు సూచించుచు కార్యదర్శులకు ప్రత్యేకముగ సీల్డుకవరులో ఉత్తరము వ్రాయవలెను.

9. నాటకనిర్ణయ సంఘమందలి సభ్యు లెవరు గాని యీ పోటియందు పాల్గొనరాదు.

10. బహుమానమును నిర్ణయించుట యందు నిర్ణయసంఘమువారి తీర్పు ఖాయము.

11. పోటీదారుల పక్షమున బహుమతికై యెట్టి ప్రచారమును చేయబడరాదు.

12. పోటీ కంపబడెడి నాటకములలో నేది యు నిర్ణయసంఘమువారి దృష్టికి సంతృప్తి కర ముగ లేనిచో బహుమతి నాపివేయుటకు ఆ సం ఘమున కధికారము గలదు.

13. బహుమతి పొందిన నాటకము యొక్క ప్రదర్శనహక్కులు-రెండుసంవత్సరములవరకును, ప్రథమ ముద్రణాధికారమును పరిషత్తునకు గలవు.

14. పోటీకి పంపబడెడి నాటకములలో దేని నయినను ప్రచురించుటకు గాని, ప్రదర్శించుటకు గాని పరిషత్తువారు పూనుకొన వచ్చును. కాని అట్టి ప్రచురణము గాని, ప్రదర్శనము గాని సదరు గ్రంథకర్త యొక్క అంగీకారముపైననే చేయ బడును.

నీలంరాజు వెంకటశేషయ్య,
గూడవల్లి రామబ్రహ్మం,
సంయుక్త కార్యదర్శులు.

అడ్రెసు:—ఆంధ్రనాటకకళాపరిషత్తు,
పోస్టుబాక్సు 28౦ నెంబరు,
మదరాసు



ఆలయ ప్రాంతము P. R.R.

# గాంధిమహాత్ముని నిష్క్రమణము

[ చిలవలుపలవలుగా చెప్పుకొనుచుండిన మహాత్ముని నిష్క్రమణము స్థిరపడినది. దీని వలన ప్రజలందును, ప్రజానాయకులందును అలజడియు, పరితాపమును గలిగినవి. ఎందరు ఎన్నివిధముల ప్రార్థించినను ఆయన వినలేదు. కాంగ్రెసు ఇతోధికౌన్నత్యమును బడయుటకే వెళ్లుచున్నానని యాయన యుపపత్తులను చూపుచున్నాడు. ]

"నేను కాంగ్రెసును వదల గోరుచున్నాను. మీరు ఆశీర్వదించి నాకు అనుమతినియ్యగోరెదను. నేను కోపగించి వెళ్లిపోవుటలేదు. కాంగ్రెసుమహాసభ అభివృద్ధినొంది సహజమగు నౌన్నత్యమును, శక్తిని బడయ గలుగుటకే నేను వెళ్లగోరెదను. నే నిపుడు కాంగ్రెసుకు గుదిబండగా నున్నానని తలచుచున్నాను. నేను కాంగ్రెసులో నుండుటవలన అది క్రుంగిపోవుచున్నది. నేను దానిని క్రుంగదీయుచున్నాను. కాంగ్రెసు ఇపుడు తన అభిప్రాయమును సహజముగా వెల్లడించుటలేదు. అది యొక కీలుబొమ్మయైనది. ఇంకొకరిపై ప్రేమతోగాని, గౌరవముకొరకుగాని తన స్వశక్తిని, సొంత అభిప్రాయములను లోపల నణచుకొనియుండుట ఏసంస్థకుగాని, ఏజాతికిగాని వినాశకరము. అట్టిప్రేమయు ప్రేమ కాజాలదు.

పండిత జవహరలాలుగారు వ్రాసిన లేఖవలననే నేను కాంగ్రెసును వదలుటలేదు. కాని యింత శీఘ్రముగా కృతనిశ్చయుడ నగుట కది సహకారియైనది మాత్రము నిశ్చయము. కొన్నినెలలనుండియు నన్నీభావ మలముకొన్నది. నాకర్తవ్యమును వదలవలెననియు, నా స్థానమునుండి పారిపోవలెననియు నేను లేశమైన కోరుటలేదు.

అంధుడు దారికొరకు మరియొక యంధునిపై నాధారపడినట్లు కాంగ్రెసు నాపైనను, నేను కాంగ్రెసు పైనను ఆధారపడియున్నాము. అహింసకుగల శక్తిని వెల్లడిపరచుటకే నేను జీవించియుండుట. అహింస యనగా మాటలోను, భావములోను, క్రియలోనుగూడ అహింస. దౌర్జన్యము పశులక్షణము. మనుష్యులలో నాగరకతను గలిగించుటకు అహింసయే మూలాధారము. కాని అహింసయం దిట్టినమ్మకమును మీకు నేనెన్నడును కలిగింపజాలకపోతిని. నేను కాంగ్రెసులో నుండుటవలన సమగ్రమగు అహింసాపరత్వము కాంగ్రెసులో నెన్నటికిని గలుగదను గట్టినమ్మకము నాకిపుడు కలిగినది. మీ రట్టి యహింసాతత్వమును పూర్తిగ నలవరచుకొంటి రనుసమ్మకము నాకు కలిగినచో నేను శీతనగాగ్రభాగమునను౦డినను, పాతాళలోకమునందుండినను మీ యాహ్వానము లేకయే మరల మీమధ్యకువచ్చి మిమ్ములను గమ్యస్థలమునకు గొంపోదును. అకలంకమగు నిష్కాపట్యము, సమగ్రమగు నహింస, అస్ఖలితమగు సత్యము మనకుండినచో మన యభీష్టము సిద్ధింపగలదు.

'గాంధీజీ, మీ రిటుపైని కాంగ్రెసులో నుండ గూడదు' అని గఫూరుఖానుగారు చెరసాలనుండి రాగానే నాకెరిగించిరి. ఆయనయభిప్రాయము సరియైనదే. కాంగ్రెసు కార్యసంఘసభలోగూడ చాలమంది నా యభిప్రాయమును గ్రహించిరి. నేను నిష్క్రమించుట కనుమతించిరి. "కావున మీ ఆశీర్వచనములతో నేను కాంగ్రెసును వీడెదను. విడనాడుట తప్పనితోచిన మరుక్షణమే వచ్చెదను. నే నెప్పటికిని కాంగ్రెసుసేవకుడనే కాని కాంగ్రెసుద్వేషిని కాను."

---

Printed and Published by K. Nageswara Rao, at the Andhra Patrika Press, No.7, ThambuChetty St., Madras.
Editor: G. Subbaramayya.






కలగూరగంప: విశ్వవిఖ్యాతపుస్తకాలయములు; అయిదుగురు గొప్ప ఆలంకారికులు; మన పల్లెటూళ్లలో 'బ్రాడ్‌కాస్టింగ్సు'; నేర్చుకొనవలసిన "దుర్గుణాలు"; కళ-సౌందర్యము; వైజ్ఞానికప్రశ్నలు ; జైనులు-భారతీయ

# చిత్రములు



---




సంపు. ౧౧ భావసంవత్సరము, మార్గశిరమాసము (డిసంబరు ౧౯౩౪) సంఖ్య ౧౨

# కవిబ్రహ్మ

పాటిబండ మాధవశర్మ
(కవితావిహారము)

౧

హరిహరనాథపాదజలజార్పితవర్తనుఁ, డాంధ్రకావ్యకృ
ద్వరగురుమూర్తి, యోగపరిపాలితచిత్తుఁడు, సుందరాంగకుం,
డురుమహిమాన్వితుండు, కవియోగివరేణ్యుఁడు, తిక్కయజ్వ, సు
స్థిరకరుణాప్రసన్నుఁడయి చేకొనుఁగావుత మన్నమస్కృతుల్.

౨

హరిహరభేదభావముల యల్లరిలోపల, సంస్కృతాంధ్రవా
గ్వరచనవైమనస్యముల వేడిమిలోపల, దేశిమార్గవై
ఖరుల నిరంతరప్రథనకర్మములోన, మహోజ్జ్వలం, బను
త్తరము, నపూర్వమైన యొకతత్వము ముట్టిన మార్గదర్శివై,

౩

త్యాగముచే రజస్తమము లారడి సేయని భావితాత్ముఁడై,
యాగముచేత బ్రహ్మపదమంటిన కర్మపరుండవై, సమ
స్తాగమసారమౌ హరిహరాత్మకదైవముఁ గన్న జ్ఞానివై,
యోగముచేత బ్రహ్మము సయోగము బొందిన సిద్ధమూర్తివై,

౪

భానుజు రాజభక్తియెడఁ, బాండవు విక్రమమందు, స్వర్ణదీ
సూనుని త్యాగమందు, మధుసూదను తంత్రమునందు, నంతకృ
త్మానుసి సత్యసిద్ధియెడ, ద్రోణు గురుత్వమునందు, భారతా
ఖ్యానజగాన నీవు పొడకట్టని ఘట్టము లేద యొక్కెడన్ !

౫

కవియగు నీవు శాశ్వతమకా యల బ్రహ్మముపోలె నన్న ధ
ర్మువు దిగనాడి, నీకు నొకపుట్టువు, మృత్యువు నిర్ణయించి, మా
నవుఁడవ కాఁదలంతురు జనమ్ములు తత్త్వవిమూఢులౌట ; ని
క్కువముగ నీకునున్ గలవొకో జననాదికకర్మబంధముల్ ?

౬

దేవతలైరి మానవులు, దేవవచఃస్థితిగాంచెఁ దెల్గు, లో
కావనమయ్యె, నాస్తికులు ఆస్తికులైరి భవద్వచోవిధిన్ ;
" గావున భారతామృతము గర్ణపుటంబుల నారఁ గ్రోలి యాం
ధ్రావలి మోదముం " బొరసె నక్షరమయ్యె భవద్విలాసమున్ !

౭

అవ్యయంబగు పరమాత్మ నాత్మతోడ- నర్చసేయువిధాన నిన్నర్చసేతుఁ
దొలుత నీలీలమే యగు తెలుఁగుకవిత-యందు నాపాలఁబడిన యల్పాంశతోడ !!!

—"వీరపూజ" నుండి.

---

# ప్రేమ: విశ్వమానవకల్యాణము

దేవగుప్తాపు విశ్వేశ్వరరావు
[శ్రీ నవ్యసాహిత్యమండలి]

'The roses of Love gladden the garden of Life'

ప్రేమ జీవితపరమావధి; స్వర్గమునకు మార్గము; హృదయసీమను కాంతిమయముగ జేయు నొక యపూర్వతేజము; ప్రపంచజ్యోతి. ఇయ్యది దేవతాస్వభావము; దేవతాసంపత్తి. తద్వ్యతిరిక్త గుణము రాక్షససంపత్తి. ప్రేమ యతిమనోజ్ఞము, మధురము, మిగుల నగాధము. అవ్యక్తమగు బ్రహ్మానందమునకు సత్తమోత్తమమగు వ్యక్తస్వరూపము ప్రేమయే. నిత్యమును, సర్వోత్కృష్టమును నగు నానందము ప్రేమయందున్నది ప్రేమ మానవునకు త్యాగము సేయు బుద్ధికుశలతను, స్థితప్రజ్ఞను ప్రసాదించును. ప్రేమ ఆనందనిధానము. హృదయమున జనించు నితరభావన లెవ్వియు 'ప్రేమ' యంత మధురతిక్తములు గావు; కోమలములును గావు. ప్రేమ యన 'రాగము' కాదు. రాగమున స్వార్థపరత్వము మిళితమైయున్నది. ప్రేమాగ్నిహోత్రమున స్వార్థశలభము మాడి నశించును. ప్రేమ మానవుని తన సర్వస్వము నర్పించివేయ సంసిద్ధుని జేయును. ప్రేమయు, ఆత్మార్పణమును అవినాభావసంబంధముగల మనోవృత్తులు.

ప్రేమ మానవునియందలి యహంకారమును, స్వార్థమును పటాపంచలుచేసి యతిమనోహరమును, అతిమధురమును నగు నొక మానసికవిప్లవమును దెచ్చును; ఆనందదాయకమైన నూతనచైతన్యమును వర్ధిలజేయును. హృదయమున ప్రేమావిర్భావమైనంతనే యిట్లహంభావము నశించి త్యాగబుద్ధి విస్తరిల్లును. ప్రేమ హృదయావృతాజ్ఞానాంధకారమును బోద్రోలి జ్ఞానతేజఃపుంజమును వ్యాపింపజేయును. అతివిస్తృతము, అతినిమ్నము, అతిమధురము నగు నొక విచిత్రానందము ననుభవింప జేయును. ప్రేమపూరితుని హృదయమున నానందజ్యోతి నిత్యమును ప్రకాశించును. ప్రేమరుచిని చవిగొన్నవారలలో స్వార్థచింత సన్నగిల్లును; భోగపరాయణత్వమున విరక్తి గలుగును. విషయవాంఛలను తృణప్రాయముగ జూచి యున్నతాదర్శముల నందుకొన పైకెగబ్రాకుదురు. బ్రహ్మానందము మానవజీవితమునకు పరమావధి; ఇయ్యది ప్రేమజనితానందమునకు నతిసామీప్యమున నున్నది. మానవుని సంకుచితస్వభావమును సడలించి యంతులేని యూహాపరిమితి నతివిస్తృతముగ జేయునది స్వచ్ఛప్రేమయే! ఇయ్యది ప్రేమకు సహజపరిణామము; మానవస్వభావముననే యిమిడియున్నది. తానే విశ్వమునెల్ల నాక్రమించియున్నాననెడి పరమసత్యమును అజ్ఞానపూర్వకముగనైనను అనుభవములోనికి దెచ్చుకొనుటవలననే ప్రేమానందమును బడయగలుగుదుము.

ప్రేమ మానవజీవితమును సుఖదాయకముగను, అనుభవనీయముగను, ప్రసజ్యముగను, సార్థకముగను, ధన్యతమముగను జేయును. ప్రేమ విశ్వమునైన కదలింపజాలునది. ఏమానవోద్యమమునకైన నిదియే వెన్నెముక. జీవితమును వివిధవర్ణవివిధాంబరములతో జిత్రించి యలంకరించి సరిదిద్దును. వివిధాలోచనములకు, వివిధమనోవికారములకు, వివిధసుఖములకు ప్రేమయే మాతృస్థానమును వహించుచున్నది. గంభీరాలోచనములు, విభిన్నమనోవృత్తులు, వేడుకలు — క్షణభంగురమగు నీ మానవజీవితమును ఉత్కృష్టాశయ పరిపూర్ణముగ నొనరించున వేవియైనను — ప్రేమావిర్భావమునకే. ఆ పవిత్రాగ్ని ప్రజ్వరిల్లజేయుట కివన్నియును దోహదములే! ప్రేమ స్థూలదృష్టి కొకేరూపమున గాన్పించుచున్నను, సూక్ష్మపరిశీలనమునకు వివిధరూపములతో విశ్వహృదయమున విరాజిల్లుచున్నటుల కనుగొందుము. వివిధ పరి

స్థితులలో వివిధసర్మములఁ జేబట్టి నిదియే యాజ్ఞా పించును.

ప్రేమాభావము 'ద్వేషము.' తేజో౽భావ మంధ కారమైనటుల ప్రేమాభావమె 'ద్వేష'మనునది. ద్వేష మునకు ప్రత్యేకవ్యక్తిత్వమావంతయును లేదు. ప్రేమపదా ర్థమునకు ద్వేషము ఛాయామాత్రము. అయినను 'ద్వేషము ప్రేమజన్యమే! ప్రేమవృద్ధిని నిరోధించు నేదియైనను మానవు డేవగింప, ప్రేమసామ్రాజ్యాభివృద్ధికి ప్రతిబంధ కముగ నుండువానిని భగవంతుఁడు తొలగింప బ్రయత్నిం చును.

ప్రేమ స్వార్థమునుండి బయల్వెడలి క్రమముగ విశ్వవ్యాప్తి నందును. హృదయమే ప్రేమకు జన్మ స్థానము. ప్రేమ వివిధాకారముల ప్రవర్తించుచున్నను స్వార్థప్రేమనుండి జన్మించినదిమాత్రమే! ప్రయత్న పూర్వకముగ నైనను, కాకపోయినను స్వార్థమే మాన వుని మానసికశక్తుల నవిచ్ఛిన్నముగ నేలుచున్నది. తండ్రిని ప్రేమించుట 'తన' తండ్రి యనుటచేతనే; స్నేహితుని ప్రేమించుట 'తన' స్నేహితు డనుట చేతనే; మాతృదేశాభిమాన మాతృభాషాభిమాన విషయ ములఁగూడ నంతే! మానవుని ప్రేమించుట తన తోడి మానవు డనుటచేతనే! కాన, విశ్వమానవప్రేమ స్వార్థ ప్రేమ కత్యధికవ్యాప్తియేగాని వేఱొండుగాదు. అయి నచో, 'స్వార్థ'మన నేమి? ప్రేమకు ప్రాతిపదిక. బాల్య దశలో జీవించకుండ నెట్లు యౌవనులమగుట యసంభ వమో, అట్లే స్వార్థము ప్రాతిపదికగాని ప్రేమ శశవిషాణ ప్రహాసదృశము.

మానవవ్యక్తిత్వము విశ్వదర్పణమున ప్రతిబింబ మాత్రము. సర్వశక్తియుతుఁడగు భగవంతుని కిరణసదృ శుడు మానవుడు. ప్రేమ పరమాత్మవలెనే నాశరహి తము. ప్రేమాగ్నిపవిత్రకణము లనవరతము ప్రకాశించు చుండును. తదజ్ఞానము స్వార్థచింతన పటాపంచలు చేయును. మానవు డీప్రేమను విశ్వవ్యాప్త మొనర్చుట చేతనే భగవత్సాన్నిధ్యమును జేరుచున్నాడు. ప్రేమ వ్యక్తులమీదనే యాధారపడక సమస్త చరాచరకోటికి సవలంబనమను పరతత్త్వము నాశ్రయించినపుడే 'విశ్వ ప్రేమ'గ పరిణమించును. భగవద్భక్తి యన వేరలేదు, విశ్వవ్యాప్తప్రేమ మానవమోక్షప్రదాయిని.

ప్రేమతో నిండియున్న పూర్ణజీవనము సార్థక మానవజీవన మని ముందు గ్రహించియుంటిమి కదా! అట్టి పవిత్రజీవనమును గడపుటకు మానవమాత్రుడు చేయ వలసిన, చేయదగిన ప్రయత్నమును మనలో పురికొల్పి తగిన ప్రోత్సాహము నొసంగి యుత్సాహ ముదయింప జేయుటకై 'విశ్వహృదయము' సర్వదా వేచియుండును. ఆదివ్యశక్తిని చేజిక్కించుకొనుటయందే మానవ ప్రతిభ వ్యక్తమగుచున్నది. ప్రేమ మానవునియందలి నిద్రాణ ములైయున్న శక్తులను మేల్కొలుపుటకును, ముకుళిత ములై యున్న భావములను వికసింపజేయుటకును సాయ పడును. ప్రేమోదయము కార్యోత్సాహమును గల్గించును. అభిలషితసుఖప్రాప్తికై నవీనమార్గాన్వేషణమున మన స్సును జొప్పించును. ప్రేమ మానవుని యభివృద్ధికి సహాయపడు ప్రధమాంశము. ప్రేమాగ్ని లేనిదే జీవిత యంత్ర పరిభ్రమణము దుస్సాధ్యము.

ప్రేమ వివిధపరిస్థితులలో వివిధవ్యక్తులయందు వివిధశక్తుల నావిర్భవింపజేయును. ఒకని కవిని, వేఱొ కని గాయకుని, యింకొకని శిల్పిని, మఱొకని చిత్ర కారునిగను జేయగల మహత్తరశక్తి ప్రేమయందే యున్నది. లలితకళలకు వలసినది మృదుశిరీషకుసుమ సదృశహృదయము. అట్టిహృదయము తప్పనిసరిగ ప్రేమా ర్ద్రమై యుండును. ఈప్రేమయే గౌతమబుద్ధునియందు త్యాగశక్తిని విజృంభింపజేసెను; జీసస్‌లో ఆత్మో త్సర్గనామధేయమును గైకొనెను; చైతన్యుని హృదయ మున భక్తితన్మయత్వమును రేకెత్తజేసెను. లలితకళలకు భావతరళత యెంత యావశ్యకమో, భక్తిపరవశతకు ప్రేమ యంత యావశ్యకము. ప్రేమోదయమున కాలంబనము నిష్కల్మషమనోవ్యాపారము. ప్రేమ కమనీయస్వర్గహర్మ్యారోహణమునకు ప్రథమసోపా నము.

ప్రేమస్వరూపుడు పరమేశ్వరుడు; పరమేశ్వరుడు ప్రేమమూర్తి! సత్యము, ప్రేమ, సౌందర్యము- ఇవన్నియు నేకస్వరూపములె! భగవంతుడే సత్యము; నిత్యము. భగవద్భక్తియే నిత్యమును, ఉత్కృష్టమును నగు ప్రేమ. భగవంతుడు సత్యమూర్తి; ప్రేమస్వరూపుడు; సౌందర్యనిధానము. యథార్థసౌందర్యము దివ్యసౌందర్యము. సుందరవస్తువు శాశ్వతప్రసన్నతాసామగ్రి. సహజముగ మానవుడు సౌందర్యోపాసకుడు; ప్రేమపిపాసి. సౌందర్యోపాసనయు, ప్రేమోపాసనయు జన్మతః గలుగు మానవధర్మములు. ఈశ్వరుడు సర్వసౌందర్యమునకు స్థానము; సౌందర్యమూర్తి. విశ్వ మీశ్వరునినై పుణ్యప్రదర్శనశాల. పరమేశ్వరుడు ప్రకృతిరూపమున నీప్రపంచమున మనకండ్లయెదుట నృత్యముచేయుచున్నాడు. అట్టి ప్రకృతిసౌందర్యము ప్రేమోద్దీపనము. ప్రకృతి మాధుర్యము ప్రేమ నావిర్భవింపగలుగును. అమృతకరుని శీతలత్వము, పికకూజితముల మృదుమధురశ్రావ్యస్వరములు, దక్షిణ సమీరముల దివ్యస్పర్శము, పుష్పసౌకుమార్యము, అరుణపల్లవముల పేశలత్వమును హృదయమును తీవ్రతమమగు మానసికప్రవృత్తికి లోబరచి హృదయోద్వేగమును పొందించును. అందువలననే కాబోలు, కవికుమారుడు:

'ఏపువ్వు పూసినా
ఏపాట పాడినా
ఎందుకో ఈహృదయ
మింత కళవళపడును!

కొండమీదా కట్టు
కొన్న చుక్కల మేడ
పైని జాబిలిరాజు
పకపకా నవ్వితే
ఈహృదయ మెందుకో
ఇంత కళవళపడును!

ఏపేదవాని ఆకలిచిచ్చు కన్నీరు
ఏకష్టజీవికొంజెముట నెత్తురుబొట్లు
ఏవలపుపెడద క్రా
గినమంట నిట్టూర్పు
ఈపాడుబ్రతుకులో
ఇంకిపోయెనో గాని—
ఏపువ్వు పూసినా...'

యని గానము చేసినాడు. 'అమలమలయ సమీరవిహారములకు, రమ్యకలకంఠ కుహూకుహూ రావములకు'ను మేల్మేలని తలలూచి మెచ్చుకొనువారి హృదయము ప్రేమోద్రేకమున పలవరించును. ప్రకృతిరమ్యత సౌరభముల వెదజల్లు సరసీని వెన్నెలలనురియు పూర్ణేందుబింబ సందర్శనమును గలిగినపుడే తెలియును. ప్రకృతిచిత్రము, 'స్వచ్ఛకాదంబినీ వృతాంబరమున సాంధ్యరాగ మరీచి కాచ్ఛటలు' గ్రమ్మునటుల పశ్చిమాంబుధిని భానుడు గ్రుంకునపుడు గాననగును. 'ప్రకృత్యాశయముల నువయకాలపు భావసంపదల కాంచుటకై రండనునట్లు స్వీయ తరంగహస్తమాలికల చాపి యుచ్చైస్స్వనాల బిలుచు నబ్ధి బోధించును.' మనోహరదృశ్యము లన్నియు మానవ హృదయమును సంచలింపజేయును; ప్రకృతిమాధుర్యము మానవహృదయమున శాశ్వతముగ హత్తుకొని భగవంతుని సుందరప్రకృతియందు ముగ్ధుని జేయును.

ఇట్టి ప్రకృతిసౌందర్యము సౌందర్యోపాసకునికి సంతతానందదాయకము. చిత్రకారులు, శిల్పులు, కవులు, గాయకులు సౌందర్యోపాసకులు గారా? చిత్రకారుని రంగులకుంచె సౌందర్యదృశ్యమును గాదా చిత్రించును! శిల్పులు మనోహరముగ ప్రతిమల జెక్కుట మాపరులకు సుందరముగ గానుపడి వారిని ఆనందసముద్రమున నోలలాడించుటకు కాదా? కవులు చదువరుల నానందాబ్ధి నోలలాడించినట్లు గాదా తాము కావ్యముల రచింతురు? గాయకుడు సభికుల బ్రహ్మానందభరితుల జేయును గాదా తన యసమాన గానకళాప్రావీణ్యముచే! మానవహృదయము లోకభావనాదర్పణము. సౌందర్యోపాసకుడు కళాధరుడు. ప్రేమోపాసకుడు దివ్యమధురిమను కుసుమపేశల సుధాస్పర్శచే నర్పించి యనుభూతసుఖమును

ముక్తకంఠమున గానముచేయు రసరాజు. ప్రేమోపాసకుని, సౌందర్యోపాసకుని, నిత్యసత్యవ్రతుని గీతములు ప్రపంచప్రహసన ప్రతిస్వనములు; అతని దుఃఖము మనుష్యతాశ్రువులు. అతడు స్వప్నలోక సంచారి; కల్పనాలోకవిహారి. అతడే దివ్యమూర్తి. ప్రేమోపాసకుడు గగనపథవిహారవిహంగమపతి; మోహన నీల జలధరమూర్తి; ప్రళయ ఝంఝూప్రభంజనస్వామి. మానవుని హృదయాంతరాళమున జెలరేగు నిమ్నభావములకు మానవహృదయ సౌకుమార్యమునకు రూపమిచ్చి వానిని హృదయంగమ మగురీతిని గానము చేయగలుగు వాతడే ప్రేమోపాసకుడు, ప్రేమగాయకుడు. ప్రేమ ధనమువలని నిరతిశయానంద మెఱిగిన మానవునికి 'హేమమణిరత్నగణ' మనవసరము. ఊహైకజీవితుడగు మానవునికి దివ్యభాగ్యమగు ప్రియురాలు లోకమెల్లెడలను మేఘములలో, మెఱపులలో గానిపించుచున్నది. అతడు తేటిమ్రోతయందును, కోయిలకూతయందును, సెలయేటి గలగలరవమునందును ప్రేమగానమును వినుచున్నాడు; వృక్షశాఖలపైని గూర్చొని ముద్దులొలుక గూయు పక్షుల యవ్యక్తమధుర రవములలో ప్రేమ ధ్వనులు- ప్రకృతిమాధుర్య గ్రహణసూచక మర్మరధ్వనులు వినుచున్నాడు. ప్రేమ యాతనికి హృదయానందకరముగ నమృతకిరణముల వెలయింపజేయు రోచిస్సు; సుధానీరధి; తేనెనిగ్గు. ప్రేమోపాసకుడు స్వేచ్ఛాగానప్రవృత్తియందు నిమగ్నుడై యుండును. భోగములకన్న ప్రేమార్ద్రహృదయమే జీవితమున కానందదాయక మనుసత్యమును గ్రహించి ప్రేమమూల్యమును దెలిసికొనినయాతడింకెట్లు ప్రవర్తించును? అతని చిత్తప్రవృత్తి, ఆదర్శము తదితరమం దెట్లు లగ్నమగును?

ప్రేమపాశమే కనకసరోజమాలిక. ప్రేమాలాపమె ప్రణవమంత్రము. ప్రేమమూర్తియగు నీశ్వరుని కనకసరోజమాలిక యగు ప్రేమపాశముచే నిబద్ధుని గావింపవచ్చును. కాన ప్రేమోపాసకుడే ఈశ్వరభక్తుడు. ప్రేమయే అవ్యయానందకళ: నిశ్చలమానసిక వ్యాపారము. అకళంకహృదయసీమల జన్మించి, నిర్భరానందరూపమై, భావసుధాసారపరిషిక్తమై, యభోగపూర్వమై, తన్మానసికానందరూపముగ ప్రకృతిని గలతబెట్టునదే ప్రేమ. ఆ ప్రేమోపాసకుడే కళానందుడు, చిన్మయుడు. ఈ ప్రేమోపాసకుడే భావడోలికలలో సదా యూగులాడుచు మైమరచియుండును.

'చల్లని జ్ఞానప్రకాశములో ప్రేమావధి మొలకెత్తదు.' —'కాంటు'

ఈవిశాలవిశ్వమంతయు ప్రేమపరిపాలనమునందే యున్నది. వికసించిన అరవిందము, పికగాయనీమణుల యవ్యక్త కలకలనినాదము, అరుణపల్లవ శోభితములైన వసంతకాలోన్నతమహీరుహములు, పురివిప్పి నృత్యము చేయు మయూరకాంతాసంతతులు, లతావనితలు, అందందు చెఱుకుకండ్లలో పరువులెత్తుచుండు భీతహరిణ సముదాయములు- వీనిని కాంచినపుడు మహదానందము ననుభవింతుము. పసిపాపల మందహాసచంద్రికలలో ప్రేమరస ముప్పొంగును. లేగదూడకు మురిపెమున పాలిచ్చుచు నోడలెల్ల నాకునపుడు గోవుహృదయము ప్రేమార్ద్రమగును. ఇట్టిదృశ్యములు పొడగట్టినపుడు అనుభూతములుగాని గంభీరభావము లొక్కసారిగ ముప్పిరిగొన మనహృదయ ముప్పొంగును. ప్రేమమయ మగు జీవితము శుక్లపక్షమును బోలును అట్టిజీవితము పూర్ణిమాజ్యోత్స్నాపులకితము. దుఃఖమయజీవితమునం దదృష్టవశమున గలుగు ప్రేమానుభవము శ్రావణశర్వరిని గిలిగింతలువెట్టు మెఱుపుతీవ. ప్రేమపాశనిబద్ధులైన దంపతులానందపరవశులైయుండ వారి యానందమును మటుమాయజేయు సంఘటనము కార్తికపౌర్ణమీ రాత్రమున నెడనెడ చంద్రుని గప్పు మేఘశకలము.

గోకులబృందావనమునుండి శ్రీకృష్ణుడీ ప్రేమగానమునే తన భావమురళితో శ్రావ్యముగ గానము చేసెను. శ్రీరామచంద్రమూర్తి తన నేత్రద్వయమునుండి యిట్టి ప్రేమదృక్కులనే తన ప్రజలపై బరపెను. మొరకుయూదులనడుమ భౌతికశరీరమును వీడుచు జీససు ప్రకటించిన దీ ప్రేమసందేశమే! భారతదేశమందలి ప్రపక్తలందరు నీప్రేమతత్త్వమును దశదిశల జాటిన

వారే! గౌరాంగుడు, దయానందుడు, రామమోహనుడు, నేడు శ్రీగాంధిమహాత్ముడు — ఈ ప్రేమాతత్త్వము ను వేనోళ్ల జాటినవారే!

సత్యమైన ప్రేమ సౌందర్యోపాసన; దైవమునందచంచలభక్తి; విశ్వమానవప్రేమ. తదితరము కుహనా ప్రేమ. పరమేశ్వరునియందు నిలిపెడి ప్రేమయే సంతత బ్రహ్మానందదాయకము. అందు దురాకాంక్ష కించిన్మాత్రమును తావు లేదు. జడప్రకృతియందలి ప్రత్యణువును దివ్యసౌందర్యమును వెదజల్లును. (A thing of beauty is a joy for ever — 'Keats'.) కాన ప్రకృతియందలి సౌందర్యము మానవునికి సదా యానందదాయకమే యగును. దాన ప్రకృతి సౌందర్యమూర్తియై మానవహృదయాంతరాళమున ప్రేమోజ్జ్వలనకారకమై వెలుగొందుచున్నది. తన సృష్టిని ప్రేమించువారినే పరమేశ్వరుడు ప్రేమించును. దైవభక్తిని, మానవసేవ, జాతిమతవివక్షత (Cast, creed or colour) లేకుండ జేయుటమూలముననే ప్రకటించగలము. భగవంతుడు కడు బీదజనులయందును, నిమ్నస్థితియందున్న దీనులయందును మాత్రమే నివసించును. ప్రేమ పట్టణములలో గాక పల్లెటూరిగుడిసెలలో కాపురముచేయును. పరమేశ్వరుడుగూడ నీజానపదుల కష్టసుఖముల పంచుకొనుచు వారికి సదా యనుచరుడై యుండును. అట్టి బీదసాదల కష్టసుఖములయందు పాలుగొనుటవలననే మానవుడు పరమేశ్వరుని ప్రేమకు అర్హుడగును. సర్వస్వమును భగవదర్పణము చేయుటయందే మానవుని కైవల్యయానందము చేకూరగలదు. నిమ్నస్థితియందున్న మానవులకు సేవజేయుటయే పరమేశ్వరుని కత్యంతప్రీతికరమగు సేవ!

*'ప్రేమ మానవుని గొప్ప దౌర్బల్యము.' మానవునియందలి యహంకారమును, స్వార్థపరత్వమును మటుమాయజేసి పురుషునియందలి 'మానవత్వము' ను సార్థకముగజేయును. మానవుని ప్రకృతితత్త్వవేదిగను, విశ్వమానవసేవాపరాయణునిగను పరివర్తనముజేయును.

†'ప్రేమించువానికే దండించునధికార మున్నది.' తనయుడు తప్పిదమొనర్చిన తండ్రి ఏల దండించును? తనయునియందు ప్రేమ లేకనా? దండనమునకు కూడ ప్రేమయే కారణముకదా! రాజు తన ప్రజల నేల నేరమునర్చిన దండించును? సన్మార్గప్రవర్తకుల నొనర్చుటకుగదా? ఒకవ్యక్తిని ఎట్టిసంబంధమును, ఆదరాభిమానములును లేని మరియొకవ్యక్తి దండించిన యసభ్యముగావా! పరమేశ్వరుడు మానవులను సన్మార్గప్రవర్తకుల జేయుటకుగాదా దండించును? ఇట్టి దండన ప్రేమజూపుటకే కాదా?

ప్రేమతత్త్వలక్ష్యములు : ప్రేమతత్త్వము వేరు, లక్ష్యము వేరు. ప్రేమలక్ష్యము లోపభూయిష్ఠము. అందువలననే ప్రేమ, లక్ష్యభేదమునుబట్టి యొక్కొక్కప్పుడు దుఃఖముల సంప్రాప్తింపజేయును. ప్రేమతత్త్వమున కట్టిలోపముల నారోపింపజాలము. క్షణభంగురమగు లక్ష్యము ప్రేమ కంటగట్టిన నది దుఃఖ సంప్రాప్తికిమాత్రమే కారణమగును. బలవత్తరమగు ప్రేమ నాహినికి ఆనకట్టల గట్టజాదిన నది మానవప్రకృతి నంతను సంక్షోభింపజేయును. అందువలన నెంతసుఖము మన మనుభవింపదలంతుమో, యంతటి దుఃఖమిట్టిపట్ల మన మనుభవింపవలసివచ్చును. ప్రేమ దుఃఖోపశాంతికి కారణమైనను కేవల మీప్రపంచమునకు సంబంధించినదయినంతవఱకు నది తనవెంట నూతనమగు నశాంతిని గూడ గొనిరాకపోదు. ఒక్కొక్కప్పుడు ప్రేమాతిశయమువలననే దుఃఖాతిశయముగూడ పైని వివరించినరీతిని గలుగును. దుఃఖముతో నిరంతరసహవాసమువలన నది మనల కొక 'వింతభోగము' గ పరిణమించును. అది కొందరకు నిరుపమానసంపదయై యాత్మశక్తి నుజ్జీవింపజేయును. (ముఖ్యముగ 'కృష్ణపక్షము' రచయితల వంటివారికి.) ధీరులు తమకు ప్రభవించిన దుఃఖముతో క్రుంగిపోవరు. ఆదుఃఖమధ్యముననే వారు సుఖసారమును గ్రహింపజూతురు. కాని యట్టిది కేవలము దుఃఖముతో గల దీర్ఘసాహచర్యమువలనమాత్రమే లభ్యమగునది కాదు. ఒకవేళ లభ్యమైనను ప్రేమ రహితమైన

* చాణక్యుడు.

† టాగోరు.

యట్టిసుఖము శాశ్వతముగ నిలువజాలదు. దుఃఖములలో తెలంగినవాని హృదయమున ప్రేమ యంకురించి దుఃఖోపశాంతి గాంచును. ప్రేమాంకురక్రమ మిది. ప్రేమజన్యమైన యశాంతి ప్రేమ విఫలమైనసందర్భములలోనే విశేషముగ దుర్భరమై యుండును. ఈదుర్భరబాధగను మానవుని కనుభవములోనిదే! స్వతంత్రబుద్ధితో లోకమున సంచరించి దుఃఖములపాలై తత్ఫలితముగ ప్రేమతోగూడ సంపూర్ణముగా మశ్శాంతి ననుభవింపలేని మనస్వులకు శరణ్యమీశ్వరుడు. అట్టివారు తమ్మునిరసించి ఈశ్వరుని కర్పించుకొని భగవత్సంపర్కముచే పవిత్రీభూతులగుటయే కర్తవ్యము.

ప్రేమలక్ష్యభేదము కారణముగా గలుగుదుఃఖముల నుపశమింపజేయుట కొక్కటియే మార్గము. అయ్యది జీవితతత్త్వమును, ప్రేమతత్త్వమును విమర్శించి యిట్టి దుఃఖములు సంప్రాప్తించుట లక్ష్యభేదమువలననే కాని ప్రేమతత్త్వమున నీదుఃఖబీజములు లేవనియు, ప్రేమ సంతతశుభప్రదాయిని యనియు తెలిసికొనుటయందే యున్నది. ప్రేమసంహితలో నుండు నిట్టి విషమఘట్టముల నవలీలగ దాటుటకు గలుగుశక్తి ప్రేమతత్త్వమును సావధానముగ పరిశీలించుటచే గలుగును. ప్రేమమార్గమింత కంటకయుతమయ్యును అవశ్యము అనుసరణీయము. ప్రేమసాధన మానవుని స్వర్గసౌధమునకుగొంపోవును. ప్రేమలక్ష్యభేదము కారణముగా గలుగుకష్టముల దాటగలిగిన యమృతసిద్ధి నొందించగల శక్తి ప్రేమకు మాత్రమే కలదు. నిశ్చయముగ నిట్టి శక్తి ప్రేమ కొక్కదానికే కలదు!! ప్రేమసత్ఫలితములు ప్రత్యక్షములు!!!

ప్రేమ నెందులకై ప్రాణములు జూపవలయును? ప్రేమించుట ఎందులకు? ప్రేమను జూపకుండ నుండలేమా? ప్రకృతిపరిశీలన మీప్రశ్నకు సదుత్తరమిచ్చును. నేటి నవకవి ఏమని గానముచేయుచున్నాడు?

'సౌరభము లేల జిమ్ము పుష్పవ్రజంబు?
చంద్రికల నేల వెదజల్లుఁ జందమామ?
ఏల సలిలంబు పాఱు? గాడ్పేల విసరు?
ఏల నాహృదయంబు ప్రేమించు నిన్ను?

మావిగున్నకొమ్మను మధుమాసవేళ
బల్లవము మెక్కి కోయిల పాడు టేల?
పరులఁ దనియించుటకొ? తన బాగుకొఱకొ?
గాన మొనరింపక బ్రదుకు గడవదోకొ?'

పుష్పసంతతు లెందులకై సౌరభముల వెదజల్లునో, చందమామ చంద్రికల నేల వెదజల్లునో, నదీనదము లేల ప్రవహించునో, వాయు వెందులకై వీచుచున్నదో, అందులకే తన్హృదయముకూడ ప్రేమించుచున్నదని గానము చేయుచున్నాడు! ఆహా! ఎంతటి మనోజ్ఞభావము! మధుమాసమున జేమావికొమ్మపై గూర్చొని కోయిల కన్నె 'కుహూకుహూ' నినాదమును శ్రావ్యముగ నేల నొనరించునో తన హృదయ మందులకే ప్రేమించుచున్నదట!

ఇట్లు ప్రేమగానముచే మానవుల పులకితగాత్రుల జేసిన కవి యెంతయు ప్రశంసనీయుడు! కవిని ప్రేమగానమును చేయకుండ నిరోధించు కఠిన హృదయులుందురా!

ప్రేమోపాసకుని దివ్యభాగ్యము ప్రేమయే! అట్టి దివ్యభాగ్యము తనకు దక్కినదని సంరంభమున నాతడిట్లు గానముచేయుచున్నాడు!

"సార్వభౌమభాగ్యము లేల చాన, మనకు?
ఏలికల మాదు మనోన్యోన్యహృదయములకు!
ప్రవిమలప్రేమసామ్రాజ్యపట్టభద్ర
భాగ్యముంగన్నఁ జీవితసంపద లవేల!

హేమమణిరత్నగణ మేల లేమ, మనకు?
సాంధ్యసమయ సువర్ణితచ్ఛాయ లరసి
తారకాశోభితాంబరతలముఁ గాంచి
చింతలను బాయుదము చేయిఁ జేయి కలిపి!

ముత్తియంపు సరము లేల ముదిత, మనకు?
వలపుఁబాటల త్రుళ్లింత లాలయనాడు

సెలల తెరగల నురువుల చెలువుఁజూచి
ప్రీతి నందుచ మలఁతికోరికలఁ బాసి."

ప్రేమగాయకుడే భగవద్భక్తుడని చెప్పియుంటిమి; ఆతడు 'తన' 'కానుక' నిట్లు భగవదర్పణము జేయుచున్నాడు:

'ఏది నీ కిత్తు నందువా హృదయనాథ!
కానుకగా నే మొసంగఁగాఁ గలను నీకు?

* * * *
* * * *

రాజరాజేశ్వరుడ వీవు, ప్రభుడ వీవు
హృదయపతి వీవు! భవదీయపదసరోజ
మృదురజోలేశ దివ్యసంపదను వలచి
వీథివీథుల వాడల విపినములను
భిక్షుకునిబోలెఁ దిరుగాడు పేదనోయి!

* * * *
* * * *

ఆహా! ప్రేమగాయకుని భక్తి వినమ్రతలు! భగవంతుని ప్రోల వినమ్రతాసూచకముగ నిలువబడి భక్తుడై చేయు విన్నపము!! భగవంతుని 'పదసరోజ మృదురజోలేశ దివ్యసంపదను వలచి వీథివీథుల వాడల విపినములను భిక్షుకునిబోలె దిరుగాడు పేద'యట తాను!!!

ఇంకను పరిశీలింపుడీ ప్రేమోపాసకుని భక్తిపూరిత హృదయమును:

"ఎట్లు ని న్నూహసేతునో టెఱుఁగలేక
వంగి వంగి శిరము వాంచి క్రుంగిపోదు

* * * *
* * * *

చండ మృత్యుగభీర గర్జారవములఁ
బల్లవింపవు నవ్యవిపంచివోలె
మాధురులఁ జిమ్మ నీకంఠమంజురవము
చిత్రములు స్వామి, నీవింత చేత లెల్ల!"

"కలుష దుర్దాంత పంక సంకలితకుహర
ముల జనించు మదీయాశ్రుమలినధార
స్వామి, భవదీయపాదదేశమునఁ బాతీ
పరమపావన జాహ్నవీప్రతిభ గాంచు!"
('కృష్ణపక్షము'నుండి యుద్ధృతము.)

పరమేశ్వరుని దివ్యసాన్నిధ్యమున జేరు నాత్మ తిరస్కృతి యెన్నడును వ్యర్థము గాబోవదు. మెల్లమెల్లగ ధైర్య మంకురించి 'భగవంతుని ధ్యానించు టెట్లా' యని శంక పొడమును. భగవంతుని 'వింతచేతలు' విభ్రాంతి పుట్టించుచుండును. ఆపరమేశ్వరునికి కానుకగా నేమి యర్పింపవలెనో యనుశంక యుదయించి తుదకు తన మాలిన్యమంతయు పతితపావను డగు జగత్ప్రభుని పాదసంపర్కముచే పవిత్రము కాగల దను ప్రత్యయ మతనికి జన్మించును.* స్వచ్ఛ మధుశీతల ప్రేమ సాగరుడగు ఈశ్వరుడు పతితుల బ్రోచును. ప్రేమోపాసకుని యశ్రుబిందువులే మందస్మిత సుమమును పోషించు జీవనములు!

'మనములు కరఁగించు మాటలు కలిపి
యీ పేద యెలుఁగుతో నీచిన్ని పాట
లనవరతమ్ము నాహ్లాదమ్ముతోడ
పాడుకోనీవోయి పరమాత్మ, నన్ను!
('కల్పమంజరి'నుండి)

ప్రేమపక్షములపై మానవుడు తన్ను దామరచుట సహజము. తన నిజస్థితిగతులను విస్మరించి, స్వాభిమానజనితమగు కల్పనాలోకవిహారి యగునత్తరి భ్రాంతి యుతమగు నూహలపై తన భవిష్యత్సౌధమును నిర్మించుకొనును. ఇట్టి సమయమున నెకలంతలైనను భ్రాంతి మాయాజాలములను ద్రెంచుటకును, యథార్థశక్తిని జ్ఞప్తికి దెచ్చుటకును ఉపకరింపగలవు. ఇట్టివి యాత్మపరీక్షను పురికొల్పును. సత్యస్థితిని దెలిసికొన ప్రోత్సహించన నవకాశము నిచ్చు ప్రేమయే యాతని నిపుడు వశపరచుకొనెను.

* శ్రీ శివశంకరశాస్త్రిగారు- 'కృష్ణపక్షము' సింహావలోకనమునుండి.

'ప్రియాప్రియాలాపములను వర్ణింప నెన్ని
యూహ లెంత రసజ్ఞత యుండవలయు
నవమృణాళ నాళ మధురాన్నము భుజించు
నోట ప్రేమసందేశముల్ నుడువదగును.'—'కౌండాలి'

ఘనీభవించిన ప్రేమాశ్రుకణముల రాశి తాజ్ మహల్! ఆమహలునందలి ప్రతిచలువరాతిపలకయును ప్రేమగ్రంథములోని పత్రమువలె గాన్పింపదా? షాహజాన్ ప్రేమనిధానమైన ముంతాజ్ బీగము మరణమే తాజ్ మందిర నిర్మాణమునకు కారణము. ఈ శిలాస్వప్నమును గాంచినది షాహజాన్ చక్రవర్తి ప్రేమార్ద్ర హృదయమే! దుర్భరవియోగ దుఃఖభావ ప్రకటనయే యాచలువరాతి సమాధి! షాహజాన్ ఆలాపించిన నీరస వేదనాగానపు విషాదస్వరముల మేళవింపే నేటికిని ఆ చలువరాతి గోరీనుండి బయల్వెడలి చూపరుల హృదయముల కరిగించివేయుచున్నది! ప్రేమయే కళాసైపుణ్యమును పొంది, ప్రేమ ప్రవాహమగు యమునాతీరమున నిలిచి, అచంచలమగు ప్రేమ యమరత్వమును పొందిన ప్రదేశ మిదియే యని లోకమునకు చాటుచున్నది.

భార్యయందలి ప్రేమయే 'గీతాంజలి'కి మూలసూత్రము, ప్రాతిపదిక. దేశీయుల స్వాతంత్ర్యకాంక్ష (ప్రేమ)యే సత్యాగ్రహమునకు దారితీసి వారిని నానా కష్టముల ననుభవింపజేసినది. ప్రేమమూలముననే యెట్టి కష్టములకైన నోర్చి స్వాతంత్ర్యస్థాపనము చేయజూచుచున్నాము భారతీయులగు మనము. ప్రేమశక్తి యాలోచనాతీతము. దానికిలొంగని కార్యముగాని, మించిన బలముగాని లేదు. ప్రేమ మానవుని దౌర్బల్యమును, ఆయుధమును నగును. ప్రేమాయుధమే సర్వాయుధములలో నుత్తమమైనది. బుద్ధభగవానుని యాయుధమును, నేడు గాంధీమహాత్ముని సాధనమును నగు నీ ప్రేమాయుధప్రాశస్త్యమును వేర వివరింపబనిలేదు.

బుద్ధదేవుడు ప్రేమ మనుష్యత్వమునకే నామాంతర మనుచున్నాడు. ప్రేమ మానవ ధర్మము, మానవచిహ్నము, మానవత్వము! * * *
* * * ప్రేమోన్మత్తుడే బుద్ధిమంతుడు.

చైతన్యస్వామి ప్రేమోన్మత్తతచే జగన్నాథుని రథపుమ్రోల నృత్యముచేసినను ఆ భక్తశిఖామణి యున్మత్తునిగాఁ దలపఁబడెనా? ప్రేమోన్మత్తతచే జయదేవకవి రచియించిన 'అష్టపదులు' గౌరవింపఁబడుట లేదా!

* * *

'Where Love is, There God is also'

—Tolstoy.

'నాకు నీయందు ప్రేమయున్నది. నిన్ను గోరుచుందును. నే నీమాత్రమే చెప్పగలను. రాత్రి నిదురించుచు నిదియే. పగలు మేలుకొనియు నిదియే.'

—కోటేశ్వర్.

ప్రేమ ఎడతెగని మృదుమధుర స్వనము లీను మురళి. గోచరాగోచరావస్థలకు ఎడములేక మిరుమిట్లు గొల్పు మెరుపుతీగ. లోకవ్యవహారములలో భగవంతుని చూడగల్గిన దృష్టికలిగినవాడు భగవంతుని ప్రేమగానము సామాన్యసంఘటనములయందే వినుచున్నాడన్న మాట.

* 'Poets are all who love, who feel great truths and tell them; and the truth of truth is love.'

[ప్రేమ, పరమసత్యానుభవము కలిగి వాటిని ప్రకటింపగలుగువాఁడు కవి. సత్యములలో పరమసత్యము ప్రేమ.—Bailey.]

నరుడ కిహలోకమునందే స్వర్గము నిచ్చి సకల సౌఖ్యముల సమకూర్చి వానిని ఘనకార్యాచరణమునకై పురికొల్పి భిక్షుకునిసైతము సింహాసన మెక్కించి జీవితము నానందమయముగ జేయగలుగునది ప్రేమ. అల్పుని ఘనునిగాను, లోభిని త్యాగిగాను, వృద్ధుని ఉత్సాహవంతుడగు యువకునిగను, భీరుని ధైర్యశాలిగను, బలహీనుని శక్తివంతునిగను మార్చగలుగునది ప్రేమ. మానవ హృదయాంతర్గతౌన్నత్యమును వెలికిదీసి దుర్మార్గప్రవర్త

* భారతి సెప్టెంబరు సంచిక.

కులను సన్మార్గమున బెట్టి సంఘైక్యమును గృహశాంతిని నెలకొల్ప గలుగునది ప్రేమశక్తియే! బంధుత్వము, స్నేహము — 'ప్రేమ' యను నక్షరద్వయముపైననే యాధారపడును. ప్రేమకొరకు నరుడు తన ప్రాణములైన ధారవోయగల త్యాగశీలి యగును. ప్రేమ జీవితమునకు వెలుగునిచ్చెడి దివ్యజ్యోతి; ఆత్మశాంతికరమగు తారకమంత్రము.

ప్రకృతినుండి హృదయములోనికిని, హృదయసీమనుండి ప్రకృతిలోనికిని అదృశ్యమై వలినివలె ప్రేమవాహిని ప్రవహించుచుండును. ఇద్దాని వీచికలయందీ రెండింటి సమ్మేళనము ఘటిల్లును. అందువలననే ప్రేమోపాసకుడు ప్రకృతిని గాంచి, తన్మయచిత్తుడై పో[illegible] చున్నాడు; భావోన్మత్తతచే చిందులు త్రొక్కు-చున్నాడు. ప్రేమోపాసకునిగాంచి ప్రకృతికాంత పులకితగాత్ర యగును. రసపిపాసి యగు ప్రేమోపాసకుడు ప్రకృతియందే లీనమై, పరవశుడై 'ఆకుల[illegible] నాకునై, పూవులో పూవునై, కొమ్మలో కొమ్మనై, నును లేత రెమ్మనై......ఈయడవి దాగిపోనా ఎట్లయిన నిచటనే నాగిపోనా?' యని గానము చేయుచున్నాడు.

ప్రేమ నిశ్శబ్దవాతావరణమునుండి మధురగీతికల నాలాపించి వినిపింపజేయును; రసప్రపూర్ణహృదయమునుండి యువ్వెత్తుగ సౌందర్యవాహినుల వెడలించును. ప్రత్యక్షప్రపంచమున నద్భుతకార్యముల నవిరళముగ జేయించునది ప్రేమ; నిదర్శనము 'తాజ్ మందిరము'. ప్రేమ విషము నమృతముగ, కఠినశిలల శిరీషకుసుమములుగ, చింతనిప్పుల మల్లికాకుసుమములుగ, పాపుల పావనులుగ, పందల పండితులుగ జేయును; మృత్యువును జయించి అమృతమయియై దివ్యకాంతుల వెదజల్లు 'ప్రేమ'ను సాక్షాత్కరింప జేయును. శిశిరమున నాకుల విదల్చి మోడువారిన పాదపమును వసంతకాలమున చివురుదొడిగించి నేత్రానందకరముగ నొనరించున దీ మహత్తరశక్తియే! పవిత్రాశయముల, ఉన్నతాదర్శముల, గంభీరభావముల మానవునికి ప్రసాదించున దీ ప్రేమయే! ప్రేమపూరితజీవితము సౌందర్యమయమై, రసబంధురమై, గురుగంభీరమై, మహదాశయ ప్రభాకలితమై యలరారును.

* ప్రేమ యన కొందరిదృష్టియందు మన కం[illegible]నకు రూపాయిలమీద, సినీమాలమీద, పుస్తకాలమీద, పక్షులమీద ఉండెడి మమకారమువంటిదికాదు. ప్రేమకు పర్యాయపదములుగ కూరిమి, వాంఛ, తమకము, ఇచ్ఛ మున్నగుపదములను వాడుట నీచముగ నుండును. [illegible] ప్రబుద్ధపు టనుగమము లసభ్యములు: కామ, స్సంకల్పో, విచికిత్సా, శ్రద్ధా, అశ్రద్ధా, ధృతి, రధృతి, హ్రీ, ర్భీ, రిత్యేవం సర్వం మనః' ప్రేమకు ఈమన స్సాశ్రయ మగుట! ప్రేమను స్థాయిగా నుంచి రసముల సాధింప జూచుట సవ్యముగాదు. బీభత్సమున, భయానకమున, అద్భుతమున—ప్రేమ యెట్లు 'స్థాయి' యగును? కొందరి ప్రేమతత్త్వనిర్వచనము దధిద్రీహిన్యాయముగా నుండును.

మహర్షి వేంకటరత్నము ప్రేమతత్త్వ నిర్వచనము విశాలముగ నుండును. ఈయన ప్రేమతత్త్వము నెరింగిన మునిపుంగవుడు. దీనులయం దీయనకు గల ప్రేమ యసమానమైనది. అనాథ బాలబాలికల జూచినంతనే వీరి నవనీతహృదయము ప్రేమార్ద్రమగును. ఎట్లయిన వారి నుద్ధరింప జూచుటయే నాయుడుగారిముఖ్యోద్దేశము. వారి యేయుపన్యాసమున నైన ప్రేమ నిర్వచనమే గాంతుము. సంఘసేవయం దంతర్లీనమై ప్రవహించుచున్న ప్రేమవాహినిని స్పృశించినవా రొక్క-నాయుడుగారే!

ప్రేమ యాధ్యాత్మిక జీవనమునకును ముఖ్యాధారము. ప్రేమయే భక్తి. తనయందు ప్రేమను జూపు రాధకంటె శ్రీకృష్ణభగవానున కెవ్వడు భక్తులుండి నారా? ప్రేమగానమును సదాచేయు గోపిక లాదర్శప్రాయులగు భక్తవరులు గారా? చంద్రకాంతియట్లు, గానకళయట్లు, కవిచంద్రుని గీతమాలికలట్లు ప్రేమలతలు సౌందర్యసందీప్తములై మోక్షప్రదాయినులగును.

---

* ఒక సహృదయుని గ్రంథావలోకనమునుండి పరిగృహీతము.

ఆవేగభరితమగు ప్రేమ కవులు, భక్తులు, ప్రేమికులు, గాయకులు, వక్తలు, చిత్రకారులు, శిల్పులు, వీరులు—వీ రందరియందును కాననగును. ప్రేమకు మాతృస్థానము మేధాశిఖరములు గావు; హృదయోదధియే! కవులచే కావ్యముల వ్రాయించునది, భక్తులచే భక్తి పారవశ్యమున నృత్యము జేయించునది, ప్రేమికులచే ప్రేమలేఖల వ్రాయింపజాలునది, గాయకులచే గీతముల శ్రావ్యముగ నాలాపింపజేయునది, వక్తలచే 'గాంగనిర్ఝర సదృశ్యా రాళ వాగ్ధాటి'ని ప్రదర్శింపజేయునది, శిల్పులచే నద్భుత శిల్పముల జెక్కించునది, వీరులచే వీరకార్యముల నాచరింపజేయజాలునది, చిత్రకారునిచే నతిసుందరదృశ్యముల చిత్రింపజేయునది ప్రేమయే! కావ్యరచనకు, లలిత కళోపాసనకు, వీరకార్యాచరణమునకు, వక్తృత్వమునకు, భక్తిపరవశతచే నాట్యమును జేయుటకు, శ్రావ్యగానమునకు, ప్రణయమూర్తి సన్నివేశమున సరససల్లాపముల నాడించునది ప్రేమోద్వేగమే!

స్వచ్ఛమగు దేశాభిమానము రవీంద్రుని సొమ్ము:

To My Motherland

Blessed am I that I am born to this land
and that I had the luck to love her.
What care I if queenly treasure is not in her store
but enough for me the loving wealth of her love.
The best gift of fragrance to my heart comes from her own flowers
And I know not where else shines the moon that can flood my being with such loveliness.
The first light revealed to my eyes was from her own sky
And let the same light kiss them before they are closed for ever.

[From-September 1934 Modern Review]

'ప్రేమ యుదారము లగు నుపకృతులకు జూపు కృతజ్ఞత కాదు; తురీయమగు జ్ఞానమునెడ జూపు మెప్పు గాదు; అకలంకమగు పవిత్రతకు జూపు గౌరవముగాదు; అమోఘమగు దైవనిర్ణయమునకు జూపు విశ్వాసము గాదు; ప్రభుని యాజ్ఞకు జూపు విధేయత గాదు; హానికరముగాని సత్యమునకు జూపు నంగీకృతి గాదు; వినమ్రత, అకలంకవిశ్వాసము, కృతజ్ఞత, గౌరవము- ఇట్టి భావములకన్న 'ప్రేమ' యతినిర్మలము, అతిపవిత్రము, అతివిశాలము, అత్యాకర్షణీయము, అతిమోహనము.'

—మహర్షి వేంకటరత్నము సుభాషితము.

"ప్రేమ యాధ్యాత్మహృదయంబె వ్యోమ మయ్యె
దాని యుచ్ఛ్వసితమె జగత్ప్రాణమయ్యె
ఊర్పుటావియె తేజమై యుజ్జ్వలించె
నంబు వయ్యెను బాష్పకణంబె యగును.

వ్యక్తమయిన ప్రేమరసార్ణవంబునందు
కాలకర్మస్వభావయోగమునఁ జేసి
కరడుగట్టిన పయిపాలు గట్టిపడఁగ
ధాత్రి యయ్యెను జగదేకధాత్రిప్రేమ.

* * *

వివిధమార్గంబులనుబట్టి ప్రేమలక్ష్మి
విశ్వమయులను నిటు లొందె విశ్వమయుని
తోడ నతఁ డెట్టులాడిన నాడు చల్లె
సూదితో దారమట్లనుస్యూతగతిని.

కలువ ఱేఁ డతఁ డయినఁ దాఁ గాంతియగును,
సూన మతఁ డైనఁ దాఁ దేనెసోన యగును,
జలద మతఁ డైనఁ దాను క్రౌంజలువ యగును,
తల్లి యతఁ డైనఁ దాను దత్ స్తన్య మగును.

ప్రేమసామ్రాజ్యవైభవం బేమి సెప్ప?
అన్నియును జుట్టుకొనెడుఁ—బేరాస కాదు
అన్నియును మ్రింగు—లయకాలయముఁడు గాదు
కడుపులోఁ బెట్టుకొనుఁ బ్రేమ— కన్నతల్లి.

ఆవరించును భువి జగత్ప్రాణమట్లు
దివియు భువియుఁ ద్రివిక్రమదేవునట్లు

చేతులను జాచుచు గౌఁగిటఁ జేర్చుకొనుటకె
పుచ్చుకొనుటకుఁగా దింక నిచ్చుకొనుటకె."

[కైలాసవాసి వేంకటరామయ్యగారి "విశ్వప్రేమ" (వైశాఖ భారతి)నుండి.]

కవి : ప్రేమ:—

'గురజాడ' మొదలు 'కుందుర్తి' వరకును అందరును ప్రేమతత్త్వపరిశీలనము చేసినవారే! కవిలేఖిని ప్రేమార్ద్రమగుట తప్పనిసరియైనది. 'దువ్వూరి కోకిల' 'వహువహూ' నినాదమున ప్రేమ యుట్టిపడినది; 'వనకుమారి' యందు ప్రేమతత్త్వమును హృదయంగమముగ చిత్రించినాడు. కృష్ణశాస్త్రి 'ప్రేయసీ, ప్రేయసీ, ప్రియుఁడనే ప్రియుఁడనే, వేయికన్నులతోడ వేచియున్నానే!' యని ప్రేమగీతముల నాలాపించినాడు. స్వర్గీయ బసవరాజు అప్పారావు గీతములలోని ప్రేమ హృదయమును ద్రవ్యాలుజేయును. 'అబ్బూరి'వారి 'నదీసుందరి'లోని 'ప్రేమతత్త్వము' ప్రేమ నిజతత్త్వమును విశదీకరించుచున్నది. 'రాయప్రోలు'వారి వివిధ కావ్యములలో 'ప్రేమ' వివిధవర్ణములలో గాన్పించుచున్నది. 'వేదుల'వారి యావేదనాపూరిత గీతములలో గూడ ప్రేమ తొంగిచూచుచున్నది. కథకులు, చిత్రకారులు, కవులు — అందరును వివిధ రూపములలో నీ ప్రేమ మహత్త్వమునే చాటుచున్నారు! అందరును హృదయవీణను మీటి 'విశ్వసంగీతము'ను వెలువరించినవారే!

ప్రేమగానము :

"All thougts, all passions and all delights
Whatever stirs this mortal frame,
All are but ministers of Love
And feed this sacred flame."

ప్రేమగానము విశ్వహృదయమున నతిత్వరితముగ పరివర్తనమును దెచ్చును. ప్రేమ శత్రువులనుసైతము 'కాళ్లబేరము'నకు కొనితెచ్చును. ప్రేమగానము మృత్యుదేవతను మరలింపగలుగును. కఠినశిలకములగూడ కరగించివేయును. ప్రేమగానముచే దేవతలుగూడ సాక్షాత్కరింతురు. ప్రేమగానముచే విశ్వమునైన కదలింపగలుగుదుము. నిర్బంధముచే నెట్టికార్యమును చేయింపజాలమనియు, ప్రేమచే నొడంబరిచి విషము నైన త్రావింపగలమనియు మనకు స్వానుభవమే! శ్రీ వేంకటపార్వతీశ్వరకవు లీ ప్రేమగానమునే తమ 'ఏకాంతసేవ' లో వెలయించినారు! వీరి ప్రేమగానముచే ఆంధ్రావని యొకనాడు నిండిపోయినది. వీరిలేఖిని ప్రేమరసమును చిలుక నాంధ్రు లందరు దానిని గ్రోలి యానందించినారు. ఇట్లే వంగదేశ మొకనాడు రవీంద్రుని ప్రేమగీతములతో ప్రతిధ్వనించిపోయినది.

ఈసమస్తసృష్టిజాలమును తనచీరచెఱఁగులచాటున దాచి రక్షించుచున్న ప్రేమదేవీ స్వరూపమును 'మానవజీవితము'న శ్రీ బలరామకృష్ణయ్యగారు హృదయంగమముగ చిత్రించినారు; ప్రేమతత్త్వమును నిర్వచించినారు. శ్రీ అరవిందయోగి యీప్రేమతత్త్వ నిర్వచన, నిరూపణలకయ్యే తపము చేయుచున్నాడు. ప్రాక్పశ్చిమవాసుల నడుమనున్న భేదభావమును తొలగించి ప్రాక్పశ్చిమసమ్మేళనమునకై మహత్తర ప్రయత్నము లను సలుపుచున్న కవీంద్రరవీంద్రుడు, తూర్పు పడమరల సఖ్యపరచి విశ్వమానవ కల్యాణమునకై తోడ్పడ 'విశ్వభారతి'ని తన శాంతినికేతనమున స్థాపించెను. దీనబంధు శ్రీ ఆండ్రూసుమహాశయుఁ డీవిశాలప్రపంచమున గల ధనికులకు దరిద్రులకును, పెట్టుబడిదారులు కార్మికులకును మధ్యనున్న ద్వేషభావమును బోద్రోలి సామరస్యమునకై పాటుపడుచున్నాడు. గాంధిమహాత్ము డీ ప్రేమసందేశమునే సబర్మతీయాశ్రమమునుండి నలుదెసలకు వినిపించెను. మహాత్ముని చరఖాధ్వని యీసందేశమునే సదా వినిపించును. శ్రీ మేకారోలండు మున్నగు భారతదేశమిత్రు లీప్రేమసందేశమును గాంధీ, రవీంద్రుల ముఖతః విని ప్రాక్పశ్చిమసమ్మేళనమునకై ప్రయత్నించుచున్నారు. ప్రపంచమునందలి ప్రముఖులెల్లరును విశ్వావృతమైన ద్వేషభావమును నశింపజేసి ప్రేమసామ్రాజ్యపట్టాభిషేకమునకై పాటుపడుచున్నవారే.

ప్రేమగాన మెట్టి మహత్కార్యమునైన జేయగలుగును. ప్రేమగానమును విని హృదయము ద్రవీభూత

ముకాని మానవుడు కర్కశహృదయుడు. ప్రేమతత్త్వ మును గ్రహించని మానవుని జీవితము అధఃపతనమే! ఆనందశూన్యమే! ప్రేమతోలుకాడని గృహాంగణము ప్రేతభూమి. ప్రేమసూత్రముచే పరిపాలింపబడని కుటుంబము పశువులమంద. ఏనాడు ప్రపంచమంతయు ప్రేమపూరితమగునో ఆనాడే విశ్వమానవకళ్యాణము. ఆ దినమునుండియే ప్రపంచమున కంతకును నూతనశకె మొండు ప్రారంభమగును.

ధనార్జనాయత్తచిత్త ప్రవృత్తిగల మానవుని ప్రేమ యన నేమో తెలియదు. అట్టిమానవుడు జీవిత మాధుర్యమును గ్రోలజాలడు; ప్రేమామృతము నాస్వా దింపజాలడు. ధనమునకును ప్రేమకును భూనభోంతరాళ ములకు, తూర్పుపడమరలకు నున్నంత భేద మున్నది; కాంతికిని అంధకారమునకు నున్నంతవ్యత్యాస మున్నది. అందువలననే వివేకానందు డెన్నడును ధనమును స్పృ శింపనైన లేదు. ఆమహాపురుషుడు ధనము నుచ్ఛిష్ట మాత్రముగ హీనముగ జూచెను. ఆమహామహుడు ప్రేమ ధనముమాత్రమే ఆర్జనీయమనువిషయమును గమనించెను. ఇట్టిపవిత్రనియమబద్ధుడై యాతడు పాశ్చాత్యుల జీవిత లక్ష్యమగు 'ధనము'ను వారినడుముననే నిరసించెను.

నేటి పాశ్చాత్యహృదయము 'ధనము, ధన'మను పదముతో ఘూర్ణిల్లిపోవుచున్నది. సంకల్పసిద్ధులై తలచి నట్లు భాగ్యభోగ్యముల ననుభవించుచు జీవితము భౌతికసుఖముల నపరిమితముగ ననుభవించుచున్నారు జీవితపరమావధి యగు సౌఖ్యమును తామమాత్రమే ప్రపంచమునం దెల్లననుభవించుచున్నామని యూహించు చున్నారు. భౌతికసుఖము లెన్నియున్న నేమి? ఐహిక సుఖముల నెన్నియనుభవించిననేమి? ఆధ్యాత్మిక విషయ చింత గాని, ఆముష్మికసుఖములకై ప్రాకులాడుట గాని వారియందు లేమి జీవితసాఫల్యమునకై నిజమగు చిత్త శాంతికై యన్వేషించవలసివచ్చినది. దాన, వారు వికల హృదయులై మార్గాంతరాన్వేషణమునకై నలుదెసల వెర్రిగ జూచుచున్నారు. అంత వారికి భరతఖండము నుండి గాంధీమహాత్ముని ప్రేమగానము వినబడినది. వా

రద్దియో పెన్నిధానము లభించినటుల నా ప్రేమగీతము నతిశ్రద్ధగ నాలకించుచున్నారు. తమ దేశములకు వచ్చి రవీంద్రుడు ప్రేమగానమునే వినిపించుచున్నాడు. వేల కొలది యోజనములు దాటి ప్రాచ్యహృదయస్థమగు ప్రేమతత్త్వము నవగాహనముచేసుకొన బ్రయత్నించు చున్నారు. ఐననేమి? ప్రయోజనరహితము. ధన వ్యామోహమున నున్నంతవరకు వా రాముష్మిక సౌఖ్య ముల, ప్రేమఫలముల పొందజాలరు. కృత్రిమవాతావర ణమున దోహదముచేయగా నెదిగిన హృదయవృక్షములు వారివి. అట్టివి ప్రశాంతప్రదేశమునుండి వచ్చు వినిర్మల వాయువు మైసోకగనే వివర్ణతజెందును. మొదట రామ మోహనుడు, పిమ్మట వివేకానందుడు, నేడు గాంధీ రవీంద్రులు ప్రేమగానమును, మలయమారుత సదృశమగు ప్రేమగానమును పాశ్చాత్యదేశములకు గొంపోవుచున్నా రు. విశ్వమానవకల్యాణమునకై ప్రాచ్యులు పాశ్చాత్య హృదయమును, ముఖ్యముగ పాశ్చాత్యులు ప్రాచ్యహృద యమును కనుగొనవలయును. ఐహికచింతను వీడి యాము ష్మికవ్యాపారముల కొలదిగనైన బ్రవేశించి ధనార్జనకై సోదరదేశములపై ద్వేషభావ మూనక, భోగలాలసతను తగ్గించి నైతికబల మలవరచుకొనవలయును. నాడే వారికి సత్యమార్గము గోచరమగుటయు, జీవితసాఫల్యము చేకూరుటయు, విశ్వమానవ కల్యాణమున కవకాశము కలుగుటయు జరుగగలవు. 'అధికారతృష్ణ'ను విసర్జించి కలిగినదానితో తృప్తిపడెడి స్వభావము నలవరచుకొని 'పరులు నిన్నెట్లు జూడవలయునని నీవుతలతువో యొరు లను నీ వట్లు జూడు'మను ప్రేమసూత్రమును పాటిం చుచు సోదరుల రుధిరముపై తమ సౌఖ్యహర్మ్యములను నిర్మింపకయుండిననాడే పాశ్చాత్యులకు ముక్తిగలదు.

నానాజాతిసమితి(The league of Nations), ఆయుధవిసర్జనసభలు (The Disarmament Confe- rences), నేడు విఫలమైనవనిన నర్థమేమి? పాశ్చాత్య హృదయ మింకను పరివర్తన మందలేదన్నమాట. విల్సనుమహాశయుని ధర్మమాయని నానాజాతిసమితి స్థాపింపబడెనుగాని, నానాజాతులు విధిలేక సఖ్యత్వ మును స్వీకరించెనుగాని, వీరిలో వీరికి ద్వేషభావ

మత్పన్నమగకుండ విల్స నేమి చేయగలడు? (అయ
నప్పటికి రష్యా జపాను బోలు జాతులు సభ్యత్వ
మును మానుకొనుటయు జరుగుచున్నదిలెండు.) కావల
సినవి సద్భావమిత్రభావములు గాని స్వార్థపరులై అధి
కారవాంఛచే నంధులై వారాయుధముల నిర్మించు
చున్నారని వీరు, వీరు రాజ్యాక్రమణ సన్నాహమున
నున్నారని వారు యుద్ధసన్నద్ధులై యుండ సద్భావ
మెట్లు నెలకొలుపబడగలదు? ఒకజాతి తన సోదరజాతిని
ప్రేమనష్టములతో నాదరించి యొకరి కష్టసుఖముల
నింకొకరి నెరిగించుకొనుట శ్రేయస్కరముగాని యొక
వంక ఆయుధవిసర్జనోన్ముఖులై సభలజేయుచు వేరొక
వంక నాయుధసామగ్రిని వృద్ధిజేసి యుద్ధప్రయత్నముల
జేయుచున్న యెడల నింకెక్కడి ప్రపంచశాంతి? ఏదిన
మున ప్రపంచయుద్ధము ప్రారంభమై జగత్తు నెల్ల
ముంచెత్తునో యని మానవకోటి యెల్ల భయకంపితమై
యున్నదే, ఇక ప్రపంచశాంతి స్వప్నకాంక్షితమేనా?
ఈయుద్ధప్రయత్నములను, ఈయాయుధనిర్మాణమును
జేయుచున్న జాతులన్నియును 'జాతిసమితి'లో సభ్య
త్వము నంగీకరించినవే. సమితి కట్టుబాటులకు లొంగ
నొడంబడినవే! ఈ జాతుల ప్రతినిధు లందరును
'ప్రపంచశాంతి'యో 'విశ్వమానవ కల్యాణమో' యని
నోరార నఱచినవారే! ఆయుధవిసర్జన మవశ్యకర్తవ్య
మని బల్లగ్రుద్దిన వాచాలులే! అందఱును బూటకపుశాంతి
ప్రియులు! అధికారతృష్ణార్తులు!! ద్వేషభావపూరితులు!!!
జాతిసమితి నిజముగ నొక 'స్వార్థపరుల కూటము'గను,
'బందిపోటు దొంగలగుంపు'గను మాత్రమే పరిణమించి
నది. కార్లైయిలు, ఎమర్సను, గెటే, మాజినీ, టాల్
స్టాయి, రినాను మున్నగు కర్మవీరు లొకనాడు పవిత్ర
వంతము గావించిన పాశ్చాత్యదేశము లీనాడీయధికార
తృష్ణచే మన్నుమిన్ను గానకపోవుచున్న వనిన నెంత
శోచనీయము! కార్లయిలు ఆధ్యాత్మిక సూత్రములును,
టాల్స్టాయి అహింసాధర్మమును, ఎమర్సను వ్యక్తి
స్వాతంత్ర్యవాదమును, గెటే జీవితతత్త్వ నిర్ణయమును,
మాజినీ ఆత్మత్యాగమును, రినాను సత్యనిష్ఠను, ఇబ్సను
ఏమియులుల గ్రంథరాజములను నిత్యమును పఠించుచున్న
వారే వీరు! విశ్వమానవకల్యాణమునకు నీమహాత్ముల పవి
త్రాత్మ లెంతగ పరితపించినవో వారి దేశీయు లను వీరి
ప్రస్తుతకర్తవ్య మెందున్నదో ఏమైన నూహించినారా?
ఊహింప లేదనుట సుస్పష్టము. యూరపు అమెరికాలకు
నిజమును, నిత్యమును నగు ఆనందము వలయు ననిన,
వారు మనఃపూర్వకముగ నిజసౌఖ్యాన్వేషకులై యున్న
సంస్కార విషయపరిత్యాగమున నున్నదని చెప్పనగును.
ప్రేమ గర్భితకార్యాచరణమున నున్నదని చెప్పనగును.
పాశ్చాత్యుల హృదయమందలి నిర్వేదమునకు నాడే
యంతము కలదు! ప్రేమమార్గానువర్తులై; ప్రేమగానము
నందలి 'హాయి'లో మైమరచి, ప్రేమగానమును ప్రాచ్య
తత్త్వమునుండి తీసుకొనివచ్చి వినిపించుచున్న కోయిల
లగు గాంధీ-రవీంద్రుల 'కుహూకుహూ' నినాదము
నందలి మాధుర్యమును గ్రోలి ప్రేమార్ద్రహృదయులై
స్లేపుకన్య, రైనాల్డులవలె సార్థకజీవితులై వారు విశ్వ
మానవకల్యాణమునకు దారితీసిననాడే ప్రపంచ కల్యా
ణము కలదు. నాడే ప్రపంచశాంతి యలవడును. కానిచో
ప్రపంచశాంతి యనునది కవులు నిద్రలో నిర్మించు
కొనిన గగనసౌధము; ఊహాగానములోని గీతమాలిక;
భావగీతములోని పాదము; అయోమయపు పాటలోని
చరణము. చెప్పబోవున దేమన, ఈప్రపంచమున నెన్న
డేని ద్వేషము నశించి శాంతి నెలకొనవలె ననినచో
నయ్యది ప్రేమమూలముననే సాధ్యము. ప్రపంచశాంతి
సిద్ధికై ప్రాపంచిక వ్యవహారములలో ప్రేమసూత్రమే
యాచరణలోనికి కొనిరాబడవలెను. ప్రేమవిధానమే
యనుసరింపబడ వలయును. ప్రేమగానము విశ్వమునం
తటను ప్రతిధ్వనించినపుడే ప్రపంచము శాంతినిల
యము, ఆనందనిలయము కాగలదు. 'ప్రేమింప నెరిగిన
వాని విశ్వమంతయు ప్రేమించును.' 'Love thy
neighbour' అను ఏసుక్రీస్తువాక్కు క్రైస్తవ ప్రపం
చము శిరసావహించునాడు, 'అహింసా పరమో
ధర్మః' అను బౌద్ధమతము బోధించుధర్మము నీ విశాల
ప్రపంచమునందలి బౌద్ధసంఘ మాచరించునాడు 'విశ్వ
మానవప్రేమయే భగవద్భక్తి' యను కార్లయిలు ప్రవక్త
వచనము మానవకోటి యెరింగిననాడు మాత్రమే మానవ

కోటికి ముక్తికలదు. టాగోరుకవిగ్రంథముల నేల యంత మమతతో ప్రపంచము పఠించుచున్నది? ఈ కవిచంద్రుని గ్రంథములు ప్రేమతత్త్వనిర్వచనమును గావించుచుగనుక. 'గీతాంజలి'కి పాశ్చాత్య దేశములలో నంత ప్రచార మెందులకు కలిగినది? ఈగ్రంథము వారి హృదయమున శోకవిధమును మహదానందము ననిర్వచనీయ మశాంతిని చేకూర్చగలిగినదగుట. గాంధీమహాత్ముని బోధలేల పాశ్చాత్యుల నింత యాకర్షించుచున్నవి? భోగపరాయణులయ్యు జీవితమునందు నిజసౌఖ్యము నెరుగక యట్టి సుఖములకై వేసట యనుభవించుచున్నవారల కీ మహాత్ముని వచనము లమృతప్రాయములుగ గాన్పడినందున. శ్రీరాముడు, బుద్ధభగవానుడు, క్రీస్తు, మహమ్మదు, టాల్‌స్టాయి, గాంధీ, టాగోరు— వీరందరును ప్రపంచ మున్నంతకాలమును ప్రేమసందేశమును వినిపించి ప్రపంచోద్ధరణమును గావించుచునేయుందురు! ఎంత కఠినహృదయుడైనను ప్రేమమూర్తికిమోల మోకరించవలసినదే. సమస్తప్రాణికోటిని వశపరచుకొనగల మహత్తరశక్తి ప్రేమయందున్నది. ప్రేమ మాహాత్మ్యము అద్భుతమైనది; మహత్తరమైనది; లోకాతీతమైనది. ప్రేమవృత్తియే సకలవృత్తులకన్న దివ్యము, మధురము, మహిమోపేతము, విశ్వసమ్మోహన కరము.

వాల్మీకి మహర్షి మొదలుకొని ఆధునికయుగమునందలి నవకవులవరకును అందరును ప్రేమతత్త్వనిర్వచనమును చేసినవారే! కవిత్వమునకు పరమలక్ష్య మగు ప్రేమారాధనను తమతమ కావ్యమూలమున గావించినవారే! వాల్మీకి రామాయణమున శ్రీసీతారాముల మధ్యస్థమగు అకలంకప్రేమను సహజవర్ణనములలో చిత్రించినాడు. కాళిదాసు, భవభూతి, భారవి, భాసుడు మున్నగు సంస్కృతకవులు, వ్యాసవాల్మీకాది పౌరాణికకవులుగూడ ప్రేమమాహాత్మ్యమునే వెల్లడించినారు తమ కావ్యమూలమున. భాగవతమున పోతన గోపికాబృందమునకు శ్రీకృష్ణునియెడ గల యపూర్వప్రేమానుబంధమును ప్రదర్శించెను. పెద్దన, తిమ్మన, పాపరాజు మున్నగు నాంధ్రకవు లీప్రేమమాహాత్మ్యమునే తమకావ్యములయందు గన్పరిచినారు. కవికిని ప్రేమకును గల సంబంధము మరొకప్పుడు విపులముగ చర్చించెదను.

నేటి ప్రభుత్వమును ప్రేమమూలముననే లోబరుచుకొనవలయు నను నాశయము భారతీయులలో ప్రబలుటకు గారణము 'సబర్మతిఫకీరు' ప్రేమసందేశము మాత్రమే కదా. బ్రిటిషుప్రభుత్వము భారతీయుల ప్రేమను చూరగొనకనే వారిని పరిపాలించుచుండుటచే ప్రేమను సాధనముగా గైకొని రాజకీయస్వాతంత్ర్యమును పొందుటయందు విజయమందజూచుటయే గదా మహాత్ముని యాశయము. ప్రేమవిధానము సర్వవ్యవహారములయందును జయమును గొనితెచ్చుననియు, రక్తపాతమసరముగాకుండగనే ప్రపంచశాంతి సులభమనియు, మానవకోటి ప్రేమతత్త్వమును గ్రహించి ఐహికాముష్మిక సుఖముల నంది విశ్వమానవకల్యాణమునకు దోడ్పడవచ్చుననియు, నాడే ప్రపంచశాంతి లభ్యమనియు ఆచరణపూర్వకముగ జూపుచుండుటచేత నేగదా నేడు గాంధీమహాత్ముని ప్రపంచ మంతయు ప్రేమించుచున్నది! రవీంద్రు డీప్రేమతత్త్వము నెరిగినయువకులను గోరియే కదా అంతర్జాతీయ విశ్వవిద్యాలయమును 'విశ్వభారతి'ని శాంతినికేతనమున స్థాపించెను! ఇట్టి మహదాశయములతో నిర్వహింపబడుటచేత నేగదా 'విశ్వభారతి'లో శిక్షణార్థమై ప్రపంచమందంతటనుండియు తలిదండ్రులు తమ బిడ్డల పంపుచుండుట! భావిభారత సౌభాగ్యమును ప్రపంచచరిత్ర నిట్లు శిక్షణబడసిన యువకులేగదా నిర్ణయించునది! ప్రేమమూర్తులై, అహింసాస్వరూపులై యలరారుచున్న గాంధీరవీంద్రుల పవిత్రనామములు ముందుతరములవారికి పవిత్రభావప్రేరకములై విశ్వమానవ కల్యాణమునకు దోడ్పడుగాక!

ఆంధ్రభాషలోని ప్రేమకావ్యము లతిమనోహరముగ విరచింపబడినవి. శ్రీవేంకట పార్వతీశ్వరకవుల 'శ్రీకాంతసేవ'యును, శ్రీ కాళ్లకూరివారి 'సౌందర్యమంజరి'యు నీతరగతికి చెందినవే. వ్యంగ్య సౌరభమే ప్రధానముగాగల యీప్రేమకావ్యకుసుమము లాంధ్రభాషాదేవి కలంకారప్రాయములై తనరారుగాక! 'కవికొండల'వారి దివ్యలేఖిని యింకను ప్రేమవాహినుల

నాంధ్రావనిపై బరపుగాక! ఆంగ్లకవులైన కీట్సు, షెల్లీ, వర్డ్స్‌వర్తు, టెనిసన్ మున్నగువారిని బోలు పలువురు కవు లాంధ్రావనిని ప్రేమగీతములతో నింపుదురుగాక!

ప్రేమాతిరేకమును గాఢముగ చిత్రింపగలుగువాడే కవి. ఇట్టిప్రజ్ఞ 'బసవరాజు'వారి పిమ్మట 'తురగా' వారి కబ్బినది—వీ రేదోవిధముగ ప్రతిగేయమునందును ప్రేమలీలలనే చిత్రించుచుందురు. 'బసవరాజువారు' 'శైలాసుజ్ఞా'ల నిర్మలప్రేమమును కడు హృద్యముగ జిత్రించినారు.

ఈప్రపంచమున నభ్యసింపవలసిన శిక్షలలోకెల్ల ప్రేమశిక్షయే సర్వోత్తమమైనది. అన్నిపరీక్షలయందు కంటెను ప్రేమపరీక్షయందు త్తీర్ణమగుటయే కష్టతమము. అవ్యక్తప్రేమయే అవలంబనీయము. లోకమున నొక్కటియే ప్రేమముఖ మున్నది. ఈముఖమునుండి వెలువడిన వాక్కును మానవకోటియెల్ల శిరసావహించును. అప్రకటితప్రేమయే యతిపవిత్రమైనది, సర్వోత్కృష్టమైనది. ప్రేమ స్వర్గమునుండి దిగి మరల స్వర్గమునకే పోవును. ప్రేమవాహిని స్వర్గమునుండి మానవుని పునీతుని జేయుటకై యవతరించి యాతని స్వర్గావరోహణము జేయ శక్తివంతుని జేయును. దయాస్వాంతుని హృదయమునకే ప్రేమ తోలుకాడును. 'భిక్షమమ్మా!' యని భిక్షుకురాలు జాలికరముగ కేక వైవగనే తడబడు నడకతో నేతెంచి దయాస్వాంతుడు భిక్షమువైచి కరుణాప్లావిత వచనములతో పంపును. దయ, ప్రేమ యనునవి అవినాభావసంబంధము గలవి. దయ హృదయద్వారమును దెఱచిన, ప్రేమ లోన బ్రవేశించును.

ప్రేమ జిహ్వానేత్రములయం దున్నది. ప్రేమ ప్రకటనమునకు జిహ్వనుండి వాక్కు, నేత్రద్వయమునుండి ప్రేమపూరితదృక్కులు ముఖ్యములు. 'ఒక మంచిమాట, ఒక చల్లని ప్రేమపూరితమైనచూపు' ఎట్టి కష్టములలో నున్నవారినైన సుఖమున బెట్టగలవు. 'పరులను ప్రేమించుట తన్ను ప్రేమించుకొనుటయే!' యను ఎమర్సను మహాశయుని వాక్కు ప్రతిమానవుని హృదయమున గాఢముగ తీవ్రముగ నాటుకొనవలయును. ఈ వాక్యభావమును గ్రహించినవారికి స్వార్థత్యాగమున మిళితమైన కష్టనిష్ఠురము లనుభవములు గావు. నాడే ప్రేమించుటలోగల మహదానందమును మానవు డనుభవించును. ప్రేమఆత్మల వివాహమునందు మానవుని సుఖజీవనము గలదు. ఏనాడు 'ఆత్మ' పరకీయ యగు ప్రేమతో సంయోగము నందునో ఆనాడే మానవుకు సౌఖ్యప్రపూర్ణమగు జీవనము నాశించగలుగును.

'మీ రన్యోన్యము ప్రేమించుకొనుటయే నా యానతి' యని భగవంతుని యాశయము. మహాప్రవక్తలందరు నిదియే చర్వితచర్వణముగ జెప్పుచున్నారు. ఇట్టిబోధ యెంతయు నావశ్యకము. ఏలయనిన, ఆధునిక ప్రపంచమందలి సంఘర్షణలు, భయంకరయుద్ధములు నీ వాక్యము నొక్కదానిని అర్థముచేసికొని యాచరణయం దుంచినమాత్రమున మటుమాయమగుట నిశ్చయము. దూరదృష్టిని సూచించు నీ వాక్యములు మహాపురుషుల వదనగహ్వరమునుండి వెలువడ నెంతయు నర్హములు.

వేదకాలమునాటి బ్రాహ్మణుడు పరమేశ్వరు నుద్దేశించి ప్రపంచమునందలి సమస్తప్రాణులను ప్రేమతోడను, సమానదృష్టితోడను జూచెడి వివేచనాశక్తి తనకు బ్రసాదింపుమని ప్రార్థించుచున్నాడు.

*

'నా పుస్తకములు స్త్రీనేత్రములు'—మూరు.

*

మాటిమాటికిని ప్రేమించుచుండువానికి ప్రేమించుట తెలియదని తులసీదాసు చెప్పుచున్నాడు.

*

'ప్రేమ క్రీడావస్తువులతో క్రీడించును'. ఏలయనగా, ప్రేమకు దేవత బాలుడు. ప్రేమ కన్నులతో గాక హృదయముతో జూచును. కాననే 'ప్రేమదేవత యంధురాలు' (Love is blind)అని షేక్స్పియరు నుడివెను. ఇద్దాని సత్యము ప్రేమతత్త్వవేదులకు మాత్రమే విదితము.

ప్రకృతి ప్రేమపూరితమని ఆధునికకవి యిట్లు గానము చేయుచున్నాడు:

"ప్రకృతి మార్దవ పూర్ణశోభలను దెలిపి
పురుషుని విభూతిగుణయోగమును వెలార్చి
పరమసుచిరమైన ప్రేమప్రపంచమునకు
నడుచు మార్గము మఱల నేర్పడునె సకియ!"

—రాయప్రోలు.

"Serene will be our days and bright
And happy will our nature be
When Love is an unerring light
And joy its own security"—'Coleridge'

నేటికాలపు విద్యార్థి ప్రేమ కతినీచమగు నర్థమును చేయుచున్నాడు. ప్రేమతత్త్వమును గ్రహించి, ప్రేమోత్కృష్ట్యమును గుర్తెరింగి తమ భావిజీవనము ప్రేమార్ద్రము గావించి మానవసేవకై యంకితము చేయ వలసిన విధి విద్యార్థిదశయందే యున్నది. తనను, తన జాతిని, తన దేశమును, తన భాషను—తుదకు విశ్వము నంతను ప్రేమించుట నేర్వవలసినది విద్యార్థులే! విద్యాబుద్ధులతో బాటు ప్రేమపాఠమునుగూడ నేర్చుకొనునది విద్యార్థియే! ప్రేమకును భోగవిలాసములకును స్వర్గపాతాళాంతర మున్నదని గ్రహించునది విద్యార్థియే! శైలామజ్వాలల నడుమ నున్న యాదర్శప్రాయమగు నిష్కళంకప్రేమయే, భౌతిక సుఖాంశకు తావులేని యనురాగమే, స్వార్థచింత భోగవిలాసముల కవకాశములేని ప్రేమానుబంధమే మానవ మోక్షప్రదాయినియగు ప్రేమయని విద్యార్థి గ్రహించునది. సామాన్య గృహమును స్వర్గతుల్యముగ జేయునది ప్రేమఫలమే!

ఆంగ్లకవిపుంగవుడగు టెనిసన్ (Tennyson) మహాశయుని అనుభవపూర్వకమైన వాక్కృత్యంతము గమనార్హము:

*" 'Tis better to have loved and lost
Than never to have loved at all."

* *

విశ్వమందలి ప్రతిమానవుని హృదయాంతరాళము నుండి వెలువడు భావము లన్నియును ప్రేమపూరితములే యగుగాక! మనుజు నుడులన్నియును ప్రేమమిళితములే యగుగాక! ఆచరించు కార్యము లన్నియును ప్రేమదేవతకై యుద్దేశింపబడిన క్రతువులే యగుగాక! ప్రేమయే మానవుని మానసికవృత్తుల నవిచ్ఛిన్నముగ నేలుగాక! లోకము విద్వేషరహితమై ప్రపంచ వ్యవహారము లన్నియును ప్రేమప్రభావమువలననే పరిష్కరింపబడును గాక! విశ్వమంతయు ప్రేమపూరితమై, ప్రేమగానమును ప్రతిధ్వనింపజేసి ప్రేమోత్కృష్ట్యమును గ్రహించుగాక!! ప్రపంచశాంతి, విశ్వమానవసౌభ్రాత్రము, విశ్వమానవకల్యాణము ప్రేమమూలముననే కరతలామలకము లగుగాక!!!

లోకపూజ్యుడైన శ్రీ గాంధీమహాత్ముని సుభాషితమును పాఠకమహాశయుల హృదయగతమొనర్చి, మా యీవ్యాసమును ముగింతుము:—

"నిన్ను ద్వేషించువానిని సైతము నిర్మలహృదయముతో ప్రేమింపుము. ప్రేమబలముముందు భౌతిక బలములు లొంగిపోవును."

---

* [ఎన్నడును ప్రేమింపకయే యుండుటకంటె, ప్రేమించి తన ప్రేమావలంబనమును పోగొట్టుకొనుటయే మేలు.]

# మైసూరు శిల్ప చిత్రములు

(K. S. R.)



౧. హైశాలేశ్వరాలయము-హళేబీడు



౨. చెన్న కేశవస్వామి దేవాలయము-బేలూరు

## 'విహంగయానము'*

కపిస్థలం శ్రీరంగాచారి

౧

ఇది మనకు క్రొత్తది; మన భాషకు క్రొత్తది— ప్రకృతిశాస్త్రసంబంధమును మొట్టమొదటి నవల; స్వతంత్రముగ వ్రాయఁబడినది.

'ప్రకృతిశాస్త్రజ్ఞానమును సామాన్యజనుల హృదయమున కెక్కించు నుత్తమనవలలు ఫ్రెంచి, జర్మను భాషలలోమాత్రమే కలవు. వాని ప్రబోధముచేఁ బలన నా దేశములలో ప్రకృతిశాస్త్రవేత్తలును, పరిశోధకులును అనేకులైనారు. ఆదేశములోని జ్ఞానము ప్రతిదినమును మానవోపయుక్తములను క్రొత్తక్రొత్తవింతలకు దారిచూపుచున్నది. అందువలననే ఇంగ్లాండు, అమెరికాలుకూడ నిట్టిజ్ఞానమునకై ఫ్రెంచి, జర్మనుభాషలను అభ్యసించుచున్నవి.'

విషయము ప్రకృతిశాస్త్రమునకు చేరినది; కాఁబట్టి రసవంతమైన కథకును, పాత్రపోషణకును ఇట్టి నవలలలో అంతగా చోటుండదు. మఱియు, ఇతర నవలలలోవలెఁగాక వీనిలో గ్రంథకర్త పాత్రలతో కలసిమెలసి, చదువరులతో నేరుగా మాటలాడవచ్చును.

అయినను, 'విహంగయానము' ను చేత నెత్తుకొన్నవారు మొదటినుండి కడపటివరకు చదువక క్రింద పెట్టలేరు. ప్రకృతిశాస్త్రజ్ఞానముకలవారికి ఇది వినోదము; పిల్లలకును, ఆ శాస్త్రజ్ఞానము లేనివారికిని ఇది Arabian Nights Entertainments.

౨

విహంగయంత్రము నీట మునుఁగఁగలదు; గాలిలో నెగురఁ గలదు; సముద్రమున తేలఁగలదు; తిమితిమింగిలములు మ్రింగినను భేదించుకొని వెలువడఁగలదు. 'యంత్రమునకు అడుగున రెండుకాళ్లుండును. ఈ కాళ్లమీఁద నది చక్కఁగా నిలువఁబడఁగలదు. ఆకాళ్లను ఎత్తుచు, దింపుచు పక్షివలె నాయంత్రము నడువఁగలదు. కాళ్లకు అయిదేసి వ్రేళ్లు గలవు. ఈవ్రేళ్లయందు మరలు అమర్పఁబడి పాదగమనమునకు అనుకూలమగును. ఒక మీట నొక్కినయెడల లోనుండి రెండుచక్రములు పాదముల క్రిందికి దిగును. ఈచక్రములతో నీయంత్రము మోటారుబండివలె పరుగెత్తఁగలదు. ఒకచుక్కాని యీ చక్రములను సరియైనదారిని నడిపింపఁగలదు. అవసరము పట్టినేని మెడక్రిందిభాగమునుండి మఱియొక రెండుకాళ్లు క్రిందికి దిగఁగలవు. అప్పుడు ఈద్విపాద యంత్రము చతుష్పాత్తు కాఁగలదు. అట్లే యీ నాలుగుకాళ్లను లోనికీడ్చుటకు మఱియొకమీట కలదు. అప్పు డీయంత్రము పాదరహితమై పొట్టమీఁదనే దేకిపోఁగలదు. ఒకమీట నొక్కినయెడల పక్షిఱెక్కలవంటి రెండు పెద్ద ఱెక్కలు పైకి రాఁగలవు. ఆఱెక్కలు యంత్రసహాయమున కదలుచు నీనిర్మాణమును ఆకాశమునకుఁ దగినట్లు చేయును. మఱియొక మీట నొక్కినయెడల నీ ఱెక్కలు రెండుపెద్దచక్రములుగా మాఱిపోయి గిఱగిఱ తిరుగఁగలవు. అప్పు డది పొగయోడవలె మహాసముద్రమధ్యమున సంచరింపఁగలదు. పక్షిమెడవంటి మెడయు, నం దిరుప్రక్కల రెండుకండ్లును, పెద్ద పొడుగైన మూతియు దీనికిఁ గలవు. గుండుదెబ్బ తగిలినను భేదింపఁబడని మిశ్రలోహముతో యంత్రపు పైభాగ మంతయు నాలుగుపొఱలుగా నిర్మింపఁబడియుండును. పొఱపొఱకును నడుమ ప్రకృతిప్రాపకగుణముగల లోహవల్లికలు అమర్పఁబడియుండును.'

చూచుటకు పక్షివలె నుండు నిట్టి యీవిహంగయంత్రమున ప్రయాణము చేయుట విహంగయానము.

---

* కర్త: తేకుమళ్ల రాజగోపాలరావు; ప్రకాశకులు: ఆంధ్రసరస్వతీగ్రంథమాల, పరశువాకము, వేపేరి పోస్టు, చెన్నపురి.

విహంగయానము నాయికయగు ప్రేమవతికి ఆర్ష
ద్వీపమును చేకూర్చినది; సముద్రమధ్యమున ఆపన్నులైన
వారికి రక్షణము కూర్చినది; సముద్రములకు కావలికాచి
జలాంతర్గాముల సంగతి ఒరులకు తెలియకుండునట్లు
కాపాడినది; శత్రువులు ఆర్ష ద్వీపమువంక రాకుండ
చూచినది; భూప్రదేశములను శోధించి భావికార్యసౌధ
ములకు సోపానములు నిర్మించినది; జగన్నాథుని సేవతో
ఆరంభమై, కాశ్యాదిక్షేత్ర సంచారమువలన పవిత్రమై
జగదుద్ధారణకు పూనుకొన్నది. కాఁబట్టియే ఈనవల
'విహంగయానము.'

3

ఆర్ష విజయుఁడను ప్రకృతిశాస్త్రవేత్త ఒకనాఁటి
సంజప్రొద్దున పెద్దాపురముకోటలోనికి ఒకఐంద్రజాల
కునివలె వచ్చి, సోదరుల మరణమువలన చాల చిక్కి
పోవుచున్న లలితామహారాణిని కొన్ని ప్రకృతిశాస్త్రపు
వింతలతో మెప్పించి, పెద్దాపురమున ఒక ప్రకృతిశాస్త్ర
నిలయమును స్థాపింప నామెయాజ్ఞను పడయుచున్నాఁడు.
ఆ కేండ్లకు ప్రకృతినిలయము లోకోత్తరమైన మహా
సంస్థ యైనది. అచ్చట శాస్త్రవేత్తగా నుండి ఆర్ష
విజయుఁడు ప్లుతమనోహారిణులను, జలాంతర్గాములను
నిర్మించుచున్నాఁడు. లలితామహాదేవియొక్క ఆదర
మున పెరిగినదియు, ఆర్ష విజయునియొద్ద విద్య నేర్చు
చున్నదియు నగు ప్రేమవతి అనుపిల్ల ఈ నిర్మాణముల
వలన లెక్కలేని ముత్తెపుగనులను, రత్నపుగనులను,
ప్రవాళపుగనులను కనిపెట్టి రాణిగారికి చాలసంపదను
కలిగించుచున్నది. ప్రేమవతి ఆకాశమునందుమాత్ర
మెగురఁగల పక్షివంటి విమాన మొకటి నిర్మించి, లలితా
మహాదేవి మొదలగువారితో బదరి, కేదారము, గంగోత్రి,
యమునోత్తరి, పంచప్రయాగలు, కైలాసమును ఒక్క
దినములో సేవించినది. ఒకనాఁడు కాశి కేఁగి గంగను
తెచ్చి నాఁటిప్రొద్దున తొమ్మిదిగంటలకు రామేశ్వర
మున రామలింగస్వామికి అభిషేకముచేసి సాయంకాల
మునకు మరల ఊరుచేరినది. ఇట్లు సమస్తయాత్రలను
సేవించి, హరిద్వారమునుండి హిమాలయయాత్రలు చాల
కష్టముతో చేయుచుండు యాత్రికులకొఱకు తన విమాన
మును వినియోగించి, నీటిలోను, గాలిలోను సంచారము
చేయఁగల యంత్రమును నిర్మించుటయందు ప్రేమవతి
నిమగ్నయై యున్నది.

ఒకనాఁడు లలితయు, ఆర్ష విజయుఁడును ఒక్క
సారిగా ప్రజలలో ప్రకృతిశాస్త్రములపై ఉత్సాహము
చెలరేఁగుటకు పెద్ద ఆందోళనము కావించుట మొదలగు
విషయములను ప్రసంగించుచుండఁగా ప్రతీహారియొకఁడు
వచ్చి ప్రేమవతి నలువురు చెలికత్తెలతో సముద్రవిహా
రము చేయుచు అందు మునిఁగిపోయి, రెండునాళ్లుగా
కానవచ్చుట లేదని చెప్పఁగా విని, లలిత మూర్ఛితయై
నేలఁబడిపోవుచున్నది.

కాని, లలితకు తెలియకయే మంచి కట్టుదిట్టము
లతో ప్రేమవతి నలువురు చెలికత్తెలతోను, నూర్వురు
సేవకురాండ్రతోను, వలసిన యంత్రకారిణులు మొద
లగువారి బలఁగముతోను, ఐదేసివేలటన్నులు మోయఁగల
మూఁడు జలాంతర్గాములతోను, నాలుగు వాయువిమాన
ములతోను, ఏఁబది ప్లుతమనోహారిణులతోను, సమస్త
ప్రకృతిశాస్త్ర సంబంధమైన యంత్రములతోను, ఒక
యేఁడాదికి చాలిన ఆహారాది ఇతర పదార్థములతోను
ఒకనాఁటి శుభోదయమున శాంత మహా సముద్రమును
గూర్చి వెడలిపోయినది. సముద్రగర్భమునందలి అనంత
నిధులను సంపాదించి, ప్రేమవతి సముద్రరాజ్య పట్టభద్ర
యైనది. శాంతమహాసముద్రమున ప్రళయభీకరములైన
తుపానులు రేఁగుసమయమగు వర్షకాలమున తన చెలికత్తె
కాపాడిన మున్నూటయేనుబదినల్వురు ఆపన్నులను
నిర్మానుష్యమగు ఆర్ష ద్వీపమునకు చేర్చి, ఆద్వీపమును
పరిపాలింపఁదొడఁగినది.

ఒకనాఁడు ప్రేమవతి ఇరువురు చెలికత్తెలతో
సముద్రమున సంచారము చేయుచుండి, నీట మునుఁగ
యత్నించుచున్న రామభద్రుఁడను తన స్నేహితుని
చూచి, అతని వృత్తాంత మడుగుచున్నది. తానును, వీర
భద్రుఁడును విహంగ యంత్రములలో నిరంతర ప్రయా
ణము చేయుచు, భూలోకపటమును చిత్రించుచు, శాంత

మహాసముద్రమున అక్షాంశము ౧౫౦° ౪౩' ౫౯" ధ్రువాంశము ౫౦° ౫౪' ౧౬" గల ప్రదేశమున ఎగురుచుండఁగా, దిగువ సముద్రములో మునిఁగిపోవుచున్న ఓడయొక్క తెఱచాపకొయ్యను తమ యంత్రముల పాదములకు బంధించి, దానిని మునుఁగకుండ చేయఁజూచియు, తెఱచాపకొయ్య దృఢముగా లేక యంత్రపు కాలిలోనికి వచ్చి ఓడ మునిఁగిపోవుటయు, ఓడను కాపాడుటకై తనయంత్రముతో మునిఁగిన వీరభద్రుఁడు ఎన్నిదినములైనను పైకి రాకుండుటయు రామభద్రుఁడు ప్రేమవతికి తెలుపఁగా, ఆమె సువర్ణయంత్రముతోను, పరివారముతోను, ప్లుతమనోహారిణులతోను నీట మునిఁగిపోయి, ఎంతోకష్టముతో సముద్రగర్భమున మూర్ఛితులైయున్న వీరభద్రుని, అతని అనుచరులను కాపాడి, రామభద్రుని కనిసికొని, వారితో మానవోద్ధరణమునకు పూనుకొనుచున్నది.

పిమ్మట ఎరిబస్అను అగ్నిపర్వతమునకు ఆఱువేలమైళ్లు కావల భూగర్భమున ఒకమైలులోతున వీరిసహాయమున ప్రేమవతి అమరావతీవిశ్వవిద్యాలయమును స్థాపించినది.

ఇట్లుండఁగా, సుమత్రాద్వీపమునుండి బయలుదేరి ఆస్ట్రేలియావంకకు పోవుచుండఁగా నడుమ కొట్టిన తుపానులో చిక్కి, గాలి యీడ్చినట్లెల్ల పోయిపోయి, మంచుకరుళ్లనడుమ బంధింపఁబడి, కొట్టుకొనివచ్చిన 'సాగరసంచారి' అనుఓడలోని ఆంగ్లులను కాపాడఁజేసి, ప్రేమవతి వారిలో మువ్వురికి తన దర్శన మిచ్చుచున్నది. ఒకనాఁడు ఓడనాయకునికి వీరభద్రుఁడు అమరావతీ విశ్వవిద్యాలయములోని వింతలను జూపుచున్నాఁడు.

తరువాత ప్రేమవతి ఆహ్వానించుటవలన లలిత, ఆర్యవిజయుఁడు మొదలగువారు ప్రేమవతి పంపిన సువర్ణవిహంగములలో పెద్దాపురమునుండి బయలుదేరి అమరావతీ విశ్వవిద్యాలయములో ప్రేమవతిని కలిసికొనుచున్నారు.

పిమ్మట, చాలబలవంతపెట్టి అందరును ప్రేమవతిని ఆర్యరాజ్యమునకు పట్టాభిషిక్తను చేయుచున్నారు.

'ప్రేమవతి లోకోద్ధరణమునకు పూనుకొనెను. నానారాజసభాసభ్యుల రాష్ట్రములలో ఎందుఁ జూచినను విద్యాశాలలే! ఎందుఁగాంచినను యంత్రశాలలే! ఎందుఁ జూచినను ప్రేమపూరితములైన ఆపదుద్ధరణక్రియాకలాపములే! అమరావతీవిశ్వవిద్యాలయము పండితులను, జగద్గురువులు ప్రచారకులను ప్రసాదింపఁగా, నిర్బంధవిద్యయు, ఆపన్నులను రక్షించుటయు రాజశాసనములు కాఁగా, జగద్వ్యాప్తమైన ప్రేమయే జీవితాదర్శము కాఁగా, క్రమముగా లోకములు అంధకారమునుండి జ్ఞానజ్యోతిని బడయఁదొడఁగొన్నవి.'

ఇది కథ.

౪

'నుదుట పెద్దకుంకుమబొట్టును, పక్షియీకలతో నలంకరింపఁబడిన యెఱ్ఱని తలగుడ్డను, చంకను ఒక బొంతను, కుడిచేత నొకపెద్ద నెమలికుంచెను, కాళ్లకు కొయ్యపావుకోళ్లను ధరించి', రాణిగారియెదుట, 'అస్య శ్రీ ఇంద్రజాలమహాతంత్రస్య భాస్కర ఋషిః ప్రాచీనాంధ్రాక్కర రగడ, సీసాదయః ఛందోవిశేషాని నవీన పాశ్చాత్య ప్రకృతిశాస్త్రాదయః దైవతాని, న్యూటన్, క్యావెండిష్ ఇత్యాదయః నిరంతరసేవకాః...' అని ఐంద్రజాలికుఁడు కొన్ని మంత్రములు చదివి నెమలికుంచెను ముమ్మాఱు ఆడించి వారికి చూపిన వింతలుగల మొదటిప్రకరణము చదువునప్పుడు శాస్త్రపరిచయము లేనివారును, పిల్లలును మహారాణిగారితో 'ఆశ్చర్యములో మునిఁగిపోవుచున్నాను' అనకమానరు.

'కమ్మని కీల్జడతోను, నిద్దంపుమెఱుంగు మేని చాయతోను, హస్తకంకణములతోను, ఆభరణములతోను పదియడుగుల పొడుగును, మూఁడడుగుల వెడలుపును గల మానవాకారమును నొక సుందరమైన యాఁడుదాని యాకారమును' గలిగి, ఇచ్చవచ్చిన చోటికి తీసికొనిపోఁగల ప్లుతమనోహారిణులు; 'సూదులు, కత్తులు,

బట్టలు ఆరవేసికొను తీఁగలు, ఆకుతాయి; సుత్తె, అడ
కత్తెర, కత్తెర, బంపము, ఉలి, కొలబద్ద, కదురు,
కండె, గాలము, వండుకొను ప్రొయ్యి, విల్లు, అమ్ములు,
వింటినారి, శూలము మున్నగునవి చాలఁగలిగి, వేఁటాడు
టకు, బట్టలు నేయుటకు, వడ్రము, కమ్మరము, కంసాలి
పనిచేయుటకు శత్రువులతో యుద్ధమొనరించుటకు పనికి
వచ్చు విసనకఱ్ఱ, వేయిచేతుల బాణాసుర యంత్రము;
'ఇనుపకవచములను బాణములను ధరించినవారి నెందఱ
నైన ఆకర్షించి తనకు అంటుకొనిపోవునట్లు బంధించి
వేయు' శిరోనామకాస్త్రము; విష వాయువులను కలి
గించు వాయవ్యాస్త్రము; రక్తమాలిన్యము గూర్చు
నాగాస్త్రము; తన్ను మానవుఁడు తాఁకనేని వాని
స్పర్శగల సమూహమంతయు వితాకు చెందఁజేయునది,
అగ్నిస్వరూపమై శత్రువులను దహించివేయునది మొద
లగు విద్యుద్బాణములు; నూరడుగుల యెత్తును, నలువది
యడుగుల చుట్టుకొలతయు గలిగి వైకుంఠనాయకుని
రథమువలె నున్న పక్షిశకటము; నడచిపోఁగల తెల్లని
యంత్రపు యేనుగులు; భరతశాస్త్రము ననుసరించి
ఆడుచు, సంగీతశాస్త్రము ననుసరించి పాడఁగల కీలు
బొమ్మలు; భూలోకమునంతను కంపింపఁజేయఁగల పర
మాణుభేదక యంత్రము; జలగర్భములోని గనులను,
జంతువులను గనిపెట్టగల జలగర్భశోధని— ఇటువంటివి
శాస్త్రపరిచయము లేనివారికిని, పిల్లలకును వింతలు.

కాని, ఇవి 'శాస్త్రసిద్ధముగాని శాస్త్రవ్యతి
రిక్తములు కావు'.

'ఆంధ్రులకు ఆవేశ మన్నిటను అధికము' అయి
నను, ఇది చూడుఁడు:

ఒకక్షణమైనను ఆలస్యము కారాదని పరదేశములు
తీవ్రముగ వ్యవహారములు జరుపుకొనుచుండఁగా 'ఆ
ప్రక్కనే ఆంధ్రదేశమున దీర్ఘనిద్ర. గోడనుండి మఱల
నిద్రితుల భయంకరమైన గుఱ్ఱుశబ్దములు. ఒకఁడు ఒక
నిద్రితుని లేపుచున్నాఁడు. వెంటనే ఆనిద్రితుఁడు లేచి
తన్ను లేపినవానిని చావమోది మఱల పండుకొని
గుఱ్ఱుపెట్టుచున్నాఁడు.'

... ... ... ...

'భరతవర్షములో చెన్నపురి తంబుసెట్టివీధిలో
నాలుగేండ్ల యొకబాలిక రెండేండ్ల తన తమ్ముని
పోషించుకొనుచున్నదఁట! ఎవ్వరును ఈ నిసువులకు
దిక్కులేరఁట! తమ్ముఁడు మార్గమున నడచు శకటముల
క్రిందికి పరుగెత్తుచుండఁగా ఆత్రములో ఈయక్క వచ్చి
వానిని లాగివేయుచుండునఁట! భుజించి వీథినిఁ బాఱ
వైచిన యెంగిలి విస్తరులనుండి అన్నము తెచ్చి అక్క
తమ్మునికి తినిపించునఁట! ఒకనాఁడు తమ్మునికి జ్వరము
వచ్చినది. ఏమి చేయవలయునో అక్కకు తెలియదు.
ఏడ్చుచు నా పసిబాలిక వానిప్రక్కఁ గూరుచుండఁగా
నెదుటియింటి బ్రాహ్మణుఁడు పిల్లవాఁడు మరణించునని
శంకించి "నిర్భాగ్యురాలా! నీతమ్ముని ఈవీథినుండి తీసి
కొని పోయెదవా లేదా" అని బెత్తముతో వారి నిద్దఱను
కొట్టసాగెనఁట! దేశనాయకులగు మహాశయులు లెంపలో
వీరిని నిత్యమును జూచుచు పోవుచుందురుగాని— నాటక
ములకును, భోగములకును బోవు ధనములో నొక్క
దమ్మిడీయైన వీరి కిచ్చుటకు వారికి దరిద్రమఁట!'

... ... ... ...

'నెలకు పదిరూపాయల బకిజీతము, పదునాలు
రూపాయల నిర్భాగ్యపు సత్రభోజనము, ఇంతయు
కర్చుపెట్టఁగా జీవనోపాధికూర్పలేని శుష్కమైన శాస్త్ర
జ్ఞానము— పెద్దపరీక్షలకు చదువుచో నిండ్లు వాకిండ్లు
తాఁకట్లు. అటుపైన అన్నములేక అష్టకష్టములు—
ఏకూలిపనిలో చేరి యొకపావలా గణించి గంజినీళ్లయిన
త్రాగవచ్చునుగాని యీచదువు లెవ్వరు భరింపఁగలరు?
ఈ శుష్కవిద్వాంసు లెందుకు పనికివత్తురు?'

... ... ... ...

'బొజ్జ సవరించుకొనుచు, మీసములు మెలిపెట్టు
కొనుచు కొందఱు నాయకులు తీఱికయే లేక కష్టపడు
చుందురు.'

* * * * *

'ఈనవలను నట్టి యొక (గ్రామపరిపాలనా) సంఘములోనివారు కట్టుబాటులేని కలలుపగులఁగొట్టుకొను చుండఁగా రాష్ట్రీయప్రభుత్వమువారు అడ్డురావలసి వచ్చినది. ఎన్నిక లగుదాఁక నొకఁడు ప్రజల బంటు. అటువెనుక నాతఁడు చిత్రముగా కండ్లను, మూతిని త్రిప్ప నేర్చిన అలభ్యదర్శనుఁడగు నంతఃపురకాంత.'

ఇట్టివి చదివినప్పుడు ఎందలు తడిచిచూచుకోరు!

## ౬

ఈ నవలలోని శైలి గ్రాంథికము; సందర్భోచితము.

శ్రీముఖనామసంవత్సర శ్రావణబహుళ అమావాస్యాసోమవారమున కేతుగ్రస్త సూర్యోపరాగ సమయమున బెజవాడలోని కృష్ణాతీరమున అర్ధరాజయుని ఉపన్యాసము చదువునప్పుడు గ్రంథకర్త గొప్పవక్త అని తోఁచును.

భావ గ్రాంథికమైనను సంభాషణలు సహజముగనే యున్నవి.

వర్ణనలలో నీరిశైలి చాల మెరుగెక్కియున్నది. ఈ Aurora Australis వర్ణన చూడుఁడు;

'ఒక్కొక్కవేళ ఆకాశమున విద్యుజ్జ్యోతులు ఆకస్మికముగా మెఱసి మాయమగుచుండెను. కొంచెము ముదిఁకిచెందినట్లున్న ఆకుపచ్చని తీగెలవంటి మెఱుపులు ముందు మెఱయుచుండెను. వెంటనే యవి యదృశ్యమై గులాబిరంగు మెఱుపులు వచ్చుచుండెను. ఆవెంటనే యవి యదృశ్యమై తెల్లని తీగకడ్డీలు ఆకసమున మెఱయుచుండెను. ఆతరువాతిక్షణములోనే వట్టి యాకసము; ఏ మెఱుపును నుండదు. ఇంతలో చూచుచుండఁగనే ఎట్టిని కాంతిరేఖలు; చూపఱులు హృదయంగమమైన యాకాంతులను గ్రహించులోపలనే బంగారుచాయలు. ఈరీతిగా ఆదీర్ఘనిశాంధకారమునందు ఆకసమున విద్యుజ్జ్యోతులు అప్పుడప్పుడు మెఱయుచుండెను. కన్నులకు స్వాదువులై మనస్సునకు అమృతధారలై యా విద్యుజ్జ్యోతులు దేవముూతలవలె ఆకసమున శోభాయమానముగా తళుక్కుమనుచుండును. ఈదృశ్యమును ఏమానవుఁడును తనజన్మములో మఱచిపోలేఁడు.'

... ... ... ...

శాంతమహాసముద్రపు ఈతుపాను చూడుఁడు:

'ఉఱుములతోను, మెఱుములతోను, నిబిడీకృతమైన కార్మేఘములతోను నిండి చిల్లిపడినట్లు ఏనుఁగు తొండములవంటి జలధారలను ఆకసము ఆమహాసముద్రగర్భమున క్రుమ్మరింపసాఁగినది. గంటకు నూరుమైళ్ల వేగముతో సుడిగాలియొక్కటి బయలుదేరి తన కందినప్రతి వస్తువును చిమ్మిపాఱవైచుచున్నది. అడుగున నల్లని నీరున్నది; పైని కాఱుమేఘము లున్నవి; మేఘముల నల్లని చీకట్లు సముద్రజలములో ప్రతిఫలించుచున్నవి; నీలాంజనతుల్యమైన సముద్రజలము మేఘములనుండి ప్రతిబింబించుచున్నది; రెంటినుండియు సూచికాభేద్యములగు చిమ్మచీకట్లు రోదసీకుహరము నావరించుచున్నవి; చీఁకటిమీఁద చీకటి చేరి దట్టమై చిక్కఁబడి, గట్టిపడి జగములు నిండి అంధకారమునకు సహితము అంధత్వము గూర్చుచున్నది. కొండల పొడుగున లేచు సముద్రపు టలలు వాయువేగముతో పరువెత్తును మహాసముద్రమునుకూడ తమప్రవాహములలో ముంచివైచియీడ్చుకొనిపోవుచున్నవి. అది భయంకర సమయము; ప్రళయశక్తులు తాండవమాడును చెలరేఁగు దుర్దినము.'

## ౭

"విహంగయానము పిల్లలకు 'Fairy Tales'; దేశాటనప్రియులకు 'Book of Exploration'; హాస్యప్రియులకు 'Tit Bits'; సంస్కరణప్రియులకు 'Social Reform'; స్వప్నప్రియులకు 'Utopia."

Jules Verne, H. G. Wells ల నవలల క్షేమాత్రమును తీసిపోవని ఈనవలను వ్రాసిరి.

౧. "ప్రకృతిశాస్త్రములే మానవజీవితమునకు సర్వవిషయములను ప్రథమప్రమాణములు.

౨. ప్రకృతి శాస్త్రజ్ఞానసంపాదనమే నిజమైన విద్య.

౩. ప్రకృతియంతయు మానవునకు బంటు; శాస్త్రజ్ఞానమే ప్రకృతిని నడపించు సాధనము.

౪. ప్రపంచము నిత్యము,మానవజీవితమధ్రువము:

౫. సర్వమానవసముద్ధరణమున కనుకూలించు జీవితమే ధర్మమునకు నిదానము.

౬. అవ్యాజమైన సర్వమానవప్రేమ మే జీవితాదర్శము.

౭. ఈశ్వరుఁడే జగన్నియంత"

అని సర్వమానవ హృదయములందును సువర్ణాక్షరములతో లిఖింపఁజాలిన శ్రీయుత శేషమల్ల రాజగోపాలరావుగారు ప్రశంసనీయులు.

ఈ నవలలో దొరలిన అచ్చుతప్పులను రెండవ ముద్రణమున సవరించుటకు వీరి కాంధ్రలోకము అవకాశము కలిగించును గాక!

---



జైలు —సూర్య.

# రాణాప్రతాపసింహ చరిత్ర*

గన్నవరపు సుబ్బరామయ్య

"వీరపూజ మానవులకు జాతీయధర్మములలో నుత్తమధర్మము. వీరులు లోకపరిణామప్రాప్తికై యవతరించెడి మహానుభావులు. వీరుల సంకల్పము లుదారములు; భావములు విశాలములు; ఆదర్శములు పవిత్రములు; భక్తి యవిభక్తము; ఆచరణములు ధర్మసంస్థాపనానుకూలములు. వీరులు దేవాంశసంభూతులు. వీరుల చరిత్ర మున్నతమయిన కైలాసశిఖరమువలె గంభీరము; దివ్యమయిన గంగాజలమురీతి నాప్యాయకరము; మహత్తరంబయిన దీపప్రభవలె భాసమానము; ఉద్యానోద్భూతంబైన మలయానిలంబుపగిది సువాసనాసంకలితము. * * * భావ ప్రపంచవిహారులయిన మహాకవులు, కళాభిజ్ఞులయిన యంత్రనిర్మాతలు, విజ్ఞానసంపన్నులయిన శాస్త్రజ్ఞులు, భావోద్దీపకులయిన గాయకశ్రేష్ఠులు, తత్వజ్ఞులయిన మతస్థాపకులు, యుద్ధవిశారదులైన శూరులు, వీరగుణసంపన్నులు. * * * యుగప్రభావము ననుసరించి వీరులను రాజసభావ మావహించినపుడు జిజ్ఞాసాభిలాషయును ప్రబలుట లోకచరిత్రవలన విశదమగుచున్నది." †

ఈవాక్యములు వీరుల స్వరూపస్వభావములను దెలుపుచున్నవి.

భారతదేశ మిట్టి వీరవతంసముల కెందరకో పుట్టినిల్లు. వారిలో రాజపుత్రు లగ్రగణ్యులు. వారిదేశకాల ప్రశస్తు లిట్టివి:

"క్రీస్తుశక మేడవశతాబ్ది నడిమిభాగముననుండి పంద్రెండవశతాబ్ది కడపటివరకు వీరిప్రాబల్యమును, ప్రాముఖ్యమును అధికముగ నుండినందున హిందూదేశ చారిత్రమున నీకాలమునకు రాజపుత్రయుగమని పేరు కలిగినది. ఈకాలమున ఉత్తర దక్షిణ హిందూదేశములందు విలసిల్లిన రాజ్యములన్నియు రాజపుత్రులవే. ఈరాజ్యములలో దేనికది స్వతంత్రమయి, సార్వభౌమపదవి కాశించి యిరుగుపొరుగు రాజ్యములతో నిరంతరము కలహించుచువచ్చినది. రాజపుత్రుల యీ నిరంతర కలహములవలన మహమ్మదీయుల కిటుపిరువాత హిందూదేశమును జయించుట కడుసుకరమయినది. మహమ్మదీయ యుగమునందుగూడ రాజపుత్ర రాజ్యములు కొన్ని మధ్యహిందూదేశమునందును, మాళవ రాజపుత్ర స్థానములయందును దమ స్వాతంత్ర్యమును నిలుపుకొనుచు వచ్చినవి. ఈరాజ్యములనుకూడ కబళింపనాకలిగొన్న మహమ్మదీయులకును, ప్రాణముల పణముగ నొడ్డియైనను దమ స్వాతంత్ర్యమును నిలుపుకొన వీరకంకణముకట్టిన రాజపుత్రులకును జరిగిన భయంకర సంగ్రామము లసంఖ్యములు. ఈసందర్భమున రాజపుత్రులు చూపిన అనుపమాన శౌర్యపరాక్రమములును, ఆత్మగౌరవస్వదేశ స్వాతంత్ర్యాభిమానములును అక్కజముగొలుపు వీరగాథలయి రాజపుత్రస్థానము వీరకథానకములకు పంటపొలమయినది."౧

వీరివంశముపుట్టుపూర్వోత్తరము లీతీరువి:

"రాజపుత్రులు తాము చంద్రవంశ క్షత్రియులమని, సూర్యవంశ క్షత్రియులమని, పాండవుల సంతతివారమని, రాముని సంతతివారమని చెప్పుకొందురు. పూర్వకాలమున భూలోకము మ్లేచ్ఛసంబాధితముకాగా

---

* కర్త: డి. రాజశేఖరశతావధాని; క్రౌను నాల్గుపుటలసైజు, పుటలు ౨౮౫+౧౩+౮. వెల రు౧-౮-౦. గ్రంథమువలయువారు, ప్రొద్దుటూరు మునిసిపలు హైస్కూలు హెడ్ మేష్టరు శ్రీ పి. ఆర్. సుబ్రహ్మణ్యయ్యర్ (బి. ఏ., యల్. టి) గారికి వ్రాయవలెను.

† 'వీరపూజ' ప్రస్తావన; శ్రీకాశీనాథుని నాగేశ్వరరావుగారు వ్రాసినది.

తన్ని వారణమునకయి ఆబూపర్వతశిఖరముమీదగల తన యగ్నికుండమునందుండి వసిష్ఠమహర్షి వరుసగా పరమారులను (ప్రమారులు), పరిహారులను (ప్రహారులు), సోలంకులను (చాళుక్యులు), చౌహాణులను (చాహుమాణులు) సృజియించెనను, పరంపరాగతముగావచ్చు నొక యైతిహ్యము కారణముగ * * *(పయి)నాలుగు రాజపుత్ర వంశములవారు మాత్రము తాము అగ్నికుల క్షత్రియులమని విశ్వసింతురు * * * * రాజపుత్రులు వేదకాలపు క్షత్రియుల సంతతివారని చరిత్రకారులలో కొందర యుద్దేశ్యమయినను వారు క్రీస్తుశకమునకు పూర్వము రెండవశతాబ్దినుండి హిందూదేశముపయి దండెత్తివచ్చి యిచ్చట స్థిరపడిపోయిన విదేశీయులగు యవనశకపహ్లవహూణాదుల సంతతివారని చాలమంది సిద్ధాంతీకరించినారు. పైని పేర్కొనిన విదేశీయులు దేశీయులతో సంబంధబాంధవ్యములు నెరపి క్రమముగా హిందూమతావరణమున ప్రవేశించినవెనుక వారిలో గొప్పవారు క్షత్రియులుగ పరిగణింపబడుచు వచ్చిరనుటయును, విదేశీయులనుండియేకాక దేశీయములయిన యాదిమజాతులనుండియు గొన్ని రాజపుత్రవంశములేర్పడియుండుననుటకును అవకాశములు గలవు * * * కొన్ని శకకుషాణజాతులనుండి యేర్పడినవనుటకు కాకపోయినను హూణులయందలి గుజారులనుతెగనుండి యేర్పడినవనుట కాధారములు గలవు. ప్రతీహారులవంటి ప్రసిద్ధరాజపుత్ర వంశములు కొన్ని గుజారులనుండి యేర్పడినవే * * * గోండులు, భారులు అను మధ్య హిందూదేశమునందలి యాదిమజాతులనుండి పరిణామమును జెంది రాజత్వము నందినవే. హిందూమతమును, హిందూసంస్కృతిని పునరుద్ధరింప దీక్షాకంకణము కట్టిన బ్రాహ్మణులీవంశముల యుత్పత్తికథనమున పౌరాణిక వంశసంబంధము నతుకుపరిచి తద్వంశజులకు క్షత్రియత్వము నాపాదించి వారియాశ్రయప్రాపకముల తమ మతమును వ్యాపింపజేసినట్లు కన్పట్టును. అంతటనుండి యీవంశములవారు సూర్యవంశజులుగనో, చంద్రవంశజులుగనో పరిగణింపబడుచువచ్చిరి."-౨

దీనినిబట్టి రాజపుత్రులాదిమజాతులసంతతివారు, సంకరజాతుల సంతతివారు నగుదురనియు, సూర్యచంద్రవంశములవారు కారనియు తేలుచున్నది. వీరు ఏసంతతికిచెందినవారయినను భారతదేశము నేడెనిమిది శతాబ్దులకాలము పైదేశీయులగు మహమ్మదీయుల యాక్రమణముపాలు కాకుండ రక్షించుటకయి ప్రాణములను ధారవోసిన మహాయోధులనుట సత్యము. కావుననే వీరు భారతీయవీరులలో నగ్రగణ్యులని కీర్తినిబడసినారు. ఈకీర్తిమూర్తులవంశము లనేకములు తామరతంపరగ తీగలుసాగినవి.

రాజపుత్రవీరాగ్రేసరులు నెలకొలిపినరాజ్యము లనేకములు. వానియందు పేరుపెంపులను గనినది మేవాడరాజ్యము. అది రాజపుత్రస్థానమున కలంకారము; వీరపురుషులకు, వీరమాతలకు, వీరపత్నులకు నిలయము. ఈరాజ్యమును పరిపాలించిన రాజపుత్రవంశమువృత్తాంత మిది:

"ఈయుగమున వర్ధిల్లిన రాజపుత్రవంశములలో మేవాడను బరిపాలించిన గుహిలోటులను సిసోదియాలొకరు. వీరు సూర్యవంశజులు. ఈవంశమును స్థాపించినవాడు బాప్పారావల్. మేవాడపయి అరబ్బులు దండెత్తివచ్చినప్పు డితడు భిల్లులసాహాయ్యమున వారినోడించి తరుమగొట్టెను. ఇతనికుమారుడు గుహిలుడు రాజపుత్రస్థానమునందలి చిత్తూరుదుర్గమును వశపరుచుకొనెను. నాటనుండి ఎనిమిదిశతాబ్దులనగా అక్బరు రాజ్యకాలమువరకు అదియే యీవంశమువారికి రాజధానిగ నుండెను. క్రీస్తుశకము పదునూడవ శతాబ్దినుండిమాత్రమే యీవంశమువారు మహమ్మదీయులతోడి సంగ్రామములందు రాజపుత్రవర్గమునకు నాయకులయి రాజకీయముగ మిక్కిలి ప్రాముఖ్యమును బడసిరి."౩

---

౧, ౨, ౩. సుప్రసిద్ధచరిత్రకారుడు శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారి 'హిందూదేశచరిత్రము,' ౧౯౩౮ సం. ముద్రణము.

వీరరసార్ద్రములు, ఆశ్చర్యానందములకు తానకములు నగు నీమేవాడురాజపుత్రవీరవరుల కథానకములను సహృదయుడు కర్నల్ జేమ్సుటాడుదొర ఆంగ్లభాషయందు రసోత్తరమగు గ్రంథముగ రచియించి కీర్తిని మించినాడు.

శిశోదియావంశీయులగు రాజపుత్రవీరులలో నప్రతిమప్రతాపుడగు రాణాప్రతాపసింహుడు మేటి. ఇతడు 'నిరుపమానదేశభక్తుడు. రాజ్యములేక, దుర్గములు లేక, సైన్యములేక, ద్రవ్యములేక, తలదాచుకొనం జోటులేక, తిన తిండిలేక, హారావళీశైలసానువులలోఁ బిడికెడు బీడుగడ్డియు, దోసెడు నీరమును గ్రహించుచు నాత్మస్వాతంత్ర్యముఁ గోలుపోవ నిష్టపడక ప్రపంచోన్నత ప్రబలవిరోధి-డిల్లీశ్వరుడు, ౨౫ లక్షల సాదాతిబలము, ౧౫ లక్ష లాశ్వికదళము, ౧౦ వేలు వారణములు, పదివేలు ఫిరంగులు గల దొడ్డసార్వభౌముడగు అక్బరుపాదుషాహితోఁ బ్రతిఘటించి యిరువదియైదువత్సరము లవిచ్ఛిన్నముగ యుద్ధము సాగించి గెలుపొంది యాభిజాత్యము, నాత్మదేశగౌరవమును నిలువబెట్టిన విశ్వవీరచూడామణి.' ఈవీరచూడామణి భారతీయులకు నిత్యోపాస్యుడు. ఈతని యుదాత్త చరిత్రము నిరంతర పారాయణయోగ్యము.

పురుషసింహమగు నీ రాణాప్రతాపసింహుని ప్రశస్తచరిత్రము నేఁడాంధ్రమున పద్యకావ్యముగ వెలసినది.[౧] దీనిని దుర్భాక రాజశేఖరకవిసింహము వెలయించెను. ఇయ్యది యించుమించుగ పందొమ్మిదివందల పద్యములుగల అయిదాశ్వాసముల పద్యకావ్యము. వస్తుగౌరవమునను, గ్రంథవిస్తృతిని ఈకాలమున వెలువడుచున్న కావ్యములలో దీనికి మహత్త్వము సమధికమయి యొప్పినది. ఇందు కేవలము ప్రతాపుని చరిత్రమేకాక మేవాడును పాలించిన తత్పూర్వుల చరిత్రమును సంగ్రహముగ గ్రంథారంభభాగమున వర్ణింపబడినది.

ఈ గ్రంథమురచనమునకు ప్రధానాధారము టాడుదొర ఆంగ్లగ్రంథము. 'ఇందలి పాత్రములన్నియు దేశేతిహాసరంగముల నర్తించినవియే.' 'వీరిరువురఁ (ప్రతాపుడు, అక్బరు) గూర్చియుఁ బ్రత్యేక చరిత్రముల నెన్నిటినో పఠించితిని. పూర్వ చరిత్రగ్రంథములలోని యంశములు గ్రహించి వ్రాయుటతప్ప క్రొత్త కథలను జేర్పలేదు.' 'ప్రతాపుని హృదయమిత్రుడయి మెలగిన భిల్లలోకసార్వభౌముని పేరు 'భీమచాం'దని మాత్రము వాడితిని. ఇదితప్ప కథాంశమున నామారు పొక్కడును లేదు' అను గ్రంథకర్తవాక్యము లీకావ్యము యొక్క చరిత్ర ప్రామాణ్యమును చాటుచున్నవి.[౨]

గ్రంథకర్త కవి, శతావధాని. కావ్యనాటకములను పెక్కిటిని రచియించి యీకవి 'కవిసింహ' మయినాడు. అష్టావధానశతావధానముల ననేకముల విజయమును వరించి యీయవధాని 'అవధానిపంచానన' మయినాడు. ఈయన వీరసత్త్వసంపన్నుడు. ఈయన కృతులు వీరరసప్రతికృతులు. వీరవరులగాథ లీవీరసత్త్వుని హృదయమునకు సాక్షాత్కారము నొసగి వీరరసప్రవాహినులగు పృథులకావ్యములయి వెలసినవి. ఇట్లు అగ్గలించిన అలవాటునను, పెంపుగనిన పేరుపునను చేయివడిపెరిగిన యీయన నేడు రచియించిన యీ రాణాప్రతాపసింహచరిత్ర మీయనరచనములకు మేలుబంతి. దీనిని వెలయించి యిప్పుడీయన 'కావ్యకళానిధి'యు నయినాడు.

ఈయఖండకావ్యమున కవితాసామగ్రి గ్రంథకర్తసామర్థ్యమున కుద్దిగా నున్నది. ఆయన 'అవధాని

---

౧. రాజస్థాన కథావళిని శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు తెలుగున వచనరూపమున నిదివరకే రచియించియున్నారు.

౨. చరిత్రప్రామాణ్యము మరింతగట్టిగ నుండవలయునని కాబోలు గ్రంథకర్త 'అవసరమయిన తావులనెల్ల నాంగ్లగ్రంథములనుండి యాధారముల నధోభాగసూచితముల' గావించినారు. ఇందువలన గ్రంథము పెరుగుటతప్ప నితర ప్రయోజనము కానరాదు. కావ్యపఠనావసరమున చరిత్రప్రామాణ్యమును చర్చించుట రసహృదయులపనికాదు.

పంచానన'ముకదా, తత్కావ్యమున కవితాసామగ్రి యేల కడమవడును?

అవధానుల వాఙ్మయభండార మపారమయినది. కవితాసామగ్రి దాన నిత్యపుష్కలము. నిరంతర సాహిత్యప్రపంచపరిశీలనమున సేకరించి దానిని వారు స్వోపయోగముకొరకు దాచియుంచుకొందురు. వాఙ్మయప్రపంచమునగల సరసములను పదములు, చదునయిన సమాసములు, కుదురయినవాక్యములు, తీయనిజాతీయములు, జానుదెనుగునుడికారములు, మనోహరములను వర్ణనములు, ప్రశస్తములగు లోకోక్తులు సూక్తులు, అద్భుతములగు కల్పనములు, హృద్యములగు నలంకారములు మొదలగునవి యాకవితాసామగ్రి. ఈగ్రంథమున నట్టిసామగ్రికి కొరంతలేదు. అలంకారములు- ఉపమాలంకారము లందును-అసంఖ్యము లిందు గలవు. వానిలో పెక్కిటి కపూర్వతయు నబ్బినది. గ్రంథమున నవిరళముగనున్న నవ్యకల్పనములు గ్రంథకర్త కల్పనాకౌశలమునకు జక్కని తెలివిడి.

గ్రంథమున వర్ణితమయినవి భయంకరమహాసంగ్రామ ఘట్టములు. ప్రచండవీరు లుభయపక్షముల యోధులు. తదీయమగు నుత్సాహమును, ఉద్రేకమును, శౌర్యమును, ధైర్యమును, సాహసమును, రాజభక్తిని, కార్యదీక్షను ప్రకటించు పదసంచయము యుద్ధానురూపమయి వీరరసప్రాచుర్యమును ప్రకటించుచున్నది. ఆశ్చర్యమును, భీతిని, ఏవను, దైన్యమును, దయను, సానుభూతిని జనియింపజేయుపట్టు లిం దనేకములు గలవు. రాజపుత్రవీరుల దేశభక్తి సాటిలేనిది. భిల్లవీరులస్వామిభక్తి అనన్యాదృశము. మాతృదేశోద్ధరణమునకయి రాజపుత్రులుపడినపాట్లెల్లహృదయవిదారకములు. కవితాధార ఉత్ఫుల్లముగపొంగిన వర్షాకాలమునందలి మహానదీప్రవాహమువలె నిరాఘాటముగ పరువులు వారుచుండును. అందందు దాన పూర్వకవుల ధోరణియు పొడకట్టుచుండును.

ఈగ్రంథమునితివృత్తము కల్పితము కాదు; వాస్తవికమగు చరిత్రము. 'పూర్వచరిత్ర గ్రంథములలోని యంశములను గ్రహించి వ్రాయుటతప్ప క్రొత్త కథలు చేర్పబడనిది.' 'కల్పనలుగాని, యతిశయోక్తులు గాని విధిగ మానివేయబడినది.' 'కథాంశమున మారు పొక్కడును లేనిది.' ఇట్టి కేవలచరిత్రమును పద్యముల నిబంధించినాడు కవి. 'ఇందలి పాత్రములన్నియు దేశేతిహాసరంగముల నర్తించినవి' కావున వాని యౌచిత్యమును విచారింపవలసిన యావశ్యకము లేదు. అయినను సహజసుశీలవంతము లగుటచే వాని కౌచిత్యము తనంతనలవడినది.

ఈ గ్రంథము నాది నపూర్వమగు పద్యమయ 'పూర్వపీఠిక' గలదు. దానిపరిమితి డెబ్బదియేడు నానాజాతుల పద్యములు. అందు ముప్పది పద్యములమేర 'ప్రకృత సారస్వతస్థితిని'—ఈనాటి కావ్యములు, కవులు, వారి బిరుదములు, వ్యావహారికభాష, అప్రసక్తముగ నవలలు, నాటకములు, నటనులు, వారిబిరుదములు ఇత్యాదులు లెస్స నెక్కిరింపబడినవి. వెనుకటి కుకవినింద యొకటిరెండు పద్యములతో చెల్లెడిది. ఇం దదితదధికప్రాయము, కుత్సితనిందకావున-యిన్ని పద్యముల నాక్రమించినది. అందలి—

"ఒకవంకాయకు నూఱుమందికవులై
 యున్నార లవ్వారి పే
ళ్లకు సాహిత్యసరస్వతుల్ వరకవుల్
 వాచస్పతుల్ పైవఁ గొం
కక సర్వజ్ఞశిరోవిభూషలనుతోఁ
 కల్ కొన్ని వ్రేలాడు; మి
న్నక యాతోఁకలు చూచి వారలును నా
 నందింత్రు నిశ్శంకతన్. ౨౬

పిడికెడుపిట్టకుఁ జెడఁబా
రెడుతోఁక యనునుడి ననుసరించునుజూఁడి యి
య్యెడఁ గైతగాండ్రు పేరుల
కడపటఁ దగిలించుకొనిన ఘనబిరుదంబుల్." ౨౮

అను పద్యములు-విశేషించి రెండవపద్యము-ఇతర 'కైతగాండ్ర' తోపాటు గ్రంథకర్తను సయితము వెక్కిరించునది కాకతప్ప దెట్లును. వీరును తగిలించుకొని యున్నారు 'పేరుకడపట ఘనబిరుదములను.' అంతే

కాదు, వానిని తమ సంతకమునకే తగిలించుకొనిరిచూడ లోకానాదవిరుద్ధముగ.

మరియు,

"నాల్గుపుటలుండ నొకఁడు గ్రంథంబువ్రాయ
నా కొకఁడెయుండ నొరుఁడు కావ్యంబుగూర్చు
నింకొకఁడు పత్రములె లేక కృతిని బెంచుఁ
దలఁపఁగానేల? నేటిచిత్తములలీల" ౨౮

అనుపద్యమున గ్రంథబాహుళ్యము కావ్యమున కుపలక్షణ మనుసూచనను తోపించుచున్నది. గుణబాహుళ్యమువలె గ్రంథబాహుళ్యము కావ్యమున కుపలక్షణము కాజాలదు. 'వాక్యం రసాత్మకం కావ్యం' అన్నాడు విశ్వనాథకవిరాజు. నేటిచిన్నకావ్యముల రసవత్తరములు, నపూర్వరమణీయములు ననేకములు లేకపోయిననికావు.

ఇంకను నవలలనుదూషించు
"ఇవమట్లు పుడమినుంచిన
నవలలు సామాన్యులైననవలలవలెఁ బై
ననెలుంగు లోలోటారం
బనబోధము వానియందు నంతయె చూడన్."

అనుపద్యమునను,

ఇట్లే ప్రతాపునిభార్యను భూషించు
"తపనీయఘటితసుందరమందిరము లున్న
బలురకంబుల నుపవనము లున్నఁ
మదనోపమానుడై మన్నించుమగఁడున్న
దాసీజనంబు వందలుగ నున్నఁ
బెన్నిధులనుమీఱు విత్తసంపదయున్నఁ
గరమరుదైన భోగంబు లున్న
వలువలు నగలు రాసులురాసులుగ నున్న
దమమాట వేదమై తనరుచున్న
మాటవినఁ గష్ట మిప్పటిమానవతులు ***"౪-౨౩౬

అనుపద్యమునను దోచు స్త్రీజననింద అనాగరక కార్యము. ఇట్టివాని కిందు జోటీయవలసినది కాదు.

ఇంగ్లీషుప్రభావమువలన నలవడుపోకడ లక్కడ నక్కడ నిందు కలవు. తద్భాషాపరిచయముగలవారి కది తప్పనిపని. మరియు నీనాటిపోకడ లాంధ్రభాషాసాహిత్యముల కభ్యుదయ ప్రదాయకము లని జనవాక్యము. ఛందస్సుకొరకు, యతిప్రాసలకొరకు పొల్లుపదములు, లచ్ఛిద్రార్థకములు, సముచ్చయార్థకములు మున్నగునవి యెడనెడ దొరలినవి. గ్రంథబాహుళ్యమున నది యనివార్యము; ఇట్టిది ప్రాచీనకావ్యములయందే యనివార్య మయ్యెను! తావన్మాత్రమున కావ్యమునకు పిదప దనము గలుగదు. గ్రంథబాహుళ్యములేని యీనాటి యుత్తమఖండకావ్యములయందు చాల కొన్నిమాత్రము ఈదోషమున కధికముగ పాలుకాకున్నవి.

ఎందయినను తరచినకొలది గుణములు, దోషములు వేలకువేలుగా బయలుపడుచుండవచ్చును. తరచుటకు తీరికయు, నోరుపును విశేషముగ నుండవలెనుగాని.

అనుగాక! ఈస్వతంత్ర వీరశిఖామణి చరిత్రమున కవి స్వతంత్రశక్తి నన్నింటను కనుపరిచినాడు. అది యిందలివిశేషము. దానికి సంతసింపవలెను.

ఇట్టి గ్రంథములు- కేవల చరిత్రాత్మకములు, వీరరసప్రధానములు నయినవి- ఆంధ్రవాఙ్మయమునకు క్రొత్తలు. వెనుకటి కవుల కట్టివానిపయి రుచి పుట్టినది కాదు ఏయిద్దరు ముగ్గురకోతప్ప. నేటివారిలో కొందర కట్టిరచనములు గిట్టినను అఖండత అనువుగాని దయిపోయినది. అఖండములుగ నట్టిగ్రంథముల పెక్కింటిని రచియించి యాంధ్రమున కర్పించినఖ్యాతి డిప్పటికీ రాజశేఖరకవియే కనుపించునది. ఈయనరచనముల వలన నాంధ్రసాహిత్యము బలుపుగనినది. దీనికయి యీ 'కావ్యకళానిధి' నెంత కొనియాడినను దీరదు.

"పదియేండ్లయ్యును నిన్నుఁగూర్చి పఠియిం
పఁ జాగి యిన్నేండ్లు నా
మదిలోనన్ భవదీయవిక్రమకళా
మాధుర్య సౌభాగ్యముల్
కుదురై నెక్కొని వేరుపాదుకొనియెన్
గొండంతలా కోరికల్
పొదలెన్ నిన్ను నుతింప నీచరితం
బున్ వ్రాసి హర్షించితిన్."

అని గ్రంథకర్త యీ గ్రంథమును రచియింపగలిగినందుకు తనహర్షమును ప్రకటించుకొనుటెంతయు నుచితము. అగును; మిక్కిలి హర్షింపవలసి విషయము.

పవపడి-

"కరముఖ భక్తిని నారచించినమహా
గ్రంథంబునం దెందు నీ
చరితం బాంధ్రులు నిత్యముఞ్ జదివి నీ
స్వాతంత్ర్యముఞ్ ద్యాగవి
స్ఫురణంబుఞ్ సముదారవిక్రమకళా
పూర్ణత్వముఞ్ నేర్వఁగ
ల్గిరయేనిఞ్ ననుబోలుధన్యు లిలలో
లేరంచు హర్షించెదఞ్."

అని కవి ఆశించెను. ఆయనకోరికి సఫలమగునేని, ఆయనయేకాదు, ఆంధ్రులెల్లరును ధన్యులు కాకపోరు. అపుడు కవిహర్షమును వేయిమడుంగులు కాగలదు. సెబాసు, సెబాసు! ఇక

"ఆప్రతాపమహీంద్రునటు రాజులు స్వధర్మ
నిరతులై దేశమూనెదరుగాక!
శ్రీసలుంబ్రాకృష్ణసింహుఁబోల్ స్వామి భ
క్తిపరులు యశమునొందెదరుగాక!
పాటేశ్వరినిబోలి భారతాంగనలు సా
ధ్వులటన్న పేరు చెందుదురుగాక!
యమరసింహునిమాడ్కి నాంధ్రయువకులెల్ల
గురువిక్రమమున వెల్గుదురుగాక!
కమలవనమట్టి భారతఖండమెల్ల
వీరరసఖండమయి ధాత్రి వెలయుగాక!
యాంధ్రులనుపేరు ఖండఖండాంతరముల
దక్షులెల్లరు శిరములఁ దాల్తురిగాక!"

యని కవితోపా టాంధ్రులెల్లరు మంగళగానము చేయదగుదురు.

ఈగ్రంథమున గుణవంతమయిన మేలికవిత యిట్లుండును:

పల్లవవ్యాప్తి పుష్పవద్వైభవంబు
ఫలనవోదయభూతి కొమ్మలకుఁ గూర్చి
మాధవగృహీతయగు మఘు మాసలక్ష్మి
యఖిలజగము పూఁదోటయ ట్లలరఁజేసె.

ఆ. ౨-౧౩

తళుకున్నిద్దఁపు జాళువా కలికిపూఁ
తల్ సుల్కుచుఞ్ వేయి న
ల్గులు నల్దిక్కులఁ బిక్కటిల్ల బలుని
గ్గుల్ దేలు బంగారు గ
జ్జెలు వాతాహతి మ్రోఁతలెత్తఁగఁ జలిం
చెఞ్ వైరిసైన్యంబు గుం
డెలు ప్రీలంగ రవిధ్వజోత్తమము హా
ల్దీఘాటు సీమోపరిఞ్.

ఆ. ౩-౨౭

ఎత్తునుండి వచ్చు కడు
నెత్తను నశ్వము దానిపైన లో
కోత్తర శౌర్య సాహస స
మున్నతమూర్తి ప్రతాపదేవుఁడా
యుత్తమునెంట నొత్తుకొని
యుగ్రబలాఢ్యులు సూర్యవంశ్యరా
హుత్తులు మొత్తమై గదలి
రుర్విసమస్తము కంప మెత్తఁగఞ్.

ఆ. ౩-౧౧౪

మండెడు వహ్నికుండముల
మాడ్కి విలోకన విస్ఫులింగముల్
నిండ, హయవ్రజంబుఁ గద
లించుచు భూరిఖురాగ్రఘట్టనా
ఖండధరాపరాగముల
క్రందున గాఢతమంబుఁ గూర్చి యు
ద్దండత రాజపుత్రభట
తండము దాఁకె నరాతికాండముఞ్.

ఆ. ౪-౫౦

పదియాఱుకళల విశ్వమునిండి వెలుఁగు
కళానిధి సహజకళంకమూర్తి;
నిలుపెల్ల విచ్చి వన్నెల నీను పెల్లదా
మరకుఁ దుమ్మెదపోటు మాననిపని;

తళతళ మెఱయుఁ నిద్దపుటద్దము పరాగ
ధూసరమగుట పోఁ ద్రోయరాని;
యమలవాఃపూరగౌరాంగ గంగా
నది వానకారు కళంకు వదలకుండు;
నివి ప్రకృతికి లోనైనవి ;యింతవటకు
నాయెఱిఁగినంతదాఁక రాణాప్రతాప
సింహదేవుఁడు ప్రకృతివిజేత ; యిట్టి
ఘనుని మోమున నీవిన్నవన మిదేల ! ఆ. ౮-౧౨౮

నీలకాదంబినీనివహంబుచందాన
సకలదిక్కుల విపక్షసంచయములు
చేరినకొలఁది భవిష్యదాకాశంబు
విపులాంధకారసంవృతముగాఁగ
సైన్య మంతంతకు సమసిపోయెను ; దుర్గ
సంఖ్య క్రమమ్ముగా సన్నగిల్లె ;
నాప్రతాపుని ధైర్య మతని సాహసము దై
వందినవృద్ధి నొందంగసాఁగె ;
నింతలోనన వర్షర్తు వెదిగివచ్చెఁ ;
బర్వతముల రేఁగెడు విషవాయువులకుఁ
గొలఁకులందలి విషజలంబులకు స్రుక్కి,
మొగలుసేనలు ఢిల్లికిఁ బోయె మఱలి. ఆ. ౫-౪

విశ్వంబునెల్లఁ బిప్పిగఁ జేయఁజాలి గుం
పులుగాఁగఁబడు పిడుగులకు నడలి,
జడివట్టి కురిసి మాసముదాఁక విడువక
చెలరేఁగుచుండు వానలకుఁ జిక్కి,
కుక్షిలోనికిఁ గ్రుచ్చుకొనిపోయి శ్రమఁబెంచు
నీదరగాలికిఁ జేవవడియు,
రక్తమంతటిని బేరఁగఁజేసి హృదయంబు
స్తంభన మొనరించు చలికి స్రుక్కి,
చిత్తయెండల వేడికి నత్తమిల్లి
రాజసురసార్వభౌముఁడు రాణివాస
మనుఁగుబిడ్డలు నలజడి కగ్గమగుచుఁ
బాండవులుగూడఁ బడనట్టి బాధపడిరి. ఆ. ౫-౭

కొమ్మలకును బల్లవనివ
హమ్ములవలెఁ జైత్రమాస మంతట నారం
భమ్మైన యవననృపసై
న్యమ్ములు సంపులయి వెలసె హారావళిపై.
ఆ. ౫-౯

పున్నమ సన్నని వెన్నెల
మున్నీటను దేలు దొడ్డ పూమొగ్గటు ల
త్యున్నతసితగోపుర సం
పన్నంబగు నేకలింగపతి దేవళముౘ. ఆ. ౫-౫౬

ఐరావతంబుపై నరుదెంచు నిర్జర
సార్వభౌముని మేలు చక్కఁజేసి,
వృషభవాహన మెక్కి యేతెంచు కైలాస
వాసు విలాసంబు గాసి చేసి,
హంసరాజము నెక్కి యరుదెంచు భారతీ
శ్వరుని రూపవిభూతి భంగపఱచి
శిఖిరాజవాహన శ్రీమీఱ వచ్చెడు
స్కందు నందము నెందు డిందుపఱచి,
మనుజపతివరాళి మన్మథ మన్మథుండు
చైతకాశ్వముపైన సాక్షాత్కరించి
దివ్యదర్శన మిచ్చె ; నా తేజమునకు
నంజలి ఘటించి, యాత్మోపహార మిడుదు.
ఆ. ౫-౨౪౪

* * * *

కల్పనములయు, అలంకారములయు వైచిత్రి యిట్టిది :

నికటారామఫలాళిఁ బాలకుఁడు ఖం
డింపక్ మొదల్ పెట్టు నా
రకమై పాచకసార్వభౌముఁడును గూ
రల్ గోయునట్లొచుఁ బూ
నికమై వీరవిహారముల్ నెఱపి ఖం
డేరావు తౌరుష్కయో
ధకదంబంబుల మస్తముల్ దునిమె దు
ర్దాంత క్రియాభీలుఁడై. ఆ. ౩-౧౮౬

గండశిలా ప్రపంచము న
గంబుననుండియు దొర్లినట్టు లు
ద్దండమహోన్నతాశ్వికవి
తానము నాలుగువేలసంఖ్య పై

నుండియు మీఁదరా నిలువ
　　నోపక యావనసేనలన్నియుఁ
బండినపైరునాఁ దలలు
　　వాల్చుచు మ్రొగ్గె రణాంగణంబునన్.
ఆ. 3-౧౪౪

హనుమద్వానరభర్త శైలముల బా
　　హాశక్తిమై తెచ్చినై
చిన రామాయణయుద్ధమందు నసుర
　　శ్రేణుల్ వలెన్ వ్రాలి యా
వనదంతావళకోటియున్ శిలలు పై
　　వ్రాలన్ ధరన్ వ్రాలి యొ
క్కని మేమంబున మ్రగ్గె నట్టలవలెన్
　　గాత్రంబులున్ నుస్గగాన్. ఆ. 3-౧౫౪

మొగలాయిసేనాసముద్రాంతరమునుండి
　　పొడతెంచు బడబాగ్ని మూర్తులనఁగ
రాణాప్రభంజనరాజి మోగల్ శాఖి
　　నిలువకూడెను తాళఫలములనఁగ
రణదుర్గ వీరకాద్రమునఁ జేతికొలంది
　　నుప్పు నిప్పులకొప్ప కుప్పలనఁగఁ
దురకదండను తోఁటఁ దొడిమయూడుచు దొర్లు
　　పరిపక్వకూష్మాండ ఫలములనఁగ
సమయమాంత్రికమాళి భూతములఁ దనుప
నడుపు రక్తాన్న నిబిడపిండంబులనఁగ
నలపరంగులు పెనుపిరంగులను ఛేల్ప
రాలె దెసలఁ దస్తాయసగోళతతులు. ఆ. 3-౧౬౭

ఖగరాజు కినిసి పన్నగరాజుశీర్షముల్
　　చిద్రుపలై వ్రాలంగఁ జెండినట్లు
వానకారునఁ గృషీవలుఁడు గుద్దలిపట్టి
　　పుట్టలన్నియుఁ దెగఁ గొట్టినట్లు
కడురోషమున లోహకారుండుమండెడు
　　మూషలన్నియు నుల్ల నేసినట్లు
గ్రీష్మవాతము బిట్టు రేఁగి యారామజ
　　పాపుష్పముల రాల్చి నైచినట్లు

దండధర గదాదండ ప్రచండ దీర్ఘ
దండమున శతఘ్నీసముదాయ పృథుల
వక్త్రములు వ్రక్కవ్రక్కలై పడఁగ మోదెఁ
దేజసింహుండు తీవ్రసందీప్తుఁడగుచు. ఆ. 3-౧౯౦

యావన సైన్య దుగ్ధాబ్ధిఁ ద్రచ్చినఁబుట్టు
　　కాలకూటానలజ్వాల లనఁగఁ
దురకదండను చిల్వదొర ఫణంబులఁ దోఁచు
　　మాణిక్యపటలసంపద లనంగ
సమరానిలమున మ్లేచ్ఛసరోవరమునుండి
　　రాలెడు శతపత్రరాజి యనఁగ
బహుళ శతఘ్నీప్రవాళవల్లుల జాలు
　　సుమమైన పగడాల గుత్తులనఁగఁ
బరగి తాళ బింబ కపిత్థ ఫలసమాన
నీల భయద తప్తాయస గోళతతులు
బహుబృహన్నాళికాస్త్రముల్ పఱఁగఁజేసి
బుడుతకీచులు నడిపె రబ్బురము దోఁప. ఆ. 3-౨౨౭

సారవంతము కైల వారామహామహీ
　　ధరపార్శ్వముల, సమధరణిఁగట్టు
వడి దినమంతయుఁ బిడికెడు గడ్డియుఁ
　　గుక్కెఁడు నీరంబుఁ గ్రోలికొనుచుఁ
బరిశుభ్రతరమైన స్వచ్ఛందవాయువుఁ
　　బీల్చుచుఁ గడుసాధువృత్తియలర,
నక్బరుతో రణం బారంభమైన యా
　　పదియునుదొమ్మిది వత్సరములు
నందనోద్యానభాగంబునన్ మెలంగు
కామధేనుసంతానముకరణి నెపుడు
పిల్లలును మేము బయల జీవింపవలసె
మానవుల కర్హమగు తిండి మఱచిపోయి. ఆ. ౫-౭౭

కాళ్ళనిండ గుడ్డ, కడుపునిండుగఁ దిండి,
కంటినిండ నిద్ర, గాన కెపుడు
బిచ్చగాండ్రకన్నఁ బీదలమై యుంటి;
మింక నెంత కాల మిట్లు కడచు! ఆ. ౫-౭౯

* * * *

ఈగ్రంథమునగల లోకోక్తులయం దివికొన్ని:

"తల్లిఁజంపువానికిఁ బినతల్లి చేతులు గణింపఁ జివుళ్లు" ౧-౨౯౬.

"చెంతఁ జింతామణిని వీడి చిల్లిగవ్వ కెనుభుజము చూఁప నెవ్వాని మొగము వాఁచె" ౨-౧౪౮.

"ఎలుకలదాడి కోడి తనయింటికి నిప్పిడుహాళీ లుండురే" ౨-౨౨౦.

"పమ్మరి కేడును గుదె కొక్కెనాడు" ౩-౨౮౯.

"పచ్చనియింటఁ జిచ్చునిడుపాపులు" ౪-౪౩.

"పులి నాకివిడిచినకండ" ౪-౯౮.

"తఱచినకొలది మంచిగందంపుఁ జెక్క" ౪-౧౩౯.

"తలుపులఁ గ్రమింపవాని కప్పళ్ళము లెంత" ౫-౨౬౮.

"ఊఁక తోఁక దొడిగి యాఁగ బెబ్బులియైన" ౫-౨౯౬.

---

## ప్రబంధములలోని విరహము



# భిల్లకామిని

కవికొండల వేంకటరావు

నల్లకొండ, నారయడమెసూకొం,॥ద్యి.,టపులిమెట్ట దాటి కొంచెం పడమటెంపుగా తిరిగిపోతే అక్కడ గోదావరియొగుజాడ రమ్యంగావుంటుంది. వేటకుఅనుకూలంగా వుంటుంది. పచ్చవెదుళ్లూ, పూలటేకులూ, మనంచూడని వింకా ఎన్నోవృక్షజాతులూ, పక్షిజాతులూ, మెకాలూ, ఎంతోసుఖంగా వున్నట్టగపిస్తాయి "నరమానవుడి" సంపర్కం లేకుండా. గాండులు, బడగాలు, కోయలు, కొండవాళ్లు-వీళ్లునరుల్లోవాళ్లైనా వాళ్లవనసంచారం ఏలా వుంటుందీ అంటే, సూర్యాస్తమయానికి ముందు కనవచ్చే నల్లని దూరపుజూపుల్లో మెదిలే ఏడారి దిబ్బండలమీ్మది ఒంటెలసముదాయంలాగు, మనవాళ్లు కానట్టుగా అగపిస్తూవుంటారు. వాళ్ల శరీరాలూ నలుపులుకూడాను. మళ్లీన్ని బొద్దిపొట్టలూ, ఊచ చేతులూవేసికొని మిక్కిలి ఒంటెకూపు అలవడ్డట్టుగానే వుంటారు. వాడు అందగాడూ, ఇది అందకత్తెఅని వేలుపెట్టి చూపించడ మెచ్చిందాఅంటే వాళ్లలోవాళ్లు మెచ్చుకొంటూ చూపించుకోవలసిందే. ఆమర్మం వాళ్లకే తెలిసివుండాలి.

అయినా మనం అందం అందం అంటాం! అందం అంటే ఏమిటి? సౌందర్యం అన్నమాట! సౌందర్యపిపాసగలవాడికి లోకమంతా అందగిస్తూనేవుంటుంది.

షికారీ భగవాన్‌దాస్ బొందిలీపురుషుడు. పచ్చని వర్ణం, పుష్టి కమ్మరం, మీసకట్టు ముమ్మరం. చొక్కాతొడిగితే ఎప్పటికప్పడే బొత్తాములుండని ఛాతీ. ఆబొత్తాములుండకపోవడమనేది ఛాతీబాహ్యలక్షణమే అని అనుకుంటారేమో! కాదు. అంతర్లక్షణముకూడాను. ఆతని ఛాతీక్రింద, బ్రహ్మదేవుడిచే అమరింపబడ్డ గుండె. ఏనిమిషాని కానిమేషమే చూచిన చూపుచే ఇట్టే ఉద్రిక్తమైపోయి దిగుపాటుగా పరిణామం పొందుతూవుంటుంది. ఇప్పుడు దిగుపాటున పెట్టిన బొత్తాం అప్పుడే త్రెస్సిపోతుంది ఒక్కఉబలాటం పెచ్చుపెరిగిందీ అంటే.

అతని కోభేపైన గుఱ్ఱం వుంది. "వలపుల బరణి"లాంటి శేవైన భార్యా వుంది. గుఱ్ఱాన్నిగురించి వ్రాస్తే భార్యానిగురించి వ్రాయడానికి ఎడ ముండదు. భార్యనిగురించి వ్రాస్తే గుఱ్ఱాన్నిగురించి వ్రాయడానికి తావుండదు. ఎవరికి వాళ్లే ఆయిద్దఱూ అతని చేతులకింద మసలుతూ అతని చెప్పుచేతల్లో వుంటూ సమానగౌరవాన్ని అతని కనుసన్నల పొందుతూవుంటారు. అయితే గుఱ్ఱం ఎప్పుడూ బాహాటంగా పదిమందికంటాబడుతూ "అర్రబ్బిగుఱ్ఱంరా అబ్బ!" అని అనుకొనేలాగు అంతరిక్షంలోకి 'గ్గాలప్'

కొడుతూవుంటుంది. భార్యకైతే ఏలక్షావొక్క రోజుకో వొక్క—శుక్రవారంసాయంత్రం ఆంజనేయస్వామిగుడికి పూజాద్రవ్యాల పళ్లెం పట్టుకెడుతూ మేలిముసుగులోంచి క్రీగంటి చూపులు చూచి, ఘల్లుఘల్లున తప్పుకుంటూ అవునా కాదా అన్నట్టు అలా పక్కసందులోకే అదృశ్యమైపోతుంది.

ఇలాంటి భార్య వీధికిటికీ చిన్నిఊచల్లోంచి చూస్తూ వీడ్కోలిచ్చి, వేగంగా తిరిగి రండి అన్నట్టు తెప్పలాడిస్తూవుంటే భగవాన్దాసు, అలాంటి గుఱ్ఱాన్నెక్కి మన్నెంలోకి పులివేటకు ప్రయాణమైవెళ్లేడు.

మాఘమాసం జీడిమామిడిచెట్లు పూతమీద పిందెమీద వుండి మదంవాసనకొట్టే రోజులు. తంగేడుపువ్వు పసుప్పచ్చగా రొట్టల్లే పూసే రోజులు. ఈతచెట్లు గెలలుగా పూసి దిగే రోజులు, మామిడిచెట్లు రాచవుసిరికాయలంతేసి, పెద్దవుసిరికాయలంతేసి పిందెలు చూపించే రోజులు. మఱ్ఱిచెట్లనూ వెదురుబిడాలనూ ఎండాకు ఒకమూలరాల్తూవుంటే, చిగురాకు ఒకమూల ఇలకెత్తుతూవుండే రోజులు. “వాసాంసి జీర్ణాని యథా విహాయ నవాని గృహ్ణాతి నరోఽపరాణి”అన్నది మనుష్యుల్లో ఎల్లాగో తెలియదుగాని చెట్లల్లో తెలుస్తుంది. పాతాకులు అలా ఊడుస్తూవుంటే కొత్తాకులు ఇలా తెలుస్తూవుంటాయి.

పురుషోత్తపట్నప్రాంతానికిఅతడు చేరుకునేసరికి పొద్దుకూకుతోంది. అతనికి దాహం మిక్కుటంగా అవుతూంది. గుఱ్ఱాన్ని ఒకచెట్టుకుకట్టి, ఒకమఱుప్రదేశంలో రేవుగా కనిపిస్తే ఆరేవులోకి దిగి ఆలావొంగుని గోదావరిలో మంచినీళ్లు పుడిసెడుతో తాగుతూవున్నాడు. ఎదూరుగుండా ఎఱ్ఱనిసూర్యుని తేజస్సు దించుకు పోతూవుంది సముద్రంలోకి—సముద్రం కనబడకపోయినా సముద్రమనే వూహ అతని హృదయంలో తాండవమాడుతూ వుంది.

గభీమని వెనకనుంచి ఒక చిఱుతపులి ఎక్కణ్ణుంచి వచ్చిందో?—అతనిమీద కుఱికింది. ఢెఢీల్ మని— లోపలి నిసర్గప్రవృత్తిని పుచ్చుకొని,ఒక్క చెంపపెట్టు దాని కోరలూడేటట్టు దానికిపెట్టి భగవాన్దాసు“బాబోయి!” అని కేకేశాడు. వనమంతా దద్దరిల్లిపోయింది. చిఱుతపులి తోకముణిచి పంచబంగాళమైంది.

భగవాన్దాసు వీపుమీదికి చెయ్యిపోయినంతమట్టుకు తనచేయి పోనిచ్చుకు చూసుకుంటే అంగుళంలోతుగా రెండంగుళాలకైవారానికి ఇంతకండ-కుడిరెక్కగూడు ప్రాంతాంది-చిందుగు నోట కఱుచుకుపోయినట్టు తగిలింది. నెత్తురుకారి, నీళ్లు ఎఱ్ఱపడిపోతూ, సంధ్యారాగానికి లేని ఆర్ద్రభావం తాను చూపిస్తూవుంది.

ఒడలు జలదరించిపోయి, రెండడుగులు వెనక్కి వేసి ఒడ్డెక్కుతూ మూర్ఛపోయినాడు. మఱితరువాత ఓగడియదాకా ఏం జరిగిందో అతనికి తెలీదు.

ఎప్పుడైతే భగవాన్దాసు 'బాబోయి' అని కేకవేశేడో ఆ కేక పక్కనున్న గుజ్జెం హృదయంలో చలింపు గలుగజేసింది. చిందులు తొక్కింది. అంతకుముందే చిందుగు వస్తూన్నప్పుడే పసిపట్టి చిందులు తొక్కింది. కాని మొదటిసారిచిందులుకూ, రెండోసారి ఇప్పటిచిందులుకూ చాలా తేడా వుంది. అయినా మాటలురాని జంతువుకాబట్టిన్నీ, చెట్టుక్కట్టివేయబడి వుండడంబట్టిన్నీ అదేమీ ఉపకారం తనయజమానికి చెయ్యలేక పోయింది. ఆకేకే ఓ భి ల్ల కా మి నికి విని పించింది. దాని హృదయంలో సంచలనం గొలిపింది. ఆమె అప్పటికి ఏంచేస్తూందీ అంటే దిగువాయిరేవులో అనతిదూరంలోనే సాయంకాలంస్నానంచేస్తూవుంది. నల్లని రయికె, ఆకుపచ్చరంగు చిటెపమిటె, గట్టుకు విసిరేసి గుండారు కట్టుబొంత, విలాసపురంగుల్ది, పైకి వక్షస్థలంచాయకు దాపుకొని ఆలాగే రేవులో స్నానం జేస్తూవుంది – మొలకగూడుతో కూడా తడియబాఱుతూవుందా అన్నట్టు. ఆమెచాయకు నెత్తురుజాడలు ప్రవాహాన్నే కొట్టుకువెళ్లి అంతకుముందు విన్న కేక వినుకలికితోడు మరీ సంబోధించినట్టు అవడంతోటే స్నానంచేస్తూన్న భిల్లకామిని స్నానం చేస్తూవున్నట్టుగా ఎగుచాయకువచ్చి మూర్ఛగొనియున్న భగవాన్దాసుని చూచి, నెత్తురు వఱదలుగాకుండా ఒత్తిపట్టి, తన బాసతో తనవాళ్లను కూకేసింది.

ఒకవెయ్యిమంది వచ్చినట్టుగా వందమంది అడవిజాతివాండ్రు మగవాండ్రు ఆడవాండ్రు అందఱూ వచ్చేరు. వచ్చి గుఱ్ఱాన్నీ, భగవాన్దాసునీ, భగవాన్దాసు అవస్థనూ, చూచి ఎలాగన్నా భగవాన్దాసుని బ్రతికించాలని అతణ్ణి మోసుకొని తిన్నగా తమ గుడిసెలప్రాంతానికి సాయమట్టుకు వెళ్లినారు. గుఱ్ఱాన్నికూడా తర్లించుకు తీసికొని వెళ్లినారు.

వాళ్లగుడిసెలూ అంటే అవన్నీ నేల గుడిసెలు. తూర్పువైపే గుమ్మం దిడ్డిగంతలా తలుపూ తడికా లేని దొడ్డి టుంటుంది. తక్కినదంతా ఆకుకప్పు. ఆ దిడ్డిగంతే లేక పోతే ఒక్కొక్కగుడిసెలో ఒక్కొక్కచిన్న రథ ముంది అనుకోవాలి.

గబగబ భిల్లకామిని పక్కగుడిసెవాళ్ల దగ్గఱ కెళ్లి ఒక చిన్నరోలు చంకనెట్టుకు తీసికొనివచ్చి అందులో ఏవేవో మూలికలు కొట్టి చూర్ణంచేసి పెద్దలసాయంతో భగవాన్దాసుగాయానికి కట్టుకట్టింది. భగవాన్దాసుని పండబెట్టిన గుడిసెలో చిన్న ఆముదపుదీపం పెట్టింది. భగవానుదాసు కునుకుపోకుండా భజన నేయండర్రా అని పదిమందినీ పోగుచేసి మూడురాత్రుళ్లూ, మూడుపవళ్లూ ఆగుడిసెలో చేయించింది.

—కునుకుపోతేనంట, ఆకునుకులో కల వస్తేనంట, ఆకల్లోకి పులివస్తేనంట, అది కీడంట, పులినోటనుండి వెలువడ్డవానికి

మూడు రోజులుదాకా; మూడు రోజులూ నిదరపోకుండావుండాలి.

భగవాన్‌దాసు ఆవిధంగా మూడు రోజులు నిద్రపోలేదు. తదేకదృష్టితో తిల కిస్తూ పడుకున్నాడు భిల్లుల్ని చూస్తూ వింటూ. అతనికి జ్వరంకూడా తగిలింది. రెండోరోజున జ్వరం తీవ్రంగాకూడా కాసింది. పరాకుమాటలు హెచ్చయినాయి. అయినాగానీ మూడోరోజు గడిచేసరికి చాలా మట్టుకు సర్దుకుపోయింది. కాని శీతాకాలం అవడంచేత పుండుమానడం చాలా ఆలస్యమై అక్కడే రెండుమూడు నెలలు అతగాడు ఆగిపోవలసివచ్చింది.

ఈ రెండుమూడు నెలల్లోనూ భగవాన్‌దాసుకి తన్ను తొల్త కాపాడిన భిల్లకామినితో స్నేహం ఎక్కువైంది. ఆమెతోనే అడవుల్లో తిరుగుతూ అక్కడక్కడ కూర్చుంటూ వాళ్ల భాష కొంచెంకొంచెం నేర్చుకుంటూ త్రచ్చాడుతూ వుండేవాడు. ఆభిల్లకామిని అతగాడి గాయానికి మందునూనె రాచి, కట్లుకట్టి అలాగ్గా తనవెంట తిప్పకొంటూ, ఒక్కొక్కప్పుడు దావాగ్నులు చూపెడతాననీ, ఒక్కొక్కప్పుడు గొప్ప వారినిపాతాలు చూపెడతాననీ చాలా దూరం తీసుకుపోతూవుండేది.

అంతలో వైశాఖమాసం జొరబడి తొలకరివానలూ రెండు మూడు కురిసినయి. ఒకరోజు సాయంత్రం గుడిసెలచెంతనే ఆవలగా నున్న ఓ కొత్తగా పచ్చికపట్టిన ఒక సమప్రదేశమ్మీద ఇద్దరూ కూర్చునియున్నారు. గందమమావాస్యకు కొంచెంముందు అది తాచుపాములుకి కళ్లు పొరలుకమ్మి తఱుచు నిదరవచ్చే తరుణ మది. ఓ రెండుపాములు కస్సుబుస్సు మంటూ, ఒండొంట చుట్టబెట్టుకుని అట్టే పైకి లేచి దభీమని ఆగడ్డిమీద పడుతూవుంటే చూసో చూడకో గోరింకలు వాటిని ఆపాముల్ని సాయంకాలసంధ్యారాగంలో తన్నుతూవున్నాయి.

వెంటనే భగవాన్‌దాసు "ఓబట్టక్కడ పరువు. దానిమీద ఆకోడెత్రాచులు పడుకుంటే ఆబట్ట తిరిగీ నీవు ధరిస్తే అదృష్టవంతురాలివి" అన్నాడు భిల్లకామినితో.

భిల్లకామిని తనపైనున్న ఆకుపచ్చ రంగు పమిటె తీసి అక్కడ పఱచి భగవాన్‌దాసుకేసి చూచి సిగ్గుపడి భగవాన్‌దాసు సర్వసాధారణంగా శయనించే గుడిసెలోకి వెళ్లిపోయింది. భగవాన్‌దాసు భిల్లకామిన్నీ పరకాయించి తేరిచూచేడు. రంగురంగుల బొంత కట్టుకుంది. ఒక్క నల్లరయికమాత్రం తొడుక్కుంది.

వెనకాలే తానుకూడా కుటీరంలోకి వెళ్లేడు. భిల్లకామిని అడిగింది "పాములు పండుకున్నాయా నాపమిటెమీద ?" అని. "నేను చూడలేదు" అన్నాడు భగవాన్దాసు. భిల్లకామిని ఒక నాగకన్నెలాగు మెలికలు

తిరిగిపోతూ గుడిసెలోనుండే "అవిగో!" అని చూపించింది.

భగవాన్దాసు "అధమపక్షం ఒక 'డోర్ కర్టన్' అయినా వుండాలి మనగుడిసెకు" అన్నాడు. అని భిల్లకామినియొక్క రంగుల బొంత ఊడదీసి అడ్డంగా దిడ్డిగంతగుమ్మానికి కట్టబోతున్నాడు.

భిల్లకామినికి అమాంతంగా కోపంవచ్చి మహాంకాళి అయిపోయి ఆదిసమొలపాళం గానే మూలనున్న రోకలి తీసి దానితో భగవాన్దాసునెత్తిమీద ఒక్కపెట్టు పెట్టింది. భగవాన్దాసుతల రెండుచెక్కలయింది. అతని తలనెత్తురు అత డద్దుకడుతూవున్న రంగు బొంతమీద చిమ్మట కొట్టినట్టుగా కమ్ముకుపోయింది. అత డే గుడిసెలో తాను రక్షింపబడ్డాడో, ఆగుడిసెలోనే మృతిసెంది నాడు. అతని గుఱ్ఱం బెదరి ఎక్కడికో పోయింది.

భిల్లులంతా సమావేశమయి భిల్లకామినిని తర్కించి అడిగితే జరిగిన కథను పూసగ్రుచ్చినట్లు చెప్పింది. వాళ్లంతా కూడా "మంచిపని చేశావు" అన్నారు.

భిల్లకామిని తన బొంత తాను తీసికొని గోదావరిగంగలో ఉప్పళించుకొని ఆగుడిసెమీదనే వెనుతట్టు ఆరేసుకొని, అది ఆరుతూవుంటే దాని సొగసు కనుగొంటూ వుంది నిశ్చింతగా.

భగవాన్దాసుని మున్ను బ్రదికించినదీ తానే, ఇప్పుడు చంపిందీ తానే అనే జిజ్ఞాసే లేదు దాని ముఖంలో. ఎందుచేత? ఆమె గుడిసె కనుమొఱగు అక్కఱలేని గుడిసె. ఆమెహృదయం పాఠకులకు వదలివేస్తా, తెలిసికోండీ!

---

## చిన్నికృష్ణుడు

చింతా దీక్షితులు

చిన్నికృష్ణుడు పుట్టాడు
చిటచిట పువ్వులు కురిశాయి

చిన్నికృష్ణుడు నవ్వాడు
తళతళ మెరుపులు మెరిశాయి

చిన్నికృష్ణుడు నడిచాడు
చప్పట్లు కొట్టింది భూదేవి

చిన్నికృష్ణుడు ఆడాడు
ఆటలు అప్పుడు పుట్టాయి

చిన్నికృష్ణుడు పాడాడు
అప్పుడు పాటలు పుట్టాయి.

---

# ఆ కా శ దీ పం

శ్రీరంగం శ్రీనివాసరావు
(కవితాసమితి)

[ ఛందస్సు : యథేచ్ఛము. గణప్రధానము, లయప్రధానము కాకుండా, విరుపులతో, అనుప్రాసలతో, వివిధ స్వరవిన్యాసంతో భావానుగతి నిరూప్యమై ఈరచనకు పద్యత్వసిద్ధి అర్థించబడ్డది. వచనవాక్యాలే కాని గీతమువలె వ్రాయబడుటకూడా ఈసిద్ధిని అందుకొనడానికే. చదువడం రాగయుక్తంగానే అక్కరలేదు. పైకిమాత్రం చదివితే మంచిది విరామ సూత్రాలను పాటిస్తూ...]

గదిలో ఎవరూ లేరు.
గదినిండా నిశ్శబ్దం.
సాయంత్రం ఆరున్నర.
గదిలోపల చినుకులవలె చీకట్లు.
ఖండపరశుగళకపాలగణముల
కనుకొలకులలో ఒకటివలె
చూపులేని చూపులతో తేరి
చూస్తున్నది గది.
గదిలోపల ఏవేవో ఆవిరులు.
దూరాన నింగిమీద
తోచిన ఒకచుక్క
మిణుకుచూపులు మెలమెల్లగా విసరి,
గదిని తలపోతతో
కౌగలించుకొంటున్నది.
ఒక దురదృష్టజీవి
ఉదయం ఆరున్నరకు
ఆగదిలోనే ఆరిపోయాడు.
అతనిదీపం ఆగదిలో
మూల నక్కి మూలుగుతున్నడి.

ప్రమిదలో చమురు త్రాగుతూ
పలుదిక్కులు చూస్తున్నది.
చీకటిబోనులో
సింహములా నిలుచున్నది.
కత్తిగంటుమీద
నెత్తుటిబొట్టులా గున్నది.
ప్రమిదలో నిలిచి
పలుదిక్కులు చూస్తున్నది దీపం.
అకస్మాత్తుగా ఆదీపం
ఆకాశతారను చూసింది.
రాకాసికేకలు వేసింది.
(నీకూ నాకూ చెవులసోకని కేకలు)
ఆకాశతారఆదరపుచూపులుచాపింద్
అలిసిపోయింది పాపం, దీపం.
ఆకాశతార ఆహ్వానగానం చేసింది.
దీపం ఆరిపోయింది.
తారగా మారిపోయింది.

—"మహాప్రస్థానం" నుండి.

# నీలవేణి

రాయసం వెంకటశివుడు

## ౧

సముద్రతీరమందలి యిసుకయెడారి జనులకేమంత వాసయోగ్యముగ నుండును? వేసవిని జాముప్రొద్దెక్కినదిమొదలు సాయంకాలమువఱకును సూర్యుని ప్రచండకిరణములకు కాలికాలిన యిసుకబయలునుండి వేడిమి పైకెగయుచుండును. అచ్చటచ్చట గానవచ్చెడి యుడిగిపోయిన మొలకలుమొదలును ఎండనుండి తలదాచుకొనుటకు జనుల కుపకరింపవు. జిహ్వకు రుచిగ ద్రావుటకు దగినంత మంచినీరు దొరకదు. సూర్యాస్తమయసమయమునకు చల్లగాలి తిరుగుట నిజమె. కాని, నిరతము, ఆపట్టిభూమి నివాసముగ జేసికొనినవారికి, ఏదోసమయమున విహారార్థ మచటి కేతెంచువారలకువలె, అందలి జీవితమంతగ సుఖప్రదముగ నుండదు. స్వానుభవమున వారికి స్పష్టముగ గానబడునవి కాలుచుండెడి యిసుకయెడారియు, చెవులు చిల్లులుపడునట్టుగ నిరతము తీరమును మోదెడి యలల చప్పుడును. సముద్రతరంగములనుండి వీతెంచు శీతలవాయువులు సంసార సౌఖ్యసంపదలవలెనే వారికి క్షణభంగురమనుచుండును.

ఐనను, రాతిలోని కప్పకు రాతిలోనె జీవితము గడచిపోవుచుండును. నీలమ్మకు నీలివాడనివాసము అనుకూలముగనే యున్నది. నావవేసికొని తండ్రియు, నన్నయు సముద్రముమీద బోయి, చేపజెల్లలు పట్టుకొని, సంసారము గడపుకొనుటకు పడు కష్టము లాబాలకేమి తెలియును? నీలమ్మయు, తమ్ముడును ఇంటిపనులు నెరవేర్చు తల్లికిగాని దోనెపనిమీద నుండు అన్నయయ్యలకుగాని, చేయుసాయ మంతగ లేదు. అక్కతమ్ములు, ఒకరినొకరు చెట్టపట్టుకొని, సాయంకాలము సముద్రపుటొడ్డున కేగి, అచట తేనెగవ్వలు, గంగాళువచిప్పలు నేరికొనుచును, తా మిసుకలో దీర్చి కట్టిన బొమ్మరిండ్లను పెద్దకెరటము లూడ్చివేయగా కేకలువేయుచు క్రొత్తయిండ్లు మరలమరల గట్టుచును కాలము గడుపుచుందురు. గోలీల యాట, గాలిపడగ లెగురవేయుట,—ఇవియె వారికిని, ఆపల్లెయందలి యితరపిల్లలకును ముఖ్యకాలక్షేపములు.

## ౨

'ఓడలు బండ్లగును, బండ్లోడలగును.' కాలవైపరీత్యమునను, గాంధీమహాత్ముని కార్యశూరత్వమహిమమునను పల్లెలు పట్టణములుగను, పట్టణములు పల్లెలుగను బరిణమించినవి. ఈమధ్య నొకనాటి సాయంకాలము నీలమ్మ తమ్మునితో బంతమునైచి, తీరమును తాకెడి పెద్దయలలలోనుండి దుముకుచు నొడ్డున చాల దూరము పరుగిడిపోయెను. అపుడు వారికన్నుల కొకవింతదృశ్య మగపడెను. వయసువచ్చిన మనుష్యులు కొందఱు, చిన్నపిల్లలవలె, ఒకరిచేత నున్న వస్తువుల నొకరు పెఱుకుకొన బెనగులాడుచుండిరి. కొందఱు తెల్లని టోపీలు పెట్టుకొని, రంగుజెండాలు చేతబట్టుకొని నిలుచుండిరి. సమాచారము కనుగొనెదమని యాపిల్ల లిరువురును ఆగుంపుదగ్గఱకు బరుగెత్తిపోయిరి. సముద్రపు పట్టిల బండు కాఱుప్పును బిడికెండ్లలో బట్టుకొని యైదాఱుగురు యువకులు నిలుచుండిరి. వారదివఱకు బ్రోగుచేసి గుడ్డలలో మూటగట్టిన యుప్పును వారిని ముట్టడించిన సర్కారుభటులు స్వాధీనపఱుచుకొని, అంతటితో దనివినొందక, టోపీల పిన్నవారల చేతుల నుండిన యుప్పుకణములనుగూడ గైకొన బ్రయత్నించుచుండిరి. చిన్నయుప్పురాలకై పెద్దవారిట్లు పెనగులాడుటయందలి సరసత ఆపిల్లలకు బోధపడలేదు. ఎట్టకేలకు, రక్షకభటులు జెండాలయువకుల చేతుల నుండి యుప్పునంతటిని వశపఱుచుకొనిరికాని, వారిలో నొకడుమాత్రము తన పిడికిలిని వదలకుండెను. రక్షకభటులు వేర్వేరుగను, కలసియును, ఆయువకుని గుప్పిలి సడలింప నెన్నియోయుపాయములు చేసిరికాని, అన్ని

యునిష్ఫలమయ్యెను! అంత జెండాలవారు తమమార్గమున దాము పోయిరి. రక్షకభటులు, అచట ప్రోగుపడి యుండిన యుప్పురాసులను మంటిలో గలిపివైచి, మరి వెడలిపోయిరి.

## ౩

పిల్లలలో ననుకరణశక్తి మెండు. దారిపొడు గునను నీలమ్మయు, తమ్ముడును రక్షకభటులు, లవణ సత్యాగ్రహులును జేసినచొప్పున, ఇసుకతో నింపిన యొకరిసుప్పిలి నొకరు విడిపింప బ్రయత్నించి వినో దించుచుండిరి. వారు పల్లెవాడచేరుటయె తడవుగా, ఇసుకబట్టిన పిడికిలిని సడలించుట ఆప్రాంతముల పిల్ల లకు వేడుకయాట యయ్యెను. రాత్రి కూడుతినుసమయ మున నీలమ్మ తన తల్లిదండ్రులకు దా మానాడు చూచిన సంగతి వర్ణించిచెప్పెను. తోడనె యావార్త పల్లె యంతయు వ్యాపించెను. ఇట్లు పంద్రెండువందలమైళ్ల దూరమున పశ్చిమసముద్రతీరమున గాంధిమహాత్ముడు పన్నిన లవణవ్యాహారహస్యము, తూర్పున తెలుగుదేశ మందలి కుగ్రామమగు నీలివాడకు బ్రాకి ప్రకటిత మయ్యెను.

## ౪

దళాధిపతి ప్రసాదరావుచౌదరి తన యిరువది మంది శాంతిసైనికులను వెంటనిడుకొనివచ్చి, కొన్ని దినములక్రిందటనె నీలివాడకు క్రోసుదూరమున నున్న సైకతస్థలమున దన శిబిర మేర్పఱుచుకొనెను. సముద్ర తీరమున నచ్చటచ్చట లభ్యమైన యుప్పును తన సహ చరులచే నాతడు ప్రోగుచేయించి, సంచులతో దానిని మండలమందలి యితరసత్యాగ్రహదళము లుండెడి తావు లకు బంపుచుండెను. అంత నది దేశములో నమ్మడు వోవుచుండెను. లవణశాఖవారు రక్షకభటుల సాయము గొని, ఈశాంతిదళము ప్రోగుచేసిన యుప్పును అథాత్తుగ నప్పుడప్పుడు పట్టుకొని, అట్టి ప్రదేశములం దుత్పన్న మైన యుప్పురాసులను బాడుచేయుచుండిరి. కాని, వార లనుకొనునంత సులభముగ శాంతిసైనికులు తమ చేతికి జిక్కిన యుప్పు నిచ్చివేయువారు కారు. ప్రసాద ౘవుచేతిది గట్టిపట్టు! చేతనున్న యుప్పును శత్రువశము చేయుటకన్న, తనప్రాణమునైన గోల్పోవ సిద్ధముగ నుండున ట్లాతడు గానబడెను. ప్రభుత్వోద్యోగు లొక చోట నుప్పురాసిని బాడుచేసినచో, వెంటనే పది తావులందలి మేలిరాసు లాతని కనులకు గానవచ్చు చుండును. కావున నిట్టిపగతుని ధారాళముగ జయింప వలనుపడక రక్షకభటులు వీనిని మాయోపాయమున భంగపఱుప బ్రయత్నించుచుండిరి.

ఒకనాడు వేకువనె ప్రసాదరావు పడకవిడిచి తా నెచటికి బోవునదియు శిబిరములోని సహవాసులకు జెప్పక, ఒంటరిగ బయనమయ్యెను. తూర్పురేక లింకను ఆకసము నలంకరింపలేదు. తానొకడె యా యెడారిని బడి పోవుచుంటినని యాయువకుడు తలంచినను, ఇరు వురు పురుషులు వాని జాడలు కనిపెట్టుచు, మెల్ల మెల్లగ వానిని వెంబడించిరి. వీరు రక్షకోద్యోగులు. సమయము చూచి రహస్యముగ వీనికి శాస్తిచేసినచో, వాని యనుచరులు నిరుత్సాహులై యచటినుండి శిబిర మెత్తివేయుదురని వారి యాలోచన.

ఈ కనుచీకటిసమయమున నెడారిని బడి తా నాత్రమున నొంటరిగ బయనముచేయుచుండుట తల పోయగా, ప్రసాదరావుచౌదరి మనసున నాశ్చర్యము పొరలిపొరలి వచ్చెను. నెలదినములక్రిందనేకదా యాతె డింకను కళాశాలలో జదువుసాములు సాగించుకొను చుండెను. ఇంతశీఘ్రముగ పుస్తకము మూలవైచి జెండా చేతబట్టుదునని కలనైన నాత డనుకొనలేదు. పెద్ద సుడిగాలి వీచునపుడు, చిన్నిమొలకలు మొదలుకొని మహావృక్షములవఱకును, చెట్లన్నియు నూగాడజొచ్చును. సబర్మతీ తీరకుటీరనివాసి యను నొక మానవమాత్రుని చేసైగనెకదా, భారత దేశమంతటి నొక్కపెట్టున గలంచి వైచిన యీ మహావాయు వుద్భవమయ్యెను! చిన్న నాటినుండియు నాయువకుని కుత్సాహజనకములైన యాశలు, నాశయములు నిపుడే మైపోయునవి! పుడమి యందలి నదులన్నియు తుదకు సముద్రగత మగునట్లు, ప్రజలందఱి కోరికలును గాంధిమహాత్ముని మహోద్యమ మున గలసిపోయెనే! భరతదేశమందలి ప్రతిభావంతులు,



౫. ఒంటికల్లు గణపతి
(అంతః ప్రాకారమున)



హైశాలేశ్వర దేవాలయము-హాళేబీడు

౬. కుడ్యశిల్పము



కోలారు బంగారుగనులు　　K, S. R.



కోలారు బంగారుగనులు-వడబోతయంత్రములు　　K. S. R.

గాంధిమహాత్ముని మహాశయములె తమ యాశయములని తలపోయుచు, నోరుమెదపక, ఆవీరుని పాదచ్ఛాయల నడుగులు పెట్టుచున్నారే! ఇదియొకదా మహాపురుషుని వ్యక్తిత్వమునకును, సామాన్యమానవప్రకృతికిని గల తారతమ్యము!

౫

ఇట్టి యూహాపరంపరలో నిమగ్నుడై నడచుచుండెడి యాయువకు డంత తనకాలికి నేలలో గొంత భేద మగపడగా, అధాత్తుగ నిలిచి, చేత గొంతయిసుక తీసి, ఒకటిరెండు కణములు నోటవేసికొని రుచిచూచి యుప్పని గ్రహించి, అచట తన జెండా పాతెను. ఉప్పునేల యెంత మేఱ వ్యాపించెనో చూతమని యపుడాతడు వంగి చేతితో భూమి నచ్చటచ్చట తడివి పరిశీలించుచుండెను. ఇంతలో వెనుకనుండి యధాత్తుగ వాని శిరస్సునను, వీపుమీదను లాటీకఱ్ఱ పెట్లు శరవేగముగ గురిసెను. "హరిహరీ! గాంధీకి జై!" అనుమాటలు తడబడుచు నుచ్చరించి ఆయువకుడు స్పృహతప్పి నిలువున బడిపోయెను. తాము దిగ్విజయము చేసినట్టుగ మోదమందియు, దొంగతనము చేసినట్టుగ దొట్రుపడి, పగతు రంత పలాయితు లయిరి.

౬

ఆనాడు సూర్యోదయసమయమున నీలమ్మ సముద్రతీరమున సోదరులతో గలసి యాటలాడుచుండెను. ఈమాఱు అన్నయు వారలతో గూడియుండెను. చెల్లెలి కంటె అన్న రెండుమూడేండ్లు మాత్రమె పెద్ద. వాడిపుడు తండ్రిచేతి కంది యింటిపనులలో నాతనికి దోడుపడుచుండెను. ఐన నపుడపుడుమాత్రము, మొన్న మొన్ననె కడచిపోయిన వాని బాల్యక్రీడాదినములు వాని మనస్సున మెరమెరలాడుటచేత, పనినుండి వాడొకటిరెండురోజులు ఆటవిడుపు గైకొని, తోబుట్టువులతో దిరుగాడుచుండును. ఈనా డాముగ్గురు పిల్లలును, అలలను దప్పించుకొని దుముకులాడుచు, తమలో దాము పంతములువైచుకొని నీటియొడ్డున చాలదూరము ఫరువులెత్తిరి. ఒడ్డున కనతిదూరమున నంత నొక రంగు జెండా కనబడి వారు నిలిచిరి. అపుడు నీలమ్మ, "అన్నయ్యా! నేను, తమ్ముడును మొన్న చూచిన జెండా లిటువంటివె సుమీ. అక్కడ యింకా కొన్ని జెండాలుండును. పోయి చూదాము రండి!" అని పలికి, తా నచటికి దారితీసెను. సోదరివెంటనే యన్నదమ్ములాత్రోవను నడచిపోయిరి.

అక్కడ మఱి యేజెండాలుగాని, మనుష్యుల జాడగాని కానరాకుండుటచేత, తిరిగిపోవుద మని అన్నయు దమ్ముడును చెప్పినను, తనకంటికి నిసుకమీద నల్లగ నేదో దూరమున గనబడుచున్నదని నీలమ్మ పలికి, తా నచటికి బరుగెత్తిపోయి, "అన్నయ్యా, ఇటురండి. ఇక్కడ నెవడో మనుష్యుడు పడిపోయి నాడు!" అని కేకవేసెను. వా రిట్లు చూచినది నాడు వేకువనె రక్షకభటుల క్రూరప్రహారణములబారి పడిన శాంతిదళాధిపుడు ప్రసాదరావె!

౭

నాడు పోలీసుల నెవరినిగాని తన పిడికిలినుండి యుప్పునైకొననీయని మేటిబలవంతుడై నేడు నేలబడి యుండుటకు నీలమ్మ మిగుల వగచెను. శరీరచలనము లేని యాతడు మృతుడయ్యెనని యాబాలిక భావించెను. ఆబలాధికునిమీద నీర్ష్యచేతనె వైరు లాతని కిట్లు చేసిరని యాచిన్నది తలంచెను. తా మింటికి జని పెద్దవారితో నీసంగతి చెప్పుదమని యన్నదమ్ము లనిరి. శవమునొద్ద నిలువరాదని యన్న చెల్లెలిని వారించెను. కాని, యాశాంతిసైనికుని కింకను బ్రాణముండ వచ్చునని నీలమ్మనమ్మకము. కావున నాముగ్గురుపిల్లలును పడిపోయిన యువకుని ప్రయాసమున వెలికిల బరుండబెట్టిరి. అంత, చెల్లెలియాలోచనచొప్పున రోగికి గొంతుక తడుపుట కేచటనైన మంచినీరు తెచ్చుటకై అన్న బయలుదేఱెను. ఊపిరి సరిగా విడుచుట కిపుడనుకూలముగ నుండుటచేత, ఏకోశముననో ప్రాణలేశ మంటిపెట్టుకొనియుండిన యాశాంతిసైనికుడు, అంత మెల్ల మెల్లగ శ్వాసము విడువజొచ్చెను. ఒక తాటియాకుదొప్పతో నిపుడు అన్న తెచ్చిన నీటితో, చెల్లెలు




"...నేడు నేలబడియుండుటకు నీలమ్మ మిగుల వగచెను"

రోగిమొగము గడిగి, ఒకకొన్ని నీటిబిందువులు వాని నోట మెల్లగ బోసెను. అవి గుటకపడినవి! ఇట్లు శీతలోపచారములు చేసి, మృత్యుముఖమునుండి యా యువకుని యసువులు దక్కించితిమని యాపసివారు మిగుల ముదమందిరి. వాని కింకను స్పృహ రాకుండినను, ప్రాణములు నిలిచె ననుట స్పష్టమయ్యెను. ప్రచండభానుని కెదురుగ మండుచుండెడి యిసుక నేలలో వాడు పండుకొనియుండుట ప్రాణోపద్రవకరమని వారెంచి ఎటులైన వానిని దమగ్రామము జేర్చుట కాలోచించిరి. అక్కయును దమ్ముడును రోగిమీది కెండ రాకుండ జూచి వాని కుపచారములు సలుపుచుండునట్లును, ఈలోపుగ అన్న వేగముగ బోయి తమయూరివారి కీవార్తచెప్పి వారిని గొనివచ్చుటకును వారేర్పఱచుకొనిరి. ఒకగంటలోనె నీలివాడగ్రామస్థులు సవారిలో ప్రసాదరావును తమయూరికి గొనివచ్చిరి. నీలమ్మ కుటీరముప్రక్కనుండు గుడిసియె రోగికి విడిది. ఆతని దేహమునందలి దెబ్బలకు, గాయములకు నపుడు మందులు పట్టించిరి. రోగి నోట మెల్లమెల్లగ పలుచని జావ పోయుచు నీలమ్మయు, ఆమెతల్లియు వాని మంచము నొద్ద గనిపెట్టుకొనియుండిరి.

౨

రాత్రికి ప్రసాదరావు కొంత తెప్పిఱిల్లెను. స్పృహవచ్చి యాతఁడిటునటు తేఱిపాఱచూచెను. తానొక గుడిసెలో మంచముమీద బండుకొనియుండుటయు, పల్లెవారు తన కుపచారములు సలుపుచుండుటయు గనిపెట్టి, ఇది పట్టికలయని యాతడు మొదట తలంచెను. తన యొడలిమీది గాయములు తడివిచూచుకొని, రోగి నిట్టూర్పు విడిచెను. బాధచేతను, నీరసముచేతను ప్రసాదరావు మూలుగుచు, హీనస్వరమున దన జెండా యేమయ్యెననియు, తానెచట నుంటిననియు వారలను ప్రశ్నించెను. సత్తువచేరుట కింకకొంత జావ పోసి, అతని జెండా సురక్షితముగ నచటనె యుండెననియు, వాని సమాచారము క్రమముగ నెఱిగింతుమనియు, వాడేమియు నలజడిపడ నక్కఱలేదనియును, తల్లియు, గూతురును వాని నూరార్చిరి. పతాకము

సురక్షితమని వినునపుడు సైనికుని ముఖకమలము సంతసమున వికసనమందెను.

క్రమక్రమముగ ప్రసాదరావునకు దెలివివచ్చెను. పల్లెకన్నియవలన దన ప్రస్తుతసమాచారము విని యాత డాశ్చర్యమందెను. గ్రామస్థులును, ముఖ్యముగ నింటివారును, తనకు జేసిన సహాయసపర్యల కాతడు కృతజ్ఞత కలిగియుండెను. దైవసంఘటనము లెంత విచిత్రము! ఆంపటీకం టెను నీలమ్మ యాతని కిపు డాప్తురాలయ్యెను. అత్యధిక బాధాపీడితుడై, కాలుసేతులు గదుపుకొనుటకైన శక్తిలేని యాయసహాయస్థితిలో, తన కీయబలను రక్షకురాలినిగ జూపినందు కాయోఘుడు దేవుని బొగడెను. నీలమ్మయె వాని కిపుడు తల్లియు, నేడుగడయు!

౯

మఱునాటి యుదయమునకు శాంతిసైనికులు వెదకికొనుచు వచ్చి, నీలివాడలో నీలపుతీరమున బసియుండిన తమ నాయకుని గలసికొనిరి. శత్రువుల దౌర్జన్యమున కాహుతిగావలసిన తమ చెలికాని యసువులు, ఈ యూరివారి సాయమునను, ఈ పల్లెపిల్లల సౌజన్యమునను, నిలిచియుండుటకు వా రెంతయు సంతసించిరి. అనుంగుమిత్రుని దమబుజములపై నుంచుకొని శిబిరమునకు గొనిపోవలెనని వారు మొదట సంకల్పించిరి. కాని, యిట్టిస్థితిలో రోగిని గదుపుట యుక్తముకాదని గ్రామవాసులు వారించిరి. రోగియభిప్రాయము నదియె. ఎట్టియుద్రేకమునకు నవకాశమీయని యానిశ్శబ్దప్రదేశమున నే యుండినచో, కొలది దినములలోనే తమ నాయకుడు స్వస్థుడగునని సైనికులును దలంచిరి. కావున ప్రసాదరావున కాపల్లెవాడ మఱి కొన్నిరోజులవఱకును నివాసస్థల మయ్యెను.

నానాట ప్రసాదరావునకు శరీరము నెమ్మది నొందెను. గాయములు మానజొచ్చెను. జ్వరము నివారణమయ్యెను. నీరస మొకటితప్ప వాని దేహమున నిపు డేలోపము గానిపింపదు. తక్షణమె తన శిబిరము జేరి, తన కార్యము లేల తాను చక్క పెట్టుకొనరాదని యా యువకుడు విసువునొందెను. ప్రపంచరంగమంతయు కార్యమయమై యుండగా, తా నీమాలమాలపల్లెలో హాయిగ పాన్పుమీద బవళించి, తన ప్రజ్ఞాపౌరుషముల నన్నిటిని జోకొట్టి నిద్రపుచ్చుచుంటినని యాశూరుడు తన్ను దాను నిందించుకొనెను. ఆవీరుని మన స్త్రీవ్రత మేదేని కార్యసాధనమునగాని యుపశమింపదని యాలోచించి, నీలమ్మయు దల్లియు వానిని జూచి, "అయ్యా, మీరు తెలిసినవారు. ఇక్క డెవరికిని చదువురాదు. గాంధీమహాత్ముని ప్రభ దేశమంతా మోగిపోతున్నది. ఆసంగతు లేమైనా మావాళ్లకు మెల్లగ చెప్పగలరా?" అని యడిగిరి. తనకొట్టె నేతిని బడెగదా యని యా యువకుడు సంతసించి, అట్లే చేతు ననెను. ఇటు లాపల్లెవాడయందు దేశపరిస్థితులు, లవణసత్యాగ్రహము, స్వరాజ్యసంపాదనము— మొదలగు విషయములనుగుఱించి సత్యాగ్రహుల యభిప్రాయములు వ్యాప్తము లయ్యెను.

ఒకనాడు ప్రసాదరావుతో నీలమ్మతల్లి, "మా పల్లెవాళ్లకు కూటికి లేకున్నను, కల్లుకర్చు తప్పదు! నాయనా!" అని మాటలసందర్భమున ననెను. ఇది నిమిత్తముగా ప్రసాదరావు మద్యపాననిషేధమును గుఱించి యచటి జనులలో కొంత ప్రబోధము గలిగించెను. అచ్చటివారు కల్లు సారాయిలు వర్జించునట్లు కృషి సల్పెను. నీలమ్మయింటినుండి యారంభమైన యీ సంస్కరణము కొలదిదినములలోనే గ్రామమంతయు వ్యాపించెను.

౧౦

ఇపుడు ప్రసాదరావునకు బరిపూర్ణారోగ్యము గలిగెను. ఏకనాయకుడు లేని శిబిరము జీవములేని కళేబరమువలె నుండెనని సైనికులు చెప్పిరి. తాను బోయి వచ్చెదనని యింటివారియొద్దను, గ్రామస్థులయొద్దను ఆయువకుడు సెలవుగైకొనునపుడు, ఉభయపక్షముల వారును విశేషభావోద్రేకపూరితు లైరి. ఆసజ్జనుని హితబోధనము ననుసరించి తమ దినచర్య నడపుకొందుమని గ్రామవాస్తవ్యులు వాగ్దానముచేసిరి. తాము ను శాంతిసైన్యమున జేరుదుమని పలువురు యువకులు

సుద్దజెండాలతో వానివెంట బయలుదేఱిరి. పల్లెవాడలో ప్రసాదరావు ప్రవాసదినములు వ్యర్థముగాకుండెననుట వియె ప్రబలనిదర్శనములు.

ప్రసాదరావు చేపట్టిన యుద్యమ మాప్రాంతములం దిపుడు బాగుగ జరుగుచుండెను. నాయకుడు మరల తమ్ముఁ గలసికొనినప్పటినుండియు సైనికు లత్యుత్సాహమున దమ పనులు నెరవేర్చుచుండిరి. పల్లెపటాలపు పిల్లలాప్రాంతపువారలె కావున, వారు గుట్టలుగుట్టలుగ నుప్పురాసులు దెచ్చి పేర్చుచుండిరి. మద్యపాననిషేధ ప్రచారము పల్లెనుండి పల్లెకు ప్రాకిపోయెను. అంత చుట్టుపట్టుల గ్రామములనుండి ప్రజలు గుంపులుగుంపులుగ వారి శిబిరమును జూడవచ్చుచు, కానుకలు, చందాలును గ్రుమ్మరించిరి. నిరుపేదలు ఉప్పు నేతి తెచ్చి యిచ్చుచుండిరి. ఇట్లు అర్థబలము, అంగబలమును సమృద్ధముగ గల యాశాంతిసైనికులు, తా మింక దుర్జేయులమనియె భావింపదొడంగిరి.

ప్రసాదరావుమాత్ర మట్లెన్నడును దలంచువాడు కాడు. ప్రథమమునుండియు నియమానుసార జీవితమున కభ్యాసపడి, పలుమా ఱాత డాత్మపరీక్ష చేసికొనుచుండువాడు. తన చదువుసాములును, ప్రజ్ఞాప్రతిభలును జూచుకొని విఱ్ఱవీగువాడు కాడు. కలిమియం దణకువయు, లేమియం దోరిమియు నియమములుగ జేకొనినవాడు. పరిస్థితులు తమ కిపు డెంత ప్రోత్సాహకరముగ నుండినను, భవిష్యత్తునం దవి తాఱుమాఱగు నపుడు తా మెట్లు తెప్పిఱిల్లగలమా యని యాత డాలోచించుచుండును. ఆతనికి సత్యమె నిదానము; ధర్మమె కర్తవ్యము. సత్యదీక్షగల గాంధీమహాత్ముని యుద్యమమున బనిచేయువారలలో బలువురు ఆమహనీయుని సన్నియమముల నుల్లంఘించుచుండుట కాతడు వగచుచుండును. నిత్యబ్రహ్మచర్యదీక్షతో నుండవలసిన సత్యాగ్రహులలో ననేకులు సుఖలాలసులగుట యాతనికి దుఃఖావహముగ నుండెను. పగతురనైన ప్రేమింపవలెనుసుమీ యని సతతగురూత్తము డుపదేశించుచుండినను, అచటి శాంతిసైనికులు రెండుమూడుమాఱులు ప్రభుత్వోద్యోగులను బరిహసించి, వారియెడ దౌర్జన్యము చూప సిద్ధముకాలేదా?

చుట్టుపట్టుల పల్లెలవారు శిబిరమునకు వచ్చి, తనకు వేసెడి తెంపులేని ప్రశ్నములకు ప్రసాదరావు ప్రశాంతముగ సమాధానము లిచ్చుచుండుట వృథాప్రయాసమని సైనికులలో పలువురి తలంపు. ప్రేమ, దయ, సత్యసంధతయును సత్యాగ్రహుల ముఖ్యసాధనకలాపమని దళాధిపతి వారల కొత్తిచెప్పుచుండువాడు. ఒకనాడొక పల్లెవాడు మాటామటకు సందేహించుచు, ప్రసాదరావు ప్రోత్సహింపగ నిట్లు పలికెను: "అయ్యా, కల్లుతాగవద్దనికదా మీరు బోధిస్తున్నారు. చిన్ననాటి అభ్యాసాలు వక్కసారిగ కట్టిపెట్టడము సులభమా? 'పాడుకల్లు మానివేయండిరా!' అని నేను మాపల్లె పిల్లలతో నొక్కచెప్పితే, 'చదువుకున్నవాళ్లు, సత్యాగ్రహీలు, కాఫీవుపమాలు కట్టిపెట్టినమరు నాడు, మేము మా కల్లుముంతలు పగలగొట్టుతాము లే!' అన్నారు."

దీనికి ప్రసాదరావు తానేమియు సమాధానమీయక, చుట్టునుండు సోదరసైనికసమితిని జవాబు చెప్పుమనెను. కాఫీ నాగరికతకు చిహ్నమని కొందఱును, కల్లువలె కాఫీ కయిపుచేయదని కొందఱును, మద్యమునవలె దుర్వ్యాసనలు కాఫీనుండి నెడలవని మఱికొందఱును సమాధానము లిచ్చిరి. దళాధిపతి యపుడందుకొని, కల్లుకాఫీలు రెండును దేహమునకు బలమేమియు నీయక తాత్కాలికోద్రేకమును మాత్రము గలిగించెడి విషపదార్థములె యనియును, శరీరమునకు రెండును సమానముగ చెఱుపుచేసెడివె యనియును, తమ టీకాఫీల యలవాటు త్యజింపలేనివారికి మద్యము వర్జింపుమని పామరులకు బోధింప నధికారము లేదనియును తీరుపు చెప్పెను.

ఇట్లు ఆశిబిరమున కాఫీనీళ్లకొఱకు సైనికులు కొందఱు తెల్లవాఱనీయకుండెడి దురభ్యాసము తొలగిపోయెను. పల్లెలలోనివారు మద్యపానము వర్జించుటకు తగినంత ప్రోత్సాహ మపుడు గలిగెను.

## ౧౧

ముఖ్యపట్టణమందలి నాయకు లొకరొకరె బంధితులై కారాగృహమునకు బోవుటవలన, వెంటనె తన దళమును దీసికొని వచ్చి, తా నొక యున్నతపదవిని స్వీకరింపుమని ప్రసాదరావున కిపు డాహ్వానమువచ్చెను. ఈప్రాంతములం దిన్నాళ్లును సత్కారములు జరిగించిన శాంతిసైన్య మిపుడు తమ్ము వదలిపోవుట చుట్టుపట్టుల వారికి విషాదకరముగ నుండెను. తాను పోయివచ్చెదనని ప్రసాదరావు నీలివాడవారికి జెప్పినప్పుడు నీలమ్మ కంట నీరు పెట్టుకొనెను. ఎంతసేపటికిని ఆబాల యూరకుండినది కాదు. ఒకవేళ లేకుంటే యెడారిలో బడియుండిన తనను దన యింటికి జేర్చి లెక్కలేని యుపచారములు సలిపి, తనప్రాణములు గాపాడిన నీలమ్మ ప్రసాదరావునకు ప్రాణసమానగదా! అట్టి సుగుణమణిని సంతృప్తిపఱచుట యా శూరుని ముఖ్యవిధి. కావున నెటులో యాకన్య నొడంబఱిచి, స్వస్థచిత్తమున దా నాగ్రామము విడువవలెనని యా యువకునికోరిక. ఎట్టకేల కా బాలకు హృదయగతమగు వాంఛవొకడ లాతనికి దెలియవచ్చెను. ఆసుందరి కా యువకునిమీద జెప్పనలవిగాని ప్రేమ మేర్పడెను. ఇట్టి ధీరదాక్షిణ్యశీలుని దాను వరించి వివాహమాడకున్న దన జీవితము వ్యర్థమని యా మెలత తలంచెను. కులవిద్యాసంపదలం దధికుడైన యాశూరుడు తన కంటని ప్రామి పండని యాబాల యావంతయు దలంపదయ్యెను.

ఇంక, ప్రసాదరావును గుఱించి యేమిచెప్పుము? మనసార వలచిన చేడియనెగాని తాను జెట్టపట్టనని చిన్ననాటనుండియు ప్రతినవట్టిన ఛాందసు డాతడు. ఆపల్లెపడంతి కులవిద్యాసౌభాగ్యము లాత డారయలేదు. దైవసంఘటనము లెంతటి విచిత్రములో కాని, ఆముద్దియమోము గాంచిన నిమేషమునుండియె యా యువకుని డెంద మాలతాంగియందె యవలగ్నమై యుండెను. అంతటి సదయహృదయ నెన్న డాసరసుడు గాంచియుండలేదు. తా నెపుడైన బరిణయమైనచో, ఆచెలువనే స్వీకరింతునని యాచతురుడు తన హృదయమును సమాధానపఱుచుకొనెను. మనమున నమ్మిన సత్యమును వలసినపుడు వెలిపుచ్చుట కా ధీరుడు వెఱచెడివాడు కాడు. ఐనను దేశమంతయు సంక్షోభించెడి యీయసమయమున పెండ్లిమాటలు తలపెట్టుట అనుచితముగదా! నీలమ్మయైనను ఆసరసుని తన నాతరుణముననె పరిణయమగుకమ్మని పట్టుపట్టునంతటి నట్టిదికాదు. దేశపరిస్థితులు చక్కపడిన పిదపనైనను, తన వాంఛాసాఫల్యమున కావంతయైన నవకాశముగునా యనియె యా సుందరిసంప్రశ్నము. ఈ చిన్ని ప్రశ్నమునకు గల సమాధానమునందె యా సుదతి యాశాప్రపంచమంతయు కేంద్రీకృతమైయుండెను.

ఎట్టకేలకు మనసు దిట్టపఱచుకొని, ప్రసాదరావు చౌదరి, ఆపల్లెకన్నియ ముద్దువ్రేలి కొక ముద్దుటుంగరము పెట్టి ముద్దుపెట్టుకొనినపుడె ఆకలికిముఖకమలము కలకదేఱెను. ఇపు డచటికి వచ్చి బారులుతీరి నిలిచిన శాంతిసైనికుల నయనముల కాబాల పల్లెవాడయూడ బడుచువలెగాక, ఏవీరపత్నివలెనో కానబడెను. శీలముతోగూడిన సౌందర్యవిభవ మెపుడు నిట్టిదియె. ఇపుడు నీలివాడకు వీడుకోలు చెప్పెడి శాంతిసైనికులు గాంధి మహాత్మునకును, ప్రేయసి నీలవేణితో గూడిన తమ ప్రియసేనానిమీదను అమితోత్సాహపూరితమగు జయధ్వానములు సలిపించిరి.

## ౧౨

ఇది జరిగి ప్రసాదరావు ముఖ్యపట్టణమునకు వచ్చిన కొలదిదినములకె యొకనా డాతనిని రక్షకభటులు బంధించి, మాఱుమూలగ్రామమున మకాము చేసియున్న న్యాయాధిపతియొద్దకు గొనిపోయిరి. నిందితుని ప్రతివాదనయె లేని యిట్టియభియోగములలో న్యాయనిర్ధారణమున కెంతకాలము కావలెను! దండనాధిపుడు విచారణముగించి, తనగదిలో గూర్చుండి తీర్పువ్రాసి బైటవసారాలోని రోదనశబ్దము విని, గవాక్షమునుండి వెలుపల కట్టె చూచెను. ఒక యువకుడు దూరమున నిలిచి, తన ప్రేయసి వీడుకోలుకొఱకు ప్రతీక్షించుచుండెను. అతడె నిందితుడగు ప్రసాదరావు.

ప్రియుడు కోమలిముంగురులు సరిచేయుచు, విలపింప వలదని యామెను వేడుచు, తన చేతిరుమాలతో ఆదీన




"తన చేతిరుమాలతో......కన్నీ రొత్తుచుండెను."

వదనకన్నీ రొత్తుచుండెను. ఏడాది తిరుగకయె తా నింటి కేతెంచెదనని యాకాంత నత డెంత యూరార్ప జూచినను, ఆయతివకనుదోయినుండి యశ్రుకణము లొలుకుచునేయుండెను. రాజరత్న మొదలియారు "రాతి గుండె న్యాయాధిపతి" యని పేరు మ్రోగినవాడు. పేరు పెంపులు, బిరుదుకితాబులును గుటిపించెడి రాజాను గ్రహసంపాదనమునకు దగిన యవకాశము లిదియెకదా! ఐన నీ దృశ్యమునకు, శ్రావణ వర్ష మునకు నల్లరాల కొండ చెమ్మగిలునట్టుగ, ఆయుద్యోగి హృదయ మించుక మెత్తగిల్లెను. పరులకు మార్గప్రదర్శకుడు గావలసిన విద్యాధికుడగు ప్రసాదరావువంటి యపరాధికి తగిన శిక్ష వేయవలెనని యపుడె వ్రాసిన తీర్పుకాకితము నా న్యాయమూర్తి పట్టున చించివైచి, వేరొక కాకితము గైకొని, ముద్దాయి సత్యాగ్రహదీక్షను తీవ్రముగ నెఱప జూచెడి సాహసికుడైనను, కోమలహృదయుడగు నీ తరుణవయస్కునికి కొంతక్షమ చూపినచో త్వరలో నీతడె ప్రభుభక్తిపరాయణులలో మిన్నగ పరిణమింప గలడను విశ్వాసమున నాతనికి స్వల్పశిక్ష నొసంగుచున్నా నని తీర్పువ్రాసి, తన డెందమందలి యుమ్మలిక మొకింత యపనయించుకొనెను.

## ౧౩

ఇదివఱకు జెప్పిన యుదంతములు జరిగి యిప్ప టికి సుమారు సంవత్సర మైనది. ఏడాది గిఱ్ఱున దిరిగి రాగా, మల్లెమొగ్గలతోను, మందవాయువులతోను గలసి మరల వసంతము నీలివాడగ్రామమున బ్రత్యక్షమయ్యెను. ఇపుడు నీలవేణి యెచట నున్నది? ఏమిచేయుచున్నది? కడచిపోయినది యొక వత్సరమె యని లోకము లెక్క వేసికొనుచున్నదికాని, నీలవేణియంతరంగమున కీలో పుగ సమకూరిన యనుభవసంచయము పదిసంవత్సర ములకు సరిపడియుండెను. ఇపుడు నీలవేణి సముద్రపు టొడ్డున నాళువచిప్పలేరుచుండెడి పల్లెబాలికకాదు. ఆసుదతిపేరు, ఆమెయూహలు, ఆమె యాదర్శములును పల్లెలు, పట్టణములును వ్యాపించియున్నవి. దేశహితైక బుద్ధితో ప్రియుడు కారాగారమున గాసిల్లుచుండగా, తాను స్వగ్రామమున విహరింప నిచ్చగింపక, ఆసుగుణ వతి స్త్రీలుసలుపు విదేశవస్త్రబహిష్కరణోద్యమమున బాల్గొనియెను. పగలంతయు నెండలో బజారులయందు నిలుచుండి, విదేశవస్త్రముల కేగబడువారి నవి కొన వలదని దైన్యమున వేడుచు, వారల చీవాట్లును, రక్షక భటుల కఠినచర్యలను లెక్కసేయక విఘ్నుల నెరవేర్చు నెలతలలో నీలవేణి మిన్నయయ్యెను. చెన్నపురినుండి యాహ్వానము రాగా నీలవేణి యంత నానగరమున కేగి,

యచిరకాలముననే యచటి నారీమణులకు నాయికయై, ఆంధ్రభామినులు ధైర్యస్థైర్యములకు బట్టుకొమ్మలని తమిళసుందరులు శ్లాఘించునట్టుగ మెలంగెను. నీలవేణి నంతట రక్షకభటులు బంధించుట, అచటికిపుడు న్యాయాధిపతిగ నేర్పడిన రాజరత్న మొదలియారు ఆఱు నెల లాధైర్యవతికి కారాగృహశిక్ష విధించుట మున్నగు నవి వార్తాపత్రికల కెక్కిన చారిత్రకవిషయములె.

## ౧౪

భారతదేశోద్ధారకుడగు గాంధీమహాత్ముడును, భారతజనశ్రేయోభిలాషియగు ఇర్విన్ప్రభువును దేశమున శాంతి నెలకొల్పుటకు జేసికొనిన సమాధానము ననుసరించి కారాగారబంధితులైన సత్యాగ్రహు లొక్కరొక్కరె చెరసాలనుండి విముక్తు లగుచుండిరి. వేలూరు కారాగృహమునుండి వెలువడిన నీలవేణిని సమ్మానించుట కేగిన దేశభక్తులలో ప్రసాదరావుచౌదరి యొకడు. అదివఱకే శ్రీకృష్ణజన్మస్థానమునుండి విముక్తుడై వచ్చిన చౌదరి యిపుడు తన ప్రేయసిని గలసికొనునపు డానందపరవశు డయ్యెను.

తనకు సుస్వాగత మిచ్చుటకు దనవారు చెన్నపురి వచ్చి వేచియుండిరని వేలూరి కారాగృహముఖద్వారమున ప్రియునివలన వినిన నీలవేణి యంతట వారినిగాంచ నువ్విళులూరుచుండెను. చెన్నపురి రెయిలుస్టేషనులో నడుగిడునప్పటికె సత్యాగ్రహప్రముఖులును, నీలివాడ బంధువులును ఆమెను పూలమాలలతో ముంచివేసిరి. ఊరేగింపుటుత్సవము జరిగినవెనుక నిశ్శబ్దమగు నేచిన్న యింటనో తనకేర్పఱిచిన బసకు దనను వారు కొనిపోవుదురని యాతరుణి యనుకొనెనేకాని, అలంకృతమై జనావళిచే బరివేష్టితమైన యొకసుందరభవనమునకు దానపు డేతెంచి, అచట గల్యాణమంటపమున వివాహవేదిక నధిష్ఠింతునని యాకలికి కలలోనైన దలంపలేదు. ఇంత యాకస్మికముగ, నింత సంపూర్ణముగ దన భాగ్యము ఫలించునని యాపడతి యెన్నడును భావింపలేదు. ఆసుందరి యిపుడు తన యస్పృష్టమును దలపోయుటకును, తన నెచ్చెలులను బలుకరించుటకును వ్యవధానము గాంచకుండెను. ఇపు డిచట గూడినప్రేక్షకుల వదనములు, పురోహితుని, పలుకులు, ప్రాణేశుని పాణిగ్రహణము, సభాసదుల యాశీర్వాదములు, బంధుజనుల కానుకలు, మిత్రుల యభినందనములు- ఇవి యన్నియు నీలవేణికి గలలో గనిన విషయములవలె దోచెను.

ఆనాడు వధూవరులను, వారి యాంతరంగిక మిత్రులను ఆశ్చర్యవాహినిని ముంచివేసిన యొక యుదంతమునుగూర్చి యిచట బ్రస్తావింపక తీఱదు. సదస్యులు చందనతాంబూలాదులు స్వీకరించి తమ నెలవులకు నెడలిపోవుచుండగా, అపుడె వీథిలో నిలిచిన మోటారుబండిలోనుండి వచ్చి యొక భాగ్యవతి వివాహవేదికనుండి దిగుచుండెడి వధువుమెడలో నొక హారము నైచి, పెండ్లివారి సపర్యలు పూర్తిగ గైకొనకయె వేవేగమె బండియెక్కి నెడలిపోయెను. విలువగల యాయాభరణము సమర్పించిన పుణ్యవతి యెవ్వరో తెలిసికొని, ఆమెకు దమ కృతజ్ఞత జూప పెండ్లివారికి వలను పడకుండెను. అంత వరుడు ప్రసాదరావుచౌదరి మిగుల ప్రయాసమున జేసిన విచారణపర్యవసాన మేమన, పెండ్లికూతురి మెడలో హారమువైచిన సుదతీమణి న్యాయమూర్తి రాజరత్న మొదలియారిగారి ధర్మపత్ని యనియె.

# పరిణామము

పాలంకి వెంకటరామచంద్రమూర్తి

జానకమ్మముఖం ఎఱ్ఱబారింది. ఆమె చేతులో ఉన్న ఉత్తరాన్ని 'ఫర్రు' మని చింపి, దూరముగా విసరివేసింది.

"ఏమిటే?" అన్నాడు దగ్గుతో, ఎదురుగా సోఫాలో కూర్చునిఉన్న శ్రీనివాసరావుపంతులు.

"ఎంతపనిచేశారు?"

ఆమెనయనాలనుండి విస్ఫులింగములు రాల్తున్నాయి. 'ఆఉత్తరంతెచ్చినవార్త ఏమిటో?' అని ఆలోచించబోయాడు ఆవృద్ధుడు.

"ఇంకేముంది? నాప్రయత్నమంతా నేలగలిసింది! వాళ్లంతా ఏకమయి, నాపీకి పిసికేరన్నమాటే!"

"ఆసంగతేమిటో చెప్పేవుకా" దన్నాడు నెమ్మదిగా.

"పద్దెనిమిదేళ్లొచ్చిన వీడికి బుద్ధి ఉండక్కర్లేదూ?...ఎందుకుండాలి! వీడుమాత్రం వాళ్లల్లో వాడుకాదూ? పెంచుకున్నంతమాత్రం మనవాడయి పోతాడా?"

"ఏంచేశాడేమిటి రామం?" అని తిరిగి ఓమాటు ప్రయత్నంచేసి చూశాడు పంతులు.

"ఇంతకంటే ఏంచెయ్యాలి! మేనమామ తీసుకెళ్లి కూతురికి ముడెట్టేడు. ఇంకా బుద్ధిలేక, 'క్షమించాలి, మీదంపతులిద్దరూ దయచెయ్యాలి...' అని ఉత్తరం!......తోటపల్లికొండలకి షికారని పేరెట్టి నన్ను బుట్టలోపెట్టేడు మనవాడు— మనవాడేమిటి? మనడబ్బుకోసం చేరిన వాళ్లవాడే."

రామం చేసిన సాహసానికి శ్రీనివాసరావు ఆశ్చర్యపోయాడు మొదట. "జనకతల్లివైపువాళ్ల ప్రోత్సాహంవల్ల ఒకబడిఉంటాడు రామం. వాళ్లనేకవిధాల వీడికి నచ్చచెప్పిఉంటారు" అన్నాడు.

"అవును. వాడికి వాళ్లేముఖ్యం. నన్నందుకే గడ్డిపరకలాగ తోసిపారేశాడు."

"నీమాట తోసిపారేశాడంటావుకాని, కొంచెం ఆలోచించు. చిన్నప్పటినుంచీ 'పెళ్లిచేసుకుందాం' అనుకుంటోన్న వాడి మేనమామకూతుర్ని, పదమూడేళ్లొచ్చి, చక్కగా ఎదుగుతోన్న పిల్లని చేసుకుంటే బాగుంటుందంటావా, లేకపోతే, మూడేళ్లపిల్ల, మీ అన్నకూతురు ఎప్పటికో, ఎదిగేదాకా కనిపెట్టుకోడం బాగుంటుందంటావా?"

భర్తనోటమ్మట వెలువడిన ఈమాటలు జానికమ్మ క్రోధానలానికి ఆజ్యధార లయాయి.

"ఆ! అలాగా? నాప్రయత్నం బాగుండలేదూ? ఒక్కమాటు వెనక్కి దృష్టిమరల్చండి! పదిహేనేళ్లక్రితం,—తమకి నలభయ్యయిదేళ్లుంటాయి అప్పటికి—"కృష్ణా, రామా" అనుకునే రోజులు దగ్గరపడ్డా, వచ్చి పద్దానుగేళ్లపిల్లని నన్ను పెళ్లిచేసుకోడం బాగుందికాబోలు!"

ముసలాయనకు జానికమ్మచెప్పిపాడుపు చెప్పుదెబ్బలాగయింది. ఆతడికి ఉపద్రవమైన కోపంవచ్చింది. కాని అదృష్టవశాత్తు, దగ్గు అడ్డువచ్చి, ఆతడు కోపాన్ని వెలిబుచ్చకుండా చేసింది. అతడు నెమ్మదిగా "మీవాళ్లంత వెర్రిబాగులవాళ్లయి ముడిపెట్టలేదు నిన్ను నాకు. నాడబ్బంతా నీపేర బ్యాంకులో వేయించి మరీపెళ్లిచేశారు" అన్నాడు.

"రామం చేరినదికూడా ఆసొమ్ము కోసమే నాడబ్బుమీద ఆసక్తిఉండి చేరినవాడు నాచెప్పుచేతులలో పడిఉండాలి......"

జానకమ్మ క్రోధంలో ఉడికిపోతోంది. ఆవేశం చేత ఉచ్ఛ్వాసనిశ్వాసము లెక్కువై ఆమెవక్షస్థలం మాటిమాటికీ పొంగుతోంది. ఆమె పళ్లు 'పటపట'మని

కొలుకుతో, నిప్పులొలికే వదనాన్ని పైకెత్తి, "ఉండండి, వెధవల్లారా! మీపాట్లు ముందున్నాయి చూద్దురు గాని. మిమ్మల్నందర్నీ మంగలంలో పెట్టి వేచేస్తాను. పెద్దపులితో ఫా! చెలగాటం మీకు?" అని అరిచింది.

శ్రీనివాసరావు వదరిపడ్డాడు. ఉపనయనంకాని కుర్రవాళ్లల్లో ఎదిగి పదిహేడేళ్లొచ్చినవాడనీ, తన వృద్ధాప్యంలో చేతికందుతాడనీ రామాన్ని తీసికొచ్చి దత్తతచేసుకున్నాడు. నేటితో ఈ పెంపకానికి విఘాత మొచ్చిందన్నమాట!

## 2

"ఎవరాతలుపుదగ్గర?" అంది జానకమ్మ లోపలినుంచి.

"నేను." అనిహీనస్వరంలో సమాధానమొచ్చింది.

"రామం." అన్నాడు పంతులు.

జానకమ్మ చెయ్యి కడుగుకొని, సావిట్లోకి వచ్చింది. రామం తలవంచుకుని నిలువబడి, కాలి బొటనవ్రేలితో నేలమీద గీస్తున్నాడు. శ్రీనివాసరావు పంతులు రాబోయే పిడుగులవర్షాని కెదురుచూస్తున్నాడు.

"రామం!"

"ఊ!"

"తోటపల్లి కొండలకని చెప్పి మమ్మల్ని మభ్య పెట్టి వెళ్లి పెళ్లి చేసుకుంటావా? నీపెళ్లి మేము చూడ కూడదా ఏమిటి?" అతిశాంతముగా పలికినమాట లివి.

"మొదట నాకేమీ తెలియదు. దారిలో మా మామయ్యవచ్చి తీసికెళ్లేడు. మధ్యలో ఆసంగతీ, ఈసంగతీ చెప్పి, ఇంటికెళ్లేక పెళ్లిమాటెత్తేడు."

"ఊ?"

"'మాఅమ్మ కిష్టంలేదు. అందుచేత నాకొద్దీపెళ్లి' అని చెప్పేను. 'ఫరవాలే'దని బలవంతపెట్టి చేసేశారు."

రెండు నిమిషములు నిశ్శబ్దంగా గడిచేయి.

"అమ్మ కిష్టంలేదని ఎందుకనుకున్నావూ ఈ పెళ్లి అంటే?"

రామారావు ముఖమెత్తి చూశాడు ఆశ్చర్యంతో. భార్యవైఖరి పంతులకర్థమవటంలేదు.

"నేనేదో వేళాకోళానికి శ్యామలని నీకు పెళ్లి చేస్తానంటే, ఆమాట పట్టుకుని, పెద్దపన్నాగం పన్ని నాకు తెలియకుండా పెళ్లి చేసేశారు నీకు. నాజన్మలో నేచేయదగిన ఈ ఒక్క శుభకార్యం, నాచేత జరుపబడ కుండా ఉండకపోవడమేకాదు గదా నాకళ్లయెదుట కూడా జరుగనీయక—అంతేకాదు—నాకు తెలియనే తెలియకుండా జరిపేశారు. ఇంతకంటే దారుణం ఏముంది.?" జానకమ్మముఖంలో దైన్యం గోచర మయింది.

రామానికి కళ్లమ్మట నీళ్లొచ్చాయి. "అమ్మా, క్షమించాలి. దురభిప్రాయపడి చేసినపని ఇది."

"కళ్లమ్మట నీళ్లెందుకురా ఈమాత్రందానికి? నాకూ సంతోషమే కోడలొచ్చిందంటే......లే! నీళ్లుపోసుకో! వంట అయింది." అంటూ లోపలికి వెళ్లింది జానకమ్మ.

'రామాన్ని గుమ్మంలో అడుగుపెట్టేటప్పటికి పీకిపట్టుకుని గెంటేస్తుంది జానకి' అని మొట్టమొదట అనుకున్న పంతులుకి, తనభార్యయొక్క సౌమ్యప్రవర్తన చాలా ఆశ్చర్యం కలిగించింది. 'ఏమైనా ఆడది, జాలిగుండెకలది.' అనుకుంటూ, ఆయన 'స్నానం చెయ్యరా, మడిగట్టుకుందాం' అన్నాడు.

## 3

శ్రీనివాసరావుకీ, జానకమ్మకూ తెలియకుండా రామాన్ని తీసుకుపోయి తనకూతుర్నిచ్చి పెళ్లిచేసిన గణపతిరావు, తాను చేసినసాహసం అతిప్రమాదజనకం అని అంతా అయినపిమ్మట ఆందోళనపడజొచ్చాడు. కాని ఈవిషయంలో జానకమ్మ చూపిన ఔదార్యాన్ని, గుర్తించి విన్నప్పుడు అతని హృదయభారం తగ్గింది. గయ్యాళి అనుకోబడే జానకమ్మ సాధుస్వభావాన్ని

గ్రహించినప్పుడాతడు పశ్చాత్తాపంతో చిన్నబుచ్చుకున్నాడు. తాను తొందరపడి ఆదంపతులకు చేసిన అపచారాన్ని వాళ్లు మరచిపోయేటట్లు చేద్దామనే ఉద్దేశంతో రాజమండ్రీవచ్చి పంతులుగారింటి కెళ్లేడు. 'పెళ్లి బంధువులెవళ్లూ రాకుండా జరిగిందిగనుక, ఏ సత్యనారాయణవ్రతం పేరో చెప్పి, చుట్టాలను సమావేశం చేయించి పిల్లని, పిల్లవాణ్ణి పీటలమీద కూర్చోపెట్టి ఆశీర్వచనం చేయిద్దాం' అని ఆతడు తనఉద్దేశాన్ని తెలియచేశాడు. పంతులుగారు 'బాగానేఉంది' అనుకున్నాడు. కాని జానకమ్మ 'జరిగినదేదో జరిగిపోయింది కదా. ఇప్పుడు తిరిగీ ఎందుకూ ఈతంతు? ముందు ముందు చేసుకోవలసిన కార్యాలు లేకపోలేదుగదా!' అని ముక్తసరుగా మాట్లాడి ప్రసంగాన్ని ముగించింది.

తలిదండ్రులు తనయెడల చూపిన క్షమ రామంలో మార్పు తీసుకొచ్చింది. నాటినుంచీ, తన్ను దత్తునిగా స్వీకరించినఆదంపతుల ఉద్దేశాలను గ్రహించుకుంటూ వాటి కనుకూలంగా ప్రవర్తించడం తనవిధి అని ఆతడు నిశ్చయం చేసుకున్నాడు. ఈమనోనిశ్చయం గాఢపడుటకు తగినపరిస్థితులు కలిగేయి. శ్రావణమాసంలో తనువుఇవ్వడం, పండుగులకు పిలుపురావడంతోనే తన్ను పంపడం, బొమ్మలనోముకు సుభద్రను తీసుకురావడం — ఈ విషయాలన్నింటిలోనూ ముందంజ వేస్తోన్న జానకమ్మయెడల తాను చూపవలసిన కృతజ్ఞత అనంతమైనదని ఆతడనుకోవలసివచ్చినది.

౪

సుమారు రెండుసంవత్సరాలు గడిచేయి. 'మీకోడలు, చిరంజీవిసౌభాగ్యవతి సుభద్ర రజస్వల అయిన' దని గణపతిరావుదగ్గరనుంచి ఉత్తరం వచ్చింది.

మరినాలుగుమాసాలయాక, గణపతిరావు 'కార్యమెప్పుడుచేసుకుంటా'రని అడగటానికొచ్చాడు.

'ఇంకా కొన్నాళ్లు పోనియ్యండి' అంది జానకమ్మ. 'సరే, మీఇష్టం.' అని గణపతిరావు వెళ్లేడు. రామం మామగార్ని సాగనంపుతో "మామయ్యా, నీసూట్కేసులో నాలుగుపుస్తకాలు పెట్టేను. దానికియ్యి" అన్నాడు.

'లెక్కలు బుర్రకెక్కటం లేదు. అంతేకాకుండా క్లాసుకి పెద్దవాణ్ని నేను......' అన్నాడు రామం ఒకనాడు.

'ఈలెక్కలు మనల్ని ఉద్ధరిస్తాయి గనుకనా? స్కూలుమానెయ్యి. మునిగిపోయిందేమీ లేదు.' అంది జానకమ్మ.

రామాని కింక తీరుబడే. రెండురోజుల కొకనవల ముగించేవాడు ఇంట్లో కూచుని. వాఙ్మయం అంటే అభిరుచికలిగింది. 'నువ్వు బాసుగా చదువుకోవలెను.' అని సుభద్రకు జాబువ్రాశాడు. దానికి అత్తగారి భావాలతోనూ, సుభద్ర అక్షరాలతోనూ ప్రత్యుత్తరం వచ్చింది. కాలక్రమాన, తల్లికి తెలియకుండానే, సుభద్ర మగనిఉత్తరాలకు సమాధానం వ్రాస్తోండేది.

సంవత్సరం గడిచింది. 'కోడల్ని తీసుకొస్తే బాగుంటుందేమోనే ఇంక' అన్నాడు పంతులుగారు.

శోభనం రాజమండ్రీలోనే జరిగింది. చాలా వైభవంగా జరిగింది. బాజారులో ఉన్న పట్టుచీరలలో మిక్కిలి విలువైనది కోడలికి కొనిపించింది జానకమ్మ. పన్నెండుపెద్దకాసులు కొంగున కట్టించింది.

"ఏమండీ!" అంది గణపతిరావుభార్య మగనితో.

"అల్లుణ్ని మనింటిదగ్గర మూడునిద్దర్లకీ పంపేటట్టుగాలేదు చూస్తే."

"పోనిద్దూ. ఆవిడిష్టమొచ్చినట్లు జరగనియ్యి. కొడుకుని తీసుకుని ఎక్కడకో వెళ్లాలంటోంది రేపు. మన కెందుకూ అనవసరమైన పట్టింపు?"

నాలుగోనాటి ఉదయం సుభద్రను వెంటబెట్టుకుని రామం అత్తగారు, మామగారు వెళ్లిపోయారు. 'నేనుగూడా వెడితే!' అనుకున్నాడు రామం. 'అమ్మ ప్రయాణమో!' అని మనస్సును సమాధానపరుచుకున్నాడు.

ఇంట్లో కార్యం అవటంవల్ల మూడురోజుల నుంచీ కలిగిన ప్రయాస జానకమ్మకి నలత కలుగ జేసింది. "నే నెక్కడకీ కదలలేనురా. 'వంట్లో బాగుండ లేదుగనుక రావడానికి వీలులేకపోయింది.' అని వాళ్ల కుత్తరం వ్రాయి." అని జానకమ్మ ప్రయాణాన్ని ఆపుజేసింది.

*

నెలయింది. 'మూడునిద్దర్లకీ రావలసిన' దని రామంమామగారిదగ్గరనుంచి ఉత్తరం వచ్చింది.

"కార్యం అయిందికనుక ఇంక మీమామగారు స్వయంగావచ్చి పిలవడం మానేసి, ఉత్తరాలమీద వ్యవ హారం నడపటం మొదలెట్టేరు. చూశావ్!" అంది జానకమ్మ కొడుకుతో.

"ఏమిటో, మేనల్లుణ్నిగదా అనే చనువుతో వ్రాశాడు. తీరికలేకపోయింది కాబోలు. లేకపోతే వచ్చేవాడే."

"మేనల్లుడవుతే లోకువచెయ్యా లేమిటి?

ఉత్తరం వచ్చినంతమాత్రాన్ని వాళ్లింటికెళ్లి కూర్చో క్కర్లేదు మనం. మాట్లాడ కూరుకో. సమాధానం కూడా వ్రాయకు."

..................

రామం, "అమ్మ కీచిన్నవిషయంలో ఇంత పట్టింపెందుకో?" అనుకున్నాడు.

మరొకనెల గడిచింది. 'వాళ్లలాగ మనం ఉపేక్ష చేస్తే ప్రమాదంరావచ్చు.' అనే ఉద్దేశంతో సుభద్రను తీసుకొచ్చి, అత్తవారింట దిగబెట్టేడు గణపతిరావు.

"రామం, తాడేపల్లిలో ఇల్లు ఒక్కవర్షంవస్తే కూలిపోయేలాగుందిట! మనం అశ్రద్ధచేస్తే అ రవంతా జరిగిపోతుంది. పట్టుమని వారంరోజులపని ఉండదు. వెళ్లి ఆఇల్లుకాస్తా బాగుచేయించిరా నాయ నా!" అంది జానకమ్మ ఆనాడే.

'నెలో, రెండునెలలో మకాంచేస్తే పూర్తి చెయ్యవలసిన ఇంటిపని వారంరోజులలో ఎలాగ అవు తుంది? ఇంతకీ, అమ్మకి ఇంటితలపు ఈనాడే వచ్చిం దెందుచేతో?......ఏమైనాసరే, నేను వెళ్లకతప్పదు.' అనుకుని బయలుదేరేడు రామం. అడుగుకనిపెట్టి, భార్య దగ్గరకెళ్లి, 'త్వరగా వచ్చేస్తాలే' అనిచెప్పి, రైలుకెళ్లి పోయాడు.

'చీటికీ మాటికీ ఇంటికిరాకుండా, పనిముగించి మరీరావలెను' అని ఇంటిదగ్గరనుంచి ఉత్తరం వచ్చింది రామానికి. 'సరే' అని ప్రత్యుత్తరం వ్రాసాడు.

మాసాంతమయేదాకా రామారావు రాజమండ్రీ రాలేకపోయాడు. నిరీక్షిస్తో కాలంగడుపుతోన్న సుభ ద్రకి తుదకు భర్తృదర్శన మయింది.

భోజనాలయాయి. "నాలుగు రోజులనుంచి అనుకుంటున్నా, 'పని పూర్తిఅయినా కాక పోయినా బయలుదేరి వచ్చెయ్యా' మని ఉత్తరం వ్రాద్దామని. మావాళ్లు ఉత్తరంమీద ఉత్తరం రాస్తు న్నారు నన్ను రమ్మని" అంది జానకమ్మ రామంతో.

"ఎప్పుడో నెల్లాళ్లతర్వాత కాబోయేపెళ్లికి ఇప్పటినుంచి ఎందుకూ వెళ్లడం?" అన్నాడు పంతులు.

"పెళ్లినాటికి సరిగ్గా అందరిచుట్టాలలాగా నేను వెడితే వాళ్ల కేమి లాభం? మాఅమ్మ ఒక్కత్తేకదా! పనిపాటల్లో కాస్త ముందుగావెళ్లి దానికి సాయపడక పోతే ఎలాగ?"

"కోడల్నికూడా తీసికెడతావా అలాగైతే?"

"అంతా అక్కడికిపోయి కూచుంటే ఇక్కడ మీకు భోజనమో?"

"సరే, అలాగైతే నరేంద్రపురంలో దిగబెట్టి రారా అమ్మని" అన్నాడు కొడుకుతో శ్రీనివాసరావు.

"దిగబెట్టివస్తే ఎలాగ కుదురుతుంది? ఏమి కావలసివచ్చినా పిలిస్తే పలికేవా డుండాలా. నాకక్క డ? ఎంతకాలం? ఒక్కనెల్లాళ్లే కామూ? పెళ్లి అయి పోడంతోటే వచ్చేస్తాం!" అంది జానకమ్మ.

పంతులు నిర్ఘాంతపోయాడు. రామారావునకు వెన్ను విరిగినట్లయింది.

మర్నాడు జానకమ్మ రామారావుతో నరేంద్ర పురం వెళ్లింది.

శ్రీనివాసరావుపంతులుకూడా ఒకప్పు డిరవై యొక్క సంవత్సరముల వయస్సుగల యువకుడే. తనతో కాపురంచెయ్యడాని కొచ్చిన తనప్రథమకళత్రాని కప్ప టికి సరిగ్గా సుభద్రలాగ పదహారేళ్లే ఉన్నాయి. కనుక ఆవయస్సులో నూతనదంపతులయొక్క భావాలెల్లా గుంటాయో ఆతనికెరుకయే. శోభనమైనదిమొదలు భర్త నుండి ఎడబాటుచేయబడుతోన్న సుభద్రను చూస్తే ఆవృద్ధుడు వేదనకు లోనయాడు. మగడు దూరంగా ఉండడంచేత, ఆయింట్లో పిలిస్తే పలికేవాళ్లికొకళ్లు లేకపోవడంచేత, కోడలు బెంగ పెట్టుకుంటుందని ఆలో చించి, ఆమెను పుట్టినింట దిగబెట్టి వచ్చి హోటల్లో ప్రవేశించాడు.

భార్యప్రవర్తనలో హఠాత్తుగా అగుపించిన ఈ మార్పునకు కారణమేమిటో? ఎడబాటువలన ఆయువతీ యువకుల హృదయాలలో పుట్టే సంక్షోభానికి తాను కారకురాలనని జానకి గుర్తిస్తోందా? పెండ్లి అయిన వెంటనే, రజస్వలకాకపూర్వమే తనతో కాపురం చెయ్యడానికొచ్చి, ఒకరోజుకూడా తన్ను విడిచిఉండని జానకికి విరహవేదన అంటే ఎలాగ తెలుస్తుంది? తనకీ ఆమెకూ వయస్సులో విశేష భేదముందనిన్నీ, ఆమెకు దాంపత్యసౌఖ్యం పూర్తిగా లభించలేదనీ శ్రీనివాసరా వ్పుడు ఒప్పుతాడు. అందుచేత జానకి, తెలుసుకో కుండా అపుత్రవాళ్లకి అపచారంచేస్తోందేమో అను కున్నాడు. 'కాని ముప్ఫయ్యేళ్లది. ప్రపంచంలో ఎందరో దంపతుల్ని చూస్తోంది. ఆమాత్రం తెలియక పోతుందా?' అనే సందేహం పీడించింది. కనుక ఏదో ఓగొప్పకారణం ఉంది దీనంతకీ...ఏమైతేనేమి, తనకి పెత్తనం నశించింది. తాను ప్లీడరీచేసి గడించిన ఆసొమ్మంతలోనూ ఒక్కకానీ ముట్టుకోడానికి తన కధికారం లేదు.

౬

“అందుచేత మీఅమ్మ నామీద కసి తీర్చుకుం టోందన్నమాట! ఈరెండుసంవత్సరాలు చూపిన ఆద రణ, ప్రేమ అంతా నటనేనా?”

“అనే అనుకోవాలి.”

“నామీద కక్షకట్టి నన్ను మీసమ్మం తొక్కకుండా చెయ్యవచ్చు. ఏమీ ఎరగని సుభద్ర నెందుకూ ఏడిపించడం?

“ఇద్దరురాజులు యుద్ధానికి దిగినప్పుడు, మధ్య నిరపరాధు లెందరు నశించటంలేదూ?”

“మీనాన్నకైనా జాలి అనేదిలేదూ?”

“ఉండి ఏమిచేయగలడు? ఆజాలి అనేది ఉండ టంవల్లనే నామూలాన్ని ఆ దంపతులలో కలహాలు బయలుదేరుతున్నాయి. ‘లేని ప్రేమ నటిస్తో, వాడికి శోభనంచేసి, తుదకు అన్యోన్యానురాగం కుదిరిన వా ళ్లిద్దర్నీ ఎడబాటు చేస్తోన్న గోముఖవ్యాఘ్రానివి. నీవు బ్రహ్మరాక్షసివి కాని మనిషివై పుట్టవలసినదానివి కావు. నీవు ఎరుకుండి, పట్టుదలతో పూనుకున్న ఈ మహాపాతకానికి ఫలితంక్రింద మళ్లీ జన్మలో ఘోర మైన వైధవ్యం సంభవిస్తుంది నీకు' అని తిట్టేడు. ఈ జన్మలో నా కంతకంటే ఎక్కువ వెలిగిపోతోన్న దేమీ లేదు' అని సమాధాన మిచ్చింది.”

“డబ్బు చేతికిచిక్కిందికదా అన్నపొగరు. లేక పోతే ఆడదల్లాంటి సమాధాన మివ్వగలదా?”

“.................”

“ఇన్నాళ్లనుంచి అక్కడ పెరుగుతో, ఎంతో అడకువతో ప్రవర్తిస్తోన్న నీకుకలిగిన ప్రతిఫలమేమిటి?”

“ఇంతవరకూ ఏమీ లేదన్నమాట.”

“అట్లయితే పరాయివానిలాగేనా ఉండడం నువ్వాయింట్లో ఇప్పుడు? ప్రపంచంలో దత్తత యియ్య బడ్డవాళ్లంతా ఇటువంటి అవస్థకే లోనవుతున్నారా?”

“లేదు. శైశవంలో పెంపకంయియ్యబడ్డ పుత్ర వాళ్లు తమఆటపాటలచేత అన్యగర్భవాసులైనా దత్తత తల్లిహృదయాన్ని ఆకర్షిస్తారు. అంతేకాకుండా, సాధారణంగా దత్తతచేసుకోబడ్డ పుత్రవాళ్లు ఏఅన్న కొడుకులో, తమ్ముడుకొడుకులో అయిఉంటారు. నాకూ, వీళ్లకూ అట్టి సంబంధమేలేదు. స్వశాఖలో

వాణ్ని, వసుసకానివాణ్ని గనుక దత్తత వీలైంది. అయినప్పటికీ నామీద ప్రేమకలగడానికి వీలులేక పోలేదు. నామీద అటువంటి ఆదరణకూడా చూపేరు వాళ్లు. మానాయన నామీద ఎప్పుడూ అట్టిప్రేమ చూపుతోనే ఉన్నాడు. అమ్మకు నామీద కలుగవలసిన ప్రేమకు విఘాతమొచ్చింది. అందుకు కారణం మనమే."

"ఆమెకు చేసిన అపచారాన్ని గురించి పశ్చాత్తాపుల మయాము కామూ, ఎన్నివిధాలనో? ఆమెచెప్పినట్లు చేశాం. అతివినయంతో ప్రవర్తిస్తున్నావు నువ్వు. ఇట్టిపరిస్థితుల్లో ఇంకా ఎందుకూ ఈకసి? ఈ జన్మలో క్షమించడం అంటూ ఉండదా ఏమిటి?"

"ఉండకపోవచ్చు. ఆమె క్షమించాలని మనమెందు కనుకోవాలి? మన మామెకొనర్చిన మహాపచారానికి మనకు కావలసిన ప్రాయశ్చిత్తము చాలా ఉంది. ఆమెను తల్లి అని సలహాచేయకుండా ఆమెకు తెలియకుండా స్వతంత్రించి వివాహం చేసుకున్నప్పుడు ఆమె నన్ను పుత్రునిగా ఎలాభావిస్తుంది? ఇదేమీ గర్భవాసం కాదుగదా, కొడుకేమి చేసినా ఊరుకోడానికి?"

గణపతిరావునకు మనోవేద నెక్కువవుతోంది. అల్లుడుకూడా తనమీద సానుభూతి చూపడం మానేస్తున్నాడు.

"వ్యవహారం పూర్తిగా చెడిపోయిందని తెలుసుండి ఇంకా ఎందుకూ ఆయింట్లో ఊగులాడడం?"

"వేరు దిక్కులేక!"

"దిక్కులేకేమి ? నీతల్లిదండ్రులు బ్రతికున్నారు. నీఅన్నదమ్ము లున్నారు. నీకేమిలోటు? నీవాటా నీకివ్వకపోరు."

ఆమాటలువిని ఉగ్రుడయిపోయాడు రామారావు. "నన్ను దత్తుడని పేరుపెట్టి ఈ దంపతులకు విక్రయించిననాడే నాతలిదండ్రుల కాత్మహత్యా సంభవించింది. వీళ్లింటికొచ్చి, వీళ్ల ప్రేమ సంపాదించుకోడంచేత కాక, వీళ్లను నే చంపుకున్నాను. అన్నదమ్ములని పేరుపెట్టుకొని ఆడురనేడితే, 'దత్తత ఇచ్చి వదుల్చుకో ప్రయత్నించినా, పిశాచంలాగ మళ్లీ వచ్చా'డని వాళ్లుమాత్రం ఏవగించుకోరూ ? అందుచేత అక్కడకువెళ్లినా దయాధర్మభిక్షుమే. స్వతంత్ర జీవనానికి తగినవిద్యలేదు. లక్షాధికారివనే ఉద్దేశంతో అశ్రద్ధచేసి మానేశాను......కనుక కర్తవ్య మేమిటంటే ఎప్పటికైనా వస్తే దయ ఈమెకే రావాలనే ఆశతో ఇక్కడే కనిపెట్టుకుండాలి."

"ఎంతవరకూ ?"

"అవసరమవుతే జీవితాంతంవరకూ!"

"సుభద్రగతి ఏమిటి ?"

"నే చేయగలిగిన దేమిటో చెప్పు. దానిమీద నాకున్న ప్రేమ నిష్కళంకమైనదనుటలో సందేహము లేదు కదా!"

"అయితే, మాయింటికొచ్చెయ్."

"నేడబ్బున్నవాణ్ని అనే ఉద్దేశంతో, ఇంకా మేనల్లుళ్లు, నీకూతుర్ని కళ్లనద్దుకుని పెళ్లిచేసుకునే వాళ్లు చాలామందున్నా, నాకే ఇచ్చి పొంగలేనంగా పెళ్లిచేశావు. లక్షాధికారినని ఉద్దేశింపబడ్డ నేను అక్షయపాత్రతో నీయింటి కెట్లు రాగలను ?...... ఏధనం నాదత్తతకీ, వివాహానికీ, మా అమ్మకక్షకీ, నా దౌర్భాగ్యానికీ కారణమయిందో, ఆధనాన్ని ఇక్కడేఉండి సాధిస్తాను."

గణపతిరావు కన్నీరు తుడుచుకుంటూ తిరిగి వెళ్లిపోయాడు.

౭

"నేను నిర్భాగ్యుడను. అపరాధిని. అందుచేత నాకుకలిగిన సిలుగులను ధైర్యంతో సహించాలి. కాని సుభద్రమాట !" ఇట్టితలపులు రామంమనస్సును తరుచుగా కలతపెడుతోండేవి.

"అమ్మ, తనకు 'సుభద్ర అనే కోడలుంది' అనే విషయమే తెలియనట్లుగా ప్రవర్తిస్తోంది. 'అమ్మా,

మీకోడల్ని తీసుకురానా?' అని అడుగుతే ఏమంటుందో? ఏమంటుంది? 'సరే' అని. సుభద్ర వీధి గుమ్మంలో అడుగుపెట్టేటప్పటికి, 'అబ్బాయ్ ప్రయాణం' అంటుంది. అప్పుడు చెయ్యవలసినపని! కేవలం ముసలాయనకు వంటచెయ్యడంకోసం సుభద్రను తీసుకొచ్చినట్లవుతుంది. ఏదో ముక్కో, చెక్కో తేల్చుకోడానికి 'నేను సుభద్రతో కాపురం చెయ్యడం ఇష్టంలేదా నీకు?' అని నిక్కచ్చిగా అడుగుతే?...... ఎందుకూ అడగడం, ఆమెఅభిప్రాయం ఎరుగుండీ కూడా? 'నాకు ఇష్టంలేదు' అని ముఖంమీద అనేస్తే ఉన్నగోటు రవంతా చెడిపోతుంది."

తనకు కార్యమై ఏడాదికావస్తోంది. కాని ఆతడు ముచ్చటతీరా పట్టుమని పదిరోజులు భార్యతో కలిసి ఉండలేదు. గతజన్మలో ఏదంపతుల అనుకూలదాంపత్యానికి విఘాత మేర్పరిచాడో కాని దారుణమైన ఫల మిప్పు డనుభవిస్తున్నాడు.

సుభద్రారహితమైన జీవితం సుఖప్రదమైనది కాదు. అప్పడీధనరాసులవల్ల ప్రయోజనం మృగ్యం. కనుక అమ్మకూ, ఆమె ఫిక్సెడ్ డిపోజిట్లకూ ఒకసలాము కొట్టి ఎందుకుపోరాదూ?

......తొందరపడకూడదు. జానకమ్మహృదయం ఎంతకఠినమైనా, మానవహృదయమే. తన విధేయతను ఉపేక్షిద్దామని చేస్తోందేమో ఇలాగ? కాని, అగ్నిహోత్రంకంటె దారుణమైన దీపరీక్ష.. అయితే నేమి? ఈ ఘాతకు ఆగడానికి ప్రయత్నించాలి.

సరే,అలాగైతే కొన్నాళ్లు ఓపికపట్టాలి. 'మధ్య మధ్య అమ్మకి తెలియకుండా, ఏదో వంక పెట్టుకుని, సుభద్రని చూసివస్తూంటే!' ఈతలపాయువకుని హృదయంలో ఓవెన్నెలరాత్రిని మెలగించి. పాపం ఆ మనస్సు తక్షణమే చిక్కబట్టుకున్నాడు. అమ్మకి తెలియకుండా సుభద్రను పెళ్లిచేసుకోడం ప్రథమ తప్పిదం. ఇప్పు డమ్మకి తెలియకుండా సుభద్రను కలుసుకోడం రెండో తప్పిదం అవుతుంది. అది కూడదు. ఆ తలపు తనమనస్సులోనికి చొరనీయరాదు.

— జనకతండ్రియో, అన్నగార్లో, మామగారో, ఎవళ్లో ఒకళ్లు, ఇంటికి రాకపోయినా ఏ బజారులోనో ఉండి, ఎవరిచేతో రహస్యంగా కబురుచేసి రామానికి 'ఈ బ్రహ్మరాక్షసిని వదిలించుకో' అని బోధించేవారు. ఈరహస్యప్రవర్తన రామానికి నచ్చేది కాదు. వాళ్లు తన్ను కలుసుకుని మాటలాడినప్పుడల్లా తనకు మనస్సంక్షోభం కలగడంతప్ప, ప్రయోజనం ఏమీ అన్నపడటంలేదు. అందుచేత, సాధ్యమైనంతవరకూ వాళ్లని తప్పించుకు తిరిగేవాడు. ఇతణ్ణి కలుసుకు మాట్లాడ్డానికి ఏదో ఒకపన్నాగం పన్నవలసొచ్చేది. ఏదో విధంగా ఇవన్నీ జానకమ్మ గ్రహిస్తోండేది. విషపు నవ్వుల దెప్పిపొడుపులతో 'మీవాళ్లమీ చేస్తోన్నదీ నాకు తెలుసు!' అనే భావాన్ని తెలియజేస్తోండేది ఆమె. అందుచేత తనవంపునుట్టాలు ముఖాముఖీ అయినప్పుడుకూడా తప్పించుకుపోయేవాడు రామం.

౨

దినాలు నెమ్మదిగా గడచిపోతున్నాయి. రామారావు తన్ను పెంచుటకని తెచ్చిన ఆదంపతులయెడల నిరుపమానమైన విధేయత చూపుతోనే ఉన్నాడు.

రామారావునుగురించి పంతు లమితమైన వేదనకు లోనయేవాడు. 'తలితండ్రులసమ్మతి లేకుండా జరుగుతోన్న వివాహాలు ప్రపంచంలో ప్రతీదేశంలోనూ ఉన్నాయి. ఇటువంటి కసితీర్చుకోడం మాత్రం ఎక్కడా లేదు' అనుకునేవాడు. తానప్రయోజకుడనని తెలిసికూడా జరుగుతోన్న దారుణాన్ని చూసి ఉరుకోలేక భార్యమీద మండిపడేవాడు. ఆమె వికటమందహాసంచేసి 'నా త్యాగంకోసం గాని నన్నుద్ధరించడానికి కాదు ఈవినయం!' అనేది. రామారావు మహాపరాధం జరిగించాననే పశ్చాత్తాపంతో కుమిలిపోతో, జానకమ్మను ఏదోవిధంగా సంతుష్టిపరచాలనే గమ్యస్థానం పెట్టుకుని, కోరిచేసుకున్న భార్యనుండి కూడా వియోగానికి ఒడబడి త్యాగం చూపిస్తోంటే, తనడబ్బుకోసం నక్కవినయాన్ని కనపరుస్తున్నాడనే తలంపుతో, ప్రమత్తతవల్ల గుండెకరిగి, కరుణాలేశమొకటి ఆతణ్ణి చేరుతుం

దేమో. ఆ నేభయంచేత హృదయాన్ని మాటిమాటికి ఘనీభవింపజేస్తోందే దామె. ఆతడు, తనధనంకోసమే చేరి ఆడకువ చూపిస్తున్నాడనుకున్నా, అంతకారిన్య మెందుకో? కడుపుకకూర్తిచే చేరిన సేవకుణ్ని లాగ చూసినా ఆతడు దయనీయుడేకదా!

ధనవంతురాలననే అహంకార మామె నావరించింది. ఆమెహృదయం అయఃపిండము. అందు దయ, సానుభూతి అనేవాటికిలోరకు వెలకడం అవివేకం. రామారావుయొక్క అభాగ్యజీవనం ఆమెకు కన్నులపండుగ. సుభద్రకన్నీటినిగూర్చి తెలియజేయు హృదయనిర్భేదకమగు పలుకు లామెకు శ్రవణానందకరములు. గణపతిరావుమనోవేదన ఆమె కాహ్లాదకరము. పంతులుగారి ఒడలిమంట ఆమెకు బాణసంచావంటిది.

౬

ఆనాడు రాజమహేంద్రవరం కలకలలాడుతోంది. మ్యునిసిపల్ ఆఫీసులో గవర్నరునకు స్వాగత మివ్వటానికి ఏర్పాటు జరిగింది.

శ్రీనివాసరావుపంతులుకు ఆహ్వాన మొచ్చింది. ముసలాయన ఆల్పాకాకోటు బూజుదులిపేసుఆరోజున.

పంతులు మ్యూజియంతోటలలోంచి తిరిగివచ్చి సోఫాలో కూలబడ్డాడు. "ఏమిటివి విశేషాలు నాన్నా" అన్నాడు రామం.

ఆతనికి ముసలాయినముఖంలో విషాదం అగుపించింది.

"ఏమండీ, ఎండలో తిరిగివస్తే నిస్త్రాణ చేసినట్లుగా ఉంది. కాఫీ పుచ్చుకుంటే ?"

రామారావు అడిగినదానికి సమాధానం చెప్పకుండానే పంతులు, "మీమామగా రగుపించాడురా, బజార్లులో. ఇంటికిరమ్మంటే వచ్చాడుకాదు."

రామారావు మాట్లాడలేదు.

"నా ప్రథమభార్యకు జనించిన సంతానమంతా పెరిగి పెద్దవాళ్లవకుండానే పోవడంచేత, పుత్రశోకమంటేనే నాకు తెలుసుకాని, వాళ్లు ఎదిగి కష్టాలుపడుతోంటే తలిదండ్రులకు కలిగేబాధ నాకంతగా స్వానుభవంకాదు. కాని ఈరోజున గణపతిరావును చూస్తే, ఆవేదన అవగాహనఅవుతోంది. అబ్బ! ఆడపిల్లని కన్నవాడికిబాధ దారుణమైనదన్నమాట. కొడుక్కి కోడలితో అనుకూలదాంపత్యం కుదరకపోతే పునర్వివాహం చేసి, ఆబాధ నంతంచేసుకుంటాడు మగపిల్లవాని తండ్రి. కూతురుకాపురానికి విఘాతమొచ్చినప్పుడు తండ్రిపడే పరితాపం అనంతమైనది."

రామారావు మాట్లాడలేదు. ఆతని మనస్సులో అణచివేయబడ్డ భావాలన్నీ స్వతంత్రించి పైకొచ్చి, మనస్సును కలచివేస్తున్నాయి.

పంతులుకూడా కొంతసేపటివరకూ మాటలాడలేకపోయాడు. ఆతనిమనస్సులోకూడా గొప్ప సంక్షోభం బయలుదేరింది. ఆత డాయువతీయువకులకు కలిగిన ఎడబాటుచూసి సహించలేడు. మహాదారిద్ర్య మనుభవింపవలసివచ్చినాసరే, రామారావు తక్షణం ఆయిల్లు వదలి వెళ్లి, సుభద్రను కలుసుకోవాలి. పాపం, ఆ పిల్ల బెంగపెట్టుకుని మంచం పట్టిందట! పదిరోజుల క్రితం ఆసంగతి తెలియజేస్తూ గణపతిరావువ్రాసిన ఉత్తరాన్ని తనభార్య—తనభార్యకాదు, తన ధనాన్ని మెచ్చించి కొనితెచ్చుకున్న పెనుభూతం — 'టక్కరి వేషం' అంటూ చింపిపారవేసింది! తమ్ముడు వదలి వెళ్లిపోవడం రామానికి క్షేమకరం అని తెలిసికూడా, ఆవృద్ధుడు తనఉద్దేశాన్ని తెలియజేయలేకపోయాడు. 'ఉద్ధరిస్తాం' అనిచెప్పి, పెంపకానికి తీసుకొచ్చిన కుర్రవానితో 'వెళ్లు' అని అనడం ఎలాగ?

"చిలకాగోరింకల్లాగ ఉండి సుఖంగా జీవితం గడుపదగిన మీదంపతుల సంసారంలో నిష్కారణంగా ఉపద్రవం సంభవించిందే అని ఏడుస్తున్నా" అన్నాడు పంతులు.

రామారావు పంతులుకేసి చూశాడు. ఆయన కండ్లు నీటితో నిండేయి.

"నాన్నగారూ, ఎందుకండీ ఈవిచారంఇప్పుడు? జీవి కెప్పుడూ సుఖంఅనేది లేదు. ఆతడు తెలివైన వాడై చేయవలసిన దేమిటంటే, తన కందరానిసుఖాల నన్నింటిని పరిత్యజించి, ఓరిమివహించి, మనస్సును సమాధానపరుచుకోవాలి. ఈరీతిగానే, నేను ఈరెండు సంవత్సరాలనుంచీ, నాహృదయానికి శాంతి సెలకొల్ప కలిగేను."

"అబ్బాయి, వెఱ్ఱివాడవై నిన్ను నువ్వే మోస గించుకుంటున్నావు. అనివార్యమైన వేదన కలిగి నప్పుడు, అన్యమార్గం లేదుకనుక అప్పుడు 'ఓర్పు' అనేదే శరణ్యము. అట్టిబాధను హృదయపూర్వకంగా సహిం చటం యుక్తమే. కాని మీవియోగదుఃఖము ఇతరులవల్ల కలిగినది కనుక అనివార్యమైనది కాదు. మీదాంపత్యము వలన కలుగవలసిన సుఖం నీకందరానిదికాదు. ఎన్నటి కైనా మీఅమ్మ నీవిధేయతవలన సంతుష్టి చెందు తుందేమో అనే తప్పుఅభిప్రాయాన్ని ఊతగాపుచ్చు కుని కాలాన్ని గడుపుతున్నావు. ఈఅభిప్రాయంతో, సహజంగా హృదయంలో ఉప్పొంగివచ్చే అనురా గాన్ని అణిచివేస్తున్నావు. ఎడబాటువల్ల కలిగే బాధని బలవంతంగా దిగమ్రింగుతూ, 'ఇది సహనము' అను కుంటూ మోసపోతున్నావు. నీవు 'ఓరిమి' అను కుంటూన్నది, అమ్మను సంతోషపెట్టాలనే పట్టుదల వల్ల శరీరంలో కలిగిన మైకము. మైకమనేది శాశ్వతంగా ఉండదు. ఆమైకము పోవడంతోటే, నువ్వు 'ఓర్పుతో అణచుకున్నాను' అనుకునే బాధలన్నీ ఒక్కమాటుగా విజృంభించి ద్విగుణీకృతమై అగుపిస్తాయి నీకు."

రామారావుకు, తన్నావరించుకొనియున్న జడ త్వంయొక్క స్వరూపం చిత్రింపబడింది. ఆత డొక దీర్ఘనిద్రలోంచి మేల్కొంచినట్లుగా భావించాడు. తండ్రికి దగ్గరగా జరిగి, తడబడే మాటలతో "నాన్న గారూ, నన్నేమి చేయమన్నా రిప్పుడు?" అన్నాడు.

"ఈక్షుద్రదేవతారాధనకు స్వస్తిచెప్పి, ఈఇల్లు వదలి, మాణిక్యంలాంటి నీభార్యను తీసుకుని, ఏపల్లె టూరో పోయి జీవనం చెయ్యి—"

రామారావు తక్షణమే లేచాడు. "సరే, నాకు సెలవు దయచెయ్యండి" అన్నాడు.

"నాయనా, పుట్టిన తలితండ్రులతోటీ, అన్న దమ్ములతోటీ పెరగనియ్యకుండా, పెంపకం అని తీసుకొచ్చి 'భాగ్యవంతుణ్ణి!' అనే అభిప్రాయాలు నీలో కలుగనిచ్చి, ఇంతకాలం వెట్టిచాకిరీ చేయించు కుని, తుదకు ఈరీతిగా నిన్ను పంపిస్తున్నా. 'ధనవం తుణ్ణి' అని ఒడలు తెలియక, పునర్వివాహం తలపెట్టి కష్టార్జితవిత్తాన్ని ధారపోసి బానిసత్వాన్ని అంట గట్టుకున్న నాకు ఈజన్మలో నీ ఋణాన్ని తీర్చుకో టాని కవకాశం లేదు. నాయనా, ఈ పాపాత్మునికి నిన్ను క్షమించమని వేడుకోటానికిహూడా హక్కు లేదు."

"నాన్నగారూ, మీరు విచారించవద్దు. ఈ నాలుగుసంవత్సరాలలోనూ మీరు నాక్షేమమే కోరు తో నాపైన చూపిన అవ్యాజానురాగము నాలో మీ యందు పితృభావాన్ని కలుగజేసింది. 'మీదంపతులలో ఒకరు నన్ను పుత్రునిగా భావించారు' అనే తలపు నే నిప్పు డుత్సాహంతో వెళ్లడానికి తగిన కారణ మవు తోంది."

రామారావుపలుకు లాయనకు మరింత వేదన కలుగచేశాయి. ఆవృద్ధుడు కుఱ్ఱవానివలె ఏడవటం మొద లెట్టేడు.

లోపలినుంచి జానకమ్మ వచ్చింది. "నే వెళ్లి వస్తా మరి" అంటున్నాడు రామారావు.

"ఎక్కడికిరా ఇప్పుడు?" అంది జానకమ్మ. పై మీద గుడ్డహూడా లేకుండా వెడదాం అని నిశ్చయించు కున్న రామారావునిచూస్తే, ఊరుప్రయాణమని ఎవరూ అనుకోడానికి వీల్లేదు.

"ఎందుకండీ. ఆకళ్లమ్మట నీళ్లు, ఎవరో చచ్చి నట్లు?" అంది జానకమ్మ మొగుడుకేసి చూసి.

"ఎవరో చచ్చారనికాదు ఏడుస్తోంట, నే చావ లేదనే!" అన్నాడు ముసలాయన.

ఉంటే, ఇంకా ఎలాంటి మాటలు వినవలసొస్తుందో అని, రామారావు మాటలాడకుండా అక్కడ నుంచి వెళ్లిపోయాడు.

సందుతిరిగి మెయిన్‌రోడ్డు కొచ్చాటప్పటికి తల వంచుకుని అటూ ఇటూ నడయాడుతోన్న గణపతి రావు అగుపించాడు.

"మామయ్యా!"

"నీతో కలిసి మాట్లాడితే ప్రయోజన ముంటుం దేమో అనివచ్చి, ఎందునిమిత్తమేనా ఇటు వస్తావేమో అని చూస్తున్నా."

"రైలుకు వేళవుతోన్నట్లుంది."

గణపతిరావు అల్లుడు తనకు రైలుకు వేళ అవుతోందని చెప్పడంలో 'మాట్లాడక్కర్లేదు. త్వరగా దయచెయ్య'మని సూచిస్తున్నాడేమో అనే సందేహానికి లోనై 'సుభద్రకి చాలా జబ్బుగా ఉంది. నిన్నొక్కమాటు తీసుకెళ్లి చూపిద్దామని వచ్చాను.' అన్నాడు.

"అవును. నడిచివెడితే స్టేషను కందుకోలేము." అంటూ జట్కావాణ్ని కేకలేశాడు రామారావు.

"ఎక్కండి."

గణపతిరావువెనకాల అల్లుడు బండిలో కురికేడు.

"ఇలాగే వచ్చేస్తున్నా వేమిటి?"

"ఇంతకంటే కూడా తెచ్చుకోడానికే ముందిక్కడ నాకు?"

## ౧౦

"అమ్మా, నాన్న రాలేదు టే?"

"వస్తారమ్మా, ఏదీ, ఇంకా రైలు వచ్చేవేళ అవందే."

"ఆయనకూడా వస్తారంటావా?"

"అతణ్ని తీసుకురావటానికే కాదూ మీనాన్న వెడత? తప్పకుండా వస్తాడు రామం ఈమాటు" అంది సుభద్రతో తల్లి. కాని 'ఆతడు వస్తాడా' అనే సందేహం ఆమెకూ కలిగింది.

"అమ్మా, పూర్వజన్మలో నేను మాఅత్తగారికి అత్తగారి ననుకుంటా. అప్పుడు నావల్లపడ్డ బాధలకి ఇప్పుడావిడ కసితీర్చుకుంటూంది కాబోలు."

"అమ్మాయి, నువ్వు మాట్లాడక పడుకోవాలి. ఇందాకా చూశావా, ఆయాసం వచ్చింది! కాస్తసేపు నిద్రపో."

"మామగారితో చెబుతే, ఆయన్ని ఒక్కమాటు ఇక్కడకు వచ్చేటట్లు చేస్తారుసుమా. నాన్నతో అలాగ చెప్పలేకపోయావా?"

"చెప్పేను. నాన్న తప్పకుండా తీసుకొస్తారు రామాన్ని. ఈరైల్లో వచ్చేస్తూంటారు ఈపాటికి."

సుభద్ర లేచికూచుంది మంచంమీద. "అమ్మా, ఆయన వచ్చినప్పుడు డాక్టరుగారిని రాకుండా చెయ్యాలి."

"ఏ?"

"నన్ను ఆయనతో మాట్లాడనియ్యరు డాక్టరు గారు!"

"సరేలే చూడొచ్చు. మందుకి వేళయింది. రెండోమోతాదు పుచ్చుకోవూ?"

"అమ్మా, నాకు మందక్కర్లేదే. చ్చాలా తేలిగ్గా ఉంది వంట్లో."

"మందుచ్చుకోడంచేతే తేలికగా ఉంది. ఆ మోతాదుకూడా పుచ్చేసుకో."

"అమ్మా, నీకు ఏపిచ్చిపట్టుకుంటేఅదేనే! నాకు ఈవేళనుంచి మందక్కర్లేదు. నారోగం కుదిరిపోతేనే!"

"వద్దంటే లేచికూచున్నావు మళ్లీని. ఇదుగో మందు; తాగిపడుకో."

సుభద్ర మందుతాగి పడుక్కుంది. "అమ్మా, ఒళ్లంతా చెమట పడుతోంది. ఏమిటో తాపంగా ఉంది" అంటూ ప్రక్కమీద అటూఇటూ దొర్లడం మొదలెట్టింది.

తల్లికేమీ తోచటంలేదు. సుభద్రకి తాపం ఎక్కువవుతోంది. తటాలున వీధిలోకెళ్లి, దాసీదాన్ని

పిలిచి డాక్టరుకు కబురుచేసింది. కూతురుమంచంమీద కూర్చొని, విసరడం మొదలుపెట్టింది. సుభద్ర దొర్లటం మానలేదు. ఇంతలో డాక్టరొచ్చాడు.

"సుభద్రా, ఏమిటి బాధ!"

"ఆయన్ని తీసుకొస్తానని వెళ్లి, అత్తగార్ని తీసుకొచ్చాడు నాన్న."

"నేను డాక్టర్నమ్మా! మీ నాన్నగారింకా రాలేదు......ఇదిగో రైలుకూసింది. ఓ ఇరవై నిముషాల్లో వస్తారు......"

అంటూ చల్లగాలి తగలడానికి, తలుపులన్నీ బార్లా తెరిచాడు. తల్లికళ్లమ్మట నీళ్లునిండుతున్నాయి. "ఇంతసేపూ సరిగ్గా మాట్లాడుతోనే ఉందండి......"

"అవునర్రోయ్. అదిగో రైలు. ఎన్ని దీపాలో! ఎంతజనమో! అంతా యాత్రికులే. ఆయ నిందులో ఎక్కడున్నారు?"

తల్లి దగ్గరగా చేర్చుకుంది కూతుర్ని. "అమ్మాయీ," అని ఏడవటం మొదలెట్టింది. "డాక్టరుగారూ, ఇంజక్షనేమైనా ఇస్తే?"

"మీరు కంగారు పడకండి." అంటూ డాక్టరు మంచుగడ్డ తెప్పించాడు రోగితలకి కట్టేనిమిత్తం.

వీధిలో గుర్రపుబండి ఆగింది. గణపతిరావు,ఆతని వెనుక రామం లోపలికొచ్చారు.

"అమ్మాయీ, ఇల్లాచూడూ. నేను! నాన్నని."




"రామం ఆమెను రెండుచేతులతోనూ పట్టుకుని,......బొంగురుపోతోన్న కంఠాన్ని సవరించుకుంటూ"

"ఆయనిందులో ఎక్కడున్నారు?"

రామం సుభద్రప్రక్కను కూచున్నాడు. "సుభద్రా, నన్నుచూడటం లేదూ? నేనే. నీ ప్రక్కనున్నా. ఇలాచూడు" అన్నాడు రామం.

సుభద్ర రామంకేసి వెర్రిదానివలె చూడ్డం ప్రారంభించింది. రామం ఆమెను రెండుచేతులతోనూ పట్టుకుని, "భయంలేదు, నేనే వచ్చేశా ఇక్కడికి" అన్నాడు, బొంగురుపోతోన్న కంఠాన్ని సవరించుకుంటూ.

డాక్టరు సోడానీటిని గ్లాసులోపోసి, రామానికందించి, "కొంచెం త్రాగించు పంతులూ" అన్నాడు.

"సుభద్రా, కొంచెం సోడా తాగుతావా?"

సుభద్ర భర్తకేసి చూస్తూనే రెండు గుటకలు వేసింది. "మళ్లీ వెళ్లిపోతారా?" అంది. "అబ్బే ఇంకెక్కడికీ వెళ్లను." సుభద్ర ప్రక్కనొదిగి, తండ్రికేసి చూసింది. "రామం ఇక్కడే ఉండిపోతాడమ్మా." అన్నాడు గణపతిరావు.

ఒకపావుగంట గడిచింది. డాక్టరు "నేను వెడతా" నన్నాడు. "దేవుడులా వచ్చారు బాబూ మీరు!" అంది సుభద్రతల్లి డాక్టరుతో. గణపతిరావు కృతజ్ఞత తెలియజేశాడు. వెళ్లిపోయే డాక్టరు, నవ్వుతో "రోగికి సహాయకారి అయిన డాక్టరు అదుగో మంచంమీదున్నాడు" అన్నాడు. ఆతడు ఆగి, కంఠస్వరాన్ని తగ్గించి, "అతనిరాక కొంచె మాలస్య మయినట్లయితే ఏమో ఏమైయుండునో!" అని పలికేడు.

౧౧

సుభద్రకి శరీరారోగ్యం చక్కబడిందని తెలుసుకున్నప్పుడు శ్రీనివాసరావుపంతుల కమితమైనటువంటి ఆనందం కలిగింది. "మీసలహా ప్రకారం నాడు తక్షణం బయలుదేరకపోయియున్నచో, మీ కోడలు నాకు దక్కియుండకపోవును." అని రామం ఉత్తరంలో ఉన్నవాక్యమును ఆయన చదువుకుని, "ఈ ఒక్క విషయంలోనైనా రామానికి భగవంతుడు సాయపడ్డాడు. కేవలం మృత్యుముఖంలోంచి ఇవతలపడింది సుభద్ర" అనుకున్నాడు.

కాని పంతులుకు మాత్రం దారుఢ్యం తగ్గిపోతూంది. వృద్ధాప్యానికి తోడు శ్లేష్మవ్యాధి ఆయనను పీడించుకు తింటూంది. క్రమక్రమంగా ఆయనకు వగ ర్పెక్కువవజొచ్చింది. కూచుని లేవలేకపోయేవాడు.

తుద కాతడు మంచం పట్టేడు. అతనికి చాకిరీ చెయ్యడంకోసమని నౌఖర్లు నియమింపబడ్డారు. ధనికులకు పరిచారకుల లోటుండదుకదా? కాని మరణోన్ముఖుడై ఉన్న ఆవృద్ధునకు ప్రేమవాక్యం ఒక్కటీ వినిపించటంలేదు. ఆతని ప్రయాణసన్నాహాని కుచితమైన పరిస్థితులేమీ ఏర్పడటం లేదు. 'ఇంతబ్రతుకూ బ్రతికి చివరికి ఇంటివెనక్కాల చస్తున్నా'ననే తల పాతణ్ని అప్పుడప్పుడు బాధించేది. అటువంటి సమయాల్లో, రామాన్ని రప్పించుకోవా లనే తల పాతనికి కలిగేది. కాని చాలాకాలంనుంచి దూరంచేయబడి, ఇప్పుడుచచ్చి బ్రతికిన సుభద్రనుంచి రామాన్ని విడదీయడాని కాతని మన స్సొప్పలేదు. అంతేకాకుండా 'ఆతని కేమీ ముట్టచెప్పలేకపోయాం' అనే చింత ఆయనను అనుక్షణం బాధపెడుతోండేది. అట్టి పరిస్థితుల్లో మంచం పట్టిన తనకు వెట్టిచాకిరీ చేయడానికని కుమారుణ్ని ఆహ్వానించటం ఆయనకు వెగటుగా తోచడమే కాకుండా, తనకు హక్కుకూడా లేదనే అభిప్రాయాని కొచ్చి, ఏదోవిధంగా ఈక్షుద్రజీవితానికి అంత్యదశవ స్తేనేచాలని చావు కెదురుచూస్తున్నా డాయన.

ఈస్థితిలోఉన్న శ్రీనివాసరావుపంతుల్ని కాస్త యోగక్షేమం కనుక్కువెడదామనే ఉద్దేశంతో ఒకనాటి మధ్యాహ్నం రావుసాహేబు సుబ్రహ్మణ్యాం పంతు లొచ్చాడు. సుబ్రహ్మణ్యంగారు రిటైర్డు డిప్యూటీ కలెక్టరు. శ్రీనివాసరావుకి బాల్య స్నేహితుడు. వాళ్లిద్దరూ బాతాఖానీ మొదలెట్టి ఆ మధ్యాహ్నం గతం అంతా ఒక్కమాటు వెళ్లబోసుకున్నారు. చిన్నతనంలో వాళ్లు గోదావరిలో ఈతాలాడినరోజులు జ్ఞప్తి కొచ్చాయి.

"రఘురామయ్యదోయ్ ఈతంటే! మధ్య తిప్పదాకా వెళ్లి సునాయాసంగా తిరిగొచ్చేవాడు. ఆ సరదా నలభైయేళ్లొచ్చినా పోలేదు ముండావాడికి. కాని అదే వాడికొంప తీసేసింది చివరికి" అన్నాడు సుబ్రహ్మణ్యంగారు.

రఘురామయ్య సహాధ్యాయులలో గజయీతగాడని పేరుపడి చివరికి గోదావరీస్రవంతికి ప్రాణాలర్పించినవాడు. ఇరవై ఏళ్లక్రితం ఈవిధంగా మరణించిన ఆ బాల్యస్నేహితుని ప్రసంగంవచ్చినప్పుడు శ్రీనివాసరావు మనస్సు కొంచెం విషాదానికి లోనయింది.

"అతనికొడుకు చిదంబరం ఎక్కడున్నాడో ఇప్పుడు? అన్నట్లు ఆతని చదువుకు నువ్వు చాలా సహాయం చేసినట్లున్నావు."

"నాసహాయానికేంగాని, ఆతడు చాలా అదృష్టవంతుడు. ఇప్పుడు గుంటూరులో ఎక్జిక్యూటివ్ ఇంజనీయరుగా ఉంటున్నాడు."

ఈవిధంగా ఆవృద్ధులిద్దరూ చాలాసేపు 'పిచ్చాపాటీ' కబుర్లు చెప్పుకోవడం అయాక రావుసాహేబు మిత్రునిదగ్గర శెలవుపుచ్చుకున్నాడు.

ప్రసంగవశాత్తూ జ్ఞప్తికివచ్చిన చిదంబరం ఆ రాత్రిఅంతా శ్రీనివాసరావుతలపులలో సంచరించాడు. అవసరమవుతే, అవకాశ మున్నంతవరకూ ఉపకారం చేసే చిదంబరంమాట ఇంతవరకూ స్మరణకే రానందుల కాతడెంతో ఆశ్చర్యపడ్డాడు.

మరునాడు ఆయన, రామానికి తనదేహస్థితిని గురించి తెలియజేస్తో 'ఒక్కమారు బయలుదేరి రావలసిన' దని జాబువ్రాయించాడు.

౧౨

"ఏమే, నాన్నకి వంట్లో చాలా జబ్బుగాఉందిట! ఉత్తరం చూశావుకదూ? మరిఏమంటావు?"

సుభద్ర ఏమీమాట్లాడలేదు కొంతసేపటివరకూ. "పోనీ నన్నుకూడా తీసుకెళ్లకూడదా?" అంది చివరికి.

అందుకు రామం "అవును, ఈసమయంలో మరణశయ్యమీద ఉన్న మానాన్నకి నిన్ను తీసుకువెళ్లి ఓమాటు చూపించడం బాగానే ఉంటుంది కాని—."

"కాని?" అని సుభద్ర రామంకేసి చూసినవ్వింది.

"అబ్బే, ఏమీ లేదు. నీకింకా వంట్లో దారుఢ్యం పూర్తిగా చేరలేదని."

అది సకారణంకాదని రామారావుకు తెలుసును. కాని అంతకంటే ఏమీ చెప్పలేకపోయాడాతడు.

పరిస్థితులెరుగున్న సుభద్ర తనప్రయాణప్రశంసను మార్చి, "మీఅమ్మగారు మీరు మళ్లీ అక్కడికు రావడం ఇష్టపడతారా? మీరు వచ్చేటప్పుడు ఆవిడతో చెప్పనైనా లేదుటకూడాను!" అంది.

"ఇష్టమైనా కాకపోయినా, నేనిప్పుడు వెళ్లటం నావిధి."

చిన్నతనంనుంచీ తల్లిదండ్రుల చెప్పుచేతల్లో పెరిగి యుక్తాయుక్తములు తెలిసినసుభద్ర తనభర్త అప్పుడు తన్ను వీడి వెళ్లిపోవలసివచ్చిన అగత్యాన్ని గ్రహింపక పోలేదు. కాని మళ్లీ ఆయింటికివెడితే ఆయన తన్ను మరచిపోతారేమో అనేభయ మాకోమల హృదయాన్ని బాధించింది. రామం ఆమెభావాన్ని గ్రహించి, దగ్గరగాతీసుకొని "నేనొచ్చి, అప్పుడే రెండునెలలవుతోందికదా, నాలోవచ్చినమార్పింకా కనిపెట్టలేదూ నువ్వు? ఆయనకాస్త నిమ్మళంగా ఉండడంచూసి వచ్చేస్తా. ఇంకఏదో జీవనోపాధికోసం ప్రయత్నంచెయ్యద్దూ మరి?" అన్నాడు. ఒకనిముషం గడవనిచ్చి, "నీకు జబ్బుగాఉందని విన్నప్పుడు నన్నక్కడ ఒక్కక్షణం నిలవనిచ్చాడు కాదాయన. అల్లాంటప్పుడు ......" అంటూ రామం ఆగేడు.

సున్నితహృదయంగల సుభద్ర మామగారికి తనపైనగల అనురాగాన్ని తలుచుకుంటూ తానుచూపిన స్వార్థపరత్వానికి సిగ్గుపడింది. "అవునండీ. మీరుతప్పకుండా బయలుదేరివెళ్లాలి" అంది.

రామం మెయిల్లో రాజమహేంద్రవరం చేరుకున్నాడు.

## ౧౩

"నాయనా, నాకాల మింక రోజులమీదుంది. నాజీవితం దుఃఖభరితమే అయినప్పటికీ, నీభార్య పుట్టెడురోగంవచ్చి బ్రతికిందన్నవార్త విని ఎంతో ఆనందించాను. దానితో సుఖంగా సంసారం గడుపుకోటానికి తగినంత ఆధారం ఏమైనా నీకు కలిగినట్లయితే, నీబ్రతుకంతా నామూలాన్ని నిస్సారంగా చేయబడ్డదనే విచారంతో బాధపడే నేను ఏదో ఒకవిధమైన మనశ్శాంతితో ప్రాణాలు విడిచేస్తాను. భగవంతుడు నాకట్టి అవకాశాన్నికలిగించి, సర్వం అంధకారంలా ఉన్న నా అవసానకాలంలో ఒకతటిల్లతను సృష్టిస్తున్నాడు. గుంటూరులో చిదంబరం అని ఎక్జెక్యూటివ్ ఇంజనీ రున్నాడు. నా ప్రాణమిత్రుడైన ఆతనితండ్రి అకస్మాత్తుగా చనిపోతే, ఆతనిచదువు కభ్యంతరంరాకుండా నాసహాయం అతడు కొంచెంపొందవలసొచ్చింది. ఆతడు చాలావిశ్వాసం కలవాడు. నేనంటే వాళ్లతండ్రిలాగే చూసుకొంటాడు. అందుచేత మన కుపకారం అంటే తప్పకుండా చేస్తాడు. ఉన్నతోద్యోగి అయిఉండడంవల్ల, నీకేదైన ఒకపని ఇప్పించడాని కవకాశ ముందతనికి. ఏమిటో ఇన్నాళ్లనుంచీ నాకాప్రసక్తే పోయిందెందుచేతో. ఇప్పుడైనా ఆలస్యం చెయ్యకుండా ఆతణ్ని కలుసుకోడం మంచిది. అందుచేత ఓఉత్తరం వ్రాస్తాను. అదిపుచ్చుకుని బయలుదేరి వెళ్లు" అన్నాడు శ్రీనివాసరావు రామంతో.

జననికి తనయందు జనించిన వైముఖ్యభావం వేళ్లుపారుకొని బలపడుతోన్నకొద్దీ జనకునకు తనపై గల వాత్సల్యం వృద్ధిఅవుతోందన్న తల పాయువకుని నయనాలకు నీటితెరల కల్పిస్తోంటే ఆతడు లేచి కలం, కాగితం తెచ్చాడు. చిదంబరమునకు వ్రాయవలసిన లేఖ పూర్తి అయింది. వణికేచేతులతో శ్రీనివాసరావు ఆఖరు పర్యాయము కలాన్ని పుచ్చుకుని ఉత్తరంలో సంతకం పెట్టేడు.

"తక్షణం బయలుదేరి గుంటూరువెళ్లిపో. ఏమి జరిగినదీ ఉత్తరంవ్రాయి." అన్నాడాయన.

తాను ఉత్తరంవ్రాస్తే చదువుకొనేవరకూ ఆవృద్ధుడు జీవించిఉంటాడా అనేసందేహం కలిగింది రామానికి. ఏమి జరగడాని కేముందీ? మీ యీఉత్తరం చూసినప్పుడు ఆయన నాకు చేయదగిన ఉపకారం తప్పకుండా చేస్తాడు. మీమనస్సులో ఇంక ఆవిషయమైన తలపు లుంచుకోకండి నాకేమీ లోటులేకుండా జీవితం వెళ్లిపోతుంది" అన్నాడు రామం. తండ్రిదేహస్థితి కొంచెం చక్కబడకుండా, ఆత డక్కడనుంచి ఎలా వెడతాడు!

కాని ఆవృద్ధునిదేహస్థితి మరి బాగుపడలేదు. వారమురోజులు గడిచినపిమ్మట వేకువజామున ఆతనిగ్రుక్కడుప్రాణములూ ఆదేహమును విడిచిపోయినవి.

## ౧౪

జనకుని కంత్యక్రియలు జరిపేడు రామం. ఇంకతా నా ఇంటిలో ఉండవలసిన పనిలేదు. వీలుకూడా లేదు. శ్రీనివాసరావుమరణంతో త న్నక్కడుండేటట్లు చేసే ప్రేమబంధ మొకటీ తెగిపోయింది. తల్లి కూడా, 'ఇక నీదారి నువ్వు చూసుకోవలసిందే' అని చూచాయగా తేల్చేసింది. ఆమెఅన్నగారు సకుటుంబీకుడై రాజమహేంద్రవరం రావడానికి ఏర్పాటు జరుగుతోంది. అందుచేత పదమూడవనాడే బయలుదేరి రామం అత్తవారింటికి వెళ్లిపోయాడు.

అక్కడికి వెళ్లినప్పటినుంచీ ప్రతిరోజూకూడా 'గుంటూరు వెళ్లాలి' అనుకుంటూండేవాడు. కాని ఏ రోజుకారోజే అశ్రద్ధ అయిపోయేది. అతడు సాధ్యమైనంతత్వరలో ఉద్యోగాన్ని సంపాదించుకుని ఎక్కడో స్థిరపడాలనే తలం పాతణ్ని తొందరపెడుతోనే ఉంది. కాని ఓచిన్నభయం ఆతణ్ని పీక్కు తినేది. ఆ ఉత్తరం పట్టుకెళ్లి చూపిస్తే, ఆ చిదంబరంపంతులు 'ఇంత ఆస్తిపరుడికి ఇంకా ఉద్యోగ మెందుకో! తీరా ఇల్లాంటివాడి కేగుమాస్తాపనో ఇస్తే సరిగ్గా చేస్తాడా!' అని సందేహించక మానడు. అప్పుడు, ప్రసంగవశాత్తూ

తనయొక్క హైన్యస్థితిని ఆయనకు తెలియచేస్తో, తల్లి పేరఉన్న డబ్బుమీద తనకేమీ హక్కు లేదనిన్నీ, తన కండులో ఏమాత్రంకూడా ముట్టే పరిస్థితులు లేవనీ, అందుచేత జీవనోపాధికి ఏదో ఉద్యోగం సంపాదించడం అత్యవసరమనీ తెలియచెప్పవలసొస్తుంది ఆ ఇంజనీయరుకి! ఇదంతా, ఆఉద్యోగిముందట వెళ్లబోయడం భావ్యంకాదని తోచింది రామానికి ఎందుచేతో.

కాని క్రమక్రమంగా "ఏదో కట్టిఅభిమానం పెట్టుకుని, అత్తవారింట్లో కూచోడమేమి" టను కున్నాడు. తాను పెంపకానికెళ్లగా లభించినది తండ్రి ఆర్థికమే అని దగ్గరబంధువు లందరికీ తెలిసినవిషయమే. కనుక ఎటువంటి సందేహం పెట్టుకోకుండా తక్షణం బయలుదేరి గుంటూరు వెళ్లాలి.

రామారావు ప్రయాణప్రయత్నం చేస్తున్నాడు. గణపతిరావు బజారునుంచి వచ్చి, "రామంవిన్నావా?" అన్నాడు.

"ఏమిటి?"

"ఆర్బత్ నాట్ కంపెనీ ఫెయి లయిందిట!"

"ఆ!" అని రామం చకితిలపడ్డాడు. ఆతని చెవుల నతడు నమ్మకోలేకపోయాడు. ఆతనికి పదినిముషాల దాకా నోట,మాటరాలేదు.

"ఏమిటినాన్నా" అంటూ సుభద్ర అక్కడికొచ్చి, భర్తయొక్క నిశ్చేష్టతచూసి నిలబడిపోయింది.

గణపతిరావు నాలుక కరచుకున్నాడు. ఆర్బత్ నాట్ బ్యాంకు దివాలాతీసిందన్న వార్త తన అల్లుడి కంతబాధ కలుగచేస్తుందనుకోలేదు. ఆత డేమీ తోచక "ఇంతకీ ముసలాయన అదృష్టవంతుడు. ఈ దుర్వార్త తెలియకుండా వెళ్లిపోయా డాబ్రాహ్మడు"అన్నాడు.

"ఏదుర్వార్త నాన్నా?" అని అడిగింది సుభద్ర. "మీ మామగారు డబ్బునంతనీ వడ్డీకి వేసిన బ్యాంకు దివాలాతీసిందటమ్మా."

"ఎక్కడుందీ బ్యాంకు?"

"చెన్నపట్టణంలో."

"అంతదూరం పట్టుకెళ్లి ఎందుకు పోశారో ఆ డబ్బంతా?"

"ఆబ్యాంకుఅధికారి చాలాగొప్పవాడు. 'సర్' అనే బిరుదు సంపాదించి 'చాలా ఘరానామనిషి' అనిపించుకున్నవాడు. తక్కిన బ్యాంకులకంటే, ఈ బ్యాంకులో వడ్డీ ఎక్కువ ఇస్తారనే అభిప్రాయంతో, పెద్దపెద్ద ఉద్యోగస్థులూ, డిప్యూటీ కలకర్టూ సంపాదించుకున్న డబ్బంతా అందులో వేశారు. వాళ్లంతా ఒక్కమాటుగా 'పాపర్ల'యి పోయారు. రావు సాహేబు సుబ్రహ్మణ్యంపంతులు సుమారు నలభైరెండు వేలదాకా వేశాడుట!"

"ఆడబ్బంతా పోయినట్లేనా అలాగయితే?" అంది సుభద్ర.

రామారావు సుభద్రకేసీ, మామగారివైపూ వెర్రివానిలాగ చూస్తూ, అలాగే ఉండిపోయాడు.

"రూపాయికి దమ్మిడీయో, రెండు దమ్మిడీలో వస్తుంది."

"అవుతే నాన్నా, మామగా రెంత వేశారో!" అంది సుభద్ర.

"ఎనభై వేలపయినే కాని తక్కువకాదు."

రామారావునకు కండ్లలో నీరు చేరింది. ఆతని హృదయం బరువైంది. 'ఎంతలో ఎంతమార్పొచ్చింది? నేటితో మా అమ్మకి పేదరికం సంభవించిందన్నమాట. గడచిన ఇరవై యేళ్లనుంచి సుఖజీవనాని కలవడిన ఆమె గతి ఏమిటింక? ఆమెకు నూతనంగా సంభవించిన ఘోరవైధవ్యానికి తోడు ఇటువంటి దారుణమైన ధననష్టం కలిగించిన భగవంతుణ్ని ఏమనాలి? తగిలిన వేలుకే తగిలింది దెబ్బ' అని విలపించా డాతడు.

చేతిలోని తినుబండారాన్ని కాకి తన్నుకుపోతే రోదనంచేసే బాలునివలె విలపిస్తోన్న రామాన్ని చూసి, గణపతిరా వాశ్చర్యపోయాడు. జానకమ్మ కుండే సొత్తులో ఒకపైసా అయినా తనది కాదని ఎరుగుండీ కూడా ఎందుకిల్లా వాపోవడం తన అల్లుడు? ఇతరుల

కాపదలొచ్చినప్పుడు సానుభూతి కనపర్చటం ధర్మమే. కాని రావుసాహేబు సుబ్రహ్మణ్యంపంతులయెడల ఎంతసానుభూతి చూపేమో అంతకంటే ఎక్కువగా విచారించక్కర్లేదు, జానికమ్మధనం పోయినప్పుడు' అని ఆతని అభిప్రాయం.

గణపతిరావు లోనికిపోయాక, సుభద్ర ఖిన్నురాలై యున్న భర్తదగ్గరకొచ్చి, 'పోనీ రేపు వెళ్లకూడదూ ఆకూరు?' అంది. అంతవరకూ ఏమీ తోచక కూచున్న రామారావు ఏదో ఓనిశ్చయానికి వచ్చినట్లు తెలియ చేసే శిరఃకంపంతో చివాలునలేచి, సూటుకేసు చేత పుచ్చుకున్నాడు. 'ఇదిగో, వెడుతున్నా. ఏమయినదీ ఉత్తరం వ్రాస్తాలే' అంటూ వెనక్కి తిరగకుండా స్టేషనువైపు నడచిపోయాడాతడు.

## ౧౫

తనధనం అంతా తనకు దూరమయిపోయిం దని విన్నజానకమ్మ 'బారు'మని ఏడవడం మొదలెట్టింది. ధనమూలమైన ఈవిశాలప్రపంచంలో, ఘోరదారిద్ర్యంలో మేల్కాంచిన ఆమెకు నిలువడానికి తావు లేదు.

ఆమెకు రెండవతూరి పరామర్శ ప్రారంభమయింది. ఇరుగుపొరుగమ్మలు, శోకజలధిలోపడి కొట్టుకొంటూన్న ఆమెను ఓదారుస్తో 'నీకేమమ్మా నిక్షేపంలాంటి అన్నగారున్నాడు. వెళ్లిపోయి, పుట్టింట హాయిగా ఉండొచ్చు' అన్నారు.

పిల్లల్ని, పెళ్లాన్ని తీసుకొనివస్తానని చెప్పివెళ్లిన అన్నగారు నాడో, మర్నాడో అక్కడికి చేరుకుంటాడు. పోయినసిరితో ఆతణ్నేలాగా!ఆహ్వానంచెయ్యడం? సంసారంతో వచ్చి ఆపట్టణంలో స్థిరపడదామనుకొన్న ఆతడు, వచ్చినదారినే వెళ్లిపోవడమే కాకుండా, నిర్భాగ్యురాలైన తన్నుకూడా వెంటపెట్టుకుపోవలసొస్తోంది. తాను విధవరాలైపోవడమే కాకుండా పొరుగిరట పడిఉండవలసొస్తోంది. ఎంతదారుణం!

క్రమంగా ఆమె శోకాన్ని దిగమింగుకుంటూ, 'కానున్నది కాకమానదుకదా' అనుకుని గుండెనిబ్బరం చేసుకోడానికి ప్రయత్నించింది.

జానకమ్మ ఏరోజు కారోజు సోదరుని ఆగమనాని కెదురుచూస్తోంది. అనుకున్ననాటి కయిదారు రోజులు గడిచిపోయాయి. ఆఖరి కాతనివద్దనుండి జాబొకటి వచ్చింది. అందులో ఆతడు తాను రాజమహేంద్రవరంనుంచి ఇంటికివెళ్లినపిమ్మట తనఅభిప్రాయం మార్చుకోవలసొచ్చిందని తెలియచేశాడు. "చెల్లెలికి దత్తపుత్రుడుండగా, అతణ్ని త్రోసిరాజని తాను సకుటుంబంగా వెళ్లి చెల్లెలిగారింట కూర్చోడం లోకసమ్మతమైన పనికాదు." అనేకారణం తనప్రయాణాన్ని ఆపు చేసిందని సూచించాడు.

'ఇంకా వాళ్లకు తెలియనేలేదా?'అనుకుంది జానకమ్మ. తెలియకపోవడమేమిటి? పరశురామప్రీతి అవుతోన్న పల్లెగూడెంలో నలుదెసలా వ్యాపించే భయంకరాగ్నికీలలవలె దేశమంతటా ఆక్రమించుకుపోయిన ఆర్బత్ నాట్ కంపెనీ దివాలాసంగతి తనఅన్నకు తెలియకుండా ఎలావుంటుంది? అన్నగారు ఇంటికివెళ్లి ఉద్దేశంమార్చుకోవడానికి కారణం లోకాపవాదకాదు. లోకాపవాదకు వెఱపుగలవాళ్లే తనవాళ్లవుతే, తనకు అటువంటి ముసలిమగణ్ని ఎందుకు కట్టిపెట్టేరు? ఇపుడు వేదాంతం చెపుతోన్న తనఅన్నగారీవరలో తమయింట మసాలతరబడి మేసి, తుదకు క్రొత్తబట్టలు కట్టుకొని ఎన్నిమాట్లు వెళ్లలేదు? అప్పుడీ లోకం అంటే ఉన్న భయం ఏమైంది? తాను ధనికురాలైన విలంతువుగనుక తనధనముపై ఆధారపడి ఉండవచ్చునన్న మనోనిశ్చయంతో నిర్వక్రమించిన ఆతడు, తనధనమంతా గంగలో కలియడంవల్ల, ఆధారభూతం అవుతుందనుకున్న తాను పెనుభూతమై ఉదరపోషణార్థమై ఆతణ్నే పీక్కుతింటుదేమో అన్నభయంచేత, అన్న భయపడ్డాడు కాని లోకాపవాదభయ మేమాత్రం లే దాతనికి.

జానకమ్మ సోదరుని సంకుచితస్వభావాన్ని గ్రహించి ఉగ్రురాలయిపోయింది. కాని ఏమిలాభము? ఆమె జీవన్మృత, నిర్ధనురాలు, తృణప్రాయంగా చూడబడుతుంది.

ధనము సర్వార్థసాధనము. బంధువుల నాకర్షింపజేసే శక్తి అందులోఉంది. రెండుఇటుకల్ని ఐక్యమయేటట్లు చేసే 'సిమెంటు'లాగ ధనం రెండువ్యక్తుల్ని దగ్గరగా తీసుకొస్తుంది. ధనంతో పాటు సంబంధాలుకూడా అదృశ్యమవుతాయి. ఇది లోకప్రవృత్తి.

ఇంక తనకు గత్యంతరమేమిటని జానికమ్మ తలపోసింది. ఆ తల పామెమానసవీథిలో చొరబడినప్పుడామెకు జగత్తంతా అంధకారమైపోయింది. తనశిరస్సుపైన పూలవానకురిసి తనకు స్వాగతమిస్తారన్న బంధువుల గృహాలన్నీ మూసివేయబడ్డ తలుపులతో అవుపించాయి ఆమెకు. తానొంటరిగానున్న ఆవిశాలభవనాన్ని నలుదెసలా ఒకమా రామె పరికించింది. ఆమె ఒడలు కంపించింది. ఆయింటికద్దెనివ్వటాని కామెకు స్తోమతేది? ఆగృహంలో ఒక్కక్షణం ఉండడాని కామెకు త్రాణ లేదు. శీఘ్రంగా వదిలెయ్యాలి ఆయిల్లు. వదలిఎక్కడకి పోవడం? సంసార మహాసాగరాన్ని ధనమనే నాకా సహాయాన్ని సురక్షితంగా దాటి దరి జేరగలనన్న ధైర్యంతో ఉన్నఆమె అనాక అకస్మాత్తుగా భిన్నమై పోవడంచేత నీటిలోపడి కొట్టుకుంటూ గుటకవేస్తోంది.

రెండుదినాలు అతిమందంగా గడిచాక, జానకమ్మకు మఱొకజాబు వచ్చింది. దాన్ని వ్రాసినవాడు రామారావు. ఆమె కవరునుచింపి చదివింది.

ఆతడు తన్ను తండ్రి అవసానకాలంలో పిలిపించి, తనకుద్యోగం వచ్చేనిమిత్తమై చిదంబరంపంతులుకు శిపార్సుచేస్తో వ్రాసిఇచ్చిన ఉత్తరాన్నిగురించి తన జాబుయొక్క మొదటిభాగంలో తల్లికి తెలియజేశాడు. చిదంబరంపంతులు ఆపెద్దకుటుంబానికి అకస్మాత్తుగా సంభవించిన కష్టాలకు అపరిమితమైన సానుభూతి కనపరుస్తూ, తనకు తగినటువంటి ఉద్యోగాన్ని చూసి ఇప్పిస్తానని వాగ్దత్తంచేశాడు.

జానకమ్మ మొదటిపేజీముగించి రెండవపుట కొచ్చింది.

"తగిన ప్రయత్నాలన్నీజరుగుతున్నాయి. 'ఇంటికివెళ్లి ...సంసారాన్ని లెచ్చుకో. ఈ లోపున ఆర్డరుకాగితం తయారు చేయిస్తాను.' అని పంతులుగారు నాతో ఈ ఉదయం చెప్పేరు. సాయంకాలంబండిలో బయలుదేరుతున్నా. కాని రాజమహేంద్రవరంలో ఇప్పుడు దిగను. ఏకంగా పిఠాపురంవెళ్లి, మీకోడల్ని తీసుకొని రాజమండ్రీ ఎల్లుండి ఉదయానికి వస్తాను. ఈ లోపుగా, నీవు ప్రయాణసన్నాహం చేయడానికని ఈ ఉత్తరంవ్రాస్తున్నా.

అమ్మా, మనకు సంభవించిన రెండు కష్టాలూ కూడా సామాన్యమైనవికావి. కాని ధైర్యం వహించి, సహించుకోవడంకన్న గత్యంతరం లేదు. కష్టాలెల్ల కాలం ఉండవు. బెంగపెట్టుకోవద్దు.

గుంటూరు, } కుమారుడు,
౨౩-౧౨-౧౯౦౬. } రామారావు."

జానకమ్మ భర్త దివంగతుడైనప్పటి దృశ్యాన్ని కండ్లారా చూసింది. తన ధనరాశి దగ్ధమైపోయిందన్న దుర్వార్త చెవులారా వింది. కాని ఆదుఃఖాలను ప్రయత్నించి దిగమ్రింగుకొ కలుగుతోంది ఆమె. రామం వ్రాసిన జాబును చదవటం ముగిసినపిమ్మట చెప్ప నశక్యమై, అమిత మైనటువంటి బాధ ఒకటి ఆమె హృదయాన్ని ఆవరించుకుంది. ఆదుర్భరహృదయ భారాని కామె రూపమియ్యలేక పోయింది. ఆమె నేల కొరిగిపోయి, దొర్లడం ప్రారంభించింది.

విగతభర్తృకయై, దరిద్రదేవతయొక్క భయంకరమైన కౌగిలిలో చిక్కి పెనగులాడుతోన్న తన్ను చేరి "కుమారుణ్ని!" అని రక్షించటాని కుద్యమిస్తున్నాడు రామం. ఆతడు తమతో ఉన్నంతకాలం తాను ఆతణ్ని పాలూ పెరుగూ పోసి పెంచినమాట నిజమే. కాని మాంసాభిలాషతో ఎప్పుడో ఓనాడు తుదముట్టింపబడుటకే ఉద్దేశించబడి పెంచబడే మేకలూ మొదలైన సాధుజంతువులకంటే నిర్భాగ్యస్థితిలో పెరిగేడు రామం. ఆజంతువులను పెంచి, చంపడంలో మాంసాసక్తి కనబడుతోంది. కాని ఈసాధు ప్రాణిని, ఇతనికి సంబంధించిన ఇతరసాధుప్రాణులనూ,

# కాశీచిత్రములు

(R. N. N. R.)



౧. దశాశ్వమేధ ఘట్టము



౨. మరియొక ఘట్టము



3. కేదారఘట్టము



౪. మణికర్ణికాఘట్టము

'హింసిద్దాం' అని పూనుకున్న అతిక్రూరమైన తనఉద్యమానికి కారణం అగుపించదు. అకారణంగా హింస కొడబడ్డ తాను రాక్షసికం టే అధమురా లన్నమాట. తనకా ఆఉత్తముడు కుమారుడు? నూరు జన్మలు తల క్రిందుగా తపముచేసినా అటువంటి తలపుకూడా తన మనస్సులో [illegible]
కన్నతల్లి [illegible]
తనవంటి [illegible]

జానకమ్మకు [illegible]
రామం కాదేమో అనే [illegible]
మళ్లీ ఒకమాటు చదివి చూసుకుంది. అనుమానమేమిటి? రెండురోజులలో తన కోడల్ని తీసుకునివచ్చేస్తున్నాడు రామం. ఏముఖంతోటి తను వాళ్లిద్దర్నీ ఎదుర్కొనకలదు!

ఆమె ఉత్తరంకేసి చూస్తూనే ఉంది. అందులో ఉన్న ప్రతీఅక్షరం క్రమంగా పరిమాణంలో పెద్దదవుతో నలుప్రక్కలా ప్రాకిపోతోన్నట్లుగా తోచిందామెకు. ఆమెకు ప్రతీఅక్షరంలోంచీ ఏదోముఖం తొంగిచూస్తూన్నట్లుగా అయింది. అదిగో సుభద్రే. సుభద్రా! ఈమర్యాగ్గురాలిమీద కసితీర్చుకో. సలసలకాగే నూనెలో నన్ను ముంచు. వేదన తెలియచేస్తానేమో చూడు...... అదుగో, నన్ను వద్దంటే ఎందుకూ అలాపిలుస్తావు? మీరిద్దరూ ఏ బాధ పెట్టినా ఒప్పుదలే కాని, 'అమ్మ', 'అత్తా' అనిపిలుస్తే సహించలేను... సుభద్రా! సుభద్రా! ఏమమ్మా, మాట్లాడవు? అవును. ఎందుకుమాట్లాడాలి? నిన్నెప్పుడైనా మనఃస్ఫూర్తిగా పలుకరించానా? అదుగో రామం వస్తున్నాడు. ఎందుకూఆనవ్వు? నామీద పగసాధించటానికొచ్చారని తలుస్తోన్న నాభ్రమచూసి నవ్వుకుంటున్నారు. మీ సాధుహృదయాలలో 'పగ' అనే విషపువిత్తనానికి స్థానంలేందే.



"రామారావు పళ్లెంలోఉన్న బియ్యంమీద ఆనామాక్షరాలను చిత్రించాను."

ఈవిధంగా ఆమె కలతనిద్రలోవలె ఆ రెండు దినాలూ గడిపింది.

౧౬

"అమ్మా!" అని తలుపుదగ్గర పిలుపు వినబడింది. జానకమ్మ తలుపు తెరిచింది. సుభద్ర మొదట లోన ప్రవేశించింది. ఆమె రక్తహీనమై యున్న జానకమ్మ

ముఖంచూసి, "అత్తయ్యా!" అంది. నిలబడలేకుండా ఉన్న జానకమ్మను చూసి పడిపోతుందనే అభిప్రాయంతో సుభద్ర ఆమెను పట్టుకుంది. జానకమ్మ కోడల్ని కౌగిలించుకుని ఏడవడం మొదలెట్టింది.

బండివాణ్ణి పంపి, రామం లోపలి కొచ్చాడు. "రామం!" అంది తల్లి.

"ఏమమ్మా!"

ఆమె మాటలాడలేకపోయింది. ఈ రెండుదినాల నుంచీకూడా, వాళ్లు రావడంతోటే తనుచేసిన మహాపరాధమునకు క్షమార్పణ కోరుకోవాలని నిశ్చయించుకుంది. ఎందుచేతో ఇప్పుడామె 'నన్ను క్షమించరూ?' అని అడుగలేకపోయింది. ఆమెకు దుఃఖం పొంగి వస్తూంది.

రామం ఆమె నాస్థితిలో ఎన్నడూ చూడలేదు. ఆతనిహృదయం నీరయిపోయింది. 'అమ్మ, జరిగిన దంతా మరచిపోవాలి' అన్నాడు.

సుభద్ర నీళ్లుపోసుకొని వంటచేసేసింది.

సామానంతా చకచకా సర్దబడింది. మరి రెండు రోజులయాక రామం తల్లినీ, భార్యనూ వెంటబెట్టుకుని గుంటూరు చేరేడు.

## ౧౭

సుమారు సంవత్సర మయాక, ఒకనాడు గుంటూరులో ఓవర్‌సీర్ రామారావుగారింట 'బాలసారె' అని బ్రాహ్మలంతా చేరేరు. బాలెంతరాలను సుభద్ర చంటిబిడ్డను ఒడిలో నుంచుకుని, రామారావుప్రక్కన పీటమీద కూర్చుంది. బాలికకు నామకరణ సమయమేతెంచింది. పురోహితు "డేమి నిశ్చయించా" రని ప్రశ్నించాడు. ఆదంపతు లిద్దరినోళ్లమ్మటా కూడా 'జానకీదేవి' అన్నశబ్దం ఒక్కమాటుగా జనించింది. రామారావు పళ్లెంలోఉన్న బియ్యంమీద ఆనామాక్షరాలను చిత్రించాడు. కొంచెందూరాన నిలిచిచూస్తూన్న జానకమ్మకు హృదయ ముప్పొంగి, ఆమెనయనాల నుండి రెండానందాశ్రువులు రాలేయి.

---

విష్ణుకుండివంశము కడచిన నెలభారతి
పుట. ౭౫౫ లోని పట్టికలో సవరణ

| క్రీస్తుశక కాలము | | విష్ణుకుండులు |
|---|---|---|
| ౪౫౫—౪౮౦ | ...౧ | మొదటిమాధవవర్మ |
| | ౨ | దేవవర్మ |
| ౪౮౦—౫౦౦ | ...౩ | రెండవమాధవవర్మ |
| | ౪ | మొదటి విక్రమేంద్రవర్మ |
| ౫౦౦—౫౩౦ | ...౫ | ఇంద్రవర్మ లేక ఇంద్రభట్టారకవర్మ |
| ౫౩౦—౫౪౦ | ...౬ | రెండవవిక్రమేంద్రవర్మ |
| ౫౪౦—౫౪౬ | ...౭ | గోవిందవర్మ |
| ౫౪౬—౬౧౦ | ...౮ | మూడవ మాధవవర్మ |
| ౬౧౦—౬౨౩ | ...౯ | మంచన్న భట్టారకుడు |

భా. వేం. కృ.

---

# హంసవిజయము

విద్వత్కవితిలక, కాంచనపల్లి కనకాంబ

## రెండవయంకము

(విష్కంభము)

(ప్రవేశము జడ్జి నీలకంఠశాస్త్రి)

శాస్త్రి—గురునాథా, గురునాథా, ఏనాఁడు నీకటాక్షము నాపైఁ బ్రసరించెనో యానాటినుండి, నీచరణారవింద ధ్యానామృతపానమహిమంబున వాస నాత్రయమును వర్జించి, భగవద్భాగవత కైంకర్యలోల త్వంబున బ్రహ్మానంద మనుభవించుచున్నదికదా నా మనంబు!

క. ఆసింపం డర్థంబుల
శాసింపండేరి వివిధ శాస్త్రాభ్యాసో
ల్లాసుం డాసద్గురునకు
ధీసంపన్నునకు నాత్మదీప్తికి జేజే.

శ్రీ వేంకటాచలస్వామిసన్నిధిని నేఁ బూనఁబోవు మండలదీక్షను నిర్విఘ్నముగ జరగునట్లాశీర్వదింపుము. అల్లదే, స్వామికోనెలలో ఘంటారావము వినవచ్చుచున్నది. ఎట్టిమనంబునైనను లీనముఁజేయు నీఘంటారావము నాలకించినకొలఁది "గో-విం-ద-గో-విం-ద-గో-విం-ద." యనునట్లు కొంతసేపును, ఓమ్-ఓమ్-ఓమ్మను ప్రణవనాద మొక్కొకతఱిని వినవచ్చుచు నితరప్రపంచము తోఁపకుండఁజేయుచున్నది. చిత్తలయ సాధనంబు లనేకశతంబు లుండఁగా నాచార్యులవారు నాదోపాసనంబునకే యగ్రస్థాన మొసంగిరి. (అని ఘంటారావ మాలకించుచుఁ దాదాత్మ్యం బనుభవించుచుండును.)

(ప్రవేశము నారాయణభట్టు)

నారా—ఓహో శాస్త్రిగారా! తమ దర్శన మెంతకాలమునకైనది. నేఁ డెట్టిసుదినము. మీవంటి పుణ్యాత్ముల దర్శనమైనది. తమ రెచ్చటనుండి?

శాస్త్రి—నారాయణభట్టుగారూ! నమస్కారములు. గుర్వాజ్ఞానుసారంబున జయంతాశ్రమమునుండి స్వామిపుష్కరిణీతీరమునకు దీక్షకొఱకు కేగుచున్నాను.

నారా—సమస్త సన్మంగళాని భవంతు. గురుదీక్షాఫలసిద్ధి రస్తు.

శాస్త్రి—జనకునివంటి శ్రీరాజశేఖర మహారాజా నాస్థానమున పురాణగోష్ఠీపరాయణులగు తమ యాశీర్వాదము మా కభ్యర్థనీయముకదా.

నారా—నామాట యటుండనిండు. గురుకటాక్షము పొందినదిమొదలు పరమవైరాగ్యమున న్యాయాధికారపదవిని, ధనార్జనమును నిర్విచారముగ విడనాడి వానప్రస్థాశ్రమంబునఁ బ్రవేశించి బ్రహ్మానుసంధానము చేయుచున్నారు. మీబోంట్ల జన్మము సార్థకము.

శాస్త్రి—మీరాజుగారి భక్తివైరాగ్యముల ముందు మేము ప్రశంసింపఁ దగము. ఒక్కమాట! యువరాజుగారు తండ్రిని మించునట్లున్నారని వదంతి. నిజమేనా?

నారా—పరమహంసమునీంద్రుని వరప్రసాదమునఁ బుట్టిన యాతని చరిత్ర మతివిచిత్రము. మూడేండ్లవాఁడుగ నున్నపు డొకనాఁడు మంత్రినిఁజేరి నిరంజననామధేయమున నందఱు తన్నేల పిలిచెదరనియు, దాని యర్థ మేమనియు నడిగెను. మంత్రి సుదర్శనుఁడును దన్నామము శివపరమనియు, దాని కర్థము పాపరహితుఁడనియు ననెను. నిరంజనుఁ డద్దానిని విని 'యేదేని పాపము జేసినఁగదా జన్మము. జీవుఁడనైన నా కాపేరేల? నన్నికమీఁద జీవుఁడనియే పిలువవలె'నని పట్టుపట్టెను. నాఁడుమొదలు మేమందఱు మాతనిని జీవుఁడని పిలుచుచున్నాము.

శాస్త్రి—సింగముకడుపున లేడి పుట్టునా? జన్మప్రభృతి మహాభక్తలక్షణములతో ప్రత్యుత్పన్నమతియై యాలమందలో నాఁబోతువలె, బృందావనం

బునఁ గృష్ణునివలె రాజసమారుం డానందపురమున వృద్ధిపొందుట సాధుబృందమున కానందదాయకము కదా! ఇంకొక్క విషయము. దీర్ఘసత్త్రయాగము సంకల్పించిరఁట కాదా మీమహారాజుగారు! ఒక్క సారియేని వచ్చి చూచుటకు నా కవకాశము కలిగినది కాదు.

నారా—అది యొక యపూర్వమనోహరమగు ప్రయోగము. మున్ను ఋషు లెట్లు నిర్వహించిరో మన మెఱుంగముకాని, యీ మహారాజు సేయించు సత్త్రి యాగము నిక్కముగాఁ గలికల్మషహరము. అచట నెనిమిదిజాములు నామసంకీర్తనము, తరంగము, లష్టపదులు, రామదాసుసచ్చరితము, కబీరుని పాటలు మొదలగువానితో మంగళకరమగు తాళమృదంగధ్వని యవిచ్ఛిన్నతైలధారవలె వినవచ్చును. వేదనినాదంబు భూసురశ్రేష్ఠులవలన వినవచ్చును. అర్వాసమయంబులఁ బ్రస్థానత్రయపాఠంబులు పండితోత్తములు జిజ్ఞాసువులకు బోధించుచుందురు. పురాణహరికథాకాలక్షేపాది గోష్ఠీవినోదంబులు పెక్కులు కల్పింపఁబడినవి. సర్వసాధారణంబగు నిక్కార్యక్రమంబుగాక చిత్తపరిణామానుసారముగ నభ్యర్థించినవారికి నధికారసంపత్తికల గురువులు తనుసాధనముల నుపదేశించుటకును, సాధకుల లభ్యసించుటకును, యోగశాలలయందు వసతులు కల్పింపఁబడినవి. ఈగోష్ఠి నానందింపవచ్చిన యష్టాదశవర్ణంబులకు నిరతాన్నదానంబు జరుగుచుండును. కలివిజృంభణంబున జరుగుచున్న యార్యవిజ్ఞాననాశనంబును నివర్తింపఁజేసి సకలవిద్యాబీజముల రక్షించుటకై మహారాజీయాగంబు సుర్వాజ్ఞానుసారంబుగ నిర్వహించుచున్నాఁడు.

గీ. భక్తిహీనిని నెపకు బాటసారుల కది
విశ్రమింపఁదగిన విడిదికాఁగ
వేంకటేశ్వరుండు వేడ్క నిర్మించెను
యోగ్యతకొలఁది నట నుండవచ్చు.

శాస్త్రి— పరమభాగవత చరిత్రశ్రవణమున ధన్యుఁడ నైతిని. తమ రిపు డెచ్చటనుండి వచ్చుచున్నారు?

నారా—ఈసమీపమున నున్న నారాయణవనాగ్రహారమున నివసించు సుశీలమునీశ్వరునిపై మహారాజునకు భక్తితాత్పర్యములు కలవు. వారికి ప్రతిసంవత్సరమును నిత్యనైమిత్తికములకై యిచ్చు వర్షాశనము సమర్పించి వారిక్షేమోదంతము విచారించిరమ్మని నన్ను మహారాజుగారు పంపుటచే నటకుఁ బోయి వచ్చుచు దారిలో శ్రీనివాసనేవకులై వచ్చుటలో మీదర్శన మైనది. తొందరపనులు కలవు, నాకు సెలవొసంగుఁడు.

శాస్త్రి—నమస్కారము. నమస్కారము. తమ కార్యముల కంతరాయము కలిగింపరాదు. నాకు సెల వొసఁగుఁడు.

(నారాయణభట్టు, శాస్త్రి నిష్క్రమింతురు.)
[ఇది విష్కంభము]

(ప్రథమ రంగము)

(రాజశేఖరసభ: ప్రవేశము, రాజశేఖరమహారాజు సింహాసనస్థుఁడై మంత్రిసహితుఁడై యుండును.)

రాజశే—మంత్రిసత్తమా! చిరంజీవియెన్నఁడు విద్యాభ్యాసమును బూర్తిచేసి వచ్చి తానీ సింహాసనంబు నధిరోహించి నాభుజస్కంధముపైనున్న భారము దానువహించు నానాఁడు గురుచరణ సన్నిధానమున బ్రహ్మానుసంధానముఁ జేసికొనుచు నిర్విచారముగ నుండుసు. "నగురో రధికం నగురోరితరం నగురోరధికం నగురోరితరం శివశాసనత శ్శివశాసనతః శివశాసనతః శ్శివశాసనతః" (అని ధ్యానము చేయుచుండును.)

సుదర్శ—మహాప్రభూ! విద్యాప్రదాన విధానమును జర్చించి సిద్ధాంతీకరించుటకుఁ బండితగోష్ఠిఁ గావింప నేలినవారి సెలవుప్రకారము ముఖ్యులగువారల కాహ్వానములు పంపియుంటిని. వా రంద రిపుడే దయచేయనున్నారు.

రాజశే— మేలు, మేలు. మంత్రిసత్తమా! చిరంజీవి విద్యావిధానమును నిర్ణయింప మేము గుతూహల పడుచున్నాము. నేఁడే యాసమావేశము నీ వనుసంధించుట మాకెంతయు సంతోషదాయకము. గురుపుత్రులను

మనకు విద్యావిధాన మేదియో తెలిసియున్నను రాజకుమారుని విద్యావిషయమునుటచేఁ బండితసభలో నిర్ణయమునుటయే ప్రజలకు సమ్మతిగలుగఁజేయు.

సుదర్శ—మహాప్రభూ! దేవరయంతరంగమట్టిద, యెఱుంగుదు.

నారా—(ప్రవేశించును. మహారాజు నమస్కరించును) మహారాజా! దేవరవారి యాహ్వానానుసారముగ ప్రాచ్యపాశ్చాత్య విద్యాప్రవీణులైన పండిత ప్రతినిధులు విచ్చేసి విడిదిలోఁ గృతాతిథ్యులై సేవదేరి వచ్చి ద్వారమున వేచియున్నారు.

రాజశే—భట్టుగారూ! వారినవశ్యముతోడ్కొని రండు.

నారా—(చిత్త మని నిష్క్రమించి తిరిగి పండితులతోఁ బ్రవేశించును.)

(ప్రవేశము, కృష్ణశర్మ, రామవర్మ, శివదాసు, సీతాపతిపంతులు.)

సుదర్శ—విద్వత్ప్రతినిధులకు స్వాగతము. మీ విద్యాగోష్ఠి నాలకించుటకును, మీసిద్ధాంతముప్రకారమాచరణప్రచారణలు జరిపించుటకును మహారాజుగారుత్సాహపడుచున్నారు.

శర్మ—మహాప్రభూ! విచారణము, వివేచనము, వితరణము, స్వధర్మాచరణ ప్రచారణములయం దభిమానముగల మీమహాసభలో మాపండితమండలియు శాస్త్రచర్చ జరపుటకు మిక్కిలి కుతూహలపడుచున్నది.

గీ. రాజశేఖరాస్థానవిరాజమాన
సుకవిగాయకబృందసంశోభగాంచు
జంతు వానందమునఁ దేలి జగము మఱవఁ
గలుగు నని వింటి నిక్కము గనుఁగొంటి.

రాజశే— మహాశయులారా! మాయాహ్వానము మన్నించి మీరు మాసంస్థానమునకు వచ్చుటచే మాకు మహానందము గలిగినది. ప్రకృతము విద్యాప్రదాన విధానమునుగూర్చి పండితులలో భిన్నాభిప్రాయము లున్నవికదా! జీవితపరమార్థ మేమి? విద్య తత్పరమ ప్రయోజనసాధనముగా నుండవలయునా? "అర్థకృతే వ్యవహారవిదే" యన్నట్లు తక్కినప్రయోజన మెటు లున్నను నర్థసంపాదనమునకు, వ్యవహారజ్ఞానమునకుఁ దోడ్పడునట్టి విద్యయే యున్నఁజాలునా? ధర్మమోక్షముల కవిరోధముగ నర్థకామములు వలయునని నాల్గు పురుషార్థములు నిర్వచించిన పెద్దల యభిప్రాయ మేమై యుండును? చిరంజీవి ప్రాథమికవిద్య నెట్టులో యింటనే యుపాధ్యాయులయొద్దఁ గఱచినాఁడు. ఇంక నుత్తమ విద్యాగ్రహణమునకు సమయము వచ్చినది. చిరంజీవి నెట్టి విద్యావిధానమున నడుపుట యనుసిద్ధాంతము కావలసియున్నది. కళాశాలల నిర్మించి విద్యార్థుల సమకూర్చుకొని తామయి విద్యఁగఱపుట యుత్తమమా, లేక సద్విద్వాంసుల నన్వేషించుకొనుచు వచ్చి విద్య నర్థించు నధికారులకు విద్యాభ్యాసముసేయుట యుత్తమమా ?

శివదాసు— మహారాజా! సభ్యులారా! నే నెక్కడ నుపన్యాసము లిచ్చినను హూణభాషలో మాటాడుటయేకాని తెలుఁగున మాటలాడువాడుక లేదు. కాని ఈసభలోని నియమమునుబట్టి మాటలాడుచున్నాను. విషయమునుమాత్రము గ్రహించి పక్షపాతము లేక నాయభిప్రాయమును స్వీకరింపవేఁడెదను.

లోకమంతయుఁ గన్నుదెఱచి నవనాగరకమార్గములఁ బట్టి పురోవృద్ధిగాంచుచుండ మన మింకను బూర్వాచారనిగళబద్ధులమై ధర్మమనియు, మతమనియు, వేదాంతమనియు, మోక్షమనియు విచారణలతోఁ గాలహరణము చేసినయెడలఁ దక్కినదేశములవారికంటె మనదేశము మిక్కిలి వెనుకఁబడుననుట కేమాత్రము సందేహము లేదు. అంతియకాక జాతులు, భాషలు జీవము కలిగి దినదినము మార్పుఁజెందుచుండఁ దదనుగుణముగ నాయాయవసరంబులకుఁ దగిన నూతనవిధానము లేర్పఱుపక యెన్నఁడో యిక్ష్వాకులకుఁబూర్వము మృతభాషలో వ్రాయఁబడిన వేదశాస్త్రములను బట్టి యీయిరువదియవశతాబ్దమున ధర్మనిర్ణయము చేయనెంచుట మిక్కిలి యనుచితము.

పంతులు——మహారాజా, దాసుగారు చెప్పిన చొప్పున నవనాగరికతలో మనము నేర్చుకొనఁదగిన విషయము లనేకములు గలవు. నేను లేవని చెప్పునంతటి ఛాందసుఁడను కాను. పాశ్చాత్యవిజ్ఞానమునఁ గల మంచినంతను సంగ్రహించి భరతఖండవిజ్ఞానమును దానికిఁ జేర్చి మనదేశమునకుఁ బైరెంటియొక్క పరిపూర్ణప్రయోజనమును గలిగింపవలయునను దీక్షతో నా న్యాయాధికారిపదవిఁగూడ వదలికొని దేశాటనముఁ గావించి పండితవర్యులఁ బరీక్షించి తుదకు నొక్కసంస్థ నేర్పాటుచేసి మాయభిప్రాయానుసారముగ నుభయ సంప్రదాయసమ్మేళనము జేయఁ బ్రయత్నము జేయుచున్నాము. నాకుఁదోడుగా నీరామవర్మగారును నా కత్యంతము సాయముచేయుచున్నారు.

రామ——మహారాజా! ఆర్యులారా! క్షత్రియుఁడ నగుటచే సహజముగ బ్రహ్మవిద్యపై నా కభిమానము కలదు. ఆంగ్లవిద్యలో నుత్తీర్ణుఁడనై యాధునికనాగరికతాప్రపంచమును బరిశీలించి యందలి మేలగుభాగముల గ్రహించి మాసంస్థను వృద్ధిబొందింప నేఁ జేసిన పరిశోధనల విన్నవించుకొనుచున్నాను.

కేవల సనాతనధర్మపద్ధతి నెలకొల్పఁబడియు సంఘముగా నొక్కకుండములో నందఱచేత నగ్నికార్యములు చేయించు ఋషికులంబుఁ గాంచితిని. ఆర్యసమాజమున కనుకూలముగా నన్నివర్ణములవారిచే వేదపఠనంబు నేయించు గురుకులంబును జూచితిని. పాశ్చాత్యవిద్యావిధానంబున లేదని శాంతికై నెలకొల్పఁబడిన నికేతనంబులఁ గాంచితిని. పరాసుమాతృకాముఖంబున నాశ్రితుల ననుగ్రహించువారి ఘోషంబుల నాలకించితిని. అమరత్వసిద్ధి కలిగింతుమని పెద్దసంఘము నాకర్షించియు కాలవశతనొందిన సాములఁ దిలకించితిని. నిమ్నజాతుల నుద్ధరించు కులపతుల యాశయంబు లరసితిని. కర్మాగారములు నెలకొల్పి చేతిపనులు కల్పించియుఁ, బాలు, పెరుగు, వెన్నల నమ్మించియు నాశ్రితులకు జీవనోపాయముల కల్పించి ధనముహర్చుకొని సకల ప్రాంతములనుండి శిష్యగ్రహణము సేయు దయాళువుల బాగోగుల విచారించితిని. బహుజన్మవృత్తాంతములఁ దెల్పుచు భారతవిజ్ఞానంబు నుపదేశము సేయుటకై ప్రాచీనఋషులఁ బాశ్చాత్యకాయంబుల గుర్తించుచు సకలదేశవాసులకు దివ్యమైన జ్ఞానమును బ్రకటించు గోష్ఠులను జొచ్చి చూచితిని. జాతీయకళాశాలల ప్రశంసలు వింటిని. హైందవజాతీయత నిలువఁబెట్టుటకై పండితులు నిర్మించిన విశ్వవిద్యాలయముల జాడలఁ గాంచితిని.

చెట్టుపేరుచెప్పి పండ్లనమ్మినట్టు మహనీయుని పేరును, విగ్రహమును గ్రహించి వారి బోధములను బ్రకటించి సొమ్ముచేసికొనుచు గురువులను మించి సవరించుచు నపరిపక్వమైన సాహసులకు నుత్తమాశ్రమంబు నొసంగుచు విధినిషేధంబుల నుల్లంఘించుటకు మిషను కల్పించుకొని రామ, కృష్ణ, గోవింద యనుకొను భక్తుల యుత్సాహములఁ జూచితిని. ఇవియన్నియు భారతవిజ్ఞానమునకై యేర్పడిన సంస్థలే. ఇవిగాక రాయల్ ఏషియాటిక్ సంఘమువారి ప్రకటనలను జదివితిని. దేనియందును మనస్సు విశ్రాంతి జెందదాయెను. ప్రాగ్దేశవిజ్ఞానమును పాశ్చాత్యపద్ధతులపై నడపు విధానమేదియా యని మేము తీవ్రపరిశోధనలఁ జేయుచున్నాము. ప్రాచీనవిద్య నాధునికపద్ధతులపై నడపు విధాన మింకను జక్కగ నేర్పడలేదు. దినదినాభివృద్ధి గాంచు పాశ్చాత్యవిజ్ఞానము నాంగ్లాదిభాషలలోనుండి దేశభాషలలోనికి వచ్చు మార్గములను బరిశీలించుచున్నాము. సర్వతంత్రస్వతంత్ర బిరుదాంచితులైన శర్మగారు మాతోఁ బూర్ణమైన సానుభూతిని జూపెదరని నమ్ముచున్నాను.

శర్మ——మహాప్రభూ! ఆర్యులారా! దాసుగారి పక్షము కేవలప్రాచీనప్రాగ్దేశవిజ్ఞానమునకు విరోధము. పంతులగారికిని, వర్మగారికిని నార్యవిజ్ఞానముపై నభిమానము లేదని నేను చెప్పఁజాలను. కాని యొక్కమాట వాస్తవస్వరూపము. సారస్వతోపాసనము సద్గురూపాస్తిచేఁ దెలిసికొను సచ్ఛిష్యులకు బోధపడునే కాని తదితరులకు బోధపడదు. పంతులుగారికిని వర్మగారికినిగూడ సంస్కృతభాషాపరిచయము కలిగించుకొనుట కవకాశము కలుగలేదు. అభిమానము చొప్పున

వారు భాషాంతరీకరణములద్వారా పూర్వగ్రంథాంశములను జదువ నుద్యమించినను గ్రంథభాండాగారపరిశోధనములతో సత్యము తేలదు.

క. గురుజనముల సేవింపక
  పరమార్థము కొలదు గ్రంథభాండాగారం
  బరయుట వీణె మృదంగముఁ
  గర మర్థించెడుఁ గతిగద గానంబునకై.

జీవితమునొక్క పరమప్రయోజనము మహారాజుగారు సూచించియున్నారు. "శాస్త్రస్యాపి పరమప్రయోజనం మోక్షః" అని యున్నదికదా. అఖండానందప్రాప్తియే పరమార్థమని మన పెద్దలు సిద్ధాంతీకరించినారు. అనిర్దిష్టపరమ ప్రయోజనముకల పాశ్చాత్యదేశములయందు మానవుఁడు చిత్తశాంతిలేమి నల్లాడుచున్నాఁడు. ఆనవనాగరిక దేశంబులం దెచ్చట చొచ్చిచూచినను దుపాకిమందుకంపు కొట్టుచున్నదే కాని తపించు మానవహృదయమును జల్లఁబడఁజేయు నుపాయముగాని, శాస్త్రముగాని, బోధముగాని, యిప్పటికిఁ గానరాదు; కానవచ్చునాశయుఁ దోఁప కున్నది. ధర్మరహితములైన యర్థకామములఁ దగులుటచే నాగరికదేశములందు నాశాభయములకు లోనై రాగద్వేషములపాలై సంఘము లన్యోన్యము సమరంబొనర్చుకొనుచు నాకసమందు, భూమియందు, సముద్రమునందు నన్యోన్యమారకప్రయోగంబులు గావించుకొనుచుఁ గామమునఁ బడి భగ్నహృదయులై యాలుమగ లన్యోన్యపరిత్యాగములఁ గావించుకొనుచు, నాత్మహత్యలపాలగుచున్నారు.

ధర్మాచరణముచే లోకమర్యాదలు నిలిచి సంఘమునకు సౌఖ్యము కలుగును. మోక్షముచే నాత్మానందము కలుగును. అర్థము జీవనమునకు, రక్షణమునకు నావశ్యకము. కామము జీవులకు సహజప్రవృత్తి. ఇట్టి యర్థకామములను ధర్మానుగుణముగ నడిపించి మోక్షము సాధించిన యార్యులపద్ధతియందు కేవల మర్థకామంబులకైన ప్రవృత్తి గ్రహింపఁదగినదికాదు.

ఆధునిక కాలమందు విజ్ఞానవ్యాపనమునకై నెలకొల్పఁబడిన ప్రతిష్ఠాపనముల నన్నింటి సింహావలోకనంబుసేయుచు వర్మగారు చేసిన దీర్ఘోపన్యాసమును వింటిరిగదా!

ద్విపద—
అన్నింటిలో మంచి యరయుచుం డెడివి
 కొన్నిమతంబులు క్రొత్తగాఁ బుట్టె
2 ఇష్టమైనట్టుల నిల నాచరింప
 దుష్టుల కవి గొప్పదోహదా లయ్యె
3 మంచిము కొక్కరిది మంచిది కన్ను
 నెంచి మరొక్కరి దేకంబుజేసి
4 మంచివిగ్రహమంచు మహి నెవ్వఁడేఁ ద
 లంచిపూజించు నాలంపటుం డగుచు
5 విషయంబులందున వేడుక హెచ్చ
 ఋషివలెఁ గాన్పింప నీమతం బరయు
6 మంచివన్నియు నేరి మహి నొక్కచోట
 నుంచుట నెరుగఁడె యూహింప నజుఁడు.

"తెజ్జము," "రంధ్రము" నను రెండుశబ్దములను జేర్చి తెంద్రమందురు. కుటుంబము, సంసారమును జేర్చి కుటుంబరమందురు. శిష్టులవలె మాటలాడ యత్నించు ప్రాకృతులపాటు లివ్వి. స్వదేశవస్త్రములతో విదేశస్థుల యుడుపులఁబోలె లాగులు, నంగీలు కుట్టించుకొందురు. ఇది దేశాభిమానుల మనుకొనువారి యవస్థ. ఇంక ప్రతిష్ఠాపరుల విషయ మొక్కమాట. ద్వంద్వాతీతులు కాఁజాలనివారు, సమరసభావము కుదురనివారు, అహంకారమే ప్రధానలక్షణముగా కలవారు, సద్గురుసేవ చేయఁజాలనివారు తమ చిన్నబుద్ధికిఁ దోఁచిన సందేహములను బట్టి శాస్త్ర మలక్షణమనుటకు నుత్సహించుచు శిష్టకృతవ్యాఖ్యాన మపేక్షింపనివారు, గీర్వాణభాషాప్రవీణత లేనివారు, తాము నిరభిమానముగ సద్గురుసేవ నేయనివారగుటచేఁ దమ శిష్యులనుగూడ తాము చక్కగ శిక్షింపక బుజ్జగించి గురుత్వమును నిలుపుకొనువారును, దేశాభిమానావేశముతో దేశసేవయు, భాషాసేవయు నిక్కముగఁ జేయుచున్నా మనునమ్మకముతోఁ బ్రారంభించి పట్టుదలతో నడుపుచున్న వీరి ప్రతిష్ఠాపనలు తత్త్వశూన్యములగుట సహృదయులు వీని మెచ్చరు. పాఠ్యప్రణాళిక నాయకులకే తెలియదు,

తమకంటె పెద్దలైనవారి సన్నిధియందు వినయవిధేయతలతో "తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా" అన్నటుల సంచరించి సంప్రదాయకులు పూర్ణులై మున్నధీతిబోధాచరణ ప్రచారములు గావించిరి.

ఇప్పటి నాయకు లక్కడక్కడఁ బ్రోగుచేసి కొన్న విషయములకుఁ దమ యూహలు తోడుచేసి తమకంటెఁ జిన్నలైనవారి నాకర్షించుకొని, వారి యందు నాయకత్వమును జెల్లించుకొనుచు బోధప్రచారణములుమాత్రము గావింతురు.

సీ. బాల్యమందున బహుభంగులఁ బోయెడు
మనమును నిగ్రహింపనికతమునఁ
జెడుమార్గములఁ ద్రొక్కి కడుకష్టములఁ బొక్కి
యంపకు చూడంగ నన్నిసూళ్లు
కుడుచుచుండుటఁ జేసి కులగౌరవముఁ బాసి
మగిడివచ్చుట కెంతమాత్రమేని
సందు దొరకకుంట సాహసంబునఁ దన
మార్గ మెక్కడ ధర్మమార్గ మనుచుఁ
బ్రజల బోధింపఁ బ్రవక్తయై పలువురు
నాయకుండనఁ బైకి నగుచు లోన

గీ. వగచుచుండెడువానికిఁ బరులకుఁ దన
దోషములు సంక్రమించు నీదుఃఖ మేల
పంప లజ్జావిహీనుఁ డల్పంబుకొఱకు
మందిఁ జెఱచుఁ దాఁ జెడు నప్రమాణబుద్ధి.

దాసు—మహారాజా! సభ్యులారా! శాస్త్రిగారి సంభాషణ మసహ్యముగాను, బకుపాత్రముగాను నున్నది. సభలో మాటలాడునపుడు పలువుర చిత్తమున కుద్వేగకరముగా నుండకుండునట్లు మాటలాడఁదగునుగదా!

సుదర్శ—మహారాజా! ఆర్యులారా! శర్మగారి వలెనే దాసుగారును నొక్కపక్ష మవలంబించినారు. ఎవరి పక్షమును వారు ప్రతిపాదించుచున్నారు. వ్యతిరేకవ్యక్తులకు వ్యతిరేకాభిప్రాయము లుండును. సకలాభిప్రాయములును వినఁగల సమరసభావము గలిగియుండుట సహృదయుల లక్షణము. దాసుగారి యభిప్రాయము లెంతనిర్భయముగాఁ బ్రతిపాదితములైనవో శర్మగారి యాశయములు నంత నిశ్శంకముగాఁ బ్రభుసన్నిధానమునఁ బ్రకటింపఁబడుచున్నవి. శర్మగారి ప్రసంగము నిష్కపటముగ, నిశ్శంకముగ జరగవచ్చును.

శర్మ—మహాప్రభూ! సహృదయులారా! కలికాలవశంబున నార్యవిజ్ఞానవాహ నామధారులలోఁ బ్రవేశించిన సహస్రదోషములు నే నెఱుంగనివాఁడను గాను. విజ్ఞానబీజ సంరక్షణమున కవకాశము కలిగింతు రను నాశతో నిన్నిదినములకు నీమహారాజసభలో నాయభిప్రాయమును వెలిబుచ్చితినేకాని మరియేయితరసభలోను నే నితఃపూర్వ మెన్నండును నోరు తెఱచి యెఱుంగను.

అభయంబొసంగెడు విభుండును, విజ్ఞులయినవారల పోషణకుం దగిన విత్తంబును సారాసారంబు లరయఁజాలు తత్త్వవేత్తలు గలుగు నిట్టిసభలో సత్యనిర్ణయమునకై సాధువులు ప్రసంగించు టుచితమేట్లు కాకపోవును? ప్రాయమురానట్టివారు (మహారాజా, జ్ఞానముచేత ప్రాయమురానట్టివారు) తమ యభిప్రాయములను పట్టుదలతోఁ దలతోఁక యెఱుంగక వ్యాసునంతవాని విషయమైన వ్యాఖ్యానము సేయుచు విశ్వాసవిగ్రహముల నెల్లెడ భగ్నము సేయుచుండువారి సభలు నిందలకుఁగాని నిర్ణయమునకుఁగాదు.

గీ. బాలనాయకంబు బహునాయకంబు ని
నాయకంబు దుష్టనాయకంబు
సాధు దూషణం బసమ్మోషణంబు నా
సభ యదేరి కింపు శాంతి నింపు.

ఏకదేశంబుగా నే నప్రామాణికులను నాయకమ్మన్యుల నంటినేగాని దాసుగా రొక్కమ్మకి యార్యవిజ్ఞాన మంతపై బ్రహ్మాస్త్రప్రయోగము చేసియుండిరి. వేదశాస్త్రపురాణేతిహాసములును, భోజకృష్ణదేవరాయాది మహానుభావుల సచ్చరిత్రలు నొక్కమా రంతరించినను దాసుగారి కావంతయైనఁ జింతయుండదు కదా! ప్రకృతము నామనవి యేమనఁగా విజ్ఞానము కలికాలవశంబున శీఘ్రముగా దోసిటఁబట్టిన నీటివలె సన్నగిల్లుచున్నది. మహనీయు లద్దానిని రక్షించుట విధి. సత్సంప్రదాయ మెఱుంగని యిట్టివారల మాటలతోఁ దత్త్వరహస్య మెఱుఁగఁబడదు.

గీ. వట్టిమాటల వినినంత నట్టుగనునె
శాస్త్రజాలంబు జాలంబు సద్గురూక్తి
కీలకంబున మంజూషలీలఁ దెఱచి
లోమహాభాష్యసారంబు స్వామికృపను
భక్తి సేవించి శక్తినిఁ బడయకున్న.

మాటలు పెక్కేల! ప్రపంచవృక్షమునకు భరతఖండము ఫలప్రాయము. అందును సద్గురుకటాక్షగమ్యమయిన విజ్ఞానమే యమృతప్రదమగు ఫలసారము. తదంగములగు మూలము, శాఖలు, పత్రపుష్ప పల్లవంబులు తత్తదుచిత గౌరవమునకుఁ బాత్రములేయయ్యు బీజమును వహించి వృక్షపరంపరకు నాధారభూతమయిన ఫలమే యపేక్షణీయమునుగదా! పాశ్చాత్యదేశీయవిజ్ఞానమంతయు సహృదయులకు నాదరణీయమే. "అన్వయవ్యతిరేకాభ్యాం పూర్ణబోధ స్సమాచరేత్" పాశ్చాత్యశాస్త్రపరిశోధనలు వ్యతిరేకమునకగు, నార్యవిజ్ఞానము నన్వయమునకగు. పరిణామశీలమగునది పాశ్చాత్యజ్ఞానము. పరిపూర్ణమైనది భారతవిజ్ఞానము. పరిపూర్ణమునకు నాద్యంతములుకాని, క్రొత్తపాతలుగాని లేవు. సత్యము త్రికాలాబాధ్యము. రెండురెండ్లు నాలు గనుటవంటిది. వారినిర్ణయములు మారుచుండును. కాని మనసిద్ధాంతములు స్థిరమైనవి. హేతుజ్ఞానమునకు హేత్వాభాసజ్ఞాన మవసరమైనట్లు, స్వమతస్థాపమునకుఁ బరమతజ్ఞాన మవసరమైనట్టు లార్యవిజ్ఞానమును స్థిరముగా నెలకొల్పుటకుఁ బాశ్చాత్య ప్రకృతిశాస్త్రజ్ఞాన ముత్తమాధికారులగు ప్రవక్తలకు మాత్ర మావశ్యకము. తదితరులకుఁ బ్రామాణ్యబుద్ధి కలిగించి భారతవర్ష విజ్ఞానము గురుకులములద్వారా బోధింపవలెను.

వర్మ—మహారాజా! గురుకులమున జిజ్ఞాసువులగు స్వల్పసంఖ్యాకులుమాత్రము పరిపూర్ణు లగుదురు. ఆర్యవిజ్ఞానముపై నభిమానము మాకును లేకపోలేదు. గురుకులములు గురుకులములన్న నెట్లు పొసగఁగలదు. శాస్త్రిగారివలె ననుభవవిరుద్ధములగు నాకాశపురాణములు సిద్ధాంతములు మే మామోదింపఁజాలము.

పంతులు—మహారాజా! శర్మగారి యాశయములందు నాకు మిక్కిలి గౌరవము గలదు. పాశ్చాత్యవాతవ్యాధి తగిలి మెడ మెలితిరిగి కేవలము పశ్చిమముఖుండనై చిరకాలమట్లే యుంటిని. యదృచ్ఛావశంబున నేటికి పండ్రెండేండ్లకుఁబూర్వము పరమహంసస్వామి నాయెడ ననుగ్రహించి యొసఁగిన విజ్ఞానచపేటికాప్రహారంబున వెనుకకీడ్చుకొనిపోవుచున్న ముఖము సుముఖమై ప్రాఙ్ముఖ మయ్యెను. ఆనాటినుండియు నార్యవిజ్ఞానముపై నా కభిమాన ముదయించినదికాని, బహువాసనాదూషితమైన మనంబుకలవాఁడ నగుట భక్తిప్రపత్తులతో సాధుసేవ చేయఁజాలక శర్మగారు ఖండించిన గ్రంథభాండాగారపరిశోధనలఁ బరితృప్తినొందుచుంటిని. నమ్మకముతో నా పుత్రులలో వలె నామనఃపరిణామ మిమ్మహారాజు నా కనుగ్రహించిన యవకాశముచే నీసభవారికి విన్నవించితి. అనుభవములో నాచరింపఁదగిన కృత్యము శర్మగారేమి సూచింతురో వినఁ గుతూహల పడుచున్నాను.

రాజ—(జనాంతికము) అమాత్యశేఖరా! మన మానాఁడు పరమహంసస్వామివారి దర్శనమున కరుగుచుండఁగా మన కీపంతు లెదురుగ వచ్చుచుండెను జుమా! మహనీయుల సకృద్దర్శనమేని యూరడిపోవదుగదా!

సువర్మ—సత్యము. మహారాజా! పరమహంసభగవత్పాదుల బోధంబును చపేటికాప్రహారంబుగ నీ మహాసభలో వర్ణించుటచేఁ దన భక్తిప్రపత్తులను, మనఃపరిణామమును దెలుపుకొనుచున్నాఁడు.

రాజశే—శర్మగారూ! తమ ప్రసంగమును వినుటకు సభవారందరుఁ గుతూహలపడుచున్నారు.

శర్మ—మహారాజా! సభ్యులారా! కాలానుసారమగు మార్పులను నే నంగీకరింపననియు, ననుభవరహితమైన ప్రసంగములఁ జేయుదుననియు మా ప్రతివాదులు సూచించుచున్నారు. నిక్కమునకు సద్వాదులమగు మేము కాలస్వరూపుఁ డీశ్వరుండని యెఱుఁగుదుము. ఈ జగంబంతయు నీశ్వరుని స్వరూపమని యారాధింతుము. విరాట్పురుషునకు నైన్నధర్మంబని మే మెఱుఁగుదుము. లోక

మున నున్నదున్నటులు మేము భరింపఁగలము. కలియుగ ధర్మంబులకు వెగటొందము. శిశిరఋతువున నాకురాలి మోడుమాత్రము నిలుచును. తత్త్వవేత్త యాకులురాలు టకుఁ జింతింపఁడు. ఆకులు చెట్టున కతికింపఁ బ్రయత్న మును జేయఁడు. కాని మోడువలెనున్న కారణమున మూఢునివలె దానిని గొట్టి ప్రొయ్యిలోఁ బెట్ట ప్రయత్నమును జేయఁడు. నిష్ప్రయోజనమని తత్త్వశూన్యులు శాఖల నఱికినను సజ్జనులు వృక్షమూలస్కంధము వసంతమున ఫలవంతమగుటకుఁ గాపాడుచుందురు. ప్రళయ కాలమున విత్తనములు దాఁచుటకై మహనీయు లీదుష్ట కాలమున సైతము పరీక్షితునిఁబోలి కొన్నియెడల తత్ప్రచారమును సహించినారు. ప్రాచీన విజ్ఞానమును సంఘమందు ప్రచారముఁజేయ నుద్యమింపరు. (చక్కిలములు మొదలైన) భక్ష్యములఁ జేయునపు డెంత శ్రద్ధగ తునగకుండఁ జేయుదురో తినువేళల నంత నిర్విచారముగ త్రుంచి నములుదురుగదా! అట్లే పరమేశ్వరుఁడు కృతాదియుగములయం దెంతపూర్ణముగ ధర్మములు వృద్ధిపొందించెనో అంతనిర్విచారంబుగఁ బ్రళయపూర్వవర్తియగు కలికాలంబున ధర్మవిఘటన మొనర్చుచున్నాఁడు. విజ్ఞానబీజ సంరక్షణకై వెదకుకొనువారికిఁ బెన్నిధుల వలె మహానుభావులనువారిని సేవించి జ్ఞానమును సంపాదించు శిష్యులనుగూడ బరాత్పరుఁడే సంధించుచున్నాఁడు. కాఁబట్టి యాస్తికులకుఁ బరమార్థముకొఱకు గురుకులములను, ప్రమాణబుద్ధి కుదురనివారలకు లౌకిక విద్యలకొఱకు కళాశాలలను కల్పించుట న్యాయమని నాయాశయము.

నాటకములోని వ్యతిరేకములగు పాత్రలన్నియు నాయకుని, రసమును బోషించునవియే. విశ్వామిత్రుఁడు, నక్షత్రకుఁడు, కాలకౌశికుఁడు, కలహకంఠి మొదలగు పాత్రలన్నియు వ్యతిరేకములయ్యు హరిశ్చంద్రునికి వన్నె దెచ్చునవియే యగును. విపణివీథియందు పథ్యాపథ్య వస్తుజాల మెంత యున్నను హితమగు వస్తువులఁగదా బుద్ధిమంతులు కొనుదురు. ప్రకృతము నిరంజనకుమారునకు మాత్రము విద్యాభ్యాసము గురుకులమునందే యొప్పునని నా యభిప్రాయము. మీద దేవరచిత్తము.

(1) తన మనమున సందేహముతీరుట, (2) తనప్రతివాదిని సభలో ముఖపిధానము సేయఁజాలు సర్వంకష ప్రజ్ఞ యలవడుట, (3) తన్నాశ్రయించు శిష్యుని సర్వ సంశయములఁ బాపి తనంతవాని నొనర్చుటయు గురుకులములోని విద్యలక్షణము.

ఇఁకఁ బ్రకృతకళాశాలలయందున్నవో విద్యార్థులకు జిజ్ఞాసలేదు. విత్తార్జనమే విద్యకుఁ బ్రయోజనము. సంశయములు నుండవు. ఒకవేళ నున్నను నీచదువువలన సంశయములు తీరనుదీరవు. పరీక్షావిధానమున సుమారు నలువది గుణములు నూటికి చాలు నందురు. గురుకులంబున వాక్యార్థపద్ధతిలో సర్వతంత్రస్వతంత్రుఁడైనఁగాని పండిత గోష్ఠిలో వచ్చు ప్రశ్నలన్నిటికి సమాధానముఁ జెప్పి యుత్తీర్ణుఁడుకాఁజాలఁడు. తల్లిదగ్గఱ నుండి తల్లితోఁబాటు గృహకృత్యముల నారితేరిన పిల్లవడువున "అభ్యాసయోగాత్ సాన్నిధ్యబలాచ్చ"యని యన్నట్లు బోధస్వరూపుఁడగు గురుసన్నిధానమున సకలము శిష్యుఁడు సుకరముగ నెఱుఁగనగు. శాస్త్రార్థములు సులభగమ్యము లగుచుండును. నియమాదులు, భయభక్తులు, చిత్తసంయమనము సహజామనస్కసిద్ధిగల సాధువులచెంత నలవడినట్లు పొట్టపూటికై చదువులు నేర్చిన యయ్యవారల యొద్ద శిష్యులకుఁ జిత్తపరిణామము కలుగఁజేయు సన్మార్గములు పట్టువడవు.

దాసు—మహారాజా! సర్వతంత్రస్వతంత్రులగు శర్మగారింత సమరసభావమును, సామర్థ్యమును గల వారని నే నెఱుంగఁజాలనైతిని. ఛాందసముగా పట్టు పట్టెదరేకాని సకలసమ్మతముగ, యుక్తియుక్తముగఁ బ్రసంగింతురని యూహింపనైతి. ఈ గోష్ఠిలో మావంటివారు గూడనిలిచి విచారింపఁదగిన సారాంశములను శర్మగారెన్నియో నిరూపించినారు.

సుదర్శ—బహుజనసమ్మతిపై నిర్ణయముఁజేయుటకంటె సభ్యులెల్ల నేకాభిప్రాయులౌట విశేషముగద. ఇట్టిసూచనలు కానవచ్చుట శుభము.

శర్మ—బహుభాషలేల! జాబాలి తీర్థముననున్న పరమహంసస్వామి యనుగ్రహమును బొందిన మహనీ

యుఁడు సుశీలముని నారాయణవనాగ్రహారమున నివసించును. పరమహంసయోగీంద్రులంతర్ముఖులై యుంటచే వారి సన్నిధి బాలకులకు సిద్ధించుట కష్టము. సుశీల మునీశ్వరుం డాశ్రితులకు జ్ఞానమొసంగు ప్రవృత్తిలో నున్నాఁడు. నే నమ్మహనీయుని యనుగ్రహవిశేషంబున నేతమ సభలో నానేర్చిన మాటలుపలుకఁగలిగితిని. రాజకుమారు నక్కడ కనుపుటయే శ్రేయస్కరమని నామతము.

నారా—మహారాజా! శర్మగారు సెలవిచ్చిన విషయ మవశ్య మాచరింపఁదగినది. నిరంజనకుమారుఁ డచ్చట విద్యాపారంగతుఁడు కాఁగలఁడు. నాపుత్రుఁ డన్నంభట్టు బాల్యమునుండి రాజకుమారునితోఁ గలిసి యాటపాటల వర్తించుచున్నవాఁడు. వీరినిద్దఱ జతచేసి సుశీలముని సన్నిధికి నంపుట మేలని విన్నవించుకొనుచున్నాను.

రాజశే—మంచిది. సభ్యులారా! మీ రేమని నిర్ణయించినారు?

దాసు—శర్మగారి యభిప్రాయమును నేనే సంతోషముగా నంగీకరించినపుడు పంతులుగారును, వర్మగారునుగూడఁ బూర్ణముగనద్దానితో నేకీభవింతురనియే నా నమ్మకము. నేఁ డీ మహారాజు కల్పించిన యవకాశముచే సమ్యగ్దర్శనుండ నైతిని. కళాశాలలోఁ జదివియు నిట్టి యుత్తమగోష్ఠిలో స్వస్వరూపమును తెలిసికొనుజిజ్ఞాసువులగు నాబోంట్లకు జ్ఞాన మొసంగుటకు నీగురుకులంబులు పోషింపఁబడుఁగాక.

రాజశే—శ్రీ శివదాసుగారి ప్రసంగము నాకు మిగుల సంతోషము కలిగించినది. సర్వార్థ సాధకము కదా సాధుసంగతి. మంత్రివర్యా, చిరంజీవిని శ్రీ వేదమూర్తులైన సుశీలస్వామివారి సన్నిధికిఁ బంపు నేర్పాటులు గావింపుము. ఈ పండితోత్తములకుఁ దగు సన్మానము జేయింపుము. ఈ సంస్థానమున వారికి స్వాగతము సర్వదా సిద్ధమనుము.

సుదర్శ—చిత్తము.

(తెరవ్రాలును.)

## ద్వితీయ రంగము

(ప్రవేశము నారాయణభట్టు)

నారా—మహారాజుగారు కుమారుని సుశీలమునీశ్వరసన్నిధానమునకుఁ దోడ్కొనిపొమ్మని నా కాజ్ఞాపించినారు. నే నిదే కుమారవిద్యాగారమునకరిగెదను. అదిగో చిరంజీవియుపాధ్యాయుఁడగు నరకేసరిశాస్త్రి యిట్లే వచ్చుచున్నాఁడు.

(ప్రక్కనుండి ప్రవేశము నరకేసరిశాస్త్రిగారు)

ఏమయ్యా నరకేసరిశాస్త్రిగారూ! క్షేమమా, కుమార మహారాజుగారి విద్యాభ్యాసము సాగుచున్నదా?

నరకేసరి—ఓహో! నారాయభట్టుగారూ! నమస్కారము. మీబోఁటి పెద్దలు నన్ను నరకేసరియని పిలుచుటయే నాకు శ్రేయస్సు. మీదయవల్ల నా యోగక్షేమమున కేమియు కొదువలేదుగాని నిరంజన కుమారుని విద్యాభ్యాసవిషయ మేమిచెప్పుటకును దోఁపకున్నది.

నారా—ఏమి? ఏమి?

నర—కుశాగ్రబుద్ధియగుట నేఁ జెప్పిన పాఠముల నాతఁడు వెంటనే గ్రహించును. కాని యేవిధమైన సమాధానము చెప్పనలవికాని ప్రశ్నల నడుగుచుండును. పాఠసమయమునందుఁ బరధ్యానముగ నుండును. ప్రారంభమునుండియు నిట్టి విపరీతగుణము లున్నవిరేగాని, యొక్కపక్షమునుండి బొత్తిగ రాజకుమారుఁడు మన లోకములో లేఁడు. అంతఃపురదాసీజనులు నాతనిఁ గూర్చి యిట్లే చెప్పుకొనుచున్నారు. పెక్కుదినములు పాఠశాలకును రాలేదు. ఎక్కడ నున్నాఁడో తెలియదు. ఉన్నటులుండి యేతోఁటలో నెచ్చటనో, కాసారతీరమందో, లేక వృక్షచ్ఛాయయందో కూర్చుండి వనమృగమయూరాదులతో వినోదించుచుండును. ఒకనైపునకు బాలకుల నంపి మఱియొకనైపున నేను వెదకుచువచ్చుచున్నాను.

నారా—నేఁ డాతనిని బయనముచేసి సుశీల సన్నిధానమునకుఁ దీసికొనిపోవలయును. నేనును వచ్చెదను. మన మిద్దఱ మాతని వెదకుదము.

నర—మంచిమాట చెప్పినారు. నా నెత్తినఁ బాలుపోసితిరి. అమ్మహనీయుఁ డాతని నెట్లు సవరించునో కాని, యీరాజకుమారుని నేనుమాత్రము దిద్దఁ జాలను. నా కాతఁడు ముక్కునకుమించిన ముత్యము. ఆరాజర్షి కిశోరమునకు గురుత్వము వహింప సుశీలముని తగియుండునుగాని నేఁగాను.

ఆతని కెందు నాస్థగాని, యాసగాని యున్నట్టు దోఁపదు. అలబ్ధవిశ్రమాస్పదుండై శూన్యవిలోకనములతో నుండును. మూర్ఖుం డనరాక ముక్తుం డనరాక యుండు నీచిన్నికుమారుని చూచిన నావంటివాని హృదయమే దహించుకొనిపోవుచున్నది.

నారా—ఈతఁడు రామాదులంబోలిన మహనీయుండగు. ఎదుటనున్న కదంబవనమం దేకాంతలతాగృహమం దెందేని యున్నాఁడేమో చూతము రమ్ము.

(ఇద్దఱు నిష్క్రమింతురు.)

(కదంబవనము. శ్రీచరణపుష్కరము.

ప్రవేశము నిరంజనకుమారుఁడు)

నిరంజ—మహాదేవ, మహాదేవ, మహాదేవ దయానిధే, భవానేవ, భవానేవ, భవానేవ గతి ర్మమ. (పంచచామరము—పాటగాఁ బాడవచ్చును):

నిరామయుఙ్ దయాసముద్రునిఙ్
భుజంగభూషణుఙ్
బరాత్పరుఙ్ బ్రపన్నునిఙ్
శుభప్రదుఙ్ బ్రశాంతునిఙ్
నిరంజనుఙ్ మునీశ్వరేశు
నీరజాక్షు ధీరునిఙ్
హరుఙ్ జిదేకమూర్తి సాంబు
నాత్మభక్తిఁ గొల్చెదఙ్.

శంభో! మహాదేవ! విచిత్రంబుగ మనోహరంబుగ నీలోకము సృజియించియు నద్దానిని దుఃఖమంబుగ నొనరించినాఁడవు. భూతప్రేతపిశాచగణములతో శ్మశానమందు నివసించియు శంకరుండ వైతివి. కపాలమాలికలు ధరియించు నీయర్ధాంగి సర్వమంగళ యయ్యె. నీతత్త్వ మెఱుంగ నిలింపులేని చాలరన నే నెంతవాఁడను?

గీ. ఆఁడురూపంబుఁ జూచి కాపాడుతల్లి
వండునో లింగమూర్తి కన్నారఁ గాంచి
యద్వయుండగుఁ బూర్ణుండ వని వలతునొ
తాపసాకృతిఁ దాల్చిన తరుణమందు
గురునిగా నెంచి భక్తిని గొలువఁగలనొ.

(అని చింతించుచుఁ దెరమరుగునకుఁ బోవును)

(ప్రవేశము దామాడోలీశాస్త్రి)

(తెరలో 'నిరంజనకుమారా! నిరంజనకుమారా!' అని వినఁబడును.)

దామా—ఎవఁ డాపిలుచువాఁడు? అబ్బబ్బా! ఈకుత్తిసెగవలు హద్దులో నాఁగరుగద. ఆపేరితోఁ బిలువవద్దురాయని యొక్కొక్కరితోఁ జెప్పలేక చచ్చిపోవుచున్నాను. మునుపే ముక్కిడి, దానిపైఁ బడిసె మన్నట్లున్నది. పెదపిచ్చి చినపిచ్చియన్నట్లు మామహారాజుకడుపున నొక పిచ్చిమహారాజు పుట్టినాఁడు. ఎవరికైన లోకమున మారుపేరఁ బిలిచినఁ గోపము. మారాజకుమారునకుఁ దనపేరఁ బిలిచినఁ గోపము. నిక్షేపమువంటి పేరు నిరంజనుఁడని యుండఁగా 'జీవుఁడా' యని పిలిచినఁగాని యాతఁడు పలుకఁడు. దేవుఁడాయని మే మందఱు మాలాగున నే పిలుచుచున్నాము. ఈచీమిడికుంక లెట్టు లఘోరించిన నాదేమి పోయినదని యూరకుందునందునా యాపేరు వినఁగానే మాతిక్కశంకరునికి మఱింతతిక్క ముదిరి యింకను దూరమున కేగి యేచెట్టో గట్టో యెక్కి దిగకున్న వెదకలేక నాప్రాణములు పోవును.

పాట:—

దేవుఁడా యెందున్నవాఁడుర జీవుఁడు.
జీవుఁడు మాజీవుఁడు మాభూవిభుని కుమారుఁడు.
జీవుఁ డెవ్వఁడు, దేవుఁ డెవ్వఁడు
జీవదేవుల తావు లెక్కడ
భావమున గురుసూక్తినాటిన
దేవుఁడౌనట జీవుఁడౌర!

(ప్రవేశము అన్నంభట్టు)

(ఎదుటచూచి) అదిగో సుభేలుగాఁడు ఎవఁడో వచ్చుచున్నాఁడు. ఓరీ పప్పుభట్టు, నీ వెవత్తా? ఆపారాయణయ్యకొడుకవా?

అన్నంభట్టు—నాపే రన్నంభట్టని యెన్నిసార్లు చెప్పినను నన్నుఁ బప్పుభట్టని పిలిచెద వేల? నారాయణభట్టుగారు మానాయనగారని నీకుఁ దెలియదా యేమి? పారాయణయ్య యనెదవేల? ఇందులకే దామోదరశాస్త్రి యనుటకుమారు నిన్ను డామాడోలీశాస్త్రియని యందఱు పిలిచెదరు.

డామా—పరుసపేరువలె నేమి యెగిరిపడెదవురా! కుఱ్ఱవాఁడవు నీ కేమియెఱుక, వెలనాటి కందిపప్పు మఱింతగమ్మఁగా నుండును. చప్పని యన్నంభట్టు మేలా? కమ్మని పప్పుభట్టు మేలా? మీతండ్రిగారిని నారాయణయ్య యనఁబోయి పారాయణయ్యయంటిఁగాఁబోలు. పొరపాటున ననినను బురాణముచెప్పువారికి శాస్త్రమేమి? "శాస్త్రేషుహీనాః కవయో భవంతి, కవిత్వహీనాశ్చ పురాణభట్టాః" ఇఁకఁ జాలు. తాతకు దగ్గులు నేర్పినట్లు నాముందు నీతోఁక జాడింపక రాజకుమారుని జాడ తెలిసియున్నఁ జెప్పు, వెదకలేక చచ్చిపోవుచున్నాను.

అన్నంభట్టు--(దామోదరశాస్త్రిచెవిలో నేమో చెప్పి పరుగెత్తును.)

డామా—అరుగో నారాయణభట్టును, నరకేసరిశాస్త్రియు నావలెనే రాజకుమారుని వెదకివెదకి యీవైపునకే వచ్చుచున్నారు. కోటలో నందఱకు నన్నుఁ జూచిన భయము. నాకు నారాయణభట్టును జూచిన భయము. ఎందఱిలోనైన, నెట్టిసమయములోనైన రాజుగారి చెవిలో మూతిపెట్టువాఁ డతఁడు. చీటికిమాటికి మహారాజుగారు నే నిట నున్నాననుమాటయే మఱచి నారాయణభట్టుకే యగ్రతాంబూల మొసఁగుచుందురు.

(ప్రవేశము నారాయణభట్టు, నరకేసరిశాస్త్రి)

నారా—దామోదరశాస్త్రిగారూ! రాజకుమారునిజాడ యేమైన తెలిసినదా?

డామా—మహారాజుగారి జాడ తమ కెఱుక, కుమారమహారాజుగారిజాడ తమకుమారరత్నమున కెఱుక. మెడమీఁదదలగలవానితో మాటలాడని రాజకుమారుఁడు మీకుఱ్ఱవాని చెవులుకొఱుకుచుండును. చెంతనే కోనేటిగట్టున రాతిపలకమీఁద నొంటరిగా రాజకుమారుఁ డున్నట్టు తెలిసినదనియుఁ, దా నాతని వెంటనే తోడ్కొనివచ్చెదననియు చెప్పి మీవాఁడు వెళ్లినాఁడు. పిట్ట కొంచెము, కూఁత ఘనమన్నట్లు వాఁడు చూచుట కట్లున్నాఁడుకాని మంత్రిగారికిఁగూడ నాలోచనచెప్పలేకపోవుదునా యని తలఁచుచుండును.

నారా—నీహాస్యమున కేమిగాని నిజముగా రాజకుమారునిఁ బిలిచికొనివచ్చెదనని మావాఁ డరిగినాఁడా?

డామా—రాతిబొమ్మకుఁ జక్కిలిగింతలా యన్నట్లు మీకా నాహాస్యము. వారును వచ్చువేళ యయినది. మనమందఱ మొక్కసారి కానఁబడిన నాతని కేమి తోఁచి మన కగపడకుండ నెటకేని పోవునో యెవ్వఁ డెఱుఁగు. భట్టునకుఁగూడ సుకేలసన్నిధానమునకుఁ బోవ నుత్సాహము కలదు. కావున నెట్లైన సమ్మతింపఁ జేసి రాజకుమారు నిటకుఁ దేఁగలఁడు. సందేహము లేదు. రెండునిమిషములు గూర్చుండుఁడు.

నర—ఈ డామాడోలీశాస్త్రిగారు పరిహాసము మాని యింతప్రశాంతముగ మాటలాడుట నే నెన్నఁ డెఱుంగను. మీరుండబట్టిగాని లేకున్న నన్నొంటరిగానినిఁ జేసి ఎక్కసక్కెములాడి చంపుచుండును.

డామా—నారాయణభట్టుగారే నన్ను 'దామోదరశాస్త్రి' యని యంతగౌరవముగాఁ బిలుచుచుండ పవనసుంభితచర్మభస్త్రిగాండ్లందఱు నన్ను 'డామాడోలీశాస్త్రి' యననేల? వస్తువెఱుంగని వాగాడంబరమునకు నేను బెదరువాఁడను గాను. సాధుగోష్ఠివిరహితులై, ధ్యానపూజావివర్జితులై, కుక్షింభరులై, వాగ్వైఖరి శబ్దఝరిమాత్రము కలిగిన వేదాంతపణ్య విక్రేతల సన్నిధిని నాస్తికసంస్థాన సాంవత్సరికకించిమాన శతరూపికాసన్మానప్రాప్తిఫలకముగ గ్రంథపఠన గావించిన మీబోంట్ల పాండిత్యములు డామాడోలీ పాండిత్యములు

గాని నాదిగాదు. రాజసన్నిధానమున వేషధారులగు
మీబోంట్లు కెన్నటికైన స్వస్వరూపజ్ఞానము రానిమ్మని
నేనే డామాడోలీశాస్త్రియని పేరుపెట్టుకొంటిని.
"అహరహో గర్వః పరిత్యజ్యతాం" అన్నట్లు నాకును
గర్వపరిహారముగ నుండనీయని యీబిరుదము నేనేధరించి
నాను. ఆహా! యీశ్వరేచ్ఛాస్వరూపము. సభలో బల్లపైఁ
జేయిపెట్టియూఁగులాడుచు మాటలు తడబడ తలతోఁక
లేక ప్రసంగించుచు, దిగుదిగుమని పలువురు కేకలువైచినను
తా నసమర్థుఁడనని తా నెఱిఁగియున్నను, సభ్యుల యల్లరి
వలనఁ దన మాట లేరికి వినఁబడకున్నను న్యగ్రాసనాధి
పతి గంట వాయించుచున్నను దన యుపన్యాసము
మానఁజాలని జానపదనాయకునిభంగి మీ కేమియుఁ
దెలియదని తెలిసియు, నన్ను డామాడోలీశాస్త్రియని
పిలిచెద వెందుకయ్యా!

నర—(స్వగతము) బుద్ధి తక్కువయై వీనిని
గదలించితిని బాబూ! (ప్రకాశముగ) ఏమయ్యా! హాస్య
ము ముదిరి హాలాహలప్రసంగములోనికి దిగినది. విదూ
షకుఁడవు నీవు, విద్వాంసులము మేము. మమ్ముఁ
దృణీకరింపవచ్చునా?

డామా—చాలు చాలు. నీవిద్వత్తు నే నెఱుం
గుదునుగాని నావిదూషకత్వము నీ వెఱుంగవు. ఉప
కారవేతనము ననుభవించు నుద్యోగులకు, న్యాయవాదు
లకు, ముసలమ్మలకు భావ్యశాంతిఁ జేయించుట యను
కొంటివా? ఇది మంత్రసంప్రదాయము, ఇది యోగ
సంప్రదాయము, ఇది సాంఖ్యసంప్రదాయము, ఇది
యుపాసనాప్రక్రియ లెండు. ఇది వ్యాసఘట్టము
లెండు. ఇవి తేలునవికావు. పంక్తి సాగనిం డనుచు
దాటవేసి, గ్రంథపరిసమాప్తిచేయుట యనుకొంటివా?
భద్రము. ఏమియనుకొంటివి? ఈయాసంస్థానము నీయా
పీఠము ననుకొనుచున్నావేమి నీయాటసాగుటకు? ఇది
రాజశేఖరాస్థానము. ముక్కుపచ్చలారని మాకుమార
మహారాజు నీముక్కు నలిపివేయుచున్నాఁడు. నీవిద్వత్తు
తేలినదా?

నర—(స్వగతము) నే నీతనికే సమాధానము
చెప్పలేకున్నాను. ఇఁక నిరంజనకుమారునకా?

నారా—దామోదరశాస్త్రిగారూ! ఇంతతోఁ
బోనిండు. ఎక్కడ తగిలి యెక్కడఁ దేలునది తెలి
యవుకదా మీమాటలు. భక్తిప్రపత్తులు నేర్చుకొని
బాగుపడనిమ్మని ప్రభువుగారు తన్ననుగ్రహించి పిలి
పించినారని యెఱుంగక తన పాండిత్యప్రతిభను గాం
క్షించి సంస్థానాలంకారముగ నాహ్వానముచేసినారని
యెంచుకొనుచుండును.

డామా—మామగారు బాగుగఁ జెప్పినారు.

నర—చిన్నవాఁడనని యెంతమాటనైనను విదూ
షకునిచే ననిపించుట పెద్దలకు మీకుఁ దగునా?

డామా—నేను విదూషకుఁడనైన నైతినిగాని
నీవుమాత్రము పండితుఁడవు కావు, పగటివేషగాఁడవు.

నారా—నరకేసరిశాస్త్రీ, యీతఁడు సామాన్యుఁడు
కాఁడు. కృష్ణరాయల సభలోఁ దెనాలిరామకృష్ణునకే
చెల్లినది. రాజశేఖరాస్థానమున నీ దామోదరశాస్త్రికే
చెల్లినదిసుమా హాస్యము. దామోదరశాస్త్రిగారూ,
పిచ్చుకపై బ్రహ్మాస్త్ర మేల? ఈతనిని వదలి ఇంతకుఁ
బూర్వము పాడిన పాట మరల నొక్కసారి పాడుఁడు.

డామా—పాట:

దేవుఁడెవ్వఁడు జీవుఁడెవ్వఁడు దేవజీవుల తావులెక్కడ
భావమున గురుసూక్తి నాటిన దేవుఁడౌనట జీవుఁ డౌర

నర—(స్వగతము) ఇన్నిచోటులు చూచితిని
గాని యీసంస్థానమున నున్న సేవకునిలోఁ జివరకుఁ
జాకలివానితోఁగూడ మాటలాడుట కష్టముగ నున్నది.

డామా—మా జీవమహారాజుగారి స్మరణములో
నీమాట మఱచితిని. నీవంటి విమతుల దూషించువాఁడ
నగుటచే విదూషకుఁడ నయితిని.

(ప్రవేశము నిరంజనకుమారుఁడు, అన్నంభట్టు)

డామా—మానాయనా! వచ్చితివా! పెద్దమహా
రాజుగారు పెద్దపండితుల గోష్ఠిలో నున్నారు. న
న్నటకు రానీయరు. తమరన్నో గడియలో సుశీలముని
సన్నిధానమున కరుగుచున్నారు.

నారా—ఆయుష్మంతా! మహారాజుగారి సెలవయినది, నారాయణవనమున నున్న సుశీలమునిసన్నిధానమునకుఁ దమను గొనిపోయి శుశ్రూషకు విడిచి రమ్మని.

అన్నంభట్టు—తండ్రీ, నన్నుఁగూడ రాజకుమారునితోఁ బంపెదనంటివికాదా!

నారా—బాబూ! నీకును రాజకుమారు ననుసరించి పోవ సెలవయినది.

నిరం—భట్టుగారూ! నాచెలికాఁడును నావెంట వచ్చుట నా కానందముగా నున్నది. ఇంచుకయయినఁ బ్రశాంతిలేని నాచిత్త మాసుశీలముని యనుగ్రహమున శాంతిఁగాంచుఁగాక.

డామా—నీయమ్మకడుపు చల్లఁగ సకలవిద్యాదురంధరుఁడవు కమ్ము. జీవత్వమును వదలి నీవు మా కందఱకు దేవుఁడ వయ్యెదవులే.

"భావమున సురసూక్తి నాటిన దేవుఁడౌనట జీవుఁ డౌరా!"

నిరం—సురసూక్తిలబ్ధియే జీవుని దేవు నొనరించునా? ఈతని మాటలు, పాటలు నవ్వుపుట్టించునవై నను మిక్కిలి నాణెమైనవిసుమా!

డామా—రాజకుమారా! ఈ నారాయణభట్టుగారికిఁ జెత్తనమిచ్చుటచే ముక్కుమొగమెఱుంగనివారి నందఱ నుపన్యాసకులుగా నియమించి నన్నుఁ బండితగోష్ఠిలోనికి రానీయకుండఁ జేసినాఁడు. ప్రథమశిక్షలో నావిధాన మవలంబించినతరువాత నుత్తమవిద్యావిధాన మెంతయో సుకరముగ్గ నుండఁగలదు. స్థాలీపులాకన్యాయముగ నుదాహరించెదను.

బూడిదగుమ్మడికాయపొట్టలో నడ్డముగ గరిటెఁ గ్రుచ్చిన "ఈ" అగును. చెవులబూరెలమూఁకుడు చెవులలో గరిటెఁ దూర్చిన "ఆ" యగును. ఒకసీసా, రెండుచేటలు, నొక రోకలి, నాలుగు కొయ్యరోళ్లు, ఒక చీపిరికట్ట పెట్టి యేనుఁగుపాఠమును జెప్పవలెను. ఇంక నిట్టి వనేకములు కలవు. మహారాజకుమారా, ఆశ్రితులపై ననుగ్రహ ముంచవలెను. నా కీనాటి సభలో మాట్లాడుట కవకాశ మీయలేదు. కావున నా సిద్ధాంతము లన్నియు నొక్కగ్రంథముగ వ్రాసెదను. ఏలినవారు తిరిగివచ్చినతరువాత వీని నమలులోఁ బెట్టింపవలయును.

నిరం—మీమాట లెప్పుడును మాకు సంతోషదాయకములే. గ్రంథము పూర్తికానిండు, చూచెదము. నారాయణభట్టుగారూ! మీరు సిద్ధముగా నుండుఁడు. నే నిదే మాతలిదండ్రులయొద్ద సెలవు వడసి వచ్చెదను.

(అందఱు నిష్క్రమింతురు.)

# ఆంధ్ర దేశము-పిండారీదండులు

(౧౮౦౦-౧౮౩౫)

అడవి శంకరరావు

పందొమ్మిదవ శతాబ్దారంభమున ఆంధ్రదేశమునం జాలభాగము లల్లకల్లోలముగ నుండినట్లు చరిత్రను బట్టి మనకుం దెలియవచ్చుచున్నది. ౧౮౧౬ జనవరి ౩౧వ తేదిని చెన్నపురి ప్రభుత్వము వారు లండనులోని తూర్పిండియా కంపెనీ డైరక్టరుల కిట్లు వ్రాసిరి :

"సెయింటుజార్జికోట ప్రభుత్వము (చెన్నపురి ప్రభుత్వము) నకు లోంబడిన ప్రదేశములలోనికిం జొరంబడు నుద్దేశ్యముతో కృష్ణానదియొక్క యుత్తరపుటొడ్డున పెద్ద పిండారీదండులు తిరుగాడుటనుసరించి మీకుం దెలియుటకై సంజాయిషీ మార్జినులో నొసంగంబడినది. రాంబోవు పిండారీదాడినుండి మనసరిహద్దురాష్ట్రములను గాపాడుటకు వలయు సన్నాహములు వెంటనే చేయంబడినవని మీరు గుర్తించియేయుందురు. వీలుగానున్న అశ్విక దళ మొకటియు (అనంగా ఆరవ అశ్వికదళము) ఆర్కాటునుండి బళ్లారికిం బంపంబడినది. యుద్ధనౌక యొకటి ఆయుధములు, మందుగుండు సామానుతో బందరు, గుంటూరు జిల్లాలలో మనపాలనకు లోంబడినవారి సంరక్షణార్థమై బందరురేవునకుం బంపంబడినది. మైసూరిరాజావారి సైన్యములనుండి పదమూండువందలమంది గుఱ్ఱపు రౌతులును, రెండువేలమంది పదాతిసైన్యమును దత్త మండలములలోని బ్రిటిషు సైన్యములోం గలిసి క్రమేణ పనిచేయునుద్దేశ్యముతో సిద్ధముచేయంబడినారు. నిజాము ప్రభుత్వమునకు లోంబడిన పెక్కు గ్రామములును, కంపెనీపాలనకు లోంబడిన కొన్ని గ్రామములును పిండారీలచే దోచుకొనంబడినవని తెలియంజేయుటకు మా కాందోళనముగ నున్నది. కాని సరిహద్దుప్రదేశములనుండి యిటీవలం దెలియవచ్చిన సంగతులనుబట్టి ఈ దోపిడిగాండ్రు గోదావరినిదాంటి వెనుకకుమరలిరని వినుటచేం గొంత మనశ్శాంతిగనున్నది."

ఈలేఖవలన ౧౮౧౬ ప్రారంభమున పిండారీ దండులు గోదావరికృష్ణానదులను దాంటివచ్చుచున్నట్లు స్పష్టమగుచున్నది. ౧౮౧౬ ఏప్రియల్ ౨౯-వ తేదిని చెన్నపురి ప్రభుత్వమువారే యిట్లు వ్రాసిరి :

"కడచిన జనవరి ౩౧ వ తేదిని మేము వ్రాసినలేఖనుబట్టి అప్పటికి పిండారీదండులకదలికననుసరించి డైరక్టరులకు బూర్తిగం దెలుపంబడియే యున్నది. పిండారీలు దత్తమండలములలోనికిం జొరంబడుటకుం బ్రయత్నించి విఫలమనోరథులగుటయుం, దరువాత వారు కృష్ణానది కెడమవైపున ముందునకుంబోయి బందరుజిల్లాలోనికిం గొంతవరకుం జొరంబడి మరలగోదావరిదాంటి వెనుకకేగుటయుం దెలిసియే యున్నది. జనవరిమాసాంతమునను, ఫిబ్రవరిమాసములోను పిండారీలు మరల కదలికంజూపుచున్నట్లు ఫోర్టుసెయింటు జార్జికోటకు వర్తమానము వచ్చినది. వారు సంచారమొనర్చుచున్న దూరపుప్రదేశములలోనైనను వారిసంఖ్యయు, వారియుద్దేశ్యమును బూర్తిగం దెలియవచ్చుటలేదు. ఒకపిండారీదండు నాగపూరుసమీపముననను, మరియొకటి (మహారాష్ట్రములోని) పూరియండావైపునకును సంచారమొనర్చుచున్నారు. మరియొకదండు గోదావరికి దక్షిణమున వరంగలువైపునకు కదలుచున్నట్లు హైదరాబాదులోని రెసిడెంటువద్దనుండి ఫిబ్రవరి ౧౧-వ తేదిని తెలియవచ్చినది. ఈసమాచారమును కృష్ణానదీతీరముననున్న జిల్లాలలోని స్థానికోద్యోగులకు హైదరాబాదు రెసిడెంటుగారు తెలియంజేసియే యున్నారు. నాగపురమునకు సమీపముననుండిన దండే గోదావరికి దక్షిణమున సంచారమొనర్చుచున్న దండని యూహింపం దగియున్నది. ౧౯-వ తేది గలిగి గుంటూరునుండి వచ్చిన బేగిరావుటపావలన పిండారీదండులు గుంటూరులోంజొరంబడి ఆపట్టణమును దోచుకొనుటయేకాక ఆమండలములోని ఇతర

గ్రామములను చాలవరకు దోచుకొనినట్లు తెలిసి మే మాందోళనము పడుచున్నాము."

## గుంటూరుదోపిడి

గుంటూరుదోపిడిని గురించిన వివరము లీక్రింది లేఖలలో నొసంగఁబడియున్నవి. ఈలేఖ ౧౮౧౬ మార్చి ౧౨-వ తేదిని మధ్యాహ్నము రెండుగంటలకు గుంటూరు మేజిస్ట్రేటు ఆఫీసునుండి వ్రాయఁబడినది.

"చెన్నపురి ప్రభుత్వమువారి జ్యూడిషియల్ డిపార్టుమెంటు కార్యదర్శిగారికి—

అయ్యా,

విచారకరమైనను, విఖ్యాతమైన ధర్మము ననుసరించి చెన్నపురిగవర్నరుగారికిని, కౌన్సిలుసభ్యులకును నే నీక్రిందివివరములఁ దెలియఁజేయవలసియున్నది. ఈ దినమున సూర్యోదయమగుచుండఁగనే పెక్కుపిండారీ మూఁకలు గుంటూరుగ్రామమును బ్రవేశించినవి. ఈ మూఁకలు పెద్దవిగనుండెను. వారి నెదుర్చుటకుఁ జేయవలసిన ప్రయత్నములన్నియుఁ జేసినను ఈపిండారీ మూఁకలు గుంటూరుపట్టణమున చాలచోట్ల దోపిడీలు చేసి ఘోరమగు దౌర్జన్యముల నొనర్చినారు. ఈపట్టణమందలి సైనికులకును, పిండారీమూఁకలకును సంఘర్షణ మనేకపర్యాయములు జరిగినది. ఐదుగురు ఖైదీలుగఁ బట్టుపడినారు. అందులో నిరువు రపాయకరమైన గాయముల నందినారు. పంద్రెండు గుఱ్ఱములు పట్టుకొనఁబడినవి. ఈపిండారీలసంఖ్యను నే నిప్పుడు సరిగఁ దెలుపఁజాలను. వారీగ్రామములో సంచరించుచుండఁగా నేను గుర్తించినదానినిబట్టి వారు రెండువేలమందికిఁ దక్కువయుండరని యెంచుచున్నాను. వా రొకగంట క్రిందనే గుంటూరును వదలి వాయవ్యదిశ కతిత్వరితముగఁ బ్రయాణము సాగించిరి. సైనికుల నిచ్చుటకు మా సహాయార్థమై పంపుమని నేను కొండపల్లికి మరల వ్రాసితిని. రెండవఅశ్వికదళముయొక్క అధికారికిఁగూడ గుంటూరి కతిశీఘ్రముగ నాతనిసైన్యముతో రావలయునని కోరుచు నేను లేఖను వ్రాసితిని. నాగృహము సంపూర్ణముగా దోచుకొనఁబడినది. ఓక్సుగారియొక్కయు హెయిన్సుగారియొక్కయు గృహములకుఁగూడ నించుమించు అట్టిఅవస్థయే పట్టినది.

(సం) జె. ఎ. డల్ జెల్.

అసిస్టెంటు మేజిస్ట్రేటు.

మేజిస్ట్రేటుఆఫీసు-గుంటూరు

౧౨ మార్చి ౧౮౧౬-మధ్యాహ్నము ౨ గంటలు."

ఈపై లేఖలోఁ జేర్కొనఁబడిన జె. ఏ. ఓక్సు గారు గుంటూరుజిల్లాకు ౧౮౧౬ లో కలెక్టరుగ నుండిరి. కలెక్టరైన ఈ జె. ఏ. ఓక్సుగారే ౧౮౧౬ మార్చి ౧౩-వ తేదిని నరసారావుపేటనుండి చెన్నపురి ప్రభుత్వము- జ్యూడిషియల్ డిపార్టుమెంటు కార్యదర్శిగారి కిట్లు వ్రాసిరి:

"అయ్యా,

గుంటూరుగ్రామమును, అచట్టుపట్ల గ్రామములను పిండారీలు దోచుకొనిరనిన వార్త మిక్కిలి ఆందోళనమొందు చిత్తముతో మీకుఁ దెలియఁజేయుచున్నాను. నిన్నరాత్రి చింతపల్లి, అమరావతినైపునఁ దుపాకీలఁ బ్రేల్చుట వినవచ్చినది. వారి యాశ్వికదళ మిచ్చటకు వచ్చునని ప్రతిఘటిసయ యెదురుచూచుచున్నాము. సత్తెనపల్లి జమీందారు చనిపోయినందున నేను సత్తెనపల్లికేగి తిరిగి నరసారావుపేటకు వచ్చుచుండఁగా మార్గమధ్యమందలి గ్రామములలో నెందును జనసంచారమే లేకుండుట గనుగొంటిని. కంపెనీవారి ఇచ్చటి ఖజానా దోచుకొనఁబడినది, లేనిది నాకుఁ దెలియుట లేదు. ఈఖజానాలో ముప్పదివేల వరహాలుండెనని నాకుజ్ఞాపకము. కట్టుబడి నౌఖరులను గొందఱిని గుండారావు ప్రోగుచేసినాఁడు. వారిసాయమునను, గుండారావుబంధువుల సాయమునను సరియైనసైన్యము వచ్చువరకు మే మీదోపిడిగాండ్ర నాఁగఁగలమని నాకు ధైర్యముగ నున్నది."

కంపెనీవారి సైన్యము కొంతకాలమునకు గుంటూరిలోనికి వచ్చుటవలన గుంటూరిలోని ప్రజల యలజడి కొంతతగ్గినట్లు ఈక్రిందిలేఖవలనఁ దెలియఁగలదు. ఈ లేఖ గుంటూరు మేజిస్ట్రేటు డాల్ జెల్ గారిచే వ్రాయ

రాసుప్రభుత్వకార్యదర్శికి ౧౮౧౬ మార్చి ౧౫-వ తేదిని వ్రాయఁబడినది. లేఖ క్రిందనుదాహరింపఁబడినది:

"నిన్న మధ్యాహ్నము నరసారావుపేటకు పిండారీలు వచ్చినట్లు రూఢియైన సమాచార విషయమును నేనే నాకుఁ జేరినది. ఈజిల్లాలో ముఖ్యులైన జమీందారులలో నొకరికి నరసారావుపేట నివాసస్థానము. నరసారావుపేటకు మేజర్ పెప్పర్ (Major Pepper) గారి నాయకత్వమున మూఁడవ దేశీయపదాతిసైన్యము (Native Infantry) లోని రెండవజట్టు వచ్చినట్లు సమాచారము వచ్చినది. రెండవ అశ్వికదళ మింకను గుంటూరునకుఁ జేరలేదు. ఈ దోపిడిగాండ్రు ప్రయాణముచేయుచున్న మార్గము తెలియవచ్చుటచే మేజర్ వాకర్ (Major Walker) గారు తిన్నగా వారిని దరుముచుఁబోయిరని నే నూహించుచున్నాను. ఈ ప్రాంతములలో పిండారీలదోపిడులలో నత్యంతదారుణమైన, ఘోరకృత్యము లొనర్పఁబడినవి. వారు దోచుకొనిన ప్రతిగ్రామములోను వారిక్రోధమునకు గురియై కష్టముల పాలైనవా రున్నారు. వినాశకరమైన వీరి బారినుండి కొన్నిపల్లెలుమాత్రమే తప్పిపోయినవి. ఈ దోపిడిగాండ్రచే గాయములపాలైనవారిలో రమారమి ఏఁబదిమంది హెయిన్సు (కోర్టునకుఁజేరి గుంటూరిలోఁ బనిచేయుచున్న వైద్యుఁడు) వద్దకువైద్యమునకై వచ్చినారు. వారియెడల ఆవైద్యుఁడు కనుపరచుచున్న శ్రద్ధ విశ్రాంతి నెరుఁగనిదియై చాల ప్రశంసార్హమై యున్నది. కంపెనీవారి సైన్య మిచ్చటకుఁ జేరినతరువాత ప్రజలలో నెట్టిమార్పుగలిగెనది తెలిసికొనుటకై నిన్నరాత్రి నడకమీఁద గుంటూరులో నేను సంచారము చేసితిని. ప్రజలలో అలజడి కొంతవరకు తగ్గినట్లు నేను కనిపెట్టితిని. తమ యాస్తినంతయు ఈదోపిడిలోఁ గోల్పోవుటచేత వారు పడుచున్న కష్టములును, పిండారీల రాక్షసకృత్యములవలన వా రనుభవించిన పాట్లును నాకు మిక్కిలి మనోవేదన గల్గించినవి. ఇంతజాలికరమగు దృశ్యమును నే నెప్పుడును జూచియుండలేదు. ఓక్సుగారియొక్కయు, ఇచ్చట సైనికసంస్థకుఁ జెందిగుంటూరుచుట్టుపట్ల సర్వేచేయుచున్న జట్టువారియొక్కయు క్షేమసమాచారము తెలియక నేను చాల భయపడితిని. కాని ఓక్సుగారు నరసారావుపేటలో నున్నారని తెలియవచ్చుటచే నాకు చాలఆనందము గలిగినది. సర్వేచేయుచున్నజట్టులో లెఫ్టినెంటు యమ్ డోనాల్డుగారికి తప్ప మిగిలినవారికి గాయములేమియుఁ దగులలేదు. వారిలో కొందరి ఆస్తిమాత్రము దోచుకొనఁబడినది.

"౧౨-వ తేదిని కలెక్టరుఆఫీసును, కోర్టుభవనమును, జైలుభవనమును సంరక్షించుటలోఁ దాత్కాలికముగా సైనికులుగాఁ బనిచేసినవారు ప్రజాక్షేమమునకై పడినపాటును నేను ప్రశంసించుటకై మీయనుమతిని వేఁడుచున్నాను. పిండారీలను తరిమివేయుటలో కొత్వాలు పడిన కష్టమును, పిండారీలు దోచుకొనిన ఆస్తిని తిరిగి వారివద్దనుండి లాగికొనుటలో గుంటూరులోని మాదిగవాండ్రు జూపిన ధైర్యమును మిక్కిలి కొనియాడఁదగినవై యున్నవి."

పై లేఖను వ్రాసిన గుంటూరు మేజిస్ట్రేటు జె. ఏ. డాల్ జెల్ (J. A. Dalzell) గారే ౧౮౧౬ మార్చి ౧౬-వ తేదిని మదరాసుప్రభుత్వమువారికి వ్రాయుచు పిండారీలు దోచుకొనిన గ్రామములలోని ప్రజలు బ్రిటిషువారికి లోఁబడినప్రదేశములనుండి ఇతరుల పాలనలోనున్న రాజ్యములలోనికి వెడలిపోవుచున్నారనియు, బ్రిటిషుపరిపాలనము ప్రజలను రక్షింపలేదను భావము దేశములో వ్యాపించుట బ్రిటిషువారి ప్రతిభకు భంగకరమనియుఁ దెలియఁజేసిరి. డాల్ జెల్ గారు ౧౯-వ మార్చిని మదరాసుప్రభుత్వకార్యదర్శికి లేఖ వ్రాయుచు పిండారీలు వెడలిపోవుచున్న మార్గములోనున్న గ్రామములలో వారనఁ బ్రజలకు హడలుగనున్నదనియు, కాని గుంటూరునకుఁ బశ్చిమముననున్న అయినావతి (Ainavote) గ్రామములోని ప్రజలు వారి నెదిర్చినట్లు తమకు వర్తమానము వచ్చినదనియుఁ దెలియఁజేసిరి. దేశమును సంక్షోభముపాలు చేయుచున్న పిండారీదండులు ఐనావతిగ్రామమును సమీపించఁగనే ఆగ్రామములోని ప్రజలు వారిస్త్రీలను (భార్యలను, కొమార్తెలను) పిండారీలచేతులలో నప్పగించుటకంటె

కుటుంబములతోఁ దాము సర్వనాశమైపోవుటకుఁ గూడ సిద్ధపడి అట్టియేర్పాటులను జేసికొనిరి. అట్లు ధైర్యముగ వినావలి గ్రామస్థులు పిండారీల నెదిర్చియు, పిండారీ లెక్కువసంఖ్యగలవారగుటవలన గ్రామస్థులోడిపోయినపుడు, ఆ గ్రామస్థులు తమగృహములకు నిప్పంటించుకొని తమ మానమును గాపాడుకొనుటకై కుటుంబములతోఁబాటు అమంటలలోపడి ప్రాణత్యాగముఁజేసిరి. ౧౮-వ మార్చినాఁటికి డాక్టరు హెయిన్సు సంరక్షణలోనున్న క్షతగాత్రుల(Wounded Patients) సంఖ్య వందవఱకు పెరిగినదనియు, హెయిన్సుగారి వైద్యమువలనను, వారి నిరంతరకృషివలనను గాయములందినవారు ఆరోగ్యము బడయుచున్నారనియుఁ గూడ డాల్ జెల్ గారు వ్రాసిరి.

౧౮౧౬ మార్చి ౨౦-వ తేదిని ఒంగోలునుండి వ్రాయఁబడిన ఈ క్రింది లేఖవలన పిండారీల ఘోరకృత్యములను గూర్చి వివరములు తెలియఁగలవు:

"పిండారీ రౌతులు గుంటూరును దోచుకొని ఆచుట్టుప్రక్కల నేఁబది గ్రామములవరకు దోచి అనేకమంది స్త్రీలను మానభంగ మొనర్చినారు. అచ్చటనుండి ౧౮ (మార్చి) తేది సోమవారము బయలుదేరి వారు మరి నలువది గ్రామములను దోచి వాటిని పరశురామప్రీతిఁ జేసి స్త్రీలను మానభంగ మొనర్చినారు. అచ్చటనుండి వారు నెల్లూరు రానున్నారు. ఈదళమువారి యొక్క యుద్దేశ్యము దోపిడిమాత్రమే యైయున్నది. పిండారీల గుఱ్ఱపుదళము ఇరువదివేలమంది రెండువందల తుపాకులతో నీలగొండ, మామిడాలపిల్లి సమీపమున నున్నారు. ఈగుఱ్ఱపుదళము బందరునకుఁ బోవునని జనులనుకొనుచున్నారు. ఈదళము దినమున కేఁబది క్రోసులు ప్రయాణము చేయఁగలరు. మన గుఱ్ఱపురౌతులుగాని, మన పదాతిసైన్యముగాని వారిని కలిసికొనలేవు. గుంటూరులో ధనికుఁడైన సాహుకారు కాశా స్త్రీపిల్ఫి, పిండారీలచే దెబ్బలను దిన్నవాఁడు, చనిపోయినాఁడు. పిండారీలచే మానభంగ మొనర్పఁబడిన స్త్రీలనేకులు నూతులలోఁబడి మరణించినారు"

## తక్కినజిల్లాలు

ఈపిండారీలభయము తక్కినజిల్లాలకుఁ గూడ వ్యాపించుచుండినట్లు క్రింద నుదాహరింపఁబడిన లేఖలవలన స్పష్టమగును. కడప మేజిస్ట్రేటు న్యూమన్ గారు (Mr. Newman) ౧౮౧౬ మార్చి ౧౭-వ తేదిని మదరాసుప్రభుత్వకార్యదర్శికి వ్రాయుచు దూపాడు తాలూకాలో పిండారీలు ప్రవేశించినట్లు తమకుఁ దెలియవచ్చినదనియు, కర్నూలులోని ఉద్యోగస్థులు పంపిన సమాచారమునుబట్టి కృష్ణానదీతీరమున పిండారీమూఁక చాలపెద్దది చేరియున్నట్లు తెలియుచున్నదనియు వ్రాసిరి. అప్పటికి కడపకలెక్టరువద్ద ఖజానాలో ౨,౧౩,౦౦౦ వరహాలు ప్రభుత్వధనము నిలువయుండి, కడపచుట్టుప్రక్కలజిల్లాలు చాలముఖ్యమైనవగుటచే వానిసంరక్షణార్థమై మదరాసు ప్రభుత్వమువారు తగిన కట్టుబాటులను చేయవలయుననియుఁ గూడ న్యూమన్ గారు వ్రాసిరి. ఈన్యూమన్ గారే ౧౮౧౬ మార్చి ౧౯-వ తేదిని వ్రాయుచు చాలమంది ప్రజలు కడప వదలిపోవుటకుఁ బ్రయత్నించుచున్నారని తెలిపిరి. ౧౮౧౬ మార్చి ౨౪-వ తేదిని వ్రాసిన లేఖలో దూపాడుతాలూకాలోని అనేక గ్రామములను పిండారీలు దోచుకొని నదినిదాఁటి వెనుకకు మరలిరనియు, వారిని దరుముటకు రెండవ అశ్వికదళము పంపఁబడినదనియుఁ గూడ న్యూమన్ గారు తెలియఁజేసిరి. కడపకలెక్టరైన రాస్ గారు ౧౮౧౬ మార్చి ౨౩,౨౪-వ తేదులను చెన్నపురిలోని రివిన్యూబోర్డువారికి వ్రాసిన లేఖలలో కడపలోని హిందువులు చాలమంది కడపను వదలి చుట్టుప్రక్కలనున్న పర్వతప్రదేశములలోనికిఁ బారిపోయిరనియు, మిగిలినవారుకూడ సమాచారము వచ్చినవెంటనే ఏక్షణముననైనను పారిపోవుటకు సిద్ధముగనున్నారనియు, అవరకే తెలియఁజేసినట్లు గ్రామములలో జనసంచారమే లేదనియు వ్రాసిరి. రెండవ అశ్వికదళము పిండారీలను కలిసికొనలేకపోయిరనియు, పిండారీలు కడపవదలి కృష్ణానదీతీరమునకు మరలవచ్చిరనియు, పర్వతప్రదేశములకు, అడవులకుఁ బారిపోయిన ప్రజలను లంబాడీలు, కుర్చివార్ జాతివారు దోచుకొనినారనియు,

చెన్నూర్, ధూర్, కమలపూర్ తాలుకాలలోఁ గూడ ప్రజలు భయముచేఁ దమగ్రామములను వదలి పారిపోయిరనియు, వారిలోఁ గొందరు మాత్రము ౧౮౧౬ మార్చి ౨౩-వ తేది సాయంత్రమునుండి వెనుకకు మరలి రానారంభించుచున్నారనియు, పిండారీలు వెడలిపోయిన సమాచారమును నాల్గువైపుల ప్రజలకుఁ దాము తెలియఁబరుచుచుండుటచేఁ బ్రజలు మరల వెనుకకు తిరిగి తమ గ్రామములకు రావచ్చునని తా మెంచుచున్నామనియుఁ గూడ రాస్‌గారు వ్రాసిరి.

రాజమహేంద్రవరములో ౧౮౧౬ లో మేజిస్ట్రేటుగానుండిన లాంగ్‌గారు ఆసంవత్సరము మార్చి ౨౩-వ తేదిని చెన్నపురిప్రభుత్వకార్యదర్శికి లేఖ వ్రాయుచు బందరు, గుంటూరుజిల్లాలలో పిండారీలు ప్రవేశించినట్లు తెలియవచ్చుటచే రాజమహేంద్రవరము నందలి ప్రజలు భయకంపితులై యున్నారనియు, ఈభయము ప్రజలలో పెద్దాపురమువరకు వ్యాపించియున్నదనియు, చాలమంది తమ కుటుంబములను పర్వతప్రాంతములలోనికి, గోదావరి చుట్టుప్రక్కల ప్రదేశములలోనికిఁ బంపివేయుచున్నారనియు, ఏలూరు, రాజమహేంద్రవరముల మధ్యనున్న గ్రామములను బ్రజలు భయముచే వదలిపెట్టి వెడలిపోయిరనియు, ఈగడబిడల వలన రైతులు తమకిస్తీలను చెల్లింప నిరాకరించుచున్నారనియుఁ దెలియఁజేసిరి.

కడప మేజిస్ట్రేటు న్యూన్‌హామ్‌గారు ౧౮౧౬ మార్చి ౨౮-వ తేదిని మదరాసుప్రభుత్వకార్యదర్శికి లేఖ వ్రాయుచు ఆస్తిని గోలుపోయినందుకు ప్రజలు పడెడు విచారముకంటె వారిసంసారములలోని స్త్రీలు మానమును గోల్పోవుటచే వారికిఁగలిగెడు ఆవేదన హెచ్చుగనున్నదనియు, అందుచే ఈ పిండారీదండులు తగినరీతిని శిక్షింపఁబడిరని ప్రజలకుఁ దెలుపలేనియెడల, పిండారీలు వచ్చుచున్నారని యేనీలివార్త వినినను కడపజిల్లాలోని ప్రజలు భయకంపితులగు స్థితిలో నున్నారనియుఁ దెలిపిరి. ఈసంగతిని గురించియే గుంటూరుజిల్లామేజిస్ట్రేటు ఎల్లిస్‌గారును, గుంటూరుకలెక్టరైన ఓక్సుగారును కలిసి ఒకలేఖను మదరాసుప్రభుత్వకార్యదర్శికి ౧౮౧౬ మార్చి ౩౧-వ తేదిని వ్రాసిరి. బ్రిటిషు పరిపాలనమునందుఁ బ్రజలకుఁ గలనమ్మకము పూర్తిగా నశించుటచే బ్రజలు తమగ్రామములనుండి పూర్తిగ వెడలిపోయిరనియు, గుంటూరిలోనైనను చాలతక్కువమంది పట్టణములో మిగిలియున్నారనియు, పట్టణము యొక్కస్థితి చాల శోచనీయముగనుండి, కుటుంబములతో గుంటూరిలో మిగిలియున్నవారొక్కరు గనఁబడుటలేదనియు, తగినంత సైన్యము గుంటూరుజిల్లా సంరక్షణార్థము పంపఁబడువరకు పరిస్థితు లట్లేయుండుననియు పైలేఖయందు వ్రాయఁబడెను.

## గంజాముజిల్లా

పిండారీమూఁకలు గంజాముజిల్లానుగూడ విడువలేదు. ౧౮౧౭ జనవరి ౨౪-వ తేదిని ఫోర్టుసెయింటు జార్జికోటనుండి వ్రాయఁబడిన రాజకీయవిషయములను గురించిన లేఖలో పిండారీలు గంజాముజిల్లాలోఁ బ్రవేశించిరనియు, వారు లెఫ్టినెంటు బార్త్‌విక్ (Barthwick) చే తరిమివేయఁబడిరనియు, గంజాముజిల్లాలో పిండారీలొనరించిన దురంతములగురించి గంజాముజిల్లా కలెక్టరు రివిన్యూబోర్డువారికి వ్రాసిన ఈక్రిందిలేఖవలన వివరములు బోధపడుననియుఁ దెలిపిరి.

గంజాముజిల్లాకలెక్టరు హ్యూస్పాట్స్‌వూడ్ (Hugh Spottswoode) ౧౮౧౭ జనవరి ౬-వ తేదిని వ్రాసిన లేఖ దిగువ నుదాహరింపఁబడినది :—

"ఫోర్టుసెయింటు జార్జికోటలోనున్న రివెన్యూ బోర్డువారికి—

అయ్యా,

పదేపదే నా కేకరీతిగా వచ్చుచున్న రిపోర్టులను బట్టి మరాటాదండులు గంజామునకుఁ బోవుమార్గమునను, దానికావలను గల ప్రదేశము లన్నియు దోచుకొని నాశనముజేసిరని మీకుఁ దెలియఁజేయుటకు వేగిరపడుచున్నాను. తుర్ల, మందసేవ్, జల్లంత్ర, బుడార్ సింగ్, ఛీఘట్టే, కళ్లికోట, హుట్‌ఘర్ జమీందారీలలోని ప్రజ లీపిండారీలవలన దారుణమగు హింసలపాలయినారు. ఇచ్ఛాపురము మొదలగు పరగణాలు దోచుకొనఁ

బడి తగులఁబెట్టఁబడినవి. మరాటీమూఁకలు తమంతఁ దాము పోని ప్రదేశములందైనను:వారిని గురించి భయము వ్యాపించి గ్రామములనుండి గ్రామస్థులు పూర్తిగా వెడలిపోవుటవలన, ఆప్రదేశములలోనుండియున్న దోపిడికాండ్రు అండానీలమూఁక లీగ్రామములను దోచుకొనినారు. ఈ దోపిడీలవలన నెంత నష్టముకలిగినది నేనిప్పుడు తెలియఁజేయలేకున్నాను. ఒక్క గంజాము పట్టణమునుండియే ధనమును, నగదును నాలుగులక్షల రూపాయలవరకు వారు దోచుకొనిపోయిరని చెప్పుకొనుచున్నారు. ఈయంచనా చాలతక్కువయనియు, నష్టము నాలుగులక్షలకంటె నెక్కువయుండుననియు నేనెంచుచున్నాను. పిండారీలు నాగడమఁ దిరిగిపోవుచు గుంసూర్ మార్గమునఁ బోవుటచే గుంసూరు జమీందారీకి చాల నష్టముగలిగెనది. పిండారీలు పోయిన ప్రతిప్రదేశమునందును వారు త్రోవలోనున్న గ్రామములను దోచుకొనుటయు, గ్రామస్థులు గ్రామములను వదలి పారిపోవుటయు జరుగుచున్నది. పిండారీలు పోని ప్రదేశములలోఁగూడ వీరివలని భయము వ్యాపించి గ్రామస్థులు గ్రామములను వదలివేయుటచే నష్టమపరిమితముగఁ గలిగినది. మన పరిపాలనము తమ్ము రక్షించుననునమ్మకము ప్రజలలో నశించినది. పర్వతప్రదేశములకును, అరణ్యప్రదేశములకును సంరక్షణార్థము పారిపోయిన ప్రజలు నేఁటికిని తమ గ్రామములకు మరలి వచ్చుట కిష్టపడుటలేదు. బరంపురములో నాకచేరీలోఁ బనిచేయుచుండిన గుమాస్తాలు చాలమంది కనఁబడుటలేదు. వారు మరాటీమూఁకచేఁ జంపఁబడిరేమో తెలియుటలేదు. వారందఱు సంరక్షణార్థ మడవులకుఁ బారిపోవుటచేతను, అచ్చట చాలమంది మన్యపు జ్వరముచే పీడితులగుటచేతను, కొండలలో నివసింపలేక చాలమంది ఈజ్వరములవలన మరణించియుండవచ్చును. వారిని గురించి నాకు సరియైనసంజాయిషీ వచ్చినతోడనే ఆసంజాయిషీ నేను మీకుఁ దెలియఁజేసికొనియెదను. ముఖ్యముగా ఈజిల్లాలో పరిస్థితులు తారుమారుగ నుండి వానిఫలిత మేమగునో చెప్పుటకు వీలులేకున్నది. ఆదాయము విషయమై ఆలోచించినయెడల ఈ పరిస్థితుల కంటె నష్టకరమగునది వేరుండదు. ఇప్పుడు మేము శిస్తులను వసూలుచేయలేము. పిండారీలు నాశనము చేయఁగా మిగిలిన పంట గ్రామస్థులు పొలములను విడిచి వెడలిపోవుటవలనను, పశువులు విచ్చలవిడిగా పంటలను మేయుటచేతను, కొనువా రెవ్వరు లేకపోవుటచేతను నష్టమైపోవుచున్నది."

౧౮౧౭ జనవరి ౨౪-వ తేదిని సెయింటుజార్జి కోటనుండి వ్రాయఁబడిన లేఖలో పిండారీలు గంజాము జిల్లాలో నొనర్చిన దురంతములు, వారి నెదుర్చుటకు చేయఁబడుచున్న ప్రయత్నము లీక్రింద నుదాహరింపఁబడినరీతిని వివరముగా వర్ణింపఁబడినవి:

"కిమ్మిడి జిల్లాలోనికి పిండారీలు జొరఁబడినట్లును, వారు కిమ్మిడిగ్రామమును, దాని చుట్టుప్రక్కల గ్రామములను దోచుకొని తగులఁబెట్టినట్లును వర్తమానము వచ్చినది. ఈ వర్తమానము మాకు జనవరి ౧-వ తేదిని చేరినది. ౭-వ తేదినాఁటికి వారు గంజాము జిల్లాను దాదాపు సంపూర్ణముగా నాశనముచేయుటయే కాక గంజాముపట్టణమును గూడ దోచుకొనిరని విని మే మాందోళనముపడితిమి. కిమ్మిడిని రక్షించుటలోను, పిండారీమకాములను తరువాత ముట్టడించుటలోను మేజర్ ఆలివర్ నాయకత్వమున ఆరవదేశీయపదాతిసైన్యము నుపరచిన ధైర్యము, ప్రవర్తన మాకు చాల సంతోషముఁ గల్గించినది. పిండారీలు గంజామును వదలినతరువాత వారిని దరుముచుఁబోయిన లెఫ్టినెంటు బార్త్విక్ (Barthwick) యొక్క పట్టుదల, వివేచననుగురించి ఉత్తరసైన్యభాగమున కధిపతి ౪,౫ జనవరి తేదులను వ్రాసిన లేఖలు మాకు చాలసంతృప్తిగల్గించినవి. గంజాములోఁజొరఁబడిన పిండారీలు దక్షిణాభిముఖులై కదలుచున్నట్లు ఈ పైలేఖలవలనఁ దెలియవచ్చుచున్నది. ఉత్తరసర్కారులలో పిండారీలు చొరఁబడుటవలనను, మనరాజ్యముయొక్క ఉత్తర, పశ్చిమసరిహద్దులలోఁ బెక్కుచోట్ల ఈదండులు చొరఁబడుటవలనను ఆప్రదేశములలోని ప్రజలనుభవించిన విపత్తులును, వారుపొందిన నష్టమును గురించి మే మాలోచించితిమి. శాంతముగాను,

స్వకాయకష్టమువీఁదను ఈ చెన్నపురిరాజధానిలో బ్రతుకుచున్న ప్రజలయొక్క ప్రాణములను, ఆస్తులను సంరక్షించుటకై నేఁడున్న కట్టుబాటులకంటె దిట్టమైన కట్టుబాటులు వెంటనే చేయఁబడవలయునని మే మెంచుచున్నాము. మా (చెన్నపురిప్రభుత్వముయొక్క) కోరికపై ఈరాజధానిలో నుత్తరభాగమునను, మధ్యభాగమునను, దత్తమండలములలోను, మైసూరులోను గల మనసైన్యములలో శ్రేష్ఠులనువారిని పరిస్థితుల ననుసరించి యుద్ధము తటస్థించినచో యుద్ధరంగములకుఁ బంపుటకు సిద్ధముగానుండునట్లు మే మేర్పాటుజేసినాము. తమక్రిందనున్న సైన్యములనుండి తమ కవసరమని తోఁచినంతమందిని దేశముయొక్క యితరభాగములలో శత్రువుల నెదుర్కొనుటకుఁగాని, వారిని దరిమి వేయుటకుఁగాని వారి వీలు ననుసరించి యుపయోగించుటకుఁ దగిన యధికారము విభిన్నసైనికదళముల నడుపుచున్న సైనికోద్యోగుల కొసఁగఁబడినది."

## దండయాత్రలవలనఁ గల్గిననష్టము

పిండారీదండయాత్రలవలనఁ బ్రజ లనుభవించిన కష్టములు కొంతవఱకు క్రిందిలేఖవలనఁ దెలియఁగలవు. ఈలేఖ ౧౮౧౭ మార్చి ౨౬-వ తేదిని ఫోర్టు సెయింటు జార్జికోటనుండి హెచ్. ఇలియట్ (H. Elliot), టి. హిస్‌లాప్ (T Hislop), ఆర్. ఫుల్లర్‌టన్ (R. (Fullerton), రాబర్టు అలెగ్జాండర్ (Robert Alexander) లచే రివెన్యూలేఖగా వ్రాయఁబడినది.

"నిరుడుసంవత్సరము మార్చినెలలో గుంటూరు, బందరు, కడపజిల్లాలలో పిండారీదండులు చొరఁబడుటవలనఁ గలిగిన నష్టమును బరిశీలించుటకును, అట్టిదాడుల నిఁకముందు స్థానికప్రయత్నములచే నెదుర్చుటకు చేయవలసిన సంరక్షణోపాయములనుగురించి సలహానిచ్చుటకును, పై మూఁడుజిల్లాల (గుంటూరు, బందరు, కడప) యొక్క కలెక్టరులను ముగ్గురను మే మొక కమీషనుగా నియమించియున్నామని ౧౮౧౭ జనవరి ౧౦-వ తారీఖున రివెన్యూ డిపార్టుమెంటుద్వారా మేమంపిన లేఖవలన మీకుఁ దెలిసియేయున్నది. ఈ కమీషనువారియొక్క నివేదిక మా కిటీవలనే చేరినది. ఈ లేఖతోఁబాటు ఆరిపోర్టుయొక్కయు, దానియొక్క వివిధములైన అనుబంధములయొక్కయు ప్రతులను గూడ మీకుఁ బంపుచున్నాము. నిస్సహాయులైన ప్రజలపైఁ గావింపఁబడిన దారుణమగు రాక్షసకృత్యములును, వీనివలన మనపాలన తమకు సంరక్షణ మొసఁగఁగలదను నమ్మకము ప్రజలలోఁ బూర్తిగ నశించుటయు, అన్నివైపుల పిండారీమూఁకలు వ్యాపింపఁజేసిన సర్వనాశనకర మగు స్థితియు ఈరిపోర్టు మీకుఁ దెలియఁజేయఁగలదు. పైనఁ జెప్పఁబడిన జిల్లాలలో పిండారీలీసంవత్సరముగూడ దురంతము లొనరింపకుండ ప్రజలను సంరక్షించుటకై మనము తగినకట్టుబాటుల నొనర్చినయెడల ప్రజలు పొందిన నష్టము కొంతవఱకుఁ గొన్నివిషయములలోఁ గూడిరావచ్చును. వీలైనంతవరకు పైయుద్దేశ్యమును నెరవేర్చు నుద్దేశ్యముతోఁ బంపుటకు వీలుగానున్న సైన్యమంతయు వేరువేరుస్థలముల కంపఁబడినది. పిండారీల దండయాత్రలవలన భయములేని ప్రదేశములలోఁగాని, అట్టిభయకారణము చాలతక్కువగానున్న ప్రదేశములలోఁ గాని మే మితరసమయములందుఁ జేయు కట్టుబాటులను సడలించి ఆప్రదేశములలో సైన్యమును తగ్గించినామని మీరు గ్రహించియేయుందురు. ఇతరడిపార్టుమెంటులనుండి మే మంపుచున్న లేఖలవలన మీ కీసంగతులు బోధపడియే యుండును. ఈపిండారీదండయాత్రవలన ప్రభుత్వమువారి కెంత ద్రవ్యనష్టము కలిగెనది, ఆవిషయ మంత ముఖ్యమైనది కాదు. ద్రవ్యనష్ట మెంతయైనది కంభముకమీషను రిపోర్టులో ౨౫-వ పేరాలో వివరింపఁబడినది. ప్రజలయొక్క ఆస్తులు సర్వధ్వంసము చేయఁబడుటవలనను, పరిశ్రమల కుపయోగించుపరికరములు, పశువులు, జనము నష్టమగుటవలనను, ప్రజలు తమతమగ్రామములను వదిలిపోవలసివచ్చుటవలనను, దోపిడీలు జరిగిన ప్రదేశములలో పిండారీలు మరల వత్తురను భయము గాఢముగా నేఁటికిని వ్యాపించియుండి పరిస్థితులు నేఁటికిని నిలుకడలేకయుండుటవలనను దొరతనమువారి కీవివిధకారణములవలనఁ గలుగు నష్టము ధనరూపముగానైనను ఎంతయుండునో నిర్ణయించుట కిప్పుడు వీలులేదు. అయినను, ఈవిధముగా నాలోచించినను

పిండారీ దండయాత్రలవలనఁగలిగిననష్టములలో ధననష్టము కనీసనష్టమైయున్నదని చెప్పవలయును. ప్రభుత్వమునకుఁ గలిగిన ధననష్టముకంటె వ్యక్తులకుఁ గలిగిన ధననష్టము చాల హెచ్చుగనున్నది. ప్రజలిచ్చినవివరములఁబట్టి చూచిన యెడల ఈనష్టము ౩,౬౫,౯౧౦ వరహాలైయున్నది. కంభముకమీషనుసభ్యులీనష్టమును విచారణచేసి అందులో ౨,౫౫,౯౪౬ వరహాలవరకు నష్టమును దా మొప్పుకొనియే యున్నారు. గుంటూరిలోని యూరపియను సివిలు ఉద్యోగస్థులకు ౧౬౪౯ వరహాలవరకు నష్టము కలిగినది. కంభముకమీషనువారి కీనష్టములను గూర్చి వివరములను ప్రజలు నివేదించినప్పుడు, ప్రభుత్వమువారినుండి ఈనష్టపరిహారము పడయు నుద్దేశ్యము ప్రజలకుఁ బూర్తిగ నుండెను. ప్రజల కట్టిదూశలఁ గలిగింపకుండ రెండువిషయములు వా కడ్డుపడుచుం డెను. నష్టముయొక్క పరిమితి చాల హెచ్చుగనుండెను. ప్రజలను సంరక్షించుటలో నెట్టియైన లోపములుండి, ఆలోపములవలనఁ బ్రజల కేదైన నష్టము కలిగినయెడల ఆనష్టమునకు ప్రభుత్వమువారే బాధ్యులునుగారు. దోపిడియు, దురంతములొనర్చుటయు ముఖ్యోద్దేశ్యముగాఁ గలిగి, దానికొరకై కట్టుదిట్టముగా తయారైన బలము గల అశ్వికదళములఁ జెక్కుంటెని, అవి నిలుకడలేక తిరుగాడుచుండఁగా నేఁడు ప్రభుత్వమువారి స్వాధీనమున నున్న పరిమితమగు నిప్పటిసైన్యముతో నెదుర్చుట దుస్సాధ్యము. కాని ప్రజాసంరక్షణార్థమై పాటుపడు చుండిన కారణమున తమస్వంత ఆస్తులను గాపాడు కొనుట మానిన యూరపియను ఆఫీసర్లకు నష్టపరిహార మిచ్చుటకు బలకరమగు ప్రత్యేకకారణము లున్నవని మాత్రము మేము గ్రహించితిమి. ఇట్టివారిలో గుంటూరు రిజష్టరుగారగు డాల్ జెల్ గారును, గుంటూరిలోనే సహాయవైద్యులగు హెయిన్సుగారును గలరు. నష్టపరిహారమునకు వీరికిఁ గలహక్కును మే మొప్పుకొని నాము. కలెక్టరైన ఓక్సుగారికిఁగూడ నిట్టి నష్టపరిహార మొసంగవలయునేమో చూడవలసియున్నది. ఓక్సుగారికిఁ గలిగిననష్టమును గురించిన వివరములకొరకు న్నే మెదురుచూచుచున్నాము.

ఈదోపిడీలలో బాధపడినవారియొక్కయు, ఆ సమయమునఁ జంపఁబడినవారి బంధువులయొక్కయు పోషణార్థమై కంభముకమీషనువారిచే సిఫారసు చేయఁబడిన పెన్షనులను మేము వెంటనే మంజూరుచేసి నాము. ఇట్టిపెన్షనులన్నియుఁ గలిసి నెలకు ౪౬ వరహాలుమాత్రమే యై స్వల్పమొత్తముగ నున్నది. పిండారీలబారినుండి తమ్ము దాము కాపాడుకొను సమర్థతగల వారికి ఆయుధముల నొసంగవలయునని కమీషనర్లు చేసిన సూచన లావరకే ఆచరణలోనికిఁ దేఁబడినవి. ఇఁక ముందును శ్రద్ధగా నవి యాచరణలో నుంచఁ బడును. కాని విస్తారమైన మనసరిహద్దులలోఁ దగిన బలము లేనందున శత్రువు లన్నివైపులనుండి చొరఁబడినప్పుడును, ఆశత్రువు లొకచోటినుండి మరియొకచోటికిఁ గడువేగముగాఁ బ్రయాణము సేయుచు ఘోరమగు రాక్షస కృత్యము లొనర్చుచున్నప్పుడును మనసరిహద్దులలోని కీముఁకలు చొరఁబడకుండ చేయు ప్రత్యేకపుటుద్దేశ్యముతో నేర్పరుపఁబడిన సైనికదళముయొక్క సాహాయ్యమునఁగాని వేరు ప్రయత్నములవలన లాభముండదు. వేరు ప్రయత్నములవలన లాభముండునని మిమ్ము మేము నమ్మింపలేకున్నాము. ఈసంవత్సర మొక్క గంజాము జిల్లాలో తప్ప పిండారీదండయాత్రలకు వీలుగానుండిన తక్కిన మనజిల్లాలలో మేము వారిదండయాత్రల నాఁపఁగల్గితిమి. గంజాముజిల్లానుండి పదునొకండుదిన ములలోనే ఈసంవత్సరము పిండారీమూఁకలు తరిమివేయఁ బడినను, ఆకొద్దికాలములోనే వారు గలుగఁజేసిన నష్టము మరల కుదిరానిదై యున్నది. గతసంవత్సరము (౧౮౧౬) లో గుంటూరుప్రజ లనుభవించిన దారుణములవంటివే ఈసంవత్సరము (౧౮౧౭) న గంజాముప్రజ లనుభవింపవలసివచ్చెను. "

౧౮౧౬-౧౭ సంవత్సరములలో ఆంధ్రమండల ములలో పిండారిదండయాత్రలవలనఁ గలిగిన నష్టము పై లేఖలోఁ గొంతవరకుఁ దెలుపఁబడినది. ఈదండ యాత్రలలో పిండారీమూకల చేతులలోఁబడి ఈ జిల్లాలలో ఏకుటుంబములవా రెట్టి కష్టము లనుభవించిరో, ఆవివరములు కంభముకమీషను రిపోర్టులో నొసంగఁ బడియున్నవి.



శుక్లపూర్ణిమ

( శ్రీ కాశీనాథరావుగారి తంజావూరి ప్రాచీన చిత్రసంగ్రహమునుండి ꠰

# కళింగ గాంగశకము

మల్లంపల్లి సోమశేఖరశర్మ

౨

పూర్వోక్తవిషయముల నన్నిటిని మన సున బెట్టికొని యిక పూర్వగాంగులను గుఱించి విచారింతము. వీరి వింతవఱకు జిర్జింగిశాసనముతో ముప్పదియైదు శాసనములు దొరకినవి. వీటికిని, పరగాంగశాసనములకును గల ముఖ్యమయిన వ్యత్యాసములివి ; పూర్వగాంగశాసనములు

(౧) పరగాంగ శాసనములకు వలె పౌరాణికవంశకథనము నీయవు. దానికి బదులుగ వానియందు ప్రశస్తి (వక్కాణ) మాత్ర ముండును.

(౨) తఱచుగ దాతతరము నొక్కటియే తెలుపును. అథవా, అంతకంటె తెలిపినను రెండుమూడుతరములకంటె నవి తెలుపవు.

(3) అట్లనుటవలననే పరగాంగశాసనములలోవలె కళింగమును బరిపాలించిన ఆయారాజుల రాజ్యకాలపరిమితిని దెలుపుట కవకాశము లేదని గ్రహింపవచ్చును.

(౪) దాన, శాసనకాలములను పరగాంగశాసనములలోవలె శకవర్షములలో దెలుపవు. వానివలె నెక్కువ వివరములను ఇయ్యవు.

(౫) శాసనకాలమును కొన్ని తెలుపవు. తెలుపునవి మాత్రము తఱచుగ వట్టిసంవత్సరసంఖ్యను దెలుపును. ఈసంఖ్య కొన్నిట అంకరూపముననను, మఱి కొన్నిట అక్షరరూపముననను, వేఱొక కొన్నిట అంకములందును, అక్షరములందునుగూడ నుండును. ఈసంవత్సరములు విజయరాజ్యసంవత్సరములని, ప్రవర్ధమానవిజయరాజ్య సంవత్సరములని, గాంగేయవంశసంవత్సరములని, గాంగేయ వంశప్రవర్ధమాన విజయరాజ్యసంవత్సరములని, గంగ-కదంబవంశ ప్రవర్ధమానవిజయరాజ్య సంవత్సరములని పేర్కొనబడినవి. ఈ సంవత్సరసంఖ్య ౫౨౮ వఱకు పోవుట వలన పూర్వగాంగ పరిపాలనముతో నారంభమయి ఈ కాలపరిగణనము సాగుచుండెనని నిశ్చయించి చరిత్రకారులును, చరిత్ర పరిశోధకులును ఈ సంవత్సరములకు గాంగశకసంవత్సరము లని పేరిడిరి.

అయితే, ఈ పూర్వగాంగశాసనములు పరగాంగ శాసనములకువలె సాధారణముగ శాసన లేఖకోత్కీర్ణకులను బేర్కొనుటయే కాక కొన్ని వారితండ్రినామములను దెలుపుటయుగలదు.

పైనిచెప్పిన విషయముల ననుసరించియే వజ్రహస్త, అనంతవర్మచోడగంగుల శాసనములకువలె నివి పూర్వగాంగుల అనుస్యూత వంశానుక్రమణిక నీయజాలవని విదితము

# పూర్వ గాంగ శాసనములపట్టిక

| శాసనసంఖ్య | శాసనదాత తండ్రి పేరు | శాసనదాత పేరు | గాంగశక వర్షములు | రాజధాని | శాసన లేఖకుని తండ్రి పేరు | శాసన లేఖకుని పేరు | శాసనోత్కీర్ణకుని తండ్రి పేరు | శాసనోత్కీర్ణకుని పేరు |
|---|---|---|---|---|---|---|---|---|
| ౧. | ... | ఇంద్రవర్మ | ౩౯ | దంతపురము | ... | దేసింఘదేవువ | ... | ... |
| ౨. | ... | హస్తివర్మ | ౭౯ | కళింగనగరము | భానుచంద్రుడు | వినయచంద్రుడు | భానుచంద్రుడు | వినయచంద్రుడు |
| ౩. | ... | ,, | ౮౦ | ,, | ,, | ,, | ,, | ,, |
| ౪. | ... | ఇంద్రవర్మ | ౮౭ | ,, | ,, | ,, | ... | ... |
| ౫. | ... | ,, | ౮౭ | ,, | ,, | ,, | ... | (?) స్తాపుణోజు |
| ౬. | ... | ,, | ౯౧ | ,, | ,, | ,, | ... | ... |
| ౭. | ... | ,, | ౧౨౮ | ,, | అమాత్యదేవచంద్రుడు | శంకరదేవు | వినయచంద్రుడు | ఆదిత్యమంచి |
| ౮. | దానార్ణవుడు | ,, | ౧౩౭ | దంతపురము | ధర్ముడు | శాంబపురోపాధ్యాయుడు | ఆదిత్యభోగికుడు | ఖండిచంద్రుడు |
| ౯. | ... | ఇంద్రవర్మ | ౧౩౮ | కళింగనగరము | అమాత్యకీకతుడు | సర్వదత్తుడు | ... | భోగికుడు |
| ౧౦. | దానార్ణవుడు | ,, | ౧౫౪ | ,, | ధర్మచంద్రుడు | శాంబపురోపాధ్యాయుడు | ఆదిత్యభోగికుడు | ఖండిచంద్రుడు |
| ౧౧. | గుణార్ణవుడు | దేవేంద్రవర్మ | ౧౮౩ | ,, | మాతృచంద్రుడు | పల్లవచంద్రుడు | ఖండిచంద్రుడు | సర్వచంద్రుడు |
| ౧౨. | ,, | ,, | ౧౮౪ | ,, | ... | ,, | ,, | ,, |
| ౧౩. | ,, | ,, | ౧౯౫ | ,, | మాతృచంద్రుడు | మదనాంకురపల్లవుడు | శంకరుడు | నాగనభోయి |
| ౧౪. | దేవేంద్రవర్మ | అనంతవర్మ | ౨౦౪ | ,, | ... | ... | ... | ... |
| ౧౫. | అనంతవర్మ | నందవర్మ | ౨౨౧ | ,, | ... | ... [తుడు | ... | ... [డు |
| ౧౬. | అర్జునవర్మ | దేవేంద్రవర్మ | ... | ,, | ... | సర్వచంద్ర శ్రీసామం | ... | శ్రీసామంతఖండిమల్లు |

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| ౧౭. | అనంతవర్మ | దేవేంద్రవర్మ | ౨౫౪ | కళింగనగరము | దుర్గదేవుడు | ఉగ్రదేవు | ... | ఖండిశ్రీసామంతుడు |
| ౧౮. | రాజేంద్రవర్మ | అనంతవర్మ | ౩౦౪ | ,, | ... | దుర్గప్పరహాస్యుడు | ... | ... |
| ౧౯. | ,, | దేవేంద్రవర్మ | ... | ,, | ... | ... | ... | శ్రీఖండవిలి |
| ౨౦. | ,, | ,, | ౩౧౦ | ,, | ... | సర్వచంద్రుడు | ... | ఖండిమల్లుడు |
| ౨౧. | అనంతవర్మ | రాజేంద్రవర్మ | ౩౪౨ | ,, | సామిరాజు | రసామేయుడు (?) | మావుచంద్రుడు | కనకాద్రిరాజసుండిపిలా |
| ౨౨. | ,, | దేవేంద్రవర్మ | ౫౧(౩౪౯) | ,, | ... | నాగరాజశ్రీసామంతు[డు | ... | సర్వదేవుడు [క(?) |
| ౨౩. | దేవేంద్రవర్మ | సత్యవర్మ | ౩౫౧ | ,, | ... | ... | ఖండ్యమ | వీరప |
| ౨౪. | ,, | అనంతవర్మ | ... | ,, | ... | విజికుడు | ... | ... |
| ౨౫. | ... | వజ్రహస్తుడు | ... | ,, | ... | ద్రోణాచార్యుడు | ... | కంచ్యనాచారి |
| ౨౬. | భూపేంద్రవర్మ | దేవేంద్రవర్మ | ౩౯౭ | ,, | ... | ముగప | ... | సప్పదప (?) |
| ౨౭. | అనంతవర్మ | ,, | ౫౨౦ | ,, | ... | ... | ... | ... |
| ౨౮. | ,, | మధుకామార్ణవు[డు | ౫౨౬ | ,, | మాధవుడు | మధుసూదనుడు | ... | రణమ (?) |
| ౨౯. | ... | అనంతవర్మ | నవశతకసప్త[రస | ,, | ... | ... | ... | ... |
| ౩౦. | ... | దేవేంద్రవర్మ | శ.౧౦౦౩ | ,, | ... | ... | ... | ... |
| ౩౧. | ... | సామంతవర్మ | ... | స్వేతక | ... | ఆదిత్యవర్మ | ... | కంచరదేవపిల (?) |
| ౩౨. | ... | ఇంద్రవర్మ | ... | ,, | ... | ... | ... | పద్మచంద్రుడు |
| ౩౩. | మహేంద్రవర్మ | పృథివీవర్మ | ... | ,, | ... | సామంతుడు | ... | శ్రీసామంతస్వయంభువు |
| ౩౪. | చోడభీముడు | రెండవ కీర్తిరాజదేవు | ... | కల్యాణపురము | ... | ... | ... | ... |

కాగలదు. దానంజేసి ప్రశస్తిని, శాసనోదాహృతు లయిన లేఖకోత్కీర్ణకాదులను, గాంగశకసంవత్సరములను సాయముచేసికొని పాలకక్రమమును నిరూపించి, వీలయినయెడల నొకవంశానుక్రమణిక నేర్పాటు చేయవలసి యుండును. పాలకక్రమనిర్ణయమున కనుకూలించు వివరములతో ఇంతవఱకు దొరకిన పూర్వ గాంగశాసనములపట్టిక ముందుపుటల యం దొసంగబడినవి. (పూర్వ గాంగశాసనముల పట్టిక).

రాజ్యవత్సరముల ననుసరించియే కాక శాసనలిపిస్వరూపము ననుసరించియు, ప్రశస్తిపరిణతి ననుసరించియు పైపట్టికయందలి రాజక్రమ మేర్పఱుపబడినది. పైనిచ్చిన పట్టికయందలి మొదటిరాజు గాంగశకము ౩౯ - వ సంవత్సరమునాటి ఇంద్రవర్మ.[1] ఇతనితరువాత

1. Jour. Andh. Hist. Res. Soc., Vol. III, p. 49.

మన్మిత్రులు శ్రీ గొడవర్తి రామదాసుగారు ఈసంవత్సరము గాంగశకవర్షము కాదని, యీ ఇంద్రవర్మ కళింగగాంగశాఖకు భిన్నమయిన మఱియొక గాంగశాఖవాడని, శాసనమున దెలుపబడిన సంవత్సరములు గాంగశకవర్షములుకాక అతనిరాజ్యవత్సరములని వ్రాసినారు. (Jour. Bi. Or. Res. Soc., Vol. 15, pp. 640-641; Vol. XX, pp. 36-37).

వా రిట్లనుటకు గల హేతువు లివి: (౧) ఇంద్రవర్మప్రశస్తిలో మహేంద్రమునుయొక్కగాని, గోకర్ణస్వామియొక్కకాని ప్రస్తావమేలేదు; (౨) కళింగగాంగులలోని మొదటి త్రికళింగాధిపతియగు మూడవ అనంతవర్మ వజ్రహస్తదేవు ధరించిన పరమమహేశ్వర, పరమభట్టారకబిరుదములు ఇంద్రవర్మకు లేవు; (౩) గాంగశకము మొదటి ఒకటిన్నరశతాబ్దులలో వాడుకచేయబడుచువచ్చిన ప్రశస్తియందలి పదసమాసాదులలోకన్న ఇంద్రవర్మ ప్రశస్తియందలి వానిలో కవితాధోరణి, పదాడంబరము ఎక్కువ; (౪) కళింగరాజులు తమశాసనకాలమును ప్రవర్ధమాన విజయరాజ్యసంవత్సరములలో దెలుపగా ఇంద్రవర్మ పట్టి 'ప్రవర్ధమానసంవత్సరము'ననే తెలిపినాడు. అందువలన ౩౯ అతనిరాజ్య సంవత్సరముగనే గ్రహింపవలసియుండును; (౫) ఇంద్రవర్మ శాసనమునందలి యక్షరములు గాంగశకము ౧౫౪ నాటి దేవేంద్రవర్మ విశాఖపట్టణము శాసనాక్షరములను, ౩౪ - వ (కలచురి) సంవత్సరపు (క్రీ. శ. ౫౯౬) శంకరగణుని అభోనాశాసనాక్షరములను, ౨౮౬ - వ గుప్తశకపు (క్రీ. శ. ౬౦౫) శిలాదిత్యుని నవలఖిశాసనాక్షరములను బోలియున్నవి. అందువలన ఆశాసన మీపూర్వోక్తశాసనములనాటిది. దానిసరియయినకాలము క్రీ. శ. ౬౨౨ అగును.

గాంగులు మొదటినుండియు శైవులన్నవిషయము మొదటి కామార్ణవుడు మధుకేశ్వరభక్తుడగుటనుబట్టియే విశదమగుచున్నది. కాని కదంబుల పలుకుబడి, కదంబులతోడి బాంధవ్యము ఎక్కువయినపిదపగాని గోకర్ణేశ్వరుడు గాంగులదైవ మయినట్లు తోచదు. అనంతవర్మచోడగంగుకాలమునాటికి భక్తి ముదురుటచేత మొదటికామార్ణవుడు తననలువురిసోదరులతోను మహేంద్రగిరి గోకర్ణస్వామి నారాధించినట్లు చెప్పబడినది. బిరుదములలోపము భిన్నశాఖాత్వనిరూపణమునకు ప్రమాణము కాజాలదు. అనంతవర్మచోడగంగు తరువాతివారలకు త్రికళింగాధిపతి బిరుదము లేదు. అంతమాత్రమున వారు భిన్నశాఖవా రనజాలముకదా! కావున పూర్వోక్తశాసనములనుబట్టి ఇంద్రవర్మ భిన్నశాఖవాడని నిర్ణయించుటకు గాదు. ఇక ఇంద్రవర్మ శాసనప్రశస్తి యితరగాంగశాసనప్రశస్తులకు భిన్నమయినదే. ఇందు శ్వేతకగాంగులప్రశస్తికిని, కళింగనగరగాంగుల ప్రశస్తికిని పోలికలు కలవు చూడుడు

నుండి ౭౯ - వ సంవత్సరము వఱకు నింత వఱకు పూర్వగాంగశాసనము లేవియు దొరకకపోవుటవలన ఇంద్రవర్మకు హస్తివర్మకు నడుమగల రాజులు తెలియరాలేదు. అది యటులుండ ఇంద్రవర్మ శాసనప్రశస్తియు, హస్తివర్మశాసనప్రశస్తియు భేదించుట చిత్రము. మఱియొకవిషయము - త్రికళింగాధిపతి బిరుదము పూర్వగాంగులలో మొదటివాడుగ దెలియవచ్చిన ఒక్క యీఇంద్రవర్మకే కలదు. పైపట్టికయందలి గాంగరాజులు మొదటి యిరువురి ప్రశస్తికిని వ్యత్యాసము కలుగుటకును, ఇంద్రవర్మతరువాతివారికి త్రికళింగాధిపతి బిరుదము లేకపోవుటకును నడిమికాలమున సంభవించిన యేదో యవాంతరము

ఇంద్రవర్మప్రశస్తి: "భగవతస్సకలభువనతలోత్పత్తిస్థితిప్రలయహేతోః పరమేశ్వరస్య సతతప్రణామావాప్త పుణ్యసంచయప్రభావ నిరస్తాశేషదురితో గాంగామలకులగగనతల సహస్రరశ్మిః"; సామంతవర్మప్రశస్తి: "భగవతశ్చరాచరగురోః శకలశశాంకశేఖరధరస్య స్థిత్యుత్పత్తి ప్రలయహేతోః మహేంద్రాచల శిఖరనివాసినః శ్రీ గోకర్ణేశ్వరస్వామినశ్చరణకమలారాధనావాప్త పుణ్యనిచయః గంగామలకులాంబరేందుః." దీనినిబట్టి యీ ఇంద్రవర్మ సామంతవర్మ, హస్తివర్మలకు పూర్వులయిన తొలుతటి గాంగులలో నొకడను విషయమే ధ్రువపడగలదు. ఈయంశమును శాసనకాలము బలపఱుచుచున్నది. 'ప్రవర్ధమానసంవత్సర' ప్రయోగమాత్రమున ఆకాల మతని రాజ్యసంవత్సరము లనుటకు వీలులేదు. 'ప్రవర్ధమాన' పదముకూడ లేకుండ తమశాసనకాలమును వట్టి 'సంవత్సర'ములలోనే తెలిపిన కళింగనగరగాంగులు కలరు (చూడుడు: అనంతవర్మసూనుడయిన దేవేంద్రవర్మ శాసనము: "సంవత్సరశతద్వయే చతుష్పంచాశాభ్యధికే ౨౫౪"). శాసనాక్షరము లొక్కొకప్పుడు ౨౦౦ ల సంవత్సరములవఱకు ఏవిధమయిన పరిణామమును పొందకుండుటకూడ కలదు. అట్లగుటచేత ఇంద్రవర్మ శాసనాక్షరములనుబట్టి అతడు గాంగశకము ౧౫౪ నాటివాడు, అనగా అతనిశాసనమున తెలిపినకాలమునకు ౧౨౦ యేండ్లకు తరువాతివాడని ఖండితముగ నిర్ణయింపలేము. వేంగీ-కళింగతెలుగులిపి ప్రారంభకాలమున అంతత్వరితగతిని పరిణామమును చెందియుండలేదు. ఒకవేళ ఇంద్రవర్మ భిన్నగాంగశాఖవాడేయని వాదమున కంగీకరించినను అతడు హస్తివర్మకు పూర్వుడే కాని తరువాతివాడుమాత్రము కాడు. ఒకవేళ ఇంద్రవర్మయే కళింగమున గాంగరాజ్యమును స్థాపించిన మొదటిరాజయ్యెనేని, ౩౯ అతని రాజ్యసంవత్సరముగనే అంగీకరించినను అది గాంగశకము ౩౯ అగుట కేయాక్షేపణము నుండదు, సరిగా ఈశాసనము హస్తివర్మకు ౪౦ యేండ్లు పూర్వపుదిగనుక.

శ్రీ రాళ్లభండి సుబ్బారావుగారు మొదట ఈశాసనమును ప్రకటించినప్పుడు ఈశాసనలిపి ౯, ౧౦ శతాబ్దులనాటి తెలుగులిపిని (అనగా చాళుక్య అమ్మరాజవిజయాదిత్యునినాటి శాసనములలిపి) బోలియున్నదని వ్రాసినారు! చూడుడు: "The alphabet is Telugu of the 9th or 10th C., A. D., and resembles closely that of the Chalukyan Grants edited by me in Vol. 2, pt, 3 and 4 (Jour- Andh. Hist. Res. Soc., Vol. III, p. 49.) (వారీ 3, ౪ సంచికలలో ప్రకటించినది రెండవ అమరాజ విజయాదిత్యుని పాములవాకశాసనము). వారిట్లు వ్రాసినప్పు డేమనవలెను? సరే, సంవత్సరమును ౩౦౯ గ చదివి, తరువాత ౩౯ గ దిద్దుకొన్నట్లే ఈ యభిప్రాయమునుకూడ సవరించుకొన్నారు లెండు (" The Characters employed in this inscription are boxheaded and may be said to be'ong to the beginning of the 6th Century A. D — J. A. H. R. S, Vol. V, p. 272; Vol. VI, p. 71). ఒక్కవిసరుతో శాసనము ౪౦౦ ల సంవత్సరములు పూర్వమునకు పోయినది!

కారణ మయియుండునని నా యభిప్రాయము.

ఇక ప్రశస్తిపరిణామమును జూతము. పూర్వగాంగశాసన ప్రశస్తియందు గోచరించు ముఖ్య విషయములు మూడు: (౧) రాజధానీవర్ణనము, (౨) భగవంతుడగు గోకర్ణ స్వామిప్రస్తావము, (3) గాంగరాజ ప్రతాపాదికవర్ణనము.

ఇంద్రవర్మకు తరువాతివాడుగ దెలియవచ్చిన హస్తివర్మశాసనము[2] నందలి ప్రశస్తి యిది :

(౧) సర్వర్తురమణీయాత్ విజయకలింగ నగరాత్

(౨) సకలభువననిర్మాణైకసూత్రధారస్య భగవతో గోకర్ణస్వామి నశ్చరణ కమలయుగలప్రణామాదపగతకలి కలంకః

(3) వినయనయసంపదామాధారఃస్వాసి ధారాపరిస్పందాధిగత సకల కలింగాధి రాజ్యః చతురుదధితరంగ మేఖలావనితలప్రవితతామల యశాః అనేకసమరసంఘట్టజనిత జయశబ్దః గాంగామలకులప్రతిష్ఠః ప్రతాపాతిశయానమిత సమస్తసామంతచూడామణిప్రభా మంజరీ పుంజరంజితచరణః మాతాపితృ పాదానుధ్యాతః పరమమాహేశ్వరః శ్రీమహారాజో హస్తివర్మా.

ఈప్రశస్తియే యేవిధమయిన మార్పును లేకుండ గాంగశకము ౮౦ నాటి హస్తివర్మ శాసనమునందును,[3] ౮౭, ౮౭, ౯౧ సంవత్సరములనాటి ఇంద్రవర్మ శాసనములందును[4] గానవచ్చును. అటుతరువాతనుండి రాజధాని నాసకమయినది (ఉదా: కళింగనగరవాసకాత్, దంతపురవాసకాత్). సకల భువన నిర్మాణైకసూత్రధారు డగు భగవంతుడు గోకర్ణస్వామి మహేంద్రాచలామలశిఖర ప్రతిష్ఠితుడును, చరాచరగురువు నయ్యెను. గాంగామలకులప్రతిష్ఠులు 'గాంగామలకుల తిలకు'లయిరి. కొద్దిమార్పులతో, చతురుదధి .........యశులు 'ప్రవితత చతురుదధిసలిల తరంగమేఖలావనితలామలయశులు'నుప్రతాపాతిశయ ...... చరణులున్' అనేకసమరసంఘట్టవిజయజనితజయశబ్దప్రతాపోపనతసమస్త సామంత......చరణు'లునయిరి. ఈవిధమైన మార్పులతోడి ప్రశస్తిపరిణామమును గాంగ శకము ౧౨౮, ౧౩౭ ౧౫౪ సంవత్స

2. భారతి, హస్తివర్మ నర్శింగపల్లి శాసనము, సెప్టెంబరు, ౧౯౩౪.

3. ఆంధ్రపత్రిక, ఉగాదిసంచిక, ౧౯౨౦.

4. Ep. Ind., Vol. III, p. 127; Jour. Andh. Hist. Res. Soc, Vol. IV, p. 21; Ind. Ant., Vol. VI, p. 131.

రములనాటి ఇంద్రవర్మల శాసనములందు[5] పొడగాంచ వచ్చును. ఒక్కటి - 'నయ వినయసంపదా మాధారః' అనునది యేకారణముననో ౧౨౮, ౧౩౭ సంవత్సరములనాటి శాసనములలో లుప్తమయినది. దీనికేమి కాని, గాంగశకము ౧౩౮ నాటి ఇంద్రవర్మ శాసనప్రశస్తి పైమూడు సంవత్సరములనాటి శాసనములందలిప్రశస్తికి భిన్నముగ నుండుట గమనింపదగిన విషయము. కనుడు:

(౧) జలధి జలతరంగకరపల్లవాలింగిత సకలకలింగావనితలతిలకాయమానాత్ విజయకలింగనగరాత్

(౨) సకల భువన......సూత్రధారస్య శకలశశాంకచూడామణే ర్మహిభోగపరికరస్యమహేంద్రాచల శిఖరనివాసినో గోకర్ణస్వామినో నవరతప్రణామాద్విగతకలి కలంకః

(3) సహజవినయాపాస్తారిషడ్వర్గోదయః శక్తిత్రయప్రకర్షావనత సమస్తసామంతశిరోమకుటమణిప్రభాపల్లవిత చరణాంభోజయుగళః స్వాధిగతానేకవిద్యాకలాకలాపప్రసాదావాప్త ఆచార్యకః ప్రథితవిపులామలగాంగాన్వయాంబర శకలశరచ్ఛశాంకః మాతాపితృపాదాను ధ్యాతఃపరమ మాహేశ్వరః శ్రీమహారాజేంద్ర వర్మా.[6]

ప్రశస్తియం దీవిధమయిన వ్యత్యాస మేల కలుగవలెనో తెలియరాకున్నది. ఈ ప్రశస్తి వ్యత్యాసమునకు దోడు తత్పూర్వ శాసనములకు, దీనికి లిపివిషయమున గూఢ భేదము కనబడుట విచిత్రము. అంతియకాదు, లేఖకోత్కీర్ణకులుకూడ-పైపట్టిక చూడుడు-౧౩౭-వ గాంగశకమునాటి శాసనమునందలి వారికి భిన్నులు. దీనికి తరువాతి నయిన ౧౪౭, ౧౮౩ నాటి శాసనముల లిపి మరల నీ ౧౩౮ కి పూర్వపు శాసనముల లిపివలెనే యుండుటయు, లేఖకోత్కీర్ణకులు తత్పూర్వపు శాసనములయందు,నీ రెండిటియందునొక్కరే యగుటయు గమనింపదగిన విషయములు. మిగిలిన శాసనముల లిపి యొప్పిన కాలమునకే ఈ ౧౩౮-వ సంవత్సరపు శాసనలిపి కూడ సరిపోవుచున్నను ఈ వ్యత్యాసములు సంభవించుటకు దగిన హేతువు లుండియుండవలెను[7].

5. Ind. Ant., Vol XIII, p. 120; Ep. Ind., Vol. XIV, p. 360; Ep. Ind., Vol. XVIII, p. 307.

6. Ind. Ant., Vol. XIII, p, 122.

7. కాని యీశాసనప్రశస్తియందు శ్వేతకగాంగరాజప్రశస్తిచ్ఛాయలు కనబడుచుండుటచేత ఒకవేళ ఈ యింద్రవర్మ శ్వేతకగాంగశాఖలోనివాడనియు, ప్రాయికముగ నితడు,కళింగనగరముపయి దాడి వెడలివచ్చి దానిని వశపఱుచుకొని, కళింగనగరపు దానార్ణవసూను డగు ఇంద్రవర్మను తఱుమఁగొట్టియుండుననియు నూహించుట కవకాశము కలదు. కాని యీయింద్రవర్మ నిజరాజధానియగు కళింగనగరమును మరల శీఘ్రకాలముననే యధీనము కావించుకొనె ననుట కాతని గాంగశకము ౧౫౪-వ సంవత్సరపు శాసనమే ప్రమాణము.

ఇక గాంగశకము ౧౮౩ నాటి శాసన ప్రశస్తిలో కొంచెమునూత్నకలిగినది. ఎట్లన, గోకర్ణస్వామి ఇప్పటికిని 'చరణకమల యుగలు' డేకాని 'నయవినయ సంపద' లకు మాత్రమే యాధారులయిన గాంగులు పూర్వముకన్నడు వారిరాజ్యమిపు బలపడగా 'నయవినయశౌర్యౌదార్య సత్య త్యాగ సంప దల' 'కాధారభూతు' లయిరి. ఇపుడు వారు 'ప్రతాపావనత సమస్త సామంతు'లే కాదు, 'సామంతచక్రులు' నయిరి. వారి కిపుడు సకల కలింగాధిరాజ్యము 'స్వాసిధారా పరిస్పందాధి గతము' కాదు, 'నిజనిస్త్రింశధారోపార్జితము'. కళింగనగర మిపుడు 'సర్వర్తుసుఖరమణీయ' మే కాక, 'సకలవసుమతీతిలకాయమాన మును', 'విజయవంతము'నుగూడ అయినది. ఈవిధమయిన మార్పులతో గూడిన ప్రశస్తి ౧౮౩, ౧౮౪ సంవత్సరములనాటి గుణార్ణవ సూనుడగు దేవేంద్రవర్మ శాసనములలో గన్పట్టును. ౧౯౨ నాటి యతని శాసనము[9] ప్రశస్తియందు పైమార్పుల నాదరించుటయే కాక 'నయవినయాదిసంపద'లకు 'దయా దానదాక్షిణ్యము'లనుగూడ జేర్చినది. ప్రశస్తి యం దీవిధమున నూతనముగ జేరుచువచ్చిన పదసముదాయము — ఆపదములు తరువాతి శాసనములయందు వాడబడిన నేమి, వాడ బడకపోయిన నేమి — పరిణామమును నిశ్చ యించి, రాజుల పూర్వ, పరక్రమమును నిర్ణ యింప గీలకముకదా!

గాంగశకము ౧౯౨-వ సంవత్సరము నాటనుండియే కళింగగాంగ శాసనలిపియందు మార్పు చూపట్టును. ౧౯౨ నాటి శాస నమునందలి యక్షరములు తత్పూర్వపుశాస నాక్షరముల కించుక భిన్నములయి కుటిల రూపము నందినవి.

గాంగశకము ౨౦౮ నాటి అనంతవర్మ శాసనప్రశస్తి[10] ౧౮౩, ౧౯౨ సంవత్సరముల నాటి శాసనముల ప్రశస్తివలె విపులవిశేషణ పద సంకలితము కాకపోయినను దానికి భిన్న మయినదిమాత్రము కాదు. పూర్వశాసన ప్రశస్తులలోని కొన్నికొన్ని విశేషణ సమా సాదులు జారిపోయినవన్నమాటకాని క్రొత్త పదములుమాత్ర మేవియు జేర లేదు. అందు వలన నిది యీకాలపుది కాదేమో అను శంకకుగాని, యీ అనంతవర్మ ౧౯౨ నాటి దేవేంద్రవర్మకొడు కగునో కాదో యన్న సందియమునకుగాని తావులేదు. లిపినిబట్టి చూచినను ఇది ౧౯౨ నాటి దేవేంద్రవర్మ శాసనమునకు దరువాతిదిగను, ౨౨౧ నాటి నందవర్మశాసనమునకు[11] చేరికగ నుండిగనేకాన వచ్చును.

---

8. Ep. Ind., Vol III, p. 130 ff; Jour. Andh Hist. Res. Soc., Vol. II, p. 272 ff; Cp. no. 1 of 1920-21.

9. Ep. Ind., Vol. XIII, p. 212 ff.

10. Jour. Andh. Hist. Res. Soc., Vol. II, p. 272 ff; Cp. no. 2 of 1920-21.

11. Ibid, Vol. II, p. 185 ff; భారతి, సం. ౫, సం. ౩.

గాంగశాసనములలో ౨౨౧-వ సంవత్సరము మరల నొక పరిణామఘట్టము. ఇంతవఱకు సర్వర్తుసుఖరమణీయమును, విజయవంతమును, మొదట కలింగావనితలతిలకాయమానమును, పిదప సకలవసుమతీతిలకాయమానమును అయిన కళింగనగరమిపుడు గాంగరాజ్యము స్థిరప్రతిష్ఠితమయి, వారి రాజ్యవైభవము లతిశయించుటతో 'అమరపురానుకారిణి' యైనది. భగవంతుడగు గోకర్ణస్వామికిని 'శశాంకచూడామణి' లభించినది. ఇంతటినుంచి గాంగు లపుడపుడు 'గాంగామ కులోద్భవులే' కాక, 'గాంగామలకులతిలకోద్భవులు' కూడ నగుచు వచ్చిరి; 'నయవినయదయాదానదాక్షిణ్య శౌర్యౌదార్య సత్యత్యాగగుణసంపదలు' వారి నిక విడువలేదు.

గాంగశకము ౨౨౧-వ సంవత్సరమున నుండి ఒక శాసనమునందలి యక్షరములు పెద్దవిగను, వేఱొక శాసనమునందలివి చిన్నవిగను, ఇంకొక శాసనమునందలివి పొంకముగను, మఱియొక శాసనమునందలివి కొంకిరిగను ఉండిన నుండవచ్చును గాని ఒక వంద సంవత్సరములపాటు లిపి మాత్రము ఎక్కువ గొప్పమార్పు కనబడునంతగ పరిణామమును జెందియుండలేదు —అట్లని మార్పే చెందలేదని కాదు. ఈ కాలపువే దేవేంద్రవర్మ శ్రీకాకుళము[12], దేవేంద్రవర్మ బెంగుళూరి[13] శాసనములు. రెండిటిలోను రాజుపే రొక్కటియేనైనను తండ్రులపేరులు వేఱు; మొదటి శాసనపు దేవేంద్రవర్మ తండ్రి అర్జునవర్మ;[14] రెండవశాసనపు దేవేంద్రవర్మతండ్రిరాజేంద్రవర్మ. ఈ రెండు శాసనములలో ప్రశస్తియందు తత్పూర్వశాసనప్రయుక్తములయిన విశేషణపదసమాసాదులు చాల లేకపోయినను 'గోకర్ణస్వామిన శ్చరణ కమలారాధనైకతత్పరః' అను క్రొత్తవిశేషము కలదు. అంతియగాక యిందు 'గాంగచరణ యుగల'మునకు 'వర'త్వ మబ్బినది. కాని శ్రీకాకుళముశాసనమున గాని, అంతకు పూర్వపు శాసనములయందుగాని గాంగరాజులకు లేని 'కుశల'త్వము బెంగుళూరిశాసనమున దేవేంద్రవర్మకు లభించుట గమనింపదగిన విషయము. ఈ శాసనములు రెండిటిలోను గూడ గాంగశకవర్షములు లేకపోవుటవలన ప్రశస్తి ననుసరించియు, లిపి లేఖకోత్కీర్ణక నామముల ననుసరించియు వాటి స్థానమును నిర్ణయింపవలసి యుండును.

౨౨౧నాటి శాసనప్రశస్తియందువలె నీ రెంటియందు గాంగరాజగుణాభివర్ణనము కానరాకపోవుటచేత నివి యాశాసనమునకు పూర్వపు వగునేమో యనుశంక కలుగవచ్చును కాని యాశాసనమునలేని నూతన

12. Ibid, Vol. VI I, p. 192 ff; Cp no. 7 of 1918-19.

13. Ep. Carn, Vol. IX, Bn. 140.

14. గౌనర్మెంటు శాసనశాఖవా రీనామమును తప్పుగ రాజేంద్రవర్మయని చదివిరి.

11.   12-   13   ౯౨౧

విశేషము లిం దుండుటచేత నివి దానికి తరు వాతివేయని నాయుద్దేశము. ౨౨౧-వవత్సరపు శాసనమునకు దరువాత గాంగశకము నిచ్చిన మొదటిశాసనము ౨౫౮నాటి దేవేంద్ర వర్మది[15]. ఈ దేవేంద్రవర్మ గోకర్ణచరణకమ లారాధనతత్పరుడు కాకపోయినను 'కుశ లి' యే. ఇతడే కాదు, ఇంతటినుండి గాంగ భూపాలు రెల్లరును గుశలులే. అందువలన 'కుశల' రహితమయిన శ్రీ కాకుళశాసనము ౨౨౧ నాటి శాసనమునకు తరువాతిదియు, ౨౫౮ నాటి శాసనమునకు పూర్వపుదియు నన్నది ధ్రువము. ఇక దేవేంద్రవర్మ బెంగు ళూరిశాసనము ౨౫౮ నాటి శాసనమునకు తరువాతికి గొనిపోవలెనా, ముందుంచవలెనా యనునది ప్రశ్న.

ప్రశస్తియందు నూతనముగ జేరిన క్రొత్తపదములనుబట్టి శాసనపూర్వ, పరత్వ ములు నిర్ణయింతమన్న నీబెంగుళూరిశాసన మున 'కుశలీ' పదముతక్క క్రొత్త దేదియు లేదు. ఈపదము ౨౫౮ నాటి దేవేంద్రవర్మ శాసనమునందును ఉండుటచేత ఈదేవేంద్ర వర్మ కాదేవేంద్రవర్మ పూర్వుడా, తరువాతి వాడా యని యాలోచింపవలెను. ప్రశస్తి ననుసరించి కాక లేఖకోత్కీర్ణకనామముల ననుసరించి చూచినను ఈప్రశ్న పరిష్కారము కాదు. ఏలయన, దేవేంద్రవర్మ శ్రీకాకుళ శాసనపు లేఖకోత్కీర్ణకులు సర్వచంద్ర శ్రీ సామంత, శ్రీసామంతఖండిమల్లులే రాజేం ద్రవర్మకొడుకు దేవేంద్రవర్మయొక్క గాంగశక ము ౩౧౦ నాటిశాసనమునకును[16] లేఖకోత్కీ ర్ణకులు. రాజేంద్రవర్మకొడుకు దేవేంద్రవర్మ యొక్కయు, గాంగశకము ౨౫౮ నాటి అనంత వర్మకొడుకు దేవేంద్రవర్మయొక్కయు శాస నములందు ఉత్కీర్ణకుడుగ గానవచ్చు శ్రీ ఖండవిలి, ఖండిశ్రీసామంతులును ఖండి మల్లుడు నొక్కరేయని నాయుద్దేశము. లేఖ కోత్కీర్ణకు లిట్లు ఒక్కరుగనే కనబడుట వలన పూర్వోక్తశాసనదాత లెల్లరు చాల దగ్గఱసంబంధము కలవారనిమాత్రమే నిర్ణ యింపగలముకాని అంత కెక్కువగ వారి పూర్వ, పరత్వములను నిర్ణయింపజాలము. లిపినిబట్టి చూచినచో స్థూలముగ శాసన మీ శతాబ్దికి, లేక యీకాలమునకు జెందిన దనగలము కాని, దాని ముంప వెనుకలను నిర్ధారింపలేము. ఇక మిగిలి తోడ్పడినచో ఆయాశాసనదాతల జనకనామసామ్య మొ క్కటే తోడ్పడునది. ఈసామ్యము ననుస రించియే గాంగశకము ౩౧౦ నాటి దేవేంద్ర వర్మయు, బెంగుళూరుశాసనపు దేవేంద్ర వర్మయు నొక్కరే యగుదురని తేలుచున్నది. కావున బెంగుళూరు శాసనపు దేవేంద్రవర్మ పైగాంగశాసన పట్టికయందు గాంగశకము ౩౦౮ నాటి అనంతవర్మకుదరువాత జూప బడినాడు.

15. Ind. Ant., Vol. XVIII, p. 143 ff.
16. Ep. Ind., Vol. XVIII, p. 311 ff.

గాంగశకము ౨౫౪నాటి అనంతవర్మ సూనుడగు దేవేంద్రవర్మకాలమున నుండి గాంగధరణీధవులు 'ధ్వస్తారాతికులాచలు' లైరి. ఈవిశేష మొక్కటియే యీశాసన ప్రశస్తియందు నూతనముగ బొడకట్టునది. ఈ ప్రశస్తినే ౨౫౪నాటినుండి గాంగనృపతు లొకవందసంవత్సరములపాటు తమశాసనములయందు వాడుక చేయుచువచ్చిరి. ఈవందసంవత్సరములకాలములో ప్రశస్తియందు వచ్చిన చేర్పు 'సితకుముదకుం దేంద్వవదాతయశు'లను విశేషణవాక్య మొక్కటే. ఇది మొదట గాంగశకము ౩౦౪నాటి రాజేంద్రవర్మతనయుడగు అనంతవర్మదేవుశాసనమునను[17], గాంగశకము ౩౫౧ నాటి దేవేంద్రవర్మ తనయుడగు సత్యవర్మశాసనమునను కనబడును. ఈ విశేషణవాక్యము 'సితకుముదకుం దేంద్వవదాతదిగ్దేశవినిర్గతయశు'లనురూపమునను (గాంగశకము ౩౧౦ నాటిశాసనము, వజ్రహస్తదేవు శాసనము[18]), 'సితకుముదకుం దేంద్వవదాతవినిర్గతయశు'లను రూపమునను (దేవేంద్రవర్మ కొడుకు అనంతవర్మ శాసనము) ౨౫౪ కు తరువాతిగాంగశాసనములయందు కానవచ్చుచున్నది.

గాంగశకము ౨౫౪ మొదలు ౩౯౭ వఱకు గల శాసనములలో ఇదివఱకు తెలిపిన వానికంటె ప్రశస్తివిశేషము లేవియు లేవు. గాంగశకకాలమును దెలుపని రెండు శాసనములు - (౧) దేవేంద్రవర్మ తనయు డయిన అనంతవర్మదేవు, (౨) వజ్రహస్తదేవులవి - ఈ కాలమునాటివి. ఈ రెండుశాసనములయందలి ప్రశస్తులునుగూడ గాంగశకము ౩౧౦ నాటి శాసనప్రశస్తివలె పరిణతి చెందినవే. అందువలన వీటిని ౩౧౦కి బిదప నెక్కడ బెట్టినను పెట్టవచ్చును. ఇంతకన్న వీటి స్థానమును సూక్ష్మముగను, నికరముగను నిర్ణయించుట కవకాశము లేదు. ఇక లిపినిబట్టి చూచినచో,

17. Ibid, Vol. III, p. 17 ff.

శ్రీరాళ్లభండి సుబ్బారావుగారు ఈయనంతవర్మదేవుది గాంగశకము ౨౮౪ నాటి శాసన మింకొకటి బయలుపడినట్లు వ్రాయుచున్నారు (చూడుడు: కళింగసంచిక, పుట. ౫౧౭; J. A. H. R. S., Vol. Vi, p. 196). ఈ శాసనమును గౌనర్మెంటుశాసనశాఖవారు తమ ౯౧౯-వ, ౯౨౪-వ సంవత్సరముల నివేదికలలో వరుసగా ౧౩౩-౧౩౫, ౯౭-౯౮ పుటలలో విమర్శించినట్లు శ్రీసుబ్బారావుగారు వ్రాసినారు కాని ఆనివేదికలయందలి యాపుటలలో ఎంతవెదకినను ౨౮౪-వ గాంగ శకమునాటిశాసనము దొరకలేదు.

శ్రీ సుబ్బారావుగారు కళింగసంచికలో రాజేంద్రవర్మకొడుకు అనంతవర్మ (గాంగశకము ౩౦౪, (?)౨౮౪ నాటివాడు)నుగుఱించి వ్రాయుసందర్భమున దిమిలనుగుఱించి తెలిపినవిషయము లన్నియు శ్రీ గొబ్బూరి వేంకటానందరాఘవరావుగారు తమ 'కళింగము, ఎలమంచిలి' అను వ్యాసమున దెలిపినవే; ఎక్కువగ దెలిపినది దండిమహాకవి 'కొంతకాల మాతని (జయసింహుని) యాస్థానకవీశ్వరు' డన్న విషయము. కాని వారు దీనికి ప్రమాణము నిచ్చియుండలేదు!

18. Ep. Ind., Vol. III, p. 220.

నాగరి, తెలుగువర్ణసంకరము దేవేంద్రవర్మ కొడుకు సత్యవర్మ శాసనమున నెక్కువ. దేవేంద్రవర్మకొడుకు అనంతవర్మదేవు, వజ్రహస్తదేవుల శాసనములయందును ఈ నాగరాక్షరాధిక్యము కనబడుచుండుటచేతను, పూర్వోక్తప్రశస్తిపరిణామాధారముననే పై పట్టికయందు అనంతవర్మదేవు, వజ్రహస్తులు ౩౫౧ నాటి దేవేంద్రవర్మ కుమారుడయిన సత్యవర్మకు బిదప జూపబడినారు.

ఇక నిచ్చట నాలోచింపవలసినది అనంతవర్మదేవుకుమారుడు దేవేంద్రవర్మ శాసనమొకటి కలదు. ఇతని శాసనము[19] 'ఏకపంచాశ[త్ *]'నాటిది; కాని దీనిని వ్యాఖ్యాసమేతముగ బ్రకటించిన ఫ్లీటుదొరగారు లిపిరీతినిబట్టియు, రాజనామసామ్యమునుబట్టియు ౨౫౪ నాటి దేవేంద్రవర్మయు, నితడు నొక్కరే యగుదురనియు, శాసనకాలము ౨౫౧ అనుటకు ౫౧ అని పొరపాటున తప్పు వ్రాయబడిన దనియు వ్రాసిరి[20]. కాని ఫ్లీటుదొరగారు వ్రాసినట్లు ౨౫౧ కూడ కాదని, ౩౪౯ అగునని నాయభిప్రాయము. శాసనకాలము తప్పుగ వ్రాయబడిన దనుటకు

19. Ind. Ant., Vol. XIII, p. 273 ff.

20. Ibid, p. 274.

కాని శ్రీసుబ్బారావుగారుమాత్రము శాసనకాలము తప్పను ఫ్లీటుదొరగారినిర్ణయము నంగీకరింపరు. వారి మతమున నిది గాంగశకము ౫౧ నాటిదనే! ఈదేవేంద్రవర్మ గాంగశకము ౩౯ నాటి ఇంద్రవర్మకు దరువాత రాజ్యమునకు వచ్చినవాడేకాక అతనికుమారుడుకూడనట!! (చూడుడు: కళింగసంచిక, పుట. ౫౦౦; J. A. H. R. S., Vol. VI, pp. 73-74.) వా రట్లూహించుటకు గలకారణము లివి: "(ఈ) శాసనమును ప్రకటించిన డాక్టరు ఫ్లీటు అక్షరముల పోలికలనుబట్టియు, గాం. శ. సం. ౨౫౪ లో ఒక దేవేంద్రవర్మ యుండుటం బట్టియు ఈదేవేంద్రవర్మకూడ ఆకాలపువాడే యని యూహించెను. కాని లిపిపరిశీలన బాసుగా చేయగా అది బహుప్రాచీనతమమయినదని తేలుచున్నది. మరియు ఈశాసనముకూడ నంపప్రభంజనవర్మ క్రీ. శ. ౫-వ శతాబ్ద ప్రారంభము)శాసనముతోపాటు దొరకుటవల్లను, శాసనమున అక్షరములతో గాం. శ. ౫౧ అని వ్రాయబడుట చేతను ఇది ఆకాలపుదేకాని దరిమిలాది కానేరదు."

"On Paleographical and Synchronistic grounds, the learned Scholar (Fleet) identified this king with his name sake successor who ruled in 254 G. E. but since this grant was found along with others of very early date and since the date of the grant is given clearly in words and since the alphabet of this grant is archaic Telugu of about the middle of the 6th Century A. D. it is not correct to identify the donor of this grant with his name sake successor who lived two centuries after him."

ఏమి టీతర్కము? గాంగశకము ౩౯ నాటి ఇంద్రవర్మశాసనలిపిని మొదట పదవశతాబ్దినాటి దన్నారు! దేవేంద్రవర్మ శాసనలిపిని ఆఱవశతాబ్దినాటి దన్నారు!! ఈ రెండుశాసనములందలిలిపిని — శాసనలిపిని తెలిసినవారే కానక్కరలేదు — గుర్తుతో పరిశీలించినవా రయినను అట్లనబోరు. ఇట్టివ్రాతలు పత్రికప్రతిష్ఠకేకాక వ్యాసకర్త ప్రతిష్ఠకును భంగమును దెచ్చునవి.

సందియము లేదు. అట్లయిన నీదేవేంద్రవర్మ ఎప్పటివాడని విచారించుటలో ఫ్లీటుగా రని నట్లు కేవలము లిపిరీతి, నామసామ్యములే కాక ప్రశస్తికూడ నెక్కువగ తోడ్పడునని, ప్రశస్తిపరిణామ మితరవంశముల విషయమున నెటులున్నను ఈ కళింగగాంగులవిషయమునమాత్ర ముపేక్షింపరానిప్రమాణ మని ఇంతవఱకు జేసిన చర్చననుసరించియే తెలియుచున్నది. ఈ శాసనప్రశస్తియందు కళింగనగరము 'అమర పురానుకారిణి' యనియు, గోకర్ణస్వామి 'శశాంకచూడామణి' యనియు నభివర్ణింపబడుటచేత నిది గాంగ శకము ౨౨౧కి పూర్వపుది కానేరదు. శాసనదాత 'కుశలి' యగుటచేత ౨౨౧-కి తరవాతిదికూడను. 'సితకుముదకుందేందువదాతయశ'త్వముచేత నిది ౨౫౮ కు తరువాతి దనియు స్పష్టమగుచున్నది. ఇక నీ'సిత...యశ'త్వము ౩౦౮ నాటి శాసనమునందుండుటచేత నిది దానికి పూర్వపుది కాని, తరువాతిది కాని కావలెను. ఇది ౨౫౮ నాటి శాసనమునకు తరువాతి దనుటకు ఈపైనిపేర్కొనినవాని నన్నిటిని మించినది వేఱొకప్రమాణము కలదు. అది శాసనకాలపరిభాష. మన కింతవఱకు దొరకిన ఇంద్రవర్మ మొదటి శాసనకాలము 'ప్రవర్ధమాన సం. ౩౯' అని తెలుపబడినది. మనకు దొరకిన తరువాతి శాసనమగు హస్తివర్మ నర్సింగపల్లిశాసనమున ఈ కాలమే 'ప్రవర్ధమానవిజయరాజ్యసంవత్సరాః ఏకోనాశీతి' యని పేర్కొనబడినది. గాంగశకము ౨౫౮వఱకు గలహస్తివర్మతరువాతి గాంగనృపాలురెల్లరు నతనినే అనుసరించి తమ శాసనకాలమును 'ప్రవర్ధమానవిజయరాజ్య సంవత్సరము'లలో దెలుపుచునచ్చిరి. ఈ శకకాలపరిభాష ౨౫౮ కు తరువాతినుండి మారిపోయినది. మన దేవేంద్రవర్మ తన శాసనకాలమును 'గాంగేయవంశప్రవర్ధమానవిజయరాజ్యసంవత్సర మేకపంచాశ[త్ *]' అని తెలుపుట వలన నితడు ౫౧ నాటివాడు కాడుకదా, ౨౫౮నాటివాడుకూడ కాదని స్పష్టపడుచున్నది. 'గాంగేయవంశప్రవర్ధమానవిజయరాజ్యసంవత్సరము' లనుకాలపరిభాష గాంగశకము ౩౦౮నాటినుండి యారంభము. అందువలన మన దేవేంద్రవర్మ నిజముగా గాంగశకము ౩౦౦లకు తరువాతివాడు, అనగా ౩౦౮నాటి శాసనదాతతండ్రితరమువాడు కాని, శాసనదాతతరువాతితరమువాడు కాని అగును. ౩౦౮నాటి శాసనము రాజేంద్రవర్మ కొడుకుఅనంతవర్మది. ౩౪౨నాటిశాసనము[21]

21. Cp. No. 13 of 1917-18.

ఇది యింతవఱ కెక్కడను ప్రకటితమయినట్లు కానరాదు. కాని శ్రీసుబ్బారావుగా రిది బీహార్ అండ్ ఒరిస్సా రీసర్చిపత్రికలో (Vol. XII, p. 101) ప్రకటితమయినట్లు వ్రాసిరి (చూడుడు: J.A.H.R.S., Vol. VI. p. 197, foot note, no. 45). ఈశాసన మాసంపుటము నెన్నిమారులు తిరుగవేసినను నాకంటబడలేదు. ఇట్లు తప్పుప్రమాణము లిచ్చుచున్నచో నేమిగతి? కళింగసంచికలోకూడ (పుట. ౩౨౨) ఈ తప్పుప్రమాణమునే యిచ్చినారు!

అనంతవర్మకొడుకు రాజేంద్రవర్మది. ఈ రాజేంద్రవర్మతండ్రి ౩౦౮నాటి అనంతవర్మయే యయినచో — గాంగశకవత్సరములు క్రమముగా వచ్చుటవలనను, ౩౦౮కు, ౩౮౨కు నడుమ నెక్కువ యంతరము లేనందువలనను — అట్లనుట కవకాశము కలదు— దేవేంద్రవర్మ ౩౦౮ కు తరువాత గాని, ౩౮౨ కు తరువాతగాని రావలసియుండును. 'ఏకపంచాశ[త్ *]' అని శాసనమునందే యుండుటచేత అతడు ప్రాయికముగ ౩౫౧నాటివాడు కావలెను. అట్లేయయినచో దేవేంద్రవర్మ, సత్యవర్మ[22] లిరువురి శాసనములు నొక్కయేటి వగుటయేకాక ఇరువురునుగూడ నాయేటసంభవించినసూర్యగ్రహణము నిమిత్తమున నే దానము చేసినవారగుచున్నారు. ఆ యేట రెండు సూర్యగ్రహణము లున్నవని, అందు మొదటి సూర్యగ్రహణమునిమిత్తమున దేవేంద్రవర్మయు, రెండవ సూర్యగ్రహణమునిమిత్తమున సత్యవర్మయు దానము చేసియుందురని చెప్పి యాయసందర్భమును తొలగించుకొనవలసియుండును. అట్లుకాక యిచ్చిన శకకాలమును 'గాంగేయవంశప్రవర్ధమానసంవత్సర [శతత్రయ*]మేక(కో) [న*] పంచాశ [త్ *]'

22. Ind. Ant., Vol. XIV. p. 10.

శ్రీసుబ్బారావుగారు ఈసత్యవర్మనుకూడ గాంగశకము ౫౧ నాటి వానిసే చేసినారు! (చూడుడు: "Since the date of the king's grant is stated in words to be G. E. 51, 'Gangeya-vamsa Samvatsara Satana mekapanchasat' Dr. Fleet's theory that it should be read as 351 G. E. cannot be accepted especially in view of the fact that the inscription contains several grantha and prakrit words of archaic type"—J. A. H. R. S, Vol. VI. p. 77; "దేవేంద్రవర్మ, సత్యవర్మలశాసనములలో ఏకపంచాశ(త్) అని అక్షరములతో లేదీ లివ్వబడినను, డాక్టరు ఫ్లీటు మొదలగువారు వాటిని గాం. సం. లు ౫౧ అనియు, ౩౫౧ అనియు చదువవలెనని వ్రాయుట సమంజసముగా లేదు" — కళింగసంచిక, పుట. ౫౦౧). తెలుగున వ్రాసినదానికంటె ఇంగ్లీషున పత్రికలో ప్రకటించినది మరీ అసందర్భముగా నున్నది: ఇంతవఱకు గ్రంథాక్షరములను ఎఱుగుదుము కాని 'గ్రంథ' పదముల నెఱుగము. ఎక్కడివివి? 'గ్రంథాక్షరము'లకే యిట్లు వ్రాసిరికాబోలు. గ్రంథాక్షరములు పడినందున తెలుగుదేశశాసనము పురాతనమయినదట! సంస్కృతగ్రంథములు వ్రాయుటకు తమిళు లుపయోగించులిపికి గ్రంథలిపి యని పేరు. తమిళులతోడి సంసర్గము హెచ్చిన చాళుక్యానంతరకాలమున గాని కళింగశాసనములం దీయక్షరములు పడుట కవకాశములేదన్నది అందఱు నంగీకరించుమాట. అట్టిది అవి కనబడినవి గనుకనే శాసనము పురాతనమైనదని శ్రీసుబ్బారావుగా రనుచున్నారు!

ఎపిగ్రాఫియా ఇండికా, ౫ - వ సంపుటమునం దిచ్చిన శాసనానుబంధమున కీల్‌హారన్ పండితుడుకూడ ఈశాసనకాలము ౩౫౧ గనే తెలిపినాడు (సంఖ్య, ౬౭౮). అది చూచినయెడల శ్రీసుబ్బారావుగా రట్లు వ్రాసియుండరు. దానినే కాదు శాసనప్రతిబింబములనుగూడ వారు చూచినట్లు తోచదు. ఏలయన శాసనమున శాసనకాల మిట్లు తెలుపబడినది 'గాఙ్గేయబమ్శ సంబఛరశతత్రయైక పఞ్చాసత్' అని. ఫ్లీటుదొరగారి యపపాఠమును ఇండికాశాసనానుబంధమున కీల్‌హారన్‌దొర సవరించినాడు.

అని యించుక సవరణకావించినచో అది ౩౮౯-వ సంవత్సరమయి పైనినుడివిన యసందర్భమున కవకాశమే లేకపోవును. అందువలన దేవేంద్రవర్మ గాంగశకము ౩౮౯నాటి వాడుకాని, పైరీతిని సమన్వయించుకొనునెడల ౩౯౧నాటివాడుకాని కావలెను.

ఈనిర్ణయమునకు లిపి సాధకమేగాని బాధకముకాదు. గాంగశకము ౨౨౧, ౨౫౪ నాటి శాసనములలోవలెనే యిందును నాగరివర్ణము లచ్చటచ్చట సకృతుగ (చూడుడు: 'అమరపురానుకారిణః','అత్రసీమాలింగాని' అన్నవానిలోని 'అ', 'సచరాచరగురోః' 'భగవతో' అన్నవానిలోని 'గ' మొదలగు వర్ణములు నాగరలిపివి) నుండుటచేత నిది వీని పొడ యేమాత్రమును గానరాని గాంగశకము ౯౧ నాటిది కాదని నిర్ధారణ మగుచున్నది. ఇక నక్షరకుటిలత్వమును పరికించినచో నది ౧౯౫నాటి శాసనమున సూచనగ గనిపించినను మఱియొక యఱువదేండ్లకు బిదప, అనగా ౨౫౪నాటి శాసనమున మఱింత పొటమరించి, ఇంకొక యేబదియేండ్లకు, అనగా ౩౦౦ నాటి శాసనమున బాగుగ ప్రస్ఫుటమయినది. ౨౫౪ నాటి శాసనాక్షరములకు ౩౦౦ నాటి శాసనాక్షరములకు భేదము బాగుగ గోచరించును. ఈమార్పు అనంతవర్మకొడుకు దేవేంద్రవర్మ (౩౮౯ లేక ౩౯౧ నాటిదని తేల్చిన) యీశాసనమున మఱింత పరిపక్వమనది. ఈశాసనమునందలి 'క', 'ఖ' 'చ' 'జ', 'ణ', 'త', 'ధ', 'ర', 'శ' వర్ణములు ౨౫౪ నాటి శాసనమునందుకంటె వికాసమును పొందుటచేత అక్షరపరిణామ మాశాసనమునందుకంటె దీనియం దెక్కువగ చూపట్టును.

ఇటుతరువాతదొరకిన గాంగశాసనము[23] గాంగశకము ౩౯౭ నాటి దేవేంద్రవర్మది. ఈశాసనమంతయు నాగరిలిపిలోనే వ్రాయబడినది. గాంగపరిపాలనము కళింగమున నారంభమయినతరువాత రమారమి నాలుగువందల సంవత్సరములకు శాసనలిపిగ తెలుగు అంతరించి, నాగరి దానిస్థాన మాక్రమించినది. లిపిలోవలెనే ప్రశస్తియందును మార్పు కలిగినది. ఈశాసనమునాటికి కళింగనగరము 'అమరపురానుకారిణి' యేకాక ' అనేకదేవకులాకులము'ను, 'ఆకల్పాంతసంకల్పితానల్పజనసంపత్సంశోభిత మహామహిమము' నయినది[24]. గోకర్ణస్వామి'ప్రసిద్ధసిద్ధతాపసాధ్యాసి

---

23. Jour. Andh. Hist. Res. Soc., Vol. II, p. 146 ff.

24. ఈశాసనప్రశస్తిపాఠము బ్రహ్మశ్రీ కర్రి సాంబమూర్తిశాస్త్రిగా రిచ్చినదే శ్రీ సుబ్బారావుగారు నిచ్చినారు. శాసనప్రతిబింబములను చదివిచూడగా ప్రకటితమయిన శాసనపాఠమున ప్రమాదము లున్నట్లు తోచినది. పైనిచ్చిన ప్రశస్తిపాఠము ప్రతిబింబమునుబట్టి చదివి నే నేర్పఱుచుకొన్నది. ఈశాసనమునం దిచ్చిన వంశానుక్రమ వివరణమునగూడ శ్రీసుబ్బరావుగారు శ్రీ శాస్త్రిగారిత్రోవనే అనుసరించిరి. నేను ఆక్రమము నంగీకరింపజాలను. శాసనము భూపేంద్రవర్మసూనుడు దేవేంద్రవర్మది. ౧౮, ౧౯, ౧౬ పంక్తులలో నిచ్చిన

తకందరోదరమహేంద్రగిరిశిఖర శేఖరు'డును, 'త్రిభువనమహాప్రాసాదనిర్మాణైక సూత్రధారు'డు నయ్యెను. గాంగులు 'గాంగకులచూడామణు'లేకాక 'స్ఫూర్జన్నిజ భుజవ్రజ భ్రాజిత సకల కళింగాధిరాజ్యులు' 'మందానిలవేలాకులకల్లోలజలధిమేఖలావనితలామల యశు'లునయినపుడిక 'ప్రవర్థమాన విజయరాజ్య సంవత్సర'మునే పేర్కొనిన నేమిగాక ?

దీనికి పిదప గాంగశకము నిచ్చిన శాసనములు రెండే దొరకినవి: ఒకటి ౧౮౦ నాటి అనంతవర్మతనయుడయిన దేవేంద్రవర్మది[25]; రెండవది ౧౮౩ నాటిమధుకామార్ణవదేవుది[26]. ౧౮౦నాటి దేవేంద్రవర్మకాలమున కళింగనగరము అందఱకు 'సుఖరమణీయ'మేకాక 'సుధాధవల ప్రాసాదమాలావిరతలలితలాస్య'మును, 'దుర్దండపండితసకలాలంకృత'ము నయినది. గోకర్ణస్వామికి వట్టి 'మహేంద్రాచలామలశిఖర'మున నేకాక 'కనకశిఖర'మున 'ప్రతిష్ఠ'. కలిగినది, ఎంతటిభాగ్యశాలియో. మిగిలినవిశేషణములన్నియు ప్రాతవే. దేవేంద్రవర్మ 'దుర్దండపండిత'ఆశ్రయ మెక్కువగుటచేత కాబోలు గీర్వాణ మతిశయించి యతడు 'దేవేంద్రబ్రహ్మ' యయినాడు! ఇంతకన్న నీశాసనమున విశేషము లేవియు లేవు. ఇక ౧౮౩ నాటి శాసనమున మహేంద్రాచలము 'కందరోదర'మేకాక 'కందరోదరదరి'కూడ నయినది! ఇక మఱియొక విశేషమేమన, సంప్రదాయవిరుద్ధముగ ప్రశస్తియంతయు శాసనదాతతండ్రికి ముడివెట్టబడినది. అటుపిదపనే శాసనదాతయభివర్ణితుడయ్యెను.

ఇక గాంగశకము నీయని మూడు శాసనములు కలవు: (౧) సామంతవర్మ, (౨) ఇంద్రవర్మ, (3) పృథివీవర్మలవి. ఈ మూడునుగూడ 'శ్వేతకాధిష్ఠానము'ననుండి యొసంగబడినవి. లిపినిబట్టి చూచినచో సామంతవర్మ శాసనము[27] చాలప్రాచీనపుదిగ గన్పట్టును. ఇది వేంగీ-కళింగతెలుగులిపిలో వ్రాయబడినచండవర్మకోమర్తిశాసనమును[28]

శ్లోకము నను సరించి తెలియవచ్చువంశానుక్రమ మిది: వజ్రి; అతనికొడుకు మారసింహుడు; అతనికొడుకు దేవేంద్రవర్మ.

ఈవిధమయిన వంశానుక్రమము నిచ్చుటకే యవకాశ మున్నదికాని వా రర్థముచేసినవిధమున నిచ్చుటకు వీలు కాన్పింపదు. దీని ననుసరించిచూచినచో మారసింహునికే భూపేంద్రవర్మ యను నామాంతర మున్నట్లు చెప్పవలెను. అనంతవర్మ, దేవేంద్రవర్మ, భూపేంద్రవర్మ లేక రాజేంద్రవర్మ నామములు రాజుల బిరుదములే కాని అసలుపేరులు కావు. భూపేంద్రవర్మ యనునది బిరుదమని, మారసింహు డనునది రాజుయొక్క అసలు పేరని నా యభిప్రాయము.

25. Jour. Andh. Hist. Res. Soc., Vol. III, p. 171 ff.

26. Ibid, Vol. VIII p. 168 ff; Jour. Bi Or. Res. Soc., Vol. XVIII, p. 272 ff.

27. Ep. Ind., Vol. XV, p. 275.

28. Ep. Ind., Vol. IV, p. 142 ff.

బోలియున్నది. ఇంద్రవర్మ, ప్రిథివీవర్మల శాసనములు రెండును నాగరిలిపిలోనే యుండుటచేత వారికి సామంతవర్మకు కాలమున చాల అంతర ముండవలెను. ఇంద్రవర్మ[29], ప్రిథివీవర్మల[30] శాసనములలో ప్రిథివీవర్మ శాసనలిపియందు చాలపరిణామము కనబడుటచేత పృథివీవర్మ ఇంద్రవర్మకు చాల తరువాతివా డని యూహింపవచ్చును. ఇంద్రవర్మ యొక్కడుతక్క మిగిలిన యిరువురును దాము గంగవంశజులమని చెప్పుకొనినవారలే. సామంతవర్మ ‘ గంగామలకులాంబరేందు ’డు ; పృథివీవర్మ ‘ గంగామలకులతిలకు’డే కాక ‘ శ్రీకోలాలపురపట్టనకు’డుకూడను. సామంతవర్మ ‘స్వభుజబలపరాక్రమాక్రాంతసకలస్వేతకాధిరాజ్యు’డే కాని ఇంద్రవర్మ, పృథివీవర్మలు ‘ సకలకలింగాధిరాజ్యులు ’. ప్రశస్తియందు కళింగనగరపాలకులకును, స్వేతకపాలకులకును భేద ముండుటచేత నిరువురును భిన్నభిన్నశాఖలవారనుట యుచితము. సామంతవర్మప్రశస్తి యిది :

‘భగవత శ్చరాచరగురో శ్శకలశశాంకశేఖరస్య స్థిత్యుత్పత్తిప్రలయహేతోః మహేంద్రాచలశిఖరనివాసినః శ్రీగోకర్ణేశ్వరస్వామిన శ్చరణకమలారాధనావాప్త పుణ్యనిచయః గంగామలకులాంబరేందుః స్వభుజబలపరాక్రమాక్రాంత సకలస్వేతకాధిరాజ్యః శక్తిత్రయప్రకర్షానురంజితాశేషసామన్తః పరమమహేశ్వరః మాతాపితృపాదానుధ్యాతః శ్రీసామన్తవర్మా కుశలీ’.

ఇట్లు స్వేతకపాలకులు మువ్వురును గుశలులే. ఇక ఇంద్రవర్మ, ప్రిథివీవర్మల శాసనప్రశస్తియొక్కటే. అది పూర్వోదాహృతప్రశస్తిపరిణామమే. వారి వక్కణలందు వచ్చిన పరిణామ మిది : ‘ ప్రలయ ’, ‘ హేతు ’వులకు నడుమ ‘ కారణ ’ము వచ్చినది. గోకర్ణేశ్వరుడు ‘ భట్టారకు ’ డయ్యెను. కళింగాధిరాజ్యులయిన స్వేతకపాలకులకు ‘ సామంతచక్ర ’ము లభించినది. ఇవియే మొదటి ప్రశస్తియందు లేని విశేషములు. వీరు మువ్వురిలో నొక్కరునుగూడ గాంగశకమును వాడియుండలేదు. ఇక లాంఛనములను పరిశీలించినచో ఇంద్రవర్మ, పృథివీ వర్మల శాసనముద్రికలమీద గాంగుల వృషభలాంఛనమే[31] కన్పట్టును. సామంతవర్మశాసనముద్రికమీది లాంఛనము పోవుటవలన నతని లాంఛన మేదిమైనది తెలియదు. కాని యతనిదికూడ వృషభమే యైయుండవచ్చును.

29. Ep. Ind , Vol. XIX, p; 134 ff; Jour. Andh. Hist. Res. Soc , Vol. III, p. 183 ff.

30. Ep. Ind , Vol. IV. p. 198.

31. గాంగశాసనముద్రికలమీద వృషభలాంఛనముతక్క మఱియొకటి కానరాదు. రాజేంద్రవర్మకొడుకు దేవేంద్రవర్మశాసనముద్రికమీదిలాంఛనము ఏనుగు అని ఫ్లీట్‌దొరగారు వ్రాసిరి కాని శ్రీ సుబ్బారావుగారు వ్రాసినట్లు అదికూడ వృషభమే యయియుండుననుటకు సందియము లేదు.

స్వేతకరాజధానిగ పాలించిన గాంగులను గుఱించి యింతకంటె మన కెక్కువ తెలియదు.

కళింగనగరమునుండి పరిపాలించినగాంగ మహారాజు అనంతవర్మ మందసా శాసన[32] మింకొకటి కలదు. ఇది గాంగచరిత్రకారులకు ఒక 'కొఱకరానికొయ్య'. ప్రశస్తి పూర్వ గాంగప్రశస్తి; శాసనకాలము శకవర్షము లందు ఇట్లు తెలుపబడినది: 'సకాబ్దనవ సతకసప్తరసమత' అని. దీనిని సంస్కరింప నిది 'శకాబ్దే నవశతకసప్తరస - మితే' అని యగును. శాసనశాఖవారు దీనిని శకవర్షము ౯౭౬దిగ గణించి ఇది శకము ౯౯౦ లో సింహాసన మెక్కిన వజ్రహస్తునిదని నిర్ణయించినారు[33]; శ్రీగొడవర్తి రామదాసుగారు 'సప్త', 'రస' పదములకు శాసనమున స్థానసంఖ్య తెలుపనికారణమున ఏకస్థాన సంఖ్యలుగనే గైకొని రెండిటిని కలిపి ( ౭ + ౬ = ౧౩ ) పదుమూడు చేసి శాసన కాలము శకవర్షము ౯౧౩ అని, యిది పూర్వోక్తవజ్రహస్తునికి చాలపూర్వపుదని నిర్ధారణచేసిరి[34]. శ్రీరామదాసుగారి నిర్ణయ మును కాదన్నవార లింతవఱ కెవ్వరును లేరు. ఈవిధమున నీశాసనము వాదప్రతి వాదకారణ మయినది. దీనినిగుఱించి మఱి యొకప్పుడు చర్చించెదను. నాయుద్దేశము కూడ ఇది దేవేంద్రవర్మమధుకామార్ణవునికి బిదప సింహాసనమునకు వచ్చిన పూర్వోక్త వజ్రహస్తుని దని యే. కావున నీవ్యాసమున నీశాసనమునుగుఱించి చర్చింపబనిలేదు.

పూర్వగాంగశాసనదాతల యనుక్రమ మొకరీతిగ పైవిధమున నిర్ణయింపబడినను అనుస్యూతమగు పూర్వగాంగవంశాను క్రమము నేర్పఱుచుట కింకను సాధ్యము కాదు. అయినను వారి శాసనములయం దీయబడిన తరముల ననుసరించియు, శాసన దాతల జనకనామముల సామ్యము ననుస రించియు గాంగశకకాలవత్సరముల ననుస రించియు వారికి గల పరస్పరసంబంధ సన్నిహి తత్వములను ఈ ప్రక్కపుటయందు చూపిన విధమున దెలుపవచ్చును.

ఆపథకమును తిలకించినచో గనబడు విశేషము లివి: మన కింతవఱకు దొరకిన పూర్వగాంగశాసనముల ననుసరించి చూచిన చో ఇప్పటికి మూడవవాడుగ దెలియవచ్చిన గాంగభూపతి దానార్ణవుడనదగు ఇంద్రవర్మ. అనంతవర్మ చోడగంగుశాసనమునుబట్టి చూ చినను దానార్ణవుడు మొదటి గాంగరాజుల లో నొకడు — వీరసింహునిద్వితీయకుమారు డు. అన్నగారగు కామార్ణవుడు - సంతాన

32. Cp. no. 12 of 1917-18; Jour. Bi. Or. Res. Soc, Vol. XVII, p. 175 ff.

33. Ep. Rep. for 1918, p. 138.

34. Jour. Bi. Or. Res. Soc, Vol. XVII, p. 175 ff.

## పూర్వగాంగుల పరస్పర సంబంధ, సన్నిహితత్వములను దెలుపు పథకము

(౩౯) ఇంద్రవర్మ
(౭౯,౮౦) హస్తివర్మ
(౮౭,౮౭,౯౧,౧౨౮) ఇంద్రవర్మ — దానార్ణవుడు
|
(౧౩౭,౧౩౮,౧౪౫) ఇంద్రవర్మ — గుణార్ణవుడు
|
(౧౮౩, ౧౮౪, ౧౯౨) దేవేంద్రవర్మ — దేవేంద్రవర్మ
|
అనంతవర్మ (౨౦౪) — జయవర్మ

అర్జునవర్మ | దేవేంద్రవర్మ

అనంతవర్మ | దేవేంద్రవర్మ (౨౫౪)

అనంతవర్మ | నందవర్మ (౨౨౧)

రాజేంద్రవర్మ | అనంతవర్మ (౩౦౪)

రాజేంద్రవర్మ | దేవేంద్రవర్మ (౩౧౦)

అనంతవర్మ | దేవేంద్రవర్మ (౩౫౧)

అనంతవర్మ | రాజేంద్రవర్మ (౩౪౨)

దేవేంద్రవర్మ | అనంతవర్మ

దేవేంద్రవర్మ | సత్యవర్మ (౩౫౧)

వజ్రహస్తుడు

ఇంద్రవర్మ | భూపేంద్రవర్మ | దేవేంద్రవర్మ (౩౯౭)

అనంతవర్మ | దేవేంద్రవర్మ (౫౨౦)

అనంతవర్మ | మధుకామార్ణవుడు (౫౨౬)

విహీనుడయిన కారణమున గావచ్చును — ఈ దానార్ణవునికే పట్టముకట్టెను. చోడగంగు శాసనములం దభివర్ణితమయినది దానార్ణవ వంశావతారక్రమమే. పూర్వ గాంగశాసన దాత లెల్లరుకూడ దానార్ణవుని (ఇంద్రవర్మ) సంతతివారుగనే కనబడుదురు. పూర్వగాంగ శాసనదాతలలో నింతవఱకు మొదటివాఁడుగ దెలియవచ్చిన ఇంద్రవర్మ రాజధాని దంతపురము. అనంతవర్మచోడగంగుశాసనముల ననుసరించి మొదటి కామార్ణవుని (దానార్ణవుని అన్నగారు) రాజధానియు దంతాపురమే (దంతపురము). పిదపనే 'నగరము' లేక 'కళింగనగరము' గాంగభూపతులకు రాజధానియైనది. పూర్వగాంగులలోని మొదటి ఇంద్రవర్మకు తర్వాతివారికందఱకు 'కళింగనగరమే' రాజధాని యైనట్లు పూర్వగాంగశాసనములు విశదపఱుచుచునేయున్నవి. ఈ సాదృశ్యముల ననుసరించి పూర్వగాంగ శాసనములవలన నభివ్యక్తమయిన గాంగ భూపతులు అనంతవర్మచోడగంగుశాసనములం దతనికి పూర్వులుగ నభివర్ణితులయిన వారలే యని నిర్ణయించుట సాహసము కానేరదు. కాని, అనంతవర్మచోడగంగు పూర్వుల నందఱను పూర్వగాంగశాసనములందు గుర్తించుటకును, పూర్వగాంగశాసనములనుబట్టియే పూర్వగాంగుల యొక్క అనుస్యూతవంశావతారక్రమము నేర్పఱుచుటకును ఇంకను వారివి చాల శాసనములు - అతుకులు కలుపవలసినవి - దొరకవలసియున్నది. వాటికొఱకు చరిత్రాభిమానులెల్లరు కృషిచేయుట ఆవశ్యకము.

3

ఏమెలసంజచీకటుల కిల్లగు జీబుగుబుల్ల మాయపూ
సోయగపుంబువుంజెలుల చూపుల పిచ్చి విరాళి జెందెనో!
బోయ పడంతులన్ జెనకి, పొత్తుల ప్రీలిన నీలికొప్పులం
దూయెల లూగు, వన్యకుసుమోజ్జ్వలబంధము లుచ్చివాయువుల్.

ఈపవమానవీచికల కెక్కడికో బరువెత్తు భావ పు
ష్పాపచయాలసార్ద్రహృదయమ్మున, నేసుఖసాధశయ్య, నీ
పూపనిగారపున్ వయసుపోడుము లల్లన విచ్చు, క్రొత్తరా
రాపిళులందు, కందు మధురత్రపలన్ వల పొల్కబోసెదో!

కలకల నీవునవ్వినవికాసము, జల్లున తీపె ప్రాతరు
జ్జ్వలతలిమాలవేగునను; చక్కనినీముఖశోభగాంచ నే
వలసల బోయెదన్ గగనవాహినితీరము లంట, చుక్కపూ
పులపొదలంట, దిక్కులకవుంగిలి నింగిచెరంగు లంటుచున్.

పయనమువేళ నీవుభయపక్షనిరంకుశశర్వరీహృదా
శయనిభృతప్రచారముల జార్చితి వాలికచూపు, లే, హిమా
లయమయి, గడ్డగట్టితి జ్వలచ్ఛశితారలసానుభూతు, లా
పయి, ప్రణయప్రభాతమయి, కర్వడవా సతి, నిర్దయానిశల్?

పండినవెన్నెలన్ గగనభామినీ; శారదమేఘమాలికా
ఖండములందు డాచినవికాసము; పూసినచల్వగందమై
గండతలాల నిగ్గు లొలుకంగ; వియోగపహోయసాధ్వముల్
రెండవచందురుంబలె తెరింతు; వరింతు నిరీక్షణాయతుల్.

నాకయి నవ్యమోహబుతునాట్యము సేయు వసంతపుత్రి మా
ధ్వీకలకంఠగీతికల దేలు సరాగము చేదు చేదుగా,
చీకటిరేల, నీలసరసీకుముదాంతనిబద్ధచంద్రరే
ఖా కిలికించితమ్మయి, సుఖ విమ్మడు నీచిరుపాట నామెదన్.

గుసగుసలాడె, స్వర్గవనకుంజగృహమ్ముల తారకొతతుల్
ఈసుకల నిరకే పెందరగే లీడిగేలరబడె వెల్పుటటిలో
విసివి, విరాళి, కంఠమురి వేసికొనన్ బ్రతిమాలి జాలి నే
కొసరగ హేమకుంతలనిగూహనముల్, ముదిసంజ క్రొత్తడిన్.

వెన్నెలచీరె లూని పలవింతు బయళ్లను, తూర్పుకోనలో
కిన్నెరలాని రాగ మొలికింతు వుషస్సుల; నీలకుంతలా
చ్ఛన్నతమోవితానముల సన్నగ బెళ్కెడు కల్కిచూపులన్
ఎన్నటికో తెగించి, పులకించి, తళుక్కున పల్కరించుటల్ !

నిలువున నీవు మేఘములనీడల, నింద్రధనుర్విచిత్రకాం
తుల మణితోరణాల తమితో దయసేసితివేని, స్వర్గవీ
థుల పలికింతు ప్రేమఫణితుల్, సురకన్యలు పుల్కరింప, భూ
తలి కెలయింతు హర్షరసధారల, కావ్యలతల్ ఫలించెదన్.

నీపడకింటిజాలక మణీరమణీయరుచి ప్లుతమ్ములై
మాపుల నీకటాక్షసుమమాలలు నాదెస విచ్చునో సఖీ !
పాపము ! నావిశీర్ణతృణపర్ణకుటీరములో, వసంతల
క్ష్మీపునరాగమోత్సవనిమిత్తము స్వాగతతోరణమ్ములై.

నీచెక్కిళ్లను గారువెన్నెలలు మున్నీరైన, తత్పాండువీ
చీచాంచల్య పవిత్ర ఖేలనములన్ శ్రీవిష్ణు వౌదేను, ప్రా
చీచైతన్యము లీగు నీయధరగోష్ఠీ స్మేరతాంబూలరే
ఖాచిద్భోగవిలాసినై, లసదుషఃకల్యాణముల్ పాడుదున్.

దూరమునుండి నీవడవితోటలతావులు కొండవాగులై
పారెడు మర్మగానముల బాంధవముల్ వినదింతు నామెదన్;
తారెడు సంజదీవుల పదమ్ముల ముద్దిడుదూరవారిధీ
తీరసువర్ణమేఖలల తీయనిగట్గల లూచు నీకలల్.

నీకు ప్రదక్షిణల్ సలిపి నేడిదె, దక్షిణవాయువీచికల్
ప్రాకెడు నామెయిన్ చనవుపాటున చందనవాటి చల్వలై;
రాకలవాకలై భువి గరంచెడు ద్రావిడగీతు లీది, నీ
వాకిలివాలునే విరహవహ్నివిరాళములైన యూరుపుల్.

నీ వాంధ్రావతి కేగుదేర మగుడన్, నిర్యన్నదీగర్భవా
ణీవాచాలతరంగ ఘోషముల వర్ణింతున్, శరచ్చంద్రకే
ళీవాల్లభ్యవిలోకనావళి నివాళింతున్, హృదంతానురా
గావేగమ్ముల పాలపొంగులగు నీయాహ్వానసంరంభముల్.

---

# విష్ణుకుండి వంశము

భావరాజు వేంకటకృష్ణరావు

## లాంఛనము, నాణెములు

విష్ణుకుండీయుల మహాలాంఛనము సింహ మని తెలియుచున్నది. రెండవ మాధవవర్మయొక్కయు, మూడవ మాధవవర్మయొక్కయు ఈపూరు శాసనపు ముద్రికలపై 'శ్రీమాధవవర్మా' యని శుభాంకితము మాత్రము గానవచ్చును గాని, సింహలాంఛనము గానరాదు. ఒకవేళ పొలమూరిశాసనపు ముద్రికపై నా లాంఛన ముండెనేమో తెలియదు. చరిత్రకారుని దురదృష్టవశమున నాముద్రిక పగిలిపోయి యెచ్చటనో జారిపోయినది. రామతీర్థం, చిక్కుళ్లశాసనపు ముద్రికలపై సింహలాంఛనము స్పష్టముగ గానవచ్చుచున్నది. సర్వాంగసుందరమైన సింహము, కుడివైపునకు తిరిగి, కుడిముందుపాదమును ఎత్తి నఖములను విప్పియున్నట్లు ముద్రికపై ఉబ్బెత్తుగా పోతపోయబడియున్నది. ఆ సింహము నోరు తెఱచికొని యున్నది. దానికి రెండు తోకలు గానవచ్చుచున్నవి.[౧] ఈ సింహలాంఛనము బౌద్ధసంప్రదాయ సిద్ధమైనది.

విష్ణుకుండీయుల నాణెములపై గూడ నీ సింహలాంఛనమే గానవచ్చుచున్నది. అనకాపల్లికి సమీపముగానున్న శంకరం[౨] గ్రామముచెంతనున్న బొజ్జన్నకొండ, యెత్తికొండలపై గానబడిన బౌద్ధనిర్మాణావశేషములను వెలికి దీసినపుడు అచ్చట కొన్ని రాగినాణెములు, బంగారునాణెములును దొరకియుండెను. వాటికి ముందువైపున సింహమును, వెనుకప్రక్కను కలశమును చిత్రింపబడియున్నవి.[3] సర్ వాల్టరు ఎలియటు వాటిని పరీక్షించి యవి పల్లవులనాణెములు గావలయునని అభిప్రాయమిచ్చెను. రాయబహాదూర్ వెల్వకుడి వెంకయ్యగారు ఆయభిప్రాయమునే అంగీకరించుచు, చాళుక్య కుబ్జవిష్ణువర్ధనుడు ఆంధ్రదేశమును జయించినతరువాత పల్లవులనాణెములను తననాణెములక్రింద మార్చి యుండవచ్చునని నిశ్చయించిరి.[౪] పల్లవుల కలశమును త్రిశూలముక్రింద విష్ణువర్ధనుడు దిద్దించియుండెనని వారివాదము. వారివాదమంతయు ప్రమాదపూరితము. విష్ణుకుండీయులను జయించి కుబ్జవిష్ణువు వేంగిదేశమును ఆక్రమించుకొన్నాడుగాని పల్లవులను నిర్జించిగాదని యింతకుముందు మనచే విశదీకరింపబడియెను. కావున చాళుక్యులకు పూర్వము ఆంధ్రభూమిని ఏలినవంశము విష్ణుకుండీయులు గావున, కుబ్జవిష్ణువు విష్ణుకుండీయుల కలశచిహ్నమును త్రిశూలముగ దిద్దించినాడని యూహ చేయవచ్చును. కాని అదియుగూడ వట్టిభ్రాంతియని అనవచ్చును. కలశరూపమే అరిగిపోయి, కొన్నినాణెములందు త్రిశూలాకృతిగా తోచుచున్నదని నావిశ్వాసము. ఇది యిట్టులుండ, ఆ నాణెములపై కొన్ని యక్షరములు గూడ గానవచ్చుచున్నవని వెంకయ్యగారు తెలిపిరి. ఆ యక్షరములు చాలా ప్రాచీనమైన వేంగీలిపియందున్నవనియు, ఆవ్రాత క్రీస్తుశకము నాలుగు, లేక అయిదు శతాబ్దములనాటిది గావలయుననియు నిర్ణయించిరి. ఆయక్షరములను వారు "శ్రీకాంత" అనిచది

---

౧. చిత్రముగ పల్లవులకును, తెలుగుచోడులకునుగూడ సింహమే లాంఛనము. ఈవిషయము పరికించి చూడ నీవంశములకు అన్నింటికిని ఆంధ్రదేశ భాగమే జన్మభూమి యని స్ఫురించును.

౨. శంకరము అనునది "సంఘారామము" యొక్క సాంకర్యరూపము.

3. Annual Report on South Indian Epigraphy 1909. p. 4 Para 5.

౪. పూర్వోక్తప్రమాణము; Annual Report of the Archaeological Survey of India for 1907-08., p 173.

విరీ. ఆపదమునకు అర్థములేదు. మిాదుమిక్కిలి ఆ యక్షరములను మరియొకవిధముగాకూడ చదువవచ్చును. ఆయక్షరములను ఆరీతిగా చదువుటకంటె 'శ్రీప[ర్వ]త' అని చదువుట సమంజసము. విష్ణుకుండీయులు శ్రీ పర్వతస్వామి పాదానుధ్యాతులు గావున, "శ్రీపర్వత" మని వారు తమనాణెములపై అక్షరాంకములను ముద్రింపించియుందురు. మరియు విష్ణుకుండీయులు మహారాజ్యమును స్థాపించి యేలినవారు గావున వారికి సొంతనాణెములుండెననికూడ యూహ చేయవచ్చును.

## అశ్వమేధయాగ ప్రశంస

విష్ణుకుండీయులనుగూర్చి మరియొక ముఖ్యాంశమును చర్చింపవలసియున్నది. విష్ణుకుండినులు బ్రాహ్మణ మతావలంబకులు; వైదికాచారప్రియులు. వేదోక్తముగ యజ్ఞయాగాదులను క్రతువులను మొదలయిన వాటిని శ్రద్ధగా నాచరించుట వారికి మిక్కిలి ప్రీతికరము. వారికాసంప్రదాయము వారికి పూర్వు లయిన ఇఖాకు (సంస్కృతము: ఇక్ష్వాకు) వంశీయులనుండి సంక్రమించినట్లున్నది.

విష్ణుకుండివంశీయులు తొమ్మండుగురిలో మాధవవర్మ పేరుగల ముగ్గురును, ఒకరికంటె నొకరు ఎక్కువ ప్రసిద్ధులని యింతకుముందు సూచించియుంటిమి. వారిలో మొదటి మాధవవర్మ శాసనము ఒక్కటియుకూడ మన కింతవఱకు లభించకపోయినను, రెండవ మాధవవర్మ యీపూరుశాసనమందు (పూర్వోక్తములయిన వాటిలో నాల్గవది) ఆతనికి ఒసగబడిన బిరుదుగద్యమందు "ఏకాదశాశ్వమేధావభృథావధౌత జగత్కల్మషః", "అగ్నిష్టోమ సహస్రయాజినః" అని రెండువచనములుమాత్రము గనబడుచున్నవి. మొదటి మాధవవర్మ భగవానుడైన శ్రీపర్వతస్వామియొక్క పాదానుధ్యాతుడని చెప్పబడలేదు. ఆబిరుదము తొలిసారి రెండవమాధవవర్మకే ఉపయోగింపబడి యున్నది. కావున దీనినిబట్టి మొదటి మాధవవర్మ శ్రీపర్వతస్వామి పాదానుధ్యాతు డగునో, కాడో నిర్ణయింపజాలము. మరియు నితడు ఏకాదశాశ్వమేధములు, అగ్నిష్టోమాది సహస్ర యాగములు చేసినాడో లేదోగూడ నిర్ణయింపజాలము.

రెండవమాధవవర్మయే తొలుదొల్త అశ్వమేధ యాగమున్న, రాజసూయమునుగూడ నాచరించి మహోన్నతపదవిని బొంది, తనవంశప్రసిద్ధిని ఉత్తరాపథమునకుగూడ వ్యాపింపజేసినవాడని తోచుచున్నది. చిక్కుళ్ల తామ్రశాసనమందు ఈ మహారాజునకు "ఏకాదశాశ్వమేధావభృథావధౌత జగత్కల్మషః", "క్రతు సహస్రయాజినః" అని బిరుదువచనములు తాత మాధవవర్మకువలెనే చేర్చబడియున్నవి. కాని ఆతనికంటె నితడు అధికుడని సూచించు మరికొంత బిరుదుగద్యగూడ నీమహారాజునకు విశేషముగ చేర్చబడియున్నది. ఇతడు సర్వమేధమును గావించి సర్వభూతములకు తృప్తి యొనరించి స్వారాజ్యపదవి నొందినవాడనియు, బహుసువర్ణ, పౌండరీక, పురుషమేధ, వాజపేయ, యాగ్య, షోడశి, రాజసూయ, ప్రాధిరాజ్య, ప్రాజాపత్యాద్యనేకవివిధ సృగను గురుతర శత సహస్రయాజియనియు, శ్రేష్ఠములైన క్రతువుల ననుష్ఠించుటవలన పరమేష్ఠితత్వమును ప్రతిష్ఠించుకొన్నవాడనియు, చిక్కుళ్ల శాసనము అభివర్ణనము చేయుచున్నది. వీటిలో పురుషమేధ రాజసూయములు తప్ప మిగిలిన వన్నియు సామాన్యము లయినవి. వాటిలో కొన్నింటిని విష్ణుకుండీయులకును, సాలంకాయనులకును పూర్వులైనట్టియు, మహాంధ్రభూమిని ఏకచ్ఛత్రాధిపత్యముగ బరిపాలించినట్టియు ఇఖాకు (యిక్ష్వాకు) వంశీయులు ఆచరించియుండిరి.* ఆంధ్రకళింగములను సార్వభౌముని వలె నేలగల్గిన రాజశ్రేష్ఠుడగు రెండవమాధవవర్మ మహారాజు రాజసూయమును, మిగిలిన క్రతువులును చేసినాడనుటలో నాశ్చర్యములేదు. మరియు నా మహారాజు ఇంచుమించుగా నేబది సంవత్సరములు నిరాఘాటముగ పరిపాలించి అఖిల జగద్వ్యాప్తమైన యశమును సంపాదించి 'సకలజగన్మండల విమలగుణ పృథుక్షితి మకుట

---

* నాగార్జునకొండపై దొరికిన ప్రాకృతభాషా శాసనములు: "అగిహోతాగి. ధేమ వాజపేయ అసమేధ యాజిస, అనేకహిరణ్యకోటి గోసతసహసహలసత సహసపదాయిస"...(ఎపి. ఇండికా, సం.౨౦, పుటలు ౬-౨౫)

మణిగణ నికరావనత పాదయుగళుడని ప్రఖ్యాతి గన్న వాడు గావున పురుష మేధ అశ్వమేధములనుగూడ ఆచరించినాడన్నచో విశ్వసింపవచ్చును. సకల జగన్మండల మంతయును జయించి పెక్కుమంది క్షితిపతులను సామంతులుగ జేసుకొనగలుగుటకు ఆతడు మహాసమర్థుడై యుండవలయును. ఆ కాలపు చరిత్ర మనకు యింకను ఎఱుగరాకున్నది. కావున ఆతడు పురుష మేధ, అశ్వమేధ, రాజసూయముల నెట్లు ఆచరించియుండెనో నిర్ణయింప వీలుకలుగుట లేదు.

ఇక మొదటి విక్రమేంద్రవర్మ రాజ్యాభిషిక్తుడు కాక పోయినను వంశానుగతమైన బిరుద మొకటి యతనికి చేర్చబడినది. రామతీర్థం శాసనమందు ఇంద్రభట్టారకుడు తనతండ్రియైనయాతనికి "శ్రీ విష్ణుకుండిపార్థివోద తాన్వయతిలక సముద్భూత ఏకాదశాశ్వమేధావభృథావ ధౌత జగత్కల్మష క్రతుసహస్రయాజినః" అని మొదటి మాధవవర్మకువలెనే చేర్చినాడు. కావున ఇందు విశేష మేమియును కాన్పించుట లేదు. అట్లే ఇంద్రభట్టారకుడేమియు యజ్ఞయాగములను చేసినట్లు శాసనములు దెలుపుట లేదు. కాని విష్ణుకుండినులలో నీతడే మొట్టమొదట పరమమాహేశ్వరపదమును ధరించినవాడు. ఈతనికుమారుని చిక్కుళ్ల శాసనమునందు "యథావిధివినియోజిత ఘటికావాప్త పుణ్యసంచయః", "సతతభూమిగోహిరణ్యప్రదానప్రతిలబ్ధపుణ్యాజీవితోపభోగః" అనియు విశేషణములు చేర్చబడినవి. దీనినిబట్టి యితడు నిరంతరము శాస్త్రోక్తములయిన మహాదానములుచేసి పుణ్యమార్జించినాడని మాత్రమే ధ్వనించుచున్నది. యజ్ఞయాగాదిక్రతువు లొక్కటియైన జేసినట్లు కనబడదు.

రెండవ విక్రమేంద్రవర్మయు, గోవిందవర్మయు గూడ నిదేరీతిగ క్రతువులేవియు నాచరించనట్లు శాసనములవలన దెలియుచున్నది. ఇక కడపటివాడగు మూడవ మాధవవర్మ, మరల తనపేరింటి రెండవమాధవవర్మవలె మహాగరిష్ఠుడైనట్లు గన్పట్టుచున్నాడు. ఆతడు తాను "అగ్నిష్టోమసహస్రయాజి" యనియు, "హిరణ్యగర్భప్రసూతః" అనియు, "ఏకాదశాశ్వమేధావభృథస్నాన విగత జగతేనస్కః" అనియు చెప్పుకున్నాడు. విశేషించి "సుస్థిరకర్మా" యని యొకప్రశస్తవిశేషణమునుగూడ జేర్చుకొన్నాడు. కావున నితడుగూడ అశ్వమేధయాగమును ఆచరించి పాపసంచయమును బోగొట్టుకొని జగత్ప్రసిద్ధుడైనాడనుట స్పష్టము.

ఇపుడు విష్ణుకుండీయులలో అశ్వమేధయాజినులు ఇద్దరుమాత్రమే అగపడుచున్నారు. వారిరువురును మాధవ వర్మాభిధానులే. ఈ మాధవవర్మాభిధానులు నిజముగా అశ్వమేధక్రతువులు ఆచరించిరని యెంచినపుడు, ఒకటిచేయగలరు గాని, యిద్దరును చెరియొక పదకొండు అశ్వమేధముల వరుసగా చేయగలిగియుండురా, అది సంభవమా యని సంశయముకలిగి, "యిదియంతయు విష్ణుకుండినులు కేవలము ఆడంబరముకొఱకు వ్రాయించుకొన్న బిరుదము గాని, యథార్థముగా ఆంధ్రదేశమును మాత్రము నేలిన ఒక చిన్న రాజవంశ మెక్కడ, దిగ్విజయసూచకమైన అశ్వమేధయాగమును ఆచరించుట యెక్కడ?" అని పండితులైనచరిత్రజ్ఞులు కొందరు సందేహించుచున్నారు.

అశ్వమేధము ఏమిసూచించును? అశ్వమేధయాజియైన రాజశ్రేష్ఠుడు దిగ్విజయముచేసి సకలభారతవర్షమునకును చక్రవర్తి కావలయునా? ఈ ప్రశ్నలకుత్తరముగావలయును. అశ్వమేధక్రతువిధానమునందు యాగాభిలాషియైన రాజు ముందు దిగ్విజయముచేసియుండవలయునని నియమము గానరాదు.[౧] "సర్వంపాప్మానం తరతి తరతి బ్రహ్మహత్యాం యోశ్వమేధేనయజతే" యని శ్రుతివాక్యప్రమాణము గలదు. పుత్రార్థము పరితపించుచుండిన దశరథుడు అశ్వమేధము నాచరించెనని రామాయణము వాకొనుచున్నది.[౨] అశ్వమేధక్రతు

---

౧. ఇండియన్‌కల్చర్, (జర్నలు ఆఫ్ ఇండియను రిసర్చి ఇన్‌స్టిట్యూటు) సం ౧. సంచిక ౧. పుట ౧౧౪-౧౧౫. ఇందు డాక్టరుదేవదత్త రామకృష్ణ భాండార్కరుగారు ఈ యశ్వమేధములను గురించి చర్చించిశారు. ఆవ్యాసము నాకీవిషయమున ఎక్కువగా తోడ్పడినది.

౨. రామాయణము; బాలకాండము. సర్గ ౧౨; ౯-వ శ్లోకము.

వునకు గావలసినపరికరములలో ప్రధానమైనది యాగ
పశువు; ఉత్తమాశ్వము. ఆహయము తన యిచ్చవచ్చినట్లు
కొంత నియమితకాలము ఈ భూమండలియందు విహ
రించుటకై వదలిపెట్టవలయును. దాని స్వేచ్ఛావిహారమును
ఎవ్వడైన నిరోధించినయెడల వానిని సంహరించుటకు
అతిరథుడైన సేనానాయకుని సైన్యమిచ్చి వెనువెంట
బంపవలయును. ఎంతకాలమిట్లు అశ్వము యథేచ్ఛగా
తిరుగవలయునో కల్పసూత్రములందు తెలుపబడియుండ
లేదు. ఒకప్పుడీహయము ఆరాజుయొక్క రాజ్యసీమల
దాటి అరుగకపోవచ్చును. ఒకప్పుడు సీమలందున్న వైరి
రాజుల భూములయందు సంచరింపవచ్చును. ఆ యశ్వ
మేదిక్కునకు బోయినను దాని సంచారమునుమాత్రము
యేవిధముగానైనను నిరోధింపకూడదు. అట్టి సందర్భ
మున సర్వతంత్ర స్వతంత్రుడును, పెక్కుమంది మండ
లాధీశులచే గొలువబడుచుండినవాడును నగు మహారాజుచే
ఈ క్రతువు జేయబడవచ్చును. కాని యాగాశ్వము
ఉద్దేశపూర్వకముగ ఆరాజ్యసీమలను దాటించి దూరస్థ
ములైన అన్యక్షితిపతుల రాజ్యములలోనికి సంచరింప
జేసినపుడు అశ్వమేధక్రతువునకు విశేష ప్రాముఖ్యము
కలుగును. అప్పుడది సర్వజిద్యాగమును బోలును. చక్ర
వర్తి, లేక సామ్రాట్ కాగోరినవాడు సర్వజిత్ క్రతువు
నందువలె దిగ్విజయము చేసివచ్చి అశ్వమేధమును
ప్రారంభింపవలయును. కాని దిగ్విజయము చేయకుండ
గనే తనరాజ్యమునందును, పరిసరప్రాంత సీమలందును
వైరిక్షితిపతుల నోడించిన రాజశ్రేష్ఠుడుకూడ అశ్వమేధ
యాగమును చేయవచ్చును. సకల జగతీమండలమునందు
దిగ్విజయము చేసివచ్చి అశ్వమేధమును దలపెట్టిన మహా
రాజుయొక్క యుద్దేశమును, తత్ఫలితమును వేఱుగా
నుండును. అట్లు దిగ్విజయముతో కూడిన అశ్వమేధయాగ
మును యుధిష్ఠిరుడాచరించెను. మహాభారతములోని
ఆశ్వమేధికపర్వమును చదివినవారికి విశదము. యుధిష్ఠి
రుని యాగాశ్వము అటు గాంధారము (ఆఫ్ఘనిస్థానము)
నుండి యిటు కామరూపము (అస్సాము) వఱకును, దక్షి
ణమున ఆంధ్ర ద్రావిడ దేశములవఱకును, స్వేచ్ఛగా
సంచారము చేసి హస్తినాపురి జేరెను. అట్లు సకల
భారతభూమియందున్న రాజులందరిని, అశ్వమును
నిరోధించినవారి నెల్లరి నర్జును డోడించి దిగ్విజయ
మొనర్చెను.

పిమ్మట పాండవాగ్రజుడు మహావైభవముతో
అశ్వమేధక్రతువు నొనర్చెను. ఆ మహారాజుగావించిన
విధముగా దిగ్విజయసూచకమైన అశ్వమేధమును చేయుట
సామాన్యరాజపుంగవులకు దుస్సాధ్యము. అట్టితఱి యుధి
ష్ఠిరునిరీతిగా అశ్వమేధమును ఇతరులెవ్వరైన ఆచ
రించియుండిరా యన్న ప్రశ్న జనించుచున్నది.

భరతవర్ష చారిత్రమునందు పెక్కండ్రు రాజ
శ్రేష్ఠులు అశ్వమేధమునుచేసినట్లు తెలియుచున్నది.
శుంగవంశీయుడగు పుష్యమిత్రుడు రెండు అశ్వమేధ
ములుచేసినాడట.[౧] పరాశరీపుత్రగాజాయనసర్వతాత
యొక యశ్వమేధము నాచరించెను.[౨] వేదశ్రీ సాతకర్ణి
రెండుపర్యాయములశ్వమేధముల నొనర్చెను.[3] ఇక్ష్వాకు
వంశీయులు అశ్వమేధయాజినులమని చెప్పుకొనిరి.[౪] భార
శివవంశజులు తాము దశాశ్వమేధముల నాచరించితిమని
గర్వముతో దెలుపుకొనిరి.[౫] వాకాటక మొదటిప్రవర
సేనుడు నాలుగశ్వమేధములును,[౬] సముద్రగుప్తచక్ర
వర్తి యొక యశ్వమేధమునుమాత్రము ఆచరించి

---

౧. ఎపి. ఇండికా సం. ౨౦ పుట. ౫౭.

౨. ఇండి. ఆంటిక్వేరి, సం. ౬౧ పుట. ౨౦3; ఇండియను హిస్టారికలు క్వార్టర్లీ, సం. ౯ పుట ౭౯౫.

3. ఆర్కియోలాజికల్ సర్వే ఆఫ్ వెస్టరన్ ఇండియా, సం. ౫ పు. ౬౦.

౪. ఎ. ఇండికా, సం. ౨౦ పుటలు. ౧-౨౫.

౫. కార్పసు ఇన్స్క్రిప్షన్సు ఇండికోరం.

౬. పూర్వోక్త ప్రమాణము, పుట. ౯౭.

యుండిరి. విష్ణుకుండి రెండవమాధవవర్మయు, మూడవ మాధవవర్మయు ఏకాదశాశ్వమేధములను గావించినారని తెలియుచున్నది. వీరందరిలో సముద్రగుప్తుడొక్కడే యుధిష్ఠిరునివలె దిగ్విజయము గావించి అఖండవైభవముతో చక్రవర్తి చిహ్నమైన అశ్వమేధయాగము నొనరించినాడని తోచుచున్నది. సముద్రగుప్తుడు "చిరోత్సన్నాశ్వమేధాహర్త్రా" యని చిరకాలమునుండి ఆచరణలోలేని యశ్వమేధమును తాను మరల ఆచరించితినని చెప్పుకొన్నాడు. ఆతడు భరతభూమిని దిగ్విజయము చేసినపిమ్మట అశ్వమేధమును గావించినాడనుటకు ఆతని అలహాబాదు ప్రశస్తియే ప్రబలప్రమాణము.

సముద్రగుప్తునివలె భారశివవంశజులు దశాశ్వమేధములను, వాకాటక మొదటి ప్రవరసేనుడు నాలుగు అశ్వమేధములుగాని, విష్ణుకుండి మాధవవర్మలు ఏకాదశాశ్వమేధములను, సకల జగతీమండలము నంతయు జయించి చేసియుండిరా యన్న ప్రశ్న మనల నెదుర్కొనుచున్నది. సముద్రగుప్తునివలె వీరెవ్వరును అఖండ దిగ్విజయము చేసియుండలేదనుట చరిత్రయందు నిర్వివాదాంశము. కొంచెముగనో, గొప్పగనో దిగ్విజయము చేసి శత్రుక్షితిపతులను నైరుగను, తమసీమలయందున్న వారిని, ద్రోహులయిన మాండలిక రాజులను జయించి, అశ్వమేధమును మహారాజాభిధానులైన భారశివ వాకాటక మొదటి ప్రవరసేనాదులు, విష్ణుకుండిన మాధవవర్మలు మొదలయినవారు చేసియుండిరనుటలో నాశ్చర్యముగాని, అసంభవముగాని ఏమియు గాన్పింపదు. భారశివులు గొప్ప సామ్రాజ్యమును నిర్మించుకొనిరి. అట్లే వాకాటకులు నొక విశాల సామ్రాజ్యమును ఏలియుండిరి. ఆరీతిగనే విష్ణుకుండినులు సకలాంధ్ర భూమిని, దక్షిణకోసలాది కళింగసహితముగ నేకచ్ఛత్రాధిపత్యముగ పాలించిరి.

ఈసందర్భమునందు అశ్వమేధయాగాచరణమును గూర్చి వ్యాసభగవానుడు యుధిష్ఠిరునితో నాడిన వాక్యములు మనకు కొన్ని క్రొత్త విషయములను దెలుపుచున్నవి. "ఓయుధిష్ఠిరుడా, ఈ యాగమును యథావిధిగా, శాస్త్రోక్తము ననుసరించి ఆచరింపుము. లోపములుండినచో యజమానుడు నశించును. ఈ యాగార్థమునకై విశేషముగ సువర్ణము వెచ్చింప వలయును గాన దీనికి 'బహుసువర్ణక' మని పేరుగల్గినది. కావున నీవు ఈయజ్ఞమునందు బ్రాహ్మణులకు శాస్త్రోక్తమైన దానికంటె త్రిగుణముగ దక్షిణ నొసంగినచో, నీకు అశ్వమేధయాగఫలము త్రిగుణముగ లభించును. నీవు ఒసగు దక్షిణను స్వీకరించి నీకు ఫలము నొసగుటకు విద్వాంసులైన బ్రాహ్మణులు సమర్థులు. కావున భూరిదక్షిణలను త్రిగుణముగా నొసగి మూడశ్వమేధములను ఆచరించిన ఫలము నొంది సమస్త బంధుహత్యాపాపమునుండి విముక్తుడవుగమ్ము" అని వ్యాసభగవానుడు యుధిష్ఠిరునకు ఆజ్ఞాపించెను.*

వ్యాసప్రోక్తములైన యీవాక్యములు మనకు మిక్కిలి యుపయోగకరములుగా నున్నవి. శాస్త్రచోదితమైన దక్షిణకంటె మూడురెట్లు అధికముగ బ్రాహ్మణులకు సువర్ణము దక్షిణగా నొసగుటవలన మూడు అశ్వమేధములు చేసినఫలము లభించునట! అటులనే యగుచో వాకాటక మొదటి ప్రవరసేనుడును, విష్ణుకుండిన మాధవవర్మలు ఇరువురునుగూడ తల యొకసారి మాత్రమే అశ్వమేధమును ఆచరించి అందు శాస్త్రోక్తమైనదానికంటె, వరుసగా వారు నాలుగురెట్లు అధికముగను, పదకొండురెట్లధికముగను సువర్ణము దక్షిణయొసగి, నాలుగశ్వమేధములఫలమును, పదకొండు అశ్వమేధముల ఫలమును ఒక్కసారిగా పొందియుండిరని విశ్వసింపవలసియున్నది. †

---

* ఆశ్వమేధికపర్వము-అధ్యా ౮౮, శ్లో. ౧౩-౧౫.

† శాంతిపర్వమునందు (అధ్యా. ౨౯ శ్లో ౮౬, ౮౭, ౧౩౨) భరతుడును, సగరుడును, ఒక్కొక్కరు వేయి అశ్వమేధములను చేసిరని చెప్పబడినది. సగరునిగూర్చి విశేషములు తెలుపబడలేదు. కాని భరతుని యశ్వమేధములనుగురించి కొన్ని సంగతులు తెలియవచ్చుచున్నవి. ఆమహారాజు యమునానదియొడ్డున ౩౦౦ను,

విష్ణుకుండి మాధవవర్మలు ఇరువురు ఇంచుమించుగా దక్షిణాపథమునందు దిగ్విజయము చేసియే అశ్వమేధమును చేసినారని యూహింపవచ్చును. వాకాటక రాజులు వారికి పరమమిత్రులు, బంధువులును, రెండవ మాధవవర్మ వాకాటక రాజపుత్రినే పెండ్లియాడెను. పశ్చిమమున కుంతలమునందు కదంబులు పల్లవులతోడి కులవైరము చొప్పున విష్ణుకుండినులతో మైత్రి కలిగియుండిరి. దక్షిణమున పల్లవులు విష్ణుకుండినుల నెదిరింపజాలకయుండిరి. తూర్పున కళింగ మానాడు స్వతంత్రరాజ్యముగ నుండినట్లు గానరాదు. ఆకాలమున కళింగము క్షుద్రక్షత్రియరాజవంశములపాలనముక్రింద చీలియుండినట్లు తోచుచున్నది. ఇట్లే మూడవ మాధవవర్మ కాలమునందు విష్ణుకుండీయులు దక్షిణాపథమునందు దిగ్విజయముచేసిన ట్లూహించుట కవకాశముగన్పట్టుచున్నది. ఉత్తరమున వాకాటక సామ్రాజ్య మంతరించినది. దాని స్థానమున చేదిరాజ్యమున త్రిపురీనగరము రాజధానిగా కలచుర్యులు రాజ్యము స్థాపించుకొనిరి. మూడవ మాధవవర్మ కలచురిరాజకన్యలను బెండ్లియాడి వారితో బంధుత్వమును కలుపుకొన్నాడు. అసిగాక కలచుర్యులు విష్ణుకుండి మహారాజంత బలవంతులునుగారు. పడమటను కదంబవంశము మొదటిపులకేశిచే భంగపాటు నొందుచుండెను. అందువలన చాళుక్యులుగాని, కదంబులుగాని మాధవవర్మ నెదుర్కొనుటకు సామర్థ్యము చాలకయుండిరి. దక్షిణమున పల్లవులు చోళులవలన కలిగిన విపత్తునుండి తెములుచ్చుకొనుటకు ప్రయత్నము చేయుచు అందు మునిగియుండిరి. కావున వారును విష్ణుకుండినుల నెదుర్కొన జాలకుండిరి. తూర్పున, అప్పుడే రాజ్యము స్థాపించుకొనుచున్న గాంగవంశీయులుకూడ పలుసార్లు విష్ణుకుండినులుచే నోటువడియుండిరి. మూడవమాధవవర్మ వారిని రెండుసారులు కనీసము ఓడించియుండును. అట్టితటి యాతడు దిగ్విజయముచేసియే అశ్వమేధయాజి యైనాడనుట సమంజసము.

విష్ణుకుండిన మాధవవర్మ లిరువురును నిజమునకు మహారాజాధిరాజులు. కాని దక్షిణాపథమునకు ఆ"మహారాజాధిరాజ" పదము ఉత్తరాపథమునందు ప్రచారములోనికి వచ్చినతరువాత రెండుశతాబ్దములవరకు రాలేదు. కావున వారాపదము తమ పేరులకు జేర్చుకొని యుండలేదు. ఊరికే ఇట్టిమహారాజులమని చెప్పకొన్నను, విష్ణుకుండివంశీయులు మహారాజాధిరాజ సమానులు. వారు మహారాజపదమును మహారాజాధిరాజపదముయొక్క అర్థమందే వాడియుండిరి.*

---

సరస్వతీనదియొడ్డున ౨౦టిని, గంగానదియొడ్డున ౧౭౮ టిని వెరసి 33౮ ఉత్తమాశ్వములను అశ్వమేధములకై వినియోగించి సంహరించెనట! ఒకొక్క యశ్వమేధము త్రిసణీకృతదక్షిణచే మూడు అశ్వమేధములకు తుల్యమైనపుడు, 3 × 33౮ = ౧౦౦౨ అశ్వమేధములు చేసినట్లయినది. కావున ఇట్లే భరతుడు అశ్వమేధ సహస్రయాజి కాగలిగినాడని యూహింపవచ్చును.

* బాదామి చాళుక్యులలో 'మహారాజాధిరాజు బిరుదమును మొదట రెండవపులకేశి ఉపయోగించుకొన్నాడు. కాని వినయాదిత్యుని (క్రీ. శ. ౬౮౦-౬౯౬) వరకు అది రూఢిగా లేదు. వేంగీచాళుక్యులలో మహారాజాధిరాజపదమును ధరించినవాడు రెండవ విజయాదిత్యనరేంద్రమృగరాజు (క్రీ. శ. ౭౯౯-౮౪౭.).

# బులుసు సాంబమూర్తి

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి

సమ్మెటపోటులు తగిలినపుడే నిప్పుసెరసులు ఎగిరి గంతువేయును. సంచలనము పుట్టినపుడే సామర్థ్యము తలయెత్తును. చలిపుడిని పొంగిన హృదయము నుండియే అడగియున్న శక్తి యుబుకును. ప్రతికూల పరిస్థితులు ప్రతిఘటించినపుడే మహోద్యమములు కవచములుదాల్చి నిలువంబడును; నిదురించు శక్తులు తళుక్కులీనుచు రంగస్థలిపై లంఘించి విజయకేతన మెత్తును. సంఘమందలి అత్యాచారము, రాజకీయములందలి అసంతృప్తి, మతాంగణమందలి దురాచారము మతోద్ధారకులను, మహాయోధులను, సాహిత్యాచార్యులను కనినవి. ప్రపంచచరిత్రలను పరిశీలించితిమేని, దృష్టాంతములు కొల్లలై గోచరించును. రాజకీయమత సారస్వత విప్లవములు గతశతాబ్దమున వంగదేశములో ననేకమహాపురుషులను బుట్టించినవి. ఈ విప్లవములందు పుట్టిన తలఁపులు క్రమానుష్ఠానమున వృద్ధిఁగాంచి, కఠోరతపమున శక్తి నందినవి. తీవ్రదీక్ష, నిత్యవ్రతము, బాహ్యప్రేరణము కూడినపుడు మనుష్యత్వమహత్త్వములు విజృంభించును. వంగవిప్లవములు కడచిన శతాబ్దమున ఆంధ్రావని నంతతీవ్రముగ సోకనందున ఆంధ్రప్రజ్ఞ అపు డడఁగియుండెను. ఈ శతాబ్దారంభమున వాని వేడిమి తెలుఁగునేల నంటినది. నాఁటినుండియు కొంత తాంధ్రులు ఆశయారాధనమునకు కడంగిరి. ఇటీవలి రాజకీయోద్యమము ఆంధ్రులను బలముగఁ దట్టినది. ఈ యుద్యమమునఁ బుట్టిన దొడ్డతెలుఁగుబిడ్డలలో సాంబమూర్తి యొకఁడు.



బులుసు సాంబమూర్తిగారు

జగమెఱిఁగిన సాంబమూర్తికి పదునాలుగేండ్ల ఈడుమాత్ర మున్నది. పట్టాభివలె ఇతఁడు గాంధీలో రాజకీయజన్మ నందలేదు. ఇటీవలి ఉద్యమమువలన సాంబమూర్తిశక్తి తలచూపుట నిక్కమే! కాని ఈశక్తి తపము నెఱుఁగదు; క్రమానుష్ఠానము నెఱుఁగదు.

గొప్పందనము మహీరుహమువంటిది. అది గారడివానిచేతి మొలక కాదు. ఒకనాఁటితో నది పెరిఁగి, తుదిరొబ్బతో గగనగండమున ప్రేమస్పర్శఁ గావింపదు. అంకురమునుండి అది దాఁటవలయు జన్మఘట్టములెన్నో నియున్నవి. చక్కని నేల, అనుకూలవాతావరణము, రవిరశ్మి లేనిపట్ల అంకురము తనయందలి మహాజీవనమును తనయందే మడియనిచ్చును. సాంబమూర్తియందలి శక్తి అతని హృదయమున నడఁగియుండెను. దానిని మొలకఁజేయు బాహ్యప్రేరణము ఆలస్యముగఁ జూపట్టెను. భావబంధుర వాతావరణమున,—ప్రాముఖ్యముగలచోటున పుట్టి పెరిఁగియున్నయెడల, యువకుఁడై యుండఁగనే నిండుపండువంటి ప్రజ్ఞ దేశ ప్రజల

దృష్టి నాకర్షించియుండువాఁడు. అతఁడు మాఱుమూల కలుసులోనివాఁడు. దుళ్లయందు పుట్టినాఁడు. దుళ్లను పిడికిటఁ బట్టి పదపడి కాకినాడలో కాలుపెట్టి, కథ సాగించినాఁడు. సామాన్యకుటుంబములోనివాఁడు. ఈతని యిల్లు గొప్పందనమునకు గోపురము కాదు. సంతృప్తి జీవనమునకు ఆటపట్టు. గొప్పందనమును నులిమివేయునది సంతృప్తి. దుళ్ల తల్లి పల్లెటూరి ముత్తైదువ. ఈమె స్తన్యమున శాంతిసుఖము లున్నవికాని, శిసువును డాయించు ఉన్నతభావనము లేదు. పసిబిడ్డయిన సాంబమూర్తి - బుడిబుడినుడువులందు వీరగాథలు లేవు; జిలిబిలిపలుకులందు గురుతర వృత్తాంతములు లేవు. భావిజీవనమును భాస్వంత బాల్యస్వప్నములందు చూచులేమో సాంబమూర్తి యెఱుఁగఁడు. స్వప్నముల యల్లిక ఆకస్మికముగ నొకానొక ౧౯౨౦ లో నెవ్వఁడును నేర్వఁజాలఁడు. ప్రత్యక్షమైతోఁచు కాంతిమయ దృష్టాంతములును, హృదయము నాకర్షించు మహావీరుల అద్భుతక్రియలును, ఆవేశగర్భితమై, ఆశయబంధురమై, ఆనందదాయకమైన ఆచార్యుల ఉద్బోధనమును, ప్రశంసనీయమైన గృహప్రబోధమును, ఆదర్శమండిత ఆవరణమును, ఉత్సాహపూరిత వాతావరణమును కలిసినపుడు బండరాతివలె నుండక బాల్యము కొంగ్రొత్తయందమున వృద్ధినంది రమ్యారామమందలి మల్లికవలె పరిమళించును. ఈ సంపుటి నెఱుఁగని సాంబమూర్తి సామాన్య మానవునివలెజీవయాత్రఁ గడపుటకే ౧౯౨౦ వఱకు తన శక్తిని వినియోగించినాఁడు. ఈతని మనసు సంతృప్తి యందును, ఆశయస్పర్శరాహిత్యమందును అడఁగిమడఁగి యుండెను. అందుచే నీతని తరువాతి గొప్పందనమునకు అనివార్యమైయుండవలసిన పునాది ౧౯౨౦ నకు ముందీతని జీవనమున పొడఁగట్టలేదు. అద్భుత విజ్ఞానము గాని, కళోపాసనాకౌశలముగాని, వక్తృతానైపుణ్యము గాని, రచనాప్రావీణ్యముగాని శైశవభూమియందు మొలకెత్తకున్నయెడల, మఱి సృష్టి నందఁజాలవు. సాంబమూర్తియందును నివి సృష్టినందలేదు. ఇవి చిరకీర్తికి వలసిన శక్తులు.

చిరకీర్తిని, అమరత్వమును నిలుపు శక్తు లివియే కావు. మనుష్యుఁడు కవి కాకపోవచ్చును; వక్త కాకపోవచ్చును; లేఖకుఁడు కాకపోవచ్చును. మనుష్యుఁడు మనుష్యుఁడు కావచ్చును. సాంబమూర్తి మంత్రశక్తిగల విద్యాధికుఁడుకాఁడు. ౧౯౨౦లో నందిన పునర్జన్మకతన మనుష్యుఁ డనిపించుకొనిన వ్యక్తి. ఒక్కొక్క ముహూర్తమున నాకస్మిక విజృంభణము నందునది ఆధ్యాత్మికశక్తియే. జగదీశ ప్రీత్యర్థము జరుగు క్రియలందే ఇది గోచరించును. తళ్కొత్తు నొక యపూర్వభావము అంధకారమయమైన జీవనమును ఆలోకపూరిత మొనరించును. ఇది, తళ్కొత్తిన ముహూర్తము పునర్జన్మద్వారము.

నడినెత్తిమీఁది నక్షత్రముదెస దృష్టి నిలిపి, తన జీవనమును దానికి సంధింపవలెనని ఆశపడి ఆశయము నందిపుచ్చుకొనకపోయినను, కొంత సగ మెక్కి "శభాస్!" అనిపించుకొనఁగల ప్రజ్ఞాధురీణులు హద్దుపద్దులుకల చోటులందు కట్టుబడరు. తొలితరగతి న్యాయవాదు లీశ్రేణిలోవారు. వీరు జిల్లాకోర్టులలో నుండుట సకృత్తు. తనవృత్తియందు అజేయులైన ఘనులతో సముఁడు కాకున్నను, కొంత వృద్ధిని, ధనమును సంపాదింపఁగలిగిన దిట్టయైనాఁడు సాంబమూర్తి. నేఁడు న్యాయవాదవృత్తిపై వడగండ్లు పడిన కడగండ్లు ఈవఱలో నెన్నఁడు రాలియుండలేదు. అనుకూలసమయమున వృత్తి నారంభించి, కాకినాడ ప్లీడరులలో సాంబమూర్తి మేలుచేయి అనిపించుకొనినాఁడు.

ఐశ్వర్యవంతుఁడును, వేషభాషలందు మెఱుఁగుబూఁతలు ప్రదర్శించునాతఁడును మహామహుఁడను అపోహ ఒకప్పుడు ప్రబలినది. కూడనిదైనను, జనసామాన్యముయొక్క ఓటునంది ఒక్కొక్కఅపోహ ఒక్కొక్కశకమున నొకదశ వెలిఁగించితీరును. ప్రజలందు మొనగాఁడు కావలెనని ఆశపడు వ్యక్తి, ప్రజాప్రశంసను దోసిట నింపు అపోహాకే (అది సహజకాంతినికాక కళాయిపూఁతను కలిగినదేయయ్యు) మనసిచ్చి, దాని నారాధించి, పైకివచ్చును. గొప్పయుద్యోగి, గొప్ప

వ్యక్తి యనుభావము బహ్మా నరసింహేశ్వరశర్మను పిన్ననాఁడే పట్టి చచ్చేవఱకు అతనిని పీకివేసినది. ఆభావమునే ఆరాధ్యదేవతఁ జేసికొని, దాని కటాక్షమంది విలువగల శక్తిని దుర్వ్యయముచేసి, జీవనమును వ్యర్థముజేసికొని అతఁ డేఁపుకట్ల సవారి నెక్కినాఁడు. స్వార్థపరులు కొందఱు "ఓహోహో!" అని డబ్బా వాయించినంతన, విద్యాగంధమెఱుఁగని సాంతకుటుంబములోనివారు "ఎంతవాఁడ, వెంతవాఁడవైతి!" వని పొగడినంతన ఉబ్బితబ్బిబ్బై, విలాసజీవనమందును, ధనారాధనమందును జీవనములు కోల్పడువారి సంఖ్య బలియుచునే యుండును. వీరికి దూరదృష్టి సున్న. స్వతంత్ర విమర్శనము హుళక్కి. గుండెకు గట్టిదెబ్బ తగిలినఁగాని వీరు మారరు. ధనసంపాదనమే గొప్పంచన మనుభావము సాంబమూర్తిహృదయమున చోటునందెను. దాని ప్రోద్బలమున నాతఁడు మూటలుకట్టినాఁడు. కాని ౧౯౨౦ లో లేచిన ఉద్యమము తొంటి సాంబమూర్తిగుండెపై పిడిగ్రుద్దు వేసినది. అతని హృదయమున రాజ్యమేలు తొల్లింటితలఁపు తుత్తుమురులై నేలరాలినది. తనకు దేవతయైన ఐశ్వర్యమునకు సాంబమూర్తి అనతైన తన్ను సమర్పించినాఁడు! తన పిలుక్కడుస్తులను చుట్టఁజెట్టి చింతనిప్పులలో చొప్పించినాఁడు! తన గోటును గోతిలుందు క్రుక్కినాఁడు! నీటును నీళ్లలోఁ గలిపినాఁడు! నూతనాలోకమున సాంబమూర్తి పునర్జన్మ (Resurrection) నందినాఁడు. సాంబమూర్తిలోని మహాభోగి చచ్చి, మహర్షికి చోటిచ్చినాఁడు.

మహర్షికి 'సోల్జ' రను ఆంగ్లపదము చెల్లదేమో కాని యోధుఁడను భారతశబ్దముచెల్లును. "రణరంగమున శత్రుదళములను తునియలుచేయువాఁడుకాక తనయందలి పగతురను నిర్జించినవాఁడేమహాయోధుఁడని" "ధమ్మపద"మను పాళీగ్రంథమున శాక్యముని పలికినాఁడు. అహింసావ్రతుఁడే మహాయోధుఁడనునర్థము ఒక్క భారతనిఘంటువునమాత్ర మున్నది. ఈశబ్దమందలి యుత్కృష్టభావమును గాంధిజీ నిజజీవనమున వ్యక్తీకరింపఁగలిగినాఁడు. ఈతని యడుగుజాడలు పట్టినజచిన సాంబమూర్తి ఈశక్తిని కొంతదనుక చూపఁజాలినాఁడు.

ఇచ్ఛాపూర్వకముగ దారిద్ర్యమును వలచిన సాంబమూర్తి త్యాగమూర్తియనుట నిస్సంశయము. దుర్లకాక కలకత్తాలో పుట్టి ఉన్నతవిద్యకు వలసిన వ్యవస్థను, ఘనవిజయమునకు అక్కరైన తరుణమును అందియుఁడినచో, ఈతఁడు చిత్తరంజనునివలె మొదటి శ్రేణిన్యాయవాది యైయుండువాఁడు. న్యాయవాదవృత్తివిలువను కనకరాసులందే కొలువవలసినను, త్యాగమూల్యమును తులసీదళమూల్యమట్లు గ్రహింపవలెను. ఆశయములు స్థూలములు కావు; సూక్ష్మములు. త్యాగమును లెక్కించుట పరిమాణమున కాదు; మఱి ఆంతరంగికమైన నియమపాలనమున. సాలునకు వచ్చు మూఁడులక్షల రూకలను గిరవాటువేసి, మేడమీఁది నుండి గుభాలున వీథిలోని కుఱికి, జోలికట్టుకొని తిరిపెమెత్తిన చిత్తరంజనుని మహాత్యాగమునకును తాఁదెచ్చుకొను వేలసంఖ్యను విసరివేసి, సంపూర్ణయోగియై, ఖద్దరుజోలి దాలిచి, దేశహితైషియై ఊరూర బిచ్చమెత్తిన సాంబమూర్తిమహాత్యాగమునకును వ్యత్యాసము లేదు. చిత్తరంజనుని మేధాశక్తిగాని, నిరామ్రణసై పుణ్యముగాని, వాదకౌశల్యముగాని, వచోగాంభీర్యముగాని, రచనాపటుత్వముగాని సాంబమూర్తియందు లేదు. కాని, ఈశక్తు లన్నింటిని గలిగి చిత్తరంజనుని హృదయశక్తి నందని పదివేల వ్యక్తులకంటె సాంబమూర్తి కోటిమడుంగులు అధికుఁ డనుట నిస్సంశయము.

మేధాశక్తి గొప్పదియే! దానికి జోహారులు. అది ప్రపంచప్రతిభను కరస్థలామలకము చేయఁగలదు. కాని మనుజుని జగదీశునిప్రక్క నిలుపునది మేధాశక్తి కాదు; మఱి హృదయశక్తి. మహావిద్వాంసు లెందఱో నరకకూపమున ద్రుగ్గుటయు, అక్కరము లెఱుఁగని అమాయకులును, అనాథలును పరంజ్యోతిదాపల నిలుచుండుటయు సంభవాతీతమైన దృశ్యములుకావు. వీనిలో నద్భుత మున్నదికాని అసత్యములేదు. ప్రస్తుత ప్రతీచీనాగరికతను పరిశీలింపుఁడు. ఇది జ్ఞానప్రపూర్ణ

మై, నిరయములోనికి చక్కని రహదారులు నిర్మిం చుటలేదా! ఆధ్యాత్మికశక్తి హృదయమందే యున్నది. హృదయము నెందేని పొలిపెట్టి ఒకఁడు గంభీరస్వర మున నుపన్యసించి "యోహో!" యని అనిపించుకొనఁ గలఁడు; రంగస్థలిపై నిలిచి చక్కని నాటకములు ప్రద ర్శింపఁగలఁడు. కాని మనుష్యజీవనమందలి సౌందర్య మునకును, మహత్త్వమునకును కేలెత్తి నమస్కరింప లేఁడు. ఆధ్యాత్మికశక్తి హృదయతపోభూమియందే వృద్ధినందును. రచ్చలందు మెప్పు నిప్పించు నేర్పు దీనికి లేదు. ఈనేర్పు నిది "తూ!" యనునేమో! వ్యక్తిని పరమహింసచేసి, పరమాత్మునట్లు చేయున దీశక్తి. జ్ఞానము భౌతికశాస్త్రమునకును, విజ్ఞానము తత్త్వ శాస్త్రమునకును చెందిన వనినాఁడు ఒకసుప్రసిద్ధ వేదాంతి. జ్ఞానము మేధస్సునకును, విజ్ఞానము హృదయ మునకును చెందినవని ఈవాక్యమునకు భాష్యము చెప్పి తిమేని, సాంబమూర్తి విజ్ఞాని యందును. ఈతనిసొమ్ము హృదయశక్తి. ఈశక్తియం దీతఁడు చిత్తరంజనునకుఁ దీసిపోఁడు. మహాత్ముని చెంగట నిలుచుట కర్హుఁడు. సాహసమందును, ధైర్యమందునుకూడ సాంబమూర్తి చిత్తరంజనునకు నీడువచ్చును. దాసు మొండితనముగల మహాపురుషుఁడు. ఆతనిది మొండిసాహసము. రేపటిగతి యేమని ఆతఁడు యోజించువాఁడు కాఁడు. మీనమేష ములు లెక్కించి దానధర్మములు చేయువాఁడు కాఁడు. మంగలికి పదిరూకల కూలియిచ్చుటయు, ముప్పదియైదువేల యభాగుల కుటుంబములకు భుక్తి నిచ్చుటయు దాసుయొక్క సాధారణకృత్యము లాయెను. ముందుల కుఱుకుటే తన కర్తవ్యమని చిత్త రంజనుఁ డెంచువాఁడు. ఈగుణమును సాంబమూర్తి బాగుగా పట్టించుకొన్నాఁడు. "మాడుగుడ్డలకై వగ పేల? పక్షు లేచింత లేక ఎగయుచుండవా?" యని ఏసు వచించినాఁడు. "వాంఛను దూరముచేయు" మని నాఁడు బుద్ధుఁడు. వాంఛనుగాని, అనుమానమునుగాని, అడలునుగాని లేనివానికి చింతయేల? రేపటిచింతకు డిల్లపెట్టి దూరస్థల మేర్పఱచి, 'టింగురంగా'యని నిర్భయముగా మసలఁగల మనిషి సాంబమూర్తి. తన జోలియందు మిగిలినది బండిసున్న యని, "ఏమి దైవమా!" యని ఈతఁడు ముఖారి నాలాపించఁడు. ముందుగలి బ్రహ్మరాక్షసియై ఇతనిని బాధింపదు. దొరకినపుడు తన కేలయని ఇతఁడు భుజింపకమానఁడు. సాంబమూర్తికి భోజనశక్తి మెండు. కాని కబళములేని నిర్భాగ్యుఁ డొకఁడు ఎదుటనిలిచినపుడు కన్నుమూసి కొని "ఓంభూర్భువ స్సువః" యని స్వార్థముపై నీళ్లు చల్లఁడు. పరిహాసపూర్వకముగ "నాయనా! కాస్త డి. పి. (ధర్మపిండము) కొట్టి, మఱి దాఁటవోయి" అనును. గాడెలందు రూకలను ప్రోగొనరించుకొనిన వాఁడు రూకలు చిమ్ముట ఒకవంతు; చింపిరిజోలె యందు మిగిలిన ఒకేమాత్రపు దమ్మిడిని లేనివానిచేతిపై విడపుట ఒకవంతు. ఈదమ్మిడికిఁ గల బరువు ఆరూకల బస్తాల కుండదేమో!

అద్భుతహృదయశక్తిగలవారి చర్యలను పరికిం చితిమేని, "వీరు వెఱ్ఱులు కారా?" యని యోజిం తుము. కాని యుగయుగములందు సజీవులై యుండు వా రీవెఱ్ఱులే! "ఊహూ!" అనివేసి వటువును పంపివేసి యుండుచో, బలి పాతాళమున దిగఁబడువాఁడు కాఁడు. కాని "సిరి మూటఁగట్టుకొని పోవంజాలని" రాజులవలె నతఁడు విస్మృతిగర్భమున బుడుంగుమనువాఁడు. ఐశ్వ ర్యమునకు తిలోదకములు సమర్పించి చిత్తరంజనుఁడు సన్న్యాసి యైనాఁడు. ధనధాన్యములను గోదావరిలోఁ గూలఁద్రోసి కొల్లాయికట్టిన కటికిదరిద్రుఁ డైనాఁడు సాంబమూర్తి. ఈశక్తి విశ్వవిద్యాలయములందు చేఁ బడునది కాదు; అంతరంగమున సాక్షాత్కరించునది. ఈశక్తిగల సాంబమూర్తికి అనుక్షణము కావలయు అక్కరలు తమంతఁదామే పూర్ణమగుచుండును. భోజన వ్యవస్థను, ప్రయాణవ్యయమును ఎవరోయొకరు వహిం చుచునేయుందురు. కొంతకాలముక్రితము కొలఁది మాసము లితఁడు కలకత్తాలోనున్నాఁడు. "మహాలక్ష్మీ భవనము"* అపుడు అన్నపూర్ణ ధర్మశాల యైనది. హారిజన్ రోడ్డులో వసించుతటి అద్దె ఎడ్వాన్సును

* తారాచంద్ దత్ వీథిలోని (౩౫) మద్రాసీహోటల్.



హుమయూనుగోరి-ఢిల్లి

హుమయూను భార్య హాజీబీగము క్రీ. శ. ౧౫౫౫ సంవత్సరమున దీనిని ప్రారంభించి పదునారు సంవత్సరములకు పూర్తిచేసెను. R. N. N. R.



సమాధిపూజ G. A. R.

గుఃశించిన నిబంధన మొకటి ఈతనిని మార్కొనినది. సోహన్‌లాల్ అనునామిత్రుఁ డొకఁడు గృహయజమానితో "ఇతఁడు సాంబమూర్తిసుమీ" యని చెప్పి చిక్కునుండి అతనిని విడిపించినాఁడు. ఇతరుల కష్టనిష్ఠురములను తనవిజేసికొను సాంబమూర్తి చల్లగ తన యక్కరలను "పరార్పణమస్తు!" అని నిశ్చింతగ దీక్షాజీవనమును కడపుచున్నాఁడు. సుఖదుఃఖములును, దూషణభూషణలును తనవికాక దేవునివేయని నమ్మిన వానికి ఎంతహాయి చేకుఱును? "మొట్టో!" యను అభాగుఁడు దైవవిశ్వాసరహితుఁడు.

సాంబమూర్తిచొరవ అతని సొంతజీవనమందే కాక అతని రాజకీయములందుఁగూడ ప్రవేశించినది. కాంగ్రెసుఆశయమునుగూర్చి పెద్దపెద్దలు నీళ్లు నమలియు, ఊగిసలాడియు, గుండెలు తడవిచూచికొనియు గుసగుసలాడుచుండ, "సంపూర్ణస్వరాజ్య"మని సాంబమూర్తి ఢంకామీఁద దెబ్బకొట్టి పలికినాఁడు. అహమదాబాద్ కాంగ్రెసులో హజరత్ మోహాని "సంపూర్ణస్వాతంత్ర్య"మని గాంధిగారిని ఉలికిపడఁజేయుటకు ముందే సాంబమూర్తి అర్థానుస్వార స్వరాజ్య మనే డొమినియన్ స్టేటస్‌గాని, ఒకతీరు రెస్పాన్సిబుల్ గవర్నమెంటుగాని గాక తూచాతప్పని స్వాతంత్ర్యము పిచ్చుతవ్వకు లొంగని స్వరాజ్యము కాంగ్రెసుదృష్టియందుండవలెనని రంకవేసినాఁడు. "Half way house" లవంటి సరిపుచ్చుకొనుటలు, "To be or not to be" లుపోలు దీర్ఘయోచనలు ఇతనికిఁ గిట్టవు. ఒడుదొడుకులు పులుగులట్లు కాచుకొనియున్నవని ఇతఁడు సంశయింపఁడు. మేఘములు దొరలినను, పిడుగులు తలపై డుల్లిపడినను కిక్కురుమనకుండ ఇతఁడు తలయొగ్గును. గాంధిఉద్యమమున పాల్గొని కైదులోనే కాపురమేర్పఱచుకొనినాఁడు. వెలుపలికి వచ్చినపుడు 'రిటర్న్ టికెట్' చేతఁబట్టినాఁడు. ఉప్పుసత్యాగ్రహమున పాల్గొని "సొంతఉప్పు చేఁబడినఁగాని, ఉప్పువేసిన వస్తువులను ముట్ట"నని పట్టుపట్టినాఁడు. "నీల్ సత్యాగ్రహము" తన కేల యనక, ముందులకు లంఘించినాఁడు. ఉపద్రవములపై సాంబమూర్తికి ప్రీతి మెండు.

అపాయములపై అధికానురాగము గలవాఁడు ముసోలినీ. సింహకిశోరముల నీతఁడు పిల్లిపిల్లలనట్లు చేరఁదీయును. భయమేమో ఎఱుఁగనివాఁడు నెల్సన్. అపాయమేమో ఎఱుఁగనివారును, దానిపై నెక్కువ మక్కువ గలవారును యోధవర్గమందున్నారు. అన్నప్పుడు ఈతీరుప్రకృతి కూడివచ్చునని తెలుపను. అపాయము పరమాశయ మనఁజెల్లదు. ఆదర్శమును పూజించినట్లు, అపాయమును పూజించెనేని అతఁ డున్మాదుఁ డనిపించుకొనకమానఁడు; ఆయువును పుటుక్కు మనిపించుకొనకమానఁడు. కాని, ఇదియొక మహత్తరోద్దేశము నందుపట్ల, నడుమనిలుచు పెనుభూతమైనచో దీనినెదుర్కొని, దీనిచే నూడిగముచేయించుకొనుట మహాయోధుని కర్తవ్యము.

లాఠీదెబ్బలును, కాలితాపులును సత్యాగ్రహులకు నిత్యవాయనములైనవి. పూలచెండులను, చక్కనైన దండలను, కర్పూరహారతులను అందుకొనుటకు ముందులకు వచ్చువారు 'కోటానకోట్లు.' అత్యాచారము ఆగ్నేయాస్త్రమువలె మీఁదఁబడుచున్నదనిన, వీరు దిడ్డిగంతలందు ప్రవేశింతురు. అవమానమునకును, అపాయమునకును దేశస్వాతంత్ర్యము నాదర్శముగాఁ గొని తలయొడ్డు మహాత్ముల సంఖ్య మిగుల నల్పమైనది. మూఁడవ ఎడ్వర్డు కేలేను (Vide: Edward III rd's Seize of Calais) ఆక్రమించినపుడు నగరరక్షణమునకు ప్రముఖులైన ఆర్గురు కేలేవాసులు మానప్రాణము లర్పింపముందుల కరిగిరి. దేశస్వాతంత్ర్యమునకై ప్రాణములను బలిదానము లొనరించుకొనిన మహాయోధు లందందు ఉన్నారు. ఇట్టి యోధులకు భారతదేశమందు కఱవు లేదు. ఈ యోధులకంటె నధికులైన (బుద్ధునిచే నుల్లేఖింపఁబడిన) మహాయోధులకు భారతావని నెలవని కడచిన సత్యాగ్రహోద్యమము నిరూపించినది. ఏసుమహాశయుఁడు వాకొనిన Sermon on the Mount ఆచరణయందుఁ బెట్టినవారు భారతీయులు. ఏసుఋషికినయైన గాంధిఋషి, చెంపలనేకాదు, సర్వాంగముల నెదుటిదెబ్బల కొడ్డుఁడనినాఁడు. ముందుల కుఱికిన మొనగాళ్లలో సాంబమూర్తి యొకఁడు. ఇతఁడు చావు

దెబ్బలు తిన్నాడు. నాయకులందు ఈతడు పడినట్లు మరెవ్వరును హింసపడలేదు. చచ్చినను, తానుకాక తన శరీరమని యెంచి, గట్టిదైన తనకాయము నీతడు కర్తవ్యస్తంభమునుండి కదలించినాడు కాడు. ఇట్టి గురుగుణమును చూపి, గుండెను నిబ్బరముగ గుండు దెబ్బకు నొడ్డిన మఱియొక మహాయోధుడును ఆంధ్రుడే! వీరి యుదంతమును తన హృదియం దుంచుకొనగల దేశ చరిత్ర ధన్యము కాగలదు. వీరు వంగదేశీయులైనయెడల వీరినిగుఱించిన మహాకావ్యములెన్నో వెలువడియుండె డివి. సాంబమూర్తి ప్రజ్ఞను మహాత్ముడు గుర్తించి నాడు. మగడుపట్టిన మాలను చేబట్టుమని సాంబ మూర్తి యర్ధాంగలక్ష్మి నాతడు కోరినాడు.

సాంబమూర్తి సాహసమును చూచి పండ్లికిలించిన వారు లేకపోలేదు; వెక్కిరించినవారు లేకపోలేదు. ఈ యికిలింతలును, సకిలింతలును గాంధిగారిపల్లే తోచెను. సత్యాగ్రహము పరిహాసమునకు పాత్రమైనది.

గాంధిజీ రాజకీయములను మతముతో సంధించి నాడు. వానికి ఆధ్యాత్మికప్రాముఖ్య మిచ్చినాడు. జోగియైనవాడు సేనాధిపతి యయ్యెనని ఈవఱలో నెన్నడును ప్రపంచచరిత్ర తెలుపలేదు. జోగిఆయుధము సత్యాగ్రహమే. అపూర్వమైన సత్యాగ్రహ దృశ్యము సామాన్యులకు విడ్డూరము కలిగించుట అక్కజముకాదు. గాంధియుద్యమము నెగ్గినదని చెప్పలేము; నెగ్గలేదనియు చెప్పలేము. అది చచ్చునది కాదని రూఢియైనది. ఉద్యమము లన్నియు సద్యోగర్భములు దాల్చినవికావు. గాంధియుద్యమము స్వరాజ్యమును ప్రసవించినదికాదని నవ్వువారు వెఱ్ఱులు. సత్యాగ్రహోపాసకులను చూచి నగువారు అల్పులు. "నీల్ సత్యాగ్రహ" మనుఁడు; "ఉప్పుసత్యాగ్రహ" మనుఁడు—వీని దృష్టియందు జాతీయత్వ మున్నది. దృష్టిదోష మున్నదని ఎవ్వరును అనరు. ఇక సాధనమా? సన్న్యాసిసాధనమా? అపూర్వమైనదే. నేడు దీనికి ముట్టునది పరిహాసమే! కాని ఎప్పటికైనను వసుంధరపై శాంతిని నెలకొలుపఁ జాలునది ఈసాధనమేయని పరిహాసప్రియులును, ప్రతీచీ రాజకీయవేత్తలును గ్రహింతురుగాక.

కాంగ్రెసుపతాకము సాంబమూర్తికి పట్టి గుడ్డ పేలికకాదు. అది యాశయముల యల్లికయని ఆతడు గుర్తించినాడు. కాకినాడలో ననుఁడు; నాగపురములో ననుఁడు. దానిని చించు ప్రతిహులశక్తి తోచు నపుడు సాంబమూర్తి చివాలున ముందుల కుఱుకును. జెండాయెత్తిగాని, అతడు వెనుకకు తరలడు. బ్రాహ్మణునకు యజ్ఞోపవీత మెట్టిదో, ఆడుదానికి మంగళ సూత్ర మెట్టిదో, జాతీయస్వామునకు జెండా యట్టి దని ఆతని యుద్దేశము. దానిగౌరవమును నిలుపుటకై సాంబమూర్తి పలుమాఱు నెత్తుటలు ధారవోసినాడు.

సాంబమూర్తికి పరార్థజీవనమందలి ప్రేమ మెండు. అభాగులను చేరుపట్ల, ఇతడు ప్రఫుల్లచంద్ర రాయ్‌కి తీసిపోడు; రాజేంద్రప్రసాదున కీడువచ్చును. గోదావరివరదలకు ఊళ్లు కొట్టుకొనిపోయినపుడు నిరుపేదలను రక్షింప నీతడు మిగుల శ్రమించినాడు. ముష్టికై, ఇతడు ఊరూరఁ దిరిగినాడు. ధనవంతులను జేరి ఇతడు దీనాలాపము లొనరింపడు. డబ్బుపడయుట తన హక్కని దెబ్బలాడి నెగ్గితీరును. ౧౯౩౧లో నితడు ముష్టికై వేపావారింటి కరిగి, బండవాదము లోనికిదిగి "ఆవలికి దాటు"మని గృహయజమాని హుంకరించినను, ససేమిరాయని పెదవిమెలివేసి, వలసిన పైకము చెంగునఁ గట్టుకొని మఱి దాటినాడు.

సాంబమూర్తి ధైర్యసాహస పరోపకారాది సద్గుణములకంటె అతని సహనము అద్భుతమైనది. ఈ గుణమున నితడు వసంతీదేవి కెనయైనవాడు. వసంతి సర్వస్వమును కోల్పోయినది. చిత్తరంజనుని గోల్పడినది. చిరరంజనుని పోగొట్టుకొనినది. నిశ్చలచిత్తయై శ్రాద్ధకర్మను, దేశసేవను సలిపినది. సాంబమూర్తి సర్వస్వమును స్వరాజ్య హోమగుండమున "స్వాహా!" యని సమర్పించినాడు. ఏకాత్మజుని మృత్యువున కప్పగించినాడు. గుండెబాదుకొని "దైవమా!" అనక కాంగ్రెసులోని కుఱికినాడు. వసంతి నుగ్గడించిన సరోజిని సాంబమూర్తిని కీర్తించినది. "ఇంచుమించుగ దిగంబరియై, కొడుకు తండ్రిని

వేధింపఁగల తీవ్రతమాఘాతమునకు గుండె నొగ్గి, హృదయయాతనను, దుఃఖమును మఱచి, దేశసేవకు అప్పనమైనాఁడు సాంబమూర్తి"యని సరోజిని కాకినాడకాంగ్రెసుగద్దెనుండి పలికినది.

దేశసేవకుఁ బూనినవా రెందఱో ఉన్నారుకాని గుండెదిట్టమున్నవా రల్పముగ నున్నారు. శ్యామసుందరచక్రవర్తి సాంబమూర్తివలెనే బాధలుపడినాఁడు. కాని అతఁడు దారిద్ర్యమును పీల్చి పిప్పిచేయనిచ్చినాఁడు; తనగుండెలను తినివేయనిచ్చినాఁడు; ప్రాణముల నూడఁబెఱుకనిచ్చినాఁడు. మానసికదార్ఢ్యమున్న సాంబమూర్తి ఢక్కాముక్కలుతిని గట్టిపడ్డాఁడు.

అన్యరాష్ట్రములందు సాంబమూర్తి కొంత పర్యటనము చేసినాఁడు. కాంగ్రెసువేళలందుఁగాక ఇతరసమయములందు వంగీయులనడుమ రాజకీయోపన్యాసములిచ్చిన ఆంధ్రుఁడు ఒక్క సాంబమూర్తి మాత్రమే. కలకత్తాలోనున్నపు డీతఁడు తఱుచుగ ఆల్బర్ట్‌హాలులోను, శ్రద్ధానంద పార్కు (Mirzapur Park) లోను ఉపన్యసించువాఁడు. వంగీయుల హృదయములు ఉద్రేకమయములు. ఉద్రేకము నుప్పొంగించు వక్తలనే వినఁగాంక్షింతురు. సాంబమూర్తిలో నుద్రేకమున్నదికాని, వక్తకు వలయు సరుకు లేనందున వంగీయులచే "నోహో!" యనిపించుకొనలేదు. కాని, ఈతనివాక్కు లీతని జీవనమునకు మాఱుపేరు లనియు ఈతని జీవన మీతని వాక్కులయొక్క ప్రతిబింబమనియు గ్రహించి వంగీయు లీతని నిష్కళంకదేశభక్తిని మెచ్చిరి. ఈతని కలకత్తా ఉపన్యాసములు తక్కుంగల ఉపన్యాసములకు తోడై, వెంటనే బళ్లారి జైలున కీతని సాగనంపెను. సంయుక్తరాష్ట్రములోను, రాజస్థానమందును ఈతని నెఱిఁగినవారు కొంద ఱున్నారు. మియాగంజ్ (ఫరుకాబాద్‌జిల్లా) నోహార్ (బికనీరురాష్ట్రము)లలో నీతనిగుఱించిన ప్రశంసనుర్గర్గ్‌లో విన గలిగి ఆనందించితిని. ఇతరరాష్ట్రనాయకులు మన రాష్ట్రమునకు వచ్చిపోవునట్లే, మననాయకులును అన్యరాష్ట్రముల కరుగుచుండుచో వీరి ప్రఖ్యాతియు, ఆంధ్రుల పరపతియు హెచ్చుననుట నిస్సంశయము.

ధైర్యసాహససహనములు యోగియందేకాక, రణాంగణమందలి యోధునందునుగూడ నెలయు నురుగుణములు. గాంధీజీగాక నెపోలియన్‌వంటి నాయకుఁ డొకఁడు గోచరించినయెడల, కవచమును ధరించి సాంబమూర్తి తన గుఱ్ఱమును ముందుల కుడాయించువాఁడు. ఈతనియందు అలీసోదరులందువలె సమరశౌర్య మధికముగఁ గలదు. ఒకవంక కరుగఁడగు నాతని గాంధిజీ వేఱొకవంకకు మరల్చివేసినాఁడు. సాంబమూర్తి సంపూర్ణముగ మాఱి నూతనక్రియావిధానమున ఎంతేని యుత్సాహముఁ జూపినాఁడు. ఉత్సాహముతో సరితూగుఊహ ఈతనియందు లేదు. ఇతఁడు లంఘింపఁ గలఁడుగాని, లంఘించుటకు ముందు ఒకనిముసము యోజించు టెఱుఁగఁడు. ఇతనిచొరవ గొప్పదియేగాని, అది చక్కనిమాపు నెఱుఁగదు. రాజకీయవేత్తగమనిక సంగీతమూర్ఛనమువలె నుండవలెను. ఇందు హెచ్చుతగ్గ స్థాయిలుండును. హెచ్చుకళవలె పైచేయిఁ జూపియు అవసరమగుపట్ల క్రిందికితగ్గితరువాతి యుత్థానముపై కన్నువేయును. ఇది ఎగుడుదిగుడుతంతుఅనియు, నిలుకడ లేని పద్ధతియనియు సాధారణులు నవ్వవచ్చును. కాని దూరదృష్టిగలవారు "శభాస్!"అందురు. సాంబమూర్తి ఆశయముపై వీరు పన్నీరు చల్లుదురు. దొడ్డదియని ఈతని హృదయముపై పువ్వుచెండులు ప్రువ్వుదురు. తొలి శ్రేణియోధులలో నొక్కండని జోహా రొనరింతురు. కాని, రాజకీయదర్శకుఁ డనికాని, మహానాయకుఁ డనికాని ఈతనిఁ జేరరు.

ఇకముందు సాంబమూర్తి నూతనశక్తిని దెచ్చుకొనవలెను. ఒకమహానాయకుఁడు కట్టెదుట తోఁచి నపుడు చూపిన సామర్థ్యముకంటె ఇపు డీతఁ డధికసామర్థ్యమును, ధృతిని చూపవలెను. సాంబమూర్తి వృద్ధుఁడు కాఁడు. రాజకీయరంగమున, కర్మక్షేత్రమున పదునాలుగేండ్ల అనుభవమును సంపాదించినాఁడు. భావికాలమున నీతఁడు చేయవలయు కర్తవ్యమెంతో యున్నది.

"వృద్ధుఁడ నైతిని. చాలబరువు మోసితిని. కడపటిదినములలో కొంతవిశ్రాంతిఁ గైకొన నభిలషించు

చుంటిని." అని నాయకుఁడు నేఁడు కాంగ్రెసునుండి తరలినాఁడు. పలువురు నేఁ డుత్సాహమును గోల్పడిరి. సత్యాగ్రహోద్యమముకతన స్వాతంత్ర్యము చేఁబడునా యని ఇపు డనేకులు సంశయించుచున్నారు. చేఁబడు నని వేయిమాఱు లందునుగాని, దీక్షఁబూనిన ఆచార్యుఁడు నడితెరువున సెలవుపెట్టినందున ఉద్యమమునకు చెఱుపు కలిగినదని చెప్పకమానను. ఈయుద్యమము నేఁడు కొంత నిలుకడనందినను, ఉద్దేశసిద్ధి నీయఁగలుగున దిదియే. దౌర్జన్యమునెడ భారతీయునకు నమ్మకము లేదు. అది యొకవేళ స్వరాజ్యమునేకాదు స్వర్గమును కూడ తెచ్చి చేతికిచ్చినను, "థూ!" యని భారతీయుఁడు వాని నవ్వల విసరివేయును. స్వరాజ్యము రానీ రాకపోనీ, లాఠీదెబ్బలు కుంభవృష్టిగఁ గురియనీ, చీకటికైఁదు లెదుట మృత్యుముఖగహ్వరములట్లు తోఁపనీ, "సత్యమేవ జయతి!" యని సత్యాగ్రహ మహోద్యమమునకు ప్రతిభారతీయుఁడును బుజమునొడ్డిననాఁడు మనస్వాతంత్ర్యము మనచేతులందు పడితీరును.

ఈమహోద్యమమునెడల విశేషవిశ్వాసముగలవాఁడు సాంబమూర్తి. నూతనగాయత్రినందిన సాంబమూర్తి జందెపుపోచలను నడుమునఁ గట్టి, వేఱుమతమున ప్రవేశించువాఁడుకాఁడు. దేశహృదయమున విద్యుత్ప్రవాహమును పాఱించుట ఈతని కర్తవ్యము! ప్రజలందు అపూర్వచలనమును, అపూర్వోత్సాహమును రేకెత్తించుట ఈతని కర్తవ్యము!! ఆశాభంగమున క్రుక్కియున్న మనసులందు నూతనజీవసంచారమును, నూతనతేజమును పుట్టించుట ఈతని కర్తవ్యము!!! పూర్ణస్వాతంత్ర్యభావమును నే డెన్నో హంసపాదులు తగుల్కొనినవి. కొందఱు నాయకుల దృష్టినుండియే ఇది దిగజారిపోయినది. అచిరములో మన ప్రభువులు కొంత ఆయబెల్లమును తెచ్చి చేతఁబెట్టెదరు. పుచ్చుకొని "బ్రదుకు జీవుఁడా" అనుకొందమని అనేకు లూహించుచున్నారు. తోఁకలు ముడుచుకొనువారు కలుగులలో దూఁగుటకు సంశయింతురా? క్రొత్తఉద్యోగములు దిగుమతియగునని తెయ్యిమనువారు క్రొత్తబిరుదులు కంధరసీమల నలంకరించునని ఎగిరిపడువారు నేఁ డిప్పుడే ప్రత్యక్షమైనారు. "సంపూర్ణ స్వాతంత్ర్య"మని గొంతెత్తి పలికినవాఁడు సాంబమూర్తి! నేఁ డీతని గొంతుకు బొంగురుపోలేదని నాతలంపు. స్కాట్ మహాశయుని కాచంట్ లెపర్డ్ యోధునికంటె నధిక ధైర్యమున జాతీయపతాకముకడ నిలిచినవాఁడు సాంబమూర్తి!! కర్తవ్యకేతనముకడ నిలిచిన ఈతని పదములందు నేఁడు వడఁకు పుట్టలేదని నాతలంపు. ఉద్దేశము సిద్ధించువఱకు దీక్షావస్త్రమును వదలనని పట్టుపట్టినాఁడు సాంబమూర్తి!!! నేఁ డీతని కొల్లాయి వదులుకాలేదని నా తలంపు. తాను పూనిన కోటివత్తుల వ్రతమునకై తన సర్వస్వమును తైలధారయట్లు అఖండమునకు సమర్పించినవాఁడు సాంబమూర్తి!!!! నేఁ డీతని వ్రతనిష్ఠ, ఈతని తపఃకాంక్ష, ఇతని దృఢప్రతిజ్ఞ, ఇతని యచలవిశ్వాసము, ఇతని యిచ్ఛాశక్తి తునియలు కాలేదని నాతలంపు. తోడియోధులను కడకు చేర్చుకొని, క్రొత్త యోధులను ఆకర్షించి జాతీయధ్వజము చేఁబట్టి పాంచజన్యమును పూరించి నేటి కురుక్షేత్రమున నితఁడు చరచర నడచుఁగాక.

నేఁడు భారతభాగ్యరేఖ మేఘముల మఱుఁగున నడఁగియుండుట నిక్కమే. ఇది మరల తళ్కొత్తదా? సృష్టిచిత్రములు అర్థశూన్యములా? ఉత్తమాశయములు పిచ్చితలంపులా?

---

# గోవర్ధనాచార్య సప్తశతీసారము

శిరోమణి సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి

అవ—నాయకసంగమమున శ్రమ కలుగునని యనుచున్న నాయికతో నొకతె పలుకుచున్నది :

కురుల మొత్తంబు తలవ్రేఁగుఁ గూర్చునేని - నమృతఘటపాతమున మృత్యు వయ్యెనేని
నక్కు ప్రియునెక్కుడలకు బర్వెక్కునేని - మాన్ప నీరోగ మిలయందు మందు లేదు.

అవ—వచ్చుచున్న నాయికాపతి నవలోకించి సంకోచించు నాయకునితో దూతి యన్యోక్తితో ననుచున్నది :

ఓకురంగమ, మడి ప్రాలియున్న సరస - శాలిమంజరిఁ ద్యజియింపనేల యిపుడు ?
గఱికతూపులు, గఱికవిల్, గఱికయొడలు-గల గఱికమానిసి యితండు వలదు వెఱవ.

అవ—ఒకతె మఱొకతెతో ననుచున్నది :

తిరుగుంబోతగు కాంతుని - నరసిన తలఁగాంచి యంగనామణి యెడఁదం
బరితాపముఁ గొనవలసిన - తఱియందును బిట్టు సమ్మదంబునె కొనియెన్.

అవ—చెలికత్తె నాయకునితో ననుచున్నది :

పెడమొగంబును జేసియు విఱియఁబోసి - వెండ్రుకల చిక్కుడల్చుచు వ్రేళ్లఁగుచ్చి
యఱిమి నష్టంబుగాఁ ద్రిప్పి తెఱవ నిన్నుఁ - గురులసందులఁ బడి కడం గోరి చూచు.

అవ—ఒకఁ డొకదానిముచ్చటను దెలుపుచున్నాఁడు :

కుతుకమతినిఁ బెంచుకొనుచున్న చెనిఁగిచేఁ - పూఁతవట్టి యెదుగు మొదలుగాఁగ
నాదినంబునుండి యల కాఁపుకన్నెకుఁ - బచ్చకోకఁ గట్ట ముచ్చటయ్యె.

అవ—నాయిక చెలికత్తెతో ననుచున్నది :

కొలువఁడు మునుపటివలె; నను - వలపింపఁడు; సిగ్గువడఁడు స్వచరిత్రంబుల్
తలఁచియు; నమ్మఁడు నాపతి - చెలి నాపాలిట నవోఢ సెత్తురువయ్యెన్.

అవ—ఒకఁ డొకముచ్చటను దెలుపుచున్నాఁడు :

పండియున్న భర్తపాదంబు లొత్తుచు - వెలఁది సురఁటిఁ బట్టి వీచుచుండఁ
దలుపుసందునుండి తమిఁగాంచు మిండగాఁ - డూఱడిల్లుచుండె నుల్లమందు.

అవ—ఒకతె యొకముచ్చటను దెలుపుచున్నది :

తగినంత నిద్రలేమియె - యగు దీనికి వ్యాధిహేతు వని వెజ్జు వచిం
పఁగ నాచిన్నది సిగ్గిలె; - బిగిసె సవతి; దయితుఁ డదరెఁ; బ్రియసఖి మురిసెన్.

అవ—ఒకతె యొకదాని ముచ్చటను దెలుపుచున్నది:
మునిమాపునందుఁ దన కాంతుని చేతులఁ దూలిపడి రతులచే రేయె
ల్లను బుచ్చి ప్రొద్దుటను దివ్వెను బెట్టఁగ నవ్వె రొక్కపిల్లను సకియల్.

అవ—ఒకతె యొకతరుణదంపతులముచ్చటను దెలుపుచున్నది:
తరుణీతరుణులు గుడిలోన్ - బరస్పరాపహృతదృఙ్మనస్కులగుచు నొం
డొరుపయిఁ బూజకు నెత్తిన - విరులు విసరుకొనిరి రెచ్చి బెట్టిదపుఁదమిన్.

అవ—దానిపతి మూఢుఁడగుటచే నదియును మూఢురాలని యనుచున్న యుప
పతితో దూతి పలుకుచున్నది:
పతి వట్టి మొద్దె నిజముగ - రతికళఁ దన తెలివిఁ గలిచె రమణీమణి మ్రొ
త్ప్రితిమకడ నేకలవ్యుఁడు - వితతంబు ధనుష్కళాప్రవీణతఁ గొనఁడే?

అవ—ఒకతె యొకని ముచ్చటను దెలుపుచున్నది:
చెలికత్తెవేసమును గొని - తలదువ్వను, బూలుముడుచుఁ, దమి మెయి దిద్దం
దిలక, మలందును గందము, - వెలఁదికి మిండండు దానిపెనిమిటియెదుటన్.

అవ—'నీమగఁ డందగాఁడే! ఆతని నేల ప్రేమింప'వని యనుచున్న యొకతెతో
నాయిక యనుచున్నది:
నవమన్మథుఁ డీతండని - జవరాం డ్రెల్లరు నుతింత్రు సకియా, యువి న
చ్చవు నాకు మగఁడు కావుట - నవని నమృతమైన విషమ యౌనపథమన్నన్.

అవ—అవమానితుఁడగు నాయకునితో నాయిక యనుచున్నది:
నవుదువు కాలం దన్నఁగఁ; - బవళింతువు నేల గెంటఁ బొన్పుననుండిన్
రవులింతు చిలిపిపనులన్ - నివర్తిలవు నాయెడంద ని స్నేమందున్.

అవ—నాయకునియందలి నాయికాసక్తిని దూతి తెలుపుచున్నది:
నిన్న పగటిపూట నిద్రలో నినుఁగూర్చి - పాప మానెలంత పలవరింప
సవతి నవ్వె; నత్త దివులొందెఁ; బరువెత్తి - మూసి రంత దానిమొగముఁ జెలులు.

అవ—మోహము రేఁగినచో భయముండదని యొకతె యొకదాని ముచ్చటను
నాయికకుఁ దెలుపుచున్నది:
ధైర్యసాహసములకుఁ బ్రేతములు మెచ్చ - విడిచి మేఁతలు వీక్షింప వృకగణంబు
అతివ మృతుఁడైన తన ప్రియు నాననంబుఁ - గొలవివెలుఁగులఁ గని ముద్దుగొనుచునుండె




# కాగితపు చాపలు

కొ. నరసింహాచార్యులు

౨

ఇదివఱ కల్లిన చాపయందు పడుగు-తునుకలు ఒకటే కాగితమునందు చేరియుండి వాటికడ్డముగా పేకతునుక లల్లబడియున్నవి. ప్రస్తుతము చెప్పబోవు విధపుచాపయందు పడుగు, పేకలు రెండును చేరి చాపకు భూమిక యయి దానియందు మూలవాటముగా వేరు తునుక లల్లబడును.

## భూమిక

పూర్వపు విధమునఁనే యొక కాగితమును దీసికొని దానిచుట్టును ఒకయంగుళము వెడల్పున వదలి మిగిలిన లోభాగమున చిత్రము A యందలి విధముగ పదునొకండు పొడవు కోతలు వేయవలెను. కోతల సంఖ్య మారవచ్చును. ఇందు ౧,౩,౫,౭,౯,౧౧ అను


















తునుకలను చిత్రము B యందలి విధముగ కోసి తీసివేయవలెను. అట్లు తీసివేయబడిన తునుకలను మిగిలిన పడుగుతునుకల కడ్డముగా చిత్రము C యందలి b, d, f, h, j, l, n వలె అల్లవలెను. వాటిమధ్య నుండు స్థలములు, లేక సందులు ౧,౩,౫,౭,౯,౧౧ స్థలములకు సమముగా నుండవలెను. b, d మొదలగు తునుకల సంఖ్య చాలనియెడల నదే విధపు కాగితమునందు అట్టివే వేరుతునుకలను కోసికొని అల్లవచ్చును. b తునుకను ౨ నకు పైనను, ౪ నకు క్రిందను, ౬ నకు పైనను ౮ క్రిందను, ౧౦ పైనను తీసికొనిపోయి దాని కొనలను భూమికయంచులకు క్రింద మరుగుపడునట్లు అతికించవలెను. ఈ తునుకలు కదలగూడదు. d తునుకను ౨,౬, ౧౦ లకు క్రిందను, ౪,౮ లకు పైనను, దీసికొనిపోవలెను. ఇట్లు తక్కినతునుకలనుగూడ అల్లి వాటి కొనలను, భూమికఅంచులకుఅడుగున నతికించవలెను.

చాపయల్లిక (చిత్రము C)

మనయిష్టమువచ్చిన రంగుకాగితమున, పడుగుపేకతునుకలకు సమానమగు వెడల్పుగల తునుకలను కత్తిరించుకొనవలెను. ఇందు ఒకతునుకను (నలుపురంగున జూపబడినవి అల్లవలసిన తునుకలు) ౧౧ వద్ద అడుగున నతికించవలెను. ఇది చాల చిన్నతునుక. ౯, ౯ అను రెండవ తునుకను ౧౦, b అను పడుగుపేకల క్రాసునకు పైగా నుండునట్లు అల్లవలెను. ౭, ౭ అను మూడవతునుకను ౮, b అను పడుగుపేకల క్రాసునకు క్రిందుగను, ౧౦, d ల క్రాసునకు మీదుగను పోనిచ్చి అల్లవలెను. ఇటులనే తక్కిన ౫-౫, 3-3 a-a, c-c, e-e, g-g, i-i, k-k, m-m, o అను తునుకలను చిత్రమునందలివిధముగ అల్లవలెను.

చిత్రములు D, E, F మూడు విధములగు చాపలను చూపును. మూల యల్లిక యందు గూడ తునుకలను అల్లినతర్వాత వాటి నన్నిటిని చక్కగ అతికించి అడుగున మఱియొక కాగితమును పెట్టి అతికించవలెను. పడుగు ఒకరంగునను, పేకతునుకలగు b, d, f మొదలయినవి మఱియొకరంగునను, మూల యల్లిక కుపయోగించు తునుకలు (నల్లగా గుర్తించబడి యుండునవి) వేఱొకరంగునను ఉండవచ్చును. ఇట్టివే యనేకవిధములగుచిత్రములు చాపయల్లికయందు చూపవచ్చును.

# నక్షత్రమండలము

(భావసంవత్సర మార్గశిరమాసము)

గొబ్బూరు వేంకటానందరాఘవరావు

(కవితాసమితి)

ఉత్తరము



దక్షిణము

[ ఈ పటమును తలమీదుగా ఆయాదిక్కులు సరిపడునట్లు పట్టుకొని ఖగోళమును పరిశీలింపవలెను.

ఇందు జూపబడినట్లు నక్షత్రాదులు
1934 డిసెంబరు 8 తేదీని రాత్రి 8-50 గంటలకు
,, ,, 15 ,, ,, 8-22 ,,
1934 డిసెంబరు 22 తేదీని రాత్రి 7-54 గంటలకు
,, ,, 29 ,, ,, 7-28 ,,
1935 జనవరి 5 ,, ,, 7-0 ,,
కనబడును.]

**11.** 12- 17 ౯౪౩

"Thine works are wondrous great,
Almighty ! Creator
Of Worlds of moving stars
That ever the praises sing
Of such Omnipotence."

"సర్వశక్తుఁడవను ఓసృష్టికర్తా, నీకృతులు అత్యద్భుతములు; మహాఘనములు. నిత్యమును చలనశీలములైన నక్షత్రకోటులు అనంతదివ్యప్రపంచములై నీమహామహిమమునుగూర్చి గానముచేయుచు, నీవు సర్వశక్తుఁడవని బహుసహస్రముఖముల ఎడతెగక ఘోషించి తెలుపుచునే ఉన్నవి."

"మాసానాం మార్గశీర్షోహమ్" (భగ. X. 35) పంద్రెండుసెలలలో మార్గశిరమనబడుసెల నేను అని శ్రీకృష్ణభగవానులు భగవద్గీతలో తెల్పియున్నారు. అట్టియీమాసములో రాత్రి తొలిజామున నగపడు నక్షత్రాదుల నరయుదము.

## పాలవెల్లి (The Milky Way)

ఈమాసములో పాలవెల్లి వెడల్పుగల వింటివంటియాకారముతో ఆగ్నేయమును స్పృశించిన తూర్పుదెసనుండి, పశ్చిమసమీప వాయవ్యమువఱకు రమ్యముగా వ్యాపించియున్నది. అయ్యది మృగవ్యాధరుద్రుడున్న శ్వానమండలమునుండి, పూర్వశ్వాన, వృత్ర, మిథున, వృషభ, సారథి, భృగుపరశు, అప్సరస, రాజహంస మండలములమీదుగా పడమట శ్యామసీమలను గడచి, ఛాయాపథము దిగువ అస్తమించుచున్న శ్రవణము వఱకు వ్యాపించియున్నది.

## First Magnitude Stars

మిక్కిలి తేజోవంతములైనట్టియు, బహుసొగసైనట్టియు నక్షత్రములు ఈమాసపు తొలిజామున తొమ్మిది కనబడుచున్నవి :

౧. గరుడ (Aquila) మండలములోని శ్రవణము (Altair).

౨. మకరము (Capricornus) లో ఇంద్రద్యుమ్నుడు (Fomalhaut-ఫోమలో).

౩. శంతనుడు (Acherner).

౪. రోహిణి (Aldebaran).

౫. రిగల్ (Rigel-వృత్రునిపాదముకడమక్క).

౬. ఆరుద్ర, వృత్రుని బాహువు (Betelgeaux).

౭. బ్రహ్మహృదయము (Capella in Auriga).

౮. మృగవ్యాధుడు (Sirius in Canis Major).

౯. పూర్వశ్వానము (Procyon in Canis Minor).

### పశ్చిమమున

"విష్ణువాహ నమ స్తుభ్యం పక్షిరాజాయ తే నమః" అని మనవారు పూజించు గరుడమూర్తిలోని శ్రవణము పడమట అస్తమించుచున్నది. ఆసమీపమందలి పాలవెల్లియు, ఛాయాపథము, శ్యామసీమలు త్వరలో అస్తమింపనైయున్నవి. ధనిష్ఠయు త్వరలో అస్తమించును. శ్యామసీమలకావల ఊర్వశీ పురూరవసులును, దిగువ ప్రోష్ఠపదానక్షత్రములు(Square of Pegasus) ఆదిగువ కుంభ మీనరాసులును కానవనుచున్నవి.

### నైరృతిదిగ్భాగమున

ఇంద్రద్యుమ్న మహారాజు (Fomalhaut-ఫోమలో) చక్కగా మెఱయుచున్నాడు. అతనికథతో సంబంధముగల ఒక ఘూక, కమఠము లాప్రక్కనే చూపటనగుచున్నవి. బకునిసందర్భములు కొన్ని క్రిందటి మాసమున చర్చించితిమి. ఇపుడు ఘూక, కమఠములను గూర్చి తెలిసికొందము.






ప్రావారకర్ణమను ఘూకము (Phoenix)

ఈ గ్రుడ్లగూబకు సై-గామా గుర్తులుగల చుక్కలు గ్రుడ్లుగాను, డెల్టా గుర్తుగలచుక్క ముక్కుగాను భావించుకోవలెను. అపుడు ఎడమప్రక్క నున్నట్లు గూబరూపము స్పష్టముకాగలదు.

## ప్రావారకర్ణఘూకము
## (ఫీనిక్స్-Phoenix)

పాశ్చాత్యు లీచుక్కల గుంపును ఫీనిక్స్ (Phoenix) అందురు. It is a bird fabled toburn itself on a pyre and rise renewed from the ashes. ఈపక్షి అగ్నిగుండమునబడి చచ్చియు, ఇంద్రజాలవిద్యచేవలె తిరిగి బ్రతికి ఎప్పటిరూపముతో వచ్చినదని పాశ్చాత్యగాథలు గలవు. పాశ్చాత్యులచే Chemical furnace అని చెప్పబడు ధుంధుడను రక్కసుడు (రామాయణములో అగ్నివర్ణునివలె) ఘోరాగ్నిజ్వాలలతో వెలయున ట్లగపడుచుండును. ఆధుంధుని అగ్నిరూపమే పైపాశ్చాత్యగాథలకు కారణముగానోపు.

ఇంద్రద్యుమ్నునిపేరు భూమిమీద మాసిపోయినదో, లేదో నిర్ణయించుటకు నిదర్శనముగా బహుపురాతనజీవియైన యీఘూకమును — ప్రావారకర్ణమనుపేరు గలదానిని — దేవతలు ప్రశ్నించినట్టు భారతమునందు కథగలదు. ఈఘూకముయొక్క రూపము ఆకాశమున నక్షత్రములలో గానవచ్చుచుండెనని పెక్కుప్రాచీన చిత్రములవలన నిరూపితమగుచున్నది. పైన ఎడమప్రక్క పటములో ఈచుక్కలగుంపును సూక్ష్మముగా పరిశీలించినపుడు కానవచ్చుదృశ్యము చూపబడినది.





**Sculptor** అని పాశ్చాత్యులచే వ్యవహరింపబడుచున్న యుగంధరకూర్మము యొక్క నక్షత్రస్వరూపము, కూర్మసంపూర్ణరూపమును. శిరమును, ఒకపాదమును ఎడమప్రక్కనున్న, పృష్ఠభాగమును వెనుకటికాళ్లను కుడిప్రక్కనున్న చూడవలెను. సంపూర్ణరూపము ఎడమప్రక్క కమఠరూపమున సూచింపబడుచున్నది.

## యుగంధరకమఠము (Sculptor)

ఘూకమునకు పైగా యుగంధరకమఠమున్నది. దీనిని పాశ్చాత్యులు (**Sculptor**) చిత్రకారుని పనిచోటు అని చెప్పుచున్నారు. ఈపేరు ఇటీవలివారు పెట్టినది. కాని ప్రాచీననక్షత్ర చిత్రములలో ఈచుక్కలున్నచోట ఒకకమఠరూపము కనబడుచున్నది. ఇంద్రద్యుమ్నునిపేరు భూమిమీద మాసిపోయినదో, లేదో నిర్ణయించుటకు దేవతలు చేసిన "దర్యాప్తు" లో, యుగంధరుడను కమఠమునుకూడ ప్రశ్నించినట్లు భారతమున కలదు. ఆమహారాజు దానమిచ్చినగోవుల డెక్కలరాపిడిచేత పల్లమేర్పడి, సరస్సుకాగా, ఆకొలనిలోనే ఈకూర్మము నివసించుచుండినట్లును, ఆకొలనికి ఇంద్రద్యుమ్న మనుపేరు రూఢమైయున్నట్లును భారతము తెలుపుచున్నది.

కమఠమను సంపులోగలచుక్కలు సూక్ష్మముగా పరిశీలించినపుడు కనబడురూపము కుడిప్రక్కపటములో కానవలెను. అందుకమఠరూపము చూపరులకు చక్కగా స్ఫురించుటకు తాబేలుబొమ్మకూడ ప్రక్కనే కలదు.

ఈకమఠమునుగూర్చిన మరియొకముఖ్యాంశము కూడ గమనింపదగియున్నది. క్షీరోదమనబడు పాలవెల్లియొక్కరూపమును చక్కగా గమనింపుడు. క్షీరోదముయొక్క ఉత్తరధ్రువము (**North Galactic Pole**) కన్యారాశికడను, దక్షిణధ్రువము (**Sculptor**) ఈకమఠముకడను ఉన్నట్లు శాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు. ఈయంశమునే ఆధారముచేసుకొని పూర్వులు, అవతారగాథలు బయలుదేరినపిదప, క్షీరసముద్రమథనసందర్భమున, శ్రీహరి కూర్మరూపమున నడుమనుండి సముద్రమథనమునకు తోడ్పడెనని చెప్పినట్లు కనబడుచున్నది.

## దక్షిణమున

ప్రావారకర్ణ ఘూకముడిగువ శంతనుడు (**Achernar**) ను, శరాలి-వల-మండలములును కానబడుచున్నవి. వీటికావల, ఆగ్నేయదిశను అద్రిక, మయుడు, ఉపరిచరవసు నక్షత్రములు చూడవలెను.

## మధ్యను

యుగంధరకమఠమునకుమీదను, ఉత్తరముగా శింశుమారము (**Cetus**) సంపును, ఆసంపునకుపైన ఉత్తరముగా అశ్విని, చ్యవన, ఇంద్రమదాదులును, ఆపైన పాలవెల్లిలో అప్సరసలును ప్రకాశించుచుండుట కానవలెను. అశ్విని ఇంచుమించుగా నభోమధ్యరేఖపై నున్నది. అశ్వినికి పడమట రేవతి, దానికి పడమట ఉత్తరాభాద్ర పూర్వాభాద్రలును ఉన్నవి. అశ్వినికి తూర్పుగా భరణి, కృత్తిక నక్షత్రములు కానవచ్చుచున్నవి. కృత్తికనుండి అప్సరసమండలము వఱకు వక్రరేఖాకారము స్ఫురింపజేయుచు భృగుపరశుమండలమును, అదిగువ తేజోవృద్ధిక్షయములు క్రమముగా పొందుచు, గ్రుడ్లు మిటకరించునట్లు తోచుపులోమరక్కసుడును గమనింపదగియున్నారు.

## ఉత్తరమున

ధ్రువుడు తోకచివఱను మెఱయుచుండగా, చిన్నయెలుగు దిసవకు ఉత్తరముగా వ్రేలబడినట్లు కనబడుచున్నది. ధ్రువునిదిసవ వరుసగా కశ్యప, మహేంద్ర, అగ్ని, మిత్ర, విధాతలును, విధాతకు తూర్పుగా ధాతయు చక్కగా కనబడుచున్నారు. ధ్రువుని దిసవ ఊర్వశియు, ఊర్వశిదిసవ పురూరవసునక్షత్రమును మెఱయుచున్నవి. ధాత, విధాతలకు పడమట నరకునిలో నిశుంభుడు కొంచెము కానవచ్చుచున్నాడు.

ఈశాన్యభాగమున, తూర్పున విఘ్నేశ్వరవాహనమైన మూషకము కొంచెము తొంగిచూచుచున్నది. తూర్పున మిథునము ఇపుడే ఉదయించినది. మిథునమున కావల బ్రహ్మహృదయము తెల్లగా తేజరిల్లుచున్నది.

ఈబ్రహ్మహృదయముగల సారథి (Auriga) మండలములోని అగ్ని (Nath or Beta Taurus) నక్షత్రమును, అజశాబకములు (The kids) అను చుక్కలును చూడదగియున్నది. ఆదిసవను ఎద్దుకన్నువలె ఎఱ్ఱగనున్నదనుసామ్యము సార్థకము చేయుచు — ఎద్దుయొక్క కన్ను — వృషభరాశియొక్క నేత్రస్థానము నాక్రమించి, రోహిణి ఎఱ్ఱగా ప్రకాశించుచున్నది. రోహిణి కావల "నెండియు త్తరీయమున చిక్కి తేలియాడుచు మెఱయు మిణుగురుపురుగు" లట్లు రమ్యములై కృత్తికచుక్కలును నేత్రపర్వము చేయుచున్నవి.

## ఒరయన్ యోధుడు

యమునానదియొక్క సంభవస్థానమని తోచు చోట మెఱయుచున్న రిగెల్ (Rigel) చుక్క ఒక పాదముగాను, దాని కనతిదూరమున తూర్పుననున్న మరియొకచుక్క రెండవపాదముగను, ఆర్ద్ర (Betelgeaux) పరివృత్త (Bellatrix) నక్షత్రములు బాహువులుగాను, గొల్లకావిడిచుక్కలు మూడును పటకాగాను, మాయామృగశిరము శిరముగాను కలిసి, జగంబులు మ్రింగ నప్పళించునట్లు తోచుచు తూర్పున బాసుగా నుదయించి మెఱయుచున్న వృత్రునిరూపము, నక్షత్రపరిశోధకులకు ఎడతెగని ఆనందము కూర్చుచున్నది.

## గ్రహములు

ఈనెల 13-వ తేదీని శని ధనిష్ఠతృతీయపాదమున, అనగా కుంభరాశిలో బుజుగమనము కలిగియున్నది. ధనిష్ఠఅస్తమించినతరువాత త్వరలోనే శని అస్తమించుచుండును. గురుడు తులారాశిలో విశాఖానక్షత్ర ప్రథమ, ద్వితీయపాదములలో నుండుటను, ఉదయమున కొంచెమగపడును గాని రాత్రి కనబడకుండును. అంగారకుడుకూడ తెల్లవారుజామున కన్యారాశిలో కానరాగలడు. శుక్రుడు వృశ్చిక, ధనూరాసులలో నుండుటచేతను, 23-12-34 వఱకును శుక్రుడు మూఢములో నుండుటచేతను కనబడడు. ఆతేదీ పిదపను సూర్యాస్తమానముకాగానే కనబడును.

## పరమక్షయదినము

ఈ మాసము 22-వ తేదీ పరమక్షయదినము (Shortest day in the year). అటుపిమ్మట అహఃప్రమాణము క్రమముగా హెచ్చుచుండును. సుమారు రెండువేల సంవత్సరములక్రిందట డిసెంబరు 25-వ తేదీనుండి సూర్యుని తేజోష్ణములు, అహఃప్రమాణము వృద్ధియగుచుండెను. తత్పూర్వము "అహములు సన్నములై, దహనము హితమై, నిశలు దీర్ఘతరములై, లోకము బహుశీతోపేతమై ఉహుహూ" అని వణకుచుండెను. సూర్యుడు చలిచే కబళింపబడి చచ్చినట్లుండెను. డిసెంబరు 25-వ తేదీనుండి సూర్యుని తేజోష్ణములు, అహఃప్రమాణము వృద్ధియగుచుండెను. ఆహేతువుచేతనే డిసెంబరు 25-వ తేదీ సూర్యుని జన్మదినముగా పాశ్చాత్యులు భావించుచున్నారు. ఏసుక్రీస్తు జన్మదినము డిసెంబరు 25-వ తేది. క్రైస్తవుల క్రిస్మస్‌పండుగ ఆనాడే. ఆహేతువుచేతను, మరికొన్ని ప్రబలకారణములచేతను క్రీస్తు అనగా మన సూర్యుడేయనియు, యేసుక్రీస్తు చేసినట్లు బైబిలునందుచెప్పబడినకార్యములు, క్రైస్తవుల పండుగలు సూర్యగమనసంబంధము లేయనియు, ఆఖగోళవిశేషములే ఆధ్యాత్మికార్థము (allegorical representation)తో బైబిలునందు వర్ణింపబడుచున్నవనియు డాక్టరు కార్పెంటరుగారు Pagan and Christian Religions అనుగ్రంథమునందు తెల్పియున్నారు.




## విశ్వవిఖ్యాతపుస్తకాలయములు

"ప్యారిసునగరమునందలి నేషనల్ లైబ్రరి జగత్ప్రసిద్ధమయినది. అందు ౩౭ లక్షల పుస్తకములున్నవి. ఇన్ని పుస్తకములు ప్రపంచమునగల యింక ఏపుస్తకాలయమునను లేవు. లండను నగరమునందలి బ్రిటిషు మ్యూజియము (పుస్తకాలయము) దీనికి తరువాత చెప్పవలసినది. అందు ౨౩ లక్షల పుస్తకములుగలవు. అమెరికా దేశమునందలి వాషింగ్టను పట్టణమున 'కాంగ్రెసు లైబ్రరి' ఉన్నది. అదియును పెద్దది. ఇందును ఇంచుమించుగ బ్రిటిషుమ్యూజియమునగలయన్ని పుస్తకములుండును. ప్రపంచమున పేరుగన్న పెద్దపుస్తకాలయములు కొన్ని, వానియందుగల పుస్తకములసంఖ్యతో నీక్రింద తెలుపబడుచున్నవి—

లెనిన్గ్రాడు (రషియా) పబ్లికు లైబ్రరి, ౨౦,౮౮,౦౦౦

ప్రష్యన్ స్టేట్ లైబ్రరి ౧౭,౭౦,౦౦౦

మ్యూనిక్ పబ్లిక్ లైబ్రరి ౧౮,౦౦,౦౦౦

స్ట్రాస్బర్గు విశ్వవిద్యాలయము లైబ్రరి ౧౨,౦౦,౦౦౦

మ్యాడ్రిడ్ నేషనల్ లైబ్రరి ౧౧,౨౫,౦౦౦

వియన్నాస్టేట్ లైబ్రరి ౧౦,౦౦,౦౦౦

వియన్నా యూనివర్సిటీలైబ్రరి ౧౦,౦౧,౦౦౦

యూరపుఖండమున పెద్ద పుస్తకాలయములు ౬౦౯ గలవు. అన్నిపుస్తకాలయములయందలి పుస్తకములసంఖ్య మొత్తము పదొకండుకోట్ల అరువదిలక్షలు. అమెరికా సంయుక్తరాష్ట్రములయందు ౩౧౮ పెద్ద పుస్తకాలయములున్నవి. వానియందలి పుస్తకముల సంఖ్య అయిదుకోట్ల నలువదిలక్షలు. ఇవికాక మధ్య, దక్షిణాఅమెరికాయందు ౨౨, ఆసియాలో ౨౩, ఆస్ట్రేలియాలో ౭, ఆఫ్రికాయందు ౩ పెద్దపుస్తకాలయము లున్నవి.

యూరపునందు, కేవలము జర్మనియందే ౧౬౦ పెద్దగ్రంథాలయము లున్నవి. వానియందు రెండుకోట్ల పుస్తకము లున్నవి. ఇంగ్లండులోని లైబ్రరీలసంఖ్య నూటయొకటి. వానిలో మొత్తముపుస్తకములు ఒక కోటి డెబ్బదిలక్షలు గలవు. ఇటలీలో ౭౫ లైబ్రరీలు పెద్దవిఉన్నవి. వానియందలి గ్రంథములసంఖ్య కోటి ముప్పదిలక్షలు. యూరపునందలి లైబ్రరీలలో ప్యారిసులోనున్న నేషనల్ లైబ్రరి ప్రాచీనమయినది. తర్వాత ౧౩౬౭ సం. న వియన్నాలైబ్రరి పుట్టినది. ఇవికాక యూరపుదేశమున పాత క్రైస్తవసన్యాసిమఠములలో మంచి లైబ్రరీలు అనేకములున్నవి. వీనిలో కొన్ని కొన్ని ఆరవశతాబ్దమున జన్మించినవి. విశ్వవిద్యాలయపుస్తకాలయములలో స్పెయినులోని సాలమన్ లైబ్రరి ప్రాచీనతమమయినది. అది క్రీ. శ. ౧౨౫౪ లో పుట్టినది. స్ట్రాస్బర్గ్ యూనివర్సిటీ లైబ్రరి యూనివర్సిటీ లైబ్రరీ లన్నింటిలో పెద్దది. రోమునగరమునందలి ప్రాచీనవాటికను పుస్తకాలయమున అయిదు లక్షల పుస్తకము లున్నవి. మరియు ప్రాచీనతవిషయమున నిది సర్వోత్తమమయినది.

మనభారతదేశమున కలకత్తానగరమునందలి ఇంపీరియల్ లైబ్రరి మంచిది. ఇతర పెద్దనగరములయందును కొన్ని పెద్దలైబ్రరీలున్నవి కాని వానిలో పుస్తకములు లక్షకంటె మించియుండవు."

[మాధురి ౧౯౩౮ నవంబరు సంచిక, సంపాదకీయవిచారమున నుండి.]

---

## అయిదుగురు గొప్ప ఆలంకారికులు

౧. కాశ్మీర పండితుడు రాజానకమమ్మటుడు 'కావ్యప్రకాశము', 'శబ్దవ్యాపార విచారము' నను రెండు గ్రంథములను రచియించెను. కావ్యప్రకాశ ముత్తమాలంకార గ్రంథము. ఇంచుమించు పండ్రెండవ శతాబ్దప్రారంభ మీతనికాలమని యూహింపబడు చున్నది.

౨. వంగపండితుడు విశ్వనాథకవిరాజు 'సాహిత్యదర్పణము' ను రచియించెను. ఇం దాయనసొంత మేమియు లేదు. వాస్తవమున నీయన సంగ్రహకారుడు మాత్రమే. విశ్వనాథుడు పదునెనిమిదిభాషల పండితుడ నని చెప్పికొనినాడు. ఈయన ప్రసిద్ధవంగకవియగు చండీదాసువంశమువాడు; పండ్రెండవ శతాబ్ది మధ్య భాగమువాడు.

౩. ఓఢ్రపండితుడు విద్యానాథుడు 'ప్రతాపరుద్రయశోభూషణ' మను నలంకారమును రచియించినాడు. 'ప్రతాపరుద్రీయ' మనునది యీగ్రంథమునకు సంగ్రహనామము. ఈ గ్రంథమున నుదాహరణము లన్నియు ఉత్కలరాజగు మహాదేవునిపుత్రుడగు ప్రతాపరుద్రునికి సంబంధించినవి. దక్షిణభారతదేశమున నీగ్రంథము నేడును పఠనపాఠనప్రచారము గలిగియున్నది. సకలసంస్కృత పాఠశాలలయందును ఇది చదువబడు చున్నది. సాహిత్యదర్పణమువలెనే ఇదియు సంగ్రహమాత్రగ్రంథము.

౪. విదర్భదేశమున జన్మించిన జయదేవపండితుడు రెండు పేరుగన్న గ్రంథములను రచియించెను. ఒకటి చంద్రాలోకమను నలంకారగ్రంథము; ఇం కొకటి ప్రసన్నరాఘవనాటకము. కావ్యాదర్శకారుడగు దండిపండితునివలె నీతడును లక్షణముల ననుష్టుప్ఛందముననే రచియించెను. ఉదాహరణముల స్వయము విరచించెను. ఈయన ప్రాయశః పదుమూడవ శతాబ్దివాడగును.

౫. దక్షిణదేశపండితుడు అప్పయ్యదీక్షితు డొక గొప్పవిద్వాంసుడు. ఈయన శైవుడు. అలంకారశాస్త్రమున మూడుగ్రంథములను—కువలయానందము, చిత్రమీమాంస, వృత్తివార్తికము—రచియించెను. పూర్వాచార్యుల నీయన సంపూర్ణముగా ననుసరించెను. విజయనగరాధీశుడు వెంకటపతిరాయలకాలమున దక్షిణదేశమున సాహిత్య చర్చలు విశేషముగ జరుగుచుండెడివి. వెంకటపతిరాయలు ౧౫౮౫—౧౬౧౪ కాలమువాడు. అప్పయ్యదీక్షితుడు వేలూరునాయకుని యాశ్రితుడుగ నుండెను. ఈనాయకుడు వేంకటపతిరాయల సామంతుడు.

[మాధురి ౧౯౩౮, నవంబరు సంచిక—సంపాదకీయవిచారమునుండి]

---

## మన పల్లెటూళ్లలో 'బ్రాడ్‌కాస్టింగు'

పశ్చిమదేశాల్లో బాగా ఉపయోగిస్తున్న 'వైర్‌లెస్' హిందూదేశపు పల్లెటూళ్లలో ప్రవేశపెడితే ఎంతో సహాయకారిగా వుంటుంది. అజ్ఞానము, ఏకాంతస్థితిచేత బాధపడుతూ దూరదూరంగా పల్లెటూళ్లలో నివసిస్తున్న కాపువారికి, కూలివారికి నిత్యమూ నాగరక ప్రపంచంలోని విజ్ఞానాన్ని, ఉత్తమ జీవనమార్గాన్ని, క్రొత్తద్రవ్యార్జన మార్గాలనుగూర్చి చెప్పటానికి 'బ్రాడ్‌కాస్టింగు' పనికివస్తుంది. వరదలు, భూకంపము, క్షామము మొదలైనవాటివల్ల కొన్ని పల్లెటూళ్లు నాశనమవుతున్నపుడు దూరముగావుండి వర్ణ మత భాషాభేదములచేత ఆటంకపరుపబడిన యితర ప్రాంతాలు తోడుపడటానికి వీలులేకుండా వున్నది. ప్రతిదినమూ 'బ్రాడ్ కాస్టింగు' వల్ల దేశంలోని వ్యవసాయదారులందరికీ పరిచయం కలిగిస్తూవుండవచ్చు.

హిందూదేశపు రాజకీయస్థితి యెట్లావున్నా, దీని ఆర్థికస్థితినిమాత్రం యీవిధంగా బాగుపరచవచ్చు.

ఈదేశానికి ముఖ్యంగా సంపద చేకూరుస్తున్నది వ్యవసాయదారుడు. అందుచేత వాడికి విజ్ఞానాన్ని, నవ్య కృషివిధానాన్ని దినదినమూ బోధిస్తే మంచిది. గ్రామ పునర్నిర్మాణంలో ఇది గొప్పవిశేషం.

ప్రత్యేకంగా ఉపన్యాసకులు పల్లెటూళ్లకు పోయి బోధించాలనుకోటం అసంభవము కావచ్చు. పల్లెటూరిజనము గ్రంథాలు చదివేటంత విద్యావంతులు కారు కాబట్టి బోధచెయ్యటానికి మనుష్యులే కావాలి; కాని ఆవిద్యాబోధ ప్రతిదినమూ ఉండాలి. ఒక ఉపన్యాసకుడు ఒకవూళ్లో చెప్పి మళ్లీ ఇంకోవూరికి పోయి వచ్చేలోపల వీళ్లిదంతామరిచిపోతారు. నిజంగా పల్లెటూళ్ల ప్రజల జీవనవిధానాన్ని వృద్ధిపొందించాలంటే ప్రతిదినమూ ఈ యంత్రమూలమున వార్తాప్రచారం చెయ్యాలి. ఎవడో ఒక్కవిజ్ఞాని ఒకనగరంలో నుంచోని యీవిధంగా వందలకొలది గ్రామాలప్రజలకు వివిధవిషయాలలో ఉపకారం చెయ్యవచ్చు.

పల్లెటూళ్ల ల్లో ఆరోగ్యము, ఐశ్వర్యము, సౌఖ్యము అభివృద్ధిచెందటానికి వారు చాలా చిన్న చిన్న పనులను క్రొత్తమార్గాలలో కష్టపడి చేసుకోటం అవసరము. వారికి ముఖ్యంగా చెప్పవలసినవి శరీర నిర్మాణశాస్త్రము, ఆరోగ్యవిధానములు, శిశురక్షణ, లాభకరమైన నవీన వ్యవసాయ పద్ధతులు, వర్తకవ్యాపార విషయములు మొదలైనవి. ఇందువల్ల బస్తీలలో వుండేవారికీ వీరికీ అన్యోన్య సన్నిహిత సంబంధం యేర్పరచవచ్చు.

ఇటువంటి 'బ్రాడ్‌కాస్టింగు' ఏర్పరచటానికి అప్పుడే ఆలోచనలు జరుగుతున్నవి. హైదరాబాదు నవాబుగారు తమరాజ్యంలో యేర్పరచటానికి మూడు లక్షల రూపాయలిచ్చారు. 'పశ్చిమోత్తర సరిహద్దు రాష్ట్రము'లో సుమారు ౨౦౦౦ చదరపుమైళ్ల వైశాల్యమునందలి గ్రామాల కీక్రొత్తపద్ధతి యేర్పాటు చేస్తున్నారు. కొం. న.

[ఏషియాటిక్ రివ్యూ ననుసరించి]

---

## నేర్చుకోవలసిన "దుర్గుణాలు"

పైకి విపరీతంగా కనబడ్డా, ఒక బ్రిటిష్‌కళాశాల విద్యార్థులకు బహుమతు లిచ్చే సందర్భంలో 'బ్రైటన్' నగరాధ్యక్షురాలు చెప్పిన యీక్రింది విషయాలలో సత్యం లేకపోలేదు:

"విద్యార్థులు జీవనోపాధి నన్వేషించుకునే ముందు వారికి నేనొక సలహా యిస్తున్నాను. ఇది విద్యాశాఖవారూ, మన తత్వశాస్త్రజ్ఞులూకూడా నిరాకరించి 'దుర్గుణం' అని దూషించేవిషయం. కాబట్టి నా ఉపన్యాసం కాగానే మీ ఉపాధ్యాయులు ఈవిషయాలు మీబుర్రలో కెక్కకుండా చేయటానికి గట్టి ప్రయత్నం చెయ్యవలెనని కోరుచున్నాను.

"ముందుగా మీరు ఒకఅభిప్రాయం కలిగించుకోవాలి 'మేము ఎందుకూ పనికిరాము' అని. మీరు చాలా అల్పులుగా జనించి లోకంలో నిరర్థకులై వున్నారని విశ్వసించాలి. అంతేకాని 'ఆత్మవిశ్వాసం' అంటూ మీపంతుళ్లు చెప్పేమాటలు విని గర్వపడవద్దు. ఎందుకంటే ఏదైనా గొప్పగ్రంథముకాని, కట్టడముకాని, చిత్రముకాని చూచినప్పుడు మీమనస్సులలో గౌరవమూ, భయభక్తులూ కలగటానికి ముందుగా మీరు అల్పులు అనేభావం మీ కుండాలి. అప్పుడు మహాత్ములమీద మీకు విశ్వాసం యేర్పడి మీకు తెలేకుండానే వారిగుణాలు మీలో ప్రవేశిస్తుంటవి.

"రెండవది. భవిష్యత్తును గూర్చి వీలైనంత దురభిప్రాయమే కలిగించుకోండి; రాబోయేకాలం మహాభయంకరంగానే వుంటుందనుకోండి గాని, వూరికే గాలిమేడలు కట్టుకోవద్దు. ఘనులంతా చెప్పే 'ఆప్టిమిజమ్' మీకు వద్దు. ఎప్పుడూ 'పెస్సిమిజమ్' మాత్రమే అలవరుచుకోండి. లోకమంతా ఇప్పుడున్నట్టే ముందుండదు. ఎక్కడినుంచో ఏదో వస్తుంది, మనకు ఒరిగిస్తుంది అనుకోకుండా ఎప్పుడూ జాగ్రత్తగా వుండడమే అలవరుచుకోండి. అప్పుడు మీలో శక్తి, సహనశీలత, పట్టుదల బలపడగలవు. మీకు సుఖాలు ఉండక పోవుగాని, కష్టాలుగూడా వుంటవని మరిచిపోవద్దు.

11. 12- 18 గంగ

"అసంతృప్తి అనేది అద్భుతంగా అలవాటు చేసుకోండి. 'సంతుష్టి వుంటేగాని సౌఖ్యంలేదు' అనే ఉపాధ్యాయులమాటలన్నీ వుత్తవి. ఎంత పైకివచ్చినా ఇంకా యేదో కావాలనే కోర్కె వుంటేనే సజీవంగా వున్నట్టు. సంతృప్తిచెంది వూరుకుంటే చచ్చిపోయి నట్టే. విల్లంబులతోను, పర్ణశాలలతోను మానవుడు సంపూర్ణతృప్తి చెందివున్నట్టయితే యీనాడు మన కీవిజ్ఞానమంతా వచ్చేదేకాదు. అంటే మనము దేన్ని నాగరకతాభివృద్ధి అని నమ్ముతున్నామో, శాస్త్రపరిశోధన లేయే సౌకర్యాలు మనకు రోజురోజూ కలిగిస్తున్నవో అవిఅన్నీ 'అసంతృప్తి'కి ఫలితాలే. కాబట్టే బ్రతికినన్నాళ్లూ మీరు బ్రతికివుండాలంటే 'తృష్ణ' అనేది బాగావుండాలి" కొం. న.

—డెయిలీ ఎక్స్‌ప్రెస్.

---

## కళ—సౌందర్యము

"అన్నిదేశాలలోను కళకీ సౌందర్యానికీ గొప్ప సంబంధం వున్నదనడం పొరపాటు. ప్రకృతికీ, స్త్రీలకూ సౌందర్యం అవసరమేమోగాని కళకు అంతగా అక్కరలేదు. ప్రాచీనచిత్రాలలోనూ శిల్పంలోనూ అనేకచోట్ల సౌందర్యవాసనైనా లేక, కేవలం అవి వికారంగానూ, వివర్ణంగానూ వుండి మహాదుఃఖాన్నీ, వుద్రేకాన్నీ, వాంఛనూ కలిగించి మహాకళకు తార్కాణాలుగా వున్నవి.

"ఈ కాలంలో తీవ్రయోచనాశక్తి వుంటే చాలుననే అభిప్రాయం ప్రబలుతున్నది. కాని, అంతకంటే అవసరమైనది భావోద్రేకము, అనగా, ఇంద్రియములు పొందే తాత్కాలికానుభవము. ఇదే కళావస్తువు కలిగించవలసిన ముఖ్యఫలితము. గ్రంథంకాని, చిత్రంకాని సులభంగా అర్థంకాకుండావుండాలని లోతుగ్గా ఆలోచించవలెనని వ్రాస్తే కేవలం ఊహాలు పనికిరావనికాని, దానిని చూచినవాడికి వెంటనే ఫలితం కనపడాలంటే మనశ్శరీరాలను ఉద్రేకింపజేయటమే ముఖ్యగుణం. కేవలం ఆనందమే కలగాలనీ యెక్కడా లేదు. గొప్పవిషాదంకాని, ఓదార్పుకాని, ఏదో గడబిడకాని కలగవచ్చు.

"ఒకగ్రంథంలో 'సౌందర్యం' లేదంటే అది విమర్శకాదు. అట్లాగే చిత్రకళ, శిల్పముకూడాను."

కొం. న. —'స్టేట్స్‌మన్'

---

## వైజ్ఞానిక ప్రజ్ఞలు

సైన్సు నానాటికి అభివృద్ధిఅవుతున్న కొలదీవింత వింతవిషయములు వింటూ ఆచరించగలుగుతూవుండ గలము. ఇదివరలో కళ్లద్దముల ప్రయోజనము చిన్నక్షరములను పెద్దక్షరములుగాను, దూరపువస్తువులను దగ్గరగా వున్నట్లుగాను చూపించటమేగా వుండేది. పట్టపగలు, దీపముముందర అయితేనేతప్ప సులోచనముల జోడుయొక్క ప్రయోజనము లేకపోయేది. రాత్రి చీకట్లో కళ్ల జోడు పెట్టుకున్నా ఒకటే, మానినా ఒకటే; గ్రుడ్డికన్ను తెరచినా ఒకటే, మూసినావకటే అయినట్లు. కాని ఈనడుమను చీకట్లో త్రోవకనుక్కొని ప్రయాణము చేయుటకు, పుస్తకములు చదువుటకు, పనిపాటులు చేసుకొనుటకు, ఆఖరుకు సూది బెజ్జములో దారము గ్రుచ్చుకుంటకుసహా ఉపయోగించే కళ్లద్దములు కనిపెట్టబడినవి. ఇందేమియు బ్రహ్మాండమైన వైజ్ఞానిక రహస్యము లేదు. అద్దపుపెంకులకు బదులు ఎలెక్ట్రిక్కు బల్బులు కండ్లకు తగిలిస్తారు. జేబులో బేటరీ పెట్టివుంటుంది. దానితో బల్బులకు కనెక్షను వుంటుంది. ఇదే సూత్రమైనప్పటికీ, పనితనము నేర్పువల్ల అది మామూలుజోడువలె కనిపించును. ఇంతేకాకుండా బ్యాటరీలైటులోలాగ ఫోకస్సులో వున్నంతమట్టు పదార్థమేకాక, మామూలుగా కన్ను కనుకొనగలిగేటంత మేరలో వుండే పదార్థములన్నీ స్పష్టముగా గోచరమవుతవి.

ఇప్పుడు వార్తాపత్రికలను మనము చదువుతున్నాము, లేదా ఎవరైనా చదువుతే వింటున్నాము; కాని గ్రామఫోను ప్లేటులాగ దానంతటదే మాట్లాడి ఏక్కడెక్కడి ప్రసంగములు చెప్పుతూవుంటే హాయిగా

వింటూ కూర్చోలేకుండావున్నాము. ఇకముందువచ్చే దినపత్రికలు, వారపత్రికలు మొదలైనవి మనము చదువుకోవడమో, చదివించుకోవడమో మొదలగు బాదరబందీ లేకుండా తీరుబాటైనప్పుడు పిలిస్తే వచ్చిచెప్పవలసిన సంగతులన్నీ చెప్పేసి వూరుకొంటాయి. అయితే యీ పత్రికలు చదువుకొంటకు పనికిరావు. దానిమీద అక్షరా లుండవు. మాట్లాడేటప్పుడు కలిగే ధ్వని యొక్క వక్రవక్రతరంగములనన్నిటినీ ఫోటోతీసి ప్రకటిస్తారు. గ్రామోఫోనుసూగులకు బదులుగా "ఫోటోలిస్టాఫోను" అనే పరికరమును దానిమీద పెట్టితే అది ఆఅక్రము లన్నిటిమీదనుంచి నడిచి ఆమాటల నన్నిటినీ తిరిగీ ఉచ్చరించి ఎక్కడెక్కడి కథలు, లెక్చర్లు మొదలుసవానిని యథాతథా గా, ఏయే యుపన్యాసకులు లేక నటకు లెట్టిగొంతుకలు, ఉదాత్తానుదాత్తములు ఒత్తులు సాదులుతోను ప్రసంగించారో ఆవిధంగా ప్రసంగిస్తాయి. అయితే వీనిని రేడియోలలాగున బజారులో పెట్టడానికి వీలులేదు. అక్కడి గల్లంతులో ఇదేమీ వినిపించదు. ఒకయింట్లోనో గదిలోనో ఒకకుటుంబమువారు కూర్చొని ఆలకించితే చల్లగా, సన్నంగా కథచెప్పుతూవుంటాయి.

ఈ వక్రవక్రమైన తరంగాలు ధ్వనికిమాత్రమే వుంటాయనుకోకూడదు. మాటలుగాను, ధ్వనిగాను ఉచ్చరించబడక మెదడులో కేవల మూహ లేక ఆలోచన రూపముగా ప్రసరించుచున్నప్పుడుకూడ ఆ ఆలోచనా గమనమునకుకూడ తరంగా లుంటాయని వైజ్ఞానికులు కనిపెట్టినారు. ఈసూత్రము ననుసరించి లండనులో మేజరురేయిమండు ఫిలిప్సుఅనునాతడు 'హ్యూమనోస్కోపు' అనే సాధనమును కనిపెట్టినాడు. దీనివల్ల మోటారులు మొదలైన యంత్రములను నడిపేవారు బండిలో కూర్చొని యంత్రాలను నడపాలనుకుంటే నడుస్తాయి, ఆపాలంటే ఆగుతాయి. భావతరంగాలేమో ఒక అదృశ్యకిరణమై వెళ్లి ఒక వైరులెస్సుమీటను నొక్కతాయిట. దానితో బండి యంత్రముకదలడమో మానడమో జరుగుతుందిట. ఈయంత్రము నింకా అభివృద్ధిపరచినయెడల యెదుటివారి హృదయములలో ఎట్టి భావము లుంటున్నవో వినుటకు సాధ్యమౌతుందని అతను చాటుతున్నాడు.

మనస్సులో జరుగుతూవుండే వూహాలను కనిపెట్టుటకు యంత్రాలు కనిపెట్టబడుతున్నవి. ఒకమనిషి పైకి చెప్పుచున్నమాట అతనిహృదయంలో వున్న భావమునకు సరియైన ప్రతిబింబ మవునో కాదో పోల్చుకొనుయంత్రమును అమెరికాసంయుక్తరాష్ట్ర పోలీసు శాఖకు చెందిన కర్నలుగోదార్డుగారు కనిపెట్టినారు. పోలీసువారు ఈయంత్రమును నేరస్థులమీద, దొంగలమీద ప్రయోగించుచున్నారు. నేరస్థులైనవారు తమ తప్పులను ఒప్పుకొనుచున్నారు. ఈయంత్ర మెట్లయినను యథార్థము బయలుపరచును గనుక ఇప్పు డసత్య మాడి తరువాత నేల సిగ్గులపాలుకావలెనని అనేకులు దీనిపేరు చెప్పేటప్పటికి నిజమును ఒప్పుకొనుచున్నారు. ఈయంత్రముసహాయమున అన్యాయముగా నేరముమోపబడినవారిని తప్పించుటకుకూడ వీలుకలుగుచున్నది. ఇప్పటికి 1400 కేసులు దీనిమూలమున విచారణచేసినను, ఒక్కటియూ అసత్యముకాలేదు. చికాగోనగరములో 45 బ్యాంకులవారు దీనిని కొనుక్కొన్నారు. దీనిమూలమున తప్పులెక్కలు వ్రాసి ధనము నపహరించెడి గుమాస్తాల నిట్టే కనిపెట్టవచ్చును. ఒకబ్యాంకువారు 5000 డాలర్లు కనిపించనప్పుడు 56 గురు గుమాస్తాలమీద అనుమానపడి అందరిమీద ప్రయోగించిరి. పన్నెండుగురు నేరస్థులైనట్లు తెలిసినది. ఈయంత్రము వచ్చినతరువాత జయిలుశిక్ష మొదలైనవి అవసరములేకుండా పోవుచున్నవి. ఒకసారి నేరముచేసిన దొంగలకు తిరిగీ ఉద్యోగమిచ్చినచో వారు తిరిగీ దొంగతనముచేయకున్నారు. దొంగతనము సాగదంటే చేయసాహసించగలవా రెంతమంది వుంటారు?

ఇప్పటి గ్రామఫోనులు, టాకీలు మొదలైనవి సాధారణులకు యేవోసంగతులు, సంగీతములు వినిపించుటకే సహాయపడుతున్నవికాని చెవిటివాళ్లకు వీటివల్ల ప్రయోజనమేమీ లేకుండావుంది. జర్మనీలో ఒక పండితుడు పళ్లతో వినగల సాధనమును కనిపెట్టినాడు. ఈసాధన మమర్చిన గ్రామఫోనులు చెవిటివాళ్లు విను

టకేతప్ప సాధారణులు వినడానికి పనికిరావు. గ్రామ ఫోనుప్లేటుమీద ముల్లు నడిచేటప్పుడు కలిగే ధ్వని తరంగములన్నీ ఒకతీగద్వారా మెత్తని అట్టలలోనికి జరపబడతవి. ఈఅట్టలను చెవిదగ్గర పెట్టుకొంటే యేమీ వినబడదు. కణతలదగ్గరకాని, గడ్డముదగ్గరకాని, ముఖ్యముగా పెదిమలద్వారా పండ్లకు ఒత్తియుండు నట్లుగాని తగిలించియుంచినయెడల కర్ణనాళములకు వాటికి ఉండు నరముద్వారా చెవులకు ధ్వనులు స్పాటు లుగా వినిపించుతుంది. ఇది ముఖ్యముగా చెవిటివారికి మిగుల ప్రయోజనకరము.

గరిమెళ్ల సత్యనారాయణ

---

## జైనులు - భారతీయ వాఙ్మయము

జైనులు భారతీయవాఙ్మయానికి కూర్చి యుండే రచనలను ప్రస్తావిస్తూ, అందులో ఒకటైన నీతివాక్యామృతాన్ని గురించి 'ఇండి యన్ కల్చర్' అనే పత్రికలో యం. వింట ర్నిజ్ గారిలా వ్రాశారు:

ఈ నీతివాక్యామృతంలోని విశేష మేమి టంటే, ఇందులోనివన్నీ చిన్నచిన్న వాక్యాలు. అందులో కొన్ని సామెతలుగాకూడా ఉపయోగిం చుకో తగినవి. కొన్నిటిని చూడండి:

'కరువులోకూడా రాజు పన్నులు కావాలం టాడు. సముద్రానికికూడ దప్పికవేస్తే ఇక ప్రపంచానికి నీళ్లెలా వస్తాయి?'

ప్రజల క్షేమానికేగాని తన ఖజానా నించుకో డానికిగాదట రాజు ప్రజలను శిక్షించవలసింది: 'తన జీవనానికిగానే తప్పు (రోగాలు) లెన్నే వాడు ఒకరాజా (వైద్యుడా)?'

'యజమానిదాపునవుంటే గొఱ్ఱెకూడా సింహ మవుతుంది.'

'ఇల్లొకవంక తగలడిపోతూవుంటే బావి తవ్వ డమా!'

'కుక్కకు ఏమిపెట్టి పోషిస్తేమాత్రం అది ఎముకలు గిముకలు తినడం మానుతుందా! పాముకు ఎంత చక్కెరా, పాలూ తాగిస్తేమాత్రం దాని విషం పోతుందా! అల్లాగే ఎంతనేర్పినా కోతి తన చాం చల్యం మానదు.'

'మట్టుపంగా భోంచేసేవాడు అమితభోజి.'

'బలవంతునికి అంతా పథ్యమేనని విషం తాగ వద్దు.'

'శాస్త్రాధికారులు మంత్రాధికారులుకారు అనే సోమదేవసూక్తిని మన్నించేవుంటే దేశంలో ఇంత రక్తపాతమూ, ఇంత దీనస్థితీ ఉండేవేకాదు.'

---

## సోవియటుచైనా

ఆసియాఖండములో చైనాసోవియటు పరిపా లన నూతనపరిస్థితులను కల్పించినది. కూలినాలిచేసికొని జీవించు బీదవారికి సేద్యగాండ్రకున్ను అనుకూలముగ నుండుటకై గొప్పప్రయత్నము లీప్రభుత్వమువారు చేయుచున్నారు. ఇట్టిప్రభుత్వమును నెలకొల్పుటలో చైనావారు చాలధైర్యము చూపినారని చెప్పవలసి యున్నది. ఎందువల్లననగా సోవియటుచైనా అసలు చైనాలో ఆరవభాగముమాత్రమే. ఫ్రాన్సుదేశ విస్తీ ర్ణము ఈ సోవియటుచైనాలో నవాంశమే. జర్మనీ యొక్క విస్తీర్ణము సోవియటులో 2/3 మాత్రమే. అధి నివేశముల విస్తీర్ణము తీసివేయగా జపాను సోవియటు చైనాలో సగముకన్న కొంచెము పెద్దది యగుచున్నది. అదేవిధముగ ఇంగ్లండు దీనిలోపాతికభాగమగుచున్నది. సోవియటుచైనాలోని ప్రధానమండలము హాలెండు బెల్జియముల మొత్తమువిస్తీర్ణమునకు రెండింతలుపెద్దది. అట్టిది యీసోవియటుచైనా. యూరోపులోని దేశ ములపోలిక నటుంచినను దీనిని ప్రపంచమందలి ఖండ

ములతోకూడ పోల్చవచ్చును. సోవియటుపరిపాలన ప్రారంభింపబడిన చైనాభాగ మింతపెద్దది.

వీరిప్రభుత్వవిధాననియమములు వీరి ధైర్య సాహసములకు నిదర్శనములు. దానిప్రకారము ప్రభుత్వమునకు ప్రజలయామోదమును, సహకారమును ఆవశ్యకము. ఇది సామ్యవాదమునకు సరిపోవుచున్నది. ఇందుమూలమున దేశమందలి వినాశకరహేతువులు నిర్మూలము గావింపబడినవి.

ఈప్రభుత్వము స్త్రీలకు సర్వస్వాతంత్ర్యముల నిచ్చినది. వివాహవిషయములందును, విడాకులయందును ప్రజలయిష్టమే. విద్యాభ్యాసము, మతము మొదలయిన విషయములలో ప్రజలకు సంపూర్ణస్వాతంత్ర్యములు గలిగినవి. వీరు దేశవిదేశ తీవ్రవాదులకు వసతి నొసంగియున్నారు. తమవారితోబాటు అన్యదేశములందుండి వచ్చిన పనిపాటులవారికిని వీరు అన్నిహక్కుల నిచ్చి రక్షించుచున్నారు.

భూములకు సంబంధించిన చట్టములు, ఎర్ర సైన్యము మొదలయినవి పనిపాటులవారి రక్షణకై యేర్పరుపబడినవి. వీరి ఆర్థికవిధానము సామ్రాజ్యవాదుల కనిష్టము గొల్పునదియై యున్నది. దానివల్ల ప్రస్తుతము ధనవంతుల చేతులలోనున్న అధికారములు ప్రజలచేతులలోనికి వచ్చుచున్నవి. అచ్చట పరిపాలనావిధానమును సూక్ష్మముగ తెలుపుట కానిపని. వారి పరిపాలనావిధానమంతయు ప్రజాసామాన్యమునకు చాల అనుకూలమై ఆర్థికముగ దేశాభివృద్ధి కనుకూలించునదై యున్నదని చెప్పినచాలును.

['Young ceylon' అనుపత్రికలో సోవియటు చైనాను గురించిన విషయములనుండి పైభాగము గ్రహింపబడినది]

---

### ఇండియాలో కూలిపని - పసిపిల్లలు

ఇండియాజనసంఖ్యలో పసిపిల్లలసంఖ్య ఎక్కువ. శిశుమరణము లిక్కడ అధికము గాన మనదేశమున స్వల్పకాలము మాత్రము జీవించువా రెక్కువగనున్నారు. ఇక జనసామాన్యమునందు దారిద్ర్యము ప్రబలియున్నది. ఇండియాలో ప్రారంభవిద్యకు నిర్బంధములేదు. ఈ కారణములవలన పనిపాటులవారిలో ఇతరదేశములందు కంటె యిండియాలో పసిపిల్లలసంఖ్య చాలఎక్కువగా నున్నది. కూలిపనులలో నియోగింపబడిన పసిపిల్లల సంఖ్య స్వల్పమే. ఇక పరిశ్రమాలయములలో నున్న పసిపిల్లల సంఖ్య మరీస్వల్పము.

ఇండియాలో బాలురు, బాలికలు తమ తలిదండ్రులకు వ్యవసాయము, చేతిపనులు మున్నగువానియందు సాయపడుచున్నారు. అది యిప్పటికిని చాలచోట్ల జరుగుచునే యున్నది. ఆధునికపరిశ్రమలు అభివృద్ధి చెందగనే పసిపిల్లల కూలిపని ఒకగొప్పసమస్యయైనది. చక్కని యేర్పాటులు గలిగిన పరిశ్రమలలో, మంచి కట్టుదిట్టములు నేర్పరచి, అందు పసిపిల్లలను పనుల యందు చేర్చుకొనుటలో నిశ్చయముగ అనేకలాభము లున్నవి. ఆలాభములు మనకు కలుగవలయునన్న పసిపిల్లలను చేర్చుకొనువిషయములో మంచి కట్టుదిట్టములు లేకపోయినయెడల సంఘమునకు, పసిపిల్లలకు అనేక ఆపదలు సంభవించుట కవకాశములు గలుగగలవు.

పనులయందలి పరిస్థితులు, జీవన నియమములు, సంఘముయొక్క నిర్బంధములు అను నీమొదలువిషయములు, పసిపిల్లలను పనిపాటులలో, ముఖ్యముగా పరిశ్రమాలయములలో చేర్చుకొనుటయందు అడ్డుతగులుచున్నవి.

పరిశ్రమలలో కూలికిపోవుటకు వయ స్సెంత యుండవలయును? వారి ఆరోగ్యము, పనిచేయుకాలము, కూలీలు మొదలగువిషయములలో ప్రస్తుతము ఇండియాలో ఎక్కువ శ్రద్ధవహించుచున్నారు.

పసిపిల్లలు కూలిపనులు చేయుటనుగురించి చట్టముల నిర్మించుటలో, వారి దేహారోగ్యము, వారికి చదువురాగలకాలములో చదువుకొనుటకు మంచి సదుపాయములు కల్పించుట మొదలయిన ముఖ్యాంశములు జాగ్రతగ గమనించుచున్నారు. ఈవయస్సు వచ్చిననే

గాని పనులలో పసిపిల్లలను చేర్చుకొనకూడదను నియమము, తరువాత ఈవయస్సువరకు వీరు పనిచేయుటకు ఈనియమముల ననుసరించవలయును అను మొదలయిన కట్టుదిట్టములను చేసినయెడల పైచట్టముయొక్క ఆశయములు నెరవేరగలవు.

పసిపిల్లలను పనులలో చేర్చుకొను సమస్యకు ఒకే ఉపాయమున్నది. అదియేమనగా, ఇండియాలో నంతటను నిర్బంధ ప్రారంభవిద్యను ప్రవేశపెట్టుటకు ఏర్పాటులు చేయవలయును.

పరిశ్రమాలయములలోను, గనులలోను పనిచేయు కాలము ఇపుడు చాలవరకు తగ్గింపబడినది. అట్టికాలమును ఇంకను తగ్గించువిషయమై ఆలోచనలు జరుగుచున్నవి. క్రొత్తక్రొత్తగా బయలుదేరుచున్న పెద్దపెద్ద పనులలో పనివారి దేహారోగ్యము, సంరక్షణ మొదలయినవాటి విషయమయి సంతృప్తికరమయిన ఏర్పాటులున్నవి. ఇట్టివానివిషయమై ఇంకను కొన్ని ఏర్పాటులు జరుగవలసియున్నది. ముఖ్యముగా చిన్నచిన్న గనుల పనులు, తోటపనులు, పైర్లు మొదలయినవానియందు పై నియమములింకను సరిగ ఏర్పడలేదు. కూలీల విషయములో వాటిని యిచ్చుపద్ధతిమాత్రమే ప్రస్తుతము చట్టముచేయబడియున్నది.

తాత్కాలికముగ పనిచేసి మరల నిలిచిపోవు పరిశ్రమలింకను పరీక్షింపబడలేదు. ప్రస్తుత పరిస్థితులను బట్టి రెండుసంవత్సరముల కొకమారు ఒకఉద్యోగి తేయాకుతోటల తనిఖీచేయుచున్నాడు. ఇట్టితోటలలో స్త్రీలు, పసిపిల్లలు మాత్రమే ఎక్కువగ పనిచేయుచున్నారు. పరిశ్రమాలయములు, గనులలో స్త్రీలు, పిల్లలు అంతఎక్కువగ లేరు. కనుక పైర్లు మొదలయిన వాటి పనులను తనిఖీచేయుటకు స్త్రీల నెక్కువగ ఇన్‌స్పెక్టర్లుగ నియోగించుట మంచిది.

పసిపిల్లల కూలిపనులవిషయములో రెండవది ఏమనగా, వారి జీవనసౌకర్యములు, వారి దేహారోగ్యము, సంఘస్థితులు, పిల్లలయభివృద్ధి కనుకూలములగు పరిస్థితుల నేర్పరచుట యిత్యాదులు. ఇచట ముఖ్యముగ గమనింపతగ్గవి: వసతులు, ఆరోగ్యవిషయము, కాన్పులు, శిశువులపోషణ, పనివారి గృహములు వారి మతము మొదలయినవి. ప్రస్తుతము ఇండియాలో ఇవన్నీ పరిశ్రమల యజమానుల మంచితనమునకే వదలివేయబడియున్నవి. కొన్నిచోట్ల జనులయాదరణము వలన ఎట్లో జరుగుచున్నవి. కాని కాన్పులవిషయమై మాత్రము రెండురాష్ట్రములలో చట్టములు చేయబడియున్నవి. ఇంతముఖ్యమైన విషయములయందు ప్రభుత్వమువారు తగిన చర్యతీసుకొనుటయే ప్రస్తుతము ఇండియాలో జరుగవలసియున్నది.

యజమానులే తమపనివారికి యిండ్లఏర్పాటు చేయుట అంత కోరదగినదికాదు. అందువలన చాల యిబ్బందులున్నవి. స్వేచ్ఛయును తక్కువ అవకాశము గలుగును. ప్రభుత్వమువారుగాని, వారితో సంబంధము గలిగిన యితరసంస్థలుగాని పనివారికి గృహసౌకర్యముల కలిగించి నామకార్థమేదో బాడుగ తీసుకొనుచువచ్చిన యెడల పనివారి కేయిబ్బందులును కలుగవు.

గృహసౌకర్యములు కలిగించుటతోబాటు ఆరోగ్యవిషయములనుగూడ గమనించవలయును. నీటిసరఫరా, మురుగునీటిని చేరనీయకుండుటకై ప్రస్తుతము జరుగు ఏర్పాటులును మున్నగువాని విషయమున్ను గమనింపదగినవి. ఇలాటిగృహనిర్మాణ, ఆరోగ్యసంరక్షణ సదుపాయములవలన శిశువుల కెంతోమేలు గలుగగలదు. ఇంతేకాక పనివారల విజ్ఞాన వ్యాయామములకున్ను ఏర్పాటులుండవలెను. ఇట్టి చక్కని పరిస్థితులు ఏర్పడిన యెడల మానవాభ్యుదయము, గృహసౌభాగ్యము మొదలయినవాని యభివృద్ధి కేయాటంకమును ఉండదు.

ఇంతకన్న ముఖ్యమయిన అంశము ఇంకొకటి కలదు. అది పసిపిల్లల కూలిపని విషయమై గమనించవలసిన సంఘనియమములు, దీనికిసంబంధించిన చట్టములు మొదలయినవాటిని బాగుపరచి యిండియాలో పారిశ్రామికుల స్థితులను సంస్కరించి పసిపిల్లల యభ్యుదయమున కనుకూలపడు పరిస్థితుల నేర్పరచు పరిపాలనావిధానము పసివారి కెక్కుడు లాభదాయకముగ నుండవలయును.

నాగ్లె

ఈవిధానముప్రకారము పసిపిల్లల అభివృద్ధికి అవకాశములు మెండుగ నుండవలయును. అదియే ఈ విధానముయొక్క కర్తవ్యమై యుండినయెడల సంఘము గూడ అవిచ్ఛిన్నముగ వృద్ధిబొందగలదు. ఈవిధాన మునకు ముఖ్యసూత్రములు: తమంతటతామే వచ్చి పసిపిల్లల పోషించువారికి చేయూతనిచ్చుట, నిర్బంధ ప్రారంభవిద్యాపోషణము, సంఘాభివృద్ధి కనుకూలించు చట్టముల నిర్మాణము అనునవి.

౧. జనసంఖ్యాభివృద్ధిని గమనించి యుండుట; ౨. శిశువులకు పుట్టుకతోనే రోగములు రాకుండకాపాడుట, ౩. శైశవములో బిడ్డల ఆరోగ్యమును కాపాడుట అనునవి పసిపిల్లలను పోషించు బాధ్యతను కోరి తెచ్చుకొనుటలో మూడువిధములు.

సంతానోత్పత్తి కొంతతగ్గినయెడల యిండియాలోని పసిబిడ్డలకు క్షేమముగలుగును. ప్రసవించు సందర్భములలో అనేకమంది స్త్రీలు మనదేశమున చనిపోవుచున్నారు. గర్భములోనే చనిపోయి వెలికివచ్చు బిడ్డలు కొందరు. ఇక బాగుగనే పుట్టినవారిలో అయిదవవంతుబిడ్డలు ఒకసంవత్సరము వయస్సురాక పూర్వమే చనిపోవుచున్నారు. యౌవనము రాకనే చనిపోవు స్త్రీపురుషులసంఖ్య చాల యధికము. ఇట్టి మనయిండియాలో సంతాననిరోధము చేయుట గొప్ప సుగుణము కాగలదు. ఈవిషయమై మైసూరు ప్రభుత్వమువారు అపుడే చర్యతీసుకొన్నారు. సంతాన నిరోధమును బోధించు వైద్యశాలల నిర్మించువిషయమై మదరాసు గవర్నమెంటువా రిదివరకే తమసమ్మతిని తెలిపియున్నారు. సంతాన నిరోధమును బోధించు వైద్యశాలలను దేశమంతట నెలకొల్పుటయే ప్రస్తుతము జరుగవలసినపని.

రెండవ విషయము: మన దేశములో ఆరింట అయిదుపాళ్లు పసిపిల్లలకు విద్యాసౌకర్యములు లేవు. అట్టి సౌకర్యముల నేర్పరచు విధానములను అవసరముగ ప్రవేశపెట్టవలయును.

ఈవిద్య నేర్పుటలోనే పారిశ్రామికములకు పనికి వచ్చునట్లుగ పిల్లలనుతయారుచేయవలెను. మనదేశములో వర్ధిల్లుచుండిన అనేకములయిన పరిశ్రమలు, చేతిపనులు నశించినవి. ఇక ఆధునిక పరిశ్రమలలో మనవారు చాలవెనుకబడియున్నారు. కావున పసిపిల్లలకు నేర్పువిద్యలో యిట్టిమార్పులను చేయుట అవసరము.

సంఘాభివృద్ధి కనుకూలించు చట్టముల నిర్మించుట ఈవిధానముయొక్క ప్రధానాశయ మయి యుండగలదు. ఈవిధానమువలన పసిపిల్లలు బాగుగ వృద్ధిబొంది తెలివితేటల సముపార్చుకుని, సన్మార్గావలంబులయి, పెద్దపెరిగినతరువాత మంచిపనివాండ్రయి, దేశాభ్యుదయము కోరు జానపదులయి, తమకును, తమ సంఘమునకును, తమదేశమునకును అమోఘమగు సేవ జేయగలరు.

రజనీకాంతదాసుగారు 'International Labour Review' లో వ్రాసిన వ్యాసమునుండి పై విషయములు సంగ్రహింపబడినవి.

---

## హిందూమతముయొక్క కొన్ని మూలతత్త్వాలు

మానవసంఘంలో కేవల మొక్క జ్ఞానులు, కేవల మొక్క అజ్ఞానులుమాత్రమేకాదు ఉండేది, ఇద్దరూ ఉన్నారు. అమనుష్యుల్లోకూడా ఎన్నో రకాలు. ఒక్కొక్కరి దొక్కొక్కప్రకృతి. కావున ఒక్కొక్కరి కొక్కొక్క కోరిక. దీనివలన అందరినీ ఒకే మార్గములో కొనిపోవుట దుస్తరము. ఆస్పత్రిలో రోగులున్నారంటే అందరి జబ్బులనీ ఒకేమందుతో కుదుర్చగలమా! రోగస్వభావాన్నిబట్టి మందు మారుతూ వుంటుంది.ఒకగురువున్నాడంటే,ఒకేవిషయాన్నయినా అందరుపిల్లలకూ ఒకేపద్ధతిలో నేర్పలేడు. వాళ్లవాళ్ల తత్త్వాన్నిబట్టి అనేకపద్ధతులు అవలంబిస్తూవుంటాడు. ఈ చిన్నపరమసత్యాన్ని గ్రహించే హిందూమతం యీవిశాలప్రపంచంలోని ప్రతీవానికీ-ఎక్కువవాడు

గాని, తక్కువవాడుగాని-తనలోకావచ్చింది; అనేక పద్ధతులతో ఒకేగమ్యాన్ని చేరుస్తూవుంది; భావస్వాతంత్ర్యాన్ని ప్రకటిస్తూవుంది. ఈలా అందరికీ ఐకమత్యం కుదిర్చింది. ఇందులో, మీమీ అభిరుచులను, మీమీ హేతువాదాలనుబట్టి నిరాకారునుగానో, సాకారునుగానో దేవుణ్ణి పూజింపవచ్చు. లేదా, ఇష్టమైతే 'అసలు దేవుడేలే' డనికూడా చెప్పవచ్చు. కాని ఈమతం నీవు నీగమ్యాన్ని చేరుకొనేమార్గం చూపగలదు. సత్యమొక్కటే, కాని దాన్ని పొందేమార్గాలు చాలా అని దానిబోధ. మనంచెప్పవచ్చు మాకు వెలుగుకావాలని, కాని మాఅందరికి ఫలానా వెలుగే కావాలని చెప్పలేము. ఒక్కొక్కరి కొక్కొకదీపం కావలసివస్తుంది, వాళ్లవాళ్ల అవకాశాన్నిబట్టి. కాని ఆదీపాన్ని ఏరుకొనడంలో ముందుచూపుతో ఏరుకొనవలసి యుంటుంది. మన సొంత ఆలోచన ఇందు కవసరం. ఇదే భావస్వాతంత్ర్యం. ఇదే మనలను పైకిపైకి తెచ్చేది.

హిందూమతంలో ఎన్నోమార్గా లున్నాయి: ఋజువైనవని కొన్నీ, వక్రమయినవనికొన్నీని, వాస్తవమే. కాని యెన్నివున్నా చివరకు అన్నిటికీ గమ్య మొక్కటే. ఇందులో దేనిని అవలంబించడమా అంటే అది నీవుండే పరిస్థితులనుబట్టి ఉంటుంది. ఒకానొకమహాత్ముడు చెప్పినట్లు, వేదాలనీ, సాంఖ్యమనీ, యోగమనీ, శైవమనీ, వైష్ణవమనీ యెన్నోవున్నాయి యిది మంచిది, అది మంచిది అని చెప్పేవి. కాని, నీళ్లు చివరికి ఎక్కడకు వెళ్లుతాయి? సముద్రానికి. అల్లాగే ఎవడెవడేయేమార్గాన పోయినా చివరకు చేరవలసింది ఆ భగవంతుని సన్నిధాన మొక్కటే.

హిందూమతంలో ఇంకొక్క అద్భుతశక్తి గూడావుంది: ఎవరిదగ్గర ఏమి మంచివుండినా గ్రహించడమేకాకుండా, దాన్ని ఎలాగైనా, ఎంతకాలానికైనా. తనదారిలోకి తెచ్చుకొంటుంది.

(కలకత్తా రివ్యూ ననుసరించి)

---

## మా పా ప

చావలి బంగారమ్మ

మాపాప చెంబులో
 నీళ్లొలకబోసింది
చందురుడు జారిపడి
చిందులాడేడు
చేయెత్తి మాపాప
చెడ మొత్తినాది
మరికొంత సేపటికి
మనసు నొచ్చింది
పాపనేమన లేక
పారిపోయేడు
పాకొచ్చి మాపాప
పడక జేరింది
కసిచేత తానొచ్చి
కళ్లలోబడ్డాడు
'నీకింతె'యని పాప
నిదురబోయింది
మరల నేడొచ్చునో
మరిరాడొ—ఏనెరుగ.



# ఆంధ్రాభ్యుదయము




శ్రీ యల్. సంజీవరాయడుగారు

వీరు జాత్యంధులు. ప్రొద్దుటూరునివాసులు. వీరికి మంచి ధారణాశక్తిగలదు. వీరు మాత్రములు దెలిసిన పెద్దపెద్ద లెక్కలనయిన నోటలెక్కించి చెప్పగలరు.

---







శ్రీమతి జె. సి. బెర్నార్డుసతి

ఈయమ కొచ్చి మునిసిపలుసంఘమున కధ్యక్షురాలుగా ఎన్నుకొనబడినది. ఇండియాలో నిట్లు మునిసిపలుసంఘమునకు స్త్రీని అధ్యక్షురాలినిగ చేయుట కిదియె ప్రథమము.

---



## పాండురంగమాహాత్మ్యము

పుట ౧౫౬, వెల రు. ౦-౧౦-౦.

గ్రంథకర్త: ఉభయభాషాప్రవీణ అత్తలూరి సూర్యనారాయణ, ఈమని, గుంటూరుజిల్లా.

తెనాలిరామకృష్ణకవి రచియించిన 'పాండురంగమాహాత్మ్య' నామకమహాప్రబంధమునందలి 'కథా వచనరూపంబున' రచింపబడినది.

---

## అనార్కలీ

గ్రంథకర్త: ముద్దుకృష్ణ. "జ్వాల", బెజవాడ. రాయల్ సైజు ౧/౮ పేజీలు ౩౬. వెల ౦-౪-౦

అక్బరుకొడుకు సలీం అనార్కలీ అనే బానిస దాన్ని ప్రేమించి పెండ్లిచేసుకోవలె ననుకొంటే అక్బరు మంత్రులసలహాతో ఆబానిసదాన్ని గోడలో పెట్టి పూడ్పించివేస్తాడు. ఇది యీపుస్తకములో ఉన్న కథ. ఇది చదువుకోడానికి పనికివచ్చే నాటకము. పుస్తకములో ఎక్కడా స్వగతాలు మొదలయిన పాత పద్ధతులు లేవు. సలీం కలగంటూ హడావుడిగా లేవడముతో ఆరంభమయినది. కొంచెముసేపు అయ్యేసరికి అబుల్ఫజలు అనే మంత్రీ, కవీ, సలీందగ్గరకు వస్తాడు. వాళ్లిద్దరూ పదిపేజీలు వ్యంగ్యముగా దానిమ్మపూలను గురించి మాట్లాడుకొంటారు. పదిపేజీలు యీసంభాషణతో నడిచేసరికి సలీంకు విసుగెత్తిందో, కాక గ్రంథకర్తకు విసుగెత్తిందో "ఈ వింతభాష నొదిలి సూటిగా మాట్లాడుదాము" అన్నాడు సలీం. అబుల్ఫజల్ సలీంకబుర్లకు గాభరాపడిపోయినాడు. వాండ్లిద్దరూ ప్రేమించుకోడము అక్బరుకు యిష్టమే. అయితే పాదుషాకొడుకు-కాబోయేపాదుషా బానిసదాన్ని పెండ్లిచేసుకోవడముమాత్రం పనికిరాదు. అయితే ఆసందర్భములో ఏమిచేయవలెనో అక్బరుకు తెలియక మంత్రులసలహాతో అనార్కలీని గోడలో పెట్టించి పూడ్పించివేయిస్తాడు. కథలో ఆకట్టె పట్టులేదు. పైగా కథ తెలియనివాండ్లు అతి జాగ్రత్తతో చదివితేకాని తెలియదు. పాదుషాకొమారుడు బానిసదాన్ని పెండ్లి చేసుకోవడము తప్పు అనే భావగాంభీర్యముతప్ప మరేమీ కనుపించలేదు. కాస్తలో, వీలయినప్పుడల్లా సలీం గంభీరోపన్యాసాలు చేస్తాడు. పుస్తకములో భాష మాత్రము ప్రతిపేజీలోనూ ఏదోఒకచోట అర్థం కాకుండా పేచీలుపెడుతూ ఉంటుంది. మొత్తము మీద గ్రంథకర్తఅభిప్రాయము ఇది అయిఉండవలెను, అదయిఉండవలెను అని అనుకోవలసిందే. మాసరాకు మొదటిపేజీలో మొదటి పంక్తిలో"...సోఫామీదను గోడనైపుముఖమైపడుకున్న సలీం నిట్టూర్చి...కన్నీరయిన కలలకన్నులతో..." అని ఉంది. గోడనైపుముఖమై అంటే గోడనైపు ముఖము పెట్టుకొని అని అర్థమయిఉండవలెను. ఇక కన్నీరయిన కలలకన్నులతో అంటే, కలలో జరిగిన దృశ్యమువల్ల కండ్లవెంట నీరువచ్చిందని, అట్లాంటి కండ్లు అని అర్థమేమో. ఇట్లాంటివి ప్రతిపేజీలోనూ, కాకపోతే ప్రతి రెండు

పేజీలకు ఒకచోటనైనా తప్పకుండా వస్తూఉంటవి. ఇట్లాంటి మాటలేకాకుండా వాక్యాలుకూడా కొన్ని చోట్ల అర్థంకావడము కష్టము. మచ్చుకు ౧౪-వ పేజీలో ౧౧-వ పంక్తి "హిందూమహమ్మదీయ సమ్మేళన, అక్బరుఅంబీరురాణులప్రేమఫలం, సలీం." ఇట్లాంటివి అన్వయము చప్పునబోధపడని వాక్యాలు చాలా ఉన్నవి.

అచ్చు-పుస్తకము తయారుచేసినపద్ధతీ అందముగా ఉంది.

శ్రీ. శి.

---

## కృష్ణగీతివ్రాతము

గ్రంథకర్త: శ్రీ విక్రమదేవవర్మ మహారాజులుంగారు, జయపురము, విశాఖపట్టణముజిల్లా.

మొత్తమున ౧౧౭ గీతులఁగావించిన శ్రీకృష్ణస్తుతి యీచిన్నగ్రంథము. ఇందు ౧. నవరత్నమాలిక, ౨. గ్రహమాలిక, ౩. రాశిమాలిక, ౪. నక్షత్రమాలిక, ౫. వత్సరమాలిక అను నయిదుభాగము లున్నవి. ౧-వ భాగమున నవరత్నములయు, ౨-వ భాగమున నవగ్రహములయు, ౩-వ భాగమున ద్వాదశరాసులయు, ౪-వ భాగమున సప్తవింశతినక్షత్రములయు, ౫-వ భాగమున షష్టివత్సరములయు నామములు గర్భితములయియున్నవి. ఈపద్ధతి గ్రంథకర్తృరచనాచమత్కృతిని తెలియఁజేయుచున్నది. 'విక్రమేశవర్మవినుత కృష్ణ' అనునది ప్రతిగీతికిని మకుటము. శ్రీవారు పండితులు, కవులు, బహుగ్రంథకర్తలు. తత్కవితామాధురి యాంధ్రలోకము చక్కగా చవిచూచినదియ.

---

## సాహిత్యమంజరి

(ప్రథమ ద్వితీయభాగములు)

పు. ౨౪౬+౨౫౫; వెలరు. ౧-౨-౦ + ౧-౨-౦.

సం. ౧౯౩౪

సంగ్రాహకులు: పిన్నంరాజు వేంకటసుబ్రహ్మణ్యశర్మ, సాహిత్యశిరోమణి; ఉభయభాషాప్రవీణ పంచాగ్నుల పద్మనాభశర్మ, ఆంధ్రపండితులు, బోర్డున్నత పాఠశాల, కావలి, నెల్లూరుజిల్లా.

ప్రకాశకులు: వాయునందన ముద్రాలయాధిపతులు, కావలి.

ఇవి ప్రాచీనాధునిక గద్యపద్య గ్రంథముల యందలి కతిపయభాగముల సంగ్రహణములు. సంగ్రథిత భాగములు సాహిత్యాభివృద్ధికరములు. మొదటిభాగము నాలుగవఫారమునకు, రెండవభాగము అయిదవఫారమునకు నుద్దేశింపబడెను. ఇది సముచితముగ నున్నది.

ఈగ్రంథములు 'మూడు నాలుగు వత్సరముల వఱకు నుపయోగపడవలయు' నని సంగ్రాహకులు కోరుచున్నారు. మూడు నాలుగు వత్సరములే ఏల, భాగముల మార్చిమార్చి యుపయోగించునెడల నెన్నియేండ్లకయిన పనికిరావచ్చును. వీనిపయి పాఠ్యగ్రంథ నిర్ణయసంఘము వారి అంగీకారముద్రయు పడినది. ఇక వీనిని విద్యార్థుల యుపయోగమునకు దేవలసినభారము విద్యాశాలల అధికారులపయి బడినది. ఈ సంగ్రహణముల నాయాగ్రంథభాగముల ప్రారంభమున నాయా గ్రంథకర్తల సంగ్రహచరిత్ర ముండవలసియుండెను. కఠినపదములకు టిప్పణియు నావశ్యకము. ఈరెండు సౌకర్యములులేమి యొక కొరంతయే. ఈకొరత దీర్చినచో వీని ప్రయోజన మతిశయిల్లగలదు.

---

## సూక్తిసుధాలహరి

పు. ౧౬౪+౧౨; వెల రు. ౦-౧౨-౦

కూర్పరి: పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి, పిఠాపురము, తూర్పుగోదావరిజిల్లా.

శాస్త్రిగారు "ముప్పదియేండ్లనుండి యుపాధ్యాయవృత్తిలో సంపాదించిన యనుభవము" గల పెద్దలు; అంధవిశ్వాసములు లేనివారు. విద్యార్థులుభయభాషా సాహిత్యముతోఁగూడఁ బ్రకృతిశాస్త్రాదిజ్ఞానమెకాక, విద్యాభ్యాసకాలమునుండియు మత

సాంఘికస్పర్థ లులేక, ఐకమత్యము, ధైర్యము, ఓర్పు, సత్యసంధత, స్వమతాచారగౌరవము, దైవభక్తి మొద లగు సుగుణముల నలవరచుకొనవలసిన యావశ్యకతను గుర్తించి యీ 'సూక్తిసుధాలహరిం' గూర్చినారు. 'ఇందుఁ బ్రసిద్ధకవులయొక్క గ్రంథములనుండి పై యంశములకు సంబంధించిన పద్యగద్యభాగ్యములే కూర్పఁబడినవి!' అని 'బాలురకుత్సాహకరములై యా హ్లాదకరములు నవరసభరితములు' నయినవి. '3, ౪, ౫ ఫారములలో నేతరగతికైన', 'సౌకర్యమునననుసరించి ఉపాధ్యాయుల చిత్తవృత్తిననుసరించి' బోధించుట కుపయోగపడును.

ఇం దుద్ధృతభాగముల కర్తల సంగ్రహచరిత్ర ములు, టిప్పణి కలదు.

---

## బాలవీరులు

పు. ౫౮, వెల రు ౦-౬-౦

గ్రంథకర్త: జయంతి వెంకటకృష్ణారావు.

ప్రకాశకులు: పసుమర్తి వీరభద్రస్వామి, బి. ఏ., సంపాదకుడు, కవితాకల్పలతాగ్రంథమాల, విజయనగరము.

'పరశురాముడు, రఘురాముడు, బాలకృష్ణుడు, అభిమన్యుడు, బభ్రువాహనుడు, వృషకేతుడు' అను నార్గురు పురాణవీరుల కథ లిందు వచనరూపమున గలవు. అక్కడనక్కడ నవి క్రొత్తపూత పూసికొనియున్నవి.

---

## బర్మాపత్రిక దీపావళిసంచిక

బర్మాలోచేరిన ఒకటిన్నరలక్ష ఆంధ్రులలోను స్త్రీలగతి విషాదకరమై ఉన్నది. పురుషులసంఖ్యలో నాలుగోవంతు స్త్రీ లున్నారు. వారిలో చాలమంది బంధువులెవరూ లేకుండానే బర్మాకువెళ్లి పరులచేత మోసగింపబడ్డవాళ్లు. తాత్కాలికంగా ధనసంపాదనకై పోయిన పురుషులు కుటుంబాలను తీసుకుపోక, యిటు వంటి స్త్రీలతో స్నేహంచేసి అనామకులైన సంతా నాన్ని కలిగించి పరిహాసపాత్రు లవుతున్నారు. రం గూను విద్యాశాఖాధికారులు ప్రకటించిన ఒక నివేది కలో 'రంగూనుపాఠశాలలలోని యావిద్యార్థులకు తలి దండ్రులను నిర్ణయింపడం కష్టంగావున్న' దని రాశా రుట. ఇటువంటి దుస్థితులన్నీ యేకరువుపెట్టుతూ వెంకన్నగారు వ్రాసిన 'బర్మా స్థిరనివాసాంధ్రులు' అనే వ్యాసము ఈదీపావళిసంచికలో ప్రథమస్థానమం దున్నది. శ్రీ ఆర్. మీనమ్మగారు 'రంగూను ఆంధ్ర స్త్రీల'నుగూర్చి వ్రాసిన విషయములుగూడా పరిగణిం పదగినవి. విద్యాశూన్యలైన స్త్రీలను మోసగించి తీసుకు పోవటంకన్నా పురుషులు కుటుంబాలను తీసుకుపోవట మో, లేక అక్కడ స్థిరంగావుండదలచినవో బర్మాస్త్రీ లను సగౌరవంగా వివాహంచేసుకోవటమో మంచిది.

సచిత్రంగా భారతిసైజున ప్రకటింపబడ్డ యీ సంచిక తొంబదిపుటలలోను కార్మికసమస్యలను, కాంగ్రెసు, గాంధితత్త్వములను గూర్చిన వ్యాసములు గణనీయములు. సరియైన నాయకుడు లేమిచే బర్మా కార్మికులందు అంతఃకలహము లుద్భవించి ఉన్న నేర్పుగూడా నశిస్తున్నదనీ, కార్మికుల విద్యాభివృద్ధికి, ఆరోగ్యనిర్మాణానికి సౌకర్యాలు త్వరగా యేర్పడా లనీ పత్రిక వ్రాస్తున్నది. అక్కడ చేరి ధనికులైన ఆంధ్రులు సంఘాలను విరివిగా స్థాపించి ప్రయత్నాలు చేయవలసివున్నది. ఈసంచికలో ఒకనాటకము, కథలూ, పద్యాలూ కూడా ముద్రించారు.

పొట్టపోసుకోటానికి బర్మాకుపోయి ఆంధ్రులు పడుతున్న కష్టనష్టాలు,వారిలో కొందరుచేసుకుంటున్న దుర్ణయాలు తెలుసుకొనటానికి యీసంచిక చూడవలెను.

కుం. న.

---

## ఎక్ ఫ్రాక్ మెంట్స్ ('ఇంద్రజాలములు')

వి. యస్. భూషణ్ (వెంపటి నాగభూష ణం)గారి ఇంగ్లీషుపద్యాలమీద అభిప్రాయం ఇస్తూ రవీంద్రనాథటాగూరుగారు 'మీ పద్యాలకూ కవిసమ యాలకూ సంబంధంలేదు' అన్నారు; అంటే

భూషణ్‌గారి స్వతంత్రతను పొగడారు. కాని యీ పుస్తకంలో యెక్కడచూచినా మాకు కవిసమయ దాస్యమే కనబడుతున్న దే—అందులో తెలుగు ప్రబంధ కవుల సమయాలు! వీరు ఇంగ్లీషులో వ్రాసిన వరూధినీ ప్రవరాఖ్య సంభాషణలో వరూధిని అంటుంది:

"పోవద్దు—సూర్యుడు పద్మినిని ఆకర్షించకుండా పోతాడా? తుమ్మెద పూదేనె త్రాగకుండా పోతుందా?"........

అది అలంకారాలను గూర్చి. ఇక సొంత అభిప్రాయమేమైనా ఊహాతీతమైనది వెళ్లబుచ్చారా అంటే ప్రవరుడు వెళ్లిపోగానే 'ఆహా! పురుషు డెంతకఠిన హృదయుడు!' అని ఆశ్చర్యపోతారు. శతాబ్దాల క్రిందటనే అన్నాడు పెద్దన్న 'క్రూరుడై యరిగె మహీసురాధముడు' అని.

టాజ్‌మహలును వర్ణించివర్ణించి చివరకు 'కాలదేవత నీలిచెక్కులమీద మెరుస్తున్న అశ్రుకణము' అంటారు. బాగానే వుందిగాని, టాజ్‌మహలుకున్న ముఖ్యమైన గుణము శాశ్వతత్వము: ఎన్నియుగాలు దాటినా, ఎన్నిజాతులు నశించినా అది హైందవ శిల్ప కళాకీర్తిని, ఆమహమ్మదీయుని అగాధప్రేమనుచాటుతూ నిల్చివుంటుంది గదా—ఆ గొప్పగుణాన్నే ఈ ఉపమానంలో నాశనం చేశారేం? అశ్రుకణం చెక్కులమీద పడి క్షణంలో జారిపోతుంది. 'టాజ్' కూడా అంతేనా యేమిటి, కొంపదీసి? శాపంలాగా వుంది.

వీరికవిత్వంలో గుణములున్నవి: అవి మంచి దిట్టమైన ఇంగ్లీషుభాష; 'అలిటరేషన్' అనే అలంకారము (వచ్చిన ధ్వనే మళ్లీ రావటం.)

కేవలం శబ్దగాంభీర్యానికీ, 'యేవేవో' వూహాలకీ మాత్రం లోబడక, వీరు, 'లిరిక్'కు ప్రాణసమానమైన ఉద్రేకాన్ని, ఆంగ్లభావ.లోని పలుకుబడినీ (పాండిత్యాన్ని కాదు) పరిచయం చేసుకోని, ఆంధ్రజాతి స్వభావాన్ని అర్థంచేసుకోని దాన్ని కవిత్వంలో ఇతరులకు చెప్పటానికి ప్రయత్నిస్తే మంచిది.

మచిలీపట్టణమందలి 'ఆనంద ఎకాడెమీ' వారు దీన్ని ప్రకటించారు. కుం. న.

---

## మనస్స్వాతంత్ర్యము

(తృతీయభాగము)

పు ౧౬౩; వెల రు ౦-౮-౦.

గ్రంథకర్త, ప్రకాశకులు: వల్లూరి సూర్యనారాయణరావు, బి. ఎ., బి. యల్., యల్. టి. కొవ్వూరు, పశ్చిమటి గోదావరిజిల్లా.

---

## శబ్దరత్నాకరము

(ఆంధ్రనిఘంటువు)

సంధాత: ఆపండి వ్యాసశాస్త్రి, ప్రధానపండితులు, వీరేశలింగోన్నతపాఠశాల, రాజమహేంద్రవరము.

పు. ౪౮౮, వెల విద్యార్థులకు రు. ౧-౦-౦, ఇతరులకు రు. ౧-౪-౦

---

## భద్రాద్రిరామశతకము

కర్త: సత్యవోలు సుబ్బారావు, పిఠాపురము. క్రౌనుసైజు, వెల రెండణాలు.

---

## జయకర్నాటక నాట్యాంకము

(కన్నడము)

సంపాదకులు: బెళగావి రామచంద్ర; హ. పి. జోశి. జయకర్ణాటక కార్యాలయము, ధార్వాడ.

---

## ర త్న మా ల

సనాతనపద్ధతులకు లొంగి దుర్మరణముపాలయిన యొక అనాథబాలిక దుర్మరణవృత్తాంతమీ ఖండకావ్యము. కృష్ణాజిల్లా కొండపల్లి ప్రేమలతా గ్రంథమాల ప్రచురణము.

రచయితలు: బుద్ధిరాజు హనుమంతరావు, దేవరాజు సూర్యనారాయణరావు.

---

## హారీతి, కుబేర, మాధారి

(ఇంగ్లీషురచనము)

గ్రంథకర్త: జయంతి వెంకటకృష్ణరావు. దొరకుచోటు తెలుపలేదు. వెల రు ౧-౦-౦

---

# మనవి మాటలు

## *నాటకమున సంగీతము

కడచిన నెలలో రాజమహేంద్రవరమున నొక మహాసభ జరిగెనది. అందు పలువురాంధ్రవిద్యాధికులు నాటకప్రదర్శనమున సంగీతమునకు స్థానముకలదా, లేదా యనువిషయమునుగూర్చి యత్యధికముగ చర్చించిరి. కొందరమతమున నందు సంగీతమునకు స్థానము కలదు; మరికొందరమతమున లేదు; తక్కినవారిమతమున కలదు, లేదు - కోమటితీర్పు ఎవరివాదమునను సంపూర్ణత కానరాదు.

మానవహృదయమునకు మిక్కుటముగ నానందము గలిగించుటయే నాటకమునకు పరమప్రయోజనము. ఇది తజ్ఞులమాట. అది జీవితమునకు ప్రతిబింబముకాన అందుత్తమకళలగల సుందరతరమగు నంశములు మిళితము లయియున్నవి. ఆయంశములే ఆహార్యము, వాచికము, ఆంగికము, సాత్త్వికము ననబడు ప్రధానములగు నాటకాంగములు. వానిలో నాహార్యమున శిల్పకళాంశమును, వాచికమున కవిత్వ, గానకళల యంశములును, ఆంగికసాత్త్వికముల నాట్యకళాంశమును నిమిడియున్నవి. ఇవినాలుగును లలితకళలు. ఈనాలుగు లలితకళల సమష్టియయి నాటకము లలితలలితము, అనిర్వాచ్యానందజనకము నయినది.

పైనపేర్కొనినకళలు ప్రత్యేకప్రయోగసాధ్యములు. అట్టి ప్రత్యేకప్రయోగములవలననునానందము జనియించును. కాని ఆయానందము వానిసమష్టిప్రయోగమగు నాటకమువలన గలుగు నానందమునకు మిగుల దీసికట్టు. ఆయాకళలపరిచయము గలవారికే వానివాని ప్రయోగమువలన గలుగునానందము సిద్ధించును. అది సకలజనసామాన్యముకాదు. ఉప్పు పులుసు కారములు వేరువేరు రుచులుగలవి. ఆమూడిటియొక్క మిశ్రణము వలన గలుగురుచి వేరు. అది విశిష్టము. సకలజనసామాన్యము. ఇట్టినిదర్శనము లెన్నియేని మానవుని యనుదిన జీవితమున గానవచ్చును. కావున పైన చెప్పినట్టు లాకళాంశముల కన్నిటికిని సమష్టిప్రవృత్తి గలిగినపుడే నాటక మనుమందానందైక ప్రయోజనమయి సార్థకము కాగలదు.

ప్రయోజనాంతరము కల్పితమగునేని, ఈ కళాంశములయందు దేనినైన, కొన్నిటినైన, అన్నిటినైన మానివేయవచ్చును. అపు డుద్దిష్టప్రయోజనము సిద్ధింపవచ్చును. మరుగుననుండి మాటలాడువారి పాడి మాటలు వినవచ్చునపు డామాటల యర్థమునుబట్టి విను వారిచిత్తవృత్తి మారుచుండును. ఆమారుపు మానసవికారమాత్రమగునుకాని నాటకప్రయోజనమగు నానందమునూత్రము కాజాలదు. అట్టి వస్తువునకు నాటకనామమే చెల్లదనిన నిజముచెప్పుటగును.

ప్రకృతిసిద్ధములగు లోకవ్యాపారములకు వాని ప్రయోజనమును, విలువను స్మరించి వానియందుగల సౌందర్య మతిశయించుటకును, అవి నిత్యత్వమును బడసియుండుటకును వానికి 'హద్దుపద్దుల'ను నియమించుకొనుచుండుట లోకమర్యాద. అట్టి నియమములే శాస్త్రములనబడినవి. నాటకముల విషయము నట్టిదే యని వేరుగ చెప్పబనిలేదు. ఏనాటి ప్రాతకాలముననో నాగరకత కేవిధమయినసంబంధము లేక, మహారణ్యములలో, దుర్గమపర్వతసీమలలో నివసించుచు, మానుష స్వభావవిరుద్ధము లగు కార్యముల నాచరించువారు నయిత మొకొకప్పుడు-కాదు తరుచు-ఆనందానుభవము కొరకు, స్వేచ్ఛమెయి ఏవోవేషములను వేసికొని, పాటలతో, మాటలతో చేతుల ద్రిప్పుకొనుచు, చిందులు ద్రొక్కుచు ప్రేక్షకుల కపరిమితానందమును గలిగించుచుండురనుట ప్రపంచచరిత్రమువలన వినుకలి కందిన విషయము. అట్టిచర్యల నీనాడును అనాగరకజాతుల

---

ఇచట నీ 'నాటకము' అనుపదము దృశ్యప్రబంధసామాన్యవాచకము.

యందు కాంచుచున్నాము. ఆచర్యల నేమనవలెను! అవి నాటకములకు తొలిరూపములు కావా? వాని నాధారముచేసికొని లక్షణము లేర్పడినవి కావా? వాని వలన వారికిగలిగెడు ప్రయోజనము కేవలమానందము కాదా! లోకవృత్తమును, మానవ మానసికతత్త్వమును దెలియగల ధీమంతుల కీప్రశ్నముల కుత్తరములు కరతలామలకములు.

ఆనాటి నిపుణమతులను లోకహితైషులు మానవహృదయానందముకొరకయి మానవ హృదయ ప్రవృత్తి కనురూపముగ నట్లు జనియించినవాని-నాటకముల-యందలి సారస్యమును, మానవజీవితమును పరమానందమయముగ జేయగల వానిశక్తిని గ్రహియించి వానికి నిత్యత్వమును గలిగించుటకయి యథామతి వానిని సంస్కరించి నియమములను ఏగిలించినారు. అట్టివాని సంస్కృతరూపములే శాస్త్రకారులు నిర్వచించిన వివిధ విధరూపకములు. అంతేకాదు; ప్రకృత్యనురూపములను నీనాటకముల యుత్పత్తి కపౌరుషేయతనుకూడ వారంటగట్టినారు. అట్టికార్యములయందు ప్రాచీనులగు భారతీయు లతి ప్రగల్భులు!

దీనినిబట్టి తేలినసారాంశము: తక్కినకళాంశములతో పాటు నాటకమున సంగీతమునకును ప్రాధాన్యము, నావశ్యకము కలవని. సమప్రాధాన్యములగు నీకళాంశము లొకదానికొకటి లొంగి అడుగంటినయెడల నానందమునకుమారు విచారము విశేషముగ గలుగుట నిశ్చయము. దానిని తప్పించుపని అన్నికళలయందును కుశలుడగు నటకునిచేత గలదు. అకుశలుడగునటకుడు నాటకరంగమున నడుగిడుటకయినను దగడు; ఎన్నడునుదగడు. నాటకకర్తయు నందుకు బాధ్యుడుకాక తప్పదు. అతడు కేవలము సంగీతాశ్రయములగు వాచికములను—గేయములను, అధికముగ పద్యములను — నాటకమున గూర్పజనదు. అందన్నికళాంగములకును సమావకాశము కలుగున ట్లాతడు విధిగ చూడవలెను. అందుకుదగని యాతడు నాటకరచనమున కేనాడును దగడు, ముమ్మాటికిని దగడు.

---

## ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారము

### చెన్నపురి

మొనమొన్ననే యిటీవలి మూడేండ్ల కార్యక్రమములనివేదికను ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారాధిపతులు ప్రకటించినారు. ఈమూడేండ్లలో భాండాగారమున ఏవిధమునను చెప్పదగిన అభివృద్ధి కనపడదు. ఇందుకు ధనాభావము కారణమట! ఈ భాండాగారముగతి ఎప్పుడు నిట్టులేయున్నది. ఈమూడేండ్లలో, వనుకటి మూడేండ్లలోకంటె భాండాగారమున నాలుగువేల మంది అధికముగ పుస్తకములను చదువవచ్చినారు. దీని వలన ప్రజలు భాండాగారముప్రయోజనమును విశేషముగ గ్రహించుచున్నారని తేలుచున్నది. ఏమిలాభము, దానికి తగినట్లు అభివృద్ధి లేకపోయినపుడు?

క్రొత్తగా సంపాదించిన గ్రంథములు పదునైదట! అందులో విలిచినవి అయిదు; ఎరవుతెచ్చుకొని కాపీలువ్రాయించినవి పది. ఎన్నియో పుస్తకములు గ్రంథభాండాగారమున చినిగిపోవుచున్నవి. వానిలో నైన నెన్నిటికి ప్రతికలు పుట్టినవి! ఇన్నూటయిరువది యారింటికట! ఇన్నింటిలో సంస్కృతగ్రంథములు ౧౩౫; అరవమున ౪౧; కన్నడమున ౩౬; తెలుగున ౧౮. తక్కినవి ఇస్లామియాభాషలవి. గ్రంథభాండాగారాధిపతులకు సంస్కృతముపై ప్రత్యేకాభిమానముకలదేమో! ఆభాషయందయిన నన్ని గ్రంథము లుద్ధరింపబడినవి కాని, లేకున్నచో దానిగతియు తక్కినవానిని బోలియుండవలసినదే. ఇదియంతయు దేశభాషల సారస్వతముపయి ప్రభుత్వమునకుగల ఆదరాతిశయమును విశదముచేయుచున్నది. చెన్నరాజధానియందు దేశభాషలయందలి వ్రాతపుస్తకములనేమి, అచ్చుపుస్తకములనేమి కొన్నిటినైన భద్రపరచియుంచిన గ్రంథాలయము, ప్రజాసామాన్యమున కందుబడినున్నది, యీ ప్రాచ్యలిఖిత గ్రంథభాండాగార మొక్కటియే. ఈయొక్కదానిని బాగు పరిచి అభివృద్ధికి గొనితెచ్చుటకు ప్రభుత్వము నిరంతరము దారిద్ర్యమును ప్రకటించుట విచారకరము.

ప్రాచీనగ్రంథసంపాదనమునకయి యుత్తర ప్రత్యుత్తరములద్వారమున ప్రయత్నము చేయబడెనట! ఆప్రయత్నమువలన లభించిన గ్రంథముల పట్టికలలో గ్రంథభాండాగారమున లేని మంచిపుస్తకములేవియు లేవట. కావున వానిసంపాదనమునకయి వినియోగింప దలచినసొమ్ము జీర్ణగ్రంథోద్ధరణమున కధికముగ వినియోగింపబడెనట. క్రొత్తపుస్తకములను సంపాదింప కున్నమానె, చివికి జీర్ణించుచున్నవాని నిట్లుద్ధరించినం దుకు సంతసింపవలెను. నూతనగ్రంథ సంపాదనమున కంటె జీర్ణోద్ధరణము చాల ముఖ్యమయినది. వెనుకటి వలె కొందరు ప్రత్యేకముగ నందుకని నియమింపబడిన నేకాని నూతనగ్రంథసంపాదనము సాధ్యముకాజాలదు. పల్లెటూళ్లలో నెన్నియిండ్లనో అటుకలపయి తాళ పత్రగ్రంథ సంపుటములు చివికిపోయినవి. ఇప్పటికి శేషించినవియు చివికిపోవుచున్నవి. నేడు వాని విలువను, ఉపయోగమును తెలియనివారు వానిన్ని పెంట ప్రోవులపాలు చేయుచున్నారు.

అపూర్వములను ప్రాచీనగ్రంథములను ముద్రించు పద్ధతి యొక్కటి గ్రంథాలయమున కలదు కాని యీ మూడేండ్లకాలమున, ఏభాషయందుగాని, ముద్రించిన గ్రంథము, క్రొత్తది, ఒక్కటి అయిన కానరాదు. కారణమ్మే తెలిసినదే— ధనాభావము!

అచ్చుపుస్తకములను కొనుటకు రు౧౨౫–౧౩–౦ మాత్రము వెచ్చింపబడెను. వెనుకటి మూడేండ్లలో రు. ౮౮౪౮–౬–౦ వ్యయింపబడెను. దీనికి ద్దానికి 'హస్తి మశకాంతరము:' 'నానాటికి తీసికట్టు నాగంభట్టూ.'

మెకంజీదొర స్థానికచరిత్రలను సేకరించియుంచి నారు. వానియందు దేశచరిత్రనిర్మాణమునకావశ్యకములను పరికరమ్ములపరిమితముగ గలవు. వానికి సరిఅయిన విషయవివరణసూచిక లేదు. దానిని తయారుచేయుపని చెన్నపురి విశ్వవిద్యాలయచారిత్రకపరిశోధనశాఖవారి కొకఏడాదిక్రిందట నంటకట్టబడెను. గ్రంథభాండాగారము నిర్వర్తింపవలసినపని అది; నానబెట్టి తొలగ ద్రోసికొనినది.

రాబోవు మూడేండ్లకాలమున నీభాండాగారము మదరాసు విశ్వవిద్యాలయమున కప్పగింపబడునట. ఇంతకన్న నది చాలమేలు.

ప్రకృతము; విశ్వవిద్యాలయగ్రంథ భాండాగారమును విశ్వవిద్యాలయ పట్టభద్రులుమాత్రమే యుపయోగించుకొనవలెనను విజాతీయ మగు నియమ మొకటి కలదు. : అట్టి నియమము గ్రంథముల నెరవిచ్చు విషయ మునవయినచో కొంత సబబుగనుండును. కాని పట్టభద్రులు కానివా రెవ్వరును గ్రంథభాండాగారము నుపయోగించుకొనరాదనుటమాత్ర ముచితేతర మనకతప్పదు. ఈ లిఖితగ్రంథభాండాగారమునకు నట్టి నియమ మనువర్తింపజేయబడునేని 'ముల్లుపుచ్చికొ(ఱ)ఱ)డచినచందము' కాకపోదు. ప్రకృత మిం దందరకు ప్రవేశము కలదు కావున అట్టినిషేధనియమము దీనికి బట్టించకుండవలెను. ముద్రితగ్రంథభాండాగారమునకుకూడ నట్టినియమము తగదు.

ఈ గ్రంథభాండాగారమునందలి ఆంధ్రగ్రంథముల నన్నిటిని ఆంధ్రవిశ్వవిద్యాలయమున కిచ్చివేయవలెనని ఆంధ్రపత్రిక (౧౨-౧౧-౧౯౩౮) సలహా యిచ్చినది. దీనికి గ్రంథాలయాభివృద్ధి సరిగాలేకపోవు టొకకారణము కావచ్చును. మరియు 'చెన్నపట్టణమున నీ గ్రంథాలయ ముండుటయు', అందువలననేకాబోలు 'అన్నిభాషలయెడలను కృషి సలుపుటకు అవకాశములు తక్కువయుండగలవు' అనినది. ఇది యింకొక కారణము కావచ్చును. అభివృద్ధికి బాధ్యత, ఆదరము కారణములు. అది లేనందువలననే యిట్లు గ్రంథభాండాగారము హీనస్థితియందుండుట. ఇది తెనుగునుమాత్రము బట్టినదికాదు; తక్కినభాషలనుకూడ బట్టినదే.

ఆంధ్రపత్రికసలహా ననుసరించి తెనుగుపుస్తకములు ఆంధ్రవిశ్వకళాపరిషత్తున కొసగబడుగాక! అట్లే అరవపుస్తకములను చిదంబరవిశ్వవిద్యాలయము తీసికొనిపోవుగాక! తక్కినభాషలవాని నేమిచేయవలెను? అందును, సంస్కృతగ్రంథములమాట ఏమి, అవి అన్నిభాషలవారికి కావలసినవే! ఎవరెవరు ఎట్లెట్లు పంచు

కొనవలెను వానిని? కాబట్టి గ్రంథభాండాగారమునుండి ఏభాషకుచెందిన పుస్తకములనుగాని అవతలికి కదలించు మాట తలపెట్టకూడదు, గ్రంథభాండాగారము నభివృద్ధికి దెచ్చుమార్గములనే యరయవలయునుగాని. ఇట్టి భాషా సాముదాయిక గ్రంథభాండాగారములు ప్రాచ్యవిద్యా పరిశోధకులకు చాల నుపయోగకరములు; అట్టివి యెన్ని యున్నను చాలవు. ఉన్న ఒకదానినయిన ఉన్నట్టు లుండనీయక చీల్చిచీలికలుచేయుట యుక్తముకాదు. ఈ విషయమునుగూర్చి వెనుక నొకమారిట్టిసూచనలే కావింపబడగా, భారతి ౧౯-వ సంపుటమున ౭-వ సంచికయందు లెస్స చర్చించి తెనుగుపుస్తకములను గ్రంథభాండాగారమునుండి కదల్పకూడదని తెలుపబడినది.

ఆంధ్రవిశ్వవిద్యాలయము వ్రాతపుస్తకములకొక ప్రత్యేకగ్రంథాలయమును నెలకొలిపి అందు సంస్కృతాంధ్రగ్రంథములనుమాత్రము సేకరించి యుంచుకొనవచ్చును. ప్రాచ్యలిఖితగ్రంథ భాండాగారమున నొకటికన్న నెక్కుడుగనున్న సంస్కృతాంధ్ర గ్రంథముల ప్రతులలో నొక్కదాని, ననుకూలించినచో, సంపాదించుకొనవచ్చును. తక్కినవానికి ప్రతికలను వ్రాయించుకొనవచ్చును. ఇవియే చేయవలసిన, చేయదగిన పని.

---



చక్కెర ఫ్యాక్టరి
మాండ్యా, మైసూరురాష్ట్రము

K. R. R.



# స్వాభిప్రాయ విశేషములు

ప్రపంచవ్యవహారములు రౌద్రసంతప్తములై రుద్రాభిషేకము నభిలషించుచున్నవి. వివిధవ్యవహారములందును శాంతిసహకారస్థానములను సమరము లాక్రమించి ప్రళయ తాండవమును జేయుచున్నవి. వ్యక్తులకు, కుటుంబములకు, కులములకు, సంఘములకు, జాతులకు, స్వీయపోషణరక్షణములకు పరపీడన పరాక్రమణములు శరణ్యములుగ నేర్పడి, పరార్థము దుర్లభమైనది. వివిధవ్యవహారములందును ధనపశుబలములు ధర్మస్థానము నాక్రమించి పరమార్థము దుర్లభమగుచున్నది. న్యూయార్కునుండి టోకియొవరకును సంగ్రామధ్వనులు ప్రతిధ్వనిల్లుచు, ప్రళయప్రయత్నములు ప్రతిష్ఠను బడయుచున్నవి. ఆయుధవిసర్జనసభలు స్వస్తివాచకములు నిరాదరణీయములై ఆయుధధారణము, సంగ్రామఘోషలు సమాదరణీయములైనవి. ప్రజ లన్నమునకు పరితపించుచున్నను మంత్రు లాయుధముల నర్థించుచున్నారు. పరపీడనపరాక్రమణపరాయణములైన యూరపురాజ్యముల కాయుధధారణము సహజావస్థమైనను, పరాధీనజాతులకు ప్రాణహానికరముగనున్నది. జపాను జర్మను రాజ్యముల విజృంభణములు, గ్రేట్‌బ్రిటను ఫ్రాన్సురాజ్యముల సంరక్షణములు, ఇటలి రుష్యారాజ్యముల ప్రగల్భములు, ఇతరరాజ్యముల భయభ్రాంతులు ప్రపంచ వ్యవహారములందు నిరాశను గలుగజేయుచు భావి పరిణామ మంధకారబంధురముగ నున్నది. శ్వేతరాజ్యములందు వ్యాప్తమైన సంక్షోభము పరాధీనరాజ్యములకు మహోపద్రవమునకు మూలమగుచున్నది. ప్రపంచవ్యవహారములందు యూరపురాజ్యముల నావరించిన యాశాపిశాచము స్వతంత్రరాజ్యములకే భయంకరమై బీభత్సముగ నున్నపుడు పరాధీనరాజ్యములస్థితి అయోమయముగనున్నది. యూరపురాజ్యాధికారులకు, ముఖ్యముగను బ్రిటీషురాజ్యాధికారులకు, జపాను, అయిర్లాండులు ప్రతిఘటనమైనను జ్ఞానోదయమును గలుగజేయకుండుట విధికృతముగ నున్నది. పరాధీనస్థితియందున్న హిందూస్థానస్థితి విషాదపూరితమై, నిరాశను గలుగజేయుచున్న విధమును జాయింటుకమిటి రిపోర్టును, స్వదేశ వ్యవహారములును విశదము చేయుచున్నవి.

* * *

**జాయింటుకమిటి రిపోర్టు**

రాజ్యాంగ సంస్కరణముల విషయమై జాయింటుకమిటి ప్రచురించిన రిపోర్టు శ్వేతపత్రమునకన్న నధ్వాన్నముగ నున్నది. బ్రిటిషు రాజకీయపక్షములు ప్రదర్శించెడి నాటకప్రభావమును కమిటీరిపోర్టు వెల్లడి

చేయుచున్నది. జాతీయ ప్రభుత్వనాయకులు మాగ్డనాల్డు, సామ్యుయల్ హోర్, బాల్డ్విన్ గార్లు మొదలగు ప్రముఖులు ప్రారంభించిన భారత రాజ్యాంగ సంస్కరణ నాటకప్రదర్శనమునకుచర్చిల్ పేజ్ క్రాఫ్టు వర్గమువారుచూపుచున్న కపటనాటక ప్రదర్శనము బ్రిటిషు రాజ్యాంగనీతికి నిదర్శనము. అన్నిపక్షముల వారికిని బ్రిటిషు పార్లమెంటుకు భారతీయ ధర్మకర్తృత్వనిర్వహణము ఆచంద్రార్కము నిల్చియుండుట సమానాశయము. బ్రిటీషు నాయకులకు భారతీయులపట్ల, భారతీయనాయకులకు లేని సానుభూతి సానుకంపములు బ్రిటిషుప్రజలకు కలవని ఘోషించుట పరిపాటి యయినది. జాయింటుకమిటిరిపోర్టును ఈమాయాధర్మాధారముననే నిర్మింపబడినది. గాంధీమహాత్ముడు రౌండు టేబిలుసమావేశము నందు చేసిన ధర్మప్రతిజ్ఞను జాయింటుకమిటి నిరాకరించుట దురహంకార దురభిమానములను వెల్లడిచేయునట్లు వివేకాభిమానములను వెల్లడిచేయుట లేదు. జాయింటుకమిటి రిపోర్టునందు ఏమూలాలను వెదకినను స్వాతంత్ర్యసారము మృగ్యముగ నున్నది. రిపోర్టునకు మూలాధారములైన ౧. ఫెడరేషన్, ౨. కేంద్రప్రభుత్వమునందు బాధ్యత, 3. రాష్ట్రీయస్వాతంత్ర్యము మాటలయందు వ్యక్తము చేయబడినను, క్రియలయందు శూన్యముగ నున్నది.

ఫెడరేషన్ ఎన్నితరములకు సాధ్యమగునదియును రిపోర్టును వ్రాసిన కమిటీకే తెలియకున్నది. ఆరువందల స్వదేశసంస్థానములకును, బ్రిటిషుభాగములకును సంయోగ సాహచర్యములు, బాధ్యతాయుత ప్రభుత్వమునందు బలవంతము లేకను సాధ్యము గావని ప్రపంచ రాజ్యాంగచరిత్రములు నేయి నోళ్లను వ్యక్తముచేయుచున్నను మాయ మాటలతో ప్రపంచమును వంచింపదలచుట నిరుపయోగము. ఫెడరేషన్ భారతీయ రాజ్యాంగమునకు లక్ష్యమయినపుడు వెంటనే సాధనోపాయములను నిర్ణయించి ఫెడరేషన్ సాధ్యము చేయుటయును, రిపోర్టునందు సూచించుటయును పరమావసరము ఫెడరేషన్ఆదర్శము ఇతరాదర్శములవలెనే రిపోర్టునందుమాత్రమే గోచరంబగుచుండును.

నిరంకుశాధికారప్రియులైన స్వదేశ సంస్థానాధీశులును, బ్రిటిషు రాష్ట్ర నిర్వాహకులును, నిరంకుశారాధనమునందువలె స్వాతంత్ర్యారాధనమునందు సుముఖులుగారని తెలిసినవిషయము. ఫెడరేషను చిరకాలమునకు సాధ్యముగానపుడు దానియాధారముగల శేషించిన రాజ్యాంగ సంస్కరణములును చిరకాలమువరకును మృతాక్షరములుగ నుండగలవు. మాంటుఫర్డుసంస్కరణములందు విఫలమైన ద్వంద్వాధికారవిధానమును మాటలకైనను కేంద్రప్రభుత్వమునందు నిర్మింపగోరుట కేవలము కపటనాటక ప్రదర్శనము. ఈ కపటనాటక ప్రదర్శనమునకును చర్చిల్ వర్గమువారు చూపుచున్న ప్రతిఘటనము స్వాతంత్ర్యప్రియులకు నిరాశను గలుగజేయుచున్నది. సైన్యాధికారము, రక్షణాధికారము, ఆర్థికాధికారము లేని ద్వంద్వాధికారము దేశక్షేమమునకు నిరర్థకమని ద్వంద్వప్రభుత్వానుభవము వెల్లడిచేసినను, జాయింటుకమిటీరిపోర్టు నిరర్థకవిధానమును సార్థకముచేయదలచుట యసంభవము,

కేంద్రప్రభుత్వమునందు నిరంకుశాధికారమును, రాష్ట్రప్రభుత్వములందు స్వాతంత్ర్యాధికారమును దుర్లభములు. రాష్ట్రప్రభుత్వములందు సూచితములైన స్వల్పాధికారములకును చేయబడిన మినహాయింపులు పోయినపుడు రాష్ట్రాధికార స్వాతంత్ర్యము నామమాత్రావశిష్ట మని సామాన్యులకును తెలిసినవిషయము. శాంతిక్షేమము లనుమాటలందు మంత్రులయధీనమును, చేతలందు గవర్నరువశమును చేయుట రాష్ట్రీయ స్వాతంత్రమునకు నిదర్శనముగాదు. రాష్ట్రములందు గవర్నరులకును, కేంద్రప్రభుత్వమునందు గవర్నరుజనరలునకును కల్పింపబడిన నిరంకుశ శాసన నిర్మాణాధికారమును, మినహాయింపులును స్వాతంత్ర్యధర్మమునే నిర్మూలము చేయుచున్నవి. ప్రధాన రాష్ట్రములందు రెండు శాసనసభల నేర్పాటుచేయుటయును, సామ్రాజ్యశాసనసభకు ప్రత్యక్షవరణమును తీసివేసి పరోక్షవరణమును సూచించుటయును నిరంకుశాధికారమును సుస్థిరము చేయుటకు వినియోగపడుచున్నవి. రాజ్యాంగసంస్కరణ విధానమంతయు నిరంకుశాధికార ప్రియులైన సంస్థానాధీశులకు, ధనాధీశులకు, బ్రిటిషు వ్యాపారస్థులకు, బ్రిటిషుసామ్రాజ్యాభిమానులకు వినియోగపడినటులు భారతీయప్రజలకు వినియోగపడదనిరిపోర్టుపరిశీలనము విస్పష్టము చేయుచున్నది. భరతవర్షమునం దన్నిపక్షములవారును జాయింటుకమిటీరిపోర్టును నిరాకరించినవిధమును జిన్నా, జయకరు, సప్రూ, శ్రీనివాసశాస్త్రి, చింతామణిగార్లు మొదలగునాయకుల యభిప్రాయములు వెల్లడి చేయుచున్నవి. జాయింటుకమిటి లేబరుపక్షసభ్యులు వ్రాసిన ప్రత్యేకాభిప్రాయములె సంస్కరణముల సంకుచిత స్వభావమునకు వ్యాఖ్యానములు. భారతీయప్రజలు జాయింటు కమిటి రిపోర్టును నిరాకరించినవిధమును లెజిస్లేటివుఅసెంబ్లీఎన్నికలు చెప్పకచెప్పుచున్నవి.

*　　*　　*

### అసెంబ్లీ ఎన్నికలు

అసెంబ్లీ ఎన్నికలందు ప్రజాలత్యము శ్వేతపత్రసంస్కరణములందు లగ్నము చేయబడినది. కాంగ్రెసు సంకుచితములైన శ్వేతపత్రసంస్కరణములను నిరాకరించుట దేశగౌరవమునకును, స్వాతంత్ర్యప్రాప్తికిని సాధనమని నిర్ణయించినది. ఈనిర్ణయమును పరీక్షించుటకు విల్లింగ్డన్ ప్రభువు ఎసెంబ్లీని రద్దుచేసి ఎన్నికలను జరుపుటకు నిర్ణయించిరి. కాంగ్రెసు విల్లింగ్డన్ప్రభువు చేసిన నిర్ణయమును స్వీకరించి ప్రజాభిప్రాయమును వ్యక్తము చేయుటకు సమ్మతించినది. ఎసెంబ్లీఎన్నికలందు, చెన్నరాజధానియందు ఎసెంబ్లి అభ్యర్థులు 100-కి 100 మంది చొప్పునను, దేశమునం దంతటను 100-కి 90 వంతునను విజయమునుబొంది శ్వేతపత్రముపట్ల ప్రజాభిప్రాయమును సువ్యక్తముచేసిరి. దేశస్వాతంత్ర్యమునకు చిహ్నమైన కాంగ్రెసుప్రతిష్ఠ అసెంబ్లి ఎన్నికలందు దేశమునం దంతటను మారుమ్రోగినది. ఎన్నికలందు అభ్యర్థుల గుణగణములతోను, సాంఘికకులతత్వములతోను, సంపదలతోను, విద్యావివేకములతోను, మతాభిప్రాయములతోను, నిమిత్తము లేకను స్వాతంత్ర్య చిహ్నమైన కాంగ్రెసు అభ్యర్థిత్వము అభ్యర్థుల కఖండమైన విజయమును సమకూర్చినది

స్వాతంత్ర్యరథమును గమ్యస్థానమును చేర్చుటకు ప్రజలకుగల సంకల్పోత్సాహములను విజయమును బొందిన అభ్యర్థుల ఓట్ల సంఖ్యలు ప్రతిపక్షులకును హృద్గతముచేయుటకు తగియున్నవి. విల్లింగ్డనుప్రభువుచేసిన సవాలునకు ప్రజలు ఓట్లమూలముగ చెప్పినజవాబు సంశయాత్ములకు సహితము జ్ఞానోదయమును గలుగజేయుటకు తగియున్నది. ప్రజలు శ్వేతపత్రమును నిరాకరించినపుడు జాయింటుకమిటిరిపోర్టును నిరాకరింతురనుట నిర్వివాదాంశము. ప్రజాభిప్రాయమును, నాయకుల యభిప్రాయమును, నిర్లక్ష్యము చేయుచు బ్రిటిషుపార్లమెంటు భారతరాజ్యాంగసంస్కరణ శాసనమును వెంటనే నిర్మించుటయును, నిర్మితమైన శాసనమును వెంటనే ఆచరణమునందు పెట్టుటయును సంభవము. జాయింటుకమిటీకి ప్రజాభిప్రాయముతో నిమిత్తము లేదను విషయమును రిపోర్టునందలి ఇతరవిషయములవలె, ఉత్కళరాష్ట్ర సరిహద్దుల నిర్ణయములును సువ్యక్తము చేయుచున్నవి. శ్రీమంతులైన పర్లాకిమిడి రాజాగారికి సంతృప్తి గలుగజేయుటకు ఆంధ్రప్రజాకీర్ణములైన పర్లాకిమిడి, బరంపురము మొదలగు గంజాంజిల్లా భాగముల నుత్కళరాష్ట్రమునందు జేర్చుటయందు కమిటి చూపిన నిర్లక్ష్యభావమే నివేదికయందలి ఇతరవిషయములందును ప్రత్యక్షమగుచున్నది. కమిటీరిపోర్టునందలి యన్యాయనిర్ణయములను ప్రతిఘటించవలసిన భారము ప్రజలమీద గలదు. ప్రజాప్రాతినిధ్యమునకు ప్రధానసంస్థయైన కాంగ్రెసు ప్రతిఘటన భారమును వహించవలసిన యవసరావకాశము లను దేశవ్యవహారములు విశదము చేయుచున్నవి.

* * *

కాంగ్రెసు

రౌండుటేబిలు సమావేశమునందు గాంధీ మహాత్ముడు దెలిపినట్లు కాంగ్రెసు హిందూస్థానమునందలి రాజకీయసంస్థలందు ప్రధానసంస్థయనియును, ప్రజాభిప్రాయమునకుసాధనమనియును రాజ్యాంగవేత్తలందరును అంగీకరించినవిషయము. అసెంబ్లిఎన్నికలు గాంధీ మహాత్ముని వాదమును వేయిముఖములను రుజువుచేసినవి. కాంగ్రెసు సాంఘిక, మత, కులాదిభేదములు లేని భారతజాతీయసంస్థయని ఎన్నికల విజయములు రుజువుచేసినవి. క్రైస్తవమతావలంబకులైన సామ్యుయల్ ఆరన్‌గారు హిందువుల ఓట్లతో మలబారునందు అఖండవిజయమును పొందిరి. భూలాభాయిదేశాయి, నాగేశ్వరరావు, డాక్టర్ రాజన్‌గార్లు మొదలగు అభ్యర్థులు వేల ఓట్లతో సనాతనాభ్యర్థుల నోడించి విజయమును బొందిరి. రెడ్డిసీమయైన రాయలసీమయందు సుపరిచితులు గాని అనంతశయనం అయ్యంగారు సాంఘికతత్వమును, జస్టిసుపక్షతత్వమును ప్రతిఘటించి అఖండవిజయమును బొందిరి. అభయంకరుగారు హిందూసంఘాభిమానమునకు చిహ్నముగ నిలిచిన, మూంజిగారి నోడించి సంఘాభిమానాతీతమైన కాంగ్రెసుతత్వమును స్థిరతరము చేసిరి.

చెన్నపురియందు సత్యమూర్తి, వేంకటాచలం శ్రేష్ఠిగార్లు రామస్వామి మొదలియార్, షణ్ముఖంచెట్టిగార్ల నోడించి పొందిన దిగ్విజయము స్వాతంత్ర్యసంరంభము

సందు కాంగ్రెసుపక్షమునకు ప్రజాహృదయమునందుగల గౌరవ ప్రతిష్ఠలను సువ్యక్తము జేసినది.

సామాన్యులవలె శ్రీ మంత్రులును, వర్తకులును, స్వాతంత్ర్యమును కోరుచున్న విధమును షణ్ముఖంచెట్టిగారి పరాజయము చెప్పక చెప్పుచున్నది. షణ్ముఖంచెట్టిగారికి విజయమును సమకూర్చుటకు జిల్లాబోర్డు ప్రెసిడెంట్లు, మునిసిపాలిటీల యధ్యక్షులు, ఇతరాధికారులు చేసిన దుర్ణయములన్నియును నిరర్థకములైనను ప్రజాసంకల్పమునకు ప్రమాణములుగనున్నవి. ఎసెంబ్లి ఎన్నికలయందు స్వార్థకల్పితములైన బ్రాహ్మణబ్రాహ్మణేతరాభిమానములకు, సనాతన సంస్కరణాభిమానములకు, హిందూమహాసభీయాభిమానములకు కాంగ్రెసుపక్ష జాతీయపక్షాభిమానములకు, జస్టిస్‌పక్ష కాంగ్రెసు పక్షాభిమానములకు గలిగిన సంరంభమునందు స్వాతంత్ర్యచిహ్నమైన కాంగ్రెసుపక్షాభిమానము దిగ్విజయమును పొందినవిధము స్వాతంత్ర్యప్రియులకు సంతోషమును, నిరంకుశాధికారులకు విషాదమును కలుగజేయుటకు తగియున్నది. కాంగ్రెసు పార్లమెంటరిబోర్డు, కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గము, బొంబాయి కాంగ్రెసు నిర్ణయించినవిధమునను, జాయింటు కమిటి రిపోర్టును నిరాకరించి స్వాతంత్ర్య సంపాదనమునకు సాధనములను కల్పించుట ఎసెంబ్లి ఎన్నికలందు విజయమునుబొందిన యభ్యర్థుల ధర్మమైయున్నది. ఈధర్మమును కాంగ్రెసు అసెంబ్లి సభ్యులు నిర్వహింపగలవిధము కాలగర్భమునందుగలదు.__కాంగ్రెసు అభ్యర్థుల విజయమంతయును కాంగ్రెసుసంస్థల బలనిర్మాణములమీద నాధారపడియున్న విధమును అసెంబ్లిఎన్నికలు రుజువుచేసినవి. ఎసెంబ్లి ఎన్నికలవిజయమువలెనే స్వాతంత్ర్య సంరంభమునందు కాంగ్రెసువిజయమును కాంగ్రెసు సంస్థల బలనిర్మాణములమీద నాధారపడియున్న విధమును గతించిన ౧౭ ఏండ్ల రాజకీయానుభవము ప్రజానాయకులకు హృద్గతము చేసినది. ఈయనుభవమును సార్థకము చేయవలసినయవసరమును కమిటీరిపోర్టు వివిధపక్షములవారికిని వెల్లడి చేయుచున్నది. భారతీయ స్వాతంత్ర్యము భారతీయులహస్తములందుగలదుగాని, పరదేశీయుల దానమువలన సాధ్యముగాదని సర్వత్ర తెలిసియున్నను, ప్రజానాయకులకు పరులదానములందు విశ్వాసమునుంచుట పరిపాటియయినది. బొంబాయి యందు కాంగ్రెసు నిర్ణయించినటులు సంపూర్ణ స్వాతంత్ర్యసంపాదనమునకు ప్రజాపరిషత్తును నిర్మించుటకు కాంగ్రెసుచేయవలసిన ప్రయత్నములు ప్రజానాయకుల మహాదీక్షను కోరుచున్నవి. ప్రజానాయకులు కాంగ్రెసు దీక్షాపరాయణులగుటకు బొంబాయి కాంగ్రెసు నిర్ణయించిన కాంగ్రెసునవీనాంగనిర్మాణము సకలజనులకును ఆచరణయోగ్యమగుచున్నది. ఎసెంబ్లిఎన్నికలవిజయము స్వాతంత్ర్యవిజయమునకు కేవలము అంకురారోపణము. స్వాతంత్ర్యాంకురారోపణమును ఫలవంతమును జేయవలసిన మహత్తరమైన భారమితరరాష్ట్రనివాసులందువలె నాంధ్రులందును గలదు. ఆంధ్రులీభారమును పరమోత్సాహముతో నిర్వహింపగలవిధమును సత్యాగ్రహసమరోదంతమును, ఎసెంబ్లిఎన్నికలవిజయమును వెల్లడిచేయుచున్నవి.

* * *

## ఆంధ్రులకర్తవ్యము

అసెంబ్లిఎన్నికలయందు ఆంధ్రాభ్యర్థులు పొందిన యఖండవిజయము ఆంధ్రుల కార్యపరత్వమునకును ఉత్సాహమునకును నిదర్శనము. గంజాంమండలమునందు గిరిగారి విజయము కార్మికప్రజావిజయమునకును, గోదావరి కృష్ణామండలములందు నాగేశ్వరరావుగారివిజయము సంస్కరణ విజయమునకును, గుంటూరు నెల్లూరు మండలములందు రంగాగారివిజయము రైతువిజయమునకును, రాయలసీమయందు అనంతశయనంగారి విజయము కేవల కాంగ్రెసువిజయమునకును నిదర్శనములుగ నున్నవి. కాంగ్రెసు అభ్యర్థులవిజయము స్వరాజ్యవిజయమనియును, ప్రజావిజయమనియును, కాంగ్రెసు విజయ మనియును, వ్యక్తుల విజయము కాదనియును ఎన్నికల ప్రచార ఫలములు విశదముచేసినవి. కొన్ని ప్రాంతములందు స్వాభిమానపరాయణులు కాంగ్రెసు వ్యవహారములందు విభేదములను కల్పించుటకు చేసిన ప్రయత్నములు విఫలములై పరిహాసపాత్రము లైనవి. దేశస్వాతంత్ర్యసంపాదనమున కేర్పడిన మాతృసంస్థయందు విభేదములను కల్పించుటకు స్వాభిమానపరాయణులు పూనుకొనుట యనుచితమని ఎన్నికలు నేర్పిన గుణపాఠమును మరువకుండుట వివేకము. అసెంబ్లి ఎన్నికలందు కాంగ్రెసుప్రచారకులు చేసిన అఖండమైన సేవ వర్ణనాతీతమై ధన్యవాదములకు పాత్రమగుచున్నది. ఆంధ్రమహాజనులు ముఖ్యముగ ఓటరుమహాశయులు కులతత్వములను, పక్షతత్వములను విసర్జించి దేశస్వాతంత్ర్యచిహ్నమైన కాంగ్రెసునకు చేసిన సేవ కాంగ్రెసు అభ్యర్థుల అఖండవిజయమునకు వినియోగపడి, కాంగ్రెసు కృతజ్ఞతకు పాత్రమైనది. జాయింటుకమిటీరిపోర్టును ప్రతిఘటించుటకు సకల సందర్భములందును కాంగ్రెసుపరమైన ప్రజాసహాయము సాధనభూతముగ నున్నది. ప్రజలు కాంగ్రెసుసంస్థలందు సభ్యులుగ జేరియు, కాంగ్రెసుసంస్థలను సకలవిధముల పోషించియును, ప్రజాపరిషత్తు మూలమునను సంపూర్ణ స్వరాజ్యమును సాధించుటకు స్వాతంత్ర్య సంరంభమునందు దీక్షాపరాయణులై సకలవిధముల పాటుపడి భగవదనుగ్రహమునకు పాత్రులగుదురుగాక! జాయింటుకమిటి నిర్ణయించిన ఉత్కళరాష్ట్ర దక్షిణ సరిహద్దులను ప్రతిఘటించి గంజాం మండల - ఆంధ్రసోదరులకు న్యాయమును గలుగజేయుటకు ఆంధ్రులందరును దీక్షాపరాయణులై సకలవిధమును సహాయము చేయుటకు ప్రార్థితులు. అస్సెంబ్లి ఎన్నికలతో నారంభమైన విజయోత్సాహమును పూర్ణ స్వరాజ్యమును సాధించువరకును సంరక్షించుటకు భగవంతు డనుగ్రహించుగాక!

---



Printed and Published by K. Nageswara Rao, at the Andhra Patrika Press, No.7, ThambuChetty St., Madras.
Editor: G. Subbaramayya

